సంగ్రహ

# ఆంధ్ర విజ్ఞాన కోశము

ఎనిమిదవ సంపుటము

## లక్షద్వీపములు - హోమియోపతి వైద్యము


ఆచార్య మామిడిపూడి వేంకటరంగయ్య, ఎం. ఏ.

అధ్యక్షులు - సంపాదకీయవర్గము





ప్రకాశకులు :

సంగ్రహ ఆంధ్ర విజ్ఞానకోశ సమితి

హైదరాబాదు

1971




# తొలిపలుకు

సంగ్రహాంధ్ర విజ్ఞానకోశముయొక్క ఈ తుది ఎనిమిదవ సంపుటమును ఆంధ్రప్రజానీకమునకర్పించుట ముదావహమైన కర్తవ్యముగా భావించుచున్నాను ఈ విజ్ఞానకోశప్రచురణ విషయము 1953వ సం॥ ప్రాంతమున ఉస్మానియావిశ్వవిద్యాలయ భవనమున అధ్యాపకుల నడుమ చర్చకువచ్చి నిర్ణయము గైకొనబడుటయు అచిరకాలములో మేధావులైన పండితులతోకూడిన సంగ్రహాంధ్ర విజ్ఞానకోశసమితి ఏర్పడుటయు ఆంధ్రమహాజనుల కేంద్ర రాష్ట్రప్రభుత్వముల సహాయసహకారములతో సమితివారి నిరంతరకృషి ఫలితముగా ఒక సంపుటము తరువాత మరియొక సంపుటము వెలువడి ఎనిమిదవ సంపుటముతో ఈ మహాగ్రంథముయొక్క సంపూర్ణ స్వరూపము అవతరించుటయు జరిగినది

వివిధ కళలకు వివిధ శాస్త్రములకు సంబంధించు విశ్వవిజ్ఞానమును ప్రోదిచేసి సంక్షిప్తరూపములో సమకాలికులైన ఆంధ్ర జనసామాన్యముయొక్క ప్రాంగణమునకు కొనివచ్చి భావితరములవారి కందజేయుట ఈకోశముయొక్క లక్ష్యమగుటచే గ్రంథాధ్యయనమువంటి నిర్మాణ కార్యములకు అవకాశము చాలని ఈ దినములలో విజ్ఞానసారమును సంగ్రహముగ తెలుపుటకూడ ఘనమైన సేవగనే భావింపవలెను సుసంపన్నములైయున్న ప్రాచీన ఆధునిక విజ్ఞానసంస్కృతుల సమ్మేళనము సకలవిధముల ఎంతయు ప్రయోజనకరము మహాసాగరమువలెను విజ్ఞానము అనంతమైనది! అందునను ప్రాచీనకాలమునందుకంటె ఈ యుగమున సృజనాత్మకమైన మానవుని మేధాసంపద మరింతగా వికసమై క్రొత్తపుంతలు త్రొక్కుచున్నది తత్ఫలముగ కళావిజ్ఞానములు శాఖోపశాఖలై గుణాతిశయముచే ప్రకృతిని గూడ శాసించుచున్నవా అనునట్లు అచ్చెరువుగొల్పుచున్నవి మానవుడు చంద్రమండలముపై దిగి అందలి గూఢవిషయములను విశ్వమునకు బహిర్గత మొనర్పగల్గుటయే ఇందుకు తార్కాణము ఇందుకు తోడ్పడుచు అనుదినము అపూర్వముగ మార్పులకు గురియగుచున్న భౌతిక శాస్త్రవిజ్ఞానము సాంకేతికశాస్త్ర విజ్ఞానము నిన్నమొన్నటివరకు ఆంగ్లమువంటి పరభాషలలో బోధింపబడుచు ఆంధ్రులకు అందని మ్రానిపండుగనుండెను ఇప్పుడు తేటతెలుగుభాషలో ఈ విజ్ఞానకోశముద్వారా ప్రకృతిరహస్యములు వారి కరగతమగుట ఎంతయు హర్షదాయకమైన విషయము

ఆంధ్రభాషలో సమగ్రమైన విజ్ఞానసర్వస్వములేని లోపమును పూరింపవలెనని ఈ ఉద్యమప్రారంభకులు వాంఛించి నడుముకట్టుటయు సంపూర్ణవిజయము సాధించుటయు యావదాంధ్రులకు మోదకారణము ఈ యుద్యమము ప్రధానముగ తెలంగాణమునందు ఆవిర్భవించి రూపుదిద్దుకొనుట తెలంగాణముయొక్క జాగృతికి ఘంటారావమువంటిది ప్రాచీనార్వాచీన విజ్ఞానజలమును ఆంధ్రులు నిరంతరము చేకొనుటకుపకరించు తరుగని మోటబావిగ ఈకోశము వర్ధిల్లవలెనని కోరుచున్నాను

విజ్ఞానకోశ నిర్వహణము సామాన్యమైన కార్యము కాదు దీనికి అంగబలము అర్థబలముతోపాటు విద్వాంసులగు మేధావుల అండదండలు మిక్కిలి అవశ్యకములు కేంద్ర రాష్ట్రప్రభుత్వములును మరియు ఎందరో ఉదారులగు దాతలును మాకు ఆర్థికముగ గొప్ప సహాయము చేసినారు విద్వాంసులు అమూల్యములైన తమ రచనలద్వారా ఈ కోశమును సుసంపన్న మొనరించినారు ఈ సహాయసంపదలను కూడగట్టుకొని ఏకాగ్రచిత్తముతో ఈ ఉద్యమవిజయమునకు కర్ణధారులై కృషిసల్పిన ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనంగారి సేవాధర్మమెంతయు ప్రశంసాపాత్రమైనది

ప్రాచీన ఆధునిక విజ్ఞానములు రెండును సార్వజనీనములు, సార్వకాలికములునైనవనుట నిర్వివాదము సత్పురుషులు, సత్యసంధులు, విశాలభావోపేతులు, అభ్యుదయకాముకులునైన మహనీయులు ప్రాచీనకాలమునందును ఈనాడును ఈ భారతదేశమునందే కాక, పరభూములయందును ఉన్నారనుటకు ఈ కోశమునందలి ఎనిమిది సంపుటములలో

పూర్వులైన వైజ్ఞానికుల జీవితగాథలే కాక వివిధ క్షేత్రములలో వారు ప్రసాదించిన విజ్ఞానభిక్ష మానవసౌభాగ్య ప్రదమగుచున్నది పెక్కు విషయములపై మేధావులగు విద్వాంసులచే రచింపబడిన ప్రామాణికములగు 256 వ్యాసములచే నొప్పు ఈ సంపుటము పాఠకమహాశయులకు పెన్నిధి యనుట నిర్వివాదము

గుణబహుళమైన ఈ బృహద్గ్రంథ ప్రచురణ విషయమున పెక్కుకారణములచే కొంత కాలవిలంబనము అనివార్యమైనది ఈ కోశమునకు ఆదినుండి పరిసమాప్తియగువరకు ఆర్థికసహాయమును కల్పించి దాని విజయమునకు కారణభూతులైన ఆంధ్ర భారతప్రభుత్వములవారికిని తక్కినదాతలకును మా హృదయపూర్వకమైన కృతజ్ఞతలను ప్రకటించుచున్నాము విజ్ఞానవీథులలో విహరించుటకుపకరించు ఈ కోశ సంపుటములన్నిటిని అధికసంఖ్యలో కొనుటమూలమున ప్రజాహిత సంస్థలు భాషాభిమానులైన ప్రజలు ఈ బృహద్గ్రంథమునకు ఆర్థికముగ తోడ్పడగలరని ఆశించుచున్నాము ఈ విజ్ఞానయాత్రయందు మార్గదర్శకులుగానున్న విద్వాంసులకు మేధావులకు నమోవాకములర్పించుచున్నాము దీర్ఘకాలికమైన ఈ మహోద్యమమును విజయప్రదమొనర్చి ఈ మహాగ్రంథమునకు రూపురేఖలు దిద్దిన మా కార్యకర్తలను అభినందించుచున్నాము

హైదరాబాదు<br>8-4-1971

మ. చెన్నారెడ్డి<br>అధ్యక్షులు<br>సంగ్రహ ఆంధ్ర విజ్ఞానకోశసమితి

# నివేదన - అవభృథము

సంగ్రహాంధ్ర విజ్ఞానకోశముయొక్క ఎనిమిదవదియు కడపటిదియు అగు ఈ సంపుటమును ఆంధ్రసరస్వతి పాదపీఠము కడ ఉంచుచు ఇట్లు విజ్ఞాపనము చేయుచున్నాము ఈనివేదన అవభృథరూపమైనది అవభృథమనగా యజ్ఞము కడపట న్యూనాతిరిక్త దోషపరిహారార్థము చేయు కర్మము అని శబ్దరత్నాకరము' ఈ సారస్వతయజ్ఞమునందు మేము చేయవలసినది సింహావలోకనరూపమైన కర్మము

అక్టోబరు 15 1953 సంవత్సరము నాడు ఉస్మానియా విశ్వవిద్యాలయమునందు పనిచేయుచుండిన డాక్టరు శేషభట్ల విశ్వనాధము శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనము అను ఇద్దరు వ్యక్తుల భయకుంచితమైన ఉత్సాహమే సంగ్రహాంధ్రవిజ్ఞానకోశ నిర్మాణ ఉద్యమమునకు మల్లివిత్తనమైనది స్వర్గవాసులు మాడపాటి హనుమంతరావుపంతులు బూర్గుల రామకృష్ణరావు పంతులుగార్ల ఆదరజలసేచనముతో ఇది మొలకయెత్తినది పద్మభూషణ ఆచార్య మామిడిపూడి వెంకటరంగయ్యగారి ఆశీస్సులతో డాక్టరు మర్రి చెన్నారెడ్డిగారి సౌజన్యముతో పండిత ఆదిరాజు వీరభద్రరావుగారి కర్ణధారిత్వముతో ఈ చిన్ననౌక విజ్ఞానసముద్రముపై తెరచాప విప్పి విహరించినది ఆదిరాజు వీరభద్రరావుగారు వార్ధక్యమువలన 1963 వ సంవత్సరములో కార్యవిరమణచేయగా ఆచార్య గరికపాటి లక్ష్మీకాంతయ్యగారు కొంతకాలము శ్రీ ప్రతాప రామసుబ్బయ్యగారు ఉద్యమము కడముట్టువరకును ముఖ్యసంపాదకభారము వహించిరి

ఉద్యమముయొక్క ఆరంభమునందు డాక్టరు బూర్గుల రామకృష్ణరావుగారును, డాక్టరు నీలం సంజీవరెడ్డి గారును విజ్ఞాన కోశసమితికి అధ్యక్షులుగనుండిరి ఐదు సంవత్సరముల ప్రసవవేదన తరువాత 1958వ సంవత్సరములో విజ్ఞానకోశము మొదటి సంపుటము ఆవిర్భవించెను ఇంతకు కొంచెముముందే అనగా 1957వ సంవత్సరములోనే సాహితీప్రియులు డాక్టరు బెజవాడ గోపాలరెడ్డిగారు విజ్ఞానకోశసమితికి అధ్యక్షతను స్వీకరించి 1966వ సంవత్సరమువరకును ఆధారమును మిక్కిలి దక్షతతో నిర్వహించిరి శ్రీవారి సమయముననే సమితికి ఆర్థిక స్థైర్యము తగు మాత్రముగా ఏర్పడినది వారి సిఫారసు మీదనే కేంద్ర ప్రభుత్వమువారును ఆంధ్రప్రదేశ ప్రభుత్వమువారును విరాళములను మంజూరు చేసిరి

1966 వ సంవత్సరము నుండి నేటివరకు డాక్టరు మర్రి చెన్నారెడ్డిగారు సమితి అధ్యక్షులుగా ఉన్నారు ఉద్యమ ప్రారంభము నుండియు డాక్టరుగారు సమితి ఉపాధ్యక్షులుగా ఉండిరి విజ్ఞానకోశమునుగూర్చి ఆనాటి శాసనసభ్యులకు వివరించు ప్రథమసమావేశము 1954 వ సంవత్సరమున శ్రీ చెన్నారెడ్డిగారి ఇంటనే జరిగినది ఆచార్య మామిడిపూడి వెంకటరంగయ్యగారు శాసనసభ్యులకు ఈ యుద్యమమును ఎరుకపరచిరి గ్రంథాలయశాసనమును సముచితముగ మార్చి, ఉద్గ్రంథములను గ్రంథాలయములు సేకరించు విధానమునకు నాందియు డాక్టరు చెన్నారెడ్డిగారు అమాత్యులుగ ఉండు కాలముననే జరిగెను

ప్రారంభదశనుండియు డాక్టరు రాచాడ సత్యనారాయణగారు విజ్ఞానకోశసమితికి కోశాధ్యక్షులుగనుండిరి 1969 లో వారు ఉస్మానియా విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులుగ నియమింపబడుట మాకు సంతోషదాయకమైనది అప్పటినుండియు శ్రీ చెలమచర్ల రంగాచార్యులుగారు కోశాధ్యక్షులుగ వ్యవహరించుచున్నారు

స్కీము మొత్తముమీద కేంద్ర ప్రభుత్వము వారు ముప్పదివేలును ఆంధ్రప్రదేశ ప్రభుత్వమువారు రెండు లక్షల ముప్పదివేలును గ్రాంట్లు ఇప్పించిరి సభ్యత్వమువలనను విరాళముల వలనను సమితి రు 48 995/- సేకరించుకొన్నది విజ్ఞానకోశసంపుటముల అమ్మకమువలన ఇంతవరకు షుమారు రు 90 000/- సంపాదించు కొనగలిగినది

భవిష్యత్తు—అవసరములు అనుకొన్న ప్రకారము కడపటి సంపుటము ముద్రణమయినది అను సంతృప్తితో హృదయము తేలుచున్నను దీనిమీదను గతసంపుటములమీదను ఎంతయో కార్యభారము మిగిలిపోయినదను చింతచే హృదయము బరువుతో క్రుంగుచున్నది మొదటి సంపుటము పూర్తిగా అయిపోయినది రెండవదియు అట్టిస్థితికే వచ్చినది మిగిలిన సంపుటములలో అత్యధికభాగము బైండునకు నోచుకొనలేదు ఖర్చు అయిపోయిన సంపుటములను పునర్ముద్రణ చేయవలసియున్నది అట్లుచేయుటలో వాటియందలి వ్యాసములను ఆయాశాస్త్రములందు ఇటీవల కలిగిన అభివృద్ధి దృష్ట్యా పునర్వ్యవస్థీకరణముచేసి ముద్రింపవలసియుండును లేకున్నచో విజ్ఞానముదారివేరు గ్రంథముదారి వేరు కాగలదు

పరిశిష్ట సంపుటములు ఒకటి రెండైనను సమకూర్పవలసిన ఆవశ్యకత ఎంతేనియుకలదు కార్యారంభమునందు విజ్ఞానకోశమున ఉండవలసిన విషయములను (Subjects and Topics) నిర్ణయించియుంటిమి వానిలో కొన్ని రచయితలనుండి రాకుండుటచే విడిచివేయవలసివచ్చినది గ్రంథము అకారాది క్రమమున కూర్పబడియుండుటచే ఉచితస్థానమునందు రాని వ్యాసములను విధిలేక విడువ వలసినవారమైతిమి ఇట్టి వానిని అన్నింటిని క్రోడీకరించి వ్యాసములు వ్రాయించి మేము పెట్టుకొనిన పరిమిత పరిధియందైనను సమగ్రత సాధించుటకొరకు పరిశిష్ట సంపుటమొకటియో రెండో అపరిహార్యము అగుచున్నవి ఇది యిట్లుండ ఒక్కొక్క మహాశాస్త్రమునకు నిరంకుశముగా ఇన్నిశీర్షికలు అని నిర్ణయించుట మాత్రము ఏమంత ఉచితము ఏమంత వివేకము అను ప్రశ్నలు ఉదయింపక మానవు పదునెనిమిది సంవత్సరముల వెనుక తెలంగాణమునందు మేమీమహోద్యమమును ఆరంభించినపుడు అసలు దానిని సంపూర్ణముగ అమలు చేయగలమను ధైర్యము మాకే లేకుండెను కొందరు హితచింతకులను అట్లే భావించిరి "సూరన్నేమి! గరిసెడు కొట్టులేమి! అను సామెత కు చక్కని లక్ష్యముగా ఉంటిమి కానిస్వాతంత్ర్యానంతరము దేశభాషలకు నవజీవన వికాసము కలిగినది మాశక్తియుక్తులతో సంబంధములేకుండగనే విజ్ఞానకోశము ఈవాగలిని ఎద్దులుగట్టకుండ సరస్వతియే లాగుకొనివచ్చినది అంతవరకును మేలే అయినది

భవిష్యత్తునందును ఇది యిట్లే దైవాధీనము బస్సువలెనే ఉండవలెనా? ప్రధానోద్దేశము పూర్తి అయినది కనుక ముందు కార్యజాతమునకు విజ్ఞానకోశసమితి తనకాళ్లమీద తాను నిలబడవలెను అను సూత్రము నిరాక్షేపము మేమునుదానిని అంగీకరింతుము అయినను ప్రకారణమునో మనదేశమునందట్టి శుభసమయము ఆసన్నముకాలేదు సంస్థలు తమకాళ్లమీద తాము నిలబడగల సత్తువను ప్రభుత్వముకాని ప్రజలుకాని కల్పింపగలరు ఉద్గ్రంథములను ఉపయుక్త గ్రంథములను ధారాళముగ కొనిపెట్టుకొను విద్యాచైతన్యము దేశమునందింకను బాగుగా పొటమరించలేదు కావున సదుద్యమముల సృష్టి బాధ్యతతోపాటు స్థితిబాధ్యతయు ప్రభుత్వముల మీదనే వ్రాలుచున్నది

పరిశిష్ట సంపుటములను గూర్చి ఆలోచించుచున్నప్పుడు మరియొక అంశమును గుర్తించుకొనదగును పరిమిత సంఖ్యగల శీర్షికలను మాత్రమే చేపట్టి ఒక్కొక్క మహావిజ్ఞాన విభాగమును చాలీచాలని అంగరఖాలో ఇముడ్చుటకు యత్నించితిమి ఇప్పుడైనను ఆశాస్త్రదేహమును నిండు అంగరఖాలో ఉంచుట ఈతరమువారికిని రాగలతరమువారికిని ఉపకారకము కాగలదు అట్లు స్థానసంకోచముచే విడువబడిన శీర్షికలను స్థలసంకోచముచే పరిగణనకు తీసికొనబడని శీర్షికలను పరిశిష్ట సంపుటములకు మూలముకాగలవు ఇట్లు చేయుటచే ఈప్రచురణకు పుష్టియు, కొంతవరకైనను సమగ్రతయు చేకూరునని ఆశించుచున్నాము

విజ్ఞానకోశముయొక్క ముఖ్యలక్ష్యము ప్రాచీన విజ్ఞానమును ఆధునిక విజ్ఞానమును సామాన్యపాఠకునకు అందుబాటులోనికి తెచ్చుటయైయున్నది విజ్ఞానమునందును సాహిత్యరీతియు శాస్త్రరీతియు ఉండవచ్చునని గుర్తించి వానికి ప్రతీక

లుగా పూర్ణకుంభకోను విద్యుత్తు ఘటనను చేకూర్చిన భారతీయ జ్ఞానవాహిని చిహ్నము పూర్ణకుంభము. పాశ్చాత్య విజ్ఞానచిహ్నము విద్యుత్ఘటము ఈసంపుటముల లోని అట్టమీద ముద్రితమైన ఫలకమునకు ఇదియే అంతరార్థము ఈ ఎనిమిది సంపుటములందును కూర్చబడిన వ్యాసముల విభజన మిట్లున్నది

| | |
|---|---|
| వాఙ్మయము-కళలు | 519 |
| భౌతికశాస్త్రములు | 452 |
| ఇంజనీరింగు టెక్నాలజీ | 5 |
| సాంఘికశాస్త్రములు | 184 |
| ఆంధ్రదేశమును గూర్చిన విశేషశీర్షికలు | 309 |
| ఇతరములు | 105 |
| మొత్తము | 1574 |

సంపుటము లందలి భాష సులభగ్రాంథికము పారిభాషిక పదములను ప్రసిద్ధమైన వాటినే మారచయితలు వాడిరి అన్యభాషాపదములను లేఖినితో వ్రాయు మను భాండ మునకు లోనుగాక ప్రచారములోనికి వచ్చిన అన్యభాషాపదములను వారు యథాతథముగ వాడి తమ ఉచితజ్ఞతను ప్రకటించిరి మొత్తముమీద విశ్వవిద్యాలయ శ్రేణిలోగూడ మాతృభాష ద్వారా విద్యాబోధనము చేయుటకును విద్యను పరిగ్రహించుటకును గురుశిష్యులుభయులకును సంగ్రహ ఆంధ్రవిజ్ఞానకోశ సంపుటము లు చక్కగ తోడ్పడగలవని మాదృఢవిశ్వాసము అదియైన పాఠకులే ప్రమాణము

ఎనిమిదవ సంపుటమునందు 'అగ్నిద్వీపములు' మొదలుకొని హోమియోపతివైద్యము వరకు గల 258 వ్యాసములు కూర్చబడినవి అందలి వివరములు

| | | | |
|---|---|---|---|
| వాఙ్మయము-కళలు | — 83 | సాంఘికశాస్త్రములు | — 82 |
| భౌతికశాస్త్రములు | — 66 | ఆంధ్రదేశమును గూర్చిన విశేషశీర్షికలు | — 86 |
| ఇంజనీరింగు టెక్నాలజీ | — 4 | ఇతరములు | — 10 |

ధనాభావముచే ఈసంపుటమునందు వర్ణచిత్రములను కోరినంతగా చేయలేకపోయితిమి అందుకు చింతించుచున్నాము

ఉద్యమ ప్రగతి కాలము: 1958 వ సంవత్సరమునందు ప్రారంభింపబడిన ఉద్యమము మొదటి 5 సంవత్సరములును నిధి సేకరణమునందును మొదటి సంపుటమును ముద్రించుటలోను గడచినది ఆయాసంపుటముల ప్రకాశనకాలము ముద్రణాలయముల వివరములు ఇట్లున్నవి:

| | | | | | |
|---|---|---|---|---|---|
| మొదటి సంపుటము | — | జులై | 1958 | — | అజంతా ప్రింటర్సు |
| రెండవ | — | సెప్టెంబరు | 1960 | — | |
| మూడవ ,, | — | జులై | 1962 | — | |
| నాల్గవ ,, | — | నవంబరు | 1964 | — | స్వరాజ్యప్రెస్సు |
| ఐదవ | — | డిసెంబరు | 1966 | — | శివాజీ ప్రెస్సు |
| ఆరవ ,, | — | మార్చి | 1969 | | ఆంధ్ర రచయితల సహకారసంఘ ముద్రణాలయము(లి) |
| ఏడవ | — | ఫిబ్రవరి | 1970 | — | ,, |
| ఎనిమిదవ | — | ఏప్రిల్ | 1971 | — | ,, |

కాలవ్యవధిని విశ్లేషణచేసి చూడగా సంపుటము ఒక్కంటికి సగటున 2 సంవత్సరములు పట్టిన ట్లు కన్పించుచున్నది వ్యయము సంపుటము ఒక్కంటికి రు 50,000/- అయినది సంపుటము ఒక్కంటికి మరియొక పదినేలు ఖర్చుచేయగలిగినచో

అవి యింకను సుందరముగను సమగ్రముగను ఉండియుండును. మనోరథానామగతిర్నవిద్యతే.

ప్రకృతము సంగ్రహాంధ్ర విజ్ఞానకోశ సమితి యొక్క స్థితిని నిర్వృత్త విజయుడైన ఒక సేనాని పరిస్థితితో పోల్చవచ్చును. అతడిప్పుడే శత్రువుమీద పరిమితవిజయమును సాధించియున్నాడు. ఇచ్చట శత్రువు విజ్ఞానముయొక్క అభావమే. అవిజయనునందాతని చతురంగబలములు పలుకూటాల విసరించియున్నవి. రణపరిశ్రమచే నిస్సత్తువతో ఉన్నవి. వాటినన్నిటిని సమీకరించుకొని క్రొంగ్రొత్త బలముతో పుంజుకొనునట్లు చేయవలసియున్నది. అవశిష్ట కార్యములను సమాప్తినొందింపవలసియున్నది.

మంచిది. అట్లైనపుడు! ఆంధ్రమహాజనుల ఆదేశమునకు విధేయతతో వేచియుండుటయే. వారేమి ఆదేశింతురో! యున్నట్టి విజ్ఞానకోశమునే చేయుమందురో సామాజికశాస్త్రములకుగాని ప్రకృతిశాస్త్రములకుగాని ప్రత్యేక విజ్ఞానకోశములు సంసిద్ధము చేయుమందురో కాలమే ప్రకటింపవలెను. పొందికగా ఉండుటయు కోరదగినదియే. ఆంగ్ల మహాకవి మిల్టను చెప్పినట్లు "They also serve who stand and wait". ఆదేశమును ఎదురుచూచుచు ఓర్పుతో వేచియుండువారును సేవించినవారేయగుదురు.

పదునెనిమిది సంవత్సరముల నుండి అవిచ్ఛిన్నముగా తోడ్పడిన ప్రాజ్ఞలోకమునకంతకును విజ్ఞానకోశసమితి కృతజ్ఞతలు సమర్పించుచున్నది. విశ్వాసానురాగములతో వెంటనుండిన చిన్నలకు ఆశీస్సులందించుచున్నది.

"పూర్ణమసు పూర్ణంమే భూయాత్"

విరోధికృతుసంవత్సర<br>
శ్రీరామనవమి<br>
3—4—1971<br>
విద్యానగరం<br>
హైదరాబాదు – 44

ఖండవల్లి లక్ష్మీరంజనం<br>
కార్యదర్శి

# కార్యనిర్వాహకవర్గము

| | | |
|---|---|---|
| 1 | అధ్యక్షులు | డాక్టరు మఱ్ఱి చెన్నారెడ్డి<br>తార్నాక హైదరాబాదు |
| 2 | ఉపాధ్యక్షులు | డాక్టరు డి సదాశివరెడ్డి ఎం ఏ (Oxon)<br>మాజీ ఉపాధ్యక్షులు ఉస్మానియా విశ్వవిద్యాలయము హైదరాబాదు |
| 3 | ,, | ప్రొఫెసరు మామిడిపూడి వేంకటరంగయ్య ఎం ఏ,<br>మాజీ ప్రొఫెసరు ఆంధ్ర బొంబాయి విశ్వవిద్యాలయములు సికింద్రాబాదు |
| 4 | ,, | శ్రీ ముళ్ళపూడి తిమ్మరాజు చౌదరి<br>జమీందారు తణుకు పశ్చిమ గోదావరిజిల్లా |
| 5 | కార్యదర్శి : | ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం ఎం ఏ<br>యు జి సి ప్రొఫెసరు ఉస్మానియా విశ్వవిద్యాలయము హైదరాబాదు |
| 6 | సంయుక్తకార్యదర్శి | డా బి రామరాజు ఎం ఏ, పి హెచ్ డి,<br>ప్రొఫెసరు తెలుగు శాఖాధ్యక్షులు పోస్టుగ్రాడ్యుయేట్ సెంటరు వరంగల్లు |
| 7 | కోశాధికారి : | "బ్రాహ్మీభూషణ 'శిరోమణి' శ్రీ చెలమచర్ల రంగాచార్యులు, రీడరు,<br>తెలుగుశాఖ ఆర్ట్సు కళాశాల ఉ విశ్వవిద్యాలయము హైదరాబాదు |
| 8 | సభ్యులు | గౌ డాక్టరు బెజవాడ గోపాలరెడ్డి,<br>గవర్నరు, ఉత్తరప్రదేశ్ |
| 9 | ,, | డాక్టరు రావాడ సత్యనారాయణ,<br>ఉపాధ్యక్షులు ఉస్మానియా విశ్వవిద్యాలయము హైదరాబాదు |
| 10 | ,, | శ్రీ పి వి జి రాజు, ఎం ఎల్ ఎ<br>పూర్వామాత్యులు, ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వము హైదరాబాదు |
| 11 | ,, | శ్రీ ఎమ్ ఆర్ అప్పారావు,<br>పూర్వామాత్యులు ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వము హైదరాబాదు |
| 12 | ,, | శ్రీ ఎస్ బి పి పట్టాభిరామారావు, ఎం ఎల్ సి<br>పూర్వామాత్యులు, ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వము, హైదరాబాదు |

| | | |
|---|---|---|
| 13 | సభ్యులు | డాక్టరు ఎస్ వెంకటేశ్వరరావు ఎమ్ డి,<br>హార్డికర్ బాగ్ హైదరాబాదు - 29 |
| 14 | ,, | శ్రీ బి వి సుధాకరరావు, ఎం ఏ ఎం ఎల్ సి<br>బేగంపేట హైదరాబాదు - 16 |
| 15 | ,, | శ్రీ కల్వ సూర్యనారాయణగుప్త,<br>వర్తకులు సద్దెంబరు బజారు హైదరాబాదు |
| 16 | ,, | శ్రీ కె వి నరసింహాచార్యులు<br>హార్డికర్ బాగ్ హిమాయత్‌నగర్ హైదరాబాదు - 29 |
| 17 | ,, | శ్రీ టి హయగ్రీవాచారి,<br>తెలంగాణా ప్రాంతీయసంఘ పూర్వాధ్యక్షులు వరంగల్లు |
| 18 | ,, | శ్రీమతి సంగం లక్ష్మీబాయమ్మ<br>ఇందిరా సేవాసదనము సైదాబాదు, హైదరాబాదు - 16 |
| 19 | ,, | శ్రీ వి పి రాఘవాచారి ఎమ్ ఎల్ సి,<br>హైదరాబాదు |
| 20 | ,, | శ్రీ కె వి నారాయణరెడ్డి,<br>సాంఘిక ప్రజా శిక్షా న్యాయశాఖామాత్యులు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము హైదరాబాదు |
| 21 | , | శ్రీ ఖండవల్లి బాలేందుశేఖరం, ఎమ్ ఏ<br>ప్రిన్సిపాల్ ఎస్ వి ఆ ఎస్ తెలుగు కళాశాల విద్యానగర్ హైదరాబాదు-44 |
| 22 | ,, | డాక్టరు పోణంగి శ్రీరామ అప్పారావు ఎం ఏ, పి హెచ్ డి<br>డైరెక్టర్ తెలుగు అకాడమీ హిమాయత్‌నగర్ హైదరాబాదు-29 |
| 23 | ,, | శ్రీ బి వి సుబ్రహ్మణ్యం, బి ఏ బి ఎల్<br>అడ్వకేట్ జనరల్ ఆంధ్ర ప్రదేశము హైదరాబాదు |
| 24 | ,, | డాక్టరు డి వి సుబ్బారెడ్డి<br>సెక్రటరీ తెలుగుభాషాసమితి అశోక్‌నగర్ హైదరాబాదు 20 |



## సంపాదకీయవర్గము

| క్ర సం | విషయము | సంపాదకులు |
|---|---|---|
| 1 | భాష, సారస్వతములు, లిపి | ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం, ఎం ఏ<br>రిటైర్డ్ ప్రొఫెసరు ఉస్మానియా<br>విశ్వవిద్యాలయము హైదరాబాదు - 44 |
| 2 | చరిత్ర | శ్రీ ఖండవల్లి బాలేందుశేఖరం ఎం ఏ,<br>ప్రిన్సిపాల్ ఎ వి కె ఎస్ తెలుగు<br>కళాశాల హైదరాబాదు - 44 |
| 3 | తత్త్వశాస్త్రము | డాక్టరు సయ్యద్ వహీదుద్దీన్<br>ఆచార్యులు ఉ వి హైదరాబాదు - 7<br>&<br>డాక్టరు శ్రీపాటి శ్రీదేవి ఎం ఏ పి హెచ్ డి,<br>రిటైర్డు ప్రిన్సిపాల్ మహిళా కళాశాల ఉ వి<br>678/4 ఖైరతాబాద్ హైదరాబాదు - 4 |
| 4 | భూగోళశాస్త్రము | 'సాహిత్యరత్న' బి ఎన్ చతుర్వేది ఎం ఏ,<br>రీడర్ భూగోళశాస్త్రశాఖ ఉ వి హైదరాబాదు - 7<br>&<br>శ్రీ వి విద్యానాథ్ ఎం ఏ,<br>భూగోళశాస్త్రశాఖ ఉ వి హైదరాబాదు - 7 |
| 5 | అర్థశాస్త్రము | డాక్టరు భాపల్లి విశ్వేశ్వరరావు ఎం ఏ పి హెచ్ డి<br>నారాయణగూడ హైదరాబాదు - 29 |
| 6 | మానవశాస్త్రము, సాంఘికశాస్త్రము | శ్రీ జి వి సుధాకరరావు, ఎం ఏ,<br>బేగంపేట హైదరాబాదు - 16 |
| 7 | రాజనీతిశాస్త్రము | ఆచార్య మామిడిపూడి వెంకటరంగయ్య, ఎం ఏ,<br>మాజీ ప్రొఫెసరు ఆంధ్ర బొంబాయి విశ్వవిద్యాలయములు,<br>81 మారేడుపల్లి సికింద్రాబాదు - 26 |
| 8. | మతములు | శ్రీ గరికపాటి లక్ష్మీకాంతయ్య, ఎం ఏ<br>రిటైర్డు లెక్చరర్<br>విద్యానగర్ హైదరాబాదు - 44 |

| | | |
|---|---|---|
| 9 | సంగ్రామశాస్త్రము | ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం ఎం ఏ<br>విద్యానగరము హైదరాబాదు - 44 |
| 10 | క్రీడలు | శ్రీ బి టి వెంకటాచారి<br>భౌతికశాస్త్రశాఖ ఉ వి హైదరాబాదు 7 |
| 11 | వార్తాశాస్త్రము | శ్రీ యన్ నరోత్తమరెడ్డి ఎం ఏ<br>నారాయణగూడ హైదరాబాదు 29 |
| 12 | న్యాయశాస్త్రము | శ్రీ వల్లూరి వెంకటేశ్వర్లు బి ఏ బి ఎల్<br>అడ్వకేట్ సుప్రీంకోర్టు కొత్తపేట హైదరాబాదు |
| 13 | వాణిజ్యశాస్త్రము | శ్రీ మొక్కపాటి శివాజీ ఎం ఏ<br>రీడర్ ఆర్థిక శాస్త్రశాఖ ఆర్ట్స్ & సైన్సు కళాశాల వరంగల్లు |
| 14 | వినోదములు | శ్రీ పోతుకూచి సాంబశివరావు బి ఏ, ఎల్ ఎల్ బి,<br>అధ్యక్షులు ఆంధ్ర విశ్వసాహితి<br>20H న్యూబోయిగూడ సికింద్రాబాదు - 3 |
| 15 | యాత్రలు, అన్వేషణము | శ్రీ దేవులపల్లి రామానుజరావు బి ఏ ఎల్ ఎల్ బి,<br>కార్యదర్శి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ హైదరాబాదు |
| 16 | శిల్ప | డాక్టరు రాయప్రోలు సుబ్రహ్మణ్యం<br>సూపరింటెండింగ్ ఆర్కియాలజిస్టు<br>భారత ప్రభుత్వ పురాతత్త్వశాఖ హైదరాబాదు - 7 |
| 17 | గానశాస్త్రము | శ్రీ పుచ్చా వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి,<br>విజిటింగ్ ప్రొఫెసర్ & రిసెర్చి ఆఫీసర్ ప్రభుత్వ నృత్య<br>గాన కళాశాల, కింగ్ కోఠీరోడ్డు హైదరాబాద్ - 1 |
| 18 | చిత్రకళ | శ్రీ కె శేషగిరిరావు,<br>ఉపన్యాసకులు ప్రభుత్వ లలిత కళాశాల హైదరాబాదు |
| 19 | నృత్యకళ | శ్రీ నటరాజ రామకృష్ణ బి ఏ<br>డైరెక్టర్ నృత్యకళానికేతనము హైదరాబాదు |
| 20 | వాస్తువిద్య | డాక్టరు ఎం రాధాకృష్ణశర్మ, ఎం ఏ, పి హెచ్ డి<br>చరిత్రశాఖ, ఉ వి హైదరాబాదు - 7 |
| 21 | గణితశాస్త్రము | శ్రీ రాఘవేంద్రరావు, ఎం ఏ,<br>అధ్యక్షులు, గణితశాస్త్రశాఖ ఉ వి హైదరాబాదు - 7 |

| | | |
|---|---|---|
| 22 | భౌతికశాస్త్రము | డాక్టరు రావాడ సత్యనారాయణ<br>ఉపాధ్యక్షులు ఉస్మానియా విశ్వవిద్యాలయము హైదరాబాదు 7 |
| 23 | రసాయనశాస్త్రము | డాక్టరు నందూరి వెంకటసుబ్బారావు డి ఎస్ సి<br>నేషనల్ సైన్సుకళాశాల ఉ వి హైదరాబాదు 7 |
| 24 | వృక్షశాస్త్రము | శ్రీ బి వి రమణరావు ఎం ఎస్ సి<br>రీడరు వ్యవసాయకళాశాల<br>రాజేంద్రనగరు హైదరాబాదు 31 |
| 25 | జంతుశాస్త్రము | శ్రీ వి జగన్నాథరావు ఎం ఎస్ సి<br>జంతుశాస్త్రోపన్యాసకులు ఉ వి హైదరాబాదు-7<br>&<br>డాక్టరు పి నారాయణరావు ఎం ఎస్ సి<br>జంతుశాస్త్రోపన్యాసకులు ఉ వి<br>హైదరాబాదు-7 |
| 26 | భూగర్భశాస్త్రము | డాక్టరు కె వి రావు<br>భారత భూగర్భశాస్త్రశాఖ హైదరాబాదు<br>&<br>డాక్టరు ఎస్ బాలకృష్ణ<br>అసిస్టెంటు డైరెక్టరు నేషనల్ జియోఫిజికల్<br>రిసెర్చి ఇన్‌స్టిట్యూట్ హైదరాబాదు-7 |
| 27 | ఖగోళశాస్త్రము | డాక్టరు చేతనభట్ల విశ్వనాథం ఎం ఏ, పి హెచ్ డి<br>గణితశాస్త్ర శాఖాధ్యక్షుడు పోస్టు గ్రాడ్యుయేట్<br>సెంటరు వరంగల్లు<br>&<br>డాక్టరు ఎం బాలకృష్ణశర్మ ఎం ఏ పి హెచ్ డి<br>రీడరు ఖగోళశాస్త్రశాఖ ఉ వి హైదరాబాదు-7 |
| 28 | వైద్యశాస్త్రము | డాక్టరు ఎస్ వెంకటేశ్వరరావు ఎం డి<br>హార్డికర్ బాగ్ హైదరాబాదు-29 |
| 29 | స్థాపత్యము | శ్రీ వల్లూరి సుబ్బరాజు<br>అగ్రికల్చరల్ ఇంజనీరు హైదరాబాదు<br>&<br>స్వర్గీయ ప్రొఫెసరు వి వి ఎల్ రావు,<br>18 సెకండు మెయిన్ రోడ్డు గాంధినగరు<br>అడయార్ మద్రాసు-20 |

30 వ్యవసాయశాస్త్రము — శ్రీ కంభంపాటి భాస్కరము డి ఎస్ స
వ్యవసాయకళాశాల రాజేంద్రనగరు హైదరాబాదు-31

31 సంఖ్యాకశాస్త్రము — శ్రీ డి వి ఎస్ ద్వారక ఎం ఎస్ సి
రీడరు గణితశాస్త్రశాఖ ఉ వి హైదరాబాదు-7

32 మానసికశాస్త్రము — ఆచార్య కె వేదాంతాచారి ఎం ఏ ఎం ఇ డి,,
విద్యాతత్త్వకళాశాల ఉ వి హైదరాబాదు-7

33 విద్యాశాస్త్రము — శ్రీ సత్తిరాజు కృష్ణారావు ఎం ఏ ఎం ఇ డి
హైదరాబాదు

34 వాతావరణశాస్త్రము — డాక్టరు ఎన్ రాజేశ్వరరావు ఎం ఎస్ స ప హెచ్ డి
రీడరు భౌతికశాస్త్రశాఖ ఉ వి హైదరాబాదు-7

35 వివిధములు — డాక్టరు టి సత్యనరసింహామూర్తి ఎం ఎస్ స పి హెచ్ డి
రీడరు భౌతికశాస్త్రశాఖ ఉ వి హైదరాబాదు-7

36 ఆంధ్రదేశము, విశేష శీర్షికలు — పండిత ఆదిరాజు వీరభద్రరావు
కార్యదర్శి లక్ష్మణరాయ పరిశోధకమండలి
78 అజంపుర హైదరాబాదు-24

37 ఆయుర్వేదము — స్వర్గీయ వేదాల తిరుమల వేంకట రామానుజస్వామి
ఆయుర్వేద కళామందిరం లింగంపల్లి హైదరాబాదు-27

38 భారతీయప్రాచీనవిద్యలు, కళలు — శిరోమణి చెలమచర్ల రంగాచార్యులు
రీడరు తెలుగుశాఖ ఆర్ట్సుకళాశాల ఉ విశ్వవిద్యాలయము హైదరాబాదు

39 పశువైద్యశాస్త్రము — డాక్టరు స వెంకటేశ్వరరావు
రీడరు, వెటిరినరీ కాలేజి ఉ వి హైదరాబాదు-7

40 టెక్నాలజి — డాక్టరు రామలి గం కపర్ది
ప్రొఫెసరు, కెమికల్ టెక్నాలజీశాఖ ఉ వి
హైదరాబాదు-7

41 రాజ్యపాలనాశాస్త్రము — ఆచార్య మామిడిపూడి వెంకట రంగయ్య ఎం ఏ

# రచయితలు

| క్రమ సం | పొడిఅక్షరములు | వ్యాసరచయిత | వ్యాసము | పుట |
|---|---|---|---|---|
| 1 | ఆ వీ | శ్రీ ఆదిరాజు వీరభద్రరావు<br>కార్యదర్శి లక్ష్మణరాయ పరిశోధక మండలి<br>ఆజంపుర హైదరాబాదు | 1 కరీంనగరుజిల్లా<br>2 శేషాద్రి రమణ కవులు<br>3 హైదరాబాదుజిల్లా | 63<br>625<br>759 |
| 2 | ఆర్ బి కె పా | డా॥ ఆర్ బి కె పారక్<br>ఎం బి బి ఎస్<br>ప్రిన్సిపాల్ జయసూర్య హోమియోపతి కళాశాల<br>కాచిగూడ హైదరాబాదు | హోమియోపతివైద్యము | 764 |
| 3 | ఆర్ రా | శ్రీ ఆర్ రాఘవేంద్రరావు<br>ఎమ్ ఏ<br>గణితశాస్త్రశాఖాధ్యక్షులు ఉస్మానియా<br>విశ్వవిద్యాలయం హైదరాబాదు | లాప్లాస్ | 10 |
| 4 | ఆర్ రా | ప్రొఫె ఆర్ రామనాథం,<br>ఎం ఎస్ సి ఎం ఐ ఆర్ యి<br>వాతావరణశాస్త్ర శాఖాధ్యక్షులు ఆంధ్ర<br>విశ్వవిద్యాలయము వాల్తేరు | 1 సముద్రప్రవాహములు - పవనములు<br>2 సముద్రములు - వాతావరణము | 593<br>601 |
| 5 | ఆర్ వి రా | డా ఆర్ వి రావు,<br>ఎం ఏ, పి హెచ్ డి<br>నారాయణగూడ హైదరాబాదు | 1 లాభముల సమస్య<br>2 సహకార సంస్థలు | 11<br>624 |
| 6 | ఆర్ స రె | శ్రీ ఆర్ సత్యనారాయణరెడ్డి, ఎం ఏ,<br>భూగోళశాస్త్ర అధ్యాపకులు డి ఎన్ ఆర్<br>కాలేజి భీమవరం పశ్చిమగోదావరిజిల్లా | వెనిజులా | 323 |
| 7 | ఆర్ సూ | శ్రీ ఆర్ సూర్యనారాయణమూర్తి<br>ఎం ఏ బి ఇడి,<br>ప్రిన్సిపాల్ ఎస్ సి ఐ ఎమ్ గవర్నమెంటు<br>కళాశాల, తణుకు, పశ్చిమగోదావరిజిల్లా | 1 వంగదేశ చరిత్ర<br>2. సోవియట్ రష్యా చరిత్ర | 43<br>855 |
| 8 | ఉ ల | శ్రీ ఉద్పుటూరి లక్ష్మణాచార్య, ఎం కాం<br>లెక్చరర్, సాయంకాలకళాశాల, సికింద్రాబాదు. | వ్యాపారపు లెక్కలు | [illegible] |

| క్ర సం | పొడి అక్షరములు | వ్యాసరచయిత | వ్యాసము | పుట |
|---|---|---|---|---|
| 9 | ఎ చెం | శ్రీ ఎ చెంచయ్య ఎం ఏ, చారిత్రక పరిశోధకులు ఎస్ వి ఎస్ తెలుగు కళాశాల విద్యానగర్ హైదరాబాదు-44 | 1 సుమిత్ర (చ)<br>2 హొలెండు (చ) | 667<br>787 |
| 10 | ఎ కె డి | శ్రీ ఎ కె దీక్షిత్ ఎం డి డి సి హెచ్ శిశురోగ చికిత్సకులు బాంబాగ్‌రోడ్డు, హైదరాబాదు | శిశురోగములు – శిశు పోషణము (ఆంగ్లవైద్యము) | 515 |
| 11 | ఎన్ రా | డా ఎన్ రామయ్య, రీడర్ వృక్షశాస్త్రశాఖ, ఉస్మానియా విశ్వవిద్యాలయము హైదరాబాదు | వృక్షమూలములు | 805 |
| 12 | ఎన్ ఎస్ భా | డా ఎన్ ఎస్ భాస్కరరావు, ఇండియా మెటిరియాలాజికల్ డిపార్టుమెంటు పూనా (మహారాష్ట్రము) | 1 వాయుగుండములు- సుడిగాలులు<br>2 వాయుపీడన విధానములు | 102<br>107 |
| 13 | ఎన్ సి ఎస్ వేం | శతావధాని శ్రీ ఎన్ సి ఎస్ వేంకటాచార్యులు, తెలుగు అకాడమీ నారాయణ్‌నగర్ హైదరాబాదు | సంస్కృత వ్యాకరణ శాస్త్ర చరిత్ర | 578 |
| 14 | ఎమ్ కు | డా ఎమ్ కులశేఖరరావు, ఎం ఏ పి హెచ్ డి రీడర్ తెలుగుశాఖ సాయంకళాశాల హైదరాబాదు | వెంకటపతిరాయలు (రెండవ) | 880 |
| 15 | ఎస్ ఎమ్ అ | డా ఎస్ ఎమ్ అల్లాఉద్దీన్ & | 1 విశ్వజననవాదము | 274 |
| 16 | తి కృ దే | శ్రీ తిరుమల కృష్ణదేశికాచార్యులు ఖగోళశాస్త్రశాఖ ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు | 2 విశ్వనిర్మితి | 278 |
| 17 | ఎస్ వే రా | డా ఎస్ వేంకటేశ్వరరావు ఎం డి, హార్డికర్ బాగ్ హిమాయత్‌నగర్ హైదరాబాదు | 1 వైద్యశాస్త్రచరిత్ర<br>2 సంపారనియంత్రణము<br>3 సుఖరోగములు<br>4 హృదయము | 408<br>570<br>661<br>745 |
| 18 | బి సాం | శ్రీ బి సాంబశివరావు, ఎం ఎస్ సి, ఎగ్రానమిస్టు & హెడ్ ఫెలో, వ్యవసాయకళాశాల బాపట్ల గుంటూరుజిల్లా | వస్త్రపరిగ్గీకరణము | 622 |
| 19 | తి స మూ | శ్రీ తిరుగంటి సత్యనారాయణమూర్తి, ఎమ్ ఏ, చారిత్రకోపన్యాసకులు | 1 వర్తమాన రాజకీయ సిద్ధాంతములు | 72 |

| క్రమ సం. | పొడి అక్షరములు | వ్యాసకర్త | వ్యాసము | పుట |
|---|---|---|---|---|
| | | | 2 విదేశాంగ నీతి - రాజ్యము | 181 |
| | | | 3 శ్రీముఖ శాతవాహనుడు | 546 |
| | | | 4 సముద్రగుప్తుడు | 697 |
| 20 | కె ఎస్ సూ | డా కె ఎస్ సూర్యనారాయణ<br>19-5-9/24 బహదూర్ పుర కాలనీ<br>హైదరాబాదు-2 | వ్యవసాయ అర్థశాస్త్రము | 447 |
| 21 | కె రా శ | శ్రీ కె రామకృష్ణ శర్మ,<br>149/ S R T యాకత్‌పుర కాలనీ<br>హైదరాబాదు | వేలుపుగొండ | 853 |
| 22 | కె వి రె | శ్రీ కె విఠల్ రెడ్డి ఎం ఏ,<br>భూగోళశాస్త్రోపన్యాసకులు ఆర్ట్స్ & సైన్సు<br>కళాశాల సికింద్రాబాదు | సిరియా (భూ) | 667 |
| 23 | కే రా శా | డా కేతవరపు రామకోటి శాస్త్రి ఎం ఏ పి హెచ్ డి<br>తెలుగుశాఖ ఉస్మానియా విశ్వవిద్యాలయము<br>12-10-558 సీతాఫల్ మండి సికింద్రాబాదు | శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రి | 545 |
| 24 | కు వేం శా | డా కుప్పా వెంకట్రామ శాస్త్రి, ఎం బి బి ఎస్<br>బుట్టయ్యపేట చౌమహాలువద్ద మచిలీపట్నం,<br>కృష్ణాజిల్లా | వాపులు - వ్రణములు | 101 |
| 25 | కొం సీ ఆ | శ్రీ కొండపల్లి సీతారామాంజనేయులు<br>చింతగుంటపాలెం మచిలీపట్నం కృష్ణాజిల్లా | హరినా భూషణము | 729 |
| 26 | కో వేం | శ్రీ కోమాండూరి వేంకటాచార్యులు ఎం. ఏ,<br>రిసెర్చి ఇన్‌స్టిట్యూటు ఆంధ్రప్రదేశ చారిత్రక<br>భూగోళసర్వస్వము విద్యానగర్,<br>హైదరాబాదు | సింహాద్రిక్షేత్రము | 659 |
| 27 | కొ సో శా | శ్రీ కొల్లూరి సోమశేఖర శాస్త్రి,<br>ప్రిన్సిపాల్, సంస్కృతకళాశాల మోడేకుర్రు<br>అమలాపురం తాలూకా తూ గోదావరిజిల్లా | వైశేషికదర్శనము | 416 |
| 28 | ఖం న శా | "వ్యాకరణ శిరోమణి" శ్రీ ఖండవల్లి నరసింహ శాస్త్రి,<br>సంస్కృత కళాశాల సీతారాంబాగ్,<br>హైదరాబాదు | వేదభాష్యములు | 842 |

| క్రమసంఖ్య | పొడి అక్షరములు | వ్యాసకర్త | వ్యాసము | పుట |
|---|---|---|---|---|
| 29 | ఖం. శా. శే. | శ్రీ ఖండవల్లి శాలివాహనశేఖరం ఎం. ఏ. ప్రిన్సిపల్ ఎస్. వి. ఇ. ఎస్. తెలుగుకళాశాల విద్యానగర్ హైదరాబాదు-44 | వెలుగోటి వంశము | 327 |
| 30 | ఖం. ల. | ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం ఎం. ఏ., యు. జి. సి. ప్రొఫెసర్ ఉస్మానియా విశ్వవిద్యాలయము విద్యానగర్ హైదరాబాదు-44 | 1 విజయగాథ | 167 |
| | | | 2 సర్వజ్ఞ సింగభూపాలుడు | 308 |
| 31 | గ. రా. శ. | శ్రీ గడియారం రామకృష్ణశర్మ అలంపురం (పోస్టు) మహబూబ్‌నగర్ జిల్లా (ఆం. ప్ర.) | 1 వాస్తుప్రమేయము | 131 |
| | | | 2 వాస్తుభావవికాసము | 135 |
| | | | 3 వాస్తువు - మతము | 141 |
| | | | 4 విద్యారణ్యస్వామి | 208 |
| 32 | గ. వేం. జో. | శ్రీ గడియారం వేంకటజోగారావు ఎం. ఏ. ఎల్. ఎల్. బి. సి. యస్. ఆంగ్లభాషాధ్యాపకులు ఎస్. ఎస్. ఎన్. కాలేజి నర్సారావుపేట గుంటూరుజిల్లా | 1 వర్జిల్ | 75 |
| | | | 2 విలియమ్ వర్డ్స్‌వర్త్ | 551 |
| | | | 3 షెల్లీ పి. బి. షెల్లీ | 563 |
| | | | 4 షేక్స్‌పియర్ | 666 |
| | | | 5 హోమర్ | 762 |
| 33 | గ. ల. | శ్రీ గరికపాటి లక్ష్మీకాంతయ్య ఎం. ఏ., పూర్వసంస్కృత అధ్యాపకులు విద్యానగర్ హైదరాబాదు-44 | హర్షవర్ధనుడు | 732 |
| 34 | చా. వెం. హ. | స్వర్గీయ శ్రీ చావలి వెంకట హనుమంతరావు, జర్నలిస్టు విద్యానగర్ హైదరాబాదు-44 | 1 వార్తాపత్రికలు-ప్రకటనలు | 110 |
| | | | 2 వార్తాపత్రికలు - సమాజ జీవితము | 112 |
| | | | 3 వార్తాసంస్థలు | 114 |
| | | | 4 వార్తాసేకరణము | 116 |
| 35 | చి. దా. శా. | శ్రీ చిట్టా దామోదరశాస్త్రి ఎం. ఏ., లెక్చరర్ తెలుగుశాఖ వెంకటేశ్వర విశ్వవిద్యాలయము, తిరుపతి | వెంకటేశ్వరవిశ్వవిద్యాలయము | 394 |
| 36 | చి. భీ. | శ్రీ చిలుకూరి భీమశంకరరావు, ప్రభుత్వ సంగీత నృత్యకళాశాల మారేడుపల్లి సికింద్రాబాదు | విష్ణుదిగంబర్ పలుస్కర్ | 284 |
| 37 | చె. రం. | శిరోమణి శ్రీ చెలమచర్ల రంగాచార్యులు రీడర్, తెలుగుశాఖ ఆర్ట్సు కాలేజి ఉస్మానియా విశ్వవిద్యాలయము హైదరాబాదు | 1 విద్యాబాధుడు | 197 |
| | | | 2 విశ్వేశ్వరకవి | 281 |
| | | | 3 వైష్ణవమతము - వివిధ సంప్రదాయములు | 417 |

| క్ర సం | పొడిఅక్షరములు | వ్యాసరచయిత | వ్యాసము | పుట |
|---|---|---|---|---|
| 38 | జ పు | శ్రీ జటావల్లభుల పురుషోత్తము<br>మల్లికార్జునపేట కాకినాడ తూర్పుగోదావరిజిల్లా | వైదికమతము | 329 |
| 39 | జ మా శ | శ్రీ జమ్మలమడక మాధవరామశర్మ<br>ఉపన్యాసకులు డా కృష్ణమూర్తి సంస్కృతకళాశాల<br>3వ లైను అరండల్ పేట గుంటూరు-2 | వేదవ్యాఖ్యాతలు<br>(సంప్రదాయమతము) | 399 |
| 40 | జి ఆర్ భా | డా జి ఆర్ భాస్కర్ ఎం డి<br>ఉస్మానియా మెడికల్ కాలేజి రెసిడెన్సీ,<br>హైదరాబాదు | వైద్యధర్మశాస్త్రము<br>(ఆంగ్లవైద్యము) | 403 |
| 41 | జి వి రా | శ్రీ జి వి రావు, ఎమ్ ఎస్ సి<br>1 1/3 పెండర్ ఘాస్ట్ రోడ్డు వెంకటరావు కాలనీ<br>సికింద్రాబాదు-3 | 1 వజ్రములు<br>2 శిలలు<br>3 స్ఫటికములు - I | 56<br>506<br>103 |
| 42 | జి హెచ్ ఆర్ శ | శ్రీ జి హెచ్ ఆర్ శర్మ ఎం ఎస్ సి,<br>1-0 43 అశోకనగర్ జంతుశాస్త్రశాఖ<br>న్యూసైన్సుకాలేజి హైదరాబాదు | 1 వికారిమూత్రజీవులు<br>2 లీజ్ మెన్ అగస్ట్<br>3 శల్యవృష్ఠములు<br>4 సంధిపాదజంతువులు | 152<br>287<br>477<br>563 |
| 43 | జె వి ప్రా | శ్రీ జె వి ప్రాణేశ్వరరావు ఎం ఎస్ సి,<br>ఉపన్యాసకులు న్యూసైన్సుకళాశాల<br>2-1-4 3 నల్లకుంట హైదరాబాదు-20 | 1 శిలాజీవశేషములు<br>2 శిలాపాతాపాతి | 511<br>513 |
| 44 | జె స కా | శ్రీ జె స కామేశ్వరరావు, డి ఎస్ సి<br>1-2-5 గగన్ మహాల్ రోడ్డు హైదరాబాదు-29 | 1 విద్యుత్కణశోలనలేఖకము<br>2 విద్యుదయస్కాంత ప్రేరణము<br>3 వెంకటరామన్ చంద్రశేఖర | 223<br>227<br>317 |
| 45 | టి నా | శ్రీ టి నారాయణరావు<br>రిసెర్చి అసిస్టెంటు మనస్తత్త్వశాఖ<br>ఉస్మానియా విశ్వవిద్యాలయము హైదరాబాదు | శిలము | 520 |
| 46 | టి వి గో శా | శ్రీ టి వి గోపాలశాస్త్రి ఎం ఏ,<br>పురాతత్త్వశాఖ అడిక్ మెట్ హైదరాబాదు | 1 వాస్తువు (బౌద్ధము)<br>2 వాస్తువు (హైందవము) | 133<br>144 |
| 47 | డి శి | డా డి శివరామయ్య,<br>రీడర్ టెక్నాలజీ డిపార్టుమెంటు, ఉస్మానియా<br>విశ్వవిద్యాలయము హైదరాబాదు | వార్నిషుల టెక్నాలజీ | 113 |
| 48 | త ప్ర | శ్రీ తల్లాప్రగడ ప్రకాశరాయుడు, ఎం ఏ,<br>విద్యానగర్ హైదరాబాదు-44 | వెంకటరత్నం నాయుడు<br>రఘుపతి | 315 |

| క్ర సం | పొడిఅక్షరములు | వ్యాసరచయిత | వ్యాసము | పుట |
|---|---|---|---|---|
| 49 | తూ శి మూ | శ్రీ తూములూరి శివరామకృష్ణమూర్తి, ఎం ఏ<br>రిటైర్డు ప్రొఫెసర్ నరసరావు పేట<br>గుంటూరు జిల్లా | శ్రీకృష్ణావతారము | 594 |
| 50 | ది వేం | డా దివాకర్ల వేంకటావధాని, ఎం ఏ పి హెచ్ డి<br>తెలుగుశాఖాధ్యక్షులు ఉస్మానియావిశ్వవిద్యాలయము<br>హైదరాబాదు | 1 విజయనగరము (హంపి) | 154 |
| | | | 2 విశ్వనాథనాయకుడు | 276 |
| | | | 3 వేంగీపురము | 337 |
| | | | 4 వేటూరి ప్రభాకరశాస్త్రి | 339 |
| | | | 5 వేదము వేంకటరాయశాస్త్రి | 344 |
| | | | 6 వ్యంగ్యము-ప్రాచీన సంస్కృతాంధ్రములు | 430 |
| | | | 7 శతకములు | 457 |
| | | | 8 శతావధానము(సాష్టావధానము) | 474 |
| | | | 9 శిక్కుమతము | 508 |
| | | | 10 శుద్ధాంధ్రకావ్యములు | 528 |
| | | | 11 శ్రీరామకృష్ణపరమహంస | 547 |
| | | | 12 సోక్రటీసు | 682 |
| | | | 13 హరికథ | 727 |
| 51 | దే ఆర్ | శ్రీమతి ఆర్ దేవమ్మ, ఎం ఎస్ సి,<br>లెక్చరర్ జంతుశాస్త్రశాఖ నిజాంకాలేజి,<br>హైదరాబాదు | వలయినములు | 79 |
| 52 | ధ ప్ర | శ్రీ ధర్మేంద్రప్రసాద్, ఎం ఏ,<br>భూగోళశాస్త్రోపన్యాసకులు సాయంకళాశాల<br>హైదరాబాదు | 1 స్పెయిన్ (భూ) | 717 |
| | | | 2 హంగరి (భూ) | 719 |
| 53 | ధూ అ సో | డా ధూళిపాళ అర్కసోమయాజులు, ఎం ఏ, పి హెచ్ డి<br>ప్రిన్సిపాల్ డి ఎన్ ఆర్ కాలేజి,<br>భీమవరం, ప గోదావరిజిల్లా | వరాహమిహిరాచార్యుడు | 71 |
| 54 | న చ ర | శ్రీ నల్లాన్ చక్రవర్తుల రఘునాథాచార్యులు,<br>16-151 కరీమాబాదు రోడ్డు వరంగల్లు | 1 విశిష్టాద్వైతము | 262 |
| | | | 2 విశిష్టాద్వైతము-ఆచారములు | 264 |
| 55 | మా కృ | శ్రీ మాకల కృష్ణశాస్త్రి, ఎం ఏ,<br>అర్థశాస్త్రోపన్యాసకులు, బద్రుకాకాలేజి<br>కాచిగూడ, హైదరాబాదు-27 | 1 పద్ధి మద్య | 60 |
| | | | 2 ఓక్ సైడ్ ఫిప్ హెన్రీ | 150 |
| | | | 3 బిక్నెల్ | 157 |
| | | | 4. సిడ్ని-బీట్రిస్ దంపతులు | 654 |

| క్ర సం | పొడిఅక్షరములు | వ్యాసరచయిత | | వ్యాసము | పుట |
|---|---|---|---|---|---|
| 56 | నో నా | శ్రీ నోరి నాగభూషణం<br>3 6 518 హార్డికర్ బాగ్ హిమాయత్‌నగర్<br>హైదరాబాదు- 9 | | వాదం.కళ | 99 |
| 57 | పం ల శా | శ్రీ పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి,<br>పత్తిపాటి వారివీధి విజయనగరం | | విజయనగర సంస్థానము | 158 |
| 58 | ప గో కృ | శ్రీ పరాశరం గోపాలకృష్ణమూర్తి<br>ఎం ఏ ఎ ఇ ఎస్<br>లెక్చరర్ తెలుగుశాఖ గవర్నమెంటుకాలేజి సిద్దిపేట | 1 | వేంకటేశ్వర ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము | 333 |
| | | | 2 | వేదాద్రి | 350 |
| 59 | పు ప శా | శ్రీ పుచ్చా పరబ్రహ్మశాస్త్రి, ఎం ఏ,<br>అసిస్టెంటు డైరెక్టరు అర్కశాఖ హైదరాబాదు | 1 | లేపాక్షి | 3 |
| | | | 2 | శంకరాచార్యుడు | 408 |
| | | | 3 | హనుమకొండ | 721 |
| 60 | పు వెం | శ్రీ పుల్లాభొట్ల వెంకటేశ్వర్లు,<br>ఎం ఏ బి ఇ డి<br>తెలుగు లెక్చరర్ ప్రభుత్వకళాశాల నల్గొండ<br>ఆంధ్రప్రదేశ్ | 1 | లక్ష్మీకాంతకవి బలిజేపల్లి | 3 |
| | | | 2 | లాసాలి రాబర్ట్ కెవిలర్ | 16 |
| | | | 3 | లివింగ్‌స్టన్ డేవిడ్ | 18 |
| | | | 4 | వాలెస్ ఆల్ఫ్రెడ్ రస్సెల్ | 124 |
| | | | 5 | విశాఖపట్టణంజిల్లా | 258 |
| | | | 6 | వెంకట్రామయ్య మాధవపెద్ది | 319 |
| | | | 7 | శాలిహుండం | 434 |
| | | | 8 | శ్రీకాకుళంజిల్లా | 539 |
| | | | 9 | సుబ్బారావు బెల్లంకొండ | 663 |
| | | | 10 | సూర్యనారాయణ యడవల్లి | 691 |
| | | | 11 | హరిప్రసాదరావు | 780 |
| 61 | పు శ్రీ చం | డా పుల్లెల శ్రీరామచంద్రుడు,<br>ఎం ఏ ఎ హెచ్ డి<br>సంస్కృతశాఖ ఉస్మానియా విశ్వవిద్యాలయము<br>హైదరాబాదు | 1 | శాక్తతంత్రము | 490 |
| | | | 2 | సంస్కృతభాషావాఙ్మయచరిత్ర | 572 |
| | | | 3 | హాలుడు | 785 |
| 62 | పె లిం | ఉభయభాషా ప్రవీణ శ్రీ పెరవలి లింగయ్యశాస్త్రి,<br>5 / 1 R T సైదాబాదుకాలనీ హైదరాబాదు-36 | | వనపర్తి | 64 |
| 63 | పే సు | "సంగీతసుధానిధి' శ్రీ పేరి సుబ్బారావు,<br>లెక్చరర్ ప్రభుత్వ సంగీతనృత్యకళాశాల,<br>కింగ్‌కోటి హైదరాబాదు | 1 | వెంకటమఖి | 314 |
| | | | 2 | శ్యామాశాస్త్రి | 528 |
| 64 | పో సు శా, | డా పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి,<br>ఎం ఏ, పి హెచ్ డి,<br>ఆంగ్ల శాఖాధ్యక్షులు, నాగపూరు విశ్వవిద్యాలయం,<br>నాగపూరు, (మహారాష్ట్ర) | 1 | వ్యంగ్యము (అధునికాంగ్లము) | 444 |
| | | | 2 | షా జార్జిబెర్నార్డ్ | 556 |

| క్రమసం. పొడి అక్షరములు | వ్యాసకర్తలు | వ్యాసము | పుట |
|---|---|---|---|
| 69 బి.వి.ర. | శ్రీ బి. వి. రమణారావు ఎం.ఎస్‌సి.<br>రీడర్, ఖగోళశాస్త్రశాఖ వ్యవసాయ కళాశాల<br>రాజేంద్రనగర్ హైదరాబాదు-31 | 1 [illegible] | 563 |
| | | 2 [illegible] | 294 |
| | | 3 వృక్షములలో చోషణము | 297 |
| | | 4 వృక్షములలో శ్వాసక్రియ | 301 |
| | | 5 వృక్షశాస్త్ర చరిత్ర | 307 |
| | | 6 వృక్షశాస్త్రము | 309 |
| | | 7 శాకీయపు ఉత్పత్తి | 478 |
| 70 బి.వే. | శ్రీ బి. వేణుగోపాల్, ఎం.ఏ.<br>రిసర్చి స్కాలర్ ఖగోళశాఖ ఇ.నెం. 2-2-1133/5-3<br>అంబర్ పేట పోస్టు హైదరాబాదు-13 | హైపేషియా | 33 |
| 71 భా.ల. | శ్రీ భాగవతుల లక్ష్మీనారాయణ<br>విశ్వవిద్యా పరిషత్తు నారాయణనగర్<br>భారాలుముఖ్ గౌహతి - (అస్సాం) | శివదేవయ్య | 514 |
| 72 మం.రా.శా. | శ్రీ మంగిపూడి రామలింగశాస్త్రి,<br>కొవ్వూరు పశ్చిమగోదావరి జిల్లా | 1 లోకగీతములు-గానము | 39 |
| | | 2 సూరదాసు | 675 |
| 73 మ.అ. | శ్రీ మక్సూద్ అలీ ఎం.ఏ. ఎం.ఇ.డి.<br>మనస్తత్త్వశాస్త్రశాఖ ఉస్మానియావిశ్వవిద్యాలయం<br>హైదరాబాదు | వైయక్తికమనస్తత్త్వము | 415 |
| 74 మ.స.శా. | శ్రీ మద్దులపల్లి సత్యనారాయణశాస్త్రి,<br>ఆంధ్రోపన్యాసకులు ఎస్. ఎస్. ఎన్. కళాశాల<br>నరసరావుపేట గుంటూరుజిల్లా | 1 శ్రీశైలము | 652 |
| | | 2 సాయణాచార్యులు | 644 |
| 75 మా.వెం. | ఆచార్య మామిడిపూడి వెంకటరంగయ్య ఎం.ఏ.,<br>మాజీప్రొఫెసర్ ఆంధ్ర బొంబాయి<br>విశ్వవిద్యాలయములు 31 మారేడుపల్లి<br>సికింద్రాబాదు-26 | 1 విద్యావిధానము-బోధన విషయములు | 203 |
| | | 2 విద్యావిధానము-భారత రాజ్యాంగము | 209 |
| | | 3 వివాహములు | 243 |
| | | 4 సహకారసంఘములు-[illegible] సంఘములు | 619 |
| | | 5 సామ్రాజ్యములు | 641 |
| | | 6 సెనేట్ | 658 |
| | | 7 స్వామ్యము | 715 |
| | | 8 హెగెల్ రాజకీయతత్త్వము | 749 |
| 76 ము.బా.శ. | డా. ముక్కామల బాలకృష్ణశర్మ,<br>రీడర్, ఖగోళశాస్త్రశాఖ<br>ఉస్మానియా విశ్వవిద్యాలయము హైదరాబాదు | 1 ఉపగ్రహములు | 6 |
| | | 2 సూర్యకుటుంబము | 677 |

| క్ర సం | పొడిఅక్షరములు | వ్యాసరచయిత | వ్యాసము | పుట |
|---|---|---|---|---|
| 77 | య సిం | "యోగాసనరత్న" శ్రీ యశ్వంతసింహ, 25-బి సెయింట్ జాన్ రోడ్డు సికింద్రాబాదు-6 | హిమాలయములు | 744 |
| 78 | రాం కృ | శ్రీ రాంభట్ల కృష్ణమూర్తి, సాహిత్య కార్యకర్తలు 1-8-167 చిక్కడపల్లి, హైదరాబాదు-20 | 1 వ్యంగ్యచిత్రములు | 425 |
| | | | 2 సౌందర్యమీమాంస | 692 |
| 79 | రా సు | డా రాయప్రోలు సుబ్రహ్మణ్యం, ఎం ఏ పి హెచ్ డి, సూపరింటెండింగు ఆర్కియాలజిస్టు విద్యానగరు హైదరాబాదు | 1 శాసనములు | 485 |
| | | | 2 హరప్పాసంస్కృతి | 724 |
| 80 | లం సీ | శ్రీ లంకా సీతారామశాస్త్రి, సీనియర్ తెలుగుపండితులు మునిసిపల్ హైస్కూలు నరసరావుపేట గుంటూరుజిల్లా | వాల్మీకి | 125 |
| 81 | వ లిం మూ | శ్రీ వస్తుల లింగమూర్తి ఎం ఏ, రాజనీతిశాస్త్రశాఖాధ్యక్షులు ఎం ఆర్ కాలేజి, విజయనగరం (ఆం ప్ర) | శాసనసభలు | 494 |
| 82 | వా సు శా | శ్రీ వారణాశి సుబ్రహ్మణ్యశాస్త్రి, పిఠాపురం తూ గోదావరిజిల్లా | వేదవ్యాసుడు | 847 |
| 83 | వి సుం శ | శ్రీ విరలదేవుని సుందరశర్మ, సంస్కృత అకాడమీ ఉ విశ్వవిద్యాలయము హైదరాబాదు | సరస్వతీమహాలు | 604 |
| 84 | వి రా | వి రామచంద్రరావు ఎం ఎస్ సి, గణితశాస్త్రశాఖాధ్యక్షులు ప్రభుత్వ కాలేజి సిద్దిపేట (ఆం ప్ర) | 1 లోబొచెవిస్కి | 87 |
| | | | 2 సమీకరణములు | 598 |
| 85 | వి వి ఎల్ రా | స్వర్గీయ ప్రొఫె వి వి ఎల్ రావు, 18- ర ... మెయిన్ రోడ్డు గాంధీనగర్ అడయార్ మదరాసు 20 | 1 విద్యుత్ నిక్షేపఘటములు | 2 5 |
| | | | 2 విద్యుత్ పరికరములు | 218 |
| | | | 3 విద్యుత్తు-మూలసూత్రములు | 223 |
| | | | 4 విద్యుదుత్పాదనము | 228 |
| | | | 5 విద్యుద్యంత్రములు | 265 |
| | | | 6 విద్యుద్వాహకములు - చోదకములు | 287 |
| 86 | వి వి | శ్రీ వి విశ్వనాథ్, ఎం ఏ, లెక్చరర్ భూగోళశాస్త్రశాఖ ఉస్మానియా విశ్వవిద్యాలయం హైదరాబాదు | 1 సింహళము (భూ) | 651 |
| | | | 2 సూయజ్ కాలువ | 674 |
| | | | 3 సోవియట్ రష్యా (భూ) | 689 |
| 87 | వి న | శ్రీ విశ్వనాథ నరసింహము, 46 18-4 మండావారిపేట పొండవర్తి-శాస్త్రి R S విశాఖపట్నం | సోమనాథుడు పాల్కురికి | 688 |

| క్రమ సం | పొడి అక్షరములు | వ్యాసకర్తలు | వ్యాసము | పుట |
|---|---|---|---|---|
| 88 | పు గో | శ్రీ పున్నవ గోపాలకృష్ణయ్య | 1 విఘ్నేశ్వరుడు | 174 |
| | | ఆడ్వకేటు 12 అగ్రహ్మమంజిల్ కాలనీ | 2 వైయక్తికధర్మము | 408 |
| | | ఖైరతాబాదు హైదరాబాదు-4 | | |
| 89 | వే శం శా | డా వేటూరి శంకరశాస్త్రి | 1 వాగ్గేయకారుడు | 68 |
| | | ముక్త్యాల (పోస్టు) కృష్ణాజిల్లా | 2 వ్యవహార ఆయుర్వేదము | 450 |
| | | | 3 సుశ్రుతుడు | 688 |
| 90 | వే రా | శ్రీ వేదురుమూడి రామారావు ఎం ఏ | 1 వాణిజ్య న్యాయశాస్త్ర పరిణామము | 57 |
| | | లెక్చరర్ వాణిజ్యశాస్త్రశాఖ ఎస్ వి ఆ ఎస్ | 2 వాణిజ్యము-రఖానా | 61 |
| | | తెలుగుకళాశాల విద్యానగర్ హైదరాబాదు 44 | 3 వాణిజ్యశాస్త్రచరిత్ర | 94 |
| | | | 4 ఓపణివ్యవస్థ | 240 |
| | | | 5 వ్యాపారవ్యవస్థ-తరగతులు | 454 |
| | | | 6 వ్యాపారవ్యవస్థ-శాఖలు వాటివిధులు | 457 |
| 91 | శి హ | ఆచార్య శిరుగూరి హనుమంతరావు, ఎం ఏ ఎల్ టి, | సర్వేపల్లి రాధాకృష్ణయ్య | 615 |
| | | హార్డికర్ బాగ్, హిమాయత్‌నగర్ (రిటైర్డు) | | |
| | | హైదరాబాదు-29 | | |
| 92 | శ్రీ శ్రీ | డా శ్రీపాటి శ్రీదేవి, ఎం ఏ, పి హెచ్ డి | 1 లాకీ జాబ్ | 8 |
| | | రిటైర్డు ప్రిన్సిపాల్ ఉస్మానియా మహిళాకళాశాల | 2 వృత్తిదేశికత | 311 |
| | | 628/14 ఖైరతాబాదు హైదరాబాదు-4 | 3 హేతువాదము | 752 |
| 93 | స ల మూ | శ్రీ సన్నిధానం లక్ష్మీనారాయణమూర్తి | 1 శిక్షాశాస్త్రము | 487 |
| | | కౌశా స్వారాజ్యవిహార్ 10 పద్మారావునగర్ | 2 మాత్రస్వరశాస్త్రజాతము | 670 |
| | | సికింద్రాబాదు 25 | | |
| 94 | సి వి వి అ | శ్రీ సి వి వి అప్పారావు, బి ఏ బి ఇడి, | వీరపురుషదత్తుడు | 288 |
| | | 1-8 526/3 చిక్కడపల్లి హైదరాబాదు-20 | | |
| 95 | సి ల | డా సి లక్ష్మన్న, ఎం ఏ, పి హెచ్ డి, | 1 సమాజము-కుటుంబవ్యవస్థ | 587 |
| | | & | 2 సమాజీకరణము | 589 |
| | కె ప | శ్రీమతి కె పద్మజ, ఎం ఏ, | 3 సమాజోత్పత్తి | 591 |
| | | మానవ సాంఘికశాస్త్రములశాఖ ఉస్మానియా | 4 సామాజికశాస్త్ర సంశోధన విధానము | 686 |
| | | విశ్వవిద్యాలయము హైదరాబాదు | 5 సామాజిక సమూహము | 689 |
| 96 | సి వి ర | డా సి వి రత్నం | విటమినులు | 178 |
| | | ఎం ఎస్ సి, పి హెచ్ డి | | |
| | | రసాయనశాస్త్రశాఖ ఉస్మానియా విశ్వవిద్యాలయము | | |
| | | హైదరాబాదు | | |

| క్రమ సంఖ్య పొడి అక్షరములు | వ్యాసరచయిత | వ్యాసము | పుట |
|---|---|---|---|
| 97 సూ రా శా | శ్రీ సూరి రామకోటిశాస్త్రి<br>ప్రిన్సిపాల్ కె ఎల్ ఎస్ సంస్కృతకళాశాల<br>తెనాలి గుంటూరు జిల్లా | సాంఖ్యదర్శనము | 633 |
| 98 హ ఆ | శ్రీ హరి ఆదిశేషువు ఎం ఎస్ సి,<br>నెం 11 బహదూర్ పుర గవర్నమెంటు<br>హౌసింగ్ కాలనీ హైదరాబాదు-2 | 1 లిథియమ్ | 17 |
| | | 2 లైసెన్కో | 36 |
| | | 3 లోహమిశ్రమములు | 43 |
| | | 4 లోహములు | 44 |
| | | 5 వర్తులాకృతికరసాయన క్రియలు | 77 |
| | | 6 వాయుద్రవీకరణము | 103 |
| | | 7 వెండి | 321 |
| | | 8 వైజ్ఞానికశాస్త్రవేత్తలు (గణితఖగోళశాస్త్రములు) | 359 |
| | | 9 వైజ్ఞానిక శాస్త్రవేత్తలు (భూగర్భవిజ్ఞానశాస్త్రము) | 361 |
| | | 10 వైజ్ఞానికశాస్త్రవేత్తలు (రసాయనశాస్త్రము) | 374 |
| | | 11 వైజ్ఞానికశాస్త్రవేత్తలు (వైద్యశాస్త్రము) | 384 |
| | | 12 సహజ కృత్రిమ రబ్బరులు | 627 |
| | | 13 సాంకృత్యాయన్ రాహుల్ | 630 |
| | | 14 స్ఫటికములు II | 703 |
| 99 హ పు | శ్రీహరి పురుషోత్తము<br>16-2-705/1/6 మలక్ పేట హైదరాబాదు-36 | 1 విలియమ్ జోన్స్ | 250 |
| | | 2 వెంగమాంబ తరిగొండ | 337 |
| 100 హ బా సు | శ్రీహరి బాలసుబ్రహ్మణ్యం,<br>C/o శ్రీహరి ఆదిశేషువు బహదూర్ పుర<br>గవర్నమెంటు హౌసింగ్ కాలనీ, హైదరాబాదు-2 | వెనేడియమ్ | 326 |
| 101 హ ల | శ్రీహరి లక్ష్మీపతి, ఎమ్ ఎస్ సి,<br>ప్రిన్సిపాల్ న్యూసైన్సుకళాశాల అమీర్ పేట,<br>హైదరాబాదు | 1 లౌడ్ స్పీకర్ | 47 |
| | | 2 విశ్వకిరణములు | 272 |

# వ్యాసానుక్రమణిక

# సంగ్రహ ఆంధ్ర విజ్ఞానకోశము

## ల

### లక్షద్వీపములు

లక్షద్వీపములనునవి సుందరమైన ద్వీపసముదాయము ఇవి కేరళరాష్ట్రమునకెదురుగా అరేబియా సముద్రమునందు ప్రాచీనకాలమునుండి ఏర్పడియున్నవి. భారత పరిపాలనముక్రింద చేరిన నాటినుండి ఈ ద్వీపముల ప్రాముఖ్యము గుర్తింపబడినది. ఉత్తరభాగమందలి చెట్లట్ కిల్టన్ కార్డమట్ అమెని బిత్ర అను దీవులు కలిపి సమష్టిగా అమిన్ ద్వీపమనబడుచున్నది. ఆండ్రాత్ కవరట్టి అగట్టి కల్పెని మినికాయ్ అనునవి తక్కిన ద్వీపములు. ఒక దీవినుండి మరియొకదీవికి నడుమ నున్న దూరము 20 మొదలు 115 మైళ్ళవరకు కలదు. మొత్తము 25 పైనగల ఈ ద్వీపసముదాయములో కొన్ని మానవనివాసయోగ్యములై నవికూడ గలవు.

వీటిలో 1¾ చ. మైళ్ల వైశాల్యముకలిగి అన్నిటికంటె పెద్దదియగు మినికాయ్ ద్వీపముయొక్క జనసంఖ్య 6000. ఇది కన్యాకుమారి అగ్రమునకు సూటిగా పశ్చిమదిశయందున్నది. అరేబియాసముద్రములో రక్షకస్థానము నలంకరించియున్న ఈ ద్వీపముపైన బ్రిటిష్ ప్రభుత్వము 1886 వ సం॥లో బ్రహ్మాండమైన ఒక లైట్‌హౌస్ (ఓడలకు దిక్కుతెలిపి ప్రమాదములనుండి తప్పించుటకై రేవునందు నిర్మింపబడు ఉన్నతమగు దీపస్తంభము) నిర్మించినది. ఓడలకు హెచ్చరికచేయు ఈ దీపకాంతి పరిసరములందు 18 మైళ్ల దూరము వరకు ప్రసరించుచుండును. ఈ దీపస్తంభమును బ్రిటిష్ ప్రభుత్వము 1956 ఏప్రిలు నెలలో భారతదేశమునకు ఒప్పగించినది.

పవనస్థితిని తెలియజేయు వేధశాలయొకటి మినికాయ్ ద్వీపముపై 1891 లో నిర్మింపబడినది. 1968 లో ఆధునిక పద్ధతిపై ఈ వేధశాల అభివృద్ధిచేయబడి తుఫాను ప్రమాదములనుగూర్చి ముందుగా హెచ్చరికచేయగల స్థాయితోనికి తేబడినది. ఎప్పటికప్పుడు శాఖా సమాచారమును వాతావరణశాస్త్రజ్ఞులకు వెల్లడిచేయుటకై ఈ ద్వీపముమీద ఒక నిస్తంత్రీకార్యాలయము నెలకొల్పబడినది.

లక్షద్వీపములు ఉత్తరం దక్షిణదిశలుగా అర్ధచంద్రాకారములో విస్తరించి సముద్రమట్టమునకు 10-15 అడుగుల ఎత్తునమాత్రమే ఉన్నవి. వీటిపై కొండలుగాని నదులుగాని లేవు. పశ్చిమ ప్రాంతమున కొన్ని సరస్సులుమాత్రమున్నవి. ఈ ద్వీపముల మొత్తము విస్తీర్ణము 42 చ. మైళ్లు. కాని ఈ వైశాల్యములో నాల్గవవంతు భూభాగమునమాత్రమే 25 000 మంది ప్రజలు నివసించుచున్నారు. వీరిలో అత్యధికులు ముస్లిములు. ఈ సరస్సులు చేపలుపట్టు వృత్తివారికి మిగుల అనుకూలముగనుండి చూచుటకెంతయు సుందరముగ నుండును. ఈ ద్వీపములలో విశేషముగా పెరుగు కొబ్బరిచెట్లనుండి తీయబడు నార విలువగల పెక్కు నారపరిశ్రమల కుపయోగపడుచున్నది. వీటివలన పెక్కురకు జీవనాధార మేర్పడుచున్నది. కొబ్బరి నారపరిశ్రమలలో నైపుణ్యము గలవారికి ప్రత్యేకమైన శిక్షణ యొసగబడుచున్నది. ఈ ద్వీపములలో వరిధాన్యము పండకపోవుటచే ఇతరదేశముల వారి చ్పటికి ధాన్యము నెగుమతిచేసి దానికి ప్రత్యామ్నాయముగా వస్తుమార్పిడి పద్ధతిపై నారవస్తువులను ఇచ్చటినుండి కొనిపోవుదురు. కొబ్బరి తోటలలోపాటు రాగులు జొన్నలు మొదలైన మెట్టు ధాన్యములు ఈ ద్వీపములలో పండింపబడు చున్నవి.

నరజాతి శాస్త్రలక్షణముల విభాగము

ద్వీపవాసులు శేషించిన ద్వీపవాసులకంటె భిన్నులుగనుందురు ఈ ద్వీపము తొలుత మాల్దివ్ దీవులలో అంతర్భాగముగ నుండెడిది. 16వ శతాబ్దిలో రాజ్యమును కోల్పోయిన మాల్దీవుల సుల్తాను తిరిగి దానిని రాబట్టుకొను యత్నములో కన్ననూరురాజు అతనికి సహాయపడినందుకు ప్రతిఫలముగా సుల్తానాతనికి మినికాయ్ ద్వీపమును ధర్మమొసగెనట! మినికాయ్ ప్రజలు సింహళమునుండి తొలుత వలసవచ్చినవారి సంతతివారే. సింహళీయులు మొదట బౌద్ధులుగనుండి పిమ్మట ఇస్లాము మతమును స్వీకరించిరి. మాల్దివ్ దీవుల ప్రభువగు ఎరిబవన్ దిట్టకూడ ఇస్లామును స్వీకరించి లక్షద్వీపవాసులు మహమ్మదీయులు కాకపూర్వము రెండు శతాబ్దుల క్రింద (క్రీ శ 1158) సుల్తాన్ మహమ్మద్ అను బిరుదనామమును స్వీకరించెను

లక్షద్వీపములందలి స్త్రీలు స్వతంత్రశక్తిగల సాహసోపేతలు. బాల్యవివాహమిప్పటికిని వారి ఆచారముగ నున్నది. భర్తను వరించు హక్కు వారు చలాయించుచునేయున్నారు. స్త్రీ వారసత్వము (మరుమక్కతాయము) ఇంకను ఇచ్చట ఆచరణమునందున్నది. వివాహానంతరము అల్లుడు మామ యింటనే కాపురముండు ఆచారముకూడ కలదు. స్త్రీలు తమసాంఘిక ఆర్థిక గృహసమస్యలను వరంగీలు అను తమ ప్రత్యేక క్లబ్బులలో చర్చించుకొందురు. అట్లే పురుషులకొరకు ప్రత్యేకముగా అట్రీలు అను క్లబ్బులుగూడ నున్నవి. వరంగీలలో కావింపబడు తీర్మానములు విధిగా అట్రీలచే ఆమోదింపబడుచుండును

లక్షద్వీపములందలి పురుషులు పడవలు నడుపుటలో చతురులు. వీరిలో పెక్కురు యువకులు విదేశనావలపై ఉద్యోగములు చేయుచుందురు. నెలలపర్యంతము వీరు విదేశములలో నుండగా వీరి కుటుంబములందలి వయోధికులు ఇంటి వ్యవహారములను చక్కబెట్టుకొనుచుందురు

మినికాయ్ ద్వీపవాసులను సాంఘికముగా మూడు వర్గముల క్రింద విభజింపనగును (1) కరణవాలు లేక కోయలు. వీరు కులీనశ్రేణికి చెందినవారు; ఈ ప్రజలు కేరళరాష్ట్రమందలి నంబూద్రి నాయరుకులములకు చెందినవారని తెలియుచున్నది (2) మాల్మీలు లేక ఉరక్కారులు; వీరు నావికావృత్తిని స్వీకరించువారు (3) మేలచెరీలు; కల్లుగీతగీయు గౌండ్లకులమునకు చెందిన వీరు భూసేద్యముగూడ గావించుచు కూలిపనులు సహితము చేయుచుందురు

లక్షద్వీపముల పూర్వచరిత్ర అంతగా తెలియవచ్చుటలేదు. స్థానిక కథనముల ననుసరించి కేరళ ప్రభువులలో ప్రసిద్ధిచెందిన చెరుమన్ పెరుమాళ్ అనువాతడు ఇస్లాము మతమును స్వీకరించి యాత్రార్థమై మక్కాకు బయలుదేరి వెళ్లెననియు కొంతకాలమైనపిదప అతని నన్వేషించుటకై నావలో ప్రయాణించిన బృందము ఆనావ లక్షద్వీపములచెంత భగ్నము కాగా అచ్చటనే నివాసమేర్పరచుకొని స్థిరపడిరనియు 200 సంవత్సరముల అనంతరము వీరు ముబారకముల్లాక్ అను అరబ్బు మతబోధకునివలన ఇస్లామును స్వీకరించిరనియు తెలియవచ్చుచున్నది. ఆంద్రాత్ ద్వీపముపైనున్న ఈ మతబోధకుని సమాధి లక్షద్వీపవాసులకీనాడొక యాత్రాస్థలముగ పరిగణింపబడుచున్నది

కొంతకాలమైనపిదప ఈ ద్వీపములు కోలత్తూరు రాజా స్వాధీనములోనికి వచ్చినవి. ఇతడు మరల వీటిని కన్ననూరు రాజాకు బదిలీచేసి అతనిచే ఏటేట కొంత కప్పమును కట్టించుకొనుచుండెను. 1786 లో ఈ ద్వీపవాసులు కన్ననూరు రాణిపై తిరుగుబాటుసల్పి తాము టిప్పుసుల్తానుపాలనములో నుండుటకంగీకరించి అతనియెడ తమ భక్తి ప్రపత్తులను ప్రకటించిరి. తనకు స్వాధీనమైన ఈ ద్వీపములకు ప్రతిఫలముగా టిప్పుసుల్తాను లోగడ తాను చిరక్కల్ రాజానుండి జయించిన ప్రాంతములో కొంతభాగమును కన్ననూరు రాణికి నష్టపరిహారముక్రింద ఇచ్చివేసెను. దానితోపాటు కొంత ధనమునుగూడ ఆమెకు చెల్లించెను. లక్షద్వీపములపై ఈమె నామమాత్రపు అధికారమును బ్రిటిష్ ప్రభుత్వమంగీకరించి ఆమెనుండి యేటేట పదివేలరూప్యముల కప్పమును స్వీకరించుచుండెను

టిప్పుసుల్తాను బ్రిటిష్‌వారిచే ఓటమి చెందినపిమ్మట శ్రీరంగపట్నము వారివశముకాగా అమిన్ దీవులు దక్షిణ కెనరా కలెక్టరు పాలనములోనికిని కన్ననూరుద్వీపము మలబారు కలెక్టరు ఏలుబడిక్రిందికిని వచ్చెను. లక్షద్వీపములన్నియు మొత్తముగా బ్రిటిష్ ఏలుబడిలోనికి వచ్చినపుడు వాటి పరిపాలనకై అమీనులు నియోగింపబడిరి. వీరు మలబారు కలెక్టరుకు బాధ్యులై యుండెడివారు. వారసత్వాధికారము లేని ఈ యమీనులు సివిల్ క్రిమినల్ వ్యవహారములను పర్యవేక్షించుటకై తమకు సహాయులుగ క్రింది అధికారులను నియ

మించుచుండిరి స్థానిక కులీనవర్గమునకు చెందిన ఈ యమీనుల అధికారములు భారతదేశమందలి మూడవతరగతి మేజస్ట్రేటు అధికారములకు తుల్యముగనుండును 1956 నవంబరులో అమిన్ ద్వీపసముదాయము భారతదేశములో లీనమగు వరకు అవి దక్షిణకెనరా జుడిషియల్ జిల్లా మేజస్ట్రేటు పర్యవేక్షణములోనుండెను అతనిక్రింది అధికారియగు డెప్యూటీ తహశ్శీలుదారు ఈ ద్వీపములకు సంబంధించిన వ్యవహారములను చూచుచుండెడివాడు ఈవిధానమిప్పటికిని కవరట్టి ద్వీపమును తన ప్రధాన కార్యాలయముగా చేసికొని పరిపాలించుచున్న భారతీయ విదేశాంగశాఖాధికారి పర్యవేక్షణమున అమలు జరుగుచున్నది

ఈ ద్వీపములకు భారతప్రభుత్వపాలనము విస్తరింపక పూర్వము అచ్చటి ఆస్తిపాస్తులను కొబ్బరిచెట్లు విలువతో లెక్క కట్టెడివారు కాని వ్యవసాయవిధానము ఆధునికమైన తరువాత భూములను ఇతర స్థిరచరాస్తులను విలువకట్టెడి నూతనపద్ధతి అమలులోనికి వచ్చుటతో అచ్చటి కొన్నివర్గముల మధ్య తాత్కాలిక సంఘర్షణములు బయలుదేరి క్రమముగా అవి సమసిపోయి నూతనపద్ధతియే ఆమోదింపబడినది సర్వవిధములైన వివాదములను పరిష్కరించు అధికారము అమీనున కున్నను ప్రధానపాలనాధికారికి అపీలుచేసికొను హక్కు ప్రజలకు కలదు

1847 లో ఈ ద్వీపమందు ఘటిల్లిన పెనుతుపాను జలప్రళయములవలన కొబ్బరితోటలు చాలవరకు నిర్మూలమై విశేష జననష్టముకూడ సంభవించెను ప్రభుత్వము ఈ నష్టమును కొంతమేరకు భర్తీచేసినఫలితముగా వారిస్థితి క్రమముగా మెరుగుపడెను కన్ననూరు రాణి పాలనము అస్తవ్యస్తమై ఆమె చెల్లింపవలసిన కప్పములు బకాయిపడగా బ్రిటిష్ పాలకులు 1875 లో ఈ ద్వీపములను సంపూర్ణముగా స్వాధీనపరచుకొనిరి

1967 వరకు ఈ ద్వీపముల పక్షమున లోక్ సభలో భారతప్రభుత్వమొక సభ్యుని నియమించుచుండెడిది 1967 లో సాధారణపుయెన్నికలు జరిగినపిమ్మట అచ్చటి ప్రజలచే ఎన్నుకొనబడిన ప్రతినిధి లోక్ సభలో సభ్యుడుగా వ్యవహరించుచున్నాడు భారతదేశములోచేరిన అనంతరము ఈ ద్వీపములలో సర్వతోముఖాభివృద్ధి సాధింపబడుచున్నది ప్రజలు చాలవరకు స్వయంపోషక జీవితమును గడుపుచున్నారు, ఉచిత వైద్య విద్యాసౌకర్యములు స్కాలర్ షిప్పులు మంజూరు చేయబడుచున్నవి ఉన్నతవిద్య నభ్యసించు ఈ ద్వీపవాసులకు భారతదేశపు నడిగడ్డపై సకల సౌకర్యములు సమకూర్పబడుచున్నవి ప్రస్తుత మీద్వీపములలో మూడు ఉన్నతపాఠశాలలు ఒక హాయ్యర్ సెకండరీ పాఠశాల పదకొండు సీనియర్ బేసిక్ పాఠశాలలు పదునెనిమిది జూనియర్ బేసిక్ పాఠశాలలు ఆరు నర్సరీ పాఠశాలలు గలవు కొబ్బరినార పరిశ్రమ అత్యుత్తమ సాంకేతికస్థాయిలో అభివృద్ధి చేయబడినది పూర్వముండిన నాటునడవల స్థానములో ఈనాడు వేగవంతమైన (?) మోటారు లాంచీలు నడుపబడుచున్నవి నిత్యజీవితావసర పదార్థములు సరసమైన ధరలకు సహకారసంస్థలద్వారా ప్రజలకు సరఫరా యగుచున్నవి ఈనాడు లక్షద్వీపవాసులు అభ్యుదయపథమున శోభించిన భారతీయులతోపాటు పయనమైపోవుటతో ఆ ద్వీపముల స్వరూపస్వభావములు సంపూర్ణముగ మారుచున్నవి

ప్ర రా సు

## లక్ష్మీకాంతకవి బలిజేపల్లి

అగ్రశ్రేణికి చెందిన నాటకరచయితగను ఉత్తమ నటుడుగను విఖ్యాతుడైనవాడు బలిజేపల్లి లక్ష్మీకాంతకవి ఇతడు గుంటూరు జిల్లా బాపట్లతాలూకా ఇటికంపాడు గ్రామమున ఆదిలక్ష్మమ్మ నరసింహశాస్త్రి అను దంపతులకు 1881 వ సం॥న జన్మించెను హరితస గోత్రికులైన వీరు వెలనాటి వైదికబ్రాహ్మణులు

లక్ష్మీకాంతము చిన్నతనమున మేనమామయైన భాగవతుల చెన్నకృష్ణయ్యవద్ద ప్రాథమిక విద్య నభ్యసించెను ఆ పిమ్మట కర్నూలునుండి మెట్రిక్యులేషను పరీక్షలో ఉత్తీర్ణుడయ్యెను బాల్యమునుండి లక్ష్మీకాంతమునకు కవిత్వము చెప్పు శక్తిసామర్థ్యములలవడినవి తన తండ్రివద్దను మేనమామవద్దను సంస్కృతాంధ్రములను బాగుగా నభ్యసించి మంచి పాండిత్యమును అలవరచుకొనెను

పూర్వునకు కావి యబ్బినట్లు సంస్కృతాంధ్రములయందు మంచి అభినివేశముగల యీ కవిశేఖరునకు మేనత్తయగు సరస్వతమ్మ రామాయణ భారత భాగవతములయందలి ప్రముఖ సన్నివేశములను, భక్తిభావముతోనిండిన మధుర ఘట్టములను ఉగ్గుపాలతో నూరిపోసినది, ధార్మికలోకము ప్రశంసాపాత్రుడు (?) వంతుడైన యితడు సంగీతసాహిత్యములలోకూడ వ్యుత్పత్తిని (?)

కృషితో మంచి శక్తిసామర్థ్యములను సంపాదించుకొనెను గ్రంథములు వ్రాయుచు నాటకములలో వేషములు వేయుచు క్రమముగా లబ్ధప్రతిష్ఠుడు కాదొడగెను

లక్ష్మీకాంతము కర్నూలు పట్టణమునందు సబ్‌రిజిస్ట్రారు ఆఫీసులో హెడ్‌గుమాస్తాగా కొంతకాలము పనిచేసెను ఆ పిమ్మట గుంటూరునందలి పురోన్నతపాఠశాలలో ప్రధానాంధ్ర అధ్యాపక పదవిని స్వీకరించి మంచిదక్షతతో దానిని నిర్వహించిరి సాహిత్యమునందును నాటకకళయందును మిక్కిలి అభిమానముగల ఈయన ఆ ఉద్యోగమునుగూడ వదలిపెట్టి అవధానములుచేయుచు పెక్కు తెలుగు సంస్థానములను సందర్శించి తన అపూర్వకవితానైపుణ్యముతో ఆయాప్రభువుల ప్రశంసలను పొందెను

1922 వ సంవత్సరమున ఈతడు గుంటూరునందు చల్లపల్లి రాజావారి సహాయముతో చంద్రికాగ్రంథమాలను నెలకొల్పి ఆ సంస్థపక్షమున పెక్కు ఉత్తమగ్రంథములను ప్రచురించి సాహిత్యాభివృద్ధికి గొప్ప కృషిసలిపెను

1929-1930 సం॥లలో జరిగిన ఉప్పుసత్యాగ్రహ ములో పాల్గొని లక్ష్మీకాంతము రెండు సంవత్సరములు కారాగార శిక్షననుభవించెను జైలులో ఇతడు పెక్కు గ్రంథములను రచించెను

గుంటూరునందు "హిందూనాటకసమాజ"మను పేరుగల ఫస్టుకంపెనీలో ఆతడు సభ్యుడుగానుండి ఆ సంస్థపక్షమున నిర్వహింపబడిన వివిధనాటకములలో వేషములువేయుచు ఆ సంస్థకు మంచినాటకములనుగూడ వ్రాసి ఇచ్చుచుండెను లక్ష్మీకాంతకవి తానువ్రాసిన 'సత్యహరిశ్చంద్ర నాటక'ములో హరిశ్చంద్రుడుగను నక్షత్రకుడుగనుగూడ వేషములను ధరించి ప్రేక్షకుల ప్రశంసలను పొందుచుండెడివాడు స్వయముగా కవియైన ఆతడే ఆ ముఖ్యపాత్రలను నటించుచు ఆయాభూమికల మనోభావములను తన నటనాచాతుర్యముతో వెలువరించుచు గద్యపద్యములను ప్రత్యేకదక్షతతో పఠించుచుండెడివాడు

1916 వ సం॥న ఆంధ్రరాష్ట్రీయ మహాసభ పానగల్లు రాజా ఆధిపత్యమున విశాఖపట్టణములో జరిగినది ఆ సభలో జరిగిన సాంస్కృతిక కార్యక్రమములలో 'సత్రాజితీయ నాటక' మాడబడినది ఈ నాటకకర్తయైన లక్ష్మీకాంతకవియే శ్రీకృష్ణపాత్రను ధరించి నాటకమును జయప్రదమొనరించగా ప్రేక్షకులు ఆనందాతిరేకముతో హర్షధ్వానము చేసిరి

లక్ష్మీకాంతకవి తాను రచించిన సత్యహరిశ్చంద్ర బుద్ధిమతీవిలాస సత్రాజితీయ ఉత్తరరాఘవాదినాటకములలో వివిధములగు భూమికలను నిర్వహించి తన అపూర్వ నటనాకౌశలముతోను మధురమైన కంఠముతోను నాటకములను చాకచక్యముగా నిర్వహించి రక్తికట్టించుచుండెడివాడు ఈయన హరిప్రసాదరావువంటి ఉత్తమశ్రేణికిచెందిన నటుడు కాకపోయినను గానవిద్యాపారంగతుడగుటవలన గద్యపద్యములను మంచనేర్పుతో పఠించి నాటకమునకు వన్నె తెచ్చుచు ఆబాలగోపాలమును ఆనందింపజేసెడివాడు ఆంధ్రలోకమితనిని నటకుడుగాకంటె కవిగానే అధికముగా గుర్తించి ఉన్నతశిఖరములనధిష్ఠింపజేసి ఘనముగా సత్కరించినది

చిత్రము 1



బలిజేపల్లి లక్ష్మీకాంతకవి

1930 వ సం॥న లక్ష్మీకాంతకవి రంగూన్ ఆంధ్రుల ఆహ్వానమున అచ్చటికి వెళ్లెను అచ్చటి కళాశాలలలో కళాశాల విద్యను గురించి చక్కని ఉపన్యాసములుచేసెను తానురచించిన హరిశ్చంద్ర నాటకమును అక్కడ ప్రదర్శించి ప్రజలను అమితముగా మెప్పించి మంత్రముగ్ధులనుజేసెను ఆ ప్రదర్శనలలో ఆయనచూపిన ప్రతిభకు సంతుష్టులైన ప్రజలు "కవితాకళానిధి" యను బిరుదముతో అతనిని సత్కరించి భూరిసన్మానములను చేసిరి

చిత్తజల్లు పుల్లయ్య ప్రోత్సాహముతో లక్ష్మీకాంతకవి సినీరంగమున ప్రవేశించెను పెక్కుచిత్రములలో స్వయముగా నటించుటయేగాక అనేకచిత్రములకు కథలను మాటలను పాటలను వ్రాసి ప్రారంభదశలోనున్న తెలుగు చలనచిత్రములకు జీవముపోసి పేరుప్రఖ్యాతులను సంపాదించగలిగెను 1948 వ సం॥న చలనచిత్ర నిర్మాణసంఘమువారు సినీరంగ అభివృద్ధికి ఈ కవిశేఖరుడు ప్రదర్శించిన అసమానప్రజ్ఞాప్రాభవములకు సంతసించి "పుంభావసరస్వతీమూర్తి" యను బిరుదమును ప్రసాదించి ఘనముగా సత్కరించిరి

వరవిక్రయము సినిమాలో ఈతడు బుడ్డాగేసిం చక్రవర్తియైన లింగరాజులింగరాజుపాత్రను అత్యంతప్రతిభా సంపన్నుడుగా నటించి అసమానప్రతిభను వెల్లడించుకొనెను మహాకవి కాళ్ళకూరి నారాయణరావు సృష్టించిన లింగరాజు లింగరాజు పాత్రకు ఆంధ్రదేశమున లక్ష్మీకాంతకవి తన అపూర్వ నటనాకౌశలముతో శాశ్వతత్వమును కల్పించెను

లక్ష్మీకాంత కవిశేఖరుని హస్తమునుండి వెలువడిన పెక్కు నాటకములలో "సత్యహరిశ్చంద్రీయము" రామసత్ప్రంగము వంటిది ఈ నాటకప్రాదుర్భావముతో తెలుగునాట ఇతర కవులచే రచింపబడి అంతకుముందే ప్రచారమందున్న హరిశ్చంద్ర నాటకములన్నియు సూర్యునిముందు దివ్వెటిలవలె వెలవెలబోయి తెరమరుగునబడినవి నేడు ఈ హరిశ్చంద్ర నాటకమునకున్న బహుళప్రచారము జనాదరణము మరియే యితర తెలుగు నాటకమునకు లేదనుట స్వభావోక్తియే యగును ధీరోదాత్త నాయికానాయకులైన చంద్రమతీ హరిశ్చంద్రుల పవిత్రగాథను నాటకరూపములో కరుణారస భరితముగను నీతిప్రధానముగను మలచి రచించి అది ఆబాల గోపాలమునకు అందుబాటులో నుండునట్లుచేసి ఉత్తమ తెలుగు నాటకరచయితలలో నొక్కడనిపించుకొని ఆంధ్ర సాహిత్యనందనోద్యానమున తనకు శాశ్వతస్థానమును కల్పించుకొనిన కవితల్లజుడు లక్ష్మీకాంతము ఆయనవ్రాసిన సత్యహరిశ్చంద్రీయము"లో శ్మశానఘట్టమునందలి ఈ క్రింది పద్యము ఆంధ్రదేశమునందలి కుగ్రామములలో సహితము ప్రతినోట ఈనాడు వినిపించుచుండుట మిక్కిలి గమనార్హము

శా॥ మాయామేయజగంబెనిత్యమనిసంభావించి మోహంబునన్
నాయిల్లాలని నాకుమారుడని ప్రాణంబుండునందాక నెం
తోయల్లాడిన యీశరీరమిపుడిందున్ గట్టైలన్ గాలుచో
నాయిల్లాలునురాదు పుత్రుడును తోడైరాడు తప్పింపగన్॥

ఈ హరిశ్చంద్రనాటకమున బలిజేపల్లికి మిక్కిలి అభిమానమైనపాత్ర నక్షత్రకుడు దీనిని ఆయన గొప్ప ప్రతిభతో నటించుచుండెడివాడు ఈయన హరిశ్చంద్రనాటకము మృదుమధురమైన కవిత్వముతోను పాత్రోచితమైన సంభాషణలతోను నిండియుండి రంగస్థలమున ప్రదర్శనకు మిక్కిలి ఉపయుక్తముగా నుండుటచే అది ఆంధ్రదేశమున వాడవాడల పలుమారు ప్రదర్శింపబడుచున్నది

బలిజేపల్లి రచించిన మరొకనాటకము భవభూతికృత ఉత్తరరామచరిత్రకు ఆంధ్రానువాదమైన ఉత్తరరాఘవము" ఈ నాటకము అనువాదమనిపించుకొనక స్వతంత్రరచనవలె తెలుగు నాటకరంగమున భాసించుచున్నది

ఇతరరచనలు –

(1) బుద్ధిమతీవిలాసము (నాటకము)
(2) శివానందలహరి (ఆదిశంకరకృతి ఆంధ్రానువాదము)
(3) స్వారాజ్యసమస్య (పద్యకృతి)
(4) బ్రహ్మరథము } (నవలలు)
(5) మంజూష }

జీవితచరమదశలో వాల్మీకివిరచిత శ్రీమద్రామాయణమునందలి సుందరకాండమును తెనుగులోనికి అనువదించుటకు ఆయన పూనుకొనిరి కాని ఆయన యీ తుదికోరిక అసంపూర్ణముగా మిగిలిపోయినది

బలిజేపల్లి లక్ష్మీకాంతకవి నటుడుగను నాటకకర్తగను దేశభక్తుడుగను జీవితమును గడపి చరమదశలో శ్రీకాళహస్తి క్షేత్రసమీపమున ఒకచిన్న పల్లెలో తన స్వార్జితవిత్తముతో తనకు కావలసిన సర్వసదుపాయములను సమకూర్చుకొని విశ్రాంతితో నిశ్చింతగా జీవితమును వెళ్లబుచ్చుచు 1953 వ సంవత్సరమున యీ జగత్తునుండి అదృశ్యుడై పోయెను

పు వెం

## లఘుగ్రహములు

అంగారకునకును గురునకునుమధ్య మరి ఏ ఇతర గ్రహముల మధ్య లేనంతదూరముండుటచే ఈ ఖాళీప్రదేశములో మరియొక గ్రహము ఉండియుండవచ్చునని పలువురు శాస్త్రజ్ఞులు భావించిరి కాని వారు ఎట్టిప్రయత్నములు చేసినను ఎట్టిగ్రహమును కనుగొనలేకపోయిరి

1772 వ సంవత్సరములో జాన్ డేవిడ్ టిటియస్ అను జర్మను శాస్త్రజ్ఞుడు గ్రహములకును సూర్యునకును మధ్యగల దూరములను పరిశీలించి ఒకసూత్రమును ప్రతిపాదించెను ఈ సూత్రమును బోడ్ అను మరియొక శాస్త్రజ్ఞుడు అందరి దృష్టికి తెచ్చి దానినిట్లు విశదీకరించెను –

భూమియొక్కదూరము ఒకటి (1) గా తీసికొనినచో, మిగిలిన గ్రహముల దూరములను $[0.4 + 0.3 \times 2^{n}]$ అను సూత్రముద్వారా కనుగొనవచ్చును ఈ సూత్రమ్ము

ద్వారా కనుగొనబడిన గ్రహముల దూరము క్రింద చూపబడినవి -

| గ్రహము | బోడ్ సూత్రముప్రకారము సూర్యునినుండి గ్రహపుసగటు దూరము | అసలు సగటుదూరము |
|---|---|---|
| బుధుడు | $0\ 4 + (0\ 3 \times 2^{-1}) = 0\ 5 \times 1\ 5 \times 10^{8}$ కి మీ | $0\ 4 \times 1\ 5 \times 10^{8}$ కి మీ |
| శుక్రుడు | $0\ 4 + (0\ 3 \times 2^{0}) = 0\ 7 \times$ | $0\ 7 \times$ |
| భూమి | $0\ 4 + (0\ 3 \times 2^{1}) = 1\ 0 \times$ | $1\ 0 \times$ |
| అంగారకుడు | $0\ 4 + (0\ 3 \times 2^{2}) = 1\ 6 \times$ | $1\ 5 \times$ |
| ఖాళీప్రదేశము | $0\ 4 + (0\ 3 \times 2^{3}) = 2\ 8 \times$ | ? |
| గురుడు | $0\ 4 + (0\ 3 \times 2^{4}) = 5\ 2 \times$ | $5\ 2 \times$ |
| శని | $0\ 4 + (0\ 3 \times 2^{5}) = 10\ 0 \times$ | $9\ 5 \times$ |
| యురేనస్ | $0\ 4 + (0\ 3 \times 2^{6}) = 19\ 6 \times$ | $19\ 2 \times$ |
| నెప్ట్యూన్ | $0\ 4 + (0\ 3 \times 2^{7}) = 38\ 8 \times$ | $30\ 1 \times$ |
| ప్లూటో | $0\ 4 + (0\ 3 \times 2^{8}) = 77\ 2 \times$ | $39\ 5 \times$ |

1781 వ సంవత్సరములో యురేనస్‌ను కనుగొనిన తరువాత ఈ సూత్రమునకు ప్రాధాన్యము హెచ్చెను పైని పేర్కొనబడిన ఖాళీప్రదేశములో మరియొక గ్రహమును కనుగొనవలెనను ఉత్సాహము పెక్కురు శాస్త్రజ్ఞులకు కలుగుచుండెను 1801 వ సంవత్సరములో పియాజి (Piazzi) అను సిసిలీదేశపు శాస్త్రజ్ఞుడు మొట్టమొదట లఘుగ్రహమును ఈ ఖాళీతావులో కనుగొనెను 1802 లో మరియొక లఘుగ్రహము కనిపించెను వీటిలో మొదటిదానికి సెరెస్ (Ceres) అనియు రెండవలఘుగ్రహమునకు పల్లాస్ (Pallas) అనియు నామములు ఇవి అత్యంతము చిన్నవిగానుండుటచే వీటిని లఘుగ్రహము లందరు ఫోటోలు తీయు సాధనములు దూరదర్శినులకు అమర్చిన తరువాత ఈ లఘుగ్రహములను కనుగొనుట మిక్కిలి సులభమయ్యెను ఇప్పటికి రెండువేలవరకు లఘుగ్రహములు కనుగొనబడినవి ఈ లఘుగ్రహములన్నియు సూర్యునిచుట్టు పడమటిదిక్కునుండి తూర్పుదిక్కునకు తిరుగుచున్నవి వీటి సంచారకాలము 1½ సం॥లనుండి 6 సం॥ల వరకు కలదు సూర్యునినుండి వీటిదూరము చాలావు 3 5 × $10^{8}$ కి మీటర్ల నుండి 5 × $10^{8}$ కిలోమీటర్లవరకుండును

ఈ లఘుగ్రహముల కక్ష్యలన్నియు అంగారకునకును గురునకును మధ్య అంతటను సమముగా విస్తరించక కొన్ని ప్రదేశములలో ఎక్కువగాను మరికొన్ని ప్రదేశములలో తక్కువగాను కేంద్రీకరింపబడియున్నవి ఈ కక్ష్యలు ఎక్కువగా కేంద్రీకరింపబడిన ప్రదేశములకు అతిసమీపములో ఈ గ్రహములు అసలు తిరుగుచున్నట్లు కనిపించుటలేదు ఈ ఖాళీప్రదేశములకు "కిర్కువుడ్ ఖాళీలు (Kirk Wood Gaps) అని పేరు

ట్రోజను లఘుగ్రహములు -

చిత్రము 2

పటము 1
ట్రోజనులు

కెప్లరు న్యూటను అను శాస్త్రజ్ఞులు ప్రతిపాదించిన సిద్ధాంతములను రెండు వస్తువులు పరస్పరము ఆకర్షించుకొనుచున్నప్పుడు ఉపయోగించి ఈ వస్తువుల కక్ష్యలను కనుగొనవచ్చును కాని రెండు వస్తువుల కంటె అధికసంఖ్యగల వస్తువులు ఒకదానినొకటి ఆకర్షించుకొనుచున్నచో వాటి కక్ష్యలు కనుగొనుట మిక్కిలి కష్టము మూడు వస్తువులున్నపుడు వాటి మధ్యగల ఆకర్షణశక్తిని వాటి కక్ష్యలను, కనుగొనుట కొన్ని పరిస్థితులలో సులభము ఈ మూడు వస్తువులు ఒక సమభుజత్రిభుజముల

శీర్షముల దగ్గర నుండి ఈ మూడు వస్తువులలో ఒక వస్తువు యొక్క ద్రవ్యరాశి (mass) మిగిలిన రెండింటి (ద్రవ్యరాశి) కంటె చాలతక్కువగ నుండి మిగిలిన రెండింటిలో ఒకదాని ద్రవ్యరాశి మూడవదాని ద్రవ్యరాశిలో 0 04 వంతుకంటెను తక్కువగానున్నచో ఈ మూడువస్తువులు ఎల్లపుడును తమ తమస్థానములలోనే ఉండి ఈ మూడింటి గరిమనాభిచుట్టు తిరుగుచుండును ఈ సిద్ధాంతమునకు సరియగు ఉదాహరణములు సూర్యుడు గురుడు లఘుగ్రహములు - ఈ లఘు గ్రహముల ద్రవ్యరాశి మిక్కిలి తక్కువగా నుండును గురుడు సూర్యుని ద్రవ్యరాశిలో 0 001 మాత్రమే ఉండును అందుచేత ఏవియైన కొన్ని లఘుగ్రహములు సూర్యునకును గురునకును సమాన దూరములో నున్నచో (చూడు పటము 1) అవి ఎల్లపుడును అటులనే సంచరించుచుండును ఇట్టి లఘుగ్రహములు ఏడు గురునకు తూర్పునను ఐదు పశ్చిమముగను కలవు ఇవి గురుని కక్ష్యలోనుండి సూర్యునిచుట్టు సంచరించును గురునకును వీటికిని మధ్యనున్న దూరము పైసిద్ధాంతమునసరించి ఎల్లపుడును ఒకటిగనే ఉండుటచే ఈ రెండువస్తువులు (Bodies) ఒకదానినొకటి ఢీకొను ప్రసక్తి లేదు ఈ పండ్రెండు లఘుగ్రహములను ట్రోజనులందురు

భూమికి దగ్గరగాబోవు కొన్ని లఘుగ్రహములు (పటము 2) భూమికి ఏ ఇతరగ్రహములు రాలేనంత దగ్గరగా ఈ లఘుగ్రహములు వచ్చును ఎరాస్ (Eros) మనకు అతి దగ్గరగానున్నపుడు ($14 \times 10^6$ మైళ్లు) అపోలో (Appolo) $8 \times 10^6$ మైళ్ల దూరములోనుండును ఎడోనిస్ అను లఘు గ్రహము శుక్రుడు భూమి అంగారకుడు అను గ్రహములకు దాదాపు $1 \times 10^6$ మైళ్లు దగ్గరగా వచ్చును

లఘుగ్రహములు : వాటి పరిమాణము : రూపము :— లఘుగ్రహములు మిక్కిలి చిన్నవి ఎరాస్ (Eros) 15 మైళ్ల వ్యాసమును కలిగియుండగా అపోలో మొదలగు ఇతరములు ఒకమైలు వ్యాసముకలవిగానున్నవి ఇవి చాలవరకు వంకర టింకరగానుండి (irregular shape) ఒండొంటిలో భ్రమించుచుండునపుడు కొన్ని కాలములందు తక్కువగాను, మరికొన్ని కాలములందు హెచ్చుగాను సూర్యకాంతిని పరావర్తనము చేయును ఈ కాంతి మారునట్టి కాలమును పరిశీలించి ఈ లఘు గ్రహము లెంత కాలములో భ్రమించుచున్నవో - వీటి పరిమాణ మెంతయున్నదో కనుగొనవచ్చును

ఎరాస్ యొక్క కాంతి మారుచున్న పద్ధతినిబట్టి ఈ లఘుగ్రహము ఒక ఇటుకవలెనున్నదనియు దీని పొడవు 15 మైళ్లును వెడల్పు మందము 5 మైళ్లును ఉండుననియు ఊహించబడినది ఈ లఘుగ్రహపు భ్రమణకాలము 5 గంటల 16 నిమిషములు శోధించిన లఘుగ్రహముల భ్రమణకాలము 2 గంటల 52 నిమిషములనుండి 20 గంటలవరకుండును యునోమియా (Unomia) అను లఘుగ్రహముతప్ప తక్కిన వన్నియు పడమటినుండి తూర్పునకు భ్రమించుచున్నవి యునోమియామాత్రము తూర్పునుండి పశ్చిమదిశకు భ్రమించుచున్నది

లఘుగ్రహములేర్పడుటకు కారణములేమి ? ఒక పెద్ద గ్రహము కొన్ని కారణములచే భిన్న భిన్నములుగా బ్రద్దలయి (ఈ గ్రహమును మరియొకవస్తువేదైన ఢీకొనినచో ఇట్లు జరగవచ్చును) లఘుగ్రహములుగా మారవచ్చును ఈ భిన్నములయిన ముక్కలు ఒకదానినొకటి అనేకపర్యాయములు ఢీకొనగా అవి చిన్నవిగామారి చివరకు పొడియై శనిగ్రహము చుట్టునున్న వలయములోని పదార్థములుగానగును ఈ సిద్ధాంతము నిజమైనచో ప్రస్తుతము చూడబడుచున్న లఘుగ్రహముల కక్ష్యలు అన్నియు ఒకచోట అనగా పెద్దగ్రహము బ్రద్దలయినచోట కలువవలెనుకదా ? కాని వాటికక్ష్యలు అట్లు కలియుటలేదు సూర్యకుటుంబములోని మిగిలిన గ్రహములు స్వీయమైన ఆకర్షణశక్తిచే ఈ కక్ష్యలను మార్చియుండును

చిత్రము 3



కొన్ని లఘు గ్రహముల కక్ష్యలు

పటము 2

కొన్ని లఘుగ్రహముల కక్ష్యలు భూమికక్ష్యకు మిక్కిలి

దగ్గరగా నుండుటచే ఇవి భూమితో ఢీకొనుటకు అవకాశము కలదు. మనము ఆకాశములో చూచుచున్న కొన్ని ఉల్కలు ఇట్టివే కావచ్చును.

అల్పగ్రహములు అనేక పరిశోధనములకు ఉపయోగించును.

( ) వీటి కక్ష్యలు అనేక సిద్ధాంతములను ఋజువుచేయుటకు ఉపయోగింపవచ్చును. ఉదా: మూడువస్తువుల ఆకర్షణ పద్ధతి (2) ఈ అల్పగ్రహములు బ్రద్దలయినట్టి ఒక గ్రహము యొక్క ముక్కలు కనుక వీటి పరిశోధనలు అనేక ఖగోళ శాస్త్రవిషయములను తెలిసికొనుటకు ఉపయోగించును. (3) ఈ ఉపగ్రహములు భూమికి మిక్కిలి దగ్గరగా వచ్చును కావున వాటిదూరమును మిక్కిలి నిశ్చితముగా కనుగొని, దానినుండి భూమికి సూర్యునకుగల దూరమును మిక్కిలి శేరికగా కన్గొనవచ్చును.

సి. భూ. శ.

## లాక్ జాన్

జాన్‌లాక్ అనునతడు అత్యంత ప్రఖ్యాత బ్రిటిష్ రాజకీయతత్త్వవేత్తలలో నొకడు. ఇతడు క్రీ. శ. 1632 ఆగస్టు 29 వ తేదీన సామర్‌సెట్ షైరున కుత్తరమున నున్న రిన్‌గ్టన్ అను గ్రామమున జన్మించెను. కాని తరువాత కొంతకాలమునకు బ్రిస్టల్ నగరమునుచేరి అచ్చట నివసించుచుండెను. చిన్న వయసునందే ఇతనితల్లి మరణించెను. ఇతనితండ్రి భూస్వామిగను న్యాయవాదిగను గూడ జీవితమును తరుసామర్థ్యముతో గడపెను. పలుకుబడి గడించిన లాక్ తనతండ్రినుండి గొప్ప ఆస్తిని సంక్రమింపజేసికొనుటతోపాటు అతని మహత్తర గుణములన్నిగూడ అలవరచుకొనెను.

ప్రారంభములో లాక్ వెస్ట్‌మినిస్టరు పాఠశాలయందు విద్యనభ్యసించి, అనంతరము అచ్చటనుండి ఆక్స్‌ఫర్డు నగరమునందలి క్రైస్టు చర్చికళాశాలకు తరలివెళ్ళి అచ్చట విద్యార్థి వేతన సహాయముతో విద్యార్జనము కొనసాగించెను. అచ్చటి పాఠ్యప్రణాళిక సంప్రదాయపద్ధతి ననుసరించి వ్యవహారమునందుండెను. — వ్యాకరణశాస్త్రము అలంకార శాస్త్రము తర్కశాస్త్రము రేఖాశాస్త్రము నీతిశాస్త్రము మొదలైనవి ఈ ప్రణాళికయందలి అంశములు. కానసాగించిన అధ్యయనము అంత తృప్తికరముగ లేదని ఆతడు చెప్పుచుండెడివాడు. ఎట్లయిననేమి! ఆతడు ఆక్స్‌ఫర్డు విశ్వవిద్యాలయమునుండి బి. ఏ. ఎం. ఏ. పట్టములను గైకొనెను. వెను వెంటనే ఆక్స్‌ఫర్డు విశ్వవిద్యాలయమునందాతడు గ్రీకుభాషయందధ్యాపకుడుగను అలంకారశాస్త్రమునందు రీడరుగను పిమ్మట 1664 లో నీతిశాస్త్రబోధనమందు గుణదోషవివేచకుడుగను నియుక్తుడై ఉద్యోగము సలిపెను.

ఇన్ని కార్యములలో నిమగ్నుడైయుండినను ఆతనికి విరామకాలమింకను మిగిలెడిది. డెస్కార్టెస్ రచించిన గ్రంథములను పఠించిన పిమ్మట ఇతనికి తత్త్వశాస్త్రము నందు పరిపూర్ణజ్ఞానము కలిగెను. మొదట ఆక్స్‌ఫర్డు విశ్వవిద్యాలయమునందును అటుతర్వాత రాయల్ సొసైటీ యందును ఆతడు జరిపినవ్యాసంగములు రసాయన వాతావరణ శాస్త్రముల నధ్యయనమొనర్చుటకు సహాయపడెను. పైన పేర్కొనిన వ్యాసంగములు ఉద్యోగములు చాలవా అనునట్లు ఆతని సర్వతోముఖమైన అఖండమేధాశక్తి కారణముగా జాన్‌లాక్ వైద్యశాస్త్రమునుకూడ అభ్యసించి కొంతకాలమైనపిదప వైద్యవృత్తిని నిహితము చేపట్టెను. అయితే ఈ శాస్త్రమునందాతడు పట్టమునుమాత్రము పొందలేదు.

పై కార్యక్రమములకు తోడుగా ఆతడు ఆక్స్‌ఫర్డు నందున్నకాలములోకూడ రాజకీయవిషయములందు శ్రద్ధాసక్తులను ప్రకటించెడివాడు. ఆ తరుణములో మతమునకును ప్రభుత్వమునకును నడుమగల సంబంధమునుగూర్చియు మత సహనముయొక్క ప్రాముఖ్యమునుగూర్చియు పెక్కు వ్యాసములను ఆతడు రచించెను. రాజ్యతంత్రప్రమేయమునుగూర్చి ఆతడు జర్మనీకి వెళ్లవలసివచ్చినపుడు వైద్యవిద్యావ్యాసంగమును వదలుకొనెను. అచ్చటినుండి మరలివచ్చిన వెంటనే ఆతడు స్పెయిన్ దేశమునకు రాయబార కార్యాలయ కార్యదర్శిగా వెళ్లవలసియుండెను. కాని ఆ యుద్యోగములోచేరుటకాతడు నిరాకరించెను. రాజకీయజీవితమునకు తాను అంకితమగుటకై ఆతడు విద్యావ్యాసంగమును విరమించెను.

తలవనితలంపుగా అష్లిప్రభువుతో ఆతనికి మైత్రి సర్పడెను. కొంతకాలముతర్వాత లాక్, అష్లిపైనొక శస్త్రచికిత్స చేసి ఆతని ప్రాణమును రక్షించెను. తత్ఫలితముగా ఇరువురి నడుమ మైత్రీబంధము గాఢమాయెను. అందుచే లాక్‌కు రాజకీయములయెడ అభిరుచి, అభిమానము మెండాయెను. అష్లి, 'ప్రభువు' బిరుదమును స్వీకరించి అనంతరము 1672 లో లార్డ్ ఛాన్సెలరు పదవిని అధిష్ఠించినంతనే లాక్ బ్రిటిష్

వాణిజ్యమండలికి కార్యదర్శి అయెను. బ్రిటిష్ పరిపాలనా యంత్రాంగములో ఆష్లీప్రభువు ప్రముఖస్థానమును వహించియున్నంతకాలము అదృష్టదేవత లాక్‌ను వరించియుండెను. ఆష్లీ 1675 లో ఘటిల్లిన పతనముతో లాక్ కూడ పబ్లిక్ జీవితరంగము నుండి వైదొలగవలసినవాడయ్యెను.

లాక్ సంపూర్ణముగా రాజకీయ వ్యవహారములలో నిమగ్నుడైయున్నను శాస్త్రీయ అధ్యయనములో అతడు ఆసక్తిని వీడలేదు. అట్లే వైద్యరసాయనశాస్త్రములో కూడ శ్రద్ధతీసికొనసాగెను. విజ్ఞానశాస్త్ర మతసంబంధము లగు సమస్యలను చర్చించుటకాతడు సమావేశముల నేర్పరచుచుండెడివాడు. ఈ చర్చలఫలితముగా ఆర్జించిన విశేషజ్ఞానమును పురస్కరించుకొని అతడు మానవజీవిత అవగాహనమునుగూర్చి అత్యుత్తమ గ్రంథములను రచించెను.

ఇంతలో తన ఆరోగ్యమునుగూర్చి ఆందోళనను జనింపగా అతడు ఫ్రాన్సునకు వెడలి నాల్గుసంవత్సరములచ్చటనే గడపెను. అతని మిత్రుడు ఆష్లీప్రభువు మరల అధికారములో ప్రవేశింపగా లాక్ ఇంగ్లండునకు తిరిగివచ్చి పూర్వపు కార్యకలాపములను తిరిగి కొనసాగించెను. కాని ఆష్లీప్రభువు బ్రిటిష్ రాజునకు వ్యతిరేకముగా జరిపిన కుట్రఫలితముగా అతనికి ప్రవాసమును తుదకు మృత్యువుకూడ సంభవించెను. ఆ కుట్రలో ప్రమేయమున్నట్లుగ లాక్ అనుమానింపబడెనే కాని వాస్తవమునకాతడు నిర్దోషియని స్పష్టపడెను. అయినను పిమ్మట లాక్ హాలెండునకు పారిపోయి రాజధానియగు ఆమ్‌స్టర్‌డామ్‌లో "డాక్టర్ వాన్ డర్ లిన్ డెన్" అను మారుపేరుతో జీవించుచుండెను. అచ్చట వాతడు స్పినోజా అనుయాయులతో మైత్రి నెరపుకొని స్థిరనివాసియై తన వ్యాసరచనమును పూర్తిచేయసంకల్పించెను.

ఇంగ్లండులో 1688 వ సంవత్సరములో జరిగిన విప్లవ సమ్మోహమునందాతనికి కొంతవరకు ప్రమేయమున్నదని వదంతులు పుట్టెను. లాక్ మిత్రుడైన విలియమ్ (William of Orange) ఇంగ్లండునకు నూతనప్రభువు కాగా అతని క్రొత్త ప్రభుత్వము లాక్‌కు బాధ్యతాయుతమైన పదవులను ప్రసాదింప నిశ్చయించెను. కాని అతడు వాటిని నిరాకరించి అధ్యయన రచనావ్యాసంగమునందే తనజీవితమును కొనసాగింప నిశ్చయించుకొనెను. హాలెండులోనుండగా నాల్గు సంవత్సరములకాలములో 'సహనము' అనుశీర్షికతో అతడు లాటినుభాషలో రచించిన సుదీర్ఘగ్రంథము హాలెండునందును అతడు ఇంగ్లండుకు మరలివచ్చినవెంటనే దాని ఆంగ్లానువాదము ఇంగ్లండునందును ప్రకటింపబడెను. 1690లో సివిల్ ప్రభుత్వమును గురించి రెండుగ్రంథములును 1693 లో విద్యావిషయముపై అభిప్రాయములు అను గ్రంథమును ప్రచురింపబడెను.

అనారోగ్యము వలన అతని కార్యక్రమమునకు అంతరాయము కలుగుటచే ప్రచారరంగమునుండి అతడు తుదిసారిగా నిష్క్రమించెను. సహనమునుగూర్చి లోగా అతడు వ్రాసిన గ్రంథములతనిని పెక్కువివాదములకు గురిచేసెను. క్రైస్తవ మతసంబంధ సహేతుకత్వము నున్నగు గ్రంథములుకూడ ఈకాలముననే రచింపబడినవి. సర్ ఐసాక్ న్యూటనుకు ఆ కాలమున అతడు వ్రాసిన లేఖలు అతని రచనలలో ముఖ్యములైనవి. రాజకీయరంగమునుండి విరమించినను అతడు ఆర్థిక రాజకీయసమస్యలపై ఆసక్తిని ప్రకటించుచు తన అభిప్రాయములను వ్యక్తమొనర్చుచుండెడివాడు. 1700 వ సంవత్సరములో ఆరోగ్యము క్షీణింపగా లాక్ లండను నగరమును వీడి ఎస్సెక్సునకు తరలివెళ్లి ప్రశాంతముగా కాలము గడుపుచు రచనావ్యాసంగమును సాగించుచునే యుండెను. ఆతనిజీవితములో తుది నాల్గుసంవత్సరములును క్రైస్తవ మత గ్రంథ పఠనమునందుగడచెను. "సహనము"నుగూర్చి నాల్గవ లేఖను రచించుచుండగా 1704 అక్టోబరు 28 వ తేదీన జాన్ లాక్ పెక్కురు అభిమానులను దుఃఖసాగరమున ముంచి ఇహలోకమును వీడి చనెను.

జాన్ లాక్ సర్వతోముఖమైన ప్రజ్ఞాశాలియని పేర్గాంచెను. అతడు ఆసక్తిని ప్రకటించనివిషయమొక్కటియు లేకుండెను. ప్రభుత్వపాలనముపైన మతవిషయములపైన సహనముపైన, విద్యావిషయముపైన ఆర్థిక వాణిజ్యవ్యాపార విషయములపైన మత వాఙ్మయముపైన అతడు గావించిన రచనములు అత్యంత ప్రతిభావంతములైనవి. ఈగ్రంథములందలి విషయములు వ్యాఖ్యానములు సర్వసాధారణము, సంప్రదాయసిద్ధములైన వాటికంటె భిన్నముగ నుండుటేకాక ప్రాచీనములైన మౌలికసమస్యలపై కూడ క్రొత్తవెలుగును ప్రసరింపజేసెను. అతని జీవితకాలములోనే అతని విజ్ఞానము, వివేకము ప్రభుత్వమునకును, ప్రజలకుకూడ ఆచరణీయముగా మిక్కిలి ఉపయుక్తముగనుండెను. గాఢమైన అతని లోకజ్ఞా

భవము మానవులనుగూర్చి వారి మస్యనుగూర్చి విజ్ఞానతత్వ శాస్త్రములనుగూర్చి అతనికిగల పరిజ్ఞానము అతనిరచనల ద్వార సమకాలీనులైన తనదేశ ప్రజలకు మాత్రమేకాక ప్రపంచమందలి భావితరములవారికికూడ సహాయపడెను లాక్ కంటె గొప్ప మేధ వియు వివేకియు తార్కికుడును మరొకడు లేడని అతని జీవితచరిత్రము రచించిన థామస్ ఫౌలర్ వక్కాణించెను మానవ శరీరమందలి అంగవిన్యాసములను విమర్శించు పరిపూర్ణవిజ్ఞానముగల వైద్యశాస్త్రవేత్తవలె లాక్ మానవహృదయాంతరాళములోని లోతులువెదకి అవగాహనమొనర్చుకొనగలిగినవాడు ఇంగ్లండులో నేకాక ఐరోపా ఖండమునందుకూడ అకాలపు తాత్త్వికులకాతడు మార్గదర్శిగా నరలెను జర్మను తత్త్వవేత్తయగు లిబ్‌నిజ్ ఫ్రెంచి తత్త్వవేత్తయగు వాల్టేర్ ప్రభృతులు లాక్ రచించిన గ్రంథములను విమర్శించియున్నను ఆ యుగపురుషులలో అతడు మిక్కిలి వివేకియని ప్రశంసింపకతప్పలేదు అనాటిప్రజలాతని యెడ అతిశయమైన గౌరవప్రేమలను ప్రకటించుచుండెడివారు అతని జీవితము ఒడుదుడుకులతో గడచినను ప్రజలు ప్రభుత్వము అతనిపట్ల విశేషాదరణమునుచూపి అతనిచే మహోన్నతమైన పదవులను అలంకరింపజేసిరి అసంఖ్యాకములైన అతని రచనలద్వారమునను ప్రవర్తనముద్వారమునను అతడు లోకమునకు సహనశీలమును ఉదారస్వభావమును నిస్స్వార్థమును ప్రదర్శించి ప్రపంచమునకెంతయో ఉపకారమొనర్చెను

ఠీ ఠీ

## లాప్‌లాస్ (1749-1827)

ఇతని పూర్తిపేరు ఎయరీ సైమన్ మార్క్విస్ డి లాప్‌లాస్ అనునది ఫ్రెంచి గణితశాస్త్రవేత్తయు, ఖగోళ శాస్త్రజ్ఞుడునైన ఇతడు నార్మండీమండలమందలి బ్యూమాంట్ అగ్ ఆను తావున క్రీ శ 1749 మార్చి 28 వ తేదీన జననమందెను ఇతని తండ్రి యొక పేదరైతు అతని ఇరుగుపొరుగు వారైన కొందరు ధనికులు లాప్‌లాస్ యెడ శ్రద్ధాసక్తులు వహించి అతని విద్యార్జనమునకు తోడ్పడిరి విద్యాసము పార్జనానంతరము లాప్‌లాస్ బ్యూమాంట్ నగరమునందలి సైనిక పాఠశాలలో గణిత శాస్త్రోపాధ్యాయుడుగా నియుక్తుడై ఉద్యోగము నెరవుచుండెను 1767 లో అతడు కొందరి సిఫార్సులను గైకొని పారిస్ నగరమునందుండిన అలెంబర్టు అను ప్రముఖుని కడకు చని తాను రచించిన యంత్రగతి శాస్త్ర సిద్ధాంతములు అను గ్రంథమును అతనికి నివేదించి అతని సానుభూతిని సంపాదించెను లాప్‌లాస్ ప్రతిభకు అలెంబర్టు ఆనందమొంది పారిసునందలి ఈకోల్ మిలిటెయిర్ అను విద్యాసంస్థయందు గణితశాస్త్రాచార్యుడుగా అతడు నియుక్తుడగునట్లొనర్చెను లాప్‌లాస్ విశ్లేషణసిద్ధాంతము నందు విశేషప్రావీణ్యమును గడించి దానిని ఖగోళీయ యంత్రగతిశాస్త్ర సంబంధమైన సమస్యలకు అన్వయింప దొడగెను

1773 ఫిబ్రవరి 10 వ తేదీన సమావేశమైన విజ్ఞానశాస్త్ర పరిషత్సభయందు లాప్‌లాస్ పఠించిన పత్రములో గ్రహసంబంధములైన మధ్యమ గదచలనముల స్థిరత్వమును (Invariability of planetary mean motions) వెల్లడించెను సూర్యగ్రహ మండలముయొక్క స్థిరరూపమును ఖండితముగా నిర్ణయించుటలో ఇది ప్రథమసోపాన మనబడినది అనంతరము వరుసగా పెక్కు గంభీరమైన పరిశోధనములను అతడును లగ్రాంజ్ అను మరియొక శాస్త్రవేత్తయును జరపిరి ఈ పరిశోధనల ఫలితముగా లాప్‌లాస్ 1784-86 సంవత్సరముల నడుమ మూడు సంపుటములలో ప్రకాశమానమైన స్వీయ చరిత్రమును రచించెను తన రచనలయందు దాతడు బృహస్పతి శనిగ్రహములయొక్క సుదీర్ఘమైన అసమానత్వమునకు గల కారణములను లాప్‌లాస్ ప్రత్యక్షముగా నిరూపించెను అంతేకాక అతడు జోవియన్ విధానము నకు సంబంధించిన సిద్ధాంతములని పరిపూర్తిగావించి భూకక్ష్యయొక్క అసాధారణ వైపరీత్యమునందు కలుగు ప్రాపంచిక పరివర్తనములపై చంద్ర కుటుంబముయొక్క గమనవేగము ప్రత ఆధారపడునను అంశమునుకూడ వెల్లడించెను

ఇంతలో మూడు తరములనుండి ఆకర్షణ సిద్ధాంతమును గురించి పరిశోధనము సల్పిన ప్రఖ్యాతగణిత శాస్త్రజ్ఞుల కృషిని క్రమబద్ధ మొనర్చు సమయమాసన్న మాయెను లాప్‌లాస్ ఈ కర్తవ్యమును చేపట్టి 1799-1825 సం॥ల మధ్య సుప్రసిద్ధమైన మెకానిక్ సెలెస్ట్' అను మహా గ్రంథమును అయిదు సంపుటములలో రచించెను ఈ గ్రంథమాతని గణిత శాస్త్రప్రావీణ్యమునకు చిరస్మరణీయమగు చిహ్నముగా ప్రకాశించెను ఈ గ్రంథరచనముద్వారా సూర్యకుటుంబమునకు సంబంధించు యాంత్రిక సమస్యలకు సంపూర్ణ పరిష్కారమును చూపుటమే లాప్‌లాస్ యొక్క ధ్యేయము 1796 లో అతడీ విషయమును సులభశైలిలో మరియొక గ్రంథరూపమున

ప్రజలకు సుబోధక మొనర్చెను ఈ గ్రంథము ఖగోళశాస్త్ర చరిత్రయొక్క సంక్షిప్త స్వరూపమని పేర్కొననగును ఇందు అతని నీహారికా ప్రమేయమును (nebular hypothesis) గూర్చిన ప్రశంస కూడ కలదు

లాప్లాస్ పరిభ్రమణ ద్రవరాశియొక్క క్షేత్రతుల సామ్యమును (figure of equilibrium of rotating fluid mass) గూర్చి అధ్యయన మొనర్చెను ఈ విషయమును గూర్చిన అతని స్వీయచరిత్రయందలి ప్రథమభాగమును 1778 లోను తుదిభాగమును 1817 లోను విజ్ఞానశాస్త్ర పరిషత్సభ కాఅడు పంపెను ఈ అధ్యయనపత్రముల ఫలితాంశములు మెకానిక్ సెలెస్ట అను గ్రంథమునందు పొందుపరుపబడినవి 1785 లో రచింపబడిన మరియొక సుప్రసిద్ధ పత్రమునందు బాహ్యాణువుపై గోళాకారముయొక్క ఆకర్షణమును గూర్చిన సాధారణ సమస్యకుకూడ అతడు సంపూర్ణమైన పరిష్కార మార్గమును సూచించెను ఈ పత్రము ననుసరించి లాప్లాస్ అంకగుణకములయొక్క శక్తియుత ప్రమేయ మను విషయమును అతడు నూతనముగా ఆవిష్కరించెను

సంభవనీయతా సిద్ధాంత మను విషయములోగూడ లాప్లాస్ తన ప్రతిభను ప్రదర్శించెను ఈ సిద్ధాంతమును విపులీకరించుచు అతడు థియరీఎనలటిక్ డెస్ ప్రాబబిలిటీస్ అను గ్రంథమును 1812 లోను ఎస్సెయ్‌ఫిలాసఫిక్ అను మరియొక గ్రంథమును సులభశైలిలో 1814 లోను అతడు ప్రకటించెను

లాప్లాస్ చే ఆవిష్కరించబడిన ఆకర్షణ సిద్ధాంతము నకు సంబంధించు పాక్షిక విభిన్న సమీకరణములనుబట్టి అతడు పదార్థవిజ్ఞానశాస్త్రమునందలి పలుశాఖలకును విశేషించి ఉష్ణ విద్యుదయస్కాంత సిద్ధాంతములకును ముఖ్యమైన సంకలనములను సమకూర్చి వాటికి వికాసమును కల్పించెను అతని రచనలన్నియు ఫ్రెంచిప్రభుత్వముచే ప్రచురింపబడెను

వివిధ విజ్ఞానశాస్త్ర సంస్థలచే లాప్లాస్ గౌరవింపబడి, పెక్కు సన్మానముల నందుకొనెను తుది దినములలో అతడు ఆర్క్యుయిల్ అను ప్రదేశమునకు విశ్రమించుటకై వెళ్లిన సమ్మట ప్రపంచమంతటినుండి పలువురు ప్రముఖ లాతనిని సందర్శింప వేగిరి అతడు 1827 మార్చి 5 వ తేదీన అస్తమించెను

ఆర్ ధా

## లాభములసమస్య

కర్షకులు భూమి పెట్టుబడి - ఈ మూడును వాటం తటవియే ఉత్పత్తిసాధనములు కానేరవు - ఒకవ్యక్తి వాటిని ఒకచోచేర్చి పనిచేయించవలయును ఏవ్యక్తియైనను ఈ పని చేసి వాటికియ్యవలసిన ప్రాధాన్యమును పారితోషికమును ఇచ్చి శేషించినదానిని అనుభవించును జాతీయలాభాం శము (National dividend) లో లాభ మొక భాగమై యున్నది సామాన్యవ్యవహారములో ఉత్పత్తి వ్యయమం తయు పోను శేషించినదానిని లాభమనెదము నిత్య వ్యవహారములో స్థూలలాభమునందు నికరలాభము మాత్రమే కాక వేతనములు ఇతర రాబడులు ఇమిడియుండును

వ్యక్తిగతముగా ఒకడొకపరిశ్రమను నడుపునప్పుడు అతడనతికాలములో పెట్టుబడిని శీఘ్రమైనంత త్వరితముగా వాపసుతీసికొనుటకు యత్నించును విపణివీధియందలి ధర వరలనుబట్టి అతడు పనిచేయును సాధారణముగా హెచ్చు లాభములు సంపాదించుటకాతనికి అవకాశములుగలవు

మామూలు పద్ధతులప్రకారము పెట్టుబడికి ఎట్టి లాభములేని ఉత్పత్తిని జాయింటు స్టాకు కంపెనీలద్వారా నడిపెదరు అట్టిసంస్థలలో కనీసలాభములు మాత్రమే లభించును

ఉత్పత్తికి ఖర్చుపెట్టబడిన వ్యయముకంటె సరకు అమ్ముటవలన వచ్చు మొత్తము ఆదాయము అధికముగా నున్నయెడల ఆయాధిక్యతకు స్థూలలాభమని పేరు ఒక్కొక్కప్పుడు ఒకవ్యక్తి తన స్వంత ధనమును వ్యాపారములో నుంచవచ్చును ఈ లాభములో అతనికిరావలసిన వడ్డీయును కలసియున్నది అట్లే ఆతడెక్కడైన ధనమును అప్పు పుచ్చుకొన్నయెడల దానికి వడ్డీ కట్టవలయును తాను పనిచేయు కాలమునకు కూడ ఆర్థికదృష్ట్యా విలువకలదు ఇదికూడ స్థూలలాభములో ఇమిడియున్నది అంతేకాక పరిపాలన వేతనములు ఇయ్యవలసియున్నది ఇవన్నియు స్థూల లాభముల నుండి తీసివేసినచో నికరలాభము తేలగలదు నికరలాభములను నిర్ణయింపవలెననిన అన్నిరకములు తెల్లింపులు మినహాయింపవలసియున్నది మూలధనము తగ్గిపోకుండ పోషించుటకగు వ్యయము ప్రమాదములనుండి తప్పించుకొనుటకగు ఖర్చులు మున్నగునవి స్థూలలాభములనుండి మినహాయించిన తరువాతమాత్రమే నికరలాభములు తేలును అర్థశాస్త్ర

పరిభాషలో వీటిని లాభములని వాడెదరు భీమా ముస్నగు వాటికగు ఖర్చులుగూడ స్థూలలాభములనుండియే తీసివేయవలయును

అనుభవజ్ఞానులకు నికరలాభములు హెచ్చుగారాగలవు నిజముగా నొకవ్యక్తి తన ధనమును ఒకానొక పరిశ్రమలో పెట్టుబడి పెట్టినప్పుడు ఒకానొక సమయములో సరియగు వడ్డీ రాకుండుటయేగాక అసలు మొత్తమునకే భంగము కలుగు చుండు ఉదాహరణములు లేకపోలేదు ఎంత భీమా చేసినను లాభములు ముందుగా నిర్ణయించుట కష్టసాధ్యము

అర్థశాస్త్రవేత్తలు లాభములనుగురించి పెక్కు సిద్ధాంతములను ప్రవేశపెట్టియున్నారు ఒకవ్యక్తి ధైర్యసాహసములను చూపినందువలన లభించిన ప్రతిఫలము లాభమని చాలమంది అనెదరు ఈ సిద్ధాంతము సాహసమునకు ప్రాముఖ్యమిచ్చుచున్నది ఇంతకు పూర్వము వ్రాసినట్లు అనుభవజ్ఞానులు వ్యాపారమందుగల సాధకబాధకములను ముందుగా తెలిసికొనగలరు భయోత్పాతములను కల్పించు కొన్ని పరిస్థితులను ముందుగా తెలిసికొనుటకు వీలుపడదు అర్థశాస్త్రములో మానవునియొక్క నడవడి ఉద్దేశము అలవాటు మీద హెచ్చుగా ఆధారపడియున్నందున చాలవిషయములలో తర్కశాస్త్రరీత్యా దీనికి కారణములు తెల్పుట కష్టము. అందుచే ఒక పరిస్థితిలో ఒక వస్తువు ధర హెచ్చుచు డునని ఊహించుకొనవచ్చును కాని ధర నిజముగా పెరుగకుండుటయే కాక ప్రజలు ఆ వస్తువు కొననందున ధరలు తగ్గవచ్చును భీమాపద్ధతివలన లాభములెన్ని పొందినను అవి అనిశ్చితమనియు రావచ్చు ఫలితమే లాభమనియు మరియొక సిద్ధాంతము కలదు ఏ వ్యక్తియు సాహసముతో ఒక వ్యాపారములోనికి దిగినయెడల కొంతయైనను ప్రతిఫలము ఎదురింపవచ్చును

నూతనమార్గముల ననుసరించుటవలన కలుగుఫలమే లాభమనియు సాంఘికముగా పెట్టుబడిదారుడు గొప్ప పాత్ర వహించుచున్నాడనియు కొందరు చెప్పెదరు కాని పూంజీ సిద్ధాంతమునకు ప్రతికూలురైనవారు దీనిని అంగీకరింపరు నిజముగా చూచినచో వ్యాపారము నిర్వహించువాడు యుక్తిపరుడుగా వ్యవహరింపవలెను వాటివలన వచ్చు లాభములు తాత్కాలికములని పెక్కురు చెప్పినను, వ్యాపారము కాని, పరిశ్రమ కాని అభివృద్ధికై తీసికొన్న అభివృద్ధిఫలములు తాత్కాలికములైనను వ్యాపారము నడుపు వ్యక్తి ఈ విషయములో మంచిపాత్ర వహించుచున్నాడని చెప్పవలయును

అభివృద్ధిచెందుచున్న దేశములలో వ్యాపారము నిర్వహించు వ్యక్తులు నూతనశాస్త్రసమ్మతమైన పద్ధతులను పాత పరిశ్రమలలో ప్రవేశపెట్టుటయందేకాక క్రొత్త పరిశ్రమల లోనికి కూడ పోవుటకు ఎంతో దోహద మిచ్చుచున్నారు ఆర్థిక పారిశ్రామిక వ్యవస్థ సక్రమముగా నడువవలెనని లాభార్జనప్రసక్తి యుండవలెను

ఉత్పత్తిక్రమములో భూమి పనివారలు పెట్టుబడి ఎంతముఖ్యమో పారిశ్రామికుడు కూడ అంతే ముఖ్యమని కొందరు ఆర్థిక శాస్త్రవేత్తలు చెప్పియున్నారు లాభముల పంపకము దేశముయొక్క ఆర్థికవిధానము సంఘవ్యవస్థపై ఆధారపడియుండును కొన్ని పరిస్థితులయందు లాభములో కొంతభాగమును కార్మికులుకూడ పొందవచ్చును లాభభాగయోజనమనగా ఇదే

ఇప్పటివరకు వ్రాసినదానినిబట్టి లాభములు జాతీయ లాభాంశమందొక భాగమనియు భూమికి బాడుగ యివ్వవచ్చునట్లు కార్మికులకు కూలివచ్చునట్లు పెట్టుబడిదారునకు వడ్డీ వచ్చునట్లు వ్యవహారకర్తకు లాభములు రావలెనని తెలిసికొంటిమి ఉత్పత్తిలోను పంపకములోను ఇది ముఖ్యమైన విషయము దేశసంపదకు ఉత్పత్తి అభివృద్ధికి అనేకరంగములలో తోడ్పడుచున్నవి వీటికి సరియగు ప్రతిఫలము ముట్టినవాడే దేశము ఆర్థికముగా అభివృద్ధి నొందగలదు అంతేకాక వీటివలన ఉత్పత్తి పెరిగి వివిధరంగములలో పనిచేయువారు సహకారభావము ఉత్సాహము చూపి పనిచేయగలరు అప్పుడే ఉత్పత్తి బాగుగా పెరుగును ఉత్పత్తి బాగుగా పెరిగినవాడే జాతీయాదాయము సవ్యముగా పంచబడి ఉత్పత్తికై సహకరించి అన్నిరంగములకు మంచిరాబడిరాగలదు అందుచేతనే అన్నిరంగములు శక్తిసామర్థ్యములతో పనిచేసినచో, దానికి హెచ్చు ప్రతిఫలము బాగుగనుండుననియు పంపకము కష్టసాధ్యముకాదనియు చెప్పెడిమాటలలో చాలసత్యమున్నది

లాభములు పూంజీ సిద్ధాంతలక్షణములనియు ప్రభుత్వమే పరిశ్రమలను నడుపవలయుననియు కొందరు చెప్పుటగలదు పరిశ్రమలన్నియు ప్రభుత్వముచే నడుపబడుట కష్టసాధ్యము ఉత్పత్తి క్రమములో పారిశ్రామికుడెంత అవసరమో పంపకములో లాభముల సమస్యగూడ అతనికి అంత

ముఖ్యము

ఆర్ వి రా

## లాలాలజపతిరాయలు

నేను మరణించవచ్చును కాని నేను చిందించు ప్రతి రక్తకణమునుండియు వేలాది స్వాతంత్ర్యయోధులు ఉద్భవింతురు — సైమన్ కమిషను రాకకు నిరసనగా పంజాబు కేసరి లాలాలజపతిరాయలు పలికిన పలుకులివి. ఇతని చరిత్ర ధైర్య సాహసములకు నిదర్శనమైనది లోకులకు ఉత్తేజకరమైనది.

వేద యుగము నాటినుండి ఇటీవలివరకును పంజాబు ఎన్నియో మార్పులకు లోనైనను అందలి పంచనద మధ్య ప్రదేశపు ప్రాదేశికైక్యతకు మాత్రము భంగము వాటిల్లలేదు. క్రీ శ 1947 లో బ్రిటిషువారి పుణ్యమాయని అఖండభారతము ఖండభారతమైనట్లే పంజాబురాష్ట్ర హృదయముకూడ రెండు వ్రక్కలైనది. అందు భారతదేశమునకు లభించినవ్రక్క తూర్పుపంజాబురాష్ట్రమనునది. క్రీ శ 1966 జనవరిలో ఈ తూర్పుపంజాబురాష్ట్రము మరల (1) పంజాబురాష్ట్రము (2) హరియానారాష్ట్రము అను రెండుముక్కలైనది.

వీరభూమియైన ఈ పాంచాలము ఒకనాడు సింధు రవి వ్యాస శల్య శతద్రువులనెడి పంచమహానదులకు నెలవైన రీతిగనే పంచమహా సింహములకును నెలవయ్యెను. అతిరథ శ్రేష్ఠుడు (1) ధృష్టద్యుమ్నుడు (2) మహారాజు పురుషోత్తముడు (3) గురు గోవిందసింహుడు (4) రణజిత్ సింహుడు (5) లాలాలజపతిరాయలును పంచమహా సింహములే.

పంజాబు ఆంగ్లపాలకుల కరగతమైన ఎమ్మట లాలా లజపతిరాయల పూర్వులలో కొందరు మలేరు కోటలా అను ప్రాంతములలో ఉండెడివారట. వీరిని అగ్రవాలులు (అగర్వాలులు-వైశ్యులు) అని వ్యవహరించిరి. వ్యాపార మేకాక రాజకీయోద్యోగములు చేయుటకూడ వీరిలో పరిపాటి. లజపతి రాయల తాత రల్లూమాల్. ఈయన జగ్రాం (జగ్రాన్) సమీపమున ఒక గ్రామమునకు కరణము. మతవిషయములలో చాల పట్టుదలగలవ్యక్తి. వీరిది జైనమతములో శ్వేతాంబర శాఖ. రల్లూమాల్ పుణ్యదంపతులకు క్రీ శ 1845 జనవరి 28 వ తేదీన లజపతిరాయల తండ్రియగు రాధాకిషన్ జనించెను. ఇతడొక మౌల్వియొద్ద విద్యాభ్యాసముచేసిన ప్రభావము మూలమున ఇస్లాము మతాచారములను పాటించు చుండెడి వాడు. కాని హిందూమతమునుమాత్రము వదలుకొనలేదు.

"నేను మహమ్మదీయ ప్రవక్తను నన్ను కన్న పాడినది నామాతృదేవత" అని లజపతిరాయలు ఒకచోట వివరించెను. ఇతనితల్లి పరమ పతివ్రత గొప్ప సంస్కారమునుగలది. ఈమె తనభర్త కంటెముందే పరమపదించినది. తల్లియెడల లజపతికి అపరిమితమైన భక్తి అనురాగమునుకూడ. రసవంద్రి రాధాకిషన్ క్రీ శ 1923 లో కీర్తిశేషుడైనప్పుడు లజపతి చెరసాలయందుండెను. తండ్రికి అవసానదశలో పరిచర్యలుచేయు భాగ్యము తనకు లభింపమికి లాలాజీ విచారపడుచుండెడివాడు.

లజపతిరాయలు క్రీ శ 1865 జనవరి 28 వ తేదీన పంజాబు రాష్ట్రములో ఫిరోజ్ పూరు మండలమునందు ఢూడికె అనెడి గ్రామమున తన మాతామహుని యింట జన్మించెను. లజపతి తండ్రియొక్క స్వగ్రామము జగ్రాం. ఇది అతని అత్తవారి ఊరగు ఢూడికెకు రెండుక్రోసులు. లజపతి తల్లి కుమారు నెత్తుకొని పుట్టింటినుండి అత్తవారియింటికి నడచి వచ్చుచు పోవుచుండెడిదట! జగ్రాం మలేరియావ్యాధికి పుట్టినిల్లు. అందుచే బాల్యమునుండియు లజపతి అనారోగ్య పీడితుడే. ఆ కారణమున అతడు కడు బ్రుంగిపోయినట్లుండెడివాడు.

లాలాజీవిద్యాభ్యాసము ఇంటియందే ఆరంభమయ్యెను. ఈయనకు చిన్ననాటినుండియు ఆటపాటలమీదకంటె చదువు

చిత్రము 1



లాలాలజపతి రాయలు

మీదనే మక్కువ యెక్కువ. చిత్రమేమనగా లాలాజీ ఓకా మహుడు జైనమతస్థుడు ఏక మహమ్మదీయ ముఖాభిమాని.

మతాభిమానిది ఎక్కువమతము ఈ కారణమువలన లజపతికి మతవిషయమునందు అప్పటిలో అల్లకల్లోల పరిస్థితి యేర్పడెను తండ్రిని కొంతకాలము అనుసరించినను పెద్దవాడై సిమ్మట ఆతడు తురుష్క మతాభిమానమును పూర్తిగావీడెను చదువుకై ఇల్లువిడిచి ముందు లాహోరు తరువాతఢిల్లీ పిదప లూధియానా తుదకు మరల లాహోరును చేరుకొనినాడు తన తండ్రికి శిష్యుడును మిత్రుడునైన లాలాభవానీదాసు ఆదరము లజపతికి లాహోరులో బాగుగ లభించినది లజపతి తన ప్రవేశ పరీక్షయందు కలకత్తా విశ్వవిద్యాలయమునుండి ప్రథమశ్రేణిలోను పంజాబు విశ్వవిద్యాలయమును డి తృతీయశ్రేణిలోను ఒకేసారి ఉత్తీర్ణుడయ్యెను

లాలాజీని పై చదువులు చదివింపవలెనని ఆ భాకిషన్ గాఢముగ అభిలషించెను కాని దారిద్ర్యము తీవ్రమైన ఆటంక మయ్యెను అయినను తండ్రి సాహసించి కుమారుని కళాశాలకు పంపినాడు ఆ దినములలో కళాశాలలో నెలకు రెండు రూకలును విద్యార్థి భోజనవసతి గృహములో నెలకు ఒక రూకయు కష్టపడి చెల్లించుచు ఆటంకములకును అసౌకర్యములకును జంకక లాలాజీచదువును సాగించుచు సాహసించి న్యాయశాస్త్ర పాఠశాలలోకూడ ప్రవేశించెను ఎన్నియో కష్టనిష్ఠురములకోర్చి క్రీ శ 1882 ఫిబ్రవరిలో ఆతడు న్యాయశాస్త్ర పరీక్షయందు తీరుడైనాడు విద్యార్థిదశలో ఆతడు ఉపాధ్యాయుల ఆదరాభిమానములను చూరగొనెను

దయానందస్వామి ఆధునిక భారత పునర్వికాసప్రదాత నవీనభారత నిర్మాత నవజీవనవిధాత లాలాజీ పరిశుద్ధమైన దేశభక్తికిని అమోఘమైన దైవభక్తికిని పరిపూర్ణమైన ఆత్మసమర్పణ శక్తికిని దయానంద సరస్వతి ఉపదేశములే ప్రధాన కారణములు వైదికమతమును అభిమానించుటయు ప్రాచీనార్యుల ఘనతకు గర్వించుటయు ఆర్య సమాజమే తనకు అలవరచినదని లాలాజీ పెక్కుమారులు అంగీకరించెను సత్యము ధర్మము స్వాతంత్ర్యము అను మూడింటిని సంబంధించిన చైతన్యమును ఆతనిలో ప్రవర్తిల్ల జేసినదికూడ ఆర్యసమాజమే లాలాహంసరాజు పండితగురుదత్త లాలాలజపతులు ముగ్గురును విద్యార్థిదశనుండికూడ మిత్రులు హంసరాజ గురుదత్తులు లజపతి జీవితపథమును మొదటినుండియు తీర్చిదిద్దినవారు తమవువ్వురును ఆర్యసమాజ శ్రేతాగ్నులు వాను ఉపాధ్యాయ వృత్తిని అవలంబింపవలెనని కోరియు

లజపతిరాయలు గురుదత్తుని వాతబోధానుసారము ప్రజాసేవకై న్యాయవాది వృత్తిని అవలంబించినాడు లాహోరులో ప్రఖ్యాత న్యాయవాదియై తాను ఆర్జించిన ధనము లక్షలాదిగ ప్రజోపయోగి సంస్థలకు లజపతి స్వేచ్ఛగా దానముచేసినాడు కొన్నినాళ్ళకు ఇట్టి న్యాయవాదివృత్తిని పరప్రభుత్వముపట్ల నిరసనగా విసర్జించి అభిమానధనుడను సంపాదించి ఆతడు దేశసేవకు అంకితుడయ్యెను

లజపతిరాయలు గొప్ప జీవితచరిత్రకారుడు ఆతని సమకాలికులెవ్వరును ఆతడురచించినన్ని జీవితచరిత్రలు రచించియుండలేదు ఇటలీ భారతదేశములందలి దేశభక్తులను గూర్చియు మతప్రవక్తలనుగూర్చియు లజపతిరాయలు ఉరుదులో రచించిన జీవితచరిత్రలు ప్రజామోదమును సంపాదించినవి వారిని బహుభాషాక్షేత్రీయుల నొనర్చినవి ఆర్యసమాజ వ్యవస్థాపకుడైన దయానందుని జీవితచరిత్రముగూడ ఆతడు ఉరుదులో రచించి కృతార్థుడయ్యెను ఆర్యసమాజము అను పేరుగల లాలాజీ గ్రంథము క్రీ శ 1913లో లండనులో ప్రకటితమైనది

తండ్రి ఉపాధ్యాయుడగుటవలన లజపతిరాయలు గొప్ప విద్యాపోషకుడకూడ నైనాడు అమెరికాయందు పెక్కు విద్యాసంస్థలను ఆతడు దర్శించి వచ్చినపిదప పంజాబులో అనేక విద్యాలయములను స్థాపించెను తిలక్‌స్కూల్ ఆఫ్ పాలిటిక్స్' నకును దయానందాంగ్లవైదికకళాశాల కును ఆతడు మూలస్తంభము హరిజనాభివృద్ధికి తోడ్పడి జాతీయ విద్యకు ప్రోత్సాహమొసగి విద్యావేత్తగా విఖ్యాతి గడించిన వాడితడు ఈయన ప్రముఖ పత్రికావ్యవస్థాపకుడుకూడ వందేమాతరం అను ఉరుదు దినపత్రికను పీపుల్ అను ఆంగ్లవారపత్రికనుకూడ నెలకొల్పినాడతడు పంజాబులో పత్రికల అభివృద్ధికికూడ ఆతడు పాటుపడినాడు

ఆపిదప ఆర్యసమాజములో చీలికలు వచ్చినవి అయినను క్రీ శ 1897 1900 సంవత్సరములలో భారతదేశమందు కరువు కాటకములు విలయతాండవముచేసినపుడు ఆతడుచేసిన ప్రజాసేవ ప్రశంసనీయము ఆతని సేమాత్రమును సంకుచిత ప్రాంతీయ భావములులేవు యావద్భారతమును జాగృతమొనర్పదలచిన వాడితడు లాలాజీచేసిన ప్రజాసేవలు క్రైస్తవమత ప్రచారకులకు బహుకష్టములు కల్గించినవి ఆట్టి ప్రజాసేవకులు ఆనాడు కాంగ్రెసు కార్యకర్తలలో చాల కొలదిమంది

మాత్రమే కలరు నాటిభారతదేశ జాతీయోద్యమములో నిరంతరము పరిశ్రమించిన యితడు విశ్రాంతికోరకై హైదరాబాదు వచ్చి ఒకనాడు హర్షములో ఆడి జ్వరపీడితుడై తన్మూలమున యావజ్జీవితము రోగగ్రస్తుడైనాడు

ఇతడు 1914 లో హరిజనోద్ధరణ సంఘమును స్థాపించెను గాంధిమహాత్ముని అస్పృశ్యతా నివారణసూత్ర మితనికి మిగుల ఇష్టమైనది అఖిలభారతతృతీయ జాతీయమహాసభలు చెన్నపట్టణములో జరిగినపుడు ఇతడొక ప్రతినిధిగా ఎన్నికయయ్యెను

క్రీ శ 1901 నుండి ఇతడు రాజకీయములలో ఎక్కువగ పాల్గొనెను 1904 లో రాజకీయ వాతావరణము పూర్తిగ మారిపోయినది 1905 లో ఇతనియందును జాతీయోద్యమమునందును కొన్ని ముఖ్యమైనమార్పులు సంఘటిల్లినవి ఇతడు కాంగ్రెసుప్రతినిధిగా 1905 జూన్ నెలలో లండను వెళ్ళినాడు అచ్చట లిబరల్ పార్టీకంటె లేబర్ పార్టీయే భారతదేశ స్వాతంత్ర్యమువెడ ఎక్కువ సానుభూతి కల్గియున్నదని ఇతడు గ్రహించినాడు జులైలో మాంచెస్టరు లీడ్స్ ఎడింబరో గ్లాస్గో మున్నగు నగరములను సందర్శించినాడు గోఖ్లేతో కలిసియు వేరుగనుగూడ ఇతడు పెక్కు ఉపన్యాసము లచట ఇచ్చినాడు అచ్చట దాదాభాయి నౌరోజీని సర్ విలియం వెడర్ బర్న్‌ను కలిసికొని భారతదేశ పరిస్థితులనుగూర్చి చర్చించినాడు ఇతనికి అమెరికాలో ఘనస్వాగతము లభించినది భారతజాతీయోద్యమమును క్రీ శ 1905 నుండి అధికముగ లాల్, బాల్ పాల్ మహాశయులు నడపినారు అందుచే ఆ కాలమునకు లాల్-బాల్-పాల్ యుగము అను పేరువచ్చినది లాలాజీ కాశీ కలకత్తా కాంగ్రెసులలో బహుముఖ్యపాత్ర వహించెను క్రీ శ 1920 లో కలకత్తాలో జరిగిన ప్రత్యేక కాంగ్రెసు మహాసభకు ఇతడధ్యక్షుడు క్రీ శ 1921 లో ఇతడు పంజాబురాష్ట్రమున కేవలము పదిదినములు పర్యటించి తిలక్ స్వరాజ్యనిధికి లొమ్మిదిలక్షల రూప్యములు సేకరించెను

సైమన్ కమీషనునకు ప్రతికూలమైన ఇతడు బ్రిటిషు రక్షకభటులచే లాహోరునందు తీవ్రముగ గాయపడియు కొలది దినములకే ఒక మహాసభలో ప్రసంగించినాడు కాని గాయములనుండి కోలుకొనని కారణముచే ఇతడు 1928 నవంబరు 17 నాడు కాలధర్మము నొందెను ఆకాశమున భాస్కరుడు ప్రకాశించుచున్నంతకాలము లాలాజీవంటివారు మరణింపరు ! అని గాంధిమహాత్ముని పలుకు

లజపతికి వాందూమాతరముగను గాంధిమహాత్మునియందును అచంచల విశ్వాసము ధైర్యసాహసములు అగ్రగామిత్వము నిస్సందేహమైన స్వార్థరాహిత్యము అనునవి ప్రజానాయకున కుండవలసిన ప్రధానగుణములని ఇతడు ఋజువుపరచెను ప్రజోపద్రవమును ముందుగ కానే ఎరుగ్గనుట ఇతని విశిష్టత అని డాక్టరు అనిబిసెంటు లజపతిని గూర్చి వచించుట ముమ్మాటికిని సత్యము

ఈ శతాబ్ది మొదటి మూడుదశాబ్దులయందును యువతరమువారిని ఉత్తేజపరచి వారిపై తన అమోఘ ప్రభావముద్రను హత్తుకొల్పిన లాలాలజపతిరాయల యశఃకాయము అజరామరమైనది ఇట్టి నాయకుని విద్యావేత్తను సంఘసంస్కర్తను ప్రతిభా సంపాదకుని మాతాపితృ గురుదేశభక్తి ప్రవృత్తియుక్తుని స్వాతంత్ర్య మహాసమర యోధాగ్రేసరుని కనిన భారతమాత ధన్యురాలు

బొ వెం కు శ

## లాసాలి రాబర్ట్ కెవిలర్ (1643-1687)

ఉత్తర అమెరికా ఖండములోని మిసిసిపి నదీప్రాంతమును పరిపూర్ణముగా పరిశోధించిన ఫ్రెంచి అన్వేషకుడైన లాసాలి రిని రాబర్ట్ కెవిలర్ సూర్ డి' అనునతడు ఫ్రాన్సుదేశములోని నార్మండి రాష్ట్రమందు రోయన్ అనుతావున 22-11-1643 వ తేదీన జన్మించెను ఆనాడు తెలకులవు శ్రేష్ఠమైన ఉన్నత విద్య నభ్యసించెను

లాసాలి 23వ ఏట (1666 సం|) ఉత్తర అమెరికాలోని సెయింట్ లారెన్స్ దీప్రాంతమునగల మాంట్రియల్ వద్ద ప్రభుత్వమునుండి పారితోషికముగా పొందిన భూములను సాగుచేసికొనుటకు సూర్యదేశమును వీడి వలసవెళ్లెను ఆతడచ్చట ఎర్ర ఇండియనుల నుండి ఓహాయో ఇల్లినాయిస్ నదులకు సంబంధించిన పెక్కుకథలను విని ఆ ప్రదేశములను సందర్శించి అందలి నూతన విశేషములను తెలిసికొనవలెనని కుతూహలపడెను

1669-70 సంవత్సరములలో దక్షిణ ప్రాంతపు శీకారణ్యములు నడుమనున్న అంటారియో ఇరై, సెయింట్ లారెన్స్ అను సరస్సులగుండా అతడు ప్రయాణమైపోయి లూయిస్ విల్ జలపాతము వరకు గల ఓహాయోనది ప్రవా

హావు ఉనికిని కనుగొనెను 1671 లో ఇల్లినాయిస్ నదికి సంబంధించిన వివరములను గూడ అతడు తెలిసికొనెను

కెనడా గవర్నరైన ఫ్రాంటెంకా అనునతడు లాసాలి యొక్క సామర్థ్యమును అతడు సల్పిన నిర్విరామకృషిని గుర్తించి అతనిని తన అప్తవర్గములో చేర్చుకొని 1674 లో తన ప్రతినిధిగా ఫ్రాన్సు దేశమునకు పంపెను కార్యనిర్వహణ దక్షుడైన లాసాలి ఫ్రెంచి ప్రభుత్వముతో మంతనములు సలిపి కింగ్స్టన్ అంట్ అనుతావున "ఫ్రాంటెంకా అను దుర్గ నిర్మాణమునకు ఫ్రెంచి ప్రభుత్వపు అనుమతిని పొంది, ఫ్రాంటెంకా యొక్క అభిమానమునకు మరింత పాత్రుడయ్యెను దీనికితోడు వ్యాపార రంగమున లాసాలికి గల ప్రావీణ్యమును గుర్తించిన ఫ్రెంచి ప్రభుత్వము మిసిసిపి నదిలోయయందు దుర్గములను నిర్మించి వ్యాపారమును నిర్వహించుట కవసరమైన ప్రత్యేకాధికారములను అతనికి ప్రసాదించెను

1679 ఆగస్టులో లాసాలి తన ప్రయాణమున కవసరమైన పన్నాహములను సమకూర్చుకొని ఇరై సరస్సులో ఓడపై ప్రయాణించి గ్రీన్ అఖాతములో ప్రవేశించెను విస్కాసిన్ అను ప్రదేశమున ఉన్నితో నిండిన మరియొక పడవను వెంట నిడికొని అతడు ప్రయాణమును సాగించెను ఈ సరకును విక్రయింపగా వచ్చు లాభముతో తన ఋణములను తీర్చుకొనుట కాతడు సంకల్పించెను దురదృష్టవశమున ఈ సరకుల పడవ ప్రమాగములో చిక్కుకొని నష్టమునకు గురియయ్యెను తనవెనుక వచ్చుచుండిన సరకుల పడవకు సంభవించిన ప్రమాదమును లాసాలి తెలిసికొనజాలక తన ప్రయాణమును పశ్చిమ దిక్కుగా కొనసాగించి మియామిదుర్గమును చేరుకొనెను అచ్చటనుండి, తన దండులోని సహోద్యోగియగు హెన్రి డిటాంటి నాయకత్వమున 14 మందితో బయలుదేరిన మరియొక నావలో సెయింట్ జోసెఫ్ నదియందు ప్రయాణించి ఇల్లినాయిస్ ప్రాంతమును చేరుకొనెను అచ్చటవారు ఎరోరియా సరస్సు సమీపమున ఒక దుర్గమును నిర్మించిరి మిసిసిపి ప్రాంతమును పరిశోధించుట కవసరమైన సంభారములను సమకూర్చుకొని అచ్చటనుండి ప్రయాణ సన్నద్ధులైరి

లాసాలి, నలుగురు స్నేహితులతో ఫ్రాంటెంకా దుర్గమును చేరి అచ్చట మరికొంత సహాయమును పొంది త్వరగా తిరిగి వచ్చుటకు సంకల్పించెను కొందరు సహాయకులతో డిటాంటి దుర్గ నిర్మాణమున కనువగు ప్రదేశములను వెదుకుటకు వేరొక వైపునకు పోయెను

లాసాలి ఫ్రాంటెంకానుండి తిరిగి వచ్చినపుడు ఎన్నాళ్ళకును డిటాంటి ప్రభృతులు తిరిగిరాకుండుటచే ఆందోళనము చెంది 1682 లో డిటాంటి అన్వేషణార్థము పశ్చిమ ముఖముగా ప్రయాణమై ఇల్లినాయిస్ మీదుగా మిసిసిపి నది ప్రాంతమున కేగెను కాని అతడు డిటాంటి జాడను తెలిసికొనలేక తన పరివారముతో కాలి నడకన మియామి దుర్గమును చేరుకొని అచ్చటినుండి ఫ్రాంటినీ దుర్గమున కేగెను

డిటాంటిని అతని అనుయాయులను ఎర్ర ఇండియనులు ఖైదీలుగా పట్టుకొని బాధించి విడిచిపెట్టిరి అపుడు వారు గ్రీన్ అఖాతమును చేరుకొనిరి

సాహసికుడైన లాసాలి మరికొంత ధనమును ప్రోగు చేసికొని ఏబదిమందితో తన అన్వేషణమును తిరిగి ప్రారంభించెను డిటాంటి తిరిగి తిరిగి తుదకు లాసాలి బృందమును గలిసికొనెను ఈ సాహసికులందరు చికాగోను దర్శించి అటుపిమ్మట ఇల్లినాయిస్ దుర్గముగుండ విశాలమైన మిసిసిపి ముఖద్వారమును సునాయాసముగా చేరుకొనిరి 1682 ఏప్రిల్ 9 వ తేదీన లాసాలి మిసిసిపి నదీప్రాంతమును దాని ఉపనదులుగల విశాల భూభాగమును స్వాధీనపరచుకొని, దానికి లూయీజియాన్ అని పేరుపెట్టెను అచ్చట ఒక విజయ స్తంభమును ప్రతిష్ఠించి దానిపై తన అన్వేషణ వివరములను మిసిసిపి ఓహియోనదులు ప్రవహించు భూభాగమంతయు ఫ్రెంచి ప్రభుత్వమునకు సంబంధించినదేనని తెలుపు అంశములను అతడు లాటిన్ భాషలో వ్రాయించెను ఫ్రెంచి ఆయుధములనుగూడ అతడచ్చట తన విజయచిహ్నములుగా నుంచెను

ఇట్లుఖండవిజయమును సాధించిన లాసాలి ఇల్లినాయిస్ మిసిసిపి నదుల ముఖద్వారముల చెంత గొప్పదుర్గములను నిర్మించి, వలసల నేర్పరిచి ఆ సువిశాల భూభాగమందలి సిరిసంపదలను తన వశమునందుంచుకొని పరిపాలింప నెంచెను కెనడారాష్ట్రములో తన చిక్కులనుండి విముక్తుడై ఈ స్వతంత్ర రాష్ట్రమునకు గవర్నరు కావలెనని అతడువ్విళ్లూరుచుండెను

ఇల్లినాయిస్ నదీప్రాంతమున 1682 లో సెయింట్ లూయీ చేరున లాసాలి, బలవత్తరమైన ఒక దుర్గమును నిర్మింప నారంభించెను ఇట్లుండ లాసాలికి అన్నివిధముల తోడ్పడుచుండిన గవర్నరు ఫ్రాంటెంకాను ఫ్రెంచి ప్రభు

త్వము కొందరు కర్తకుల అభాండమున బాధ్యము చేసికొని స్వదేశమునకు రావించెను. లాసాలి శత్రువులు ఎన్నిన కుతంత్రములను ఫ్రాంటింకా క్రొత్తగవర్నరునకు నివేదించి తన నిర్దోషిత్వమును ఋజువు రచుకొనగనోచి అతని పద్ధతి క్రియాణమై రోవుచుండెను. ఈలోగా క్రొత్త గవర్నరు పంపిన అధికారులు లాసాలినుండి ఇల్లినాయిస్ దుర్గములను బలప్రయోగముచే స్వాధీన పరచుకొనిరి. లాసాలి పెక్కు చిక్కులకులోనై నిస్సహాయ స్థితిలో ఫ్రాన్సు దేశమునకు వెళ్లెను.

ఆ తరుణము ఫ్రాన్సునకును స్పెయినునకును నడుమ గొప్ప యుద్ధము జరుగుచుండెను. మిసిసిపి నది ముఖద్వారమున దుర్గముల నేర్పరచుట యుద్ధతంత్రరీత్యా అవశ్యకమని ఫ్రెంచి ప్రభుత్వము గుర్తించి దుర్గనిర్మాణములకు లాసాలిని నియోగించి అందుకవసరమైన ఆర్థిక వనరులను కూడ ఏర్పరచెను. ఈ దుర్గ నిర్మాణానంతరము లూసియానా రాష్ట్రమునకు ఫ్రెంచి ప్రభుత్వము లాసాలిని గవర్నరుగా నియమించి ఇల్లినాయిస్ రాష్ట్రమందతడు నిర్మించిన దుర్గములను అతనికి తిరిగి యిచ్చివేసెను.

1884 జూలై నెలలో లాసాలి ఫ్రాన్సునుండి నాలుగు వందలమంది సహచరులతో ఓడలనెక్కి మెక్సికో జలసంధిగుండా పయనించి మిసిసిపి నదీప్రాంతములను విపులముగా పరిశోధించి అచ్చట స్థిరనివాస మేర్పరచుకొన దలచెను. అంతకు పూర్వమే స్పెయినుతో ఫ్రాన్సు దేశమునకు జరిగిన యుద్ధములో ముఖ్యమైన ఒక సరకుల నావ ధ్వంసమగుటకు లాసాలియే కారణభూతుడను తలంపుతో నావికాదళాధిపతియైన బియోజీ అనునాతడు లాసాలి ఆధిపత్యమును వ్యతిరేకించుచుండెను. అయినను లాసాలి ఉత్సాహియై మిసిసిపి నదీ ముఖద్వారమును దాటి పడమటి దిశగా 400 మైళ్లు ముందునకు సాగెను. స్పానిష్ భూభాగమైన మెటగోర్డా సింధుశాఖయందలి టెక్సాస్‌ను మిసిసిపి యొక్క పశ్చిమ ద్వారమని అతడు భ్రమపడి కొంత దూరము భూప్రయాణమొనర్చి తన పొరపాటును గ్రహించుకొనెను. కాని అతడు సల్పిన ఈ సుదీర్ఘ ప్రయాణము ఫలింపలేదు. అతని వెంటనున్న నాల్గు నావలలో రెండు ధ్వంసమైనవి; ఒకటి ఫ్రాన్సుకు తిరిగి వెళ్లినది. అతనితోనున్న సిబ్బంది సంఖ్య 45 మందికి తగ్గిపోయినది. వారు సైతము నిరుత్సాహముతో విసిగిపోయిరి. ఇట్టి విపత్కర పరిస్థితిలో కూడ లాసాలి ధైర్యమును వీడక మరికొందరిని వెంటనిడికొని కెనడాను చేరయత్నించి విఫలుడయ్యెను. రెండు సంవత్సరములల్లో ఆ ప్రాంతమున పెక్కుకష్టముల నెదుర్కొని 1687 జనవరిలో కృతనిశ్చయుడై తుదిపర్యాయము మిగిలియున్న వారిలో సగము మందిని వెంటనిడికొని కెనడాకువెళ్లి అచ్చట లభించిన సహాయముతో తిరిగి తన గమ్యస్థానము చేరుటకు సంకల్పించెను.

లాసాలి దూరదృష్టిలేని చేసిన కొన్ని నిర్ణయములు అనాలోచితమైన తొందరపాటు చర్యలు అతని సహచరులలో సైతము అతని యెడల అసంతృప్తిని కల్గించినవి. అధికార గర్వపూరితమైన అతని ప్రవర్తనము నెడల వారిలో ఏవగింపు ఏర్పడినది. దీనికితోడు ఫ్రాన్సు కెనడాలలో అతనికి పెక్కురు బలమైన శత్రువు లేర్పడిరి. ఈ సంఘటనలన్నియు వారి నడుమ అంతఃకలహములకు దారితీసినవి. ద్వేషోపహతులైన లాసాలి తన సహచరులచే ట్రినిటీనది ఒడ్డున టెక్సాస్ అను తావున 1687 మార్చినెలలో రహస్యముగ హత్య గావింపబడెను. మహోత్సాహుడైన లాసాలి అకుంఠిత ఆత్మవిశ్వాసముతో ఒహాయో ఇల్లినాయిస్ నదులను గురించియు మిసిసిపి నది పుట్టుకనుండి అది సముద్రములో సంగమించు వరకుగల దాని చరిత్రను గురించియు సేకరించిన అమూల్య సమాచారము సాధించిన మహా విజయములు చిరస్మరణీయములు. ఇంతటి ఘనవిజయములతో కూడిన అతని జీవితము విషాదాంతముగ అంతమయ్యెను.

ష. వేం.

## లిథియము

ఇది పరమాణుసంఖ్య 3 పరమాణుభారము 6.94 గల రాసాయనిక మూలద్రవ్యము. ఇది ప్రపంచములో విరివిగా వ్యాపించియున్నది. కాని దీని ఖనిజములుమాత్రము చాల అపురూపముగ లభించుచున్నవి. పాలలోను రక్తములోను మొక్కలలోను ముఖ్యముగా పొగాకు మసిలోను లిథియము యౌగికములు అత్యల్పప్రమాణములో నుండును. లెపిడొలైటు అను ఖనిజము లిథియముకలిసిన అభ్రకముగా తెలియనగును. అందులో 6 శాతమువరకు లిథియము అల్యూమినియము ఫ్లోరోసిలికేటు కలిసియుండును. ఆంబ్లిగోనైటు అను ఖనిజము లిథియము అల్యూమినియము ఫ్లోరోఫాస్ఫేటు అను వాటిసమ్మేళనము. పెటాలైటు అను ఖనిజము [illegible] యము. అల్యూమినోసిలికేటులయొక్క మిశ్రమము [illegible]

ఖనిజములలోను మొదటిదానిలో 7-10 శాతము రెండవ దానిలో 8 శాతముగల లిథియము ఉండునని తెలియుచున్నది ప్రపంచములో ఏడాదికి రెండువేలటన్నుల లిథియము యౌగికములు తయారగుచున్నవి భారతదేశములోని బీహారు మైకాగనులలో లెపిడొలైటు ఖనిజమున్నట్లు తెలియుచున్నది హజారీబాగ్ జిల్లాయందు తగరపు ఖనిజము కెసిటిరైటుతో కలిసి చిన్నచిన్నపలుకులుగా లభించుచున్నది మధ్యప్రదేశ్ లోని బస్తరు జిల్లాలో లెపిడొలైటు తగినంత లభింపగలదని సూచనలుగలవు కోలారు బంగారుగనులలో కూడ పొప్పొడుమెనె అను లిథియము ఖనిజము లభించును

ధాతుసాధన లిథియము ఖనిజములనుండి మొదట క్లోరైడును తయారుచేసికొని దానిని వేడిచేసి కరగించి విద్యుత్ప్రసారమువలన రాసాయనిక వియోగమును నిర్వహించి లిథియమును సాధించెదరు ఇది వెండివలె తళతళలాడుచు సోడియము పొటాసియములను పోలియుండును కాని వాటికంటె ఇది మిగులగట్టిగా ఉండి 186°C వరకు వేడిచేసినప్పుడు కరగి 1880°C వేడిలో సలసలమరగును ఆల్కలీ ధాతువుల కుటుంబములో ఇది మొదటిది అందుచేత కొన్ని గుణములలో వాటికంటె ఇది విలక్షణముగనుండును లిథియము యౌగికములు జ్వాలకు మనోహరమైన ఎర్రనిరంగు నిచ్చును అందుచేత వాటిని బాణసంచాలలోను జ్వాలామాలికలలోను సంకేతములను అందచేయుటకు వాడుచున్నారు లిథియము లవణములను వాటిలో ముఖ్యముగా సిట్రేటు సాలిసిలేటులను మోశాదుప్రకారము కీళ్ల వాతపు నొప్పులకు ఔషధముగా ఉపయోగించుచున్నారు వాటిని ఎక్కువగా వాడినయెడల విషముగా తయారగును కొన్ని ఊటనీటి జలధారలలోకూడ లిథియము లవణములు అల్పప్రమాణములో ఉండుటకలదు అందుచేత అట్టి నీటిధారలకు ఔషధముగా పనిచేయు లక్షణముండును లిథియమును కొలదిగా కలిపినప్పుడు అల్యూమినియము తుంకు, సీసముల ధాతుమిశ్రమములకు గట్టిదనము కల్గును గాజుతో లిథియము యౌగికములు కలిసినప్పుడు మసకమసకగానున్న తెల్లనిరంగు ఏర్పడును అందుచేత దానికి పాలవంటి తెల్లని బల్బుల తయారీలో వాటిని వాడుచున్నారు లిథియము ఖనిజములు రేడియో ఆక్టివు ఖనిజములతో కలిసిమెలిసి ఇంగ్లండులోని కారన్‌వాల్ ప్రాంతమునందు లభించుచున్నవి లిథియమునకు న్యూక్లియ రాసాయనికచర్యలలో ప్రాధాన్యముండును అందుచేత లిథియము ఖనిజములపై భారతదేశములో పరమాణుశక్తి సంఘమువారి అజమాయిషీ చలాయింపబడుచున్నది

హ ఆ

## లివింగ్‌స్టన్ డేవిడ్

దాదాపు ఆఫ్రికాఖండమంతటిని సమగ్రముగా పర్యటించిన డాక్టర్ లివింగ్‌స్టన్ డేవిడ్ మతప్రచారకుడుగను సాహసికుడైన ప్రముఖ అన్వేషకుడుగను గొప్ప ప్రతిష్ఠ గడించుకొనెను అతడు స్కాట్లెండునందలి లామార్క్ షైరులో 1813వ సం॥లో సత్ప్రవర్తనులైన పేద దంపతులకు జన్మించెను అతనితండ్రి తీరికసమయములలో సాహసికయాత్రికుల జీవితచరిత్రలను చదువుచుండెడివాడు అందుచే లివింగ్‌స్టనుపై తలిదండ్రుల ప్రభావము మిక్కిలి బాల్యమునుండియే పడినది

గర్భదరిద్రుడగు లివింగ్‌స్టను తన పదమూడవయేటనే స్వగ్రామమునగల ఒక ప్రత్తి ఫ్యాక్టరీలో చిన్న నౌకరుగా ప్రవేశించి రోజుకు 10-12 గంటలు పనిచేయుచు 24 సం॥ల వయస్సు వచ్చువరకు కఠినమగు ఆ వృత్తియందే జీవితమును గడిపెను బాల్యమునుండి మిక్కిలి విజ్ఞానతృష్ణగల అతడు తన తొలిసంపాదనతో లాటిన్‌భాషయందలి ప్రథమ పాఠ్యగ్రంథమును కొని సాయంపాఠశాలలో ప్రవేశించి విద్యనార్జించుచు తీరికసమయములలో తనకు లభించిన గ్రంథములను పఠింపదొడగెను బహుగ్రంథ పఠనముతో అతనియందు నవచైతన్యము మొలకెత్తి క్రైస్తవ మతప్రచారకుడై తన జీవితమును మానవసమాజముయొక్క దుఃఖోపశమనమునకు అర్పణముచేయ సంకల్పించెను

మతప్రచారమునకు వైద్యవిద్య మిక్కిలి అవశ్యకమని గ్రహించి లివింగ్‌స్టను వైద్యవిద్యను గ్రీకుభాషను గూడ అభ్యసించి లండన్ మిషన్ సొసైటీవారు నడపిన వైద్యపరీక్షలో ఉత్తీర్ణుడై 1840 లో వైద్యపట్టమును స్వీకరించెను అతని సేవానురక్తిని గ్రహించి ఆ సంస్థవారతనికి మంచి శిక్షణమునిచ్చి ప్రోత్సహించిరి లివింగ్‌స్టన్ తన మతప్రచారమునకవసరమైన గ్రంథములను వృక్షజంతు శాస్త్రగ్రంథములను భౌగోళిక రసాయనశాస్త్ర గ్రంథములను అభ్యసించెను

రెవరెండ్ మొఫాట్స్ అనునతడు లండన్ నగరములో ఆఫ్రికా ఖండమునుగూర్చి పెక్కు ఉపన్యాసముల నొసగి,

పెక్కు యువక అన్వేషకుల దృష్టిని ఆ ప్రాంతమువైపు మరల్చెను. అట్టి యువకులలో నొకడైన లివింగ్‌స్టన్ ఆఫ్రికా ఖండములో పనిచేయ సంకల్పించి 1840 లో అధికార ముద్రతో బయలుదేరి కేప్‌టౌన్ గుండా మొఫాట్స్ 20 సంవత్సరముల శ్రమ వలన నేర్పరచిన బెచువానా రాష్ట్రమందలి లటాకోను 1841 జులైలో చేరుకొనెను. లివింగ్‌స్టన్ పెక్కు సంవత్సరములు ఈ రాష్ట్రమందలి అన్యదేవతారాధకుల మధ్య క్రైస్తవ మతబోధకుడుగా వ్యవహరించెను. బక్వాన్ జాతి నాయకుడును అతని అనుయాయులును క్రైస్తవ మతమును స్వీకరించుటతో లివింగ్‌స్టనుకు ఉత్సాహము చేకూరినది.

బోయరులు ట్రాన్స్‌వాలునందు స్వజాతీయులైన మతప్రచారకులనే నియమింపనెంచుటచే లివింగ్‌స్టన్ అచ్చటి నుండి ఉత్తరముగా పయనించి నిగామి అను సరస్సును కనుగొని అచ్చటినుండి నదులపై అడ్డదిడ్డముగా ప్రయాణించుచు జనసాంద్రతగల పెక్కు రాష్ట్రములను కనుగొనెను. అతడింకను పడమటదిక్కుగా అట్లాంటిక్ తీరమందున్న పార్‌డి లోండావరకును తూర్పున హిందూ మహాసముద్రతీరమందలి క్విలిమానివరకును పోయి ఆ ప్రాంతములను వివరముగా పరిశోధించెను.

మా బోట్స్‌మేరి అనుతావున లివింగ్‌స్టన్ గృహమును నిర్మించుకొని మొఫాట్స్ పెద్ద కుమార్తెయగు మేరీని వివాహమాడి సంతానవంతుడయ్యెను. భార్య బిడ్డలు అపాయకరమైన ప్రయాణములలో తనవెంటనుండుట క్షేమకరముకాదని భావించి అతడు వారిని ఇంగ్లండునకు పంపివేసెను. పరిశోధన నిమిత్తమై మరల అతడు పరిమిత వస్తు సంచయముతో 1852 లో బయలుదేరి 1856 నాటికి క్విలిమాని ప్రాంతమును చేరుకొనెను. దారియందాతడు పెక్కు రోగములకు కష్టనష్టములకు గురియైనను సరకుచేయక విక్టోరియా జలపాతమును దర్శించి అచ్చట అమూల్యమైన విషయములను సేకరించుచు ప్రజల జీవితవిధానమును తెలిసికొనుచుండెను. అచ్చటి వాతావరణమువలన అతని ఆరోగ్యము కుదుటపడగా స్వదేశమునకు మరలివచ్చి కారణాంతరములచే తన పదవికి రాజీనామా నొసగెను. ఆంగ్లదేశమందలి శాస్త్రీయసంస్థలు, ప్రజాసంస్థలు పురపాలకసంఘములు విశ్వవిద్యాలయములు అతని మహత్తరసేవలను గుర్తించి, అతనికి ఘనసన్మానము సలిపి పారితోషికముల నొసగెను. 1857 లో మతప్రచారకుని యాత్రలు అనుగ్రంథమును రచించి అతడు ప్రకటించెను. ఈ బృహద్గ్రంథమువలన అతనికి గొప్ప ప్రజాదరము లభించినది.

డాక్టర్ లివింగ్‌స్టన్ కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయసంఘము పక్షమున జాంబిజినది దాని ఉపనదులు ప్రవహించు విశాల భూభాగముల పరిశోధనమునకై పోవు బృందమునకు నాయకుడై విక్టోరియా రాణి ఆజ్ఞాపత్రమును పొందెను. ఈ బృందము 1858 మార్చి నెలలో బయలుదేరి ఆ ప్రాంతములకు వెళ్లి పెక్కు విజయములను సాధించెను. ఆ ప్రాంతము తత్పరిసరములు వ్యాపారమునకును మతప్రచారమునకును మిక్కిలి యోగ్యములైనవని నిర్ణయించుకొనియు అనంతరము లివింగ్‌స్టన్ సల్పుచుండిన అన్వేషణములకు పెక్కు అవరోధములు కలుగుటవలన అతడు డోలాందోళిత మనస్కుడై యున్నతరి అన్వేషణములను మాని స్వదేశమునకు తిరిగి రావలెనదని 1863 జులై నెలలో అతనికి వర్తమానమందినది. కాని ఉత్సాహియైన లివింగ్‌స్టను ధైర్యమునుకోలుపోవక స్వంతవ్యయముతో వేరొక ఓడను ఖరీదుచేసి ప్రయాణసన్నద్ధుడయ్యెను. కాని దానిలో ప్రయాణించుటకవకాశము లేమిచే అతనికి నిరుత్సాహము కల్గినను మహాసాహసికుడుగమక కాలినడకన మహారణ్యములను గడచి న్యాయాసా సరస్సుయొక్క ఉత్తరపుటొడ్డునుచేరి అచ్చటనుండి స్వంత ఓడలో తానే నావికుడుగా హిందూమహాసముద్రమును దాటి బొంబాయినగరమును చేరెను. అచ్చట కొంతకాలము గడిపి 1864 జులై నెలలో అతడు లండన్ నగరమునకు వెళ్లెను. అచ్చట బానిసవ్యాపారమును తుదిముట్టింపవలెననియు మతప్రచారమును వ్యాపారకలాపమును సాగింపవలెననియు నైలునది పుట్టుకను గురించి తెలిసికొనవలెననియు ఆశభావించెను. కాని ఈ కార్యములాతనికి సాధ్యముకాలేదు. ఆ తరుణముననే తన భావికార్యక్రమమును దోహదపరచుటకై అతడు "జాంబిజి - దాని ఉపనదులు" అను తన రెండవ గ్రంథమును ప్రకటించెను. దానితో మరల నాతనికి మాతృదేశీయులు ఘనసన్మానములు జరిపి గౌరవించిరి.

మధ్య ఆఫ్రికాఖండములోని న్యాయాసా, టాంగనీకా ప్రాంతములందలి జలప్రవాహములకు సంబంధించిన వివాదమును పరిష్కరించి, నైలునది జన్మస్థానమును కనుగొనుటక్కై

రాయల్ జియోగ్రాఫికల్ సొసైటీవారు లివింగ్‌స్టనును కోరిరి లివింగ్‌స్టను మతప్రచారకుడుగా వెళ్లి ఆ ఎవాదమును పరిష్కరించుటకంగీకరించెను 1866 మార్చినాటికి లివింగ్‌స్టను పై ప్రాంతమును చేరి వివాదమును తీర్చుటకు పూనుకొనగా ఇంతలో దుష్ప్రవర్తనులగు కొందరు లివింగ్‌స్టను మరణించినట్లు వార్తను ప్రచారమొనరించిరి ఎంగ్ నాయకత్వమున బయలుదేరిన ఒక అన్వేషణబృందము ఆవార్త అబద్ధమని నిరూపించెను

లివింగ్‌స్టను పశ్చిమాభిముఖుడై మహారణ్యములను చొచ్చి కష్టనష్టములననుభవించుచు 1866-68 సం॥ల మధ్య మొయిరో బంగ్వోలో అను సరస్సులను కనుగొనెను ఒక వంక పెక్కు చిక్కులతో విరామములేక ప్రయాణమొనర్చుచున్నను ఆ ప్రాంతీయుల విజ్ఞానాభివృద్ధికి ఆర్థికాభివృద్ధికి అతడు పాటుపడెడివాడట !

లివింగ్‌స్టన్ ఉజిజి యనుచోట విశ్రాంతి తీసికొననెంచి 1869 మార్చినెలలో అచ్చటికి వెళ్లెను అతనివెంటనున్న అమూల్య వస్తుసముదాయమంతయు అచ్చట దొంగిలింపబడెను అంత నాతడు విచారగ్రస్తుడై తీవ్రమగు అస్వస్థతకు గురియయ్యెను కాని ధైర్యమును చిక్కబట్టి పశ్చిమాభిముఖుడై లువాలాబానది ననుసరించి ముందుకు చొచ్చుకొనిపోయి అది నైలునది యని భ్రమపడెను చివరకది కాంగోనది యని ధృవపడినది మరల అతడచ్చట తీవ్రవ్యాధిగ్రస్తుడై తిరిగి ఉజిజికి వచ్చివేసెను

లివింగ్‌స్టను అరుమాసములకు మరణింపనుండగా 'న్యూయార్క్ హెరాల్డ్' సంస్థ యజమానియగు స్టాన్లీ నాయకత్వమున సహాయకసంఘమొకటి పంపబడినది వారు ఉజిజిలో లివింగ్‌స్టనును కలిసికొని ఘోసంబంధమైన వ్యవహారమును పరిష్కరించి రావలసినదను రాయల్ సొసైటీవారి ఆదేశమును అతనికి తెలియబరచిరి ఆ సమయమున లివింగ్‌స్టను తీవ్ర జ్వరపీడితుడై యున్నందున అతనిని మాతృదేశమునకు వెంటనే మరలిరమ్మని స్టాన్లీ కోరెను కాని కర్తవ్య నిష్ఠాగరిష్ఠుడైన లివింగ్‌స్టన్ తన అనారోగ్యమును లెక్కచేయక సంస్థ ఆజ్ఞ ననుసరించి బంగ్వోలో సరస్సునకు వెళ్లి తన కర్తవ్యమును నెరవేర్చుటకు ప్రయత్నించుచుండగా పూర్వపు అతిసారవ్యాధి మరల తీవ్రముగా బాధింపదొడగెను. దీనికి మరికొన్ని ఇతరవ్యాధులు తోడై అతని అనారోగ్యమును ప్రమాదస్థితికి తెచ్చినవి క్షీణించుచున్న ఆరోగ్యముతో అతడు 1873 ఏప్రిలునెలలో చిటుంబో గ్రామమును చేరుకొని ఆ సంవత్సరము మే 1 వ తేదీన మరణించెను విశ్వాసపాత్రులైన నీగ్రోసేవకులాతని మృతదేహమును భయంకర క్రూరజంతువులతోనిండిన ఆఫ్రికా మహారణ్యములగుండా వేయిమైళ్లు కాలినడకన మోసికొనివచ్చి జాంజిబారునుండి ఓడలో లండనునకు తీసికొనిపోయిరి అచ్చట ఆ మృతదేహము వీరోచిత మర్యాదలతో వెస్ట్‌మిన్‌స్టర్‌యందు సుప్రసిద్ధులైన సమాధుల మధ్య ఖననమొనర్చబడినది

లివింగ్‌స్టను మరణించినచోట అతని స్మారకచిహ్నము నేర్పరచుటయేగాక విక్టోరియా జలపాతమువద్ద అతని శిలావిగ్రహము ప్రతిష్ఠింపబడినది అతని మరణానంతరము అతడు రచించిన తుదివ్యాసములను ఆఫ్రికానుండి లండన్ నగరమునకు తెచ్చి 1874 లో మధ్య ఆఫ్రికా ఖండమున లివింగ్‌స్టన్ రచించిన తుదివ్యాసములు అను శీర్షికతో హోరేస్ వాలర్ అనునతడు గ్రంథమును ప్రకటించెను అతని స్మృతిచిహ్నములుగా కాంగోనదీపరీవాహక ప్రాంతములకు లివింగ్‌స్టన్ ఇస్లైండ్ మిషన్ అనియు జాంబిజినదీప్రాంతమున లివింగ్‌స్టన్ సంపాదించిన భూములకు లివింగ్‌స్టన్‌ల్యాండ్ అనియు నామకరణములు చేయబడినవి

లివింగ్‌స్టన్ తనకు లభించిన స్వల్పవేతనముతోను తన గ్రంథములను విక్రయించగా లభ్యమైన ధనముతోను మిత్రులును ప్రభుత్వమును చేసిన సహాయముతోను ఆఫ్రికా ఖండమందలి మూడవవంతు భూభాగమును 30 సంవత్సరముల దీర్ఘకాలము సమగ్రముగా పరిశోధించి క్రైస్తవ మతప్రచారమొనర్చినందులకు దేశీయ విదేశీయ విజ్ఞానసంస్థలు అతనిని సముచితముగా గౌరవించి అతనికీర్తిచంద్రికలు దిగంతవిశ్రాంతమగునట్లు స్మారకచిహ్నములను నిర్మించినవి

వృ వేం

## లెనిన్

ప్రపంచమందలి పీడిత ప్రజానీకమునకు ఆశాజ్యోతిగను మార్క్సిస్టుసారస్వత మహోపాధ్యాయుడుగను విశేషించి రష్యను శ్రామిక ప్రజావిప్లవమునకు సారథిగను ప్రప్రథమ సోవియట్ సోషలిస్టురాజ్య సంస్థాపకుడుగను, మహత్తర విజ్ఞానవేత్తగను నిగర్వచూడామణిగను కరుణార్ద్రహృదయుడుగను లెనిన్ మానవాళికి చిరపరిచితుడైనాడు

ఇతడు ప్రపంచ కమ్యూనిస్టు విప్లవయోధాగ్రణులలో మేటివాడు. ఈయన పూర్తి పేరు వ్లడిమిర్ ఇల్యిచ్ ఉల్యనోవ్. రష్యాలోని ఓల్గామహానదీ తీరస్థనగరమగు సింబిర్స్కనందు ఇల్యానికొలయెవిచ్ ఉల్యనోవ్, మేరియా అలెగ్జాండ్రొవ్నా అను పుణ్యదంపతులకు క్రీ. 1870 ఏప్రిల్ 10వ తేదీన లెనిన్ జన్మించెను. ఈ దంపతులకు కలిగిన ఆర్గురు బిడ్డలలో లెనిన్ రెండవవాడు. తలిదండ్రుల ప్రతిభాశీలతవలన వారి విజ్ఞానభాగ్యమువలన క్రమబద్ధమైన జీవితవిధానమువలన ఈ యార్గురుబిడ్డలు విద్యావంతులుగను విప్లవవాదులుగను తీర్చిదిద్దబడినారు.

బాల్యమునుండి సోదరులకంటె లెనిన్ చదువుపట్ల విశేషమైన శ్రద్ధాసక్తులను ఏకాగ్రతను ప్రదర్శించెడివాడు. గ్రంథపఠనమనిన అతనికి తీరనితృష్ణ. పుష్కిన్, తుర్గనెవ్, బెలిన్స్కి, నెక్రసోవ్ మున్నగు మహనీయ రష్యను రచయితల కృతులనన్నిటిని ఇతడు క్షుణ్ణముగా అధ్యయనమొనర్చెను. ఆనాటి రష్యాప్రభుత్వముచే నిషేధింపబడిన పెక్కు రచనలు ఇతని సారస్వత వ్యాసంగములో ప్రధానస్థానము నలంకరించెను. కుటుంబములో ఇతడు పొందిన పెంపు, అభ్యుదయ రచయితల ప్రభావము, పరిసరజీవిత పరిశీలనము కారణముగా లెనిన్ మనఃప్రవృత్తి భావపరంపర సవ్యమార్గములో రూపొందసాగినవి. నిరంకుశమైన రష్యనుజార్ ప్రభుత్వపాలనము, భూస్వామి వర్గము పేదరైతులను గురిచేయు హింసలు, పెట్టుబడిదారులు అభాగ్యశ్రామికవర్గముపై జరుపు దమనవిధానము - ఇవన్నియు ఈ యువక హృదయములో పీడకులపట్ల పట్టరాని విద్వేషమును పీడితులపట్ల ఎనలేని సానుభూతియు రేకెత్తించెను. ఇతని మనసులో రగుల్కొనుచున్న విప్లవభావములు ఇతడింకను బాలవిద్యార్థిగా నున్నపుడే సువ్యక్తమైనవి.

పై సంఘటనల వలననేకాక లెనిన్ జ్యేష్ఠసోదరుడైన అలెగ్జాండరుయొక్క నిస్వార్థ విప్లవజీవితమువలనగూడ ఇతడు ప్రభావితుడయ్యెను. యవ్వనదశయందే లెనిన్ కఠోరపరీక్షలను ఎదుర్కొనవలసి వచ్చెను. 1886 లో ఆయనతండ్రి హఠాత్తుగా మరణించెను. జార్ చక్రవర్తిపై జరిగిన హత్యాప్రయత్నములో పాల్గొనెనను అభియోగముపై అలెగ్జాండరు 1887 లో ఉరికంబమునకు బలియయ్యెను. తాను గాఢముగా ప్రేమించిన అన్న మరణముచే మొదలంట చలించిన లెనిన్, తన జీవితమును విప్లవపోరాటమునకు అంకితమొనర్పవలెనను అకుంఠితదీక్ష ఆతని హృదయ ... నాటుకొనెను. అయితే ... దౌర్జన్యవిధా... ములనగాక శ్రామి... జార్ నిరంకుశపాలనము ... లెనిన్ ... కొనెను. ... క్రియాకలాపములకు సన్నద్ధుడైన ఇతడు పాఠశాలవిద్యను అత్యంత ప్రతిభావంతముగా పరిపూర్తిచేసికొని సాముజికశాస్త్రమును సాంగోపాంగముగా అధ్యయించి 1887 లో కజాన్ విశ్వవిద్యాలయమునందు న్యాయశాస్త్రశాఖయందు విద్యార్థిగా ప్రవేశించెను. అచ్చట విప్లవ మనస్తత్త్వము కలిగిన సోదర విద్యార్థులతో సంబంధము పెట్టుకొని క్రియాత్మకముగా విద్యార్థిసభలలో పాల్గొనుటచే అతడు విశ్వవిద్యాలయమునుండి బహిష్కృతుడై ప్రభుత్వముచే ప్రవాసశిక్షకూడ విధింపబడెను. ప్రవాసకాలములో అతనిపై అధికారుల నిఘా స్థిరపడిపోయెను. బాహ్యప్రపంచముతో సంబంధములేని ఆ ఏకాంతవాసమందతడు గ్రంథపఠనములో నిమగ్నుడై స్వాధ్యాయమును అలవరించుకొనెను. ఇట్లు కొంతకాలము గడచినపిదప కజానుకు తిరిగివెళ్ళుటకాతడు అనుమతింపబడెను. కాని తనవిద్యను విదేశములలో సాగించుకొనుటకు అనుమతికోరగా ప్రభుత్వమా అభ్యర్థనమును త్రోసివైచి ఆతనిపేరును అనుమానితుల జాబితాలో నెక్కించినది.

కజాన్‌నగరములో రహస్యముగా వ్యవహరించుచుండిన మార్క్సిస్టు అధ్యయనసంఘము లో లెనిన్ సభ్యుడై సహచరులతో కలిసి శ్రామికవర్గ విమోచనమును ఆపేక్షించుచు కారల్ మార్క్స్ ప్రభృతులు రచించిన వాఙ్మయమును అచంచలదీక్షతో అధ్యయనమొనర్చుచుండెను. దీనిచే ప్రభావితుడై అతడు రష్యను శ్రామిక ప్రజావిముక్తికిని సోషలిస్టు వ్యవస్థాస్థాపనమునకును మార్క్సిస్టు సారస్వతమొక్కటే ఆచరణయోగ్యమైన ఉత్తమ సాధనమని సంకల్పించుకొనెను. ఈ సాహిత్యములో మార్క్స్ ప్రధానరచనయగు పెట్టుబడి (capital) అను గ్రంథమును అతడు కూలంకషముగా పఠించెను. 1889 లో లెనిన్ సకుటుంబముగా కుయిబిషెవ్ నగరమునకు తరలివెళ్ళెను. కమ్యూనిస్టు ప్రణాళిక అను ప్రముఖగ్రంథమును ఆతడచ్చట వెంటనే రష్యనుభాషలో అనువదించెను. తన సహజశక్తి స్ఫూర్తులతోను ఎదుటివారిని ఒప్పింపగల ఉజ్జ్వలసామర్థ్యముతోను లెనిన్ అచ్చటకూడ మార్క్సిస్టు బోధనా ప్రచారమును ఇనుమడింపజేసినాడు.

చిత్రము 5



ప్రవాసములో విప్లవ వ్యూహమును గూర్చి ఏకదీక్షతో ఆలోచించుచున్న లెనిన్ మహాశయుడు

ఆ రోజులలో జారు నిరంకుశపాలనమునకు ప్రతికూలముగ జరుగుచున్న ఉద్యమములో కార్మికుల పాత్రకుగల ప్రాముఖ్యమును నిరాకరించి కేవలము రైతాంగమునకే అట్టిప్రాముఖ్యమున్నదని నరోద్నిక్కు అను వర్గమువారు విశ్వసించి ప్రభుత్వోన్నతాధికారులను హత్య చేయ సాగిరి కాని ఈ వ్యక్తిగత దౌర్జన్యవాదముతో ఛేదించి జారు నిరంకుశత్వ నిర్మూలనముతోపాటు సోషలిస్టు వ్యవస్థాపనము కార్మిక కర్షక ప్రజా విప్లవము వలననే సాధ్యమగునని సంపూర్ణముగా విశ్వసించిన లెనిన్ ఈ సందర్భమున నరోద్నిక్కులతో సిద్ధాంతపోరాటమున కుపక్రమించెను ఇట్లాతడు బహుముఖముగా కృషిసల్పుచు నాల్గేళ్ళలో ముగింపవలసిన విద్యను స్వాధ్యాయముమూలమున ఒకటిన్నర యేడాదిలోనే ముగించి 1891 లో న్యాయశాస్త్ర పరీక్షయందు ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణుడయ్యెను 1892 నుండి అతడు న్యాయవాదవృత్తి స్వీకరించెను తాను చేపట్టిన విప్లవ కార్యక్రమమునకు ఈ వృత్తి అడ్డుతెరగా ఉపయోగపడెను 1892 లో అతడు ప్రథమముగా నిర్మించిన మార్క్సిస్టు అధ్యయన సమితిలో విప్లవ భావపూరితులైన పెక్కురు యువకులు సభ్యులుగా చేరి లెనిన్ బహుముఖ ప్రజ్ఞావిశేషము కారణముగా అతనిచే ఆకర్షితులైరి లెనిన్ విప్లవ కార్యక్రమము పరిసర ప్రాంతములకు విస్తరిల్లి వేలాది యువకులు అతనికి అనుయాయులైరి సువిశాల విప్లవపోరాట మార్గమున పయనించుటకు వలయు శక్తిస్తోమతులను అతడిచ్చటనే సమీకరించుకొనెను మార్క్సు ఎంగెల్సు మహాశయులు తలపెట్టిన మహాకార్యమును విజయవంతముగ కొనసాగింపగల వ్యక్తిగా అతడిచ్చట రూపొందినాడు తన కార్యక్రమ వికాసమునకు ఆ నగరము ఇరుకైన రంగమని గ్రహించి దానికై హెచ్చు అవకాశముగల ఆనాటి రాజధానియగు పీటర్స్‌బర్గునకు లెనిన్ తరలిపోయెను

ఆ దినములలో రష్యాలో ప్రబలుతున్న కార్మికోద్యమమునకు పీటర్స్‌బర్గు ప్రధాన కేంద్రముగ నుండెను అచ్చటనున్న మార్క్సిస్టు అధ్యయనసమితిలో లెనిన్ సభ్యుడై తన జీవితమును విప్లవ కార్య కలాపమునకు అంకితమొనర్చెను

మార్క్సిస్టు అధ్యయనములో అతడు గడించిన అఖండ పరిజ్ఞానము దానిని తన దేశ పరిస్థితులకు అన్వయింప జేయగల నిరుపమాన శక్తియుక్తులు నిర్మాణ కార్యక్రమములో అతని దీక్షత అన్నింటిని మించి సోషలిస్టు ధ్యేయములో అతని అచంచల విశ్వాసము-వీటన్నిటి దృష్ట్యా పీటర్స్‌బర్గు మార్క్సిస్టులాతనిని తమ నాయకునిగా గుర్తించిరి. శ్రామికవర్గము తన చారిత్రక పాత్రను నిర్వర్తించుటకు స్వతంత్రమైన కార్మిక విప్లవసంస్థ అవసరమని లెనిన్ ప్రబోధించుచు తద్వ్యతిరేకులనుసరించుచున్న సంస్కరణవాదముపై లెనిన్ సిద్ధాంత పోరాటమును సాగించుచు వారి బూటక స్వరూపమును బట్టబయలు చేయదొడగినాడు. పీటర్స్‌బర్గు కార్మికులలో శాఖలు దీరినవారి అండదండలతో లెనిన్ విప్లవాత్మక మార్క్సిస్టు పార్టీని నిర్మించి వారిపట్ల అత్యంత ప్రేమాభిమానములు చూపుచు వారిని విప్లవయోధులుగ తీర్చిదిద్దెను.

1894 లో అధ్యాపకురాలుగా పనిచేయుచున్న క్రుప్స్కయాతో లెనిన్ పరిచయ మొనర్చుకొనగా ఆ పరిచయము పరిణయముగా పరిణామమునుచెందెను.

రష్యా పరిసర దేశములందలి శ్రమవిమోచన సంస్థలతోను ఐరోపా కార్మికోద్యమముతోను సంబంధము నెలకొల్పుకొనుటకై పీటర్స్‌బర్గు మార్క్సిస్టుల ఆదేశము ననుసరించి లెనిన్ 1895 లో విదేశములకు పయనమై స్విట్జర్లెండు ఫ్రాన్సు జర్మనీ మున్నగు దేశములలో కార్మిక సమావేశములయందు పాల్గొని వాటిని ఉత్తేజపరచి అచ్చటి నాయకులతో సంబంధమును దృఢమొనర్చుకొనెను. పీటర్స్‌బర్గుకు మరలి వచ్చినవెంటనే లెనిన్ కార్మికవర్గ విముక్తి పోరాట సమితి అను ఏకైక రాజకీయసంస్థను నిర్మించి ద్విగుణీకృత శక్తితో విప్లవ కార్యక్రమమును సాగించెను. ఈ సమితి నాయకత్వమున పీటర్స్‌బర్గు మొదలైన ప్రధాన నగరములలో వేలాది కార్మికులు తమ యజమానులపై పోరాటములు సాగించిరి. 1895 లో లెనిన్ మున్నగు అగ్రనాయకులను ప్రభుత్వము నిర్బంధించి సమితి పత్రికను నిషేధించెను. అయినను కార్మికోద్యమము ఉధృతముగా కొనసాగుచునేయుండెను. కారాగారములోకూడ లెనిన్ అతని సహచరులు మార్క్సిస్టు సారస్వతమును అధ్యయన మొనర్చుచు వెలుపలి కార్మికోద్యమముతో సంబంధమును బలపరచుకొనుచుండిరి. 1897 లో అధికారులు లెనిన్‌పై తెచ్చిన అభియోగమును పురస్కరించుకొని అతనికి ప్రవాసశిక్ష విధించి సైబీరియాకు పంపివైచిరి.

సుదూరమైన సైబీరియా ప్రవాస జీవిత మాతనికి దుర్భరముగా తోచెను. విప్లవ కార్యక్రమములో అయనకు ప్రత్యక్షసంబంధము భగ్నమైనను ఉత్సాహము నెంతమాత్రము వీడక సైబీరియా గ్రామీణజీవితమును శ్రద్ధగా పరిశీలించుచుండెను. అచ్చటి రైతాంగ మాతనియెడ అత్యంత గౌరవాదరములు ప్రదర్శించుచు అతని సలహా సహకారములను స్వీకరించుచుండెడివారు. ప్రవాస జీవితమందుకూడ లెనిన్ విప్లవ సారస్వతమును పఠించుచు అవసరమైన దానిని రష్యను భాషలోనికి అనువదించి పలుప్రాంతములకు పంపెడివాడు. ఇచ్చటనే అతడు పెక్కు ఉద్గ్రంథములను శ్రమపడి రచించెను. ఈ గ్రంథములన్నియు విశేషముగా సిద్ధాంత కార్యాచరణములకు సంబంధించినవి. శ్రమదమాదులకోర్చి పట్టువీడని దీక్షతో అధ్యయన రచనా వ్యాసంగములను సాగించుచు అతడు అపుడపుడు అరణ్యప్రాంతములకు సాహ్యాళికి వెళ్లి ప్రకృతి శోభను తిలకించి ఆనందించెడివాడు. ప్రవాసమునుండి తలిదండ్రులకు బంధుమిత్రులకు వ్రాసిన లేఖలలో వారి పట్ల అతని అపారప్రేమాభిమానములు భక్తిగౌరవములు వ్యక్తమగుచుండెను. ప్రవాస జీవితమెప్పుడు అంతమగునా యని అతడు వేగిరపడుచుండగా ఇంతలో 1900 జనవరి నెలయందు ప్రభుత్వము ప్రవాసశిక్షను రద్దుపరచి పారిశ్రామిక నగరములలోను ప్రధాననగరములలోను నివసింప గూడదను మరొక ఆజ్ఞను అతనిపై అమలు పరచినది. అందుచే లెనిన్ సకుటుంబముగా పీటర్స్‌బర్గునకు అవతిదూరమునగల ఒక గ్రామములో నివాస మేర్పరచుకొనెను.

విప్లవ పక్షమునకు శక్తివంతమైన ఒక పత్రిక అనివార్యమని నిశ్చయించి సానుభూతిపరుల సహకారములో లెనిన్ ఇస్క్రా (అగ్నికణము) అను దినపత్రికను 1900 లో జర్మనీయందు స్థాపించెను. ఈ పత్రికనాతడు తన 'ముద్దుబిడ్డ'గా పెంచి పోషించెడివాడు. ఈ పత్రికా నిర్వహణములో అడుగడుగున అతడెదుర్కొనిన కష్టపరంపరలు వర్ణింపనలవివి. రష్యాలో కార్మికవర్గము అగ్రగామిగానుండి నడిపించుచుండిన విప్లవోద్యమము పరిపక్వమగుచున్న సమయములో ఈ పత్రిక వెలువడి అపారమైన సేవ యొనర్చుచుండెను. అనతి కాలములో దీనికి ఐరోపా ఖండమునకూడ ఆదరాభిమానము లేర్పడినవి. దీనిని

రష్యాలోని కార్మిక కర్షక ప్రజానీకము ప్రాణతుల్యముగ పరిగణించు చుండెను ఈ పత్రికద్వారా లెనిన్ ఒకవంక సంస్కరణ వాదులపైన మరొకవంక దమననీతి మూర్తీభవించిన ప్రభుత్వముపైన నిరంకుశమైన పెట్టుబడిదారీ భూస్వామ్య వర్గముపైన లెనిన్ నిర్విరామ పోరాటమును సాగించినాడు

1903 ఆరంభములో పోలీసు గూఢచారులు ఇస్క్రా ను గూర్చి ఆచూకీ పసిగట్టినతో లెనిన్ తన సంపాదకవర్గముతో పాటు 1902 ఏప్రిలులో లండను చేరెను పత్రికా ముద్రణము మాత్రము జీనీవానగరములో జరుపబడు చుండెను 1903 వసంతకాలములో లెనిన్ ప్రభృతులు లండనువీడి జినీవా శివార్లలో కాపురము పెట్టిరి

1903 జులై నెలలో లెనిన్ సారథ్యమున రెండవ రష్యను సోషల్ డెమాక్రాటిక్ పార్టీ కాంగ్రెసు సమావేశమై పెక్కు అభిప్రాయ భేదములను చర్చించినది ఈ సమావేశమునుండి పార్టీ శిక్షణకును నిబంధనావళికిని కట్టుబడని అవకాశవాదులు పైదొలగవలసి వచ్చినది దీనితో పార్టీ ఐక్యతకు కొంత సుస్థిరత చేకూరినది ఈ సంఘటన ప్రపంచ కార్మికోద్యమములో ఒక మలుపుగా పరిణమించి చారిత్రక ప్రాముఖ్యమును సంతరించుకొనెను ఈ మహాసభద్వారా రూపొందిన బోల్షెవిక్ పార్టీలో ఎన్నటి అంతరంగిక పరిస్థితి క్లిష్టమైనది పూర్వము ఓటమి చెందిన 'అర్థికవాదుల' స్థానములో మెన్షెవిక్కులు అను వేరొక తెగవారు ప్రవేశించి వారి అవకాశవాద ధోరణిని కొనసాగించుటతో నాటినుండి బోల్షెవిక్కులకు మెన్షెవిక్కులకు నడుమ తీవ్రమైన సంఘర్షణము ఆరంభమైనది. బోల్షెవిక్కుల పక్షమున ఐక్యతకొరకై లెనిన్ ఎడతెగని సిద్ధాంత పోరాటమును సాగింపవలసి వచ్చెను తత్ఫలితముగా అధిక సంఖ్యాకులు బోల్షెవిక్కు పక్షములో చేర సాగిరి

జారుపై తొలిదాడి లెనిన్ విదేశములలోనుండి రష్యాలో విస్తరించుచున్న విప్లవోద్యమమును నిశితదృష్టితో గమనించుచుండెను 1905 జనవరిలో పీటర్స్‌బర్గునందు జార్ ఎదుట తమ కష్టములను విన్నవించుకొనుటకై శాంతియుతముగా ప్రదర్శనచేసిన కార్మికులు హత్యగావింపబడిరి ఈ దారుణ సంఘటన రాజధాని ప్రజలలో కోపోద్రిక్తతను రగుల్కొల్పెను ఈ విషాదవార్త దేశము నాలుగుచెరగుల వ్యాపింపగా విప్లవమునకిది నాందీప్రస్తావనయని లెనిన్ అంచనావేసెను విముక్తియో! లేక వీరమరణమో! అను కార్మికనినాదము దిక్కులు ఎక్కటిల్లునట్లు ప్రతిధ్వనించెను రానున్న భీషణపోరాటమునకు ఆయత్తమగుటకై ఒకసంధాను నిర్ణయించుటకొరకు 1905 ఏప్రిల్‌లో మూడవ సోషల్ డెమాక్రాటిక్ పార్టీ మహాసభ లండనులో సమావేశమైనది ఇదియే బోల్షెవిక్కుల ప్రథమసమావేశము మెన్షెవిక్కులు దీనికి హాజరుకాలేదు ఈ మహాసభకు కూడ లెనిన్ సారథ్యమువహించి సాయుధ పోరాటముతోసహా పెక్కు సమస్యలను వివరించి నాడు పీటర్స్‌బర్గులో ఆరంభమైన కార్మికుల తిరుగుబాటు బూర్జువా ప్రజాస్వామిక విప్లవమనియు జారు నిరంకుశమును కూలద్రోసి సోషలిస్టువ్యవస్థను నెలకొల్పుటకు సాయుధమైన కార్మికుల తిరుగుబాటే నిష్కర్షయైన సాధనమనియు లెనిన్ విశదపరచెను ఈ విప్లవములో సాధింపబడు విజయమును సంపూర్ణమైన సోషలిస్టువిజయ ఘోనరించుటకై విప్లవాత్మక ప్రజాస్వామిక నియంతృత్వమును నెలకొల్పవలెనని లెనిన్ వక్కాణించెను

1905 వసంతకాలమంతయు అటుఎన్నటను రష్యాలో కార్మికోద్యమము ఉధృతమైనది పెక్కునగరములలో చెలరేగిన సమ్మెలు సాధారణ రాజకీయసమ్మెగా పరిణమించినది ప్రభుత్వ కార్యాలయములలోను కర్మాగారములలోను పని ఆగిపోయినది దేశమంతట జీవితము స్తంభించినది ఈ కల్లోల ఫలితముగా ప్రభుత్వము కళ్ళనీరు తుడుచుటకై కొన్ని సంస్కరణములను ప్రవేశపెట్టినది ప్రభుత్వ వాగ్దానములను విశ్వసింపరాదని లెనిన్ హెచ్చరించుచునే యుండెను, కొలది కాలములోనే ఈ సంస్కరణములు బూటకములని స్పష్టమయ్యెను దీనితో విప్లవమ్ము వెల్లువ విజృంభించెను

దేశము వెలుపలనుండి విప్లవమును నడపుట దుర్లభమని యెంచి 1905 నవంబరులో లెనిన్ రహస్యముగా పీటర్స్‌బర్గు చేరి బోల్షెవిక్కులకు ప్రత్యక్షముగా సారథ్యము వహించెను డిసెంబరులో తలయెత్తిన తీవ్రతమమగు సాయుధ తిరుగుబాటును ప్రభుత్వము క్రూరముగా అణచివేసినది లెనిన్‌కొరకై జార్ ప్రభుత్వము దేశమంతట గాలించుచుండగా, అతడచ్చటనుండుట ప్రాణాంతకమైన ప్రమాదమని భావించి బోల్షెవిక్ పార్టీ లెనినును లండనుకు పంపివేసినది అచటనుండి జీనీవాకు పయనమైపోయెను ఈసారి లెనిన్ విదేశములలో దాదాపు పదేళ్ల ప్రవాసజీవితమును గడుపవలసివచ్చెను కాత్యాకలి

క్రమముగా విప్లవమునకు ఓటమి తటస్థించినను అంతిమవిజయము అనతికాలములో తమకు సిద్ధింపగలదను నమ్మకము ఆయనకు దృఢపడినది. దేశదేశములలో ప్రవాసజీవితము గడుపుచున్నను రష్యను విప్లవమునకు వలయు సర్వసాధనసంపత్తినిగూర్చి లెనిన్ అహర్నిశలు తలపోయుచునే యుండెను.

1910 నాటి రష్యాలో కార్మికోద్యమము మరల ప్రాణము పోసుకొనగల్గినది. పీటర్స్‌బర్గు మాస్కో మున్నగు నగరములలో కార్మికుల సమ్మెలు సమావేశములు ప్రదర్శనములు వెల్లడియైన రాజకీయ సంరంభము ఆరంభమయ్యెను. విప్లవోద్యమము మరింతగా పుంజుకొనసాగెను. రైతాంగము సైన్యము నౌకాదళముకూడ పోరాటములోనికి ఆకర్షింపబడినది. ఈ మహోద్యమమునకు బోల్షెవిక్కులే నాయకత్వము వహించిరి. అప్పటివరకు పారిస్ నగరమందున్న లెనిన్ 1912లో ప్రాగ్ నగరము చేరెను. అచ్చట జరిగిన రష్యను సోషల్ డెమాక్రాటిక్ మహాసభలో రష్యాలో ఎప్పటికప్పుడు జరుగుచువచ్చిన సంఘటనలను లెనిన్ సమీక్షించి నూతన నిర్ణయములు చేసి స్వదేశమునకు పంపుచునే యుండెను.

1912 వసంతకాలములో పీటర్స్‌బర్గు బోల్షెవిక్కులు ప్రావ్దా అను దినపత్రికను ప్రభుత్వపు అనుమతితో స్థాపింపగల్గిరి. ప్రావ్దా వెలువడినదినము కార్మికలోకమునకొక పర్వదినముగా పరిగణింపబడినది. రష్యాకు సమీపములో నుండుటకై లెనిన్ ప్రాగ్ నగరమును వదలి పోలెండునందలి క్రాకోవ్ నగరమునకు వచ్చివేసెను. అచ్చటనుండి తన వ్యాసములను ప్రచురణకై ప్రావ్దా పత్రికకు పంపెడివాడు. అంతర్జాతీయముగా ఈ పత్రిక ముఖ్యముగా కార్మికలోకమున విశేషఖ్యాతి గడించినది.

విదేశములోనున్నను పార్టీ కార్యకలాపములను లెనిన్ ఒక్క నిముషమైనను విడిచిపెట్టి యెరుగడు. సభలలోను సమావేశములలోను సామ్రాజ్యవాదులు ఒడిగట్టిన అపరాధములను ఆయన ఆగ్రహముతో దుయ్యబట్టుచుండువాడు. పెట్టుబడిదారీ వర్గములకు పరోక్షముగా సహాయపడు కార్మిక నాయకులను నిశితముగా విమర్శించువాడు. సామ్రాజ్యవాద యుద్ధములపట్ల శ్రామికప్రజల ప్రతికూల వైఖరిని విస్పష్టమొనర్చుచుండువాడు. లెనిన్ ఎప్పటికప్పుడు అందించు సందేశములచేతను దేశమందలి బోల్షెవిక్ నాయకుల ఉద్రేకపూరిత ఉపన్యాసములచేతను ప్రేరితులైన లక్షలాది సంఘటిత కార్మిక సంఘములు తమ విముక్తికై ప్రభుత్వముపై దాడి సల్పుటకు సన్నద్ధమగుచుండెను. సామ్రాజ్యవాదయుద్ధములో రష్యా చిక్కుకొని ఓటమిచెందిన ఫలితముగా తమ నిత్యజీవితము దుర్భరమైనదని ఆగ్రహించిరి. ఎన్నో పీడితప్రజలు ప్రభుత్వముపై తిరుగుబాటు [illegible]లైన ప్రజాస్వామిక సోషలిస్టు ప్రభుత్వమును స్థాపించుకొనుటకై ఆతురత చెందుచున్న తరుణమది. ఆ శుభసమయమునకై లెనిన్ వేచియున్నాడు. బోల్షెవిక్ నాయకులు నిర్బంధములకు ప్రవాసములకు తుపాకిగుండ్లకు అలవాటుపడి రాటుదేలినవారు. ప్రభుత్వము సాగించిన హింసాకాండను దూషణ పరంపరను సహించి బోల్షెవిక్ పార్టీ తన యుద్ధవ్యతిరేక పోరాటమును క్రియాత్మకముగా సాగించి శ్రామికులను తన విప్లవమునకు సన్నద్ధమొనర్చినది. రష్యాలో విప్లవఘడియలు సమీపించుచున్నవని లెనిన్ తన దూరదృష్టితో పలికిన జోస్యము అక్షరశః యథార్థమైనది. అనతికాలములో విప్లవము ఆరంభమైనది.

మొట్టమొదట పీటర్స్‌బర్గు కార్మికులు తిరుగుబాటు లేవదీసిరి. 1917 జనవరి 9 వ తేదీన ఈ నగరమున ఆరంభమైన యుద్ధవ్యతిరేక ప్రదర్శనములు అన్ని నగరములకు దావానలమువలె విస్తరించినవి. బోల్షెవిక్ పార్టీ పిలుపును అందుకొని లక్షలాది పీటర్స్‌బర్గు కార్మికులు ఇతర నగరముల కార్మికులు బ్రహ్మాండమైన రాజకీయసమ్మె సాగించిరి. ప్రభుత్వమీ సమ్మెను అణచివేయ ప్రయత్నించెను. కాని సైనికులుకూడ అందు పాల్గొనుటచే ప్రభుత్వమునకది అసాధ్యమయ్యెను. సమ్మె ఫలించినది. శతాబ్దులుగా ప్రజలను అణచివేసిన జార్ ప్రభుత్వము కూలద్రోయబడినది. విప్లవకారులు ప్రభుత్వోద్యోగులను పదవీచ్యుతులుగచేసి రాజరికవ్యవస్థను తుదముట్టించిరి. దీనితో రష్యాయందు బూర్జువాప్రజాస్వామిక విప్లవము జయప్రదమైనది. విప్లవగమనములో కార్మిక సైనిక ప్రతినిధుల సోవియట్లు అవతరించినవి. కాని సంస్కరణవాదులైన మెన్షెవిక్కులు ఈ సోవియట్లలోదూరి కార్మిక కర్షకుల ప్రయోజనములకు ద్రోహమొనర్చి పెట్టుబడిదారీవర్గ ప్రతినిధులైన తాత్కాలిక ప్రభుత్వము అధికారమును హస్తగతమొనర్చుకొనుటకంగీకరించిరి. ఈవిధముగా ద్వంద్వాధికారము ప్రాదుర్భవించెను. నిరంకుశత్వ మంతరించినను మెన్షెవిక్కుల ద్రోహచింతనవలన దేశములో సందిగ్ధమైన అయోమయస్థితి యేర్పడె. సంపూర్ణ ప్రజావిప్లవము అత్యావశ్యకమగు పరిస్థితి యేర్పడెను.

ఈ ప్రమాదకర పరిస్థితిని గమనించి లెనిన్ సలహా ననుసరించి బోల్షెవిక్ పార్టీ అజ్ఞాతవాసమునువీడి తనశక్తిని సమీకరించుకొన గల్గెను ప్రముఖ బోల్షెవిక్ నాయకుల సారధ్యముతో ప్రావ్దా పత్రిక ప్రచురణ మరల ప్రారంభమైనది

రష్యాలో ఫిబ్రవరి విప్లవము జయప్రదమైనదను వార్తవిని స్విట్జర్లెండులో నున్న లెనిన్ విప్లవమును విజయవంతముగా తుదివరకు సాగించి తాత్కాలిక ప్రభుత్వమును తుదముట్టించి సోవియట్ రాజ్యమును స్థాపింపుమని బోల్షెవిక్ నాయకులకు సందేశమంపెను అతడానాటినుండి విశ్రాంతి ఎరుగడు తాను స్వయముగా మాతృదేశమునందుండి విప్లవమునకు నాయకత్వమును వహింపవలెనని వేగిరపడుచుండెను స్వదేశమునకు మరలి రావలెనని అతడు చేసిన తుది యత్నమెట్లో ఫలించి పది సంవత్సరముల ప్రవాస జీవితానంతరము 1917 ఏప్రలులో పీటర్స్బర్గు చేరుకొనెను లక్షలాది రష్యా ప్రజలు కార్మికకర్షకులు అరుణపతాకమును చేబూని దిక్కులు పిక్కటిల్లునట్లు విప్లవ నినాదములు చేయుచు తమ మహానాయకునకు ఘనస్వాగత మిచ్చిరి వేలాది విప్లవ సైనికదళములు లెనిన్ గౌరవార్థము అంగరక్షకులుగా బారులుదీరి నిలబడెను ఝంఝూవాత హర్ష ధ్వానములు, కరతాళ ధ్వనులు మార్మోగగా అయనకొరకు సిద్ధమొనర్పబడిన కవచ శకటమును లెనిన్ అధిరోహించి నూతన సోషలిస్టు విప్లవము నకై పోరాటము సాగింపుమని ఉద్ఘోషించెను

అక్టోబరు విప్లవనాయకుడు పీటర్స్బర్గు వచ్చిన నాటినుండి అతడు అంతిమ పోరాటమునకై బృహత్కలాపమును ప్రారంభించెను బూర్జువా ప్రజాస్వామిక విప్లవమును సోషలిస్టు ప్రజాస్వామిక విప్లవముగా పరివర్తన చేయుటకై పలయు సిద్ధాంత కార్యక్రమావళిని అతడు సిద్ధపరచెను సమగ్రమైన ఈ కార్యక్రమమును అచరణలో పెట్టినచో రష్యను శ్రామిక వర్గమునకు ఉజ్జ్వల భవిష్యత్తు తథ్యమని అతడు ఉద్ఘాటించెను అయన నాయకత్వమున బోల్షెవిక్కులీ కార్యక్రమమును అమలు పరచుటకై సన్నద్ధులయిరి లెనిన్ ఆదేశము ననుసరించి కార్మిక కర్షక సైనికదళములు ప్రభుత్వమునకు ప్రతికూలముగా శాంతియుత పద్ధతిపై ప్రదర్శనలు జరుపగా ప్రభుత్వ సైనికులు వారిపై గుండ్లవర్షము కురిపించి నాయకులను నిర్బంధమునందుంచెను లెనిన్ ఆరెస్టుకును హత్యకు కూడ ప్రభుత్వము పథకము పన్నినది ఈ ప్రమాదమును గుర్తించి లెనిన్ తగు రక్షణలతో అజ్ఞాత వాసమునకు వెడలిపోయెను మారు వేషములో అతడు కార్మికుల గృహముల లోను రైతు విద్యార్థుల గృహములలోను దినమొక గండముగా మూడు నెలలు గడపినాడు ఫిన్లెండు చేరి అచ్చటనుండి బోల్షివిక్కులతో ఉత్తర ప్రత్యుత్తరములు జరపినాడు ఎప్పటికప్పుడు పరోక్షముగ నుండియు విప్లవమును ప్రత్యక్షముగ నడపనట్లే నడపు చుండెను

ఇట్లుండగా దేశపరిస్థితులు అనాటి కానాడు ఉద్రిక్తస్థాయిని అందుకొన్నవి ప్రజలకు రొట్టె మాంసము చక్కెర కరవైపోయినవి ఆకలి విలయతాండవమాడుచున్నది ఈ దుస్థితికి అసమర్థమైన తాత్కాలిక ప్రభుత్వమే కారణమని లెనిన్ పసికట్టి శత్రువుల కుతంత్రములను కుపరిపాలనమును త్వరలో తుదముట్టింప వలెనని బోల్షెవిక్కుల కాదేశమిచ్చెను వెంటనే అత్యంత విశ్వసనీయమైన బోల్షెవిక్కు దళములు కీలక స్థానములైన ప్రభుత్వ భవనములను అక్రమించు కొన్నవి ఈ సమయమున స్వదేశములో ప్రత్యక్షముగ విప్లవములో పాల్గొనుట అత్యవసరమని భావించి లెనిన్ పీటర్స్బర్గు చేరుకొన్నాడు 1917 నవంబరు 7 వ తేదీన విప్లవ దళములు దేశమందలి ప్రధానమైన కీలకస్థానముల నన్నిటిని ముట్టడించినవి అత్యల్పమైన హింసాకాండతో తాత్కాలిక ప్రభుత్వము పదవీభ్రష్టమొనర్పబడి అధికారము సోవియట్ల వశమైనది ఆ యుదయమే లెనిన్ అధ్యక్షత క్రింద చరిత్రాత్మకమైన పెట్రోగ్రాడ్ సోవియట్ సమావేశమై సోవియట్ అధికారము క్రింద సోషలిస్టు విప్లవము విజయవంతమై సుస్థిరత చెందునను విశ్వాసమును వ్యక్తపరచెను ఈ విప్లవవిజయముతో ప్రపంచమందెల్ల మొట్టమొదటి సోషలిస్టు రాజ్యస్థాపకుడుగా లెనిన్ కీర్తింపబడినాడు

సోవియట్ రాజ్యస్థాపనము జరిగిన వెంటనే బాల్యదశయందున్న ఈ ఏకైక సోషలిస్టు రాజ్యమును నిర్మూలింపవలెనను దుశ్చింతతో అమెరికా ఇగ్లండు ఫ్రాన్సు మున్నగు సామ్రాజ్యవాద ప్రభుత్వముల సైన్యములు రష్యాయందలి విప్లవ ప్రతికూల వర్గములతో చేరి రష్యాయందలి కీలకస్థానములపై దాడిసల్పి దేశమంతటిని ముట్టడి చేసినవి ముఖ్య నగరములన్నియు విదేశసైన్యములచే అక్రమించుకొనబడినవి దేశమునకు బాహ్యశత్రువుల సమస్య ఏర్పడినది ఈ మహాప్రమాదమును ఎదుర్కొనుటకై దేశప్రజలను, బోల్షెవిక్కు

అను కార్మిక కర్షక సైనిక సంఘములును ఒక్క త్రాటిమీదుగా నడచి విజయము సాధింపవలసిన తరుణమాసన్నమైనదని లెనిన్ గంభీరముగా ప్రోత్సాహ పరచినాడు. కరువు కాటకములతో ఆకలి బాధలో అలమటించుచున్న ప్రజలపై గోరుచుట్టుమీద రోకలిపోటువలె మహా విప్లవమును నెత్తుటి యేరులలో ముంచ దలచిన పదునాల్గురాజ్యముల సైన్యములను ధ్వంసము గావించుటకై వయస్సుమళ్లిన వృద్ధసేనానులనుండి యువ కిశోరముల వరకు లతలాది సకల వర్గముల ప్రజలు దీక్షబూని అమితోత్సాహముట్టిపడ అనుపమాన త్యాగగరిమతో శత్రువులతో తలపడిరి. విప్లవసైన్యముల ధాటికి ఆగలేక విదేశ సైనికులు నుగ్గునూచమై పలాయనము చిత్తగింపవలసి వచ్చెను. 1919 డిసెంబరు నాటికి ఇంచుమించు అన్ని యుద్ధరంగములలో ఎర్రసైన్యములు విజయము చేపట్టినవి. నాటినుండి రష్యా ప్రజలు పోల్షివిక్కులు విదేశసైన్య నిర్మూలన కార్యక్రమము నుండి మరలి అంతశ్శత్రువులను తుదముట్టించుటయందును ఆర్థిక పునర్నిర్మాణము గావించుట యందును తమ శక్తి యుక్తులను వినియోగింప మొదలిడిరి. లెనిన్ ఆదేశాను సారముగా శాంతి వాతావరణములో నూతన ఆర్థిక ప్రణాళికను దీక్షా బద్ధకంకణులై ఆచరణలో పెట్ట నారంభించిరి.

అస్తమయము: అజ్ఞాత వాసములోనుండగా శత్రువు యొక్క తుపాకిగుండు దెబ్బవలన తాను అనారోగ్యముతో బాధపడుచు వచ్చినను లెనిన్ విరామమెరుగక అన్ని రంగములలోను పని సాగించుచునే యుండెను. 1923 మార్చి నెలలో ఆయన ఆరోగ్యము విషమించినది. ఆరోగ్యమును కోల్కొనుటకై అతడు మాస్కో సమీపమందున్న గోర్కీ నగరము వెళ్లి కొంచెము కుదుట పడగనే మాస్కోకు తిరిగివచ్చెను. మరల వ్యాధి ఉధృతము కాగా తిరిగి గోర్కీకి వెళ్లెను. 1924 జనవరి 21 వ తేదీన అకస్మాత్తుగా ఆయన మెదడులోని రక్తనాళములు పగిలి శాశ్వతముగా కన్నుమూసెను. ఈ విషాదవార్త ప్రపంచమంతట శరవేగముతో ప్రాకినది. ప్రపంచపీడిత ప్రజ లందరు ఈ మహనీయునకు భక్త్యంజలి ఘటించిరి. రష్యాలో అన్నిప్రాంతములనుండి మాస్కోనగరమునకు వచ్చిన శ్రామిక ప్రతినిధివర్గములు ఎన్నలు పెద్దలు శోకతప్త హృదయము లతో ఈ మహాపురుషుని భౌతిక కాయమునకు కన్నీటి ధారతో శ్రద్ధాంజలి ఘటించిరి. ఈతని మరణానంతరము పూర్వము పెట్రోగ్రాడ్ పీటర్స్‌బర్గ అను నామములతో విలసిల్లిన మహా నగరము ఈయన శాశ్వత స్మృతి చిహ్నముగా లెనిన్‌గ్రాడ్ అను వీరనామమును ధరించినది. తరువాత ని రెడ్‌స్క్వేర్ (ఎర్రచౌకు) నందుగల ప్రదర్శనశాలలో పవిత్ర ప్రత్యేక సాంప్రదాయములలో ప్రతిష్ఠించబడిన ఆయన భౌతిక కాయ మును ప్రపంచములోని అన్ని దేశములనుండి లక్షలాది యాత్రికులు దర్శించి ఆ దివ్యమూర్తికి జోహారు లర్పించుచునే యుందురు.

మానవ చరిత్రలో పెక్కురకముల విప్లవములు ఘటిల్లినవి. పెక్కురువిప్లవవాదులు జన్మించి కాలానుసారముగ వారివారి పద్ధతులలో నిరంకుశమును పైన పీడక విధానము పైన తిరుగుబాటు లర్పినారు. కొందరు కొంతవరకు విజయము సాధించినారు. పరిస్థితుల ప్రాబల్యముచే కొందరు సాధింపలేకపోయినారు. కాని లెనిన్ నాయకత్వము క్రింద నడచిన ఈ రష్యను మహావిప్లవము యొక్క స్వరూప స్వభావాదులు వాటికి భిన్నమైనవి. ఇతర దేశములలోని ఇతర కాలములలోని విప్లవములు కేవలము రాజకీయ మతపరవిప్లవములు కాగా ఆర్థిక రాజకీయ సాంఘిక సమానత ప్రాతిపదికగా రష్యాలో విజృంభించిన సోషలిస్టు విప్లవము యొక్క తీరుతెన్నులు వాటికి పూర్తిగా భిన్నములైనవి. లెనిన్ రష్యాలోని సామాజిక పరిస్థితుల గమనమును వాటి పరిస్థితిని సూక్ష్మబుద్ధితోను వివేకముతోను దూరదృష్టితోను రాజనీతి చతురతతోను గమనించినవాడగుటచే అతడా విప్లవమును అసమానమైన వ్యూహనైపుణ్యముతో నడపి తన ప్రజలకు సంపూర్ణ విజయమును సిద్ధింప జేసినాడు. ఆ మహనీయుని నాయకత్వమున విజయమును సాధించుకొనిన రష్యాప్రజలు మిగుల అదృష్టవంతులు.

లెనిన్ సరళాతిసరళ స్వభావుడు. వజ్రసంకల్పుడు. అత్యంత నిరాడంబరుడు. అతీతమైనమానవతామూర్తి. సర్వ ప్రపంచ ప్రజల ప్రేమాతిశయమును అతడు చూరగొనుచున్నాడు. సర్వదేశముల కమ్యూనిస్టులు శ్రమజీవులు ఇతనిని తమ నాయకునిగా గురువర్యునిగా స్వీకరించెదరు. ఇతడు మహనీయుడైన శ్రామికవర్గ అంతర్జాతీయవాది. కావుననే తన దేశప్రజలయొక్క ప్రపంచప్రజలయొక్క ప్రయోజనము లను కర్తవ్యములను నిరంతరము సమ్మేళన మొనర్చెడివాడు. విప్లవకార్యభారములో అనవరతము నిమగ్నుడై యుండినను అతడు శ్రమజీవుల క్షేమసమాచారములను తప్పనిసరిగను

లను ఎప్పటికప్పుడు అరయుచు వారి క్షేమమే తన క్షేమమని భావించుకొనుచుండువాడు ఇట్టి మహామనీషి అకాలముగా అస్తమించుట రష్యాప్రజలకే గాక సర్వపీడిత ప్రపంచమునకే లోటు ఈ మహత్తరవ్యక్తి స్మృత్యర్థము ప్రతిసంవత్సరము జనవరి 21 వ తేదీనాడు సర్వప్రపంచ కార్మికకర్షకశ్రమ జీవులు లెనిన్ దినోత్సవమును జరుపుకొనుచు అతని దివ్య బోధనలను ఆచరణలో పెట్టుటకై దీక్షగైకొనెదరు

ప్ర రా సు

## లేపాక్షి

అనంతపురం జిల్లా హిందూపురం తాలూకాలో హిందూపురమునకు తూర్పున పదిమైళ్ల దూరమున లేపాక్షి యను గ్రామము కలదు ఈ గ్రామమున కాపేరు ఎట్లు కల్గినదియు సరిగా తెలియదు లేపాక్షియను గ్రామదేవతను బట్టియే ఆ గ్రామమున కాపేరు వచ్చియుండునని యనుకొనుటకు ఆగ్రామదేవత నేడచ్చట కానరాదు ఊరికి దక్షిణముగా నున్న కూర్మశైలమను గుట్టమీద నిర్మింపబడిన పాపనాశేశ్వర రఘునాథదేవర వీరభద్రదేవరుల ఆలయముల కూటమియే లేపాక్షి దేవాలయమని ప్రసిద్ధమై యున్నది ఇచటి నిర్మాణములను తెలుపు శాసనములు మాత్రము క్రీ శ 1533 నుండి కానవచ్చుచున్నవి స్థలపురాణముగా స్కాంద పురాణాంతర్గతముగా చెప్పబడు లేపాక్ష్యాం పాపనాశనః అను వాక్యమునుబట్టి పాపనాశేశ్వరాలయము శాసనకాలముకంటె మిక్కిలి ప్రాచీనమైనదని భావింపబడుచున్నది శాసన కాలము ఆలయ నిర్మాణమునకు తర్వాత జరిగిన చేర్పులను కూర్పులను మాత్రమే సూచించును పాపనాశేశ్వర గర్భాలయములో అర్ధశిల్ప (boss relief) చెక్కడముగల భిక్షాటనమూర్తి యిట్టి శిల్ప సంప్రదాయము సాధారణమై యుండు పల్లవ-చోళకాలమును సూచించుచున్నది

కాగా పైన పేర్కొనబడిన శాసనములో విరుపంణ ప్రసన్న వీరభద్రదేవర అని యుండుటచే, వీరభద్రాలయమును విరుపంణ నిర్మించెనని తెలియవచ్చును అప్పుడే ఈ ఆలయకూటమునకు ప్రస్తుతమున్న ఆకార మేర్పడి యుండును గుండ్రని పానవట్టముతో తన ప్రాచీనతను సూచించు పాపనాశేశ్వరలింగము మాత్రము మిగిలియున్నది

శ్రీకృష్ణదేవరాయల యనంతరము అతని సోదరుడు అచ్యుతదేవరాయలు విజయనగర సామ్రాజ్యమునేలు నపుడు యమున విరుపంణ పెనుగొండ రాజ్యమునకు పాలెగాడు ఇతని తండ్రి నంది అక్కిసెట్టి తల్లి ముద్దమాంబిక తమ్ముడు వీరణ్ణ ఆలయ నిర్మాణము కొంత జరిగిన పిదప విరుపంణ ఉత్సవాదులను జరిపి అచ్యుతదేవరాయల నాహ్వానించెను రాయలా గిరిని దర్శించి స్వామిని దర్శించి రథోత్సవమునకై కాళీపురమును దానమిచ్చెను విరుపణ్ణ కూడ అదే సమయమున కొన్ని దానము లొసగెను వీరభద్రయుల దానము లను తెలుపు శాసనములు లోపల ప్రాకారము మీదనే యుండుటచే అప్పటి కదియే బయటి ప్రాకారముగా నుండి యుండునని చెప్పవచ్చును తరువాత విరుపణ్ణ ఇతోధికముగా ధనవ్యయమొనర్చి నేటి బాహ్యప్రాకారమును నిర్మించెను తూర్పు పడమర ఉత్తర దిశలలో ప్రాకారమునకు గోపురములు కూడ నిర్మింపబడినవి అంతర్భాగమునందే కళ్యాణ మండపము లతామండపములు కూడ నిర్మితము లయ్యెను ఊరి వెలుపలనున్న యొక బృహచ్ఛిలను బసవణ్ణగా మలిచెను ఇది చాల మనోహరమైన చెక్కడము అర్ధ మండపము యొక్క లోకప్పు అర్ధముఖమండపము కుడ్యములు వర్ణచిత్రములతో అలంకరింపబడుట ఇచ్చటి విశేషము దీనికంతయు రాజద్రవ్యమును విశేషించి వ్యయపరచినాడని రాజదండము నూహించుచు విరుపణ్ణ తానే స్వయముగా కళ్లూర చెమర్కొన్నాడనియు, వాటిని అచటి యొక గోడకు అతికించి వాటినుండి నీరుకారుచున్నట్లు ధారలున్నవనియు స్థానికులు కట్టుకథలను చెప్పుదురు ఇందలి సత్యమెట్లున్నను ఆలయములోని కళ్యాణమండపము ఆలయము వెలుపలి నందీశ్వరుడు అసంపూర్తిగనే ఉండిపోయినవి

లేపాక్షియొక్క ప్రాముఖ్యమంతయు అచటి శిల్పము, చిత్రకళను బట్టియే విజయనగర రాజులనాటి ఈ రెండు కళలయొక్క పరాకాష్ఠ పరిమిత పరిమాణములో ఇచట ప్రదర్శింపబడినది బృహత్పరిమాణ శిల్పనిర్మాణ కౌశలమిచట వెల్లివిరిసినది ఈ యాలయమునే శిల్పకళాభిజ్ఞులకు సర్వదా చెప్పబోయన్నట్లు ఆ పెద్దబసవణ్ణను సంకేత పతాకముగా నిర్మించెను ముందు దీనిని చూడగనే సామాన్యుడుకూడ తాను ఆలయములో చూడబోవు శిల్ప విశేషముల స్వరూప స్వభావములను ఊహించగలడు హాలేబీడు తంజావూరు మున్నగు చోట్లగల పెద్దనందివిగ్రహములేవియు ఈ బసవణ్ణకు సరిపోల్పవు కూర్చొని నెమరువేయుచు విశ్రాంతి తీసికొన్నట్లుగాక

చిత్రము ౬



పటము 1

పాంచాల పురుషుడు లేపాక్షి

చిత్రగు 7



పటము 2

ద్మినీ జాతి స్త్రీ విగ్రహము లేపాక్షి

చిత్రము 8



పటము 3

భిక్షాటనమూర్తి, వీరభద్రాలయము లేపాక్షి

చిత్రము 9



పటము 4

ద్వారమువద్ద స్త్రీ విగ్రహము, వీరభద్రాలయము లేపాక్షి

మూతి బిగబట్టి లేచుట కుద్యుక్తమై యున్నట్లున్నదీభంగిమ మెరుగులు దిద్దకపూర్వమే ఏ కారణముననో ఏమో పని నిలిచిపోయినట్లున్నది ఆ యసంపూర్ణతయే దీనికి లోపము ఆలయములోని శిల్పమంతయు స్తంభములమీద గోడలమీద విగ్రహములలోను ప్రదర్శితమైనది చాళుక్య చోళ హొయ్సల కాకతీయుల కాలములలో ప్రత్యేక లక్షణములతో అభివృద్ధి చెందిన శిల్పవిశేషములను అధిగమింప వలెననెడి కుతూహలమును ఇచ్చటి శిల్పి వ్యక్తమొనర్చినాడు కళకు శైవుల నిత్యజీవనము కథావస్తువు శ్రీశైల ప్రాకారశిల్పమునుండి కొన్ని శైవగాథలిందు మెరుగులతో అనుకరింప బడినవి శంఖపూరకులు పాములవాళ్లు అశ్వారూఢులు వింటిబద్దల వొంచువారు మహర్షులు విఘ్నేశ్వరులు త్రిమూర్తులు వీరితోపాటు

చిత్రము 10



పటము 5

బసవయ్య లేపాక్షి

రఘునాథేశ్వర సంబంధము తోచక్రము నరసింహుడు, కాళియ మర్దన కూర్మము మున్నగు వైష్ణవవిగ్రహములు కూడ స్తంభములపై కానవచ్చును ఇంక అలంకరణార్థము హంసలు సింహములు, ఏనుగులు లేళ్లు కోతులు గూబలు, సూర్య చంద్రులు మలచబడినవి మల్లులు, విల్లువంచు ఆటవికస్త్రీ అద్దము చూచుకొనుచు తిలక ధారణము చేయుచున్న నాగరక స్త్రీ మిక్కిలి ఆకర్షకముగా కన్పట్టుదురు

స్తంభ నిర్మాణములో విజయనగర శిల్పియొక్క ప్రత్యేకత చూపించెను ప్రధాన స్తంభము వెడల్పుగా నుండుటయే కాక దానిని సర్దుబాటు చేయుటకు ముందొక ఉపస్తంభమునకు బదు చిన్న అలంకార స్తంభమును నిర్మించి దానిని ప్రధాన స్తంభములో అడుగున సింహములో కలుపును లేపాక్షిలో తిరుచుట్టుమాల అట్టి స్తంభముల వరుసలో నిర్మింప బడినది పెద్ద స్తంభముమీద శిల్ప నిర్మాణమునకు తగిన చోటు లభించును స్తంభమునకు చేర్చి నర్తకులు ఇతర వటబృందము చెక్కబడినారు నాట్యమండపములోని స్తంభములు నాట్యసభను పోలి యుండును నాట్యబృందములోనివారు విడిగా వేరువేరు స్తంభములపై నిర్మింపబడి మధ్యరంగమున నర్తకి యొక్క నృత్యప్రదర్శనమునకు అంగభూతమై ప్రోత్సహించు చున్నట్లుండును బ్రహ్మతాళము సూర్యుడు సన్నాయి తుంబుర నారదులు తంబురాలు నందీశ్వరుడు నటరాజు ఇత్యాది సన్నివేశము నర్తకి యెదుట కన్పట్టుచుండును ఇచటి లతామండపములోని స్తంభములు లతలు పొదలు చిలుకలు గోరువంకలు కోయిలలు పువ్వులు కాయలు పండ్లు ఇత్యాదులు ఉద్యానవనమువలె ప్రతిభాసించును ఇదియంతయు చూడ శిల్పమే స్తంభాకారములో మూర్తీభవించినదా యనిపించును కొన్ని చోట్ల స్తంభమే విగ్రహముగా కాన్పించును అనగా విగ్రహములను వేరుగా నిర్మించి ఎచటనో యత్నము లేకుండ స్తంభములోని పూర్వభాగమునే విగ్రహముగా నిర్మించినచో దానికొక నిర్దిష్టస్థానము దొరకుటయేకాక అలంకారముతో గూడిన స్తంభముగా గూడ అది పనికివచ్చుచున్నది అట్టి విగ్రహములలో త్రిపురాసురసంహారమూర్తి అంధకాసుర వధ రంభా నలకూబరులు ఇంకనెన్నియో అత్యంత రమణీయ విగ్రహములు ఈదిగువ స్తంభచిత్రములలో అమర్పబడియున్నవి గోడలమీది శిల్పము అధికముగా శ్రీశైలము నందువలె శైవకథలు-అచ్చటచ్చట వైష్ణవకథలు కల్గియుండును ఇందు సిరితొండనికథ కిరాతార్జునీయము ప్రధానములు ఇవంతయు అర్ధశిల్పములో అతి రమణీయముగా చదువురాని పామరులకుకూడ ఈ గాథలద్వారా భక్తిప్రబోధముచేయుచు దృశ్యకావ్యము చేయదగి యుండును

చిత్రకళ ఆంధ్రదేశములో చిత్రకళ ప్రాచీనావశేషముగా చెక్కుచెదరక ఎచ్చటనైన లభించునన్నచో, అది లేపాక్షియే ఇచ్చట ఆలయముఖమండపములోని సువిశాల

మగు లోకప్పుగోడలు ఈచిత్రరచనమునకు అనుకూల స్థావరము లైనవి అందుపయోగింపబడిన వర్ణములు గాలికి వెలుతురుకు శిథిలముగాకుండ భద్రముగ నిచ్చట సంరక్షింపబడినవి ఇందు దేవతామూర్తులలో శైవము వైష్ణవము - రెండును గలవు లింగోద్భవ అంధకాసురసంహార భిక్షాటన దక్షిణామూర్తి నటరాజ త్రిపురసంహార కల్యాణసుందర వృషభారూఢమూర్తులు శివావతారములలో ముఖ్యమైనవి అట్లే దశావతారములు పట్టాభిరామ వటపత్రశాయి మున్నగునవి విష్ణ్వవతారములలో ప్రధానమైనవి భక్తులయొక్కయు రాజులు మండలేశ్వరులు స్త్రీలుయాత్రలుచేయు దృశ్యములు పురాణగాథలు విశేషముగా ఇచటి చిత్రకళకు కథావస్తువైనవి ద్రౌపదీస్వయంవరము కిరాతార్జునీయము శ్రీరామ పట్టాభిషేకము ఇందలి ముఖ్యగాథలు ఇచటి చిత్రములు అజంతాలోను ఇతరచోట్లవలె ప్రక్కకుతిరిగి యున్నట్లుగా కాక ప్రేక్షకులకు ముఖాముఖిగా ఉన్నట్లే కన్పడును రఘునాథాలయ సమీపమందున్న చిత్రములు మిక్కిలి ఆకర్షకముగ నుండును చేతివ్రేళ్లు అతిలలితముగా కనబడును మొసలి కుక్క మకరతోరణములు విశేషనైపుణ్యమును ప్రదర్శించును అట్లే భైరవమూర్తిలోనొక ప్రత్యేకత స్ఫురించుచుండును రఘునాథస్వామి ఆలయమునద్ద చిత్రింపడిన దశావతారదృశ్యములు అతిమనోహరములు మత్స్య కూర్మ వరాహ నారసింహ పరశురామావతారములను కేంద్రములో లక్ష్మీనారాయణ స్వామి రూపమును వామనమూర్తిని సన్నివేశపరచిన కూటమి యిది పై భాగమున ఒకప్రక్క ఉమాసహిత పరమేశ్వర మూర్తి ఖేచరులతో మబ్బులలోనుండి పుష్పములు చల్లుచున్నట్లు కనబడును ప్రక్కనున్న పెద్ద వీరభద్రమూర్తి దుర్గాదేవిపైన పులిచేట చిత్రమొక గొప్ప రమణీయదృశ్యము. ఆకారరేఖలన్నియు స్ఫుటముగాను సజీవముగాను గోచరించును తెలుపురంగునుండి తెలుపులోనికి పరిణమించిన వర్ణమేళవింపు ఈ చిత్రమునకొక విశేష సౌందర్యసంపదను కూర్చినది ఇచటి వేటగాండ్రు కిరాతార్జునీయ గాథలోని పాత్రలంటె సజీవముగా కాన్పించుదురు పులిని పొడిచినవెంటనే పైకెగజిమ్ము రక్తపుధాయ పులిపోటుబడు వేటగాని తలయొంతో వాస్తవికతను వ్యక్తముచేయును ఈ విశేషములను పురస్కరించుకొని దీనిని ఆధునికచిత్రముగా కొందరు తలంచుచుందురు

కిరాతార్జునీయగాథలో చిత్రకారుడు అటవీదృశ్యమును చిత్రించుటలో తన కౌశలమును ప్రదర్శించెను ఆవు రథము పార్వతీపరమేశ్వరులు జింకలు కుందేళ్లు కుక్కలు చిరుతపులులు కిరాతులు చెల్లెక్క గరాకామును వెతుకుట యువకులు కొండలమీదనుండి పరుగెత్తుకొనిపోవుట వరాహమునుచూచి మునులు భయభ్రాంతులగుట - మున్నగు కథాంశము లొక కవితా రచనవలె హత్తుకొని పోయినవి ఈశ్వరుడు భృంగి నారదుడు వారి తగిన భంగిమలలోను

చిత్రము. 16



పటము 10

కనక తప్పెట వాద్యకాడు లేపాక్షి

మిగిలినవారొక భంగిమలోను కనిపించుదురు మబ్బులను ప్రదర్శించుటలో కొంత అతిశయోక్తిని చూపించి అజంతా మున్నగు తావులందుకంటె విలక్షణముగా చిత్రించుటచే అవి విమానములా యనునట్లుండును కాని విమానాకృతి లేక పోవుటను బట్టియే ఇవి మేఘము లనుకొనవలసి యుండును ఒక్కొక్క సన్నివేశమును ప్రశంసించుటకు తగిన విశేషములు అనేకములిందు గలవు

లేపాక్షిలో శిల్పమునందుగాని వర్ణచిత్రములలోగాని కాన్పించు వాద్యములలో శృంగము, డోలు, మృదంగము తప్పెట, శాశివాదులు, సన్నాయి మొదలగు విజయనగర నాట్యకళలోనున్నవి. ఇంకను వాటి లోగల రవులు విన్యాసములు ప్రదర్శింపబడినవి. లేపాక్షి చిత్రకారుడు వాడిన వర్ణములు దాయవలె బేగురు సున్నపురంగు గాని తెలుపు నలుపుగాని మేళవించిన దని తోచును. ఇంతకుమించి ఈసాంకేతిక రహస్యమునుగూర్చి అధునికమైన ఊహ చెప్పయు వెలువరించజాలము. ఆ సత్యమును గుర్చి యోచించుటకంటె వాటి రమణీయకతతో నేత్రపర్వము గావించుకొనుటయే పరమార్థము నిచ్చును.

పు ప శా

## లైబీరియా

1816 వ సంవత్సరమున ఏర్పాటుచేయబడిన అమెరికను వలస నివాససంఘమువారి కృషిఫలితముగ లైబీరియావృద్ధి నొందెను. ఈ సంఘమువారు అమెరికానుండి విముక్తులయిన నీగ్రోలయొక్క అధినివేశమును ఆఫ్రికాలో వారి ఆది మజన్మభూమియందేర్పరచుటకు స్థాపింపబడిరి. మనురాడో అగ్రమునకు చుట్టునున్నట్టి గాని, మనురాడో నదీముఖమువద్ద నున్నట్టి గాని స్థలమును వారు అధినివేశముకొరకు ఎన్నుకొనిరి. ప్రప్రథమమున 1822 వ సంవత్సరమున అమెరికను నీగ్రోలు ఉపనివేశకులుగా (settlers) పంపబడిరి. రాష్ట్రపతియైన జేమ్సు మన్రో మహాశయుని గౌరవార్థము వారు ఆ అధినివేశమునకు మన్రోలియా అని నామకరణ మొనర్చిరి.

ఆదిమ ఉపనివేశికులు స్థానికులయిన తెగలవారితో అనేక యుద్ధములు చేయవలసినవారైరి. పూజ్యులైన ఆర్. ఆర్. గుర్లేఅను మతాధికారి ఆ దేశమునకు లైబీరియాఅను పేరు పెట్టెను. లైబీరియా యన స్వతంత్రభూమి. విముక్తులయిన బానిసలు అందు నివాసమేర్పరచుకొనిరి. కావున ఆనామము దానికి సార్థకమైనది. అమెరికో-నీగ్రో లైబీరియా యొక్కయు అమెరికను వలస నివాస సంఘము యొక్కయు అన్యోన్య అంగీకారమువలన లైబీరియా ఒక ప్రజాప్రభుత్వ రాజ్యముగా 1847 వ సంవత్సరమున ప్రకటింపబడినది.

స్థిరనివాసము కల్పించుకొన్న శ్వేతజాతివారు భయదమైన లైబీరియా అడవులకు ఎంత అపరిచితులై యుండిరో క్రొత్త అమెరికను నీగ్రోలు కూడా వాటికి అంత అపరిచితులై యుండిరి. వారు అమెరికను వలస నివాస సంఘముయొక్క ద[illegible]ంత నుండిరి. తమ నిరంతర స్థితికై వారు వలస నివాస సంఘముపై ఆధారపడియుండిరి. ఫైర్ స్టోను కంపెనీవారు ఒక విశాలమయిన భూప్రదేశమును రబ్బరుతోటలను పెంచు కొరకై కౌలునకిచ్చుటతో అచట ఒక పరిశ్రమనఘట్టి స్థాపించెను.

స్థానము, విస్తీర్ణము: పశ్చిమ ఆఫ్రికాలో బి యుండు నేక ప్రదేశములయొక్క దక్షిణపుచివరపై లైబీరియా యున్నది. లైబీరియా దక్షిణమున ఐవరీతీరముచేతను (ivory coast) ఉత్తరమున గినియా (guinea) చేతను సైరాలియోనే (sirra leone) చేతను చుట్టుకొనబడి యున్నది. అది పశ్చిమమున అట్లాంటిక్ సముద్రము చే వేష్టితమైయున్నది. అరాజ్యము మధ్యరేఖ (equator) కు ఉత్తరమున $4\frac{1}{2}^{\circ}$ - $8\frac{1}{2}^{\circ}$ వరకును గ్రీన్‌విచ్చుకి పశ్చిమమున $7\frac{1}{2}^{\circ}$ - $11^{\circ}$ వరకును విస్తరించి యున్నది. దాని విస్తీర్ణము 48 000 చ. మైళ్లు. కొంచము తక్కువగా దాని విస్తీర్ణము తెలంగాణా విస్తీర్ణమునకు సమానము. దాని తీరరేఖ అట్లాంటిక్ సముద్రము వెంబడి 350 మైళ్ల పొడవున నున్నది. మరియు ఆతీరరేఖ కొన్నిచోట్ల లలో 160 మైళ్లకు పైగా దేశములోనికి విస్తరించును.

నైసర్గిక స్వరూపము: ఈ ప్రదేశమందు ఎక్కువగా సాధారణమయిన రాతి నమూనాల గ్రానైటు రాయి (granite) నెయిస్ శిలలు (gneiss) కనిపించును. వర్షపాతము 100 అం మించిన చోట్లనెల్ల బొంతరాయికూడ గోచరించును. లైబీరియాను 5 మండలములుగా విభజింపనగును -

(1) **తీరమైదానము**: ఇది దేశములో తట్టునకు స. మారు 25 మైళ్లు విస్తరించును. ఇందు అనేకనదులును మడుగులును కలవు. ఆనదులలో చిన్నపడవలుమాత్రమే ప్రయాణముచేయ గలవు. అచట వరి, కొబ్బరి ఉత్పత్తులు, దబ్బజాతిపండ్లు ఫలించును.

(2) **దొంతులు దొంతులుగానుండు కొండలు**: ఈ ప్రదేశము క్రమముగా 100 అడుగుల నుండి 800 అడుగుల ఎత్తునకు పెరుగుచు 50 మైళ్లు వ్యాపించును. ఇవి రబ్బరుపైరునకు అనుకూలముగా నుండును.

(3) **ఇరుకైన మండలము లేక నిమ్నమైన కొండలు**: ఈ ప్రదేశము హఠాత్తుగ 10 మైళ్ల దూరములోనకే 1000 అడుగుల ఎత్తునకులేచును. ప్రతిమైలు పొడవునకు 100 అడుగుల ఎత్తు పెరుగును.

(4) చీలిన పీఠభూమి : ఈ మండలపు వైశాల్యము 100 మైళ్లు సముద్రపు మట్టముపై దీని ఎత్తు సగటున దాదాపు 1000 అడుగులు ఇందు జనాభాసాంద్రత తక్కువగానున్నది

(5) లోతట్టున నున్న పర్వతమయ ప్రదేశము ఇచటి పర్వతముల ఎత్తు 800 అడుగులనుండి 4000 అడుగులవరకు పెరుగును సరిహద్దుపైనున్న నింబ అను పర్వతముయొక్క ఎత్తు 6500 అడుగులు 3 & 5 మండలములలో అడవులు కలవు అచ్చటి అటవి ఉత్పత్తులలో - కోకో కొబ్బరి ఉత్పత్తులు (కొబ్బరి కొబ్బరినూనె, కొబ్బరిపిచువంటివి) కాస్సవ బియ్యము (ఒకజాతి బియ్యము) కాఫ కలవ చెప్పదగినవి

నదులను వాగులును లోతట్టుభాగమునపుట్టి తీరము వైపు సమకోణముగా ప్రవహించును దాదాపు అన్ని నదులను తీరమునకు సమాంతరముగా ప్రహించును

**శీతోష్ణస్థితి** ఆఫ్రికాలో లైబీరియా మిక్కిలి తేమతో కూడిన శీతోష్ణస్థితికల ప్రదేశములలోనొకటి అందు దాదాపు 70°-80° ఫా ల సాలానా సగటు ఉష్ణోగ్రత కలదు జనవరి నెలలో గరిష్ఠమయిన ఉష్ణోగ్రత కలదు డిసెంబరు జనవరి ఫిబ్రవరినెలలు శుష్కమాసములు మార్చి మొదలుకొని సెప్టెంబరునెల వరకు వానకాలము జూన్ నెలలోను సెప్టెంబరు నెలలోను ద్విగుణముగా గరిష్ఠమయిన వాన ఉండును అక్టోబరు నవంబరు నెలలలో సాంద్రముగా మంచుకురియును తీరము వెంబడి సగటు వర్షపాతము 180 అంగుళములు లోతట్టు దేశమున దాదాపు 80 అం వర్షపాతముండును

గాఢమయిన వర్షపాతము తీక్ష్ణమయిన ఉష్ణోగ్రత - కారణములగా అక్కడ ఎర్రనేలలు ఏర్పడినవి అవి సారవంతములైనవి

**వృక్షములు : జంతుజీవితము** అటవీప్రాంతమునందు మిక్కిలి ఆశ్చర్యకరమయిన వృక్షములు ఫంటుమ్యా ఎలాస్టికా (Funtumia Elastica) అను వృక్షములు ఇవి 200 అడుగుల పొడవున పెరుగును అనేకరకముల పెరినోరియం ఓల్డ్ ఫైల్డియా (Parinorium Old Fieldia) అను చెట్లు ఖాయ (Khaya) అను చెట్లు ప్రత్తిచెట్లు బ్రహ్మాండమయిన డ్రాకెయినాస్ (Dracaenas) అను చెట్లు అనేకరకముల అత్తిచెట్లు అనేకవిధములయిన కొబ్బరిచెట్లు కోలా (Kola) వృక్షములు అచ్చట కనిపించును

అచ్చట కానవగు సాధారణ జంతువులలో చింపంజీ కోతులు (Chimpanzee) డయనాకోతులు జింకలు చిన్న ఖడ్గమృగములు జిబ్రాజింకలు (ఇవి చిన్న మేకయొక్క పరిమాణము కలవి) పేర్కొనదగినవి సాధారణమయిన పక్షులలో - అనేకరకముల గబ్బిలములు సీమకోళ్లు రాబందు గుడ్లగూబ ఎచ్చిక డేగ చెప్పదగినవి ఏడురకముల విషపూరిత సర్పములు ఆరు అంగుళములకంటె పొడవయిన తేళ్లును అచటకలవు

**సహజసంపదలు** లైబీరియాలో వాయవ్య భాగమందుమ బోమికొండలలో దక్షిణభాగమందును కేంద్రభాగమందను సాంద్రమైన అడవులున్నవి అడవి ఉత్పత్తులలో - కలవ (వన్య) రబ్బరు కోకో కొబ్బరి కొబ్బరినూనె కొబ్బరిపిచు చెప్పతగినవి బోమి కొండలలో ప్రపంచములో నెల్ల మిక్కిలి భాగ్యవంతమయిన ఇనుపగనులు కలవు అచటి ఉత్తమతరగతికి చెందిన ముడి ఇనుము పరిమాణము 80 000 000 టన్నులని అంచనా వేయబడినది ఇతర నిక్షేపములలో చెప్పదగినవి - వజ్రములు బంగారము వల్లనిసీసము (Graphite) సీసము చలువరాయి అభ్రకము శిలాస్ఫటికము వెండి నాగతుత్తము - పేర్కొనదగును

లైబీరియాలో సగముకంటె ఎక్కువ భూభాగము సేద్యమునకు అనుకూలమైనది కాని అందులో చాలతక్కువ భాగము సేద్యము చేయబడుచున్నది

**జనులు వారి జీవితవిధానము** ఇప్పటికివి జనాభా లెక్కచేయబడలేదు భిన్నభిన్నమయిన ఆధారములు భిన్నభిన్నమయిన సంఖ్యలను తెలుపుచున్నవి జనాభా 1 5 మిలియనులకును 2 5 మిలియనులకును మధ్యస్థమైయున్నట్లు అంచనా వేయబడినది చ మైలునకు 80 జనులచొప్పున జనసాంద్రత కలదని అంచనా జరిగినది అమెరికో - నీగ్రో లైబీరియనులే కాక దాదాపు 6 000 మంది తీరస్థులయిన నీగ్రోలును ఉన్నారు వారు అమెరికో - నీగ్రోలతో సన్నిహితసంబంధము కలవారై వారి జీవిత విధానమును అవలంబించినవారు వారికి నాగరకులని వ్యవహారము ఉత్తమ సముద్రనావికులుగా పేరొందిన క్రూ' అను తెగవారుతప్ప శేషించిన 21 తెగలవారును దేశపు లోతట్టుభాగమున నివసింతురు ముఖ్యమయిన తెగలలో వై (Vai) అను తెగవారు తమ వ్రాతభాషను అభివృద్ధిచేసికొనినారు మాన్‌డిన్‌గోస్ (Mandingoes) అను తెగవారు మస్లిములు షుమారు 1000

మంది శ్వేతజాతీయులు దేశమున నివసించుచున్నారు కాని వారికి పౌరసత్వములేదు

లైబీరియాలో లోతట్టుభాగమునందలి తెగలవారు వదులన్న భీతిల్లి వాటినుండి తప్పించుకొందురు పెక్కు తెగలవారు సముద్రమునుచూచి ఎరుగరు వారికి సిరస్సు భయము ఎడతెగనిదై యున్నది నాతిదీర్ఘ పూర్వకాలము నందు రహస్య సంఘములుండెను ఆ సంఘీయులు ఈ తెగ వారిని నరబలికొరకును నరమాంసభక్షణముకొరకును నదీ జలగర్భమున దాగియుండి అన్వేషించుచుండెడివారు

ఈ తెగలవారి ఇండ్లు గుండ్రటి ఆకారపు నమూనాలో నుండును వాటికప్పులు శంక్వాకారముకలవై యున్నవి వారి ఇండ్లు కర్రలతో తాటియాకులతో వెదుళ్లతో గడ్డితో కప్పబడును నేడు పట్టణములలోని గృహములు రిబన్ బోర్డ్సు సిమెంటు కాంక్రీటులతోను బహుళ శిలాఫలకములతోను నిర్మింపబడుచున్నవి

అమెరికో - లైబీరియనులు తీరవాసులైన లైబీరియనులు మాట్లాడుభాష ఆంగ్లభాషయైయున్నది వారందరును దాదాపు ప్రొటెస్టెంటు క్రైస్తవ మత శాఖీయులేయై యున్నారు

లైబీరియాలో ఇంచుమించుగా పదిపురములు కలవు మన్రోవియాయందు 42 000 జనాభాకలదు అది లైబీరియా యొక్క రాజధానియు ముఖ్యపట్టణమునై యున్నది అది సెయింట్ పాల్ నదీముఖముపైనున్నది అమెరికా అధ్యక్షుడయిన జేమ్సు మన్రోమహాశయుని పేరట అది మన్రోవియా అనబడినది శేషించినపురములును వాటియందలి జనాభాయు ఈ క్రింద వివరింపబడినవి

| పురము | జనసంఖ్య |
|---|---|
| హార్పర్ | 5000 |
| బూకానన్ | 2100 |
| రాబర్ట్సుపోర్టు | 1800 |
| మార్షల్ | 1770 |
| గ్రీన్‌వైల్ | 1640 |
| గ్రాండ్ సెస్ | 1220 |
| టూబీ | 850 |
| రివర్ సెస్ | 810 |
| కాలెన్‌బర్గ్ | 660 |

జనుల ఆర్థికప్రవృత్తి వ్యవసాయము జనుల జీవనమునకు వలసిన సాధనసామగ్రి చేకూరుచున్నది అదిమ వ్యవసాయపద్ధతుల ఆచరణము అమలునందున్నది ఇటీవల ఆధునికవ్యవసాయ సాధనములు నుపయోగించుటను నూతన వ్యవసాయపద్ధతులను గూర్చియు పొలములకు ఎరువును చేకూర్చు విధానములను గూర్చియు ఎకరజాతి విత్తనములను కూర్చు విధానమును గూర్చియు వ్యవసాయదారులకు ప్రబోధము చేయబడుచున్నది

లైబీరియాదేశమునందలి జనుల ముఖ్యమైన పంట వరిపంట వరిబియ్యమే జనుల ప్రధానమయిన ఆహారము అరటిపండ్లు కోకో కాఫీ కాస్సవాబియ్యము పంచదార అనునవి ఇతర ఉత్పత్తులైయున్నవి

తోటలలోనిడిమి ప్రపంచములో రబ్బరును ఉత్పత్తి చేయు దేశములలో లైబీరియా ఆరవస్థానము నాక్రమించు చున్నది అమెరికా ఫైర్‌స్టోన్ కంపెనీమూలమున లైబీరియాలో రబ్బరుతోటల పెంపకము అభివృద్ధినొందినది రబ్బరు తోటలను వేయు ఉద్యమము, 1926 వ సంవత్సరములో ఆరంభింపబడినది లైబీరియాయందలి రబ్బరు ఉత్పత్తి మొత్తము 4 10 00 000 టన్నులని తెలియుచున్నది

వర్తకము - యానము : వ్యవసాయమునకును ఖనిజములకును సంబంధించిన ముడిపదార్థములు ఎగుమతిసరకులుగ నున్నవి ఎగుమతిచేయబడు సరకులలో చేర్పదగినవి - రబ్బరు కొబ్బరి కొబ్బరినూనె కొబ్బరిపీచు కోకో - కాఫీ అనునవి కేవలము రబ్బరే ఎగుమతిచేయబడు సరకులలో 85 శాతము ఎడప ప్రాధాన్యముగల ఎగుమతి సరకు ఇనుము దాని సాలీనా ఎగుమతి 20 00 000 టన్నులకు మించియున్నది బంగారముకూడా ఎగుమతిచేయబడుచున్నది అయితే అందులో విశేషభాగము అమెరికా సంయుక్తరాష్ట్రములకే ఎగుమతి యగుచున్నది

సాధారణముగ తయారయిన ఉత్పత్తులను దిగుమతి - దిగుమతి వస్తువులుగానున్నవి ఆహార ఉత్పత్తుల విషయమున లైబీరియా స్వయంసమృద్ధమైనదికాదు. వస్తువుల వల్లయి విషయమున అది సంయుక్తరాష్ట్రములపై ఆధారపడును ఎగుమతులే దిగుమతులను మించియున్నవి.

రహదారి ద్వితీయప్రపంచ సంగ్రామమునకు పూర్వము మందు రహదారికొరత్వములు శాశ్వతములు మాయమయినవి.

జరుగుచుండెను. నదులన్నియు ఒండొంటికి సమాంతరముగాను తీరమునకు సమకోణముగాను ప్రవహించుచుండును. దేశములో లోపలిభాగమును చేరుటకు నదులను దాటుటకు అవసరములేదు. కాలిబాటలలో సైకిళ్ళను మోటార్లను మాత్రమే నడపుటకు వీలుండును. రెండవ ప్రపంచయుద్ధానంతరము ఆధునికములైన రవాణాసౌకర్యములు అభివృద్ధి నొందినవి. అందు ఇపుడు 1200 మైళ్ళ రహదారులును ప్రైవేటురోడ్లును ఏర్పడినవి. మన్రోవియానుండి బోమికొండలకు 40 మైళ్ళ పొడవుగల ఇనుపదారికలదు. హార్బెల్ అనుచోటగల రాబర్టుఫీల్డు ఒక అంతర్జాతీయమయిన విమానాశ్రయముగా నున్నది. మన్రోవియావద్ద ప్రవృద్ధమయిన నౌకాశ్రయముకలదు. అచట 1000 కి పైగా ఓడలు సాలీనా మరమ్మతుకొరకు నౌకానిర్మాణస్థానమున నుండును.

**విద్య:** లైబీరియాలో సుమారు 5 శాతపు జనులు విద్యావంతులు. ఆ దేశమందు 500 లకు పైగా పాఠశాలలలో విద్య నేర్పబడుచున్నది. మన్రోవియాలో నొక విశ్వవిద్యాలయమున్నది. అది 1851 వ సంవత్సరమున స్థాపింపబడినది.

**ప్రభుత్వము:** లైబీరియా ఆఫ్రికాలో ఏర్పడిన ప్రథమ ప్రజాప్రభుత్వము. అది 1847 వ సంవత్సరములో ప్రజాప్రభుత్వముగా ప్రకటింపబడినది. దాని సంవిధానము (constitution) అమెరికా సంయుక్తరాష్ట్రముల సంవిధానము ననుసరించి రూపొందింపబడినది. రాష్ట్రపతి (ప్రప్రథమమున) ఎనిమిది సంవత్సరములకొకసారి ఎన్నుకొనబడును. ఎన్నిసార్లయినను అతడే మరల ఎన్నుకొనబడవచ్చును. కాని పిదప జరుగు ఎన్నికలు నాలుగుసంవత్సరముల పరిమితి కలవై మాత్రమే ఉండును. శిష్టసభ్యులు పదిమందికలరు. 31 మంది (విధాన) సభాప్రతినిధులున్నారు. శిష్టసభ్యులగడువుకాలము 6 సంవత్సరములు. సభాప్రతినిధుల గడువుకాలము 4 సంవత్సరములు. లైబీరియా పతాకముకూడ సంయుక్తరాష్ట్రముల పతాకము ననుసరించి ఏర్పరచబడినదే. అందు పదునొకండు ఎరుపు తెలుపు చారలు సరి బేసిగనుండును. ఎడమ చేతివైపుపైన నొక నీలపుచదరము కలదు. దానిమధ్యనొక నక్షత్రము కానవగును.

**ఇటీవలి సంఘటనలు:** 1946 వ సంవత్సరమున అభివృద్ధిప్రణాళిక ఆరంభింపబడినది. క్రొత్తరోడ్లు వేయుటకును, విద్యుచ్ఛక్తి ఉత్పాదకములయిన బృహద్యంత్రములను, తక్కువధరగల గృహములను నిర్మించుటకును ఆ ప్రణాళిక ఉద్దిష్టమయినది. ఇచటి జాతీయ ఏకీకరణ కార్యక్రమము లైబీరియనుల కందరికిని సాధారణ జాతీయతను సంక్రమింపజేయుచున్నది. ఈ కార్యక్రమద్వారమున తత్తీరవాస జనులయొక్కయు తద్దేశాంతర్భాగవాస జనులయొక్కయు మధ్యగల భేదభావము నిబ్బరముగా అంతరించుచున్నది. తగ్గు పన్నులను వేయుచును స్వల్పమయిన జోక్యము కల్పించుకొనుచును అత్యంతసామర్థ్యముతో వైదేశికుల పెట్టుబడులను ఆకర్షింపగల్గుట లైబీరియాప్రభుత్వముయొక్క గురుతరమైన సిద్ధికి కారణముగ నున్నది. 1951-52 వ సంవత్సరమునుండి ఆదేశము పంచవర్షప్రణాళికనుకూడ ప్రవేశపెట్టినది.

బి. వే.

## లైసెంకో (1898- )

ఇతడొక రష్యన్ వ్యవసాయక జీవశాస్త్రవేత్త. అనువంశిక క్రమవిజ్ఞానశాస్త్రములో ప్రముఖస్థానము వహించి నూతన జీవశాస్త్ర సంప్రదాయమును తీర్చిదిద్దినవాడితడు. పరిసరముల ప్రభావముచే వారసత్వముగా సంక్రమించు లక్షణములలో మార్పులు కల్గుననెడి సిద్ధాంతమును ఇతడు ప్రచారమొనర్చె. 1949 వ సంవత్సరములో సోవియట్ శాస్త్రజ్ఞులు ఆ సిద్ధాంతమును అంగీకరించునట్లు కృషిసల్పినాడు. కాని ఏకారణముననో అనంతరము కొందరు రష్యను శాస్త్రజ్ఞులకు ఈ సిద్ధాంతమునందు విశ్వాసము సడలి క్రమముగా మెండెల్ అను శాస్త్రజ్ఞుడు ప్రచారముచేసి బహుజనాభిమతమును పొందిన సాంప్రదాయక సిద్ధాంతమునకు అనుయాయులైనట్లు తెలియుచున్నది. ఏదెట్లయినను లైసెంకో సిద్ధాంతము ప్రపంచములో విస్తృతముగ ప్రచారము పొందజాలక అల్పసంఖ్యాకులకుమాత్రమే ఆదరణీయముగ నున్నది.

లైసెంకో స్వయముగా ఈ సిద్ధాంతమును నిర్వచింపలేదు. తన ప్రయోగకౌశల్యమును వెల్లడింపగల ప్రయోగములనుకూడ కావించినట్లులేదు. కాని వ్లాడిమిర్ ఇక్ మిచురిన్ (1855-1935) అను ప్రముఖ రష్యన్ ఉద్యానవన శాస్త్రవేత్త కావించిన ప్రయోగఫలితములను సూచించిన సిద్ధాంతమును లైసెంకో విశ్వసించి వాటిని బహుళముగా ప్రచారమొనర్చినాడు. ఒకమొక్కకొమ్మను మరియొక మొక్కతో అంటుకట్టినప్పుడు వాటి లక్షణములలో కల్గుమార్పులు పారంపర్యముగా సంక్రమించునని మిచురిన్ భావించి

గణితశాస్త్రజ్ఞులుకూడ విడివిడిగా లొబొచెవిస్కి సిద్ధాంతమును మరియొక రూపములో కనుగొనిరి కాని లొబొచెవిస్కి తన సిద్ధాంతమును 1829 సం॥లో మొట్టమొదటిసారిగా ప్రచురించి అప్పటి గణితశాస్త్ర ప్రపంచము అచ్చెరువొందునట్లు చేసెను

లొబొచెవిస్కి జ్యామితిని అతిపరావలయజ్యామితి (Hyperbolic Geometry) లేక కల్పిత జ్యామితి అని అందురు ఇది యూక్లిడ్ సమానాంతర స్వీకృత తత్త్వమునకు విరుద్ధమైనది

ఒక దత్తరేఖకు దానిమీద లేని ఒకబిందువు గుండా పోవుచు మరియు దానికి సమానాంతరముగా నుండునట్లు కనీసము రెండు సరళరేఖలను గీయవచ్చును —అను లొబొచెవిస్కి సిద్ధాంతమే యూక్లిడేతరజ్యామితికి నాందియైనది ప్రత్యేకవివరణము

చిత్రము 16




పై చిత్రములో L దత్తరేఖ P అనునది L మీద లేనట్టి వేరొక బిందువు P గుండా L కు సమాంతరముగా $L_1$ $L_2$ అను రెండు సరళరేఖలు గీయవచ్చును ఇదియే పై సిద్ధాంతము చూడగనే పై చిత్రము అసంభవ మనిపించును కాని, ఇతని సిద్ధాంతము విశ్వముయొక్క భౌతికరూపమును నిర్వచించుటలోను సాపేక్ష సిద్ధాంత విస్తృతిలోను మిక్కిలి ఉపయోగపడినది ఇతడు ప్రతిపాదించిన మరియొక సూత్రము త్రిభుజములోని మూడుకోణముల మొత్తము 180° కంటె తక్కువ' అని తెలుపును

జ్యామితికి మారుపేరు యూక్లిడ్ అంతవరకు అతని స్వీకృత తత్త్వములు సత్యములు, నిత్యములు అనింద్యములు అని శాస్త్రజ్ఞులు నమ్ముచుండిరి అట్టి మూఢనమ్మకమును ఛేదించిన లొబొచెవిస్కి సూత్రములు తీవ్రవిమర్శలకు గురియగుటలో ఆశ్చర్యమేల! ఇతని జీవితకాలములో కొందరు శాస్త్రజ్ఞులుమాత్రమే ఇతని సిద్ధాంతమును అంగీకరించిరి 19 వ శతాబ్దాంతమునగాని అది గణితశాస్త్రజ్ఞులచే విశ్వసనీయమైనదిగా పరిగణింపబడలేదు ఈ తర్కమును ఆధారము చేసికొని రీమాన్ అను ప్రసిద్ధ గణితశాస్త్రజ్ఞుడు నిలోన జ్యామితి లేక రీమానియన్ జ్యామితి (Elliptic or Riemannian geometry) అనుదానిని ప్రవేశపెట్టెను ఇతని జ్యామితిలో సమానాంతర రేఖలే లేవు త్రిభుజములోని మూడుకోణముల మొత్తము 180° కంటె తక్కువ అని ఇతడు నిరూపించెను పై విధముగా, లొబొచెవిస్కి అభేద్యములనుకొన్న సూత్రములను ఛేదించి గణితశాస్త్ర పురోభివృద్ధికి తోడ్పడెను

గణితశాస్త్ర పరిశోధనమందే గాక పరిపాలకుడుగా గూడా లొబొచెవిస్కి సామర్థ్యమును ప్రదర్శించెను 1827 నుండి 1846 వరకు కజాన్ విశ్వవిద్యాలయమునందు రెక్టార్ గాపనిచేసి అచ్చటి గ్రంథాలయమును ప్రదర్శనశాలను వేధశాలను అమూల్యమైన సామగ్రితోనింపి ఉపాధ్యాయవర్గమునకు సహాయకుడుగా నుండెను 1830 లో కలరా వ్యాధి ప్రబలినప్పుడును 1842 లో దారుణమయిన అగ్నిప్రమాదము సంభవించినపుడును లొబొచెవిస్కి తనప్రాణము లొడ్డి ప్రజలను కాపాడెను విశ్వవిద్యాలయ సామగ్రి వరకు నామమాత్రముగా కాకుండా ఇతడు రక్షణచర్యలను తీసికొని అపార నష్టమును తప్పించెను ఇంజనీరింగ్ భవననిర్మాణములు చేయునపుడు విచారణ చేయుటకై ఇతడు శిల్పశాస్త్రమునుగూడ అభ్యసించెను ఇట్లితడు మాతృవిద్యా సంస్థకు ఎనలేని కీర్తిప్రతిష్ఠలను సంపాదించిపెట్టెను తుదిక్షణమువరకు వాఙ్మయమునకు సేవచేయుచు 1856 సం॥ ఫిబ్రవరి 24 వ తేదీన కజాన్ పట్టణమునందు ఇతడు మరణించెను

జ్యామితి మూలతత్త్వములు (1829-30) కల్పిత జ్యామితి' (1835) జ్యామితి నూతన మూలతత్త్వములు (1835-38), మొదలగునవి ఇతని ప్రధాన రచనలు, "గియోమెట్రిషె ఉంటెర్ సుచున్‌గెన్" అను ఇతని జర్మను భాషాగ్రంథమును ఆంగ్లములోనికి జి బి హాల్‌స్టెడ్ అనునతడు (1891 1914) (కొత్తప్రతి) అనువదించెను ఇతడు శిల్పశాస్త్రమునందుకూడ పాండితి కలవాడు వి రా

## లోకగీతములు - గానము

ప్రపంచమంతటను వ్యాపించియున్న సంగీతమంతయు ఎన్ని ద్వారాలనుండి ఆవిర్భవించినది. దానిలో ముఖ్యమైనవి రెండు తెరగులున్నవి (1) శాస్త్రీయగానము (2) లలితసంగీతము లేక జానపద గేయము. భరత సంగీతాచార్యులైన నారద తుంబుర హనుమదాదులు తొలుత గానమును సృష్టించి ప్రచారముచేసినప్పుడు ఈ భేదములేవు. రాను రాను లక్షణకర్తలు శాస్త్రనిబంధనలను సూత్రములను సృష్టించిరి. భగవత్సంబంధమగు దివ్యనామ సంకీర్తనములు ఉత్సవ ప్రబంధములు రానురాను అభివృద్ధిగాంచి రాగతాళబద్ధములై క్లిష్టరూపమును దాల్చినవి. ఇవి పండిత వేద్యములేకాని పామరులకు అంతగా రుచించలేదు.

పురములు పల్లెలు గల ప్రదేశములు జనపదములు. వాటిలో నివసించువారు జానపదులు. వీరు పాడు సంగీతము పేరు జానపద సంగీతము. మానవ సృష్టితోపాటు అనేక ప్రాంతాలలో ప్రజల వినోదార్థము పల్లెటూరిపాటలు వెలసినవి. వాటితో మానవజీవితానికి సంబంధించిన సకలవిషయములు కలవు. మానవజీవితమును ప్రతిబింబింపజేయు సాహిత్యము హృదయాకర్షకముగా నుండవలెను. ఈ లక్షణము ప్రబంధములలోకంటె జానపదగేయములలో ఎక్కువ కనిపించును. ఈ జానపదగేయములు వినుటతోనే జానపదుల కవి అవగతమై రసానుభూతిని కలుగజేయును.

ఈ పదములలోని ఇతివృత్తము తరచుగ అలుమగల దాంపత్యము అనురాగము ప్రణయకలహము బాలక్రీడలు స్థానికసంఘటనములు వీరగాథలు, దేశభక్తి పురాణగాథలు- వీటికిసంబంధించి యుండును. ఇవిగాక స్త్రీలపాటలు, గొల్ల సుద్దులు ఎరుకలపాటలు, ఏలపాటలు పడవపాటలు తుమ్మెద పాటలు జక్కులపాటలు జంగంపాటలు దాసరిపాటలు తత్త్వాలుగలవు. బొబ్బిలిపాట పల్నాటివీరచరిత్ర దేశింగురాజు కథ కాటమరాజుకథ మున్నగునవి వీరరసప్రధానములు. రచన రసానుకూలముగ నుండును. వాటినిప్పుడు బుర్రకథలుగామార్చి దేశమందంతటను పాడుచున్నారు. ఢిల్లీ రేడియో కేంద్రమువారు జానపదగేయోత్సవములను ఏర్పరచి వివిధ ప్రాంతాల జానపదములను వినిపించుచున్నారు. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి, చెకుముళ్ల కామేశ్వరరావు, నేదునూరి గంగాధరం మొదలగువారు వీటిని విరివిగా సేకరించి అచ్చువేయించిరి.

తాళ్లపాక అన్నమాచార్యులు గొబ్బిపాటలు అల్లోనేరేళ్లు తుమ్మెదపదాలు చందమామపాటలు మొదలైనవి రచించి సామాన్యజనానికి ప్రియము చేసిరి. ఆ పాటలు పలుకుబళ్లతో అమాయక పల్లెటూరివారల ఆనంద హృదయములను ఆటపట్టు నుండి శాశ్వతమై నేటిమాటలలో మధురాతిమధురముగా నుండును. దేవేంద్రశాస్త్రి కొంతకాలముక్రింద వివిధప్రాంతములు పర్యటించి వాటిని సేకరించిరి. ఎంజమూరి సీతకూడ శ్రమించి రేడియోలో అనేక పాటలను ప్రచారము చేసిరి.

ఈ జానపదగేయములు వట్టి ఊదంపుపాటలు కాక భావ ప్రకటన చేయగలవు. ఇవి అపాతమధురమై పల్లెజనులు తేలికగా పాడగలుగునట్టి ఫణతులుకలవి. కావున వీటిని తేలికసంగీతము లేక సుగమసంగీతమని అనుట అవహాస్యము. అనాదిసిద్ధముగా వచ్చుచున్న సంప్రదాయాలు ఆచారాలు ఆధారముగా జేసికొని నిత్యనూతన కల్పనావకాశములతో ఇవి ఆకర్షకములుగా నుండవలెను. జానపదగానమును సంగీత లక్షణవేత్తలు తమ ప్రాంతముల జానపదభణితులకు ఆయాదేశపుప్రజల అభిరుచులకు అనుగుణముగా రాగలపేరులనుబెట్టి శాస్త్రబద్ధముచేసినారు. ఉదా: పహాడి-పంజాబుకొండలకాపరులు పాడుకొనునవి (2) సౌరాష్ట్ర (3) గుర్జరి (4) కానడ (5) ఆంధ్రిఅనునవి వివిధరాష్ట్రముల పేర్లను ద్యోతకముచేయుచున్నవి.

మధ్యయుగమునాటి సంగీతచరిత్రను పరిశోధించినచో యక్షగానాలలోని దరువులు భక్తిసంప్రదాయానికి చెందిన దరువులు కీర్తనలు జావళీలు ఆనాటివని చెప్పవచ్చును. వాటి సంగీతములోని లాలిత్యముచేత బహుజనాకర్షణముచేత వాటిని లలితసంగీతమన్నారు. నాటినుండి నేటివరకు నిలిచియున్న జానపదగేయరీతులు నిత్యనిర్మలమగు ఊటబావులు. మనదేశము మహారాష్ట్ర పారసీనాటక సమాజములవారి రాకతో మనసంగీతము క్రొత్తపుంతలను త్రొక్కినది. నటులు వాటిని అనుకరించి పాడుచున్నారు. ఉపయసలకు నకళ్లను తయారుచేసి ఘనతనందిచ్చినవారు ధర్మవరం కృష్ణమాచార్య గోపాలాచార్యులు అల్లకచంద్రశేఖరం, చందాలకేశవదాసు, పాపట్ల లక్ష్మీకాంతం ప్రభృతులు.

తదుపరి నవ్యసాహిత్యోద్యమముతో స్వేచ్ఛ, విశ్వమానవసౌభ్రాత్రము ప్రణయము, ప్రకృతిశక్తి ఆదర్శములుగా గైకొని ఆధునిక కవులు రచించిన [illegible]

వచ్చినారు గ్రామొఫోన్ సినిమా రేడియోలద్వారా కవుల గేయరచనలు నూతన సంగీతఫణితులు వరివరివిధాల కొనసాగినవి నాటకపు బాణిలో కూడా కలకత్తా బొంబాయి పంజాబు సినిమాలద్వారా ఆ ప్రాంతపు బాణీలు వాటిలో ఐక్యమైనవి ప్రజాస్వామ్యయుగపు భావాలలో నవ్యచైతన్యోదయమై ప్రజలకు సంగీత పరిణామము అనతికాలములోనే ఆదర్శప్రాయమైనది సినిమాదర్శకులు పారసీక స్పెయిన్ ఆఫ్రికా అమెరికా దూరప్రాచ్య సంగీతపద్ధతుల ననుకరించుకొని క్రొత్తవరుసలను ప్రవేశపెట్టినారు దాని ఫలితముగా నేడు మన స్వత్వములను మనము కోల్పోయినాము

రేడియోలో జానపద గేయాలతోపాటు గీతావళిశీర్షిక క్రింద క్రొత్తపాటలను వినిపించుచున్నారు పాశ్చాత్య గీతాలలో Rock & Roll, రాంబా జాజ్ పద్ధతులు మనలో సంక్రమించి ఒక విచిత్రమైన అవనతిని మనకు కలిగించినమాట రూఢి ఇవి మన దేశీయ జానపదరీతులను నశింపజేయుచున్నవి ఈ సంగీతము శాస్త్రబద్ధమైనదికాక నవనవోన్మేషతో నూతన మిశ్రరాగఫణితులు తయారగుచున్నవి ఈ సంగీతానికి ప్రధానాంశములు భావప్రకటన సాహిత్యనిర్దుష్టత లావణ్యము కనుక ప్రౌఢశాస్త్రీయగానముపై లోకులకు ఉదాసీనభావము రేకెత్తినది పాశ్చాత్యరాగఫణితులను వినగానే మనవారు ముగ్ధులై వాటిననుకరించుచున్నారు క్రొత్తవింత-పాతరోత అను సామ్యము ఈ విషయమున ఎంతయు అన్వర్థము ఈ పాటలను పాడుటకు అనుగుణమగు గాత్రజ్ఞులను వివిధవాద్యసమ్మేళనముగల వాద్యబృందము (Orchestra) ను అమర్చుకోవలెను సాహిత్యమునకు భావమునకు అనుగుణమగు వరుసలు కూర్చవలెను దేశభక్తిగీతాలకు విషాద సంఘటనలకు ఆనందమునుగూర్చుటకు వాడవలసినవాద్యాలు వేర్వేరు - ఈ ఆర్కెస్ట్రాద్వారా సమకూర్చి పాడించినపాటలు ఆనాహ్లాదకరమై సోదరభావమును పెంపొందించును

భారతీయ నాగరకతయొక్క ప్రత్యేకతను వ్యక్తిత్వమును నిలబెట్టవలెననినచో, జానపదుల ఆచారవ్యవహారాలు ఆటపాటలు నశించకుండ కాపాడవలెను నేడు జానపదుల ఆచారవ్యవహారాలు భావాలు వ్యక్తపరచు పాటలు ఎన్నోయున్నవి ఆ పదములు సహజముగా సౌందర్య ప్రాసలు వారి భావశక్తి అపారము అమేయము వారు తరచుగా పాటలలో అప్రయత్నముగా వాడెడి యతిప్రాసలు, వారి అమాయికభావములు ఆధునిక కవులకు మార్గదర్శకములైనవి వారిపాటలలో మూడునాలుగు స్వరాలకన్న ఎక్కువగా కనబడవు కాని వారి హృదయమునుండి వెలువడిన ఆ స్వరసమ్మేళనమే నేటిగాయకుల సంగీతరచనలలో ప్రతిబింబించుచున్నవి

మం రా శా

## లోకమాన్య బాలగంగాధర తిలక్

"స్వాతంత్ర్యము నా జన్మస్వామ్యము దానిని నేను సాధించక మానను!" అని తాను ఉద్ఘోషించుచు తంద్రాళువై తంత్రము నెరుగని భారతజాతిని తానై స్వాతంత్ర్యశంఖమును ఒత్తి మేలుకొల్పి నిర్నిద్ర శుభదమార్గమున నడిపించిన మహామహుడు లోకమాన్య బాలగంగాధర తిలక్

ఈ మహాశయుడు క్రీ శ 1856 జూలై 23వ తేదీన మహారాష్ట్రములోని రత్నగిరి మండలమున తిలక్ కుటుంబమునందు జన్మించెను ఈయన తండ్రిపేరు రామచంద్రతిలక్ అన్యాయము నెదిరించు గుణము బాలగంగాధరునకు ఉగ్గుపాలలో పెట్టినవిద్య ఇతడు చిననాడు పాఠశాలలో చదువుచుండగా తాను చేయని నేరమునకు తనను ఉపాధ్యాయుడు దండించుటను తీవ్రముగ ప్రతిఘటించినాడు అన్యాయదృష్టియు నిర్భయత్వమే క్రమక్రమముగ గంగాధరుని లోకమాన్యునిగ జేసినవి

ఇతడు న్యాయవాది వృత్తిని అవలంబింపవలెనని ఈతని తండ్రి వాంఛితము తండ్రికాంక్షను నెరవేర్చుటకోయన ఇతడు పెద్దవాడైన ఎమ్మట న్యాయవాది పరీక్షలో ప్రథమశ్రేణియందు నెగ్గెను కాని బాలగంగాధరుని మనస్సంతయు ఉపాధ్యాయవృత్తి మీదనే కేంద్రీకృతమై యుండెను ఉపాధ్యాయవృత్తి నవభారత నిర్మాణమునకును సమాజసంస్కరణమునకును అవకాశములు కల్పింపగలదని ఈతని అభిప్రాయము అందుచే అట్టి వృత్తిని అవలంబించుచు ఈతడు మరాఠా అనెడి ఆంగ్ల దినపత్రికను కేసరి అనెడి మహారాష్ట్ర దినపత్రికను నడపజొచ్చెను ఈ పత్రికలు ఆంగ్లేయ ప్రభుత్వమును దాని సామ్రాజ్యవిధానములను అనాడు చెరిగివోయుచుండెడిది కావుననే తిలక్ మహోదయుడన్నను ఈతని పత్రికలన్నను బ్రిటిష్ ప్రభుత్వమునకు కడుపుమంటగా నుండెడిది ఈయన వ్యాసములను ఉపన్యాసములను దేశద్రోహకరములైనవని నిర్ణయించి ఆంగ్లప్రభుత్వము ఈయనను రెండు

చుట ప్రభుత్వ విధేయ ధర్మమనియు తిలక్ తన కేసరి పత్రికలో ప్రభుత్వమును దూయబట్టినాడు. అందులకై ప్రభుత్వము ఇతనిపై రాజద్రోహ నేరమును మోపి అభియోగమును తెచ్చెను. ఆనాడు ప్రతివాదియైన తిలక్ పక్షమున న్యాయవాదిగా పనిచేసినవాడు తరువాతి కాలమున కాంగ్రెసునకును జాతీయ వాదమునకును ప్రబల శత్రువుగా పరిణమించి పాకిస్థాన్ స్థాపనకు బద్ధకంకణుడైన జిన్నాయే! కాగా తిలక్‌పై నేరమును విచారించిన న్యాయాధిపతి ఇతఃపూర్వము ఒక అభియోగములో తిలక్ పక్షము వహించి వాదించిన బారిస్టరే! ఆ ఆంగ్లేయ న్యాయమూర్తి అంత మహాదోషారోపము చేయబడిన అభియోగములో ప్రతివాదికి పూటవెట్ట (జామీను) నిచ్చుటకుపై తము అంగీకరింపలేదు. ఈ సందర్భమున తిలక్ మూడు దినములలో ఇరువదియైదు గంటలు తన పక్షమున స్వయముగ వాదించుకొనెను; ఒకరి దేశమునకు పరదేశస్థులు వచ్చి స్వదేశస్థులపై దేశద్రోహ నేరమును ఆరోపించుటయందుగల యుక్తాయుక్త జ్ఞానమును తిలక్ విమర్శించినాడు. ఏమి వాదించిన నేమిలాభము! వలసరాజ్యస్థాపన కాంక్షకు బాధిర్యము భూషణముకదా! క్రీ శ 1908 జూన్ 24 వ నాడు తిలక్ మహాశయునకు ఆరేండ్ల దండనము విధించి ఈయనను బర్మాయందలి మాండలే కారాగారమునకు పంపుట జరిగినది.

లోకమాన్యుడు గొప్ప సంఘసంస్కర్త కూడ. వధువునకు 16 సంవత్సరములు దాటనిదే వివాహము చేయరాదనియు వరునకు 40 సంవత్సరములు దాటినచో వివాహయోగ్యత ఉడుగుననియు ఈయన విశ్వాసము. ఆ వయస్సు దాటిన పురుషులకు వివాహము అనివార్యమైనచో వారు విధవావివాహమునకు మొగ్గవలెనని కూడ ఈయన వాదము. అతి బాల్యవివాహములు ఆచరణములో నున్న ఆకాలమున తన కొమార్తెలకు ఈయన పదునారేండ్లు దాటినమీదటనే పెండ్లిండ్లు చేసెను.

తిలక్ సంఘసంస్కర్తయే కాదు; మహాగ్రంథకర్త కూడ. ఇతడు గొప్ప భాష్యకారుడు; చెరసాలలో నున్నపుడే భగవద్గీతకు మహారాష్ట్రీ భాషలో భాష్యమును రచించెను. దీనిపేరు గీతారహస్యము. ఇందు ఈతని రాజనీతి వేత్తయు అతివాద తత్త్వము వ్యక్తములైనవి. ఈయన శాస్త్రీయ రాజకీయ జ్ఞాన సంపత్తులకును పాండితికిని ఇది నికషోపలము. దీనిని భారతీయ తత్త్వవేత్తలేగాక ప్రొఫెసర్ మాక్సుముల్లర్ ప్రభృతి పాశ్చాత్య పండితులు కూడ ప్రశంసించినారు. పాశ్చాత్యలోకము తిలక్ మహాశయుని రాజనీతిజ్ఞునిగాకంటె మహాపండితునిగా మిక్కిలి మన్నించినది. 19 వ శతాబ్ది అంతములో ఒకప్పుడు ఆంగ్ల ప్రభుత్వము తిలక్ మహాశయుని రాజద్రోహ నేరము పేరిట చెరయందుంచగా మాక్సముల్లర్ వంటి పాశ్చాత్య పండితులు ఆ ప్రభుత్వమును తీవ్రముగ నిరసించి లోకమాన్యుని విడిపింపుమని విక్టోరియా రాణిని ఒత్తిడిచేయుట చూడగా అది ఇతని పాండిత్యమునందు వారికిగల గౌరవమును బట్టియే జరిగెను.

ఇతడు సాహిత్య గవేషకుడేగాక ఖగోళశాస్త్ర పరిశోధకుడుకూడ. మార్గశీర్షమాసమును గూర్చి ఈయన చేసిన పరిశోధనల ఫలితము పాశ్చాత్యులను ముగ్ధుల నొనర్చినది. ఆర్యులది ఉత్తరధృవ ప్రాంతమనియు వేదములు వారి వాక్కులనియు అవి క్రీ పూ 4 వేలయేండ్లనాటి వనియు ఈయన వాదము.

మాండలే కారాగృహమున తిలక్ ఆరోగ్యము పూర్తిగా చెడిపోయినది. క్రీ శ 1914 లో ఈతడు చెరనుండి విడుదల అయ్యెను. 1916 లో ఈతని షష్ట్యబ్ది సంపూర్తి ఉత్సవము భారతదేశమందంతట భక్తిశ్రద్ధలతో నిర్వహింపబడినది. ఈయనకు భారత ప్రజానీకము లక్షరూప్యముల నిధిని సమకూర్చెను. ఆ నిధిని తిరిగి ఈయన ప్రజాహిత కార్యకలాపముల కొరకే సమర్పించినాడు.

తుదిఘడియ వరకును ఈ మహనీయుడు ప్రజాసేవ మానలేదు; అనారోగ్యమును లక్ష్యపెట్టలేదు. శ్రోత్రపేయముగను తర్కబద్ధముగను జాములకు జాములు సంవాదము సాగింపగల చతురుడీయన. నిర్విరోధ వక్తృత్వము ఒకచెంపయు ఆరోగ్య హైన్యము వేరొక చెంపయు తన ఆయుష్యమును క్రుంగదీయగా ఈయన క్రీ శ 1920 జూలై 31 వ తేది అర్ధరాత్రమున శాశ్వత నిద్రలో మునిగెను. మోతిలాల్ నెహ్రూ మహాత్మ గాంధి వంటి పెద్దలు పెక్కురు ఈయనను ఆ సమయమున చుట్టియే యుండిరి. తన అనంతరము స్వాతంత్ర్యోద్యమనాయకుడు గాంధిమహాత్ముడే కావలెనని ఇతడు వెల్లడించి మరియు కన్నుమూసినాడు. అవసానసమయము వరకును "కాంగ్రెసు-ఆదాయవ్యయములు-సమావేశములు" అని పల్వరించుచునే ఈ మహాశయుడు పరమపదించెను. స్వాతంత్ర్యము

లేని భారతజాతికి మనుగడయే భారమని చింతించుచుండు కూడ కలవరించిన అట్టి దేశభక్తుడును స్వాతంత్ర్య సమరయోధుడును ప్రత్యేకతేజకుడును బ్రిటిష్ ప్రభుత్వ దర్ప భంజకుడును అగు టిళక్ మహాభాగుని నిర్యాణ వార్తా శ్రవణ విగ్నగ్న విషాద సాగరమై భారత జాతి పునరుద్ధరణ ఆశా లతాంకురములను గాఢముట్లు ఎప్పుడు ఎదుర్కొనున్న ఆనాడు దిగ్వలయరటిము శ్రమించును రంగమును అయినది.

నాటినుండియు భారతీయులు తమబిడ్డలకు టిళక్ అని నామకరణ మొనర్చి ఆ మహాశయుని యందు తమకుగల ఆదరాభిమానములను ప్రకటించుకొనుచున్నారు. ఈయన స్వాతంత్ర్య సందేశమునకును మహోజ్వల ఆదర్శములకును అనన్య త్యాగరతికిని అకుంఠిత దేశభక్తికిని నివాళు లర్పించుచున్నారు.

ఈ మహామహుని జీవితమంతయు పరప్రభుత్వముతో ఒకనిరంతర సమరము. బ్రిటిష్ పాలకుల కితడు ప్రక్కలో బల్లెము. ఆంగ్లేయులితనిని అశాంతికి "హేతుభూతు"డని దూషించినారు. ఈతని స్వాతంత్ర్య కాంక్ష వారికి అశాంతి కారణమయ్యెను. లోకమాన్యుడు ఆ దినములలో రాజకీయ చైతన్యజ్వాలకు ఎంతగా ఆజ్యము పోసెనో ఈ దూషణయే చెప్పక చెప్పగలదు. భారతీయుల స్మృతిపథములో లోకమాన్యుడు చిరకాలజీవి.

వి వి శ శ

## లోహమిశ్రమములు

రెండుగాని అంతకంటె ఎక్కువగాని రసాయన మూల ద్రవ్యములు సమ్మిశ్రమైనప్పుడును వాటిలో కనీసము ఒకటైనను లోహధాతువైనప్పుడును లోహమిశ్రమము ఏర్పడును. ఇనుముతో కార్బను మిశ్రితమైనప్పుడు తయారగు ఉక్కు ప్రఖ్యాత లోహమిశ్రమమై యుండును. దానియందుండు కార్బను లోహముకాదు. అదియొక ఉపధాతువు (non metal). అట్లే కంచు మరియొక ప్రసిద్ధిచెందిన లోహమిశ్రమము. అందులో మిశ్రితమగు రాగి తగరములుకూడ లోహధాతువులే. కంచువలెనే ఎన్నియో ఇతర లోహ మిశ్రమములుకూడ సమ్మేళనమగు లోహములకంటె గట్టిగా నుండును. లోహమిశ్రమము తయారైనతర్వాత కొన్నియెడల చర్యలకు పాల్పరచినప్పుడును వేడిచేసి చల్లార్చినప్పుడును అది మరింత గట్టిపడును. ఉదా [illegible] ఎక్కువగును. మోటారు [illegible] బండ్ల [illegible] యొక్క కడ్డీలు) అట్టి [illegible] చేయబడును [illegible].

పోత ఇనుము (cast iron) [illegible] లోహమిశ్రమమే. అందులో ఇనుము కొంతకు పాటు కార్బను కలిసియుండును కాని దానిని [illegible] లోహమిశ్రమమని భావించరు. ఇది [illegible] లో ఉక్కయందు కంటె అధికముగా కార్బను కలిసియుండుటయు అది లోహ మిశ్రమమని మనలో కలుగుతున్న కారణములు. స్వచ్ఛమైన వెండి బంగారములు గట్టిగానుండవు. నగలలో వాడబడు 18 కేరట్ల బంగారములో 75 శాతము మాత్రమే బంగారముండును. మిగిలిన 25 శాతములో సగము రాగియు సగము వెండియు కలిపినచో అట్టిబంగారము [illegible] గట్టిగానుండుటయేకాక దానిని కావలసిన నగరూపములో తీర్చి దిద్దుకోవచ్చును. సమపాళ్లలో రాగి అల్యూమినియములు కలిసిన లోహమిశ్రమము చాలగట్టిగనుండును. దానికి దెబ్బ తగిలినచో ముక్కలగును. అల్యూమినియములో 12 శాతము రాగి కలిసినను రాగిలో 18 శాతము అల్యూమినియము కలిసినను లభించు లోహమిశ్రమములు చాల ఉపయోగకరముగనుండును. అందుచే లోహ మిశ్రమముల తయారీలో లోహములకే కాక వాటి పాళ్లకు కూడ ప్రాధాన్య మెక్కువయుండును. "అధికస్య అధికంఫలం" అను సూత్రము లోహమిశ్రమ కల్పనలో వర్తించదు. లోహమిశ్రమములన్నియు కేవలము మిశ్రమములుకావు. ఒకలోహ ధాతువు మరొక లోహధాతువుతో సంయోగమై ధాత్వంతర యౌగికములు (Intermetallic Compounds) తయారగుట చూచుచున్నాము. ఒకప్పుడు ఆ ధాత్వంతర యౌగికములు అల్పప్రమాణములో తయారై మరొక ధాతువులో మిశ్రితమ్ము కావచ్చును. కావున లోహమిశ్రమములన్నింటిని, (1) కేవల మిశ్రమములు (2) ధాత్వంతరయౌగికములు (3) ధాత్వంతర యౌగికలోహమిశ్రమములు అని స్థూలముగా మూడు తరగతులుగా భాగించవచ్చును. లోహములయొక్క లోహమిశ్రమములయొక్క నిర్మాణమును X-కిరణ శోధనమువలన ఒక లోహముయొక్క పరమాణువులు మరొక లోహపు [illegible] చట్రములో ఎట్లున్నచో [illegible]

ఒకదానిసరసన మరొకటి ఉన్నవా? అను విషయములను తెలిసి కొనవచ్చును ధాతవ్యంతరయోగికము లేర్పడునా? లేక లోహమిశ్రమములోనున్న ధాతువులొకదానితోనొకటి పరస్పరద్రావణమగునా? అను విషయములను లోహమిశ్రమమును కరగి అది క్రమముగా చల్లారునప్పుడు ఏరీతిగా ఉష్ణోగ్రత మారుచున్నదో శాస్త్రజ్ఞులు పరిశీలించి తెలిసికొనగల్గుచున్నారు

1931° F ఉష్ణోగ్రతలో కరగు రాగి 786° F ఉష్ణోగ్రతలో కరగు జింకుతో కలిసియుండు లోహ మిశ్రమములను తయారుచేయవలెనన్నచో రాగి కరగునప్పటికి జింకు ఆవిరై పైకిపోవునేగాని ఇత్తడి తయారుకాదు ముందు రాగిని కరగి అవసరమైన జింకుకంటె ఏక శాతము ఎక్కువగా కలిపి ఇత్తడిని తయారుచేయుదురు అల్యూమినియము-రాగి మిశ్రమములను తయారుచేయుటలో కూడ ఇట్టిసమస్య ఎదురగును యుక్తితో ఇట్టి సమస్యలను పరిష్కరించి ధాతుసాధకులు ఉపయుక్తములైన కంచు ఇత్తడి రకరకముల ఉక్కులు మొదలైన పెక్కు లోహమిశ్రమములను తయారుచేసి అది విజ్ఞాన శాస్త్రమే కాక కళవంటిదనికూడ వారు ప్రత్యక్షముగ ప్రదర్శించినారు

హ ఆ

## లోహములు :

క్రోమియము మాంగనీసు కోబాల్టు నికెలు మొదలైన లోహధాతువులు ఆధునికయుగములో ఇనుము తరువాత తత్తుల్య ప్రాముఖ్యముగలవి వాటినిగూర్చి సంగ్రహముగా తెలిసికొందము

క్రోమియము పరమాణుసంఖ్య 24 పరమాణు భారము 52 01 గల రాసాయనిక మూలద్రవ్యమిది క్రోమైటు లేక క్రోమ్ఐరన్ స్టోన్ అను ఖనిజరూపములో ఇది ఎక్కువగా లభించును ప్రపంచములో ఏడాదికి 12 5 లక్షల టన్నుల క్రోమియము తయారగుచున్నదనియు అందులో ఎక్కువ భాగము ఉక్కుతయారీలో వినియోగ మగుచున్నదనియు తెలియుచున్నది భారతదేశములో కృష్ణాజిల్లా బీహారురాష్ట్ర)మందలి సింగభూమి మహారాష్ట్రములోని భండారా రత్నగిరి జిల్లాలు ఒరిస్సాలోని కటక్, కెయోన్ ఝార్, ఢెంకనాల్ జిల్లాలు ఈ ఖనిజ సేకరణమునకు ఉనికిపట్టులు భారతదేశమునకు ఏడాదికి ముప్పదివేల టన్నుల ఫెర్రోక్రోమ్ అవసరము అదికాక 12 వేల 500 టన్నుల క్రోమేటు లవణములు అగ్నిసహనశీల పదార్థముల తయారీకిని రంగుల తయారీకిని అవసరము ఆంధ్రదేశమందలి రివిడి ఒరిస్సా యందలి జాజిపూరు రోడ్డు ప్రాంతములతో ఫెర్రోక్రోము యంత్రాగారములున్నవి పశ్చిమబెంగాలులోని దుర్గాపూరులో క్రోమియము ఉక్కును తయారుచేయుట కేర్పాటు జరుగుచున్నది అందుచే భారతదేశమునకవసరమగు క్రోమియము ఉక్కును ఇచ్చటనే అచిరకాలములో తయారుచేసికొను అవకాశము కలదు

క్రోమియము ధాతుసాధన గోల్డ్ ష్మిట్ థెర్మిట్ విధానమునుసరించి క్రోమియము ధాతుసాధనము కొనసాగించబడుచున్నది క్రోమియము క్సైడును అల్యూమినియము పొడరుతో బాగుగా కలిపి ఆమిశ్రమమును ఒక లోహపుపాత్రలో గ్రహించెదరు ఆ పాత్ర మధ్యలో బేరియము పెరాక్సైడు మెగ్నీషియము కలిసిన మిశ్రమము ఒక గొట్టములో నిక్షేపించెదరు ఆ మిశ్రమమును దూరమునుండి వెలిగించుటకై దానిలో ఒక మెగ్నీషియము తీగనుంచెదరు మెగ్నీషియము తీగె చివర నిప్పు అంటుకొనగానే అది సురసుర మండి క్రమముగా గొట్టమందు గల లోహపు పాత్రలోని మిశ్రమముకూడ మండను అప్పుడు



$$Cr_2\,O_3 + Al \rightarrow 2\,Cr + Al_2\,O_3$$

అను రసాయనక్రియ కొనసాగినందున క్రోమియము ఏర్పడి మహోష్ణస్థితిలో కరగి ఇతరపదార్థములనుండి వేరగును స్వచ్ఛమగు క్రోమియమును ఎలెక్ట్రాలిటిక్ విధానమువలన సాధించి ఎలెక్ట్రో ప్లేటింగులోను ఉక్కుతయారీలోను ఉపయోగించుచున్నారు

క్రోమియము యౌగికములలో పొటాసియము సోడియము క్రోమేటులు డై క్రోమేటులు క్రోమ్ఆలమ్ అనునవి ముఖ్యమైనవి క్రోమేటులను క్రోమేటుఖనిజములను అనుకూలమైన ఆల్కలీఆక్సీకరణులతో కలిపి విశాలమైన రివెర్బరేటరీ ఫర్నేసులో వేడిచేయుదురు అప్పుడు



$$4\ FeO\ Cv_2\ O_3 + 8-KOH + O_2 \rightarrow 4\ K_2\ Cv\ O_4 + 2\ Fe_2\ OH^3\ H_2O$$

అను రసాయనక్రియ సాగును తత్ఫలముగ లభించు పసిమి ధూమ్రవర్ణములుగల పదార్థమును నీటిలో గ్రహించి వడపోసి ద్రావణమును స్ఫటికీకరించునప్పుడు పొటాసియము క్రోమేటు లభించును దానినుండి బేరియము లవణములతో ద్వియోగక్రియ

గను బేరియము క్రోమేటును లెడ్ లవణములతో ద్వియోగ క్రియవలన క్రోమ్‌పసుపును క్రోమ్‌ఎరుపును అనబడు మంచి వూతరంగు పదార్థములుగా ఉపయోగించుచున్నారు

పొటాసియము క్రోమేటు ద్రావణమునకు సల్ఫ్యూరిక్ ఆమ్లమును కలిపినప్పుడు



$$2\,K_2CrO_4 + H_2SO_4 \rightarrow K_2Cr_2O_7 + H_2O + K_2SO_4$$

అనుచర్య కొనసాగగలదు అంశిక స్ఫటికీకరణము వలన ముదురు నారింజరంగుగల పొటాసియము డై క్రోమేటు స్ఫటికములను పొటాసియం సల్ఫేటునుండి వేరుచేయ గ్రహింపవచ్చును. అది మంచి ఆక్సీకరణిగా ఉపయోగపడుచున్నది జలయుత సల్ఫ్యూరిక్ ఆసిడ్ సమక్షములో దానిని ఆక్సీకరణిగా వాడినప్పుడది ఆక్సిజనిని కోల్పోవుటయు పొటాసియము క్రోమియము సల్ఫేటుల మిశ్రమద్రావణ మేర్పడుటయు జరుగును ఆ ద్రావణ మిశ్రమమును స్ఫటికీకరించినప్పుడు క్రోమ్‌ఆలమ్ లభించును పశువులచర్మము బిరుసెక్కకుండునట్లు మృదువుగ నుండు క్రోముచర్మముగా పదునుచేయుటకై క్రోమ్ ఆలమ్ వాడబడుచున్నది ఇతర క్రోమియము యౌగికముల తయారీలోకూడ అది సహాకరించగలదు

**మాంగనీసు** ఇది పరమాణుసంఖ్య 25 పరమాణుభారము 54 94 గల రాసాయనిక మూలద్రవ్యము పైరోలుసైట్ అను పేరుగల ఆక్సైడుఖనిజము ముఖ్యమైనది ప్రపంచములో ఏడాదికి 60 లక్షలటన్నుల ఖనిజము సేకరింపబడుచున్నదనియు అందులో సగటున 35 శాతము మాంగనీసు ఉండుననియు అంచనా వేయబడినది ఆంధ్రదేశములో శ్రీకాకుళము విశాఖపట్టణంజిల్లాలు మహారాష్ట్రములో భండారా నాగపూరుజిల్లాలు ఒరిస్సాలో గంజాము కోరాపుట్ జిల్లాలు ఈ ఖనిజసేకరణమునకు ప్రసిద్ధిచెందినవి ఈ రాష్ట్రములలోని ఏడు ఫ్యాక్టరీలలో ఫెర్రోమాంగనీసు తయారగుచున్నది భారతదేశములోలభించు ఖనిజములో మలినపదార్థములను కొంతవరకు తొలగించి 12 5 లక్షల టన్నుల ఖనిజమును ప్రతిసంవత్సరము విదేశముల కెగుమతి చేయుచున్నారు కొంతవరకు మలిన నిర్ముక్తమైన ఖనిజమును బ్యాటరీసెల్సు నిర్మాణములో ఉపయోగించుచున్నారు

**ధాతుసాధన** మాంగనీసు ధాతుసాధనము రెండు విధములుగా కొనసాగించవచ్చును (1) మాంగనీసు డయాక్సైడును కార్బనుతోకలిపి కాల్చినప్పుడు లభించు ట్రైమాంగనీసు టెట్రాక్సైడును మరికొంత కార్బనుతో ఎలెక్ట్రిక్ ఫర్నేసులో వేడిచేసి ఆక్సీకరణ మొనర్చుట (2) ఆ మాంగనీసు ఆక్సైడునే థెర్మిట్ విధానమును అనుసరించి అల్యూమినియము పొడరుతో ఆక్సీహరణ మొనర్చుట రాగి జింకు మాంగనీసు కలిసిన లోహమిశ్రమమే మాంగనీసు ఆనబడును మాంగనీన్ అను పేరుతో రాగి మాంగనీసు నికెలుకలిసియున్న మిశ్రమ మొకటి విద్యుత్ ప్రసార నిరోధకపు తీగెల కుపయోగపడు చున్నది మాంగనీసు ఉక్కు చాలాగట్టి పదార్థము రాళ్ళను పిండికొట్టుట కుపయోగపడు క్రషర్ల నిర్మాణములోను ముక్కలుచేయుట కుపయోగపడు దవడల ఆకారముగల యంత్రనిర్మాణములోను మాంగనీసుఉక్కు వాడబడుచున్నది ఫెర్రోమాంగనీసులో 70-80 శాతము మాంగనీసు 0 8 శాతము కార్బను కలిసియుండును స్పీజెల్ ఐజెనులో 20-32 శాతము మాంగనీసు మమారు 0 8 శాతము కార్బను కలిసియుండును ఈ రెండుమిశ్రమములు ఉక్కు తయారీలో కార్బను ప్రమాణమును లెక్కప్రకారము కలుపుటకు సహాకరించును

మాంగనీసు తెల్లగానుండును పెళుసుగను గట్టిగను ఉండు ఈ పదార్థము 1260°C వేడిలో కరగి ద్రవమగును మాంగనీసు లవణములలో పొటాసియము పెర్మాంగనేటు మంచి ఆక్సీకరణిగాను క్రిమిహారపదార్థముగాను పుక్కిలించుట కుపయోగపడు ద్రావణముగాను వాడబడును పొటాసియము హైడ్రాక్సైడును పైరోలుసైటును గాలి బాగుగా చొరబారునట్లు వేడిచేసినచో ఆకుపచ్చరంగుగల మాంగనేటు తయారగును దానిని నీటిలో ద్రావణమొనర్చి కార్బను డయాక్సైడును ప్రసరింపజేసినప్పుడు పొటాసియము పెర్మాంగనేటు ఏర్పడును ఆ ద్రావణమును వడబోసి అంశికస్ఫటికీకరణమువలన ఇతర పదార్థములనుండి వేరుపరచి స్ఫటికీకరించినప్పుడు మిలమిలమెరయు ముదురుగులాబీరంగు సూదుల వంటి స్ఫటికములు లభించును అవి ప్రయోగశాలలలో ఆక్సీకరణులుగాను వైద్యములో ఔషధములుగాను ఉపయోగపడుచున్నవి

**కోబాల్టు** పరమాణుసంఖ్య 27 పరమాణుభారము 58 94 గల ఇదియొక రాసాయనిక మూలద్రవ్యము కోబాల్టు నికెలు ఐరన్ ఆర్సెనైడులు కలిసియున్న స్మాల్టైటు[illegible]

కోబాల్టుగ్లాన్స్ అను ఖనిజము ఆర్సెనేటు రూపములో కోబాల్టు బ్లూమ్ అను ఖనిజము రజితఖనిజములలో మలినముగను కోబాల్టు లోహధాతువు లభించును ఈ ఖనిజములనుండి ఏడాదికి సుమారు నాల్గువేల టన్నుల కోబాల్టు ప్రపంచమంతటిలో తయారగుచున్నది భారతదేశములో ఈ లోహధాతువు ఏమియు తయారగుటలేదు కాని మున్ముందు ఖేత్రి సిక్కిమ్ రాగిఖనిజములనుండి మలినరూపములో ఈ లోహ సాధన చేయు అవకాశములున్నవి

**ధాతుసాధన** ఖనిజములను వాయుసంపర్కములతో కాల్చినప్పుడు కోబాల్టు ఆక్సైడు లభించును దానిని హైడ్రోజని వాయుసంపర్కములతో కాల్చినప్పుడు జరుగు ఆక్సీహరణ క్రియవలన కోబాల్టు లభించును కోబాల్టు వెండివలె తళతళలాడు గట్టిలోహము ఇది మాగ్నెట్ చే ఆకర్షితమగును 35 శాతము కోబాల్టుగల ఉక్కుతో అత్యుత్తమమైన మాగ్నెట్ తయారు కాగలదు క్రోమియము టంగ్‌స్టన్ కోబాల్టులు గల స్టెలైట్ అను లోహమిశ్రమము అతిగట్టిగను రసాయన ద్రవ్యములచే చెక్కుచెదరనిదిగను అగుటచే శస్త్రచికిత్సోపకరణముల నిర్మాణములో దీనిని వాడుచున్నారు ఫెస్టెల్ షెటల్ అనునది మరియొక కోబాల్టు మిశ్రమలోహము అందులో కోబాల్టు క్రోమియము ఇనుము కలిసియుండును దానితో ఎలెక్ట్రిక్ హీటర్లయందలి తీగెలను భోజనపాత్రలను చెంచాలను ఫోర్కులు మొదలగువాటిని తయారు చేయుచున్నారు కోబాల్టు క్రోమియము మొలిబ్డినములు కలిసియున్న మరియొక ధాతుమిశ్రమము దంతవైద్యములో వెండి బంగారముల బదులు వాడుకయందున్నది విరిగిన ఎముకల బదులు దీనితో పోతపోసిన శరీరభాగములను తయారుచేసి శస్త్రచికిత్స సల్పి అమర్చబడుచున్నవి రేడియో ఆక్టివు కోబాల్టును కాన్సరు చికిత్సలోను సయనో కోబాల్ ఎమీను (విటమిన్ బి 12) దేహపోషక పదార్థముగను కోబాల్టు యౌగికములు నీలిరంగు పింగాణి గాజుతయారీలోను సాంకేతిక సమాచారమును రహస్యముగా తెలియచేయుటకు వాడబడు సిరాలలోను ఉపయోగింపబడుచున్నవి

**నికెలు** ఇది పరమాణుసంఖ్య 28 పరమాణుభారము 58 71 గల రసాయన మూలద్రవ్యము నికెలు కోబాల్టుతో పాటు స్మాల్టైటుఖనిజములోను తెల్లని నికెలు ఖనిజముగా ఆర్సెనైడు నికెలుగ్లాన్స్ నికోలైట్ ఖనిజముల రూపములో లభించుచున్నది ప్రపంచములో ఇది ఏడాదికి 110 వేల టన్నుల వరకు తయారగుచున్నది భారతదేశములో నికెలు ఇతర ఖనిజములతో కలిసి బీహారు రాజస్థాన్ కాశ్మీరు మణిపూరు మైసూరు ఒరిస్సా మహారాష్ట్రములలో లభించుచున్నది కాని మనకవసరమైన నికెలు ఇతరదేశములనుండియే దిగుమతి యగుచున్నది

**ధాతుసాధన** నికెలు ధాతుసాధన మాండ్ విధానము ననుసరించి జరుగుచున్నది ఖనిజమును బాగుగా కాల్చినపుడు లభించు మట్టిలో రాగి నికెలు గంధకము ఇనుము కలిసి యుండును దానిని 400° వరకు వేడిచేసి వాటర్ గ్యాసును అంతే పరిమాణములో కార్బనుమొనాక్సైడు హైడ్రోజని ఇంధనవాయు మిశ్రమమును పంపుదురు తత్ఫలితముగా నికెలు తయారగును మిగిలిన ఇనుపలోహము ఆక్సైడుగనే ఉండును అప్పుడుదానిని 60° వేడియందుంచి కార్బన్ మొనాక్సైడు ప్రసారమొనర్చెదరు నికెల్ కార్బొనైల్ అను ద్రవపదార్థము తయారై ఆవిరిరూపములో బయటికివచ్చును తరువాత దానిని 150°-180° వేడిగానున్న గొట్టములద్వారా పంపునప్పుడు వియోగముచెంది నికెలు తయారగును కార్బను మొనాక్సైడును తిరిగి తిరిగి ఉపయోగించెదరు

ఎలెక్ట్రాలిక్ విధానమువలన స్వచ్ఛమైన నికెలు లభింపగలదు నికెలుకూడ మాగ్నెట్ వలన ఆకర్షింపబడు లోహమే ఇదికూడ తెల్లగా తళతళలాడుచుండును దీనికి బాగుగా మెరుగుపెట్టవచ్చును అందుచే నికెలు ప్లేటింగులో ఇది ఉపయోగపడుచున్నది ఆల్కలీల చర్యవలన దీనిలో మార్పు కలుగదు కావున ప్రయోగశాలలలో నికెలుమూసలు ఉపయోగింపబడుచున్నవి నికెలు చూర్ణస్థితిలో నున్నప్పుడు తైల పదార్థములతో హైడ్రోజని సంయోగించు రసాయన క్రియను ఉత్తేజింపచేయును నికెలు ఉక్కులో 25 శాతముండును 75 శాతము రాగితో కలిసియున్న క్యూప్రో నికెలు మిశ్రమలోహము నాణెముల తయారీలో విరివిగా ఉపయోగపడుచున్నది నికెలు క్రోమియము ఇనుముగల నిక్రోము అను మిశ్రమముయొక్క ద్రవీభవన ఉష్ణోగ్రత చాలఎక్కువ దానిని విద్యుత్సాధనములలో వాడుచున్నారు రాగి నికెలు జింకుకలిసిన మరియొక మిశ్రమలోహము జర్మను వెండి అను పేర వెండికంటె చవుకగా నుండుటవలన గృహోపకరణముల నిర్మాణములో అది ఉపయోగింపబడుచున్నది హ ఆ

## లౌడ్‌స్పీకరు

లౌడ్‌స్పీకరు శబ్దపౌనఃపున్యమునకు చెందిన ఆవర్తి విద్యుత్ప్రవాహమును శబ్దతరంగముగ మార్చును. ఈ విధముగ ఇది మైక్రోఫోను చేయుకార్యమునకు వ్యతిరేకముగ వ్యవహరించును. లౌడ్‌స్పీకర్లను నాలుగు రకములుగ విభజించవచ్చును (1) విద్యుద్గతి లౌడ్‌స్పీకరు (2) విద్యుదయస్కాంత లౌడ్‌స్పీకరు (3) విద్యుత్‌స్థితి లౌడ్‌స్పీకరు (4) స్ఫటికమును ప్రయోగించు లౌడ్‌స్పీకరు. ఆకృతినిబట్టి వీటిని రెండు విధములుగ విభజించవచ్చును (1) శృంగాకార లౌడ్‌స్పీకరు (2) శంఖువు ఆకృతిగల లౌడ్‌స్పీకరు. నడిపెడి విధానమునుబట్టి విద్యుద్గతి లౌడ్‌స్పీకరును కదలెడి తీగచుట్ట లౌడ్‌స్పీకరు అనియు కదలెడు ఇనుప లౌడ్‌స్పీకరు అనియు విభజింపవచ్చును. లౌడ్‌స్పీకరు ఏరకమునకు చెందినదైనను శబ్దపౌనఃపున్యమునకు చెందిన ఆవర్తి విద్యుత్ప్రవాహములు డయాఫ్రమును మారెడి యాంత్రికబలములో ముందుకును వెనుకకును నెట్టును. ముందువెనుకలకు కదలెడి డయాఫ్రము వాయు యానకములో శబ్దతరంగములను కలుగజేయును.

**శృంగాకార లౌడ్‌స్పీకరు** ఇందు పొడవైన శృంగాకారపు గొట్టము ఉపయోగింపబడును. డయాఫ్రము చిన్నదైనను పొడవైన గొట్టములోని వాయుస్తంభము ద్వారా శబ్దము అధికమగుటకు అవకాశముండును. విద్యుత్ప్రవాహబలము స్వల్పముగ నున్నను డయాఫ్రము ఎక్కువ శబ్దమును కలుగజేయుటవలన ఈ లౌడ్‌స్పీకరును ఉపయోగించుట లాభదాయకము. శృంగము ఎక్స్‌పోనెన్షియల్ వక్రరేఖను పోలియుండును. ఆకృతి ఈ విధముగ నుండకపోయినచో అందుండివెలువడు శబ్దము వికృతముగ నుండును.

**శంఖువు ఆకారముగల లౌడ్‌స్పీకరు** ఇందు డయాఫ్రము శంఖువు ఆకారములో నుండును. పరిమాణము పెద్దదిగ నుండి ఎక్కువ ఘనపరిమాణము గల్గిన వాయువునందు ఇది శబ్దప్రకంపనములను కలిగించును. డయాఫ్రము ముందు వెనుకలనుండు వాయువును వేరుచేయుటకు లౌడ్‌స్పీకరును 'బాఫల్' బోర్డుకు బిగించెదరు. పేపరు లేదా మిశ్రమ అల్యూమినియము రేకుతో డయాఫ్రము చేయబడును.

నేడు సాధారణముగా విద్యుద్గతి లౌడ్‌స్పీకర్లే విరివిగా వాడుకలోనున్నవి. ఇవి నడచెడి విధానము కదలెడి తీగచుట్ట లేక కదలెడి ఇనుముపై ఆధారపడియుండును. ప్రప్రథమమున కదలెడి ఇనుప లౌడ్‌స్పీకర్లు వాడుకలోనికి వచ్చినవి. ఇవి తక్కువ సునిశితత్వము కలిగియుండి తక్కువ శబ్దపౌనఃపున్యములను పునరుత్పాదించుటయందు సామర్థ్యము లేనట్టివి. వీటి వాడకము కదలెడి తీగచుట్ట లౌడ్‌స్పీకరు ఆచరణములోనికి వచ్చిన నాటినుండియు తగ్గిపోయినది. కదలెడి తీగచుట్ట లౌడ్‌స్పీకర్లు అధికమైన సునిశితత్వమును కలిగియున్నవి. కదలెడి తీగచుట్ట లౌడ్‌స్పీకరు ఇది చిత్రపటములో చూపబడినది.

చిత్రము 18

పటము 1

శృంగాకార లౌడ్ స్పీకరు

చిత్రము 19

పటము 2

శంఖువు ఆకృతిగల స్పీకరు

మిక్కిలి సన్ననైన తీగ యొకటి స్థూపాకార గొట్టముపై చుట్టబడియుండును దీనిని శబ్దసర్పిలము (Voice Coil) అనియందురు అది ముందుకు వెనుకకు 5 అంగుళమునుండి 5 అంగుళము దూరము వరకు కదలుచుండును ఏ దిశయందును అది కదలిక వెంగ నేరదు అది శాశ్వత అయస్కాంత క్షేత్రము నందుగాని లేదా విద్యుదయస్కాంత క్షేత్రము నందుగాని అమర్చబడి యుండును దీనివి అయస్కాంత ఘటము యిదురు క్షేత్రము వ్యాసార్థముగనుండి తీగచుట్ట పైగల ప్రతిబిందువునకును లంబముగనుండును ఈ తీగచుట్ట గుండా విద్యుత్ప్రవాహము సాగునపుడు విద్యుద్గతి బలము వలన ప్రవాహ తలమునకు లంబముగను క్షేత్రపు దిశలో ముందునకును వెనుకకును కదలుచుండును ఆవర్తి విద్యుత్ప్రవాహము సాగుచుండునపుడు తీగచుట్ట ప్రకంపన చలనమును పొందుచుండును తీగచుట్ట డయాఫ్రమునకు స్థిరముగా బిగించబడి యుండుటచే డయాఫ్రము అదేచలనము పొంది వాయుయానకములో అదే శబ్దపౌనఃపున్యమును ఉత్పాదనము చేయుచుండును తీగచుట్ట ఎల్కు, తోలు మొదలగు ఉంగరపు వలయములవలన డయాఫ్రము స్వేచ్ఛగా వ్రేలాడుచుండును కేంద్రీయ మధ్యగూడు వలన అక్షీయచలనము మాత్రమే కలుగును

స్వేచ్ఛగా వ్రేలాడదీయుట వలన డయాఫ్రము ఎక్కువ చలనమును పొందుట ముఖ్యముగ గమనింపదగినట్టి లాభదాయకమైన విషయము అల్పశబ్దపౌనఃపున్యములను ఉత్పాదన చేయుటలోగూడ పనితత్వము గోచరించుచుండును

కదలేడి ఇనుప లౌడ్‌స్పీకరు ఇందు చిన్నదియు తేలిక పాటిదియునగు మెత్తని ఇనుప ఆర్మేచరు శాశ్వత అయస్కాంత క్షేత్రమునందు వ్రేలాడదీయబడి డయాఫ్రమునకు లౌడ్‌స్పీకరు అంటియుండును అయస్కాంత యోక్ (yoke) చుట్టును తీగచుట్టబడియుండి చివరభాగిములు లౌడ్‌స్పీకరు కొనలకు కలుపబడియుండురు

లౌడ్‌స్పీకరు చుట్టగుండా శబ్దపౌనఃపున్యతరగతికి చెందిన ఆవర్తి విద్యుత్ప్రవాహములు సాగునపుడు అయస్కాంతక్షేత్రములో మార్పులు కలుగును అయస్కాంతక్షేత్రములోని మార్పులు ఇనుప ఆర్మేచరుపై ప్రయోగింపబడు బలములో మార్పులను కలిగించును దాని వలన డయాఫ్రము ప్రకంపనములను పొందును వాయుయానకములో శబ్దము ప్రవృద్ధిచెందును

హ ల

## వంగదేశ చరిత్ర

బెంగాలు అనబడు ప్రాంతము చరిత్రాత్మకముగా వంగదేశమని ప్రసిద్ధిగాంచినది వంగీయులు వివిధ జాతులకు చెందినవారు వీరు ముఖ్యముగా ద్రావిడ (లేక ఆస్ట్రోలాయిడ్) మంగోలియన్ ఇండో-ఆర్యన్ జాతుల సమ్మేళనము అంగ వంగ పుండ్ర కళింగ సుహమదేశముల ప్రజలు దీర్ఘతమయను ఋషికిని ఒక అసురస్త్రీకిని కలిగిన సంతానమని చెప్పు పురాణ గాథ కలదు

ఐతరేయబ్రాహ్మణమందు పుండ్రులు ఆంధ్రులు శబరులు అనార్యులనియు దస్యుజాతికి సంబంధించినవారనియు పేర్కొనబడెను

గ్రీకు విజేతయగు అలెగ్జాండర్ భారతదేశముపై దండయాత్రగావించిన కాలమున ప్రాశ్చి గంగారిడై అనురాజ్యములు దిగువ గంగానదీ పరీవాహక ప్రదేశమున యున్నట్లు గ్రీకు చరిత్రకారులవలన తెలియుచున్నది ఈ రెండు రాజ్యములకు రాజు జాండ్రేమ్స్ లేక అగ్రేమ్స్ అనువాతడు నందవంశమునకు చెందిన మహాపద్మనందుడును జాండ్రేమ్స్‌ను ఒకరే యని చరిత్రకారు లభిప్రాయపడిరి వంగరాష్ట్రము అశోకుని సామ్రాజ్యమందు అంతర్భాగముగా నుండెను వంగదేశ భాగములైన పుండ్రవర్ధన సమతాత, తామ్రలిప్త కర్ణసువర్ణలలో పెక్కు అశోకస్తూపము లున్నట్లు హుయన్‌త్సాంగు అను చైనా యాత్రికుడు పేర్కొనెను

మౌర్యరాజుల పతనానంతరము తిరిగి గుప్తులు ప్రాబల్యములోనికి వచ్చినంతవరకు గడచినకాలములో వంగదేశ చరిత్ర మృగ్యము సముద్రగుప్తుని అలహాబాదు శిలాస్తంభ శాసనము వలన గుప్తరాజుల ఆధిపత్యము వంగదేశమునందు ఏర్పడినట్లు తెలియుచున్నది రెండవ చంద్రగుప్తుని కాలమందును మొదటి కుమారగుప్త స్కంధగుప్తుల కాలమందుకూడ వంగదేశము గుప్తుల అధికారమునకు లోనయి ఉన్నది

గుప్తసామ్రాజ్య విచ్ఛిన్నానంతరము (క్రీ శ 6 వ శతాబ్దము) చరిత్రగతి అస్పష్టముగనున్నది గౌడరాజులలో నరేంద్రుడని బిరుదుగాంచిన శశాంకుడు ప్రసిద్ధికెక్కినవాడు ఇతడు ఒరిస్సాపై తన ఆధిపత్యమును క్రీ శ 602 లో స్థాపిం

చెను. ఇతడు కుతంత్రము పన్ని స్థానేశ్వరపురాజైన రాజ్యవర్ధనుని ఒక సమావేశమునకు రప్పించి ఒంటరిగా నిరాయుధుడైయున్న యాతనిని చంపించెను. రాజ్యవర్ధనుని సోదరుడైన హర్షవర్ధనుడు స్థానేశ్వరమునకు రాజై శశాంకుని సైన్యములను కనోజ్ నుండి పారద్రోలెను. కాని హర్షుడు వంగదేశముపై కావించిన దాడులను గౌడరాజు జయప్రదముగా తట్టుకొనగల్గెను. శశాంకుడు పవిత్రమైన బోధివృక్షమును సమూలముగా నరకి వేసినట్లును పాటలీపుత్రమునందలి బుద్ధుని పాదచిహ్నములను ధ్వంసముచేసినట్లును హుయన్ త్సాంగ్ వలన తెలియుచున్నది. శశాంకుడు తన నాణెములపై నందిని చిహ్నముగ వాడుటచే అతడు శైవమతస్థుడని భావింపవచ్చును. శశాంకుడు క్రీ శ 637 లో మరణించిన పిమ్మట వంగప్రాంతము హర్షవర్ధనుని పాలనక్రిందికో లేక కామరూపరాజైన భాస్కరవర్మ పరిపాలనలోనికో వచ్చియుండవచ్చును. ఆ తరువాత పాలవంశ రాజ్యస్థాపనకు పూర్వము ఆ ప్రాంతమునందు అరాచకపరిస్థితు లేర్పడినట్లు తారానాథుడను టిబెట్ చరిత్రకారునివలన తెలియుచున్నది. క్రీ శ 7, 8 శతాబ్దములలో నేపాలుదేశస్థులయిన ఖడ్గవంశీయులును రెండవ గుప్తవంశమునకు చెందిన ఆదిత్యసేనుడు మొదలగువారును సుర వంశమునకు చెందిన ప్రాంతీయ రాజులును కామరూపరాజులును వంగదేశమందలి పలుప్రాంతములలో పరిపాలనము చేసిరి. ఈ కాలముననే పెక్కు విదేశ రాజులు గౌడరాజ్యముపై దండెత్తిరి. కనోజ్ రాజగు యశోవర్మన్, కాశ్మీరరాజైన లలితాదిత్యుడు, జయపీడ యను మరియొక కాశ్మీరరాజు ఇట్లు దండయాత్రలు జరిపిన వారిలో ముఖ్యులు.

**పాలవంశపురాజులు :** వంగదేశమును పాలించిన గోపాలుడను పాలవంశపురాజు క్రీ శ 750-60 ల మధ్య రాజ్యమునకు వచ్చెను. అతని అధికారము మగధరాజ్యముపై కూడ విస్తరించెను. అతని తరువాత 8 వ శతాబ్దిఅంతమున ధర్మపాలుడు ప్రభువై 64 సంవత్సరములు రాజ్యమేలి సామ్రాజ్యమును వృద్ధిచేసెను. ఇతడు కనోజ్ ను కొంతకాలమాక్రమింపగల్గెను. ధర్మపాలుని కాలమున పాటలీపుత్రము తన ప్రాచీనౌన్నత్యమును కొంతవరకు తిరిగి సంపాదించుకొనెను. ఇతడు 'విక్రమశిల'యను నొక విశ్వవిద్యాలయమును పహార్ పూర్ వద్ద ఒక బౌద్ధ దేవాలయమును సంఘారామమును నెలకొల్పెను. ఈ దేవాలయ శిల్పము అత్యద్భుతమైనది. ధర్మపాలుని తరువాత రాజైన అతని మేనల్లుడు దేవపాలుడు 48 సంవత్సరములు పాలించెను. దేవపాలుడు అస్సాము ఒరిస్సాలను జయించెను. సువర్ణద్వీపమునేలు బలపుత్రదేవుడను శైలేంద్ర చక్రవర్తి ఇతని కాలమున వచ్చి నలందాయందలి సంఘారామమునకు కొన్ని గ్రామములను దానముగా నిచ్చెను. ఇతని తరువాత వచ్చిన పాలరాజుల కాలమందు ఘూర్జర-ప్రతీహారులు మగధను కాంభోజులను టిబెట్ దేశీయులు ఉత్తర వంగరాష్ట్రమును ఆక్రమించిరి. మొదటి మహీపాలుడు (క్రీ శ 978-1030) కాంభోజులను అణిచివేయగల్గెను. కాని చోళచక్రవర్తియైన రాజేంద్రచోళునిచే క్రీ శ 1023 లో ఓడింపబడెను. ఇతని కాలమందును ఇతని తరువాత వచ్చిన నయపాలుని కాలమందును బౌద్ధమత వ్యాప్తికొరకై పరివ్రాజక బృందములు టిబెట్ దేశమునకు పంపబడెను. నయపాలుని తర్వాత ఏలినరాజులలో రామపాలుడు ముఖ్యుడు. ఇతడు ఉత్తర బీహారు అస్సాములను జయించి పాలుల యధికారమును కొంతవరకు పునరుద్ధరించెను. ఇతని తరువాత వచ్చిన పాలరాజులు బలహీనులు. మదనపాలుని కాలమున సేన రాజులు వంగదేశమును వశపరచుకొనిరి. గయప్రాంతమును పాలరాజులు మరికొంత కాలము పరిపాలించిరి. కాని క్రీ శ 1197 లో వారిలో కడపటివాడగు ఇంద్రద్యుమ్నపాలుని మహమ్మద్ బిన్ భక్తియార్ అను వాతడు రాజ్యబహిష్కృతుని చేసెను.

పాలరాజులకాలమందు వంగదేశము ఉత్కృష్టస్థితిని పొందెను. కళాపోషకులైన వీరు బౌద్ధమతమును ఆదరించి నలందా విశ్వవిద్యాలయమును పోషించిరి. బౌద్ధులయినను వీరు హైందవమతముపై ఆదరముచూపి హైందవులకు ఉన్నత పదవుల నొసగిరి.

**సేనరాజులు :** సేనవంశీయులు మొదట కర్ణాటకమునకు చెందినవారు. వీరు బ్రాహ్మణులైనను క్షత్రియ కులధర్మములను పాటించిరి. వీరు ఒరిస్సా ఉత్తరభాగమున నివాసమేర్పరచుకొని పాలరాజులవద్ద కొలువుచేసి విజయసేనుని కాలమున స్వతంత్రించిరి. సేనవంశమునకు మూలపురుషుడు సామంతసేనుడు (క్రీ శ 1058 - 1016). మూడవ సేనరాజగు విజయసేనుడు (1097-1159) మదనపాలుని రాజ్యభ్రష్టుని చేసి వంగదేశమును వశపరచుకొనెను. ఇతడు నేపాళము

అస్సాములను జయించి విజయపురమును రాజధానిగా చేసుకొనెను సేనరాజులు శైవమతస్థులగుటచే పెక్కు శివాలయములను నిర్మించిరి ఇతని తరువాత రాజ్యమునకు వచ్చిన బల్లాలసేనుడు గౌర్ లేక లఖ్నౌతి నగరమును నిర్మించెను ఇతడు తాంత్రిక సంబంధమైన హిందూమతమును అవలంబించెను నేపాల్ భూటాన్ మొదలగు పొరుగు రాజ్యములకు హిందూమతవ్యాప్తికై బ్రాహ్మణ పరివ్రాజకులను పంపెను ఇతని తరువాత వచ్చిన లక్ష్మణసేనుడు కనోజ్‌ను పాలించుచున్న గహడ్వాలవంశపు రాజు నోడించి వారణాసి వరకు తన రాజ్యమును విస్తరింపజేసెను గీతగోవిందమును రచించిన జయదేవుడు పవనదూతను రచించిన దోయీ అను వతడు ఇతని ఆస్థానమునందుండిరి కాని 1199 లో మహమ్మద్ బిన్ భక్తియార్ ఖిల్జీ దండయాత్ర కావించినపుడు లక్ష్మణసేనుడు పలాయనముచేసెను సేనరాజులు 13 వ శతాబ్ది మధ్యభాగము వరకు స్వతంత్ర రాజులుగా తూర్పు వంగదేశమును పాలించిరి

**మహమ్మదీయయుగము** మహమ్మద్ ఘోరీ ఢిల్లీలో తన అధికారమును నెలకొల్పిన వెనుక అతని సేనానులలో నొకడైన మహమ్మద్ బిన్ భక్తియార్ ఖిల్జీ వంగదేశమును 1199 లో సునాయాసముగా జయించెను ఇతడు ఢిల్లీ సుల్తానులకు లోబడి వంగదేశమునందు తన రాజ్యమును నెలకొల్పెను అప్పటినుండి వంగరాష్ట్రమునందు స్థిరపడిన మహమ్మదీయ పాలనము బ్రిటిష్‌వారు వచ్చునంతవరకు కొనసాగెను బానిస రాజులలో ముఖ్యులైన ఇల్టుట్‌మిష్ బాల్బను అనువారు తమ ఆధిపత్యమును తిరిగి వంగరాష్ట్రముపై నెలకొల్పుటకు దానిపై దండయాత్రలు చేసిరి ఈ ప్రాంతము ఢిల్లీకి అతి దూరమున ఉండుటచే ఢిల్లీ అధికారము దానిపై నామ మాత్రముగా నుండెడిది తుగ్లక్ చక్రవర్తులు వంగదేశమును తమ స్వాధీనములో నుంచుకొనుటకు చేసిన ప్రయత్నములు విఫలమయ్యెను క్రీ శ 1345 లో హాజీఇలియాస్ షంషుద్దీన్ ఇలియాస్ అను బిరుదుతో వంగదేశమునందు స్వతంత్రరాజ్యమును నెలకొల్పెను అతని అధికార ప్రాబల్యము పశ్చిమమున వారణాసి దక్షిణమున ఒరిస్సా ఉత్తరమున తిరుహుత్ వరకు వ్యాపించెను సికందర్ షా (1357-1393) కాలమందు వంగదేశము సుఖసంపదలతో తులతూగినది ఇతనిని చంపి రాజ్యమునకు వచ్చిన ఇతని కుమారుడగు ఘియాజుద్దీన్ ఆజమ్ అతి క్రూరుడు క్రీ శ 1410 లో రాజ్యమునకు వచ్చిన సైఫుద్దీన్ హమ్‌జాషా పేరుకుమాత్రమే రాజుగానుండెను రాజ్యాధికారమంతయు అతని మంత్రి అయిన రాజాగణేష్ అను హిందూజమీందారు హస్తగతమయ్యెను రాజాగణేశ్ మరణానంతరము మహమ్మదీయ మతమును స్వీకరించిన అతని పుత్రుడు జాదుజలాలుద్దీన్ మహమ్మద్‌షా అను నామముతో రాజ్యము నేలెను ఇతడు హిందువులను క్రూరముగా హింసించి వారిలో చాల మందిని ఇస్లాము మతములోనికి మార్చెను ఇతని పుత్రుడైన షంసుద్దీనును అధికారులు కుట్రపన్ని వధించి తిరిగి హాజీ ఇలియాస్ వంశస్థుడైన నాజిరుద్దీనునకు రాజ్యమొసంగిరి నాజిరుద్దీన్ మహమ్మద్ 17 సంవత్సరములు ప్రజానురంజకముగా పాలించెను క్రీ శ 1460 లో రాజ్యమునకు వచ్చిన ఇతని పుత్రుడు బర్బక్‌షాగూడ ధర్మబుద్ధుడై ప్రజానురంజకముగా పాలించెను ఇతని కాలమున అబిస్సీనియా బానిసలు సైన్యములో ఉన్నతాధికారములు పొందిరి అప్పటి నుండి అబిస్సీనియనుల ప్రాబల్యము పెరుగుటచే అనేక అంతఃపుర విప్లవములు జరిగి అబిస్సీనియనులు కొంతకాలము రాజ్యాధికారమును చేజిక్కించుకొనిరి చివరకు అరబ్బు జాతీయుడైన అల్లాఉద్దీన్ అనుమంత్రి అల్లాఉద్దీన్ హుస్సేన్‌షా అను పేరుతో 1493 లో రాజయ్యెను ఈ విధముగా ఒక క్రొత్త రాజవంశము రాజ్యాధికారమునకు వచ్చెను వంగదేశమును పాలించిన రాజులలో హుస్సేన్‌షా అగ్రగణ్యుడు ఇతడు అబిస్సీనియనుల యొక్క ఇతర అంతఃపుర రక్షకుల యొక్క అధికారమును క్రమముగా అంతము చేసెను దక్షిణ బీహారును జాన్‌పూరు సుల్తానులనుండి స్వాధీనము చేసుకొని తనయధికారమును దక్షిణమున ఒరిస్సావరకు వ్యాపింపచేసెను హిందువులను మహమ్మదీయులను సమానముగా ఆదరించెను క్రీ శ 1518 లో ఇతని పుత్రుడగు నసీరుద్దీను నస్రత్‌షా అను పేరుతో రాజ్యమునకు వచ్చెను ఇతడు తండ్రి రీతిని ఉదారుడై హిందూ మహమ్మదీయ కళాకారులను కవులను శిల్పకారులను పోషించి ప్రసిద్ధికెక్కెను 1533 లో కోటయొక్క కొజ్జా రక్షకులచే ఇతడు సంహరింపబడెను ఇతని తరువాత వచ్చిన రాజులు అసమర్థులు క్రీ శ 1533 లో హుస్సేన్‌షాహి వంశపు తుదిరాజైన మహమూద్‌షాను షేర్‌ఖానూర్ అను వాతడు తొలగించి వంగదేశములో తన ఆధిపత్యమును స్థిరపరచుకొనెను.

సుల్తానుల కాలములో శిల్పమయమైన గొప్ప మసీదులు గౌడ్ పాండొా అను నగరములందు విలసిల్లెను కృత్తివాసునిచే అనువదింపబడిన రామాయణము గొప్ప కావ్యముగా వంగీయుల యాదరణను పొందెను మహాభారతము భాగవతము కూడ ఈ కాలములో వంగభాషలోనికి అనువదింపబడెను సుల్తాను హుస్సేనుషా హిందూ మహమ్మదీయులు అనుసరింప విధముగా ఒక నూతనమత సంప్రదాయమును ప్రవేశపెట్టెను విద్యాపతి చండీదాసుడు గొప్ప సిద్ధులుగను కవులుగను పేరందిరి ఈ కాలమునందు పుట్టిన గొప్పమత ప్రబోధకులలో చైతన్యుడు (1486-1534) అగ్రగణ్యుడు ప్రజలు బౌద్ధ మతమునుండి హిందూమతములోనికి మారుటకు తగిన వాతావరణమును కల్పించిన వారిలో చైతన్యుడొకడు మహమ్మదీయ దండయాత్రలచే వంగ బీహారు ప్రాంతములలోని పెక్కు బౌద్ధసంఘారామములు ధ్వంసమగుట వలన అచ్చట నివసించు సన్యాసులు తమ మత గ్రంథములతో నేపాలునకు వెడలిపోయిరి 16 వ శతాబ్ది తరువాత వంగదేశమునుండి బౌద్ధము పైదొలగెను

1534 లో బీహారునందు తన ఆధిపత్యమును నెలకొల్పిన పిదప షేర్ ఖాన్ అను ఆఫ్ఘన్ సర్దారు 1538 లో వంగదేశముపై దండయాత్ర జరపి గౌర్ నగరము నాక్రమించి వంగ రాజ్యాధిపతిగా ప్రకటించుకొనెను మొగలు చక్రవర్తియైన హుమాయూను షేర్ ఖాన్ వలన తనకు కలుగనున్న అపాయమును గుర్తించి అతనిపై దండయాత్ర జరపి చునార్ కోటను గౌర్ నగరమును స్వాధీనము చేసికొనెను షేర్ ఖాన్ తన సైన్యముతో గుప్తముగా అచ్చటినుండి వెడలి హుమాయూన్ మరలిపోవు మార్గమును అరికట్టెను చౌసా వద్ద జరిగిన యుద్ధములో (1539) హుమాయూన్ షేర్ ఖానుచే పూర్తిగా ఓడింపబడెను షేర్ ఖాను ఫరీదుద్దీన్ షేర్షా యను నామముతో గౌర్ నగరమున సింహాసన మధిష్ఠించెను పిదప కనోజ్ వద్ద జరిగిన మరియొక యుద్ధములో షేర్ ఖాన్ హుమాయూన్ పై ఘనవిజయమును సాధించి ఢిల్లీ నాక్రమించెను విశాల దృక్పథముగల మహమ్మదీయ మతమునకు నాందిచేసిన యుగపురుషుడుగా షేర్ షా ప్రసిద్ధి గాంచెను ఈతడు ఐదు సంవత్సరములు మాత్రమే పాలించెను

షేర్షా పిదప సింహాసన మధిష్ఠించినవారు బలహీనులు మహమ్మద్ ఆదిల్షా (1554-1555) వంగదేశమునకు రాజుగా నుండెను కాని పరిపాలనభారమంతయు హేముయను నతనికి అప్పగించెను హేము ఆదిల్షా తరపున మొగలు సైన్యములను ఓడించి ఆగ్రా ఢిల్లీలను వశపరచుకొనెనేకాని అతడు సాధించిన విజయము దీర్ఘకాలము నిలువలేదు 1556 లో జరిగిన రెండవ పానిపట్టు యుద్ధమందు అతడు అక్బరు సైన్యముచే ఓడింపబడి వధింపబడెను ఈ యుద్ధము ఎమ్మట కొంత కాలము వరకు ఆఫ్ఘను నాయకులు మొగలు సామంతులుగా వంగదేశమును పాలించిరి 1574 లో రాజ్యమునకు వచ్చిన దావూద్ అధికార బలముచే మదాంధుడై మొగలు సార్వభౌమత్వమును తృణీకరించెను 1576 లో ఇతడు బంధింపబడి వధింపబడెను ఈ విధముగా వంగప్రాంతము మొగలు సామ్రాజ్యములో ప్రముఖ రాష్ట్రముగా ఏర్పడెను

మొగలు సింహాసనమున కభ్యర్థియైన బెంగాలు గవర్నరగు షుజా అనునతడు తన సోదరుడైన ఔరంగజేబు ఢిల్లీ సింహాసన మధిష్ఠించిన పిదప అతనిని ప్రతిఘటించెను కాని షుజా యుద్ధములో పూర్తిగా ఓడి తరుమబడి ఆరకాన్ అరణ్యములలో మరణించెను ఔరంగజేబు అనంతరము మొగలు సామ్రాజ్యము శీఘ్రముగా క్షీణించుటచే రాష్ట్ర గవర్నరులు తమ స్వాతంత్ర్యమును ప్రకటించుకొనిరి అలివర్దిఖాన్ అనువాతడు 1740 లో వంగ బీహారు పరగణాలకు నవాబై సమర్థతతో పాలించెను మహారాష్ట్ర దాడుల కోర్వజాలక అలివర్దిఖాన్ వారితో సంధి గావించుకొని ఏటేటా కొంత కప్పము కట్టుట కంగీకరించెను 1756 లో అలివర్దిఖాన్ మనుమడు సురాజుద్దౌలా నవాబగుటతో వంగరాష్ట్ర చరిత్రయందే గాక భారతదేశ చరిత్రయందుగూడ పెద్దమార్పులు వచ్చెను మొత్తముమీద మొగలుల కాలమందు వంగదేశము సర్వతోముఖముగా వైభవోపేతమై యుండెను

బ్రిటిష్‌యుగము : బ్రిటిష్ ఈస్టిండియా కంపెనీవారు మొగలు చక్రవర్తి అనుజ్ఞతో 1690 లో తమ స్థావరమును కలకత్తావద్ద ఏర్పరచుకొని 'ఫోర్ట్ విలియం' అను కోటనుకూడ కట్టుకొనిరి ఇంగ్లీషువారు తమ కోటను పటిష్ఠము చేసికొనుటకు సురాజుద్దౌలా అభ్యంతరము తెలుపుచు 1756 లో కలకత్తాపై దాడిసలిపి ఫోర్టువిలియమును వశపరచుకొని పెక్కురు బ్రిటిషువారిని ఖైదీలుగా చేసెను ఇట్లు బందీకృతులైన వారిలో 123 మంది ఊపిరి సలుపక మరణించిరి నౌకాదళ సహాయముతో క్లైవు ప్రభువు కలకత్తా నగరమును తిరిగి వశపరచుకొనుటయేగాక సురాజుద్దౌలా నవాబుతో సంధిగావించుకొనెను

కొని అతనినుండి పూర్వము బ్రిటిషు వారనుభవించిన ప్రత్యేకాధికారములను తిరిగి సంపాదించెను కాని క్లైవు ఈ సంధిని ఉల్లంఘించి సురాజుద్దౌలాను పడగొట్టుటకు —తని సైన్యాధ్యక్షుడైన మీర్జాఫరును నవాబుగ చేయుటకు పన్నిన కుట్రలో పాల్గొనెను మీర్జాఫర్ రాజద్రోహిగా ప్రవర్తించినఫలితముగా 1757 లో జరిగిన ప్లాసీ యుద్ధములో నవాబు సైన్యములు బ్రిటిష్‌వారిచే పూర్తిగా ఓడింపబడెను ఎదప సురాజుద్దౌలా పట్టుబడి వధింపబడెను మీర్జాఫర్ బ్రిటిషువారి సహాయముతో నవాబయ్యెను క్లైవునకును ఫోర్టువిలియం కౌన్సిల్ సభ్యులకును మీర్జాఫర్ లక్షలకొలది రూప్యములు బహుమతిగా నొసగెను

1760 లో బ్రిటిష్‌వారు మీర్ ఖాసిం వద్ద విశేష ధనమును స్వీకరించి మీర్జాఫరును పదవీచ్యుతునిచేసిరి మీర్ ఖాసిం మీర్జాఫరువలె గాక పరిపాలనమును పటిష్ఠము చేయుట యందాసక్తి చూపెను ఫోర్టువిలియం కౌన్సిలువారు ధనాశాపూరితులై ప్రభుత్వక్షేమము దృష్ట్యా క్రొత్తనవాబు విధించబోయిన ఆంక్షలను అంగీకరించక 1763 లో మీర్జాఫరును తిరిగి నవాబుచేసి మీర్ ఖాసిమును దేశమునుండి బహిష్కరించిరి కాని మీర్ ఖాసిము ఊరుకొనక అయోధ్య నవాబగు షుజాఉద్దౌలా, మొగలు చక్రవర్తియగు రెండవ షా ఆలముల సహాయముతో కంపెనీ వారి నెదిరించెను కాని వారు 1764 లో జరిగిన బక్సారు యుద్ధములో బ్రిటిష్ సైన్యములచే పూర్తిగా ఓడింపబడిరి క్లైవు తిరిగి ఫోర్టువిలియం గవర్నరుగా నియమింపబడెను అతడు 1765 లో మొగలు చక్రవర్తితో అలహాబాదు నందు సంధి గావించుకొనెను ఈ సంధి ప్రకారము బ్రిటిష్ వారికి బెంగాలు బీహారు, ఒరిస్సాలలో దివానీ అధికారము సంక్రమించెను బెంగాలునందు ద్వంద్వ ప్రభుత్వమేర్పడెను కాని 1767 లో క్లైవు బెంగాలును వదలి వెళ్లిన తర్వాత కంపెనీ ఉద్యోగులు పరిపాలనమును స్వలాభమునకే ఉపయోగించుకొనుచుండిరి 1770 లో సంభవించిన తీవ్రక్షామముచే బెంగాలు జనాభాలో మూడవవంతు మరణించగా తక్కిన వారు పెక్కు బాధలకు గురియైరి

1772 లో ఫోర్టువిలియం గవర్నరుగా నియమింపబడిన వారన్ హేస్టింగ్స్ పరిపాలనా దక్షుడు ఇతడు నవాబునకు కొంత భరణమొసగి ప్రభుత్వాధికారములను కంపెనీ తరపున నిర్వహింప మొదలిడెను 1773 లో బ్రిటిష్ పార్లమెంటులో ప్రవేశ పెట్టబడిన రెగ్యులేటింగ్ చట్టము వలన వారన్ హేస్టింగ్సు ఫోర్టువిలియం యొక్క మొదటి గవర్నర్-జనరలుగా నియమింపబడెను ఇతని హయాములో బలవంతులయిన మహారాష్ట్రులతోను హైదరాలీతోను ఒకేసారి యుద్ధము చేయవలసి వచ్చెను ఈ యుద్ధముల నాతడు జయప్రదముగా ముగించి బ్రిటిష్ సామ్రాజ్యపు నిర్మాతగా పేరొందెను 1784 లో వారన్ హేస్టింగ్సు గవర్నర్ జనరల్ పదవినుండి విరమించెను 1786 లో గవర్నర్-జనరలుగా వచ్చిన లార్డ్ కారన్ వాలిస్ కావించిన సంస్కరణములలో బెంగాలునందు భూమిపన్ను గురించి చేసిన శాశ్వత నిర్ణయము ముఖ్యమైనది దీనివలన కంపెనీ ప్రభుత్వమునకు నికరమైన భూమిశిస్తు జమీందారులకు భూమిపై సర్వహక్కులు లభ్యమైనవి బ్రిటిష్ వారి అధికారము 1856 వ సంవత్సరము నాటికి భారత దేశమంతటిపైన, సింహళముపైన బర్మాలో విశేషభాగముపైన విస్తరించెను 1833 లో బ్రిటిష్ పార్లమెంటులో ప్రవేశ పెట్టబడిన చార్టర్ చట్టము ద్వారా ఫోర్టువిలియం గవర్నర్-జనరల్ పదవిని ఇండియా గవర్నర్ జనరల్ పదవిగా నిర్వచించిరి 1828-35 వరకు గవర్నర్-జనరలుగా పాలించిన లార్డ్ విలియం బెంటింక్ ఈ విధముగా మొదటి ఇండియా గవర్నర్-జనరల్ అయ్యెను

ఇతని కాలమున ప్రజాక్షేమము దృష్ట్యా కొన్ని రాజ్యాంగ సంస్కరణములు ప్రవేశ పెట్టబడెను 1829 లో గవర్నర్-జనరల్ ప్రవేశపెట్టిన శాసనముద్వారా హైందవ మతసంప్రదాయమైన సతీసహగమనము ను విలియం బెంటింక్ నిషేధించెను 1835 లో ప్రవేశ పెట్టబడిన మరియొక శాసనముద్వారా ఆంగ్లభాష అధికారభాషగా నిర్ణయింప బడినది ఈ సంస్కరణములను ప్రవేశ పెట్టుటలో రాజారామమోహన రాయలు మొదలగు వివేకవంతుల సానుభూతి గవర్నర్-జనరలుకు లభించెను

డల్హౌసిప్రభువు కాలమందు (1848-56) విద్యాసంస్థలపై అధ్వర్యవము జరపుటకు ప్రతి రాష్ట్రమందు ఒక విద్యాశాఖ ఏర్పాటు చేయబడెను ఈతని కాలమున హౌరానుండి రాణీగంజ్ వరకు రైలుమార్గము నిర్మింపబడెను కలకత్తాను మిగిలిన నగరములతో కలుపుచు తంతిమార్గములు వేయబడెను; రాచబాటలు నిర్మింపబడెను 1857 లో ఇండియాలో మొట్టమొదటి సారిగా కలకత్తాయందు విశ్వవిద్యాలయము స్థాపింప

బడెను డల్హౌసి ప్రవేశపెట్టిన సంస్కరణముల ఫలితముగా జరిగిన ఆక్రమణముల వలన సంస్థానాధీశులందు సైనికులందు ఆందోళన జనించి 1857-59 లో బ్రిటిష్ ప్రభుత్వముపై తిరుగుబాటు ఘటిల్లెను ఈ తిరుగుబాటు అణచివేయబడి ఈస్టిండియా కంపెనీ వారి అధికారమంతటిలో రద్దుచేయబడెను ఇంగ్లండు రాజు తన ప్రతినిధిని 1858లో భారతదేశమునకు వైస్రాయిగా నియమించి పంపెను వైస్రాయ్‌లకు కలకత్తా నగరము 1911 వరకు రాజధానిగా నుండెను 1911 లో రాజధాని కలకత్తానుండి ఢిల్లీకి మార్చబడెను

కంపెనీ పరిపాలనాకాలమున దాని అధికారులు దేశ వాణిజ్యమునందు సంపూర్ణాధికారము కలిగి విశేషధనము నార్జించిరి వీరు స్వలాభముకొరకై పేదలైన నేతపని వాండ్రను క్రూరముగా హింసించుచుండిరి భారతదేశపు ప్రత్తితో ఇంగ్లీషువారు తమ దేశములో ఉత్పత్తిచేసిన మిల్లు వస్త్రములను భారతదేశములో విరివిగా విక్రయించుటచే బెంగాలులోని చేనేతపరిశ్రమ పూర్తిగా క్షీణదశకు వచ్చెను

ఆంగ్లవిద్యను ప్రవేశపెట్టుటచే భారతీయులందు కలిగిన విమర్శనాశక్తితో వారు తమ మూఢనమ్మకములను మూఢాచారములను పునఃపరిశీలన గావించుకొన మొదలిడిరి వంగప్రముఖుడైన రాజా రామమోహనరాయలు (1784-1833) ఈనూతనయుగమునకు ప్రవక్త హిందూస్త్రీలు భర్తల చితులపైబడి మరణించు దురాచారమును నివారించుటకై అతడెంతో పట్టుదలతో ప్రచారము గావించెను అప్పటి సంస్కృత విద్యావిధానము దేశప్రజలను చీకటిమార్గములోనే దాచియుంచునని రాయలు విశ్వసించి ఆంగ్లవిద్యాప్రబోధనకు కృషిచేసెను అతడు గొప్ప ఆధ్యాత్మికసంపన్నుడుకూడ దేవుడొక్కడేననియు విగ్రహారాధన కూడదనియు ఉపనిషత్తుల ప్రవచనము ననుసరించి నిర్గుణబ్రహ్మము నారాధింపవలెననియు భావించి యతడు బ్రహ్మసమాజమును స్థాపించెను రవీంద్రనాథ్‌టాగూరు తండ్రియైన దేవేంద్రనాథ్‌టాగూరు కేశవచంద్రసేనుడు బ్రహ్మసమాజమునకు ప్రచారము గావించినవారిలో ముఖ్యులు ఈ సమాజముద్వారా హిందువులలో ఎంతో సాంఘికాభ్యున్నతి కలిగెను

మరియొక ప్రఖ్యాత వంగపుత్రుడైన రామకృష్ణపరమహంస (1836-1886) పారమార్థికచింతతో జీవనము గడిపి మతములన్నిటియందు సత్యమొక్కటేనని బోధించెను, ఆయన ప్రియశిష్యుడైన స్వామి వివేకానందుడు (1863-1902) రామకృష్ణునిపేర ఒక మఠమును స్థాపించి అతని దివ్యసందేశములను భారతీయులకు బోధించుటయేగాక ఈ మఠముద్వారా యెన్నియో సంఘసేవా కార్యక్రమములనుకూడ నిర్వహింప మొదలిడెను వివేకానందుడు 1893 లో చికాగో నగరములో జరిగిన సర్వమత సమ్మేళన సమావేశమునందుపాల్గొని గావించిన గంభీరోపన్యాసముచే ఆతనికి ప్రపంచఖ్యాతి కల్గెను

ఆధునికయుగములో బెంగాలునందలి ప్రముఖరాజకీయవేత్తలలో సురేంద్రనాథబెనర్జీ మొదటివాడు ఆయన 1876లో భారతీయులందరు ఒకే దేశమునకు చెందినవారను భావము కలుగుటకై "ఇండియన్ అసోసియేషన్ ఆఫ్ కలకత్తా" అను సంస్థను స్థాపించి 1883 లో భారతజాతీయ మహాసభను సమావేశపరచెను 1885 లో ఏర్పడిన భారతజాతీయ కాంగ్రెసులో పైనపేర్కొనిన సంస్థ లీనమైనది ఇట్లు ఒకేఒక మహాసంస్థగా రూపుదాల్చిన భారత జాతీయ కాంగ్రెసునందు గొప్ప పేరు పొందిన బెంగాలు నాయకులలో విపిన్‌చంద్రపాలు చిత్తరంజనదాసు ముఖ్యులు

1905 లో వైస్రాయ్‌కర్జన్ ప్రభువుచే బెంగాలు రెండు రాష్ట్రములుగా విభజన చేయబడెను బెంగాలుప్రజలకు ఈ విభజన ఇష్టములేకపోవుటచే రాష్ట్రవ్యాప్తముగా పెద్ద ఆందోళన చెలరేగెను బంకించంద్రుడు రచించిన వందేమాతరం గీతము జాతీయగీతమై భారతీయులకు ఉత్తేజము కల్గించెను 1911 లో బ్రిటిష్ చక్రవర్తియైన ఐదవజార్జి ఢిల్లీయందు జరిగిన దర్బారులో బెంగాలు విభజనమును రద్దు చేయుచు బెంగాలు ప్రెసిడెన్సీ యను క్రొత్తరాష్ట్రమును ఏర్పాటు చేయుచున్నట్లు ప్రకటించెను

సుభాషచంద్రబోసు అగ్రగణ్యులైన జాతీయ నాయకులలో నొకడు మహాత్మాగాంధితో అభిప్రాయ భేదములు కలుగుటచే అతడు కాంగ్రెస్ సంస్థను వీడి ఫార్వర్డ్‌బ్లాక్ అను క్రొత్తపార్టీని యేర్పరచి బలమును చేకూర్చుకొనెను 1939 లో మొదలైన రెండవ ప్రపంచయుద్ధ సందర్భమున 1941లో గృహనిర్బంధమునుండి అతడు తప్పించుకొని జపాను వారి సహాయముతో అజాద్‌హింద్‌ఫౌజ్ ను మలయాద్వీపకల్పములో ఏర్పరచి స్వతంత్రభారత ప్రభుత్వమును 1943 లో అచటినుండి ప్రకటించెను జపానువారు [illegible] ఓడిపోవుచుండగా, సుభాషచంద్రబోసు ఒక విమానప్రమా[illegible]

దములో మరణించినట్లు తెలియుచున్నది 1943 లో బెంగాలు ఘోరమైన క్షామమునకు గురికాగా సుమారు 20 లక్షలమంది ప్రజలు మరణించిరి

మహమ్మదాలీ జిన్నా నాయకత్వమున మహమ్మదీయులు ప్రత్యేక స్వతంత్రదేశమును కోరి కలకత్తా నగరమందలి హిందువులపైనను బెంగాలులోని ఇతర ప్రాంతములందలి హిందువులపైనను హింసాకాండకు దిగిరి ఈ విధముగా అనేక రాష్ట్రములందు హిందువులు మహమ్మదీయులు ఒకరినొకరు చంపుకొనిరి 1947 ఆగస్టు 15 వ తేదీన భారతదేశము స్వతంత్రమగుటతో పాటు పాకిస్థానము ప్రత్యేకదేశముగా భారతదేశమునుండి బ్రిటిష్‌వారిచే చీలదీయబడి గుర్తింపబడుటచే బెంగాలులో మూడింట రెండువంతులు తూర్పు పాకిస్థానముగా భారతదేశమునుండి చీలిపోయెను

పాశ్చాత్యవిద్య వ్యాపించుటతో పాటు ప్రాచీన భారతీయ సంస్కృతియందు విశ్వాసము పునరుద్ధరింపబడుటచే ప్రాచ్య పాశ్చాత్య సంస్కృతి సమ్మేళనముగల గ్రంథములుద్భవించి వంగవాఙ్మయము సుసంపన్నమై అద్భుతముగ అభివృద్ధి చెందెను వంగ ప్రముఖులగు రవీంద్రనాథ ఠాగూరు బంకించంద్రచటర్జీ శరత్ చంద్రచటర్జీ మొదలగువారి రచనలు ప్రపంచఖ్యాతి బడసినవి విశ్వభారతి శాంతినికేతనము గొప్ప జాతీయ విద్యాసంస్థలుగాను అంతర్జాతీయ సుప్రఖ్యాత కేంద్రములుగాను రూపొందినది

ఆర్ సూ మూ

## వంశధార

వంశధార అనునది ఒరిస్సా రాష్ట్రమునందలి జయపురము కొండలలో పుట్టి 60 మైళ్ళు ఆ రాష్ట్రమునందే ప్రవహించి తరువాత ఆంధ్ర రాష్ట్రములో ప్రవేశించుచున్నది ఈ నది నిడివి 140 మైళ్లు ఇదియొక జీవనది నైరృతి పవనములచే శ్రీకాకుళము జిల్లాలో అధికవర్షములు కురియుట వలన అచ్చటి వంశధార నాగావళి నదులలోనికి ఆ ప్రాంతపు వర్షజలములో 75 నుండి 80 శాతమువరకు ప్రవేశించుచున్నది. కాని ఈ నదుల జలము సద్వినియోగమగుటలేదు 3000 చదరపు మైళ్ళ ఆయకట్టుకలిగిన వంశధార నది క్రింద పాతకాలపు వ్యవసాయ పద్ధతుల ననుసరించి ప్రస్తుతము 50 వేల ఎకరముల భూమిమాత్రము సాగు చేయబడుచున్నది కాని ఈ నదిక్రింద మరొక 2½ లక్షల యకరముల భూమిని మొదటికారు పంటకును 50 వేల యకరముల భూమిని రెండవకారు పంటకును అభివృద్ధిపరచుటకు అవకాశము కలదు

కరువుకాటకములకు ఆకరమైయున్న శ్రీకాకుళము జిల్లా ప్రజలకు వంశధార ప్రాజెక్టు ముందుముందు అత్యంత ప్రయోజనకారి కాగలదు ఆంధ్రరాష్ట్రము నందలి మధ్యరకపు ప్రాజెక్టులలో వంశధార ప్రాజెక్టు ముఖ్యమైనది ఈ ప్రాజెక్టు నిర్మాణము విషయములో 1854 వ సంవత్సరము నుండి నేటివరకు వివిధప్రదేశములలో పరిశీలనములు జరగుచు వచ్చినవి సంగడి గొట్ట మదనాపురము అను మూడు కేంద్రముల వద్ద పరిశీలనములు జరిగి తుదకు మదనాపురము చెంత రిజర్వాయరును నిర్మించుట తక్కిన కేంద్రముల కంటె ఎక్కువ ప్రయోజనకరమని ఇంజనీయరులు నిర్ణయించిరి

ఈ ప్రాజెక్టుకు ప్రారంభములో 7 కోట్ల 60 లక్షల రూప్యములు వ్యయమగునని అంచనా వేయబడినది 2 లక్షల 10 వేల యకరముల పల్లపు భూములకును 40 వేల యకరముల గోగునారపండు భూములకును వంశధార జలము సమృద్ధిగా అందగలదనియు యకరమునకు సుమారు 300 రూప్యములు ఆదాయము లభింపగలదనియు ఈ ప్రాజెక్టు మూలమున నరసన్నపేట చెక్కలి శ్రీకాకుళము పాతపట్నము తాలూకాలలోని భూములకు చక్కని నీటివసతు లేర్పడగలవనియు అంచనా వేయబడినది

ఈ ప్రాజెక్టు నిర్మాణమున కవసరమైన స్థలనిర్ణయమునుగూర్చి క్లిష్టసమస్యలేర్పడి వివిధ రూపములలో ఆందోళనము జరిగెను ఈ క్లిష్ట సమస్యలను సాకల్యముగా పరిశీలించిన ఆనాటి ఇంజనీరింగు నిపుణులు ఒక నివేదికను సిద్ధమొనర్చిరి కొంతమేరకు ప్రామాణికమైనదిగా భావింపబడుచున్న ఈ నివేదిక యందలి ముఖ్యాంశములీ దిగువన పొందుపరుపబడినవి

**సింగడి** ఇది వంశధారనదికి ఎగువభాగములో ఒరిస్సా పరిహద్దువందున్నది ఇచ్చట ప్రాజెక్టును నిర్మించుటవలన పాతపట్నము తాలూకాలో అదనముగా 15 వేల యకరముల భూమి సాగులోనికి వచ్చినను పెద్దపెద్ద కొండవాగుల కడ్డముగా క్రొత్తకాలువలను అత్యధికధనమును వ్యయించి త్రవ్వవలసి యుండును అంతేకాక ఈ కాలువలను త్రవ్వుట వలన ఒరిస్సా రాష్ట్రములో సుమారు 12 వేల యకరముల భూమి మునిగిపోవుటయే కాక తొమ్మిది మైళ్ళ నిడివిగల

పర్లాకిమిడి రైలుమార్గమును గంజాము జిల్లా యందలి గిణ పవరమను ముఖ్యమగు ఏజెన్సీ వ్యాపార కేంద్రమును ముంపు ప్రమాదమునకు గురియగును. ఎంగడివద్ద నదీగర్భము చాల వరకు ఇసుకమయమై యుండుటచే సుమారు 70 అడుగుల లోతువరకు త్రవ్వవలసిన కారణముగా ప్రాజెక్టు నిర్మాణమునకు విపరీతముగా ధనము వ్యయమగును.

గొట్టి ఇచ్చట ప్రాజెక్టును నిర్మించుటవలన 28 లక్షల యకరముల భూమి సాగగుట కవకాశమున్నను మదనాపురమువద్ద కంటె అధిక విస్తీర్ణమును సారవంతమునైన మహేంద్రతనయ అను లోయయందలి పెక్కు గ్రామములు మునిగిపోవు ప్రమాద మేర్పడగలదు.

**మదనాపురము** ఇది పైన పేర్కొనబడిన రెండు కేంద్రములకును నడుమనున్నది. ఇచ్చట రిజర్వాయరును నిర్మించిన ఫలితముగా 1 98 250 ఘనపు టడుగుల నీటిని నిలువ చేయవచ్చునని అంచనా వేయబడినది. దీనిక్రింద ముందు ముందు సాగగుటకు అవకాశమున్న 4 లక్షల యకరములలో 3 లక్షల యకరముల భూమి సాధ్యమైనంత త్వరితముగా ఫలితమునకు రాగలదు. అంతేకాక మరొక 50 వేల యకరములలో రెండవ పంటకుకూడ లభించగలదు. కాగా నష్టము దృష్ట్యా ఆలోచించినచో ఆంధ్ర ప్రాంతములోని సుమారు 2 వేల యకరముల భూమియు మరికొన్ని ఒరిస్సా ప్రాంతీయ భూములును మునుగగల ప్రమాదమున్నది. సాంకేతిక దృష్ట్యా విచారించినచో ఈ స్థలము అన్నివిధముల అనుకూలమైనది.

పై నివేదికాంశములను పరిశీలించినచో మదనాపురము వద్ద ప్రాజెక్టును నిర్మించినయెడల కనీసనష్టముతో గరిష్ఠ ఫలితమును పొందవచ్చునని తెలియగలదు. సాంకేతిక పరిశీలనమునకై అచ్చటికి స్వయముగా వెళ్ళిన కేంద్ర ప్రభుత్వ మంత్రి డా॥ కె యల్ రావు, మదనాపురప్రాంతము యొక్క ప్రకృతి ఎద్దమైన రిజర్వాయరుగా రూపొందగలదని ప్రశంసించిరి.

కేంద్రజల విద్యుత్ సంఘమువారి సూచనల ననుసరించి ఒరిస్సా రాష్ట్రమునందలి గుడారి అను స్థలము వంశధార ప్రాజెక్టు నిర్మాణమునకు అనుకూలముగ నుండెడిదని పెక్కురు శాస్త్రవేత్తలు భావించిరి. ఈ స్థల పరిశీలనమునకు 6 లక్షల రూప్యములు వ్యయమైనవి. గుడారివద్ద ప్రాజెక్టును నిర్మించినచో తమకుప్రయోజనము కలుగదని ఒరిస్సా ప్రభుత్వము అభ్యంతరము వెలిబుచ్చినది.

ఏమైనను ఆంధ్ర ఒరిస్సా ప్రభుత్వముల నడుమ వంశధార ప్రాజెక్టు నిర్మాణము చేయదగు స్థలము నిర్ణయమై ఏకీభావము కుదరలేదు. కేంద్ర జల విద్యుత్ సంఘమువారు ఈ విషయమై ప్రత్యామ్నాయ సూచనలు చేసినను ఒరిస్సా ప్రభుత్వము వాటిని అంగీకరింప త్రోసిపుచ్చినది.

కాని 1959 1961 1962 సంవత్సరములలో ఒరిస్సా ఆంధ్ర ప్రభుత్వములమధ్య జరిగిన సంప్రదింపుల ఫలితముగా కుదిరిన అంగీకారము ననుసరించి వంశధార నదీజలములను ఉభయ రాష్ట్రములు చెరిసగముగా పంచుకొనవలసియుండును. ప్రాజెక్టు నిర్మాణమువలన కలుగు లాభనష్టముల ననుసరించి ఉభయప్రభుత్వములు దామాషా పద్ధతిప్రకారము నిర్మాణపు ఖర్చులను భరింపవలసి యుండును. ఉభయ రాష్ట్రములలో ప్రస్తుతము సాగులోనున్న ప్రాంతములకు ప్రథమస్థాన మీయబడును. ఈ ప్రాజెక్టు నిర్మాణమువలన ఒరిస్సా భూభాగములు నీట మునిగిపోకుండ ఆంధ్రప్రభుత్వము తగిన రక్షణను నియ్యవలెనను షరతుతో నీరడి వద్ద ప్రాజెక్టును నిర్మించుటకు తుదకు ఒరిస్సా ప్రభుత్వ మంగీకరించినది. గొట్ట వద్ద రిజర్వాయరు, నీరడి వద్ద బ్యారేజి - ఈ రెండును వంశధార ప్రాజెక్టులోని ముఖ్యాంశములు. ఈ పథకము ననుసరించి తగిన నిధులు సాంకేతిక వివరములు కేంద్ర ప్రభుత్వమునుండి లభించిన వెంటనే ప్రాజెక్టునిర్మాణము ఆరంభము కావలెనని నిర్ణయింపబడినది. ప్రస్తుతమచ్చట ప్రాథమిక నిర్మాణ కార్యక్రమము మాత్రము పూర్తియైనది.

వంశధార ప్రాజెక్టు నిర్మాణము నిమిత్తమై ద్వితీయ పంచవర్ష ప్రణాళికా కాలమునందే, గొట్ట వద్ద రిజర్వాయరు నిర్మాణమునకును నీరడివద్ద ఆనకట్ట నిర్మాణమునకును తాత్కాలికముగా 100 లక్షల రూప్యములు కేటాయింపబడినవి. మూడు సంవత్సరములనుండి ఆలోచనయందుండిన వంశధార ప్రాజెక్టు నిర్మాణ కార్యక్రమము పై ఒడంబడిక ననుసరించి జయప్రదముగా జరుగ గలదని ఆశింపవచ్చును.

వంశధార ప్రాజెక్టునుగూర్చిన ముఖ్యాంశములు

'గొట్ట' డాము :

| | |
|---|---|
| నదీ పరీవాహక ప్రదేశము | 8757 చ మై |
| డాము ఎఫ్ ఆర్ ఎల్ | + 157 00 |
| జలాశయపు శక్తి | 1 9178 కోట్ల ఘనపుటడుగులు |
| డాము పొడవు | 5 706 అడుగులు |

| | |
|---|---|
| ఆయకట్టు | 2 06 750 యకరములు |
| డాము ఖర్చు | 8 కోట్ల 71 లక్షల రూప్యములు |
| రెండు కాల్వల త్రవ్వకపు ఖర్చు | 4 కోట్ల 82 |
| మొత్తము ప్రాజెక్టు ఖర్చు | 13 కోట్ల 53 లక్షల రూప్యములు |

**నీరడి ఆనకట్ట**

| | |
|---|---|
| పరీవాహక ప్రదేశము | 8050 చ మైళ్లు |
| జలాశయపు శక్తి | 7 6 కోట్ల ఘనపుటడుగులు |
| ఆనకట్ట పొడవు | 1816 అడుగులు |
| ఆనకట్ట ఎఫ్ ఆర్ ఎల్ | +285 00 |
| కుడికాల్వక్రింద ఆయకట్టు | 20 వేల యకరములు |
| ఆనకట్ట నిర్మాణపు ఖర్చు | 96 92 లక్షల రూప్యములు |

గొట్ట వద్ద డాము, నీరడి వద్ది ఆనకట్ట నిర్మాణముల కగు మొత్తముఖర్చు సుమారు 14 కోట్ల 50 లక్షల రూప్యము అగునని అంచనా కట్టబడినది

ప్ర రా సు

## వజ్రములు

వ్యావహారికముగా వజ్రము నిర్భయమునకు చిహ్నమని తలచెదరు బౌద్ధ లిఖితపత్రములలో వజ్రమును గురించి క్రీ పూ 400 సంవత్సరములకు పూర్వమే పేర్కొనబడెను గ్రీకు సాహిత్యములో పలుచోట్ల భారతదేశమునుండి వచ్చిన 'తెల్లరాయి'గా వజ్రము పేర్కొనబడెను కాని దీనినిగూర్చి ప్రప్రథమముగా క్రీ శ మొదటి శతాబ్దములో లాటిన్ కవియు ఖగోళశాస్త్రజ్ఞుడునైన మనీలియస్ అనువానిచే అధికారపూర్వకముగా పేర్కొనబడెను అతని సమకాలికుడైన ప్లినీ అను రోమను ఖగోళశాస్త్రజ్ఞుడు వజ్రము భారతదేశపు రత్నముగా చెప్పెను రోమనులు వజ్రమును చెక్కుడు పనిముట్టుగా ఉపయోగించుచుండెడివారు పై విషయములను బట్టి భారతదేశమే వజ్రమును ప్రపంచములో మొట్టమొదటగా ప్రవేశపెట్టినట్లు తెలియుచున్నది

భారత సాహిత్యములో వజ్రమును గూర్చిన అధికార పూర్వక వర్ణనము 6వ శతాబ్దమునాటి వరాహమిహిరుని "బృహత్సంహిత"లో కలదు భారతదేశములో ముఖ్యముగా ఆంధ్రప్రాంతములో వజ్రములను గురించిన చరిత్ర 13వ శతాబ్దపు మార్కొపోలో వర్ణనతో మొదలైనట్లు తెలియుచున్నది ఆయన తదుపరి వజ్రమును వర్ణించినవారు గార్సియస్ ఎట్ హార్టో అను స్పెయిను దేశస్థుడు డామింగోపెయ్ అను పోర్చుగల్ దేశస్థుడు 16వ శతాబ్దినాటి టావర్నియర్ అను ఫ్రాన్సుదేశీయుడు భారతదేశములోని వజ్రములను గూర్చియు వజ్రఖననమును గూర్చియు టావర్నియర్ చేసిన వర్ణన బహువిశిష్టమైనది 14వ శతాబ్దములో యూరపు దేశములో వజ్రములనేకాక వజ్రములను సానపట్టు విధానమును కూడ భారతదేశమే ప్రవేశపెట్టినది

యూరపులో 1476లో లుడ్విగ్ వాన్ బెర్క్వెన్ మొట్టమొదట నిర్ణీత రీతిలో వజ్రములను కోతకోయుట మొదలుపెట్టెను ప్రస్తుతము సార్వజనికమైన ప్రకాశమానమైన కోత యూరపులో 17వ శతాబ్దములో ప్రవేశపెట్టబడెను దక్షిణ అమెరికాలోని బ్రెజిల్ దేశములో వజ్రము మొదటిసారిగా క్రీ శ 1725లో కనుగొనబడెను ఈదేశము వజ్రోత్పత్తియందు ప్రపంచమంతటిలో రెండవది 1781లో మాటిన్ అను వజ్రమును కనుగొనుటతో బోర్నియో ద్వీపములో (ఇండోనీషియా) వజ్రోత్పత్తి ప్రారంభమైనది దక్షిణ అఫ్రికాలో 1867లో డడ్లీ అను వజ్రమును కనుగొనుటతో అందు వజ్రోత్పత్తి ప్రారంభమైనది ఆ తరువాత పలుచోట్ల వజ్రములు లభించెను ప్రస్తుతము దక్షిణాఫ్రికా ప్రపంచమంతటిలో వజ్రోత్పత్తికి ప్రథమస్థానమైనది

**భౌతిక దర్శన (optical) లక్షణములు** వజ్రము స్ఫటికరూపములోనున్న కర్బనము ఇది గ్రాఫైటుయొక్క రూపము వజ్రము ప్రకృతిలో అన్ని పదార్థముల కంటెను గట్టిది కాగా గ్రాఫైటు అతి మెత్తనైనది వజ్రము వస్తువులను కోయుట కుపయోగపడగా గ్రాఫైటు కందెన పదార్థముగా (lubricant) ఉపయోగపడును వజ్రమును ఉదజనితో 850° సెం గ్రే వరకు వేడిచేసినచో సన్నని నీలపు మంటతో అది కాలును; గాలితో సంపర్కము లేకుండ వేడిచేసినచో అది గ్రాఫైటుగా మారును ప్రకృతిలో వజ్రములు రెండు విధములుగా దొరకును–(1) పారదర్శక లక్షణము కలిగినది; (2) కార్బనాడో అను సూక్ష్మస్ఫటికముల సమ్మేళనమైన నల్లని రాయి

ప్రకృతిలో వజ్రము అధికముగా స్ఫటికరూపములోనే లభించును నంజన కిరణములతో (X Rays) వజ్రమును పరీక్షించినచో స్ఫటికము నిర్మాణములో అది ఘనసరణి

(cubic system) భాగమైన టెట్రాహెడ్రల్ వర్గముయొక్క సౌష్ఠవమును కలిగియుండును. అరుదుగనైనను ఘనసరణిలో పూర్తి సౌష్ఠవము కలిగిన స్ఫటికములుకూడ లభ్యమగును. సాధారణముగా స్ఫటిక తలములు (crystal faces) అంచులు స్ఫటికములలోవలె సరళరీతిగాకాక వంకరగా యుండును. అప్పటికైనను వజ్రము క్షేత్ర సౌష్ఠవము (geometric symmetry) ను కలిగియుండును. అణువులు అతి సమీపముగా (రెండు అణువులమధ్య దూరము 1 54 $\times$ 10$^{-7}$ మి మీ ) యుండుటవలన ఒక స్ఫటికమును ఒకేఒక పరమాణు సముదాయముగా భావించవచ్చును. ఇట్టి అణువుల పరస్పర సామీప్యత వలననే వజ్రములకు గట్టితనము రాసాయనిక స్థిరత్వమేర్పడును. వజ్రముయొక్క గట్టితనపుసంఖ్య 10. భూగర్భశాస్త్రజ్ఞులు ఖనిజముల గట్టితనమును పరీక్షించు మోహ్ (Mohs) ప్రమాణములో ఈ సంఖ్య గరిష్ఠమైనది. అక్టహెడ్రల్ తలములకు (octahedral faces) సమాంతరముగా యుండు నాలుగు దిక్కులలో స్ఫటిక బలహీనతల వలన వజ్రములు చీటలు వారును. ఈ దిక్కులలో అణుసంధానశక్తి తక్కువ. వజ్రసాంద్రత 3 52. కాని కార్బనాడో సాంద్రత 2 90 ను డి 3 15 వరకు ఉండును. వజ్రముయొక్క కిరణవక్రీకరణ సూచి (refractive index) ఏకవర్ణ కాంతి (mochromatic light) లో కొలవబడును. ఈ సూచి ఆధికముగా యుండుటచే కాంతి కిరణములు పూర్తిగా పరివర్తనమొంది వజ్రప్రకాశమునకు కారణభూత మగును. ఎరుపు నీలకాంతులలో కొలచినచో కిరణవక్రీకరణ సూచనలలోని భేదమే కాంతి విచ్ఛిన్న కొలమానమగును. ఆదియే వజ్రముయొక్క ప్రకాశము (' ఫైర్ ' అని పారిభాషిక పదము). దాని ప్రమాణము 0 044.

నంజన కిరణములలోను పారనీల లోహిత కిరణముల లోను (ultra violet rays) కేథోడ్ కిరణములలోను వజ్రమును ముంచగా కనిపించు వెలుగు ప్రతిదీప్తి లేక ఫాటో లూమినెసెన్సు' అనబడును. వజ్రమునకీ లక్షణము కలదు. కాంతి కిరణములు వజ్రము గుండా పోవునపుడు విడివడిన వర్ణసప్తకమును (spectrum) విచ్ఛిన్న కిరణదర్శని (spectroscope) తో పరీక్షించినచో కొన్నిభాగములు దృగ్గోచరములు కావు. అట్టి వర్ణసప్తకమును విలీన వర్ణసప్తక మందురు (absorption spectrum). శాస్త్రపరిశోధనములవలన వజ్రములలో పారనీల లోహితకిరణములవలన కల్గు ప్రతిదీప్తివర్ణముల కును విలీన వర్ణసప్తకమునకును సంబంధమున్నట్లు నిరూపింపబడెను. ఈ సంబంధము మూడు రకములు (1) వర్ణరాహిత్యముగను లేక పసుపురంగులోను ఉండి నీలిరంగు ప్రతిదీప్తినిచ్చు వజ్రములలో విలీనరేఖ (absorption line) వర్ణసప్తకమందలి నీలలోహితభాగములో 4155 A$^{\circ}$ వద్ద కలుగును (2) ఆకుపచ్చ వర్ణముకాని వసుపారుపచ్చ వర్ణముకాని కలిగి ఆకుపచ్చ ప్రతిదీప్తినిచ్చు వజ్రములలో విలీనరేఖ వర్ణసప్తకమందలి ఆకుపచ్చ భాగములో 5040 A$^{\circ}$ వద్ద కలుగును (3) పసుపువర్ణముకాని పసుపు - బూడిదరంగు కలసిన వర్ణములు కాని కలిగి పసుపురంగు ప్రతిదీప్తినిచ్చు వజ్రములలో విశిష్టముగా లేని విలీనరేఖ 4155 A$^{\circ}$ వద్దనే కలుగును.

నంజన కిరణములకు ఖనిజములలోని పారదర్శకత వాటిలోని అణుభారముపై ఆధారపడి యుండును. అణుభార మధికమైన కొలది పారదర్శకత తగ్గిపోవును. వజ్రములు నంజన కిరణములకు అసమానమైన పారదర్శకత కలవి.

నాణ్యమైన వజ్రములలో చుక్కలుకాని మరేవిధమైన దోషములుకాని ఉండకూడదని రత్నశాస్త్రజ్ఞుల అభిప్రాయము. అవి గ్రాఫైటు, హెమటైటు, మాగ్నటైటు, జిర్కన్, గార్నెటు మొదలైన ఖనిజముల రూపములో ఉండును. బ్రెజిల్ దేశపు వజ్రములలో శిలాస్ఫటికముకూడ ఉండును. దోషము అధికముగానున్న వజ్రములు గుచ్ఛములుగా నున్నచో అట్టివానిని బోర్ట్ వజ్రములందురు.

వజ్రములు సాధారణముగా చిన్నవిగా లభ్యమగుట వలన వాటి తూకమును కారట్లు అనెడి మానములో వెల్లడించెదరు. పూర్వము వజ్రములను గురివింద గింజలతో తూచి ఇన్ని గురివిందగింజల (రతులు) బరువుండెనని చెప్పుచుండెడివారు; పర్షియా దేశములో మిస్కలు" అనెడి మానములో చెప్పుట కద్దు. అటుపై వివిధ దేశములలో కారటుయొక్క మానము పలు విధములుగా యుండెను. 1907 వ సంవత్సరంలో తూకమానికల అంతర్జాతీయ సంస్థ ఒక కారటు బరువు 200 మిల్లీగ్రాములని నిర్ణయించెను. ఈ మానమే ప్రస్తుతము అన్ని దేశములలో వాడుకయందున్నది. వజ్రముల కనునైన కోతను ప్రకాశమానమైన కోత ' (1 వపటముచూడుడు) అని యందురు. బల్లపరుపుగా నుండు కొన్ని వజ్రములను గులాబీ కోతలోకూడ తయారుచేయుదురు. బల్లపరుపుకోత వజ్రమును 'లాస్క్' అనబడు చున్నది. గులాబీ, లాస్క్ కోతలు భార

తీయ వజ్రముల ప్రత్యేక లక్షణములు

చిత్రము 20

ప్రకాశమానమైన కోత



పటము 1

పార్శ్వ అవలోకనము | క్రిందిభాగము (గోపురము) | శిరో (పై) భాగము

చిత్రము 21

గులాబీ కోత



పటము 2

పార్శ్వ అవలోకనము | ఉపరితల అవలోకనము

**ఉత్పత్తి** ప్రకృతిలో వజ్రములు నీలవర్ణముగగాని నీలాకుపచ్చ వర్ణముగగాని ఉండి 'కింబర్లైట్' అను అతి క్షారతముమైన శిలలలో లభించును అట్టి శిలలు వివిధరకములైన శైలములలో చొచ్చుకొనియుండును అంతేకాక నదీపదముల వెంబడి చేరి నిలువయుండు గులకరాతి సమూహములలోను నిక్షేప శిలలయందలి ఒక విధమైన రాళ్ళసమూహములలోను వజ్రములు లభ్యమగును ఇట్టి వజ్రములు ఎల్యూవియల్ వజ్రాలనబడును చిన్నచిన్న వజ్రములు అరుదుగా ఉల్కలలో కూడ కనుగొనబడినవి అవి 'కాస్మిక్' కిరణముల వలన ఉత్పత్తి యగును 'కింబర్లైట్' శిలలు తయారగు పీడనోష్ణ స్థితినిబట్టి చూచినచో వజ్రములు ఈ శిలలలో ఉత్పత్తియగు అవకాశములేదు వజ్రోత్పత్తికి అంతకంటె అధికమైన ఒత్తిడి అవసరము అందుచే వజ్రములు భూగర్భములో ఉత్పత్తియై, కింబర్లైటు శిలాద్రవ్య రూపమున నున్నప్పుడు దానితో పాటు భూమ్యుపరితలమునకు అవి తేబడినట్లు విశ్వసింపబడు చున్నది వాతాహతి వలన అట్టి శిలలు విచ్ఛిన్నమై నీటి ద్వారా నదీ నదములవెంబడి కొట్టుకొనిపోయి కొన్నితావుల పోగుబడును ఆ టియందే ఎల్యూవియల్ వజ్రములు లభించును వివిధ దేశములలో వజ్రములు లభ్యమగు విధానము దిగువ పేర్కొనబడినది

**భారత దేశము** మధ్యప్రదేశ్ రాష్ట్రమందలి పన్నా జిల్లాలోను ఆంధ్రప్రాంతమందలి అనంతపురం జిల్లాలోని వజ్రకరూర్‌లోను కింబర్లైటు అను రాతి కడ్డీలలో వజ్రములు లభించుచున్నవి పన్నా జిల్లాలో కనుగొనబడిన కింబర్లైటు ను పరిశీలించగా అచ్చట విశేషముగా వజ్రములు లభించగలవని స్పష్టమైనది వాతాహతికి గురియైన కింబర్లైటు శిల మెత్తని దగుటచే దానిని వాడుకలో ముద్ద అని యందురు వజ్రకరూరువద్ద వజ్రములకై ఖననచర్య జరుపుట లాభదాయక మగునా అను విషయమునుగూర్చి పరిశోధనములు జరుగు చున్నవి మిగిలిన మూడు తావులను గూర్చి పరిశోధనము చేయవలసియున్నది

పన్నా ప్రాంతములోను వింధ్య పర్వతశ్రేణికి చెందిన కైమూరు ఇసుకరాళ్లలోను చాలకాలమునుండి వజ్రములు లభించుచున్నవి ఇట్లు లభించినవాటిలో విజయ వజ్రమొకటి ఇది 85 కారట్ల బరువుకలది వజ్రకరూరు ప్రాంతములో వర్షాకాలము ఎదవ భూమి దున్నునప్పుడు వజ్రములు లభించు చుండును కర్నూలు ప్రాంతమందలి బంగనపల్లి లోను గుంటూరు కృష్ణ కడప కర్నూలు అనంతపురంజిల్లాలలోని నదీ పదములయందలి గులకరాతి సమూహములలోను వజ్రములు విశేషముగ లభించుచుండెడివి పూర్వము గోదావరీ తీరమున భద్రాచలం ప్రాంతమందును గుంటూరు జిల్లాలో కొల్లూరు సమీప మందలి కృష్ణాతీరమందును 550 లో వజ్రములకై ఖనన కార్యము ప్రారంభించబడినది 16వ శతాబ్దిలో రావల్ కొండ వద్ద కూడ వజ్రపుగని యుండెడిదని టావర్నియర్ అనునాతడు వ్రాసియున్నాడు ప్రస్తుతము రామల్లకోట అని పిలువబడు ఆ ప్రాంతములో క్రిందటి రెండుమూడు సంవత్సరములలో 85 వజ్రములు దొరికెనట! అవి బెంగుళూరులో వేలమునందు విక్రయించ బడినవి

**ఇండోనీషియా** ఈ దేశములో ఇంతవరకు తెలియ వచ్చిన వజ్రపుగనులు బోర్నియో ద్వీపములో యున్నవి. అవి పడమటి తీరమందలి నదీనదములలో నుండు గులకరాతి సమూహములో నెలకొనియున్నవి. ఇట్టి గనులు పోన్‌ట్యానక్ ప్రాంతమందలి లాండక్ దిలోను దాని ఉపనదులలోను రియాంకన్నన్ రియాంకవా అను నదుల వెంటను కలవు.

**బ్రెజిల్** దక్షిణ అమెరికాలో బ్రెజిల్ దేశమందలి మినాస్‌గిరాస్ రాష్ట్రములో డైమెంటినా అనుచోట వజ్రములు మొదటిసారిగా కనుగొనబడినవి. మాటోగ్రాసో బాహాయా గోయాజ్ అమెజోనాస్ పరానా సవాపాలో అను శాఖలలో కూడ ముఖ్యములైన వజ్రపు గనులున్నవి. ముఖ్యముగా ఇచ్చట వాతాహతి నొందిన జారతమనగు శిలలలో మంచి వజ్రములు లభించును. ఇవి 4-5 వేల అడుగుల ఎత్తుగల సమతలములలో నుండును. ఇచ్చటి వజ్రములు సాధారణముగా చిన్నవైనను మిగుల నాణ్యమైనవి. ఒక్కొక్కచోట చాలబరువైన కార్బ్ వజ్రములుకూడ లభ్యమగును (ఉదా 1895 సం॥లో లభించిన 3195 5 కారట్ల బరువుగల వజ్రము)

**దక్షిణాఫ్రికా** 1866 లో ఆరంజి నదిలోని గులకరుప్పలలో మొదటిసారిగా వజ్రము లభించెను. అటుపై ఆరంజి ఫ్రీస్టేటు రాష్ట్రములో వజ్రములు కల్గిన కింబర్లైటు శిలలు కన్గొనబడినవి. శీఘ్రకాలములోనే ఆరంజిఫ్రీస్టేటు ట్రాన్స్‌వాలు రాష్ట్రములలో కూడ వజ్రపుగనులు బయటపడినవి. ఇట్లే బసుటోలాండు రాష్ట్రములోని కా నదీ తీరమందు కూడ 1956 లో మూడు కింబర్లైటు కడ్డీగొట్టములు కనుగొనబడినవి. ఈ ప్రాంతము లన్నిటిలో ఖననకార్యక్రమము కొనసాగుచున్నది. ప్రపంచములోకెల్ల అధిక మూల్యమును నాణ్యమును కల్గిన పారిశ్రామిక అలంకారిక రత్నవజ్రములు దక్షిణాఫ్రికాలో ఉత్పత్తియగుచున్నవి. ఇప్పటివరకు ప్రపంచములోకెల్ల పెద్దదైన కులినన్ వజ్రము (3106 కారట్లు కలది) ట్రాన్స్‌వాల్ రాష్ట్రమందలి ప్రిటోరియా వద్దనున్న ప్రిమియర్ గనిలో లభించెను. అచ్చటనేగల కాన్లిన్ గని సమ చతుర్భుజ గోళాకారమైన రత్న వజ్రములకును పారిశ్రామిక వజ్రములకును ప్రసిద్ధి.

**కాంగో** ఆఫ్రికా ఖండములోని కాంగో దేశములో రండలంగా అను సమతలములో వజ్రములుగల కింబర్లైటు శిలలు కలవు. వజ్రోత్పత్తి ముఖ్యముగా ఈ దేశమందలి కటంగా రాష్ట్రములో జరుగుచున్నది. ఆగ్నేయ కాంగోలోని కసాయి నదివెంబడి వజ్రములకై ఖననము జరుగుచున్నది. వజ్రోత్పత్తియందు కాంగో ప్రపంచములోకెల్ల ప్రథమ దేశము. ఉత్పత్తి వ్యయమునందు ప్రపంచ మంతటిలో దక్షిణాఫ్రికాది తరువాతి స్థానము.

**టాంగనీక** విక్టోరియా సరస్సుకు దక్షిణమునందున్న నదీతీరమందలి గులకరాళ్లలో 1910 లో మొట్టమొదటి వజ్రము లభించెను. ఇచ్చటి లేత గులాబీరంగు వజ్రములు అత్యంత నాణ్యమైనవని జగత్ప్రసిద్ధమైన)

**సియారాలియోన్** ముదురాకుపచ్చ రంగుగల వజ్రములు ఈ దేశమందుగల గులకరాతి సమూహములలో లభించును. ఈ గులకరాతి సమూహములు బహువిస్తీర్ణములో వ్యాపించి యున్నవి. ఇట్టి గులకరాతి సమూహము టాంగో వద్దనున్న ఒక వాగులోను సేవా నదిలోను దాని ఉపనదులలోను గలవు. ఇచ్చటి వజ్రములు అంత నాణ్యమైనవి కావు. 1930 లో మొదటిసారిగా ఈ దేశములో వజ్రము కనుగొనబడినది. 1945 లో 770 కారట్ల బరువుగల వజ్రము లభ్యమైనది.

ఘనా బ్రిటిష్‌గయానా బొలివియా వెనిజులా రష్యా మున్నగు దేశములలోకూడ నదీ లోయలందలి గులకరాళ్లలో వజ్రములు లభించెను. బ్రిటిష్‌గయానా వజ్రములు బూడిదవర్ణము గలవి.

**ఉపయోగములు** వజ్రములు విశేషముగా ఆభరణములలో అలంకారము కొరకుపయోగింప బడుచున్నవి. అందుకుపయోగపడని కార్బనాడో బార్టావంటి వజ్రములు పారిశ్రామికముగా ఉపయోగింప బడుచున్నవి. ఈ చిన్న వజ్రములు పొదగబడిన భాగములను బోరింగు యంత్రములలో అత్యధికముగా వాడుదురు. లోహములతో లోహ మిశ్రమములతో తయారైన పారిశ్రామిక యంత్ర భాగములను సున్నితముగా పూర్తిచేయుటకును పలువిధములైన శిలలను చెక్కుటకును కోత పనిముట్ల భాగములుగా ఈ తరగతి వజ్రముల నుపయోగించు చున్నారు. వజ్రపు పొడిని జిగట పదార్థములతో కలిపి మెరుగు పెట్టుట కుపయోగించు చున్నారు. కొంచెము పెద్ద పరిమాణముగల వజ్రములలో తగుమాత్రమైన బెజ్జమును తొలిచి విద్యుత్ బల్బులలోనుండు ఫిలమెంటును ఆ బెజ్జముద్వారా లాగి ఫిలమెంటుకు అవసరమైన సన్నదనము కల్గునట్లు తయారు

చేయుదురు

పెద్ద పెద్ద వజ్రములు ప్రాచీన ప్రణయ గాథలతోను అదృష్ట దురదృష్టములతోను సాహస కార్యములతోను సంబంధము కల్గియున్నవి దురదృష్ట సంఘటనములను తొలగించుటకై ఆ కాలములలో వజ్రములు మరల మరల సానపెట్టబడి చిన్నవిగా చేయబడెడివట! మరికొన్ని విధ్వంసముకూడ చేయబడెడివట! ఒక్క భారతదేశమునందే వజ్రములకిట్టి మూఢనమ్మకములు మెండుగా కల్పింపబడినవి

ప్రఖ్యాత వజ్రములు 1 కోహినూరు వజ్రము-ఇది ప్రపంచ ప్రఖ్యాతిగల భారతీయ వజ్రము దీని పూర్వచరిత్ర అస్పష్టముగ నున్నది పూర్వమిది మాళ్వదేశపు రాజుల యొద్ద అలంకార ప్రాయముగ వందలాది సంవత్సరము లుండెనట! 1304లో అల్లావుద్దీన్ ఖిల్జీ మాళ్వరాష్ట్రము నాక్రమించినప్పుడు ఈ వజ్రమును స్వాధీన పరచుకొని ఢిల్లీకి కొనిపోయెనట! 1526లో ఇది గ్వాలియర్ మహారాజు అధీనములోనికి వచ్చినది మరల ఇది ఢిల్లీకి ఎప్పుడు చేరినదో తెలియదు 1739 లో నాదిర్షా ఢిల్లీని కొల్లగొట్టినప్పుడు ఈ కోహినూరు వజ్రమాతనికి దక్కినది డల్హౌసిప్రభువు లాహోరును 1850 లో జయించినప్పుడు ఆతనికీ వజ్రము చిక్కినది కొలది దోషములతో గులాబీకోత గల ఈ వజ్రమును తూచగా దానిబరువు $186\frac{1}{16}$ కారట్లని తెలియ వచ్చినది ఆ దోషములు తొలగుటకది సానపెట్టబడగా తూకములో 80 కారట్లు తరుగుదల వచ్చెను ప్రస్తుతమీ కోహినూరు వజ్రము ఆంగ్ల రాజ్యాభరణములలో ఒకటిగా భాసించుచున్నది

2 గ్రేట్ మొగల్ వజ్రము-1650 లో గుంటూరు జిల్లాలోని కొల్లూరువద్ద మండిన గనులలో లభ్యమైన 787½ కారట్లుగల వజ్రమిది గులాబీకోతలో సానపెట్టబడిన పిదప 280 కారట్లకు దీని బరువు తగ్గెను ప్రపంచచరిత్ర కల్లోలితమైన సమయమున లభించిన చరిత్ర ప్రాముఖ్యము గలదీవజ్రము ఎమిర్ జెమ్లా అను పారసీక సాహసికుడు గోల్కొండ యందుండి నైజాము రాజ్యమును ధ్వంసము చేయించుటకై ఈవజ్రమును ఔరంగజేబుకు లంచముగా ఇచ్చెనట! ఆ సమయమునందే తండ్రియగు షాజహానును ఔరంగజేబు పదభ్రష్టుని చేసెను నాదిర్షా ఢిల్లీని కొల్లగొట్టి ఈ వజ్రమును పర్షియాకు తీసికొనిపోగా నాదిర్షా అనుచరులాతనిని వధించి ఆ వజ్రమును స్వాధీనము చేసికొనిరట! తుదకు పర్షియాలోనే ఏ కారణముననో ఈ వజ్రము ధ్వంసము చేయబడినట్లు తెలియుచున్నది

3 ఆర్లాఫ్ వజ్రము-ఈ వజ్రమెప్పుడెట్లు లభించెనో ఇతమిత్థమని చెప్పజాలము శ్రీరంగములోని రంగనాథస్వామి విగ్రహపు నేత్రగోళములనుండి ఈ వజ్రము ఊడబెరుకబడి బిందను కొనిపోబడినదని వినికిడి అనంతరము హాలెండు రాజధానియగు ఆమ్స్టర్ డామ్ లోని రత్నాలవర్తకునకు అది అమ్మబడగా అతడు దానిని తిరిగి సాన పెట్టినాడట! లేత పసుపువర్ణము గల ఈ వజ్రమును రష్యా యువరాజగు ఆర్లాఫ్ దీనిని ఆ వర్తకునివద్ద కొని రాణియగు రెండవ కేథరైనుకు ప్రేమ కానుకగా ఇచ్చెనట! అనంతరమిది రష్యా రాజ్యాభరణ చిహ్నముగా కొంతకాలము వెలుగొందెను

ప్రపంచ ప్రఖ్యాతిగనిన ఇతర వజ్రములలో 1 కులినన్ 2 బ్రగాంజా 3 ఎక్సెల్సియార్ 4 ప్రెసిడెంట్ వర్గాస్ 5 జోంకర్ 6 జూబిలీ 7 ఎట్ అను నామములు ధరించినవి పేరెన్నిక గనినవి ఈ వజ్రములు ఐరోపా ఆసియా ఖండములందును ఇతర దేశములందును మహారాజులవద్ద కోటీశ్వరులవద్ద వారివారి ఆభరణములలో పొదుగబడి ప్రకాశమానముగా వెలుగొందుచున్నవి

జి వి రా

## వడ్డీసమస్య

ప్రాచీన తత్త్వవేత్తలు వడ్డీవిధానమును ఆమోదించియుండలేదు గ్రీకు వేదాంతి ఆరిస్టాటిలు రోమను నీతిజ్ఞుడు సిసరో భారతీయ రాజధర్మవేత్త చాణక్యుడు వడ్డీపద్ధతిని ఖండించిరి బైబిలునందలి మోసెస్ బోధించిన ధర్మనీతి వడ్డీ వసూలు పాపమని భావించుటవలన క్రైస్తవ వర్తకులు యూరపు చరిత్రలోని మధ్యయుగములందు వడ్డీ వ్యాపారమున పాల్గొనలేదు దానిని యూదులకే వదలిపెట్టిరి షేక్స్పియర్ రచించిన వెనీస్ వర్తకుడు అను నాటకములో షైలాకు పాత్ర ఎట్టిదో తెలియని పాఠకుడు బహుశః ఉండడు

ఆధునిక ఆర్థికవ్యవస్థ ఆవిర్భవించుటకు ముందు వాణిజ్యరంగమున ఇట్టి భావములు ప్రబలుటకు కారణములు గలవు ఉత్పత్తికొరకై గాక ఉపభోగమునకే (consumption) ఋణము లాకాలమున తీసికొనబడుచుండెడివి ఇందువలన ఋణగ్రస్తులనేకులకు అప్పుతీర్చు స్తోమత కాలక్రమమున పెరుగుటకు బదులు తరుగుచుండెడిది కావున వీలైనంత హెచ్చు వడ్డీతో వీలైనంత తక్కువకాలములో వడ్డీయే

అసలు ను మించియుండునంతగ తీసికొనవలసిన పరిస్థితులేర్పడి ఋణగ్రస్తులు అప్పిచ్చినవారిచే అనేకవిధముల బాధింప బడుటయు జరిగినది. ప్రాచీన మధ్యయుగముల సంస్కృతి ననుసరించి ఇట్లు వడ్డీ వ్యాపారము అనీతియనియు పాపమనియు భావింపబడెను.

వడ్డీ సిద్ధాంతములను ప్రవచించు సందర్భమున అర్థ శాస్త్రజ్ఞుల రచనలలో రెండు మౌలికాంశములు ముచ్చటించ బడుచున్నవి.

(1) వడ్డీ ఏ ఆర్థిక కారణములవలన ఉత్పన్నమగు చున్నది ?

(2) ఏదేని ఒకసమయమున వడ్డీ రేటు ఫలానా విధముగనుండుటకు కారణమేమి ? - అనునవి. మొదటి అంశ మున (i) సీమాంతిక ఉత్పాదకత సిద్ధాంతము (Marginal Productivity Theory) (ii) ఉపభోగస్తంభన లేక నిరీక్షణ సిద్ధాంతములు (Abstinence or waiting theories) (iii) ఆస్ట్రియను సిద్ధాంతము (iv) కాలాభిమాన సిద్ధాంతము (Time Preference Theory) అనునవి చర్చించెను. కాగా రెండవ అంశమున (i) క్లాసికల్ సిద్ధాంతము (ii) ఋణనిధుల సిద్ధాంతము (Lonable Funds Theory) (iii) కీన్సీయ తరళతాభిమాన సిద్ధాంతము (Liquidity Preference Theory) అనునవి స్పష్టమొనర్చెను. ఈ సిద్ధాంతముల తర్కమును విపులీకరించవలసిన అవసరమెంతేని కలదు.

ఉత్పత్తిసాధనములన్నిటి ప్రతిఫలములను నిర్దేశించు సూత్రముగా జె. బి. క్లార్కు, విక్‌స్టైడ్‌లచే ప్రవచించబడిన సీమాంత ఉత్పాదకతా పంపిణీ సిద్ధాంతమొకటున్నది (Marginal productivity theory of distribution). పెట్టుబడికి గల ఉత్పాదకత వడ్డీకి కారణమని ఈ సూత్రము తెల్పును. పెట్టుబడి వస్తువులను (capital goods) ఉపయో గించుటద్వారా అధికోత్పత్తి సాగుచున్నది. శ్రమకాని మరి ఏ ఇతర ఉత్పత్తి సాధనముకాని తనంతటతాను సాధించిన విలువకంటె పెట్టుబడితో అవి కలిసి సాధించిన వస్తువుయొక్క విలువ హెచ్చు. ఇతర ఉత్పత్తిసాధనముల ఉపయోగ పరిమితిని అట్లేయుంచి, మరియొక పెట్టుబడి యూనిట్‌ను ఒక పారిశ్రామికవేత్త అధికముగా వినియోగించెనుకొని నచో ఈ ప్రక్రియవలన ఉత్పత్తి పరిమితిలో అధికముగా కల్గిన మార్పు, పెట్టుబడి వస్తువుయొక్క ఉత్పాదకతను తెల్పును. పారిశ్రామికోత్పత్తియు క్షీణఫలముల న్యాయము (Law of Diminishing Returns) ననుసరించి జరుగును కదా! కావున అధికముగా ఉద్యోగించిన పెట్టుబడి యూనిట్టుకు సాధించు ఉత్పాదకత అట్లు ఉద్యోగించిన పెట్టుబడి యూని ట్టుకు చెల్లింపబడు ధరకు - అనగా వడ్డీ రేటుకు - సమానమగు నంతవరకు పెట్టుబడి వస్తువుల విశేష వినియోగము సాగు చుండును. పై చెప్పిన రెండును సరిసమానమైన సందర్భ ములో ఏర్పడు ఉత్పాదకతను పెట్టుబడియొక్క సీమాంత ఉత్పాదకత అందురు. ఈ సూత్రము ననుసరించి వడ్డీ, పెట్టుబడి సీమాంత ఉత్పాదకతకు చెల్లించిన మూల్యమగును. ఈ సిద్ధాంత విపులీకరణమున ఒక తర్కలోపమున్నది. ఉత్పత్తి మూల్యము అన్ని ఉత్పత్తిసాధనముల సమష్టి కృషిపై ఆధారపడియుండగా వాటిని విడదీసి పెట్టుబడి ఉత్పాదకత వలన పెరిగిన మూల్యమిదియనియు శ్రామికుల ఉత్పాదక శక్తివలన పెరిగిన మూల్యమిదియనియు నిర్దేశించి చెప్పుట సాధ్యముకాదు.

సీనియర్ అను అర్థశాస్త్రవేత్త ఉపభోగస్తంభన సిద్ధాంతమును ప్రతిపాదించెను. రేపుకన్న నేడువోయి కావున జనులెవ్వరైనను నేటివస్తు వినియోగమును తగ్గించుకొని దానిని రేపటికి వాయిదావేసినచో వారొక త్యాగమును ప్రకటించుచున్నారని ఈ సిద్ధాంతమునకర్థము. ఉపభోగవస్తు వుల ననుభవించుటలో చూపబడిన పరిత్యాగమునకు ప్రత్యా మ్నాయముగా వేరొక ప్రతిఫలముండవలెనుకదా! అదే వడ్డీ. వ్యవస్థయే ఈ సిద్ధాంత ప్రవచనమున శాస్త్రజ్ఞులుపయో గించిన పదములలో నొక లోపమున్నది. ఉపభోగస్తంభన, పరిత్యాగము అనునవి వాస్తవముగా జరుగుటలేదు. ధనవం తులు ఆదాచేయుటలో త్యాగమేమున్నది! ఉపభోగమెట్లు స్తంభించుచున్నది? వారి ఆదాయమునంతను ఖర్చు చేయ గలరా? పొదుపు దానంతటదియే సంభవించుచున్నదికదా!

కావున అల్‌ఫ్రెడ్ మార్షల్ ఈ మాటలకు బదులు నిరీక్షణ అను పదమును వాడెను. వస్తు వినియోగమును తాత్కాలికముగ మాత్రమే మాని భవిష్యత్తులో అనుభ వించుటకు జనులు నిరీక్షించుచున్నారని దీని తాత్పర్యము. ఇది శాశ్వతముగా ఉపభోగస్తంభనము కాదుగదా! కేవలము నిరీక్షణము మాత్రమేయగును. ఇందుకు చెల్లించు ప్రతి ఫలము వడ్డీ. పెట్టుబడికి గిరాకీ ఏల కల్గుచున్నదో ఈ సిద్ధాంత

తము లు తెల్పుటలేదు

తాత్కాలిక భవిష్యదనుభవముల నడుమగల భేదాను విపులీకరించిన ఆస్ట్రియను సిద్ధాంతవేత్త బాంబావర్క్ అను నతడు ఇట్లు వచించెను

(i) మానవస్వభావదృష్ట్యా భవిష్యత్తులో ఉద్భవించ గల వాంఛలతో పోల్చుచో ప్రస్తుతపువాంఛలు ఎంతయు బలవత్తరములు ఏవి ఎట్లు ముఖ్యమో కోరికల పుట్టలైన మానవులు సరిగా నిర్ణయించుకోలేరు నేటి వాంఛానుభవ రమ్యతను వారు రంగులలో చిత్రించుకొని భవిష్యత్తుకు తక్కువ విలువనిత్తురు మానవుల బలహీనత అట్టిది (ii) వస్తు పరిమితి రానున్న రోజులలో పెరిగి ఈనాటికంటె ఎక్కువ వస్తువులు పొందుటకు వీలేర్పడునని భావించి వారు ఈనాటి వస్తువులకాపాదించు విలువ హెచ్చు కావున ఈనాటి ద్రవ్యమును వినియోగదారులు రేపు వాడుకొమనట్లు చేయ వలెననిన వారికి వడ్డీ ఆశ చూపించవలెను

ఈ అభిప్రాయములనే ఆధారముగా వాటిని పెంపు చేసికొని ఇర్వింగ్ ఫిషర్ అను నతడు కాలాభిమానసిద్ధాం తము'ను రూపొందించెను ప్రస్తుతము ప్రజలు ధనమును వెచ్చించుటకై చూపు తహతహకు వెనుకగల అంశముల నాతడిట్లు పేర్కొనెను (i) వ్యక్తుల ఆదాయములు ఎక్కువ ఆదాయముగల వ్యక్తులు తమ ప్రస్తుత వాంఛలను సులభముగా తీర్చుకొనగల్గుదురు సామాన్య వినియోగ దారులవలె వారు ప్రస్తుతమునకే హెచ్చు విలువ నీయరు ఇతరులతో పోల్చినపుడు వారు భవిష్యత్తునకిచ్చు విలువ హెచ్చు కాని నీదవారికి నేటితో పోల్చిన రేపనునది సున్న (ii) కాల క్రమేణ ఆదాయములలో కల్గు మార్పు క్రమశః ఆదాయ ములలో పెరుగుదల రాని వ్యక్తులు ఎప్పటికప్పుడే టమడబ్బు తెచ్చు సుఖములను అనుభవించుటకు ఉవ్విళ్ళూరుదురు (iii) వ్యక్తిగత లక్షణములు ముందుచూపు జాగ్రత్తగల వ్యక్తులమాత్రము భవిష్యత్తున కెక్కువ విలువ నీయగలరు కావున జనులు ప్రస్తుత వినియోగమును తగ్గించుకొమనట్లు చేయవలెననినచో వడ్డీ అను ఎరకావలెను

వడ్డీ వ్యవస్థకు ప్రాతిపదిక ఏది యను విషయమును సూత్రీకరించిన పై సిద్ధాంతము లన్నిటియందు కన్పట్టు లోప ములు ఇవి (i) సమాజమునందలి వనరులన్నియు పూర్తిగా వినియోగింపబడుచున్నట్లు ఇవి భావించుచున్నవి ఇది సత్య దూరము (ii) పైన ప్రతిపాదింపబడిన పరిత్యాగము నిరీక్షణ తత్కాలిక భవిష్యద్విలువలలోగల తారతమ్యదృష్టి అను అంశములకును సమాజమున నిల్వలేర్పడుటకును ఏమియు సంబంధములేదు కాగా పెట్టుబడికి గల అవకాశములే వడ్డీ కారణములు - అని యొక విమర్శనము (iii) ఈనాటి సమా జములో ముఖ్యపాత్ర నిర్వహించుచున్న బ్యాంకులు ద్రవ్య చలామణిని వృద్ధిచేసి, పరపతిని సృష్టించి అప్పులిచ్చుచున్నవి ఈ అంశము ఈ సిద్ధాంతముల దృష్టిలో లేదు

కీన్సుపండితుడు ప్రవచించిన తరళతాభిమాన సిద్ధాం తము'న ఈ విమర్శలకు సమాధానము కలదు ఈ సూత్రము ననుసరించి ద్రవ్యమునకుగల గిరాకీ సరఫరాలు వడ్డీరేటును నిర్ణయించును వెంటనే ఖర్చుచేయుటకు వీలుగా చేతియం దుంచుకొను డబ్బు జాప్యము ఆటంకము లేక బ్యాంకు నుండి తీసికొనుటకు అనువైన పద్దులోనున్న పైకము ప్రజల తరళ తాభిమానమునకు చిహ్నములు క్రయ వ్యవహారోద్దేశము (Transaction motive) పూర్వ జాగ్రత్తోద్దేశము (Pre cautionary motive) పట్టావ్యాపారోద్దేశము (Speculative motive) అను మూడంశములక్రింద తరళతాభిమాన మును పరిశీలింపవగును (i) క్రయవ్యవహారోద్దేశము ఆదా యము సంక్రమించు కాలవ్యవధిపై ఆధారపడియుండును సాధారణకూలీలకు ఏరోజుకూలి ఆరోజు ముట్టును కొన్ని దేశములలో పారిశ్రామిక కార్మికులకు వారమునకొకసారి కూలి ఇత్తురు భారతదేశమున ఉద్యోగస్థులకు నెలకొకసారి జీతములు వచ్చును వీరు దైనందినావసరములకు కొంత ద్రవ్యమును సిద్ధముగా నుంచుకొనవలెను ఇట్లే పారిశ్రామిక వేత్తలును ముడిసరకులను కొనుటకుగాని కార్మికులకు వేత నములిచ్చుటకుగాని ఇతర ప్రస్తుతావసరములకుగాని కొంత ధనమును చేతియందుంచుకొనవలెను (ii) డాక్టరు బిల్లుల వంటి అవాంతరముల నెదుర్కొనుటకు జాగ్రత్తపరచుకొన బడిన ద్రవ్యము పూర్వ జాగ్రతోద్దేశమునకు గురుతు ఇవి రెండును వడ్డీరేటు ప్రభావమునకు లొంగిరావు వడ్డీరేటు హెచ్చు గానున్నను తక్కువగానున్నను ఈ పద్దులక్రింద కావలసిన సొమ్ము ఖర్చు చేయబడవలసినదే కదా! (iii) కాని వడ్డీ రేటుకును పట్టావ్యాపారదృష్ట్యా ద్రవ్యమునకు గల తరళ తాభిమానమునకును గల సంబంధము అవినాభావము ఈ విధముగా కీన్సు ప్రతిపాదించిన వడ్డీ సిద్ధాంతమునందు పట్టా

వ్యాపారోద్దేశమునకు ప్రాముఖ్యమేర్పడుచున్నది ద్రవ్యము కూడ ఒక వస్తువే తక్కిన వస్తువులవలె ఇది సమాజమునందు కొన్ని నిర్ణీతమైన విధులను నిర్వర్తించుటచే దానికిగల గిరాకి మేరకు అది సరఫరా చేయబడవలెను ఆర్థిక సమాజము సమతూలనస్థితి (Equilibrium) యందుండవలెననిచో పైన చెప్పిన మూడు ఉద్దేశములదృష్ట్యా ఏర్పడు తరళతాభిమాన మును సంతృప్తిపరచుటకు వలసిన ద్రవ్యము సమాజమునకు కావలెను

వడ్డీరేటు తగ్గి పెట్టుబడులు పెరిగి ఆదాయోద్యోగ ములు హెచ్చుచు సమాజము పురోగమించునట్లు ద్రవ్య సరఫరా పెంచవచ్చునని ఈ సిద్ధాంతమందలి నీతి కాని సమాజము సంపూర్ణోద్యోగస్థితికి ఎంత తక్కువగానున్నను పైన చెప్పిన కార్యసాధనకు ద్రవ్యము సరఫరాయగుచు సాగిపోయినచో సరియైన పెట్టుబడి వ్యూహము లేని కారణ మున ద్రవ్యోల్బణపరిస్థితులు ఏర్పడ పోవు ఈ అంశమును కీన్సు చర్చించలేదు అది ఈ సిద్ధాంతమందలి లోపము కాని దానిని అతని అనుయాయులు చర్చించి తదనుగుణముగా అభివృద్ధిచేసిరి

క్లాసికల్ సిద్ధాంతము నిల్వలయొక్క సరఫరాను పెట్టుబడికి గల గిరాకీని పరిశీలించును వడ్డీరేటు హెచ్చు చున్నకొలది నిల్వల సరఫరా హెచ్చును వడ్డీరేటు తగ్గు చున్నకొలది పెట్టుబడిగిరాకి పెరుగును ఈ రెండు చాపముల యొక్క ఖండన బిందువువద్ద వడ్డీరేటు ఏర్పడుచున్నది వడ్డీ వ్యవస్థయొక్క లోతుపాతులను తరచిచూడకుండుటచే ఈ సిద్ధాంతమందలి లోపము ద్రవ్యముయొక్క పాత్రను ఇది పరిశీలింపనేలేదు

"ఋణనిధుల సిద్ధాంతము ను ప్రవేశపెట్టిన విక్సెల్ పైన పేర్కొనబడిన రెండు చాపములకు ద్రవ్య సరఫరా చాప మును కలిపి ద్రవ్యపరిమితి నిల్వల సరఫరాల కూడలి ఫలిత ముగా ఏర్పడు మొత్తమును ఒక చాపముగా పరిశీలించెను

ఆధునిక పాశ్చాత్య ఆర్థిక ప్రపంచమున కీన్సుకును కీన్సీయులకునుగల ప్రాబల్యఫలితముగా తరళతావాదమునుండి ఉద్భవించిన ఈ దిగువ సలహాలే ఆర్థిక విధానమున పాటిం బడుచున్నవి (i) కేంద్ర బ్యాంకులు వడ్డీరేటును తగ్గించుట (ii) వైయక్తిక సాహసోత్పత్తిదారులు (private entrepreneurs) ముందంజవేయని పరిస్థితులలో ప్రభుత్వము పరిశ్రమ లను చేపట్టుట (iii) తరుగుబడ్జెట్టు విధానముద్వారా ద్రవ్య పరిమితిని అధికముచేయుట మన్న అనుయాయులు ద్రవ్యో ల్బణ రహిత ఆర్థికాభివృద్ధికి పెట్టుబడి వ్యూహమును జోడించెదరు

సిద్ధాంతరంగమునుండి వాస్తవప్రపంచమునకు మరలు నపుడు ద్రవ్యము వహించు పాత్రతోపాటు పరపతి ద్రవ్య మును సృష్టించు బ్యాంకులు ఋణములు మంజూరుచేయు పరపతి సహకార సంఘములు ఆదిగాగల అనేక సంస్థల ప్రాముఖ్యమును మనము గుర్తించవలెను ఇవన్నియు పెట్టుబడిని సరఫరా చేయునట్టియు కొనుగోలు చేయునట్టియు వ్యక్తుల యొక్క సంస్థలయొక్క విపణులు ఇచటి వడ్డీరేటు నిర్దేశింప బడిన వడ్డీరేటు వెనుకబడిన గ్రామీణ ప్రాంతములలోని షావు కారు వసూలుచేయు వడ్డీ ఎక్కువగా నుండుటకు అది సంఘటిత విపణి కాకపోవుటయే కారణము

గ్రామీణ ప్రాంతములలోను వడ్డీరేటు హెచ్చుగానున్న ఇతర స్థలములలోను వడ్డీరేటు ఎందుకు హెచ్చుగానున్నది? వడ్డీని మొత్తమువడ్డీ (Gross interest) నికరవడ్డీ (Net interest) అని విభజింపవగును అస్తవ్యస్తమైన ఆర్థిక పరి స్థితులుగల వెనుకబడ్డ ప్రాంతములలో ఋణములు కేవలము ఋణములుమాత్రమే అవి పెట్టుబడికి దోహదకారులు కావు వాటి వినియోగము ఉత్పత్తి పెంపుదలకాక ఉపభోగము (Consumption) మాత్రమే ఇట్టి ఋణస్థులు వాటిని తీర్చ గలరా? అప్పిచ్చువాడు లేని యూరిలో నివసింపవద్దని సుమతి శతకకారుని సలహా! ఈ అప్పులన్నియు నికరవడ్డీ వసూలుకు కాక మొత్తము వడ్డీ వసూలుకు దోహదకారులు కదా! సంఘటిత విపణులలో నికరవడ్డీ వసూలుచేయబడగా విపణిలేని ప్రాంతములలో వడ్డీయే కాని అసలు చెల్లింపలేని పరిస్థితు లుండుటవలన మొత్తము వడ్డీ వసూలు చేయబడుచున్నది ఉత్పత్తికికాక వినియోగమునకు అప్పులిచ్చుటకును షావుకారు వెనుదీయడు ఆ వ్యవస్థ అట్టిది సంఘటిత విపణిని వ్యాప్తి చేయుటయే దీనికి పరిష్కారము

దక్షిణభారత గ్రామములలో వడ్డీవ్యాపారస్థుడు షావు కారనియు ఉత్తర భారతములో మహాజన్ అనియు పిలువ బడుచున్నాడు ఇతడు ద్రవ్యవిపణి అవ్యవస్థతకు ప్రతీక 1955లో రిజర్వుబ్యాంకు నిర్వహించిన సర్వేననుసరించి 888 కోట్ల రూప్యములు లేదా గ్రామస్థులకు లభించు అప్పుల మొత్తములో 45 శాతము ఇతడే సరఫరా చేయుచున్నాడు.

ఇతని పద్ధతులను గురించి ప్రస్తావించుచు మహాజన్ ఉక్కు ఎడీలిలో మన గ్రామములు నలిగిపోవు చున్నవి అని వుల్ఫ్ అనునాతడు వ్రాసెను డార్లింగ్ అను అర్థశాస్త్ర రచయిత కూడ ఇట్టి భావములనే వెలిబుచ్చినాడు ఈ వడ్డీవ్యాపారి పలుకుబడికిగల కారణములను కేంద్ర బ్యాంకింగు ఎన్క్వయిరీ కమిటీ ఇట్లు నిరూపరచినది (1) ఇతడు గ్రామీణులకు మిక్కిలి అందుబాటులోనున్న వ్యక్తి తండ్రితాతల కాలమునుండి ఈ ఋణస్థులు ఋణదాతలు ఒకరినొకరు ఎరుగుదురు ఒకే గ్రామమున నివసించుటచే ఏమియు కుదువపెట్టకుండగనే వడ్డీ వ్యాపారి ఋణములనిచ్చును (2) వినియోగమునకు ఉత్పత్తికి కూడ ఋణముల నిచ్చుచు అతి రహస్యముగా వ్యాపారమును సాగించి, అప్పుతీసికొన్న వ్యక్తి పేరు పైకిపొక్కనీయక అతని మర్యాద కాపాడుచు అసలు చెల్లింపలేకున్నను వడ్డీని మాత్రము సకాలమునకు వసూలు చేయుచుండును; అత్యవసర పరిస్థితులలో తప్ప అతడు కోర్టుకెక్కక అవసరమైనచో ప్రస్తుతపు మొత్తమును చెల్లించుటకు పూర్వమే మరల ఋణమునిచ్చుచు తన విధానములను కొనసాగించుచుండును (3) సంవత్సరముల తరబడి వ్యాపారమును ఇట్లు సాగించుచు మితిమీరిన వడ్డీరేటుకు అప్పులనిచ్చి మొత్తము మీద అసలుకు మించిన వడ్డీని రాబట్టుట ఈతని పద్ధతి గ్రామీణ వర్తకుడుకూడ ఇతడే యగుటవలన పంటలకాలములో ఋణగ్రస్తుడైన వ్యవసాయదారునినుండి పంటను కళ్లములోనే తక్కువధరకు కొనుట ఇతనికి అసాధ్యముకాదు

ఋణగ్రస్తుల అజ్ఞానము నిరక్షరాస్యత ఆర్థికదుర్బలత్వము ఆధారముగా ఈ ఋణదాతలొనర్చుచున్న అకార్యములను కొన్ని కలవు (1) అప్పిచ్చుచున్న సమయమున ఆ సంవత్సరమునకగు వడ్డీనంతయు ముందుగనే వసూలుచేసి ఋణస్తునిచే మొత్తమంతయు ముట్టినట్లు రసీదుపొందుట (2) ఋణస్తుని వేలిముద్రను ఖాళీపత్రముపై గ్రహించి ఇచ్చినదానికంటె హెచ్చు మొత్తమును అందువేయుట (3) వసూళ్లు జరిగినప్పుడెల్ల తప్పుడు పద్దులు వ్రాయుట (4) ఋణము నిచ్చునపుడు ఇతర సమయములందు నజరానాలు వసూలు చేయుట ఈ సందర్భమున పేర్కొనదగినవి

ఈ మధ్యకాలమున వ్యవసాయదారులకు అప్పులుపెట్టు వృత్తిలో ప్రవేశించిన మరియొక వర్గము భూకామందులు పైన పేర్కొనబడిన రిజర్వుబ్యాంకు నివేదిక ననుసరించి ఈ భూకామందులు 187 కోట్ల రూప్యములు లేదా గ్రామస్తులకు అప్పుగా లభించు మొత్తములో 25 శాతము సరఫరా చేయుచున్నారు గ్రామ సహకార పరపతి సంఘములలో ఈ ఉభయవర్గములవారు ప్రవేశించి వాటిని స్వప్రయోజనములకు వాడుకొనుట గమనించదగిన అంశము కాగా సహకారీ-షావుకారీ యైన ఈ ద్విఫలకసాయము గ్రామీణుని కెట్టుపయోగ పడగలదు! ఈ అనర్థములను తొలగించుటకు నిర్మాణయుతమైన ద్రవ్యవిపణి (Organized money-market) యొక్క వ్యాప్తిని పెంచుచు దానిని సమర్థవంత మొనర్చుటయే క్రమేపి ఏకైక పరిష్కార మార్గము

సామ్యవాద సమాజమున కూడ వడ్డీవ్యవస్థయుండును కాని అందలి స్వల్పవడ్డీ వ్యక్తులకుకాక ఋణప్రదానము చేయు సంస్థలకు చెందును సామ్యవాద సమాజమునందును ఉత్పత్తి కొనసాగవలెనుగదా! ఉత్పత్తినుండి వినియోగమును వ్యవకలనము చేసినచో నిల్వలు వచ్చును నిల్వలకుగల ఆదరణ దృష్ట్యా వాటికొక సరఫరా ధర కలదు ఈ సరఫరాకు బాధ్యతవహించు సంస్థలకు అమూల్యము చెల్లింప బడవలెను అదియే వడ్డీరేటు ఐతే ఈ సంస్థలన్నియు జాతీయము చేయబడిన సంస్థలగుటచే వడ్డీరేటు నామమాత్రముగ నుండును సామ్యవాద గణితమున ఉత్పత్తి సమర్థతతో పురోగమించుచున్నదని నిర్ధారణగా తెలిసికొనుటకు వడ్డీ రేటునుకూడ ఉత్పత్తి ఖర్చులలో నొక అంశముగా తీసికొందురు సిద్ధాంతరీత్యా ఇట్లేయుండునని ఆస్కార్ లాంగ్ వంటి సామ్యవాద అర్థశాస్త్రజ్ఞులు ప్రకటించగా వాస్తవముగకూడ రష్యావంటి సామ్యవాద దేశములలో పరిస్థితులిట్లే యున్నవి

నూ కృ శా

## వనపర్తి

వనపర్తి మహబూబునగర (పాలమూరు) మండలమున ముఖ్యమగు తాలూకాపట్టణము ఇది వనపర్తి రోడ్డు స్టేషనుకు (సికింద్రాబాద్ - బెంగుళూరు రైల్వే రహదారి) 18 మైళ్ల దూరముననున్నది వనపర్తి తాలూకా వైశాల్యము 68 184 చ మైళ్లు గ్రామములు 159 జనాభా 1 38 254 అక్షరాస్యులు 19 148 గ్రామపంచాయతీలు 68 తటాకములు పెద్దవి చిన్నవి కలిసి 101

ఈ తాలూకా భూములన్నియు దేవమాతృకములే కృష్ణానది యీ తాలూకాకు దక్షిణదిశగా ప్రవహించుచున్నది

వనపర్తి సంస్థానముగ నున్నపుడు సంస్థానప్రభువులు పెద్ద తటాకములను కొన్ని త్రవ్వించియుండిరి. అందు వనపర్తికి 8 మైళ్ల దూరమున కానాయపల్లె దగ్గర రాణి శంకరమ్మ కట్టించిన శంకరసముద్రము అనునది ఒకటి. ఇది 9 10 గ్రామముల మాగాణి భూములను సస్యశ్యామల మొనర్చుచున్నది. మరియొకటి వనపర్తికి దాదాపు 13 మైళ్ల దూరమున శంకరంపేట దగ్గర రాజా ముమ్మడి రామేశ్వరరాయల జనని రాణి సరళాదేవి పేరిట నిర్మింపబడిన సరళాసాగర్ అనునది. రంగసముద్రము (రంగాపురమున) కృష్ణసముద్రము (కృష్ణాపురమున) అనునవికూడ పేర్కొనదగిన పెద్ద తటాకములు.

వనపర్తి తాలూకా కేంద్రమగుటచే అన్ని ప్రభుత్వ కార్యాలయములకు తగిన భవనములచ్చటనున్నవి. అందు పేర్కొనదగినవి సివిల్ ఆస్పత్రి బాలబాలికలకు ప్రత్యేకముగా బహుళార్థ సాధకోన్నత పాఠశాలలు కృష్ణదేవరాయ పాలిటెక్నిక్ తహసీలు మున్సిఫ్ మేజిస్ట్రేటు కార్యాలయములు పంచాయతీసమితి కార్యాలయము ప్రభుత్వ బస్సుడిపో బ్యాంకు భవనములు మొదలగునవి.

వనపర్తియందు సూత్రపట్టి అనువారలు నిర్మించిన గొప్పభవనములు పోటీపడుచున్నట్లు ఎదురు బదురుగా నుండును. ఈ పట్టణము స్వాతంత్ర్య లబ్ధివరకు మహారాజామందిరము నానుకొని కృష్ణరాయనగర్ అను పేరుతోను ఆగ్నేయదిశగా వల్లభనగర మను పేరుతోను క్రొంగ్రొత్త శోభను సంతరించుకొని పెరుగుచున్నది. 1968 - 1969 లో మంచినీటి పంపులను మ్యునిసిపాలిటీ వారేర్పరచియున్నారు. వనపర్తి తాలూకాలో పేర్కొనదగిన పెద్ద గ్రామములు కొత్తకోట వనపర్తిరోడ్డు (మదనాపురము) అడ్డాకుల పెబ్బేరు మున్నగునవి. వనపర్తిరోడ్డు పెద్ద వ్యాపారకేంద్రము. వేరుసెనగ వడ్లు కాయధాన్యముల రవాణి ఇందు అదు

వనపర్తి సంస్థానమునకు మొదటి రాజధాని సూగూరు. ఇది కృష్ణాతీరమున నున్నది. ఈ సంస్థానపాలకులలో నొకరైన మొదటి రామకృష్ణరాయలు తన రాజధానిని సూగూరు నుండి వనపర్తికి మార్చుట వలన దీనికి వనపర్తి సంస్థానమని పేరు లభించినది. సంస్థానపాలకుల గృహనామము జనుంపల్లి. వీరు మోటాటి శాఖకు చెందిన రెడ్లు. వీరి మూలపురుషుడు వేశముఖు వీరకృష్ణభూపతి. వీరిది పెనుకాలగోత్రము. దాదాపు 400 సం॥ల క్రింద కృష్ణభూపతి విజయనగర సామ్రాజ్యమునకు లోబడిన ఒక సామంతుడుగా కంద్యాలసీమలో అధికారము నెరపుచుండెనని ప్రతీతి. శ్రీకృష్ణదేవరాయలు విజయనగర సామ్రాజ్యము నేలుచున్నకాలమున ఈ కృష్ణభూపతి స్వతంత్రముగ నొక రెడ్డి రాజ్యమును స్థాపింపదలచి తనపరివారముతోను పోటరులతోను కలసి కృష్ణానది యుత్తరతీరముననున్న పానగంటి సీమకు తరలివచ్చి పాతపల్లి యను నొక గ్రామమును ప్రవేశించి యచటనుండరకు వాడదై యా ప్రాంతమును కొంత కొంత యాక్రమించి యేలుచు సూగూరు పట్టణమును రాజధానిగా చేసికొని పాలింపదొడగెను. తన తమ్ములకు సమీపమున కొంత నేలయిచ్చి యట రంగాపుర మను గ్రామమున వారిని నిలిపెను. క్రమముగా ఆ రాజచంద్రుడు అచ్చటి ప్రజల యాదరాభిమానముల బూరగొనుచు స్వీయభుజశక్తితో రాజ్యవిస్తృతిగావించుచుండెను. ఇతని నారాజమ్మని పుత్రులిర్వు రొకరి వెనుక నొకరు రాజ్యమేలిరి. అతని మునిమనుమడగు అష్టభాషా బహిరగోపాల రాయలు పేరెన్నిక గన్న రాజవరేణ్యుడు. వీరకృష్ణభూపతికి నాల్గవతరము వాడైన వేముడి వేంకటరెడ్డి పుత్రరత్నమీగోపాలరాయలు వనపర్తిరాజ వంశమునకు 'బహిరీ' బిరుదము సంపాదించిన మేటి. రాజన్యుడితడే షడ్విధప్రాకృతములు సంస్కృతాంధ్రములను ఎనిమిదింటిలో పాండిత్య ప్రతిభలు గలిగి కవనమల్లగలమేటి. ఈ రాజశేఖరుడు పెక్కురు పగతుల నోడించి రాజ్యవిస్తృతి గావించియు పండితకవిగోష్ఠుల నిర్వహించుచు నెందరో విద్వాంసుల బోషించియు లక్ష్మీసరస్వతుల కాశ్రయుడను పేరుగాంచెను. ఈ యష్టభాషా గోపాలరాయ ప్రభువుచే ఈ వంశచరిత్రకు నూతనాధ్యాయ మారంభమయ్యెను. గోపాలరాయలకు కుమారులు లేనందున వేంకటరెడ్డిని దత్తుడుగా గ్రహించియుండెను. గోపాలరాయలు క్రీ.శ. 1687లో పరమపదించెను. ఈ వేంకటరెడ్డి రాజేంద్రుడు ఢిల్లీ పాదుషాల నుండి సవై బిరుదునందెను. వేంకటరెడ్డి తన పాలక జనకుని పేరిట గోపాలుపేటయను నొక గ్రామమును నిర్మాణము చేయించి దీనిని పాలించుటకు రంగారెడ్డియను తన తమ్ముని నియమించెను. ఇదియే గోపాలుపేట సంస్థానము. వేంకటరెడ్డి కుమారులు గోపాలరాయలు జనుంపల్లి ప్రభువుల వంశము నందు పేర్కొనదగిన పాలకుడు మొదటి రామకృష్ణరాయలు క్రీ.శ. 1817 లో ఇతడు నిజాము నుండి 'రాజాబహద్దరు' బిరుదమునందెను.

ఆతని తరువాత ఈతని దత్తుడు రాజా మొదటి రామేశ్వర రాయ బహిరీ బలవంతు బహద్దరు ఈతడు బాల్యముననే రాజ్యాధికారమును చేపట్టి పేరు ప్రతిష్ఠలు సంపాదించెను అనేక యుద్ధములందు నిజామునకు కుంఫణీ (ఈస్టిండియా కంపెనీ) వారికి అండగానుండి సత్కారములనందెను కుంఫణీ వారి పాలనారీతులను ఇతడు మెలకువతో గమనించి తన సంస్థానమునందు శాశ్వతపన్ను వసూలు పద్ధతిని మొదటి సారిగా అమలుపరచెను మొదటి రామేశ్వరరాయలు ఆంగ్లభాషలో పండితులు ఉర్దూ ఫార్సీ అరబము మున్నగు భాషలందు వైదుష్యముగలవాడు మొదటి రామేశ్వరరాయల దత్తపుత్రుడైన రాజా రామకృష్ణరాయలు అకాలమరణము నందుట వలన రెండవ రామేశ్వరరాయలు దత్తుగా వచ్చెను ఈయన సమర్థుడు తన ప్రజ్ఞాపాటవము నుపయోగించి ప్రజానురంజకముగా సంస్థానము ను పాలించి బహుముఖముల వృద్ధిపరచెను కవులకు వేదశాస్త్ర పండితులకు మడిమాన్యముల నిచ్చి పోషించెను

కృష్ణదేవరాయలు రామదేవరాయలు రెండవ రామేశ్వర రాయల కుమారులు కృష్ణదేవరాయల ధర్మపత్ని రాణి సరళాదేవి ఈమె నుగాల రాజా నాయని వేంకటరంగారావు తనయ రామదేవరాయల యర్ధాంగియగు కుముదినిదేవి ప్రస్తుతము శాసనసభ్యురాలు ఈమె ఎంగళి వేంకటరామారెడ్డి కూతురు కృష్ణదేవరాయల కుమారుడగు రామేశ్వరరావు ఉన్నతవిద్యా పట్టభద్రుడు పోలీసు చర్యవరకు ఇతడు సంస్థాన ప్రభువుగానుండి ప్రజాహిత కార్యముల నొనర్చినవాడు ప్రస్తుతము పార్లమెంటు సభ్యుడు ఉస్మానియ విశ్వవిద్యాలయమున సెండికేట్ సభ్యుడు

**సాహితీపోషణము :** వనపర్తి సంస్థానప్రభువు లందరు విద్యాపోషకులే అందుకొందరు పండితులు రచయితలునై యుండిరి ఈ సంస్థాపసంపాదకులగు వీరకృష్ణభూపతికి (క్రీ శ 1510 - 1660) ఆరవతరమువాడగు రాజాబహిరీ గోపాలరాయలు ప్రసిద్ధుడు షడ్విధప్రాకృతము లందును సంస్కృతాంధ్రములందును సుదృఢమైన ప్రతిభావ్యుత్పత్తులు గలిగియుండుటచే అష్టభాషాకవి' యనుబిరుదును సమరాంగణ విజయుడగుటచే బహిరీ యనుబిరుదును ఇతని కన్వర్థములు చరిత్రకారులీప్రభువును సాధారణముగా అష్టభాషాగోపాలరాయడని వ్యవహరింతురు ఈతడు రామచంద్రోదయ మను యమకకావ్యమును తన తండ్రి ఇమ్మడి వేంకటరెడ్డి ప్రతిష్ఠించిన కోదండరామస్వామి స్తోత్రరూపములో సంస్కృతమునందు రచించెను ఈ కావ్యము పండితులకును అభేద్యముగ నుండుటచే దీనికి గీర్వాణభాషలో చక్కనివ్యాఖ్యానిని ప్రభువే రచించెను రంగాపురమున వెలసిన తమ యిలవేల్పగు రంగనాయకస్వామి వసంతోత్సవ వర్ణనమొనరు శృంగార మంజరీభాణ మను రూపకమునుగూడ ఇతడు సంస్కృతమున రచించెను ఆంధ్రభాషలో గూడ ఇతడు గ్రంథములు రచించినట్లు ప్రతీతి కలదుగాని యవి కాలగర్భమున అణగియుండును మొదటిరెండు గ్రంథములు ముద్రితములు

అష్టభాషా గోపాలరాయలు దక్షిణదేశయాత్ర చేయుచు ఆయాతీర్థక్షేత్రములందలి పండితరత్నముల నేరికొని తన యాస్థానము నందుంచుకొనెను బహుశతావధానాది ప్రతిష్ఠలు జరిపి సప్తసంతాన ప్రశస్తి నార్జించినవాడితడు ఇతని మేనల్లుడగు బిజ్జలతిమ్మ భూపాలుడు సంస్కృతమున మురారికృతమగు అనర్ఘరాఘవ నాటకమును శ్రవ్యపద్య కావ్యముగా అతిప్రౌఢశైలిలో అత్యంత మనోహరముగా విరచించెను తిమ్మభూపాలు డాకాలమున అలంపూరు సీమకు ప్రభువైయుండెను

వీరరాఘవీయవ్యాఖ్య వీరియాస్థాన పండితులైన శ్రీమాన్ వీరరాఘవాచార్యులు విశిష్టాద్వైతపరముగ భాగవతమునకు వీరరాఘవీయ మనుపేర వ్యాఖ్యను రచించిరి అఖిలవిశిష్టాద్వైతి ప్రపంచమునకు శిరోధార్యమైనదీవ్యాఖ్య వనపర్తి ప్రభువులు దీనిని ముద్రింపించియున్నారు

మొదటి రామేశ్వరరాయలతల్లి వనపర్తికి 3 మైళ్ళ దూరమున 18వ శతాబ్దియారంభమున రాజనగర మను నొక క్రొత్తగ్రామమును నిర్మించెను ప్రథమ రామకృష్ణరాయలపేరులో రాజనగరమున ప్రతిష్ఠింపబడిన రామకృష్ణస్వామి ఆలయమునందు ప్రతిసంవత్సరము కార్తిక శుద్ధ పూర్ణిమనాడు వేదశాస్త్ర పండిత సభలు జరిపి విద్వాంసులను ఉచితరీతి సత్కరించుట 1949 వరకు జరుగుచుండెను అట్లే రంగాపురమునందు రంగనాయకస్వామి బ్రహ్మోత్సవ సమయమున కవిగాయకాది మహావిద్వాంసుల సమ్మేళనము జరిపి సత్కరించుట పరిపాటి ఈసభలకు దూరప్రాంతముల నుండి విద్వత్కవిగాయక పండితులు పెక్కురు వచ్చి తగు గౌరవ మర్యాదల నందుచుండెడివారు,

గద్వాల చెన్నకేశవ శతకము పెద్దగుడి చెన్నకేశవ విలాసము రామేశ్వర విజయము మున్నగు కృతులు రచించి అరసు అయ్యనాచార్యులు క్రీ శ 1820 ప్రాంతమున వనపర్తి సమీప గ్రామమగు పెద్దమంగడియందు జీవించి యున్నవారు హొసదుర్గము కృష్ణమాచార్యులు ఈ సంస్థానమున శాస్త్రాధికారిగా నుండిరి విద్వత్కవిపుంగవులు వీరు శతాధిక గ్రంథ కర్తలు అలంకారమణిహారము ఉన్మత్తరాఘవము శ్లోకస్వరమాలిక ప్రసన్నానందలహరి రఘునాథవిజయము శ్రీకృష్ణసంగరత్నమాల శ్రీనివాస విలాసము శ్రీ రామాయణ వైభవము మున్నగు ఉత్తమ గ్రంథములను ఈయన రచించెను ఈయన తురీయాశ్రమ స్వీకారమొనర్చి మైసూరులోని పరకాల మఠ పీఠాధిపతులుగా విరాజిల్లిరి ఈతని సమీపబంధు హొసదుర్గము శ్రీనివాస రాఘవాచార్యులు బహు శాస్త్ర పండితులు

అకింతల సుబ్బాశాస్త్రి 19 వ శతాబ్ది మధ్యభాగమున జీవించి యుండిరి ఈయన కృష్ణాతీరమందున్న వేపర్ల గ్రామవాస్తవ్యులు భాష్యార్థ రత్నమాల యను గ్రంథము ఈయన రచన వనపర్తి సంస్థానాశ్రితులైన ఈయన అద్వైత వేదాంత నిష్ణాతులు ఒక ప్రహసనముగూడ ఈయన వ్రాసిరని వినికిడి

సంగంపల్లి నరసింహసిద్ధాంతి మహబూబునగరు జిల్లాలోని సంగంపల్లి వాస్తవ్యుడు ఈయన మైసూరు సంస్థానమున జ్యోతిశ్శాస్త్ర పరీక్షలో నుత్తీర్ణులై జీవితాంతమువరకు వార్షికమును గ్రహించినవారు భూభ్రమణ గ్రాంథికరసన మనునది ఈయన కృతి ఈయనకూడ వనపర్తిప్రభు సన్మానితుడే కాశీ విద్వాంసులు తగ్గుశాస్త్రి పాంగతులు శతాధిక శిష్యులను దీర్చిదిద్దిన శ్రీ మాన్ నంబాకం రాఘవాచార్యులు కంఠీరవాచార్యులు శిరోమణి కొట్టలూరి శేషాచార్యులు వనపర్తి సంస్థాన విద్వాంసులు

ఏకవీంద్రఘంటా పంచాననులును శతావధానులును నైన తిరుపతి వేంకటకవులును కార్యమపూడి రాజమన్నారు కవి గొల్లపిన్ని మల్లికార్జునశాస్త్రి మున్నగు సదండ పండిత కవులు వనపర్తి ప్రభువులచే సన్మానితులు వనపర్తి రాణి శంకరమ్మ కోరికపై 'రాజవంశ రత్నావళి' అను సంస్కృత గ్రంథమును తెలిగించిన శ్రీ రాజమన్నారుగారి పేరిటనే సత్కరింపబడెను శతావధాని వెమలూరి వేంకటశాస్త్రి సంస్థాన కవిగానుండి వనపర్తి సంస్థాన చరిత్రను పద్యకావ్యముగా సంస్థాన గోత్రపుర కోటి మేరు రచించిరి

విఖ్యాత పరిశోధకులును విద్వాంసులునగు శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారికి వనపర్తి ప్రభువు లాశ్రయమిచ్చిరి దాదాపు పదేండ్లపాటు ఈకవి గ్రంథ ప్రచురణ కర్తృనిర్వాహకులుగా పనిచేసిరి ఆ కాలమున ఈయనచే ప్రాచీన గ్రంథ పరిశోధనము గావింపజేసి అపూర్వములగు గ్రంథము ను ముద్రింపజేసిన యశస్సు వనపర్తి రాడ్వతంపులది

ఈ సంస్థానమునందలి కొడుకుంట్ల గ్రామవాసియగు పాపాశాస్త్రి భారతసంగ్రహ క్రమ రాంభికాసంవాగకార్య కర్తలు రాజనగర గ్రామవాసులగు గోకాల వేంకటాచార్యులు భాష్యాంత వైయాకరణులు రసజ్ఞులు సాహిత్యమున అసమాన వైదుష్యము గలవారగు ఎందరో కవిపండితులు ఈయన శిష్యులు వీరి సోదరులు గోకాల నరసింహాచార్యులు శతావధానులు సంస్కృతాంధ్రములలో మేటి కవులు కల్యాణి భారతీస్తుతి మొదలగు ఈయన రచనలు ముద్రితములు ఆంధ్రీకృత మాలతీ మాధవము కురుసంధానము జగన్మోహన భాణము దూతాంగదము మొదలగునవి అముద్రితములు పండిత అచ్చంపేట నరసింగయ్యశాస్త్రి గొప్ప వైయాకరణి కాశీ పండితుడగు శివకుమారుని కడ శిష్యరికమున శేష పరిపూర్ణముగా శాస్త్రాధ్యయనము జేసినవాడితడు శిరోమణి ఖండవల్లి నరసింహశాస్త్రి పండితవతం సీతారామశాస్త్రి విద్యాప్రవీణ సూరి రామకోటిశాస్త్రి విద్వాన్ వి శంకరశాస్త్రి శిరోమణి టి వి ఎస్ మురళీనాచార్యులు శతావధాని వేదాల తిరుమల రామానుజస్వామి అనుముల వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రి శిరోమణి సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి శిరోమణి చలమచర్ల రంగాచార్యులు శిరోమణి కేశవపంతుల నరసింహశాస్త్రి మున్నగు కవిపండితులెందరో ప్రభువుల యాహ్వానమున పరీక్షకులుగా విచ్చేసి సన్మానితులై ప్రతి వత్సరము వార్షికము నందినవారే శిరోమణి కప్పగంతుల లక్ష్మణశాస్త్రి ఆస్థాన విద్వాంసులు వనపర్తి సంస్థానమున ఉన్నతోద్యోగిగానున్న మాదిరాజు విశ్వనాథరావు కొందరలాది నాటకముల తెనిగించిరి ఈయనయు కప్పగంతుల లక్ష్మణశాస్త్రియు 'కర్ణసుందరి' నాటకము నాంధ్రీకరించిరి బిల్హణుడు రచించిన కర్ణసుందరి" నాటిక దీనికి మూలము రాజాపురం వాస్తవ్యులు అభినవకాళిదాస

నిరుదాంచితులు అగు తెలకపల్లి రామచంద్రశాస్త్రి వనపర్తి ప్రభువులచే సన్మానితులు

ఈ సంస్థాన ప్రభువులు దాదాపు వంద సంవత్సరములు క్రిందట బ్రహ్మవిద్యా ముద్రాక్షరశాల అను పేరుతో తెనుగు ముద్రణాలయమును స్థాపించి యందు ఉత్తమములగు ప్రాచీనార్ష గ్రంథములను ప్రకటించిరి 1947 వ సంవత్సరమున ఎమర్శకాగ్రేసరులు కవిపండితులు నగు సురవరము ప్రతాపరెడ్డి సూచనమేరకు వనపర్తి ప్రభువుల సమక్షమున జరిగిన వేదశాస్త్ర పండిత సభలోని యుద్దండ పండితులు శాస్త్రోపన్యాసముల సారము శాస్త్రీయ విజ్ఞానము అను పేరిట ప్రచురింపబడినది రాజనగరము రంగాపురములయందు జరిగిన పండిత కవిగోష్ఠులకు స్థిరమగు వాఙ్మయ రూపమిచ్చుటకు చేయబడిన ప్రయత్నమిది ప్రాచీనార్ష విద్యారీతులను పరిరక్షించుటయందే కాక విజ్ఞానశాస్త్ర వికాసమునట్లును డ రామేశ్వరరాయలకు ప్రత్యేకదృష్టి కలదు తత్ఫలితముగా డా॥ బెజవాడ విశ్వనాథము రచించిన ఆధునిక విజ్ఞానవికాసము అను విజ్ఞానశాస్త్ర నిరూపక గ్రంథము ముద్రితమైనది

వనపర్తి ప్రభువుల గ్రంథాలయము చాల విలువైనది ఇందలి ముద్రితాముద్రిత సంస్కృతాంధ్ర గ్రంథములను రామేశ్వరరాయలు హైదరాబాదు నందలి ఆంధ్ర సారస్వత పరిషత్తు గ్రంథాలయమునకు నడుగరగా నిచ్చిరి పూర్వపు నిజాము రాష్ట్రములోని ఆర్ష సంస్కృతీ సభ్యత లారిపోకుండ ఆస్తికత యంతరింపకుండ కాపాడిన గౌరవము గద్వాల మొదలగు సంస్థానములతోపాటు వనపర్తి సంస్థానమునకును దక్కుననుటలో అత్యుక్తి యిసుమంతయు లేదు

పె లిం శా

## వరంగల్లు జిల్లా

**ఎల్లలు** వరంగల్లు జిల్లాకు ఉత్తరమున కరింనగరము జిల్లా దక్షిణమున ఖమ్మముజిల్లా తూర్పున గోదావరి నది పడమట నల్లగొండ జిల్లాయును గలవు

ఈ జిల్లా విస్తీర్ణము 4 555 9 చ మైళ్లు ఇందలి తాలూకాలు 6 గ్రామములు 875 పురములు 8 జనసంఖ్య 15 45 485 వీరిలో పురుషులు 7 90 789 స్త్రీలు 7 54 693 గ్రామవాసులు 13 27 676 నగరవాసులు 2 17 859 జనసాంద్రత 312 (1961 సం లెక్కల ననుసరించి)

**వరంగల్లు తాలూకా:** విస్తీర్ణము 810 6 చ మైళ్లు; గ్రామములు 200 పురములు 2 జనసంఖ్య 5 39 427 వీరిలో పురుషులు 2 6 412 స్త్రీలు 2 63 0 5 గ్రామవాసులు 3 75 602 నగరవాసులు 1 63 825 జనసాంద్రత 666

**పరకాల తాలూకా** విస్తీర్ణము 526 1 చ మైళ్లు గ్రామములు 128 పురములు 1 జనసంఖ్య 1 7 2 0 వీరిలో పురుషులు 83 54 స్త్రీలు 84 076 గ్రామవాసులు 1 65 508 పురవాసులు 6 722 జనసాంద్రత 3 8

**ములుగు తాలూకా** విస్తీర్ణము 1286 2 చ మైళ్లు గ్రామములు 151 జనసంఖ్య 93 408 పురుషులు 47 813 స్త్రీలు 45 595 గ్రామవాసులు 93 403 జనసాంద్రత 76

**నర్సంపేట తాలూకా** విస్తీర్ణము 781 8 చ మైళ్లు గ్రామములు 1(7 పురములు 1 జనసంఖ్య 1 47 126 వీరిలో పురుషులు 75 361 స్త్రీలు 71 765 గ్రామవాసులు 140 266 పురవాసులు 6 860 జనసాంగ్రత 188

**మహబూబాబాదు తాలూకా** విస్తీర్ణము 677 4 చ మైళ్లు గ్రామములు 150 పురములు 2 జనసంఖ్య 2 74 108 వీరిలో పురుషులు 1 40 089 స్త్రీలు 1 34 0 9 గ్రామవాసులు 2 51 600 పురవాసులు 22 508 జనసాంద్రత 150

**జనగామ తాలూకా** విస్తీర్ణము 924 8 చ మైళ్లు; గ్రామములు 184 పురములు 2 జనసంఖ్య 3 9 136 వీరిలో పురుషులు 1 63 910 స్త్రీలు 1 56 226; గ్రామవాసులు 3 01 192 పురవాసులు 17 944 జనసాంద్రత 345

| | జిల్లాలోని పురములు | జనసంఖ్య |
|---|---|---|
| 1 | వరంగల్లు | 1 56 106 |
| 2 | హసన్‌పర్తి | 7 719 |
| 3 | పరకాల | 6 722 |
| 4 | నర్సంపేట | 6 860 |
| 5 | మహబూబాబాదు | 13 248 |
| 6 | డోర్నకల్లు | 9 260 |
| 7 | జనగామ | 11 927 |
| 8 | చేరియాల్ | 6 0 7 |
| | మొత్తము | 2 17 859 |

**పర్వతములు:** పాకాల సింగరేణి ప్రాంతములనుండి చిన్న గుట్టల వరుసలు బయలుదేరి ఆగ్నేయదిశయందున్న అశ్వారావు పేటవరకు పోయి దిగువ గోదావరి లోయకు

సరిహద్దుగా నుండును కందికల్లు గుట్టలవరుస ఆగ్నేయ దిశ నుండి ఆదిలాబాదు జిల్లాలోని చిన్నూరువరకు వ్యాపించును వరంగల్లుకు పదిమైళ్ల దూరమున వాయవ్యముగా చంద్రగిరి గుట్టలు దానికి పడమరగా 11 మైళ్ల దూరమున హసన్‌పర్తి ఇనుపగుట్టలును గలవు జిల్లా అంతట చుక్కలవలె చిన్నచిన్న గుట్టలు చెదురుగా నున్నవి హనుమకొండ సముద్రమట్టమునకు 1700 అడుగుల ఎత్తునున్నది

నేల ఈ జిల్లాలో ఎక్కువగా ఇసుక భూములు నల్లరేగడనేల కొన్ని తాలూకాలలో నున్నను అది స్వల్ప ఖండములుగ నున్నది

నదులు ఇతర నీటివసరులు 11 వ శతాబ్దిలో కాకతీయులు ఈ జిల్లాలో పెద్దపెద్ద తటాకములను నిర్మించిరి అందు ముఖ్యమైనవి పాకాల రామప్ప లక్నవరం ఘనపురం చెరువులు ఈ నాలుగు తటాకముల క్రింద దాదాపు 20 000 ఎకరముల భూమి సాగుబడి యగుచున్నది ఈ జిల్లాయందలి నదులు వాగులు తటాకములు కృష్ణా గోదావరీ నదుల మాగాణమునకు సంబంధించినవి మానేరు పాలేరు నదులు కృష్ణానదీ మాగాణమునకు సంబంధించినవి లక్నవరం చెరువు గోదావరీ మాగాణమునకు సంబంధించినది

పాకాలసరస్సు వింధ్యపర్వతములనుండి పశ్చిమముగ ప్రవహించిన నదికి ఆనకట్ట వేయుటచే ఏర్పడినది ఈ సరస్సు దీనిలోతు సగటున 30-40 అడుగుల మధ్య ఉండును ఇందలి నీరు త్రాగుట కుపయోగపడదు ఈ సరస్సునకు అన్నివైపుల విశాలమైన అడవికలదు ఆనకట్టకు దిగువన మైళ్ల పర్యంతము సాంద్రారణ్యము అల్లుకొనియున్నది ఈ ప్రాంతపు జనాభా అతి పలుచగ నుండును ఈ సరస్సునుండి కొన్ని కాలువలు బయలుదేరి పరిసర ప్రాంతమును సస్యశ్యామల మొనర్చు చున్నవి సరస్సువైశాల్యము సుమారు 12 చ మైళ్లు

వర్షపాతము జిల్లాయందు విశేషభాగములో 30 నుండి 35 అంగుళములును కొలదిప్రాంతములలో మాత్రమే 40-45 అంగుళముల వర్షపాతమును ఘటిల్లుచున్నది ఈ వర్షపాతము దృష్ట్యా వరంగల్లు ప్రాంతము పరిపంటకు అనువుగ నున్నది

వ్యవసాయము జిల్లాలో 17 70 081 ఎకరముల భూమి వ్యవసాయ యోగ్యముగ నున్నది మిగత భూభాగము విశేషముగా దట్టమగు అడవులచే విస్తరింపబడి యున్నది సాగునందున్న భూమిలో 2 75,372 ఎకరములు మాగాణి 14 94 659 ఎకరములు మెట్ట మాగాణిభూమిలో కొంత భాగము చెరువుల క్రిందను మరి కొంతభాగము బావుల క్రిందను తక్కినభాగము నదుల క్రిందను గలదు ముఖ్యముగ చెరువులు వ్యవసాయమునకు ఎక్కువ ఉపయోగకరములుగ నున్నవి

పరిశ్రమలు ఈ జిల్లాలో ముఖ్యముగా తివాచీల నేత పరిశ్రమ పట్టు నేతపరిశ్రమ ఇత్తడి పరిశ్రమ అభివృద్ధి యగుచున్నవి తివాచీ పరిశ్రమ ఎక్కువగా వరంగల్లునందు నెలకొని యున్నది పట్టుపరిశ్రమ వరంగల్లు తాలూకాలో హసన్ పర్తి యందును పూసల పరిశ్రమ ఇత్తడి పరిశ్రమ జనగామ తాలూకాలో పెంబర్తి యందును పెంపొందుచున్నవి

వరంగల్లుజిల్లా మాళవి జాతి పశువులకు ప్రసిద్ధమై యున్నది

ప్రయాణ వార్తాసౌకర్యములు జిల్లాలోని 205 పోస్టాఫీసులలో ఒకటి హెడ్ పోస్టాఫీసు 19 సబ్ ఆఫీసులు మిగిలినవి బ్రాంచి ఆఫీసులు 3 తంతి కార్యాలయములు కూడ కలవు జిల్లాలోని రైలు మార్గములు దక్షిణ మధ్యరైల్వే ఆధీనమందున్నవి ఖాజీపేట డోర్నకల్లు ఈ జిల్లాయందలి ముఖ్యమైన రైల్వేజంక్షనులు పరకాల ములుగుతాలూకాలకు మాత్రమే రైలుసౌకర్యములు లేవు ఇవి వరంగల్లుతో రోడ్డు రహదారులచే కలుపబడి యున్నవి అన్ని తాలూకాలనుండి వరంగల్లుకు ప్రభుత్వముచే నడుపబడు బస్సులుగలవు హైద్రాబాదునుండియు ఖమ్మము కరీంనగరముల నుండియు వరంగల్లుకు బస్సు సౌకర్యము లున్నవి

రామప్ప దేవాలయము : వరంగల్లుకు ఈశాన్యముగా 40 మైళ్లలో నున్న ములుగు తాలూకాలో రామప్ప చెరువునకు సమీపమున సుప్రసిద్ధమైన రామప్ప దేవాలయమున్నది హనుమకొండలోని వేయి స్తంభాలగుడి కైవసిపోలిన ఈ దేవాలయము శిల్పవిన్యాసములో దానికంటెను మిన్నగనున్నది ఆలయమందలి సంస్కృత శాసనమును బట్టి అది క్రీ శ 1234 లో రేచర్ల రుద్రుడను కాకతీయ గణపతిదేవుని సామంతునిచే నిర్మింపబడినట్లు తెలియుచున్నది

వేయి స్తంభాలగుడి వరంగల్లుకు ప్రక్కనే యున్న హనుమకొండలో కాకతీయుల ప్రముఖ ప్రాభవమిత వేయి స్తంభాలగుడి ఇప్పటికిని నిలిచియున్నది శివ విష్ణు సూర్య దేవుల కంకితమైన ఈ సుందర త్రికూటాలయము వంజీ

శిల్పము ఆరంభ చాళుక్య దేవాలయ శిల్పమును పోలియున్నది

ఓరుగల్లుకోట అయినకొలు మైలారు దేవుడు హనుమకొండలోని సిద్ధేశ్వర భద్రి దేవాలయములు పాలకుర్తి కొరవి వీరభద్రాలయము కోటనుపాక జఫర్ గడ్ దుర్గము జీడికల్లు హసన్‌పర్తి మొదలగునవి ఈ జిల్లాలో దర్శనీయమైన ఇతర ప్రదేశములు

వరంగల్లు జిల్లాలో నివసించు ఆటవికులగు కోయల పునరావాసముకై కాలనీలు నిర్మింపబడినవి పాకాల తాడ్వాయి చినబోయినపల్లి చలవాయి జాకారం మున్నగు ప్రాంతములలో ఇట్టివి గలవు ఈ జిల్లాలో రాక్షసిగుళ్లు అనబడు 'కెయిరనులు' (ప్రాచీనాంధ్రుల శవ ఖననశిలానిర్మాణములు) గొంగళ్లు మహబూబాబాదు అందు మెండుగగలవు

చరిత్ర గొప్ప తటాకములతో గుడులు గోపురములతో కోటలతో చరిత్ర ప్రాధాన్యముగల శిథిలములతో, చరిత్రకారులకు, పురావస్తు పరిశీలకులకు ప్రకృతి సౌందర్యోపాసకులకు భక్తజనానీకి వరంగల్లుజిల్లా యాత్రాస్థలమైనది వందలకొలది సంవత్సరములుగా వరంగల్లు హనుమకొండలు పారిశ్రామిక ప్రాముఖ్యమును కల్గియుండినట్లు మార్కోపోలో కూడ తన యాత్రా గ్రంథమున ప్రస్తావించి యున్నాడు

ఈ జిల్లా మొదట ఆంధ్రులచే పాలింపబడిన దక్కను లోని భాగము వారి అనంతరము ఇది వాతాపి చాళుక్యుల పాలనలోని వచ్చినది చాళుక్యుల అనంతరము రాష్ట్రకూటులు పాలించిరి క్రీ శ 12వ శతాబ్దిలో ప్రోలరాజు చాళుక్యరాజగు మూడవ తైలపదేవుని ఓడించి రాజ్యమునకు వచ్చెను ఈతని కొడుకు రుద్రదేవుడు రాజ్యమును విస్తరింపచేసెను రుద్రదేవుని తమ్ముడగు మహాదేవరాజు కుమారుడు గణపతిదేవుడు కళింగ ప్రభువును నిర్జించెను ఈతనికి గుజరాతు బెంగాలు ప్రభువులుకూడ సామంతులయిరట! దక్షిణమున నెల్లూరువరకు ఇతని సామ్రాజ్యము విస్తరించి యుండెను గణపతిదేవుని కుమార్తె రుద్రమదేవి క్రీ శ 1260 లో చక్రవర్తిని అయ్యెను 1296 లో ప్రతాపరుద్రుడు ఓరుగల్లు రాజ్యమునకు ప్రభువయ్యెను ఇతడు రుద్రమదేవి దౌహిత్రుడు 1321 లో ఈ సామ్రాజ్యమును మహమ్మద్-బిన్ తుగ్లక్ వశపరచుకొనెను ఓరుగల్లు నేలిన ఈ రాజవంశమునకు కాకతి అనుదేవత కులదేవతగా నుండుటచే కాకతీయ వంశమనియు కాకతీయులనియు దానికి పేర్లుకల్గినవి

కాకతీయ చక్రవర్తులలో వీరభద్రుడు చివరివాడుగా కనబడుచున్నాడు ఇతడు 1325 లో కొండవీడుకు పారిపోయెనట!

క్రీ శ 1335-36 ప్రాంతములో మహమ్మదీయుల శక్తి క్షీణించినంతనే ఆంధ్రదేశము చిన్న చిన్న రాజ్యములుగ చీలిపోయినది అట్టివాటిలో మొదటిది భద్రాచల ప్రాంతమందలి కూనవరమును రాజధానిగ చేసికొని మునునూరి ప్రోలయ నాయకుడు పాలించినది తదుపరి ఓరుగల్లు రాజధానిగా తెలంగాణములో మునునూరి కాపయనాయకు డేలినది ప్రోలయనాయకుడు నిస్సంతు గావున అతని మరణానంతరము ఆ రాజ్యముకూడ కాపయనాయకుని ఏలుబడిలోనికి వచ్చినది

క్రీ శ 1422 లో ఓరుగల్లు రాజ్యము బహమనీ సుల్తానులకును అటుపై గోలకొండ కుతుబ్ శాహీ కును వశమైనది 16వ శతాబ్దారంభమున షితాబుఖాను బిరుదాంకితుడు సీతాపతిరాజు ఓరుగల్లును పాలించెను గోలకొండ సుల్తానగు కులీకుతుబుషా షితాబుఖాను నోడించెను కుతుబుషాహి వంశములో ఏడవ సుల్తాను అబుల్ హసన్ తానాషాను మొగలు చక్రవర్తి ఓడించగా గోలకొండరాజ్యము మొగలు సామ్రాజ్య భాగమయ్యెను మొగలు సామ్రాజ్య పతనమున అసఫ్ జా నిజాముల్ ముల్కు దక్షిణ ప్రాంతమునకు సుబేదారుగా వచ్చి నిజాముల వంశమునకు మూలపురుషుడయ్యెను ఆర్గురు నిజాములు పాలించిన అనంతరము ఏడవ నిజామగు సర్ మీర్ ఉస్మాన్ ఆలీఖాన్ (1911-1956) రాజ్యమేలుచుండగా భారత దేశమునుండి బ్రిటిష్ పాలకులు నిష్క్రమించిరి భారత దేశమునకు 1947 లో స్వాతంత్ర్యము సిద్ధించెను 1950 లో భారతదేశము 'రిపబ్లిక్' గా మారిన తరువాత స్వదేశ సంస్థానములదృశ్యమయ్యెను ఈ సంఘటనముతో నిజాము పరిపాలనముకూడ అంతరించినది భాషాప్రాతిపదికపై భారత ప్రభుత్వము తక్కిన రాష్ట్రములతోపాటు నిజామురాష్ట్రమును గూడ విభజింపగా 1956 లో సువిశాలమైన ఆంధ్రప్రదేశ రాష్ట్రమేర్పడెను ఈ నూతన రాష్ట్రమందలి 21 జిల్లాలలో ఇప్పుడు వరంగల్లు అని పిలువబడుచున్న జిల్లా ఒకటి

ఆంధ్రప్రదేశమునకు రాజధానియైన హైదరాబాదు తరువాత తెలంగాణములో ఎన్నదగినది వరంగల్లు నగరమే హనుమకొండ మట్టెవాడ ఓరుగల్లు కోటప్రాంతములు వరంగల్లులోని భాగములు వరంగల్లు నగరము జిల్లా ప్రధానస్థానము

విద్యయందును వాణిజ్యమునందును పారిశ్రామిక వ్యవస్థల యందును ప్రజా జాగృతియందును తక్కిన విషయము లందును ఈ నగరము గణనీయ స్థానమును గాంచి యున్నది ఉస్మానియా విశ్వవిద్యాలయమునకు ఉపశాఖగా పోస్టు గ్రాడ్యుయేట్ సెంటరు ఇచ్చట ఇటీవల నెలకొని యుండుటచే ఈ నగరము విద్యారంగమున ప్రాముఖ్యము వహించు చున్నది ఇచట వైద్యకళాశాల ఇంజనీరింగు కళాశాలల మున్నగు పెక్కు విద్యాసంస్థలు గూడ పనిచేయుచున్నవి జిల్లా ప్రధాన పాల నాధికారి కలెక్టరు

ఆ వీ

## వరాహమిహిరాచార్యుడు

వరాహమిహిరాచార్యుడు ఆదిత్యదాసుని కుమారుడు కాంపిల్లక నగరమున ఇతడు సూర్యదేవతా ప్రసాదము పొంది తండ్రియొద్దనే జ్యోతిష సిద్ధాంతము నభ్యసించెను ఉజ్జయినీ ప్రభువు సమాదరము బడసి ఇతడా నగరమున లఘు జాతకము బృహజ్జాతకము వివాహపటలము బృహత్సంహిత యోగయాత్ర పంచ సిద్ధాంతిక మున్నగు హోరా సిద్ధాంత గ్రంథములను రచించెను లఘుసంహిత లేక సమాస సంహిత అను గ్రంథమునుగూడ ఈతడే రచించినట్లు ఊహించబడుచున్నది కొన్ని గ్రంథములందు కాంపిల్లకనగరమును చోట కాపిత్థక నగరమను పాఠాంతరము కలదు ఆతని జన్మస్థలము కాల్పీ నగరమని బహుజనాభిప్రాయము - బృహజ్జాతకములో ఇరువదియారవ అధ్యాయమున ఇతడుతన తండ్రి పేరు తన వాసము మున్నగు వివరములను గూర్చి చెప్పిన శ్లోకమిట్లున్నది

ఆదిత్య దాస తన యస్తద వాప్త బోధః
కాంపిల్లకే సవితృ లబ్ధ వరప్రసాదః
ఆవంతికో మునిమతాన్యవ లోక్యసమ్యక్
హోరాం వరాహమిహిరో రుచిరాం చకార

ఈతని గ్రంథమగు లఘు జాతకమునకు భటోత్పలాచార్యుడు రచించిన టీకలో వరాహమిహిరుడు మగధ దేశము నందలి బ్రాహ్మణుడని వ్రాసినాడు మగధదేశమున పుట్టి జీవికకొరకు విక్రమార్క పరిపాలితమైన ఉజ్జయినీ పట్టణమునకు ఆతడు చేరెనని పలువురి అభిప్రాయము

వరాహమిహిరాచార్యుని పంచ సిద్ధాంతి కాంతర్గత మగు రోమక సిద్ధాంతమందు సప్తాశ్వి వేదసంఖ్యం శకకాలము

పాస్య" అనియుండుటచేతను 427 శాలివాహన శక సంవత్సరము (అనగా క్రీ శ 505) నందలి గ్రహస్థానముల నిచ్చుట చేతను ఈతని జన్మ [illegible] 400 శాలి [illegible] మై యుండి [illegible] [illegible] [illegible] [illegible] రాజు వరాహ మిహిరాచార్యుడు 500 శా [illegible] సంవత్సరములో దివంగతు డయ్యె [illegible] వరాహ మిహిరుడు [illegible] సంవత్సరము 427 శా శక మునే గ్రహగణితమునకు ఉపయోగించు [illegible] సాధనకు స్వీకరించెనని చెప్పవచ్చును అట్లగుచో అతడు శా శ 427 లో జన్మించి 509 లో దివంగతు డయ్యెనని ఊహింప వచ్చును

వరాహ మిహిరాచార్యుని బృహత్సంహిత యందు అయన కూర్యకాలము ప్రతిపాదింప బడినది "ఆశ్లేషార్ధాద్దక్షిణ ముత్తరమయనం రవేః ధనిష్ఠాద్యం నూనం కదాచి దాసీత్ యేనోక్తం పూర్వశాస్త్రేషు సాంప్ర మయనం సవితుః కర్కటకాద్యం మృగాదితశ్చాన్యత్ ఉక్తాభావో వికృతిః ప్రత్యక్ష పరీక్షణైః వ్యక్తిః" అని చెప్పుటచేత వేదాంగ జ్యోతిష ముందు ప్రపద్యేతే శ్రవిష్ఠాదౌ సూర్యా చంద్రమసా వుదక్ సార్పార్ధే దక్షిణార్కస్య మాఘ శ్రావణ యోస్సదా"— అనగా, ఉత్తరాయణ ప్రవేశము ధనిష్ఠాది యందును దక్షిణాయన ప్రవేశము ఆశ్లేషార్ధ మందును వేదాంగ జ్యోతిష కాలమున అగుచుండె ననియు కాని వరాహమిహిరాచార్యుని కాలమందు దక్షిణాయన ప్రవేశము కర్కటకాది యందును (అనగా పునర్వసు చతుర్థచరణమందు) ఉత్తరాయణ ప్రవేశము మకరాది యందును (అనగా ధనిష్ఠా తృతీయ చరణాదియందు) ఘటిల్లుచుండెనని తెలుచున్నది కాబట్టి విషువత్ క్రాంతి వృత్త సంపాత బిందువగు (Equinoctial point first point of Aries) సాయన మేషాది బిందువు వరాహమిహిరాచార్యుని కాలములో అశ్విన్యాది యందుండెనని తెలుచున్నది అప్పటినుండి ఆ బిందువు క్రమముగా వెనుకకు పోవుచు వచ్చినది. అనగా విషువద్బిందువు యొక్క పశ్చాచ్చలనమును దానిచే నేడు దాదాపు 2 భాగములు వెనుకకు వెళ్ళినది ఈ కారణముచే వసంత కాలోదయము చైత్రమాసము కాకుండగనే అగుచున్నది అశ్విన్యాదికిని ఈ వసంత విషువద్బిందువునకును మధ్య దూరము అయనాంశలు అను పేర వ్యవహరింపబడు చున్నది, ఈ అయనాంశలు ఎన్ని అనునది నేడు వివాదగ్రస్తమైన విషయములు [illegible]

మించి పంచాంగకర్తలలో వైవిధ్యమును సమకూర్చినది.

**పంచ సిద్ధాంతిక** ఈ గ్రంథమున వరాహమిహిరునకు తత్కాలోప లబ్ధములైన ఐదు సిద్ధాంతములను (1 పితామహ సిద్ధాంతము 2 వసిష్ఠ సిద్ధాంతము 3 సూర్య సిద్ధాంతము 4 రోమక సిద్ధాంతము 5 పౌలిశ సిద్ధాంతము) క్రోడీకరించిన గ్రంథమునందు వాటి గణిత పద్ధతులు చెప్పబడినవి రోమక పౌలిశ సిద్ధాంతములను లాటాచార్యుడు రచించెననియు ఈతడు ఆర్యభట శిష్యుడనియు కొందరి వాదము కాని ఈ రెండు సిద్ధాంతములు కొన్ని భారతీయ సైద్ధాంతిక సంప్రదాయములను పాటించకుండుటచే శ్రుతిబాహ్యములని ఖండింపబడినవి స్పష్టతర స్సావిత్రః అనుటచేత పంచ సిద్ధాంతికాంతర్గత సూర్య సిద్ధాంతము దృక్సిద్ధికి సరిపోవ ననుటవలన వరాహమిహిరుని కాలమునకు సూర్య సిద్ధాంతమే బహుళ ప్రచారములో నున్నట్లు కన్పించుచున్నది బ్రహ్మగుప్తాచార్యుడు ఖండఖాద్యకమందు వక్ష్యామి ఖండఖాద్యక మాచార్య భట తుల్యఫలం అని చెప్పుటచేత ఆనాటి భారతదేశములో ఆర్యభటీయముకూడ విశేషముగ ప్రచారములో నున్నట్లు ఊహింపదగును

**బృహత్సంహిత** ఈ గ్రంథమునందనేక విషయములు చెప్పబడినవి జలార్గళశాస్త్రము మొదలు వరాహమిహిరుని కాలమునాటి రాజమర్యాదలవరకు వర్ణింపబడినవి కాళిదాసు రఘువంశమున తస్మై సమ్యక్ హుతో వహ్నిః వాజినీ రాజనావిధౌ అని వర్ణించిన వాజినీరాజనావిధిని వరాహమిహిరుడు బృహత్సంహితలో "భగవతి జలధర పక్ష్మక్షపాకరార్కేక్షణే కమలనాభే ఉన్మీలయతి తురంగ మకరి రథనీ రాజనం కుర్యాత్" అని నిర్వచించి యున్నాడు - అనగా విష్ణువునకు సూర్య చంద్రులు నేత్రములని చెప్పబడుటచే వర్షాకాలమందు సూర్య చంద్రులు మేఘుచ్ఛన్నులైనప్పుడు మేఘములను కనురెప్పలు సూర్య చంద్రులను నేత్రములను ఆషాఢ శుద్ధైకాదశినుండి కార్తీక శుద్ధైకాదశి పర్యంతము కప్పుచుండగా విష్ణువు శయనించినాడని చెప్పబడుచు ఆనాల్గు మాసములు చాతుర్మాస్య దినములని తెలుపబడు చున్నవి అందుచే ఆషాఢ శుద్ధైకాదశికి శయనైకాదశి అనియు కార్తీక శుద్ధైకాదశికి ఉత్థానైకాదశి అనియు పేర్లు కల్గినవి ఉత్థానైకాదశి దినమందు వాజినీరాజనావిధిని రాజులు చేయవలెననియు తదుపరి శరత్కాలమందు జైత్రయాత్ర సలుపవలెననియు తత్కాలమ దలి రాజన్యుల సంప్రదాయము ఇట్టి సంప్రదాయము లెన్నియో బృహత్సంహిత యందు వర్ణింప బడినవి

**బృహజ్జాతకము** ఇది జాతక గ్రంథము జాతక శాస్త్రమునకు హోరా శాస్త్రమని నామాంతరము కలదు హోరా శాస్త్రమందు బృహత్సంహితను సిద్ధాంతభాగమందు పంచసిద్ధాంతికను రచించిన వాడగుటచే వరాహమిహిరాచార్యుడు త్రిస్కంధ జ్యోతిషపారగుడని కొనియాడ బడినాడు

మిథిలానగర ప్రాంతమున వరాహ మిహిరాచార్యుడు రచించిన లఘుజాతక గ్రంథము ప్రచారములో నున్నది కాశీ పట్టణమున బృహజ్జాతకము నేటికిని ప్రచారమునందు కలదు ఈతని బృహత్సంహితను డా॥ కెర్న్ అను నాతడును పంచ సిద్ధాంతికా గ్రంథమును థీబో సుధాకరద్వివేది అను పండితు లును ముద్రింపించిరి వరాహమిహిరుడు రచించిన బృహజ్జాతకమునకు భట్టోత్పలాచార్యుడు మహీధరుడు మహాదేవుడు కేరళీయుడు అనువారు వ్యాఖ్యానములు రచించిరి

వరాహమిహిరాచార్యుడు సంహితా హోరా సిద్ధాంత నామక త్రిస్కంధములందును మహాపండితుడే కాక సంస్కృత సాహిత్య మందును కవిత్వమునందును గొప్పగా ప్రశంసింప దగినవాడు అతడు రచించిన ఆర్యావృత్తములు చాల శ్రవణపేయములుగ నుండుటచే అతడతి సునాయాసముగ కవిత్వమునుగూడ చెప్పగల్గెనని తెలియుచున్నది

ధూ ఆ సో

## వర్తమాన రాజకీయ సిద్ధాంతములు

వర్తమాన రాజకీయ సిద్ధాంతములు చాల కలవు వాటిలో ముఖ్యమైనవిమాత్రమే ఇచట వర్ణింపబడినవి

**ఇండివిడ్యుయలిజం** దీనిని వ్యక్తి సిద్ధాంతమందురు దీనిపేరు సూచించునట్లు ఇది వ్యక్తిస్వేచ్ఛకు ప్రాధాన్యమిచ్చును ఇది మర్కెంటైలిజమును వ్యతిరేకించి ప్రభుత్వ విధులను అధికారములను చాల తగ్గించి వ్యక్తిస్వేచ్ఛను బాగుగా పెంచినది దానిప్రకారము వ్యక్తి స్వేచ్ఛ పరమ లక్ష్యము రాజ్యము దానికి తోడ్పడుసాధనము మాత్రమే వ్యక్తిస్వేచ్ఛ రాజ్యాధికారము పరస్పరము విరుద్ధమైనవి ఏ ప్రభుత్వము ఎంత తక్కువ అధికారమును చలాయించునో అది అంత శ్రేష్ఠమైనది ప్రభుత్వము ప్రజలకు శాంతిభద్రతలను కలుగజేయుట, వారిమధ్య జరుగు ఒప్పందములను న్యాయ

మునకు సన్నిహితముగ నుండును కేపిటలిస్టు సమాజమును సంస్కరించుటకు సిండికేటులు అనగా శ్రామిక సంఘములు దౌర్జన్యయుతమైన ప్రత్యక్షచర్యను సాగించుటను ఇది ప్రోత్సహించును చిన్న పెద్ద సమ్మెలుసాగించుట పెట్టుబడిదారుల ఉత్పత్తి సంస్థలను విధ్వంసము చేయుట ఆర్థికకార్యకలాపములను స్తంభింపజేయుట ఆచరణయొక్క ముఖ్యలక్షణములు దాని ద్వారా నూతన (సిండికలిస్టు) సమాజనిర్మాణము జరుగగలదు దీని స్వరూపము సరిగా సూచింపబడలేదు రాజ్యములేకయే వివిధశ్రామిక సంఘములు జాతీయవ్యవహారములన్నింటిని పరిదిద్దుకొని సంతృప్తికరమగు జీవితమును సాగింపకలవని భావింపబడినవి

కలెక్టివిజం ఈ సిద్ధాంతము ప్రకారముకూడ వ్యక్తిపరమైనఆస్తి సంఘములో వర్గవిభజనకు సంఘర్షణకు అసమానతకు అశాంతికి మూలకారణమగును దాని నిర్మూలనము ద్వారా అత్యధిక సంఖ్యాకులైన పీడితశ్రామికుల పరిస్థితిని ఉద్ధరింపవీలగును కేపిటలిస్టు సమాజమును కలెక్టివిస్టు సమాజముగ రూపొందింపవచ్చును అయితే అట్టిమార్పు దౌర్జన్యయుతమైన చర్యద్వారాగాక రాజ్యాంగసమ్మతమైన శాంతిమార్గముద్వారా జరుగవలెను అంతేగాక ఆశించిన మార్పులన్నియు ఒక్కపెట్టునగాక క్రమక్రమముగా మెట్టు తరువాత మరొకమెట్టుగా సాగవలయును నూతన వ్యవస్థ విప్లవాత్మకముగ రూపొందక క్రమపరిణామానుసారము జరుగవలెనని నిర్ణయించుట కలెక్టివిస్టువాదుల విశిష్టత దీని ప్రాధాన్యతను ఇంగ్లండులోని కలెక్టివిస్టు వాదులలో ముఖ్యులైన జార్జిబెర్నార్డ్‌షా హెచ్ జి వెల్స్ వెబ్ దంపతులు నొక్కిచెప్పిరి 1884 లో వారు స్థాపించిన కలెక్టివిస్టుసంస్థకు "ఫేబియన్ సొసైటి" అను పేరుపెట్టుటలో గల అంతరార్థమిదియే ఇంగ్లండులో సోషలిజము అట్లే అవతరించినదని వీరి నమ్మకము ద్వితీయప్రపంచ యుద్ధము ముగిసిన తరువాత అచట జరిగిన పరిణామములు అందుకు ప్రబల నిదర్శనములు కలెక్టివిస్టుసిద్ధాంతము కేవలము మార్పును సాధించుటలోనేగాక నూతనవ్యవస్థ నిర్మాణము నందుకూడ పార్లమెంటరీ ప్రజాస్వామ్య పద్ధతిని అనుసరించును; ప్రజాభిప్రాయము సోషలిజము వైపునకు మొగ్గునట్లు ప్రచారము చేయుచు పార్లమెంటు నిర్మించు శాసనములద్వారా సంస్కరణములను కొనసాగించును అభ్యుదయదాయకమైన పన్నులవిధానమును అవసరమైన పరిశ్రమల జాతీయకరణమును ఆస్తిహక్కుల సంస్కరణమును ప్రభుత్వ ప్రైవేటు రంగముల సహకారమును అది ప్రోత్సహించును కొద్దిమంది ధనికుల లాభమునకు తావిచ్చు పోలీసు రాజ్యము అత్యధిక సంఖ్యాకులైన శ్రామికుల జీవితము నుద్ధరించు సంక్షేమ రాజ్యముగ మారును సమాజ శ్రేయస్సుకు వ్యక్తిస్వేచ్ఛ పూర్తిగ బలిచేయబడక వీలైనంతవరకు సంరక్షింపబడును ఈ విధానమును నేటిభారత రిపబ్లిక్ అనుసరింప ప్రయత్నించుట గమనింపదగినది

గిల్డ్ సోషలిజం ఈసిద్ధాంతమును రూపొందించిన వారిలో ఇంగ్లండునందలి ప్రముఖ అర్థశాస్త్రవేత్తయగు జి డి హెచ్ కోల్ అనుసంస్కర్త పేర్కొనదగినవాడు అది కొంత వరకు కలెక్టివిస్టు సిద్ధాంతమును మరికొంతవరకు సిండికలిస్టు సిద్ధాంతమును అనుసరించును గిల్డ్ అనగా ఒక పరిశ్రమకు చెందిన శ్రామికులు ఉద్యోగులు కూడిన సంఘము దేశములోని గిల్డులద్వారా కేపిటలిస్టువ్యవస్థ సోషలిస్టువ్యవస్థగా మార్పుచెందవలెననియు నూతన సమాజమందలి జీవితము గిల్డులమీద ఆధారపడి యుండవలెననియు గిల్డుసోషలిజంయొక్క సారాంశము ఈమార్పు వీలునుబట్టి శాంతియుతమైన రాజ్యాంగమార్గములను అవసరమునుబట్టి శ్రామికుల సమ్మెల వలనను జరుగవచ్చును

ఫాసిజం దీనికి పుట్టినిల్లు ఇటలీదేశము ప్రథమ ప్రపంచ యుద్ధము తరువాత అచటి జీవితమంతయు అల్లకల్లోలము పాలయినది దానిని సరిదిద్దుటకు ఫాసిజం అను ఉద్యమము బయల్వెడలినది ఆ ఉద్యమ నాయకుడు ఇటలీ నియంతయగు ముస్సోలినీ దాని ముఖ్యలక్షణములివి వ్యక్తులకు సొంత ఆస్తియుండుట అవసరము ఆర్థికస్వామ్యము అనవసరము సంఘములో భిన్నవర్గములమధ్య సహకారము అభిలషణీయము వ్యక్తిస్వేచ్ఛ ప్రజాస్వామ్యము నిరర్థకములైనవి వాటికి బదులు నియంతపాలనము నెలకొల్పబడవలెను జాతీయ అంతర్జాతీయ రంగమునందు శాంతి సంధానములు ప్రకృతివిరుద్ధములు బలప్రయోగము యుద్ధము సహజములైనవి ఈసిద్ధాంతమును అమలుజరిపిన ముస్సోలినీ నియంతృత్వము క్రింద ఇటలీకి మొదట కొంత ఉన్నతి కల్గినదిగాని చివరకుదానికి అధోగతి తప్పలేదు

రెండు ప్రపంచయుద్ధముల మధ్యకాలములో హిట్లర్ నాయకత్వముక్రింద జర్మనీలోకూడ ఫాసిజము నాజీయిజమను

పై ప్రబలించిన సిద్ధాంతరీత్యా రెండును సన్నిహితములైనను రెండింటివలన కలిగిన దుష్ఫలితములకు చాల పోలికలు గలదు. తగిన నాయకత్వమునకు కూడ నిరాకరణము తప్పలేదు.

**అనార్కిజం** ప్రభుత్వాధికారం విశృంఖలము వలన కలిగిన దుష్ఫలితములు దుర్భరముగ తోచిన మేధావులు కొందరు దానిని ఎదుర్కొనుటకు ఈసిద్ధాంతమును ప్రతిపాదించిరి. దీనిని అరాజక సిద్ధాంతమనుట సమంజసము. దీనిని రూపొందించిన వారిలో రష్యాకు చెందిన బకునిన్ క్రోపోట్కిన్‌లు ప్రముఖులు. యుద్ధముమీద రక్తపాతముమీద రాజ్యము ఆధార పడి యున్నదనియు రాజ్యాంగ శాసనములు ప్రజల సుఖ శాంతులకు మానవుని నైతిక వికాసమునకు నిరోధకమనియు అందువలన రాజ్యమను వ్యవస్థ నిర్మూలింపబడవలెననియు వారి వాదము. రాజ్యరహిత సమాజములో వ్యక్తులు స్వచ్ఛందముగా నీతినియమసహిత జీవితమును సక్రమముగ సాగింపగలరని వారి ఊహ. ఈసిద్ధాంతము ఆదర్శప్రాయమైనది కావచ్చునేమో కాని ఆచరణీయమైనది మాత్రము కాజాలదు.

**గాంధేయమార్గము సర్వోదయసిద్ధాంతము** భారత జాతిపిత' అయిన గాంధీజీ సూక్తుల ననుసరించి ఆతని అనుచరులు ఈ సిద్ధాంతములను రూపొందించిరి. వారిలో వినోబాభావే జయప్రకాశ నారాయణ్‌లు ప్రముఖులు. రెండుసిద్ధాంతములకును మూలాధారమును మూలతత్త్వమును ఒకటే. అశాంతి అవినీతి అనైతికతలతో కలుషితమైన రాజకీయ జీవితము పరిశుద్ధము చేయబడవలెననునదియే అది. వ్యక్తి యొక్క సర్వతోముఖాభివృద్ధి దానిలక్ష్యము. దానికి రాజ్యవ్యవస్థ సాధనము. వ్యక్తిస్వేచ్ఛ ప్రజాస్వామ్యము సగౌరవమైనవి. గ్రామస్వరాజ్యము పంచయతీ రాజ్యము నెలకొల్పబడవలెను. ఆర్థికన్యాయము స్వామ్యము ప్రభుత్వశాసనముల ద్వారా కాక ధర్మకర్తృత్వ భావనద్వారా సమకూరవలెను. జాతీయ అంతర్జాతీయ సంగములందు శాంతి సహకారములు అవసరము. వర్గరహిత సాంసారహిత సమాజము దాని అంతిమ లక్ష్యము. మార్పులన్నియు సత్య అహింసలు ఆధారముగాగల సత్యాగ్రహ రూపమున సాధింపబడుట అతిముఖ్యమైన అంశము.

ఓ. వ. మూ.

## వర్జిల్ (క్రీ. పూ. 70-19)

పుబ్లియస్ వర్జిలియస్ మారో అను రోమకకవి క్రీ. పూ. 70వ సంవత్సరము అక్టోబరు 15న ... మాంటువా ప్రాంతమందలి ఆండిస్ అను గ్రామమున జన్మించెను. యితని తండ్రి ... [illegible] ... ... [illegible] ... చుండెను.

వర్జిల్ తలిదండ్రులు గౌరవనీయులైన మధ్యతరగతి కుటుంబమునకు చెందినవారు. ఆర్థికముగ చెప్పుకొనదగిన స్థాయిగలవారు. ఆ దినములలో శాస్త్రయందుండిన విశిష్టమగు విద్యావిధానము ననుసరించి వర్జిలునకు శిక్షణ గరపబడినది. విద్యార్థిగా ఆతడు క్రిమోనా మిలన్ రోమ్ నేపుల్స్ అను నగరములలో ప్రఖ్యాతిగాంచిన గురువులయొద్ద గ్రీకు రోమను వాఙ్మయములలోను తత్త్వశాస్త్రములోను సుశిక్షితుడయ్యెను. న్యాయశాస్త్రమును అధ్యయన మొనర్చెను. ఆతడు న్యాయవాదివృత్తియందు విజయము సాధింపలేకుండెను. ఆతని సహజ బిడియము వికారమగు చేష్టలు ఇందుకు కారణములని తెలియుచున్నది. రాజకీయ వ్యవహారములలో ఈయన ప్రత్యక్షముగా ప్రధానపాత్ర నెద్దియు నిర్వహించి యుండలేదు. చిన్న వయస్సునందే కవితావ్యాసంగము తనకు సరిపడు విషయముగా ఆయన గుర్తించినాడు.

ఆతడు తన 33వ ఏట (క్రీ. పూ. 37) ఎక్లాగ్స్ (Eclogues) అను ప్రథమ కావ్యసంపుటిని వెలువరించినాడు. ఇది ఐదేళ్ళ కృషిఫలితము. ఇది బ్యూకోలిక్స్ ('Bucolics') అను పర్యాయపదముతో కూడ వ్యవహరింపబడుచుండెడిది. ఇది పది లఘుపద్యములుగల సంపుటి. ఇందొక్కొక్కటి 67 నుండి 111 పంక్తుల నిడివిగలది. ఈ కావ్యమున గ్రామీణ వాతావరణము పసుల కాపరుల దైనందిన జీవితము ప్రకృతిశోభ రమణీయముగ అభివర్ణింపబడినవి. ఈ గ్రంథమున థియోక్రిటస్ (క్రీ. పూ. 3వ శతాబ్ది) అను గ్రీకు కవి యొక్క రచనాప్రక్రియలను వర్జిల్ భారీముగ ఉపయోగించినను వాటిని తన ప్రయోజనములకు అనువుగ మలచుకొనినాడు. ఇందు గ్రామీణ దృశ్యములకు తోడుగ, మాంటువా ఆల్ప్స్‌పర్వతప్రాంతముల ప్రకృతిశోభ వర్ణింపబడినది. ఈ సంపుటి యందలి పది పద్యములలో కనీసము 1 & 9 సంఖ్యలుగల మూడు పద్యములు సమకాలీక పరిస్థితులు అభివ్యక్తములుగా గల్గినట్టివి. ఒకటవ, తొమ్మిదవ

పద్యములలో ప్రవేశ పెట్టబడిన వ్యక్తుల నామములు ప్రఖ్యాతి వహించినవి; ఇవి ప్రసిద్ధమైన గ్రీకు గోపసంప్రదాయము (Pastoral tradition) ననుసరించి యున్నవి. తొమ్మిదవ పద్యమునందు వర్జిల్ అనుభవించిన బాధలు వర్ణితములు.

ఫిలిప్పీ యుద్ధానంతరము సైనిక కలాపములనుండి విడుదలయైన యుద్ధభటులకు జీవనోపాధికై భూవసతిని కల్పించుటకు రోమక ప్రభుత్వము కొన్ని ప్రాంతములను వశపరచుకొన్నది. ఆ ప్రాంతములలో వర్జిల్ భూములుకూడ చేరియున్నవట. ఒకానొక సందర్భమున అతని భూమినుండి వర్జిల్ ఒక సైనికునిచే బలాత్కారముగ గెంటి వేయబడినట్లును, తరువాత ఆ భూమి అతనికి దక్కినట్లును విశ్వసింపబడుచున్నది. ఈ సంఘటన అతనికి ఎవరీతమైన క్లేశమును కల్గించి యుండును.

పైన పేర్కొనిన మొదటి ఎక్లాగ్ లో అగస్టస్ చక్రవర్తిని గూర్చి కొన్ని శ్లాఘ్యవచనములు గలవు. ఇందలి ప్రధాన వ్యక్తి నూతనముగా స్వేచ్ఛను పొందిన టిటైరస్ అను దాసిని వర్జిల్ తనను తానే ఈ పాత్రయందు చిత్రించుకొని యుండెనని కొందరు విమర్శించినారు. కాని ఈ విమర్శ సరియైనది కాజాలదని తెలినది.

నాల్గవ ఎక్లాగ్ చాల ప్రఖ్యాతిగాంచినది. క్రీ. పూ. 40వ సంవత్సరములో న్యాయాధిపతియగు పోల్లియో అను దాని అభినందనపూర్వకముగా వర్జిల్ జోస్యము చెప్పినట్లు దైవాంశ సంభూతుడు, తాను కన్నను ఉన్నతస్థాయిగల అద్భుతమగు ఒక శిశువాటనికి జన్మించుననియు, అతడు ప్రపంచమునకు స్వర్ణయుగమును ప్రసాదింపగలడనియు ఆజోస్యము సూచించెనట! ఇంతకును ఆజోస్యము ఫలింపనే లేదు.

ఆరవ ఎక్లాగ్ మిల్టను వ్రాసిన లిసిడస్ అను గ్రంథమునకు మాతృకవంటిదని చెప్పవచ్చును. ఈ కావ్యమందలి పద్యములలో కూడ వర్జిల్ యొక్క స్వతస్సాత్త్వికశక్తి ద్యోతకమగును. ఇందు మనోహర సంఘటనలను సూచించు శ్లేష పుష్కలముగా గలదని కొందరు విమర్శకుల అభిప్రాయము. మొత్తము పదియెక్లాగ్ లను నీ కావ్యసంపుటములు వర్జిలు కవికి ఖ్యాతిని కూర్చినట్టివి. అంతవరకు గ్రీకులు గుత్తకొన్న వాఙ్మయప్రపంచములో మొదటిసారిగా రోమకుడయిన వర్జిల్ రోమక కాంతను విజయసూచకముగా ఎగురవేయగల్గినాడు. ఆతని కావ్యములో కమనీయత, కవితా ప్రక్రియలో సాంకేతిక సామర్థ్యము ప్రస్ఫుటముగ కన్పట్టును.

అగస్టస్ ప్రభువు అనుయాయులలో ఒక ప్రముఖుడైన మేసినస్ అను నతడు ఎల్లవేళలయందు వర్జిల్ యొక్క యోగక్షేమములను అరయుచుండువాడు. అకాలమున నేపిల్స్ నగరము చెంత స్వశక్తిచే సంపాదించుకొనిన భూవసతియందు వర్జిల్ నివసించుచు సుప్రసిద్ధులైన పండితవర్గముతో సన్నిహితుడై సంచరించుచుండెడివాడట!

వర్జిలుచే అనంతరము రచింపబడిన జార్జిక్స్ (Georgics) అను గ్రంథము మేసినస్ కు అంకితమియ్యబడినదట! ఏడేండ్ల కృషిఫలితమై నాల్గు భాగములుగల ఈ గ్రంథము నీతిబోధాత్మకమైన కావ్యముగా పరిఢవిల్లినది. కవి ఇందు ఇటలీదేశమునందలి గ్రామీణజీవితకలాపములను రమ్యముగా చిత్రించినాడు. దీనియందు కర్షకుని విధులు కూడ సూచింపబడినవి. వ్యవసాయము, పశుపోషణము, ద్రాక్షతోటల పెంపకము, తేనెటీగల సంరక్షణము ఇత్యాది విషయములు గూడ వివరింపబడినవి. గ్రంథాంతమున గ్రీకు పురాణ గాథాలహరిలోని అరిస్టేయస్ (తేనెటీగల పెంపకమునుగూర్చి ప్రజలకు తెలియజెప్పిన ప్రథమ వ్యక్తి), ఆర్ఫియస్ అను వారలను గూర్చిన కథలు చేర్చబడినవి.

ఈ గ్రంథము ఆనాటి సాంఘిక రాజకీయ పరిస్థితులను ప్రతిబింబించుచున్నది. ఇటలీదేశములో సంప్రదాయబద్ధమైన జీవితమును, వ్యవసాయ పునరుద్ధరణమును తన ప్రధాన కర్తవ్యములుగా ప్రభుత్వము ఎంచుకొన్నది. ఈ అంశము వర్జిల్ హృదయమునకు సన్నిహితమై దగుటచే అతనియందగి విశేషమగు స్ఫూర్తి కలిగించెను. కావుననే ఈ కావ్యమునందు అగస్టస్ ఘనకార్యములను గురించియు, అంతర్యుద్ధముల తర్వాత దేశమున సుస్థిర రాజకీయ వాతావరణమును నెలకొన అదను ప్రజల ఆకాంక్షను గూర్చియు వర్జిల్ ఉత్తేజకరముగ ప్రస్తావించినాడు. ఈ కావ్యమందలి ఇతివృత్తము స్థూలముగా గ్రామీణ జీవిత మాధుర్యము. ప్రకృతిలో ప్రాణులు, జడపదార్థములు అనంతముతో పరవశించి యుండునట్లు ఈ కవి చిత్రించినాడు. పశుపక్ష్యాదులు సహితము ప్రేమాభిమానములుగల జీవులుగను, మానవుల ఉపకారమును స్వీకరించి ప్రత్యుపకారము చేయగల కృతజ్ఞతా ప్రాణులుగను వాటిని ఈతడు కారుణ్యముతో వర్ణించినాడు. నాల్గవ భాగమందలి తేనెటీగల వర్ణనము మనోహరముగ నుండును. వాటి జీవనవిధాన చిత్రణము పొ ??

డయాక్సైడు రూపములోను నైట్రొజని మూలద్రవ్యరూపము లోను గాలిలో కలియున్నవి గాలి మిశ్రమమనియు అందులో పరిమాణము ననుసరించి 0.031 శాతము కార్బను డయాక్సైడు 79.107 శాతము నైట్రొజని 20.939 శాతము ఆక్సిజని ఇతర వాయుపదార్థములు ఉన్నవనియు కవెండిష్ అను శాస్త్రవేత్త 1781లో రుజువుచేసెను గాలి మిశ్రమమైనప్పటికిని దానిలో కలసియున్న వేర్వేరు పదార్థముల ప్రమాణములలో గణనీయమైన మార్పులు కన్పింపవు అందులోగల నైట్రొజని కార్బను డయాక్సైడు వర్తులాత్మక రసాయనక్రియలలో పాల్గొనుచు చక్రనేమి క్రమములో తిరిగి గాలిలోనికి యథాపూర్వస్థితిలో వచ్చి చేరుకొనునువిషయము స్పష్టమైనది

**నైట్రొజని వర్తులాత్మకయానము :** గాలిలో ఇష్టము వచ్చినట్లు తిరుగుబోతువలె స్వేచ్ఛగా సంచరించుచున్న నైట్రొజని ఉరుములు మెరుపులతో వర్షము కురియుచున్నపుడు కల్గు విద్యుత్ చెణుకుల సంపర్కములో ఆక్సిజనితో సంయోగమై నైట్రిక్ ఆక్సైడుగా మారును ($N_2 + O_2 \rightarrow 2NO$) తర్వాత అది మరింత ఆక్సిజనితో కలసి ($2NO + O_2 \rightarrow 2NO_2$) నైట్రొజని పెరాక్సైడుగా మారి వర్షజలబిందువులతో యోగించినందువలన ($2NO_2 + H_2O \rightarrow HNO_2 + HNO_3$) నైట్రిక్ నైట్రస్ ఆమ్లములు ఏర్పడును అందువలననే మొదట లభించు వర్షజలములో ఆమ్ల స్వభావము గోచరించును ఈ రీతిగా సృష్టిలో జరుగుచున్న రసాయనక్రియవలన వర్షము కురియునప్పుడు రోజుకు 2½ లక్షల టన్నుల నైట్రిక్ ఆమ్లము తయారగును అదంతయు సూటిగా వర్షమునకు దక్కక సముద్రమునందో లేక ఊసర క్షేత్రములయందో పడును కాని అది నేలలో చేరి మొక్కలకుపయోగపడి ప్రోటీనులుగా మారును ఆ మొక్కలను ఆహారముగా గ్రహించు జంతువుల దేహనిర్మాణములో అది వినియోగమై అవి మరణించి ఖననమైనప్పుడు నేలలోని సూక్ష్మజీవుల చర్యవలన ప్రోటీనులు శిథిలమై నైట్రొజనిగా మారి గాలిలో కలియును జంతువులు దహనమైనప్పుడు కూడ ఆక్సీకరణ క్రియవలన అది నైట్రొజనిగా మారి గాలిలో కలిసిపోవును గాలిలో ఉన్న నైట్రొజని మరియొక దారి ననుసరించి కూడ జీవప్రపంచములోనికి ప్రవేశము కల్పించుకొనును చిక్కుడు మొక్కల వేళ్ళయందున్న బొడిపెలలో సూడోమోనస్ రేడికోలా అను సూక్ష్మజీవులుండును అవి గాలిలోనుండు నైట్రొజనిని వినియోగించుకొని కార్బను యౌగికములుగా మారును అంతేకాక కొన్ని రకముల నాచులు సూక్ష్మజీవులు కాల్షియము కార్బొనేటు (సున్నపురాయి) సంపర్కముతో నైట్రొజనిని వినియోగించుకొనును వీటివలన తయారైన నైట్రొజని యౌగికములను శాకాహారులగు జంతువర్గము ఆహారముగా గ్రహించుటచే వాటిమూలముగా అవి మాంసాహారులగు జంతువర్గమునకు సరఫరా యగును ప్రోటీనులుగా వాటి దేహములను ఇది పెంపుచేయును వాటి మలమూత్రాదులును అవి మరణించినప్పుడు వాటియందలి నైట్రొజని యౌగికములు నైట్రొజనీకరణులైన నైట్రికీకరణులైన సూక్ష్మజీవులవలన మారు నైట్రేటులును మొక్కలకు పుష్టికరమైన ఎరువుగా ఉపయోగించుచున్నవి

కార్బనుకూడ కార్బను డయాక్సైడుల రూపములో వర్తులాత్మక రసాయన క్రియలయందు పాల్గొనును అదికూడ మానవుని మనుగడకు అవశ్యకమైనదే గాలిలోనుండు కార్బను డయాక్సైడు నీటి ఆవిరి సూర్యకాంతి ప్రసారము జరుగునప్పుడు క్లోరోఫిల్ సంపర్కముతో పెక్కు రసాయన క్రియలలో పాల్గొనుటవలన కార్బోహైడ్రేటులు లభించును ఏడాదికి 500 బిలియను టన్నుల కార్బనుడయాక్సైడు 410 బిలియను టన్నుల నీటి ఆవిరి ఇట్టి రసాయనక్రియలో పాల్గొని 341 బిలియను టన్నుల గ్లూకోజు తయారగును 205 బిలియను టన్నుల నీటి ఆవిరి 364 బిలియను టన్నుల ఆక్సిజని తిరిగి గాలిలో కలియుచున్నది దీనినిబట్టి ఈ రసాయనక్రియలు ఆహార సమస్యాపరిష్కారములో విశేషముగా సహకరించుచున్నవని తెలియగలదు సూర్యునినుండి భూమికి చేరుకొనెడి శక్తిలో శతాంశమంతు మాత్రమే ఈ రసాయనక్రియలలో ఉపయోగపడును సృష్టిలో తయారగు కార్బోహైడ్రేటులలో 90 శాతము నీటిమీద పెరుగు సూక్ష్మశరీరము గల నాచువంటి మొక్కలవలననే నిర్వహణమగును ఈ కాంతి చైతన్యరసాయన క్రియలలో లభించు కార్బోహైడ్రేటులు పరోక్షముగా జీవజాతికి ఆహారమగుచున్నవి అవి జీర్ణమై శక్తినిచ్చి ఉచ్ఛ్వాసరూపమున గ్రహించు ఆక్సిజని వలన ఆక్సీకరణమై నిశ్వాసరూపమున కార్బను డయాక్సైడుగా వెలుపలికి వచ్చి గాలిలో కలియుట నిత్యము జరుగు

చుండును లేదా మొక్కలనుండి భూగర్భములో పాతు కొనిపోయి రాతినబొగ్గు పెట్రోలియము వగైరాలుగా మారిన కార్బను యౌగికములను ఇంధనములుగా మనము వాడినప్పుడు అవి మండి ఆక్సీకరణమై కార్బను డయాక్సైడుగా మారి గాలిలో కలిసిపోవును

ఈ రీతిగా వర్తులాత్మకముగా నిర్వహణమగుచుండు కాంతి చైతన్యరసాయన క్రియలలో సూర్యకాంతిలోని ఏతరంగదైర్ఘ్యపు చైతన్యము పాల్గొనుచున్నదియు రసాయనక్రియలు అంచెలంచలుగా ఏరీతిగా సాగుచున్నదియు శాస్త్రవేత్తలు బాగుగా శోధించినారు ఇంకను శోధించుచునే యున్నారు

హ. అ

## వలయినములు

వలయినములనునవి జంతువర్గమునందలి ఒక ప్రత్యేక శాఖకు చెందినవి సాధారణముగా పొడవైన వీటి శరీరములు ఉంగరములవలె చుట్టలు చుట్టుకొని వర్తులాకారముగనుండును వివిధతరగతులకు చెందిన ఈ వలయినములు పెద్ద ఆకారములోను చిన్న ఆకారములలోగూడ గోచరమగును ఇవి భూమియందును మంచినీటియందును ఉప్పునీటియందు గొట్టములందును జీవించును కొన్ని వలయినములు ఇతర జీవరాసులనాశ్రయించుకొని జీవించును జలచరములైన ఒకజాతి వలయినములు నీటియందు స్వేచ్ఛగ ఈదగలవు జంతువర్గమునకు చెందిన ఈ వలయినములలో మనకు సాధారణముగా కన్పట్టునవి నీటియందుండు జలగలు భూమిపై బొరియలలోనుండు వానపాములు ఇత్యాదులు

వర్గీకరణము: వీటి శరీరము విడువుగను వృత్తఖండములుగను నిక్కపొడుచుకొన్న జంటవెంట్రుకలు కలదిగను ఉండును పృష్ఠమస్తిష్కగండమునకు చెందిన రెండు ఉత్సర్గనాళికలుగల ఈ జంతుజాతియొక్క రక్తవాహినీప్రణాళి మూయబడియుండును ఈవలయినములు ఏకలింగ ద్విలింగకములుగానుండును

మొదటి శరపాదవర్గము: విశిష్టమగు దేహాకృతిగల ఈవలయినములు పెక్కువర్తులఖండములతో నిర్మితమైయుండును అవి సూక్ష్మమైన పాదములను దృఢమైన రోమములను కలిగియుండును వాటి దేహగుహ విస్తృతముగనుండి ఆడమగ ప్రాణులందు భేదము స్పష్టముగ కన్పట్టును

ఈ వర్గమునకు చెందిన మొదటిగణమునందలి వలయినములు బహురోమకములు సముద్రమునందు చరించు ఈకృములకు అంతరములను బాగాగాగములుగయిన వృత్త వలయములును పార్శ్వ ఉపాంగములును కలవు వాటి శిరములు సంవేదాంగములతో విశిష్టములైయుండును ఆడ మగ కృములలైంగికాంగములు కలిసిగాని విడిగాగాని ఉండును వీటికి శాశ్వతమైన ప్రజననగ్రంథులుండవు

చిత్రము 22



పటము 1

ఈ వర్గమునకేచెందిన మరియొక ఉపగణమునందలి వలయినముల దవడలు ముందునకు పొడుచుకొనివచ్చినట్లుండును వీటి వర్తులభాగములు శరీరముపొడవునను సదృశములై యుండి పార్శ్వోపాంగములు అభిన్నములుగ స్వేచ్ఛగ ఈదుటకనుకూలముగ నుండును మరియొక ఉపగణమునకు చెందిన కృములు కదిలక మెదలక ఒక్కచోటనే పడియుండును వీటికి ముందుకు పొడుచుకొనివచ్చు గ్రసనియు దవడలును కాన్పింపవు వీటి శరీరములు రెండు సూడు విషమవర్తుల విభాగములతోను పార్శ్వోపాంగములతోను కూడియుండి ఇవి గొట్టములలో నివసించుచుండును

అల్పరోములైన మరియొకగణము మంచినీటియందు గాని భూమియందుగాని నివసించుచుండును వాటికిఅంతరబాహిర వర్తులభాగములుండును తలగాని అభిచరణముగాని ఉండదు దృఢరోములు తక్కువ

చిత్రము 23



పటము 2

ఆడ మగ లైంగికచిహ్నములు కలిసియుండి అభివృద్ధియందు ఎడములేక నూటిగనుండును వానపాము ఇందుకుదాహరణము

రెండవ(జలోకా)వర్గము: ఈ కృముల శరీరములు ముందు వెనుక భాగములందుగల చూషకములలో దీర్ఘీకృతములైయుండును వీటి నోటికి దవడలుండును వీటి శరీరములందు సుస్ప

ష్టమైన కొన్నివర్తులభాగములుండును బహిర్భాగమున ఆవర్తులభాగములు అనేక అప్రధానవలయములుగా ఉపవిభక్తములై యుండును దేహగుహ (coelome) సంయోజకధాతువులచే రూపుమాపబోవును లైంగికలక్షణములు కలిసియుండును నిరంతరాభివృద్ధిచెందు ఈకృములు స్వతంత్రజీవులుగగాని పరాన్నభుక్కులుగగాని జీవించుచుండును ఈవర్గమునందలి మొదటి గణమునకుచెందిన కృములకు ముందుభాగమున చూషకముండదు దవడలుకూడ లేవు రెండవ గణమునకు చెందిన కృములకు ముందుభాగమున చూషకములుండుటయు లేకుండుటయుకూడ కలదు వీటికి గవడలుండవు మూడవ గణమునకు ముందుభాగమున చూషకములును మూడు దవడలును విస్తృతముగా విభక్తములైన రక్తచూషకభాగములును ఉండును నాల్గవగణమునకు చెందిన కృములకు దవడలుండవు

మూడవ (ప్రవలయిన) వర్గము ఇవి లోపల వర్తులభాగములు కల సముద్రపుకృములు బాహ్యమునందు వర్తులభాగములు అస్పష్టముగనుండును అభిచరణములు దృఢరోమములు ఉండవు లైంగికచిహ్నములు విడివిడిగానుండును,

ఎకియూరిడా (echiurida) ఇవి సముద్రములో చరించు కృములు వీటికి వర్తులభాగములు అభిచరణములు ఉండవు వీటి ఆకృతి సాధారణముగా వర్తులముగనో కోడిగ్రుడ్డు ఆకారమునన్ ఉండును వీటికి మామూలుగనే నోరు ముందు భాగమున గుదము వెనుకభాగమున ఉండును పైన వ్రేలాడుచుండు నోరు పొడవైన తొండముగలెనుండును ఉదా భోనిలియా అను కృమి

సిపన్క్యులిడా (Sipunculida) ఇవిసముద్రసంబంధములైన కృములు అంతర్వలయములుండు వీటి వర్తులభాగములు అభిచరణములు లేక సంస్పర్శకములచే నోరు చుట్టుకొనబడియుండును

దేహభిత్తి: వెలుపలిభాగమున దేహభిత్తి సూక్ష్మమై కోశరహితమైన (noncellular) ఉపచర్మముచే కప్పబడియుండును గ్రంథికోశికలు సంవేదికోశికలు బయటికి తెరచుకొనియుండుటకు అవి ఉపయోగించును అవి ఉపచర్మము క్రిందనుండు బాహ్యత్వక్కుచే మరుగుపడియుండును. ఆ బాహ్యత్వక్కు అవిచ్ఛేదీయ కోశికలయొక్క పొరచే ఏర్పడును దానితో పెక్కు సంవేదికోశికలును గ్రంథికోశికలను గ్రసిద్ధములై యుండును అవిచ్ఛేదీయ కోశికల అడుగున ఒక గుండ్రని పేశతంతువుల పొర కలదు. దీనిక్రిందనున్న దైర్ఘ్య పేశతంతు



చిత్రము 4

పటము 1

లున్నవి అను దైర్ఘ్య పేశుల సంకోచము శరీరమును పొట్టిగా చేయు చుండగా గుండ్రని పేశుల సంకోచము శరీరము పొడవుగసాగును జీర్ణనాళికయొక్క బహిర్భాగమును ఆవరించి రాంగ ఉపకలయను నది కప్పివేయును ఆగుశ్లేష్మికయు జీర్ణ ఉపకలయు దీనిననుసరించి యుండును ఆహారనాళికాభిత్తికిని దేహభిత్తికిని నడుమ శూన్యప్రదేశము కలదు దానికే దేహగుహ అనిపేరు

దేహగుహ (coelom) ఇది అడ్డముగ గదులక్రింద విభజింపబడియుండును జలగావర్గమందు అధికముగా వృద్ధమైన కండరములు ఆక్రమించుటచే దేహగుహ కొలగిస్థలమును ఆక్రమించును ఇందు ఉదరగుహీయ (coelomic) ద్రవముండును

జీర్ణకోశము వలయునముల యొక్క జీవితవిధానమును బట్టియు వాటి ఆహారమునుబట్టియు వాటి జీర్ణక్షేత్రము మారుచుండును కొన్ని కృముల దవడలు కఠినమైన పదార్థముచే నిర్మింపబడియుండును నోరు కండరములు గల యొక గ్రసని లోనికి తెరచుకొనియుండును జలగ ఇందుకుదాహరణము దాని వెంట నొక ఇరుకైన గ్రాసనళిక లదు ఇదికూడ ఒక సామాన్యమైన గొట్టములోనికి తెరచుకొనియుండును అది ఉదర ఆంత్రము (intestine) అది గుదము వద్ద తెరచుకొని యుండును అక్కడ అల్పరోములలోపల ఒక క్రాపు ఒక పేషణి (gizzard) జఠర ఆంత్రములు ఉండును జలగావర్గములోని క్రాపు ఆంత్రనాళములోనొక గొప్ప భాగము అది ప్రక్కగా పదినొకండు జంటలు గల చిన్న సంచులుగా నిర్గతమై జఠరములోనికి తెరచు-



చిత్రము 2b

పటము 4

కొనియుండును అచ్చటనే ఆహారము జీర్ణమగును ఆ జఠరము ఇరుకైన ఆంత్రముగా సాగుచు గుదమునకు తెరచుకొని యుండును అల్పరోములలో ఒక అంత్రపుటము కలదు అది యొక్క దీర్ఘ రేఖాకారమైన మడత ఈ అంత్రపుటము ఆహార సారము ను పీల్చుకొను అంత్రముల యొక్క పృష్ఠభాగములో కేంద్రమునందుండును

**జీర్ణకోశ గ్రంథులు** జీర్ణకోశగ్రంథులు గ్రాసనాళ ప్రదేశమున కానవగును పురురోగులలో ఆ గ్రంథులు జంటలుగా సుశాఖారవాతముగాను ఉండగా అల్పరోములలో మూడు జంట గ్రంథులు కన్పించును జలగల విషయములో లాలాగ్రంథులును గ్రసనికయు చుట్టుగ నుండును వాటి స్రావము రక్తమును పేరుకొనకుండ చేయును

చిత్రము ౭౮



పటము 5

**వాహికామండలము** వలయినముల వాహికామండలము మూయబడియుండును ఆహారవాహినిపైనుండు పృష్ఠవాహాని ముడుచుకొను స్వభావము కల్గియుండును అది పేరి - ఆంత్ర - రక్త - జాలకముమండియు దేహభిత్తిమండియు ఇతర అంగములనుండియు రక్తమును సంగ్రహించి దానిని పూర్వ శరీరాగ్రమునకు పంపును అచ్చట నుండి అది పార్శ్వమందున్న సంయోజినులద్వారా ప్రసరించును ఈ సంయోజినులలో కొన్ని విస్తృతములై తాళబద్ధముగా స్పందించి రక్తమును అధరవాహినికి పంపును కావున అవి గుండెకాయలు అనబడినవి అధరవాహిని అనునది పలుచని తెరతో సంకోచము చెందని ఒక నాళిక; అది విభాజకముగా వర్తించును జలగల విషయములో వాహికామండలమునకు దేహగుహ యొక్క

చిత్రము 27



పటము 6

కుల్యకతో ప్రత్యక్ష సంచారసంబంధము కల్గియుండి రుధిర గుహగా నేర్పడును ముఖ్యమైన రక్తవాహికలు పార్శ్వము లందుండి కొవలయంధు రెండువలయనములచే అనుసంధింపబడి యుండును

**శ్వాసము** బానపాముల విషయమున చర్మముద్వారా శ్వాసనము ఘటిల్లును చెక్కు పురురోములు (polychaetes) క్లోమకేసరములద్వారా శ్వాసను పీల్చుకొనును జలీయ అల్పరోములు గుదద్వారమున శ్వాసించును అట్లు శ్వాసించుటలో మలకోశమునుండి బయటికిని బయటనుండి లోపలికిని నీరు పంపుచేయబడును

**ఉత్సర్జనమండలము** (excretory system) ఉత్సర్జనాంగములు దేహమునందు సరళముగగాని వలయముగగాని చుట్టలుగగాని ఏర్పడియుండు నాళికలు అవి బయటికిగాని ఆహారనాళికలోనికిగాని తెరచుకొనియుండును వృక్క

చిత్రము ౨౮


పటము 7

రంధ్రములద్వారా దేహగుహాద్రవమునుండి నత్రజనికి చెందు పనికిరాని పదార్థములను అది తొలగించును సిద్ధమైన వృక్కకము దేహగుహలోనికి తెరచుకొని విశేషముగా చుట్టుకొనియుండు మాంసనాళికతో సంబంధించియుండును తరచుగా మారుచుండెడి వృక్కకముల సంఖ్య అల్పరోములలో (oligochaeta) అసంఖ్యాకముగను జలూకావర్గములో (hirudinea) తక్కువగను ఉండును

**నాడీమండలము** ఇందొక కేంద్రనాడీమండలముండును. ఇదిరెండు మేధస్సు నాడీసూత్రమును పరిణామ నాడులును ఇందుగలవు ఇవి నాడీసూత్రమునుండి ఉత్పన్నమగును మెదడు (మస్తిష్క గుచ్ఛకము) పూర్వ కాయాగ్రమున నుండును పరివేష్టకగ్రసని సంయోజనుల ద్వారా అధర తంత్రికాగుచ్ఛమునకు మెదడు సమాచారమును పంపును తంత్రికాగుచ్ఛవు ద్విగుణముగ నుండును ఈ రెండు సగములు పూర్తిగా కలిసిగాని, విడిగాగాని ఉండును ప్రతిఖండమున భాగ

మండును ఈ రజ్జువు కొంచెగ విస్తరించును దానినుండి నాడులు వర్తుల మండలము యొక్క భిన్న భాగము లకు

చిత్రము 29

పటము 8

విక్షిప్తములగును కాని వానపాముల విషయములో నాడులు సంయోజినులనుండి విక్షిప్తములగునేకాని గుచ్ఛకము నుండి విక్షిప్తములు కావు

**జ్ఞానేంద్రియములు** కన్నులు పార్శ్వేంద్రియములు కటకములు సామ్యవేదులు స్వాదకశికలు వేంద్రుకలు మున్నగునవి ఇందలి భాగములు వీటిలో నేత్రములు సామాన్యమైన రంగు చుక్కలుగగాని ముకురములతోను దృష్టి పటలముతోను కూడిన సవిస్తర నిర్మాణము కలదిగగాని ఉండును పురురోములకు కన్నులు అభిముఖముగ పరిముఖమునందును కన్నులు అయిదు జంటలుగ పార్శ్వము లందు వర్తుల భాగమున అమర్పబడి యుండును జతౌకా వర్గమునకు మొదటి అయిదు వర్తుల భాగములలో ఒక్కొకదానియందు ఒక్కొక జంట కన్నులు చొప్పుననుండును పార్శ్వేంద్రియములు వర్తులభాగమున రచితములై యుండును ఇవి వ్యవర్తక్రియా ఙ్గములు సామ్యవేదులు లేక అష్టపుటులు (statocysts or ootocysts) అనునవి సమస్థితిని ఇంద్రియములు

చిత్రము 30

పటము 9

అవి అనేక పురురోములలో కాననగును అవి చర్మముపై ఇసుక రేణువులతో నుండు అంతర్గమనములు-అనగా స్థలమును విడిచి కదలని పురురోముల యొక్క శరీరుకావయవములు జలగలకు ముఖచూషకముల యొక్క ముందటి అంచువద్ద గిన్నె ఆకృతిగల జ్ఞానేంద్రియములు కలవు

**ప్రజననతంత్రము** కొన్ని పురురోములు (polychaetes) ఉభయలింగులు కలవిగనుండును కొన్నిటిలో ఒకే వలయినము నందు స్త్రీపురుషాంగములు రెండును అమరియుండును అల్పరోములకును జలగలకును ఒక్కొక్క దానియందు స్త్రీపురుషాంగములు రెండును కలవు పురురోములలోని ప్రజననేంద్రియములు జంటగా నుండును అవి విశేషముగా వాటి శరీరపు ఖండములలో కనిపించును నేరీసు (అలో) (Nereis) లింగచిహ్నములు వేరుగ నుండి జననకోశికలు germ cells) తాత్కాలిక అండాశయమునుండి కాని బీజకవచములనుండి కాని ఏర్పడును అవి ప్రజనన ఋతువులలో అభివృద్ధి నొందును పురురోములలో అండాణువు (ova) శుక్రకణులు (sperms) జనన వాహిని ద్వారమునగాని వృక్కక రంధ్రముల ద్వారమునగాని దేహ భిత్తికాభంగము ద్వారమునగాని శరీరమును వదలిపెట్టును నెరీసులవంటి కొన్ని జంతువుల విషయములో ఆకార నిర్మాణములందు గొప్ప మార్పులు జరుగును కన్నులు పార్శ్వపాదములు శూకములు అట్టి మార్పులకు గురియగు అవయవములు అల్పరోములలో జనదపిండములు కొన్ని ఖండములకే-అనగా అండాశయములకు ఎదుటనుండు బీజకవచములకే-పరిమితములగుచున్నవి ఉదా వానపాములు పురుషాంగమునందు రెండు జంటల బీజకవచ సంచులుండును అవి పదవ పదునొకండవ ఖండముల మధ్య నుండును అందు జంట బీజకవచములు శుక్రపు గొట్టములు ఉండును ఒక్కొక్క బీజకవచపు సంచి వెనుక ప్రక్కనుండు జంట శుక్రాశయములలోనికి లేదా శుక్రకోశములలోనికి తెరచుకొని యుండును అచ్చట శుక్రములు నిలవయుండును చిమ్ని ఆకారముగల శుక్రద్వారములు శుక్రవాహినీ కలశములలోనికి దారితీయును ఒక్కొక్క ప్రక్కనుండు రెండు శుక్రవాహినీ కలశములు వెనుకవైపుకు పోయి 15 వ ఖండముయొక్క అధరోపరితలమున తెరచుకొనును సామాన్యములైన స్త్రీ అంగములందొక అండాణు కోశముల జంటయు అండవాహినుల జంటయు రెండు జంటల శుక్రధానులును ఉండును అండవాహిను లనునవి పొట్టిగనుండు గొట్టములు వాటికి చిమ్ని ఆకారముగల ద్వారముండును

అవి ఎదునాల్గవ ఖండముయొక్క ఆధరోపరితలమున తెరచు కొని యుండును శుక్రధానులను సంచులందు శుక్రాణువులు సంయోగకాలమున గ్రహింపబడును జలగలన్నిటియందును లైంగికేంద్రియములు జంటలుగా నుండును పురుషాంగము లలో బీజకోశములు కోశసంవృతములై యుండును ప్రతి బీజకవచము నుండియు ఒక చిన్నవాహిని ఉత్పన్నమగును అది ఇతర బీజకవచములనుండి ఉత్పన్నమగు సదృశవాహిను లతో కలిసి పెద్ద వాహినిగా నేర్పడి వెడల్పయిన ఒక శుక్ర పుటలోనికి తెరచుకొని యుండును ఒక్కొక ప్రక్కనుండి రెండు శుక్రపుటులు ఒక ఉత్క్షేపకములోనికి తెరచుకొని యుండును స్త్రీ ప్రజననేంద్రియములు అండాశయ యుగ్మముతో నిర్మితములై యుండును వాటికి రెండు అండవాహిను లుండును అవి ఒక సాధారణమైన కందరమునుగల యోని లోనికిని జనన వివరద్వారమున బయటికిని తెరచుకొని యుండును

**పునరుత్పాదనము :** పెక్కురకముల వలయినములలోను పురురోమములలోను (polychaetes) పునరుత్పాదన విషయమున అసాధారణమైన ఒక సంఘటనము కన్పట్టును-నష్టపడు భాగములు తిరిగి సమకూరుటయే ఈ సంఘటనము

**పోలికలు** వలయినముల నడుమ పెక్కు అంశములలో పోలికలు కలవు ప్రసృష్టికి (phylum) చెందిన వృతవలయ డింభము (trochopleore larva) బ్రయోజో (Bryozoa) చూర్ణప్రాకారములతో (mollusca) దగ్గరసంబంధము కలది

చిత్రము 81



పటము 10

దానికి ప్రాచీనరూపమగు వత్సవలయ జీవితో (trochozoon) సంబంధమున్నది వత్స వలయముల యొక్క నిర్మాణములలో కొన్ని టెనోఫోరా (ctenophora) రోటిఫెరా (rotifera) వర్గములతో సాన్నిహిత్యము కలియున్నది వలయినముల యొక్క పోలికలను గూర్చి అభిప్రాయ వైవిధ్యము కలదు

వానపాములు వాటి బొరియలకడ్డ భూమి అడుగు భాగమునుండి మట్టిని నిర్విరామముగా బయటికి తోడి వేయుచుండును ఇందువలన అచ్చటి నేల సన్నపారును తత్ఫలితముగా గాలియు క్రిములును వృక్షముల వ్రేళ్లవద్దకు చేరును వానపాముచే తినబడు మన్ను సారవత్తమైన దగుటచే అది చెట్లకు బలమునిచ్చును

పందొమ్మిదవ శతాబ్ది మొదటిభాగములో ఆఫ్రికా ఆస్ట్రేలియా ఇండియా జపాను మెక్సికో అమెరికాసంయుక్త రాష్ట్రములలో గాయములనుండి రక్తమును పీల్చుటకై జలగలు ఉపయోగింపబడెను జలగలయందలి విషక్రిములనుచంపి పరిశుద్ధమొనర్చుట అసంభవమగుటచే గాయము రోగాణు రక్తశాస్పృష్టమై రోగి మరణించెడివాడు అంతేకాక జలగ నుండి బలాత్కారముగా గ్రహింపబడిన హిరుడిన్ అను ద్రవము రక్తము గడ్డకట్టుటకై ఉపయోగించబడెను

దేవమ్మ

## వల్లభాచార్యుడు

తన ఆనందము నెల్లరకు పంచిపెట్టుటకై మధుపము వగిది పర్యటించి ఉన్మత్తునివలె దేశములు త్రిమ్మరి తన్మయత్వమధురత్వములను సర్వజన సులభమొనర్చిన వల్లభాచార్యులు ఆంధ్ర దేశస్థుడైన లక్ష్మణభట్టు పుత్రుడని స్థిరీకృతమైనది ఇతని జన్మస్థలము గోదావరీ తీరమందలి కాంకరపాడు గ్రామము తల్లి పేరు ఇల్లమ్మ లక్ష్మణభట్టు వెలనాటి శాఖీయ బ్రాహ్మణుడు మహా విద్వాంసుడు ధర్మనిష్ఠా గరిష్ఠుడు; పూర్వాచారపరాయణుడు ఇతని సంప్రదాయ పీఠాధిపతులు ఉత్తరభారతమున కుదురుకొనిరి కాని నేటికిని వారు పుత్రుల వివాహములకై ఆంధ్రదేశమునకు వచ్చి కృష్ణా గోదావరీ మండలస్థులగు వెలనాటి కన్యకలను ఎన్నుకొనుచుందురు

వల్లభుని జనన కాలమునుగూర్చి భిన్నాభిప్రాయము లున్నవి క్రీ శ 1479-1481 సంవత్సరములు నడుమ ఆతడు జన్మించి యుండునని రూఢిగా విశ్వసింప బడుచున్నది

కాశీ నగరవాసియైన లక్ష్మణభట్టు వల్లభుని ఆతని చేత నారాయణభట్టు అను విద్వాంసునియొద్ద చదువనేర్పెను

అమానుషమేధాసంపన్నుడైన ఆ బాలుడు అచిరకాలముననే క్రమముగ వేద వేదాంగ వేదాంతములను అధ్యయన మొనరించినాడు అప్పటికతనికి పదేండ్లప్రాయము ఏయే ఆచార్యులయొద్ద నేయే విద్యలుకలవో వాటినెల్ల ఆతడు నిమ్మట గ్రహించి తానునేర్చిన విద్యల నెల్లరకు పంచి యిచ్చెను ఆతడు పూర్ణముగ పరిశీలించిన శాస్త్రములలో మధ్వ సాంప్రదాయక గ్రంథములుకూడ నున్నవి

వల్లభునకు పదునొకండవ యేటనే పితృవియోగము కల్గినది ఆతడు తన తల్లిని దక్షిణదేశము నందలి స్వస్థానమునకు పంపి తాను మధ్వయతీంద్ర శాస్త్రములను ప్రత్యేకముగ విచారించి పూర్వాచార్యుడైన విష్ణుస్వామి భావములను గూడ అధికతర శ్రద్ధతో అవగాహన మొనరించుకొనెను పిదప వాటినుండి స్వసిద్ధాంతానుకూల విషయములను అధికముగ గ్రహించి ప్రత్యేకముగ శుద్ధాద్వైత వాదము అను పేరిట స్వీయసిద్ధాంతము నొకదానిని రూపొందించినాడు

అద్వైత మాయావాదమును ఖండించుచు విశిష్టాద్వైతమును సమర్థించుచు విద్వత్సభలలో ఉపన్యసించు ఈతని యశము దేశమునల్గడలను వ్యాపించినది దానితో ఇతడు తన పుష్టిమార్గము ను స్థాపింప సంకల్పించుకొనెను పండ్రెండవ యేటనే ఉజ్జయినిలో అనేకులను శుద్ధాద్వైత వాదమునకు చేర్చెను దక్షిణదేశమునకు వచ్చి తైర్థయాత్రలో ఉనమూశా మహులుండిన విద్యానగరమును చేరెను ఆనాడచట పండిత ప్రభువగు శ్రీకృష్ణదేవరాయల పాలనము సాగుచుండెను వల్లభుడు 'ఆచార్య' అనియు ఆచార్యచక్ర చూడామణి జగద్గురు శ్రీమదాచార్య మహాప్రభువు అనియు బిరుదములచే అచట సత్కరింపబడెను

తన ద్వితీయ దిగ్విజయ యాత్రలో వల్లభుడు పండరి విఠలనాథుని దర్శించినాడు అప్పుడే ఆతనికి వివాహవాంఛ కల్గినదట! అందుచే సుమారు 28వ యేట కాశీపురమునగల సజాతీయ బ్రాహ్మణ కుటుంబమునకు చెందిన మహాలక్ష్మి అను కన్యను పెండ్లియాడి కాశీయందే నివసించుచు క్రీ శ 1511 1516 ప్రాంతములో గోపీనాథుని, విఠలనాథుని తనయులుగా పడసెను తృతీయ తైర్థయాత్రలో గోవర్ధనగిరికడ భూగర్భమున శ్రీనాథస్వామి మూర్తికలదని గ్రహించి దానిని ఉద్ధరించి ఆ విగ్రహ ప్రతిష్ఠకై యొక మందిరమును కూడ నిర్మించినాడు

వల్లభాచార్య సంప్రదాయ పీఠములు 84లో 22 వ్రజప్రాంతమున గలవు ఎనుబదినాల్గు అని చెప్పబడు ఆతని సిద్ధాంత గ్రంథములలో 85 మాత్రమే ఆతనివని కొందరి వాదము వాటిలో 30 మాత్రమే సుప్రఖ్యాతములు అందు మొదటిదైన అణు భాష్యము వేదాంత సూత్రములకు భాష్యము రెండవదియైన సుబోధిని భాగవత మందలి మొదటి నాల్గు స్కంధములకును దశమైకాదశస్కంధములకును వ్యాఖ్యాప్రాయము ఈ రెండును చాల ప్రధాన గ్రంథములు

వల్లభుడు తన చరమదశను వారాణాసిలో గడపనెంచెను అప్పటికి పూర్ణానందస్వామియై నలుబది దినములు తపోనిష్ఠ యందుండి తన 52వ యేట హనుమాన్ ఘట్టమున గంగాజల నిమజ్జన రూపమున కాలధర్మము నొంది శాశ్వత బృందావన కృష్ణసాన్నిధ్యము నొందెను ఆ హనుమాన్ ఘట్టము వల్లభాచార్యుని ఆలయము నొకటి నిర్మించుకొని చిరస్మరణీయ మగుచున్నది

**శుద్ధాద్వైతవాదము** భక్తి మార్గమును దృఢీకరించిన పల్వురిలో విష్ణుస్వామి ప్రథముడు తక్కినవారు నింబార్క, మధ్వాచార్య రామానుజులు విష్ణుస్వామి రుద్రసంప్రదాయమును వల్లభాచార్యుడు స్వీకరించి మాయారహిత బ్రహ్మమును ప్రతిపాదించి శుద్ధాద్వైతమును నెలకొల్పినాడు మాయా నిరపేక్ష్యముగనే బ్రహ్మము సృష్టికార్యమును నిర్వహించునని ఇతని వాదము అందుచే బ్రహ్మముతోపాటు జగత్తుకూడ సద్రూపమగుచున్నది

**సగుణబ్రహ్మము** వల్లభుడు సాకార బ్రహ్మసిద్ధాంతమును చిత్రించి శంకర రామానుజులనుండి ప్రత్యేకతను చూపెను బ్రహ్మము ప్రకృతి గుణరహితుడు గావున నిర్గుణుడనిగాని సర్వగుణ శూన్యుడనిగాని తాత్పర్యముకాదు ఆతడు సచ్చిదానంద లక్షణోపేతుడు అందుచే సగుణుడు నిర్గుణుడు అకర్త కర్త అణువు మహాన్ కూడా ఇట్లు సగుణ నిర్గుణముల సమరస సమన్వయస్వరూపమై బ్రహ్మము అద్వితీయుడే యగునని వల్లభుని ప్రతిపాదనము బ్రహ్మకు సాంశత్వము నిరంశత్వముకూడ శ్రుతియే చెప్పుచున్నది

**జీవుడు** ఈ బ్రహ్మమునుండి చేతనాత్మకము జడాత్మకము అని ద్వివిధ సృష్టి ఉద్భవించును అది జీవజగత్తుల సృష్టియగును చిదంశము జీవరూపమును అక్షరబ్రహ్మము

భౌతిక విశ్వరూపమును తాల్చునన్నమాట అగ్నినుండి మిడుగురులను సముద్రమునుండి తరంగములనువలె అక్షరునుండి జీవులు జనితములు అందుచే బ్రహ్మమునకును జీవునకును అభేదము బ్రహ్మమువలె జీవుడును సత్పదార్థమే కాని జీవుడు బ్రహ్మము కాజాలడు జీవుడు అణురూపము ఈ జీవుని గూర్చి బ్రహ్మసూత్రములు విచారించును వాటికి భాష్యములు రచించి వల్లభుడు అణుభాష్యమని పేరిడుట గమనార్హము

జీవులు శుద్ధ బద్ధ ముక్తరీతిచే త్రివిధము శుద్ధ జీవులు అవిద్యావరణమును పొందక ఐశ్వర్యాదిక శక్తియుక్తులగుదురు బద్ధులు సంసారులై జనన మరణ సుఖదుఃఖాదులలో మునిగి తేలుచుందురు శరీరేంద్రియాదులను ఆత్మగ భ్రమించి సంసారపాశబద్ధులయ్యు సర్వతుణికత్వ జ్ఞానము గడించి సంసారాదులను నశ్వరముగ గ్రహించి క్రమముగ భగవత్ప్రేమాభివృద్ధిచే ధ్యానాదులవలన ముక్తులగుదురు అవిద్యానాశనమున సంసారబంధములను త్రెంచి విముక్తి నొందువారు ముక్తులు వీరు పూర్వ ఆనందాదిలక్షణములను సంపాదించి భగవంతునితో ఏకత్వము నొందుదురు

జగత్తు ఈ మతములో కల్పితమైన సంసారమును సద్విశిష్టమగుజగత్తును ఒకటి కానేరవు జగత్తుకూడ బ్రహ్మాత్మకమే గావున లయకాలమున నశింపక రూపాంతరస్థితి నొందును అందుచే జగము అభావమని నిశ్చయింపరాదు నశ్వరమనగా రూపాంతరత్వమే అవస్థాభేదము నొందు దానిని భ్రాంతి అనరాదు మాయ భ్రాంతికాక బ్రహ్మము యొక్క శక్తియై ఆతని ఆవిర్భావ తిరోభావ కార్యములను చేయించును అందుచే మాయ అవిద్యారూపము కానేరదు జగదీశ్వర విభేదదృష్టియే అజ్ఞానము దీనినుండి కడతేరుటకు భగవదనుగ్రహ మనబడు పుష్టి కాక అన్యమార్గము లేదు జ్ఞానముకూడ ఉపయుక్తమైనను భక్తియే ప్రధానము భక్తి యొక్క సఫలత్వము పుష్టి ననుసరించి గ్రహింపనగును

పుష్టి నిర్వచన స్వరూపములు అనుగ్రహ రూపో। భగవద్ధర్మః। పుష్టిః — పోషణం। తదనుగ్రహః । అను భాగవతవచనము (౭-౧౦-౩౦) పుష్టిమార్గమును నిర్వచించుచున్నది పుష్టిస్తురసః పరిణామతః। స్థాల్యాం అవి గ్రహింపబడెను ధర్మరూపేణ పుష్టాతి అనియు భాగవతసూక్తి భగవంతుని అనుగ్రహమే ధర్మమై భక్తులకు పుష్టితుష్టుల నొసగునని శుద్ధాద్వైత సిద్ధాంతము పుష్టిచే భక్తియు ఇనుమడించును దానికి పుష్టిభక్తి యనిపేరు దీనిలో ఐహికవాంఛలు నశించి పరమాత్మానుభూతియే ప్రధానముగ నుండును ఈ పుష్టిభక్తి చతుర్విధము 1 ప్రవాహ పుష్టిభక్తి 2 మర్యాదా పుష్టిభక్తి 3 పుష్టి పుష్టిభక్తి 4 శుద్ధ పుష్టిభక్తి అని వీటి పేర్లు ఈ చతుర్విధ (పుష్టిభక్తి) స్థితుల నార్జించుటకు ప్రేమాసక్తులు ఏరి పక్వము కావలెను భక్తి వ్యసనరూపము తాల్పవలెను అప్పుడు సాధకునకు శ్రీహరి సర్వత్ర గోచరింప గలడు అందుచే అంతర్బహిః ప్రపంచ మంతయు ప్రేమపాత్రముగ పరిణమింప గలదు మర్యాదాభక్తులు సాయుజ్య ముక్తిని పొందగా పుష్టి పుష్టిభక్తులు దానిని నిరసించి ఆనందతన్మయులగుచుందురు మర్యాదా భక్తికి ఫలాపేక్షగల అంబరీషోపాఖ్యానమును పుష్టి పుష్టికి రాసక్రీడలును ఉదాహరణములు

పుష్టిమార్గమున సేవకు ప్రాధాన్యము మెండు అది నామసేవ స్వరూపసేవ అని ద్వివిధము స్వరూపసేవ తనుజ-విత్తజ-మానస రూపములని మరల త్రివిధము తిరిగి ఈ మానససేవ మర్యాదా-పుష్టిమార్గములని ద్విభాకరింపబడెను ఈ మర్యాదా మార్గమున మానవసేవకు శాస్త్రజ్ఞానము అగత్యము ఆత్మజ్ఞానము భగవదారాధనము అహంకార మమకార విసర్జనము ఈప్సితసిద్ధి ఆనందప్రాప్తి అనునవి ఇందలి దశలు పుష్టిమార్గానువర్తి మొగటినుండియు కేవలము ఈశ్వరానుగ్రహమునకై కృషిచేయును లోక విషయములు సదా ఆతనికి దూరములు విష్ణుస్వామి సంప్రదాయమున భక్తి సగుణము వల్లభ సంప్రదాయమున భక్తికి ప్రేమ ముఖ్యలక్షణము నిర్గుణమే ఈ భక్తి తాత్పర్యము దానినే నిష్కామ భక్తి అనవలెను ఇందు భక్తికొరకే భక్తి ఆచరింప బడుచున్నది ముఖ్యముగ కష్ణకృపాసిద్ధికై ఈ భక్తి ఉద్దేశింపబడినది ఇట్టి భక్తిసాత్త్వికము పూర్వ భక్తిమార్గమునకును, పుష్టిమార్గమునకును భేదము ప్రేమలక్షణమందుగలదు ఈ ప్రేమ లక్షణాభక్తిశుద్ధము పవిత్రమునగుట ప్రధానముగ గమనార్హము

గోపికాదర్శము : పుష్టి మార్గావలంబులకు గోపికా విశుద్ధభక్తి ఆదర్శము గోపికా సమూహమే ఈ శాఖయందు గురుసమానమగుచున్నది ఈ గోపికలు 1 వ్రజాంగనలు, 2 కుమారికలు, 3 గోపాంగనలు అని ముత్త్రివిధము. వ్రజాంగనకు కృష్ణుడు గోపకిశోరుడు ఆతనియందు వీరికి వాత్సల్య

భక్తి కుమారికలకు కృష్ణుడు పతి వీరిది మధురభక్తి గోపాంగనలకు కేవలము కృష్ణప్రాప్తి గమ్యము వీరిది స్వార్థశూన్యమైన పరకీయభావన ఈ త్రివిధ భక్తులుగాక గోప బృందము ఆదర్శముగ నున్న సఖ్యభక్తి అను నాల్గవ భక్తికూడ పుష్టి మార్గమున ముఖ్యము ఈ వల్లభ సంప్రదాయములో తొలుత రాధకు ఎక్కువ ప్రాధాన్యము లేదు కాని కాలక్రమమున ఈమె శ్రీకృష్ణ పరబ్రహ్మ యొక్క శక్తిస్వరూపముగ రూపొందెను అందుచే కడకీమె పుష్టిమార్గములో ముఖ్యస్థానము నలంకరించినది

వల్లభప్రోక్త స్తమ్ము కర్మయందెట్లు నిష్కామత్వము కలదో భక్తి యందుకూడ అట్లు నిష్కామత్వము కలదని వల్లభుని నిరూపణము భగవంతునకును భక్తునకును సంబంధము శారీరికాదికముచే కాక పవిత్రహృదయ మూలకమని వల్లభాచార్యుని ప్రతిపాదనము అట్టి భక్తియే ముక్తిదాయకము తారకము నగును

వి వ రా వ

## వాగ్భటుడు

చరక సుశ్రుత వాగ్భటులు ముగ్గురు ఆయుర్వేదమునకు మూల స్తంభముల వంటివారు ఈ ముగ్గురను వృద్ధత్రయమనియు బృహత్త్రయమనియు అనెదరు వీరి ముగ్గురిలో వాగ్భటుడు చివరివాడు

చరకుడు కాయచికిత్సలోను సుశ్రుతుడు శస్త్రచికిత్సలోను వాగ్భటుడు శాస్త్ర సిద్ధాంతములను తీర్చిదిద్ది సుగమముగ సూత్రప్రాయముగ చెప్పుటలోను దిట్టలుగా పేరు పొందినారు

వాగ్భటులు వృద్ధవాగ్భటుడని వాగ్భటుడని యిద్దరుగా గుర్తింపబడినారు వృద్ధ వాగ్భటుడు ముందుగా "అష్టాంగ సంగ్రహము నను గ్రంథమును రచింపగా వాగ్భటుడు తర్వాత అష్టాంగహృదయము ను గ్రంథమును రచించినాడు వృద్ధవాగ్భటుని అష్టాంగసంగ్రహము' ననుసరించియే వాగ్భటుడు తాను "అష్టాంగహృదయము"ను రచించినానని చెప్పుకొన్నాడు చరక, సుశ్రుతములనుకూడ తన గ్రంథమున పేర్కొన్నాడు

వాగ్భటుడు సింధుదేశవాసి; వాగ్భటాచార్యపౌత్రుడు; సింహగుప్తాచార్య పుత్రుడు; ఈతడు రచించిన 'అష్టాంగ హృదయము 'నే వాగ్భటమనియు వాహటమనియు పేర్కొ-

నుట జరుగుచున్నది

ఆయుర్వేద తంత్రములందలి సారమును గ్రహించి అందరును సులభముగా తెలిసికొనుటకు వీలగునట్లు సంస్కృతమున చక్కని శైలిలో అష్టాంగహృదయము ను ఇతడు రచించినాడు వాగ్భటరచిత మగుటచేత ఈ గ్రంథమును వాగ్భటమనుట చెల్లునుగాని వాహటమను పేరు ఎందుకు వచ్చినదో నిశ్చయముగా చెప్పుటకు వీలు కనపడదు

సత్యవిషయములను చాటిచెప్పుటకు వాహటము లేక వాహాటము అను మాట తెలుగులో చెల్లుబడిలో నున్నది ఇందుకు బహిరంగము అను అర్థమును నిఘంటుకారులు చెప్పుచున్నారు

అష్టాంగహృదయ రచయితయైన వాగ్భటుడు తన గ్రంథమునందు వైద్యవిషయములను సరళముగాను నాతికఠినముగాను చాటుమాటులేక ఒక క్రమము ననుసరించి చాటిచెప్పుటచేత ఈ గ్రంథమునకు వాహటమను పేరు వచ్చియుండునని ఊహింపతగి యున్నది వాగ్భటుని పేరు వాహటుడని తద్భవముగాకూడ వాడుకపడి యుండవచ్చును ప్రాకృత పదమైన వాహటమే సంస్కృతమున వాగ్భటమైనదని కొందరు అభిప్రాయ పడుచున్నారు

వాగ్భటాచార్యుని తాతయగు వృద్ధవాగ్భటుని కాలము క్రీ శ 7వ శతాబ్దిగాను మనుమడగు వాగ్భటుని కాలము క్రీ శ 8 లేక 9వ శతాబ్దిగాను చరిత్రజ్ఞులు నిర్ణయించినారు కాశ్మీర దేశపు రాజగు విజయసింహుని కాలమునందు (క్రీ శ 12వ శతాబ్ది) వాగ్భటుడు ఉండెనని డా॥ పి స రాయ్ అభిప్రాయము

వాగ్భటుడు మొదట వైదిక మతావలంబియైన బ్రాహ్మణుడైనను తుదకు బౌద్ధమతావలంబి యైనాడని చరిత్రజ్ఞుల నిర్ణయమేగాక అష్టాంగహృదయ"మందలి విషయములు కూడ అందుకు ద్యోతకములుగా కనుపడుచున్నవి గ్రంథారంభమున దైవప్రార్థనచేయు సందర్భమున అరిషడ్వర్గరూపమున ప్రబలుచుండు రోగములను నిశ్శేషముగా పోగొట్ట గలిగినట్టి అచింత్యాద్భుతశక్తిసంపన్నుడైన అపూర్వ వైద్యునకు నమస్కార" మన్నాడేగాని పేరుతో ఏ దేవుని ప్రార్థించలేదు

''రాజతరంగిణి' యందు —

సింహగుప్తసుతః పరమబౌద్ధో వాగ్భటాచార్యః,

కాశ్మీర నగరపతి యయసింహుని ప్రజాపాలన సమయే సీత్ అని కలదు

అష్టాంగ హృదయము కూడ ఇతర వైద్య సంహితా గ్రంథములవలెనే సూత్ర శారీర నిదాన చికిత్సా కల్ప ఉత్తర అను ఆరుస్థానములను 120 అధ్యాయములను కలిగి ఉన్నది ఇంతకుపూర్వము రచింపబడిన చరక సుశ్రుతాది సంహితాగ్రంథముల సంగ్రహస్వరూపమే అష్టాంగ హృదయ మనియు ఇది సకలాయుర్వేద తంత్రములనెడు సముద్రమును మథింపగా తేలిన అమృతము వంటిదనియు ఆయుర్వేదవిదుల ప్రశంసలనందు కొన్న గ్రంథము

వాగ్భటుడు గొప్పపండితుడు కవి వైయ్యాకరణి అతి విస్తృతమై అక్కడక్కడ చెదురుగా చెప్పబడిన వైద్య శాస్త్ర విషయములన్నిటిని క్లుప్తపరచి క్రమబద్ధ మొనర్చి వివిధ వృత్తములలో మనోహరమగు కవితాశైలిని సుబోధకముగా నుండునట్లును ధారణయోగ్యములుగ నుండునట్లును పొందుపరచినాడు దీనివలన ఇతని అసాధారణమైన ప్రజ్ఞ విదితమగుచున్నది అతి విస్తృత విషయములను సూత్రబద్ధ మొనర్చి క్లుప్తముగా చెప్పుటలో ఇతనికి ఇతడేసాటి యన వచ్చును ఇది పఠన పాఠనములకు యెక్కువగా ఉపయోగపడు వైద్యశాస్త్రగ్రంథము కేరళదేశమున ఈ గ్రంథమునకు బహుళ ప్రచారము కలదు

ఆయుర్వేదమునగల అష్టాంగములను గూర్చి వివరించుటతోపాటు శస్త్రచికిత్సకు సంబంధించిన విషయములలో కొన్ని స్వతంత్ర పోకడలు కానవచ్చుచున్నవి

సంతాన ప్రశంసనుగూర్చి కవిత్వధోరణిలో ఈయన చెప్పిన ఈ క్రింది శ్లోకమొక మచ్చు తునకగా కాళిదాసును తలపించు చున్నది

> స్ఖలద్గమనమవ్యక్త వచనం ధూళి ధూసరమ్
> అపలాలా విలిముఖం హృదయాహ్లాద కారకమ్
> అపత్యం తుల్య తాకేన దర్శనస్పర్శనాదిషు
> కింపునర్యద్యశో ధర్మ మాన శ్రీ కులవర్ధనమ్ ॥"
>
> అష్టాం - హృ ఉత్తర,

వాగ్భట వ్యాఖ్యలు

(1) మృగాంకదత్తుని కుమారుడు అరుణదత్తుడు రచించిన సర్వాంగసుందర వ్యాఖ్య (15 క్రీ శ )

(౨) చతుర్వర్గ చింతామణి కర్త హేమాద్రి విరచిత ఆయుర్వేద రసాయన వ్యాఖ్య (13 క్రీ శ )

(3) ఇగిగా ఇందు విరచిత శశిలేఖ ఆశాధర కల్లణ విరచిత అష్టాంగహృదయార్థద్యోతకము చంద్రనందన రచిత పదార్థచంద్రిక దామోదర రచిత సంకేతమంజరి - బాలప్రబోధక హృదయబోధిక పథ్య వాగ్భట కౌముది ప్రదీప ఇత్యాదులు కలవు

రసరత్నసముచ్చయ మను రసవిషయిక గ్రంథమునుకూడ ఈ వాగ్భటుడే రచించినాడని కొందరు చరిత్రకారుల వాదమున్నది ఆ వాగ్భటుని జనకుడును సింహగుప్తుడేనని ఉల్లేఖింపబడి యున్నందున వీరిద్దరు ఒకరేనని తలంచుటకు అవకాశము కలదు మరికొందరు చరిత్రకారులు రస వాగ్భటుడు వేరుగా కలడని చెప్పుచున్నారు

వాగ్భటమునకు తెలుగులో పద్యరూపమున బాహటమను పేర అనువాదములుకూడ ఉన్నవి క్రీ శ 1580 వ సం॥ లో బాలసరస్వతీ మహోపాధ్యాయుని శిష్యుడు చుండి లింగయార్యుడు ప్రశస్తమగు కవితలో దీనిని రచించినాడు శ్రీధన్వంతరి పత్రికలో ఇది ముద్రితమైనది

వే శం శా

## వాణిజ్య న్యాయశాస్త్ర పరిణామము

పలురకములుగ విభజింపబడిన న్యాయ శాస్త్రములలో వాణిజ్య న్యాయశాస్త్రము ఒకటి వాణిజ్యమునందు వ్యాపారములో ఏర్పడు తగవులను పరిష్కరించుటకు ఏర్పరుపబడిన న్యాయసూత్రములన్నియు క్రోడీకరింపబడి యుండుటచే దీనికాపేరు కలిగినది వాణిజ్యవ్యక్తులు - వారి తగవుల పరిష్కార మార్గములు దీని ముఖ్యాంశములు ఒకరుగాని అందరుగాని లేక అందరితరపున ఒకరుగాని ఒకరి తరపున అందరుగాని వ్యాపారమును వాణిజ్యమును సాగించుచున్నపుడు వారిని మొత్తముగ గాని వైయక్తికముగ గాని వాణిజ్యవ్యక్తులుగ పరిగణించెదరు

వాణిజ్యము ఫోనీషియా దేశస్థుల కాలములో క్రమగతిని సాగి రానురాను ఉచ్చదశను పొందినది వాణిజ్యము అభివృద్ధిని పొందుచున్నకొలది వర్తకులు కొన్ని క్లిష్టపద్ధతులను ఎదుర్కొనవలసివచ్చెను ఒకరి వస్తువుల రవాణాయందును ధరలయందును సరఫరాయందును వారిమధ్య భేదాభిప్రాయములు కలుగు చుండెడివి ఈ భేదములను తొలగించి వాణిజ్యమును సుకరము చేసుకొనుటకు వారు ప్రత్యేకముగ కొన్ని

న్యాయ సూత్రములను ఏర్పరచుకొని ఆ సూత్రముల ప్రకారము తగవులను పరిష్కరించుకొనుచుండెడివారు. ఆ కాలములో దూరతీర వ్యాపారమునకు విదేశ వాణిజ్యమునకు వేర్వేరు ప్రదేశములలో సంతలు ఏర్పరుపబడుచుండెడివి. ఈ సంతలు కొన్ని నిబంధనలతో నడిపింపబడుచు వాణిజ్యమునకు ముఖ్యాంగములైనవి. వాణిజ్యము ఖారీయొత్తున జరుగుచుండెడిది కావున సామాన్యముగ తగవులుకూడ నిత్యము ఏర్పడుచుండెడివి. ఈ తగవులను పరిష్కరించుటకు ఆయా ప్రదేశములలోని ఆచార వ్యవహారములను ఆధారముగ చేసికొని గావింపబడిన నిర్ణయములే ప్రత్యేక న్యాయసూత్రములుగ రూపొందించబడినవి.

ప్రథమమున వాణిజ్య న్యాయసూత్రములు వ్రాతపూర్వకముగ ఉండెడివికావు. ఆయా ప్రదేశములలో పలుకుబడి కలిగిన పెద్దమనుష్యులు అచ్చటి ఆచార వ్యవహారములపై ఆధారపడి న్యాయ నిర్ణయములను జరిపించుచుండెడివారు. వీరి నిర్ణయములు తిరుగు లేనివిగ ఆమోదించబడుచుండెడివి. ఈ నిర్ణయములు ప్రత్యేక న్యాయసూత్రములుగ ఇంగ్లండుదేశములో రూపొందించబడి ఒక నిర్ణీత న్యాయశాస్త్రము తయారు చేయబడినది. ప్రస్తుతము భారతదేశములో అమలు పరచుచున్న వాణిజ్య న్యాయ సూత్రములకు ఇంగ్లండుదేశపు వాణిజ్య న్యాయశాస్త్రమే మూలము కనుక ఇంగ్లండుయొక్క వాణిజ్య న్యాయశాస్త్ర ఉద్భవమును దాని క్రమపరిణామమును పూర్తిగ తెలిసికొనవలెను. ఈ పరిణామదశను 4 భాగములుగ విభజింపవచ్చును.

(1) వర్తకుల సాధారణ పరిష్కార న్యాయము
(2) శాసనరీత్యా చేయబడిన చట్టములు
(3) ఇంగ్లండులోని సామాన్య న్యాయస్థానపు తీర్పులు
(4) న్యాయ సూత్రములు

**వర్తకుల సాధారణ పరిష్కార న్యాయము** – వాణిజ్య న్యాయశాస్త్ర ఉద్భవమునకు వర్తకుల సాధారణ పరిష్కార న్యాయములు మూలాధారములై యున్నవి. వర్తక ప్రదేశములలో మొదటినుండి ఉన్న ఆచార వ్యవహారములు దృష్టియందుంచుకొనబడినవి. ప్రథమమున వర్తకులు వారివారి తెగలవారలై చిన్నచిన్న న్యాయస్థానముల నేర్పరచుకొని తమ తగవులను ఆ న్యాయస్థానములద్వారా పరిష్కరించుకొనుచుండెడివారు. సంతలు మొదలగు వర్తక కేంద్రములలో, చిన్న న్యాయస్థానముల నేర్పరచుకొని అచట తలయెత్తు తగవులను వెనువెంటనే పరిష్కరించుకొనుచుండెడివారు. వీటిని శీఘ్రన్యాయ నిర్ణయ స్థానములని వారు చమత్కరించుచుండిరి. ఆ ప్రదేశములలో గల ఆచార వ్యవహారములందు ఆరితేరిన పెద్దలే న్యాయ నిర్ణేతలుగ నియమింపబడుచుండిరి. ఈ ఆచార వ్యవహారములే అంగీకరింపబడి వాణిజ్య న్యాయసూత్రములుగ మారినవి. ఈ న్యాయస్థానములు 13 వ శతాబ్దములో కొంతకాలమువరకు ప్రత్యేక వ్యక్తిత్వముతో నడుపబడుచుండెడివి. తరువాత ఇంగ్లండులోని సామాన్య న్యాయస్థానములు వీటి న్యాయ నిర్ణయాధికారములను గ్రహించి తమలో లీనమొనర్చుకొనినవి. ఈ న్యాయ నిర్ణయములు ఎల్లకాలము ఒకే విధముగ ఉపయోగపడలేదు. ప్రజల అభిరుచులు ఆచార వ్యవహారములు మారుట వలన ఇవికూడ మారుచుండెడివి.

**శాసనరీత్యా చేయబడిన చట్టములు** ; తరువాత శాసనరీత్యా కొన్ని నిబంధనము లేర్పడి ప్రభుత్వము విధించిన న్యాయ సూత్రములు అమలులోనికి వచ్చినవి. ఈ సూత్రములే ప్రస్తుత వాణిజ్య న్యాయశాస్త్రమునకు ఆధారములై ఆచార వ్యవహార న్యాయములకంటె ఆధిక్యతను పొందినవి. ప్రజా పరిస్థితులపై ఆధారపడి ప్రభుత్వము నిర్ణయించిన విధానములలో న్యాయనిర్ణయము జరుగుచుండెడిది.

**ఇంగ్లండులోని సామాన్య న్యాయస్థానపు తీర్పులు** ఇంగ్లండులోని న్యాయస్థానములయొక్కయు న్యాయాధికారులయొక్కయు తీర్పులు పొందుపరచబడి ఆధార న్యాయ సూత్రములు తయారైనవి. ఇట్లు క్రోడీకరింపబడిన న్యాయ సూత్రములను సాముదాయికముగ సామాన్య న్యాయ శాస్త్రము అని పిలుచుచుండెడివారు. దీనినే అలిఖిత న్యాయ సూత్రసముదాయము అనికూడ అనుచుండెడివారు. అనగా ప్రభుత్వముచేత ఏ శాసనములోను వ్రాయబడని న్యాయ సూత్రములని అర్థము. ఇప్పటికికూడ ఇంగ్లండులోని ఒప్పంద న్యాయములు ఇండియాలో వలె వ్రాతపూర్వకముగ లేవు.

**న్యాయసూత్రములు** 12 వ శతాబ్దములో హెన్రీ ప్రభువుచే న్యాయ నిర్ణయమునకై ప్రత్యేకముగ స్థాపింపబడిన న్యాయ స్థానములను "రాజుల న్యాయస్థానము" అని అనెడివారు. ప్రత్యేక న్యాయసూత్రములపై ఆధారపడి ఈ న్యాయ స్థానములు నడచుచుండెడివి. ప్రాచీనపద్ధతిలో దావాలు

తీర్పులు జరుగు చుండెడివి ఇంగ్లండులో సామాన్య న్యాయ స్థానములు అంగీకరించని - అంగీకరించినను సరియైన న్యాయ మియ్యని - తగవును ఆ వ్యక్తుల దాఖలాపై ఈ కోర్టులందు విచారించి న్యాయముగ తీర్పులిచ్చుట జరుగుచుండెడిది ఈ కోర్టులకు అధ్యక్షునొకనిని నియమించి అతనికి ప్రథమ న్యాయాధికారి అను నామము నొసగిరి ఆ కారణముచేత వీటిని అధ్యక్షన్యాయస్థానము లనికూడ అనెడివారు

ఈ రెండురకముల న్యాయస్థానములు వేరువేరుగ ఒకే కాలమున వ్యవహరించు చుండెడివి కాని 1873 సం॥ తరువాత ఈ రెండు న్యాయస్థానముల హక్కులను హైకోర్టు తీసుకొని అప్పటి పరిస్థితుల ప్రకారము వర్తించుచుండెడిది మనువు ఆపస్తంబుడు నారదుడు మొదలగు మహాత్ములు వారివారి కాలములకు సరిపోవునట్లుగ కొన్ని వాణిజ్య సూత్రములను నుడివినప్పటికిని భారతదేశములో ప్రస్తుతమున్న వాణిజ్య న్యాయసూత్రములకు అవి మూలములు కావు ఇంగ్లండు యొక్క వాణిజ్య న్యాయశాస్త్రమును ఆధారముగ చేసికొని ఆ సూత్రములను భారతదేశపు ఆచార వ్యవహారములతోను ప్రభుత్వ చట్టములతోను సమన్వయ మొనర్చి అనువైన వాణిజ్య న్యాయశాస్త్రమును తయారు చేయలేదు అంత వరకు ఇంగ్లండు న్యాయసూత్రములనే భారతదేశాచారము లకు తగునట్లు మార్చి వాడబడు చుండెడివి

1872 తరువాత తయారైన భారత వాణిజ్య న్యాయ శాస్త్రము "1872 వ సంవత్సరపు 9 వ చట్టము" (Act 9 of 1872) అనియందురు తరువాత 1930 లో వస్తువుల అమ్మక మునకు ప్రత్యేకముగ చట్టము (sale of goods Act) ఏర్పరుప బడినది ఈవిధముగ వ్యవహారపత్రముల (Negotiable Instruments) కొరకు 1882 లో ప్రత్యేకచట్టము చేయబడినది ఇట్లు అనుభవముపై ఆధారపడి భారతదేశ పరిస్థితుల కను కూలముగ నుండునట్లు ఇంగ్లండు న్యాయసూత్రములు సంస్కరింపబడి భారతదేశపు వాణిజ్య న్యాయశాస్త్రము మలచ బడినది

వాణిజ్య న్యాయశాస్త్రమందు వాణిజ్యముయొక్క చానిని గురించియేకాక వాణిజ్యమునకుగల అనుబంధ ప్రక్రియలను గుర్తించికూడ పరిష్కారమార్గము లేర్పరచ బడినవి అందుచే, ఈ శాస్త్ర విషయమును రెండు ముఖ్యమైన విభాగములుగ చేయవచ్చును వ్యాపార ఒప్పందములకు సంబంధించినవాటిని సాధారణ ఒప్పందము లనియు మిగిలినవాటిని ప్రత్యేక ఒప్పందము లనియు అందురు సాధారణ ఒప్పందములను విభాగములో ఒప్పందము ఒడంబడిక బాధ్యత ఉపపాదన అంగీకారము మొదలగువాటిని గూర్చియు ప్రత్యేక ఒప్పంద ములను విభాగములో హామీ ఒప్పందములు భాగస్వామ్య ఒప్పందములు ప్రాతినిధ్య ఒప్పందములు వస్తువుల అమ్మకము భీమా వ్యవహార పత్రములు కంపెనీలు బుణగ్రస్త ఒప్పందములు మొదలగువాటిని గూర్చియు క్రింద క్లుప్తముగ తెలుపబడినది

**సాధారణ ఒప్పందములు** ఒప్పందన్యాయముయొక్క ముఖ్యోద్దేశము జరిగిన ఒడంబడిక ప్రకారము ఆ వ్యక్తులకు రావలసినదానిని పొందునట్లు చేయుట తగవులన్నియు హక్కులపైననే ఏర్పడును ఈ హక్కులను వైయక్తిక హక్కు సమష్టిహక్కు అని రెండు విధములుగ విభజించ వచ్చును ఒప్పందమునందు ఒడంబడిక బాధ్యత అను రెండు అంశములను ముఖ్యముగ చూడవచ్చును ఈ రెండును కలిసి నపుడే ఒప్పందము పూర్తి అగును

**బాధ్యత (obligation)** వ్యక్తిపైగాని వ్యక్తుల సము దాయముపైగాని ఒక కార్యమును చేయుటకు లేదా చేయ కుండుటకు ఏర్పడు బలవత్తరమైన న్యాయసమ్మతమైన బంధ మును (legal tie) న్యాయశాస్త్రములో 'బాధ్యత' అని యందురు

**ఒడంబడిక** ఒడంబడిక ఏర్పడుటకు 'బాధ్యత' తో పాటు ఈ క్రింది రెండు విషయములుండవలెను (1) ఉద్దేశముల కలయిక (2) పరస్పర వివరణ ఒక ఒడం బడిక ఏర్పడుచున్నపుడు, అందుగల వ్యక్తులు వారు చేసికొను చున్న ఒప్పంద విషయములను పుణ్ణముగ అర్థము చేసికొన వలెను వారి ఉద్దేశములు కలసిన తరువాతనే ఒడంబడిక, బాధ్యత ఏర్పడి ఒప్పందము పూర్తి అగును

**ఒప్పందము** బాధ్యతను ఒడంబడికను తెలిసికొనిన తరువాత న్యాయసమ్మతమైన ఒప్పందమునుగూర్చి తెలిసికొన వలెను వాణిజ్య న్యాయసూత్రములలో 10 వ సెక్షను ప్రకారము న్యాయ సమ్మతమైన ఒప్పందము ఈ విధముగ నిర్వచింప బడినది

"చట్టప్రకారము బలములేక ప్రత్యేకించి విసర్జించినట్లు చూపబడిన కార్యములు తప్ప ఒక న్యాయసమ్మతమైన

ఉద్దేశముతో తగిన ప్రతిఫలము పొందుచు ఒప్పందమునకు అర్హులైన వ్యక్తులమధ్య స్వేచ్ఛాపూర్వక అంగీకారముతో జరుపబడిన ఒడంబడిక లన్నియు న్యాయసమ్మతములైన ఒప్పందములే

ఒకవ్యక్తి ఒడంబడిక ఏర్పరచుకొను ఉద్దేశముతో రెండవ వ్యక్తితో ఒక విషయమును ఉపపాదించినపుడు ఆ రెండవవ్యక్తి దాని నంగీకరించినయెడల వారిమధ్య ఒప్పందము ఏర్పడును కనుక ఒప్పందమునకు ముఖ్యాంశములగు ఉపపాదనమును (offer) అంగీకారమును (Acceptance) గురించి తెలిసికొనవలెను సెక్షను 2 (a) ఈ విధముగచెప్పెను "ఒకవ్యక్తి ఒక కార్యమును చేయుటకును లేక చేయకుండుటకును వేరొకవ్యక్తితో అతని అంగీకారము పొందుటకు తన ఇష్టమును తెలియబరచుచు చెప్పిన ఆ మొదటివ్యక్తి ఉపపాదనము జరిపెనని అర్థము

అంగీకారమునుగూర్చి సెక్షను 2 (b) ఈ విధముగ చెప్పెను ఉపపాదన చేయబడినవ్యక్తి ఆ ఉపపాదనలోగల అంశములను సమ్మతించినచో ఉపపాదనకు అంగీకారము జరుపబడెనని అర్థము ఉపపాదన అంగీకారములతోపాటు న్యాయసమ్మతమైన ఒప్పందము ఏర్పడుటకు ప్రతిఫలము (consideration) కూడ అవసరము సెక్షను 2 (d) ప్రతిఫలమును గూర్చి ఈ విధముగ చెప్పెను

"వాగ్దాతయొక్క కోరికపైన వాగ్దత్తుడుగాని మరి యే యితరవ్యక్తియైన గాని ఒక కార్యమును చేయుటకు లేక చేయకుండుటకు అంగీకరించి ఆ విధముగ నిర్వర్తించినచో అది మొదటివ్యక్తి కోరికకు ప్రతిఫలముగ గుర్తింపబడును" ఒప్పంద వ్యక్తులలో ఒకనికి కొంత హక్కుగాని లాభము గాని ఆదాయముగాని కలిగించునదిగనో లేక రెండవవ్యక్తికి కొంత నష్టముగాని బాధ్యతగాని ఆపాదించునదిగనో ఉండు దానిని ప్రతిఫలమందురు

ఉపపాదన అంగీకారము - ప్రతిఫలములకు వలయు ముఖ్యాంశములు ఒప్పంద వ్యక్తులకు కావలసిన అర్హతలు సమ్మతి ప్రతిఫలములలో లోపములు మొదలగు విషయములు వానికి సంబంధించిన న్యాయసూత్రములు ఈశాస్త్రమునందు విపులముగ తెలుపబడినవి ఏర్పడిన ఒప్పందములన్నియు చట్టముచే అంగీకరింపబడవు అంశముల న్యాయముననుసరించి ఒప్పంద నిర్ణయము నాలుగు విధములుగ విభజింపబడినది (1) చట్టాంగీకారమైనది (valid) (2) చట్టముచే అంగీకరించబడనిది (void) (3) నిర్వర్తించుకొనదగినది (voidable) (4) చట్టప్రకారము జరిపించరానిది (unenforcible) 10 వ సెక్షనులో నిర్వచించిన విధముగ ఒప్పందమునకు కావలసిన అంశములన్నియు కలిగినదానిని చట్టాంగీకారమైన ఒప్పందమని అందురు ఆ విధముగలేని ఒప్పందములన్నియు చట్టముచే అంగీకరింపబడని ఒప్పందములే నిర్వర్తించుకొనదగిన ఒప్పందమనగా న్యాయస్థానమందు ఒప్పందములోని నష్టమును భరించువ్యక్తి ఏర్పడిన ఒప్పందమునకు యిష్టపడి జరిపించుకొన వచ్చును లేదా మానుకొన వచ్చును ఇంకను చట్టప్రకారము న్యాయసమ్మతమైన అంశములతో కూడి చట్టముచే అవసరమైన చెల్లింపులుగాని స్టాంపులుగాని లేని ఒప్పందములు చట్టప్రకారముగ జరిపించరాని ఒప్పందములుగ గుర్తించబడును

ప్రత్యేక ఒప్పందములు (special contracts)

**హామీఒప్పందము (guarantee)** హిందూదేశపు వాణిజ్య న్యాయశాస్త్రములో సెక్షను 124 నుండి సెక్షను 147 వరకు ఈ విషయమే ప్రస్తావించ బడినది ఒకవ్యక్తిచేసిన వాగ్దానమునకు లేక చేయనున్న క్రియకు ఒప్పందములోలేని మూడవవ్యక్తి వాగ్దత్తునకు హామీయిచ్చుట దానిపై వారి హక్కులు ఇవి దీనియందలి అంశములు

**పూచీన్యాయము (Bailments)** సెక్షను 148 నుండి సెక్షను 181 వరకు ఒక వస్తువును మార్పునకు గాని అవసరమునకుగాని వేరొక వ్యక్తికిచ్చి మరలవారి ఒప్పందము ప్రకారము ఆ వస్తువును తిరిగి పొందుట పూచీ ఒప్పంద మన బడును ఇందులో పూచీదారుని సొంతదారుని హక్కులు విధులు వివరించబడి యుండును

**ప్రాతినిధ్యపు ఒప్పందము (Agency)** [సె 182 - 238 వరకు] ఒకవ్యక్తియొక్క పనులకు అవసరములకు అతనికి బదులుగ అవేబాధ్యతలతో వేరొకవ్యక్తిని నియమించి తద్ద్వారా కార్యములను కావింపించుకొని బాధ్యతమాత్రము స్వంతముగా వహించు ఒప్పందమును ప్రాతినిధ్యపు ఒప్పంద మందురు తనకు ప్రతినిధిగ వేరొకనిని నియమించినపుడు పరస్పరము వారి బాధ్యతలు మూడవ వ్యక్తితో వారికిగల బాధ్యతలు ఇచట వివరింపబడి యుండును

**భాగస్వామ్య ఒప్పందము** వ్యాపారమందు భాగ

స్వామ్యచట్టము చాల ముఖ్యమైనది అందులకై ప్రత్యేకముగ "1932 భాగస్వామ్యచట్టము తయారు చేయబడినది ఎందూదేశ భాగస్వామ్యచట్టము ఇంగ్లండుదేశపు 1890 వ భాగస్వామ్యచట్టము ననుసరించియే తయారు కాబడినది భాగస్వామ్యము ఈ క్రింది విధముగ నిర్వచింప బడినది అందరు గాని అందరితరపున ఒకరుగాని వ్యవహరించి వచ్చిన లాభమును పంచుకొనుటలో ఒకరికిని మరియొకరికిని గల సంబంధమునే భాగస్వామ్యము అని అందురు దీనియందు వారి హక్కులు బాధ్యతలు వ్యాపార గమనము మొదలయినవి వివరించబడి యుండును

వస్తువులఅమ్మకపుచట్టము (sale of goods Account) 1930 లో వస్తువుల అమ్మకపుచట్టము ప్రత్యేకముగ తయారు చేయబడినది వర్తక వ్యవహారములందును వస్తువుల స్థితి యందును గుణములందును ధరలందును ఏర్పడు తగవులను పరిష్కరించుటకు వలసిన సూత్రములన్నియు ఇందు క్రోడీకరించ బడినవి

కంపెనీ చట్టము ఇంగ్లండుయొక్క కంపెనీచట్టముపై ఆధారపడి భారతదేశములో 1956 లో "కంపెనీలచట్టము తయారు చేయబడినది అంతకుపూర్వము దీనికి సంబంధించి యున్న వేర్వేరు సూత్రములన్నిటిని ఇందుకలిపి సమగ్రమైనదిగ దీనిని తయారుచేసిరి కంపెనీఅనగా ప్రత్యేక వ్యక్తిత్వము కలిగినసంస్థ - అనగా వాటాదారుల సమూహము అందుచే వారి వ్యవహారముల నిర్వహణమునకు ఏర్పడవలసిన సూత్రములన్నియు ఇచట వివరించబడినవి ఈ సూత్రముల ననుసరించియే కంపెనీలన్నియు నడచి తీరవలయును

వ్యవహార పత్రములు (Negotiable Instruments) వ్యవహార పత్రములనగా వాణిజ్య వ్యాపార వ్యవహారము లందు ధనమునకు బదులుగ వాడు పత్రములు వ్యాపారులు చెక్కులు హుండీలు వాగ్దానపత్రములు మొదలగున వన్నిటినిగూర్చియు వారి వ్యవహారములను గూర్చియు అనుసరించ వలసిన న్యాయసూత్రములు ఇచట వివరించబడి యుండును

భీమా (Insurance) ఏ వస్తువులకైనను ప్రకృతి వలన, సమాజమువలన కలుగబోవు నష్టములను భర్తీ చేసి కొనుటకు వీలుగ వ్యాపారస్తులు ఆ వస్తువులను భీమాచేయు దురు ఏ పరిస్థితులలో వారి నష్టములకు పరిహారము చేసికొన వచ్చును ? భీమా కంపెనీకి, వీరికి ఏ రకమైన సంబంధము లుండును ? అనునది ఇచట శదీకరింపబడి యుండును

ఋణగ్రస్త దివ్వాలతనము (Insolvency) ఒకవ్యక్తి ఋణగ్రస్తుడై దివాలాతీసినపుడు ఋణదాతల కేర్పరచవలసిన సదుపాయములు రక్షణలు మొదలగునవి ఈ చట్టములో విపులీకరించబడియుండును ప్రభుత్వము ఈ చట్టప్రకారము ఒకవ్యక్తిని నియమించి ఋణగ్రస్తుని ఆస్తులను గ్రహించి వాటిని ఋణదాతలకు వారి నష్టములనుబట్టి దామాషా పద్ధతి ననుసరించి పంచియిచ్చును

ఈ విధముగ వాణిజ్య న్యాయసూత్రములు వేర్వేరు విభాగములుగ చేయబడి ఆయా వర్తకులకు వ్యాపారస్తులకు వారి తగవులను పరిష్కరించుకొను మార్గము తేల్పరుపబడినవి ప్రస్తుతకాలములో వాణిజ్యము సఫలమగుటకు ఈ సూత్రముల ననుసరించి నడచుకొనినయెడల అభివృద్ధి మార్గములో ముందుకుపోగలము

వే. రా.

## వాణిజ్యము – రవాణా

వాణిజ్యాంగములలో రవాణా ప్రధానమైనది కేంద్రీకృతములైన ఉత్పాదితములను దేశవ్యాప్తముగ వినియోగదారులకు లభింపజేయుటయే వాణిజ్యముయొక్క ముఖోద్దేశము వస్తూత్పత్తి నిర్ణీతమైన ఒక ప్రాంతములో కాకుండుటయు వినియోగము మాత్రము వివిధప్రాంతములలో జరుగుచుండుటయు అట్టిచో ఉత్పత్తియగు పదార్థములను వేర్వేరుస్థానములకు చేరవేయు అవసర మేర్పడుటయు సంభవించుచున్నది ఇట్లు చేరవేయుటకు రవాణా సాధనములు అనివార్యము రవాణా విధానము భారీయెత్తున ప్రగతిని పొందినగాని దేశపురోభివృద్ధి సాధ్యము కాజాలదు హెచ్చు విస్తీర్ణము జనబాహుళ్యముగల భారతదేశ ఆర్థికవాణిజ్యాభివృద్ధికి రవాణావిధానము ప్రత్యక్షముగ ఉపయోగపడుటయే కాక పలువురకు ఉద్యోగములను వృత్తులను కల్పించుచు, దేశాదాయమునకు విశేషముగా తోడ్పడుచున్నది

రవాణాసాధనముల అభివృద్ధి ముఖ్యముగ రెండు విధములు ఉపకరించును (1) వస్తూత్పత్తి ధరలలో యూనిట్ వ్యయమును తగ్గించును (2) వస్తువులకు చలనవృద్ధి కల్పించి గిరాకీ నేర్పరచును రవాణా అభివృద్ధిచే ఏర్పడు లాభములను ఆర్థిక సామాజిక రాజకీయపరముగ విభజించవచ్చును యూనిటు ఖర్చు తగ్గుటచేత వస్తువులను దూర

ప్రదేశములకు కూడ తక్కువ వ్యయముతో చేరవేయ వచ్చును ప్రజలకు ఈనాడు దూరప్రయాణము సులభ సాధ్యమైనది రవాణాద్వారా ప్రణాళికలకు ప్రజాసౌకర్యములకు అవసరమగు ధనము ప్రత్యక్షముగను పరోక్షముగను లభ్యమగుచున్నది

**రవాణా – ఆర్థికవ్యవస్థ** వస్తూత్పత్తి వేర్వేరు ముడి పదార్థములు వేర్వేరు ప్రాంతములలో లభ్యమగుటపై ఆధారపడుటవలన అట్లుత్పత్తియగు వస్తువులను పరస్పరము మార్పిడి చేసికొని వ్యాపారముద్వారా ఆర్థిక సంపత్తిని పెంచుకొనుటవలన ఈ కార్యకలాప మంతటిలో రవాణా విధానముపయోగపడుచున్నది వస్తువుల సరఫరా గిరాకీని అనుసరించి యుండును విపణిలోని వస్తువుల ధరలపైన వ్యక్తుల అవసరములపైన గిరాకీ ఆధారపడియుండును ధరను గిరాకీని సరఫరాను సమన్వయించుటలో రవాణా ప్రాధాన్యము వహించును గిరాకీ హెచ్చుగనుండు తావులలో రవాణా సౌలభ్యముద్వారా సరైన సమయములలో సరైన సరఫరా జరిపి లాభములు పొందవచ్చును రవాణా ఖర్చులు ఎంత తక్కువగనుండిన వస్తువుల ధర అంత తక్కువగనుండి గిరాకీ పెరిగియుండును పోటీ వ్యాపారవ్యవస్థలో భారీపరిశ్రమల విషయమున ఉత్పాదనములు హెచ్చు గిరాకీని పొందవలెనన్నచో శీఘ్రమును చౌకయు నగు రవాణాసాధనము లవసరము

పరిశ్రమల స్థాపనకు రవాణా ముఖ్యాంగముగ పరిగణింపబడుచున్నది అందుకై ముడిపదార్థముల సరఫరా విపణి సౌలభ్యము మున్నగు విషయములు పరిశీలింపబడవలెను రవాణాసాధనములద్వారా ముడిసరకులను తెప్పించి వానివలన ఉత్పత్తియగు వస్తువులను సకాలములో విపణికి పంపి లాభమార్జించుటకు వీలగును ఆధునిక రవాణాసాధనములద్వారా నేడు ప్రపంచవ్యాప్తముగ వ్యాపారము సాగుచున్నది అమెరికా రష్యా బ్రిటన్ జపాను మొదలగు పెద్దరాజ్యములు వాణిజ్యమునందు ప్రఖ్యాతిగాంచుటకు ఆధునిక రవాణావిధానమే కారణము

**రవాణా – సామాజిక వ్యవస్థ** సామాజిక వ్యవస్థయందు కూడ రవాణా ప్రాముఖ్యము కల్గియున్నది యుద్ధకాలములో సైన్యములను ఆయుధ సామాగ్రిని చేరవేయుటకును రవాణాసాధనములత్యవసరము పూర్వము సరైన రవాణా సాధనములు లేక ప్రజలు దూరప్రాంతములకు పోవుట కష్టమయ్యెడిది ఎచ్చటివారచ్చట కూపస్థ మండూకములవలె ఉండవలసి వచ్చుటచే ఒకరి ఆచారములు సాధనసంపత్తులు విజ్ఞానవిషయములు మరియొకరికి తెలిసెడివి కావు రవాణా సాధనములు రానురాను అభివృద్ధి చెంది దేశమందలి వివిధ ప్రాంతములనే కాక వివిధ దేశములను ఏకముచేసినవి గ్రామప్రజలు పట్టణములు చేరి తమ ఫలసాయమును అమ్మజొచ్చిరి నగరములలోని బ్యాంకు గిడ్డంగి భీమాసదుపాయములను కూడ గ్రామీణులు బడయగల్గిరి ఇట్లు మానవ జీవనము అన్ని రంగములలోను శీఘ్రగమనమును పొందుచున్నది

**రవాణా – రాజకీయవ్యవస్థ** ప్రభుత్వ పరిపాలనా వ్యవహారములను సవ్యమైన మార్గములో నడిపించి ప్రజలకు సంతృప్తి కల్గించుటకు కూడ రవాణాసాధనములు అనివార్యమగుచున్నవి వివిధప్రాంతములకు శ్రామికుల పంపిణీ రవాణాసాధనములద్వారా జరిగి దేశ విదేశీయ పారిశ్రామిక వాణిజ్యరంగములు అభివృద్ధి చెందుచున్నవి అంతేకాక ఉద్యోగావకాశములు హెచ్చి వ్యక్తిగత సామూహికాదాయములు పెరుగుచున్నవి ఇట్లు పెరుగు ఆదాయమే దేశాదాయమై దేశ ప్రగతికి తోడ్పడుచున్నది ప్రభుత్వ ప్రణాళికలు కార్యరూపము చెందుటకును, సైనికబలమును పెంపొందించుటకును రవాణా బహుముఖముల తోడ్పడుచున్నది పారిశ్రామిక రంగమున ప్రభుత్వము చేపట్టిన పరిశ్రమల అభివృద్ధికై విదేశములనుండి యంత్రములను దేశములో లభించని ముడిసరకులను దిగుమతి చేసికొనుటకు ఆధునిక రవాణాసాధనము లత్యవసరములైనవి ఇట్టి సాధనముల ద్వారా భారీయెత్తున సామగ్రిని దిగుమతి చేసుకొనిననే గాని ప్రభుత్వము సరసమైన ధరలకు వస్తువులను ప్రజలకందియ్యజాలదు

ప్రస్తుత రవాణామార్గములను ముఖ్యముగ భూమార్గములు జలమార్గములు వాయుమార్గములుగ విభజింపవచ్చును వస్తువుల తరహాను వాటి బరువును, వాటి అవసరమును ఆర్థిక పరిస్థితులను అనుసరించి వేర్వేరు రవాణా సాధనము లుపయోగింపబడును

**భూమార్గములు** వీటిని రోడ్డు మార్గములు రైలు మార్గములు అని వర్గీకరింపవచ్చును నాగరికారంభము

తోనే వాణిజ్యారంభముకూడ జరిగినది కాని ఆకాలమున వాణిజ్యపరిమాణము తక్కువగ నుండెడివి భూమార్గములపై ఒంటెలు గాడిదలు గుఱ్ఱములద్వారా వర్తకము సాగుచుండెడిది యంత్రము లవతరించుటతో రోడ్డురవాణా సాధనములలో మోటార్లు ప్రధాన సాధనములైనవి ఇవి కూడ ప్రజోపయోగములు వస్తూపయోగములు అని రెండు విధములుగ నున్నవి కార్లు టాక్సీలు బస్సులు ప్రయాణములకును లారీలు ట్రక్కులు వస్తురవాణాకును ఉపయోగమున నున్నవి రోడ్లు అభివృద్ధిచెందని గ్రామసీమలలో బండ్లద్వారానే నేడు సరకులు రవాణా చేయబడుచున్నవి భారతప్రభుత్వము రోడ్డుమార్గముల నిర్మాణము పట్ల శ్రద్ధ చూపుచు దానికధిక ప్రాధాన్య మొసగుచున్నది రైలు మార్గముల నిర్మాణముకంటె రోడ్డునిర్మాణము తక్కువ వ్యయశీలమగుటవలన మారుమూల ప్రాంతములకు ఇదియే అనుకూలమైన మార్గమగుటవలన ప్రభుత్వమట్టి ప్రాముఖ్య మిచ్చుచున్నది ప్రథమ పంచవర్ష ప్రణాళికా కాలమునాటికి భారతదేశములో 97 000 మైళ్ల కంకరరోడ్లు 1 47 000 మైళ్ల మట్టిరోడ్లు నిర్మింపబడినవి దరిమిలా 10 000 మైళ్ళ కంకర రోడ్లు 20 000 మైళ్ళ మట్టిరోడ్లు నిర్మించుటకు అంచనా వేయబడినది ఈ నిర్మాణము కూడ పూర్తియైనది ప్రధాన రహదారులకు 5 మైళ్ళదూరమున నున్న గ్రామములను కలుపుచు గ్రామీణ ప్రాంతములలో రోడ్లనిర్మాణము జరుపుటకు నిర్ణయించబడినది రోడ్డురవాణా చట్టము ననుసరించి భారతదేశమందలి వివిధ రాష్ట్రములలో రోడ్డురవాణా కార్పొరేషను లేర్పడి రోడ్ల నిర్మాణముతోపాటు యాంత్రికరవాణా సాధనముల నిర్మాణము కూడ చురుకుగ సాగుచున్నది అట్టి కార్యక్రమము ఆంధ్రరాష్ట్రములో కూడ వేగముగ జరుగుచున్నది విశేషభాగము ప్రయాణికుల బస్సురవాణా ప్రభుత్వపరమైయుండగా స్వల్పభాగమింకను ప్రైవేటు వ్యక్తుల చేతులలో నున్నది పబ్లిక్‌వర్క్సు శాఖ వారు రోడ్ల నిర్మాణమును నిర్వహించుచున్నారు

రోడ్డుమార్గముల నుపయోగించు వేర్వేరు తరగతుల ప్రజలు, వ్యాపారులు చెల్లించు లైసెన్సుఫీజులద్వారా ప్రభుత్వమునకు ఆదాయము చేకూరుచున్నది రైలుమార్గముల కంటె లారీలు ట్రక్కులద్వారా సరకులు శీఘ్రముగ కొనిపోబడుటచే వస్తువులంత త్వరగా చెడవు అంతేకాక రైలు మార్గములకంటె రోడ్డుమార్గముల నిర్మాణము చవుక విపరీత భారముగల వస్తువులను మిక్కిలి దూరప్రాంతములకు రోడ్డు మార్గములద్వారా రవాణాచేయుట కష్టము మార్గములో జరుగు నష్టములకు లారీ యజమానిగాని వాహకుడుగాని బాధ్యత వహింపరు రోడ్లు సవ్యముగ లేనపుడును వర్షాకాలమునను సరకులు నిర్ణీత కాలములలో నిర్ణీత ప్రదేశములకు చేరకపోవచ్చును అట్టి సందర్భములలో రైలుమార్గము తప్ప వేరు గత్యంతరముండదు భారతదేశములో జాతీయ మొనర్పబడిన రైలుమార్గములు దేశాదాయమునకు ముఖ్యాంగములుగ పనిచేయుచున్నవి

జలమార్గములు కాలువలు నదులు సముద్రముల గుండ వాణిజ్యము ఫొనీషియనులకాలమునుండి ప్రగతిపొందుచువచ్చినది ఆనాడు పడవలు నావలు ఓడలద్వారా జరిగిన రవాణామూలమున దూరదేశములతో వారికి సంబంధ మేర్పడినది గ్రీసు వెనీసు దేశస్థులుకూడ సముద్రపు రవాణా యందు ప్రాముఖ్యము గాంచిరి పొగయోడలు జలాంతర్గాములు వచ్చి సముద్రయానమును సులభసాధ్యమొనర్చినవి దేశములోకూడ నదులు, కాలువలు రవాణా మార్గములుగ ఉపయోగపడుచున్నవి పడవలు మోటారులాంచీలు మొదలైన సాధనములద్వారా తక్కువ ఖర్చుతో సరకులను చేరవేయవచ్చును కృష్ణ గోదావరి మొదలగు నదుల కాలువలు వర్తక వాణిజ్యములకు ఈ నాడుకూడ మిగుల ఉపయుక్తములుగ నున్నవి అంతర్జాతీయ వ్యాపారమునకును కోస్తావ్యాపారమునకును విదేశములతో వివిధరకములైన సంబంధములు కల్గించుకొనుటకును సముద్రమార్గము లీనాడు విశేషముగ తోడ్పడుచున్నవి ఆధునిక యుగములో భారీయెత్తున సైన్యములను ఒక ప్రాంతమునుండి మరియొక ప్రాంతమునకు తరలించుటకుగూడ సముద్రమార్గములపైగల రవాణా సాధనములు విశేషముగ తోడ్పడుచున్నవి 4000 మైళ్ళ తీరప్రాంతముగల హిందూ మహాసముద్రము బ్రహ్మాండమైన రవాణా జలమార్గముగ ఖ్యాతిగాంచినది భారతదేశమున బొంబాయి, మద్రాసు, కలకత్తా కొచ్చిన్ విశాఖపట్టణములందు ఐదు పెద్ద నౌకా నిర్మాణకేంద్రములును తక్కిన తావులందు 99 చిన్న నౌకాశ్రయములును కలవు స్వాతంత్ర్యానంతరము భారతప్రభుత్వము నౌకా నిర్మాణమునకును, నౌకా వ్యాపారమునకును అధిక ప్రాముఖ్యము నిచ్చుచున్నది

మొదటి రెండు పంచవర్ష ప్రణాళికలలోను సముద్రపు రవాణా సాధనముల నభివృద్ధి చేయుటకు సుమారు 76 కోట్ల రూప్యములు వ్యయ రుపబడినవి. అంతరముకూడ ఈ విషయమై గణనీయమైన అభివృద్ధి జరిగినది.

**వాయుమార్గములు**: వాయు మార్గమునకు సాధనమైన విమానములకు ఇతర వ్యాపార రవాణాసాధనములకువలె ప్రాముఖ్యము అంత విశేషముగ లేదు. ముఖ్యముగ ఇది ప్రజల ప్రయాణసాధనముగనే ఉపయోగపడుచున్నది. అంతే కాక ఇది అధిక వ్యయశీలమైనదగుటచేలన సామాన్యులకు అందుబాటులో నుండదు. దీనిద్వారా రవాణా కాబడు వస్తువులు అధికభారము కలవై యుండరాదు. కాని రాను రాను విమానముల నిర్మాణప్రక్రియ సాంకేతికముగ అభివృద్ధిచెంది భారీయెత్తున రవాణాచేయదగు బ్రహ్మాండమైన విమానములు కూడ ఈ నాడు తయారగుచున్నవి. శీఘ్రగతిని ప్రయాణీకులను సరకులను గూడ దూరప్రాంతములకు అవి రవాణా చేయగల్గుచున్నవి. అతి త్వరగా చెడిపోవు వస్తువులను అతి త్వరగా దూరప్రాంతముల కెగుమతిచేయుటకు ఈ విమానములు ఎంతయు ఉపయోగకరముగ నుండును. అంతర్జాతీయ వ్యాపారమును అంతర్జాతీయ రాజకీయసంబంధములను వేగముగా కొనసాగించుటకివి మిగుల అవసరము. భారతదేశవిభజన యగునరికి లైసెన్సులు పొందిన పెక్కు కంపెనీలు విమానయానమును నిర్వహించుచుండెడివి. 1949 లో భారత ప్రభుత్వము టాటాకంపెనీతో భాగస్వామిగా ఎయిర్ ఇండియా ఇంటర్నేషనల్ అను సంస్థను నిర్వహించినది. అట్లే మరి రెండు సంస్థలు ప్రాచ్యదేశములతో వాయుయానముద్వారా సంబంధములు కల్గియుండెను. 1950 లో వాయుయాన రవాణా విచారణసంస్థ యొకటి స్థాపించబడినది. ఎయిర్ ఇండియా తప్ప తక్కిన సంస్థలు లాభసాటిగ లేవని తేలుటచే 1953 లో ఆ సంస్థలన్నియు జాతీయ మొనర్పబడి "ఇండియన్ ఎయిర్ లైన్స్" అను ప్రభుత్వసంస్థ అవతరించినది. అనాటినుండి దేశీయ విదేశీయ వర్తక జనసంబంధములకు విమానములు విరివిగా ఉపయోగింపబడసాగినవి. రానురాను విమానసౌకర్యము అభివృద్ధియై వైకౌంట్లు, బోయింగులు జెట్లు మొదలైన అధునిక భారీవిమానములు ప్రవేశపెట్టబడినవి. విమానయానముద్వారా భారతప్రభుత్వాదాయము హెచ్చినది. భారత దేశములో ముఖ్యముగా బెంగుళూరు హైదరాబాదు మున్నగునగరములలో విమాన నిర్మాణము అభివృద్ధి దశయందున్నది.

వే. రా.

## వాణిజ్యశాస్త్ర చరిత్ర

వాణిజ్యము నాగరికత పుట్టుకతోనే ఆరంభమైనది. వ్యాపారమునకు పరిశ్రమలకు అనుబంధక్రియలుగ వస్తువినిమయములో జరుగువ్యవహారములన్నిటిని వాణిజ్యము అని అందురు. శ్రమవిభజన విధానము ఆధిక్యతను పొందుచు వస్తువుల సేవల క్రయవిక్రయాభివృద్ధికి తోడ్పడి వాణిజ్యప్రగతికి దారితీసినది. నాగరికత ఆరంభమైన ప్రథమదశలో ప్రత్యేకావసరములైన చెకుముకిరాయిని కొన్నిరకములైన లోహములను వేర్వేరు ప్రదేశములలో వినియోగమునకొరకు చేరవేయు ఆవశ్యకత కలిగినది. వినియోగ ప్రయోజన సాఫల్యమే వాణిజ్యము. శిలాయుగములో వాణిజ్యపరిధి చాల స్వల్పముగ ఉండెడిది. క్రమముగా నాగరికత అభివృద్ధిచెంది లోహయుగము అవతరించినది. కంచు ఇనుము మొదలగు లోహముల వినియోగము హెచ్చినది. కాని ఈ లోహములు కొన్నిప్రదేశములలోనే లభ్యమగుటచే అవి అచటనుండి దూరప్రదేశములకు కొనిపోబడి అచటి వస్తువులతో వినిమయము జరుపబడుచుండెడిది. ఈ విధముగ రవాణా వినిమయములు వాణిజ్యములో ముఖ్యాంగములుగ రూపొందినవి.

వాణిజ్యచరిత్ర రవాణా సంసర్గవిధానముల (communications) పెరుగుదలతో పరిణామమును పొందినది. ఆనాటివారు ఒంటెలను రవాణ సాధనములుగ ఉపయోగించి ఎడారులద్వారా వ్యాపారమును దూరప్రదేశములతో సాగించవచ్చునని తెలిసికొనిరి. వర్తకులిట్లు ఒంటెలపై ప్రయాణముచేసి దూరప్రదేశములకు తమసరకులను కొనిపోయి లాభమును పొందుచుండిరి. ఎడారినడుమనుండు ఫలవంతమైన ప్రదేశములను (oasis) నిలువగిడ్డంగులుగ ఉపయోగించుకొనుచు ఆ నడిమికోస్తానుండి ఇతరప్రదేశములతో వారు వ్యాపార సంబంధములను సౌలభ్యము చేసికొనుచుండెడివారు. ప్రాచీన నాగరికప్రాంతములగు మెసపొటేమియా ఈజిప్టుదేశములలో వర్తకము ఈ విధముగ అభివృద్ధి చెందినది.

ఒంటెలద్వారా చేయబడుచుండిన వర్తకము అధిక వ్యయముతోను శ్రీఘ్రకాలయాపనతోను కూడియుండుటచేత, ఇట్లు వ్యాపారముచేయు విలాసవస్తువులు అధికధరలతో కూడి

యుండెడివి ఆ కారణముననే ముఖ్యావసర వస్తువులు ఈ వ్యాపారమునందు ప్రముఖపాత్ర వహించలేక పోయినవి అయినను ఒంటెలపై వర్తకము కొన్ని శతాబ్దములవరకు నిరాటంకముగ సాగినది

కాలగమనములో ఒంటెలపై వర్తకము క్రమముగ వెనుకబడి సముద్ర మార్గములపై వర్తకము ఆరంభమైనది సముద్ర వాణిజ్యమునకు నాందివేసినవారు ఫొనీషియా దేశస్థులు వారు తమ ఓడరేవులనుండి సముద్రమార్గము ద్వారా సైప్రస్ రోడిస్ రేవులతో వర్తకము ప్రారంభించి క్రమముగ తమ వర్తకమును పశ్చిమ మధ్యధరా ప్రాంతములవరకు వ్యాపింపజేసిరి వ్యాపారానుకూలతకు వేర్వేరు ప్రదేశములలో నెలవులను స్థాపించుకొనిరి టైర్ సిడన్ కార్తేజ్ అను ముఖ్యవ్యాపార కేంద్రములు రూపొందినవి పశ్చిమదేశములతో గాజుసామానులు లోహములు నేతబట్టలు మొదలైన వస్తువులతో వ్యాపారము చేసి వాటికి బదులుగ తగరము రాగి వెండి మొదలగువానిని కొని తీసికొని పోవుచుండెడివారు నాణెముల చెలామణి లేనందువలన ఫొనీషియా దేశస్థులు క్రయవిక్రయములను వస్తువినిమయ పద్ధతితోనే జరుపుకొనుచుండెడివారు

8 వ శతాబ్దములో గ్రీకుదేశస్థులు నాణెముల పద్ధతిని ఆచరణమున పెట్టి వ్యాప్తిలోనికి తెచ్చిరి మొట్టమొదటిసారిగ ఏథెన్స్ ప్రభుత్వము నాణెములను వినిమయసాధనముగ ప్రవేశపెట్టి క్రమముగా వెండినాణెముల నుపయోగించి జనామోదమును బడయగలిగినది ఏథెన్స్ వ్యాపారస్థులు వల్లసముద్ర మార్గముద్వారా వ్యాపారమును సాగించుకొనుచు తమకు లభ్యమగు ఆలివునూనె, అత్తిపండ్లు తేనె మట్టివస్తువులు నేతబట్టలు విక్రయించి నిత్యావసర వస్తువులైన గోధుమలను తదితర ఆహారవస్తువులను క్రయము చేసికొనుచుండెడివారు వీరి కాలమునుండియే దూరప్రదేశములతో వ్యాపారవ్యాప్తి సముద్రమార్గములద్వారా జరిగినదని చెప్పవచ్చును

అలెగ్జాండరు గావించిన ఆసియాదేశముల విజయయాత్ర ఆ దేశములతో గ్రీకు వాణిజ్యమునకు నూతనావకాశమును కల్పించినది వాణిజ్యాభివృద్ధితోపాటు అలెగ్జాండ్రియా 'యాంటియాక్' పట్టణములుకూడ సర్వతోముఖముగ అభివృద్ధి గావించబడినవి

ప్రప్రథమమున రోమురాజ్యములో వాణిజ్యమునకంత ప్రాముఖ్యము లేకపోయినది కార్తేజ్ వినాశము గ్రీసుపై రోమను ఆధిక్యత రోమురాజ్యములో వాణిజ్యాభివృద్ధికి సాయపడినవి ఆ రాజ్యములో శాంతిభద్రతలను నెలకొల్పుటకు అగస్టస్ చేసిన యత్నములు సామాజికాభివృద్ధితోపాటు వాణిజ్యాభివృద్ధికికూడ తోడ్పడినవి వీరి వాణిజ్యము గ్రీకు వాణిజ్యరీతులనే పోలియుండెడిది ఈ కాలములోకూడ విలాసవస్తువులకే ప్రాముఖ్యమొసగబడి ఒంటెలపై వ్యాపారము విరివిగ సాగుచుండెడిది ఎర్రసముద్రము ద్వారా భారతదేశమువంటి తూర్పుదేశముల విలాసవస్తువులు అరబ్బు దేశములకు చేరుచుండెడివి ఈ జలమార్గములను సానుకూలము చేయుటకు అగస్టస్ కాలువలను అభివృద్ధి చేయించెను తరువాతికాలములో వర్షఋతు పవనములవలన అరేబియాసముద్ర మార్గము ప్రయాణమునకు సులభసాధ్యమై ఇండియాకు క్రమబద్ధమైన మార్గమేర్పడినదని కనుగొని వారా మార్గమును అధికముగా ఉపయోగములోనికి తెచ్చిరి

కాని ఆదిమజాతుల దండయాత్రలవలన పశ్చిమరోమను సామ్రాజ్యము చాలవరకు నాశనమై వారివాణిజ్యము క్షీణదశకు వచ్చినది కాన్‌స్టాంటినోపిల్ ముఖ్యకేంద్రముగ వీరు తూర్పు మధ్యధరా ప్రాంతములతోనే వాణిజ్యమును నిలుపుకొనిరి తదుపరి మహమ్మదీయులదృష్టి ఈజిప్టుపై పడి అలెగ్జాండ్రియా వారి వశమైపోయెను అయినను కాన్‌స్టాంటినోపిల్ మహమ్మదీయులచేతిలో 1453 వరకు పడకపోవుటవలన అంతమేరకు ఆసియా యూరోపుదేశములతోనే వాణిజ్యము నిరాటంకముగ కొనసాగినది 6 వ శతాబ్దమునుండి ఈ కాలమువరకు కాన్‌స్టాంటినోపిల్' గొప్ప వ్యాపారకేంద్రముగనుండి దూరతీర వ్యాపారమునకు చాల సాయపడినది ఈ కాలపరిధిలోనే వాణిజ్యము సర్వతోముఖముగ అభివృద్ధి చెందుటకు అవకాశము కలిగినది దంతములు తోలు వస్తువులు నేతవస్తువులు మొదలగువాటిని ఎగుమతిచేసి ధాన్యము లక్క ఉన్ని మున్నగువస్తువులను దిగుమతి చేసికొనుచుండెడివారు వర్తకులు బ్యాంకింగు పద్ధతులను నేర్చుకొని అమలుపరచుటయే ఈ కాలములోని వాణిజ్యపు ముఖ్యపరిణామము బంగారము ద్రవ్యముగ వాడబడుటచే అది సర్వజనాంగీకారముగ నుండెడిది ఋణముల పద్ధతి ఓడలభీమా సుంకములు పన్నులవిధింపు మున్నగునవికూడ అమలులోనికి

వచ్చెను ఎగుమతి దిగుమతులపై సుంకములు క్రయవిక్రయములపై పన్నులు వేయబడుచుండెడివి కాని సంతలలో మాత్రము కొంతవరకు స్వేచ్ఛావాణిజ్యము జరుపుటకు అనుమతి ఉండెడిది ఈ సంతలలో ఏ దేశమువారైనను వ్యాపారము చేసికొన వచ్చును వారిలో వెనీసు జినీవా దేశస్థులపై మాత్రము కొంత అభిమానము చూపబడుచుండెడిది ఈసంతలలో 'కాన్‌స్టాంటినోపిల్' సంత చాల ప్రసిద్ధిచెందినది

తరువాత కాన్‌స్టాంటినోపిల్ వారసులుగ ఇటాలియా దేశపు వర్తకపట్టణములు వెలసినవి బైజాంటైన్ పద్ధతులలో వాణిజ్యము నడపి దాని వినాశసమయమునకు వీరు లాభములను సేకరించ మొదలుపెట్టిరి మధ్యశకము వచ్చుసరికి వెనీసు వాణిజ్యములో చాల ప్రగతినిపొంది శోభనుగాంచినది వెనీసు నగరము ఆడ్రియాటిక్ సముద్రమునకును మిగిలిన నీటిపాయలకును మధ్యనుండుటవలన అది వాణిజ్యకేంద్రముగ శీఘ్రగతిని అభివృద్ధిపొంది వెంటవెంటనే వాణిజ్యములో నూతనమార్గములను అనుసరించుచు పశ్చిమదేశములతో జలమార్గమున తూర్పుదేశములలో ఎడారిమార్గమున తన వాణిజ్యమును అభివృద్ధి చేసికొనినది

ఇటలీదేశ వ్యాపారులు 14 వ శతాబ్దారంభములో గుంపులుగా ఓడలపై బయలుదేరి పశ్చిమ మధ్యధరా ప్రాంతములకు జిబ్రాల్టరుద్వారా పల్లపుప్రాంతములకు మిరియములు లవంగములు నీలిమందు సరఫరాచేసి అచటనుండి ఉన్ని లోహములు జంతుచర్మము లను దిగుమతిచేసికొని లాభమును పొందెడివారు ఈ కాలములో వాణిజ్యము ఒక నూతన విధానములో జరుగుచుండెడిది వ్యక్తిగతముగ వీరు వర్తకులకుకాక ఉమ్మడిగా ఏర్పడిన ఓడవ్యాపారుల బృందమునకు సామూహిక పద్ధతిపై రవాణా ఏర్పాటుచేసి సరకులను ఆయా ప్రాంతములకు అందించుచుండెడివారు అందుచే రవాణా అతి తక్కువ వ్యయముతో జరుగుచుండెడిది వ్యాపారపులెక్కలను వ్రాయు పద్ధతిని వాణిజ్య నిర్వహణమును, క్షుణ్ణముగ అవగాహన చేసికొనుటచే, వీరి కాలములో వర్తక కౌశల్యము అధికముగాపెరిగినది పల్లపుప్రాంతములలో వ్యాపారము లాభసాటిగనున్నదని గ్రహించి, వెనీసు వర్తకులు ప్రత్యేకముగ దూరప్రాంత వర్తకులకు ఉత్సాహమును ప్రత్యేకరక్షణమునుకూడ ఒసగుచుండిరి

ఇంతవరకు ఇటలీ మొదలగు పల్లపుప్రదేశములే ఇంగ్లండుకంటె వాణిజ్యములో అధికృతను పొందియుండెడివి కాని ఇంగ్లండు అన్ని సముద్రమార్గములకు అనువుగనుండుటచే ఇటలీ ఫ్రాన్సుదేశములకంటె అది అతిశీఘ్రముగ చాల అధికృతను పొందినది తరువాత జర్మనీదేశ వ్యాపారపట్టణములు వాటి వాణిజ్యాభివృద్ధికొరకు ఒక సమాఖ్యగా ఏర్పడి ఉత్తరదేశములతో ఎగిరవస్తువులలో వ్యాపారము చేసి లాభము గడించుచుండెను

యూరోపుదేశములలో నూలు వస్త్రములు అతి ముఖ్యమైన వాణిజ్య వస్తువులుగ ఎంచుకొనబడినవి వాణిజ్యముకొరకు వర్తకులు ప్రత్యేక తెగగా ఏర్పడి వర్తకముచేయుచు చాల లాభములను గడించిరి వాణిజ్యము కొంత ప్రగతిని పొందినను పూర్తివికాసము నొందలేదని చెప్పవచ్చును భూసముద్ర మార్గముల రవాణా చాల వ్యయశీలముగ నుండెను అదియుగాక భూమార్గముల ద్వారా ఎక్కువ వస్తువులను రవాణా చేయుటకు వీలులేకుండెను వస్తుమూల్యముపై రవాణా ఖర్చులు పడుటవలన కొన్ని ప్రదేశములలో నష్టము కలుగుటకుకూడ అవకాశముండెడిది మరల దేశీయ వాణిజ్యదారులు విదేశీయవర్తకులపై కొన్ని నిబంధనములు వేయుచుండుటవలన నష్టము సంభవించుచుండెడిది పై దేశములనుండి వచ్చినవ్యాపారులు వారిప్రదేశములలో ఫలానాధరకంటె ఎక్కువగ వారి వస్తువులను విక్రయించరాదనియు వారి నివాసము దేశీయవర్తకులతోనే ఉండవలెననియు నిబంధనములు చేసిరి వారివస్తువులు ఆకాలవ్యవధిలో విక్రయము కాకపోవుటవలనను వ్యాపార రహస్యములన్నియు దేశీయవర్తకులకు తెలుపవలసి వచ్చుటచేతను వారు నష్టపోవుచుండిరి సంతలకు వచ్చి వ్యాపారము చేయువారికి మాత్రము కొన్ని సదుపాయములియ్యబడుచుండెవి ఈ సంతలకు రానురాను ప్రాముఖ్యము కల్గి సరియైన వాణిజ్యరూపమునకు దారితీసినవి వాణిజ్య న్యాయశాస్త్రము రూపొందించబడి దాని ఆధారముతో వర్తకుల తగవులు పరిష్కరింపబడుచుండెడివి; వర్తకనిధానములు సులభతరము చేయబడినవి విదేశమారకము మాధ్యమిక ప్రక్రియలు ఏర్పడినవి ముఖ్యముగ హుండీల చెల్లింపు విధానములు అమలులోనికి వచ్చుటవలన, ఋణముల చెల్లింపు, ద్రవ్యచలనము సులభతరమైనవి

15 వ శతాబ్దము వచ్చుసరికి యూరపు వాణిజ్యములో విప్లవాత్మకమైన మార్పుకలిగినది 1453 లో 'కాన్‌స్టాంటినో

పిల్ టర్కీ ప్రభుత్వ వశమైనది 1486 లో డయాస్ అను నతడు గుడ్ హోప్ అగ్రమును చుట్టి క్రొత్తమార్గమును కనుగొనెను 1492 లో కొలంబస్ అమెరికాపై పాదము మోపెను కాన్‌స్టాంటినోపిల్ టర్కీ వశమగుటవలన వెనిస్ జెనీవా వ్యాపారగమనములో చాల మార్పుగలిగినది టర్కీ వారి నిర్బంధములవలన వెనీసు వ్యాపారము క్షీణింపజొచ్చినది పోర్చుగీసువారు స్పెయినువారు క్రొత్త మార్గములద్వారా వ్యాపారమును ప్రారంభించి లాభములను పొందసాగిరి కాను రాను వీరు సముద్రమార్గములను కొంతవరకు స్వంత హక్కుగా చేసికొనుటచే ఇంగ్లీషువారికి వాణిజ్యము కష్టతరమైనది తూర్పుదేశములకు ఉత్తరమునుండి మార్గములను వెదకుచు 1558 లో వారు కృతకృత్యులైరి కాస్పియన్ సముద్రముగుండా ఆర్కేంజ్ నుండి మాస్కోకు దారిచేయబడి బొకారాలో భారత చైనావస్తువులు విక్రయింపబడినవి తదుపరి వీరు ఆర్కేంజిల్ లోని రష్యా వ్యాపారస్థులతో కలిసి ఒక సంకలితమూలధన సంస్థ (Joint Stock Company) నేర్పరచుకొని కాస్పియన్ సముద్ర మార్గములగుండా వ్యాపారముచేసి చాల లాభములను గడించుచుండెడివారు ఆ కంపెనీకి మాస్కో కంపెనీ లేక రష్యాకంపెనీ' అను నామధేయముండెడిది ఆసియాతో వర్తకమార్గములను ఈ కంపెనీయే ఏర్పాటుచేసెనని చెప్పవచ్చును కాని 1851 లో పశ్చిమ మధ్యధరాప్రాంతములలో ఇంగ్లీషుదేశస్థులు టర్కీవారితో కలిసి పాతమార్గములగుండా తిరిగి వ్యాపారమును ఉమ్మడి నిబంధనలతో ప్రారంభించిరి ఆ శతాబ్దము తుదివరకు ఈ కంపెనీ వ్యాపారము చాల లాభసాటిగ జరిగెను

వాస్కోడిగామా సాహసయాత్రవలన భారతదేశములోనికి విదేశవాణిజ్యము ఆరంభమైనదని చెప్పవచ్చును అంతకుపూర్వము మలయా జావా చైనాలతో మాత్రమే వర్తక సంబంధములుండెడివి పురాతన కాలమునుండి హిందూదేశములో వ్యాపారము అభివృద్ధిగాంచియే యున్నది అది దేశమునకు మాత్రమే పరివ్యాప్తమైనది గాని దూరతీర వ్యాపారముగ అభివృద్ధి పొందలేదు రాజులు వారివారి రాజ్యములలో లభ్యమగు వస్తుసముదాయమును గుఱ్ఱములపైన ఏనుగులపైన ఒంటెలపైన వేర్వేరు స్థలములకు పంపి వర్తకము చేయుచుండెడివారు ఈ వాణిజ్యములో మణులు రత్నములు సుగంధ ద్రవ్యములు ఎక్కువగా ఉపయోగింపబడెడివి

పోర్చుగీసువారు గోవాను తమ అధికారస్థానముగ చేసికొని ఇండియాలోగల వర్తకమార్గములన్నిటిపైన ఆధిక్యతను పొందుటకు ప్రయత్నించిరి ఎర్రసముద్రము కాంబే మొదలగు జలమార్గములను తమ వశమునందుంచుకొని వర్తకమును పూర్తిగా తమ ఆధీనములో నుంచుకొనవలెనని ఉద్దేశించిరి వారి ముఖ్యవ్యాపారనిర్మాణములన్నియు కొచ్చిన్ కాలికట్ రేవులయందే చేయబడెడివి

2వ ఫిలిప్ కాలములో పోర్చుగల్ స్పెయిను దేశములు ఉమ్మడిగా వాణిజ్యమును కొనసాగించుచుండెడివి కాని 16వ శతాబ్ది తుదిదశలో ఇంగ్లీషువారు డచ్చివారు తమదృష్టిని భారతదేశముపై కేంద్రీకరించిరి వారు 1595 లో గుడ్ హోప్ అగ్రముగుండా మార్గమేర్పరుచుకొని హిందూ మహాసముద్ర మార్గములద్వారా వ్యాపారమును ప్రారంభించిరి ఈ మార్గము సులభతరముగ నుండుటవలనను డచ్చివారి సువాసనద్రవ్యములకు అధికధరలు పలుకుటచేతను ఇంగ్లండు దేశపు వ్యాపారబృందము వారి వ్యాపార పోటీ కొరకు లాభముకొరకు ఉమ్మడిగ ఒక కంపెనీని ఏర్పరచుకొనిరి 1600 సం॥ డిసెంబరులో జారీచేయబడిన రాజశాసనము ననుసరించి ఇంగ్లీషు వర్తకుల సౌకర్యమునకై హిందూదేశముతో వ్యాపారము చేయుటకు ఈస్టిండియా కంపెనీ ఏర్పడినది ప్రథమమున ఈ కంపెనీ ఎగుమతి దిగుమతులపైననే కేంద్రీకరించినది కాని భారతీయ వస్త్రములకు ఎక్కువ గిరాకీ యుండుటచూచి సూరత్ వద్ద బట్టల ఫ్యాక్టరీ నిర్మాణమునకు అనుమతి బడసెను అక్కడే వారు నీలిమందునుకూడ క్రయముచేసి యూరోపులో దానిని అధిక ధరలకు విక్రయించి మిక్కిలి లాభములను పొందుచుండెడివారు ఇంగ్లండు వ్యాపారస్థులు భారతదేశపు నేత బట్టలను కూడ అధికముగ దిగుమతి చేసికొనుచుండెడివారు కాని 17వ శతాబ్దములో ఇంగ్లండు వ్యాపారస్థులు హిందూ దేశపు వస్త్రముల దిగుమతి కారణముగ వారి దేశములో ఉన్ని మొదలగు వస్త్రపరిశ్రమలు క్షీణించుచున్నవని గ్రహించి వానిని ఆటంకపరచిరి తదుపరి సంవత్సరములలో స్వంత వినియోగమునకు కాక ఆఫ్రికాకు ఎగుమతి చేయుటకై వారు భారతీయ వస్త్రములను దిగుమతి చేసికొనుచుండెడివారు

రానురాను ఓడల నిర్మాణములలో క్రొత్తపోకడలు వచ్చినవి బ్యాంకింగు విధానము ప్రజాదరణను పొంది ప్రవర్తకపు సమతూలనము దేశముయొక్క ఆర్థిక ప్రగతికి ముఖ్యమైన విషయముగ గుర్తింపబడినది

ఈ కాలములో ఇంతకు పూర్వమువలెకాక వాణిజ్యము ముఖ్యావసర వస్తువులకై ఉపయోగపడుచుండెడిది దూరతీర వాణిజ్యములలో పంచదార పొగాకు లాభసాటిగ నుండెడివి ఈస్టు ఇండియా కంపెనీ టీ ఆకుపై ఆధిక్యతను పొంది వాణిజ్యము సాగించుచుండెడిది విలాసవస్తువులకు కాక వాణిజ్యములో ముఖ్యావసర వస్తువులకే ప్రాధాన్యమియ్యబడినది అందుచే వర్తకదేశములకు పరిశ్రమలనభివృద్ధి పరచవలసిన అవసరమేర్పడినది ముఖ్యముగ బ్రిటిష్ వాణిజ్య విధానము పరిశ్రమాభివృద్ధికి తోడ్పడి తుదకు పారిశ్రామిక విప్లవమునకు దారితీసినది అందుచే ప్రపంచమునకు వాణిజ్య కేంద్రముగానుండిన బ్రిటన్ పరిశ్రమల కేంద్రముగ మారిపోయినది

18 వ శతాబ్దపు అఖరుదశవరకు ఇంగ్లీషువారు భారతదేశపు క్యాలికో వస్త్రములను మస్లిన్ లను దిగుమతి చేసికొను అవసరమేర్పడినది తరువాత లాంకషైర్ లో నూలు పరిశ్రమను స్థాపించుటచే వీరు చాలలాభమును పొందిరి అమెరికానుండి, ఇండియానుండి ముడిప్రత్తిని తెప్పించుకొని యంత్రసామగ్రులద్వారా వస్త్రములను భారీయెత్తున తయారుచేసి ఇండియకు పంపుచుండెడివారు ఆ వస్త్రములను అతి తక్కువధరలకు అమ్ముచుండుటవలన భారతీయ వర్తకులకు చాల నష్టమేర్పడినది ఆ ధరలతో దేశియ వస్త్రముల ధరలు తట్టుకొనలేకపోయినవి అయినను దేశీయవాణిజ్యము వేరొక విధముగ అభివృద్ధి పొందినది

ఆవిరియంత్రములు ఉపయోగమునకు వచ్చుటవలన రవాణా సులభతరమై దేశములో మారుమూలప్రదేశములను కూడ వర్తకమునకు అనువుగ రూపొందించినవి ఆవిరి ఓడల వలన దూరతీరములకు హెచ్చు మొత్తములను తక్కువ వ్యవధిలో తక్కువ వ్యయముతో రవాణాచేయుటకు వీలయినది 1869 లో సూయజ్ కాలువ తెరువబడుటచే తూర్పుతీర ప్రాంతములతో వాణిజ్యము చాల సులభమైనది

19 వ శతాబ్దిలో పరిశ్రమలు చాల అభివృద్ధిచెందినవి అమెరికా జర్మనీ దేశములు పారిశ్రామిక రంగములో ముందడుగేసినవి ఆ దేశములలో పరిశ్రమలకు ముఖ్యమైన ముడిఇనుము బొగ్గు లభ్యమగుటయే దీనికి కారణము

మొదటి ప్రపంచయుద్ధ సమయములో యుద్ధసామాగ్రిని యంత్రములను ఇతర వస్తువులను దూరతీరములకు తరలించవలసిన అవసరము కలుగుటచే నౌకా నిర్మాణమును అభివృద్ధిపరచుటకు ప్రయత్నములు జరిగినవి ఈ నౌకలను వాణిజ్యమున కుపయోగించవచ్చునుగాని మొదటి ప్రపంచ యుద్ధము తరువాత ఏర్పడిన ఆర్థికమాంద్యమువలన నౌకా నిర్మాణము దెబ్బతినినది మరల 1936 సం॥ తరువాత అమెరికాలో వాణిజ్య నౌకాసంస్థలను పెంచుటకు యత్నములు జరిగినవి మరల రెండవ ప్రపంచ యుద్ధమువలన నౌకా నిర్మాణము యుద్ధానుకూలముగ మార్చబడినది యుద్ధ విరమణ తదుపరి ఈ నౌకలను వేగముగ వాణిజ్యావసరములకు మరలించుటచే లాభదాయకమైనది

తరువాతి కాలములో వివిధదేశములు వాణిజ్య పరముగా అభివృద్ధి పొందినవి విదేశ వాణిజ్య ప్రాముఖ్యమును గమనించి విమానమార్గముతరువాత నౌకామార్గము ఉత్తమమైన మార్గమగుటచే దాని అభివృద్ధి నాకాంక్షించిరి దేశీయ వాణిజ్యమునకు రైళ్లు లారీలు మొదలగు సాధనములు మారుమూల ప్రాంతములకుకూడ ఉపయోగకారులుగ నున్నవి వాణిజ్యమునకు ఉపకారకమైన తంతితపాలాలు టెలిఫోనులు బ్యాంకులు గిడ్డంగులు ప్రభుత్వ శాసనములు భీమా మొదలైనవి అధికముగ ఆచరణములోనికి వచ్చినవి విదేశ వ్యాపార లభ్యమునకు విదేశ మారకసౌకర్యము ప్రపంచ వాణిజ్యసంస్థ మొదలైనవికూడ ఏర్పరుప బడినవి ప్రస్తుతము వాణిజ్యము అన్ని దేశములలోను ఆవశ్యకమై, అభివృద్ధిని పొందుచున్నది

ఈ విధముగ వంశెబయుగమునుండి ప్రారంభమైన వాణిజ్యము వాయుయాన యుగమువరకు వచ్చినది ప్రస్తుతము వాణిజ్యము దేశఆర్థిక స్థిరత్వమునకు ఆటపట్టై సర్వతోముఖముగ అన్ని దేశములందును అభివృద్ధిని పొందుచున్నది

వే రా

## వాదనకళ

లలిత కళలలోనెల్ల మిగుల నుత్కృష్టమైనది సంగీతము దీని మూలము నాదము నాదమే సంగీతముగా రూపొందు చున్నది

శ్లో॥ ననాదే న వినాగీతం న నాదేనవినాస్వరః।
ననాదేన వినారాగః తస్మాన్నాదాత్మకం జగత్॥

నాదము లేనిచో గీతముగాని స్వరముగాని రాగముగాని లేదు ప్రాణానల సంయోగముచే మూలాధారమందు బయలు దేరి హృదయకంఠాస్యముల ద్వారమున ఈ నాదము బయ ల్వెడలుచున్నది నాదమూలమైన ఇట్టి సంగీతమును ఉపా సించినవారు పెక్కురున్నారు దేవతలు దానవులు యక్షులు గంధర్వులు కిన్నరులు భృంగి నశేకుడు సమీరజుడు తుంబు రుడు నారదుడు మానవులు పెక్కురు కృతకృత్యులైరి సంగీతము యొక్క పరమావధి మోక్షప్రాప్తి యనబడినది

గాత్రం వినాగాయనమప్రశస్తం అనుటను బట్టి గాత్ర సంపత్తి లేనివారు ఏదేని ఒక వాద్యమును లేక జంత్రమును చేకొని సాధనచేసి తద్ద్వారా నాద బ్రహ్మానుసంధానమును చేసికొని ముక్తినొందిరి

కావ్యప్రబంధముల వలన నారదుడు మహతి విశ్వా వసుడు బృహతి తుంబురుడు కళావతి శారద కచ్ఛపి-అను వీణలను వాయించెడివారని తెలియవచ్చు చున్నది శ్రీ రాధా మాధవుని వేణుగానము రాళ్లను సహితము కరగించి మోడు లను సైతము చిగురింప జేసెను

శ్లో॥ వీణావాదన తత్త్వజ్ఞః శ్రుతిజాతివిశారదః।
తాలజ్ఞశ్చా ప్రయాసేన మోక్షమార్గం సగచ్ఛతి॥
(సంగీత రత్నాకరము)

తా॥ "వీణా వాదనతత్త్వజ్ఞుడును శ్రుతిజాతి నెరిగిన వాడును తాలాభిజ్ఞుడును సులభముగ మోక్షమునొందును "

వాదనము అనగా వాద్యమును పలికించుట-అనగా శ్రుతిలయలకు సంబంధించిన ధ్వని విశేషమును సాధన ద్వార మున ఉత్పత్తిచేయుట అట్టిసాధనము ముఖ్యముగా చతు ర్విధము

౧ తతము = వీణాదికము ౨ ఆనద్ధము = మురజాది కము ౩ సుషిరము = వేణు శంఖ కాహళ్యాదిముఖ వాద్యము ౪ ఘనము = కంచుతాళము మొదలగు వాద్య విశేషములు

వాయులీనము సారంగి మున్నగు వాద్యములలో గల తంత్రులందు గోళ్లతోగాక కమానుతో రాపిడిచేయగా నాద ముద్భవమగును

ఆనద్ధవాద్యము ఇది కేవలము తాళవాద్యములకు చెందినది గాన మొనరించునపుడును కీర్తన కృతి దరువు పాడునపుడును జంత్రముమీద వాయించునపుడును తాళము ననుసరించి వాయించు సాధనమిది

ఉదా మృదంగము కంజిరా డోలక్ డోలు మొద లైన చర్మవాద్యములు

పాట పాడునపుడు ప్రక్కన తాళవాద్యముల తోడు లేనిచో సంగీతము ఇంపుగా నుండదు బాగనుగా మృదంగ తాళము జతగూర్చి "ను చొక్కజేయు ధీరుడెవ్వడో" అని త్యాగరాజు తాళవాద్యమును పాటకచేరీలుచేయు సమ యములందును నాదస్వరము వాయించు నపుడును విను చుందుము

**మృదంగము** పనస ఎగిస వాడిస మ్రానులను గుండ్ర ముగా లోపల తొలిచి దానిరువైపుల చర్మముతో కప్పి పైన రెప్పలుగానుండునట్లు మరొక చర్మమునుగూడ దానిపై మూసి వారులచే బిగింతురు

మృదంగమునకు కుడివైపు చర్మ మధ్యమున గుండ్ర ముగా కరణి యనునొక నల్లని పదార్థమును అతికించెదరు అనములో బాగుగా కాలిన చిట్టెపు నల్లరాతిని కొన్ని రసాయ నములతో చేర్చి కాటుకగానూరి పట్టించెడిదే కరణి ఎడమ వైపున అన్నమును వెలిబూడిదను మెత్తగా నలిపి ఉండను జేసి చర్మముమీద దానిని అంటించెడివారు ఇపుడు తడి గోధుమ రవ్వను మెత్తగా నలిపి ఉండజేసి అంటించుచున్నారు దీనిని తడి చేయుచు మంద్రస్థాయి షడ్జమునకు వచ్చునట్లు కుడివైపున వారును బిగించుచు సడలించుచు శ్రుతికమవుగా వచ్చునంత వరకు బిగించి లేక కర్రబిళ్లమీద గుండ్రాతితో కన్నులమీద మృదంగమును నిలబెట్టి కొట్టుటచే ఆధారమధ్య షడ్జమునకు సరిచేసి ఆరెప్ప కరణులమీద చాపు, మీటు' అను నామములు గల చేతివ్రేళ్లతో తాడనము చేయవలయును అట్లు కుడి ఎడమవైపులనుండి రెండు నాదములను జోడించి వాయించుటచే ఇంపైన శబ్దముద్భవించి వీనులకు విందొనర్చు చుండును వీటన్నిటిని హస్తద్వయముతో పలికించు శబ్దములను 'జతులు (తక తకిట, తధిగిణత తకధుణుకుతోమ్) అందురు

హిందూస్థానీ సంగీతమున మద్దెలకు మార్పుగా రెండుగా చేయగా వచ్చు రెండు తబలలను ఒకవైపు మాత్రమే చర్మముతో మూసెదరు కుడి ఎడమలను రెండు వేర్వేరు సాధనములుగా చేసి ఎడమదానిని ఒడిలోను కుడిదానిని ఒక కుదురుమీదను పెట్టి వాయింతురు

ఇంచుమించు మృదంగమువలె నుండి ఇంకను గంభీరముగా నుండునట్లు డోలును తయారు చేయుదురు దీని ప్రమాణము పెద్దదిగా నుండును దీనికుడివైపున కరణివంటిది యుండదు గట్టి చర్మము మాత్రమే యుండును ఎడమవైపున సన్నని కర్రముక్కతో వాయింతురు వివాహము లందు రథోత్సవములందు ఊరేగింపుటుత్సవములందు తాషా మర్ఫా రండోలు అనునవి వాయింపబడును

వేణు నాదస్వరము (సన్నాయి) నాగస్వరము శంఖము శృంగము మూర్సింగ్ మొదలైన సాధనములు నోటితో గాలిని పూరించి ఆయాజంత్రములకు గల రంధ్రము లను రెండుచేతుల వ్రేళ్లచే మూయుచు తెరచుచు నాదమును పలికింతురు ఇది చాల మనోహరముగా నుండును తిరునాళ్లు దేవతారాధనము శుభకార్యములందు మంగళకరములైన సన్నాయి మున్నగు వాద్యసంగీతములు విధిగా నుండును

పాట పాడునపుడు తాళానుగుణముగా నుండుటకు కంచు తాళములను వాయించుచు చిరుతలను వేయుట నాదస్వర వాద్యములందును హరికథా కాలక్షేపములందును రామభజనలలోను మనము చూచుచుందుము ఇవి ఘనములు లోహజములు

జలతరంగము కాష్ఠతరంగము మొదలైన వాద్య విశేషములును గలవు జలతరంగము ఎంగాణి గిన్నెలలో సప్తస్వర రాగ శ్రుతుల కనుగుణముగా నుండునట్లు నీరు పోయుచు తీయుచు సరిచేసి రెండు పుడకలతో వాటి అంచులమీద వాయించినచో గిన్నెలలోని నీరు తరంగములుగా కదలుచు శ్రావ్యమైన ధ్వనియుద్భవించును దీనిచే కీర్తనలు పాటలు మొదలైనవి వాయించ వచ్చును

కాష్ఠతరంగము : నల్లని చెక్కలను శ్రుతుల కనుకూలముగా నుండునట్లు తయారుచేసి వాటిమీద కర్రముక్కలతో కొట్టినచో శ్రావ్యమగు నాదముత్పన్నమగును దీనిపై కీర్తనలు వాయించనగును

ఘటవాద్యము కుండమూతిని ఉదరమునకు అనించి ప్రక్కల రెండు చేతులతో వాయించునపుడు ముందునకు వెనకకు కదలికచే దాని మూతిలోనికి గాలిపోయి వెలుపలికి వచ్చునపుడు గంభీరమైన శబ్దము వచ్చును ఆ శబ్దము వినుటకు మిగుల హాయిగొల్పును ఇదియు తాళవాద్యమే

శంఖవాద్యము నోటిద్వారా గాలిని పూరించి ఊదుటచే ఒకవిధమైన శబ్దముత్పత్తియగును మృదంగముమీద వాయించు జతులవలె నోటితో జతులను ఈ శంఖముమీద పలికించినచో వినుటకెంతో రంజకముగా నుండును దీనిని కొనగోలు అనియందురు

క్లారినెట్ బ్యాండు పది లేక పదునేనుమంది సాముదాయకముగా ఏకవిధమైన వస్త్రాదికమును ధరించి రెండువరుసలలో నిలబడుదురు కొన్ని రకముల ఇత్తడి సాధనములు తళుక్ తళుక్ మని మెరయుచుండును కొన్ని వెండి ఆభరణముల వంటివి సన్నాయివలెనుండు క్లారినెటుకు తగిలించబడును చేతివ్రేళ్లతో రంధ్రములను మూయుచు తెరచుచు నోటితో ఊదుచున్నచో మంద్రమధ్య తారస్థాయిలలో శబ్దముత్పన్నమగును వినుటకు యింపుగా నుండును వాద్యగాండ్రు వాటిని ప్రధానముగా యుద్ధసమయములందు భటసమూహములు ఉత్సాహముతో మైమరచి ప్రాణముల లెక్కచేయక జయము సంపాదించుటకై వాయింతురు వినోదముల వెరపు సర్కస్ గుడారములలో కూడ వీటిని వాయింతురు ఇపుడివి వివాహాది శుభసమయములలో కూడ బాగుగా పాదుకొన్నవి వీటికి తోడుగా తాళవాద్యములుగా సన్నని పుల్లలతో చర్మవాద్యములను కొట్టెదరు ఇవన్నియు కలిసి బాండువాద్యమనబడుచున్నది

నౌబత్ ఖానా : రాజులు సంపన్నుల గృహములయందు వివాహ సమయములలో వాద్యగాండ్రు ఎత్తుగా కట్టించిన ఒకమంచెమీద ఎక్కికూర్చుని రెండు చిన్నసైజు సన్నాయిలను చిన్న నగారాలవంటి రెండు చర్మవాద్యములను వాయించుచుందురు దేవాలయములలోకూడ ఆయాపూజాసమయములు దూరప్రజలకు తెలియుటకు వాయింతురు ఇప్పుడివి సన్నగిల్లినవి

జంత్రవాద్య సమ్మేళనము (Orchestra) వీణ వేణు, వాయులీన జలతరంగ, కాష్ఠతరంగ సితారు, మృదంగము, తబల మొదలైన అనేక వాద్యముల నొకేసారి కలిపి వాయిం

చుట తంత్రీవాద్య సమ్మేళన మనబడును. ఒకే పాటను ఇన్ని వాద్యముల సమ్మేళనముచే వాయించినపుడు వినుటకు మనోహరముగా నుండును. ఇవి సామాన్యముగా చలనచిత్రములలో పాటను పాడునపుడు రసవంతముగను ఆహ్లాదకరముగను ఎని ఎంచుటకు నేపథ్యగానముక్రింద నాలుగు లేక ఐదు తంత్ర వాద్యముల సమ్మేళనముతో పాడింతురు.

**బుల్ బుల్ తారా** ఇదియొక వాద్య విశేషము. ఒక చెక్కమీద కొన్ని తీగలను బిగించి ఒక చివర కుడిచేతియందు గల ప్లాస్టిక్ బిళ్లతో తంత్రులను ప్రయోగించుచు వాటికిపైగా అమర్చిన గుండ్రని ఇనుప చక్రములమీద ఎడమ చేతివ్రేళ్లతో నొక్కుచుండినచో ఆ తంత్రులమీద వ్రేళ్లు అనిన స్వరములు ధ్వనించును.

**సంగీతపు పెట్టె** రెండు చెక్కలకు మధ్య స్వరములకు తగిన రీడ్ల నమర్చి నోటితో సందులలోనికి ఊదుచు లోనికి గాలి పంపుచున్నచో ఇంపైన ధ్వనివచ్చును. ఇది బాలురకు, బాలికలకు ఆటవస్తువుగా ఊదుకొని ఆనందించుట కుపయోగపడును.

పరమశివుడు వెండికొండపై తాండవకేళి సల్పునపుడు దానికి అనుగుణముగా బ్రహ్మ తాళమును వాయించుట, ముకుందుడు (శ్రీకృష్ణుడు) మురళిని, సరస్వతి వీణను, చంద్రసూర్యులు వేణువులను, గంధర్వ అప్సరసలు కిన్నరులు తుంబుర ఏకతార మొదలగు వాద్యములను, నందీశ్వరుడు మర్దళమును వాయించుచుండగా నారదుడు సంగీతమును నెరపుచుండిరట.

నో. నా. భా.

## వాపులు - వ్రణములు

శరీరములోని ధాతువులకు తాపము కలిగినపుడు ఆ ధాతువులు జరుపు ప్రతిక్రియ యొక్క పరిణామమే వాపులు, వ్రణములు. ధాతువులకు తాపము కలిగించు కారణములు ప్రధానముగా రెండురకములు (1) జీవము (2) నిర్జీవము అని. రోగములను కలిగించుజీవులు జీవకారణములలో ప్రధానమైనవి. నిర్జీవకారణములలో భౌతికము, రాసాయనికము అనిరెండురకములు. వాపులకు వ్రణములకు శరీరముపై ఒత్తిడి గాయములద్వారా బయటివస్తువులు శరీరములో దూరుట, అత్యుష్ణము, అతిశీతలత్వము, విద్యుత్ ఘాతము, కిరణకాంతి ప్రసారము ఎక్సురే మొదలగు శక్తితరంగముల తాకిడి భౌతికకారణములలో ప్రధానమైనవి. ఆమ్లములు, క్షారములు, విషపదార్థములు వీటిస్పర్శ రాసాయనిక కారణములలో ముఖ్యమైనవి.

ఈ వివిధ కారణములవలన శరీరములోని ధాతువులకు కలుగు తాపమునకు వ్యతిరేకముగా ప్రతిక్రియ రెండు విధములతో జరుగును. తాపకారణములను నశింపజేసి బయటకు త్రోసివేయుట మొదటిది. తాపకారణమువలన కలుగు నష్టమును భర్తీచేసి ధాతువుల పునర్నిర్మాణమును జరుపుట రెండవది. శరీరధాతువులు జరుపు ప్రతిక్రియయు ప్రధానముగా రక్తప్రసారములోవచ్చు మార్పులద్వారా ఘటిల్లును. రక్తనాళములు ప్రత్యేకముగా ధమనులు కేశనాళికలు వ్యాకోచముచెంది పెద్దవగుట మొదట జరుగును. అంతకు ముందు ముడుచుకొనియున్న అనేక కేశనాళికలు విప్పారి రక్తప్రసారము అనేకరెట్లుగా విస్తరించును. ఇందువలన తాపమునకు గురియైన శరీరభాగము ఎఱ్ఱబడుట వెచ్చబడుట సంభవించును. రక్తనాళములనుండి బయటకు కారెడి కణపూరిత ప్లాస్మా ద్రవమువలన వాపు ఏర్పడును. ఇందుచే ధాతువులలోని చిన్ననాడులపై జరుగు వత్తిడివలన నొప్పి కలుగును. ధాతువులలో జరుగు విచ్ఛిత్తివలన ధాతువ్యాపారము కొంతవరకు కుంటుపడును.

రక్తనాళముల వ్యాకోచమువలన రక్తప్రసార వేగము తగ్గును. ఇందువలన అంతకుముందున్న రక్తప్రసారపు తీరులో మార్పు ఘటిల్లును. మామూలు పరిస్థితులయందు రక్తనాళములమధ్యలో కణములును అంచులలో ప్లాస్మా ద్రవమును ప్రవహించుచుండును. రక్తప్రసారవేగము తగ్గినపుడు రక్తములోని తెల్లకణములు అంచునకు జరిగి రక్తనాళముల గోడకు అంటుకొనియుండును. క్రమేణా వ్యాకోచముచెందిన రక్తనాళముల గోడలసందునుంచి తెల్లకణములు తమ ప్రత్యేక చలనశక్తివలన సందుచేసికొని బయటకు జారును. ఇట్లు బయటపడిన తెల్లకణములు రోగమును కలిగించు సూక్ష్మజీవులపై దాడిచేసి చుట్టుముట్టి వాటిని కబళించును. ఈ రసములవలన సూక్ష్మజీవుల విషములను విరిచివేసి సూక్ష్మజీవులను విచ్ఛిన్నముచేసి వాటిని కబళించును. ఈపోరాటములో అనేక తెల్లకణములు నిర్మూలమగుటకూడ జరుగును. ఈ పోరాటముతర్వాత సూక్ష్మజీవులయొక్క, తెల్లకణములయొక్క మృతకళేబరములను, ధాతువిచ్ఛిత్తివలన ఏర్పడు మాలిన్యమును తొలగించుటకు ధాతువులలోని [illegible] కణ

ములు పూయముకొని మాలిన్యమును తొలగించు ఆరోగ్యసబ్బంది వలె పనిచేయును తాపమునకు గురియై విచ్ఛిత్తిచెందిన ధాతువుల పునర్నిర్మాణమునకై ఆ ధాతుకణములు పెంపు చెంది విభాజ్యమై జరిగిన నష్టమును భర్తీచేయును చీముకు కారణమగు సూక్ష్మజీవులపై తెల్లకణములు ఎక్కువగా హతమై విధ్వంసము జరిగినపుడు చీముఏర్పడి కురుపుతేలుట అది పెద్దదై చిట్లి చీము కాలువగా బయటికి ప్రవహించుట జరుగును తాపకారణముల స్వభావమునుబట్టి ధాతువులకు జరుగునష్టము తీవ్రముగా నుండును ధాతుతాపము తీవ్రమై రక్తప్రసార వేగము బాగుగా తగ్గినపుడు రక్తనాళములలో రక్తము గడ్డకట్టి రక్తప్రసారము కుంటుపడి ధాతువిశ్లేషణము జరిగి పెద్దపెద్ద వ్రణములు ఏర్పడును ఒక్కొక్కప్పుడు ధాతుతాపము చిరకాలము సాగినయెడల మానుపట్టని మొండిగాయములు వ్రణములు ఏర్పడును

మనముచూచు వ్రణములు దెబ్బలు గాయములవలన గాని సూక్ష్మజీవులవలనగాని రక్తప్రసార నిరోధమువలనగాని నిష్ప్రయోజనకరమగు ధాతువిస్తరణచే ఘటిల్లు పుట్టకురుపు (కేన్సర్) మొదలగు వ్యాధులవలనగాని ఏర్పడవచ్చును అందువలన ఈ వ్రణములు సామాన్యరూపములలోను విషమ రూపములోను ఉండవచ్చును మధుమేహము ధాతుక్షయము కుష్ఠు మొదలగు వ్యాధులవలన ఎంతకాలమునకుకూడ మాను పట్టని మొండివ్రణములుకూడ ఏర్పడవచ్చును పుట్టకురుపు వలన ఏర్పడు విషవ్రణములు ప్రాణ ప్రమాదమునకు దారి తీయును అందువలన వాపులు - వ్రణములు ఏ తరగతికి చెందినవో సకాలములో నిర్ధారణచేసి వాటికి తగిన చికిత్స చేయ కొనుట అవసరము

ఉ వెం కా

## వాయుగుండములు - సుడిగాలులు

అల్పపీడన ప్రదేశములందలి తేమగాలులు పైకి పోయి మేఘములుగా మారి నీటిబిందువులు అందేర్పడును వర్షములు వాతావరణసంబంధమైన మార్పులు ఇట్లేర్పడుటవలన ఆయా ప్రాంతముల వాతావరణ స్థితిగతులను తెలిసికొనవలెనన్నచో అచ్చటి గాలియొక్క గుణవిశేషములను - అనగా తేమ ఉష్ణము లకు సంబంధించిన వివరములను తెలిసికొనుట అవసరము కావున వాతావరణశాస్త్రములో వాయుసముదాయము (air mass) అను పదమునకు ప్రత్యేకార్థ మేర్పడినది

వాయుసముదాయము ఉష్ణోగ్రత తేమ ఏకరీతిగా నుండు ప్రదేశముల పై పవనము కొంతకాలము వీచినచో ఆ పవనము ఆప్రదేశముల లక్షణమును గ్రహించును ఏకరీతి ఉష్ణోగ్రత తేమ గల్గిన వాయు సముదాయములు ముఖ్యముగా ప్రతిచక్రవాత ప్రదేశములందేర్పడును అట్లె అత్యుష్ణమండల మగు భూమధ్య రేఖ ప్రాంతమందు గూడ వాయుసముదాయము లేర్పడును భూతలముపై ఏర్పడు ఈ వాయు సముదాయములు ఖండాంతర వాయు సముదాయము లనబడును సముద్ర తీరములలో ఏర్పడు వాయుసముదయములు సముద్ర వాయుసముదయము లనబడుచున్నవి భూతలముపై ఏర్పడు వాయు సముదాయములు పొడిగా నుండును తీర ప్రాంతములో ఏర్పడు వాయు సముదాయములు శీతలవాయు సముదాయము లనబడును భూమధ్యరేఖ ప్రాంతములందును సమశీతోష్ణ మండలము లందును ఏర్పడు వాయు సముదాయములు శీతలవాయు సముదాయము కంటె అధిక ఉష్ణోగ్రత కల్గి యుండుటచే వాటినిఉష్ణవాయు సముదాయము లందురు వాయు సముదాయము లేర్పడు స్థానమునుండి ఇతర ప్రాంతములపై వీచు గాలులు ఆ ప్రాంతపు శీతోష్ణస్థితిని గ్రహించి కొంత మార్పునకు లోనగును శీతల వాయు సముదాయములనుండి ఉష్ణమండలము మీదికి వీచిన గాలులు ఆంధ్రదేశము యొక్క ఉష్ణోగ్రతను గ్రహించును అట్లే ఉష్ణవాయు సముదాయముల నుండి శీతల ప్రాంతముపైకి వీచు గాలులు ఆ ప్రదేశమందలి తేమను గ్రహించును కాని ఈశీతల ఉష్ణ వాయు సముదాయములు కొంతవరకు తమ సహజలక్షణములను కల్గియుండును ఈ రెండురకముల వాయు సముదాయములు కలిసి కొను భూమ్యుపరితలము వాయుసంధి (air front) అనబడును ఇట్టి సంధులు వాతావరణమునందు మార్పులు కలుగజేయుటలో ప్రధానపాత్ర వహించును

**వాయుగుండములు - సుడిగాలులు** సమభార రేఖలను బట్టి అధిక పీడన ప్రాంతములను గుర్తింపవచ్చును అధిక అల్ప పీడన మండలములు భూగోళముపై అక్షాంశ, రేఖాంశముల వద్ద కానవగును అల్పపీడన మండలములు రెండు విధములు నుండును (1) పశ్చిమము నుండి వీచు పవనములచే 20-50 డిగ్రీల అక్షాంశముల మధ్య ఏర్పడునవి దీనిని సమ శీతోష్ణ మండలమందురు (2)0-20 డిగ్రీల అక్షాంశముల నడిమిప్రాంతములో తూర్పు నుండి వీచు పవనములచే ఏర్పడునవి, ఈ

ప్రాంతము ఉష్ణమండలమునందును సమశీతోష్ణ మండల మందలి గాలులు గంటకు 20—40 కిలోమీటర్ల వేగముతో పడమర నుండి తూర్పునకు పయనించును. ఉష్ణమండలమందలి గాలులు 10—25 కిలోమీటర్ల వేగముతో తూర్పు నుండి పడమరకు పయనించును. ఉష్ణమండల విధానములకును సమశీతోష్ణ మండల విధానములకును గల ముఖ్య భేదమేమనగా మొదటి వానియందు వాయుసముదాయములు అందేర్పడును అనగా రెండు శీతల వాయుసముదాయములుగాని రెండు ఉష్ణవాయుసముదాయములు గాని కలియుచోట అవి ఏర్పడును. కాని సమశీతోష్ణ మండల విధానములు పై చెప్పిన వాయుసంధుల వద్ద ఉత్పత్తి యగును. కావున సమశీతోష్ణమండల విధానములు వాయుసంధుల విధానము లనియు గూడ పిలువబడుచున్నవి.

**సమశీతోష్ణ మండల మందలి వాయుగుండములు సుడిగాలులు**

భూగోళమందు ముఖ్యముగా పేర్కొనదగిన వాయుసంధులు రెండు. వీటిని ధ్రువసంధు (polar fronts) లనెదరు. మొదటిది ఉత్తరార్ధగోళమందును రెండవది దక్షిణార్ధ గోళమందును ఏర్పడును. భూమధ్య రేఖ సమీపమున నున్న అక్షాంశము నుండి వీచు పశ్చిమ పవనములు వెచ్చదనమును ధ్రువప్రాంతము నుండి వీచుపవనములు చల్లదనమును తమతో కొని వచ్చుటచే ఈ వాయుసంధులందు వివిధ ప్రాంతములలో వివిధరకముల ఉష్ణోగ్రతలు- అనగా ఉష్ణపాతము లేర్పడును.

ధ్రువ ప్రాంతపు వాయు సంధులు ఒక చోటినుండి మరియొక చోటికి గాలితో పాటు పయనించుచుండును. అవి ఇంచుమించు భూగోళమం దన్నిప్రాంతములకు ప్రయాణము చేయును. సాధారణముగా 50 డిగ్రీల ఉత్తర లేక దక్షిణ అక్షాంశముల ప్రాంతములందు వీటి స్థానమును గుర్తింపవచ్చును. కాలమును బట్టి అప్పుడప్పుడు వీటిస్థానములు మారుచుండును. శీతాకాలమునందలి భూమధ్య రేఖ వైపునకు 5 లేక 10 డిగ్రీల వరకు కదలును.

సమశీతోష్ణ అల్పపీడన విధానములు సాధారణముగా ధ్రువప్రాంతపు వాయుసంధులందేర్పడును. సంధియొక్క మధ్య ప్రాంతము నుండి ఒక అల ఆరంభమై అచ్చటిగాలుల స్థిరత్వమును కోల్పోవును. ఈ అల రాను రాను పెద్దదై చాలదూరము వ్యాపించి ఒక స్థలము నుండి వేరొక స్థలము వరకు గాలిలో పయనించును. క్రమముగా దానివేగము హెచ్చును. ఇట్లు చిన్నదిగా ఆరంభమై పైపైకి పెద్దదగు సమశీతోష్ణ అల్పపీడన కేంద్రములుగా [illegible] [illegible] సిద్ధాంతము నిర్ణయము [illegible] [illegible] ఉద్భవించి మొదలుగునది [illegible] సిద్ధాంతమును నార్వేయను వాతావరణ శాస్త్రవేత్తచే ప్రతిపాదింపబడినది.

**సమశీతోష్ణమండల తుపానుల జీవిత చక్రము**

మొట్టమొదట రేఖతో కూడిన పశ్చిమ పవనములు సంధియొక్క దక్షిణభాగమునను చల్లని ధ్రువప్రాంతములపై వీచు తూర్పుపవనములు సంధియొక్క ఉత్తరభాగమునను ఉండును. ఈ పవనములు సంధికి ఇరుప్రక్కల సమాంతరమున నుండుటచే అవి స్థిరముగనుండును. సమభార రేఖలు కూడ సంధికి సమాంతరముగనే యుండును. క్రమముగా సంధియందు చలనము కల్గుటచే చిన్నఅల ఏర్పడును. ఇట్లేర్పడు అలయొక్క ఉపరిభాగమున అల్పపీడన ప్రదేశమేర్పడును. ఈ ప్రదేశముచుట్టును గాలులు గుండ్రముగతిరుగును. ఈ గాలులచే ఆవరింపబడిన అల్పపీడన ప్రదేశము సంధికి లంబముగనుండును. ఇట్లేర్పడిన దానిని మహాచక్రవాతమందురు. ఈ మహాచక్రవాతము పవనముల మధ్య ఇమిడి యుండుటచే ఆపవనముల వేగముతోపాటు అదికూడ ఒక ప్రాంతమునుండి మరొక ప్రాంతమునకు పయనించును. క్రమముగా దాని వేగము హెచ్చి తుదకు అది తుపానుగా ఏర్పడును. శీతల ప్రాంతములందు సమభార రేఖలు వక్రముగను ఉష్ణప్రాంతములందు సరళముగను ఉండును. a b లకు మధ్యగల సంధి ఒకప్రాంతమునుండి మరియొకవైపునకు పోవునపుడు వెచ్చనిగాలులు ఇంతకు ముందు చల్లనిగాలులు గల ప్రదేశమునాక్రమించును. కావున వీటిని ఉష్ణసంధులందురు. అట్లే b c లకు మధ్యగల సంధి ఒక ప్రాంతమునుండి మరియొక ప్రాంతమునకు జరుగునపుడు ఇంతకుముందు వెచ్చనిగాలులచే ఆవరింపబడిన ప్రదేశమును చల్లని గాలులు ఆక్రమించును. కావున వీటిని శీతలసంధులందురు. ఉష్ణ సంధులు తూర్పువైపునకు ఏటవాలుగా వంగియుండును. 6కిలోమీటర్ల ఎత్తునుండికూడ వీటిని గుర్తింపవచ్చును. తేమతో గూడిన వెచ్చనిగాలులు సంధి వెంబడి వీచునపుడు ఆ ప్రాంతములో దట్టమైన మేఘము లేర్పడును. కావున ఉష్ణసంధి సమీపించిన ప్రాంతములలో మొదట పలుచని తెల్ల మేఘములు తరువాత దట్టమైన తెల్ల మేఘములు ఏర్పడును. పిమ్మట ఎత్తుగా దట్టమైన మేఘములును, అనంతరము కారుమేఘములు

లును అటుతర్వాత నీలిమేఘములును ఏర్పడును తర్వాత చల్లని జల్లులు ఆరంభమై క్రమముగా ఎక్కువగును సంధి ఒక ప్రాంతము నుండి మరొక ప్రాంతమునకు కదలునపుడు ఒక్కొక్కప్పుడు కుంభ వృష్టికూడకల్గును

శీతలవాయు సంధి రెండవపటములో చూపబడినవిధముగనుండును శీతల వాయువులు వెచ్చనిగాలులను దూసుకొనిపోయి వాటిని పైకి ఎగదన్నును అప్పుడు దట్టమైన కారు మేఘములేర్పడును అందుచే శీతలసంధి పయనించుస్థలములలో మెరుపులతో కూడిన తుఫానులు కుంభ వృష్టియు కల్గును కాని వాతావరణములో కల్గు ఈ మార్పు కొంది కాలము మాత్రమే ఉండి ఎప్పటి ఆకాశమంతయు నిర్మలముగ నుండును

సాధారణముగా శీతలవాయుసంధి ఉష్ణవాయుసంధికంటె ఎక్కువ వేగముతో పయనించుటచే అది ఉష్ణసంధిని అతిక్రమించి వెచ్చని గాలులను పైకినెట్టును వాయువిలీనము ఇందువలననే ఏర్పడును వాయుసంధి యందు మొదట ఏర్పడు అల యొక్క ఉపరి భాగమునుండి తుఫాను ఆరంభమై క్రమముగా దక్షిణమునకు తగ్గుచువచ్చును తేమతోకూడిన వెచ్చనిగాలులు లభింపనపుడు తుఫాను క్రమముగా అణగిపోవును సాధారణముగా సమశీతోష్ణ మండలపు సుడిగుండములు వాయుసంధి వద్ద ఏర్పడినను అప్పుడప్పుడు సంధిలేనప్పుడుకూడ అవి ఘటిల్లవచ్చును వాయుసంధులతోకూడిన సుడిగాలులు భారతదేశమునందు రావు కాని వీటిలో బలహీనమైన రకములు భారతదేశపు ఉత్తర భాగమున శీతాకాలములో పడమరనుండి తూర్పునకు పయనించును వీటిని పశ్చిమ సంచలనము (western disturbances)లనియెదురు ఇవి ఉత్తర భారతమునందు పంటభూములకు పుష్కలముగా వర్షమును కల్గించును ఉత్తరము నుండి వచ్చు గాలులు తమతో చల్లదనమును తెచ్చిశీతలవాయు స్థితిని ఏర్పరచును

ఉష్ణ మండలతుఫానులు—సుడిగుండములు ఉష్ణమండలపు తుఫానులు మిక్కిలి ఉధృత మైనవగుటచే అవి విపరీతమైన నష్టమును కలుగజేయును వీటినిగూర్చి క్షుణ్ణముగా పరిశోధనములు సల్పిన పెడ్రీపెడ్డింగ్టన్ వాటివిర్మాణమును గురించియు చలనమునుగూర్చియువెల్లడిచేసెను ఇతడు వ్రాసిన సెయిలర్స్ హాండ్ బుక్ అను గ్రంథమునందు తుఫానులు తీసుకొనవలసిన జాగ్రత్తలను వివరించినాడు

సుడిగుండములని చెప్పబడు తుఫానులు వెచ్చనిగాలులు గల సముద్ర ప్రాంతములలో ఏర్పడును భూగోళమునందివి ముఖ్యముగా ఏర్పడు స్థలములు 4 వ పటమునందు చూపబడినవి ఈ తుఫానులు ఉత్తర దక్షిణార్ధగోళములందు తరచుగా వేసవికాలములో పుట్టుచుండును కాని బంగాళాఖాతమందును అరేబియాసముద్రమందును వసంత ఋతువులోను ఆకురాలు కాలములోను తరచుగా కల్గుచుండును ఈ ఈ రెండు కాలములందేర్పడు సైక్లోనిక్ స్టారమ్స్ అనియు పశ్చిమ అట్లాంటిక్ సముద్రమందేర్పడు వాటిని హరికేన్స్ అనియు పశ్చిమ పసిఫిక్ మహాసముద్రము నందేర్పడు వాటిని టైఫూన్స్ అనియు వివిధ నామములతో పిలువబడుచున్నవి ఈ తుఫానులు తూర్పుదిశనుండి వీచు పవనములలో ఇమిడియుండి పడమరదిక్కుగా పయనించును అవి మార్గమధ్యమున భూమిని ఎదుర్కొన్నచో తత్ఫలితముగా కలుగు రాపిడిచేతను తేమ సరఫరా ఆగిపోవుటచేతను వాటి ఉధృతను తగ్గును కాని భూమిని తాకక పూర్వము ఉష్ణమండలపు ప్రతిచక్రవాతపు గాలులయొక్క పశ్చిమ గమన దిశకు అవి వచ్చినయెడల మొదట ఉత్తరముగను పిదప తూర్పుగను నెట్టబడి ఈశాన్యముగా పయనించును

ఉష్ణమండలపు తుఫానులేర్పడు ప్రాంతములలో సమభార రేఖలు ఇంచుమించు వర్తులముగనుండును కేంద్రమువద్ద పీడనశక్తి హెచ్చుగానుండుటయే ఇందుకు కారణము ఉధృతమగు తుఫానులందు కేంద్రము వద్ద వాయుపీడనము సగటున 50-60 మిల్లిబారులకు తక్కువగా నుండును కాని సాధారణముగా అంత ఎక్కువ పీడనపాతముండదు అనగా సుమారు 15-20 మిల్లి బారులు మాత్రముండును గాలులు కేంద్రము చుట్టును వలయాకారముగ వీచుచుండును కేంద్రము వద్ద వాటి వేగము హెచ్చును ఉధృతమైన తుఫానులందు కేంద్రము నావరించి కేంద్రమునకు సమీపముగనుండు గాలుల వేగము మిక్కిలి హెచ్చుగానుండును 1942 లో వంగరాష్ట్రి మందలి మిడ్నపూరులో ఏర్పడిన తుఫాను యొక్క గాలి వేగము 120 నాట్స్ (Knots = దూరమును తెలుపు పాశ్చాత్యమానము) వరకుండినట్లు గణింపబడినది రామేశ్వరమునందు 1964 లో ఘటిల్లిన తుఫాను వేగము 120-150 నాట్స్ వరకుండెను కాని ఇట్టి తుఫానులు అరుదుగ మాత్రమే సంభవించును భారతదేశములో సంభవించు




ఘటము - 2 ఆసన్న సమశీతోష్ణమండలపు తుఫాను యొక్క ప్రాక్పశ్చిమ ఊర్ధ్వ మధ్యచ్ఛేదము.




పటము - 8. స్వయంలీన సమశీతోష్ణమండలమందలి తుఫానుయొక్క ప్రాక్పశ్చిమ ఊర్ధ్వమధ్యచ్ఛేదము




పటము - 4 ప్రపంచమున వివిధప్రాంతములలో ఉష్ణమండల తుఫానులు బయలుదేరు స్థానములు అవి పయనించు ముఖ్యమార్గములు




పటము – ౬. ఋతుపవన వాయుగుండములు సామాన్యముగా పయనించు మార్గములు




పటము-1 ఐసోబార్లు సమభార రేఖలు సూటిగా ఉన్నప్పుడు పీడనపాతశక్తి ( $P_g$ యొక్క కొరియోలిస్ శక్తి $C_o$ యొక్క ప్రభావముక్రింద నుండు వాయుచలన సమతూకస్థితి H అధికపీడనమును, L అల్పపీడ మును సూచించును $P P_2$ అనునవి ఐసోబార్లు ఏకరేఖా బాణములు పైచెప్పిన శక్తులు పనిచేయు దిక్కును సూచించును (వ్యాసము 107 వ పుటలో చూడుడు)




పటము-2 పీడనపాత, కొరియోలిస్ మధ్యాపగామి ($C_F$) శక్తులచే ప్రభావితమగు వాయుచలన సమతూకస్థితి.
(తక్కినవి పై 1 వ పటములో వలెనే).

## వాయుపీడన విధానములు

చక్రవాతము ప్రతిచక్రవాతము




పటము–3 వలయాకార సమభార రేఖావిధానము — వలయాకారముగ చుట్టబడిన రేఖలు సమభార రేఖలనబడును; వాటి మధ్యనున్న బాణములు వాయువుల ప్రసారదిశను సూచించును

అధోముఖవక్రము ఊర్ధ్వముఖవక్రము




పటము–4 అధోముఖ సమభార రేఖలు; ఊర్ధ్వముఖ సమభార రేఖలు; అవిచ్ఛిన్న రేఖలు సమభార రేఖలనబడును. వాటి మధ్యనున్న బాణముల గుర్తులు వాయువుల ప్రసారదిశను సూచించును. — — — అను రేఖ అధోముఖ సమభార రేఖయొక్క ఇరుసును ———— అను రేఖ ఊర్ధ్వముఖ సమభార రేఖయొక్క ఇరుసును సూచించును




పటము - ౬ సముద్రవాయుప్రసార విధానము




పటము - ౭ అవరోహణ (Anabatic) వాయుప్రసార విధానము

తుఫాను వాయువుల వేగము 60-70 నాట్స్‌ను మించియుం డదు. తుఫాను యొక్క విస్తీర్ణ ప్రదేశ వ్యాసార్ధము వందలకొలది మీటర్లుండు గమున్నను కేంద్రమువద్ద అత్యధిక వేగముతో వీచు వాయువులు 100 కిలోమీటర్ల దూరము కంటె ఎక్కువగ ఆక్రమించవు. ఉష్ణ ప్రాంతములపై పయనించు దూరము ఎక్కువగుటచే భారతదేశములో సంభవించు తుఫానులకంటె హరికేనులు టైఫూనులు ఉధృతముగానుండును. ఇందు 100 నాట్ల వేగముగల గాలులు వీచుచుండిన తుఫానులు సాధారణముగా సంభవించుచునే యుండును. 170 నాట్ల వేగముగల గాలులలో తుఫానులు కూడ కొన్ని తావుల సంభవించినట్లు రికార్డుచేయబడియున్నది. ఉధృతముగ నుండు తుఫానుల కేంద్ర భాగములు అల్పపీడనశక్తిగల వాయువులచే ఆవరింపబడి మేఘాచ్ఛాదితములు కాక నిర్మలముగనుండును. కావున తుఫానుయొక్క కేంద్ర భాగము పయనించు ప్రదేశమునందు భారీ వర్షములుగాని ఉధృతమగు వాయువుల ఒత్తిడిగాని ఉండవు. కాని ఈ కేంద్ర భాగము దాటిన తరువాత మాత్రము భారీ వర్షములు ఘటిల్లును. ఈ తుఫానునాభి (Eye of the storm) యొక్క పరిమాణము తుఫాను పరిమాణమునుబట్టి యుండును. సాధారణముగ ఈ నాభి యొక్క వ్యాసము సుమారు 20 కిలోమీటర్లుండును. ఈ తుఫాను గాలులు కల్గించు నష్టము గణనీయముగ నుండును. కాని అంతకంటె అధిక తరముగా జరుగు విధ్వంసము తుఫాను సంభవించిన తరువాత ఘటిల్లు వరదలవలన ఏర్పడును. లోతట్టములో నుండు తావులలో తుఫాను సంభవించిన ఎడల తత్ఫలితముగా వరదలు కూడ ఘటిల్లును. ఇవి ఘటిల్లు ప్రాంతములలో రోజుకు సుమారు 20-30 సెంటిమీటర్ల వర్షము సామాన్యముగ కురియుచుం డును. ఉదాహరణమునకు జమైకా ప్రాంతమందలి సిల్వర్ హిల్ అను పర్వత పరిసరములలో 1901 లో తుఫాను సంభవించిన ఎడల నాల్గురోజులు వరుసగా 250 సెంటిమీటర్ల వర్షము కురిసినట్లు నమోదుచేయబడినది. ఈ తుఫానులతో పాటు తుఫాను తరంగములు ఉవ్వెత్తుగా లేచి భీభత్సము గల్గించెనట. ఇవి సాధారణముగా తీర ప్రాంతములలో ఏర్పడును. నూటికి 90 వంతులు జననష్టము వీటివలననే కల్గుచుం డును. 1737 లో హుగ్లీనది వద్ద సంభవించిన తుఫాను ఫలితముగా 40 అడుగుల ఎత్తున తరంగములేర్పడి మూడు లక్షల జనులు మరణించిరి. 1864 లో ఆ ప్రాంతమునందే మరి యొక తుఫాను సంభవించి 60 వేలమంది ప్రజలు మరణించిరి. ఆ సంవత్సరమునందే మచిలీపట్నమునందు సంభవించిన తుఫాను సందర్భమున 60 వేలమంది ప్రజలు మరణించిరి. 1789 లో గోదావరి జిల్లాలోని ఒక ప్రాంతమున ఘటిల్లిన తుఫాను ఫలితముగా 20 వేల జననష్టము సంభవించెను. ఎబది సంవత్సరముల తరువాత ఆ ప్రదేశమునందే అట్టి విపత్తు సంభవించెను. మిడ్నపూరులో సంభవించిన తుఫాను ఈ శతాబ్దములో ఘటిల్లిన తుఫానులన్నిటికంటె తీవ్రతరమైనదని చెప్పవచ్చును.

లోతు తక్కువగా ఉన్న తీర ప్రాంతములందు సముద్ర తరంగములు ఎక్కువస్థాయిలోనుండును. లోతుప్రాంతములో అంతకంటె ఉగ్రముగానుండును. కాని తుఫానువాయువులు వీచుకాలమున లోతు తక్కువగానున్న తీరప్రాంతములందు కూడ తరంగముల తీవ్రత హెచ్చుగానుండును. 80నాట్స్‌కంటె ఎక్కువ వేగముతో పయనించు గాలులు తుఫాను తరంగములేర్పడుటకు తోడ్పడును. గోదావరి కృష్ణ డెల్టాల తీర ప్రాంతములు పాక్ అఖాతము ఈరకమునకు చెందినవి.

ఋతుపవన సుడిగుండములు: ఉత్తరమునుండి వీచుచల్లని గాలులను దక్షిణమునుండి ఉత్తరమునకు పయనించు తేమతోకూడిన వేడివాయువులును కలియుటవలన ఏర్పడు సంధి వలననే సుడిగుండములేర్పడును. ఈ సంధిరేఖ వేసవిలో ఉత్తరముగా పయనించును. ఈ రేఖ అరేబియా ఇరాన్ పశ్చిమ పాకిస్తానులద్వారా పయనించి బంగాళాఖాతము మీదిగా దక్షిణ బర్మాలోనికి సాగిపోవును. అందువలన సముద్రప్రాంతములో తీవ్రమైన వాయుగుండములు ఉత్పన్నము కాజాలవు. అల్పస్థాయికి చెందిన వాయుగుండములు మాత్రము బంగాళాఖాతముయొక్క ఉత్తరభాగము నందేర్పడి పశ్చిమ దిశగా పయనించుచుండును. వీటివలన దేశమధ్యభాగమునకు అధికతరమగు వర్షములు కలుగుచుండును. ఈ వాయుగుండములు కొన్ని వాయవ్య భాగములోని అల్పపీడన ప్రాంతములో లీనమైపోవును; మరికొన్ని ఉత్తరముగా పయనించి హిమాలయ ప్రాంతమున అధికవర్షములు కలుగజేయును. ఇవిపయనించు మార్గములను ఈ పటములో చూడవచ్చును.

ఎస్. ఎస్. ఝా

## వాయుద్రవీకరణము

భౌతిక విజ్ఞానశాస్త్రముల చరిత్రయందు వాయుద్రవీకరణమొక రసవత్తరమైన ఘట్టము. ఈ కృషిలో ఫారడే అను శాస్త్రజ్ఞుడు "V" ఆకారపు గొట్టములో ఒకవైపు క్లోరీను వాయువును తయారుచేసి మరొకవైపు మంచుగడ్డను ఉప్పుతో కలిపి హిమశైత్యమును మించెడి శైత్యస్థితిని కల్పించి 1823 లో ద్రవీకరించెను. అప్పుడు క్లోరీను పసిమిరంగుగల ద్రవరూపమును లభించెను. ఆ తర్వాత 1834 లో థైలోరియరు అను శాస్త్రవేత్త కార్బనుడయాక్సైడు వాయువును బాగుగా అదిమి ద్రవీకరించెను. అతిసులభముగా దానిని ఘనీభవించినట్లొనర్ప వచ్చుననియు ఈథరు కార్బనుడయాక్సైడుల మిశ్రమముతో హిమశైత్యముకంటె నూరు నూట పది డిగ్రీల తక్కువ శైత్యస్థితి లభించుననియు స్పష్టమయ్యెను. అది థైలోరియరు మిశ్రమమను పేర బరగుచు ఇతర వాయువులను ద్రవీకరించుటలో తోడ్పడెను. ఫారడే దాని నుపయోగించి ఎథిలీను ఫాస్ఫీను హైడ్రోజని బ్రోమైడులను ద్రవీకరించి అమ్మోనియా నైట్రస్ ఆక్సైడులను ద్రవీకరించుటయే కాక ఘనీభవించునట్లుకూడ చేయగల్గెను. కాని హైడ్రోజని

చిత్రము - 87




పటము - 1

ఆక్సిజని నైట్రోజని నైట్రిక్ ఆక్సైడు కార్బను మొనాక్సైడు వాయువులను ద్రవీకరించుట ఫారడేకు సాధ్యము కాదయ్యెను. వాటికి వాయురూపము శాశ్వతమైన లక్షణమై యుండవచ్చునను అభిప్రాయము శాస్త్రవేత్తలకు కల్గెను. 1869 లో ఆండ్రూస్ అను శాస్త్రవేత్త వాయుపదార్థముల సంకటస్థితిని వివరించి వాటిని ఒత్తిడి మూలమున ద్రవీకరించుటకు ముందుగా సంకట శైత్యస్థితివరకు వాటిని చల్లబరచుట ముఖ్యమని నిర్ణయించువరకు మరొక అడుగైన ముందుకు పడలేదు.

ఆండ్రూస్ పరిశోధనలే 19వ శతాబ్ది ఉత్తరార్థములో శాస్త్రవేత్తలు సాధించిన విజయములకు పునాదులయ్యెను. 1877లో కెయిలెటెట్ పిక్టెట్ అనువారు ఆక్సిజనిని ద్రవీకరించిరి. వారు సలసల మరుగుచున్న సల్ఫరుడయాక్సైడుతో -10°C ఆక్సిజనిని చల్లార్చి 300 వాతావరణ పీడనముల ఒత్తిడిని కల్పించి ఒత్తుచు అది మరింత చల్లబడునట్లు (-118.8°C వరకు) హఠాత్తుగా ఒత్తిడిని తగ్గించుచు ఆక్సిజని ద్రవీకరణమును సుసాధ్యమొనరిచిరి. ఆక్సిజనితోపాటు నైట్రోజనిని గాలినికూడ ఆశాస్త్రవేత్తలు ద్రవీకరించిరి. వెనువెంటనే 1883లో పోలిష్ శాస్త్రవేత్తలైన రోబ్లూస్కీ ఒల్జూస్కీ అనువారు తాము ద్రవీకరింపనెంచిన వాయువును బాగుగా అదుముచు అప్పుడే ఎథిలీను ద్రవముతో చల్లార్చి అది మరగునట్లును వాయుపదార్థపు ఒత్తిడి తగ్గునట్లును చేసి 130°C శైత్యస్థితిని సాధించిరి. ఆ శైత్యస్థితిలో 20 వాతావరణముల ప్రమాణపు ఒత్తిడితో ఆక్సిజని ద్రవమయ్యెను. తర్వాత ఆ ఆక్సిజని ద్రవమును ప్రయోగించినపుడు -200°C శైత్యస్థితి లభించెను. ఈ రీతిగా హైడ్రోజని వాయువును ద్రవీకరించినపుడు కొలదిపాటి ద్రవము లభించెను.

చిత్రము - 88




పటము - 2

1895 లో జర్మనీయందు లిండే ఇంగ్లండునందు హాంప్సన్ అను శాస్త్రవేత్తలు ఒకరితోనొకరు సంబంధములేకయే గాలిని విరివిగా ద్రవీకరించెడి పరిశ్రమను తీర్చిదిద్దిరి. 1900 లో డ్

అనుసారగ వాయువును ప్రవీకరణమొనర్చు ప్రత్యేకమైన ఉపకరణమును రూపొందించెను. ఆ సాధనముతో గాలిని సంపీడన వాతావరణముల ఒత్తిడి శక్తి క్రియయందునకు అదిమి దానిని ఒక తిరుగుడుచక్రము (flywheel) మీదికి ప్రసరించునట్లు చేయుదురు. అందువలన ఆ గాలి తిరుగుచుండిన గాలిలో నుండు శక్తిని వినియోగించుకొని కొంత చల్లబడునట్లు చేయును. తరువాత ఒక సన్నని గొట్టముగుండా దానిని వ్యాకోచము నొందునట్లు చేసి మరింత చల్లారునట్లు చేయుదురు. ఈ రీతిని బాగుగా చల్లారిన గాలిని యంత్ర సాధనములోని ప్రవేశించుగాలిని ప్రథమదశలోనే బాగుగా చల్లారునట్లు చేసి గంటకు లీటరు ద్రవమును తయారు చేయగల్గినారు. గాలిని అదుముటకు వారు విద్యుచ్ఛక్తిలో కొంత భాగము తిరిగి రాచేయుటకూడ సాధ్యమైనది. ద్రవీభవించిన గాలిని చల్లార్చి హైడ్రోజనిని హీలియమునుగూడ ద్రవీకరణ మొనర్చిరి. ద్రవమైన హైడ్రోజని - 252 78°C వేడిలో సలసల మరగును. హైడ్రోజని ద్రవమును దానితో చల్లార్చినపుడు - 259°C శైత్యస్థితిలో కరగి ద్రవమగుగట్టి మంచువంటి తెల్లని ఘన పదార్థమగు హైడ్రోజని లభించును. అతిశైత్యస్థితియందున్న వాయు ద్రవములను 'థెర్మోస్ ఫ్లాస్కు'లలో నింపి సేకరించుచున్నారు. విపరీతమైన శైత్యస్థితియందున్న పదార్థములలో మనకు పరిచితమైన లక్షణములు కన్పట్టవు. వాయుద్రవము తెలనీలిరంగులోనుండి పొగ మంచును కల్పించును. దానితో లభించు - 190°C శైత్యస్థితిలో సీసము రబ్బరుసాగినట్లు సాగును. రబ్బరు పెళుసెక్కి పొడియగును. పాదరసము ఘనీభవించి రేకుగా సాగగొట్టుటకు వీలగును. పండ్లు పూలు మాంసఖండములుగట్టిపడి కల్వములో నూరినప్పుడు చూర్ణమగును. ఒక కెటిల్‌లో వాయుద్రవమును గ్రహించి మంచుగడ్డపై ఉంచినపుడు అది సలసల మరగి ఆవిరిగా బయటికి వచ్చును. ఇట్టి విపరీత లక్షణములు గోచరించుటవలన అతి శైత్యస్థితి యందున్న పదార్థముల గుణశోధనకొరకై లెయిడెన్ నగరమునందు (హాలెండు) ఒక ప్రత్యేక పరిశోధనాలయములో నిరంతరకృషి కొనసాగుచున్నది.

హా. అ.

## వాయుపీడన విధానములు

ఒక ప్రదేశమునుండి మరియొక ప్రదేశమునకు వాయువుల వీచుటచే కల్గు మార్పులవలన ఋతువులును వాతావరణమును ఏర్పడుచుండును. స్థూలముగా గోళిక చక్రవిధ ఋతువులందు ఎక్కువ తక్కువ మండలములకు వీచుచుండునట్లు తెలియనగును. కాలానుగుణముగా వాయువులు వేర్వేరు దిక్కులనుండి వీచుచుండును. ఈ గాలులు ఋతుపవనములనబడును. భారతదేశమందు ఋతుపవనములు ముఖ్యముగా ఆగ్నేయ నైరృతి ఋతుపవనములమీద ఆధారపడి యున్నవి. తీరప్రాంతమునందు వీచు గాలులు ఋతుపవనములవలె కాక వేరు విధముగా నుండును. సాయంసమయమున సముద్రముపైనుండి వీచు చల్లని గాలులు మధ్యాహ్నపువేండి తీవ్రతను తగ్గించును. రాత్రులందు భూమిపైనుండి చల్లని గాలులు సముద్రముమీది వీచుచుండును. ఇవి స్థానిక పవనములనబడును. తీరప్రాంతమున వీచు అలలతోకూడి గాలులు ఉధృతముగ వీచి కల్పితముగ రెండు మూడు దినములవరకు భారీవర్షములు కురియును. ఇవి తుఫానులుగా గుర్తింపబడుచున్నవి.

**గాలులు మదిగాలులు**: భూమ్యుపరితలమునకు సమాంతరముగ వీచు గాలులు పవనములనబడుచున్నవి. పైకి వీచు గాలులు మదిగాలులనబడుచున్నవి. మదిగాలులవలన వాతావరణమునందు పెక్కు మార్పులు కల్గును. గాలులు ఊర్ధ్వముగ వీచుటచే ఉరుములు మెరుపులును అధోముఖముగ వీచుటచే నిర్మలాకాశము మంచును ఏర్పడును.

**వాతావరణాంతిక పటములు పీడన పద్ధతులు**: ఒకే కాలమున వేర్వేరు ప్రదేశములలో వాతావరణము పరిశీలింపబడును. ఇది అంతిక పరిశీలనమనబడును. వాతావరణ పటములు ఈ పరిశీలనములనుబట్టి తయారు చేయబడును. వీటి యందు గీయబడిన సమపీడన రేఖలు సమభార రేఖ (Isobars) లనబడును. ఇవి పటముయొక్క విస్తీర్ణము ననుసరించి కాక మిలీబారుల అంతరువులలో రెండు మూడు గీయబడును. వాతావరణ పటములు తయారగుటకు వాతావరణ పరిశీలన కార్యాలయములందు దినమునకు నాలుగైదు పర్యాయములు పరిశీలనములు కావింపబడును. సముద్రమట్టమునందు చేయబడు పరిశీలనముల వలన భూతలపటము ఏర్పడును. కాగా వాతావరణముయొక్క ఊర్ధ్వతలమందేర్పడు ఉష్ణోగ్రతలయొక్క తేమలయొక్క పరిశీలనమువలన ఊర్ధ్వవాయుతల పటము ఏర్పడును. కాగా వాతావరణము యొక్క ఊర్ధ్వతలమందేర్పడు ఉష్ణోగ్రతల యొక్క తేమల యొక్క పరిశీలనమువలన ఊర్ధ్వవాయుతల పటము ఏర్పడును. వీటి సహాయమున విశేష భూభాగముపైనుండు పీడన విధానములను పవనముల యొక్క రీ

రకముల మార్పులను కనుగొనవచ్చును

**వాయువులు - వాటికి పీడనపాతముతో సంబంధము.** వాతావరణ ముఖ్యాంశమును బట్టి గాలి అధికపీడన ప్రదేశమునుండి అల్పపీడన ప్రదేశమునకు సూటిగా వీచదు. పీడనపాతము (pressure gradient) నకు అది లంబదిశగా ప్రసరించును. ఈ గాలి వీచు విధానము బాయిస్ సిద్ధాంతము నందీవిధముగా తెలుపబడినది "ఉత్తరార్ధ గోళమునందొక పరిశీలకుడు గాలివాలుకు వెనుకట్టుగా నిల్చున్నచో అల్పపీడన వాయువులు అతని ఎడమభాగమునందును అధికపీడన వాయువులు అతని కుడివైపునందును వీచును. దీనికి వ్యతిరేకముగా దక్షిణార్ధగోళమునందు జరుగును. దీనికి కారణమేమన భూమి తన కక్ష్యమీద తిరుగుటవలన దాని ఉపరితలము కూడ పడమరనుండి తూర్పునకు అక్షము ననుసరించి వేర్వేరు వేగములలో తిరుగును. దీనివలన ఒక ప్రదేశము దాని అక్షాంశమును బట్టి జరుగునని తెలియగలదు. ఇందుచే ప్రతి వస్తువునకును దాని చలనదిశకు లంబముగా మరలించుశక్తి ఉత్పన్నమగును. అందుచేతనే ఉత్తరార్ధగోళమునందు గాలి కుడివైపునకును దక్షిణార్ధగోళమునందు ఎడమ వైపునకును వీచును. ఇట్లు మరలుశక్తి కొరియోలిస్ వేగవృద్ధిక్రమ" మనబడును. గణిత శాస్త్రములో ఈశక్తి "కొరియోలిస్ ఫోర్స్" అని పిలువబడును. ఒక విశాల భూభాగముమీద అలముకొనియుండు వాయుపీడన విధానమునుండి వీచు గాలులు స్థిరముగా ఒకే వేగముతో చాలరోజులు వీచుచుండును. అనగా అవి స్థిరమైన ఒక శక్తిమీద ఆధారపడి యుండునని అర్థము.

గాలిచలనమున కాధారములగు పీడనపాతశక్తి, కొరియోలిస్ శక్తి అను రెండు రెండుశక్తులను ఈసందర్భమున పరిశీలించగలము. ఇవి వీచు మార్గము, వీటివేగములు ఎల్లవేళలయందును పరస్పరము సమతూలనముగ నుండవలెను. ఉత్తరార్ధ గోళమునందు గాలియొక్క చలనమునకు కొరియోలిస్ శక్తి ఎల్లప్పుడును లంబదిశలో నుండును. గాలివీచు మార్గము సమభార రేఖలకు (Isobars) సమాంతరముగ నుండి అల్పపీడన వాయువులను వెను కువెట్టి పీడనపాతము వలన ఉద్భవించు శక్తికి కొరియోలిస్ శక్తి సరిగా వ్యతిరేకముగ నుండునట్లు చేయును. స్థిరవేగమేర్పడినపుడు ముఖ్యముగా ఈ రెండుశక్తులు సమానముగనుండుట ఇందలి ఫలితాంశము.

పీడనపాతమునుండి కనుగొనబడు గాలులు భూస్థానస్థితిపవనములు (geostropic winds) అని యనబడుచున్నవి. ఉత్తర దక్షిణార్ధ గోళములందు వీచు గాలులయొక్క చలనము సూటిగానుండును. వాయుప్రసారము వంపుతిరిగిన యెడల నూడ శక్తియగు మధ్యదామిశక్తి (centrifugal force) యొక్క ప్రభావము గోచరించును. ఈ శక్తి కూడ వాయుచలనమునకు లంబముగ నుండును. గాలులు స్థిరముగ నున్నపుడు వంపుతిరిగినను, అవి సమభార రేఖకు సమాంతరముగనే ఉండును. కాని సూటిగా ప్రసరించు వాయు వేగములో అట్లుండవు. సమమైనబలములమధ్య గాలివంపుతిరిగి ప్రసరించును.

సమగ్రముగా పరిశీలించినచో భూమధ్యరేఖ సమీపమున తప్ప తక్కిన తావులలో భూస్థానస్థితి పవనములును క్రమముగా తగ్గు వాయువులును మనకు గోచరమగు పవనములతో చక్కని సంబంధమును కల్గియుండును.

భూమ్యుపరితలము ఎగుడుదిగుడుగ నుండుటచే ఘర్షణ వలన వాయువేగము క్షీణించును. ఇది వాయుస్థిరగతియందు మార్పుకల్గించుట వలన అధికపీడన ప్రదేశమునుండి అల్పపీడన ప్రదేశమునకు వాయుప్రసారము ఘటిల్లును. ఇందుచే వాయుప్రసారము వలన ఉపరితలమువద్ద (అల్పపీడనమువైపు) 10-30 డిగ్రీల కోణమేర్పడుచున్నది. పైజెప్పిన ఘర్షణప్రభావము ఎత్తునకు పోయినకొలది తగ్గుచుండును. భూమ్యుపరితలమునకు 800 మీటర్ల ఎత్తున ఈ ఘర్షణశక్తి పూర్తిగ అంతరించుటచే పవనచలనము సమభార రేఖలకు సమాంతరముగ నుండును.

సమీకరణము లను బట్టి పరిశీలించినచో కొరియోలిస్ శక్తి ఆయాప్రదేశముల అక్షములపై ఆధారపడి యుండునని తెలుగలదు. ఈ విషయములను క్షుణ్ణముగ పరిశీలించుచో రెండు ఫలితాంశములు ఉత్పన్నమను కాగలవు (1) భూమధ్యరేఖవద్దను దానికి అత్యంత సమీపముననను వాయుప్రసారము దాదాపు పీడనపాతము ననుసరించి యుండును (2) విరుద్ధశక్తులు లేనపుడు పీడనపాతమువలననే వాయువు ప్రసారమగుచు క్రమముగా ఆ పీడనపాతములు క్షీణించును.

**పీడనవిధానములు :** ప్రసరణములు సమభారరేఖల పరిశీలనముల వలన వాతావరణ పటములవలన వాతావరణ పీడనములు ఎచ్చట అధికముగను ఎచ్చట అల్పముగను ఉండునో తెలియగలదు. అల్పపీడన ప్రదేశమనగా ఆ ప్రాంతపు పీడనము తక్కువగనుండి అన్నివైపుల అధికపీడనముతో చుట్టబడి

యుండునని అర్థము ఇట్టి ప్రదేశములో సమభారరేఖలు మధ్యగా వలయాకారము వర్తనుండును బలహీనమైన అల్ప పీడన ప్రదేశమునందు ఒక సమభార రేఖ యుండును

రెండు mb అంతరములలో 2 లేక 3 సమభార రేఖలున్నపుడును వాయువేగము 17-27 Kts మధ్యనున్నపు డును వాయుగుండ మేర్పడునని చెప్పుదురు సమభార రేఖలు దగ్గరగను ఎక్కువగను ఉండి వాయువేగము 28 33 Kts మధ్యనున్నచో అట్టిస్థితిని తీవ్రవాయుగుండముగ గుర్తిం చెదరు ఈస్థితి మరింత తీవ్రమై విషమించునపుడు-అనగా గాలి వేగము 33 Kts ను దాటినచో అది తుఫాను అనబడును ఇంకను ఉధృతమై 47 Kts ను అధిగమించినచో అది మహా చక్రవాతమనబడు చున్నది ఈ మహాచక్రవాతములు అల్ప పీడన స్థితియందు ఉత్తరార్ధగోళమున అపసవ్యముగను దక్షి ణార్ధగోళమున సవ్యముగను ఘటిల్లును అల్పపీడన ప్రాంతము లందు సాధారణముగ గాలులు కేంద్రీకృతములై యుండును మైదానములందవి కేంద్రీకృతములై నిలువుగా పైకిపోవును ఇట్లు పోవుటవలన ఆ వాయువులు చల్లబడును ఈ వాయువు లందు అధికముగా తేమయున్నచో మబ్బులు వర్షములు ఘటిల్లును

అధికపీడన ప్రదేశమున మధ్యప్రాంతములో మరల అత్యధికపీడనము కేంద్రభూతమై యుండగా దాని చన్ని వైపులయందును పీడనము తగ్గుస్థాయిలో నుండును సమభార రేఖలు వంపుతిరిగి మధ్యప్రాంతమున దగ్గిరదగ్గిరగా నుండును అన్నిటిలో మధ్యనుండు సమభార రేఖవద్ద అధిక పీడనము కేంద్రీభూతమై యుండును బలహీనమైన అధికపీడన ప్రదేశములు హైస్ (Highs) అనబడును కాగా ఉధృతముగనున్న అధికపీడన ప్రాంతములు ప్రతిచక్రవాతములు (anti cyclones) అనబడును అధికపీడన స్థితియందు ఉత్తరార్ధగోళమున గాలులు సవ్యముగను దక్షి ణార్ధగోళమున అపసవ్యముగను వీచును

అధికపీడన ప్రదేశములందలి వాయువులు కేంద్రీ భ్రంశము చెందును అట్టి తావులలో గాలులు పైనుండి క్రిందికి దిగుచుండును ఇట్లు దిగుటవలన ఆ వాయువులు వేడెక్కును అందుచే నీటి బిందువులేర్పడవు ఈ కారణముచే అధికపీడన ప్రాంతములందు పొడి వాతావరణ మేర్పడును పైన ఉదాహరించినట్లు తత్సమీపమువనుండు సమభార రేఖల విధాన ములే కాక ఈ సమభార రేఖలు తరంగరూపమున పోవుచు కొన్ని ప్రదేశములందు చక్రవాతములవలెను మరికొన్ని ప్రదే శములందు ప్రతిచక్రవాతములవలెను వంపులు తిరిగియుండును చక్రవాతములవలె వంపు తిరిగిన సమభారరేఖలు అధో ముఖపు వంపు (troughs) అనియు ప్రతిచక్రవాతములవలె వంపు తిరిగిన సమభారరేఖలు ఊర్ధ్వముఖపు వంపు (ridges) అనియు పిలువబడుచున్నవి

ఉత్తర అర్ధగోళము అందలి — యుగ్మదేశముయొక్క ఊర్ధ్వ అధోముఖ విధానములను గూర్చి ప్రసరణమును తెలియ జేయుట కష్టము విపులముగా చెప్పవలెనన్నచో అధోముఖపుగా వంపులు తిరుగు రేఖలు ఉపరితలమున కేంద్రీకృతమై మేఘముల నేర్పరచి వర్షపాతమును కల్గించుచుండును ఊర్ధ్వముఖ రేఖలు చక్కని వాతావరణమును కల్గించుచుండును

**స్థానిక లేక భూపవనములు** విశాల భూభాగములపై ఏర్పడు పీడనవాయువులు కొన్ని వందల మీటర్ల పైకాలమ్ము మును విస్తరించియుండును ఈ భూపవనములు పరిమిత ప్రదేశములందేర్పడును అవి స్థానిక స్థలలక్షణముల వలన పెంపొందుచున్నవి కొన్ని స్థానిక పవనములు దిగువ పేర్కొ నబడినవి

**భూపవనములు; సముద్రపవనములు** తీరప్రాంతము నందు భూమియు సముద్రజలమును వేర్వేరు పరిమాణము లలో వేడెక్కుట వలనగాని చల్లబడుట వలనగాని ఇట్టి పవ నము లేర్పడును పగటివేళ సముద్రములయొక్క ఉష్ణోగ్రత యందు ఎక్కువ మార్పు ఉండదు కాని భూమి పగటివేళ త్వరగా వేడెక్కి రాత్రులందు త్వరగా చల్లబడును అందుచే పగటివేళ భూమిమీది గాలి వేడెక్కి వ్యాకోచము చెందును

తలములోని గాలులు వ్యాకోచముచెంది ఎత్తునకు పోయి అచ్చట పీడమను పెచ్చించును సముద్ర మట్టము నకు అదే ఎత్తునమన్న పీడనము తక్కువయుండును కనుక ఈగాలి సముద్రముమీదికి దిగి అచ్చటి తలములలోనుండు గాలులను భూమిమీదికి ప్రసరింపజేయును ఈగాలి భూమిమీద చల్లగా వీచును తలములందు రాత్రులందు భూమి త్వరగా చల్లబడుట వలన ఉష్ణోగ్రత త్వరగా పడిపోవును అందుచే పై గాలులకు ఇది విరుద్ధముగ నుండును ఋతుపవనములు బలముగాలేని ప్రాంతములందు భూ సముద్రవాయువుల ప్రసరణ విధానము అధికముగా గోచరించును

**ఆరోహణ అవరోహణ వాయువులు (Anabatic & Katabatic winds)** చాల ఎత్తునమన్న కొండ లోయలు కొండచరియలు

మిగిలిన వాతావరణమంతయు సూర్యకిరణములకు పారదర్శకమై యుండును భూమ్యుపరితలముతో సంబంధము కల్గనప్పుడుతప్ప వేరు సమయములలో పగటియందు వాతావరణము వేడెక్కదు వాతావరణము నందుగల ఉష్ణ వికిరణముచే రాత్రులందు గాలియొక్క ఉష్ణోగ్రత విశేషముగా తగ్గదు అందువలన ప్రతిదినము భూమ్యుపరితలమునకు సమీపమునయున్న గాలియందలి ఉష్ణోగ్రతలలోనే మార్పులుండును

కాని కొండ ప్రదేశములలో పగటియందు పరిసర వాయువులు వేడెక్కి తేలికయగును అదే మట్టమున కొండలకు దూరముగనున్న ప్రాంతములోకంటె కొండ పరిసరములలో వాయువు పైకిపోయినకొలది వేర్వేరు మట్టములలో తేలికయగుచుండును అట్టి సమయమున కొండపరిసరములు దూరమునగల చల్లనిగాలులచే ఆక్రమింపబడును భూమ్యుపరితలము నుండి పర్వతములపైకి పోవు గాలులను ఆరోహణవాయువులందురు రాత్రులందీగాలులు పూర్తిగా వ్యతిరేకముగ వర్తించుచుండును రాత్రులందు పర్వత సమీపము నందలిగాలులు దూరముగ ప్రసరించు గాలులకంటె చల్లగానుండును కొండలపైనుండి క్రిందకుదిగు ఈ గాలులు అవరోహణవాయువులనబడును ముఖ్యముగా లోయప్రాంతములందొకప్పుడు అవరోహణ వాయువులు ప్రచండరూపము దాల్చుచుండును

యస్ యస్ భ

## వార్తాపత్రికలు - ప్రకటనలు

పత్రికాప్రచరణమును గూర్చి ప్రస్తావించునప్పుడు పత్రికా ప్రకటన రంగమందలి పరిస్థితులను వానియందుకల్గిన మార్పులను గమనించుట అవసరము పత్రికల ప్రథమకర్తవ్యము వార్తా సేకరణము వార్తాప్రసారము వార్తలపై వ్యాఖ్యానము అయినప్పటికిని పత్రికలు ఏనాటి కానాడు తమకెదుర్కొను ఆర్థిక సమస్యలను పరిష్కరించుకొనుటకై కృషిచేయవలసి యుండును పత్రికల ఆర్థిక పరిస్థితిని తీర్చిదిద్దుకొనుటలో ఎన్ని ప్రతులు అమ్మకమగుచున్నవో ప్రకటనల ద్వారా ఆదాయ మెంతవచ్చుచున్నదో మున్నగు విషయములను విచారించవలసి యుండును వార్తా ప్రచారమందును సంపాదకీయ వాఖ్యలు వ్రాయుటయందును, ఇతరవిధములుగను పత్రికలు ఎంతటి గణనీయమైన సేవ చేయగల్గినను ప్రకటనల మూలముగా చాలినంత ధనము లభించనిచో కొలది కాలములోనే వాటిని మూసివేయవలసిన పరిస్థితి ఏర్పడగలదు

అందుచే ప్రకటనలద్వారా తమ ఆదాయమును పెంపొందించుకొను విషయములో ఏ పత్రికయు అప్రమత్తతతో ఉండరాదు దేశములో వివిధ రంగములలో జరుగుచుండు ప్రగతినిగూర్చియు సాంకేతిక విజ్ఞానశాస్త్ర వ్యావసాయక పారిశ్రామిక క్షేత్రములలో ఘటిల్లు అభ్యుదయమును గూర్చియు ప్రజాబాహుళ్యమునకు తెలియచేయుట మూలమునను ఆయా పరిశ్రమాధికారుల వ్యవసాయదారుల వ్యాపారము లాభకరముగా సాగుటకవకాశముండును అందుకు పత్రికా ప్రకటన లొక్కటే యోగ్యమైన మార్గము కొన్నికొన్ని విషయములలో పత్రికా ప్రకటనలు చట్టబద్ధమై యుండుట అవసరము కోర్టు ప్రకటన లిందుకు ఒక ఉదాహరణము

కొన్ని దశాబ్దములకు పూర్వము పత్రికాప్రకటన రంగములోగల పరిస్థితులకును ముఖ్యముగా ప్రణాళికా వ్యవస్థ ముందుకుసాగనారంభించిననాటినుండి క్రమేణా ఏర్పడిన పరిస్థితులకును గల వ్యత్యాసము స్పష్టముగా కన్పించగలదు భారతదేశములో వ్యవసాయము పరిశ్రమలు రవాణా వికర్యములు విద్య సంఘక్షేమము ఆరోగ్య వైద్య కార్యక్రమములు ముందడుగు వేయుచున్న ఈ తరుణమున ఆయా కార్యక్రమములలో సాధింపబడిన ప్రగతినిగూర్చి పత్రికా ప్రకటనములు విస్తృతములైనవి ఈ విస్తృతితో పత్రికా ప్రకటనలకు సంబంధించిన అనుబంధ విషయముల కార్యకలాపములుగూడ ముమ్మరమైనవి క్రొత్తక్రొత్త ప్రకటనల ప్రక్రియలు ప్రపంచమందలి వివిధ పత్రికలతో అనుసరింపబడుటతో వాటి కనుగుణముగా పోటీ పద్ధతిపై భారతదేశములోగూడ ప్రత్యేకమైన ప్రకటన సంస్థలు అవతరించుటయు వాటి కార్యకలాపములు వృద్ధి యగుటయు సంభవించినది నూతన ప్రకటన ప్రక్రియలను విజయవంతముగా అనుసరించిన ఫలితముగా వివిధ రంగములకు సంబంధించిన అభివృద్ధి సమాచారము ప్రజా బాహుళ్యమును ఆకర్షించినది పత్రికా ప్రకటన విషయములో అభివృద్ధిచెందిన ఇతర దేశములతో పోల్చి చూచినచో భారతదేశ మింకను వెనుకబడియున్నను గత రెండు దశాబ్దములలో సాధింపబడిన ప్రగతి ప్రశంసనీయమైనది

పత్రికా ప్రకటన పద్ధతులలో కల్గుచున్న మార్పులను

అభివృద్ధియు రెండు షయములను స్పష్టపరచ లవు ఒకటి దేశ గ్రామాలలో పత్రికల సంఖ్య క్రమేణ పెంపొందుట రెండవది అభివృద్ధి పథములద్వారా గ్రామ వ్యవసాయము వస్తూత్పత్తి మొదలైనవాటిలో ఇతోధికముగా సాధించబడుచున్న ఫలితములు ఇతరదేశములతో పోల్చి చూచినచో జనాభా లెక్కనుబట్టి భారతదేశమున అక్షరాస్యు పత్రికల మొత్తముసంఖ్య చాల తక్కువయినను నగరములలోనే కాక గ్రామసీమలయందుకూడ పత్రికా పాఠకుల సంఖ్య క్రమముగా ఎక్కువగుచున్నది ఆంగ్లభాషా పత్రికల సంఖ్యకంటె దేశ భాషలలో ప్రకటింపబడు దిన వార పక్ష మాసపత్రికలసంఖ్య త్వరితగతిని హెచ్చగుచున్నవి

నగరములలోనేకాక గ్రామములలోకూడ ధైనందిన ముగ వాడబడు సబ్బులు సైకిళ్ళు రేడియోలు గడియారములు విద్యుచ్ఛక్తిగల తావులందు బల్బులు మున్నగు పెక్కు వస్తువుల ఉపయోగము ఊహింపజాలనంతగా వృద్ధిచెందినవి ఇట్టి వాడకపు వస్తువులనుగూర్చిన ప్రకటనలు పత్రికలలో పుష్కలముగా ప్రచురింపబడుటయు ఆ పత్రికలను లక్షలాదిప్రజలు కొని చదువుటయు జరుగుచున్నది ఇందు మూలముగా అటు పత్రికలకు ఆదాయము పారిశ్రామికాధికారులకు ఇతర ఉత్పత్తిదారులకు విశేషలాభములు కల్గుటయు జరుగుచున్నది పారిశ్రామిక వ్యావసాయిక క్షేత్రములందును ఇతర సాంకేతిక రంగములందును సాధించిన అభివృద్ధి ఫలితముగా పత్రికలయందు ప్రకటనలు ఈనాడు విశేషముగా కన్పట్టుచున్నవి వీటివల్ల ప్రయోజనమును పొందదలచిన వివిధ వర్గముల ప్రజలు అధికతరమైన సంఖ్యలో పత్రికలను కొనుటవలన ఇందుమూలమునగూడ పత్రికల ఆదాయము దినదినాభివృద్ధి చెందుచున్నవి ఇంతేకాక ప్రభుత్వ రంగమునందు వివిధ శాఖలలో ఉద్యోగముల ఖాళీలను గూర్చిన ప్రకటనలమూలమున ప్రదర్శనలనుగూర్చిన ప్రకటనల మూలమున ప్రభుత్వము లిచ్చు వేర్వేరు ప్రకటనలమూలమున పత్రికలకు విశేషధనము చేకూరుచున్నది పత్రికా ప్రకటనలయొక్క స్వరూప స్వభావములను తీర్చిదిద్ది వాటిని ప్రజారంజకముగ నుండునట్లు ఆకర్షణీయ మొనర్చుటకై రకరకములైన ప్రక్రియలు అమలునందున్నవి ఏ పత్రికలయందు ఎక్కువ ప్రకటనలు ఎక్కువ ఆకర్షణీయముగ ముద్రింపబడునో ఆ పత్రికలకు ఆదాయము పలుకుబడి విశేషముగ కల్గుచున్నవి ఇరువది ముప్పదేండ్లనాడు పత్రికలలో ముద్రితములైన ప్రకటనలకును నేనాడు [illegible] ప్రకటనలకు [illegible] పడుమాల [illegible] ప్రకటనలు [illegible] వారి [illegible] పత్రికా [illegible] చనములందు [illegible] లయాలలో ఏర్పడిన ప్రత్యేకశాఖ ప్రణాళికలయందు పత్రికా ప్రకటన ప్రక్రియలకుగూడ ముఖ్యస్థాన మియ్యబడుచున్నది

ప్రకటనలద్వారా పత్రికలకు చేకూరు ఆదాయ మెంత ముఖ్యమైనదో తెలియజేయుటకు శాసనసభలలోను పార్లమెంటులోను జరుగు చర్చలు తీర్మానములు నిదర్శనములు గలవు పత్రికలకు ఏ విధానము ననుసరించి ప్రభుత్వ ప్రకటనలు సరఫరా చేయవలెనను విషయము ఈచర్చలలో ప్రధానముగ నుండును వీలైనంత మేరకు ప్రభుత్వశాఖల కార్యక్రమములకు పథకములకు ఉద్యోగములకు పెద్దపెద్ద పారిశ్రామిక సంస్థలకు సంబంధించిన ప్రకటనలను సేకరించి తమ ఆదాయమును పెంపొందించుకొనుటకు పత్రికలు కాంక్షించుచుండును

1968–1969 వ సంవత్సరమునకు సంబంధించి ఇండియన్ ప్రెస్ రిజిస్ట్రార్ సమర్పించిన నివేదికలో 288 పత్రికలకు సంక్రమించిన ఆదాయ సమాచారమునుగూర్చి ప్రస్తావించబడినది వీటిలో 21 పత్రికలు వీటి మొత్తము ఆదాయములో 75 శాతము 85 పత్రికలు 50–75 శాతము 126 పత్రికలు 50 శాతమునకుతక్కువగను ఆదాయమును సంపాదించినట్లు అంచనా వేయబడినది కొన్ని పత్రికలు తాము ప్రకటించు పుటలలో నూటికి 60 శాతము ప్రకటనలకు ప్రత్యేకించగా అధిక సంఖ్యాకమైన పత్రికలు 25 నుండి 50 శాతమువరకు మాత్రమే ప్రకటనలను కేటాయించినట్లు ఈ నివేదికలో పేర్కొనబడినది వివిధ అనధికారసంస్థలు రాష్ట్ర కేంద్రప్రభుత్వములు విశేషధనమును దినపత్రికలకు – అందును ముఖ్యముగా ఆంగ్లభాషా పత్రికలకు – తమతమ ప్రకటనల ముద్రణమునకై వెచ్చించుచున్నవి చిన్నతరహా పత్రికలకును క్రొత్తగా స్థాపింపబడిన పత్రికలకును ప్రకటనలద్వారా లభించు ఆదాయము తక్కువగనున్నది ఇట్టి పత్రికలు త్వరలోనే మూతపడుటకు కారణము వాటిప్రకటనల ఆదాయము పెరుగక పోవుటయే ఈ విష

యమై రాష్ట్ర ప్రభుత్వములు కేంద్ర ప్రభుత్వము ఇతర అనధికారసంస్థలు ఉత్పత్తిసంఘములు చర్చించి వేదపత్రికల మనుగడ సాగునట్లుగా సహాయ పడుటకు వాటి విధానములు రూపొందించుకొనుట వాంఛనీయము

పత్రికా ప్రచురణమునందు ప్రకటనలకుగల స్థానమును పురస్కరించుకొని వాటికి సంబంధించు వివిధ సమస్యలను విచారించి సవ్యమైన విధానమును రూపొందించుట కొక సంఘ మేర్పరుప బడినది ఈ సంఘము లందు ప్రకటన సంస్థలకును పత్రికలకును ప్రజ సంస్థలకును ప్రాతినిధ్య మీయ బడినది ఈ సంఘము పత్రికా రంగములో కల్గుమార్పులను గుర్తించి వాటి కనుగుణముగా ప్రకటన పద్ధతులలో రావలసి యుండు మార్పు లెట్టివో నిర్ణయించుటకు అవకాశ మేర్పడ గలదు

వా వెం హ

## వార్తాపత్రికలు - సమాజ జీవితము

వార్తాపత్రికలు ప్రజాస్వామ్య విధానములో నిర్వహించవలసిన బాధ్యతలలో సంఘక్షేమమును పెంపొందించుట ముఖ్యమైనది సమాజ ఆర్థిక సాంఘిక సాంస్కృతిక జీవితముతోపాటు సమాజముయొక్క ఐక్యతను బాధ్యతను గూడ పెంపొందించుటయే సంఘక్షేమ మనబడును ఇవన్నియు సమాజాభ్యుదయమునకు తద్ద్వారా దేశాభ్యుదయమునకు దోహదముచేయు విషయములు ఏ సమాజములో వివిధ వర్గములమధ్య ఐక్యము సమష్టిబాధ్యత విశేషముగా ఉండునో ఆ సమాజము యొక్క గౌరవప్రపత్తులు ప్రపంచములో ఎక్కువగా నుండును

ఈ ఆశయములను ప్రజలలో పెంపొందించుటయందు వార్తాపత్రికలు చేయగల కృషి సేవ ఒక విధముగా ప్రత్యేక విశిష్టత కల్గియుండును సమాజములో పేరుకొనియుండు దుష్టశక్తులు అనేక విధములు అట్టి శక్తులు సమాజ పురోభివృద్ధికి అడుగడుగున అడ్డు తగులుచుండును అంచగొండితనము ఆశ్రితజనపక్షపాతము స్వార్థము బలహీన వర్గాలను బాధించి సమాజ క్షేమమునకు ప్రతికూలముగా ప్రవర్తించుట అధికార దుర్వినియోగము మొదలైన దుష్టలక్షణములు సాధారణముగా ప్రతి సమాజములోను కన్పించును ఇట్టిశక్తుల నరికట్టుటకు బలవత్తరమైన ప్రజాభిప్రాయ మవసరము ఈ ప్రజాభిప్రాయము వేర్వేరు మార్గములలో వేర్వేరు విధములుగ ద్యోతకమగుచుండును ఇట్టి శక్తుల దుశ్చర్యలను సంఘములో బహిర్గత మొనర్చుటద్వారా వారిని సన్మార్గములోనికి త్రిప్పుటకు పత్రికలకు పెక్కు అవకాశములు గలవు అట్టి అవకాశములను పత్రికలు చొరవలో కల్పించుకొనుట అవసరము

అల్లే సమాజాభివృద్ధికి తోడ్పడు వివిధ విషయములను గురించి వార్తలను వ్యాసములను ప్రచురించుటద్వారా సంపాదకీయ వ్యాసములలో చర్చించుటద్వారా పత్రికలు నిర్వహించవలసిన బాధ్యత విశేషముగ నుండును ఉదాహరణమునకు భారత దేశమందు పంచవర్ష ప్రణాళికల క్రింద గత 28 సంవత్సరములలో పెక్కు అభివృద్ధి కార్యక్రమములు చేపట్టబడినవి వాటిద్వారా దేశాదాయము సగటువ్యక్తి ఆదాయము పారిశ్రామిక వ్యవసాయక విద్యారంగములలోను ఇతరరంగములలోను అభివృద్ధి సాధించబడు చున్నది ఈ కార్యక్రమముల నిర్వహణములో లోపములున్నమాట నిజమే వాటి మూలముగా సామాన్య ప్రజలకు సంక్రమించవలసిన ప్రయోజనములు వారికి చేకూరుటలేదను విషయముకూడ సత్యమే అయినను వ్యవసాయము పరిశ్రమలు విద్య రవాణా శాఖ మొదలైన రంగములలో కల్గిన అభివృద్ధిని ఎవరును కాదన జాలరు సాధించబడిన ప్రగతిని తక్కువ అంచనా వేసిగాని విస్మరించిగాని లోటుపాట్లను గూర్చి మాత్రమే పత్రికలు ప్రచారముచేయుట సమంజసముకాదు ఏ రంగములోనైన జరుగుచుండు ప్రగతిని తలయెత్తుచుండు లోపములను సమదృష్టితో పరిశీలించి లోటుపాటులను గూర్చి నిర్మాణాత్మకముగా సహృదయముతో సవిమర్శనాత్మకముగా ప్రచార మొనర్చుట పత్రికల విధ్యుక్తధర్మము వివిధ రంగములను గూర్చి పత్రికలలో వార్తలు ప్రచురించుట యందుగాని సంపాదకీయ వ్యాఖ్యలను వ్రాయుట యందుగాని పైవిధముగా న్యాయబద్ధమైన ప్రజాస్వామ్య ధోరణిని అవలంబించుట వలననే ప్రగతి సాధింపబడుటకు అవకాశముండును అనగా ప్రజాస్వామ్య వ్యవస్థలో పత్రికలు పత్రికాధిపతులు సంకుచిత ధోరణిని విడనాడి విశాలదృష్టిని అవలంబింప వలెను

దేశములో పెక్కు రాజకీయ పక్షములు వేర్వేరు సిద్ధాంత ప్రాతిపదికలపై ఏర్పడుటయు వాటిపరస్పర విమర్శల వలన దేశవ్యవహారములను నిర్వహించు పార్లమెంటు శాసనసభలు మొదలైన ప్రజాప్రాతినిధ్య సంస్థలలో పరస్పర ఖండన మండనలచే ప్రతిష్టంభనలు ఏర్పడి రాజకీయ జీవితము

కలుగుట మగుటయు వీటి ప్రభావము ప్రభుత్వముపై ప్రసరించి అవాంఛనీయమైన సంక్షోభ పరిస్థితు లేర్పడుటయు జరుగుచుండును. ఇందువలన ఏర్పడు విషమ పరిణామముల మూలముగా పార్లమెంటరీ ప్రజాస్వామ్యపు పునాదులు సడలిపడు అవకాశము కలదు. ఇట్టి దుష్పరిణామములు కలుగకుండ పత్రికలు వివిధ రాజకీయ పక్షములకు వాటి నాయకులకు హెచ్చరిక చేయవలసి యుండును. కొన్ని పత్రికలు అవి అభిమానించు కొన్ని రాజకీయ పక్షములను మరికొన్ని అవి అభిమానించు ఇతర రాజకీయ పక్షములను వాటి కార్యక్రమములను బలపరచుట సహజము, సమంజసముకూడ అయినను మొత్తము దేశక్షేమమునకు ప్రజాక్షేమమునకు ప్రజాస్వామ్య సిద్ధాంతములకు రాజ్యాంగ చట్టమునకు భంగము సంభవించు పరిస్థితులలో పత్రికలు ఏదియో ఒక పార్టీని మాత్రము—దాని విధానము సరియైనదైనను కాకున్నను సమర్థించుటకు బదులుగా రాజ్యాంగ చట్టముయొక్క రక్షణదృష్ట్యా వారిని విమర్శించుట సమాజశ్రేయస్సు ననుసరించి అవసరమగును. ఇట్టి ప్రధాన విషయములలో ఒక్కొక్కప్పుడు అధికారుల అసంతృప్తికి గురికావలసి వచ్చినను బాధ్యతగల పత్రికలు తమ అభిప్రాయములను నిష్పాక్షికముగా స్పష్టముగా వెలిబుచ్చుటద్వారా సమాజముపట్ల దేశముపట్ల తమ బాధ్యతను నిర్వర్తించ గల్గును.

అయితే ఏ దేశమందైనగాని లేక భారతదేశమందైనగాని సాంఘికాభ్యుదయ లక్ష్యమునకు కట్టుబడి పత్రికలు తమ బాధ్యతను నిర్వహించుచున్నవా? అట్టి బాధ్యతను గుర్తించి వర్తించు పత్రికలు తక్కువగను బాధ్యతను విస్మరించియో లేక గ్రహించజాలకయో వర్తించు పత్రికలు విశేషముగను ఈనాడు కన్పట్టుచున్నవి. ఇందుకనేక కారణములుండవచ్చును. కొన్ని పరిస్థితులలో పత్రికలకు సాంఘిక న్యాయము సాంఘికాభ్యుదయము సాంఘిక విలువలు మొదలైన లక్ష్యములను పాటించుట వ్యవహారదృష్ట్యా లాభకరముగా ఉండకపోవచ్చును. లేక చిన్న చిన్న సాంఘిక లోపాలకు వ్యక్తిగత లోపాలకు ప్రభుత్వలోపాలకు లేని ప్రాముఖ్యమును ఆరోపించుచు వాటిని పెద్దవిగాచేసి చిత్రించినను వ్యక్తిగత దూషణలకు దిగినను తమ పత్రికల అమ్మకము ఎక్కువగునను అభిప్రాయము కొందరు పత్రికాధిపతులకు పత్రికా రచయితలకు ఉండుట సహజము. ఇది ప్రజాస్వామ్య యుగములో పత్రికాధిపతులకు పత్రికారచయితలకు ఉండవలసిన లక్షణము కాదు. పత్రికా రచయితలలో శిక్షణ అనుభవములేక పత్రికా సంపాదక సూత్రములను గ్రహించలేకపోవుట వలననే ఇట్టి పరిస్థితి సంభవించుచున్నది.

ఉదాత్తమైన చిత్తశుద్ధిలేని ఇట్టి పత్రికలు పత్రికారచయితలు సంఘజీవితమును సంఘ సౌశీల్యమును పెంపొందించుటకు కాక వాటిని మరింత కలుషితము చేయుటకే దోహదమొసగును. వ్యక్తులయందును రాజకీయ పక్షములయందును ప్రభుత్వమునందును నాయకులయందును సమాజమునందును లోపములను గోరంతలు కొండంతలు చేయుటకు కొన్నిపత్రికలు ఆతురతను ఉత్సుకతను ప్రదర్శించుట శోచనీయము. ఇట్టి పత్రికలయొక్క సాంఘిక బాధ్యతను గుర్తింపజేయు మార్గములు ప్రత్యేకముగా లేకున్నను పత్రికారచయితల సంఘములు ప్రభుత్వముచే ఏర్పాటుపరచబడిన పత్రికాసలహాసంఘములు ఈ విషయమున కొంతవరకు తోడ్పడవచ్చును. కొన్ని సందర్భములలో ఇట్టి పత్రికల నడవడిని గూర్చి ప్రెస్ కౌన్సిల్ ఆఫ్ ఇండియా వారికి ఫిర్యాదు చేసినచో దానిని గురించి వారు విచారణ జరిపి అవసరమైన చర్యను తీసికొనగలరు. ఇట్టి చర్యలను లక్ష్యపెట్టక తమ నడవడిని మార్చుకొనని పత్రికలయొక్క ప్రచురణకర్తలపైన సంపాదకులపైన ప్రభుత్వము చట్టసమ్మతమైన చర్యతీసికొనును. భారత దేశములో పౌరులకున్న స్వేచ్ఛకంటె పత్రికా రచయితలకున్న స్వేచ్ఛ అధికమైనది కాదని పత్రికా నిర్వాహకులు పత్రికా రచయితలు గ్రహించవలయును.

ఇతర విషయములెట్లున్నను దిన వార పక్ష మాస ద్వైమాస త్రైమాస పత్రికలను నిర్వహించువారు తమ ప్రధాన బాధ్యతలను సర్వదా ఆచరణ యందుంచుట అవసరము. పత్రికారచనకు పూనుకొన్నవారు దానినొక ప్రధాన జీవనోపాధి మార్గముగా కాక దేశాభ్యుదయము కొరకు అవలంబించుటకై సిద్ధముగ నుండవలెను. ఇట్టిలక్ష్యములు లేనివారు పత్రికానిర్వహణమునకు పూనుకొనుటవలన సాంఘిక సంక్షేమమునకును దేశాభ్యుదయమునకును కాక సంఘవిచ్ఛిన్నమునకును దేశవిచ్ఛిన్నమునకు కూడ దోహదము చేసినవారగుదురు. అట్టివారిని పత్రికారచన రంగమునుండి తొలగించవలసి యుండును. అట్టివారికి ప్రజలు ఎట్టివిధమైన ప్రోత్సాహమును ఇయ్యకూడదు.

డా. వెం. శే.

## వార్తాసంస్థలు

ప్రజాస్వామ్య రాజ్యాంగ విధానము అమలులోనున్న దేశములలో వార్తాపత్రికలకు ప్రముఖస్థానము ఉండునను విషయము ఎల్లరు అంగీకరించినదే. ఇతర రాజ్యాంగ విధానములుగల దేశములలో కూడ పత్రికలు ప్రకటింపబడుచున్నను ఈ రెండురకముల రాజ్యాంగ విధానములు గల దేశములలో పత్రికల స్థానమునందు భేదములున్నవి.

ఆధునిక కాలములో స్థానిక దేశీయ అంతర్జాతీయ రంగములలో ఘటిల్లు విశేషములను ప్రజలకు తెలియజేయుటకును ప్రజాభిప్రాయమును సమన్వయము మొనర్చుటకును వారు అన్ని రంగములలో పాల్గొనునట్లు చేయుటకును వార్తాప్రసారమొక ప్రధానసాధనమైనది. వార్తాసేకరణమునకు తత్ప్రసారమునకు ప్రచురణమునకు విమర్శనమునకు పత్రికలు స్వేచ్ఛ ననుభవించుట ప్రజాస్వామిక దేశములందొక ప్రధాన లక్షణము. ప్రజాక్షేమమును దృష్టిలోనుంచుకొని తమ బాధ్యతలను నెరవేర్చుచు ప్రజాహితములగు ప్రభుత్వ చట్టములను మన్నించుట పత్రికల కర్తవ్యము. ఇట్టి స్వేచ్ఛను పత్రికాధిపతులు కలిగియున్నారా? లేక పరిమితమైన హక్కులున్నవా? అను సమస్య ప్రజాస్వామ్యమునకు కసౌటివంటిది. నిరంకుశ విధానములలోనున్న రాజ్యములలో ఇట్టి పత్రికా స్వాతంత్ర్యము మృగ్యము కావచ్చును. అట్టి రాజ్యములలో ప్రభుత్వ విధానములను మన్నించి వాటికి అనుకూలముగా వ్యాఖ్యానించనిచో ప్రభుత్వ దండనమునకు పత్రికలు గురియగును.

పలుదేశములలో వార్తాపత్రికల ప్రచురణము చిరకాలమునుండి సాగుచున్నను వాటి ప్రాధాన్యము క్రమముగ పెరుగుచు వచ్చినది. ప్రథమదశయందు ఆయా దేశవ్యవహారములలో పాల్గొనిన విద్యావంతులు కొలదిమంది మాత్రమే. కాని విద్యాసౌకర్యములు విస్తృతమైనకొలదియు శాస్త్ర విజ్ఞానము వృద్ధియైనకొలదియు ఇతర దేశములతో రాజకీయ వాణిజ్య సాంస్కృతిక సంబంధములు అభివృద్ధికాకొలదియు వార్తాపత్రికల ప్రాముఖ్యము విశేషముగా అతిశయించి పత్రికల సంఖ్యయు వాటి వ్యాప్తియు ప్రపంచమంతట విస్తృతి కెక్కినది. వివిధ దేశములందు ఘటిల్లు సంఘటనల ప్రభావము వాటిపై పరస్పరముగా ప్రసరించుటయు తత్ఫలితముగా ఆయా దేశముల విషయములనుగూర్చి అవగాహనము ప్రజలలో ఏర్పడుటయు పత్రికా ప్రచురణమువలన కల్గిన పరిణామమే.

పత్రికలు తమ బాధ్యతను ప్రజోపయోగప్రదముగా నిర్వహించుటకు వాటి స్వేచ్ఛ అవసరము. వార్తలను ఎట్టి విశేషములను ప్రజలకు అందించుటయేకాక వాటిని విమర్శించుట వ్యాఖ్యానించుటకూ పత్రికలు తమ బాధ్యతగా గుర్తింపవలెను. సద్భావముతో ప్రజాభిప్రాయమును నిష్పక్షమైన మార్గములో నడుపుటకు ఆందోళనము గూడ ఇందు విషయమై వార్తలను ఇతరవిషయములను సేకరించుటకును వాటిని ముద్రించి తమ చదువరులకు అందచేయుటకును వాటి అంతరార్థమును ప్రజలకు విశదీకరించుచు వ్యాఖ్యానించుటకును పత్రికాధిపతులు శిక్షణపొందిన సమర్థులగు పత్రికా రచయితలను సంపాదకులను నియమింపవలెను. పత్రికారచయితలుగా శిక్షణపొందు అవకాశములు ఉస్మానియా విశ్వవిద్యాలయము వంటి కొన్ని విశ్వవిద్యాలయములలో కలవు. ఇట్టి సౌకర్యములు ఇతోధికముగ అవసరమగుచున్నవి.

వార్తాపత్రికల బాధ్యతలు విస్తృతిమవుచున్నకొలది ప్రపంచమందలి వివిధ ప్రాంతములనుండియు దేశములోని వివిధ నగరములనుండియు వార్తాప్రచారమునకు ఎలయు పోస్టు టెలిగ్రాఫ్ టెలిఫోన్ మొదలగు సౌకర్యములను సమకూర్చుటకు ప్రభుత్వము పూనుకొనవలెను. పత్రికా ప్రచురణము బహురూపములలో విస్తరించుచున్న ఈ కాలములో వాటికి ఉచితమైన స్వేచ్ఛా స్వాతంత్ర్యములతో పాటు బాధ్యతలకూడ అవి విధిగా పాటింపవలెను. ఈ ముఖ్య సిద్ధాంతమునకు పత్రికాధిపతులు కట్టుబడక తమ ఇష్టానుసారముగా వ్యవహరించినచో అందువలన కలుగు ఇబ్బందులకు వారు గురికావలసి యుండును.

ప్రజాస్వామ్య విధానము అమలునందున్న దేశములలో రాజకీయ రంగమునందు వేర్వేరు పక్షములు తమ తమ రాజకీయ కార్యక్రమములను అనుసరించుచు ప్రజాజీవనము చేయవచ్చును. తమ విధానములు ప్రజామోదమును పొందుటకు ఆయా పక్షములు శాంతియుతముగా ప్రచారము చేసికొనవచ్చును. ఇట్టి ప్రజాస్వామిక దేశములలో ఈ విధమగు ప్రచారమునుగూర్చిన వార్తలను కార్యక్రమమును నిష్పక్షపాతముగా ప్రచురించుటకు పత్రికలు తోడ్పడవలెను. అట్లే వాటిని గూర్చి సద్విమర్శ చేయుటకుకూడ పత్రికాధిపతులు స్వేచ్ఛ కల్గియుండవలెను. ప్రజాస్వామ్యములో పార్లమెంటు ప్రభు

త్వము న్యాయ స్థానములతోపాటు పత్రికలు నాల్గవ ఎస్టేటు గా పరిగణింపబడు చున్నవి.

ఈ కాలములో రాజకీయవిషయములే కాక దేశాభ్యుదయమునకు దోహదము నొసగు వైజ్ఞానిక పారిశ్రామిక విద్యా సంక్షేమములకు సంబంధించు [illegible] క్రమముగ ఆచరణములోనికి వచ్చుచున్నవి. క్రీడా వినోదములు మొ॥ వానిని సాహిత్యాదులను ప్రతిదేశమున [illegible] చేయుచున్నది. వీటికి సంబంధించిన విశేషములను వార్తలను ప్రకటించుటకు పత్రికలు కృషిచేయుటయే కాక వీటినిగూర్చి విమర్శనలు, ప్రజలు శ్రద్ధ గైకొనుటకు సంపాదకీయ వ్యాసములను ఇతర రచనలను ప్రచురించుటకు ప్రోత్సాహ మొసగ వలయును.

గత రెండు శతాబ్దాలుగ పత్రికా ప్రచురణమునందు ఐరోపా అమెరికా ఖండములలోనే కాక ఆసియా ఆఫ్రికా ఖండములందును ఇండియావంటి కొన్ని దేశములలోను విప్లవాత్మకమైన మార్పులు ఘటిల్లినవి. ఆ దేశములో పత్రికా ప్రచురణమునందు ఘటిల్లు మార్పుల ప్రభావము ఇతరగా పొరుగుదేశములపై ప్రసరింపక మానదు. ఇట్టి పరిణామములో కలుగుచున్న ప్రగతిని మనము ప్రత్యక్షముగ చూచు చునేయున్నాము. భారతదేశమునకూడ 18వ శతాబ్ది తుదిలో పత్రికా ప్రచురణమునకు అంకురారోపణము జరిగినది. ఈస్ట్ ఇండియా కంపెనీలో ఉద్యోగిగానుండిన జేమ్స్ ఆగస్టస్ హిక్ అనునతడు 1781లో ప్రప్రథమముగా బెంగాల్ గెజెట్ అను పత్రికను కలకత్తాలో స్థాపించెను. క్రమముగా భారతీయ ప్రముఖులుకొందరు కలకత్తా బొంబాయి మద్రాసు నగరములలో పత్రికాప్రచురణమునకు పూనుకొనిరి. వీరిలో రామమోహనరాయలు ప్రథముడు. అప్పటి రాజకీయ పరిస్థితులను గూర్చి వ్యాఖ్యానించుటకు స్వాతంత్ర్యములేని భారతీయ పత్రికాధిపతులకును ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారులకును నడుమ సంఘర్షణము చెలరేగుచుండెడిది. అందుచే ప్రభుత్వాగ్రహమునకు గురికాకుండుటకై భారతీయపత్రికలు రాజకీయ విషయములపైగాక సంఘ సంస్కరణము విద్యాబోధనము మున్నగు నిరపాయకరమైన అంశములపై మాత్రమే ప్రజలకు ప్రబోధము కల్పించుచుండెడివి. కాలక్రమేణ దేశ వార్తలను స్థానిక వార్తలను ప్రచురించుట వాటిపై వ్యాఖ్యానము లొనర్చుట అవసరమైనది.

వార్తలు వివిధముగనుండను [illegible] ములు దే రాజకీయములకు సంబంధించు వార్తలు. వీటిలో ముఖ్యములైనవి ఆవిష్కారములు ప్రజా జీవితమునకు సంబంధించు వివిధ విషయములను గురించిన వార్తలను పత్రికా [illegible] ఆర్థిక సాంస్కృతిక క్రీడావినోద [illegible] ఇటీవల ప్రాముఖ్య మెక్కువైనది. [illegible] పత్రికా పాఠకుల కోర్కెలను తృప్తిపరచుట [illegible] కాగములను [illegible] ఆర్థిక స్తోమత ఇట్టి పత్రి[illegible] కొలదిగమాత్రమే కలవు. అధికసంఖ్యాకములు [illegible] వార్తలను వార్తాసంస్థలద్వారా సేకరించి ప్రచురించుచున్నవి. వార్తలు సేకరించు సంస్థలు [illegible] దేశములో బయలుదేరినవి. భారతదేశములో కూడ వార్తాసేకరణ సంస్థలు [illegible] విదేశములలో తమ విలేఖరుల నేర్పరచి [illegible] వ్యాసములను వార్తలను సేకరించుచున్నవి. వీటిలో అసోసియేటెడ్ ప్రెస్ ఆఫ్ ఇండియా మొదటిది.

తరువాత కొలది కాలమునకు దేశీయ పత్రికలకు విదేశ వార్తలను అందించుటకేర్పడిన రాయిటర్ వార్తా సంస్థతో అసోసియేటెడ్ ప్రెస్ ఒప్పందము చేసికొని విదేశ వార్తలను అందజేయుటకు పూనుకొనెను. 1910లో ఏర్పడిన ఇండియన్ న్యూస్ ఏజన్సీ అను సంస్థ అసోసియేటెడ్ ప్రెస్ రాయిటర్లకు కొంతకాలము పోటీగా పనిచేయసాగెను.

బ్రిటిష్ వార్తా సంస్థయైన రాయిటర్స్ అసోసియేటెడ్ ప్రెస్ మిళితమగుటచే ఆ సంస్థ సరఫరాచేయు వార్తలలో బ్రిటిష్ దృక్పథము క్రమముగా అధికతరమయ్యెను. అప్పుడే భారతదేశములో స్వరాజ్యోద్యమము ఉధృతమయిన కారణముగా భారతీయ పత్రికలు కొన్ని కలిసి రాయిటర్ వార్తాసంస్థకు పోటీగా జాతీయ దృక్పథముతో వార్తలను సరఫరా చేయుటకు ఫ్రీ ప్రెస్ ఆఫ్ ఇండియా అను సంస్థను స్థాపించి సదానంద్ అను ప్రసిద్ధ పత్రికా రచయితను దానికి డైరెక్టరుగా నియమించెను. అచిరకాలములో ఆర్థికచిక్కులను ఎదుర్కొనవలసి [illegible] ఆ వార్తా సంస్థను 'ఫ్రీ ప్రెస్ జర్నల్' అను [illegible]

పత్రికగా మార్చివైచి ఫ్రీ ప్రెస్ వార్తలను ప్రత్యేకముగా ప్రకటించు పత్రికగా దానిని నడుపసాగెను. అసోసియేటెడ్ - రాయిటర్స్ సంస్థకు అనాటి బ్రిటిష్ పాలకులతోగల పలుకుబడిని పురస్కరించుకొని జాతీయ వార్తాసంస్థగా పేరొందిన ఫ్రీ ప్రెస్ పై అది దాడిచేయగా విధిలేక తన సంస్థను అసోసియేటెడ్ రాయిటర్స్‌తో విలీనము చేయుటకు సదానంద్ అంగీకరింపవలసి వచ్చెను. జాతీయ వార్తాసంస్థలను నడపుటకు వాతావరణము అనుకూలముగ లేకుండుటచే తరువాత ఏర్పడిన కొన్ని సంస్థలు సాంకేతికాది సౌకర్యములు లేక త్వరలోనే తమ కార్యకలాపములను విరమించుకొనవలసి వచ్చెను.

1948 లో వివిధ భారతీయ వార్తాపత్రికలు కలిసి ప్రెస్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా అను వార్తాసంస్థను స్థాపించి దానికి బలమైన ఆర్థికస్వాతంత్ర్యమును సమకూర్చినవి. భారతదేశమందలి వార్తాసంస్థలలో ప్రెస్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా ఈనాడు ప్రముఖమైనది. ఈ సంస్థయొక్క శాఖలు విదేశములలోకూడ విరివిగా ఏర్పడి రాయిటర్ సంస్థతో సమానమైన ప్రతిపత్తిని సంపాదింపగలిగెను. తరువాత ఏర్పడిన యునైటెడ్ న్యూస్ ఆఫ్ ఇండియా అను వేరొక వార్తాసంస్థ గట్టి పునాదులను బలపరచుకొని ప్రెస్‌ట్రస్టుతో సమానముగా తన బాధ్యతలను నెరవేర్చుచున్నది.

పత్రికల ప్రచార ఫలితముగా ప్రజలలో విషయ పరిజ్ఞానాసక్తి విమర్శనాదృష్టి రాజకీయ చైతన్యము అధికతరమైనది. పత్రికల అమ్మకముకూడ ఎక్కువైనది. కాని వార్తలను సేకరించు సంస్థలును ప్రత్యేక పత్రికా విలేఖరులును శ్రమించి పక్షపాత రహితముగా వీలైనంత సమాచారమును పత్రికలకు అందజేయుట వాటి విధి. ఆ లక్ష్యమును ముందుంచుకొని తమబాధ్యతను నిర్వహించినప్పుడే వార్తాసంస్థలయొక్క కార్యక్రమముపై ప్రజలకు విశ్వాసమేర్పడగలదు. పత్రికా విలేఖరులు ఏ స్థాయిలోనైనను తాము సరఫరా చేయు వార్తలు సత్యదూరమైనవి కాకుండునట్లు జాగరూకత వహించవలెను. కొందరు ప్రత్యేకవిలేఖరులు తాము సరఫరా చేయు వార్తలను కేవలము వార్తారూపములో కాక వాటికి కొంత వ్యాఖ్యానమును మిళిత మొనర్చుట కాంచుచున్నాము. ఇది కొంతమేరకు నిషిద్ధమైనను అనుభవజ్ఞులైన విలేఖరులు పంపు లేఖలలో వార్తలయందలి గూఢార్థమును ప్రజలకు తెలియచెప్పుటకు అప్పుడప్పుడు వ్యాఖ్యానమును వార్తలతో మిళితమొనర్చుట అవసరము. ఇట్టి విలేఖరులు తమరచనలలో ప్రజా బాహుళ్యమునకు జాతీయ అంతర్జాతీయ రంగములలో జరుగుచున్న వివిధరకముల సంఘటనలను విడమర్చి వ్రాయుట వలన పత్రికా పాఠకుల విషయ పరిజ్ఞానాసక్తిని పెంపొందించుటకు దోహద మొనర్చుచున్నారు. పత్రికా రచనము జరుగుచున్న చరిత్రకు ప్రతిబింబమను సూక్తి ఇది నిదర్శనము.

దా. వెం. హ.

## వార్తాసేకరణము - వార్తాప్రసారము

వార్తాపత్రికలనుగూర్చిన కర్తవ్యములలో వార్తాసేకరణము, వార్తాప్రసారము, వార్తలపై వ్యాఖ్యానము ప్రధానాంశములు. సంఘజీవియైన మానవుడు తనపరిసరసమాజములోను తనదేశములోను ఇతరదేశములలోను జరుగు సంఘటనలనుగూర్చి తెలిసికొన నుత్సహించును. సాంఘిక ఆర్థిక రాజకీయ సాంస్కృతికాది వివిధరంగములలో నిత్యము జరుగుచుండు విశేషములను సేకరించి పాఠకులకు అందజేయుట ద్వారా వార్తాపత్రికలు ప్రధానమైన సాంఘికప్రయోజనమును తీర్చుచున్నవి. నాగరికదేశము లన్నిటిలో ఈ విధముగా నేటికాలమున వార్తాపత్రికలకొక కీలకస్థానము కలదు.

ప్రజాస్వామ్య వ్యవస్థగల దేశములలోను సమాజములలోను ప్రజా బాహుళ్యమునకు కొన్నిహక్కులు బాధ్యతలు సంక్రమించును. ఈ బాధ్యతలు హక్కులు రాజకీయ ఆర్థిక సాంఘికాది ఇతర రంగములకు సంబంధించి యున్నంతవరకు సమర్థవంతముగ నిర్వహింపబడవలెనన్నచో ప్రజలకు ఆయా విషయములలో కొంత పరిజ్ఞాన మవసరము. అట్టి పరిజ్ఞానమును కల్పించి పెంపొందించుటలో పత్రికలు విశేషముగా తోడ్పడును. ఉదాహరణమునకు ఒక ప్రాంతములో ఒకానొక రంగములో జరుగు పురోభివృద్ధిని గూర్చి వేరొక ప్రాంతములోని ప్రజలకు తెలియజెప్పుటకు దానికి సంబంధించు వార్తలను పత్రికలలో ప్రకటించుటయు వాటిని వ్యాఖ్యానించుటయు వార్తాపత్రికల ప్రధాన కర్తవ్యము. దేశమందలి వివిధ రాజకీయపక్షముల కార్యక్రమములనుగూర్చి ప్రజలకు ఎరుకపరచుటద్వారా వారి రాజకీయ పరిజ్ఞానమును పెంపొందించుట కవకాశముండును. దేశాభ్యుదయమునకు ఏ రాజకీయ పక్షమువలన ప్రయోజనము చేకూరునో, ప్రజలు నిర్ణయించుకొనుటకు పత్రికలు సహాయ పడుచుండవలెను

సాధారణముగా ఒక్కొక్క రాజకీయ పక్షమునకుగాని సాంఘిక మతసంబంధమైన ఇతర పక్షములకుగాని వాటివాటి భావములను కార్యక్రమములను సమర్థించు అధికార అనధికార స్వతంత్ర దినపత్రికలు వార పక్ష మాసపత్రికలు ప్రకటింపబడుచుండును.

వార్తాసేకరణ :- వార్తాసేకరణమునకై పత్రిక అవలంబించు మార్గములు వేరువేరుగా నుండును. వీటిలో వార్తాసేకరణ సంస్థల ఏర్పాటు మొదటిది. పత్రికా ప్రచురణలో ముందడుగువేసిన ప్రతి దేశమునందు ఇట్టి వార్తాసేకరణ సంస్థలు ఏర్పడియున్నవి. ఈ సంస్థలు స్వదేశమందలి వివిధ ప్రాంతములలోను విదేశములలోను తమ శాఖలనేర్పరచి అందు విలేఖరులను నిర్ణయించి వారిద్వారా ఆయా తావులందు జరుగు ముఖ్యవిషయములను సేకరించుచుండును. ఇట్లు సేకరించు విషయములను తమతమ ప్రాంతములలో ప్రచురింపబడు దినపత్రికలకు సరఫరాచేయుచు ధన సంపాదనము చేయుచుండును. ఇట్టి జాతీయ వార్తాసంస్థలు భారతదేశములో ముఖ్యమైనవి మూడు గలవు (1) ప్రెస్ట్రస్ట్ ఆఫ్ ఇండియా (2) యునైటెడ్ న్యూస్ ఆఫ్ ఇండియా (3) హిందుస్థాన్ సమాచార్. మొదటి రెండుసంస్థలు ఇంగ్లీషు భాషలో వార్తలను సరఫరాచేయగా మూడవది హిందీ భాషలో రఫరా చేయుచుండును. మొదటిది భారతదేశములో ప్రచురింపబడు వార్తాపత్రికల సమష్టి యాజమాన్యము క్రింద నడుపబడుచుండగా రెండవది కొన్ని వార్తాపత్రికల యాజమాన్యమునను మూడవది ఆ సంస్థలో పనిచేయు సహకార సంఘసభ్యుల యాజమాన్యమునను నడుపబడుచున్నవి. ఇవికాక వార్తలతోపాటు వ్యాసములను పత్రికలకు అందజేయు మరికొన్ని సంస్థలుగలవు. వీటిలో ఇండియాన్యూస్ అండ్ ఫీచర్ ఎలయన్స్, ఇండియా ప్రెస్ ఏజన్సీ, "ఈస్టరన్ ఇండియా ప్రెస్ ఏజన్సీ మొదలైనవి కొన్నిమాత్రమే.

ఈ జాతీయ ఆంగ్ల హిందీ వార్తాసంస్థలుగాక వివిధ వార్తాపత్రికలు ప్రచురింపబడు రాష్ట్రములలోని రాజధానీ నగరములందును ఇతర నగరములలోను దేశరాజధానియైన ఢిల్లీలోను తమతమ ప్రత్యేక స్వకీయ విలేఖరుల నేర్పరచుకొని వారిద్వారా ప్రత్యేకవార్తలను సేకరించి ప్రచురించుచుండును. ఇట్లే విదేశములలోకూడ తమతమ విలేఖరులను నియమించుకొని, వారిద్వారా అచ్చటి సంఘటనములను గూర్చిన వార్తలను వ్యాసములను సేకరించి ప్రకటించుచుండును. పత్రికల ప్రతిభయు పలుకుబడియు సమర్థులైన ఇట్టి విదేశీయ విలేఖరులు సరఫరాచేయు విలువగల వార్తల మీదను వ్యాసములమీదను విశేషముగా ఆధారపడియుండును. కొన్ని పెద్దపత్రికలు వివిధరంగములలో వార్తలు సేకరింపగల సమర్థులైన విలేఖరులను నియమించి వారిద్వారా తమ పాఠకుల ప్రత్యేక అభిరుచులకు అనుగుణమైన వార్తలను విశేషములను అందజేయుచుండును. ఉదాహరణమునకు పారిశ్రామిక వాణిజ్య రాజకీయ సైనిక రంగములు.

పత్రికలకు వార్తలను అందజేయు సంస్థలలో రాష్ట్రప్రభుత్వ పౌర సంబంధ సమాచారశాఖలు కేంద్రపౌర సంబంధశాఖ కొన్ని పెద్దపెద్ద వాణిజ్య పారిశ్రామిక సంస్థలేర్పరచుకొను పౌర సంబంధశాఖలుకూడ చేరియుండును. ఈ సంస్థలు ప్రభుత్వశాఖలు పత్రికలతో వీలైనంత ఎక్కువగా సహకార సంబంధములను సంపాదించుకొని వాటికి సంబంధించు వార్తలను విశేషములను ప్రచురింపచేయుచుండును. ఈ విధముగా వర్తమానకాలములో పత్రికల వార్తాసేకరణ కార్యక్రమము బహుళార్థ ప్రయోజనములను సాధింపగలదిగా విస్తృతి చెందినది. ప్రపంచములో విజ్ఞానశాస్త్ర పరిజ్ఞానము అర్థశాస్త్ర పరిజ్ఞానము అంతర్జాతీయ సహకార భావము హెచ్చుచున్నకొలది ఆయారంగములలో వార్తాసేకరణ ప్రచార ప్రచురణ మార్గములలో విప్లవాత్మకమైన పరిణామములు ఘటిల్లుచుండును.

వార్తాప్రసారము :- దినపత్రికల ప్రధాన కర్తవ్యము వార్తల ప్రచురణము. ఈ వార్తావిశేషములు క్రమబద్ధముగ శీఘ్రముగ పత్రికలకు చేరుట ముఖ్యమైన విషయము. తంతి విధానము ఆచరణములోనికి రాకముందు వార్తలు పోస్టు ద్వారా అందుచుండెడివి. తంతివిధానము భారతదేశములో ప్రవేశపెట్టబడిన తరువాత ముఖ్యమగు వార్తలన్నియు సాధారణముగా తంతిద్వారానే సరఫరా చేయబడుచు వచ్చినవి. ఒక ముఖ్యపట్టణమునుండి ప్రచురింపబడు వార్తాపత్రికలమధ్య పోటీ ఎక్కువగ నుండుటచే పత్రికలన్నియు వార్తలను తంతి ద్వారానే తెప్పించుకొనుచుండును.

పోస్టు తంతి మార్గములేకాక కొన్ని సంవత్సరములనుండి కొన్ని పెద్దపత్రికలు ముఖ్యకేంద్రములలో ప్రత్యేకముగ తమ శాఖా సంస్థలను ఏర్పరచుకొని ఆ కేంద్రము

లకును తమ పత్రికా కార్యాలయములకును నడుమ టెలి ప్రింటర్ తీగలను ఏర్పాటు చేసికొనుట జరుగుచున్నది. టెలి ప్రింటర్ ద్వారా వార్తలు ఒక కేంద్రము నుండి టైపు చేసిన వెంటనే పత్రికా కార్యాలయమునకు అందుటవలన త్వరిత గతిని వార్తలను ప్రచురించుటకు అవకాశముండును. వార్తా పత్రికలే కాక ముఖ్యవార్తా సంస్థలకు గూడ వివిధ కేంద్రములలో టెలిప్రింటరు సౌకర్యము నమకూర్చుకొని వరుసగా వార్తలను ప్రసారము చేసికొనుచున్నవి.

ఒక దేశమునుండి మరియొక దేశమునకు రేడియో టెలిఫోన్ వార్తలను అంతర్జాతీయ వార్తాసంస్థలు కేబుల్ ద్వారా ప్రసారము చేయును. కొన్నిదేశములలో వార్తా సంస్థలు పత్రికా ప్రతినిధులు పంపు తంతులకు మామూలు తంతులకంటె అధిక ప్రాధాన్యమిచ్చుటకు ఏర్పాటుండును. మామూలు తంతులకంటె వార్తలను సంబంధించు తంతులకు చార్జీ తక్కువగనుండును. ప్రభుత్వ సమాచారశాఖలు ప్రభుత్వ రంగమునందలి విషయములను స్థానిక వార్తాపత్రికలకు వెంటనే అందునట్లుగా ప్రత్యేక శ్రద్ధచూపుట కద్దు. కేంద్రప్రభుత్వ సమాచారసంస్థ దీనికై దేశములోని వివిధ రాష్ట్రముల ముఖ్యపట్టణములలోను ముఖ్యపట్టణములు కాని పత్రికా కేంద్రములలోను ప్రత్యేక కార్యాలయముల నేర్పాటు చేసి కొనినది.

సంపాదకీయము ప్రపంచములోను తమ దేశము లోను రాష్ట్రములలోను తమ స్థానికముగను జరుగు సంఘటనలపై ఎప్పటికప్పుడు వ్యాఖ్యానించుట పత్రికల బాధ్యతలలో ఒకటి. ఈ వ్యాఖ్యలు సంపాదకీయ వ్యాసముల ద్వారాగాని ప్రత్యేక వ్యాసముల ద్వారాగాని ప్రజా శాసకులకు అందజేయబడుచుండును. పత్రికా సంపాదకీయములు ఆయా పత్రికల విధానమునకు అనుగుణముగనుండును. ఆ విధానమును ప్రజలచే అంగీకరింపజేయుట పత్రికా సంపాదకుల ధ్యేయము. ఈ కాలమున చెప్పుకొనదగిన పత్రికలు ఏ ఒక రాజకీయ పక్షమునకో లేక ఆర్థిక వర్గమునకో ఏ ఒక సాంఘిక వర్గమునకో సానుభూతి కలిగి వాటి విధానములను ప్రచారము చేయుట చూచుచున్నాము. వాటివాటి విధానముల కనుగుణ్యముగా సంపాదకీయ వ్యాసములను వ్రాయుట కూడ జరుగుచున్నది. కొన్ని తాత్కాలిక ఆర్థిక సాంఘిక రాజకీయ విషయములపై ఎల్లప్పుడు వ్యాఖ్యానములతో నిర్భయముగ నిష్పాక్షి కముగ గూడ వ్యాఖ్యానించు పత్రికలుకూడ కొన్ని గలవు.

సంపాదకీయ వ్యాఖ్యలకు పత్రికా సంపాదకులు ప్రత్యేక బాధ్యతలు కలిగియుందురు. పత్రికలయందు ప్రచురింప బడు ప్రతివిషయమునకును వారిపై చట్టబద్ధమైన బాధ్యతఉన్నను సంపాదకీయ వ్యాసములయందలి వ్యాఖ్యలయెడల వారి బాధ్యత ప్రత్యేకమైనదిగను, మైనది. వార్తలు వీలైనంత వరకు ప్రాథమికంగా తెలుపవలెను. జరిగిన విషయమును గూర్చియు జరుగుచున్న విషయమును గూర్చియు అవి ఇదివరకే జరిగినట్లుగ లిఖింపబడవలయు. అవసరమున్నచో అట్టి వార్తలను పత్రికాధిపతులు దృష్ట్యా సంపాదకీయముల ముఖ్యముగా విమర్శింపవలసి యుండును. కనుక సంపాదకీయ వ్యాసములను వ్రాయువారు పత్రికా విధానమందును నిర్వహణమందును దీర్ఘానుభవముగలవారై యుండవలెను. రాజకీయ వార్తాపత్రికా సంపాదకులు ప్రపంచ రాజకీయ సంఘటనలను క్షుణ్ణముగా అవగాహన చేసికొన్న వారుగా ఉండ వలెను.

సంపాదకీయ వ్యాసములద్వారానేకాక ఆయా విషయ ములపై వ్యాఖ్యానించుటకు ప్రత్యేక రచయితలను నియ మించుట పత్రికాధిపతులకు పరిపాటియైనది.

భారత స్వాతంత్ర్యోద్యమము సాగుచున్న కాలములో పెక్కురు పత్రికా సంపాదకులు తమ పత్రికలద్వారా జాతీ యోద్యమమును బలపరచుట తమ ప్రధాన కర్తవ్యముగ భావించుచుండెడివారు. అట్టి సంపాదకులకు వ్యక్తి ప్రాధా న్యము హెచ్చుగ ఉండెను. కాని ఇటీవల కలిగిన మార్పులవలన అట్టి ప్రాధాన్యము తగ్గుచు వచ్చినది. విశిష్టమైన వాగ్ధాటిగల మాన పత్రికా సంపాదకుల కీర్తిప్రతిష్ఠలు వ్యక్తిత్వము ఈనాడు దినపత్రి కల సంపాదకులలో చాలమందికి మరుగున పడినది. దీనినిగురించి ఇండియన్ ప్రెస్ కమీషనువారు (1953-1954) కూడ కొంత అలజడిని వ్యక్తపరచిరి. పత్రికా సంపాదకుని స్వేచ్ఛను తిరిగి నెలకొల్పుటకై మార్గముల నన్వేషించుట పత్రికా ప్రపం చములో ఒక సమస్యాంశముగా నేడు పరిగణింపబడు చున్నది.

దా. వెం. హ.

## వార్నిషుల టెక్నాలజీ

వార్నిషు అనగా వస్తువుల ఉపరితలములపై పూతగా ఉపయోగించు ఒకరకమైన ద్రవసమ్మేళనము. ఇది ఆరిన

లు పరిశీలించిన వృక్షపుగామం కలిగి ఉంటు కట్టి పారంపర్య పొరగా వేస్వడును

వార్నిషుల చరిత్ర ప్రాచీన కాలము అతిప్రాచీన చరిత్రయందు ఎరుగబడి యున్నది ఇది మొదట ఈజిప్టు దేశములో ప్రారంభమై యుండునని భావింపవచ్చును

వార్నిష్ అను శబ్దోత్పత్తికి ఈజిప్టు చరిత్రయందొక సుదీర్ఘమైన గాథ కలదు అది ఇచట అప్రస్తుతము నేడు వార్నిషు అను పదమును రెజినులకు మాత్రమేకాక డ్రైయర్సుకు పలుచనచేయు ద్రవములకు (Thinners) సమ్మేళన ద్రవ్యములకు ఉపయోగించుచున్నారు

ఈజిప్టుదేశస్థులు బహుశః సాంద్రపు రెజినులు లేక ఒలియో రెజినులు అను పదార్థములను అవిసెనూనెను ఉపయోగించి మేలైన వార్నిషులను తయారుచేసి యుండురు వారు మొదట పలుచన చేయు ద్రవములను వాడెడి వారేకాదు ఈజిప్టులోని శవపేటికలపై వార్నిషులను చేతి వ్రేలితోగాని వెడల్పుగానుండు చంచాలతోగాని పూసెడివారట! మస్టిక్ ఒలిబనమ్ అను రెజినులు ప్రాచీనమైన తూర్పు దేశముల వారికి సులభముగా దొరకియుండవచ్చును వీటిని చూర్ణముచేసి వేడి కడ్డీలతో కరగించి వస్తువుల ఉపరితలములపై మెరుగు పెట్టెడి వారు

అపెలెస్ ప్రాక్సిటెలిస్ అను జాతులవారు వర్ణచిత్రములకు శిల్పములకు రెజినులతో మెరుగు పెట్టుట నభ్యసించిరి వీటికిగూడ పైనుదహరించిన రెజినులనే వాడుచుండెడి వారు రంగులను కరగించిన మైనములలో వీటిని కలిపి ద్రవ్యరూపము లోనే కుంచెలతో వేసెడి వారు చల్లారిన తరువాత ఉపరి తలమును కొద్దిగా వెచ్చచేసినచో అవి ఎనామిల్ పూత వేసినట్లగుపించెడివి కొందరు రంగుమైనపు కడ్డీలనే వెచ్చని ఉపరితలములపై రంగులువేయుట కుపయోగించెడివారట! తరువాత కరిగిన మైనములో రెజినులను కూడ కలుపుటచే ఈ రంగులకు మెరుపుదనము అధికమైనది

ప్లినీ అనువాతడు రెజినులను కరగించు ద్రావణులుగా నూనెలను కూడ వాడవచ్చునని పేర్కొనెను ఈతనికంటె ముందుగనే డిస్కొరైడ్ అనునతడు అక్రోటు గసగసాలనూనెను అరుట కుపయోగించు నూనెలుగా పేర్కొనెను

యూరపు ఖండములో వార్నిషులను తయారుచేయు ప్రాథమిక సూత్రములను 10-11 శతాబ్దములలో మొట్ట మొదటగా థియో ఫిలస్ ప్రెస్బిటర్ అనువాడు ఒకానొక తన గ్రంథములో పేర్కొను రెజినును ద్రవీకరించి వేడిగానున్న అవిసెనూనెలో కరగించగా వచ్చుద్రవములో ఎంతోకొంత స్పిరిటును చెందువరకు వేడిచేసెడివారు తరువాత రెజిన్ పరిమాణమునకు రెట్టింపు ఉండునట్లుగా వేడినూనెను కలిపెడి వారు అప్పుడేర్పడిన వార్నిషును ఆప్పటి పద్ధతులవలెనే పరీక్షించి చిక్కగను వెచ్చగను ఉండుదానిని కుంచెలతోకాక వ్రేలితోనే ఉపరితలములపై మెరుగుపెట్టెడివారు క్రీ శ 1888 లో ఆల్కేరియస్ అనునాతడుగూడ ఇట్టి విధానమునే వివరించెను

క్రీ శ 1410 ప్రాంతములో జన్వన్ ఐక్ అను కళా కారుడు రచించిన వర్ణచిత్రములు చాలకాలము భద్రముగా నుండుటకు పూర్తియైన వర్ణచిత్రములపై వేసిన ఒలియో రెజిన్ వార్నిషులే కారణముగాని చిత్రములకు వాడిన రంగులు కాదని ధృవపడినది

క్రీ శ 1520 లో కవచములు విల్లులు మొదలగు వాటికి వేయు వార్నిషులను తయారు చేయుటకు రోజిన్ అను దానిని సాండరక్ అను పదార్థముతో కలిపి అవిసెనూనెలో కరగించెడివారు అంతేగాని పలుచనచేయు ద్రవ్యములను వాడలేదు చరిత్రను పరిశీలించగా క్రీ శ 9 నుండి 15 వ శతాబ్దివరకు వాడిన మాసు బు వార్నిషులలో తేలికగా కరగు రెజిన్‌గాని సాండరక్‌గాని మస్టిక్‌గాని లేక రెండును గాని అవిసెనూనెలో కరగించబడి దానిలో సాధారణముగా కొంత రోజిన్‌కూడ కలుపబడి యుండెడిది 1575 లో మరల అంబరు అనుదానిని అవిసెనూనెలో కరగించి తరువాత థియో ఫిలస్ విధానముప్రకారము మిగతానూనెను కలిపెడివారని వ్రాయబడినది 1650 లో మార్గ్రేవియేట్లోనున్న ఆల్బర్టి అను వాతడు అంబరును అవిసెనూనెలో కరగించి తయారుచేసిన వార్నిషుకు కర్పూరతైలము పలుచనచేయు ద్రవముగాకూడ వాడవచ్చునని తెలుపుటకుముందు ద్రవీకరణ విధానమును గూర్చి ఎవరికిని తెలియదు

1773 లో వాటిన్ అనునతడు ప్రప్రథమముగా ప్రస్తుతము వాడుకలోనున్న రంగుల యొక్కయు వార్నిషుల యొక్కయు పారిశ్రామిక విధానములనుగూర్చి వ్రాసెను కోపాల్ అను ముదురురంగు వార్నిషు తయారీలోకూడ ఆంగ్లేయులు [illegible] వారు ప్రపంచములో మొదటి [illegible]

ఇంగ్లాండులో 1790 లో నెలకొల్పబడినది. ఎమ్మట (1820) ఫ్రాన్సులోను జర్మనీ (1880) లోను ఆస్ట్రియా (1848) లోను ఇట్టి కర్మాగారములు వెలసినవి. వార్నిషులనుగూర్చిన పరిశోధనలు విరివిగా 80 సం॥ల నుండి జరుగుచున్నవి.

**వార్నిషుల రకములు** వార్నిషుల తయారీలో ఉపయోగించు పదార్థములనుబట్టి అందు వివిధరకములు కలవు.

**నూనె వార్నిషులు** డ్రైయరులు చేర్చబడిన డబుల్ బాయిల్డ్ నూనెలను వార్నిషులందురు.

**ఓలియోరెజినస్ వార్నిషులు** వీటిలో నూనె స్వభావసిద్ధముగ దొరకు రెజినులుగాని కృత్రిమముగా తయారుచేయు రెజినులుగాని యుండును.

**స్పిరిటువార్నిషులు** సారాయివంటి ద్రావణిలో స్వాభావిక రెజినులను గాని కృత్రిమ రెజినులనుగాని కరగించగా ఏర్పడునవి స్పిరిటు వార్నిషులు.

**బేకింగు వార్నిషులు** అతి తక్కువగగాని తగుమాత్రముగగాని నూనెల నుపయోగించి తయారుచేసిన వార్నిషులు బేకింగు వార్నిషులనబడు చున్నవి.

**వార్నిషుల తయారీకి అవసరమగు పదార్థములు**

**(అ) నూనెలు**

**అవిసెనూనె** దీనిని తయారుచేసిన వెంటనే ఉపయోగించరు. కొంత కాలము నిలువయుంచినచో మడ్డిఅడుగునకు దిగును. భారతదేశపు అవిసెనూనెను వేడిచేసినచో మరికొంత మడ్డిదిగును. వార్నిషుతయారీకి ఈనూనెను కొన్నిసంవత్సరములు నిలువయుంచుదురు.

**టంగ్‌నూనె** – దీనిని 'చైనాకర్రనూనె' అనికూడ అందురు. దీని పచ్చినూనె త్వరగా ఆరను. అమెరికాలో దీనిని విరివిగా వాడుదురు. దీనితో తయారగు వార్నిషులు నీటిని వోరపీయవు; మన్నిక తక్కువ.

**చేపనూనె** – దీనిని ఇతరనూనెలతో కల్తీచేయుటకు మాత్రమే వాడుదురు.

**సోయా చిక్కుడునూనె** దీనిని అవిసె నూనెతోగాని, టంగ్‌నూనెతోగాని కలిపి వాడుదురు. విడిగా వాడినచో త్వరగా ఆరదు.

**నిర్జలీకరణఆముదము** – ప్రస్తుతము వార్నిషులతయారీలో దీనిని గూడ ఉపయోగించు చున్నారు.

**(ఆ) రెజినులు**

**స్వాభావిక రెజినులు (షెల్లక్)** భారత దేశములోను పొరుగు దేశములలోను గల అత్తిచెట్లయొక్క లేతకొమ్మల నుండి స్రవించు ద్రవమును షెల్లక్ అందురు. ప్రాచీన భారత దేశమునందు వాడిన లత్తుక (lac) ఎక్కడ దొరకెడిదో తెలియరాదు. లక్కపురుగునుండి రంగు రెజిన్ కలసిన ఒక పదార్థము స్రవించుచుండును. ఈ పురుగునుండి వచ్చు షెల్లక్‌ను ప్రాచ్యదేశస్థులు ఆభరణములలోను వార్నిషుల తయారీలోను చాలకాలమునుండి వాడియున్నారు. కృత్రిమముగా రంగులతయారీని కనిపెట్టకముందు లక్కరంగు వ్యాపారరంగములో ఇది చాల విలువైన పదార్థముగానుండెడిది. యూరపు దేశములలో మొదట 17 వ శతాబ్దియందు ఈస్టుండియా కంపెనీవారు దీనిని ప్రవేశపెట్టిరి. ఆ తరువాత ఇది ప్రపంచములో చాలవిలువైన వర్తక పదార్థముగా మారినది. ఇంగ్లండు ద్వారా అమెరికాలో ఇది ప్రవేశపెట్టబడినది. 19 వ శతాబ్ది ప్రారంభములో పాశ్చాత్యప్రపంచము ఈ లక్కరంగలో చాల ఆసక్తిని కనపరచినది. కాని 1890 ప్రాంతమున దీనివిలువ ఒక్కసారిగా పడిపోయి రెజిన్ ఎగుమతి ప్రాముఖ్యములోనికి వచ్చినది.

**అరిపూస (Rosin)** అవిసెనూనె తరువాత వార్నిషుల తయారీలో ఇది విరివిగా ఉపయోగించ బడుచున్నది. దేవదారుచెట్లనుండి స్రవించుద్రవముతో దీనిని తయారు చేయుదురు. ఆద్రవమును నిలువచేసి శుద్ధియొనర్చి ఆవిరిగాని శూన్యములోగాని స్వేదనము చెందించుదురు. కర్పూరతైలము ఆవిరియైన తరువాత అరిపూస వేరుచేయబడును. రోజిన్ స్పిరిటును కర్పూర తైల ప్రతినిధిగా వాడుదురు.

**అండమాన్ రెజిన్ :** ఇది అండమాన్ దీవులయందలి అడవులలోగల ఒక విధమైన చెట్టునుండి లభించును. ఇది లేత పసుపు రంగునుండి ముదురుగోధుమ రంగువరకు వివిధ వర్ణములలోనుండును.

**డామర్** ఇది ఈస్టిండీస్ మలయా సయాము దీవులలోనుండు డామర్ ఓరియంటలిస్ అనుచెట్టునుండి స్రవించు ద్రవము. ఇది కొంత మైనమును గూడ కలిగియుండును. ఇది కర్పూరతైలము తెల్లస్పిరిటులలో కరగునుగాని ఆల్కహాలులో కరుగదు. ఇది అరుదుగా వాడబడినను, కరగించకుండగనే నూనెలలో కలుపుట కష్టముగానుండును. దేశపటములు, కాగితములు మొదలగు వాటికై వాడబడు వార్ని

షులలో దీని నుపయోగింతురు

**కోపల్** ఇది కొన్నిరకముల చెట్ల ద్రవములనుండి లభించును జాంజిబారు (ఆఫ్రికా)నుండి వచ్చు కోపల్ అగ్రశ్రేష్ఠమైనది ఫిలిప్పైనుదీవులలోను న్యూజిలెండులోను లభించు కోపల్ కూడ ఉపయోగకరమైన వార్నిషు రెజినులే

**రాసాయనిక పు రెజినులు**

**ఆల్కిడ్ రెజినులు** థాలిక్ ఎన్‌హైడ్రైడు వంటి పోలిబేసిక్ ఆమ్లములు గ్లిసరాల్ వంటి పోలిహైడ్రిక్ ఆల్కహాలులు ప్రతిక్రియ చెందగా లభించు ఫలమును మామూలు నూనెలతోగాని అరుటకుపయోగించు నూనెలతో గాని మార్పు చెందించగా ఏర్పడు పదార్థములను ఆల్కిడ్ రెజినులని అందురు

**ఫినాలిక్ రెజినులు:** ఫినాల్‌గాని బిస్‌ఫినాలుగాని ఫార్మల్‌డిహైడ్ వంటి ఆల్‌డిహైడ్‌లతో ప్రతిక్రియ చెందగా ఏర్పడు పదార్థములను ఫినాలిక్ రెజినులని అందురు

**ఎమినో రెజినులు** యూరియా మెలమిన్ వంటి ఎమినో పదార్థములను ఆల్‌డిహైడ్లతో స్వేదనము (condensation) చెందించగా ఏర్పడు పదార్థములను వివిధములైన ఆల్కహాలులలో ప్రతిక్రియచెందించి కావలసినమేరకు పోలిమెరైజు చెందించినపుడేర్పడునవి ఎమినో రెజినులు

**ఇపాక్సి రెజినులు** ఎపిక్లోరోహైడ్రిన్ అను రసాయన పదార్థమును బిస్‌ఫినాలుతో స్వేదనము చెందించగా ఇవి ఏర్పడును

**వినైల్ రెజినులు** వినైల్ ఎసిటేటును గాని వినైల్ క్లోరైడును గాని లేక ఈరెండింటి మిశ్రమమునుగాని పోలిమెరైజుచేసినపుడివి ఏర్పడును

**సిలికన్ రెజినులు** సిలికన్ ఆమ్లజని అణువులు మిథైల్ లేక ఫినైల్ అణువుల సంయోగముచే లభించు పదార్థమే సిలికన్ రెజినులు

**ఎక్రిలిక్ రెజినులు** మిథైల్ మెథక్రిలేట్‌వంటి మోనోమరులను ఉత్ప్రేరకము (catalyst) యొక్క సమక్షములో వేడిచేసినపుడు అవి పోలిమెరైజుపొంది ఎక్రిలిక్ పోలిమర్ ఎస్టరులుగా మారును వీటినే ఎక్రిలిక్ రెజినులు అనియందురు

**మాలిక్ రెజినులు:** మాలిక్ ఎన్‌హైడ్రైడ్ రోజినులు ప్రతిక్రియ నొందగా ఏర్పడుపదార్థములు మాలిక్ రెజినులు అనబడును

**కుమర్ రెజినులు** కౌమరిన్ గాని, ఇండీన్ గాని ఈరెండింటి మిశ్రమమునుగాని పోలిమెరైజ్ చెందించగా ఏర్పడునవే కుమర్ రెజినులు

**ద్రావణులు - పలుచన చేయుపదార్థములు** కర్పూరతైలము పెట్రోలియము శుద్ధిచేయుటలో వచ్చునాఫ్తా టోలాల్ బెంజాల్ క్సైలాల్ ఎథిల్ ఆల్కహాల్ బ్యుటిల్ ఆల్కహాలు సైక్లోహెక్సనాల్ ఎథిల్ ఎసిటేట్, బ్యుటిల్ ఎసిటేట్ ఎమిల్ ఎసిటేటు మెథిల్-ఎథిల్ కిటోన్ వైట్ స్పిరిట్ మొదలయినవి ద్రావణులుగాను పలుచన చేయు పదార్థములుగాను ఉపయోగించబడును

**మృదుత్వము నిచ్చు పదార్థములు** డైబ్యుటిల్ థాలేటు ట్రెక్రిసిల్ ఫాస్ఫేటు డైబెంజైల్ థాలేట్ డై ఆక్టైల్ సెబకేట్ డైబెంజైల్ సెబకేట్ ఆల్కైల్ రిసినోలియేట్‌లు కర్పూరము మొదలైనవి వార్నిషుల తయారీలో మృదుత్వమును పెంపొందించుటకు వాడబడుచున్నవి

**త్వరగా ఆరుటకుపయోగించు పదార్థములు** సేంద్రియామ్లములలో తయారైన కరువగు లోహపు సోపులను డ్రైయర్లుగా ఉపయోగింతురు వీటిని తయారుచేయుటలో సాధారణముగా సీసము కోబాల్టు మాంగనము ఇనుము యశదము అను లోహములను వాడుదురు వీటితో ముఖ్యముగా అలిసెనూనెలోని కొవ్వుగల ఆమ్లములను రోజిన్ నాఫ్తానిక్ ఆమ్లములను టాల్‌నూనెలోని ఆమ్లములను, ఆక్టోయిక్ ఆమ్లములను ఉపయోగింతురు ఈ ఆమ్లములతో ఏర్పడిన సోపులను వరుసగా లినోలియేట్లు రెజినేట్లు నాఫ్తనేట్లు టాలేట్లు ఆక్టోయేట్లు అనియందురు

పైన పేర్కొనబడిన సోపులను ఖనిజస్పిరిటులో కరగించి కావలసిన మేరకు లోహశాతముండునట్లు బజారులో అమ్ముదురు ముఖ్యముగా ఉపయోగించు డ్రైయర్లలోని శాతము క్రింది విధముగ నుండును నూనెలో 0 6 శాతము సీసము 04 శాతము కోబాల్టు 004 శాతము మాంగనమును ఘనరూపములోనున్న రెజినులో 0 8 శాతము సీసము, 08 శాతము కోబాల్టును ఉండును

**వార్నిషుల తయారుకుపయోగించు పాత్రలు :** వార్నిషులు తయారుచేయుటకు స్థిరముగా నుండునవి, కదల్చుటకు

వీలుగా నుండునవి కొన్ని పాత్రలవసరము స్థిరముగా నుండు పాత్రలను నూనెలను తయారు చేయుటకును పెద్ద మొత్తములలో వార్నిషులను తయారు చేయుటకును ఉపయో గింతురు దల్చుటకు వీలుగానుండు పాత్రలను ఓలియో రెజిన్ వార్నిషులను తయారుచేయుట కుపయోగింతురు వీటిని ఒ వలసిన స్థలములకు కొనిపోవుటకు లిఫ్టింగ్ సాధన ముండును ప్రతి పాత్రయందును ఒక ఉష్ణమాపకము ఉష్ణో గ్రతను గుర్తించి తెలియజేయు మరియొక సాధనము వెనుక గోడల కమర్చబడియుండును

రంగు ప్రాముఖ్యములేని వార్నిషులను తయారు చేయుటకు ఈ పాత్రలను ఇనుముతోగాని ఉక్కుతోగాని చేయుదురు వాటి అడుగు భాగములు అవసరమైనపుడు తొలగించి తిరిగి పెట్టుటకు వీలుగానుండి రాగితోచేయబడును వార్నిషుల రంగు ప్రధానవిషయమైనపుడు స్టైయిన్‌లెస్ స్టీలు పాత్రలను వాడుదురు చవుకగా దొరకు అల్యూమినియము పాత్రలుకూడ వాడుకలో నున్నవి వీటి పైశాల్యము 500 1000 2000 గ్యాలనులు పట్టునంత వరకుండును

**వంటగది** వేడిచేయుటకు వీలుగా రెండు వరుసలలో రంధ్రములు గల్గిన పాత్రలు ప్రత్యేకమైన గదులలో ఉంచ బడును ఒక వరుస రంధ్రములపై స్థిరముగానుండు పాత్ర లను మరియొక వరుస రంధ్రములపై కదల్చుటకు వీలుగా నున్న పాత్రలను ఉంచుదురు

పాత్రలను వేడి చేయుటకు కోక్ వంటి ఘనరూప ఇంధనమునుగాని కిరోసిన్ వంటి ద్రవరూప ఇంధనమునుగాని కోల్ గ్యాస్ వంటి వాయు ఇంధనమునుగాని వాడుదురు ఆధునిక ముగా వార్నిషులను తయారుచేయు గదులలో విద్యుచ్ఛక్తిని వాడుచున్నారు

**నిలువచేయుటకుపయోగించు తొట్టెలు** ఉపయో గించు ద్రావకములనుబట్టి ఈ తొట్టెలు వివిధ రంగులలో నుండును వీటిలో కలుపవలసిన ద్రావణి పరిమాణమును సూచించుటకై సాధనములమర్చబడియుండును

**వడపోత** తయారైన వార్నిషులలో ద్రేలాడు మాలి న్యములును కొన్ని అనవసర పదార్థములును ఉండును వీటిని వడపోత వలనగాని సెంట్రిఫ్యూజ్ (కేంద్ర పరాఙ్ముఖము) చేయుటవలనగాని తొలగించుదురు ఇట్టి శుద్ధీకరణము వార్నిషు లకు పారదర్శకము అధికమైన మెరుపుదనముగల పొర నేర్పర చుటలో సహాయపడును

**నిల్వయుంచుట** పూర్తిగా తయారైన వార్నిషులు వ్రగ్గుటకై పెద్ద తొట్టెలలో కొన్ని వారములపాటు నిలువ యుంచుదురు పాత్రలలో రసాయన క్రియ నెమ్మదిగా జరిగి ఈ తొట్టెలలో వార్నిషులతయారీ పూర్తియగును

**నూనె వార్నిషులు** వీటిని మరగించిన నూనెలు అని యందురు నూనెను అది మసలు స్థానమువరకు వేడి చేయరు; సాధారణముగా 150 C వరకు దానిని కాచుదురు దీనిని వేడి చేయునపుడు ఇందులోనుండి గాలిని పంపుదురు ఈ వేడి నూనెకు పైనుదహరించిన డ్రైయర్లను చేర్చుదురు భారత దేశములో మంచిరకపు నూనె 6 గంటలలోను పేల్ బాయిల్డ్ నూనె 10 గంటలలోను ఆరును మరగించిన నూనె పచ్చినూనె కంటె త్వరగా ఆరి గట్టిపొర నేర్పరచును

**ఓలియో రెజినస్ వార్నిషులు – స్వాభావిక రెజిన్ వార్నిషులు** మొదట ఈ స్వాభావిక రెజినులలో కోపల్ గాని కాంగోరెజిన్‌గాని ఒక పాత్రలో తీసికొని దానిని చాల జాగ్రత్తగా కరగించుదురు పాత్ర అడుగున ఒక ద్రవపు పొర ఏర్పడువరకు నెమ్మదిగా వేడిచేయుచు మొత్తము రెజి నంతయు కరగువరకు కలుపుచుందురు సుమారు 1½ గంటలలో ఉష్ణోగ్రత 343 C వచ్చువరకు వేడిచేసి ఈ ఉష్ణోగ్రత సుమారు అరగంట వరకు స్థిరముగా నుండునట్లు చూచుదురు ఇట్లు వేడి చేయుటవలన రెజిను బరువులో సుమారు 20 శాతము తగ్గును మెరకగానున్న పళ్లెములో కరగిన రెజినును పోసి నెమ్మదిగా గడ్డకట్టువరకు ఉంచుదురు తరువాత దానిని చిన్నచిన్న ముక్కలుగా చేయుదురు ఇట్లు కరగించు విధానమును రన్నింగ్ అందురు

పై విధముగా కరగించిన రెజిను బరువునకు రెట్టింపు బరువుగల అవిసె నూనెను కలిపి 300 C వరకు వేడి చేయుదురు ఆ ఉష్ణోగ్రత అధమము 20 నిమిషముల వరకు స్థిరముగా నుండునట్లు చూచుదురు తరువాత దానిని 200°C వరకు చల్లార్చి వెంటనే మొదట తీసికొనిన రెజిను బరువునకు మూడు రెట్లు బరువుగల ఖనిజ స్పిరిటులను చేర్చి తయారీకరణము పొందించుదురు

తయారైన ప్రతి 100 గ్రాముల వార్నిషుకు 0 5 శాతము సీసమును 0 02 శాతము కోబాల్టును, 0 01 శాతము మాంగ నీసును చేర్చుటకై 24 శాతము లెడ్ నాఫ్తనేటు 6 శాతము

కోబాల్టునాఫ్తనేటు 6 శాతము మాంగనీసు నాఫ్తనేటు అను డ్రైయర్లను కలుపుదురు తయారైన వార్నిషు ముగ్గుటకు కొంత కాలము నిల్వయుంచి తరువాత దానిని బజారులో అమ్ముదురు

**రాసాయనికముగా తయారైన రెజినుతో వార్నిషుచేయుట** రెజినును తయారుచేయుట అనేకవిధానములు గలవు ఉదాహరణకు ద్రావణి (solvent) పద్ధతిని బట్టి అల్కిడ్ రెజిను తయారీ దిగువన వివరింపబడినది

కొంత అవిసె నూనెను దాని బరువులో 4 రవ వంతు గ్లిసరినును గ్లిసరినులో 56 వ వంతు కాల్షియం ఆక్సైడును ఒక పాత్రలో కలిపి ఆ మిశ్రమములోనుండి కర్బనద్విఆమ్ల జనిదవాయువును పంపుచు 240 C వరకు వేడి చేయుదురు ఈ ఉష్ణోగ్రతను సుమారు అరగంట వరకు స్థిరముగా నుంచుదురు మొదటి మిశ్రమము యొక్క మొత్తము బరువులో సుమారు 8వ వంతుకంటె కొంచెమెక్కువగా థాలిక్ ఎన్‌హైడ్రేడును 6వ వంతు బరువుగల ఖనిజ స్పిరిటును కలుపుదురు ఈ మిశ్రమ పదార్థములన్నిటిని రిఫ్లక్స్ అగు వరకు వేడి చేయుదురు ప్రతిక్రియ సుమారు ౨ గంటలు జరుగును అంత వరకు ఉష్ణోగ్రతను స్థిరముగా నుంచుదురు పాత్రలో అప్పుడున్న ద్రవము 60 శాతము వచ్చువరకు దానిని చల్లార్చుదురు ఈ ద్రవములో ప్రతి 100 గ్రాములకు 0 86 గ్రాముల లెడ్ నాఫ్తనేట్‌ను 0 14 గ్రాముల కోబాల్టు నాఫ్తనేటును కలిపి కరగించుదురు

ఈవిధముగా తయారైన రెజినుతోకూడ స్వాభావిక రెజిను వార్నిషును తయారు చేసినట్లే వార్నిషును తయారు చేయుదురు

**స్పిరిటు వార్నిషులు** వీటికి షెల్లక్ వార్నిషు మంచి ఉదాహరణము షెల్లక్ లక్కవంటి స్వాభావిక రెజినులను తేలికగా ఆవిరియగు ద్రావణులలో వేడిచేయగాని చేయకగాని కరగించి తయారుచేయుదురు రెజినులను ద్రావణులతో కలిపి కవ్వమువంటి సాధనముతో బాగుగా మధించుచో అది కలిసిపోవును లేదా ద్రావణిలో రెజినులను కలిపి కొద్దిగా వెచ్చచేయుదురు షెల్లకను మిథిలేటెడ్ స్పిరిటులో కరగించగా ఏర్పడు ద్రావణమును ఫ్రెంచిపాలిష్ అను పేరుతో అమ్ముదురు

డామరును కర్పూర తైలములో కరగించగా ఏర్పడు వార్నిషులను గూడ ఈ రకమున కుదావరణకుగా చెప్ప వచ్చును రంగులో తేడారాకుండుటకై కర్రతో చేయబడిన కవ్వములనే వాడుదురు

**బేకింగు వార్నిషులు** స్వల్పముగగాని కనుమాత్రము గాని నూనెల నుపయోగించి తయారుచేసిన వార్నిషులను బేకింగు వార్నిషులందురు ఇవి సాధారణ ఉష్ణోగ్రతలవద్ద ఆరవు హెచ్చు ఉష్ణోగ్రతలవద్ద సుమారు రెండుగంటల కాలములో ఆరి ముడుతలులేకుండ నునుపుగా నుండి మెరయుచున్న పొరల నేర్పరచును ఇవి ఆరుటకు పట్టుకాలము ఉష్ణోగ్రతలనుబట్టియు వీటి తయారీలో ఉపయోగించు నూనెనుబట్టియు రెజినులనుబట్టియు ఉండును

ఈ వార్నిషులు వీటిలోని ద్రావణులు ఆవిరగుటవలన గాని గాలిలోని ఆమ్లజని వలనగాని ఏ యితర విధానము నందైనను కలుగు రసాయన క్రియవలనగాని ఆరును స్పిరిటు వార్నిషులు ఆరుటకు వాటిలోని స్పిరిటు ఆవిరియగుట ఒకటే మార్గము

ఓలియోరెజినస్ వార్నిషులు ఆరుటలో ద్రావణి బాష్పీభవనము చెందుటయేగాక నూనెలు పొలిమెరైజ్ చెందుటకూడ ప్రముఖమైన అంశము వార్నిషుల తయారీలో జరుగు లోహ సమ్మేళనమువలన అవి ఆరుటకు అవకాశము కల్గును

వస్తువుయొక్క అసలు పదార్థ ధర్మము తెక్కువ మార్పుచెందక ఉపరితలధర్మములు మాత్రమే వార్నిషుల వల్ల మారును కొయ్య వస్తువులపై వేయబడు వార్నిషులు అవి అరిగిపోకుండగను మచ్చలు పడకుండగను వాతావరణపు మార్పులవలన చెమ్మను పీల్చుకొనకుండగను కాపాడుచుండును లోహములకు పూయు వార్నిషులను లక్కరంగు లందురు లోహములరూపురేఖలను మార్చకుండ వాటి నశింపును ఈ వార్నిషులు తగ్గించును కట్టడములు నీటిని పీల్చుకొని బీటలువారకుండ నుండుటకు గూడ వార్నిషులను పూయుదురు కాగితములపై వార్నిషు పూతవేయుట వలన వాటికి నీటిని పీల్చుగుణము తగ్గి ముద్రణమునకును వ్రాయుటకును అనుకూలముగ నుండును

లేతరంగులకు జలనిరోధకత్వము, వాతావరణ నిరోధకత్వము ఎక్కువగా అక్కరలేనపుడు చౌకగా చేయబడు షెల్లక్ వార్నిషులను వాడుదురు ఓలియోరెజినస్ వార్ని

షులు షెల్లాక్ వార్నిషులకంటె ఎక్కువ నిరోధకత్వమును కలిగి యుండును కాని ఇవి చాలవరకు ముదుగ రంగులో నుండును మంచి వాతావరణ నిరోధకత్వముగల స్పార్ వార్నిషు అను ఓడలకు వాడుకకు పూయుటకు ఉపయోగింతురు ఇవి కూడ ఒక రకమునకు చెందిన ఒలియోరెజినస్ వార్నిషులే వీటిని టంగునూనె ఫినాలిక్ రెజినులతో కలిపి తయారు చేయుదురు విద్యుద్వాహకముగా నుపయోగించు తీగెలను విద్యుద్బంధనము చేయుటకు గూడ వార్నిషుల నుపయోగింతురు వర్ణచిత్రముల కుపయోగించు రంగులలో అనుయాయులుగా వార్నిషులు వాడబడుచున్నవి

గిల్‌సొనైట్ వంటి బిటూమినస్ పదార్థములను ఆరుట కుపయోగించు నూనెతో కలిపి వేడిచేయగా వచ్చిన వస్తువును ఒక ద్రావణిలో కరగించిన ఫలితముగా తయారగు వార్నిషులను ఆస్ఫాల్టు వార్నిషులందురు ఇవి నల్లగా కాంతి నిరోధకమైయుండును లోహములపై చేయు విద్యుద్బంధనపుపూతలకును ఆరుగుదల నిరోధకములకును వీటిని వాడుదురు

లక్కను పదార్థములపై పూసినపుడు మొదట అది పలుచని పారదర్శక పొరగా ఏర్పడి తరువాత గట్టి వార్నిషుగా తయారగును ఈ లక్క 160 F వరకు వేడిచేయనిదే ఆమ్లములవలనగాని క్షారములవలనగాని ఏ విధమైన మార్పుచెందక పోవుటచే అది మంచి రక్షణ నొసగు పైపూతగా ఉపయోగపడును ఇది ఆరుటకు పూర్వమే దీనియందు కొన్ని లోహ ద్రావణములను కలిపి వివిధరంగులలో ఈలక్కను తయారుచేయుదురు లక్కరంగు వేయుట చాల కష్టమైన విధానము ఒక్కొక్క వస్తువును పూర్తిచేయుటకు 300 నుండి 400 వరకు పూతలు పెట్టవలసివచ్చును ఈ పనికి కొన్ని సంవత్సరములు కూడ పట్టుచుండును

డి. శి.

## వాలెస్ ఆల్‌ఫ్రెడ్ రస్సెల్

ఆంగ్లదేశపు జీవశాస్త్రవేత్తయు సంఘసంస్కర్తయు ప్రముఖ అన్వేషకుడును అన వాలెస్ ఆల్‌ఫ్రెడ్ రసెల్ 1823 జనవరి 8వ తేదీన మన్‌మత్‌షైర్‌యందు జన్మించెను అచ్చటి పాఠశాలలో అతడు విద్య నభ్యసించునపుడు భూమి కొలతకు సంబంధించిన విద్యతోపాటు శిల్పశాస్త్రయందు కూడ ప్రావీణ్యమును పొందెను 1840 లో అతడు ఉపాధ్యాయవృత్తియందుండి కూడ వృక్షశాస్త్రమునందు నూతన విషయములను శ్రద్ధతో పరిశోధింప మొదలిడెను ప్రకృతి శాస్త్రచరిత్రనుగూడ అతడు అవగాహన చేసికొన నారంభించెను

1844 45లో వాలెస్ ఉపాధ్యాయుడుగా నుండగా ఆ నికి బేట్స్ అను వానితో పరిచయమేర్పడి అతనిచే ప్రభావితుడై పేడ పురుగులు మున్నగు కీటకములను సేకరించి వాటి జీవితవిధానమును గ్రహింప మొదలిడెను వాలెస్ బేట్సుల మైత్రి దినదినాభివృద్ధి చెందినది ఇరువురును 1848 లో దక్షిణ అమెరికాలోని అమెజాన్ నదీప్రాంతమును పరిశోధించుటకు వెళ్ళిరి ఏడున్నర సంవత్సరములు కలిసి పనిచేసిన తర్వాత ఆ శాస్త్రవేత్త లిరువురు విడిపోయి స్వతంత్రముగా ఎవరికృషిని వారు కొనసాగించిరి తమ పరిశోధనావిశేషములను వారు వేరువేరుగా గ్రంథస్థ మొనరించిరి

దక్షిణ అమెరికానుండి వాలెస్ మాతృదేశమునకు ఓడలో మరలి వచ్చుచుండగా ఆ ఓడ తగులబడి అతడు సేకరించిన అమూల్య వస్తుసముదాయము భస్మమైపోయెను అతడు ధైర్యమును వీడక లోగడ తాను పోస్టుద్వారా పంపిన భోగట్టా సహాయముతో 1853 లో రెండు ఉద్గ్రంథములను ప్రకటించెను

వాలెస్ 1854-62 సం॥ల మధ్య మలయా ద్వీపములలో పరిశోధనములు జరిపి జంతు వృక్ష శాస్త్రములకు సంబంధించిన పెక్కు నూతన విషయములను 1869 లో గ్రంథరూపమున వెల్లడించెను అతడు జీవుల సహజగ్రీకరణము అను నూతన సిద్ధాంతమును కనిపెట్టెను తాను శ్రమించి సంపాదించిన ముఖ్యమైన కీటకసముదాయమును ప్రముఖ శాస్త్రవేత్తయగు హోప్ సేకరించిన కీటకసముదాయమును జతపరచి వాటిని ఆక్స్‌ఫర్డు విశ్వవిద్యాలయమందును బ్రిటిష్ వస్తుప్రదర్శనశాలయందును ప్రదర్శించెను తాను సేకరించిన కీటకసముదాయమును వాలెస్ రెండు వర్గములుగా విభజించెను ఈ విభజనము నతడు జంతువుల జీవనభేదమును బట్టి నిర్ణయించెను

1858 ఫిబ్రవరిలో బోర్నియోద్వీపమందు పర్యటించుచుండిన వాలెస్ తాను కనుగొనిన కీటకముల ఉత్పత్తికి సంబంధించిన నూతనసిద్ధాంతమును ప్రముఖ శాస్త్రవేత్తయగు ఛార్లెస్ డార్విన్‌నకు పంపెను యువ అజ్ఞాత శాస్త్రవేత్తయైన వాలెస్ ఆవిష్కరించిన ఆ నూతన సిద్ధాంతమును

చూచి డార్విన్ ఆశ్చర్యచకితుడై చార్లెస్ లైల్ అను పేరొందిన శాస్త్రజ్ఞునకు వాలెస్‌ను ప్రశంసించుచు లేఖ వ్రాసెను. చార్లెస్ లైల్, జోసెఫ్ హూకర్ అను శాస్త్రవేత్తల సహాయమున వాలెస్ యొక్క మానవ సిద్ధాంతమును డార్విన్ యొక్క మూల సిద్ధాంతముతో జోడించి లిన్నియన్ సొసైటీ వారిముందు 1858 జూలై 1వ తేదీన సుదీర్ఘమైన ఒక వ్యాసమును చదివెను. అది పెక్కురు శాస్త్రవేత్తల మన్ననలను పొందెను.

తాను వ్రాసిన వ్యాసములలో మరికొన్ని విశేషాంశములను జోడించి 1870 లో స్వాభావిక ఎంపికకు జంతువులు-వాటి విశేషములు అను గ్రంథమును ప్రకటించెను. ఈ గ్రంథమునందాతడు కొన్ని సందర్భములలో డార్విన్ మూల సిద్ధాంతములతో భేదించి తన నూతనసిద్ధాంతమును బలపరచుకొనెను. ముఖ్యముగా కీటకముల ఉత్పత్తికిని మానవుల ఉత్పత్తికినిగల భేదమును మానవుల ఉత్పత్తిపై ప్రకృతికిగల ప్రభావమును శాస్త్రీయ దృక్పథముతో అతడు వివరించెను. ఇది వాలెస్‌నకు గల ఆధ్యాత్మిక చింతనకు ప్రబల నిదర్శనమని చెప్పబడినది.

1875 లో ఆత్మ సంబంధమైన నూతన విధానము-మరికొన్ని అద్భుతములు అను ఆధ్యాత్మిక ప్రబోధ గ్రంథమును 1876 లో భౌగోళిక పరిస్థితులననుసరించి జంతువిభజనము అను ఉద్గ్రంథమును అతడు రచించెను. ఉష్ణప్రాదేశిక ప్రకృతి విశేషములు - మరికొన్ని ఇతర వ్యాసములు" అను గ్రంథమును 1878 లోను ఆస్ట్రేలేషియా సముద్రపుదీవులలో జీవిత విధానము అను గ్రంథములను 1879 1880 సంవత్సరముల లోను భూమిని జాతీయము చేయుట డార్వినిజమ్ అను గ్రంథములను 1883 1889 వ సంవత్సరములలోను అతడు ప్రకటించెను. వాలెస్ 19 వ శతాబ్దిలో సల్పిన అన్వేషణములలో తానెదుర్కొనిన జయాపజయముల సమీక్షించుచు విచిత్ర శతాబ్దము అను పేరుతో 1898లో ఒక బృహద్గ్రంథమును వెలువరించెను. ఇంతేకాక 1900 లో ప్రకృతి సాంఘిక శాస్త్రముల అధ్యయనము' అను గ్రంథమును 1903లో సృష్టిలో మానవుని స్థానము అను గ్రంథమును అతడు ప్రకటించెను.

వాలెస్ తన ఆత్మకథను 1905 లోను ప్రపంచము-జీవితము" "దేశకాలముల సాంఘిక పరిస్థితులు - నైతిక ప్రగతి అను గ్రంథములను 1910 లోను ప్రకటించెను. అతని ధీశక్తియు స్వతంత్రభావనయు అపరిమితములై నవి. అతని ప్రజ్ఞాప్రాభవములు బహుముఖములుగా ప్రకాశించినవి.

ఇంగ్లండునందలి ప్రముఖ వృక్షశాస్త్ర వేత్తయగు విలియం మిటెన్ అను వానిని జ్యేష్ఠపుత్రికను వాలెస్ వివాహమాడెను.

అనంతరమాతడు వృక్ష జంతు శాస్త్రపరిశోధనముల విషయమున పెక్కు పాశ్చాత్యదేశములు పర్యటించి అమూల్యమైన విజ్ఞానశాస్త్ర రహస్యములను సేకరించెను. వాలెస్ సల్పిన పరిశోధన కృషిని గుర్తించి డార్విన్ స్మృతి చిహ్నముగా బ్రిటిష్ రాయల్ సొసైటీవారు బంగారు పతకమును ప్రప్రథమముగా అతనికి సమర్పించి ఘనముగా సత్కరించిరి. 1910 లో బ్రిటిష్ ప్రభుత్వమునుండి ఆర్డర్ ఆఫ్ మెరిట్ అను అత్యున్నత యోగ్యతాపత్రమును కూడ వాలెస్ పొందెను. రాయల్ సొసైటీవారు తమ సంస్థయందు దాతనికి విశిష్ట సభ్యత్వము నొసగి సన్మానించిరి.

జీవ వృక్షశాస్త్రముల వికాసమునకును మానవ సేవకును తనజీవితమును అంకితముచేసి నిర్విరామ కృషిసల్పి పెక్కు నూతనసిద్ధాంతములను ప్రతిపాదించిన వాలెస్ డార్సెట్ నగరమున 1913 నవంబరు 7వ తేదీన తన భౌతిక దేహమును చాలించి యశస్కాయుడయ్యెను.

ప. వెం.

## వాల్మీకి

శ్లో॥ వేదవేద్యే పరేపుంసి జాతే దశరథాత్మజే।
వేదః ప్రాచేతసాదాసీత్సాక్షాద్రామాయణాత్మనా॥

అను సూక్తినాధారము చేసికొని శ్రీమద్రామాయణ మహాకావ్యమును ప్రాచేతసనామకుడైన వాల్మీకి రచించె నందురు. అందులకే 'వాల్మీకేర్మునిసింహస్య కవితావనచారిణః' ... 'వాల్మీకేర్వదనారవింద గళితం రామాయణాఖ్యం మధు' అని శ్రీమద్రామాయణాదియందు చెప్పబడినది. కాగా వాల్మీకి యను మహర్షి శ్రీమద్రామాయణకర్త యనియు, అయనకు ప్రాచేతసుడను బిరుదముగలదనియు మనమూహింపవచ్చును. అసలు వాల్మీకి యనువానార్థమును విచారింపగా "వల్మీకాదుత్థితః-వాల్మీకిః" - పుట్టనుండి బయల్పడిన వాడనియు వల్మీకస్యాపత్యం పుమాన్ వాల్మీకిః - వల్మీకుని కుమారుడనియు అర్థములు కల్గును. అందులకే వల్మీకజన్మా మునిః' అనియాతని ననిరి. ఇట్లనుటకు ప్రమాణము లేక పోలేదు.

పద్మపురాణములో నిట్లు కలదు ఒక బోయ పాంథులను గొట్టి యరణ్యమున జీవించుచుండెనట ఒకనాడా త్రోవ మహర్షులు కొందరు పోవుచుండ అతడడ్డుపడియెనట మహాత్ములగు నా సాధుపుంగవుల దర్శనమగుటతోడనే అతని మనసు మారి యార్తితో వారిపాదములపై బడి తనకేదేని మంత్రము నుపదేశింపుడని ప్రార్థించెనట! అంత వారిలో ఒక మహర్షి దయగలవాడై యతనికి మరా అను రెండుక్షరములనుపదేశించెనట! దాని నాతడేమరక జపించుచుండగా అతనిచుట్టును పుట్ట పెరిగిపోయెననియు కొంతకాలమున కచటికి కొందరు కిరాతులువచ్చి ఓయీ! కిరాత! అనిపిలుచుటతోడనే పుట్టనుండి అతడు ఈవలకు వచ్చెననియు నొకగాథ కలదు

వాల్మీకిని నుతించు శ్రీమద్రామాయణాది శ్లోకము

శ్లో॥ కూజంతంరామరామేతిమధురంమధురాక్షరం!

ఆరుహ్యకవితాశాఖాంవందేవాల్మీకికోకిలమ్॥

కవితాశాఖాం = కవిత్వపుకొమ్మను ఆరుహ్య = ఎక్కి రామ రామేతి = రామ రామ యని మధురం = తియ్యనైనట్టిదియు మధురాక్షరం = మకారమగ్రమునగల రాక్షరమును (మరాయనుదానిని) కూజంతం = ధ్వనిచేయుచున్న (పలుకుచున్న) వాల్మీకికోకిలం = వాల్మీకియను కోయిలను, వందే = నమస్కరించుచున్నాను అని పై శ్లోకార్థము ఈ యర్థముననుసరించి వాల్మీకి రామతారకజపమును మరా అని జపించినట్లును అది సఫలమై అతడు రామాయణమును రచించినట్లును ఊహింపవచ్చును

ఈ వాల్మీకి ప్రాచేతసుడనుటకు గలకారణములు వైదికకాలమున ఋక్షుడు భార్గవుడు ప్రాచేతసుడు అను ముగ్గురు మహర్షులు గావచ్చుచున్నారు ఇందు ఋక్షుడను నాతడే వాల్మీకియనియు అతడే భార్గవుడనియు పేర్లు గానవచ్చుచున్నవి ఇకవరుణునకు ప్రచేతసుడను నామమున్నను వరుణేతరుడు ప్రచేతసనాము డింకొక డుండి యుండవచ్చును ఆ ప్రచేతసుని కుమారుడే ప్రాచేతసుడై యుండవచ్చును ప్రతిద్వాపరయుగమునను మిశ్రితమైన వేదరాశిని విభజించిన అతడు వేదవ్యాసుడను బిరుదమునందునట! ఈ వాల్మీకి యను నామాంతరముగల ప్రాచేతసుడు గూడ ఇరువది నాల్గవద్వాపరమున వ్యాసబిరుదమునందినవాడనియు విష్ణు వాయు, కూర్మపురాణము లుదాహరించుచున్నవి చూడుడు:

1 ఋక్షో౽భూద్భార్గవస్తస్మా ద్వాల్మీకిర్యోఽభిధీయతే - విష్ణుపురాణ 3 - 3

2 పరివర్తే చతుర్వింశే ఋక్షోవ్యాసోభవిష్యతి - వాయుపురాణం 23

3 తృణబిందుస్త్రయోవింశే వాల్మీకిస్తు తతః పరం - కూర్మపురాణం

ఈ పై శ్లోకముల బట్టి ఋక్షుడను భార్గవుడే వాల్మీకియనియు ఇరువదినాల్గవ ద్వాపరమున వాల్మీకి వేదవిభాగకర్తయనియు అవ్యాముడే ప్రాచేతసాపరనామధేయుడగు వాల్మీకియనియు కృష్ణయజుర్వేదీయప్రాతిశాఖ్య సంబంధముతో విశదమగుచున్నది అట్లైనచో శ్రీమద్రామాయణ రచయితయగు వాల్మీకి ద్వాపరమువాడనియు వాల్మీకి భృగువంశములోనివాడనియు అనుకొనవచ్చునుగదాయని, అది సరిపడదు ద్వాపరయుగములోనివాడు వాల్మీకియని చెప్పకొనుటకంటె పారస్వతయుగములో అతిప్రాచీనుడనియు భార్గవుడనుటచే భృగుమహర్షి గోత్రోద్భవుడనియు నెంచుటుచితము కాని మంత్రద్రష్టయైన భృగువుతో సంబంధము గల్పించి అయన కుమారుడు జమదగ్నియైయుండ—ఈ వాల్మీకి అతడే అని చెప్పుట అసంగతముగనున్నది కాగా వాల్మీకి కలియుగము లోనివాడే యనియు అందునను చాలప్రాచీనకాలమువాడనియు అకాలమున నిక్ష్వాకులు భారతదేశపరిపాలకులనియు వాల్మీకి భృగు గోత్రసంజాతుడనియు శ్రీమద్రామాయణము ఇరువదినాల్గవ ద్వాపరయుగమునాటి చరిత్రమనియు తెలుచున్నది ప్రచేతసుని గోత్రములోనివాడే ఋక్షుడనియు తెలిసినది పాణినికి పూర్వుడాపస్తంబుడు (స్మృతికర్త) అతనికిపూర్వుడుమనుస్మృతికారుడునైనవాడు మనువు మనుస్మృతికి పూర్వము భారతసంహితయనియు దానికిపూర్వము శ్రీమద్రామాయణమనియు పరస్పరసంబంధముగానవచ్చుచున్నది అదెట్లనగా, పాణిని సూత్రములలో అపస్తంబుడు ఉట్టంకితుడైనాడు అపస్తంబసూత్రములు మనుస్మృతి నుదాహరించుచున్నవి మనుస్మృతిలో గానవచ్చు శ్లోకములు వ్యాసభారతములో నున్నవి భారతములోని ధర్మములనే మనుస్మృతిలోనికి గొనిపియుందురని యూహింపనగును శ్రీమద్రామాయణము కిష్కింధాకాండములోని శ్రీరామ—వాలి సంభాషణములో రాజధర్మములు 18 32, 33 సర్గలలోని శ్లోకములును మనుస్మృతి రాజధర్మాధ్యాయములోని 318 319 శ్లోకము లొక్కటిగనే కానవచ్చుచున్నవి అందుచే మనుస్మృతిలోని శ్లోకములు కొన్ని భారత,

రామాయణకాలము నుండి యుద్ధప్రసంగముల కత్యల్పదు. అనగా మనుస్మృతిలోని శ్లోకముల నవరోక్షసంపర్కముగ చేర్చియుండును. ఇట్లే రామాయణమున గూడ ప్రక్షిప్తము లనేకములు గలవు. వానిలో మను ప్రోక్తములు కొన్నియుండుట యొకవాదు.

ప్రాయశః మనుగాధాశ్లోకా వాల్మీకివత్సలా మొదలగు శ్లోకములవలన రామాయణముకంటె మనుస్మృతి ప్రాచీనమైన దానినిగాగూడ గల్పించిరి. ఇవి భ్రాంతిమూలకములే కాని యథార్థములుకాదు. భారతముకన్న రామాయణము ప్రాచీన మనుటకు భారతశాంతిపర్వములో విదురుడు 1వ అధ్యాయము 205వ శ్లోకములో భీష్మద్రోణులు ధర్మవిషయమున శ్రీరామ చంద్రునకు తీసిపోరు అనెను - మరియును - యుద్ధకాండములో -

శ్లో॥ అపిచాయం పురాగీతః శ్లోకో వాల్మీకినా భువి।
నహన్తవ్యాః స్త్రియ ఇతియద్ బ్రవీషి ప్లవంగమ ॥

అని చెప్పెను.

ఇట్లే శంతిపర్వములోని శ్లోకములు కొన్ని అయోధ్యా కాండమున 10వ సర్గలో నుదహరింపబడినవి. అందుచే భారతముకంటె రామాయణము ప్రాచీనమైనదయ్యు అది కొన్ని ప్రక్షిప్తములతో కూడియున్నది. కావున క్రీ. పూ. 10వ శతాబ్దమునాటి మనుస్మృతికన్న భారతము పూర్వమనియు దానికంటె రామాయణము మరికొంత పూర్వమైనదనియు యూహించుకొనినప్పుడు - క్రీ. పూ. 16వ శతాబ్దములో శ్రీమద్రామాయణ రచనయై యుండవచ్చునని ఫాహాయాన్ మొదలగు పండితులు ఇక్ష్వాకులనాటిది రామాయణమనియు అందుచే అది క్రీ. పూ. 25వ శతాబ్దపు నాటిదనిరి. ఎవరేమి యూహించినను - శ్రీమద్రామాయణ రచన - క్రీ. పూ. 16వ శతాబ్దమున కీవలకు రాదు.

వాల్మీకి ప్రశంస: వాల్మీకి శ్రీరామచంద్రకృపా పూర్ణకటాక్షము గలవాడగుటచేత — మధుమయ భణితీనాం మార్గదర్శీ మహర్షిః" - అన్న వానుడికి గురియయ్యెను. కావుననే - వేదవేద్యుడగు పరాత్పరుడు దాశరథియగుటతోడనే ఆ పరాత్పరానుగ్రహమును పొందిన వాల్మీకిని వేదములు శరణు జొచ్చినవి. తన్మూలకముగ నాపరాత్పరుని వేదసమ్మితమగు రామాయణములో జూపెట్టెనని - 'వేద వేద్యే!' - అను శ్లోకభావమునను సరించి వేదములకు శరణ్యుడన్నభువనత ఈ కవిశేఖరునకు లభించినది. రవిగాంచనిచో కవిగాంచును"-అను నార్యోక్తి ననుసరించి కవికుల్లపలుగు వాల్మీకి సర్వజ్ఞుడై శ్రీమద్రామాయణ రచన మెంతటి వైదికమైనదో యెంతటి తాత్త్వికమైనదియు నైయున్నది. అందున రచయిత మహర్షి అతీంద్రియ ద్రష్ట - ద్వీపాంతరములనుగూడ మెప్పించి వాగు వైదికాచారములను - వేదమార్గానుసారియయ్యునేకాక తత్త్వోపదేశములను నత్యంత సులభముగ బోధించెను - కాళిదాస ప్రభృతులవంటి గుటచేతనే ప్రాచీనాగ్రగణ్యులు - సీతారామాదులయందు నమోవాకమిడిరి. వాల్మీకి తపోనిధియై బ్రహ్మనిష్ఠాగరిష్ఠుడై శ్రీమద్రామాయణ వృక్షమునెక్కి వేదవేద్యుని కావ్యరూపమున గాన మొనర్చిన పుంస్కోకిలగా కీర్తికెక్కెను. నానృషిః కురుతే కావ్యమ్ - అన్న సూక్తి ఈ ఆదికవియందు సార్థకమయ్యెను. ఈ వాక్యమునకు కారణము - వాల్మీకి రచనాదర్శముగనే - శతకోటి ప్రవిస్తరమైనది శ్రీమద్రామాయణము అందులకే మురారి శ్రీమద్రామాయణమును - వాల్మీకి వాగమృతకూప మని వచించినాడు.

సాధారణముగా గురుముఖాత్తమైన విద్యగలవానికి తన విద్యలో పరిమితత్వముండును కాని - శ్రీరామకటాక్షసాదితకవిత్వ చతురుడగుటచే ఈతని పాండిత్యమవధిలేని సాగరమైనది. గాంభీర్యభరితమైన వాక్కులలో పుటికి పుచ్చుకొనినది. వేయేల! సత్యలోకమున శ్రుతిస్మృతి శ్రవణమాధుర్యమున మొగమువాచిన సరస్వతి భూలోకమునకు వచ్చి ప్రథమ విశ్రాంతిని వాల్మీకి వాక్కున గావించుకొనినదనిన అతిశయోక్తి యుండనేరదు. వాల్మీకి ఉదయించి శ్రీరామకథను వ్రాయనిచో రామాయణమెక్కడిది! శ్రీరామునకింతటి కీర్తియెక్కడిది! సర్వధర్మముల నిరూపించి మృదుశైలిలో వ్రాసిన వాల్మీకి వాక్కు ధన్యమగుటయేకాదు. ఎవరెంతటి విజ్ఞానమును గ్రహింపగల్గుదురో వారికంతగ భావగోచరమగును. తన కావ్య ప్రతిపాద్యుడు పరమపురుషుడగు రాఘవుడైనాడు దానితో తాను ధన్యుడైనాడు. రఘువంశమునకు ప్రళయాంత స్థాయిగ ప్రతిష్ఠను చేకూర్చినాడు. ఇంతయేల! గ్రహదశాంతర్దశలలో చెడుదనమేర్పడినచో రామాయణములోని ఆయా నిర్దిష్టసర్గల పారాయణమున అరిష్టశాంతి చేకూరును. సుందరకాండ పారాయణము కామధేనువువంటిది. వాల్మీకి రచనలోని శ్లోకపఠనముననే శుభములొదవును. కీడుతొలగును! వేదసమ్మితమైన రామాయణమును వ్రాసి శ్రీరామచంద్రాను

గ్రహమునుపొంది బ్రహ్మర్షియైన యాతనివాక్కునకే ఆ మహిమ గలిగినది సంస్కృత వాఙ్మయమంతటికిని గౌరవము వచ్చుటకు వాల్మీకి రామకథాకథకుడగుటయే కారణమన వచ్చును

శ్రీమద్రామాయణావతరణము. ఈ మహర్షి తాను వల్మీకమునుండి ఈవలకు వచ్చినతరువాత వైదికాచారమున నిత్యజీవితము గడుపుచుండగ ఆయనవద్ద భరద్వాజనాము డగు శిష్యుడు చేరి కొలుచుచుండెననియు వారిరువు రొక నాడు మాధ్యందిన వనమునకై మహర్షి సేవ్యమైన తమసా నదికి స్నానమునకు పోవగా అచటనొక క్రౌంచమిథునము సంసారధర్మమునుండ నొకబోయ యాజంటలో నొకదానిని బడగొట్టుటయు దానినిజూచి దయామయుడును సాధూత్త ముడునగు వాల్మీకి మహర్షికి-

శ్లో॥ మానిషాద! ప్రతిష్ఠాంత్వమగమశ్శాశ్వతీస్సమాః।
యత్క్రౌంచమిథునాదేకమవధీః కామమోహితమ్॥

అను ఛందోబద్ధమగు వాక్కు అనుపతర్క్యముగ వెలువడెను ఓరీ! కిరాతా! కామాతురమైన క్రౌంచమిథునములో నొక దానిని బడవేసితివి కావున నీవు శాశ్వతములైన సంవత్సర ములు ప్రతిష్ఠ నందజాలవు అనునర్థమిందు గలుగుచున్నను శిష్యుడగు భరద్వాజుడు ఆలోచింపనొలది యా మహర్షి వాక్కులలోని మహిమ యెట్టిదోకాని మహత్తరమగు భావ ములూహకువచ్చి గురువుతో నాశ్రమమున కేగినపిదప నతడు తన భావములను వివరించిచెప్పెను ఇంతలో నారదుడాయా శ్రమమునకు రాగా ఆతని కభివందనమొనర్చి-

శ్లో॥ కోన్వస్మిన్ సాంప్రతంలోకే గుణవాన్ కశ్చవీర్యవాన్।
ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ సత్యవాక్యోదృఢవ్రతః॥

ఈ లోకమునయిపుడు గుణవంతుడును ప్రభావవంతుడును ధర్మమూర్తియు చేసినమేలు మరువక సత్యవాక్కుతో దృఢ ప్రతిజ్ఞ గలవాడెవడు? అని ప్రశ్నించెను నారదుడు శ్రీరామ కథను సంగ్రహముగ చెప్పెనని బాలకాండాంతర్గత ఆదిసర్గేతి వృత్తము ఆ నారదోక్త రామకథను వినిన వాల్మీకియు భార ద్వాజుడును ఉభయులు సంచరించి తమసానదీతీరమున వెలు వడిన వాల్మీకి వాగర్థమువిట్లు వితర్కించుకొనిరి మాని షాద - లక్ష్మీనివాసస్థలమందుంచినవాడా! అను నీ యర్థ ముతో సీతాకల్యాణరూపమగు బాలకాండము- ప్రతిష్ఠాంత్వము గమః - నీవు ఎంపోకసముద్ర శిష్టించుము! అని శ్రీరాముని ప్రజలడిగినట్లుంచి - శ్రీరామపట్టాభిషేక ప్రయత్నార్థబోధక మైన అయోధ్యాకాండము మానిషాద! ప్రతిష్ఠాంత్వమగమ శ్శాశ్వతీస్సమాః - ఓయీ! నీవు పెక్కువత్సరములు రాజ్యమున పట్టాభిషిక్తుడవై యుండక చాలకాల మరణ్య మందుందువు అను నరణ్యకాండమును యత్క్రౌంచమిథు నాదేకమవధీః కామమోహితమ్-అనుచోట-క్రౌంచ కౌటిల్యాల్పీ భావయోః- అనెడి ధాత్వర్థవివరణ మూలమున-ఓరీ! కామ మోహితమగు క్రౌంచమిథునములో నొకనిని చంపుము-అను టలో కుటిల స్వభావులగు వాలిసుగ్రీవులలో నొకరిని ఇతయక మారేంద్రజిత్తులలో నొకరిని అల్పులగు రావణ విభీషణులలో నొకరిని జంపుమను నర్థముతో-కిష్కింధ సుందర యుద్ధకాండములును ద్యోతకములగుచుండుటనుబట్టి నారద వచనానుసారము స్వాభీష్ట శ్రీరామచరిత్ర కథాభాగములుగ హృదయమునకు గోచరమయ్యెను ' ఇట్టి భావమును మనసు నందుంచుకొని చతుర్వింశత్సాహస్రిక శ్లోకములతోను- ఒక్కొక్క సహస్రమున కొక్కొక్క గాయత్రీమంత్రాక్షరము నుంచి వాల్మీకి శ్రీమద్రామాయణరచనము కావించెను బోయకు గాయత్రీమంత్రమిదియని తెలియదనరాదు శ్రీరామ మంత్రోపాసకునకు తెలియరానిదిలేదు

శ్లో॥ మూకంకరోతివాచాలం। పంగుంలంఘయతేగిరిం।
యత్కృపాతమహంవందే। పరమానందమాధవం॥
అనునానుడి-అట్లు తెలియకున్నను-

శ్లో॥ లౌకికానాంహిసాధూనాం అర్థంవాగనువర్తతే।
ఋషీణాంపునరాద్యానాంవాచమర్థోనుధావతి॥

అను భవభూతి వాక్కునను సరించియే లోకేతివృత్తము జరుగుచుండునన్న వచనము సమాధానము కాకపోదు

రామాయణప్రాశస్త్యము

వాల్మీకి శ్రీరామనామ జపధురంధరుడగుటనేమి నార దోపదేశమహిమనేమి ఇతివృత్తములోని నాయికానాయ కులు లోకోత్తరచరితులగు లక్ష్మీనారాయణులగుటనేమి పర స్వతీదేవిదయొక్క భూలోకావతరణమందు ప్రథమ విశ్రాంతి స్థానమగు కారణముననేమి శ్రీమద్రామాయణమున వద్భుత విషయములనేకములు గలవు పారాయణమాత్రమునకే అనంతఫలము కలుగగలదు ఆక నర్థవివరణములో ననేకధర్మ ములున్నవి

భరతుడు దశరథున కంత్యక్రియలాచరించునపుడు

శ్లేషాలంకారమును - ఇయంసీతామమసుతా '-అను సీతా వివాహఘట్టము దాహరించుచున్నది. కిష్కింధాకాండములో అయిదవసర్గమున-

శ్లో॥ సీతాకపీంద్రక్షణ దాచరాణాంరాజీవ
వహేమజ్వలనోపమాని

సుగ్రీవరామప్రణయ ప్రసంగేవామాని నేత్రాణిసమం స్ఫురంతి ఇందుక్రమాలంకారమును బహుచమత్కారముగ సీతా వాలి రాక్షసులకు వామనేత్రమదరుట రామ సుగ్రీవసఖ్యమని ధ్వని నెంతచక్కగ జూపెను! ఇట్లు అనంతాత్మక కవితాగుణరత్నము శ్రీరామాయణ మహోదధి యందు దొరకును

ఎం సి

## వాసన్ ఎస్ ఎస్ (1903-69)

సుబ్రహ్మణ్య శ్రీనివాసన్ అను సుప్రసిద్ధ భారతీయ చలనచిత్ర నిర్మాత తంజావూరి మండలములోని తిరుత్తురైపుండి (తిరుత్తురైపుండి) గ్రామమున క్రీ శ 1903 మార్చి 10వ తేదిన జన్మించెను. తన ఉన్నతపాఠశాల విద్యవరకు తిరుచిలోనే అభ్యసించి 1924 ప్రాంతములో ఈయన కళాశాల విద్యకై మదరాసువచ్చి పచ్చయప్ప కళాశాలలో కొంత కాలము అధ్యయనము చేసినాడు. స్వీయకుటుంబ ఆర్థికదుస్థితివలన ఈతని కళాశాలవిద్య పూర్తికాలేదు. కొంతకాలమాతడు గ్రంథవిక్రేతగా పనిచేసెను. చిన్ననాటినుండియు రచనావ్యాసంగ వ్యసనరతుడైన వాసన్ తమిళములో కథలను గులకరింపజూనినాడు. ఇది క్రమముగ 1928లో 'ఆనందవికటన్' అను తమిళ పత్రికా స్థాపనమునకు దారితీసెను. పత్రికాసంపాదకుడైన వాసన్ యొక్క నూతనభావములను వాటిని ఉపసర్పించు విధానమును ప్రజాకర్షణమునకు హేతువులయ్యెను. దానితో ఆనందవికటన్ మదరాసు రాష్ట్రమునందు అల్పకాలములో అనల్ప ప్రచారమును సంపాదించిన వారపత్రిక అయినది. అందలి గల్పికలును రేఖాచిత్రములును పాఠకుల ఊహావైభవమును అందుకొన్నవి.

తొలినాళ్లలో ఇతనికి గుర్రపు పందెములయందు మిక్కుటమైన శ్రద్ధభానత చిన్న అశ్వదళముకూడ ఇతనికుండెడిదట! నౌకావిహార యాత్రలయందుసైతము ఇతనికి ఔత్సుక్యము మెండు. మదరాసులో గుర్రపుపందెముల సంఘమునకితడు కార్యదర్శిగ నుండెడివాడు. 1939లో చలనచిత్ర నిర్మాణ వ్యాపారమును అవలంబించి 1941లో జెమినీ చలనచిత్రనిర్మాణశాలావ్యవస్థాపనముతో ప్రసిద్ధ చలనచిత్ర నిర్మాతయు దర్శకుడును అయినాడు. చలనచిత్రపరిశ్రమ సమస్యల యందు తనకుగల తీరని ఆసక్తియే ఈయనను అచిరకాలములో అరంగమునందు నాయకునిగ చేసినది. వాసన్ కొంత కాలము భారతదేశ చలనచిత్ర సమాఖ్యకు అధ్యక్షుడు దక్షిణ భారత చలనచిత్ర నిర్మాతల సంఘసభ్యుడు కేంద్ర చలనచిత్ర గుణదోష నిర్ణాయక సంఘసభ్యుడు చలనచిత్రముల సంగ్రహింపుల సంఘసభ్యుడు భారత చలనచిత్ర వాణిజ్య మండలి అధ్యక్షుడు భారతదేశ ప్రాదేశ వార్తాపత్రికల సంఘసభ్యుడు.

దాదాపు నేటికి 45 సంవత్సరముల క్రిందట ఒక ఖద్దరు ధోవతి ధరించి ఖద్దరు చొక్కా జేబునందు పది రూప్యములతో యోగ్యమైన ఉద్యోగాన్వేషణార్థము మదరాసు నగరము చేరిన పేద యువకుడు ఈ శ్రీనివాసన్. తన నిరంతర నిర్విరామ కృషియే యీయనను బహుసత్త్వములుగల ప్రసిద్ధ పత్రికాసంపాదకునిగను చలనచిత్రనిర్మాణ వ్యాపార వాణిజ్య యోధునిగను తీర్చిదిద్దినది. అట్టి అల్పారంభములో ఇట్టి ఉన్నతిని అందుకొనుట అచ్చమైన స్వయంకృషికిని ఈయన ధైర్యసాహసముల సంపూర్ణ విజయమునకును ఉజ్జ్వలోదాహరణము.

1934 నుండియు ఈయన గాంధేయ సిద్ధాంతముల యందు ప్రగాఢమైన విశ్వాసముగల కాంగ్రెసువాది. కాంగ్రెసు సభ్యులలోవచ్చిన అవాంఛనీయ పరిణామముల ప్రభావము ఈయనపై ఏమాత్రము పడలేదు. ఆ సంస్థయందు శ్రీనివాసునకు సుదృఢమైన ప్రత్యయము. మదరాసు శాసనసభనుండి (కేంద్ర) రాజ్యసభకు 1964లో వాసన్ ఎన్నికయగుట మూలమున ఇతని ప్రజాసేవాభిరతి సంపూర్ణముగ గుర్తింపబడెను. 1969 అగస్టునందు తనకు 'పద్మభూషణ' బిరుదప్రదానము జరుగుట ఈతని దేశసేవానిరతికి పతాక

తన మిత్రుల మనస్సుపై వాసన్ చెరగని ముద్ర వేసిన వ్యక్తి. సమస్తజాతీయ సమస్యలతోడను ఈయనకు సంబంధము కలదు. తమిళకళా సంస్కృతీ సారస్వతములకును కర్ణాటక సంగీతమునకు ఇతడు చేసినసేవ నిరవధికము. తమిళమున వారపత్రిక నడపుటకు సరియైనమార్గము చూపినవాడితడు. తమిళమున ఎంతప్రసిద్ధ రచయితయో అంత ప్రసిద్ధ రాజకీయ వ్యంగ్య చిత్రకారుడు. దక్షిణదేశ చలనచిత్రపరిశ్రమకు సాధు

నవ్య మార్గదర్శి మదరాసులో నిర్మింపబడిన హిందీ చలన చిత్రముల ఉత్తరదేశ విజయమునకు అంకురార్పణము చేసిన వాడు. అన్నిటినిమించి ఇతడు నిరాడంబరుడు. గాఢమైన మిత్రధర్మమును పాటించిన విశ్వాసపాత్రుడు రసహృదయుడు.

1968లో గర్భకోశసంబంధమైన శస్త్రచికిత్స పొందిన ఎవప 1969 జులై నెలనుండియు రుగ్మతతో బాధపడుచు 1969 ఆగష్టు 28వ తేదీన (63వ యేట) మదరాసులో నిస్వగృహమునందు దివంగతుడై ఈయన యావద్భారతదేశమునకును ప్రత్యేకించి తమిళనాడునకును తీరని లోపమును కల్గించెను. ఈయనకు భార్యయు ఒక్క పుత్రుడును ఒక్క పుత్రికయు గలరు.

కొ. కు. శ

## వాస్తు ప్రమేయము

శ్లో॥ వాస్తుజ్ఞానం ప్రవక్ష్యామి యదుక్తం బ్రహ్మణా పురా గ్రామసద్మ పురాదీనాం నిర్మాణం వక్ష్యతేధునా॥ (సంగ్రహ శిరోమణి)

శ్లో॥ భారతీయ సంప్రదాయము ప్రకారము మానవులు ... పరమార్థములైన ధర్మార్థ కామములను సాధించుటకై ... విద్యలను 64 కళలను అభ్యసించవలయును. మహర్షులు ఈ విద్యలకు కళలకు ప్రాతిపదిక ధనైషణ పరలోకైషణ అను మూడు ప్రయోజనములను నిర్దేశించినారు.

భారతీయ వాఙ్మయమునందు ఈ కళలను గూర్చి విద్యలను గూర్చి విస్తారముగ వ్రాయబడియున్నది. శ్రీమద్భాగవత - హరివంశ - విష్ణుపురాణములందును వాత్స్యాయన కామసూత్ర - శుక్రనీతిసార - కౌటిలీయార్థ శాస్త్రము లందును లలితవిస్తరాది బౌద్ధ గ్రంథములలోను ఉత్తరాధ్యాయన సూత్రాది జైన గ్రంథములందును కళలు విభిన్న సంఖ్యలో వివిధ నామములతో పేర్కొనబడినవి. కొందరు వాస్తువును 32 విద్యలలో పేర్కొనగా మరికొందరు 64 కళలలో పేర్కొన్నారు. తక్కిన విద్యలు కళలవలెనే వాస్తు విజ్ఞానమున గూడ భారతీయులు ప్రపంచమునకు గురుస్థానమున నున్నారు.

వాస్తు నిర్వచనము: 'వాస్తు' అనుశబ్దము వస (నివాసే) అను ధాతువునుండి నిష్పన్నమైనది. ఇది మానవని వేశనముల ననుసరించి ప్రాచీనకాలము నుండి వ్యవహరింపబడుచున్నది. వాస్తు శబ్దమునకు విభిన్నార్థములు కలవు. శిల్పశాస్త్రములలో వాస్తువు విస్తృతార్థమున వాడబడినది.

నగరాదిక వాస్తుంచ వక్ష్యేరాజ్యాది వృద్ధయే
(అగ్నిపురాణము)

ప్రాసాదారామ దుర్గ దేవాలయ మఠాదివాస్తు మాన లక్షణ నిరూపణము (గరుడ పురాణము)

ఆవాస వాసవేశ్మాదౌ పురేగ్రామే వణిక్పథే ప్రాసాదారామ దుర్గేషుదేవాలయమఠేషుచ (గరుడ పురాణము)

గ్రామంక్షేత్ర మారామస్సేతు బంధ స్తటాకమాధారో వావాస్తుః (కౌటిలీయార్థ శాస్త్రము)

దేశకోరథ కాలేన సర్వాభూమిం పరీక్షయేత్ యత్రప్రశస్యతే భూమిః తత్రవాస్తుం ప్రకల్పయేత్" (పూర్త చంద్రికా)

వాస్తు = ధరా (నిర్మాణస్థలము) హర్మ్యము (భవన-ప్రసాద - మండప - సభా - శాలా - ప్రపా - రంగములు), యానము (అసందికా - స్యందన - శిబికా - రథములు) పర్యంకము = (పంజర - మంచలి - మంచ - కాకాష్ట - ఫలకాసన-బాలపర్యంకములు)-(An encyclopaedia of Hindu Architecture) వాస్తు శాస్త్రమనగా గృహ - గ్రామ - నగర - దేవాయతన - ప్రాసాద - దుర్గ - ఆరామ తటాక - సేతుబంధాది నిర్మాణ లక్షణములను తెలుపు శాస్త్రమని తెలుచున్నది.

వాస్తుశాస్త్రములు: భారతీయ వాస్తు విజ్ఞానము ఉత్కృష్టమైనది. భారతీయ ఆధ్యాత్మిక వికాసమున కనుగుణముగా ఆయా ప్రయోజనములతో గూడిన ఆరాధనలు ఉపాసనలు వాటికి తగిన దేవతలు దేవాగారములు వెలసినవి. ప్రపంచ వాఙ్మయమున ప్రాచీనతమము లగు వేదోపనిషత్తులలో దేవమూర్తులు దేవాగారములు పూజలు ప్రస్తావించబడినవి. ఆపస్తంబ - బోధాయన గృహ్యసూత్రములలో యజ్ఞశాలా వేదికా నిర్మాణ రీతులు వివరింపబడినవి.

ప్రాచీన కావ్యేతిహాసములగు రామాయణ మహాభారతములందు మహానగరములు విజయ తోరణములు మహాప్రాసాదములు ఉద్యానములు ప్రాకారములు పరిఘలు, దేవాయతనములు సుందరముగా వర్ణింప బడినవి. మత్స్య, గరుడ స్కాంద నారద, బ్రహ్మాండ భవిష్య లింగ వాయు, అగ్ని పురాణములలో వాస్తులక్షణములు వివరింప బడినవి

కౌటిలీయార్థశాస్త్ర శుక్రనీతి సారములలో గూడ వాస్తు విశేషములు తెలుప బడినవి. వాస్తు శిల్పలక్షణములకు సంబంధించిన వాఙ్మయము కంటె ఆగమములు మూలాధార గ్రంథములని చెప్ప వచ్చును. ఇందు శాస్త్రచర్చ గలదు. ఈ ఆగమములలో వాస్తు ప్రధానలక్షణము లైన భూపరీక్షా స్థలపరీక్షా దిక్సాధన స్థలపథ హర్మ్య - ప్రాసాద దేవాయతన - దేవతాప్రతిష్ఠాది నిర్మాణ పద్ధతులన్నియు సప్రమాణముగా నిరూపింప బడినవి. ఆగమములు 28 కలవు. వీటిలో అంశుమద్భేదాగమ కామికాగమ కారణాగమ సుప్రభేదాగమ వైఖానసాగమములందు వాస్తుశిల్ప విషయములు విశేషముగా వివరింపబడినవి.

ఈ గ్రంథములుగాక ప్రత్యేక వాస్తుశిల్ప శాస్త్రగ్రంథములు కలవు. వీటిలో చాలభాగము వ్రాతప్రతులలో ఉన్నవి. కొన్ని మాత్రమే ముద్రితములైనవి. అనేక గ్రంథములు విదేశీయ గ్రంథాలయములలో భద్రపరచ బడియున్నవి. డా॥ ప్రసన్నకుమారఆచార్య విశేష పరిశ్రమచేసి ప్రపంచ దేశములలోని గ్రంథాలయములు ప్రకటించిన గ్రంథపట్టికల శోధకము చేసికొని తమ 'హిందూవాస్తు విశ్వకోశము' లో 150 భారతీయ వాస్తు శాస్త్రముల పేర్లను ప్రకటించినారు. ఈ ప్రసిద్ధ అప్రసిద్ధ వాస్తు గ్రంథములన్నిటిలో మానసార శిల్పశాస్త్రము దేవాలయ గ్రామనిర్మాణాదికమును సలక్షణముగ వివరించు ఉత్తమ గ్రంథము. దీనిని పాశ్చాత్యులు పరమ ప్రమాణముగా స్వీకరించుచున్నారు. చిత్రసారము' నందలి శిల్పతంత్రప్రకరణములో ఈ శిల్పశాస్త్రము ద్వాదశలక్ష గ్రంథాత్మకమని తెలుప బడినది.

ఏతత్తంత్రాది సంఖ్యాతులక్షద్వాదశకామికా"
("చిత్రసారము )

**వాస్తుభేదములు** కామికాగమమున వాస్తువుస్థల ప్రధానమని జలప్రధానమని రెండువిధములుగ చెప్పబడినది. మొదటిది మరల హర్మ్యాది వాస్తువు పర్యంకాదివాస్తువు అని రెండు విధములు. హర్మ్యాదివాస్తువులో దేవాలయ మండప రాజభవన సభాంగణములు, నాటకశాలలు మున్నగువాని స్థలములను గురించిచెప్పబడును. పర్యంకాదివాస్తువునందు శిబికములు మంచలు మంచములు శకటములు, పల్లకులు డోలికలు లాయములు గోష్ఠములు, మొదలైనవని చెప్పబడును.

రెండవదగు జలప్రధానవాస్తువు మూడు విధములు గలది 1 జాంగలము 2 అనూపదేశము 3 సాధారణదేశము అనునవి. కామికాగమమున జలప్రధానవాస్తువు శైవ బ్రాహ్మ వైష్ణవ ఐంద్ర సౌమ్య భౌతిక అసుర పైశాచ వారుణ ఆగ్నేయములని పదివిధములుగ చెప్పబడి ఆయాలక్షణములు వివరింపబడినవి.

**భూగ్రహణము** స్థల - తీర్థ - దేవతలకు సరిపడిన లక్షణములు మానవనివాసయోగ్యములని ఖండితముగా చెప్పబడినది. నివసించుజనులకు అభ్యుదయకరములుగా ఉండునట్లు జనావాసములకు స్థలములనెన్నుకొనుచుండిరి. ఎచట శుచి - శుభ్రతలుండునో అచట ఆధ్యాత్మిక దివ్యత్వములు నెలకొనునని ప్రాచీనులు విశ్వసించిరి. జనావాసములకు ఫలవృక్షలతాపూర్ణము జంతు పక్షి నివాసయోగ్యము కృషియోగ్యము జలసమృద్ధము సారవంతమునగు భూమిని గ్రహించవలెనని వాస్తుశాస్త్రములు చెప్పుచున్నవి.

**భూపరీక్ష** వాగృహములలో నివసించు జనులకు సర్వశ్రేయములు కలుగుటకై శాస్త్రజ్ఞులు భూపరీక్షావిధానమును తెలిపినారు. భూగుణమునుబట్టి వాస్తుభూమి ఉత్తమ మధ్యమ అధమభేదములుగా చెప్పబడినది. దీనిని తెల్పుకొనుటకై కొన్ని పరీక్షలు తెలుపబడినవి. వీని వివరములు వాస్తుగ్రంథములలో కలవు. నిర్మాణస్థలములు ఆరోగ్య ప్రదేశములై ఉండుటగాక మానవుని అవసరములను తీర్చగలవై శత్రు చోరాదిపీడలనుండి రక్షింపజాలినవై ఎప్పుడును శుభములు కలిగించునవై ఉండునట్లు ప్రాచీనశాస్త్రజ్ఞులు పరీక్షలతో నిర్ణయించి నిర్మాణములు ప్రారంభించెదరు.

**గ్రామ విన్యాసము** భూపరీక్షానంతరము నిర్మాణములు ప్రారంభింపబడును. వాటిలో గ్రామ నగరనిర్మాణరీతులు క్రిందివిధముగా తెలుపబడినవి (1) అగ్రహారము (2) గ్రామము (3) ఏకభోగము (4) నగరము (5) పురము పట్టణము (6) ఖేటకము (7) ఖర్వటము (8) శిబిరము (9) సేనాముఖము (10) మఠము (11) రాజధాని అనునవి. కామికాగమమున ప్రకీర్ణక సంవత్కర పరక, శ్రీప్రతిష్ఠక శ్రీవత్స కుంభక వైదికములని 7 భేదములు తెలుపబడినవి. మానసార శిల్పశాస్త్రమున దండక సర్వతోభద్ర నంద్యావర్త పద్మక భద్రక స్వస్తిక ప్రస్తర కార్ముక చతుర్ముఖములని 8 విధములైన గ్రామ నగరాది నిర్మాణ భేదములు వానిలక్షణములు తెలుపబడినవి.

దుర్గభేదములు రాజనీతి శాస్త్రములలో రాజధానీ నగర దుర్గాదులకు ప్రాముఖ్యము చెప్పబడినది వాస్తుశాస్త్రములలో వివిధ దుర్గనిర్మాణములు చెప్పబడినవి

> రాష్ట్రాంగ కాలస్సర్వో యథావాగోమా చ్యుతః
> దుర్గే చ రాతోర జా-భూగమో్యాశవద్రిపుః ॥
> (శుక్ర నీతి సారము)

ఋగ్వేదములో అయసీ పురవర్ణనలు (2-2 8

మానసారమున దుర్గములు శిబిర వాహినీముఖ స్థానీయ ద్రోణక సంవిద్ధ నిగమ స్కంధావారములు - అని ఎనిమిది విధములుగ చెప్పబడినవి నిర్మింపబడు స్థలభేదములను బట్టి గూడ దుర్గభేదములుండును-గిరిదుర్గ-వనదుర్గ జలదుర్గ రథదుర్గ దేవదుర్గ పంకదుర్గ మిశ్రదుర్గములని ఇవి వ్యవహరింపబడును అన్ని దుర్గములు ఇటుకలతో రాళ్ళతో మట్టితో కట్టబడిన దృఢప్రాకారములు కందకములు కలిగియుండవలెను గోడలు 6 మూరలు మందము 12 మూరలు ఎత్తు ఉండవలెను

**జనావాసగృహములు :** సాధారణముగ గ్రామ నగర దేవాలయముల నిర్మాణమున అనుసరింపబడు పద్ధతులే గృహ నిర్మాణమున గూడ పాటించబడును

జనులువసించు ఇండ్లు గృహ సదన భవన ప్రాసాద ములని విభజింపబడినవి సాధారణముగా సదన భవన ప్రాసాద ములు 2-3 5-7 అంతస్తులతో కట్టబడును మానసారమున "శాలావిధాన లక్షణము అను విభాగమునందు నిర్మాణ లక్షణ ములు వివరింపబడినవి భట్టోత్పల వాస్తువు నందు వాస్తువు ఎనిమిది విధములుగా చెప్పబడినది వీనిని ఆయములందురు నిర్మాణ స్థలముయొక్క పొడవును వెడల్పుతో గుణించగా వచ్చిన ఫలితమును 8 తో భాగింపగా వచ్చు శేషము 0' అయి నచో రిక్తము 1 మిగిలినచో ధ్వజాయము 2 మిగిలినచో ధ్వాంక్షాయము 3 మిగిలినచో సింహాయము 4 మిగిలినచో, శ్వానాయము 5 మిగిలినచో వృషభాయము 6 మిగిలినచో ఖరాయము 7 మిగిలినచో భద్రాయము అనబడును ఈ ఆయములలో కట్టినచో వాని ఫలితములుకూడ తెలుపబడినవి

విశ్వకర్మ శిల్పములో గృహములు 45 విధములుగా చెప్పబడి వాని లక్షణములు వివరింపబడినవి

1 మేరు 2 మందర 3 విమాన 4 భద్రక, 5 సర్వతోభద్ర 6 రుచక, 7 నందన, 8 నందివర్ధన 9 శ్రీవత్స 10 వాస్తవి 11 గృహరాజ 12 శాలాగార 13 మందిర 14 వైరాజ 15 బ్రహ్మమందిర 16 భవన 17 ఉత్తంభ 18 శిబి 19 ఎలయ 20 దుందుభి 21 పద్మ 22 మహాపద్మ 23 నంద్యావర్త 24 వర్ధమాన 25 స్వస్తిక 26 భాస్కర 27 గుహావృష 28 గ్రహ 29 వృషభ 30 హంస 31 గరుడ 32 సింహ 33 భూముఖ 34 భూధర 35 శ్రీజయ 36 పృథ్వీధర 37 వజ్ర 38 చక్ర 39 ముష్టిక, 40 బభ్రు 41 వక్ర 42 వర్ధనీ 43 ఖడ్గ 44 గదా 45 శ్రీవృక్షము లు అగ్ని పురాణమున ఈ పేరులే ఈషద్భేద ముతో దేవగృహభేదములుగా చెప్పబడినవి

**దేవాలయములు** తలవిన్యాస ఉపపీఠ అధిష్ఠాన స్తంభ కుడ్య ప్రస్తర విమాన రచనా విధానములను బట్టి దేవాలయ భేదములుండును అయా సంప్రదాయములకు చెందిన మూల విగ్రహ పరివార దేవతలననుసరించికూడ దేవాలయ భేదములు చెప్పబడును కామికాగమములో 1 మేరు 2 రమ్య 3 మందర 4 రత్నమాలి 5 ద్యుమణి 6 చంద్రశేఖర 7 మాల్యవాన్ 8 పారియాత్ర 9 రత్న శీర్ష 10 ధాతుమాన్ 11 పంచకోశ 12 పుష్పహాస 13 శ్రీకార 14 స్వస్తిక 15 మహాపద్మ 16 పద్మకూట ములు అను దేవాలయ వాస్తువు చెప్పబడినది

బౌద్ధవాస్తువు బౌద్ధ వాఙ్మయములో భవన నిర్మాణ మునుగూర్చి అతిసూక్ష్మ విషయములుగలవు బుద్ధుడు శిష్యు లకు చేసిన ఉపదేశములలో భవన నిర్మాణము ముఖ్యకర్తవ్య ముగా చెప్పబడినది బౌద్ధ నిర్మాణములలో చైత్యము, స్తూపము విహారము ఆరామము ఉపాసక మందిరము అను భేదములు కానవచ్చుచున్నవి చైత్య స్తూపములను పర్యాయ పదములుగా వాడవచ్చును స్తూపములు రెండువిధములు బుద్ధునియొక్క బౌద్ధగురువులయొక్క పవిత్రాస్థికలను నిక్షే పించి వానిపై నిర్మింపబడునవి ఒకవిధము ; ఒక విశేషసంఘట ననుగాని ఒక ప్రదేశమునందలి విశేషమునుగాని తెలుపుటకు నిర్మింపబడునవి రెండవవిధము విహారము' అనగా మత బోధకులు శిష్యులతో వసించు విశాలమందిరము ఆరామ' మనగా గ్రామమునకు కాతిదూరమున కాతిసమీపమున నిర్మింపబడిన విశ్రాంతి మందిరము బౌద్ధభిక్షువులందు విశ్ర మించుచుందురు

బౌద్ధుల వాసగృహ నిర్మాణమునందలి విశిష్ట్యములు*

పైకప్పులు గోడలకువాడిన రంగులు ద్వారబంధ చిత్రవిశేషములు మిగుల సుందరముగా మహావగ్గ చుల్లవగ్గ ములలో వర్ణింపబడినవి ఈనిర్మాణములకు ఇటుకలతో రాతితో కర్రతో సోపానములను నిర్మించుచుండిరి ఇండ్లలోని వివిధాలంకారయుక్తములైన చారుగృహోపకరణములు గృహాలంకారణసామగ్రి బౌద్ధవాఙ్మయమున విస్తారముగ వర్ణింపబడినది

జైనవాస్తువు : జైనులకు అవశేషములమీద భక్తివిశ్వాసములులేవు వీరుహైందవదేవతలను కొందరిని అంగీకరించెదరు ఇంద్ర శుక్ర లక్ష్మి గరుడ నాగ గంధర్వాదులను పూజింతురు ఈదేవతలను జైనులు భావనాధిపతులు వ్యంత్రులు, జ్యోతిష్కులు వైమానికులు అని నాలుగువిధములుగా విభాగించుకొన్నారు జైన బౌద్ధవాస్తుపద్ధతులు వైదికపద్ధతులకు మిగుల సన్నిహితమైనవి జైన బౌద్ధముల వాస్తురీతులలో సాదృశ్యమెక్కువ ఉండును జైన వాస్తువునందు ఉత్తర దక్షిణ సంప్రదాయములనుబట్టి బసది - వాసకా' అను రెండు భేదములు కావచ్చుచున్నవి బసది అనగా పూజామందిరము వాసకా అనగా నివాసస్థలము బౌత్తరీయ పద్ధతిలో తీర్థంకరులచేప్రతిష్ఠింపబడిన బసదులు' మాత్రమేకలవు వాసకలు లేవు దక్షిణదేశమున వాసక లుండును వీనిలో గోమటేశ్వర విగ్రహములుండును జైన గుహాలయములు బౌద్ధగుహాలయములవలెను జైన మందిరములు హైంధవదేవాలయములవలెను ఉండును

నిర్మాణ విధాన క్రమము: వాస్తుశాస్త్రములందు గ్రామనగరాదుల నిర్మాణప్రణాళిక ఒకక్రమమునమనుసరించి వివరింపబడినది

"ప్రథమంగ్రామమానంచ ద్వితీయంపాదవత్ స్మృతం
తృతీయంతద్బలిందీత్వా చతుర్థంగ్రామవేశనం,
పంచమంగృహవిన్యాసం తత్రగర్భంచనిక్షిపేత్
షట్కంగృహప్రవేశంచ తన్మానమధునోచ్యతే"
("మానసారము")

(1) నిర్మాణమునకు ప్రత్యేకింపబడిన స్థలమునుకొలుచుట (2) నిర్మింపవలసినఇండ్లు - ఆలయములు - వీధులు, చెరువులు - ఉద్యానములు మొదలైనవానికి పాదములువిభజించుట (3) బలికర్మ (4) గృహనిర్మాణారంభము (5) అవసరములైన గదులకు స్థలములు ప్రత్యేకించుట - గర్భవిన్యాసము అనగాగృహాంతర్భాగమున శాస్త్రోక్తముగా సువర్ణ - నవరత్న - ధాన్యాదులలో వేనినైన కలశములో ఉంచి నిక్షేపించుట (6) శుభముహూర్తమున శాంతికర్మలు జరిపి గృహములో ప్రవేశించుట ఇవి మిగులముఖ్యమైనవి కామికాగమములో ఇంకను విపులముగానిర్మాణక్రమము చెప్పబడినది

గ్రామాదీనాంతు విన్యాసో నివేశాదిశ్చకథ్యతే
ఆదౌ కాలపరీక్షాస్యాత్ ద్వితీయోదేశనిర్ణయః
తృతీయా భూపరీక్షాస్యాత్ ప్రవేశార్థబలిస్తతః
స్వీకారః పంచమోభూమేః షష్ఠః కర్షణముచ్యతే
శంకుసంస్థాపనం పశ్చాదష్టమః పదనిర్ణయః
నవమః సూత్రవిన్యాసోదశమో దేవతాబలిః
గృహ వీథ్యాదిభేదః స్యాదేకాదశ ఉదాహృతః
ద్వాదశోగర్భ విన్యాసస్తతో దేవనివేశనం
( కామికాగమము 33 పటలము' )

(1) కాలనిర్ణయము (2)స్థలనిర్ణయము (3)భూపరీక్ష (4)బలివిధానము (5) భవనాంతర్భాగ నిర్దేశము (6)స్థలమును దున్నుట (7) శంకుస్థాపనము (8) పాదులకు స్థలనిర్ణయము (9) త్రాటితోకొలిచి పాదులకుముగ్గువేయుట (10) నిర్మాణారంభమున దేవతాబలి(11)వసార్మాలను(verandahs)నిర్మించుట (12) కలశమును భవనమధ్యమున నిక్షేపించుట - ఈక్రమమును పాటించికట్టినచో ఆనిర్మాణములు లోపరహితముగనుండి శుభములు కలిగించును

వాస్తు విశేషములు: గ్రామ నగర గృహ దేవాయతన ప్రాసాదాది నిర్మాణములన్నియు సుదృఢములు సర్వలక్షణ సంశోభితములుగా ఉండుటకై వాస్తుశాస్త్రములు ఆరంభమునుండి సమాప్తివరకు ప్రతివిషయమునుగూర్చి ప్రత్యేకశ్రద్ధతో లక్షణములను చెప్పినవి; ఇవి ఆధునికులుగూడ అనుసరింపదగియున్నవి సాధారణముగా వాస్తుశాస్త్రములు నిర్మాణములకు సంబంధించిన క్రింది విషయములను చెప్పును

(1) మానప్రమాణములు (కొలతలు) (2) తల విన్యాసము, (3) పాద విన్యాసము (4) శంకుస్థాపనము (5) భూమిలంబవిధి (పాదులు త్రవ్వుట) (6) గర్భ విన్యాసము (పాదులు పూరించుట) (7) ఉపపీఠవిధి, (8) అధిష్ఠానవిధి (9) స్తంభలక్షణములు (10) మంటప లక్షణము (11) ద్వారవాతాయన లక్షణము (12) ప్రస్తరము (చుంచు) (13) ప్రాచ్ఛాదనము (పైకప్పు) (14) విమాన

లక్షణము (15) గోపుర లక్షణము (16) ప్రవేశకర్మ దేవాలయములకు నుకొన్ని విశేషములు పేర్కొనబడినవి

**మంటప లక్షణములు** వాస్తు శాస్త్రములలో వివిధములయిన మంటప నిర్మాణములు చెప్పబడినవి

(1) మంటపము (2) రాజసభ (3) శాల (4) దివ్య మంటపము (5) నాట్య మండపము (6) అభిషేక మంటపము (7) క్షుద్ర మంటపము (8) కల్యాణ మంటపము (9) సరోవర మంటపము (10) అర్ధ మంటపము-అను భేదములు ముఖ్యమైనవి

**ప్రేక్షాగారములు** - భరతుని నాట్య శాస్త్రములో నాట్యమంటపములు మూడు విధములుగ చెప్పబడినవి - 1 వికృష్టము (దీర్ఘచతురస్రము) (2) చతురస్రము (3) త్ర్యస్రము (ముక్కోణము) శారదాతనయుడు తన భావప్రకాశము లో వృత్త నాట్య మంటపమునుగూర్చి చెప్పెను మరికొన్ని శిల్ప గ్రంథములలో నాట్యమంటప భేదములు కొన్ని పేర్కొనబడినవి

**ఆతురాలయములు** చరక సుశ్రుతముల ద్వారా ప్రాచీనభారతమున ఆతురాలయములు ప్రసూతిశాలలు కుమారాగారములు అను పేర వైద్యశాలలుండినట్లు తెలియుచున్నది వాస్తుశాస్త్రములలో గ్రామరచనా సంగర్భమున నంద్యావర్తక సర్వతోభద్ర' గ్రామనిర్మాణ లక్షణముతో పాటు వైద్యశాలా నిర్మాణముకూడ చెప్పబడినది క్రీ శ అయిదవ శతాబ్దమున భారతదేశమును సందర్శింపవచ్చిన చీనా యాత్రికుడు ఫాహియాన్ పాటలీపుత్రమునందలి ఒక ధర్మవైద్యశాలను సుందరముగా వర్ణించియున్నాడు అశోక శిలాశాసనములలో నర పశు వైద్యశాలలను స్థాపించినట్లు తెలుపబడినది సుశ్రుతుడు తన గ్రంథమున సూతికాగారము నిట్లువర్ణించినాడు సర్వాగారంయథాసంఖ్యం తన్మయ పర్యంకమువలి వ్రతి త్రింపవిభక్త పరిచ్ఛదం ప్రాగ్ద్వారం దక్షిణద్వారం అష్టహస్తాయతం చతుర్హస్త విస్తృతం రక్షామంగళసంపన్నం విధేయం ఈ విధముగనే "కుమారాగారము' (శిశుపోషణగృహము)కూడ వర్ణింపబడినది

వాస్తుగ్రంథములలో గ్రామనగరాదులయందు నిర్మింపబడవలసిన విద్యాశాలలు న్యాయాలయములు నటాశము పుష్కరిణి విక్రయశాలలు క్రీడాస్థలములు ఉద్యానములు, పుష్పవాటికలు, వ్యాయామశాలలు మొదలయిన వివరింపబడినవి

గ రా శ

## వాస్తు భవవికాసము

వాస్తువనగా గారోగ్యమగు భూమియందు ఆవాసముల నిర్మాణమని యర్థము భారతీయులకు మిగుల ప్రాచీన కాలమునుండియే సుందర ప్రాసాద నిర్మాణరీతులు తెలిసియుండెననుటకు వేదవాఙ్మయమే ప్రమాణము బుద్ధిజీవులగు జనులు కాలక్రమమున మనోవికాసమునొందుచు తమ నివాసములను సకల సౌకర్యములతో నిర్మించుకొనుటయందు సాఫల్యము నొందినట్లు భారతీయ నిర్మాణరీతులు చెప్పుచున్నవి

**వేదయుగము** వేదములలో హర్మ్య శాలా ప్రాసాదముల ప్రస్తావనము కలదు అథర్వవేదమునందు జనులు చక్కని ఇండ్లలో నివసించుచుండినట్లు చెప్పబడినది అందలి 9 13 15 వ మంత్రములందు వివిధాకృతులు గల గృహములు ప్రస్తావించబడినవి దారు స్తంభములయొక్క దూలములయొక్క దంతెలకు ఉపమిత్ ప్రతిమిత్ పరిమిత్' అను పదములు వాడబడినవి కొన్ని స్థలములలో స్థూణ (ప్రధాన స్తంభములు) అక్షు (చీల్చిన వెదురుబద్దలు) ఛాదిస్' (పైని కప్పుగడ్డి) అను శబ్దములు ప్రయోగింపబడినవి ఈ వస్తువులతో కట్టుకొన్న గుడిసెలు నేటికిని పల్లెపట్టులలో విశేషముగా కానవచ్చుచున్నవి ఈ గడ్డిగుడిసెలే క్రమవికాసము నొంది హర్మ్య ప్రాసాదములుగా మారినవని చెప్పవచ్చును

తైత్తిరీయబ్రాహ్మణ సామవేద మంత్రములలో బ్రాహ్మణగృహవర్ణనము కలదు ఆ కాలపు బ్రాహ్మణగృహమున మధ్యభాగమునందు అగ్నిశాల దానిప్రక్కన హవిర్ధానము పత్నీసదనము వంచపాళి పెక్కుగదులు ఉండెడివి ఋగ్వేదములో వేయిద్వారములుగల ఒక మహారాజ ప్రాసాదము వర్ణితమైనది మిత్రావరుణులు 100 స్తంభములు 100 ద్వారములు గల భవనము నాక్రమించుకొని యుండినట్లు అందు తెలుపబడినది

వేదయుగమున యజ్ఞములు ప్రాముఖ్యము వహించియుండెను అందుకై ప్రాచీనవంశము అనబడు శాలను, వేదికలను ఇటుకలతో వెదురుతో కర్రలతో నిర్మించుచుండిరి వేరువేరు యజ్ఞములకు వేరువేరు ఆకృతులుగల వేదికలు నిర్మించబడుచుండెడివి ఇటుకలను ఒకచోట అమర్చి వేదికలను నిర్మించుచుండినందున వీటికి 'చితి చయన, స్థూణము అను

వ్యవహారము కలిగెను స్తూపము శిరబంధాకృతి (జడ చుట్టు)లో ఉండినట్లు తైత్తిరీయ సంహితయందు వర్ణింపబడి నది శుల్బ సూత్రములలో యజ్ఞవేదికలు శాలలు మొదలైన నిర్మాణములకు సంబంధించిన కొలతలు తెలుపబడినవి దేవా లయాది నిర్మాణపద్ధతికి యజ్ఞవేదిక నిర్మాణపద్ధతియే మూలమై యున్నదని భారతీయ విద్వాంసుల అభిప్రాయము బోధాయన ఆపస్తంబులు తమ సూత్ర గ్రంథములలో చితుల వివిధ స్వరూప నిర్మాణభేదములను వివరించినారు ఈ వైదిక స్తూప చితులననుసరించియే జైన బౌద్ధుల స్తూప చైత్యాల యాది నిర్మాణరీతులుండియుండ వచ్చును కావున భారతదేశము నందలి మత సంప్రదాయములకు సంబంధించిన వాస్తురీతు లకు వేదములే మూలాధారములుగ నున్నవి

ప్రాగైతిహాసిక యుగము : వేదయుగము తరువాత కాలక్రమమునకును మొహంజొదారో హరప్పా చెన్హుదారో ఝుకర్ కోహిస్తాన్ బెలూచిస్తాన్ వజీరుస్తాన్ మొదలైన సింధునదీ ప్రదేశములలో నాగరికత సంపూర్ణ వికాసము గాంచియుండినట్లు తెలియుచున్నది ఆ ప్రదేశములందు దొర్ల డిన మంటిదిబ్బలను పురావస్తు పరిశోధకశాఖవారు త్రవ్వి పరిశోధనలు జరిపినపుడు బయల్పడిన కట్టడములు వస్తు సామగ్రి పాత్రలు ఆభరణములు దేవతామూర్తులు మున్నగు వాటినిబట్టి క్రీ పూ 3-4 వేల యేండ్ల క్రిందటనే ఎన్నిసౌ కర్యములతో కూడిన సుందర మహానగరములు అచ్చట నిర్మింప బడినట్లు తెలిసికొనవచ్చును అచట యాగమంటపము యజ్ఞ సంబంధములైన జంతువుల అస్థులు బయల్పడినందున సింధు నదీలోయ నాగరికత వేదయుగానంతర కాలమునాటిదని భార తీయ విద్వాంసులు నిర్ణయించినారు ఇచటి నిర్మాణములలో కాల్చిన ఇటుకలు పచ్చిఇటుకలు కానవచ్చినవి కాస్యప శిల్పశాస్త్రమునందు చెప్పబడిన రీతిలో ఇచ్చట ఇటుకలుండుట గమనింపదగిన విశేషము

ఈవిధముగా క్రీ శ 3 4 వేల యేండ్లకు ముందునుం డియు ఇటుకలతో కట్టిన కట్టడములుండినట్లు తెలియుచున్నను తరువాత మౌర్యయుగములలో (క్రీ పూ 3వశతాబ్దవరకు) అట్టినిర్మాణములు కానరాలేదు ఇందుకు కారణమేమో తెలి యుటలేదు మౌర్యయుగమునకు పూర్వపు కట్టడములన్నియు కర్రతోనో ఇతరవస్తువులతోనో నిర్మింపబడియుండుననియు, అందువలన ఆకాలపు కట్టడములు కానరాకున్నవనియు భార తీయ పండితులు తలచుచున్నారు

బౌద్ధయుగము: క్రీ పూ 3 వ శతాబ్దినుండియు శిలా నిర్మాణములు కానవచ్చుచున్నవి అశోకచక్రవర్తి తన కాల మున ఇటుకలతో రాళ్లలో కట్టడములు నిర్మించు పద్ధతిని పునరుద్ధరించెను బౌద్ధమతము అనాడాతనికి ప్రముఖమైనది ముఖ్యమైనది కావున అశోకుడు బౌద్ధనిర్మాణములను వెల యింపజేసెను ఆ తరువాత పలువురు విదేశీయులు ఎమతీ యులు భారతదేశముపై దండయాత్రలు జరిపి భారతీయ నిర్మాణములను నాశనమొనర్చుటచే భారతీయ వాస్తుశిల్ప కళలు ఏ గముల క్రమపరిణామవికాసమును పొందెనో వివ రించుటకు ఆధారములు చాలవు నష్టావశిష్టము లగు కొన్ని నిర్మాణముల ఆధారములతోడనే భారతీయ వాస్తుకళావికా సమును గ్రహింపవలసి యున్నది

నాటి నిర్మాణకళకు బుద్ధుని జీవిత విశేషములే ప్రోత్సా హము నొసగినవి గౌతమబుద్ధుని భౌతికశరీరము అగ్నిదగ్ధ మైన తరువాత ఆయన పవిత్ర అస్థికలు ఎనిమిది భాగములు చేయబడి వైశాలి కపిలవస్తు అల్లకప్ప వేష్టద్వీపము రామ గ్రామము పావా కుశనగరము మున్నగు ఎనిమిది స్థలము లలో అని నిక్షేపింపబడినవి ఈ నిక్షేపమున కొక విధానము కలదు ఒక వేదికనుకట్టి దానిపై అస్థికలుంచిన స్ఫటికపేటి కను నిక్షేపించి దానిపై అండాకారములో మట్టిదిబ్బనుకట్టి అది వర్షము వలనచెడకుండ ఇటుకలతో కప్పుచుండిరి దానిని భక్తులు పూజించుచుండిరి ఈ మట్టిదిబ్బలను స్తూపములనియు చితికి సంబంధించిన వాటిని చైత్యములనియు వ్యవహరించి నారు పైన చెప్పబడిన ఎనిమిది స్తూపములలో ఏడింటిని అశో కుడు తెరపించి వాటియందలి అస్థికలను అనేక కలశములలో పెట్టించి దేశమంతటను పంచి పెట్టించెను అన్ని కలశములను తగు స్థలములలో నిక్షేపింపజేసి అతడు స్తూపములను నిర్మింప జేసినాడు అశోకుని నాటినుండి స్తూప నిర్మాణమున మార్పులు జరిగినవి ఒక వేదిక దానిపై అండాకారపు దిబ్బ దానిపై చతురస్రాకార సుందిరము అందులో అస్థికల నిక్షేపము జరిగినది దీనిని హర్మ్యిక మందురు దీని పైభాగముగ శిలా ఛత్రమును నిలిపెదరు ఈ స్తూపము చుట్టును శిలామయ ప్రాకారము దానికి నాలుగు దిక్కులలో నాలుగు తోరణ ద్వారములు ఉండును ఈ ప్రాకారఫలకములమీద తోరణ ములమీద బుద్ధునిజాతకగాథలు ధర్మసంకేతములు చెక్కబడినవి

అశోకుని కాలపు స్తూపములు భార్హుత్ సాంచి బిప్రావా సారనాథ్ మున్నగు తావులలో బయటపడినవి ఆ కాలపు శిలా స్తంభములు అద్భుత కౌశల్యమును చాటు చున్నవి ఆంధ్రదేశములోని అమరావతి ఘంటసాల జగ్గయ్య పేట మాణిక్యాల మున్నగుస్థలములలో ప్రాచీనపద్ధతి స్తూప ములు కానవచ్చుచున్నవి

అజంత కార్లి నాసిక్ కన్హేరి ఎల్లోరా గుహాలయ ములు తరువాతి కాలమున తొలువ బడినట్టివి వీటిలో వెనుక భాగము అండాకారముగ నుండి బుద్ధవిగ్రహములోను స్తూపముతోను కూడి యుండును ముందుభాగమున విశాల స్తంభ మంటపము అంకణములుగా విభజింపబడి యుండును ద్వారముల పైన వాతాయనములు అమర్చబడినవి భిక్షుల నివాసములకై విహారములు సంఘారామములు వెలసినవి

బౌద్ధుల వలెనే ఆ కాలపు జైనులుకూడ చైత్యా లయ ములను ఆరామములను గుహాలయములను నిర్మించిరి ఇవన్నియు ఇంచు మించు బౌద్ధ నిర్మాణములను పోలియున్నవి ఒరిస్సా ప్రాంతములోని ఉదయగిరి ఖండగిరులలో కానవచ్చు హాతిగుంఫ రాణిగుంఫ గుహాలయములు క్రీ పూ ప్రథమ శతాబ్ది నాటివి దక్షిణ దేశమున బాదామి అంకాయి తిరు చిరాపల్లి వల్లిమల ఎల్లోరా సిత్తన్నవాసల్ శ్రావణ బెళ గోళ మొదలైన ప్రదేశములలో జైన గుహాలయములు వెలసినవి

జైనులు కట్టించిన ఆలయములు మాత్రము హైంద వాలయములను పోలి యున్నవి లక్కుండి పలితానా గిరి నార్ అబూ పరేశనాథ్ ఖజురాహో గ్వాలియర్ చిత్తోడ్ మొదలైన చోట్ల గల జైనాలయములకును హైంద వాలయములకును పోలిక లున్నవి

వైదికపునరుద్ధరణయుగము విదేశీయపండితులు బౌద్ధ జైన ములకు భిన్నమైన వాస్తువును తెలుపుటకై దానికి బ్రాహ్మణ వాస్తువు అని నామకరణము చేసినారు ఈ బ్రాహ్మణ వాస్తువులో ఔత్తరీయ పద్ధతి (Indo — Aryan Style), ద్రావిడపద్ధతి అను రెండు ప్రధాన భేదములు వివరింప బడినవి జైన బౌద్ధముల తరువాతి కాలమును వైదికమత పునరుద్ధర ణయుగమని వ్యవహరింపవచ్చును అవైదికములగు బౌద్ధ జైనమతములచే ఆరగ్రదొక్కబడిన వైదిక మతము ను పునరుద్ధ రించుటకు దీక్షాకంకణమును ధరించినవారు గుప్తసార్వ భౌములు వీరితరువాత దక్షిణమున చాళుక్యులు పల్లవులు పునరుద్ధరణ కార్యక్రమమును చేపట్టి దాని అహమహమికతో కొనసాగించిరి దాని ఫలితముగా వెనుక బట్టిన పురాణముల ప్రాముఖ్యము మరల విజృంభించెను అప్పటినుండి వాస్తుశిల్ప కళలకు వైదిక మతము మూలాధారమయ్యెను బౌద్ధము నకు ముందు నిర్మింపబడిన వైదిక దేవాలయములు మృత్ దారు నిర్మితములైనందున అవి శిథిలమై పోయినవి బౌద్ధుల తరువాత శాశ్వత నిర్మాణముల ఆవశ్యకత మరల గుర్తింప బడినది అందువలన పురాణగాథాశిల్ప మయమైన బృహద్దే వాలయములు నిర్మింప బడినవి

ఇంత వరకు భారతదేశమున కానవచ్చుచున్న ప్రథమ శిలా నిర్మిత దేవాలయము గుంటూరు జిల్లా యందలి చేజెర్ల గ్రామము లోని కపోతేశ్వరాలయ మొక్కటియే ఇది క్రీశ నాల్గవ శతాబ్ది యందు గజపృష్ఠాకారమున కట్టబడినది గుప్త వాకాటక మహారాజులు నాచ్నాగంజ్ దేవఘర్ ప్రాంతము లలో కట్టించిన వైదిక దేవాలయములు సుందర శిల్ప విరా జితములై యున్నవి సాంచీస్తూపము వద్ద నున్న ఒక ప్రాచీ నాలయము విమాన రహితముగా కన్పట్టుచున్నది అందొక చిన్న గర్భగృహము దాని ముందు ముఖ మంటపము గలవు కాలక్రమమున ఆలయ నిర్మాణ రీతులలో చాల మార్పులు జరిగినవి గర్భగృహము అంతరాళము రంగ మంటపము - వీటి చుట్టును ప్రదక్షిణ పథము ప్రవేశద్వారము ముఖమంట పము గర్భాలయముపై విమానము మరల బాహ్య ప్రదక్షిణ పథము; దాని చుట్టును మహాప్రాకారము అందులో పాక శాల యజ్ఞశాల కల్యాణమంటపము ప్రాకారమునకు మహాద్వారము, దానిపై గోపురము మొదలైన వాటితో రానురాను దేవాలయ నిర్మాణము విస్తృత రూపము దాల్చి నది.

ఎల్లోరా మహాబలిపురము, ఎలిఫెంటా బాదామి ప్రాంతములలో వైదిక గుహాలయములు వెలసినవి ఈ గుహా లయ నిర్మాణ పద్ధతుల ననుసరించి పల్లవ చాళుక్య వాస్తు రీతు లుదయించినవి చాళుక్యరీతి యందు ఏకకూట ద్వికూట, త్రికూట చతుష్కూట పంచకూట యుగళ దేవాలయ ములు నిర్మింపబడినవి నక్షత్రాకృతిగల తలవిన్యాసము (Ground plane) గ్రహింపబడి, విచిత్రాలంకరణముతో మనోహరములైన ఉపపీఠములు, అధిష్ఠానములు కల్పింపబడి

వాటిపై ఆలయ నిర్మాణము చేయబడినది ఈ చాళుక్యరీతిలో గర్భాలయముపై చతురస్రవిమానము దానిపై అమలకము ఆపైన శిఖరము రచింపబడుట ఒక విశిష్ట పద్ధతి ఈ రీతి వాస్తువు పశ్చిమమున గిరినార్ నుండి తూర్పున గౌహతి వరకు వ్యాపించినది 10 వ శతాబ్ది నుండి చాళుక్య రీతిలో కొలది మార్పులు జరిగినవి ఎత్తైన విమాన ప్రాముఖ్యము తగ్గినది సున్నితమైన అలంకరణశిల్ప భాగము హెచ్చినది కల్యాణి చాళుక్య హొయసల కాకతీయుల కాలమునాటి ఆలయములలో ఈ సుకుమార శిల్పాలంకరణము విశేషముగ గలదు కళింగ వంగ మాళవ మగధ కాశ్మీర ఘూర్జర దేశములలోని వాస్తు రీతులలో చాల వ్యత్యాసములు ప్రవేశ పెట్టబడినవి

భారతీయశిల్పశాస్త్రములు నాగర వేసర ద్రావిడ అను మూడు విధములైన ఆలయ వాస్తు భేదములను పేర్కొనినవి నాగర శిల్పరీతిలో కట్టబడిన ఆలయములు కాశీ బృందావనము భువనేశ్వరము పట్టడకల్లు ఖజురాహో అలంపూరు మొదలైన స్థలములలో కలవు ఎల్లోరా లోని కైలాసనాథ గుహాలయము ధార్వాడ కాంచి రామేశ్వరము మధుర తంజావూరు విజయ నగరములలో కట్టబడిన దేవాలయములు ద్రావిడ రీతికి చెందినట్టివి

దక్షిణ భారతము నందలి ముఖ్యమైన ప్రాచీన దేవాలయములు పట్టణములవలె విశాలముగ నుండును ఈ యుగము నందలి నిర్మాణ రీతులను బట్టి హైందవ వాస్తువును కొన్ని ముఖ్యరీతుల క్రింద విభాగింప వచ్చును వీటిలో చాళుక్య వాస్తురీతి పల్లవవాస్తురీతి చోళ వాస్తురీతి ముఖ్యము లైనవి చాళుక్య రీతిలో హొయసల పద్ధతి కాకతీయ పద్ధతి అను సూక్ష్మ భేదములు కానవచ్చును కళింగరీతియనునది చాళుక్యరీతి నుండి కొలది మార్పుతో అవతరించినట్టిదే కాగా పల్లవరీతి యనునది శుద్ధ ద్రావిడము బౌద్ధ జైన చాళుక్య పల్లవ వాస్తు పద్ధతుల నన్నిటిని జీర్ణమొనర్చుకొని అన్నిటికి ప్రభావితమై చోళ వాస్తురీతి (విజయనగర వాస్తు రీతి) యనునది ప్రత్యేకముగ వెలసినది ఈ విభిన్న వాస్తు రీతులలో [illegible] నేక విషయములందు వైవిధ్యము స్పష్టముగా కా [illegible] నిర్మాణమునకు గ్రహించు శిల తలవిన్యా [illegible] నుండి ద్వారగోపురము వరకు నిర్మింపబడు ఉపపీఠ కుడ్య స్తంభ వీధికా మంటప ద్వారములు పై కప్పులకుగల అలంకార విశేషములు వీటి అన్నిటియందు ప్రత్యేక లక్షణములు రూపొందినవి

ఆయా కాల పరిస్థితులను బట్టియు విభిన్నమత సంప్రదాయములను బట్టియు శిల్పుల ప్రతిభా కౌశల్యములను బట్టియు భారతీయ వాస్తు నిర్మాణపద్ధతులలో ఉత్తమ వికాసము గోచరించును భావవికాసము ననుసరించి నిర్మాణ రీతులలో విభిన్నత కానవచ్చినను శిల్పులందరును సత్యం శివం సుందరం అను ప్రధాన లక్ష్యములను సాధించుటకే కృషిచేసినారు

గ రా శ

## వాస్తువు (బౌద్ధము)

బుద్ధుని కాలమున ఉత్తరభారతదేశములో బౌద్ధ మతము ప్రబలముగ వ్యాప్తియందుండెను ఆకాలమున గృహములు విడివిడిగాకాక గుంపులుగ నుండెడివనియు వీటిని కలుపుచు అరణ్యమధ్యమునుండి తటాకముల ప్రక్కనుండి పంటభూములగుండ దుర్గములు నిర్మింపబడి యుండెవనియు జాతక కథలలో పేర్కొనబడి యున్నది ఆనాటి గృహము లెట్లు నిర్మింపబడినవో ప్రాచీన గ్రంథములలో తృప్తికరమైన వివరములు లేవు కాని కొన్ని నిర్మాణవిశేషములు మాత్రము బౌద్ధ ప్రాకృత పాలి గ్రంథములలో లభించినవి

మగధలోని గిరివ్రాజ దుర్గముయొక్క పరిధి అర మైలు వెడల్పుండెననియు అది మహాగోవిందుడను శిల్పిచే నిర్మింపబడినదనియు విమానవత్థు అను గ్రంథమునుండి తెలియవచ్చినది ఇట్లే అయోధ్య బనారస్ కపిల కౌసాంబి వైశాలి మొదలైనవాటిని గూర్చి తెలుపబడి యున్నది తరువాతి బౌద్ధగ్రంథములనుండి పల్లెలు పట్టణముల యందలి కట్టడములను గూర్చిన కొన్ని వాస్తు విశేషములు బయటపడినవి

ఖుల్లవగ్గ" అను గ్రంథమున అయిదు రకముల బౌద్ధ గృహములను బుద్ధుడు వర్ణించినట్లు చెప్పబడియున్నది విహార అర్థయోగ ప్రాసాద హర్మ్య గుహ అని వాటి నామములు

విహారములు ; ఇవి బౌద్ధులు విహరించు శాలలు, స్తూపములు మున్నగు కట్టడములను కల్గియుండెడివి

అర్థయోగ :దీని అర్థము ననుసరించి రెండర్థభాగము లను కలుపునది అని తెలియుచున్నది నేటికిని రెండర్థగృహ

ములను కలువు ఇండ్లను పల్లెటూళ్ళలో చూడగలము అర్ధ యోగమనగా 'సువర్ణవంగగేహ' మని బుద్ధఘోషుడు వ్యాఖ్యానించినాడు ఇందువలన ఇదియొక బంగారువర్ణము గల్గిన భవనమని బోధపడుచున్నది

ప్రాసాద ఇదియొక దీర్ఘభవనమని బుద్ధఘోషుడు చెప్పినాడు కాని రైస్ డేవిడ్స్ మొదలగు చరిత్రకారులు ఇది మేడవలె నుండు భవనమని ఊహించినారు మోనర్ విలియమ్స్ అను పండితుడు ఇది బౌద్ధమతమునందు చేరుటకు ప్రజలు సమావేశమగు భవనమని అభిప్రాయపడినాడు

హర్మ్య వసతి కొరకై ప్రాసాదమునందు ఒకటి రెండు గదులుగల భవనమని దీని భావము వీటిని గురించి శిల్ప శాస్త్ర గ్రంథములందును కొన్ని సంస్కృత కావ్యములందును కొన్ని వివరములు లభింపగలవు

గుహ భూగర్భమున నుండు ఇదియొక శిలాగృహము "ఉమ్మగ్గజాతకము నందు ఈ బౌద్ధగుహను గూర్చి విపులముగ వర్ణింపబడినది

*పురాతత్త్వపరిశోధనలలో అనేక బౌద్ధ అవశేషములు* బయల్పడుచున్నవి వీటిలో విహారములు ఆరామములు సంఘారామములు ప్రాసాదములు చైత్యగృహములు స్తూపములు మొదలైనవి ఎన్నియో కలవు వీటిలో ముఖ్యమైనవి స్తూపములు ఇవి బుద్ధజననమునకు పూర్వపు కట్టడములని చెప్పుట కాధారములున్నవి 'స్తూప్' అను సంస్కృత ధాతువును పురస్కరించుకొని ముఖ్యమైన కొన్ని అవశేషములను ఒకచోట ఉంచి వాటిమీద కట్టెడు నిర్మాణములకు స్తూపములని పేరు అట్లే చితి అను పదమును పురస్కరించుకొని అవశేష సముదాయముల నొకచోట ఉంచి కట్టెడు నిర్మాణములు చైత్యము లనబడెను ఇందుచే అర్థమునుబట్టి చైత్యములు స్తూపములు ఒకటేనని తెలుచున్నది అమరావతి స్తూపమునందు ఉష్ణీష అను రాయి సముద అను దానిచే నెలకొల్పబడినట్లు హిశముఖ తథ్య భగవతో మహాచేతియప ఉష్ణీషస అను ▼ సనము వలన తెలియుచున్నది ఇదియుగాక అమరావతియందు కన్పించు మహాచైత్యము గుండ్రముగనుండి చుట్టును రాతిఫలకములతో అమర్చియున్నట్లు అక్కడి అవశేషముల వలన తేలుచున్నది

స్తూపమనునది బుద్ధునికి పూర్వము నుండియు వచ్చుచుండిన కట్టడము కనుక ఆనాటి ఈ నిర్మాణములోని ఉద్దేశము తెలిసికొనుట అవసరము లాంగ్‌హర్ట్స్ అను పాశ్చాత్యుడు స్తూపమనునది చనిపోయినవాని ఆత్మను భద్రపరచుటకు వినియోగింపబడు భూగృహమనియు మరణించినవారి అవశేషములను దీనియందుంచి తిరిగి పైకివచ్చి బ్రతికియున్నవారిని బాధపెట్టకుండుటకై పెద్ద బండలతో దానిని కప్పెడివారని అవశేషములను బట్టి చెప్పవచ్చు ననియు వ్రాసెను ఈ రాతి బండల సమాధులను (megaliths) ఇప్పటికిని చూడవచ్చును కొన్ని తావులందివి రాక్షసగుళ్లు అని పిలువబడుచున్నవి ఇందుచే ఈ రాక్షసగుళ్లు సమాధులు బౌద్ధస్తూప నిర్మాణముల కాధారములని చెప్పవలెను కాలాంతరమున ఈ స్తూపములు మూడు తరగతులుగా విభజింపబడినవి (1) శారీరక (2) పారిభోగిక (3) ఉద్దేశిక

శారీరక స్తూపములు వీటికి డగోబ లేక ధాతుగర్భ అను నామముకూడ కలదు బుద్ధుని శరీరావశేషములను ఉంచికట్టిన నిర్మాణములకు శారీరక స్తూపములని పేరు బుద్ధుడు మహాసంబోధి పొందినకాలమున త్రపుష భల్లిక అను *నగర శ్రేష్ఠులకు తన వెంట్రుకలను, గోళ్లను ఇచ్చెను* వీటిపైన వారు స్తూపములను నిర్మింపించిరి తిరిగి బుద్ధుని నిర్వాణానంతరము అతని శరీరావశేషములను ఎనిమిది భాగములుగ విభజించి వాటిపైన స్తూపములను నిర్మింపించిరి తర్వాత అశోకుని కాలమున వీటిలోని ఏడు స్తూపములను త్రవ్వి వాటిని 8400 భాగములుచేసి ఒక్కొక్క భాగముమీద ఒక్కొక్క స్తూపమును నిర్మింపించిరట!

పారిభోగిక స్తూపములు — ఇవి బుద్ధునిచే ఉపయోగింపబడిన వస్తువులమీద నిర్మింపబడిన కట్టడములు సుజాత అను శ్రేష్ఠియొక్క కుమార్తె బుద్ధుడు సంబోధి పొందినవాడు, ఒక గిన్నెయందు పాయసము నియ్యగా బుద్ధుడా పాయసమును భుజించి ఆ గిన్నెను ప్రక్కనున్న నిరంజన నదిలో విసరివైచెనట నాగులు దేవతలు ఆ గిన్నెను పట్టుకొని దానిమీద నొక స్తూపమును నిర్మించిరట అట్లే బుద్ధుడుపయోగించిన సింహాసనమునకు బౌద్ధభిక్షువులు ప్రణమిల్లుచున్న శిల్పన్నియో స్తూపఫలకములు గలవు ఇవియు పారిభోగిక స్తూపఫలకములే

ఉద్దేశిక స్తూపములు వీటియందు బుద్ధుని అవశేషములుగాని అతడుపయోగించిన సామాగ్రిగాని, యుండవు ఇవి కేవలము బుద్ధుని పరినిర్వాణ చిహ్నములు వైబా

యాత్రికుడు యువాన్ చ్వాంగ్ భారతదేశములో పెక్కువేల ఉద్దేశికస్తూపములను దర్శించినట్లు వ్రాసికొన్నాడు బుద్ధుని జ్ఞాపకార్థము అశోకుడు లుంబినీవన మందొక ఉద్దేశికస్తూపమును కట్టించెను

బౌద్ధస్తూప నిర్మాణ విశేషములు కొన్ని మహావంశ అను సింహళబౌద్ధ గ్రంథమునందు కలవు సింహళ మందలి మహాస్తూప నిర్మాణము కొన్నివేల బౌద్ధభిక్షువుల సమక్షమున రాజు దుత్తగామణి అను ఒక బయలునందు గుండ్రముగా గీటు గీచి పునాదులు వైచెను దీని యందు ముఖ్యముగా మూడు భాగములు కలవు (1) అండాకారముగనుండు కట్టడము దీనిని కొంతవరకు నూతి గోడవలె కట్టి పైన అండాకారముగ రూపము కల్పించెదరు (2) అండభాగముపైన హార్మిక (బర్మాలోని స్తూపమును పోలునది) అను పెట్టెవలె నుండు ఇటుకలతో అమర్చబడిన కట్టడము కలదు దీనిపైన (3) సూచి లేక ఛత్త్ర (ఛత్త్రావళి) అను గొడుగుల వరుస యుండును

లాంగ్ హర్ట్సు ప్రథమమున స్తూపాకారములెట్లుండెనో 'స్తూపములగాథ' అను వ్యాసములో వర్ణించెను దీనినిబట్టి స్తూపము పదిలో రెండింతలగ్రొత్తవలెనుండును దానిచుట్టును శిలాప్రాకారమొకటి యుండును గిన్నె క్రిందిభాగము గుండ్రని నూతిగోడవలె యుండును బుద్ధనిర్యాణానంతరము ప్రథమముగ కట్టిన స్తూపములు చిన్నవిగానుండుటచే వానిని పూలతో అలంకరించుటకు అక్కడక్కడ కొయ్యమేకులుండెడివి గుండ్రని ఈస్తూపములచుట్టును మొదట చెక్కప్రాకారము లుండెడివి తర్వాత శిలాప్రాకారములు నిర్మింపబడినవి ఈ ప్రాకారములందు లతలు పువ్వులు కాయలు మొదలైనవి అందముగ చెక్కబడియుండెను ప్రాకారములకు నాలుగువైపుల నాల్గుదిక్కులను సూచించు తోరణములతోకూడిన ద్వారములు గలవు

పురాతత్త్వ అవశేషములందు ముఖ్యముగా నేపాలులో నున్న ప్రాహ్వా స్తూపము ఇప్పుడు కాన్పించువాటిలో మొదటిది దీ ఎత్తు 2 అడుగులు వ్యాసము 116 అడుగులు 200 సంవత్సరముల తర్వాత కట్టిన సాంచిస్తూపముయొక్క ఎత్తు 54 అడుగులు వ్యాసము 120 అడుగులు స్తూప అండము పైనుండు హార్మిక మందు బుద్ధుని అవశేషములు భద్రపరుపబడినట్లుగ మహావంశము నందు లిఖింపబడియున్నది హార్మికముపైన ఛత్త్రావళి యుండుచుండవచ్చును కొన్ని స్తూప ఫలకములందు స్తూపముల నమూనాలుగలవు కొన్ని శాసనములలో ఛత్త్రావళి మొదలగు భాగములు కొందరు శ్రేష్ఠులచే నెలకొల్పబడినట్లున్నది

ఆంధ్ర ప్రాంతమందుండు బౌద్ధస్తూపములకొక విశేషమున్నది స్తూపములచుట్టును నాల్గుదిక్కులను సూచించుతావులందు నాల్గు సమచతుర్భుజ ఆయకట్టులు (extentions) గలవు వీటికి ఆయకవేదికలని పేరు వీటిపై అయిదు స్తంభములు నెలకొల్పబడినవి వీటికి ఆయకకంబము (స్తంభము) అని పేరు కొన్ని స్తూపములందు బుద్ధుని అవశేషములు ఈ స్తంభములక్రింద దొరకినవి

స్తూపఅండము ఇటుకలతోను సున్నముతోను కట్టెడివారు తర్వాత పెద్దపెద్ద రాతిబండలను చెక్కి అండముచుట్టును హార్మికమునకు అతికెడువారు ఈ రాతిబండలపై అనేక జాతకకథలు స్తూప నమూనాలు పూవులు చెట్టుచేమలు త్రిరత్నచిహ్నములు శాక్యసింహములు ఏనుగులు గుఱ్ఱములు మొదలైనవి చెక్కెడివారు ఈ చెక్కడముల మూలముగా ఎన్నియో విషయములను తెలిసికొనగల్గుచున్నాము స్తూపముపై రాతిబండల తొడుగు ఉండుటవలన అండము నందుండు వంపులకు అనుగుణముగనుండు రాళ్లను దీర్ఘ సమచతురప్రాకారముగనుండు రాళ్లను రాతిబండలను కలుపుచు బిగించుటకు ఉష్ణీష యను రాళ్లను ప్రక్కలయందు బిగింపబడు దంథ సూచి యను రాళ్లను బౌద్ధ అవశేషములందు కాన్పించును

స్తూపముచుట్టును ప్రదక్షిణమునకు కొంతదారి వదలి దృఢ శిలాప్రాకారములను నిర్మించెడివారు ఈ ప్రాకారముల చుట్టును స్తంభములనుపాతి మసూరప' (lenticular) రూపమువలెనుండు కంతలను స్తంభములందు తొలిచి విడిగా కంతలకు అనుగుణముగా యుండునట్లు మరికొన్ని రాతిచెక్కలను తయారుచేసి స్తంభములను కలుపుచు ఆవరణమును తయారుచేసెడివారు ఇట్లే తోరణద్వారములను చెక్కతో గాని రాతితోగాని తయారుచేసెడివారు ద్వారముచెంత ఎత్తయిన రెండు స్తంభములనుపాతి ద్వారోపరి త్తిదారుల'ను (lintels) రెండు గాని మూడుగాని కలుపుచు ఒక ఆకృతిని తయారుచేసి వాటిమీద దానిని స్థాపించెడివారు ఇట్లు తోరణములతోను ప్రాకారములతోను రాతి

తోడుగలతోను అలంకరింపబడు స్తూపములు ఎంతో రమణీయముగా నుండెడివి. ఆ నాటి స్తూపముల శోభను ఈ నాటికిని సాంచిలో చూడవచ్చును. తోరణములందు ప్రాకారములందు బౌద్ధకథలు యక్ష గంధర్వ కిన్నెరగల బొమ్మలు మృగములు పశువులు వృక్షములు చెక్కబడియున్నవి. ఈహామృగములు మకరములు మొదలైన వింత జంతువులు కూడ అందు మనోహరముగ చిత్రింపబడినవి.

బౌద్ధకట్టడములలో అనేక విహారములుగలవు. ఇవి నివాసములుగాని దేవగృహములుగాని విద్యాపీఠములుగాని కావచ్చునని మహావంశము నందు పేర్కొనబడినది. వీటికి సంఘారామములనియు ఆరామములనియు పర్యాయపదములు గలవు. అరిగోమ్ అను శాసనమందు దేవాలయములు తత్సంబంధమైన కట్టడములు విహారములను పేరుతో వ్యవహరింపబడుచుండెడివని చెప్పవచ్చును.

నాగార్జునకొండ నలంద మొదలగు తావులలో చెక్కు విహారములు త్రవ్వకములలో బయల్పడెను. వీటినిబట్టి విహారములందు స్తూపములుండెనని తెలుచున్నది. దీని చుట్టువుల దీర్ఘచతురప్రాకారములలో గదులుగ విభజింపబడిన నిర్మాణము లుండును. ఒక్కొక్కగది ఒక బౌద్ధభిక్షువు నివసించుటకు సరిపోవునట్లుండెను. నాగార్జునకొండలోని విహారములందు ఎదురెదురుగ రెండు చైత్యగృహములు కలవు. ఇవి గజపృష్ఠాకృతిలోనున్న కట్టడములు. వీటి పునాదులు గజపృష్ఠమువలె నుండి గోడలు మనిషి లోపలి పోవుటకు వీలుగ నిర్మింపబడియుండును. పైకప్పు రైలుపెట్టెకప్పువలె నుండును. కిటికీలు లేక ఇవి అంధకారముగనుండెడివని అచ్చటి అవశేషములవలన తెలియుచున్నది.

పైన ఉదాహరించిన స్తూపములు విహారములు బయలులలో నిర్మింపబడినవి. ఇవికాక బౌద్ధులు కొండచరియలయందు కూడ స్తూపములను విహారములను నిర్మించిరి. వీటికి లయనములు' అని పేరుగలదు. ఇవి చెక్కడములలో నిర్మింపబడియున్నవి. ఈ లయములు ప్రథమమున దారుమయమై యుండెడివని తెలియుచున్నది. వీటి ప్రవేశద్వారములు ఆ నాటి అత్యున్నత కళావిశేషములను తెలియజేయుచున్నవి. ప్రవేశమునకుపైన గుర్రపునాడా ఆకృతిలో వాతాయనములు గలవు. బౌద్ధులకు పవిత్రమైనదగుటచే ఇది పిప్పలి (రావి) పత్రాగ్రమును పోలియున్నవి. ఈ వాతాయనముల కిరుప్రక్కలనున్న చిన్నగవాక్షముల ద్వారా సూర్యకాంతి లోపల ప్రవేశించును.

మౌర్యుల కాలములో తొలువబడిన కొలయనములకు ముందు ఎత్తయిన ఏక స్తంభములున్నవి. వాటిపై సింహ ధర్మచక్రముల చిహ్నాలుండెడివి. ఇట్టి గుహాలయములు పశ్చిమ కనుమలలోనున్న కార్లీ అను గుహయందు చూడవచ్చును. లయనములకు ప్రతోలి అను ప్రవేశద్వారము కలదు. స్తంభములు పూర్ణఘటములనుండి పైకి వచ్చునట్లు చెక్కబడియున్నవి. స్తంభకాండము కోణములుగలిగి పెన్సిలువలె నుండెడిది. కొన్ని స్తంభములందు పాలిక హీర పట్టిక లత మొదలైన నగిషీలుండెడివి. లయనకుడ్యములను పైకప్పును కలుపుచు కపోత ప్రస్తర వితానములు గలవు. ప్రవేశద్వార కుడ్యమునందు గవాక్ష వాతాయనములుండెను. ఈ విభాగములన్నియు విహార ప్రాసాదములందు కూడ కలవు.

సమగ్రముగా బౌద్ధవాస్తు విశేషములను గూర్చి తెలుపు గ్రంథములు చాల అరుదు. కాని పైన ఉదాహరించిన స్తూప విహారములందుండు విశేషములను గ్రహించి వాటితో గ్రంథస్థమైయున్న యితర అంశములను మిళితమొనర్చి ప్రాచీనులు ఆగమ గ్రంథములను తయారుచేసిరి. ఇవియే తర్వాత వచ్చిన హిందూదేవాలయ వాస్తుశాస్త్రాదులకు ఆధారము లయ్యెను.

టి వి గో శా

## వాస్తువు-మతము

శ్లో॥ భూపాదౌయస్యనాభి ర్వియదసుర నిలశ్చంద్ర
సూర్యౌచనేత్రే ।
కర్ణావా శాశిరోద్యౌర్ముఖ మపిదహనోయస్య
వాస్తేయమబ్ధిః ।
అంతస్థంయస్య విశ్వం సురవరఖగగోభోగి గంధర్వ
దైత్యైః ।
చిత్రం రంరమ్యతేదంత్రి భువనవపుషం విష్ణుమీశం
నమామి ॥

( మహాభారత-విష్ణుసహస్రనామము' )

భారతీయులు విశ్వమంతయు భగవానుని స్వరూపమని విశ్వసించెదరు. ఈ విషయమునే మహాభారతమునందలి పై విష్ణుసహస్రనామ శ్లోకము తెలుపుచున్నది.

తైత్తిరీయోపనిషత్తులో శింశుమారచక్రము యోగనిద్రలో ఉన్న విష్ణుదేహమునందలి వివిధ భాగములుగా వర్ణింపబడినది శింశుమార చక్రమనగా అశ్విన్యాది 27 నక్షత్రములు 12 రాసులుగా విభజింపబడిన నక్షత్రచక్రము సప్తాశ్వములతో భ్రమణముచేయు సూర్యుడు సంవత్సర కాలములో విశ్వరూపుడగు విష్ణువు దేహభాగములలో పన్రెండింటిని దర్శించును అవియే మేషాదిరాసులగుచున్నవి విశ్వము భగవత్ స్వరూపమను విశ్వాసము అన్నిటిలో తానుండి తనలో విశ్వమున్నదను కల్పనకు మూలాధారమైయున్నది

ఈ కల్పనమే గ్రామ గృహనిర్మాణ విషయమునను చేయబడినది వాస్తువుగూడ మానవదేహముగా భావింపబడినది

శ్లో॥ గ్రామశ్శరీరమంగం స్యాద్దేవ మర్త్యపరిగ్రహాః ।
ఉపాంగమితి విజ్ఞేయం విమాన భవనాదికం ॥

( కామికాగమము' )

వాస్తువనగా గృహనిర్మాణమునకై గ్రహించు స్థలము "వస-నివాసే" అను ధాతువునుండి వాస్తుశబ్దము నిష్పన్నమైనది ఇది అతిప్రాచీనకాలమునుండియు మానవనివేశనముల నుద్దేశించి వ్యవహరింపబడుచున్నది

భారతీయులు వాస్తుపురుషుని నిర్మాణస్థలాధి దేవతగా విశ్వసించెదరు ఈ వాస్తువును విశదీకరించు జ్ఞానమును వాస్తువిద్య అనెదరు తక్కిన విద్యలవలెనే భారతీయ వాస్తువిద్య గూడ మహోత్కృష్టమైనది సుప్రసిద్ధ పాశ్చాత్య కళా విమర్శకుడగు ఇ బి హావెల్ మానవజాతి తెలిసికొనదగినది మానవుని గూర్చియే అని ఐరోపా ఖండము భావించగా భారతదేశము మానవునిగాక భగవంతునిగూర్చి తెలిసికొనవలెనని నొక్కి పలుకుచున్నది కావుననే భారతీయశిల్పము మానవునకు దివ్యసృష్టితోగల సన్నిహిత సంబంధమును గ్రహించుటకు తోడ్పడుచున్నది అని వ్రాసినాడు

భారతీయ శిల్పుల ధ్యేయము భగవత్సేవ (మానవసేవ) వారు సకలశాస్త్ర కోవిదులు సంప్రదాయాభిజ్ఞులు

స్థపతిః స్థాపనోచార్యో వేదవిత్ శాస్త్రపారగః ।
శ్రుతజ్ఞః సూత్రవాహీచ - శిల్పశాస్త్ర విదుత్తమః
విచారజ్ఞ శ్రుతజ్ఞశ్చ-చిత్రకర్మాచవర్ధకీ ।
తక్షాది కర్మవిత్ ప్రాజ్ఞః తక్షకః పరికీర్తితః ॥

( మానసారము''-2వ అధ్యాయము'')

భారతీయ కళలన్నిటివలెనే వాస్తుశిల్పకళలు గూడ మతప్రధానములైనవి ఇవి మతముతో ఆవిర్భవించి మతముతో వృద్ధిపొంది మతప్రయోజనములకై వినియోగింపబడినవి భారతీయ వాస్తుశిల్పాది కళలన్నిటిని ధర్మము మతప్రచారము ప్రబోధకశక్తియై యున్నది భారతీయ సంస్కృతి ధర్మమను గట్టిపునాదిపై ఆధారపడి యున్నందున నేటికిని అది నిలిచియుండి తన వ్యక్తిత్వమును చాటుచున్నది వాస్తువిద్య 64 కళలలో చేర్చబడినది

అధర్వవేద సంబంధమైన కౌశిక-నక్షత్ర కల్పసూత్రములందు వాస్తుసంస్కారములు చెప్పబడినవి ఈ సూత్రములందు వివరింపబడిన విషయసూచికను సాయణాచార్యులు తన భాష్యపీఠిక లో నొసగియున్నాడు అందిట్లున్నది

తత్ర తావత్ కౌశికసూత్రేక్రమేణ ప్రతిపాద్యాన్యే తానికర్మాణి-గ్రామ నగర దుర్గ రాష్ట్రాది లాభార్థాని వాస్తుసంస్కారకర్మ-గృహప్రవేశకర్మ తతో అధ్యయన విధిరితి ''

నక్షత్ర కల్పేపి భూతికామస్యవాస్తు సంస్కార కర్మణోవాస్తోష్పత్యా మహాశాన్తిః ఇతి

అధర్వవేదకాలమునాటికే వాస్తువునకు మతముతో సంబంధముండినట్లు తెలియుచున్నది శతపథ బ్రాహ్మణమునందు కపిలవాస్తు ప్రస్తావన కలదు

వేదమతము — వైదికమతమునందు యజ్ఞ కర్మల ద్వారా సకల దేవతోపాసన చెప్పబడినది అందువలన యజ్ఞశాలలు-వేదికలు-కుండములు విశేషప్రాధాన్యము నందినవి శుల్బసూత్రములలో యజ్ఞవేదికలు శాలలు వాటికి సంబంధించిన మానప్రమాణములు వివరింపబడినవి తైత్తిరీయ సంహితలో చితి-స్తూపవర్ణనము కలదు బోధాయన, ఆపస్తంబులు చితుల స్వరూపములను విపులముగా చెప్పినారు ఈ చితులు పది విధములు కలవి కంకచితి అలజాచితి, ప్రఉగచితి ఉభయతఃప్రఉగచితి చతురస్రశ్యేనచితి, రథచక్రచితి ద్రోణచితి, కూర్మచితి సామూహ్యచితి పరిచయ్యాచితి అని వాటి నామములు ఈ చితులకు ఉండవలెన వరుసలు వానిలో ఇటుకల సంఖ్య ఒక్కొక్క ఇటుక పరిమాణము, ఆకృతి, నామము వివరముగా తెలుపబడినవి ఒక వరుసలో 200 చొప్పున 5 వరుసలలో 1000 ఇటుక లుండవలెనని చెప్పబడినది చితులతోపాటు ఆహవనీయ-గార్హపత్య-దక్షిణాగ్ని

కుండములు వాటి చతురస్రవర్తుల - అర్ధవలయాకృతులు మానములు వివరింపబడిన । యజ్ఞశాలలను ప్రాచీనవంశము' లనుచుండిరి వాటి కొలతలు వాటికి నుపయోగించు కర్ర వెదురు ఇటుకలు మొదలైన సామగ్రి వివరింపబడినవి ఈ నిర్మాణపద్ధతులనుండియే గృహ గ్రామ నగర దేవాలయ నిర్మాణ రీతులుదయించినవి

సాధారణముగా వాస్తువును లౌకికము ధార్మికము అని రెండు విభాగములు చేయవచ్చును లౌకికవాస్తువులో గృహ గ్రామ నగరాది నిర్మాణవిషయములు ప్రాధాన్యము వహించును ఈ గృహనిర్మాణమున ఆరంభమునుండి చివర గృహప్రవేశమువరకు మతసంబంధములైన బహువిధకర్మలు విధింపబడినవి ఆయా మతవిధులకు అనుగుణముగా అంతర్భాగ నిర్మాణముండును

ఉత్తమాశ్చబలికర్మకుర్వతో గ్రామశంభునిల
యాదిభిస్సదా।
పుష్టితుష్టిరశాంతిసంపదాం సర్వదాభయని
వృత్తిభక్తిభిః॥ ( మానసారము -8 అ)
శుభైశ్చకర్మభిర్నం త్రైః గురుభక్త్యాతథైవచ।
శుభమైశ్వర్యమాయుష్యం ప్రాణినామిహజాయతే ।
( వాస్తుశిరోమణి )

ఈ బలికర్మ విధులవలన గ్రామ గృహ నగరాదులకు పిడుగులు గాలివానలు అగ్నిభయములు లేకుండునని శాస్త్రకారులు చెప్పినారు భారతీయ వర్ణాశ్రమ పద్ధతికి అనుగుణముగా గృహనిర్మాణ విధానమేర్పడినది కొన్ని నగరములు మతప్రాధాన్యముకలవై భారతీయుల కారాధ్యములైనవి

అయోధ్యామధురామాయా కాశీకాంచీ అవంతికా
పురీద్వారావతీచైవ సప్తైతే మోక్షదాయకాః

ఈ విధముగా లౌకికవాస్తువునందును మతసంబంధము లేకపోలేదు

ధార్మికవాస్తువునందు దేవమందిరనిర్మాణము - అర్చామూర్తి నిర్మాణము పౌరాణికగాథా పవిత్రచిహ్న రచనాదికములు ప్రాధాన్యము వహించుచున్నవి

వేదయుగమున యజ్ఞకర్మలతోపాటు ప్రతిగృహమునందును దేవతార్చన కొనసాగుచుండినది అందువలననే అప్పటినుండి నేటివరకును ప్రతి హైందవగృహమున దేవగృహము ప్రత్యేకముగా కట్టబడుచున్నది ప్రాచీన వైదికాలయములు భారతదేశములో క్రీ పూ 8వ శతాబ్దిమండి కాన వచ్చుచున్నవి అంతకుముందుండిన నిర్మాణములు మృత్-దారు నిర్మితములైయుండున అవి కాలగర్భమున కలిసిపోయినవి

సాధారణముగా భారతీయ ప్రాచీనాలయములు గుహాలుగను గుహాకృతులుగను ఉన్నవి మానవుని హృదయగుహయందు దహరాకాశమున్నదనియు దానియందు జ్యోతిస్వరూపుడగు ఈశ్వరుడున్నాడనియు భక్తుడు ఈశ్వరసాయుజ్యమునందగలడనియు ఈ దేవాలయములు స్థూలముగా సూచించుచున్నవి ఈ విషయము మహానారాయణోపనిషత్తు' నందు సుందరముగా వర్ణింపబడినది ఆలయనిర్మాణరీతులననుసరించి భారతీయ వాస్తువునందు నాగర వేసర ద్రావిడ అను మూడు భేదములు చెప్పబడినవి దేవాలయ నిర్మాణము గర్భగృహముతో ప్రారంభింపబడి ఆ తరువాత క్రమముగా బృహదాకృతి దాల్చినది

దేవాలయ నిర్మాణరీతులలో వైదికములగు శైవ వైష్ణవ శాక్తేయ గాణాపత్య సౌర కౌమార మత సంప్రదాయముల ననుసరించి ప్రధానమూర్తులు పరివారదేవతలు భిన్నములైనందున భిన్నశైలు లుదయించినవి దేవాలయ నిర్మాణ దేవప్రతిష్ఠ పూజావిధానములన్నియు పురాణాగమాదులలో వివరింపబడియున్నవి

బౌద్ధమతము - వైదికవాస్తువునుండియే బౌద్ధ, జైన వాస్తువు లావిర్భవించినవి బౌద్ధవాఙ్మయమునందలి చుల్లవగ్గ మహావగ్గ మహాపరినిబ్బానసుత్త మహాసుదాసనసుత్తములలో వాస్తువిశేషములు ప్రస్తావింపబడినవి బౌద్ధవాస్తువునందు శారీరకధాతునిక్షిప్తములైన స్తూపచైత్యములు ప్రాధాన్యమందినవి

మహాపరి నిర్వాణసూత్రము' నందలి దీఘనికాయమునందు బుద్ధుడే తన శిష్యుడైన ఆనందునితో (౧) బుద్ధులు (౨) ప్రత్యేక బుద్ధులు (౩) అర్హతులు (౪) చక్రవర్తులయొక్క అవశేషములను చైత్యనిర్మాణములందు భద్రపరచి పూజింపవలెనని చెప్పినట్లుకలదు. బుద్ధాదేశముప్రకారము అశోకచక్రవర్తి ఆ యవశేషములనుంచిన 84 000 స్తూపములను నిర్మించెనని ప్రతీతికలదు అందుకు నిదర్శనముగా అనేకస్తూపచైత్యాలయములు వెలసియుండినట్లు తెలియుచున్నది

స్తూపము ఇటుకతోనో, రాళ్లతోనో అర్ధగోళాకారముగ నిర్మింపబడినది స్తూపచైత్యములు శారీరకములు పారిభోగిక

ములు ఉద్దేశికములు అని మూడు విధములుగా ఉన్నవి శారీరకధాతువులనుంచి కట్టబడినవి శారీరక స్తూపములు పై మహాపురుషులుపయోగించిన వస్తువులు - భిక్షాపాత్రములు పానపాత్రములు-దండములు మొదలైనవాటినుంచి కట్టినవి పారిభోగికస్తూపములు బుద్ధసంబంధులైన మహాక్షేత్రములలో ధాతురహితముగా కేవల స్మారకచిహ్నములుగా కట్టిన వాటిని ఉద్దేశి స్తూపము అని వ్యవహరించెదరు ఈ స్తూప నిర్మాణరీతి భారతీయ వాస్తువునకు బౌద్ధమతము ప్రసాదించిన విశేషమని విద్వాంసుల అభిప్రాయము

స్తూపచైత్యములు అర్ధగోళాకారమున నుండుటకు మూలకారణము తాత్త్వికదృష్టి స్థూలదేహములో సూక్ష్మరూపమైన ఆత్మయుండును దేహము బుద్బుదమువలె క్షణికమైనది ఈ భావమును స్ఫురణకు తెచ్చుటకై బౌద్ధశిల్పులు నీటిబుడగవంటి అర్ధగోళాకారమున స్తూపమును నిర్మించి అందు మహాత్ములవలె ధాతువును నిక్షేపించినారు స్తూపము తన్నిర్మాణము బౌద్ధులకు పుణ్యప్రదమగు ధర్మకార్యము స్తూపములపై బౌద్ధమతప్రచారమునుద్దేశించి బుద్ధజీవితగాథలు జాతకకథలు శిల్పించబడినవి వైదికయజ్ఞశాలలనుండి బౌద్ధవిహారములు సంఘారామములు అవతరించినవి ఇవి బౌద్ధభిక్షువులు వసించుటకై నిర్మింపబడినవి చైత్యవిహారాది నిర్మాణమునకు ముందు బౌద్ధులు గుహాలయములను నిర్మించినారు బౌద్ధవాస్తువు సంపూర్ణముగా మతమున కంకితమైనది

జైనమతము - జైనవాస్తువు వైదిక బౌద్ధముల ననుసరించినట్టిది జైనవాస్తువునందును గుహాలయములు స్తూప చైత్యములు ఉన్నవి జైనులకు అవశేషములపై భక్తివిశ్వాసములు లేవు తీర్థంకరుల స్మారకార్థము ఉద్దేశిక స్తూపములు మాత్రము నిర్మింపబడినవి ఈ స్తూప గుహాలయములు బౌద్ధమును అనుసరింపగా జైనదేవాలయములు పూర్తిగా వైదికాలయములననుసరించినవి జైనవాస్తువునందు ఉత్తరదక్షిణ సంప్రదాయభేదములననుసరించి బసది-వాసకా అను నిర్మాణములు ప్రాధాన్యమువహించినవి బసదులు పూజామందిరములు వాసకలు జైనసన్యాసులువసించు నిర్మాణములు

ఇస్లాంమతము - ముస్లిములు భరతఖండమున స్థిరపడినతరువాత హైందవశిల్పుల సాయముచేత తమ మసీదులను, సమాధులను మహలులను దుర్గములను నిర్మించుకొన్నారు ముస్లిములకు శిల్పకళను భారతీయ హైందవులే నేర్పినారనియు వారి నిర్మాణములందు వైదికమతప్రభావమే కలదనియు సుప్రసిద్ధ కళాగవేషకుడగు ఇ. బి. హావెల్ పండితుడు గట్టిగా చెప్పినాడు

ఈ విధముగా భారతీయ వాస్తువునకు మతము ప్రచోదకశక్తియై మహానిర్మాణములకు కారణభూతమైనది

గ రా శ

## వాస్తువు (హైందవము)

బౌద్ధవాస్తువు వలెనే హిందూవాస్తువు మత ప్రోక్తమైనట్టిది హిందూమతమునందు శైవ వైష్ణవములు మిళితమైయున్నవి ఇందలి శివ కేశవులతోపాటు గణపతి బ్రహ్మ నవగ్రహములు కుబేరుడు మొదలగు దేవతలు హిందూ మతమునకు చెందిన వారే ఈ దేవతలకు సంబంధించిన కట్టడముల వాస్తువే దేవాలయనిర్మాణ విశేషములను తెలుపు శాస్త్రము

హైందవ దేవాలయములు భారతదేశములో ప్రప్రథమముగా ఆంధ్ర ప్రాంతమందు నెలకొల్పబడినవి ఒకటి రెండు వైష్ణవాలయములు ఉత్తర భారతమున కూడ నున్నట్లు ఆధారములు కన్పించినను తరువాత 700 సంవత్సరముల వరకు వాటి ప్రసక్తి కానరాదు కాని ఆంధ్ర ప్రాంతమందును కన్నడ రాష్ట్రమందును దేవాలయనిర్మాణ ప్రయత్నములు వెంట వెంటనే ముమ్మరముగ సాగినట్లు పురాతత్త్వ పరిశోధనల వలన తెలియ వచ్చినది

దేవగృహనిర్మాణమునకు త్రోవతీసినది బౌద్ధులు వీరు కొండ చరియలందును బాహ్య ప్రదేశములందును దేవగృహములను నిర్మించిరి బౌద్ధాలయ నిర్మాణములకు అలవాటు పడిన హిందూస్థపతులు, బౌద్ధాలయముల వలెనే హిందూ దేవాలయములను కట్టి యుండిరి, అట్టి దేవాలయములు నాగార్జునకొండవద్ద రెండు గలవు (1) గజపృష్ఠాకృతిలోనున్న పుష్పభద్రస్వామిఆలయము (2) రెండు దీర్ఘ చతురప్రాకారములో L ఆకృతిని నిర్మితమైన సర్వదేవాధివాసము ఇవి రెండును దక్షిణ హిందూదేవాలయ వాస్తువునకు ఆధారములుగా పరిగణింప బడుచున్నవి ఇవి క్రీ శ 3 వ శతాబ్దినాటి కట్టడములు

ఉత్తర దక్షిణ హిందూవాస్తు సంప్రదాయముల నడుమ కొంత భేదమున్నది మొదటి సంప్రదాయమునందు లంబ ప్రవృద్ధి (Vertical treatment) ఆలయములు — అనగా

ఆలయశిఖరములు ఆకాశము నంటునట్లు నిర్మింపబడు చుండె డివి. కాగా రెండవ సంప్రదాయము ననుసరించి విశేషము గా అను ప్రస్తావి స్తరణగల (Horizontal treatment) దేవాలయములు (అనగా నిర్ణీత ప్రదేశమున దేవాలయమునకు చెందిన మంటపములు శాలలు మున్నగునవి ఒకే ప్రాకారమున నుండుట) నెలకొల్పబడు చుండెడివి. దక్షిణ హిందూవాస్తు సంప్రదాయము ద్రావిడ సంప్రదాయ మనబడుచున్నది. ఈ సంప్రదాయము ఆగమములమీద ఆధారపడి యున్నది. ఇందు వలన ఆలయభాగములు, వాటి కొలతలు మున్నగు విశేషములు వాటి నుండి తెలిసికొనవచ్చును.

**ద్రావిడదేవాలయ వాస్తూత్పత్తి:** క్రీ శ 7 వ శతాబ్దిలో పల్లవులు కొన్ని రాతికట్టడములను సృష్టించిరి. ఇవి బౌద్ధ గుహాలయములవలె బయళ్లలో నిర్మింపబడు ఇటుక కట్టడముల వలెకాక గుహాలయ పద్ధతిననుసరించి ఆయా ప్రదేశములందు విరివిగా లభ్యమగు బృహత్ శిలలు ఆలయములుగ మార్పబడెడివి. వీటిని మద్రాసు సమీపమున నున్న మహాబలిపురము నందు చూడవచ్చును. వీటిలో ముఖ్యమైనవి పాండవుల రథములు. నాగార్జునకొండ వద్దనున్న రెండు దేవాలయములు వీటి కాధారములు. ఈ రథములు కొన్ని గజపృష్ఠాకృతిలోను మరికొన్ని దీర్ఘచతురస్ర లేక సమచతురస్రాకృతిలోను సృష్టింపబడినవి. ఈ రెండుఆకృతులు మిశ్రమైనవి మరికొన్ని కలవు.

**ద్రౌపది రథము:** దీని క్రిందిభాగము ఒక వేదికవలె కన్పించును. ఇది రెండుభాగములుగ నుండును. పైభాగము పన్నిని హారమువలె నుండును. హారము క్రిందివేదిక- రెండును కలిసి అధిష్ఠాన మగును. దీని నమూనా సమచతురస్రాకృతిలో నుండును. అధిష్ఠానమునకు పైన నాలుగు ప్రక్కలు గోడల వలెనుండి చాటి స్తంభములమీద కప్పు ఆధారపడి యున్నట్లుండును. ఈ గోడభాగమును జంఘమందురు. దీనియందలి ప్రవేశ ద్వారమున కిరుపైపుల ద్వారపాలకులు గలరు. పై కప్పు నాల్గుప్రక్కలు పెంకుటింటి కప్పువలె వర్షపునీరు జారిపోవుటకు వీలుగా ఏటవాలుగ నుండును.

**అర్జున రథము:** ఇదికూడ సమచతురస్రముగ నిర్మింపబడినరథము. కాని దీనికి అధిష్ఠానములేదు. జంఘము' నకు చెక్కుస్తంభములుండును. ఈ స్తంభముల మధ్యఅనేక శిల్పములు కలవు. వీటియందు మిథునములు, ఇంద్రుడు మొదలైన వారు కలరు. జంఘమునకు ద్వారము లేదు. దీని పైభాగము వంగిన ఆకువలె బయటికి చొచ్చుకొని వచ్చినట్లు చెక్కబడినది. దీనికి కపోత మని పేరు. దీనిపైన మూడు భాగములుగ విభజింపబడిన శిఖరము కలదు. క్రిందిభాగముచుట్టును మూడు చిన్న గృహములు కాన్పించును. ఇట్లే మధ్యభాగముండును. కాని యిది క్రిందిదానిలో సగముండును. చివరి భాగము ఎనిమిది కోణములు కలిగి బోర్లించిన గిన్నెవలె నుండును. కపోతము నుండి పైగిన్నె వరకుగల భాగము విమాన మని వ్యవహరింపబడుచున్నది.

**భీమరథము:** దీనియందు రెండు భాగములు గలవు. క్రింది భాగము దీర్ఘచతురస్రాకృతిలో నుండును. ఇందు అధిష్ఠానము లేదు. ఇది స్తంభములమీద మంటపమువలె తయారు చేయబడినది. ఇందలి కపోతము ఎత్తుగ నుండి పై భాగము అర్జున రథమందలి కపోతమువలె నుండును. గజపృష్ఠాకృతివలె కప్పుట్టు పై భాగము కప్పువలె నుండును. దీని పార్శ్వములు కోష్ఠములను కలిగియుండును. క్రిందిభాగమున నున్న స్తంభములను సింహములు మోయుచుండును.

**సహదేవరథము:** ఇది గజపృష్ఠాకృతిలో నున్నది. ఇందు ఆడంబర రహితమైన అధిష్ఠానము కలదు. దీని ముందు రెండు స్తంభములు గల మంటపము గలదు. ప్రస్తరము విమాన భాగమునందుండు విశేషములు అర్జునరథమును పోలియుండును. వెనుకప్రక్క క్రిందినుండి పై భాగము వరకు, గజపృష్ఠాకృతి యందుండు వంపును చూడవచ్చును.

**గణేశ రథము:** ఇది భీమరథమువలె నుండును. కాని పై నుండు గజపృష్ఠ భాగము క్రింద నుండు దీర్ఘ చతురస్ర భాగము కపోతము మీది పై భాగము — ఇవన్నియు కలిసి విమానమువలె తోచును. ఈ కలయిక వలన ఈ విమానము 'శాల శిఖర దేవాలయము' గా పరిగణింప బడుచున్నది. ఈ 'శాల శిఖర దేవాలయము ద్రావిడ దేవాలయ ప్రత్యేకత.

**చాళుక్య దేవాలయములు** (క్రీ శ 550–750) దక్షిణాపథము నందు హిందూ వాస్తు పురోగతికి తోడ్పడినది. చాళుక్యులు వీరు ప్రప్రథమముగా ఒక పద్ధతి ననుసరించి దేవాలయ నిర్మాణమును ప్రవేశపెట్టిరి. దీనికి పూర్వము గుహాలయములను ఇటుకలతో తయారైన దేవాలయములను, బృహత్ శిలాలయములను నిర్మించుటకై ప్రయత్నములు జరిగినవి. శక్తిపారవశ్యులైన చాళుక్యులు భగవంతునకు శాశ్వత నివాసము

నేర్పరచుటతో ముందంజ వేసిరి వీరి శిలాలయములందు పల్లవ ద్రావిడ సంప్రదాయములు గుప్త సంప్రదాయము మిళిత మొనర్పబడినవి ప్రథమ దశలో వీరు నిర్మించిన దేవాలయములు ఐహోళె బాదామి పట్టడకల్ అను చోట్లందు చూడవచ్చును పూర్వపు గుప్తపృష్ఠాకృతి దేవాలయములకును గర్భ గృహములకును పైన శిఖరములను నిర్మించి అనంతరము వీటియందు చాళుక్యులు పెక్కు మార్పులను ప్రవేశపెట్టిరి

ద్రావిడ సంప్రదాయ పద్ధతిపై కట్టినది మాలెగిట్టి శివాలయము ఇది క్రీ శ 625 లో పులకేశి కాలమున నిర్మింపబడినది ఈ దేవాలయమును (1) గర్భ గృహము (2) సభామంటపము (3) ముఖమంటపము అను మూడు భాగముల క్రింద విభజింపవచ్చును మాలెగిట్టి ఆలయమునకు మామూలుగా ఉండవలసిన అమలక శిల గాని కలశము గాని లేదు

సభామంటప మొక సావడి వలె కన్పించును దీని వెలుపలి గోడలయందు బొమ్మల చుట్టును చట్రమువలె మందు దేవకోష్ఠ ముందును పార్శ్వములందు రంధ్రములు వేసి గవాక్షములను చిత్రించిరి ప్రవేశద్వారము చెంత నాల్గు స్తంభములమీద ముఖమంటపము గలదు

క్రీ శ 8వ శతాబ్దిలో విజయాదిత్యుని కాలమున పట్టడకల్ అనుచోట పాపనాథ్ దేవాలయము నిర్మింపబడినది ఇది ఔత్తర సంప్రదాయ పద్ధతిన కట్టినది దీనికిని పైనుదహరించిన దేవాలయమునకును ఎక్కువ భేదము లేదు శిఖరములో మాత్రము భేదమున్నది దీనియందలి శిఖరము నిలబెట్టిన కోడిగ్రుడ్డువలె నుండును అగ్రమున ఉసిరికాయవలె నుండు అమలకశిలను మూచి ఆకృతిలో నుండు కలశమును కాంచుదుము

**చోళ దేవాలయములు (క్రీ శ 850–1150)** : చోళులు గూడ దేవాలయ నిర్మాణమునందు ఎక్కువగా తోడ్పడిరి వీరి ముఖ్య దేవాలయములు తంజావూరునందును గంగైకొండ చోళపురము నందును గలవు తంజావూరు దేవాలయ అధిష్ఠానము క్రింద రెండు సన్నని హారములు గలవు ఇవి దేవాలయమునకు చుట్టును నీటి అలలవలె కన్పించును దాని పై పట్టికలు అలంకారములు గలవు దీనియందు జంఘము రెండు విధములుగ విభజింపబడి యున్నది ఈ రెండును పైన క్రింద ఒకేరీతిగ నుండును ఈ భాగముల నడుమ వంగిన ఆకువలె నుండు భజ్జ కలదు జంఘపు గోడలమధ్య పెద్ద ద్వారమువలె నుండు కోష్ఠములు గలవు ఇరుప్రక్కల స్తంభ నమూనాలును వాటి మధ్య చిన్న కోష్ఠములును గలవు కపోతము వెడల్పయిన ఒక హారము వలె నుండును దీని పై శిఖరము క్రింద వేదిక్యుగ మండి పైకి పోనుపోను సూది మొనవలె నుండును ఈ దేవాలయము ముందు శివగంగ అను తెప్పకొలను గలదు శ్రీనివాస నల్లూరులో చోళులలో మొదటి రాజరాజు కట్టించిన జంబుకేశ్వర దేవాలయమునకు తూర్పుదిక్కున ఒక చిన్న గోపురము కలదు ఇది ఆలయమునకు ప్రవేశ ద్వారము వలె నుండును

**పాండ్యదేవాలయములు (క్రీ శ 1100–1350)** ద్రావిడ సంప్రదాయ దేవాలయములు పాండ్యరాజుల కాలమున విస్తారముగా నిర్మింపబడినవి ఇవి క్రీ శ 16వ శతాబ్దినాటి విజయనగర దేవాలయములకు నాందియని చెప్పవచ్చును వీరి సామ్రాజ్యము దక్షిణదేశమంతయు వ్యాపించినది వీరి కాలమున ముఖ్యమైనది చిదంబరములోని నటరాజస్వామి దేవాలయము ఇది హిరణ్యవర్ణుడను కాశ్మీరరాజుచే నిర్మింపబడినదని ప్రతీతి ఇది నగర మధ్యమునందున్నది దీని చుట్టును పెద్ద ప్రాకారము గలదు లోపల ముఖ్యదేవాలయముకాక పెక్కు చిన్న ఆలయములు కొలను స్తంభములమీద నిర్మించిన మంటపములు మొదలయినవి కలవు

**విజయనగర దేవాలయములు (క్రీ శ 1350–1565)** విజయనగర దేవాలయములందు స్తంభములు మంటపములు ముఖ్యములైనవి స్తంభములు రెండు భాగములు గలిగి యుండును ఒక భాగము కప్పును దేవాలయ అధిష్ఠానమును కలుపు స్తంభము దీనియందు అధిష్ఠానము జంఘ ప్రస్తరము స్తంభాగ్రము (capital) మున్నగు ఉపభాగములు కలవు అధిష్ఠానమునందు ఎక్కువ నగిషీ లేకున్నను వెడల్పయిన హారములున్నవి కొన్ని దేవాలయములలో జంఘములందు రాజులయొక్క భక్తులయొక్క విగ్రహములు చిత్రింపబడి యున్నవి ప్రస్తరము భారవాహకులచే చేతులు వెనుకకు పెట్టి మోయుచున్నట్లుండును వీటిపైని స్తంభాగ్రము నాల్గు భాగములుగ చీలి చీలిన కొనలు మొగ్గలవలె వ్రేలాడుచు యుండును రెండవ భాగము పెద్ద స్తంభమునకు ముందుండు క్రింది అధిష్ఠానమును కలిపియుండును జంఘమును

నందు రెండవ భాగములో సింహములు ఏనుగులు మొదలగు జంతువులు ముందరి రెండు పాదములను పైకెత్తి పై భాగమును మోయుచున్నట్లుండును మంటపములు కొన్ని దేవాలయముల లోపలయుండును గర్భగృహము అంతరాళము తర్వాత అర్థమంటపము సభామంటపమును గలవు గర్భగృహమునకు బయటను మంటపములోపలి గోడల యందును నాట్యభంగిమలు మిధునములు చిత్రింపబడి యున్నవి కొన్నిటియందు దేవకోష్ఠములు వాటియందు దిక్పాలకులు నవగ్రహములు మొదలయినవి చెక్కబడి యున్నవి దేవాలయమునకు బయట పాకమంటపము ఉయ్యాల మంటపము నృత్యమంటపము అలంకరణమంటపము వాహనమంటపము వాయిద్యమంటపము మొదలయినవి గలవు సభామంటపమునందును పైమంటపములందును కప్పుగోడ (parapet wall) నిమ్నముగనుండి వర్షజలము జారిపోవుటకు సనువుగా చేయబడినది ఈ మన్నని ప్రదేశమందక్కడక్కడ సజీవముగనున్న బల్లులు క్రిందికి దూకుచున్నవా అనునట్లు చిత్రింపబడినవి దేవాలయ బాహ్యకుడ్యములమీద దేవకోష్ఠములమీద రామాయణ భారత భాగవత గాథలయొక్క దశావతారములయొక్క, మంగళ వాద్యములయొక్క దృశ్యములను చూడవచ్చును

దేవాలయపు వెలుపలి ప్రాకారములపై గాలిగోపురములున్నవి వీటిని ముఖ్యముగా తిరువణ్ణామలై లోని అరుణాచలేశ్వర దేవాలయమందు చూడవచ్చును గాలిగోపురములు దేవాలయ ప్రవేశద్వారములుగ నిర్మింపబడినవి ఇవి అంతస్తులు కల్గియుండును ప్రతి అంతస్తునందు ఒక ద్వారముండును ఇరుప్రక్కల గోడలపై పెక్కువిగ్రహములు చిత్రింపబడియుండును చివరి అంతస్తుమీద ఇరువైపుల ఆవు కొమ్ములవలెనుండి మధ్యవరుసగా నాలుగైదు కలశములుండును మొదటి ప్రాకారమున 20-25 అడుగుల ఎత్తుగల ముఖద్వారము ద్వారశాఖలయందు గంగ యమున చక్కని స్త్రీ రూపములలో మకర కచ్ఛపములమీద నిలబడియున్నట్లుండును, పై నుదహరించిన వాస్తువిశేషములన్నియు విజయనగర కళాకౌశలమునకు విశిష్టస్థానమును చేకూర్చినవి

**ఉత్తర భారత దేవాలయవాస్తూత్పత్తి :** ఉత్తర భారతమున దేవాలయ వాస్తువునకు ప్రప్రథమముగా దోహదమిచ్చినది గుప్తరాజులు వీరు యావద్భారతదేశమును 160 సంవత్సరములు పాలించిరి భగవంతునకు శాశ్వత భవనములను ఏర్పరుపవలెనను దీక్షతో టిగవ ఎరన్ ఉదయగిరి మొదలగు తావులలో గుప్తరాజులు పెక్కు ఆలయములను కట్టించిరి వీటియందు ఇప్పటికిని జీర్ణముకాక పదిలముగ నున్నది టిగవలోని విష్ణాలయము దీనియందు గర్భాలయము ముఖమంటపము అను రెండు భాగములు గలవు గర్భాలయము రాతిబండలతో నిర్మింపబడినది దీని ఎదుట రెండు స్తంభములపై నిర్మింపబడిన ముఖమంటపము గలదు ఈ స్తంభములు గుప్తకళావైశిష్ట్యమును నిర్దేశించును దీనియందు (1) చతురస్రాకారములో అధిష్ఠానము (2) బహుముఖములుగల ప్రకాండము (3) పూర్ణఘటము (4) సింహములుగల స్తంభాగ్రము అను నాల్గు విభాగములు గలవు గర్భాలయము ఎదుట ద్వారోపరిభాగమున ఒక గుర్రపు పీట గలదు దీనినిబట్టి ఈ దేవాలయము మొదట ధాతువుతో నిర్మింపబడియుండునను భావన స్ఫురించును ఇట్టిదే సాంచిలో నుండు చిన్న దేవాలయము

భీనా సమీపమున గుహాలయమందున్న గుప్తదేవాలయ ముఖమంటపము పెక్కు స్తంభముల మీద నిర్మింపబడినది అచ్చటి గర్భాలయము నందు మార్పులెవ్వియు లేవు

ఝాన్సీశివారులలో గల దేవఘుడ్ నందు గుప్తరాజుల నాటి శివాలయము క్రీ శ 6వ శతాబ్దికిచెందినది దీని పునాదులు ఎత్తైనవగుటచే అధిష్ఠానము ఎత్తుగ కనిపించును దీని నడుమ గర్భాలయము కలదు దీనికి నాల్గువైపుల నాలుగు ద్వారములు గలవు ప్రవేశద్వారమున ఇరుప్రక్కల శాఖల (Jambs) మీద ద్వారపాలకులు గలరు నాల్గుద్వారముల ముందు నాల్గు స్తంభములపై గల మంటపములు గర్భాలయము నుండి పైకి చొచ్చుకొని వచ్చినట్లుండును గర్భాలయపు పై కప్పుమీద శిఖరమున్నది ఇది మెట్లుమెట్లుగ నిర్మింపబడిన 'పిరమిడ్' వలె కన్పించును పైన సమచతురస్రాకృతిలో ఒక వేదిక కలదు దాని మీద ఆమలకశిలయు కలశమును కలవు 'టిగవ' దేవాలయము నందువలె అచ్చటు చతురస్రాకృతి కల్గిన అధిష్ఠానము, అష్టకోణాకృతిలో ప్రకాండము, పూర్ణఘటములు స్తంభాగ్రమున సింహములు మున్నగునవి కలవు

పశ్చిమ హిందూదేశమున సౌరాష్ట్రములో క్రీ శ 6-8 శతాబ్దముల నడుమ అనేక చిన్న దేవాలయములు నిర్మింపబడినవి వీటిలో 'గోప్' దేవాలయము అతి పురాతనమైనది

ఇది చాలవరకు శిథిలమైపోయినను ప్రస్తుత స్థితినిబట్టి దీని అసలు స్వరూపమును కొంతవరకూహింపవచ్చును దీనియందు దేవఘడ్ దేవాలయము నందువలె ఎత్తైన అధిష్ఠానముగలదు దీనికి నడుమ తులసికోటవలె కన్పట్టు గర్భగృహము కలదు తూర్పు ద్వారము గల దీనిపైని పైకప్పోయిన కొలది మూసుకొని పోయినట్లు గోచరించును బయటి రెండు వరుసలలో శిఖరములు గలవు ఇది మెట్లువలె నుండును క్రింది మెట్టు నందు రావి ఆకులవలె నుండు చైత్య గృహ గవాక్షముల రూపులు రెండు కన్పించును పై మెట్టు చిన్నదగుటచే చిన్న గవాక్షము కల్గియుండును గర్భగృహమందును ద్వారోపరి భాగమునగల గొడుగురాయి (lintal) యందును బౌద్ధ గుహాలయ సంప్రదాయము కన్పించును

క్రీ శ 8వ శతాబ్దిలో కాశ్మీరమునందు లలితాదిత్య అనంతవర్మల కాలమున కొన్ని దేవాలయములు నిర్మింపబడినవి వీటిలో ముఖ్యమైనవి మార్తాండలోని సూర్య దేవాలయము శ్రీనగరుకు సమీపమందున్న వంగనాథ్ ఆలయము ఇవి రెండును దాదాపు ఒకే విధముగ నిర్మింపబడినట్లు తెలియుచున్నది ఇప్పుడివి శిథిలావస్థలో నున్నవి పంచాయతన దేవాలయములనువవి పెద్ద ఆవరణములో నిర్మింపబడినవి వీటి నడుమ గర్భాలయమున్నది దీని నాల్గు కోణము లందు నాల్గు చిన్న ఆలయములు గలవు గర్భాలయ అధిష్ఠానము రెండు వేదికలుగ అమర్పబడినది ఈ ఆలయమునకు నాల్గు వైపుల ద్వారములు గలవు తూర్పు ద్వారము ఎత్తైన సోపానములతో అలంకరింపబడియున్నది రెండు భాగములు గల్గిన దీని శిఖరము మూడివలె కోసుదేలి కలశమును కల్గియుండును దీని ద్వార శాఖలు రెండు స్తంభములవలె కన్పట్టును వాటిపై త్రికోణాకృతిలో రెండు ఆయకట్టులున్నవి తక్కిన నాల్గు చిన్న ఆలయములు కూడ ఇటులే యున్నవి ఈ ఆలయముల చుట్టును దీర్ఘ చతురస్రాకృతిలో ప్రాకారము కలదు నాల్గు కోణములందు చిన్న ఆలయములు నిర్మింపబడినవి ఈ దేవాలయముల వాస్తురీతి మధ్య యుగపు వాస్తు పద్ధతిలో కొన్ని మార్పులు తెచ్చెను కాశ్మీరమునకు పశ్చిమముగా నున్న గాంధార వాస్తుశిల్పులు చాలి యందు గోచరించును స్తంభములు గోడలు ప్రవేశ ద్వారములు శిఖరములు వీటి నిర్మాణము యవన సంప్రదాయానుసారముగ నుండును, స్తంభములందు గ్రీకు కొరింథియన్ వాస్తుపద్ధతు లెక్కువగా కాన్పించును

తూర్పు భారతదేవాలయ వాస్తురీతులు తూర్పు కోస్తా ప్రాంతమందలి ఒరిస్సా దేవాలయనిర్మాణ సంప్రదాయములో కొంత క్రొత్తదనము గోచరించును ఉదా క్రీ శ 8వ శతాబ్దికిచెందిన పరశురామేశ్వర దేవాలయము ఇది భువనేశ్వరమందున్నది పైనుదహరించిన దేవాలయములకంటె దీనియందు ఎక్కువ విస్తృతి కన్పట్టును ఈ ఆలయములు రేఖాదేవుళ్ పద్ధతిననుసరించి నిర్మింపబడినవి ఇందు రెండు భాగములుగలవు (1) గర్భగృహము (2) జగమోహన మరల ఇవి ఒక్కొక్కటి రెండు భాగములు కల్గియుండును దీనియందధిష్ఠానము ఎత్తుగనుండదు ఈ తావునందు అధిష్ఠానమునకు బడ' యనిపేరు దీనియందు నాల్గు హారములుండును పై రెండు హారములందు చిన్నబొమ్మలు చెక్కబడియున్నవి నడుమ నొక పెద్ద దేవకోష్ఠమున్నది బడ యొక్క పై భాగమునకు జంఘమనిపేరు దీని పై భాగమునుండి శిఖరము మొదలగును దీనియందు (1) ఛత్ర (2) అమల (3) కంక అను మూడు భాగములుకలవు ఇది నాల్గు కోణములుతేలి ఘంటాకృతిలోనుండును ఛత్ర' భాగము పెక్కుతలములుగల్గి మెట్లవలె కన్పించును ప్రతి మెట్టునందు అమశిలల హారముండును ఛత్ర పై భాగము చదునుగనుండి దానిపైనున్న పెద్ద అమల సూచి ఆకృతిలో కలశమువలె నుండును జగమోహన్' వెలుపలనుండు క్రిందిభాగమంతయు గర్భగృహమునకు బయటనుండు బడ' వలెనుండును కాని జంఘ పై భాగము (శిఖరము) త్రికోణాకృతియందుండును దీనికి పీఢ అను నామముకలదు ఇది ద్రావిడ విమానమువలె కన్పించును దీని పై భాగమున ఘంటకలశము కలదు

ఈ భాగములన్నియు విస్తృతిచెందిన ఒరిస్సా దేవాలయములందు కన్పట్టును

క్రీ శ 900 నుండి 1100 వరకు ఒరిస్సాలో పెక్కు దేవాలయములు నిర్మింపబడినవి వీటిలో పూరిజగన్నాథాలయము ముఖ్యమైనది క్రీ శ 1100-1250 నడుమ కట్టిన దేవాలయములలో ముఖ్యమైనది కోణరక్‌లోని సూర్య దేవాలయము అద్భుతమైన ఈ కట్టడమునందు పై నుదాహరించిన భాగములన్నియు గలవు

**మధ్యభారత దేవాలయ వాస్తు రీతి** (క్రీ శ 950-1050) ఇచ్చటి దేవాలయములు చండేల రాజులచే నిర్మింపబడినవి వీటియందు పై నుదాహరింపబడిన దేవాలయములకంటె కట్టడపు సొంపు విశేషముగ కన్పించును రాజగృహముల సొంపంతటిని చండేల రాజులీ ఆలయముల నిర్మాణమునందు ప్రవేశపెట్టిరి ఈ దేవాలయములు శైవ-వైష్ణవ జైనమత ములకు చెందినవి వీటికి మిగత దేవాలయములకువలె ప్రాకా రములుండక ఎత్తైన విశాలమగు రాతిగుట్టలమీద కట్టబడినవి వీటి నమూనా క్రాస్ వలె నుండి దీర్ఘ చతురాకృతిలో తూర్పు పడమరలకు విస్తరించియుండును ఒకే దేవాలయము నందు మహామంటపము అర్థమంటపము ముఖమంటపము కలిసి యుండును గర్భగృహము అంతరాళము సభామంట పముకలిసి మహామంటప మగును

ఈ దేవాలయముల క్రింది అధిష్ఠానములన్నియు కలిసి యుండును వీటియందు భట (ఉపపీఠము) ఎత్తుగనుండును భట కు పైన కుముదహారములుండును వంపులున్న చోట ఈ హారములు అందముగ కన్పించును నిలువుగనుండు ఈ వంపులు పైకప్పు (గ్రస్తరము) నుండి క్రిందివరకు రెండు మూడు వరుసలలో లావుగానుండు పూలమాలలవలె నుండును ఇవి నాలుగు కోణములందును కన్పట్టును అధిష్ఠానమునకు పై భాగ మున అక్కడక్కడ దేవకూలికలుండును పశ్చిమ దేవాలయము లందువలె ఇందు కక్ష్యాసనము కలదు ఇచ్చట ప్రేక్షకులు కూర్చొని మంటపములపై జరుగు దేవసేవను తిలకించవచ్చును అర్థమంటపము ముందు నాల్గు స్తంభములమీదను, వెనుక ఎనిమిది స్తంభములమీ ను పైకి చొచ్చుకొని వచ్చినట్లు గోచ రించును ప్రవేశద్వార మీ అర్థమంటపమున కలిసియుండును మహామంటపమునందు అర్థమంటపమును ఆనుకొని లోపల మరియొక మంటపము గలదు దీనియందు నాల్గు స్తంభములును, వీటిపైన జోర్లించిన పద్మమువలె ఒక వితానమును కలవు దీని పార్శ్వములందు చిన్న స్తంభములమీద గవాక్షద్వారము లుండును ఈ మంటపమును ఆనుకొని అంతరాళము గలదు దీనియందు రెండు స్తంభములున్నవి గర్భగృహము దీర్ఘ చతురస్రాకృతిలో నుండును ప్రదక్షిణపథము అంతరాళమును గర్భగృహమును చుట్టియుండును ఈ దానిపై మరియొకటిగా అమర్పబడిన చిన్నచిన్న శిఖరశ్రేణులపై దేవాలయ ప్రధాన శిఖరము నిర్మింపబడి శోభదేలియుండును అందుచే ఇది ఉపశృంగ శిఖరమని ఎలువబడుచున్నది మహామంటప, అర్థ మంటప అంతరాళములపై శిఖరములు ఒరిస్సాలోని పీఢ దేవుళ్ శిఖరములవలె కాన్పించును వెలుపలి గోడలపైన పెక్కు స్త్రీ పురుష సంయోగ దృశ్యములు చిత్రింపబడి యున్నవి

నిరాడంబరమైన ఖజురాహో దేవాలయపద్ధతి ననుస రించి నిర్మింపబడిన సూర్యదేవాలయమును రాజస్థానములో ఓసియా అనుచోటున చూడవచ్చును దీనియందు గర్భ గృహ అంతరాళ మహామంటప అర్థమంటపములు గలవు కాని శిఖరము గర్భగృహమునకు తప్ప తక్కిన భాగములకు లేవు ఇది క్రీ శ 10వ శతాబ్దిలో నిర్మింపబడినది

**పశ్చిమదేవాలయరీతులు** ఈ దేవాలయములందు ముఖ్యముగా రెండు భాగములు కన్పట్టును (1) గూఢమంట పము (2) సభామంటపము గూఢమంటపమునందు ఒక చివర గర్భగృహముండును ఇది సమచతురస్రాకృతిలో నుండును దీనిచుట్టును లోపల ప్రదక్షిణపథముండును గర్భగృహము చుట్టును ఉండు గోడలన్నియు కలిసి ప్రాసాదమగును ఈ ప్రాసాదములో ఘూలకలు' (కిటికీలు) గలవు ప్రాసాదము నకు ఎదుటనుండు గూఢమంటపము దానితో కలిసియుండును గూఢమంటపమునందు కూడ ఘూలకలు' కలవు ఈ మంటపము పది స్తంభములమీద నిర్మింపబడినది ఇవి నాలుగు నాలుగు చొప్పున ఇరువైపులనుండు ఘూలకములముందును గర్భగృహము ముందును గూఢమంటప ప్రవేశద్వారముముందును గలవు దీని వలన మధ్యనున్న స్తంభములు గుండ్రముగానున్నట్లు కన్ప ట్టును ఈ స్తంభములపైన వికసించిన ఒక పద్మము బోర్ల వేసినట్లు కాననగును స్తంభాగ్రములలో స్త్రీ మూర్తులను గాని ఇతర విగ్రహములనుగాని కప్పునందు చెక్కెదరు గూఢ మంటప ద్వారమునకు ముందు రెండు స్తంభములమీద ముఖ మంటపము కలదు గూఢమంటపమున కెదురుగా సభామంట పము ప్రత్యేకముగా స్తంభములమీద నిర్మింపబడినది వీటికి నాలుగుదిక్కులందు ఆరేసి స్తంభములచొప్పున 24 స్తంభము లుండును దీనియందును మధ్యస్తంభములు గుండ్రముగా అమర్పబడియుండును దీనికప్పు గూఢమంటపముకప్పును బోలి యుండును దీనికి నాలుగువైపుల నాలుగు సోపానపంక్తు లును రెండు స్తంభములమీద తోరణములును అమర్పబడి యుండును బయటి స్తంభములను కలుపుచు కొంతవరకు గోడలు గలవు ఇవి లోపల అరుగులవలెయుండి అమోఘముగను

వంపు బండలతో అందు కక్ష్యాంతనములు నిర్మింపబడియున్నవి ఈ దేవాలయ అధిష్ఠానములకు ప్రాదేశిక నామములు పీఠములు ఇందు ఖట జడంబ కణి గ్రహపతి గజధర ఖర అను భాగములు గలవు ఖరపైనుండు విభాగమునకు మండోవరము' అని పేరు దీనియందు కుంభ కలశ జంఘ కపోతము మున్నగు అంతర్భాగములు గలవు మధ్యమధ్య మండోవరమునందు దేవకూలికలుండును వాటియందు దిక్పాలకులు మొదలగు దేవతావిగ్రహము లుంచబడినవి కపోతము మీదగల చిన్నచిన్న శిఖరశ్రేణులపై పెద్ద శిఖరమున్నది అది నాలుగు కోణములు కలిగి ఘంటాకృతిలో నున్నది పెద్ద శిఖరముపై అమలక శిలయు కలశమును గలవు కొన్ని దేవాలయములయందు సభామంటమున కెదురుగా కొలనులున్నవి వీటిమెట్లు కోణములందు చిన్నచిన్న దేవాలయములు నిర్మింపబడినవి

అబూ శిఖరముపైనున్న జైనదేవాలయము లన్నియు ఈ పద్ధతి ననుసరించి నిర్మింపబడినవే వీటిలో క్రీ శ 10వ శతాబ్దియందు నిర్మింపబడిన ముఖ్య దేవాలయములను మోనక్ కవోడా, దేకమల్ అను తావులలో చూడవచ్చును క్రీ శ 18వ శతాబ్దిలో తేజ్‌పాల్ అనునాతడు ఇచ్చట బ్రహ్మాండమైన జైనదేవాలయమును నిర్మించెను

టి వి శి శా

## విక్ స్టెడ్ ఫిలిప్ హెన్రీ (1844 – 1927)

క్రీ శ 1670 1986 సం॥ల నడుమ ఇంగ్లండు అర్థశాస్త్ర పరిణామము ఎట్లు ప్రవర్తిల్లినదో ఏయే అర్థశాస్త్ర భావముల ప్రభావము ఆంగ్లేయ అర్థశాస్త్రజ్ఞులపై పనిచేసినదో పరిశీలించినచో "ఆస్ట్రియను ఆర్థిక దృక్పథము నకు సంబంధించిన సీమాంత ప్రయోజన భావ (Marginal utility concept) ప్రాబల్యము బోధపడగలదు ఈ దృక్పథమును తీర్చి దిద్దుటయందేకాక దానిని విస్తరింప జేయుటయందు కూడ ప్రథమ తాంబూలము విక్ స్టెడ్ నకే లభించెను భావుకుడుగను, అర్థ శాస్త్ర వేత్తగను విక్ స్టెడ్ గడిపిన జీవితము ఆసక్తి దాయకమైనది

పారస్వత తత్త్వ నీతిశాస్త్రములందును మిదుమిక్కిలి సామాజిక సమస్యలయందునుగల అభిరుచి నుండి అర్థశాస్త్రముపట్ల ఆతనికి అభిమానము ఉత్పన్నమైనది డాంటె అను జర్మను తత్త్వవేత్త రచనలు ఆతని మనఃప్రవృత్తిపై బలీయమైనప్రభావ ముద్రవైచినవి యూనిటేరియనుచర్చియందాతడు మతాధికారిగా నున్నప్పటినుండి డాంటే ఆతనికి అభిమాన పాత్రుడైనాడు తన జీవితమందలి తుదిముప్పది సంవత్సరములును ఉపన్యాస రచనావ్యాసంగము ద్వారా అర్థ శాస్త్రవిజ్ఞాన వ్యాప్తికి విక్ స్టెడ్ ఎట్లు వినియోగించెనో అట్లే డాంటేతత్త్వమును ప్రచార మొనర్చుట యందు కూడ తన కాలమును వినియోగించినాడు సారస్వతరంగమున కూడ వర్డ్స్‌వర్తు ఇబ్సెనుల రచనల యందు ఈతని పాండిత్యము అనల్పమైనది వాఙ్మయరంగమున మేధావుల భావములచే ప్రభావితమైన అంతరంగముతో ఇతడు అర్థశాస్త్రప్రాంగణములో అడుగిడినాడు

విక్ స్టెడ్ భావములు యూనిటేరియను పద్ధతికి చెందిన వగుటచే సంప్రదాయ మతమునకు విరుద్ధముగ ఆతని మత ప్రసంగములు ప్రగతి మార్గమున నడచినవి ఆతని భావనా విధానమున తత్త్వచింతనము పాలెక్కువ కావున నైతిక, సాంఘిక సమస్యలు క్రమశః ఆతని నాకర్షించి అర్థశాస్త్ర నిర్మాణమున కాతనిని ఉద్యుక్తుని చేసెను ఇప్పట్టున రస్కిన్ మహాశయుడు ఆతని నుత్తేజపరచినాడు సంపద మానవ జీవితమును ఉదాత్తపరచు సాధనము కావలెననియు కావున ఆర్థిక వేత్తలు తమశాస్త్రమున లోక బహుళ ప్రయోజనమును ఆశింపవలెననియు రస్కిన్ గావించిన నిరూపణము విక్ స్టెడుకు ఆనందము కల్గించుటచే ఇతడు సామ్యవాద సిద్ధాంతముల ప్రయోజనమును అవగాహనచేసికొనుట కుద్యుక్తుడయ్యెను

"ఆస్ట్రియను" 'లా సేన్' ఆర్థికదృక్పథములకు ప్రతినిధులైన జెవన్స్ ప్లేటో అనువారు రచించిన గ్రంథము లందలి కొన్ని సూత్రములు విక్ స్టెడ్ యొక్క స్వతంత్ర రచనలకు దోహద మొనగినవి వైద్యదృక్పథములవలెనే, కేంబ్రిడ్జి ఫేబియన్ భావములను గూడ ఇతడు అభిమానించినను రెండింటికిని తారతమ్యము గలదు ఆస్ట్రియను లాసేన్ దృక్పథములచే ఇతడు ప్రభావితుడుకాగా వృత్తి ఉద్యోగముల రీత్యా ఇతనికి కేంబ్రిడ్జివర్గముతో సంబంధమును ఫేబియను వర్గములతో మైత్రియు ఏర్పడినది

"ఆస్ట్రియను ఆర్థికదృక్పథము"ను వ్యాప్తిచేసిన వాడగుటచే ఆ వాదమునకే చెందినస్టాన్లీ జెవన్సుయొక్క ప్రభావము ఇతనిపై ఉండుట సహజము జెవన్సు రచనలలో అగ్రగణ్యమై 1871 లో ప్రచురింపబడిన 'ది థియరీ ఆఫ్ పొలి

టికల్ ఎకానమీ అను గ్రంథమునందలి సారమును డాంటీ రచనల నిగ్గును అనుసరించి తన అర్థశాస్త్రమును రచించెను పాల్ గ్రేవ్ నిఘంటువు అను విజ్ఞానకోశమునందు అతడు వ్రాసిన వ్యాసములును కార్ల్ మార్క్స్ విలువ సిద్ధాంతము పై అతడు జార్జి బెర్నార్డుషాతో నడపిన వివాదమును ఈ కోవకు చెందినవే

ఆంగ్ల అర్థశాస్త్రోపాధ్యాయు డగుటయే ఈతనికి కేంబ్రిడ్జివాదముతో ఏర్పడిన అనుబంధము 1885లో కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయమున డాక్టర్ ఆల్ ఫ్రెడ్ మార్షల్ ప్రొఫెసరు పీఠమధిష్ఠించిననాటినుండి కేంబ్రిడ్జి ఆర్థిక దృక్పథము వికాసమునొందసాగెను ఆ యాచార్యుని అనుయాయులలో విక్ స్టెడ్ కూడ ఒకడై అతని సూత్రములను విపులీకరించి బోధించెను మొత్తముమీద విక్ స్టెడ్ లో వైయక్తిక సాపేక్షభావము (subjectivism) ప్రధానమైనదగుటచే అతడు ఆస్ట్రియన్ వాదిగా ఆర్థిక ప్రపంచమునకు ఎరుకయైనాడు

ఫేబియనులకును అతనికిని నడుమగల స్నేహము దొడ్డది ఛాందసమతమునకు (nonconformism) ప్రతికూలు డగుటచేతను సారస్వతరంగమందలి ఆలోచనాపరుల భావములచే ప్రభావితుడై మానవశ్రేయస్సును కాంక్షించినవాడగుటవలనను రికార్డోవలె నడిపయన్నున అర్థశాస్త్ర నిర్మాణమునకు పూనుకొనిన జ్ఞానియగుట మూలమునను ఫేబియను వర్గీయులు ఈతని మేధస్సుచే ఆకర్షితులైరి మార్క్స్ విలువ సిద్ధాంతము పై బెర్నార్డ్ షాను చిత్తుచేసిన నాటినుండి ఫేబియనులు విక్ స్టెడ్ పరస్పరము సన్నిహితులైరి తదాదిగా ఫేబియనులాతనిని అర్థశాస్త్ర నిపుణునిగా గుర్తించుటయు, తమ అర్థశాస్త్ర సమస్యలను స్పష్టీకరణమునకై అతనికి పంపుటయు జరిగెను తన జీవితాంతమువరకు విక్ స్టెడ్ సామ్యవాద సిద్ధాంత ప్రయోజనముల నభిమానించుచునే యుండెను

అర్థశాస్త్ర వికాసచరిత్రలో తన స్వతంత్ర ప్రతిపాదనల ద్వారా విక్ స్టెడ్ నిర్వహించినపాత్ర దిగువ పేర్కొనిన శీర్షికలక్రింద వివరింపదగును :

1) సమతుల్యస్థితి సిద్ధాంతమునకు ప్రాతిపదికగా అతడు సూత్రీకరించిన సీమాంత ప్రయోజన భావము
2) అవకాశపు ధరయొక్క భావన (concept of opportunity cost)
3) అర్థశాస్త్ర సాంకేతిక సామగ్రికి చేర్చిన సరఫరా వక్రరేఖ (supply curve)
4) సంపద పంపిణీ సంబంధించిన సిద్ధాంతము

సీమాంతప్రయోజన భావనను జెవన్స్ నుండి విక్ స్టెడ్ గ్రహించెను ఒకానొక వ్యక్తియొక్క వస్తురాశి పెరుగుచున్నకొలది క్రొత్తగా దానికి చేర్పబడు మొత్తముయొక్క ప్రయోజనము దానికి పూర్వము కలుపబడిన భాగముయొక్క ప్రయోజనముకంటె తక్కువగా నుండునని ఇందలి తాత్పర్యము సామాన్యభాషలో తినగా తినగా గారెలు కనరు అను సామెత ఇట్టిదే కాగా జెవన్స్ వాడిన అంతిమ ప్రయోజనము (Final degree of utility) అను శబ్దమునకు బదులుగా విక్ స్టెడ్ సీమాంతప్రయోజనము (marginal utility) అను పదమును ప్రవేశపెట్టెను అనగా రాశి పెరుగుచున్నకొలది సీమాంతప్రయోజనము అవరోహణ క్రమములో నుండునని ఈ సూత్రముయొక్క సారము

జ్ఞానసముపార్జనమున విక్ స్టెడ్ ఇంతవరకే ఇతర పండితులకు ఋణపడియున్నాడు అతడీ సూత్రమును విస్తరింపజేసిన విధము గమనార్హమైనది కొంత సొమ్మును వ్యయించి కొన్ని వస్తువులను కొనదలచితి మనుకొనుడు ఆ వస్తువులను కొనుటయందు ఆ సొమ్మును ఎంతెంత పరిమితులలో విభజించినచో ఆ కొనుగోలునుండి జనించు మొత్తము సంతృప్తి అధికతమమై యుండును? క్రయముచేసిన వస్తువుల సీమాంతప్రయోజనము వాటికి చెల్లించు ధరలకు అనుపాతములో నున్నప్పుడు ఇది సంభవమగును 1888 లో తాను వ్రాసిన ది ఆల్ఫబెట్ ఆఫ్ ఎకనామిక్ సైన్సు (అర్థశాస్త్రముక అక్షరజ్ఞానము) అను గ్రంథమున విక్ స్టెడ్ ఈ విషయమును మొదటిసారి వివరించెను

అవకాశపు ధర అను భావనకూడ ఇతని సిద్ధాంతములలో ముఖ్యమైనది ఏ వస్తువుకైనను చెల్లించుధర దానిని పొందుటకై వదలుకోవలసిన వస్తువుయొక్క సీమాంత మూల్యమే అనునది ఈ భావనయొక్క అంతరార్థము అమ్మకపుదారులు తాము అమ్మెడి వస్తురాశి నారికొనగు సీమాంత ప్రయోజనమే వారు దాని కాపాదించు సరఫరాధర ఇదియే విక్ స్టెడ్ నిర్మించిన సరఫరా వక్రరేఖ సిద్ధాంతము నందలి సూక్ష్మవిషయము

శ్రమ పెట్టుబడి వంటి ఉత్పత్తిసాధనముల నిర్ణయమును

నందుకూడ విక్‌స్టెడ్ సీమాంతప్రయోజన న్యాయమును ప్రయోగించెను. వస్తుమూల్యమునకును ఆ వస్తూత్పత్తికి సహాయభూతమైన ఉత్పత్తికారకముల ధరలకును మధ్యగల సంబంధమును జెవన్సు స్పష్టీకరించలేదు. వైయక్తిక సాపేక్షవిలువ సిద్ధాంతమును (subjective value theory) అనుసరించిన విక్‌స్టెడ్ వస్తుమూల్యమే ఉత్పత్తిసాధనముల విలువను నిర్ణయింపగలదని స్థిరీకరించెను. ఈ యంశమును వివరించు సందర్భమున ఒక ఉత్పత్తిసాధనముయొక్క ధర ఆ ఉత్పత్తిసాధనముయొక్క సీమాంతోత్పాదకతకు సరిసమానమగునని ఇతడు వచించెను. ఇదియే సీమాంత ఉత్పాదకతా పంపిణీసిద్ధాంత (marginal productivity theory of distribution) మనబడినది. ఈ సూత్రము ప్రకారము ఉత్పత్తిసాధనములకు వాటివాటి సీమాంతోత్పాదకతకు తుల్యమైన మూల్యమును చెల్లించినచో అట్టి మూల్యముల మొత్తము ఆ వస్తువుయొక్క విపణిధరకు సమానమగును. అయితే ఈ సిద్ధాంతమును అతడు తరువాత లోపభూయిష్ఠమని భావించి ఉపసంహరించుకొనెను. కాని అట్టి భావనలో సంపూర్ణమైన సత్యములేదు; ఇందున్న దోసగు స్వల్పాతిస్వల్పము.

విక్‌స్టెడ్ గ్రంథములన్నిటిలోగల సిద్ధాంతములను పరిశీలించునపుడు గోచరమగు సామాన్యసత్య మొకటున్నది. అర్థశాస్త్రసారమును అతడు ఒక "ఎన్నిక"గా ఎత్తిచూపెను. ఆర్థికసంఘటనల నన్నిటిని కొనుగోలుదారుని యొక్కయో, అమ్మకపుదారునియొక్కయో అంతిమ ఎన్నికలుగా నిరూపించుట, ఆర్థికసమాజముయొక్క విరాట్స్వరూపమును బహిరంగపరచుటయే! ఆర్థిక సంబంధముల నెల్ల ఇట్లు చిత్రీకరించుట గొప్ప విషయము. వైయక్తికమైన ప్రత్యేక కృషి (specialization) పరస్పర లాభాన్వేషణద్వారా మార్పిడికి దారితీసి వ్యక్తులనడుమ ఆర్థికసంబంధములను ఏర్పరచునని అతడు నిరూపించిన తీరు ఆర్థిక కలాపములను నడిపించు అదృశ్యహస్త మొకటున్నదని ఆడమ్‌స్మిత్తు చేసిన వివరణమును జ్ఞప్తికి తెచ్చును. ఉదాహరణమునకు, మాంసపుకొట్టు యజమాని వ్యక్తిగతజీవనమున త్యాగశీలియై యుండవచ్చును. కాని విపణివీధిలో కొనుగోలుదారునిపట్ల అతడు దానశీలమును ప్రదర్శించడుగదా! తన వస్తువునకు తగిన ధరను చెల్లించినవానికే అతడు దాని నమ్మును. ఇందు నైచ్యమేమియులేదు. ఇట్లు విపణివీధి ప్రవర్తన మాత్రమే కాక ప్రజల నడవడియు సకల విషయములలో సీమాంతలక్షణపు ప్రాతిపదికమీదనే నడచునని విక్‌స్టెడ్ వక్కాణించెను. తిండిగింజలుకాని బట్టలుకాని కొనుసందర్భమున ఒక రూప్యమును వాటిలో ఒకదానికై వెచ్చించునపుడు అధికప్రయోజన మెంత కల్గునో అంత ప్రయోజనము కల్గునపుడుమాత్రమే మరియొక రూప్యమును రెండవ వస్తువుపై వెచ్చించుదుము. అట్లే సంగీతమును వినునపుడుగాని ప్రదర్శనశాలలో చిత్తరువులను తిలకించునపుడుగాని ధనమును కాలమును కేటాయింతుము. బిడ్డల సంరక్షణమునగాని మిత్రులతో కాలముగడుపునప్పుడుగాని ఆధ్యాత్మికచింతనమునగాని జీవితమున మరియేయితర సన్నివేశమునగాని మన ప్రవర్తన ఇట్లే యుండును.

ఆర్థిక విషయములతో మాత్రమే విక్‌స్టెడ్‌కు ప్రత్యక్ష సంబంధమున్నను సామాజిక విషయములను గూడ ఇట్టి గీటురాయి క్రిందికే అతడు తెచ్చెను. మానవులు తమ ప్రవర్తనమును అధికతమమైన సంతృప్తి కల్గునట్లు దిద్దుకొందురనియు అందు కనుగుణముగా తమ సమయమును ధనమును కేటాయించుకొందురనియు అతని సూత్రీకరణము. మహత్తర గ్రంథమైన ది కామన్‌సెన్స్ ఆఫ్ పొలిటికల్ ఎకానమీలో (1910) ఈ అంశముల నాతడు విపులీకరించెను.

అర్థశాస్త్రకారుడు కవిపుంగవుని వలె సమాజమును ఉత్తేజపరుపలేకున్నను, ప్రవక్తవలె ఉర్రూతలూగింపజాలకున్నను వారివలెనే అతడు కూడ తన ఆర్థికరంగమున సేవాధర్మమును నిర్వర్తించును. సంఘక్షేమము సాధించి దానికి క్రొంగొత్త శక్తిని చేకూర్చుచు సమాజ సంరక్షణమునకు తోడ్పడగలడనుటకు విక్‌స్టెడ్ వంటి మహనీయుని జీవితమొక ఉదాహరణము.

సూ. కృ. శా.

## వికారి సూక్ష్మజీవులు (Amoeba)

అమీబా అను వికారిసూక్ష్మజీవులకు నిర్దిష్టమైన ఆకారము లేదు. అందుచేతనే వీటిని వికారిసూక్ష్మజీవులని అందురు. వీటిని ఏకకణ (Unicellular) లేక కణరహిత (Acellular) జీవులని కూడ అందురు. ఇవి మంచినీటి గుంటలలోను చెరువులలోను నివసించును. ఫైలం ప్రోటోజోవా అను జాతిలో ఇవి "రైజోపోడా" అను తరగతికి చెందినవి. సూక్ష్మదర్శినీ యంత్రముతో చూచినచో, ఇవి చిన్న చుక్కల వలె అగుపించును.

ఇట్టి సూక్ష్మజీవిలో కూడ జీవపదార్థము (Proto plasm) కలదు ఈ జీవపదార్థములో ఒక కేంద్రకము (Nucleus) ఉండును ఇది మిథ్యాపాదములను Pseudopodia) ఏర్పరచుకొనుచు తన ఆకారమును మార్చుకొనుచుండును దీనిలోని జీవపదార్థము బాహ్యపుటంచు వద్ద నున్న ఎక్టోప్లాజమ్ లోపలనుండు ఎండోప్లాజమ్ అను రెండు విధములుగా నుండును కేంద్రకము కాక జీవపదార్థములో సంకోచకణమును (Contractile vacuole) ఆహారకణములును (Food Vacuoles) ఉండును జీవపదార్థములోని మలినము లను సంకోచకణములు సేకరించి విసర్జించును ఆహార కణములు ఆహారమును జీర్ణము చేయుటలో ఉపకరించును

**చలనము** అమీబా మిథ్యాపాదముల ద్వారా నిదానముగా నీటిలో కదలుచుండును అమీబా చలనమును వర్ణించుచు శాస్త్రవేత్తలు అనేక సిద్ధాంతములను ప్రతిపాదించిరి వాటిలో రెండు ముఖ్యమైనవి (1) ఉపరితల బిగువు సిద్ధాంతము (Surface Tension Theory) (2) స్నిగ్ధతలో మార్పు సిద్ధాంతము (Change in Viscosity Theory)

**ఉపరితలబిగువు సిద్ధాంతము** ఈ సిద్ధాంతము ప్రకారము అమీబా ఉపరితలములో నున్న జీవపదార్థములో బిగువు వలన కలుగు మార్పుచే లోపలి జీవపదార్థము కదలును అందుచేత అమీబాలో చలనము సంభవించును

**స్నిగ్ధతలో మార్పు సిద్ధాంతము** హాంటిన్ మాస్ట్ అను శాస్త్రవేత్తలు ఈ సిద్ధాంతమును ప్రతిపాదించిరి జీవపదార్థము బాహ్యపుటంచు వద్ద బిగురుగాను, లోపల ద్రవరూపములోను ఉండును అమీబా చలించునప్పుడు బాహ్యపుటంచు వద్దనున్న బిగురుగనుండు జీవపదార్థము ద్రవముగామారి ముందుకు ప్రవహించును ఆ సమయములో లోపలనున్న ద్రవపదార్థము బిగురుగా మారి ముందున్న ద్రవమును త్రోయును అనగా బిగురుపదార్థము ద్రవపదార్థముగను ద్రవపదార్థము బిగురుపదార్థముగను మారుచు అమీబాచలనమునకు దోహదకారులగును

**ఆహార సేకరణ** అమీబా నీటిలోని సూక్ష్మజీవులను ఇతర చిన్న క్రిములను భుజించును దీనికి నోరు, ఆహార నాళము మొదలగునవి లేవు ఇది మిథ్యాపాదములద్వారా ఆహారమును సేకరించి జీర్ణము చేసికొనును ఆహారము జీర్ణమగుటకు ఆహారకణము, జీవపదార్థములోని రసాయనములు ఉపయోగపడును

**శ్వాసక్రియ** అమీబాకు శ్వాసనాళములుగాని శ్వాసకోశములుగాని లేవు నీటిలోని ప్రాణవాయువును (ఆమ్లజని) ఇది శరీరపు వెలుపలి భాగద్వారా పీల్చుకొని లోని బొగ్గుపులుసు వాయువును (carbon dioxide) బయటకు విసర్జించును

**విసర్జనము** మలినపదార్థములను విసర్జించుటకు దీనిలో ప్రత్యేక అవయవములు లేవు సంకోచకణములు జీవపదార్థములోని మలినములను సేకరించి జీవపదార్థపుటంచువద్ద అవి పగిలిపోవును అప్పుడు వాటిలోని మలినములు నీటిలో కలిసిపోవును

**ప్రత్యుత్పత్తి** అమీబాలో కూడ మిగిలిన జంతువులలోవలెనే ప్రత్యుత్పత్తి జరుగును ఇది రెండు విధములుగా నుండును

(1) ద్విధావిచ్ఛిత్తి (Binary Fission); (2) బహుధావిచ్ఛిత్తి Multiple Fission)

**ద్విధావిచ్ఛిత్తి** ద్విధావిచ్ఛిత్తి జరుగునపుడు అమీబా మిథ్యాపాదములు లేకుండ గుండ్రముగ నుండును దాని మధ్యభాగము సన్నబడును ఇంతలో జీవపదార్థములోని కేంద్రకము నిలువుగాసాగి సన్నబడును తరువాత అవి రెండును కేంద్రకములుగా విడిపోవును అప్పుడు అమీబాగూడ రెండుగా మధ్యకు చీలును ఒక్కొక్క భాగములో ఒక్కొక్క కేంద్రముండును ఈరెండుభాగములు రెండు అమీబాలుగా పెరుగును

**బహుధావిచ్ఛిత్తి** వాతావరణము సరిగా లేనప్పుడును, అమీబా ఉండు గుంటలలోను చెరువులలోను నీ రెండిపోయినప్పుడును; అమీబాలో ఈ పద్ధతి ననుసరించి ప్రత్యుత్పత్తి జరుగును ఈ క్రియ జరుగుటకుముందు అమీబా, తన చుట్టును గుండ్రని గట్టికవచమును ఏర్పరచుకొనును పిదప లోపలగల కేంద్రకము అనేక చిన్నచిన్న కేంద్రకములుగా విడిపోవును అదే సమయములో జీవపదార్థముకూడ అనేక ముక్కలుగా విడిపోయి, ఒక్కొక్క కేంద్రకము చుట్టును ఆవరించును ఇట్టి ముక్కలు కవచము లోపలనే ఉండును వర్షములు కురిసి కొలనులలో మరల నీరొచ్చినప్పుడు లోనున్న ముక్కలు కవచమును పగులగొట్టుకొని బయటకివచ్చి ఒక్కొక్కముక్క ఒక్కొక్క అమీబాగా పెరుగును ఈ విధముగా బహుధావిచ్ఛిత్తివలన ఒక్క అమీబా అనేక అమీబాలను సృష్టించును

**పరాన్నజీవులైన అమీబాలు** కొన్నిజాతి అమీబాలు ఇతర ప్రాణులలో పరాన్నజీవులుగా (parasites) బ్రతుకును వీటిలో ముఖ్యమైనవి (1) ఎంటమీబాహిస్టొలిటికా (2) ఎంటమీబాకోలి (3) ఎంటమీబాజింజివాలిస్ వీటిలో మొదటి రెండును మానవుని పెద్దప్రేగులలోను మూడవది దంతములలోను పరాన్నజీవులుగానుండి మానవునికి హానిచేయును

జి హెచ్ ఆర్ కె

## విజయనగరము (హంపి)

క్రీ శ పదునాల్గవ శతాబ్ది ప్రథమపాదమున యవన సేనలు దక్షిణాపథముపై దండెత్తి దేవగిరి యందలి యాదవ రాజ్యమును ద్వారసముద్రమునందలి హొయసలరాజ్యమును ఓరుగంటి యందలి కాకతీయాంధ్ర సామ్రాజ్యమును కూల ద్రోసెను ఇట్లు ప్రసిద్ధములైన మూడు హైందవరాజ్యములు కొంచెమించుమించుగా ఏక కాలమున కూలిపోవుటచే దక్షిణా పథమునందలి హైందవులు నిరాధారులై పలుపాట్లు పడవలసి వచ్చెను అయినను ధర్మరక్షణైకపరాయణులైన హైందవులు ధైర్యము విడువక నిజధర్మ సంస్కృతిరక్షణకు బద్ధకంక ణులై దృఢసంకల్పముతో విరోధుల నెదిరించి చిన్న చిన్న రాజ్యములను నెలకొల్పిరి ఇట్లు 14వ శతాబ్దిలో తలయెత్తిన హైందవరాజ్యములందగ్రగణ్యమై హైందవమత ధర్మ సంస్కృతుల కండదండయై నిజనిర్మల కీర్తిప్రతాప తేజః కాంతులచే అరుల అక్షులకు మిరుమిట్లు గొల్పినది విజయనగర సామ్రాజ్యము ఈ సామ్రాజ్యమునకు రాజధాని విజయనగ రము దైవదుర్విపాకమున శిథిలీకృతమైన ఈ నగర మిప్పుడు చూడవచ్చిన హైందవుల కన్నీరు మున్నీరుగా నేడ్పించుచు బళ్ళారిమండలమున హంపి అను పేర నెరగుచున్నది పంపా విరూపాక్షదేవుని నామమందలి పంపాపదమునుండి ఇది ఏర్పడినది

ఓరుగల్లు ఆంధ్ర సామ్రాజ్యమస్తమించిన పిమ్మట (1323) ప్రతాపరుద్రుని కోశాగారాధ్యక్షులైన హరిహర బుక్కరాయనామధేయులగు ఇరువురు సోదరులు తుంగ భద్రానదికి ఉత్తరతటమున ఉన్న ఆనెగొంది రాజ్యమును పాలించు జంబుకేశ్వర రాయలను (కంపిలిరాయడని కొందరు చెప్పుచున్నారు) ఆశ్రయించి అతని కొలువున మంత్రిత్వమును సంపాదించిరి ఆ కాలమున గణనాతీతమున రాజప్రతి నిధిగాపరిపాలించుచుండిన బహాఉద్దీన్ అను నతడు తన చక్రవర్తియైన మహమ్మదుతుఘలక్ ఆజ్ఞలను ధిక్కరించి స్వాతంత్ర్య ప్రకటించెను బహాఉద్దీన్ అను మేనత్త కుమారుడే అయినను తుఘలక్ చక్రవర్తి అతనిని క్షమింపక ఖాజాజహాన్ అను నతనిని బహాఉద్దీనును శిక్షించుటకై సేనలతో పంపెను బహాఉద్దీన్ ఆ సేనల ధాటి కాగలేక పారివచ్చి ఆనెగొంది పాలకుడైన జంబుకేశ్వర రాయల శరణుచొచ్చెను శరణాగతుని రక్షింపవలెనను హిందూధర్మమును పురస్కరించుకొని జంబు కేశ్వరుడతని కభయమొసగెను ఈ సంగతి విని కోపోద్దీపితుడైన తుఘలక్ చక్రవర్తి అపార సేనాసమేతుడై 1334 వ సంవత్సరమున ఆనెగొందిపై దండెత్తెను కంపిలినగర సమీప మున జరిగిన యుద్ధమున జంబుకేశ్వరుడు మరణించెను ఆనె గొంది చక్రవర్తి వశమయ్యెను అచ్చట మంత్రిపదవి నిర్వ హించుచుండిన హరిహరబుక్కరాయ సోదరులు బందీకృతులైరి చక్రవర్తి మల్లిక్ నాయబ్ అనువానిని ఆనెగొందిలో రాజప్రతినిధిగ నియమించి బందీకృతులైన హరిహరబుక్క రాయసోదరులను వెంటనిడుకొని ఢిల్లీకి వెడలిపోయెను స్వాతంత్ర్య ప్రియులైన ఆనెగొంది ప్రజలు మల్లిక్ నాయబ్ పరిపాలనమును అంగీకరింపక తిరుగబడిరి

ఇట్లుండగా తుఘ్లక్ చక్రవర్తి కారాగృహబద్ధులైన హరిహర సోదరులను విడుదలచేసి తనకు సామంతులుగా రాజ్యమును పాలించుటకై వారిని ఆనెగొందికి పంపి మల్లిక్ నాయబును ఢిల్లీకి రప్పించెను ఢిల్లీలో ఉన్నప్పుడు హరిహర బుక్క సోదరులు బలవంతముగ మహమ్మదీయమతమును స్వీక రింపవలసివచ్చెనని కొందరు చెప్పుచున్నారు వారు ఆనె గొందికి వచ్చు సమయమున దక్షిణాపథమందు కాపయ నాయకుడు మూడవ బల్లాణరాజు మున్నగువారి యాజ మాన్యమున మహమ్మదీయ వినాశనమునకై ఏర్పడిన జాతీయ సమితి మిక్కిలి బలవత్తరమైయుండెను హరిహర సోదరులకా జాతీయసమితితో యుద్ధము సంభవింపగా వారా యుద్ధమున ఓడిపోయి అరణ్యముల సంచరించుచు పంపా క్షేత్రమున తపస్సొనరించుచున్న విద్యారణ్య మహర్షిని దర్శించిరి విద్యారణ్యుడు వారిని కరుణించి వారిచే మరల హిందూమతమును స్వీకరింపజేసి కృష్ణాసేతువులకు నడుమ నున్న ప్రదేశమంతయు విరూపాక్షదేవునిదనియు ఆ దేవుని ప్రతినిధులు ఆ ప్రాంతమును పరిపాలింపుమనియు ఆదే శించెను వారప్పుడు నిర్ధనులై ఉండుటచే అతడు శ్రీ కంఠా

రము నుండి వారికి కావలసిన ధనమొసగి ఆశీర్వదించి పంపెను ఆ ధనముతో సేనలను సమకూర్చుకొని ఆనెగొందిని మరల వశము చేసికొని తద్విజయ సూచకముగా విరూపాక్షాలయమునకు సమీపమున ఒక నగరమును నిర్మించి దానికి విద్యారణ్యుని పేర విద్యానగరమని నామధేయ మొసగిరి

హరిహరసోదరులు విద్యానగరమును నిర్మించిన వృత్తాంత మీ క్రింది విధమున కూడ చెప్పబడుచున్నది చక్రవర్తిచే ఆనెగొందిని పరిపాలించుటకు పంపబడిన హరిహర సోదరు లచటికి వచ్చి కొంతకాలము సామంతులుగనే పాలించి కాలక్రమమున స్వతంత్రులైరి హరిహరుడు ఆనెగొంది సింహాసనమును అధిష్ఠించినప్పటినుండియు సుందర నగర నిర్మాణమునకు తగిన ప్రదేశము నన్వేషించుచునే ఉండెను ఒకనాడతడు తమ్మునితో మృగయార్థమై తుంగభద్రానదికి దక్షిణభాగమున ఉన్న అడవికేగెను వేటసమయమున కుందేళ్లు వేటకుక్కలను తరుమజొచ్చెను ఈ విచిత్ర సంఘటనమునకు అచ్చెరువడి అడుగుచున్నవారికి విరూపాక్షస్వామిని సేవించి తన ఆశ్రమమున కరుగుచున్న విద్యారణ్య మహర్షి కనిపించెను వారా మహనీయుని దర్శించి జరిగిన ఉదంతము ను తెల్పి అందుకు కారణము సెలవిమ్మని వేడుకొనిరి విద్యారణ్యుడంత వారిని దయామేదురుడై పరికించి ఇది వీర క్షేత్రము మహానగర నిర్మాణమునకు తగిన ప్రదేశము ఇట నిర్మింపబడిన నగరమతి వైభవోపేతమై చిరకాలము వర్ధిల్లి పేరుగాంచు"నని పల్కెను ఆ మాటలు విని హరిహర బుక్క రాయసోదరులు తాము కూడ సుందరనగర మొకటి నిర్మింప కాంక్షించుచుంటిమనియు ఆ కోరిక నాటికిదీరె ననియు తెల్పి ఆనెగొంది బొక్కసమున అప్పుడు తగినంత ధనము లేకుండుటచే దానిని కూడ సమకూర్చి తమ్ముసిద్ధ సంకల్పులను కావింపవలెనని ఆ మహనీయుని వేడుకొనిరి విద్యారణ్యుడట్లే యథాశక్తిగా ధనమును చేకూర్ప యత్నింతునని పల్కి నగర నిర్మాణ కార్యమునకు కడంగుడని వారి కాదేశించెను వారరిగిన ఎమ్మట విద్యారణ్యుడు నిష్ఠతో చింతామణి మంత్రమును జపింప ఒక్కనాడు లక్ష్మీదేవి ప్రత్యక్షమై ఏమి కావలయునో వేడుకొను"మని పలికెనట! విద్యారణ్యుడు 'దేవీ! నాపేర ఒక నగరమును వెలయించి నీవందు నిత్యము నిలువవలె''నని వేడుకొనెనట ! లక్ష్మి అనుగ్రహించి తిరోహిత అయ్యెనట ! విద్యారణ్యుడా వార్తను హరిహర సోదరులకు తెల్పి నగర నిర్మాణమునకు సుముహూర్తమును నిర్ణయించెను ఆ సమయమున అతడు తనకు సాయముగా ఉండుటకై కాశీనుండి ఒక జ్యోతిశ్శాస్త్ర పండితుని కూడ రప్పించెను ఆ పండితుడు శత్రుప్రాంతమందలి పర్వతమును అధిరోహించి నక్షత్ర పరిశీలనము కావించి నిర్ణీతముహూర్త సమయమునకు సరిగా శంఖారావము కావింపవలెననియు ఆ ధ్వని వినబడినంతనే విద్యారణ్యుడు కరగించి ఉంచిన తామ్ర లోహమును జంత్రపు అచ్చులో పోయవలెననియు ఏర్పాటు చేయబడెను ముహూర్తసమయము సమీపించెను శంఖధ్వని వినిపించెను విద్యారణ్యుడు కరగియున్న లోహద్రవమును అచ్చులో పోసెను తరువాత కొలదికాలమునకే మరొక శంఖ ధ్వని వినిపించెను ఎమ్మట కాశీపండితుడు విద్యారణ్యుని కడ కరుదెంచెను మొదట వినబడిన శంఖధ్వని యెవ్వరో భిక్షుకుడొనర్చినదనియు రెండవదే కాశీపండితుడు సుముహూర్త సమయమున కొనర్చిన ధ్వని అనియు తెలియవచ్చెను విద్యారణ్యుడు విధివిలాసమునకు ఆశ్చర్యపడుచు చల్లారిన యంత్రమును పరీక్షించెను అది రెండుంబావిక ఖీటలుగా చీలియుండెను ఆ ఖీటల రహస్యమెరిగిన విద్యారణ్యుడును కాశీ పండితుడును అచ్చట నిర్మింపబడు నగరము రెండువందల పాతిక సంవత్సరములకంటె ఎక్కువ కాలముండదని నిర్ణయించి యంత్రస్థాపన మొనరించి పురనిర్మాణమున కనుజ్ఞ నొసంగిరి ఆ నగరమే విద్యారణ్యుని పేర విద్యానగరమై కాలక్రమమున వర్ణవికారముచే విజయనగరమని ప్రసిద్ధి పొందెను పైన చెప్పబడిన కథకు అనుగుణముగా ఆ నగరము 1336 మొదలు 1565 వరకు జాజ్వల్యమానముగా ప్రకాశించిన తరువాత మహమ్మదీయుల విధ్వంసన కార్యమునకు గురియై శైథిల్యము ప్రాప్తించెను

హరిహర బుక్కరాయల తండ్రి సంగముడు అందుచే వీరి వంశమునకు సంగమవంశమని పేరు కల్గినది సంగమవంశీయులు 1336 నుండి 1486 వరకును, సాళువ వంశీయులు 1486 నుండి 1505 వరకును తుళువ వంశీయులు 1505 నుండి 1541 వరకును తరువాత అరవీటి వంశీయులును విజయనగర సామ్రాజ్యమును పరిపాలించిరి 1565వ సంవత్సరమున జరిగిన తాళికోట (రాక్షసతగ్గి) యుద్ధమున, రామరాయలు మరణించిన ఎమ్మట అతని సోదరుడైన తిరుమలరాయలు అపరిమిత ధనమును సదాశివరాయలను సింహాసనమును, ధనధాన్యములను

గైకొని హతశేషమైన సేనతో తిరుపతి కరిగెనని కేటో అను చరిత్రకారుడు వ్రాసి ఉన్నాడు తిరుమలరాయలు చనగానే కొందరు నగరవాసులుకూడ నగరమును విడిచి పారిపోయిరి సకలకళా వైభవ విరాజమానమైన నగరము ఆ సమయమున ప్రేతభూమివలె కనిపించెనట! ఎన్నట సమీపారణ్య ప్రాంతముల వసించు నిషాదులును మహమ్మదీయ సైనికులును నగరము ప్రవేశించి దానిని యథేష్టముగా దోచుకొనిరి వారు ప్రజలను నిర్దయముగా వధించిరి విగ్రహములను దేవాలయములను విరుగగొట్టిరి; ప్రాసాదములను నేలమట్టము కావించిరి ఒకచోట అగ్నిని, వేరొకచోట ఖడ్గమును గ్రహించి నగరమందంతటను పైశాచికవిహార మొనరించిరి ఏ దేశచరిత్రలో కాని అంత సుందరమైన నగరమంత హఠాత్తుగా అంత సంపూర్ణ విధ్వంసము నొందిన సన్నివేశము గోచరముకాదని స్యూయల్ అను చరిత్రకారుడు వ్రాసి ఉన్నాడు విజేతలైన సుల్తానులు సేనలతోకూడ అందు ఆరునెలలుండియు అందలి సంపత్సర్వస్వమును కొల్లగొట్టజాలకపోయిరనినచో ఆ నగర వైభవ మెంత అనంతమైనదో ఊహింపవచ్చును



హంపి శిథిలములు

పటము - 1

ప్రౌఢదేవరాయల కాలమున (1428-1447) పారశీక చక్రవర్తియగు షాహరుఖ్ అబ్దుల్ రజాక్ అను వానిని, పోర్చుగల్ రాజు నికోలోకోంటి అనువానిని విజయనగరమునకు రాయబారులుగా పంపిరి 1520 వ సంవత్సరమున శ్రీకృష్ణదేవరాయలు విజయనగరసామ్రాజ్యమును పరిపాలించుచుండ ఫిగరిడో అను పోర్చుగీసు రాయబారి విజయనగరమునకు వచ్చెను అతనితో పైయస్ అను వర్తకుడు కూడ వచ్చెను తాము దర్శించిన అపూర్వమగు విజయనగర వైభవమును చక్కగా కన్నులకు కట్టినట్లు ఈ మువ్వురును ఏకకంఠముగా వర్ణించి ఉండుటచేతను వీరు పరదేశీయులగుటచేతను వారి వ్రాతలలో అభూతకల్పనలుకాని అతిశయోక్తులుకాని లేవనవచ్చును

విజయనగరమును పోలిన నిరుపమాన భాగ్య వైభవ సంపన్నమగు నగరమును ప్రపంచమందింకొకచోట ఎక్కడను చూడలేము వినజాలమన్నను అతిశయోక్తి కాదు ఒకదానిలోపల ఇంకొకటిచొప్పున అలరారు ఏడు ప్రాకారముల నడుమ కట్టబడిన ఈ మహానగరము దుర్గమమైనది ఏడవ ప్రాకారము లోపల రాయల మందిరములు సభామండపములు కొల్వుకూటములు కలవు వెలుపలి ప్రాకారములలో మొదటిదానిని రెండవదానికిని నడుమ కలప్రదేశమున సారవంతములై సాగుచేయబడుచున్న భూములును ఫలపుష్పశోభితములయిన తోటలును పెక్కు కలవు అచ్చటచ్చట పెద్ద సౌధములు బావులు ఆరామములు విరాజిల్లుచున్నవి రాజవీధులందిరుప్రక్కలను పుష్పలావికలు పరిమళము వెదజల్లు వివిధ పుష్పములను అమ్ముచుందురు ఈ దేశీయులకు గులాబిపూవులన్న మిక్కిలి ఇష్టము పూవులన్న వారికి ప్రాణము ఆహారము లేకుండనైన బోవుదురు కాని అచ్చటి స్త్రీ పురుషులు పూలు ముడువకుండ పోజాలరు రత్నవర్తకులు అమూల్యములైన వజ్రవైడూర్యాది రత్నములను విచ్చలవిడిగా రాసులక్రిందపోసి నడివీధులలో విక్రయించుచుందురు నగరివాకిటికి ఎదురుగా ఉన్న నాలుగువీధు లందును చక్కని నునుపైన రాతికాలువలద్వారా పరిశుద్ధజలము నిరంతరము ప్రవహించుచుండును నగరికి ఎడమవైపున దండనాయకుని సౌధమును దానికి వెనుక టంకశాలయును కలవు ఈ దేశమున వరహా ప్రతాప పణము అను మూడురకములైన నాణెములు ముద్రింపబడుచున్నవి దేశమంతయు జనసంకీర్ణమై ఇసుకవైచిన రాలనట్లు వివిధ వేషభూషణాలంకృతులైన స్త్రీ పురుషులతో క్రిక్కిరిసి ఉండును టంకశాల వెనుక ఇరువది గజముల వెడల్పును మూడువందల గజముల పొడవునుగల ఒక వీధివున్నది దానికి ఇరువంకలను చక్కని పూపొదరిండ్లతో కూడిన ముంగిళ్లుకల సుందరగృహములు బారులుతీరి వుండును సాయంసమయములందు ముంగిళ్ళయందలి చంద్రకాంత శిలావేదికలపై వివిధ భూషణాలంకృతలైన

కార విలాసములు చేటి జనులతో సుఖోపవిష్టులై ఉందురు అని అబ్దుల్ రజాక్ వ్రాసియుండెను



హంపి శిథిలములు
పటము - 2

ఈ రాజ్యమునకు రాజధాని విజయనగరము. రాజెప్పుడును ఇచ్చట నివసించుచుండును. డెబ్బదిరెండు మైళ్ళ పొడవుగల పర్వతపంక్తి ఈ నగరమునుచుట్టి ఉన్నది. ఆ ఆవరణలో వరి మున్నగు ధాన్యములు పండు ప్రదేశములును, నిమ్మలు నారింజలు పనసలు మొదలగు ఫలవృక్షములతో కూడిన తోటలును కలవు. ఈ పర్వతపంక్తులకు నడుమ జలాశయము లనేకము లున్నవి. వీటి ఆధారముననే పైరులు సాగుచేయబడుచుండెను. రాజభవనమునకు పోవు మార్గమున సేనానులయొక్కయు ప్రభువులయొక్కయు సుందర మందిరములు కలవు. నేత్రపర్వములగు విగ్రహములచే అలంకరింపబడి గృహపంక్తులు మనోహరములై ఒప్పుచుండును. లిస్బనునగర మెంతస్థల మాక్రమించుకొనియుండునో అంతకంటె ఎక్కువస్థల మాక్రమించుకొని రాయలమందిరము బలాఢ్యమై సురక్షితమై ఉన్న ప్రాకారముతో ఒప్పారుచున్నది. వర్తకులు నివసించు వీధులలో నవరత్నములును వస్త్రములును ఇంకను ప్రపంచములో లభించు అన్నివస్తువులును విక్రయింపబడుచుండును. ఇచ్చట ప్రతి సాయంకాలము సంత జరుగును. ఇందశ్వములు మున్నగు జంతువులేకాక పలురకములైన ఫలములుకూడ విక్రయింపబడుచుండును. ప్రతివీథియందును దేవాలయములు కలవు. కాని ప్రధానములును, మహత్తరములును అగునవి నగరము వెలుపలనే కానిపించును. ఈ నగరము వైశాల్యమును గురించి నేను వ్రాయజాలను. నగర మెంత యొక ప్రదేశమునుండి చూచుటకు కానరాదు. నేనొక గోపురము నెక్కి నగరము నందలి కొంత భాగమును చూడగలిగితిని. నాకు కనిపించిన భాగము రోమునగర మంత పెద్దదిగా నుండి అత్యంత సుందరముగా గోచరించినది. చాలా తోపులు తరుషండము లనేకము లున్నవి. గృహారామములలో నీళ్ళకాలువలును చెరువులును కలవు. ఈ నగరము ప్రపంచమందలి సమస్త వస్తుసముదాయముతో నిండిన ఉత్తమనగరముగా గోచరించుచున్నది అని పెయిస్ వ్రాసియుండెను.

విజయనగరమునకు విద్యానగరి యను పేరు విద్యారణ్య సంబంధముచే కాక ఇంకొక విధముగాకూడా సార్థకమైనది. విజయనగర రాజులు రసజ్ఞులును కవిపండితపోషకులునై ఆంధ్ర సంస్కృతములే కాక కన్నడాద్యన్యభాషలనుకూడ పెంపొందించిరి. శ్రీకృష్ణరాయలవారి పోషణమున అల్లసాని పెద్దనాది మహాకవులు రసవత్తరములైన ప్రబంధములు పెక్కు రచించి ఆంధ్రవాణికి అపూర్వాలంకారములు సమకూర్చిరి. ఈ యుగము ఆంధ్రసారస్వతమునకు స్వర్ణయుగము. ఈ యుగమున విద్యలతోపాటు పరిశ్రమలును వాణిజ్యవ్యాపారములును మిక్కిలి అభివృద్ధిచెంది దేశమును సుభిక్షము కావించినవి. విజయనగర సామ్రాజ్యమున ఆంధ్రులతోపాటు కర్ణాటక ద్రావిడ ప్రజలును నివసించిరి. ఆ రోజులలో విజయనగరము విశేషసంపద్వైభవములతో విరాజిల్లి విదేశీయులకు కూడ విస్మయము కల్గించినది. ఇప్పుడు హంపిలోనున్న శిథిలావశేషములా పూర్వవైభవమును వేనోళ్ళచాటి చెప్పుచుండును. వాటిని చూచి ఆ పురవైభవమును మనసా స్మరించి కడవెడుకన్నీళ్లు కార్చుటయే ఇప్పు డాంధ్రులకు మిగిలినది.

ది. వేం.

## విక్సెల్

విక్సెల్ ప్రఖ్యాత స్వీడిష్ అర్థశాస్త్రవేత్త. "స్టాక్‌హోమ్ స్కూలు" అని పిలువబడు స్వీడిష్ అర్థశాస్త్ర భావజాలమును వ్యవస్థీకరించిన మేధావి ఇతడు. నిరుద్యోగమును తగ్గించి ఉత్పత్తిని పెంచి ఆర్థికమాంద్యమునుండి సమాజమును వెలికి తీయుటకు వడ్డీరేటు నందు, కూలిరేటు నందు ప్రవర్తిల్లవలసిన మార్పును గురించియు వినియోగము నిల్వలు పెట్టుబడి-వీటి గతులను గురించియు ఈతడు తనవి అను యాయులు ప్రవచించిన "స్టాక్‌హోమ్ స్కూలు

భావములను కీన్సీయ సిద్ధాంతమునకు ప్రత్యామ్నాయ వాదమని చెప్పవచ్చును

విక్సెల్ జన్మించినది 1851 లో ఈతడు తత్త్వశాస్త్రము గణితమును అభ్యసించి 1885 లో పట్టభద్రుడాయెను తరువాత ఆర్థికశాస్త్రమును పఠించుట ప్రారంభించి ఫ్రాన్సు జర్మనీ ఆస్ట్రియా ఇంగ్లండులలో దానిని నేర్చెను 1900లో స్వీడనునకు తిరిగివచ్చి లండ్ విద్యాలయమున అర్థశాస్త్ర శాఖలో ఉద్యోగింపబడెను 1904 నుండి 1916 వరకు ఆ శాఖకు ఆచార్యస్థానమున పనిచేసె 1926 లో మరణించెను

ఇతడు స్వీడిష్ జర్మను ఇంగ్లీషు పత్రికలలో ప్రకటించిన వ్యాసములు అనేకము ఇంగ్లీషుభాష అర్థమగు దేశములలో ఈతని భావములను తెలిసికొనుట కుపయోగపడునది "రాజకీయార్థశాస్త్రముపై ఉపన్యాసములు" అను ఈతని అనువాదిత గ్రంథము ఇది 1901 1906 సంవత్సరములలో రెండు సంపుటములుగా జర్మను భాషలో వ్రాయబడి 1934 1935 లలో ఇంగ్లీషులోనికి తర్జుమాచేయబడినది ఈతని మూల గ్రంథములన్నియు జర్మను భాషలోనే లభించును పై చెప్పిన రెండు సంపుటములు కాక మరి మూడు గ్రంథములు ఈతని రచనలలో ముఖ్యమైనవి (1) మూల్యము మూలధనము, అద్దె (1893) (2) పెట్టుబడిధనసిద్ధాంతము (1896) (3) వడ్డీ-ధరలు (1898) అనునవి

అర్థశాస్త్ర వికాసమున ఈతని సిద్ధాంతమునకు గల స్థానమెట్టిదో పరిశీలింతము (1) వడ్డీరేటు వస్తుధరల సిద్ధాంతములను ద్రవ్యసిద్ధాంతముతో సమన్వయపరచుట ఇతడు చేసిన ప్రత్యేక కృషి (2) ఆస్ట్రియను భావజాలమునకు చెందిన సీమాంతఉత్పాదకతా సిద్ధాంతమును లాసేన్ భావజాలమునకు చెందిన సార్వత్రిక ధరల సమతూలనస్థితి సిద్ధాంతమును సమన్వయపరచుట ఇతడు కావించిన మరియొక కృషి. గణితము నుపయోగించి ద్వివర్ణ సమీకరణముల ద్వారా ఆర్థిక వ్యవస్థయందు ప్రవర్తిల్లగల వస్తుధరల నన్నిటిని పేర్కొనదగును అనునది దీని నుండి తేలు సారాంశము పైన చెప్పిన రెండు మార్గములయందు ఈతని ఆర్థిక తత్త్వవిచార మెట్టిదో విపులీకరింతము

ఈతని భావములలో పెట్టుబడి వడ్డీరేటు సిద్ధాంతములు కేంద్రస్థానమున నున్నవి వడ్డీరేటును రెండు కోణములనుండి పరిశీలింపనగును (1) సహజమగు వడ్డీరేటు (2) ద్రవ్యపు కొలతలో వడ్డీరేటు దీనిని విపణి వడ్డీరేటు అని కూడ అందుము నిల్వలను పెట్టుబడిని సమతూలనస్థితిలోనికి తీసికొనివచ్చునది సహజమగు వడ్డీరేటు విపణి వడ్డీరేటు సహజమగు వడ్డీరేటుకన్న ఎక్కువగా నైన నుండవచ్చును లేక తక్కువగానైన నుండవచ్చును పెట్టుబడి సొమ్మునకు గల కొరత ననుసరించి దానికి ఏర్పడిన ధరయే విపణి వడ్డీరేటు ఇది సహజమగు వడ్డీరేటుకన్న తక్కువగా నున్నచో (1) పొదుపరితనము ప్రోత్సహింపబడదు (2) వినియోగము హెచ్చును (3) పారిశ్రామికవేత్తలు తమ లాభములు పెరుగగల అవకాశమున్నదని గ్రహింతురు (4) ధరలు పెరుగును మొత్తము మీద ఆర్థిక కార్యకలాపములన్నియు విస్తరించును బ్యాంకులు మున్నగు పెట్టుబడి సమకూర్చు ద్రవ్య సంస్థలు వడ్డీరేటును తగ్గించుట ద్వారా ఇట్టి ప్రగతిని సాధించ వీలగునను సలహాను తన రచనల ద్వారా మొదటిసారిగా ఇచ్చిన ఖ్యాతి విక్సెల్ నకే దక్కును ఈ విషయమున కీన్సుకు మార్గదర్శియైనవా డితడు

సార్వత్రిక వస్తుధరల నిర్ణయము గణితమార్గమున ద్వివర్ణ సమీకరణముల ద్వారా జరుగగలదని ఈతని వాదము ఆర్థిక వ్యవస్థయందు భవిష్యత్తులో ప్రవర్తిల్ల గల ధరలనన్నిటిని ఈ వాదముపై ఆధారపడి నిర్దేశింప వీలగునని సామ్యవాద ప్రభుత్వములు ఆచరణలో చాలవరకు రుజువు చేసినవి ఇట్టి ప్రతిభను సిద్ధాంత ఆచరణ రంగములు రెండింటి యందును విక్సెల్ కలిగియుండుట అసాధారణ విషయము

సూ కృ శా

## విజయనగర సంస్థానము

విజయనగర సంస్థానాధీశ్వరుల మూలపురుషులు సూర్యవంశ్యులని విశ్వసింపబడుచున్నది ఉదయపుర రాజవంశీయుడైన విజయభూపతి తన దిగ్విజయయాత్రలో దక్షిణదిశగా వచ్చి సెక్కు రాజులనోడించి బీజాపుర ప్రాంతమున విజయనగరమను పట్టణమును దుర్గముతోగూడ కట్టించెను విజయభూపతి దానిని రాజధానిగా చేసికొని చాలకాలము పాలించెను ఇతనికి బుద్ధవర్మ అను నామాంతరమున్నది ఇతని కుమారుడగు మాధవవర్మ బెజవాడయందలి కనకదుర్గాదేవి ప్రసాదముచే స్వతంత్రుడై నిడదవోలు రాజధానిచేసికొని వికాలభూభాగము నేలెను ఇతనిపుత్రుడు దేవవర్మ పాండ్య కేరళ చోళరాజులను ఇతని పౌత్రుడు మైలమభీముడు (చిక్కభీముడు) కల్యాణ

రాజులను ఓడించిరి ఇతని వంశీయుడగు అమలరాజు కొండపల్లి సీమయందు పూష (సూర్య) వంశజులగు క్షత్రియులకు నివాసభూమియగునట్లు పూసపాటి అను పట్టణమును నిర్మించెను ఈ నగరము లోకవ్యవహారమున పూసపాడు అని ఎలువబడుచు వచ్చెను

అమలరాజు వంశీయులప్పటినుండియు పూసపాటి వారయిరి క్రమముగా అయ్యపరాజు మొదటి తమ్మిరాజు రాజ్యాధిపతులయిరి తమ్మిరాజు పుత్రులలో మొదటిరాచిరాజు సుప్రసిద్ధుడు ఇతడు క్రీ శ 1438-1447 సం॥ల మధ్య రాజ్యాధిపతియయ్యెను రాచిరాజు చామెర తిమ్మరాజు నోడించి అతనితో కూడి మ్లేచ్ఛుల జయించి వారిదుర్గములను గ్రహించి మాళవరాజును గెలిచి అతనికిగల సున్నెసుల్తాను బిరుదమును గ్రహించెను ఇతడు చాళుక్యరాజ్యమును పునః స్థాపించి చాళుక్యరాజ్య స్థాపనాచార్య బిరుదమును గ్రహించెను

మొదటి రాచిరాజు పుత్రులలో రెండవ తమ్మిరాజు పేర్గాంచినవాడు ఇతడు వీరప్రతాపరుద్రగజపతి పుత్రులను జయించి గజపతి బిరుదము నాకర్షించెను ఇతడు మ్లేచ్ఛసేనల నోడించి బహాదుల్లాఖానుడు శరణువేడగా అతనిని రక్షించెను 1470 వరకు జీవించిన ఈతని పుత్రులలో రెండవ రాచిరాజు ప్రఖ్యాతుడు ఇతడు కటకాధీశుడగు పురుషోత్తమగజపతి నుండి కేతవరమునుగ్రహించి దానిని పాలించెను ఇతడు నవభారత కృతికర్త 'యని శ్రీకృష్ణవిజయము చెప్పుచున్నది ఇతని పుత్రుడగు మూడవతమ్మిరాజునకు వీరప్రతాపరుద్రగజపతి తన కుమార్తె నిచ్చెను కృష్ణదేవరాయలకు కూడ ఈ ప్రతాపరుద్రగజపతి తన కుమార్తె నిచ్చుట ప్రసిద్ధమైయున్నది ఇతని తండ్రి రాచిరాజు 1518లో కొండవీటి దుర్గరక్షకుడై యుండినపుడు కృష్ణరాయనిచే జీవగ్రాహముగ పట్టుకొనబడెను ఇతని పుత్రుడు పగపాలకుడైనట్లు కాన్పింపదు రెండవ రాచిరాజు తమ్ముడగు తిప్పరాజుకొడుకులలో పెదకృష్ణభూపతి పరిపాలకుడై పెక్కురు శత్రువుల నోడించెను ఇతని సమ్మట ఇతని కుమారుడగు పెదజగన్నాథరాజు ప్రభువయ్యెను ఇతని కుమారుడు కృష్ణరాజు పొట్నూరునుజయించి అందొకకోటను కట్టించెను ఇతని అనంతరము క్రమముగా అన్నమరాజు నాల్గవ తమ్మిరాజు పొట్నూరునుండి రాజ్యమేలిరి అన్నమరాజు పుత్రుడగు ఒకటవ సీతారామచంద్రరాజు 1673 నుండి 1698 వరకు పొట్నూరు సంస్థానమును పాలించెను ఇతడు ఔరంగజేబువలన జుల్ఫికార్ అను రెండంచుల ఖడ్గమును బహుమతిగా పొందెను ఇతని తర్వాత క్రమముగా అన్నమరాజు ఆయిదవ తమ్మిరాజు వేంకటపతిరాజు ఒకటవ ఆనంద గజపతిరాజు రెండవ సీతారామచంద్రరాజు అనువారు పొట్నూరునకు పాలకులయిరి మొదటి వేంకటపతిరాజు ఉషాభ్యుదయ కర్త మొదటి ఆనందగజపతిరాజు నవరామాయణ కర్త సీతారామచంద్రరాజు హీరమండలంహుండాను గ్రహించి ప్రతాపగిరిదుర్గాధీశుని జయించెనే కాని తిరిగి అతని ఖడ్గముచేతనే నిహతుడయ్యెను

1713లో ఒకటవ ఆనందగజపతిచే ప్రారంభింపబడిన ప్రస్తుతపు విజయనగరదుర్గము అతని కుమారునిచే 1720 లో పూర్తి చేయబడెను ఈ కోటను బుస్సీసరదారులలో నొకడు 1757లో నిర్మించెనని చెప్పుదురు మొదటి విజయరామగజపతి సర్వస్వతంత్రుడై ఢిల్లీచక్రవర్తితో ప్రత్యక్షముగా రాజ్యవ్యవహారములనుగూర్చి సంప్రదించు అధికారమును కల్గియుండెను ఇతడు కళింగప్రాంతములో పెక్కుభాగములను జయించుటవలన కళింగాధిపతిగను రాజమహేంద్రవరము సర్కారులకుగూడ ప్రభువగుటచే త్రిలింగాధిపతిగను ప్రశస్తి నొందెను ఉత్తరసర్కారుల రాజులందరిలో ఇతడు అత్యంత బలాఢ్యుడు ఇతడు తుమ్మపాలవద్ద మహారాష్ట్రుల నోడించెను ఫ్రెంచి సైన్యాధిపతియగు బుస్సీ విజయరామరాజు సహాయమువలననే ఉత్తరసర్కారులలో బలీయుడయ్యెను బుస్సీ 1756 నవంబరులో 500 యూరోపియనులను 4000 సిపాయిలను వెంటనిడికొని రాజమహేంద్రవరమున ప్రవేశించెను విజయరామరాజు తనకు తన సామంతులకుచెందిన పదివేలసేనతో బుస్సీసైన్యమునుకలిసి అతనివలన సన్మానమును పొందెను ఆనాడు బొబ్బిలి విజయనగరము తాలూకాలు శ్రీకాకుళము సర్కారులో నుండెడివి

బొబ్బిలిప్రజలు జలప్రవాహములను తమ భూములకు మరలించుకొనుచు విజయనగర ప్రాంత గ్రామములను దోచుకొనుచు విజయనగర ప్రభువు ఆగ్రహమునకు గురియైరి బొబ్బిలిరాజు విజయనగరప్రభువును లక్ష్యపెట్టకుండెను మరియు శ్రీకాకుళము నందున్న హైదరాబాదు నవాబు సరదారగు జాఫరల్లితోకూడ బొబ్బిలి రాజగు రంగారావు, ఫ్రెంచివారిని సర్కారులలోనికి రాకుండ విరోధింపదలచెను

విజయరామరాజు పై విషయములను బుస్సీకి నివేదించి బొబ్బిలి రాజును బొబ్బిలినుండి తొలగించుట అత్యావశ్యకమని ఆతనిచే అంగీకరింప చేసెను. బొబ్బిలిని విడిచిపెట్టుమనియు బొబ్బిలి తాలూకాకంటె అధిక వైశాల్యమును అధికరాబడియుగల భూభాగమును వేరొకచోట ఇప్పించెదననియు రంగారాయనికి బుస్సీ వార్తనంపెను. రంగారావు దీని నవమానముగా భావించి అంగీకరింపడయ్యెను. అంత విజయరామ గజపతి తన 11 వేల సైన్యమును బుస్సీసైన్యమును వెంటనిడుకొని దేవుపల్లి మార్గమున బొబ్బిలిపై దాడివెడలెను. 1757 జనవరి 24 వ తేదిన బొబ్బిలియుద్ధమారంభమయ్యెను. బుస్సీసైన్యమున 250 మంది గుర్రపు రౌతులును 750 మంది ఐరోపియనులును ఉండగా బొబ్బిలి కోటలో 250 మంది ఆయుధపాణులు మాత్రముండిరి. అంతకురెండింతల మంది స్త్రీ బాల వృద్ధులుండిరి. బుస్సీ, నాల్గు బురుజుల కెదురుగా నాల్గు ఫిరంగులను సిద్ధపరచి యుద్ధమునారంభించెను. అపరాహ్ణకాలము వరకు విజయరామరాజు సైన్యమున ఒకడైనను బురుజు మీదికి వెళ్లలేకుండెను. అంతట కొంతసేపు యుద్ధమాపివేయ బడెను. ఈ లోగా శత్రుబలమును గ్రహించి తమ విజయమును గూర్చి శంకించిన అభిమానధనుడగు రంగారాయుడు కోటలోని స్త్రీ జనము శత్రువాత బడకుండ తనవారిచేతనే చంపించెను. పిమ్మట కోట బురుజుల సంరక్షణమునకై వచ్చుచున్న రంగారావు శత్రువుల తుపాకిగుండు తగిలి నేలకొరిగెను. దుఃఖోద్వేగముచే క్రోధోద్రిక్తులైన రంగారాయపరివార జనము ఆయుధపాణులై బెబ్బులులవలె ఒకచోట గుమిగూడి బుస్సీ, ఎంతవేడినను శరణు కోరక భయంకరముగ పోరాడి వీరస్వర్గము నొందిరి. ఒక ముదుసలి యొక బాలుని చేయి పట్టుకొనిరాగా బుస్సీ వారికభయ మిచ్చెను. ఆ బాలుడే బొబ్బిలిరాజు పుత్రుడగు చినరంగారావు.

యుద్ధసమయమున, రంగారాయని యెడల మిగుల భక్తివిశ్వాసములుగల ఆతని బావమరదియు పౌరుషప్రతాపములుగల తాండ్రపాపయ్య బొబ్బిలి యందు లేకుండెను. బొబ్బిలివారి ఓటమిని మరణమును విని అతడు క్రోధోద్రిక్తుడై హుటాహుటిగావచ్చి యుద్ధము జరిగిన మూడవనాటి రాత్రి నిద్రాపరవశుడైయున్న విజయరామరాజుపై బడి కత్తితో పొడిచి చంపినట్లు 'రంగారాయచరిత్రము' నందును 'ఆంధ్ర మార్కండేయ పురాణ' పీఠికయందును పేర్కొనబడి యున్నది.

పిమ్మట విజయరామరాజు సోదరుని కుమారుడగు రెండవ ఆనందగజపతి సంస్థానాధీశ్వరుడయ్యెను. విజయరామ గజపతి మరణానంతరము బుస్సీ బొబ్బిలివారి పక్షమునకు తిరగుట వలన బుస్సీయే తనపినతండ్రి బలవన్మృతికి కారణమని రెండవ ఆనందగజపతి నిశ్చయించి విశాఖపట్టణము నుండి ఫ్రెంచివారిని తరిమి దానిని స్వాధీనము చేసికొని ఆంగ్లేయులతో రాయబారము జరిపి వారికి విశాఖపట్టణము నిచ్చివైచెను. రెండవ ఆనందగజపతి కర్నల్ ఫోర్డు అధిపత్యమున 1758 నవంబరులో బ్రహ్మాండమైన సైన్యముతోను ఆయుధబలముతోను చందుర్తి వద్ద ఫ్రెంచిసైన్యము నోడించి రాజమహేంద్రవరమును మచిలీపట్టణమును ఆక్రమించి, రేవుల నాంగ్లేయులకిచ్చి తక్కిన ప్రదేశములను తాను గ్రహించెను. జగన్నాధము నుండి బెజవాడ వరకునుగల విశాలప్రాంతమును ఈ ప్రభువు రెండు సంవత్సరములలో స్వాధీనము చేసికొనెను. నిజాం నవాబగు సలాబత్ జంగు ఈ ప్రభువుతోను కంపెనీవారితోను సంధి చేసికొని ఆయా ప్రదేశములను వారికిచ్చుటకు ఒడంబడిక చేసికొనెను. ఇట్లు ఉత్తరసర్కారులలో ఆంగ్లేయుల ప్రవేశమునకు రెండవఆనందగజపతియే కారణమనుట నిర్వివాదాంశము. పరాక్రమశాలియగు ఇతడు పెద్దాపురమును పాలించు రాయ గజపతివర్మను ఉండూరువద్ద నోడించి రాజమహేంద్రవరమున స్ఫోటకము తగిలి ఇరువదేండ్ల వయస్సుననే (1760) మరణించెను. నిస్సంతులైన ఆతనిభార్య లిరువురును సహగమన మొనర్చిరి.

పెదవిజయరామగజపతి భార్య చంద్రయ్యమ్మ తన భర్త యాజ్ఞననుసరించి ఆతని పినతండ్రి కుమారుడైన పూసపాటి రామచంద్రరాజు కొడుకగు వేంకటపతిరాజను బాలుని పెంచుకొని, ఆతనికి "విజయరామగజపతి అని నామకరణము చేయించెను. 1760 లో రెండవ విజయరామగజపతికి పట్టాభిషేకము జరిగెను. ఈతడు అల్పవయస్కుడగుటచే ఈతని సవతి అన్నయగు సీతారామరాజు సౌమ్యుడగు పూర్వపు దివానును పదవీ భ్రష్టునిచేసి దివానుపదవి నాక్రమించెను. ఇతడనేక సామంతరాజుల నోడించి వారి రాజ్యములలో కొన్నింటిని విజయనగరమున చేర్చెను, కొన్ని జమీలచేత పన్నులు కట్టించుకొనెను. ఈ జమీందారులందరును రెండవ విజయరామగజపతి యెడల భక్తి గౌరవములను,

సీతారామరాజు యెడల భయక్రోధములను గలిగియుండిరి. జయపురము బొబ్బిలి సాలూరు మాడుగుల శృంగవరపుకోట మొదలగు పదునెనిమిది జమీలు విజయనగరసంస్థానమునకు లోబడియుండెను. కొన్నిజమీలు విజయనగరమున చేరెను. సీతారామరాజు దౌష్ట్యమును సహింపక జమీందారులలో కొందరు విజయనగరసంస్థానముపై తిరుగుబాటు చేసిరి. సీతారామరాజు కంపెనీ సైన్య సహాయముతో వారిలో కొందరిని లొంగదీసికొని మరికొందరిని నిర్బంధమున నుంచెను. అంతేకాక ఇతడు చంద్రయ్యమ్మను హత్య చేయించి రయితులపై శిస్తులను మిక్కుటముగా పెంచెను. బ్రాహ్మణులు మున్నగువారి కీయబడిన మాన్యములను తిరుగ గ్రహించెను. ఇతడు పరిపాలనాదక్షుడైనను క్రూర స్వభావుడగుటచే రాజబంధువు లితనిని దివానుపదవినుండి తొలగించిరి. అనంతరము విజయరామగజపతికొక పుత్రుడు జనించెను. నిరాశాహతుడగు సీతారామరాజు మద్రాసువెళ్ళి గవర్నరు థామస్ రంబోల్డుకు లక్షరూప్యముల నిచ్చి ఆతని సహాయమున తాను సంస్థానపు దివానుగా పనిచేయుటకును తనకుమారునే విజయరామరాజు దత్తుడుగా స్వీకరించి ఆతని పేర వ్యవహారములు జరిపించుటకును బోర్డువారిచేత విజయరామగజపతిని ఆజ్ఞాపింపజేసెను. దానికి విజయరామరాజు అంగీకరింపకుండుటచేతను 8 లక్షల 50 వేల పేష్కసు అతడు బాకీ యుండుటవలనను 1793 అగస్టు నెలలో సీతారామరాజు సహాయముతో విజయనగర దుర్గమును కంపెనీవారు స్వాధీన మొనర్చుకొనిరి. అంతట ప్రభుభక్తిపరాయణులగు రైతులు కంపెనీవారికి పన్నులు చెల్లింపకుండిరి. విశాఖజిల్లాను విడిచి మచిలీపట్టణమునకు వెళ్ళవలెనని మహారాజును కంపెనీవా రాజ్ఞాపించిరి. కంపెనీవారు తనకీయవలసిన మూడులక్షలు పోగా మిగిలిన బాకీని మూడువాయిదాలలో తీర్చెదనని మహారాజు తెలిపినను బోర్డువా రంగీకరింపక మచిలీపట్టణమున కాతడు వెళ్ళక తప్పదనిరి.

రాజబంధువులు తమప్రాణములైనను విడచుటకు సిద్ధపడి మచిలీపట్టణము వెళ్ళుట అవమానకరమని ప్రభువునకు నివేదించి, కంపెనీవారితో యుద్ధము చేయుటకు సహాయపడెదమని వాగ్దాన మొసగిరి. 1794 జులై 10 వ తేదీన జరిగిన భయంకర యుద్ధములో సౌమ్యుడును విద్వత్కవీంద్రుడును సచ్చరితుడును అగు రెండవ విజయరామరాజు కంపెనీ సైన్యములతో పోరాడి స్వర్గస్థుడయ్యెను. విజయనగర సంస్థానాధీశ్వరుల స్వాతంత్ర్యమీ యుద్ధముతో అంతరించెను. సీతారామరాజు దురాశయు కంపెనీవారి దుర్నీతియు దీనికి హేతువులైనవి.

యుద్ధానంతరము విజయనగర సంస్థానమునుండి పెక్కు జమీలు విడదీయబడినవి. పూర్వము సీతారామరాజుచే బంధింపబడిన జమీందారులు విముక్తులైరి. కాని జమీలన్నియు స్వాతంత్ర్యమును కోల్పోయినవి. సంస్థానమందలి కొన్ని తాలూకాలను కంపెనీవారు తీసికొని సంస్థానమునకు ఆరులక్షల రూప్యములు నష్టపరిహారముగా నొసగిరి.

రెండవ విజయరామరాజు దత్తపుత్రుడైన నారాయణగజపతిరాజు బ్రాహ్మణులకు పెక్కు అగ్రహారములను క్షత్రియాగ్రణులకు పెక్కు మొఖాసాలను సమర్పించెను. ఇతడు మంత్రశాస్త్రవేత్తగను జ్యోతిశ్శాస్త్రజ్ఞుడుగను హోమపూజాపరాయణుడుగను ప్రసిద్ధుడు. తాను కంపెనీ ప్రభుత్వము వద్ద చేసిన ఋణములను 1822 లో తీర్చివేసి కాశీయాత్ర వెడలి అందే తపోనిష్ఠుడై యుండి 1845 లో మరణించెను. నారాయణగజపతి మరణించునప్పటికి ఆతని కుమారుడగు మూడవ విజయరామరాజున కిరువదేండ్ల వయస్సు. విజయనగరమునకు మరలివచ్చుట కాతడు విశేషాసక్తి చూపకున్నను ప్రభుత్వాహ్వానముపై 1848 లో ఆతడు విజయనగరమునకు వచ్చెను. 1852 జులై నెలలో ఈతనికి అఖండవైభవముగ పట్టాభిషేకము జరిగెను. గంజాముజిల్లాలోని హిరమండలమును శ్రీకూర్మక్షేత్రమును కోటిపల్లిక్షేత్రమును పూసపాటి వారెట్లో నిలుపుకొనగల్గిరి. గంజాముజిల్లాయందును రాజమహేంద్రవరము సర్కారులోను వీరికిగల యావత్ప్రదేశమును ఆంగ్లేయులు తీసికొనిరి. మూడవ విజయరామగజపతి సమర్థుడనియు వదాన్యుడనియు ప్రఖ్యాతిగాంచెను. ఇతడు సుప్రీంలెజిస్లెటివ్ కౌన్సిలుసభ్యుడై "ఇండియన్ మెజారిటీబిల్లు"ను ప్రవేశపెట్టి నెగ్గించెను. సంస్థానపు ఆదాయములు 17 లక్షల రూప్యములకు పెంచెను. భీమునిపట్టణమునకును ఇతర నగరములకును రాచబాటలు వేయించెను. వేలరూప్యములు విశాఖపట్టణము నందలి వైద్యశాలలకు విరాళము నొసగెను.

ఈ విజయరామగజపతి ఆటలలో నిపుణుడు; సంగీత సాహిత్యములందు ఆదరము గలవాడు; పెక్కురు సంగీత

సాహిత్య విద్వాంసులను ఆస్థానపండితులుగా నియమించినాడు ఈతనికి రాజకార్యధురంధరులు ధర్మనిరతులునైన పెనుమెత్స జగన్నాథరాజు దివానుగా నుండెను ఈ దివాను సంస్థానములో పెక్కు నీటివసతుల నేర్పరచి ఆనకట్టలు కట్టించి వ్యవసాయమునకు అనుకూలములగు కాలువలను త్రవ్వించెను విజయనగరమును సర్వతోముఖముగ అభివృద్ధి చేసి దాని రాబడిని పెంచెను ఇట్టి పెక్కు యో అభివృద్ధి కార్యక్రమములను జయప్రదముగా నిర్వహించిన ఈ విజయరామగజపతియొక్క యోగ్యతను గుర్తించి గవర్నరు జనరలు ఈతనికి మహారాజ మన్నెసుల్తాను మున్నగు బిరుదముల నొసగెను

మొదటి విజయరామరాజు సతీమణి పేరు అలకరాజేశ్వరి ఈ దంపతులకు అప్పలకొండయాంబ అను పుత్రికయు నారాయణగజపతి ఆనందగజపతి అను నిద్దరు పుత్రులును కల్గిరి నారాయణగజపతి బాల్యముననే మరణించెను రేవా సంస్థానాధిపతి అప్పలకొండయాంబను వివాహమాడెను ఆనంద గజపతి శ్రీకృష్ణదేవరాయని వలె సుప్రసిద్ధుడయ్యెను విజయనగరమునకు ఆనందసీమ' అను ప్రఖ్యాతి కల్గెను ఆనందగజపతి నిజసౌందర్య గాంభీర్య మాధుర్య విజ్ఞానసంపత్తిచే ప్రజలను సమ్మోహింపజేసెను ఈతడు సంస్కృతాంధ్రము లనేకాక ఇంగ్లీషు గ్రీకు లాటిను అరబిక్ పర్షియను భాషలను సంగీతమును వీణావాద్యమును అభ్యసించెను

తండ్రి అనంతరము ఆనందగజపతి రాజ్యాధికారమును స్వీకరించెను ఈతడు తర్కమీమాంసా యోగ ధర్మశాస్త్రాదులను ఆంధ్రములోనికి కనువదింపజేసెను వాచస్పతి వ్రాసిన సంస్కృత నిఘంటువును ముద్రింపించెను మాక్సుముల్లరు పండితుడు ఆంగ్లములోనికి కనువదించిన ఋగ్వేదమును ప్రకటింపించెను స్వయముగ నీతడు సంస్కృతాంధ్రములందు కవిత్వముకూడ చెప్పగల్గియుండెను విజయనగర ప్రభువులకు కాశీనగరమున నొకకోట లదు కాశీనగరమున స్థాపితమైన విజయనగర సంస్కృతగ్రంథమాల' యందు 15 ఉత్తమ గ్రంథములు ప్రకటింపబడినట్లు తెలియుచున్నది కృష్ణదేవరాయలవలె ఈడు పిండితకవులను పోషించెను

ఈతని యనంతరము సంస్థానాధ్యక్షులైన చాల్గవ విజయరామగజపతి గత్తర చెల్లదని రాజబంధువర్గములో కొందరు అభియోగము తేగా అది యెట్లో శమించెను ఈ విజయరామగజపతి ధర్మనిరతుడు ఈతడు రాజ్యాధికారిగా స్థిరపడిన యనంతరము సంస్కృతకళాశాలకు భవనమును కట్టించెను సంగీత కళాశాలను స్థాపించెను ఆంగ్లపాఠశాలను కళాశాలగా చేసెను అనంతతమునాటికమలగు ధర్మకార్యముల నొనర్చెను ఈతని పుత్రుడు ప్రతిభాశాలి యగు అలక నారాయణగజపతి ఈతని కాలమునకూడ వాఙ్మయసేవ విశేషముగా కొనసాగింపబడెను ఈతని పుత్రుడగు పూసపాటి విజయరామరాజు (పి వి జి రాజు) ఆంధ్రప్రదేశ ప్రభుత్వమునందు కొంత కాలము విద్యాశాఖామాత్యులుగ నుండిరి ప్రస్తుత మీతడు శాసనసభ్యుడుగ నున్నాడు ఈతడుగూడ మహాదాత విజ్ఞానవేత్త విజయనగరసంస్థానము జమీందారీ రద్దుచట్టము వలన అంతరించినను ఆ సంస్థానాధీశు లొనర్చిన సంగీత సాహిత్యసేవయు ధర్మకార్యములును వారి సత్కీర్తియు పరాక్రమమును ఆచంద్రార్కముగా నుండుననుట నిస్సంశయము

సం బ శా

## విజయపురి

ఇటీవల ఆరేండ్ల క్రిందటివరకు నాగార్జునసాగరము ఆనకట్ట ఆంధ్రదేశమందలి గుంటూరు - నల్లగొండ మండలము లను అనుసంధానించుచుండెడిది ఇప్పుడిది పరిపాలనా సౌకర్యార్థము ఒక్క నల్లగొండ మండలములోనిదిగనే వ్యవహరింపబడుచున్నది ఈ ఆనకట్టకు సుమారు నాల్గుక్రోసులు ఎగువ భాగములో (నేటి నల్లగొండ మండలములో) పురాతనమైన విజయపురీనామనగరము నిర్మితమని ఊహింపబడెను ఇది నల్లమల అనబడు తూర్పుకనుమలపాయలో గూటియందమర్పబడినట్లు కుదురుకొని రమారమి మూడువేల యకరములవరకునుగల తన పరిసరముల యందలి పచ్చిక పట్టుల మనోహరదృశ్యములచే చూపరకు కనువిందొనర్చుచుండగలదు ఇచ్చటవచ్చటగల చిశధమ్మ (క్షుద్ర ధర్మ) గిరి' పెద కుందేళ్ళగుట్ట' చిన కుందేళ్ళగుట్ట వంటి కొన్ని గుట్టలను వినాశరించినచో, స్థూలముగ ఈ కనుమలపాయకు క్రిందిభాగమును సమతలమనియే వ్యవహరించుట యుక్తము పర్వతీయమగుటచే పెట్టని కోటలవంటి కొండలును తృణకాష్ఠజల సమృద్ధియు గల్గిన తన వైభవము సహజరక్షణ దక్షతను వ్యూహరచనాచణత్వమునకు ఆయువుపట్టు అనదగు ఉనికిని వెల్లడించుచుండగా, ఇది అద్భుత రాజధానీనగరమై విలసిల్లినది

ఈ విజయపురి క్రీ శ 3 4 శతాబ్దులలో ఇక్ష్వాకాంధ్రులకు రాజధాని ఒకటవ (వాసిష్ఠీపుత్ర) చాంతమూలుడు ఈ ఇక్ష్వాకువంశమునకు మూలపురుషుడని ఒకమతము అట్లే చతుర్థ బౌద్ధసంగీతికి (The fourth Buddhist Council) 400 ఏండ్ల అనంతరము ఈ విజయపురీ నగరనిర్మాణము జరిగెనని ఇంకొకమతము కూడ లోకమున కలదు ఈ మతముల యందలి సత్యాసత్యములను గూర్చి చర్చించుటకు ముందు నేడుపలభ్యమగు పురావస్తుశాస్త్ర సంపత్తిని పరిశీలింతము

నాగార్జునకొండనుగూర్చి జరిగిన ఖనన పరిశోధనములు ముఖ్యముగ మూడు అందు మొదటిది ఎ హెచ్ లాంగ్ హార్ట్స్ పండితుడు క్రీ శ 1926 నుండి 1931 వరకును జరిపెను దానిఫలమే "నాగార్జునుని కొండలోని బౌద్ధశిథిలములు అనుగ్రంథము రెండవది టి ఎస్ రామచంద్రన్ క్రీ శ 1938 నుండి 1940 వరకును జరిపిన పరిశోధన దీని ఫలమే నాగార్జునకొండ–1938" అను గ్రంథము మూడవ పరిశోధనము డా రాయప్రోలు సుబ్రహ్మణ్యము పర్యవేక్షణలో జరిగెను ఈయన గవేషణా ఫలితములు పెక్కు వ్యాసముల రూపమున వెలువడినవి సమగ్ర గ్రంథరూపమున అవి త్వరలో ప్రకటితములు కాగలవు

మొత్తముమీద ఇంతవరకుసాగిన పరిశోధనములనుబట్టి శాతవాహనసామ్రాజ్యము భగ్నమైనపిమ్మట అంతవరకు వారికి సామంతులుగగాని దండనాయకులుగగాని ఉండిన వారో లేక వారి కొలువులో సేవచేసినవారో కొందరు వేర్వేరు ప్రాంతములను వశపరచుకొని తెలుగుదేశమునందు క్రొత్తశాఖలను నెలకొల్పిరని తెలినది ఇట్టి వారి యందు కృష్ణాప్రాంతమునగల ప్రాగాంధ్రదేశమును పాలించిన ఇక్ష్వాకువంశమువారొకరు వీరి నే పురాణములు శ్రీ పర్వతీయాంధ్రులనియు ఆంధ్రభృత్యు (ఆంధ్రశాతవాహన భృత్యు) లనియు పేర్కొనుచున్నది నాగార్జునునికొండలో దొరికిన బ్రాహ్మీలిపి (ప్రాకృత) శాసనములనుబట్టి క్రీ శ 3 4 శతాబ్దుల యందలి ఆంధ్రుల చరిత్రయు వి శే ష ం చి ఈ ప్రాంతమును పాలించిన ఇక్ష్వాకువంశరాజుల చరిత్రయు తెలియుటయేకాక నాగార్జునుని కొండకు క్రీస్తు శకారంభ శతాబ్దులలో శ్రీ పర్వతమను పేరున్నట్లుకూడ విదితము కాగలదు. శ్రీ పర్వతమను పేరు నాగార్జుననికొండకు మాత్రమే కాదనియు అచ్చటినుండి కృష్ణాతీరమునందే కర్నూలు మండలములోని వ్యాపించిన నల్లమల (కొండ) ల వాలునకంతకును ఆ పేరు చెల్లుననియు కొందరు చెప్పుచున్నారు పురాణములలో చెప్పబడిన ఇక్ష్వాకాంధ్రరాజుల రాజ్యకాలపరిమితి నంవత్సరములు ఇది సరియైనదనియే తోచుచున్నది ఈ యిక్ష్వాకువంశజులు తెలుగుదేశమునకు ప్రస్తుతము పూర్వమే వచ్చియుండినట్లు తెలియుచున్నది నేటివరకు దొరకుచున్న శాసనాధారములను బట్టి తెలియవచ్చు ఇక్ష్వాకు ప్రభువులు ఆరుగురు వీరి రాజధానియే విజయపురి ఇది నాగార్జునుని కొండలోనే కలదు ఇక్ష్వాకుప్రభువులు శాతవాహనులవలె అశ్వమేధములు చేసినవారే

ఇక్ష్వాకాంధ్రు లని పేరుపడి విజయపురి నేలిన మొదటి వాసిష్ఠీపుత్ర శ్రీ శాంతమూలుడు (వాసిష్ఠీపుత్ర చాంతమూల) అని శాసనములవలన తెలును ఇతనినే ఒకటవ శాంతమూలు డందురు మొదటి ఇక్ష్వాకురాజు ఏహువల శాంతమూలుడే (రెండవ శాంతమూలుడు) కని వాసిష్ఠీపుత్ర శ్రీ శాంతమూలుడు కాదని యింకొక వాదమున్నది




(వీరుకాక రెండు చిన్న శిథిలశాసనములలో 'కుమార వీర అరిశ కుమార కరడర' అనువారు కూడ పేర్కొనబడి యుండిరి)

ముందు శుంగ - కణ్వవంశములను అంతమొనరించి, ఆంధ్రసామ్రాజ్యమును స్థాపించినవాడు శ్రీముఖుడు (సింధుకుడు లేదా సిముకుడు) అని పురాణములు తక్కుగంటనులో

ఘోషించుచున్నను అతడు శ్రీముఖుడు కాడనియు శ్రీముఖుని వంశీయుడైన మొదటి (పటుమావి) పులోమావియే (క్రీ పూ 48) అని కొందరును అసలతడు శాతవాహనుడని ప్రత్యేకముగ పేరుగల ఆంధ్రరాజు మాత్రమే అని మరికొందరును ఆంధ్రుల ప్రథమ ప్రభువు విషయమున ఎట్లు వాదించుచున్నారో అట్లే ఈ ఇక్ష్వాకాంధ్రుల ప్రథమ ప్రభువు విషయమునను వివాదములున్నవి కాని వాసిష్ఠీపుత్ర శ్రీశాంత (చాంత) మూలుడే (క్రీ శ 250-275) ఇక్ష్వాకురాజ్య వ్యవస్థాపకుడని నేడు నిర్వివాదముగ తెలిసినది

ఏది యెట్లున్నను నమో భగవతో అగ్గపొగ్గల నో మీ పుతస సిరి విజయ సాత కణిస సం 8 గి ప (గ్రీష్మపక్ష) 4 దివ - వైశాఖ పూర్ణిమ అను పాఠము విజయపురి సమీపమునగల కనుమలలో దొరకిన ఒక శాసనమందు అగుపడగలదు ఈ శాసనము బౌద్ధశాసన మనుట నిస్సందేహము ఇందు అగ్గపొగ్గలస (The foremost Teacher - ఆచార్యశ్రేష్ఠ) అనెడి విశేషణము బుద్ధభగవానునకు చెందినది కావున ఇక్ష్వాకాంధ్రులకు పూర్వమునందే బౌద్ధమతము విజయపురిలో వ్యాపించియుండెనని నిర్ణయింపనగును

ఇట్లే ఆంధ్రప్రదేశ ప్రభుత్వ పురావస్తుశాఖవారు నిర్వహించిన త్రవ్వకములను బట్టి కరీంనగరమండలములో పెదబంకూరు నందు దొరకిన సాధనసంపద సాతవాహన చరిత్రను చాల ప్రకాశములోనికి తెచ్చినది ప్రత్యేకముగ అందొక సామంతమండలాధికారియైన ముద్రిక ప్రస్తుతము తోడ్పడగలదు విజయపుర ఆహరదిక (A governor ruling over Vijayapura Ahara) అని చెప్పుచుండుట అది విజయపురికి చెందిన ఒక రథి (కల) కనకు (governor) సంబంధించినది ఈ ముద్రికపైగలది తొలిదశలోని బ్రాహ్మీలిపి క్రీ పూ ఒకటవ శతాబ్దికిని క్రీ శ రెండవ శతాబ్దికిని నడిమికాలమునందు సాతవాహన చక్రవర్తుల సామంత మండలాధిపుని పరిపాలనాకేంద్రముగ విజయపురి ప్రసిద్ధిగాంచినట్లు పై ముద్రిక మూలమున స్థూలముగ నిర్ణయము కాగలదు

ఈ కాంతారమునకు ప్రత్యేకముగ విజయపురి' అనెడి పేరేల వచ్చెనో దిటముగ చెప్పగల ఆధారము అగపడదు ఈ శబ్దవ్యుత్పత్త్యర్థ సూచకమని తీర్మానింప తగిన ఉదాహరణము మృగ్యము కాని ఈ కనుమ విజయములకు పతాకగా నిల్చియుండునని ఊహించుట దిగ్దర్శనము అవి గౌతమీ పుత్ర శాతకర్ణి విజయములై యుండవలెను అనంతర శాతవాహన చక్రవర్తులలో గౌతమీ పుత్ర శాతకర్ణి తన విజయములకు ప్రసిద్ధిగాంచినవాడు గౌతమీ పుత్రునకును విజయశాతకర్ణికిని మధ్య వాసిష్ఠీ పుత్ర పులమావియు శివశ్రీయు శివస్కందుడును యజ్ఞశ్రీయు అను నల్వురు శాతవాహన రాజులు ఆంధ్రదేశమును పరిపాలించినట్లు పురాణములలోని పట్టికలు వాకొనుచున్నవి గౌతమీ పుత్ర సాతకణిస పులోమావిస యజ్ఞ సాత కణిస వంటి బిరుదాంకిత పాఠములలో లభించిన నాణెములను ముద్రికలయు సాక్ష్యమునుబట్టి ఈ నల్వురు రాజుల విషయమును స్పష్టమగుచునేయున్నది ఈ నిర్ధారణములను బట్టి గౌతమీ పుత్రునిదియు విజయశాతకర్ణిదియు కాగల పట్టాభిషేక కాలములు క్రీ శ 84 క్రీ శ 160 వ సంవత్సరములని పరిగణించినచో విజయపురి కాంతారము రమారమి యెనుబది యేండ్లపాటు సాతవాహన చక్రవర్తుల పరిపాలనములో నున్నదని నిర్ణయమానమగును

ప్రాచీన శాసనాధార సాధన సంపత్తిలో విజయపురిని నాగార్జునునికొండ అని యెందును ఉటంకించియుండలేదు ఏ పుట మూలమున ఈ నాగార్జునునికొండ' అను పేరు విజయపురికి ఎప్పుడు వచ్చినట్లు తోచుచున్నది స్థానిక పారంపరీణ గాథలను బట్టియు టిబెటుదేశ చరిత్రకారుడగు తారానాథుని బట్టియు ఆంధ్రకవి గౌరన చెప్పిన నరనాథ చరిత్రము (మద్రాసు విశ్వవిద్యాలయ ప్రచురణము తెలుగు సీరీస్ నెం 7-అధ్యాయము 6 పుట 158 సం 1937) బట్టియు నాగార్జున ప్రతిమను ఈ కనుమను సంబంధమేర్పడినది నాగార్జునుడిచ్చట నివాసమేర్పరచుకొని యిరువది యైదేండ్లపాటు సమీప శ్రీపర్వతమందు తపస్సులో నిమగ్నుడైనట్లు తెలియనగును ఇక్ష్వాకురాజుల శాసనములలో శ్రీపర్వత విజయపురి అనియే వ్యవహారము కాకతి గణపతిదేవుని (క్రీ శ 1161, పలనాటి తాలూకా దుర్గి శాసనములో మొదటిసారిగ నాగార్జునుని కోట పేర్కొనబడినది తదుపరి రెడ్డి రాజులయు శ్రీకృష్ణదేవరాయలయు శాసనములలో నాగార్జునకొండసీమ' అని కలదు వెలనాటి చోళుల కాలమున కృష్ణా-గుంటూరు మండలములలో బౌద్ధమతము ప్రబలియున్న కాలమందు దీనిని బహుళ ప్రసిద్ధ నాగార్జునుని పేరిట నాగార్జునునికొండ' అని వ్యవహరించియుండిరి

శ్రీ పర్వతము నల్లమల అనబడు తూర్పుకనుమల శ్రేణిలో నున్నట్లు గుర్తింపబడినది. ఇది శ్రీశైల మనబడు పర్వత శ్రేణికి సంబంధించిన కొండల వరుస అగుటచే ఈకనుమలలో కుదురుకొన్న దీనికి శ్రీ పర్వత మని పేరు వచ్చి యుండవచ్చును. ఈ రెండు పేర్లును (శ్రీశైల శ్రీ పర్వతములు) అసలు నల్ల (మంచి లేక శుభకరమగు) మల (కొండ) అనబడు దానికి సంస్కృతీకరణమై యుండునని తోచుచున్నది. పైన చెప్పినట్లు స్థానిక గాథలయు తారానాథునియు గౌరనార్యునియు ప్రమాణములను సిద్ధాంతములుగ మనము స్వీకరించినచో మాధ్యమిక సంప్రదాయ ప్రవర్తయగు నాగార్జునుని శాతవాహన చక్రవర్తులలో ఎవ్వరో యొకరు బౌద్ధసంఘారామ ప్రతిష్ఠాపనము మహాయాన మత శాఖా ప్రవచన గ్రంథమును విజయపురికి (నాగార్జునకొండకు) ఆహ్వానించియుండుటకు సాధ్యము.

టిబెటు దేశము తగ్రంథములలో నాగార్జున ఉపతి ఒకానొక శాతవాహన చక్రవర్తికి మంత్రియనియు ప్రసక్తింపబడెను. ఒకప్పుడా శాతవాహన చక్రవర్తికి ధనాభావ మేర్పడగా నాగార్జునాచార్యుడు తన రససిద్ధి సామర్థ్యము (Power of alchemy) మూలమున ఇటికలను బంగారపు టచ్చులుగా మార్చెనని కొన్నిగాథలు చెప్పుచున్నవి. నాగార్జునుని రససిద్ధిని గూర్చి యిట్లే గౌరనార్యుని నవనాథ చరిత్రయు చెప్పుచుండుటచే అటు టిబెటు గ్రంథములకును ఇటు నవనాథ చరిత్రకును మూలమేదైయుండునో చారిత్రక గవేషకులే దానిని నిర్ణయింతురుగాక! పోగా అమరావతి యందలి మహాచైత్యమునకు గల అంచు ప్రాంగణ (పరిధి) నిర్మాత నాగార్జునుడే అని బౌద్ధ గ్రంథముల వలన తెలియును. అట్లే జగ్గయ్యపేట యొద్దగల బుద్ధప్రతిమను స్థాపించిన చంద్రప్రభాచార్యుడు నాగార్జునుని ప్రశిష్యుడే అని జగ్గయ్యపేటలో దొరకిన బుద్ధప్రతిమ క్రింది ఐదు పంక్తుల శాసనము వలన విదితము. ఇట్టి ప్రబల నిదర్శనముల మూలమున హాల చక్రవర్తియే అనికొందరు ధ్రువీకరించి చెప్పునట్టి ఒక శాతవాహన చక్రవర్తి కాలములో బౌద్ధభిక్షువుల ధ్యానాదిక కార్యార్థము నిర్మింపబడిన పెక్కు సంఘారామస్తూపముల ప్రతిష్ఠా సందర్భమునందు ఆంధ్ర సామంత రాజ్యమండల కేంద్రమైన విజయపురికి ఆ పేరు పెట్టబడి యుండునని మనమూహింపవచ్చును. నేటి దనుక నిర్వహింపబడిన పురావస్తు ఖనన గవేషణములవలన ఈ ప్రదేశమునందు సుప్రసిద్ధ వగమిను బౌద్ధసంఘారామములు నెలకొనియున్నట్లు విశదమగుచున్నది.

పేటలో కొన్ని సంఘారామములు మహాయాన ఖాసిద్ధాంతములకంటె భిన్నమతైన ప్రాచీన హీనయాన సిద్ధాంతములకు చెందినవి. మొత్తముమీద ఈ సమయందు నాగార్జునుని రాకతో ఒక విధమగు పునరుజ్జీవనము కలిగినదని ఊహింపగలము. నవనాథచరిత్రలోని గాథలును మన ఊహకు సమురు పోయుచున్నవి.

ఇక్ష్వాకాంధ్రులకాలములో కూడ ఈ కనుమకు విజయపురీ నామమే సార్థకమగుచు వచ్చినదని ధ్రువముగ చెప్పగలము. ఇటు సింహళమునుండి అటు కాశ్మీరమునుండి వచ్చిపోవుచుండెడి భిక్షుకుల సౌకర్యార్థము సింహళమునకు చెందిన బోధిసిరి (బోధిశ్రీ) అనెడి ఒక ఉపాసిక వీని పురుషదత్తుని కాలమున చుళధమ్మగిరి (క్షుద్రధర్మగిరి) పై కులహ విహారము ను నిర్మింపించెను. అందలి శాసనము చీనా కిరాతము కాశ్మీరము వనవాస గాంధారము వంగము తోసలి అపరాంతము యవనము ద్రమిళము మున్నగు దేశములనుండి భిక్షువులు ఆ కనుమలోనికి విద్యార్థులై వచ్చినట్లు చెప్పుచున్నది.

ఏహువుల శాంతమూలుని ఎనిమిదవ రాజ్యకాలపు నాటి రెండు శాసనములను బట్టి నాగశ్రీ ప్రియసోదరుడగు చంద్రశ్రీ అను ఉపాసకుడు శ్రీ పర్వతము మీది విజయపురిలోని అపర మహావినశైలియ మహానికాయము నందలి ప్రత్యేక ఆర్యసంఘమునకు శైలమంటపమును భాండార శాలాకమును కట్టించెనని తెలియగలదు. ఇచ్చట నాల్గు ఉద్దేశికస్తూపములతో కూడిన ఒక పెద్ద రాతిస్తూపమునకు వెలుపల కొన్ని చిత్రశిలాఫలకములును రాతి దూలములును గలవు. అందొక దూలముపై వెస్సంతర జాతక విశేషములతో పాటు విజయపురిని పేర్కొనుచున్న ఏహువుల చాంతమూలుని ఎనిమిదవ రాజ్యసంవత్సరమునాటి శిల్పమును పైన చెప్పిన శాసనమును గలవు. పిలేశ్వరమందలి పీల అను పదమునకు తొలి రూపము పిహు' కావచ్చును. దానికి వేలు (పు) లేక (ఇల్ = ) వెల పదము చేరినపుడు పిహు (వె) వలు (లు) రూపము సిద్ధించుట సంభావ్యము.

ఇక్ష్వాకాంధ్రుల కాలములో బ్రాహ్మణమత దేవళలను

శివ, విష్ణు దుర్గ కుబేర అష్టభుజ కార్తికేయ పుష్పభద్రాదుల ఆలయములకు సైతము విజయపురి ప్రసిద్ధిగన్నది భారతదేశము నందలి దేవాలయ వాస్తుశాస్త్ర పరిణామ చరిత్రలో తొలిఘట్టమును ఈ అష్టభుజస్వామి ఆలయము సూచించునని ఎరిగిన వారి పలుకు ఏహువల చాంతమూలుని సేనాధిపతులలో నొకరు తన విజయములను సూచించుచు ఇచ్చటనే సర్వదేవా (ధివాసదేవా) లయము నొకటి కట్టించెను

ఈ విజయపురి కనుమ ఆ ఎమ్మట ఆభీర రాజపాలనము క్రిందకు వచ్చినట్లు ఆభీరవసుషేణుని మున్నదియవ రాజ్య సంవత్సరమునాటి శాసనము చెప్పుచున్నది ఆ పిమ్మట పల్లవుల కాలములో సింహవర్మయు శివస్కందవర్మయు అను ఇద్దు పల్లవరాజుల అధీనములోనికి విజయపురి వచ్చెను అటు తరువాత ఇది కొలదికాలము వనవాస నేలిన కదంబులకు లోనైనది తూర్పు చాళుక్య ప్రభువగు విష్ణువర్ధనుడు తూర్పు తీరము నాక్రమించు పర్యంతమును ఇది విష్ణుకుండినులయు శాలంకాయనులయు అధీనము నందుండెను ఎదప కొంత కాలము చాళుక్యరాజ్యములో ఒకభాగమైయున్నది ఆ పిమ్మట క్రమముగ తెలుగు చోళులకును హైహయులకును రెడ్డిరాజులకును గజపతులకును వశమయ్యెను వేంగిపురాధీశుల కాలమునందును తదుపరియుకూడ ఆంధ్రుల రాజధాని వేంగి మున్నగు ప్రదేశములకు మారుచు వచ్చుటతో ఈ విజయపురి తన ప్రాముఖ్యమును కోల్పోయి విస్మృతి సముద్రమున క్రుంకినది

అటు ఎమ్మట విజయపురి అనుపేరే మాసిపోయెను అది యిక నాగార్జునుని కొండ అనుపేరు దాల్చి ఒక దుర్గాధ్యక్షుని అధీనములోనుండి కర్ణాట రాష్ట్ర ప్రవేశమునకు ముఖ్యద్వారమై వెలయ నొప్పటికేలకు ఒక గడి దుర్గముగా (Frontier citadel) రూపొందినది ఎదప అది విజయనగర సామ్రాజ్యాధినేత యగు శ్రీకృష్ణరాయలచే క్రీ శ 1514 - 1516 సంవత్సరముల నడుమ ముట్టడింపబడి గజపతుల నుండి జయింపబడెను ఆ తరువాత పదునారవ శతాబ్ది పశ్చిమార్థములో విజయనగర పతనముతో అది గోలకొండ నేలిన కుతుబ్షాహి వంశమువారికి హస్తగతమైనది వారినుండి ఆంగ్లేయ పరిపాలకులకును క్రమముగ భారతదేశస్వాతంత్ర్యానంతరము నేడు ఆంధ్రప్రదేశ ప్రభుత్వమునకును పూర్వము విజయపురి అని పిలువబడిన ఈ నాగార్జునకొండయు శ్రీపర్వతపు లోయయు చేరినవి అనగా ఆనాటి ఆంధ్రుల సొమ్ము వెదకొనుచు వచ్చి ఈనాటి ఆంధ్రదేశీయులకు ధర్మసమ్మతముగ దక్కినది

నేటి నాగార్జునసాగరము నిర్మాణము పేరిట జరిగిన ఖనన గవేషణ ఫలముగలభించిన సంపత్తియంతయు నిన్న మొన్నటి వరకు అశ్వమేధాశ్వ అస్త్రపంజరముతోకూడ అచ్చటనే కొండపై నిర్మితమైన ఆంధ్రప్రదేశ ప్రభుత్వ పురావస్తు శాస్త్ర భాండాగారమునందు ఎదిలింపబడుట మన అదృష్టము

ఇక్ష్వాకులకాలము ఆంధ్రదేశమునందు బౌద్ధమునకు ప్రసిద్ధిగన్నది ఇక్ష్వాకురాజవంశ స్త్రీలు చూపిన ఆదరణ ప్రోత్సాహముల మూలమున విజయపురి లోయలో బౌద్ధ స్తూపములును తదితర నిర్మాణములును పెక్కులు నిర్మితములైనవి ఈ స్తూపరానాది నిర్మాణకృషివలన విజయపురిలో శిల్పకళ అమోఘముగ ప్రవర్ధిల్లెను ఈ శిల్పమంతయు అమరావతీశిల్ప సంప్రదాయమును అనుసరించియే వృద్ధినొందినది ఈ విజయపురి ఇక్ష్వాకుల కాలములో ఆసియా ఖండమంతటికిని యాత్రాస్థలమయ్యెను బౌద్ధ విజ్ఞాన దీపకళికకు ప్రకాశము నొసగిన విద్యాపీఠమయ్యెను బౌద్ధవిజ్ఞాన ప్రసరణములో శాతవాహనుల ధాన్యకటకమును మించి ప్రఖ్యాతమయ్యెను బౌద్ధాంధ్ర కళాకీర్తికి వైజయంతి అయ్యెను ఇప్పటికి రమారమి పదునేడు శతాబ్దులకు పూర్వము విజయపురిలో వెలసిన విశ్వవిద్యాలయ సభారంగ సంఘారామ విహార దేవాలయ గృహాదులనిర్మాణములును హీనయాన మహాయాన సంబంధి బహువిధశాఖలును శైవ వైష్ణవమతములును సమస్తశాస్త్ర పారంగతులగుపండితులును లలితకళాకారులును వర్తకులును వీరగల్లులును సతీశాసనములును వేనోళ్ల భారతీయ పురాతన సంస్కృతిని చాటుచున్నవి ఇట్లు ఒకటిన్నర శతాబ్దుల కాలము భారతీయ విజ్ఞానమునకు ఆలవాలమైన ఈ లోయ నేడు లోకకల్యాణార్థము ఆంధ్ర దేశమును సస్యశ్యామలము గావించినది కృష్ణవేణమ్మ గర్భములో లీనమగుచున్నది

పరమపావనమగు నాగార్జునసాగర నిర్మాణము నిరుపద్రవముగ కొనసాగి, భావిభారతీయులెల్లరకు నేటి ఆంధ్రులు సమర్పించుకొను సకలకల్యాణకరమగు శాసనమై వెలసి చిరస్థాయి నొందగలదు నాగార్జునాచార్యులు ఒకప్పుడు ఈ కొండ ప్రాంతమును తన సిద్ధశక్తులచే సువర్ణమయము చేయవలయునని యత్నింపబోయి విష్ణుదేవుని నిరాకృతిచే విముఖుడయ్యె

నని కొన్ని గాథలు చెప్పుచున్నవి కాని అమోఘులగు నాగార్జున కులపతి నాగార్జునసాగరము రూపమున అవతరించి ఇప్పుడు ఈ ప్రదేశము అలయ సర్వశాస్త్రముల మొనరించియుండు బంగరు (పంటలు) పండింప గలడని సంభావించుట సముచితముగ నున్నది

బి. వి. కు. శ.

## విజయవాడ

విజయవాడనే విజయవాటిక బెజవాడ అని అనుచున్నారు. వర్తమానకాలమున బెజవాడ అను పేరే సుప్రసిద్ధము. ఈ నామముకూడ ప్రాచీనముగనే కన్పించుచున్నది. తూర్పు చాళుక్యరాజన్యుడు గుణగవిజయాదిత్యుని (క్రీ. శ. 848-92) కాలమునాటి అద్దంకి శాసనమునందు బెజవాడ పేర్కొనబడియున్నది. ఈ పట్టణము అంతకు కొన్ని శతాబ్దులముందే వర్ధిల్లియుండును. ఇది కృష్ణానది యుత్తరపు టొడ్డున వ్యాపించియున్నది. గుంటూరు దీనికి 20 మైళ్ళు, మచిలీపట్నము 50 మైళ్ళు. దీనిచుట్టును గుట్టలు కలవు. ప్రకృతి రమణీయమైన పరిసరములలో బెజవాడ నిలిచియున్నది. ప్రాచీనకాలము నుండియు ఇది సముచిత ప్రాధాన్యము వహించియుండు ననుటకు హేతువు కలదు. కృష్ణానదిని దాటుటకు ఈ ప్రాంతములలో విజయవాడ మిక్కిలి అనుకూలమైన స్థలముగా ఉన్నది. సాధారణముగా నదులమీది రేవుస్థానములు చిన్నవియు పెద్దవియు అగు గ్రామములకు ఆటపట్టులుగా నుండును. ఆ రీతిగా ప్రాచీనకాలము ననే బెజవాడ ఏర్పడియుండును.

శాతవాహనులకాలమునను అనంతర యుగము లందును రాజుల విజయస్కంధావారములకు విజయవాడ స్థానముగా ఉండి యుండును. విజయవాటిక అనుపేరు ఈ విధముగనే కలిగెను. నాగార్జునకొండవద్ద విజయపురి అను ప్రాచీ నగరము కలదు. ఇది ఇక్ష్వాకువంశము వారికి ముఖ్యపట్టణముగా నుండెను. కృష్ణకుత్తరమునుండి శత్రుసైన్యములు దక్షిణమునకు రాకుండుటకై సాతవాహనులు, ఇక్ష్వాకులు మున్నగు రాజకుటుంబములవారు తమ సైన్యముల నిచ్చట నిలిపియుండుట సంభావ్యము. అట్టిది విజయస్కంధావారమయి విజయవాటిక, విజయవాడ బెజవాడ అనురీతిని నామమునందు మార్పుచెందుచు అత్యంత ప్రాచీన ప్రశస్తిగల నగరముగా గన్పించుచున్నది. సాంగాపమంతో ప్రసిద్ధ చక్రవర్తియైన ? ? ? ? ? ణ్ణబెణ్ణాపతి అను బిరుదు ? ? ణ్ణబెణ్ణ ? ? ? వేశిపి ? ? పుత్రుని రాజధానియైన ధాన్యకట నగరము కృష్ణకు దక్షిణమున ఉన్నది. దీనికి సమీపమునవే నది ఉత్తరపుటొడ్డున ఆ చక్రవర్తి విజయస్కంధావారముండి యుండుటలో ఆశ్చర్యములేదు.

ఈ నగరమునకు బెజవాడ అనుపేరు వచ్చుటకు జనులు ఒక ఐతిహ్యమును కల్పించుకొనిరి. ఇచ్చట గుట్టలు చాల కలవని చెప్పనైనది. ప్రాచీనకాలమున ఇవి కృష్ణానదికి అడ్డుగానిలచి ఆ నదీప్రవాహమును సముద్రము చేరకుండ నిరోధించెడివి. నదీజలములు ఎదురుతట్టి నృసింహక్షేత్రము వరకు వ్యాపించెడివట. ఇది వేదాద్రి నరసింహ క్షేత్రము కావచ్చును. అప్పుడు దేవతలు శ్రీ మల్లేశ్వరస్వామిని కనకదుర్గాదేవిని ప్రార్థించి కృష్ణకు కొండలలోనుండి మార్గమిప్పింపుడని వేడిరి. వారి యనుగ్రహముచే పర్వతము లందు సొరంగము ఏర్పడినది. ఈ బెజ్జముగుండ నదీప్రవాహము పెద్దధ్వనితో వెలికి ఉరికెను. కొండలకు బెజ్జము పడిన ప్రాంతమగుటచే దీనికి బెజ్జమువాడ (బెజవాడ) అనుపేరు వచ్చెనని కథ కల్పింపబడినది. ఈ కథ నిరాధారము కాకున్నను కృష్ణానది పర్వతపంక్తులనుండి మార్గము చేసుకొని వెలువడినకాలము మన్వంతరములకు చెందిన వృత్తాంతము కాని ఇటీవలిదికాదు. బెజవాడ సమీపమందలి గుట్టలలో ఇంద్రకీలపర్వతము సీతానగరపుకొండ ముఖ్యమైనవి. కనకదుర్గామల్లేశ్వరస్వాముల ఆలయములు ఇంద్రకీలాద్రిపాదమున ఉన్నవి.

పాండవ సోదరులలో నొకడగు విజయుడు ఇంద్రకీల పర్వతముపై ఈశ్వరునిగూర్చి తపస్సు చేసెనని ప్రసిద్ధికలదు. పాశుపతాస్త్రమును సంపాదించుటకై అతడు శివుని ఆరాధించెను. పరమేశ్వరుడు అతని నిష్ఠకు, పరాక్రమమునకు మెచ్చి పాశుపతాస్త్రమును ప్రసాదించెను. ఈ సన్నివేశము కృష్ణానదీతీరమందలి ఇంద్రకీలాద్రిపై జరిగెననియు దానినిబట్టి విజయునితో కలిగిన సంబంధముచే ఈ పట్టణమునకు విజయవాడ నామము కలిగెననియు కొందరు చెప్పుదురు. ఇచ్చట విజయేశ్వరాలయము అను ?గదేవళముకలదు. దీనికి అర్జు

ముడు నెలకొల్పెనని ప్రజలు విశ్వసింతురు ఏదియెట్లైనను విజయవాడనగరము పౌరాణికమును చారిత్రకమును అయిన ప్రశస్తిగల స్థానమగుట నిర్వివాదము

చారిత్రకముగ ఈ నగరము విష్ణుకుండినయుగమున మొదటిమాటు వినవచ్చుచున్నది ఈ రాజకుటుంబమువారు క్రీ శ ఐదు ఆరు శతాబ్దములలో తీరాంధ్రదేశమును పరిపాలించిరి వీరి రాజధాని వేంగిసమీపమందలి దెందులూరు పట్టణము ఆ కాలపు ఉచ్చారణ ఇప్పటికి కొంచెము భిన్నముగా నుండును విష్ణుకుండిన శాసనములలో దీనిని విజయదెందులూరు అని వ్యవహరించిరి ఒక్కొక్కప్పుడు ఈ కుటుంబపురాజులకు విజయవాడ కూడ కార్యస్థానముగా నుండెను ఈ వంశములోని మూడవ మాధవవర్మ చక్రవర్తి కడుధర్మాత్ముడై న్యాయైకప్రియుడుగా ఉండెను ఈతడు నేరస్థులను పరీక్షించుటకై 'దివ్యములు' అను పూర్వవిచారణ పద్ధతిని చక్కగా అనుష్ఠింపజేసెను కావున ఈ మహారాజునకు 'అనపేత వివిధదివ్య' అను బిరుదు చెల్లెను ఈయన క్రీ శ 546-611 నడుమ దీర్ఘకాలము భూపరిపాలనము చేసెను ఈ రాజు న్యాయబుద్ధిని గూర్చి ఒక సన్నివేశము శాసనబద్ధమై కాన్పించుచున్నది ఒక్కప్పుడీయన కుమారుడు పురవీధులలో రథగతుడై పోవుచు ఒక పేదరాలి కుమారుని మృతికి కారణమయ్యెను చింతకాయలమ్ముకొని జీవించు ఆ దీనరాలు తనకుమారుని మరణవార్తను మాధవవర్మ మహారాజునకు నివేదించుకొనెను రాజు విచారణచేయించి తన పుత్రునకు మరణదండన విధించెను ఆ శిక్ష యమలుచేయబడెను అంత బెజవాడ నిలయుడగు శ్రీ మల్లేశ్వరస్వామి మాధవవర్మ భూపతి ధర్మబుద్ధికి మెచ్చుకొని ఆతని తనయుని తింత్రిణీజీవిని పుత్రకుని బ్రతికించి బెజవాడయందు కనకవర్షము కురిపించెనట! ఈ కథ ముక్కంటికాడు వెట్టి వంశీయుడైన మహామండలేశ్వర పల్లకేత భూపాలుడు బెజవాడ మల్లేశ్వరాలయమునందు వేయించిన శాసనమువలన తెలియవచ్చుచున్నది (దక్షిణహిందూదేశశాసనములు I-932) మాధవవర్మ భూపాలుని కాలము శక 514 అని పల్లకేతుని శాసనమందుకలదు ఇది క్రీ శ 592 కు సరిపడుచుండుటచే మాధవవర్మ కాలముతో సంవదించుచున్నది శాసనశిలయందు కొంత భాగము శిథిలమగుటచే పల్లకేతరాజు కాలము నష్టమైనది ఈ శాసనమునందు మల్లేశ్వరస్వామి ఇతర ప్రసాదవృత్తాంతములును చెప్పబడినవి అందు ప్రసిద్ధశైవాచార్యుడైన శ్రీపతి పండితుని వృత్తాంతమునుగలదు ఈ యాచార్యుడు పశ్చిమ చాళుక్యుల దండనాధుడైన అనంతపాలుని సభయందు తన మహిమ చూపినట్లు ఇతర కథానకములచే తెలియవచ్చుచున్నది అనంతపాలదండనాధుడు క్రీ శ 12వ శతాబ్ది ప్రారంభమున విజయవాడలో నుండెను శ్రీపతి పండితుడును ఆకాలమువాడే ఈయన వృత్తాంతమును శాసనములో ఉగ్గడించిన పల్లకేత భూపాలుడు క్రీ శ 13 వ శతాబ్దముననో తరువాతనో జీవించియుండును

విష్ణుకుండినుల యనంతరము తీరాంధ్రదేశమును శాసించినవారు తూర్పుచాళుక్యులు వీరికాలమునకు విజయవాడ ప్రసిద్ధి చెందినట్లు పెక్కునిదర్శనములుకలవు తూర్పుచాళుక్య వంశస్థాపకుడగు కుబ్జవిష్ణువర్ధనుని కాలమున (క్రీ శ 630 ప్రాంతము) చైనాయాత్రికుడగు హుయాన్ త్సాంగు (యువాన్ చ్వాంగ్) భారతదేశమును సందర్శించి ఆంధ్రదేశమందలి గొప్ప బౌద్ధక్షేత్రములనుగూడ ఆరాధించెను అతడు తనయాత్రావర్ణనలలో వేంగిపురమును పేర్కొనియున్నాడు చైనాయాత్రికుడు వర్ణించిన బౌద్ధారామములు కొన్ని విజయవాడకు సంబంధించినవని రాబర్టు సూవెలు మున్నగువారు భావించిరి కొందరీ వాదమును అంగీకరింపలేదు ఎట్లైనను ఆంధ్రదేశమునందలి ప్రముఖ ప్రాచీననగరము లన్నిటియందును నెలకొన్న బౌద్ధమతము విజయవాడయందు నెలకొనలేదని చెప్పుటయుక్తియుక్తముకాదు బౌద్ధమతము క్షీణించిన వెనుక వారి సంఘారామములు వైదికమతానుయాయుల దేవాలయములుగ మారెను బౌద్ధదేవతలు హిందూదేవతలుగా అవతరించిరి బెజవాడ కనకదుర్గాదేవి బౌద్ధమతమందలి తారాదేవి ప్రతిరూపమని కొందరు విమర్శకులు చెప్పుచున్నారు బౌద్ధమత మెట్లున్నను విజయవాడయందు జైనులు బాగుగా నెలకొనియున్నట్లు కన్పించుచున్నది తూర్పుచాళుక్యరాజు మూడవవిష్ణువర్ధనుడు (క్రీ శ 718-52) బెజవాడయందలి 'నడుంబివసతి' యను జినాలయమునకు మునికొండగ్రామమును దానముచేసెను ఈ యాలయమును కుబ్జవిష్ణువర్ధనుని రాణి అయ్యణమహాదేవి కట్టించెనట! అనగా క్రీ శ 630 నాటికే ఈ జైనాలయము విజయవాడలో వెలసినట్లు రుజువగుచున్నది యువాన్ చ్వాంగ్ కాలమునకు బెజవాడయందు జైనులు వర్ధిల్లు చుండినట్లు తేలును ఈ

వంశమునందలి మరియొక ప్రభువు రెండవ అమ్మరాజు (క్రీ. శ. 945-70) బెజవాడయందలి సర్వలోకాశ్రయజినభవనము నైనాలయమును నిర్వహించు అర్హనందియను ఆచార్యునకు కలచుంబర్రుగ్రామమును దానముచేసెను. ఈ యంశము లన్నియు విజయవాడయందు జైనుల ప్రాబల్యమును చూపించును.

ఇదివరలో పేర్కొన్నట్లు తూర్పుచాళుక్య చక్రవర్తి గుణగవిజయాదిత్యుడనబడు మూడవ విజయాదిత్యుని కాలమున బెజవాడ ఆ పేరుతో ఉదాహరింపబడినది. ఈతని సేనాపతియైన పండరంగడు నెల్లూరు ప్రాంతమందలి బోయ కొట్టములను జయించి సామ్రాజ్యపు దక్షిణభాగమున శాంతి నెలకొల్పి విజయసూచకముగా అద్దంకియందు శాసనము వేయించెను. ఇది తరువోజఛందములో వేయించబడిన శాసనము. దీనిలోని ఒకవాక్యము గమనింపదగినది.

కందుకూర్బెజవాడ గావించెమెచ్చి

నెల్లూరు జిల్లాలోని కందుకూరును బెజవాడ నగరమంత శోభావంతముగా చేసెనని దీనిభావము. ఉపమాన సామర్థ్యముచేత బెజవాడ ఆ కాలమున అగ్రశ్రేణి నగరములలో ఒకటిగా నుండెడిదని మనము భావింపవచ్చును. తూర్పుచాళుక్యుల కాలమందే వెలసిన మరియొక శాసనముగూడ బెజవాడ ప్రసిద్ధిని చాటుచున్నది. దీనిని యుద్ధమల్లుని బెజవాడ శాసనమందురు. ఇతడు రెండవయుద్ధమల్లుడని చెప్పుచున్నారు. ఈతని పాలనాకాలము క్రీ. శ. 927-34. గుంటూరు జిల్లాలోని చేబ్రోలునగరమునుండి కుమారస్వామి జాతరకై బెజవాడ వచ్చి ఆ స్థలమే ఎక్కువ వాసయోగ్యముగా నున్నదని భావించి బెజవాడలోనే ప్రతిష్ఠితుడయ్యెనని చెప్పబడినది. యుద్ధమల్లుడు కట్టించిన మఠమునందు గొరగలు (శైవులు) కాక ఇతరులు బసచేయరాదనియు అట్లుచేసినచో స్థానాపతులు వారిని వెడలగొట్టవలెననియు శాసింపబడినది. దీనిచే క్రీ. శ. 10 వ శతాబ్దమునందే శైవమతము విజయవాడలో బలీయమైన స్థానము సంపాదించెనని చెప్పవీలగుచున్నది. దీనిని సమర్థించు మరియొక సూచనయు కలదు. జైనవసతులకు దానముచేసిన రెండవ అమ్మరాజు విజయవాడ యందలి సమస్త భువనాశ్రయ శైవాలయమునకు కూడ దానము చేసెను. ఈ దేవళమును మొదట నరేంద్రమృగరాజను ప్రఖ్యాతివడసిన రెండవ విజయాదిత్య మహారాజు (క్రీ. శ. 808-46) కట్టించెను.

విజయవాడ సమీపమున చరిత్ర ప్రసిద్ధిని పొందిన కొన్ని యుద్ధములును సాగినవి. ఇట్టివానిలో ఒకటి క్రీ. శ. 1019-42 నడుమ జరిగినట్లు సూచనలున్నవి. ఈ సంఘటన ఏట్లేర్పడెనో చూతము. క్రీ. శ. 1019 ప్రాంతమున తూర్పు చాళుక్యరాజు విమలాదిత్యుడు రాజ్యభారముచే వైరాగి ఆయ్యెనని చెప్పుదురు. ఇతనికి ఇద్దరు కుమారులు కలరు: రాజరాజనరేంద్రుడు, విజయాదిత్యుడు. రాజరాజనరేంద్రుని తల్లి కుందవాంబ-కాంచీపుర చోళుల ఇంటి ఆడపడుచు. విజయాదిత్యుని తల్లి తెలుగు చోళవనిత మేడమాదేవి. కాంచీపురచోళులు రాజరాజనరేంద్రుని మూలమున తమ యాధిక్యమును వేంగిదేశములో ప్రతిష్ఠించుకొనుచుండిరి. చోళులకు బలవత్తర శత్రువులైన పశ్చిమచాళుక్యులు రాజరాజనరేంద్రుని సవతితమ్ముడైన విజయాదిత్యుని చేరదీసి వేంగి రాజ్యమున కల్లోలములు రేపుచుండిరి. విమలాదిత్యుని సింహాసన త్యాగానంతరము అతని జ్యేష్ఠనందనుడైన రాజరాజు సింహాసనమునకు రావలసియుండెను. పశ్చిమచాళుక్య చక్రవర్తియైన రెండవ జయసింహవల్లభుడు (క్రీ. శ. 1015-42) రాజరాజనరేంద్రుడు సింహాసన మధిష్ఠింపకుండ అంతరాయములు కల్గించెను. విజయాదిత్యుడు అన్నకు ప్రక్కలో బల్లెమువలె వ్యవహరించెను. పశ్చిమచాళుక్య సేనానియు, మహావీరుడును అగు చావరసు సహాయముతో విజయాదిత్యుడు బలిష్ఠమగు బెజవాడదుర్గమును ఆక్రమించుకొనెను. చావరసుసేనాని బిరుదులలో బెజవాడ దుర్గవిజేత అనునది కలదు. ఇట్టి ప్రమాదములచే రాజరాజనరేంద్రుని పట్టాభిషేకము క్రీ. శ. 1022 వరకును జరుగుటకు వీలులేకపోయెను. ఇంతలో అతని మేనమామయు మామయు అగు చోళచక్రవర్తి మొదటి రాజేంద్రుడు రాజరాజు సహాయమునకై ప్రబల సైన్యములను పంపెను. విజయవాడ సమీపమున జరిగిన మహాయుద్ధములో పశ్చిమచాళుక్య సైన్యములు ఓడి మరలిపోయెను. విజయాదిత్యుడును పారిపోయెను. చోళసేనాని 'జయసింహకులకాల' అను బిరుదును గైకొనెను. రాజ్యమునందలి అంతశ్శత్రునిర్మూలనము జరిగిన తరువాతనే రాజరాజనరేంద్రుడు తూర్పుచాళుక్య సింహాసనమున ఆరూఢుడయ్యెను.

పదునొకండవ శతాబ్దము పొడుగునను చోళులకును

శ్చిమచాళుక్యులకును వేంగీరాజ్యము విషయమై స్పర్ధలు యుద్ధములును కొనసాగుచునేయుండెను క్రీ శ 1070 ప్రాంతమున రాజరాజనరేంద్రుని కుమారుడు రాజేంద్ర చోళుడు చోళసామ్రాజ్యమున కధిపతియై కులోత్తుంగ చోడదేవుడను పేరుతో చక్రవర్తిత్వమును నెరపెను ఆంధ్ర దేశముకూడ అతని పినతండ్రి విజయాదిత్యుని మరణానంతరము కులోత్తుంగచోడునకే సంక్రమించెను కులోత్తుంగుడు వేంగిదేశమును పాలించుటకు తనకుమారులను రాజప్రతినిధులుగ పంపజొచ్చెను కొంతకాలమునకు వీరును వేంగిలో నుండుటకు ఇష్టపడనందున తెలుగుదేశపు ఆధిపత్యమును కులోత్తుంగుడు తన కిష్టభృత్యులును సేనానులును అయిన వెలనాటి చోడులకు ప్రసాదించెను వెలనాటి మొదటి గొంకరాజు వీరిలో మొదటివాడు వేంగిరాజ్యమునందు సర్వస్వతంత్రులైన ప్రభువులు లేకుండట చూచి పశ్చిమచాళుక్య చక్రవర్తియైన ఆరవ విక్రమాదిత్యుడు (క్రీ శ 1076 1126) ఈ సదవకాశమును ఉపయోగించుకొన దలచెను వేంగిని జయించుటకై విక్రమాదిత్యుని దండనాథుడు మహాపరాక్రమశాలియు బ్రాహ్మణుడును అగు అనంతపాలుడు నియోగింపబడెను ఈతడనేక సమరవిజేత అనంతపాలుడు కృష్ణకుత్తరదేశమును జయించి విజయవాడను తనకు కార్యస్థానముగా చేసుకొని పటుదర్పముతో పరిపాలించెను అనంతపాలుని మేనల్లుడైన గోవిందదండనాథుడు కొండపల్లిదుర్గమునకు అధిపతిగా నుండెను వెలనాటి గొంకరాజు మున్నగువారిని పారద్రోలి వేంగీనగరమును దహించి గోవిందదండనాథుడు విజయవాడను సాధించెను క్రీ శ 1118–32 సంవత్సరముల నడుమ విజయవాడనగరము పశ్చిమచాళుక్యుల అధీనమునందున్నట్లు కాన్పించును అనంతపాలదండనాథుని సమక్షమునని శ్రీపతిపండితుడు తన మహిమలు ప్రదర్శించెనని తెలియుచున్నది శివుడే పరదైవమని నిరూపించుటకై ఈ యాచార్యుడు చంద్రనిప్పులను తన చేలాంచలమున ముడి వేసెనట! క్రీ శ 1135 ప్రాంతమున గోదావరీతీరమున జరిగిన మహాయుద్ధములో ఆంధ్రనాయకులును చోళసైన్యములును కలిసి పశ్చిమచాళుక్యుల నోడించి పారద్రోలిరి వేగిదేశము తిరిగి వెలనాటి చోళుల యధీనములోనికి వచ్చెను బెజవాడ కూడ వీరులు మారియుండును ఈ కాలమున బెజవాడకు శాసనములలో జననాథపురమను వ్యవహారము కాన్పించును దాక్షారామమునకు కూడ ఈ పేరుండెను

ఇట్లుండ కాకతీయులు పశ్చిమాంధ్రమున బలసమన్వితులగుచుండిరి వీరు ప్రాగాంధ్రమును తమయేలుబడిలోనికి తెచ్చుకొనుటకై ఉద్యమించిరి కాకతిప్రోలరాజు ఈ ప్రయత్నములో అసువుల గోల్పోయెను అతని కుమారుడు రుద్రదేవ రాజునకు కొంతవిజయము లభించెను అమరావతిని పాలించుచున్న కోటవంశీయులను ఆతడు జయించెను వెలనాటి విజయము గణపతిదేవ చక్రవర్తి కాలములో పరిణతిని పొందెను గణపతిదేవుడు కోటవారితో బాంధవ్యముచేసెను తనకుమార్తెయగు గణపాంబను కోటబేతరాజునకిచ్చి వివాహముచేసెను దీనిచే కోటవంశము వారాతనికి అనుకూలురైరి గణపతిదేవుని సోదరీద్వయము మేళాంబిక కుందాంబికలు నతవాటి బుద్ధరాజుకుమారుడు రుద్రనాయకుని పెండ్లియాడిరి దీనిచే నతవాటివారు గణపతిదేవుని మిత్రులైరి ఇప్పటి మధిర ప్రాంతమును పూర్వము నతవాటిసీమ యనుచుండిరి ఇట్లు తనబలమును పెంపొందించుకొని గణపతిదేవుడు క్రీ శ 1201 ప్రాంతమున వెలనాటి విజయమునకు పూనుకొనెను బెజవాడ కనకదుర్గాలయ ప్రాంగణమున నతవాటి ప్రభువగు వక్కడి మల్లిరుద్రుని శాసనములను దీనినిబట్టి గణపతిదేవుడును అతని మిత్రవర్గమగు నతవాటివారును క్రీ శ 1201 సం॥ న విజయవాడను జయించిరని ధ్రువపడుచున్నది ఇప్పటినుండి కాకతీయసామ్రాజ్య పతనము వరకును విజయవాడనగరము పరిసర ప్రదేశమున్ను కాకతీయుల అధీనమందుండెనని చెప్పవచ్చును

కాకతీయసామ్రాజ్యభానుడు క్రీ శ 1323 లో అస్తమించెను దేశము యవనాక్రాంతమయ్యెను ముసునూరి ప్రోలయ కాపయనాయకుల నేతృత్వమున దేశభక్తిపరులైన వీరు అందరును ఒకకూటముగా ఏర్పడి ఆంధ్రదేశమును మహమ్మదీయుల బారినుండి విడిపించిరి పారతంత్ర్యవిమోచనానంతరము ఈ నాయకులు ఐకమత్యములేక స్వతంత్రరాజ్యములు స్థాపించిరి తీరాంధ్రదేశమునందు రెడ్డిరాజులును తెలంగాణమున పద్మనాయకులును వేర్వేరు రాజ్యములు నెలకొల్పుకొనిరి క్రీ శ 1324 నుండి సుమారు ఒకశతాబ్దముపాటు రెడ్డిరాజ్యము కోస్తా ప్రాంతమున సాగెను ఈ కాలమున బెజవాడ వీరిరాజ్యములో చేరియుండెను రెడ్డిరాజ్యమును ఉత్తరమునుండి గజపతులును దక్షిణమునుండి విజయనగరాధి

పతులను కబళించుటకు నిరంతర ప్రయత్నములు చేయు చుండిరి. పద్మనాయక రాజ్యమునకు బహమనీరాజ్యము చుక్కెదురయ్యెను. కొండవీటిరెడ్డిరాజ్యము క్రీ శ 1425 ప్రాంతమున పతనమొందెను. క్రీ శ 1488 ప్రాంతమున రాచకొండ వెలమరాజ్యము బహమనీసుల్తానుల వశమయ్యెను. రాజమహేంద్రవర రెడ్డిరాజ్యము క్రీ శ 1445 కు పూర్వమే విజయనగరాక్రాంతమయ్యెను. ఇంతలో ఓఢ్రదేశాధీశుడైన కపిలేశ్వర గజపతి విజయనగరమువారిని వెనుకకు నెట్టి ఆంధ్ర దేశతీరప్రాంతము నెల్లూరుజిల్లావరకును తాను ఆక్రమించు కొనెను. ఈ రీతిగ విజయవాడ పట్టణము గజపతుల యధీన మాయెను.

కాని కపిలేశ్వరుని మరణానంతరము (క్రీ శ 1470) అతని కుమారులు హంవీరుడును పురుషోత్తముడును గజపతి సింహాసనమునకై కలహించిరి. పురుషోత్తముడు కటకము నాక్రమించెను. హంవీరుడు నిస్సహాయుడై బహమనీ సుల్తాను మూడవ మహమ్మదు షాహును (క్రీ శ 1463 - 82) సహాయ మర్థించెను. దీనికిబదులుగ గజపతుల యధీనము నందున్న తెలంగాణా ప్రాంతమును తీరస్థాంధ్రదేశము నంతను మహమ్మదుషాకు ఇచ్చుటకు ఒడంబడిక చేసుకొనెను. బహమనీ సుల్తాను ఈ లాభసాటి బేరమునకై మిక్కిలి సంతోషించి హంవీరునకు తోడ్పడి యాతనిని కటక సింహాసనముపై కొంత కాలము నిలబెట్టెను. ఆంధ్ర దేశములో విస్తారమైన భాగము అయాచితముగ మహమ్మదుషాహు వశమయ్యెను. దానిని పూర్తిగ స్వాధీనము చేసుకొని సువ్యవస్థ చేయుటకై మలిక్ నిజాముల్ ముల్కు బైరి మున్నగు సరదారులను నియోగించెను. వీనికి రాజమహేంద్రవరము కార్యస్థానముగా నుండెను. బెజవాడకు సమీపమున ఉన్న కొండపల్లి దుర్గమును మరియొక సరదారుడు పాలించెను. ఈ కాలముననే (క్రీ శ 1480) సుప్రసిద్ధపురుషుడైన ఖ్వాజామహమ్మదు గావాన్ అను బహమనీ సుల్తానులమంత్రి కొండపల్లిదుర్గమున రాజాజ్ఞచే సంహరింపబడెను. కొండపల్లి ప్రక్కనే ఉన్న విజయవాడ కూడ మహమ్మదుషాహు వశమై యుండును. కాని అచిర కాలములోనే ఈ ప్రాంతము బహమనీ సుల్తాను హస్తముల నుండిజారిపోయెను. మూడవ మహమ్మదుషా మరణించిన కొద్దికాలములోనే పురుషోత్తమగజపతి మరల తీరాంధ్ర దేశము పై దండెత్తివచ్చి రాజమహేంద్రవరము కొండపల్లి కొండ వీడు వినుకొండ మున్నగు దుర్గములన్నియు స్వాధీనము చేసు కొని ఈ ప్రాంతమున సుల్తానుల పలుబడిని తుదముట్టించెను. కావున బెజవాడ తిరిగి హిందూపరిపాలనము క్రిందికి వచ్చెను (క్రీ శ 1484 - 85).

ఇప్పటినుండి విజయనగర చక్రవర్తియై శ్రీకృష్ణదేవ రాయల కాలమువరకు విజయవాడ ప్రాంతము గజపతుల క్రింద నుండెను. కృష్ణదేవరాయలు రాజ్యమునకు వచ్చిన కొంత కాలమునకు (క్రీ శ 1513) అతడు కళింగ దండ యాత్ర నారంభించెను. ఇది క్రీ శ 1518 వరకును ఉదయ గిరి దుర్గము మొదలుకొని కటకమువరకును సాగెను. కళింగ దండయాత్ర యందే కృష్ణరాయలు బెజవాడ కొండపల్లి కంభంమెట్టు మున్నగు పెక్కుదుర్గములను వశముచేసుకొనెను. అయినను ప్రతాపరుద్రగజపతిని ఓడించి అతనితో జరిగిన సంధి ప్రకారము కృష్ణదేవరాయలు కృష్ణానదికి ఉత్తరమునన్న దేశమును గజపతికే వదలివైచెను. ఈ విధముగ విజయవాడ యందు గజపతుల పాలనమే ఇంకను కొంత కాలము సాగెను.

ఇంతలో తెలంగాణమునందు కుతుబుషాహి వంశము వారు అభ్యుదయము నొందజొచ్చిరి. ఈ వంశస్థాపకుడైన కులీ కుతుబుషా కడుసమర్థుడు. ఇతడు క్రీ శ 1492 ప్రాంతమున తెలంగాణాప్రాంత పరిపాలకుడుగా కడపటి బహమనీసుల్తాను మహమూదుషాచే నియుక్తుడయ్యెను. నాటినుండి క్రీ శ 1543లో దుర్మరణమునకు గురియగువరకును కులీకుతుబుషా తెలుగుదేశమునందు తన యధికారమును క్రమాభివృద్ధి నొందించుచునేయుండెను. క్రీ శ 1525-30 సంవత్సరముల నడుమ కొండపల్లి దుర్గమును దాని కవతిదూరములోనున్న బెజవాడయు కులీకుతుబుషాకు వశమైయుండును. ఈ ఘటన యిట్లు జరిగెను. కృష్ణదేవరాయలకును గజపతికిని జరిగిన సంధి ప్రకారము కృష్ణకు ఉత్తరదేశము గజపతి వశమువనుండెను. కొండపల్లిదుర్గము గజపతి రాజ్యముయొక్క దక్షిణ తమ స్థావరముగా ఏర్పడెను. సీతాపతియను వీరుడు (ఒకటే బహుశాను కావచ్చును) గజపతి సామంతుడై ఓరుగల్లు కంభంమెట్టు, బెల్లంకొండ దుర్గములకధిపతిగా నుండెను. సీతాపతి వద్ద సుశిక్షితమైన భానుమ్ము బలము ఉండెను. అతడు కుతుబ్షాహీ రాజ్యముపై దురాక్రమణముచేయగా కులీకుతుబుషా సీతా పతిని శిక్షించుటకై సైన్యమునడిపెను. సీతాపతి క్రమ ముగా ఓరుగల్లు కంభంమెట్టు దుర్గములను పోగొట్టుకొనెను.

కొండపల్లిలోనున్న గజపతుల సేనానిని సీతాపతి సహాయము కోరెను మొత్తముమీద కుతుబుషా బలములకును గజపతి సైన్యములకును పలంచెన్నూరు (పెనుగంచిప్రోలు కావచ్చును) వద్ద గొప్పయుద్ధము జరిగి కుతుబుషా విజయమందెను ఈ విధముగా అతడు గజపతుల హస్తమునుండి కొండపల్లి విజయవాడ ప్రాంతమును లాగుకొనెను ఇప్పటి నుండి గోల్కొండ సుల్తానుల ప్రభుత్వము ఔరంగజేబు చక్రవర్తిచే తుదిముట్టింపబడువరకును (క్రీ శ 1687) విజయవాడ కుతుబుషాహీల క్రింద ఉండెను

కడపటి కుతుబుషా సుల్తాను అబుల్ హసన్ తానాషాయు అతనిమంత్రులు అక్కన్న మాదన్నగార్లును ఆంధ్రుల కత్యంత ప్రీతిపాత్రులు గోల్కొండరాజ్యమును కూలద్రోయవలెనని ఔరంగజేబు పట్టుదలవహించియుండుటచే ఆలనివారికి దూరముగా మండగోరికాబోలు అక్కన్న మాదన్నగార్లు బెజవాడయందు తమ కార్యాలయములు నెలకొల్పుకొనినట్లు తెలియుచున్నది విజయవాడయందలి కనకదుర్గాదేవిని సేవించుటకై వారిచ్చట మకాము చేసిరనికొందరు భావింతురు మొగలులకు దూరముగానుండు నుద్దేశముతోనే అబుల్ హసన్ కుతుబుషా కొండపల్లిదుర్గములో దర్బారుచేయుచుండెను అక్కన్న మాదన్నలు ధర్మాత్ములై బీదసాదలకు విరివిగా అన్నదానములు చేయుచుండిరి కనకదుర్గ భక్తులవసతికై వారు సత్రములు కట్టించిరి తానాషాయొక్కయు అతనిమంత్రి వరేణ్యులయొక్కయు సౌమనస్యమును కాంక్షించి ఈస్టుఇండియా కంపెనీవర్తకులు వారికి విలువైన కానుకలు సమర్పించుచుండిరి క్రీ శ పదునేడవశతాబ్దమునందు భారతీయ చరిత్రయందు మూడవదగు మరియొకశక్తి ప్రవేశించెను ఇదివరలో దేశీయులైన హిందువులు మసల్మానులుమాత్రమే విజిగీషువులై దేశమునందు ఆధిపత్యమునకై పెనగులాడుచుండిరి ఈ శతాబ్దమునుండియు వైదేశికులైన వర్తకసంఘముల వారును వారి వెనువెంట వైదేశి ప్రభుత్వములును ఇదివరకే సంక్షుభితమైన భారతరాజకీయ వాతావరణమునందు కాలుపెట్టిరి ఈ వర్తకసంఘములన్నియు యూరపుఖండమునుండి వచ్చినవి వీరందరును క్రైస్తవమతమునకు చెందినవారు ఈ వర్తకసంఘములు సముద్రముమీదవచ్చి వ్యాపారము చేయుచుండెను కావున ఇప్పటినుండియు భారతదేశపు సముద్రతీరప్రాంతమును అచ్చటి రేవుస్థానములును ప్రాముఖ్యము వహించెను ఈ విధముగా మచిలీపట్నము నిజాంపట్నము నెల్లూరుప్రాంతమున ఆర్మెగామ మున్నగు రేవులు వాడుకలోనికివచ్చెను మచిలీపట్టణము విదేశవర్తకుల వ్యాపారస్థానముగా అగ్రేసరమయ్యెను గోల్కొండ నవాబులు దీనిని విస్తారముగా వినియోగించుచుండిరి విదేశవర్తకులలో ఫ్రెంచివారు ఇంగ్లీషువారు డచ్చివారు పోర్చుగీసువారు (బుడతకీచులు) వాణిజ్యమునకై పోటీలు పడుచుండిరి క్రీ శ 1611 నాటికి ఇంగ్లీషువర్తకసంఘమునుగూర్చి మచిలీపట్టణమున వినవచ్చుచున్నది అబ్దుల్లాకుతుబుషాహే మొదటవీరికి సుముఖుడు కాకుండియు తరువాత వీరి వ్యాపారమునకంగీకరించి క్రీ శ 1634లో తన రాజ్యమునందు వర్తకము చేయుటకై బ్రిటిషు వర్తకులకు ఫర్మానా ఒసగెను కుతుబుషామంత్రియు ధనలుబ్ధుడును అగు మీరుజుమ్లా ఈ వ్యాపారమునందుపాల్గొని విశేషధనమార్జించి గోల్కొండ నవాబును ధిక్కరించునంతవాడయ్యెను

గోల్కొండరాజ్య పతనానంతరము దక్కనును ఒకసుబాగాచేసి ఔరంగజేబు దానిపాలనకై తన యధికారులను పంపుచుండెను ఘాజిఉద్దీను అనువాడు మొదటిదక్కను సుబేదారుగా కన్పించుచున్నాడు ఔరంగజేబు మరణానంతరము ఢిల్లీవ్యవహారములు కల్లోలితములయ్యెను అసఫ్ జానిజాముల్ ముల్కు క్రీ శ 1724లో దక్కను సుబేదారుగావచ్చి ఇచ్చట తన బలమును స్థిరపరచుకొనెను అదివరలో గోల్కొండనవాబుల క్రిందనుండిన ఆంధ్రదేశప్రాంతమంతయు నిజాముల ఏలుబడిలోనికి వచ్చెను మొదటి నిజాము మరణానంతరము (క్రీ శ 1748) అతని కుమారుడు నాసిరుజంగునకును మనుమడు ముజఫరుజంగునకును హైదరాబాదు సింహాసనము విషయమై కలతలేర్పడెను అప్పుడు పాండుచేరియందు బలవంతులుగానున్న ఫ్రెంచివర్తకులును వారినాయకుడగు డూప్లేయు ముజఫరుజంగుపక్షమువహించి అప్పటి కల్లోలమునకు దోహదముచేసిరి యుద్ధమునందు (క్రీ శ 1750) నాసిరుజంగు హతుడయ్యెను ముజఫరుజంగునకు దీనివలన ఎక్కువలాభము కలుగలేదు వానిని కడప నవాబులు చంపించిరి చివరకు హైదరాబాదు రాజ్యము అసఫ్ జాయొక్క మరియొక కుమారుడగు సలాబతుజంగునకు దక్కెను ఫ్రెంచిసేనాధిపతి బుస్సీ కాపుదలగా సలాబతుజంగు 1751 సంవత్సరమున సింహాసన మధిష్ఠించెను ఫ్రెంచివారియెడ కృతజ్ఞతాబద్ధుడై సలాబతుజంగు

వారికి 1752లో కొండవీడు సర్కారును బహుమతిగా ఇచ్చెను ఫ్రెంచివారు మచిలీపట్నములో తమ స్థానమును బలపరచుకొనజొచ్చిరి మచిలీపట్నము నిజాముపట్నము మోటుపల్లి రేవులు వారి వశమయ్యెను మరుసటి సంవత్సరమున సలాబతుజంగు ఫ్రెంచిసైన్యముల భృతికై కొండపల్లి ఏలూరు రాజమహేంద్రవరము చికాకోలు (శ్రీకాకుళము) సర్కారులను ఇచ్చివేసెను ఈ విధముగా 1753 ప్రాంతమున బెజవాడ ఫ్రెంచివారి అధీనమయ్యెను కృష్ణకు దక్షిణమున కొండవీడు ఇదివరకే వారి వశమునందుండెను ఇట్లు ఫ్రెంచివారికి సుదీర్ఘమగు ఆంధ్రకోస్తాతీరము లభించెను

సలాబతుజంగు ఇచ్చినను శ్రీకాకుళము సర్కారులు ఫ్రెంచివారికి స్వాధీనపడకుండ అచ్చటి మహమ్మదీయ సేనాపతి జాఫరుఅలీఖాను అనునాతడు అడ్డుపడెను విజయనగర సంస్థానాధిపతి విజయరామరాజుకూడ ఫ్రెంచివారియెడ విరోధము వహించెను చివరకు బూసీయును విజయరామరాజును సఖ్యపడి బొబ్బిలికోటను 1757లో విధ్వంసము చేసిరి మచిలీపట్నమునుండి హైదరాబాదుపోవు యాత్రలలో బుస్సీ బెజవాడవద్ద తరచు విడియుచుండెను 1758లో బుస్సీ తన సైన్యాధిపత్యమునువిడిచి పాండుచేరికి పోవలసినవాడయ్యెను ఆతనిని స్వదేశమునకు పిలిపించిరి డూప్లే అంతకుముందే ఫ్రాన్సుకు మరలవలసినవాడయ్యెను డూప్లే బుస్సీల నిర్గమనముతో భారతదేశమునందు బ్రిటిషువారిపని సుకరమయ్యెను ఉత్తరసర్కారులను ఫ్రెంచివారినుండి చేజిక్కించుకొనుటకై రాబర్టుక్లైవు కర్నల్ ఫోర్డును పంపించెను విజయరామరాజు తరువాత విజయనగరాధిపతియైన ఆనందరాజు బ్రిటిషు పక్షపాతముకలవాడై కర్నలుఫోర్డుకు సహాయముచేయుటకు అంగీకరించెను ఫోర్డుసేనాని రాజమహేంద్రవరము ఏలూరు మున్నగుస్థలములను పట్టుకొని 1759లో అతికష్టముమీద మచిలీపట్టణమునుకూడ స్వాధీనము చేసుకొనెను దీనితో సర్కారుసీమలో ఫ్రెంచివారి అధికారము తుదముట్టెను నిజాము సలాబతుజంగు ఇంగ్లీషువారి సైన్యశక్తినిగుర్తించి వారికి మచిలీపట్నము నిజాముపట్నము సర్కారులను, కొండపల్లిసర్కారులో గుడివాడ అకులమంద ప్రాంతములను దత్తముచేసెను

సలాబతుజంగుకు నిజాము అలీఖాను బసాలతుజంగు అను ఇద్దరు సోదరులుండిరి వీరిరాజ్యానికి ఎడతెగని చిక్కులు కలిగించుచుండిరి నిజామలీఖాను ఆంగ్లపక్షపాతి బసాలతుజంగు ఫ్రెంచి సైనికుల సహాయముపై ఆధారపడెడివాడు నిజామలీఖాను సమర్థుడు రాజ్యకాంక్షగలవాడు హైదరాబాదు రాజ్యమునకు తానే పాలకుడు కాగలెనని యాని కోరి నిజామలీఖాను ప్రేరణచే సలాబతుజంగు 1761 లో సంహరింపబడెను నిజామలీఖాను సుబేదారయ్యెను ఇంగ్లీషు కంపెనీవారు దేశరక్షణకై ఆంగ్లసైన్యమును ఇచ్చినచో రాజమహేంద్రవరము ఏలూరు కొండపల్లి సర్కారులను బ్రిటిషువారి కిచ్చుటకు నిజామలీఖాను బేరము పెట్టెను ఇంగ్లీషువారివద్ద తగినంత సైన్యము లేకుండుటచే వారిందుల కంగీకరింపలేదు ఈ లోపున బసాలతుజంగు ఆదోనినుండి సైన్యముతో వచ్చి గుంటూరు సర్కారును స్వాధీనము చేసుకొనెను నిజామలీఖాను ప్రతినిధియైన హసనలీఖాను అనువాడు నిజాము అనుమతి లేకయే బ్రిటిషువారితో ఒడంబడిక చేసికొని ఉత్తరసర్కారులైదిటిని ఆంగ్లవర్తక కంపెనీకి ఇచ్చుటకును కంపెనీవారు ఆ జిల్లాల ఆదాయములో ఖర్చులుపోగా సగభాగమును నిజాముకు చెల్లించుటకును ఒప్పుకొనెను దీనిని విని నిజామలీఖాను కుపితుడయ్యెను ఆతడు బ్రిటిషువారిపై యుద్ధమునకు తయారీలు చేయనారంభించెను బ్రిటిషువారు దీనిపైయెత్తుగా ఉత్తర సర్కారుల కొరకు ఢిల్లీ పాదుషానుండి 1765 లో సన్నదును సంపాదించి వాటిని ఆక్రమించుకొనుటకు తమకు హక్కుకలదని ప్రకటించిరి 1766 వ సంవత్సరమున ఆంగ్లేయులు బలిష్ఠమగు కొండపల్లి దుర్గమును పట్టుకొని అచ్చటి ఖిల్లేదారును వెడలగొట్టిరి నిజాము - బ్రిటిషు సంబంధములు కొత్తగా చెడినట్లే కనిపించెను నిజాము మంత్రియగు రుకునుద్దౌలా చాకచక్యము చేత ప్రమాదము తప్పెను కైలాడ్ అను ఆంగ్లసేనాని కంపెనీపక్షమున హైదరాబాదు వచ్చి నిజాము దర్బారుతో (క్రీ శ 1766) ఒక ఏర్పాటునకు రాగలిగెను దీని ప్రకారము ఉత్తరసర్కారులను నిజాము బ్రిటిషువారికి కప్పము కట్టు పద్ధతిపై ఇచ్చుటకును బ్రిటిషువారు సాలుకు 8 లక్షల కప్పము చెల్లించుటకును కొంత సైన్యమును నిజాము అధీనములో పెట్టుటకును అంగీకారము కుదిరెను గుంటూరు సర్కారు మాత్రము బసాలతుజంగు జీవితకాలమున అతని వశమునందుండుటకు ఏర్పాటయ్యెను ఈ విధముగా విజయవాడ నగరముతోపాటు కృష్ణా జిల్లాయు బ్రిటిషువారికి దక్కెను

కం. ఖు.

## విజ్ఞానేశ్వరుడు -

విజ్ఞానేశ్వర యోగి యాజ్ఞవల్క్యస్మృతికి మితాక్షర అను వ్యాఖ్యానమును రచించిన మహాపండితుడు హైదరాబాదుపట్టణమునకు దాదాపు 40 క్రోసుల దూరములో ప్రస్తుతపు మైసూరురాష్ట్రమునందలి కల్యాణ యను గ్రామము ఈతని నివాసస్థానము క్రీ శ 10-13 శతాబ్దముల మధ్య ఇదొక నగరముగనుండి ఆరవ విక్రమార్కుని రాజ్యమునకు రాజధానిగ నుండెడిది మితాక్షర' లో విజ్ఞానేశ్వరుడు తాను భారద్వాజ గోత్రికుడననియు పద్మనాభభట్టోపాధ్యాయుని ఆత్మజుడననియు పరమహంస పరివ్రాజకుడననియు వర్ణించుకొనియున్నాడు తద్గ్రంథోపసంహారమునందు కల్యాణ నగరము వంటిది నాసీదస్తి భవిష్యతి (ఇదివరకు లేకుండెను ఇప్పుడు లేదు ముందు ఉండబోదు) అనియు విక్రమార్క మహారాజువంటివాడు నోదృష్టశ్రుత ఏవవా" (చూడబడలేదు వినబడలేదు) అనియు కీర్తించి కల్యాణనగరమును విక్రమార్కుని తానును (విజ్ఞానేశ్వరుడు)' ఏతత్త్రయం స్థిరమస్తు అని ఆశించి జన్మభూమియందు తన ప్రేమను విజ్ఞుడును పోషకుడునునైన మహారాజుపట్ల తన భక్తికృతజ్ఞతలను విజ్ఞానేశ్వరుడు చాటియున్నాడు

ఆ కల్యాణనగరము అనంతరము కుగ్రామమైపోయినది విక్రమార్కమహారాజును విజ్ఞానేశ్వరయోగియు బ్రహ్మాండములో లీనమైపోయినారు కాని ఏతత్త్రయమును మన స్మృతిపథములోనికి తెచ్చు మితాక్షర గ్రంథము ఆసేతు హిమాచల పర్యంతము ప్రతి హిందువుమీద తన వెలుగును వెదజల్లుచు శాశ్వతముగా విరాజిల్లుచున్నది

విజ్ఞానేశ్వరుడు విక్రమార్కమహారాజుయొద్ద మంత్రిగా నుండెనని ప్రతీతి కలదు ఆయన భారతదేశమునకు ప్రధాన ధర్మశాస్త్రోపాధ్యాయుడనుటలో అతిశయోక్తి లేదు ఆయన తరువాత ధర్మశాస్త్రగ్రంథములను రచించినవారిలో జీమూతవాహనుడు తప్ప శేషించినవారు మిత్రమిశ్ర మాధవాచార్య నీలకణ్ఠభట్ట దేవన్నభట్టాది ధర్మశాస్త్రకోవిదులు విజ్ఞానేశ్వరుని గురువుగా భావించి ఆయన అనుయాయులుగనే తమతమ గ్రంథములను రచించినారు ప్రముఖ భారతన్యాయవాదులు న్యాయమూర్తులు ప్రివీకౌన్సిలు సభ్యులు విజ్ఞానేశ్వరుని ఘనతను ఎంతగనో కొనియాడి యున్నారు విజ్ఞానేశ్వరుడు తీర్చిదిద్దిన హిందూకుటుంబ ధర్మము, కాలానుగుణమైన కొలది మార్పులకు లోనైనను నేటివరకు ధర్మముగనే పరిగణింపబడుచున్నది ఇది చిన్నపట్టణమైన కల్యాణలో రూపొందించబడి ప్రాయశః అక్కడే ప్రమాణగ్రంథముగా స్వీకరింపబడుటయేగాక భారతదేశము మొత్తముమీద ప్రధానమైన ప్రమాణగ్రంథముగా సర్వులచేత స్వీకరింపబడుట విజ్ఞానేశ్వరుని భావౌన్నత్యమును మితాక్షర యొక్క పటుత్వమును చాటుచున్నది

ఈ మహనీయుడు వ్యాఖ్యానించిన యాజ్ఞవల్క్యస్మృతి -ఆచార వ్యవహార ప్రాయశ్చిత్తములు అను మూడు భాగములుగా నున్నది వ్యాఖ్యానము సర్వత్ర సమంజసముగ నున్నది అందులో వ్యవహారాధ్యాయ మొక విశిష్టతను కలిగియున్నది న్యాయనిర్వహణములోని విధానములు అందున కుపకరించు ధర్మసూత్రములు సృష్టీకరింపబడియున్నవి ఈ వ్యవహారాధ్యాయములో దాయవిభాగ మనునది యొక ప్రకరణము ఇది ఈనాటి హిందూధర్మశాస్త్రములో (Hindu Law) ప్రధానపాత్ర వహించుచున్నది దాయమనగా ఒకని ఆస్తి, అతనికి మరొకనితో యున్న సంబంధముచేత అట్టి మరొకనికి చెందునది "దాయశబ్దేన యద్ధనం స్వామి సంబంధాదేవ నిమిత్తాత్ అన్యస్యస్వం భవతి అని నిర్వచించి అట్టి దాయమును అప్రతిబంధదాయమనియు సప్రతిబంధదాయమనియు రెండుతరగతులుగా విభజించినారు ఈ విభజనము విజ్ఞానేశ్వరయోగికి పూర్వము ధర్మశాస్త్రములలో ఎచ్చటను కానరాదు అట్లే దాయవిభాగమను సమాసములో, విభాగమను దానికి ఒకరికంటె ఎక్కువ స్వామ్యములకు చెందిన ద్రవ్యసముదాయమును ఒక్కొక్కరికి ప్రత్యేకించుకొనుట "విభాగో నామ ద్రవ్య సముదాయ విషయాణామ్ అనేక స్వామ్యానామ్ తదేక దేశేషు వ్యవస్థాపనమ్" ఈ రెండు నిర్వచనములను సమర్థించుటకు స్వత్వమనగా ఏమి ? అను ప్రశ్న ఉదయించును విభజనముచేత స్వత్వముదయించునా ? లేక స్వత్వముచేత విభజనము జరుగునా ? అను రెండు ప్రశ్నలుత్పన్నము కాగలవు ఒక వస్తువుపై సర్వాధికారములు అనగా భోగ దానాదమన వినిమయ విక్రయాది సమస్తాధికారములు ఎవరికుండునో అతడు ఆ వస్తువునకు స్వామియగును ఆ వస్తువు అతని స్వత్వము ఇది ధర్మశాస్త్ర పరిభాష ఈ ప్రశ్నలకు సమాధానము చెప్పుటకుముందు స్వత్వమనునది శాస్త్రమును బట్టియే నిర్ణయింపదగునా ? లేక ప్రజా

భిప్రాయమును బట్టి-అనగా వారి ఆచారమును బట్టి - నిర్ణయించవచ్చునా? "స్వత్వం శాస్త్రైక సమధిగమ్యం వా లౌకికం వా ?" అను మౌలిక ప్రశ్నను వేసి స్వత్వం లౌకికమేవ" అని సిద్ధాంతీకరించినాడాయన స్వత్వము లౌకికమను భావము విజ్ఞానేశ్వరుని సిద్ధాంతములకు మూల సూత్రము ఒకని ఆస్తిలో వాని కుమారునకును మనుమనికిని మునిమనుమనికిని పుట్టుకతోడనే స్వత్వము కలుగుననియు తండ్రి జీవించియుండగనే ఆస్తిని విభజించమని కోరుటకు కుమారుడు మొదలగు వారికి అధికారము కలదనియు కర్రగా తండ్రి అవ్యవహారికమైన పనులచే కుటుంబ ఆస్తిని అన్యాక్రాంతము చేయుచో కుమారుడు మున్నగు వారు అట్టి ఆస్తిని రాబట్టుకొను అధికారము కలిగియుందురనియు మొదలైన సిద్ధాంతములన్నియు స్వత్వము యొక్క లౌకికత్వము మీదనే ఆధారపడియున్నవి అనగా శాస్త్రములను గాలించినను అట్టి భావములు కానరావు ప్రజల ఆచరణముమీద అభిప్రాయములమీద స్వత్వము ఆధారపడి యున్నదను భావము ప్రగతిశీలమైన దనుట స్పష్టము ఈ సిద్ధాంతము వలన వచ్చిన మార్పులు ముందు వివరింపబడినవి

సప్రతిబంధదాయమనగా ఒక స్వామి ఆస్తి అతడు చనిపోయిన తరువాత మరొకనికి చెందుట అప్రతిబంధదాయమనగా ఒక స్వామి ఆస్తిలో అతడు జీవించియుండగనే వాని కొడుకునకును మనుమనికిని మునిమనుమనికిని గూడ స్వత్వము కలుగుట భార్య కూతురు తల్లి తండ్రి ఇతర జ్ఞాతులు స్వామిచనిపోయిన తరువాత మాత్రమే ధన భాక్కులు-అనగా హక్కుదారులు కాగలరు స్వామి బ్రతికి యున్నంత కాలము భార్యాదులకు వాని ఆస్తిలో స్వత్వమేర్పడదు స్వామి బ్రతుకు వారి స్వత్వమునకు ప్రతిబంధక మగుట చేత వారి స్వత్వము సప్రతిబంధకమైనది కుమారుడు మనుమడు మునిమనుమడు మాత్రము స్వామి జీవించియుండగనే స్వామి ఆస్తిలో స్వామితోపాటు సమాన హక్కుదారులై యుండగలరు - అనగా వీరు పుట్టుకతోడనే హక్కుదారులయ్యెదరు స్వామిబ్రతుకు వారికెట్టి ప్రతిబంధకమును కాజాలదు స్వామి ఆస్తిలో వానికొడుకులు మనుమలు మునిమనుమలు వారి వారి పుట్టుకతోడనే అప్రతిబంధకముగా హక్కుదారులు కాగలరు పుత్ర పౌత్ర ప్రపౌత్రులు తప్ప ఇతరులందరును సప్రతిబంధకముగనే స్వామి ఆస్తికి హక్కుదారులు కాగలరు ఈ భావములు ఈ విధముగా అపూర్వములైనను శాస్త్రైక సమధిగమ్యములు కాకున్నను లౌకికాది ప్రమాణాంతరముల చే విజ్ఞానేశ్వరుడు వీటిని సాధించి సిద్ధాంతీకరించినాడు పెక్కు వాద ప్రతివాదములను ఆయన విమర్శించినాడు ఆయన తన సిద్ధాంతమును ప్రజాభిప్రాయమును చేతను ఇతర ప్రమాణములచేతను చక్కగా సమర్థించియున్నాడు వీటన్నిటిలో ముఖ్యమైనది శ్రుతి వాక్య. "ఆత్మావై పుత్ర నామాసి అనునది నీవే నీపుత్రుడనబడువాడవు అగుచున్నావు" ఇచ్చట "ఆత్మా" యను శబ్దమునకు నీవు అనియర్థము అంతేకాని జీవాత్మ పరమాత్మ అను పదములలో ఇమిడియున్న ఆత్మ అనునర్థముకాదు పుత్ర యమనది పుత్ర పౌత్ర ప్రపౌత్రులనుసూచించును ఇంతవరకు అందరకును ఆమోదయోగ్యమే ఈ శ్రుతిచేత మితాక్షర లో పుత్ర పౌత్ర ప్రపౌత్రులకు జన్మచేతనే స్వత్వం అనుసూత్ర మెట్లు సాధించబడినదో గమనింపదగిన విషయము

ఉదాహరణము

వెంకయ్య (1)

(వెంకయ్య 2) సుబ్బయ్య — మారయ్య (వెంకయ్య 3)

(వెంకయ్య 4) కోటయ్య — రామయ్య (వెంకయ్య 5) — రంగయ్య (వెంకయ్య 6)

(వెంకయ్య 7) శివయ్య — శంకరయ్య (వెంకయ్య 8)

సాంబయ్య — బసవయ్య

పైన చూపబడిన ఉదాహరణములో అందరును జీవించియున్నట్లు భావించవలెను వెంకయ్య (1) అను మూల పురుషునకు ఇద్దరుకుమారులు సుబ్బయ్య, మారయ్య అనువ్యక్తులనోర

నామములు గలిగిన వారున్నారు కాని ఆత్మావై పుత్త్రనామాసి అను శ్రుతిచేత వెంకయ్య ముందు సుబ్బయ్యగాను తరువాత సూరయ్యగాను రూపము పొందినాడు అందుచేత ఇప్పుడు శ్రుతిననుసరించి ముగ్గురు వెంకయ్యలున్నారు అట్లే కోటయ్య రామయ్య రంగయ్య శివయ్య శంకరయ్యలు కూడ వెంకయ్య అవతారములే "ఆత్మావై పుత్రనామాసి అను వాక్యములో పుత్ర శబ్దము పుత్ర పౌత్ర ప్రపౌత్రులను సూచించుటచే వెంకయ్యలు మొత్తము ఎనిమిది మంది యున్నారు వెంకయ్య (1) కు యున్న ఆస్తి వెంకయ్య ఆస్తి కనుకను మరియు ఎనిమిది మంది వెంకయ్యలున్నారు కనుకను ఆయాస్తి ప్రతి వెంకయ్య ఆస్తియునై యున్నది సుబ్బయ్య మొదలగు వారు పుట్టుట తోడనే-అనగా తల్లి గర్భములో ప్రవేశించినప్పుడే-వారందరు వెంకయ్య ప్రతులే కాబట్టి ఒక్కొక్కరి పుట్టుక తోనే వెంకయ్య ఆస్తి వారందరి ఆస్తియైనది ఈ విధముగా 'ఆత్మావై పుత్త్రనామాసి అను శ్రుతి వాక్య- పుత్ర పౌత్త్ర ప్రపౌత్త్రాణాంజన్మనైవ స్వత్వం స్యాత్" అనియు తద ప్రతిబంధ దాయమనియు నిరూపించుచున్నది పై ఉదాహరణములో పుత్త్ర పౌత్త్ర ప్రపౌత్త్రులలో వారు కాదు కనుక పాంబయ్య బసవయ్యలకు జన్మచేత ఎట్టిహక్కును కలుగదు కాని మూలపురుషుడు వెంకయ్య (1) చనిపోయిన తరువాత వీరు సుబ్బయ్య ప్రపౌత్త్రులు కాబట్టి అతని ఆస్తిలో హక్కుదారులు కాగలరు

ఈ విధముగా విజ్ఞానేశ్వరయోగి కుటుంబ జీవిత విధాన నిర్మాణముచేసి వ్యక్తి ధనమును కుటుంబధనముగా మార్చినాడు (ధనమనగా స్థిరచరాత్మకమైన మొత్తము ఆస్తి యని అర్థమేగాని కేవలము రూప్యములు మాత్రమే కాదు) పైన చెప్పబడిన ఉదాహరణములో సుబ్బయ్య పుట్టక పూర్వము వెంకయ్య (1) ధనము అతని స్వంతధనము- అనగా వైయక్తిక ధనము సుబ్బయ్య పుట్టగనే, అది వెంకయ్య (1) సుబ్బయ్య (వెంకయ్య 2) ల కుటుంబ ఆస్తిగా మారినది అప్పటినుండి కుటుంబ సభ్యుల సంఖ్య వృద్ధియై, శంకరయ్యతో ఎనిమిది మంది స్వాములు కల్గిన కుటుంబముగా మారినది ఆస్తియంతయు కుటుంబపు ఆస్తియైనది వెంకయ్య (1) మొదలుకొని శంకరయ్య (వెంకయ్య8) వరకు అందరును కుటుంబస్వాములే (ఒక ఆస్తి ఎవరిదై యుండునో, అట్టి ఆస్తికి అతడు స్వామి; ఆ యాస్తి వాని స్వత్వము; ఇది ధర్మ శాస్త్ర పరిభాష )

వీరుగాక వీరిభార్యలు అవివాహితలైన కుమార్తెలు స్వాములు కాని పాంబయ్య బసవయ్యలతో సహా అందరు కుటుంబ సభ్యులు వీరికి కుటుంబపు ఆస్తిలో స్వామ్యమేమియు లేకున్నను వీరి పోషణకు విద్యాభ్యాసమునకు వివాహాది కర్మలకు కుటుంబయజమాని (కర్త) బాధ్యత వహించియున్నాడు కుటుంబస్వాములలో పెద్దయైనవాడు కుటుంబకర్త కుటుంబపు అత్యవసరములకు ఒకడు కుటుంబ ధనమును వెచ్చించ వచ్చును అత్యవసరము లేకుండ కుటుంబ ఆస్తిని దాన అదమన వినిమయ విక్రయాదులను చేయుటకు కర్తసమర్థుడు కాజాలడు పై ఉదాహరణములో వెంకయ్య (1) కు కుమారులు పుట్టకపూర్వమున్న స్వతంత్రము - అనగా తన ఆస్తిని తన ఇష్టము వచ్చినట్లు అన్యాక్రాంతము చేయుశక్తి సుబ్బయ్య పుట్టినప్పటినుండి పరిమితమై కుటుంబ అత్యవసరములకు మాత్రమే ఉపయోగమునకు వచ్చును స్థూలముగా ఈ విషయము సరియైనదే యైనను వెంకయ్య (1) తనపూర్వార్జితమైన ఆస్తితో సంబంధము లేకుండ (అవిరోధేన) స్వంతముగా ఏదైన ఆస్తిని ఆర్జించినచో అట్టి స్వార్జితమును అన్యాక్రాంతము చేయుటకు ఎక్కువ స్వాతంత్ర్యము కలిగియుండును 'యాజ్ఞవల్క్యస్మృతి లో

'భూర్యాపితా మహోపాత్తా నిబంధోద్రవ్యమేవవా
తత్రస్యాత్ సదృశం స్వామ్యం పితుః
పుత్రస్యచోభయో:॥"

అని చెప్పబడియున్నది అనగా తాత సంపాదించిన భూమి వర్షాశనము ఇతర చరాస్తులలో తండ్రికిని కొడుకునకును సమానమైన స్వామ్యముండును ఇది కాక ఇతరుల వాక్యములు కొన్నిటిని విజ్ఞానేశ్వరుడు ఉపయోగించి యున్నాడు

మణిముక్తా ప్రవాలానాం సర్వస్యైవ పితాప్రభుః
స్థావరస్యతు సర్వస్య న పితానపితామహః॥"

మణి మొదలగు సమస్త చరమునకు తండ్రి ప్రభువు కాని సమస్త స్థావరమునకు తండ్రిగాని తాతగాని ప్రభువుకాడు ప్రభువనగా అన్యాక్రాంతము చేయుటకు ఎక్కువ అధికారము కలిగిన వాడనియేగాని సంపూర్ణస్వామ్యము తండ్రికుండు నను భావము కాదని విజ్ఞానేశ్వరుని నమున్వయము అట్లే,

స్థావరం ద్విపదం చైవ యద్యపి స్వయమార్జితం
అసంభూయసుతాన్ సర్వాన్ న దానం నచవిక్రయః

అనగా స్థావరమును జనకుడు (తండ్రి) స్వయముగా ఆర్జించినను కొడుకుల నందరిని సమావేశపరచకుండ వారి సమ్మతి లేకుండ దానముగాని విక్రయముగాని చేయగూడదని తాత్పర్యము. ఈ వాక్యమునుబట్టి తండ్రికి దాన విక్రయాధికారము లేదని విజ్ఞానేశ్వరుని సమన్వయము. పై శ్లోకమును జీమూతవాహనుడు వ్యాఖ్యానించుచు తండ్రికి తన ఆస్తిలోనున్న అధికారము పోదనియు దాన విక్రయములు నిషేధింపబడలేదనియు 'వచన శతేనాపవస్తునః అన్యథా కరణాశక్తేః' అనునట్లు ఉన్నవస్తువును నూరువచనములైనను తీసివేయజాలవనియు జీమూతవాహనుడు సిద్ధాంతీకరించి యున్నాడు.

పరస్పర విరుద్ధములుగా కనపడు పై వాక్యమును సమన్వయించి విజ్ఞానేశ్వరుడు కుటుంబధర్మమును ధృవీకరించినాడు. అతని కాలము నుండి ఈ నాటివరకు అందు కొన్ని కొన్ని మార్పులు జరిగినను అదియే ఆచరణములో నుండుట దాని పటిమను చాటుచున్నది. విజ్ఞానేశ్వరుని సిద్ధాంతములను బట్టిగాని జీమూతవాహనుని సిద్ధాంతమును బట్టిగాని ఒక పురుషుడు మరణించిన తరువాత అతని భార్య కుమార్తె మొదలగు సన్నిహితులు జీవించి యున్నను పుత్రులున్నచో వారే ధనభాక్కులు కాగలరు. తండ్రి మరణానంతరము ఎట్లయినను కుమారులే గదా ధనభాక్కులగునది! అట్టిచో కుమారుడు పుట్టిన వెంటనే తండ్రి తాతల ఆస్తిలో హక్కుకలిగిన మాత్ర మేమిలాభము? అను ప్రశ్నకు మితాక్షర యీసమాధాన మిచ్చుచున్నది. తండ్రిగాని తాతగాని అవ్యవహారికముగా ఆస్తిని అన్యాక్రాంత మొనర్చిగాని ఋణములు చేసిగాని కుటుంబమునకు దారిద్ర్యము తెచ్చిపెట్టకుండ 'జన్మనైవస్వత్వం' అనుసూత్రము నివారించుచున్నది. వైయక్తికాధికారము కంటె, కుటుంబబాధ్యత ఎక్కువగ నుండుటకు ఇతరు లెవ్వరు అక్రమముగా దాన విక్రయాది అన్యాక్రాంతముల ద్వారా కుటుంబధనమును హరించుటకు వీలులేకుండ జన్మస్వత్వము అడ్డగించగలదు. ఆస్తి కుటుంబమునకు చెందిన దగుటచే ఏ ఒకస్వామి మరణించినను ఇతరుల కెవ్వరికిని హక్కు కలుగదు - మరణించిన వానితోనే దాని హక్కుకూడ అంతరించగలదు. కుటుంబధనమట్లే యుండగలదు. కుటుంబము అట్లున్నంతకాలము ఏ ఒక్కరు కూడ తనకు ఇంతభాగగునిగాని అంతభాగమనిగాని అనుటకు వీలుండదు. కుటుంబ విచ్ఛిత్తి జరుగువరకు భాగనిర్ణయమను నది సంభవించదు. కుటుంబము యథాతథముగ యున్నంతకాలము కుటుంబ సభ్యులందరు సమాన సుఖమనుభవింపగలరు. కుటుంబస్వాములలో ఎవరైనను విడిపోదలచినచో అట్టి అధికారము వారికి కలదు. ఇటీవలి వరకు ఒక్కొక్క కుటుంబము దీర్ఘకాలము విభజన మనునది లేక మహావృక్షముగా పెరుగుట మన మెరిగియున్న విషయమే. స్త్రీలు వివాహితలై కుటుంబసభ్యులుగా జీవయాత్ర సాగింతురు. అట్టి కుటుంబములో జన్మించిన ఆడపిల్లలుకూడ వివాహితలై ఇతర కుటుంబములలో సభ్యలగుచున్నారు. కుటుంబస్వాములు కుటుంబకర్తయొక్క ఆదేశములను పాటించుచు కుటుంబ భారమును మోయుచుందురు.

కుటుంబ గర్భములోనేగాక పెక్కు ఇతర విషయములలో గూడ మితాక్షర సర్వులచేత అంగీకరింపబడిన ప్రధాన ప్రమాణము. పురుషుడు అపుత్రుడుగా మరణించినపుడు యాజ్ఞవల్క్య స్మృతి యందు

పత్నీదుహితరశ్చైవ పితరౌ భ్రాతరస్తథా
తత్సుతాగోత్రజా బంధుశ్శిష్యసబ్రహ్మచారిణః
ఏషామభావేపూర్వస్య ధనభాగుత్తరోత్తరః
స్వర్యాతస్యహ్య పుత్రస్య సర్వవర్ణేష్వయంవిధిః

అని చెప్పబడియున్నది. అనగా మృతుని ఆస్తి వరుసగా పత్నీ దుహితలును తల్లి తండ్రి భ్రాతలు వారిసుతులు గోత్రజులు బంధువులు శిష్యులు సహాధ్యాయులు-వీరిలో పూర్వుడులేని పక్షమున ఉత్తరోత్తరుడు ధనభాక్కు కాగలడు. అన్ని వర్ణములలో గూడ అపుత్రుడు పరలోక గతుడైనచో, ఇదియే విధియని ఈ శ్లోకార్థము. మితాక్షర" వివరించిన విధము ప్రమాణమై కాలానుగుణముగా అందు కొలది మార్పులు చేయబడి 1956 వరకు భారతదేశమునందు చాల భాగములో ధర్మశాస్త్రముగా (Law) పరిగణింప బడియుండెను. స్త్రీలకు ఆస్తి సంక్రమించు అవకాశమును 'మితాక్షర' ఎక్కువచేసినది. సంఘ ప్రగతిదాయకమైన ఈ మార్గమును వ్యతిరేకించువారికి 'మనుస్మృతి' మొదలగు ధర్మశాస్త్రములలో కొన్ని వాక్యములు ఆధారములుగ నున్నవి. ఉదాహరణమునకు మనుస్మృతిలో పకారమట్టి కొన్నిశ

భర్తారక్షతి యౌవనే పుత్రో రక్షతి వార్ధక్యే నస్త్రీ స్వాతంత్ర్య మర్హతి (బాల్యములో తండ్రి యౌవనములో భర్త వృద్ధాప్యములో పుత్రులు స్త్రీని రక్షించెదరు) అందుచేత స్త్రీ స్వాతంత్ర్యమునకు అర్హురాలు కాదు") అని చెప్పబడియున్నది ఈ యాక్షేపణమును ఎదుర్కొనుచు విజ్ఞానేశ్వరుడు స్త్రీ సాధారణముగా ఇల్లు దాటి బయటికి వెళ్ళక తన పనులను ఇతరుల ద్వారా చేయించుకొనుననియే నస్త్రీ స్వాతంత్ర్య మర్హతి అను వాక్యముందలి భావము గాని ఆస్తిని అనుభవించు సామర్థ్యముగాని అవసరముగాని లేదని అర్థముకాదు బాలుడు కూడ తన పనులను ఇతరుల ద్వారా చేయించుకొనును కాని ఆస్తిని పొందడా ? పెద్ద దేశమునకు సహితము అతడు రాజు కాగలడే ! అందుచేత స్త్రీ ఆస్తిని పొంద కూడదను వాదము సమంజసము కాజాలదు అని వాదించి పురుషుడెట్లు ఆస్తినిపొంది అనుభవించునో స్త్రీ గూడ అట్లేయని స్త్రీ పురుష సమానత్వమును అతడు సాధించి సిద్ధాంతీకరించి యున్నాడు ఈ విషయమునే మరొక సందర్భములో గూడ అతడు గట్టిపరచియున్నాడు

ఆస్తిని సంపాదించు పద్ధతులు అనగా ధనాగమనోపాయములు రిక్థ క్రయ సంవిభాగ పరిగ్రహాధిగమములు పురుషునకే వర్తించునా లేక స్త్రీలకు గూడ వర్తించునా ? అను ప్రశ్నకు పూర్వులు ఈ ఉపాయములు పురుషులకు మాత్రమే వర్తించునని నుడివియుండగా ఈ సామాన్య విధములు అందరికిని వర్తించునని విజ్ఞానేశ్వరుడు విశదీకరించెను స్త్రీలకు ధనాగమనోపాయములు కేవలము పారిభాషిక పదములచే సూచింపబడినవేగాని ఇతరములు కావని పూర్వపక్ష మొనర్చువారి యభిప్రాయము (పురుషులకు రిక్థ = ఒకడు చనిపోయిన తరువాత అతని ఆస్తి మరొకనికి సంక్రమించుట—క్రయములో సాధారణోపాయము లన్నియు యిమిడియున్నవి సంవిభాగ - ఇద్దరుగాని అంతకంటెఎక్కువమందికిగాని చెందిన ఆస్తిని అధిగమమనగా స్వామిరహిత ధనమును తీసికొనుట — భూమిలోగాని మరెచ్చటనైనగాని దొరకిన ఆస్తి—ఈ విధముల ననుసరించి పురుషుడు ఆస్తిని సంపాదించవచ్చును కాని స్త్రీ ఏ విధముగా ధనమును లేక ఆస్తిని సంపాదింపగలదు ? ఈ ప్రశ్నకు సమాధానముగా, ధర్మశాస్త్రములలో పెక్కు పారిభాషిక ధనములు స్త్రీ ధనముగా చెప్పబడియున్నవి అధ్యగ్ని = వివాహ సమయమున అగ్నిహోత్రముముందు పీటలమీద కూర్చున్నప్పుడు బంధువులు చదివించు వస్త్రములు ఆభరణములు రూప్యములు మొదలగునవి అధ్యావాహనిక = పల్లకీలో ఊరేగుచున్నప్పుడు ఇయ్యబడు బహుమతులు పాద వందనిక = పెద్దల పాదములకు నమస్కరించుచున్నప్పుడు వారిచ్చునవి అన్వాధేయక = వివాహానంతరము యిచ్చునవి శుల్కం = ఆడ పిల్లను క్రయమొనర్చుకొని యిచ్చు రూప్యములు ప్రీతిదత్తం భర్తృదత్తం అధివేదనిక = ప్రథమ భార్యయుండగా ద్వితీయ స్త్రీని వివాహము చేసికొని పోవుచు ప్రథమ భార్యను ఓదార్చుటకిచ్చు ధనము ఈ పేర్లు గలవి మాత్రమే స్త్రీధనముగా పరిగణింపబడినది అందుచేత స్త్రీధన మనునది పారిభాషిక పదముల చేత పరిమితమైనదిగా ధర్మశాస్త్రములలో చెప్పబడియున్నది యాజ్ఞవల్క్యస్మృతిలో స్త్రీధనము క్రింది విధముగా చెప్పబడినది

> పితృమాతృ పతిభ్రాతృదత్తమధ్యగ్న్యుపాగతం
> ఆధివేదనికాద్యంచ స్త్రీధనం పరికీర్తితమ్ ॥

ఆద్యంచ (మొదలగునవి) అను శబ్దమును అవకాశముగా తీసకొని విజ్ఞానేశ్వరుడు రిక్థక్రయసంవిభాగ పరిగ్రహాధిగమములు అని దానికర్థముచెప్పి స్త్రీకి పురుషునితో పాటు సమానమైన ధనార్జనాధికారమిచ్చియున్నారు పత్నీ దుహితరశ్చైవ" అను శ్లోకార్థమును వివరించునప్పుడు ప్రతిపక్షులు లేవదీసిన ప్రశ్నలన్నిటికిని తగురీతిగా ఆయన సమాధానమిచ్చినాడు పితారక్షతి కౌమారే భర్తారక్షతియౌవనే పుత్రోరక్షతి వార్ధక్యే నస్త్రీస్వాతంత్ర్యమర్హతి ' అని చెప్పబడిన మనుస్మృతివాక్యమును సమన్వయించుచు తదస్తు పారతంత్ర్యం-ధన స్వీకారేతుకోవిరోధః - అనగా పారతంత్ర్యమున్నచో ఉండుగాక ధనస్వీకారమునకు విరోధమేమున్నది?" అని విజ్ఞానేశ్వరుడు సమాధానమిచ్చినాడు అనగా చిన్నపిల్లవాడు తన పనులను తాను చేసికొనలేకపోవుటచే వానిపక్షమున పెద్దవాడు ఆ పనులను చేయగలడు చిన్నపిల్లవానికి స్వతంత్రములేదు, కాని ఆస్తికి స్వామికాగలడు అట్లే స్త్రీ గృహాబాధ్యతలవలన తనే స్వయముగా వెలుపలి పనులను చేసుకొనజాలదు ఆ విధమైన స్వాతంత్ర్యము ఆమెకులేదు కాని, ఆస్తిని ఎందుకు ఆర్జనచేయకూడదు? ఈ విధమైన విప్లవాత్మకదృష్టితో మితాక్షర ధనస్వీకార విషయమున స్త్రీ పురుష సమానత్వము సిద్ధాంతీకరింపబడినది స్త్రీ ధనమనగా

స్త్రీ యొక్క ధనమని యర్థమేగాని అందులో పరిభాష ఏమియు లేదు "స్త్రీధనశబ్దో యౌగికః నపారిభాషికః" అని విజ్ఞానేశ్వరుడు స్పష్టీకరించియున్నాడు

పత్నీదుహితరశ్చైవ అను రిక్థక్రమశ్లోకార్థమును స్త్రీధనమును వివరించునప్పుడు విజ్ఞానేశ్వరుడు ఆస్తివిషయములో పురుషుడెంతో స్త్రీగూడ అంతేనని నిర్ణయించియుండగా ప్రివీకౌన్సిలు వారు రిక్థములో పురుషునకెల్లప్పుడు సంపూర్ణాధికారముండుననియు స్త్రీకి జీవితకాలమువరకు ఆస్తిని అనుభవించు అధికారముమాత్రమే కలదనియు దానాదమనవినిమయ విక్రయాది అధికారములు లేవనియు ఆమె చనిపోయినతరువాత ఆస్తి ఎవనినుండి ఆమెకు సంక్రమించినదో వాని ఇతర బాంధవులకు పోవుననియు తీర్పులు చెప్పియున్నారు (ప్రమాదో ధీమతామపి)—కాని హిందూధర్మశాస్త్రము స్త్రీలకు తక్కువ అధికారమిచ్చి అన్యాయము చేసినదనియు బ్రిటిషు పరిపాలనము వచ్చిన తరువాతనే స్త్రీలకెక్కువ అధికారములు వచ్చినవని చెప్పువారు అజ్ఞులని చెప్పకతప్పదు స్త్రీలకు-ముఖ్యముగా వితంతువులకు ప్రివీకౌన్సిలు తీర్పులతో అధికారము నశించి ఆస్తిని అనుభవించుటలోగాని దత్తతచేసికొనుటలోగాని పెక్కుకడగండ్లకులోనైనారు 1956వ సం॥లో నూతన హిందూచట్టములు అమలులోనికివచ్చినతరువాత స్త్రీలకు మరల పురుషులతోపాటు సమానమైన అధికారము ఏర్పడినది ఎన్నివిషయములలోనో 'మితాక్షర' సమాజమును ముందుకు తీసికొనిపోగల శక్తికలిగియున్నది

చాలకాలముక్రిందట వ్యక్తిపానిసత్వము ఆచారముగానున్నపుడు పితృనియంతృత్వ సమాజములో (patriarchal Society) 'భార్యా పుత్రశ్చ దాసశ్చ త్రయ ఏవ అధనా స్మృతాః। యత్తే సమధిగచ్ఛంతి యస్యైతే తస్య తద్ధనం' అను వాక్యము ధర్మముగా నుండెను! అనగా భార్య పుత్రుడు దాసి-వీరు అధనులు వీరు సంపాదించుధనము వారి యజమానులది అని భావము సాజాద్వ్యాధిసత్వ సమాజము (అనగా హరిశ్చంద్రుని కాలమునాటిది) క్రమముగా దాదాపు అన్ని ప్రాచీనదేశములలోను అంతరించినది భార్యా పుత్రుల విషయములో పుత్రుని తండ్రితో సమానముగను భార్యను భర్తతో సమానముగను ధర్మశాస్త్రమును ప్రజాభిప్రాయమునకు సరిపోవునట్లు సంస్కరించి తీర్చిదిద్దినకీర్తి విజ్ఞానేశ్వర యోగిది

నాస్తి తేషాం యశః కాయే జరామరణజం భయం

వ. గో.

## విటమినులు

మానవుని మనుగడకు అత్యావశ్యకమగు పిండిపదార్థములు మాంసకృత్తులు క్రొవ్వుపదార్థములు మున్నగు ఆహార వస్తువులు తగుపాళ్లలో శరీరమునకు అందచేసినను శరీరముయొక్క పెరుగుదల క్రమరీతిని సాగదనియు స్వల్ప పరిమాణములో అనేక యితర పదార్థములు కూడ శరీరమునకు పుష్టినిచ్చుటకు అవశ్యకములనియు శాస్త్రజ్ఞులు చాలకాలము క్రితమే ప్రయోగములద్వారా నిరూపింపగలిగిరి అట్టివాటిలో విటమినులనబడు పోషకపదార్థములు ప్రముఖస్థానము నాక్రమించుచున్నవి

విటమినులన్నియు కర్బన రసాయన (organic) పదార్థములు ఇంచుమించుగా 16 విటమినులు ఈనాడు స్పష్టముగా గుర్తింపబడినవి ఆధునిక విజ్ఞానశాస్త్రపరిశోధనల వలన ఈ విటమినుల ఉనికి అణునిర్మాణము శరీరమునకు ఇవి ఉపయోగపడు రీతి స్పష్టముగా తెలిసినది రాసాయనిక నిర్మాణము ననుసరించి విటమినులు వివిధవర్గములకు చెందియున్నవి స్థూలముగా వాటి ద్రావణీయతను ఆధారముగా తీసికొని నీటియందు కరగునవి క్రొవ్వుపదార్థములలో కరగునవి అను రెండు విధములుగా విటమినులు విభజింపబడినవి

నీటియందు కరగువిటమినులు — బి' విటమినుల సముదాయము సి' విటమిను ఈతరగతికి చెందినవి

బి' విటమినుల సముదాయము —

విటమిను బి (Thiamine) — విటమిను బి లోపించుట వలన జలహీనతకు సంబంధించిన బెరిబెరి అను వ్యాధి సంభవించును పైగా అలసట కల్గుట ఆకలితగ్గుట, పెరుగుదల నిలిచిపోవుట జరుగును మనము తిను పిండిపదార్థములు శరీరమునకు సక్రమముగా ఉపయోగపడి శక్తిగా రూపొందు ప్రక్రియలో విటమిను బి' ఉపయోగపడు చున్నది

తెల్లని బియ్యపు గింజకును దానిపై పల్చని పొట్టునకును మధ్యగలసన్నని పొరలో విటమిను బి' విశేషముగాలభించును మర బియ్యము కంటె దంపుడు బియ్యము ఎట్లు శ్రేష్ఠతరమైనదియు దీనినిబట్టి విదితమగును పప్పులు గోధుమలు మాంసములలో కూడ విటమిను 'బి' లభించును

విటమిను 'బి'$_2$ (Ribo flavin) — శరీరము యొక్క పెరుగుదలకును ముఖ్యముగా నోరు నాలుక చర్మము నేత్రముల యొక్క ఆరోగ్యమునకును విటమిను బి అత్యావశ్యకము చర్మము పెదిమలు పెదిమల కొనలు ఎరుపెక్కి చిట్లుట, చూపు మందగించుట కన్నులు ఎరుపెక్కి ఉబ్బుట వెలుతురును చూడలేక పోవుట నాలుక పూయుట విటమిను బి$_2$ లేమిచే సంభవించును - మాంసము కోడిగ్రుడ్లు పాలు చిక్కుళ్లు, గుల్లచేపలు వీటినుండి విటమిను బి$_2$ లభ్యమగును

నికోటినిక్ ఆమ్లము - అతివిరేచనములు (diarrhoea) చర్మవ్యాధులు కలుగకుండ ఈ విటమిను సహాయపడును ఈ విటమిను లోపించుట వలన వచ్చు రోగమును 'పెల్లగ్రా' అందురు ఉదరము నాడీమండలము ప్రేగులు సరిగా పని చేయుటకును చర్మము ఆరోగ్యముగ నుండుటకును శరీరము యొక్క పెరుగుదలకును కూడ ఈ విటమిను అవశ్యకము మతి స్థిమితము లేకుండుట జీర్ణస్థితి తప్పుట చర్మము పగులుట నాలుక పూయుట మున్నగు లక్షణములను బట్టి ఈ విటమిను లోపించినదని తెలిసికొనవచ్చును మాంసములోను, చేపల లోను గోధుమపిండిలోను పొట్టుతీయనిగింజలలోను ఈ విటమిను లభించును

విటమిను బి$_6$ (pyridoxine) — చర్మము యొక్క ఆరోగ్యమునకును, రక్తములోని ఎరుపు తెలుపు కణముల సంఖ్య క్రమముగా నుండుటకును ఇది అవసరము ఎలుకల ఆహారములో ఇది లోపించినచో, 'పెల్లగ్రా' వంటి వ్యాధి వాటికి సంభవించును మాంసకృత్తులయందును మొలకెత్తు గోధుమల యందును ఇది కలదు

పాంటోథెనిక్ ఆమ్లము - మానవులలో దీని ఉపయోగమును గురించి నిర్ధారణగా తెలియదు కాని కోళ్లలోను ఎలుకలలోను ఇది లేకపోవుటవలన వాటి ఆరోగ్యము చెడునని కనుగొనబడినది ఇతర రాసాయనిక ద్రవ్యములలో కలిసి ఇది ధాతుకణములలో కోఎన్‌జైమ్-ఎ (coenzyme A) అను పేరట జీవనప్రక్రియలలో (metabolism) ప్రముఖపాత్ర వహించుచున్నది

విటమిను 'బి$_{12}$' (cyanocobalamine) — వీరసత్వ బలహీనతలతో కూడిన నంజు' (pernicious anaemia) అను భయంకరవ్యాధి చాలకాలమువరకు నివారణోపాయము లేనిదిగా ఎంచబడుచువచ్చినది కాలేయము సహాయముతో ఈ రోగమును కుదుర్చవచ్చునని 1925లో నిరూపింపబడినది 1948లో ఈ వ్యాధి నివారణమునకు మూలమగు విటమిను బి$_{12}$ అమెరికా బ్రిటను దేశములలో కనుగొనబడినది అత్యంత క్లిష్టమగు రాసాయనిక నిర్మాణముగల ఈ అపూర్వపదార్థము కోబాల్ట్ అను లోహమును కలిగియుండుట ప్రత్యేకవిశేషము కాలేయము streptomyces griseus అను సూక్ష్మజీవుల నాధారముగాగొని బి$_{12}$ విటమినును పొందవచ్చును అనేకసంవత్సరముల నిర్విరామకృషి ఫలితముగా వివిధ ఆధునిక పరికరముల సహాయముతో ఈ పదార్థముయొక్క సంపూర్ణ రాసాయనిక నిర్మాణము ఈ మధ్యనే తేటతెల్లమైనది ప్రకృతినుండి లభ్యమగు ఈ పదార్థముయొక్క కృత్రిమనిర్మాణము నేటివరకు విజ్ఞానశాస్త్రజ్ఞులకు ఒక సవాలుగా నిలచియున్నను రేపైనను ఇది తప్పక సాధింపబడగలదు

పైన పేర్కొనబడిన ఆరు విటమినులేకాక బి విటమినుల సముదాయములో మరికొన్నికూడ గలవు ఉదాహరణమునకు బయొటిన్ ఫోలిక్ ఆసిడ్ మొదలగునవి శరీరారోగ్యమునకు అవసరమని తెలియుచున్నది

విటమిను సి' (l-Ascorbic acid) - నారింజఫలము అను తినుటవలన స్కర్వీ అనువ్యాధిని నివారించవచ్చునని వందలసంవత్సరములనుండి పెక్కురకు తెలియును పళ్ల చిగుళ్లు వాచి రక్తము కారుట చర్మముపై గోకినచో సులభముగా పుండుపడుట - ఈ రోగమునకు ముఖ్యలక్షణములు పెరుగుదలకును రక్తనాళముల పటుత్వమునకును దంతదార్ఢ్యమునకును ఈ విటమిను అత్యవసరము

నిమ్మజాతిఫలములు పచ్చికాయలు రామములగపండ్లు (టొమేటోలు) పెద్ద ఉసిరికకాయలు, పచ్చికూరలు మున్నగు పదార్థములలో ఈ విటమిను విరివిగా లభించును

క్రొవ్వుపదార్థములలో కరగు విటమినులు :- ఎ' డి', ఇ' కె' అను విటమినులు ఈ తరగతికి చెందినవి

విటమిను ఎ - ఇది శరీరమున లోపించినచో పెరుగుదల స్తంభించుట వ్యాధినిరోధకశక్తి క్షీణించుట బరువు తగ్గుట సంభవించును అంతేకాక రేచీకటి మొదలగు కంటివ్యాధులు, దంతవ్యాధులు తరచుగా జబ్బుచేయుటకూడ ఘటిల్లును

శరీరము పెరుగుదలను సక్రమముగా చూచుట

యందును నేత్రములు తమ విధిని నిర్వర్తించుటయందును విటమిను ఎ ప్రముఖపాత్ర వహించుచున్నది వృక్షములు కాని జంతువులుకాని తమంతటతాము ఈ విటమినును తయారుచేసికొనలేవు క్యారెట్లు ఆకుకూరలలో కల కెరొటినులు టొమేటో పండ్లలోని ఎరుపురంగు పదార్థము శరీరములో కాలేయమునందు రాసాయనికముగా మార్పుచెందుటవలన విటమిను ఎ ఏర్పడుచున్నది

చేప కాలేయమునుండి తీసిననూనె కోడిగ్రుడ్డులోని పచ్చసొన వెన్న ఆకుకూరలు కేరట్లు టొమేటోలద్వారా మన శరీరమునకు విటమిను ఎ లభ్యమగును

**విటమిను డి** - విటమిను డి శరీరమున లోపించినచో ఎముకలకు సంబంధించిన రికెట్స్ అనువ్యాధి కల్గును ఎముకలగట్టిదనము తగ్గుటవలన ఏర్పడు దొడ్డికాళ్లు వంకర చేతులు లంబోదరము మొదలగునవి ఈ రోగలక్షణములు కాల్షియము ఫాస్ఫరము శరీరములో తగుకీతిని ఉపయోగ పడనిచో ఈ వ్యాధి కలుగును ఈ విపరీతస్థితిని డి విటమిను సరిదిద్దగలదు

విటమిను డి' ఒక పదార్థముకాదు రాసాయనికముగా అత్యంత సన్నిహితమగు కొన్నిపదార్థములను ఒకటిగా కలిపి దానికి ఈ పేరును వాడుచున్నారు ఈస్ట్ (yeast) అను పదార్థమునందుగల ఎర్గోస్టరాల్ అను పదార్థము పూర్వ నీలలోహిత (ultra violet) కిరణముల ప్రభావముచే విటమిను డి గా మారును చర్మమునందుగల కొలెస్టరాల్‌కు సంబంధించిన ఒక పదార్థము సూర్యరశ్మి ప్రభావమువలన విటమిను డి3 గామార్పుచెందును

చేపనూనెలు కోడిగ్రుడ్లు వెన్న మొదలగువాటి ద్వారా మనము విటమిను డి ని పొందవచ్చును శరీరమునకు ఎండతగులుటవలనకూడ విటమిను డి' కొరత కొంతవరకు నివారణమగును

**విటమిను ఇ' (Tocopherols)** - ఎలుకలపై చేసిన ప్రయోగములనుబట్టి విటమిను ఇ కొరతవలన గర్భధారణమునకు సంబంధించిన అవయవములు పనిచేయవని తెలినది ఇతర జంతువులలో ఈ విటమిను లోపించినచో, కండర ములయందు అవాంఛనీయములగు మార్పులు కలుగునని తెలియుచున్నది మానవులలో విటమిను 'ఇ యొక్క ఆవశ్యకమును గురించి నిర్ధారణగా చెప్పలేము "

టొకోఫెరాల్స్ అను నాలుగు పదార్థములను కలిపి విటమిను ఇ అను పేరున వ్యవహరించెదరు

మొలకెత్తిన గింజలలోను కోడిగ్రుడ్లలోను కూరగాయలలోను విటమిను ఇ కలదు

**విటమిను కె** శరీరమునకు గాయము తగిలినపుడు చర్మముచిట్లి రక్తము బయటకు చిమ్మును అయితే సర్వసాధారణముగా కొలది నిమిషములలో రక్తము గడ్డకట్టి స్రవింపకుండును అట్లుజరగనిచో రక్తస్రావమువలన ప్రాణాపాయముకూడ సంభవించును

రక్తములోగల ప్రొత్రాంబిన్ అను పదార్థము గాయము కలిగినపుడు నెత్తురు గడ్డకట్టునట్లుచేయ సహాయపడుచున్నది విటమిను కె తోడ్పాటుతో ఈ పదార్థము కాలేయములో సర్వదా ఉత్పత్తియగుచుండును అందువలన శరీరములో విటమిను కె తగినంత లేకున్నచో గాయము కలిగినపుడు గడ్డకట్టుశక్తిని రక్తము కోల్పోవును

క్యాబేజి ఆకుకూరలు గోబిపువ్వు మొదలగు కూరలలో విటమిను కె పుష్కలముగా లభించును

సి వి ర

## విదేశాంగ నీతి - దౌత్యము

ఒక రాజ్యము ఇతర రాజ్యములయెడ అవలంబించు వైఖరిని విదేశాంగ నీతిలేక విదేశాంగ విధానము అని అందురు దానిమీదనే విదేశసంబంధములు లేదా అంతర్జాతీయ సంబంధములు ఆధారపడి యుండును యుద్ధము చేయుట సంధి కుదుర్చుకొనుట వాటిలో ముఖ్యాంశములు

సాధారణముగా రాజ్యముయొక్క విదేశాంగ విధానము దానికి గల పరమప్రయోజనమునుబట్టి నిర్ణయింపబడును అది రాజ్యమునకు సాధ్యమైనంత బలమును సమకూర్చుటకు సంబంధించియుండును బలము అను పదమునకు విస్తృతార్థముగలదు సైనికబలము రాజకీయాధికారము, ఆర్థికస్తోమత దానియందు చేరియున్నవి జాతి, మత, సంస్కృతుల ప్రాబల్యము దాని అంతర్భాగము ఇంకను దేశపాలనా చక్రమును త్రిప్పు రాజవంశమునకుగాని, పాలక వర్గమునకుగాని ప్రజానాయకునకుగాని నియంతకుగాని కల ప్రత్యేక ప్రయోజనములు కూడ దానితో ముడిబడి యుండును

విదేశాంగవిధానము దేశకాల పరిస్థితుల ననుసరించి

మారుచుండును ప్రాచ్య పశ్చిమరాజ్యములందు గత ప్రస్తుత కాలములలో అది వివిధ పరిణామములకు లోనైనది ప్రాచీన భారతదేశము నందు అది రాజనీతిలో ప్రధానభాగముగ పరిగణింపబడినది దానిని వివిధగ్రంథములు వివరించినవి వీటిలో ముఖ్యముగ ఎన్నతగిన కౌటిల్యుని అర్థశాస్త్రము నందు దానికి సంబంధించిన కొన్ని విశేషములివి రాజుయొక్క విదేశాంగ విధానమునకు అంతిమలక్ష్యములు (1) శక్తిని సమకూర్చుకొనుట (2) సిద్ధిని సంపాదించుట (3) వృద్ధిని సాధించుట దానికి సామ దాన భేద దండోపాయములు సంధి విగ్రహయాన ఆసనసంశ్రయ ద్వైధీభావములను చర్యలు తోడ్పడును వీటిలో అనుకూలమైన దానిని రాజు సామాన్య ధర్మాధర్మముల ప్రసక్తి లేక అనుసరింపదగును కౌటిల్యుని విధానము వంటి దానిని మధ్య యుగమున ఇటలీలో విలసిల్లిన మకియవెల్లి అను రాజనీతివేత్త ప్రిన్స్ అను గ్రంథముద్వారా ప్రచారముచేసినాడు వీరిరువురి సూక్తులు సిద్ధాంతరీత్యా స్పష్టముగ ఆమోదింపబడకున్నను ఆచరణలో అందరిచే అనుసరింపబడినవి ఇది చారిత్రక సత్యము గతకాలమున వివిధ రాజవంశములు తమ వైభవ ప్రాభవముల నిమిత్తము కుటిలవిదేశాంగ విధానమును అనుసరించినవి 18 19 శతాబ్దులలో యూరపురాజ్యములు అమెరికా ఆసియా ఆఫ్రికాఖండములలో తమ వ్యాపారముల వలసల కొరకై జరిపిన దౌర్జన్యములు దురాక్రమణలు అందరెరిగినవే రాజవంశముల పాలనతొలగి ప్రజాప్రతినిధులపాలన ప్రారంభమైన తర్వాతకూడ పరిస్థితి పెద్దగా మారలేదు ఇందుకు రెండు ప్రపంచయుద్ధములు ప్రబల నిదర్శనములు తదనంతరము అమెరికా నాయకత్వము క్రింద నున్న ప్రజాస్వామ్యరాజ్యముల కూటమునకును రష్యా ఆధిపత్యము క్రిందనున్న కమ్యూనిస్టు రాజ్యములకూటమునకును మధ్య ప్రచ్ఛన్నయుద్ధము సాగుచున్నది నేటి పాకిస్థాన్ భారతదేశము ఎడల చూపునైఖరి మతద్వేషముపైనను దక్షిణ ఆఫ్రికా శ్వేతప్రభుత్వము శ్వేతేతర జాతులపట్ల అవలంబించు విధానము జాత్యహంకారము మీదను ఆధారపడియున్నది కావున విదేశాంగ నీతి సవ్యమార్గమున ఆశించినంతగ అభివృద్ధి చెందలేదు అయితే అందువలన నిరాశకు లోనగుటతగదు. అభివృద్ధి అసలు లేదనుటకూడ సత్యముకాదు ఈ పరిణామమునకుకూడ పునాది ప్రాచీన భారతదేశమునందు సుస్థిరముగ వేయబడినది భారతయుద్ధకాలమునవే కొన్ని రకములైన యుద్ధచర్యలు అధర్మముగ భావింపబడి నిషేధింపబడినవి అశోకచక్రవర్తి యుద్ధ విజయమును త్యజించి ధర్మవిజయమును అవలంబించుట జగద్విదితము అతని బోధయందున్న సత్యమును ఇప్పటికిని యుద్ధభీతితో కంపించుచున్న ప్రపంచము గ్రహింపగల్గుచున్నది యుద్ధకాలమునందును శాంతి సమయము నందును వివిధ రాజ్యములు పరస్పరముగ పాటింపతగు నియమావళిని యూరపుఖండమున రూపొందించిన వారిలో 17 వ శతాబ్దికి చెందిన హ్యూగో గ్రోషియస్ అనునాతడు ప్రముఖుడు అతని గ్రంథములో పేర్కొనబడిన నియమములు విదేశాంగవిధానము అంతర్జాతీయ వ్యవహారములు వృద్ధియగుటకు తోడ్పడినవి యుద్ధము నరికట్టుటకును శాంతిని ప్రోత్సహించుటకును అనుకూలమైన ఆశయములు అభిప్రాయములు గతకాలమునకూడ కానవచ్చును అయితే వాటి కార్యాచరణకు తగు సంస్థలను వ్యవస్థలను నిర్మించి నిర్వహించుట ప్రస్తుతకాలమందలి వినూత్నపరిణామము మిత్రరాజ్యసమితి ఐక్యరాజ్యసమితి అందుకు ముఖ్యనిదర్శనములు వాటి యాజమాన్యము క్రింద మారణాయుధముల విసర్జన నిర్యుద్ధ సంధుల విస్తరణ వివాదముల శాంతియుత పరిష్కారము, ఆర్థిక వైజ్ఞానిక సాంకేతిక సాంస్కృతిక రూపముల సహకారము అంతర్జాతీయ రంగమున కొంతమేరకు సాధింపబడుచున్నవి

ఇపుడు స్వతంత్ర భారతదేశము ఆధునిక విదేశాంగనీతిని సంస్కరించుటలో నిర్వహించిన పాత్ర పేర్కొనతగినది దేశపాలనకు నాయకత్వము వహించిన ప్రధాని నెహ్రూ సర్వజనశ్రేయస్సుకై ప్రాచీనుడైన అశోకచక్రవర్తి యొక్క విదేశనీతిని సమకాలీనుడైన గాంధీజీ యొక్క రాజనీతిని సాధ్యమైనంతవరకు అనుసరింప ప్రయత్నించి, అందుకు అనుగుణమైన విధానమును రూపొందించెను అమెరికా రష్యాలకు చెందిన సైనికకూటములయెడ అలీనవిధానమును అవలంబించుట అంతర్జాతీయవ్యవస్థయైన ఐక్యరాజ్యసమితికి పూర్తి ప్రోద్బలమిచ్చుట కొరియా కాంగో ఇండోచైనాల వంటి రాజ్యములలో యుద్ధనివారణకు శాంతి స్థాపనకు తోడ్పడుట అన్నిటికంటె మిన్నగా పంచశీల సిద్ధాంతముద్వారా భిన్నరాజ్యముల మధ్య శాంతియుత సహజీవనమును ప్రోత్సహించుట దాని విశిష్టలక్షణములు కాని అతని విదేశాంగ

విధానము పాకిస్థాన్ పై చాలపట్ల విఫలమైనది అంతమాత్రమున ఉన్నతాశయములు అభ్యుదయ భావములు గల అతని విధానము నిష్ప్రయోజనమైనదని నిందించుట విజ్ఞత కాదు

ప్రస్తుత ప్రపంచ పరిస్థితిలో మానవజాతిని మానవ సంస్కృతిని సంరక్షించుటకై యుద్ధమును నివారించుట శాంతియుత పరిష్కారమార్గమును ప్రోత్సహించుట సహన సహజీవన సహకారవిధానములను పెంపొందించుట అత్యావశ్యకము అందుకై జాతీయ అంతర్జాతీయ అభిమానముల మధ్య సమన్వయమును సాధింపవలసి యున్నది స్వేచ్ఛ సామ్యము న్యాయము ప్రాతిపదికలుగా వసుధైక రాజ్యము స్థాపింపబడవలసి యున్నది అందుకు అనుకూలముగ నుండునట్లు ప్రతిరాజ్యము దాని విదేశాంగ విధానమును సరిదిద్దుకొనుట పవిత్రధర్మము

దౌత్యము - విదేశాంగ విధానమునకు సన్నిహితమైనది దౌత్యము ఒక రాజ్యముయొక్క విదేశాంగ విధానమును పరదేశములందు అమలుజరుపు ఉద్యోగులు దూతలు లేక రాయబారులు అనబడుదురు నేడు నాలుగు తరగతులకు చెందిన దూతలు అన్ని రాజ్యములలో నియమింపబడుచున్నారు తరతమ ప్రాధాన్యక్రమమునుబట్టి వారిని ఈ వరుసలలో పేర్కొనవచ్చును - (1) రాయబారులు (2) సర్వాధికారముగల అమాత్యులు లేక అసాధారణదూతలు (3) నివాసముండు అమాత్యులు (4) ఛార్జి-డి-ఎఫేర్సు అనబడువారు వారు పెక్కు ఇతర రాజ్యముల నుండి వచ్చి భారతదేశములో తమ విధులను నెరవేర్చుచున్నారు వారి కార్యాలయములను రాయబారికార్యాలయములు హైకమిషన్లు లెగేషన్లు కమిషను కాన్సలేట్స్ వైస్ కాన్సలేట్స్ అని యందురు అట్లే భారతదేశమునకు సంబంధించిన ఇట్టి వివిధ రకములదూతలు రాష్ట్రపతిచే నియమింపబడి విదేశములందు వ్యవహరించుచున్నారు కాలము గడచినకొలది రాయబారుల విధులు విస్తారమగుచున్నవి ప్రస్తుతము విదేశాంగనీతికి వలయు ధ్యేయముపైన పేర్కొనబడినది అది దౌత్యకార్యకలాపములకు కూడ వర్తించును

ఓ న మూ

## విద్యాచరిత్ర-అమెరికా

క్రీ శ 18 వ శతాబ్ది ఉత్తరార్ధమున నెలకొన్న ప్రజాస్వామ్య ఆదర్శములను ఆధారముగ చేసికొని అమెరికా సంయుక్త రాష్ట్రములలో విద్యావిధాన నిర్మాణము జరిగెను వివేక సంపన్నమైన పౌర సమాజము ఏర్పడుటకై సర్వజనులకు విద్యాలబ్ధి కల్గించుట ఆ యాదర్శములలో మొదటిది కలవారు లేనివారని విభేదము చూపక సర్వులకును సమానావకాశములను కల్పించుట రెండవది వివేక సంపన్నమైన సమాజము మూలమున ప్రజ భద్రత సుస్థిర పడగలదనియు ప్రజాప్రభుత్వాదర్శములయెడ ప్రత్యయబుద్ధి యేర్పడగలదనియు అమెరికనుల ఆశయము అట్లే సమానావకాశములు లభించిన యెడల తమతమ అధికార తారతమ్యమును బట్టి ఎల్లరును సంపూర్ణులు కాగలరనెడి సిద్ధాంతముపై రెండవ ఆశయము ఆధారపడియున్నది ఈ లక్ష్యములను ఆదర్శములను బట్టి అమెరికనుల విద్యా విధానము జాతీయమనుట స్పష్టము నిర్వాహణ పద్ధతినిబట్టి మాత్రము అది జాతీయ దృష్టి కలదికాదు అమెరికా విద్యావిధానము కలుబడియారు రాష్ట్రములకు సంబంధించినదేకాని కేవలము కేంద్రమునకు మాత్రమే సంబంధించినది కాదు ఈ విధానమందలి వికేంద్రీకరణ పద్ధతి ననుసరించి సకలరాష్ట్రములలోని విద్యావిధానమును ఏకసూత్రిత మొనర్చి జాతీయభావమును ప్రోత్సహించు సమన్వయ మార్గములు లేకపోలేదు వాటిలో కొన్ని మార్గములు ఈ క్రింద ఉటంకింపబడినవి

1 విద్యా విషయమై కొన్ని జాతీయ పరిపాలనా సంస్థలు నెలకొల్పబడినవి ఇవి కేంద్ర పాలితములు కేంద్ర సంస్థా సాధనములు తమతమ రంగములకు చెందిన విషయములను సమీకరించి దేశమంతటను వాటిని వ్యాపకము చేయును

2 కేంద్రముచే ప్రోత్సహింపబడు కొన్ని వృత్తి సంబంధి సంస్థలున్నవి వీటి మూలమున అన్ని రాష్ట్రములందలి ఉన్నత విద్యయు సమానమగునట్లు ప్రమాణీకరింపబడును

3 అమెరికాలో యేల్ కొలంబియా క్యాలిఫోర్నియా వంటి కొన్ని ప్రసిద్ధ విశ్వవిద్యాలయములును కొన్ని పరిశోధనాకేంద్రములును కలవు, దేశము నలుమూలల నుండియు, విద్యార్థులును పరిశోధకులును వచ్చి వీటిలో ప్రవేశింతురు వారి విద్యావ్యాసంగములు యావద్దేశవ్యాప్తములు

4 ప్రతి రాష్ట్రమునను ఆయావిద్యాశాఖలలో బోధనా సాధనా విధాన మనబడు ఒక విధమైన సమానత్వమును విద్యార్థి జీవితమునందు సాధించుటకు యత్నము జరుగుచుండును, ఈ విధానమందలి మూడు వేళలలో మొదటిది ప్రాథ

మిక పాఠశాలాదశ రెండవది ఉన్నత పాఠశాలాదశ మూడవది ఉన్నత విద్యాదశ కళల బోధనకు సంబంధించిన ఈ మూడు దశలతో తులతూగు మరిమూడు దశలు సాంకేతిక విద్యారంగమునను కలవు అందు మొదటిది పారిశ్రామిక పాఠశాలాదశ; రెండవది సాంకేతిక పాఠశాలాళ మూడవది వృత్తి విద్యకు సంబంధించిన పాఠశాలాదశ అమెరిక విద్యా విధానములో ఇట్టి భిన్నభిన్న దశాక్రమ విభాగము విజయవంతముగ పరిణమించినదని తెలియుచున్నది

**అమెరికా విద్యావిధాన వివరణము** — ప్రతిరాష్ట్రము తన విద్యావిధానమును తానే నిర్వహించుకొనును ఈ నిర్వహణ సౌలభ్యమునకు ప్రతి రాష్ట్రము మండలములుగను నగరములుగను నగర పరిసరములుగను విభజింపబడును ఈ చిన్న చిన్న కేంద్రములలో అచ్చటి స్థానికాధికారులకు ప్రభుత్వ పాఠశాలలను ఏర్పాటుచేయు అధికారముకలదు మత సంబంధము వర్గవిభేదములేని లౌకిక స్వభావముగల ఈ ప్రభుత్వపాఠశాలల యందే నూటికి తొంబదిమైదుమంది విద్యార్థులు అధ్యయనము చేయుదురు అచ్చటచ్చట స్థానీయములైన కొన్ని స్వతంత్ర పాఠశాలలును కలవు అవి అంత ఆదరమును చూరగొనినవి కావు వాటిని రెండు తరగతులుగా వర్గీకరింపవచ్చును (1) రోమను కేథలిక్ శాఖకో లేక ప్రొటెస్టెంట్ శాఖకో చెందిన క్రైస్తవమతపర పాఠశాలలు (2) ప్రయోగాది ప్రయోజనములుగల ప్రయోగ పాఠశాలలు కళాశాల విద్యకు ముందుగా విద్యార్థి విద్యార్థినులకు శిక్షణ మొసగు బడులు కూడ ఈ రెండవ కోవలోనికే రాగలవు స్వతంత్ర పాఠశాలలపై రాష్ట్రప్రభుత్వ అధ్వర్యముండదు ప్రభుత్వ పాఠశాలల యందును స్వతంత్ర పాఠశాలల యందును నిర్బంధోచిత విద్యా విధానము ఆచరణయందున్నది

**ప్రాథమిక విద్య** — ప్రాథమిక విద్యాశిక్షణములో ప్రథమ దశ శిశు విద్యాకేంద్రముల' (nurseries) యందును 'వస్తుబోధనా విద్యాకేంద్రముల (kinder gartens) యందును కడచుచున్నది ఈ కేంద్రములకు పూర్వదశా పాఠశాల (pre-schools) అని ప్రసిద్ధి పదునారు నెలలు—నాల్గేండ్ల నడుమ వయస్సుగల బాలబాలికలకు వీటిలో ప్రవేశము లభించును వారిలో శుభ్రమును నిరాడంబరమును ఆరోగ్యవంతమును అగు జీవితమును పెంపొందించుటయే ఈ పూర్వదశా పాఠశాలల ప్రధాన లక్ష్యము వీటియందలి పాఠ్య భాగములలో వినోద క్రీడలు సంగీతము ద్వారా వివిధ కార్యక్రమములు ప్రవేశపెట్టబడును ఈ కేంద్రములలో శిశువులకు సమీకృతాహారము నిత్తురు

అమెరికాయందు పెక్కు విద్యా కేంద్రములు శిశుమనస్తత్వ పరిశోధనములకు ఉపయోగపడుచున్నవి వస్తు బోధనా విద్యా కేంద్రములలో ఇంచుక పెద్ద వయస్సుగల వారిని అనగా—2 నుండి 6 ఏండ్ల వయస్సుగల వారిని ప్రవేశపెట్టుకొందురు అచ్చట కూడ సాంఘిక ప్రవర్తనాదికమునందును సైతము సుశిక్షణముతో కూడిన జీవితమునకు ప్రాముఖ్యమొసగబడును

ప్రాథమిక విద్యా శిక్షణములో రెండవ దశయగు విస్పష్ట విద్యాదశ బాలబాలికలకు సరిగా ఆరవ ఏటితో ఆరంభ మగును ఈ దశలో బోధనమునకు ఇన్ని సంవత్సరములనెడి పరిమితి ఎచ్చటను లేదు కొన్నిబడులలో ఆరేండ్ల వరకును కొన్నిటిలో తొమ్మిదేండ్ల వరకును శిక్షణము సాగవచ్చును ప్రాథమిక పాఠశాలా విద్యార్థుల సంఖ్య కూడ ప్రదేశములను బట్టి మారుట కలదు మిక్కిలి కుగ్రామములందు పదిమంది మాత్రమే విద్యార్థులున్నచో మహానగరములందు వేయిమందికి పైగా గూడ నుందురు ఆ దేశములో సగమునకు పైబడిన పాఠశాలలు జనపదములయందే కలవు వాటిలో ఏకోపాధ్యాయ పాఠశాలలు సగమునకు మించియున్నవి జానపద విద్యార్థుల అవకాశములను అభివృద్ధి పరచుటకై భిన్నభిన్న కేంద్రములందు కేంద్రపాఠశాలలు (consolidated schools) ఏర్పడియున్నవి వీటిలో ప్రతిదినము విద్యార్థుల రాకపోకలకగు వ్యయమును ప్రభుత్వమే భరించును ప్రాథమిక పాఠశాలలో అమెరికను భాషాసారస్వతములు అమెరికా చరిత్ర లఘుగణితము శరీరశాస్త్రము చిత్రలేఖనము సంగీతము బోధింపబడుచున్నవి విదేశములలో పుట్టి అమెరికాకు వలస వచ్చిన పెక్కురను అమెరికనులనుగా తీర్చిదిద్దుట ఈ నిర్బంధ పాఠ్యనియమముల ఉద్దేశము

**ఉన్నతపాఠశాల విద్యావిశిష్టత** — ప్రాథమికపాఠశాల విద్య ముగియగనే ఏ విద్యార్థియైనను అమెరికాలో ఉన్నత పాఠశాలయందు చేరవచ్చును' కాని ప్రాథమిక విద్యను ముగించిన పెక్కురు పూర్ణకాలికములైన ఉన్నత పాఠశాలలలో ప్రవేశింతురు అందలి విశిష్టలక్షణములిట్టివి

(1) ప్రపంచములో ఉన్నతవిద్య ప్రప్రథమముగ అమెరికాలో ఉచితముగ గరపబడినది

(2) ఉన్నతపాఠశాల విద్యాసౌకర్యములు లేనిచోట్ల బాలబాలికలను సమీపగ్రామములందలి పాఠశాలలకు పొమ్మని ప్రోత్సహింతురు ఉన్నత విద్యాసౌకర్యములు లేని గ్రామీణులు ఈ బాలబాలికల వ్యయములను భరింతురు ఉచితభోజన వసతిగృహములనుగూడ వారికి కల్పింతురు

(3) విద్యార్థి విద్యార్థినులు పాఠ్యభాగములందు కొన్ని అంశములను నిర్బంధముగ చదివితీరవలెను కొన్నిటిని ఐచ్ఛికముగ చదువవచ్చును అభిమానపూర్వకమైన ఇట్టి ఐచ్ఛికపఠనము నిమిత్తమై పాఠశాలలలో పెక్కు బోధనాంశములను ప్రవేశపెట్టుదురు బాలబాలికలు తమ యిష్టమునుబట్టి వాటిలో కొన్ని అంశములను పఠింపవచ్చును చిత్రలేఖనము వ్యవసాయవిధానము స్థాపత్యశిల్పము గృహవిద్య సంగీత సాహిత్యములు విజ్ఞానశాస్త్రము సాంఘికశాస్త్రములు వాణిజ్య వ్యాపారశాస్త్రములు స్వయంచాలక యంత్ర పరిశ్రమలు (automobile industries) ఖనిజలోహశాస్త్రములు మున్నగునవి ఆ పాఠశాలలలోని ఐచ్ఛికాంశములు

(4) పాఠ్యభాగముల నిర్ణయమువలనను విద్యార్థుల యోగ్యతలవలనను సమాన ప్రమాణములను సాధించుట అవశ్యకమని ఉద్దేశింపబడి బయటి పరీక్షాధికారులచే జరుపబడు పరీక్షలు ఇందుండవు భవనములు సాధనసామగ్రి ఉపాధ్యాయుల యోగ్యతలు పాఠ్యవిషయములు గ్రంథాలయములు ప్రయోగశాలా సౌకర్యములు అన్నింటినిమించి ఉపాధ్యాయ కార్యభారము మొదలైనవి ప్రమాణీకరణమునకు అగత్యమైనవి

(5) ఉపాధ్యాయ కార్యభారమువంటిదే విద్యార్థి కార్యభారముకూడ ఈ కార్యభారము వారువారు చేయవలసిన పనిప్రమాణముల (units of work) వలన నిర్ణయింపబడును వారమునకు కొన్ని గంటలుచొప్పున ఒక యేడాదిపాటు విద్యార్థి చేయు పఠనము విద్యార్థి కార్యభారమనబడును అట్లే ఉపాధ్యాయుడు చేయు బోధనకార్యము ఉపాధ్యాయ కార్యభారమనబడును ఆయా తరగతులనుబట్టి వారమునకు కొన్నిగంటల పఠనము ఆంగ్లమునను సాంఘికశాస్త్రమునను గణితమునను విజ్ఞానశాస్త్రమునను జరిపితీరవలెను ఎక్కువగంటలు ఐచ్ఛికాంశముల పఠనమున వినియోగించుట ఆవశ్యకము కళాశాలా ప్రవేశార్హత ఈ పఠన కార్యప్రమాణములపై ఆధారపడియుండును

**ఖండకాలికవిద్యావిధానము-తరువాయి పాఠశాలలు - (Continuation Schools)** - పూర్ణకాలిక ఉన్నత పాఠశాలలకు పోలేనివారు ఖండకాలికవిద్యను (parttime education) అభ్యసింతురు ప్రతి రాష్ట్రమునందును ఇట్టివిద్యకు పాఠశాలలు కలవు పూర్తి విశ్రాంతిలేనివారు తరచుగ 18 యేండ్ల వయస్సు వచ్చువరకు ఖండకాలిక పాఠశాలలకేగుదురు ఈ పాఠశాలలలో వారమునకు 4 నుండి 8 గంటల పరిమితివరకు పరిస్థితులనుబట్టి పఠనాకార్యక్రమము జరుగుచుండును అట్టి సంస్థలను తరువాయి పాఠశాలలందురు వీటిలో పెక్కింటియందు వృత్తివిద్యలకు ప్రాధాన్యమీయబడును తక్కిన దేశములందువలెనే అమెరికా యందును మున్ముందు లభింపనున్న సాంకేతిక విద్యకు వృత్తివిద్యాసాధన భూమియగును తరువాయి పాఠశాలలయందు వృత్తిసాంకేతిక విద్యలను నేర్పుటకు జరుగుయేర్పాట్లు కార్మికులను వృత్తిపరులను పాఠశాలలకు అనివార్యముగ హాజరగునట్లు ప్రోత్సహించుచున్నవి ప్రాథమిక పాఠశాలలయందును ఉన్నతపాఠశాలలయందును వలెనే ఈ తరువాయి పాఠశాలలయందును స్త్రీ పురుషులు కలిసి విద్య నభ్యసించుట తప్పనిసరి యగుచున్నది

వృత్తివిద్యలును సాంకేతికవిద్యలును విశ్వవిద్యాలయ దశలోకూడ బోధింపబడును దంతవైద్యము వైద్యశాస్త్రము స్థాపత్యశిల్పము అనువర్తిత రసాయనశాస్త్రము స్వయంచాలక యంత్రపరిశ్రమల విద్యలు వాయుశాస్త్ర సంబంధి పరిశ్రమల విద్యలు మతబోధనము వేదాంత న్యాయశాస్త్రములు మున్నగునవి విశ్వవిద్యాలయ స్థాయిలో బోధింపబడును కార్నెల్‌లోని స్థాపత్యశిల్పపాఠశాలయు హార్వర్డ్‌లోని వైద్య న్యాయశాస్త్ర పాఠశాలలును కొలంబియాలోని ఉపాధ్యాయ శిక్షణశాలయు అంతర్జాతీయఖ్యాతిని గడించినవి

**కళాశాలవిద్య :-** ఉన్నతపాఠశాల విద్యను ముగించినవారు సాంకేతిక పాఠశాలలకుగాని బోధనా సంస్థలకుగాని, కళాశాలలకుగాని విశ్వకళా పరిషత్తులకుగాని విద్యాభ్యాసమునకై పోవచ్చును

**బోధనా సంస్థలు :-** ప్రాథమికోన్నత పాఠశాలోపాధ్యాయులకు బోధనమార్గపఠనము భిన్నభిన్న సంస్థలయందు లభించును, ఉత్తర ప్రత్యుత్తర సంబంధి పాఠశాలలు కూడ

అమెరికాయందుకలవు ఉత్తర ప్రత్యుత్తరముల ద్వారమున ఈ పాఠశాలలు బోధనమార్గములను తెల్పును ఇట్టి వేర్వేరు బోధనాపాఠశాలలు వివిధ రాష్ట్రములలో 400 వరకు కలవు వీటిలో 40 లక్షలకుపైగా విద్యార్థులుందురు వీరంవరకు ఉచితవిద్య గరపబడును తమవిద్య ముగిసిన తర్వాత వీరు ఒక ఏడాదిపాటు ప్రభుత్వ పాఠశాలలలో ఉపాధ్యాయులుగ పని చేయవలయును ఇతర వృత్తులనవలంబింప నున్న యువకులు సైతము బోధనాపాఠశాలలలో ప్రవేశించి బడిజీతమును తప్పించుకొని తాత్కాలిక జీవనోపాధిగ ఉపాధ్యాయ వృత్తిని స్వీకరింతురు మొత్తము మీద విద్యాబోధన మార్గములో శిక్షితులైన వారిలో బహుశాతము ఉపాధ్యాయ వృత్తికి కట్టుపడరు కట్టుపడినవారుకూడ ఉన్నతవేతనాపేక్షచే ఒక పాఠశాలనుండి వేరొకపాఠశాలకు తరచు మారుచుందురు

**విశ్వవిద్యాలయములు** - అమెరికాయందు కళాశాల విద్య విశ్వవిద్యాలయములలోను ప్రత్యేకమైన కళాశాలల లోను బోధింపబడును సర్వావయవ సంపూర్ణమైన విశ్వవిద్యాలయమునకు అచ్చట మూడు శాఖలుండును (1) సకలకళలను శాస్త్రములను బోధించు కళాశాలలు (2) కళాశాలానంతర పాఠశాలలు (3) వృత్తివిద్యల విభాగము ప్రత్యేక కళాశాలలలో నాల్గేండ్లు బోధనము సాగును అటుపిమ్మట ఆయాతరగతులకు విద్యార్థి హాజరైన గంటల మొత్తమును బట్టి ఏ బి (బి ఏ) పట్టము లభించును విశ్వవిద్యాలయములకు వలె ఈ పట్టములను ప్రదానముచేయు అధికారము న్యాయశాస్త్రరీత్యా ఈ కళాశాలలకే కలదు ఇట్టి పట్టమును సంపాదించిన విద్యార్థి మాత్రమే కళాశాలానంతర పాఠశాలలలో చేరగలడు ఇచ్చట మరల మూడేండ్ల బోధనము జరుగును ఇవి యితర దేశములందలి విశ్వవిద్యాలయ దశను పోలియుండును కాని యే ఐరోపీయ విశ్వవిద్యాలయమునందు గాని విద్యార్థి స్వతస్సిద్ధముగ చేయవలసిన పనికిగల ప్రాధాన్యము కంటె ఇచ్చట చేయవలసిన పనియొక్క ప్రాధాన్యము తక్కువ కళాశాలానంతరపాఠశాలలలో విద్యార్థులు ఏ ఎం (ఎం ఏ) వంటియు ఎం యస్ , డి యస్ సి వంటియు పట్టములు లభించు విద్యల కొరకై వ్యాసంగము చేయుదురు మొత్తముమీద యావజ్జీవిత రంగమునో సాంఘికరంగమునో ప్రతిబింబింపగల వివిధ బోధనాంశములు ఆ కళాశాలలందును కళాశాలానంతర పాఠశాలలందును అమెరికన్ విద్యార్థుల ఐచ్ఛిక పఠనమునకు లభింపగలవని ఒక్కమాటలో చెప్పన చాలును

**వయోజనవిద్య** — యూరపునందు వలె అమెరికాలో వయోజనవిద్య ప్రగతినొందలేదు అట్లే ఇంగ్లండు నందువలె ఇది శ్రమజీవుల అప్రయత్నకృతమైన ఉద్యమము కాదు ఇటీవలనే అమెరికాలో వయోజన విద్యను గురించి ఊహలు వ్యాపించి ప్రాథమిక పాఠశాలాజ్ఞానమునకు లోకజ్ఞానమును జతపరుపవలెననెడి భావము విజృంభించెను వయోజన విద్యాభివృద్ధికై అచ్చట ప్రభుత్వామోదమును పొందిన సంస్థలు 'సారస్వతపరిషత్తులు' అను పేరుతో పెక్కుగలవు అవి ఉపన్యాస పూర్వకమును ఉత్తర ప్రత్యుత్తర పూర్వకమును అయిన బోధనావిధానమునకు పూనుకొనుటయే కాక అనుదినబోధనమునకు తరగతులను ప్రారంభించి గ్రంథాలయ సౌకర్యములను గూడ కల్పించుచున్నవి ఈ సారస్వత పరిషత్తులకు తోడు వై యం సి ఎ వై డబ్ల్యు సి ఎ వై యం హెచ్ ఎ (హెబ్రూ) అను మహాసంస్థలు కూడ భిన్నభిన్నములైన వయోజన పాఠశాలలను నెలకొల్పుటకు సాహాయ్యపడగలవు ఇట్టివే మాతాపితృగురుజన జాతీయ మండలి అమెరికను గ్రంథాలయసంఘము అను మరికొన్ని జాతీయ సంస్థలును కలవు అన్ని విశ్వవిద్యాలయములందును విస్తరోపన్యాస విధానములు (extention courses) కలవు ఉత్తర ప్రత్యుత్తర విధాన మూలకబోధయు ఆకాశవాణి ప్రసంగమూలకబోధయు చలనచిత్ర మూలకబోధయు అనులనోపన్యాస మూలకబోధయు పైన చెప్పిన విస్తరోపన్యాస విధానములలోనివి అన్నిటికంటె ఉత్తర ప్రత్యుత్తర విధానమూలక ప్రత్యేక పాఠశాలలు అధికము కాని వాటిలో పెక్కులు ధనలాభలోభలోల బుద్ధితో నడపబడుచున్నవి

**వ్యాయామ(క్రీడా) విద్య** :— ఈ విద్యకు అమెరికా పెట్టినదిపేరు 19 20 శతాబ్దులలో ప్రపంచదేశములన్నియు ఈ విద్యావిధాన విషయమున అమెరికాకు ఋణపడి యున్నవి ఆడుచుపాడుచు విద్యనేర్చుకొనుట వంటి విధానము లెన్నియో ఈ వ్యాయామ క్రీడావిద్యలో నెలకొనియున్నవి అధ్యయనమును ఒక శ్రమగా విద్యార్థి భావింపక క్రీడా విశేషముగ భావించుట బహుధా కార్యకారియని అమెరికనుల విశ్వాసము ఇట్టి విద్యలెన్నియో కళాశాలలచ్చట నెలకొనియున్నవి శరీర.

బుద్ధిబలముల సాహచర్యము అసత్యమనెడి సిద్ధాంతమును బట్టి ఈ విద్యావిధానమునకు ప్రాముఖ్యమేర్పడు చున్నది

బి వి క్ష క

## విద్యాచరిత్ర - ఇంగ్లండు

ఇంగ్లండు యొక్క రాజ్యాంగ చట్టమువలెనే దాని జాతీయ విద్యావిధానము కూడ విచ్ఛిత్తి నెరుగని ఒక దీర్ఘ పరిణామము లౌకికములు మతపరములునైన పాఠశాల లచ్చట పెక్కు తెగలుండియు ప్రభుత్వాదరమును ప్రజాదరమును సమానముగ పొందుచున్నవి విశాలమైవిద్యము ఆంగ్లవిద్యా విధానమందలి విశిష్టలక్షణమని ప్రతీతి జాతీయ విద్యాసమితి యను సంస్థలో ప్రభుత్వమంతగా జోక్యము కల్గించుకొనకున్నను దాని ప్రాతినిధ్యముండుటను ఇదికే వలమొక సలహా సంస్థమాత్రమే ఇది ఎట్టి పరీక్షలను నిర్వహింపక పోవుటవలననే ఆ దేశములో విద్యాపాలక సంఘములకు సంపూర్ణ స్వాతంత్ర్యముకలదు

ఆంగ్ల విద్యావిధాన వికాసము - ఐరోపీయ దేశములందువలెనే ఇంగ్లండునందును శతాబ్దులు తరబడిగా మత సంఘములు విద్యను నిర్వహించినవి విద్యాసంస్థలకు దయాళువులైన వ్యక్తుల ఉపకారములు లభించినవి తొల్లిటి విద్యాసంస్థలలో కొన్ని ధనికవర్గముకొరకేర్పడెను అవి లౌకికములు విద్యాసంస్థలను నెలకొల్పిన ఏ మతసంఘము నెడనైనను ప్రభుత్వము పక్షపాతము చూపదు దేనికిని ఆర్థిక సహాయ్యము చేయదు

క్రీ శ 1833 లో ఎట్టకేలకు ప్రభుత్వము విద్యాసంస్థలకొరకై ధనసహాయ్యమున కియ్యకొనెను ఈ నిర్ణయము 1839 లో విద్యాశాఖ ఏర్పాటునకు దారితీసినది ప్రభుత్వమొసగిన ధనమును విద్యాసంస్థలకు పంచుటలో పర్యవేక్షణము చేయుటవినా ఈ శాఖ మరేమియు కల్పించుకొనలేదు ఆ పంపకము పరీక్షా ఫలితములను బట్టి యుండుట పరిపాటి 1870 వరకు పేదలకు పాఠశాలలు తక్కువగ నుండెడివి ఆ పిదప రాజకీయరంగమున కల్గిన ప్రజాస్వామ్య పరిణామముల్లు విద్యారంగమునకూడ ప్రతిధ్వనించి పెక్కు పాఠశాలల కొరకు - విశేషించి ప్రాథమిక పాఠశాలల కొరకు ఆందోళన హెచ్చెను ఈ పరిస్థితులలో (1870) ప్రసిద్ధిగన్న 'ఫార్ స్టెర్ శాసనము' నెలకొన్నది

ఫార్ స్టెర్ చట్టము :- ఇది ప్రాథమిక విద్యావిధానమును గూర్చిన శాసనము దీనిని బట్టి (1) పాఠశాలలను నెలకొల్పు విషయములో ప్రభుత్వమునకెక్కువ బాధ్యత యుండవలెను (2) విద్యార్థులు తప్పక పాఠశాలలకు హాజరుకావలెను (3) ప్రజలు స్థానిక విద్యలకొరకై తప్పక పన్ను చెల్లింపవలెను (4) పాఠశాలల నిర్వహణము విద్యాసదస్సుల బాధ్యత ఈ చట్టము పూర్తిగ ఆచరణములోనికి వచ్చునరికి ఆరేడు సంవత్సరములు పట్టెను ఈలోగా క్రింది నడిమితరగతుల ప్రజలయందు మాధ్యమిక పాఠశాలల స్థాపనకై ఆందోళన రేగినది దానితో ప్రభుత్వము తడవతడవకు కొన్ని సంఘములను నెలకొల్పుటయు అవి అసంతృప్త కారణములను అన్వేషించి అభివృద్ధికై సూచనలను చేయుటయు జరుగుచు వచ్చెను మాధ్యమిక విద్యయందు సైతము ప్రభుత్వము జోక్యము చేసికొనుట అప్పటి నుండియే ప్రారంభమైనది

1890 నాటికి ప్రాథమికవిద్యను ఉన్నతపాఠశాలా విద్యతో జతకూర్చుటకు నడిమిదశగా మాధ్యమిక పాఠశాలను నెలకొల్పు అధికారము స్థానికాధికారులకు లభించెను అప్పుడే పెక్కు గ్రామసంఘములకు విజ్ఞానశాస్త్రములు వర్తక వ్యాపారములు వ్యవసాయము ఆధునికభాషలు మున్నగు వాటిని బోధించు సాంకేతికాది పాఠశాలలను నెలకొల్పుటకై అనుమతియు దొరికినది 1899 లో ఒక జాతీయ విద్యాసదస్సును ఏర్పరచుటకై ప్రభుత్వము ప్రత్యేకముగ కేంద్రసంఘమును సృష్టించెను ఇందు కేంద్రమంత్రి యొకరు అధ్యక్షులుగ నుండిరి భిన్నభిన్న పాలకవర్గముల యాజమాన్యములోనున్నభిన్నభిన్నపాఠశాలలను ఒకరీతిగ క్రమబద్ధము చేసి క్రమరాహిత్యమువలన కల్గిన గందరగోళమును నిర్మూలించుటయే ఈ సదస్సు ప్రయోజనము కాని దీని స్థాపనతో సర్వము తీరిపోలేదు పైచెప్పిన వైవిధ్యమువలన పాఠశాలల క్రమనిర్వహణములో కల్గిన బాధలను తొలగింపగోరి 1902 లో విద్యాశాసన మొకటి ప్రవేశపెట్టబడెను ఈ చట్టము ననుసరించి, ఫార్ స్టెర్ శాసనము రీత్యా స్థాపితములైన విద్యాసంస్థలు రద్దుగావింపబడెను తత్ఫలితముగా ఒక చోటగల ప్రాథమిక మాధ్యమికోన్నత విద్యావిధానములన్నియు ఒక్కొక్కస్థానికసంస్థ యాజమాన్యములోనికి వచ్చెను ఈ స్థానికసంస్థలు మండల సదస్సులవంటివి మండల విద్యాధికారి విభిన్న విద్యాదశల సమన్వయాది విషయములను

గూర్చి, కేంద్రజాతీయ విద్యాసదస్సుతో సంప్రతించుచుండుట ఆవశ్యకము ఇట్లు ఒకదశాబ్దము చాల కృషి జరిగెను అయినను పెక్కు స్వతంత్ర పాఠశాలలు ప్రత్యేకముగ మిగిలిపోయినవి ప్రజాసామాన్యములో పాఠశాలలు చాలినన్ని లేవను అసంతృప్తి తీవ్రముగనే యున్నది ప్రథమ ప్రపంచ సంగ్రామకాలమున (1914-18) ఈ విషయమై ప్రభుత్వము చేయగలిగినది లేకపోయెను ఆ సంగ్రామనిర్వహణమునకు బహురీతుల తోడ్పడిన సాధారణ ప్రజలలోని విద్యావిషయక మగు అసంతృప్తిని తీర్చుబాధ్యత నెరిగిన ప్రభుత్వము 1918 లో ఫిషర్ శాసనము ను ప్రవేశపెట్టి అందలి మొదటి ప్రకరణములో దాని ప్రధానాశయములను రెండింటిని సూచించెను (ఎ) జాతీయ విద్యావిధాన స్థాపనమునగా పరిపాలనాదృష్టి పథమునుండి జాతీయతను సాధించుట (బి) ప్రజాసర్వస్వము నందు విద్యావ్యాప్తికై పాటుపడుట అదిదేవ ముఖ్యమగు ఇతర సూచనలు (1) శిశువిద్యాకేంద్రములు నెలకొల్పుట (2) 4-14 యేండ్ల వయస్సువారికి నిర్బంధ విద్య (3) ప్రాథమిక పాఠశాలాదశలో ఉచితవిద్య (4) నిర్బంధ వ్యాయామ క్రీడావిద్య (5) సర్వశాలలలోని విద్యార్థులకును వైద్యపరీక్ష (6) వికలాంగులకు విద్య (7) 14 యేండ్లు దాటికూడ ప్రాథమిక పాఠశాలను అధిగమించలేనివారికి పై విద్యను నేర్పు ఏర్పాటు ఇట్లు ఆంగ్లవిద్యా విధానపథములో ఫిషర్ శాసనము ఒక మైలు రాయివంటి దయ్యెను

**హాడోకమిటి** - ఫిషర్ శాసనములోని పెక్కు అంశములు 6 7 యేండ్లపాటు ఆచరణములో నున్నవి 1926 లో కేంద్ర విద్యాసదస్సు అవసరమైన మార్పులను సూచించుటకు హాడో అనువాని యాజమాన్యమున ఒక సంఘము నేర్పరచెను ఈ హాడో సంఘనివేదికయే ఇంగ్లండులోని ఆధునికాంగ్ల విద్యావిధానమునకు ప్రాతిపదిక ఆ నివేదికలోని ప్రధానాంశము లివి (1) ప్రాథమిక విద్యసాధ్యమైనంత వరకు స్వయంసంపూర్ణముగ నుండవలెను (2) నిర్బంధ విద్యావయస్సు 15 యేండ్లకు పరిమితము (3) సకలదశలలోను సర్వవిషయ జ్ఞానదాయకముగ నుండుటకై విద్య సంఘావసరములకు సంబంధించియుండుట ముఖ్యము,

**జాతీయ విద్యాసదస్సు చట్టము** - ఈ సదస్సునకు కేంద్ర విద్యామంత్రియే అధ్యక్షుడు ఇందు ప్రభుత్వసలహా సంఘాధ్యక్షుడైన ఆంతరంగికమంత్రియు, రాష్ట్రప్రధాన కార్యదర్శులును ప్రభుత్వోన్నత కార్యవర్గాధ్యక్షుడును రాజకోశాగారాధ్యక్షుడును సదస్యులు దీనికి అనుబంధసంఘములు పెక్కుగలవు కాని 1902 నాటి శాసనము ననుసరించి సలహా సంఘ మొక్కటియే అధికారపూర్వకమైనది ఈ సంఘ నిర్మాతలు విశ్వవిద్యాలయములయు తదితర అధికార విద్యాసంస్థలయు శ్రేయోవృద్ధులను దృష్టియందుంచుకొని సభ్యులను నియమింతురు

**సదస్సు - దాని విధులు** - ఈ విద్యాసదస్సు విధులు సాధారణముగ సలహాపూర్వకమైనవి స్థానిక విద్యాసంస్థలు అధికారపూర్వకముగ దీనికి అధీనమైయుండ నక్కరలేదు సమావేశములను సంప్రతింపులును నిష్ప్రయోజనములైనచో ఈ సదస్సు స్థానికసంస్థలకు ధనసాహాయ్యమును మాత్రము నిలుపుచేయగలదు దీని పర్యవేక్షణమున ప్రభుత్వ పాఠశాలా విచారక బృందమొకటి యేర్పడియుండును ప్రాథమిక మాధ్యమిక సాంకేతికాది విద్యావిధానముల పరిపాలనము ఈ బృందము అధీనమందుండును ఈ బృందము కంటె భిన్నమైనది స్థానికపాఠశాలా విచారకబృందము మొదటిబృందము విద్యాబోధన శాస్త్రసంబంధము కల్గి ఉపాధ్యాయులకు బోధనవిధానముల నేర్పరచును విద్యలకు సంబంధించు అమూల్యవిషయములను సంగ్రహపరచును ఈ విషయసంగ్రహమును రెండవ స్థానికబృందము వినియోగించుకొనును స్థానిక పాఠశాలలను వాటిలోని బోధనాపద్ధతులను ఇది పరీక్షించును మొదటిది రెండవదాని పరీక్షాపద్ధతులను గూర్చి పరిశీలించుచు తన విద్యావిషయక పరిశీలనలను సమాచార రూపమున వివరణపత్రములుగా ప్రచురించును

పైనచెప్పిన పాఠశాలావిచారక బృందములేకాక ఆ దేశమున ఇంకను అనేక విద్యాసంఘములు నెలకొల్పబడినవి వాటి సలహాలు పత్రముల రూపమున వెలువడును ఇట్టిసంఘముల అధ్యక్షులలోనొకరైన మైకేల్ శాడ్లర్ విద్యాసమాచార పత్రములను పెక్కు సంపుటములుగ ప్రచురించినాడు అవి చాల ప్రసిద్ధములు పై సంఘములు బహువిద్యా సమస్యలను గురించికూడ ప్రత్యేకపత్రములను ప్రకటించును,

మొత్తముమీద విద్యాసదస్సు పాఠశాలావిచారక బృందములు మూలమునను బహువిద్యాసంఘముల మూలమునను జాతీయ విద్యావిధాన నిర్మాణము సల్పుచు నిరంకుశత్వమును మాత్రము పూనక వ్యవహరించుట ఇంగ్లండునందు పరిపాటి

**స్థానిక విద్యాపరిపాలనము** — ఫిషర్ శాసనమునుబట్టి స్థానిక విద్యాధికారులు విద్యావిధాన నిర్వహణమునకు పూనిరి విద్యావిషయములో ఇంగ్లండుదేశము 62 జిల్లాలుగను 88 శాఖశాలలుగను 131 పురపాలకసంఘములుగను 40 నగరములుగను లండను ప్రత్యేక మొక నగరముగను మొత్తము 317 విభాగములుగ అప్పుడు విభజింపబడినది దీనిలో విద్యావిషయముల నిమిత్తమై సంఘములెన్నుకొనబడినవి అవియే స్థానికసంస్థలు విద్యకొరకై ప్రజలమీద పన్నులు విధించుటయు ఋణములు తెచ్చుటయు క్రొత్త పాఠశాలలను తెరచుటయు ప్రాతవాటిని నిర్వహించుటయు వీటి విధులు ప్రతి సంస్థకును కార్యనిర్వాహణసంఘమొకటి యుండును ఇంగ్లండులో ప్రాథమికవిద్య ఉచితము వికలాంగుల విద్యకును మతవిద్యకును ప్రత్యేకశ్రద్ధ చూపబడును

**ప్రాథమిక పాఠశాలలు** — ఇందు నాల్గు దశలు గలవు (1) శిశు విద్యాకేంద్ర వస్తు బోధనావిద్యాకేంద్రములు (2నుండి 5 ఏండ్ల వయస్సువరకు) తొలిదశలోనివి; (2) ప్రాథమిక పాఠశాలలు (5 నుండి 8 ఏండ్లవరకు) రెండవ దశలోనివి (3) ఎన్నల పాఠశాలలు (9 నుండి 11 ఏండ్లవరకు) మూడవ దశలోనివి (4) పెద్దల పాఠశాలలు (12 నుండి 16 ఏండ్లవరకు నాల్గవ దశలోనివి మొదటి దశలో మాంటిసోరీ పద్ధతి ననుసరించి ఇంద్రియశిక్షణము జరుగును రెండవ మూడవదశలలో మతవిద్య భాషాసారస్వతములు గణితము ప్రకృతిశాస్త్రము చరిత్ర భూగోళశాస్త్రము చిత్రలేఖనము ఆరోగ్యశాస్త్ర వ్యాయమ క్రీడాదులయందు బోధనము సాగును నాల్గవ దశలో విద్యావిషయములందు అనుష్ఠానమునకు ప్రాధాన్యము కలదు ఈ నాలుగు దశలలోను విద్యార్థులు పరీక్షలు తప్పుట యుండదు నాల్గవదశ దాటినవారు బహు సకృత్తుగనున్న కేంద్రపాఠశాలలలో నాల్గేండ్లపాటు ఇంకను చదువవలెనన్నప్పుడు మాత్రము పరీక్షనీయవలెను వాణిజ్యశాస్త్రము పారిశ్రామిక వృత్తివిద్యలు మున్నగువాటిలో ఈ నాల్గేండ్లను కొలదిమందికి శిక్షణ లభించును

ఈ బడులన్నియు స్థానిక విద్యాధికారుల యేలుబడిలో నుండును వీటిని ప్రభుత్వ పాఠశాలలందురు తక్కినవి స్వతంత్రములు వీటిపై ప్రభుత్వపర్యవేక్షణ లేదు వీటికి విద్యార్థులు విధిగా హాజరు కావలెనను నిర్బంధముండదు వీరసాదలతో తమ పిల్లలు కలిసి చదువుకొనుట గిట్టని ధనికులు తమ ఇండ్లయొద్ద పిల్లలకు శిక్షణమిప్పించినను అది నిర్బంధ బడి హాజరగుటగనే లెక్కింపబడును

**ఉన్నతపాఠశాలలు** — వీటిలో నాల్గు తెగలున్నవి (1) ప్రభుత్వ పాఠశాలలు (2) దినపాఠశాలలు (3) స్థానిక పాఠశాలలు (4) స్వతంత్రములు ప్రభుత్వపాఠశాలలు ధనికుల సౌకర్యముకొరకేర్పడినవి లాటిను మున్నగు ఆదిమహాకావ్య భాషల అధ్యయనమున కివి పేరుబడినవి దినపాఠశాలలు సాధారణ ప్రజోపకారకములైనవి గ్రీకు లాటిను భాషల అధ్యయనమును వ్యాయామ క్రీడాదులమూలమున ఏకీభావ సాధనమును వీటియందుకూడ అనివార్యముగ జరుగును స్థానిక పాఠశాలలు మధ్యతరగతి ప్రజలకును బీదలకును ఉద్దేశింపబడినవి విజ్ఞానశాస్త్రముల బోధనకు ప్రాధాన్యము వహించినవి ప్రభుత్వ యాజమాన్యములేని స్వతంత్రపాఠశాలలకు విద్యార్థులు నిర్బంధముగ హాజరుకాగలెను

**ఉన్నతపాఠశాల విద్య** — ఇది ఎల్లరకు ఉచితముకాదు పేదరికమునుబట్టిగూడ అర్హతగలవారికే విద్యార్థివేతనము లుండును సమస్తవిషయములనుగూర్చిన కొలదిజ్ఞానమును విద్యార్థులకు అలవరతురు నీతిబోధ ఎల్లరకును తప్పదు పరీక్షాధికారులు బయటివారుగనుందురు విద్యాపరిమితి నాలుగేండ్లు

**వృత్తి సాంకేతిక విద్యలు** — ప్రాథమికవిద్యానంతరము ఖండకాలిక విద్యాబోధనకై సాయంవిద్యాసంస్థలు నాల్గుదశలలో విశ్వవిద్యాలయస్థాయి వరకునుగలవు ఇందు వృత్తిసాంకేతికవిద్యలన్నియుగరపబడును ఇవికాక ప్రత్యేక వ్యావసాయక కళాశాలలును గలవు అట్లే విద్యార్థినులకుకూడ కళా శిల్ప గృహవిజ్ఞానశాస్త్రములందు విద్య గరపబడును

**వయోజన విద్య** — విశ్వవిద్యాలయములు శ్రామిక విద్యాసంఘములు, కార్మికసమితులు మున్నగునవి వయోజన విద్యావ్యాప్తికి కృషిచేయుచుండును

**బోధన పాఠశాలలు** — ఉన్నత పాఠశాల విద్య ముగియగనే విద్యార్థులు బోధన పాఠశాలలకు పోవుదురు వీటిని ప్రభుత్వ స్వతంత్రసంస్థలు రెండును నిర్వహించును రెండేండ్ల శిక్షణ ముగియగనే ఇందలి విద్యార్థులు ప్రాథమిక పాఠశాలలలో ఉపాధ్యాయులగుదురు విశ్వవిద్యాలయస్థాయిలో శిక్షణము నాలుగేండ్లు ఇందు సమస్తకళలు, వ్యాయామ క్రీడాదులు బోధింపబడును

విశ్వవిద్యాలయ విద్య - ఇవి సర్వాధికారముగల స్వతంత్రసంస్థలు సమస్తకళలు శాస్త్రములు నేర్పబడు వీటికి అన్నివర్గములనుండి ధన సహాయము లభించును ఆక్స్‌ఫర్డ్ కేంబ్రిడ్జి లండన్ మాన్‌చెస్టరు లివర్‌పూల్ లీడ్స్ బర్మింగ్ హామ్ బ్రిస్టల్ డర్హామ్ వంటివి పదునొకండునకుపైగా ప్రసిద్ధ విశ్వవిద్యాలయములును కేంద్ర సంస్థలలో ఇతర విశ్వ విద్యాలయ కళాశాలలును గలవు

స్త్రీవిద్య - బాల్య ప్రౌఢదశలలో సహవిద్య అంగీకృత మైనను కౌమారమున స్త్రీలకు ప్రత్యేక విద్యాలయము లున్నవి

శరీర వ్యాయామ విద్య - వ్యాయామ క్రీడాదుల మూలమున బాలబాలికలను విద్యావంతులుగ చేయుటకు ఇంగ్లండులో పెక్కు పాఠశాలలును కళాశాలలునుగలవు ప్రయోజనకరమై రసభావబంధురమైన వైయక్తికత ఆంగ్ల విద్యావిధానములో ప్రతిఫలించుచున్నది

బి వి కు శ

## విద్యాచరిత్ర - జపాను

క్రి శ 1867 లో జపానునందు ఆంగ్లాది పరభాషా బోధనకై ఒక పరిషత్తు వ్యవస్థాపితమై అది క్రమముగ నేటి టోకియో సామ్రాజ్య విశ్వవిద్యాలయముగ పరిణద్ధమైనది కాని పాశ్చాత్యమైన దేనిని దిగుమతి చేసికొన్నను దానిని తమ దేశప్రయోజనముల కనుకూలించునట్లు పరివర్తిల్ల జేసి కొనుట అవశ్యకమని జపాను దేశస్థులు అనుభవము మీద గ్రహించిరి కావున క్రి శ 1886 నుండి విశ్వవిద్యాలయ ముల సంఖ్య పెంపగుటయేగాక ఉన్నత విద్యాస్థాయిలో శోధనాత్మక కృషికి ప్రోత్సాహము మెండయ్యెను అట్లే ప్రాథమిక విద్యయు నిర్బంధ మొనర్పబడినది

ఆధునిక విధానము - రాష్ట్రవిద్యావిధాన మంతయు ఒక అమాత్యుని అధీనములో నుండును ఇతని విద్యాశాఖ పెక్కు ఉపశాఖలుగ విభక్తము ఉన్నతవిద్య సమస్త విషయ జ్ఞానము సాంకేతిక విద్య పాఠ్యగ్రంథములు పాఠశాలలలో మతవిద్యవంటి వానికి చెందినవి ఈ ఉపశాఖలు విద్యా పరి పాలనకు చెందిన ఈ ఉపశాఖలుగాక పాఠశాలా విచారక బృందము మరి మూడు ఉపశాఖలతో కలసియున్నను

(i) కళాశాలా విద్యలకును పారిశ్రామిక విద్యలకును వైద్య విద్యలకును ఉపాధ్యాయ బోధనా విద్యలకును చెందిన విచారక బృందము (Inspectorate) ఇందొక ఉపశాఖ

(ii) వాణిజ్య, వ్యావసాయిక నౌకా వాయుశాస్త్రాది సాంకేతిక విద్యలకు చెందిన విచారక బృందము రెండ వది

(iii) బాలబాలికల సర్వవిషయ జ్ఞానసంబంధి విద్యలకును ఉపాధ్యాయ బోధనా పాఠశాలలకును చెందినది మూడవ విచారక బృంద ఉపశాఖ ఇది యంతయు విద్యావిధాన పరిపాలనకు సంబంధించిన పథకము

జపానునందు విద్యాసంస్థ లన్నియు మూడుగ వర్గీక రింపబడినవి (1) ప్రభుత్వ యాజమాన్యము కలవి (2) స్థానికవిద్యాధికారుల ఆధ్వర్యములోనివి (3) స్వతంత్రము లైనవి అని వీటికి వ్యవహారము పూర్తిగ ప్రభుత్వము వారిచే నిర్వహింపబడునవియే ప్రభుత్వ విద్యాసంస్థలు స్థానికసంస్థలు స్థానికవిద్యాధికారి వర్గపాలితములు స్వతంత్రవ్యక్తులుగాని స్వతంత్ర సంఘములుగాని నడపునవి స్వతంత్ర సంస్థలు

ప్రాథమిక విద్య - యూరపుఖండ మందును అమె రికా యందును వలెనే జపానుదేశము నందును ప్రాథమిక దశలో వస్తుబోధన విద్యాకేంద్రములు కలవు ఇవి ప్రభుత్వ నిర్వహణములోనివి అన్ని పాశ్చాత్యదేశముల యందు వలెనే జపానునందు కూడ ఈ దశలో బాలబాలికల శుభ్రతను గూర్చియు ఆరోగ్యవిషయములను గూర్చియు ఆట పాటలకు సంబంధించినంతవరకు వారివారి సహజావబోధముల అభివృ ద్ధిని గూర్చియు శ్రద్ధ తీసికొనుట జరుగును

తరువాతిది విస్పష్టమైన ప్రాథమిక విద్యాదశ ఆరేండ్లవారు గాని అంతకు పైబడిన వయస్సువారు గాని ఈ విద్యాదశలో చేరుదురు ఎదునాల్గేండ్లు వచ్చువరకును వారు బడికి నిర్బంధముగ హాజరు కావలెను కాని, ప్రాథమిక విద్యాదశ సాధారణముగ ఆరేండ్లపాటు మాత్రమే అన వచ్చును పై రెండేండ్ల విద్యయు విద్యార్థికి ఐచ్ఛికము సర్వసాధారణమగు ఆరేండ్ల ప్రాథమికవిద్య ముగియగనే బాల బాలికలు వేర్వేరుగ ఉన్నత విద్యా పాఠశాలల కేగు దురు అనగా ప్రాథమిక విద్యాదశలోనే బ్రహ్మచర్యము నేరపబడును బడికి నిర్బంధముగ హాజరగుట విద్యార్థుల లెల్లో అట్లే విద్యార్థినులకును ఇందుచే నిరక్షరాస్యత యను నది జపానుదేశ మెరుగనిది అన్ని దేశముల యందువలె దేశభాష లెక్కలు చిత్రలేఖనము సంగీతము, కొంచెము

చేతిపని వంటి వాటిని బోధించుట మాత్రమే ఈ దశలో విద్యాప్రయోజనము కాదు నైతిక జాతీయాదర్శము లను విద్యార్థి విద్యార్థినుల హృదయ క్షేత్రములలో నాటుట కూడ ఇప్పటి విద్యకు పరమప్రయోజనము రెండేండ్ల ఐచ్ఛి కాభ్యాస దశలో విద్యార్థులు చరిత్రను, భూగోళశాస్త్ర మును విజ్ఞానశాస్త్రమును పఠింపకతప్పదు ఏదేనియొక విదేశభాష, స్థాపత్యశిల్పము వ్యవసాయ వాణిజ్యశాస్త్ర ములు వంటి వాటిలో ఒకటి రెంటిని అభిమాన విషయము లుగ కూడ వారు పఠింపవలయును

**ఉన్నత పాఠశాల విద్య** - జపానులో ఉన్నత పాఠ శాలలన్నియును మాధ్యమిక విద్యాపాఠశాల లనబడును సాధారణముగ అయిదారేండ్లపాటు ఈ మాధ్యమిక విద్యను గడచిన బాలురు ఉన్నతతర పాఠశాల లనబడు వాటిలో ప్రవేశింతురు ఇవి ప్రవేశపరీక్షగల మనదేశపు కళాశాలలతో సమానములు ఇట్టివి జపానులో మహిళలకు మాత్రము లేవు

ఈ మాధ్యమిక విద్యా పాఠశాలలలో సామాన్య విష యముల పఠనమునకుతోడు జాతీయచరిత్ర పఠనమున కొంత శ్రద్ధమెండు స్థానిక సంఘటనములనెడి ప్రత్యక్ష ప్రమాణ ముల మూలమున ప్రగాఢమైన ఒక జాతీయ భావము నభి వృద్ధిపరచుటయే వారి ఉద్దేశము ఈ మాధ్యమిక పాఠ శాలలు బాలురకొరకే ఏర్పడినవి ప్రత్యేకములైన బాలి కోన్నత పాఠశాలలలో సాధారణ విషయముల పఠనమునకు తోడు గృహశాస్త్రముల పఠనము నెడకూడ శ్రద్ధ అధికము అందుచే ఇట్టి ప్రత్యేకబాలికా పాఠశాలలను గృహ విద్యో న్నత పాఠశాలలు అందురు

బాలుర ఉన్నతతర పాఠశాలలలోని విద్య సామ్రాజ్య విశ్వవిద్యాలయముల (Imperial universities) స్థాయికి దారితీయునదిగ నుండును ఈ ఉన్నతతర పాఠశాలలలోని చదువు మూడేండ్ల పాటుగాని ఏడేండ్ల పాటుగాని సాగును ఈ రెండవపద్ధతి (ఏడేండ్ల) చదువులో సాధారణ విద్యకంటె నాల్గేండ్లపాటు ఎక్కువగ ఉన్నతస్థాయిలో చదువు నేర్పబ డును ఈ నాల్గేండ్ల ఉన్నతస్థాయి విద్యకూడ సాహిత్య విభాగమునందుగాని శాస్త్రవిషయ విభాగమునందుగాని రెండింటి యందుగాని కావచ్చును సామ్రాజ్య విశ్వవిద్యా లయములలో మున్ముందు న్యాయశాస్త్ర శాఖయందో, సాహిత్యశాఖయందో ప్రవేశింపగోరువారు సాహిత్యమునకు సంబంధించిన విభాగములో చేరుదురు భౌతిక శాస్త్రాదులు స్థాపత్యశిల్పము వైద్యవ్యవసాయ శాస్త్రములు వంటి వాటి యందు అధ్యయనము చేయగోరువారు శాస్త్రవిషయ విభాగ ములో చేరుదురు ఏ విభాగమునకు చెందిన వారైనను రెండు విదేశభాషలను తప్పక చదువవలెను

**విశ్వవిద్యాలయ విద్య** - జపానులో ఐదు సామ్రాజ్య విశ్వవిద్యాలయము లు కలవు వీటిలో భిన్నభిన్న కళాశాలలు ఈ కళాశాలలలో భిన్నభిన్నశాఖలుండును ఈ శాఖలయందు కూటములు అనబడు విద్యార్థి పరిశోధక మండలులుండును బి ఏ పట్టభద్రులైనవారు రెండేండ్లపాటు పరిశోధనము చేయుచు ఈ కూటములుగ నేర్పడుదురు

సామ్రాజ్య విశ్వవిద్యాలయములైదునుగాక జపా నులో స్వతంత్ర విశ్వవిద్యాలయము లెన్నియో కలవు వాటిలో జపాను మహిళల విశ్వవిద్యాలయము ప్రసిద్ధి గన్నది ఉన్నత పాఠశాలా విద్యలో ఉత్తీర్ణలయిన బాలికలకు గృహ ఆర్థికశాస్త్రము నందును సాహిత్యమునందును విజ్ఞాన శాస్త్రాదులయందును మూడేండ్లపాటు ఈ విశ్వవిద్యాలయ మున శిక్షణ లభింపగలదు జపానులో ఒక్క డాక్టరు పట్టము మాత్రమే న్యాయశాస్త్ర సమ్మతముగ అంగీకృతము బి ఏ మొదలగు పట్టము లన్నియు చట్టబద్ధముగ అంగీకృతములు కావు

**సాంకేతిక విద్య** - భారతదేశముతో పోల్చినపుడు సాంకేతిక విద్యావిషయములో జపాను సాధించిన ప్రగతికంటె లోకమునకు ఆశ్చర్యావహమైన అంశమింకొకటియుండదు అచ్చట సాంకేతికవిద్య బహువిషయములకుచెందినదై బహు ముఖములుగ విజృంభించెను ఇది నాల్గు దశలుగ విభజింపబడు చున్నది

(1) **విశ్వవిద్యాలయ విద్యాస్థాయి** :- ఉన్నతదశ విశ్వ విద్యాలయస్థాయికి చెందును ఇందు సామ్రాజ్యవిశ్వవిద్యా లయములలోని స్థాపత్యశిల్ప కళాశాలలయందును వ్యావ సాయక కళాశాలలయందును సాంకేతికవిద్యను గరుపు చుందురు

(2) **ఉన్నత పాఠశాలా విద్యాస్థాయి** - కొన్ని సాంకే తిక పాఠశాలలయందును, స్వతంత్ర కళాశాలలయందును బోధింపబడునట్టి సాంకేతికవిద్య రెండవదశకు చెందినది.

ఆయా సంస్థలలోని ఆయా విభాగములకు ప్రత్యేక పాఠశాలలని' సాధారణమైన వ్యవహారము మాధ్యమికవిద్యను సంపూర్తి చేసినవారికే యీ ప్రత్యేక పాఠశాలలలో ప్రవేశము లభించును

(౩) మాధ్యమిక పాఠశాలా విద్యాస్థాయి - ప్రాథమిక విద్యలో ఐచ్ఛికముగ రెండేండ్ల హెచ్చువిద్య నేర్చినవారికే సాంకేతికవిద్యయందు మూడవదశ ఉద్దేశింపబడినది దీనిని నేర్పు సంస్థలను సాంకేతిక పాఠశాల' లందురు వాటియందు వ్యవసాయము మత్స్యశాఖ సముద్రసంపచ్ఛాఖ వాణిజ్యము యాంత్రికశాఖ మున్నగువాటిలో శిక్షణమీయబడును

(౪) ప్రాథమిక పాఠశాల విద్యాస్థాయి - సాంకేతిక విద్యలో నాల్గవదశ సాధారణ ప్రాథమికవిద్య మనేర్చిన వారికొరకై సాధారణసాంకేతిక పాఠశాలల యందు ఏర్పడుచున్నది సాంకేతిక విషయములలో ప్రాథమికవిద్య నిచ్చుట నేర్పబడును చిన్నవాటి చదువులలో సర్వవిషయ జ్ఞానసముపార్జనము లోపించిన బాలురకు ప్రత్యేక పాఠశాలలు వెలకొల్పి ఆ తరువాత వారిని సాంకేతిక పాఠశాలలయందు చేర్చుకొనుట ఇంగ్లండునందు ఒక విశిష్టాచారము జపానునందు వృత్తివిద్యను ప్రాథమిక దశవరకే నేర్చుకొని ఆ ఎదవ జీవనోపాధి సముపార్జనలోనికి దిగినవారికొరకై వృత్తి విద్యలో అధికజ్ఞాన సముపార్జనార్థమై 'తరువాయి పాఠశాల లని యేర్పడుట ఒక విశిష్టాచారము ఇట్టివిద్యను సాధారణముగ స్థానికసంస్థలు నిర్వహించుచున్నవి వయస్సు పైబడినవారికివి ప్రయోజనకరములు ఇట్టి తరవాయి వృత్తి విద్యా పాఠశాలలు సాయంకాలయందే పనిచేయును ప్రాథమిక విద్యాపాఠశాలల భవనములే అధికముగ ఇందులకు ఉపయోగపడుచున్నవి వృత్తివిద్యాధిక్యముతోపాటుగ ఇంచుక సమస్త విషయజ్ఞానము నుకూడ నిచ్చుట అలవరతురు

ఉపాధ్యాయ బోధనాసంస్థలు - ప్రాథమిక పాఠశాలో పాధ్యాయుల బోధన నిమిత్తమై ప్రామాణిక పాఠశాలలు (Normal schools) అని జపానునందు అమెరికాయందు వలెనే వెలసియున్నవి వీటిని ప్రభుత్వము నిర్వహించును హెచ్చు రెండేండ్లతో కలిపి ఎనిమిదేండ్లపాటు ప్రాథమికవిద్యను నేర్చిన విద్యార్థులకే ఇట్టి బోధనాసంస్థలలో ప్రవేశార్హత కలదు వీటిలో సమస్త విషయజ్ఞానమునకు సంబంధించునట్టియు సన్నాహరూపమైనట్టియు, ప్రవేశవిద్య ఒక యేడాదిపాటు నేర్పబడును ఆ పిదప నాల్గేండ్లు వరుసగ బోధనవిద్య సాగును

ఈ ప్రామాణిక పాఠశాలలస్థాయికి పైస్థాయిలో ఉన్నత ప్రామాణిక పాఠశాలలు అని కొన్ని ఏర్పరుపబడినవి మాధ్యమిక పాఠశాలోపాధ్యాయులకు బోధన మిట్టివాటిలో గరపుదురు బాలికోన్నత పాఠశాలోపాధ్యాయులకుగూడ ఇచ్చటనే బోధనజరుగును కాని ఇట్టి పాఠశాలల సంఖ్య చాల తక్కువ బనను బాలబాలికలకు వేరువేరుగ ఏర్పడియున్నవనవచ్చును ఒక్కొకదానిలో వందకుమించియే ఉపాధ్యాయ విద్యార్థులుందురు విద్యాబోధన విధానముల సాధనకై వీరికొరకు కొన్ని మార్గదర్శకపాఠశాలలు కూడ మాధ్యమికస్థాయికి చెందినవి కలవు ఇందు చదువు సాధారణముగ నాల్గేండ్లపాటు జరుగును పట్టభద్రులనిమిత్తము ఒకటిరెండేండ్లపాటు తరవాయి చదువునకేర్పాట్లునుగలవు జపానీయులలో దేశభక్తి ప్రగాఢతయు గవేషణాభిలాషయు అభ్యాససిద్ధి ప్రభృతి లక్షణములును జపాను దేశస్థుల విద్యావిధానము లలో ప్రస్ఫుటముగ గోచరించుట ఆశ్చర్యజనకము కాజాలదు అట్లే జపానునందు రెండువిధములైన మతములుగాని ఒకే మతముయొక్క రెండుశాఖలుగాని యున్నవనవచ్చును అవి విద్యావిధానములో ఒకదానితోనొకటి కారసిల్లుచున్నవి ఐనను జపానుదేశస్థులెల్లరు "నా విష్ణుః పృథివీపతిః" అని నమ్ముదురు అందువలన వారి విద్యావిధానమంతయు ఆ విశ్వాసమును ప్రోద్బలకముగ తీర్చిదిద్దబడి రాజభక్తిని ప్రేరేచినదియై పౌరులలో ప్రగాఢ దేశభక్తినికూడ పాదుకొల్పుచున్నది

వి వి ద శ

## విద్యాచరిత్ర - పశ్చిమ జర్మనీ

ఆధునికమైన పశ్చిమజర్మనీలో విద్యావిధాన పరిపాలనమంతయు కేంద్రీకృతము కేంద్ర విద్యాధిష్ఠాన వర్గమునకు పరిపాలనాంగములుగ విభిన్నశాఖలేర్పడి అందొక్కొక్క శాఖ ఒక్కొక్క అధ్యక్షుని దర్శకత్వముగ పనిచేయును ఈ శాఖలలో అధ్యక్ష నియుక్తులైన సభ్యులుందురు కేంద్రవిద్యాధిష్ఠానవర్గము ఒక్కొక్క రాష్ట్రమునకు ఒక్కొక్క రాష్ట్రపాఠశాలాసదస్సును నియమించును అట్లే కొన్ని గ్రామపాఠశాలా సదస్సులుకూడ ఏర్పడును మహానగరములకు పాఠశాలా ప్రతినిధివర్గములను పేరిట సదస్సులుండును వివిధములైన ఈ విద్యావాల సంస్థలకు తోడు అధిష్ఠానవర్గము తన పాఠ

శాలా విచారక బృందమును పర్యవేక్షమునకై పంపుచుండును. ఇంతేకాక ఈ దేశములో తలిదండ్రుల సంఘములు, విద్యార్థి పోషకుల సంఘములునుగలవు. ఈ ఉపదేష్టృసంఘములు ప్రభుత్వముచే స్థాపింపబడును.

**ప్రాథమిక పాఠశాలావిద్య** - అమెరికా ఇంగ్లండుల యందువలెనే పశ్చిమ జర్మనీయందును పసిపిల్లల విద్యాకేంద్రములు కలవు. ఇవి చాలవరకు స్వతంత్రసంస్థలచే పరిపాలితములు. ప్రపంచములోని దేశములన్నిటియందుకంటె పశ్చిమజర్మనీలో మాంటిసోరీ విధానసూత్రములు ఎక్కువగా ఆచరణమందున్నవి.

**పాఠశాలలు వయోజనవిద్య** - జర్మనీయందు బాలబాలికలు తమతమ ఆరవ జన్మదినముకు మొదలుకొని విధిగా పాఠశాలలకు పోవలయును. మొదటినాల్గేండ్లును ప్రాతిపదిక విద్య ఎల్లలందరకును సమానముగనే ఉండును. కొన్ని రాష్ట్రములలో ఈ ప్రాతిపదిక విద్యయే ఆరేండ్లుండును. ఈ అధ్యయనానంతరము బాలబాలికలలో ఎనుబది శాతము విద్యార్థినీ విద్యార్థులు ప్రాథమిక పాఠశాలలలోనే ఉండిపోయి పదునాల్గేండ్లు వచ్చినపిమ్మట ఆయాబడులను వీడి ఏదో ఒకవృత్తియందుగాని వ్యాపారమునందుగాని శిక్షణ పొందుదురు. క్రీ శ 1962 లో పాఠశాలలను వదలివచ్చిన విద్యార్థులలో 72 శాతము ప్రాథమిక పాఠశాలా విద్యార్థినీ విద్యార్థులున్నారు. వారు వృత్తిశిక్షణశాలలకు వారములో ఆరు నుండి పండ్రెండు గంటలవరకు ఆపైన మూడేండ్లును వెళ్లితీరవలయును.

ప్రాథమిక పాఠశాలలలో అధ్యయనము ముగించిన అనంతరము విద్యార్థినీ విద్యార్థులు మాధ్యమిక పాఠశాలలకుగాని ఉన్నత పాఠశాలలకుగాని వెళ్లవచ్చును. మాధ్యమిక పాఠశాలలలో ఆరు తరగతులుండును. అచ్చట విద్యాభ్యాసము ముగిసిన తర్వాత విద్యార్థులు ప్రభుత్వసంస్థలలోగాని, వ్యాపార సంస్థలలోగాని ఉద్యోగములు సంపాదించుకొనవచ్చును. ఉన్నత పాఠశాలలలో విద్యాభ్యాసము తొమ్మిదేండ్లును పూర్తియైన తర్వాత అది చరమ పరీక్షతో ముగియగలదు. అనంతరము విశ్వవిద్యాలయములలోగాని, అట్టి వేరు సంస్థలలోగాని ప్రవేశము సంపాదించుటకు పై పరీక్షలో ఉత్తీర్ణత ఆవశ్యకము. ఈ ఉన్నత పాఠశాలలు మూడు విధములైనవి. మొదటివానిలో ప్రాచీన సంప్రదాయ భాషలయందు శిక్షణకు ప్రాముఖ్యము కలదు. రెండవ తరగతిలో గణితము, ప్రకృతి శాస్త్రములు మున్నగువాటికి శిక్షణకు ప్రాముఖ్యమియ్యబడును. ఈ పాఠశాలలలో చాలవరకు జీతములు కట్టవలసిన అవసరముండదు. విద్యాశిక్షణలో విద్యార్థినీ విద్యార్థులందరు వారివారి ఆర్థిక సాంఘిక స్థితిగతులతోగాని వంశ విజ్ఞాన విధేయతలతోగాని నిమిత్తము లేకయే, సమానావకాశములు కలుగునట్లు ప్రభుత్వమీ పాఠశాలలకు గ్రాంటు లిచ్చును. ప్రాథమిక పాఠశాలలయందు మాత్రమే సహవిద్య నెరపుదురు. ఆపై తరగతులకు బాల బాలికల పాఠశాలలు ప్రత్యేకములై యుండును.

విద్యార్థినీ విద్యార్థులు (1) స్వతంత్రభావనాశక్తిని పెంపొందించుకొని ఉత్సాహముగ చదువుకొనుటకును (2) దేశమునెడ తమ బాధ్యతలను గుర్తించుటకును (3) ఇతరుల విశ్వాసములపట్ల గౌరవభావమును పెంపొందించుకొనుటకును (4) స్వదేశమునెడను తోడిమానవులనెడను ముఖ్యముగా అంతర్జాతీయ సామరస్య సహకార సౌమనస్యములయందు ఆసక్తిని అభివృద్ధిచేసికొనుటకును తోడ్పడుటయే జర్మనీలోని విద్యాసంస్థలన్నిటియందును బోధనా ప్రణాళికలకు ప్రధాన లక్ష్యము. ఈ రీతిగ సామాన్య వైజ్ఞానిక శిక్షణ నిచ్చెడి పాఠశాలలేకాక వృత్తి శిక్షణ నిచ్చెడి పాఠశాలలు పెక్కులు వేరుగా నున్నవి. వీటిలో వృత్తి శిక్షణ నిచ్చెడి పాఠశాలలకు సామాన్య పాఠశాలలను వదలి వచ్చెడి విద్యార్థులందరును పదునెనిమిదేండ్లు వచ్చువరకు వెళ్లితీరవలయును. పూర్ణకాల వృత్తి విద్యాశాలలను ఉన్నత వృత్తి శిక్షణశాలలు గూడ ఇట్టివే. కార్యాలయములయందును వ్యాపారసంస్థలయందును పనిచేయుటకు యోగ్యులైనవారికి శిక్షణనొసగి దేశీయవృత్తులకు ఉపకరించు విధముగ వారిని తీర్చి దిద్దుటయే పూర్ణకాల వృత్తి శిక్షణశాలల ప్రధానధ్యేయము. ఇంకను అధికమైన యోగ్యతలతో అక్కరపడు వృత్తులకు తగిన విద్యార్థుల నెన్నుకొని ఉన్నత వృత్తి శిక్షణశాలలు నిపుణమగు శిక్షణ నొసగగలవు. ఈ శిక్షణ పరిమితి ఆరునెలలనుండి ఆరేండ్లవరకు సాగును. దేశమందలి తొంబదియారు స్థాపత్య కళాశాలలును ఇట్టి ఉన్నత వృత్తి శిక్షణశాలలుగనే పరిగణింపబడును.

విద్యాసంస్థల వివరములు

| విద్యాసంస్థల పేర్లు | విద్యాసంస్థల సంఖ్య | విద్యార్థుల సంఖ్య |
|---|---|---|
| 1) ప్రాథమిక పాఠశాలలు | 30 767 | 56 07 400 |
| 2) మాధ్యమిక పాఠశాలలు | 1 377 | 5 39 200 |
| 3) ఉన్నత పాఠశాలలు | 1 761 | 9 57 900 |
| 4) వృత్తివిద్యాశాలలు | 2 167 | 17 41 900 |
| 5) సాంకేతిక విద్యాశాలలు | 5 157 | 4 06 120 |

**మాధ్యమిక పాఠశాలా విద్య** ఉన్నత పాఠశాలా విద్యనేర్చుకొనలేని వారి నిమిత్తమై పశ్చిమజర్మనీ ప్రభుత్వము మాధ్యమిక పాఠశాలలను ఏర్పరచినది ఇంగ్లండులోని ప్రాథమిక విద్యాదశయందలి 12 నుండి 16 ఏండ్లవారి వరకు గల పెద్దల పాఠశాలలతో వీటికి పోలిక కలదు విద్యార్థులు తమ పదియవయేటి నుండి కూడ ఈ పాఠశాలలలో చేరవచ్చును అట్టి పరిస్థితులలో ఈ మాధ్యమిక విద్యాపరిమితి ఆరేండ్లు పదునాల్గేండ్లు దాటిన తర్వాత విద్యను కొనసాగింపలేనివారు జర్మనీలో ఖండకాలిక పాఠశాలలయందు ప్రవేశింపగలరు ఇవి ఇంగ్లండులోని తరవాయి పాఠశాలలను పోలినవి కాని బాలబాలికలకు ఎవ్వరియొద్దనేని పని నేర్చుకొనునప్పుడే యిట్టి ఖండకాలికాధ్యయన సౌకర్యములు లభింపగలవు పశ్చిమ జర్మనీ ప్రభుత్వము కూడ ప్రపంచమునందలి అన్ని దేశముల వలె విద్యార్థుల హాజరును ప్రాథమిక దశనుండియు నిర్బంధముచేసినది కాని యిందు కొంతభేదముకలదు పశ్చిమజర్మనీ దేశమున బాలబాలికలు హాజరగుట ప్రభుత్వ రక్షకభటుల ఆధీనములోనుండును ఆ రక్షకభటులు ఆయా వయస్సులను బట్టి విద్యాభ్యాసయోగ్యులయిన వారి పట్టికలను సిద్ధముచేసి పాఠశాలాధికారులకు పంపుదురు హాజరుకాని విద్యార్థుల పేర్లు రక్షకభటులకు అందిచ్చుట ఉపాధ్యాయుల విధి ఈ నిర్బంధ విద్య బౌద్ధిక శారీరక వికాసముగల బాలబాలికలకు మాత్రమేగాక మూగ చెవిటి గ్రుడ్డివారలకు కూడ కలదు ఇట్టి బధిర పంగ్వంధులకు అచ్చట వేర్వేరు పాఠశాలలున్నవి

**ఉన్నత పాఠశాలా విద్య** - దీని పరిమితి తొమ్మిదేండ్లు ఉన్నతపాఠశాలలలో పెక్కింటికి స్థానికసంస్థల యాజమాన్యమే సిద్ధము ఏ వాడలో ఉన్నతపాఠశాలలుండునో ఆ వాడలో పాఠశాలా ప్రత్యేకసంఘము నొకదానిని ప్రభుత్వము నియమించును ఆ సంఘమాపాఠశాలా వ్యవహారములను పర్యవేక్షింపగలదు జర్మనీయందు ఉన్నతపాఠశాలోపాధ్యాయులకు తమ పాఠ్యాంశములనుగాని తమ పాఠ్యగ్రంథములనుగాని తాము నిర్ణయించుకొని తమ బోధనాపద్ధతులను తాము అవలంబించు స్వాతంత్ర్యము లేదు

**ఉన్నత పాఠశాలలలోని తెగలు** - ఉన్నతవిద్యాదశలో ఐదు తెగల పాఠశాలలున్నవి

(1) **సాధనశాల (Gymnasium)** - ఈ పేటిపాఠశాలలలో గ్రీకు రోమను సంస్కృతములవంటి ఆది భాషలకు సంబంధించిన బోధ జరుగును

(2) **వాస్తవిక సాధనశాల** - ఇందు ఆదిభాషల బోధనతోపాటు ఆధునిక భాషల బోధనకు ఏర్పాటులున్నవి ఇది ఉన్నతస్థాయి పాఠశాల

(3) **ఆధునిక వాస్తవికపాఠశాల** ఇందు కేవలము ఆధునిక భాషలతోపాటు శాస్త్రవిషయములును సాంకేతిక విషయములును సన్నాహరూపమున నేర్పుదురు ఇవి తక్కువ స్థాయి పాఠశాలలు

(4) **ఆధునిక పాఠశాలలు** - ఇవి సంపూర్ణాభివృద్ధిగల పాఠశాలలు పైనచెప్పిన మూడవతెగ పాఠశాలలు బోధించు విషయములనేగాక ఇవి ఆధునిక కళలనుకూడ బోధించుచుండును

(5) **భోజనవసతి సౌకర్యములుగల పాఠశాలలు** - బీద విద్యార్థులకొరకేర్పడిన భోజనవసతి సౌకర్యములుగలవి ఈ ఉన్నతవిద్యా పాఠశాలలు ఇవికూడ సంపూర్ణాభివృద్ధిగల పాఠశాలలేగాని ప్రత్యేకముగ చిన్నచిన్న పట్టణములలోని బీద విద్యార్థులకొరకై యేర్పడినవి భోజన నివాస వసతులు రెండునుగల పాఠశాలలు జర్మనీలో ఈ స్థాయియందు మాత్రమే అగపడుచున్నవి

పశ్చిమ జర్మనీలో ఉన్నతపాఠశాలావిద్య చాల వ్యయపూర్వకమైనది అందుచే బీదలును యోగ్యులునైన విద్యార్థులకు జీతమును తగ్గించు సౌకర్యములు ప్రత్యేకముగ కలవు ఉన్నతపాఠశాలావిద్యకు యుక్తవయస్కుడైన కొడుకు ఒకడున్నప్పుడుమాత్రమే తండ్రి వానికి నిండుజీతము కట్టవలయును రెండవవాడున్నప్పుడు అతనికి 75 శాతము జీతము కట్టిన చాలును అట్లే మూడవవానికి 50 శాతము కట్టిన చాలును ముప్పేరనుమించి యెందరు కొడుకులున్నను

వారి ఉచితవిద్యనే లభింపగలదు ఈ జీతము తగ్గింపు సౌకర్యము ఆయా తండ్రుల కుమారులు భిన్నభిన్న పాఠశాలలలో భిన్నభిన్న దశలయందున్నప్పుడే దొరకును ఇచట కొడుకల కని చెప్పిన సౌకర్యము కూతుండ్లకను చెల్లగలదు

**ప్రాథమికోన్నత పాఠశాలల పరీక్షలు** - విద్యార్థిని పైతరగతిలోనికి పంపుట కేవలము పరీక్షనుబట్టి కాదు అయా విద్యార్థుల విద్యాకృషినిబట్టి ఆయా ఉపాధ్యాయులిచ్చు అభిప్రాయము నాధారము చేసికొనియు విద్యార్థులను పై తరగతులకు పంపుదురు ఉన్నతవిద్యాసమాప్తి కాగానే ఒక పరీక్ష జరుగును ప్రతిరాష్ట్రమునందును గల ఉన్నతపాఠశాలా విద్యాసమాప్తి పరీక్షాసంస్థ (School Leaving Examination Board) ఈ పరీక్షను నిర్వహింపగలదు ఈ సదస్సు నందొక విచారకుడును ఆ పాఠశాలా ప్రధానోపాధ్యాయుడును ఆయా విషయములను బోధించు ఉపాధ్యాయులును సందర్భములనుబట్టి ఉందురు ఇట్టి ఉన్నతపాఠశాలా పరీక్షా ప్రమాణము భారతీయకళాశాలలయందలి ప్రవేశపరీక్షాప్రమాణముతో తులతూగును ఇచ్చట విద్యార్థికి ఏమి తెలియునన్నది పరీక్షాంశమేగాదు సమాధానించు విధానములో విద్యార్థి స్వతశ్శక్తిని ఎంత చూపగలడు అన్నదే పరీక్షాంశము

**ఉపాధ్యాయ బోధనా సంస్థలు** -

**ప్రాథమిక విద్యోపాధ్యాయులు** - ఉపాధ్యాయవిద్యాసంస్థల (Pedagogic academies) లో ప్రాథమిక విద్యోపాధ్యాయులకు బోధనసాగు ఏర్పాట్లు కలవు వీరు కనీసము ఉన్నతపాఠశాలావిద్యను పూర్తిచేసి యుండవలయును ఈ సభలలో బోధనము రెండేండ్లపాటు ఈ రెండేండ్లుముగియగనే ఆ ఉపాధ్యాయులు ప్రథమపరీక్షలో ఉత్తీర్ణులు కావలెను ఇట్లు పరీక్ష నెగ్గినవారికి తాత్కాలికోద్యోగములు దొరకగలవు అందు రెండునుండి నాల్గేండ్లవరకు బోధనాభ్యాసంగమును పూనవలెను తదనంతరము ఆ ఉపాధ్యాయులకు ద్వితీయ పరీక్ష సాగగలదు అది కేవలము వృత్త్యనుభవపరము, సాధనాపరమునైయుండును దీనియందలి ఉత్తీర్ణతనుబట్టి వారు ఉద్యోగములలో స్థిరపడుదురు

నాట్లరు అధికారములోనికి వచ్చినతరువాత ఈ ఉపాధ్యాయ బోధనాపాఠశాలలు చాలవరకు గ్రామప్రాంతములలోకూడ నెలకొల్పబడినవి భావికాలపు ఉపాధ్యాయులు జానపద జీవితముతో నిత్యసన్నిహిత సంబంధమును కలుపుకొని గ్రామీణయువకులకు నాయకులు కాగలరను నుద్దేశమే యిందలి ప్రధానోద్దేశము

ఉన్నతపాఠశాలోపాధ్యాయులకు బోధన నొసంగుటకు ప్రత్యేకముగా ఉపాధ్యాయ విద్యాసంస్థలు లేవని చెప్పవచ్చును ఇట్టి బోధనము కొన్ని రాష్ట్రములలో విశ్వవిద్యాలయములకుగాని కలవు వీటిలో ప్రవేశమునకు విశ్వవిద్యాలయ విద్యార్థులకే అర్హత అట్టి అర్హతకొరకు వడినవారికి సమయమున్నచో ఆ అర్హత కల్గువరకు ఈ విద్యాసంస్థలే బోధనసాగించును అందు బోధనవిద్యలో ఒకటి రెండేండ్లపాటు శిక్షణ జరుగగలదు ఇందు ఉత్తీర్ణులైనవారికి ఉన్నతపాఠశాలలలో ఉద్యోగానుభవసమునిమిత్తము రెండేండ్లుమరలసాగనముండును ఆ కాలమునందు ఆయా ఉన్న పాఠశాలా ప్రధానోపాధ్యాయుల పర్యవేక్షలో ఈ సాధకులు పనిచేయుదురు తరువాత స్థాని పరిషా దిస్సులు జరుపు పరీక్షయందు నెగ్గి వీరు శాశ్వతోద్యోగములలో స్థిరపడుదురు

**సాంకేతిక విద్య** - తమ వృత్తుల కనుకూలించు చేతి పరిశ్రమలలో పని నేర్చుకొనువారు ప్రాథమిక విద్యనో ప్రాథమికానంతర విద్యనో పరిపూర్తిచేసినవారగుచో వారికితర ఐరోపీయ దేశములందువలెను అమెరికా యందువలెను వృత్తి విద్యలలో శిక్షణ మొసగబడగలదు ఆయావిద్యార్థుల సామర్థ్యమును పెంపొందించి వారివారి కిష్టమగు చేతిపనులలో అభిరుచిని అభివృద్ధిపరచుటయే ఈ వృత్తి విద్యల శిక్షణ ప్రయోజనము వృత్తి విద్యాపాఠశాలల యందలి జీవితము శాఖోపశాఖలుగ విస్తరిల్లి అది క్రమసంయుతమైన సాంకేతిక విద్యావిధానమునకొరకు ప్రాతిపదికగ నేర్పడుచున్నది

వృత్తి విద్యా పాఠశాలలవలెనే సాంకేతిక విద్యా పాఠశాలలును వాణిజ్యము శిల్పాదివిద్యలు పరిశ్రమలు మున్నగువాటియందు శిక్షణ నిచ్చును కాని వృత్తి విద్యవలె సాంకేతిక విద్య ఖండకాలిక విద్యగాదు అఖండ దీక్షతో నిర్వహింపదగినది పారిశ్రామికులను ఆయావర్తక వ్యాపారములలో నాయకులగునట్లుగను బాధ్యతాపరులగునట్లుగను తీర్చిదిద్దుట సాంకేతిక పాఠశాలల ప్రధానాశయము గావున ఖండకాలిక విద్య (Partime Education) వారికి చాలగదు; పూర్తి శ్రద్ధ అవశ్యకము ఈ సాంకేతిక పాఠశాలలు రెండు తెరగులైనవి (1) ఉన్నత సాంకేతిక పాఠశాలలు, (లి)

సాంకేతిక సదనములు ఇందు మొదటిరకము పాఠశాలలలో వృత్తి విద్యతోపాటు సమస్తవిషయ జ్ఞానసంబంధి విద్యను కూడ నేర్పుదురు ఇవి స్వతంత్రముగ కర్మాగారాదికముమ నెలకొల్పుకొను ఛాత్రకొరకుద్దేశింపబడిన వగుటచే ఇందుకు చేరుటకు పీటియందు ఇరువదేండ్లకు మించినవారిని చేర్పు కొనుటయే నియమవిధి అట్టివారికి లోగడ తమవృత్తిలో కనీసము మూడేండ్ల అనుభవముండుటకూడ ఇందొక నియమము జర్మనీలో ప్రతివృత్తి పాఠశాల యందును వృత్తి సదనమునందును శాఖోపశాఖలుగ వృత్తి విద్యలను నేర్పుదురు అంతేగాదు ఒక్కొక్క పాఠశాలయు ఒక్కొక్క సదనమును ఒకటి రెండు విద్యలలో ఉన్నత స్థాయివరకు ప్రత్యేక కృషిని జరుపుచుండును

విశ్వవిద్యాలయ వీక్ష - పాఠశాలావిద్య పూర్తి చేసినవారి విజ్ఞానాభివృద్ధికొరకై నేడు చాల అవకాశములు కల్పింపబడినవి ముఖ్యముగ యువకవిద్యార్థుల నిమిత్తమై జనతావిశ్వవిద్యాలయములును పౌరగ్రంథాలయములును నెలకొల్పబడియున్నవి మొత్తమీద 4 479 శాఖలుగల 1 148 సాయంకాలవిద్యాసంస్థలు (1955 నాటిలెక్కలనుబట్టి) కలవు మానవసంబంధసామరస్యాభివృద్ధికిని స్వతంత్ర భావనకును వ్యక్తి స్వాతంత్ర్యముతో తమజీవితమును తాము తీర్చిదిద్దుకొనుటకును అవకాశములు కల్పించెడి స్వయంవిద్యాశిక్షణకేంద్రములు ఇచ్చట పెక్కులు గలవు ఇట్టికేంద్రములలో విద్యార్థులకు ఏవిధమగు భావనిర్బంధమును ఉండదు

కళలు శాస్త్రవిజ్ఞానము పరిశోధనలు - కళలు విజ్ఞాన శాస్త్రములు పరిశోధనలు మున్నగువానిలో శిక్షణ ఇచ్చెడి ఉన్నతవిద్యాసంస్థలు ద్విముఖ ప్రయోజనములు గలవి (1) వివిధవృత్తులకును ఉత్తమ నిపుణులను సంసిద్ధపరచుటయు (2) నూత్నపరిశోధనలను ప్రోత్సహించుటయు ఈ సంస్థలకర్తవ్యము జర్మన్ ఫెడరల్ రిపబ్లిక్ లో మొత్తము 18 విశ్వవిద్యాలయములును 9 సాంకేతికకళాశాలలును 6 చిన్నరకపు సాంకేతికసంస్థలును గలవు వీనిలో చివరిరెండువిధములైన సంస్థలుకూడ విశ్వవిద్యాలయములతో సమానస్థాయిగలవి గాటింగెన్, హైడెల్‌బర్గు మెయిన్జ్, మ్యూనిక్ లలో శాస్త్రపరిషత్తులు గలవు డుసెల్‌డార్ఫ్‌వద్దనున్న ఉత్తర రైన్ వెస్ట్‌ఫేల్లియా రాష్ట్రీయశాస్త్ర పరిశోధనాకేంద్రము కూడ ఇట్టి పరిషత్తనియే చెప్పనగును

కానిగ్ స్టయిన్ ఒడంబడిక ననుసరించి ముఖ్యమైన పెక్కుపరిశోధన కేంద్రముల నిర్వహణ బాధ్యతలను రాష్ట్ర ప్రభుత్వములే స్వీకరించినవి ఉత్తమశ్రేణికి చెందిన 40 పరిశోధన కేంద్రములతో కూడిన మాక్స్‌ప్లాంక్ సొసైటీ" ఇట్టి సంస్థలలో అగ్రగణ్యమైనది ఈ కేంద్రములు ముఖ్యముగ ప్రకృతిశాస్త్ర పరిశోధనలయందు శ్రద్ధగా కృషిచేయుచున్నవి వీటికి విశ్వవిద్యాలయములతో ఎట్టి సంబంధములేదు క్రీ శ 1957 నుండి ఈ ఒడంబడికవలన కాగలవ్యయములో సగపాలు కేంద్రప్రభుత్వము భరించుచున్నది

కేంద్ర రాష్ట్రప్రభుత్వములు కలిసి కళలయు విజ్ఞాన శాస్త్రములయు పరిశోధనల విషయములో సమష్టిగా ఒక సలహాసంఘము నేర్పాటుచేసి పరిశోధకులకు సమగ్రమైన ప్రణాళికలను ఆయత్తపరచు బాధ్యతలనెల్ల ఈ సంఘమునకే అప్పగించిరి కొత్తతరమునకు చెందిన శాస్త్రవేత్తల విజ్ఞాన వికాసములకు వెచ్చించు వ్యయములో 72 శాతమువరకు కేంద్రప్రభుత్వము ఆ పద్దులోచేర్చి పైసంఘము నిర్వహించు పరిశోధనల వ్యయమునుగూడ భరింపగలదు తక్కినమొత్తము రాష్ట్రప్రభుత్వముల నుండియు, కళాశాస్త్ర విజ్ఞానములను ప్రోత్సహించు పోషకుల సంస్థనుండియు లభించును ఈ పోషకసంస్థను వాణిజ్యవ్యాపార సంస్థలవారు పరిశోధనకొరకును బోధనకొరకును ఉన్నతవిద్యా ప్రోత్సాహముకొరకును సమష్టిగ నెలకొల్పియున్నారు

పశ్చిమ బెర్లిన్‌తో కూడిన "ఫెడరల్ సమాఖ్య యందలి విశ్వవిద్యాలయములు అట్టి యితరసంస్థలు దిగువ పేర్కొనబడినవి

విశ్వవిద్యాలయములు

(విద్యార్థుల సంఖ్య 2 05 000)

(1) బెర్లిన్
(2) బాన్
(3) కొలోన్
(4) ఎర్లాంగెన్-నూరెంబర్గు
(5) ఫ్రాంక్‌ఫర్టు
(6) ఫ్రైబర్గు
(7) గసెన్
(8) గోటింగ్
(9) హాంబర్గు
(10) హైడెల్‌బర్గు
(11) కీల్
(12) మైన్జు
(13) మార్బర్గ్
(14) మ్యూనిక్
(15) మ్యూన్‌స్టర్
(16) సార్‌బ్రూకెన్
(17) టూబింగెన్
(18) వూర్ట్జ్‌బర్గు

సాంకేతికకళాశాలలు

(విద్యార్థుల సంఖ్య 58 600)

(1) ఆచెన్
(2) బెర్లిన్ (సాంకేతిక విశ్వవిద్యాలయము)
(3) బ్రన్స్విక్
(4) క్లాస్థాల్ (ఖనిజశాస్త్రపరిషత్తు)
(5) డార్మ్‌స్టెట్
(6) హనోవర్
(7) కార్ల్స్రుహె
(8) మల్యానిక్
(9) స్టట్‌గార్టు

విశ్వవిద్యాలయ స్థాయిగల ఇతర శాస్త్రకళాశాలలు

(విద్యార్థుల సంఖ్య 4 800)

(1) వైద్యపరిషత్తు - డుసెల్‌డార్ఫ్
(2) పశువైద్యకళాశాల - హనోవర్
(3) వ్యవసాయ శాస్త్రపరిషత్తు - హోహెన్‌హీం
(4) అర్థశాస్త్ర పరిషత్తు - మన్‌హీం

ఇవికాక క్యాథలిక్కులకు ప్రొటెస్టెంటులకు చెందిన 17 ఆస్తిక కళాశాలలును (ఇందలి విద్యార్థుల సంఖ్య 2 800) 16 సంగీత నాటక కళాశాలలును 11 దృశ్యకళాశాలలును (విద్యార్థుల సంఖ్య 9 100) 88 ఉపాధ్యాయకళాశాలలును (విద్యార్థుల సంఖ్య 46 600) పలుతావులందు కలవు

పశ్చిమజర్మనీలో విశ్వవిద్యాలయము లందును అట్టి యితర సంస్థలయందును ప్రస్తుతము దాదాపు 2½ లక్షలమంది జర్మనులు 28 000 మంది విదేశీయులును శిక్షణ పొందుచున్నారు వీరిలో 27 శాతము విద్యార్థినులు విదేశీయులలో సుమారు 25 శాతము సాంకేతిక శిక్షణమును పొందుచుండిరి జర్మను విద్యార్థులలో 54 శాతము కళలయందును సాంఘికశాస్త్రముల యందును సుశిక్షితులగుచున్నారు వైద్యశాస్త్రమున 16 శాతమును విజ్ఞానశాస్త్రములలో 6 శాతమును సాంకేతిక విషయములలో 14 శాతమును శిక్షణ పొందుచుండిరి

జర్మనీ విద్యా ద్వినిమయసంస్థ అనుసంస్థ విద్యార్థులకు ఇతర దేశములతో సంబంధసౌకర్యములను నెలకొల్పుటకై ఉద్దిష్టమైనది ఫెడరల్ రిపబ్లికు విశ్వవిద్యాలయములు విదేశీయులకొరకు ఏర్పరచిన ఉచిత విద్యావేతనముల విషయమునకు కూడ ఈ సంస్థకార్యభారము వహింపగలదు

విదేశీయ విశ్వవిద్యాలయములలో అధ్యయనము ముగించుకొని వచ్చిన విదేశపట్టభద్రులు ఫెడరల్ రిపబ్లికులోని పరిశోధనశాలలయందు శిక్షణపొందుటకై అలెగ్జాండర్ వాన్ హంబోల్టు ధర్మసంస్థ విద్యార్థి వేతనముల నొసగుచున్నది ప్రస్తుతము ఏబదికి మించిన దేశములనుండి వచ్చిన 387 మంది ఈ రీతిగా ఉచిత శిక్షణ పొందుచున్నారు

నాజీ ప్రభుత్వములో జర్మను విద్యావిధాన మంతయు యువకులను నాజీ తత్త్వమునకు అనుకూలముగా భావోద్రిక్తుల నొనర్చుట కుద్దేశింపబడినది దేశమందలి యువకులెల్లరు తమ విద్యార్థిదశలోనే హిట్లరుసమాజము నందు సభ్యులై తీరుట హిట్లరు గావించిన నియమస్థితి కాని ఇటీవల పశ్చిమజర్మనీ విద్యావిధానములో కొన్నికొన్ని ప్రజాస్వామిక లక్షణములు ప్రవేశపెట్టబడినట్లు వినుచున్నాము అట్లయినచో అవి ప్రపంచరాజకీయ పరిణామములో కొంత మేలు చేకూర్పగలవు

వి వి కు శ

## విద్యానాథుడు

అగస్త్య మహాకవి - విద్యానాథుడు

విద్యాకైరవ కౌముదీంశ్రుతి శిరస్సీ మంతముక్తా మణిం
చారాన్ వక్షభువక్త్రి లోకజననీం వందేగిరాం దేవతామ్
యత్ప్రాబాజ్ఞ సమక్రియాః సుకృతినాం సారస్వత ప్రక్రియా
బీజన్యాసభువో భవంతి కవితానామైక్య జీవాతవః

అనుచు కవిపండితమండలి హర్షధ్వానములు చెలగ ఆంధ్ర సామ్రాజ్య రమాధినాథుడగు ప్రతాపరుద్రదేవుని పేరోలగమున మూర్తీభవించిన యాంధ్రత్వము పుంభావసరస్వతి అగస్త్యపండితాఖండలుడు వాగ్దేవతాస్తోత్రముతో తన అలంకారశాస్త్ర సర్వస్వసంగ్రహమునకు మంగళాచరణము కావించినాడు ఆంధ్రసామ్రాజ్యలక్ష్మి అమరవాఙ్మయ రత్నముకురములో ప్రతిబింబించి శాశ్వతమూర్తియై విలసిల్లినది ఏమి యాయలంకార ప్రబంధము ! ప్రత్యక్షరమునను రసము తొణికిసలాడుచున్నదే ! అడుగడుగునను ఆంధ్రకీర్తిముద్రలు గాన్నదే ! అహో ! అపూర్వసారస్వతప్రక్రియ ! విద్యాసాధుడీ మహాకవిచక్రవర్తి ! విద్యానాథుడు [illegible] అని కొంతలో కము ఏకకంఠముగ పల్కినది [illegible]
అన్నాడు శివస్వరూపుడు శివదేవయ్య [illegible]

నవ్వు చెంగలింప విద్యానాథ మహాకవి అని అనువదించినాడు త్రిలింగరాజవరమేశ్వరుడు అగస్త్యుని ఉత్తమాంగమున సువర్ణ ప్రసూనములు కురిపించినవి మెడలో రత్నహారములు మెరసినవి మంగళవాద్యములు మొరసినవి ప్రతాపరుద్రయశో భూషణము సహృదయులకు కర్ణభూషణమై వెలసినది అగస్త్య మహాకవి విద్యానాథుడుగా వాసిగాంచినాడు పాతపేరు వ్యవహారమున పాతపేరై మెరుగుతరిగి మరుగులడినది ఎవరీ పుణ్యశాలి అగస్త్యుడు?

ఆంధ్రచక్రవర్తి యాస్థానమునం - విద్వత్కవులు - అది క్రీశ పదుమూడు పదునాలుగవ శతాబ్ది మధ్యభాగము కళాలతలకు వసంతము కాకతీయనందనోద్యానము కన్నుల పండువుగా కళకళలాడుచున్నది రుద్రదేవ గణపతిదేవ రుద్రమదేవులు అల్లారుముద్దుగా పెంచినారు ప్రతాపరుద్ర చక్రవర్తి క్రొత్తజాతి అంటుమొక్కలుకూడ చేర్చి వన్నెలు కూర్చినాడు సహస్రస్తంభ దేవాలయము రామప్పగుడుల వంటి చెక్కునిర్మాణములు కాకతీయశిల్ప కళాసంపదకు మచ్చుముక్కలుగా నిల్చినవి పాకాలతటాకమువంటి వారి నిర్మాణములు నేటికిని చెక్కుచెదరకున్నవి రాజధానిలో వేలసంఖ్యలో ఆనాడు చిత్రకళామందిరము లుండినట్లు ప్రతాప చరిత్రము సిద్ధేశ్వరచరిత్రములు సాక్ష్యమిచ్చుచున్నవి

కాకతీయుల పోషణములో తక్కిన కళలన్నియు ఒక యెత్తు కావ్యకళ ఒకయెత్తుగా వర్ధిల్లినది విశేషించి ప్రతాప రుద్రసార్వభౌముని పాలనము విద్యావ్యాప్తికి స్వర్ణయుగ మనదగినది ఆ సహృదయశేఖరుని ఔదార్యము జగత్ప్రసిద్ధము ఆతనిచేతికి ఎముకలేదు ఆ చల్లనిపూవల్లభ తల్లజు నాశ్రయించిన కవితంసులు పండితగ్రామణులు గజాంతైశ్వర్యముల ననుభవించినారట! ఈ విషయమును తెల్పునట్టి ఆ ఘాణకమొకటి కువలయానందములో కన్పట్టుచున్నది అది యిది -

> 'కతిపయ దివసైః క్షయం ప్రయాయాత్
> కనకగిరిః కృతవాసరావసానః
> ఇతిముద ముపయాతి చక్రవాకీ
> వితరణశాలిని వీరరుద్రదేవే

బంగారుకొండ మేరుపర్వతమే అతని యీవిలో చెల్లిపోవునట! పేరు తెలియని కవిప్రశంస యేమంత పెద్ద! ఆధానశేఖరుని దాతృతాఫలము నిండుగా అనుభవించిన యదృష్టవంతుడు అగస్త్యవిద్యానాథుడు

ఆ రాజేంద్రుని ఆస్థానకవిపండితుల గృహాంగణాలు మత్తగజముల మదగంధముతో గుబాళిల్లుచున్నవి

ఆ రసికశేఖరునకు కవితామృత కలశాలు సమర్పించి కవీశ్వరులు గంధసింధురములను బహుమానకృతిగా అందుకొను చుండిరట! రారమ్మనుచున్న రిసాలములకు పుంస్కోకిలలు చేరవా? ప్రతాపరుద్ర చక్రవర్తి ఆస్థానములో శాస్త్ర నిష్ణాతులైన పండితులు కావ్యకళాధౌరేయులైన కవులను రెండువందల మందికి మించియుండిరని లెక్కకట్టి చెప్పిన కాని సర్వజ్ఞమాట కొంత యతిశయోక్తియన్నను మొదటికి మోసము లేదుకదా!

ఈ విధముగ ఆ ప్రభువరేణ్యుని ఆస్థానము నలంకరించి పేరెన్నికగన్న సంస్కృత విద్వత్కవులలో కొందరు వీరు

1 శాకల్యమల్ల కవీశ్వరుడు - ఈతడు మహాపండితుడును కవీశ్వరుడును అయినవాడు ఉదారరాఘవమను మహాకావ్యమును రచించెను చిత్రకవితలోను మల్లికవి చంద్రుడు గిట్ట నిరోష్ఠ్యనియమములో రామాయణమును రచించి ఔరా! యనిపించుకొన్నవాడు చతుర్భాషా నిఘంటువును కూర్చి మేటి నైఘంటికుడుగా కూడ ఖ్యాతిగాంచిన వాడు

2 వీరభల్లట దేశికుడు - సర్వశాస్త్ర పారంగతుడైన యీ యుద్దండపండితుడు శాస్త్రపరీక్షకుడుగా కాకతి విద్వత్సభకు భూషాయమానుడై వెలయుచుండెను

3 అప్పయార్యుడు-జినేంద్రకల్యాణాభ్యుదయ కర్త యగు ఈతడు జైనపండితుడు అన్నిమతముల వారును కాకతిరాజుల పరిపాలనమున సుఖజీవనము గడపిరనుటకు ఈ అప్పయార్యునివంటి వారేతార్కాణ

4 త్రిపురాంతకకవి-ఈ మహాకవి బహుగ్రంథకర్తగా ప్రసిద్ధివహించినవాడు కవితాప్రక్రియలలోను భిన్నగతులు వెలయించినవాడు క్రీడాభిరామమునకు మూలమైన ప్రేమాభిరామమను సంస్కృత గ్రంథమును రచించినవాడితడే ఈతని త్రిపురాంతకోదాహరణము సుప్రసిద్ధము సంస్కృతాంధ్రములలో మేటిరచయితగా ఖ్యాతిగాంచినవాడు

5 కోలాచల మల్లినాథ కళాశాప థానీ - సుప్రసిద్ధ వ్యాఖ్యాతయగు మహామహోపాధ్యాయ మల్లినాథసూరి

వంశీయులు పరంపరగా మహావిద్వాంసులుగా కవీశ్వరులుగా పేరు మోసినవారు

ఈ మల్లినాథశతావధాని ప్రతాపరుద్రుని ఆస్థానమున కవితావిలాసములు వెలయించి ఆ రాజన్య మౌళిచే స్వర్ణాభిషేక గౌరవము నందెను

6 గంగాధరకవి గీర్వాణభాషలో భారతకథను నాటకముగా నిబద్ధించి అపరవ్యాసుడని కీర్తిగడించినవాడీ మహాకవి

అగస్త్యమహాకవి యీతనికి బావమరదియట ! ఈతని వంశమువారెల్ల కవిపండితులుగా వన్నెకెక్కినవారే

7 విశ్వనాథకవి - సౌగంధికాహరణము ను రచించి పేరుగాంచినవాడితడు గంగాధరకవికి జ్యేష్ఠపుత్రుడు మహావిద్వాంసుడు కాదంబరీ నాటకకర్తయైన నరసింహకవికి అగ్రజుడు అగస్త్యమహాకవికి మేనల్లుడు మధురా విజయము రచించిన గంగాదేవియను కవయిత్రికి ఆచార్యుడు ఈతని కవిత మిగుల మనోహారిణియై విలసిల్లినట్లు గ్గడింపబడినది

8 నరసింహకవి - ఈతడు గంగాధరకవికి ద్వితీయ పుత్రుడు విశ్వనాథకవికి అనుజుడు అగస్త్యమహాకవికి రెండవ మేనల్లుడు కాదంబరీ కల్యాణ మను నాటకమును సంస్కృతమున రచించెను ఇంకను ఇట్టి సంస్కృత పండిత కవులు పెక్కురు ప్రతాపరుద్రదేవుని ఆస్థానము నలంకరించిరి తెలుగు కవులలో భాస్కరరామాయణ కర్తలు భాస్కరాదులు మార్కండేయ పురాణరచయిత మారన నయనరగడరచయిత రంగనాథుడు మొదలైనవారును పదకర్తయగు కృష్ణమాచార్యులును ఆ శ్రేణిలో పేర్కొనదగినవారు నక్షత్రములలో పూర్ణచంద్రునివలె ఈ కవులందరిలోను మేటి కిరీటియై ప్రకాశించినవాడు అగస్త్యమహాకవి

అగస్త్యమహాకవియే విద్యానాథుడు - నలకీర్తి కౌముది "బాలభారతము ప్రతాపరుద్రయశోభూషణము మొదలైన డెబ్బదినాలుగు గ్రంథములు రచించి విశేషకీర్తి నార్జించిన ఈ కవీశ్వరుని మొదటి పేరు అగస్త్యుడనియు ఎమ్మట చక్రవర్తిచే విద్యానాథుడను బిరుద మొసగబడినదనియు విమర్శకుల యభిప్రాయము ఈ నామనిర్ణయము కొంచెము జటిలము గానే యున్నది నలకీర్తి కౌముది మున్నైన గ్రంథముల ఆశ్వాసాంత గద్యములలో కవినామము అగస్త్యుడుగానే కనబడును

ఇతి శ్రీ నలకీర్తి కౌముద్యాఖ్యే లక్ష్మీపదలాంఛనే అగస్త్యకృతే మహాకావ్యే ప్రథమః సర్గః- ఇత్యాది బాలభారతములోను -

శ్రీ స్థూల స్థూలంకరణ ఫణితి గ్రంథినివృత్తై
కవింమస్త్యైరస్త్యైః కిమిహారో మంథహారిత్రైః
మర్యాదర్యాంకః ప్రతిఫలదలంకార రచనైః
అగస్త్యః పౌరస్త్యానసరతి సూక్తైః సుమనసః-

అని అగస్త్యపదమే యుపలబ్ధమగుచున్నది విద్యానాథ పదము వ్యవహరింపబడలేదు ఇక ఈ మహాకవిని కీర్తించిన విశ్వనాథకవియు రాజచూడామణి దీక్షితులును గంగాదేవియు అగస్త్యపదాభిధేయునిగనే కీర్తించిరి

అగస్త్యోదయమున జలాశయములు తేటగొనినట్లే జడుల హృదయములుకూడ ఈ అగస్త్యోదయమున ప్రసన్నము లయినవి సారస్వత రహస్యవేదియగు ఈ అగస్త్యకవి విద్వన్మౌళియై విలసిల్లినాడు డెబ్బదినాల్గు కావ్యములు రచించి విఖ్యాతుడైన అగస్త్యమహాకవిని ఎవరుకోరరు!

ఇట్లన్నింటను అగస్త్యశబ్దమే వితర్కవివాదముగా గోచరించుచున్నది వీనిలో విద్యానాథ పదమీ కవీశ్వరాభిధానముగా ఎందును కానరాదు

ఇక ప్రతాపరుద్రీయము లో విద్యానాథపదమే ప్రకరణాంత గద్యములలో ఇతి శ్రీ విద్యానాథకృతౌ ప్రతాపరుద్రయశోభూషణే అలంకారశాస్త్రే నాయక ప్రకరణమ్ - ఇత్యాదిగా కనబడును ప్రకరణాంత గద్యను లేవరో వ్రాసియుందురనుకొన్నచో గ్రంథకర్తయే స్వయముగా నాయక ప్రకరణమున పదియవ కారికలో

కాకతీయ నరేంద్రస్యయశోభూషయితుం కృతా
విద్యానాథ కృతిశ్చేయంస్వయం తేనవిభూష్యతే' -

విద్యానాథ కృతియిదియని స్పష్టముగా చెప్పెను అంతియే కాదు సాధారణముగా కవి పేరుపట్టుబడు చక్రబంధములో కూడ అగస్త్యపదములేదు వైద్యనాథకృతి వీరరుద్రయశః' అనియే స్ఫురించునట్లున్నది

ఆ చక్రబంధమిది -

లక్ష్మీ దీక్షిత వైభవస్య జగతాంనాథస్య భద్రశ్రియో
దిత్స్వరబ్ధని జప్రతాపజనితాం భాకృద్ధురాం యచ్ఛతః
నిత్యం రుద్రజనాధిపస్యజయినో భాతిప్రకాశంష్ఠిరా
రాజత్పాలనమోదితాత్మనిభుజేయోగ్యాశ్రయత్వాద్ధరా

ప్రతాపరుద్రీయ వ్యాఖ్యాతలలో ముఖ్యుడైన కోలాచల కుమారస్వామి సోమపీథి-రత్నాపణావతారికలో

> పుణ్యశ్లోకగుణోక్తి శాణనికషాదుత్తేజనాలంకృతం
> సంజగ్రాహరసాది రత్ననిచయం విద్యాధినాథః పురా
> సోహంతద్వ్యవహార హేతుమధునాకించిత్కరోమ్యాపణం
> తత్రానుగ్రహ మూల్యతో ఖిలమితం క్రీణంతు ధన్యాజనాః

అని కవిని విద్యాధినాథ శబ్దముచే ఉపపాదించియు వెంటనే 'అథతత్ర భవాన్ విద్యానాథనామా మహాకవిరలంకార శాస్త్రమారంభమాణః' ఇత్యాదిగా అవతారికా వాక్యమున విద్యానాథుడనియే కవిని పేర్కొనెను అగస్త్యమహాకవియని యెక్కడను అనలేదు ఇక రెండవ వ్యాఖ్యాత శుకపటము (చిలకమర్తి) తిరుమలాచార్యుడును తన రత్నశాణవ్యాఖ్యలో

> విద్యానాథః కథముఖ బహోరాకరాద్భాస్త్రజాలాత్
> సంజగ్రాహ ప్రకృతికతినే రత్నజాలంకరండే
> విద్వద్గోష్ఠీ హృదయరమణే రత్నశాణేధువాస్మిన్
> అంతర్గూఢద్యుతి విలసితంతత్ సముత్తేజయామి

అను పద్యములో విద్యానాథపదమునే కవినామధేయముగా ప్రయోగించెను ప్రతాపరుద్రీయమును పరామర్శించిన లాక్షణికులును విద్యానాథపదమునే వాడినారు

విషయమిట్లుండగా ఆ అగస్త్యుడే ఈ విద్యానాథుడనుటకు అవకాశమెందున్నది ? ప్రమాణమేది ? ప్రతాపరుద్రీయములోనే యున్నది కావ్యప్రకరణమున గుణీభూతవ్యంగ్య ప్రస్తావములో అగూఢవ్యంగమునకు విద్యానాథుడిచ్చిన లక్ష్య శ్లోకములో కనబడుచున్నది యాకవీశ్వరుని తొలిపేరు అగస్త్యుడనునది ఆ శ్లోకమిది –

> ఔన్నత్యంయది వర్ణ్యతే శిఖరిణః క్రుధ్యంతినీచైః కృతాః
> గాంభీర్యం యది కీర్త్యతే జలధయః క్షుభ్యంతిగాధీకృతాః
> తత్త్వాం వర్ణయితుంబిభేమి, యది వాజాతోస్మ్యగస్త్యః స్థితః
> త్వత్కాన్ప్ర్ర్వగుణ రత్నరోహణగిరే! శ్రీ వీరరుద్ర ప్రభో !'

ఓ వీరరుద్ర ప్రభూ ! నీ ఔన్నత్యము వర్ణింతునా తమ్ము తక్కువ పరచితినని కొండలు కోపించును నీ గాంభీర్యము కీర్తింతునా తమ్ము తేలికపరచితినని సముద్రాలు ఘూర్ణిల్లును కావున నిన్ను కీర్తింప భయపడుచున్నాను కాదు నేను భయపడనులే ! నే నగస్త్యుడనుకదా ! ఇందు పర్వతములకు సముద్రాలకు నేను భయపడను నిన్ను కీర్తించియే తీరుదును అన్నవ్యంగ్యము గూఢముగ లేక బట్టబయలైనది కావున అగూఢవ్యంగ్యము

ఈ పద్యములో కవిప్రయోగించిన అగస్త్యపదము ఆ కవి తొలినామమే సందేహములేదు అది శ్లిష్టముగా ప్రయుక్తమైనది అగస్త్యమహర్షియనగ నే వింధ్యపర్వత గర్వనిర్వాపకుడుగనుక కొండలకు గుండెదిగులు అట్లే సముద్రజలలాను పుడిసిలిపట్టి త్రావివైచినవాడౌట ఆయన పేరంటే సముద్రాలకు హడలు ఈ పౌరాణిక భావమును తన నామధేయమైన అగస్త్యపదములో శ్లేషభంగిచే చక్కగా కుదుర్చుకొని కల్పనచేసి రచించినాడీ లక్ష్యపద్యమును మహాకవి అట్లు కాదేని నే నగస్త్యుడనుతే అనుట పొసగదు చమత్కరించుటకు అనువుగా ఉన్నందున కవీశ్వరుడిట తన మొదటి పేరును వాడుకొన్నాడని తత్త్వము విమర్శకు లెల్లరును అగస్త్య విద్యానాథుల నైక్యవాదమునకు ఈ శ్లోకమునే అంతర ప్రమాణముగా అంగీకరించినారు

ఇట్టి ఒక విషయము స్పష్టము శాకల్యమల్లభట్టారకుడు మొదలైన విద్వద్రేసరులవలె అగస్త్యమహాకవి తొలినుండియు ప్రతాపరుద్ర చక్రవర్తి కొలువున ఆస్థానవిద్వాంసుడుగా చేరినట్లు కనబడదు ఇతని పూర్వదశయంతయు నలకీర్తికౌముది బాలభారతము శ్రీకృష్ణ చరితములవంటి బహుగ్రంథములను రచించుటలోను శిష్యులకు పాఠములు చెప్పుటలోను గడచియుండును ఉత్తరదశలో చక్రవర్తి దృష్టికి వచ్చి తదాహూతుడై ఆస్థానవిద్వాంసుడుగాచేరి విద్యావైభవమువలన విద్యానాథ బిరుదముతోనే ఈ మహాకవి ప్రసిద్ధుడై ప్రతాపరుద్రీయ కృతిలో ఆ బిరుదనామమునే వాడుకొని యుండును అతని పూర్వ పూర్వగ్రంథాలలో విద్యానాథపదము లేకపోవుటకును, ప్రతాపరుద్రీయములో అగస్త్యపదము సర్వత్రకనబడకపోవుటకును హేతువిదియేయనుట సమంజసము

కానెసర్వప్ప ఈ క్రింది వ్రాతకూడ దీని కనుకూల సాక్ష్యమగుచున్నది తురకసర్దారు ప్రతాపరుద్రుని చెరపట్టి ఢిల్లీకి కొనిపోవుచు దారిలో గోదావరి యొద్దను విడియుండగా ఆ రాజచంద్రుని జూడ ప్రజలును అధికారులును శివదేవయ్య మున్నైన మంత్రి వర్యులును అచటికి వచ్చిరని చెప్పి అందునొక్క విప్రుండు ప్రతాపరుద్రీయంబను కావ్యంబు చెప్పి ఆ రాజునకు అంకితముగా చేయుటయు సర్వజ్ఞుండగు ఆ విప్రునకు ప్రతాపరుద్రుండు అంగుళీయకంబునిచ్చి యతనిని విద్యానాథుండని పేరుగు నెక్కుడు చాటించుటయు (సిద్ధేశ్వరచరిత్ర -170 పు)

**అగస్త్య విద్యానాథుని కృతులు** – ఈ మహాకవి డెబ్బదినాలుగు కృతులు రచించెనని మధురావిజయ రచయిత్రి మహారాజ్ఞి గంగాదేవి వాక్యమువలన తెలియుచున్నది ఆ గ్రంథములన్నింటి పేళ్లైనను నేడువినవచ్చుటలేదు కాలము కడుపుకడలి అందులో ఎన్నిమునిగి రూపుమాసెనవో! శిథిలములై మిగిలిన ఈ మహాకవికృతులలో కొన్నియివి –

**బాలభారతము** –

> బహుభావల బహువిధముల
> బహుజనములవలన వినుచు భారతబద్ధ
> స్పృహులగు వారికి నెప్పుడు
> బహుయాగంబుల ఫలంబు పరమార్థముగున్'

అన్నారు నన్నయ్య అట్టిది భారతీయుల భారతబద్ధస్పృహ అగస్త్యమహాకవి యీ గాథనే చేకొని 20 సర్గముల మహాకావ్యముగా రచించెను కథ భారతగాథ కవిత శారదావతారుడును వేదశ్చంద్రముఖికరాంగుళిదళాసంగళ్వణ ద్వల్లకీభాచోయుక్తి సహోక్తి దర్శితసుధాజనుడును అగు అగస్త్యమహాకవిది చెప్పెడిదేమి? హేమ్నః పరమామోదః బాలభారత మెంత మనోహరమో రాజకీయాలు తలమున్కలై యుండిన వాడయ్యు ఎట్లో తీరికగల్గించుకొని ఈ మహాకావ్యముపై మనోహరమగు వ్యాఖ్యరచించినాడు ప్రసిద్ధుడగు సాళ్వతిమ్మరుసు మహామంత్రి

మచ్చుకొక పద్యము :

> 'లలాట నేత్రజ్వల నోష్మతాపితాః
> కపర్దసంధోః పరిపీతపాథసః
> ఫణామణీనాం కపటేన భోగినాం
> శిలీముఖాః శాతముఖాః కిరీటినః'

ఇక ఇట్టి శాతముఖములైన శిలీముఖములుగల ఆ జగజెట్టి కిరీటికి సాటియేది!

**శ్రీకృష్ణ చరిత్రము** – విశ్వమోహనములగు శ్రీకృష్ణ లీలావిలాసములకు ముగ్ధముకాని హృదయమేది? అగస్త్య మహాకవి తన కవితాసుధాధారలు శ్రీకృష్ణభగవానుని కరివస్థలో ఘటిల్లించి కృతకృత్యుడై నాడు ఇందొక విశేషము ఈ కావ్యము గద్యకావ్యము గద్యానికి నీనాని పంచినందురు వ్యాసని చియుగు అగస్త్య వీంద్రుడు వనగర్వనిత ప్రాభవము ను ఈ శ్రీకృష్ణచరితములో ప్రదర్శించెను ఉత్తమ శ్రేణి గద్యకావ్యములలో ఇదియొకటి యని పరిశోధకులు ప్రశంసించినారు

**నలకీర్తికౌముది** – భారతాదిపురాణ ప్రసిద్ధమైనది నలచరిత్ర నలదమయంతుల గాథ పుణ్యావహము –

విఖ్యాతమగు శ్రీహర్షుని నైషధ కావ్యమున్నను పాపహరమగు నలదమయంతుల కథయందలి యాదరము చేతను నైషధకావ్యము కొంత అతివర్ణనము అశ్లీలస్పర్శము కలదను విమర్శకు గురియైనదగుటచేతను సారస్వతమర్మవేదియగు ఈ అగస్త్యమహాకవి యట్టిలోపములు లేకుండునట్లును గ్రంథగ్రంథులు లేకుండునట్లును లలితశైలితో ఈ మహాకావ్యమును నిర్మించి లోకమున కందించినట్లు భావింపవచ్చును శ్రీహర్షుడు నైషధమును ఆనందపదాంకితము చేయగా అగస్త్యమహాకవి తన నలకీర్తికౌముదికృతిని లక్ష్మీపద చిహ్నితము కావించెను మధుర సార్ధ్రమంజరీ పుంజమువలె నలకీర్తికౌముదీ పద్యనివహము మనోహరమై యొనరూరుచుండును

ఉపలబ్ధమైన సర్గాంత గద్యమును బట్టి యిది మహాకావ్యమే యనవలెను ఇతి శ్రీ నలకీర్తికౌముద్యాఖ్యే లక్ష్మీ పదలాంఛనే అగస్త్యకృతే మహాకావ్యే ద్వితీయ సర్గః ఈ మహాకావ్యము సమగ్రముగా లభింపకుండుట దురదృష్టము ఉదాహరణమున కిందలియొక పద్యము

> స్నాతాఘటూత్థపరిముక్తపయోభిరాత్త
> కౌశేయ కోశకుసుమా అసదాస్య పద్మా
> అముక్తమౌక్తిక విభూషణ సవ్యపూర్ణా
> భాతిస్మతీవ యాశరదుర్వశేయమ్'

ఇందు దమయంతి శరల్లక్ష్మి లెంత హృద్యముగ చిత్రింపబడినారో! ఈ మహాకావ్యము బహుప[illegible] పొంది

యుండుటచే ఇందలి కొన్ని పద్యముల భావములను పిమ్మటి కవులు తమ కావ్యములలో అనుసరించిరి. అట్టి యనుసరణములలో వసుచరిత్రములోని యీ పద్యమొకటి

నానాసూన వితాన వాసనల నానందించు సారంగమే
లానన్నొల్ల దటంచు గంధఫలిబల్కాకఁ దపంబందియో
షానాసాకృతిఁ దాల్చిసర్వసుమనః సౌరభ్యసంవాసయై
పూనెం బ్రేక్షణమాలికా మధుకరీపుంజంబు లిర్వంకలన్-

దీనికి పలికీర్తికౌముదిలోని ఈ క్రింది పద్యము మూలమందురు

భృంగానవాప్తి ప్రతిపన్న ఖేదా
కృత్వావనే గంధఫలీతపోఽలమ్
తన్నాసికా భూదను భూతగంధా
స్వపార్శ్వనేత్రీ కృతభృంగసేవా-'

అగస్త్య నిఘంటువు - ఈ మహాకవి ప్రామాణికమగు ఒక నిఘంటువును కూడ రచించినట్లు విమర్శకులు భావించుచున్నారు. ఉత్తరరామచరిత్ర నాటకమునకు వ్యాఖ్యరచించిన ఘనశ్యాముడను పండితుడు తన వ్యాఖ్యలో అగస్త్య నిఘంటువు నుండి ప్రమాణముల నొసగియున్నాడు

మణిపరీక్ష - రత్నములపుట్టువు జాతివిశేషాదులను తెలుపు గ్రంథము "మణిపరీక్ష"

లఘుకృతులు - లక్ష్మీస్తోత్రము లలితాసహస్రము శివసంహిత శివస్తవము సకలాధికారమువంటివి మరికొన్ని అగస్త్యపండితుని కృతులుగా చెప్పబడుచున్నవి

ప్రతాపరుద్ర యశోభూషణము - అగస్త్యమహాకవిని విద్యానాథునిచేసి అఖండకీర్తి నార్జించిపెట్టినది అలంకార శాస్త్ర సర్వస్వసంగ్రహమను నామాంతరముగల ఈ ప్రతాపరుద్రయశోభూషణమే. అలంకార శాస్త్రార్ణవమునకు నిజముగా అగస్త్యుడేయై తత్సార మెల్ల సంగ్రహించి సర్వోపభోగ్యముగా ఒకచో నిడి మహోపకారము కావించినాడీ మహానుభావుడు. కావ్యప్రమేయములలో నేదియో యొకటి గసమో అలంకారమో ధ్వనియో తీసికొని గ్రంథములు రచించిన అలంకారికులెందరో కలరు. అట్టి ప్రౌఢుల కుపకరించును ఒకచో కావ్యసామగ్రి యెల్ల చూడగోరువారి కుపకరించు గ్రంథము లేని కొరత ను ఈ విద్యానాథుని కృతి తీర్చుచున్నది. ఇది నాయక కావ్య నాటక రస దోష గుణ శబ్దాలంకారార్థాలంకార మిశ్రాలంకారములను తొమ్మిది ప్రకరణములుగల గ్రంథము. నాతి విస్తృతములైన ప్రకరణములలో బోద్ధవ్యములైన కావ్యాంగములను లక్ష్యలక్షణ సమన్వయ పూర్వకముగా సహృదయహృదయమున హత్తునట్లు నిరూపించుట యిందలి విశేషము. ఇట్లు విషయసౌలభ్యము దానికి వన్నెదెచ్చు పరిణత కవితావిలాసము ఇందు సమకూడుటచే ఈ లక్షణగ్రంథము పండితామోదమునుబొంది శీఘ్రకాలముననే పఠనపాఠనములతో విశేషప్రచారమునంది మహావ్యాఖ్యాతలుట్టంకించుకొనదగు ప్రమాణగ్రంథమైనది. అలంకార శాస్త్రమున ప్రకరణగ్రంథముగా ఆసేతుశీతాచలము ఖ్యాతి వడసినది. కొందరు లాక్షణికులిందలి కొన్నియంశములను విమర్శింపగా మరికొందరా విమర్శలను పరామర్శించి గ్రంథమును సమర్థించిరి. వ్యాఖ్యాతృచక్రవర్తియగు మహామహోపాధ్యాయ కోలాచల మల్లినాథ సూరికుమారుడు కుమారస్వామి సోమపీథి విద్యానాథుడు సంతరించిపెట్టిన విషయము అందరకును అందునట్లు రత్నాపణమును తెరచెను. ఈవ్యాఖ్య మూలమునకు దీటైనదని కీర్తి గడించినది. ప్రతాపరుద్రీయముపై చేయబడిన మరియొక వ్యాఖ్య రత్నశాణము అర్వాచీనము

విద్యానాథుని ఈ కృతిలో ఆంధ్రత్వమొక ప్రత్యేకత

జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపిగరీయసీ' అన్నారు. తనజాతి తనదేశము తనభాషయనుచు అభిమానింపని వారుండరు. పట్టియభిమానము వలన ప్రయోజనములేదు. అదికార్యరూపమును దాల్పవలెను. స్వాభిమానమును కావ్యరూపమున ప్రకటింపగల్గు శక్తియు అదృష్టమును పుణ్యము చేసికొన్న కొందరికే కల్గును. అట్టివారిలో అగస్త్య విద్యానాథుడొకడు. ఆంధ్రతా పూర్ణహృదయుడీ మహాకవి కృతినెల్ల ఆంధ్రకీర్తి స్మృతిగా పాటించినాడు. ఆంధ్ర చక్రవర్తికి కంఠమెత్తి కైవారములు పాడినాడు. ఆంధ్రయోధుల శౌర్యోత్సాహాలు అగ్గించినాడు. ఆంధ్రపండిత కవిగోష్ఠులభివర్ణించినాడు. ఆంధ్రరాజధానీలక్ష్మిని అందలమెక్కించినాడు. సర్వత్ర ఆంధ్రతాముద్ర. 'అప్రాశ్నసక్తాః ఏకరశ్చ తృప్తాః' ఒకపనిచే రెండర్థములు సాధించినాడు విద్యానాథుడు. ఇటు స్వజాతికీర్తనము అటుచక్కని లక్షణగ్రంథనిర్మాణము. వర్ణ్యుడు ఆదర్శగుణభూషితుడు. అతడు ఆంధ్ర సంస్కృతికి మూర్తి ప్రతాపరుద్ర చక్రవర్తి. తదంకితముగా వెలసిన యీకృతి యాంధ్రజాతికే యంకితమైనదిగా పర్యవసించును

ఒక ఆక్షేపము ఇందు మానవుడు వర్ణ్యుడగుట నిజమే! ప్రతాపరుద్ర చక్రవర్తి మానవుడే! కాని యెట్టిమానవుడు? వైదికధర్మరక్షా దీక్షితుడు వాఙ్మయకళా పోషకుడు ప్రజారంజకుడు భగవదవతారముగా సత్యవచనులచే కీర్తింపబడిన పుణ్యమూర్తి అట్టి పురుషోత్తముని కీర్తించుట గుణమే దోషముకాదు సత్సంప్రదాయముకూడ నరాంకితము గిట్టని సోమన పోతన ధూర్జటివంటి కవులు కొందరున్నను నన్నయ తిక్కన యెఱ్ఱన శ్రీనాథ పెద్దనాది మహాకవులు గుణగ్రాహులై ఉత్తమ గుణశోభితులగు రాజవరేణ్యులకు మాన్యులగు మంత్రి దండనాథులకు తమకృతులను అంకితముచేసియున్నారు వీరెల్లరు కుక్షింభరు లని కొట్టివేయదగిన వారుకారు నిజమునకు వీరిలో ఎందరో తృణీకృత పురందరులు! ఋషితుల్యులు! కావున విద్యానాథ మహాకవి ప్రతాపరుద్ర చక్రవర్తిని తనకృతికి వర్ణ్యునిగా స్వీకరించుట యాకవీశ్వరుని గుణగ్రాహిత్వమునకే తార్కాణగాని లోపముగాదు ప్రతాపరుద్ర చక్రవర్తి లోకోత్తరగుణోత్తరుడనుటను కావ్యములు చరిత్రలు శాసనములు వేనోళ్ల చాటుచున్నవి అట్టి పూతచరిత్రుడు ఉపశ్లోక్యుడుగా లభించుటయే దుర్ఘటము అట్టి మహనీయుడు లభించినవాడు సమర్థుడైన కవీశ్వరుడేమిగాక్కి. నంతయగును తద్గుణైః కర్ణమాగత్య చాపలాయ ప్రచోదితః అన్నాడు గుణగరిష్ఠులైన రఘువులను కీర్తించు నవకాశము లభించినదని మురియుచు కవికులచక్రవర్తి కాళిదాసు అలంకారశాస్త్ర మెంతకాలమునకు ధన్యమైన దన్నాడు ఆంధ్ర చక్రవర్తి వర్ణ్యుడుగా లభించెనను ఆనందములో విద్యానాథ మహాకవి భామహోద్భట రుద్రభట్ట భోజరాజాది ప్రాక్తనాలంకారికుల సూక్తులను ఈ సందర్భమున వృద్ధ సమ్మతిగా ప్రకటించినాడు భూష్యభూషణ భావముతో విలసిల్లుచున్నారు విద్యానాథ వీరరుద్ర భూనాథులు!

కాకతీయ నరేంద్రస్య యశోభూషయి తుంకృతా
విద్యానాథ కృతిశ్చేయం స్వయం తేన విభూష్యతే

ఎంతటి హృదయంగమ సన్నివేశము!

విద్యానాథ మహాకవి వాఙ్మయరంగములో ప్రవేశపెట్టిన ఈ యశోభూషణప్రక్రియ అనంతరికులగు అలంకారశాస్త్రకారుల నెంతగనో ఆకర్షించినది పలువురు కవులీపద్ధతి ననుసరించి రచనలు సాగించినారు

ప్రతాపరుద్రీయము చదువుచుండగా ఆంధ్ర హృదయములో ఏదో నూతనోత్తేజము కలుగుచుండును

రేరేఘూర్జర జర్జరోసి సమరే లంపా కంపసే!
వంగత్వంగస కిం! ముధాబలరకః కాణోస కింకో కణ!
హూణ! ప్రాణపరాయణోభవ! మహారాష్ట్రి రాష్ట్రి త్యమీ
యోద్ధారో వయ మిత్యరీనభిభవం స్త్రద్రథ మాశృగ్భటాః

ఎక్కడో ఆంధ్రవీరులు పగతురను కవ్వించి కవ్వించి తరిమి కొట్టుచున్నట్లున్నది ఉపాయనహస్తులై ఆయా రాజన్యులు అహమహమికతో త్రోక్కిసలాడు చున్నారు త్రిలింగరాజ పరమేశ్వరుని దర్శనార్థము! బంగరు బెత్తాలెత్తి క్రమపరచు చున్నారు వారిని వేత్రహస్తులు! ఔరా! ఆంధ్ర సామ్రాజ్య రమా ప్రాభవము! ఆ కొలువులో తానుకూడ ఒకడై ఉప్పొంగు చున్నాడు ఆంధ్రపఠిత

అలంకార శాస్త్రసర్వస్వమేకాదు అగస్త్య విద్యానాథ మహాకవి సృష్టించిన ప్రబంధము! ఇది యాంధ్రవైభవ సర్వస్వము! యథార్థముగా ఇది సహృదయులకు కర్ణోత్సవమే! అలంకార శాస్త్రాబ్ధి వాగస్త్యుడు విద్యానాథుడు వాఙ్మయాకాశములో పూర్ణచంద్రుడై వెలుగొందుచున్నాడు

జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః
నాస్తి యేషాం యశఃకాయే జరామరణజం భయమ్

చె రం

## విద్యారణ్యస్వామి

పదునాల్గవ శతాబ్దారంభమున హిందూ సామ్రాజ్యము అన్నియు పతనమైన తరువాత దక్షిణాపథము దుర్భర యాతనల ననుభవించెను ఉత్తరభారతమున తురుష్కులు రాజ్యమును స్థిరపరచుకొని దక్షిణమునకు దండయాత్రలు మొదలుపెట్టిరి అప్పుడు హిందూధర్మమే పునాదులతో కదలి కాలవాహినిలో కలసిపోవు ఆపద సంభవించెను ఈ సంకట సమయమున శ్రీమాధవ విద్యారణ్యులు అవతరించిరి

జన్మాదికము ఇతడు ఆనెగొంది ప్రాంతమున సుమారు క్రీ శ 1287వ సం॥న జన్మించెను ఈతనిని గూర్చి క్రింది విషయములు 'పరాశర మాధవీయమువను ఇతర గ్రంథములలోను వ్రాయబడినవి

ఇతడు కృష్ణయజుర్వేదశాఖకుచెందిన బోధాయన సూత్రుడు భారద్వాజసగోత్రుడు తల్లిపేరు శ్రీమతీదేవి తండ్రి మాయణభట్టు వీరికి సాయణాచార్యుడు భోగనాథుడు అను తమ్ములును సింగలాంబిక అను చెల్లెలును

కలరు ఇతనికి తలిదండ్రులు పెట్టినపేరు మాధవుడు సన్న్యాసాశ్రమమును స్వీకరించిన తరువాత విద్యారణ్య నామమున అతడు వ్యవహరింపబడెను ఇతని వంశనామము "సాయణము"

**విద్యాభ్యాసము** మాధవసాయణులు చిన్నతనమున తండ్రికడ నేర్వవలసినంత నేర్చి శాస్త్రాభ్యాసమునకై కాంచీపురమునకు పోయిరి అప్పుడు కాంచీపురము మహావిద్యాపీఠమై ప్రసిద్ధిగాంచియుండెను వేద వేదాంగపారంగతులు మహాతపోధనులు కామకోటి పీఠాధిపతులు అయిన శ్రీవిద్యాతీర్థస్వామి చరణ సన్నిధిలో విద్యనభ్యసించు భాగ్యము ఈ సోదరులకు లభించినది విద్యాతీర్థస్వామి శిష్యులలో భారతీతీర్థ-శంకరానంద-వేదాంత దేశిక-మాధవాచార్య-సాయణాచార్యులు ముఖ్యులు వీరిలో వయసునుబట్టి మొదటి ముగ్గురును పెద్దవారు మాధవ సాయణులు చిన్నవారు సోదరులిద్దరును వేదవేదాంతాది శాస్త్రములనిచటనే అభ్యసించిరి మాధవాచార్యుడు తనకు నలుగురు గురువులున్నట్లు చెప్పినారు వారిలో మొదటివాడు విద్యాతీర్థస్వామి రెండవవాడు భారతీతీర్థులు మూడవ గురువు శంకరానందులు నాల్గవయాతడు శ్రీకంఠనాథుడు.

**విద్యాతీర్థ స్వామి :** ' వేదములు ఎవరి నిశ్వాసమో ఎవరు వేదమూలకముగా సమస్తజగమును సృష్టించిరో అట్టి విద్యాతీర్థ రూపుడైన మహేశ్వరునకు నమస్కారము అని విద్యారణ్యులచే స్తుతింపబడిన శ్రీవిద్యాతీర్థులు కంచిలోని కామకోటి పీఠమునధిష్ఠించిన మహామహావుడని తెలియుచున్నది ఆ పీఠపరంపరలో ఇతడు 51వ వాడు ఇతనిని విద్యాశంకర విద్యానాథ విద్యేశ్వర అనియు పిలిచెదరు

**భారతీతీర్థులు** ఇతనిని భారతీ కృష్ణ తీర్థులనియు అద్వైత బ్రహ్మానందులనియు ఆత్మానంద సరస్వతి అనియు సమకాలికులు స్తుతించినారు ఇతడు గొప్ప విద్వాంసుడు ఆతని వాగ్ధోరణి పండితరంజకమైనదనియు అతడు పాఠప్రవచనము చేయుటలోను అనర్గళముగ ఉపన్యసించుటలోను దిట్ట అనియు హరిహరరాయల కాలపు శాసనము చెప్పుచున్నది భారతీతీర్థులు విద్యాతీర్థులచే ఆశ్రమ స్వీకారమును పొందిరి ఇతని వైదుష్యమును గురుభావముతో సహాధ్యాయుడగు శంకరానందుడుకూడ కీర్తించెను మాధవు డితనిచే సన్న్యాసదీక్షను స్వీకరించి విద్యారణ్యుడయ్యెను

**శంకరానందులు** విద్యాతీర్థుని శిష్యులలో శంకరానందుడు ముఖ్యుడు ఈతని పూర్వాశ్రమనామము మహేశుడు తండ్రి బాలచంద్రమణి మధ్యార్జునక్షేత్ర మీతని జన్మస్థలము విద్యాతీర్థులచే ఈతడు ఆశ్రమమును స్వీకరించెను ఈతడు ఉద్దామపండితుడు మహాతపస్వి కూడ ఈతడు అద్వైతమత నిరూపణకై ఉపనిషత్తులకు శ్లోకరూపదీపిక అను సూత్రదీపిక ఆత్మపురాణ వివేకసారాది వేదాంత గ్రంథములను గీతాతాత్పర్య బోధినీ అను భగవద్గీతా వ్యాఖ్యానమును రచించెను

**శ్రీకంఠనాథుడు** - మాధవ సహోదరుల గురుమండలములో నాల్గవవాడు శ్రీకంఠనాథుడు సాయణాచార్యుడు నెల్లూరు ప్రాంతముల నేలుచుండిన సంగమరాయలకుమంత్రిగనుండినపుడు చిట్రగుంట గ్రామమును గురువగు శ్రీకంఠనాథునకు ధారపోయించివేయించిన శాసనములో శ్రీమాన్ సన్నిధిమాదధత్ పశుపతిః శ్రీకంఠనాథాత్మనా అని కీర్తించెను ఈయన స్థల కులములను గూర్చి వివరములేవియు తెలియరాలేదు

**సన్న్యాసాశ్రమ స్వీకారము** - కాంచీపురమున విద్యావ్యాసంగమును ముగించుకొని ఇంటికి వచ్చినతరువాత ఇంటిలోని దారిద్ర్యము దక్షిణాపథమునకు సంభవించిన విపత్తు ధర్మమునకు కలుగుచున్న గ్లాని మాధవుని హృదయమును సంక్షోభపరచినది మానవశక్తికి మీరిన కష్టములు పరంపరగ పైన పడినప్పుడు స్వాభావికముగనే మనుష్యుని మనస్సు మహాశక్తియుక్తుడగు భగవంతునివైపు మరలును మాధవుడు హంపి యందలి తమ కులదేవతయైన భువనేశ్వరీ మాతను గూర్చి పండ్రెండు వత్సరములు తపస్సుచేసెను అంత భువనేశ్వరీదేవి సాక్షాత్కరించి నీకు ఈ జన్మలో ధనప్రాప్తి లేదు నీ అనుగ్రహమున పరులు భాగ్యశాలు రగుదురు అని వరమొసగెను తరువాత ఆయన గ్రంథ రచనా వ్యాసంగమున కొంతకాలమును గడపెను వివాహేచ్ఛ వదలుకొని శృంగేరికి పోయిరి అచట క్రీ శ 1330 ప్రాంతమున భారతీ తీర్థులచే ఆశ్రమ స్వీకారమును చేసి విద్యారణ్య నామమును గ్రహించిరి

ఆ సమయమున దక్షిణ భారతమునందు స్వతంత్ర హిందూ రాజ్యమొక్కటియు లేదు ముస్లిముల అత్యాచారములచే హిందూప్రజ నానాబాధల ననుభవించుచుండెను అట్టి సంకట సమయమున విద్యారణ్యస్వామి హంపి ప్రాంతమున తపమొనరించుచు దైవికముగ తటస్థించిన సంగమ

రాయల పుత్రులగు హక్కబుక్క సోదరులను (హరిహర రాయలు బుక్కరాయలు) కలిసిరి వారికి స్వతంత్ర హిందూ రాజ్యమును స్థాపించుటకై మహోత్తేజము నొసగిరి

**విద్యానగర నిర్మాణము** - హిందూధర్మ సంరక్షణము నకై స్థాపింపబోవు సామ్రాజ్యమునకు తగిన రాజధాని అవసరమై యుండెను తుంగభద్రా తీరమునందలి హేమ కూట మతంగ పర్వతముల నడుమనుండు విశాల స్థలమున విద్యారణ్యస్వామి హరిహరరాయలచే క్రీ శ 1336 వ సం॥న విద్యానగర నిర్మాణమునకు శంకుస్థాపనముచేయించెను శిలానొక శాసనమునందు ఈ విషయ మీక్రిందివిధముగ చెప్ప బడినది

"విద్యాభిధాననగరీ విజయోన్నతి శాలినీ
విద్యారణ్య కృతాతస్యాం రత్నసింహాసనేస్థితః ॥

ఈ మహానగరము దుర్భేద్యమైనది రాజ్యస్థాపనము చేసినతరువాత హరిహర బుక్కరాయ సోదరులు శృంగేరికి పోయి శారదా పీఠమునకు మహాదానము లనేకములు చేసి నారు

**రాజ్యకార్య నిర్వహణము** - విద్యారణ్యుల ఆదేశము ననుసరించి సంగమరాయల పుత్రులలో జ్యేష్ఠుడగు హరిహర రాయలు విద్యానగర సామ్రాజ్య సింహాసనము నధిష్ఠింపగా అయిన తమ్ములు నలుగురును సామ్రాజ్య విస్తరణ సంరక్షణ కార్యముల నొనరించిరి పెద్దతమ్ముడగు కంపరాయలు పూర్వ తీర ప్రాంతములను జయించి ఉదయగిరి రాజధానిగా నెల్లూరు, కడప సీమలను పాలించెను ఆయనకు మాధవా చార్యుల తమ్ముడగు సాయణాచార్యులు మంత్రిగానుండెను కంపరాయల అనంతరము ఆతని చిన్నకొడుకగు సంగమ రాయలకు సాయణాచార్యులు పోషకుడుగానుండి ప్రధాన మంత్రియై సేనాపతియై రాజ్యరక్షణము చేసెను

నాల్గవవాడగు మారప్ప మైసూరు ప్రాంతములను గోవా కదంబరాజ్యములను ఏలెను కడపటివాడగు ముద్దప్ప ముళువాయి రాజ్యమును పాలించెను కడపటివాడగు ముద్దప్ప ముళువాయి రాజ్యమును పాలించెను మూడవవాడగు బుక్కరాయలు సర్వసేనాపతియై సామ్రాజ్య రక్షణము వహించెను హరిహరరాయాది సోదరులకు విద్యారణ్యస్వామి ఆరాధ్యదైవము ఆచార్యుడు ప్రధానమంత్రి మార్గదర్శకుడునై యుండెను ఆయన వలన శృంగేరి పీఠము చక్రవర్తులకు సేవ్యమైనది ఈ సోద రులు శృంగేరి పీఠమునకు మహాదానములుచేసి వేయించిన శాసనములందు వీరు శ్రీ విద్యారణ్య పాదపద్మారాధకు లని యు స్వామి కర్ణాటక సింహాసన ప్రతిష్ఠాపనా చార్య లనియు పేర్కొనబడినారు విజయనగర చక్రవర్తు లొనరించిన గ్రామదాన సంపత్తిదానములచే ఆ పీఠము సంస్థాన స్వరూపము దాల్చెను

హరిహరరాయల మరణానంతరము వీరుడగు బుక్క రాయలు సింహాసన మెక్కెను శృంగేరిలో గ్రంథరచన మొనర్చుచున్న విద్యారణ్యస్వామి బుక్కరాయల ప్రార్థనచే విద్యానగరమునకు వచ్చి ప్రధానమంత్రిత్వ బాధ్యతలను స్వీక రించెను రాజ్యపాలనాపద్ధతిని గ్రామపాలనాపద్ధతిని సువ్య వస్థితము చేసెను బుక్కరాయలు క్రీ శ 1377 లో మర ణింపగా ఆయన కుమారులు రెండవ హరిహరరాయలు స్వామి ఆదేశానుసారము పూర్వపశ్చిమ దక్షిణ సముద్రాధీశ్వర హిందురాయసురత్రాణ బిరుదములతో సింహాసన మెక్కెను ఇమ్మడి హరిహరరాయల కాలమున గూడ విద్యారణ్యుడు గురువుగను కొంతకాలము మంత్రిగను ఉండెను ఈతని తోబుట్టువు కుమారుడు లక్ష్మీధరామాత్యుడు దేవరాయలకు మంత్రిగా నుండెను

**ధర్మోద్ధరణము** - విద్యారణ్యులు లోకకల్యాణ కార్య ములందు విశేషాసక్తికలవాడు వేదవేదాంగ వేత్తలైన పండితులను తపశ్శాలురైన యతీంద్రులను సమీకరించి ఆతడు ధర్మోద్ధారక కార్యములను జరిపించెను విమతీయుల దురం తములచే భ్రష్టులగు భారతీయుల నుద్ధరించుటకు ఆయన మహోద్యమము కొనసాగింపవలసి వచ్చెను ఆ కాలమున శృంగేరిలోని శారదాపీఠము కళావిహీనమై యుండెను అచట పెద్దమఠముకాని శారదాదేవి లోహప్రతిమగాని జగ ద్గురు పీఠస్థాయికి తగిన సంపద్వైభవములుగాని లేకుండెను అది కేవలము తపోవనమై యతులకు విరక్తులకు మాత్రము సేవ్యమై యుండెను తగినవారు లేక తరచుగా గురుపరం పర విచ్ఛిత్తినిగూడ పొందుచుండినది

మ్లేచ్ఛుల దుండగము లచే భ్రష్టమైన భారతజాతి నుద్ధ రించుటకు కామకోటి శృంగేరి పీఠములు చాలలేదు నలు మూలలలో ధర్మప్రచారము కొనసాగించుటకును జాతినుద్ధ రించుటకును మరికొన్ని పీఠము లవసరమయ్యెను విద్యారణ్య

స్వామి పుష్పగిరి శివగంగ ఆవని సాంకేశ్వరము కొల్హాపురము విరూపాక్షము, మొదలైన ఎనిమిది అద్వైతమత పీఠములను క్రొత్తగా స్థాపింపజేసెను ఈ పీఠములను విద్యాతీర్థస్వామి శిష్యులే అధిష్ఠించినారు ఈ అన్ని మఠముల సహాయమున దేశోద్ధారక ధర్మోద్ధారక కార్యములు ముమ్మరముగ కొనసాగెను

గ్రంథరచనము — విమతీయుల దురాగతములచే జాతి నిర్వీర్యమై నాశోన్ముఖమైనపుడు ధర్మోద్ధరణమే దానికి తగిన చికిత్స ఈ రహస్యము నెరిగినవాడగుటచే విద్యారణ్యులు ఒకవంక రాజ్యచక్రమును త్రిప్పుచు మరియొకవంక పీఠాధిపతులచే ధర్మప్రచారము చేయించుచు ధార్మికగ్రంథరచనా కార్యమునుకూడ చేపట్టిరి దిగ్దంతులవంటి పండితప్రకాండులను పిలిపించిరి స్వయముగా మాధవ సాయణులిరువురును ఉద్దండపండితులు వారి పర్యవేక్షణలో శతాధిక గ్రంథములు వెలువడినవి వాటిలో శ్రౌత స్మార్త వేదాంత ధర్మశాస్త్ర మీమాంసా వైద్య జ్యోతిష వ్యాకరణ సాహిత్యాది విషయములకు సంబంధించిన ఉద్గ్రంథము లున్నవి సోదరులగు మాధవ సాయణులకువలె విద్యారణ్య భారతీ తీర్థులకు కూడ పరస్పర అభేదబుద్ధియుండెను మాధవాచార్యునకు ప్రవృత్తిమార్గవిషయిక గ్రంథరచనలో సాయణాచార్యులు సహాయకుడుగ నుండినట్లే అతని నివృత్తిమార్గవిషయిక గ్రంథరచనలో భారతీతీర్థులు తోడ్పడినాడు ఈ విషయ మాయాగ్రంథములలో సూచింపబడినది విద్యద్వరేణ్యుడగు సాయణాచార్యుని అధినేతృత్వమున పండితమండలి మహాకార్యమగు వేదభాష్య రచనమును పూర్తిచేసినది మాధవ విద్యారణ్యుల పేరుతో చాల గ్రంథములు ప్రసిద్ధములైయున్నవి వీటిలో వేదార్థప్రకాశిక జైమినీయ న్యాయమాల, పరాశరమాధవీయము సర్వదర్శనసంగ్రహము వైయాసిక న్యాయమాల మాధవీయ ధాతువృత్తి జీవన్ముక్తి వివేకము వేదాంతపంచదశి వాక్యసుధాప్రకరణము అను భూతిప్రకాశిక కాలమాధవీయము మొదలైన గ్రంథములు ముఖ్యములైనవి

శృంగేరి పీఠాధిరోహణము — విద్యారణ్యస్వామి గురువగు భారతీతీర్థులు 1380 వ సం॥ న నిర్యాణము చెందిరి అవెంటనే విద్యారణ్యులు పీఠము నధిష్ఠించిరి సరిగా ఆ సంవత్సరమే వారు నిర్మింప చేయుచుండిన విద్యాశంకర దేవాలయము పూర్తియైనది ఈ సందర్భమున ఇమ్మడి హరిహరరాయలు శృంగేరికి వెళ్ళి తన పూర్వు లొసగిన భూములకు తోడు మరికొన్నిటిని దానమిచ్చి శాసనము వేయించినాడు

నిర్యాణము — విద్యారణ్యులు శృంగేరిపీఠాధిపతులుగ ఆరేండ్లు ఆచార్యస్థానము వహించిరి దీర్ఘాయుష్కులై 118 సం॥ లు బ్రతికి 1386 వ సం॥ న పావనహంపీ క్షేత్రమునకు వచ్చి అచటనే సిద్ధిబొందిరి వీరి శిలాప్రతిమ వీరిసమాధి హంపియందున్నవి గురుదేవునియందు భక్తిచే ఇమ్మడి హరిహరరాయలు ఈ మహనీయుని జ్ఞాపకార్థముగ శృంగేరి మఠమునకు 600 వరహాలు రాబడిగల భూములను దానమిచ్చుటయే గాక శృంగేరిసమీపములో విద్యారణ్య పురాగ్రహారమును కట్టించి బ్రాహ్మణులకు సమర్పించినాడు ఈ విధముగ విద్యారణ్యస్వామి హిందూరాజ్యమునకు హిందూధర్మమునకు హిందూసంస్కృతికి హిందూవాఙ్మయమునకు సేవచేసి దక్షిణాపథమును ప్రకాశింప చేసినారు

గ రా శ

## విద్యావిధానము - బోధన విషయములు :

విద్యామూలమున సాధింపదగిన ఆశయములను బట్టి విద్యాలయములలో బోధింపవలసిన విషయముల నిర్ణయము జరుగవలెను ఈ ఆశయములను విద్యావేత్తలు ప్రస్తుతకాలమున మూడురకములుగ విభజించియున్నారు జ్ఞాన సంపాదనము మొదటి ఆశయము పనులయందు నైపుణ్య సంపాదనము రెండవ ఆశయము నైతిక విలువలపట్ల గౌరవ సంపాదనము మూడవ ఆశయము ఈ క్రమమునననుసరించి విద్యాలయములలో బోధింపవలసిన విషయములుకూడ మూడు రకములుగనున్నవి అవి (1) జ్ఞానమును సమకూర్చు విషయములు, (2) నైపుణ్యమును సమకూర్చు విషయములు (3) నైతిక విలువలను సమకూర్చు విషయములు

జ్ఞానమును సమకూర్చు విషయములు మానవుడు సంపాదించవలసిన జ్ఞానమంతయు అతడు నివసించు ప్రపంచమునకు సంబంధించినట్టిది దీని మినహాగా మరియొక జ్ఞానము లేదు ఈ ప్రపంచము రెండు రకములుగనున్నది ప్రకృతిసిద్ధమైన ప్రాకృతిక ప్రపంచము మొదటి రకములోనిది మానవుడు సృష్టించిన సామాజిక ప్రపంచము రెండవ రకములోనిది మానవుని జీవితమునకంతకు ఈ రెండు ప్రపంచములు ఆధారములు అందుచేతనే వీటినిగురించిన జ్ఞానము అతనికి

అవసరమగుచున్నది

ప్రాకృతిక ప్రపంచము భూమి ఆకాశము సూర్యుడు గ్రహములు నక్షత్రములు వాయువు అగ్ని మహాసముద్రములు నదులు పర్వతములు ఎడారులు అరణ్యములు గనులు వివిధజంతుకోటి మొదలగువాటితో కూడుకొనునట్టిది ఇవి స్వతస్సిద్ధములు వీటిసృష్టి పరిణామము మానవుని శక్తికి అతీతమైనట్టిది మానవుడు సృష్టించిన సామాజిక ప్రపంచము పల్లెలు పట్టణములు రాజ్యములు సామ్రాజ్యములు పరిపాలనవిధానములు వ్యవసాయము పశుపోషణము పరిశ్రమలు వర్తకవ్యాపారములు రవాణాసౌకర్యములు కుటుంబములు కులములు వర్ణములు వర్గములు విద్యావిధానములు సంప్రదాయములు ఆచారము మతములు పూజాపురస్కారములు దేవాలయములు తత్త్వములు నీతినియమములు సంగీతాదికళలు - వీటితో కూడుకున్నది సృష్టికి ప్రతిసృష్టి చేయుశక్తి మానవునికి కలదు అతడు సృష్టించిన సామాజిక ప్రపంచము దీని బాహ్యస్వరూపము

ప్రాకృతిక ప్రపంచమునకు సంబంధించిన జ్ఞానము పదార్థవిజ్ఞానశాస్త్రము రసాయనశాస్త్రము జీవశాస్త్రము జ్యోతిషము భూగర్భశాస్త్రము మొదలగు ప్రకృతిశాస్త్రముల ద్వారా లభించుచున్నది మానవుడు కల్పించిన ప్రపంచమును గురించిన జ్ఞానము సామాజికశాస్త్రము అర్థశాస్త్రము రాజనీతి చరిత్ర ధర్మశాస్త్రము వేదాంతము మతగ్రంథములు వాఙ్మయము కళల గురించిన శాస్త్రములు వీటిద్వారా లభించుచున్నది అందుచేత జ్ఞానసంపాదనమునకు ప్రకృతిశాస్త్రములు సామాజికశాస్త్రములు సాహిత్యము ప్రధానసాధనములని స్థూలముగ చెప్పవచ్చును వీటి అన్నిటికి భాష మూలము భాషాజ్ఞానములేకయే ఏజ్ఞానమును సంపాదించుట సాధ్యముకాదు అదేవిధముగ శాస్త్రములన్నిటికి గణితము మూలశాస్త్రమని చెప్పవచ్చును అందుచేతనే విద్య అక్షరములతోను అంకెలతోను ప్రారంభమగుచున్నది జ్ఞానమనగా ప్రాకృతిక సామాజిక ప్రపంచములను గురించిన జ్ఞానము విద్యాలయములలో జ్ఞానసంపాదనార్థము బోధింపబడు విషయము అన్నియు ఈ రెండిటికి సంబంధించినట్టివి

ఈ సందర్భములో గుర్తించవలసిన విశేషములు మరి రెండుగలవు గత నాలుగువందల సంవత్సరములనుండి పరిశోధనలు కారణముగ ప్రపంచమును గురించిన జ్ఞానము అపరిమితముగా వృద్ధిగాంచెను గత మూడు నాలుగు దశాబ్దములుగ ఈ పెరుగుదలయొక్క వేగము మరింత వృద్ధిగాంచుచున్నది ఒక్కొక దశాబ్దములో ఇది రెండింతలు పెరుగగలదని శాస్త్రవేత్తలు ప్రస్తుతము అంచనా వేయుచున్నారు విద్యార్థులు విద్యాలయములలో గడుపుకాలము కొన్నిసంవత్సరములు మాత్రమే ఈ పరిమితకాలములో వారు జ్ఞానమునంతను సంపాదించు అవకాశములేదు అందుచేత విద్యను బోధించువారు జ్ఞానములో ఏదిమౌలికమో ఏదిమౌలికము కాదో అప్పటి కప్పుడు నిర్ణయించవలసియున్నది ఈ నిర్ణయముల ననుసరించి పాఠ్యప్రణాళికలు కాలానుసారముగ మార్పులు గాంచుచుండును ఇట్టి మార్పులు చాలా అవసరము

ఇదిగాక ఇటీవలికాలమున దేశములన్నిటిలో విద్యాలయము లందు ప్రవేశించు విద్యార్థుల సంఖ్య అపరిమితముగ పెరుగుచున్నది ఇంతకు పూర్వము విద్యపట్ల విముఖులుగ నుండిన కులములవారు వర్గములవారు ప్రస్తుతము విద్యపట్ల ఆసక్తి కలవారగుచున్నారు ఇదిగాక దాదాపు దేశములన్నిటిలో 6-11 సం॥ ల వయస్సు పిల్లలకు (కొన్నిదేశములలో 6-14 సం॥ ల వయస్సు పిల్లలకు) విద్యనిర్బంధముగను ఉచితముగను నేర్పువిధానము ప్రవేశపెట్టబడియున్నది దీని ఫలితముగ ప్రాథమిక మాధ్యమిక ఉన్నతదశలలోకూడ విద్యార్థుల సంఖ్య పెరుగుచున్నది

ఈ పెరుగుదల మూలమున బోధనవిషయములలో కొన్ని సమస్యలు ఉత్పన్నములైనవి విద్యార్థుల తెలివితేటలలోను శక్తిసామర్థ్యములలోను తరతమ భేదము లున్నవి అందరు అన్ని విషయములను ఒకస్థాయిలో నేర్చుకొనగల ప్రజ్ఞకలవారుకారు కొందరు బహువేగముగ ముందంజ వేయగలవారు మరికొందరు అట్టి శక్తి లేనివారు ఇదిగాక బోధన విషయములను నిర్ణయించుటలో ఉపాధ్యాయుల శక్తిసామర్థ్యములుకూడ గుర్తింపవలసియున్నవి ఇందులో పట్టణములలోని ఉపాధ్యాయులకును పల్లెలలోని వారికిని కొంత భేదముకలదు దీనితోపాటు విద్యాలయము లన్నియు ఒకస్థాయిలో ఉండుటలేదు కొన్ని విద్యాబోధనకు కావలసిన వసతులు పరికరము లు కలిగినట్టివి మరికొన్ని ఇట్టివి లేనివి అందుచేత జ్ఞానసంపాదనమునకు సాధనములగు విషయములలో

ఏవి ఎంతవరకు పాఠ్యములుగాగలవో నిర్ణయించుటయందు విద్యార్థుల శక్తిసామర్థ్యములు ఉపాధ్యాయుల ప్రజ్ఞ విద్యాలయముల సాధనసంపత్తి గుర్తించవలసియున్నవి.

ఇదిగాక విద్యను ప్రాథమికవిద్య మాధ్యమిక విద్య ఉన్నతవిద్య అని మూడుదశలుగ విభాగము చేయుట ప్రస్తుతకాలమున సర్వసాధారణము. ప్రతిదశలో నేర్చుకొను విషయములు ప్రకృతిశాస్త్రములు సామాజికశాస్త్రములు అనువాటికి సంబంధించినవే అయినను ఏ యే దశలో ఏ యే శాస్త్రములకు సంబంధించిన జ్ఞానమును ఎంతవరకు సంపాదించుట ఉచితమో నిర్ణయించవలసియున్నది. బోధన విషయములను నిర్ణయించువారు ఈ నిర్ణయమునుకూడ చేయుచుందురు.

**నైపుణ్యమును సమకూర్చు విషయములు** - చేయదగిన పనులయందు నైపుణ్యమును సమకూర్చు విషయములలో రెండవవర్గమునకు చెందినట్టివి. యుగయుగములుగ కాయకష్టముతో కూడిన పనులను చేయువారు విద్యాలయములలో ప్రవేశించి విద్యలను నేర్చుకొనుచుండిన వారుకారు. లేఖకులు మతబోధనచేయువారు - ఇలాటివారు మాత్రమే విద్యను నేర్చుకొనుచుండిరి. అందుచేత విద్యావంతులు కాయకష్టము చేయరాదను సంప్రదాయ మేర్పడెను. దీని ఫలితముగ ఇటీవలి కాలమందుకూడ విద్యను నేర్చుకొనినవారు కాయకష్టముతో నిమిత్తములేని ఉద్యోగములలో ప్రవేశించుటయే గౌరవప్రదమని భావించుట జరుగుచున్నది. కాని ఇది చాలప్రమాదకరము. దేశము సమాజము బహుముఖముగ వృద్ధిగాంచుటకు వ్యవసాయము పరిశ్రమలు వర్తక వ్యాపారములు ప్రధానసాధనములు. పరిపాలనశాఖలలో గుమాస్తా ఉద్యోగములను తదితరములగు ఉద్యోగములను చేయువారి సంఖ్య పెరిగినంతమాత్రమున సమాజము వృద్ధిగాంచజాలదు. ఈ సత్యమును పాశ్చాత్యదేశములవారు చాలకాలము క్రిందట గ్రహించిరి. భారతదేశమందుకూడ ఇప్పుడిప్పుడు గ్రహించబడుచున్నది.

దీని ఫలితముగ విద్య నేర్చుకొను కాలములో కొంత భాగము కాయకష్టముతో కూడిన పనులలో నైపుణ్యము సంపాదించుటకై వినియోగము కావలసియున్నదను సూత్రము ఆచరణలోనికి వచ్చుచున్నది. విద్యను నేర్చుకొనువారు గ్రంథపఠనము చేయుటయేగాక, కాయకష్టముతోకూడిన పనులను కూడ చేయవలెననియు కాయకష్టమునందు గౌరవభావముకలవారై ఉండవలెననియు విద్యావిధానమును రూపొందించినవారు గ్రహించుచున్నారు. ప్రాథమిక దశనుండి తోటపని నూలువడకుట పశువుల పెంపకము మొదలైన పనులను నేర్పుటకు ఇదియే కారణము. ఈ సూత్రము ననుసరించియే మాధ్యమికదశలో వడ్రంగము వ్యవసాయము మొదలగు వాటిని నేర్చుకొనుట జరుగుచున్నది.

ఈ విధానములోని తుదిపరిణామముగు వృత్తి విద్యలను నేర్పుటకై ప్రత్యేకవిద్యాలయాలను స్థాపించుట. విద్యార్థులలో శక్తి సామర్థ్యములందును అభిరుచులందును తరతమభేదములు సహజములు. కొందరు శాస్త్రవిద్యయందు అభిరుచులులేనివారు. వారికి వృత్తి విద్యలయందు గౌరవయు అభిరుచియు మెండు. ఇట్టి సందర్భములో వృత్తి విద్యలను నేర్పు విద్యాలయములు అవసరము అగుచున్నవి. వీటి ప్రధానోద్దేశము జీవితములో చేయదగిన పనులలో నైపుణ్యమును నేర్పుట. వీటిలోని బోధన విషయములు ఇతర విద్యాలయములలో బోధింపబడు విషయములకంటె భిన్నములుగ నుండును.

**నైతికవిలువలను సమకూర్చు విషయములు** - విద్యజ్ఞాన సముపార్జనమునకును వృత్తులయందు నైపుణ్యమును సంపాదించుటకును సాధనమగుటయేగాక, సమాజములో మానవుడు పాటించవలసిన విలువలను నేర్చుకొని పాటించుటకు ప్రధాన సాధనము కావలెను. అట్టి విలువలను - నీతినియమములను - నేర్పు విద్యయే నిజమైన విద్య. వాటిని నేర్పని విద్య అసంపూర్ణమగు విద్య అని చెప్పదగియున్నది. నీతినియమముల పట్ల గౌరవభావము లోపించినచో స్త్రీ పురుషులతో కూడిన సంఘము విచ్ఛిత్తిగాంచునని ప్రత్యేకముగ చెప్పవలసిన పనిలేదు. సామాజికజీవితమనగా నియమబద్ధమగు జీవితము.

సామాజికవిలువలు-నీతినియమములు-కాలానుగుణముగ మారుచుండును. కాని ఎన్నిమార్పులుగాంచినను విలువలే లేని సమాజము ఏకాలమునందును ఉండదు. ప్రాచీన మధ్యయుగములలో వర్ణాశ్రమధర్మములను పాటించుటయే నీతినియమము. మను సంప్రదాయము మనసమాజములో ఏర్పడియుండెను. ఇట్టి ధర్మములందు గౌరవమును పెంపొందించుట విద్యాలయముల ప్రధానోద్దేశముగ నుండెను. కాని ఇటీవలి కాలమున వీటికి ప్రాధాన్యము నశించెను. వీటిస్థానే జాతీయభావము

ప్రజాస్వామికము మానవసమత్వము లౌకికదృష్టి సోషలిజం అనునవి సమాజమునకును సమాజములోని ప్రతివ్యక్తికిని ధ్యేయములుగనుండ వలెనను తత్త్వము ప్రాధాన్యముగాంచు చున్నది

ఈ కాలపు విలువలయందు విద్యార్థులందరికి గౌరవము కలుగు నట్టి విద్యను బోధించుట అవసరమగుచున్నది బోధన విషయములలో వీటికి ప్రాధాన్యము కల్పించవలెను పౌర శాస్త్రము- నీతి విద్య దీనికి తోడ్పడగల విషయములు కాని ఈ గౌరవభావము గ్రంథపఠనమువలన మాత్రమే లభించునట్టిది కాదు ఇది సాంఘిక సేవకు సంబంధించిన కార్యక్రమములలో పాల్గొనుట మూలముననే లభించగలదు

అన్నికులములవారు అన్నిమతములవారు కలిసి పని చేయుకార్యక్రమములు విద్యావిధాన మందొక అంతర్భాగ ముగ నుండవలెను ఇదిగాక ఏదియో ఒకవిధమైన సాంఘిక సేవలో విద్యార్థులు పాల్గొనవలెను స్వార్థమొక్కటే జీవిత పరమార్థమను సంకుచిత భావము నశించుటకు సాధనాంతరము లేదు ఈ సాంఘిక సేవ అనేకరూపములలో నుండవచ్చును తుదకు తమతమ విద్యాలయములను వాటి పరిసరములను శుభ్రముగ నుంచుబాధ్యతను విద్యార్థులు వహించుటకూడ సాంఘిక సేవ అని చెప్పవచ్చును పరిసర ప్రాంతములలోని పల్లెలకు పట్టణములకువెళ్ళి తమతమవయస్సునకు అనుభవమునకు పరిజ్ఞానమునకును అనుగుణమగు సేవాకార్యక్రమములలో పాల్గొనుట ఈ సందర్భములో ఆచరణయోగ్య మగుచున్నది బాల భటోద్యమములవంటి ఉద్యమముల ఆశయము ఇదియే

పై వివరణమువలన విద్యాలయములలో బోధింపదగిన విషయములు జ్ఞానసంపాదనమునకును పనులయందు నైపుణ్యమును సంపాదించుటకును సామాజిక విలువపట్లను నియమబద్ధమగు జీవితముపట్లను గౌరవభావమును సమకూర్చునట్టివిగ నుండవలెనని స్పష్టమగుచున్నది మూడురకములగు ఈ సంపాదనములలో సాధనమగు విద్యయే నిజమైన విద్య వీటిలో ఏది లోపించినను విద్యావిధానము అసమగ్రమైనట్టిదని చెప్ప తగియున్నది

మా వెం

## విద్యావిధానము - భారత రాజ్యాంగము

రాజ్యాంగరీత్యా భారతరాజీయ విధానము ఫెడరల్ పద్ధతికి చెందినట్టిది ఈ పద్ధతిలో ప్రభుత్వము చెలాయించు అధికారములు వహించు బాధ్యతలు కేంద్ర రాష్ట్ర ప్రభుత్వముల మధ్య విడివిడిగా కేటాయింపబడును దీని ననుసరించి విద్యావిధానమునకు సంబంధించిన అధికారములు కొన్ని ప్రత్యేకముగ రాష్ట్రప్రభుత్వములకును కొన్ని ప్రత్యేకముగ కేంద్రప్రభుత్వమునకును మరికొన్ని ఉభయప్రభుత్వముల కును కేటాయించబడినవి ఇందుకుగాను రాజ్యాంగపు 7 వ షెడ్యూలులో మూడు కేటాయింపు జాబితాలు చేర్చబడినవి

ఈ జాబితాలను పరిశీలించిన పక్షమున మొత్తముమీద విద్యావిధానమును రూపొందించి అమలుపరచు అధికారము రాష్ట్రప్రభుత్వములదే అని స్థూలముగ చెప్పవచ్చును రాష్ట్ర ప్రభుత్వముల ప్రత్యేకాధికారములను నమోదుపరచు రెండవ జాబితాలోని 11 వ పద్దు కొన్ని మినహాయింపులకు లోబడి విశ్వవిద్యాలయములతో సహా విద్య అంతయు రాష్ట్రప్రభుత్వముల అధికారపరిధిలో నుండునట్లు విధించుచున్నది వివిధ దశలకును వివిధ తరగతులకును సంబంధించిన విద్యను వాటికి సంబంధించిన సౌకర్యములను ప్రజలకు అందజేయవలెనన బాధ్యత రాష్ట్రప్రభుత్వములపై ఉన్నది విద్యావిధానములోని గుణదోషములకు ఈ ప్రభుత్వములవారే బాధ్యులని స్థూలముగ చెప్పవచ్చును విద్యావిధానమును రూపొందించుటలో వారికి చాలవరకు స్వాతంత్ర్యము కలదు

పైన చెప్పినట్లు ఈ స్వాతంత్ర్యము కొన్నిమినహాయింపులకు లోబడియున్నది ఈ మినహాయింపు లన్నియు కేంద్ర ప్రభుత్వమునకును విద్యావిధానముపైగల అధికారమునకును సంబంధించినవి 7 వ షెడ్యూలులో మొదటి జాబితాలోని 63 64 65 66 పద్దులు ఈ అధికారస్వరూపమును స్పష్టము చేయుచున్నవి 63వ పద్దు ఫలితముగ వారణాసి హిందూ విశ్వవిద్యాలయము, అలీఘర్ ముస్లిం విశ్వవిద్యాలయము ఢిల్లీ విశ్వవిద్యాలయము జాతీయ ప్రాధాన్యముగలవిగ శాసనము ద్వారా పార్లమెంటు ప్రకటించు తక్కిన విశ్వవిద్యాలయములు [(ఏ రాష్ట్రమందున్నను) కేంద్రప్రభుత్వపు అధికారములో నుండును శాంతినికేతన్‌లోని విశ్వభారతి పార్లమెంటు ప్రకటన ననుసరించి కేంద్రప్రభుత్వ పరిధిలోనికి వచ్చినట్టిది 64 వ పద్దు ఫలితముగ కేంద్రప్రభుత్వము నుండి పూర్తిగగాని, పాక్షికముగగాని ఆర్థికసహాయమును పొందుచుండు శాస్త్రీయవిద్యాసంస్థలు సాంకేతిక విద్యాసంస్థలు జాతీయ ప్రాధాన్యము కలవిగ శాసనము ద్వారా పార్ల

మెంటు ప్రకటించిన వక్షమున కేంద్రప్రభుత్వపు అధికారము లోనికి వచ్చును దక్షిణభారతహిందీ ప్రచారసభ అఖిల భారత వైద్యశాస్త్రసంస్థ హిందీసాహిత్య మ్మేళనము బొంబాయి ఢిల్లీ కాన్పూరు ఖరగ్‌పూరు మద్రాసులలోని భారత సాంకేతిక సంస్థలు (Indian Institutes of Technology) - ఈ వర్గమునకు చెందిన సంస్థలలోకొన్ని 66 వ పద్దుఫలితముగ వృత్తులకు ఉద్యోగములకు సాంకేతికవ్యవహార ముల నిర్వహణకు శిక్షణ నిచ్చునట్టియు పోలీసు అధికారులకు శిక్షణ నిచ్చునట్టియు కేంద్రప్రభుత్వ సంస్థలు ప్రత్యేకశాస్త్ర ముల అభివృద్ధికిగాని పరిశోధనాభివృద్ధికిగాని నేరముల ఆచోకీ విషయములో శాస్త్రీయ సహాయమునకుగాని ఉద్దేశింపబడిన కేంద్రసంస్థలు కేంద్రప్రభుత్వపు పరిపాలనలోనుండును 66వ పద్దు వీటిఅన్నిటికంటె ప్రధానమైనట్టిది దీనిఫలితముగ ఉన్నతవిద్యకు సంబంధించిన వ్యవహారము అన్నిటిపైన అజమాయిషీ అధి కారము కేంద్రప్రభుత్వమునకు లభించుచున్నది ఉన్నతవిద్యకు గాని ఉన్నతపరిశోధనకుగాని ఉద్దేశింపబడిన సంస్థలమధ్యను శాస్త్రీయ సంస్థలమధ్యను సాంకేతికసంస్థల మధ్యను సమన్వ యము కుదురుట ప్రాతిమానములను లక్ష్యములను నిర్ణయిం చుట -ఇది 66 వ పద్దు ప్రకారము కేంద్రప్రభుత్వపు కర్తవ్య మగుచున్నది దీనిమూలమున ఉన్నతవిద్యపై ఎంతటి అధికా రము నైనను వహించుటకు కేంద్రప్రభుత్వమునకు అవకాశ మున్నది

7 వ షెడ్యూలులోని మొదటిజాబితా కేంద్రప్రభుత్వపు ప్రత్యేక అధికారములను రెండవజాబితా రాష్ట్రప్రభుత్వముల ప్రత్యేక అధికారములను నమోదుపరచుచున్నవి ఇందు లోని మూడవజాబితా ఉభయప్రభుత్వములకుగల అధికారము లను పేర్కొనుచున్నది అనగా ఇందులోనిపద్దులపై రాష్ట్ర ప్రభుత్వములకు ఎంతటి అధికారముకలదో అంతటి అధికా రము కేంద్రమునకుకూడకలదు కాని ఈ రెండుప్రభుత్వ ములు చేయు శాసనముల మధ్యగాని జారీచేయు ఉత్తరువుల మధ్యగాని పరస్పర వైరుధ్యమేర్పడినపుడు కేంద్రశాసన ములు ఉత్తరువులు మాత్రమే చెల్లగలవు అందుచేత మొత్తము మీద ఈ పద్దులపై కేంద్రమునకే ఎక్కువ అధికార మున్నదని చెప్పవచ్చును

ఈ మూడవజాబితాలోని 20 వ పద్దు అతిముఖ్యమైన ట్టిది దీని ఫలితముగ "ఆర్థిక సాంఘిక ప్రణాళికలను రూపొందించుట" పై ఉభయప్రభుత్వములకు అధికారము లభించుచున్నది ఈ పద్దులో విద్యావిధానమును గురించి ప్రత్యేకముగ చెప్పబడక పోయినను అప్రత్యక్షముగ వాటికి గొప్ప ప్రాధాన్యము లభించియున్నది దేశముయొక్క ఆర్థి కాభివృద్ధియు సాంఘికాభివృద్ధియు విద్యాభివృద్ధితో ముడి పడియున్నట్టివి విద్యాభివృద్ధిలేక ఈ రెండురంగములలో అభి వృద్ధి సాధ్యము కాజాలదు కావున ఆర్థిక సాంఘిక ప్రణా ళికలను రూపొందించుటలో విద్యాప్రణాళికలను రూపొందించ వలసిన అవసరమేర్పడుచున్నది ఇదిగాక ప్రణాళికలను రూపొం దించు అధికారము రాజ్యాంగరీత్యా ఉభయప్రభుత్వములకు లభించియున్నను ఆచరణలో ఈ అధికారమును కేంద్రప్రభు త్వము మాత్రమే ఎక్కువగ నిర్వహించవలసియున్నది ప్రణా ళికలను రూపొందించుటలో అఖిలభారత దృష్టి అవసరము అట్టి దృష్టి కేంద్రప్రభుత్వమునకు మాత్రమే కలదు ఇదిగాక ప్రణాళికలను అమలుపరచుటకు కావలసిన ఆర్థికస్తోమత కేంద్ర ప్రభుత్వమున కున్నంతగా రాష్ట్రప్రభుత్వములకు లేదు ఈ రెండుకారణములచే ప్రణాళికలను రూపొందించుటలోను - అందులో ఒకప్రధానాంశమైన విద్యావిధానమును రూపొందిం చుటలోను - కేంద్రప్రభుత్వము ప్రధానపాత్రను వహించు చున్నది అఖిలభారత దృష్ట్యాను జాతీయసమగ్రత దృష్ట్యాను విద్యావిధానములో జరగవలసిన మార్పులను సూచించుట లోను అందుకు కావలసిన ఆర్థికసౌకర్యములను తదితర సౌకర్యములను సమకూర్చుటలోను కేంద్రప్రభుత్వము నాయ కత్వము వహించియున్నది ఆ సూచనలను రాష్ట్రముల లోని ప్రత్యేక పరిస్థితులకు అనుగుణముగ అమలుపరచు బాధ్య తను రాష్ట్రప్రభుత్వములు వహించుచున్నవి పరిపాలనవిధాన ములో కర్తవ్య నిర్ణయము కర్తవ్య నిర్వహణము అనునవి ప్రధాన భాగములు ఈ రెండింటిలో కేంద్రప్రభుత్వము కర్తవ్యనిర్ణయమందును రాష్ట్రప్రభుత్వములు కర్తవ్య నిర్వ హణమందును ఎక్కువ పాల్గొనుచున్నవి

రాజ్యాంగములోని మరికొన్ని సూత్రములు కూడ ఉభయప్రభుత్వములకు ఉమ్మడి అధికారములను కొన్ని సూత్రములు కేంద్రప్రభుత్వమునకు ప్రత్యేకాధికారములను కల్పించుచున్నవి 7 వ ప్రణాళిక టక్కాచే ఈ సందర్భమున ప్రాముఖ్యము వహించుచున్నదని అనుకోనరాదు ఈ సంద ర్భమున మరికొన్ని సూత్రములుకూడ గమనార్హములు

వీటిలో ప్రప్రథమమున పేర్కొనదగినవి 45, 46 సూత్రములు వీటిలో 45 వ సూత్రము 6–14 వయస్సు ఎల్లలలందరికి 1960 లోపుగ నిర్బంధోచితవిద్యను లభింపజేయవలెనని ఉభయ ప్రభుత్వములను ఆదేశించుచున్నది 1960 ఎన్నడో దాటిపోయినది ఇప్పటికీ కూడ రాజ్యాంగములోని ఆదేశము కార్యరూపము ధరించలేదు రాష్ట్ర ప్రభుత్వములకు ఈ విషయములో ఆర్థిక సౌకర్యములులేవు అందుచేత కేంద్రప్రభుత్వమే ఈ బాధ్యతను వహింపవలసియున్నది 46 వ సూత్రము బలహీనవర్గములయొక్కయు వాటిలో ముఖ్యముగ షెడ్యూల్డు కులములకు (హరిజనులకు) షెడ్యూల్డు తెగలకు (ఆదివాసులకు) చెందిన జనముయొక్కయు విద్యాభివృద్ధికి ఉభయ ప్రభుత్వములు బాధ్యత వహించవలసినట్లు ఆదేశించుచున్నవి ఇందులో కూడ ఆర్థిక కారణముల మూలమున రాష్ట్ర ప్రభుత్వములు గొప్ప పాత్రను వహించగల స్థితిలో లేవు కేంద్రమే భారమునంతను వహించవలసి యున్నది బలహీన వర్గములలో స్త్రీలు కూడ చేర్చబడియున్నారు స్త్రీలు విద్యలలో వెనుకబడి యున్నారు జన సంఖ్యలో వారిది అర్థభాగము హరిజనులు ఆదివాసులు తదితరులు కలిసి జనసంఖ్యలో నాల్గవ వంతు ఉన్నారు అందుచేత దేశములోని ప్రజలలో ముప్పాతిక భాగపు విద్యాభివృద్ధి కేంద్రప్రభుత్వముపై ఆధారపడి ఉన్నది ఈ విద్యాస్వరూప నిర్ణయమును చేయుట దానికి కావలసిన ఆర్థిక సౌకర్యములను సమకూర్చుట – ఈ పనులను కేంద్రము చేయుట తప్పదు కార్యక్రమములను అమలుపరచు పనిని రాష్ట్ర ప్రభుత్వములు చేయవలెను

రాజ్యాంగములోని 350 (ఎ) సూత్రము కూడ ఇట్టిదే ప్రతిరాష్ట్రమందును అధిక సంఖ్యాకులు మాట్లాడు భాషను మాట్లాడని అల్ప సంఖ్యాక వర్గముల వారున్నారు వీరి పిల్లలకు ప్రాథమిక దశలో మాతృభాష ద్వారా విద్యను గరపుట ఉచితమని నిపుణుల అభిప్రాయము కాని ఇది అన్ని రాష్ట్రములలో జరుగుటలేదు అందుచేత ఇట్టి సౌకర్యమును కలిగించు బాధ్యతను ఆయా రాష్ట్ర ప్రభుత్వములే గాక కేంద్ర ప్రభుత్వము కూడ వహించ వలసినట్లు ఈ సూత్రము విధించు చున్నది

రాజ్యాంగములోని 343 వ సూత్రము ప్రకారము దేశములో హిందీ భాష అధికార భాషగ నిర్ణయింపబడినది కాని ఈ భాష దేశములోని ప్రజలందరికి తెలియదు తెలియని వారి సంఖ్య తెలిసిన వారి సంఖ్యకంటె అధికముగ నుండవచ్చును హిందీ భాషాభివృద్ధికై ప్రత్యేక కార్యక్రమమొకటి ఉన్నగాని అది ప్రజలందరి అందుబాటులోనికి రాజాలదు ఈ కార్యక్రమమును నిర్వహించ వలసిన బాధ్యతను రాజ్యాంగములోని 351 వ సూత్రము కేంద్ర ప్రభుత్వముపై విధించు చున్నది

ఇదిగాక విద్యాభివృద్ధి విషయములోను సాంస్కృతికాభివృద్ధి విషయములోను అంతర్జాతీయ సంస్థలతోను విదేశములతోను సంబంధము నేర్పరచుకొనవలసిన అవసరము ఎంతయో ఉన్నది యునెస్కో వంటి సంస్థల సహాయమున దేశములోని విద్యావ్యాప్తికై సంబంధించిన కార్యక్రమములనేకములు సాగుచున్నవి ఇట్లే బ్రిటన్ రష్యా అమెరికా మొదలైన దేశములతో సాంస్కృతిక ఒడంబడికలనేకములు చేసికొనబడి యున్నవి మన రాజ్యాంగము ప్రకారము విదేశములతో వ్యవహారము లన్నియు కేంద్ర ప్రభుత్వము మాత్రమే నిర్వహించ వలసియున్నది అందుచేత విదేశములతో విద్యా విషయక సంబంధము లన్నియు కేంద్ర ప్రభుత్వపు అధీన మందున్నవి రాష్ట్ర ప్రభుత్వములకు వీటితో జోక్యము లేదు

విద్యావిధానమునకు సంబంధించిన అధికారములో చాలభాగము రాష్ట్రప్రభుత్వములకు చెందినట్టిదనియు కేంద్ర ప్రభుత్వమునకుగల అధికారముగాని బాధ్యతగాని చాల స్వల్పమనియు అనేకులుభావించుచున్నారు కాని పై వివరణము ఈ భావము సరియైనది కాదని స్పష్టముచేయుచున్నది 7 వ షెడ్యూలులో కేంద్రప్రభుత్వమునకు కేటాయింపబడిన ప్రత్యేకాధికారము స్వల్పమైనను ఉభయప్రభుత్వములకు ఉమ్మడిగ కల్పింపబడిన అధికారము విస్తారమగుటచేతను ఈ ఉమ్మడి అధికారమును చెలాయించుటలో కేంద్రప్రభుత్వమునకుగల ఆర్థికస్తోమత అధికమగుటచేతను మొత్తముమీద కేంద్రప్రభుత్వము అనేక కార్యక్రమములలో పాల్గొనుట జరుగుచున్నది విద్యావిధానమును సరిదిద్దుటయందు ఉభయప్రభుత్వములు భాగస్వాములనియు ఇందులో కేంద్రప్రభుత్వముయొక్క భాగము అనల్పమనియు చెప్పవచ్చును

కేంద్రప్రభుత్వము విద్యారంగములో వహించిన పాత్ర ఈక్రింది కార్యక్రమములకు సంబంధించినట్టిది

(1) విదేశములలో విద్యావిషయక, సాంస్కృతిక

విషయక సంబంధములు; (2) విద్యకు సంబంధించి వివిధరాష్ట్రములలో సంభవించు పరిణామముల గురించి సమాచారమును సేకరించి ప్రచురించుట (3) కేంద్రప్రభుత్వ రాష్ట్రప్రభుత్వ కార్యక్రమముల సమన్వయము (4) కేంద్రపరిపాలనలోనుండు ప్రాంతముల – మణిపూరు త్రిపుర గోవా పుదుచ్చేరి మొదలగునవి – విద్యావిధానము (5) శాస్త్రీయ పరిశోధన (6) సాంకేతికవిద్య (7) హిందీభాషను గురించి ప్రచారము అభివృద్ధి కార్యక్రమములు (8) జాతీయ సంస్కృతికిని జాతీయ కళలకును సంబంధించిన అభివృద్ధి కార్యకలాపములు; (9) ప్రాచీన భారతీయ సంస్కృతియొక్క పోషణము (10) సంస్కృత భాషాపోషణము (11) వికలాంగుల విద్య (12) విద్యారంగములో వివిధ సంస్థలద్వారా జరుగుచుండు పరిశోధన కార్యక్రమముల సమన్వయము (13) అల్ప సంఖ్యాకుల సంస్కృతి పరిపోషణకు సంబంధించిన కార్యక్రమములు (14) బలహీన వర్గముల విద్యాసౌకర్యములు (15) జాతీయ సమైక్యతకు సంబంధించిన కార్యక్రమములు (16) ఉన్నత విద్యను అభ్యసించుటలో ప్రత్యేకములగు తెలివితేటలుగల యువకులను ఎన్నుకొని వారికి విద్యార్థి వేతనములనిచ్చి ప్రోత్సహించుట (17) ఉన్నతస్థాయికి చెందిన వృత్తులకు ఉద్యోగములకు కావలసిన శిక్షణ నిచ్చుట (18) కేంద్రవిశ్వవిద్యాలయములను ఇతరవిద్యా సంస్థలను నిర్వహించి పోషించుట (19) 6–14 వయస్సుపిల్లలకు ఉచితముగను నిర్బంధముగను విద్యలభింపజేయుట (20) స్త్రీలవిద్యకు ప్రత్యేకసౌకర్యములను కల్పించుట

ఈ కార్యక్రమములలో కొన్నిటిని స్వతంత్రముగను మరికొన్నిటిని రాష్ట్రప్రభుత్వముల సహాయ సహకారములతోను కేంద్రప్రభుత్వము నిర్వహించుచున్నది ఎంతటిబాధ్యతను కేంద్ర ప్రభుత్వము వహించుచున్నదో ఎంతటిబాధ్యతను రాష్ట్రప్రభుత్వములు వహించుచున్నవో తెలిసికొనుటకు ఆ యా ప్రభుత్వములు విద్యకై ఖర్చుపెట్టు అంకెలు కొంతవరకు సహాయ పడుచున్నవి 1951–52 లో కేంద్రము 4·18 కోట్లు రాష్ట్రములు 60·28 కోట్లు ఖర్చుపెట్టెను 1961–1962 లో కేంద్రము 51·88 కోట్లు రాష్ట్రములు 234·48 కోట్లు; 1965–66 లో కేంద్రము 88·04 కోట్లు రాష్ట్రములు 375·98 కోట్లు ఖర్చుపెట్టుట జరిగెను దీనినిబట్టి 1965–66 లో విద్యకై ప్రభుత్వము ఖర్చుపెట్టిన మొత్తములో అయిదవ వంతు కేంద్రము, తక్కిన నాలుగు వంతులు రాష్ట్రములు భరించుచున్నట్లు చెప్పవచ్చును అనగా అయిదవవంతు బాధ్యతను కేంద్రము తక్కిన నాలుగువంతుల బాధ్యతను రాష్ట్రములు వహించుచున్నట్లు స్పష్టమగుచున్నది

హా వెం

## విద్యాసాగరుడు ఈశ్వరచంద్ర

వంగరాష్ట్రమున జన్మించిన మహనీయులలో ఈశ్వరచంద్ర విద్యాసాగరుడు ప్రథమశ్రేణికి చెందినవాడు చరిత్రప్రసిద్ధికెక్కిన భారతీయసంఘ సంస్కర్తలలోను విద్యావేత్తలలోను దానశీలురలోను 19వ శతాబ్ది భారత పునరుజ్జీవన చరిత్రలోను వంగభాషాగద్యరచనమునందును ఇతడగ్రగణ్యుడు ఇతని మానవత్వము సాటిలేదనుట జగత్ప్రసిద్ధము ఈతని సార్థకనామమునుబట్టి ఇతడు విజ్ఞానసర్వస్వము మూర్తీభవించిన మహావ్యక్తిగా యావద్భారతముచే ఉగ్గడింపబడినాడు ఇతని జన్మచే వంగరాష్ట్రము ధన్యమైనది

నిరాడంబర జీవిత విధానమునందును వినయ శీలత్వ సౌజన్యములందును ఔదార్యమునందును అచంచలధైర్య సాహసములందును సత్యసంధతయందును అన్నిటిని మించిన సర్వమానవసమానత్వమునందును ఇతనికి ఇతడే సాటియై ఆనాటి ప్రజల యొక్క, బ్రిటిష్ ప్రభుత్వము యొక్క మన్ననలు బడసినవాడు విద్యాసాగరుడు వంగదేశపు ప్రాచీన సంస్కృత పండితులవలె ఇతడు సామాన్యమైన ధోవతిని ఉత్తరీయమును పాదరక్షలను ధరించెడివాడు ఆ దినములలో వైస్రాయివంటి అత్యున్నతోద్యోగులు కొలువుదీరియున్న దర్బారులలో రాజఠీవి కనుగుణమైన కాశ్మీరుశాలువలు మొదలైన వలువలుధరించి సంప్రదాయపండితవర్గము ఆసీనులైయుండగా విద్యాసాగరుడు తన సామాన్యవస్త్రములనే ధరించి అచటి కరుగుచుండెడివాడు అట్లే ఇంటియొద్దగాని సంస్కృత కళాశాల ప్రధానాధ్యాపకుడుగ అందునప్పుడుగాని సామాన్య వస్త్రధారణము తోడనే మసలెడివాడు ఇట్టి ప్రాచీన వస్త్రధారణము దేశభక్తి సూచకమేకాక ప్రాచీనభారతనాగరికతకును వైదిక విజ్ఞానమునకును చిహ్నమని కూడ అతడు పలువురితో పలుకుచుండెడివాడు

విద్యాసాగరుడు సంస్కృత వంగ, హిందీ, ఆంగ్లభాషల యందు ఉద్దండుడైన పండితుడు దాదాపు సంస్కృత శాస్త్రములన్నిటిని ఇతడు ఆపోశనము పట్టినాడనవచ్చును అత్యంత

సులభ శైలిలో పండిత పామర లోకము మెచ్చునట్లు సంస్కృత వ్యాకరణమును రూపొందించియు పెక్కు సంస్కృత గ్రంథములను ప్రచురించియు ఇతడు ఖ్యాతిగాంచినాడు వేదాంతమును సాంఖ్యమును కూలంకషముగ అవలోడన మొనర్చిన ఇతడు అవి కేవలము కృత్రిమము బూటకము నైన తత్త్వశాస్త్రములే అనియు "కారణాంతరములచే



వాటిని విద్యార్థులకు బోధింపవలసి వచ్చినదనియు నిర్మొగమాటముగ నిర్భీతిగ అభిప్రాయము వెలిబుచ్చెడివాడు ఆ దినములలో భగవంతుని అస్తిత్వమునందు అనుమానము ప్రకటించినవారు భారతీయ సాంస్కృతిక జీవితములో రామమోహన రాయల కాలమునుండి టాగూరు గాంధిమహాత్ముల కాలము వరకు ఇతడు తప్ప అన్యులెవ్వరును లేరనియే చెప్పవచ్చును ఎటువంటి తెరుదురైనను ప్రతిఘటించి తాను విశ్వసించిన సిద్ధాంతములనే పట్టువిడువక ఆచరించిన ధీరోదాత్తుడగుటచేతనే ఆనాటి వంగ సంప్రదాయ పండితవర్గమున కితడు పగవాడయ్యెను కాని మహనీయగుణగణములచే సామాన్య ప్రజానీకమునకు పరమ సన్నిహితుడై చారిత్రక పురుషుడైనాడు

రామమోహనరాయలు కేశవచంద్రసేనుడు కందుకూరి వీరేశలింగము వంటి మహనీయులు బాల్యవివాహములు వితంతువివాహ నిషేధము బహుభార్యాత్వము దేవదాసీ వ్యవస్థ పరదాపద్ధతివంటి దురాచారములను ఖండించి తన్నివారణమునకై మహోద్యమములు నడిపినట్లే విద్యాసాగరుడు తన సర్వస్వమును ఆ మహదాశయముల కర్పించినాడు ఆతని కాలమున లో మత సాంఘిక, రాజకీయ రంగములలో సాగిన ఉద్యమముల ప్రతిధ్వనులు. ఆతడు విశేషముగ అభిమానించిన విద్యారంగమునగూడ వినిపించినవి ఆధునిక భారతావనిలో ముఖ్యముగ స్త్రీ విద్యకై విద్యాసాగరుని కంటె విశేషముగ పాటుపడినవారు వేరొకరు లేరు ఇతడు రచించిన వర్ణపరిచయ మను అత్యద్భుత వంగ భాషా ప్రథమబోధిని నాలుగైదు తరములవారికి విద్యావ్యాసంగములో అనన్య సామాన్యముగ దోహదమొనర్చి రవీంద్రునంతటివాని ప్రశంసలను బడసినది

ఆ దినములలో మ్లేచ్ఛయవనాది హైందవేతర జాతీయులకు స్థానములేని సంస్కృత కళాశాలలలో ఒక సంస్థకు విద్యాసాగరుడు ప్రధానాధ్యాపకుడుగాగా పూర్వాచార పరాయణులైన బ్రాహ్మణుల ఆగ్రహమునకుగురియై బ్రాహ్మణవిద్యార్థులకై ప్రత్యేకింపబడిన ఆ కళాశాలయందు సంస్కృత మభ్యసింపదలచిన అంగ్ల విద్యార్థులకు ప్రవేశమునిచ్చి తన విశాలహృదయమును ప్రపంచమునకు చాటుకొని చరిత్రను సృష్టించినవాడితడు; ఈ విధముగ "దేవభాష" ను శూద్రులకందజేసి పుణ్యము కట్టుకొన్న మనీషిగా ఉగ్గడింపబడినాడు

మహిళాలోకమానాటి సమాజములో గురియైన క్లేశపరంపరకు అత్యాచారములకు విద్యాసాగరుడు తల్లడిల్లి వారి అభ్యుదయమునకై నిర్భయముగా మహోద్యమము నడిపి విధవాపునర్వివాహమువంటి పెక్కు సంస్కరణములను గూర్చి ప్రభుత్వముచే సముచితమైన శాసనములు చేయించు వరకు ఆతడు విశ్రమించినవాడు కాడు అందుచే మహిళా ప్రపంచమితనికి విశేషముగా ఋణపడియుండును

విద్యాసాగరుని సిద్ధహస్తములో వంగభాషా గద్య రచనము పరిపక్వమై మధురాతిమధురముగా పరిణామము చెందినది ఆతడు ముఖ్యముగా సాంఘిక చారిత్రక సమస్యలపై కేంద్రీకరించి రసవత్తరముగ వ్రాయుచుండెడివాడు షేక్స్పియరువంటి మహాకవులరచనల కొన్నిటిని ఆతడు అనుకరించి వంగభాషలో హృద్యమమైనకథల రూపమున వెలయించినాడు సంస్కృత వాఙ్మయమున ఆతడు మహోపాధ్యాయుడై యుండియు, ఛాందసులవలె "నన్ను మాట్లాడనీయక మాకాలు శాకి" అని ముక్కు మూసికొని శ్లోకాలేకాక కొన్నింటి, కలవరపెట్టు సమకాలీనసమస్యల పరిష్కారమునకై నిర్భయముగ ప్రయత్నించినాడు

విద్యాసాగరుడు కరుణానముద్రుడనబడుటకు ఆత్మీ-

ఉదాహరణములు పేర్కొనబడినవి ఈ కరుణ జాతి మత కుల వర్గ విచక్షణ లేకయే హిందు మహ్మదీయ క్రైస్తవ మైన ప్రజాసామాన్యముపట్ల క్రియారూపమున ప్రదర్శించెడి వాడు. సహజముగ మానవాళియెడల ఇతనికి గల అపార ప్రేమాభిమానములతో ఎవరెట్టి కష్టములపాలగుచున్నను వాటిని నివారించి వారికి సాయపడుటయందు శారీరక శ్రమయే గాక ధనమును గూడ వెచ్చించెడివా డు

ఆ దినములలో ప్రయాణములు వేగముగ సాగుటకు పాలకీలుపయోగింపబడెడివి పరిసరప్రాంతములందు విద్యా లయములను దర్శించుటకు విద్యాసాగరుడు పాలకిలో ప్రయాణ మొనర్చుచుండునపుడు మార్గ మధ్యమున తట స్థించు ఎకలాంగులను గాని వ్యాధిగ్రస్తులను గాని అతడు తన పాలకిలో ఎక్కించుకొని వారు చేరవలసిన స్థలములలో వారిని దింపి అవసరమైన ధనమును వారి కిచ్చుచుండెడి వాడట ! ఇట్లాతని బహుముఖఖ్యాతి వంగరాష్ట్రమున నల్దె శల వ్యాపించగా అతని రాకను ముందుగా ఎరిగిన పరిసర గ్రామీణులు అతనిని దర్శించుటకు మార్గమధ్యమున తండోప తండములుగా గుమికూడి ఆతురతతో ఎదురుచూచు చుండెడి వారట ! విద్యాశాఖాధికారివంటి ఉన్నతోద్యోగి తన పద వికి అనుగుణమైన ఉడుపులను ధరించి ఆడంబరముగ ఉండక పోవునా అని తలంచినవారు అతని అతి సాధారణమైన వస్త్ర ధారణమునుచూచి ఆబ్బుర పడెడివారట ! అకాలమునగాని సకాలమునగాని తన యింటికివచ్చు అతిథి అభ్యాగతులను అతడు సాదరముగ కుశలమడిగి తృప్తిగ వారికి భోజనమిడి, అనంతరము తృణమో పణమో ముట్టజెప్పి సాగనంపెడి వాడట ! ఇట్టి వెన్నియో ఉదంతములు అతని జీవితకాల మున ఘటిల్లి అతని మానవత్వమును వెల్లడి చేసినవి జీవితా రంభమున తన కుటుంబమనుభవించిన దుర్భర దారిద్ర్య క్లేశమే ఎద్యాసాగరుని అంత గొప్ప మానవతావాదిగా తీర్చి దిద్దినది

విద్యాశాఖాధికారిగ తాను సంపాదించుచుండిన వేత నము ద్వారానే కాక స్వయముగ రచించినట్టియు, సంకల నము చేసినట్టియు పెక్కు ఉద్గ్రంథముల అమ్మకము వలన గూడ విద్యాసాగరుడు నెలకు నాల్గువేల రూప్యము లార్జిం చెడివాడు ఈ ధనము నతడు విద్యాసంస్థలను పోషించుట యందును అర్హులైన పేద పండితులను సన్మానించుట యందును కష్టదశయందు తగుల్కొన్న సకల వర్ణముల వారిని ఆదుకొనుట యందును వరదలవలన అగ్నివలన ఇతర ప్రమాదములవలన గృహవసతిని కోల్పోయిన వారిని బంధు మిత్రులకు దూరమైన వారిని రక్షించుటయందును వ్యయ పరచెడివాడు చిల్లర ధర్మములు చేయుటకు వీలుగా ఇతడు తనవెంట ఎల్లపుడు తనసంచీనిండ చిల్లర నాణెముల నుంచుకొనెడి వాడట !

ఆత్మగౌరవముకంటె ధన సంపాదనము అధికతరమైన విషయము కాదనుటకు అతని జీవితమునందు పెక్కు సంఘట నలు తార్కాణములుగా పేర్కొన వచ్చును ఇట్టి ఒకానొక సందర్భమున తన ఉన్నతాధికారికిని తనకును నడుమ వాదోప వాదములు జరుగగా ఇక తా నా పదవి యందుండుట తన ఆత్మగౌరవమునకు భంగకరమని తలచి తన పదవికి రాజీ నామా ఇచ్చినాడట ! ఇందుచే [తన నెలసరి ఆదాయమునే కాక పెన్షను హక్కునుకూడ అతడు కోల్పోయినాడు స్వాభిమానమును రక్షించుకొనుట యందాతని పట్టుదల ఈ యుదంతమువలన తెలియగలదు

విద్యా సంస్థలకు అనాథశరణాలయములకు వైద్యా లయములకు ప్రజోపయోగకరమైన ఇతర సంస్థలకు విద్యా సాగరుడు చేసిన దాన ధర్మములు అపారము లక్షన్నర రూప్యములతో అతడు నిర్మించిన కళాశాల కలకత్తా నగర మున ఇప్పటికిని విలసిల్లు చున్నది తన ఆరోగ్యమును బాగు చేసికొనుటకై ఆరోగ్య కేంద్రమునకు వెళ్ళుమని అతని మిత్రులు కోరగా, దానికగు ధనమును తాను వ్యయించుచో ఒకానొక పేదసంస్థ కియ్యవలసియున్న నెలసరి 800 రూప్య ములను తానియ్యజాలక పోవుదునని విద్యాసాగరుడు జవా బిచ్చెనట !

స్వీయ సుఖమునుకూడ అపేక్షింపక కందుకూరి వీరేశ లింగమువలె స్వంత ధనమును ఋణధనమునుకూడ వెచ్చించి సంస్కరణోద్యమములు నడపుచు [విధవా వివాహములు స్వయముగా చేయించుచుండుటచే విద్యాసాగరుడు తుది దశలో అప్పుల పాలయ్యెను ఋణగ్రస్తుడుగా మరణించుట కిష్టపడక అతడు మిగిలిన తన ఆస్తిని తెగనమ్మి ఋణవిము క్తుడై శేషించిన ధనమును తన అనంతరము కొన్ని సంస్థ లకు, కొందరు వ్యక్తులకు నెలసరి ముట్టునట్లుగా మరణశాస నము వ్రాసియిచ్చెనట !

స్వభావోన్నతమైన విద్యాసాగరుని వ్యక్తిత్వమును నిరుపమానమైన ఆతని ఆర్ద్ర హృదయమును ప్రత్యక్షముగా వీక్షించిన మధుసూదనదత్తువంటి మహా రచయిత వెన్నవంటి ఆతని బెంగాలీ మాతృ హృదయమును ప్రాచీన మహాఋషులనుబోలు ఆతని సత్యవాక్పరిపాలనము వర్ణింప నలవికానివని ఉద్ఘాటించినాడు. విద్యాసాగరుని అజేయ ధైర్యసాహసములు మానిపోని మానవత్వము విశ్వకవి ఠాగోర్ ప్రశంసించినాడు. ఇట్టి కరుణామయుడు స్వార్థమెరుగని సంస్కరణవాది, మహోపాధ్యాయుడునైన విద్యాసాగరుడు చరిత్ర యున్నంతవరకు భారతీయుల-ముఖ్యముగా వంగదేశీయుల స్మృతి పథములో శాశ్వతముగ వెలుగుచునే యుండును. విశేషించి వంగరాష్ట్ర మహిళాలోకమీ మహనీయునకు ఎన్నియో విధముల ఋణపడి యున్నది. ఈ మనీషి 150 వ జన్మదినోత్సవము భారతదేశమంతట 1970 సెప్టెంబరు 26 వ తేదీన వైభవోపేతముగా జరుపబడినది.

ప్ర. రా. సు.

## విద్యుత్ నిక్షేప ఘటములు

నిర్వచనము : రాసాయనిక శక్తిని విద్యుచ్ఛక్తిగా మార్చుటయే విద్యుద్ఘటము చేయుపని. విద్యుద్ఘటముల చేరిక విద్యుద్ఘటమాల (Battery) అనబడును.

వ్యత్యాసముగల విద్యుద్వ్యాపాకశక్తితో కూడిన రాగి తుత్తినాగపు రేకులను కొన్ని లవణములతోను ద్రావకముల తోను క్షారములతోను కలిసిన ద్రవపదార్థములో (Electrolyte) ఉంచినచో ఆ రేకుల (Electrodes) మధ్య వోల్టేజి గోచరమగును. ఎలెక్ట్రొలైట్ గుండా విద్యుత్తు ప్రవహించినపుడు దానియందుచేరియున్న పదార్థములు మార్పు చెందును.

విద్యుత్తును సంగ్రహించిపెట్టు బ్యాటరీలు రెండు విధములుగనుండును

(1) సీసము-ద్రావకముల (Lead acid) బ్యాటరీ

(2) క్షారసంబంధమైన (Alkaline) బ్యాటరీ

**సీసము-ద్రావకముల బ్యాటరీ :** ఈ దిగువ భాగములతో ఇది నిర్మింపబడును (1) ఘటము (2) రేకులు (3) ప్రత్యేకించు పరికరములు(Separators) (4 విద్యుద్ద్రవము (Electrolyte)

ఘటము సాధారణముగా గాజు ఎబొనైట్ ప్లాస్టిక్ మొదలైన పదార్థములతో చేయబడును. ధనవిద్యుత్తు రేకులు లెడ్ పెరాక్సైడుతో ($PbO_2$) ఉన్న సీసపు రేకులతో చేయబడును. ఋణ విద్యుత్తు రేకులు మెత్తనై కన్నములతో నిండి యున్న సీసపు రేకులతో తయారుచేయబడును.

చదరపు కొలతను ఎక్కువచేయుటకును లోపలి నిరోధక శక్తిని తగ్గించుటకును ధన విద్యుత్తురేకులనడుమ ఋణ విద్యుత్తు రేకులను ఋణ విద్యుత్తు రేకులనడుమ ధన విద్యుత్తు రేకులను విశేషముగా ఘటమునందమర్చెదరు.

ప్రత్యేకపరచు పరికరములు గాజుతోగాని దేవదారు వంటి కొయ్యచెక్కలతోగాని నిర్మించెదరు. ఈ చెక్కలలోని గుగ్గిలపు సంబంధమైన సత్త్వరసమునుతీసివైచి సూక్ష్మ రంధ్రము లెక్కువగనుండునట్లు చేయుదురు.

విద్యుద్ద్రవము : పలుచన చేయబడిన గంధక ద్రావకమును నీటిని బట్టీలో పెట్టి ఉడికించగా వచ్చిన మంచినీరు విద్యుద్ద్రవములో కలిసియుండును. బ్యాటరీ పూర్తిగా చార్జియైనప్పుడు జలమానములో (Hydrometer) కొలవగా ఎలెక్ట్రొలైట్ యొక్క తారతమ్య సాంద్రత (specific gravity) సుమారు 1 250 వరకుండును. విద్యుదావేశము (charge) తగ్గినపుడు తారతమ్య సాంద్రతకూడ తగ్గిపోవును. కాని అది 1 150 వరకు తగ్గినపుడు మరల విధిగా విద్యుదావేశమును కల్పింపవలయును.

విద్యుత్స్రావము (Discharge) గంధక ద్రావకములోని గంధకపు అణువు రేకులమీదనుండు సీసముతో కలిసి లెడ్ సల్ఫేట్ అగును. దీనిని సల్ఫేషన్ అనియందురు.

ధన విద్యుత్సంబంధమైన రేకు లేక ఫలకము మీదనుండు లెడ్ పెరాక్సయిడ్‌లోని ప్రాణవాయువు విద్యుద్ద్రవములో నుండు ఉదజనితో కలిసి నీరుగా మారును. అందువలన విద్యుద్ద్రవము బలహీనమై తారతమ్య సాంద్రత తగ్గిపోవును.

విద్యుదావేశము తగ్గినపుడు విద్యుద్ఘటము యొక్క చిహ్నములీ క్రింది రీతిగానుండును

(ఎ) తక్కువ తారతమ్య సాంద్రత

(బి) విద్యుద్ఘటము యొక్క వోల్టేజి 1 8 వోల్టుల కంటె తక్కువగా నుండును

(సి) రేకుల (ప్లేట్ల) మీద లెడ్ సల్ఫేట్ అను తెల్లని ఉప్పు గోచరించును

విద్యుదుత్పత్తిము - విద్యుద్ఘటమును పరముఖ విద్యుచ్ఛక్తి

వాహము (Direct current) నకు చేర్చినచో, విద్యుదావేశము ఘటిల్లును విద్యుద్భరిత మగునప్పుడు విద్యుత్ప్రవాహము ఒక వైపుగను, విద్యుత్స్రావ మగునప్పుడు దానికి విరుద్ధమగు వైపుగను ప్రవహించును అందువలన బ్యాటరీలోని రాసాయనిక మార్పులుకూడ అట్టి సందర్భములలో విరుద్ధముగా నుండును

(ఎ) గంధకము ప్లేట్లను వదలి విద్యుద్ద్రవముతో చేరును

(బి) విద్యుద్ద్రవములో నుండు నీరు తగ్గిపోవును ఏలనన విద్యుద్ద్రవమునందుండు ప్రాణవాయువు ధనవిద్యుత్ ఫలకములో నుండు సీసముతో కలిసి లెడ్ పెరాక్సయిడుగా మారును

పూర్తిగా విద్యుద్భరిత మైన బ్యాటరీ చిహ్నములు

(ఎ) పొగ భారాళముగా వచ్చును

(బి) తారతమ్య సాంద్రత ఎక్కువగ నుండి మారక యుండును,

(సి) ఒక్కొక్క విద్యుద్ఘటమునకు 2.8 వోల్టులు స్థిరముగా నుండును

(డి) చార్జింగు కరెంటు (విద్యుత్ప్రవాహము) స్థిరముగ నుండును

(ఇ) ధన విద్యుత్ ఫలకపురంగు గోధుమ వర్ణముగ నుండును ఋణ విద్యుత్ ఫలకపురంగు ప్రకాశముతో కూడిన బూడిద వర్ణముగ నుండును

బ్యాటరీ చార్జిచేయు పద్ధతులు

(1) ట్రికిల్ చార్జి

(2) స్థిరమైన విద్యుత్ప్రవాహముతో

(3) స్థిరమైన వోల్టేజితో

(4) ఫ్లోటింగ్ విధానము

సీసము - ద్రావకముల బ్యాటరీ రెండవ రకపు విద్యుద్ఘట మనబడును ఈ బ్యాటరీని పైన సూచించిన నాల్గు విధములుగా చార్జిచేయవచును బ్యాటరీలను గూర్చి తెలుపు ప్రామాణిక గ్రంథములలో పై నాల్గు పద్ధతులు వివరింపబడినవి

బ్యాటరీ శక్తి : బ్యాటరీ శక్తి అంపియర్ గంటలలో (Ah) కొలవబడును ఒక బ్యాటరీ శక్తి 100 Ah అయినచో అది 10 అంపియర్ల కరెంటును 10 గంటల కాలమిచ్చును ఇవి "10 గంటల రేటు" అనబడును

విద్యుత్స్రావము యొక్క కాలముమీద బ్యాటరీ ఇచ్చు విద్యుత్తు ఆధార పడియుండును ఉదాహరణమునకు ఒక మోటారు కారు స్టార్టరును చల్లని ప్రాతః కాలమున ఉపయోగించినచో (అది సుమారు 100 అంపియర్ల కరెంటును తీసికొనునుగాక) ఒక్క నిమిషములోనే బ్యాటరీలో విద్యుత్తు అంతయు ప్రవహించును ఉష్ణోగ్రత తక్కువగా నున్న యెడల బ్యాటరీ సమర్థత కూడ తగ్గును

సీసము - ద్రావకముల బ్యాటరీ సమర్థత బ్యాటరీ సమర్థతను కనుగొనుటకు అది ఇచ్చు విద్యుత్తును (output) దానిలో నింపిన విద్యుత్తుతో (input) భాగించవలెను ఈ సామర్థ్యమును కొలుచుటకు రెండు విధానములున్నవి

(ఎ) అంపియర్ - అవర్ సామర్థ్యము

(బి) వాట్ - అవర్ సామర్థ్యము

(1) అంపియర్ అవర్ (Ah) సమర్థత (శాతము)

$$= \frac{\text{అంపియర్స్ (ఇచ్చినవి)} \times \text{కాలము - గంటలలో}}{\text{అంపియర్స్ (నింపినవి)} \times \text{కాలము (గంటలలో)}} \times 100$$

(2) వాట్ - అవర్ (wh) సమర్థత (శాతము)

$$= \frac{\text{వాట్స్ (ఇచ్చినవి)} \times \text{కాలము (గంటలలో)}}{\text{వాట్స్ (నింపినవి)} \times \text{కాలము (గంటలలో)}} \times 100$$

Ah సమర్థత 90 శాతము wh సమర్థత 75 శాతము సీసము-ద్రావకముల బ్యాటరీకి (స్రవణపు రేటు తక్కువగా నున్నప్పుడు) ఉండును

సీసము - ద్రావకముల బ్యాటరీ పోషణము సక్రమ పోషణ చర్యలవలన సీసము ద్రావకముల బ్యాటరీయొక్క జీవితమును పొడిగించ వచ్చును ముఖ్యముగా దిగువ పేర్కొనబడిన అంశములను గమనించవలెను

(ఎ) ఒక్కటేని తారతమ్య సాంద్రత తగ్గినపుడు విద్యుదావేశము (charge) కల్గించ వలెను

(బి) బ్యాటరీ ఉపయోగింపబడక పోయినను ఒక పద్ధతి ప్రకారము చార్జి చేయుచుండ వలెను

(సి) విద్యుద్ద్రవము బ్యాటరీలో పోయ కూడదు (అది క్రింద ఒలికిపోయినప్పుడు తప్ప)

(డి) ప్లేట్లు మునిగి యుండునట్లు బట్టిలో కాచిన శుద్ధమైన నీటితో (distilled water) నింపుచుండవలెను

(ఇ) బ్యాటరీలను అధికముగా చార్జిచేయుటగాని అధికముగా డిస్‌చార్జి చేయుట గాని కూడదు

(ఎఫ్) బ్యాటరీ చివరలు తినివేయబడుటచే పెట్రోలియమ్

జెల్లీతో వాటిమీద పూయుచుండవలెను

సీసము - ద్రావకముల బ్యాటరీల ఉపయోగములు

మోటారు కార్లలోను పోష్టాఫీసులలోను ట్రాక్టర్లలోను పవర్ హౌసులలోను (కరెంటు పోయినపుడు దీపములకొరకు) ఈ బ్యాటరీలు ఉపయోగింపబడును

క్షారసంబంధమగు బ్యాటరీ ఉక్కుతో చేయబడిన పెట్టెలో ప్లేటును అమర్చి విద్యుద్ద్రావకమును (కాస్టిక్ పొటాష్ బట్టిలోకాచిన నీరుకలిసినది) పోసెదరు ధనవిద్యుత్తు రేకులు నికెల్ హైడ్రాక్సయిడుతో నింపబట్టియు నికెల్ పూత పూయబడినట్టియు ఉక్కు రేకులు ఋణవిద్యుత్తు రేకులు ఇనుముకాని కాడ్మియముగు ఇనుముతో నింపబడినట్టియు నికెల్ పూత పూయబడినట్టియు ఉక్కు రేకులు వేరుపరచు పరికరములు (separators) ఎబొనైట్ దండములు విద్యుద్ద్రావపు తారతమ్యసాంద్రత 1 190 ఇది విద్యుత్ స్రావము జరుగునపుడు మారదు ప్లేట్లలో రాసాయనిక మార్పులు జరుగునపుడు విద్యుద్ద్రావము గుండా ప్రాణవాయువు పోవుచుండును

పూర్తిగా చార్జి చేసినపుడు బ్యాటరీసెల్ ఓల్టేజి 1 7 ఓల్టులనుండి 1 8 ఓల్టులవరకుండును సామాన్యముగా అది 1 3 ఓల్టులుండును విద్యుత్స్రావమైన పిమ్మటకూడ 0 9 ఓల్టులకంటె తక్కువ కానియ్యకూడదు అనగా వెంటనే చార్జి చేయవలయునన్నమాట

క్షారసంబంధమగు బ్యాటరీల ఉపయోగములు - వీటిని సీసము - ద్రావకముల బ్యాటరీలను ఉపయోగించు తావులందు పయోగింపవచ్చును సీసము - ద్రావకముల బ్యాటరీలకంటె వీటివెల 6-7 రెట్లవరకుండును ఉష్ణోగ్రత లెక్కువగనున్న తావులందును కంపనము లెక్కువగనున్న తావులందును (ఈడుపు బండ్లయందును నావలయందును) ఈ బ్యాటరీ లెక్కువగా వాడబడును.

## రెండురకముల బ్యాటరీల తారతమ్య పరిశీలన

### సీసము - ద్రావకముల బ్యాటరీ

ప్రయోజనములు

(ఎ) చౌకగానుండును
(బి) విద్యుద్ఘటమునకు ఎక్కువ ఓల్టేజి నిద్ధించును
(సి) అంతరవిద్యున్నిరోధము తక్కువగనుండును

నష్టములు

(ఎ) బలహీనముగనుండును
(బి) విద్యుత్తు తనంతటనే స్రవించును
(సి) ప్లేట్లు త్వరగా చెడిపోవును

### క్షారసంబంధమైన బ్యాటరీ

ప్రయోజనములు

(ఎ) దృఢముగనుండును
(బి) విద్యుత్తు తనంతటనే స్రవించదు
(సి) చార్జింగు కరెంటు, డిస్‌చార్జింగు కరెంటు ఎక్కువైనను తట్టుకొనును
(డి) ఒకేవిద్యుద్ధారణశక్తియున్న బ్యాటరీలతో పోల్చగా యీ బ్యాటరీ తేలికగానుండును
(ఇ) చెడిపోకుండదీర్ఘకాలము పనిచేయును

నష్టములు :

(ఎ) వెల ఎక్కువ
(బి) ఒకే ఓల్టేజికి ఎక్కువ ఘటములు అవసరము
(సి) బ్యాటరీ పైభాగమును (పెట్టెను) తాకినచో కరెంటు వచ్చును
(డి) అంతర విద్యున్నిరోధ మెక్కువ
(ఇ) విద్యుద్ద్రావమునకు గాలిపోకినచో చెడిపోవుటచే ఎప్పుడును సీలు వేసియుంచవలెను.

వి. గోపాలరావు

సజాతీయ ధ్రువములగుటచే వాటి మధ్య వికర్షణ ఘటిల్లును

నిర్మాణము - ఈ పరికరమునందు మెత్తని ఇనుప తునక తీగచుట్ట అంతర్భాగమునందు బిగించబడును ఉక్కు కండెపై మరొక తునక స్వేచ్ఛగా కదలుటకు వీలగునట్లుండును ఈ తునకల మధ్యగల వికర్షణచే సూచిక విక్షేపము కలుగును.

నియంత్రణసాధనము - నాలుగవ పటమునందు స్ప్రింగు నియంత్రణ ముపయోగింపబడినది గురుత్వనియంత్రణమును కూడ ఉపయోగించవచ్చును

మందము చేయు సాధనము ఇందుకు వాయుఘట్టన నిరోధకము సామాన్యముగా ఉపయోగించబడును

స్కేలు - పనిచేయు సాధనము యొక్క టార్కు (పురి సామర్థ్యము) విద్యుత్ప్రవాహక వర్గముపై ఆధారపడి యుండుట వలన ప్రారంభములో స్కేలు భాగములు క్రిక్కిరిసి యుండును పరికరపు విస్తృతియందు పదవ భాగములోపల స్కేలు ఉపయోగకరము కాదు నాలుగ ఆకారములగల నికెల్ ఇనుప విభాగము నుపయోగించుటతో దీనిని కొంత వరకు అధిగమించవచ్చును ఈ స్కేలును అక్రమ-విభాజిత స్కేలని అందురు.

పనిచేయు తీగచుట్టలు - నిర్వాహక కవచములగల మందపు తీగతో చుట్టబడిన కొన్ని చుట్లతో అమ్మీటరుగ ఉపయోగించినప్పుడు, తీగచుట్ట ఉండును వోల్టేజిని కొలచుటకు ఉపయోగించు పరికరమునందు తీగచుట్ట వార్నిష్ కవచముగల సన్నని తీగతో అనేకమైన చుట్లుండును

లాభములు - 1 చవుక 2 దృఢత్వము 3 ఎ సి లేక డి సి కొలచుటకు సార్వత్రికముగ ఉపయోగించవచ్చును

దోషములు:- (1) స్కేలు విభాగములు క్రిక్కిరిసి ఉండును

(2) ఉష్ణోగ్రతలోను వేరు అయస్కాంత క్షేత్రముల మరిశకత్వములోను మార్పులు కలుగజేయును

కదలెడి తీగచుట్ట పరికరము:-

అయస్కాంత క్షేత్రమునందు విద్యుత్తు ప్రవహించు వాహకము నుంచినపుడు ఆ క్షేత్రము, వాహకము ద్వారా విద్యుత్తు ప్రవహించునపుడేర్పడు అయస్కాంత క్షేత్రముల మధ్య పరస్పరచర్య జరుగును అయస్కాంత క్షేత్రములో వాహకము త్రేలాడ దీయబడినచో అది కదలును (మోటారు ఫలితము)



చిత్రము ... పటము (౬)

రెండు అయస్కాంత క్షేత్రముల మధ్య గల పరస్పర చర్య ఎఫాలముగా కదలెడి తీగచుట్ట పరికరము పనిచేయును

(అ) శాశ్వత అయస్కాంత క్షేత్రము

(ఆ) కదలెడి తీగచుట్ట గుండా విద్యుత్తు ప్రవహించినపుడేర్పడు అయస్కాంత క్షేత్రము (వార్నిషు కవచము గల కొన్ని సన్నని తీగచుట్లు)

నియంత్రణ సాధనము - వ్యతిరేకముగా చుట్టబడిన రెండు ఫాస్ఫర్ బ్రాంజ్ స్ప్రింగులనుపయోగించుటవలన నియంత్రణము లభ్యమగును ఈ స్ప్రింగుల ద్వారా విద్యుత్తు కదలెడి తీగచుట్టువరకు కొనిపోబడును

మందము చేయు సాధనము - సాధారణముగా విద్యుత్తు సుడుల నిరోధ ముపయోగించబడును అయస్కాంత క్షేత్రమునందు తీగ చుట్టబడిన అల్యూమినియము చట్రము కదలిక విద్యుత్తు సుడులనేర్పరచును

స్కేలు :- స్కేలు సరిసమాన విభాగములు కలిగి యుండును చలన కదలెడి తీగ చుట్ట విక్షేపము, అందు ప్రవహించు విద్యుత్తునకు అనులోమానుపాతములో నుండును శాశ్వత అయస్కాంత క్షేత్రము సరిసమాన వ్యాప్తిని కలిగి యుండును

ఉపయోగము - ధ్రువీకరణమునకు ఈ పరికరము డి సి ని కొలుచునపుడు మాత్రమే ఉపయోగించబడును అది వేరువేరు క్షేత్రములను రెండింటిని కలిగియుండును

లాభములు :- 1 అత్యంత సునిశితత్వము 2 సరిసమాన విభాజిత స్కేలు 3 వేరు అయస్కాంత క్షేత్రములకు లోను గాకుండుట,

దోషములు - 1 ఆల్టర్నేటింగు కరెంటు (ఎ సి) ని కొలుచుట కుపయోగించబడదు ఖరీదు సులువుగా పాడగును

వోల్టుమీటరు - కదలెడి తీగచుట్టు పరికరముతో పెద్ద విలువకలిగిన గుణకనిరోధకమును శ్రేణిలో కలుపుట వలన వోల్టుమీటరుయొక్క విస్తృతిని పెంచవచ్చును

చిత్రము 42



పటము - 6

అమ్మీటరు - పరికరమునకు చిన్న విలువ కలిగిన నిరోధకమును సమాంతరముగ కలుపుట వలన అమ్మీటరుయొక్క విస్తృతిని పెంచవచ్చును

వాట్ మీటరు - విద్యుద్వలయమునందలి విద్యుత్ సామర్థ్యమును "వాట్" లలో వాట్ మీటరు కొలచును

చిత్రము 43




పటము - 7

గ్లైనమోమీటర్ అను సాధనము ఇందుకు సాధారణముగా వాడుకలోనున్నది

చిత్రము 44



పటము - 8

చిత్రము 45




పటము - 8 (అ)

వర్ణనము - ఈ పరికరమునందు రెండు తీగ చుట్లుండును

1 మందపుతీగతో కొన్నిచుట్లు గల విద్యుత్తు తీగచుట్టు ;

(2) సన్నని తీగతో అనేక తీగచుట్లుగల్గి కంపించు స్వేచ్ఛగాతిరుగాడు వోల్టేజి తీగచుట్టు ఈ విద్యుత్తు తీగచుట్టు వోల్టేజి తీగచుట్టలయందు విద్యుత్తు ప్రవహించునపుడేర్పడు రెండు అయస్కాంతక్షేత్రములమధ్యగల పరస్పర చర్య ఫలితముగా సూచికగల వోల్టేజి తీగచుట్ట కదలును వోల్టేజి తీగచుట్టయందు విద్యుత్ప్రవాహమును పరిమితముచేయుటకు R అను నిరోధము కలుపబడినది

శక్తి (energy) మీటరు - విద్యుచ్ఛక్తిని కిలోవాట్ అవర్ (kwh) లలో ప్రేరితరకపు శక్తిమీటరు కొలచును

చిత్రము 46



పటము - 9

పనిచేయు విధానము - రెండు విద్యుదయస్కాంత క్షేత్రములమధ్య పరిభ్రమించు అల్యూమినియము బిళ్ల ఈ రకపు శక్తి మీటరునందుండును 1 వోల్టేజి తీగచుట్టవలన ఏర్పడు అయస్కాంత క్షేత్రము 2 విద్యుత్తు తీగచుట్టవలనఏర్పడు అయస్కాంతక్షేత్రము ఈరెండుక్షేత్రములు ఫలితాంశమైన ఫ్లక్స్ ను ఉత్పన్నమొనరించును అందువలన అల్యూమినియంబిళ్లయందు విద్యుత్తు సుడులు ప్రేరితమగును ఫలితక్షేత్రమును విద్యుత్తు సుడులవలన ఏర్పడు క్షేత్రములమధ్య పరస్పర చర్యయు బిళ్లను పరిభ్రమింపచేయుటకు కారణభూతమగును

ఉపయోగము - పారిశ్రామిక గృహవిద్యుత్ సాధనములయందు వినియోగించబడు విద్యుచ్ఛక్తిని కొలుచుటకు ఈ మీటరుపయోగపడును వాట్ మీటరు, శక్తి (energy) మీటరుల సంధానములు ఒకేరీతిగానుండును

**తదితరమైన మీటరులు** :- కదలెడి ఇనుపఖండము తీగ చుట్టలు గల పరికరములేకాక, వేర్వేరు సూత్రములపై ఆధారపడి పనిచేయు పరికరములనేకములు కలవు 1 స్థిర విద్యుత్తు పరికరములు 2 వేడితీగపరికరములు 3 ఉష్ణయుగ్మపరికరములు ఒకటవ, మూడవరకపు పరికరముల నిర్మాణము క్లిష్టతరము వేడితీగరకపు పరికరము దిగువ వివరింపబడినది

**వేడితీగ అమ్మీటరు** :- పరికరమునందు AB అంత్యముల మధ్య సన్ననితీగ సాగతీయబడియుండును (10 వ పటము చూడుడు) దీనిమధ్యబిందువు O కేంద్రమైన కప్పీచక్రము ద్వారా స్ప్రింగునకు కలుపబడిన మరొక సన్నని తీగతో బిగువుగా లాగబడును AB తీగగుండా విద్యుత్తు ప్రవహించునపుడు, అది వేడెక్కి సడలును కప్పీచక్రముపై చుట్టబడిన సన్ననితీగ సడలింపును స్ప్రింగు గ్రహించుట వలన,

చిత్రము 47




పటము - 10

O బిందువుసులాగును ఈవిధముగ చేయుటవలన కప్పీచక్రము పరిభ్రమించును చక్రమునకు బిగించబడిన సూచికవిక్షేపము పొందును ఎ సి డి సి విద్యుత్ప్రవాహము లను కొలుచుటకు ఇది ఉపయోగించబడును కావున కదలెడి తీగ చుట్టపరికరముకంటె ఇది ప్రయోజనకారి విక్షేపము ఉష్ణ ఫలితమునకును ఉష్ణఫలితము ప్రవహించు విద్యుత్తుయొక్క వర్గమునకును అనులోమానుపాతములో నుండును

**వివిధరకముల తారతమ్యము** - వేర్వేరు సూత్రములపై ఆధారపడి పనిచేయు పరికరములు స్కేలులు వాటి సునిశితత్వము మొదలగు విషయములు ఈ దిగువ పట్టికయందు పొందుపరచబడినవి -

| రకము | సామర్థ్య వ్యయము | స్కేలు ఆకారము | యాంత్రిక విశేషములు | ఎ సి లేక డి సి | సునిశితత్వము |
|---|---|---|---|---|---|
| కదలెడి తీగచుట్టు | అల్పతమము | సమాన విభాగములు | దృఢత్వము | డి సి లేక సవరించబడిన ఎ సి | ఖచ్చితము |
| స్థిర విద్యుత్తు | దాదాపు శూన్యము | వర్గనియమము (క్రిక్కిరిసిన విభాగములు) | స్వల్ప వోల్టేజిమాదిరులు సున్నితమైనవి | డి సి లేక విశాలం పౌనఃపున్య విస్తృతిగల ఎ సి | మితము |
| వేడితీగ | అధికము | వర్గనియమము | సులువుగా కాలిపోవును | డి సి లేక ఎ సి | స్వల్పము |
| ఉష్ణయుగ్మ | అధికము | వర్గనియమము | భారమధికమగుచో సులువుగా పాడగును | డి సి లేక ఎ సి | బాగుగా నుండును |
| కదలెడి ఇనుము | మితము | వేరువిధముగ నుండ వచ్చును | దృఢత్వము | డి సి లేక ఎ సి | మితము |
| విద్యుద్గతి | అల్పము | వర్గనియమము | దృఢత్వము | డి సి లేక ఎ సి | మితము |

వి వి ఎల్ ఆ

## విద్యుత్కిరణ దోలన లేఖకము

## (Cathode Ray oscillograph)

రేడియో తరంగముల (అతి రేడియో ఫ్రీక్వెన్సి రేడియో ఫ్రీక్వెన్సి) ఆకారమును తెలిసికొనుటకీ క్రింది యంత్రము అత్యవసరమైనది దీనిముఖ్యాంగ మొకగాజు గొట్టము (Glass envelope)

చిత్రము 48

Heater
Cathode
High voltage anode (Anode No 2)
Vertical deflecting plates
Base
Electron beam
Fluorescent screen
Control electrode (Grid No.1)
Focusing electrode (Anode No.1)
Horizontal deflecting plates
Glass envelope

ఈ గొట్టములోని గాలి పూర్తిగా తీసివేయబడును ఎక్రగా నేడిచేయబడిన విద్యుదగ్రము(High Voltage anode No.2) నుండి విద్యుత్కిరణము (electron beams) ఉత్పత్తి యగును వేగముచే బాగుగా త్వరణమొసర్పబడిన ఈ విద్యుత్కిరణములు సూటిగా పెళ్ళి చివరనున్న ప్రస్ఫురణ తెరను (fluorescent screen) తాకును అట్లు తాకినపుడు ఆకుపచ్చ రంగుకాని నీలి రంగుకాని ప్రస్ఫురించును విద్యుదగ్రములు నమకూర్పబడిన భాగమును ఎలక్ట్రాన్ తుపాకి అని అందురు ఇందులో ఋణాగ్రము (cathode) గ్రిడ్ ధన అగ్రములు (focussing electrode anode No. 1) 1 2 ను కలవు. ధన అగ్రము 1 ధన విద్యుత్ పొటెన్షియల్‌గా నుండు టవలన విద్యుత్కిరణములు కర్షితమగును అగ్రములోని సన్నని రంధ్రముల ద్వారా ఈ విద్యుత్కిరణ ప్రవాహము బయల్వెడలును ఈ రంధ్రములనుండి వచ్చు విద్యుత్కిరణములు సమాంతర రేఖలలో పయనించును. ధన అగ్రములు 1, 2 ను మధ్యనున్న స్థిర విద్యుత్ క్షేత్రము విద్యుత్కిరణ కటకము (lens) వలె వర్తించును అందువలన విద్యుత్కిరణ ప్రవాహము పదీకరణమై ప్రస్ఫురణ తెరమీద చుక్కవలె కాన్పించును. రెండవ విద్యుదగ్రముయొక్క పొటెన్షియల్ స్థిరముగనుండుటచే 1 వ విద్యుదగ్రము మారుటకు అనుకూల ముగనుండును అందుచే మొదటిదానిని పదీకరించు (focussing) అగ్రమని యందురు

విద్యుత్కిరణ పుంజము స్పష్టమైన చుక్కగా మారవలెనన్నచో ఎలక్ట్రానులు అతివేగముగా ప్రవహించవలెను అందుకు అధికముగా ఋణాత్మక శక్తిగలిగి చేకూర్పవలెనన్న రెండవ గ్రిడ్‌పకును ధన అగ్రము 1ని వరుస మరియొక గ్రిడ్ ను ఉపయోగించవచ్చును

ఈ విద్యుత్కిరణపుంజము బాగుగా పదీకరణమైనప్పుడు తెరమీద సన్నని చుక్క కాన్పించును మొదటి రెండు ఫలకముల మధ్య స్థిర విద్యుత్ క్షేత్రమున్న యెడల పైన చెప్పిన చుక్క తెరమీద మరియొక వైపునకు వంగును అట్లే అడ్డముగా క్షేత్రముకూడ ఈ క్షేత్రమునకు లంబముగా వంగును మొదటి ఫలకముల (vertical deflecting plates) వరుసను తెలియుచున్నట్లియు, మారుచున్నట్లియు, విద్యుత్తరంగములున్న మరేక రెండవ ఫలకముల (Horizontal deflecting plates) వరుసను ఆవర్తకమైన తరంగములున్నను, తెరమీద ఛవి స్థిరముగా నుండి, తరంగిత రేఖని కాన్పించును ఈ విధముగా తెలియని తరంగకారములను చూచి తెలిసికొనవచ్చును.

వె. వి. కా.

## విద్యుత్తు . మూలమాత్రములు ...

విద్యుచ్ఛయస్కాంత శాస్త్రములు రెండును పరస్పర సంబంధము కల్గియుండుటచే వాటి మూల సిద్ధాంతములు నవి ప్రధాన మాత్రములుగా ఈ దిగువ పేర్కొనబడినవి

(౧) అయస్కాంత శాస్త్ర మాత్రకలు ,-

1 కూలూంబ్ మాత్రము

2. ష్టిక్ పెట్ మా త్ర ము (హెన్రీ రయస్ - అయస్కాంతము వలన పొందిన వస్తువులకు గూర్చి).

(౨) స్థిర విద్యుత్ శాస్త్ర మాత్రము

1 కూలూంబ్ మాత్రము (విద్యుదావేశములకు సంబంధించినది )

(సి) ప్రవాహ విద్యుత్ శాస్త్ర సూత్రములు

1. లాప్లాస్ సూత్రము
2. ఫారడే సూత్రము (విద్యుదయస్కాంత ప్రరోచనమునకు సంబంధించినది)
3. లెంజ్ సూత్రము (విపర్యయ విద్యుచ్చాలక బలము)
4. ఓమ్స్ (Ohm) సూత్రము
5. కిర్చాఫ్ సూత్రములు (రెండు)
6. ఫారడే విద్యుద్విశ్లేషణ సూత్రములు (రెండు)
7. కెల్విన్ సూత్రము (విద్యుత్ప్రసార సంబంధమైన ఆర్థిక విషయము)

అయస్కాంత శాస్త్రము

కూలాంబ్ సూత్రము — ఈ సూత్రము అయస్కాంత ధ్రువముల బలము వాటి మధ్యదూరము యానకముయొక్క ప్రవేశ్యతల మధ్యగల సంబంధమునుగూర్చి తెలుపును

$F$ = అయస్కాంత ధ్రువముల మధ్యబలము (న్యూటనులలో)

$d$ = ధ్రువముల మధ్యదూరము (మీటర్లలో)

$m_1, m_2$ = ధ్రువముల బలము (అంతర్జాతీయప్రమాణ పద్ధతిలో)

$\mu_r$ = యానకముయొక్క సాపేక్షప్రవేశ్యత

శూన్యమునందుగాని గాలియందుగాని దాని విలువ ఏకాంకమునకు సమానము

$\mu_0$ = నిర్వాతరాశముయొక్క ప్రవేశ్యత (మీటరుకు $4\pi \times 10^{-7}$ హెన్రీలు చొప్పున అని అనుకొనినప్పుడు)

$$F = \frac{m_1 m_2}{4\pi \mu_0 \mu_r d^2} \text{ న్యూటనులు}$$

సెం మీటరు గ్రాము, సెకను పద్ధతిలో ప్రప్రథమమున ఈ సూత్రము క్రిందివిధముగా పేర్కొనబడినది

$$F = \frac{m_1 m_2}{d^2} \text{ డైనులు}$$

అయస్కాంత ధ్రువముల మధ్య బలము ధ్రువబలముల లబ్ధమునకు అనులోమానుపాతములోను, వాటి మధ్యగల దూరముయొక్క వర్గమునకు విలోమానుపాతములోను ఉండును"

ఇచట $d$ సెంటిమీటర్లలో కొలవబడును

న్యూటను" అనునది మీటరు కిలోగ్రాము సెకను పద్ధతిలో బలమునకు ప్రమాణము ఒక కిలోగ్రాము ద్రవ్యరాశిపై ఈ బలము ప్రయోగింపబడినపుడు ఆ ద్రవ్యరాశికి మీటరు/సెకను² చొప్పున త్వరణము కలిగించు బలము న్యూటను అని నిర్వచింపబడినది

న్యూటను = $10^5$ డైనులు

గమనిక సజాతి ధ్రువములు వికర్షణను విజాతి ధ్రువములు ఆకర్షణను పొందును ఇది అయస్కాంత శాస్త్రమునందు ఆకర్షణ లేక వికర్షణ సూత్రమని ఎలువబడును

స్టీన్‌మెట్జ్ సూత్రము ఇది అయస్కాంతత్వపదార్థమునందేర్పడు అయస్కాంత మందనము (Hysteresis) వలన కలిగిన నష్టపరిమాణమును తెలియజేయును

$W_h$ = అయస్కాంత మందనమువలన నష్టము (వాట్లలో)

$Y^0$ = స్టీన్‌మెట్జ్ గుణకము ని ఎలువబడు స్థిరాంకము (సెం మీ గ్రా సె పద్ధతిలో)

$B_m$ = పదార్థమందలి గరిష్ఠ ఫ్లక్సు (Flux) సాంద్రత (వెబరు/మీటరు²లలో) అని అనుకొనినపుడు

$$W_h = 2.51 \times 10^{3} \times B_m^{1.6} \text{ జౌలులు / మీటరు}^3$$

జౌలు ఒక న్యూటను బలము తన ప్రయోగస్థానమును బలదిశలో కదిపినపుడు ఆ బలము ఒక 'జౌలు' పనిచేసినదందురు

ఇనుము మొదలగు అయస్కాంత పదార్థములు అయస్కాంతీకరణ ఆవృత్తికి లోనైనపుడు అయస్కాంత ప్రరోచనము (Magnetic Induction) లేక ఫ్లక్సు సాంద్రత B 1 అయస్కాంత బలము H నకు వెనుకబడును ఈ దృగ్గోచర విషయమును అయస్కాంత మందనమందురు అయస్కాంత మందన వక్రవలయ వైశాల్యము అయస్కాంతీకరణ ఆవృత్తి వలన కలుగు నష్టపరిమాణమును సూచించును ప్రతి ఆవృత్తియందు ప్రమాణఘనము పొందుశక్తి నష్టములు ఆ ఆవృత్తియందలి ఫ్లక్సు సాంద్రతగరిష్ఠ విలువ $B_m$ల మధ్యగల సంబంధమును స్టీన్‌మెట్జ్ అను శాస్త్రవేత్త కనుగొనెను

$$W = Y B_m^n$$

ఇచట Y స్టీన్‌మెట్జ్ గుణకము అనేక పదార్థములకు n ఘాతపు విలువ 1 6 అని స్టీన్‌మెట్జ్ కనుగొనెను కొన్ని పదార్థములకు దాని విలువ 1 5 నుండి 2 5 వరకుండును

పదార్థముల Y విలువలు ఈ దిగువ పట్టీలో పొందుపరచబడినవి

| పదార్థము | Y విలువ |
|---|---|
| గట్టిపోత ఉక్కు | 0 028 |
| పోత ఉక్కు | 0 003 నుండి 0 012 వరకు |
| పోత ఇనుము | 0 011 నుండి 0 0 6 వరకు |
| అతిమెత్తని ఇనుము | 0 002 |
| మంచి డైనమో ఉక్కు రేకు | 0 002 |
| సిలికాన్ ఉక్కు (2 శాతము సిలికాన్) | 0 0031 |
| సిలికాన్ ఉక్కు (4 8 శాతము) | 0 00076 |

## (బి) స్థిర విద్యుత్ శాస్త్రము

కూలూంబ్ సూత్రము రెండు విద్యుదావేశముల మధ్య గల ఆకర్షణ లేక వికర్షణ బలము విద్యుదావేశముల లబ్ధమునకు అనులోమానుపాతములోను వాటి మధ్య గల దూరముయొక్క వర్గమునకు విలోమానుపాతములోను ఉండును

$q_1$ $q_2$ = విద్యుదావేశములు (కూలూంబులలో)

d = వాటి మధ్య గల దూరము (మీటరులలో)

F = విద్యుదావేశముల మధ్య గల బలము (న్యూటనులలో)

అని అనుకొనినపుడు

$$F = \frac{1}{4\pi K_0 K_r} \frac{q_1 \; q_2}{d^2} \text{ న్యూటనులు}$$

ఇచట $K_0$ = స్వేచ్ఛాంతరాళము యొక్క అనుమతి గుణకము (కూలూంబ్/వాట్ = $\frac{10^9}{36\pi}$

$K_r$ = సాపేక్ష అనుమతి గుణకము లేక

పారవిద్యుతిక సామర్థ్యము శూన్యమునందుగాని, గాలియందుగాని దానివిలువ ఏకాంతమునకు సమానము

సాపేక్షఅనుమతిగుణకము యానకమునందు శూన్యమునందు ఉంచినపుడు రెండు విద్యుదావేశముల మధ్యగల బలముల నిష్పత్తి

గమనిక - సజాతి విద్యుదావేశములు వికర్షణను విజాతి విద్యుదావేశములు ఆకర్షణను పొందును

## (సి) ప్రవాహవిద్యుచ్ఛాస్త్రము

చిత్రము - 49



పటము - 1

లాప్లాస్ సూత్రము పటమునందు AB వాహకముగుండా 1 సెం మీ గ్రా సె ప్రమాణముల విద్యుత్తు ప్రవహించు చున్నది CD అనునది ds అను సూక్ష్మ సూక్ష్మ దైర్ఘ్యముగల వాహక విభాగము P వద్ద m సెం మీ గ్రా సె ప్రమాణ ధ్రువబలముగల ఉత్తరధ్రువ మున్నది C P ల మధ్య దూరము r సెం మీ C వద్ద ప్రవాహదిశతో CP θ కోణమునుచేయుచున్నది ds విభాగపు పొడవైన వాహకముగుండా ప్రవహించు విద్యుత్తు ధ్రువముపై ప్రయోగించుబలము F (డైనులలో) యీ దిగువ ఉదాహరించబడిన లాప్లాస్ సూత్రముప్రకార మీయబడినది

$$F = \frac{m \; I \; ds \; \sin\theta}{r^2} \text{ డైనులు}$$

ds విభాగము CP రేఖ ఉండు తలమునకు లంబదిశలో ఉండును ఫారడేసూత్రము (విద్యుదయస్కాంత ప్రేరేపణమునకు సంబంధించినది)

తీగచుట్టతో సంబంధముగల అయస్కాంతపు ఫ్లక్సు మారుచున్నపుడు విద్యుచ్చాలకబలము తీగచుట్టయందు ప్రేరితమగును విద్యుచ్చాలక బలపరిమాణము ఫ్లక్సు మార్పు రేటునకు అనులోమానుపాతములో నుండును

$$\text{విద్యుచ్చాలక బలము } E \propto \frac{d\phi}{dt}$$

ఇచట dt కాలవ్యవధియందు ఫ్లక్సులో మార్పు dφ ఒక సెకనుకాలములో ఫ్లక్సు మార్పును వెబరులలో గ్రహించుచో

$$E = \frac{d\phi}{dt} \text{ వోల్టులు}$$

విద్యుచ్చాలక బలప్రమాణము వోల్టులలో కొలవబడును

B = అయస్కాంత క్షేత్రబలము (వెబర/మీటరు²)

l = వాహకపు పొడవు (మీటరులలో)

ds = క్షేత్రమున కడ్డుగా వాహకము కదలిన దూరము (మీటరులలో)

$dt$ = కాలము (సెకనులలో)

అని అనుకొనినపుడు

$$E = Bl\left(\frac{d\theta}{dt}\right) = Blv \text{ వోల్టులు}$$

ఇచట $v$ = వేగము (మీటరు/సెకను)

లెంజ్ సూత్రము విద్యుచ్చాలక బలమును ప్రేరేపిత మొనరు ఫ్లక్సులో మార్పునకు కారణభూతమగుదానిని వ్యతిరేకించుదిశలో ప్రేరేపిత విద్యుచ్చాలక బలము విద్యుత్ప్రవాహమును ఉత్పాదనమొనరించును ఫారడే లెంజ్ సూత్రములను సమకూర్చుటవలన విద్యుచ్చాలక బలమునకు ఈ దిగువ సమీకరణము లభించును

$$\left(E = \frac{d\phi}{dt}\right) \text{ వోల్టులు}$$

$$E = Blv \text{ వోల్టులు}$$

ఓమ్ సూత్రము స్థిర ఉష్ణోగ్రతవద్ద వాహకముగుండా పోవు విద్యుత్తు వాహకపు అంత్యములుగల పొటెన్షియల్ భేదము అనులోమానుపాతములో నుండును

పొటెన్షియల్ భేదము $E$, విద్యుత్ ప్రవాహము $I$ అయినచో,

$$E \propto I$$

$$\frac{E}{I} = \text{స్థిరాంకము}$$

ఈ స్థిరాంకమును వాహకపు నిరోధము $R$ అని అందురు

$$\frac{E}{I} = R$$

$$E = IR$$

$E$ వోల్టులలోను $I$ యాంపియర్లలోను కొలవబడుచో $R$ ఓములలో కొలవబడును

కిర్కాఫ్ సూత్రములు కిర్కాఫ్ ఈ క్రింది రెండు సూత్రములను కనుగొనెను

(1) విద్యుత్తు ప్రవహించు వాహకముల అనుసక్త బిందువు వద్ద విద్యుత్ప్రవాహముల బీజీయ మొత్తము శూన్యమగును

2 వ పటమునందు

$$I_1 + I_2 - I_3 + I_4 - I_5 = 0 \text{ లేక } \Sigma I_1 = 0 \text{ ---------}$$



చిత్రము - 50

పటము - 2

బిందువు వద్దకు పోవు విద్యుత్తునకు ధన సంజ్ఞను బిందువునుండి పోవు విద్యుత్తునకు ఋణ సంజ్ఞను ఒసగవలెను పూర్తియైన విద్యుద్వలయమునందు వివిధ భాగములలోని పొటెన్షియల్ భేదముల బీజీయ మొత్తము అదే దిశలో పనిచేయు విద్యుచ్చాలక బలముల బీజీయ మొత్తమునకు సరిసమానము


చిత్రము - 51

పటము - 3

మూడవ పటమునందు

$$I_1R_1 + I_2R_2 - I_3R_3 - I_4R_4 = E_1 - E_2$$

ఫారడే విద్యుద్విశ్లేషణ సూత్రములు

(1) విద్యుద్విశ్లేషణమునందు వెలువడిన పదార్థము యొక్క ద్రవ్యరాశి, విద్యుద్ద్రావణము గుండా ప్రవహించినచో విద్యుద్రాశి అనులోమానుపాతములో నుండును

(2) అనేక విద్యుద్ద్రావణముల గుండా ఒకే విద్యుద్రాశి ప్రవహించినపుడు వెలువడు పదార్థముల ద్రవ్యరాశులు వాటి రాసాయనిక తుల్యభారముల నిష్పత్తిలో నుండును

ఒకకూలూంబు విద్యుత్తు ప్రవహించినపుడు, వెలువడు పదార్థము యొక్క ద్రవ్యరాశి ఆపదార్థము యొక్క విద్యుద్రాసాయనిక తుల్యాంకమని అందురు

ఒక యాంపియరు విద్యుత్తు ఒక సెకను కాలము ప్రవహించినపుడు విద్యుద్రాశిని కూలూంబ్ అందురు

I = విద్యుత్ప్రవాహము (యాంపియర్లలో)

t = కాలము (సెకనులలో)

Q = విద్యుద్రాశి (కూలూంబులలో)

అయినపుడు

$Q = I \times t$

వెలువడు ద్రవ్యరాశి m అయినచో

$m \propto Q$

$m = Z\ Q = Z \times I \times t$

ఇచట Z విద్యుద్రాసాయనిక తుల్యాంకము

రాగి విద్యుద్రాసాయనిక తుల్యాంకము = 000329 గ్రాములు/కూలూంబ్

వెండి = 00118 గ్రా/కూ

రెండవ సూత్రము ప్రకారము అనేక విద్యుద్రావణముల గుండా ఒకే విద్యుద్రాశి ప్రవహించినపుడు విద్యుద్విశ్లేషణము వలన వెలువడిన పదార్థముల ద్రవ్యరాశులు $m_1 m_2 m_3$ అయినచో

$$m_1\ m_2\ m_3 = E_1\ E_2\ E_3$$

ఇచట $E_1, E_2, E_3$ లు పదార్థ రాసాయనిక తుల్యభారములగును

కెల్విన్ సూత్రము మితవ్యయముతో పనిచేయుటకు వడ్డీ వెల తరుగు రూపమున రాగి పెట్టుబడి కగు సంవత్సరపు ఖర్చులు వాహకపు నిరోధము వలన వృథా యైన శక్తి యొక్క సాంవత్సరిక నష్టముల కగు ఖర్చులకు పరిసమానమగును

a = వాహకపు మధ్యచ్ఛేద వైశాల్యము

p = స్థిరాంకము

Q = మరియొక స్థిరాంకము

అయినచో

సంవత్సరపు వడ్డీ + వెలతరుగు = p a

వృథాయైన ఖర్చు = Q/a

మితవ్యయముతో పనిచేయుటకు

$$p\,a = Q$$

$$a^2 = Q a/P$$

$$a = \frac{\sqrt{Q}}{P}$$

వి వి ఎల్ రా

## విద్యుదయస్కాంత ప్రేరణము

## (Electromagnetic Induction)

విద్యుత్ప్రవాహముండు తావున అయస్కాంత క్షేత్రముండునని ఓర్ స్టెడ్ అను శాస్త్రజ్ఞుడు 1820 సం లో కనుగొనెను ఈతడు విద్యుచ్ఛాస్త్రమునకు పునాదివేసిన మహామేధావి ఈ సూత్ర మీ క్రింది రూపమున నిరూపింపవచ్చును

అయస్కాంత సూచికపైన విద్యుత్ ప్రవాహిక తెచ్చుమార్పు

చిత్రము - 53



పటము 1

$N^1$ అనునది అయస్కాంతసూచిక అది సులభముగా తిరుగుటకై ఒక స్తంభముమీద అమర్చబడినది N ఉత్తరదిక్కును S దక్షిణ దిక్కును సూచించును దానిపైన సమాంతరముగా A B అను ఒక రాగితీగను ఉంచి దాని ద్వారా విద్యుత్తును ప్రవహింపజేసినయెడల N ఎడమవైపునకు S కుడివైపునకు తిరుగును దీనికి కారణము A B చుట్టును విద్యుత్తువలన కల్పింపబడు అయస్కాంతక్షేత్రము దీనిని ఇంకొక విధముగా చూపవచ్చును మెత్తని (బొగ్గులేని) ఇనుపకడ్డీచుట్టును మాలుతో కప్పబడిన రాగితీగను చుట్టి దానిద్వారా విద్యుత్తును ప్రవహింపజేసినయెడల ఆ కడ్డీ అయస్కాంతమగును దానికి దగ్గరగా ఇనుపసూదుల నుంచినచో అది వాటిని ఆకర్షించును

ఈ సందర్భమున ఒక ప్రశ్న ఉత్పన్నమగును విద్యుత్తువలన అయస్కాంతము ఉత్పన్నమైనచో అయస్కాంతము వలన విద్యుత్తుకలుగగలదా? అని దీనిపై ఫారడే అను శాస్త్రజ్ఞుడు పెక్కు ప్రయోగములుచేసి పై విషయమును ఋజువు చేసెను

చిత్రము - 63



పటము. 2

## అయస్కాంత ప్రేరణమువలన విద్యుదుత్పన్నము

రాగిచుట్ట కొనలయందు ఘటిల్లు విద్యుత్ప్రవాహమును తెలిసికొనుటకు గాల్వనీమాపకము అమర్చబడెను ఆ చుట్టలో ఒక అయస్కాంతపు కడ్డీ ఉంచబడెను కాని గాల్వనీమాపక మేమియు చూపజాలకుండెను అయితే కడ్డీని త్వరగా చుట్టలో పెట్టినయెడల మాపకములో కొలదికదలిక కల్గును దానిని త్వరితముగా చుట్టనుండి పైకితీసిన యెడల రెండవప్రక్క కదలిక చూడనగును ఈ విషయమును ఫారడే అను శాస్త్రజ్ఞుడు కనుగొనెను అచల అయస్కాంతక్షేత్రములో లోపపుతీగ ఉన్నయెడల అందు విద్యుత్ప్రసారము జరుగదు కాని క్షేత్రముయొక్క తీక్ష్ణత మారునప్పుడు విద్యుత్తు ఉత్పన్నమగును ఇది అయస్కాంత ప్రేరణమువలన జరుగునని విశదమగుచున్నది ఈ విషయమే ఈ క్రింద చూపబడిన ప్రయోగమువలన ఇకను స్పష్టముగ తెలియగలదు

చిత్రము - 64




పటము 3

A అనునది రాగితీగ చుట్ట అనుకొందము దాని కొనలు O అను బ్యాటరీకి K అను మీటుద్వారా కలుపబడినవి మీటు నొక్కినపుడు A ద్వారా విద్యుత్తు ప్రవహించును మీటను తెరచినచో విద్యుత్తు ఆగిపోవును Aకు ఎదురుగా మరియొక రాగితీగచుట్ట అమర్చబడినది దాని కొనలు గాల్వనీమాపకమునకు తగిలించబడినవి మీటను నొక్కినపుడు G లో విద్యుత్తు ప్రవహించినట్లు తెలియును మీట మూసియున్నంతవరకు B లో విద్యుత్తు ప్రసరింపదు మీట తెరువగనే విద్యుత్తు తిరిగి B లో ప్రవహించును K అను మీట పూర్తిగా తెరచియున్నప్పుడు కూడ B లో విద్యుత్ ప్రసారముండదు ఈ మార్పులు ఎక్కువగా ఘటిల్లుటకు A లో ఒక ఇనుపకడ్డీని అమర్చవలెను ఈ సంఘటనము బోధపడుటకు ఈ క్రింది పద్ధతులు వివరింపనగును K మీటను నొక్కగనే A చుట్ట మొదటలేని అయస్కాంతక్షేత్రము హఠాత్తుగా రూపము చెందినది ఈ క్షేత్రము B మీదికి ప్రసరింపగనే అందు విద్యుత్ప్రేరణము జరిగిది అట్లే క్షేత్రము B మీద నుండి పోయినపుడు వ్యతిరేక విద్యుత్తు ప్రవహించును

పైన అయస్కాంతమును తీగచుట్టలవద్ద కదలించినప్పుడు విద్యుత్తు పేతమైనట్లు కనుగొంటిమి ఇట్లు ప్రేరేపింపబడిన విద్యుత్ప్రవాహమును అయస్కాంతమును స్థిరముగా నుంచి తీగచుట్టను కదలించినను లేక త్రిప్పినను అందులో విద్యుత్తు ప్రవహించును ఇవియే విద్యుదుత్పత్తి చేయు డైనమోకు ముఖ్యసూత్రము

జే. పి. శా.

## విద్యుదుత్పాదనము

వాహకముగుండా జరుగు ఎలక్ట్రానుల ప్రవాహము విద్యుత్ప్రవాహమనబడును విద్యుత్తు యీవిధముగ ప్రవాహదశలో నుండునపుడది మానవునకత్యంత ఉపకారిగనుండును విద్యుత్ప్రవాహమును అనేక విధములుగా ఉత్పాదనమొనరింపవచ్చును అందు ముఖ్యమైన పద్ధతులు రెండు విద్యుద్ఘటములలోవలె రాసాయనిక పద్ధతివలన తీగచుట్ట అయస్కాంతమువలన విద్యుచ్ఛక్తిని పొందవచ్చును దండాయస్కాంతమునుగాని గుఱ్ఱపు నాడాకారపు అయస్కాంతమునుగాని మనము ఉపయోగించవచ్చును రెండవపద్ధతివలన జరుగు విద్యుదుత్పాదనము దిగువ వివరించబడినది

**అయస్కాంతము తీగచుట్టలవలన విద్యుదుత్పాదనము :-**

(1) తీగచుట్టను అయస్కాంతములో పరిభ్రమింపచేసినపుడును

(౩) అయస్కాంతము వెలుపల తీగచుట్టను గుండ్రముగా త్రిప్పినపుడును

(౪) తీగచుట్టను నిశ్చలముగ నుంచి అయస్కాంతమును ముందు వెనుకలకు కదపినపుడును విద్యుత్తు ఉత్పాదనము చెందును

విద్యుదుత్పాదన మెట్లు సంభవించునో తెలుపు మూలసూత్రముల నుదహరించు సాధారణ ప్రయోగము గుఱ్ఱపు నాడ ఆకారపు అయస్కాంతములో (1 వ పటము) చూపబడినది. పటములో చూపిన రీతిగా ఉత్తర దక్షిణ ధృవముల మధ్య అయస్కాంత క్షేత్రబలరేఖ లుండును. B అనునది వాహకత్వ గుణముగల రాగివంటి తీగ. తీగ అంత్యములు G అను పరికరమునకు (మీటరునకు) కలుపబడినవి. తీగయందు విద్యుచ్ఛక్తి జనించినదియు లేనిదియు మీటరు తెలియజేయును. తీగను అయస్కాంత క్షేత్రబలరేఖలను ఖండించునట్లు నిట్టనిలువుగా క్రిందికి కదిపినపుడు తీగయందు విద్యుత్తు ప్రవహించుటను తెలియపరచు పరికరపు సూచిక ఒకవైపునకు కదలును. అయస్కాంతబలరేఖ ను విడచి ఇంకను తీగను క్రిందికి దింపినపుడు పరికరము విద్యుత్ప్రవాహమును సూచింపదు. తీగ అయస్కాంత క్షేత్రమును దాటిపోయిన తక్షణమే విద్యుత్ప్రవాహము ఆగిపోవును.

చిత్రము – ౬౬




పటము – 1

మరొక ప్రయోగమును చేయుదము. అయస్కాంత క్షేత్రబలరేఖల క్రిందుగా తీగను నిశ్చలముగా నుంచి అయస్కాంతబలరేఖలు తీగను ఖండించునట్లు అయస్కాంతమును క్రిందికి కదుపుదము. అపుడుకూడ పరికరపుసూచిక విద్యుత్ప్రవాహమును సూచించుట గమనించగలము. తీగను కదిపినను లేక అయస్కాంతబలరేఖలను కదిపినను ఫలితమొక్కటే. కాని వలయమునందు విద్యుత్తు ప్రవహించవలెననినచో వాహకము అయస్కాంత క్షేత్రబలరేఖలనుండి సాపేక్ష గమనముండవలెను.

యథార్థముగ మనము విద్యుత్ప్రవాహమును ఉత్పాదన మొనరించము కాని దానికి బదులు విద్యుచ్చాలక బలమని పిలువబడు విద్యుత్పీడనమును తీయ దుత్పత్తి కావించెదము. తీగయొక్క రెండు అంత్యములను కాన్యముగా తీగలచే కలుపగా ఎలక్ట్రానుల పథము పూర్తియగుటచే యీ విద్యుత్పీడనము విద్యుత్తును ప్రవహింపచేయును. తీగయొక్క అంత్యములు రెండును కలుపబడక పోయినను పీడనము లేక విద్యుచ్చాలక బలము తీగయందు అస్తిత్వమును కలిగియుండును. తీగ అయస్కాంత క్షేత్రమున కడ్డుగా కదలుట విద్యుచ్చాలక బలమునకు మూలము.

అయస్కాంత క్షేత్రమునకు అడ్డుగా తీగను అతిత్వరితముగా కదిపినపుడు పరికరము అత్యంతబలముగల విద్యుత్ప్రవాహమును సూచించును – అనగా అమితమగు విద్యుచ్చాలక బలము తీగయందు ప్రేరితమగును.

అమితమగు విద్యుచ్చాలక బలమును మరొకపద్ధతి వలన పొందవచ్చును. ఒకే తీగను ఉపయోగించుటకంటె రెంటవపటములో సూచించినట్లు అనేకమైన తీగలను కట్టకట్టి ఉపయోగించవచ్చును. అన్నితీగలను కలిపి ఒకేసారిగ అయస్కాంతబలరేఖలను ఖండించుచు క్రిందికి కదిపినచో విద్యుచ్చాలక బలము అన్నితీగలయందు ప్రేరితమగును. ప్రత్యేకముగ ఉన్న తీగలను పటములలో చూపనరీతిని శ్రేణిలో కలిపినచో వోల్టేజిల సంకలనము వలన గరిష్ఠ వోల్టేజిని ఉత్పత్తి చేయవచ్చును.

చిత్రము – ౬౭




పటము – 2

ప్రేరిత విద్యుచ్చాలకబలము యొక్క పరిమాణము శ్రేణిలో కలుపబడిన తీగల సంఖ్యపైనను అయస్కాంత క్షేత్ర బలరేఖల సంఖ్యపైనను అయస్కాంతబలరేఖలను తీగలు ఖండించు వేగముపైనను ఆధారపడియుండును. తీగలు బలరేఖలను ఖండించుట అనగా తీగలు బలరేఖలకు అడ్డుగా కదలవలెనని యేకాని సమాంతరముగ కదలరాదు అని భావము.

విద్యుచ్చాలక బలముయొక్క ఉత్పత్తిని మరొక

దృష్టితో తిలకించవచ్చును మూడవపటమునందు A అనునది స్ప్రింగాకారపు తీగచుట్ట దీని అంత్యములు G అనబడు విద్యుత్ప్రవాహమును సూచించు పరికరమునకు కలుపబడినవి B అనునది దండాయస్కాంతము దండాయస్కాంతమును తీగచుట్టలోనికి త్వరితముగా త్రోసినచో సూచిక విక్షేపము నొందును అనగా విద్యుత్ప్రవాహము ఉత్పత్తి చెందినది తీగచుట్టలో ఉండినను అయస్కాంతపు కదలిక ఆగినచో విద్యుత్ప్రవాహముకూడ ఆగిపోవును

చిత్రము - 57




పటము - 8

దీనిని ఈ క్రిందివిధముగ వివరించవచ్చును

తీగచుట్టవద్దకు అయస్కాంతమును తేనపుడు అయస్కాంత క్షేత్రబలరేఖలు పూర్తిగ తీగచుట్టకు దూరముగ నుండును తీగచుట్టవద్దకు అయస్కాంతమును తెచ్చినపుడు అయస్కాంతబలరేఖలు కొన్ని దగ్గరనున్న చుట్లగుండా పోవును తక్షణమే పరికరము విక్షేపమును సూచించును ఇంతకుపూర్వము కొన్నిచుట్టలగుండా బలరేఖలు పోవక ఇప్పుడవి పోవుటయే జరిగిన మార్పు ఆ చుట్లగుండా యిపుడు పోవు బలరేఖల సంఖ్యలో మార్పు కలిగినదని చెప్పవచ్చును అట్టి మార్పు కలిగినపుడు విద్యుచ్చాలకబలము ప్రేరితమగును అయస్కాంతము తీగచుట్టులోనికి కదలుచుపోయినపుడు ప్రతిచుట్టనుండి పోవు బలరేఖలసంఖ్య మారుటవలన విద్యుచ్చాలక బలము ప్రేరితమగును చుట్టనుండి అయస్కాంతమును తొలగించినపుడు కూడ విద్యుచ్చాలకబలము ప్రేరితమగును ఎంతవేగముగ అయస్కాంతమును చుట్టలోనికి త్రోసిన అంతఎక్కువ విద్యుచ్చాలక బలము ప్రేరితమగును

దీనిని సంక్షిప్తముగ క్రిందివిధముగ చెప్పవచ్చును తీగచుట్టగుండా పోవు అయస్కాంత క్షేత్రబలరేఖలు మారినపుడు తీగచుట్టయందు విద్యుచ్చాలకబలము ప్రేరితమగును పై మార్పులు సంభవించినపుడు మాత్రమే తీగచుట్ట విద్యుచ్చాలక బలమునకు మూలఉత్పత్తి స్థానమగును

విద్యుచ్చాలక బలముయొక్క ఉత్పాదనను గురించి వర్ణించిన రెండుపద్ధతుల వివరణము ఇచ్చుట అవసరము వాస్తవముగ రెండుపద్ధతులను ఒకటిగనే పరిగణించవచ్చును తీగ అయస్కాంతరేఖలను ఖండించునని సాధారణముగ అనుకొందుము కాని అయస్కాంతరేఖలలోకూడ మార్పుకలుగుచున్నది మూడవపటములోని B అనుతీగ మిగిలినబయటితీగలు తీగచుట్టక్రింద నుండునని ఊహించవచ్చును తీగనుగాని తీగచుట్టనుగాని క్రిందికి కదిలినప్పుడు అయస్కాంతమునుండి వెలువడు అయస్కాంత ఫ్లక్సును (Flux) కప్పివుచ్చును తీగలేక తీగచుట్ట క్రిందికిపోవు కొలదియు తీగచుట్టగుండా పోవు అయస్కాంతబలరేఖలు క్రమముగా క్షీణించుచుండును అనగా తీగచుట్టగుండా పోవు అయస్కాంత ఫ్లక్సు మారుచుండును కావున విద్యుచ్చాలకబలము ప్రేరితమగును

పై నియమముల ననుసరించి ఉత్పాదనయంత్రము లందు విద్యుచ్చాలకబలములు ఉత్పత్తి అగుచున్నవి

అయస్కాంతపు తీగచుట్టల సంపుటిని విద్యుదుత్పాదనయంత్రమందురు అట్టి ఉత్పాదనయంత్రము విద్యుచ్ఛక్తిని ఉత్పత్తిచేయును ఉత్పాదనయంత్రము పెద్దదిగగాని చిన్నదిగగాని ఉండవచ్చును దీనియందు అయస్కాంతపు తీగచుట్ట ఉండును అయస్కాంతపు కదలిక గాని తీగచుట్ట పరిభ్రమణముగాని లేకుండ ఏ ఉత్పాదన యంత్రమును విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయనేరదు

తీగచుట్టను చేతితో త్రిప్పవచ్చును కాని టార్చిదీపమును వెలిగింపచేయుటకు కూడ అతివేగముగా త్రిప్పవలయును వెంటనే చేతులకు నొప్పిపుట్టును అపుడు తీగచుట్టను త్రిప్పుట మానివేతుము దీపము వెలుగుట మానును

ఉత్పాదనయంత్రములను పనిచేయించుటలో అలసట చెందని "ప్రధానగామి" (Bume mover) అనునది ఉత్పత్తి కేంద్రములో ఉండవలయును దీనినే ఇంజను'అనియు టర్బైను అనియు అందురు ఉష్ణమునుండి చలనము కల్పించుయంత్రములు ఇంజనులనబడును ఉష్ణయంత్రములకుదాహరణ

ములు ఆవిరి యంత్రములు పెట్రోలు యంత్రములు డీసెలుయంత్రములు టర్బైనుల కుదాహరణములు గాలియంత్రములు వాయుపూరిత యంత్రములు, నీటి టర్బైనులు ఆవిరి టర్బైనులు ఇవిగాక అధునికముగా కనిపెట్టబడిన పరమాణుకూర్పులేక పరమాణు రియాక్టరు కూడ ఉన్నవి యంత్రము లన్నిటియందు ఉష్ణమును జనింపచేయుటకు ఇంధనము కాల్చబడును ఇంజను ఉష్ణమునుండి చలనమును కలుగచేయును పరమాణుకూర్పు ఇంజనుకాదు అందు ఏ పదార్థమును కాల్చబడదు నవ్యవిధాము వలన అది ఉష్ణమును కలుగచేయును ప్రకృతియందు లభ్యమగు బొగ్గు నూనె యురేనియము మొ॥ ఆవిరి నీరు గాలి అందు అంతర్భూతమగు శక్తి ప్రథమమున యాంత్రికశక్తిగను పిదప విద్యుచ్ఛక్తిగను మారెడు వివిధ మార్గములు కాల్గవ పటములో చూపబడినవి

చిత్రము - 58



పటము - 4

1 ఉష్ణము 2 యురేనియం 3 బాయిలరు 4 టర్బైను 5 దండము 6 అయస్కాంతము 7 తీగచుట్ట 8 ఆవిరినుండి నీరు బయటికి పోవు మార్గము 9 నీరు లోపలికి ప్రవేశించు మార్గము 10 ఆవిరి బయటికి పోవు మార్గము

**శక్త్యుత్పత్తిస్థానములు** - విద్యుదుత్పాదనమందుపయోగపడు ఉత్పత్తిస్థానములు ముఖ్యముగా నీరు, బొగ్గు, గాలి నూనె కేంద్రకీయశక్తి భూమ్యుష్ణశక్తి లేక అగ్నిపర్వతములు విద్యుదుత్పాదన మందలి ఆధునికములకు చెందిన విద్యుచ్ఛక్తి కేంద్రములను గురించి దిగువ సంక్షిప్తముగ వివరించబడినది

**ముఖ్య విద్యుచ్ఛక్తి కేంద్రములు** - యాంత్రికశక్తిని విద్యుచ్ఛక్తిగా మార్చుస్థానము విద్యుచ్ఛక్తి కేంద్రమనబడును పైన ఉదహరించిన మూలముల నుండి యాంత్రికశక్తి ఆవిర్భూతమగును కొన్నిరకముల విద్యుచ్ఛక్తి కేంద్రములిచట వివరింపబడినవి

**జలవిద్యుత్కేంద్రము** - ఎత్తునుండి నీరు పడునపుడువ్యవించు శక్తినుండి విద్యుచ్ఛక్తి పొందు స్థానమును జలవిద్యుత్ కేంద్రమందురు అట్టి కేంద్రములవద్ద ఎత్తయిన రిజర్వాయరు కట్టి దానియందు నదీజలమును నిలవచేయుదురు రిజర్వాయరునకు బాల క్రిందుగ విద్యుచ్ఛక్తి ఉత్పత్తి యగు యంత్రాగారముండును రిజర్వాయరునుండి పోతపోసిన పెద్ద ఇనుపగొట్టముల ద్వారా యంత్రాగారమువద్దకు నీరు తీసికొని రాబడును యంత్రాగారమువద్ద నీరు ఎట్లుపయోగపడునో 5 వ పటములో వివరించబడినది

చిత్రము - 59



పటము - 5

జలవిద్యుచ్ఛక్తి స్కీము

1 రిజర్వాయరు 2 డామ్ 3 గొట్టము 4 విద్యుచ్ఛక్తి కేంద్రము 5 నీరుపోవు మార్గము

పైనుండి పడు నీటిలోగల శక్తి ఉత్పాదనయంత్రము యొక్క తిగచుట్టను త్రిప్పును నదీజలపాతము బలవత్తరమైనదగుటచే, అది విద్యుదుత్పాదనయంత్రాగారములో గల "టర్బైన్" అను పెద్ద చక్రమును త్రిప్పగల్గును-అప్పుడు వేరురకములైన టర్బైనులుకూడ కలవు జలపాతము కేంద్రములో గల జలచక్రమునకు కట్టిన త్రోసి టర్బైనులను త్రిప్పును

చిత్రము - 60



పటము - 6

నీటి టర్బైను

1 టర్బైను వేగమును కంట్రోలు చేయు గవర్నరు 2 నీటి ధారను తగ్గించు కీలకము 3 నీటి ఎరభరాగొట్టము 4 కవచము 5 లోహపు కప్పు

చిత్రము - 61



పటము - 7

ఆవిరి టర్బైను అంతర్భాగము

1 విద్యుదుత్పాదన యంత్రము 2 వాజిల్ 3 దండము 4 బ్లేడులు

కేంద్రములోగల బృహత్ జలచక్రములను టర్బైను అందురు టర్బైను గుండ్రముగా తిరుగుచు దండమనబడు పొడవైనకర్రను కూడ త్రిప్పును ఉత్పాదనయంత్రమువరకు ఈ దండము పోవును దండము తిరుగునపుడు అది ఉత్పాదన యంత్రమునందలి తీగచుట్టను త్రిప్పును అయస్కాంతముమధ్య తీగచుట్ట గుండ్రముగా తిరుగును తీగచుట్ట తిరుగునపుడు విద్యుచ్ఛక్తిపుట్టును తుంగభద్ర ఆనకట్ట పైకారా పెరియారు మాచ్‌ఖండ్ ప్రాజెక్టుల వద్దగల విద్యుత్కేంద్రముల యందు ఉత్పాదనయంత్రపు అంతర్భాగమును చూడజాలము ఉత్పాదనయంత్రము మూయబడి ఉండుటవలన అయస్కాంతమునుగాని తీగచుట్టనుగాని చూడలేము జలవిద్యుత్ కేంద్రము వద్ద ఉత్పాదనయంత్రములు అనేకములుండును

ఆవిరి టర్బైనుకేంద్రము - అన్నివిద్యుత్కేంద్రములవద్ద ఒకేరకమైన నీటి టర్బైనుల నుపయోగించరు కొన్ని కేంద్రములవద్ద ఆవిరిశక్తి నుపయోగింతురు ఆవిరి టర్బైను బ్లేడులను త్రిప్పును టర్బైను విద్యుదయస్కాంతమును త్రిప్పును ఆవిరి టర్బైనులు పెద్దవిగను బరువుగనుండుటచే వాటిని త్రిప్పుటకు ఎక్కువ ఆవిరి అవసరము

విద్యుచ్ఛక్తి కేంద్రమువద్ద నేలబొగ్గు మండెగా పేర్చబడును కేంద్రమువద్దనున్న యంత్రము ఆ బొగ్గును సన్నని పొడిచేయును అచ్చటగల పెద్ద కొలిమిలోనికి ఈబొగ్గుపొడి విసరివేయబడును కొలిమిలోని మంటవలనబాయిలరులోని నీరు ఆవిరిగమారును గొట్టములద్వారా ఆవిరి టర్బైనువద్దకు కొనిపోబడును ఆవిరి అమితమగుశక్తితో టర్బైనుల బ్లేడులను త్రోయును టర్బైను పరిభ్రమించును పొడవైన దండము టర్బైను ఉత్పాదనయంత్రమునందలి తీగచుట్టకు కలుపబడును టర్బైనుతోపాటు దండము తిరుగును దండముతోపాటు తీగచుట్ట తిరుగును తీగచుట్ట భ్రమణముతో విద్యుచ్ఛక్తి జననమందును

విద్యుచ్ఛక్తికేంద్రముల గోడలకు అనేక మీటరులు బిగించబడును కొన్నిమీటరులు ఎంత విద్యుచ్ఛక్తి ఉత్పాదనమగుచున్నదో తెలుపును ఎంత విద్యుచ్ఛక్తి వాడబడుచున్నదో మరికొన్ని మీటరులు తెలియపరచును కొలిమి ఎంత వేడిగనున్నదో తక్కిన మీటరులు చూపును

పరమాణు విద్యుచ్ఛక్తి కేంద్రములు - ఆవిరి టర్బైను కేంద్రముల వద్ద నీటిని ఆవిరిగ మార్చుటకు ఉష్ణమవసరము పూర్వము విద్యుత్కేంద్రములవద్ద వేలకొలది టన్నుల బొగ్గు నీటిని ఆవిరిగ మార్చుటకు కాల్చబడుచుండెడిది ఈ విధముగా బొగ్గు నీరు విద్యుచ్ఛక్తిని పొందుటకై అనాడు వినియోగింపబడినది ఇటీవల పరమాణు విద్యుచ్ఛక్తి కేంద్రము అనబడు క్రొత్తరకపు కేంద్రములు నెలకొల్పబడుచున్నవి పరమాణువిద్యుచ్ఛక్తి కేంద్రములవద్ద పెద్ద రిజర్వాయర్లుగాని బొగ్గుమందెలుగాని ఉండనవసరములేదు యురేనియమనబడు బూడిదరంగు లోహము కొలదిగనుండిన సరిపోవును రియాక్టరులు అనబడు బ్రహ్మాండ

చిత్రము - 62



పటము - 8

పరమాణు రియాక్టరు

1 కాంక్రీటు గోడలు 2 బాయిలరు 3 ఆవిరి టర్బైను 4 రియాక్టరు 5 నీరు 6 రియాక్టరునుండి ఉష్ణవాయువులు నీటిని ఆవిరిగా మార్చుట

మైన ఉక్కు స్థూపములలో యురేనియము పరమాణువులు విచ్ఛిన్నమైనపుడు అమితమగు ఉష్ణము వెలువడును ఈ ఉష్ణము నీటిని ఆవిరిగ మార్చును అందుండి అపాయకరమైన కిరణములు వెలువడుటచే స్థూపములచుట్టును 8 అడుగుల మందముగల కాంక్రీటు గోడలు కట్టబడును పునరుపయోగము కొరకై ఆవిరిని నీటిగ మార్చుటకు బ్రహ్మాండమైన శీతలీకరణ గోపురము ఉపయోగించబడును

ప్రపంచములో మొట్టమొదటి పరమాణు విద్యుత్కేంద్రము ఇంగ్లండులో కాల్డరు హాలువద్ద నెలకొల్పబడినది ఇండియాలోకూడ ఇట్టి కేంద్రములు తారాపూరు మొదలగు చోట్ల స్థాపింపబడినవి

పరమాణు విద్యుత్కేంద్రముల వద్ద యురేనియము బాయిలరలోని నీటిని ఆవిరిగ మార్చును ఆవిరి టర్బైనును బలముగ త్రోయును టర్బైను దండమును త్రిప్పును దండము ఉత్పాదక యంత్రమునందలి తీగచుట్టను త్రిప్పును తీగచుట్ట పరిభ్రమణముతో విద్యుచ్ఛక్తి ఉత్పాదనమగును

చిత్రము - 62



పటము - 9

1 పెట్రోలుటాంకు 2 మోటారు 3 ఉత్పాదక యంత్రము 4 పెట్రోలు టాంకు 5 మోటారు 6 దండము 7 తీగచుట్ట 8 అయస్కాంతము

అంతర్దహన యంత్ర విద్యుత్కేంద్రము అంతర్దహన యంత్రములు రెండు రకములు 1 పెట్రోలు యంత్రము 2 డీసెలు యంత్రము పెట్రోలు యంత్రము కూడ విద్యుదుత్పాదనమందుపయోగపడు చున్నది 9వ పటమున పెట్రోలు యంత్రము చూపబడినది పెట్రోలు యంత్రమునందు గల స్థూపము యొక్క అంతర్భాగమున ఇంధనము మండుచుండును వేరుగా బాయిలరు అవసరములేదు అందుచే అది అంతర్దహన యంత్రమనబడుచున్నది పెట్రోలుయంత్రమునందలి స్థూపము ఉండవచ్చును యంత్రము దండమును త్రిప్పగా దండము ఉత్పాదనయంత్రమందలి తీగచుట్టను పరిభ్రమింపచేయును పెట్రోలు వందలి శక్తి విద్యుదుత్పాదనము కొరకై వినియోగించబడుచున్నది.

డీసెలు యంత్రము పెట్రోలు యంత్రమువలెనే నుండును పెట్రోలుకంటె చవుకగా లభించు డీసెలు నూనె ఇంధనముగా వాడబడుచున్నది పరిమాణమునడీసెలు యంత్రము పెట్రోలుయంత్రము కంటె పెద్దది తక్కువ క్లిష్టమైనది దానికంటె ఎక్కువ పనిచేయగలది

ఇతరములు - (1) వాయుశక్త్యుత్పాదనయంత్రములు (2) భూమ్యుష్ణశక్త్యుత్పాదన యంత్రములు.

వాయుశక్తి యంత్రములు - విద్యుదుత్పత్తికేంద్రములకు దూరముగ నుండు గృహములకు పొలములకు తోటలకు వాహకముల ద్వారా విద్యుత్తును కొనిపోవుటకు అమితముగా ధనవ్యయమగును. అందుచే వాయుశక్తి నుపయోగించి అచ్చట ప్రత్యేకమైన ఉత్పాదక యంత్రమును నెలకొల్పవచ్చును. గాలి మరయొక్క రెక్కలను క్రొసి గుండ్రముగ త్రిప్పినచో ఆ రెక్కలు గాలి మర యందలి గండమును త్రిప్పును దండముతో పాటుతీగ చుట్ట పరిభ్రమించి విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయును

చిత్రము - 63



పటము - 10

భూమ్యుష్ణశక్తి - కొన్నిచోట్ల ఆవిరి భూమినుండి వేగముగా వెలువడును. ఇట్లు వెలువడు ఆవిరి ఎంతో ఎత్తువరకు గాలిలో పైకిపోవును. వీటిని ఆవిరిగైజర్లు (steam geysers) అనియందురు. భూమి అంతర్భాగమున ఈ ఆవిరి ఉత్పన్నించును. భూమియందలి రాళ్ళపగుళ్ళద్వారా వర్షపునీరు లోనికి పోయిన కొలదియు విపరీతముగ వేడెక్కును. ఇట్టి అత్యుష్ణ జలము క్రమముగ ఆవిరిగ మారును. ఈ ఆవిరి భూమినుండి అతివేగముగా పైకి ఉబికివచ్చును. నిర్ణీతమగు కేంద్రములవద్ద భూమిలో దింపబడు గొట్టములద్వారా పైకివచ్చు ఆవిరి టర్బైనులను త్రిప్పి విద్యుత్తును ఉత్పత్తిచేయును

వి వి ఏల్ రా

చిత్రము - 64

ఇండ్లకు విద్యుచ్ఛక్తి సరఫరాయగు విధానము



జలపాతము



బొగ్గు



యురేనియము



భూమినుండి ఆవిరి



గాలిమర



పెట్రోలు



విద్యుదుత్పాదనము

పటము - 11

విద్యుత్ప్రవాహము అధికమయినపుడు ఇది కూడ వృద్ధినందుచు, ఆర్మేచరుయొక్క పరిభ్రమణమునకు అడ్డుతగులును విద్యుచ్ఛక్తి అధికముగ లభ్యమగుటకు యాంత్రిక శక్తినికూడ ఎక్కువగ సరఫరా చేయవలెను

పెద్ద ఉత్పాదక యంత్రములందు సామర్థ్యము నూటికి తొంబది పాళ్ళుండును ఇనుము (హిస్టెరిసిస్) రాగి (ఉష్ణము) ఘర్షణలచే కలుగు నష్టములవలన సామర్థ్యము తగ్గును

మోటారులో కలుగు విపర్యస్త ఉత్పాదన యంత్ర ఫలితము – మోటారు మీటనొక్కగనే విద్యుత్ప్రవాహము I ప్రవహించును E అనునది వినియుక్త విద్యుచ్చాలక బలమునకును R అనునది విద్యుద్వలయములోని మొత్తపు నిరోధమునకును సమానమైనచో

$$E = IR$$

అను సమీకరణము లభించును ఆర్మేచరు త్వరణము నందినచో తీగచుట్ట ఫ్లక్సును అధికమైన రేటుతో ఖండించును ఇందువలన ఆర్మేచరు అంత్యములమధ్య $\frac{E'dQ}{dt}$ అనబడు విపర్యయవిద్యుచ్చాలకబలము ఉత్పాదనమగును పరిభ్రమణ వేగ మతిశయించినచో విద్యుత్ప్రవాహము క్షీణించును యాంత్రిక భారము లేకపోయినను ఘర్షణ లేనపుడును వేగము $E' = E$ అగువరకును పరిభ్రమణ వేగము అతిశయించుచు విద్యుత్ప్రవాహము శూన్యమగువరకు, దిగజారుచుండును విద్యుచ్ఛక్తి సరఫరాలేనందున యాంత్రిక శక్తి విడుదల కానేరదు

ఆర్మేచరునకు యాంత్రిక భారము నుపయోగించినచో వేగము తీడించును $E'$ క్షీణతనొందును I అధికమగును యాంత్రిక భారము అధికమైనకొలది విద్యుత్ప్రవాహము అధికమగుచుండును సార్వత్రికముగ సామర్థ్య సమీకరణము ఈ దిగువచూపిన రీతిని ఉండును

$$EI = E'I \quad I^2R$$

ఇందు EI సరఫరా చేయబడిన సామర్థ్యము $E'I$ అనునది యాంత్రిక శక్తిగను ఘర్షణ శక్తిగను మారిన సామర్థ్యము $I^2R$ అనునది వలయమునందు ఉష్ణముగ మారినసామర్థ్యము

విపర్యయ విద్యుచ్చాలక బలమును ఈ విధముగ వివరించవచ్చును విద్యుచ్ఛక్తి ఉత్పత్తిస్థానమును ఆ వలయమునందుపయోగించిన మొత్తపు పొటెన్షియల్ పెరుగుదల; విద్యుచ్ఛక్తి యాంత్రికశక్తిగ మారుట వలన ఆర్మేచరు మధ్యగల విపర్యయ విద్యుచ్చాలకబలము $E'$ నకును విద్యుచ్ఛక్తి ఉష్ణముగ మారుటవలన వలయమునందలి పొటెన్షియల్ పతనము IR ల మొత్తమునకును సమానమగును

మోటారునందలి ప్రారంభ నిరోధము – ఉష్ణమువలన కలుగు నష్టమును అల్పతమము చేయుటకు మోటారునందలి ఆర్మేచరు తీగచుట్ట యొక్క రోధము R తక్కువగనుండును ప్రారంభమునందు విపర్యయ విద్యుచ్చాలకబలము పెరుగుటకు ముందు I అధికముగనుండును ఈవిద్యుత్ప్రవాహము I, ఆర్మేచరు తీగచుట్టను కాల్చివేయును అందువలన అదనపు ప్రారంభ నిరోధము కూర్చబడును వేగము ఎక్కువైనకొలది యీ నిరోధము తగ్గించబడును

చిత్రము – 68

పటము – 4

a మీట నొక్కెడు స్థానము

b మీట వీడెడు స్థానము

క్షేత్రపు తీగచుట్టలు – చిన్నదైన మోటారియందు తప్ప ఆర్మేచరు పరిభ్రమణము పొందుక్షేత్రము విద్యుదయస్కాంతమువలన ఏర్పాటుకావించబడును. క్షేత్రవిద్యుత్ప్రవాహము ఆర్మేచరు విద్యుత్ప్రవాహముండు వలయమునుండి ఉత్పన్నమగును క్షేత్రపు తీగచుట్టలు ఆర్మేచరు తీగచుట్టలతో శ్రేణిలో గాని సమాంతరముగగాని మిశ్రమ పద్ధతిలోగాని ఉండును

చిత్రము – 69

శ్రేణి అనరేటరు

సమాంతర జనరేటరు

మిశ్రమ జనరేటరు

పటము – 5

శ్రేణిపద్ధతిలో చుట్టబడిన మోటారు ప్రారంభదశలో అధికమైన తోలి టార్కు (Torque) నిచ్చును

భూగర్భములో రైలును నడుపునపుడు అవసరమగు త్వరణ మిచ్చుసందర్భములందు ఈ మోటార్లు ఉపయోగ పడును సమాంతర పద్ధతిలో చుట్టబడు మోటారు మన్నైన టార్కు నిచ్చును లోడ్ పై ఆధారపడని వేగము అవసర సందర్భములో -ఉదాహరణకు లిఫ్ట్ లలో శ్రేణీపద్ధతిలో చుట్టబడు మోటార్లు ఉపయోగపడును విద్యుత్ప్రవాహము పై ఆధారపడని విద్యుచ్ఛాలకబలమునిచ్చు ఉత్పాదక యంత్రమునందు అల్పభాగము శ్రేణీ పద్ధతిలోను అధిక భాగము సమాంతరపద్ధతిలోను క్షేత్రపు తీగచుట్టలు కలుపబడి యుండును

ద్విముఖ విద్యుత్ప్రవాహ (ఎ సి) ట్రాన్స్‌ఫార్మరు -




చిత్రము - 70

పటము - 6

కొద్దిచుట్లు $N_1$ కల తీగచుట్ట A అనునదియు ఎక్కువ చుట్లు $N_2$ కలతీగచుట్ట B అనునదియు మెత్తనిఇనుపరేకులు పొరలుగాగల సంపుటిపై చుట్టబడియుండును ఒక విద్యుద్వ లయమునందున్నట్టి మైన మొత్తము ఫ్లక్సు అంతయు వేరువల యముగుండా పోవును (6 వ పటమును చూడుడు ) ద్విముఖ విద్యుత్ప్రవాహము ప్రైమరీ తీగచుట్టగుండా ప్రవహించి నపుడు సెకండరీతీగ చుట్టయందు ద్విముఖ విద్యుత్తు ప్రేరిత మగును ప్రైమరీయందువిద్యుత్ప్రవాహ ముండుటచే సెకండ రీని కలుపుచు ఫ్లక్సు QS అనద్ద గరిష్ఠ రేటుతో మారుచుండును సెకండరీ అంత్యములవద్ద ప్రేరితమయిన విద్యుచ్ఛాలకబలము (6 వ పటములో చూపినరీతిని) సరిగా ఈ సమయమున గరిష్ఠము నుండును PR వద్ద మారెడు రేటు శూన్యమగుటచే ప్రేరితమైన విద్యుచ్ఛాలకబలము శూన్యముగ నుండును

$$\frac{\text{ప్రైమరీ వోల్టేజి } E_1}{\text{సెకండరీ వోల్టేజి } E_2} = \frac{N_1}{N_2}$$

అని ఋజువు పరచవచ్చును

A ప్రైమరీ అయిన ట్రాన్స్‌ఫార్మరును పైకెత్తు ట్రాన్స్‌ఫార్మరనియు B ప్రైమరీ అయిన ట్రాన్స్‌ఫార్మరును దిగువ పెట్టు ట్రాన్స్‌ఫార్మరనియు అందురు ఇచట $N_1$ $N_2$ కంటె ఎక్కువ పరిపూర్ణ సామర్థ్య మ్ముండినదను కొనినచో సరఫరా చేయబడిన సామర్థ్యము = గ్రహింపబడిన సామర్థ్యము

$$E_1 I_1 = E_2 I_2$$

వోల్టేజి అధికమైనచోట విద్యుత్ప్రవాహము అల్పమగును సెకండరీనుండి గ్రహించిన విద్యుత్ప్రవాహము ప్రైమరీ యందు వలయు విద్యుత్ప్రవాహమునందు మార్పు కలుగ జేయును ప్రైమరీ సెకండరీ విద్యుత్ప్రవాహములు రెండును రెండు తీగచుట్టలలో ఫ్లక్సును కలుగజేయును కాని యివి వ్యతిరేక దిశలలో పనిచేయును ప్రతితీగచుట్టయందలి ఫ్లక్సు దానియందుగల విద్యుత్ప్రవాహమును క్షీణింపజేయును (లెంజ్ సూత్రప్రకారము) కాని పేరువలయమునందుగల విద్యుత్ప్రవాహమును ప్రేరితముగాని అధికముగానిచేయదు సెకండరీయందలి విద్యుత్ప్రవాహమధికమయినచో ప్రైమరీ యందుకూడ విద్యుత్ప్రవాహ మధికమగును

వి వి యల్ రా

## విద్యుద్వాహకములు - చోదకములు

విద్యుద్వాహకము విద్యుత్ప్రవాహమునకు అల్ప రోధ మును కల్గించు పదార్థము విద్యుద్వాహకము బడును దైనం దిన వినియోగార్థము ఈ వాహకమునకు అల్పనిరోధగుణ మును యాంత్రికశక్తియు కల్గి వంగెడిలక్షణమును, తక్కువ ధరయు కూడ ఉండవలయును రాగికంటె వెండి ఉత్తమ మైన వాహకము కాని నిత్యజీవితోపయోగములకు ఇది చాల ఖరీదైనది అల్యూమినియము తగరము సీసము, ఇనుము మున్నగునవి విద్యుద్వాహకములకు మరికొన్ని ఉదాహర ణములు

విద్యుత్ చోదకము: విద్యుత్ప్రవాహమునకు అధిక నిరోధము కల్గించు పదార్థము విద్యుత్ చోదక మనబడును ఈ విద్యుత్ చోదకము కొన్ని విద్యుత్ యాంత్రిక భౌతిక రసాయన ధర్మములను కల్గియుండవలెను

విద్యుద్ధర్మము అధిక నిరోధమును కల్గియుండవలెను

యాంత్రికధర్మము యాంత్రిక ప్రతిబలమునకు (ఉదాహరణ ఒత్తిడి) లోనుకాకుండ నుండవలెను

భౌతికధర్మము పరిశుద్ధమైన విద్యుత్ చోదకము అల్పశోషణ శక్తినికల్గి అధిక ఉష్ణోగ్రతను తట్టుకొనజాలి యుండవలెను

రసాయనధర్మము : రసాయన పదార్థములవలన క్షయముకాకుండ నుండవలెను

ఏ విద్యుత్ చోదకమైనను పరిపూర్ణత్వమునుకల్గి యుండ నేరదు ఒక్కొక్క చోదకమును ఒక్కొక్క ప్రయోజనము కొరకు వినియోగింతుము. పింగాణి, శాల్పివ బంకమన్ను మొదలైనవి ఉత్తమ చోదకములైనను కేబులునందుండు వాహకములకు వాటిని కవచములుగా ఉపయోగింపజాలము ఈ పదార్థములకు వంగెడి గుణములేకయుండుటే ఇందుకు కారణము రబ్బరుకూడ ఉత్తమచోదకమే అయినను ఉష్ణోగ్రత 116° దాటినచో (ఉదా విద్యుత్కుంపటి మున్నగునవి) అది ఉపయోగపడదు గాజు మైకా కొయ్య కాగితము మొదలైనవికూడ చోదకములకు మఱికొన్ని

ఉదాహరణములు

వాహకముల నిర్మాణము విద్యుద్వాహకములు సాధారణముగా రాగితో తయారుచేయబడును రాగిధర విశేషముగ పెరుగుటచే దానికి ప్రత్యామ్నాయముగా నేడు అల్యూమినియము ఎక్కువగా వాడబడుచున్నది మధ్యచ్ఛేదము వచ్చువరకు రాగిదిమ్మనుండి అచ్చులద్వారా రాగితీగెలాగబడును తరువాత ఈతీగ తొట్టెలలో కరగించబడిన తగరపు ద్రావణమునందు ముంచబడును ఇట్లు చేయుటకు రెండు కారణములున్నవి రాగితీగకు వల్కనైజు చేయబడిన రబ్బరు కవచమును ఏర్పరచునపుడు అందలి గంధకము రాగితో రాసాయనిక క్రియ చెందకుండుటకును రాగివాహకము మలువుగా అతుకునట్లు చేయుటకును తగరపు ద్రావణములో రాగి తీగలు ముంచబడును అల్యూమినియము తీగకూడ దిమ్మనుండి ఇట్లే లాగబడుచున్నది కాని దీనికి తగరపుపూత అవసరముండదు

రాగి అల్యూమినియములు విద్యుద్వాహకములుగ నేడు విరివిగా వాడబడుచున్నవి వాహకముగ నిర్ణయింపబడు లోహము దానిఖరీదుపై ఆధారపడియుండును పారిశ్రామికముగ వెనుకబడిన దేశములు బాక్సైటు (అల్యూమినియ ముండిన ఖనిజము) ఖనిజమునుండి అల్యూమినియమును గ్రహింపజాలి పుడు రాగికంటె అల్యూమినియము ధర భవిష్యత్కాలములో తగ్గగలదు

వాహకములుగ రాగి అల్యూమినియముల పోల్కి

| అల్యూమినియము | రాగి |
|---|---|
| 1 సమనిరోధము కల్గి సమవిద్యుత్తు ప్రవహించుట కనువగు తీగయొక్క భారము తక్కువ | 1 ఉత్తమ విద్యుదుష్ణవాహకము కావున ఒకేపొటెన్షియల్ పతనమునకు కావలసిన మధ్యచ్ఛేద వైశాల్యము తక్కువ. |
| 2 యంత్రమొనర్పు సులభము | 2 అధిక యాంత్రికబలము కలది |
| 3 ఉష్ణవికిరణతలము అధికము కావున విద్యుత్ప్రవాహ సాంద్రత అధికముగ నుండును | 3 క్షయనిరోధకము |
| 4. నిరోధకశక్తి రాగికంటె ఎక్కువ | 4 ఉపయోగింపగా మిగిలిన రాగిముక్కల విలువఎక్కువ |
| 5 ఉష్ణోగ్రతాగుణకము పరిమాణముగ నుండును | 5 అతుకుట సులభము |
| | 6 అల్పవిశిష్ట నిరోధము కలది |

సన్నని తీగల సంపుటితో ఏర్పడు వాహకము : కేబులు సులభముగ వంగుటకు వాహకమును పెక్కు సన్నని తీగల సంపుటిగ చేయుదురు. కేబులునందు నిర్ణీత సంఖ్యగల తీగల నుపయోగింతురు. అనగా 1, 3, 7, 19, 37, 61, 91, 127 అనునది సాధారణముగా కేబులునందుండు తీగల సంఖ్యలు. తీగలపొర అంతకుముందున్న పొరకు వ్యతిరేకదిశలో సర్పిలాకారముగ చుట్టబడియుండును. ఈ విధానమువలన పూర్తిగా తయారైన కేబులుయొక్క వంగెడిగుణము అధికమగును. అంతేకాక పురియొక్కుటవలన మెలిదిరుగుటవలన తీగలు పిట్టగూడుగ ఏర్పడుట విరుగుట మొదలైన ప్రమాదములు తగ్గును.

సన్నని తీగల సంపుటితో ఏర్పడువాహకముల పరిమాణము : సన్నని తీగల సంఖ్యవలన ప్రతిసన్నని తీగయొక్క వ్యాసము వలన సన్నని తీగలుగల వాహకపు పరిమాణము నిర్ధరింపబడుచున్నది. ఉదాహరణకు 7/0 044 అంగుళముల కేబులు ఏడు సన్నని తీగలను కల్గియుండుననియు అందలి ప్రతితీగయొక్క వ్యాసము 0 044 అంగుళములుండుననియు గ్రహింపవలెను.

కవచరహిత వాహకములు : కవచరహిత వాహక విధానములలో రాగి అల్యూమినియము వాహకములు వివిధ రకములైన మధ్యచ్ఛేదములను కల్గియుండును (ఉదాహరణకు దీర్ఘఘన చతురస్రాకారపు లేక వృత్తాకారపు మధ్యచ్ఛేదములు). ఇవి అల్పతమ విద్యుత్పీడనముతో విద్యుత్ సరఫరా చేయునపుడును విద్యుత్తును సరఫరాచేయు స్థానములందును ఉపయోగింపబడుచున్నవి. కవచరహిత కడ్డీ విధానములలో అల్పతమ విద్యుత్పీడనము మించినపుడు ఈ క్రింది జాగ్రతలు తీసికొనబడును.

(ఎ) అనధికార వ్యక్తులకు అందుబాటులో లేకుండ చేయుట.

(బి) స్వేచ్ఛగా సంకోచవ్యాకోచములు చెందుటకు వీలు కలుగజేయుట.

(సి) అధిక విద్యుత్పీడనవిధానములలో అగ్ని ప్రమాదములకు గురికాకుండ కవచములను విరివిగ ఏర్పరచుట.

వాహక నిరోధము : విద్యుత్ప్రవాహమునకు వాహకము కల్పించు నిరోధము మూడు విషయములపై ఆధారపడియుండును. (1) వాహకపు పొడవు (2) వాహకపు మధ్యచ్ఛేద వైశాల్యము (3) ఉపయోగింపబడు పదార్థపు రకము.

పొడవు : వాహకపు పొడవును రెట్టించినచో (ఉదాహరణకు వందమీటర్లను రెండువందల మీటర్లకు) నిరోధము రెండురెట్లధికమగును. $R$ అను వాహకపు నిరోధము (ఓములలో గ్రీకు సంకేతముగ సూచింపబడును) $l$ అను వాహకపు పొడవునకు సూటిగా అనులోమానుపాతములో నుండును.

మధ్యచ్ఛేద వైశాల్యము : వాహకపు మధ్యచ్ఛేద వైశాల్యమును రెట్టించినచో వాహకపు నిరోధము సగమగును (ఉదాహరణకు వైశాల్యము 0 1 చ. సెం. మీ. నుండి 0 2 చ. సెం. మీ. కు పెరిగినపుడు నిరోధము సగమగును). నిరోధము మధ్యచ్ఛేద వైశాల్యమునకు విలోమానుపాతములో నుండును.

విశిష్టనిరోధము : ఈ గుణాంకము ఉపయోగించు పదార్థముపై ఆధారపడియుండును. ప్రమాణఘనముగల పదార్థముయొక్క అభిముఖతలముల మధ్యనుండు నిరోధము విశిష్ట నిరోధమనబడును. రాగియొక్క విశిష్టనిరోధము 0 0000007 ఓమ్ అంగుళము నకొనినచో ఘనఅంగుళపు ఘనపరిమాణముగల రాగిదిమ్మయొక్క అభిముఖతలముల మధ్యనిరోధము 0 0000007 ఓములుండును. దీనినే $7 \times 10^{-7}$ ఓమ్/అంగుళము లేక 7 మైక్రో ఓమ్/ అంగుళము లేక అందురు. విశిష్ట నిరోధమును గ్రీకు అక్షరమైన $P$ అను సంకేతముతో సూచింతురు.

$$R = P\frac{l}{a}$$

ఇచ్చట $R$ = నిరోధము ఓములలో

$P$ = విశిష్టనిరోధము

$l$ = పొడవు

$a$ = మధ్యచ్ఛేద వైశాల్యము

వాహకముపై ఉష్ణప్రభావము : వాహకముగుండ విద్యుత్తు ప్రవహించునపుడు వాహకపు ఉష్ణోగ్రత హెచ్చును (ఉదాహరణకు గదిని వెచ్చజేయు విద్యుత్ కుంపటి). వాహక నిరోధముపై ఉష్ణప్రభావము వాహకపు సంఘటీకరణముమీద ఆధారపడియుండును. రాగి అల్యూమినియము మొదలయిన శుద్ధలోహముల నిరోధము ఉష్ణోగ్రత హెచ్చినకొలదియు హెచ్చుచుండును. కాన్స్టంటన్ మాంగనిన్ మొదలగు మిశ్రమ ధాతువుల నిరోధము ఉష్ణోగ్రత హెచ్చినకొలదియు సాపేక్షముగ స్థిరమై యుండును. కర్బనము ఎలెక్ట్రోలైటు

ద్రావణముల (ఉదాహరణకు క్షార లవణముల ద్రావణము) నిరోధము ఉష్ణోగ్రత హెచ్చి కొలదియు తగ్గుచుండును

ఉష్ణోగ్రతా గుణకము $1^{\circ}C$ ఉష్ణోగ్రతకు హెచ్చించునపుడు ఒక ఓము నిరోధము గల పదార్థముయొక్క నిరోధమందలి వృద్ధిని ఆ పదార్థపు ఉష్ణోగ్రతా గుణకమందురు ఉదాహరణమునకు రాగియొక్క ఉష్ణోగ్రతాగుణకము 0 004 ఓము అను కొనినచో ఒక ఓము రాగి రోధముయొక్క ఉష్ణోగ్రత $1^{\circ}C$ నకు హెచ్చినప్పుడు దాని నిరోధము 1 004 ఓములగును పరిశుద్ధ లోహములగు రాగి అల్యూమినియము మొదలైనవి ధన ఉష్ణోగ్రతాగుణకమును కలిగియుండును ఉష్ణోగ్రత హెచ్చినపుడు వాటి నిరోధముకూడ హెచ్చును కర్బనము ఎలక్ట్రొలైటు ద్రావణములు ఋణఉష్ణోగ్రతాగుణకమును కలిగియుండును ఉష్ణోగ్రత హెచ్చినపుడు వాటి నిరోధము తగ్గును

నిరోధవృద్ధి గణనము ఉష్ణోగతవలన వాహకపు నిరోధవృద్ధిని రెండు సూత్రములవలన కనుగొనవచ్చును

(ఏ) 0 C వద్దనుండి ఉష్ణోగ్రత హెచ్చునపుడు

(బి) రెండుమాధ్యమిక ఉష్ణోగ్రతలనడుమ ఉష్ణోగ్రతఅధికమైనపుడు

వివరణము

ఉష్ణోగత $0^{\circ}C$ నుండి హెచ్చినపుడు

$$R_t = R_o (1 + dt)$$

ఇచ్చట $R_o$ = $0^{\circ}C$ వద్ద నిరోధము

$R_t$ = $t^{\circ}C$ వద్ద నిరోధము

d = ఉష్ణోగ్రతా గుణకము

t = ఉష్ణోగ్రతలో వృద్ధి

(ఎ) నూరుఓముల రాగిచుట్టయొక్క నిరోధము ఉష్ణోగ్రత $0^{\circ}C$ వద్దనుండి $50^{\circ}C$ వరకు హెచ్చినపుడు పైసూత్రమును ఉపయోగించి గణించినచో 1 2 ఓములగును

(బి) రెండు మాధ్యమిక ఉష్ణోగ్రతల నడుమ ఉష్ణోగ్రత హెచ్చునపుడు ఈ దిగువ సూత్రమును ఉపయోగింపవలెను

$$\frac{R_2}{R_1} = \frac{1+dt_2}{1+dt_1}$$

ఇచ్చట $R_1 = t_1$ C వద్ద నిరోధకము

$R_2 = t_2{}^{\circ}C$ వద్ద నిరోధకము

d = ఉష్ణోగ్రతాగుణకము

$t_1$ తొలి ఉష్ణోగత

$t_2$ = తుది ఉష్ణోగ్రత

ఉదాహరణమునకు మోటారుయొక్క క్షేత్రపు రాగితీగ చుట్టల రోధము $20^{\circ}C$ వద్ద 80 ఓములుండునపుడు ఉష్ణోగ్రత $20^{\circ}C$ నుండి $40^{\circ}C$ వరకు హెచ్చినచో పైసూత్రమునుబట్టి ఉష్ణోగ్రతాగుణకము 0 004 ఓము అగును

వి వి ఎల్ రా

## విపణివ్యవస్థ

ముడి పదార్థములను ఉత్పత్తిదారులకు చేరవేయుట మొదలు కారిచే ఉత్పాదితమగు తయారీ సరకులను వినియోగదారులకు చేరవేయువరకు గల కార్యకరణ స్థానమును విపణి యని అందురు క్రయవిక్రయములు సరఫరా ఒడంబడికలు జరుగు కేంద్ర స్థలములనియు సరఫరా గిరాకీలు మారుటతో ధరల మార్పుతో వస్తువులు వినిమయము చెందు ప్రదేశములనియు విపణుల కర్థము ఈవిధముగ విపణికార్యక్రమమును ముఖ్యమైన మూడురకములుగ చెప్పవచ్చును (1) సమకూర్చుట (2) సమన్వయముచేయుట (3) పంపిణీచేయుట అను ఈ మూడు కార్యక్రమములను విపణి జీవమువంటివి

వివిధ ఉత్పత్తిస్థానములనుండి సరఫరా స్థలముల నుండి వినిమయమునకయి వస్తువులను ఒక కేంద్రస్థానమునకు తెచ్చుటను సమకూర్చుట అని అందురు ముఖ్యముగ వ్యవసాయక ఉత్పాదిత వస్తువుల క్రయవిక్రయములు వాటి ఉత్పాదిక స్థలములలోనే జరుగుట కష్టము కావున వాటిని ఒక కేంద్రస్థలములో సమకూర్చి విక్రయించుట చాల అవసరము ఈ విధముగ సమకూర్చబడిన వస్తుసముదాయము లను వినియోగదారుల కందజేయుట పంపిణీ యనబడును ఈ విధానములో వినియోగదారులు వస్తువులను పొందు రీతులు వివరింపబడి యుండును క్రయదారులు ఉత్పత్తిదారుల మధ్య సమన్వయము అవసరము అనగా గిరాకీ సరఫరాలను నిశితదృష్టితో పరిశీలించి అటు క్రయదారుల ప్రయోజనములు ఇటు ఉత్పత్తిదారుల ప్రయోజనములు సమానముగ నుండి ఏ వ్యక్తియు నష్టము పొందకుండ చూడవలెను గిరాకీ సరఫరాలను సమన్వయపరచుటవలన విపణిలోని ధరలు సరియైన రీతిలో నుండును క్రయ విక్రయములు సర్వజన ప్రయోజనకరముగ నుండునట్లు సమన్వయించుట విపణియొక్క ముఖ్య కర్తవ్యము

ఉత్పత్తిదారులు వర్తకులు వినియోగదారులు విపణిపై తమ ప్రత్యేక దృష్టిని ఉంచెదరు ఉత్పత్తిదారుడు తా నుత్పత్తిచేసిన వస్తువులకు విపణియందు అధిక లాభములు రావలెనని చూచుచుండును వర్తకులు సరసమైన ధరలకు ఉత్పత్తిదారులనుండి వస్తువులను పొంది వినియోగదారుల కధికమైన ధరల కమ్మవలెనని ఆశించుచుందురు వినియోగదారులు తమ కవసరమైన వస్తువులు విపణియందు తరసమైన ధరలకు లభించవలెనని కోరుకుందురు పరస్పర భిన్నములైన ఈ మూడు ఉద్దేశములు సమన్వయమగునపుడే విపణి సార్థకత చెందును

విపణి కార్యక్రమములను యింకను ఈ క్రిందివిధముగ వివరించవచ్చును (1) క్రయము (2) విక్రయము (3)

నిల్వయుంచుట (4) వాణ్యనియమనము (5) ధరల నిర్ణయము (6) ప్రకటన (7) రవాణా (8) ఆగీ మొదలయినవి. ఇవియన్నియు ప్రధానకార్యక్రమములు. వీటిని నెరవేర్చుటకు ఈ క్రింది ఉపప్రధాన కార్యక్రమములు కూడ కలవు (1) ధనసేకరణ (2) భీమా (3) చట్టవిధులు.

వస్తువుల వినియోగావసరములపై క్రయమునకు ఉద్దేశమేర్పడుచుండును. విక్రయవస్తువుల యెన్నికనుగూర్చియు వస్తువుల సరఫరా మూల్యములనుగూర్చియు ముందుగ తెలిసికొనవలయును. తరువాత ధరల నిర్ణయముపై అభిప్రాయముల మార్పిడి జరుగును. ధరనిర్ణయమైన తరువాత మూల్యము చెల్లింపు వస్తువుల యజమాన్యము యొక్క మార్పు జరుగును. అనేకవిధముగ వ్యాపారిసంస్థలో కూడ క్రయము అనునది చాల ప్రధానమైన కార్యక్రమము. సాధారణముగ అట్టి సంస్థలు క్రయమునకు ప్రత్యేకశాఖను నిర్వహించుచుండును. క్రయము యొక్క ముఖ్యోద్దేశము ఉత్పత్తి కార్యక్రమములకుగాని విక్రయములకుగాని స్వీయప్రయోజనమునకుగాని వస్తువులను సరియైన సమయములకు అందజేసికొనుటయే.

వస్తువులకు గిరాకీ కల్పించుట క్రయదారుల నెన్నిక చేయుట ధరల నిర్ణయమునకై అభిప్రాయములు మార్చుకొను ధరమూల్యమును పొందుట వస్తుయాజమాన్యమును క్రయదారులకు మార్చుట – అనునది విక్రయమునకు సంబంధించు ముఖ్యకార్యక్రమము. ఉత్పత్తిదారులు విక్రయవర్తకుల విక్రయకార్యక్రమమును సరియైన రీతిలో చేపట్టినచో లాభమును పొందుచు అభివృద్ధి చెందగలరు. లేనిచో నష్టము తప్పదు. అదేవిధముగ వినియోగదారులు తమ ఆదాయమును సమంజసముగ వ్యయపరచుకొనినచో అభిలషించిన వస్తుసముదాయమును పొందగలరు.

వస్తువులకు ప్రయోజనము కల్పించుటకును వినిమయమును సాధ్యముచేయుటకును వాటిని గిడ్డంగులలో నిల్వయుంచుదురు. వస్తువులన్నియు ఒకేసమయములో ఉత్పత్తియై ఒకే సమయములో వినియోగమునందు లేవు. కొన్నివస్తువులు కొన్ని కాలములలోనే ఉత్పత్తియై వాటి వినియోగము మాత్రము ఎల్లకాలము జరుగుచుండును. మరికొన్నివస్తువులు కొన్ని కాలములలోనే వినియోగమగుచుండును. కాని వాటి ఉత్పత్తిమాత్రము ఎల్లకాలము నుండును. ఈ రెండుపరిస్థితులను సమన్వయించుటకు వస్తువుల నిలువ చాల అవసరము. ఈ నిలువవిధానమునే గిడ్డంగుల విధానమందురు. అదేవిధముగ కేంద్రీకృతమైన ఉత్పాదితవస్తువులకు దూరప్రదేశములలో గిరాకిని కల్పించి సరఫరా గిరాకీలను సమన్వయపరచుటకు కూడ గిడ్డంగులు వాడబడుచున్నవి. గిరాకి అనుగుణముగ ఎప్పటికప్పుడు వస్తువులను ఉత్పత్తిస్థానముల నుండి తెప్పించుకొనుట చాలా కష్టము. ముందునే గిరాకిని ఊహించియో కొంతకాలప్రమాణమును నిర్ణయించియో వస్తువులను విక్రేతలు ఉత్పత్తిస్థానములనుండి తెప్పించుకొని గిడ్డంగులలో నిల్వచేసి గిరాకినిబట్టి విక్రయించి లాభము పొందగలరు.

సరుకుల క్రయవిక్రయములు విపణియందు ఈ క్రింది పద్ధతులలో జరుగుచుండును (1) పరీక్షానిర్ణయపద్ధతి – ఈ పద్ధతియందు కొనుగోలుదారులు నేరుగ వస్తువులను పరీక్షించి నిర్ణయము ప్రకారము క్రయము చేయుట సంభవించును. వస్తువుల వాణ్యము ధర కొనుగోలుదారుని సమక్షముననే నిర్ణయింపబడును. (2) నమూనాపద్ధతి – ఈ పద్ధతి ననుసరించి క్రయదారులు తాము కోరు వస్తువుల నన్నిటిని పరీక్షింపరు. వర్తకులు కొనుగోలుదారులకు ఆ వస్తువుల నమూనాను మాత్రమే పంపెదరు. కొనుగోలుదారుడా నమూనాను పరీక్షించి వస్తువులను క్రయము చేయును. ఈ వస్తువులు నమూనాకంటె భిన్నముగ నుండరాదను నియమము కలదు. (3) వివరణపద్ధతి – ఈ పద్ధతియందు విక్రయవర్తకులు తాము విక్రయించు సరకుల వివరణను అనగా వాణ్యమును ధరను ముందుగ క్రయదారులకు తెలిపెదరు. ఈ వివరణ ననుసరించి క్రయదారులు వస్తువులను క్రయము చేయుదురు. ఇచ్చటకూడ వివరణకును వస్తుగుణములకును భేదముండరాదు. (4) తరగతివారీ పద్ధతి – ఈ విధానము ద్వారా సరకుల వాణ్యమునుబట్టి అవి ప్రత్యేక తరగతులుగ విభజింపబడి ధరల నిర్ణయముతో విక్రయించబడుచుండును. కొనుగోలుదారులు ఈ తరగతుల నిర్ణయము ననుసరించియే తమకు కావలసిన వస్తువుల నెంచుకొని పొందగలుగుదురు. తరగతుల విభజన సరళముగ జరుగవలెను. ఆపై వాణ్యనియమనమును బట్టి వస్తువులు విక్రయించబడుచుండును. భారత ప్రభుత్వము ప్రత్యేకముగ వాణ్యనియమ సంఘము నేర్పరచినది. ఆ సంఘము ఉపాదేయ వస్తువుల గుణములనుబట్టి వాణ్యనియమనము చేయును. రంగు, రుచి, వాసన, బరువు మున్నగువానినిబట్టి ఈ వాణ్యనియమనము జరుగుచుండును. "ఆగ్‌మార్కు" అను నిర్ణయము వాణ్యనియమమును తెలియజేయుచుండును. (5) సరకులధరల

నిర్ణయించుకూడ విపణి కార్యక్రమములలో చాల ముఖ్యమైనది. ఇందుకు విపణిపరిస్థితులను క్షుణ్ణముగ పరిశీలింపవలసిన అవసరమున్నది. పైన చెప్పినట్లు వస్తువుల గిరాకిని పరిశీలించి దానితో సరఫరాను సమన్వయపరచి ధరలను నిర్ణయించవలెను. వస్తువులకు గిరాకిని సృష్టించుటకు సరకుల రవాణాఖర్చులను వినియోగదారుల పరిస్థితులను విపణిపరిస్థితులను పోటీ మొదలైన విషయములను పరిశీలించి ధరలను నిర్ణయించవలెను. ధరలు అత్యధికముగనున్నచో వినియోగదారులా వస్తువులను క్రయము చేయుటకు ఇచ్ఛగింపరు. అదే విధముగ ధరలు అతితక్కువలో నున్నచో వ్యాపారులు నష్టపోవుదురు. అందుచే సరియైన రీతిలో సామాన్యమైన లాభముతో ధరలను నిర్ణయించుట చాలముఖ్యము. (6) వ్యాపారవాణిజ్యములలో వస్తువులను గూర్చిన వివరములు ఉత్పత్తిదారులకును వినియోగదారులకును ప్రకటనలమూలముగా తెలుపుట ముఖ్యము. వస్తుసముదాయములను గూర్చియు సేవలను గూర్చియు ఇట్లు తెలుపుప్రక్రియలు వ్యాపారప్రకటనలనబడును. ఈనాటి విపణివ్యవస్థలో ప్రకటన విధానము అతిముఖ్యమైనది. క్రొత్తవస్తువులకు గిరాకిని కల్పించుటకును వాడుకయందుండు వస్తువుల గిరాకిని నిలబెట్టుటయేకాక యీకను పెంచి అధికలాభములను గ్రహించుటకును ప్రకటనలుద్దేశింపబడినవి. (7) రవాణాసౌకర్యము క్రయవిక్రయములను సులభసాధ్యము చేయును. కేంద్రీకృతమైన ఉత్పాదితములను దేశవ్యాప్తముగ అందచేసి వాటి వినియోగమును సాధించుటకు రవాణాసాధనములు అత్యవసరము. వస్తుమూల్యము రవాణాఖర్చులపై ఆధారపడియుండుట వలన రవాణాచౌకగను సరియైన సమయములో సరఫరాను అందునట్లును ఉండవలెను.

వస్తువులను సవ్యముగా బంగీచేయుట కూడ విపణివ్యవస్థలో ముఖ్యమైన అంశము. దూరప్రయాణములలో వస్తువులు చెడిపోకుండుటకై నవీనపద్ధతులలో కట్టుదిట్టముగా బంగీచేయుట చాలముఖ్యము. సరకులను గిడ్డంగులలో భద్రపరచుటకు అవసరమగు ఈ బంగీలను కట్టుట అవసరము. ప్రస్తుతము రేకుడబ్బాలు దళసరి అట్టలు మొదలయినవి బంగీవిధానములో ఉపయోగపడుచున్నవి. కొనుగోలుదారులను ఆకర్షించి అధికలాభములు తీయుటకు బంగీవిధానమును ప్రపంచమంతట అత్యంత ఆకర్షవంతముగ చేయుప్రక్రియలు ఆచరణమందున్నవి.

వ్యాపారమునకవసరమైన ధనసేకరణముకూడ శాస్త్రీయవిజ్ఞానములో చేరిన అంశమే. ఖాతాయొక్క వాణిజ్యము చేయువ్యాపారి మూలధనమంతటిని స్వంత ఆస్తులనుండి పొందలేడు. బ్యాంకులద్వారా ప్రభుత్వముద్వారా అట్టి ధనమును సంపాదించుటకాతడు యత్నించును. ప్రకృతివైపరీత్యముల వలన ఇతర విధముల వ్యాపారులకు కలుగు వివిధరకముల నష్టములను భర్తీచేసికొనుటకు వర్తకులు వాటిని బీమా చేయుదురు. అందుచే బీమావిధానము విపణివ్యవస్థలో అతి ముఖ్యమైన పాత్రవహించుచున్నది. ఏ కారణము వలననైన బీమాచేయబడిన వస్తువులకు న్యాయసమ్మతముగ నష్టమేర్పడినచో బీమాకంపెనీవారు ఆ నష్టమును పూర్తిగా భర్తీచేయుదురు. ఈ పద్ధతివలన వర్తకులు పెనునష్టముల పాలుకాకుండ విపణివ్యవస్థను సక్రమముగా నడుపగలుగుదురు. వ్యాపారము చేయువారు కొన్నిప్రత్యేక నిబంధనల ననుసరించి నడుపవలెయుండును. వస్తుక్రయవిక్రయముల చట్టమునందును వాణిజ్యన్యాయచట్టమునందును ఇట్టి నిబంధనలేర్పడినవి.

వ్యాపారము చేయువ్యక్తులను బట్టియు వారిపద్ధతులను బట్టియు వ్యాపారసరళి ననుసరించియు విపణి కొన్ని ముఖ్యమైన రకములుగ విభజింపబడినది. దేశములో వివిధ ప్రాంతములలో జరుగు వ్యాపారమును స్వదేశవ్యాపారమనియు ఇతర దేశములతో జరుపువ్యాపారమును అంతర్జాతీయ లేక విదేశవ్యాపారమనియు అందురు. దేశీయవ్యాపారవిపణులు మరల ప్రధానవిపణులనియు ఉపప్రధాన విపణులనియు విభజింపబడినవి. ఉత్పత్తిదారులు సరకులను టోకు వర్తకులకు విక్రయించు కేంద్రములను ప్రధాన విపణులందురు. టోకువర్తకులు చిల్లరవర్తకులకు విక్రయించువాటిని ఉపప్రధాన విపణులనియు వినియోగదారులు వస్తువుల పొందు విపణులు ముఖ్యవిపణులనియు పిలువబడుచున్నవి. భావిలో వస్తువుపై ఒప్పందములు చేసికొను క్రయవిక్రయముల విపణులను భావి ఒప్పందవిపణులని అందురు. పాటాలకై ప్రత్యేకముగ కొన్నిప్రదేశము లేర్పడి ఆ ప్రదేశములలోనే వాటి వినిమయము గావించబడుచుండును. వీటిని "పాటావిపణులు" అని అందురు. ఈ విధముగ పలురకములైన వృత్తులలో పనులు నడిపించబడుచు ఉత్పాదితవస్తువులను వినియోగదారుల కందించుటకు సహాయపడుచున్నవి.

వే. రా.

## విప్లవములు

మితిమీరిన బలప్రయోగసాధనమున ఒక రాజకీయ వ్యవస్థను పూర్తిగ మార్చి దానిస్థానే మరియొక వ్యవస్థను స్థాపించు చర్యకు విప్లవమని పేరు. విప్లవము కూడ ప్రభుత్వముపై జరుగు తిరుగుబాటులలో ఒకటి అయినను ఉద్దేశమందును ఉద్దేశసిద్ధికై ఉపయోగింపబడు సాధనమందును దీనికిని తక్కిన తిరుగుబాటులకును గొప్ప భేదమున్నది. తక్కిన తిరుగుబాటుల ఉద్దేశము రాజకీయవ్యవస్థను పూర్తిగ మార్చుట కాదు. వాటిలో అనేకములు ప్రభుత్వము నుండి ఏదియో ఒక ప్రత్యేక ప్రయోజనమును సంపాదించుటకు తీసికొనబడు చర్యలు. శిస్తులను తగ్గించవలెనని రైతులు జరుపు తిరుగుబాటు ఈ కారణముచే విప్లవము కాజాలదు. అట్లే ఒక రాజును బంధించియో హత్యచేసియో అతని స్థానమున మరియొక రాజును సింహాసనాధిష్ఠితుని చేయుటకు తలపెట్టిన తిరుగుబాటు విప్లవము కాదు. ప్రస్తుతకాలమున బలప్రయోగము చేసి పరిపాలనాధికారులను మార్చు చర్యలు దక్షిణ అమెరికా రాజ్యములలో సర్వసాధారణము. అధికారులు మారినను ప్రభుత్వ విధానములో ఎట్టి మార్పు ఉద్దేశింపబడకపోవుటచేత ఈ చర్యలకు విప్లవమను పేరు తగదు. కాని ప్రజాస్వామికమును తొలగద్రోసి నియంతృత్వమును స్థాపించుటకు పాకిస్థాన్‌లో అయూబ్‌ఖాన్ లేవదీసిన తిరుగుబాటు విప్లవమగుచున్నది. 19 వ శతాబ్దములో ఇంగ్లండు వంటి కొన్ని దేశములలో బలప్రయోగసాధనమునగాక సంస్కరణచర్యల ద్వారా ప్రజాస్వామిక విధానము స్థాపింపబడెను. దీని మూలమున రాజకీయ వ్యవస్థలో గొప్ప మార్పు సంభవించెను. కాని శాంతియుతముగా జరిగిన ఈ మార్పును విప్లవమని అనుటతగదు. దీనినిబట్టి ఉద్దేశమందును సాధనమందును విప్లవము తక్కిన తిరుగుబాటులకు గొప్ప భేదమున్నదను విషయము స్పష్టమగుచున్నది.

మానవచరిత్రలో విప్లవములు ఎక్కువగ పాశ్చాత్య ప్రపంచమందే జరిగినట్లు చెప్పవచ్చును. భారతదేశము చైనా జపాన్ పశ్చిమ ఆసియా మొదలగు ప్రాంతములతో కూడిన ప్రాచ్య ప్రపంచమందు ఇటీవలవరకు విప్లవములు సంభవించినట్లు లేదు. ప్రాచీనకాలములో భారతదేశమందు ఏకస్వామ్యములు కాని గణరాజ్యములు కొన్ని ఉండి తర్వాత అంతరించినవి. కాని ఇవి విప్లవములమూలమున అంతరించినవో లేక మౌర్యచక్రవర్తి వంటి వారిచే జయింపబడుటచేత అంతరించినవో చెప్పుటకు సాధ్యము కాదు. ప్రాశ్చాత్య ప్రపంచములో అట్లు కాక అన్ని యుగములలో అనేకవిప్లవములు సంభవించినవి. ప్రాచీనగ్రీసుదేశములోని ఏథేన్సు వంటి నగరరాజ్యములలో ప్రభుత్వవిధానములు బలప్రయోగము ద్వారా తరచుగా మారుచుండెను. ప్రజారాజ్యమైన రోమనగరము క్రీ. పూ. మొదటి శతాబ్దములో విప్లవకారణముగ ఏకస్వామ్యముగ మారెను. ఆధునిక యుగమున 17 వ శతాబ్దములో ఇంగ్లండులోను 18 వ శతాబ్దములో అమెరికా ఫ్రాన్సులలోను 20 వ శతాబ్దములో రష్యాలోను జరిగిన మహావిప్లవములు జగత్ప్రసిద్ధములు. అట్లే 20 వ శతాబ్దమున ఇటలీలో ముస్సోలిని జర్మనీలో హిట్లరు లేవదీసిన ఫాసిస్టు విప్లవములు కూడ ప్రసిద్ధిగాంచెను. పాశ్చాత్య విప్లవములతో పరిపోల్చదగినవి ఆసియాఖండమందు 20 వ శతాబ్దమునకు పూర్వము సంభవించలేదు. కాని ఇటీవల అనేకములు అట్టివి సంభవించెను. చైనాలో 1911 ప్రాంతమున జరిగిన ప్రజాస్వామిక విప్లవము 1949 సంభవించిన కమ్యూనిస్టు విప్లవము వలసవిధానమును తొలగద్రోసి జాతీయరాజ్యములను స్థాపించుటకు భారతదేశమందును ఇతర దేశములందును సాగింపబడిన ఉద్యమములు ఈ వర్గమునకు చెందినవి.

ప్రాచ్యపాశ్చాత్యప్రపంచ చరిత్రలలో కనుపించు ఈ భేదమువలన విప్లవములకు సంబంధించిన సిద్ధాంతములు పాశ్చాత్యరాజనీతిశాస్త్రవేత్తలను ఆకర్షించినట్లు కౌటిల్యాది ప్రాచ్య శాస్త్రవేత్తలను ఆకర్షించలేదు. ప్లేటో అరిస్టాటిల్ మకియవెల్లి హాబ్స్ లాక్ రూసో మార్క్సు మొదలగు ప్రాశ్చాత్య శాస్త్రవేత్తలు విప్లవములకు దారితీయు పరిస్థితులు విప్లవములకు గురికాకుండ స్థిర ప్రభుత్వమును స్థాపించుటకు సాధనములు విప్లవ ప్రవర్తనలోని ధర్మాధర్మములు మొదలగు విషయములను వారి రచనలలో విచారించి వ్యాఖ్యానించిరి. ఇటీవలకాలమున అట్టి రచనలు అసంఖ్యాకములుగ వెలువడుచున్నవి.

అమలులో నుండు రాజకీయ వ్యవస్థ పట్ల ప్రజలలో అసంతృప్తి కలుగుటయే విప్లవములన్నిటి ప్రధానకారణమని చెప్పవచ్చును. కాని ఎట్టి పరిస్థితులలో అసంతృప్తి కలుగును? అను విషయమును గురించి శాస్త్రవేత్తలలో అభిప్రాయ భేదములనేకములున్నవి. ప్రపంచములో ప్రస్తుతమందు సమాజ

ములను మూడు రకములుగ విభజింపవచ్చును పూర్తిగ సంప్రదాయ బద్ధములు మొదటి రకములోనివి ఇవి వ్యవసాయమే ప్రధాన వృత్తిగా గలవి సంప్రదాయములను ఆచారములను కొద్దిగ సడలించుకొని పారిశ్రామికముగ పురోగమించుచుండునవి రెండవరకములోనివి ఇట్టి సమాజములు పూర్తిగ పురోగమించినట్టివి కావు పూర్తిగ ప్రాచీనాచారబద్ధములును కావు ఇవి సంధిదశలో ఉన్నట్టివి ఆసియా ఆఫ్రికాఖండములలోని దేశము నేములు దక్షిణ అమెరికాలోనివి ఈ రకమునకు చెందినవి పూర్తిగ పురోగమించి అభివృద్ధిని సాధించినవి మూడవ రకములోనివి పాశ్చాత్య ప్రపంచములోని దేశములిట్టివి మొదటి రకపు దేశములందును మూడవ రకపు దేశములందును సాధారణముగ విప్లవములు సంభవించవు సంప్రదాయబద్ధములగు వాటిలో దారిద్ర్యముండవచ్చును వర్గములమధ్య వర్ణములమధ్య తరతమ భేదములుండ వచ్చును కాని వీటికన్నిటికి భగవంతుని కాని ప్రారబ్ధకర్మయో కారణమని కాని ప్రజలలో దృఢముగ నాటుకొని యుండుటచేత ప్రభుత్వము పట్ల వారికి ప్రత్యేకముగ అసంతృప్తి ఉండుటలేదు అందుచేత విప్లవములకు అవకాశముండదు అభివృద్ధిగాంచిన దేశములు సిరిసంపదలతో తులతూగుచుండుటచేత వివిధ వర్గముల వారు సుఖముగ జీవయాత్ర చేయగలవారుగనున్నారు వాటిలో అనేకములు ప్రజాస్వామికములగుట చేత ప్రజలు కోరు మార్పులన్నియు ఎన్నికల ద్వారా శాంతియుతముగ జరుగుటకవకాశమున్నది అందుచేత వాటి యందు విప్లవములకు అవసరము లేదు పురోగమనమును ప్రారంభించి దానిని పూర్తిగ సాధించలేని స్థితిలో నుండు రెండవ రకపు దేశములందే విప్లవమును కోరు ప్రజలు ఉండుటయు విప్లవము అవసరమగుటయు సంభవించుచున్నది సాధారణముగ సంధిదశయందుండు దేశములలోనే విప్లవ పరిస్థితులేర్పడుచుండును

17 వ శతాబ్దములోని ఇంగ్లండు 18వ శతాబ్దములోని అమెరికా ఫ్రాన్సులు 20 వ శతాబ్దములోని రష్యా, చైనాలు వలసవిధానముపై తిరుగుబాటు చేసిన భారత దేశము వంటి దేశములు- ఇవి అన్నియు సంధి దశయందుండినట్టివి ప్రాచీన సంప్రదాయములు సడలుటయు క్రొత్త సంప్రదాయములు పూర్తిగ నేర్పడకపోవుటయు వీటి లక్షణము వీటిలో క్రొత్తధనిక వర్గమొకటి రూపొంది పరిపాలనాధికారమును సంపాదించుటకు ప్రయత్నించుటయును అదివరకు అధికారముండినవారు వీరిని ప్రతిఘటించుటయు సహజము ఇట్టి ఘర్షణ విప్లవమునకు దారితీయును దేశము పురోగమించుచున్నను పురోగమనము త్వరితగతిని సాగుట లేదనియు దానికి ప్రభుత్వముయొక్క అలసత్వము కారణమనియు విమర్శించువారు ఈ దేశములందనేకులుందురు ఏ పురోగమనము కూడ నిరాటంకముగా సాగదు అప్పుడప్పుడు దానికి విఘాతములు కలుగుచుండును దూరదృష్టిలేని వారనేకులసంతృప్తులై ప్రతిఘాతములకు ప్రభుత్వము యొక్క అసమర్థత కారణమని చెప్పుచుందురు ఐశ్వర్యమెట్టిదో ఎరుగని వారికి అసంతృప్తి ఉండదు కాని ఐశ్వర్యమును కొంత వరకు రుచిచూచిన తర్వాత దానిని తాత్కాలికముగ కోల్పోయిన వారిలో అసంతృప్తి ఎక్కువ పురోగమించుచుండు దేశములలోని పరిస్థితి ఇట్టిది ప్రస్తుతకాలమున ఇట్టి దేశములలో విప్లవధోరణిగల రెండువర్గములవారు ప్రత్యేకముగ పెరుగుచున్నారు వారిలో ఒకరు కార్మికవర్గమువారు (proletariat) వీరు పట్టణములలోని ఫ్యాక్టరీలలో పని చేయువారు కుటుంబములకు కులములకు గ్రామీణ జీవితములకు సంబంధించిన ప్రాచీనకాలపు కట్టుబాట్లను పూర్తిగ త్రెంచుకొన్నవారు విప్లవధోరణిగల రెండవవర్గమువారు రాజకీయములే వృత్తిగాగల పొలిటీషియనులు ఆందోళనలను లేవదీయుటయు ప్రజలలో అసంతృప్తిని పెంచుటయు వీరి కార్యక్రమములో ప్రధానస్థానము వహించుచుండును ఈ రెండువర్గముల వారి ప్రభావముచే విప్లవ వాతావరణము సృష్టింపబడును ఫ్రాన్సులోను రష్యాలోను సంభవించిన విప్లవములలో కార్మిక వర్గపు ప్రభావము ఎక్కువగ నుండెను విప్లవములను లేవదీయు యందు మధ్యమవర్గమునకుగాని మేధావివర్గమునకుగాని చెందిన నాయకులు ప్రముఖపాత్రను వహించినను వారి అనుచరవర్గములో చాలభాగము కార్మికులుగ నుందురు

విప్లవములు సంభవించు దేశములందు మేధావుల వర్గములో అత్యధికభాగము ప్రభుత్వ విధానములను ఖండించువారుగనుందురు రచయితలలోను ఉపాధ్యాయులలోను మతప్రచారకులలోను ఇట్టి మనోభావము ప్రబలుట విప్లవసూచకముగ శాస్త్రవేత్తలనేకులు గ్రహించుచున్నారు ఫ్రెంచి విప్లవమునకు పూర్వము వాల్తేరు రూసో, డిడరో మొదలగు

మేధావులు ప్రభుత్వ విధానములను ఖండించిరి. రష్యాలో కూడ ఇట్లేజరిగెను. ఈ సందర్భములో ప్రస్తుత ప్రపంచములో కలిగిన గొప్ప మార్పు నొకదానిని గమనించవలసియున్నది. కారల్ మార్క్సు ప్రతిపాదించిన కమ్యూనిస్టు సిద్ధాంతమును ప్రచారము చేయు కమ్యూనిస్టు పార్టీలు ప్రతి దేశమందును ఏర్పడియున్నవి. ఇవి విప్లవ సిద్ధాంతము. విప్లవముల ద్వారా ప్రజాస్వామికములను ఇతర పరిపాలన వ్యవస్థలను పూర్తిగ నిర్మూలించి కమ్యూనిస్టు విధానమును స్థాపించినగాని ప్రజలకు విముక్తి లేదనుట ఈ సిద్ధాంతమునకు ప్రధానలక్షణము. అగ్రరాజ్యములగు సోవియట్ రష్యా, చైనాలలో ఈ సిద్ధాంతము ననుసరించి ఏర్పడిన ప్రభుత్వములు వివిధదేశములలోని కమ్యూనిస్టు ప్రచారకులకు అండగ నిలబడియున్నవి. ఇదివరలో బౌద్ధము, క్రైస్తవమతము, ఇస్లాముమతము మొదలగు మతములవారు వారివారి సిద్ధాంతములను ప్రచారముచేసి వివిధ దేశములలోని రాజకీయ సాంఘికపరిస్థితులను మార్చినట్లు ప్రస్తుత కాలమున కమ్యూనిస్టులు వారి ప్రచారముద్వారా విప్లవ వాతావరణమును సృష్టించుచున్నారు.

ప్రభుత్వములయొక్క అసమర్థతయు సంకుచిత దృష్టియు విప్లవమునకు దారితీయును. ఫ్రాన్సు మొదలగు దేశములలో సంభవించిన విప్లవములు దీనిని రుజువు చేయుచున్నవి. నూతనవర్గములవారు కోరు సంస్కరణములను సకాలములో ప్రవేశపెట్టకపోవుట, ఉత్పన్నములగు సమస్యలను వెంటవెంటనే పరిష్కరించక కార్యభారమును పెంచుకొనుట, పురోగమన కారణమున ప్రజల ఆదాయము పెరుగుచున్నను సౌష్ఠవముగ పరిపాలనమును సాగించుటకు కావలసిన ద్రవ్యమును ఎక్కువ పన్నులను విధించి వసూలుచేయుటకు సందేహించుట, విమర్శకుల అభిప్రాయములను ఖండించుటకు అవసరమైన ప్రచారమును సాగించలేకపోవుట, చిన్నచిన్న తిరుగుబాటుల నణచుటకు కావలసిన చర్యలను తీసికొనలేకపోవుట - ఇవియన్నియు అసమర్థతకు నిదర్శనములు. ప్రభుత్వవర్గమునకు చెందినవారు ఆత్మవిశ్వాసమును కోల్పోయియు నిస్సహాయులుగ ప్రవర్తించుటయు విప్లవపరిస్థితులకు లక్షణము. పట్టుగల ప్రభుత్వములు విప్లవములను లేవదీయ ప్రయత్నించువారిని ఎప్పటికప్పుడు అణచివేయగలవు. కనుకనే అట్టి ప్రభుత్వములు లేకపోవుట వలననే విప్లవములు సంభవించును.

సాధారణముగ విప్లవములన్నియు ఒకరీతిగా సాగుచుండునట్లు చెప్పవచ్చును. ప్రథమదశయందు విప్లవకారులలో మితవాదులు నాయకత్వము వహించి ప్రధానములగు మార్పులను మార్గము చేయుటయు, రెండవదశలో అతివాదులు నాయకులై విపరీతములగు మార్పులను ప్రవేశపెట్టి అనుమానాస్పదులగు వారిపట్ల అమానుషముగ ప్రవర్తించి హింసాకాండలోనికి దిగి రక్తప్రవాహములు పారించుటయు, మూడవదశలో అతివాదుల ప్రాబల్యము తగ్గి సాధారణ పరిస్థితులు కొంతవరకు ఏర్పడుటయు, నాల్గవదశలో సైనికసాధకుడగు నియంత ఒకడు అధికారమును తనహస్తగతము చేసికొనుటయు, అయిదవదశలో అతడు ప్రధానములగు మార్పులను స్థిరపరచి తక్కినవాటిని రద్దుచేసి విప్లవమునకు పూర్వమునందున్న పరిస్థితులలో అనేకములను పునరుద్ధరించుటయు ఈ దశలు యూరపుఖండములో సంభవించిన విప్లవములలో కనిపించుచున్నవి. భూలోకస్వర్గమును సృష్టించుటకు విప్లవకారులు తలపెట్టెదరు. కాని ఇది మానవమాత్రులకు సాధ్యమగునట్టిది కాదు. విప్లవములను లేవదీయవచ్చును. కాని ఉద్దేశించిన మార్పులనన్నిటిని ప్రవేశపెట్టగలశక్తి ఏ విప్లవమునకును లేదు. మితిమీరిన దౌర్జన్యమునకు తగిన ప్రతిఫలము విప్లవము సంపాదింపజాలదు.

పాశ్చాత్య ప్రపంచమునందు సంభవించిన విప్లవములలో ఫ్రెంచి విప్లవము, రష్యావిప్లవము ప్రపంచవ్యాపకమగు ప్రభావము కలవి. వాటిమూలమున ఇతరదేశములందు కూడ విప్లవములు సంభవించెను. అవి తలపెట్టిన ఆశయములు ఆ దేశములన్నిటిలో గొప్పమార్పులు సంభవించుటకు కారణభూతములయ్యెను. ఫ్రెంచి విప్లవములో లేని ప్రత్యేకత ఒకటి రష్యావిప్లవములో ఉండుటను గుర్తించుట అవసరము. ఫ్రెంచి విప్లవము సాంఘిక వ్యవస్థయందు గొప్పమార్పులను ప్రవేశపెట్టలేదు. కాని సమాజమును సంతను పూర్తిగ మార్చు ఉద్దేశముతో రష్యా విప్లవము సాగింపబడినది. రష్యాలోని రాజకీయ వ్యవస్థయేకాక ఆర్థిక సాంఘికవ్యవస్థలు కూడ దీనిమూలమున మారినవి. దీనిని ఆధారము చేసికొని శాస్త్రవేత్తలు విప్లవములను పరిమితమగు విప్లవములు - పరిమితిహీనములగు విప్లవములు అని రెండు రకములుగ వర్గీకరణము గావించియున్నారు.

ఖా. వెం.

## వియత్నాం

ఆగ్నేయ ఆసియాలో ఇండోచైనా అని పిలువబడు భూభాగమందలి మూడురాజ్యములలో వియత్నాం అను చిన్నదేశ మొకటి. తక్కిన రెండు దేశములు లావోస్ కాంబోడియా అనునవి. నేడు అమెరికా దురాక్రమణకు గురియైన వియత్నాం వైశాల్యము అమెరికాసంయుక్తరాష్ట్రముల మొత్తము విస్తీర్ణములో 28వ భాగము. జనసంఖ్య అమెరికాలో ఆఱవ వంతు. అమెరికాకు 9000 మైళ్ల దూరముననున్న దేశమిది. సాధారణమైన అమెరికాపౌరుడు ఒక వారములో సంపాదించు ఆదాయముతో వియత్నాంపౌరుని సాంవత్సరికాదాయము సమానమన్నచో ఈ దేశపు ఆర్థిక స్థితి వేరుగ చెప్పనక్కరలేదు. అమెరికా పౌరుని సగటు జీవితకాలము 70 సంవత్సరములు కాగా వియత్నాం పౌరుని జీవితకాలము దానిలో సగము మాత్రమే. ఆధునిక సాంకేతిక విజ్ఞాన పారిశ్రామిక ప్రమాణములలో అమెరికాతో పోల్చిచో వియత్నాం కొన్ని వందల సంవత్సరములు వెనుకబడియున్నదనవచ్చును.

ఈ దేశమున బౌద్ధులు, క్యాథలిక్కులు విశేషముగ నున్నారు. ఆదిమజాతులకు చెందిన పలుతెగలవారు పర్వత ప్రాంతములందు వసించుచున్నారు. వీరుకాక చైనీయులు కాంబోడియనులు థాయ్ దేశీయులు చాలకాలముగ ఇచ్చట స్థిరనివాసులై జీవించుచున్నారు. పూర్వమీ దేశమును చైనా రాజవంశీయులు సుమారు వెయ్యి సంవత్సరములు పాలించిరి. అనంతరము ఫ్రెంచివారు ఎనుబదేళ్లు రాజ్యమేలినారు. అత్యధికులైన ఇండోచైనా ప్రజలు మాటాడునవి ఏనామ్, కాంబోడియా వియత్నాం ఫ్రెంచి భాషలు.

మాటికి తొంబదిమంది వ్యవసాయముపై జీవించెదరు. ఎంత శ్రమకైనను ఓర్చుకొని చేయగల్గుటచే వారి శరీరములు దృఢముగను ఆరోగ్యముగనుండును. అంగసౌష్ఠవమునందును ముఖవర్చస్సు తీరునందును వియత్నామీయులు ప్రపంచమందలి అందమైన జాతులలో ఒకరుగా మానవశాస్త్రవేత్తలు అభిప్రాయపడినారు. మనః ప్రవృత్తియందువారు సాత్త్వికులు కోమలహృదయులు. కవ్వించిచో వారు రౌద్రాకారము వహించి పగబట్టి సాధింపగలరు. మర్లులు తూరి వ్యవసాయ విధానము ఈనాటిది అతి పురాతనమైనది. దీర్ఘకాలికమైన పరపాలన కారణముగా, సాంకేతిక పారిశ్రామిక రంగములందు వెనుకబడియుండుటచే ప్రజలు భూమాతనే నమ్ముకొని వ్యవసాయమే ప్రధాన జీవనాధారముగ గల్గియున్నారు.

దేశము చిన్నదైనను తాము నిరుపేదలైనను వియత్నామీయులు క్రీస్తుపూర్వమునాటి తమ సంస్కృతిసంప్రదాయములను స్మరించుకొని గర్వించుచుందురు. పరంపరగా వచ్చిపడిన దండయాత్రలు పరపాలనపీడనము వారిని ఘోర స్వాతంత్ర్య పిపాసువులుగ తీర్చిదిద్దినవి. వివిధజాతులకు విభిన్నమతములకు చెందినవారైనను ఇండోచైనీయులు భిన్నత్వములో ఏకత్వమును సాధించి తమ స్వాతంత్ర్యమును సంరక్షించుకొనుటకై సమైక్యమొంది అసమానమైన త్యాగనిరతితో అనూహ్యమైన కష్టపరంపరలనెదుర్కొన జాలియున్నారు.

చిత్రము - 71




పటము - 1

పెక్కు ఇతర ఆసియాదేశములవలెనే వియత్నాం కూడ పాశ్చాత్య పారిశ్రామిక విప్లవ దుష్ప్రభావమునకు గురియైనది. పారిశ్రామికముగా ప్రగతిని సాధించిన ఫ్రెంచి ప్రభుత్వము క్రీ శ 1834లో ఇండోచైనాను ఆక్రమించి తమ

దుష్పరిపాలనముద్వారా దేశమును కొల్లగొట్టసాగిరి ఫలితముగా ప్రజలు మరింత నిరుపేదలై వారి కుటుంబజీవనము జాతీయ సాంస్కృతిక జీవనము విచ్ఛిన్నము కాజొచ్చెను ఫ్రెంచి వలసపాలనములో రైతు విప్లవములు నిరంతరము ఘటిల్లగా ఆ దేశములో తాము విరివిగా నిర్మించిన కారాగారములలో ఫ్రెంచి అధికారులు వేలాది దేశభక్తులను బంధించి తిరుగుబాటులను క్రూరముగ అణచివేయుచు వచ్చిరి ప్రజలకు వైద్య విద్యాసౌకర్యములుగాని కనీస జీవనోపాధి వసతులుగాని ఫ్రెంచివారు కల్పింప నిరాకరించిరి

ఇట్లుండ రెండవ ప్రపంచయుద్ధ సందర్భమున జపాను సైన్యములు ఇండోచైనాపై దాడిసల్పినవి జర్మను నాజీ నాయకుల పలుకుబడి క్రిందనుండిన ఫ్రెంచి "విషీ" ప్రభుత్వ దేశమునమసరించి వియత్నాంలో తిష్ఠవేసిన ఫ్రెంచి సైన్యములు జపాను దండయాత్రను ప్రతిఘటించలేదు జపాను పక్షమున ఫ్రెంచి అధికారులే ఇండోచైనాను పాలింపసాగిరి రెండవ ప్రపంచ యుద్ధములో తమకు ఘటిల్లిన ఓటమికి పూర్వమే (1945) వియత్నాం ప్రజలకు పరమ శత్రువైన బావోడాయ్ అను కౌశ ధనిక వియత్నాంరాజకీయవాదిని జపానువారు "సార్వభౌమాధిపతి" గా నిల్పి పాలింపసాగిరి జపానుపరాజయానంతరము వియత్నమీయులు స్వాతంత్ర్యము ప్రకటించుకొనగా బావోడాయ్ తన పదవికి రాజీనామా చేయవలసివచ్చినది

రెండవ ప్రపంచయుద్ధము ముగిసిన పిమ్మట అమెరికా సహాయముతో ఫ్రెంచివారు తిరిగి తమ పెత్తనమును వియత్నాంపై స్థాపింపయత్నించి ఆదేశముపై దాడిసల్పి బావోడాయినే రాజ్యాధినేతగా నియమించిరి వియత్నమీయులీ దురాక్రమణము సహింపక తమ నూతన స్వాతంత్ర్యమును సంరక్షించుకొనుటకై ఆయుధములు చేపట్టి ఫ్రెంచిసైన్యములతో హోరాహోరి పోరాడసాగిరి వియత్నామును లొంగదీయ పంపిన ఫ్రెంచిసైన్యములే 1954 లో చరిత్రాత్మకమైన డీన్‌బీన్‌ఫూ అను తావున వియత్నాం జాతీయసైన్యములచే చక్రబంధమొనర్పబడి నిర్మూలింపబడి మిగిలియున్న ఫ్రెంచి సైన్యములు వియత్నమీయులకు శరణుజొచ్చినవి ఈ ఘోర పరాజయముతో ఆగ్నేయాసియాయందు ఫ్రెంచివారి పలుకుబడి అణగారి పోయినది

వెంటనే అమెరికాతోసహా తొమ్మిది రాజ్యముల ప్రతినిధులతో కూడిన ఒక మహాసభ ఇండోచైనా సమస్యను పరిష్కరించుటకై జినీవాలో సమావేశమైనది ఆ మైత్రి వియత్నాం దేశమునకు సంపూర్ణ స్వాతంత్ర్యమివ్వవలెను తాత్కాలికముగా వియత్నామును ఉత్తర దక్షిణ మండలములుగా విభజించుటకును అంతర్జాతీయ సంఘపర్యవేక్షణ క్రింద 1956 లో వియత్నాంలో ఎన్నికలు జరుపుటకును ఎన్నికలు జరుగు వరకు రెండు మండలములలోని పై మహాసభలో పాల్గొన్న రాజ్యముల సైన్యములు ప్రవేశింపకుండుటను మహాసభలో అంగీకారము కుదిరినది అమెరికా ప్రభుత్వప్రతినిధులు అంగీకరించకున్నను, తాను దౌర్జన్యమును ప్రయోగించి వియత్నాంలో శాంతిభద్రతలను భంగముచేయనని వాగ్దానమొసగినది

ఆట్టిస్థితిలో పూర్వము ఫ్రెంచిపాలనము క్రింద వ్యవహరించిన అధికారియు వియత్నాం ధనిక వర్గీయుడును నైన డియమ్ అమెరికా ప్రభుత్వమునకు నమ్మినబంటై వారిచే వియత్నాం రాజ్యాధినేతగా నియుక్తుడై నాడు ఆనాటి నుండి అమెరికా తన అధికార సైనిక ధనప్రాబల్యములను డియమ్‌ను అతని వర్గీయులను పదవులలో నిలబెట్టుటకై పణముగా పెట్టినది డియమ్ పాలనక్రింద ప్రజల ఇక్కట్లు తీవ్రతరమయ్యెను అతని నిరంకుశ చర్యలకు అవధులు లేకుండెను కటిదారిద్ర్యము అవినీతి లంచగొండితనము, నిరుద్యోగము చీకటిబజారు విలయతాండవ మొనర్చెను తన నిరంకుశమును ప్రతిఘటించిన ప్రజను డియమ్ అమెరికా సహాయముతో క్రూరముగ అణచివేయసాగెను కారాగృహ నిర్బంధములు చిత్రహింసలు ఉరితీతలు కాల్చివేతలు దైనందిన సంఘటనలుగా పరిణమించెను డియమ్ క్రూరకృత్యములను భరింపజాలని పెక్కురు బౌద్ధులు ఆత్మార్పణము గావించుకొనిరి డియమ్ ప్రభుత్వవ్యయములో 75 శాతము అమెరికా భరించవలసిన పరిస్థితి ఏర్పడెను అట్లైనను అతని పరిపాలన యొక్క దివాలాకోరుతనము బోధపడగలదు ప్రజల ఆగ్రహమునకును డియమ్ ప్రభుత్వమునకును నడుమ అమెరికా ఆయుధశక్తి ఒక్కటిమాత్రమే అడ్డుతెరగా నిల్చియున్నది ఎనిమిది వత్సరముల రాక్షసపాలన తరువాత డియమ్ ప్రజాశత్రువని తెలిసికొనిన అమెరికా ప్రభుత్వము తాను చేయుచు వచ్చిన సహాయమును ఉపసంహరించుకొనక తప్పలేదు డియమ్ తరువాతిపాలకులు కూడ అతని అడుగుజాడలలో నడచినవారేగాని, ప్రజల సమస్యల నొక్కటియైనను పరిష్కరిం

చినవారు కారు

అమెరికా-డియమ్ సంయుక్తపాలనమును ప్రతిఘటించుటకై 1960లో వియత్నామునందు జాతీయ విమోచన సమితి ఏర్పడి ప్రజల అండదండలతో శత్రువుతో పోరాడి గ్రామీణప్రాంతమున మూడింట ఎనుబది శాతముపై శాతభాగములో తమ ఆధిపత్యమును స్థాపించుకొనగలిగెను. వియత్కాంగ్ అను విమోచన సైనికదళము నిర్మింపబడి స్వల్పకాలములో అమోఘముగా బలపడెను. ఈ విమోచన సైన్యములో ఒక భాగమైన స్త్రీ దళముకూడ నానాటి వృద్ధియై పురుషులతోపాటు సమానధైర్య త్యాగ పరాక్రమములతో పోరాడసాగినది. ఈ విమోచనసమితి ఆధిపత్యము విస్తరించిన గ్రామప్రాంతములో ధనిక భూస్వాముల అదనపు భూములను బంజరు నేలలను పేదరైతులకు పంచియిచ్చినది. పాఠశాలలను నిర్మించినది. వైద్యసౌకర్యముల నేర్పరచినది. విశాల ప్రాతిపదికపై నిర్మింపబడిన ఈ విమోచన సమితిలో బౌద్ధులు క్యాథలిక్కులు మధ్యతరగతి వ్యాపారులు కమ్యూనిస్టులు సోషలిస్టులు మితవాద మేధావులు రైతు ప్రతినిధులు పర్వత ప్రాంతీయులు సభ్యులైనారు. ఈ సమితి ప్రకటించిన దశ సూత్రప్రణాళిక సకల ప్రజలయొక్క సంపూర్ణ సహకారమును చూరగొన్నది. ఉత్తర దక్షిణవియత్నాం మండలముల తక్షణ పునరైక్యము ఈ ప్రణాళికలోని ముఖ్యాంశములలో నొకటి.

ఆరంభములో జాతీయ విమోచన గెరిల్లా దళములు పురాతన ఆయుధములతోనే శత్రువును ప్రతిఘటింపవలసి వచ్చినది. అనతికాలములో తాము శత్రుసైన్యములనుండి వశపరచుకొన్న అమెరికా ఆయుధములతో పోరాడసాగినవి. సలహాదారులుగా నటించుచున్న అమెరికా అధికారులు క్రమముగా వియత్నాముకు విశేషసంఖ్యలో సైన్యములను దింపుచునేయుండిరి. దక్షిణవియత్నాంలో నిరంతర రాజకీయ సంక్షోభము దేశభక్తశక్తులకు ప్రభుత్వసైనికుల లొంగుబాటు ప్రజల నిరాశానిస్పృహలు ఆకలి హాహాకారాలు డీమ్ పతనానంతరము ఉచ్చస్థాయి నందుకొనగా దిగజారుతున్న పరిస్థితిని మెరుగుపరచుటకై 1963 లో విశేష సంఖ్యలో అమెరికా సైన్యములు వియత్నాంపై ప్రత్యక్షముగా దండయాత్రచేసినవి.

ఆగ్నేయాసియాపైన వీలైనచో ఆసియాఖండమంతటిపైన తన వలసాధిపత్యమును నెలకొల్పుటయే అమెరికా రాజకీయ సైనిక వ్యూహమని అంతర్జాతీయ రాజకీయ పరిశీలకులభిప్రాయపడినారు. ఈ వ్యూహమును పురస్కరించుకొనియే అమెరికా ఆసియాఖండమునందే కాక ఇతర ఖండములందుకూడ కీలకస్థానములందు తన సైనికస్థావరములను నెలకొల్పియున్నది. అధ్యక్షుడు ఐసెన్ హోవర్ హయాములో వియత్నాంపై అమెరికా చాటుమాటుగ ఆరంభించిన దండయాత్ర అతని అనంతరము కెన్నెడి జాన్సన్ల పాలనములో తీవ్రతరమై తుదకు నిక్సన్ కాలములో తీవ్రతమమైనది.

తన ఆధునాతన మారణాయుధములతో అసంఖ్యాక సైనిక ధనబలముతో సైతము అమెరికా వియత్నాం ప్రజలపై ఈషన్మాత్రము విజయము సాధించలేకపోగా నిత్యము తన సైనికులను అధికసంఖ్యలో యుద్ధభూమికి బలియిచ్చుచున్నది. తన మారణవిషవాయు పరీక్షలకును ఆయుధ పాటవ పరీక్షలకును దక్షిణవియత్నాము ప్రయోగశాలగా అమెరికా మార్చివేసినది. ప్రయోగించిన విషవాయువుల ఫలితముగా పంటభూములు పాడైనవి గ్రామములు ధ్వంసమైనవి నదీనదములు సరోవరములు బావులు కలుషితములైనవి. వేలాదిగా ప్రజలు మరణముపాలైనారు. లక్షలాదిగ బిడ్డలు స్త్రీలు ముదుసలులు వికలాంగులైనారు. దేశమంతయు పీనుగుపెంటయైనదన్నచో అత్యుక్తి కాజాలదు. ప్రభుత్వము జరిపించిన చిత్రహింసల ఫలితముగా పట్టబడిన గెరిల్లాసైనికులు అమాయక ప్రజలు కొందరు వికలాంగులు కాగా మరికొందరు దుర్మరణముపాలైనారు. గెరిల్లాసైనికులను గాలించుటకై వారు తలదాచుకొనిన రహస్యస్థావరములు నిర్మూలింపబడినవి. అరణ్యములు నాశనమొనర్పబడినవి. గెరిల్లాల పోరాట స్థైర్యమును ప్రజల నైతిక నిబ్బరమును ధ్వంసము చేయుటకై అమెరికా ప్రయోగించిన దమననీతి, దారుణ హింసాకాండ మానవచరిత్రలో కనివిని ఎరుగనిదని లోకము తల్లడిల్లినది. మానవ నాగరికతకే ఇది మాయని మచ్చగా రష్యా అమెరికా బ్రిటను ఫ్రాన్సు మున్నగు పెక్కుదేశములకు చెందిన రాజనీతివేత్తలు మానవతావాదులైన తత్త్వవేత్తలు వర్ణించియున్నారు.

అయినను ఈ యమానుషకృత్యములకు ఎదురొడ్డి ప్రపంచము విస్మయమొందునట్లు వియత్నాం ప్రజలెట్లు అమెరికా దురాక్రమణను ప్రతిఘటింపగల్గిరో ఊహింపజాలము. ఆశా

వృద్ధులవరకు సకలవర్గములవారు శత్రువును ప్రతిఘటించుచునే తమ త్యాగనిరతను కెట్లుగడచిరో ఎట్లు భరించిరో ఎట్లు నిద్రించిరో ఊహించలేము వియత్నాము వీరాధివీరులు జనించిన వీర మార్గమునొంది విజయము సాధింపగలిగిన పోరు ఉద్ధగా చరిత్ర ప్రసిద్ధిగాన్నది వియత్నాం పోరాటవీరగాథ ప్రపంచ చరిత్రలో మరి మన్నాటికి సువర్ణాక్షరములతో లిఖించదగినది

జాతీయ విమోచన సమితి ప్రకటించిన అంచనా ప్రకారము 1965 నాటికే దక్షిణ వియత్నాములో మృతుల సంఖ్య ఒకలక్ష 70 వేలు గాయపడినవారి సంఖ్య 3 లక్షలు ఈనాటికి సంఖ్య ఎంతవరకు పెరిగియుండునో ఊహించుకొనవచ్చును

నానాటి నిరాశాపూరితులైన ప్రభుత్వసైనికులు పలాయితులై విమోచన సైన్యములో చేరిపోవుటతో 1965 నాటికి దక్షిణ వియత్నాం ప్రభుత్వ శక్తి పూర్తిగా దిగజారినది సర్వ విధముల విమోచన సైన్యముల పోరాటపాటవము ఆయుధ సంపత్తి వ్యూహరచనాదక్షత అత్యుత్తమ స్థాయి నందు కొన్నవి శత్రువుపై సంపూర్ణ విజయసాధనకు అవకాశము ఏర్పడినది అమెరికా ప్రభుత్వమునకు రాజకీయముగను సైనికముగను చోరగా జారిపోయినది ప్రపంచ రాజ్యముల దృష్టిలో దాని పరువు ప్రతిష్ఠలు అపాయము పాలైనవి విజయము సమీపములోనే కన్పించుటలేదు అణుశాంబు మినహా ఇతర మారణాయుధములను ప్రయోగించి చూచినది అయినను తుది ఆశ అమెరికాను పట్టుకొని పీడించుచునే యున్నది యుద్ధమును విస్తృతపరచినగాని విజయము లభింపదని నిశ్చయించి దక్షిణ వియత్నాం విమోచన సైన్యములకు ఉత్తరవియత్నాంనుండి అందుచున్న సరఫరాలను అరికట్టుటకై 1965 మార్చిలో అమెరికా ఉత్తర వియత్నాంమీద ప్రచండమైన దాడి ప్రారంభించినది రెండుసంవత్సరములు పైగా నిరంతర విమాన దాడులకు గురియై తమ పంటభూములకు గృహములకు పజలకు ఘోరనష్టము సంప్రాప్తించినను ఉత్తరవియత్నాం ప్రజలు తమనాయకమణియైన హోచిమిన్ నేతృత్వమున వానిని సహనముతో భరించుచు ఒక్కత్రాటిమీద సమైక్యమై శత్రువును ప్రతిఘటించిరి నిర్విరామముగా సాగుచుండిన శత్రు విమానదాడుల నడుమగూడ ప్రజాజీవనము ప్రశాంతముగ సాగుచునే యుండెను వజ్రతుల్యమైన వారి సంకల్పబలము సహనశీలము, త్యాగనిరతి అనుపమానమని ప్రపంచము ప్రశం సించినది అనాటికానాడు విమానదాడులధికమైన కొలదియు ఒకవంక ప్రజల పట్టుదల మెక్కువై విమానముల కూల్పివేత అధికమగుటయు దక్షిణవియత్నాం విమోచన సైన్యములకు సరఫరాలు యథావిధిగాసాగుటయు మరొక వంక ప్రపంచాభిప్రాయము తమకెదురగుటయు అందుకు వెరచి అమెరికా ప్రభుత్వము ఉత్తరవియత్నాముపై దాడులను ఏదియో సాకుపై విరమించుకొనవలసి వచ్చుటయు తప్పనిసరియైనది

ఉత్తరవియత్నామును గూడ లొంగదీయజాలని అమెరికా ప్రభుత్వ మిప్పుడు తన ఆగ్రహమును దక్షిణవియత్నాం విమోచనసైన్యముపై కేంద్రీకరించి అచ్చటి ప్రజలపై అత్యాచారములను ఊహింపజాలనంతగా తీవ్రము మొనర్చినది అయినను వాటిని నిబ్బరముతో భరించి వారుచేసిన ప్రతిఘటనము ప్రపంచమును ఆశ్చర్యచకితులను గావించినది సైగాన్ ప్రభుత్వమువట్ల అమెరికా దురాక్రమణపట్ల ప్రజల వైరుధ్యము విమోచన సైన్యముల విజయపరంపర విమోచన సైన్యములో సైగాన్ ప్రభుత్వసైనికులు చేరిక విశేషసంఖ్యలో అమెరికను సైనికుల మరణించగా జీవించియున్నవారిలో కలిగిన నిస్తేజములు దురాక్రమణ యుద్ధకారణముగా ప్రభుత్వబొక్కసములో లోటు తత్ఫలితముగా అమెరికాలో తలయెత్తిన ఆర్థికసంక్షోభము ప్రపంచము దృష్టిలో అమెరికాకు కలిగిన అపఖ్యాతి — ఇవన్నియు కలిసి అమెరికా ప్రజకు కనువిప్పు కలిగించినవి తమపూర్వులు స్వాతంత్ర్య పోరాటసందర్భమున గావించిన త్యాగములు ప్రదర్శించిన వీరోచిత పరాక్రమములను అమెరికా ప్రజలు స్మరించుకొని తమ పూర్వులార్జించి ఇచ్చిన సద్వారసత్వమును సత్సంప్రదాయమును ఈనాటి తమప్రభుత్వము కళంకపరచినదని బాధపడ జొచ్చిరి దురాక్రమణను తక్షణమే తుదముట్టించి తమ సైనికులను తమ మధ్యకు వెంటనే పిలిపించుమని సకలవర్గములకు, సకల రాజకీయపక్షములకు సకలమతసంస్థలకు చెందిన అమెరికనులు విద్యార్థి బృందములు అమెరికను సైనికుల తల్లిదండ్రులు పత్రికా విలేఖరుల ద్వారమును సభలద్వారమునను సత్యాగ్రహముల ద్వారమునను నిక్సన్ ప్రభుత్వముపై తీవ్రమైన ఆందోళన మొనర్చిరి

చిత్రము - 72

పటము 2

చేయగలిగిన వినాశము చేసియు విజయము సాధింప జాలని అమెరికా ప్రభుత్వము ఒకప్రక్క వియత్నాం వీరులు సాధించిన విజయములకు చెవరియు వేరొకప్రక్క ప్రపంచాభిప్రాయమునకు వెరచియు అన్నిటికంటె మిన్నగా తన ప్రజల వ్యతిరేకతకు లొంగియు అమెరికా ప్రభుత్వము తన 5 లక్షల సైనికులను దక్షిణ వియత్నాంనుండి దశలవారిగా స్వదేశమునకు మరల్పవలసిన స్థితి ఏర్పడినది

అయినను అమెరికాకు సామ్రాజ్య కాంక్షచల్లారలేదు అవకాశముకొరకు ఎదురు చూచుచున్న అమెరికా ప్రభుత్వము కాంబోడియాలో ఇటీవల ఘటిల్లిన రాజకీయపరిణామములను పురస్కరించుకొని అచ్చటి మాతన ప్రజాప్రతికూల ప్రభుత్వమునకు అండగా తన సైన్యములను తన ధనమును సరఫరా చేయుచు అచ్చటి ప్రజాజీవితమును కూడ కలుషిత మొనర్ప సమకట్టినది

దక్షిణవియత్నాం ప్రజల ప్రాతినిధ్యముతో నిర్మింపబడిన విమోచన మితిచే నూతనముగా ఏర్పాటుపఱచిన తాత్కాలిక విప్లవప్రభుత్వము ఇతర రాజ్యముల యొక్కయు సోషలిస్టు రాజ్యముల యొక్కయు, ప్రపంచదేశము అందలి ప్రజాతంత్ర వాదుల యొక్కయు మన్ననలను పొంది తన ఏలుబడిలో నున్న విశాల భూభాగములో దశసూత్రప్రణాళిక ననుసరించి ప్రజారంజకముగా పాలనమును నెరపుచు తమ ఉత్తర దక్షిణ దళముల పునస్సమైక్యము కొరకు నిర్విరామముగ కృషి చేయుచున్నది. కాగా అమెరికా ప్రభుత్వ దయాదాక్షిణ్యము పైననే ఆధారపడుచు ప్రజలకు దూరమైన దక్షిణ వియత్నాం ప్రభుత్వము తన రాజధానియగు సైగాన్ నగరమును తత్పరిసరములను మాత్రము అంటిపెట్టుకొని అగ్నిపర్వతముపై కులకము రీతిగా దినములు వెళ్ళబుచ్చుచున్నది. ఈ వ్యాసము వ్రాయునాటి కూడ జాతీయ విమోచన సైన్యము అకస్మ సైగాన్ ప్రభుత్వమునకును నడుమ యుద్ధము చెలరేగుచునే యున్నది

వ్ర రా మ

## విలియమ్ జోన్స్ (1746_1794)

మంచి నముకకును మర్యాదకును సంస్కృతికిని సంపత్తునకును పేరొందిన ఒక సత్కుటుంబమునందు విలియమ్ జోన్స్ అను నాతడు లండనునగరములో 1746 సెప్టెంబరు 28 వ తేదీన జననమందెను ఇతడు హారో ఆక్స్ఫర్డు విశ్వవిద్యాలయములందు విద్యను సముపార్జించెను 1765 నుండి 1770 వరకు ఈ ప్రముఖ విద్యావేత్త స్పెన్సరు సంస్థానపతి కుమారుడగు లార్డ్ ఆల్ త్రోప్ నకు శిక్షకుడుగ వ్యవహరించెను విద్యార్థిదశనుండియు ఇతడుగాఢమైన ప్రాచ్యభాషాభిమాని 1770 లో పారశీకభాషనుండి నాదర్ షా జీవితమును ఫ్రెంచి భాషలోనికి అనువదించెను 1771 లో పారశీక వ్యాకరణమును గూడ రచించెను 1774 లో ఈ విద్వాంసుడు న్యాయవాది పట్టమును పొందెను 1780 లో న్యాయశాస్త్ర విషయములను గూర్చి పెక్కు వ్యాసములను మౌలాభక్ అనుపేరుతో అ ట్వి పద్యసప్తకము'నకు తర్జుమాయును వెలువరించెను

విజ్ఞాన పీఠమునదగు భారత దేశములో నివసింపవలెనని ఇతడు తహతహలాడి తుదకు సర్ బిరుదముతో 1783లో బెంగాలు సుప్రీంకోర్టు అను న్యాయసభకు న్యాయాధిపతియయ్యెను భారతదేశమున అతడు గడిపిన నియమ జీవితమును భారతీయులలో ఎందరు పాటిం తురనునది వివాదగ్రస్తమగు విషయము ఒకవంక ఉద్యోగధర్మమును నిర్వహించుచునే మరియొకవంక సంస్కృతమున రెండేండ్లలో మహాపండితుడై పండితులతో సహితము అనర్గళముగ సంస్కృత భాషయందు

చర్చింపగల్గిన ప్రతిభాశాలి ఇతడు. అభిజ్ఞాన శాకుంతలము మనుస్మృతి వేదసంగ్రహితము లగు ఖండికలు పద్యములు గాథలు విభిన్న భారతీయభాషలలోగల న్యాయసూత్రములు ఈయన ఆంగ్లములో అనువదించినాడు. ప్రాచీనభారతీయుల కళలు శాస్త్రములు ఆచార వ్యవహారములు గాథాచరిత్రములు మున్నగాగల విజ్ఞాన సముద్రమును మథనము పట్టిన అగస్త్యుడనదగినవాడితడు. అదేకాదు వృక్షశాస్త్రవికాసమునకు భారతదేశమునందుగల అనేక జాతుల నితడు సూచించెను. జ్యోతిశ్శాస్త్రమునకు చిహ్నలను సూచించుచు ఇతడు రెండు గ్రంథవ్యాసములను ప్రచురించినాడు.

1784 లో ఏషియాటిక్ సొసైటీని కలకత్తా నగరమున నెలకొల్పి ప్రాచీన భారతీయ ప్రతిభావ్యుత్పత్తులగూర్చి శాస్త్రీయ పద్ధతిగల అధ్యయనోపన్యాసములను పదకొండు సంపుటములుగా ప్రకటింపజేసెను. ఎన్నికగన్న ముప్పదిభాషలలో ఇతడు ప్రవేశమున్న ఘనతని నిరూపించుకొనగలిగెను. "నిర్మాణ సౌష్ఠవమున గ్రీకుభాషకంటె పద ప్రసారమున లాటిన్‌భాషకంటె విశుద్ధతయందు ఈ రెండు భాషలను మించినభాష దేవవాణియగు సంస్కృతము" అని ఈ మహనీయుడు వ్రాసెను. "నేను హిందువుడను కాను కాని పరమునందు దుర్గతి నరకయాతనలను అనుభవింపవలసియుండు'నని ప్రబోధించుచు పాపమునుండి మానవుని వారింపనెంచు క్రైస్తవుల అభిప్రాయమునకంటె పాతకిని పవిత్రునిగను వివేకిగను మార్పొందించు హైందవసిద్ధాంతమును నేను అవలంబనముగ గొందును" అని ఉద్ఘాటించిన వైమనస్య విహీనుడైన వివేక చూడామణి విలియమ్‌జోన్సు. ఈ మహోన్నతుడు 1794 ఏప్రిల్ 27 వ తేదీన కలకత్తానగరమున తన భౌతికకాయమును విసర్జించి దేవవాణి ప్రౌఢిమ నాకాంక్షించుచు దివిజధామమున కేగెను.

హ. ష.

## విలియమ్ వర్డ్స్‌వర్త్ : క్రీ. శ. 1770-1850

మానవజాతిని తన సహజలక్షణముచే పులకింపజేయు ప్రకృతి ఆంగ్లకవితను గూడ సుమారు ఐదు శతాబ్దుల నుండి పులకితమొనర్చి పునీతము చేయుచున్నది. మహాకవులగు ఛాసర్ షేక్స్‌పియర్ మిల్టన్ ప్రభృతుల కవనము అంతకంటె తక్కువ శ్రేణికిచెందిన హెర్రిక్ మార్వెల్ ఇత్యాదుల వంటి వారి కవనము ప్రకృతి కల్గించు ఆనందమును బోలు ఉత్తేజమును కల్గించి సమ్మోహితులను గావించుచున్నది. కాని డ్రైడన్ పోప్‌ల రచనలయందలి కవితావస్తువు నగరవాతావరణ సంబంధమైయుండుటచే అందు ప్రకృతిశోభ కల్గించు ఆహ్లాదప్రవంతి అదృశ్యమై తిరిగి గ్రే కౌపర్‌ముల్లగువారి కవనములలో ప్రత్యక్షమగును. అయితే ప్రప్రథమముగ ఆంగ్ల వాఙ్మయములో వర్డ్స్‌వర్త్ కవివరుడగువాడు ప్రకృతి రామణీయకతను రసోత్పాదకములగు సుందర శబ్ద చిత్రణము ద్వారమున అక్షయముగ అందజేసినాడు. ప్రకృతిమాతపై అతనికి గల ప్రేమాభిమానములు కేవలము కాలక్షేపములు కావ్యభాగమునకు భూషణప్రాయములు మాత్రము కావు. ప్రకృతి పట్ల అతనికిగల ప్రగాఢమమకారము అతని కవిత్వమునకు ఆత్మ వంటిది.

వర్డ్స్‌వర్త్ క్రీ. శ. 1770 వ సం॥లో ఇంగ్లండునందలి కంబర్‌లాండ్ రాష్ట్రములో కాకర్‌మత్ నగరమున జన్మించినాడు. ఇతని తలిదండ్రులు మధ్యతరగతివర్గమునకు చెందిన వారు. ఇతని చిన్నతనముననే వారు గతించిరి. ఇతని తండ్రి "లాన్స్‌డేల్" అను ప్రభువు కొలువులో ఏజెంటుగనుండెడి వాడట! ఆ ప్రభువు వర్డ్స్‌వర్త్ కుటుంబమున కియ్యవలసియున్న ధనము నిచ్చియున్నచో వారు సుఖముగా జీవితమును గడపుచుండెడివారే! అట్టిది జరుగకుండుటచే అతని బాల్యము పెక్కు బాధలతో గడుపవలసి వచ్చినది. అయినను బంధుమిత్రుల ఆదరముతో అతని జీవితము నిరాడంబరముగను నిర్విచారముగను సాగినది.

అతని బాల్యదశయందు విద్యాభ్యాసము జన్మస్థలమునందే జరిగినది. పాఠ్యపుస్తకములందలి విజ్ఞానముకంటె అతడు ప్రకృతిమాత ఒడిలో - పుష్పములలో పుంతలలో పర్వతములలో చుక్కలలో చెరువులలో విజ్ఞానమును అధికతరముగ ఆర్జించినాడు. ఆయన వ్రాసిన ది ప్రిల్యూడ్ (ఉపక్రమణము లేక పల్లవి) అను కావ్యమువలన ఈ విషయమును గురించి విపులముగ తెలియగలదు. నిశిత విమర్శనా దృష్టిలేని సాధారణ పాఠకునకు కూడ ఈ కావ్యమునందు మూడంశములు ప్రస్ఫుటముగా బోధపడగలవు (1) ఆయన ఏకాంతవాస వాంఛ (2) ప్రకృతియందతడు పొందుచుండిన ఆనందము (3) ప్రకృతి సుపరిచితములైన అతని భావానుభూతులు. ఏకాంతవాసమును అనుభవింపజేయగలిగినను వర్డ్స్‌వర్త్ ఎన్నడును ప్రకృతిలో ఏకాకియై ప్రబలకరమ సామాన్యముగా తక్కిన జీవరాశులతో కలిసి కొండలయందును, కోనలయందును, చేలయందును,

చెరువులయందును చరించుచు బాలబాలికలవలె అనూహ్యమైన సజీవస్పందనమును పొందెడివాడు! అందుచే అతని ఆశయములు అనుభూతులు అతని కవిత్వము పఠించు వారికి సుపరిచితములై సన్నిహితములైయుండును.

వర్డ్స్‌వర్త్ జీవితమందలి రెండవ ఘట్టము 1787లో అతడు కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయమునందు ప్రవేశించుటతో ప్రారంభమగును. విద్యార్థి దశయందాతడు విశిష్టమగు తెలివితేటలు ప్రదర్శింపలేదు. పాఠ్యగ్రంథాశిక్షకంటె స్వాభావికమైన తన ప్రతిభాసామర్థ్యములకే అధిక ప్రాధాన్యమొసగి వాటిననుసరించెడివాడు. పాఠశాలా పరీక్షలయందుకంటె సెలవులలో ప్రకృతిమాతతో కాలక్షేపము గావించుటయందే అతడు విశేషాసక్తిని చూపెడివాడు. పాఠశాలవిద్యను ముగించిన పిమ్మట ఆయన నాళ్గేండ్లపాటు విశ్వవిద్యాలయములో విద్యార్థిగా గడపినాడు. ఈ దశయందే ఫ్రాన్సు స్విట్జర్లెండు ఇటలీ మొదలైన దేశములలో విస్తారముగ సంచరించి ఆయా భాషల నభ్యసించి అందలి ప్రకృతి దృశ్యములను తిలకించి పులకితుడైనాడు. ఫ్రెంచి స్వాతంత్ర్య పోరాటమాతనిని బాగుగ నాకర్షించినది. ఆ సందర్భమున ఫ్రెంచి వనితయగు అన్నెట్ వేలన్ అను నామె వలపుల కాతడు దాసుడైనాడు.

అయితే ఫ్రెంచి విప్లవము వెనుక జరిగిన భీకర ప్రయోగశ పరిపాలనమును నెపోలియను నియంతృత్వవిధానమును వర్డ్స్‌వర్తును కృంగదీసినవి. స్వాతంత్ర్య భానూదయమని యమున జీవించియుండుట బ్రహ్మానందదాయకమనియు యువకజీవితము స్వర్గతుల్యమనియు కవితాగానమొనర్చిన ఈ మహనీయుడు మానవుడు దానవుడుగా మారి సాటి మానవుని చేయు హింసాకాండను చూచి నిరాశ నిస్పృహలకు లోనైనాడు.

1793వ సం॥ నుండి వర్డ్స్‌వర్త్ జీవితములో మరియొక మలుపు మొదలైనది. ప్రశాంతమైన ప్రకృతి గర్భమున విశ్రాంతి తీసికొనుచు తన సోదరియగు డొరొతీ యొక్క సానునయ వాక్యములచే అతడు మనఃక్లేశమును మరచిపోగల్గినాడు. 'ది బోర్డరర్స్' ('సరిహద్దు ప్రాంతీయులు') అను విషాదాంత నాటకము అతని మనమునకు కల్గిన అఘాతమును విశదీకరించగలదు. కవిమిత్రులగు కోల్‌రిడ్జి డొరొతీల సాంగత్యముతో వర్డ్స్‌వర్త్ నూతన జీవితమును గడుప సాగినాడు. 1795లో కాల్వర్ట్ అను మిత్రుడు తన వీలునామాద్వారమున ఘట్టిపైన సంభావనముతో తన సోదరి అండదండలతో ఆల్ఫాక్స్‌డెన్ అను ఊరు నివాసమేర్పరచుకొని కోల్‌రిడ్జితో సాంగత్యమును కొనసాగించుచు నిరాడంబరమైన జీవితమును వర్డ్స్‌వర్త్ గడుపుచుండెను. ఈ ముగ్గురి శరీరములు వేరైనను ఆత్మ లొకటియా యనునట్లు అత్యంత ప్రగాఢమైన పరస్పరాదర మైత్రీభావముతో మెలగినారట! వర్డ్స్‌వర్త్ కోల్‌రిడ్జి లిద్దరు ఉభయకర్తలుగా రచించిన 'భావకథా గీతికలు' (Lyrical Ballads) 1798లో ఆవిష్కరణమైనవి. ఈ ఉత్తమగ్రంథము ఆంగ్ల కవితాస్రవంతికి పునరుజ్జీవనము కల్పించినది. అందుచే ఈ రచయితలు కాల్పనిక సాహిత్య పునరుజ్జీవనోద్యమమునకు మూలవిరాట్టులైరమటలో అబ్బురముండదు. దురదృష్టవశాత్తు ఈ కావ్యసంపుటికి ప్రజాదరణము లభింపకున్నను ఇది వాఙ్మయ చరిత్రలో శాశ్వత స్థానమును సంపాదించుకొనగల్గినది. సాధారణ ప్రజాజీవితమందలి సర్వసామాన్యములగు సంఘటనలను దైనందినము వాడుక భాషలో కవనముల్లుట వర్డ్స్‌వర్త్ విశిష్టకళాగా కోల్‌రిడ్జ్ అసాధారణమైన దైవాధీన జీవసంఘటనములను ప్రజలకు రమ్యములగు గీతికా కథలలో కవితనల్లగల్గినాడు. ఈ జంటకవులు 18వ శతాబ్దిలో కవనమును ఊపిరిసలుపనీయక బంధించివేసిన ఉక్కు చట్రమును ఊడబెరికి కవనము చెప్పు విధానమును కవితావస్తువును ఎన్నుకొనుట యందును సంపూర్ణ స్వాతంత్ర్యమును నాటి నవ్యకవితా వాహినిని నిరాటంకముగ ప్రవహింపజేసినారు. భావగీతికలలో వర్డ్స్‌వర్త్ వ్రాసిన 'టిన్‌టర్న్ అబ్బీ' కోల్‌రిడ్జి వ్రాసిన 'ఏన్షెంట్ మారినర్' ఎన్నదగినవి. తన ఈ పద్యము ద్వారమున వర్డ్స్‌వర్త్ మొదటిసారిగా తన సందేశమును ప్రపంచమునకు చాటినాడు. బాల్యమున ప్రకృతి తన సోదరముగ నాకర్షించినదియు వయస్సు మళ్లినకొలది తొలి అనుభవములు తనను ఉదాత్త స్థాయి కెట్లు కొంపోయినదియు వర్డ్స్‌వర్త్ ఈ పద్యమునందు వివరించును.

ఆల్ఫాక్స్‌డేల్ మరణానంతరము తనకు రావలసిన బాకీ చేతికందగా, వర్డ్స్‌వర్త్ ఆర్థికస్థితి మెరుగుపడినది. అతడు 1802లో మేరీ హచిన్సన్ అను నామెను వివాహమాడినాడు. స్కాట్లెండు దేశమును రెండుసార్లు సందర్శించి వాల్టర్ స్కాట్ అను నవలా రచయితతో గాఢమైత్రిని సంపాదించుకొన్నాడు. దాదాపు ఈ కాలమునందే తత్త్వజ్ఞాన

బోధ ప్రధానాంశముగాగల ది రిక్లూస్ ( ఏకాంతవాసి ) అను మహా కావ్యరచనమున కాతడు శారీరెత్తున పథకమును వేసినాడే గాని అది అసంపూర్ణముగానే ఉండిపోయినది. ది ప్రిల్యూడ్ అను కావ్య భాగమునందు ఈ విశేషితము చక్కగా చిత్రితమైనది. ఈ కావ్యమును ది ఎక్స్కర్షన్ ( విహారము ) అను మరియొక కావ్యమును వర్డ్స్‌వర్త్ మరణకాలమునాటికి అసంపూర్ణములుగనే మిగిలిపోయినవి.

వర్డ్స్‌వర్త్ జీవితమందలి తుది అర్ధశతాబ్దము సరోవర మండలమునందు ప్రశాంతముగా గడచిపోయెను. 1818లో శాధ్యాక లెక్కువ లేనియే వరమానము బాగుగ లభించిన యొక ప్రభుత్వోద్యోగమును చేపట్టి కొంత కాలమందు పని చేసి 1842లో ఆ పదవికి రాజీనామా యిచ్చి పింఛనుదారుడైనాడు. మరునటి సంవత్సరము ప్రభుత్వ స్థానకవిగా నియమితుడైనాడు. అంతిమదశలో కావించిన రచనలు రాజకీయముగ అయనలో కల్గిన మార్పును ద్యోతకము చేయును. ఎనుబదియేండ్లు సుఖజీవనమును గడిపిన వర్డ్స్‌వర్త్ స్వగృహమునందే 1850 వ సం॥లో మరణించెను.

వర్డ్స్‌వర్త్‌కు ఆంగ్లకవులలో ప్రముఖ స్థానమును సంపాదించి పెట్టిన కవిత్వ మంతయు అతడు నలుబదేండ్ల వయస్సులోగా వ్రాసినట్టిదే. అతడు రచించిన పద్యరాశినంతటిని స్థూలముగా రెండుభాగములుగా విభజించవచ్చును (1) ప్రకృతివర్ణనము ప్రధానాంశముగాగలకవనము (2) సామాన్య మానవజీవితమును చిత్రించుకవనము. అయన వ్రాసిన ఓడ్స్ కావ్యములో ఓడ్-టు డ్యూటీ, ఓడ్-అన్-ది-ఇంటిమేషన్స్-ఆఫ్-ఇమ్మోర్టాలిటీ అను విభాగములు ముఖ్యములైనవి. ఎమర్సన్ మహాకవి ఈ రెండవ ద్యము 19వ శతాబ్దమునాటి ఆంగ్లకవిత్వమునకు మకుటాయమానముగ నుండెనని వ్యాఖ్యానించినాడు. 'సానెట్స్' అను అతని గ్రంథములో మిల్టనును గురించి వ్రాసినదియు, ఇహసుఖములలో మునిగి తేలుచు ప్రకృతిని విస్మరించు మనస్తత్త్వమును గురించి వ్రాసినదియు, వెస్ట్‌మినిస్టర్ బ్రిడ్జ్ అను గ్రంథ భాగమును ప్రముఖములైనవి. అతని భావగీతికలలో 'సాలిటరీ రీపర్', 'డేఫడిల్స్' మున్నగునవి బహుళ ప్రాచుర్యమును పొందినవి. 'మైకేల్', 'లూసీ గ్రే', 'రుయిత్‌జేమిమా' మొదలయినవి కూడ ఆ కోవకు చెందినవియే.

వర్డ్స్‌వర్త్ మహాకవి ప్రకృతిని ఉపాసించినవాడు. కేవలము భావుకగ్రస్తుతోనే కాక అంతర దృష్టితో ప్రకృతిని అవగాహన చేసికొనిన ఏకైక ఆంగ్లకవి ఈతడు. ప్రకృతి వ్యక్తిత్వమునకు దైవాంశను కూడ ఆపాదించి ఆరాధించినాడు. అంతేకాక ప్రకృతిని బోధకురాలిగా స్వీకరింపుమని లోకమునకు సూచించినాడు. శబ్దమాధుర్యమును సంస్కృతీపదములు అపరిమితముగ వెల్లువుగనప్పుడు కవిత్వమని ఆ మహాకవి ముగ్ధ నిర్వచించినాడు. కవిలోకోత్తర వర్ణనా నిపుణుడనేది నానుడికి పుట్టినిల్లుచేసిన ద్రష్ట స్రష్ట ఇతడు.

గ. వేం. శో.

## వివృత బీజవంతములు

బీజవంతములగు మొక్కలు సంవృత బీజవంతములనియు (Angiosperms) వివృతబీజవంతములనియు (Gymnosperms) రెండు వర్గములుగా విభజింపబడినవి.

వివృతబీజవంతములు ఒకవైపు ఉన్నత అపుష్పోద్భిదములతోను (Higher cryptogams) మరియొకవైపు సంవృత బీజవంతములతోను అతిసన్నిహితమైన సంబంధమును కలిగియున్నవి. అందుచే వాటి లక్షణములు ఆ రెండిటికిని మధ్యరకముగా నుండును. వివృతబీజవంతములగు మొక్కలు సుమారు 700 ఉపజాతులుగా నున్నవి.

నిమ్నతరగతులకు చెందిన వివృతబీజవంతములగు మొక్కలకును ఉన్నత తరగతులకు చెందిన అపుష్పోద్భిదములకును పరస్పరము చాల పోలికలు కనబడును. అట్టి పోలికలలో కొన్ని ముఖ్యమైనవి: (1) సామాన్య జీవితచరిత్ర ఈ రెండిటియందును ఒకే మాదిరిగ నుండును (2) ఏకాంతర జనన దశలు (alternation of generations) ఈ రెండింటియందును ఉన్నవి (3) వేరు కాండము పత్రములు అను భాగములు ఈ రెండు తరగతుల మొక్కలయందును స్పష్టముగా కనబడును (4) విభిన్న పత్రములు గలిగి అవి గడియారపు స్ప్రింగువలె చుట్టుకొని యుండును (5) సూక్ష్మ స్థూల స్త్రీబీజములు అయా స్త్రీబీజ పత్రములు రెండింటియందును ఉండును (6) ఈ రెండింటిలో పక్ష్మసహిత చలవురుషబీజములు (ciliate spermatozoids) ఉత్పత్తి యగును (7) అండధానులు (Archegonia) ఈ రెండిటియందును కనబడును.

కాని ఈ రెండు తరగతులలో కొన్ని ముఖ్యమగు

వ్యత్యాసములు కూడ గలవు. వివృతబీజవంతములలో మొదట అండకోశములు (Ovules) ఏర్పడి అవి తరువాత బీజములుగా తయారగును. అపుష్పోద్భిదములలో అండకోశములుగాని బీజములుగాని లేవు. వివృతబీజవంతములలో పరాగనాళ మేర్పడును. అపుష్పోద్భిదములలో అది ఏర్పడదు. వివృతబీజవంతములగు మొక్కలలో ఏధ (cambium) ఉండుటచే దానివలన ద్వితీయస్థౌల్యము (Secondary thickening) జరుగును. అపుష్పోద్భిదములలో ఏధ లేకుండుటచే అది జరుగదు.

వివృతబీజవంతములగు మొక్కలను సంవృతబీజవంతములగు మొక్కలతో పోల్చి చూచినచో కొన్ని ముఖ్యమగు ఈ క్రింది పోలికలు కనబడును. స్పష్టమైన వేళ్లు, కాండము, శాఖలు, పత్రములు కలిగియుండుట, బాగుగా అభివృద్ధిజెందిన వాహినీ మండలమును (Vascular system) కలిగియుండుట, పుష్పసహితముగ నుండుట, పరాగరేణువు నుండి పరాగనాళము బయలుదేరి దానిగుండ పుంజన్యువులు స్త్రీజన్యువు దగ్గరకు ఫలదీకరణము కొరకు చేరుట, అండకోశబీజములు తరువాత బీజములుగా మారుట మొదలగునవి.

ఈ రెండు తరగతుల మొక్కలలో కొన్ని ముఖ్యమగు భేదములు అగపడును. వివృతబీజవంతములలో అండకోశబీజములు ఏ విధమగు రక్షణయు లేక పైకి కనబడునట్లు అండపాళిపై ఏర్పడియుండును. కాని సంవృతబీజవంతములలో అండకోశబీజములు అండాశయముచే రక్షింపబడియుండును. ప్రతి అండపాళికి సంవృతబీజవంతములలో అండాశయము, అండాశయనాళము, దానికొమ్మ (Stigma = కుక్షి) యుండును. అండాశయము తరువాత కాయగా తయారగును. వివృతబీజవంతములలో దారువు (xylem) జలవాహకోశములచే (tracheids) నేర్పడును. వాటిలోని అధోవాహకణములకు సహకోశకణములు (Companion cells) ఉండవు. సంవృతబీజవంతములలో దారువు వాహినీకోశములచే (vessels) నేర్పడును. వాటి అధోవాహికములకు సహకోశకణములుండును. వివృతబీజవంతముల పుష్పములు ఏకలింగములు. వాటికి రక్షకదళములుగాని ఆకర్షణపత్రములుగాని యుండవు. వాటిలో గాలివలన పరాగసంపర్కము జరుగును.

వివృతబీజవంతములు ఏడుగణములుగా విభజింపబడినవి. శిలారూపములనున్న వివృతబీజవంతములను పరిశీలించినచో, అవి ఆదిమతరగతులకు చెందిన పర్ణములనుండి ఉత్పత్తిచెందినట్లు తెలియును. ఈ తరగతి పర్ణములు పురాకల్పమున (paleozoicera) మత్స్యయుగము (Devonian Period) నందు మంచి అభివృద్ధిలో నుండెను. కార్డైటేలిస్, సైకడోఫిలికేలిస్ అను గణములు అంగారయుగపు (carboniferous period) మధ్యకాలమున విస్తారముగ నుండెను. మధ్యకల్పపు (Mesozoic era) ప్రారంభకాలమున అవి అంతరించిపోయెను. మధ్యకల్పపు చివరిభాగమున బెన్నిటైటేలిస్ అను గణము అంతరించిపోయెను. ఈ గణములోని మొక్కలు సైకడేలిస్‌లోని మొక్కలు సైకడోఫిలికేలిస్‌నుండి వేరువేరుగా ఉత్పత్తియైనట్లు నిదర్శనములున్నవి. జింగోయేలిస్ కోనిఫెరేలిస్ గణములు వేరువేరుగా కార్డైటేలిస్ గణము నుండి ఉత్పత్తియైనవి. జింగోయేలిస్ గణములో ప్రస్తుతము జింగోబైలోబా (Ginkgo biloba) అను ఒక్క ఉపజాతి మాత్రమే మిగిలియున్నది. కోనిఫెరేలిస్ గణమునకు చెందిన వివృతబీజవంతములు 500 ఉపజాతులకుమించి ఇప్పుడగపడుచున్నవి. నీటేలిస్ అనుగణములోని మొక్కలు ఇటీవల ఉత్పత్తియైనవి.

భారతదేశమున తూర్పు పడమర హిమాలయములలో 1200-కి 800 మీటర్ల ఎత్తుపై కోనిఫెర్ వృక్షజాతి చాల దట్టముగా వ్యాపించియున్నది.

D. V. R.

## వివేకానందస్వామి

భావికాలములో వివేకానందస్వామియని ప్రసిద్ధిగాంచనున్న నరేంద్రనాథదత్తుడు క్రీ. శ. 1863 నందు అవతరించెను. ఈయన జన్మస్థలము కలకత్తానగరము. అది ఆనాడు ఆంగ్ల బుద్ధివికాసమునకు కూడలి. ఆ ఉద్యమమునే నాటివారు జాతీయ పునరుద్ధరణ మనిరి. ఈ పునరుద్ధరణము వలననే 19 వ శతాబ్ది భారతభూమికి వంగదేశ నాయకత్వము రూఢియైనది.

తెరతొలగగనే క్రిక్కిరిసిన రంగమునందు ప్రవేశించిన నటునివలె బాల్యము వీడగనే నరేంద్రుడు కలకత్తాయందు కౌమారరంగమున ప్రవేశించెను. సనాతన సుస్థిర భారతీయ సంస్కృతి అనాటికే విలసరాజ్యస్థాపకుల పరిపాలనా పద్ధతులకు బహుకాలము నుండి గురియై పాశ్చాత్యభావ [illegible] మార్గములలో ప్రవహింప జూచుచుండెను. పరిపా

లనాయంత్రాంగమునందును విద్యావిధానాదికమునందును నిమగ్నులైయున్న కొందరు వంగీయులు ఆనాడు సృజనాత్మక యుగధర్మ నాయకులతో తలపట్లు పట్టుచుండిరి. ఒక నూతన చైతన్యమును ఒక నవ్యసంస్కారాన్వేషణమును సాహితీపరులు సైతము వెల్లివిరియ చేయజొచ్చిరి.

బాల్యమున నరేంద్రుడు పాఠశాలలో ప్రదర్శించిన మేధాసంపదయు సంగీతకళాభినివేశమును క్రీడావరాయణత్వము అమేయములైనవి. ఏకసంథాగ్రాహియైన ఆయన పఠనాసక్తి నిరుపమానము. తల్లి సంరక్షణలో నుండగ పరాకాష్ఠనొందిన తన హైందవ మతగ్రంథాధ్యయనమునకు ఆయన ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా యందలి యావద్విజ్ఞానమును అనుసంధానించినాడు. నేడు స్కాటిష్ చర్చికళాశాల అనబడెడి నాటి 'జనరల్ ఎస్సెంబ్లీ' యొక్క విద్యాసంస్థకు రెవరెండ్ డబ్లియు హేస్టిమహోదయుడు అధ్యక్షుడు. ఆ సంస్థయందు నరేంద్రుడు పాశ్చాత్యతత్త్వశాస్త్రమును పఠించునపుడే హేస్టి అతని ప్రతిభా విశేషము మహాద్భుతమైనదని శ్లాఘించెను. అంతేకాదు నరేంద్రుడు మహాయశస్వి కాగలడనికూడ అగురువు వక్కాణించినాడు. అహేస్టి మహాభాగుని వలననే నరేంద్రుడు తొలిదొల్త రామకృష్ణ పరమహంసను గూర్చి వినుట జరిగినది. వర్డ్సువర్తు మహాకవి యొక్క నిగూఢ తాత్త్విక అనుభూతులను గూర్చి ఉపన్యసించుచు ఆ కళాశాలాధ్యక్షుడైన హేస్టిపండితుడు రామకృష్ణపరమహంస యొక్క నిగూఢతాత్త్వికాధ్యాత్మిక శక్తిసంపదనుగూర్చి వివేకానందునకు ఉట్టంకించినాడు.

క్రీ శ 1880 లో కలకత్తా యందలి రాష్ట్రీయ కళాశాలయందు తాను న్యాయశాస్త్రమును అధ్యయనము చేయ ప్రారంభించినపుడే నరేంద్రుడు సాంఘికపరిణామ - ఉత్తుంగ తరంగములకు ఎదురొడ్డవలసినవాడయ్యెను. ఆనాటి సాంఘిక పరిణామావశ్యకతలు అనేకములు. వానినిగూర్చి సూక్ష్మబుద్ధులయోచనలు విభిన్నములు.

యువకుడైన నరేంద్రుడు భావికాలమునకు ఆవశ్యకమగు సునిశితబుద్ధి వైశారద్యమును స్పష్టముగ సంతరించుకొనుచుండెను. ఆ బుద్ధికుశలతకు ఆధ్యాత్మిక జ్ఞానోపాసనయు తోడై తన్ను ప్రేరేపింపగా ఆయన శ్రీరామకృష్ణపరమహంసను తొలిసారిగా క్రీ శ 1881 లో సందర్శించెను. అది మొదలు కొని పరమహంసయొక్క బోధనలలో నరేంద్రుడు తన్మయత్వమును పొందెను. రామకృష్ణునితో తాను ఐదారేండ్లపాటు ఏకాంతముగ యోగసాధనయందు భ్రమరకీటన్యాయమున ఆధ్యాత్మిక సంపదను సంగ్రహించుకొని ఏకాంతవాసుడయ్యెను. జ్ఞానముతో ఆధ్యాత్మిక రూపరేఖను, విజ్ఞానముతో సూక్ష్మబుద్ధి వివేకములను దాంపత్యము నెరపగా ఏర్పడిన ధ్యానముద్ర క్రమక్రమముగ వివేకానందుని కర్మయోగ్యునిగా చేయజొచ్చినది.

క్రీ శ 1886 లో తన గురువు శాశ్వతసమాధి స్థితి నొందగా వివేకానందుడు సతీర్థ్యులందరి సహకారముతో శ్రీరామకృష్ణ సేవాసంఘమును నెలకొల్పి దానిని నెలకొల్పి దానికి ముఖ్య స్థానమనదగిన బేలూరుమఠమునుగూడ స్థాపించెను. ప్రాచ్యుల ఆధ్యాత్మికత్వమునకును పాశ్చాత్యుల విజ్ఞానమునకును సంగమస్థానమైన వివేకానందుడు భారతీయులకు మార్గదర్శకత్వమును నెరపగల తనజీవిత పరమలక్ష్యమును సాధించుటలో నేమరుపాటు చూపలేదు.

చిన్నతనమున వివేకానందుడు దారిద్ర్యవేదనలను చవిచూచినవాడు. భారతదేశాటనము మూలముగ వివేకవంతమైన అతని బుద్ధి అసంఖ్యాకులయిన దేశీయుల దారిద్ర్యమును చూడ సమర్థమయ్యెను. మానవసేవాపరతతోడి జాత్యుద్ధరణమును జాతీయతాభావప్రేరణము వంటివి వివేకానందుడు స్వానుభవమువలన ఏర్పరచుకొనిన ధ్యేయములు. అతని జీవితాశయములలో దేశాటనము ప్రముఖస్థానమును ఆక్రమించినది. మిక్కిలి శ్రమకోర్చిన తన జీవితమునందలి నలిదశాబ్దులలో సహనము సమత్వమువంటి మహోదారగుణములను గూర్చి ప్రత్యక్షముగ సందేశము నందించినవాడు వివేకానందుడు. తేజోవిశాలమును వెదజల్లు అతనిమూర్తిమత్త్వమును సమర్థవక్తృత్వమును లోకమును ముగ్ధమొనర్చినవి. భారతదేశము నలుచెరగులయందేగాక తూర్పు ఆసియా యూరపు ఖండములయందును అమెరికా సంయుక్తరాష్ట్రములయందును అధిక సంచారమును సలిపినవాడు అతడు. మహాసభలయందును ఎట్లో అట్లే కర్తవ్యాంశములవలనను సైతము అతడు విజయములను సాధించెను. చికాగోనగర ప్రసిద్ధమహాసభలయందు ఎట్లో హిమాలయప్రాంత సుందరాశ్రమములయందును అట్లే జ్ఞానబోధ మొనర్చెను.

అమెరికా యందలి యా చికాగోనగరమున ప్రపంచమత మహాసభలోనే అతడు తొలిసారిగ (1893) అంతర్జాతీయ దృష్టిని ఆకర్షించుట జరిగినది. పాశ్చాత్యదేశముల యందు

హిందూమతతత్త్వబోధకు పెక్కు కేంద్ర మఠములను నెలకొల్పుటతో అతని దేశసేవపరాకోటి నందుకొనెను. అట్టి కేంద్రములలో నొకటి న్యూయార్కునగరమునందు ఆతనిచే క్రీ శ 1894 లో వ్యవస్థితము. మానవ జాతిలోని భేదభావముల సామరస్యసాధకమై తన చే మఠశరణకను కృషిసల్పిన మహనీయుడు అతడు. మానవసౌభ్రాత్రము సాంఘిక ఆధ్యాత్మిక సమత్వముల మూలమునందే సుసాధ్యమగుననెడి తన పరమవిశ్వాసమును అతడెన్నడును కోల్పోవలేదు. తన నిష్కామ నిర్విరామ సేవానిరతి అమేయములైన ఆతని జీవశక్తి సామర్థ్యములను జీర్ణము చేయ మూవత్తయేండ్లు నిండకముందే తన ముప్పది తొమ్మిదవయేట (క్రీ శ 1903 లో) అతడు శాశ్వతయోగ సమాధినొందెను. నేటికి ఓడేండ్ల వెనుక విశ్వవ్యాప్తముగ జరిగిన తన జన్మదిన శతవర్షోత్సవములు అతని యశోవిభూతికేగాక అతనిచే వ్యవస్థాపితములైన పెక్కు సజీవ సంస్థల విభూతికిగూడ స్మారకచిహ్నములైనవి.

మతసందేశముల విశిష్టత - హిందూజాతి తనదేవుని తనధర్మమును విసర్జించి ఆధ్యాత్మికత్వమునే పరిత్యజించి జీవితమూల్యములనే తారుమారుచేసిన కాలములో సుమారు వేయేండ్లనాడు శ్రీ శంకరభగవత్పాదులు అవతరించిరి. ఆనాడు ఎన్నోశాఖలు ఎందరోగురువులు ఎవరికివారు తామే ఆధ్యాత్మిక జ్ఞానసంపన్నులమనుకొనిరి. పోనిమ్ము బౌద్ధమందమా? అది ఆనాడులోకమునేలినది. కాని ఆ బౌద్ధము బుద్ధభగవానుచే ప్రవచింపబడినదికాదు. అందు తథాగతుని సజీవసందేశములేదు. అట్టి తరుణములో జీవాత్మ పరమాత్మల ఐక్యమును మూలాధారముగాగల అద్వైతమతము ప్రజానుబుద్ధి వికాసములకు తోడ్పడి వారిని ఆస్తికులను జీవిత పరమార్థ సాధకులనుగా చేసి బౌద్ధము కల్పించిన ఆధ్యాత్మిక అగ్రస్థితి నిర్మూలించెను.

వివేకానందస్వామి అవతరించిన దినములలోకూడ పైన చెప్పిన దుస్థితియే వెల్లివిరిసినది. ఎన్నోశతాబ్దుల నుండి ఇస్లాము మతమువలన త్రొక్కిళ్ళుబడిన హిందూమతము క్రైస్తవమత ధిక్కారములను ఎదుర్కొనవలసి యుండెను. తురుష్కమతము కత్తిదూసి హిందూమతముమీదికి రాగా క్రైస్తవము ధన ప్రలోభన ప్రచారములతో దానిని నేలబెట్టి కాలరాయజూచినది. విద్యాధికుల మనుకొని హిందువులు తాము క్రైస్తవములోనికి పరివర్తింపబడుట గర్వకారణ మనుకొనిన దినములవి. వారు తమతమ మతమును తామే ద్వేషించుకొనిరి. వలస రాజ్యస్థాపకుల అంగరుతకుకు తెలుకులును క్రైస్తవ మత ప్రచారకుల కులుకుపలుకుల మెలవులును ఆనాడు హైందవులలో విద్యావంతులను అధికముగ ఆకర్షించి మతాంతరులను చేసినవి. భారతదేశమంతయు క్రైస్తమయమై పోగలదని భయము కలిగిన దినములవి. కలకత్తా విశ్వవిద్యాలయముతో నరేంద్రదత్తుడు తానును దైవములేదులయందు విశ్వాసము లేక మెలగిమెలగి సకాలములో రామకృష్ణుని అనుగ్రహమున దైవప్రేరితుడై వివేకానందుడైన దినములవి.

ఆ వివేకానందుడు శంకరుని అద్వైతమునే బోధించెను. కాని యిది యధార్థ జనసత్త్వములు కలిగి కాలానుగుణముగ అన్వయింపబడిన అద్వైతము. మనదనేడు అద్వైతయుగము. దీని గూర్చియే యెల్లరు ప్రసంగింతురు. కాని విజ్ఞాన శాస్త్రముతో మేళవింపబడిన అద్వైతమును తర్కోపేన సామర్థ్యమును గోల్పోవని అద్వైతమును మాత్రమే వివేకానందుడు ప్రచారము చేసినాడు. ఈ శతాబ్దిలో సాగిన విజ్ఞాన శాస్త్రపరిశోధనలన్నియు అద్వైతసిద్ధాంతములోని మౌలికాంశమును అంగీకరించినవే! సాపేక్ష సిద్ధాంతము(The Theory of Relativity) తేజః (కణ) పరిణామవాదము (The quantum Theory of light) పరమాణు నిర్మాణపరసిద్ధాంతములు (The Theories of the structure of Atom) వంటివన్నియు ఏకైకసత్యమును ప్రతిపాదించునవేగదా! ద్రవ్యము (Matter) వనుము శక్తి (Energy) అవి నడుమగల వ్యత్యాసము అంతరించిపోయినది. ద్రవ్యము నేడు అనశ్వరము (Indestructible) కాదు. దానిని శూన్యత్వము (Nothingness) ఆవహించును. చిట్టచివరకు మిగుల పరమాణువుల నిర్మాణమొక కొరవడియ్యమువలె నుండు వైద్యుత శక్తుల సముదాయము.

శంకరాచార్యులవారి అద్వైతము, బౌద్ధముతో తలపట్టుపట్టగా వివేకానందుని అద్వైతము తురుష్క క్రైస్త వాదమతములతోడనే గాక పాశ్చాత్యుల లోకాయతవాదముతో గూడ తలపట్లు పట్టి వాటిని పీటీ చేయగలిగినది.

హిందూమతమునకు శత్రువులైన వారి గుహలలోనికే పోయి గర్జించిన వివేకానందుని గర్జనలతో మునుపు భీరువులైన హిందువులు తిరిగి ఉత్తేజితులై సజీవులును వీర్యవంతులును, పూర్వమువలె విశేషులును అయినారు.

వివేకానందస్వామి యీ శతాబ్దిలో హైందవమతమునకు నూతనోత్తేజము నొసగిన మహావ్యక్తి. వ్యక్తి కాదు సంస్థ. పరాక్రమోపేతమైన యీతని హిందూధర్మమును గ్రహించినను మిగిలిన పరమతస్థులు ఇప్పుడు క్రిందయినారు. బౌద్ధులను హిందువులుగా మార్చినట్లు చెప్పబడు శంకరభగవత్పాదులవారే తు పక్క క్రైస్తవమతస్థులను వివేకానందుడు హిందువులుగా మారుటను కోరుకొని యుండరు. అన్యమతస్థులను హిందువులనుగా మార్చుటచే హిందూమతము క్షీణించుననియు మతాంతరుడగు ప్రతి హిందువుని హిందువుల సంఖ్యను క్షీణింపజేయుటయేగాక వారికి శత్రువు అగుచున్నాడనియు వివేకానందుని విశ్వాసము. వివేకయుక్తమైన మతమే యూరపుఖండమును బ్రోవగలదనియు అట్టిది అద్వైతమే అనియు అతడు ఘోషించినాడు. "విశ్వమానవ సహనమే గాదు సర్వమత సత్యత్వమును కూడ అతడు అంగీకరించెను. "సాహాయ్యమేగాని నిగ్రహముగాదు. మిత్రత్వమే గాని వినాశత్వము గాదు. శాంతి సామరస్యమేగాని మత వైషమ్యములు కావు" అని ప్రతిమతపతాకముపైన భావికాలములో లిఖింపబడగలదని ఆయన ముక్తకంఠముతో పలికినాడు.

'వివేకానందుని సిద్ధాంతము. విశ్వమత స్థాపనను గూర్చినది. అది దేశకాల నిరపేక్ష్యము; అటవికులైన వారిపల క్షుద్రదేవతారాధనము మొదలుకొని నవీనకులైన ఆధునిక విజ్ఞానవేత్తల ఉదార శాస్త్రస్థాపనల పర్యంతమును వ్యాప్తమైయున్న ఆస్తికవిశ్వాస సామర్థ్యమంతను స్వీకరింపగలది. అతడు సర్వమతసిద్ధాంతములను మహోదారముగ సమన్వయించెను. ఈ పద్ధతి ప్రతిమతము వారిని తమతమ మార్గములో అభ్యుదయమునకు గొనిపోగలదు' అని ప్రెంచి పండితుడు రొమెన్ రోలెండ్ పలికినాడు.

వివేకానందుని మతము బలమునకు కారణమైనదిగాని దౌర్బల్యమునకుగాదు. అది ఆత్మవిశ్వాసమునకు సంబంధించిన మతము. "ప్రపంచములో నెల్ల నీతిపరమును మతవిశ్వాసపరమును అయినది భారతజాతి. హిందువులను ఇతరజాతులతో పోల్చుట దైవదూషణమైనపని" అని స్వామి వివేకానందుడు ఉద్ఘాటించెను. అట్లని హిందూమతానుష్ఠానములో దొరలిన దోషములయెడ అతడు తూష్ణీంభావమును దాల్చినవాడు కాదు. వాటిని నిర్దయముగ ఖండించినాడు; మూఢత్వమును దూషించినాడు; అస్పృశ్యతాదిని నిర్మూలింపగోరి పేదలయు, పీడితవర్గములయు సేవకై గ్రామసంచారములను ప్రబోధించినాడు. ఖడ్గసాహాయ్యము లేనిదే క్రైస్తవము దిగ్విజయమును చేయలేకపోయినదనియు ఆ మతము భోగలాలసతల పేరిట హృదిలోనికి వచ్చినదనియు పాశ్చాత్యదేశములలో నేను క్రైస్తవులకు దండగా బండరాయియైన దొరుకదనియు అతడు నిర్భయముగ అమెరికాయందు ఉద్ఘోషించెను.

క్రీ శ 1893 సెప్టెంబరు 11 వ తేదీ ప్రపంచములోని హిందువుల కెల్లరకు పర్వదినము. అమెరికాలోని చికాగో నగరమునందు జరిగిన ప్రపంచమత ప్రథమమహాసభయందు వివేకానందుడు విజయభేరి మ్రోయించెను. అది హిందువులకు దిగ్విజయసూచకము. తన సిరుమధారాశ వాగ్ధాటిచే అతడు ఆ సభను ఉర్రూతలూగించినాడు. రోమెన్‌రోలెండు అతనిని శాస్త్రీయసామ్రాజ్యాధిపత్యము నధిష్ఠించిన వచోధనిని ప్రశంసించినాడు. పూర్వయుగములోని వేదర్షియుండి మన సనాతన ధర్మసంస్కృతులను గూర్చి గర్వపడుచుకూడ జీవితమర్మమును ఉపదేశించుటలో వివేకానందుడు అత్యద్భుతుడనిపించుకొనెనని పండిత జవహర్ లాల్ నెహ్రూ వక్కాణించెను.

వివేకానందునిది కేవలము హిందూ మతసందేశమే కాదు. అది మతవిశ్వాసముల శాసనము. అల్లాడుచున్న హిందూమత నౌకకు అతడొక ఆశాతీరము, ధీరసత్త్వరూపమున లభించిన లంగరు. అతనిది ప్రమాణవాక్యము. తన సిద్ధాంతములను క్రమబద్ధము చేసికొని వాటిని వికాసోన్ముఖ మొనర్చుకొనుటయే నేడు హిందూమతమునకు కావలసినది. నిర్భయముగ సత్యమును చెప్పగలుగుటయే నేడు లోకమునకు కావలసినది. ఈ రెంటికిని స్వామి వివేకానందుడు సంగమస్థానము' అని సోదరి నివేదిత అతనిని వర్ణించెను.

వివేకానందునిది నీతిధర్మవర్తనముల విజయసందేశము. ఇంద్రియగ్రామ సంయమముచే జీవాత్మ పరమాత్మకాగల సందేశము. భారతీయుల తాత్త్వికచింత పాశ్చాత్యుల లోకాయత వాదతిమిరమును పంచబంగాళమగునట్లు చేయవలయునని చెప్పెడి సందేశము. ప్రతిజీవియందును ఇతర జీవుల తాదాత్మ్యబంధనములు అవిచ్ఛిన్నమైన ఏకత్వమును కలిగింపగలవని హైందవ ప్రత్యగాత్మ విశ్వమునకు ప్రబోధించిన సందేశము.

వి. వి. శ. శ

## విశాఖపట్టణము జిల్లా

ప్రాచీన చరిత్రక భౌగోళిక ప్రసిద్ధిగల విశాఖపట్టణము జిల్లా 1950 వ సం॥ వరకు భారతదేశమందలి పెద్దజిల్లాలలో నొకటిగ నుండెడిది పరిపాలనా సౌలభ్యము కొరకై ప్రభుత్వము దీనిని విశాఖపట్టణము శ్రీకాకుళము జిల్లాలుగ విభజించినది

ఉనికి విస్తీర్ణము విశాఖపట్టణము జిల్లా తూర్పు తీరమున ఉత్తర అక్షాంశము 17°- 0′ నుండి 18°-36′ వరకును తూర్పు రేఖాంశము 81° 50′ నుండి 8 •-55′ వరకును విస్తరించి యున్నది ఈ జిల్లా విస్తీర్ణము 5,79 చ మైళ్ళు జనాభా 22 90 759 వీరిలో పురుషుల సంఖ్య 11 42 647 స్త్రీల సంఖ్య 11 43 112 వీరిలో 18 77 724 మంది గ్రామములలోను 4 18 035 మంది నగరములలోను నివసించుచున్నారు జిల్లా యందలి జనసాంద్రత చ మైలుకు 442 ఈ జిల్లాలోని గ్రామములసంఖ్య 3524 పురముల సంఖ్య 10 ఈ జిల్లాయందు విశాఖపట్టణము అనకాపల్లి, ఎలమంచలి నర్సీపట్నము చింతపల్లి పాడేరు చోడవరము శృంగవరపుకోట విజయనగరము భీమునిపట్టణము అనుపది తాలూకాలున్నవి

సరిహద్దులు ఈ జిల్లాకు ఉత్తరమున ఒరిస్సారాష్ట్రము శ్రీకాకుళము జిల్లాయును కలవు తూర్పున బంగాళాఖాతము దక్షిణమున తూర్పుగోదావరి జిల్లాయును బంగాళాఖాతమును గలవు వ మరదిక్కున ఒరిస్సారాష్ట్రము గలదు

ఈ జిల్లా ఏజెన్సీప్రాంతము మైదానప్రాంతము అని రెండుభాగములుగ విభజింపబడియున్నది

ఏజెన్సీప్రాంతము ఈ ప్రాంతము జిల్లా లోపట్టున గలదు ఇది తూర్పు కనుమలతోను కొండలతోను గట్టులతోను అడవులతో నునిండియుండి సముద్రతీరమునకు సమాంతరముగ ఈశాన్యము నుండి నైరృతివరకు వ్యాపించి యున్నది

మైదానప్రాంతము జిల్లాలో మిగిలిన భాగమంతయు మైదానప్రదేశము తీరప్రాంతము ఉప్పుగనులతోను చిట్టి పర్రలతోను కొండమడుగులతోను నిండియున్నది ఏజెన్సీ విస్తీర్ణము 2591 చ మైళ్ళు ఇచ్చటి జనసంఖ్య 1 80 10 బంగారులు కోండదొరలు పోర్జాలు అను కొండజాతులవారు ఈ ప్రాంతములో నివసించుచున్నారు ఒకప్పుడీ ఏజెన్సీ ప్రాంతమంతయు సాంద్రారణ్యములతోను క్రూరమృగములతోను నిండియుండెడిది ప్రస్తుతమిది అభివృద్ధి దశయందున్నది

తాలూకాల వివరములు

(1) విశాఖపట్టణము తాలూకా – ఈ తాలూకా విస్తీర్ణము 193 చ మైళ్ళు ఇందు 58 గ్రామములు రెండు నగరములు కలవు మొత్తము జనసంఖ్య 3 06 471 గ్రామవాసుల సంఖ్య 95 79 నగరవాసుల సంఖ్య 2 11 190 జనసాంద్రత చ మైలుకు 1 588

(2) అనకాపల్లి తాలూకా – దీని విస్తీర్ణము 304 చ మైళు గ్రామముల సంఖ్య 304 పురముల సంఖ్య 1 మొత్తము జనసంఖ్య 2 44 491 గ్రామీణులసంఖ్య 1 78 0,9 పురవాసుల సంఖ్య 46 402 జనసాంద్రత 804

(3) ఎలమంచిలి తాలూకా – ఈ తాలూకా విస్తీర్ణము 347 చ మైళ్లు గ్రామముల సంఖ్య 143 పురముల సంఖ్య 1 మొత్తము జనసంఖ్య 2,59 735 గ్రామప్రజల సంఖ్య 2 46 179 పురవాసుల సంఖ్య 13 553 జనసాంద్రత 748

(4) నర్సీపట్నం తాలూకా – దీని విస్తీర్ణము 5 6 చ మైళ్లు ఇందు 130 గ్రామములు 1 పురమును కలవు మొత్తము జనాభా 2 41 375 గ్రామీణులసంఖ్య 2 8 607 పురవాసుల సంఖ్య 32 763 జనసాంద్రత 468

(5) చింతపల్లి తాలూకా – దీని వైశాల్యము 720 చ మైళ్లు ఇచటి గ్రామముల సంఖ్య 317 వీటి యందలి జనసంఖ్య 43 629 ఈ తాలూకాలో పురములు లేవు జనసాంద్రత 48

(6) పాడేరు తాలూకా–ఈ తాలూకా వైశాల్యము 19 9 చ మైళు గ్రామములసంఖ్య 162 మొత్తం జనాభా 1 83 145 జనసాంద్రత 1 0

(7) చోడవరం తాలూకా – దీని విస్తీర్ణము 534 చ మైళ్లు గ్రామములు 386 పురములు 2 జనాభా మొత్తము 298 619 వీరిలో గ్రామవాసులు 2 75 933 పురవాసులు 22 686 జనసాంద్రత 503

(8) శృంగవరపుకోట తాలూకా – దీని వైశాల్యము 407 చ మైళ్లు గ్రామముల సంఖ్య 337 పురములు 1 మొత్తము జనాభా 2,034 8 గ్రామవాసులసంఖ్య 1 93 611,

పురవాసుల సంఖ్య 9 807 జనసాంద్రత 512

(9) విజయనగరము తాలూకా - దీని వైశాల్యము 319 చ. మైళ్లు ఇందలి గ్రామముల సంఖ్య 191 పురములు 1 మొత్తం జనసంఖ్య 3 11 320 గ్రామవాసుల సంఖ్య 2 34 512 పురవాసుల సంఖ్య 76 808 జనసాంద్రత 667

(10) భీమునిపట్నం తాలూకా - విస్తీర్ణము 337 చ. మైళ్లు ఇందలి గ్రామములు 199 పట్టణములు 1 మొత్తం జనాభా 2 43 766 వీరిలో గ్రామీణులు 2 33 698 పురవాసులు 9 668 జనసాంద్రత 724

**శీతోష్ణస్థితి** - ఏప్రిల్ మే జూన్ నెలలు అధిక ఉష్ణోగ్రతగలవి ఈజిల్లాయందలి పశ్చిమప్రాంతములు మిగుల చల్లగనుండును కనుక ఇతర ప్రాంతముల నుండి ప్రజలు ఇచ్చటికి అధికముగా వచ్చుచుందురు

ఏజన్సీ ప్రాంతములో నైరృతి ఋతుపవనములచే అధికముగ వర్షము కురియుచుండును తీరప్రాంతము సమశీతోష్ణస్థితి యందుండును సంవత్సరపు సగటు వర్షపాతము 40'- 4"

**కొండలు; అడవులు** - ఈ జిల్లాలో తూర్పుకనుమలు వ్యాపించి యున్నవి వీటిలో [illegible] అడుగుల ఎత్తుగల కొండలుకూడకలవు ఇందు 1714 చ. మైళ్ళ వైశాల్యముగల అడవి యున్నది దీనినుండి కలప వెదురు వంటచెరకు లభించుచున్నది

**వ్యవసాయము** - ఈ జిల్లాయందలి భూమిని సేద్యరీత్యా నల్లరేగడ ఎఱ్ఱనేల అని రెండు తరగతులుగా విభజింపవచ్చును సారవంతమైన నల్లరేగడలో పంటలు అధికముగా పండుచున్నవి వేసవిలో ఈ నేల బీటలు వారుచుండును సాగుకు అనుకూలమైన 8 74 470 ఎకరముల భూమిలో 7 84 547 ఎకరముల నేల సాగులోనున్నది నీటి పారుదల సౌకర్యముగల భూవిస్తీర్ణము 3 18 483 ఎకరములు

**ఆహారధాన్యములు** - వరి సజ్జ ఈ జిల్లాలో పండు ముఖ్యమైన ఆహారపదార్థములు తిలలు పప్పుధాన్యములలో పెసలు వాణిజ్యపుపంటలలో వేరుసెనగ, చెరకు నువ్వులు పేర్కొనదగినవి

**గృహపరిశ్రమలు** - ఈ జిల్లాలో గణనీయమైన గృహపరిశ్రమ చేనేతవస్త్రములు. దీని తరువాత శర్కరతో తయారు చేయు పదార్థములు నీటి తరువాత నువ్వుల నూనె, కర్రలు, రంగులతో తయారగు బొమ్మలు

**భారీ పరిశ్రమలు** - విశాఖపట్టణమునందు హిందూస్థాను షిప్‌యార్డు అనకాపల్లి యందు పంచదార ఫ్యాక్టరీ ఈ జిల్లాలో పేర్కొనదగిన భారీ పరిశ్రమలు

**ముఖ్యవృత్తులు** - ఈ జిల్లాలో నాలుగింట మూడువంతులు ప్రజలు వ్యవసాయమువలన ప్రత్యక్షసంబంధమైన పనులవలన జీవించుచున్నారు మిగిలినవారు గృహపరిశ్రమలలోను వ్యాపారములలోను ఇతర ఉద్యోగములలోను పని చేయుచున్నారు

**భాషలు** - ఇందు అధికసంఖ్యాకులు మాతృభాషయగు తెలుగు మాట్లాడుచున్నారు మిగిలినవారు ఒరియా గదబ ఉర్దూ ఖోండు కోయ హిందీ తమిళము మళయాలము పంజాబి వంగ ఇంగ్లీషు భాషలు మాటాడుచున్నారు

**విద్య** - ఏజెన్సీ ప్రాంతముకంటె మైదానప్రాంతమందు విద్య అత్యధికముగా వ్యాపించియున్నది 1961 వ సం॥ జనాభా లెక్కల ననుసరించి ఈ జిల్లాలోని అక్షరాస్యుల సంఖ్య 16 85 శాతము 1966-67 లెక్కల ప్రకారము ఈ జిల్లాయందు 1 04 ప్రాథమిక పాఠశాలలు 16 మాధ్యమిక పాఠశాలలు 85 ఉన్నత పాఠశాలలు కలవు

వాల్తేరులో ఆంధ్రవిశ్వవిద్యాలయము ఉపస్థితియందున్నది దీనికి అనుబంధములుగా ఒక ఆర్ట్సు అండ్ సైన్సు కళాశాలయు ఒక సైన్సు కళాశాలయు ఒక ఇంజనీరింగు కళాశాలయు ఒక న్యాయశాస్త్ర కళాశాలయు ఒక ఉపాధ్యాయ శిక్షణ కళాశాలయు ఒక వైద్యకళాశాలయు నెలకొనియున్నవి ఇవికాక విశాఖపట్టణములో ఒక ఆర్ట్సు అండ్ సైన్సు కళాశాల కలదు విజయనగరములో రెండు కళాశాలలు అనకాపల్లిలో ఒక కళాశాలయు నిర్వహింపబడుచున్నవి ఇవికాక ప్రభుత్వయాజమాన్యమున ఆధునికపద్ధతులలో వైద్యకళాశాలలు ఇంజనీరింగు కళాశాలలు పాలిటెక్నిక్ కళాశాలలు మరికొన్ని నిర్వహింపబడుచున్నవి

**ఆరోగ్యము; వైద్యము** - ఏజెన్సీ ప్రాంతములో పూర్వము మలేరియావ్యాధి విశేషముగా వ్యాపించి యుండెడిది ప్రభుత్వము ఇటీవల దీనిని నిర్మూలించి ప్రజల ఆరోగ్యమును కాపాడుచున్నది ఈ జిల్లాలో నిర్మింపబడిన 38 ప్రభుత్వ ఆస్పత్రులలో వైద్యసౌకర్యము కల్పింపబడినది విశాఖపట్టణమందలి కింగ్ జార్జిజనరల్ ఆస్పత్రి ఆంధ్రదేశ

మందు మిగుల పెద్దది వాల్తేరులో మానసిక చికిత్సకై ఒక పెద్ద ఆస్పత్రి నిర్మింపబడినది

రవాణా సౌకర్యములు - ఈ జిల్లాలోని తాలూకాల ముఖ్యపట్టణము లన్నింటికి రైలు సౌకర్యములు కొన్ని రోడ్డు సౌకర్యములు కలవు జిల్లాలో 182 మైళ్ళ నిడివిగల జాతీయ రహదారిమార్గమును 60 మైళ్ళ సాధారణ రోడ్డుమార్గములు కలవు ఇవి కాక 278 మైళ్ళ విస్తీర్ణములో జిల్లా పరిషత్తుచే నిర్మింపబడిన రోడ్లు కలవు

69 మైళ్ళు దక్షిణమండలపు రైల్వేమార్గము 69 మైళ్ల దక్షిణ - తూర్పుమండల రైల్వేమార్గము ఈ జిల్లా యందు కలవు

తంతితపాలా సౌకర్యములు - ఈ జిల్లాలో 359 పోస్టాఫీసులున్నవి ఇందులో 1 హెడ్డాఫీసు 37 సబ్ పోస్టాఫీసులు, 321 బ్రాంచి ఆఫీసులు కలవు 24 టెలిగ్రాఫ్ ఆఫీసులును 6 టెలిఫోను ఎక్స్చేంజి ఆఫీసులును 72 పబ్లిక్ కాల్ ఆఫీసులును ఈ జిల్లాలో కలవు

నదులు -

(1) మాచ్‌ఖండ్‌నది (మత్స్యకుండము)-ఇది చింతపల్లి తాలూకాలోని మాడుగుల కొండయందు పుట్టి ఉత్తర దిశగాసాగి మరల పడమ దిక్కునకు మరలి ఒరిస్సా రాష్ట్రము లోనికి ప్రవహించుచున్నది ఈ నదికి డూడూమా వద్ద ఒక జలపాతము గలదు ఆ కర్షణీయముగ నుండు దీనినుండి జలవిద్యుత్తు తయారగుచున్నది

(2) చంపావతి - ఇది గాలి కొండపర్వతములో ఉద్భవించి శృంగవరపుకోట విజయనగరము భీమునిపట్నము తాలూకాల గుండా ప్రవహించి కోనాడ అను తావున సముద్రముతో సంగమించుచున్నది

(3) శారదానది - ఇది కూడ మాడుగుల కొండయందే జన్మించి చోడవరము అనకాపల్లి ఎలమంచిలి తాలూకాల గుండా ప్రవహించి వాడాడ అను తావున సముద్రములో కలియుచున్నది

(4) వరాహనది - ఈనది గోలుకొండలలో పుట్టి నర్సీపట్నము ఎలమంచిలి తాలూకాల గుండా ప్రవహించి వాడాడ అనుతావున బంగాళాఖాతములో కలియుచున్నది

(5) గోస్తని - ఇది శృంగవరపుకోట తాలూకాలోని అనంతగిరి కొండలో పుట్టి శృంగవరపుకోట, భీమునిపట్నము తాలూకాలలో ప్రవహించి భీమునిపట్నమువద్ద సముద్రములో చేరుచున్నది గోస్తనములవంటి ఆకారముగల శిలల నుండి ధారగా ప్రవహించుటచే ఈ నదికీ పేరు కలిగినది

పైన పేర్కొనిన నదులే కాక మహేంద్రగెడ్డ సరుగుడు గెడ్డ తాండవ అనునదులుకూడ ఈ జిల్లాయందు పేర్కొనదగినవి

దర్శనీయప్రదేశములు

(1) మాచ్‌ఖండ్ ప్రాజెక్టు - విశాఖపట్టణమునకు 12 మైళ్ళ దూరమున డూడూమా అను తావున మాచ్‌ఖండ్ నదిపై హైడ్రో ఎలెక్ట్రిక్ ప్రాజెక్టు నిర్మింపబడినది దీనివలన 110 వేల కిలోవాట్ల విద్యుత్తు తయారగుచున్నది ఈ విద్యుత్తును ఆంధ్ర ఒరిస్సా రాష్ట్రములు వినియోగించుచున్నవి ఈ ప్రాంతమందలి వాతావరణము మనోహరమైన ప్రకృతి రామణీయకదృశ్యములు ప్రజలను ఆకర్షించి ఆనందింపజేయు చుండును

(2) సింహాచలము-సింహాచలము విశాఖపట్టణము - విజయనగరము రైలుమార్గముపైగల పవిత్రవైష్ణవక్షేత్రము ఇది రైలుస్టేషనుకు రెండుమైళ్ళ దూరమున 800 అడుగుల ఎత్తుగల సింహాచల మనుకొండపై నెలకొన్నది ఇందు వేంచేసియున్న దైవము వరాహలక్ష్మీనరసింహస్వామి 11 వ శతాబ్దినాటి శాసనమువలన ఈ క్షేత్రము అప్పటికే యాత్రాస్థలముగా ప్రఖ్యాతినొందినట్లు తెలియుచున్నది కొండపైని దేవాలయము పరకుగల చక్కనిమెట్లు దారికిరుప్రక్కల నున్న ప్రకృతి దృశ్యములు అతిలోకరమణీయముగ నుండి యాత్రికులను ఆకర్షించుచుండును శ్రీవిష్ణువు ఈ క్షేత్రముననే ప్రహ్లాదుని కటాక్షించెననియు ఈ భక్తుడే ఈ క్షేత్రమందలి దేవాలయమును నిర్మించెననియు భక్తులు భావించుచుందురు పదకొండవ శతాబ్ది ఉత్తరార్ధమున రామానుజాచార్యులు ఈ క్షేత్రమును దర్శించెను ఇది అతిశ్రేష్ఠస్థానముగల మహాక్షేత్రమగుటచే ఔత్తరాహులు సైతము ఈ స్వామిని దర్శించుచుందురు

విశాఖపట్టణము - ఇది ఈ జిల్లాకు ముఖ్యకేంద్రము వైశాఖ యను శబ్దమునుండి విశాఖపట్టణమను నామముత్పన్నమైనది 17 వ శతాబ్ది మధ్యభాగమున ఈస్టిండియా కంపెనీవారు ఒక కర్మాగారము నిచ్చట నిర్మించుటతో దీని ప్రాముఖ్యమధికమైనది; అటుపిమ్మట ఇది జిల్లా ముఖ్యకేంద్ర

ముగ అభివృద్ధికాంచినది. ఈ పట్టణము సముద్రపుటొడ్డున ఐదు మైళ్ళ పొడవున నిర్మింపబడినది. ఈ నగరము వాల్తేరు, విశాఖపట్టణము అను రెండుభాగములుగ నున్నది. వాల్తేరునందు ప్రముఖ విద్యాకేంద్రమైన ఆంధ్ర విశ్వవిద్యాలయము నెలకొనియున్నది.

విశాఖపట్టణము ఆంధ్రప్రదేశ్ గవర్నరుకు వేసంగి విడిది. ఇచ్చట భారతదేశ మంతటిలో పెద్దదైన హిందూస్థాన్ ఓడ యార్డు 666 ఎకరముల భూమిని ఆక్రమించియున్నది. ఇది స్వతస్సిద్ధముగా ఏర్పడిన గొప్ప నౌకాకేంద్రము. ఇచ్చట గొప్ప విమానస్థావరము, బ్రహ్మాండమైన లైట్‌హౌసు, నూనె శుద్ధి కర్మాగారము గలవు.

అరకులోయ - విశాఖపట్టణమునకు 79 మైళ్ళ దూరమున ఈ లోయ కలదు. దీనిని చేరుటకు చక్కని రోడ్డు నిర్మింపబడినది. ఈ మార్గమున ఇరుప్రక్కల సుందరదృశ్యము లెన్నియో గలవు. ఈ లోయను దర్శించుయాత్రికులకు సకల అవసరములు సమకూర్చబడుచున్నవి. ఈ లోయ అభివృద్ధికై బహుళార్థ సాధకమైన కార్యక్రమములు అమలు జరుపబడుచున్నవి.

ఇచ్చట నివసించు ఆదిమవాసులు తమ నృత్యగానములతో ప్రకృతిసిద్ధమైన రామణీయకతను ఇనుమడింపజేయుచు యాత్రికుల కానందము కలుగజేయుదురు. ప్రభుత్వమువారు యాత్రికుల సౌకర్యమునకై రహదారి బంగళాను ఆధునాతనపద్ధతులతో నిర్మించిరి.

రామతీర్థము - విజయనగరమునకు తొమ్మిదిమైళ్ళ దూరమున ఈ క్షేత్రమున్నది. దీనికి సమీపములో నున్న బోడి కొండపై ఇటుకకట్టడములలో జైనతీర్థంకరుల విగ్రహములున్నవి. (వివరములకు "రామతీర్థము" అను వ్యాసము చూడుడు-7 వ సంపుటము.)

విజయనగరము - విశాఖజిల్లాలో ఇది రెండవ పెద్ద పట్టణము. విజయనగర ప్రభువులు దీనిని తమ రాజధానిగా చేసికొని ఈ ప్రాంతమంతటిని పరిపాలించిరి. ఇచట ఒక పెద్దకోటయు, పెద్దజలాశయమును కలవు. ప్రాచీన విద్యాకేంద్రమైన ఈ నగరపరిసరములు పచ్చని తోటలతో కళకళలాడుచుండును.

అనకాపల్లి - ఇది విశాఖజిల్లాలో గొప్ప వ్యాపారకేంద్రము. ఇచ్చట ఒక సహకార కర్మాగారమును, బెల్లము తయారుచేయు కర్మాగారమును కలవు. ఇచ్చటగల కన్యకాపరమేశ్వరీ దేవాలయము పట్టణపు శోభను ఇనుమడింపజేయుచుండును. ఇచ్చట ఆర్ట్సు అండ్ సైన్సు కళాశాల కూడ ఒకటి కలదు.

జిల్లాచరిత్ర - గంజాము జిల్లాలో లభించిన శాసనములు, నాణెములు సైతము ప్రాచీన కళింగదేశాంతర్గతమైన ఈ మండలముయొక్క పూర్వచరిత్రను వ్యక్తము చేయుటలేదు. కొంత కాలమీ ప్రాంతమును సాతవాహన రాజులు పాలించిరి. వీరి పిమ్మట పెక్కు చిన్న రాజవంశములవారు దీనిని పాలించిరి. ఈ జిల్లాలో కొంత భాగమునకు దేవరాష్ట్రమని ఆనాడు పేరుండెడిది. దీని పాలకుడైన కుబేరుడను రాజును సముద్రగుప్తుడు జయించినట్లు తెలియుచున్నది.

క్రీ. శ. 5 వ శతాబ్దాంతమున ఈ మండలము పూర్వగాంగుల రాజ్యములో అంతర్భాగముగ నుండెడిది. క్రీ. శ. 624 లో దీనిని చాళుక్యపులకేశి వశపరచుకొనెను. తూర్పు చాళుక్య ప్రభువగు జయసింహుడు క్రీ. శ. 641-673 సం. ల నడుమ విశాఖపట్టణము వరకుగల ప్రాంతమును జయించి పాలించినట్లు తెలియుచున్నది. ఆనాడు వేంగిరాజ్యమున కుత్తరపుహద్దు విశాఖజిల్లా ఉత్తరపు దిక్కువరకు వ్యాపించియుండెను. కళింగదేశము నందలి చాలభాగము వేంగిరాజ్యాంతర్గతముగ నుండినట్లు దీనివలన విశదమగుచున్నది. పూర్వ చాళుక్యుల కాలముననే ఈ ప్రాంతము మరల గాంగుల వశమైనది. క్రీ. శ. 1078-1150 ల నడుమ అనంతవర్మ చోడగంగు ఈ ప్రాంతమును పాలించు కాలమున మొదటి కులోత్తుంగ చోడుడు దీనిపై దండెత్తి జయించినట్లు ఆ ప్రభువు వేయించిన శాసనము తెలుపుచున్నది.

చాళుక్యచోళుల అనంతరము ఈ భూభాగముపై వెలనాటి చోళులు కొంతకాలము రాజ్యమేలిరి. ఆ వంశమునకు చెందిన మహాకవ గొంకరాజు యొక్కయు పృథ్వీశ్వరులనువారి యొక్కయు శాసనములు సింహాచలము, ద్రాక్షారామము, విశాఖపట్టణము, శ్రీకూర్మములందు లభించినవి.

క్రీ. శ. 1248 లో కాకతిగణపతిదేవుడీ ప్రాంతమును జయించెను. కాకతీయసామ్రాజ్యపతనానంతరము రెడ్డిరాజ్యస్థాపకులలో నొకడగు అనవేమారెడ్డి 1872 లో ఈ ప్రాంతముపై దండయాత్రచేసి దానిని స్వాధీనపరచుకొనెను. 1450వ సం॥ పిమ్మట కళింగగజపతులు దీనిని తమ స్వాధీనములోనికి తీసికొనిరి.

విజయనగరసామ్రాజ్యాధీశ్వరులైన శ్రీకృష్ణదేవరాయలు క్రీ శ 1515 లో ఈ ప్రాంతముపై దండయాత్ర చేసి, గజపతుల నోడించి ఈ భూభాగమంతటిని స్వాధీనమొనర్చుకొని శ్రీకాకుళపట్నము తాలూకాలోని పొట్నూరునందు విజయస్తంభమును నాటించెను రాయలకును గజపతులకును సంధికుదిరిన పిమ్మట మరల ఈ ప్రాంతము గజపతుల హస్తగతమై 1589 వరకు వారి స్వాధీనమునందే యుండెను అపిమ్మట ఇది గోల్కొండ కుతుబుషాహీల వశమైనది అనంతరము పూసపాటి వంశమువారు దీనిని క్రమముగా స్వాధీనపరచుకొని విజయనగరమునందు గొప్పకోటను నిర్మించి పాలింపదొడగిరి

గోలకొండ నవాబుల కాలమునుండి డచ్చివారు, ఇంగ్లీషువారు ఫ్రెంచివారు దీనిని తమవ్యాపార కేంద్రముగ చేసికొని ఈ ప్రాంతమున పెక్కు కట్టడములను నిర్మించిరి అటుపిమ్మట ఉత్తరసర్కారు జిల్లాలు నైజాము నవాబుల వశమైనది తర్వాత ఇంగ్లీషువారు వీటిని స్వాధీనపరచుకొనిరి ఈ జిల్లా బ్రిటిషువారి స్వాధీనములోనికి వచ్చిన పిమ్మట వారిసామ్రాజ్యము అస్తమించువరకు బ్రిటిషువారితో ఈ ప్రాంతమున పెక్కుసాయుధపోరాటములు జరిగినవి ఈ తిరుగుబాటులు ఈ జిల్లాచరిత్రకు ఘనతనుచేకూర్చుచు ఆంధ్రుల చరిత్రయందు సైతము ఒక విశిష్టతను సమకూర్చుచున్నవి

ఈ ప్రాంతము ఈస్టిండియా కంపెనీవారికి లభించి నప్పుడు శ్రీకాకుళము సర్కారులో నుండెడిది దీనిని వారు గంజాము విశాఖపట్టణము జిల్లాలుగ విభజించిరి 1936 లో ఒ స్వారాష్ట్రమేర్పడి నప్పుడు గంజాము ఒరిసా రాష్ట్రములో కలుపబడినది 1950 లో విశాఖపట్టణముజిల్లాలోని కొన్ని తాలూకాలతో శ్రీకాకుళముజిల్లా వేరుచేయబడి మిగిలిన భాగము యథాప్రకారము విశాఖపట్టణము జిల్లాగా వ్యవహరింపబడినది

వు వెం

## విశిష్టాద్వైతము

కాంచు ది శాస్త్రము వేదాంతశాస్త్రము సమగ్ర బ్రహ్మతత్త్వ నిరూపకము ఉత్తమ పురుషార్థప్రాపకము అయినందువ సర్వశాస్త్రాలకు శిరోమణి యైనది

భగవద్రామానుజాచార్యుల చేత తమ శ్రీభాష్యము నందు ప్రపంచితమైనది విశిష్టాద్వైత తత్త్వము ద్వైతమునగా భేదము తదభావము అద్వైతము బ్రహ్మతత్త్వము ఏకమే పరమార్థమని తద్భిన్నము అపరమార్థమనియు తెలుపుచున్నది అద్వైతమతము భిన్నస్వరూపస్వభావములుగల చిత్ - అచిత్ - ఈశ్వరతత్త్వములు మూడు అనియు అందు చిదచిత్తత్త్వములు ఈశ్వరునకు శరీరభూతములై పరతంత్రములై అతనితో సర్వదా అవినాభావసంబంధము కలిగి యుండుననియు ప్రాంశభూతములగు వాటితో విశిష్టమగు బ్రహ్మతత్త్వము ఏకము అనియు విశిష్టాద్వైతము నిరూపించుచున్నది జగత్సృష్టికిముందు బహుస్యాంప్రజాయేయ (నేను విస్తృతరూపముగ జనింతును) అని సంకల్పించుచున్న పరబ్రహ్మము స్థూలసూక్ష్మదశలలో తనను జగదభిన్నముగ భావించుచున్నది ఈ జగద్రూపపరిణామము నిర్వికారమగు బ్రహ్మస్వరూపమునకు సంభవింపదు కావున సూక్ష్మరూపమున అతనికి శరీరముగ జీవప్రాయమై యుండు చిదచిద్పదార్థములకే పరిణామమును చెప్పవలయును ఈ విషయము మనుస్మృతి ఒకటవ అధ్యాయములోని "సోభిధ్యాయ శరీరాత్ స్వాత్, సిసృక్షుర్వివిధాః ప్రజాః" అను శ్లోకమున స్పష్టము పరమాత్మ సృష్టికి సంకల్పించి తన శరీరము నుండి వివిధప్రజలను ప్రపంచమును సృజించుచున్నదని దాని యర్థము ఇట్లు స్థూలసూక్ష్మదశలలో బ్రహ్మము చిదచిద్విశిష్టమనియు జగదభిన్నముగ తనను భావించుచున్నదనియు స్పష్టము

ఈ సిద్ధాంతమునకు అతిప్రధానహేతువు చిదచిద్రూప ప్రపంచమునకును ఈశ్వరునకును శరీరశరీరిభావము అంగీకరించుట బృహదారణ్యకమునందును సుబాలోపనిషత్తునందును స్మృతిపురాణాదులందును సుస్పష్టముగ పలువిధములగు అచిత్పదార్థములను జీవాత్మలను ఈశ్వరునికి శరీరముగ నిరూపించు ప్రమాణములు కలవు అవి ఇవి "యః పృథివ్యాంతిష్ఠన్ పృథివ్యా అంతరః యం పృథివీ న వేద యస్య పృథివీశరీరం యః పృథివీమంతరో యమయతి సత ఆత్మా అంతర్యామ్యమృతః ఇది బృహదారణ్యకము ఈ వాక్యమునకు తరువాత గూడ పలువిధములగు ప్రత్యేక వాక్యములు కలవు ఇట్లే ఈ ఘట్టమునందే "య ఆత్మని తిష్ఠన్ యస్య ఆత్మాశరీరం" ఇత్యాదివాక్యము జీవునకు బ్రహ్మనియామ్యత్వమును శరీరభూతత్వమును స్పష్టముగ తెలుపుచున్నది ఇక సుబాలోపనిషత్తునందలి "యస్య పృథివీ శరీరం, యః పృథివీమంతరే సంచరన్ యం పృథివీ న వేద యస్య అవ్యక్తం శరీరం

యస్యతేజశ్శరీరం ఏషసర్వభూతాంతరాత్మా అపహతపాప్మా దివ్యోదేవ ఏకోనారాయణః ఇత్యాదిచే ఈవిషయము స్పష్టము చేయబడినది. ఇట్లే కొన్ని స్మృతివాక్యములు "జగత్సర్వం శరీరంతే" "యదంబు వైష్ణవః కాయః" "తత్సర్వం వై హరేస్తనుః" "తానిసర్వాణితద్వపుః" ఇత్యాదులు. ఇట్లు బహుశ్రుతి స్మృతి సిద్ధమగు జగచ్ఛరీరకత్వమును ఆధారముగాగొని సర్వశరీరకుడగు పరమాత్మ ఒకడేయనియు ఈ దృశ్యప్రపంచాతిరిక్త తత్త్వాంతరము లేనందున విశిష్టాద్వైతము సిద్ధమనియు శ్రీరామానుజుల సిద్ధాంతము. ఇచట కొకయాక్షేపము. పరమాత్మకు జగత్తుశరీరమనుట అనుపపన్నము "అశరీరంశరీరేషు" "అప్రాణోహ్యమనాః" "అచక్షుశ్శ్రోత్రంతదపాణిపాదం" ఇత్యాదిశ్రుతులు బ్రహ్మము అశరీరమని చెప్పుచున్నవి కదా! మరియు పృథివ్యాదులు అతనికి శరీరమనుట గూడ అసమంజసమే. శాస్త్రములయందు శరీరలక్షణమిట్లు చెప్పబడినది: కర్మఫలభూత సుఖదుఃఖానుభవసాధనము ఇన్ద్రియాశ్రయము చేష్టాద్యాశ్రయము పాంచభౌతికము శరీరము. ఇందేలక్షణము గూడ ప్రత్యేకముగా పృథివ్యాద్యచిత్పదార్థములకుగాని జీవాత్మలకుగాని అన్వయింపనందున వానిపరమాత్మకు శరీరభూతములనుటచెల్లదు. జీవులుగాని అచిత్పదార్థములుగాని పరమాత్మకు కర్మఫలభోగసాధనములుకావు. మరియు అయ్యది పుణ్యపాపకర్మలకులతీతుడు. జగద్వ్యాపకులకు గూడ శరీరశరీరిభావహేతుకమగు విశిష్ట్యమును చెప్పుట అయుక్తమే.

ఇందులకు సమాధానమిది: పరమాత్మకు సర్వపదార్థములు శరీరములేయని చెప్పు పలుశ్రుతి స్మృతి వాక్యములను కాదనలేము. మరి "అశరీరం అపాణిపాదం" ఇత్యాదిశ్రుతులకు కర్మసంబంధ ప్రాప్తమగు శరీరమునికి లేదనియే యర్థము. ఈవిషయమును "నభూతసంఘసంస్థానో దేహోస్య పరమాత్మనః" "నతస్య కర్మనిమిత్తజా" ఇత్యాది ప్రమాణములనుబట్టి తెలిసికొనవచ్చును. అస్మదాది శరీరములవలె కర్మనిమిత్తములును భౌతికములును గాక భగవన్మూర్తులు స్వేచ్ఛాపరిగ్రహీతములై అప్రాకృతములైన వనియు ప్రమాణములకు భావము. ఇట్టి వ్యవస్థను అంగీకరింపనిచో పరమాత్మకు శరీరమును బోధించువాటికిని అశరీరత్వమును బోధించువాటిని పరస్పర విరోధము కలుగును. మరియు ఈశ్వరునకేగాక ముక్తాత్మలకు గూడ "సఏకధా భవతి త్రిధా భవతి పంచధా" ఇత్యాది శ్రుతులు స్వేచ్ఛాపరిగృహీతాప్రాకృతానేకశరీర పరిగ్రహసంబంధమును తెలుపుచున్నవి. కనుక శరీరమునకు లక్షణముచెప్పునపుడు కేవలము అస్మదాది భౌతికశరీరములకు మాత్రము వర్తించులక్షణమును గాక వేదాది ప్రమాణసిద్ధములగు అప్రాకృత భగవదాది శరీరములకుగూడ వర్తించు ఉభయానుగతలక్షణమునే నిర్వచింపవలెను. పూర్వపక్షిచే చూపబడిన లక్షణము ఈశ్వరముక్తాత్మశరీరములలో అవ్యాప్తము. శాపగ్రస్తులగు అహల్యాదులయొక్క శిలాకాష్ఠాదిరూపశరీరములయందు కర్మఫలభోగసాధనత్వమున్నను ఇంద్రియాశ్రయత్వములేదు. ఏకాకారత్వరూపమగు జాతినిబట్టి శరీరలక్షణమును నిర్వచింపవలెన్నచో అది అసాధ్యము. పంచభూతములలో కానబడు ఏకవిధాకారము మానవ–పశు పక్షి కీటకాది శరీరములలో కనబడుటలేదుకదా!

ఇట్లుండ ఈశ్వరముక్తాత్మలకు శరీరము కలదని చెప్పు శ్రుతివాక్యములకు కొందరు గౌణార్థకత్వమును కల్పించిరి. ప్రకృతిలోనుండు ప్రతివస్తువు వేరొక్కటి ఇది పరమాత్మ శరీరము అని చెప్పు అసంఖ్యాకములగు వైదికవాక్యములకు గౌణార్థత్వమును కల్పించుట అసమంజసము. ఈ స్థలమున శ్రీరామానుజులచేత సర్వానుగతముగా నిర్వచింపబడిన శరీరలక్షణమిట్లున్నది: "యస్య చేతనస్య యద్ద్రవ్యం సర్వాత్మనా స్వార్థే నియంతుం ధారయితుం చ శక్యం తచ్ఛేషతైకస్వరూపం చ తత్తస్య శరీరమ్" ఏ చేతనునికి ఏ పదార్థము సర్వవిధములుగను స్వార్థమునకు వినియోగించుకొనుటకు వీలగుచు అతనిచేత పోషింపబడుచు అతనికే పరతంత్రమైయుండునో అదియతని శరీరమగును. ఈ లక్షణముప్రకారము ఈశ్వరునికి సర్వచిదచిత్పదార్థములు విధేయములై నియామ్యములై భోగ్యములై యున్నందున అవియన్నియు అతనికి శరీరము లనుటలో ఆక్షేపములేదు. రోగాదులచేత నియమనశక్తి ప్రతిబద్ధమైనందున యథేష్టముగ శరీరప్రవృత్త్యాదులు కలుగకపోవచ్చును. అంతమాత్రముచేత నియామ్యత్వము శరీరలక్షణము కాకపోదు. చంద్రకాంతాది మణిసన్నిధానమున అగ్నికి సహజమగు దాహకత్వశక్తి ప్రతిబంధింపబడి తాత్కాలికముగా అగ్నిశీతలముగ తోచినను దానికి ఉష్ణస్పర్శము సహజగుణము కాదనలేము కదా! కావున ఇట్టి శరీరలక్షణము పరమాత్మతో సమన్వితమై తదేకనియామ్యమై తత్పరతంత్రమగు చిదచిన్మిశ్ర సర్వప్రపంచమునకు సంభవించుటచేత తద్విశిష్టుడగు పరమాత్మకు చెప్పబడు ఏకత్వమే విశిష్టాద్వైతము.

ఉపనిషత్తులు కొన్ని చిత్ అచిత్-ఈశ్వరత త్త్వములకు స్వరూప స్వభావములను బట్టి భేదమున్నట్లు చెప్పుచున్నది "ప్రధానక్షేత్రజ్ఞ పతిర్గుణేశః" "క్షరం ప్రధానం అమృతాక్షరం హరః క్షరాత్మానా వీశతే దేవ ఏకః" "ద్వాసుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే" "జ్ఞాజ్ఞౌ ద్వావజౌ ఈశనీశౌ" "అజామేకాం లోహిత శుక్ల కృష్ణాం" "అజోహ్యేకో జుషమాణోఽనుశేతే జహాత్యేనాం భుక్తభోగామజోఽన్యః" ఇత్యాది శ్రుతి వాక్యములు స్వరూప భేదమును బోధించునవి. "తత్త్వమసి" "అయమాత్మా బ్రహ్మ" "ఐతదాత్మ్యమిదం సర్వం" "సర్వం ఖల్విదం బ్రహ్మ" "బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి" ఇత్యాదులు జీవ ప్రపంచములతో ఈశ్వరునికి అభేదమును చెప్పుచున్నవి. ఈ అభేదమును సమర్థించుటకై "నేహ నానాస్తి కించన" "ఏకమేవాద్వితీయం" ఇత్యాదులు భేదమును నిషేధించుచున్నవి. ఇట్లు పరస్పర విరుద్ధములుగ తోచు భేదాభేద శ్రుతులకు సమన్వయము కుదరదని యెంచి అద్వైత సిద్ధాన్తకారులు అజ్ఞాతార్థబోధకములైనందున అభేదశ్రుతులే యదార్థములనియు ప్రత్యక్ష సిద్ధార్థబోధకములైనందున భేదశ్రుతులు అయథార్థములనియు వ్యవస్థను చూపిరి. ఈ పద్ధతిని శ్రీరామానుజులంగీకరింపలేదు. వారు ఆపాతప్రతిభాసమగు భేదాభేద శ్రుతి విరోధమును ఘటక శ్రుతుల సమన్వయముతో విడదీసి పరిహరించిరి. శరీర శరీరిభావ బోధక శ్రుతులే ఆ ఘటక శ్రుతులు. ప్రత్యేకముగ తత్త్వత్రయమునకు స్వరూప స్వభావభేదమును భేదశ్రుతులు చెప్పుననియు సృష్టి ప్రళయములయందు స్థూల సూక్ష్మరూపమునున్న చిదచిత్తులను తనకు శరీరముగా కలిగి సర్వదా తద్విశిష్టుడై యుండు పరమాత్మ ఒకడే అయి యుండుటను విశిష్ట బ్రహ్మాతిరిక్త పదార్థము వేరులేనందున, అద్వైత శ్రుతులకు సార్థక్యమనియు వీరి సమన్వయము. శ్రుతులలో ఎటుగత్తి చెప్పబడిన పలువిధములగు అనన్త కళ్యాణ గుణములను పరమాత్మకు వాస్తవములు కావనుట అనుచితమని భావించిన శ్రీరామానుజులు బ్రహ్మము సగుణమే అనియు నిర్గుణ శ్రుతులు అతనికి హేయములగు ప్రాకృత గుణములు లేవని చెప్పుచున్నవనియు నిర్గుణ సగుణ శ్రుతులకు వ్యవస్థను చూపిరి. ఇట్టి తమ వాదమునకు ప్రమాణముగా "అపహతపాప్మా విజరో విమృత్యుర్విశోకో విజిఘత్సోఽపిపాసః సత్యకామస్సత్య సంకల్పః" అను శ్రుతిని ఉదాహరించిరి.

సగుణమగు ఈ పరబ్రహ్మము శివుడా నారాయణుడా దేవతాన్తరమా అను మతభేదము శ్రుతి వైవిధ్యముచేత కలిగినప్పుడు "పూర్వపదాత్ సంజ్ఞాయామగః" అను ణత్వ విధాయక వ్యాకరణ సూత్ర ప్రకారము ఇతర దేవతలకు సమన్వయింపరాని నారాయణ పదశబ్దము సుబాలోపనిషత్తు మహోపనిషత్తు-నారాయణానువాకము-మొదలగు ఉపనిషత్తులలో స్పష్టముగా ప్రయుక్తమైనదునను పురుషసూక్తమున చెప్పబడిన "హ్రీశ్చతే లక్ష్మీశ్చపత్న్యౌ" ఇత్యాది వాక్య ప్రతిపాదిత లక్ష్మీపతిత్వాది లక్షణములవలనను "అగ్నిరవమో దేవానాం విష్ణుః పరమః" ఇత్యాది తైత్తిరీయ సంహితాగత వాక్యములవలనను శ్రీమన్నారాయణ పరత్వమునే శ్రీరామానుజులు నిర్ధారణమొనర్చిరి. "అంగాన్యన్యా దేవతాః" అను శ్రుతి ప్రకారము దేవతాన్తరములు జగచ్ఛరీరకుడగు నారాయణునకు అంగభూతములని తెలిపిరి.

ప్రకృతిమండలమున తాపత్రయాభిహతుడగు జీవునకు విముక్తి కొరకు కర్మజ్ఞానయోగాంగక భక్తియోగము సాధనమనియు పరమపదమను శబ్దవాచ్యము అప్రాకృతమునగు శ్రీవైకుంఠమును చేరి అచట సర్వజ్ఞత్వ సత్యసంకల్పత్వాది సహజగుణావిర్భావము కలిగి భగవత్సేవ నొనరించుచు పునరావృత్తి రహితముగ శాశ్వతానన్దమునందుటయే ముక్తియనియు బ్రహ్మసూత్ర భాష్యమున శ్రీరామానుజులు స్థాపించిరి.

స ద ర

## విశిష్టాద్వైతము - ఆచార వ్యవహారములు

శ్రీ రామానుజులచేత పరిపోషితమైన విశిష్టాద్వైత సిద్ధాన్తమును అవలంబించిన శ్రీవైష్ణవులు తమ ఆచార వ్యవహారాది సంప్రదాయములలో పాంచరాత్రాగమ ప్రామాణ్యమునంగీకరించిరి. ఆ యాగమోక్తక్రమమున భగవదారాధన విధానమును ఆత్మకును దేహమునకును విధింపబడిన పంచ సంస్కారములను పాటించిరి. బ్రహ్మసూత్ర వ్యాఖ్యానమును చేయుచు శ్రీ రామానుజాచార్యులు పాంచరాత్రమునకు సర్వాత్మనా ప్రామాణ్యమును నిరూపించిరి. భగవద్గీతవలె, పాంచరాత్రాగమము కూడ సాక్షాత్ భగవన్ముఖావిర్భూతమైనదని "పాంచరాత్రస్య కృత్స్నస్య వక్తా నారాయణస్స్వయమ్" అను ప్రమాణము తెలియుచున్నది, మరియు, విభవప్రోక్తమగు వైభవాగమమును గూడ

ప్రమాణముగా గ్రహించి తదనుసారముగా భగవదారాధన మును ఆచారాదులను పాటించువారుగూడ శ్రీవైష్ణవులలో ఒక శాఖగా మన్నారు

సర్వమానవ సముద్ధరణమునకు దీక్షవహించి ఉద్యమించిన శ్రీ రామానుజులు పాంచరాత్రాగమోక్త విధానము లను అట్టివారికిగూడ వర్తింపజేసి తద్వారా మోక్షాధికార మును కలిగించిరి వైదిక మంత్రానుష్ఠాన పూర్వకముగా భగవదర్చనావకాశము వారికి లేనందున అందులకు ప్రత్యా మ్నాయముగా పరమ ప్రపన్నులగు దివ్యసూరులచేత (ఆళ్వారులు) రచింపబడి వేదసమప్రామాణ్యము కలిగి అప్పటికే బహుళ ప్రచారములో నుండిన ద్రవిడగీతములను (పాశురములను) కొన్నింటిని అను స్తేయములుగా చేర్పరచి ఆరాధన విధానమును నిర్వచించిరి ఆయా వేదభాగములతో పాటు ఈ ద్రవిడ ప్రబన్ధములనుగూడ భగవదాలయములలో విధ్యాను స్తేయములుగా నియమించిరి పాంచరాత్రవిహిత పంచ సంస్కారములు ద్రవిడ ప్రబన్ధాధ్యయనము లేనిచో వేదాధ్యేతయగు బ్రాహ్మణునికిగూడ శ్రీవైష్ణవత్వము, పరమ వైదికత్వ సిద్ధియు లేవని నిర్ణయించిరి ఈ సంస్కారములను వైదికావైదిక విభాగము లేకుండ సర్వసాధారణములు గావించి వేదచోదిత కర్మజ్ఞాన సహకృతోపాసనమునకు (భక్తిమార్గమునకు) సాధకత్వమును కల్గించిరి

శ్రీవైష్ణవులు దేవతాన్తర సేవనమొనరింపరు ఇతర దేవతల సేవ పరిమిత ఫలప్రదమనియు, మోక్ష పురుషార్థ ప్రదాన శక్తి సర్వకారణభూతుడుగ సిద్ధాన్తీకరింపబడిన శ్రీమన్నారాయణునియందే "మోక్షమిచ్ఛేజ్జనార్దనాత్" ఇత్యాది ప్రమాణోక్తార్థముగా కలదనియు అంగీకరించి శ్రీమన్నారాయణునే ఆరాధింతురు తాము నిత్యనైమిత్తికాది కర్మలలో తత్తద్దేవతలనుగూర్చి హోమమును చేయుచున్నప్పుడు "అహంహి సర్వయజ్ఞానాం - భోక్తా చ ప్రభురేవచ" ఇత్యాది గీతా ప్రమాణమునను సరించి, తత్తద్దేవతలకు అంతర్యామిగ వర్తించు పరమాత్మకే ఈ హోమాదులు చెందునని భావింతురు మరియు, "యేఽప్యన్యదేవతా భక్తాః - యజన్తే శ్రద్ధయాన్వితాః - తేఽపిమామేవ కౌన్తేయ! యజన్త్యవిధి పూర్వకమ్" అని గీతలో స్పష్టముగా విధిపూర్వకము కాదని నిషేధింపబడినందున అన్యదేవతా భజనము వీరికి అనంగీకార్యమైనది

పంచసంస్కారములు శ్రీరామానుజులకు పూర్వముగూడ పంచసంస్కారాది విధానము శ్రీవైష్ణవ సంప్రదాయమున కలదు

పంచసంస్కార స్వరూప వర్ణనము —

(1) తాపము అగ్నితప్తములగు సుదర్శన పాంచజన్యములచేత ఆచార్యునివద్ద భుజద్వయమునందు ముద్రలనొందుట

(2) పుండ్రము ముఖాది ద్వాదశస్థానములయందు భగవత్పాద ద్వయాకృతియగు తిలకమును శ్వేతమృత్తికతోను నడుమ హరిద్రాచూర్ణముతోను సచ్ఛిద్రముగను ఊర్ధ్వాకృతిని ఆచార్య నిర్దేశప్రకారము ధరించుట

(3) నామము - భగవద్భాగవత దాస్యము తనస్వరూపమునకు సూచకముగా "రామానుజదాసుడు - శఠకోపదాసుడు - వేంకటదాసుడు" ఇత్యాది రూపములతో ఆచార్య నిర్దిష్టమగు ఏదో ఒక పేరును ధరించుట

(4) మన్త్రము (1) అష్టాక్షరి (2) ద్వయము-(3) చరమశ్లోకము-అను భగవచ్ఛరణాగతి బోధకములగు మూడు మహా మన్త్రములను అపభ్రంశముగా ఆచార్యోపదేశమువలన పొంది గురు పరంపరాపూర్వకముగా నిత్యము వాటి నను సన్ధించుకొనుట

(5) యాగము - అనుగ్రహపూర్వకముగ ఆచార్యునిచే ప్రసాదింపబడిన సాలగ్రామమును తామ్రాదిమయ భగవన్మూర్తులను నిత్యము త్రికాలములయందు షోడశోపచారములచే నారాధించుట

ఈ శంఖచక్రాంకన ఊర్ధ్వపుండ్రధారణాదులు శూద్రాదులకు మాత్రము విహితములనియు వేదవిహితములు కావనియు వైదికనిషిద్ధములనియు ఆక్షేపములు మతాన్తరస్థులచే ఉద్ఘాటితములైనవి కాని ఇవి బ్రాహ్మణులకు గూడ విహితములనుటకు శ్రుతిపురాణాదులలో పలు ప్రమాణములు కలవు

"పవిత్రమగ్నిః అగ్నిర్వై హుప్రారః సహుప్రారోనేమిః, నేమినాతప్తతనుః బ్రహ్మణస్సాయుజ్యం సాలోక్యమాప్నోతి" అని సామవేదము "చక్రశిఖరితవపుపాణి స్తే-చక్రమాదాయాగ్నౌప్రతాప్య బ్రాహ్మణస్యదక్షిణే బాహౌధారయేత్", "పాంచజన్యమాదాయాగ్నౌప్రతాప్య బ్రాహ్మణోత్తర బాహౌధారయేత్' అని అథర్వణవేదము

"అగ్నినాతైక్తసంస్కృతే ధారయన్నూర్ధ్వపుండ్ర

మాలికేత్ తస్మాద్ద్విరేఖం భవతి అని శతపథబ్రాహ్మణము "ధృతోర్ధ్వపుండ్రః కృతచక్రధారీ విష్ణుంపరం ధ్యాయతి యో మహాత్మా" అని కఠవల్లి "యద్వష్టుతేగ్రం తత్రతమ్మృత్స్నాం శ్వేతాం ఉద్ధృత సీతుర్ధరేత్ అప్సుమేవ శ్వేతమృత్స్నా భవతి తాం శుద్ధజలేన ప్రాంతే ఘర్షయేత్ తయానిత్యమూర్ధ్వపుండ్రం బిభృయాత్ నాసాదికేశాంతమూర్ధ్వపుండ్రం విష్ణోః స్థితస్య చరణద్వయాకృతి సాక్షాత్ శ్రీః స్థాయై శ్రీగ్రహిరిద్రాయతో హరిద్రాగయతి తజ్జలేన శ్రీవీతేఃసంయుక్త తత్సాన్మధ్యరేఖాంధారయేత్ ఏవంవిధిశ్చాయోధారయతి స వైదికోభవతి – సప శ్యామల్లో భవతి" అని అథర్వవేదము ఇట్లే స్మృతి పురాణాదులలో గూడ గల పలుప్రమాణములను చూపి సుదర్శన సురద్రుమాదిగ్రంథములలో శాస్త్రజ్ఞులగు ప్రాచీన శ్రీవైష్ణవులు ఈ పంచసంస్కార ప్రామాణికతను స్థాపించియున్నారు

భక్తి:– కర్మయోగముచేత పరిశుద్ధమనస్కుడై జ్ఞానయోగముచేత నిత్యాత్మస్వరూపము నెరిగినవాడు గ్రస్మృతి లబ్ధిచేత పూర్వకముగా భగవత్సాయుజ్యలాభమునకై చేయవలసిన భగవదుపాసనము అవిచ్ఛిన్నమై ధర్మవసమానాకారమై యావజ్జీవ మనుష్ఠేయమునై యుండును ఇట్టి ఉపాసనమే భక్తియోగము ఇది తల్లబ్ధిః వివేక – విమోక – అభ్యాస – క్రియా – కల్యాణ – అనవసాద – అనుద్ధర్షేభ్యః" అను బోధాయనవృత్తి వాక్యానుసారముగా సాధనసప్తకముచేత సాధింపబడునని శ్రీరామానుజులు బ్రహ్మసూత్రభాష్యమున స్థాపించిరి ఉపదేశపరంపరాప్రాప్తమగు ఈ భక్తియోగము యామునాచార్యుల కాలమునకే లుప్తమైనదందురు వారికి పితామహులను సంచుమించు శ్రీశంకరభగవత్పాదులకు సమకాలికులునునైన శ్రీనాథమునులు ఈ భక్తియోగనిష్ఠులై యుండిరి వారు తమ పౌత్రులగు యామునాచార్యులకు ఈ యోగమును ఉపదేశింపుడని తమ శిష్యులగు పుండరీకాక్షాచార్యులను ఆదేశించిరి వారట్లుపదేశింపకయే దేహమును చాలించినందున అది యామునాచార్యులకు దుర్లభమైనది అంతటితో భక్తియోగ సంప్రదాయమంతరించినది

ప్రపత్తి – శరణాగతియని చెప్పబడు ప్రపత్తి భగవత్ప్రాప్తికి సర్వాధికారమగు ఉత్తమోపాయము ఇదికూడ శ్రుతిస్మృతిపురాణాది చోదితమే ఈప్రపత్తి భక్త్యాదిసాధనముల కంటె అతిరిక్తమగు మహోపాయముగా నిరూపింపబడినది ఇక రామాయణ భారత భాగవతాదులలో గజేంద్ర ప్రపత్తి ద్రౌపదీ ప్రపత్తి విభీషణప్రపత్తి మొదలగునవి అనుష్ఠానరూపమున మనకు కనబడుచున్నవి తన అకించనత్వమును గ్రహించుకొని భగవంతునిపై మహావిశ్వాసముంచి నీవేరక్షకుడవని అతని పాదముల నాశ్రయించి ఆత్మార్పణము చేయుటప్రపత్తి యనబడును భగవత్ప్రవృత్తివిరోధి స్వప్రవృత్తి నివృత్తిః ప్రపత్తిః అని పెద్దలు దీనిని నిర్వచించిరి భగవద్రక్షకత్వమున సంపూర్ణ విశ్వాసముంచుటయే ఇందు ముఖ్యోద్దేశము

ఈవిశేషము స్వశక్తితో తన కార్యమును సాధింపగలవాడయ్యును ఈ ప్రపత్తి ననుష్ఠించినచో అతనికిది ఫలప్రదముకాదు అశక్తునిచేత అనుష్ఠితమైనపుడే ఫలప్రదమగును అను విషయము సుస్పష్టమే దేశకాలాది నియమవ్యవస్థ గూడ ఈ ప్రపత్తికి లేదు "యదహారేవ విరజేత్ తదహరేవ ప్రవ్రజేత్" అన్నట్లు భగవంతునిపై విశ్వాసమ్ము, ఆర్తియు తనకు కలిగిన ఉత్తరక్షణముననే అనుష్ఠింపవచ్చును ప్రపన్నుడు లక్ష్మీపూర్వకముగా స్వామినాశ్రయింపవలెను ఇట్లు ఆ దివ్యదంపతులే ఆశ్రయణీయులుగాని ఏకశాయాయికోపాసనమును శ్రీవైష్ణవులంగీకరింపరు ఈ విధముగ ప్రపత్తి వైదికకర్మాద్యంగకము కానందున బ్రాహ్మణస్త్రీ శూద్రాది సర్వాధికారముగా పరిగణితమైనది

శ్రీమన్నారాయణుడే పరతత్త్వమని యెంచి విశిష్టాద్వైతమును తమ ద్రవిడ ప్రబంధములలో చాటిన ఆళ్వారులును శ్రీ గోదాదేవియును ఈ ప్రపత్తి మార్గముచే అవలంబించినట్లు వారి ప్రబంధములలో స్పష్టము

శ్రీ యామునాచార్యుల శిష్యులలో ప్రధానులు (1) పెరియనంబి (2) తిరుమలైనంబి (3) తిరుక్కోట్టియూర్ నంబి (4) మారినేర్ నంబి (5) తిరుకచ్చినంబి – అని ఐదుగురు కలరు శ్రీరామానుజాచార్యులవారికి " పంచాచార్యపదాశ్రయః అని ప్రసిద్ధి కలదు పైన పేర్కొనబడిన వారే ఈ పంచాచార్యులు వారిలో నొకరివద్ద చక్రాంకనమును, ఇంకొకరివద్ద అష్టాక్షరీమన్త్రార్థమును మరొకరివద్ద ద్వయ చరమ శ్లోకార్థములను వేరొకరివద్ద శ్రీరామాయణార్థమును, ఇంకొకరి వద్ద ద్రవిడ ప్రబంధార్థములను శ్రీ రామానుజులు గ్రహించిరట,

ఆసేతుశీతాచలము శిష్యవర్గముతో పర్యటించిన శ్రీ

రామానుజాచార్యులు విశిష్టాద్వైతసిద్ధాంతమును ప్రబోధించుచు అనేక వైష్ణవదేవాలయములయందు పాంచరాత్రాగమోక్తార్చనా విధానమును సంస్కృతవేదములతో పాటు ద్రావిడ ప్రబంధాధ్యయనమును కూడ ఏర్పరచుచు సర్వసాధారణమగు ప్రపత్తిమార్గమును ఉపదేశించి శ్రీవైష్ణవ మత ప్రచారము గావించిరి. వారి తరువాత ఆచార్య పరంపరలో వేదాంతదేశికుల వరకు ఏకముఖముగ అభివృద్ధి ప్రచారమైన శ్రీవైష్ణవమతము దక్షిణ వడగలై - తెన్‌గలై - అను రెండు శాఖలుగా చీలినది. ఇందు వడగలై సంప్రదాయమునకు మూలపురుషులు వేదాంతదేశికులు. పిళ్లైలోకాచార్యుల వారు, వారి శిష్యులు శ్రీవరవరమునులు తెంగలై సంప్రదాయ ప్రవర్తకులలో ముఖ్యులు. శ్రీరామానుజులు శ్రీవైష్ణవమతప్రచారమునకై తమ శిష్యులను పలువురిని పీఠాధిపతులుగా నియమించిరి. నేటికిని ఆయా ఆచార్య పీఠాధిపతి వంశము వారు దేశమునందలి పలు మూలలయందు విశిష్టాద్వైత ప్రచారకులై వెలయుచున్నారు.

వ. ద. ర.

## విశ్వకవి రవీంద్రనాథ ఠాకూరు (క్రీ.శ. 1861 1941)

రవికవియనియు విశ్వకవియనియు గురుదేవుడనియు ఇంకను పెక్కు రీతుల ప్రీతి పూర్వకముగ పిలువబడు రవీంద్రనాథ ఠాకూరు వంగదేశ కవి సమ్రాట్టు. ఈయన జననము (క్రీ.శ. 1861 మే 6 వ తేదీ) వలన కలకత్తా నగరము పునీతమైనది. ఆకాలమున భారత దేశము బహుముఖముగ పునరుజ్జీవనము నొందుచుండెను. రవీంద్రుని తండ్రి మహర్షి దేవేంద్రనాథుడు. పితామహుడు ద్వారకనాథఠాకూరు. పితృదేవుని తపోగరిమకును పితామహుని జీవిత దక్షత పథమునకును రవీంద్రుడు సంగమస్థానమైనాడు. మహనీయ కవిపుంగవుడుగా తత్త్వవేత్తగా సర్వకళాపారగుడుగా సమస్త ప్రకృతి సౌందర్యోపాసకుడుగా మాతృదేశభక్తుడుగా విశ్వప్రేమిగా జాతీయ విద్యాభిధాయిగా కర్మయోగిగా కారుణ్యనిధిగా రూపు కట్టిన ఘనమౌ సమగ్ర సుందరమూర్తియగు పూర్ణపురుషుడు రవీంద్రుడు.

ప్రాక్తన జన్మసంస్కార బలమువలన బాల్యమునుండియు కవితావాసన ఈయను ప్రేరేచినది. తన తండ్రి వెంట హిమాద్రిని సందర్శింపబోయినపుడు అచటి భౌతిక ప్రకృతి శోభచే ఈయన ఉత్తేజితుడయ్యెను. తనచే 16 వ యేట రచింపబడిన కవిగాథ యశోంబరమును నేయుచు దగా ఈకని ఆశాపూలు విచ్చి ఆ అంబరమునకు గతాలింప జేసినది. తన 17 వ యేట ఠాకూరు బారిస్టరు చదువుకై ఇంగ్లండునకు వెళ్లెను. క్రీ.శ. 1881 నాటికే కాని కవి గా ... ప్రభాత గీతములు, సంధ్యాగీతికలు మున్నగునాటిలో ... యిచుచు రాములాల ... ఆ ... నేడు ప్రకృతి ప్రతీకారము మానిని ... దీర్ఘంగా చిత్రించినాడు.

ఈ నిక్ గ్రంథాళ్లు (కథానికలు) చిత్ర తోటమాలి వెన్నెల వంటి ఉదాత్త రచనలు ఈశ్వరీ ప్రేమారాధన పూర్వకమైన భావగీతములు గాంభీర్య సౌందర్య పూర్ణమైన రవీంద్రుని నిర్మల రచనాపూరము పెక్కు తెరగుల ఇట్లు పరవళ్లు త్రొక్కెను. ఆ ఎన్నుట రచించిన తన వ్యాస సంపుటములలో ఈతడు తన వంగ జాతియందలి కొన్ని దురాచారములను తూర్పారబట్టెను. క్రీ.శ. 1918లో ఈయన గీతాంజలికి నోబెల్ బహుమతి నొసగి ఆ బహుమాన ప్రధాన సంస్థ తనను తాను గౌరవించుకొన్నది. అట్లే ఆంగ్ల ప్రభుత్వము ఈతనికి సర్ బిరుదమునొసగెను. పదంపు 1919లో భారత దేశమున జరిగిన జలియన్ వాలాబాగ్ దురంతముపై యెడ నిరసన తెల్పుచు రవీంద్రుడు ఆ బిరుదమును పరిత్యాగమొనర్చి తన దేశభక్తిని నిరూపించుకొనినాడు.

చిత్రము – 74

పటము – 1

క్రీ.శ. 1920లో రవీంద్రుడు పెక్కు దేశములు పర్యటించి అంతర్జాతీయ సామరస్యము శాంతి ముఖ్యలోకకల్యాణదాయకములని అచట విజయశంఖము పూరింపగలిగెను. 1930లో ఆక్స్‌ఫర్డు విశ్వవిద్యాలయమున ఈయన ఇచ్చిన హిబ్బర్ట్ ఉపన్యాసములు రవీంద్రునకు లోకోత్తర కీర్తిని ఆపాదించినవి. పదియేండ్ల అనంతరము ఆ విశ్వవిద్యాలయమే రవీంద్రునకు 'డాక్టర్ ఆఫ్ లెటర్స్' అను పట్టమునొసగి సన్మానించినది. తన తేజముచే విశ్వాకాశమును ప్రకాశింపచేసెడి తపనుడు సైతము అస్తగిరి చేరునట్లు రవీంద్రుడు అస్తే

గతుడగుట మూలమున (1941 అగష్టు 7 వ తేదీ) భారత దేశము ఖిన్నతనొందెను

మహా కవిగా – ఆధునిక యుగమున ప్రపంచ కవులలో ఉత్తముడని టాగూరుయశస్సునార్జించి లోకపురుషుడైనాడు ఈతని రచనలు అద్వితీయగ సారస్వతమునకు నూతనోజ్జీవమును జవమును కల్గించినవి జడప్రకృతికిని మానవజీవితమునకును గల స్నేహమును సూచించుటయందు రవీంద్రుని ప్రతిభ అసదృశము కవి కర్మవీరుడను కార్లైల్ ప్రశస్తుల ప్రవచనమునుసరించి గురుదేవుని జీవితయావత్తును కార్యాచరణము కాగలదు 'బసోహా' మ్మను పద్ధతి నుండి 'సోహ మ్మను' పద్ధతి వరకు కొనలు సాగినదీమహా విశ్వము విశ్వమును ప్రదర్శకమగు మానవ నాటకములోని ప్రధానాంశములను గ్రహించి వాటిలో కళను మేళవించి చక్కని ఆకృతి కల్పించి చదువరుల మనోమాలిన్యమును క్షాళన మొనర్చి వారిని ఉన్నత దశకు తీసికొని రాగల్గిన కవిధీరుడు టాగూరు మహాశయుడు ఈ శతాబ్ది కర్తవ్యమును క్షుణ్ణముగనెరిగి దేశములన్నియు పీడింపబడుచున్న ప్రధాన సమస్యను గుర్తించి దైవవిశ్వాసరహిత జీవితము తెగిన గాలిపడగ వంటిదని దేశదేశములకు చాటి చెప్పిన మహాభాగుడు టాగూరు ఈతని 'గీతాంజలి' భారతీయ విద్వాంసుల వలననే కాక, పాశ్చాత్య విద్వాంసుల వలన కూడ మహోన్నత గౌరవమునకు అర్హమైనది అది భక్తి ప్రధాన కావ్యములలో ఉత్కృష్టమైనది ఈతని భావగీతములన్నియు లోకమందలి ప్రతిప్రాణిని పరమాత్మ ప్రతిరూపమని ప్రకటించినవి అనేకత్వముతో నిండియున్న యీ జగన్నాటకమునందు ఏకత్వమును సాధించునది ఏది కలదో దాని స్పర్శ సౌఖ్యమును వీడరాదు' అనునది ఈతని సర్వకావ్యసారము జీవితసమస్యలే గాని భగవత్సమస్యలంతగా కాన్పింపని ఆంగ్లేయ సారస్వతమునకు 'గీతాంజలి' వంటి ఈతని కృతులు క్రొత్త జీవమును ప్రసాదించినవి

రవీంద్రుని సారస్వతమందు మధురమగు బాల్యవర్ణనకు ప్రాధాన్యము మెండు బాలుడు ఈతని సారస్వతమున పట్టభద్రుడు అందుకే 'చంద్రవంక' 'కాబూలి' గీతాంజలి' లో బాల్యతత్త్వము సూచ్యము రవీంద్రుని కథానికలలో బాలుడే నాయకుడు కావున ఈ కవి కుంజరునకు బాల్యానక ఒక మధురాతి మధుర గీతికవంటిది 'రాయచరణు'ని కథ దీనికొక నిదర్శనము. ప్రేమయే ఈ బాల్య సందేశము అట్టి సందేశముల మూలమున ప్రాక్పశ్చిమ ఖండములను సన్నిహితముగా వింప యత్నించిన మహనీయులలో ఉత్తముడుగావుననే టాగూరునకు అంత ఖ్యాతి అంతేకాదు బహుధా పాశ్చాత్య వ్యామోహ పాశబద్ధులగు భారతీయులకు తొల్లిటి నిర్మల నైతికతత్వం జీవిత సందేశమును ప్రసాదించి భారతీయులతో పాటు లోకులను ఉద్ధరింప బద్ధకంకణు డగుట మూలమున గూడ ఈయనకు బహు విఖ్యాతి కల్గినది

నాటక కర్తగా – నాటక రంగమున రవీంద్రుడు క్రొత్త పోకడలను ప్రవేశపెట్టెను తన 19 వ యేటనే వాల్మీకి ప్రతిభను చాటిన వాడితడు భావోద్రేకము తక్కువగ నుండు శీత కాలములో ఈయన నాటక రచనకు పూనుకొనెడివాడట విసర్జన లోని రఘుపతి పాత్ర పోషణము టాగూరు నాటకీయ శిల్పమునకు నికషోపలము రాజు–రాణి యందలి యితివృత్తము మాత్రమే ఉత్కృష్టమైనది చిత్రాంగద (1891) నాటక కళకు భూషణము కర్ణ–కుంతి అను నాటిక చదువరులను చకితుల నొనర్చును శారదుత్సవము, ప్రాయశ్చిత్తము, తపాలాఫీసు' వంటివి ఆకర్షకములు ముక్తధార నటీర్పూజ మున్నగునవి ఉత్తమస్థాయినందుకొన్నవి 'ముక్తధార గాంగ నిర్ఝరశ్రేణి వంటిది మహోదార రచనము ఆంగ్ల ప్రభుత్వ నిరంకుశత్వమునకు ఇందలి రాజు పాత్ర ప్రతీక కావున దీనిని సాంఘిక నైతిక రాజకీయ రూపక మనదగును "నటీర్ పూజ" రవీంద్రనాథునకు ప్రీతిపాత్రమైనది కలకత్తాలోని బాలికలచే ప్రదర్శితమైన యిది భారతీయ నాటక చరిత్రయందు ఒక నవ్యశకమును నెలకొల్పెను 'ఫాల్గునము శారదుత్సవము' మొదలైనవి ఋతువ్యయ ప్రకృతి సౌందర్యారాధనమున తత్పరములు చండాలిక బౌద్ధధర్మపరము మొత్తముమీద రవీంద్రుని రూపకములన్నియు విజ్ఞానవినోదదాయకములనుట నిజము చెప్పుట

నవలా రచయితగా —నవలలో కూడ రవీంద్రుడు కవీంద్రునివలె అగపడునుట స్థూలమైనవిమగ్గన పట్టుదెల్ల బంగారమగు శిల్పచాతుర్యము తనది గావున ఈతడు తన నవలలో సైతము కథానికా ఖండకావ్యములందువలె విజయము నొందగల్గెను కాల్పనిక, చారిత్రక వీరరస ప్రధాననవలలను సృష్టిచేసిన బంకిమ్‌చంద్రుడు, ఇతనికి పూర్వమే వంగసాహిత్యములో కథా వస్తువులకు కాటకము కల్పించినాడు జనసంఘసంపర్కరాహిత్య వ్యక్తిరేఖ భావములవలన, బంకిమ్ చేతిలో

సాంఘికనవల జపానుస్త్రీల పాదములవలె కట్టడులలో పడి యుండెను. భావుకుడైన టాగూరు తొలుదొత్త 1884లో 'బౌఠాకూరానీర్ హాట్' అను నవలను ఆ తరువాత 'రాజర్షి' అను నవలను రచించెను. ఇవి పూర్వ సంప్రదాయ సిద్ధ మార్గముననే నడచినవి. ఇందలి పాత్రలు నవలాకర్తృ భావములకు ప్రతిమలేగాని సజీవ చాంచల్యమాన చిత్రములు గావు. 'రాజర్షి' లో పాత్రల భావసంఘర్షణను వర్ణించుటకు కవి చేసిన యత్నము మాత్రమే మనలను ఆకర్షించుచున్నది. పై రెండు నవలల నాటికి ఇంకను రవీంద్రునిలో ఆదర్శ వాస్తవిక వాద దృక్పథములకు సమన్వయము కుదురలేదు. 'చోఖేర్ బాలి' (1903) 'నౌకాడుబి' (1906) అను కవి తొలి రచనా ప్రతిభకు పతాకలుగ ఆతరువాత వెలువడినవి. బంకిమ్ చంద్రుని పరివేషమును అతిక్రమించిన ఈ నవలలు సాంఘిక నవలా ప్రగతికి తోడద్పడెను. 'చోఖేర్ బాలి' నవల కేంద్ర సాహిత్య అకాడమీ పక్షమున శ్రీ కృష్ణా కృపలానీ పండితుని చే ఆంగ్లములోనికి అనూదితమైనది. ఒడ్డులొరసి ప్రవహించు నది వంటిది 'నౌకాడుబి' యందలి కథా గమనము. ధర్మనిరతిని కోమలుల సౌజన్య శీలములకును నిలయమైన హేమనళిని పాత్ర ఈ నవలచదివిన వారి హృదయ సామ్రాజ్యమును అధ్యాసింపగలదు.

టాగూరు మహాభాగుని నవలలలో ఎవరెస్టు శిఖరము వంటిటిది 'గోరా'. ఇందు మూర్ధమైన దేశభక్తి కట్టకడపటికి షుభిశాల విశ్వమానవ భావనగా పరిణద్ధమగును. ఇందలి పాత్రలన్నిటిలోను మాతృమూర్తియైన ఆనందమయి మనల నెప్పుడును వెన్నాడుచునే యుండును. పరాధీనమైన భారత హృదయములో ప్రజ్వరిల్లిన స్వాతంత్ర్య జనశాగ్నికి గోరాపాత్ర ఒక ప్రతీక. 'గోరా' లో శిల్పము సాంఘిక ప్రయోజనము సముజ్జ్వల సందేశము గూడ సంగమించినవి. ఈ నవలకు కిమ్మట రచింపబడిన వాటిలో 'చతురంగ' 'ఘరేబాయిరే' 'యోగాయోగ' ముఖ్యగునవి. కథనమునకు మించి మథనమునకు పేరొందినవి 'ఘరేబాయిరే'. స్త్రీ స్వాతంత్ర్య సమస్యామూలకమైనది. గృహస్థధర్మమును తృణీకరించునంతటి ప్రమాద దూషితమైన నైతిక విశృంఖలత్వము ఎంతజుగుప్సాకరమైనదో గురుదేవుడీ నవలలో సాందీప్ పాత్రమూలమున ఆకర్షకముగ నిరూపింపగలైను. వంగరాష్ట్రమందు సాంద్రముగ వ్యాపించిన హిందూ శ్రుత విష్లవవాతావరణము ఇందు చిత్రితము. 'యోగాయోగ'లోని కథావస్తువు మనసులు కలియని మమతలులేని దాంపత్య ఘటుత్వము.

నవలారచ చే రవీంద్రుడు నిర్మించిన యశస్సౌధమునకు నాలుగేమణిస్తంభిత స్తంభములు 'చోఖేర్ బాలి' తొలిటిది, మధ్య సంభము 'గోరా', 'ఘరేబాయిరే' మూడవది, చివరిది 'శేషేర్ కవితా'. "విశ్వకవి తన నవలలలో భూలోకమునకు దిగివచ్చి సాధారణ మానవ సన్నిగాతుడై జీవిత సత్యప్రతిపాదకుడై పైనదెప్పిన నాలుగు స్తంభముల ఆటయందు వెలుగునీడలు చిమ్ముచుండెడు గుడు ప్రముచ్చుల ఒసుగులుపోయువాడు". పై నాల్గు నవలలను మాత్రమే చెప్పుట 'నౌకాడుబి' 'రెక్ ఆఫ్ ది బోట్' వాటి ప్రసిద్ధములు కానటుకుకాదు. 'గోరా' లోని పాత్ర చిత్రణచాతుర్యము 'నౌకాభంగము'లో అగపడినను రెండవ దానిలోని పాత్రలునడచు మార్గము వట్టి వాటి కవి చేసినాటి.

కథానికా కర్తగా : లోకమును గూర్చిగాని జీవితమును గూర్చిగాని, ఏదేని సిద్ధాంతములను ప్రతిపాదించి ధ్రువీకరించుటకై రవీంద్రుడు కథానికలు చెప్పడు. కేవలము మానవీయమైన ఔత్సుక్యమే కథారచనకు ఈయనను ప్రోత్సహించును. ప్రాశ్చాత్య పాశ్చాత్య సంస్కృతుల సమన్వయమును ఒక విధముగ సాధించిన బ్రాహ్మమతప్రవర్తలకు ఈయన ప్రథమదాయాది. అందుచేతనే సమాజములోని దురాచారములను ఆయన పాత్రలు అవహసించుచుండును. అంతేకాదు, ఆ పాత్రల మానవత్వమునెడ గురుదేవునకు అపారమైన సానుభూతికూడ. అట్టి వాటిలో శిల్పనైపుణిని వెల్లడించుకొన్ని (1) నయన్‌జోడ్ బాబులు (2) హైమంతి (3) నగను (4) కల్లు (5) ఫటిక్ వంటి కథలు ప్రథితములు.

ఇతడు తనకథలయందు చిత్రించిన పాత్రలపై విశ్వమనంతము సంస్కారమును చేరిట వ్యామోహములకును స్వార్థములకును బానిసలైన నవనాగరకులు మొదలుకొని ప్రకృత్యారాధనములో లీనమైపోయి ఉత్పత కృత్రిమము తెరుగక అమాయికమైన సౌందర్యమును అనందమును వ్యాపింపజేయు వ్యక్తుల వరకును-ఎందరో రకరకములైన వ్యక్తులు ఈయన కథలలో మెలగుచుందురు. రాధామోహనుడు కథయు, కాబూలీవాలా నీలకాంతుడు తారాపదుడు మొదలైన వారి కథలను కల్పించువేదన ఇంతింత అనరానిది. వీటిలో సంస్త చాయ సిద్ధమైన హైందవసమాజపు అవధులను దాటి, నిరవధిక

సంస్కృతీ సమ్మేళనమునకు సంకేతభూమిగ విలసిల్లు ఉదాత్తమైన భారతీయ సంస్కృతియొక్క ఆదర్శము సముజ్జ్వలమై ప్రపంచమునకు మార్గదర్శకము కావలెనని ఆకాంక్షించెను. అతని దృష్టిలో సత్యము శివము సుందరము నైనదే ధర్మము.

సౌందర్యోపాసకుడుగా – కాళిదాసు వలె గురుదేవుడు ప్రకృతిలోని సౌందర్యమునంతయు ఆస్వాదించి అభివ్యక్తము చేసిన ఉదాహరణములు పెక్కులు కలవు. ఛందస్సులో ఈయన పాశ్చాత్యరీతులను కల్పించి కవితకు సౌందర్యము తెచ్చి నట్లే నవీన చిత్రలేఖనమునకును తెచ్చెను. ఖండకావ్యములలో ఈయన ఉత్కృష్ట రూపొందిన సౌందర్యము అట్లే చిత్రాంగద లో సౌందర్యము లాలింపబడినది. ఒక లేఖరి మూలముననే కాక చిత్రకళా గానకళాదుల మూలమున గూడ సౌందర్యోపాసనచేసిన సర్వజ్ఞ కళామయమూర్తి టాగూరు. ఆంధ్ర కవులలో శ్రీనాథుని వలె వంగ కవులలో పంచేంద్రియ తర్పణమును కోరు సర్వ కళారాధనము ఈయన మతము.

శాస్త్రీయ విద్యావిధాయిగా:– ఈ శతాబ్దిలో నెలకొన్న భారత జాతీయోద్యమోత్సాహమునకు 1901 నాటి జాతీయ విద్యాసంస్థయైన విశ్వభారతి వ్యవస్థాపనము ఒక చక్కని ఉదాహరణము. రవీంద్రుని అభిమాన లక్ష్యములగు జాత్యంతర సామరస్యమును అంతర్జాతీయ సామరస్యమును విశ్వభారతి గా ప్రవర్ధమానమై ప్రపంచమున శాంతికాముకులను ఆకర్షించుచుండుట భారతీయులకు గర్వకారణము. స్వతంత్ర ముఖముగ నేడు అంతర్జాతీయస్థాయిలో వర్ధిల్లి విశ్వవిద్యాలయమైన దీనికి కేంద్ర ప్రభుత్వము సాహాయ్యము చేయుచుండుట అదృష్టము. దీని ఆశయములును, ఆదర్శములను మానవకల్యాణమునకుతోడ్పడ గలవు.

రవీంద్రుడు మనస్తత్త్వ శాస్త్రవేత్తకూడ అగుట వలన, బాల బాలికల శిక్షణమునకుయుక్తమైన విధానముల మూలమున ఈ శాంతినికేతనములో విద్యలు నేర్పింప ఉద్దేశించినాడు. 'శ్రీనికేతనము' కూడ అతని మనస్సృష్టియే. అధ్యతన పద్ధతులలో వ్యవసాయముచేయుట, నేయుటయే కాక, గ్రామపునర్నిర్మాణకార్యక్రమమును సైతము ఇది తన లక్ష్యముగ కైకొన్నది.

జాతీయతా భావప్రబోధకుడుగా 'ఎచట మనస్సునిర్భయముగ నుండగలదో ——— ఎచట లోకము ఇరుకైన అడ్డుగోడల వలన చిన్నచిన్న గదులుగ చీలిపోలేదో —అట్టి స్వేచ్ఛాభామమైన భువర్లోకములో మాదేశమును మేల్కొననిమ్ము తండ్రీ!' అనిన గీతాంజలి లోని ప్రార్థనాగీతమే ఇందుకు తార్కాణము. రవీంద్రుని జాతీయతను చాటగలదు. గీతాంజలి యందలి భారతీయసంస్కృతిగలిగిన దేశము లోకము నంతటిని తన కౌగిలిలోనికి తీసుకొనగలదు. నిద్రాణమైయుండిన సనాతన భారతీయ సంస్కృతిని నవచైతన్యమై అన్వయించిన భారతీయ సంస్కృతిని రవీంద్రుడు సేతువుగాంటి వాడు. విశేషసంస్కృతిని పరస్పరము సమన్వయమును ప్రకటించు ఈతని జాతీయత అంతర్జాతీయ దృక్పథముగలది.

ఆధ్యాత్మిక సాధకుడుగా రవీంద్రుని ఆధ్యాత్మికతత్త్వము ఉపనిషత్తత్త్వమే. ఉపనిషత్తులు ప్రతిపాదించిన బ్రహ్మానుభవమును రసదృష్టి మూలమున సాధించుటయే ఈతని ఆధ్యాత్మిక సాధన. విశ్వవ్యాప్తమగు ఈశ్వర తత్త్వానుభూతి నొందిన మహాపురుషులు ఋషులు. బుద్ధుడు, క్రీస్తు, వ్యాసుడు కవి కాలేరు పునర్జన్మ కవి మతమువంటి విషయములను గూర్చి రవీంద్రుడు తన గ్రంథములలో పెక్కుతావులందు ఆత్మభావములను అభివ్యక్తము చేసినాడు. ఆధ్యాత్మికానుభూతిని ప్రసాదించిన శక్తి సామర్థ్యములతో రసస్ఫూర్తిచేసిన వాడు ఇతడు. 'సాధన' అను గ్రంథమునుబట్టి అనేకత్వమును ఉపాసించుచు మనస్తత్త్వము ఏకత్వభావనలో పర్యవసించుటయే సాధనల పరాకాష్ఠయని ఈతడు బోధించెను. అన్నివస్తువులయందును భగవత్తత్త్వమున్నదని గ్రహించి అనుభవించుటయే ఈశావాస్యమిదగ్ం అనెడిసూక్తికి అర్థము తెలిసికొనుట. అప్పుడే బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి (బ్రహ్మానుభవమును పొందినవాడే బ్రహ్మయగును) అని టాగూరువలె అని ఎంచుకొని ఆనందాను భూతివలన బ్రహ్మసాక్షాత్కారము పొందగలము.

ఉపనిషత్ప్రాయ ప్రతిపాదకుడుగా వైష్ణవ కవుల ప్రభావముతోపాటు తండ్రి ప్రభావము కూడ తనపైగల రవీంద్రుని రచనలలో ఉపనిషద్వాణి అంతర్వాహినిగా తోచుటలో ఆశ్చర్యములేదు. 'సచ్చత్యచ్చాభవత్' అని ఉపనిషద్వాక్యమొకటి కలదు. ఒకే ఒకసత్యము సత్యముగను అనృతముగను కూడభాసించినచో, అనేకాకృతములకు పరస్పరవిరోధముండజాలదు. అనృతము అనృతరూపమున సత్యమే అని సాధనలో టాగూరు సూచించెను. జన్మను పూర్ణీభవింపజేయునది మృత్యువే గదా! మరణమునందు మరణించునది ఏదియులేదు. అవిచ్ఛిన్న జీవప్రవంతిని నిర్మలముగ సవ్యముగ ఉండునట్లు పోషించునదే

మరణము (అను శాప్గపాశము) ఈ రీతిగ పరామర్శించి పాపము అశుభము అసహ్యవిషయము అనువాటిని పుణ్యము, శుభము సౌందర్యము అను వాటి రూపాంతరములుగ చెప్పి వీటి అన్నిటియందును ప్రధానమైనది ఆత్మయే అని రవికవి స్తుతులు గీతాంజలి వంటి 'నీకరణ' 'ప్రియునికానుక' ఉత్సర్గ సంపుటి మున్నగు పెక్కు రచనలలో నిరూపించుట జరిగెను ఇదం సర్వం యదయ మాత్మా' మున్నగు శ్రుతి వాక్యములనుబట్టి భౌతికాధ్యాత్మిక జగతులకు గల అనన్యత్వమును అహల్యా కథయందును ఉర్వశీగాథయందును ఇతడు చిత్రించినాడు ఈ అనన్యత్వము ప్రణయ గీతములుగల వన మాలి 'ప్రియునికానుక' 'కాందిశీకుడు' అను సంపుటములలో స్పష్టముగ గలదు

రవీంద్ర గాంధీమహాత్ములు : 'ఏకాలాచలోరే' అను ప్రసిద్ధ గీతములో రవీంద్రుడు కర్తవ్యపాలనమును ప్రబోధించగా, గాంధీజీ సత్యాగ్రహ వాతావరణమువంటి వాటిలో ఆ అర్థమును ఆచరణములో పెట్టెను రవీంద్రుడు గురుదేవుడు కాగ గాంధిజీ మహాత్ముడైనాడు। "గాంధి వంటి నేను కాగా టాగూరు గులాబితోట యైనాడు గాంధి కష్టించు కాపు రవీంద్రుడు రాగమాలిని శకుంతము; అతడు నేపాని అతడు వైతాళికుడు" అని అమెరికన్ రచయిత బాయాఫీటర్ చక్కగ వర్ణించెను ప్రఖ్యాత ఫ్రెంచి రచయిత రోమా రోలా గాంధిని సెయింట్ పాల్ తోడను రవీంద్రుని తత్త్వవేత్తయగు ప్లేటో తోడను పోల్చి ప్రపంచ శుభోదయమునకు కృషిచలుపు వీరిరు సాధన మార్గములు మాత్రమే భిన్నమైనవని పలికినాడు గాంధిమహాత్ముడు కూడ రవీంద్రుని గురుదేవుడనియు ప్రాగ్దేశ గౌరవ పరిరక్షకుడనియు వర్ణించెను వీరిరువురు వెలిగించిన జ్ఞానదీపము జిజ్ఞాసువులకు ఏనాటికైన మార్గదర్శకములు కాగలవు రవీంద్రుడు గాంధిమహాత్మునకు గాంధి మహాత్ముడు రవీంద్రునకు కావలసినది। అట్లు కాకపోయిన వారు కాజాలకపోవుట ప్రకృతిచేసిన నిర్ణయము।

రవీంద్రకవి రసభోగి అతని సర్వము సౌందర్యమయమై ఒక మహత్తర రూపమును దాల్చినది వ్యవహార జగత్తులోని సంఘర్షణములు అతని శాంతస్థితిని భంగపరచలేవు అతని జీవితమొక భోగభూమి అయిన అంతఃనగరము ఒక అమరగానము అతడు కవిలోక చక్రవర్తి సౌందర్యదీప్తి । ప్రేమ మూర్తి విరిక

## విశ్వకిరణములు :

ఆధునిక భౌతికవిజ్ఞాన పరిశోధనా క్షేత్రములో నిర్విరామ కృషిసల్పబడుచున్న విభాగములలో అతిముఖ్యమైనవి విశ్వకిరణములు కేంద్రకీయ భౌతికవిజ్ఞానము విశ్వకిరణ విషయ పరిశోధన సందర్భములో పాజిట్రాను మీసాను హైపరాను మొదలగు వివిధరకముల మూలకణములెన్నియో క్రమముగా కనుగొనబడినవి అతిక్లిష్టమైన కేంద్రకీయ దృగ్గోచరవిషయము కెన్నియో వెలుగులోనికి తీసికొని రాబడినవి కేంద్రకీయ రచన కేంద్రకీయప్రక్రియల గురించి వింతసమస్యలెన్నిటినో లేకెత్తించి విజ్ఞానప్రగతి దోహదమొనరించినది 108 ఎలక్ట్రాను వోల్టుల శక్తిగల కణముల ఉనికి తెలియవచ్చినది విశ్వాంతరాళమునుండి ప్రభవితములై అన్నిదిశలలోను పయనమగుచున్న వికిరణజాలమును విశ్వకిరణములందురు విశ్వకిరణములకు విపరీతమైన చొరబడు శక్తి గలదు

వాయువులు స్వల్ప విద్యుద్వాహకత్వము కల్గియున్నవను విషయమొక శతాబ్దము క్రింద కనుగొనబడినది క్రీ శ 1900 లో ఇంగ్లండునందు సి టి ఆర్ విల్సన్ జర్మని యందు ఎల్ స్టరు గైటెల్ అనువారు స్వర్ణపత్ర విద్యుద్దర్శినిని విద్యుదావేశపూరితముగావించి ప్రత్యేకముగనుంచిరి ఆ పత్రములు క్రమముగ దిగజారుటను గమనించిరి పరిసరములందుండిన గాలి అయనీకరణముచెందుట వలన ఈ ఫలితమేర్పడినదనుట సంగతము గాలివాహకత్వము స్థిరముగా నుండుటయే ఇందుకు కారణము కావున భూమి నుండి మనకు అగోచరమగు వికిరణములు వెలువడుటవలన ఈ ఫలితమేర్పడినదని విల్సన్ ఊహించెను భూమియందలి రేడియోధార్మికతగల ఖనిజముల వలన ఈ అయనీకరణము సంభవించినదని నమ్మబడినది పారిస్ నగరమందు 975 అడుగుల ఎత్తుగల ఐఫిల్ గోపురము నుండి విద్యుద్దర్శిని చే విన్యాసపరీక్షణమును జరిపిన పరిశీలనము లను 1909వ సం।లో వుల్ఫ అను శాస్త్రజ్ఞుడుగావించెను స్విట్జర్లెండు విజ్ఞాని గాకెల్ బెలూనును 14 800 అడుగుల ఎత్తువరకు పంపి ఆ విషయమును గురించి పరిశీలనములనుగావించెను ఈ ప్రయోగ ఫలితము అయనీకరణము రేటునందు కల్గిన వృద్ధి భూమి నుండి వెలువడు వికిరణములవలన అయనీకరణము సంభవించునను సిద్ధాంతమే పోయిన పోదియు అయనీకరణము రేటు తగ్గించవలసియుండెను ఈ ప్రయోగము వలన కల్గిన వింత ఫలితము శాస్త్రజ్ఞుల తలను కలవరపరచెను 19 1 నుండి

నకు సమమైనపుడు విశ్వకిరణ తీవ్రత తగ్గును సముద్రపు ఒడ్డునందు విశ్వకిరణ తీవ్రత క్షీణించును ప్రథమ విశ్వకిరణము లత్యంత శక్తి గలిగియుండును ఒక్కొక్క సారి విశ్వకిరణమునందలి విద్యుదావేశకణములు 100 లక్షలకోట్ల ఎలక్ట్రాను వోల్టుల శక్తిని కల్గియుండునని కనుగొనబడినది

విశ్వకిరణములు సజాతిపుంజము కానేరదు ద్రవ్యమునందు కల్గు శోషణ వలన అవి రెండు అంగములను కలిగియున్నవని నిరూపింపబడినది పది సెంటిమీటర్ల మందము కలిగిన సీసపు దిమ్మచే ఆపబడు విశ్వకిరణములను మృదువైన అంగములనియు దిమ్మను దాట గలిగిన కిరణములను దృఢమైన అంగములనియు అందురు మృదువైన అంగములో వాతావరణమునందుత్పత్తియైన ఎలక్ట్రానులు పాజిట్రానులు ప్రోటానులు కలవు వీటి శక్తి 20 కోట్ల ఎలక్ట్రాను వోల్టుల శక్తిని మించదు ఇవి సీసమునందు సులువుగా శోషణనందును దృఢమైన అంగమునందు ప్రోటానులు హీలియము ఖారసహిత కేంద్రకములు మీసానులు ఉండును

1935 లో యుకావా అను జపాను భౌతిక శాస్త్రవేత్త ప్రతిపాదించిన మీసానుకణములు విశ్వకణములందు కలవని ఆండర్‌సన్ నెడర్‌మేయర్ మున్నగువారు ప్రయోగపూర్వకముగా నిర్ధరించిరి విశ్వకిరణ జల్లులను ఫోటో ద్వారా గమనించిన ఆంధర్సన్ బ్లాకెట్లు ఎలక్ట్రానుకు విద్యుదావేశమున వ్యతిరిక్తమగు పాజిట్రాను అనబడుకణములను కనుగొనిరి పావెల్ ఒకిలాని అనువారు మీసానులు రెండు రకములని కనుగొనిరి (1) $\pi$ మీసానులు (2) $\mu$ మీసానులు, $\pi$ మీసాను ద్రవ్యరాశి ఎలక్ట్రాను ద్రవ్యరాశికంటె 206 రెట్లెక్కువ యుండును ఇవిగాక K మీసానులు అతిభారవంతమైన హైపరానులు మున్నగు మూలకణములెన్నియో కనుగొనబడినవి

విశ్వకిరణముల యొక్క ఉత్పత్తి కేంద్రమేది? అను విషయము వివాదగ్రస్తమైన సమస్యగనే యున్నది వీటి ఉత్పత్తిని గురించి అనేక ఊహనీయ సిద్ధాంతములు గలవు

ప్రేలుడు సిద్ధాంతము — లెమెటర్ రెజినర్ మున్నగువారు ఒకానొకప్పుడు విశ్వమంతయు ఏక కేంద్రకమనియు షుమారు 300 కోట్ల సంవత్సరముల క్రిందట విశ్వము ప్రేలినదనియు అఖండితభాగములు పరస్పరము దూరమగుచుండు పాలపుంత (Galaxy) లనియు ప్రతిపాదించిరి ఈ పాలపుంతలు ఒకదాని నుండి మరొకటి దూరమగుచుండుటను విషయము ఖగోళ భౌతికశాస్త్రముల వలన కూడ నిర్ధరింపబడినది విశ్వకిరణములు అప్పటి నుండియు పరిభ్రమించుచున్నధూళియని వీరివాదము

నిర్మూలన సిద్ధాంతము — తారకాంతరాళమునందు ద్రవ్యము నిర్మూలన మొంది శక్తిగ మారుచున్నదని మిల్లికాన్ ప్రతిపాదించెను దీనినే తదుపరి క్లైయిన్ ఆర్లీ అను వారు ప్రోటాను ఎలక్ట్రానుల సంపుటియైన ద్రవ్యము వ్యతిరిక్త ప్రోటాను పాజిట్రానుల సంపుటియైన వ్యతిరిక్త ద్రవ్యముతో కూడుట వలన ద్రవ్యము నిర్మూలమగుచు శక్తిగ ఉద్భవించుచున్నదని మిల్లికాన్ సిద్ధాంతమందు మార్పు కల్గించిరి తత్ఫలితమే విశ్వకిరణ జననము

త్వరణ సిద్ధాంతము – పాలపుంతలయందును తారాంతరాళమునందును అయస్కాంతక్షేత్రములున్నవనియు విశ్వకిరణములందలి విద్యుదావేశ కిరణముల వివరీతశక్తి అయస్కాంతక్షేత్రముల వలన కలుగుచున్నదనియు విశ్వసింపబడుచున్నది అయస్కాంతక్షేత్రముల యాథార్థ్యము సందేహాస్పదము

వికర్షణ సిద్ధాంతము – ఈ సిద్ధాంతము ఇటీవల లిటిల్‌టన్ బాండి అను వారిచే ప్రతిపాదింపబడినది ప్రోటాను యందలి విద్యుదావేశము ఎలక్ట్రాను యందలి విద్యుదావేశముకంటె ఎక్కువనియు అయితే ఈ భేదము చాల తక్కువనియు వీరి నమ్మకము అందువలన పదార్థమందు ధనవిద్యుదావేశ మెక్కువగుటచే విశ్వమందలి వివిధ భాగములు వికర్షణమును పొందుచు ఎడమగుచున్నవని వీరి వాదము పాలపుంతలో గల కేంద్రకములు నెట్టివేయబడుటచే విశ్వకిరణములుత్పన్నమైన వని వీరి సిద్ధాంతము ఈ సిద్ధాంతములు కేవలము ఊహనీయములు మాత్రమే విశ్వకిరణజననమును గూర్చిన యథార్థవిషయము ఇంకను సాధింపబడవలసిన సమస్యగనే నిలిచియున్నది

హ

## విశ్వజననవాదములు

విశ్వజనన వాదములలక్ష్యము విశ్వతత్వమును వివదీకరించుటయే విశ్వతత్త్వము విశ్వమందలి మూర్తుల స్వరూపస్వభావములపైనను కాలానుక్రమముగ అవి పొందుపరిణామములపైనను ఆధారపడియున్నది ("విశ్వనిర్మితి" అను

వ్యాసములో విశ్వమందలి మూర్తులస్వరూప స్వభావముల గూర్చి వివరింపబడినది) ఇచ్చట కాలానుగత విశ్వపరిణామములను విశదీకరించు సిద్ధాంతములు క్లుప్తముగా వివరింపబడినవి ఆధునిక విశ్వజననవాదములు దాదాపు అన్నియు విశ్వసంబంధిప్రతిపాదనమును (Cosmological Principle) ఆధారముగా చేసికొని నిర్మింపబడినవే విశ్వమందలి పదార్థముయొక్క గతులయొక్క వితరణము అన్ని దిశలందును సమానముగా నున్నదనుటయే ఈవిశ్వసంబంధి ప్రతిపాదనము స్థూలదృష్టితో విశ్వమునంతయు పరిశీలించినచో అందలి జ్యోతిర్విశ్వకూటము అన్ని దిశలయందును సమవితరణముగల్గి దూరమునకుఅనులోమసంబంధములోగల తిరోగమనద్రుతులను గల్గియుండుట ఈ ప్రతిపాదనకు బలము చేకూర్చుచున్నది

విశ్వజననవాదములు సాధారణముగా రెండురకములు (1) పరిణామ లేక మహావిపాటన (Big Bang) సిద్ధాంతము (2) ప్రశాంతస్థితిలేక నిరంతర ద్రవ్యసృష్టిసిద్ధాంతము ఈ రెండును మౌలికముగా విశ్వసంబంధి ప్రతిపాదనమును ఆధారముగా చేసికొని నిర్మింపబడినవే

**పరిణామ సిద్ధాంతము** – ఈ సిద్ధాంతము మొదట లెమటేరుచే 1931లో ప్రతిపాదితమై ఎమ్మట గామో అను శాస్త్రజ్ఞునిచే బలపరచబడెను ఇప్పుడు అత్యధికదృతులతో విస్తృతినందుచున్న విశ్వమందలి పదార్థము అనాదికాలములో అతి సంకుచితస్థితిలో అమితమైన సాంద్రతగల్గిన కేంద్రకరూపములో నుండెనని ఈసిద్ధాంత మూహించుచున్నది ఇట్లు అత్యధిక ఉష్ణోగ్రతాసాంద్రతలు గల్గిన ఆదిమకేంద్రకము అందులోగల విపాటన (పరిణామ) శక్తులకు లోనై మహావిపాటనమొందెను అప్పటినుండియే విశ్వవిస్తృతి ఆరంభమయ్యెను ఇటు విస్తృతికి లోనగుటవలన విపాటిత ఆదిమపదార్థముయొక్కసాంద్రత ఉష్ణోగ్రతలు తగ్గి అది పెక్కు పెద్దవాయు మేఘశకలముల రూపమున విభజీకృతమయ్యెను ఈ బృహన్మేఘశకలములే ఆదిమజ్యోతిర్విశ్వములు వీనియందలి ద్రవ్యమే సంకుచితమై యిప్పటి జ్యోతిర్విశ్వములు నక్షత్రములు ఉద్భవించెను మహావిపాటనకాలమున ఉత్పన్నమైన అత్యధిక ఉష్ణోగ్రతలయందు కేంద్రకప్రక్రియ (Nuclear Reactions)లారంభమై అంతవరకు విడివిడిగానున్న ప్రోటానులు ఎలక్ట్రానులు న్యూట్రానులు పుంజీభూత మగుటవలన వివిధమూలకము లేర్పడి యుండవచ్చునని గామో అను శాస్త్రజ్ఞు డూహించుచున్నాడు

బృహద్విపాటనకాలమునుండి జ్యోతిర్విశ్వములు తిరోగమనకు లోనగుచునే యున్నవని భావించినచో విశ్వముయొక్క వయస్సు హబ్బుల్ సిద్ధాంతముయొక్క విలోమగుణకమునకు సమానము కాగలదు (హబ్బుల్ స్థిరాంక నిర్వచనమునకై "విశ్వనిర్మితి" అను వ్యాసము చూడుడు) హబ్బుల్ స్థిరాంకము విలువ ప్రతి పదిలక్షల పార్సెక్కులకు 100 కి మీ సెకను అని తలచినచో పై సిద్ధాంతము ప్రకారము విశ్వముయొక్క వయస్సు పదిలక్షలకోట్ల వత్సరము లగుచున్నది ఈ సందర్భములో అన్యవిధములైన పరిశోధనలు మన జ్యోతిర్విశ్వముయొక్క వయస్సుకూడ దాదాపు అన్ని సంవత్సరములే అని తెల్పుట గమనించదగి యున్నది

సాపేక్షతావిశ్వజననవాదముల (Relativistic Cosmology) ప్రకారము పరస్పర గురుత్వాకర్షణపరిధుల నతిగమించి సుదూరము తొలగిపోయిన జ్యోతిర్విశ్వములకు మధ్య వికర్షణ ముండుటకు వీలున్నది ఈవిధమైన వికర్షణము తత్సంబంధమైన గణిత సమీకరణములలో "విశ్వసంబంధి స్థిరాంకము (Cosmological Constant)" అనబడు స్థిరాంకము ద్వారా వర్ణింపబడుచున్నది విశ్వమందలి జ్యోతిర్విశ్వములు నిరంతర తిరోగతికి లోనగునా లేదా? కొంతకాలము తిరోగతి మరికొంతకాలము పురోగతి వరుసగా కలిగియుండునా? అను విషయ మీ విశ్వసంబంధి స్థిరాంకముపైనను విశ్వమందలి పదార్థముయొక్క సగటు సాంద్రతపైనను ఆధారపడి యుండును విశ్వమందలి పదార్థము దాదాపు అంతయు జ్యోతిర్విశ్వముల రూపములోనే యున్నదనియు జ్యోతిర్విశ్వాంతరాళపదార్థ మత్యల్పముగా నున్నదనియు మనము భావించినచో ప్రస్తుతము జ్యోతిర్విశ్వములు ప్రదర్శించు తిరోగమన వేగములు విశ్వము నిరంతర విస్తృతికి లోనగుచున్నదను ప్రతిపాదనముతోనే సరిపోవుచున్నది

**ప్రశాంతస్థితి సిద్ధాంతము** – ఈ సిద్ధాంతము బొండిగోల్డు అను శాస్త్రజ్ఞులచే ప్రతిపాదింపబడి హాయల్ అను శాస్త్రజ్ఞునిచే సాపేక్షతా సూత్రముల ననుసరించి విస్తృతీకరింపబడెను ఈ సిద్ధాంతము విశ్వమందలి పదార్థముల యొక్క గతి వితరణము అన్ని దిశలందును సమముగానుండు ననుటయే (ఇదియే విశ్వసంబంధి ప్రతిపాదనము) గాక, అన్ని కాలములందును ఇట్లేయుండు ననియును భావించును దీనికి

పరిణత విశ్వసంబంధిప్రతిపాదన" (Perfect Cosmological Principle) మందురు కాని విశ్వమందలి పదార్థము విశ్వవిస్తృతి మూలమున ప్రతి క్షణము క్షయమందుచే విశ్వమందలి పదార్థముయొక్క వితరణగతులన్ని వేళలందును ఒకే రీతిగా నుండుటకై యిట్లు క్షయమందు పదార్థము దానికి తులతూగు సద్యోనిర్యాత పదార్థముచే పూరింపబడుచుండవలెను ఈ విధముగా జ్యోతిర్విశ్వాంతరాళమునుండి అనుక్షణము పదార్థ మావిర్భూత మగుచునే యున్నదనియు ఇట్లుత్పన్నించిన పదార్థమునుండి ఎప్పటికప్పుడు క్రొత్త జ్యోతిర్విశ్వము లేర్పడుచునే యున్నవనియు యిట్లేర్పడిన జ్యోతిర్విశ్వములు విశ్వవిస్తృతి మూలముగా నేర్పడిన పదార్థ సాంద్రతా క్షయమును పూరించుచునే యున్నవనియు ప్రశాంతస్థితివాదము ప్రతిపాదించుచున్నది అనగా ఈ సిద్ధాంతము ప్రకారం విశ్వమునకు ఆరంభలయములు లేనేలేవు ఆదెప్పుడును సద్యోజాతముగనే యున్నది

హబ్బుల్ స్థిరాంకముపై ఆధారితమైన గణనములు 2 1/2 లక్షల వత్సరముల వ్యవధిలో పూర్వపరిమాణమునకు సరియైన విశ్వాంతరాళములో ఒక గ్రాము హైడ్రోజనుపదార్థము ఉత్పన్నమైనచో అది విశ్వవిస్తృతి మూలముగా నేర్పడిన పదార్థక్షయమును పూరింప సమర్థవంతమగునని తెలుపుచున్నవి మెక్రి అను శాస్త్రజ్ఞుడు పదార్థ మొకేవిధముగా విశ్వమందంతటను ఉత్పన్నమగుట లేదనియు ముఖ్యముగా జ్యోతిర్విశ్వ కేంద్రములలో నట్టి ఉత్పత్తి అధికముగా సాగగలదనియు భావించుచున్నాడు

పరిణామ ప్రశాంతస్థితి ద్వాతములందేది ఉచితమో నిర్ణయించుట అతి క్లిష్టమైన విషయము వీలనతిని వురూహించు ఫలితములు సుదూరములోనున్న జ్యోతిర్విశ్వములయందు మాత్రమే అవలోక్యమాన మగును కాని, దూరము హెచ్చినకొలది అవలోకనలయొక్క యాదార్థ్యము అనుమానాస్పద మగుటచేత మనమీ రెండు సిద్ధాంతములయందు దేనిని కూడ స్థిరీకరింపలేని స్థితిలో మున్నాము

ఎస్ ఎమ్ అ
తి కృ దె

## విశ్వనాథ నాయకుడు :

అనవద్యము, అప్రతిమానము అయిన రాజభక్తిని ప్రకటించి రాజమన్ననలకును ప్రజల ప్రశంసలకును పాత్రుడైన ఆంధ్ర వీరపుంగవుడు విశ్వనాథనాయకుడు అతని జననాదికముసుగూర్చియు బాల్యమును గూర్చియు తెలిసికొనుటకు తగిన ఆధారములు లేవు అతని తండ్రి అయిన నాగమనాయకుడు శ్రీకృష్ణదేవరాయల కొలువున నొక సేనానాయకునిగ ప్రసిద్ధిగాంచి యుండెను విశ్వనాథుడును విద్యాబుద్ధులు నేర్చి విలువిద్యయందారితేరిన వాడై రాయలవారి కొలువు వారి నలంకరించెను

శ్రీకృష్ణదేవరాయలు విజయనగర సామ్రాజ్యమును వీరశేఖరచోళుడును మధుర రాజ్యమును చంద్రశేఖర పాండ్యుడును పరిపాలించుచుండిరి రాయల తుది రోజులలో వీరశేఖర చోళుడు చంద్రశేఖరపాండ్యునిపై దండెత్తి అతని రాజ్యమునుండి వెడలగొట్టెను చంద్రశేఖర పాండ్యుడుచేయునది లేక విజయనగరమునకు పారిపోయి రాయల శరణుజొచ్చెను రాయలు అతనివలన జరిగిన వృత్తాంతమంతయు విని వీరశేఖరుని అడంచి పాండ్యరాజ్యమున చంద్రశేఖరుని పునఃప్రతిష్ఠితుని కావించుటకై నాగమనాయకుని సేనలతో పంపెను రాజాజ్ఞ తలదాల్చి నాగమనాయకుడు సేనలతో దక్షిణమునకరిగి చోళు నోడించెను కాని అతడు పాండ్యరాజ్యమును చంద్రశేఖర పాండ్యున కొసంగక తానే ఏలుచుండెను పాండ్యుడుపోయి మరల రాయలతో మొరపెట్టుకొనెను రాయలు పాండ్యరాజ్యమును చంద్రశేఖరున కొసంగి సేనలతో వెంటనే తిరిగిరావలసినదని నాగమనాయకునకు ఉత్తరువొసంగెను నాగమనాయకుడు స్వార్థపరుడై రాజాజ్ఞను మన్నింపనయ్యెను

నాగమనాయకుని అవిధేయత తెలియవచ్చినంతనే రాయలు క్రోధోద్రిక్తుడై నిండు కొలువున్న సమయమున "ఈ అవినీతుని పదమడంపజాలు ధైర్యము కలవారు నా కొలువున ఎవ్వరును లేరా?" అని గర్జించెను నాగమనాయకుని కుమారుడైన విశ్వనాథుడా మాటలువిని ఆసనమునుండి లేచి దేవరవారు అనుగ్రహించి పంపుచో ఆ అవినీతుని అడంచి జీవగ్రాహునిగనో మృతరూపమునో కొనివచ్చుటకు ఈ సేవకుడు సిద్ధముగానున్నా"డని పలికెను ఆ విశ్వనాథుడు కూడపోయి తండ్రితో కలసికొనుటకు అనుజ్ఞ వేడుచున్నాడని రాయలు మొదట భావించియు తరువాత అతని రాజభక్తి విశేషమును, శౌర్యపరాక్రమములను గ్రహించి, ఆశ్చర్యానంద చకితుడై అతని అధికారమున ఉన్న ర వేల అమరం సేనలతో నాగమనాయకునిపై దండెత్తి అతని శిక్షించి రమ్మని

అనుజ్ఞ ఒసంగెను. అతనికి అంతకంటె ఎక్కువ సాహాయ్యము నిచ్చుటకు రాయలంగీకరింపలేదు.

విశ్వనాథుడు ఆ ఆరువేల సేనతో బయలుదేరి తండ్రిని ఎదిరించెను. నాగమనాయకుడు కుమారుని పలువిధముల ప్రలోభపెట్టుటకు యత్నించెను కాని లాభము లేకపోయెను. తండ్రికొడుకులకు దారుణమైన యుద్ధము జరిగెను. విశ్వనాథుడు అంతర్గతమైన రాజభక్తి ప్రేరేపింప తండ్రిని ఓడించి అతనిని జీవగ్రాహునిగా బంధించి రాయలకడకు కొనివచ్చెను. రాయలు విశ్వనాథుని అపూర్వ రాజభక్తికిని అపార శౌర్య పరాక్రమములకును అచ్చెరువొంది అతని ప్రార్థనపై నాగమనాయకుని క్షమించి విశ్వనాథనాయకుని పాండ్యచోళరాజ్యములకు ఏలికగా నియమించి "దక్షిణసింహాసనాధీశుడు" అను బిరుదము నొసగెను. విశ్వనాథుడు కృతజ్ఞతాపూర్వకముగా కృతజ్ఞత ప్రకటించి రాయల అనుమతిపై దక్షిణమునకు అరిగి రాజ్యాధిపత్యమును స్వీకరించెను. తరువాత అతడు విజయనగర చక్రవర్తికి సామంతుడుగా చోళపాండ్యరాజ్యములను పరిపాలించెను.

కొంతకాలము తర్వాత కృష్ణదేవరాయలు మరణింపగా అతని తమ్ముడు అచ్యుతదేవరాయలు చక్రవర్తియయ్యెననియు అతని దేవేరియగు తిరుమలమ్మకు చెల్లెలైన మూర్తిమాంబను చెవ్వప్పనాయకుడు పెండ్లాడెననియు అచ్యుతరాయలాతనిని అంతవరకు మధురా రాజ్యములో ఒక భాగముగానుండిన చోళరాష్ట్రమునకు రాజప్రతినిధిగా నియమించెననియు "తంజావూరు ఆంధ్రరాజుల చరిత్ర" చెప్పుచున్నది.

సీ॥ అచ్యుతరాయలే యవనీశమౌళికి నరుదుగా పలుతగ
బిరుదులిచ్చె
దక్షిణ సింహాసనాధీశ సామ్రాజ్య ధౌరేయుడయ్యెనే
ధరణివిభుడు
ఘనముగా విజయదుర్గను మహాలక్ష్మి నేధీరుడు తెచ్చి
ప్రతిష్ఠచేసె
మధురాపురంబున మహనీయ పాండ్యభూమండలం
బేలెనే మహిపమౌళి,

గీ॥ అతడు నృపమాత్రుడా మహోహవ జయాంక
భువనరాహొద్ది బిరుద సంభూత కీర్తి
కార్తికీ చంద్ర ధవళిత గగనవాటి
అనఘుడౌ విశ్వనాథనాయక కిరీటి"

అను "పాండ్యరాజచరిత" మనునొక గ్రంథమందలి పద్యమును బట్టి విశ్వనాథనాయకుడు అచ్యుతరాయల వలన పెక్కు బిరుదులు పొందెననియు అతడు దక్షిణ సామ్రాజ్య ధౌరేయుడై మధుర రాజధానిగా పాండ్యమండలమును పాలించెననియు తెలియుచున్నది. మెకంజీ లిఖితగ్రంథములందలి కొన్ని కైఫీయతులు కూడ విశ్వనాథుడు రాజ్యమునకు కావించిన సేవకు ప్రతిఫలముగా అచ్యుతరాయలాతనిని మధురాధిపతిగా నియమించెనని తెల్పుచున్నవి.

పైన పేర్కొనబడిన విషయమును బట్టి కృష్ణదేవరాయలో లేక అతని తమ్ముడు అచ్యుతదేవరాయలో విశ్వనాథుని మధురాధిపతిగా నియమించినట్లు వ్యక్తమగుచున్నది. వి న్యూ జ్ అను చరిత్రకారుడు అచ్యుతరాయల రాజ్యగ్రంథకాలమందుండిన ప్రముఖ అమరనాయకుల పట్టిక నొసంగుచు అందు మధురానాయకుని పేర్కొని యుండకపోవుటయే గాక కృష్ణరాయల మరణానంతరము సాల్వనాయకుడు మంత్రియై అచ్యుతరాయలు సింహాసనమును అధిష్ఠించువరకు రాజ్యమును పాలించెననియు అతని పరిపాలనము దక్షిణమున తిరునల్వేలిజిల్లావరకును వ్యాపించి యుండెననియు చెప్పుచున్నాడు. రాజనాథ డిండిముడుకూడ చోళదేశము సెల్లప్ప (సాల్వనాయకుని) అధీనమున నుండెనని వ్రాసియున్నాడు. ఈ సాల్వనాయకుని శాసనములు చోళపాండ్యదేశములందును రామనాడుజిల్లాయందలి తిరుప్పూవనమునను కానవచ్చుచున్నవి. పై ఆధారములనుబట్టియు ఇతర శాసనాద్యాధారములను బట్టియు డాక్టరు నేలటూరు వేంకటరమణయ్య విశ్వనాథుడు కృష్ణరాయలచేతనో లేక అచ్యుతరాయలచేతనో మధురాధిపతిగా నియమింపబడిన వృత్తాంతము విశ్వసనీయము కాదని నిర్ణయించి యున్నారు.

విశ్వనాథుని జీవితమునుగూర్చి వారి అభిప్రాయము క్రింద వివరింపబడుచున్నది. "విశ్వనాథుడు 1557వ సంవత్సరము వరకును తిరునల్వేలిజిల్లాయందలి అంబాసముద్రము ప్రాంతమున అమరనాయకుడుగా నుండెను. ఈ కాలమున అతడు రామరాజవిఠలునికి లోబడి ఉండెను. విశ్వనాథుడు అచ్చట నుండినచో తిరువడిదేశమున అప్పుడు చెలరేగుచుండిన అశాంతి పరిస్థితులను అరికట్టజాలునని రామరాజయ్యదేవ అతని తిరువడిదేశముపై అమరనాయకునిగా నియమించి ఉండును. మధురారాజ్య పరిపాలనముతో అతనికి ఎట్టి సంబం

ధమును లేదు తరువాత అతడు రామరాజునకు కార్యకర్తగా వ్యవహరించినమాట నిజమే అయినను అతడు వెంటనే చోళ దేశమందలి ఒక మండలమునకు బదిలీ చేయబడెను అతని కుమారుడైన కృష్ణప్ప వ్రాయించిన శాసనములు అన్నియు క్రీ శ 1564వ సం॥నకు పూర్వము తిరునల్వేలిమండలమందే కనవచ్చుచున్నవి అందుచేత 1564 వరకును విశ్వనాథుడు కాని అతని కుమారుడు కృష్ణప్పకాని సామాన్యమైన అమర నాయకత్వముకంటె ఎక్కువ పదవిని పొందిరనుటకు సాక్ష్యములు ఏవియును లేవు కృష్ణరాయలో లేక అచ్యుతరాయలో విశ్వనాథునికి మధురాధిపత్యము ఇచ్చిఉందురను వ్రాతలు నిరాధారములు తళ్ళికోట యుద్ధానంతరము చెలరేగిన అరాజక పరిస్థితులలో 'కృష్ణప్ప మధురారాజ్యమును ఆక్రమించి దానికి తాను రాజని ప్రకటించుకొని ఉండెననుట సత్యముగా కనిపించును అప్పుడు అట్టి దురాక్రమణములను అరికట్టు శక్తి సామ్రాజ్యమునకు లేకపోవుటచే అది విచ్ఛిన్నమైపోవునను భయముచే తిరుమలరాయలుకృష్ణప్ప వాక్కును అంగీకరించి ఉండును మధురానాయకరాజ్య మవతరించిన విధమిట్టిది

క్రీ శ 1560 తరువాత విశ్వనాథుని దానశాసనము లేవియు కనవచ్చుటలేదు 1558వ సం॥నందలి కృష్ణాపుర (తిరునల్వేలిజిల్లా) శాసనమున మాత్రము విశ్వనాథుడు రామరాజయ్యన్ నుండి తిరువడిదేశమును అమరనాయకముగా పడసినట్లు చెప్పబడివున్నది తరువాతికాలమున విశ్వనాథుని కుమారుడైన కృష్ణప్ప శాసనములే ప్రముఖముగా గోచరించుచున్నవి దీనినిబట్టి విశ్వనాథుని పాలనకాలమందలి తుది సంవత్సరము 1560 అనియు తరువాత అతడు మూడు నాలుగేండ్లు జీవించి ఉండెననియు భావింపవచ్చును మృత్యుంజయలిఖిత గ్రంథమునుబట్టి కృష్ణప్ప 25-1-1564వ తేదీన మధురారాజ్య సింహాసనమున పట్టాభిషిక్తుడైనట్లు తెలియుచున్నది

ది వేం

## విశ్వనిర్మితి

విశ్వనిర్మితిని విశ్వమందుగల నభోమూర్తుల స్వరూప స్వభావములను బట్టి నిర్ణయింపవలెను ఈ క్రింద విశ్వనిర్మాణ నిర్ణాయకములగు వివిధ నభోమూర్తుల గురించి క్లుప్తముగా వర్ణింతము

జ్యోతిర్విశ్వము (Galaxies) రాత్రివేళ పాలపుంతను (Milky way) మనమందరముచూచుచునేయున్నాము ఇదియే మనమును భూమ్యాది నవగ్రహయుక్తుడైన సూర్యుడును నెలకొనియున్న మనజ్యోతిర్విశ్వము ఈజ్యోతిర్విశ్వములో మొత్తము నూరులక్షలకోట్ల నక్షత్రములున్నవి నక్షత్రములు తరచుగా యుగళ నక్షత్రములు (Double Stars)గానో బహుళనక్షత్రములు (Multiple Stars)గానో లేక నక్షత్రపుంజములు (Star Clusters) గానో కూడియుండుట మనము గమనింతుము నక్షత్రపుంజములు - వివృతపుంజములు గోళాకారపుంజములు అని రెండురకములు ఇందు వివృతపుంజములు స్వల్పనక్షత్ర సంఖ్యను గల్గి అక్రమాకారముగ నుండునవి ఇవి సృష్టి పరిణామమును అధికముగానొందని తరుణనక్షత్రములను(వీనినే తొలితెగనక్షత్రములు Population I Stars అనియునందురు) గల్గినట్టివి గోళాకారపుంజములు ఆకృతిలో గోళమువలెనో లేక అండాకారముననో యుండునవి ఇవి అధిక సంఖ్యాకమైన నక్షత్రములతో కూడినట్టివి వీనియందుండు నక్షత్రములు సృష్టిపరిణామము నధికముగా బొందిన వృద్ధనక్షత్రములు (వీనినే మలితెగనక్షత్రములు Population II Stars అనియు నందురు ) మన జ్యోతిర్విశ్వము కటకాకృతి (ఉబికియున్న మధ్యభాగము పలుచనైన అంచులుగల రూపము)లో నుండి, దాదాపు లక్షకాంతి వత్సరముల వ్యాసమును గలిగియున్నది (కాంతివత్సరమనగా, సెకనునకు 3 లక్షల కి మీ చొప్పున కాంతి ఒకసంవత్సరములో పయనింపగల మొత్తము దూరము ఈ దూరము సౌరకూటుంబములో చిట్టచివరనున్న ప్లూటోగ్రహ కక్ష్యావ్యాసమునకు పదిరెట్లుండును) నక్షత్రములు అండాకారకక్ష్యలలో జ్యోతిర్విశ్వకేంద్రము చుట్టును పరిభ్రమించుచున్నవి దీనినే మనము జ్యోతిర్విశ్వభ్రమణము (Rotation of the Galaxy) అని యందుము జ్యోతిర్విశ్వకేంద్రమునకు సూర్యుడు 30 వేలకాంతి వత్సరముల దూరమున నెలకొనియుండి 108 వత్సరముల కొకసారి జ్యోతిర్విశ్వకేంద్రమును చుట్టి వచ్చుచున్నాడు

జ్యోతిర్విశ్వ ద్రవ్యరాశి మొత్తములో 98 శాతము నక్షత్రము లందే ఇమిడియున్నది మిగిలిన 2 శాతము నక్షత్రాంతరాళవాయువు ధూళి (Inter stellar gas & dust) రూపమున నున్నది నక్షత్రాంతరాళము (Inter stellar medium) అయస్కాంతత్వమును గలిగియున్నది సూర్యుని పరిసరములలో ఈ అయస్కాంతక్షేత్ర బలము $10^{6}$ గాసులు

నక్షత్రాంతరాళము నుండియే నక్షత్రము లుద్భవించుటచేత ఈ నక్షత్రాంతరాళమునకధిక ప్రాముఖ్యము గలదు

నక్షత్రములు జ్యోతిర్విశ్వ నిర్మాణమున కాధారభూత మైనట్లు జ్యోతిర్విశ్వములు విశ్వనిర్మాణమున కాధారభూత మగుచున్నవి జ్యోతిర్విశ్వముల విషయములు అతిముఖ్యమైన పరిశోధనలు సల్పిన హబ్బుల్ శాస్త్రజ్ఞుడు జ్యోతిర్విశ్వములు మౌలికముగా మూడువిధములైననిర్మాణములనుకలిగియున్నట్లు తెల్పినాడు అవియే అండాకార సర్పిలాకార అక్రమాకార నిర్మాణములు వీనిలో ఇంకను ఉపభేదములుగలవు మనమెరిగిన జ్యోతిర్విశ్వములలో నాల్గింట మూడుపాళ్ళు సర్పిలాకృతి గలవి మనజ్యోతిర్విశ్వమును ఇట్టిదే సర్పిల అక్రమాకార జ్యోతిర్విశ్వములు తరుణవయస్సులో నున్న తొలితెగ నక్షత్రములను అధికముగాగల యట్టివి నక్షత్రాంతరాళవాయువు ధూళులపాళ్లు వీనిలో ఎక్కువే కాని అండాకార జ్యోతిర్విశ్వము లట్లుగాక వృద్ధవయస్సులో నున్న మలితెగ నక్షత్రము లధికముగాగలయట్టివి నక్షత్రాంతరాళ పదార్థము వీనియందులేదనియే చెప్పవచ్చును ఉండినను అత్యల్పముగనే యుండును జ్యోతిర్విశ్వముల ద్రవ్యరాసులు $10^{10}$ నుండి $5 \times 10^{12}$ సౌరద్రవ్యరాసుల మేరలోనున్నవి (ఒక సౌరద్రవ్యరాశి $= 2 \times 10^{33}$ గ్రాములు)

విశ్వమందలి దూరముల తత్త్వము నెరుగుటకు జ్యోతిర్విశ్వముల దూరము నెరుగవలెను దగ్గరలోనున్న జ్యోతిర్విశ్వముల దూరములు వానియందున్న "సెఫిరైడ్" అను వృద్ధిక్షయ నక్షత్రముల పరిశీలనమూలమున ఎరుగవచ్చును ఈవృద్ధిక్షయనక్షత్రములు తన యథార్థ కాంతి పరిమాణమునకు అనులోమసంబంధ సామ్యములో నున్న ఆవర్తనకాలమును కలిగియుండుటచే, ఇది సాధ్యపడును సుదూరజ్యోతిర్విశ్వముల విషయమున, వానియందుగల ఉజ్జ్వలనక్షత్రముల కాంతి పరిమాణముతో తేజోదూరవర్గ విలోమసూత్రమును (Inverse square law of distance) జోడించి కనుగొందురు కొన్ని జ్యోతిర్విశ్వముల దూరములను ముందు పేర్కొందుము

**జ్యోతిర్విశ్వకూటములు** – మనజ్యోతిర్విశ్వములో గల నక్షత్రములు యుగళనక్షత్రములు బహుళనక్షత్రములు నక్షత్రపుంజముల రూపమున కూడియున్నట్లే, జ్యోతిర్విశ్వములును యుగళజ్యోతిర్విశ్వకూటముల రూపమున కూడియుండుట తరచుగా తటస్థించును బహుళజ్యోతిర్విశ్వములందలి జ్యోతిర్విశ్వములు పరస్పరము జ్యోతిర్విశ్వాంతరాళ ద్రవ్యముచే కలుబడియుండు నను టకు నిదర్శనము లున్నవి రెండు జ్యోతిర్విశ్వముల నిట్లు కలుపు పదార్థపథమునే జ్యోతిర్విశ్వాంతరాళవారధులు లేక కేసరములు అనియు అందురు

మన జ్యోతిర్విశ్వము 17 జ్యోతిర్విశ్వము లొకటిగా చేరి ఏర్పడిన స్థానిక జ్యోతిర్విశ్వకూటమి లోనిది ఈ స్థానికజ్యోతిర్విశ్వకూటమి 20 లక్షల కాంతివత్సరముల వ్యాసముచే ఏర్పడిన పరిధిగలది మనకతి సన్నిహితముగా నున్న రెండు జ్యోతిర్విశ్వములు లఘుమేజిలాను మేఘము గురుమేజిలాను మేఘము అనునవి ఇవి అక్రమాకారము గలిగి మనజ్యోతిర్విశ్వము నుండి వరుసగా 180 వేలు 190 వేలు కాంతివత్సరముల దూరములోనున్నవి స్థానికకూటమికి చెందిన మరొకప్రముఖ జ్యోతిర్విశ్వము ఆండ్రోమేడా లేక యమ్ 31 అనునది ఇది మననుండి 15 లక్షల కాంతి వత్సరముల దూరములో నున్నది మనజ్యోతిర్విశ్వమువలెనే ఇది సర్పిలాకృతిగలది మేజిలాను మేఘద్వయము M 31 అను ఇవి మాత్రమే మనము వట్టికంటితో (దూరదర్శిని సహాయము లేకయే) చూడగలిగిన బాహిరజ్యోతిర్విశ్వములు

కూటముల రూపమున కూడియుండుట జ్యోతిర్విశ్వములు ప్రదర్శించు ముఖ్య ధర్మములలో నొకటి ఒకానొక కూటములో 10 మొదలు (అల్పకూటములు) 10 000 (అధ్యకూటములు) మేరకు జ్యోతిర్విశ్వములుండ వచ్చును నిర్మాణ సౌష్ఠవమునుబట్టి కూటములను సక్రమాకార అక్రమాకారములని రెండుతెగలుగా విభజింపవచ్చును ఇందు సక్రమాకారములు వృత్తతా సౌష్ఠవము (Spherical Symmetry) అధికకేంద్రీయ సాంద్రతగల అధ్యకూటములు ఈ విషయమునందివి గోళాకారపుంజములను బోలినవి వీని యందలి ఉజ్జ్వల జ్యోతిర్విశ్వములు ప్రధానముగా అండాకృతిగలవి పెద్దవైన సర్పిలాకృతులు వీనియందు అరుదుగా కన్పించును మననుండి 30 కోట్ల కాంతి వత్సరముల దూరమందున్న "కోమా జ్యోతిర్విశ్వకూటమి" ఇట్టిది సక్రమాకారములవలె గాక, అక్రమాకారములు వృత్తతాసౌష్ఠవముగాని, కేంద్రీయ సాంద్రతగాని చెప్పకోదగినంతగాలేని అల్పకూటములు. ఈ విధముగా ఇవి వివృతపుంజములను బోలుచున్నవి. వివిధమితలాలి కాంతితర జ్యోతిర్విశ్వములు అండాకృతులు లేక సర్పిల

ములలోనై యున్నవి సుప్రసిద్ధమైన "కన్యా జ్యోతిర్విశ్వ కూటమి" స్థాని జ్యోతిర్విశ్వ కూటములు" ఇందులకుదాహరణములు. విశ్వములో సక్రమాకారకూటముల కంటె అక్రమాకారకూటములే అధికముగానున్నవి.

జ్యోతిర్విశ్వము లోగల ఏ రెండు నక్షత్రముల మధ్య దూరమైనను వాటి పరిమాణమునకు పెక్కురెట్లుండుటచేత అవి పరస్పరము ప్రఘట్టిత (Collide) మగుట దాదాపు అసంభవమేయని చెప్పవచ్చును. కాని జ్యోతిర్విశ్వకూటములందలి జ్యోతిర్విశ్వముల మధ్య దూరములు వాటి పరిమాణముకంటె 10 రెట్లు మాత్రము ఎక్కువ యుండుటచేతను ఈ జ్యోతిర్విశ్వములు అన్యోన్య గురుత్వాకర్షణకు లోనగుటచేతను సహజగతులను గల్గియుండుటచేతను ఒకదానితో నొకటి ప్రఘట్టనమగుట సంభవమగుచున్నది. ఇట్లు రెండు జ్యోతిర్విశ్వములు ప్రఘట్టితమైనప్పుడు వాని యందు గల నక్షత్రాంతరాళ పదార్థము ఉద్ధృతమైన భౌతిక ప్రక్రియకులోనై జ్యోతిర్విశ్వాంతరాళము (Intergalactic space) లోనికి చిమ్మబడును. కాని ఇట్లు ప్రఘట్టనమగుచున్న జ్యోతిర్విశ్వముల యందలి నక్షత్రముల మధ్య దూరములు అత్యధికముగుటచే ఒక నక్షత్రముతో వేరొకటి ఢీకొనుట అసంభవమనియే తోచుచున్నది. ఇనను ప్రవ్యవేళాప్రక్రియల మూలమున నక్షత్రము అతిశయమైన వేగమును సంతరించుకొనును. ఈ విధముగా కొన్ని నక్షత్రములు ప్రఘట్టితమగుచున్న జ్యోతిర్విశ్వములను వీడిపోవచ్చును. మన నుండి 50 కోట్ల కాంతి వత్సరముల దూరములో సిగ్నస్ రాశియందున్న అత్యధిక రేడియో ధార్మిక ప్రసారకము ప్రఘట్టితమగుచున్న జ్యోతిర్విశ్వములేయని శాస్త్రజ్ఞులూహించుచున్నారు.

కూటములలోనున్న జ్యోతిర్విశ్వ వర్ణమాలలను పరిశీలించి వాటి దృగ్రేఖావేగము (Radial Velocity) లను గణించినచో ఆ జ్యోతిర్విశ్వములకు కూటమి యొక్క సామాన్య గురుత్వాకర్ష కేంద్రము చుట్టును ఉండవలసిన ద్రుతికంటె అత్యధికముగానున్నట్లు తెలియును. ఈ దృశ్యాధిక్యము కూటమి విచ్ఛిత్తికి దారితీయును. అతిపెద్ద మొత్తములో జ్యోతిర్విశ్వాంతరాళ ద్రవ్యమున్నయెడల ఈ విచ్ఛిత్తిని అరికట్టవచ్చు. కాని ఇంత పెద్ద మొత్తములలో జ్యోతిర్విశ్వాంతరాళ ద్రవ్యమున్నట్లు అవలోకనాపూర్వకమైన సాక్ష్యములు నేడు లేకున్నవి.

బహుళ జ్యోతిర్విశ్వ కూటముల కూటములు (ద్వితీయ శ్రేణికూటములు) కూడా ఉండవచ్చును. ఒక ద్వితీయ శ్రేణి కూటమి యొక్క మొత్తము ద్రవ్యరాశి $10^{16}$ నుండి $10^{17}$ సౌర ద్రవ్యరాసులుండవచ్చును. ద్వితీయ శ్రేణికూటముల పరిధికంటెను విశాలమైన ఆకాశ (Space) మందుండి పరిశీలించిచో కూటముల వితరణ మన్నిదిశలయందును సమానముగానున్నట్లగుపించును. ఈ కూటముల వితరణ స్వభావమును బట్టి అవకాశమందలి పదార్థసాంద్రతను గణింపవచ్చును. ఇది దాదాపు $10^{-30}$ గ్రా 1 ఘన సెం మీ ఉండునని ఊహింపవచ్చును.

విశ్వ విస్తృతి — సుదూరమందున్న జ్యోతిర్విశ్వముల వర్ణమాలను పరిశీలించిన యెడల వానియందలి రేఖ (ఉదాహరణకు కాల్షియం మూలకమునకు చెందిన H మరియు K రేఖలు) ఎన్నియు శోణచ్యుతి (Red Shift) నందినట్లు తెలిసికొందుము. 1929 లో జ్యోతిర్విశ్వశాస్త్రజ్ఞులలో ప్రముఖుడైన హబ్బుల్ శాస్త్రజ్ఞుడు ఒక ముఖ్య విశేషమును కనిపెను. జ్యోతిర్విశ్వము యొక్క దూరము హెచ్చిన కొలది శోణచ్యుతి హెచ్చుననుటయే ఇది. అనగా దూరమెక్కువైన కొలది ఎక్కువ వేగములతో జ్యోతిర్విశ్వములు మన నుండి తిరోగమించుచున్నవన్న మాట. శోణచ్యుతి "డాప్లర్ ఫలితము" మూలముగా ఏర్పడినదని (అదియే నిజమని) భావించినచో మన అవలోకనా పర్యవసానము శోణచ్యుతి దూరములు అనులోమసంబంధములోనున్నమాట యగును. ఈ సంబంధమును నిర్ణయించు స్థిరాంకము (అదియే హబ్బుల్ స్థిరాంకము) జ్యోతిర్విశ్వ ద్రుతులకు దూరమునకు గల నిష్పత్తి. దీని విలువ 100 కి మీ (1 సెకను) 10 లక్షల పార్సెక్కులు (1 పార్సెక్కు = 3.26 కాంతివత్సరములు) మాటలలో చెప్పవలెనన్న ప్రతి 10 లక్షల పార్సెక్కుల దూరవృద్ధికిని 100 కి మీ సెకను ద్రుతివృద్ధి కలుగును. హబ్బుల్ స్థిరాంక శాస్త్రీయముగా ఎన్ని దిశలందున్న జ్యోతిర్విశ్వములు అధికమైన తిరోగమన ద్రుతులతో మన నుండి దూరముగా పయనించుచుండుట మనము గమనింపగలము. అనగా విశ్వము నిరంతరము విస్తరించుచున్నదన్నమాట. దీనినే విశ్వవిస్తృతి అందురు.

విశ్వవిస్తృతి యొక్క ఫలితము అవలోక్యమాన (Observable) విశ్వము యొక్క పరిమాణమునకొక మితిని

కల్పించుట ప్రత్యేకసాపేక్షతావాదము (Special theory of Relativity) ప్రకారము బాహిరజ్యోతిర్విశ్వములు తిరోగమనద్రుతి కాంతిద్రుతి కంటె తక్కువగానున్నప్పుడే అవిదృశ్యమానములగును. ఈ ద్రుతి కాంతిద్రుతికి సమానమయ్యెనా మనమింక వాటిని చూడలేము. హబ్బుల్ స్థిరాంకమునుపయోగించి ఎంత దూరములో ఉండు జ్యోతిర్విశ్వములు కాంతికి సమానమైన ద్రుతిని గల్గియుండునో గుణించ వచ్చును. ఈ దూరమే అవలోక్యమాన విశ్వము యొక్క వ్యాసార్థము కాగలదు. ప్రస్తుతపు టంచనాలను బట్టి ఇది దాదాపు 10 లక్షల కోట్ల కాంతివత్సరములు. అవలోక్యమానవిశ్వములో గల మొత్తము జ్యోతిర్విశ్వముల సంఖ్య $10^{11}$ అనియు వానిలోగల మొత్తము నక్షత్రముల సంఖ్య $10^{21}$ అనియు శాస్త్రజ్ఞులంచనా వేయుచున్నారు.

క్వేజారులు :— 1963 వ సంవత్సరమున అమిత శక్తి ప్రసారకములగు పెక్కు నభోమూర్తులు కన్గొనబడెను. ఇవియే క్వేజారులు. ఇవి ఇతః పూర్వ పరిచితములైన రేడియో శక్తిదములగు నభోమూర్తుల (ఉదాహరణకు రేడియో గెలాక్సీలు) కంటె పెక్కు విషయములలో భిన్నముగానున్నవి. క్వేజారు అనునది సాధారణ రేడియో జ్యోతిర్విశ్వము కంటె పరిమాణములో 20 రెట్లును ద్రవ్యరాశిలో వెయ్యిరెట్లును తక్కువగానున్నను రేడియో జ్యోతిర్విశ్వమునకు తుల్యమైన శక్తిని వికిరణమొనరించును. క్వేజారొక సెకనులో వికిరణమొనరించు శక్తి సూర్యుడు 10 లక్షల సంవత్సరములలో వికిరణమొనరించు మొత్తము శక్తికి సమానము. వీటి తిరోగమనద్రుతి సెకనుకు లక్ష కిలో మీటర్లు. ఇది కాంతిద్రుతిలో 3 వ వంతు. క్వేజారులందలి పదార్థము ప్రదర్శించు విపరీత స్వభావములు, వాని యందుత్పన్నమౌచున్న అమితమగు శక్తి మున్నగు వాటి విశదీకరణము నేటి బృహచ్ఛక్తి భౌతికశాస్త్ర సిద్ధాంతములకు సవాళ్ళవంటిది.

విశ్వనిర్మాణమున కాధార భూతమైన వివిధ నభోమూర్తులను గురించి పైన వివరింపబడినది. విశ్వనిర్మితి యొక్క సదవగాహనమునకై మూర్తులతత్త్వమును అవగాహన మొనర్చు కొనుటయే యగును. ఈ నిర్మాణమును గూర్చిన సైద్ధాంతిక వివరణము "విశ్వజనన వాదములు" అను వ్యాసములో చదువ వచ్చును.

ఎస్. ఎమ్. ఆ.
ఆ. కృ. దే.

## విశ్వేశ్వరకవి

ఆంధ్రాలంకారికులలో కాకతీయ ప్రతాపరుద్రుని ఆస్థానకవిగా వెలసి దెబ్బదినాలుగు కృతులను వెలయించి విద్యానాధుడుగా ఖ్యాతిగాంచిన అగస్త్య పండితుడు అలంకార శాస్త్రములో ఒక నూతన మార్గమును నెలకొల్పి వాసికెక్కెను. అలంకారశాస్త్ర గ్రంథమున ఉదాహరణముగా లోకోత్తర గుణోత్తరుడైన వ్యక్తిని నాయకుడుగా కూర్చుటయే ఈ క్రొత్తత్రోవ. అలంకార సర్వస్వ సంగ్రహమనదగు తన "ప్రతాపరుద్ర యశోభూషణము" లో లక్ష్యముగా విద్యానాధుడు ప్రతాపరుద్ర చక్రవర్తి వృత్తమును నిబద్ధించి అటు అలంకార శాస్త్రమునకును ఇటు ఆంధ్రచరిత్రకును సువర్ణ సౌధమును నిర్మించి "భళి" యనిపించుకొన్నాడు. ఈ యశోభూషణ శాఖకు చెందిన గ్రంథరత్నములలో విశ్వేశ్వర కవి విరచితమగు "చమత్కార చంద్రిక" ఒకటియై వెలసినది.

ఈ గ్రంథములో కవి సింగభూపాలుడను రాజన్యుని కీర్తిచంద్రికను ఉదాహరణముగా నిబద్ధించినాడు. రెండవ సింగభూపాలుడుగా చరిత్ర ప్రసిద్ధినొందిన ఈ సింగభూపాలుడు రేచర్ల వంశీయుడైన అనపోతనాయని కుమారుడు. కాకతీయరాజ్య పతనానంతరము పూర్వము కాకతీయుల కడ చమూపతులుగానున్న ఈ రేచెర్లవారు స్వతంత్రులై రాజాచలమను రాచకొండను రాజధానిగా చేసికొని శ్రీశైలమునుండి వింధ్యవరకును పాలించినారు. ఈ సింగభూపాలుడు విశేష పరిశ్రమముచేసి సకలీత సాహిత్యశాస్త్రములోనే కాక బహువిధమైన శాస్త్ర ప్రజ్ఞాపాటవమును సంపాదించుకొని సర్వజ్ఞు డనిపించుకొన్నవాడు. ఇతడు (1) రసార్ణవ సుధాకరము (2) కువలయావళి (3) సంగీతసుధానిధి మున్నగు గ్రంథములనుగూడ వెలయించినాడు. విద్వత్కవియైన ఈ రాజశేఖరుని ఆస్థానము నలంకరించిన పండితకవులలో నాయకమణిగా పేర్కొనదగినవాడు విశ్వేశ్వరకవి.

రేచెర్ల వంశీయులైన వెలమరాజులు కృష్ణానది కీవల వాఙ్మయపోషణము గావించుచుండగా కృష్ణ కావల కొండవీటి సీమలో రెడ్డిప్రభువులుకూడ వైదిక మార్గ సంరక్షణమును సంస్కృతాంధ్ర వాఙ్మయ పోషణమునందును బద్ధశ్రద్ధులై యుండిరి. ఈ ఉభయ రాజవంశీయులకును [illegible] ధభావము రాజకీయములలో ఎట్టి [illegible]

పైనను సారస్వత రంగమున మాత్రము పెద్దమేలే చేకూర్చిన దనవచ్చును ఒకవిధముగ చూడగా వీరు ఒండొరులనుమించి ఖ్యాతిగాంచు ఉద్దేశముతో పోటీపడి వాఙ్మయపోషణము గావించినారు తులనాత్మకముగా పరిశీలించినచో రాచకొండ వారి చమత్కారచంద్రిక - రసార్ణవ సుధాకరము" లకు దీటుగా కొండవీటివారి వసంతరాజీయ - సాహిత్యచింతా మణులు" భాసించును ఇచ్చటివారి (కోలాచలము మల్లినాథ సూరి మొ॥) కాళిదాసీయ రఘువంశాది కావ్య వ్యాఖ్యలకు అచ్చటివారి (కాటయవేముడు మొ॥) శాకుంతలాది నాటక వ్యాఖ్యలు ఎదురెదురుగా నిలుచుచున్నవి ఈ విధమగు సాహిత్య స్పర్ధయెంతయు వినోదహేతువు కదా!

మధ్యాంధ్రములో కృష్ణ కిరువైపుల పై రీతిగా సారస్వత కృషి జరుగుచుండగా పశ్చిమాంధ్రమున విజయనగరములో హరిహరబుక్క ప్రౌఢదేవరాయాదులు వైదికధర్మ రక్షణమునకును వాఙ్మయపోషణమునకును నడుములు బిగించి పనిచేయసాగిరి

ఈ రీతిగా ఆనాడు తుంగభద్రనుండి గోదావరి వరకును ఆంధ్రదేశములో ప్రభువులు తురుష్కులధాటిచే ఆఘాతము నొందిన వైదికధర్మమును పునరుద్ధరించి సుప్రతిష్ఠితము చేయుటలోను ప్రబంధాదులను సంస్కృతాంధ్రములలో గ్రంథములుగా నిర్మింపజేయుటలోను శ్లాఘ్యమైనకృషి గావించి స్థిరతర కీర్తినార్జించిరి ఈ మహోద్యమములో మహత్తరమైన పాత్రవహించిన సింగభూపాలుని యశశ్చంద్రికలకు మణిదర్పణముగా భాసించుచున్నది విశ్వేశ్వరకవిచంద్రుని చమత్కార చంద్రిక"యను అలంకారశాస్త్ర గ్రంథము.

విశ్వేశ్వరకవి ఇతడు భారద్వాజసగోత్రుడు వివిధ శాస్త్రపారంగతుడు రసమీమాంస రచయితయును మహాపండితుడునగు శాశ్వరమిశ్రుడు తన గురుదేవుడని "తథా చోక్తమస్మదాచార్యైః శాకేశ్వరమిశ్రై రసమీమాంసాయాం" అను వాక్యముచే తెలిపినాడు రేచర్ల అనపోతనాయని ఆస్థానమున విద్వత్కవి పదవినధిష్ఠించినవాడితడు ఈ విద్వాంసుని చరణసన్నిధిని పెక్కురు విద్యార్ణవము దాటించిరి వారిలో పశుపతినాగనాథుని కుమారుడగు నాగనాథకవి ముఖ్యుడు విశ్వేశ్వరుడు అనపోతనాయని కుమారుడగు సింగభూపాలునకు ఆచార్యకత్వము వహించి శాస్త్రమును బోధించి అతనిని విద్వత్కవిగా తీర్చిదిద్దినట్లు కనబడుచున్నది దీక్షాయుష్మంతుడైన ఈ కవిచంద్రుడు తన శిష్యుని రాజ్యకాలములో కూడ అతని వివ్వత్సభకు మండనాయమానుడై అతని సారస్వత కృషికి చేయూతనిచ్చుచు వాత్సల్యము ప్రదర్శించెను తాను కావ్యమీమాంసయగు చమత్కార చంద్రిక"ను చేపట్టకముందే సింగభూపాలుని ప్రోత్సహించి అతనిచే రసార్ణవసుధాకర మను నాట్యాలంకార శాస్త్ర గ్రంథమును వ్రాయించి ఆనందించెను

గుణ పక్షపాతియైన విశ్వేశ్వరకవి ఉత్తమ గుణసంపన్నుడును ఆదర్శరాజచంద్రుడునైన ఈ సింగభూపాని యశోబింబమును తన వాఙ్మయాదర్శమున సుప్రతిష్ఠితముచేయ సంకల్పించి చమత్కార చంద్రికను నిబద్ధించెను ఈ సందర్భమున చమత్కారచంద్రిక పీఠికాభాగమున చెప్పబడిన ఈ పద్యము గమనింపదగినది

లోకే రాఘవపాండవాద్భుత కథాగ్రంథాను
సంధాయి నౌ
తౌ గ్రంథాదివతస్మనిర్వహ హితౌ శ్రీ సింగభూపాశ్రయః
యాయాచాదరణీ యతాం కృతధియాం
గ్రంథోయమస్మత్కృతః
నాహం యద్యపి తాదృశోస్మ్యయమసౌ
రాజాహితాదృగ్గుణః"

వాల్మీకి వ్యాసమహర్షులు రచించిన రామాయణభారతములవలె సింగభూపాలచరిత్ర నిబద్ధమైన ఈ చమత్కార చంద్రికయు సహృదయుల ఆదరమున పాత్రము కాగలదనియు తాను వాల్మీకి వ్యాసుల కెందును పోలకున్నను ఈ సింగనాయడు మాత్రము ఆ రామ యుధిష్ఠిరులతో ఈడైనవాడే సుమీ! అనియు తాత్పర్యము

చమత్కార చంద్రిక : ఈ గ్రంథము ఎనిమిది విలాసములుగ విభజింపబడి అలంకారశాస్త్ర ప్రమేయమైనగుణ రీతి రసవృత్తి పాకశయ్యాలంకారముల నెడు సప్తవిధమైన అలంకారశాస్త్ర ప్రమేయము ఇందు ప్రదర్శింపబడినది ఇట్టి ప్రమేయముతోకూడిన లక్ష్యలక్షణ సంగతమైనశాస్త్రనిబంధము నకు పాఠకులకు విధినియమములను తెలిపి వారిని సత్పథమున ప్రవర్తింప జేయుటయును అసత్పథమునుండి నివర్తింప జేయుటయును ముఖ్యప్రయోజనమని తెలుపుచు విశ్వేశ్వరకవి—

నృణాం విధౌచ నాథేచ
శిక్షా కావ్యప్రయోజనం

"శిక్షా చ న చమత్కారం
నోధితా స్థిరతాం భజేత్"

అని ఈ విధినిషేధములవలని ప్రవర్తన నివర్తనరూపమైన శిక్షణము చమత్కారయుక్తముగా చేయబడినచో అది ఆ ప్రజల హృదయమున లెస్సగా హత్తుకొనియుండునని అతడు వచించెను మరి ఇంత ప్రభావముగల ఈ చమత్కారము యొక్క స్వరూపమెట్టిది? చమత్కారమునకు నిఘంటు నిర్వచనమిట్లున్నది

చమత్ ఇత్యవ్యక్తం క్రియతే-చమత్ + కృ + ఘఞ్ - లోకాతీత వస్తుదృష్ట్వా చిత్తస్య ఆనందహేతాప్రకాశే— విస్మయే

అసాధారణమైన పదార్థములను చూచినందువలన చిత్తమునకు ఒక విధమైన తళుకు-వెలుగుకల్గును-ఇదియే విస్మయము అని దీనిభావము

ఈ లౌకికార్థమును కావ్యమునకు అన్వయించునపుడు అందుకొంత వైలక్షణ్యము గోచరించును ఆలంకారికులలో ప్రామాణికమూర్ధన్యుడైన అభినవగుప్తుడు "అభినవభారతి"లో రసమాత్ర వ్యాఖ్యానసందర్భముగ చమత్కారమును రసమునకు పర్యాయముగా భావించెను ఈ చమత్కారమును స్పృశించి వివరించిన వారిలో మరియొక ఆలంకారికుడైన క్షేమేంద్రుడు పేర్కొనదగినవాడు ఔచిత్యమేరసాదులన్నిటికి మెరుగుపెట్టునదనియు అదియే కావ్యమునకు జీవితమనదగినదనియు ఇతడభిప్రాయపడెను అంతేకాక తన కవికర్ణాభరణము లో ఔచిత్యమువలని సొదము ఈ చమత్కారము పదివిధములుగా భాసించునని పేర్కొనెను (1) అవిచారిత రమణీయము(2)విచారితరమణీయము(3)సమస్తసూక్తవ్యాప్తము (4) సక్తైకదేశగతము (5) శబ్దగతము (6) అర్థాగతము (7) అలంకారగతము (8) రసగతము (9) ప్రఖ్యాతవృత్తిగతము (10) అప్రఖ్యాత వృత్తిగతము

సాహిత్యదర్పణకారుడు విశ్వనాథుడు 'చమత్కారశ్చిత్తవిస్తార రూపోవిస్మయాపరపర్యాయః' అనియు వివరించి అద్భుత వస్తుసందర్శనాదులచే కలుగు విస్మయమను నామాంతరముగల చిత్తవిస్తృతియే చమత్కారమని నిర్వచించెను వాచస్పత్యములో అన్యులు చేసిన చమత్కార పదనిర్వచనముగా మరి రెండు విధములు చెప్పబడినవి అసాధారణమైన అర్థము నాకర్షించినపుడు, ఏమిది? ఎట్టిది? అని మనస్సునకు కలుగు ఒక విస్తృతియే యీ చమత్కారము అనగా అట్టి అద్భుతావహమగు విషయము అనుభవములో నున్న కారణముచే సంభావితము కాదపోవుటబట్టి కారణాంతముల నన్వేషించుటకై మనస్సులో కలుగు వ్యాపారవిశేషమే ఈ చిత్తవిస్తారము - చమత్కారము అని కొందరును సుఖవిశేషయే పచమత్కారః॥ కావ్యాదులవలన చిత్తమునకు కలుగు (సుఖవిశేషమే) సంతోషమేచమత్కార మని మరి కొందరును వాక్రుచ్చిరి

ఈ విధమైన పూర్వ సూరి గ్రంథపరామృష్టమైన చమత్కారము విశ్వేశ్వరుని భావనలో విశేషముగా భాసించినది అతడు దానిని కావ్యజీవితపద లోనే అభిషేకించినాడు సహృదయుల నానందింపజేయునది ఈ కావ్యచమత్కారమే సుమా! అది లేనిది ఎన్ని సొగసులున్న ఏమి ప్రయోజనము? అని అతడు ప్రశ్నించినాడు చమత్కారమును కలిపిచెప్పినప్పుడే కావ్యము సహృదయుని హృదయమున మాయనిముద్రవేయునని "శిక్షా చ న చమత్కారం బోధితాస్థిరతాం భజేత్" అను వాక్యమూలమున నొక్కి చెప్పినాడు ఇక తననిర్వచనముగా చమత్కారము నిట్లు ప్రదర్శించినాడు "చమత్కారస్తు విదుషామానంద పరీవాహకృత్" - విద్వాంసుల హృదయమున వెల్లువగా ప్రవహింపజేయు దియే చమత్కారము కావ్యమునందలి దేనివలన రసిక పాఠకుని హృదయమున ఆనందము కలుగునో అట్టి అంశము చమత్కారమని తెలిపి ఈ చమత్కృతి పూవు సెల్లగలమియుండు తావివలె కావ్యప్రమేయమైన గుణ రీతి రసాదుల యందెల్ల వ్యాపించి యుండుననియు అయా గుణరసాదులు సహృదయులకు 'ఆహో! భళి!' అనిపించు టెల్ల ఈ చమత్కారప్రభావమే అనియు విశ్వేశ్వరకవి తీర్మానించెను

ఈ సందర్భమున విశ్వేశ్వరకవి క్షేమేంద్రుని గడుసు పోకడనేపోయినాడు. అతడు ఔచిత్యమే కావ్యాత్మ అనియు అది కావ్యప్రమేయములైన - విధాంశములలో భాసించుననియు చెప్పినట్లు ఈతడును తనచమత్కారము గుణరీత్యాదులలో వ్యాపించు నిట్లు ప్రవచించెను అనగా వీరుభయులును కావ్యాత్మవాదులలో ఎవరినీ కాదన్నవారు కాక ఎవరేది యనుకొన్నను అదియెల్ల తాము నిర్వచించిన ఔచిత్యము - చమత్కారములతో సహకృతములైనప్పుడే ఆనందహేతువు లగునను సిద్ధాంతమును ప్రతిష్ఠించుకొన్నారు ఇట్లన్నంత

మాత్రముచేత వీరికి పరమోపాదేయములైన రసధ్వన్యాదులు ఉపాదేయములు కాలేదనికాదు వీరును ధ్వనిసిద్ధాంత బద్ధాదరులే దానికి చమత్కారాదులను అనుసంధించుటయే వీరి ఆశయము కావుననే విశ్వేశ్వరుడు ఇదివరలో పేర్కొనబడిన గుణరూపాదులతో కావ్యము 'ప్తాంగసంగతమనియు చమత్కారసంపన్నమైన ఆకావ్యము సుహృత్కోశాది సప్తాంగసంపన్నమైన సామ్రాజ్యమువలె విరాజిల్లునవియు అట్టి సాంగమైనకావ్యము సహృదయుల ఆహ్లాదముకొరకు లక్ష్యలక్షణ సమన్వయపు రస్పకముగా ప్రదర్శింతుననియు చెప్పినాడు ఈ కావ్యచమత్కృతిని అందిపుచ్చుకొని తత్స్వరూపనిరూపణము కావించిన తరువాతి ఆలంకారికులలో ముఖ్యుడు 'రసగంగాధర'' కర్తయగు పండితరాయలను ఆంధ్రుడు

చమత్కారచంద్రిక-అన్యలాక్షణికులు - కావ్యాహ్లాదకారకమగు ఈచమత్కారమునందు సర్వజ్ఞ సింగభూపాలుడు మిక్కిలి ఆదరము చూపినాడు తాను చమత్కార చంద్రికా కృతికర్తృత్వము నంగీకరించుటయేగాక ఒకటి రెండు చోట్ల తన గ్రంథములలో ఈ చమత్కార ప్రశస్తిని గావించియున్నాడు కువలయావళి'' ఆ ముఖములో "ప్రణీతాఖండపరమానందవస్తు చమత్కారిణీం కువలయావళీం'' అని తన కువలయావళినాటిక అఖండపరమానందవస్తు చమత్కారశోభితమైనదని ఉగ్గడించెను అందే ప్రథమాంకములో

అపూర్వసంవిధానేన తరంగిత చమత్కృతేః
పాలితోపిక దానేహం అధమర్ణోభవామి తే॥

నాయకుని వాక్యముగా చెప్పించిన ఈ పద్యమున శ్లేషభంగితో సంవిధాన రామణీయకతను సంతరించుకొని కూర్చిన చమత్కార సౌభాగ్యసంపన్నమైన కృతిని కానుకగానిచ్చిన మిత్రునికి నేను అధమర్ణుడనగుచున్నాను'' అని తనకు చమత్కారరంజితమైనకావ్యమునందుగల విశేషాదరమును వెల్లడించినాడు

"చమత్కారచంద్రిక"ను ఉపజీవ్యము చేసికొన్న తెలుగు లాక్షణికులలో కస్తూరి రంగకవి యొకడు అతడు తన "ఆనందరంగరాట్ఛందము న భూదేవతాకమైన మగణము శుభకరమనియు జలదేవతాకమైన యగణము అర్థలాభదాయకమనియు అగ్నిదేవతాకమగు రగణము భీతిజనకమనియు ఆకాశదేవతాకమైన తగణము శూన్యసాధకమనియు; సూర్యదైవతకమగు జగణము వ్యాధికారకమనియు చెప్పి అశుభములైన గణములు ఏ సందర్భములో శుభకరములగునో తెలిపినాడు

ఇట్లు దాహృతములైన పైశ్లోకములు చమత్కారచంద్రిక లోని వర్ణనివేశభాగమునుండి గ్రహింపబడినవియే అప్పకవియు వర్ణమాలను వివరించు సందర్భమున మాతృకార్చనావిధానములో చమత్కారచంద్రికాయాం అని నామనిర్దేశము చేసి అకారమునుండి క్షకారమువరకుగల వర్ణములు మాతృకలనబడునని నిర్దేశించెను ఇట్లే వ్యాఖ్యాతలును గ్రంథకర్తలును చమత్కారచంద్రిక"ను ప్రమాణీకరించుకొనుట చూడ ఆ గ్రంథము సహృదయులయు ప్రామాణికులయు ఆదరమును మిక్కుటముగా పొందియున్నదని తెల్లమగుచున్నది

రసయోర్లోకసిద్ధాంత సద్భావ వ్యవహారిణః
అత్రైవహిచమత్కార సాక్షాత్కారైక సాక్షిణః

లోకసిద్ధమైన పదార్థమును కావ్యమున నిబద్ధించుకవులు ఈ రసచమత్కారమునకే వానికి అలౌకికత్వ సంపత్తిని చేకూర్చు లోకోత్తర ఆహ్లాదజనకమైన చమత్కృతి సద్భావమునకు సాక్షులుగా వెలయుదురు రసపోషణ చతురులైన కవులను చమత్కార శోభితములైన వారి కృతులను విశ్వేశ్వరకవి ప్రశంసించుచు

'ఏవం నిర్దిశితం సంప్రదాయాదాలోచ్యలక్షణమ్
కల్పనా కల్పితం కావ్యం ఆచంద్రార్కం ప్రకాశతే"

అని తన "చమత్కారచంద్రిక" వంటి లాక్షణికుల లక్షణ గ్రంథములను బాగుగా పరిశీలించి విషయములను జీర్ణించుకొన్నవారిచే నిర్మింపబడు కావ్యము శాశ్వతమైనదై పఠనపాఠనములలో బహుళప్రచారముగని వెలయుచుండునను మంగళాశాసనముతో విశ్వేశ్వరకవి తన గ్రంథమును పరిసమాప్తి కావించెను

జయంతి తే సుకృతినః రససిద్ధాః కవీశ్వరాః '

వి రం

## విష్ణుదిగంబర్ పలుస్కర్

దక్షిణ మహారాష్ట్రమందలి కురుద్ వాడ్ నందు 1872 సంగలో (శ్రావణ పూర్ణిమనాడు) విష్ణుదిగంబర్ జన్మించెను ఈతని పూర్వీకులు పలుస్ గ్రామనివాసులగుటచే పలుస్కర్ వీరి యింటి పేరుగా ప్రచారమొందెను ఈతని తండ్రియగు గోపాల్ గాడ్గిల్ పలుస్కర్ తో పాటు వారి పూర్వీకులందరు

గొప్పకీర్తనకారులు దత్తాత్రేయ భక్తులు నైష్ఠికులునగుటచే భక్తిసంప్రదాయమగు కీర్తనా సరళియందు ప్రసిద్ధివహించి యుండిరి కురుద్‌వాడ్ సంస్థానాధిపతి వీరియందు అదరాభిమానములతో ఆశ్రయదాతలుగనుండిరి ఒక నొక దత్తజయంతిమహోత్సవ సమారంభమందు ప్రమాదవశాత్తు విష్ణుదిగంబరునికి 8 ఏండ్ల బాల్యప్రాయమందు మొగముకాలుట తటస్థించెను నేత్రములకు గూడ విఘాతము సంభవించెను సంస్థానాధిపతి ఎన్ని చికిత్సలు చేయించినను నేత్రదృష్టి బాగుపడలేదు బాల్యప్రాయమందలి వీరిగాత్ర మాధుర్యము విని వైద్యులు గాయనమందు శిక్షణమిప్పించినచో గొప్ప కౌశల్యము సంపాదింపగలడని మహారాజాకు విన్నవించిరి అప్పటి మీరజురాజా శ్రీ బాలాసాహెబ్ పట్వర్ధనునకు సంగీతాది లలిత కళలందు మిక్కిలి అభిమానముండుట వలన మల్లయుద్ధ ప్రవీణులను గాయనాచార్యులను పోషించుచుండిరి, వారి ఆస్థానమందు బాలకృష్ణబువ అను మహాగాయకుడు విద్వాంసులుగా నియమింపబడియుండిరి ప్రభువు విష్ణుదిగంబరుని స్థితి చూచి అత్యంత దయతో అతనికి సంగీత విద్య బోధింపించుట కంగీకరించెను రాజా ప్రత్యేక పర్యవేక్షణలో, విష్ణుదిగంబరుని సంగీతాభ్యాసము అవ్యాహతముగా 12 ఏండ్లు జరిగి సంగీత కళయందు అతడు గొప్ప కౌశల్యము సంపాదించెను

పందొమ్మిదవ శతాబ్దారంభమున భారతదేశమునందు గాయన కళా పరిస్థితులు శోచనీయముగా నుండెను ప్రత్యేకముగా ఉత్తర హిందూస్థానమునందలి గాయన కళయు అందలి రచనారీతులును భోగపరాయణముగా నుండుటచేతను గానకళ మొగలాయి ప్రభువుల అదరణముతో పెంపొంది యుండుటచేతను ఆయా ప్రభువుల అభిరుచులను బట్టి రచనారీతులు వెలువడుటచేతను పారమార్థిక దృష్టిలోపించి సభ్యసమాజమందు ఉపేక్షాభావము ఆవరించియుండెను గాయకుడన్నను నృత్యకళాకారుడన్నను సనాతనకులీన ప్రజాసందోహములు పంక్తి బాహ్యునిగా పరిగణించుచుండిరి విష్ణుదిగంబరుడు తన గురుదేవులగు బాలకృష్ణబువ వద్ద శుశ్రూష చేయుచు సంగీతమభ్యసించుచున్న రోజులలో నొక సంఘటన జరిగెను మీరజునందు ఒక ధనిక సనాతన గృహస్థునింట ఒక వివాహము గొప్ప ఎత్తున జరిగెను పట్టణములోని ధనికవర్గమువారలకు చందన, తాంబూల భోజనాదులకు ఆహ్వానములు వెళ్లెను ఆ కాలమందు మహారాష్ట్ర దేశమందంతట గౌరవ సన్మానములు పొంది ప్రముఖవ్యక్తిగా మన్నింపబడిన బాలకృష్ణబువకు వివాహపు ఆహ్వానమందలేదు గురువర్యులపై జరిగిన యిట్టి తూష్ణీభావ ప్రవర్తనకు అతని హృదయమెంతగనో ఆక్రోశించెను సభ్య సమాజమందు కళాకారునికున్న స్థానమునకు అతడు వ్యథచెందెను ఈ సంఘటన మాతని హృదయముపై చెరగని ముద్రవేసెను అన్ని వర్గములవారియందును భారతీయ సంగీతమన్నను భారతీయ కళాకారులన్నను ఉన్నతభావము కలిగించుటకై అప్పటి నుండి అతడు దీక్షాకంకణము ధరించెను

చిత్రము - 75



పటము - 1

విష్ణుదిగంబర్ తన 20వ యేటనే దేశమంతయు పర్యటించి సంగీత కళ యొక్క మహోత్కృష్టతను ప్రజలందు వ్యాపింపజేయ సమకట్టెను బరోడా, కొల్హాపూర్ గ్వాలియర్ ఇండోర్ జునాగడ్ మైసూరు కాశ్మీరు రాజస్థానముల యందు తన గాన ప్రతిభను ప్రదర్శించి అనేక సన్మానములనందెను పంజాబు బెంగాల్ రాష్ట్రములందు అవిరళ సంగీతప్రచారము చేసెను జనసామాన్యమునందు గానకళకున్న అప్పటి స్థానము తన పర్యటనలో చక్కగా గ్రహించి, సంగీత కళయొక్క పరమార్థము మోక్షప్రదమగు అట్టి విద్యను

ప్రజలేవిధముగా ఉపేక్షచేయుచున్నారో అతడు సోదాహరణముగను సంగీతోపన్యాసపరముగను ప్రబోధించుచు ప్రజలలో ఆసక్తి కలిగింపజొచ్చెను. తన నిరంతర ప్రచారముచే ప్రజాహృదయములందొక విశిష్టస్థానమేర్పరచుకొనెను.

1901 సం॥లో విష్ణుదిగంబరుడు లాహోరు పట్టణమునందు ప్రప్రథమముగా గాంధర్వ మహా విద్యాలయమను సంస్థనుస్థాపించి అనేక మంది విద్యార్థులకు విద్యాదానము చేసెను. మరల 1908వ సం॥లో బొంబాయి పట్టణమందు గాంధర్వ మహా విద్యాలయమునకు శ్రీ శంకరాచార్యులవారిచే ప్రారంభోత్సవము చేయించెను. విద్యార్థులయందు సత్ప్రవర్తన ఆధ్యాత్మిక భక్తి వైరాగ్యాది నైతిక ప్రవృత్తి పెంపొందుటకు సాంప్రదాయ పరంపరాగతమగు పాఠ్యక్రమముతోపాటు తులసీ సూర, కబీర్ మీరా ఇత్యాది భక్తవర్యుల గీతరచనలను స్వర తాళములతో బద్ధపరచి పాఠ్యక్రమమందు చేర్పించి బోధన జరుగునట్లుగా దిగంబరుడేర్పాటు చేసెను. విద్యార్థులు క్రమశిక్షణతో విద్యనభ్యసించుట చూచి సర్వజాతులకు చెందిన కులీన గృహస్థులు కూడ తమ తమ పిల్లలను ఈ గాంధర్వ విద్యాలయమున అధిక సంఖ్యలో చేర్పించుచుండిరి. అప్పటి నుండి ప్రజలలో సంగీత విద్యపైనున్న అపోహలు తొలగజొచ్చెను. నియమిత వేళలందు దైవప్రార్థన క్రమశిక్షణ దైవభక్తి దేశభక్తి నైతిక విద్యాబోధనలతోపాటు బంగారమునకు వన్నెపెట్టినట్లు ప్రగతి పథ సంగీతవిద్యాబోధనము సర్వజనులను ఆకర్షించుచుండెను. అసహనపరులగు కొందరు గాయకులు విష్ణుదిగంబరుని విమర్శింపమొదలిడిరి. గానకళ విలువ ఇట్టి సంస్థతో పతనమగుచున్నదని వీరియభిప్రాయము. ఇంగ్లీషు డిగ్రీ కలవానికున్న మాన్యత ఒక ప్రముఖ కళాకారునికి ఏ మాత్రము లేకుండెనని విష్ణుదిగంబరుని హృదయమెంతగనో వ్యథచెందెను.

జాతీయ భావపూరితమగు దిగంబరుని ప్రగతి కార్యక్రమమును బుద్ధిమంతులు ఆమోదించి సహకారము సల్పిరి, దూరదృష్టిలేనివారు పరిహసించిరి. పండిత్‌జీ తన కార్యక్రమమును ఇతోధికదృఢ నిశ్చయముతో అమలుచేసెను. ప్రథను త్రివర్ష పాఠ్యక్రమము పంచవర్ష పాఠ్యక్రమము సప్తవర్ష, నవవర్షముల పాఠ్యక్రమములకు క్రమముగా 'సంగీత ప్రవేశిక (ఇంటర్) విశారద' (బి ఎం) 'అలంకార' (ఎం ఎం) ప్రవీణ' (పి హెచ్ డి) నామాంకిత బిరుద ప్రదాన పద్ధతులనేర్పరచెను. సమాజమందు గాయక కళాకారుడనిన మాన్యత కలుగు స్థితికై అతడు నిరంతర విశ్వప్రయత్నము చేసెను. లోకమాన్యతిలక్ గాంధీజీ మాలవ్య చిత్తరంజన్‌దాస్ ఇత్యాది మహానాయకులు ఈ విద్యాలయమును పరామర్శించి పోవుచుండిరి. వారితో దిగంబరుని సాన్నిహిత్యము అత్యంత దృఢతరమయ్యెను. క్రమముగా గాంధర్వ మహా విద్యాలయములు పూనా నాగపూర్ ఇందోరునగరములందు స్థాపింపబడెను. భక్తి వైరాగ్య దేశభక్తి ప్రబోధక గీత రచనలను స్వరపరచి తన సంగీతామృత ప్రవాహ మనెడు మాసపత్రికయందు దిగంబరుడు ప్రచురించుచుండెడివారు. అవియెంతగనో లోకప్రియములయ్యెను. వివిధ సంగీత రచనలనన్నిటిని ప్రప్రథమమున స్వరలేఖన పద్ధతిగానేర్పరచి పాఠ్యపఠావళికలుగా రూపొందించెను. సంగీత సంబంధములగు గ్రంథములు 50 వరకు ప్రచురించెను. సంగీత విద్యాబోధనయందు అనేక విప్లవాత్మక మార్పులు తెచ్చి యుగ ప్రవర్తకుడయ్యెను. దినదినము ప్రచారమగుచున్న జాతీయగీతముల ద్వారా దేశనాయకమ్మన్యులతో అతని సంబంధములు దృఢతరమై నిరంతర దేశభక్తి ప్రబోధకగీతా ప్రచారముచే ప్రజాసమూహములందు జాతీయ భావములు వెల్లివిరిసి క్రమముగా బ్రిటీషుపాలకుల పాలిటికి గడ్డుసమస్యగా పరిణమించెను. ఆకాలమందు బ్రిటిషుపాలకుల దృష్టిలో తిలక్ ఇత్యాది జాతీయ నాయకులు వ్యతిరేక వర్గమువారగుటచే వారితో సంబంధమున్న దిగంబరుని కార్యకలాపములపై అధికారులు ఒక కన్ను వేసియుంచిరి. కాని అతని కార్యకలాపములు యథార్థముకు సంగీతకళా ప్రపంచమునకు మాత్రమే విప్లవాత్మకములుగా నుండెను. అయినను అనుమానము పెనుభూతముగదా! కడకు ప్రభుత్వము దిగంబరునిపై ఎట్టి నేరారోపణములు చేయజాలక పోయెను. అయినను అతడు కొన్ని బాధలకులోనుగాక తప్పలేదు. తన నిరంతర కృషివలన దిగంబరుడు అతడు కొన్ని బాధలకులోనుగాక తప్పలేదు. తన నిరంతరకృషివలన దిగంబరుడు బొంబాయి విద్యాలయమునకు కొన్ని లక్షల రూప్యములు సేకరించి నాల్గంతస్థుల స్వంత భవనమును విద్యార్థుల వసతిగృహమును ఏర్పరచెను. అందు ఉచిత భోజన వస్త్ర సదుపాయము విద్యార్థులకుగావించెను. క్రమశిక్షణ నియమిత వేళలయందు భోజనాదికములు ప్రార్థనాది కార్యక్రమములు, కఠిన నియమములతో అనుభవరచెను

విద్యార్థులందు నిర్భయత్వమును భాషాపటుత్వమును వక్తృత్వ పాటవమును పెంపొందించుటకై బోధకవర్గమును ప్రారంభించెను సంగీత సభలయం దాహూతులైన రసిక ప్రముఖుల సమక్షములో విద్యార్థులు క్రమము తప్పక పాల్గొనునట్లు కట్టడి చేసెను విద్యార్థులను పుత్ర సమానులుగ నెంచి వాత్సల్యములో విద్య బోధించెను తనకు కలుగుచుండు సంతాన నష్టమునకై వగచుచుండిన మిత్రులకు విద్యార్థులను జూపి వీరిందరు నాకుండగా నేనుగాని మీరుగాని చింతింప వలసిన పనిలేదని దిగంబరుడు అనుచుండెడివాడు అతని నిత్య క్రమ శిక్షణలో పెరిగి పెద్దవారైన గాయక రత్నములన దగిన శ్రీ ఓంకార్ నాథ్ ఠాకూర్ పండిత వినాయకరావు పట్వర్ధన్ శంకరరావు నారాయణరావు వ్యాస్ బంధు పండిత నారాయణమోరేశ్వర్ ఖరే వామనరావుపాధ్యే బోడస్ పాథో లీకర్ బి ఆర్ దేవధర్ ప్రభృతులెందరో గలరు ఇట్టి శిష్యవర్గముతో ఆసేతు హిమాచలపర్యంతము దిగంబరుడు పర్యటించి రామనామ ప్రచారముగావించెను

క్రమక్రమముగా పండిత్ జీ యందు ఐహికపర సంగీత రచనావ్యాసంగమునందా సక్తి తొలగి ఆముష్మిక వ్యాసంగ మెక్కువగా జొచ్చెను రామనామాంకితముగాని రచనను గానము చేయుటకు తిష్టారుచించని స్థితికి వచ్చెను పుణ్యతీర్థములందు సంచారము చేయుచు సర్వపుణ్య నదీతీరములందు మకాములు వేయుచు రఘుపతిరాఘవ రాజారాం పతిత పావన సీతారాం సుందర విగ్రహ మేఘశ్యామ్ గంగాతులసీ సాలగ్రాం" అను భగవన్నామమును తన మృదు మధుర గాత్రముతో వేలాది జనులు పారవశ్యము చెందునట్లుగా గానము చేయుచు వారిచేత గూడ కీర్తింపజేయుచుండెను ఇట్లు తపవచో నైపుణ్యముచేత సదాచార సంపత్తి ఇత్యాది గుణ విశేషములచేత పండిత్ జీ ప్రజల హృదయములందొక విశిష్ట స్థానమేర్పరచుకొనెను

దిగంబరుని ప్రార్థనతో ప్రారంభము గాని కాంగ్రెసు మహాసభా సమావేశము దాదాపు లేకుండెను ప్రతి వర్షము ఆయన ఆయన శిష్యవర్గము ప్రముఖముగా ఆహ్వానింపబడు చుండిరి నాలుగు తంబురలను మేళవించి మహాసభ వేదికపై నుండి ఈశ స్తవము వందేమాతరము ఇత్యాదిగీతము లాలాపించునప్పుడు సభయంతయు నిశ్శబ్ద వాతావరణముతో ప్రశాంతమగుచు తదుపరి సభా కార్యక్రమములు జయప్రదముగా సాగుటకు వీలేర్పడుచుండెను దిగంబర పండితుడు క్రమముగా తాపస వేషధారణము స్వీకరించి కాషాయ వస్త్రధారణము చేయనారంభించెను పంచవటి నాసికలందాతడు శ్రీరామ నామ ఆధారాశ్రమ మును స్థాపించి అచట సర్వవేళలందు శ్రీరామనామ సంకీర్తనము జరుగునట్లేర్పాటుగావించి దాదాపు అచ్చటనే నివసింపసాగెను అతడెచ్చటనుండు నచ్చట తీర్థప్రజ సము కూడ సాగెను కళాకారులందు సహజముగా నుండు మనోదౌర్బల్యాదుల దృష్ట్యా మనోభ్రష్టత్వము శరీర భ్రష్టత్వమొనరించు నిషా మొదలగు వ్యసనములను వదిలి రామనామ సుధారస పానముతో మత్తిల్లియుండవలెనని అతడు శిష్యకోటి కుపదేశించుచుండెను తన జీవితకాలములో గడించిన లక్షలకొలది రూప్యములను సంగీతకళోద్ధరణకై సమర్పించెను విద్యాలయమునందు జరుగుచున్న ఉచిత శిక్షణ ప్రచార పద్ధతులకు మెచ్చి పలుప్రాంతముల జమీందారులు సంస్థానాధిపతులు శ్రీమంతులు ఐచ్ఛికముగా విరాళములనిచ్చి ఆదరించిరి ఇట్టి అకలంక దేశభక్తుడు సంగీత యుగ ప్రవర్తకుడు రామభక్తి ధురంధరుడు అగు విష్ణుదిగంబరుడు రామమంత్రజపముచే జన్మము ధన్యము చేసికొని శ్రావణ బహుళ అష్టమికి (గోకులాష్టమి) సరియగు 21-8 1931వ తేదిన మీరజ్ నందు ఇహ లోకయాత్ర చాలించెను ఈతనియనంతము శిష్య ప్రశిష్యకోటి నిరంతరకృషి ఫలితముగా నేడు 800 వరకు గాంధర్వ మహా విద్యాలయములు భారతదేశమంతటను విస్తరించి అనన్యమగు సంగీత కళాసేవ చేయగలుగుచున్నవని నచో విష్ణుదిగంబర పండితుని సంకల్ప బలమెంత దృఢమైనదో గ్రహింపవచ్చును

చి ఏ

## వీజ్‌మన్ అగస్టు

వీజ్‌మన్ ఆగస్ట్ అను నతడు జర్మను దేశపు జీవశాస్త్రవేత్త ఈయన ఫ్రాంక్‌ఫర్ట్-ఆన్-మెయిన్ అను పట్టణములో 17 జనవరి, 1834 వ సం౹ లో జన్మించెను ల్యూకార్ట్ అను శాస్త్రవేత్త వద్ద జీవశాస్త్రము నభ్యసించుటకు 1863 లో ఈయన గీసెన్ అను పట్టణమునకు వెళ్లెను అధ్యయనము ముగిసిన తర్వాత 1866 లో ఇతడు ఫ్రీబర్గ్ అనుచోట జంతు శాస్త్రాచార్యుడుగా చేరి 1912 వరకు అదే పదవిలోనుండెను

తన మొదటి దశను ఈయన జంతుశాస్త్రములో నూతన విషయములను కనుగొనుటలోనే గడిపెను కీటకములు ఈగలు,

మొదలగు జంతువుల జీవితచరిత్రను ఈయనసూక్ష్మముగా చదివెను కాని దురదృష్టవశాత్తు ఈయన చూపుమందగించెను అందుచే సూక్ష్మదర్శిని ద్వారా జంతువులను పరీక్షించుట ఈయనకు కష్టసాధ్యమాయెను కావున జీవశాస్త్రములో తెలియని పెక్కు విషయములను కనుగొనుట యందును వాటిని గురించి తెలిసికొనుటయందును తన దృష్టిని మరల్పెను

1868-1876 సం॥ల మధ్యకాలములో జీవముల మార్పు దలను గురించి ఈయన అనేకశాస్త్రవ్యాసములను రచించి ప్రకటించెను ఈ వ్యాసములు 1882 లో ఉత్పత్తి సిద్ధాంతములో కొన్ని క్రొత్త విషయములు అను శీర్షిక క్రింద ఆంగ్లానువాదములో ప్రకటింపబడినది దానికి డార్విన్ మహాశయుడు ఉపోద్ఘాతము వ్రాయుచు జీవములమీద ప్రకృతి యొక్క ప్రభావమును గూర్చి ఉద్ఘాటించెను

జీవములలో అనువాయిత ని గురించి "జరమ్-ప్లాజమ్" అను సిద్ధాంతమును వీజ్‌మన్ ప్రతిపాదించి గొప్పకీర్తి గార్జించెను కాని ఒక జీవి ప్రకృతి ప్రభావమువలన, తన అవయవములలో కొన్ని మార్పులను పొందుననియు అవి తన సంతతికి అనువాయితగావచ్చు" ననియు డార్విన్ చెప్పిన సిద్ధాంతమును వీజ్‌మన్ ఖండించెను అందువలన వీజ్‌మన్ యొక్క "జరమ్ ప్లాజమ్' సిద్ధాంతమును ఇంగ్లండులోని డార్విన్ అనుయాయులు కొందరు వ్యతిరేకించిరి

జరమ్-సిద్ధాంతమును ప్రతిపాదించిన వీజ్‌మన్ పైన జెప్పిన డార్విన్ యొక్క సిద్ధాంతమును ఖండించుటకు కారణములు లేకపోలేదు "జరమ్ ప్లాజమ్ సిద్ధాంతమును రుజువు చేయుచు వీజ్‌మన్ అనేక శాస్త్రీయవ్యాసములను రచించెను అంతేకాక ఉత్పత్తి జరుగునప్పుడు క్రోమోజోమ్సు యొక్క సంఖ్య తగ్గునని ఈయన నొక్కి వక్కాణించెను ఈ విషయమును కొన్ని సంవత్సరములు తరువాత ప్లాట్‌వర్ ఆయన సహచరులు బలపరచి ఆంగ్లానువాదములో "అనువాయితా-జీవశాస్త్ర విషయములు" అను శీర్షిక క్రింద వ్యాసములను రచించిరి

జీవశాస్త్రమునుగురించి చర్చించి దానిలో కొన్ని నూతన విషయములపై వీజ్‌మన్ అనేక గ్రంథములను రచించెను వీటిలో "డాస్‌కీమ్‌ప్లాజ్‌మా" "డార్విన్ ఆయన సిద్ధాంతము యొక్క విలువ" అనునవి ప్రధానములైనవి

ఇట్టి ప్రఖ్యాత శాస్త్రవేత్త 6 న నవంబరు 1914 లో జేడర్‌లోని ఫ్రీబర్గ్ అను కావున పరమపదించెను

జి హెచ్ ఆర్ క

## వీరపురుష దత్తుడు

క్రీ శ 200-300 మధ్యన ఆంధ్రదేశమును విజయపురి (నాగార్జునకొండ) రాజధానిగా పాలించిన ఇక్ష్వాకువంశీయులలో వీరపురుషదత్తుడు రెండవవాడు ఇతని పూర్తిపేరు మాఢరీపుత్ర శ్రీ వీరపురుషదత్తుడు శాతవాహన రాజ్యపతనానంతరము ఇక్ష్వాకు రాజ్యస్థాపకుడైన మహారాజ వాసిష్ఠీపుత్రచా (శా)ంతమూలు ఇతని తండ్రి శాంతమూలుని ఇక్ష్వాకుస్వామి యనియు ఈ వంశీయులను శ్రీ పర్వతీయులనియు అందురు ఈ వంశపురాజుల పాలనాకాలము అర్ధశతాబ్ది మాత్రమే యైనను వీరు మహాశక్తిసంపన్నులై 'సామ్రాట్ బిరుదును ధరించి దక్షిణాపథచక్రవర్తులుగా పేరు వార్జించిరి వీరి వంశచరిత్ర చాలపురాతనమైనది శ్రీరాముడు బుద్ధుడు మహావీరుడు వీరి వంశీయులేనట! నాగార్జునకొండలో దొరికిన శాసనములను బట్టి ఇక్ష్వాకులను వారు క్రీస్తుపూర్వపు శతాబ్దములలోనే యున్నట్లును వారు క్రమముగా దక్షిణాపథమునకు వలసవచ్చి రాజ్యమేర్పరచుకొని మూడవశతాబ్దిలో ప్రసిద్ధికి వచ్చినట్లును తెలియుచున్నది

నాగార్జునకొండ త్రవ్వకములలో బయల్పడ్డశాసనములు గురజాల జగ్గయ్యపేట రామిరెడ్డి పల్లెలలో దొరకిన శాసనములు వీరి చరిత్ర కాధారములు అయితే వీరి వంశ స్థాపకుడైన మహారాజ వాసిష్ఠీపుత్రశ్రీ చాంతమూలునిశాసన మొక్కటియైనను ఇంతవరకు బయల్పడలేదు కాని ఈతని సోదరియగు శాంతశ్రీయును ఇతని కుమారుడగు వీరపురుషదత్తుడును వేయించిన శాసనములనుబట్టి వీరి పరిపాలనా వివరములు వెలుగులోనికి తేబడెను ఆ శాసనములలో శాంతమూలుడు మహారాజుగను అనేకహిరణ్య గోదాన సహస్రప్రదాతగను అప్రతిహతశాసనుడుగను అశ్వమేధ, వాజపేయ అగ్నిష్టోమాగ్ని హోత్రయాగములు జేసినట్లును వర్ణింపబడుటయేకాక బ్రాహ్మణమతావలంబకుడనియు మహాసేనుని భక్తుడై శైవమతము నందభిమానియనియు వర్ణింపబడెను కాని ఇతనికుమారుడైన వీరపురుషదత్తుడు తండ్రివలె బ్రాహ్మణమతాభిమానిగాక బౌద్ధమతము నందధికాదర గౌరవములు జూపుచు తనతండ్రి తనకు సంపాదించియిచ్చిన సామ్రాజ్యమును మాత్రము జాగ్రత్తగా కాపాడుకొనెను ఈతని కాలములో వీరి సామ్రాజ్యము కళింగము కోసలము వినాకిని మేఖలపర్వతములవరకు వ్యాపించి పరిసరరాజ్యములతో

సఖ్యత పెంపొందించుకొనినది. వీరపురుషదత్తుడు తనరాజకీయ సుస్థిరతకు వివాహసంబంధములొకవిధ్యుక్తమని గ్రహించి ఆరుగురు స్త్రీలను వివాహమాడి వారి బంధువులను తన రాజ్యములో గొప్పపదవులలో నియమించి తనరాజ్యమునకెట్టి ఒడుదుడుకులు లేకుండ దాదాపు 20 సంవత్సరములు రాజ్యపాలన చేసెను. వీరపురుషదత్తుని ప్రథమభార్య రుద్రభట్టారిక ఉజ్జయినీ శకరాజపుత్రిక. ఈ వివాహము ఇతని తండ్రిచే ఏర్పరుపబడినది. అందువలన ఇక్ష్వాకు శకసంబంధములు పటిష్ఠములై వీరి రాజ్యమునకు ముప్పులేకుండ నుండుటకవకాశమేర్పడెను. ఈ వివాహము ఇక్ష్వాకుల రాజనీతికి గొప్ప నిదర్శనము. దీనివలన వీరిరాజ్యమున కుత్తరసరిహద్దున కెట్టిప్రమాదము లేకుండుట తటస్థించెను. ఇంకొక భార్య వీరపురుషదత్తుని మేనత్తయగు శాంతశ్రీకుమార్తె. శాంతశ్రీపూగీయుల నాయకుడగు స్కందశ్రీ భార్య. మూడవ, నాలుగవ భార్యలుగూడ అతని మేనత్తయగు హమ్మసిరి కుమార్తెలు. ఇంకొక భార్యపేరు మహాదేవి భట్టిదేవ. ఈవివాహమువలన తన దగ్గర బంధువులందరు మహాతలవర, మహాసేనాని, మహాదండనాయక, అమాత్య మొదలగు ముఖ్యపదవుల నాక్రమించి వీరపురుషదత్తునికి గొప్ప అండగానిల్చి రాజ్యములో సుస్థిరత ఏర్పడుటకు తోడ్పడిరి. ఇతని సామ్రాజ్యము పశ్చిమోత్తరమున ఉజ్జయిని రాజ్యమును, పశ్చిమమున ఆభీర రాజ్యమును, దక్షిణమున వనవాస రాజ్యమును అంటియుండినట్లు తెలియుచున్నది.

రాజ్యపాలనా పద్ధతిలో వీరపురుషదత్తుడు అతని తండ్రియు శాతవాహనుల పరిపాలనాపద్ధతినే కొనసాగించిరి. సింహము వీరి రాజలాంఛనము. వీరు సర్వస్వతంత్రతతో పరిపాలనచేసిన మహారాజులు. వీరపురుషదత్తుని కాలములో రాజబంధువులగు స్త్రీలు పురుషులతో పాటు సర్వ స్వతంత్ర ప్రతిపత్తిననుభవించినట్లు గ్రహింపవచ్చును. ఏదేని ఒకవిషయము చాలాపురాతనమైనదైనయెడల దానిని అది ఇక్ష్వాకులనాటిమాట యని తెలుగునాట ఇప్పటికిని వాడుకలో నున్ననానుడి. తరచిచూడ ఈనానుడి ఇక్ష్వాకులనాటి మేనరికపు వివాహప్రాముఖ్యతను గురించిచెప్పుటకు పుట్టినదనిపించును. ఇప్పటికిని ఆంధ్రులలో మేనరికపు సాంప్రదాయము మాసిపోకుండ నుండుటయు మేనరికము నిచ్చుట కిష్టములేని సందర్భములలో వ్యంగ్యముగా "అది ఇక్ష్వాకులనాటిమాటలే!" అని చెప్పుటయు సర్వసామాన్యము. దీనినిబట్టి ఇప్పటికి 1700 సంవత్సరములైనను తెలుగువారిలో నిల్చిన ఈ సాంఘికాచారమునకు పునాదులువేసిన ఇక్ష్వాకు మహారాజులు ఆంధ్రులకు చిరస్మరణీయులు.

వీర పురుషదత్తుని కాలములో బౌద్ధమతము పరాకాష్ఠ నందుకొన్నది. ఈ రాజు తండ్రివలె పరమత సహనములేనివాడు. ఇతడు బౌద్ధమతాభివృద్ధి కెంతయుతోడ్పడి బౌద్ధసంస్థలను విశేషాదరముతో ప్రోత్సహించెను. ఆ కార్యసిద్ధికి తనబంధువర్గమంతయు తనకు బాసటయై నిల్చి అనేక విధముల తోడ్పడిరి. నాగార్జున కొండలోయలో బుద్ధుని అవశేషముపై నిర్మింపబడిన మహాచైత్యము పురాతనకాలము నుండి యుండినది. ఇది వీరపురుషదత్తుని కాలమునాటికి శిథిలావస్థలో నుండుటవలన ఇతని ఆరవ రాజ్య సంవత్సరమునందు భదంతానందుడను ఆచార్యుని పర్యవేక్షణమున ఈ మహాచైత్యము పునరుద్ధరింపబడి అనేక సుందరశిల్పములతో శోభాయమానమొనర్పబడెను. ఈ మహాకార్యమునకు ఇక్ష్వాకువంశపు రాణులు, రాజపుత్రులు విశేషముగ తోడ్పడిరి. వీరపురుషదత్తుని మేనత్తయగు శాంతశ్రీ అపరమహావినశైలీయ భిక్షువుల కొరకు శిలామంటపమును కట్టించెను. రాజపుత్రికయగు కొడబలిశ్రీ మహాశాసక సంఘముకొరకొక విహారమును నిర్మించెను. మహాదేవి భట్టిదేవ బహుశ్రుతీయ భిక్షువుల కొరకు ఒక విహారమును నిర్మించెను.

వీరపురుషదత్తుని కాలములో బౌద్ధమతము ఉచ్ఛదశనందుకొనుటయే కాక నాగార్జునకొండ గొప్పబౌద్ధయాత్రాస్థలముగా విలసిల్లెను. అనేక దేశములనుండి బౌద్ధభిక్షువులు ఉపాసకులు ఇచ్చట నిర్మింపబడిన మహాచైత్యమును దర్శించెడివారు. భారతదేశములోని వివిధప్రాంతములనుండి వచ్చు బౌద్ధ ఉపాసకులేకాక ఇతరదేశస్థులు కూడ వచ్చి ఇచ్చట కొంతకాలముండి తిరిగి వెళ్ళుచుండినట్లు శాసనములు తెల్పుచున్నవి. శాఖోపశాఖలుగ నున్న బౌద్ధులలో, అంధకులను ఒకశాఖవారు వేయించిన శాసనములలో బుద్ధుడు భగవంతునిగను, అన్ని దైవములకు అధిపతిగను చెప్పబడెను. నాగార్జునకొండవద్ద సింహవిహారమునందున్న బోధివృక్షమునకొక ఆలయముండుటచే ఇక్ష్వాకులకాలమునాటి బౌద్ధులు బోధివృక్షమును ఆరాధించువారని తలచవచ్చును. బుద్ధపాదారాధనము ఆనాటి మరొక విశేషము. త్రిరత్నస్వస్తికాధర్మచక్రమీనలాంఛనములతో

వలసారు బుద్ధపాదములుగల సలక ఒకటి నాగార్జునకొండలో దొరకినది. ఈ కొండలోని మహాచైత్యములో కన్పడు బుద్ధ ప్రశంస ఆంధ్రదేశములో దొరకిన మరే చైత్యములోను కాన్పింపదు. ఇక్ష్వాకుల కాలములో బౌద్ధమతము తూర్పున చైనా వరకును పశ్చిమమున కాశ్మీరము వరకును వ్యాపించినట్లు ప్రశంసింపబడినది. అందువలననే వీరపురుషదత్తుని రాజ్యకాలములో యాత్రికులు ఆ ప్రాంతము నుండి కూడ తండోపతండములుగా నాగార్జునకొండకు వచ్చెడివారనియు వారికి కావలసిన వసతులన్నియు రాజవంశపు స్త్రీలు ఏర్పాటు చేయుచుండెడివారనియు తెలియుచున్నది. అపరమహావినైలీయ బౌద్ధభిక్షువులకొరకు శాంతశ్రీ ఒకవిహారమును నిర్మించి అందు ఆయక స్తంభములను చెక్కించినట్లును శాంతమూలుని కుమార్తె అడవి శాంతిశ్రీ స్కంధవిశాఖ రెమ్మకుని భార్యయైన చులశాంతసిరినిక హమ్మసిరికుమార్తెయైన మహాదేవి బాపిరి మహాదేవి క్రాంతిసిరినిక మొదలగు రాణులెందరో దానములొసగి శాతోగిరికి ఆయక స్తంభములమీద చెక్కించినట్లును తెలియున్నది.

దీని వలనయుఖాత వీరపురుషదత్తుడు శక్తిసామర్థ్యములతో తన రాజ్యమునందు శాంతిభద్రతలు నెలకొల్పి బౌద్ధమతప్రచారమునకు అమితముగ తోడ్పడి ఇక్ష్వాకుల రాజ్యములో బౌద్ధమతమునకొక గొప్పస్థాయిని సంపాదించి పెట్టినట్లు విశ్వసింపనగును. అందువల్లనే ఆ మహామహుడు ఇక్ష్వాకురాజులలో కెల్ల చిరస్మరణీయుడైనాడు.

పి. వి. వి. ఆ.

## వీరేశలింగము కందుకూరి (1848-1919)

ఆంధ్రదేశము భూస్వామ్య సంస్కృతి నాగరకతలకు ఆటపట్టుగ నుండెడి కాలమది. ఆ కాలములో క్రీ. శ. 1848 ఏప్రిల్ 16 వ తేదిన కందుకూరి వీరేశలింగము రాజమహేంద్రవరమున జన్మించిరి. పుట్టుకచే ఈయన ఆర్వేలనియోగి బ్రాహ్మణుడు. ఈయన తల్లి పేరు పున్నమాంబ. తండ్రి సుబ్బారాయుడు. నాలుగేండ్ల వయస్సు నాడే తండ్రి స్వర్గస్థుడుకాగా ఇతనిని తల్లియు పెదతండ్రియు పెంచి పెద్దచేసిరి. చిన్ననాటి నుండియు చదువులో శ్రద్ధాసక్తులుగల విద్యార్థియనిపించుకొని తరగతులలో ప్రథమశ్రేణిని అలంకరించుచు, సత్ప్రవర్తనాధికము గల వాడుగ పేర్వడి, సుగుణములను వితతముగ గొనియు న్యాయముకొరకై పాఠశాలా విద్యార్థి దశలో ప్రధానోపాధ్యాయుని గూర్చ కాదనుటకు వీరేశలింగము వెనుదీయలేదు. పాఠములు చెప్పుటచేతగాని ఉపాధ్యాయులను మార్పించుటకు విద్యార్థులను సమీకరించి సమ్మెచేయించి పద్విరోధ్యోపాధ్యాయులను విద్యార్థుల అశయమును చిన్ననాడే సాధించిన వీరుడు వీరేశలింగము పంతులు. ఈ న్యాయచింతయు సత్యదీక్షయు వంటివి ఆంధ్రదేశమునకు గడువని ఎంతగనో ఉపకరించినవి.

వీరేశలింగము 1870లో మెట్రిక్యులేషన్ పరీక్షయందు ఉత్తీర్ణులయ్యెను. మరుసటి సంవత్సరము నెలకు రు 25 ల జీతము మీద ఆతడు ఉపాధ్యాయ వృత్తిలో ప్రవేశించి అప్పటి నుండియు సంఘ సంస్కరణాభిలాషులై పత్రికలలో రచనలు సాగించెనివాడు. 1874లో ధవళేశ్వరమునందు స్త్రీ విద్యను ప్రోత్సహించు నిమిత్తము బాలికాపాఠశాలనొకదానిని నెలకొల్పిరి. ఆ రోజులలో అట్టిపని బహు సాహస కృత్యము. ఈయన తన సంస్కరణ భావములకు ప్రచార సాధనముగా 1876 నుండి వివేకవర్ధిని హాస్య సంజీవని అనెడి పత్రికలను నడుప ప్రారంభించినాడు. 1883 నందు స్త్రీలకొరకై సతీహిత బోధిని పత్రికను గూడ వ్యవస్థాపించినాడు.

విద్యార్థులకు కేవలము పాఠముల అర్థతాత్పర్యములను చెప్పెడి ఉపాధ్యాయుడు కాడీతడు. ధర్మోపదేశకుడుగా తాను విద్యార్థులను ఉత్తేజపరచిన మహనీయుడు. ప్రజాసేవానురక్తిని శిష్యవర్గమునందు పెంపొందించిన మహామహుడు. సాంఘిక దురాచార మేఘములకు మహాప్రభంజనుడు. ధైర్యమునందు మేరునగ్రుడు. తన చేతి మీదుగ 36 వితంతు వివాహములను జరిపించిన సంఘసంస్కర్త. పతితయువతీ రక్షణశాలాస్థాపకుడు. సామాజిక జీవితమునకు ప్రాతిపదికగా రాజమహేంద్రవరములో పురమందిరమును, విద్యావ్యాప్తి కొరకు ఉన్నత పాఠశాలను వీరేశలింగము నెలకొల్పినాడు. ఈయన సాహిత్యరంగములో చేసినది నిర్విరామ రచనా వ్యాసంగము. ఆదికవిత్వమును సు ధీకరించుటయు సరళ రచనమును రూపొందించుటయు వంటి పని. ఇతడు తన సులభగ్రాహ్యవచన రచనా పద్ధతికి సన్నిహితమైన గిడుగు రామమూర్తి యొక్క వ్యావహారిక భాషావాదమును అంగీకరించి దాని ప్రచారమునకై ఏర్పడిన వర్తమానాంధ్ర

భాషా ప్రవర్తక సమాజము నకు తన అవసానదశలో అధ్యక్షుడు కూడ అయినాడు. వ్యావహారికాంధ్రమును వ్యాకరించుటకు సైతము ఇతడు పూనుకొనినాడని ఆన కుఱి అభ్యుదయోద్యమముల కెల్ల నైతిక తేజమునొసగి వెలుగొందిన ఈతడు నాటి మదరాసు (సమిష్టి) రాష్ట్ర ప్రభుత్వ కళాశాలలో ఆంధ్రోపన్యాసకుడుగా పనిచేసి తమ నానా విధ రచనల మూలమున యుగకర్త అనిపించుకొనినాడు. తాను సాంఘిక రంగములో ప్రవేశపెట్టిన మూఢాచార ప్రతిఘటనయు సాహిత్య రంగములో ప్రవేశపెట్టిన నవ్యరీతులను రాజకీయ రంగము నందు ప్రజావ్యతిరేక విధానములకు ప్రతిఘటనలుగా పరిణతములగుటచే వీరేశలింగము పంతులు ఆంధ్రాకాశమున ఎల్ల కాలము ధ్రువతారగా ప్రకాశింపగలడు.

కృతుల పరిగణనము — ఈయన రచించిన గ్రంథముల సంఖ్య "ఆంధ్రవాఙ్మయ సూచిక ముద్రిత గ్రంథముల పట్టిక ను బట్టి నూటయిరువదికి పైగా నుండును. ఇందు (1) ప్రబోధ చంద్రోదయము (2) హరిశ్చంద్ర నాటకము (3) అభిజ్ఞాన శాకుంతలము (4) రత్నావళి (5) మాలతీ మధుకరము (6) మాళవికాగ్నిమిత్రము (7) ప్రహ్లాద నాటకము వంటివి ప్రసిద్ధ రూపకములు (1) దశకుమార చరిత్రము (2) కురంగేశ్వర చరిత్రము (3) సుమిత్రా చరిత్రము (4) సత్యవతీ చరిత్రము (5) విక్టోరియా మహారాజ్ఞి చరిత్ర (6) ఏసుప్రభువు చరిత్ర (7) చంద్రమతీ చరిత్ర (8) చిత్రకేతు చరిత్ర (9) షెల్లీ జీవితము మొదలైనవి చరిత్రలు. ఆంధ్ర కవుల చరిత్రము - వాఙ్మయ చరిత్ర. ఈ గ్రంథము ఇటు వ్యాసమును అటు విమర్శనయు కూడ కాగలదు. స్వీయ చరిత్ర ఆత్మకథ (ఆఖ్యాయిక) (1) వినోద కథా తరంగిణి (2) నీతి కథామంజరి (3) నీతి కథలు (4) నీతి చంద్రిక (సంధి విగ్రహములు) మున్నగునవి కథలు. శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధము - అచ్చ తెలుగు కబ్బము. రాజశేఖర చరిత్ర (1877-78) నవల. సత్యరాజా పూర్వ దేశయాత్రలు యాత్రాపరమైన కథ. ప్రహసనములు మొత్తము ఏబది ఎనిమిది. (1) తర్క సంగ్రహము (2) తెలుగు వ్యాకరణము (3) సంగ్రహ వ్యాకరణము (4) అలంకార సంగ్రహము (5) జ్యోతిశ్శాస్త్ర సంగ్రహము వంటివి-తర్క వ్యాకరణాలంకార జ్యోతిశ్శాస్త్ర గ్రంథములు. (1) మానవ శరీరశాస్త్రము (2) జంతు స్వభావ చరిత్రము (3) నేచురల్ హిస్టరీ వంటివి అటు శాస్త్రములు ఇటు చరిత్రలును గూడ. (1) అభాగ్యోపాఖ్యానము (2) ధర్మకవచోపాఖ్యానము వంటివి ఉపాఖ్యానములు. ఉపన్యాసమంజరి ఉపన్యాస గ్రంథము. (1) ఈశ్వరోపాసనము (2) ఈశ్వరదత్త పుస్తకములు (3) ప్రార్థన (4) వాదూమతములు మొదలైనవి మతపరమైన రచనలు.

రచయితగా — ఆంధ్ర వాఙ్మయమున పురాతన కవిత్వము లేగిన త్రోవలో గాక వీరేశలింగకవి ఆధునిక కాలమునందు యుగకర్త అనిపించుకొనిన మహాభాగుడు. అద్భుత వాఙ్మయ రచనా ప్రపంచ నిర్మాత. విశేషించి వచన వాఙ్మయములో క్రొత్తగా వచ్చిన పోకడలకు ఈయనయే మార్గదర్శి. గురువు కూడ చిన్నయసూరి గురుత్వమేమియు లేదు. "హాస్య సంజీవని" మొదలుకొని "అలంకార సంగ్రహము" అంతు స్వభావ చరిత్ర మొదలుకొని ఆంధ్ర కవుల చరిత్రము వరకును వీక్షించిన విశేష ప్రజ్ఞాధురీణుడు ఈతడు. యథార్థమైన చిన్న కథ (కథానిక), తక్కిన అన్ని ఆధునిక వచన వాఙ్మయ ప్రక్రియలను ఈయనయే నిర్దేశించెను. రాజశేఖర చరిత్ర మూలమున నవలకు దారిచూపినాడు. నరహరి గోపాల కృష్ణమ్మ శెట్టి (కర్నూలు) యొక్క రంగరాజ చరిత్ర (1872) ఆంధ్రములో తొల్లిటి నవలయే అయినను అది అనేక కారణముల వలన వ్యాప్తిలోనికి రాలేదు. లబ్ధ ప్రతిష్ఠులైన వీరేశలింగము వలననే చిలకమర్తి ప్రభృతులు అనుసరించి అసలు వీరేశలింగము నవలనే ఆంధ్రలోకము 'వికార్ ఆఫ్ వేక్‌ఫీల్డ్' (గోల్డ్‌స్మిత్) నకు ఛాయానుసరణమున్నది. అయినను అది స్వతంత్ర మనిపించుకొనగలెను. ఆ మాటకు వచ్చినచో ఈ యుగమున ఆధునిక వచన పరణులన్నిటికిని గురుత్వము నెరపినవారు పాశ్చాత్యులే. ఆ ఆచార్యకమును ప్రప్రథమమున గ్రహించిన వ్యక్తి వీరేశలింగము పంతులు. మొత్తము మీద ఈయన గ్రంథములన్నిటిలో కొంత కళా సౌందర్యము కలది 'రాజశేఖర చరిత్ర'యే. ఈయన పద్ధతిలో పాత్ర సృష్టియు సామాజిక చిత్రణమును గల సాంఘిక నవలలు రచించిన వారే చాల తక్కువ.

చిత్రము - 76



పటము - 1

ఇక నాటక రచనను సంగతి యోచించగా ఇది ఆంధ్రమున అనిసంపూర్వము అనగా కోరాడ రామచంద్ర శాస్త్రి యొక్క మంజరీ మధుకరీయము (1860) వంటి స్వతంత్ర నాటకము గాని కొక్కొండ వేంకటరత్నము యొక్క నరకాసుర విజయ వ్యాయోగము (1873) వంటి అనువాదములు గాని అప్పటికి లేవనుట కాదు. వీరేశలింగము రచించిన 'అభిజ్ఞాన శాకుంతలము' (1878) వంటి రంగ ప్రదర్శన యోగ్యమైన నాటకములు మాత్రము దృశ్యము పై చెప్పిన వారి నాటకములు ఎన్నడైన ప్రదర్శింపబడెనేమో తెలియదు. ఇచట కూడ లబ్ధ ప్రతిష్ఠయే వీరేశలింగమునకు కానటయైనది. ఒక్క ఈయనకే కాదు లోకమునకును ఇతరులకు నవలలును నాటకములును అప్పటికే రచింపబడినవని తెలియదు. అందు వలననే ఈయన తాను తొల్లిటి నవలాకర్తననియు తొల్లిటి నాటక కర్తననియు చెప్పుకొనుట జరిగెను. ఈ పొరపాటునకు అహంకృతి కాక అనభిజ్ఞతయే హేతువు. లోకము కూడ వీరి నెరిగినట్లు వారి నెరుగక వీరి పలుకులనే నమ్మినది. ఇప్పుడా పొరపాటును దిద్దుకొనుచున్నది. 'ప్రబోధ చంద్రోదయము' 'మాళవికాగ్నిమిత్రము' 'రత్నావళి' (1891) వంటి ఈతని అనువాదములు సులభసుందరములు. ఈయన ఆంధ్రశాకుంతలము రంగమునకెక్కిన ఆదిదినములలో (1) 'చల్లనిదై శ్రమంబడ ప్రజారిత శామనపాకు వీనలే' (2) కొందల మందెదెందము శకుంతల కానిపుడేగునంచయో వంటి పద్యములు సుఖస్థముగ రానియంత మొద్దు విద్యార్థియైనను ఉండెడివాడు కాడు. ఈతని చమత్కార రత్నావళి కళ్యాణ కల్పవల్లి రాగమంజరి వంటి నాటకములు ఆంగ్లేయ నాటక విధానములు. ఇవి ప్రహ్లాద దక్షిణ గోగ్రహణాదులు పౌరాణిక నాటకములు।

పంతులుగారు నీతికథలు చెప్పినారు. నాటకములు వ్రాసినారు. వ్యాసములు వెలువరించినారు. విమర్శలు వెలార్చినారు. ప్రహసనములు పెక్కు ప్రకటించినారు. తర్కాలంకార వ్యాకరణాది శాస్త్ర గ్రంథములను సంతరించినారు. చారిత్రక కృతులు సవదరించినారు. వార్తా పత్రికలు సంపాదించినారు. పందొమ్మిదవ శతాబ్ది శేషార్ధము నుండియు తెలుగు వచన వాఙ్మయమునందారంభమైన క్రొత్త యుగములో వెలసిన ప్రక్రియలన్నిటిని ఈయన నిర్దేశించినవచ్చును. ఆ యుగమునకు గద్యయుగమని పేరు. ఈయన వలననే సిద్ధించినది. ఈయన గద్యవాఙ్మయ బ్రహ్మ. తొలుత చిన్నయసూరి నీతిచంద్రిక యే ఒరవడిగా గల ప్రౌఢశైలిని సంధి విగ్రహములతో అవలంబించినను యావజ్జీవితము సరళశైలి వైపునకే మొగ్గుటచే ఈయన కీబిరుదము అన్వర్థము.

ప్రాచీనాంధ్ర కవులలో సుఖవచనము నెరగలవైముఖ్యమునకు వీరేశలింగము యొక్క నవ్యవచన మార్గమును ప్రతిష్ఠాపకమని వచ్చును. ప్రజాహృదాకర్షణమునకు వచనము అర్థము కావలెనని ఈతని ఆశయము. అనగా భాషను పండితుల వశమునుండి తప్పించినవారు 'సరస్వతీ నారదవిలాప' కర్తయగు వీరేశలింగము. సంఘ సంస్కారము, స్త్రీ స్వాతంత్ర్యము వంటివి ఈయనకు గమ్యములగుట వచనమును గురించిన ఈ ఆశయమునకు హేతువు. అట్లగుటచే ఈయనకయ్యా సౌభాగ్యము సర్వభోగ్యమైనది. ఈయన మానవతావాది. తన జీవితమును రచనలను మానవోద్ధరణము కొరకే వినియోగించెను. విజ్ఞాన వికాస స్వాతంత్ర్యములు సర్వమానవ సహజ స్వత్వములని ఈతని ఆశయము. సంప్రదాయ దూరముగాని నవ్యత, ఈయన సారస్వతమునకు లక్ష్యము. అందుచే పద్య కవిత్వము ఆనందోపలబ్ధికని వచన రచనము విజ్ఞానోపలబ్ధికని కారణము అనిన సూక్తిని ఈతడు సార్థకపరచెను. పదునెనిమిదవ శతాబ్దిలో ఆంగ్లవచనమును ఎడిసన్ స్టీల్ స్విఫ్ట్ ప్రభృతి పాశ్చాత్యులు సంఘసంస్కార ప్రచారార్థమే ఉపయోగించిరి. ఆంధ్రులలో వీరేశలింగము పంతులును అంతియే. ఆయనకు శాశ్వత సిద్ధియే లక్ష్యము కాదు. కాగా, ఆ రచనలలో పెక్కింటికి కళా గౌరవము లేకపోయినది. నేడవి ప్రాతగిల్లుటకు కారణమదియే కాక ఆ జ్ఞానములో గాంభీర్యమును ఆ భావములలో లోతును లేకపోవుట కూడ కారణములు. తన గ్రంథములు నిల్చియుండక పోయినను, ఈయన త్రొక్కిన క్రొత్త మార్గములు మాత్రము స్థిరముగ నిల్వగలవు.

వీరేశలింగము కృతి నిర్మాతయే కాక ప్రాచీన కృతులకు సంపాదకుడు కూడ. ఈయన ఎన్నియో ప్రాచీన మహా గ్రంథములను ముద్రింపించిన భాషాపోషకులు. నాచనసోముని ఉత్తర హరివంశము నందు నష్టప్రాయములైన పెక్కు గద్యములను ఈయనయే రచించి ముద్రింపించిరని తాను అభియోగము తెచ్చి నట్లు శ్రీ మానవల్లి రామకృష్ణ కవి ఒక సందర్భమున చెప్పియుండిరి. ఆయా విషయము లన్నియు నాటి వారికి వారికెరుకయట! అసలు నేడు లభించు ఉత్తర హరివంశము నాచన సోమునిదే కాదనియు అది సోముని కృతికి సంస్కృతీకరణము యొక్క ఆంధ్రీకరణమనియు శ్రీ మానవల్లి వారి వాదము. ఇంతకు చెప్పవలసినది తమ ప్రాచీన గ్రంథ ముద్రణాభిలాషము వీరేశలింగమును పెక్కు ఇక్కట్టుల పాలు చేసినది కూడ అమటయే! అనంతుని భోజ రాజీయము చరిగొండ ధర్మన చిత్ర భారతము నంది మల్లన ఘంట సింగనల వరాహ పురాణము నారాయణకవి పంచతంత్రము మొల్ల రామాయణము మొదలగు వాటికి ఇనాలోక భాగ్యము వీరేశలింగము వలననే లభించెను.

వీరేశలింగమునకు పూర్వము ప్రహసనములు లేవు. తిట్టు కవితలు ప్రహసనములు కావు. మొత్తము మీద ఆయన సేవలలో కొంత కరకుదనమున్నది. అది పానుగంటి వారి చేతిలో పెచ్చు పెరిగెను. భౌతిక శాస్త్రముల అను వాదము నకును కందుకూరి వారే ప్రథములు. ఈయన తర్క జ్యోతిశ్శరీర శాస్త్రాదుల అనువాదములు అభినందముల నందుకొన్నవి. జీవిత చరిత్ర రచనమునకు సైతము తెలుగు నందు సూత్ర పరచినవాడు వీరేశలింగమే. సంస్కృతమునందున్న వేమభూపాలీయ రఘునాథాభ్యుదయాదులు కవిత్వమునే ప్రాధాన్యముగ గలవి. పంతులుగారు చెప్పిన విక్టోరియా మహారాజ్ఞి చరిత్రము, జీసను చరిత్రము' వంటివి ఆంగ్ల సంప్రదాయము ననుసరించి చరిత్రనే ప్రాధాన్యముగా గలవి. ఇక వీరి 'ఆంధ్ర కవుల చరిత' కంటె గురుజాడ శ్రీరామమూర్తి తమ 'ఆంధ్ర కవి జీవితముల'ను ముందుగ రచించిన మాట నిజమే. కాని కందుకూరి వారు చారిత్రక చర్చకును, సత్య నిరూపణమునకును గ్రంథముల విమర్శనకును గురుజాడ వారికంటె ఎక్కువ ప్రాధాన్యమిచ్చిరి. ముందుగ తమ 'ఆంధ్ర కవుల చరిత్రము' అచ్చగుట మాత్రమే కందుకూరి వారిలోని గుణము కాదు. ఐనను కావ్య విమర్శనకు గురుజాడ వారి ఒరవడి వీరేశలింగమునకు తోడుపడక పోలేదు.

పోగా స్వీయ చరిత్ర (19 0) నియము ఇట్టి రచనా సంప్రదాయమునందు కూడ వీరేశలింగముదే ప్రథమ తాంబూలము. వీరి వలె మరల స్వీయ చరిత్రను అంత అంత శుద్ధితో చెప్పిన వారు లేరు. అది యేసంధాగ్రాహియైన ఈతని మేధా సంపదకు నిదర్శనము. శైలీపరిణతికి పరసీమ. అందుచే ఇతర ప్రయోజనాపేక్ష లేకయే ఈ స్వీయ చరిత్రకు ఆంధ్ర వాఙ్మయములో స్థానము న్నది. అందు కొన్ని రచనలు ఆత్మస్తుతిగా గోచరించునని వారికొక విన్నపము. ఇట్టి రచనలలో కథకుడే నాయకుడు. నాయక ఖ్యాతమగు స్వీయ చరిత్రములో కేవలము నాయక గుణ కీర్తనమే యుండునను కొననేల? కించిన్మాత్ర ఘనకార్యముల వర్ణన ముండదాయేమి? కాన 'వృత్తా మాఖ్యాయతే తస్యాం నాయకేన స్వచేష్టిత' మ్మను భామహుని వాక్యమును నాయకుడు స్వచేష్టితమగు యథార్థ విషయమును చెప్పుకో అది ఆత్మస్తుతి దోషము కాదు. అనిన దండివాదమును గుర్తింప దగును. కాగా ఇక శుద్ధాంధ్ర నిర్వచన నైషధము నట్టి వీరేశలింగము యొక్క అచ్చ తెలుగు రచనా సామర్థ్యమిట్టిది:

> "అచ్చతెనుగు గబ్బముల వరించుట కూచి
> మంచి తిమ్మనయును మంచి తెలగ
> నయును లింగన' యును నయమున స్వీయభా
> షాభిమాన మాన్యులని నుతింతు."

ఈతని తెలుగు రచనా చాతుర్యము కొక్కొండ వేంకటరత్నముచే 'బిల్వేశ్వరీయము' నందు నుతిగన్నది.

శ్రీ వీరేశలింగము ఎంత భాషా సేవకుడో అంత సమాజ సంస్కరణ ప్రియుడు. సంఘమును పీడించు కీడు లన్నియు ఈయనకు శత్రువులే. అతిబాల్య వివాహము వృద్ధ వివాహము కన్యాశుల్క వరశుల్కములు, భోగము వృత్తి భోగము మేళములు, లంచగొండి తనము, మద్యపానము, అస్పృశ్యత, వర్ణవ్యవస్థ, స్త్రీల అవిద్య, మూఢాచారములు వంటి వాటిని నిర్మూలింప ఈయన మహోద్యమము సాగించెను. స్త్రీ పునర్వివాహకరణోద్యమము ఈయన చేతిలో మిక్కిలి పుష్టి గన్నది. ఇది శాస్త్రి బ్రహ్మయ్య శాస్త్రివంటి వారితో వివాదములు తెచ్చిపెట్టెను. సద్ధాభావములకు

వ్యతిరేకమై ఒపాలు మహనీయులకు ప్రతిష్ఠాభంగము కల్పించిన వీరేశలింగము వ్రాతలు న్యాయస్థానములలో అభియోగముల కెక్కినవి అయ్యును ఈయన యథార్థ వాదిత విడనాడలేదు అవసాన దశలో అపనిందలకు గురియైనాడు చిరకాల మిత్రులకు దూరమైనాడు ధనమావ్యయమయ్యెను ఆరోగ్యమా క్షీణించెను పగలెల్ల సంస్కరణమును రాత్రులెల్ల గ్రంథ రచనయు సాగించుటతో అసలే పీనస రోగ పీడితుడైన ఈయనకు రాత్రి నిద్ర దూరముకాగా కాడ్ లివర్ నూనెను ఆహారముగ చేకొని ఈయన రచనా వ్యాసంగమును నిర్వహించెడివాడు

ఈయన పలుకు కంటె వ్రాత నేర్పునకు ప్రసిద్ధి ఈతని జీవితమంతయు ఆంధ్రజాతి అభ్యుదయ సాధనకొరకై సాగిన ఒక ఉద్యమము ఆ ఉద్యమమునకు సైతము ఒక ఎదురీత లతులాదిరైన తన సంపాదన అంతయు సామాజిక సేవకై వెచ్చించిన మహోదారుడు వీరేశలింగము ఆంధ్ర జాతికి ఈయన యొక జ్యోతిగా వెలుగొందినాడు తాను వేసిన నవ్యసాహిత్య మార్గముల వలన యుగకర్తయై రొట్టి ఆపదల యందును సత్యవాదితగాని కర్మశూరతగాని, విడనాడని దీక్షా దురంధరుడై సర్వతంత్ర స్వతంత్రుడై అన్యాయాసహిష్ణువై స్వార్థత్యాగియై మానవతావాదియై నవయుగ భానుడైన ఈయన చెన్నపట్టణమునందు 1919 మే 27 వ తేదీన అస్తమించెను ఈయన జన్మదిన శతజయంత్యుత్సవము కూడ తెలుగు జాతి జరుపు కొన్నది ఇట్టి రచయితయు సంస్కర్తయు ఆంధ్రభూమిలో న భూతో నభవిష్యతి ,

వి వి జి శ

## వృక్షముల ఆర్థిక సంపద

అనాదినుండి మానవ జీవితమునకును వృక్షజాతికిని అతి సన్నిహితమగు సంబంధమేర్పడినది మానవుని దైనందిన జీవితములో చెట్టు చేమలకు చాలముఖ్యమైన పాత్రగలదు అంతేకాక మానవ చరిత్ర మానవ నాగరికత వృక్షజాతిచే ప్రభావితమగుచు పరిణామమును నొందుచున్నది ఆహారము, నివాసము దుస్తులు మున్నగు ముఖ్యావసరములకై మానవుడు వృక్షజాతిపై ఆధారపడుచున్నాడు

రెండవ ప్రపంచ సంగ్రామానంతరము మానవ నాగరికత చెట్టుచేమలనుండి లభించు పలువిధములగు పదార్థములపై మరింతగా ఆధారపడియున్నది ప్రతిదేశమునందు అధికాహారోత్పత్తిని సాధించుటయే కాక వృక్షసంబంధములగు ఇతర పదార్థములనుగూడ విశేషముగా ఉత్పత్తిచేయుట అవసరమగుచున్నది వైద్యవిషయములో కావలసిన ఔషధముల సేకరణమునకై వృక్షజాతి పూర్వముకంటె ఇప్పుడు అధికముగా వినియోగపడుచున్నది దీని ఫలితముగా వ్యవసాయాభివృద్ధి వాణిజ్యాభివృద్ధి అవశ్యమగుచున్నది వివిధ పరిశ్రమల కవసరమైన యంత్రశక్తి కుపయుక్తమగు బొగ్గు పెట్రోలియము కూడ వృక్షములనుండియే లభ్యమగుచున్నవి వృక్షమునుండి లభించు కలప కట్టడములకు మాత్రమేకాక వంటచెరకు కాగితము రేయాన్ వివిధ రసాయన పదార్థముల ఉత్పత్తి కొరకు కూడ ఉపయోగపడుచున్నది వివిధ పరిశ్రమల కవసరమగు ముడిపదార్థములు చాలవరకు వృక్షముల నుండి తయారైనవే ఉదా బెండు తోళ్ళ పదునుచేయు రసములు రంగుదినుసులు వార్నిషులు సబ్బులు పెట్లు తయారగుటకు నూనెలు రెసినులు, జిగురు పదార్థములు మొదలైనవి మొక్కలు మానవునకు మరికొన్ని విధముల ఉపకరించుచున్నవి రోగ విషయములకును పరిశ్రమలకును సంబంధించిన సూక్ష్మ జీవులు ఋతుపవనముల వృద్ధి వర్షము పడుటకే కాక వరదలవలన సంభవించు నేలకోతను అడ్డుకొను అరణ్యములు, మానవున కానందము నిచ్చుపుష్పములు తోటలు ముఖ్యపాత్రను వహించుచున్నవి వృక్షజాతినుండి లభించు ఆర్థిక సంపద దేశాభ్యుదయమునకు వెన్నెముక వంటిది వృక్షసంబంధమగు సరకుల ఉత్పత్తిచేసి వాటిని వివిధ ప్రాంతములకు రవాణాచేయుటపై ప్రపంచప్రజల ఆర్థిక సాంఘిక జీవితమాధారపడియున్నది వృక్షజాతిపై ఆధారపడి పెరుగు జంతువులే మనకు పాలు గ్రుడ్లు మాంసము పలురకముల ముడి పదార్థములను ఇచ్చుచున్నవి

చెట్టు చేమలనుండి లభించు అసంఖ్యాకములైన పదార్థములలో చాలభాగము వాటి జీవితమునకు అవసరమైనట్టివి కొన్ని వాటికి నిరుపయోగములై విసర్జింపబడుచున్నవి వాటి జీవితావసర పదార్థములు ఇవి (1) అవి నిలవచేసికొను పదార్థములు చాలముఖ్యమైనవి వీటిలో పిండివస్తువులు, నూనెలు మాంసకృత్తులుకలవు చక్కెర పిండిరకములు, సెల్యులోసు హెమిసెల్యులోసు పెక్టినులు జిగురు వస్తువులు

మున్నగునవి పిండి పదార్థములలోనివి పిండి పదార్థములు మాంసకృత్తులు మానవునకు ముఖ్య ఆహార వస్తువులు నూనెలలో కొన్నిటిని మనము ఆహారములో ఉపయోగించుచున్నాము కొన్ని వైద్యమునకును పరిశ్రమలకును ముఖ్యమైనవి (౩) గ్రంథులనుండి వచ్చు ఉత్సృజములు విసర్జకములు వీటిలో పరిమళ తైలములు రెసినులు రంగుదినుసులు మైనపు పదార్థములను ఆల్కలాయిడులు గ్లూకోసైడులు సేంద్రియామ్లములు ఎంజైములు విటమినులు హార్మోనులు వీటిలో కొన్ని పరిశ్రమలలోను కొన్ని వైద్యవిషయములను ఉపయోగపడును (౪) సంస్కారద్రవ్యములు పానీయ పదార్థములు

మనకుగాని మనము పెంచు జంతువులకుగాని ఆహారమునిచ్చు వృక్షజాతి చారిత్రక యుగమునకు ఎంతో కాలము పూర్వమే అడవి మొక్కలనుండి పరిణామముచెంది వర్ధిల్లుచున్నది ఆహారపు విలువగలచెట్టు చేమలను తృణధాన్య సస్యములు చిరుధాన్య సస్యములు పప్పుదినుసు మొక్కలు అష్టిఫలముల (Nuts) నిచ్చు చెట్లు గడ్డదినుసు మొక్కలు ఆకుకూర మొక్కలు కాయకూర మొక్కలు పండ్లచెట్లు అను వివిధతరగతులుగా విభజింపవచ్చును ఇవన్నియు వృక్షజాతిలో ఉన్నత శ్రేణి చెందినవి ఇవికాక తక్కువశ్రేణికిచెందిన వృక్షజాతిలో కొన్ని దేశములందు కుక్కగొడుగులు మున్నగు కొన్ని శిలీంధ్రములు కొన్ని శైవలములు కొన్ని నాచుజాతి మొక్కలు కూడ ఆహారముగా ఉపయోగపడుచున్నవి

తృణధాన్యములలో గోధుమ వరి బార్లీ చాలముఖ్యమైనవి వీటి తరువాత ఓట్లు రై కూడ చెప్పదగినవి ఇవి చాల కాలమునుండి సాగులోనుండుటచేతను వీటిలో పెక్కురకములు వృద్ధిచేయబడుటచేతను చేయబడుటచేతను వీటి పూర్వపు అటవికజాతులు మనస్మృతిపథము నుండి తొలగిపోయినవి చిరుధాన్యములలో పలురకముల జొన్నలు సజ్జలు, రాగులు కొర్రలు అరికలు వరిగలు మొదలైనవి ముఖ్యమైనవి ఇవికాక చామ దినక గొలుగు వెదురుబియ్యము ఆహారముగా ఉపయోగపడుచున్నవి తృణకుటుంబమునకు చెందిన పలురకముల గడ్డిజాతులు పశుగ్రాసముగా అన్నిదేశములందును సాగగుచున్నవి

వృక్షజాతిలో మాంసకృత్తులనిచ్చు మొక్కలలో కాయధాన్యపు మొక్కలు చాలముఖ్యమైనవి వీటిలో బఠానీలు, కందులు, సెనగలు పెసలు మినుములు అనుములు బొబ్బర్లు రకరకముల చిక్కుళ్ళు సోయాచిక్కుడు మొదలైనవి విస్తారముగా సాగులోనున్నవి పూర్వపశ్చిమార్ధగోళములలో వేరుసెనగ చాలప్రాముఖ్యమందున్నది దీనుండి మాంసకృత్తు ఎక్కువ ర్థమే కాక నూనె కూడ విస్తారముగా లభించుచున్నది కాయధాన్యపు కుటుంబమునకు చెందిన మొక్కలలో ఎర్ర పెసర జనుము అల్ఫాల్ఫా క్లోవర్ కుద్జు అనుమొక్కలు చాల ముఖ్యమైనవి వీటిఆకు పశువులకు మేతగా ఉపయోగపడుటచే అవి విస్తారముగా పెంచబడుచున్నవి చెట్టుజాతి కాయధాన్యపు వృక్షములలో అల్గరోబా కరోబ్ హనీలోకస్ట్ అనునవిముఖ్యమైనవి వీటి కాయలు ఆహారముగా ఉపయోగపడుచున్నవి

మాంసకృత్తును నూనెపదార్థములను కొన్నిపిండిపదార్థములను ఆహారముగానిచ్చు అష్టిఫలములు అష్టిబీజములు కొన్ని గలవు వీటిలో బ్రెజిల్‌నట్ జీడిమామిడి కొబ్బరి హాజెల్‌నట్ బాదాం బీచ్ పిస్తా చెస్ట్‌నట్లుమున్నగునవి ముఖ్యమైనవి

తృణధాన్యముల తరువాత వృక్షజాతిలో ఆహారముగా ఉపయోగపడుచున్న కూరగాయ మొక్కలు ముఖ్యమైనవి వీటినుండి ఖనిజలవణములు విటమినులు లభ్యమగుచున్నవి గడ్డదినుసు మొక్కలలో ఆహారము నిలువయున్న భాగము భూమిలో నుండును బీటుదుంప కారట్ ముల్లంగి టర్నిప్ అయిస్టర్‌మొక్క చిలగడము కంద పెండలము, కర్రపెండలము అలుగడ్డ చేమ ఉల్లిరకములు వీటిలో ముఖ్యమైనవి భూమిపైనున్న భాగములు ఆహారముగా ఉపయోగపడు మొక్కలలో క్యాబేజి అస్పరిగస్ సెలెరీ లెట్యూస్ బచ్చలిరకములు గోగు తోటకూర మొదలగునవి ముఖ్యమైనవి ఇవి అనుకూరలనిచ్చు మొక్కలు ఆహారముగా కాయలనిచ్చు మొక్కలలో పనసజాతులు గుమ్మడి కుటుంబములోని మొక్కలు అలోకాడో వంగ, బెండ టొమాటో మొదలగున పెప్పరొ ముఖ్యమైనవి

వృక్షజాతిలో మానవులకు జంతువులకు ఆహారముగా పండ్లనిచ్చు మొక్కలు పెక్కులుగలవు తొలిమానవులు కొన్ని మధురరకముల అడవిపండ్లను తిని బ్రతికెడువారట తరువాత రుచ్యములైన పండ్ల నిచ్చుజాతులను వారు విరివిగా పెంచెడివారు నాగరికత అభివృద్ధియైనకొలది కృషి

కరములైన జాతులను సంకరపద్ధతులచే అభివృద్ధి పరచుచు నేటిపండ్ల మొక్కలను తోటలలో పెంచుచున్నారు నేటికిని పలు దేశములలో వన్యఫలములను గూడ నాగరికులు అనాగరికులు ఉపయోగించుచున్నారు

పండ్లనిచ్చు మొక్కలను ఉష్ణమండల వృక్షములనియు సమశీతోష్ణమండల వృక్షములనియు రెండుతెరగులుగా విభజింపవచ్చును నిమ్మకుటుంబమునకు చెందిన పలురకములు అరటి సీతాఫలము, ఖర్జూర అత్తి జామ రేగు మామిడి ఆవిపు బొప్పాయి అనాస దానిమ్మ సపోటా చింత ఉసిరి మున్నగునవి ఉష్ణమండల వృక్షములలో చెప్పదగినవి సమశీతోష్ణమండలపు ఫలవృక్షములలో ఆపిల్ ఎయర్ ఆప్రికట్ ఫీచ్ ప్లమ్ రకములు పుచ్చ ఖర్జూర ద్రాక్ష బెర్రీ జాతులు పేర్కొనదగినవి

పలువిధములగు ఆహారపదార్థములేకాక ఆహారపు విలువగలిగి ఆహారపానీయములుగా ఉపయోగపడు ముడిపదార్థములనిచ్చు మొక్కలు గూడ కలవు వీటినుండి లభించు ముడిపదార్థములకు వాణిజ్యములో చాలా ప్రాముఖ్యముగలదు అట్టివాటిలో కాఫీగింజలు తేయాకు చాల ముఖ్యమైనవి తరువాత కోకోగింజలు చాక్‌లెట్ ప్రసిద్ధమైనవి ఇవికాక పెరుగ్వేటీ ఆకులు గ్వారనాగింజలు ఖట్ ఆకులు కాలాగింజలు కేస్సిన్ ఆకులు మొదలగునవి కూడ అచ్చటచ్చట విరివిగా పానీయములకొరకు ఉపయోగింపబడుచున్నవి ఇవి యన్నియు సారాయములేని పానీయములు సారాయిమును తయారుచేయుటకై ఉపయోగపడు పండ్లదినుసులలో రకరకముల ద్రాక్షఫలములు ముఖ్యమైనవి ఇవి వాణిజ్యములో ప్రసిద్ధికెక్కినవి బీరు బ్రాండీ విస్కీ రమ్ మొదలగు సారాయపు పానీయముల తయారీలో కూడ కొన్నివృక్షజాతుల భాగములు ముఖ్యమైనవి

మొక్కలనుండి లభించుపదార్థములలో కొన్ని సంబార ద్రవ్యములు సుగంధద్రవ్యములు కూడగలవు ఆహారము రుచ్యముగనుండుటకును శీఘ్రముగజీర్ణమగుటకునుదుర్వాసనపోగొట్టుటకునుమానవుడుఅనాదినుండియువీటినిఉపయోగించుచున్నాడు ఈద్రవ్యములు కొంతకాలమునుండి అంతర్జాతీయవాణిజ్యములో అత్యంత ప్రాముఖ్యత వహించుటయేకాక, వీటికొరకు అనేకులు విదేశయాత్రలు అన్వేషణములుకూడ సాగించిరి ఇవి చాలవరకు వైద్యమునందు గూడ ఉపయోగపడుచున్నవి

ఇట్టి ద్రవ్యములలో గెలంగాల్ దుంపలు అల్లము గుర్రపుముల్లంగివేర్లు సార్సపెల్లా(సుగంధి) పసుపు దాల్చినచెక్క కెడోరీ కేషియా కేపర్స్ లవంగాలు కుంకుమపువ్వు సుగంధమునిచ్చు కొన్ని జాతుల పూవులు ఆల్‌స్పైస్ పండ్లు జ్యానిపల్ మిరియాల రకములు ఆ ఎ వేనిల్లా ధనియాలు వాము జీలకర్ర ఏలకులు మెంతులు సెలెరీ డిల్ పేరడైజ్ గింజలు ఆవాలు గసాలు జాజికాయ జాపత్రి టోంకాచిక్కుళ్లు మొదలైనవి ముఖ్యమైనవి ఇంకను పరిమళము నిచ్చుకొన్ని రకముల మొక్కల ఆకులు ఆహారపదార్థములకు పరిమళము నిచ్చుటకును వైద్యమునందును ఉపయోగపడుచున్నవి వీటినుండి పరిమళ తైలములు సబ్బులు తయారు చేయబడుచున్నవి అట్టి మొక్కలలో బామ్ తులసి సబ్జా దవనము మరువము పెప్పరమింటు పుదీన మొదలైనవి ముఖ్యమైనవి ఇవికాక వెల్లుల్లి బాదాం ఎన్త పాపీగింజలు నిమ్మజాతి మొక్కల ఆకులు మొదలైనవికూడ సుగంధద్రవ్యములుగా వాడబడుచున్నవి

వైద్యవిషయమున ఉపయోగపడు మందులలో భేషజములు (drugs) అనునవి చాలభాగము వృక్షజాతినుండిలభించుచున్నవి అట్టి మందులనిచ్చు మొక్కలలో సేద్యమునందున్నవి చాలతక్కువ ముఖ్యముగా ఉష్ణమండలమునందు పెరుగు అడవి మొక్కలనుండియే వివిధభేషజములు లభించుచున్నవి కొన్ని రకముల మందులు భూమిలోనుండు వేర్లు దుంపలనుండి తయారగుచున్నవి వాటిలో అకొనైట్ కాల్చికం గోల్డెన్‌సీల్ జిన్‌సెంగ్ ఐపికాక్, పొడోఫిల్లం సెనీగా వెలేరియన్ మొదలైనవి ముఖ్యమైనవి కొన్ని మొక్కలపైనుండు బెరడునుండి కొన్ని భేషజములు తయారగుచున్నవి వీటిలో కాస్కేరా, క్యురేర్ క్వినైన్ మున్నగునవి ముఖ్యమైనవి మరికొన్ని ఔషధములు కాండమునుండియు దారువునుండియు దొరకుచున్నవి వీటిలో క్వాసియా గయాకం అనునవి ప్రధానములు అంతేకాక ఆకులలో మందులు లభించు మొక్కలు కూడ గలవు వాటిలో రకరకముల కలబంద బెల్లడోనా, కొకెయిన్, బుచు డిజిటాలిస్ యూకలిప్టస్ హమామెలిస్ మొదలైనవి ముఖ్యమైనవి కొన్ని భేషజములు పుష్పములనుండి లభించును వాటిలో సామొమిలి హాప్ శాన్‌టొనిక్ ముఖ్యమైనవి క్రోటన్‌నూనె నక్స్‌వామికా నల్లమందు సిల్లియం, సోరిసాన్‌ప్థ మొదలైన మందులు అయా

మొక్కల పండ్లనుండియు వాటి గింజలనుండియు లభించు చున్నవి కొన్ని ముఖ్యమైన రోగ క్రిమినిరోధ ఔషధములు (antibiotics) తక్కువ శ్రేణికిచెందిన ఉద్భిజములనుండి లభించు చున్నవి. అట్టి వాటిలో పెనిసిలిన్ స్ట్రెప్టోమైసిన్ ఆరియోమైసిన్ క్లోరోమైసిటిన్ టెర్రామైసిన్ నియోమైసిన్ మున్నగునవి వైద్యవిజ్ఞానమున చాల ప్రసిద్ధములైనవి. అగర్ ఎర్గట్ ఆల్ఫా లైకోపోడియం అను వియు రోటినోన్ డెర్రిస్ అను కీటకసంహారకౌషధములు ఎలుకలనుచంపు మందు నొసగు రెడ్ స్క్విల్ అనునదియు మొక్కలనుండి లభ్యమైనవే.

పొగత్రాగుటకును నమలుటకును మత్తుకల్గించుటకును ఉపయోగపడు మొక్కలలో పొగాకు చాలముఖ్యమైనది. సస్యము ఎగరెట్టు చుట్ట బీడీ మొదలైనవి తయారుచేయుటకు ఇది వాడబడుచున్నది. తరువాత తమలపాకులు పోకచెక్కలు చెప్పదగినవి. కోలాగింజలుకూడ కొన్ని దేశములలో నమలుట కుపయోగపడుచున్నవి. కొకెయిన్ నల్లమందు గంజాయి పెయోట్ కొన్నిరకముల కుక్కగొడుగులు కాపీ కవకవ అను పానీయములు మత్తును ఉత్తేజమును కల్గించు పదార్థములు. ఇవి కూడ వృక్షజాతినుండి లభించుచున్నవి.

ఆదినుండియు నేటివరకు మానవులు తమ ఆహారమును నివాసమును దుస్తులను చాలవరకు వృక్షజాతినుండియే సంపాదించుకొనుచున్నారు. అందుచే నాగరికత అభివృద్ధిచెందినకొలది కొన్నివృక్షములు వృక్షములనుండి లభించు పదార్థములు పరిశ్రమలలోను వాణిజ్యమునందును చాల ప్రాముఖ్యతనొందినవి. అట్టి వాటిలో పలురకముల నారలు ముందు చెప్పదగినవి. దుస్తులు మొదలగు వాటికుపయోగపడు నారలలో ప్రత్తి, లినెన్, హెంప్ జూట్ రేమీ జనపనార, కొబ్బరి మొదలైనవి ప్రముఖములైనవి. పలురకములగు కొత్తనారలు కొబ్బరినార కైరోపా, పలురకముల తాటినారలు, చీపుళ్లు, చాపలు, బుట్టలు కుర్చీలు తయారుచేయుట కుపయోగించు వివిధ వృక్ష భాగములు బూరుగదూది సోఫాలలో నింపుటకుపయోగపడు వృక్ష భాగములు వస్త్రములవలె ఉపయోగించుకొన్ని వృక్షములబెట్టలు కాగితపు పరిశ్రమకు వాడబడుకొన్ని నారలు ఇవన్నియు ఈనాడు అనుభవమునందున్నవి.

దేశసంపదలలో అటవీ సంపదయొకటి. అడవుల వలన ప్రయోజనములు అపారము. శీతోష్ణాది వాతావరణ పరిస్థితులను సక్రమముగనుంచుట నీటిని పదిలపరచుట నీటివరదలను ఆపుట నేలకోసివేయు నాపుట వన్యమృగములకాశ్రయమిచ్చుట మున్నగు ప్రయోజనము లెన్నియో అడవుల వలన కలుగుచున్నవి. ఒక్కొక్కదేశమునందు అచ్చటి శీతోష్ణవాతావరణాది పరిస్థితుల ననుసరించి పలురకములగు వృక్షములనుండి దారువు సంగ్రహింపబడుచున్నది. ఈ దారువును డి మానవ జీవితమునకు అవసరమైన అసంఖ్యాకములగు ద్రవ్యములు తయారు కాబడుచున్నవి. వీటి మూలముగా మానవ జీవితమునకు సుఖసంపదలు చేకూరుచున్నవి.

వి ఎ ర

## వృక్షములలో పోషణము

"పోషణము" అనగా పీల్చుకొనుట అనిఅర్థము. మొక్కలకు కూడ వాటి జీవితావసరములకు కొన్ని పోషక మూల ద్రవ్యము లవసరము. వాటిలో కర్బనము ఆమ్లజని ఉదజని నత్రజని గంధకము భాస్వరము ఖటికము పొటాసియము మగ్నము లోహము మాంగనము సిలికాన్ అల్యూమినియం అనునవి ముఖ్యములైనవి. ఈ మూలద్రవ్యములలో ఆహార సంయోగమునకై కర్బనమును శ్వాసక్రియకై ఆమ్లజనిని మొక్కలు గాలినుండి తీసికొనుచుండును. తక్కిన పోషక ద్రవ్యములన్నియు లవణరూపమున నీటిలో కరగి ద్రావణముల రూపమున సామాన్యముగ నేలనుండి మొక్కలచే పీల్చుకొనబడుచుండును. మొక్కలు సాధారణముగా తమ శరీరమందన్ని భాగములద్వారా నీటిని పీల్చుకొనగలవు. కాని అట్లు పీల్చుకొను నీటిపరిమాణము బహుస్వల్పముగ నుండును. నేలపై నివసించు మొక్కలు తమ వేళ్లసహాయమున నేలనుండి అత్యధిక భాగము నీటిని పీల్చుకొనును. ఆ నీటిలో గల ఆమ్లజనియు ఉదజనియు, శరీర వ్యాపార సంబంధమగు రసాయన ప్రక్రియలకు ముఖ్యావసరములు. అందుచే వృక్షములలో పోషణక్రియ నేలనుండి తీసికొను నీటిని దానిలో కరగియున్న లవణములకును వర్తించును.

వృక్షములలో పోషణక్రియ చక్కగా బోధపడుటకు నేల లక్షణములు వాటిలోని ఘటకములు నేలలోనికి మొక్కవేరులోనికి ప్రవేశించుట కనుకూలమైన పరిస్థితులు, వేళ్ల అంతరనిర్మాణము బాగుగా తెలిసియుండవలెను.

ఈ విషయమున నేల లోని ఖనిజపదార్థము సేంద్రియ పదార్థము, నేల లోని నీరు, ప్రాణము నేలలోని గాలి నేలయందలి జీవరాశి మొదలైనవి అందలి ప్రధాన ఘటకములని చెప్పవచ్చును.

నీటిని ఖనిజలవణములను చాలభాగము వృక్షములు తమ వేళ్ళచివరిభాగములద్వారా లోనికి పీల్చుకొనుచుండును. నేలలో మొక్కయొక్క వేళ్లు శాఖోపశాఖలుగ విస్తరించి యుండుటచే బాగుగా ఎదిగిన మొక్కకు కోట్లకొలది వేరు కొనలుండును. మొక్కకు వేరుకొనలెంత విస్తారముగ నేర్పడిన పోషణక్రియ అంతవిస్తారముగ నుండును. ప్రతి వేరు కొనకును రక్షణకొరకై టోపీవంటి నిర్మాణ మొకటుండును. దానిచే కొంతవరకు కప్పబడి వేరుయొక్క ప్రవిభాజి అను భాగముండును. ఈ భాగమునకు పైన వేరులోని జీవకణములు పెద్దవగుచుండు విభాగముండును. ఈ విభాగమునకే సాధారణముగా వేరు పొడవుగా పెరుగుచుండును. ఈ విభాగమునకుపైన మూలరోమమండలముండును. ఈ మండలమున వేరు సన్నని రోమములవంటి ఉద్వర్ధనములను పెక్కు కల్గియుండును. ఈ మూలరోమ మండలముద్వారా వేరు నీటిని అత్యధికముగ పీల్చుకొనుచుండును. జీవకణములు పెద్దవియగు భాగమునకూడ నీరు అధికముగా పీల్చుకొనబడును. కాని వేరుటోపీ ప్రవిభాజి మండలముద్వారా జరుగు శోషణక్రియ బొత్తిగా తక్కువగనుండును. ఖనిజలవణముల శోషణము వేరుచివరిభాగమునకటను మూలరోమమండలమునుండి ప్రవిభాజిమండలము వరకును బాగుగా జరుగుచుండును. వేరులో శోషణక్రియ జరుగు భాగము యొక్క పొడవు ఆయా మొక్కల తెగలను బట్టియు వేరు యొక్క వయస్సును బట్టియు అది పెరుగు పరిస్థితులను బట్టియు ఉండును.

వేరుయొక్క అంతర్నిర్మాణమును గూర్చియు దాని లోని వివిధ కణసంహతులను గూర్చియు స్థలాభావముచే ఇచ్చుట వీలుపడలేదు. కాని మూలరోమములు ప్రధానమైన అవయవములగుటచే వాటినిగూర్చి తెలిసికొందము. మూలరోమ మండలము వేరుపై కొన్ని మిల్లీమీటర్లనుండి కొన్ని సెంటీమీటర్ల పొడవువరకు ఆయా తెగల మొక్కలను బట్టి భిన్నముగనుండును. ఈ మండలమున వేరుకు పెరుగుదల ఉండదు. త్వరగా పెరుగు వేరుపై క్రొత్త మూలరోమములు నిరంతరము బయలుదేరుచుండును. మూలరోమములన్నియు మట్టి రేణువులను అంటుకొనియుండి నేలలోని వివిధ భాగములతో సంపర్కము కల్గియుండును. మూలరోమము లలో చాలభాగము అవి బయలుదేరిన కొలది వారములకే నశించుచుండును. కొన్ని తెగల మొక్కలలో అవి మొక్క పెరుగుదలకాలములో పూర్తిగా నిలిచియుండును. కొన్ని తెగల మొక్కలలో అవి ఒక సంవత్సరము వరకుకూడ ఉండును. కొన్ని మొక్కలలో మూలరోమములు చాల తక్కువగను కొన్నిటిలో విస్తారముగను మరికొన్నిరకముల మొక్కలలో అసలే లేకుండగను ఉండును.

వేరుపైనుండు బాహ్యచర్మములోని జీవకణమునుండి ఒక మూలరోమము మూలరోమ మండలమున బయలుదేరి ఒక గొట్టమువలె బాహ్యచర్మమునకు సమకోణములో పెరుగుచుండును. దాని చివరిభాగము మూయబడి యుండును. ఒక్కొక్క మూలరోమము సుమారు ఒక మిల్లీమీటరునుండి ఒక సెంటీమీటరువరకు పొడవును 10 $\mu$ వెడల్పును కల్గి యుండును. మూలరోమమనునది ఒకేఒక జీవకణము. దాని కణభిత్తికలో సెల్యులోసు పెక్టిక్ సంయోగ పదార్థములు ఉండును. మూలరోమ జీవకణభిత్తిలోని బాహ్యభాగమున కాల్షియమ్ పెక్టేట్ ముఖ్యముగానుండు పెక్టిక్ సంయోగ పదార్థములుండుటచే అవి మట్టి రేణువులతో బలమైన సంపర్కము కల్గియుండును. అందుచే మూలరోమమును మట్టి రేణువులనుండి విడదీయుట సులభము కాదు. మూలరోమము లోనుండు కోశరసము బాహ్యచర్మపు జీవకణ కోశరసముతో మిళితమైయుండును.

నీరు ప్రధానముగా మూలరోమముల భిత్తికలగుండా వేరు కొననుండు బాహ్యచర్మపు జీవకణములద్వారా వేళ్లలోనికి ప్రవేశించుచుండును. బాహ్యచర్మపు జీవకణములలో నుండి నీరు మట్టలోని జీవకణపంక్తులలో ప్రవేశించి అంతశ్చర్మముగుండా దారునాళములలోనికి చేరుకొనును.



చిత్రము - 77

పటము - 1

లేత మూలరోమము

దారునాళములగుండా నీరు వేళ్లనుండి కాండములో పైకెక్కి మొక్క ఆకులయందలి వివిధ భాగములను చేరుకొనును.

చిత్రము 18

కాస్పేరి
అంతశ్చర్మము
పీఠిక

మూల రోమము
బాహ్య చర్మము
పట్టి
దారువు
అధోవాహ

వేరులోపలి భాగములు - అడ్డుకోత - నీరు వేరులోనికి పోవు మార్గము చూపబడినది

పటము - 2

మొక్కలలో శోషణక్రియ బాగుగ సాగవలెనన్నచో మొదట నేలలోని నీరు త్వరగా కదలుటకు అనుకూల పరిస్థితులుండవలెను. దీపపువత్తి ప్రమిదచమురును పైకి ఎట్లు లాగుకొనునో అట్లే నేలలో కేశాకర్షణశక్తివలన నీరు వచ్చుచున్నచో లేతవేళ్లు నీటిని పీల్చుకొనగలవు. భూమిజల మట్టమునకు (Water table in soil) ఎక్కువ ఎత్తులో లేని మట్టియందును మంచి వర్షముగాని చక్కని నీటిపట్టు అయిన తరువాతగాని నేలలో నీటి ప్రమాణము బొత్తిగా తగ్గిపోనంత వరకును ఉపరితలమునందున్న మట్టి పొరలయందును కేశనాళికల ద్వారా భూమిలోనున్న నీరు బాగుగా కదలుచుండును. మట్టిరేణువులపై సన్ననిపొరవలెనున్న తేమ అంతరవకాశములలోని నీటిని మూల రోమములు పీల్చుకొనిన కొలది క్రిందినుండి పైకి కేశాకర్షణశక్తి ద్వారా నీరు కదలుచుండును. నేల ఎక్కువ తడిగానున్నను నేలలో గాలిలేకుండుటచే కేశాకర్షణశక్తి పనిచేయదు. పరిస్థితులిట్లు అనుకూలముగనున్నపుడే వేళ్లు తేమను వెదకుచు నిరంతరము పొడవుగా పెరుగుచుండును.

వృక్షములశోషణ క్రియను పరిశీలించినచో కొన్ని భౌతిక శక్తుల ద్వారా ఆప్రక్రియ నిర్వర్తించబడుచున్నట్లు తెలియును. మొక్కలలోని నీరు ఆవిరిగా ఆకుల నుండి పోవుచుండుటచే ఆకుల మధ్య భాగమునందుండు జీవకణములందలి ఉత్సరణ పీడనములో (diffusion pressure) కొరత ఏర్పడును. దానిమూలముగ దారునాళములలోని నీటిపై ఉత్సరణ పీడనలోపము ఎక్కువగుచుండును. వేరులోని శోషణ మండలములోనుండు దారునాళములయందు ఉత్సరణ పీడన లోపము చుట్టునున్న జీవకణములలో కంటె ఎక్కువైన వెంటనే వేరులో బాహ్యచర్మమునందలి జీవకణములు మొదలుకొని లోపలనున్న దారునాళముల వరకును కణములకు ఉత్సరణపీడన లోపముల పాఠము (gradient) క్రమముగా వృద్ధియగుచుండును. నేలలోని నీటియొక్క ఉత్సరణ పీడన లోపముకంటె వేరు యొక్క బాహ్యకోశికలలోని నీటిపై ఉత్సరణ పీడన లోపము హెచ్చుగానున్న అన్ని సమయములయందును నేలనుండి నీరు వేరులోనికి ప్రవేశించుచుండును. నేలలోని ద్రావణము యొక్క ఆస్రుతిక పీడనము (osmotic pressure) చాలా రకముల నేలలలో బహుస్వల్పముగ నుండుటచే ఇది అంత కష్టముగనుండదు. ఈ మాదిరి శోషణమునకు మొక్క పైభాగములలో - ముఖ్యముగా ఆకులలో ఏర్పడు పరిస్థితులు కారణములగుచుండును. ఆకులలో మొదట ఉత్సరణ పీడన లోపమేర్పడుటకు ఆకులగుండా జరుగు బాష్పోత్సేకము (transpiration) కారణము. పెరుగుదలలోగాని ఆకులలో చక్కెర తయారగుటలోగాని నీరు వినియోగపడినచో కూడ శోషణము జరుగును. అందుచే బాష్పోత్సేకము జరుగకున్నను శోషణక్రియ జరుగవచ్చును.

మొక్కలలో వేళ్ల ద్వారా జరుగు శోషణ క్రియకు పైన తెలిపిన ప్రక్రియ ఒక్కటే కారణముకాదు. వేళ్లయందున్న దారునాళికలలో పెక్కు తెగల మొక్కలయందు ఒక విధమగు అంతఃపీడనము బయలుదేరును. ఇది మూలపీడనమనబడును. దీనిపట్టి దారునాళములలో పీడనమేర్పడి కొన్ని మొక్కలలో ఆకుల కొనలనుండి నీరు చుక్కలుగా బయటికి వచ్చును. ఇది ఉత్స్వేదన (guttation) మనబడును. అందుచే మూలపీడనము కూడ వేళ్లలో జరుగు శోషణ క్రియకు కొంత వరకు కారణమగును.

వేరులోని బాహ్యచర్మపు జీవకణములనుండి ఆకులలోని జీవకణముల వరకు ఉత్సరణ పీడన లోపపాఠమేర్పడునని పైన తెలుపబడినది. దీనిలో ఇమిడియున్న మరికొన్ని భౌతిక శక్తుల సహాయమున మొక్కలలో శోషణ క్రియ జరుగుచుం

డను నేలలోని నీరు మూలరోమముల జీవకణభిత్తిక ద్వారా లోనికి అస్మృతిప్రక్రియతో జరుగును జీవకణభిత్తి లోనుండి నీరు ప్రక్కనున్న జీవకణము లోనికి పోవునపుడు అంతశ్శోషణ ప్రక్రియ (imbibitional mechanism) జరుగును దీని ఫలితముగ జీవకణములలో అస్మృతి పీడనము టర్గర్ పీడనము ఏర్పడును ఈ రెండు ప్రక్రియలే కాక కొన్ని చయాపచయ క్రియలు (metabolic mechanisms) కూడ పోషణ క్రియకు పరోక్షముగ తోడ్పడుచున్నట్లగపడను నీటి అణువులు జీవకణము ప్రవాహముగుండా శ్వాసనక్రియనుండి వచ్చు శక్తి సహాయమున కదలుచుండుటయే ఇందుకు కారణము జీవకణములు ఖనిజలవణములను పీల్చుకొనుటలో ఆయా కణములలోని చయాపచయ ఎన్జైముల ప్రభావమున్నట్లగపడును ముఖ్యముగా వాయుసహిత శ్వాసన క్రియ జరుగు గతి ప్రభావముండును

వృక్షములలో జరుగు జలపోషణ క్రియపై కొన్ని బాహ్య పరిసర కారకములకు కొంత ప్రభావము కలదు లేతవేళ్ల యొక్క పరిధాకాభిత్తికలలో (peripheral walls) నున్న నీటిపైగాని నేలలోని నీటిపైగాని గల ఉత్సరణ పీడన లోపముపై ప్రభావము గల ఏ కారకమునకైన పోషణ క్రియపై కూడ ప్రభావముండును వేళ్ల పెరుగుదల రేటుపై ప్రభావము గల కారకములమీద కూడ పీల్చుకొనబడు నీటి పరిమాణము ఆధారపడి యుండును ఆకులగుండా జరుగు బాష్పోత్సేక గతికి జలపోషణ గతిపై బలమైన ప్రభావముండుటచే బాష్పోత్సేకగతిని మార్పు చేయు ఏ కారకమైనను పోషణగతిలో మార్పు కలుగ జేయును అట్లే పోషణగతిని మార్పుచేయు ఏ కారకమైనను బాష్పోత్సేక గతిలో మార్పుచేయును దీనినిబట్టి నేలకు సంబంధించు కొన్ని ఈ దిగువ కారకములకు పోషణగతిపై ప్రభావముండును

(1) నేలలో లభించు స్థితియందున్న నీరు జల పూరితముగ నుండుట కవసరమైన నీటిలో నూటికి సుమారు 40 60 పాళ్లకు మిగుల తక్కువగాని మిగుల ఎక్కువగాని నీరున్నచో అది మొక్కలకు ఉపయోగకరముగ నుండదు

( ) నేల ఉష్ణోగ్రత సాధారణముగా పెక్కు జాతుల మొక్కలలో నేల ఉష్ణోగ్రత బాల తక్కువగ నున్నచో, పోషణ క్రియయు తగ్గిపోవును వేరు వేరు మొక్కలకు నేల ఉష్ణోగ్రతా క్షేమములు వేరు వేరుగా నుండును యుండును నేల ఉష్ణోగ్రత అధికముగ నున్నను, పోషణగతి ఒక్కొక్కప్పుడు తగ్గుచుండును

(3) నేలయందలి వాయుప్రసారము నేలలోని వేళ్ల జీవన వ్యాపారములకు కూడ కొంత గాలి అవసరము నేలయందలి గాలిలో వేళ్లకవసరమగు ఆమ్లజని యుండును నేలలో మట్టి రేణువుల మధ్య నుండు అంతరావకాశములు తక్కువగ నున్నచో వాయు ప్రవేశ సంచారములు తక్కువగ నుండును ఆమ్లజని వేళ్లకు తక్కువగ లభ్యమగుచో శ్వాసన క్రియ సరిగా జరుగక ఇతర చయాపచయ క్రియలు కూడ కృశించును కేవలము నీటియందే పెరుగు కొన్ని ఉద్భిజ్జ జాతులకు వాటి శరీర నిర్మాణమున కొన్ని తావులందు గాలిని నిలువ చేసికొను ఏర్పాట్లుండును అవి పత్రములద్వారా తీసికొను గాలిని వివిధావయవముల యందు నిలువ చేసికొనును

(4) నేలలో ద్రావణ నిష్పత్తి (Concentration of soil solution)

దీనికి నేలలో నుండు నీటి ఉత్సరణ పీడన లోపముపై ప్రభావము గలదు నేలలోని నీటి యందు లవణములు విస్తారముగ నున్నచో ద్రావణ కేంద్రీకరణము దాని అస్మృతి పీడనము హెచ్చుగ నుండును సామాన్యముగా ద్రావణము యొక్క అస్మృతిపీడనము హెచ్చిన కొలది జల పోషణగతి తగ్గుచుండును ఆకులకు కూడ నీటిని పీల్చుకొను శక్తి కలదు వర్షము మంచు, పొగమంచు కురియు సమయములలో పెక్కు రకముల మొక్కలు తమ ఆకుల ద్వారా నీటిని పీల్చుకొనును

ఖనిజలవణముల పోషణమును గూర్చి పరిశీలించుచో అవి వేరు యొక్క బహిశ్చర్మ జీవకణములలోనికిని నీటితోని మొక్కల జీవకణములలోనికిని ఉత్సరణముచే ప్రవేశించుచుండునని తెలియగలదు ఇది నిజమే అయినను కొన్ని పరిస్థితులలో ఖనిజలవణముల ఇట్టి వర్తనము అంత ముఖ్యమైన ప్రక్రియగా భావించరాదు ఇంతకంటె ముఖ్యమైన ప్రక్రియలు మరి రెండు జరుగుచున్నట్లు గుర్తింపబడినవి (1) లవణముల కూడిక (2) అయనముల వినిమయము నేలలోని ద్రావణములో వేళ్లు స్వేచ్ఛగా ఉత్సరణమగు అయనులను పీల్చుకొనుటయేకాక మట్టి రేణువులపై అధిశోషితమగు ధన అయనములను (Cations) బహుళముగ ఋణ అయనములను (anions) కూడ విడుదల చేయగలవు భూమిలో వేళ్ల పెరుగుదల గతి, జలపోషణ విషయముననే కాక ఖనిజ లవణపోషణ విషయమై

మున గూడ చాల ముఖ్యమైనది

భూమిపై గాలిలో నుండు భాగముల ద్వారా మొక్కలు ఖనిజ లవణములను పీల్చుకొనుట చాల అరుదుగా జరుగును కాని కొన్ని సస్యములకు రసాయనపు టెరువులు ఈ పద్ధతి ననుసరించి వాడబడుచున్నవి రసాయన పుటెరువుల విలీన ద్రావణములను ఆకులపై చిమ్మనగొట్టముతో చల్లిన యెడల వాటి యందున్న లవణములలోని పీల్చుకొనబడును ప్రధాన మూల ద్రవ్యములు అవసరమైన పరిమాణములలో మొక్కకు సరఫరా అగుట కీపద్ధతి ఎక్కువ తృప్తికరముగా నున్నట్లు కన్పించుట లేదు కాని ఇనుము రాగి మాంగనము యశద మువంటి సూక్ష్మ పోషక మూలద్రవ్యములను మొక్కలకు సరఫరా చేయుటలో ఈ విధానము చక్కగా ఉపయోగపడు చున్నది

బి వి ర

## వృక్షములలో శ్వాసక్రియ

జీవరాసులన్నిటిలో అహర్నిశము శ్వాసక్రియ జరుగు చుండును ఈ క్రియలో బయటినుండి శరీరములోనికి ఆమ్ల జని ప్రవేశించుటయు బొగ్గు పులుసుగాలి బయటికి పోవుట యు స్థూలముగా అగపడుచుండును శ్వాస క్రియ వలన ముఖ్య ప్రయోజనము జీవిత వ్యాపారములకు కావలసిన శక్తిని శరీరమునందు విడుదల చేయుటయే వృక్షములోని భాగములన్నిటి యందును సజీవముగానున్న జీవకణ సంహతుల యందును జీవకణములయందును శ్వాస క్రియ జరుగుచుండును శరీరములోనికి తీసికొనబడు ఆమ్లజని జీవకణములలో నుండు ఆహార పదార్థములను ఆమ్లజనీకరణము చెందించి వానిలో గుప్తముగ నుండు శక్తిని బయటికి తీసి శరీరములో విడుదల చేయును ఇది సాధారణముగా ఉష్ణశక్తిగా రూపొందును కాని మొక్కల శరీరములలో విడుదలయగు శక్తి అంతయు ఉష్ణశక్తిగా నుండునని చెప్పుటకు వీలులేదు అది రసాయన శక్తి ప్రసరణశక్తి (radiant energy) యాంత్రిక శక్తి స్థితిక శక్తి మొదలగు రూపములలో సజీవముగా నున్న జీవకణములలో రూపొందుచుండును

శ్వాసక్రియ విశ్లేషణాత్మకమగు రసాయనచర్య, సాధారణముగా వృక్షములలో పిండిపదార్థ తరగతికి చెందిన N' షడధు చక్కెర (hexose sugar) విశ్లేషింపబడు పదార్థముగానుండును కాని అవసరమును బట్టి మాంసకృత్తులు క్రొవ్వు పదార్థములు కూడ విశ్లేషింపబడుచుండును శ్వాస క్రియలో జరుగు రసాయన చర్య ఈ దిగువ సమీకరణము ద్వారా స్థూలముగా తెలియజేయుట పరిపాటియైనది



$$C_6H_{12}O_6 + 6O_2 \rightarrow 6CO_2 + 6H_2O + 673$$

షడధుచక్కెర ఆమ్లజని బొగ్గుపులుసుగాలి ఉదజని ఉష్ణశక్తి
కిలోగ్రాం కెలోరీలు

ఆహారము భుజించి సహించుట బరువుతగ్గుట ఆమ్లజనిని తీసికొనుట బొగ్గు పులుసుగాలిని వదలి వేయుట శక్తి విడుదలయగుట యనునవి శ్వాసక్రియలో బాహ్య దృష్టికి కనబడు లక్షణములు కాని శ్వాసక్రియలో ఎల్లప్పుడును ఆమ్లజని తీసికొనబడదు అట్లే ఎల్లప్పుడును బొగ్గు పులుసు గాలి వదలి వేయబడదు అందుచే వాయు సహిత శ్వాసక్రియయేగాక మొక్కల జీవకణములలో సాధారణముగా వాయు రహిత శ్వాసక్రియ కూడ జరుగుచుండును శ్వాసక్రియలో సన్నగు నీరు స్వల్పముగనున్నను అది జీవకణములలోని నీటిలో కలిసి పోవును జీవకణములలోనుండు జీవరసము సజీవముగా నుండుటకు ఆమ్లజని అవసరము

మొక్కలలో శ్వాసక్రియ ప్రమాణము అవయవమును బట్టియు జీవకణ సంహతిని బట్టియు బాహ్య పరిస్థితులను బట్టియు వేరు వేరుగా నుండును పగలు కిరణజన్య సంయోగ క్రియతో పాటు శ్వాసక్రియ కూడ జరుగుచుండును గాని శ్వాసక్రియ వలన లభించు బొగ్గు పులుసు గాలి కూడ సంయోగక్రియలో మరల ఉపయోగింపబడుచుండును రాత్రు లందు శ్వాసక్రియ మాత్రమే జరుగును ఇది ఆకుపచ్చని ఆకుల విషయమునందేగాని, హరితరహితమగు భాగములలో ఈ వ్యత్యాసముండదు

శరీరములో నుండిగాని అందలి అవయవములలో నుండి గాని వదలి వేయబడు బొగ్గు పులుసు గాలికిని, లోనికి తీసి కొనబడు ఆమ్లజనికిని గల నిష్పత్తి "శ్వాసన నిష్పత్తి" అన బడును షడధు చక్కెర సంపూర్ణముగా ఆమ్లజనీకరింపబడి

నచో ఈ నిష్పత్తిగా నుండును కాని ఆయా పరిస్థితులను బట్టియు ఆయా అవయవ భేదములను బట్టియు శ్వసన నిష్పత్తి 1 కంటె వేరుగా నుండును

వాయు సహిత శ్వసనక్రియ యొక్క రేటుపై కొన్ని కారకముల ప్రభావము కలదు అట్టి కారకములలో జీవకణములోని జీవరస వస్తువులు కాని పరిమాణము ఉష్ణోగ్రత జీవకణములలో ద్రవణీయములగు ఆహారపదార్థములు వాతావరణములోనున్న ఆమ్లజని సాంద్రత బొగ్గుపులుసుగాలి సాంద్రత జీవకణ సంహతుల యొక్క అర్ద్రత వెలుతురు అవయవములకు తగులు గాయములు హాని యాంత్రిక చర్యలు కొన్ని రాసాయనిక సమ్మేళన పదార్థములు అట్టి కారకములలో ముఖ్యమైనవి

మొక్కల శ్వసనక్రియలో పదధు చక్కెరపై ఆమ్లజని చర్యవలన బొగ్గుపులుసు గాలి నీరు శక్తి విడుదలయగుట సమీకరణమును బట్టి చాల సులభగ్రాహ్యముగా అగపడు చున్నను వాస్తవమునకు అది చాలక్లిష్టమగు రసాయన చర్యల సమ్మేళనము దానిలో అనేక ప్రతి క్రియావలయములు గొలుసు కట్టు ప్రతి క్రియలు ఉండి వాటి సారాంశముగా ఆ సమీకరణముపైకి అగపడుచుండును వాయు సహిత శ్వసనములో అవి ఒక మాదిరిగను వాయు రహిత శ్వసనములో అవి వేరొక మాదిరిగను ఉండును శక్తిని విడుదల చేయుటలో గాని దానిని ఒక పదార్థమునుండి వేరొక పదార్థమునకు ప్రసరింపచేయుటలో గాని ఆమ్లజనీకరణ ఆమ్లజని హరణ ప్రతి క్రియలు చాల ముఖ్యముగా ఇమిడి యున్నవి ఎన్నియో వికిరణములు (enzymes) సహాయ వికిరణములు( coenzymes) వాహకములు ఈ ప్రతి క్రియలో పని చేయును ఈ రసాయనక్రియ క్రమక్రమముగా ఒక దాని తరువాత నొకటి కొన్నిదశలలో జరుగుచుండును సారాయము విపాకము చెందునపుడు జరుగు రాసాయనిక ప్రతిక్రియలను వృక్షములలో జరుగు వాయు రహిత శ్వసనక్రియలో జరుగు రసాయనిక ప్రతి క్రియలను ఒకే మాదిరిగ నుండును సారాయి విపాకమును ఈ క్రింది సమీకరణముచే తెలియజేయుట పరిపాటియైనది



జైమేస్ కిలోగ్రాం

$$C_6H_{12}O_6 \rightarrow 2\,C_2H_5OH + 2\,CO_2 + 21$$

పదధుచక్కెర ఇథైల్ సారాయము బొగ్గుపులుసు గాలి కెలోరీలు శక్తి

వృక్షములలో కొన్ని జీవకణ సంహతులైనను వాయు రహిత శ్వసనక్రియా శక్తిని కలిగియుండును ఆమ్లజని తగినంత ప్రమాణములో ఆ జీవకణములకు అందుబాటులో నున్నను దానిలో వాయు రహిత శ్వసనక్రియ కూడ జరుగుచుండును ఆమ్లజని అందుబాటులో లేనప్పుడను బొత్తిగా లేకపోయి నప్పుడను వృక్షములోనున్న జీవకణ సంహతులలో చాల భాగము ఇట్టి వాయు రహిత శ్వసనక్రియను నిర్వర్తించు చుండును విత్తనములు మొలకెత్తునప్పుడను కొన్ని పండ్ల రకముల యందును నేలలో నీరునిండి గాలి లభించనప్పుడను యితర పరిస్థితుల యందును ఇట్టి శ్వసనక్రియ జరుగు చుండును కాని వాయు రహిత శ్వసనక్రియలో తక్కువ శక్తి లభించుచుండుటయేగాక జీవకణములకు విషతుల్యమగు సారాయ మేర్పడుచుండును

శ్వసనక్రియలో రాసాయనిక ప్రతిక్రియలు రెండు ముఖ్య దశలలో జరుగుచుండును (1) పిండిపదార్థము(పదధు చక్కెర) ఆమ్లజనీ కరణము నొంది పైరూవిక్ ఆమ్లము ఏర్పడుట ఈ ప్రక్రియ మధు వికరణము (glycolysis) అనబడును (2) పైరూవికామ్లము మరల ఆమ్లజనీ కరణము నొందుట

మొట్టమొదట పదధుచక్కెర అణువులకు భాస్వరము చేర్చబడుట చాల ముఖ్యమైన చర్య ఈ చర్యలో ఎడినోసిన్ డైఫాస్ఫేటు(A D P) ఎడినోసిన్ ట్రైఫాస్ఫేటు(A T P) అను జీవ రాసాయనిక మిశ్రమములు ముఖ్య పాత్ర వహించును అవి భాస్వరవాహకములుగా పనిచేయుచుండును ఈ రాసాయనిక మిశ్రమములలో నుండు భాస్వర బంధములలో శక్తి పుష్కలముగా నుండును

భాస్వరము చేర్చబడిన పండ్లచక్కెర (fructose 1 6- డైఫాస్ఫేటు) పైరూవికామ్లము వరకు మధువికరణము చెందుటలో జరుగు ప్రతిక్రియలు ఈ క్రింద చూపబడినవి

ఫ్రక్టోస్ - 1, 6 - డైఫాస్ఫేటు

ఆల్డొలేస్ అను వికిరణసహాయముతో ↕ డైహైడ్రాక్సి అసిటోన్ ఫాస్ఫేటు

↑ ఫాస్ఫోట్రైయోస్ ఐసోమరేస్ అను వికిరణము

3 - ఫాస్ఫోగ్లిసరాల్డిహైడ్ ←

↕ → ఫాస్ఫేట్

1, 3 - డైఫాస్ఫోగ్లిసరాల్డిహైడ్

↕ → డి పి ఎన్ (డైఫాస్ఫోపైరిడిన్ న్యూక్లియొటైడ్)

→ డి పి ఎన్ హెచ్$_2$

1, 3 - డైఫాస్ఫోగ్లిసరికామ్లము

+ + మగ్నము ↕ → ఏ డి పి
ఫాస్ఫోగ్లిసరిక్ ట్రాన్స్‌ఫాస్ఫొరిలేస్ అణువికిరణము
→ ఏ టి పి

3 - ఫాస్ఫోగ్లిసరికామ్లము

↕ ఫాస్ఫోగ్లిసరోమ్యుటేస్ అణువికిరణము

2 - ఫాస్ఫోగ్లిసరికామ్లము

+ + మగ్నము ↕ ఇనోలేస్ అణువికిరణము
→ నీరు

2 - ఫాస్ఫో ఇనోల్ పైరువికామ్లము

+ + మగ్నము + పొటాసియం ↕ → ఏ డి పి
ఫాస్ఫోపైరువేట్ ట్రాన్స్‌ఫాస్ఫొరిలేస్ అణువికిరణము
→ ఏ టి పి

పైరువికామ్లము —

పైరువికామ్లమునకు శ్వాసన రసాయన ప్రతిక్రియలలో కీలక స్థానమున్నది దానియందు తరువాత వివిధ దిక్కులలో ప్రతిక్రియలు సాగిపోవుచుండును పైన చూపబడిన మధు వికరణ ప్రక్రియలో ఆమ్లజని ప్రసక్తియే లేకుండుట గమనింప వలసిన ముఖ్య విషయము అందుచే పైరువికామ్లమేర్పడు వరకు వాయుసహిత వాయురహిత శ్వాసక్రియలలో జరుగు రాసాయనిక చర్యలు ఒకే మాదిరిగ నుండును ఇంత వరకు శక్తి ఏమియు విడుదల కాలేదు కాని పైరువికామ్లము ఆమ్లజనీకరణము పొందుటలో ఈ రెండు విధములగు శ్వాసనక్రియలు వేరువేరుగా నుండును

వాయుసహిత పైరువికామ్ల ఆమ్లజనీకరణములో బొగ్గుపులుసు గాలి నీరు చక్రీయ పరంపరలుగా నుండు అంతస్థులలో జరుగు ప్రక్రియల ఫలితముగా ఏర్పడును ఇది "క్రెబ్స్‌వలయము" అబడును ఈ వలయములో పాల్గొను ఎన్నియో వికిరణములుగాని సహాయవికిరణములుగాని వాహకములుగాని పెక్కు సమ్మేళన పదార్థములు ఖ్యాత్వరముతో చేయుక్తమైనట్టుగాని మాసబడలేదు అందుచే క్రింద చూపబడిన "క్రెబ్స్‌వలయము" సంక్షేపించబడినది

ఈ వలయములో బొగ్గుపులుసు గాలి ఎసిటిక్ కీటో గ్లుటారిక్ సక్సినిక్ ఆమ్లములు ఏర్పడుటలో విడుదలయగుచున్నది ఒక అణువు పైరువికామ్లముపై 2½ అణువుల ఆమ్లజని చర్యలో 3 అణువుల బొగ్గుపులుసు గాలి 2 అణువుల నీరు శక్తి ఏర్పడునని ఈ క్రింది సమీకరణము తెలియజేయును

పైరువికామ్లము + 2½ ఆమ్లజని → 3 బొగ్గుపులుసు గాలి + 2 నీరు + శక్తి వాయుసహిత శ్వాసక్రియ జీవకణములలో నుండు కణాంతర సూత్రములలో మాత్రమే జరుగుచుండునని యు క్రెబ్స్‌వలయము ద్వారా పైరువికామ్లము సంపూర్ణముగా ఆమ్లజనీకరణము నొందుటకు కావలసిన వికిరణములన్నియు వాటిలో నుండునని యు శ్వాసనక్రియతో సంబంధముగల ఏ టి పి లో చాల భాగము వానియందే సంశ్లేషించబడునని యు తెలియుచున్నది

వాయురహిత శ్వాసనక్రియలో పైరువికామ్లము ఆమ్లజనీకరణమునొందు రసాయనక్రియల ఫలితముగా సాధార

ణముగా సారాయములు సేంద్రియామ్లముల వంటి ఆమ్లజని విధమగు చర్యలలో ఇథైల్ సారాయకు తయారగును కరణమునొందిన సమ్మేళన ద్రవ్యములు ఉత్పత్తియగును ఈ జంతువుల కండరములందును కొన్ని సూక్ష్మజీవులలోను పై




క్రెబ్స్ వలయములో జరుగు ప్రతిక్రియలు

పైరూవికామ్లము నుండి లాక్టికామ్లము తయారగును. పైరూవికామ్లము ఇంకను ఇతర పదార్థములుగా మార్చబడిన తరువాత వాయు రహిత శ్వాసక్రియలలో జీవకణములకు లభించు శక్తి చాల తక్కువగా నుండును.

ఒక అణువు నుండి మరియొక అణువునకు శక్తి మారు చుండుట ప్రాణిలో జరుగుచుండు ఆవశ్యక చర్య. ఈ శక్తి భాస్వరపు బంధములలో ఇమిడి యుండును. రాసాయనిక చర్య వలన అట్టి బంధము ఛేదించబడినచో విస్తారముగ శక్తి విడుదల యగును. జీవుల శరీరములలో విస్తారమగు శక్తిగల భాస్వర బంధములుండు సమ్మేళన పదార్థములు అనేకమున్నవి. అట్టి వాటిలో ఏ టి ఎ, ఏ డి ఎ అనునవి అత్యంత ముఖ్యమైనవి. ఈ సందర్భమున ఒక షడధు చక్కెర అణువు ఆమ్లజనీకరణమునొందినప్పుడు దానినుండి ఉత్పత్తియగు ఏ టి ఎ అణువుల సంఖ్య చాల ప్రధానమైనది. కొన్ని జీవకణ సంహతులలో ఒక అణువు షడధు చక్కెర నుండి 38 ఏ టి పి అణువులుత్పత్తియగుచుండును. అనగా శ్వాసక్రియలో ఉత్పత్తియగు శక్తిలో [illegible] వంతులు ఈ విధముగా నిలవ చేయబడుచుండును. మధువికరణ ప్రక్రియలోను "క్రెబ్స్‌వలయ" చర్యలలోను మరికొన్ని ఎ టి ఎ అణువు లేర్పడుచుండును.

మొక్కలలో తయారగు మరికొన్ని రకముల సేంద్రియామ్లములు గూడ శ్వాసక్రియలో జరుగు ప్రతి క్రియలలో ఉపయోగపడుచుండును.

ట్రాన్స్‌ఫాస్ఫారిలేసెస్, డెస్మోలేసెస్, కార్బాక్సిలేసెస్, హైడ్రేసెస్, డిహైడ్రాజినేసెస్, ఆక్సిడేసెస్ అనునవి వృక్షములలో జరుగు శ్వాసక్రియలలో పాల్గొను వికరముల యొక్క ముఖ్యమైన తరగతులు.

బి. వి. ర.

## వృక్షమూలములు.

వృక్షమూలములు నాళికావృతములకు చెందిన బీజవృక్షముల యొక్క ముఖ్యాంగములు. ఇవి భూమియందుండి అనుకూల భూకేంద్రాభిసరణమును కలిగియుండును. మొక్క యొక్క అంకురదశలో మూలము వంకరతిరిగి అధోముఖముగ నుండును. దీనిని ప్రథమ మూలమని అందురు. అంకురము పెరుగుచున్నకొలది ప్రథమ మూలము వృద్ధినొంది అపికల్ మెరిస్టెమ్ ద్వారా వేరు మండలమగును. ఇట్లువృద్ధినొందిన వేరు భూమిలోనికి దిగి తల్లివేరగును. అనావృత బీజవృక్షములలోను ద్విబీజదళ వృక్షములలోను తల్లివేరు మరింత పెరిగి శాఖోపశాఖలై అన్ని దిశలకు వ్యాపించును. వీటిని ఎల్లవేళ్లందురు.

ఏకబీజదళమునందును టెరిడోఫైటా తరగతి మొక్కలందును తల్లివేరు పొడవుగా ఎదుగదు. ప్రథమమూలము కొంతవరకు మాత్రమే పెరుగును. దీనినుండి గుబురువేళ్లు ప్రక్కలకు పెరగనారంభించును. ఒకే రీతిగనుండు ఈ వేళ్లను అంటువేళ్లనికూడ అందురు. అంటువేళ్లు తల్లివేరు నుండి జనించవు. ఇవి కాండము, ఆకులు మొదలైన ఇతర వృక్షభాగములనుండి ఉద్భవించును. కాని ఎల్లవేరులు తల్లివేరు పెరిసైక్లిక్ పొరనుండి జనించును.

మూలకనిర్మాణము – మూలకమును నాలుగు ముఖ్యభాగములుగ విభజింపవచ్చును. (1) మూలాంతము – ఇది మూలము యొక్క ఎదుగుచున్న భాగము. బీజవృక్షములలో కణవిభజనము చురుకుగా జరుగుచుండు మూడు పొరలు మూలరక్షణమునకు ఇది కొలదిగా వెనుక ప్రక్కనుండును. ఈ పొరలలోనుండు అపికల్ మెరిస్టెమ్ వలననే మూలరక్షణమును మూలముకూడ ఏర్పడును. మూలాంతమునందు మాంసకృత్తులు హార్మోనులు తయారై మూలమభివృద్ధినొందుటకు తోడ్పడును. (2) ప్రైమరీ మెరిస్టెమ్ కణజాల విభాగము – ఇది మూలాంతమునకు వెనుక ప్రక్కనుండును. మూలాంతము నుండి ఏర్పడు కణములు ఎదిగి ప్రైమరీ టిస్యూ మెరిస్టెమ్‌గా ఏర్పడును. ఈ కణజాలము యొక్క విభజనము వలన రెండు లేక మూడు ప్రైమరీ టిస్యూ మెరిస్టెములుగా విడిపోవును. రెండుగాఏర్పడుచో ఈ కణములు కార్టికల్ మెరిస్టెమ్‌గాను ప్రోకాంబియల్ సిలెండరుగాను ఏర్పడును. ఈ కణజాలమునుండి మూలములు కార్టెక్స్ యొక్క పైపొరనుండిగాని లేక వేరు యొక్క బహిర్వలయము నుండిగాని జనించును. మూడు ప్రైమరీ ఉపర్పి మెరిస్టెములుగా ఏర్పడుచోట ప్రోకాంబియమ్ కార్టికల్ మెరిస్టెమ్‌మాత్రమేకాక ప్రత్యేకముగ ప్రోటోడెర్మ్ కూడ కాన్పించును. (3) ఎదిగెడువిభాగము – ఇది ప్రైమరీ మెరిస్టెమ్ కణజాలమునుండి ఏర్పడును. దీనిని బహిశ్చర్మము, వల్కలము, నాళికాపుంజము అను మూడుభాగములుగా విభజింపవచ్చును; మూలకేశరములు మూలమునందు కొంత దూరమున మాత్రమే పుట్టును; అవి, [illegible]

రాలిపోవును మూలమెరుగుచున్నంతకాలము ఈ క్రియ సాగుచుండును (4) మూలకవచము - ఇది మూలాగ్రముమండి జనించి దానిని రక్షించును మూలాగ్రమునకు పార్శ్వము నందు ఒకేపొరగల్గిన కణములను అంతమునందు దట్టముగా కణములు కల్గిన పొరను కల్గియుండును మూలకేశరముల వలెనే మూలము పెరుగుచున్నకొలది ప్రాతబడిన మూలకవచములు రాలిపోయి క్రొత్తవేర్పడుచుండును గడ్డిజాతికి చెందిన మొక్కలలో అంకురదశయందు మూలకవచము మరియొక పొరతో కప్పబడి యుండును మూలకవచము మూలాంశమును సంరక్షించుచు మూలముభూమిలోనికి చొచ్చుకొని పోవుటకు తోడ్పడును

బాహ్యరూపమందును నిర్మాణము నందు కాండమునకును మూలమునకును నడుమ వైవిధ్యమున్నది మూలములకు ఆకులవలె పత్రరంధ్రములుండవు కాండముల కొమ్మలవలెగాక మూలముల కొమ్మలు వేరుయొక్క లోపలిభాగమునుండి పుట్టును

మూలములు-వాటి ప్రయోజనము - మూలములు వృక్షములకు స్థిరత్వమును కూర్చును అవి ఆహారమును నిల్వ చేయుచు సంపాదించి నిలువయుంచును నీటిని పోషక పదార్థములను మూలకేశరములు శోషణక్రియవలన గ్రహించి నాళికాపుంజములద్వారా కాండమునకందించును కొన్ని ప్రత్యేక క్రియలకుకూడ మూలములు ఉపయోగపడవచ్చును అట్టి అవసరములకనుగుణముగా మూలములలో కొన్ని మార్పులేర్పడును ఆహారమును నిలువయుంచుకొనవలసినచో మొక్కయందధికముగ తయారగు పిండిపదార్థములు వేరునందుచేరును. దీనిచే వేరు లావెక్కి కందెవలె గాని కుంభాకారముగాని ముచ్చాకారముగాని పొందవచ్చును (ఉదా॥ ముల్లంగి బీట్ రూట్ క్యారట్) మూలములు వృక్షమునకు స్థిరత్వమును చేకూర్చుననుటకు, మర్రిచెట్టునుండి వ్రేలాడు ఆధారపువేళ్ళను ఉదాహరణముగ పేర్కొనవచ్చును ఇవి కొమ్మలనుండి నూటిగా భూమిలోనికి దిగి కొమ్మలకు స్తంభములవలె భాగములనుగ నుండును కొన్ని మొక్కజొన్న మొదలగు మొక్కలలో క్రిందికణుపులనుండి ఏటవాలుగా నేలవైపునకు వేళ్లుపెరిగి నేలలోనికి చొచ్చుకొని పోయి మొక్కలకు స్థిరత్వమును కూర్చును ఇవి ఊతపు వేళ్లనబడును,

ఒక్కొక్కప్పుడు మూలకములు కొన్ని ప్రత్యేకమైన జీవప్రక్రియలకుకూడ తోడ్పడవచ్చును పరాన్నభుక్కులగు మొక్కలు ప్రత్యేకమైన బుగ్గలవలెనుండును వేరుభాగ మూలములను కాండములలోనికి పంపి ఆహారమును గ్రహించుకొనవచ్చును (ఉదా॥ గంధపుచెట్టు) కొన్ని ప్రత్యేక సందర్భములలో మూలకములు శ్వాసప్రక్రియకుకూడ తోడ్పడును (ఉదా॥ రైజోఫోరా) ఈ మొక్కయొక్క వేళ్లు నిలువుగా నీటిపైమట్టమునకు పెరిగి మొక్కలు గాలిపీల్చుటకు సాయపడును అర్కిడ్స్ జాతికి చెందిన మొక్కలు కొన్ని వృక్షముల కాండములపై పెరుగును ఈ మొక్కల వ్రేళ్లు గాలిలో వ్రేలాడుచుండును ఇవి స్పాంజివలె మృదువుగనుండి గాలిలోని తేమను పీల్చుకొనును తిప్పతీగ మొదలగు మొక్కలవేళ్లు పత్రహరితము కలిగియుండి కిరణజన్యసంయోగక్రియచే ఆహారమును సంపాదించుకొనగలవు గతముప్పది సంవత్సరముల పరిశోధనములవలన వేరుముండలములు పెరుగుదలను గూర్చి తెలియ వచ్చినది ఈ పరిశోధనములలో బటాణి టొమాటో పొగాకు మొదలైన మొక్కలపై ప్రయోగములు చేయబడినవి ఈ మొక్కల యొక్కవేళ్లకొనలను వేరుచేసి పరిశోధనశాలలలో కృత్రిమ పోషకపదార్థములతో పరిశోధన నాళికలలో పెంపుదల చేయుదురు ఈ విధముగ జరిపిన పరిశోధనములవలన రెండు ముఖ్యాంశములు తెలిసినవి (1) మూలకముల అభివృద్ధికి విటమినులు అవసరము (2) కొన్ని హార్మోనులు గిబ్బరెల్లిన్ కైనిన్ మొదలగు జీవరసాయన పదార్థములు మూలముల అభివృద్ధికి తోడ్పడవు.

మూలకముల జీవిత-పరిణామము నాళికా వృక్షములకు మూలము ముఖ్యగుణము కాని సైలొప్సిడా అను మొక్కకు మూలములు లేవు ఈ మొక్కయొక్క అంకుర దశయందు ప్రథమ మూలముగాని తరువాత వేరు మండలము గాని ఉండవు ఈ మొక్కలు కాండము యొక్క రూపము లను కలిగియుండును వీటినుండి రైజాయిడ్స్ అను ప్రత్యేకమగు మూలకేశరములు జనించును వీటి అడ్డుగోడలుండవు ఫెర్న్ జాతికి చెందిన కొన్ని మొక్కలకు అంకురదశలో ప్రథమ మూలముండదు కాని పెద్దదైన తరువాత ఈ మొక్కకు గుబురుగా వేరు మండలమేర్పడును ఈ వేరు మండలమునకు మూల కేసరములు మూలకవచములు ఉండవు కొన్ని ఫెర్న్ జాతి మొక్కలలోను జిమ్నోస్పెర్మ్ జాతి మొక్కలలోను ద్విబీజదళ వృక్షములలోను ప్రథమ మూలము కల్గి

వేరు మండలముగాను ఎల్లవేరు మండలముగాను అభివృద్ధి నొందును కాని ఏకబీజదళ వృక్షములలో ప్రథమ మూలము అంకురదశ తరువాత అభివృద్ధి నొందదు. పెద్ద మొక్కలలో గుబురుగా వేరు మండలము మాత్రముండును. ఈ రెండు తెగల మొక్కల యందు జనీనతలో సామ్యము లేదు. ఏకబీజదళ వృక్షములలోని మూలమండలము ద్విబీజదళ వృక్షముల నుండి తిరోగమన పరిణామము ననుసరించి ఉద్భవించి యుండవచ్చునని కొందరూహించినారు. ప్రప్రథమమున వృక్షమండలము మెట్లేర్పడినది? అదెట్లు పరిణతి చెందుచున్నది? అను ప్రశ్నలకు సమాధానముగా నాళికావృక్షములపరిణామమొకవివాదగ్రస్తమైన విషయముగా తేలినది. ఇవి రెండు రకములుగా జనించి పరిణామము చెందుచున్నవని సిద్ధాంతీకరింపబడినది. మొదటి వాదము ప్రకారము నాళికావృక్షములన్నియు మూలరహితమైన సైలాప్సిడా తెగనుండి వెలువడినవి. ముఖ్య వృక్షము భూమ్యుపరితలమున కాండముగను లోపలి రైజోమ్ అను కాండము నుండి రైజాయిడ్స్ అను వేళ్లుగను ఉపయోగపడును. ఈ రైజోము కొంత కాలము తర్వాత మూలమండలముగా ఏర్పడును. మరియొక వాదము ప్రకారము నాళికా వృక్షముల తెగలన్నియు వేరు వేరుగా ఏర్పడును. అందువల్లనేనగా మధ్యనున్న మూలకరూపములు కాలగతిలో కలిసిపోయి నామరహితమైనందువలన ఆదిమ మూలములరూపమును ఊహించుటయే కష్టమగుచున్నది.

ఎన్. రా.

## వృక్షశాస్త్ర చరిత్ర

వ్యవసాయమునకును వైద్యమునకును సంబంధించిన విషయములను తెలిసికొనుటవలనను వాటిని అనుభవ ప్రయోగములలో ఉంచుకొనుటవలనను వృక్షశాస్త్రమొక విషయముగా చరిత్రకాలమునకు పూర్వమే వృద్ధిచెందినది. క్రీ శ పదునారవశతాబ్దములో వృక్షజాతినిగురించిన విజ్ఞానమును శాస్త్రీయపద్ధతులపై వర్గీకరించి క్రమపద్ధతిలో నుంచుటకు పలుప్రయత్నములు జరిగినవి. కాని 18వ శతాబ్దములో ఆ వర్గీకరణమొకరూపమును దాల్చనారంభించినది. వృక్షశాస్త్రమొక విజ్ఞానశాస్త్రముగా వివిధశాఖలతో 19వ శతాబ్దములో ప్రత్యేకముగా అభివృద్ధిచెందినది.

లభించిన శిలాధారములు చాలస్వల్పములేయైనను, కానిని, బట్టి చూచినచో క్రీ పూ 5000-3400 ఏండ్లమధ్య యున్న తొలినాగరికవాసులకు ముఖ్యముగా అస్సీరియనులకు ఈజిప్తువారి వ్యవసాయ వైద్యవిషయములలో ప్రయోజనకరమగు కొన్ని మొక్కలను గూర్చి తెలియునని చెప్పుటకు వీలగుచున్నది. వారు గోధుమ, బార్లీ మొదలగు పైర్లను సాగుచేసెడివారు. గులాబి, ద్రాక్ష, దానిమ్మ, ఖర్జూర, అత్తి, వెలగ మొక్కలను కొన్ని ఓషధులను గూడ వారు పెంచుచుండెడివారు. ఖర్జూరపు మొక్కలలో పరాగసంపర్కము చేయుటకూడ వారికి తెలియును. హిరోడోటస్ అను గ్రీకుచరిత్రకారుడు క్రీ పూ 105 లో ఈజిప్తు దేశపు వ్యవసాయమును గురించి వ్రాసెను. చైనీయులు క్రీ పూ 2500 ఏండ్లకుముందటనే వరి, తేయాకు వారింకా కొన్ని ఓషధులను పెంచుచుండినట్లు తెలియుచున్నది. గ్రీసు దేశమున క్రీ పూ సుమారు 340 ప్రాంతమున హిరోడోటస్ మొక్కలనుగూర్చి చాలవరకు పరిశీలించి 'మొక్కలచరిత్ర' అను నాతనిగ్రంథములో ఉపయోగకరములగు 500 మొక్కలను వర్ణించి వాటి వివిధభాగలక్షణములను, ముఖ్యముగా మూలికలు, పొదలు, వృక్షములు, ఏకవార్షికములు, బహువార్షికములు మొదలగు విషయములను తెలియజేసెను. క్రీ శ 1వ శతాబ్దములో డయోస్కారిడిస్ అను గ్రీకువైద్యశాస్త్రజ్ఞుడు మెటీరియా మెడికా అను తన గ్రంథములో సుమారు 600 మొక్కలను వర్ణించెను. ప్లినీ అను రోమను గ్రంథకర్త 37 సంపుటములు గల తన 'ప్రాకృతికచరిత్ర' అను గ్రంథమును అదే శతాబ్దమున వ్రాసెను. ప్రాచీన భారతదేశమున వేదయుగమునందే ఆయుర్వేద వైద్యపద్ధతి ఆచరణలోనుండెను. ఋగ్వేదములో సోమలతను మరికొన్ని శాకీయ ఔషధములను కుష్ఠు మొదలగు వ్యాధులను నివారించుటలో గల ప్రాముఖ్యమును గూర్చి వ్రాయబడియున్నది. వేదకాలమునాటి ఆర్యులకు (క్రీ పూ 2000) వైద్యమునందుపయోగపడు మొక్కలు సుమారు 100 వరకు తెలియునట్లు. క్రీ పూ 6వ శతాబ్దములో భారతదేశమున బౌద్ధమతముతోపాటు వృక్షశాస్త్రజ్ఞానముకూడ అభివృద్ధి చెందినది. కాని తరువాత కొంత క్షీణించినది. క్రీ శ 1వ శతాబ్దమున చరకుడు, సుశ్రుతుడు వ్రాసిన వైద్యగ్రంథములను పరిశీలించినచో చరకుడు ఓషధులనుగూర్చియు, వాటి ఉపయోగములనుగూర్చియు, సుశ్రుతుడు వైద్యమున ఉపయోగించు 700 మొక్కలను గూర్చియు వర్ణించినట్లు

తెలియుచున్నది తరువాత క్రీ శ 5 11 శతాబ్దముల మధ్య నాగార్జున మాధవ వాగ్భట చక్రపాణి దత్త మొదలగు పండితుల చేతులలో ఆయుర్వేద విధానము మరింత వర్ధిల్లి సుప్రసిద్ధిగాంచినది క్రీ పూ 3500 2000 మధ్య భారత దేశమున వ్యవసాయ విధానముకూడ చాల వృద్ధి చెందినది

16వ శతాబ్దమునుండి శాస్త్రవిజ్ఞాన వికాసము ప్రారంభ మైనది వైద్యమునకు సంబంధించిన వృక్షశాస్త్రమప్పుడు కూడ ప్రబలముగా నుండెను 1530 వ సంవత్సరమున బ్రన్ ఫెల్స్ అను జర్మను వృక్షశాస్త్రవేత్త వైద్యములో పనికి వచ్చు మొక్కలనుగూర్చి మూడుసంపుటముల గ్రంథమును వ్రాసెను ఫుక్స్ అను మరియొక జర్మను వృక్షశాస్త్రవేత్త వృక్షముల చరిత్ర అను గ్రంథమును 1542వ సంవత్సరమున వ్రాసెను ఆంగ్లేయ వైద్యుడును వృక్షశాస్త్రజ్ఞుడును అగు టర్నర్ అను నాతడు 1551 1562 1568 సంవత్సరములలో క్రొత్తమూలికలు అను గ్రంథమును మూడు సంపుటములలో వ్రాసెను అతడారోజులలో ఆంగ్లేయ వృక్షశాస్త్రపితగా పరిగణింపబడెను ఇటలీదేశపు వృక్షశాస్త్రజ్ఞుడును వైద్యుడును అగు సీజాల్పినో 1583 లో వ్రాసిన డిప్లాంటిస్ అను గ్రంథమున సుమారు 1500 మొక్కలను వర్ణించెను 1596 లో కాస్పర్ బాహిన్ అను మరియొక ఇటలీ వృక్షశాస్త్రజ్ఞుడు 2700 మొక్కలను వర్ణించెను

1620 1623 సంవత్సరములలో బాహిన్, తాను జీవితములో చేసిన కృషిసంతటిని రెండు గ్రంథములుగా ప్రచురించెను ఆ గ్రంథములలో 6000 మొక్కల యొక్క ఉపజాతులనుగురించి గలదు అతడా మొక్కలలో చాలావరకు ద్వినామీ పద్ధతిని ప్రవేశపెట్టుచు పేర్లు పెట్టెను ముఖ్యముగా ముతకదనమును ఆకారమును ఆధారముగాచేసికొని వాటి దగ్గర సంబంధమునుబట్టి అతడొక వర్గీకరణపద్ధతి నేర్పరచెను కాని వర్గీకరించుటలో పుష్పములకు గల ప్రాధాన్యము నాతడు గుర్తించలేదు తరువాత 1686 సంవత్సరములో కేంబ్రిడ్జి నగరమందలి జాన్ రే అను నాతడు చాల ప్రతిభతో మొక్కలను (1) అపుష్పములు (శైవలములు శిలీంధ్రములు నాచులు పర్ణములు) (2) పుష్పములు (ఏకదళబీజవంతములు ద్విదళబీజవంతములు) అని వర్గీకరించెను 1690 వ సంవత్సరములో అతడు బ్రిటిష్ ద్వీపముల ఉద్భిజ్జ జాతి" అను గ్రంథమును ప్రచురించెను టూర్నఫోర్ట్ అను ఫ్రెంచి వృక్షశాస్త్రజ్ఞుడు అదేకాలమున మొక్కలను వర్గీకరించుటలో పుష్పదళ లక్షణములను ప్రప్రథమముగా 1695 లో ప్రవేశపెట్టి తెగలు ఉపతెగలు (Genera and species) అను విషయమును పునః ప్రవేశపెట్టెను అప్పటికి సుమారు 9000 ఉపతెగల మొక్కలు తెలిసియుండెను

18 వ శతాబ్దములో వృక్షశాస్త్రము మరికొంత అభివృద్ధిచెందినది ఉప్సాలలో వృక్షశాస్త్రాచార్యుడుగా పని చేయుచుండిన కెరోలస్ లిన్నాస్ అను స్వీడన్ దేశస్థుడు ఈ విషయమున కృషిసల్పి చాల ప్రసిద్ధికెక్కెను వర్గీకరణము ద్వినామకరణములను గూర్చి అతడు చేసినకృషి చిరస్థాయియై తరువాతి తరములవారికి అత్యమూల్యమైనది 1735 లో అతడు "లైంగిక వర్గీకరణపద్ధతి" అను గ్రంథమును ప్రచురించెను ప్రతియొక్క తెగకు చెందిన మొక్కకు రెండు మాటలుగల నామము నేర్పరచు ద్వినామ పద్ధతికి గట్టిపునాది వేయుటయే అతడు సాధించిన గొప్పవిషయము తరువాత డిజుస్యూ అను ఫ్రెంచి వృక్షశాస్త్రజ్ఞుడు లిన్నాస్ పద్ధతిలో చాల మార్పులను ప్రవేశపెట్టెను 1789 వ సంవత్సరములో అతడు మొక్కల నన్నిటిని 100 కుటుంబములుగా వర్గీకరించెను వాటిని (1) బీజదళరహితములు (2) ఏకదళబీజవంతములు (3) ద్విదళబీజవంతములు అను భాగములలో చేర్చె పుష్పభాగములలో రక్షక ఆకర్షణ పత్రములు పుంకేసరములు అండాశయమునకు క్రిందనున్నస్థితి (Hypogyny) అండాశయమునకు పైనున్నస్థితి (Epigyny), అండాశయమునకు చుట్టునున్నస్థితి (Perigyny) అను సాంకేతిక పదములను ప్రవేశపెట్టెను తరువాతి ప్రాకృతిక వర్గీకరణపద్ధతులకు నాతడు వేసిన పునాది చాల ఉపయోగపడినది

19 వ శతాబ్దపు మొదటిభాగమున (1819) డి కండోల్ రాబర్ట్ బ్రౌన్ (1827), ఎండ్లిచర్ (1836) లిండ్లే (1845) అనువారు వారి వర్గీకరణపద్ధతులను ప్రతిపాదించిరి 1862-83 మధ్య బెంథమ్ హుకర్ అను గొప్ప ఆంగ్లేయ వృక్షశాస్త్రజ్ఞులు బెంథమ్ హుకర్ పద్ధతి అను ప్రాకృతిక వర్గీకరణమునకు పునాదివేసిరి ఆ పద్ధతియే ఇప్పటికిని చాలవరకు అనుసరింపబడుచున్నది వారు సంవృతబీజవంతములలో 202 కుటుంబములను గూర్చి తెలిపిరి బ్రిటిష్ ఇండియా ఉద్భిజ్జ జాలము" అను ఉద్గ్రంథమును కొన్నిసంపుటములుగా హుకర్ ప్రచురించిరి (1872-97) అది వారిప్రతిభా ప్రాశస్త్యములకు

నిగర్సనము ప్రాకృతికవరణము ద్వారా ఉపజాతులపుట్టుక అను గ్రంథమును డార్విన్ పండితుడు 1859 లో ప్రచురించిన తరువాత కొన్ని దేశములలో మొక్కలను పరిణామరీత్యా వర్గీకరించుటకును వాటి వంశవృక్షమునొక దానిని స్థిరపరచుటకును ప్రయత్నములు జరిగెను. ఈ విధముగా క్రొత్త వర్గీకరణపద్ధతులు చాల బయలుదేరెను. జర్మనీదేశములో 1883 లో ప్రాంటల్ ఐక్లర్ అను వారును 1886 లో ఎంగ్లర్ అనువాడును చేసిన వర్గీకరణపద్ధతులు కూడ అట్టివే. 1887-1909 మధ్య ఎంగ్లర్ ప్రాంటల్ అనువారు ప్రచురించిన గ్రంథములలో పుష్పరహిత ఉద్భిజ్జముల వర్గీకరణముతోపాటు 287 పుష్పసహిత ఉద్భిజ్జకుటుంబములను గూర్చి కూడ సవిస్తరముగ వ్రాసియుండెను.

20 వ శతాబ్దములో హచిన్‌సన్ అను ఆంగ్లేయవృక్షశాస్త్రజ్ఞుడు ఎంగ్లర్ పద్ధతిలో పెక్కుమార్పులను ప్రవేశపెట్టి 1926-34 సంవత్సరములలో మొక్కల వంశవృక్షసంబంధముతో ఒకపద్ధతిని ఆవిష్కరించెను. "పుష్పసహిత ఉద్భిజ్జకుటుంబములు" అను తన గ్రంథములో 332 కుటుంబములను అతడు వర్ణించెను. 1901 లో ఆస్ట్రియా దేశస్థుడగు వెట్‌స్టీన్ చనిపోయినతరువాత అభివృద్ధిచేయబడిన అతని మరియొక ముద్రణము 1935 లో బెస్సీ అను అమెరికా దేశస్థుడును 1904-1935 లో రెండిల్ అను ఆంగ్లేయ శాస్త్రజ్ఞుడును కలిసి ప్రచురించిన రెండుసంపుటములు 1948 లో టిప్పో అను అమెరికా దేశస్థుడు ప్రచురించిన పద్ధతులు ఈ శతాబ్దపు ఇతర ప్రచురణలలో ముఖ్యమైనవి.

ఆయా వృక్షశాస్త్ర ప్రత్యేకశాఖలన్నియు అనేక శాస్త్రజ్ఞులు చేసిన కృషిఫలితముగా ఇటీవల దినదినాభివృద్ధి చెందుచు శాస్త్రవిజ్ఞానము అనంతమని నిరూపించుచున్నవి.

వి. వి. ర.

## వృక్షశాస్త్రము

జీవముగగాని శిలారూపమునగాని ఉన్న ఉద్భిజ్జజాతిని గురించి సమస్తవిషయములను తెలియజేయు శాస్త్రము వృక్షశాస్త్రము. ఉద్భిజ్జముల బాహ్యరూపములు, వాని స్థూలసూక్ష్మ అంతర్నిర్మాణములు, అవిచేయు వివిధజీవన వ్యాపారములు, వాని వర్గీకరణము, పూర్వయుగములలోను నేడును భూగోళముపై వానిస్థావరములు, వ్యాప్తి, మానవునికి వానిప్రయోజనములు మొదలగునవి ఈ శాస్త్ర విషయములు. మొక్కయొక్క ప్రథమదశను డి అది ఘనపంగమగు వరకు ప్రతిదశయందును దాని అభివృద్ధి ఈ శాస్త్రమున పరిశీలింపబడును. సూక్ష్మదర్శని తో మాత్రమే చూడగలిగిన సూక్ష్మతి సూక్ష్మజీవి మొదలు ఎంతో పెద్దదైన వృక్షములవరకు భూమిపైగల సమస్త ఉద్భిజ్జములను గూర్చియు ఈ శాస్త్రము స్పష్టముగా తెలుపును.

సజీవముగానున్న మొక్కలకును పాషాణ రూపమున పొందు పరుపబడియున్న మొక్కలకును గల పరస్పర సంబంధము లేగాక జీవములకు వానిలో గల పరస్పర సంబంధమును గూడ ఈ శాస్త్రము తెలియజేయును.

మానవునితో బాటు భూమిపై పెరుగు మొక్కలు అనాదినుండియు మానవుని దృష్టి నాకర్షించినవి. క్రీ. పూ. సుమారు మూడవ శతాబ్దమున మొక్కల వర్ణనము థియోఫ్రేటస్ అను శాస్త్రజ్ఞునితో ప్రారంభమైనది. 18 వ శతాబ్దమున కార్ల్‌వాన్ లిన్నియస్ అను శాస్త్రజ్ఞుడు మొక్కల యొక్క కొన్ని లక్షణములను ఆధారముగా చేసికొని ఒక కృత్రిమ వర్గీకరణమునిచ్చెను. ఈ మధ్యకాలమున డయోస్కొరిడిస్, ఆటో బ్రన్‌ఫెల్స్, లియొనార్డ్ ఫుక్స్, హీరొనిమస్ బాక్, విలియంటర్నర్, ఆండ్రియాస్ సిజల్‌పినస్, జాన్‌రే, రాబర్ట్ మారిసన్, రివినస్, టూర్నిఫోర్ట్ మొదలగు శాస్త్రజ్ఞులు మొక్కల వర్గీకరణములను వేరువేరుగా తయారుచేసిరి. లిన్నియస్‌చేసిన వర్గీకరణ పద్ధతిని సర్ జేమ్సు ఎడ్వర్డుస్మిత్ అను ప్రొఫెసరు దృఢముగా బలపరచెను.

లిన్నియస్ వర్గీకరణము వెలుగడిన తరువాత ఆన్‌టోనీ లారెంట్ డిజుస్యూ అను ఫ్రెంచి శాస్త్రజ్ఞుడు మరియొక వర్గీకరణమును సహజ పద్ధతిపై (1778-1789) వెలువరించెను. అగస్టిన్ పైరమస్ డికండోల్ (1778-1841) అను నాతడు ప్రప్రథమమున ఈ సహజవర్గీకరణ పద్ధతిని బలపరచిన వారిలో నొకడు. తరువాత రాబర్ట్ బ్రౌన్ (1773-1858) అను బ్రిటిష్ వృక్షశాస్త్రజ్ఞుడు, జాన్ లిండ్లే, ఎండ్లిచర్ అను వారలు ఈ పద్ధతిని బలపరచిరి.

చార్లెస్ డార్విన్ 1859 లో "ఉపజాతుల ఉత్పత్తి" అను తన గ్రంథమును ప్రచురించుచు పరిణామసిద్ధాంతమును విశదీకరించిన తరువాత వృక్షశాస్త్రజ్ఞులకొక క్రొత్తదృక్పథమేర్పడినది. జీవముతోనున్న చెట్టు చేమల పరస్పర సంబంధము లను తెలుపుటయేగాక, అంతరించిపోయిన వృక్షజాతిలోని పర

స్పర సంబంధములను గూడ తెలుపు సహజవర్గీకరణము ఆట్లే వృక్షజాతి వంశపారంపర్యమును తెలుపు వంశవృక్ష మొకటియు అవసరమని వారు తలచిరి

చెట్టు చేమల అంతర్నిర్మాణము శరీర వ్యాపార నిర్వహణములను గూర్చిన పరిశీలనము అంతత్వరగ జరుగలేదు నెహెమియాగ్రూ మార్సెల్లో మాల్ఫిఘి అనువారు మొక్కల అంతర్నిర్మాణమును గూర్చి 1671 లో మొదటిసారిగా ప్రచురించిరి నూరు సంవత్సరములైన తరువాతగాని మరల ఈ విషయ పరిశీలనము జరుగలేదు తరువాత ఎందరో ప్రముఖ శాస్త్రజ్ఞులు వారి పరిశోధనలతో ఈ వృక్షశాస్త్ర శాఖలను అభివృద్ధిచేసిరి తరువాత గ్రేట్‌బ్రిటన్ ఫ్రాన్సు జర్మనీ అమెరికా దేశములలో అనేక శాస్త్రజ్ఞుల కృషివలన మొక్కల జీవకణ సంఘాతులు వాని నిర్మాణములను దెలుపు విజ్ఞానము ఎంతయో అభివృద్ధిచెందినది

మొక్కలలో జరుగు ఫలదీకరణము చాలకాలము క్రిందటనే మానవుని దృష్టి నాకర్షించినది బాబిలోనియనులు, ఈజిప్షియనులు ఫొనీషియనులు మొదలగువారికి మొక్కలలో కూడ లింగభేదములున్నవని పూర్వమే తెలియును 1676 లో నెహెమియాగ్రూ పుష్పములోనుండు పుంకేసరములను అండకోశము చేయు పనులను ప్రథమమున వర్ణించెను తరువాత లిన్నియస్ పుష్పసహితములనియు, పుష్పరహితములనియు లైంగిక లింగరహిత పునరుత్పత్తి విధానము ననుసరించి మొక్కలను విభజించెను అతని అనుయాయులు కేవలము వర్ణనమును వర్గీకరణమునే దృష్టియందుంచుకొనుటచే శరీర వ్యాపార నిర్వహణ విషయకమగు పరిశీలనము వెనుకబడినది 1782 లో జోహాన్ హెడ్విగ్ అను శాస్త్రవేత్త పుష్పరహితమగు ఉద్భిజ్జములలో పునరుత్పాదకావయవములను గూర్చి ప్రచురించెను అతరువాత వారి విషయమై మరికొంత విజ్ఞానమును సేకరించిరి ఈ ముఖ్యమైన అన్వేషణ ద్వారా పిండోత్పత్తి శాస్త్రమునకు ( embryology ) పునాదివేయబడినది తరువాత స్పష్టీకరింపబడిన జీవకణశాస్త్ర వివరములతో ఆ శాస్త్రమునకు ష్లీడెన్ ష్వాన్ మోల్ అనువారు మరికొంత బలముచేకూర్చిరి క్రమముగా పుష్పహిత పుష్పరహిత ఉద్భిజ్జములు రెండింటిలో కూడ జరుగు ఫలదీకరణము పిండోత్పత్తి దానివృద్ధి స్పష్టముగా తెలిసినది మొక్కలలో ఫలదీకరణము జరుగుటకు ముందు పరాగసంపర్కము అవశ్యకమని తెలిసికొనుటయేగాక అదిజరుగు విధానములుకూడ తరువాత స్పష్టమైనవి

మొక్కలు తమ శరీర వ్యాపారములను నిర్వహించు విధానమునుగూర్చి కృషిచేసిన మొదటివారిలో స్టీఫెన్ హేల్స్ అను వాతడు (1727) ఒకడు క్రమముగా రసాయన శాస్త్ర జ్ఞానము అభివృద్ధియైన కొలది మొక్కలలో జరుగుకర్బన సమీకరణమునకు శ్వసనక్రియకు నడుమగల భేదములు తెలిసినవి అట్లే మొక్కల అవయవములలో జరుగు చలన విన్యాసము లను గూర్చి జాన్ రే (1693) పరిశీలించెను తరువాత లిన్నియస్ ఆండ్రూనైట్ డుట్రొషెట్ వాన్ మోల్ జూలియస్ సాల్స్ మొదలగువారు చేసిన పరిశోధనలతో మొక్కల శరీర వ్యాపార శాస్త్రజ్ఞానము వృద్ధియై వృక్షశాస్త్రమునకది యొక ముఖ్యాంగమైనది. మొక్కల రూపమును (వివిధావయవములు వాని స్వరూపము) అభివృద్ధిని తెలియజేయు శాఖ అవయవ శాస్త్రము లేక రూపవర్ణన శాస్త్రము ( Morphology ) అని వ్యవహరింపబడెను ఈ శాస్త్రాభివృద్ధికి గోబెల్ స్ట్రాస్‌బర్గర్ డిబారీ ఎఫ్ ఓ బవర్ మొదలగువారు చాలతోడ్పడిరి తరువాత కణశాస్త్రము (cytology) అను మరియొక శాఖ కూడ ఏర్పడినది

భౌగోళిక వృక్షశాస్త్రశాఖ వాన్ హంబోల్టు కాలము నుండి వేగముగా అభివృద్ధియైనది భూగోళమందన్ని ప్రదేశములకు శాస్త్రజ్ఞులు ఒంటరిగను అనేక సంఘములుగను పోయి, వివిధ ఖండములలోను ద్వీపములలోనుగల వృక్షజాతిని పరిశీలించి ఎంతయో విజ్ఞానమును సేకరించిరి వారిలో ఛార్లెస్ డార్విన్ జె డి హుకర్ ఏ ఆర్ వాలెస్ హెచ్ బి గప్పీ మొదలగువారు ముఖ్యులు శీతోష్ణాదిస్థితులకును మొక్కలకునుగల సంబంధమును వారు పరిశీలించిరి తరువాత ఈ మాదిరి విజ్ఞానమును పురస్కరించుకొని జీవ్యావరణ సంబంధ శాస్త్రము Ecology, మొక్కల పరస్పర సంబంధములను వాటి బాహ్యపరిస్థితులతో సంబంధములను గూర్చి క్రమపరిశోధనముచేయు శాఖ) బయలుదేరినది

భూగర్భశాస్త్రజ్ఞులు వృక్షశాస్త్రజ్ఞులు కలిసిచేసినకృషి ఫలితముగా శిలాపరూవృక్షశాస్త్రము అను మరియొక శాఖకూడ వృద్ధిచెందినది. ఒక ప్రదేశమందలి చెట్టుచేమల నైఖరినిబట్టి, వివిధ యుగములలో శీతోష్ణస్థితులెట్లున్నవో తెలుపు భూచరిత్ర యేర్పడినది బ్రాంగ్నియర్టు గోపెర్టు స్కింపరు అనువారు

ఈ శాఖాభివృద్ధికి కాలపురుషులు విలియమ్ న్ స్మిట్ మొదలగు వారనేకులు చేసిన పరిశోధనలద్వారా ఈ శాస్త్రజ్ఞానము మిగుల అభివృద్ధిచెందినది.

మొక్కలకు వివిధ శిలీంధ్రములవలన కలుగు రోగములు తెల్పు గాని విశదముగ చేసిన డి బారీ గనలు ఆంటన్ డిబారీ అను శాస్త్రజ్ఞుని కృషిమూలమున ఉద్భిజ్జ రోగలక్షణ శాస్త్రము అను నొక శాఖగా పరిణామము చెందినది. ఫ్రాంక్ మార్షల్ వార్డ్ ఈ యభివృద్ధికి తోడ్పడిన వారిలో కొందరు. వ్యవసాయమునకు ఈ శాస్త్రజ్ఞానము మిగుల నావశ్యకమైనది.

ఉద్భిజ్జముల వివిధలక్షణములు పరస్పరమైన పోలికలు అనువంశికముగా సంక్రమించువిధానము అనునవి కలిసి మరియొక ముఖ్యమగుశాఖగా ఏర్పడినది. ఈ శాఖ శాస్త్రవిజ్ఞానాభివృద్ధికేగాక ముఖ్యమైన రకముల మొక్కల నుత్పత్తి చేయుటకు ఆర్థికముగా చాల ఆవశ్యకమైనది. జన్యుశాస్త్రము (Genetics) అనబడు ఈ శాఖ గ్రెగర్ మెండెల్ చేసిన పునాది పరిశోధనలతో ప్రారంభమై దినదినాభివృద్ధి చెందుచున్నది. వృక్షశాస్త్ర విజ్ఞానమందలి ఈ శాఖలన్నియు ప్రపంచమందలి ప్రతిదేశమునగల శాస్త్రజ్ఞుల నిరంతరకృషితో మౌలికముగను ప్రయోజన పూర్వకముగను అభివృద్ధి చెందుచునే యున్నవి.

వృక్షశాస్త్ర విజ్ఞానములో వర్తమాన కాలమున ఈ క్రింది ముఖ్యశాఖలు గలవు -

ఆకృతిశాస్త్రము (Morphology) ఇది వృక్షజాతిలో గల సంవృతబీజవంతములు (Augiosperms) వివృతబీజవంతములు (gymnosperms) టెరిడోఫైటములు (pteridophytes) బ్రయోఫైటులు (Bryophytes) శైవలములు (Algae) ప్రోటోఫైటములు (protophyta) కవాపత్రములు (Lichens) శిలీంధ్రములు (Fungi) సూక్ష్మజీవులు (Bacteria) అను ఉపభాగములకు చెందిన ఉద్భిదముల వివిధావయవముల స్వరూపము వృద్ధి కాండము పత్రములు వేళ్లు పుష్పములు పండ్లు మొదలగు ముఖ్యావయవములను గూర్చి తెలియజేయును.

శరీరావయవ విమర్శన శాస్త్రము (Anatomy): ఇది మొక్కల అంతర్నిర్మాణమును గూర్చి వివరించి విశ్లేషించును.

జీవకణ శాస్త్రము (Cytology) ఇది జీవకణ నిర్మాణము జీవకణము యొక్క ద్రవ్యము జీవకణ కేంద్రము మొదలగు వానిని గూర్చి తెలుపును.

శరీర ధర్మశాస్త్రము (physiology) ఇది మొక్కల వివిధావయవములు నిర్వర్తించు పనులను తెలియజేయును.

ఉద్భిద వర్గీకరణ శాస్త్రము (Systematic Botany) ఇది ఉద్భిజ్జముల సంబంధములతో బాటు వాని స్థానమును వర్గీకరణమును గూర్చి తెలియజేయును.

భూగోళిక వృక్ష శాస్త్రము ఇది భూగోళముపై వివిధ ఉద్భిదముల విస్తరణమును గూర్చి తెలియజేయును.

పురోద్భిద శాస్త్రము (Palaeobotany) ఇది భూమియందు వేరు వేరు పొరలలో నుండు శిలారూప ఉద్భిదముల చరిత్ర.

జీవావరణ సంబంధ శాస్త్రము (Ecology) ఇది బాహ్య పరిస్థితులతోను మొక్కల సంబంధమును వాటి గల పరస్పర సంబంధములను గూర్చి తెలియజేయును.

ఉద్భిదరోగ శాస్త్రము (plant pathology or phyto pathology) మొక్కలకు వచ్చు రోగములనుగూర్చి తెలియజేయును.

జన్యుశాస్త్రము (Genetics) ఇది ఆర్థికోపయోగములకై ఉద్భిజ్జ రకముల నుత్పత్తిచేయుట (plant breeding) తో సహా అనువంశికమును (Heredity) దాని వివరములను తెలియజేయును.

వృక్షశాస్త్రములో పైన చెప్పబడిన శాఖలేగాక దాని యందలి విజ్ఞానము ప్రయోజనకరముగ ఉపయోగపడుచున్న శాఖలలో అడవి శాస్త్రము వ్యవసాయము ఉద్యానకృషి ఓషధులు ముఖ్యమైనవి.

బి. వి. ర.

## వృత్తిదేశికత (Vocational Guidance)

తెలివితేటలతో ఒకపదార్థమునుగాని ఒక అంశమును గాని కోరుకొనుటయందును పరిస్థితికి అనుగుణముగ సర్దుబాట్లు చేసికొనుటయందును వ్యక్తులకు అయ్యెడు సహాయము దేశికత (Guidance) యనబడును. ఇట్టి సహాయము మొదలగు విధానము ప్రజాతంత్రవ్యవస్థయున్న సమాజములలో విశేషముగ వాడుకయందున్నది. అవ్యక్తసామర్థ్యములతో తోడ్పాటు కల్పించుకొనునట్టి విధముగ ప్రతివ్యక్తియు తన అభిరుచిన

మార్గమును అనుసరించు హక్కు. అట్టి ప్రజాస్వామిక వ్యవస్థ యందు చలాయింప వీలగుటయే ఇందుకు కారణము ఇట్లు నిరాటంకముగ ఎన్నుకొనుశక్తి ప్రజాతంత్ర సమాజమునందు ప్రతివ్యక్తియు అలవరచుకొని బలపరచుకొనవలెను ఇట్లు సహాయము పొందుటవలన అతడు క్రమముగా స్వతంత్రముగనే ఇతరుల ప్రమేయములేకుండ ఏదేని ఒకసందర్భమున నిర్ణయములను తీసికొనుటకు శక్తి గలవాడగును

ఆరంభములో వ్యక్తులు పొందు ఇట్టి సహాయము వివిధ వ్యక్తులకు సంబంధించిన సమస్యలపై కేంద్రీకరింపబడినది - అనగా యువతీ యువకులకు ఉద్యోగములను సేకరించిపెట్టుట మీదనే కేంద్రీకృతమైనది దీనికితోడుగా వ్యక్తుల శక్తి సామర్థ్యములకును, అవసరములకును తగినరీతిగా వివేకవంతమైన ఎన్నికను చేసికొనుటయందే విశేషమైన సావధానత చూపబడినది దీనికొక కారణమున్నది హైస్కూళ్ళ నుండియు కాలేజీల నుండియు ఉత్తీర్ణులగు యువతీ యువకులకు ఉద్యోగాన్వేషణ చేసికొనుటయే ప్రధానమైన జటిల సమస్యగా పరిణమించినది ఈ విధముగా వృత్తిదేశికతోద్యమము అభివృద్ధియై దీనికి సంబంధించిన ముఖ్యాంశములు ప్రజాసమ్మతములైనవి ఈ ఉద్యమము వివిధ తరగతులకు చెందినవ్యక్తులు తమశక్తిసామర్థ్యములను తమ అర్హతలను, తమ అభిరుచులనుబట్టి ఉద్యోగములను సంపాదించుకొని జీవిత పథములోనికి అడుగుపెట్టుటకు సహాయపడినది

ఈ ఉద్యమము వ్యాప్తి పొందినకొలదియు విద్యా విధానక్రమాభ్యున్నతికి వ్యక్తి ఒక కేంద్రముగ పరిగణింపబడి, అతని సంక్షేమముపై అధికతరమైన ప్రాముఖ్యత చూపబడ నారంభించినది ఈ సంఘటనతో వృత్తిదేశికతయొక్క అవకాశము వృద్ధియైనది ప్రస్తుతకాలమున ఈ దేశికత కేవలము ఉద్యోగ సముపార్జనవిషయమనే కాక అతని యెదుర్కొను సకల సమస్యల పరిష్కారమునకు గూడ ఉపయోగపడుచున్నది అట్లయ్యును ఉద్యోగప్రాప్తికై చేసికొను నిర్ణయములు చెక్కురు యువకులకు నేడు ప్రధానమైన ఏకైక సమస్యగా పరిణమించినది సంతృప్తికరమును జయప్రదమునైన వారి జీవితవిధానము వారెన్నుకొను ఉద్యోగములపైనను, అందు వారు సాధించు విజయముపైనను ఆధారపడి యుండును

వృత్తిదేశికత యొక్క లక్ష్యము క్రింది దిగువవివరింప బడినవి -

(1) విద్యార్థుల అభిమతమునుబట్టి వారు ఎన్నుకొను ఉద్యోగములయందు నిర్వహింపబడవలసిన విధులను గురించియు వారి హక్కులను గురించియు అందలి కీలకసమస్యలను గురించియు వారికి పరిచయ మగునట్లు సహాయ మందించుట

(2) వారు నిర్వహింపవలసిన విధులకవసరమైన సాధారణ శక్తియుక్తులను గూర్చియు నైపుణ్యమును గూర్చియు ముందుగా విద్యార్థులు తెలిసికొనునట్లు వారికి సహాయపడుట ఆయావృత్తుల కవసరమగు అర్హతలనుగూర్చి కూడ ముందుగా విద్యార్థులచే సమాచారము సేకరింపజేయుట

(3) అభిలషించిన ఉద్యోగములను నిర్వహించుట కవసరమగు అనుభవమును గడించుటకై సహాయపడుట

(4) (అ) ఆ యుద్యోగము మూలమున యువకులు సమాజమునకు చేయగల సేవను వారిచే గుర్తింపజేయుట

(ఆ) వృత్తిమూలమున వారు పొందగల ఆత్మసంతృప్తి

(ఇ) వారి పనియందుగల అభిరుచి

(5) తుదినిర్ణయము గావించుకొనుటకు పూర్వము వారవలంబించు వృత్తిని గూర్చిన ఖోగట్టాను విశ్లేషణ మొనర్పగల సాంకేతిక ప్రజ్ఞను సంపాదించుట

(6) ఆర్థికముగ వెనుకబడియున్న పిల్లలకు స్కాలర్షిప్పులుగాని అట్టి ధనసహాయముగాని సమకూర్చి వారి విద్యాభివృద్ధికి ఇతోధికముగ అవకాశములు కలిగించుట

(7) వృత్తి విద్యాశిక్షణమునకై వివిధ విద్యాసంస్థలు కల్పించు సౌకర్యముల గూర్చి సమగ్రమైన పరిజ్ఞానమును సంపాదించుటకై విద్యార్థులకు సహాయపడుట

(8) యువకులు ప్రవేశించు ఎట్టి వృత్తియందైనను తమ మనస్సును లీనమొనర్చుకొని దానికి కట్టుబడి యుండునట్లువారికి సహాయముచేయుట

(9) విద్యార్థులు కష్టపడి విద్యార్జన మొనర్చి తమ అర్హతలద్వారా దీర్ఘకాలిక ఉద్యోగములను పొందజాలక, చిట్కామార్గముల ద్వారా తాత్కాలిక ప్రయోజనములను మాత్రమే ఆశించు విధానమునుండి వారిని నిరుత్సాహపరచుట

యువకులు వారివారి భవిష్యత్తును తీర్చిదిద్దుకొనుటకై

వివిధమార్గముల ద్వారా వారికి సహాయము అందించబడుచున్నది. బహుముఖములైన ఇట్టి సహాయక్రియలు తరచుగా చిక్కులతో కూడుకొనియున్నది. విద్యార్థుల కుటుంబ సంప్రదాయము, కుటుంబపెద్దల వంశపారంపర్యమైన వృత్తి, వృత్తి ఎన్నికను ప్రోత్సహించు మతసంబంధమైన విషయములు మున్నగునవి ఈ చిక్కులలో ముఖ్యములైనవి. యువకులు తమ వృత్తులను ఎన్నుకొనుటయందు సాధారణముగా పొరపడుచుందురు. వీరు వారవలంబింపబోవు వృత్తుల యందుండెడి సాధకబాధకములను పరిశీలింపక పోవుటయు, తమ అర్హతలకును శక్తి యుక్తులకును ఆ వృత్తులు అనుగుణముగ నుండునాయని ముందుగా ఆలోచింపకుండుటయు ఇందుకు కారణములు. అట్టి సందర్భములందు వారు ఉద్యోగములకు అనర్హులై ఒకవృత్తి నుండి మరియొక వృత్తికి కప్పదాట్లు వేయుదురు.

ఇట్టి అవాంఛనీయ పరిస్థితినుండి తప్పుకొనుటకైయే వృత్తి ఎన్నికలో యువకులకు సహాయమెల్లపుడును అందజేయవలెను. వారెల్లవేళల తమ అర్హతలకు తగిన వృత్తులనే వరించునట్లు తర్ఫీదుపొందవలెను.

మానవజీవితమునందలి వివిధరంగములందువలెనే వృత్తియొన్నికయందును చిక్కులుగలవు. ఇట్టి ఎన్నికయందు యువకులకు పరిపూర్ణమైన స్వాతంత్ర్య మియ్యబడుచున్న అమెరికా వంటి దేశములలో కూడా చిక్కులు లేకపోలేదు. ఉన్నత అంతస్తుకు చెందిన ధనవంతుల బిడ్డలను గూడ ఇట్టి చిక్కు లెదుర్కొనుచున్నవి.

యువకుల వృత్తి ఎన్నికయందు గావింపబడుసహాయము తొందరపాటుతో కూడినది కాకూడదు. అది ఒకక్రమవిధానము ననుసరించి పెక్కుసంవత్సరములమీద జరుగవలసియున్న కార్యక్రమము. పైనచెప్పినట్లు యువకుల ప్రత్యేకశక్తి సామర్థ్యములు, శ్రద్ధానక్తులు, ఆశలు, ఆశయములు దీర్ఘకాలము నకుగాని పరిణతిచెంది వారాశించిన వృత్తులకు అర్హత సంపాదింపజాలరుకదా! చిక్కునసమస్యలతోకూడిన ఒకానొకసంకట స్థితియందు యువకులకు వృత్తి ఎన్నికలో చేయబడు సహాయము ఎక్కువ విలువగలదై యుండును. అట్టి సమయము ఘటిల్లుట సంభావ్యమని ముందుగా ఊహించి యువకులకు దాని నెదుర్కొనుటకనువైన సహాయమును ముందునుండియే అందించుచు, వారిని తర్ఫీదుచేయవలెను. ఈ కారణముచే ఇది యొక దీర్ఘకాలికమైన క్రమానుగతమైన అభివృద్ధి కార్యక్రమముగ ఎంచవలెనుగాని తాత్కాలికోద్రేకముతో కూడిన అనాలోచిత కార్యముగ భావింపరాదు.

పై విషయములనుబట్టి విద్యార్థుల తల్లిదండ్రులు సలహాదారులు ఉపాధ్యాయులు సహాధ్యాయులు కలిసి విద్యార్థులెన్నుకొను వృత్తుల కవసరమైన అర్హతలను సమగ్రముగా చర్చించి వివేకవంతమైన నిర్ణయములను తీసికొనినచో అట్టి నిర్ణయములు దీర్ఘకాలిక ఫలితముల నొసగగలవు.

ఈ బృహత్కార్యక్రమము ఫలించుటకై కొన్నిసిద్ధాంతములు ప్రతిపాదింపబడి ఆచరణములో పెట్టబడినవి. కొందరు సిద్ధాంతవేత్తలు యువకుల ఆర్థికస్థితిని అనుసరించి అనగా బాహ్యపరిస్థితుల ననుసరించి వారివృత్తి ఎన్నిక నిశ్చయింపబడవలెనని వాదించుచున్నారు. కాగా వారివారి సాంఘిక - ఆర్థిక అంతస్తులనుబట్టియే విశేషముగా వారి వృత్తి ఎన్నిక నిర్ణయమగునని మరికొందరు వక్కాణించుచున్నారు. ఇక మూడవ తరగతికి చెందిన సిద్ధాంతవేత్తలు, వృత్తి ఎన్నిక యనునది యువకుల సమగ్రమైన చిత్తవృత్తిలో ప్రవర్తనములో ఒక భాగమునకు సంబంధించినది మాత్రమే అనియు అందుచే ఈ సమస్యకు సంపూర్ణ వివరణము అవసరమనియు చెప్పుచున్నారు. అనగా ఇది వ్యక్తియొక్క మూర్తిమత్త్వము అను విశాలమైన సిద్ధాంతమునకు సంబంధించిన సమస్యగా తోచుచున్నది. ఇట్లు ప్రతిపాదించిన సిద్ధాంతవేత్తలలో ఆనీరో డోనాల్డుసూపర్ అనువారు ప్రముఖులు.

ఆనీరో అనువామె వివిధవర్గములకు చెందిన ప్రజల ప్రయోజనములను గూర్చియు వారివారి వృత్తులయొక్క అంతస్తులను గూర్చియు అధ్యయనము గావించెను. ఈ అధ్యయనము విద్యార్థుల ప్రయోజనములతో వృత్తులలోనున్న వారి ప్రయోజనములను పోల్చి, విద్యార్థుల కనువగు వృత్తి విద్యను ఎన్నుకొనుటకు సహాయపడగలదు. వృత్తుల వర్గీకరణమును గూర్చిన ప్రణాళికయు వృత్తుల ఎన్నికను గూర్చి ఒక వివరణమును ఆమె ప్రతిపాదించెను. వృత్తులు ఎనిమిది తరగతులుగా విభజింపబడినవి. (1) ఉపకారము (2) వ్యాపారము (3) సంఘనిర్మాణము (4) సాంకేతికసంస్థలు (5) కళలు-వినోదములు మున్నగునవి; ఇవి మరల కొన్ని ఉపవర్గములుగా విభాజ్యమైనవి. ఈ వృత్తులలో పనిచేయువారందరు ఆయాసంస్థలలో సేవచేయువారైనను, వారుపొందవలసిన

శిక్షణము పరస్పర భిన్నముగనుండి వారి శక్తియుక్తులలోను తదితర విషయములలోను విశేషముగ వ్యత్యాసము కన్పట్టుచుండును పైన పేర్కొనబడిన తరగతులలో పంచేయు వేర్వేరు శ్రామికుల గుణగణములను మరియు వృత్తులను ప్రయోజనములను గూర్చి గూడ ఆమె చర్చించెను

డొనాల్డు సూపర్ ప్రతిపాదించిన సిద్ధాంతము మానవుని శ్రామిక జీవితములో సంభవించు వివిధ సంఘటనములను అతని వృత్తి సంబంధించిన నడవడిని చర్చించును అతని సిద్ధాంతమును బట్టి ప్రతివ్యక్తియు వివిధములైన పెక్కు వృత్తులకు అర్హుడై యుండుననియు అతని వృత్తి ఎన్నిక అతని తల్లిదండ్రులయొక్క ఆర్థిక - సాంఘిక అంతస్తును బట్టియు మానసిక శక్తిని బట్టియు వ్యక్తిగతమైన ప్రత్యేక సహజలక్షణములను బట్టియు అతనికి లభించు అవకాశములను బట్టియు నిర్ణయమగుచుండుననియు తెలియుచున్నది ఈ పరిస్థితులు వివిధవ్యక్తులలో, వివిధవర్గములలో వివిధములుగ నుండును అందుచేత వారెన్నుకొను వృత్తులుగూడ వివిధములై యుండును

పై అంశముల కనుగుణముగా వృత్తి ఎన్నికయందు వ్యక్తియొక్క మానసికమైన విశిష్టలక్షణములను - అనగా బుద్ధికుశలత అసక్తి మొదలగువాటిని శారీరకలక్షణములను - అనగా ఆరోగ్యము ఎత్తు బరువు మొదలగువాటిని విద్యార్హత శిక్షణ అనుభవము మొదలగువాటిని ఉచితమైన నిర్ణయాంశములుగా సూపర్ పరిగణించెను ఈ లక్షణములను ఆ వ్యక్తియొక్క కుటుంబపరిస్థితులకు అన్వయింపజేసి ఆ వ్యక్తి ఎట్టి వృత్తికి సరిపడునో నిర్ణయింపవలెనని సూపర్ అభిప్రాయమును సూచించెను కారణమేమన, అతనికిగల పై లక్షణములు స్త్రీ అతని కుటుంబపరిస్థితి - ఇవన్నియు మొత్తముగా కలిసి అతని వ్యక్తిత్వమును నిర్ణయించును

ఒకానొకపనియందు ఒక యువకుడు గడించుపూర్వానుభవముకూడ అతని వృత్తి ఎన్నికయందు అమూల్యమైన అంశముగా ఉపకరించగలదు ఒక ప్రాకెక్టుయందు కాని ఒకవిద్యాసంస్థయందు కాని ఒక కార్ఖానాయందు కాని ఒక కార్యాలయము నందుగాని అతడు అపపూర్వోద్యోగిగ నుండి గడించిన అనుభవము గూడ సంపూర్ణోద్యోగమున తనశాశ్వతవృత్తిని ఎన్నుకొనుటలో అమోఘముగా ఉపకరించగలదు ఇందుమూలముగా అతని శక్తిసామర్థ్యములు పరి నైపుణ్యము ఇనుమడించి సుఖమయమైన సంఘజీవనమునకు అతడు దోహదమొనరగగలడు

పైజెప్పిన అవకాశములు ఇతోధికముగ అమెరికా యందలి పైస్కూలు విద్యార్థులకును కాలేజీ విద్యార్థులకును కల్పింపబడుచున్నవి ఈ అవకాశములను ఆధారముగ తీసికొని అచ్చటి విద్యార్థులు తమ విద్యార్హతలను నైపుణ్యమును పెంపొందించుకొని వాటి కనుగుణమైన వృత్తులను ఎన్నుకొనగల్గుచు వాటియందు అభ్యుదయమును సాధించుచు సమాజమునకు సేవచేయగల్గుచున్నారు

శ్రీ శ్రీ

## వెంకటమఖి

సంగీత సంప్రదాయములనుద్ధరించుచు సంగీతశాస్త్రమునకు ఉత్తమస్థాయిని కల్పించిన రాజులలో తంజావూరు నాయకరాజులు గణనీయులు వీరిలో రఘునాథ భూపాలుని పేరు సంగీతలోకమునకు సుపరిచితము రాజుల యభిరుచుల నెరిగి వారికి గల కళాకౌశలమును పెంపొందించుటయే ఆనాటి పండితుల ప్రధాన లక్ష్యమై యుండెడిది ఈ విషయమై రాజుల యొక్క పండితుల యొక్క అవినాభావసంబంధమువలననే ఆనాడు తెలుగు దేశమునందేమూల జూచినను సకల శాస్త్రములు చతుష్షష్టి కళలు పరిపూర్ణముగా సేవ్యబడియుండినవి

తంజావూరు రాజ్యమును క్రీ శ 1577–1614 మధ్యకాలమున అచ్యుతప్ప నాయకుడు పరిపాలించినాడు అతని కుమారుడగు రఘునాథ భూపాలుని వద్ద ముఖ్యమంత్రిగా నుండిన గోవింద దీక్షితులకును ఆయన భార్య నాగమాంబకును జనించిన ఇరువురు పుత్రులలో వెంకటమఖి రెండవ వాడు పెద్దవాడు యజ్ఞనారాయణ దీక్షితులు వెంకటమఖి అసలు పేరు వెంకటేశ్వర దీక్షితులు ఇతడు యజ్ఞము చేయుట వలన మఖి అను సార్థక నామము వచ్చెను (మఖమనగా యజ్ఞము) ఇతడు క్రీ శ 1620 కాలము వాడు ఇతని తండ్రియైన గోవింద దీక్షితులు కూడ సంగీత సాహిత్యములలో గొప్ప పండితుడు "సంగీత సుధానిధి" అను లక్షణ గ్రంథమును వ్రాసిన వాడితడు

వెంకటమఖి మొదట అన్నయైన యజ్ఞనారాయణ దీక్షితుల వద్ద సంగీత మభ్యసించెను తదుపరి తానప్పాచార్యులు అను వాని వద్ద సంగీత లక్ష్య లక్షణములను పరి

పూర్ణముగా నేర్చుకొనెను. ఇతడు సంగీతమందే కాక సంస్కృతమందు కూడ మహాపండితుడు. తండ్రిని మించిన పుత్రుడు మహామేధావి. వీరు కర్ణాటక స్మార్త బ్రాహ్మణులు. వశిష్ఠగోత్రులు ఆశ్వలాయన సూత్రులు. వీరికి ఆర్ష సంప్రదాయము, సంగీత వ్యాసంగము అనువంశికములే.

వెంకటమఖి విజయరాఘవ నాయకుని ఆస్థాన విద్వాంసుడు. ఇతడు తన గురుదేవుడైన తానప్పాచార్యులను సంస్తుతించుచు ఆరభిరాగములో "గంధర్వ జనతా ఖర్వ దుర్వార గర్వభంజనురే" అను గీతమును త్రిఖండముగా రచించి గురువునకు, తండ్రికి, అన్నకు వినిపించి వారి మెప్పును పొందెను. ప్రభువగు విజయరాఘవ నాయకుని కోరికపై ఇతడు 1660 సంవత్సరములో చతుర్దండి ప్రకాశిక అను గొప్ప సంగీత లక్షణ గ్రంథమును రచించెను. ఇందు వీణ, శృతి, స్వర, మేళ, రాగ, ఆలాప, ఠాయ, గీత, ప్రబంధ, తాళ అను పది ప్రకరణములు గలవు. అందు తాళప్రకరణము మాత్రము ఇంతవరకు లభించుటలేదు.

ఈ గ్రంథమందు రాగాంగ, ఉపాంగ, భాషాంగ రాగ లక్షణ శ్లోకములను వాటికి ఉదాహరణములుగా లక్షణ గీతములను కూడ ఆతడు రచించెను. వెంకటమఖి రచించిన రాగ లక్షణ గీతములన్నియు ఎట్టయాపురసంస్థాన విద్వాంసుడైన సుబ్బరామ దీక్షితులచే రచింపబడిన సంగీత సంప్రదాయ ప్రదర్శిని అను గ్రంథమందు గలవు. వెంకటమఖికి పూర్వము రాగ విభాగమందు మేళకర్తరాగములు 15 నుండి 20 వరకు ఉండెడివి. స్థాయియందు గల 12 స్వరస్థానములను 16 వరకు పెంచి మేళకర్తరాగములను డెబ్బదిరెండుగా ఆతడు సృష్టించెను. ఈ డెబ్బదిరెండు మేళకర్తలను తానే సృష్టించినట్లు తన గ్రంథమందు స్పష్టముగా చెప్పినాడు. అయితే ఈ డెబ్బదిరెండు రాగములకును భేదములున్నవి.

వెంకటమఖి పెట్టిన నామములు — ప్రస్తుతమందున్న నామములు

| | | | |
|---|---|---|---|
| (1) | కనకాంబరి | — | కనకాంగి |
| (2) | ఫేనద్యుతి | — | రత్నాంగి |
| (3) | గానసామవరాళి | — | గాన మూర్తి |
| (4) | భానుమతి | — | వనస్పతి |
| (5) | మనోరంజని | — | మానవతి |
| (6) | తను కీర్తి | — | తాన రూపి |

ఇతని కాలమునుండియే కర్ణాటక సంగీతమునకు విశిష్టత ఏర్పడినదని చెప్పుదురు. రాగ విభాగములో డెబ్బదిరెండు మేళకర్తలను సృష్టించి కర్ణాటక సంగీతమునకు ప్రపంచ సంగీత చరిత్రలో అత్యున్నత స్థానమును కల్పించిన మహామనీషి ఇతడు. కర్ణాటక సంగీత త్రిమూర్తులలో నొకరగు ముద్దుస్వామి దీక్షితులు వీరి వంశీయులే. దీక్షితుల కృతులన్నియు వెంకటమఖి సృష్టించిన సంగీత సంప్రదాయముననుసరించియే యున్నవి.

వెంకటమఖి తిరువారూరులో వెలసిన త్యాగరాజేశ్వరుని స్తోత్రము చేయుచు 24 అష్టపదులను వ్రాసెను. వెంకటమఖి గొప్ప మహిమగలవాడని చెప్పుదురు. ఇతని ప్రభువునకు కల్గిన ఉదరశూలవంటి వ్యాధిని రీతిగౌళ రాగములో గీతమును పాడి పోగొట్టెనట! ఒకప్పుడితడు "మాళవగౌళ" రాగములో గీతమును పాడి చోర బాధనుగూడ పోగొట్టెనని జన వాక్యముకలదు.

కర్ణాటక సంగీతమందు ముద్దుస్వామి దీక్షితుల కృతిననుసరించు సంగీత సంప్రదాయమును బట్టి వెంకటమఖి ఎంతటి మహాపండితుడో ఊహించవచ్చును.

పే. సు.

## వెంకటరత్నం నాయుడు, రఘుపతి

పరమాత్మను ఆత్మయందు దర్శింపగల్గిన ధీరులలో శ్రీ రఘుపతి వెంకటరత్నం నాయుడొకడు. ఆ రత్నమును గన్న ఆంధ్రమాత ధన్యురాలు. ఆ పుణ్యపురుషునకే నాడో శిష్యులమై యుండుట మావంటి వారి అదృష్టము. శిష్యగణముల నడవడిని చక్కబరచి వారిలో ఈశ్వర విశ్వాసమును, సేవానురక్తిని రగిల్చి పంపుటయే అతడు పెట్టుకొన్న ధ్యేయము. అందుచే ఆయనవద్దనుండి ఆట్టి జీవితభిక్షను పొందిన అంతేవాసుల అనుభవములే ఆయన జీవిత చరిత్ర యనదగును.

1862 వ సం॥ మహార్నవమి నాడు మచిలీపట్టణమునందలి యొక సైనిక కుటుంబమునందు వెంకటరత్నము జన్మించెను. తండ్రి సుబేదారు అప్పయ్య నాయుడు; ఇతడు ఉత్తర భారతమున ఒక సైనికోద్యోగి. తల్లి శేషమ్మ యను నామె. సంయుక్తరాష్ట్రములోని బందా' గ్రామ పాఠశాలలో వెంకటరత్నము ప్రాథమిక విద్యనేర్చెను. తండ్రి పూర్వాచార వైష్ణవ భక్తుడు. బిడ్డను కూడ అదే మార్గమున నడిపింపవలెనని కోరుకొన్నవాడు. కాని కుమారునిలో అది

వరకే స్వతంత్ర ధర్మజిజ్ఞాస ఉదయమై విద్యయొక్క ప్రయోజనమును పరమార్థమును చూపెట్టి నారంభించెను. పెద్దవాడై జీవితమును దేనికి అంకిత మొనర్చు కొనెనో దానికి వలయు యోగ్యతలన్నియు చిన్ననాటనే అతని యందు ప్రస్ఫుటముగ కన్పట్టెను. రాజా రామమోహనరాయలు సహగమన దురాచారమును మాన్పించెనని వెంకటరత్నము గ్రంథములలో చదివినాడు. ఆ మహాపురుషుని జీవిత విశేషములను తెలిసికొన వలెనను కోరిక జనించి ఆయన వెంటనే ఉపాధ్యాయు నడిగి రాయల చరిత్రమును ఆయన మత సాంఘిక సంస్కరణోద్యమ చరిత్రను మనసుకు పట్టించుకొన్నాడు. అప్రయత్నముగ అతనికి లభించిన దైవభక్తి అది ధీరాత్ముల జీవితసరళిలో మానక ప్రయత్నమును మించి ధర్మదేవత యొక్క సంకల్పశక్తిద్యోతకమగుచుండును అదియే వెంకటరత్నములో హృచ్చలనముకల్గించి జన్మసార్థకతకు దారి చూపినది. ఈ విధముగ ఆధునికాంధ్ర భూమి పై వెలసి సంఘమునకు పురోగతి చూపిన ధీమంతులు ధీరమతులు ఇద్దరు—వీరే శలింగమొకడు; వెంకటరత్నము మరియొకడు భయమెరుగని నైతిక బలముతో కర్మక్షేత్రమున మహామహీధరము వలె నిలిచి చెప్పరాని కష్టనిష్ఠురముల కోర్చి సంఘమున పేరుకొన్నకుళ్లును కడిగివేసిన వాడు వీరేశలింగం భక్తి శ్రద్ధలతో తన వద్దచేరిన చిన్నలలో పెద్దలలో ధర్మమును ధైర్యమును రగుల్కొల్పి శీలసంపద యేమా నవునకు బ్రతుకు తెరువని స్వీయ జీవితముద్వారా కనబరచినధీరుడు వెంకటరత్నము మన కాలములో దక్షిణ భారతమున అర్ధశతాబ్దము అమోఘముగ వెల్గిన ధ్రువతారలీ ఇద్దరును

వెంకటరత్నమునకు లేతవయస్సులోనే పారశీకము ఉర్దు అరబ్బీ భాషలతో పరిచయమేర్పడి క్రమముగా ఇస్లాము ధర్మశాస్త్ర గ్రంథముల పఠనమునకు చక్కని అవకాశమేర్పడినది తదుపరి హైదరాబాదు నైజాము పాఠశాల యందు అఘోరనాథ చటోపాధ్యాయుని గురుత్వమున తగినంతగా హిందూ ధర్మతత్త్వశోధయు పట్టుబడి వివిధ మత ధర్మముల వలన హిందూ సంఘమెట్లు ఎంత వగకు ప్రభావితమయ్యెనో ఈ చిన్నవానికి సుస్పష్టమయ్యెను చిరకాలానుగతముగ వివిధ మతస్థుల మధ్య ఏర్పడిన కఠినములగు కుటిల కుడ్యములు విచ్ఛిన్నములై, మత సమన్వయమును సమానత్వమును ఏర్పడిననేగాని సంఘమున శాంతి నెలకొనదనియు మతముల పేర్లు వేరైనను అన్నిటిలోని మూలతత్త్వమొకటే కనుక అదియే సర్వులకు శరణ్యమనియు ఈ కుశాగ్ర బుద్ధికి ధ్రువమయ్యెను దూరదృష్టితో రామమోహనుడు గావించిన సంస్కరణయు ఆదేయని గ్రహించి తత్సంబంధమైన దైవప్రార్థనా సమావేశముల కతడు పోనారంభించెను తండ్రి తనను కఠినముగ వారించినను చిన్నవాడయ్యు ఆత్మస్వాతంత్ర్యమును అంతర్వాణిని అతడు ఉపాస్య దేవతగా ఎన్నుకొనెను రామమోహనుని విశ్వజనీన ధర్మసూత్రము ఈ విద్యార్థి హృదయమును గాఢముగ ఆకర్షించి అతని జీవితమునొక నూతనమగు సుస్థిరమార్గమున పెట్టెను

చిత్రము - 79



పటము - 1

రఘుపతి

వెంకటరత్నంనాయుడు

తరువాత మద్రాసు క్రైస్తవ కళాశాలాధ్యక్షుడైన డాక్టరు మిల్లరుమహాశయుని అంతేవాసిగా ఈ విద్యార్థి కల్పిన హృదయ వైశాల్యమును జీవితసమస్యలను గూర్చిన ఉన్నత దృక్పథమును చివరవరకు అతని జీవితమునకు పెట్టినకోటయైనిలిచినది కాకినాడ కళాశాలలో మాకు పాఠములు చెప్పుచు సందర్భవశమున మై మాస్టర్ డాక్టర్ మిల్లర్ (నా గురుసత్తముడు డాక్టరు మిల్లరు) అని వినయ ముట్టిపడ వెంకటరత్నము చెప్పుకొనునప్పుడు మా హృదయము ఉప్పొంగి, ఈయనయే మాపాలిటి మిల్లరుగ భావించుకొనెడివారము

వెంకటరత్నము పట్టపరీక్షలో కృతార్థుడైన పిదప ది పీపుల్స్ ఫ్రెండ్, బ్రహ్మప్రకాశిక ది ఫెలోవర్కర్' అను మూడు పత్రికల విలేఖరిగ ఒక సంవత్సరము గడపెను ఆ తరువాత కొన్ని హైస్కూళ్లలోను ఎం ఏ లో కృతార్థుడై మద్రాసు పచ్చయప్ప ఇందరు నోబుల్ కళాశాలలలో ప్రొఫెసరుగను సికింద్రాబాదు మహబూబ్ కళాశాలలో ప్రధానాచార్యుడుగను తుదివిజయోత్సవ ఘట్టముగ 1905 మొదలు 1919 వరకు కాకినాడ కళాశాలాధ్యక్షుడుగను పనిచేసి, అధ్యాపక వృత్తి యొక్క పేరు ప్రతిష్ఠలను అమోఘముగ నిలిపినాడు ఇందరునందున్నప్పుడు అతడు ప్రారంభించిన

సంఘసంస్కరణోద్యమమును దాని యందాతనికి కల్గిన ఘన విజయమును మరపునకు రాని భోగము మేళముల దురాచారముపై ఆతడు సల్పిన పోరాటము సంఘమును మేల్కొల్పి దేశమునందొక ధర్మశక్తిని విజృంభింప జేసినది.

వెంకటరత్నము అధ్యాపకత్వమును ఉత్తమోత్తమమగు ఉద్యోగముగ ఎన్నుకొన్న వాడు. కాకినాడ కళాశాలాధ్యక్ష పీఠమున ఆయన జీవితకాలమంతయు చాలవరకు ఫలోన్ముఖమునకు వచ్చెను. ఆ యాశయమేమి? చిన్న వయసునందే తన్నాకర్షించి జీవనజ్యోతిగ వెలిగి బహుముఖముల కార్యరూపముదాల్చిన బ్రాహ్మ ధర్మానుష్ఠానమే అది. సచ్ఛీలుడగు పిఠాపురము మహారాజు ధనవ్యయముతో అనాథబాల బాలికల శరణాలయము బ్రాహ్మధర్మ సాహిత్య ప్రచురణము హరిజన బాలబాలికల వసతి గృహములు ఆంధ్రకేంద్ర బ్రహ్మోపాసనా మందిరస్థాపన-ఇత్యాది మరెన్నియో అతని ఆత్మ ప్రభకు ప్రతీకములై వెలసినవి. అన్నిటిని మించి కాకినాడ కళాశాలయే ఆయనకు ఉపాసనాలయమయ్యెననుట నిజము. కళాశాలకు తాను గౌరవము గడించెనను మాట సరికాదట! కళాశాలయే తనను తీర్చిదిద్దినదంటాడతడు! పెద్దతరగతులలో విద్యార్థినులనుచేర్చుకొన సంశయాత్ములైన కమిటీ సభ్యులు వ్యతిరేకించినను స్త్రీ విద్యను అవ్యాహతముగ అమలు జరిపిన ధీరుడు నాయకుడు. తనను కాకినాడకు కొనివచ్చి కర్తవ్యనిష్ఠను నేర్పి కృతార్థుని చేసినది భగవంతుని అపార కారుణ్యమే యనియు తత్ఫలితముగ తాను కోరుకొన్నది పొందినది జీవన మహాభాగ్యము తన విద్యార్థుల ప్రేమగౌరవములే యనియు ఒక సందర్భములో ఆయన చెప్పుకొన్న మాట.

"విజ్ఞానము శీలము-ఈ రెండు విషయములలో నా జీవితము యువకులకు అనుకరణీయమగునట్లు బ్రతుక వలెనని నా ఆశయము" అని ఆయన చెప్పుకొనెడి వాడు. తదనుగుణముగ ఈ మహాశయుడు ఎందరి జీవితములను ఉన్నత మార్గమున బెట్టెనో చెప్పుటకు లేదు. గ్రామ పాఠశాల విద్యార్థిగ తానెట్లు ఆత్మస్వాతంత్ర్య ప్రకటనముగావించెనో అధ్యాపకుడై తన విద్యార్థులలోను తోటి యుపాధ్యాయులలోను అట్టి స్వాధీనతనే అతడు రగుల్కొల్పువాడు. విద్యార్థుల ఆత్మోపలబ్ధికి సాయపడు దేవమందిరముగ కళాశాలను మార్చివేసిన భావుకుడు.

ఆయన మతమేమి యందునూ ఈశ్వర విశ్వాసమే అవలెను. ఆతని విశ్వాసము అతి విశాలమైనది. ఈ విశ్వాసమునే తాను చేసిన గోదావరి జిల్లా బోర్డు సభ్యత్వమునందును పురపాలక సంఘ సభ్యత్వము నందును మద్రాసు విశ్వవిద్యాలయోపాధ్యక్షత యందును నీతముగ ఎరిపించుకొని యుండును. ధర్మంచర! ధర్మాత్పరం నాస్తి అన్న ఆర్య ఋషుల ఆదేశమే వెంకటరత్నము మతము. అతడు పెంచి పెద్దవారిని చేసిన అనాథ బాలికలును మహారాజాను చేరనుంచుకొని అతడు స్థాపించిన ధర్మసంస్థలును, తనకు వచ్చు నెల జీతములో నుండి విద్యార్థులకును ఇతరులకును చేసిన వేలకొలది ధన సహాయమును అధ్యాపక వృత్తిని ఈశ్వర ప్రసాదముగ శిరసావహించి వేలాది హృదయములలో ఆయన చొప్పించిన ఉన్నత భావములును ధనికుడగు మహారాజును చేరనుంచుకొనియు తాను మాత్రము భోగలాలసకు దాసుడు కాక గడిపిన సాధారణ జీవితమును - ఇవన్నియు అతని 'ప్రేమ' మతముయొక్క బాహ్యచిహ్నములు. అట్టి పురుషరత్నముయొక్క జీవన స్మృతి మనలో ఇంకను విశేషముగా సత్యానురక్తిని సేవానిరతిని పురిగొల్పుగాక!

క. ప్ర

## వెంకటరామన్, చంద్రశేఖర్

ప్రపంచ విఖ్యాతి నార్జించిన చంద్రశేఖర వెంకటరామన్ అను భౌతిక శాస్త్రవేత్త 1888 నవంబరు 7 వ తేదిన తిరుచురాపల్లి ప్రాంతమున పండిత కుటుంబమునకుచెందిన పార్వతమ్మకును ఆమె భర్తయగు చంద్రశేఖరయ్యకును జన్మించెను. నాల్గు సంవత్సరముల తరువాత తమ కుటుంబ ఆర్థిక స్థితిని మెరుగు పరచదలచుకొని కుమారుని వెంటనిడుకొని దంపతులిరువురు తమిళనాడును వదలి విశాఖపట్టణమునకు తరలివెళ్లిరి. రామన్ తండ్రి విశాఖపట్టణమందలి ఎ వి యన్ కళాశాలలో భౌతిక శాస్త్ర అధ్యాపకుడుగా ఉద్యోగములో ప్రవేశించెను. ఆ కళాశాల ప్రిన్సిపాల్ శ్రీనివాసయ్యగారివద్ద ఇంగ్లీషు భాషను తండ్రివద్ద భౌతిక గణితశాస్త్రములను అభ్యసించి వెంకటరామన్ 12 వ ఏటనే మెట్రిక్యులేషను పరీక్షలో ఉత్తీర్ణుడయ్యెను. రెండు సంవత్సరముల తరువాత ఎఫ్ ఏ పరీక్షయందు అతడు ఉన్నత తరగతిని సంపాదించెను. తరువాత నాతడు చెన్నపట్నమందలి ప్రెసిడెన్సీ కళాశాలలో ప్రవేశించి బి ఏ పరీక్షయందు ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణుడై 'బంగారు

పతకమును పొందెను. 1907 లో ఎం. ఏ., పరీక్షయందు కూడ అతడు మొదటి తరగతిలోనే ఉత్తీర్ణుడయ్యెను.

ఆ కాలమున భారతదేశములో ఫైనాన్షియల్ సివిల్ సర్వీసునందు మాత్రమే భారతీయులకు పెద్ద ఉద్యోగములు లభించుచుండెడివి. 1907 ఫ్రిబవరి నెలలో ఈ ఉద్యోగమునకు అర్హతను సంపాదించుటకై జరిగిన పోటీ పరీక్షయందు వెంకటరామన్ ప్రథమస్థానమును గడించెను. ఇందు మూలముగా అతడు బ్రిటిష్ అధికారులమన్ననలను పొందగలిగెను. ఉద్యోగ సంపాదనములో నిమగ్నుడై యున్నను వేంకటరామనుకు విజ్ఞాన శాస్త్రమందు ఆసక్తి మెండుగా నుండెను. అదృష్టవశాత్తు ఆ తరుణమున డాక్టరు మహేంద్రలాల్ సర్కార్ అనునాతడు "ఇండియన్ అసోసియేషన్ ఫర్ ది కల్టివేషన్ ఆఫ్ సైన్సు" అను సంస్థను స్థాపించెను. ఈ సంస్థకు విజయనగరాధీశుడైన ఆనందగజపతి యొక్క ధన సాయము అధికముగ లభించెను. ఈ సంస్థయందు తనతీరిక సమయములలో భౌతికశాస్త్రీయ పరిశోధనలు జరుపుకొనుటకు వెంకటరామనుకు మంచి అవకాశము లభించెను. ఈ పరిశోధనల ఫలితముగా నిగూఢముగనున్న అతని ప్రతిభను రామన్ లోకమునకు వెల్లడింపగల్గెను. ఆనాటినుండియు ఈ సంస్థలో అతని పరిశోధనా పరంపరలు జరుగసాగెను.

1916 లో కలకత్తా విశ్వవిద్యాలయమునకు సంబంధించిన సైన్సు కళాశాల స్థాపింపబడెను. ఆ సమయమున వైస్ ఛాన్సెలర్ గానున్న అసుతోష్ ముఖర్జీ భౌతికశాస్త్రశాఖకవసరమైన ప్రొఫెసరు కొరకన్వేషించుచుండెను. ఈ నూతన కళాశాల భారతీయులొసగిన విరాళములతో స్థాపింపబడుటచే అందు నియమింపబడు ప్రొఫెసర్లు భారతీయులై యుండవలెనను నియమమేర్పడినది. అప్పటి వరకు ఉన్నత ప్రభుత్వ విద్యాసంస్థలలో బ్రిటిష్‌వారికే స్థానము లభించెడిది. కాని ఈ తరుణమున అష్టుతోష్ ముఖర్జీదృష్టి పరిశోధనలయందు గొప్పపేరు గడించిన రామన్ మీదపడి అతనిని ఆచార్యపదవి అంగీకరించవలసినదిగా ఆహ్వానించెను. 1917 జులై నెలలో వెంకటరామన్ ఆ పదవిని అధిష్ఠించెను. 1919 లో అతడు ఇండియన్ సైన్సు అసోసియేషనుకు కార్యదర్శిగా ఎన్నికయయ్యెను. ఈ రెండుపదవులును అతని పరిశోధనకృషికెంతయో తోడ్పడినవి. వెంకటరామన్ స్వయముగా పరిశోధనలు జరుపుటయేకాక, పెక్కురు విద్యావేత్తలకు అందులో ప్రవేశముకల్పించి ఒకప్రత్యేక పరిశోధనా సంస్థను గూడ స్థాపించెను. అంతవరకు ఇంగ్లండులో పరిశోధనకృషి జరుపుచుండెడి భారతీయ యువకులు వెంకటరామన్‌తో పాటు భారతదేశమునందే పరిశోధనలు జరుపుచు అతనికి అండదండగ నుండెడివారు.



చిత్రము - 80

పటము - 1
చంద్రశేఖర వెంకటరామన్

ఆ దినములలో ధ్వని వెలుగు —ముఖ్యముగా కిరణములవ మనము (diffraction of rays) — అను విషయములు వెంకటరామను మనస్సును ఎక్కువగా ఆకర్షించెను. 1921 లో మొదటి సారిగా అతడు అక్స్‌ఫర్డ్‌లో జరిగిన విశ్వ విద్యాలయముల మహాసభకు హాజరయ్యెను. మార్గ మధ్యమున మధ్యధరా సముద్రము లోతుగా నున్న తావున నీటియొక్క నీలిరంగు ఆయనను ఆకర్షించెను. భారతదేశమునకు తిరిగివచ్చినతరువాత అతడు ద్రవ్యముల కాంతి వికిరణము (Scattering of light) అను విషయమును గూర్చి పరిశోధనము జరిపిన ఫలితముగా 1924 లో లండనులోని రాయల్ సొసైటీ సభ్యుడుగా ఎన్నుకొనబడెను. ఒకేరంగుగల కిరణములు ద్రవ్యముగుండా ప్రసరించునపుడవి అన్నివైపుల వికిరణముచెందిన ఫలితముగా కిరణములయందు ప్రథమమున నున్న రంగుగాక సమీపముననుండు వస్తువులయొక్క రంగు నూతనముగా ప్రవేశించును. ఇది అసామాన్యమును అద్వితీయమును అగు విచిత్ర విషయము. దీనిమూలముగా ఈ అద్భుత పరిశోధనాఫలితము రామన్ ఎఫెక్ట్ అని ప్రపంచమంతట ప్రసిద్ధి గడించెను. దీనిమూలముగా భౌతికశాస్త్రమునందును రసాయనశాస్త్రమునందును క్రొత్తమార్గములు ఆవిష్కరణములైనవి. ప్రపంచమందు పరిశోధనాగారములన్నిటియందు ఈ రామన్ ఫలితము పై పరిశోధనములు జరుపబడినవి. ఈ మహావిజయమును సాధించిన వెంకటరామనుకు 1930 లో నోబెల్ బహుమాన ప్రదానము గావింపబడినది. అతనికి కలిగిన అఖండగౌరవము మూలమున భారతదేశమునకు కూడ గొప్ప ఖ్యాతివచ్చెను. భారతీయులు కేవల

మొదట శాస్త్రచింతనమునందే కాక ప్రయోగసిద్ధమగు విజ్ఞానశాస్త్రమునందు కూడ దిట్టలను ఖ్యాతి ప్రపంచమునకు వెల్లడియయ్యెను

వెంకటరామన్ 1933 లో తన విజ్ఞానశాస్త్ర పరిశోధనా వ్యాసంగమును బెంగుళూరునందలి ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్సు కు మార్చి అక్కడ లభించిన నూతనావకాశములను వినియోగించుకొని తన రామన్ ఎఫెక్ట్ ను గూర్చియే కాక క్రొత్త క్రొత్త విజ్ఞానశాస్త్ర శాఖలయందు పరిశోధనములు గావించెను ఏ ఒక్క శాఖయందో కాక విజ్ఞానశాస్త్రములకు సంబంధించిన సకలవిభాగముల యందును సమగ్రమైనట్టియు బహుముఖమైనట్టియు పాండిత్య ప్రతిభను ప్రదర్శించుటయే ఆతనియందలి విశేషము ధ్వని కాంతి శాఖ యందే కాక X కిరణములయందు ఆయస్కాంత కాంతి పూర్వనీల లోహితకిరణములు మున్నగు పెక్కు శాఖలయందు ఆతడు తనశిష్యులచే అతిముఖ్యమైన పరిశోధనములు జరిపించి వాని ఆసక్తిని ఇనుమడింపజేసెడి వాడు ఆతనివద్ద శిక్షణముపొందిన పలువురు శాస్త్రవేత్తలు భారతదేశమునందున్నత పదవులలో నుండి శాస్త్రవికాసమునకు సహాయపడుచున్నారు

వెంకటరామన్ అమూల్యమైన తనపరిశోధనాఫలితములను వాటి మూలమున భారతదేశములో వివిధ పారిశ్రామిక విజ్ఞానసంస్థలకు చేకూరిన ప్రయోజనములను గూర్చి పత్రికలమూలమున స్వదేశములోను విదేశములలోను ప్రచురించెను రామన్ ప్రతిభను గుర్తించిన లండన్ రాయల్ సొసైటీ వారు ఆతనికి హ్యూస్ పతకమును బహూకరించిరి బ్రిటిష్ ప్రభుత్వము 1929 లోనే నైట్‌హుడ్ ను ప్రదానముచేసెను ఇట్లు పెక్కుదేశములందలి విజ్ఞానశాస్త్ర సంస్థలవారే కాక గ్లాస్గో విశ్వవిద్యాలయము పారిస్ విశ్వవిద్యాలయము బంగారు పతకములను గౌరవబిరుదములను ఒసగెను కలకత్తా బొంబాయి మద్రాసు కాశీ ఢక్కా, ఉస్మానియా విశ్వవిద్యాలయములు అదేవిధముగా వెంకటరామనును ఘనముగ సన్మానించెను ఇండియన్ మ్యాథమాటికల్ సొసైటీ ఇండియన్ కెమికల్ సొసైటీ ఇండియన్ సైన్సు కాంగ్రెస్ అసోసియేషన్ మున్నగు పెక్కుసంస్థలాతనిని గౌరవసభ్యునిగా ఎన్నుకొనెను 1929 లో అతడు ఇండియన్ సైన్సుకాంగ్రెసుకు అధ్యక్షుడుగా ఎన్నుకొనబడెను ప్రస్తుతమాతడు ఇండియన్ అకాడమీ ఆఫ్ సైన్సెస్ అను సంస్థకు శాశ్వతఅధ్యక్షుడుగ వ్యవహరించుచున్నారు

ప్రస్తుతము వెంకటరామన్ బెంగుళూరులో తాను నెలకొల్పిన రామన్ ఇన్‌స్టిట్యూట్ అను గొప్ప సంస్థయందు డైరెక్టరుగా అత్యుత్సాహముతో వ్యవహరించుచు కంటిచూపు కాంతి ప్రకృతిలోని రంగులు మొదలైన విషయములను గురించి ఎడతెగకుండగా పరిశోధనములు జరుపుచున్నారు

జె. ఎ. కా.

## వెంకట్రామయ్య మాధవపెద్ది

ఆంధ్రనాటక కళాలక్ష్మిని సర్వాంగసుందరముగ తీర్చిదిద్దిన ప్రముఖకళోపాసకులలో మాధవపెద్ది వెంకట్రామయ్య ఒకరు వైదిక బ్రాహ్మణశాఖీయుడైన ఈయన జన్మస్థలము గుంటూరు జిల్లాలోని భట్టిప్రోలు ఈతడు తెనాలిలో స్కూలు ఫైనలువరకు విద్యనభ్యసించి ఎమ్మట బందరు జాతీయ కళాశాలలో మెకానికల్ కోర్సును పూర్తిచేసి గుంటూరు నందలి జ్యూట్ మిల్లులో కొంత కాలముద్యోగము చేసినారు ఈయనకు హిందీ సంస్కృతాంధ్రాంగ్ల భాషలలో ప్రవేశమున్నది

మాధవపెద్ది వారిది పుష్టిగల నిండైన సుందర విగ్రహము ఆజానుబాహువు విద్యార్థిదశనుండి ఆయన వ్యాయామము చేసి శరీరదార్ఢ్యతను సంపాదించుకొనిన వ్యక్తి ఆటలనిన ఆయనకు ప్రీతి పెక్కు ఆటల పోటీలలో బహుమతులను గూడ గెలుపొందినాడు

బాల్యమునుండి నాటక వేషధారణయందు ఆయనకు గాఢమైన అభిరుచి యుండెడిది వెంకట్రామయ్య శీలముగల వ్యక్తి గుణవంతుడు స్నేహపాత్రుడు సంభాషణ చతురుడు సభలలో జనరంజకముగా మాటలాడనేర్చినవాడు ఉదారస్వభావము, కళాప్రియత్వము ఆతనికి వెన్నతో అబ్బిన సుగుణసంపద

ఈ కళాప్రియుడు 1920 లో విశ్వఖ్యాతి, "నాటకాచార్యుడు"నైన త్రిపురారిభట్ల వీరరాఘవస్వామి నేతృత్వమున స్థాపింపబడిన రామవిలాస సభయందు ప్రవేశించి, ఆయన అంతేవాసియై నాట్యశిక్షణమును బడసినాడు

వెంకట్రామయ్య వేషమువేసిన మొదటి నాటకము "నరకాసురవధ" దీనిలో ఆయన ధరించిన పాత్ర ఇంద్రుడు.

త్రిపురారిభట్ల వారి సుశిక్షణముతోను చిత్రకారుడైన వడ్డి బాబురావు వేషరచనలోను ఆ పాత్రను ఆయన ప్రజ్ఞతో నిర్వహించి ప్రజలమన్ననలకు పాత్రుడైనాడు ఆయన భావినటనా కీర్తికి ఆవేషము పునాదియైనది

పిమ్మట నాలుగుమాసములకు ఆసంస్థవారు ప్రదర్శించిన "రోషనార" నాటకములో మాధవపెద్ది శివాజీ పాత్రను నిర్వహించిరి ఆయన యీ నాలుగు మాసములు వీరరాఘవస్వామిగారియొద్దకు శుశ్రూషచేసి,అహోరాత్రములు పరిశ్రమించి రంగస్థలమున విజయ సాధనకవసరమైన హంగులను మిక్కిలి నేర్పుతో సమకూర్చుకొనెను శివాజి వేషమును కడు సమర్థవంతముగ నిర్వహించి ప్రజల మన్ననలను సంతరించుకొన్నాడు ఈ వేషమాయనకు ఎనలేని కీర్తి నార్జించి పెట్టినది

గయోపాఖ్యాన నాటకమున సహదేవుడు పాత్రను రసపుత్ర విజయ నాటకమున "గులాం" పాత్రను కూడ దక్షతతో నటించి ప్రజా హృదయమును చూరగొన్నాడు ఇట్లాయన చాలకాలము రామ విలాస సభతో వివిధ భూమికలను నిర్వహించి, నటుడుగా అఖండఖ్యాతి నార్జించుకొనుచునే ఇతర నాటక సమాజములలోకూడ చేరి పనిచేయదొడగిరి తననటనా శక్తిని ప్రదర్శించి సామాజికులను రంజింపజేసి వారిచే 'హాయిహాయి' యనిపించుకొనినది "బొబ్బిలియుద్ధ" మందలి ఆయన రంగరాయ పాత్రము

వెంకట్రామయ్య నటజీవితమునకు మేలుబంతి యనదగి ఆయనకు చిరయశమ్ము నార్జించి పెట్టినది "శ్రీకృష్ణ రాయబారము నందలి దుర్యోధన పాత్రము ఈ పాత్ర నిర్వహణమున ఆయన ప్రదర్శించినప్రతిభ అనితర సాధ్యమైనది ఆ పాత్ర నిర్వహణమున నేటివరకు సాటి లేని నటుడని భావించి ఆంధ్రు లాయనను సాదరముగా గౌరవించుచున్నారు

చిత్రము - 81



పటము - 1

వెంకట్రామయ్య మాధవపెద్ది

సింగపూరు, రంగూను మున్నగు నగరములందు వెంకట్రామయ్య నటించిన "శివాజీ" పాత్రనుచూచి ముగ్ధులైన సభికులు వెండి కత్తిని బాలును ఆయనకు బహూకరించి ఘనముగా సత్కరించిరి

ఈయన తెలుగు చలన చిత్ర రంగమునకు గూడ చేసిన సేవ అనల్పమైనది సీతాకల్యాణము నందు విశ్వామిత్రుడుగను కీచకవధ లో కీచకుడుగను తులసీజలంధరు'లో ఈశ్వరుడుగను ద్రౌపదీవస్త్రాపహరణము లో శిశుపాలుడుగను భూమికలు ధరించి ప్రేక్షక హృదయములను రంజింపజేసినాడు

ఆంధ్రనాటక కళాపరిషత్తునకు ఒక మారు వెంకట్రామయ్య అధ్యక్షులై ఆ సంస్థ కార్యకలాపములను కడుసమర్థతతోనిర్వహించి దాని వికాసమునకు మిక్కిలిపాటు పడిరి

తాను ధరించిన పాత్ర ప్రధానమైనదైనను అప్రధానమైనదైనను దానిని తగిన విధముగా నిర్వహించి ఆ వేషమునకు అర్హతను శోభను సమకూర్చెడివాడాయన పాత్రౌచిత్యమునకు ఎవ్విధముగను భంగము కలుగనివిధముగా హావభావ గాంభీర్యములను ప్రదర్శించి ప్రజలమెప్పును పొందిన కొలది మంది ఆంధ్ర నటకులలో వెంకట్రామయ్య ఒకడు తన పరిమిత సంగీత జ్ఞానముతో పద్యమున కవసరమగు మేరకే రాగమును జోడించి రసోచితముగను పాత్రల స్వభావ స్వరూపముల కనుగుణముగను, భావస్ఫోరకముగను ఉండునట్లు దానిని పఠించి సభికుల మెప్పును పొందెడి వాడాయన రాగము పద్యమునకనుగుణముగా లొంగియుండవలసినదేగాని దానిస్థాయి అతిక్రమించియుండుటకు ఆయన సమ్మతింపడు అది ఆయన విశాలనటనా దృష్టికి పరాకాష్ఠ ఆయన ప్రత్యేకరసస్పృష్టి

వాచికాభినయము భావాభినయము ఆయన నాటకకళకు మకుటములు ప్రతి పదాభినయముగాని, కరచరణాద్యవయవముల విజృంభణముగాని చేయక, పాత్రల హృదయములతో ఆయన తాదాత్మ్యముపొంది రంగస్థలమున్న తాను ధరించిన పాత్రకు వాస్తవికమైన సహజశోభను సమకూర్చుచుండెడివాడు

ఆనాటి ఆయన అభినయమును తిలకించిన సహృదయ ప్రేక్షకులు నేటికిని దుర్యోధన పాత్రధారణము మాధవపెద్ది వారి సొమ్ము'ని ప్రశంసించుచుందురు

ఆయన వేషధారణముచేసి రంగస్థలముపై చూచిన ప్రతి చూపు నడిచిన ప్రతినడక ప్రదర్శించిన ప్రతిభంగిమ, ఆంధ్రనాటక కళాలక్ష్మికి కట్టిన ముత్యాల పాలవెల్లి ఆయన

నటన కళాదేవత బంగారు పతమునకు రత్నాల తోరణము ఆంధ్రనాటక కళావికాసమునకై జన్మించిన కారణజన్ముడగు ఆమహానటుని నటరాజు అపరావతార మనినచో అతిశయోక్తి కాదేమో!

మాధవపెద్ది తెనాలి పట్టణములో స్వశక్తిచే నిర్మించుకొనిన గృహములో కాపురముచేయుచు విశ్రాంతుడై వార్ధక్యకారణముగా జీవితమును ముగించినాడు. ఆ సోదరుడు ధర్మపత్ని మాత్రము సజీవులుగనున్నారని వినుచున్నాము.

వు. వెం.

## వెండి

ఇది పరమాణుసంఖ్య 47 పరమాణుభారము 107.88 గల మౌలికరసాయనిక మూలద్రవ్యము. బంగారమువలెనే ఇది ప్రజలకు అతిప్రాచీనకాలమునుండియు తెలిసిన విలువైన లోహధాతువు. వెండి బాగుగా తీగెసాగగలదు. ఒకగ్రాము వెండి ఒకటిన్నరకిలోమీటర్ల పొడవుగల తీగెగా లాగవచ్చును. వెండిని రేకుగాకూడ సాగదీయవచ్చును. అతిపలుచని వెండి రేకులను వెయ్యింటిని ఒత్తిగా పెట్టినచో 0.6 సెంటిమీటర్లు మందముగవచ్చును. ఈ రెండులక్షణములవలన వెండిని జరీ తయారీకి ఉపయోగించుచున్నారు. వెండి నాణెములతయారీలో వాడుకయందున్నది. గట్టితనముకొరకై వెండితో రాగి మొదలైన లోహములను కలిపి వెండినాణెములుగా చెలామణి చేయుచున్నారు. వెండి మంచి విద్యుత్ప్రసారశీలముకలది. ఇటీవల మెగ్నీషియము అల్యూమినియము గ్రాఫైటు ఫినోలులను పారిశ్రామికముగా తయారుచేయుటకు రూపొందించిన విధానములలో వెండివాడబడుచున్నది. 1942 లో అమెరికా ప్రభుత్వము రెండవప్రపంచయుద్ధమువలన కల్గిన అత్యవసర పరిశ్రమలలో వాడుకొనుటకై ముప్పదినాల్గువేల టన్నుల వెండిని సరఫరాచేసినది. నాటినుండి నాణెముల నిర్మాణమునందు వాడుకయయ్యెడి వెండి క్రమముగా తగ్గినది. పారిశ్రామికావసర పదార్థముగాదాని ప్రఖ్యాతి హెచ్చినది.

వెండి తెల్లగనుండి తళతళ మెరియుచుండును. కేవలగాలిలోగాని ఆసిడ్ ఆల్కలీలలోగాని అదిమసిబారదు. మెరుగుపెట్టినచో అదిమరింత మెరయును. అందుచే నగలకు దేవతారాధన పాత్రాదికములకు వెండికి గిరాకియెక్కువ. ఖనిజములనుండిమనమారు ఏడాదికి 68 కె లక్షలకిలోగ్రాముల వెండి తయారగుచున్నది. అయినను అదినేటి అవసరములకుచాలనందున వెండిధర నానాటికి హెచ్చుచునేయున్నది.

**ఖనిజములు**: వెండిఖనిజములలో అర్జెంటైటు ($Ag_2S$) రజతయుత గెలీనా (సీసము) ఖనిజము ఎన్నదగినది. భారతదేశములో రాజస్థానమునందలి ఉదయపూరుజిల్లాలోను ఝరియా బొగ్గుగనుల ప్రాంతములోను గెలీనాతోకలిసిన వెండిఖనిజరూపములో లభించును. కడప కర్నూలు జిల్లాలలో సీసముతో కలిసినవెండియు అనంతపురముజిల్లాలోని రామగిరి ప్రాంతములో బంగారముతో కలిసినవెండియు పరిమితముగా లభించుచున్నది. భారతదేశములో తయారగువెండిలో 90 శాతము రాజస్థానమునందలి జవార్ గనులలో లభ్యమగు ఖనిజమునుండి సాధింపబడుచున్నది.

**ధాతుసాధన**: ఖనిజములనుండి రజతధాతు సాధనమును రెండు విధములుగా కొనసాగించుచున్నారు (1) రసమిశ్ర విధానము (Amalgamation Process) (2) సయనైడు విధానము.

**రసమిశ్ర విధానము**: రజత ఖనిజమును చూర్ణమొనర్చి దానియందు కొలదిగా ఉప్పుకలిపి సిమెంటు చేసిన నున్నని నేలమీద వేసి పాదరసముతోను కొలది లోహమాక్షిక భస్మముతోను కలిపి గాడిదలచే త్రొక్కించెదరు. లోహమాక్షిక భస్మములో కుప్రిక్ యౌగికము ముందు క్లోరైడుగామారి రాసాయనిక చర్యలలో పాల్గొనును.



$$Ag_2S + 2\,CuCl_2 \rightarrow 2\,AgCl + 2\,CuCl + S$$

$$2\,CuCl + Ag_2S \rightarrow 2\,Ag\,S + Cu_2S + 2AgCl$$

$$2\,AgCl + 2\,Hg \rightarrow 2\,Ag + Hg_2Cl_2$$

అనురసాయన క్రియలు నిర్వర్తింపబడి ఖనిజములో యున్న రజతము పాదరసములో కలిసి రసమిశ్రమము (Amalgam) లభించును. లభించిన పదార్థమును గోతములో వేసి పిండినప్పుడు రసమిశ్రముపైకి వచ్చును. మిగిలిన పదార్థములన్నియు గోతమునందుండిపోవును. తర్వాత రసమిశ్రమును నీటితో కడిగి మలిన నిర్ముక్తమొనర్చి స్వేదన క్రియవలన వెండిని రసమునుండి వేరుచేయుదురు. ఈ విధానము 1557 నుండి మెక్సికో దేశములో వాడుకయందుండెను.

**సయనైడు విధానము**: రజత ఖనిజమును చూర్ణమొ

నర్చి దానికి అత్యంత విషస్వభావముగల 0·44 శాతపు సోడియము సయనైడు ద్రావణమును పలచని ధారగా కలియ బెట్టుచు విరివిగా గాలిని ఊదుకొత్తుల ద్వారా పంపించెదరు. అప్పుడు



$$4\,Ag + 8Na\,CN + 2\,H_2O + O_2 \rightarrow 4Na\,Ag\,(CN)_2 + 4\,NaOH$$

$$Ag_2S + 4Na\,CN \rightarrow 2Na\,Ag\,(CN)_2 + Na_2S$$

అను రసాయన క్రియలు నిర్వర్తింపబడును. గాలిలో నున్న ఆక్సిజన్ సంపర్కమువలన



$$4\,Na_2S + 2H_2O + 5O_2 \rightarrow Na_2SO_4 + 4\,NaOH + S$$

అను రసాయనక్రియ కూడ జరుగుటచే రజత ఖనిజమందున్న గంధకపు భాగము మడ్డి రూపములో క్రిందికి దిగిపోవును. రజితమంతయు ద్రావణశీలముగల సోడియము అర్జెంట్ సయనైడు రూపములో ఉండి వడియగట్టుట వలన మలిన పదార్థము విముక్తమగును. తర్వాత ఆ ద్రావణమునకు జింకుధాతువును కలిపి రజతమును అవక్షేపముగా పొందెదరు.



$$2Na\,Ag(CN)_2 + Zn \rightarrow 2Ag \downarrow + Na_2Zn(CN)_4$$

సీసపు ఖనిజములలో వెండి కలిసియుండును. కావున సీసముతో పాటు వెండి కూడ లభించును. వెండి విలువను బట్టి దానిని ఆ ధాతు మిశ్రమము నుండి వేరుచేసి సంపాదించెదరు. దానికి రెండు విధానములు వాడుకయందున్నవి (1) పాటిన్ సన్ విధానము (2) పార్క్స్ విధానము.

పాటిన్ సన్ విధానము : ఈ విధానము 1833లో తీర్చి దిద్దబడినది. సీసము వెండియు కలిసియున్న ధాతు మిశ్రమమును కరగించి చల్లార్చినపుడు తొలుత వెండితో కలిసిన సీసముపై భాగమును ఎక్కువ వెండితో మిగిలిన సీసము అడుగు భాగమున వేరగును. వాటిని గరిటెలతో వేరుచేసి మరొక పాత్రలో గ్రహించి తిరిగి తిరిగి కరగించుచు చల్లార్చి తుదకు 2.5 శాతము వెండిగల ధాతు మిశ్రమమును పొందగల్గుదురు. దానిని ఎముక బూడిదతో తయారు చేసిన క్యూపెల్ అను మూసలో గ్రహించి కరగించి ఊదుకొత్తుల ద్వారా గాలిని ప్రసరింప జేయుదురు. అప్పుడు ధాతు మిశ్రమములో నున్న సీసము ఆక్సీకరణమై ధూళి రూపములో వెలుపలికి వచ్చి వేయును. చివర క్యూపెల్ లో తళతళలాడు స్వచ్ఛమైన వెండి మిగులును. క్యూపెలేషన్ అనబడు ఈ విధానమును అనుసరించి రసమిశ్ర విధానములో గాని సయనైడు విధానములో గాని పార్క్స్ విధానములో గాని లభించిన వెండిని స్వచ్ఛమైన దానినిగా చేయుదురు.

పార్క్స్ విధానము : 1850లో ఈ విధానము కనుగొనబడినది. రజతము సీసములో కంటె జింకులో విరివిగా కరగును. ఈ లక్షణము ఈ విధానములో ఉపయోగింపబడుచున్నది. సీసము వెండి కలిసిన ధాతుమిశ్రమమును కరగించి దానికి తగుపాటి (1-2 శాతము) జింకును కలిపి అమూడింటిని మేళవించి కరగినపిమ్మట చల్లార్చెదరు. అప్పుడు వెండి జింకులో లీనమై అత్యల్ప ప్రమాణములో సీసముతో కలిసి తెట్టెగా పైన చేరుకొనును. దానిని గరిటెలతో వేరుచేసి స్వేదన విధానముచే దానినుండి జింకును తొలగించి తర్వాత క్యూపెలేషన్ విధానమువలన వెండిని మలిన నిర్ముక్తమొనర్చెదరు.

విద్యుద్విశ్లేషణ విధానము : అత్యంత స్వచ్ఛమైన వెండి కావలసినప్పుడు ఎలెక్ట్రొలిటిక్ విధానము వలంబింపబడును. సిల్వర్ నైట్రేటు ద్రావణమును ఎలెక్ట్రొలైటుగను స్వచ్ఛమైన వెండిని కేథోడుగను అపరిశుద్ధమైన వెండిని ఆనోడుగను ఉపయోగించుచు విద్యుత్ప్రసార మొనర్చెదరు. అప్పుడు జరుగు విద్యుత్ రసాయన క్రియమూలముగా ఆనోడునుండి వెండి ద్రావణములో ప్రవేశించి అయానుల రూపములో కేథోడు పైకి ప్రయాణముచేసి అక్కడ నిక్షిప్తమగును. మలిన పదార్థములు ద్రావణములో మడ్డిగా మిగిలిపోవును. స్వచ్ఛమైన వెండి కేథోడు క్రమముగా పెరుగుటయు మొదట మలినయుతమైన వెండి ఆనోడు క్రమముగా తరిగిపోవుటయు జరుగును.

వెండిని ఇతర లోహధాతు సామగ్రి (రాగి ఇత్తడి వగైరా) మీదపనిచేయించి నిత్యోపయోగము కొరకు వెండివలె తళతళలాడు చెంబాలు గ్లాసులు పళ్లెములు తయారు చేయుచున్నారు. ఇట్టి వానిపై ఎలెక్ట్రొప్లేటింగు విధానముచే వెండిపూత వేసి సామానులు వెండి వలె చవుకగాను అందరికిని అందుబాటులో ఉండి వెండిసామానుల వలె ఉపయోగించగలవు. ఈ విధానములో పొటాసియము అర్జెంటో సయనైడు ద్రావణమును ఎలెక్ట్రొలైటుగను స్వచ్ఛమైన వెండి కడ్డీని ఆనోడుగను గిల్టుచేయవలసిన చెంబాలు

మొదలైన వాటిని కేథోడుగను గ్రహించి ఈ విద్యుత్ ద్రవమును బ్యాటరీతో కలిపి విద్యుత్ప్రసారము చేయుదురు

వెండి ధాతువే కాక దాని రసాయనయౌగికములు కూడ ఉపయోగకరములై యున్నవి. సిల్వరు క్లోరైడు బ్రోమైడు అయొడైడులను ఛాయాగ్రాపులను చేయుటకవసరమైనఫలి ములను ప్లేట్లను తయారుచేయుటకై ఉపయోగించెదరు. ఇవి కాంతి చైతన్యవంతములై వాటి మీద కాంతి ప్రసారమైనప్పుడు $AgX \longrightarrow Ag + X$ అను రసాయనవియోగక్రియ చే ఛాయాచిత్ర గ్రహణమును సుసాధ్య మొనర్చును

సిల్వర్ నైట్రేటు రజతలవణము లన్నింటి యందును సిల్వర్ నైట్రేటు అతిముఖ్యమైనది. రజితధాతువును జలయుక్తమైన నైట్రిక్ యాసిడుతో కాచినప్పుడు అది ఏర్పడును ఆ ద్రావణమును జాగ్రత్తగా కాంతి తగులకుండ స్ఫటికీకరించినప్పుడు అపమకోణచతురస్రాకారములో రేకులవంటి స్ఫటికములు లభించును. వాటిని సులువుగా కరగించి పెన్సిలు ఆకారములో పోతపోయుటకు వీలగును. అట్టి కాస్టిక్ పెన్సిళ్లను కంటిపొరపై పెరిగిన దుర్మాంసమును తొలగించుటకు ఉపయోగించెదరు. సిల్వర్ నైట్రేటు ద్రావణము శరీరముపైన గాని బట్టలపైనగాని పడినప్పుడు నల్లని మరకలేర్పడును. అందుచేత దానిని తేలికగాచెరగని గుర్తులువేయుటకు పయోగించుచున్నారు

సిల్వర్ ప్రొటీను పాల విరుగుడులోనుండు కేసిన్ అను ప్రొటీనుగాని నీటిలో కరగి లీనమగు అల్బుమిన్‌గాని సిల్వర్ ఆక్సైడుతో రాసాయనికముగా యోగించినప్పుడు సిల్వర్ ప్రొటీను తయారగును. అది దానికంటె రెండురెట్లు నీటిలో ద్రావణమగును. ఆర్జిరాల్ అను వ్యాపారనామముతో ఇట్టి పదార్థమే కంటిలోవేసికొనెడి మందుచుక్కల తయారీలో వాడబడుచున్నది. సిల్వర్ నైట్రేటు ద్రావణముకంటె కంటిమందుగా ఇది ఎక్కువ మృదుశీలముకల పదార్థము

హా. ఆ.

## వెనిజులా

వెనిజులా దక్షిణ అమెరికా ఖండమందలి ఒక రిపబ్లికు రాజ్యము. ఇది పశ్చిమరేఖాంశమున 59°–40′ నుండి 73° వరకును ఉత్తర అక్షాంశరేఖయందు 1° నుండి 12°–40′ వరకును విస్తరించి యున్నది. తూర్పు దక్షిణ దిశలయందు దేశము వరుసగా బ్రిటిష్‌గయానా బ్రెజిల్ దేశములకును పశ్చిమ దిశయందు కొలంబియాకును నడుమనున్నది. కారిబియన్ సముద్రతీరము ఉత్తర సరిహద్దుగా ఏర్పడియున్నది

క్రీ. శ. 1498 వ సం॥ లో కొలంబసు తన మూడవ పరిశోధనయాత్రలో వెనిజులాను ప్రప్రథమముగా కనుగొనెను. ప్రారంభదశలో స్పెయిను జాతీయులు వెనిజులాలో వలసలు స్థాపించుకొనిరి. 1550 వ సం॥ లో ఒక సైనిక నియంత కారకాస్‌నగరమును రాజధానిగా నొనర్చుకొని ఒక రాజ్యముగా సంఘటితమైన ఆ వలసలను పరిపాలింప మొదలిడెను. క్రీ. శ. 1811 వ సం॥ లో స్వతంత్రముగువరకు ఆ దేశము స్పెయినురాజ్య పాలనక్రింద నుండెను. కాని 1845 వ సం॥ వరకు స్పెయిను ప్రభుత్వము వెనిజులా స్వాతంత్ర్యమును సంపూర్ణముగా గుర్తింపలేదు

**సైశాల్యము : జనసంఖ్య** – వెనిజులా విస్తీర్ణము 3 52 143 చ. మైళ్లు. పొరుగుదేశములతో దీనికిగల భూసరిహద్దులపొడవు 2 ·72 మైళ్ళు. ఈ దేశము 20 రాష్ట్రములుగ విభజింపబడినది. ఈ రాజ్యమున కసంబంధింపబడిన కొన్ని దీవులు సముద్రతీరమునకు సమీపమునగలవు

1961 వ సం॥ జనాభా లెక్కల ప్రకారము ఈ దేశపు జనసంఖ్య 31 48 629 మంది. వీరిలో 35 36 000 మంది ఓటు హక్కుపొందిన వయోజనులు. కారకాస్ (జనాభా 7 86 710) మారకైబో (4 21 166) బార్కిసిమెటో (1 99 691) వాలెన్షియా (1 63 601) మరాకే (1 35 353) సాన్ క్రిస్టోబల్ (98 777) అనునవి ఈ దేశమందలి ప్రధాన నగరములు

వెనిజులాలో ఆదిమతెగలకుచెందిన భారతీయులు 31 800 మంది వివిధప్రాంతములలో నివసించుచున్నారు. ప్రభుత్వము సేకరించిన లెక్కలప్రకారము వెయ్యిమందికి జననసంఖ్య 49 4 అనియు మరణసంఖ్య 8 5 అనియు తెలియుచున్నది

ప్రభుత్వపు అంచనాప్రకారము ఈ దేశములో నూరింట 75 కుటుంబములకు గృహవసతి లోపభూయిష్ఠముగ నున్నది. రోమను క్యాథలిక్కు మతముచ్చట ప్రబలముగనున్నను ఇతర మతములయెడసహనభావముగలదు. ప్రొటెస్టెంటుశాఖవారు 20 000 మంది మాత్రమేగలరు

చిత్రము - 83




పటము - 1

నైసర్గికలక్షణములు - వెనిజులా మూడు ప్రధాన భూమండలములుగా విభజింపబడినది (1) ఉత్తర వాయవ్య దిశలందలి పర్వతప్రాంతము (2) ఒరినాకోనదీ ప్రవాహ మండలము (3) గ్వియానాపీఠభూమి ఎండిస్ పర్వతపంక్తు లందలి తూర్పుభాగములో నొకశాఖ పశ్చిమ వెనిజులాలో చొచ్చుకొని ట్రినిడాడ్ జలసంధి దిశగా సాగిపోయినది పైచెప్పిన తూర్పుపర్వతశాఖయందు ఎకాకో-డి-లా - సిర్రా అనునది అత్యున్నతమైన శిఖరము ఒరినాకోనదీ ప్రవాహమండలము నకును వాయవ్యదిశయందున్న నదులకును నడుమనున్న సిర్రా అను శిఖరము జలప్రవాహములను రెండుగా విభజించుగట్టుగా వ్యవహరించుచున్నది ఒరినాకోమండలము రెండుభాగము లుగా విభజింపబడినది ఈ మండలమంతయు పల్లముగనుండి ఒకకోటమాత్రము 375 నుండి 400 అడుగుల వరకు ఉన్నతముగా యున్నది వర్షాకాలములో జలప్రవాహము ముందుగా సాగుచు ఆ ప్రాంతమును వరదలో ముంచి వేయును

దక్షిణ ఆగ్నేయదిశలందు గ్వియానా పీఠభూమికలదు దీనికుత్తర పశ్చిమపార్శ్వములందు ఒరినాకోనది ప్రవహించు చున్నది ఈ పీఠభూమిలో అధిక భాగము 3000 నుండి 6000 అడుగుల ఎత్తువర కున్నది కాని దక్షిణమున పారిమా పాకరేమా పర్వతసానువుల చుట్టును గల కొన్ని పీఠభూమి ప్రాంతముల ఎత్తు 6000 అడుగులను మించి యున్నవి బ్రిటిష్ గయానా సరిహద్దుపై నున్న రొరైమాశిఖరపుఎత్తు 9094 అడుగులు వెనిజులా వైశాల్యములో కనీసము అయిదింట నాలుగు వంతుల భూమి ఒరినాకో నదీ మండలప్రాంతమే ఈనదికి 436 ఉపనదులున్నవి వీటిలో ముఖ్యము లైనవి ఏండిస్ కొరా కరోనీ పర్వతములలో ఉద్భవించినవి పెక్కు చిన్న నదులు పార్యా జలసంధిలోనికిని కారిబియను సముద్రములోని కిని మారకైబో సరస్సులోనికిని ప్రవహించు చున్నవి ఈ నదులు ప్రయాణమునకు అనుకూ లములైనవికావు వెనిజులా యందలి 204 సర స్సులలో మారకైబో జూలియా వాలెన్షియా మున్నగునవి మిగులపెద్దవి వీటిలో విశేషభాగము ఉత్తర వాయవ్య దిశలందుగల ఏండిస్ మారకైబోనదీ ప్రవాహామండలమున నున్నవి

వెనిజులా సముద్రతీరసమీపమున 14 683 చ మైళ్ళవై శాల్యముగల 71 ద్వీపములచ్చటచ్చటఏర్పడియున్నవి ఈదేశముప్ర ధానముగా మూడుభౌతికమండలముల క్రిందవిభజింపబడదగును (1)వెనిజులా లేక గ్వియానాపీఠభూమి ఇది ఒరినాకోనదికి దక్షి ణమునయున్నది ఇందు భూగర్భమున కఠినమగునల్లిరాయి సమృ ద్ధిగా గలదు ఇది కాక స్ఫటికపురాయి, ఇసుకరాయి మున్నగు శిలావిశేషములుగూడ లభ్యములగును (2) ఇలనాస్ మండ లము ఇందు ప్రాచీనకాలమందేర్పడిన గులకరాయి ఇసుక ఇంకమన్ను భూగర్భమున దొరకును (3) పర్వతమయ ప్రాంతము ఇందు చాపదేలినవల్లిరాయి చానికిరుప్రక్కల జలప్రవాహ ఫలితముగా పేరుకొనిన ఒండ్రుమట్టి కాడవలు కన్పట్టును తూర్పుతీరమున ఒరినాకోముఖద్వారము నొద్ద మన్నుడెల్టాప్రాంతమును, ఇతర నదులును మారకైబో సరస్సుయొక్క ప్రవాహమండలమును అల్పప్రాధాన్యము గలవి వెనిజులాలో అధికపరిమాణములో పెట్రోలు త్రవ్వి తీయబడుచున్నది

వెనిజులా దేశము పూర్తిగా ఉష్ణమండలములో నున్నది. సంవత్సరమునకు సగటున 60 అంగుళముల నుండి 80 అంగుళములవరకు వర్షపాతము ఘటిల్లును. ఇది ముఖ్యముగా వేసవిలో ఉత్తర ప్రాంతమున జరుగును. కాగా దక్షిణప్రాంతములో ఎండకాలమున గరిష్ఠమగు వర్షపతనమును తక్కిన ఋతువులలో కనిష్ఠమగు వర్షపతనమును ఘటిల్లును. సంవత్సరము పొడవున వాతావరణము ఉష్ణముగ నుండును. కాని ఉన్నత ప్రాంతములందు అంతగా ఉష్ణాధిక్యత కానరాదు.

ఉద్భిజ్జసంపద - వెనిజులా యందు పెక్కు రకముల ఉద్భిజ్జసంపదకలదు. 1800 అడుగుల ఎత్తువరకు ఉష్ణప్రాధాన్యముగల పైరుపచ్చలు సర్వసామాన్యముగా కన్పట్టును. తీర ప్రాంతమును ఒరినాకో దిగువ నదీప్రవాహమండల సహితముగా సమస్తమగు పర్వతలోయప్రాంతమును ఉష్ణప్రధానములైన సాంద్రారణ్యములచే ఆవరింపబడియున్నవి. 1800 నుండి 8500 అడుగుల ఎత్తువరకు మిశ్రమ ఉద్భిజ్జములు కన్పట్టును. ఇవి ఉపోష్ణస్వభావముగల వృక్షసంతతి. 7200 అడుగులవరకు ఉద్భిజ్జములు మితోష్ణలక్షణముకలవి. ఆపైనగల వృక్షజాతుల స్వభావము కేవలము అలోష్ణము. అడవులలో గడ్డి ఏపుగా పెరుగును. కాఫిచెట్లు కొబ్బరిచెట్లు సమృద్ధిగా పెరుగును. మామిడి కోకో అరటి నారింజ నిమ్మజాతులు విరివిగా పండును. జీడిమామిడి బొప్పాయి మున్నగునవి కూడ ముఖ్యములగు పంటలు. ప్రాతసారాయము బీరు కార్టేజ్ మున్నగు పానీయముల తయారీకి కొన్నిరకముల కాటి వృక్షములు కూడ అచ్చట గలవు. అరణ్యములలో రబ్బరు వృక్షములు విశేషముగా కాన్పించును. అచ్చట ఉత్పత్తియగు కోకో ఉత్తమతరగతికి చెందినది.

1950 లెక్కల ప్రకారము జనసంఖ్యలో 40 శాతము వ్యవసాయ వృత్తివలన జీవించుచున్నారు. 56 80 898 ఎకరముల భూమియందు సేద్యము చేయబడుచున్నది. 1962 వ సం॥ లో ఈ దిగువ ఆహారపదార్థములు ఉత్పత్తియైనవి.

బియ్యం - 72 000 మెట్రిక్ టన్నులు
బంగాళదుంపలు - 1,21 208
నువ్వులు - 18 840 ,
చిక్కుడు - 28 080 ,
పంచదార - 2 46 231
అరటి - 4 86 900
కోకో - 14 794 మెట్రిక్ టన్నులు
కాఫీ - 48 879
గొడ్డుమాంసము - 1 67 467
పందిమాంసము - 6 19 356

1960 వ సంవత్సరపు వ్యవసాయ సంస్కరణ చట్టము ననుసరించి స్వల్పభూవసతి గల వ్యవసాయదారుల సౌకర్యార్థము నివాస గృహములు ఒకే ప్రదేశమున నిర్మింపబడినవి.

ఖనిజసంపద వెనిజులాలో లోహ లోహేతర జాతులకు చెందిన వివిధ ఖనిజములు ఉత్పత్తియగుచున్నవి. వీటిలో బంగారము ఇనుము మాంగనము నికెల్ బొగ్గు ఆస్బెస్టాస్ రాగి ఫాస్ఫేటు ముఖ్యములైనవి. ఈ ఇనుప ఖనిజములు ముఖ్యముగా అమెరికా సంయుక్త రాష్ట్రములకు ఎగుమతి యగుచున్నవి. ప్రపంచమంతటిలో పెట్రోలియము ఉత్పత్తియగు దేశములలో వెనిజులా రెండవస్థాన మాక్రమించుచున్నది. 1917 లో ప్రారంభమైన పెట్రోలు ఉత్పత్తి 1962 నాటికి సుమారు 18 కోట్ల 60 లక్షల క్యూబిక్ మీటర్ల వరకు పెరిగినది. క్రూడ్ ఆయిల్ సంబంధమైన యితర తైలములు గూడ ఉత్పత్తియై విరివిగా ఇతర దేశముల కెగుమతి యగుచున్నవి. దేశములోని దాదాపు అన్ని తైల పరిశ్రమలు విదేశీపెట్టుబడిదారుల యాజమాన్యమున వ్యవహరింపబడుచున్నవి. జాతీయాదాయమునకు విశేషముగా దోహదముచేయు ఈపరిశ్రమలయందు 87 వేలమంది కార్మికులు పనిచేయుచున్నారు.

పరిశ్రమలు విదేశ సరుకులపై దిగుమతి సుంకములు విధించినను వెనిజులాలో పరిశ్రమాభివృద్ధి అంతగా జరగలేదు. ప్రధానమైన పెక్కు పరిశ్రమలు విదేశీపెట్టుబడి దారులచే నిర్వహింపబడుచుండగా ఆహార ఖనిజ రసాయన పరిశ్రమలను మాత్రము దేశీయ ప్రభుత్వము పెట్టుబడులుపెట్టి ప్రోత్సహించుచున్నది. వస్త్రములు చౌకగా తయారగు కర్మాగారములు విశేషముగా గలవు. ఎమెంటు ఫ్యాక్టరీలు టైరు ఫ్యాక్టరీలు ముఖ్య కేంద్రములలో నెలకొల్పబడినవి. ప్రముఖములైన తైల కర్మాగారములు గూడ గలవు. విద్యుదుత్పత్తి 1962 నాటికి 588 కోట్ల కిలోవాట్ల వరకు పెరిగినది.

రవాణా సౌకర్యములు : పారిశ్రామికముగను, వ్యవసాయకముగను అభివృద్ధి చెందిన ఉత్తర వెనిజులాలో రవాణా సౌకర్యములు వృద్ధిచెందినవి. 1962లో 778 కిలో మీటర్ల రైలు మార్గము నిర్మింపబడినది. 1961 నాటికి రాకపోకలకు అను

భూలమగు 84 224 కిలో మీటర్ల మోటారు రహదారి నిర్మాణమై యుండెను దేశములోగల మోటారు శకటముల సంఖ్య 8 77 456 గ్వైరా మారకైబో పోర్టోకాబెల్లో గ్వాంటా అనునవి ముఖ్యమైన ఓడరేవులు 1961 నాటికా దేశమున 8 42 267 టన్నుల ప్రమాణముగల రవాణా ఓడలు పనిచేయుచుండెను దేశాంతర్భాగములో ఒరినాకోనది దాని ఉపనదులు రవాణా మార్గములుగా ఉపయోగపడుచున్నవి ఆధునికములైన జెట్ విమానములతో సహా ఆ దేశమున నాటికి పైగా వాణిజ్యోపయుక్తములైన విమానములు వ్యవహారములో గలవు అవికాక విదేశములకుచెందిన విమానములు కూడ రాకపోకల కుపయోగపడుచున్నవి 487 టెలిగ్రాఫ్ కార్యాలయములతో 24 849 కిలో మీటర్ల పొడవుగల టెలిగ్రాఫ్ విధానము వ్యవహారములోగలదు దీనియందు నిస్తంత్రీ విభాగముగూడ గలదు 1962 నాటికి 77 రేడియో ప్రసార కేంద్రములు 4 టెలివిజను కేంద్రములు పునఃప్రసార ఉపకేంద్రములతో సహా పనిచేయుచుండెను

పరిపాలనా విధానము 1958 వ సం॥ రాజ్యాంగ చట్టము ననుసరించి ఒక దేశాధ్యక్షుడు ఒక జాతీయ మహాసభ రాష్ట్రీ పురపాలక శాసన సభలు ప్రజలచే ఎన్నుకొనబడెను కార్మిక పారిశ్రామిక వాణిజ్యాభివృద్ధికి సంపూర్ణావకాశమీయబడెను సెనేట్ ప్రజాప్రతినిధి సభఅను రెండువిభాగములుగా జాతీయ మహాసభ విభజింపబడెను 18 సంవత్సరములు నిండిన 50 వేల మంది కొక ప్రతినిధి చొప్పున స్త్రీ పురుష వివక్షతలేక అభ్యర్థి ఎన్నుకొనబడును దేశమందలి 20 రాష్ట్రములలో ఒక్కొక్క దానియందు ప్రజలచే ఎన్నికయైన ఒక గవర్నరు ఒక శాసన సభ వ్యవహరించుచుండును సమాఖ్యప్రాంతములు సమాఖ్య మండలములు రిపబ్లికు అధ్యక్షుని పరిపాలనము నందుండును

విద్యా విధానము: వెనిజులాలో నిర్బంధప్రాథమిక విద్యావిధానము అమలులోనున్నది 1962-63 లో 11 602 ప్రభుత్వ పాఠశాలలు, 997 ప్రైవేటు పాఠశాలలు 13 48 761 మంది బాలబాలికలతో వ్యవహరించుచుండెను 1 97 454 మంది విద్యార్థులు గల 82 ప్రభుత్వ పాఠశాలల ద్వారాను 367 ప్రైవేటు పాఠశాలల ద్వారాను సెకండరీ, సాంకేతిక విద్యబోధింపబడుచున్నది కారకాస్ నగర మందలి సెంట్రల్ యూనివర్సిటీతో సహా దేశమునందు మొత్తము నాలుగు యూనివర్సిటీలలో ఉన్నత విద్యగరపబడుచున్నది 1961-62 వ సంవత్సరములో విశ్వవిద్యాలయ విద్యార్థుల మొత్తము సంఖ్య 25 867 వరకు పెరిగినది అవికాక ఒక ప్రైవేటు విశ్వవిద్యాలయము ఒక కార్మిక విశ్వవిద్యాలయముకూడ నెలకొల్పబడెను 1950 జనాభాలెక్కల ప్రకారము 10 సంవత్సరములు పైబడిన బాలబాలికలలో 51 3 శాతము చదువను వ్రాయను నేర్చియున్నారు నిరక్షరాస్యతను నిర్మూలించుటకై 1947 వయోజన విద్యాకేంద్రములు దేశమంతట స్థాపింపబడెను 1961 లో 34 దిన పత్రికలు 89 వారపత్రికలు ప్రచారమున నుండెను 5 68 000 దిన పత్రికలు అమ్ముడగుచున్నట్లు అంచనా వేయబడినది

దేశ రక్షణ: దేశరక్షణ కొరకు సమగ్రమును సమర్థమునగు ఒక కేంద్ర రక్షణవ్యవస్థ సంఘటితమయ్యెను విమాన నౌకాపదాతి దళములతో నిర్మాణమైన ఈ రక్షణ వ్యవస్థ ఆధునిక సాంకేతిక విభాగములతో నొప్పారుచుండెను సైనిక శిక్షణము కొరకును తత్సంబంధమైన సాంకేతిక విజ్ఞానము పార్జనముకొరకును ఒక సైనిక కళాశాలగూడ ఏర్పడియున్నది నౌకా సైనిక శిక్షణకై ప్రత్యేకముగా నౌక కళాశాల నిర్మింపబడినది

నాణెము: వెనిజులా దేశములో బొలివర్ అనునది అధికారికముగా చెలామణియందున్న నాణెము ప్రభుత్వ శాసనానుసారము 1875 1917 వ సంవత్సరములలో తూనికల యందును కొలతలయందును మెట్రిక్ ప్రమాణము ప్రవేశపెట్టబడెను

అర్ వ రె

## వెనేడియమ్

వెనేడియమ్ అనునది ఒక రాసాయనిక మూలద్రవ్యము దాని పరమాణుసంఖ్య 23 పరమాణుభారము 50 94 దీనిని 1830 వ సం॥ లో సెఫ్ట్‌స్ట్రోమ్ అను శాస్త్రవేత్త కనుగొన్నాడు 1869 లో రాస్కో అను శాస్త్రజ్ఞుడు దీనిని తయారుచేసినాడు వెనేడినైట్ చిలియట్ పెట్రొనైట్ కార్నొటైట్ అను ఖనిజముల రూపములో ఈ మూల ద్రవ్యము లభించును భారతదేశములో వెనేడియముతో కలిసిన టైటానియఫెర్రస్ మాగ్నటైట్ ఖనిజముగా బీహారురాష్ట్రములోని సింగభూమి జిల్లాలోను ఒరిస్సారాష్ట్రములోని మయూరభంజ్‌లోను లభించును దానిలో 1 5-2 5 శాతము వెనేడియము పెంటాక్సైడు ఉండునని పరిశోధనముల

వలన తెలిసినది వెనేడియము కూలోన్సైటు అను ఒకరకపు సూదంటురాయి రూపములో ఒరిస్సారాష్ట్రమందును వెనేడియం మైకా అను రాస్కోలైటు ఖనిజరూపములో మహారాష్ట్రమందలి భండారాజిల్లాలోను కేరళరాష్ట్రమందలి వర్కాలిలోను తమిళనాడులోని నీలగిరిజిల్లాలోను లభించుచున్నది. లిగ్నైట్ కోక్ మసిలో రెండుశాతప్రమాణములో వెనేడియము పెంటాక్సైడు రూపములో ఉండునని తెలియుచున్నది. భారతదేశమందలి మొత్తము వెనేడియము ఖనిజములు 2.25 కోట్ల టన్నులవరకుండునని శాస్త్రవేత్తలు అంచనా వేసినారు. వాటినుండి లభించు వెనేడియము దాని రసాయనయౌగికములు తగినంత ప్రమాణములో నుండుట వాటిసంపాదనమునకై కృషి జరుగవలసియున్నది.

వెనేడియమ్ ధాతువు శ్వేతధూమ్రవర్ణములో నుండి మిల మిల మెరయుచుండును లేదా ముద్దలరూపములో నుండును. దాని ద్రవీభావపు (melting point) ఉష్ణోగ్రత 1717°C. అది గాలిలోగాని తేమలోగాని మలినపట్టదు. హైడ్రోక్లోరిక్ యాసిడులో కరుగదు. సల్ఫ్యూరిక్ యాసిడ్ నైట్రిక్ యాసిడులతో వేడిచేసినప్పుడు మాత్రమే అది కరగును. వెనేడియమ్ లవణములు మెర్క్యూరిక్ ఫెర్రిక్ లవణములనుండి ఆక్సిహరణము చేయును.

వెనేడియము ఇనుముతో కలిసినప్పుడు తయారగు ఉక్కు పారిశ్రామికముగా అత్యంతోపయుక్తమైనదగును. అట్టి వెనేడియం ఉక్కునకు బలమెక్కువ. అది తుప్పుపట్టదు. అందుచే దానిని పనిముట్లు తయారుచేయుటకుపయోగించుచున్నారు. అయస్కాంతములను తయారుచేయుటకును వెల్డింగులో వాడబడు ఎలక్ట్రోడులపై ఆక్సీకరణమును నిరోధించుటకై పూతగనూ ఈ ధాతుమిశ్రమము ఉపయోగించబడుచున్నది. వెనేడియమును బంగారములో కలిపి తయారుచేసిన ధాతుమిశ్రమము దంతవైద్యములో వాడుకయగుచున్నది. రాగి కంచు కలసిన మిశ్రమము విమానముల ఇంజను నిర్మాణమందును అల్యూమినియముతో కలిసిన ధాతుమిశ్రమమును వాటి చట్రపు నిర్మాణమందును వాడుచున్నారు. వెనేడియమును కేవలము ఉక్కుతోగాని, క్రోమియము నికెలు మాంగనీసము సిలికానము, టంగ్‌స్టన్ బోరానులతో కలిపిగాని ఉపయుక్తములగు రకరకముల ధాతుమిశ్రమములను తయారుచేయుచున్నారు.

వెనేడియము పెంటాక్సైడును సల్ఫర్ డయాక్సైడు నుండి సల్ఫ్యూరిక్ యాసిడు తయారీకి పనికివచ్చే సల్ఫర్ ట్రయాక్సైడుగా మార్చుటకును ఎథిల్ ఆల్కహాలును ఎసిటాల్డిహైడుగా ఆక్సీకరణమొనర్చునప్పుడును ఉత్ప్రేరకముగా ఉపయోగించుచున్నారు. దానిని అత్యల్పప్రమాణములో వాడి పసుపురంగుగల గ్లాసులను తయారుచేయుచున్నారు. అట్టి గ్లాసులనుండి అల్ట్రావయలెట్ కిరణములు ప్రసారము కాజాలవు. వెనడైల్ సల్ఫేటు అమ్మోనియం వెనడేటు యౌగికములు నీలము ఆకుపచ్చరంగులలో పింగాణీపాత్రలు నునుపుతేలియుండునట్లు చేయుటకై ఉపయోగింపబడుచున్నవి. వాటిని వెనేడియము క్లోరైడును రంగుల అద్దకములో స్థిరీకరణపదార్థములుగా (mordants) ఉపయోగించుచున్నారు. వెనేడియమ్ లవణములు ఛాయాచిత్రగ్రహణమునందు తెవలపనులుగా వాడుకలోనుండి గ్రహించిన ఛాయాచిత్రములను స్ఫుటమొనర్చుటకై ఉపయోగింపబడుచున్నవి. ఈ విధముగ పెక్కు రీతులలో వెనేడియము దాని రసాయన యౌగికములు ఆధునిక పారిశ్రామిక విజ్ఞానయుగమునందు ప్రాముఖ్యము వహించుచున్నవి.

హ వా సు

## వెలుగోటి వంశము

వెలుగోటి వారు వెలమ దొరలు. ఈనాటి నెల్లూరి జిల్లా యందలి వెంకటగిరి సంస్థానమున కేలికలగు ప్రభువులు వెలుగోటి వంశమునకు చెందినవారే. వెలుగోటి వంశమువారికి రేచెర్ల వారను మరియొక నామము కూడ కలదు. ఈ వంశీయుల నాశ్రయించుకొని వీరి యాస్థానమునందు కాలము పుచ్చిన వంది మాగధులును భట్రాజులును అప్పుడప్పుడు తమ యేలికలను ప్రస్తుతించుచు వ్రాసిన పద్యములే "వెలుగోటి వారి వంశావళి" గా పరిణమించినవి.

వెలుగోటి వంశము మిక్కిలి ప్రాచీనమైనది. కాకతీయ రాజ్యము నేలి ప్రసిద్ధిగాంచిన గణపతి దేవుని కాలమున (క్రీ.శ. 1199-1262) ఈ వంశము వారు తొలుదొల్త వన్నె కెక్కిరి. ఓరుగల్లు పతనము తరువాత వెలుగోటి వారికి విస్తృతమగు భూవసతులు లభించెను. కాకతీయ వంశము పతనము చెందిన పిమ్మట వెలుగోటి వారు ఢిల్లీశ్వరులైన మహమ్మదీయ చక్రవర్తుల శాత్రవులైరి. అంతలో కాపయ నాయకుడు మున్నగు ఆంధ్ర వీరులు ముసల్మానుల ప్రభుత్వమును కూలద్రోయుటకై

తిరుగుబాటును లేవదీసిరి ఆ యవకాశమును పురస్కరించు కొని వెలుగోటి వంశము వారు మహమ్మదీయుల పక్షమును విడిచి జాతీయ వీరుల వంకకు మరలిరి ఈ వంశీయులు నేటి నల్లగొండ జిల్లా కొండ ప్రాంతములో నొక స్వతంత్ర రాజ్యమును నెలకొల్పుకొనిరి కాని బలవంతులగు గుల్బర్గా బహమనీ సుల్తానులతోడను విజయనగర ప్రభువులతోడను ఓఢ్ర దేశపాలకులగు గజపతులతోడను తరచు యుద్ధములు సంభవించుచుండిన కారణమున వెలుగోటి వారు తమ స్వాతంత్ర్యమును నిలువబెట్టుకొనలేరైరి వీరు తెలంగాణమును వీడి ఈ వంశము వారు కర్ణాటక ప్రాంతమునకు వలసపోయి విజయనగర ప్రభువులకడ సేనానులుగ నుండి తమ బలపరాక్రమములచే పేరు ప్రఖ్యాతులు సంపాదించిరి విజయనగర సామ్రాజ్యమును పాలించిన మూడవ శ్రీరంగరాయల కాలమున (క్రీ శ 1660 ప్రాంతము) కూడ వెలుగోటి వారి వీర కృత్యములు తెలియవచ్చుచున్నవి ఈరేచర్ల వంశము వారు మొట్టమొదట సామాన్య స్థితిపరులైన వ్యవసాయదారులని తోచుచున్నది

వీరి స్వస్థలము నేటి నల్లగొండ జిల్లా యందలి అనుమనగల్లు అను గ్రామము ఈ గ్రామములో పోలిరెడ్డి అను ఒక రైతు నివసించుచుండెను అతని కుమారుడయిన చెవ్విరెడ్డి ఒకనాడు రేచడు అను తన హరిజన సేవకునితో కలిసి గ్రామాంతరమునకు పోవుచుండగా అతనికొక గొప్ప ధన నిక్షేపము లభించెను కాని ఆ నిక్షేపము నరబలి యొసగనిచో ఎవ్వరికిని లభ్యపడదను నమ్మకముండుటచే స్వామి భక్తిపరాయణుడైన రేచడు తనను బలికావించి ఆ ధనమునంతను తీసికొనుమని యజమానిని ప్రార్థించెను చెవ్విరెడ్డి మార్గాంతరములేక అట్లే కావించెను తన కొరకై ప్రాణత్యాగమున కంగీకరించిన రేచని గౌరవార్థమై చెవ్విరెడ్డి తన ఇంటి పేరును రేచర్ల వారని మార్చుకొనెనట! చెవ్విరెడ్డి గొప్ప బలపరాక్రమములు గలవాడు ఈతడొక పర్యాయము రాక్షసాంశ సంభూతుడైన యొక భేతాళునితో ఘోరముగ పోరుసల్పెను భేతాళుడు చెవ్విరెడ్డి సాహస పరాక్రమముల కెంతయో సంతసించి అతనికి వరములొసగి అంతర్ధానమయ్యెనట అనాటి నుండి చెవ్విరెడ్డికి భేతాళరెడ్డి లేక భేతిరెడ్డియను నామములు కూడ కల్గెను భేతాళరెడ్డి కీర్తి రాజధానియగు ఓరుగల్లుపురము వరకు ప్రాకెనట! ఆ కాలమున ఓరుగల్లును పాలించుచుండిన గణపతి దేవుడు భేతాళరెడ్డి శౌర్య పరాక్రమముల గూర్చివిని అతనిని తనయాస్థానమునకు పిలిపించుకొని ఎంతయో గౌరవించి తన రాజ్యములోని యొకమండలమునకు పాలకునిగ నియమించెనట! రేచర్ల వంశము వారి పుట్టుపూర్వోత్తరములకు సంబంధించిన ఈ కథను మరికొందరు కొన్ని మార్పులతో వర్ణించుచున్నారు

రేచెర్ల వంశమువారు ఓరుగంటి కాకతీయులను ఆ రాజ్యావసానము వరకును మిక్కిలి భక్తి విశ్వాసములతో సేవించిరి చెవ్విరెడ్డికి దామానాయడు ప్రసాదిత్యుడు రుద్రుడు అను ముగ్గురు కుమారులుండిరి కాకతి గణపతిదేవుని యనంతరము అతని కుమార్తె రుద్రాంబ రాజ్యమున కెలిక యయ్యెను సామంత ప్రభువులలో పలువురు స్త్రీ యధికారమునంగీకరించుటకు నిరాకరించి తిరుగుబాటు కావించిరి ఆ సందర్భమున దామానాయడు మున్నగు రేచెర్ల సోదరులు రుద్రాంబ పక్షము వహించి తిరుగుబాటు దారులను పరాభవించిరి ఈ విధమున రేచెర్ల వంశమువారు కాకతీయ ప్రభువులను సేవించుచు వచ్చిరి క్రీ శ 1323 వ సంవత్సరమున కాకతీయ ప్రతాపరుద్రుడు ఢిల్లీ సుల్తానుతో తుదిసారి పోరాడి పరాజితుడైన సందర్భమున దామానాయని మనుమడు దాచానాయడు ప్రభువు పక్షమున పోరాడుచు వీరస్వర్గము నలంకరించెను దాచానాయని కుమారుడు ఎంగమనాయడు ఈ వీరుడు కాపయనాయకుడను మునునూరి వంశపు ప్రభువుతో చేతులు కలిపి ఆంధ్ర దేశమునుండి మహమ్మదీయ రాజులను వెడల నడటువకై ఎంతయో కృషి సల్పెను ఎంగమనాయడు ఒక స్వతంత్రరాజ్యమును స్థాపించుటకై కృషిసల్పెను ఈతడు జల్లిపల్లి కోటను ముట్టడించుచున్న సందర్భమున కొందరు క్షత్రియవీరులీతనిని సంహారించిరి తండ్రియైన ఎంగమనాయని చంపినందులకా గ్రహించి అతని కుమారులగు అనపోతానాయడును మాదానాయడును యుద్ధములో క్షత్రియులను తమ ఖడ్గముల కెరగావించి ప్రతీకారము నెరపిరి

అనపోతానాయని కాలము రేచర్ల వంశము వారి చరిత్రలో చాల ముఖ్యమైనది ఇంతవరకును రేచెర్ల వంశము వారి ముఖ్యస్థానము వారి స్వస్థలమగు అనుమనగల్లే అయినే, అనపోతానాయడు తన ముఖ్యపట్టణమును రాచకొండ యనబడు రాజాచలమునకు మార్చెను ఇచ్చట అతడు బలమైన

కోటను నిర్మించెను. అనపోతానాయడు పెక్కు యుద్ధములు కావించి అందు విజయమును చేకొనెను. ఈ నాయని రాజ్యమునకు తూర్పున రెడ్డి రాజ్యము నెలకొనియుండెను. వారితో కూడ యుద్ధములు సాగించి అనపోతానాయడు తన రాజ్యమును దక్షిణమున కృష్ణానది వరకును వ్యాపింపజేసెను. అందుచే ప్రసిద్ధశైవక్షేత్రమైన శ్రీశైలము రేచెర్ల వారి రాజ్యమున చేరిపోయెను. ఈ క్షేత్రమునకు పోవుటకై అనపోతానాయడు పర్వతముపైకి మెట్లు కట్టించినట్లు చెప్పుదురు. ఆనాటి ప్రసిద్ధ దుర్గములలో నొకటైన భువనగిరి కూడ అనపోతానాయకుని యధీనములోనికి వచ్చెను. ఈ విధముగ రేచెర్ల వారు తెలంగాణమనబడు ఆంధ్ర ప్రాంతమంతను తన యేలుబడిలోనికి తెచ్చుకొనిరి. అనపోతానాయని సోదరుడగు మాదానాయడు కూడ గొప్ప వీరుడు. సోదరునియందలి అభిమానముచే అనపోతానాయడు తన రాజ్యమందలి దక్షిణభాగమును మాదానాయనికి వశపరచి దానికి దేవరకొండను ముఖ్యపట్టణముగ కావించెను. రాచకొండ దేవరకొండ రాజ్యములు రెండును తుదివరకు మిక్కిలి స్నేహభావముతో వర్ధిల్లెను. అనపోతానాయడు క్రీ. శ. 1361 నుండి 1383 వరకు పరిపాలన సాగించెను.

మొట్టమొదట రేచెర్ల వారికిని బహమనీ సుల్తానులకును తరచు యుద్ధములు సాగుచుండెడివి. కాని కొంత కాలము గడచిన తర్వాత పద్మనాయక ప్రభువులు (వెలమ వారికి పద్మనాయకులను నామాంతరము కూడ కలదు) గోలకొండ దుర్గమును బహమనీ సుల్తానులకు శాశ్వతముగ నిచ్చివైచి వారితో మైత్రి సంపాదించిరి. ఈ విధముగ రేచెర్ల వారికిని, బహమనీ సుల్తానులకును మైత్రియేర్పడి, ఇతర రాజ్యములతో యుద్ధములు సంభవించినప్పుడన్యోన్య సహాయము కావించుకొనుచు వచ్చిరి. కాని రెండవ అనపోతానాయడును కుమార మాధవనాయడును తమ తండ్రి తాతలవలంబించిన రాజనీతిని విడనాడి విజయనగర రాజులతో మైత్రికావించుకొనిరి. ఎమ్మట విజయనగర రాజులును రేచర్ల వారును కలిసి బహమనీ సుల్తానైన ఫిరోజుషానోడించి నేటి నల్లగొండకు సమీపమందున్న పానగల్లు దుర్గము నాక్రమించిరి. ఈ విధముగ పద్మనాయకులకును బహమనీ సుల్తానులకును, స్నేహధర్మము చెడెను.

రేచెర్ల వంశీయులకును కొండవీటి ప్రభువులకును మొదటి నుండియు వైరభావమేర్పడియుండెను. ఓరుగల్లు కాకతీయ ప్రభువులకడ వీరిరువురు సామంతులుగనున్న కాలమున వీరి పరస్పర కలహములు ఇందులకు కారణమైయుండవచ్చును. ప్రథమ దశయందు విజయనగరము వారికిని వెలమ ప్రభువులకును ఉన్న వైరభావముండిన కారణమున పద్మనాయక రాజ్యమునకును రెడ్డి విజయనగర రాజ్యములకును కృష్ణానదియే సరిహద్దుగ నుండెను. వెలమ ప్రభువులు విజయనగరము వారితోడను బహమనీ సుల్తానులతోడను వైరము పాటించుచున్న కాలమున రెడ్డి రాజులు పై రెండు రాజ్యముల తోడను స్నేహము పాటించిరి. ఈ కారణముచే వెలమరాజులు రెడ్డి ప్రభువులను తమకు బద్ధశత్రువులుగ పరిగణించుచు వచ్చిరి. అనవేమారెడ్డి కాలమున పద్మనాయకులకును రెడ్డిరాజులకును యుద్ధము సంభవించెను. సింగమనాయని కుమారుడైన రెండవ అనపోతానాయడు రెడ్డిప్రభువైన అనవేమారెడ్డిని యుద్ధరంగమున సంహరించినట్లు రావు వంశచరిత్ర వలన తెలియుచున్నది (క్రీ. శ. 1366). రాజమహేంద్రవరమున నేర్పడిన రెడ్డి రాజ్యమున వీరభద్రారెడ్డి పరిపాలన సాగించుచుండెను. ఈ రాజ్యముతో కూడ వెలమ వారు యుద్ధములు సాగించిరి. రెండవ మాదానాయని కుమారుడైన లింగమనాయడు మహావీరుడని ప్రఖ్యాతిగాంచెను. ఇతడు రాజమహేంద్రవర ప్రభువులైన వీరభద్రారెడ్డి దొడ్డారెడ్డిగార్లను యుద్ధమునందు పరాభవించి వారి ముఖ్యపట్టణమును కొల్లగొట్టెను. ఇచ్చట కొండవీటి ప్రభువైన పెదకోమటి వేమారెడ్డి బహమనీ సుల్తానగు ఫిరోజుషా సహాయమును సంపాదించి వెలమవారితో యుద్ధమునకు దిగెను. రెండవ మాదానాయడును అతని సోదరుడైన రామచంద్రనాయడును రణరంగమున మడిసిరి. వారి బంధువైన రెండవ వేదగిరినాయని రెడ్డివారు చెరపట్టి ఉరితీసిరి. అనతికాలములోనే ఇందులకు వెలమవారు ప్రతీకారము కావించిరి. రెండవ అనపోతానాయడు విజయనగర ప్రభువుల సహాయ సంపదతో బహమనీ సుల్తాను నోడించి ఆపిమ్మట కొండవీటి ప్రభువగు పెదకోమటి వేమారెడ్డితో యుద్ధమునకు దిగెను. పెదకోమటి ఈ యుద్ధమున ప్రాణములు కోల్పోయెను. ఇతని మరణముతో కొండవీటి రాజ్యమంతరించినట్లు తెలియవచ్చును.

దేవరకొండ రాజ్యమును పాలించిన కుమార మాధవనాయకుని కుమారుడగు లింగమనాయని కాలమునందే

దేవరకొండ వారికిని బహమనీ సుల్తానులకును తీవ్రవైరములు సంభవించెను దేవరకొండ రాజ్యము చిన్నది కావున లింగమ నాయుడు బహమనీసుల్తానుల యొత్తిడికి తట్టుకొనలేక బలవంతులగు ఓఢ్ర గజపతిరాజుల సహాయముతో బహమనీ సుల్తానుల నోడించి తెలంగాణమును జయించి ఓరుగల్లుకోటను వశపరచుకొనెను (1461) కాని అందువలన అతనికెట్టి శాశ్వత ప్రయోజనము లేకపోయెను అసహాయశూరుడైన లింగమ నాయడు తన స్వతంత్రమును కోల్పోయి ఓఢ్ర దేశపు రాజులకు కప్పము కట్టుచు వారికి సామంతుడు కావలసి వచ్చెను లింగమనాయని యనంతరము దేవరకొండ రాజ్యముక్షీణించి ఒక స్థానిక సంస్థానముగ పరిణమించెను రాచకొండ రాజ్యము మూడవ సింగమనాయని యధీనమున మరికొంత కాలము స్వతంత్రరాజ్యముగా నెగడెను కాని బహమనీసుల్తానగు అహమ్మదుషా సేనలు రాచకొండ రాజ్యముపై దండెత్తి వచ్చి తెలంగాణమునంతను వశపరచుకొని మూడవ సింగమనాయని రాచకొండ నుండి పారద్రోలెను సింగమనాయడు నేటి గుంటూరు జిల్లాయందలి బెల్లంకొండ యందు తలదాచు కొనెను ఈ సింగమనాయడు 1455 వ సంవత్సరమున కీర్తి శేషుడైనట్లు చరిత్రలు తెల్పుచున్నవి ఈ విధముగ పద్మనాయక ప్రభువుల స్వర్ణయుగ మంతరించెను ఆ పిమ్మట వారు విజయనగర ప్రభువులకడ ఉద్యోగులుగ నుండుచు, కీర్తివార్జించిరి

రేచెర్ల వంశమువారు మహావీరులును రాజనీతి విశారదులును మాత్రమేకాక దైవబ్రాహ్మణ భక్తి కలవారు దానధర్మ పరాయణులు ప్రజాహితతత్పరులు పద్మనాయక ప్రభువులు తొలుదొల్త శైవమతాభిమానులై యుండిరి మొదటి సింగమనాయని కుమారుడగు అనపోతానాయడు అనేక ప్రదేశములందు భైరవ ప్రతిష్ఠలు కావించెను కొంత కాలము గడచిన పిమ్మట ఈ ప్రభువులు వైష్ణవమతము నభిమానింప జొచ్చిరి వేదాంత దేశికుని కుమారుడగు వరదాచార్యుడను పండితుడు సర్వజ్ఞసింగభూపాలుని యాస్థానమున కేతెంచి అచ్చటి ఆస్థానపండితులగు శాక్తేయుల నట్టు నోడించి, వైష్ణవమతస్థాపనను కావించి రాజు వలన మిక్కిలి గౌరవము పొందినట్లు తెలియుచున్నది రాజులే మతము నవలంబించినను మాదృశ్య సంప్రదాయమునను సరించి వారు ఇతర మతముల వారిని ఆదరించెడివారు కాదు అంతేకాదు పద్మనాయక ప్రభువులు దేవాలయములకును బ్రాహ్మణ పండితులకును అగ్రహారముల నొసంగుచుండెడి వారు వ్యవసాయమును వృద్ధికావించుటకై పద్మనాయక ప్రభువులు యథాశక్తిగ కృషి కావించిరి రేచెర్ల వంశములోని పెక్కండ్రు ప్రభువులు స్వయముగ విద్వాంసులు వారు కవులను పండితులను మిక్కిలి ఉదార బుద్ధితో గౌరవించి సన్మానించిరి రాచకొండ పాలకుడైన రెండవ సింగమ నాయడు (1384-1399) స్వయముగ గొప్ప విద్వాంసుడు ఈతనికి సర్వజ్ఞ డను బిరుద నామముండెను ఈ సింగమ నాయని ఈవిని వర్ణించు చాటుపద్యములెన్నియో కలవు ఈతడు "సింగభూపాలీయము అను నామాంతరముగల రసార్ణవసుధాకర మను అలంకార గ్రంథమును వ్రాసినట్లు చారిత్రకుల మతము మూడవ సింగభూపాలునికి కూడ "సర్వజ్ఞ డను బిరుదనామమున్నట్లు తెలియవచ్చుచున్నది సర్వజ్ఞ" బిరుదమీ వంశము వారికి పరంపరాగతముగ లభించుచుండెడిది "నామలింగానుశాసనము" (అమరని ఘంటువు) పై వ్యాఖ్యానము రచించిన బొమ్మకంటి అప్పలా చార్యుడు మూడవసింగభూపాలుని యాస్థానమునలంకరించెను కవిసార్వభౌముడగు శ్రీనాథుడు ఈ భూపాలుని యాస్థానమును సందర్శించి గొప్ప సన్మానము బడసెను

రేచెర్ల వంశమునందలి పదునేడవతరము వాడగు రాయప్పనాయని కీవంశచరిత్రలో కొంత ప్రాముఖ్యత కలదు ఈ రాయప్ప ఓఢ్ర ప్రభువులగు గజపతులకు సామంతుడుగ నుండెను ఈ నాయడు రెండవ సింగమనాయని సోదరుడగు ధర్మానాయని వంశమువాడు ఈ రాయప్పనాయనికి ఓఢ్ర ప్రభువులు వెలుగోడురాజు అను బిరుదమును ప్రసాదించిరి ఆ కారణముచే మనకు సమకాలీనులగు రేచర్ల వారికి వెలు గోటివారను నామము సిద్ధించియుండ వచ్చును

సం బా శే

## వేంకటపతిరాయలు (రెండవ)

రెండవ వేంకటపతిదేవరాయలు తనయన్నయగు మొదటి శ్రీరంగరాయల అనంతరము విజయనగర సింహాసనమునధి ష్ఠించెను ఈ సంఘటన క్రీ శ 1588-89 ప్రాంతమున జరిగె నని చిట్టివేలి శాసనమువలన తెలియ వచ్చినది కాని "విజయ నగర సామ్రాజ్యము" 'వీరప్పయన కాలజ్ఞానము అను గ్రంథ ములు దీనితో భేదించుచున్నవి వీటిననుసరించి వేంకటపతి

రాయలు క్రీ శ 1586వ సం॥న సామ్రాజ్యమును గ్రహించి నట్లు తెలియుచున్నది మైసూరు సమీపమునందలి కోలారు శాసనము అహోబల శాసనము పై సంవత్సరమునే ధ్రువ పరచుచున్నవి

వేంకటపతిరాయలు రాజు కాగనే తన రాజధానిని విజయనగరమునుండి పెనుగొండకు తరలించెను మొదటి శ్రీరంగరాయల కుమారులు కిరువురు కొడుకులుండిరి కాని శ్రీరంగరాయలు మరణించునాటికి వారు చిన్నవయస్కులగుటచే సామ్రాజ్య నిర్వహణకు అశక్తులుగనుండిరి ఈ సందర్భమున సామంతులు వేంకటపతి రాయలను రాజ్యమును గ్రహింపుమని కోరుటచే అతడు విజయనగర సామ్రాజ్యాధీశుడయ్యెను వేంకటపతి రాయలు రాజైనతరువాత విజయనగరము మరియొకసారి వెలుగు చూచెను ఇతడు కడుసమర్థుడైన పరిపాలకుడును పరాక్రమవంతుడును అగుటచే, మహమ్మదీయ రాజులతో యుద్ధముచేసి వారినితన రాజ్యమునుండి తొలగద్రోచెను సామంతులు పాలెగాండ్రు కొందరు కేంద్రప్రభుత్వమునకు వ్యతిరేకముగా తిరుగుబాటు చేయగా వారి నాతడు అణచివేసెను దండయాత్రల కారణముగా కల్గిన ఆర్థిక చిక్కుల నాతడు తొలగించి వ్యవసాయమును అభివృద్ధి చేయ ప్రయత్నించెను

**వేంకటపతిరాయల యుద్ధములు** శ్రీరంగరాయల కాలమున గోల్కొండ సుల్తానులు కబళించిన విజయనగర రాజ్యభాగమును తిరిగి గ్రహించుటకు వేంకటపతి రాయలు పూనుకొనెను ఈ ప్రయత్నమున ఇబ్రహీం కుతుబ్షా ఆక్రమించిన ఉదయగిరి దుర్గమును వేంకటపతి తిరిగి వశపరచుకొనెను అనంతరము గోల్కొండ సుల్తానులనుండి కొండవీటి దుర్గమును స్వాధీన మొనర్చుకొనుట కాతడు యత్నించెను ఈ సందర్భమున అలీఖాన్ లూర్ అనుమహమ్మదీయ సరదారు వేంకటపతికి సాయముచేసెను కొండవీటి దుర్గము ప్రమాదములోనున్నట్లు తెలిసికొని, గోల్కొండలోని కులీకుతుబ్షా అమీరుల్ ముల్క్ అనుమంత్రి అధ్వర్యమున గొప్పసేనను విజయనగర సామ్రాజ్యముపై నడిపించెను అమీరుల్ కృష్ణానదినిదాటి విజయనగర సామ్రాజ్యమున ప్రవేశించెను విజయనగర సామంతులు శక్తిహీనులగుటచే అమీరుల్ నకు వశులైరి. నంద్యాల కలగూరు జూటూరు సిరివెల్ల దుర్గాధీశులు కుతుబ్షా అధికారమునకులొంగిపోయిరి ఇదే సందర్భమున కర్నూలు గుత్తిదుర్గములును ముసల్మానుల అధీనమయ్యెను ఇట్లు అనంతపురము కడప మండలములం దధికభాగమును వశమొనర్చుకొని అమీరు నంద్యాల నరసింహ రాయల అధీనమునన్న గండికోట దుర్గమును ముట్టడించెను నరసింహ రాయలు ఎదిరించెనేకాని అమీరుకు వశముకాక తప్పలేదు మార్గమధ్యమున ఆటంకము అధికముగలేమిచే పెనుగొండ వైపు అతి శీఘ్రముగ పయనించి రాజధానినిముట్టడించెను

ఈ దండయాత్ర వేంకటపతిరాయలను కలవరపరచెను తనకు సాయముగనున్న సామంతులింకను చేరలేదు యుద్ధమునకవసరమగు సన్నాహములు పూర్తికానేలేదు ఇట్టి స్థితిలో ముసల్మానుల దండయాత్ర నెదుర్కొనుట కష్టతరమయ్యెను కొలది సమయములభించినచో పెనుగొండ తననుతాను రక్షించుకొనుటకు సిద్ధమైయుండెడిది పరిస్థితులను చక్కగ ఆలోచించి రాయలు కుతుబ్షాతో సంధిరాయబారము చేసెను గోపరాజు తిమ్మనమంత్రి ఈరాయబారమును నిర్వహించెను విజయనగర సామ్రాజ్యము పతనావస్థలోనున్నదని భావించుటచేతను తన విజయ పరంపరచే సంతుష్టుడగుటచేతను సుల్తాను శాంతిసందేశము నంగీకరించి పెనుగొండ నుండి తనసైన్యమును వెనుకకు మరలించెను

వేంకటపతిరాయలు తనకు లభించిన అవకాశమును వినియోగించుకొని మూడుదినములలోనే తనసైన్యమున కవసరమైన ఆహారపదార్థములను కోటలోనికి చేర్పించెను ఇతరసాధన సామగ్రులను సమకూర్చుకొనెను నాల్గవ దినమున ముప్పది వేల సాయుధ భటులతో కూడినసైన్యము దుర్గమున ప్రవేశించెను ఈ సైన్యమునకు జగదేవరావు నాయకత్వము వహించెను ఇతడు గొప్పసైన్యముతో కుతుబ్షాసైన్యముపై లంఘించి దానిని జయించి ముర్తుజాఖాన్, నూర్ ఖాన్ అను సర్దారులను సంహరించి చిత్తాఖాన్ అను వానిని బంధించెను అపజయము చెందిన సుల్తాను దండయాత్రనుండి విముఖుడయ్యెను 'రఘునాథాభ్యుదయ'మను కావ్యమున ఈ దండయాత్రకు సంబంధించు విశేషములు కానవచ్చును

విజయగర్వితులగు విజయనగర వీరులు ముసల్మాను సైన్యమును తరుమసాగిరి ఈ ప్రయత్నములో వారు గుత్తి దుర్గమును జయించి గండికోటపై వెడలిరి కాని కొండవీటి దుర్గమునుండి సుల్తాను సైన్యము గండికోటకు సాయమునకై వచ్చుచున్నను ఇంతలో ఉదయగిరి దుర్గాధీశుడు వెంకటపతి

రాయల ఆదేశమున తన అల్లుని నాయకత్వము క్రింద సైన్య
మును గొండవీడుపై దాడి వెడలించెను అఫ్జుల్‌ఖాను కొంత
ప్రతిఘటించినను తుదకు లొంగిపోయెను ఈ సందర్భము
ననే అచ్చటి యితర దుర్గములను రాయల సైన్యములు వశపరచుకొనెను
ముసల్మాను సైన్యము గండికోట చేరుట అసాధ్యమయ్యెను
వర్షపాతముచే కలిగిన కృష్ణానదీ ప్రవాహము గోల్కొండ
నుండి రమ్మన్న సాయమునకు అడ్డు వేసెను ఎర్రకిమ్మ
రాజు నాయకత్వమున అతని సైన్యము గండికోటను విడిపించు
టకు విజయనగరమునుండి తరలెను కాని కడపను ముర్తుజా
ఖాను ముట్టడించెనను వార్త మార్గ మధ్యమున తిమ్మరాజు
నకు తెలిసెను విజయనగర సైన్యములో కొంత భాగము
కడపకు వెడలి ముర్తుజాఖానును తరిమివైచెను

ముసల్మాను సైన్యమునకు పరంపరగా కలిగిన పరాభవ
ములను గని కుతుబ్‌షా ఐదువేల అశ్వికులను రుస్తుంఖాన్
నాయకత్వమున ముర్తుజాఖానుకు బాసటగా పంపెను
రుస్తుం పెన్నానదీ తీరమున తన సైన్యముతో విడిసియుండగా
విజయనగర సేనలాతనిపై బడిరి ఈ సంకుల సమరములో
ముసల్మాను సైన్యము పూర్తిగా ధ్వంసమయ్యెను వెంటనే విజ
యనగర సైన్యము గండికోటపై తరలెను మార్గ మధ్యమున
చిన్నచిన్న దుర్గములను జయించుచు గండికోటను కూడా
వశపరచుకొనెను ముసల్మాను సైన్యము కృష్ణాది అవలిగట్టు
నకు తరిమివేయబడెను కుతుబ్‌షా తన రాజ్యము కృష్ణానదివరకే
పరిమితమైనట్లు భావింపవలసి వచ్చెను వేంకటపతి రాయల యుద్ధ
తంత్రము విజయనగర రాజ్యమునకు క్షేమకరమయ్యెను
గోల్కొండ సైన్యము తరచుగా విజయనగరముపై విజృంభిం
చుట ఆనాటి నుండి సాధ్యము కాకుండెను విజయనగర రాజ్య
మున అంతటితో శాంతి నెలకొనెను

ఈ విధముగా బాహ్యశత్రువుల నుండి రాజ్యమును
సురక్షితము చేసిన తరువాత అంతశ్శత్రువులను నిర్మూలించుట
వేంకటపతిరాయలు తన కర్తవ్యముగా భావించెను కొందరు
సామంతులు స్వతంత్రించి రాజ్యమునకు కీయవలసిన కప్పముల
నీయకుండిరి వారినణచుటయందు రాయలు నిమగ్ను
డయ్యెను ఇట్టి సామంతులలో కర్ణాటక ప్రాంతమందలి కోలా
రున కధిపతియగు తమ్మనగౌడను వాడొకడు పెనుగొండ
దుర్గము నుండి మహమ్మదీయులను పారద్రోలిన వెంటనే రాయలు
కోలారుదుర్గముపై విజృంభించి గౌడుని సైన్యమును పాత
మార్పగా చేయునదిలేక గౌడు రాయలకీయవలసిన కప్ప
మును చెల్లించి రాయలతో సంధిచేసికొనెను

ఈ రెండవ వేంకటపతిరాయలు 1597 98లో నందేల
కృష్ణమరాజు లేవదీసిన మరియొక తీవ్రమైన తిరుగుబాటు
నెదుర్కొని అణగద్రొక్కవలసి వచ్చెను ఈ తిరుగుబాటు
కూడ కప్పమునకు సంబంధించినదే కృష్ణమరాజు తిరుగుబాటు
నందు పరాజయమును పొంది తప్పించుకొని నందేల దుర్గమున
తలదాచుకొనెను వేంకటపతి రాయలాతనిని వెంబడించి
నందేలదుర్గమును మూడునెలలు ముట్టడించెను ఆత్మరక్షణ
మసంభవమని యెంచి కృష్ణమరాజు రాయల శరణుజొచ్చెను
ఆతని దుర్గమును సామంత రాజ్యమును రాయలు పెమ్మసాని
తిమ్మనాయకునకును దేవప్పనాయకునకును దత్తము చేసెను

ఇట్లుండ విజయనగర సామ్రాజ్యమందలి తమిళ ప్రాంత
మగు వెల్లూరి అధిపతి లింగముడను సామంతుడు రాయల అధి
కారమును అతిక్రమించెను రాయలు యాచమనాయకుని
నాయకత్వమున శక్తివంతమైన సైన్యమును లింగమునిపై
దాడిచేయ పంపగా లింగముడు తమిళ సామంతుల సైనిక
సాయమును సంపాదించి 1601 మేనెలలో ఉత్తరమల్లూరును
ముట్టడించెను యాచమనాయకుడు సైన్యములకు వెరవక
సహజ ధైర్యపరాక్రమములతోను తనసోదరుడగు సింగమ
నాయని సాయముతోను శత్రువులను నెదిరించెను ఇరువాగుల
వారి నడుమ ప్రజ్వరిల్లిన ఘోరయుద్ధములో పెక్కురు శత్రు
వీరులు మరణించిరి కొందరు ఎక్కలము చూపిరి లింగముని
పక్షమువారు పెక్కురు యాచమనాయకునకు బందీలయిరి
యాచమనాయకునకు దిగ్విజయము లభించెను విజయస్వజ
ముతో తనసన్నిధికి వచ్చిన యాచమనాయకుని వేంకటపతి
రాయలు అమూల్యమాల్యాంబరాభరణాదులతో సత్కరించి
నాడు ఈ సంఘటన తరువాత జరిగిన యుద్ధములలో చోళ
పాండ్య మండలములలోని సామంతులను రాయలు జయించి
వారిపై తన అధికారముద్రను అంగీకరింపజేసెను

రెండవ వేంకటపతిరాయల రాజ్యకాలమంతయు
దాదాపు యుద్ధములందే గడచిపోయినను రాజ్యనిర్వ
హణమునందును పరిపాలనా వ్యవస్థను చక్కదిద్దుటయందును
ఆతడు ప్రమత్తుడగనే యుండెను విజయనగర రాజ్యము
నందుత్తర భాగములన్నియు ముసల్మాను దాడుల మూల
మున పాడుపడి యుండెను అచ్చటి ప్రజలు క్షేమంకరముగ

మన్న యితర ప్రాంతములకు వలసపోయి యుండిరి వేంకటపతిరాయలు తిరిగి ఆ ప్రాంతములందు జననివసంప చేయుటకు ప్రయత్నించెను అచట వ్యవసాయము ప్రారంభింపదలచిన వారి అన్నిసౌకర్యములు సమకూర్పబడెను అతని సామంతులగు అనంతుడు పెన్నమసాని తిమ్మయ దేశమున పర్యటించి రైతులకు సర్వవిధముల సాయపడిరి తత్ఫలితముగా నాశనమైన ఆర్థికవ్యవస్థ తిరిగి నిలుకొనసాగెను క్రమముగా రాజ్యమంతయు ఫలవంతమయ్యెను

రెండవ వేంకటపతిరాయలు మూడు దశాబ్దుల కాలము రాజ్యపాలనము నెరపి మునల్మాను దాడులను నిర్మూలించి పతనావస్థలోనున్న సామ్రాజ్యమునుద్ధరించెను అంతర్వాహ్య శత్రువులను నాశనమొనర్చి తన విశాల రాజ్యమున సుస్థిరమైన శాంతిభద్రతలను నెలకొల్పెను

ఎం కు

## వేంకటేశ్వర ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము

ప్రాచీనులు సముపార్జించిన సాహిత్యవిజ్ఞానసంపద్భాండాగారములు పెన్నిధులవంటివి ప్రాచీన లిఖితపుస్తకములను తాళపత్ర గ్రంథములను సేకరించి సంగ్రహించిన వాటిలో శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనా సంస్థ గణనీయమైనది వేంకటేశ్వర ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము ఈ పరిశోధనా సంస్థయందలి విభాగము శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము స్థాపితమైన పిమ్మట ఈ సంస్థ దాని అనుబంధితమైనది కనుక ప్రాచ్యపరిశోధనా సంస్థ చరిత్రయందే ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగార చరిత్రకూడ గర్భితమైయున్నట్లు గ్రహింపనగును

క్రీ శ 1933 లో రంగనాథమొదలియారు తిరుమల తిరుపతి దేవస్థానపు నిర్వహణాధికారిగా నున్నప్పుడు దేవస్థానపు ఆదాయము నిలుకడగా పెరుగుట గమనించి రావుబహదూర్ రంగస్వామి అయ్యంగారిని సంస్కృత భాషా పరిశోధనకై ఒకసంస్థను స్థాపించుటకు ప్రణాళి ను సిద్ధము చేయుమని కోరెను ఈ కోర్కెను పురస్కరించుకొని సంస్కృత తమిళ భాషలలో పరిశోధనలు జరుగుటకొరకు ముసాయిదాను అయ్యంగారు సిద్ధపరచెను

అప్పటి మదరాసురాష్ట్రమున దేవాదాయశాఖామంత్రిగానుండిన డా రాజన్ పూనాలోని భండార్కర్ పరిశోధనా సంస్థకు చెందిన డా బెల్వాల్కరును తిరుపతిలో నెలకొల్పదలచిన పరిశోధనాసంస్థకొక ప్రణాళికను సిద్ధపరుపమని కోరియుండెను బెల్వాల్కర్ తెలుగును గూడ పరిశోధనా విభాగములో చేర్చుమని సలహా నిచ్చెను పై ఇరువురు అర్పించిన నివేదికలను ఆమోదించి దేవస్థానమువారు 1939 లో వేంకటేశ్వర ప్రాచ్యపరిశోధనా సంస్థను స్థాపించిరి అందు సంస్కృతము తెలుగు తమిళము పరిశోధనశాఖలుగా అంగీకరింపబడినవి

1939 మే నెలలో రంగస్వామి అయ్యంగారు ఆసంస్థకు డైరెక్టరుకాగా జులైలో ఆ సంస్థ ప్రారంభోత్సవము జరిగినది ఆ పిమ్మట పెక్కురు పండితులు దక్షిణభారతమున నలుమూలలకుపోయి శ్రమపడి సంస్కృతము తెలుగు తమిళ భాషలయందున్న వ్రాతప్రతులను దాదాపు పదివేలవరకు సేకరించి సంస్థయందు భద్రపరచిరి

1940 లో తిరుపతియందు అఖిలభారత ప్రాచ్యవిద్వన్మహాసభ రంగస్వామి అయ్యంగారి పర్యవేక్షణమున జరిగినది పిమ్మట ఆయన రాజీనామాచేయుగా డా కృష్ణమాచారియర్ 1941 లో సంస్థకు డైరెక్టరుగా నియుక్తులైరి ఈయన సంస్కృత సారస్వత చరిత్ర ను రచించిన ప్రసిద్ధవిద్వాంసుడు ఆ సంవత్సరములోనే ఈయన అకస్మికముగ మరణించగా 1942 లో ప్రొఫెసర్ రామానుజస్వామి ఆ స్థానములో ప్రవేశించినాడు

రామానుజస్వామి ప్రాకృతవ్యాకరణము నందును ఇండోయూరోపియను భాషాశాస్త్రము నందును చక్కని పండితుడు పదునాలుగు సంవత్సరములకు పైగా వీరి పరిశోధనా సంస్థకు డైరెక్టరుగ వ్యవహరించిరి వీరి సంపాదకత్వమున 1955 నాటికి సంస్కృతము తెలుగు తమిళభాషలలో పెక్కుగ్రంథములు వెలువడినవి ఈ పరిశోధనా సంస్థపక్షమున ఒకపత్రిక కూడ 1940 నుండి ప్రచురింపబడినది ఈయన యాజమాన్యమునందే ఈ సంస్థయందు అఖిలభారత ప్రసిద్ధిగడించిన అయ్యస్వామిశాస్త్రి మానవల్లి రామకృష్ణకవి, వేటూరి ప్రభాకరశాస్త్రి ప్రభృతులు పనిచేసి కీర్తి వహించిరి

1955 సెప్టెంబరులో ప్రొఫెసరు చెన్నారెడ్డి ఈ సంస్థలో డైరెక్టరుగా చేరినారు అప్పటికి సంస్కృతము, తెలుగు, తమిళము ఆగమము, సంగీతము అను ఆయిదు విభాగము

ఏర్పడినవి ఈ సంస్థ ఆతిథ్యమున 1955 నవంబరులో సంస్కృత విశ్వపరిషత్తు అధివేశనములు భారత ప్రథమరాష్ట్రపతి డా రాజేంద్రప్రసాదు అధ్యక్షతన వైభవముగా జరిగినవి

1954 సెప్టెంబరులో తిరుపతియందు శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము ప్రారంభింపబడినది అమూల్యమగు ప్రాచ్యలిఖిత పుస్తకసంపద విశ్వవిద్యాలయాధీనములో నున్నచో గవేషణమున కెక్కువ ఉపకరించునని దేవస్థానము వారును ఈ సంస్థ నిర్వాహకులును ఆంధ్రప్రభుత్వము వారును అభిప్రాయపడిరి పి హెచ్ డి పట్టపరిశోధనములు తెలుగు సంస్కృతవిభాగములందు విశ్వవిద్యాలయములో కొనసాగింపవలెనన్నచో లిఖితపుస్తక భాండాగారమెంతయో అవశ్యకమని విశ్వవిద్యాలయాధికారులు సైతము భావించిరి

అప్పటి ఆంధ్రరాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డి పూనికపై వేంకటేశ్వర విశ్వవిద్యాలయపు వైస్ ఛాన్సెలరు దేవస్థానపు కమీషనరులతో కూడిన ఉన్నతస్థాయి సమావేశము 1956 లో కర్నూలునందు జరిగినది అందీ సంస్థను విశ్వవిద్యాలయమునకు స్వాధీనపరచుటకు నిర్ణయము గైకొనబడినది 1956 నవంబరు 1 వ తేదీన ఆంధ్రప్రదేశ్ అవతరించిననాడే ఈ సంస్థ విశ్వవిద్యాలయమునకు స్వాధీన పరుపబడినది అమ్మనుడువడని కొన్ని ప్రచురణముల ప్రతులు తప్ప తక్కిన యావత్తును విశ్వవిద్యాలయమునకు అధీనమై నాటి నుండి ఇది శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్యపరిశోధనా సంస్థగా పరిగణింపబడుచున్నది 1958 జులై నుండి "శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్యసంచిక" అను పేర ఒకపత్రిక వెలువడుచున్నది

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయమున సంస్కృతాంధ్రములలో ఎం ఏ తరగతులు 1959 జులైలో ప్రారంభమైనవి అప్పుడు ఈ పరిశోధనా సంస్థ డైరెక్టరు ఈ విశ్వవిద్యాలయమున తెలుగుశాఖ యందొక అధ్యాపకుడుగ గ్రహింపబడెను దానిఫలితముగ విశ్వవిద్యాలయ కళాశాలాధ్యక్షుడే ప్రాచ్య పరిశోధనా సంస్థకును అధ్యక్షుడగుట సంభవించినది ఈ విధముగా తొమ్మిది సంవత్సరములు ఈ పరిశోధనా సంస్థ కార్యక్రమము కొనసాగిన పిమ్మట 1968 జులైలో ప్రొఫెసరు చెన్నారెడ్డి ఈ సంస్థకు డైరెక్టరుగా తిరిగి నియమింపబడిరి 1969 ఓ సెంబరు నాటికి ఈ సంస్థ పునర్వ్యవస్థీకరణము పూర్తియై ఇందలి ఉద్యోగులకు తక్కిన విశ్వవిద్యాలయ కళాశాలోద్యోగులతో సమానముగ వేతనము లిచ్చుటకు నిర్ణయమైనది

1968 సెప్టెంబరులో వైస్ ఛాన్సెలరు అధ్యక్షతన ఈ ప్రాచ్యపరిశోధనా సంస్థయొక్క సలహాసంఘము సమావేశమై ఈ దిగువ పేర్కొనబడినట్లు సంస్థ ఆశయములు లక్ష్యములు నిర్దేశింపబడినవి

(1) "శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయఓరియంటల్ జర్నల్" అను పేర వెలువడు సారస్వతసంచిక సంవత్సరమునకు రెండుసార్లు వెలువడవలసియుండును ఈ సంస్థయందలి పరిశోధనా విభాగము లందున్న ప్రతిపండితుడు కనీసమొక వ్యాసము నైనను ఏదేనియొక విభాగమునకు రచింపవలయును

(2) అల్పకాల ప్రణాళిక క్రింద సంవత్సరమునకొక లిఖితగ్రంథము సంస్కృతమునగాని తెలుగునగాని పరిచూడబడి పరిష్కరింపబడవలసి యుండును

(3) మూడువత్సరముల వ్యవధిగల దీర్ఘకాల ప్రణాళిక క్రింద ఎ హెచ్ డి కొరకు నిర్దిష్ట అంశముపై పరిశోధన మొనర్పబడును ఈ ప్రణాళికలు స్థాయిసలహాసంఘపర్యవేక్షణములో కొనసాగును

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్యపరిశోధనా సంస్థయందిప్పటికి సంస్కృతభాషలో పదివేలు తెలుగుభాషలో నాలుగువేల అయిదువందలు తమిళభాషలో పండ్రెండువందలు ప్రాచ్యలిఖిత గ్రంథములు భద్రపరుపబడియున్నవి 1958 నుండి 1970 వరకు పైచెప్పబడిన సారస్వత సంచికలు పదిసంపుటములు వెలువడినవి సంస్కృతమున "గలగ్రహణప్రకారః "అపాణినీయప్రామాణ్యసాధనమ్" అను గ్రంథములు ప్రకటింపబడినవి "కావ్యామృతమ్" 'సాత్వతామృతమ్ అను సంస్కృత గ్రంథములును ప్రద్యుమ్న చరిత్రము అను తెలుగు గ్రంథమును సిద్ధమై అచ్చగుచున్నవి

వ గో కృ

## వేంకటేశ్వర విశ్వ విద్యాలయము,

భారత స్వాతంత్ర్యోద్యమము, విశ్వవిద్యాలయముల స్థాపనము దాదాపు సమకాలమున జరగుట ప్రమాదవశమున ఘటిల్లినదికాదు బ్రిటిషు పాలనము పాదిగింపబడుటకు భారత దేశములో ఆంగ్ల విద్యాప్రచార మవసరమయ్యెను ఉన్నత వర్గములకు చెందిన భారతీయ విద్యార్థులను ఏకీకరించుట

ఆంగ్ల భాష ఎంతయు ఉపకరించినది విశ్వవిద్యాలయము లిట్లు భారత స్వాతంత్ర్య సంపాదనమునందు విశిష్టమగు పాత్రను నిర్వహించినవి.

క్రీ శ 1857 లో స్థాపితమైన మద్రాసు బొంబాయి కలకత్తా విశ్వవిద్యాలయములు పరీక్షా సంస్థలుగ మాత్రముండెను. అర్ధశతాబ్ది పిదప ఢిల్లీ, కాశి, అలిఘర్ విశ్వవిద్యాలయములు బోధనా సంస్థలుగ గూడ వెలసినవి.

పూర్వరంగము: క్రీ శ 1926 లో కీ శే డా కట్టమంచి రామలింగా రెడ్డి ఆధ్వర్యమున ఆంధ్ర విశ్వవిద్యాలయ మేర్పడెను. అది విశాఖపట్టణముననా లేక రాజమహేంద్రవరముననా కాక అనంతపురముననా యని చర్చింపబడి కడకు విజయవాడలో స్థాపింపబడి పిదప వాల్తేరునకు తరలించబడెను. ఇట్లు వేంకటేశ్వర (రాయలసీమ) విశ్వవిద్యాలయమునకు నాంది ఆంధ్ర విశ్వవిద్యాలయ స్థాపనముతో జరిగెను. కాని అట్టి విశ్వవిద్యాలయమేర్పడుటకు ఆంధ్ర రాష్ట్రావతరణము (1953) వరకు ఆగవలసివచ్చెను. అప్పుడీ రాష్ట్రమున రెండవ విశ్వవిద్యాలయావశ్యకతనుగూర్చి పరిశీలింపబడినది. నాటి ఆంధ్రరాష్ట్ర విద్యామంత్రియగు పట్టాభిరామారావు అధ్యక్షతన మంత్రివర్గ ఉపసంఘ మొకటి నెలకొల్పబడినది. ఈ ఉపసంఘ సభ్యులు మంత్రులు విద్యాశాఖకార్యదర్శియు 1954 ఫిబ్రవరిలో కర్నూలునందు సమావేశమైరి. దీనికి డా వి ఎస్ కృష్ణ (నాటి ఆంధ్రవిశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు) డా ఎస్ గోవిందరాజులు (నాటి విద్యాశాఖాధ్యక్షులు) చెలికాని అన్నారావు (నాటి తిరుపతి తిరుమల దేవస్థాన కార్యనిర్వాహక కోద్యోగి) ప్రత్యేకముగా ఆహ్వానింపబడిరి. కీ శే టంగుటూరి ప్రకాశంపంతులు (నాటి ముఖ్యమంత్రి) అధ్యక్షత వహించిరి.

పై సమావేశ పర్యవసానముగా నాటి ఆంధ్ర విశ్వవిద్యాలయ కళాశాలాధ్యక్షులగు శ్రీ రంగధామరావు తిరుపతికి పోయి పరిస్థితులను పరిశీలించి 28 2-54 వ తేదీన తమ నివేదికను మంత్రివర్గ ఉపసంఘ సభాసమావేశములో సమర్పించిరి. నివేదిక సారాంశమిది: తిరుపతిలో బోధన పరిశోధన శాఖలు కల్గిన శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయమేర్పడి రాయలసీమయందలి కళాశాలలను అనుబంధములుగా కల్గియుండవలెను. నాటి వేంకటేశ్వర ఆర్ట్సు కళాశాలా భవనములకును హాస్టలు భవనములకును ఖాళీస్థలమునకును 24 లక్షల రూప్యములు నుండును కావలెను. మొదట భౌతిక రసాయన జంతుశాస్త్రములతో ఆరంభించి రెండు సంవత్సరముల పిదప వృక్ష భూగర్భశాస్త్రములను ప్రవేశపెట్టవలెను. పశ మానవ శాస్త్రములతో ప్రారంభించి 5 సంవత్సరములలోగా మరి ఆరు మానవశాస్త్రములను ప్రవేశపెట్టవలెను.

ఆ సమావేశ ఫలితముగా రంగధామరావు విశ్వవిద్యాలయ ప్రత్యేకాధికారిగా 1954 మార్చిలో ప్రవేశించి 1954 ఆగస్టువరకు పనిచేసి యూనివర్సిటీ బిల్లును తదితర ప్రణాళికను తయారొనర్చిరి. 1954 మే నెలలో వాల్తేరునందు జరిగిన ఆంధ్ర రాష్ట్రశాసనసభ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ చట్టమును ఆమోదించెను. 1954 జులైలో ఈ చట్టము భారతాధ్యక్షునిచే ఆమోదింపబడెను.

ప్రారంభము: ప్రకాశంపంతులు 1954 సెప్టెంబరు 2 వ తేదీన వేంకటేశ్వర విశ్వవిద్యాలయమునకు ప్రారంభోత్సవము జరిపిరి. నాటి న్యాయాధిపతి కోకా సుబ్బారావు విశ్వవిద్యాలయాధ్యక్షులుగను పట్టాభిరామరావు గౌరవాధ్యక్షులుగను గోవిందరాజులు ఉపాధ్యక్షులుగను నియమితులైరి. పేరు ప్రఖ్యాతులుగల ప్రముఖులు ఆయాశాఖల కధ్యక్షులుగా ఆహ్వానింపబడిరి.

బి ఏ బి ఎస్ సి ప్యాసుకోర్సులు ఆనర్సుకోర్సులు పోస్టుగ్రాడ్యుయేటు కోర్సులు ప్రారంభమయ్యెను. నాటివరకు మద్రాసు విశ్వవిద్యాలయమునకు అనుబంధితములై యున్న ఆంధ్ర ప్రాంతములోని రాయలసీమ కళాశాలలు అప్పటినుండి వేంకటేశ్వర విశ్వవిద్యాలయమునకు అనుబంధితములైనవి. కాని 1955 1956 వ సం॥ మార్చి పరీక్షలు ఆంధ్ర విశ్వవిద్యాలయముచేతనే నిర్వహింపబడినవి.

ప్రథమ దశ: నాటి గవర్నరు త్రివేది చేసిన ప్రత్యేక కృషి ఫలితముగా యూనివర్సిటీ గ్రాంట్సు కమిషనువారు ప్రయోగశాలాభవనములకు గ్రంథాలయ భవనమునకు పరికరములకు గ్రంథములకు 8½ లక్షల రూప్యములను ఇతర భవన నిర్మాణములకు 25 7 లక్షల రూప్యములును మంజూరుచేసిరి. ఆంధ్రప్రభుత్వము వారు 7½ లక్షల రూప్యముల గ్రాంటును తిరుపతి దేవస్థానము వారు 2½ లక్షల రూప్యముల సాలుసరి గ్రాంటును 8½ లక్షల శాశ్వత గ్రాంటును మంజూరుచేసిరి.

డా ఎ లక్ష్మణస్వామి మొదలియారు డా వి ఎస్ కృష్ణ, డా డి నచారిన రెడ్డి ఇత్యాదులతో సంఘముగనేర్పడి

ఈ విశ్వవిద్యాలయమునకు ప్రథమనిబంధనావళిని రూపొందించిరి 1956 జూను నెలనుండి చిత్తూరు కర్నూలు కడప అనంతపురం నెల్లూరుజిల్లాలలో 8 వృత్తికళాశాలలు 8 ఆర్ట్సు సైన్సుకళాశాలలు 4 ప్రాచ్య కళాశాలలు ఏర్పడి ఈ విశ్వవిద్యాలయమునకు అనుబంధితములైనవి 1956 మే నెల నుండి ఆచార్య ఎస్ జి మనవాళ్ల రామానుజం ఆర్ట్సు కళాశాలాధ్యక్షులుగ పనిచేసిరి 1955 జూను నెలనుండి సెనేటు అకడమిక్ కౌన్సిలు ఎగ్జిక్యూటివ్ పనిచేయనారంభించెను 1955 నవంబరులో డా రాజేంద్రప్రసాదు సెనేటుకు ప్రారంభోత్సవమును భౌతికప్రకృతిశాస్త్రముల ప్రయోగశాలాభవనములకు గ్రంథాలయ భవనములకు శంకుస్థాపనమును గావించిరి అప్పటి నుండియే త్రివేది విశ్వవిద్యాలయాధ్యక్షులుగను డా బెజవాడ గోపాలరెడ్డి గౌరవాధ్యక్షులుగను ఉండిరి 1957-58 లో కర్నూలునందు ప్రభుత్వ కళాశాల స్థాపింపబడెను తిరుపతి దేవస్థానమునుండి వేంకటేశ్వర ప్రాచ్యపరిశోధనా సంస్థను వేంకటేశ్వర విశ్వవిద్యాలయము వారు స్వీకరించిరి 1958 ఫిబ్రవరిలో ప్రథమ పట్టప్రదానోత్సవము జరిగెను పరిశోధనశాఖలు ప్రారంభింపబడెను తిరుపతిలో పశువైద్య కళాశాలయు కర్నూలులో స్త్రీల కళాశాలయు స్థాపింపబడెను 1959 లో యూనివర్సిటీ గ్రాంట్సు కమిషను వారు ఈ విశ్వవిద్యాలయమును సందర్శించి ద్వితీయ ప్రణాళిక క్రింద ఉన్న సంస్థలను వృద్ధిచేయుటకును క్రొత్తవాటిని స్థాపించుటకును 28 లక్షల రూప్యములను మంజూరుచేసిరి డా గోవిందరాజులు మరి 5 సంవత్సరములపాటు ఉపాధ్యక్షులుగా నియమితులైరి 1959 అక్టోబరులో నెహ్రూ పండితుడు ఇంజనీరింగు కళాశాలా భవనమునకు శంకుస్థాపనయు భౌతిక ప్రకృతిశాస్త్ర ప్రయోగశాలా భవనములకు ప్రారంభోత్సవమును చేసిరి సంస్కృతము హిందీ ఉర్దూ భాషలందును వృక్ష భూగర్భ చరిత్ర మనశ్శాస్త్రములందు పరిశోధనయు ఇంగ్లీషు తెలుగు భాషలలో ఎం ఏ కోర్సులును ఇంజనీరింగు కోర్సును 1960 సెప్టెంబరునుండి ప్రారంభమయ్యెను 1961 62 లో తిరుపతియందు వేంకటేశ్వర సంగీత నాట్యకళాశాలయు (4 గ్రీకోర్సులతో) నెల్లూరులో సాయం కళాశాలయు ప్రారంభింపబడెను మద్రాసు విశ్వవిద్యాలయమునుండి ఈ విశ్వవిద్యాలయ ప్రాచ్యపరిశోధనా సంస్థకు వ్రాతప్రతులు సమకూర్పబడెను

1962 జనవరి నాల్గవ తేదీన జరిగిన ప్రత్యేక పట్టప్రదానోత్సవ సభలో డా సర్వేపల్లి రాధాకృష్ణన్‌కు డి లిట్ గౌరవ బిరుదమును అదేసంవత్సరము ఫిబ్రవరి 15 వ తేదీన జరిగిన పట్టప్రదానోత్సవ సభలో ద్వారం వేంకటస్వామినాయుడు కాశీకృష్ణాచార్యపండితులకు డాక్టరు బిరుదమును డా ఎ లక్ష్మణస్వామి మొదలియారుకు ఎల్ ఎల్ డి బిరుదమును ప్రదానము మొనర్పబడినవి 1963 64 లో గృహనిర్వహణశాస్త్రమునకు సంబంధించిన ఎమ్ ఎస్ ఎ కోర్సును కర్నూలు వైద్యకళాశాలలో ఎమ్ ఎస్ ఎమ్ డి ఎమ్ ఎస్ సి కోర్సులును నెల్లూరులో స్త్రీల కళాశాలయు ప్రారంభింపబడెను బి ఎ ఎస్ బి ఎ ఎస్ శిక్షణ తరగతులు కూడ ఆరంభమయ్యెను ప్రాచ్య కళాశాలలో వేదవిద్యయందు మెట్రిక్యులేషను సంస్కృతమునందు బి ఎ కోర్సులుకూడ ప్రారంభింపబడెను ఇటీవల ప్రొద్దుటూరు శ్రీకాళహస్తి కందుకూరు మొదలగు తావులందు కళాశాలలు స్థాపింపబడెను చిత్తూరు తిరుపతినగరములలో సాయం కళాశాలలు ప్రారంభింపబడెను 1964 జూనునెలనుండి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయమునకు డా వామనరావును 1969 నుండి డా జగన్నాధరెడ్డియు నుపాధ్యక్షులుగ నుండిరి

ప్రస్తుతము ఈ విశ్వవిద్యాలయములో ఇంగ్లీషు తెలుగు హిందీ సంస్కృతము ఉర్దూభాషలలోను భౌతిక రసాయన జంతు వృక్ష భూగర్భ గణాంక (statistics) గృహనిర్వహణ సంగీత శాస్త్రములందును ఆర్థిక తత్త్వ మనశ్శాస్త్ర గణిత చరిత్ర శాస్త్రాదులయందును ఎం ఏ ఎం ఎస్ సి తరగతులు నిర్వహింపబడుచున్నవి సంగీతమును తప్ప పై అన్నిశాస్త్రములందును పరిశోధన సాగింపబడుచున్నది

1967-68 సం॥ నుండి అనంతపురములో ఇంగ్లీషు తెలుగు గణితము భౌతిక రసాయన శాస్త్రములయందు ఎం ఏ ఎం ఎస్ సి తరగతులతో పోస్టుగ్రాడ్యుయేటు కేంద్రము ప్రారంభింపబడినది

ఇట్లు ఆంధ్రుల చిరవాంఛితములగు ఆంధ్ర వేంకటేశ్వర ఉస్మానియా విశ్వవిద్యాలయములు మూడును గుంటూరు, అనంతపురం వరంగల్లు నగరములలో పోస్టుగ్రాడ్యుయేటు కేంద్రములతో సహా మూడు పువ్వులు ఆరు కాయలుగ వర్ధిల్లుచున్నవి

బి దా శా

## వేంగమాంబ తరిగొండ

ఈమె జన్మస్థలము తరికుండ అను నామాంతరము గల తరిగొండ ఇది కడప మండలమునకు చెందిన వాయల్పాడు గ్రామమునకు నాలుగు మైళ్ల దూరముననున్నది ఈమె 19 వ శతాబ్ది మధ్యభాగమున నుండినట్లు ఊహించుటకాధారములు కనబట్టుచున్నవి నందవరీక బ్రాహ్మణుడు వసిష్ఠ గోత్రీకుడునైన కానాల కృష్ణార్యునకును మంగమాంబకును వేంకటేశ్వర వరప్రసాదమున ఈమె జనించెను ఏ ఆచార్యుల కడను ఈమె ఓనమాలయినను అభ్యసింపలేదనియు సుబ్రహ్మణ్యగురుడీమెకు మంత్రదీక్ష నొసంగెననియు ఈమె రచించిన ద్విపద భాగవతము వలన తెలియవచ్చును బాల్యమునందే ఈమెకు సంగీత సాహిత్యములయందు ప్రజ్ఞ వర్ధించియుండినట్లు తోచును చిన్ననాటనుండియు తిరుమల వేంకటాచలపతిని పతిగా వరించి మధుర భావమున ఆ దేవుని అర్పించిన ప్రేయసియయి ఈమె ఆ భావప్రేరణమున ఈమె గావించు చర్యలు ఈమె మనస్సు దాంపత్య సుఖములపైన మొగ్గుచున్నట్లు తల్లిదండ్రులు అపోహచెందిరి వివాహమొనర్చినచో ఆమెమనస్సు కుదుటపడునను భ్రాంతితో శ్రీవత్సగోత్రీకుడు మంజేటితిమ్మయ పుత్రుడునగు వేంకటాచలపతికి ఈమె నిచ్చి వారు వివాహము జరిగించిరి కాని దైవదుర్విపాకమున కళ్యాణమయిన ఆరునెలలకే ఈమె విగతభర్తృకయయ్యెను సహజధీరచిత్తయగు ఈమె అందుల కావంతయు సంచలింపక మర్త్యమూర్తియగు వేంకటాచలపతి అమరస్వరూపమునన వేంకటాచలపతియందు లీనమైనట్లు భావించుకొనెను ఈ భావనలో రెట్టించిన శ్రద్ధాదీక్షలతో ఆ దేవదేవునిపై దృశ్య శ్రవ్యరూపములగు ప్రబంధముల ననేకముల రచియించుచు తద్గుణములను కీర్తించెను ఆమె రచియించిన కృతులు (1) వేంకటాచలపతి మాహాత్మ్యము (2) రాజయోగ సారము (3) యోగవాసిష్ఠము (4) ద్విపదభారతము (5) ద్విపద భాగవతము (6) నృసింహశతకము (7) నృసింహవిలాస కథ (8) శివనాటకము (9) కృష్ణనాటకము (10) పారిజాతాపహరణము (11) రమాపరిణయము అను పెండ్లి పాట (12) చెంచునాటకము (13) శ్రీకృష్ణమంజరి (14) రుక్మిణీనాటకము (15) గోపికానాటకము ఈ విధముగ వస్తువైవిధ్యమేర్పడసాగినకృతులు ఈమె కవితానైపుణిని ప్రకటించును గంభీరములగు వేదాంతవిషయములను విశదీకరించుపట్టులందు కూడ ఈమె శైలి కుంటుపడక చాల సరళ మధురయుతమగు పదములతో వ్యావహారిక భాషకు సన్నిహితమైయుండుట ప్రశంసనీయము శృంగారాసక్తిజ్ఞయైన ఈమె రచనలయందు శృంగార రసఘట్టముల వర్ణనములు కన్పించును ఆయా సందర్భములందు శ్రీకృష్ణుడే తనకు తోడ్పడి రచనసాగింపజేసెనని ఆమె వివరించెను ఆ యా రచనలయందు ఛందో వ్యాకరణాలంకార శాస్త్రనిషిద్ధములగు దోషములు కనవచ్చును కాని అనర్గళమైన కవితా ప్రవాహవేగమునకును అంకురించిన భక్తి సంధూతమగు తరంగ సముద్భూతికిని అవి పరిహార్యములుగనే తోచును

భర్త చెంపున లోకదృష్టికి విధవయయ్యు శ్రియఃపతికి సతి యను భావనతో ఆమె పుణ్యస్త్రీ వేషమును త్యజింపదయ్యెను అందులకు పామరులు ఆమె శీలమును శంకించి ఆమెను పెక్కువిధముల బాధింపసాగిరి శృంగేరి పీఠస్థులగు శ్రీశంకరాచార్యులు శోధించి ఆమె పరాభక్తి నిధాన యని నిరూపించినను జనులామెను వేధించుట మానరయిరి అంతట ఆమె స్వగ్రామమును విడచి తిరుమలయందు నివసించెను అచటను జనపీడ తప్పకపోయెను అంతటితో ఆమె జన సాంగత్యమును రోసి తిరుమల ప్రాంతమున నున్న దుర్గమారణ్య సీమల జొచ్చి యోగినివలె చరించెను తుదిలో ఇష్టదైవత స్వామియగు వేంకటాచలపతితో ఈమె ఐక్యత సాధించెను ఆదివ్యసతీమతల్లిని కేవలము కవితాదృక్కోణమున లక్షించువారు ఆమె సత్యస్వరూపమును దర్శింపజాలరు సంగీత సాహిత్యములయందు ప్రజ్ఞ ఆమె పరమావధి కాదు అది నిమిత్తమాత్రకమైన సాధన సంపత్తి అంతియే సాధనాపథమున సిద్ధించు అణిమాదిసిద్ధులతోపాటు పరమ పురుషార్థమగు పురుషసాక్షాత్కారముతో కూడ ఆమె తృప్తినొందలేదు తాదాత్మ్యస్థితిని సాధించిన మహాప్రకృతిస్వరూపిణి తరిగొండ వేంగమాంబ

హ. ఫ.

## వేంగిపురము

నన్నయభట్టు మహాభారతారంభమునందలి అవతారికలో రాజమహేంద్రవరమును వర్ణించుచు అది అఖిల జలధివేలా వలయిత వసుమతీవనితావిభూషణంబైన వేంగిదేశమునకు నాయకరత్నము" వలె నుండెనని చెప్పియుండెను దీనిని బట్టి తూర్పు చాళుక్యులు పరిపాలించిన దేశమునకు వేంగిదేశమని

పేరున్నట్లు తెలియుచున్నది దానికి రాజరాజనరేంద్రుని కాలమునను అంతకు ముందును కూడ రాజమహేంద్రవరమే ముఖ్య పట్టణముగ నుండినను ఒకప్పుడు వేంగిపురము ముఖ్య పట్టణముగ ఉండినట్లూహింపవచ్చును దానిని బట్టియే ఆ దేశమునకు వేంగిదేశమను పేరు కలిగియుండును

ఆంధ్ర రాజులలో ప్రథములని చెప్పదగిన శాతవాహను లకు ప్రస్తుతము మహారాష్ట్ర ప్రాంతమున ఉన్నట్టియు గోదావరీ నదీ తీరస్థమును అయిన ప్రైతాన్ రాజధానిగా ఉండెను వనవాసి ధాన్యకటకము అనునవి శాతవాహన సామ్రాజ్యమున ప్రవృద్ధికెక్కిన మరి రెండు పెద్ద పట్టణములు ఆ యుగముననే ప్రవృద్ధిపొంది శాతవాహనుల అనంతరము రాజ్యములు నెలకొల్పిన రాజవంశముల వారితో సంబంధము గల పురప్రముఖములలో కూడూరు వేంగిపురము అగ్రగణ్య ములైనవి యువాన్‌చాంగ్ అను చైనా యాత్రికుడు భారతదేశమును దర్శించినప్పుడు దక్షిణాపథమున కూడ పర్యటనము చేసియుండెను అతడు కళింగ దక్షిణ కోసలము లను దర్శించిన ఎమ్మట అటవీమార్గమున పయనించి ఆంధ్ర దేశమునకు వచ్చెను అతడు చెప్పిన ప్రకారము ఈ దేశము యొక్క చుట్టుకొలత 300 మైలు దీనికి ముఖ్య పట్టణము 'ఒంగ్-కీ-లో' ఇది ప్రస్తుతము పశ్చిమ గోదావరీ మండలము నకు ముఖ్య నగరమైన ఏలూరునకు సమీపమున నున్న వేంగి లేక వేంగిపురమని గుర్తింపబడినది ప్రాచీన వేంగిపురముండిన ప్రదేశము మిక్కిలి విస్తృతమై ఇప్పుడు శిథిలములతో కూడి యున్నది అక్కడ ప్రస్తుతము పెదవేగి చినవేగి దెందులూరు అను గ్రామములు వెలయుచున్నవి శ్రీ శ్రీ భావరాజు వేంకట కృష్ణారావు "ఆంధ్రదేశ పూర్వ రాజవంశములు" అను గ్రంథమున (పుట 9) యువాన్‌చాంగ్ దక్షిణాపథమును దర్శించినప్పుడు ఆంధ్ర (వేంగి) దేశమునకు వేంగిపురము కాక పిష్టపురము (పిఠాపురము) రాజధానిగా ఉండినట్లు తూర్పు చాళుక్య శాసనముల వలన తెలియుచున్నదని వ్రాసినారు

శాతవాహనుల తరువాత ఆంధ్రదేశ భాగములను ఇక్ష్వాకులు బృహత్పలాయనులు ఆనందగోత్రికులు పరి పాలించినట్లు తెలియుచున్నది ఆనందగోత్రికుల అనంతరము ప్రాముఖ్యమునకు వచ్చిన వారు శాలంకాయనులు వీరి చరిత్రను బాగుగ తెలిసికొనుటకు ఆధారములుగా ఆయను తామ్రశాసనము లిప్పుడు లభించుచున్నవి అందు మొదటిది విజయదేవవర్మ వేయించిన ఏలూరు ప్రాకృతశాసనము రెండవది విజయనందివర్మ కొల్లేరు శాసనము మూడవది నందివర్మ కాలమందలి పెదవేగి తామ్రశాసనము విజయస్కందవర్మ నందివర్మల రాజ్యకాలములకు చెందిన మరి రెండు తామ్ర శాసనములు గుంటూరు మండలమందలి కంతేరులో లభించినవి బృహత్పలాయనులు ఆనందగోత్రికులు నున్నగు వారికి వలెనే శాలంకాయనులకు కూడ వారి గోత్రనామమును బట్టి ఆ పేరు కలిగినది

శాలంకాయనరాజులు పాలించు కాలమునందే క్రీ శ నాల్గవ శతాబ్ది మధ్యభాగమున సముద్రగుప్తుడు ఆంధ్రదేశముపై దండెత్తెను సముద్రగుప్తుని అలహాబాదు శాసనము అతడు శాలంకాయన వంశమునకు చెందిన వైంగేయక హస్తివర్మను ఓడించినట్లు చెప్పుచున్నది వైంగేయక అనగా వేంగిదేశము నకు సంబంధించిన అని అర్థము కౌసలిక మహేంద్ర మహా కాంతారిక వ్యాఘ్రరాజ కౌరాళక మండరాజ కొట్టూరక స్వామిదత్త పైష్టపురక మహేంద్ర ఏరండపల్లక దమన, కాంచేయక విష్ణుగోప అవిముక్తక నీలరాజ పాలక్కక ఉగ్రసేన ప్రభృతులు అతనిచే ఓడింపబడిన ఇతర రాజులు

శాలంకాయనులు సూర్యభక్తులుగా కనబడుచున్నారు వేంగిపురమున సూర్యదేవాలయముండెనట శాలంకాయన రాజులకందరకును వారి శాసనములలో వాడబడిన 'చిత్రరథ స్వామి పాదానుధ్యాత' అను విశేషణము ఈ విషయమును ధృవ పరచుచున్నది చిత్రరథుడనగా సూర్యుడని నిఘంటువులు చెప్పు అర్థము సూర్యదేవుని పాదములను ధ్యానించు వారని పై విశేషము యొక్క భావము కొన్ని శాలంకాయన ముద్రలపై కాన్పించు ఉజ్జ్వలకిరణములతో కూడిన సూర్య బింబ చిహ్నము కూడ ఈ విషయమును బలపరచుచున్నది ఆంధ్రదేశమందలి సూర్యారాధనకు ప్రథమోదాహరణమును శాలంకాయన శాసనములే సమకూర్చుచున్నవి రాజధాని యైన వేంగిపురమునందే చిత్రరథస్వామి దేవాలయముండె ననుటకు ఆధారములు కన్పట్టుచున్నవి ప్రస్తుతము ఏలూరునకు వాయవ్యముగా ఎనిమిది మైళ్ల దూరమున ఉన్న పెదవేగి గ్రామమందలి చిన్న మట్టిదిబ్బయే పూర్వము చిత్రరథస్వామి దేవాలయముండిన చోటని తెలియుచున్నది అక్కడ కొన్ని ప్రాకృతశాసనముల అవశేషములు కూడ గోచరించినవి ఈ

ప్రదేశమునకు సమీపమున ఇప్పుడొక విష్ణుదేవాలయము కట్టబడి యున్నది

శాలంకాయనుల తర్వాత విష్ణుకుండినులు వేంగీసింహాసనము నాక్రమించిరి. వారి తరువాత క్రీ శ 7 వ శతాబ్దిలో ఆంధ్రదేశము తూర్పు చాళుక్యుల వశమైనది. ఈ చాళుక్యులు బాదామి చాళుక్యుల వంశమునకు చెందినవారే. రెండవ పులకేశి చక్రవర్తి తన దండయాత్రలలో తూర్పు తీరముపై కూడ దాడి వెడలి క్రీ శ 624 వ సం॥న వేంగీరాజ్యమును వశము చేసికొనెను. కాని ఆ ప్రాంతమున ఎదురుతిరిగిన వారినందర నణచి శాంతిని నెలకొల్పుటకు అతనికి సుమారు ఆరు సంవత్సరములు పట్టెను. తరువాత పులకేశి అనుజుడైన విష్ణువర్ధనుడు వేంగీపురము నుండి రాజప్రతినిధిగా వేంగీదేశమును పాలించెను. పులకేశి పల్లవులపై సాగించిన దండయాత్రలలో తమ్ముడు చూపిన అపరాక్రమమునకును చేసిన సాహాయ్యమునకును మెచ్చి అతనికి వంశపారంపర్యముగ అనుభవించుటకై వేంగీరాజ్యము నిచ్చివేసెను (క్రీ శ 631) అప్పటినుండియు కుబ్జవిష్ణువర్ధనుడు వేంగీదేశమునకు రాజయ్యెను. అతని సంతతివారైన రాజులలో ఎవరో రాజధానిని వేంగీపురము నుండి రాజమహేంద్రవరమునకు మార్చియుందురు

పూర్వ మొక మహానగరమును ఒక రాజ్యమునకు రాజధానియునై ఉండిన వేంగీపురమిప్పుడు కళావైభవములు తొలగి చిన్న గ్రామమై అందందు గోచరించు పురాతన వైభవ చిహ్నములచే చూచువారికి వింత కలిగించుచున్నది. క్రీ శ 1840 లో ఆప్రాంతమున ఖననాదులు సాగించిన సర్ వాల్టర్ ఇలియట్ పురాతన వేంగీపుర వైభవ దృశ్యమును విపులముగా వర్ణించెను. ఇచ్చటి దేవాలయములందలి రాళ్లను కొనిపోయి మహమ్మదీయులు ఏలూరులోని కోట కట్టిరని చెప్పుదురు. ఇప్పటి హీనస్థితిని చూచినచో ఇచ్చట పూర్వమొక సుందరమైన మహానగరముండెనని ఎవ్వరును విశ్వసింపరు. కాని విజయదేవ విజయనందివర్మల శాసనములు దాని ఉనికిని స్థిరపరచుచున్నవి. దండి మహాకవి కొల్లేరు సరస్సును వర్ణించుచు దానికి అనతి దూరమున ఉండిన వేంగీపురమునే ఆంధ్రనగరమని పేర్కొని ఉండుట ఈ విషయమును బలపరచుచున్నది. పైన పేర్కొనబడిన శాసనములందు ఉదాహరింపబడిన చిత్రరథస్వామి దేవాలయమిప్పటికిని నిల్చియుండి, ఆ పేరుతోనే పిలువబడుచున్నది. వేంగియందలి కోటలో ఒక పెద్ద బావి యున్నది. శత్రురాజులు కోటను ముట్టడించి వశము చేసికొన్నప్పుడు అభిమానవతులైన రాణివాసాంతరులు అవమానభయమున ఆ నూతిలో ఉరికి ప్రాణత్యాగము చేయుచుండిరని అచ్చటి వారు చెప్పుదురు

ఇప్పటి పెదవేగి గ్రామమందలి జనసంఖ్య 4570 ఇందు బ్రాహ్మణులు వైశ్యులు కమ్మలు కాపులు పద్మసాలులు గౌడులు మంగలులు గొల్లలు ఉప్పర్లు మంగళ్లు మాలమాదిగలు యెరుకలవారు గలరు. ఇచ్చటివారి ప్రధాన జీవనోపాధి వ్యవసాయమే. వ్యవసాయపు కూలియు సాంప్రదాయికములైన వృత్తులును కొందరికి జీవనమును సమకూర్చుచున్నవి. గ్రామమున పరమేశ్వర రామాలయములున్నవి. గంగానమ్మయు పోతురాజును గ్రామదేవతలు. ప్రతి సంవత్సరము కార్తీక మార్గశీర్ష మాసములలో 44 దినములు పరమేశ్వరస్వామి ఊరేగింపుటుత్సవములు జరుగుచుండును. వర్ణమతభేదములు లేక గ్రామస్థులందరు ఈ ఉత్సవములలో పాల్గొందురు. గంగానమ్మకును, పోతురాజునకును కూడ ప్రతి సంవత్సరము జాతరలు జరుగును. ఇట్లే ప్రతి సంవత్సరము చైత్రశుద్ధ నవమి నాడు శ్రీరామనవమి ఉత్సవము వైభవోపేతముగా జరుపబడును

ది వెం

## వేటూరి ప్రభాకరశాస్త్రి.

ఆంధ్ర సంస్కృతసాహిత్యములందేకాక పరిశోధన ప్రావీణ్యమునందును ఆరితేరి బహుగద్యపద్యగ్రంథములను వాటి కానువాదములను విమర్శలను వెలయించి అపారకీర్తి నార్జించిన పండితప్రవరులు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు. ఆయన దివితాలూకా పెదకళ్లేపల్లి గ్రామమున క్రీ శ 1888వ సం॥ ఫిబ్రవరి 7వ తేదిని శ్రీవత్సగోత్రమునకుచెందిన వెలనాటి వైదిక బ్రాహ్మణవంశమున శేషమ్మా - సుందరశాస్త్రులను పుణ్యదంపతులకు తృతీయాపత్యముగా జన్మించెను

సుమారైదు ఏండ్లాయూలో బడిపంతులుగా ఉండి పలువురికి ప్రాథమిక విద్యాశిక్షణమొసంగిన కొట్టరువు సుందరరామయ్యచేత సుందరశాస్త్రి తనకుమారునకు అక్షరాభ్యాసము చేయించెను. ఆ బడిలో చదువుచుండినకాలమున ప్రభాకరశాస్త్రి అన్నింట తానే చిన్ననాటనుండి ఉపాధ్యాయులకు ఆనందము కల్గించు చుండెడివాడు. సంగీతము

రాకుండినను అతడు సందర్భశుద్ధిగా పెక్కుపద్యములను చదివి తోడిబాలురకు ముచ్చటగొల్పుచుండెను ఆయన యింట సంస్కృతాంధ్ర గ్రంథములు అనేకములుండుటచే అర్థమయినను కాకపోయినను వాటిని ఎడతెగక చదువుచుండెడివాడు తండ్రి అతనికి తెలుగుమరుగులు తెలియజెప్పుచుండెను తెలుగునందలి మాధుర్యముచే ఆకర్షింపబడియు బందరు వెళ్లినగాని ఆంగ్లమును చదువుటకు ఆ రోజులలో అవకాశము లేకపోవుటచే అట్లుచేయుటకు పరిస్థితులు అంగీకరింపకయు అతడు ఇంగ్లీషు చదువును నిరాకరించెను ఇంటివద్దనే అతడు తెలుగు చదువుచు తన తండ్రికి బాల్యమిత్రుడయిన మద్దూరి రామావధానులుకడ సంస్కృతము నభ్యసించెను ఉపనయనానంతరము ఆయన చల్లపల్లి కేగి మహర్షికల్పుడైన అద్దేపల్లి సోమనాథశాస్త్రిగారి యొద్ద లఘుకౌముదిని చదువనారంభించెను సోమనాథశాస్త్రిగారు వ్యాకరణసూత్రములతోపాటు అతనికి పాతంజలయోగసూత్రములనుకూడ బోధించెను ఇట్లు ఆకస్మికముగా యోగసూత్రములనుకూడ పఠించుట ప్రభాకరశాస్త్రికి ఉత్తరజీవితమున చాల ఉపకరించినది

ఆరోజులలో శతావధానులు చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు బందరుపురమున హిందూహైస్కూలులో తెలుగు పండితులుగా పనిచేయుచుండిరి ఆయన కవితాపాండితీవిశేషములను గూర్చి పలువురు వింతగా చెప్పుకొనుచుండుట విని, ప్రభాకరశాస్త్రియు అతని సహాధ్యాయుడైన అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రియు ఒసపాటివేంకటరామశాస్త్రియుబందరువకేగి వేంకటశాస్త్రిగారికి శిష్యులైరి ప్రభాకరశాస్త్రి అచ్చట పుస్తకము పట్టి చదివినది తక్కువైనను, వేంకటశాస్త్రిగారు కావించుచుండినసారస్వత వినోదగోష్ఠులలో పెక్కువిషయములను నేర్చుకొనగల్గెను "తెలుగున నాకేమేని ఎరుకయేర్పడెనన్నచో నది శ్రీ వేంకటశాస్త్రిగారి గురుతానుగ్రహప్రాప్తమే" అని అతడొకచోట వ్రాయుండెను అప్పుడే అతనికి పద్యరచనాపాటవము అవధానవిద్యయు, ఉపన్యాసధోరణియు అలవడెను

బందరులో సుప్రసిద్ధన్యాయవాదులు వదాన్యులునైన వల్లూరిసూర్యనారాయణరావుగారి ప్రేరణచే ప్రభాకరశాస్త్రి తన పదునెనిమిదవయేట చెన్నపురి కరిగి 'కెల్లెట్' ఉన్నత పాఠశాలలో తెలుగుపండితులుగా నెలకొనిరి

అచ్చట రెండేండ్లు పనిచేసినపిమ్మట ఆయన చెన్నపురియందలి ప్రభుత్వలిఖితపుస్తకభాండాగారమున పండితులుగా చేరి ఆ పదవిని ముప్పదేండ్లకుపైగా నిర్వహించిరి ఇరువదిరెండవయేట ఆయన ఘంటసాల గ్రామవాసులైన ఒసపాటివారి ఆడపడుచును వివాహమాడిరి

చిత్రము – 88



పటము – 1
వేటూరి ప్రభాకరశాస్త్రి

చెన్నపురి ప్రాచ్యపుస్తకభాండాగారమున చేరినప్పటినుండియు ప్రభాకరశాస్త్రి కావించిన సారస్వత పరిశోధనకృషి అపారమును అమోఘమును ఐనట్టిది ఆయన తాళపత్రగ్రంథములను ఎడతెగక పరిశోధించి అముద్రితములైన వాటిని కొన్నిటిని లోకమున కెరుకపరచెను కొన్ని ఉత్తమ గ్రంథములను సాధు పాఠములతోడను అమూల్యములైన పీఠికలతోడను పరిష్కరించి ముద్రింపించిరి ఆరోజులలోనే ఆయన శివకవుల రచనలన్నియు చదివి నిశితమైన పరిశోధనము సాగించిరి అప్పుడు భాషావిషయమున చెలరేగుచుండిన వాదోపవాదములను పరిశీలించి ఆయన వ్యావహారిక భాషావాదమునకు అనేకవిధముల చేయూత నొసంగిరి ప్రాచీన తాళపత్రగ్రంథములను పరిశీలించునపుడు అందందులభించిన అపూర్వములైన చాటువులను సంకలనముచేసి ఆయన చాటుపద్యమణిమంజరి అను పేర ఒకగ్రంథము ప్రకటించిరి అది ఆయన ప్రతిభాపరిశోధన పాటవములకు చక్కని నిదర్శనము

ప్రభాకరశాస్త్రి పరిష్కరించి ప్రకటించిన పూర్వకావ్యములలో బసవపురాణము' రంగనాథరామాయణము' ఉద్భటారాధ్యచరిత్రము హరవిలాసము', 'మనుచరిత్రము' క్రీడాభిరామము ముఖ్యములైనవి వీటిలో కొన్నిటికి ఆయనరచించిన పీఠికలు ఆయన పరిశోధన పాటవమునకును పాండితీప్రకర్షకును విమర్శన వైశారద్యమునకును భాషాపరిజ్ఞానమునకును పట్టుగొమ్మలై, పలువురు పండితుల ప్రశంసలకు పాత్రములైనవి అందును, 'బసవ

పురాణ' క్రీడాభిరామములు పీఠికలు భాషాసారస్వతములకు సంబంధించిన పెక్కు నూతనవిషయములను వెల్లడించుచు గ్రంథపరిశోధన పరాయణులకు పెక్కువిధముల మార్గదర్శకములై రాజిల్లుచున్నవి. శృంగారశ్రీనాథ మను విమర్శ గ్రంథమున అతడు రెడ్డిరాజుల చరిత్రమును శ్రీనాథుని జీవిత ప్రవృత్తులను అతని రచనల పౌర్వాపర్యమును చక్కగా వెల్లడించిరి. ప్రభాకరశాస్త్రి నీతిప్రవర్తనమునకును ఎక్కువ ప్రాధాన్యము నొసంగువాడగుటచే ఆంగ్లమూలమునుండి నీతినిధి అను గ్రంథమును అనువదించి ప్రకటించిరి. అతడిందు అలతి అలతి పలుకులతో సర్వజన శిరోధార్యములును ఉత్తమగతి ప్రాపకములును జననీతులను హృద్యముగా విశదీకరించి ఉన్నారు.

ప్రభాకరశాస్త్రి భాషాసారస్వతములకును చరిత్రకును సంబంధించిన పెక్కు వ్యాసములను ఆయాపత్రికల యందు ప్రకటించి ఉండిరి. అవన్నియు అతని పరిశోధన ప్రాగల్భ్యమునకును పరిశీలన పాటవమునకును నిదర్శనములైనట్టివే. అందు ముఖ్యములైనవి తెలుగు మెరుగులు మీగడతరగలు సింహావలోకనము అను పేర్లతో గ్రంథములుగా ప్రకటింపబడినవి. వివాదాస్పదాంశములను పరిష్కరించుటయో నూత్న విషయమును వెల్లడించుటయో ఆయన వ్యాసములందలి విశిష్ట లక్షణము.

ప్రభాకరశాస్త్రి ఎంతపండితుడో అంతమంచి కవి. కపోతకథ కడుపు తీపు 'మూనాళ్ల ముచ్చట విశ్వాసము' దివ్య దర్శనము అనునవి ఆయన పద్యకావ్యములు. ఇవి పరిమాణమున చిన్నవయ్యును ప్రౌఢతాపరిపాకమున మిక్కిలి మిన్నలైనట్టివి. కపోత కథ భారత మందలి లుబ్ధకపోతోపాఖ్యానమును అనుసరించి వ్రాయబడినది. దివ్య దర్శనము ఆయన ఆత్మానుభవమునకు సంబంధించినది. తక్కినవి ఆయన స్వయముగా చూచిన సన్నివేశములకు రసవత్కావ్యరూపములు. ఆయన పద్యశైలి ప్రౌఢమై నిరాడంబరమై జాతీయ పదశోభితమై పూర్వకవుల రచనలను తలపించుచుండును. సహజమైన ఆధ్యాత్మికచింతనముచే ఎప్పుడో కాని ఆయన కవితా వ్యవసాయమునకు కడంగెడి వాడు కాడు. "కవితాశిల్పము నల్పగా తొలుత వేడ్కల్ రేగె నాకున్, గృహ ల్ చివురెత్తెన్ పసమోము మొత్తె నిక నాచే శిల్లవీ కల్లిబొల్లి వినోదంబు" అని ఆయనొకచో వ్రాసియుండిరి. దీనిని బట్టి ఆయన ఉత్తర జీవితమున విరాగభావము మెండై ముఖ్యము కూడ కలిగినట్లు తెలియవచ్చును. ఆయన భాస మహాకవి రచించిన ప్రతిమ కర్ణభారము మధ్యమవ్యాయోగము అను నాటకములను బోధాయన కృతమైన భగవదజ్జుకమును మహేంద్రవిక్రమవర్మ రచితమైన మత్తవిలాస ప్రహసనమును హర్షుని నాగానందమును రససుందరముగా ఆంధ్రీకరించిరి. అతని ఆంధ్రీకరణము మూలానుగుణమును సరళమును సరసమునై యొప్పారును. ఈ ఆంధ్రీకరణములలో ఆయన నీచపాత్రలకును స్త్రీపాత్రలకును చక్కని వ్యావహారిక భాషను వాడి యున్నారు.

ప్రభాకరశాస్త్రి సుమారు నేబది రెండేండ్ల వయస్సున తిరుపతి యందలి శ్రీవేంకటేశ్వర ప్రాచ్యవిద్యాపీఠమున పండితులుగా నియమింపబడిరి. అప్పటినుండియు ఆయన వైష్ణవ భక్తులును కవి ప్రవరులును అయిన తాళ్లపాక వారి రచనలను వెలితీయుట యందును, పరిష్కరించి ప్రకటించుట యందును తన కాలమునంతను వినియోగించిరి. ఆ విధముగా ఆయన ఆంధ్రవాఙ్మయమునకు కావించిన సేవ ఇంతింత అనరాదు. పెద తిరుమలాచార్యుని వేంకటేశ్వర వచనములకును అన్నమాచార్య చరిత్రకును ఆయన రచించిన పీఠికలు అమూల్యములైనవి. ఆ సమయముననే ఆయన సర్వజ్ఞ సంవిధానచక్రవర్తి ఇత్యాది సార్థక బిరుదనాముడైన నాచన సోమనాథుని ఉత్తరహరివంశము నకు వ్యాఖ్యానము వ్రాయదొడగి కొంతవరకు ముగించిరి. దానిని ఆయన పూర్తి చేయకమునుపే గతించుట ఆంధ్రుల దురదృష్టమని చెప్పవలయును.

ప్రభాకరశాస్త్రి సారస్వతరంగముననే కాక చరిత్ర రంగమునను అపారమైన సేవ కావించిరి. ఆయన ప్రాచీన తాళపత్రములను పరిశోధించుటతో తృప్తిపడి ఊరకుండక పెక్కు ప్రాచీన శిలాతామ్ర శాసనములను పరిశోధించి ప్రకటించిరి. చివరి రోజులలో ఆయన ప్రాచీన తాళపత్రములను శాసనములను శిల్పములను సేకరించి వాటిని ఒక మ్యూజియములో నెలకొల్పుటకు యత్నించిరి. కాని ఆ సంకల్పము కార్యరూపమును పొందకమునుపే 1950 వ సం॥లో ఆయన తిరుపతిలో దివంగతులైరి.

ప్రభాకరశాస్త్రి లౌకికమైన ఉద్యోగమును నిర్వహించుచు సారస్వత సేవ కావించుచు ఆధ్యాత్మికములైన యోగాభ్యాస

ములయందు కూడ పరిపక్వమైన అనుభవమును సంపాదించిరి 1916 వ సం॥లో ఆయన ప్రాణాపాయకరమైన రోగమునకు గురియై ఎన్ని ఔషధములను సేవించినను లాభము లేక పోవుటచే ఔషధ సన్యాసము కావించి ఆ రోజులలో కుంభకోణమున సుప్రసిద్ధులై ఉండిన సి వి వి అను పేరుగల గురుపుంగవుని ఆశ్రయించి రోగ విముక్తి పొందిరి ఆయన యోగపద్ధతికి భుక్తరహిత తారక రాజయోగ మని పేరు ఆ పద్ధతిననుసరించి ఆ గురుపుంగవులు అనివార్యములైన పెక్కు వ్యాధులను కుదిర్చి పలువురికి ప్రాణభిక్ష కావించిరి ప్రభాకరశాస్త్రియు అందు దీక్షవడసి ఆ యోగ మార్గమున గురువు తరువాత గురువంతటివాడుగా ప్రసిద్ధి పొందెను అధ్యానమార్గమును ఆయన అనుసరించి, పలువురికి చికిత్స లొనర్చి వారి జీవితములను సుఖ సంతోషభరితములు కావించిరి బాల్యమునుండియు ప్రభాకరశాస్త్రికి గల పర హిత పరాయణత్వము ఈ యోగ చికిత్సా రూపమున పరిణతి పొందినది కొన్ని సమయములందు ఇతరుల దైహిక బాధలను ఆయనే అనుభవించి వారికి స్వస్థత చేకూర్చుచుండిరని చెప్పుదురు తుది రోజులలో ఆయన రచించిన 'ప్రజ్ఞా ప్రభాకర' మను స్వీయచరిత్ర ఆయన ఆధ్యాత్మిక జీవితమునకు సంబంధించిన విషయముల నెన్నిటినో వెల్లడించును అందలి విషయము వలెనే శైలియు అతి హృద్యమై అలరారుచుండును

గౌతమ బుద్ధుడును మహాత్మగాంధియు ప్రభాకర శాస్త్రికి బహువిధముల ఆదర్శప్రాయులై ఉండిరి అహింస ప్రేమ సత్యము దీనదయాళుత్వము వారి హృదయమును ఎక్కువగా ఆవర్జించిన గుణవిశేషములు ఆయన నాగానంద నాటకమును ఆంధ్రీకరింప బూనుట ఈ కారణముచేతనే చివరి రోజులలో ఆయన గాంధి మహాత్ముని గూర్చి కూడ ఒక ఉదాత్త గ్రంథమును సంకలనముచేయ యత్నించిరి కాని అది కార్యరూపమును పొంది ఉండలేదు విదుష్టమైన పాండిత్యమునకును నిశితమైన పరిశోధనమునకును నిర్మలమైన జీవితమునకును నిజమైన మానవత్వమునకును ఆకరమై ఇహమునందే దివ్యత్వమును సాధింపజాలిన మహనీయుడు ప్రభాకరశాస్త్రి

ది. వెం.

## వేదభాష్యములు

వేదము ధర్మాధర్మములను తత్సాధనములను నిశ్శ్రేయసమును బోధించునది ప్రత్యక్షానుమాన ప్రమాణములచే వేద్యములు కాని అలౌకికయాగాది స్వర్గసాధనములను బోధించుటచే వేదమునకు వేదత్వము సిద్ధించినది వేదములు అపౌరుషేయములు భాష్యతే సర్వం స్ఫుటతయా అనే నేతి భాష్యం సర్వమును స్ఫుటముగా తెలియజేయునది భాష్యము వేదములు నాలుగు ఋగ్వేదము యజుర్వేదము సామవేదము అధర్వణవేదము అనునవి యజుర్వేదము కృష్ణ శుక్ల యజుర్వేదభేదముచే ద్వివిధము

మొదట మంత్రముల భావమును బ్రాహ్మణములు వివరించెను వేదశబ్దరూపాదులను శిక్షాలక్షణములు బోధించెను తదర్థ తద్వినియోగాదులను నిరుక్త సూత్రాదులు చెప్పెను శ్రౌతసాహాయ్యమున ఎదప కొంతకాలము బ్రాహ్మణులు వేదభావమునెరిగి క్రతువులనాచరించుచు వచ్చిరి పిదప సంస్కృత భాషార్థమెరుగక కుమ్మ వేదాధ్యయనము కావించు శుద్ధశ్రోత్రియులు వేదార్థమెరుగక యజ్ఞయాగము లాచరించెడివారు అట్టి స్థితిలో వేదవేదాంగవేత్తలు లోకానుగ్రహతత్పరులై వేదార్థవివరణమునకు క్రీస్తుశకారంభమున కీవలికాలమున పూనుకొనిరి ఆ వివరణములే భాష్యములు ఆ భాష్యములు మంత్రముల సహజార్థమును ఆవిష్కరించుట కేయత్నించినవి

యాస్కాచార్యులు స్కందస్వామి నారాయణాచార్యులు ఉద్గీథాచార్యులు హస్తామలకాచార్యులు వేంకటమాధవుడు లక్ష్మణాచార్యులు భానుష్కయజ్వ ఆనందతీర్థులు ఆత్మానంద తీర్థులు ముద్గలాచార్యులు దేవస్వామి చతుర్వేదస్వామి భట్టస్వామి, భట్టభాస్కరుడు సాయణాచార్యులు, ఉవ్వటుడు మహీధరుడు మున్నగువారు వేదభాష్యకర్తలుగా పేర్కొనబడిరి

యాస్కాచార్యులవారు ఋగ్వేదములోని కొన్ని మంత్రములకు అర్థమును నిర్వచించెను ఆ గ్రంథము నిరుక్తమనబడినది నిరుక్తమనగా నిరపేక్షముగా శబ్దార్థములను నిర్వచించునది నిరుక్తకారుడు ప్రాచీన వ్యాఖ్యాతలను ప్రమాణముగా గైకొని అగ్నిశబ్దప్రకృత్యర్థములను నిర్వచించెను యాస్కుని నిరుక్తము అసమగ్రము

అరయా వేదములకు భాష్యములు రచియించినవారిలో

సాయణాచార్యులవారు ప్రముఖులు (క్రీ శ 1315 87) భాష్యములకు మల్లినాథసూరిగారి వ్యాఖ్యయెట్టిదో వేదములకు సాయణాచార్యులవారి భాష్యమట్టిది సాయణ భాష్యములకు మార్గదర్శకములైనవి భట్టభాస్కరమిశ్రాదుల భాష్యములు సాయణుడు యాస్కుని నిరుక్తమును ఆపస్తంబబోధాయనుని శ్రౌతసూత్రకల్పములను మీమాంసా వ్యాకరణములను చక్కగా విమర్శించి భాష్యములు వ్రాసెను వేదార్థప్రకాశమను పేర సాయణాచార్యులు రచించిన ఋగాది సంహితాబ్రాహ్మణారణ్యకాదుల భాష్యములు వైదికకల్ప భూరుహములు సాయణుడు వేదవేదాంగ విద్వద్వర్యుడు అత్యంతప్రతిభాశాలి తానురచించిన భాష్యములకు మాధవీయమను పేరుపెట్టి సోదరునియందు గల భక్తిభావమును ఆవిష్కరించెను అప్పుడు శ్రీవీరబుక్క భూపాలుడు సామ్రాజ్యధురంధరుడై యుండెను సాయణాచార్యులు తొలుదొల్త మీమాంసకు సంగ్రహ వ్యాఖ్యలు వ్రాసి అధ్వర్యువేదమగు కృష్ణయజుర్వేదమునకు భాష్యమును సంతరించి పిదప క్రమముగా ఋగ్వేద సామాథర్వణవేదములకు వ్యాఖ్యానములను నిర్మించిరి

కృష్ణయజుర్వేద భాష్యములలో మొదటిది జ్ఞానయజ్ఞము దీని కర్త భట్టభాస్కరమిశ్రుడు ఇతడు ఆంధ్రుడు సకల వేదశాస్త్రవేత్త ఇంటిపేరు అమ్ములవారు ఇతడు క్రీ శ 1169 ప్రాంతమువాడని ఊహింపబడినది భట్టభాస్కరమిశ్రులు తైత్తిరీయసంహితాబ్రాహ్మణములు రెంటింగూడ సంపూర్ణ భాష్యములు సంతరించిరి ఈ పండితుడు భావస్వామికృత పూర్వమీమాంసాభాష్యమును బోధాయన కల్పసూత్రమును విశేషప్రమాణములుగా గ్రహించెను అహోబలకవి 'రుద్రప్రశ్న'కు శ్లోకాత్మక భాష్యమును రచియించెనని తెలియుచున్నది

శుక్లయజుర్వేద భాష్యములలో మహీధరాచార్య విరచిత వేదదీపమను భాష్యముత్తమము ఈ వేదదీపపూర్వోత్తర భాగముల తుదగల శ్లోకములనుబట్టి ఉవ్వటుడు మాధవుడు శంకరుడు వనువారు వాజసనేయసంహితకు భాష్యములు వ్రాసిరనియు వేదదీపమును వెలయించుటలో మహీధరునకు ఆ భాష్యములు ఉపకరించినవనియు తెలియుచున్నది వజ్రటపుత్రుడయిన ఉవ్వటుడు శుక్లయజుర్వేదీయ వ్యాఖ్యాన రచనమున ప్రసిద్ధుడు ఇతడు అవంతీ (ఆనంద) పురవాసి క్రీ శ 1080 ప్రాంతమువాడు వ్యాసునకు వేదార్థదీపిక అను పేర అనంతాచార్యుడు సంపూర్ణభాష్యమును వ్రాసెను భగీరథీ నాగదేవభట్టలకొడుకు కాశ్మీరనివాసి కాణ్వసంహితకు ఆనందబోధభట్టోపాధ్యాయుడు మరియొక భాష్యమును రచించెను

ఆనందతీర్థ భగవత్పాదులు రచించిన పద్యాత్మమగు ఋగ్భాష్యము కలదు జయతీర్థులు దీనికి ఋగ్భాష్యార్థ తత్త్వప్రకాశిక అను విపులటీకను వ్రాసిరి దీని ననుసరించిన మరియొక వ్యాఖ్య ఋగర్థరత్నమాల అనునది కలదు సాయణాచార్యకృత ఋగ్వేద భాష్యము ప్రశస్తమైనది

సామవేద ఋగ్భాష్యమును తొలుత భారతస్వామి వ్రాసెను ఇతడు కాశ్యపస గోత్రుడు యజ్ఞనారాయణుని పుత్రుడు శ్రీరంగపట్టణ(మైసూరు) నివాసి హోసలాధీశ్వర రామనాథుని కాలమున (13వ శతాబ్ది తుది భాగమున) ఈ భాష్యము వ్రాయబడెను సామవేద ఋగ్భాష్యము పూర్వార్చికకును వేదార్థప్రకాశము ఉత్తరార్చికకును లభించుచుండుటచే భారతస్వామి మొదటి భాగమునకును తరువాత సాయణులు ఉత్తరభాగమునకును భాష్యమును రచియించిరని తెలియుచున్నది

యజుర్వేదము ఋగ్వేదము సామవేదము క్రమముగా అధ్వర్యుహౌత్రోద్గాతృ కర్మ ప్రతిపాదకములు అథర్వవేదము బ్రహ్మకర్తవ్య ప్రతిపాదకము ఋగ్వేదకర్మ సామవేదములో చేరనట్లు బ్రహ్మకర్తృత్వ కర్మ వేదత్రయములో చేరదని భావించి సాయణాచార్యులు అథర్వవేదము ఇతర వేదముల వలె వ్యాఖ్యేయమే అని చెప్పి ఆ వేదమును వ్యాఖ్యానించిరి

ఉపనిషద్భాష్యములు వేదభాష్యములకు శ్రీ సాయణాచార్యులవలె వేదాంత భాష్యములకు శ్రీ శంకరభగవత్పాదులు ప్రసిద్ధికెక్కిరి శ్రీశంకరులు అద్వైతపరముగా నిర్మించిన అనేక భాష్యములకు తరువాతి వారు బహువిధ వివరణములను నిర్మించిరి దశోపనిషత్తులకు శివెశ్వరాభేదపరముగా శ్రీ శంకరులు భాష్యములు వ్రాసిరి శ్రీశంకరాచార్యుల తైత్తిరీయ భాష్యము మొదలు

"యైరిమే గురుభిః పూర్వం పదవాక్య ప్రమాణతః।
వ్యాఖ్యాతాస్సర్వవేదాంతాస్తాన్నిత్యం ప్రణతోస్మ్యహమ్॥"

అని వక్కాణించిరి దీనిని బట్టి శంకరుల భాష్యములకు పూర్వము పూర్వ రచితములైన ఉపనిషద్భాష్యములున్నవని తెలియవచ్చును శంకరాచార్యుల తైత్తిరీయోపనిషద్భాష్యమును చూచియే సాయణాచార్యులు ఉపనిషద్వ్యాఖ్యను వ్రాసిరి సురేశ్వరాచార్యులు శ్రీ శంకరుల తైత్తిరీయోపనిషద్భాష్యమునకు భాష్యవార్తికమను పేర పద్యమయవ్యాఖ్యను రచించిరి ఆనందగిర్యాచార్యులు శంకర తైత్తిరీయోపనిషద్భాష్యమునకును సురేశ్వరాచార్యకృత తద్వార్తికమునకును టీకలు రచియించెను ఆనందజ్ఞానులు శంకరుల బృహదారణ్యకోపనిషద్భాష్యాదులకు టీకలు వ్రాసెను అనేకోపనిషత్తులకు శంకరానందుడు టీకలు వ్రాసెను నారాయణాశ్రమిభూద ముండకమాండూక్య బ్రహ్మవిద్యాద్యుపనిషత్తులకు దీపికలను పేర వ్యాఖ్యలు రచియించెను శివానందయతి టిప్పణములు విజ్ఞానాత్ముని వివరణము పేర్కొనదగును

ఈశావాస్యాది ప్రధానోపనిషత్తులకు ద్వైతపరముగా భాష్యములు వ్రాసినవారిలో అగ్రగణ్యులు ఆనందతీర్థులవారు ఈ ఆనందతీర్థులు మధ్వాచార్యులు పూర్ణప్రజ్ఞులు అను నామాంతరములు కలవారు ఆనందతీర్థుల భాష్యములలో ఈశావాస్యాది కతిపయభాష్యములకు జయతీర్థభిక్షువును ఐతరేయభాష్యములు కొన్నింటికి విశ్వేశ్వరతీర్థ నరసింహయతి కృష్ణాచార్యులును కఠాదిభాష్యములు కొన్నిటికి వ్యాసతీర్థ - విదేశభిక్షు శ్రీనివాసాచార్యులును టీకావివరణాదులను వ్రాసిరి ఛాందోగ్యమాండూక్యాదులు కొన్నింటికి ఆనందతీర్థుల భాష్యములు కాక రాఘవేంద్రయతికృత అర్థసంగ్రహములు కూడ వేరుగా కలవు శ్రీనివాసాచార్యుని తైత్తిరీయోపనిషద్భాష్య టీకావతారికను బట్టి విద్యాధిరాజాదిమునీంద్రులు మరికొందరు ఛాందోగ్యాదులకు భాష్యములు రచియించినట్లు కనిపించుచున్నది రఘూత్తమయతి బృహదారణ్యక భాష్యమునకు టీకను రచించెను

విశిష్టాద్వైతపరముగా తైత్తిరీయ బృహదారణ్యకాద్యుపనిషత్తులు కొన్నిటికి వ్యాఖ్యలు రచియించినవారిలో పేర్కొనదగినవారు రంగరామానుజాచార్యులవారు ఈయన వాత్స్యానంతాచార్య పరకాల మునీంద్రుల శిష్యుడు కాంచీపురనివాసి విశిష్టాద్వైత మతోద్ధారకులగు శ్రీరామానుజాచార్యులవారు రచియించిన సూత్రభాష్యమును లెస్సగా చదివి సూత్రభాష్యోపయుక్త ఉపనిషద్వాక్య వివరణమును రచియించిన పండితశ్రేష్ఠు డితడు

కం న శా

## వేదము వేంకటరాయశాస్త్రి

ఆంధ్ర సంస్కృతములందే కాక ఆంగ్ల తమిళ కర్ణాటక హిందీ భాషలయందుకూడ ఎనలేని పాండిత్యమును గడించి ఆంధ్రమున పెక్కు నాటకములు విమర్శలు వ్యాఖ్యానములు వచన రచనలు వెలయించి విద్వత్కవి విమర్శక మూర్ధన్యుడై తన మహామహోపాధ్యాయ బిరుదమునకు సంపూర్ణ సార్థక్యమును చేకూర్చిన యతడు వేదము వేంకటరాయ శాస్త్రిగారు ఈయన పుదూరుద్రావిడ బ్రాహ్మణశాఖకు చెందినవాడును ఋషితుల్యుడనియు విద్వద్వరేణ్యుడనియు పేరుపొందిన వాడును అగు వేంకటరమణ శాస్త్రి సహధర్మచారిణి యైన లక్ష్మమ్మయందు 18౫౩ వ సంవత్సరమున మదరాసు నగరమందు జన్మించెను

ఈయన బాల్యమున తండ్రి యొద్దనే ఆంధ్ర సంస్కృతముల నభ్యసించుచు తన పదునారవ యేట మెట్రిక్యులేషను పరీక్షయందు ప్రథమ తరగతిలో ఉత్తీర్ణుడయ్యెను తరువాత ఎఫ్ ఏ పరీక్షలో కూడ కృతార్థుడై 1886 వ సంవత్సరమున ఆతడు మదరాసు క్రైస్తవ కళాశాలయందు సంస్కృత పండిత పదవినిపొంది సుమారు ఇరువది యైదు సంవత్సరములు దానిని స్వతంత్రముగను సర్వజనశ్లాఘా పాత్రముగను నిర్వహించెను ఆయన 1887 వ సంవత్సరమున బి ఏ పరీక్షకు కూర్చుండి ఆంగ్లమున సామాన్యముగను సంస్కృతమున ప్రథమ స్థానమునను ఉత్తీర్ణుడయ్యెను ఉద్యోగ విరమణానంతరము 1916 వ సంవత్సరమున ఆయన సూర్యరాయాంధ్ర నిఘంటువునకు ప్రధాన సంపాదకులుగా నియమింపబడి కొంత కాలము పనిచేసెను తరువాత 1929 వ సంవత్సరమున దివంగతులగువరకును వేంకటరాయశాస్త్రి వివిధములైన గ్రంథములను రచియించుచు ఆంధ్ర సంస్కృతభాషాసేవ గావించిరి

ఈయనరచనలను విమర్శనములు నాటకములు వ్యాఖ్యానములు వచనరచనలు అని ప్రధానముగా నాలుగు తెరగులుగా విభజింపవచ్చును ఈయనవిమర్శ గ్రంథములలో మొదటిగి స్త్రీ పునర్వివాహ దుర్వాద నిర్వాపణము ఇది ఆరోజులలో వీరేశలింగము పంతులును ఆయన మిత్రులును వితంతు వివాహములు శాస్త్ర విరుద్ధములు కావని వాదించుచు గావించుచుండిన ఉపన్యాసరచనాపూర్వకమైన ప్రచారమును ప్రమాణ పూర్వకముగా ఖండించుచు మదరాసునందలి హిందూసమాజము పక్షమున వేంకటరాయశాస్త్రి యొసంగిన ఉపన్యాసములకు

లిఖిత రూపము దీనివలన ఆయన పాండితీ ప్రతిభ లోకమునకు వెల్లడి అగుటయు మదరాసులోని పలువురు పెద్దలు వారికి మిత్రులగుటయు సంభవించెను ప్రక్రియా ఛందస్సు అలంకార సారసంగ్రహము అను లక్షణ గ్రంథములు ఈతని తరువాతి రచనలు ఇందు మొదటిది ఛందశ్శాస్త్రమునకును రెండవది అలంకార శాస్త్రమునకును సంబంధించినవి అలంకారసార సంగ్రహమున వేంకటరాయశాస్త్రి చంద్రాలోక ప్రతాపరుద్రీయములందలి సారమంతయు ఇముడునట్లుగా 108 అలంకారములను పద్యరూప లక్ష్యలక్షణములతోడను వచన రూపవివరణముతోడను విశదీకరించి ఉన్నారు ఆయన 1910 వ సంవత్సరమున భానుమిశ్రుని రసమంజరిని టీకాముగా ప్రకటించిరి 1921 వ సంవత్సరమున విశ్వనాథ కవిరాజ ప్రణీతమైన సాహిత్యదర్పణము ను మూలమునకు అన్యూనానతిరిక్తముగా ఆంధ్రీకరించి లక్షణగ్రంథానువాదకులకు ఆదర్శప్రాయుడ య్యెను ఇందు లక్షణములు సూత్రప్రాయములుగను లక్ష్యవివరణములు వచన రూపమునను ఆంధ్రీకరింపబడినవి

చిత్రము - 84



వ ము - 1

వేదము వేంకటరాయశాస్త్రి

వేంకటరాయశాస్త్రి విమర్శలు అతి నిశితములైనవి చాలకాలము ఆయన అన్యుల విమర్శించు జోలికి పోకుండియు తన ప్రతాపరుద్రీయ, నాగానందాది నాటకములను అసూయాగ్రస్తులైన పండితులు తీవ్రముగా విమర్శించి ఉండుటచే తానును విజృంభించి వారి రచనలను నిశితముగా విమర్శింప బూనుకొనిరి తన విమర్శ పరంపరకు 'శారదా కాంచిక' అని పేరిడి, అందు ఒక్కొక్క విమర్శను ఒక్కొక్క కింకిణిగా చేర్కొని ఉండిరి అందు రాయదుర్గము నరసయ్యశాస్త్రియు కొమాండూరి అనంతాచార్యులును పరిష్కరించి ప్రకటించిన జక్కన విక్రమార్క చరిత్రకు సంబంధించిన విమర్శన రూపమైన ప్రథమకింకిణి 1898 లో 'అముద్రిత గ్రంథచింతామణికి' అనుబంధముగా ప్రకటింపబడినది రెండవది శ్రీ కొక్కొండ వేంకటరత్నంపంతులు రచించిన ఆంధ్ర ప్రసన్నరాఘవముపై విమర్శ ఇందు వేంకటరాయశాస్త్రి ప్రదర్శించిన విమర్శన పరాక్రమము అప్రతిమానమైనది మూడవ కింకిణి రా వేంకట సుబ్బయ్య ప్రకటించిన శ్రీకాళహస్తీశ్వర మహాత్మ్యమునకు సంబంధించిన మగ్ర (1900) గ్రామ్యభాషా ప్రయోగ నిబంధనమను చతుర్థ కింకిణి 1899 వ సంవత్సరమున నెల్లూరు ఆంధ్రభాషాభిమాన సమాజ సభయందు ప్రయోగి 1901 వ సంవత్సరమున ఆతరగూషు శాల్పినది పంచమ కింకిణి పేరను విషయమున అభిప్రాయభేదమున్నది అది అముద్రితమైన పాండురంగ మాహాత్మ్య ముద్రణవిమర్శనమని కొందరును ధర్మవరము రామకృష్ణమాచార్యుల చిత్రనళీయ రగడకు సంబంధించి మాచాకసమామోద విచారమని కొందరును అభిప్రాయపడుచున్నారు నేటూరి పార్థసారథి అయ్యంగారు రచించిన ఆంధ్ర వ్యాకరణ సర్వస్వము యొక్క యథార్థ స్వరూపమును తెల్పు ఆంధ్ర వ్యాకరణ సర్వస్వతత్త్వము ఆరవ కింకిణి శారదాకాంచి కింకిణులుకాక ఆయన ప్రకటించిన ఇతర విమర్శలలో భారత భారత రూపక మర్యాదలు విమర్శనోదము శ్లేషవినోదము అనునవి ముఖ్యములైనవి ఇందు భారత భారత రూపక మర్యాదలు' అనునది ప్రాచ్యపాశ్చాత్య నాటక సంప్రదాయముల సామ్యవైషమ్యములను తెల్పుచక్కని విమర్శనాత్మకమైనవ్యాసము విమర్శవినోదము వేంకటరాయశాస్త్రికి మిక్కిలి అభిమానపాత్రమైన గ్రంథము ఇందు కాళిదాసుని నాటకములు మాలతీ మాధవము' రసార్ణవ సుధాకరము' రఘువంశ కుమార సంభవములు' 'విశ్వగుణాదర్శము' మున్నగు సంస్కృతగ్రంథములందును పాండురంగ మాహాత్మ్య పారిజాతాపహరణ భారత భాగవతా'ద్యాంధ్రగ్రంథములందును టీకాకారులును సంపాదకులును భ్రమ ప్రమాదములచే దొరలిన కొన్ని పాఠముల అసాధుత్వమును నిరూపించుటయే కాక ఈయన సాధు పాఠములనుకూడ సూచించియుండిరి ఇది 1903 లో ప్రకటింపబడినది

వేంకటరాయశాస్త్రి ఎంతటి మహావిమర్శకుడో, అంతటి మహోపన్యాసకులు ఆయన ఉపన్యాసములు విషయగంభీరములయ్యు హాస్యరస సంపూర్ణములై పండితులకును, సామాన్యులకును కూడ మనోరంజకములై ఉండెడివి అసంఖ్యాకములైన ఆయన ఉపన్యాసములలో కొన్నిమాత్రమే వ్యాసరూపమున ముద్రితములైనవి వాటిలో పచ్చయ్యప్ప

కళాశాలలో సంధివివేకమును గూర్చియు (1912) గ్రామ్యవాద నిరసనమును గూర్చియు (1914) ఇచ్చిన ఉపన్యాసములును నెల్లూరు వర్ధమాన సమాజ సభయందు తిక్కన సోమయాజిని గూర్చి (1919) ఇచ్చిన ఉపన్యాసమును ముఖ్యములైనవి. ఇందు చివరిది తిక్కనసోమయాజి విజయము అను పేర 1920లో ముద్రింపబడినది.

వేంకటరాయశాస్త్రి ఆంధ్రవచన వాఙ్మయమునకు కావించినసేవ అపారమైనది. ఆయన తండ్రి ఒకనాడు తన మిత్రులకు ఒకగంటి ప్రతాపరుద్రీయకథ చెప్పుచుండగా విని 18వ సంవత్సరమున దానిని పెంచి నాటకరూపమున ప్రకటించిరి. ఇదియే ఆయన ప్రతాపరుద్రీయ నాటకమునకు బీజమని చెప్పవచ్చును. 1891లో ఆయన సోమదేవ పండిత విరచితమైన కథాసరిత్సాగరమును సరస సుబోధమైన శైలిలో వచనీకరించియుండిరి. సౌలభ్యముకొరకై ఇందు విసంధిని పాటించిరి. 1910లో ఆయన భేతాళ పంచవింశతి కథలను హితోపదేశ దశకుమారచరిత్రాంధ్రీకరణములను రచియించిరి. 1921లో నన్నయ గద్యరూపమున ఆయన అనువదించిన హితోపదేశ చంపువు 1933లో ముద్రింపబడినది. ఆంధ్రకథావాఙ్మయమున ఈ గద్యగ్రంథములకు విశిష్టమైన స్థానమున్నది.

వేంకటరాయశాస్త్రి తమ గ్రంథముద్రికములై ఉండిన పెక్కు సంస్కృతాంధ్రగ్రంథములు అనేకములతో కూడి ఉండుట గమనించి కొన్నిటిని సానుపాతములతో తమ జ్యోతిష్మతీ ముద్రణాలయమున ముద్రించి ఉంచిరి (1900). అట్టి వాటిలో సంస్కృత పంచతంత్రము జ్ఞానవాసిష్ఠ రామాయణము కావ్యాలంకార చూడామణి శాబ్దాలంకారచూడామణి సారంగధర చరిత్రము పారిజాతాపహరణము ముఖ్యములైనవి.

వేంకటరాయశాస్త్రి యశస్సునకు మూలస్తంభములని చెప్పదగినవి ఆయన నాటకములును వ్యాఖ్యానములును. ఈయన రచియించిన నాటకములలో స్వతంత్రములు 4 మూడు అనువాదములు ఏడు. నాగానందము (189 ) శాకుంతలము (1896) ప్రియదర్శిక (1910) మాళవికాగ్నిమిత్రము (1919) ఉత్తరరామచరిత్రము (1920) రత్నావళి (1921) అనునవి ఈయన ఆంధ్రీకరించిన సంస్కృతనాటకములు. ఈయన అనువాద పద్ధతి విశిష్టమైనది. ముందు తాను అనువదింప దలచిన నాటకములందు పాఠపాఠ నిర్ణయము చేసికొని తరువాత యథామాతృకముగా వాటిని అనువదింతురు. యథాతథముగా మూలభావములను వెల్లడించు సంస్కృత నాటకాంధ్రీకరణములలో ఈయన అనువాదములదే అగ్రస్థానము. ఇంక ప్రతాపరుద్రీయము, ఉష, బొబ్బిలియుద్ధము అను మూడును ఆయన రచించిన స్వతంత్ర నాటకములు. మూడును మూడే త్రివిక్రముని పాదత్రితయమువలె ఆంధ్రలోకమునంత వ్యాపించి రసికులను అనంత రసవాహినులందు ఉయ్యాలలూగించినవి. ఇందు ఉష శృంగారరస ప్రధానము. తక్కినరెండును వీరరస ప్రధానములు. ఈ నాటకములలో ఆయన పాత్రరసపోషణమునందును సన్నివేశకల్పనమునందును చూపిననేర్పు అనన్యసామాన్యమైనది. సామాజికుల రక్తికై ఇంతవరకు ఉచితరీతి హాస్యరస పోషణముకూడ కావించినారు. పాశ్చాత్య నాటకరచనా విధానమును అనుసరించి ఆయన ఈ నాటకములను రంగములుగా విభజించిరి. ప్రాచ్యనాటక లక్షణములను చక్కగా అనుసరించుటకు ప్రయత్నించినారు. ఈ నాటకములలో మాండలిక భాషా ప్రయోగమున ఆయన చూపిన ప్రతిభా నాణ్యతతో దర్శనీయమైనది. ఒక్క ప్రతాపరుద్రీయమునందే ఆయన ఎనిమిది తెలుగు వ్యావహారిక భాషల ఉపయోగించిరని చెప్పుదురు. తన నాటకములలో ఆయన పద్యములను పాటలను కూడ వాడినారు. స్త్రీలును నీచపాత్రలకును ఆయన సాధారణముగా పాటలే రచియించి ఉంచిరి. పాటలన్నియు రసపాత్రోచిత గుణములై ఎంతో రమణీయములుగ నున్నవి. గంభీరములైన భావములను అలతి అలతి పలుకులతో వ్యక్తీకరించుటకు యత్నించుట చేతను సహజముగ ఆయన కలవడిన శైలి వైలక్షణ్యముచేతను, ఆయన పద్యములు ఇంచుక క్లిష్టములుగా గోచరించును. నాటక రచనయందు వలెనే తగిన నటులను ఎన్ని వారిచే ఆనాటకములను ప్రదర్శింపజేయుట యందును ఆయన మిక్కిలి ఉత్సాహాసక్తులను ప్రదర్శించుచుండిరి.

గురుకులవాసముచేసి సంస్కృతభాషా సారస్వతములను అభ్యసించుటకు అవకాశములేనివారి సౌకర్యముకొరకై వేంకటరాయశాస్త్రి కొన్ని సంస్కృతకావ్యములను సంపూర్ణటీకా తాత్పర్యములతోడను ప్రతిపద ప్రయోగ వివరణాదులతోడను ముద్రించియుండిరి. ఈ విధముగా ఆయన 1903వ సంవత్సరమున 'మేఘసందేశము'ను 1908లో 'పుష్పబాణ

విలాసమును 1910లో ఆముద్రిత గ్రంథచరిత్ర గ్రంథమంజరి యను భర్తృహరి సుభాషితమును ప్రకటించిరి తరువాత రఘువంశ కుమారసంభవ మేఘసందేశ దార్ఢటీకా శాస్త్ర్య ములతో ప్రచురించిరి ఈ గ్రంథములు సంస్కృత భాషా సాహిత్య జ్ఞానవృద్ధికి చేయుచున్న మేలు ఇంతింత కాదు.

సంస్కృత గ్రంథములకే కాక రసభావాంచితము లైన ప్రౌఢములగు కొన్ని ఆంధ్ర గ్రంథములకు కూడ వేంకటరాయశాస్త్రి టీకా వ్యాఖ్యలు రచించిరి 19[illegible]లో సారంగధర చరిత్ర [illegible] గౌరన వసిష్ఠేంద్ర ద్విపదకును ఆయన సంగ్రహటీకలు రచించి ప్రకటించిరి ఆయన పాండిత్యమునకు నిదర్శన ములై ఆయనకు అపర మల్లినాథ బిరుదమును సంపాదించి పెట్టినవి ఆయన శృంగార నైషధాముక్తమాల్యదలకు రచియిం చిన సర్వంకషా సంజీవనీ వ్యాఖ్యానములు సార్థకాభిఖ్యము లైన ఈ వ్యాఖ్యలను రచించుటలో ఆయన ప్రదర్శించిన ప్రతిభా పాండిత్యములు అవ్యాఖ్యేయములై వి ప్రౌఢము లైన ఆ గ్రంథములకు ఇట్లు కూలంకషముగా వ్యాఖ్యలు వ్రాయుటకు వేంకటరాయ శాస్త్రికి తప్ప ఇతరులకు అసాధ్య మని పండితుల అభిప్రాయము

ఆయన పాండితీప్రతిభలను గుర్తించి పలుసంస్థలాయ నను పలువిషయములందు ఘనముగా సమ్మానించి ఉండెను 1920లో ఆంధ్రమహాసభ ఆయనను మహోపాధ్యాయ బిరు దముతో పాటు వేయినూటపదార్లిచ్చి సత్కరించెను 1922 లో ద్వారకాపీఠ శంకరభగవత్పాదులు ఆయనకు 'సర్వతంత్రస్వతంత్ర' మహామహోపాధ్యాయ విద్యా దానవ్రతమహోదధి అను బిరుదములనొసగిరి 1927 లో ఆంధ్రవిశ్వవిద్యాలయము ఆయనకు కళాప్రపూర్ణ బిరు దము నొసంగి తన్నుతా గౌరవించుకొనెను 1958లో నెల్లూరునందును తరువాత ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడ మీచే హైదరాబాదునందును ఆయన శతవర్ష వర్ధంతి మహో త్సవము అత్యంత వైభవముతో జరుపబడినది ఆయనకు ఆంధ్రదేశము నలుమూలలను పలువురు శిష్యులు కలరు ఇప్పటికి కూడ వారాయనయెడ అపారభక్తి విశ్వాసములు కలిగి ఉం డుట ఆయన శిష్యజన వాత్సల్యమునకును, పాండిత్యప్రతిభ లకును తార్కాణము

వేంకటరాయశాస్త్రి నాటకములయందు పాత్రోచితమైన వ్యావహారిక భాషను ఎరిగిగా వాడెను వ్యవహార భాషా వాదమును సమర్థించి యుండలేదు గ్రంథరచన సంప్ర దాయ సిద్ధమైన గ్రాంథిక భాషలోనే జరుగవలెనని ఆయన అభిప్రాయము ఇందుకు ఆయన రచించిన గ్రామ్యభాషా నిరసనమను గ్రంథము నిదర్శనము మహాకవులు కొందరు ఆయన గ్రామ్యశాస్త్రి అని పేరిడి ఆయన గ్రంథములను బహిష్కరించుటకు యత్నించిరి కాని ఆ గ్రంథములు పొం దిన మహత్తమైన ఆదరముచే వారి ప్రయత్నములు ఫల ములు కాలేకపోయెను

పాండిత్యమును కవిత్వమును ఒక్కచోట ఉండవను అభిప్రాయమునకు వేంకటరాయశాస్త్రి అపవాదమని చెప్ప దగినవాడు కూలంకషమైన పాండిత్యము రసవంతమైన కవిత్వము నిరంతరమైన అభ్యాసము అప్రతిమానమైన బోధనశక్తి శిష్యజన వాత్సల్యము కార్య నిర్వహణశక్తి మున్నగు గుణములకు ఆలవాలమై జీవమున్నంత వరకును భాషా సారస్వతసేవ కావించుచు పలువురు శిష్యులయు మిత్రులయు జమీందారులయు మన్ననలంది వేంకటరాయ శాస్త్రి తన 76వ ఏట 1929లో శరీరయాత్ర చాలించిరి

ది. వేం.

## వేదవ్యాసుడు

వేదాన్ వ్యస్యతీతి వేదవ్యాసః - వేదములను విభజిం చినవాడు ఇది ఒకని పేరుకాదు ప్రతిద్వాపరమందును ఆర్షవిద్య లొక్కొక్కనిచే విస్తరింపబడుచుండును ప్రథమ ద్వాపరంబున స్వయంభువు వేదములను విభాగించెను ద్వితీయ ద్వాపరంబున ప్రజాపతి వ్యాసుడయ్యెను తృతీయ ద్వాపరం బున శుక్రుడు వ్యాసుడయ్యెను పదపడి బృహస్పతి వసిష్ఠుడు త్రివర్షుడు మొదలగువారు వ్యాసులైరి నారాయణుని మానసపుత్రుడగు అపాంతరతముని వేదవిభాగమునకై నియో గించెను వేదభేదన మొనరించిన అపాంతరతముని పిలిచి నారాయణుడు "వేదవ్యాసా! రమ్ము నాకధికాహ్లాదమును కలిగించితివి ఇట్లే ఎన్ని మన్వంతరములందును చేయుము ఉత్తర కాలమున వసిష్ఠపౌత్రుడు పరాశరుడనువాడు పుట్టును వానికి కుమారుడవై పుట్టుము నీవలన గల్గిన కురుక్షేత్ర రాజులు పరస్పరాభిష్టరోషులై కులము చెరచుదురు అపుడు నీవు వేద వ్యాసమొనర్పుము" అనెను అనేక విధములైన మణులతో కూడిన ఒక మణిరాశినుండి పద్మరాగాది మణులను విభజించి

పెట్టినట్లు ఋగాది బహువిధ మంత్రరాశినుండి పద్మరాగాది మణులను విభజించి పెట్టినట్లు ఋగాది బహువిధమంత్ర రాశినుండి ఋక్-యజు-స్సామ-అధర్వమంత్రములను చతుస్సంహితలుగా విభజించి పెట్టినవాడు-

"ఋగధర్వ యజుస్సామ్నాం రాశేరుద్ధృత్య వర్గశః
చతస్రః సంహితాశ్చక్రే మన్త్రైర్మణిగణా ఇవ॥
(భాగవతము స్కం 12)

వేదవిభాగము చేసిన ఈ మహనీయుడే అష్టాదశపురాణము లను మహాభారతమును బ్రహ్మసూత్రములను లోకమునకు అనుగ్రహించి యుండెను

అష్టాదశ పురాణాని కృత్వా సత్యవతీసుతః
భారతాఖ్యాన మతులం చక్రే తదు పబృంహితమ్॥
(దేవీ భాగవతమ్)

"కృష్ణద్వైపాయనంవ్యాసం విద్ధి నారాయణం ప్రభుమ్
కోహ్యన్యః పుండరీకాక్షాన్మహాభారత కృద్భవేత్॥
(పాద్మము)

మహాభారత కర్తృత్వము వేదవ్యాసుడు బాదరాయణుడే అని చాటుచున్నది బ్రహ్మసూత్రములచేతను మహాభారతముచేతను వేదార్థమును వివరించియున్నవాడు

"నమఃక్ర్యాయ లాపేన మహాశాఖా రేవచ
ఉపబృంహిత వేదాయ నమోవ్యాసాయ విష్ణవే॥

వేదవ్యాసుని నామాంతరములు-

"ద్వీపే బదరికామిశ్రే బాదరాయణ మచ్యుతమ్
పరాశరాత్సత్యవతీ పుత్రం లేభేఽరంతప॥

బదరీవృక్షశోభితమైన ద్వీపమందు పరాశర మహర్షి వలన సత్యవతీ దేవియందు జన్మించుటచేత బాదరాయణుడు అనబడెను. బాదరాయణుడు అనుటకు నామాంతరములు బదర్యాః ఛాత్రః దేశే అను వ్యుత్పత్తి "తద స్మిన్నస్తీతి దేశే తన్నామ్ని" అను పాణినీయ సూత్రమువలన బదరీశబ్దము నుండి బాదర శబ్దమేర్పడగా బాదర-అయన కలిసి బాదరాయణ శబ్దమేర్పడినది బదరీవృక్షములు కల ద్వీపము (దేశము) జన్మస్థానముగా కలవాడు గనుక బాదరాయణుడు అట్లే ద్వీప-అయన శబ్దములు కలిసి ద్వైపాయన నామము కృష్ణవర్ణముకలవాడుగనుక కృష్ణద్వైపాయన నామము సంతరించినది ఇట్లు చూడ బ్రహ్మసూత్రకర్తగా కీర్తింపబడు బాదరాయణుడు వేదవ్యాసుడేగాని అన్యుడు కాడు

వేదవ్యాసుని శిష్యులు-

వేదానధ్యాపయామాస మహాభారత పంచమాన్
సుమంతుం జైమినిం పైలం శుకంచైవ స్వమాత్మజమ్
ప్రభు ర్వరిష్ఠోవరదో వైశంపాయన మేవచ
సంహితాస్తైః పృథక్త్వేన భారతస్య ప్రకాశితాః॥

సుమంతువు జైమిని పైలుడు శుకుడు వైశంపాయనుడు అనువారికి నాల్గువేదములను మహాభారతమును అధ్యాపన చేసెను వారు ఆ భారతమును వ్యాఖ్యానించునపుడు భారతములోని ఆయా భాగమునకు మూలము ఆయా వేదసంహితయని ప్రకటించుచు వచ్చిరి

వేదవ్యాసుని త్రికాల జ్ఞానము -

పరాశరసుతః శ్రీమాన్ వ్యాసో వాక్యమథాబ్రవీత్
మయా హి సుమహత్తప్తం తపః పరమదారుణమ్
భూతం భవ్యం భవిష్యంచ జానీయామితి సత్తమాః
తస్యమేతప్తతపసో నిగృహీతేన్ద్రియస్య చ
నారాయణ ప్రసాదేన క్షీరోదస్యానుకూలతః
త్రైకాలికమిదం జ్ఞానం ప్రాదుర్భూతం యథేప్సితమ్
యథావృత్తం హి కల్పాదౌ దృష్టం మే జ్ఞానచక్షుషా॥
(శాన్తి)

నేను భూత భవిష్యద్వర్తమాన వృత్తాంతములను సాకల్యముగా తెలిసికొనదలచి మహాతపస్సు చేసితిని అప్పుడు నారాయణానుగ్రహమున నేను కోరినట్లు త్రికాల జ్ఞానము ఉద్భవించినది కల్పాదియందు ఏమిజరిగినదో ఆదియంతయు నా జ్ఞాన దృష్టికి గోచరించినది అని వేదవ్యాసుడే చెప్పెను

పాండవులు లక్కయింటినుండి వెళ్లుచుండగా వ్యాసుడు వారలకగపడి ధర్మవర్తనము నుపదేశించెను ధృతరాష్ట్రుడు తన కూతును పాండవులకిచ్చి వివాహము చేయసంకోచించు సమయమున వ్యాసుడేతెంచి అతనికి దివ్యదృష్టినొసంగి వానికి పాండవుల పూర్వ రూపమును కనబరచెను పాండవుల వనవాసకాలమున దుర్యోధనుడు వారిని సంహరింపదలచుటను తనదృష్టి నెరిగి ధృతరాష్ట్రునికడకేగి కుమారునకు బుద్ధి చెప్పుమని అతనిని నియోగించెను ధర్మజునకు ప్రతిస్మృతియను విద్యనుపదేశించి యజ్ఞనుతితపస్సుచే శత్రువుల జయమునెను దుర్యోధనుడు సంధికొడబడకుండుటచే దుఃఖితుడైన ధృతరాష్ట్రునకు ప్రత్యక్షమై పృథ్వీపతులందరును చత్తురని చెప్పెను సంజయునకు ప్రసాదించెను ఏచుహాయముచు పొందకుండ యుద్ధ భూమి యందు శక్తిని భారత యుద్ధానంతరము 18

సంవత్సరములు గడచిపోయినను పుత్రులను తలచుకొనుచు దుఃఖించుచున్న ధృతరాష్ట్రుడు సపరివారముగా ఆశ్రమ వాసములోనుండగా అతని దుఃఖమును తొలగింపగలచిన వేదవ్యాస మహర్షి ప్రాదుర్భవించి ధృతరాష్ట్రునితో ఇట్లనెను.

"విదితం మమ రాజేంద్ర యత్తే హృది వివక్షితమ్
దహ్యమానస్య శోకేన తవ పుత్రకృతేన వై
శ్రుత్వా సమాగమ మిమం సర్వేషాం వస్తతోనృప
సంశయచ్ఛే దనార్థాయ ప్రాప్తః కౌరవసన్దన
ఇమేచ దేవగంధర్వా స్సర్వేచేమే మహర్షయః
పశ్యన్తు తపసోవీర్యమద్యమే చిరసంభృతమ్
తత్కృతంహ్యైః పురా కైశ్చిత్కర్మలోకే మహర్షిభిః
ఆశ్చర్యభూతం తపసః ఫలం తద్ద్రక్ష్యథామివః
తదుచ్యతాం మహాప్రాజ్ఞ కంకామం ప్రదదామితే
ప్రవణో స్మివరందాతుం పశ్యమే తపసోబలమ్ ॥

"ధృతరాష్ట్రా! పుత్ర నిమిత్తకమైన శోకముతో దహింపబడుచున్న నీస్థితిని తెలిసికొని నన్ను పురస్కరించుకొని అందరును ఇక్కడ సమావేశమైయుండుటను తెలిసికొని మీకందరకు సంశయవిచ్ఛేదము చేయదలచి నేను వచ్చితిని. ఈ దేవ గంధర్వులును ఈ మహర్షులును నాతపః ప్రభావమును చూచెదరుగాక! ఇంతకుపూర్వము ఏ మహర్షులును ఏపని చేయుంచలేదో ఆశ్చర్యకరమైన ఆపనిని నాతపఃఫలముగామీకు ప్రదర్శించెదను. ఏమికోరిక కలదో తెలుపుము. నాతపోబలము చూడుము" అనిమహర్షి చెప్పగా ధృతరాష్ట్రుని భార్యగాంధారి ఇట్లన్నది. హతులైన పుత్రులను తలచుకొనుచు శోకించుచున్న ఈ మహనీయునకు మనశ్శాంతి లేకున్నది. నిద్రకూడ లేకున్నది.

లోకానన్యాన్ సమర్థోఽసి స్రష్టుం సర్వాన్ తపోబలాత్
కిము లోకాన్తరగతాన్ రాజ్ఞో దర్శయితుం సుతాన్"॥

మహర్షి! నీవుతపోబలమున లోకాంతరములనుకూడ సృష్టింప సమర్థుడవై యుంటివి. లోకాంతరగతులైన పుత్రులను మహారాజునకు ప్రదర్శించుట నీకెంతపని! అనుచు ధృతరాష్ట్రుని కోరికను తాను వెల్లడించినది. అప్పుడా వేదవ్యాసమహర్షి ఎవరెవరి యంశములతో ఎవరెవరు జన్మించిరో చెప్పి దేవతలు మనుష్యలోకములో జన్మించి వారుచేయవలసిన కార్యములను చేసి స్వర్గమును పొందినవారని చెప్పి మీ హృదయములలో గతించినవారిని పరలోక భయమేది కలదో దానిని తొలగించెదనని చెప్పి

"సర్వే భవన్తో గచ్ఛన్తు నదీం భాగీరథీం ప్రతి
తత్రద్రక్ష్యథతాన్ సర్వాన్ యేహతాస్తే స్మిహారణే॥

మీరందరును గంగానది దగ్గరకు వెళ్లియుండుడు అక్కడ యుద్ధములో మరణించిన వారినందరిని మీరు చూడగలరు అని మహాయోగియైన వ్యాసమహర్షి చెప్పెను. అది విని మహోల్లాసముతో జనసమూహము హర్షధ్వనులు చేయుచు గంగానది దగ్గరకు వెళ్లి మహర్షి సందర్శనార్థమై నిరీక్షించుచుండెను. అంతట ఆ రాత్రి సమయమున

"తతోవ్యాసో మహాతేజాః పుణ్యం భాగీరథీజలమ్
అవగాహ్య జుహావాథ సర్వాన్ లోకాన్
మహాద్యుతిః ।"

వ్యాసమహర్షి గంగానదిలో మునిగియుండి యుద్ధమృతులనందరిని ఆహ్వానించునంతట

'తత స్సుతుములశబ్దో జలాన్తే జనమేజయ
ప్రాదురాసీద్యథా పూర్వం కురుపాండవసేనయోః
సర్వే భాసురదేహాస్తే సముత్తస్థుః జలాత్తతః
యస్య వీరస్య యో వేషో యోధ్వజో యచ్చ వాహనమ్
తేన తేనవ్య దృశ్యన్త సముపేతా నరాధిపాః
నిర్వైరా నిరహంకారా విగత క్రోధమత్సరాః ।

"ఆ గంగాజలము లోపలనుండి మహాశబ్దమొకటి ఉద్భవించినది. అది పూర్వము రణరంగములో విజృంభించినట్టి కురు-పాండవ సేనల మహాశబ్దముతో తుల్యముగా నుండెను. ఆ వెంటనే ఆ జలములో నుండి వీరలందరును గంగాతీరమునకు చేరియుండిరి. వారు యుద్ధ సమయములో ఏ వేషముతో ఏధ్వజముతో, ఏ వాహనముతో ఎవరెవరుండిరో వారు వారు ఆ వేషము ఆ ధ్వజము ఆ వాహనము కలిగినవారై శోభించుచుండిరి. ఇక వీరిలో పూర్వపువైరము కాని అహంకారము కాని క్రోధము కాని మాత్సర్యము కాని ఏమియు లేకుండుట విశేషము.

"ధృతరాష్ట్ర స్యచ తదా దివ్యం చక్షుర్నరాధిప
మునిస్సత్యవతీ పుత్రః ప్రీతః ప్రాదాత్తపోబలాత్ ॥

"అప్పుడు అంధుడైయున్న ధృతరాష్ట్రునకు పుత్రాది సందర్శన భాగ్యము కలిగించుటకై దివ్యదృష్టిని అనుగ్రహించెను. అపూర్వము అత్యద్భుతము అయినట్టి ఆ సంఘటనను జనులందరును విస్మితులై సందర్శించిరి."

"పుత్రః శ్వశ్రూశ్చ మాతా చ భార్యాశ్చ పతిభిస్సహ
భ్రాతా భ్రాత్రా సఖా చైవ సఖ్యా రాజన్ సమాగతాః
తాం రాత్రి మఖిలామేవం విసృజ్య ప్రీతమానసాః
ఆమన్త్ర్య అన్యోన్య మాశ్లిష్య తతో జగ్ముర్యథాగతమ్
తతో విసర్జయామాస లోకాంస్తాన్ మునిపుంగవః
క్షణేనాఽన్తర్హితా శ్చైవ ప్రేక్షతా మేవ తేఽభవన్॥

'అప్పుడు తన తల్లిదండ్రులతో పుత్రుడును తన పతులతో భార్యలును తన సోదరునితో సోదరుడును తన మిత్రునితో మిత్రుడును కలిసికొని ఆ రాత్రియంతయు పరమానందములో పరస్పర ప్రసంగములతో గడపి ఆలింగన పూర్వకముగా వెళ్లుచున్నామని తమవారితో చెప్పి వారందరును ఎట్లు వచ్చిరో అట్లు వెళ్లిరి అట్లు అక్కడ ఆవిర్భవించిన వారెల్లరును వ్యాసమహర్షిచే విడిచిపెట్టబడి జనసమూహము చూచుచుండగానే ఒక క్షణములో అంతర్ధానమయిరి

అని యీగాథను వైశంపాయన మహర్షి జనమేజయ మహారాజునకు తెలిపినపుడు పరమానంద భరితుడైన మహారాజు వైశంపాయనునితో నిట్లనెను—

మమాపి వరదో వ్యాసో దర్శయేత్పితరం యది
తద్రూప వేషవయసం శ్రద్దధ్యాం సర్వమేవ తే
ప్రియం మే స్యాత్ కృతార్థశ్చ స్యామహం కృత నిశ్చయః
ప్రసాదాదృషి ముఖ్యస్య మమకామ స్సమృధ్యతామ్
'ఇత్యుక్తవచనే తస్మిన్ నృపే వ్యాసః ప్రతాపవాన్
ప్రసాదమ కరోద్ధీమాన్ ఆనయచ్చ పరీక్షితమ్
తత స్తద్రూపవయస మాగతం నృపతిం దివః
శ్రీమన్తం పితరం రాజా దదర్శ జనమేజయః
శమీకంచ మహాత్మానం పుత్రం తంచాస్య శృంగిణమ్
అమాత్యాయే బభూవుశ్చ రాజ్ఞ స్తాంశ్చ దదర్శ హ॥

"మహనీయా! వరదుడైన వ్యాసమహర్షి నా తండ్రి పరీక్షన్మహారాజును ఆ వయోవేషరూపములతో నున్న స్థితిలో నాకు చూపిన యెడల నీవు చెప్పిన దానిని గాఢముగా నమ్మెదను కృతార్థుడనగుదును వ్యాసమహర్షి ప్రసాదముచేత నా కోరిక తీరునుగాక అని జనమేజయుడనుటతడవుగా ప్రసన్నుడైన వ్యాసమహర్షి ఆవయోరూపములుకల పరీక్షిత్తును స్వర్గము నుండి రప్పించి గోచరింపచేయగా ఆ జనమేజయుడు తండ్రియగు పరీక్షిత్తును అతనితోపాటు శమీకమునిని శమీకుని కుమారుడగు శృంగిని పరీక్షిన్మహారాజు యొక్క అమాత్యులను కు డ సందర్శించి పరవశుడై పోయెను వ్యాసుడు కాశిని కాని గంగను దాటి వెడలి వ్యాసకాశియను గ్రామమున నివసించెను ప్రతి అష్టమినాడు చతుర్దశినాడు వచ్చి విశ్వేశ్వరుని దర్శించుట కనుజ్ఞనొందెను ముక్తసంగుడగు ఋషిమహర్షి ఈయన కొడుకు

నమోఽస్తు తే వ్యాస విశాలబుద్ధే
ఫుల్లారవిందాయత పత్రనేత్ర
యేన త్వయా భారత తైలపూర్ణః
ప్రజ్వాలితో జ్ఞానమయః ప్రదీపః॥

వా మ శ

## వేదాద్రి

భారతదేశమున అయాప్రాంతములందు రామకృష్ణాద్యవతారములు ఆవిర్భవించినట్లే ఆంధ్రప్రాంతమున అహోబిలమునందు నృసింహావతారమావిర్భవించినట్లు పురాణములు చాటుచున్నవి ఎఱ్ఱన రచియించిన నృసింహపురాణముకూడ ఈ విషయమునే ప్రతిపాదించినది అహోబిలమునకు పంచక్రోశపర్యంతమును నారసింహమండలమనెదరు ఆంధ్రరాష్ట్రములో అహోబిలము, మంగళగిరి సింహాచలము వేదాద్రి యాదగిరిమొదలైన మప్పదిరెండు సుప్రసిద్ధ నృసింహక్షేత్రములు గలవు ఇవియేగాక ఎన్నియో నృసింహమూర్తులు ఆంధ్రప్రాంతమున పలుతావులలో వెలసినవి

కృష్ణాజిల్లాలోని జగ్గయ్యపేటకు ఆరు మైళ్ల దూరమున కృష్ణానదీ తీరమునందు ఈ ప్రాచీన వేదాద్రి నృసింహక్షేత్రము నెలకొనియున్నది 1961 సం॥ జనాభాలెక్కల ప్రకారము ఇచ్చటి జనసంఖ్య 649 మాత్రమే వీరి ప్రధాన వృత్తి వ్యవసాయము

శ్రీ యోగానంద లక్ష్మీనృసింహస్వామి ఇచ్చటి క్షేత్రదైవము త్రేతాయుగమున ఋష్యశృంగమహర్షి ఈ స్వామి విగ్రహమును ఇచ్చట ప్రతిష్ఠించినాడని స్థలపురాణము చెప్పుచున్నది వేదములు పర్వతరూపము దాల్చి స్వామిని ధరించియుండెనట! ఇచ్చట కృష్ణ ఉత్తరవాహిని పంచనారసింహక్షేత్రమని చెప్పబడు వేదాద్రియందు పంచనారసింహమూర్తులు వేరువేరుగా కలవు మూలవిరాట్టయిన యోగానంద లక్ష్మీనృసింహస్వామి తనపై రెండుచేతులతో శంఖచక్రములను క్రిందిరెండుచేతులతో యోగదండమును ధరించియుండును గోదాదేవిని రాజ్యలక్ష్మిని వేరువేరు ఆల

యములు కలవు ఆ యావరణమునందే లక్ష్మీనృసింహస్వామి ఆలయము ప్రత్యేకముగా నున్నది. కొండపై గల పుట్ట జ్వాలానృసింహస్వామి నెలవని అచ్చటి ప్రజలందురు. సాల గ్రామరూపమున నృసింహస్వామి నదీగర్భమున కలడు. కృష్ణా నదియందు నీరు ఎండినపుడు ఈ సాలగ్రామశిల గోచరమగును. కృష్ణలోనికి దిగుటకు మెట్లుగలవు. వేదాద్రికి ఒక క్రోసుదూరమున గరుడాచలమను గుట్టపై ఉగ్రనరసింహస్వామి ఆలయముకలదు. ఆయనను వీరనృసింహస్వామియని గూడ అందురు.

ఆలయమంతయు రాతికట్టడము. క్రీ శ 12వ శతాబ్దిలో రెడ్డి రాజుల కాలమున ఈ ఆలయమునకు ప్రాకారాములు నిర్మింపబడినట్లు తెలియుచున్నది. లక్ష్మీనృసింహస్వామి ఆలయపు పడమటి ద్వారమునకు కుడిప్రక్కన గల బండపై "శ్రీమన్మహా మండలేశ్వరకొమ్మిమన్మగంతి దేవరాజు శక వర్షంబులు ౧౨౮౦ ప్రభవ సంవత్సర జ్యేష్ఠ బహుళ పంచాదశి నాడు సూర్యగ్రహణ కాలమందు శ్రీ నృసింహ తీర్థనిలయ ప్రతాప శ్రీ నృసింహదేవునకు శ్రీకృష్ణవేణి తీరమందు హవిఃఖిల్యార్పణ సంపూర్ణార్థము వేముపల్లి గ్రామమును ధారాపూర్వకముగ నొసంగినట్లు

వేము ల్లీతి విఖ్యాత గ్రామ మాచంద్ర తారకం
ప్రతాప శ్రీనృసింహాయ ప్రాదాన్మన్మహామతిః
[S I I Vd X No 383]

అని లిఖింపబడిన క్రీ శ 1358 నాటి శిలాశాసనమొకటి కలదు.

సుప్రసిద్ధ తరంగ రచయితయగు నారాయణతీర్థుని ఆత్తవాది వేదాద్రి కెదురుగనున్న ఒక గ్రామము. ఆతనిచే శ్లోకాలు "వేదాద్రి శిఖర నృసింహం కలయామి విమల విద్యుజ్జ్వలిత జిహ్వామ్" అని ప్రార్థించినాడతడు.

శ్రీనాథ మహాకవి తన తుదిదినములలో వ్యవసాయమొనర్చిన బొడ్డుపల్లి గ్రామము కృష్ణాతీరమున వేదాద్రికి సమీపముననే కలదు. కవిసార్వభౌముడు తన సాహిత్య సౌష్ఠవమునకు ఉదాహరణములని చేర్కొనిన వానిలో " వేదాద్రి నృసింహం విపులవతః స్థలీ ల్లాన మాలికాగంథలహరి—" కూడకలదు.

రాజమహేంద్రవర సమీపమున "పరాశరశైల" మను నామాంతరముగల కోరుకొండకు కూడ "వేదాద్రి" యని శాసన వ్యవహారముకలదు. (కోరుకొండ శాసనము చూడుడు S I I Vol X No 514) ఇందువెలసిన నృసింహస్వామినిగూడ రసప్రదీప అను వైద్యగ్రంథమును రచియించిన ముకుందవేంకటాచార్యునివంటి భక్తులు పులుస్మరించియున్నారు.

మండపేట రామకృష్ణకవి విరచితమగు వేదాద్రిమాహాత్మ్యము నదుము శ్రీ పావకృష్ణమూర్తి ప్రణీతమైన కృష్ణమహాత్మ్యము నందును వేదాద్రి ప్రశంస చేయబడినది.

వేదాద్రిలో నృసింహస్వామి అర్చకత్వ కైంకర్యములు వైఖానసాగమము ననుసరించి జరుగును. అచ్చట వేదాంతం అను ఇంటిపేరుగల వైఖానసులు వంశపారంపర్యముగ అర్చకులుగా నున్నారు. వారి పూర్వులు వేదాంతం వేంకటనరసింహాచార్యులు రామస్వామి అనువారు క్షేత్రాభివృద్ధికై పాటుపడిరని తెలియుచున్నది. స్వామికల్యాణోత్సవములు ఏటేట వైశాఖశుద్ధ ఏకాదశినుండి వైశాఖ బహుళవిదియ వరకు జరుగును. అంకురార్పణము గజవాహనము అశ్వవాహనము కల్యాణోత్సవము ధ్వజారోహణము మొదలైన కలాపములు ఈ తిరునాళ్ళ సందర్భమున జరుగును. అందు వైశాఖ శుక్ల చతుర్దశినాడు నృసింహజయంతికూడ కలిసి వచ్చును. "వేదాద్రి చుట్టుప్రక్కల ఈ బ్రహ్మోత్సవములు పూర్వకాలమునుండియు ప్రసిద్ధములగుటచే సుదూరములైన పరిసర ప్రాంతములనుండికూడ వేలాదిగా యాత్రికులు తిరునాళ్ళకు వచ్చుచుందురు.

దేవస్థానమునకు గల 310 ఎకరముల భూమి నుండి సంక్రమించు సంవత్సరాదాయమే కాక కానుకలు మొక్కుబడులద్వారా కూడ విశేషధనము స్వామి లభించుచుండును. ముక్త్యాలజమీందారులు స్వామి ఆలయమునకు అనువంశిక ధర్మకర్తలుగ నుండెడివారు. ప్రస్తుతమీదేవస్థానము ఆంధ్రప్రభుత్వ దేవాదాయ ధర్మాదాయ శాఖ యాజమాన్యమున పర్యవేక్షణాధికారి పాలనమునందున్నది.

గ్రహరోగాది పీడితులు ఇచ్చట నివసించుచు స్వామికి దీక్షతో ప్రదక్షిణములు చేయుచు ఇష్టకామ్యార్థములు పొందుటకు ప్రయత్నించుచుందురు. ప్రాచీనమైన ఈ క్షేత్రమునందు యాత్రికుల సౌకర్యమునకై 40 గదులు గల ఒక సత్రమున్నది.

వ గో మూ

## వేమనయోగి

వేమన పద్యములను తొలిసారిగా సేకరించి ప్రకటించి అందులో కొన్నిటిని ఆంగ్లీకరించిన చార్లెస్ ఫిలిప్స్ బ్రౌను, వేమన 17 వ శతాబ్దిలోనివాడని వచించెను ఈ నిర్ణయము సరియైనదనియే తోచుచున్నది వేమ శబ్దసామ్యమును బట్టి వేమన కొండవీటి రెడ్డిరాజులలోనివాడై 15 వ శతాబ్దికి చెందునని కొందరి వాదము అది పొరపాటనియు అతడు నెల్లూరు మండలమునకు చెందిన పంటరెడ్డియైయుండుననియు పెక్కురు పండితులు రూఢిగా వక్కాణించియున్నారు

వేమన కవులని పేరు సంపాదింపని కవులకోవలో చేరిన వాడైనను మిక్కిలి ప్రతిభాశాలి శాస్త్రములవలన ఉపనిషత్తులవలనకాక కేవలము స్వయంకృషివలన గురూపదేశము వలన యోగసిద్ధిపొందిన మూర్తిమత్త్వము కలవాడీతడు విజ్ఞానరహితమైన యోగమును సంపాదించినట్లే పాండిత్యరహితమైన కవిత్వమును సంపాదించినాడు జ్ఞానము కవిత్వము అను రెండు గుణములును ఇతని ప్రకృతిలో నిసర్గముగనున్నవే

ఇతనికి ప్రపంచ పద్ధతి చాల అక్రమముగ తోచినది అగుచో కవియైనవాడు దానిని క్షేమపూర్వకముగ సంస్కరింప ప్రయత్నింపవలెను కాని ఇతడట్లు చేయజాలడు పైగా లోక పద్ధతిని హేళనచేసి దూషింప మొదలిడినాడు తన ఉపదేశములు వ్యర్థమైపోవుట చూచి ప్రపంచము నెడ ఈర్ష్యాకోపములు పెంచుకొనినాడు దీనితో ఆ దూషణ ద్విగుణీకృతమైనది ఇతనిలో కవి సహజములైన మృదుత్వమనోజ్ఞత్వములు లోపించుటచే ప్రకృతి సిద్ధముగ తనకలవడిన కవితాశక్తి క్రమముగ కుంఠితమయ్యెను

సహజముగ నీతిపరమైన శతకాదులు చాలవరకు రసభావ (emotion) రహితములు వేమన కవితయు దీనికి అపవాదము పతింపదు పైపెచ్చు ఇతర నీతిశతక కారులకు లేని హృదయ కాఠిన్యము ఇతనిలో నుండుటవలన ఈతని పద్యములకు మిక్కిలి పారుష్యము అలవడెను కడమ నీతిశతకకర్తలు తమతమ గ్రంథములను చెప్పుటలో కొన్ని కొన్ని ప్రయోజనములను ఆశించిరి అందుచే వారిరచనలు పౌర్వాపర్య సమన్వయము కల్గియున్నవి వేమన పద్యములన్నియు 'యాదాలాపముగ' చెప్పబడినవి లేదా తాత్కాలిక ఆవశ్యక పురస్సరముగ చెప్పబడినవి పరిశీలించినచో, ఇందు బహుధా, విప్రతిపత్తివచనములును పాటిల్లినవి

వేమన కేవలము సంస్కారార్థమై కవిత్వము చెప్పినాడన వచ్చును ఇతడు ప్రధానముగ సాంఘిక ఇతరుల మనస్సునొప్పింప చూచినాడేకాని అచ్చమైన కవివలె లోకుల హృదయానురంజనముచేయ జూడలేదు నిజమునకు కళార్థమై కవితచెప్పినవారిలో కావ్యగుణములు శోభించును సంస్కారార్థమై చెప్పిన వారిలో అవి శోభించుట అరుదు ప్రత్యేకించి యితని గ్రంథములో ఉదాత్తమైన కావ్యగుణము కాన్పింపదు పోనిమ్మనిన ఒక్క లోకము మీదనేకాదు ఏ దేవుని మీదను ఇతనికి భక్త్యాదరములు అగపడవు ఇతడు శుద్ధ అద్వైతి అనగా నిర్గుణబ్రహ్మోపాసకుడు సగుణమగు దేవతోపాసనము ఇతనికి లేదన్న మాట నిర్గుణోపాసకుడగు యోగికి కవితాశక్తి అలవడి దాని మూలమున ద్ధికొండగోరినచో అతడు మరల సగుణోపాసకుడు కాకతీరదు శంకరాచార్యులు నిర్గుణోపాసకుడే! అనగా అద్వైతియే! కాని కవిత్వము చెప్పవలసి వచ్చినపుడు మాత్రము సౌందర్యలహరి శివానందలహర్యాదులలో సగుణోపాసన కావించితీరెను శంకరుని కవితకు అట్టి రసపుష్టి కల్గుట కదియే కారణము తిక్కనయు అద్వైతి అగుగాక! కవిత్వము చెప్పవలసి వచ్చినపుడు అతడు సగుణ బ్రహ్మమునే ఆరాధించెను వేమన అట్లు చేయలేదు కేవల నిర్గుణోపాసకుడుగ బహిరంగ ద్వేషిగ వ్యవహరించెను అనగా దేనియందైనను ముఖ్యముగ గమనింపదగినది దాని సారభూతమైన అంతరతత్త్వమేగాని బాహ్యపటాకారము వేషము పసియు వంటివికావనునట్టి ఈతని సాధారణదృష్టి యథార్థమునకు అంతరంగ బహిరంగములు రెండును అన్యోన్యాశ్రయములేగాని విరుద్ధములుగావు వేమన, తాను బహిరంగమును ద్వేషించుచు ఇట్టితప్పు సిద్ధాంతమును కొంత వరకు కవిత్వమునందును ప్రవేశపెట్టినాడు కవితకు భాషయు, ఛందస్సును మొదలగునవి బహిరంగములు అర్థము భావము, రసభావము మొదలగునవి అంతరంగములు ఇవి ఒక విశిష్ట విధమున తీవ్రముగ ఉన్నయెడలనేగాని, రచనకు కవిత్వమని పేరు రాదు కేవల నిర్గుణోపాసన మూలమున వేమనలో రసభావము లోపించెను నామ రూపగుణములను విడిచినచో, రసభావమేలేదు అసలు నామ రూపగుణ హీనమైన నిర్గుణ బ్రహ్మమునకును కవిత్వమునకును ఉత్కటమగు విరోధము

వేమన పద్యములందలి పారుష్యము క్షంతవ్యమని తలచినచో, ఈతనికవితలో కొన్ని అసాధారణగుణములున్నవి

అందు (1) అతి విచిత్రమగు రచనా శక్తి ఈ శక్తి శబ్దార్థాశ్రయము దీనినే భావతీవ్రతని కొందరనిరి (2) అమోఘమైన అంతశ్శుద్ధి ఈతని పద్యములకు ప్రాణమొసగిన రెండవ గుణము ఈ అంతశ్శుద్ధియే లోకము మెప్పునకొరకు అంతరంగములోని అభిప్రాయమును ఊహించి నిర్భయముగ వ్యక్తముచేయించును ఇదియే ఆత్మగతమైన ఆ శక్తి ఇతడు తీవ్రమైన భావములను అడ్డులేని నాలుకయు కలవాడన్న మాట (3) తీక్ష్ణభావములకు తగిన తీక్ష్ణశబ్దజాలమునుగూడ తెనుగుభాషలోనుండియే యెన్నుకొన్నవాడు వేమన (4) ఇతనిలోనైతే లీనౌలభ్యసారళ్యములు తరువాతి గుణములు ఇతని పదములు తెలుగుతన మెంతసులభమో యెంతసరళమో అంత నిరర్గళము క్లిష్టములగు తాత్త్విక విషయములు చెప్పునప్పుడును కుంటువడని సూక్తశైలియితనిది ఈ సౌలభ్యమునందే ఈతని కవితా శక్తి యిమిడియున్న దనవచ్చును ఇతని పద్యములన్నియు లోకమున వినబడుచునేయుండును పదములు పద్యస్ఫురితములేగాని కృతకములుగావు తానుచెప్పునట్టి ప్రతి న్యాయమునకును ఒక ఉపమానమునుగూర్చుట ఇతనికి అలవాటు ఆ ఉపమలైనను ఊహాకల్పితములుగావు సజీవములు సర్వమానవానుభవ సన్నిహితములు (5) ఆటవెలది ఛందోరహస్యము నెరుగుట ఈతనిలో ఇంకొక గుణము ఇతని ఆటవెలది యతికిచ్చిన మర్యాదయు అందమును అద్భుతావహములు యతికి విశ్రాంతి యని పేరు ఆ పేరు సార్థకమగు రీతిని వాక్యమును విరచుట ఇతనికి అభ్యాసము ఎక్కడ యతిస్థానమో, అక్కడ పదమేగాదు అభిప్రాయముకూడ తెగి నిల్చును అందువలన ఇతని వాక్యములకు నిర్భరత్వము గురుత్వమును వచ్చినవి ఆటవెలది తనవలె ఇంకొకడు చెప్పలేడనిపించినవాడు వేమన (6) పరిహాసము ఇతని ప్రధాన గుణములలో ఇంకొకటి ఇది యీతని పద్యములకు కొంత మెరుగుపెట్టి వాటిని దుర్వారబలముగల వానినిగ జేసినది అసలు ఆంధ్ర సారస్వతములో నయముతో కూడిన హాస్యమంతగా లేదు బోధన ప్రియత్వము సంస్కరణాభిలాషము వంటి వాటితో మిశ్రితమైయున్నను, వేమన పరిహాసమొక్కొక్కమారు తన పని తాను మరచిపోయి స్వచ్ఛమై తృప్తిగొల్పుచుండగలదు (7) నీతిబోధ ఈతని పద్యములకు మరియొక లక్షణము ఇతని పద్యములను వేమన పలుకులు లేక వేమన సూక్తులు లేక వేమన నీతులు అనుట తగునుగాని వేమన 'కవిత్వము' అనరాదని కూడ కొందరి వాదము ఇతని నీతులు సనాతనములు అనేకములను ఇవియే యీతని పేరును ఆ చంద్రార్కముగ నిల్పగల్గినవి ఇతడు ఔదార్యము లోభము అన్నదాన న్యాయదానములు అహింసావ్రతము యజ్ఞయాగాది కర్మకాండలు వేషము ద్రవ్యసంపాదనము మున్నగువానిగురించి స్పష్టముగను సూటిగను మాత్రమే గాక వ్యంజనాశక్తుల మార్గమునకూడ చెప్పినాడు (8) శిల్పనైపుణ్యము వేమన రచనల కొక విధముగ మెరుగుదిద్దిది ధర్మము తత్త్వము నీతి మతఖండనము మున్నగు విషయములు చెప్పినను ఇతని పద్యములందు సారళ్యభావాలతలకు నిర్లక్ష్యశిల్పనైపుణ్యము తోడ్పడుచుండును ఇతడు చెప్పిన మాట ఒరుల హృదయములంగు హత్తుకొని పోగలదు ఇది భగవద్దత్తమగు శక్తి దీనికి వివశులమై లొంగిపోయి ఈతని లోపములను క్షమింతుము ఇతని కొన్ని సిద్ధాంతములతో మన మేకీభవింపకపోయినంత మాత్రమున పైనచెప్పిన గుణగణములుండగా ఈతని పద్యములవలన మన మనస్సులు చమత్కృతి నొందకపోవు

హాస్యము తనపద్యములకు కొంత మెరుగుపెట్టి వాటిని అదమ్యబలసంపన్నములుగ చేసినది వేమన హాస్య ధోరణి యందు హాస్యమునకు మూలప్రకృతి ఇతరుల యందలి తప్పులను బయటపెట్టుట ఒకరి తప్పులను బయటపెట్టినదెల్ల హాస్యము కానేరదు అట్లు బయటపెట్టుటలో గూడ ఒక మార్గమున్నది అదియొక శిల్పము హాస్యమువలని ఫలము జనుల చిత్తమును సంస్కరించుటయే యైనను, వేమన గొప్ప బోధకుడును గూడ అందువలన ఇతనియందు హాస్యమప్పుడప్పుడు కలుషితము కాని ఒక్కొక్కమారది తనపనిని తాను మరచునట్లు చేయును అప్పుడు కేవలము (బోధచేయని) స్వచ్ఛమగు హాస్యము ఉద్భవించును పాలసాగరమున పవ్వళించినవాడు, గొల్లయిండ్ల పాలు కోరనేల? అను ప్రశ్న కల్గినది ఇచ్చట నీక ఇతడు పురాణములను తిట్టును కాబోలు ననుకొందుము కాని ఈ సందర్భమున చెప్పిన సమాధానము వేరు: "ఎదుటివారి సొమ్ములెల్ల వారికితీపి" ఈ సమాధానమునకు ఎంత కృష్ణభక్తుడైనను నవ్వకయుండలేడు

ఇతరులను నవ్వింపవలెనను ఉద్దేశము చేతనే కొన్ని కొనరు మాటలు చేర్చి వ్రాయుట ఈతని పద్ధతులలో నొకటి: "గొడ్డుటావుఁ బిదుకఁ గుండఁ గొంపోయిన పండ్లురాలదన్ను

పాల నీడు ! లోభివాని నడుగ లాభంబులేదయా"

"మేక కుతికఁబట్టి ! మెడచన్నుఁ గుడువగా ! ఆకలేల మాను ? ఆశగాక ! లోభివానినడుగ లాభంబుగలుగునా ?

ఈ పాశ్చాత్యప్రియత్వమునకు చేసినదే పెరోపకారశక్తి వేమన యందున్నది అందరికిని తెలిసిన సామాన్య న్యాయమునే గంభీరముగ రెండుపాదములలో చెప్పి మూడవపాదములో దానిని తలవని తలంపుగా శ్రోతృశ్రోతకు త్రిప్పచెప్పట -

సకల తీర్థములను సకలయజ్ఞంబుల తలలు గొరుగ కున్న ఫలములేదు కర్మకాండను ద్వేషించు ఇతనినోట యీ మాటలు వినగానే శాస్త్రములు బ్రతికినవే ! అని మనము సంతోషించునంతలోనే—"మంత్ర జలముకంటె మంగలి జలమెచ్చు' -అను పిడుగువంటి మూడవపాదము వినఁబడును దీనితో చిరునవ్వు నవ్వెదము

లోభియనిన ఇతనికి చాల అసహ్యము వానిని చంపుటకు ఈతడు మందు శెప్పుచున్నాడు "లోభివానిఁ జంప లోకంబులోపల మందువలదు వేరెమతముకలదు ! పైకమడిగి నంత భగ్గునపడిచచ్చు" మరియు అసహ్యముతో గూడిన యింకొక హాస్యోదాహరణము గమనింపదగినది—

పిసినివానియింట పీనుగు వెడలిన కట్టెకోలలకును కాసులిచ్చి ! వెచ్చమాయెననుచు వెక్కివెక్కేడ్చురా !"

నీతులు : పద్యధోరణికిని హాస్యమునకును తోడుగ తననామమును ఆంధ్రదేశమునందు ఆచంద్రార్కస్థాయిగ చేసినవి ఈతనినీతులు తత్త్వవాదములకువలె ఈతని నీతులకును అనుభవమే మూలముగాని పుస్తకములుగావు మంచి చెడ్డలెంటిని తానుచేసి అందరి తత్త్వమును చక్కగనెఱిగి యితరులకు బోధించువాడగుటచే సాధారణ నీతిగ్రంథములలో లేని తీవ్రత యితని పద్యములలో కలదు -

విన్నవారికన్న కన్నవాడధికుండు కన్నవానికన్న కలియువాడు' అనుమాట ఈతని నీతుల యందును అన్వయించును

నీతులను పరార్థములనియు స్వార్థములనియు ద్విధాకరింపవచ్చును అసలు పరార్థనీతులు కూడ స్వార్థములే ! కాని వేమన పరార్థనీతులందు ఈ స్వార్థదృష్టి చాలతక్కువ మానవ సహజమైన ఔదార్యముతో పరులదుఃఖమును పోగొట్టి సంతోషమును కూర్చుటచేత తనకుగల్గు సంతోషమే పరోపకార మందలి పరమార్థమని వేమనమతము ఔదార్యమునకు తోడు పాత్రాపాత్ర వివేకము వేమనచే బాగ ద్రగన్నది

పగతుడైన వేదబాహ్యుడైన వట్టి లేని పేదవానికిదగు నీవి అన్నదానము తర్వాత కన్యాదానమును గూర్చి ఈతని కభిమాన మెక్కువ కలిమిఁజూచి యియ్యగాయమిచ్చినయట్లు పమున కియ్య నదియు సరసఁదనము ! పేదకిచ్చు మనువు పెనవేసి నట్లుండు

నిజమగు పరోపకారబుద్ధి యున్నవాడు పరులను హింసించుటయు సైపలేడు ఈ అహింసా వ్రతమన్నచో వేమన్నకు చాల అభిమానము " జీవి జీవి జంప శివునిజంపుటేయగు ! జీవుడరయ తెలియ శివుడుకాడె !" కావుననే యితడు యజ్ఞకర్మలను చాలనిందించెను ఇతనికి తనశత్రువును కూడ హింసించుట కిష్టములేదు "చంపదగినయట్టి శత్రువు తనచేత జిక్కెనేని కీడుచేయరాదు ! పొసగ మేలుచేసి పొమ్మనుటే చాలు నిజమే ! శత్రుత్వము చచ్చుమంచిపద్ధతి యిది శత్రువులుచచ్చి శత్రుత్వము మిగిలినచో సుఖముండునా !

ఇతని స్వార్థనీతులలో స్వానుభవము వివేకము ఇంకను ఎక్కువ మానవులకీ లోకమున శాంతముగా బ్రతుకుటకు అవశ్యకములగు వివేక సహనాది గుణములను ఇవిబోధించును అంతరకును బ్రియమునుగూర్చును "చాకికోకలుదికి చీకాకుపడ జేసి మైలదీసి తెల్పమడచినట్లు ! బుద్ధిజెప్పువాడు గ్రుద్ధితే నేమయా ? ఇట్టినీతులను పైరీతిని సూటిగ చెప్పటయొక తీరు వాటిని వ్యంగ్యముగ చెప్పట, అంతకంటె బలమైన యింకొకతీరు వేమనకు ఈ మార్గమందు అనక్తియెక్కువ శక్తియు నెక్కువ ఒకేనీతిని రెండుపద్ధతులలో చెప్పెను ఇందేది ప్రబలమైనది ?

"ఆలి మాటలు విని అన్నదమ్ములరోసి వేరె పోవువాడు వెర్రివాడు !

కుక్కతోకబట్టి గోదావరీదునా ? ' ఇది స్పష్టమార్గము దీనినే ధ్వనిమార్గమున చెప్పినాడు వేమన అలి వంకవారు ఆత్మబంధువులైరి ! తల్లివంకవారు తగినపాటి ! తండ్రివంకవారు దాయాది పగవారు ఇట్లే జగము ధనమూలమైనది అని వస్తుస్థితి కథనపద్ధతి - 'కులము గలుగువారు, గోత్రంబుగలవారు ! విద్యచేత విర్రవీగువారు పసిడిగల్గువానిబానిసకొడుకులు మరి వట్టి ఉపమానములనే చెప్పి ప్రస్తుత విషయము చెప్పక దానిని స్ఫురింపజేయుట యితని యందు ఇంకొక విచిత్రమార్గము

"తిరుమలకును బోవ తురకదాసరి కాడు। కాశికేగినంది గజముకాదు। కుక్క సింగమౌనె గోదావరికి బోవ"

ఇట్లు ధర్మము నీతి పరమత ఖండనము మున్నగు ఏ విషయములు చెప్పినను ఇతని పద్యములందు పారళ్యము నిరుపమ ధారాళతయు నిర్లక్ష్య శిల్పనైపుణ్యము మొదలగు గుణములు నిండియుండును దానితోడ తన అనుభవము వలన లోకోద్ధరణార్థము చెప్పినగాని సొంతలాభమునకు చెప్పినవికావు ఈతని నీతులు. వీటివలన చదువరులకు మనో వికాసమును హృదయాహ్లాదమును లోకానుభూతియు గల్గును

వేమనపద్యములు కొన్నివేలు కలవు లభించినవి రమా రమి రెండువేల ఇందుకొన్ని ప్రక్షిప్తములనియు లోకులు శంకించుచున్నారు వీటిలో కొన్ని దుర్గ్రాహ్యములుగ ఉన్నవి అందలి అంతస్తత్త్వము లెవ్వరికిని తెలియవు అవి రసవాద పద్యములని కొందరందురు వేమన యావదాంధ్ర దేశము సంచారము కావించినాడు ఈ సంచారము దిగంబ రుడై యోగివలెకాదు సంఘసంస్కరణాభిలాష జనించిన తొలిదినములలోనై యుండును మన సంఘములో కుల భేదము నశింపవలెనని ఈతని ముఖ్యోద్దేశము ఇట్టిది యోగి అనువెల్లరకు నుండు ఆశయమే కాని సాధారణముగ యోగులు ఇట్టి ఉపదేశములను అధికారముగల శిష్యులకే బోధింతురు వేమనయోగి మాత్రము అధికారములేని లోకము మీదనే ఇట్టివాటిని ప్రయోగించినాడు లోకము ఇతనిని మన్నింపలేదు ఇతడును లోకమును మన్నింపలేదు ఇట్లు లోకముతో తనకు భేదాభిప్రాయము హెచ్చినకొలదియు ఈతని పలుకులకు పరుసదనము ప్రబలినది అటు యోగా భ్యాసము ఇటు లోకనిరసనము లేనిచో ఇతడు ఆంధ్రసాహి త్యమున కొక మహాకావ్యమును ప్రసాదించియుండును కవిత్వ ములో పింగళిసూరనవలె సంఘములో వేమన ఒకశతాబ్ది ముందుగ పుట్టినాడు వేమన ఆశయములు నేటికి ఆవశ్యక ములుగాని నాటికికావు సర్వప్రాణి సమత్వమును అపేక్షించు నది ఈ యుగముకాని వేమన యుగముకాదు

యోగసిద్ధియు, వాక్పటిమయు ఉన్నతాశయము లును కలిసి వేమన ఆంధ్రులకు మహాయోగిగ నేటికినిపూజ్యుడై యున్నాడు కవిత్వమునకు ప్రాతిపదికమైన రసభావము ఈతనిలో లేకపోవుటచే, కవిగామాత్రము ఇతనికి ఎన్నిక తక్కువ కాగా విద్వాంసులు వేమనను గమనింపలేదు అట్లే ఇతడును వారిని మన్నింపలేదు తుదకు కవులని కీర్తి సంపా దింపని కవులకోవలోనే ఇతడు చేరినవాడయ్యెను

బి. వి. కు. క.

## వేములవాడ - భీమకవి

భీమకవికి చెందిన చారిత్రకాంశ నిర్ణయములవలెనే అతని జన్మస్థలనిర్ణయము కూడ వివాదములకు నెలవైనది జయంతి రామయ్య ప్రభృతులు ఈ కవిది తెలంగాణమందలి వేములవాడయని వాకొనగా కందుకూరి వీరేశలింగము మున్నగువారు గోదావరిమండలమందలి వేములవాడయని వ్రాక్రుచ్చిరి ఇరువదులమధ్య ఈ విషయమై సుదీర్ఘములై చర్చలు సాగినవి వాటిని పరిశీలించు నిష్పాక్షిక విమర్శకునకు ఈ దిగువ పొందుపరచిన పిండితార్థము తోచగలదు

ఒక వేములవాడ గోదావరిమండలములో ద్రాక్షారామ మునకు మూడువాలుగు క్రోసులదూరమునను రెండవది తెలంగాణమందు కరీంనగరమండలమునను గలవు ద్రాక్షా రామపు వేములవాడలోని ఈశ్వరునిపేరు భీమేశ్వరుడుకాగా కరీంనగరపు వేములవాడలోని ఈశ్వరునిపేరు రాజేశ్వరుడని పిలుపబడుచున్నాడు రాజేశ్వరుడే భీమేశ్వరుడనియు వేములవాడయే దక్షవాటికయనియు కొందరు చేయువాద నలో పసలేదు

భీమకవి తననుగూర్చి దక్షారామ భీమేశనందనుడవ్ అని చెప్పకొనిన పద్యమును ఇంతవరకెవ్వరును కాదన కుండుటచే గోదావరిమండల ద్రాక్షారామసాదనమునకే బలమెక్కువ చేకూరుచున్నది అట్లైచో దక్షారామ సమీపస్థ మగు వేములవాడయే అతని నివాసమగునుగాని కరీంనగర మండలస్థమగు వేములవాడ కాజాలదు దీనికితోడు కరీం నగరమండలమున ఇంకొక దక్షారామమైనలేదు

భీమకవి జననవృత్తాంతము అతని జన్మస్థలవిషయము నందువలెనే అతనికి సంబంధించిన చరిత్రాంశముల విషయమున గూడ కొంత శిథిలత కలదు ఆంధ్రవాఙ్మయమునందితని దొకదుర్గ్రాహ్యమైన చరిత్రయని చెప్పవచ్చును వేములవాడ గ్రామమున సోమన అను నియోగిబ్రాహ్మణునకు బాలవిధవ యైన కొమార్తె యుండెడిదట! ఆమె భీమేశ్వరునకు మ్రొక్కి కొలదికాలమునకే ఒక కుమారుని కనెనట! ఆ గోపకునకు

సంఘములో తలపంపులగుచుండగా తన తండ్రి భీమేశ్వరుడే యని అతడు తల్లివలన తెలిసికొని ఆ దేవుని మెప్పించి, తద్వరప్రసాదలబ్ధకవితాధురీణుడై నాడట!

భీమకవి సంస్కృతమున ఒక జ్యోతిశ్శాస్త్రమును రచియించె ననియు తాను దానిని ఆంధ్రీకరించుచున్నాననియు చెప్పుకొనిన ఒకానొక అజ్ఞాతకవి తనకృత్యాదిలో భీమకవి జనన వృత్తాంతమును 'సీసపద్యమాలి'యందు చాలవరకు పై విధముగనే వర్ణించినాడు. కాని ఈతని కాలమును గూర్చి కవులును విమర్శకులును లోకులును ఎంత భిన్నముగ తలచినను ఆ భిన్నభిన్న శతాబ్దులైదింటిలో (క్రీ.శ. 847 1337 నడుమ) అతడు జన్మించినట్లు విశ్వసింపబడుతిథి వార, నక్షత్రాదులు సంపదింపకున్నవి.

**ఇతని గ్రంథజాలము**: భృగుసాకి బృహస్పతిసాడి వలె నాడీగ్రంథమనొకదానిని అతడు కూర్చెనని జనశ్రుతి. జాతకభాగమున అతడు మహాపండితుడనియు వదంతి. అట్లయిన కావచ్చును. 'భీమనకవికి ప్రశ్నలక్షణము' అను వొక చిన్నశాస్త్రగ్రంథము ముద్రితమైయుండ నేయున్నది. భీమకవి జోస్యము అను పేరిటనొక ఆంధ్రగ్రంథము మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమునందు కలదు. కాని అదు భూత భవిష్యద్వర్తమాన కాలముల వారి జాతకములందు వాడి విధానము కానరాదు. భీమకవి జ్యోతిషామృతసారము మ వేరొక గ్రంథము అచ్చైయున్నది. అయినను అది భీమకవి విరచితమే అని స్థిరీకరింపబడలేదు.

**రాఘవపాండవీయము**: భీమకవి రచితమగు 'రాఘవపాండవీయము'ను నన్నపార్యుకు ముందు నశింపజేయగా నన్నపార్య విరచితమైన ఆంధ్రశబ్ద చింతామణి ని భీమకవి తిరిగి నశింపజేసెనని చెప్పెడి "అప్పకవీయము సంగతి పలుకులు నిరాధారములని చెప్పరు పండితగనుపుకుల అభిప్రాయము. అట్లు తనగ్రంథనాశనమే జరిగినచో దూషణలో ఉద్దండుడైన భీమకవి తనచాటువులందు నన్నపార్యుని తిట్టిపోయకుండునా! అట్టి చాటువొక్కటి కూడ ఇంతవరకు కాన్పింపదు. అట్లని భీమకవి రాఘవపాండవీయము ను నిర్మింపలేదనుట కాదు. పింగళిసూరన తన 'రాఘవపాండవీయము' అవతారికయందు చెప్పినట్లు భీమన తొల్లి చెప్పెనను పెద్దలమాటయేగాని యందు నొండేమియునేమియున్ నిలువదెవ్వరుగానరు' కావున అథర్వణుని భారతాముల

పట్టినగతియే భీమునిద్వ్యర్థికృతికిని పట్టియుండవచ్చును. ఒక్కదానికే కాక ఇతని ఇతరకృతులకును ఇట్టిదుర్గతి పట్టియుండుట విచారకరము.

**నృసింహపురాణము**: భీమకవి నృసింహపురాణము నొకదానిని వ్రాసెనని లోకమునవాడుక. వేటూరి ప్రభాకర శాస్త్రి తన చాటుపద్యమణిమంజరి యందు (1) ఈతీవచ్చి (2) కొంజిగుయునకు గతిచత - అను రెండు కందపద్యములను మానవల్లి రామకృష్ణకవి తన (నన్నెచోడుని) కుమారసంభవపీఠిక లో పాండిమి క్షన్నల్ల ద్విజనవల్లభుడోర్చిన అను ఉత్పలమాలను కస్తూరి రంగకవి తన 'రంగరాట్ఛందము'నందు మానవనాథుడు గంగాస్నానానంతరము' అను కందపద్యమును భీమకవియొక్క 'నృసింహపురాణము' లోనివిగా ఉదాహరించినారు. ఈ కృతినేడ లభ్యము.

**శతకంధరరామాయణము** -- ఇదియు భీమకవి కృతమే అని లోకము వాకొనును. ఇంకలి రెండు పద్యము ను వీరేశలింగంపంతులు తన ఆంధ్రకవులచరిత్ర లో ఉదాహరించినాడు. సరియే అని సంతోషింతమనినను నృసింహపురాణము శతకంధర రామాయణమువంటి విష్ణుపరమైన కృతులను శివపుత్రుడై వీరశైవుడైన భీమకవి నిల్పునా? అని కందుకూరి వారొక అనుమానజాలకమును పాతకుడై విసరినారు. అందు జరిగియున్నను లేకున్నను దానితో భీమన రచనలను గూర్చిన ప్రత్యేకము అనుమానాస్పదమే యగుచు వచ్చినది.

**బసవపురాణము** -- పాల్కురికి సోమనాథుడు చెప్పిన ఆంధ్ర బసవపురాణము'ను వేములవాడ భీమకవి కన్నడీకరించెనని కర్ణాటకకవిచరితము ను బట్టి వీరేశలింగం పంతులు నిరూపింప ప్రయత్నించుటలో వాచిబలమే గాని, వాదబలములేదు. కన్నడబసవపురాణకర్త తాను వేములవాడ భీమకవినని చెప్పుకొనలేదు. ఊరక భీమకవిని అనిమాత్రమే అన్నాడు. కన్నడ భీమకవి తన తండ్రిపేరు 'శివకవిదేవుడు' అని వాకొనగా వేములవాడ భీమకవి తాను దక్షారామ భీమేశనందనుడ నని వక్కాణించినాడు. వీరశైవుడు తనతండ్రి పేరు చెప్పుకొనడు ను వాదము నంగీకరించుచో ఈ కవు లిద్దరు తండ్రుల పేరు చెప్పుకొనిరి గాన ఇద్దరును వీరశైవులు కాకుండుటయో లేక ఆ వాదమే తప్పగుటయో సంభ

వము విమలసద్గురుసేవె య లింగమభజనె యలి లింగనిష్ఠా సమతెయలి అని కన్నడ కవి వీరశైవుడు కావలెను కన్నడ కావ్యకర్తయగు భీమకవి ఆరాధ్యబ్రాహ్మణుడైనచో అట్టి వారాంధ్రేతరులలో లేరు గావున కన్నడ పురాణకర్తయగు భీమకవి ఆంధ్రుడగుట్యో వేములవాడ భీమకవిగాక శివకవిదేవ పుత్రుడగు మరియొక భీమకవియై యుండవలెను ఆ కన్నడ కావ్యమున వేములవాడ అనుపదము లేకపోవుట మన వాదమునకు సాధకము వీరేశలింగపంతుల వాదమునకు బాధకము కన్నడ కావ్యములలో భీమకవికి కలదని చెప్పబడిన ఉభయకవితా సామర్థ్యము కర్ణాట సంస్కృతము లందే కాని కర్ణాటాంధ్రములందు కాకపోవచ్చును అందుచే వేములవాడ భీమనార్యుడు ఆంధ్ర బసవపురాణమును కన్నడీకరించెనను ప్రసక్తి ఉదయించదు

కవిజనాశ్రయము - వేములవాడ భీమకవి ఛందశ్శాస్త్రము నొకదానిని రచియించెనని పెక్కురంగీకరించిరి భీమకవిఛందస్సు నుండి కొన్నిపద్యములను లక్షణవేత్తలు తమతమ లక్షణగ్రంథములందుదాహరించిరి విమర్శకులు విభిన్నమార్గములు త్రొక్కి పొరపడుటకుమాత్రమే తోడ్పడినది కవిజనాశ్రయము ప్రతులలో కృత్యాదిని మూడవపద్యము నందు మల్లియరేచనను వి కవిజనాశ్రయమను ఛందము దెనుగున నరుడుగ జెప్పెన్ అని యుండగా కోమటిరేచన మీకును నీ మహిమగవు లెన్న ఛందమెలమి రచింతున్ అని వేములవాడ భీమకవి కానేడు పద్యములుగల అవతారికలో కూర్చినట్లున్న కాకినాడ ఆంధ్ర సాహిత్యపరిషత్తువారి ఏకైకప్రతినిబట్టి ఈ గ్రంథకర్తృత్వము భీమనకు అంటగట్టరాదు చెక్కుతాళపత్ర ప్రతులను పురస్కరించుకొని ఆ పరిషత్తువారు జైనవైశ్యుడైన రేచనయనే కవిజనాశ్రయ కర్తగా నిర్ణయించినారు కందుకూరి మానవల్లి చిలుకూరి ప్రభృతులుకూడ ఇట్లే అభిప్రాయపడుటచే ఇది విశ్వసింపదగిన విషయమైనది

హరవిలాసము - కస్తూరి రంగకవి తన ఆనందరంగరాట్ఛందము'నందు భీమనయొక్క హరవిలాసము'లోనివని రెండు కందపద్యముల నుదాహరించినాడు ఈ విషయము అన్యత్ర తెలియబడదు ఈ రంగరాట్ఛందము'నందే భీమ ఛందము'లోనివని మరి రెండు కందము లుదాహరింపబడినవి ఇవి భీమనది అనబడు "కవిజనాశ్రయము"లో లేనేలేవు అందుచే రంగకవి అందును ఇందునుకూడ ప్రమాది అనియే తెలుచున్నది భీమనరచితమైన హరవిలాసము లేనేలేదు భీమన రచించిన చాటువులనుబట్టి అతని కాలనిర్ణయాది విషయములలో తేలిన సారాంశ మీ దిగువ పేర్కొనబడినది

కవిజనాశ్రయ పీఠిక యందలి చోడగంగు విర్వురిలో ఒక్కరును భీమకవి చెప్పిన రాయకళింగగంగు కాజాలడు త్రికళింగాధిపతియని శాసనములలో పేర్కొనబడిన గంగు భీమకవి చెప్పిన రాయకళింగగంగే అగుచో ఆశాసనములను బట్టి భీమకవి క్రీ శ 1095-1108 ప్రాంతమున ఉండియుండవలెను చాళుక్యవు చోక్కరాజు ప్రథమకులోత్తుంగ చక్రవర్తియని నిర్ణయించి సాహిణిమారడు ద్వితీయ ప్రతాపరుద్రుని సేనాధిపతిగాక అన్యుడని అంగీకరించినచో భీమకవి కాలము క్రీ శ 1100 ప్రాంతమని విశదము కాగలదు హయమదసిత అను చాటువు నందలి గుడిమెట్ట చాగిపోతరాజు మొదటిపోతరాజే అగుచో భీమన కాలము క్రీ 1100-1120 అగును నృసింహ పురాణములోని వనబడు పద్యములందుగల నల్లసిద్ధి యొక్క శాసనములు ఏ కులోత్తుంగుని గూర్చి చెప్పునో ఆ కులోత్తుంగుడు ప్రథమకులోత్తుంగుడేయని భావించినచో వేములవాడ భీమకవిది క్రీ శ 1078-1118 సంవత్సరముల నడిమి కాలము గును ఘనుడన్ వేములవాడవంశజుడ అను పద్యములోని తెలుంగాధీశ అను దానికిగల కళింగాధీశ అను పాఠాంతరమును సాధువుగా స్వీకరించుచో భీమకవి కాలము క్రీ శ 1100 సంవత్సరమగును

పై ఆధారములనుబట్టి చూడగా భీమనది క్రీ శ 1030-1150 సంవత్సరముల నడిమి కాలమని వ్యక్తమగుచున్నది

వేములవాడ భీమకవి శాపానుగ్రహదక్షతను గూర్చిన కథలు గాథలు గ్రంథరూపమున గూడ చిరకాలము నుండి ప్రచారములో నున్నవి అయ్యును అవి అతని కాలమును నిర్ణయించుటకుగాని అతని పాండితీ టిను ప్రమాణీకరించుటకుగాని సాహాయ్యపడవు అతని చరిత్ర వలె అయోమయముగ నున్న యి కొన్ని ఆంధ్రకవి చరిత్రయు అగపడదు కాని చండప్రచండశాపానుగ్రహక్షమతయు భీమకవి యొక్క జయశీలతయు యావదాంధ్రుల శ్రోత్రపుటములలో రింగులు వారుచునేయుండును

వి వి శే శ

## వేలుపుగొండ

పూర్వము వేలుపుగొండ ఒడ్డెరాజులకు రాజధానిగా ఉండెను. ఎమ్మట జఫరుద్దౌలా అను మహమ్మదీయుడు దీనిని ముఖ్యపట్టణముగా చేసికొని రాజ్యపాలనను కావించెను. ఇక్కడ అతడు బలిష్ఠమైన దుర్గమును నిర్మించెను. అందువలన దీనిని 'జఫర్ గఢ్' అను పేరుతో వ్యవహరించుట జరిగినది. ప్రస్తుతము ఈ పేరే ప్రసిద్ధిలోనున్నది. దీనికి విజానగరము అను నామాంతరము ఉన్నట్లు కూడ తెలియుచున్నది. ఈ దుర్గము వరంగల్ మండలములో నున్నది.

జఫర్ గఢ్ దుర్గనిర్మాణములలో లక్కమేడ అనునది సుందరమైనది. నేడిది ఇతర నిర్మాణములవలెనే శిథిలమై కాన వచ్చును. ఈ కోటగల పర్వతప్రాంతమున వేలుపుగొండ అను గ్రామము కలదు. దీనికి నాలుగు దిశలలోను నాలుగు ద్వారములు కలవు. ఇవికూడ శిథిలావస్థలోనున్నవి. గ్రామము చుట్టును పూడిపోయిన కందకము కనిపించును. దీనివలన దీని పూర్వపు ఘనత కొంతవరకు తెలియును. ఇచ్చటి శిల్పము చాళుక్య శిల్పమువలె తోచును.

దుర్గము గిరిపై నిర్మింపబడినది. ఈ గిరిని అగస్త్య మహర్షి పూజించిన సాలగ్రామమనియందురు. ఈ పర్వతముపై యోగానందనృసింహస్వామి స్వయంవ్యక్తుడయ్యెనని చెప్పుదురు. నృసింహాలయము నానుకొని పాతాళగుండము కించిద్దూరమున స్నానాల గుండమును గలవు. నృసింహ స్వామి రెండుజాములవేళ స్నానమునకై స్నానాలగుండమున దుముకుననియు అప్పుడు శబ్దము వినిపించుననియు ప్రజలు వచింతురు. ఈ ప్రాంతమును పంచనృసింహక్షేత్రమనియు పిలుతురు. వీరనృసింహము లక్ష్మీనృసింహము సుప్రసన్న నృసింహము కొండసింగరప్ప అను నృసింహదేవతలు నాల్గు దిక్కులలోను మధ్య యోగానంద నృసింహభగవానుడును కలరు. ఈ కొండమీద లోతైన జలాశయములు, గుండములు కలవు. అక్కచెల్లెండ్ర గుండము నూనెగుండము పాల గుండము వీటిలో సుప్రసిద్ధము.

నిర్మల్ లో ఉండిన ఒకా నౌకమ్ములు దంపతుల పుత్రుడు జఫరు ఇతనికి 'ధంసా' అను అన్యనామము గూడ గలదు. ఇతడు బాల్యమున ఒక బ్రాహ్మణునిదగ్గర పశువులకాపరిగా ఉండెనట! ఒకరోజు మధ్యాహ్నము ధంసా నిద్రించుచున్నపుడు అతని ముఖముపై ఎండపడుచుండగా ఒక కృష్ణసర్పము అతని ముఖముమీద తనపడగను ఛత్రమువలె పట్టుకొని యుండెనట! ఆ బ్రాహ్మణుడు ఈ సన్నివేశమును చూచి ధంసా గొప్పవాడగునని భావించి నాటినుండి అతనికి విద్యను బోధించెను. ధంసా విద్యావంతుడై ధైర్యసాహసాదిగుణ భూయిష్ఠుడై దృఢకాయుడై ప్రకాశించెను. నిజాం సేనలో ఉద్యోగము సంపాదించి ఇతడు దివాన్ రుక్నుద్దౌలాకు అభిమానపాత్రుడై యుండెను.

వేలుపుగొండ కోటలో ఉండిన రామసింగు నరసింగ ఖాను అనువారు ధంసా కొలువులో చేరిరి. వారిమాటను అనుసరించి ధంసా 1800 సైన్యముతో వేలుపుగొండకు వచ్చెను. పర్వత పశ్చిమశృంగమున ఒడ్డెరాజులు నిర్మించిన దుర్గము అచ్చటి ప్రకృతిశోభ అతనిని ఆకర్షించెను. అందువలన అతడు తూర్పువైపు పర్వతభాగమును చుట్టివచ్చునట్లు కోటను కట్ట దలచెను. దివాన్ రుక్నుద్దౌలాకు ఈ విషయమును ధంసా తెలుపగా మంచి రాబడిగల ఏడుపర్గాణాలకు అతడు అతనిని అధికారిగా జేసెను. అప్పుడే రుక్నుద్దౌలా ధంసాకు 'జఫరుద్దౌలా' అను బిరుదు నొసంగెను.

జఫరుద్దౌలా దుర్గనిర్మాణమునకు పూనుకొనెను. జగన్నాథపాజారి జగ్గవంతులు బ్రహ్మాండనాయకుడు అనువారిని అతడు అచ్చట రక్షణకై నియమించెను. జఫరుద్దౌలా సైన్య సమేతముగా వెళ్లి పాల్వంచ సంస్థానాధీశుడగు రాజానరసింహ అశ్వారావును జయించి అశ్వారావుపేటను సాధించి దుర్గ నిర్మాణమునకు కావలసిన ద్రవ్యమును ఆర్జించెను. ఇంకను కొందరు దొరలను దోచుకొని అపారధనమును సంపాదించెను. కొందరు దేశముఖులు జగ్గవంతులను బ్రహ్మాండనాయకుని లోబరచుకొని వేలుపుగొండను స్వాధీనము చేసికొనదలచిరి. కాని మార్గమధ్యమునందే జఫరుద్దౌలా ఈ విషయమును తెలిసికొని వేలుపుగొండదగ్గరకువచ్చి వారితో పోరాడి వారిని చిత్రవధచేసెను. దుర్గమును స్వాధీనముచేసికొని అతడు చండశాసనుడై రాజ్యమును పరిపాలించెను. ఎమ్మట క్రమముగా మిక్కిలి బలవంతుడై నిజాం ప్రభువునుగూడ ఎదిరించెను. నిజాము అతనికాలములో వేలుపుగొండను జయింపలేక పోయెను. తరువాతికాలమున కృష్ణదేవరాయలు కమ్మంమెట్టుతోపాటు ఈ దుర్గమును గూడ జయించినట్లు తెలియుచున్నది.

జఫరుద్దౌలా నిర్మించిన భాగములతో కలిపి వేలుపుగొండకు 'జఫరుగఢము' ను పేరు కలిగినది. ఇందు తూర్పున

ఒక చిన్నకొండయు పశ్చిమమున ఒక పర్వతమును గలవు ఈ రెండింటి మధ్యమున చుట్టును 9 గజములఎత్తు రెండు గజముల వెడల్పు గల శిలలచే గారచేయబడినది పడమటి కొండమీదికి వెళ్లుటకు భూమిలోనుండి మార్గముకలదు అందు చిన్నచిన్న రహస్యమార్గము లనేకములు గలవు అవి నేల బొయ్యార లనబడును

జఫర్ గఢ్ షహారు" అని ప్రసిద్ధిచెందిన యీనగరమునకు తూర్పు పర్వతముపై దక్షిణమున ఒక ద్వారము పడమటి కొండపై ఉత్తరమున దక్షిణమున రెండుద్వారములు మొత్తము మూడుద్వారములు కలవు 12 గజములలోతు, 12 గజముల వెడల్పుగల కందకము ఈ నగరమును పరివేష్టించి యుండెను 18 బురుజులు 10 మందులకొట్లును ఉండెను తూర్పునగల ఎల్లి ద్వారమును భజంత్రీద్వార" మను చుండిరి ఈ కొండపై మంచినీటి జలాశయములు బావులును కలవు జఫరుద్దౌలా ప్రియురాండ్రగు తులశి మణి అను వేశ్యలపేర్లపై రెండుబావులు నిర్మితములైనవి అక్కడ ధంసా నిర్మించిన చెరువు తాడిచెట్టెత్తు గల రాతికట్టడముతో శాశ్వతబ్రహ్మకల్పముగా ఉన్నది

ఈ దుర్గమును సకలసౌకర్యసంపన్నముగను దృఢముగను చేయుటకు జఫరుద్దౌలాకు 14 సంవత్సరములు పట్టినదట! తులశి మణి అను వేశ్యల ప్రోద్బలముపై ఇచ్చటి యోగానంద నృసింహస్వామికి అర్చనాదులు సశాస్త్రీయముగా జరుగుచుండెను ఇప్పుడే దుర్గము శిథిలావస్థలో నున్నది

కె రా శ

## వైజ్ఞానిక శాస్త్రవేత్తలు (గణిత ఖగోళ శాస్త్రములు)

### యూక్లిడ్ (క్రీ పూ 300 సం)

ఇతడు రేఖాగణిత శాస్త్రమునకు మూలపురుషుడు ఈయన రచించిన మూలసూత్రముల సంపుటియే ఈనాటికిని మూలాధారము క్షేత్రపరిమితి నిర్ణయమునకు ఈ శాస్త్ర విభాగమే పునాది త్రికోణమాని (Trigonometry) అంకాత్మక రేఖాగణితశాస్త్రము (Analytical Geometry) మొదలైన గణితశాస్త్ర విభాగముల కీశాస్త్రమే ప్రాథేయ మొసగినది

### బ్రూనో జోర్డాన్ (క్రీ శ 1548 1600)

ఇతడొక ఇటలీదేశపు వేదాంతి సంచారశీలియై భావస్వాతంత్ర్య ప్రబోధ మొనర్చిన ప్రచారకుడు పరమసంపూర్ణమగు సత్యమును అవగతమొనర్చుకొనుట అసాధ్యమనియు తానున్న ప్రదేశము కాలము పరిస్థితుల ప్రాబల్యము మానవుని ఎరుకకు అవధుల నేర్పరచుననియు బోధించుచు ఈతడు ప్రచారము సలిపెను వెనీసునగరములో ఇతడు కావించిన మత బోధనలను మతాధికారులు మతద్రోహకరము లని నిర్ణయించి ఇతనికి సజీవదహన శిక్ష విధించి అమలుజరిపిరి బ్రూనో ఆధునిక వైజ్ఞానిక దృక్పథమును మానవజాతికి ప్రసాదించిన ద్రష్ట మృతజీవి ఇతని భావములు స్పినోజా లిబ్నిజ్ ప్రభృతులను ప్రభావిత మొనర్చినవి

### బ్రాహే, టైకో (1546-1601)

ఇతడు డెన్మార్కు దేశమందలి యొక ఖగోళవిజ్ఞాని సాధన సంపత్తికి మెరుగులుదిద్ది ఈయన గ్రహములను నక్షత్రములను శోధించెను ఇతడు వెన్' ద్వీపములో యూరెని బోర్గ్ అను ఖగోళ పరిశోధనాలయమును యురేనియన్ బోర్గ్ అను కోటను నిర్మించెను ఈ శాస్త్రవేత్త సాధించిన పరిశోధనాఫలితములు కెప్లర్ మున్నగు శాస్త్రవేత్తలకు కను విప్పు కల్గించినవి

### జాన్ నేపియర్ (1550-1617)

స్కాట్లెండు గణితశాస్త్రజ్ఞుడగు ఇతడు లాగరిదము లను కనిపెట్టి వాటి పట్టికలను ఓర్పుతో లెక్కకట్టినాడు గుణకారములు భాగహారములు లాగరిదములను వాడుక చేయుటవలన వాటిని ఎంతోసులువుగా చేయుటకు అవకాశము కల్గెను దశాంశ విధానములో అంకెలను భిన్నములను సూచించు పద్ధతిని కూడ ఈశాస్త్రజ్ఞుడు ప్రవేశపెట్టి ప్రచారములోనికి తెచ్చెను

### బేయర్ యోహాన్ (1572 1625)

ఇతడొక జర్మను ఖగోళశాస్త్రజ్ఞుడు ఒకేరాశియందుండు నక్షత్రములను గ్రీకు అక్షరమాలనుపయోగించి వేర్వేరు నామములతో సూచించెడి విధానమును అనుసరించినవాడితడు 1603లో నక్షత్రపటము నొకదానిని ఇతడు తయారుచేసెను

## వాలిస్ జాన్ (1616 1703)

ఆంగ్లేయుడైన ఈ గణితశాస్త్రవేత్త గణితశాస్త్రనియమమ అను క్రమబద్ధముచే అపరిమితసంఖ్యకు (infinity) ∞ అను సంకేతమును సూచించెను

## లిబ్నిజ్ గాట్‌ఫ్రీడ్ విల్హెల్మ్ (1646 1716)

ఇతడు జర్మనుదేశీయుడు వేదాంతిగను గణితశాస్త్రవేత్తగను గణనీయుడైనవాడు అత్యల్పమైన మార్పు వృద్ధి క్షయముల పరిశీలనములతో రూపొందించిన గణితశాస్త్ర విభాగము నంను (calculus) అనని పేరు ముడిపడిన నియమమును 1675 లో రుజువు చేసిన ధీశాలి ఆ శాస్త్రవిభాగము రూపొందుటకు న్యూటనుతో పాటు ఇతడు ఎన్నదగిన కృషిని స్వతంత్రముగా సల్పెను సృష్టి-భగవంతునిదయ అను వేదాంత గ్రంథమును సృష్టికొన్ని అవిభాజ్యములైన మూల ద్రవ్యముల సంపుటీకరణముచే ఏర్పడినదని తెలుపు మరియొక వేదాంతగ్రంథమును 1714లో ఇతడు రచించెను ఇతడు బ్రూనోవలన ప్రభావితుడైన వేదాంతియని ఆ రచనలవలన తెలియగలదు

## హేలీ ఎడ్మండ్ (1656 1752)

ఈయన యొక ఆంగ్లేయ ఖగోళశాస్త్రవేత్తగా పేరు గాంచినవాడు 1720వ సం॥ నుండి ఇతడు రాజాస్థాన ఖగోళ శాస్త్రవేత్తగా వ్యవహరించినాడు తోకచుక్కలు కూడ గ్రహములవలె సూర్యునిచుట్టును పరిభ్రమించుచున్నవనియు అవి క్రమానుసారముగా దర్శనమిచ్చుచుండుననియు వివరించి 1682లో గోచరమైన ఒక ప్రఖ్యాతమగు తోకచుక్క మరల 1758లో కాన్పింపగలదని లెక్కకట్టి దాని రాకడను సూచించినాడు అతని జోస్యము రుజువు అయినవెంటనే తోకచుక్కల లక్షణము వెల్లడియైనందున శాస్త్రవేత్తలు దానికి 'హేలీతోకచుక్క' అనిపేరు పెట్టిరి ఆ తోకచుక్క ప్రతి 76 సంవత్సరముల కొకసారి కన్పించుచు 1910లో కూడ పునర్దర్శనమిచ్చెను

## ప్లకర్, జూలియస్ (1801-68)

ఇతడు జర్మనీదేశీయుడైన గణితశాస్త్రాత్మక భౌతిక విజ్ఞానవేత్త మూలద్రవ్యముల స్వభావమునను బాటి వర్ణపటములు (Spectra) వ్యక్తమొనర్చునని ఇతడు స్పష్టముగా వక్కాణించెను గణితశాస్త్రములో అక్షరాత్మక రేఖా శాస్త్రమును (analytical geometry) ఈయన విపులీకరించెను పదార్థముల అయస్కాంత లక్షణములను గురించి కూడ ఈతడు శోధించెను

## జాకోబీ కారల్ గస్టవ్ (1804 1851)

ఇతడొక జర్మను గణితశాస్త్రవేత్త అండాకారవృత్త నియమావళి (elliptic functions) అంకెలకు సంబంధించిన సిద్ధాంతము (theory of numbers), అంకెల వ్యూహములు (determinants) మొదలైన అంశములను గూర్చి పరిశోధించిన విజ్ఞాని

## రీమన్ జార్జిఫ్రీడ్రిక్ బెర్న్‌హార్డ్ (1826 1866)

ఇతడొక జర్మను గణితశాస్త్రవేత్త క్లిష్టస్వభావము కలిగి, వృద్ధిక్షయ లక్షణములతో నొప్పచు మార్పునందెడి అంక వ్యూహములను (functions of a complex variable) గురించి ఇతడు పరిశోధనములు సల్పెను రీమాని యను 'రేఖాగణితశాస్త్ర' మనుపేరు యూక్లిడ్ రూపొందించిన శాస్త్రముకంటె విభిన్నము సత్యసమ్మతమును అయినది ఈశాస్త్రవిభాగమునకు రీమన్ ప్రతిపాదకుడయ్యెను భూమి అండాకారముగ నున్నందున దానిపై గీచిన ఏరేఖ యైనను వక్రరేఖ యగునేగాని తిన్నని సరళరేఖయనుట పరమ సత్యము కాదు అందుచేత యూక్లిడ్ ప్రవచించిన రేఖాగణితసూత్రములన్నియు పరిమిత ప్రయోజనకరములే కాని ఖగోళ విశ్వవిజ్ఞాన విషయసేకరణమున కుపకరించునట్టివి కావు ఈ పరమసత్యమును గుర్తించి రీమన్ క్రొత్తరేఖా గణితశాస్త్ర ప్రవచన మొనర్చెను అదియే ఐన్‌స్టీన్ శాస్త్రవేత్తకు సాపేక్ష సిద్ధాంత నిర్వచనమునందును విశ్వస్వరూప వివరణమునందును ఉపకరించినది

## బెర్నార్డ్ ఎడ్వర్డు ఎమర్సన్ (1857-1923)

ఇతడొక అమెరికాదేశీయుడగు ఖగోళశాస్త్రవేత్త ఖగోళపరిశోధనలలో ఛాయా చిత్రగ్రహణము యొక్క ఆవశ్యకతను గుర్తించిన ధీశాలిఇతడు గురుగ్రహము (Jupiter) యొక్క ఐదవ ఉపగ్రహమును పదునారు తోకచుక్కలను ఈ ప్రజ్ఞాశాలి ప్రదర్శనమొనర్చెను

## జీన్స్, జేమ్స్ (హాప్‌వుడ్) (1877-1946)

ఆంగ్లేయుడైన ఇతడు ఖగోళ, గణిత భౌతిక శాస్త్రములందు ప్రజ్ఞకలవాడు సూర్యకుటుంబముయొక్క సృష్టిని గురించియు, ఉప్పెనకెరటమువలె కలిగినదను సిద్ధాంతమును-

గాలిలియో ఐన్‌స్టైన్ అను శాస్త్రవేత్త సహకారముతో ఇతడు పరిశోధనములు జరిపెను. మనశ్శాస్త్రము, ఆకాశము, కాలము, విజ్ఞాన శాస్త్రములు, సంగీతము, భౌతిక విజ్ఞాన శాస్త్రము, వేదాంతము మొదలైన విషయములను గురించి విశిష్టగ్రంథములను జనసామాన్యమునకు సుబోధకముగా రచియించి క్లిష్టమైన జ్ఞాన విషయములను తేటతెల్లము చేసిన ప్రజ్ఞాశాలి ఇతడు.

హ. ఆ.

## వైజ్ఞానిక శాస్త్రవేత్తలు (పదార్థ విజ్ఞానశాస్త్రము)

### విలియమ్ గిల్బర్టు (1540-1603)

ఇతడొక ఆంగ్లవైద్యశాస్త్రవేత్త. మాగ్నెటిజమును గురించి మౌలికపరిశోధనలు కావించి 1600 సం॥ లో లాటిను భాషయందొక శాస్త్రగ్రంథమును రచించెను. ఈ గ్రంథము 1893-1900 సంవత్సరములలో ఆంగ్లభాషలోనికి పరివర్తన మగుటతో దాని ప్రాశస్త్యము వెల్లడియైనది.

### చార్లెస్ అగస్టస్ కూలూంబ్ (1736-1806)

చిత్రము - 85



పటము - 1
విలియమ్ గిల్బర్ట్

ఇతడొక ఫ్రెంచి భౌతిక విజ్ఞాన శాస్త్రవేత్త. ఒక ఆంపియరు సేకను ప్రవాహగతిలో ఒక సెకను కాలము నందుసాగి పోయెడి విద్యుత్తును కొలిచెడి ప్రమాణమునకు 'కూలూంబు' అని ఇతడు పేరు పెట్టినాడు. దానినే శాస్త్రజ్ఞులీనాడు వ్యవహరించుచున్నారు. విద్యుదావేశము గల పదార్థముల మధ్య వ్యక్తమయ్యెడి ఆకర్షణము గాని వైముఖ్యము గాని వాటిమధ్య గల దూరము హెచ్చించినకొలదియు దాని వర్గానుసారముగా తగ్గుననియు వాటి బలాబలములు సిద్ధాంతసారముగ నేడు నియమ మొకడు కనుగొనెను. విద్యుచ్ఛాస్త్రములో అతిముఖ్యమైన ఈ నియమము కూలూంబునూత్రము అను పేర ప్రఖ్యాతినందినది.

### గెరిక్ ఆటోఫోన్ (1602-1686)

ఇతడొక జర్మను శాస్త్రవేత్త. వాయుపీడన శక్తిని రుజువుచేయు ప్రయోగమును జర్మను చక్రవర్తికిని ప్రజలకును చూపించి వినోదమును కల్పించిన ధీశాలియితడు. ఒక దానితో మరియొకటి ఖచ్చితముగా ఇమిడి పూర్ణగోళమువలె రూపొందు రెండు పెద్ద అర్ధగోళములను నిర్మించి వాటి యందలి గాలిని యంత్రసాధనమువలన ఇతడు తొలగింపగలిగెను. తర్వాత ఆ అర్ధగోళములను విడివిడిగా లాగుటకై గుర్రములను జట్టుగా ఉపయోగించినాడు. గోళముశూన్యమైనందున అర్ధగోళమును వాయుపీడన శక్తి అదిమిపట్టినందున అవి విడిపోలేదు. దీనితో వాయుపీడనశక్తి ఎల్లరకు అవగతమైనది. గెరిక్ నీటిచేనింపబడి 20 అడుగుల నిడివిగల ఒక బెరామీటరును తయారుచేసెను. అది అతని ఇంటి కప్పు యందు బయటికి కన్పడునట్లు అమర్చబడినది. నీటిమీద తేలియుండునట్లు అందొక బొమ్మ ఉంచబడియుండెను. వాయుపీడనము హెచ్చినపుడు వీధిన పోవువారికి ఆ బొమ్మ కాన్పించుటయు పీడనము తగ్గినపుడు అది అదృశ్యమగుటయు జరుగుచుండెడిది. ఈ దృశ్యమును చూచిన అమాయకులు గెరిక్ మాంత్రికుడై బొమ్మను ఇష్టమొచ్చినట్లు ఆడించుచున్నాడని చెప్పుకొనెడివారు.

### టారిసెల్లి ఇవేంజెలిస్టా (1608-47)

ఇతడు ఇటాలియను భౌతికవిజ్ఞానశాస్త్రవేత్త, గణిత శాస్త్రజ్ఞుడు. బెరామీటరును కనుగొని వాయుపీడనశక్తిని మైక్రోస్కోపు టెలిస్కోపులను సువిశదమొనర్చి, సూక్ష్మ, దూరదర్శనములను సుసాధ్యమొనర్చిన సాధకుడితడు.

### పాస్కల్ బ్లేజ్ (1623-63)

ఇతడొక ఫ్రెంచి శాస్త్రవేత్త, వేదాంతి, గణితశాస్త్రములలో సైక్లాయిడ్ వక్రరేఖా లక్షణములను వివరించి అవకాశములకు పరిష్కారవిధానములకు సంబంధించినసిద్ధాంతము (Theory of probabilities) అత్యల్పాభివృద్ధులకు సంబంధించిన శాస్త్రవిభాగము (Differential calculus) అభివృద్ధి యగుటకు తోడ్పడెను. అంతేకాక ద్రవపదార్థమును ఒక పాత్రలో గ్రహించి దానిలో ఒకచోట ఒత్తిడిని కల్పించినచో అది అన్నివైపులకు వ్యాపించగలదను భౌతికశాస్త్ర నియమమును కూడ పాస్కల్ కనుగొనెను. అది 'పాస్కల్ నియమము' అను పేర అతనికీర్తిని చిరస్థాయిగా నొనర్చినది.

## క్రిష్టియన్ హైగెన్స్ (1629-95)

ఇతడు గణితశాస్త్రజ్ఞుడైన భౌతికవిజ్ఞానవేత్త. దూరదర్శినిలో ఉపయోగించబడు లెన్సులను (మధ్యలో లేక భూతద్దము) మరింత శక్తివంతములుగా తీర్చిదిద్దిన వాడితడు. శనిగ్రహముయొక్క ఉపగ్రహములను కంకణములను పరిశీలించినవాడు. గడియారముల నిర్మాణములో లోలకమును ఉపయోగింపవచ్చునని సూచించి దానిని వాడుకకూడ చేసెను. కాంతి తరంగగతిలో పయనించుననియు ఆ తరంగములోని ప్రతిబిందువు మరియొక తరంగాత్మకచలనమునకు మూలమగుననియు ఇతడు సూచించెను. ఈసూచన 'హైగెన్స్‌సూత్రము' అని శాస్త్రజ్ఞులు పేర్కొనిరి.

## హాన్స్ లిప్పర్ షే

ఇతడు హాలెండులో కంటి అద్దములను తయారుచేసి అమ్ముచుండెడివాడు. యాదాలాపముగా ఒక అద్దముముందు మరియొకదానిని కొంతదూరములో ఉంచి చూచి దూరదర్శినిగా అది ఉపయోగించునని ఇతడు కనుగొన్నాడు. తర్వాత గెలిలియో ఈ విషయమునువిని మరింత శక్తివంతమైన టెలిస్కోపునునిర్మించి దానితో ఖగోళపరిశీలనమును కావించినాడు.

## జాన్సెన్ జఖరియ

16-17 శతాబ్దముల సంధికాలములో కంటి అద్దములను తయారుచేయు వృత్తి నవలంబించి కాంపౌండు మైక్రోస్కోపును నిర్మించిన శాస్త్రజ్ఞుడితడు.

## జాన్ హాడ్లీ

ఆంగ్లేయుడైన ఇతడును థామస్ గాడ్ ఫ్రే అను అమెరికను యంత్రనిర్మాతయు వేర్వేరుగా 1731 లో సెక్స్‌టాంట్ అను సాధనమును నిర్మించి నౌకాయానమును సుకరమొనర్చిరి. ఈ సాధనముద్వారా సూర్యుని యొక్క నక్షత్రముల యొక్క దూరమును నిర్ణయించుకొని భూగోళములో తామెక్కడ ఉన్నదియు నావికులు కనుగొనెడివారు.

## గాల్వనీలూయిగీ (1737-1798)

ఈ ఇటాలియను శాస్త్రవేత్త విద్యుచ్ఛక్తిని శోధించి వివరించిన వారిలో ప్రథముడు. జీవప్రావములు విద్యుత్ప్రవాహములని కనుగొన్నవాడితడు. విద్యుత్ప్రసారము ద్వారా బాధా నివారణ మొనర్చు విధానము ఈతని పేరిట 'గాల్వనిజము' అని వ్యవహరింపబడుచున్నది.

## కార్ట్‌రైట్ ఎడ్మండ్ (1745-1823)

జేమ్స్‌హార్ గ్రీవ్ 1765 రిచర్డ్ ఆర్క్‌రైట్ 1769 అను వారువేర్వేరుగా నిర్మించిన నూలుయంత్రములు లక్షణములను విలీనమొనర్చి 1779 లో శామ్యూల్ క్రాంప్టన్ అనునాతడు ఒకక్రొత్తసాధనమును నిర్మించిదానితో సన్ననిదారమును వడకగలిగినాడు. ముతకనూలు ఆర్క్‌రైట్ యంత్రముపైన సన్ననూలు క్రాంప్టన్ యంత్రముపైన ఈనాటికి తయారగుచున్నవి. 1785 లో ఆవిరిశక్తి సహాయముతో నూలువడకి బట్టలునేయు యంత్రమును ఎడ్మండ్ కార్ట్‌రైటు తీర్చిదిద్ది ఇంగ్లండు వస్త్రపరిశ్రమ స్థాయిని స్థిరత్వమును సమకూర్చగలిగెను. తరువాత ఆయన మరికొన్ని యంత్రములను నిర్మించినాడు. బ్రిటిష్ వస్త్రపరిశ్రమ రాణింపునకు కారకులైన యంత్రనిర్మాతలలో ఇతను ఎన్నదగినవాడు.

## హాన్స్‌క్రిష్టియన్ ఆయర్‌స్టెడ్ (1777-1851)

ఈ డచ్ భౌతికశాస్త్రవేత్త తన కృషివలన ఎలెక్ట్రిసిటీ యొక్కయు మాగ్నెటిజము యొక్కయు తత్త్వమొకటియే అని రుజువుచేసెను. ఈతడు అల్యూమినియము ధాతుసాధనమొనర్చి రసాయనశాస్త్రవేత్తగా కూడ పరిగణన కెక్కినవాడు.

## హెన్రీజోసెఫ్ (1797-1878)

ఈ అమెరికను భౌతికశాస్త్రవేత్త ఎలెక్ట్రోమాగ్నెట్లను మరింత శక్తివంతములుగా తీర్చిదిద్దెను. డైనమో ట్రాన్స్‌ఫార్మరుల నిర్మాణమునకు మూలకంబమైన ఎలెక్ట్రో-మాగ్నెటిక్ ఇండక్షనును స్వతంత్రముగా ఫారడే కావించిన పరిశోధనములు తన కెరుకపడని కాలములో, ఇతడు కనుగొనెను. 1846 లో అమెరికాలో నెలకొన్న స్మిత్‌సోనియన్ పరిశోధనసంస్థకు కార్యదర్శిగను డైరెక్టరుగను వ్యవహరించిన ప్రతిభాశాలి ఇతడు.

## గాస్ కారల్ ఫ్రీడ్రిక్ (1777-1855)

ఇతడొక జర్మను గణిత భౌతిక ఖగోళ శాస్త్రవిజ్ఞాని. అంకెలను గురించియు అవగతమైన రెండంశముల సమీకరణమును పరిష్కరించుటను గూర్చియు వలయాకారముగల ఉపరితల వ్యాపనమును గూర్చియు గణితశాస్త్రానుసారముతైన ఎలెక్ట్రిసిటీ, మాగ్నెటిజముల సిద్ధాంతములను గూర్చియు

కృషిచేసిన సర్వతోముఖ ప్రతిభాశాలి ఇతడు. మాగ్నెటిక్ క్షేత్రబలమును 'గాస్' అను యూనిట్లలో 1932 సం॥ వరకు ఇతడు లెక్కించె వాడు. అప్పటినుండి మాగ్నెటిక్ బలకల్పనమునకు 'గాస్' అను యూనిటు ప్రమాణముగా పరిగణింపబడుచున్నది

జేమ్స్ రామ్సే

1787 లో ఓడలు దనుటకు ఆవిరియంత్రముల నుపయోగింపవచ్చు నని రుజువుచేసినవాడితడు. రాదాపు ఆ సమయమునకే (1809) జాన్ ప్టీ వెన్సు అమెరికాలో కైడ్ కాలువయందు ఆవిరియంత్ర ముతో నడచను "చీవింపగలిగెను. వెను వెంటనే హడ్సన్ నదిలో రాబర్టుపుల్టన్ ఆవిరియంత్రపు ఓడలను జలయానమునం దుపయోగించి వాటి ఉత్కృష్టతను రూఢిచేసెను. నాటినుండి సముద్రయానము పొగయోడలలో సాగ జొచ్చినది

మాక్స్వెల్ జేమ్స్క్లార్క్ (1831-79)

ఈ స్కాటిష్ భౌతికశాస్త్రజ్ఞుడు ఎలెక్ట్రిసిటి మాగ్నెటిజము తరంగగతిలో ప్రయాణించుచున్నయని కాంతికూడ అట్టిదే ననియు నిర్వచించి ఎలెక్ట్రోమాగ్నెటిక్ క్షేత్రమును గురించి గణితశాస్త్రీయ సారమైన సిద్ధాంతమును తీర్చిదిద్దెను. వేడిని గురించియు చలనశీలవాయు సిద్ధాంతమునుగూర్చియు కాంతిని గురించియు రంగులకాంతిని చూడనేరని అంధత్వమును గురించియు ఇతడు పరిశీలి చెను. మాగ్నెటిజము లోని ఒక ప్రమాణమునకు 'మాక్స్వెల్' అనుపేరు పెట్టుట ద్వారా ఈ శాస్త్రవేత్త కీర్తి చిరస్థాయి యైనది

మ ౩ ఎర్నెస్ట్ (1840-1905)

ఈ జర్మను భౌతిక శాస్త్రజ్ఞుడు కాంతియొక్క వక్రీభవన శక్తిని కచ్చితముగా నిర్ణయించుట కుపయోగపడు 'ఏబీ రిఫ్రాక్టో మీటరు' అను సాధనమును నైపుణ్యముతో నిర్మించినవాడు

అంపియర్, ఆంద్రమేరి (1775-1836)

ఇతడొక ఫ్రెంచి భౌతిక శాస్త్రవేత్త. గణితశాస్త్రజ్ఞుడు. సుప్రసిద్ధమైన విజ్ఞానశోధకుడు. ఎలెక్ట్రిసిటీ శాస్త్రములో ఇతడుకృషి చేసెను. అంపియర్ సూత్రమును కనుగొని ఎలెక్ట్రి సిటీ - మాగ్నెటిజములకు గల సంబంధమును ఇతడు వివరించెను

బెకరెల్ ఆన్టోయిన్ సీజర్ (1788 1878)

ఈ ఫ్రెంచి భౌతిక శాస్త్రవేత్త విద్యుత్ రసాయన శాస్త్రవిభాగమునందు కృషిచేసినవారిలో గణ్యుడు. ఫెలిగ్రఫీ మాగ్నెటిజమును గురించి పరిశోధనలు సల్పి విజ్ఞానమును విస్తరి జేసిన పండిత వీరుడు

బెకరెల్ అలెగ్జాండర్ ఎడ్మండ్ (1820-91)

ఆచార్య పదవి నలంకరించిన ఈ భౌతికశాస్త్రవేత్త కాంతి కాంతిచైతన్య రాసాయనిక క్రియలు ద్వితరంగ చైగ్ని ర్యయత కాంతివుంజము అను గురించి శోధించి వాటిని గుర్తించుట కుపకరించెడి ఫాస్ఫరో స్కోప్ అనుసాధనమును నిర్మించిన ప్రజ్ఞాశాలి. అటుతండ్రియైన బెకరెల్ ఆంటోయిన్ సీజరుకు తగిన కొడుకు గను ఇటు నోబెల్ బహుమతిని సాధించిన ఆంటోయిన్ హెన్రీబెకరెల్ కు తగిన తండ్రిగను ఇతడు పేరుపొందినవాడు

ఫ్రాంక్లిన్ బెంజిమన్ (1706 90)

ఇతడొక అమెరికను శాస్త్రవేత్త. పుస్తక పత్రికా ప్రకటనకర్త. రాజకీయనాయకుడు. బహుముఖ ప్రజ్ఞాశాలి. ఉరుములు మెరుపులతో వర్షించుచున్నపుడు గాలిపటమును ఎగురవేసి మెరుపును క్రిందికి ఆకర్షించినవాడితడు. దాని మూలముగా మెరుపు విద్యుత్తు ఒకేతత్త్వము గల్గియుండునని ప్రయోగపూర్వకముగా రుజువుచేసిన శాస్త్రజ్ఞుడీయన 1728 నుండి 1767 వరకు ప్రకటనల ద్వారా విద్యావ్యాప్తికి దోహదమొనర్చి పెన్సిల్వేనియా విశ్వవిద్యాలయ స్థాపనకు కృషిచేసిన ప్రజాహితకార్య పరాయణుడీయన. అమెరికా స్వాతంత్ర్య యుద్ధమునకు పూర్వము వలస రాజ్యముల ప్రతినిధిగా ఇతడు ఇంగ్లండులో పనిచేసిన వ్యవహార దక్షుడుకూడ. దేశ స్వాతంత్ర్య ప్రకటనమును తీర్చిదిద్ది వారిపై నంతకము చేసిన స్వాతంత్ర్య పిపాసులలో గణ్యుడు. ఇగ్లండు ఫ్రాన్సు దేశములలో ప్రజామోదమును పొందిన అమెరికను నాయకుడు. క్రొత్తగా ఏర్పడిన అమెరికా రిపబ్లికునకు ఫ్రాన్సులో ప్రతినిధిగా మండిన కార్యసాధకుడు. 1781లో ఇంగ్లండుతో జరిపిన శాంతి సమాలోచనలలోను 1767లో అమెరికను రాజ్యాంగ నిర్మాతల సమావేశమందును పాల్గొన్నవాడితడు. ఆయన రచించిన స్వీయచరిత్ర ఖ్యాతివడసిన గ్రంథము

### డేవిడ్ బుష్‌నెల్

ఇతడు 1776లో అమెరికా విప్లవకాలమందు జలాంతర్గామిని నిర్మించి దానిద్వారా యుద్ధనౌకలను ముంచుటకు యత్నములు చేసెను తరువాత దాని మెరుగుపరచి జె. ఎ. హాలెండ్ సైమన్ లేక్ అనువారు కావించిన కృషి నేటి జలాంతర్గాముల నిర్మాణమునకు తోడ్పడినది

### డాగరే లూయీజాక్స్ మాండె (1789-1851)

ఇతడొక ఫ్రెంచిచిత్రకారుడు భౌతికశాస్త్రవేత్త కూడ ఛాయాచిత్రగ్రహణమును తీర్చిదిద్దిన శాస్త్రవేత్తలలో గణనీయుడు

### ఎలిషా గ్రేవ్స్ (1811-61)

1854 లో ఈ అమెరికను భీకరలి కనుగొన్న విధానము వలన ఆకాశమునంటు మేడలను నిర్మించుటకై సరకులను ఎక్కించి పైకి రవాణాచేయుట సాధ్యమైనది 1857 లో మెట్లకు బదులు ఎలక్ట్రిక్ లిఫ్టుల నిర్మాణమును కనుగొనినాడితడు ఈ యంత్రనిర్మాణముతో ఓటిస్ కంపెనీ పారిశ్రామికంగా ప్రఖ్యాతమైనది

### గెయిలర్ హెన్రిక్ (1814-79)

ఈ జర్మను యాంత్రికుడు కల్పనాశక్తిగల ధీమంతుడు అత్యల్పపీడనశక్తిలోనున్న వాయువులలో విద్యుత్ప్రసారమొనర్చు కాంతివంతమైన గొట్టపుదీపమును నిర్మాణమొనర్చినాడితడు

### శామ్యూల్ కోల్ట్ (1814-62)

ఈ అమెరికను పారిశ్రామిక శాస్త్రవేత్త వరుసగా పేల్చుటకు వీలగు తుపాకుల మర్పు ఎప్పటలును తయారు చేయు విధానమును 1835 లో కనుగొనెను నాటినుండి దానికి 'కోల్ట్' అను పేరు వాడుకలోనికి వచ్చినది

### గాట్లింగ్ రిచర్డ్ జోర్డన్ (1818-1903)

ఇతడు కూడ వరుసగా ఒకేసారి తూటాలను పేల్చుటకు అనువైన తుపాకి నిర్మాణమునుగావించి, మెషిన్‌గన్ల తయారీని సుసాధ్యమొనర్చెను వాడుకలో 'గాట్' అను పేరు ఆ తుపాకికి పర్యాయపదమై నిలిచినది

### జౌల్, జేమ్స్ ప్రెస్కాట్ (1818-89)

ఇతడు ఆంగ్ల భౌతిక విజ్ఞానవేత్త ఎలక్ట్రిసిటీ శక్తి చలన గతిశాస్త్రములలో పరిశోధనలనొనర్చెను ఛలనశక్తికిని, ఉష్ణమునకును గల పరస్పర సంబంధమును ఋజువుచేసి వాటి పరివర్తనస్థిరాంకమును నిర్ణయించిన ప్రయోగకుశలుడితడు ఒక సెకను కాలముపాటు ఒక ఆంపియరు రేటుగల విద్యుచ్ఛక్తి విద్యున్నిరోధమును అధిగమించి ప్రవహించుటకు కావించు పని ప్రమాణము జౌల్ అని నిర్వచింపబడినది

### హెల్మ్‌హోల్జ్ హెర్మన్ లుడ్విగ్ ఫెర్డినాండ్ ఫోన్ (1821-94)

ఈ జర్మను శాస్త్రవేత్త సృష్టియొక్క మొత్తము శక్తిలో మార్పు కలుగదని గణితశాస్త్రరీత్యా వివరించినాడు ఉష్ణము ఎలక్ట్రిసిటీ రూపమునందు శక్తిచలన శాస్త్రములలో ఇతడు ఎన్నదగిన కృషి యొనర్చెను రంగులను కంటికి కాన్పించుతీరును గురించి ఎంగ్ అను శాస్త్రజ్ఞుడు చేసిన వివరణమును విశదమొనర్చి కంటిలెన్సులో ఎట్లు దృష్టి జరుగునో ఇతడు సూచించినాడు ఆఫ్తాల్మాస్కోప్ అను సాధనమును కూడ ఇతడు నిర్మించెను

### కెల్విన్ విలియమ్ థామ్సన్ (1824-1907)

లార్డు బిరుదాంకితుడైన ఈ బ్రిటిష్ శాస్త్రవేత్త గణిత భౌతిక శాస్త్రములలో ప్రవీణుడు ఉష్ణశక్తిని గూర్చిన వివిధ భావములను సమన్వయమొనర్చి శక్తి వినాశములేదను జౌల్ సిద్ధాంతమును స్పష్టమొనర్చెను. ఇతడు ఈయన పరమతాపక్రమ విధానమును (absolute scale of temperature) తీర్చిదిద్దెను కాంతి పరావర్తనమొనర్చి విద్యుత్ప్రవాహగతి నిర్ణయమొనర్చుటకుపకరించు గాల్వనోమీటరును ఇతడు నిర్మించెను సముద్రాంతర్గతగామియైన తంతీప్రసార విధానమును రూపొందించుటలో కూడ ఇతడు కృషిచేసెను

### గస్టవ్ రాబర్ట్ కిర్‌ఖాఫ్ (1824-1887)

ఈ జర్మను భౌతికశాస్త్రవేత్త బున్సెన్‌తో కలిసి స్పెక్ట్రోస్కోపును నిర్మించెను సీసియము రుబిడియములను కనుగొనెను సూర్యకాంతి వర్ణపటమునందు ఫ్రాన్‌హోఫర్ రేఖలకునికి కారణములను వివరించినవాడితడు

### డెయిమ్లర్, గాట్‌లీబ్ (1834-1900)

నైపుణ్యముగల ఈ జర్మను ఇంధనీయ స్వయంచలనశక్తిగల యంత్రమును అభివృద్ధిచేసెను ఆధునికమయిన మోటారుకార్ల పరిశ్రమ వ్యాప్తికి దోహదమొనర్చిన పారిశ్రామికవేత్తగా ఇతడు పేర్గాంచెను

### జార్జివెస్టింగ్ హౌస్ (1846 - 1914)

ఈ అమెరికను విజ్ఞాని రైల్వేలో వాడుకలోయున్న బ్రేక్ సిగ్నల్ విధానములను కనుగొన్న కుశాగ్రబుద్ధి ఆల్టర్నేటింగు విద్యుత్తును అమెరికాలో వాడు చేయుటకును ప్రోత్సహించిన ఖ్యాతికూడ ఇతనిది.

### అలెగ్జాండర్ గ్రాహమ్‌బెల్ (1847-1922)

ఈ అమెరికను శాస్త్రవేత్త టెలిఫోను విధానమును కనుగొని శ్రీఘ్రవృద్ధికి చెవిటి వారికి విద్య నేర్పే విధానములకు మెరుగుపెట్టి తండ్రియగు మెల్విల్ చేసిన కృషిని మరింత ఫలవంతమొనర్చెను. 1876 లో మాట ను విద్యుత్తరంగములు గామార్చెడిపద్ధతిని ఇతడు నొంది 1878 లో మాటను ప్రసారముచేసి బెల్ టెలిఫోన్ కంపెనీ ని ఏర్పరచుటద్వారా విజయవరంపరకు స్థిరమైన రూపకల్పనచేసెను. 1877 లో వోల్టా పరిశోధనాలయమును స్థాపించి మాటను రికార్డు చేసెను. అదియే గ్రామఫోను నిర్మాణమునకును మాటలను చిత్రములలో మాటచిత్రీకరణమునకును మార్గము చూపినది. 1890 లో సైన్సుపత్రికను స్మిత్‌సోనియను పరిశోధనాసంస్థయందు ఖగోళభౌతికశాస్త్ర పరిశోధనాలయమును వాతావరణ పరిశోధకసంఘమును ఏర్పాటుచేయుటలో ప్రముఖపాత్రవహించి భావికాలపు అవసరములను గుర్తించిన విజ్ఞానద్రష్ట ఇతడు.

### మెర్‌గన్ థేలర్ ఓట్మార్ (1854-1899)

జర్మనీలో జన్మించిన అమెరికను ముద్రాపకుడితడు. లినోటైపు నిర్మాణమును రూపొందించి ముద్రణపరిశ్రమకు ఈ శాస్త్రవేత్త సౌకర్యము కలిగించెను.

### ఈస్ట్‌మన్ జార్జి (1854-1932)

ఇతడొక అమెరికను పరిశోధకుడు. "ఈస్ట్‌మన్ కొడక్ కంపెనీ" వ్యవస్థాపకుడు. ఫొటోలు తీయుటకుపయోగపడు ప్లేట్లను ఫిలిమ్‌చుట్టలను, కొడక్ కెమేరాలను తీర్చిదిద్దినవాడు. రంగురంగుల ఛాయాచిత్రముల మరియు విధానమును కూడ కనుగొన్నవాడు.

### టెస్లా, నికోలా (1856-1943)

ఇతడు కల్పనాచతురుడైన ఎలెక్ట్రీషియనుగా గణుతికెక్కినవాడు. ఆస్ట్రియానుండి 1884 లో అమెరికా వెళ్లి అక్కడనే స్థిరపడిన ఈయన ఎక్కువ ఓల్టేజితో ప్రవహించు ఎలెక్ట్రిసిటీని గురించి కృషిచేసిన వారిలో ముఖ్యుడై ఎన్నియో సాధనములను కల్పించెను (రేడియో వైర్‌లెస్ ఆల్టర్నేటింగుకరెంటు ముఖ్యమైనవి). నయాగరా ఎలెక్ట్రిక్ పవరు వ్యూహ నిర్మాణపథకములను సకూర్చిన ఆవిష్కర్తగా ఇతడు ప్రఖ్యాతిగాంచెను.

### రుడాల్ఫ్ డీసెల్ (1858-1913)

ఇతడొక జర్మను ఇంజనీరు. ఆవిరియంత్రములతో పోటీపడి డీసెల్ నూనెతో పనిచేయు యంత్రములను ఇతడు 1892 లో కనుగొన్నాడు. శక్తివంతములైన ఎలెక్ట్రిక్ మోటారులను నిర్మించి అవి జర్మనీలోని నౌకలలో వాడుటకను ఉపయోగించవని ఈయన చూపించెను. డీసెల్ యంత్రములందు పెట్రోలు ఆవిరిని గాలితో మిశ్రమమొనర్చి విద్యుత్‌చెణుకుతో మండించుటకు బదులుగా ఒత్తిడిని బాగుగా హెచ్చించి పుట్టించు వేడిగాలిని పెట్రోలు కంటె చవుకైన చవుకైన ముడిచమురును ముడిపెట్రోలియమును వెలిగించి నడిపించుటకు ఈతని పరిశోధనముల మూలముగా అవకాశమేర్పడినది.

### రైట్ సోదరులు

విల్బర్ రైట్ (1867-1912) ఆర్విల్ రైట్ (1871-1948) అను అమెరికను పరిశోధకులు విమానయానమును సాధ్యమొనర్చిరి. 1890లో విలియమ్ ధాల్ కావించిన యత్నములచే ఉత్సాహితులై వీరు డేటన్ లో విమాన నిర్మాణమును గురించి కృషి సాగించినారు. విద్యావిహీనులైనను యువకులైన ఎప్పటికూడ వీరు విద్యయందును యంత్ర నిర్మాణముదును ఆసక్తి కల్పించుకొని 1903 డిసెంబరులో ఒక విమానమును తయారుచేసి అందు రెండున్నర సెకనులపాటు ప్రయాణము కొనసాగించిరి. తన్మూలముగా తమ విమాన నిర్మాణములోని లోపములను దిద్దుకొని మూడురోజుల తర్వాత ఆ విమానములోనే 40 అడుగుల ఎత్తుకు ఎగిరి పన్నెండు సెకనులలో 120 అడుగుల దూరము ప్రయాణము చేసిరి. ఆ రోజుననే మరియొక యత్నములో విల్బర్ 59 సెకనులలో 852 అడుగులదూరముగాలిలో ప్రయాణము చేయగలిగెను. 2000 సంవత్సరములుగా మానవుడు గాలిలో రెక్కలుకట్టుకొని ఎగురుటకై చేసినయత్నములు, సైకిల్‌షాపును నిర్వహించుచున్న ఈ సోదరుల కృషివలన

ఫలించి ఆధునిక వైమానిక యుగమారంభమైనది. వీరికృషి వలన శక్తివంతమైన ఇంజను శాకిడికి చలించని ప్రొఫెల్లరు ప్రయాణయోగ్యమైన విమానము లభించినవి. వీరికీర్తి వీరి స్మృతిచిహ్నము మూలముగా చిరస్థాయిగా నుండగలదు.

## షోల్స్, సి. ఎల్.

ఇతడు 186 లో తన సహచరులతో కలసి పెద్దఅక్షరములతో కూడిన టైప్‌రైటరును నిర్మాణమొనరెను. అదియే వ్యాపారమునందుపయోగించబడిన మొదటి టైప్‌రైటరు. దానిని రెమింగ్టను కంపెనీవారు ఆధునిక పద్ధతిపై సంస్కరించి పారిశ్రామికముగా ఎక్కువ సంఖ్యలో తయారుచేయసాగిరి.

## బెయిర్డ్ జాన్‌లోగే (888-1940)

స్కాట్లెండు దేశీయుడైన ఇతడు టెలివిజనును 1926లో ప్రయోగపూర్వకముగా ప్రత్యక్షముచేసెను. 1928 లో రంగులతో కూడిన టెలివిజను ప్రసారమును అట్లాంటిక్ మహాసముద్రపు ఒక ఒడ్డునుండి మరియొక ఒడ్డునకు ప్రసారము చేసి దానికి స్థిరత్వమును చేకూర్చిన సాధకుడితడు.

## మెయిట్నర్, లిజీ (1878)

ఆస్ట్రో-స్వీడిష్ భౌతికశాస్త్రవేత్తయగు ఈమె గణిత శాస్త్రములో కూడ కౌశల్యముకలది. ప్రొటాక్టినియమును కనుగొనుటలో ఈమె సహకరించెను. రేడియము థోరియము ఆక్టినియములు క్రమముగా కిరణప్రసారముచేసి ఎట్లు మార్పులు పొందుచున్నవో అను విషయమును పరిశోధించెను. పరమాణు కేంద్రసంఘట్టమును గురించి ఈమె చేసిన ఘటనఫలితములను ఈమె నిశితముగా శోధించెను. ఈమె యురేనియము పరమాణు కేంద్రసంఘట్టమును గురించి కావించిన పరిశోధన ఫలితములే పరమాణు బాంబు నిర్మాణమునకు మార్గమును సుగమము చేసినవి.

## గెయిగర్, హాన్స్ (182 1945)

ఈ జర్మను భౌతిక శాస్త్రజ్ఞుడు గెయిగర్ 'కౌంటర్' అను సాధనమును నిర్మించి కిరణములు, వికిరణములు అయనీకరణమొందు కణములు మున్నగువాటిని గుర్తించుటకును లెక్కించుటకును అవకాశమును కల్పించెను. రేడియో ఆక్టివిటీని గురించిన విజ్ఞానాభివృద్ధికిని అవొగాడ్రో సంఖ్యను నిర్ణయించుటకును ఈ సాధనము తోడ్పడినది.

## ఎక్కర్డ్, ఆగస్ట్ (1884 1962)

ఇతడొక బెల్జియను భౌతికశాస్త్రవేత్త. గాలి గుమ్మటములో (బెలూనులు) ఆకాశములోనికి సుమారు 10½ మైళ్లు ప్రయాణము సాగించి 1932లో విశ్వ కిరణములను పరిశోధించిన వాడితడు. 1948లో సముద్రజలాంతర శోధనలు కూడ నిర్వహించెను. ఈయన కవలసోదరుడైన జీన్ ఎక్కర్డ్ (1884-1968) 1931 నుండి అమెరికా పౌరుడై రసాయన శాస్త్రవేత్తగను ఖగోళ శాస్త్రి ఇంజనీరుగను మిన్నెసోటా విద్యాసంస్థయందుండి పరిశోధనలు కొనసాగించెను.

## స్వామిజ్ఞానానంద (1895-1969)

ఇతడు పశ్చిమగోదావరి జిల్లాలో గొరగనమూడి గ్రామమునందు జన్మించి హైస్కూలు విద్యను ముగించుకొని వైరాగ్య భావముచే సన్యాసస్వీకార మొనర్చి హిమాలయములందు తపోనిష్ఠనంది దార్శనిక మహాప్రవచనము పూర్ణానంద సూత్రములను రచించిన వేదాంతి. తదుపరి ఆరోగ్యరక్షణకై జర్మనీ అమెరికా యాత్రలొనర్చి ఆధునిక భౌతిక విజ్ఞానశాస్త్రమును తరచి పారంగతుడై డాక్టరేటు పట్టమును ప్రఖ్యాతపరిశోధన స్థానమును పొంది ఆంధ్ర విశ్వవిద్యాలయమునందు పరమాణు కేంద్రీయ పరిశోధనా విభాగమున కధ్యక్షుడై శిష్యవత్సలుడైన ఆచార్యుడితడు. 'అత్యల్పపీడనస్థితి కల్పనము'ను గురించియు పరమాణు కేంద్రవిజ్ఞానమును గురించియు ఇతడు సమగ్రమైన గ్రంథములను రచియించెను. ప్రాచ్య వేదాంతవిజ్ఞానము ఆధునిక విజ్ఞాన శాస్త్రసృష్టియు మూర్తీభవించిన మనీషి యితడు.

## విటిల్, ఫ్రాంక్ (1907)

సర్ బిరుదాంకితుడైన ఈ ఆంగ్ల విజ్ఞాని న్యూటన్ నిర్వచించిన చలనసూత్రములలో మూడవదానిని వినియోగించి 1939 లో జెట్ ఇంజనులను నిర్మించి అత్యంత వేగముగా ప్రయాణించు విమానములను రూపొందించినాడు. ఈతని కృషివలన ధ్వనికంటె వేగముగా పయనించు విమానములు నిర్మితి సుకరమైనది. వీటిని రెండవప్రపంచ యుద్ధాంతమునందుపయోగించిరి.

## సత్యేంద్రనాథబోస్ (1894)

1958 నుండి ఇతడు కలకత్తా విశ్వవిద్యాలయములో గౌరవభౌతిక శాస్త్రాచార్య పదవి నలంకరించినాడు. ఐన్‌స్టీనుతో కలిసి పరిశోధనలు కొనసాగించి క్వాంటమ్ సిద్ధాంత దృష్ట్యా బోస్-ఐన్‌స్టీన్ నియమమును ఇతడు రూపొందించెను.

కొంతకాల మితడు విశ్వభారతి విశ్వవిద్యాలయమునకు ఉపాధ్యక్ష పదవిని నిర్వహించెను అసంఖ్యాకమైన పరిశోధనాత్మక వ్యాసములను రచియించి బ్రిటిష్ రాయల్ సొసైటిలో "ఫెలో" పదవిని భారతదేశమందలి వైజ్ఞానిక శాస్త్ర పారిశ్రామిక పరిశోధక మండలిలో సభ్యత్వమును పొందిన విజ్ఞాని ఇతడు

## చంద్రశేఖర సుబ్రహ్మణ్యన్ (1910)

చికాగో విశ్వవిద్యాలయములో ఖగోళ భౌతిక విజ్ఞాన శాస్త్రాచార్య పదవిని 1937 నుండి అలంకరించిన భారతీయ శాస్త్రవేత్త ఇతడు మద్రాసు రాజధాని కళాశాలలోను అనంతరము కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయములోని ట్రినిటీ కళాశాలలోను విద్యనభ్యసించి డాక్టరేటు పట్టమును పొందెను ఖగోళభౌతిక విజ్ఞాన శాస్త్రపత్రికకు 1952 లో వ్యవహర్త సంపాదకుడుగ ఎన్నికయ్యె ఆ శాస్త్రపరిశోధనలకు బహూకృతిగా పలుదేశముల పరిశోధక సంఘములనుండి సువర్ణపతకము లందుకొని మహామేధావియని కీర్తిగాంచెను నక్షత్రముల నిర్మాణము వాటి చలనరీతులు కాంతిప్రసారగతులు జలాత్మక పదార్థముల చలనము మాగ్నెటిక్ స్థిరత్వములు అను విషయములపై ఉద్గ్రంథములను అసంఖ్యాకమైన పరిశోధన వ్యాసములను ప్రకటించి పాశ్చాత్యదేశములందు భారతీయుల ప్రతిభకు వన్నెతెచ్చిన శాస్త్రవేత్త ఇతడు బ్రిటిష్ రాయల్ సొసైటికి 1944లో అతిచిన్న వయస్సునందే ఫెలోగా ఎన్నికయైన ప్రజ్ఞాశాలి

## జయంత్ విష్ణు నర్లీకర్ (1938- )

ఇతడు మహారాష్ట్రములోని కొల్హాపూరులో జన్మించి 1957లో బి ఎస్ సి డిగ్రీని పుచ్చుకొన్నాడు పిమ్మట కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయములో విద్యనభ్యసించి 1963లో కింగ్స్ కాలేజిలో "ఫెలో"గా ఎన్నికైనాడు కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయములో చేసిన కృషిఫలితముగా ఇతడు ఐన్‌స్టీను సిద్ధాంత సంచలిలోపములను ఉట్టంకించి "విశ్వస్వభావవాదము"ను 1964లో ప్రతిపాదితమై సవరింపబడి నిశిత మొనర్పబడిన గురుత్వాకర్షణ మాత్రములను గణితశాస్త్రరీత్యా రూపొందించినాడు గురుత్వాకర్షణము విశ్వవస్తు సర్వస్వము యొక్క సుదూర ప్రభావమై యుండవచ్చునను అభిప్రాయమును ఈయన వెల్లడించినాడు ఈ వాదమునకు ప్రయోగాత్మకమైన సాక్ష్యములేకున్నను, ఇతడును హోయల్ అను శాస్త్రవేత్తయు ఆ లోపమును సవరించు యత్నములో నిమగ్నులైనారు మొత్తము మీద వీరి పరిశోధనములు వైజ్ఞానిక ప్రపంచములో విశేషమైన సంచలనమును కల్గించినవి

## లారెన్జ్ హెండ్రిక్ అన్టూన్ (1853-1928)

ఈ హాలెండు భౌతిక శాస్త్రవేత్త ఎలెక్ట్రిసిటీ మాగ్నెటిజము కాంతి అను వేర్వేరు రూపములలో నుండు శక్తియొక్క పరస్పర సంబంధమును విస్పష్టము చేసెను ఎలెక్ట్రానులున్నవను భావమును సూచించిన మొదటి శాస్త్రజ్ఞుడీయన 1902 లో జీమన్ శాస్త్రవేత్త కనుగొన్న వైజ్ఞానిక పరిశీలనమును (Zeeman Effect) వివరించి ఆయనతోపాటు ఇతడు నోబెల్ బహుమతి పంచుకొనెను

## జీమన్ పీటర్ (1865-1943)

ఈ హాలెండు భౌతిక శాస్త్రవేత్త మాగ్నెటిక్ బలముగల క్షేత్రప్రభావము కాంతివర్ణపటము (Spectrum) లోని రేఖలమీద ఎట్లుండునో కనుగొన్న ప్రయోగకుశలుడగు విజ్ఞాని తన పరిశోధనలను సిద్ధాంత దృష్ట్యా వివరించిన లారెన్జ్ శాస్త్రజ్ఞునితో కలిసి 1902లో నోబెల్ బహుమతిని పంచుకొనెను

## రాలేజాన్ విలియమ్‌స్ట్రట్ (1842-1919)

ప్రభువుల శ్రేణికి చెందిన ఈ ఆంగ్ల భౌతిక శాస్త్రజ్ఞుడు 1904లో నోబెల్ బహుమతిని సంపాదించినాడు ధ్వనికి కాంతికి విద్యుత్తుకు సంబంధించిన మానప్రమాణములను (Units) గురించియు అతి తక్కువ పీడన శక్తిగల వాయువులను గూర్చి బోయిల్ నియమము వర్తించు రీతిని గురించియు శోధించిన పదార్థ విజ్ఞానశాస్త్రవేత్త ఇతడు ఆర్గాన్ అను జడ వాయు మూలద్రవ్యమును రామ్సే సహాయముతో ఇతడు కనుగొనెను

## లెనార్డ్ ఫిలిప్ ఎడ్వర్డు ఆంటన్ (1862-1947)

ఈ జర్మను భౌతిక శాస్త్రవేత్త కేథోడు కిరణములను గురించి గావించిన పరిశోధనల ఫలితముగా 1905 లో నోబెల్ బహుమతిని పొందెను

## థామ్సన్, జోసెఫ్‌జాన్ (1856-1940)

సర్ బిరుదాంకితుడైన ఈ ఆంగ్లభౌతిక శాస్త్రవేత్త వాయుపదార్థములలో విద్యుత్ప్రసారమును శోధించెను, ఎలెక్ట్రాను కణమును కనుగొని చూపి బయల్పరచెను, విద్యుదా

పేశమునకును గల నిష్పత్తిని నిర్ణయించి విద్యుచ్ఛక్తి మొక్క స్వభావమును గూర్చి గణితశాస్త్రబద్ధమైన సిద్ధాంతమును రూపొందించెను. అంతేకాక రేడియో ఆక్టివిటీని గూర్చి పరిశోధన జరిపి 1906 లో నోబెల్ బహుమతిని పొందిన విజ్ఞాని ఇతడు. ఈయన కుమారుడైన జార్జి పేజెట్ థామస్ కూడ ఎలెక్ట్రానుల ప్రవాహము వంపుతిరిగెడి రీతిని కనుగొని డేవిస్సన్ మరియొకరితో కలిసి 1937 లో నోబెల్ బహుమతిని పొందెను.

## మైకేల్సన్ ఆల్బర్టు అబ్రహామ్ (1852-1931)

ఈ అమెరికను శాస్త్రవేత్త కాంతివేగమును కచ్చితముగా నిర్ణయించి విశ్వవ్యాప్తమైన ఆకాశమనేదిలేదని సూచించుటకై పరిశోధనలను జరిపి సాపేక్ష సిద్ధాంత నిర్మాతనమునకు దారిచేర్పరచిన ఫలితముగా 1907 లో నోబెల్ బహుమతిని సాధించెను.

## లిప్‌మన్ గేబ్రియల్ (1845-1921)

ఈ ఫ్రెంచి విజ్ఞానవేత్త యథాతథముగా రంగుల యొక్క ఛాయా చిత్రములను తీయు విధమును కనుగొనుట ద్వారా 1908 లో నోబెల్ బహుమానమును పొందెను.

## మార్కొని గుగ్లియెల్మో మార్చిజ్ (1874-1937)

ఇటలీ దేశీయుడైన ఈ భౌతిక శాస్త్రవేత్త వైర్‌లెస్ టెలిగ్రఫీ అను నిస్తంత్రీ విధానమును తీర్చిదిద్దినందుకై బ్రాన్ అను జర్మను శాస్త్రవేత్తతో కలిసి 1909 లో నోబెల్ బహుమతిలో సగము వాటాను పంచుకొనెను.

## వాన్‌డర్‌వాల్స్ యోహానెస్ డిడెరిక్ (1837-1923)

ఈ డచ్చి భౌతిక శాస్త్రవేత్త వాయు ద్రవముల మూలకత్త్వమును వాటి సామాన్య ప్రవృత్తిని అవగతమొనర్చు కొనుటకు పరిశోధనలను జరిపెను. వాయుపదార్థముల సంకట స్థితి (critical state) ఏర్పరచి వాటి ప్రవర్తనమునకు అవసరమైన విజ్ఞానమును నెల్లడించుట మూలముగా 1910 లో నోబెల్ బహుమతిని అందుకొనెను.

## వీన్ విల్హెల్మ్ (1864-1928)

ఈ జర్మను భౌతికశాస్త్రజ్ఞుడు 1911 లో ఉష్ణశక్తి ప్రసరించు విధానమును నిర్ధారించిన ఫలితముగా నోబెల్ బహుమానమును పొందెను. X-కిరణములను గురించియు, కాంతి ప్రసారమును గురించియు ద్రవముల చలనరీతిని గురించియు కూడ శోధించిన పండితుడీయన.

## డాలెన్ నిల్స్ గస్టవ్ (1869-1937)

ఈ స్వీడిష్ శాస్త్రవేత్త రైల్వే సంకేతములలోను సముద్రజలాలోపలికలనమునకై తేలెడి రక్షక స్థానములయందలి దీపములలోను దూరమునుండి కన్పించు కాంతి సూచక దీప స్తంభములలోను ఉపయోగింపబడు ఎసిటిలీను దీపములలో ఎసిటిలీను వాయు సరఫరాలో హెచ్చుతగ్గులు స్వయముగనే సర్దుబాటగు సాధనమును తీర్చిదిద్దినందుకై 1912 లో నోబెల్ బహుమతిని పొందెను.

## కామెర్లింగ్ ఓన్స్ హెయికి (1853-1926)

ఈ హాలెండు భౌతికశాస్త్రవేత్త హీలియము అను వాయువును ద్రవీకరించి దాని లక్షణములను వివరించిన ఫలితముగా 1913 లో నోబెల్ బహుమానమును పొందెను.

## లీమాక్స్ ఫోన్ (1879-1960)

ఈ జర్మను భౌతిక శాస్త్రవేత్త స్ఫటికములను ఉపయోగించి X-కిరణతరంగ దైర్ఘ్యమును నిర్ణయించు విధానమును కనుగొన్న ఫలితముగా 1914 లో నోబెల్ బహుమతిని సాధించెను.

## బ్రాగ్, సర్ విలియమ్ హెన్రీ (1862-1942)

ఈ ఆంగ్ల భౌతిక శాస్త్రవేత్త X-కిరణ విశ్లేషణములో ఉపయుక్తమగు స్పెక్ట్రోమీటరు సాధనమును తీర్చిదిద్ది స్ఫటిక నిర్మాణ రహస్యములను వెల్లడించి తన కుమారుడైన సర్ విలియమ్ లారెన్సు బ్రాగ్‌తో కలిసి 1915 లో నోబెల్ బహుమతిని పొందెను. లారెన్సుబ్రాగ్ 1938 లో కేవెండిష్ పరిశోధనాలయమునకు (ఇంగ్లండు) అధిపతియై వాసికెక్కెను.

1916 లో నోబెల్ బహుమతి ప్రదానము జరుగలేదు.

## ఛార్లెస్ గ్లోవర్ బార్క్లా (1877-1944)

మూల ద్రవ్యముల నుండి లభించు X-కిరణముల ప్రత్యేకతను వివరించినందుకు ఈ ఆంగ్ల భౌతిక శాస్త్రవేత్త 1917 లో నోబెల్ బహుమతిని పొందెను.

## మాక్స్‌ప్లాంక్ (1858-1947)

ఈ జర్మను భౌతిక శాస్త్రజ్ఞుడు ఉష్ణగతి సంబంధాలశాస్త్ర విభాగమునకు (Thermodynamics) చెందిన ప్లాంక్ సిద్ధాంతమును ప్రవచించినందుకై 1918లో నోబెల్ బహుమతిని పొందెను.

### స్టార్క్ యోహానస్ (1874-1957)

ఈ జర్మను భౌతికశాస్త్రజ్ఞుడు డాప్లర్ వైజ్ఞానిక పరిశీలనమును పాజిటివ్ కిరణముల సంగతములలో కనుగొని వివరించిన ఫలితముగా 1919 లో నోబెల్ బహుమతిని స్వీకరించెను. స్పెక్ట్రమ్‌లోని రేఖలు విద్యుత్క్షేత్రమందు విస్తరణమొందును. ఈ వైజ్ఞానిక పరిశీలనము కూడ సాధించి క్వాంటమ్ సిద్ధాంతమును రుజువు పరచెను.

### గైలామి చార్లెస్ ఎడ్వర్డు (1861-19 8)

ఈ ఫ్రెంచి పదార్థవిజ్ఞానశాస్త్రవేత్త లోహధాతు మిశ్రమములను - ముఖ్యముగా ఇన్వార్ పాటినైటులను గూర్చి చేసిన పరిశోధనలకై 1920లో నోబెల్ బహుమతిని పరిగ్రహించెను. ఇన్వార్ లోహమిశ్రమములలో నికెలు 36 శాతము, మాంగనీసు, సిలికాను, కార్బనులు కలిసి ఒక శాతము ఉండవలెననియు ఈ మిశ్రమము వేడిమిని హెచ్చుగా పెరుగదనియు తెలిసికొనుటచే దానిని ప్రామాణికమైన మీటరు బద్దలను ఉష్ణస్థితిని నిశ్చలముగా ఉంచు థెర్మోస్టాట్ సాధనములను నిర్మించుటలో వాడుక చేయుచున్నారు. పాటినైటు లోహమిశ్రమము 90 శాతము ప్లాటినము 10 శాతము ఇరిడియముతో కలిసినప్పుడేర్పడు ప్లాటినము ఇరిడియము లోహ మిశ్రమము వంటిదే. ఈ రెండు లోహమిశ్రమముల అరుగుదల అతి తక్కువైనందున ఊటకలముల పాళీలకు మొనలు చేయుటలోను పాళీలను చేయుటలో కూడ అవి వినియోగమగుచున్నవి.

### నీల్స్ హెన్రిక్ డేవిడ్ బోర్ (1885-1962)

ఈ డేనిష్ భౌతిక విజ్ఞానవేత్త 1922లో పరమాణు రచనా విన్యాసమును వివరించినందుకై నోబెల్ బహుమతిని పొందెను. క్వాంటమ్ సిద్ధాంతము అణురచనా విన్యాసము ఇతనిచే సమన్వయమొనర్పబడినవి. పరమాణు విచ్ఛేదన మొనర్చెడి శాఖను నిర్మాణమొనర్చుటకై అమెరికాలో జరిగిన పరిశోధనలయందితడు పాల్గొనెను. కోపెన్‌హేగెను నగరములో జరిగిన విజ్ఞాన పరిశోధనలకు కులపతివంటి వాడితడు.

### మిల్లికన్ రాబర్టు ఆండ్రూస్ (1868 1953)

ఈ అమెరికను భౌతికశాస్త్రవేత్త ఎలక్ట్రాను యొక్క విద్యుదావేశ ప్రమాణమును నిర్ణయించినందుకు ఫోటో ఎలెక్ట్రిక్ వైజ్ఞానిక పరిశీలనమును చేసినందుకు, 1923లో నోబెల్ బహుమతిని అందుకొనెను. విశ్వకిరణములు X-కిరణముల భౌతిక విద్యుత్ ప్రభావములు మున్నగువాటిని గురించి కూడ ఇతడు పరిశోధనలు చేసెను. 1896-1921 ల నడుమ చికాగో విశ్వవిద్యాలయములోను 1921 1945 ల నడుమ కాలిఫోర్నియాలో టెక్నాలజీ సంస్థయందును ఇతడు ప్రముఖుడుగా నుండినవాడు.

### సీగ్‌బాన్ కార్ల్‌మన్ జార్జి (1886- )

ఈ స్వీడిష్ శాస్త్రజ్ఞుడు X-కిరణముల తరంగదైర్ఘ్యమును కచ్చితముగా నిర్ణయించెడు విధానమును కనుగొన్నందుకు 1924లో నోబెల్ బహుమతిని స్వీకరించెను.

### హెర్ట్జ్ గస్టవ్ (1887 1975)

ఈ జర్మను భౌతికశాస్త్రజ్ఞుడు ఎలక్ట్రానులకు అణువులకు మధ్య జరుగు సంఘట్టన ఫలితములను వివరించిన ఫలితముగా 1925లో నోబెల్ బహుమతిని పొందెను. రెండవ ప్రపంచయుద్ధానంతరము ఇతడు రష్యాలో పరమాణు సంబంధమైన పరిశోధనలలో నిమగ్నుడయ్యెను. కాంతి చైతన్య రాసాయనిక క్రియలను గురించి చేసిన పరిశోధనలు కూడ అతనికి విశేష ఖ్యాతిని చేకూర్చినవి.

### పెర్రిన్ జీన్ బాప్టిస్ట్ (1870-1942)

ఈ ఫ్రెంచి భౌతిక శాస్త్రవేత్త బ్రౌనీయ చలనమును గూర్చి పరిశోధించి పరమాణువుల పరిమాణములను నిర్ణయమును సాధ్యమొనర్చినందుకై 1926 లో నోబెల్ బహుమతిని గ్రహించెను.

### కాంప్టన్ ఆర్థర్ హోలీ (1892-1962)

ఈ అమెరికను భౌతికశాస్త్రవేత్త పరమాణుభారము తక్కువగాగల రాసాయనిక మూలద్రవ్యముల నుండి లభించు ఎలక్ట్రానులతో సంఘట్టనము జరిగినప్పుడు X-కిరణముల తరంగదైర్ఘ్యములో పెంపుదల సంభవించునని కనొనెను. 'కాంప్టన్ వైజ్ఞానిక పరిశీలన'మని పేరందిన ఈ పరిశోధనకై 1927లో ఇతడు నోబెల్ బహుమతిలో అర్ధభాగమును సాధింపగలిగెను.

### విల్సన్ చార్లెస్ థామ్సన్ రీస్ (1869-1959)

ఈ బ్రిటిష్ భౌతికశాస్త్రవేత్త అయనీకరణమొందిన కణములను విల్సన్ మేఘ కల్పన విధానముచే గుర్తింపసాధ్యమని నిరూపించిన ప్రయోగకుశలుడు. ఈ విధానముతో

స్వచ్ఛమైన వాయువును నీటిఆవిరితో కలిపి గాజునలకలగదిలో ప్రవేశింప జేయగా ఆ వాయువు ఘనీభవనమై నీటిఆవిరి బిందురూపము ధరించి ఛాయాచిత్రగ్రహణమునకు అనుకూలముగ నుండెను ఈ పరిశోధనలకై ఈతనికి 1927లో నోబెల్ బహుమానములో అర్ధభాగము లభించెను

రిచర్డ్సన్ ఓవెన్ విలియమ్స్ (1879–1959)

ఈ ఆంగ్లభౌతిక శాస్త్రవేత్త ఎలక్ట్రానులను గురించి ముఖ్యముగా బాగుగా వేడెక్కిన వస్తువులనుండి అవి వెలికివచ్చు నియమములను గురించి శోధించినందుకై 1928లో నోబెల్ బహుమతిని పొందెను

లూయీ విక్టర్ ప్రిన్స్ డిబ్రాగ్లీ (1892–      )

ఎలక్ట్రానుల తరంగగతి స్వభావమును వివరించినందుకై 1929లో నోబెల్ బహుమతిని సాధించుకొన్న శాస్త్రజ్ఞుడితడు 1931లో భౌతిక శాస్త్రమునందు నోబెల్ బహుమతి ప్రదానము జరుగలేదు

వెర్నర్ హైసెన్‌బర్గ (1901–      )

క్వాంటమ్ సిద్ధాంతము దృష్ట్యా ఈ జర్మను భౌతిక శాస్త్రవేత్త అత్యల్పకణ చలనమును నిర్దిష్టముగా హైడ్రోజని యొక్క సమరూపము లను కనుగొన్నందుకై 1932లో నోబెల్ బహుమతిని పొందెను

డిరాక్ పాల్ ఏడ్రియన్ మారిస్ (1902      )

ఈ ఆంగ్ల భౌతిక విజ్ఞాని హైసెన్‌బర్గ ప్రవచించిన క్వాంటమ్ సిద్ధాంతానుసారియైన అణువుల కణచలన సిద్ధాంతమును తీర్చిదిద్ది 1933లో ష్రోడింగర్‌తో కలిసి నోబెల్ బహుమతిని పంచుకొనెను

ష్రోడింగర్, ఎర్విన్ (1887 1961)

ఈ ఆస్ట్రియను భౌతికవిజ్ఞానవేత్త తరంగగతి మూలకమైన చలనశాస్త్రమును గణిత శాస్త్రోపకారముతో రూపొందించి 1933లో డిరాక్‌తో కలిసి నోబెల్ బహుమతిని స్వీకరించెను 1934లో భౌతిక శాస్త్రమునందు నోబెల్ బహుమతి ప్రదానము జరుగలేదు

జేమ్స్ చాడ్విక్ (1891–      )

సర్ బిరుదమును పొందిన ఈ ఆంగ్లభౌతిక శాస్త్రవేత్త న్యూట్రాన్ కణములను కనుగొనినందుకై 1935లో నోబెల్ బహుమతిని సంపాదించెను

ఆండర్సన్ కారల్ డేవిడ్ (1905–      )

ఈ అమెరికను భౌతిక శాస్త్రజ్ఞుడు పోసిట్రాన్ కణమును కనుగొని 1936లో నోబెల్ బహుమతిని విక్టర్ ఫ్రాన్సిస్ హెస్ అను శాస్త్రవేత్తతో కలిసి పంచుకొనెను మీసాన్ కణమును కనుగొన్న శాస్త్రవేత్తలలో ఇతడొకడు

డేవిసన్ క్లింటన్ జోసెఫ్ (1881 1958)

లూయీ డిబ్రాగ్లీ అను శాస్త్రవేత్త ఎలక్ట్రానుకణ ప్రవాహము తరంగగతిలో సాగునని చేసిన సూచనను ఈ అమెరికను భౌతికశాస్త్రవేత్త ప్రయోగరీత్యా రుజువు చేసినందుకై 1937లో నోబెల్ బహుమతిని జార్జిపేజెట్ థామ్సనుతో కలిసి పంచుకొనెను

ఫెర్మి ఎన్రికో (1901 54)

ఇటలీలో జన్మించిన ఈ అమెరికను శాస్త్రజ్ఞుడు రేడియో ఆక్టివ్ పదార్థములను చేసిన పరిశోధనలకై 1938లో నోబెల్ బహుమతిని గ్రహించెను 1934–39 మధ్య అటు పిమ్మట పరమాణుశక్తిని గురించి జరిగిన పరిశోధనలలో ఇతడు ప్రముఖపాత్ర వహించెను చికాగో విశ్వవిద్యాలయములో కృషిచేయుచు గొలుసుకట్టులో ఉత్తరోత్తరాభివృద్ధిగా కొనసాగు న్యూక్లియచర్యను కనుగొన్న శాస్త్రవేత్తల బృందమునకు ఫెర్మి నాయకుడు

లారెన్స్ ఎర్నెస్ట్ ఆర్లాండో (1901 58)

ఈ అమెరికను భౌతికశాస్త్రవేత్త సైక్లోట్రానును కనుగొన్నందుకు పరమాణు రచనా విన్యాసమును గురించి చేసిన పరిశోధనలకు ఫలితముగా 1939లో నోబెల్ బహుమానమును సంపాదించెను

1940–1941, 1942లలో నోబెల్ బహుమతి ప్రదానములు జరుగలేదు

స్టెర్న్ ఆటో (1888–      )

జర్మనీలో జన్మించిన ఈ అమెరికను శాస్త్రవేత్త ప్రోటాను కణముల మాగ్నెటిక్ చలనమును అణుకిరణములను వ్యక్తమొనర్చు అణుకిరణపుంజ విధానమును చిన్నగోళికలో అణువులు ఆవిరియగునట్లొనర్చి వాటినుండి వాటిసహజ లక్షణములను వ్యక్తీకరించు కణపుంజమును సంపాదించు ప్రయోగ

విధానమును రూపొందించి 1948లో నోబెల్ బహుమానమును అందుకొనెను

రాబి ఇసిడార్ ఐజాక్ (1898- )

ఆస్ట్రియాలో జన్మించిన ఈ శాస్త్రవేత్త మాగ్నెటిజము అను రేణువులు క్వాంటమ్ సిద్ధాంతానుసారియైన చలన శాస్త్రము కలిగియున్నవని వాటిని పరిశోధనాంశములుగా నిర్ణయించుకొనెను. పరమాణు ప్రసారమును గురించి కనుగొన్న విషయములకై ఇతనికి 1944 లో నోబెల్ బహుమతి లభించినది

పాలి వుల్ఫ్‌గాంగ్ (1900-1958)

ఈ స్విస్-ఆస్ట్రియను భౌతిక శాస్త్రజ్ఞుడు ఏ రెండు ఎలక్ట్రానులు కూడ ఒకే క్వాంటమ్ స్థితిలో నుండనేరవను అంశమును కనుగొని దానిని వివరించి 1945లో నోబెల్ బహుమానమును సంపాదించుకొనెను

బ్రిడ్జిమన్ పెర్సీ విలియమ్స్ (1882 1961)

ఈ అమెరికను భౌతిక శాస్త్రవేత్త విపరీతమైన ఒత్తిడి శక్తిని గూర్చి చేసిన పరిశోధనలకై 1946లో నోబెల్ బహుమానమును పొందెను

ఆపిల్‌టన్, ఎడ్వర్డు విక్టర్ (1892-

సర్ బిరుదాంకితుడైన ఈ ఆంగ్లపదార్థ విజ్ఞానశాస్త్రవేత్త వాతావరణములోని అయానుల ఆవరణమును గూర్చి చేసిన పరిశోధనములు రాడార్ నిర్మాణమునకు దారితీసినవి. ఫలితముగా 1947లో ఇతనికి నోబెల్ బహుమానము లభ్యమైనది

బ్లాకెట్, పాట్రిక్ మేనార్డ్ స్టువర్టు (1897- )

విల్సన్ నిర్మించిన మేఘకల్పనాత్మక గాజు పలకల గదికి మెరుగులు దిద్దినందుకు విశ్వ (కాస్మిక్) కిరణములను గూర్చి క్రొత్త విశేషములను కనుగొన్నందుకు 1948 లో ఈ ఆంగ్ల భౌతిక శాస్త్రవేత్త నోబెల్ బహుమతిని సంపాదించెను

యుకావా హైడెకి (1907- )

ఈ జపాను భౌతిక శాస్త్రవేత్త మీసానుకణములున్నయని సమ్మతము కల్గించుటకై సిద్ధాంతానుసారముగా సూచించి 1949 లో నోబెల్ బహుమానమును సంపాదించుకొన్నాడు

పావెల్ సెసిల్ ఫ్రాంక్ (1903- )

పరమాణువుల యొక్క న్యూక్లియసులను గురించి శోధించుటయందుపయుక్తమైన ఛాయాచిత్రగ్రహణ విధానమును రూపొందించి మీసానులను గూర్చి నూతనవిషయములను కనుగొన్నందుకై ఈ ఆంగ్ల భౌతిక శాస్త్రవేత్త 1950 లో నోబెల్ బహుమతిని సంపాదించినాడు

కాక్‌రాఫ్ట్ జాన్ డగ్లస్ (1897 )

సర్ బిరుదును సంపాదించిన ఈ ఆంగ్ల భౌతిక శాస్త్రవేత్త పరమాణుకేంద్రములకు పరమాణుజన్యములైన కణములకు ఉత్తేజమును వేగమును కల్పించి వాటిని వడిసెలరాళ్లవలె వాడి సంఘటన మొనర్చి క్రొత్తమూల ద్రవ్యపరమాణు కేంద్రముల సృష్టికొఱకు ప్రయోగ విధానములను తీర్చిదిద్ది ఒక చక్కని పంథానేర్పరచిన వారిలో గణ్యుడైనందున ఇతనికి 1951 లో నోబెల్ బహుమానములో భాగము లభించెను

వాల్టన్ ఎర్నెస్ట్ థామస్ సింటన్ (1903 )

ఐర్లెండులో జన్మించిన ఈ బ్రిటిష్ భౌతికశాస్త్రవేత్త రాసాయనిక మూలద్రవ్యముల పరమాణు కేంద్రముల కల్పనను సాధ్యమొనరుటకై పరిశోధనలు సలిపి 1951లో కాక్‌రాఫ్‌తో కలిసి నోబెల్ బహుమతి ప్రదానములో పాల్గొనెను

బ్లోక్ ఫెలిక్స్ (1905- )

స్విట్జర్లెండులో పుట్టిన ఈ అమెరికను భౌతిక శాస్త్రవేత్త పరమాణుకేంద్రములలో వ్యక్తమగు మాగ్నెటిక్ క్షేత్రబలమును నిర్ణయమొనర్చి 1952లో నోబెల్ బహుమతిని ఎడ్వర్డుమిల్స్ పర్సెల్ అను శాస్త్రవేత్తతో కలిసి పంచుకొనెను

ఫ్రిట్జ్ జెర్‌నిక్ (1888- )

ఈ డచ్చి భౌతిక శాస్త్రవేత్త అతిమన్నికమైన మైక్రోస్కోపును నిర్మించి జీవకణపుంజములను (tissues) సూటిగా పరిశీలించుటను సాధ్యమొనర్చినందుకై 1953 లో నోబెల్ బహుమానమును పొందెను

వాల్థర్ బోథె (1891-1957)

ఈ జర్మను భౌతిక శాస్త్రవేత్త రెండవప్రపంచయుద్ధ కాలములో జర్మనులు సాగించిన పరమాణు గుప్తశక్తి పరిశీలనములో ఎన్నదగిన కృషిచేసినాడు కాలనిర్ణయమునకు

అతిఖచ్చితమైన విధానమును నిర్ణయించినందుకై మాక్స్ బోర్న్ అను బ్రిటిష్ భౌతిక శాస్త్రవేత్తతో కలిసి ఇతడు 1954 లో నోబెల్ బహుమతిని పంచుకొనెను

## లాంబ్ విల్లిస్ ఓజీస్ జూనియర్ (1913-          )

ఈ అమెరికను భౌతికశాస్త్రవేత్త పోలికార్ప్ కష్ అను జర్మను శాస్త్రజ్ఞునితో కలిసి ఎలక్ట్రాను యొక్క ఎలక్ట్రోమాగ్నెటిక్ లక్షణమును ఖచ్చితముగా నిర్ణయించినందుకై నోబెల్ బహుమానమును 1955 లో అతనితో సమముగా పంచుకొనెను

## విలియమ్ బ్రాడ్‌ఫర్డ్ షాక్లీ (1910-          )

ఇంగ్లండులో జన్మించిన ఈ అమెరికను భౌతికశాస్త్రవేత్త ట్రాన్సిస్టరును తీర్చిదిద్దినందుకై జాన్ బార్డీన్ వాల్టర్ హౌసర్ బ్రటెయిన్ అను అమెరికన్ శాస్త్రవేత్తలతో కలిసి 1956 లో నోబెల్ బహుమతిని పంచుకొనెను

## ట్సుంగ్ డావోలీ (1926          )

ఇతడును చెన్ నింగ్ యాంగ్ అను మరియొక చైనా భౌతికశాస్త్రవేత్తయు కలిసి పరమాణుగర్భములో గుప్తమై యున్న ప్రతిఅత్యల్పకణమునకును ప్రతిబింబాత్మకమైన కణము విశ్వములో ఎచ్చటనో ఒకచోట ఉండితీరవలెను వాదమును సహేతుకముగా ఖండించిన ఫలితముగా 1957 లో నోబెల్ బహుమానమును పొందియున్నారు

## చెరెన్‌కోవ్ పావెల్ అలెక్సెయివిక్ (1904-          )

ఇతడు మరియొక సోవియట్ భౌతికశాస్త్రవేత్తయైన ఇల్యామిఖలోవిక్ ఫ్రాంక్ అనువానితోను కలిసి విశ్వకిరణములను శక్తివంతములైన కణములను గల సంబంధము అను శోధించి 1958 లో నోబెల్ బహుమతిని పరిగ్రహించిరి నీటి అడుగున ఉన్న ఎలెక్ట్రానుల వేగము వాటిమీద మరేశక్తి పాతము జరిగినను పెరుగునని ఋజువు చేయుటకు చెరెన్‌కోవ్ వైజ్ఞానిక పరిశీలనము నొనరెను అందుచే విశ్వకిరణములను గురించిన పరిజ్ఞాన సేకరణముకు క్రొత్తమార్గము లభించెను

## చేంబర్లేన్ ఓవెన్ (1920-          )

ఇతడును ఇతని సహచరుడైన ఎమిలో సెగ్రే అను అమెరికను భౌతికశాస్త్రవేత్తయు కలిసి ప్రోటానుల వ్యతిరేకమైన కణములున్నవని ఋజువుచేసినందుకై 1959 లో నోబెల్ బహుమానమును సంపాదించిరి

## గ్లేసర్ డొనాల్డ్ ఆర్థర్ (1926-          )

ఈ అమెరికను భౌతిక శాస్త్రవేత్త పరమాణుగర్భమందున్న అత్యల్పకణములను గుర్తించుటకు వీలు కల్పించిన బుడగల గదిని నిర్మించి బుడగలు బుడగలుగా ఆ కణముల మార్గమును గుర్తించుటకు అవకాశము కల్పించిన ఫలితముగా 1960 లో నోబెల్ బహుమానమును పొందెను

## రాబర్టు హోఫ్‌స్టాడ్‌టర్ (1915-          )

ఈ అమెరికను భౌతిక శాస్త్రజ్ఞుడు ప్రోటాను న్యూట్రాను యొక్క అంతరాంతరశోధ చేసి వాటిలో విద్యుదావేశము ఏ రీతిగా ఉన్నదో ప్రయోగాత్మకముగా నిర్ణయించుటకై వేగవంతమైన ఎలక్ట్రానులను హైడ్రోజని డ్యుటేరియము న్యూక్లియసుల వైపు ప్రచోదనమొనర్చి సాధించినందుకై 1961 లో నోబెల్ బహుమతిలో సగపాలును పంచుకొనెను

## రుడాల్ఫ్ ఎల్ మోస్‌బాయెర్ (1929-          )

ఈ జర్మను భౌతికశాస్త్రవేత్త గామాకిరణములు వెనుకకు అదురులేని విధముగా ప్రసారమగు రీతిని వైజ్ఞానిక పరిశీలనముగావించి వివరించినందుకై 1961 లో నోబెల్ బహుమానములో అర్ధభాగమును సాధించెను

## లాండవ్ లెవ్ డేవిడోవిక్ (1908-          )

ఈ రష్యను భౌతికశాస్త్రవేత్త — 455 78-°F (270 9 °C) శైత్యస్థితిలో ద్రవరూపమానందున్న హీలియము యొక్క లక్షణము ను గణిత భౌతికశాస్త్ర సిద్ధాంతముల దృష్ట్యా వివరించినందుకై 1962 లో నోబెల్ బహుమతి గౌరవమును పొందెను

## విగ్నర్ యూజీన్‌పాల్ (1902          )

జర్మనీలో జన్మించిన ఈ అమెరికను భౌతికశాస్త్రవేత్త పరమాణుతత్త్వపరిశోధకుడుగను ప్రిన్స్‌టన్ విశ్వవిద్యాలయ ఆచార్యుడుగను ప్రసిద్ధికెక్కినవాడు 1963 లో మరి ఇద్దరు శాస్త్రవేత్తలతో కలిసి ఇతడు నోబెల్ బహుమానములో పాలుపంచుకొనెను

## హాన్స్ డేనియల్ జెన్సెన్ (1907-          )

ఈ జర్మను భౌతికశాస్త్రజ్ఞుడు హైడెల్‌బర్గ విశ్వవిద్యాలయములో ఆచార్యుడుగా వ్యవహరించుచున్నాడు 1963లో

మరి ఇద్దరితో కలిసి ఇతడు నోబెల్ బహుమతిని అందుకొనెను

## మేరియా గొప్పెర్ట్ మేయర్ (1906- )

జర్మనీలో జన్మించిన ఈ అమెరికను భౌతిక విజ్ఞాన శాస్త్రజ్ఞురాలు కాలిఫోర్నియా విశ్వవిద్యాలయమునందాచార్యురాలుగ నుండి 1963 లో మరి ఇద్దరితో కలిసి నోబెల్ బహుమానమును పంచుకొనెను

## టౌన్స్ చార్లెస్ హార్డ్ (1915- )

ఈ అమెరికను భౌతిక విజ్ఞానవేత్త మసాచుసెట్స్ టెక్నాలజీ సంస్థలో ఆచార్యుడుగా పనిచేయుచు 1964 లో నోబెల్ బహుమతిని ఇద్దరు సహచరులతో కలిసి పంచుకొనెను

## బసోవ్ నికొలోయ్ గెన్నాడివిక్ (1922- )

ఈ రష్యను భౌతికశాస్త్రవేత్త రష్యాలోని లెబెడెవ్ ఫిజికల్ ఇన్‌స్టిట్యూటులో ఆచార్యుడుగా పనిచేయుచు 1964 లో నోబెల్ బహుమతిని ఇద్దరు శాస్త్రవేత్తలతో కలిసి పంచుకొనెను

## అలెగ్జాండర్ మిఖైలోవిక్ ప్రొఖోరొవ్ (1916- )

లెనిన్‌గ్రాడ్ రాష్ట్రీయ విశ్వవిద్యాలయములో ఇతడొక భౌతికశాస్త్రాచార్యుడు. 1964 లో నోబెల్ బహుమతిని మరి ఇద్దరితో కలిసి పంచుకొన్న సోవియట్ విజ్ఞానవేత్త ఇతడు

## ఫెయిన్‌మన్ రిచర్డ్ ఫిలిప్స్ (1918- )

ఈ అమెరికను భౌతికశాస్త్రవేత్త ప్రిన్స్‌టన్ విశ్వవిద్యాలయములలో ఆచార్యుడుగ నుండి 1965 లో నోబెల్ బహుమతిని ఇద్దరు సహచరులతో కలిసి పంచుకొనెను

## ష్వింగర్ జూలియన్ సెమ్యూర్ (1918- )

ఈ అమెరికను భౌతికశాస్త్రవేత్త కొలంబియా విశ్వవిద్యాలయమునందాచార్యుడుగ వ్యవహరించుచు 1965 లో నోబెల్ బహుమతిని మరి ఇద్దరితో కలిసి పంచుకొనెను

## టొమొనాగా ఎస్ ఇచిరో (1906- )

టోకియో విశ్వవిద్యాలయములో ఆచార్యుడుగానున్న ఈ జపాను భౌతికశాస్త్రజ్ఞుడు 1965 లో నోబెల్ బహుమతిని ఇద్దరితో చేరి పరిగ్రహించెను

## కాస్ట్లెర్, ఆల్‌ఫ్రెడ్ (1902- )

ఈ ఫ్రెంచి భౌతికశాస్త్రవేత్త సోర్బెయిన్ విశ్వవిద్యాలయమునందాచార్యుడుగనుండి 1966లో నోబెల్ బహుమాన గౌరవమును పొందినవాడు

## హాన్స్ ఆల్‌బ్రెఖ్ట్ బెధె (1906- )

జర్మనీలో పుట్టిన ఈ అమెరికను భౌతిక శాస్త్రవేత్త జాన్ వెండెల్ ఆండర్సను అను పేరుతో భౌతికశాస్త్రాచార్యుడుగ నుండి 1966 లో నోబెల్ బహుమతిని గ్రహించెను

## లూయీ డబ్ల్యు ఆల్వారెజ్ (1911- )

ఈ అమెరికను భౌతిక శాస్త్రవేత్త కాలిఫోర్నియా విశ్వవిద్యాలయమునందాచార్యపదవియందుండి మౌలికమైన కణములను గురించి కావించిన పరిశోధనల ఫలితముగా 1968 లో నోబెల్ బహుమానమును పొందెను

## ముర్రే గెల్‌మన్ (1929- )

ఈ అమెరికను భౌతికశాస్త్రవేత్త గత 15 సంవత్సరములుగా ప్రఖ్యాత సిద్ధాంతవేత్తల గోష్ఠులలో కీర్తిని గడించినవాడు. స్వతంత్ర వ్యక్తిత్వముగల అత్యల్ప కణములను గురించియు వాటి పరస్పర సంయోగములను గురించియు గావించిన పరిశోధనలకై 1969లో భౌతికశాస్త్రమున కేర్పరుపబడిన నోబెల్ బహుమానము ఈతనికియ్యబడినది. ఈతడు కాలిఫోర్నియా ఇన్‌స్టిట్యూట్ అఫ్ టెక్నాలజీలో ఆచార్యుడుగానున్నాడు

## హాన్స్ ఆల్ఫ్వెన్

స్వీడన్ దేశీయుడైన ఈ భౌతికశాస్త్రవేత్త "మాగ్నెటో హైడ్రోడైనమిక్స్ శాస్త్రవిభాగమున మౌలికమైన పరిశోధనల నొనర్చి ప్లాస్మాయొక్క భౌతికగుణములను అవగత మొనర్చిన ఖ్యాతినంది 1970లో భౌతికశాస్త్ర పరిశోధనలకేర్పాటైన నోబెల్ బహుమతిని మరొక శాస్త్రవేత్తతో కలిసి స్వీకరించినాడు

## లూయీ నీల్

ఇతడు ఫ్రాన్సుదేశములోని గ్రెనోబిల్ విశ్వవిద్యాలయమందలి భౌతికశాస్త్రాచార్యుడు. ఫెర్రోమాగ్నెటిజము, ఫెర్రిమాగ్నెటిజములను గురించి మౌలికమైన పరిశోధనలను జరిపి ఘనస్వరూపమును గూర్చిన విజ్ఞానవికాసమునకు తోడ్పడెను. 1970లో భౌతికశాస్త్రమున కేర్పడిన "నోబెల్ బహుమానమును మరియొక శాస్త్రవేత్తతో కలిసి పంచుకొన్నవాడితడు

హా. అ.

## వైజ్ఞానిక శాస్త్రవేత్తలు (రసాయనశాస్త్రము)

### సిద్ధనాగార్జునుడు (క్రీ శ సుమారు 100 సం॥)

ఇతడు వివిధౌషధములను మణిమంత్ర యోగాది మర్మ కర్మలను అణిమాదిసిద్ధులను రసవాదసార శాస్త్రములను క్షుణ్ణముగా తెలిసినవాడు క్రీ శ 16వ శతాబ్దిలో గౌరనకవి తన నవనాథ చరిత్రలో వ్రాసిన దానినిబట్టి నాగార్జునుడు పై విషయములను గూర్చి తన ప్రయోగశాలలో శిష్యులతో చర్చలు జరుపుటయేకాక అమూల్యములైన ఫలితములను గూడ సాధించెను ముఖ్యముగా నాగార్జునుని శిష్యులైన నిత్యనాథాదులతో కావించిన ప్రయోగలబ్ధ విజ్ఞానమే రసార్ణవ రస రత్నాకరాది గ్రంథములందును నాగార్జున తంత్రమునందును (మా 1వ సంపుటము పుట 766 ఆయుర్వేద గ్రంథములు") సంకలితమైయున్నదని ఊహింపదగియున్నది

### పారాసెల్సస్, ఫిలిప్పస్ అరియోలస్ (1493 1541)

ఇతడొక స్విట్జర్లెండు వైద్యుడు రసవాదవేత్త రాసాయనికుడు ఇతని అసలుపేరు థియొఫ్రాస్టస్ బొంబాస్టస్ ఫోన్‌హోహెన్‌హేమ్ కాని తాను సెల్సస్ అను గ్రీకు వైద్యాధినాధునికంటె మిన్నయను ఆత్మవిశ్వాసముతో ఆ భావసూచకముగా పారాసెల్సస్ అను నామమును ధరించెను ప్రతిరోగమునకు ప్రత్యేకమైన రాసాయనిక యౌగికము ఔషధముగా ఉపయోగింపగలదను అభిప్రాయమును వ్యాప్తి మొనర్చి ఆదృక్పథముతో కృషిచేసి వైద్యశాస్త్రమునకు వైపు అప్పటివరకు రసవాద దృష్టితోనే ఉన్న రసాయన శాస్త్రవేత్తల భావములో మలుపు కల్పించిన యుగపురుషుడితడు

### రోజర్ బేకన్ (1214-1294)

ఇతడొక ఆంగ్లభాషావేత్త వేదాంతి వేదికోరు అని తనకాలములో ప్రఖ్యాతిపొందినవాడు కాని ఆధునిక విజ్ఞాన శాస్త్రీయ దృక్పథమును రూపొందించిన ద్రష్టగా తనకాలములోనే కానరానివాడితడు విజ్ఞానశాస్త్రములు మతమునకును వేదాంత దృక్పథమునకును వ్యతిరేకము కావనియు, వాటిని అనుగమించుటట్టివే యనియు ఇతడు వక్కాణించియున్నాడు రసవాదమునుగురించియు జ్యోతిషఫలితములను సూచించు అంశములను గురించియు ఇతడు గ్రంథ రచనను కావించెను విజ్ఞాన సముపార్జనకు ప్రయోగము, పరిశీలనము ముఖ్యమని చాటి తర్వాతి తరాలవారికి మార్గదర్శకుడైన విజ్ఞాని ఇతడు కాంతి ఖగోళములు గణితము, భూగోళము, యంత్రసాధనములు, రసాయనశాస్త్రము మొదలైనవాటికి చెందిన రచనలను ఈ శాస్త్రవేత్త కావించెను దృష్టి మందులోని పదార్థముల పాళ్లయొక్క వివరణమును పేర్కొనిన రచనలలో ఇతని రచనయే అతి ప్రాచీనమైనది తన కాలమునాటి రాసాయనిక విజ్ఞానమునంతయు ఇతడు క్రోడీకరించెను ఎగిరెడి యంత్రసాధనముల నిర్మాణమునకును ఓడల నిర్మాణమునకును ఇతడు సూచనల నిచ్చెను భూమి గోళాకృతిలో నున్నదని చర్చించి నిర్ణయించిన మొదటి శాస్త్రవేత్త ఇతడు ఇతని భావములే కొలంబసును పశ్చిమ యాత్రోన్ముఖునిగా చేయుటకు తోడ్పడెను మొత్తముమీద రోజరు బేకను ఆధునిక వైజ్ఞానికులలో ఆది పురుషుడనదగినవాడు

### రాబర్టుబోయిల్ (1627-91)

ఈ బ్రిటిష్ వైజ్ఞానికుడు రసాయన మూలద్రవ్యములకును యౌగికములకును గల భేదమును వివరించిన ప్రథముడు రాసాయనిక మార్పులను రాసాయనిక విశ్లేషణమును స్పష్టముగా నిర్వచించిన విజ్ఞానవేత్త ఇతడు రసాయనశాస్త్రమునందు కీలకమైన ఈ రెండు విషయములు అరిస్టాటిలు భావ ప్రపంచమను వటవృక్షపు నీడలో ఎదుగకుండా ఉన్న రసాయన శాస్త్రమును వెలికితీసి వచ్చి పోటాపోటిగా వర్ధిల్లు అవకాశమును కల్పించెను వాయుపదార్థముల పీడనశక్తి హెచ్చినపుడు సంకోచము పొందునని కన్గొని పీడనశక్తియు పరిమాణములయొక్క గుణలబ్ధమును స్థిరముగా నుండునను సూత్రమును ఇతడు నిర్వచించెను ఈ సూత్రము బోయిల్ నియమము అనుపేర ఈ శాస్త్రవేత్త కీర్తిని చిరస్థాయిగా కొనసాగించినది

### స్టాల్ జార్జి ఎర్నెస్ట్ (1660-1734)

1723 లో ఫ్లాజిస్టన్ సిద్ధాంతమును ప్రతిపాదించిన రసాయనశాస్త్రజ్ఞుడితడు ఈ సిద్ధాంతము అసందర్భమైనదనియు, చెల్లనేరదనియు లెవోయిజర్ చేసిన పరిశీలనము వలన (1774) ఋజువైనది అయినను సంప్రదాయసిద్ధములైన భ్రమలనుండి తప్పించుకొనుట విజ్ఞానవేత్తలకు కూడ చాల కాలము పట్టుననియు ఇతర శాస్త్రవేత్తల పరిశోధనా ఫలితములన్నట్లు శ్రద్ధాసక్తులు చూపనిచో, ఎట్టి ప్రజ్ఞావంతులైనను

వెడదారిని బట్టి ప్రగతి మార్గమునకు ప్రమాదము కల్గింతు దనియు ఫ్లాజిస్టన్ సిద్ధాంత చరిత్రవలన ఋజువైనది. అరి స్టాటిల్ బెచర్ మున్నగు శాస్త్రవేత్తలు జ్వలనశీలముగల వస్తువు లన్నిటియందును గంధకముండునని భావించిరి. బెచెర్ అను శాస్త్రవేత్త 1667 లో జ్వలనశీలమైన పదార్థములం దన్నిటియందో గంధకము కానరాదనియు జ్వలనశీలతకు మరి యొక మృత్తికావిశేషము కారణము కావచ్చుననియు సూచిం చెను. ఈ రెండింటిని తన మనస్సులో ఇతడు మథించి జ్వలన శీలమగు పదార్థమునకు ఫ్లాజిస్టన్ అను నామమిడి రసాయన శాస్త్రప్రధాన విషయములను గ్రంథములందుల్లేఖించి శిష్యు లలో ప్రచారమొనర్చెను. ఈ సిద్ధాంతము ననుసరించి లోహధాతువులు గాలిలో భస్మమగునపుడు "లోహధాతువు→ భస్మము + ఫ్లాజిస్టను" అను రసాయనక్రియ నిర్వహింపబడు నని వివరింపబడినది.

1630 లో జీన్ రే అను అజ్ఞాతశాస్త్రవేత్తయు 1732 లో బోర్ హేవ్ అను ప్రఖ్యాత వైజ్ఞానికుడును లోహధాతు వులు భస్మమైనపుడు లభించు భస్మముల బరువును గ్రహించి నవి లోహధాతువుల బరువుకంటె అది ఎక్కువగా నుండు నని స్పష్టము చేసిరి. ఈ పరిశీలనమును తన సిద్ధాంతానుసార ముగా వివరించుటకై ఫ్లాజిస్టను అతితేలికైన దనియు లోహధాతువులను వీడి అది వెలికి ఎగసి భస్మము లేర్పడినపుడు వాటి బరువు హెచ్చుటలో వింతలేదనియు జార్జి ఎర్నెస్టు వితండవాదమొనర్చెను. స్థానబలము వాక్చాతుర్యము కల వాడైనందున ఎర్నెస్టు సిద్ధాంతము గాలిలో ఉన్న ఆక్సిజని మూలద్రవ్యమైన లోహధాతువులతో సంయోగించుచున్న దని లెవోషియె ఋజువుచేయువరకు ప్రచారములో నుండెను. ఎర్నెస్టు నిర్వచించిన సిద్ధాంతము అపహాస్యకారకమైనను వివిధ పరిశోధనలలో సామాన్యలక్షణమును అన్వేషించి సార్వ జనీనమైన సిద్ధాంతమును రూపొందించుటకై కృషిచేసిన శాస్త్ర వేత్తలలో ప్రథములైనందున స్టాల్ జార్జి ఎర్నెస్టు గణనీయు లైనారు.

## ప్రీస్ట్లీ జోసెఫ్ (1733 1804)

ఇతడొక ఆంగ్లరసాయన శాస్త్రవేత్త క్రైస్తవ మిష నరీ సంఘ భుక్తుడు; స్వాతంత్ర్యప్రియుడైన రాజకీయ వేత్త కూడ. ఫ్రెంచి విప్లవముయొక్క ప్రథమవర్షంతిని మిత్రులతో కలిసి జరుపుకొన్నందున మతాధికారులు ఇంగ్లండు ప్రభువు లోనైన ప్రజలను అతనిపై రెచ్చగొట్టి అతని ఇంటిని గ్రంథా లయమును పరిశోధనాగారమును కాల్చివేసిరి. అయినను అతడు వెరవక స్వస్థలమును వీడి లండనులో మరొకరి పంచ యందు కాపురముచేయుచు లైబ్రేరియనుగను కార్యదర్శి గను కాలముగడుపుచు పరిశోధనలు సాగించుచుండెను. ఈ పరిశోధనల ఫలితముగా అతడు ఆక్సిజనిని తయారుచేసి ఖ్యాతిగడించెను. ఈ ప్రయోగమునే ప్రీస్ట్లీనుండి లెవోషి యరు తెలిసికొని ఫ్లాజిస్టను సిద్ధాంతమును పూర్వపక్షముచేసి కీర్తిని సంపాదించెను. ప్రీస్ట్లీ పరిశోధనా ఫలితముగా కార్బను డయాక్సైడు జ్వాలల నార్పుటకును సోడాపానీయమును తయారుచేయుటకును ఉపయోగించుననియు ఆక్సిజని పర్వతా రోహకులకు ఊపిరి ఆడుటకు సహాయపడుననియు నీటి ఆవిరిని కణకణమండెడి బొగ్గుపై ప్రసరింపజేసినప్పుడు వాటర్ గ్యాస్ అను ఇంధనవాయువు లభించుననియు తేటతెల్లమయ్యెను. అరువది సంవత్సరముల వయసులో భావస్వాతంత్ర్యమునకై జన్మస్థలమునువదలి అమెరికాకువలస వెళ్లి అక్కడనే మర ణించుటకు అరగంటముందు వరకు రసాయనశాస్త్ర పరిశోధన లను వివరించుటలో అతడు కాలము గడపెను.

## షీలే కారల్ విల్హెల్మ్ (1742-86)

స్వీడిష్ రసాయనశాస్త్ర వేత్తయగు ఇతడు స్వతంత్ర ముగా ఆక్సిజనిని తయారుచేసిన ముగ్గురు శాస్త్రవేత్తలలో ఒకడు. నైట్రోజని బేరియము మాంగనీసు క్లోరిను అను మూలద్రవ్యములను గ్లిసరిను ఆక్సాలిక్ సిట్రిక్ టార్టారిక్ గాలిక్ మొదలైన ఆమ్లములను కార్బను యౌగికములను, మొక్కలనుండి లభించు ఫలసారము ను ప్రయోగములలో ఉపయోగించిన కుశలు డితడు. అనాది వైద్య సంప్రదాయము లందు నైపుణ్యమును గడించి ఖ్యాతిగడించెను.

## హెన్రీ కెవెండిష్ (1731-1810)

ఇతడొక ఆంగ్ల భౌతికరసాయన శాస్త్రవేత్త. హైడ్రో జనిని తయారుచేసి అది అన్ని పదార్థములకంటె తేలికైన దని ఇతడు ఋజువుచేసెను. ఈ పరిశోధన సాహిత్యవేత్తయగు డాక్టరు జాన్సనుకుకూడ "విజ్ఞానశాస్త్ర ప్రయోగములపట్ల ఆసక్తిని కల్పించెను. హైడ్రోజనితో పెద్దగుమ్మటములను నింపి చరిత్రాత్మకమైన ఆకాశయానమునకు నాంది వాచకము చెప్పెను. గాలి మిశ్రమమనియు నీరు యౌగిక మనియు తెలి

డిష్ పరిశోధనములవలన ఋజువయ్యెను. అందువలన మూల ద్రవ్యములను గురించి అరిస్టాటిల్ కావించిన నిర్వచనములు పూర్తిగా పరాస్తమయ్యెను. ప్రయోగ కౌశలమునందు కెవెండిష్ సాటి లేనివాడు. రెండు పెద్ద సైజు సీసపు గుండ్లకును రెండుచిన్న సైజు సీసపు గుండ్లకును నడుమ కల్గునట్టి ఆకర్షణబలమును నిర్ణయించి భూమియొక్క సరాసరి ఘనసెంటీమీటరుకు 5 48 గ్రాములని ఇతడు తేల్చెను. గాలిలో ఉన్న నైట్రోజనులో నూట ఇరువదియవవంతు కొన్ని క్రొత్త వాయువులున్నవని సూచించి రామ్సే జడవాయువులను కనుగొనుటకు ఇతడు సహాయపడెను. ధనవంతుడైనను ఇతడు నిరాడంబర జీవితమును గడిపినాడు. అర్థులు ఆశించిన దానికంటె దానమిచ్చిన ఈ విజ్ఞాన శాస్త్రవేత్త తన ఐశ్వర్యమును పరిశోధనలకై వినియోగించి యశస్వి యయ్యెను.

## లెవోయిజరు ఆన్టొయిన్ లారెంట్ (1743 94)

ఈ ఫ్రెంచి రసాయన భౌతికశాస్త్రవేత్త ఆధునిక రసాయన శాస్త్రమునకు పునాదివేసినవాడు. రసాయనక్రియలలో పాల్గొను పదార్థములయొక్క పరిమాణ ప్రాధాన్యమును ఇతడు గుర్తించి రసాయన క్రియలనుసరించు నియమములను కనుగొనెను. ప్రీస్టీ కెవెండిష్ శాస్త్రవేత్తలు కావించిన ప్రయోగముల ప్రాముఖ్యమును గమనించి వాటిని స్వయముగా కొలది సవరణలతో నిర్వర్తించి ప్లాజిస్టను సిద్ధాంతమును పూర్వపక్షమొనర్చి రసాయన శాస్త్ర ప్రగతికి సుగమమైన మార్గము నేర్పరచిన ధీమంతుడాయన. రసాయన యౌగికములకు వాటియందుండు మూలద్రవ్యములను స్ఫురింపచేయు పేర్లుపెట్టు విధానమును సూచించి ఈనాడమలులో నున్న సాంకేతిక పరిభాషను తీర్చిదిద్ది రసాయన శాస్త్రజ్ఞానమును ఈ ప్రజ్ఞాశాలి సుగమమొనర్చెను.

ఫ్రెంచి విప్లవకారులు ఇతడు రాజోద్యోగిగా శిక్షార్హుడని నిర్ణయించి శిరచ్ఛేదన శిక్ష విధించిరి.

## హాఫ్‌మన్, ఆగస్ట్ విల్హెల్మ్ ఫోన్ (1818 1892)

ఇతడొక జర్మను దేశీయుడైన కార్బను యౌగిక రసాయన శాస్త్రవేత్త. ఎనిలీను రంగుల పరిశ్రమకు మూల కారణమైన రోజానిలీను అను ఎర్రని పదార్థమును ప్రప్రథమముగా తయారుచేసిన ప్రయోగశీలుడీయన.

## నోబెల్ ఆల్‌ఫ్రెడ్ బెర్నహార్డ్ (1833 1896)

ఈతడు స్వీడిష్ రసాయన శాస్త్రవేత్త పారిశ్రామికుడు. 1863లో నైట్రోగ్లిసరినును తుపాకిమందు మిశ్రమమును 1866లో డైనమైటును పారిశ్రామికముగా తయారుచేసి అపారమైన సంపదను గడించిన అదృష్టవంతుడు. సహజముగ ఈతడు శాంతిప్రియుడు. కవితాప్రియుడు. చిత్తము వైజ్ఞానికదృష్టియు కలవాడైనందున ఇతడు తన సంపదనొక ధర్మనిధిగా వార్చి దానిపై లభించు వృద్ధిని ప్రతిసంవత్సరము భౌతిక రసాయన వైద్యశాస్త్రములు వికాసమునకు అద్భుత ప్రతిబింబాత్మక వాఙ్మయాభివృద్ధికిని శాంతి సాధన కృషికిని అంతర్జాతీయ ప్రాతిపదికపై ఐదు బహుమతులనిచ్చెడి ఏర్పాటుచేసి స్టాక్‌హోమ్ నగరములో ధర్మకర్తల కప్పగించి వైజ్ఞానిక మానవ వికాసమును కాంక్షించిన విరాగి సుజనుడు ఈతడు.

## వాన్ట్‌హాఫ్ యాకోబస్ హెండ్రికస్ (1852 1911)

ఇతడు డచ్చి భౌతిక రసాయన శాస్త్రవేత్త. 1901లో రసాయన శాస్త్రములో ఇతడు నోబెల్ బహుమానమును గ్రహించినాడు. రసాయన క్రియల వేగమును గురించియు, ద్రావణముల స్వభావమును వివరించు సిద్ధాంతమును గురించియు ద్రావణముల స్వభావమును వివరించు సిద్ధాంతమును గురించియు విద్యుద్విశ్లేషకశక్తిని గురించియు ఇతడు పరిశోధనములుగావించి శాస్త్రవేత్తల ప్రశస్తిని పొందినాడు. అణురచనను గురించి ఇతడు కావించిన పరిశోధనములు అణువుల స్థైర్యమును గురించిన రసాయనిక విజ్ఞానవ్యాప్తికి పునాదియైనవి.

## సర్ విలియమ్ రామ్సే

1896 97 సంవత్సరములలో ఈ శాస్త్రవేత్త గాలినుండి హీలియము ఆర్గాను మొదలైన జడవాయువులను వేరుచేసి అవి ప్రత్యేకముగా ఒకకుటుంబమునకు చెందినవని ఋజువు చేసెను. ఈ కృషిని మెచ్చి 1904లో రసాయన శాస్త్ర పరిశోధనలకై నోబెల్ బహుమానము ఇతనికి ప్రసాదింపబడినది.

## మొయిసాన్, హెన్రీ (1852 1907)

ఇతడొక ఫ్రెంచి రసాయన శాస్త్రజ్ఞుడు. ఫ్లోరినువాయువును తయారుచేసినందుకును ఎలక్ట్రిక్ కొలిమిని రూపొందించినందుకును శాస్త్రవేత్తలు మెచ్చిరి. 1906లో నోబెల్ బహుమానమును పొంది ఇతడు గణనీయుడైనాడు.

## బుక్‌నర్ ఎడ్వర్డ్ (1860 1917)

ఇతడు జర్మను రసాయన శాస్త్రవేత్త. ఆల్కహాలు తయారీలో యీస్ట్ అను ఎంజైము వహించు పాత్రను వివరించి అందుండు జైమేసు యొక్క ప్రత్యేకతను గుర్తించిన ప్రజ్ఞకు 1907లో ఇతడు నోబెల్ బహుమానమును సంపాదించుకొనెను

## గ్రిగ్నార్డు విక్టర్ (1871-1935)

ఇతడు ఫ్రెంచి రాసాయనిక విజ్ఞాని కార్బను యౌగికముల కల్పనలో హాలోజను యౌగికములను ఇతర పదార్థములతో కలిపి వాడువిధానములను తాను రూపొందించిన గ్రిగ్నార్డు యౌగికమును ఉపయోగించి, రకరకముల యౌగికముల రసాయన కల్పనలను సాధించి 1912లో ఇతడు నోబెల్ బహుమతిని మరియొక శాస్త్రవేత్తతో కలిసి పంచుకొనెను

## సెబాషియర్, పాల్ (1854-1941):

అసంతృప్త కార్బను యౌగికములు హైడ్రోజనితో సంయోగించు రసాయన క్రియలను త్వరితము చేసెడి నికెలు వంటి ఉత్తేజకరణులను ఈ విజ్ఞాని కనుగొని వనస్పతి పరిశ్రమకు కారణభూతుడైనాడు 1912లో నోబెల్ బహుమతి యందీతడు భాగమును పంచుకొనినాడు

## ఆల్‌ఫ్రెడ్ వెర్నర్ (1 66-1919)

అణువులలో పరమాణువులు సంధానమగు తీరుతెన్నులను వివరించి అణువుల మరూపతను సమన్వయమొనర్చి ఆ సిద్ధాంత ప్రవచనమునకు 19 8లో నోబెల్ బహుమతిని పొందిన స్విట్జర్లెండు రసాయన శాస్త్రవేత్త ఇతడు

## రిచర్డ్సు థియొడోర్ విలియం (1869-1923)

ఇతడొక అమెరికను రసాయన శాస్త్రవేత్త. పెక్కు మూలద్రవ్యముల పరమాణుభారములను ఉర్వవహించి కచ్చితముగా నిర్ణయించినందుకు 1914 లో ఇతడు నోబెల్ బహుమానమును అందుకొనినాడు

## రిచర్డు విల్ స్టాటర్

ఇతడు కూడ 1915 వ సంవత్సరములో నోబెల్ బహుమానమును స్వీకరించిన విజ్ఞానశాస్త్రవేత్త

## హేబర్ ఫ్రిట్జ్ (1 68-1934)

ఇతడు జర్మను రసాయనశాస్త్రవేత్త 19 8లో నోబెల్ బహుమానమును పొందినాడు నైట్రోజని నైట్రోజని నూటిగా సంయోగమై అమ్మోనియా తయారగుట వసరమైన పరిస్థితులను కనుగొని ఆ పరిశ్రమలో క్రొత్తమలుపుకు సాధించిన దేశభక్తి మహామోన్నతుడీతడు

## ఎర్నెస్ట్ వాల్టర్ (1864 1941)

ఈ శాస్త్రవేత్త జర్మను దేశీయుడు ఉష్ణగతిక ప్రధానుపయోగ పేరున అయొనైజేషను భగోళభౌతిక విజ్ఞానము మొగలైన అంశములలో కృషిచేసిన ప్రజ్ఞాశాలియని పేర్గాంచెను ఉష్ణప్రసరణ రీతిని ఇతడు వివరించి పరమశూన్యతా ఉష్ణోగ్రత ప్రాంతములో పదార్థముల స్వభావమును వివరించి 1920 లో నోబెల్ బహుమానమును పొందినాడు

## ఫ్రెడరిక్ సాడీ (1876 1956)

ఇతడు ఇంగ్లండు రసాయ శాస్త్రవేత్త ఐసోటోపులను గురించిన సిద్ధాంతమును ఇతడు నిర్వచించి 1921లో నోబెల్ బహుమానమును పొందినాడు ఇతని పరిశోధనవలన రేడియో ఆక్టివు మూలద్రవ్యముల రసాయనశాస్త్రవిజ్ఞానము పెంపు వహించి ది

## ఆస్టన్ ఫ్రాన్సిస్ విలియమ్ (1 77 1945)

ఇంగ్లండు దేశీయుడైన ఈ శాస్త్రవేత్త రేడియో ఆక్టివిటిలేని రాసాయనిక మూలద్రవ్యముల ఐసోటోపులను కనుగొని 1922 లో నోబెల్ బహుమతికి అర్హత సంపాదించుకొనినాడు

## ప్రెగల్ ఫ్రిట్జ్ (1 69 1930)

ఇతడు ఆస్ట్రియా రసాయనశాస్త్రవేత్త. కర్బనధర్మ వివరణాత్మక రసాయనశాస్త్రములో ఇతడు కౌశల్యము కలవాడు అత్యల్పపరిమాణములో లభించు పదార్థములను గుర్తించు విధానములను రూపొందించి విశ్లేషణ రసాయనశాస్త్రవిభాగములో నూతన విభాగకల్పనకు భగీరథతుల్యుడై, 1923 లో నోబెల్ బహుమతిని స్వీకరించినాడు

## రిచర్డ్ జిగ్మాండీ (1 65 1929)

ఆస్ట్రియను రసాయన శాస్త్రవేత్తయగు ఇతడు కొల్లాయిడ్ శాస్త్రవిభాగమున ప్రముఖుడు మైక్రోస్కోపును మించు

శక్తిని అల్ట్రామైక్రోస్కోపును నిర్మించి ఇతడు 1925లో నోబెల్ బహుమతిని గ్రహించినాడు

### థియొడోర్ స్వెడ్‌బెర్గ్ (1884 )

ఇతడు స్వీడిష్ రసాయన శాస్త్రవేత్త కొల్లాయిడు కణములను గూర్చియు ప్రొటీను అణువుల లక్షణములను గూర్చియు ఈ శాస్త్రజ్ఞుడు విరివిగా పరిశోధించినాడు. అల్ట్రాసెంట్రిఫ్యూజ్ సాధనమును కనుగొని కొల్లాయిడులను స్వచ్ఛముగా సేకరించుటకు ఇతడు వినియోగించినాడు. 1926లో ఇతడు నోబెల్ బహుమతినందినాడు

### హెన్రిక్ వీలాండ్ (1877 1957

ఇతడు జర్మను రసాయన శాస్త్రవేత్త. పైత్యరస మందను మూత్రాశయరి (gall bladder లోను గలపైత్య రసనంబంధమగు ఆమ్లములను అవణువులను శోధించి 1927లో నోబెల్ బహుమతిని స్వీకరించినవాడితడు

### ఎడాల్ఫ్ వి డీస్ (1 76 1959

ఇతడుకూడ జర్మను రసాయనశాస్త్రవేత్తయే అల్కహాలుల కుటుంబములో చివరనున్న పెద్ద అణువులను గురించియు వాటికి విటమినులతోగల సంబంధమును గురించియు ఇతడు శోధించి గొప్ప విశేషములను కల్పనమొనర్చి 1929లో నోబెల్ బహుమతిని అందుకొన్నాడు

### ఆర్థర్ హార్డెన్ (1 65 1940

ఇతడు ఎన్నో విధములైన ఆంగ్లజీవరసాయన శాస్త్రవేత్త. అల్కహాలు తయారీలో పాల్గొంటున్న జైమేస్ లక్షణములను వివరించి యీస్టులో నుండు ఇతర ఎంజైములను గురించి శోధించి 1929లో ఇతడు నోబెల్ బహుమానములో సగభాగమును సాధించుకొనినాడు

### ఆయిలర్ కెల్పిన్ హాన్స్ ఫోన్ 1 73- )

ఇతడు స్వీడిష్ రసాయనశాస్త్రవేత్త. చక్కెరనుండి అల్కహాలు తయారగుచున్న రీతిని గురించియు, ఎంజైములను గురించియు ఇతడు గావించిన పరిశోధనల ఫలితముగా 1929లో నోబెల్ బహుమతిలో అర్ధభాగమును సాధించుకొన్నాడితడు

### హిమర్ హాన్స్ (1901 1945

జర్మన్ దేశీయుడైన ఈ కార్బనుయోగిక రసాయన శాస్త్రవేత్త వర్ణరహిత ఆకులలో నుండు క్లోరోఫిల్‌ను గూర్చి శోధించి రక్తము వలని హిమోగ్లోబిన్‌లోని హెమిన్ అను అవణాత్మక వర్ణపదార్థములను రసాయనికముగా కల్పన మొనర్చి 1930లో నోబెల్ బహుమతిని బడసెను

### కారల్ బాష్ (1874-1940,

ఈ జర్మను రసాయనశాస్త్రవేత్త హేబరు విధానము ననుసరించి పారిశ్రామికముగా ఉపయోగపడు అమ్మోనియా తయారీని విరివిగా కొనసాగించినందుకు ఫలితముగా 1931లో నోబెల్ బహుమతిలో సగభాగమును సాధింపగల్గెను

### ఫ్రీడ్రిక్ బెర్జియస్ (1884 1949,

ఇతడు కూడ జర్మను రసాయన శాస్త్రవేత్తయే రాతిని బొగ్గును డీసెల్ పెట్రోలియము వంటి ఇంధనములను కర్రనుండి చక్కెరను తయారుచేసె, ఇతడు 1931 లో నోబెల్ బహుమతిలో అర్ధభాగమును గ్రహించెను

### ఇర్వింగ్ లాంగ్‌మ్యూర్ (1881 1957)

ఇతడు అమెరికా రసాయనశాస్త్రజ్ఞుడు. ఈయన రేడియో వాక్యూమ్ వాల్వ్‌ను తీర్చిదిద్దెను. లోహములను ఉక్కును కరగించి అతుకుటకై హైడ్రొజని పరమాణు చెలకల విధానమును ఇతడు కనుగొనెను. అణువుల ఉపరితల స్వభావ జన్యమైన రసాయన లక్షణములను గూర్చి చేసిన పరిశోధనల ఫలితముగా 1932లో ఇతడు నోబెల్ బహుమతినందెను. ఆ పరిశోధనలు రోగనిరోధక విధానములలో ఉపయోగపడు చున్నవి. మేఘమండలము వర్షించు విధానమును మంచు కురియు విధానమును ప్రోత్సహించు శాస్త్రకలాపమును ఇతడు సూచించినాడు

### హెరాల్డ్ క్లేటన్ యూరే (1 93- )

ఇతడు అమెరికను రసాయనశాస్త్రవేత్త 1934లో నోబెల్ బహుమానమునందుకొన్నవాడు. డ్యూటీరియము అనబడు భారవంతమైన హైడ్రొజనిని ఇతడు విడిగా తయారు చేసెను. అటమ్‌బాంబును రూపొందించుటయందును యురేనియము ఐసోటోపులను వేరుచేయుటయందును భారవంతమైన జలమును కల్పనమొనర్చు విషయమునను ఇతడు కృషి సల్పెను

**డెబీ పీటర్ జోసెఫ్ (1884 )**

ఈ డచ్ హాలెండులో జన్మించిన అమెరికను భౌతికశాస్త్రవేత్త అణువును గూర్చి చేసిన పరిశోధనలకై 1936 లో ఇతడు నోబెల్ బహుమతిని సంపాదించినాడు. బలోపేతమైన ఎలెక్ట్రోలైట్లను గురించి ఈతడు ప్రతిపాదించిన సిద్ధాంతము శాస్త్రవేత్తల ఆమోదమును పొందకున్నను సవరణలతో అది స్వీకరించబడినది.

**హోవర్త్ వాల్టర్ నార్మన్ (1883-1950)**

ఈ బ్రిటిష్ జీవరసాయన శాస్త్రవేత్త కార్బోహైడ్రేట్లను గురించియు విటమినులను గురించియు కావించిన పరిశోధనలకు 1937లో నోబెల్ బహుమతిని పాల్ కారర్ అనువానితో కలిసి పంచుకొనెను. 1938లో నోబెల్ బహుమతి ప్రదానము జరుగలేదు.

**ఎడాల్ఫ్ బ్యూటునాంట్ (1903- )**

ఈ జర్మను జీవరసాయన శాస్త్రవేత్త స్త్రీలింగ సూచకమైన ప్రొజెస్టిన్ అను హార్మోను రచనను నిర్ణయించినాడు. ఆండ్రోస్టెరోన్ అను పుంలింగ సూచకమైన మరియొక హార్మోనును తయారు చేసెను. జర్మను నాజీ రాజకీయముల ఒత్తిడిచే 1939లో ఇతడు నోబెల్ బహుమతిని స్వీకరించుటకు నిరాకరించెను.

**రుజికా లియోపోల్డ్ (1887- )**

ఈ స్విట్జర్లెండు రసాయన శాస్త్రవేత్త స్టెరోల్ అను రసాయన పదార్థములనుండి ఆండ్రోస్టిరోన్ టెస్టాస్టెరోన్ అను హార్మోనులను రాసాయనికముగా కల్పించి బ్యూటునాంట్ అను శాస్త్రవేత్తతో కలిసి 1939లో నోబెల్ బహుమతిని సంపాదించెను.

1940 1941 1942లలో నోబెల్ బహుమతి ప్రదానము జరుగలేదు.

**విర్టానెన్ అర్ట్యూరి ఇల్మారి (1895 )**

ఈ ఫిన్లెండు జీవరసాయన శాస్త్రవేత్త మొక్కలు నైట్రోజనిని వినియోగించుకొను విధానమును విపులముగా వివరించి 1945లో నోబెల్ బహుమతిని అందుకొనెను.

**ఓటోహాన్ (1879 )**

ఈ జర్మను భౌతిక రసాయన శాస్త్రవిజ్ఞాని యురేనియము అణుభేదనమును 1939లో సాధించి, గొలుసు కట్టుగా ఉత్తరోత్తరాభివృద్ధి కరముగ సాగు న్యూక్లియర్ క్రియను కనుగొన్నాడు. ఈ పరిశోధనలే పరమాణు బాంబును సాధ్యమొనరించినవి. ఈ శాస్త్రజ్ఞునకు 1944లో నోబెల్ బహుమతి ప్రదానమొనర్పబడినది.

**హెవెసీ జార్జి డి (1885- )**

హంగరీ దేశములో పుట్టిన ఈ స్వీడను శాస్త్రవేత్త రాసాయనిక జీవ క్రియలననుసరించి పరిశీలించుటకు రేడియో ఆక్టివ్ ఐసోటోపులు ట్రేసరు ద్రవ్యములుగా ఉపయోగపడునని కనుగొని 1943లో నోబెల్ బహుమతిని సంపాదించెను.

**జేమ్స్ బాచెలర్ సమ్నర్ (1887-1955)**

ఈ అమెరికను జీవరసాయన శాస్త్రవేత్త మొదటిసారిగా క్రిస్టలరచనా విన్యాసముగల ఎంజైమునొకదానిని స్ఫటికీకరించి కీర్తియు 1946లో మరి ఇద్దరితో కలిసి సాధించుకొనిన నోబెల్ బహుమానమును ఇతనికి దక్కినవి.

**జాన్ హోవార్డ్ నార్త్రాప్ (1891- )**

ఈ అమెరికను జీవరసాయన శాస్త్రవేత్త ఎంజైములను గురించియు వైరసులను గురించియు పరిశోధించి 1946లో నోబెల్ బహుమతిలో మూడవ వాటాను సంపాదింపగల్గెను.

**వెండెల్ మెరిడిత్ స్టాన్లీ (1904- )**

ఈ అమెరికను జీవరసాయన శాస్త్రవేత్త కొన్ని వైరసులను స్ఫటికాకృతిలో కనుగొని సాధించిన ప్రయోగములకు 1946లో నోబెల్ బహుమతిలో మూడవ వాటాను పొందినవాడు.

**విలియమ్ ఫ్రాన్సిస్ జియాక్ (1895 )**

ఈ అమెరికను రసాయన శాస్త్రవేత్త 1949లో నోబెల్ బహుమతిని పొందెను. ఆక్సిజనియొక్క రెండు ఐసోటోపులను కనుగొని ఆత్యంతిక శీతలస్థితిలో ఉన్నపదార్థముల గుణశోధ చేసి వాసికెక్కినవాడితడు.

**టిసేలియస్ ఆర్నే (1902- )**

ఈ స్వీడిష్ జీవరసాయన శాస్త్రవేత్త కొల్లాయిడు కణముల రూపమునందున్న పదార్థములను వేరుచేయుటకును గుర్తించుటకును క్రొత్త విధానమును రూపొందించి 1948లో నోబెల్ బహుమతిని గ్రహించెను.

### రాబర్టు రాబిన్సన్ (1886-    )

ఈ ఇంగ్లీషు జీవరసాయన శాస్త్రజ్ఞుడు "సర్" బిరుదమును పొందినవాడు. హార్మోనులను మొక్కల నుండి లభించు రంగులను సహజమైన పదార్థములనుండి రాసాయనికముగా తయారుచేసి ఖ్యాతిని పొందుటద్వారా 1947లో నోబెల్ బహుమతిని సంపాదించినాడు. ఇతడు ద్రోణాచార్యునివలె శిష్య పరంపరగలవాడు.

### ఆటో పాల్ హెర్మన్ డీల్స్ (1876-1954)

ఈ జర్మను రసాయన శాస్త్రవేత్త 1950లో నోబెల్ బహుమానమును కర్ట్ఆల్డర్ అను జర్మను రసాయన శాస్త్రజ్ఞునితో కలిసి పంచుకొనెను. వీరిరువురు కలిసి సేంద్రియ యౌగికముల కల్పనను సులభతరమొనర్చిన ప్రముఖ రసాయన క్రియలను రూపొందించిరి.

### గ్లెన్ థియొడోర్ సీబోర్గ్ (1912-    )

యురేనియముకంటె పరమాణు సంఖ్యలో మిన్నయైన రాసాయనిక మూలద్రవ్యములనెన్నింటినో న్యూక్లియ రసాయన క్రియా ఫలితములుగా సృష్టించిన అమెరికను భౌతిక విజ్ఞాన రసాయన శాస్త్రవేత్త ఇతడు. 1951లో ఇతడు నోబెల్ బహుమతిని గ్రహించినవాడు.

### లైనస్ పాలింగ్ (1901-    )

ఈ అమెరికను రసాయన శాస్త్రజ్ఞుడు క్లిష్టమైన ప్రోటీను అణునిర్మాణ పరిశోధనలను నిర్వహించి విజయము సాధించుటచే 1954లో నోబెల్ బహుమతిని సంపాదించెను.

### హెర్మన్ స్టాడింగర్ (1881-    )

ఈ జర్మను రసాయన శాస్త్రవేత్త పెద్ద పెద్ద కార్బను యౌగికాణువుల నిర్మాణమును గురించి కావించిన పరిశోధనల ఫలితముగా 1953లో నోబెల్ బహుమతిని సంపాదించెను.

### రిచర్డ్ లారెన్స్ మిల్లింగ్టన్ సింగె (1914-    )

ఈ బ్రిటిష్ జీవరసాయన శాస్త్రవేత్త రసాయన యౌగికములను వేరుచేయుటకు ఈనాడు అత్యంత ఉపయోగకరముగా ఉన్న క్రోమాటోగ్రాఫీ విధానమును కనుగొని 1952లో నోబెల్ బహుమతిని మరియొకనితో కలిసి పంచుకొనెను.

### అలెగ్జాండర్ రాబర్ట్సు టాడ్ (1907-    )

సర్ బిరుదాంకితుడైన ఈ బ్రిటిష్ జీవరసాయన శాస్త్రవేత్త న్యూక్లియక్ ఆసిడులను గురించి చేసిన పరిశోధనలకై 1957లో నోబెల్ బహుమతిని బడసెను.

### సిరిల్ నార్మన్ హిన్‌షెల్‌వుడ్ (1897-    )

ఈ బ్రిటిష్ భౌతిక విజ్ఞాన శాస్త్రవేత్త వాయు పదార్థములలో జరుగు పరస్పర రసాయన క్రియలను శోధించి నికొలాయ్ నికొలాయెవిచ్ సెమనోవ్ అను రష్యను శాస్త్రవేత్తతో పాటు 1956లో నోబెల్ బహుమతిని పంచుకొనెను.

### విల్లార్డ్ ఎఫ్ లిబ్బి (1908-    )

ఇతడు 1960లో రసాయన శాస్త్ర పరిశోధన జరిపినందుకై నోబెల్ బహుమతిని అందుకొనెను. ఘన ద్రవ వాయు పదార్థముల కంటె కఠినమైన తురీయస్థితిలో విపరీతమైన శక్తిని దియందున్న పదార్థముండునని ఈయన సూచించెను. విపరీతమైన రెండు ప్రేలుడు పదార్థముల మధ్య కొంత గ్రాఫైటునుమస్సి ఆరెండింటిని ఒకేసారి ప్రేలునట్లు చేసినప్పుడు చిన్న చిన్న వజ్రము లేర్పడునని ప్రయోగ పూర్వకముగా చూపి పది కోట్ల కార్బను పరమాణువులు గల వజ్రపు అణువు సెకనులో వెయ్యవవంతు కాలావధిలో ఏర్పాడుట మరియొక విధముగా వివరింప సాధ్యము కాదనియు ఈ విషయమై ఇంకను పరిశోధనలు జరుగవలెయున్నవనియు ఈ శాస్త్రవేత్త సూచించెను.

### హెయిరోవ్‌స్కీయారోస్లావ్ (1890-    )

ఈ చెకొస్లోవేకియా రసాయన శాస్త్రవేత్త 1922లో ఎలెక్ట్రో రసాయన విశ్లేషణ విధానములను కనుగొని నందుకై 1959లో నోబెల్ బహుమానమును బడసెను.

### ఫ్రెడెరిక్ సాంగర్ (1918-    )

బ్రిటిష్ జీవరసాయన శాస్త్రజ్ఞుడైన ఈతడు ప్రోటీనుల అణురచనలను గురించి పరిశోధించి ఇన్సులిన్‌లోని ఎమినో ఆసిడులను కాటి అణు ప్రమాణములను నిర్ణయించినందుకై 1958లో నోబెల్ బహుమతిని సంపాదించెను.

### మెల్విన్ కాల్విన్ (1911-    )

ఈ అమెరికను రసాయన శాస్త్రవేత్త, మొక్కలు కార్బను డయాక్సైడును గ్రహించుకొనుటకై వినియోగించు

గొన్న రసాయన క్రియలను రుజువుచేసినందుకు 1961లో నోబెల్ బహుమతిని పొందెను

జాన్ కౌడరీ కెండ్రూ (1917- )

ఈ బ్రిటిష్ రసాయన శాస్త్రవేత్త మానవదేహములో ఆక్సిజనిని కండరములకు సరఫరాచేయు మయోగ్లోబిన్ అను ప్రొటీను అణునిర్మాణమును నిశ్చయించి 1962 లో నోబెల్ బహుమానములో సగభాగమును సాధింపగల్గెను

మాక్స్ ఫెర్డినాండ్ పెరుట్జ్ (1914 )

ఆస్ట్రియాలో జన్మించిన ఈ బ్రిటిష్ జీవరసాయన శాస్త్రవేత్త రక్తములో ఆక్సిజనివాహకముగా పనిచేయు హిమోగ్లోబినును కండరములకు ఆక్సిజనిని సరఫరాచేయు మయోగ్లోబిన్ అణు నిర్మాణమును వివరించి 1962 లో నోబెలు బహుమతియందు సగభాగమును సంపాదించినాడు

గియూలియోనాటా (1903 )

ఈ ఇటాలియను రసాయనశాస్త్రవేత్త బహుఅణురూపములు (Polymers) గల ప్లాస్టిక్ పదార్థములను రాసాయనికముగా కల్పించుటయందును వాటి రాసాయనిక రచనమును వెల్లడించుటయందును చేసిన కృషికై కారల్ జీగ్లర్ అను జర్మను రసాయనశాస్త్రవేత్తతో కలిసి ఉమ్మడిగా 1963 లో నోబెల్ బహుమానమును పొందెను

డొరోతీ క్రోఫుట్ హాడ్జ్‌కిన్ (1910- )

1964 లో విటమిన్ బి 12 యొక్క అణురచనా విన్యాసమును X కిరణసాధనమును వివరించినందుకై నోబెల్ బహుమతిని అందుకొన్న బ్రిటిష్ వ్యాపిక రాసాయనిక శాస్త్రవేత్త ఈమె

వుడ్‌వర్డ్ రాబర్టుబర్న్స్ (1917- )

రసాయనశాస్త్ర పరిశోధనా ఫలితముగా ఈ బ్రిటిష్ శాస్త్రవేత్త 1965లో నోబెల్ బహుమానమును గెల్చుకొనెను

మాన్‌ఫ్రెడ్ ఐగెన్ (1927- )

1967 లో రసాయన శాస్త్రమున కీయబడిన నోబెల్ బహుమతిని మరి ఇద్దరితో కలిసి అందుకొన్న జర్మను శాస్త్రవేత్త ఇతడు ఈ ముగ్గురి పరిశోధనములు అతివేగముగా సాగెడి రసాయనక్రియలకు సంబంధించినవి వీటిలో జరుగుచున్న వారి మధ్య పరస్పర సాంకేతిక సంభాషణలకును ముమ్మరము ఎలెక్ట్రిక్ కారును నడిపించుటకు అవసరమైన బ్యాటరీల నిర్మాణమునకును ఈ పరిశోధనలు తోడ్పడును

నోరిష్ రొనాల్డ్ (1907- )

ఈ బ్రిటిష్ జ్ఞాని జార్జి పోర్టర్ మరియిద్దరితో కలిసి 1967 లో రసాయనశాస్త్ర పరిశోధనమునందు నోబెల్ బహుమతిలో భాగస్వామ్యము సంపాదించుకొనెను

జార్జిపోర్టర్ (1920- )

ఈ బ్రిటిష్ విజ్ఞానవేత్త మరి యిద్దరితో కలిసి 1967 లో రసాయనశాస్త్ర పరిశోధనమునకై నోబెల్ బహుమానమును పొందినవాడు

శేషాద్రి తిరువెంకట రాజేంద్ర (1900- )

ఆచార్యశేషాద్రి డాక్టర్ బి బి డే వద్ద మద్రాసులోను, తర్వాత నోబెల్ బహుమతును గ్రహించిన ప్రొఫెసర్ రాబర్టు రాబిన్సన్ ఫ్రిట్జ్ ప్రెగెల్ అను శాస్త్రవేత్తల సమక్షమునను, రసాయనశాస్త్ర పరిశోధనా విధానములను అందలి మెళకువలను సమగ్రముగా తెలిసికొనెను 1939-49 లలో ఆంధ్ర విశ్వవిద్యాలయమునందును తర్వాత కొంతకాలము ఢిల్లీ విశ్వవిద్యాలయమునందును రసాయనశాస్త్ర విభాగమున అధిపతియై లెక్కకుమించిన శిష్యులను తీర్చిదిద్దెను, మరెందరికో చేటతెల్లమగు రీతిని అతిగహనమైన శాస్త్ర విషయములను గూడ రసవత్తావ్యధోరణిలో ఉపన్యసించి వారిని రసాయనశాస్త్ర జిజ్ఞాసువులనొనర్చెను అంతేకాక ఇతడు సుప్రసిద్ధ పరిశోధకుడని పేరందె బ్రిటిష్ రాయల్ సొసైటీలో ఫెలోగా ఎన్నికయ్యెనట్టి శాస్త్రవేత్త ఇతనికి భారత ప్రభుత్వము 1969 లో పద్మభూషణ బిరుదమునిచ్చి గౌరవించినది

హెల్మాంట్ జాన్ బాప్టిస్టాయాన్ (1577-1644)

ఈ ఫ్లెమిష్ శాస్త్రవేత్త కార్బనుడయాక్సైడును ప్రథమముగా గుర్తించి గాలికంటె భిన్నమైన వాయుపదార్థములున్నవని విశదీకరించి 'గాస్' అను జాతివాచకపదమును కల్పించి వాడుకలోనికి తెచ్చెను

ఫోర్ క్రాయ్ ఆంటోయిన్, ఫ్రాంకాయ్ కౌంట్-డి (1755-1809)

ఈ ఫ్రెంచి రసాయన శాస్త్రవేత్త వ్యవసాయిక ఖర్మము

లైన రాసాయనిక యౌగికవిజ్ఞానము అభివృద్ధిపొందుటకు వాడు అంతేకాక రాసాయనిక శాస్త్రపరిభాషను రూపొందించుటలో తోడ్పడెను

## గేలూసాక్ జోసెఫ్‌లూయీ (177° 1°50)

ఈయన ఒక ఫ్రెంచి రసాయన భౌతికశాస్త్రవేత్త సయనొజెన్ అను విషవాయువును కనుగొన్నవాడు పారిశ్రామిక రసాయన శాస్త్రపు మెలకువలను అవిష్కరించి బోరాన్ అను రసాయన మూలద్రవ్యసాధనలో పాల్గొనెను సారాయిలో ఉండు ఆల్కహాలు ప్రమాణమును నిర్ణయించుటకై ఆల్కహాల్‌మాని' అను హైడ్రోమీటరను ఇతడు రూపొందించెను వాయుద్రవ్యములను గురించి ఛార్లెస్ కనుగొన్న నియమమును ఈతడు గూడ స్వతంత్రముగ పరిశీలించి నిర్వచించినవాడు ఒకే ఉష్ణపీడన స్థితులలో ఉన్న వాయు పదార్థములు రాసాయనికముగా సంయోగమై తత్ఫలితముగా వాయుపదార్థములేర్పడనపుడు వాటి ఆయతనములు సరళాంకముల నిష్పత్తిలో నుండునని ముఖ్యనియమమును ఇతడు కనుగొనెను అది 'గేలూసాక్ నియమము' అని ప్రఖ్యాతిచెందిన రసాయన శాస్త్రపరిశీలకమైనది

## అవోగాడ్రో ఎమిడియో (1776 1 56)

ఈ ఇటాలియను భౌతికశాస్త్రవేత్త "అవోగాడ్రో నియమము"ను సూచించి రసాయనశాస్త్ర ప్రగతికి తోడ్పడెను అణు పరమాణు భేదమును వివరించి డాల్టను శాస్త్రవేత్త నిర్వచించిన పరమాణువాదమును సవరించి పరిపుష్టమొనర్చెను (చూ రాసాయని శాస్త్రము - సిద్ధాంత భాగము)

## గుడ్‌ఇయర్ ఛార్లెస్ (1800 1 60)

రబ్బరుటైర్ల సృష్టికి కారణమైన వల్కనైజేషను విధానమును కనిపెట్టిన శాస్త్రవేత్త ఇతడు 1839 లో ఇతడు విజ్ఞానశాస్త్ర ప్రయోగములు చేయుచు అనుకోనకుండా వేడిగానున్న ఇనుప పొయ్యిమీద రబ్బరను పడవేయుటయు, అక్కడి గంధకముతో అది కలిసి గట్టిపడుటయు సంభవించెను అది చల్లారిన తర్వాత కూడ మెతుకెక్కినదగుటలేదు అందుచేత అరుగుదల తక్కువై దృఢమైన రబ్బరు టైర్ల సృష్టిసాధ్యమగుట మూలముగా మోటారుకారుల పరిశ్రమ అభివృద్ధియయ్యెను ఈ ముఖ్యవిధానమును కనుగొన్న గుడ్‌ఇయర్ అత్యధికవ్యాధితో తుదకు మరణించెను కాని అతని కృషి కోట్లకొలది పెట్టుబడిగల పరిశ్రమకు కారణమైనది

## థామస్ గ్రాహమ్ (1 05 1°69)

ఈ స్కాటిష్ శాస్త్రవేత్త వాయుపదార్థములు ప్రసారమగు వేగము వాటి సాంద్రతననుసరించియుండుననియు సాంద్రత హెచ్చయిన వాటిలో అది తగ్గుననియు తక్కువైన వాటిలో అది హెచ్చుగనుండుననియు కనుగొనెను వాయు ప్రసారవేగము దాని సాంద్రత వ్యుత్క్రమాంకపు (reciprocal) నిష్పత్తిలో నుండును నియమమును రూఢమొనర్చినందున దానితో ఈతని పేరును జోడించి 'గ్రాహమ్ నియమము' అని పేర్కొనుచున్నారు స్ఫటికాకృతిలో లభించు పదార్థముల ద్రావణములను కొల్లాయిడుల నుండి వేరుచేయుట కుపయోగించెడి డయాలిసిస్ విధానమును కనుగొని కొల్లాయిడ్ విజ్ఞానమునకు ఇతడు పునాదివేసెను

## బెస్సిమర్ హెన్రీ (1813 9)

ఈ ఆంగ్ల పారిశ్రామిక వేత్త సర్ బిరుదాంకితుడు పోతఇనుము నుండి ఉక్కును తయారుచేయు విధానమును కనుగొని బెస్సిమర్ కన్వర్టర్ అను సాధనమును నిర్మించి షెఫీల్డ్ నగరములో ఉక్కు పరిశ్రమను స్థాపించెను

## ఫ్రాంక్లండ్ సర్ ఎడ్వర్డు (1 25 1 99)

ఈ ఆంగ్ల రసాయ శాస్త్రవేత్త రాసాయనిక యోజనీయతను గురించిన సిద్ధాంతమును ప్రతిపాదించి హీలియమును కనుగొనెను జ్వాలను గురించియు దాని కాంతిని గురించియు వాయుపదార్థములను గురించియు ఇతడు పరిశోధించెను

## స్టానిస్లోకానిజరో (1 26 1910

ఇతడొక ఇటాలియను రసాయన శాస్త్రవేత్త ఆల్డిహైడులనుండి ఆల్కహాలులను తయారుచేయు విధానమును, సయనమైడు యౌగికములను కనుగొన్న శాస్త్రజ్ఞుడీయన అణుభారములను పరమాణుభారములను వివరించి కచ్చితముగా పరమాణుభారముల నిర్ణయమొనర్చెడి విధానమును చర్చించి ఇతడు రూపొందించెను అవోగాడ్రో నియమము యొక్క ప్రాధాన్యమును గుర్తించి దానివిలువను యితర శాస్త్రజ్ఞులకు నచ్చచెప్పి రసాయనశాస్త్రపురోగతికి రహదారినేర్పరచిన ప్రజ్ఞాశాలి ఇతడు

సర్ విలియమ్ క్రుక్స్ (1832 1919)

ఈ ఆంగ్ల భౌతికరసాయన శాస్త్రజ్ఞుడు థాలియమ్ అను రసాయన మూల ద్రవ్యమును కనుగొని సెలీనియము ఆ ద్యుతిమృత్తికల రేడియో ఆక్టివిటీ గురించి శోధించినాడు అత్యల్ప పీడనస్థితిలో ఉన్న వాయు పదార్థములందు విద్యుత్ప్రవాహ మొసర్చి ఎలక్ట్రాన్ల ప్రోటా నుల ఉనికిని పరమాణు రచనావిన్యాసమును తరువాతి పరి శోధకులు గ్రహించుటకవకాశము కల్పించి ఇతడెన్నియో వైజ్ఞానిక ప్రయోగముల నొనర్చెను

జాన్ వెస్లీహాయట్ (1837 1920)

ఇంగ్లీష్ అమెరికను వైజ్ఞానిక కల్పనాచతురుడు సెల్యులోజు నైట్రేటును కర్పూరముతో యోగించుట ద్వారా సెల్యులాయిడు అను క్రొత్త పదార్థమును 1869లో కల్పన మొనర్చినవాడితడు ఇది జగత్తునకే మొదటిదైన రాసాయనికముగా కల్పనమైన ప్లాస్టిక్ పదార్థముగా ఇటీవల కల్పితమైన రకరకముల ప్లాస్టిక్‌లకు మూలకందమనవచ్చును ఇతడు పదార్థములు వడపోయుటకు అనుకూలమైన సాధ నమునుగూడ నిర్మించెను

గిబ్స్ జోసయావిల్లార్డ్ (1 39 1903)

ఈ అమెరికను గణిత భౌతిక శాస్త్రవేత్త ఉష్ణశక్తి చలన శాస్త్ర విషయములలో ముఖ్యమైన పెక్కు పరిశోధన లను జరిపెను వివిధ ద్రవ్యములయొక్క వేర్వేరు రూపము లను గూర్చియు వాటి సహావాస పరిస్థితులకు సంబంధించిన నియమములను గూర్చియు పరిశోధించి వాటిని తీర్చిదిద్ది పరి శ్రమల కెంతయో సౌకర్యమును కలిగించిన ప్రజ్ఞాశాలి ఇతడు

హాల్ శాక్ స్టీఫాఫెన్ బాల్టన్ (1848 1931)

ఈ అమెరికను వ్యావసాయిక రసాయన శాస్త్రవేత్త పాలలోనుండు క్రొవ్వుపదార్థమును నిర్ణయించు పరీక్షా విధానమును 1890లో రూపొందించి విఖ్యాతి నొందెను నాటి నుండి పాలపంపకాల పరిశ్రమకు స్థిరమైన స్థాయి లభించెను పాలకల్తీని కనుగొనుటకీనాడు ఆ పరీక్షా విధానము ఉప యోగపడుచున్నది

హాల్ చార్లెస్ మార్టిన్ (1863 1914)

ఈ అమెరికను రసాయన శాస్త్రవేత్త పారిశ్రామిక ముగా అల్యూమినియమును దాతుఖనిజము నుండి అల్యూమి నియము కంపెనీని అమెరికాలో స్థాపించి పారిశ్రామిక వేత్తగా గూడ పేర్గాంచెను

కార్వర్ జార్జివాషింగ్టన్ (1864 1943)

అమెరికను నీగ్రో జాతి చెందిన ఈ వ్యావసాయిక రసాయన శాస్త్రజ్ఞుడు దక్షిణ రాష్ట్రముల అభివృద్ధికై పాటుపడినవాడు భూసార పరిరక్షణకు పంటల వైవిధ్యము అవసరమని ఇతడు నిరూపించెను వేరుసెనగ చిలగడదుంప సోయాబీను వంటి మొక్కలైన వాటినుండి లభించు చెత్తలకు పెక్కు క్రొత్త ఉపయోగములను కనిపెట్టినవాడితడు వ్యవ సాయ క్షేత్రమీద ఆధారపడు రాసాయనిక కల్పనకు మార్గ దర్శకుడని దగిన శాస్త్రజ్ఞుడితడు

విలియమ్స్ రాబర్ట్ (1886 )

ఈ అమెరికను రసాయన శాస్త్రవేత్త విటమిన్ బి అను పేర ప్రఖ్యాతినందిన థయమిన్‌ను తవుడునుండి వేరుచేయించి తర్వాత దానిని రాసాయనికముగా కల్పించిన ప్రతిభావంతు డీయన ఇతడు ఆమొక్క రాసాయనిక అంశములను గురించి గూడ ఇతడు కృషి చేసెను

బిమో హెన్రిక్ బేక్‌లెండ్ (1863 1944)

ఇతడు పారిశ్రామిక రసాయన శాస్త్రవేత్త ఫినోలు ఫార్మాల్డిహైడ్ అనెడి కార్బను యోగిక పదార్థ ములను వేడిచేయుచు ఒత్తిడిని హెచ్చించి తేనెరంగులో ప్లాస్టిక్ పదార్థమును సృష్టించిన నేర్పరి ఇతడు బేకలైట్ అను పేరుతో ఇది ఎన్నియో ప్లాస్టిక్ పదార్థముల కల్పనకు మూలకందమైనది

ముల్లికన్ రాబర్టు సాండర్సన్ (1 96 )

ఈ అమెరికను భౌతిక రసాయన శాస్త్రవేత్త చికాగో విశ్వవిద్యాలయమునందాచార్యుడుగా నుండి 1966లో రసా యన శాస్త్రమునందు నోబెల్ బహుమానమును గ్రహించెను

లాన్స్ ఆన్ సేగర్

నార్వేలో జన్మించిన ఈ అమెరికను రసాయన శాస్త్రజ్ఞుడే సంవత్సరములో పుట్టెనో తెలియదు ఈతని

పేరుతో ముడిపడి వ్యాప్తినందిన ఎకదిశ్రప్రచలిత రసాయన క్రియలలో వ్యక్తమగు పరస్పర సంబంధములను గురించియు అంతకు పూర్వము ఎలెక్ట్రొలైటులను గురించియు చేసిన పరిశోధనలమూలముగా సాధించిన ఫలితములకై 1909లో ఇతనికి నోబెల్ బహుమతి గౌరవము లభించెను

## డెరెక్, హెచ్ ఆర్ బార్టన్

ఇతని జన్మదినముకూడ సరిగా తెలియదు లండన్ నగరమునందలి ఇంపీరియల్ కాలేజి ఆఫ్ సైన్సు అనుసంస్థలో ఇతడొక రసాయన శాస్త్రాచార్యుడు ఆడ్ హేసల్ అనునతడుకూడ ఆస్లో (నార్వేదేశము) విశ్వవిద్యాలయమునందొక ఆచార్యుడు ఈ ఇరువురు శాస్త్రవేత్తలు రసాయన శాస్త్రములో అణువుల యొక్క వాటిరచన యొక్క స్థిరత్వముకు నిశ్చయమును గురించి కావించిన పరిశోధనమునకును వాటిని అనుసరించి చేసిన కృషికిని 1969లో రసాయన శాస్త్రమున ఏర్పడిన నోబెల్ బహుమానమును అందుకొన్నారు వీరి పరిశోధనముల మూలముగా సైక్లో హెక్సేను ఆల్కలాయిడులు, కార్బొహైడ్రేటులు స్టెరాయిడ్‌లు మొదలైన వాటి అణురచనా విన్యాసములు నిర్దుష్టములైనవి

## లూయీ ఎఫ్ లెలాయిర్

అర్జెంటినా రాజధానియైన బ్యూనాఎయిర్స్ యందలి ప్రఖ్యాతరసాయన శాస్త్రవేత్త ఇతడు పారిస్ నగర మీతని జన్మస్థానము శర్కరయుక్తమైన న్యూక్లియోటైడులను కనుగొని వాటిని కార్బొహైడ్రేటులను జీవరసాయన క్రియమూలముగా కల్పన మొనర్చుటలో గల ప్రముఖమైన పాత్రను ఇతడు వివరించినాడు ఈ పరిశోధనల ప్రాశస్త్యమును వైజ్ఞానిక లోకము గుర్తించినందున 1970లో రసాయన శాస్త్ర పరిశోధనలకేర్పాటైన నోబెలు బహుమతి (అరులక్షల రూప్యములు) ఇతనికి లభించినది

హ ల

# వైజ్ఞానిక శాస్త్రవేత్తలు (వైద్యశాస్త్రము),

## గాలెన్ క్రీశ (130 200)

ఇతడు గ్రీసుదేశమునకు చెందిన వైద్యుడు తన కాలములో అపారముగా వ్యాప్తి నొందు వైద్యవిజ్ఞానమును శాస్త్రబద్ధముగా ఇతడు తీర్చిదిద్దినాడు 16వ శతాబ్ది వరకు ఈయన భావములు ప్రభావవంతముగ నుండెడివి సుమారు 83 వైద్య రచనలు చేసిన ప్రతిభాశాలి ఇతడు వైద్యయోగికములను 'గేలెనికల్స్' అని ఇతని పేరుతో జోడించి పరిగణించుట ఇప్పటికిని కొన్ని సందర్భములలో జరుగుచున్నది

## వెసేలియస్, ఆంద్రే (1514 1564)

ఇతడొక ఫ్లెమిష్ శాస్త్రవేత్త। దేహనిర్మాణ శాస్త్రజ్ఞుడు గాలెన్ సిద్ధాంతములనెన్నిటినో పూర్వపరీక్ష మొనరించిన ప్రయోగశీలుడితడు ఇతడు పాడ్వావిశ్వవిద్యాలయమునందాచార్య పదవినలంకరించి 1543లో మానవ దేహనిర్మాణ వివరములను శస్త్రసాధనముల సహాయమున గ్రహించి చిత్రముల ద్వారా గ్రంథరూపమున సమీకరించి ఆధునిక విజ్ఞానసంపదకు మూలధనముగా అందించెను

## అంటోనీ వాన్ లీవన్‌హూక్ (1632 1723)

ఇతడు హాలెండు దేశపు శాస్త్రవేత్త శక్తివంతమైన కటకములను మైక్రోస్కోపు (సూక్ష్మదర్శిని) లను తయారుచేసి సూక్ష్మజీవులను ప్రోటోజోవాలను పరిశీలించిన ప్రథమ శాస్త్రజ్ఞుడీయన రక్తమును పరిశీలించి ఎర్రకణములను వివరముగా వర్ణించిన మొదటి పరిశోధకుడితడు సూక్ష్మక్రిమి శాస్త్రవేత్తలలో ప్రథముడు

## లాజారో స్పాలాంజని (1729 1799)

ఇతడొక ఇటాలియను శాస్త్రవేత్త జీవరాసులు తమంతటతాము సృష్టియగుటగాని ప్రతి జీవిని భగవంతుడు లేక, జీవశక్తిని ప్రత్యేకముగా సృష్టించుటగాని సంభవింపదనియు, అవి అన్యోన్యసంబంధమే వాటి అభివృద్ధికి కారణమనియు ప్రయోగాత్మకముగా రుజువుచేసిన శాస్త్రవేత్త ఇతడు ఒక సూక్ష్మజీవి పరిశీలగా రెండై మరల నాలుగై క్రమముగా ఎట్లు అసంఖ్యాకములుగా వృద్ధియగుచున్నవో పరిశీలించిన ప్రతిభాశాలి ఇతడు పావియా విశ్వవిద్యాలయములో ఈ విద్యావేత్త ఆచార్యుడుగా కృషిచేసి విద్యార్థుల ఆదరాభిమానములను చూరగొనగలిగెను మూత్రకోశవ్యాధి వలన బాధపడి వట నావవు మెరుపు దెబ్బతిని ఏరుకొని కావ్యగానమొనర్చుచు తన మూత్రకోశమును పరిశీలించినచో మూత్రకోశ రోగములకు సంబంధించు క్రొత్తవిషయములు అవగతము కావచ్చునని తన మరణానంతరము అట్లు చేయుమనియు శిష్యులకాదేశమిచ్చిన విజ్ఞానశీలి ఇతడు

రాబర్ట్ హుక్ (1635- 1703)

ఇతడొక ఆంగ్ల శాస్త్రవేత్త. గ్రహముల సంచారము చలన శాస్త్ర విషయమని మొదటిసారిగా సూచించిన విజ్ఞాని. ఈయన ద్రష్ట ఇతడు. ఈ సూచనయే తర్వాత న్యూటన్ గావించిన పరిశోధనలకు దారిచూపినది. ఖగోళపరిశోధనలందు వయోగించెడి టెలిస్కోపును (దూరదర్శిని) ఇతడు మరింత శక్తివంతముగా చేసెను. ఈ నాటి గడియారములకు జీవము వంటిదైన స్ప్రింగులను (పురియొక్కిన తీగె) కనుగొన్న ధీశాలి ఈయన. శిలిగ్రాఫు విధానమును, అంకగణితమున కనుమైన సాధనములను ఇతడు నేర్పుతో కనుగొనెను. వృక్షశాస్త్రములో ఈయన చేసిన పరిశోధనములు తక్కిన వాటినన్నిటిని మించినట్టిది. మొక్కలలోని భాగములను నేర్పుతో అతిపలుచని రేకులుగా ఛేదించి, వాటిని సూక్ష్మదర్శినితో పరిశీలించి జీవకణములను గుర్తించి వాటి నిర్మాణమును చిత్రముల రూపములో వివరించిన సునిశిత పరిశోధకుడితడు. ఆ పరిశోధనములను సంకలనమొనర్చి 'మైక్రోగ్రాఫియా' అను పేరుతో నొక గ్రంథమును రచించి దానిని జేమ్స్ రాజునకంకిత మొనర్చుట ద్వారా రాయల్ సొసైటీకి రాజపోషణము మరింత ఎక్కువగునట్లు చేసెను.

"తెగనంతవరకు లాగకున్నయెడల లాగినచో సాగెడి స్వభావము గల పదార్థముల యొక్క వ్యాకోచము దానిని కల్పించెడి బలప్రమీద సూటిగా ఆధారపడియుండును" అని ఇతడు కనుగొన్న భౌతికశాస్త్రసత్యమీతని నామముతో ముడివడి ఈతని కీర్తిని చిరస్థాయిగా నొనర్చినది.

గ్రూ, నెహీమియా (1641-1712)

ఇతడొక ఆంగ్లవృక్షశాస్త్రవేత్త. లండనునగరములో వైద్యవృత్తిని అవలంబించినవాడు. మైక్రోస్కోపుతో మొక్కలను (మూలికలను) పరిశీలించి వాటి లక్షణములను వివరించిన చతురుడు. మొక్కలలో ఆడ, మగ జాతులున్నవని వివరించిన మొదటి పాశ్చాత్య శాస్త్రవేత్త ఇతడు.

లామార్క్, జీన్ బాప్టిస్ట్ పియరీ ఆన్టోయిన్ (1744 1829)

ఇతడొక ఫ్రెంచి శాస్త్రవేత్త. ఇతని పూర్తిపేరు లామార్క్ జీన్ బాప్టిస్ట్ పియరీ ఆన్టోయిన్ డి మోనెట్ షెవాలియర్. వెన్నెముక కలవి, లేనివి అని జంతువులను రెండు వర్గములుగా విభజించిన మొదటి పాశ్చాత్యశాస్త్రవేత్త ఇతడు. 1778లో ఫ్రాన్సులో ఉన్న వృక్షజాతులను వివరించుచు శాస్త్రగ్రంథమును అతడు రచించెను. పరిస్థితుల ప్రాబల్యము వలన జీవులలో కలిగిన మార్పులు తర్వాతి తరములవారికి వారసత్వరీత్యా సంక్రమించునని ఈ శాస్త్రవేత్త భావించియుండెను. పరిస్థితులు, పరిసరములు జీవజాతి పరిణామములో ప్రముఖ పాత్ర వహించగలవని ఈయన తలచినాడు. కాని అది నాటి పాశ్చాత్య శాస్త్రవేత్తలకు అంగీకార్యము కాలేదు.

హేల్స్ స్టీఫెన్ (1677 1761)

ఇతడు ఆంగ్లేయ శారీరక ధర్మవిజ్ఞానశాస్త్రవేత్త. టెడ్డింగ్టన్ అను నగరములో ఇతడు మత బోధకుడుగ నుండి మొక్కలను జంతువులను గూర్చి పరిశోధించెను. రక్తముయొక్క ఒత్తిడి శక్తిని ప్రప్రథమమున నిర్ణయించిన శాస్త్రజ్ఞుడీయన.

లిన్నియస్ కార్లస్ (1707 78)

ఇతడు స్వీడెన్ దేశీయుడైన వృక్షశాస్త్రవేత్త. మొక్కమోటికలను, జంతువులను ఒక పద్ధతిననుసరించి జాతులుగా కుటుంబములుగా విభజించు విధానమును సూచించి చర్చించి ఏర్పరచిన ప్రతిభావంతుడీయన. వృక్షశాస్త్రవేత్తలలో ఇతడు కర్తృకాధిష్ఠితుడు. 1735లో ఈయన రచించిన గ్రంథము అనేక చేర్పులతో 1758వ సంవత్సరమున ముద్రణమును పొందినది. అదియే ఈనాటి నిర్వాడుకలోనున్న లిన్నియస్ పరిభాషకు మూలాధారము.

ఔన్‌బ్రూగర్ లియోపోల్డ్ (1722-1809)

ఇతడు వియన్నానగర (ఆస్ట్రియాదేశము) నివాసియైన వైద్యుడు. ఊపిరితిత్తులకు సంబంధించిన వ్యాధులను గుర్తించుటకనువైన విధానమును (percussion) రూపొందించిన శాస్త్రజ్ఞుడితడు.

బ్లేన్ గిల్బర్ట్ (1749 1834)

స్కాట్లెండు దేశీయుడైన వైద్యుడితడు. సర్ బిరుదాంకితుడు. ఆ కాలమున నావికులకు ఆహారమున శాకాహారములు లేనందున తరచుగా కలిగెడి కీళ్లవాపు, నరముల బలహీనతగల 'స్కర్వీ' యను వ్యాధిని కుదురుటకు 'నిమ్మకాయరసమును త్రాగుటకై' సలహానిచ్చిన తీక్ష్ణదృష్టిగల వైద్యశేఖరుడు. నిమ్మకాయరసములో కలదని తర్వాతి శాస్త్రవేత్తలు రుజువుచేయుటకు ఈయన అవకాశము కల్పించెను.

హానిమన్, శామ్యూల్ (1755 1843)

ఇతడు ప్రముఖుడైన జర్మను వైద్యుడు హోమియోపతి వైద్యవిధానమునకు మూలపురుషుడు ఆ వైద్యవిధానములో వాడవలసిన మోతాదు ప్రమాణము అత్యల్పమును విషయము రోగకారకమైన రసాయనయౌగిక ద్రవ్యమే మందుగా ఉపయోగపడుచున్న విషయము ఈ విధానమునకు మూలసూత్రములు. మందులతో అనుపానముగా పంచదారను కలిపి మాత్రకట్టుటవలన చేదైన రోగమునకు తీయని మందులుండ వను కానుకివి ఈ విధానము అసత్యమొనర్చినది శస్త్రచికిత్సవిధానాగా అయిన ఈ విధానము ప్రజాసామాన్యమున కందుబాటులోనుండుట వలన కొంతవరకు అది ఆశామోదమునందినదని చెప్పదగియున్నది

రాబర్టు బ్రౌన్ (1773 1858)

ఇతడు స్కాట్లెండు దేశీయుడైన వృక్షశాస్త్రవేత్త ఈయన ఆస్ట్రేలియాకు వెళ్ళి అచ్చటి వృక్షమూలములను పరిశీలించెను 1827 లో ఇతడు పుప్పొడిని నీటిలో కలిపినప్పుడు దానిలోని కణములు అవిరామముగా చిత్తవిభ్రమ మొందిన ప్రాగులోనున వలె కదలుచుండినట్లు కన్గొనెను ఈ పరిశీలనను "బ్రౌనియచలన" మను పేర ప్రసిద్ధికొందినది 1831 లో ఈ శాస్త్రవేత్త జీవకణములలో కేంద్ర (nucleus) మున్నదని వివరించెను

లీనెక్, రేనె, థియొఫిలెహాయసింథే (1781-1826)

ఇతడొక ఫ్రెంచివైద్యుడు వాడికొట్టుగొను రీతులను హృదయము ఊపిరితిత్తుల స్థితిగతులను శోధించి మర్మర ధ్వనులను వినుటకు వైద్యులుపయోగించు స్టెతస్కోపు సాధనమును ఈ శాస్త్రవేత్త మొట్టమొదట ఉపయోగించెను ఈయన వాడిన సాధనము గొట్టమువోలె బాకావలె విస్తరించియుండెడిది సన్నని చివర భాగమును అతడు చెవియందుంచుకొని, విస్తరించియున్న రెండవ చివరిభాగమును రోగిశరీరముపై ఉంచి అస్పష్టమైన ధ్వనులను స్పష్టమొనర్చుకొనెను ఆ సాధనము క్రమముగా అభివృద్ధిచెంది నేడువాడుకయందున్న స్టెతస్కోపుగా పరిణామము చెందినది

హ్యూగో ఫోన్ మొల్ (1805-1872)

ఇతడొక జర్మను వృక్షశాస్త్రవేత్త మైక్రోస్కోపుతో చేసిన పరిశీలనలవలన పేరు పొందినవాడు ఇతడు ప్రోటోప్లాజము (జీవరసము) యొక్క క్లోరోఫిల్ (ఆకులలోని పచ్చనిపదార్థము) యొక్క స్వభావమును వివరించెను ఇతని పరిశోధనములు పెద్ద మొక్కలను గురించియు శాకవృక్షములను గురించియు విజ్ఞాన సేకరణ మొనర్చుటకు దోహదమైనవి

సింప్సన్ జేమ్స్ ఎంగ్ (1811-1870)

ఇతడొక స్కాట్లెండు ప్రఖ్యాతి వైద్యశాస్త్రవేత్త 1847 లో ప్రసవసందర్భమున శస్త్రచికిత్సకై మత్తుమందుగా క్లోరోఫారమును ఉపయోగించెను సర్ బిరుదమును పొందినవాడు

లాంగ్, క్రాఫర్డ్ విలియమ్సు (1815 78)

అమెరికను వైద్యశాస్త్రవేత్తయైన ఈతడు ఈథరును శస్త్రచికిత్సయందు మత్తుమందుగా వాడవగునని 1842 లో సూచించెను

ఫ్లోరెన్సు నైటింగేల్ 1820-1910)

ఆసుపత్రి పరిపాలనా విధానమునందు నర్సులకున్న ప్రాముఖ్యమును గుర్తించి వారి కత్యవసరమైన శిక్షణ విధానమును 1844 లో తనకు నచ్చిన తీరున తీర్చిదిద్దిన సేవా ప్రతిభ ఈమె 1854 లో క్రిమియా యుద్ధరంగమునందు గాయపడిన వారిసేవకై 38 నర్సులను ఈమె ఒక దళముగా సమకూర్చుకొని స్కుటారి బాలక్లావా రంగములందు దుర్భిక్షమగ్నులను కష్టములను ప్రమాదములను లెక్కచేయక సేవాకార్యక్రమమును దీక్షతో నిర్వహించెను లాంతరుచేతబూని రాత్రిళ్లుకూడ యుద్ధరంగమున సంచరించి కొనయూపిరితో నున్న క్షతగాత్రులను సేవించుటచే ఈమెకు దివ్వెధరించిన దేవీమూర్తి అను పేరు వాడుకలోనికి వచ్చెను

1860 లో లండనులోని సెయింట్ థామస్ ఆసుపత్రి అనుబంధసంస్థగా 'నైటింగేల్ నర్సుల శిక్షణ వసతి కేంద్రము'ను ఈమె ఏర్పరచెను అదియే ఈనాడు నర్సులకు శిక్షణ గరపెడి విధానమునకును వృత్తిగౌరవమునకును మూలమైనది

జోసెఫ్ లిస్టర్ (1827-1912)

ఆంగ్లేయులలో ప్రభువర్గమునకు చెందిన శాస్త్రచికిత్సకుడీయన శాస్త్రచికిత్సానంతరము గాయములకు కార్బా

లిక్ అనిదుమ వాడి నాటికి చీముపట్టకుండ మానునట్లు చేయనగునని 1865లో ఆతడు నిరూపించెను చర్మము కలిపి కుట్టుట కనయుక్తములై క్రమముగా దేహములో జీర్ణమై లీనమగు నరములపోగులను ఈతడు వాడుకలోనికి తెచ్చెను శస్త్రచికిత్సలో మెలకువలను గ్రహించుకొని స్రావములను వెలికి కొనిపోవుట కనువైన గొట్టములను వాడుకలోనికి తెచ్చు పద్ధతిని సూచించిన నేర్పరి ఈతడు

## ఎడ్వర్డు ఫ్లూగర్ (1829-1910)

ఇతడొక ప్రయోగకుశలుడైన జర్మను దేహధర్మ విజ్ఞానశాస్త్రవేత్త నిశ్వాసము జీవకణపుంజములలోనే (tissues) జరుగుచుండు ననియు ఊపిరితిత్తులలో కాని రక్తములో కాని కాదనియు రుజువుచేసిన పండితు డీయన

## హక్స్లీ, థామస్ హెన్రీ (1825-1895)

ఇతడొక ఆంగ్ల జీవశాస్త్రవేత్త "రాటిల్ స్నేక్" అను ఓడలో శస్త్రచికిత్సకుడుగా పనిచేయుచు 1846-50 మధ్య కాలములో పసిఫిక్ మహాసముద్ర ప్రయాణ సందర్భమున సముద్రజల జీవరాసులను ఇతడు సేకరించెడివాడు జాతిపరిణామ సిద్ధాంతప్రవర్తకుడైన ఛార్లెస్ డార్విను సమర్థించిన వాడితడు దేహనిర్మాణ దేహధర్మవిజ్ఞాన జీవజాతిపరిణామ సిద్ధాంత విషయములను గురించి రచనలు గావించిన ప్రచారకుడు ఈయన

ఈతని మనుమడైన జూలియన్ సోరెల్ హక్స్లీ (1887- ) కూడ ప్రఖ్యాత జీవశాస్త్రవేత్తగాను రచయితగాను పేరుపొంది 1946-48 లలో యునెస్కో డైరెక్టర్ జనరలుగా వ్యవహరించినాడు

## హ్యూగో డివ్రైస్ (1848-1935)

ఇతడొక డచ్చిశాస్త్రజ్ఞుడు జీవపరిణామమును గురించి ఈయన చేసిన పరిశోధనములు మెండెల్ నిర్వచించిన అనువంశిక సూత్రములను 1900 లో తిరిగి కనుగొనుటకు దారి చేర్పరచెను క్రోమోసోములు వాటిలో కలుగుమార్పులు క్రొత్తలక్షణములు వ్యక్తమగు పరిస్థితులు మొదలైనవాటిని గురించి ఈతడు కీలకప్రాయమైన కృషి సల్పెను

## గ్రే అసా (1810-1888)

ఇతడొక అమెరికాదేశీయుడైన వృక్షశాస్త్రవేత్త-కాండముల పరిశోధనములను ప్రత్యేకముగా నిర్వహించినవాడితడు హార్వర్డు విశ్వవిద్యాలయములో ఆచార్యుడుగా వ్యవహరించినాడు తన రచనలవలన వృక్షశాస్త్రమునకు ప్రచారము కలిగించి ఉత్తర అమెరికాలో ఉన్న మొక్కలన్నిటిని వివరించెడి గ్రంథమును 1848 లో ఇతడు రచించెను ఈ గ్రంథమెన్నియో కూర్పులతో ప్రకటితమైనది

## బర్ బాంక్ లూథర్ (1849-1926)

ఇతడొక అమెరికను వృక్షశాస్త్ర నిపుణుడు మొక్కల పెంపకములో క్రొత్తరకములను సృష్టించుటయందు గారడీవాడనియు మాంత్రికుడనియు ఇతడు పేరుపొందెను పెద్దవి గట్టివి అయిన బంగాళాదుంపరకములను కల్పించి విరివిగా ధనసంపాదనము చేసినవాడితడు అంతేకాక స్లమ్ కాట్ శాస్తా డెయిజీ పీచులేని బ్రహ్మజెముడు అను వృక్షజాతుల నితడు సృష్టించెను పదునారు సంవత్సరముల కృషిఫలితముగా లభించిన బ్రహ్మజెముడు పశువులకు ఆహారముగా ఉపయోగింపగలదు ఇతని పరిశీలనాఫలితములలో ఇది ఉత్కృష్టమైనది.

## ఎల్లిస్ హేవలక్ (1859-1939)

ఇతడొక ఆంగ్లమానసిక శాస్త్రజ్ఞుడగు వైద్యుడు ఈయన లైంగిక జీవితమునకు సంబంధించిన వివిధ మానసిక ప్రవృత్తులను దీర్ఘకాలము పరిశీలించి తన అభిప్రాయములను ఉద్గ్రంథముల మూలముగా లోకమునకు వెల్లడించినాడు ఈ గ్రంథములు లైంగికసమస్యలపట్ల ప్రజల దృక్పథములో నూతనమైన మార్పులను ప్రవేశపెట్టినవి

## హాల్డేన్, జాన్ స్కాట్ (1860-1936)

ఇతడొక ఆంగ్లేయ జీవశాస్త్రవేత్త ఉచ్ఛ్వాస నిశ్వాసములను గురించియు రక్తములో లీనమైయుండు వాయువులను గురించియు ఆరోగ్యరక్షణకై పరిశ్రమలలో పాటించవలసిన నియమములను గురించియు గనులలో కార్మికుల ఆరోగ్య రక్షణమును గురించియు ఇతడు పరిశోధనలు సల్పి సూచనలుచేసిన సాంఘిక సంక్షేమవాది ఆయన కుమారుడైన జె బి ఎస్ హాల్డేన్ (1892-1964) జీవశాస్త్ర పరిశోధనములను గణితశాస్త్రదృష్ట్యా పరిశీలించుట అవసరమని తన కృషివలన నిరూపించెను గహనమైన శాస్త్రీయ విషయములను జనసామాన్యమునకు అవగతమగునట్లుగా వివరించిన ప్రతిభావంతుడగు రచయిత ఇతడు భారతదేశ భాషలలో కెల్ల తెలుగునకే ఇతర భాషలనుండి పదజాలమును గ్రహించి

లీనమొనర్చుటకును సహాయలక్షణము కలదనియు అందుచే ఆదియే జాతీయభాష కాదగినదనియు నూహించిన సిప్పాపి. కుడు కేన్సరువ్యాధికి గురియై బర్చుకోలేనంతటి తన దేహమును వైజ్ఞానిక శాస్త్ర పరిశోధనకై వినియోగించవలెనని దానమిచ్చిన దధీచితుల్యుడు జె బి ఎస్ హాల్డేన్ ఆయన అస్థిపంజరము నేడు కాకినాడలోని రంగారాయ వైద్యకళాశాలలో భద్రపరుపబడి వైద్య విద్యార్థులకు జ్ఞాన బోధనా సాధనమై యున్నది

## వాల్టర్ రీడ్ (1851-1902)

ఇతడు అమెరికను సైన్యములో నొక వైద్యశాస్త్రజ్ఞుడు వల్లని పసరుడోకులలో అంటువ్యాధిగా వ్యాపించెడి జ్వరమును గురించి ఇతడు విమర్శనాత్మకముగా శోధించెను తత్ఫలితముగా ఈ జాడ్యము అదుపులోనికి వచ్చెను వాషింగ్టను నగరములోని ఒక పరిశోధనా కేంద్రమునకును వైనిక ఆస్పత్రికిని ఈ శాస్త్రవేత్త పేరు పెట్టబడినది

## ఫ్రాంక్, కాసిమిర్ (1884- )

ఇతడు అమెరికను జీవరసాయన శాస్త్రవేత్త విటమిను లను గూర్చి మౌలికమైన పరిశోధనలను చేసిన ధీమంతుడీయన

## ఏబ్డెర్ హాల్డెన్ ఎమిల్ (1877 1950)

ఇతడు స్విజర్లెండు దేశీయుడైన శారీరక విజ్ఞానశాస్త్రవేత్త ఇతడు ఎంజైములను గూర్చియు ఆహారము జీర్ణమగు విధిని గూర్చియు శోధించెను గర్భధారణమును నిరూపించెడి పరీక్షావిధానమును సూచించి దానిని తీర్చిదిద్దినవాడు

## ఎమిల్, ఎడాల్ఫ్ ఫోన్ బెహరింగ్ (1854 1917)

ఇతడు జర్మను దేశీయుడగు వైద్యశాస్త్రజ్ఞుడు రక్తసారమునుపయోగించి రోగనివారణము చేయు పద్ధతిని తీర్చిదిద్దినవేత్త 1890లో డిఫ్తీరియా 1893లో టెటానస్ (ధనుర్వాతము)లను అంటిటాక్సినులను సూదిమందులుగా ఉపయోగించి అవి వ్యాధినివారకములుగా ఉపయుక్తములైనవని రుజువుచేసినవాడితడు 190 లో శరీరధర్మశాస్త్రము వైద్యశాస్త్రములలో కేన్సరుపబడిన నోబెల్ బహుమతిని అందుకొన్నవాడు

## రొనాల్డు రాస్ (1857 1932)

ఇతడు 1857 మె 13వ తేదీన హిమాలయా పర్వత ప్రాంతములో ఒల్మోరా నగరమునందు జన్మించెను ఇతని తండ్రియైన సర్ కాంప్ బెల్ క్లే గ్రాంట్ రాస్ ఆ రోజులలో సైన్యాధికారిగానుండెడివాడు ఆయన కేవలము సైనికుడే కాక షేక్స్పియరు మిల్టను బైరను కవుల కావ్యములను పుక్కిటబట్టిన సాహిత్యవేత్త ఇతనికి తండ్రి వైపునుండి స్కాటిష్ ప్రభువుల వంశగౌరవము తల్లివైపునుండి ద్రూయిడ్ల సంప్రదాయగౌరవము లభించినవి భారతదేశములో జన్మించినను ఇతడు ఏడవయేటనే విద్యాభ్యాసమునకై ఇంగ్లండుకు వెళ్ళెను అక్కడ ఎనతండ్రి యింట ఉండి లభ్యమైన సాహిత్య గ్రంథములను దీక్షతో చదివి ఎనతండ్రి మెప్పునుపొందెను ఇతని 16వ ఏట ఆక్స్‌ఫర్డు కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయములు నిర్వహించిన ప్రవేశపరీక్షలో డ్రాయింగునందు ప్రథమస్థానమును పొందెను చిత్రకారుడు కాదలచిన ఇతడు తండ్రి అవరోధమువలన సెయింట్ బర్తొలోమ్యూ ఆస్పత్రికి అనుబంధముగానున్న వైద్యవిద్యాలయములో చేరి వైద్యవిద్య నభ్యసింపసాగెను అయినను అతడు చిత్రకళను సాహిత్యమును సంగీతమును ఏమరక అభ్యసించెడివాడు పద్యములకును పాటలకును స్వరములు కల్పించుటయందును మట్టితో అందమైన బొమ్మలు చేయుటయందును ఇతడు నిమగ్నుడయ్యెడివాడు ఆరేండ్లపాటు బలవంతపు చదువు చదివి 1879లో పరీక్షయందు ఉత్తీర్ణుడయ్యెను అనంతరమాతడు ఒక ఓడలో సర్జనుగా చేరెను నవలా రచనలోను మరొక వైద్యపరీక్ష కృషిలోను కాలముగడిపి 1881లో మద్రాసునందు ఇండియన్ మెడికల్ సర్వీసులో ఉద్యోగిగా ప్రవేశించినాడు దీనితో ఆయన తండ్రి ఆశయము నెరవేరెను ఉద్యోగరీత్యా ఆయన విజయనగరము మద్రాసు బెంగుళూరు నగరములలో నివసించి, భారతీయుల కష్టసుఖములను తెలిసికొనగలిగెను అప్పుడే దోమకాటు రుచియు మలేరియా జ్వరబాధ తీవ్రతయు ఆయనకు అవగతమయ్యెను సాహిత్య వ్యాసంగమువలన పేరు ప్రతిష్ఠలుగాని ఆదాయముగాని వచ్చు జాడ కన్పించలేదు ఇంతలో ఆరోగ్యము చెడగా తిరిగి అతడు ఇంగ్లండు వెళ్ళి క్రమముగా పుంజుకొని రోజా బ్లోస్సమ్ అను కన్యను వివాహమాడి 1889లో ఇండియాకు మరలివచ్చెను

లండనులో ఉన్నపుడు అతడు సూక్ష్మజీవుల శాస్త్రము నభ్యసించి పారిశుధ్యమును గురించి డిప్లొమాపరీక్షలో ఉత్తీ

చిత్రము - 88



రొనాల్డ్ రాస్

దయ్యెను మలేరియా జ్వరమునకును దోమలకును సంబంధ మున్నదని తేలిగా తెలిసెను 1894 వరకు ఆవిషయము నెట్లు పరిశోధించి రుజువుచేయవలయునో రాస్‌నకు దారి కన్పింపలేదు తండ్రి మరణానంతర మాతడు సెలవుమీద లండనుకు వెళ్లినపుడు ఆతడు మాన్సన్ అను పరిశోధకాగ్రణితో కలిగిన పరిచయఫలముగా నూతనోత్సాహము శక్తియు ఆయనకు కలిగెను శక్తివంతమైన ఒక మైక్రోస్కోపును అతడు నిర్మించుకొని సికింద్రాబాదులో ఉద్యోగమునందు ప్రవేశించెను

1897 వేసవిలో ఆతడు బ్రతికియున్న చచ్చిన దోమలను పరిశీలించుచు కాలముగడపెను ఆయన పడిన శ్రమఫలితముగా ముఖము కాళ్లు చేతులు చెమటపట్టెడివి మైక్రోస్కోపు స్క్రూలుకూడ తుప్పుపట్టెడివి ఒక్కొక్కసారి మైక్రోస్కోపు చేయినుండి జారిపడి అద్దములు బ్రద్దలగుచుండెడివి ఇట్లు నిరంతర పరిశోధనము ఆయన సాగించుచునే యుండెను ఒక సందర్భములో అనోఫిలిస్ జాతి దోమ కడుపులో మలేరియా సూక్ష్మజీవులు కన్పింపగా ఆయన హృదయముప్పొంగి లక్షలజనమును పొట్టపెట్టుకొనుచున్న శత్రువు జాడను చేకిక్కించిన భగవంతుని అనుగ్రహమును గేయరూపమున ఆతడు కీర్తించెను ఇది జరిగిన నెలరోజుల తర్వాత రాస్ భారత దేశపు సరిహద్దుకు బదిలీచేయబడెను

అచ్చటనుండి తన పరిశోధనా వివరములను మైక్రోస్కోపులో తాను తయారుచేసిన అద్దపు పలకలను మాన్సను శాస్త్రవేత్తకు ఆతడు పంపెను మలేరియాను గురించి మరల పరిశీలనావకాశము లభింపనందున 1899 లో రాస్ ఉద్యోగ విరమణ చేసి ఇంగ్లండుకు వెళ్ళి లివర్‌పూల్ నగరములో అధ్యాపకుడుగా ఉద్యోగములో చేరెను

ఇతని పరిశోధనా ప్రాముఖ్యమును గుర్తించి రాయల్ సొసైటీవారు 1901 లో ఇతనిని ఫెలోగా ఎన్నుకొనిరి 1902లో వైద్యశాస్త్ర విషయమై ఇతడు జరిపిన కృషికి నోబెల్ బహుమతియు 1911 లో సర్ బిరుదమును ప్రదానము చేయబడినవి 1926 వరకు మలేరియా నివారణకై దోమలమీద దండయాత్రలు నిర్వహించి తన పేరుతో నెలకొల్పబడిన రాస్ సంస్థకు అధిపత్యము వహించి సెప్టెంబరు 1932 లో పక్షవాతముచే అస్వస్థుడై అవును అవును! పరిశోధించి కనుగొని తీరెదను! అను తుదిమాటలతో ఈలోకమునుండి నిష్క్రమించిన ఏకాగ్రదృష్టి గల విజ్ఞానవేత్త ఇతడు ఈ శాస్త్రజ్ఞుని విజయమునకు కార్యరంగమైన సికింద్రాబాదులో ఆయన స్మృతిచిహ్నముగా సర్ రొనాల్డ్ రాస్ రోడ్ అను నామ మిప్పటికిని నిలిచియున్నది

## ఫిన్సెన్, నీల్స్ రైబెర్గ్ (1860 1904)

ఇతడొక ప్రముఖ డెన్మార్కు వైద్యుడు అల్ట్రావయొలెట్ కాంతి ప్రసారమువలన కొన్ని వ్యాధుల నివారణ సాధ్యమని రుజువుచేసి 1903 లో నోబెల్ బహుమతిని స్వీకరించిన శాస్త్రవేత్త ఇతడు

## ఇవాన్ పెట్రొవిక్ పావలోవ్ (1849 1936)

ఇతడు అంతర్జాతీయ ఖ్యాతిగన్న రష్యను శరీరధర్మశాస్త్రవేత్త జఠరరసము యొక్క ఉత్పత్తిని గూర్చియు దానికి మానసిక స్పందనముతో నిమిత్తములేక ద్రవించు గ్రంథులను గూర్చియు అలవాటువలన కలుగు శారీరక క్రియలను గూర్చియు పరిశోధనల నొనర్చి 1904లో నోబెల్ బహుమానమును సంపాదించినవాడితడు

## రాబర్ట్ కోక్ (1843-1910)

ఇతడు జర్మన్ దేశీయుడు సూక్ష్మజీవులను గురించిన విజ్ఞాన శాస్త్రనిర్మాత సూక్ష్మజీవులను పెంచువిధానములను రూపొందించి ఎన్నియో సాంక్రామికవ్యాధులకు కారకములైన సూక్ష్మజీవులను గురించియు పశువులకు సోకు దొమ్మరోగములనుగురించియు క్షయరోగమును గురించియు, కలరాను గురించియు ఇతడు పరిశోధనములొనర్చెను క్షయవ్యాధి నిరూపణకై ట్యూబర్‌క్యులిన్ పరీక్షా విధానమును తీర్చిదిద్దినందుకై ఇతడు 1905లో నోబెల్ బహుమతిని పొందెను

## గోల్గి, కామిల్లో (1844 1926)

ఇతడొక ఇటాలియను వైద్యుడు నరములనుగురించియు జీవకణపుంజముల లక్షణములను గురించియు కృషి సల్పిన

శాస్త్రవేత్త ఇతడు నరముల వ్యూహరచనా విన్యాసమును గూర్చి చేసిన కృషి ఫలితముగా ఈయన 1906లో నోబెలు బహుమతిలో సగము వాటాను పంచుకొనెను

### లావెరాన్ ఛార్లెస్ లూయీ అల్ఫోన్సో (1845-1922)

ఇతడొక ఫ్రెంచివైద్యుడు మలేరియా సూక్ష్మక్రిములను 1880లో గుర్తించి ప్రొటోజువాలకు రోగకారకములుగ నున్న వీటి ప్రాముఖ్యమును వివరించి 1907లో ఇతడు నోబెల్ బహుమతిని బడసెను

### పాల్ ఎర్లిక్ (1854-1915)

ఇతడు జర్మను దేశీయుడైన సూక్ష్మక్రిమి శాస్త్రవేత్త రోగనిరోధక విధానమును తీర్చిదిద్దినందుకై 1908లో నోబెల్ బహుమతియందు సగము వాటాను ఇతడు సంపాదించెను సవాయి రోగమును నివారింపగల ఔషధములను గూడ ఈ శాస్త్రవేత్త కనుగొనెను

### ఎలీ మెక్నికోవ్ (1845-1916)

ఇతడొక రష్యను జీవశాస్త్రవేత్త ఫాగోసైటిస్ అనుతరగతికి చెందిన తెల్లని జీవకణములు సూక్ష్మజీవులను నాశనముచేయగలవని కనుగొనెను 1908లో నోబెల్ బహుమానములో సగము వాటాను సంపాదించుకొన్న శాస్త్రవేత్త ఇతడు పారిస్ నగరమందలి పాశ్చ్యూర్ పరిశోధనా సంస్థతో సాన్నిహిత్యంగలవాడు రోగనిరోధమునకు సంబంధించి కృషి సల్పి ఖ్యాతిగడించినవాడీయన

### ఎమిల్ థియొడోర్ కోచర్ (1841 1917)

ఇతడు స్విజర్లెండు దేశీయుడైన శస్త్రి చికిత్సకుడు థైరాయిడ్ గ్రంథిని గురించి ఇతడుచేసిన కృషికై 1909లో నోబెల్ బహుమతిని స్వీకరించినవాడు

### అల్బ్రెక్ట్ కోసెల్ (1853-1927)

ఈయన జర్మను దేశీయుడైన శరీరధర్మ శాస్త్రవేత్త ప్రొటీనులు జీవకణములు జీవకణ కేంద్రము మొదలైన అంశములను గురించి కావించిన పరిశోధనములకై 1910లో ఇతడు నోబెల్ బహుమతిని పొందెను

### గుల్‌స్ట్రాండ్ అల్వార్ (1862-1930)

ఈతడు స్వీడన్ దేశీయుడగు నేత్రవైద్యుడు కాంతి వలన ఏర్పడు ప్రతిబింబములను గురించియు, కన్ను,కాంతిని వక్రీభవమొనర్చురీతిని గురించియు వివరించి 1911లో నోబెల్ బహుమతి గౌరవమును పొందెను

### ఎలెక్సిస్ కారెల్ (1578-1944)

అమెరికా పౌరుడైన ఈ శస్త్రి చికిత్సకుడు ఫ్రాన్సులో జన్మించెను రక్తవాహికలను కలిపి కుట్టు విధానమును శరీరములో రక్తమును ఎక్కించుతీరును శరీరములో అంగము మార్పిడిని గురించి కృషిసల్పి 1912లో ఇతడు నోబెల్ బహుమతిని అందుకొనెను ఇతడు చార్లెస్ ఎ లిండ్‌బెర్గుతో కలిసి యాంత్రిక హృదయమును నిర్మించెను పుష్టికరమైన ద్రావణములలో ఉంచి శరీరాంగములను జీవకణపుంజములను కుళ్ళకుండ నిలువయుంచుటకు వీలైన విధానములను ఇతడు కన్గొనెను 1935లో "మానవుడు మనకు తెలియనివ్యక్తి అను ప్రఖ్యాత గ్రంథమును ఇతడు రచించెను

### రిషె. చార్లెస్ రాబర్టు (1850-1935)

ఇతడు ఫ్రెంచివైజ్ఞానికుడు శరీరధర్మశాస్త్రవేత్త విజాతీయమైన ప్రొటీనులకు దేహమెంతసున్నితముగా నుండునో ఎంత ప్రతిక్రియాసమర్థవంతమైయుండునో ఇతడు వివరించి 1913లో నోబెల్ బహుమతిని పొందెను

### రాబర్టు బరానీ (1876 1936)

ఇతడొక ప్రముఖ ఆస్ట్రియను వైద్యుడు చెవినిబోలు సాధనమును నిర్మించి ఇతడు నోబెల్ బహుమతిని అందుకొనెను

### బోర్డా జూల్ (1870-1961)

ఇతడొక బెల్జియనురక్తసారశాస్త్రవేత్త; రోగనిరోధక శాస్త్రజ్ఞుడు 1900లో అనుబంధాత్మక ప్రొటీను పదార్థబంధనము (Complement fixation technique) అను పద్ధతిని రూపొందించిన వాడితడు తరువాత ఇది వాసర్‌మన్ పరీక్షా విధానము లో ఉపయోగకరముగా పరిణతిచెందినది 1906లో కోరింత దగ్గును సృష్టించు సూక్ష్మజీవులనితడు కన్గొనెను వ్యాధినిరోధక విజ్ఞానాభివృద్ధికై కావించిన కృషికి ఇతడు 1919లో నోబెల్ బహుమతిని సంపాదించుకొనెను

### అగస్ట్ క్రోఫ్ (1874-1949)

ఇతడు డెన్మార్కు శాస్త్రజ్ఞుడు శరీరధర్మ విజ్ఞానవేత్త కండరములలోనికి కేశనాళికాత్మకములైన వాహికల ద్వారా

రక్తము సరఫరాయగు తీరును వివరించి 1920 లో నోబెల్ బహుమతిని అందుకొన్న విజ్ఞానవేత్త ఇతడు

1915 1916 1917 1918 1921 వ సంవత్సరములో నోబెల్ బహుమతి ప్రదానము జరుగలేదు

ఆర్చిబాల్డ్ విలియమ్ హిల్ (1886- )

ఈ ఆంగ్ల శరీరధర్మ విజ్ఞాన శాస్త్రవేత్త కండరముల చర్యలను ఉష్ణశక్తిగతి శాస్త్రనియమానుసారముగా పరిశీలించి 1922 లో నోబెల్ బహుమతిలో సగభాగమును స్వీకరించెను

మెయర్ హాఫ్ ఆటో (1884-1951)

జర్మను జాతీయుడైన ఈ శరీరధర్మ శాస్త్రజ్ఞుడు జీవ కణములలో జరిగెడి ఆక్సీకరణమును కండరములలో లాక్టిక్ ఆమ్లము మార్పుచెందెడి తీరును శోధించి వివరించిన ఫలితముగా 1922 లో నోబెల్ బహుమానములో సగభాగమునకు అర్హుడయ్యెను

ఫ్రెడెరిక్ గ్రాంట్ బాంటింగ్ (1891-1941)

కెనడా వైద్యశాస్త్రవేత్తయు సర్ బిరుదాంకితుడునైన ఈయన మధుమేహము అతిమూత్రము అను రోగములకు ఇన్సులిన్ ఔషధమే శమనమని కనుగొని 1923 లో నోబెల్ బహుమతిలో భాగస్వామియైనాడు

మెక్ లియాడ్ జాన్ జేమ్స్ రిచర్డ్ (1876-1935)

స్కాట్లెండు దేశీయుడైన ఈ శరీర ధర్మవిజ్ఞాన శాస్త్రజ్ఞుడు మధుమేహమును నివారించుటకు ఇన్సులినువాడి అది దివ్యౌషధమని నిరూపించుట ద్వారా 1923 లో నోబెలు బహుమతిలో సగభాగమును సంపాదించెను

ఐన్థోవెన్ విల్లెమ్ (1860-1927)

ఈ హాలెండు శాస్త్రజ్ఞుడు హృదయస్పందనమును రేఖా చిత్ర పటముగా రూపొందించు అవకాశమును కల్పించిన ఎలెక్ట్రో కార్డియోగ్రామ్ అను సాధనమును నిర్మించి 1924 లో నోబెల్ బహుమతిని గైకొన్నవాడు 1925 లో నోబెల్ బహుమతి ప్రదానము జరుగలేదు

యోహాన్సన్, ఫిబిగెర్ (1867-1928)

రోగలక్షణ శాస్త్రవేత్తయైన ఈ డెన్మార్కు దేశీయుడు పుట్టకురుపును గురించిన పరిశోధనలకై నలువది ప్రశంసలనందుకొని 1926 లో నోబెల్ బహుమతిని అందుకొనెను

వాగ్నెర్ జౌరెగ్ జూలియస్ (1857-1940)

ఈ ఆస్ట్రియను శాస్త్రవేత్త నరములనుగురించిన విజ్ఞానమును శోధించినవాడు జ్వరనివారణమునుగూర్చి కృషి యొనర్చి మలేరియా కలుగజేయు సూక్ష్మజీవులను మూది మందుగా ఇచ్చి మలేరియాను కుదిర్చినందులకై 1927 లో నోబెల్ బహుమతి ఈతనికి లభించెను

చార్లెస్ నికోలీ (1866-1936)

ఇతడు ఫ్రెంచి దేశీయుడైన సూక్ష్మజీవశాస్త్ర విజ్ఞాని టైఫాయిడ్ జ్వరకారకములైన "టైఫస్" అను సూక్ష్మ జీవుల వ్యాప్తిని వివరించి 1928 లో నోబెల్ బహుమతిని బడసెను

క్రిస్టియన్ ఐక్ మన్ (1858-1930)

ఇతడొక హాలెండుదేశవైద్యుడు నరముల బలహీనత వలన కలుగు బెరిబెరి యను నొక రకమైన పాండురోగమును గురించి చేసిన పరిశోధనలు ఈతనికి 1929 లో నోబెల్ బహుమానమునకు అర్హతనిచ్చెను

ఫ్రెడెరిక్ గౌలండ్ హాప్‌కిన్స్ (1861 1947)

ఆంగ్లేయుడైన ఈ జీవరసాయనిక శాస్త్రవేత్త విటమినులను గురించి ముఖ్యమైన పరిశోధనలు కావించెను కార్బోహైడ్రేటులు వినియోగమయ్యెడి తీరుతెన్నులను కండరములలో కొనసాగించెడి క్రియలలోని రాసాయనిక చర్యావిశేషములను కూలంకషముగా వివరించిన ప్రజ్ఞాశాలి ఇతడు సర్ బిరుదాంకితుడైన ఈ శాస్త్రజ్ఞుడు 1929 లో నోబెల్ బహుమానములో సగభాగమును స్వీకరించెను

కుష్నీ ఆర్థర్ రాబర్ట్సన్ (1866-1926)

ఇతడొక స్కాట్లెండు వైద్యుడు డిజిటాలిస్ మూలిక ఒక విధమైన గుండె జబ్బుకు ఔషధముగా ఉపయోగపడునని కనుగొన్న పరిశోధకుడితడు

లాండ్ స్టెయినర్ కారల్ (1868-1943)

ఇతడు అమెరికా దేశమునకుచెందిన శాస్త్రవేత్త వైద్య విజ్ఞాన పరిశోధకుడు మానవరక్తమును నాలుగురకరగతులుగా విభజింపవచ్చునని రుజువుచేసి 1930 లో నోబెల్ బహుమతిని

పొందెను 1940 లో వీనర్ అను శాస్త్రజ్ఞునితో కలసి 85 శాతపు ప్రజల రక్తములో ప్రోటీను తరగతిచెందిన Rh ఫాక్టర్ అనదగిన ద్రవ్యమున్నదని ఇతడు రుజువుచేసెను Rh పాజిటివ్ రక్తమును Rh నెగెటివ్ రక్తముకలవారి శరీరములోనికి ఎక్కించరాదనియు అట్లుచేయుట వలన ప్రమాదకరమైన జీవరసాయనిక క్రియలు నిర్వాహణమగు ననియు వివరించి రక్తదాన క్రియహానికరము కాకుండునట్లు తీర్చిదిద్దెను

### వార్‌బర్గ్ ఆటో హెన్రిక్ (1883-1968)

ఇతడు జర్మనుదేశీయుడైన శరీర ధర్మశాస్త్రవేత్త నిశ్వాస క్రియలందు పాల్గొనుచున్న ఎంజైములను గురించి చేసిన పరిశోధనలఫలితముగా ఇతడు 1931 లో నోబెల్ బహుమతినిపొందెను తర్వాత ఘట్ట కరుపుల వ్యాధికి కారణమైన జీవకణముల నిర్మాణమును గురించి ఇతడు పరిశోధనలను కావించెను

### ఏడ్రియన్ ఎడ్గర్ డగ్లస్ (1889- )

ఆంగ్లేయుడైన ఈ శరీరధర్మ విజ్ఞాన శాస్త్రవేత్త నరములలో నున్న జీవ ణము ను న్యూరానుల విధివిహిత ధర్మములను వివరించి 1932 లో నోబెలు బహుమతిలో సగభాగమును సంపాదించుకొన్న ప్రజ్ఞాశాలి ఇతడు

### చార్లెస్ స్కాట్ షెర్రింగ్టన్ (1857-1952)

ఈ ఆంగ్లేయ శాస్త్రవేత్త నరములను గురించిన విజ్ఞానములో మేటియని ఎన్నికగన్నవాడు. సర్ బిరుదమునుపొందిన కీర్తిశాలి న్యూరానులను గురించి చేసిన పరిశోధనలు ఇతనికి 1932 లో నోబెల్ బహుమతిలో సగమువాటాను సంపాదించి పెట్టినవి

### మార్గన్ థామస్ హంట్ (1866-1945)

ఇతడు అమెరికను జంతుశాస్త్రవేత్త పరంపరగా సంక్రమించు లక్షణములు క్రోమోసోములలో ఇమిడియున్న జీనులమీద ఆధారపడి యుండునని సిద్ధాంతీకరించి వాటి నడవడిని పరిశీలించి అందుండుక్రమమును వివరించి 1933 లో నోబెల్ బహుమతిని అందుకొన్నవాడితడు

### జార్జి హోయిట్ విపిల్ (1878- )

ఇతడును జార్జిరిచర్డ్ మినాట్ (1885-1950) మర్ఫి విలియమ్ పారీ (1892- ) అను వారును ప్రఖ్యాత అమెరికను వైద్యశాస్త్రవేత్తలు రోగనిరూపణ విజ్ఞానశాస్త్ర కుశలులు ప్రమాదకరమైన పాండురోగ నివారణయందు లివరు (కాలేయము తో తయారైన మందు దినుసుల ప్రాముఖ్యమును వివరించి 1934 లో నోబెల్ బహుమానమును వీరు ముగ్గురు పంచుకొనిరి

### స్పీమన్ హాన్స్ (1869-1941)

గర్భసంబంధ జీవశాస్త్రజ్ఞుడైన ఈ జర్మను దేశీయుడు గర్భస్థపిండముయొక్క క్రమాభివృద్ధికి గర్భమందలి మావిలో జరుగు భౌతిక రసాయనిక క్రియలను వివరించి 1935 లో నోబెలు బహుమతిని బడసెను

### డేల్ హెన్రీ హాలెట్ (1875 )

సర్ బిరుదాంకితుడైన ఈ ఆంగ్లశాస్త్రవేత్త ఎసిటైల్ కోలీను నరములద్వారా ఏరీతిగా స్పర్శజ్ఞానమును ప్రసారము చేయునో వివరించి 1936 లో నోబెల్ బహుమతిలో అర్ధభాగమును పరిగ్రహించెను

### ఆటో లోవీ (1873-1961)

ఇతడొక అమెరికను శాస్త్రవేత్త శరీరధర్మ విజ్ఞాన శాస్త్రము ఔషధచర్య శోధనశాస్త్రము అభిమాన విషయములుగా కృషిచేసిన పరిశోధకు డీయన

### ఆల్బర్ట్ సెయింట్ గ్యార్గీ (1893 )

హంగరీలో జన్మించిన అమెరికను జీవరసాయన శాస్త్రవేత్త ఇతడు విటమిన్ సి అను పేరుతో ప్రఖ్యాతి చెందిన ఎసకార్బిక్ ఆసిడు ఎట్లు జీవరసాయన క్రియలలో ఆక్సీకరణమగునో వివరించి 1937 లో నోబెల్ బహుమతి నందుకొనెను తర్వాతికాలములో కండరముల సంకోచమును గూర్చి ఇతడు చేసిన పరిశోధనములు చాలముఖ్యమైనవి మెసాచుసెట్స్ నగరమందలి (అమెరికా) సముద్రజల జీవ శాస్త్ర పరిశోధనాగారము తో ఎక్కువ అనుబంధముకల శాస్త్రవేత్త ఇతడు

1938 లో నోబెల్ బహుమతి ప్రదానము జరుగలేదు

### డోమాక్ గెర్‌హార్డ్ (1895- )

రసాయన శాస్త్రవేత్తయు రోగనివారణశాస్త్రనిపుణుడును అయిన ఈ జర్మను దేశీయుడు సల్ఫామందుల పరిశోధనలకు మూలకారకమైన ప్రొంటోసిల్ అను మందును రాసాయనికముగా కల్పనచేసి కృష ఫలితముగా 1939 లో ఇతనికి నోబెల్ బహుమానము నిచ్చుటకు తీర్మానించబడినను,

నాజీల రాజకీయపు ఒత్తిడి కలన ఇతడు ఆబహుమతిని నిరాకరించినాడు

1940 1941 1942 సంవత్సరములలో నోబెల్ బహుమతి ప్రదానము జరుగలేదు

## హెన్రిక్ డామ్ (1895- )

ఇతడొక డెన్మార్కు జీవరసాయన శాస్త్రజ్ఞుడు డాయిజీ ఎడ్వర్డు ఎడెల్బర్ట్ అను అమెరికను జీవరసాయన శాస్త్రివేత్తతో కలిసి విటమిన్-కె ను గుర్తించి దాని రాసాయనిక స్వభావమును (నాఫ్తక్వినోను ఉత్పన్నరాసాయనిక యౌగికము) రక్తమును గడ్డకట్టునట్లు చేయుటలో దాని ప్రాధాన్యమును వివరించి 1943 లో నోబెల్ బహుమానమును ఆయనతో కలిసి పంచుకొనెను విటమిన్ - ఇ శరీర పోషణమునకు అవశ్యకమనికూడ పరిశోధనముల మూలముగా ఇతడు వెల్లడిచేసెను

## ఎర్లాంగర్ జోసెఫ్ (1874- )

## గాసర్, హెర్బర్టు స్పెన్సర్ (1888- )

ఈ ఇరువురు అమెరికను శాస్త్రివేత్తలు నరములు నిర్వహించు కృత్యములను ఎలెక్ట్రో శారీరక కార్యములని వివరించి 1944 లో నోబెల్ బహుమతిని పంచుకొనిరి గాసర్ 1935-53 సం॥ ల నడుమ రాక్‌ఫెల్లర్ పరిశోధనాగారమునకు పర్యవేక్షకుడుగా వ్యవహరించి స్వయముగా పరిశోధనములు గావించుచు ఇతరుల కృషిని తీర్చిదిద్దుచు విజ్ఞాన శాస్త్రాభివృద్ధికి తోడ్పడెను

చిత్రము - 87

డా॥ ఉపేంద్రనాథ బ్రహ్మచారి

## ఉపేంద్రనాథ్ బ్రహ్మచారి (1873-1946)

ఈ వైద్యశాస్త్రివేత్త భారత దేశమందలి మాంఘీర్ జిల్లాలో 19 డిసెంబరు 1873 వ తేదీన జన్మించెను ఇతడు హుగ్లీ కాలేజీలో బి.ఏ. పట్టమును తర్వాత రసాయనశాస్త్రములో ఎం.ఏ. పట్టమును బొంది గణిత రసాయన శాస్త్రములలో ప్రవీణుడని పేరుపొందెను అంతటితో విద్యాభ్యాసమును ముగించక 1899 లో వైద్యపరీక్షయందు కృతార్థుడై 1902 లో వైద్యశాస్త్రమందును 1904 లో దేహధర్మ విజ్ఞానశాస్త్రమందును డాక్టరేట్ పట్టమునంది సర్వతోముఖ ప్రజ్ఞాశాలియని పేర్గాంచెను

1927 వరకు ప్రభుత్వ వైద్యశాలలో వైద్యవిద్యాచార్యుడుగా కృషిచేసి కలకత్తాలోని కాంప్‌బెల్ మెడికల్ స్కూలులో కాలజార్ జ్వరమును గురించి నిశితమైన పరిశోధనలు గావించెను ప్రభుత్వోద్యోగము నుండి విశ్రాంతి నందిన పిదప ఇండియన్ పరిశోధనా సంస్థ ప్రోత్సాహమును స్వాంతధనమును సమీకరించి యూరియాస్టిబామీన్ అను రాసాయనిక వైద్యయోగికమును కల్పించి కాలజారు జ్వరముపై విజయమును సాధించినాడు మలేరియాకు తుల్యమై మలినయుతమైన మంచినీటిద్వారా వ్యాపించెడి భయంకర వ్యాధి ఈతని కృషివలన అదుపులోనికి వచ్చినది తన కాలమును ధనమును విజ్ఞానపరిశోధనలలో గడపి "సర్" బిరుదాంకితుడై ధన్యజీవియనదగిన ఈ పరిశోధకుడు 6 ఫిబ్రవరి 1946 వ తేదీన యశఃకాయుడయ్యెను

## అలెగ్జాండర్ ఫ్లెమింగ్ (1881-1955)

ఇతడు 1881 ఆగస్టు 6 వ తేదీన స్కాట్లెండులో బీద రైతుకుటుంబమున జన్మించెను విద్యార్థి దశలో ఈయన దారిన నడచిపోవుచు అన్నికాలములలోను పెరుగు మొక్కలను పరిశీలించుచుండెడివాడు పదునాల్గవయేట అన్నవద్ద ఉండి చదువుకొనుటకై ఇతడు లండను నగరమునకుపోయెను ఇట్లుండ 19 వ ఏట దక్షిణాఫ్రికా యందు ఘటిల్లిన యుద్ధములో పాల్గొనుటకై ఫ్లెమింగ్ అచ్చటికేగి యుద్ధము ముగిసిన పిమ్మట తిరిగివచ్చి కళాశాలలో మరల ప్రవేశించెను ప్రవేశపరీక్షలో ఇతడు చూపిన ప్రజ్ఞవలన విద్యార్థి వేతనము లభించెను అటుతర్వాత ఇతడు సెయింట్ మెరీ మెడికల్ స్కూలులోచేరి వైద్యవిద్య నభ్యసింపసాగెను టైఫాయిడ్ జ్వరనిరోధక విధానమును కనుగొన్న అమ్‌రాత్ రైట్ అను నతనికి శిష్యుడై నిర్భయవిమర్శకుడై పరిశోధకుడుగా రూపొందెను

చిత్రము - 89



అలెగ్జాండర్ ఫ్లెమింగ్

ప్రథమప్రపంచ యుద్ధమునకు పూర్వమే టీకా లిమ్ఫ టైఫాయిడ్ ఔషధమును కనుగొన్నాడితడు ఎర్ లిఖ్ అను వాడు కనుగొని తయారుచేసిన సాల్వర్సన్ అను మందును ఇతడు ప్రథమసర్యాయము ఇంగ్లండులో వాడి చరిత్రకెక్కినవాడు ఇంతేగాక యుద్ధకాలములో సైనిక సంక్షేమమున కుపయోగపడు పరిశోధనలను కూడ ఇతడు నిర్వహించినాడు యుద్ధానంతరము ఇన్ఫ్లూయంజా జలుబు మొదలైన వ్యాధులను గూర్చి శోధించుచు ఇతడు సూక్ష్మ క్రిమిహర మైన లైసోజైమును కనుగొని అది మానవుల కన్నిటిలో ఎరిగా ఉండుటయే కళ్ళకు రక్షయని రుజువుచేసెను 1923లో వైద్యపరిశోధనా సంస్థవారు సూక్ష్మజీవులను గురించిన శాస్త్రి సంకలనమును తలపెట్టి స్టెఫైలోకోకై జాతిని గురించి వ్రాయుమని ఫ్లెమింగును కోరిరి కొన్ని విషయములను పునః పరిశీలన మొనర్చుచు సూక్ష్మజీవులను పెంచుట కుద్దేశించిన గాజుపళ్లెములో క్రొత్తరకమైన బూజుపడి దానిచుట్టును క్రిములను నిర్మూలనము మొనర్చినట్లు చూచెను వెంటనే అటువంటి క్రిమిహార సమర్థమగు నూతన రాసాయనిక ద్రవ్యమును తయారుచేసినట్టూహించి పునః ప్రయోగముల వలన దానిని స్థిరపరచెను రక్తప్రసారము ను దోషభూయిష్ఠ మొనర్చు విషక్రిములకు పరమశత్రువుగా పనిచేయు పెనిసిలిన్ ఔషధము క్రమముగా రూపొందెను అది అత్యంత చంచలమైనదగుటచే శాస్త్రవేత్తలు కృషిచేసి దాని అణురచన నిర్మాణమును వివరించి పారిశ్రామికముగా అది తయారగునట్లు సుసాధ్యమొనర్చిరి యుద్ధానంతరము 80 లక్షల పెట్టుబడితో పెనిసిలిన్ పరిశ్రమప్రారంభమైనది 1943 లో రాయల్ సొసైటీ వారు ఫ్లెమింగును ఫెలోగా ఎన్నుకొని గౌరవించిరి 1944లో సర్ బిరుదము 1945లో నోబెల్ బహుమానము 1947లో రైట్-ఫ్లెమింగ్ పరిశోధనాసంస్థ కు డైరెక్టరు పదవియు క్రమముగా ఇతనికి లభ్యమైనవి 1955 మార్చి 11 తేదీన హృద్రోగముచే సునిశిత దృష్టిగల ఈ పరిశోధకాగ్రణియొక్క జీవయాత్ర ముగిసెను

## హోవర్డ్ వాల్టర్ ఫ్లోరి (1898- )

ఇతడొక ఆస్ట్రేలియా శాస్త్రవేత్త రోగనిదాన శాస్త్ర నిపుణుడు సర్ బిరుదమును పొందినవాడు పెనిసిలిన్‌ను రూపొందించుటలో ఫ్లెమింగ్‌కు చేసిన సహకారమునకై 1945 లో ఇతనికి నోబెల్ బహుమతిలో సగభాగము లభించెను

## ఎర్నెస్ట్ బోరిస్ చెయిన్ (1906- )

ఈ ఆంగ్లజీవరసాయన శాస్త్రవేత్త పెనిసిలిన్ ఔషధమును రూపొందించుటలోను దాని అణురచనా విన్యాసమును వివరణ మొనర్చుటలోను దాని పారిశ్రామిక తయారీని తీర్చిదిద్దుటలోను ఫ్లెమింగుకు తోడ్పడి 1945 లో నోబెల్ బహుమతిని పంచుకొనెను

**ముల్లర్ హెర్మన్ జోసెఫ్ (1890- )**

ఇతడు అమెరికను జీవశాస్త్రవేత్తగను విద్యావేత్తగను కూడ ప్రసిద్ధిగాంచినవాడు. X-కిరణముల వలన పారంపర్య వారసత్వమునకు కలుగు లక్షణములలో మార్పులు కల్పించి క్రొత్తరకముల జీవజాతిని సృష్టించుటకు వీలగునని రుజువు చేసినందుకై 1946 లో ఇతడు నోబెల్ బహుమతి గౌరవమును పొందెను.

**కోరి కారల్ ఫెర్డినాండ్ (1896- )**

ఈ అమెరికను జీవరసాయనశాస్త్రవేత్త 1931 నుండి వాషింగ్టను విశ్వవిద్యాలయముతో ముడిపడియున్నాడు. కార్బొహైడ్రేటులు దేహములో వినియోగమగు విధానమును గురించియు, ఎంజైములను గురించియు పరిశోధించినవాడితడు. హౌసే అను శాస్త్రవేత్తతో కలిసి 1947 లో ఇతడు నోబెల్ బహుమతిని స్వీకరించెను.

**బెర్నార్డో అల్బర్టో హౌసే (1887- )**

ఇతడు అర్జెంటినా జాతీయుడైన శరీరధర్మవిజ్ఞాన శాస్త్రజ్ఞుడు. దేహము ఇన్సులిన్‌ను ఉపయోగించకుండ నిరోధించుటలో పిట్యూయిటరీ గ్రంథిస్రుతము లేరీతిగా ముఖ్యపాత్రవహింపగలవో ప్రయోగాత్మకముగా నిరూపించిన శాస్త్రమర్మజ్ఞుడితడు. 1947 నోబెలుబహుమతిని కోరి శాస్త్రజ్ఞునితో కలిసి పంచుకొన్నవాడు.

**మూలర్ పాల్ హెర్మన్ (1899- )**

ఇతడు స్విట్జర్లెండు నందలి ప్రముఖ రసాయనశాస్త్రి. పరిశోధకుడు. డి డి టి అను వ్యవహారనామముతో అందరకు పరిచితమైన డైక్లోరో డై ఫినైల్ ట్రైక్లోరో ఈథేను యొక్క క్రిమిసంహార లక్షణమును 1939 లో కనుగొన్నందున వైద్యశాస్త్రము శరీరధర్మ విజ్ఞానశాస్త్రములలో పరిశోధనముల కేర్పడిన నోబెల్ బహుమతిని 1948 లో అందుకొని అనమాన గౌరవము పొందిన ప్రతిభాశాలి ఇతడు.

**వాల్టర్ రుడాల్ఫ్ హెస్ (1881- )**

ఇతడు కూడ స్విట్జర్లెండు శాస్త్రవేత్త. మెదడులోని కొన్ని భాగములు శరీరములోని వేర్వేరు అంగముల సరిరీతిగా అదుపులో నుంచుచున్నవో వివరించిన కృషికై 1949 లో ఇతడు నోబెల్ బహుమానములో సగభాగమును సంపాదించెను.

**మోనిజ్ ఇగాస్ (1874 1955- )**

పోర్చుగీసు వైద్యుడు. మానసిక వ్యాధుల నివారణకై ప్రత్యేక శస్త్రచికిత్సా విధానమును రూపొందించి 1949 లో నోబెల్ బహుమానములో అర్ధభాగమును లభింపచేసికొనగలిగెను.

**హెంచి ఫిలిప్ షోవాల్టర్ (1896- )**

ఈ అమెరికన్ వైద్యుడు కీళ్ళరోగముల నివారణలో ప్రజ్ఞావంతుడని పేరుగాంచినాడు. మిన్నెసోటా విశ్వవిద్యాలయమునకు అనుబంధముగానున్న మేయో సంస్థలో ఆచార్యత్వమును, మేయోచికిత్సాలయములో వైద్యమును నిర్వహించుచున్న ప్రతిభాశాలి ఇతడు. ఎడ్రినల్ కార్టెక్స్ గ్రంథిస్రుతము (Hormones) లను గురించి చేసిన కృషికై 1950 లో ఇతడు నోబెల్ బహుమతిని మరిద్దరు శాస్త్రజ్ఞులతో కలిసి పంచుకొనెను.

**ఎడ్వర్డు కాల్విన్ కెండల్ (1886- )**

ఈ అమెరికను జీవరసాయన శాస్త్రవేత్త హార్మోనులను గురించియు ముఖ్యముగా ఎడ్రినల్ కార్టెక్సు నుండి లభించు పదార్థములను గురించియు చేసిన కృషికై 1950 లో నోబెల్ బహుమతిని మరిద్దరితో కలిసి పరిగ్రహించెను. థైరాయిడ్ గ్రంథినుండి థైరాక్సినును ఇతడు వేరుచేయగల్గెను. సహచరులతో కలిసి కార్టిసోన్‌ను కొంతవరకు రాసాయనిక కల్పన మొనర్చెను. మేయోచికిత్సాలయములో సహోద్యోగులతో కలిసి కీళ్లవాతజ్వరము నొప్పులు మొదలగు వాటి నివారణౌషధముగా కార్టిసోనును పిట్యూయిటరీ గ్రంథినుండి తయారగు ఎడ్రినోకార్టికోట్రాపిక్ హార్మోనును కలిపి వాడుక చేసి పరిశీలించెను. మేయో చికిత్సాలయములో 1914 నుండియు మిన్నెసోటా విశ్వవిద్యాలయమునకు చెందిన మేయోసంస్థతో 1921 నుండియు సన్నిహిత సంబంధముకల్గి ఆశాజనకముగా పరిశోధనము సాగించిన ప్రఖ్యాత వైజ్ఞానికుడితడు.

**రైక్‌స్టైన్ టాడిస్ (1897- )**

స్విట్జర్లెండు రసాయనశాస్త్రవేత్తయగు ఇతడు కార్టిసోనుయొక్క, ఎడ్రినల్ గ్రంథులనుండి లభించు ఇతర స్రావముల యొక్క రసాయన అణురచనా విన్యాసములను గురించి చేసిన కృషిఫలితముగా 1950 లో వైద్యశాస్త్ర శారీరక ధర్మశాస్త్రములలోని పరిశోధనల కేర్పడిన నోబెల్

బహుమతిని కెండల్ హెంచ్ అను శాస్త్రవేత్తలతో కలిసి పంచుకొనెను

## థెయిలర్ మాక్స్ (1899– )

పరిశోధనాత్మక కృషిలో నిమగ్నుడైన అమెరికా శాస్త్రజ్ఞుడీయన డెంగీ అను పసుపుపచ్చ జ్వరమును నివారించుటకై టీకాను రూపొందించి 1951లో ఇతడు నోబెల్ బహుమతిని పొందెను

## వాక్స్‌మన్ సెల్మన్ అబ్రహామ్ (1888– )

రష్యాలో జన్మించిన అమెరికను సూక్ష్మజీవుల విజ్ఞాన శాస్త్రవేత్త ఇతడు క్షయవ్యాధి నివారణౌషధమగు స్ట్రెప్టోమైసిను కనుగొని దాని ఉపయోగములను వెల్లడించిన ఫలితముగా ఇతడు 1952 లో నోబెల్ బహుమతిని సంపాదించెను

## క్రెబ్స్ హాన్స్ ఎడాల్ఫ్ (1900– )

ఈ ఆంగ్ల జీవరసాయనశాస్త్రవేత్తయు లిప్‌మన్ ఫ్రిట్జ్ ఆల్బర్ట్ అను అమెరికా జీవరసాయన శాస్త్రవేత్తయు కలిసి, కార్బోహైడ్రేటులు క్రొవ్వుకై లపదార్థములు దేహములో వినియోగమగు రీతులను వివరించి 1953 లో నోబెల్ బహుమతిని సంపాదించిరి

## ఎండెర్స్ జాన్ ఫ్రాంక్లిన్ (1897– )

ఈ అమెరికను సూక్ష్మజీవవిజ్ఞానశాస్త్రవేత్త వెల్లర్ థామస్ వ కల్ రాబిన్స్ ఫ్రెడెరిక్ చాప్‌మన్ అను అమెరికను వైద్యులతో కలిసి పాపరోగకారకమైన పోలియో మైలెటిస్ అను వైరసును ప్రయోగశాలలో ఏ జీవి ఆధారములేక యే జీవకణపుంజ సంపర్కములో పెంచు విధానమును రూపొందించినందుకు 1954 లో నోబెల్ బహుమతిని అందుకొనెను

## థియొరెల్ హ్యూగో (1903– )

ఇతడొక స్వీడను దేశీయుడైన జీవరసాయన శాస్త్రవేత్త ఆక్సీకరణ మొదర్పు ఎంజైములను గురించి చేసిన పరిశోధనల ఫలితముగా ఇతడు 1955లో నోబెల్ బహుమతిని పొందెను

## రిచర్డ్స్ డికిన్సన్ డబ్ల్యు జూనియర్ (1895– )

ఇతడును 1895లో జన్మించిన ఆంద్రీ ఫెడరిక్ కూర్నాండ్ అను అమెరికను వైద్యుడును 1904లో జన్మించిన వెర్నర్ ఫోర్స్‌మన్ అను జర్మను వైద్యుడును కలిసి 1956లో నోబెల్ బహుమతిని అందుకొనిరి వారు హృదయశోధనకొరకై కెథిటర్ గొట్టమును లోపలికిచొప్పించు విధానమును సూచించి దానిని వాడుకలోనికి తెచ్చిరి ఈ విధానమువలన మానవుని ఆరోగ్యము కుదుటపడినను పడకున్నను హృదయ శోధనకొరకొక నూతన విధానము ఆవిష్కరింపబడినది

## బోవాంక డేనియల్ (1907– )

ఇతడు స్విట్జర్లెండులో జన్మించిన ఇటాలియను ఔషధ చర్యాపరిశోధకుడు నల్లమందులను పోయ్యకారిన కండరములను మృదువుగాచేయు మందులను హిస్టమిన్ ప్రతికూలౌషధములను తీర్చిదిద్దుటలో ఈ శాస్త్రవేత్త కృషి అత్యంత సహకారికాయైనందున ఈతనికి 1957లో నోబెల్ బహుమతి లభించినది

## బీడిల్ జార్జివెల్స్ (1903– )

ఇతడును లెడర్‌బెర్గ్ జాషువా (1925) టాటుమ్ ఎడ్వర్డులారీ (1909) అను అమెరికను జీవశాస్త్రవేత్తలును కలిసి కొన్ని ప్రత్యేకమైన రాసాయనిక క్రియలను క్రమానుసారముగా నిర్వహించుటవలన రొట్టెబూజుమీద పెరిగెడి బూజు వంశపారంపర్యముగా కొన్ని లక్షణములను సంక్రమింపజేయగలవని రుజువుచేసి 1958లో నోబెల్ బహుమతిని పంచుకొనిరి

## కోర్న్‌బెర్గ్ అర్థర్ 1918– )

ఈ అమెరికను జీవరసాయన శాస్త్రవేత్త న్యూక్లియరు ఆమ్లములు సృష్టియందు సహజముగా ఎట్లు ఉత్పత్తియగునో పరశాణువులుగా ఎట్లు భిన్నమగునో పరిశోధించి తన కృషికి ప్రతిఫలముగా 1959లో నోబెల్ బహుమతిని అందుకొనెను

## బూర్నెట్ మెక్‌ఫర్‌లేన్ 1899– )

సర్ బిరుదును పొందిన ఈ ఆస్ట్రేలియా వైద్యుడు జాతీయమైన జీవకణపుంజములను (Tissues) దేహములో నాటినప్పుడు ఆ దేహము వాటికి ప్రతికూలముగాగాని అనుకూలముగాగాని ఎట్లు నడచుకొనునో పరిశోధించి ఫలితములను వివరించినందుకై 1960లో నోబెల్ బహుమతిలో అర్ధ భాగమును పొందెను

**మేడావార్ పీటర్ బ్రయాన్ (1915— )**

ఇతడొక బ్రిటిష్ జంతు శాస్త్రవేత్త తెగిన నరములను తిరిగి సంధించురీతిని కనుగొన్నవాడు రోగనిరోధకశక్తిని గురించి పరిశోధనల నొనర్చి 1960లో ఇతడు నోబెల్ బహుమానములో సగభాగమును సాధించుకొనెను

**బెక్సిజార్జిఫోన్ (1899— )**

హంగెరిలో జన్మించిన ఈ అమెరికా జీవభౌతిక శాస్త్రవేత్త చెవిలోపలనుండు కాక్లియా అను నతోదరభాగమును ఉత్తేజపరచు భౌతికసాధనమునుగూర్చి చేసిన కృషిఫలితముగా 1961లో నోబెల్ బహుమతిని పొందెను

**విల్కిన్స్, మారిస్ హ్యూ ఫ్రెడరిక్ (1916— )**

న్యూజిలెండులో జన్మించిన ఈ బ్రిటిష్ జీవభౌతిక శాస్త్రవేత్తచేసిన పరిశోధనాత్మక కృషివలన డిసాక్సి రైబో న్యూక్లియక్ ఆసిడ్ యొక్క అణునిర్మాణము అది నిర్వహించు విధులు వంశపారంపర్యా సంక్రమింపజేయు లక్షణములను ఒకతరమునుండి తర్వాతితరమునకు అది ఎట్లు అందజేయునో మున్నగు విషయములు విదితమైనవి ఈ కృషికై ఆయనకు 1962లో నోబెల్ బహుమతి లభించినది

**హాడ్కిన్ అలాన్ లాయిడ్ (1914— )**

దేహధర్మ శాస్త్రాచార్యుడైన ఈ బ్రిటిష్ శాస్త్రవేత్త నరములద్వారా వార్తా ప్రసారమగు విధానమును గురించి శోధించిన ఫలితముగా ఇద్దరు సహచరులతో కలిసి 1963లో నోబెల్ బహుమానమును స్వీకరించెను

**ఆండ్రూ ఫీల్డింగ్ హాక్స్లీ (1917— )**

ఈ బ్రిటిష్ శాస్త్రవేత్త లండను విశ్వవిద్యాలయము నందు దేహధర్మ విజ్ఞాన శాస్త్రాచార్యుడుగా వ్యవహరించుచు 1963లో నోబెల్ బహుమానమును మరిద్దరితో పంచుకొనెను

**ఎక్లిస్ సర్ జాన్ కెరూ (1903— )**

ఈ ఆస్ట్రేలియను శాస్త్రవేత్త అమెరికాలోని చికాగో జీవ వైద్యశాస్త్ర పరిశోధనా సంస్థయందు ఆచార్యుడుగా పని చేయుచు 1963లో నోబెల్ బహుమతిని ఇద్దరు సహచరులతో కలిసి పంచుకొనెను

**కోన్రాడ్ బ్లాఖ్ (1912— )**

జర్మనీలో జన్మించిన ఈ అమెరికను జీవరసాయన శాస్త్రజ్ఞుడు హార్వర్డు విశ్వవిద్యాలయములో ఆచార్యుడుగా నున్నాడు మానవశరీరములో కొలెస్టెరోల్ ప్రమాణమే రీతిగా సరిదిద్దబడునో తైలజన్యములైన ఆమ్లములు ఏరీతిగా వినియోగమగునో శోధించి ఇతడు 1964లో నోబెల్ బహుమతిని మరొకరితో కలిసి పంచుకొనెను

**ఫియొడోర్ లైనెన్ (1911— )**

జర్మను జీవరసాయన శాస్త్రవేత్తయైన ఈయన మాక్స్‌ప్లాంక్ జీవకణ పరిశోధక సంస్థకు డైరెక్టరుగా నుండి 1964లో నోబెల్ బహుమానమును తన సహచరునితో ఉమ్మడిగా పంచుకొనెను

**ఫ్రాంకాయిజాకబ్ (1920— )**

ఈ ఫ్రెంచి శాస్త్రవేత్త అనువంశిక నిపుణుడుగా ప్రసిద్ధికెక్కి 1965లో నోబెల్ బహుమతిని మరిద్దరితో కలిసి పంచుకొనెను

**జాక్స్ మోనోడ్ (1910— )**

ఈ ఫ్రెంచి విజ్ఞానవేత్త పాశ్చర్ పరిశోధక సంస్థలో జీవరసాయన శాస్త్ర విభాగమునం దాచార్యుడుగా వ్యవహరించుచు 1965లో ఇరువురు సహచరులతో కలిసి నోబెల్ బహుమతిని బడసెను

**ఆంద్రీమైకెల్ ల్వోఫ్ (1902— )**

ఈ ఫ్రెంచి శాస్త్రవేత్త సూక్ష్మజీవుల శరీరధర్మ శాస్త్ర నిపుణుడుగా ప్రసిద్ధిబడసి పారిస్ విశ్వవిద్యాలయమునం దాచార్యుడుగా వ్యవహరించుచు 1965లో ఇద్దరు శాస్త్రజ్ఞులతో ఉమ్మడిగా నోబెల్ బహుమానమును పొందెను

**చార్లెస్ బి హగ్గిన్స్ 1901— )**

కెనడాలో జన్మించిన ఈ అమెరికా శస్త్రచికిత్సకుడు పుట్టకురుపు (కేన్సరు) వైద్యములో నిపుణుడు బెన్‌మే కేన్సరు పరిశోధనాలయమునకు డైరెక్టరుగా పనిచేయుచు ఇతడు 1966లో నోబెల్ బహుమతిని సంపాదించుకొనెను

**రాగ్నర్ ఆర్థర్ గ్రానిట్ (1900— )**

ఫిన్లెండులో జన్మించిన ఈ స్వీడిష్ శాస్త్రవేత్త నరములను గురించి ప్రత్యేక కృషి సల్పినవాడు అందుకొరకై ఏర్పడిన నోబెల్ పరిశోధక సంస్థయందు డైరెక్టరుగా ఉన్న వాడితడు రెటినాలోని నరములలో ఒక్కొక్కటి ఒక్కొక్క తరంగ దైర్ఘ్యపు కాంతివలన చైతన్యవంతమగునని రుజువు

చే కంటిచూపును గూర్చి వివరించుచు ఇతడు 1967లో మరిద్దరు శాస్త్రవేత్తలతో కలిసి నోబెల్ బహుమానమును స్వీకరించెను

### హాల్డన్, కెఫర్ హార్ట్‌లైన్ (1903– )

ఈ అమెరికను శాస్త్రజ్ఞుడు బాల్టిమోర్ నగరమందలి 'జాన్స్‌హాప్‌కిన్స్' విశ్వవిద్యాలయమునందు దేహధర్మ విజ్ఞాన శాస్త్రాచార్యుడుగానున్నాడు కంటిలో లక్షల కొలది నరముల పోగులున్నవనియు ఒకేకాలములో ఒక్కొక్కటి వేర్వేరు పనులను చేయుననియు అతిసూక్ష్మము సున్నితమునైన ఎలెక్ట్రోడులను వాడి రుజువుచేసిన ఫలితముగా 1967లో ఇరువురు శాస్త్రవేత్తలతో కలిసి ఇతడు నోబెల్ బహుమానమును సాధించెను

### వాల్డ్ జార్జి (1906– )

ఈ అమెరికను శాస్త్రవేత్త న్యూయార్కు విశ్వవిద్యాలయమునందు జీవశాస్త్రాచార్యుడుగానున్నాడు చతురుస్మీలనము రాసాయనిక క్రియతో ఆరంభమగునని వివరించి 1967లో మరిద్దరు శాస్త్రజ్ఞులతో కలిసి నోబెల్ బహుమానము పొందిన వాడితడు

### హరగోవింద్ ఖొరానా (1922– )

చిత్రము – 69



హరగోవింద ఖొరానా

ఇతడు పంజాబులోని రాయపూరులో జన్మించి 1945 లో రసాయన శాస్త్రమునందు ఎమ్ ఎస్ సి డిగ్రీని పొందెను ఎమ్మట ఈ శాస్త్రజ్ఞుడు కార్బన యౌగిక రసాయన శాస్త్రమునందు కృషి చేయసాగెను 1947లో విదేశములందు పరిశోధనలకై ప్రభుత్వముచే పంపబడినాడు 1948లో లివర్‌పూల్ విశ్వవిద్యాలయమునుండి డాక్టరు పట్టమును సంపాదించెను అనంతరమితడు స్వదేశమునకు మరలివచ్చి తనఅభిరుచులకు తగిన ఉద్యోగము లభించనందున నిరుత్సాహముచెంది 'నఫీల్డ్' ఉపకారవేతనమును పురస్కరించుకొని కేంబ్రిడ్జి విశ్వ విద్యాలయములో నోబెల్ బహుమతి ప్రతిగ్రహీతయైన అలెగ్జాండర్ టాడ్‌వద్ద 1950 నుండి 1952 వరకు కృషి చేసెను పిదప బ్రిటిష్ కొలంబియా విశ్వవిద్యాలయములో 1952–60ల నడుమ కార్బన యౌగికరసాయన శాస్త్రవిభాగమునకు అధిపతిగా నుండి పోలినూక్లియోటైడులగు డి ఎన్ ఏ ఆర్ ఎన్ ఏ ల రాసాయనికల్పనముకై కృషిని ప్రారంభించెను తర్వాత అమెరికాలోని విస్కాన్సిన్ విశ్వవిద్యాలయమునందు ఎంజైము పరిశోధనా విభాగమున కధిపతియై 1966లో ఇతడు అమెరికా పౌరుడై అచ్చటనే స్థిరపడెను ఇతడొక స్విట్జర్లెండు యువతిని పెండ్లాడి ఆమెవలన ఇంత వరకు ముగ్గురు బిడ్డలను బడసెను

జీవ జాతులలో ప్రోటీనులు సృష్టియగు విధానమును గురించియు వారసత్వముగా సంక్రమించెడి లక్షణమును గురించియు ఖొరానా శోధించినాడు ఇతడుచేసిన కృషికై 1968లో వైద్యశాస్త్ర శారీరకధర్మశాస్త్రములందలి పరిశోధనలకై ఏర్పడిన నోబెల్ బహుమతిని మరియిద్దరితో కలిసి పంచుకొనెను ఈ శాస్త్రజ్ఞుని పరిశోధనలు పుట్టకురుపు నివారణ కుపయోగపడుననియు వారసత్వరీత్యా సంక్రమించు లక్షములను ఇష్టమువచ్చినట్లు మార్చుకొను అవకాశము లభించవచ్చుననియు తెలియుచున్నది ఇతడు ఫాస్ఫేటుఎస్టరు లను గురించియు, కోఎంజైము ఎ రసాయన కల్పనను గురించియు కృషిచేయుటయేకాక సుమారు నూరు పరిశోధనాత్మక వ్యాసములనుగూడ రచించి పాశ్చాత్యదేశములలో భారతీయుల ప్రతిభనుచాటినాడు

వారసత్వముగా సంక్రమించు లక్షణములు జీన్ ల ద్వారా ప్రాప్తించును అట్టిజీన్ సృష్టిని 1970 లో రాసాయనిక క్రియలవలన ఖొరానా సాధించి జీవరహస్యములను అవగతమొనర్చి జీవసృష్టియొనర్చుటకును జీవలక్షణములను కావలసినట్లు మార్చుకొనుటకును వీలున్నదని ఋజువుచేసినాడు జీన్ సృష్టికి డి ఎన్ ఏ అణువులు మూలము జీవము ఒక అక్షరమాల అని భావించుచో జీన్ ఒక అక్షరముగా పరిగణించవచ్చును అక్షరములను పదేపదే వాడి పదములను వాక్యములను ముద్రించుట సాధ్యమైనట్లే జీన్‌లను వాడి వేర్వేరు వ్యక్తులను సృష్టించవచ్చునని ఈయన సిద్ధాంతము మానవ జీవకణముయొక్క కేంద్రమందుండు క్రోమోజోములో ఒక్కొక్కదానియందు లక్షఏబదివేల జీనులు గుంపుగూడియుండును అందుచే ఖొరానా సాధించిన విజయము జీవశాస్త్ర పరిశోధనలలో మానవజాతి ఒకఅడుగు ముందుకుసాగుటకు తోడ్ప

డును వైజ్ఞానికముగా మానవ సృష్టికి ఇట్టి కాలవ్యవధియున్నను అనతి కాలములోనే మధుమేహము మానసికరోగములు తలిదండ్రుల యొక్క జీనుల ద్వారా వారి సంతానమునకు సంక్రమించకుండ వాటిని రసాయన క్రియలవలన సరిక్రొత్త రోగలక్షణ రహిత జీనులను ... అవకాశము కల్పించుచున్నది కోరిన లక్షణములు గల పురోభావి విలాసములుగల సంతానమునకు తలిదండ్రులు తమ జీన్సులో మార్పులు కల్పించుటద్వారా పొందు విధానములు అవకాశములు గోచరించుచున్నవి అందువలన ఖొరానా పరిశోధనములు అత్యంత ఎక్కువ ప్రాముఖ్యము కలిగినవై ఫలితముల నిచ్చుననియు ఇట్టి కృషికి అంకురారోపణ మాత్రమే జరిగినదనియు చెప్పవచ్చును ఈ ప్రఖ్యాత శాస్త్రవేత్తకు భారత ప్రభుత్వము 1969 లో పద్మవిభూషణ బిరుదమునిచ్చి గౌరవించినది

హ. ఆ.

## వైదికమతము —

సృష్టికి పూర్వము కేవలవస్తువుండెను

నాసదాసీన్నో సదాసీత్తదానీం
నాసీద్రజో నోవ్యోమాపరోయత్।
ఆనీదవాతంస్వధయాతదేకం
తస్మాద్ధాన్యన్న పరఃకించనాస (ఋ 10 129-1-2)

సృష్టికి పూర్వము ఉన్నదియు లేనిదియుకూడ లేకుండెను వాయువు లేదు దీనిపైదగు ఆకాశమును లేదు ఏది దేనినెక్కడ ఆవరించియుండెను? (ఏమియులేదు) ఎవరికి ఆశ్రయముండెను? గహనము గభీరమునగు జలముకూడ లేదు మృత్యువు లేదు అమృతము లేదు రాత్రియొక్కయు పగటియొక్కయు చిహ్నములు కూడలేవు వేరుగా వాయువులేక తనకుతానుగా శ్వసించు నొకే యొకవస్తువుండెను అంతకు మిక్కిలి మరియేమియు లేకుండెను

ఇట్టి నిరాకార నిర్గుణ సత్తామాత్రమైన యొకవస్తువు నుండి జగత్తువచ్చినదని వేదమతము ఆసద్వస్తువు సమస్తాకారములను సమస్త గుణములను ధరించి దేవమనుష్యతిర్యగాది రూపముగా వ్యక్తమైనది సృష్టి స్థితి సంహారములను గావించునావస్తువు సమస్తమును చూచుచు సమస్తమును వినుచు సర్వమును తెలిసికొన్నదై సర్వులకు శరణ్యమై శరణ్యదమైయున్నది దానిశక్తి విచిత్రము.

విశ్వతశ్చక్షురుతవిశ్వతోముఖో
విశ్వతో బాహురుతవిశ్వతస్పాత్।
సంబాహుభ్యాం ధమతి సంపతత్రై
ర్ద్యావాభూమీ జనయన్దేవ ఏకః॥ (అధ 18 2-6)

ఆ విశ్వకర్మ యొక్కడే అంతటను నేత్రములుగలవాడై అంతటను ముఖములుగలవాడై అంతటను పాదములుగలవాడై భూమిని ఆకాశమును సృజించువాడై అంగనురెక్కల వంటి తన చేతులతో ధరించియున్నాడు

వేనస్తత్పశ్యన్ నిహితంగుహాస
ద్యత్ర విశ్వంభవత్యేకనీడం।
తస్మిన్నిదం సంచవిచైతి సర్వం
సఓతః ప్రోతశ్చ విభుః ప్రజాసు॥

(శుక్లయజుర్వేదీయ వాజసనేయసంహిత 32 8)

గుహానిహితమైన యాసద్వస్తువునే విశ్వభువనములు శరణుచొచ్చుచున్నవి అంతయు నందే కలియుచున్నది ఆపరమేశ్వరుడే సృజింపబడిన యన్ని వస్తువులలోను పడుగు పేకవలె వ్యాపించియున్నాడు అని ఋషి తెలిసికొనుచున్నాడు

సృష్టి స్థితిలయకారకుడైన యాపరమేశ్వరునే సుఖము కొరకై యాశ్రయింప వలయునని చెప్పుచున్న వేదములోనే ఇంద్రాగ్నివరుణ యమాదినామములతో దేవతారాధనము కన్పట్టుచున్నది వేదమే దీనికి సమాధానము చెప్పుచున్నది

ఇంద్రంమిత్రం వరుణ మగ్నిమాహు
రథోదివ్యస్సు పర్ణోగరుత్మాన్।
ఏకం సద్విప్రాబహుధావద
న్త్యగ్నిం యమం మాతరిశ్వానమాహుః॥

(ఋ-1-166-46)

ఇంద్రుని మిత్రుని వరుణుని అగ్నిని పేర్కొనుచున్నారు దివ్యసుపర్ణుడగు గరుత్మంతుడును గలడు ఉన్న దొక్కటియే ఆసద్వస్తువునే విప్రులు అగ్నిగాను యముని గాను మాతరిశ్వునిగాను చెప్పుచున్నారు

వేద మెచ్చటను పరమేశ్వరుని రూపమునకుగాని నామములకుగాని శక్తికిగాని పరిమితులను గల్పింపదు ఆరాధన విధానములుకూడ బహువిధములు సోమరసప్రముఖములైన వస్తువులను దేవతలకర్పించుట యావిధానములలో నొకటి బహువిధయాగములు ప్రసిద్ధములైయున్నవి అగ్నిహోత్రమున ఆజ్యాదిహవిస్సు నర్పించుటయందు ముఖ్యాంగము

పరమేశ్వరునకు విగ్రహములను గన్పట్టుచున్నవి

నమోహిరణ్య బాహవే (తై సం 4-5 2) ఇత్యాది మహోన్నత విగ్రహములు మంత్రములలో కలవు ఇతియేకాక ఋగ్వేదములోగల మూరదేవ శబ్దము భౌతిక విగ్రహమునే తెలుపుచున్నది (ఋ 10-87-2)

పరమేశ్వరుని అపారశక్తి రూపములను ప్రతిపాదించు వేదము పరమేశ్వరుని స్త్రీ బాలాదిరూపములలో ప్రదర్శించు పురాణ వాఙ్మయములో కన్పట్టు వాత్సల్యశక్తి సఖ్య శక్తి దేవీశక్తి మున్నగువాటి కాధారమైనది

శిశుంనవిప్రామతి శీరహన్తి (ఋ 10-128-1)

"ఋషులాయనను ఎల్లవానినివలె లాలన చేయుచున్నారు

సఖాపితా పితృతమః పితౄణాం (ఋ 4-17-7)

దేవా నీవుసఖుడవు ఉత్తమోత్తమ పితరుడవు"

యస్తేస్తనః శశయో యోమయోభూర్యేన విశ్వా పుష్యసివార్యాణి

యోరత్నధావసు విద్యః సుదత్రః సరస్వతి తమి హధాతవేకః (అథ 7-10-1)

ఓసరస్వతీ నీ స్తన్యము మాయానందమునకు మూల కందము శ్రేష్ఠ ప్రాణులన్నింటిని నీవుదానిచే పోషించు చున్నావు దానియందు రత్ననిధికలదు అది సద్వస్తువులను మాకర్పించును దానిని నీవుమాకొరకై యర్పించుచున్నావు

విశ్వవ్యాప్తమైన పరమేశ్వరుని పవిత్రములు శుభ్రములు హృదయాకర్షకములు అయిన వస్తువులలో నుపాసించుటకు పెక్కు మంత్రములలో కన్పట్టును హంసశ్శుచిషత్ ఇత్యాది మంత్రమున సూర్యునిలో అంతరిక్షములో పుణ్యాత్ములలో శుభ్రవస్తువులలో ఈశ్వరదర్శనము కన్పట్టుచున్నది ఇది భగవద్గీతలోని విభూతియోగమును స్మరింపజేయును

అనేక మంత్రములలో పరమేశ్వరుడు అతిథిగా వర్ణింపబడినాడు ఆవాహనము ఆసనము అర్ఘ్యపాద్యాదులు మున్నగు వాటిచే ఈశ్వరుని అతిథివలె పూజించు స్మార్త పౌరాణిక షోడశోపచారసంప్రదాయమును ఇది స్ఫురింపజేయుచున్నది

యజ్ఞము, మంత్రశక్తి:— ఇంద్రవరుణాగ్ని రుద్రవిష్ణ్వాది రూపములలో నున్న పరమేశ్వరుని యనుగ్రహమును సంపాదించుకొనుటకు యజ్ఞము వేదమంత్రగానము సాధనములుగా వేదములలోనే చెప్పబడినవి

ఋచాంత్వః పోషమాస్తే పుపుష్వాన్
గాయత్రంత్వో గాయతి శక్వరీషు।
బ్రహ్మాత్వోవదతిజాతవిద్యాం
యజ్ఞస్య మాత్రాంవిమిమీత ఉత్వః॥ (ఋ 10-71-11)

ఒకడు నిరంతరము వేదములను పఠించుచుండును ఒకడు శక్వరీచ్ఛందస్సులో మంత్రములను గానముచేయును ఒకడు వేదార్థజ్ఞానమును కలిగి దాని నితరులకు కలిగించును ఒకడు వేదమంత్రములలో నియమసహితమైన యజ్ఞకర్మ ననుష్ఠించును

వేద మంత్రములతో కొంచెము ఆజ్యాది హవిస్సును హోమముచేసినను అదిదేవతకు పూర్తిగా తృప్తికరమగునంత పెద్దదిగా దేవతను చేరునని వేదోదితము దేవతాస్తోత్రములుగా నున్న వేదమంత్రములలోనే యజ్ఞవిధానమును సూచించు యజ్ఞ హోతృ వేద్యాదిపదములుండుటచే మంత్రములకు యజ్ఞములతోగల అనాది సంబంధము తెలియుచున్నది దేవతల నారాధించుటకై వేదమంత్రములను వినియోగించుటలోని విశేషమును వేదమే స్పష్టపరచుచున్నది (ఋ 8-92-9; 10-71-11)

సంతానము ఐశ్వర్యము పరాక్రమము తేజస్సు మున్నగు ధర్మావిరుద్ధములైన వాంఛలను తీర్చుకొనుటకు దేవతా స్తోత్రములు మంత్రానుష్ఠానములు యజ్ఞములు సాధనములుగా వేదములలో కన్పట్టుచున్నవి చిత్తము నసత్త్వగుణాభివృద్ధిని కల్గించుటకును సన్మార్గమునప్రవర్తింపచేయుటకును దేవతాసాహాయ్యము కోరదగినది మాబుద్ధిని అశ్రేష్ఠమైన దివ్యతేజస్సునడిపించుగాక! (ఋ 8 62-10) ఇత్యాది భావము లనేక మంత్రములలో గలవు

పిశాచములు శత్రువులు రాక్షసులు సర్పములు క్రూరమృగములు రోగములు మున్నగు అనర్థములను నివారించుకొనుటకును అభ్యుదయమును సంపాదించుకొనుటకును ఉపాయభూతము లగు శాంతిక పౌష్టిక కర్మలు అథర్వవేదములో హెచ్చుగాకలవు

సర్వజ్ఞుడైన పరమేశ్వరుని తెలిసికొనుటకుకూడ వేదము సాధనము పరమేశ్వరజ్ఞానమే వేదమునకు ముఖ్య ప్రయోజనమని సమస్తవేదములు చెప్పుచున్నవి

యస్తన్న వేద కిమృచా కరిష్యతి
యఇత్తద్విదుస ఇమేసమాసతే (ఋ 1-164-39)

అపరమేశ్వరు నెరుగని వానికి ఋక్కులచే నేమిప్రయోజనము ? ఎవరికిజ్ఞానముకలదో వారు సమస్తమును పొందుచున్నారు

పరమాత్మజ్ఞానమిట్లు ప్రశంసింపబడినది
తమేవం విద్వానబి భాయమృత్యో
రాత్మానంధీర మజరంయువానం (అ 10-8-44)

స్థిరము అజరము యౌవనోపేతమునయిన ఆయాత్మ నెరిగినవానికి మృత్యుభయములేదు

వేదసంహితలు యజ్ఞపరముగా అన్వయించునట్లే ఆధ్యాత్మ విద్యాపరముగాకూడ అన్వయించునని సాయణాచార్యులు ఋగ్వేదభాష్యభూమికలో వ్రాసియున్నారు

లోకక్షేమము — వేదపఠనము వేదమంత్రములతో నాచరింపబడు యజ్ఞములు కర్తకేకాక లోకమునకుగూడ శ్రేయస్సును గూర్చును

విశ్వం పుష్టంగ్రామే అస్మిన్ననాతురం

గ్రామమందు సమస్తము పీడారహితముగాను పరిపుష్టమైనదిగాను ఉండవలయును తై సం [45 10

యజ్ఞములు వర్షాభావమును కరవును కాటకమును నివారించునవగుటచే ఈ యనర్థములు దేశములో బయలుదేరుచో అందులకు యజ్ఞముచేయుట కధికారము గల్గియు యజ్ఞముచేయని వానిదే దోషమని తైత్తిరీయ సంహితలో చెప్పబడెను

సంధ్యోపాసనము ఆవశ్యకర్తవ్యము —

శ్రద్ధాం ప్రాతర్హవామహే
శ్రద్ధాం మధ్యం దినంపరి
శ్రద్ధాం సూర్యస్య నిమ్రుచి
శ్రద్ధేశ్రద్ధాపయేహనః (ఋ 10-119-5)

ఓ దేవా! ప్రాతఃకాలమందును మధ్యాహ్నమందును సూర్యాస్తమయ సమయమునను మేము నిన్నాహ్వానించుచున్నాము మాకు శ్రద్ధను కల్గించుము

చాతుర్వర్ణ్య క్షేమము ఆకాంక్ష్యము — వాజసనేయ సంహితలోను (26-2) ఋక్సంహితలోను 10-90-12 బ్రాహ్మణక్షత్రియ వైశ్యశూద్రవర్ణములు పేర్కొనబడినవి బ్రహ్మక్షత్రియులు రెండును కలిసినచోటు పుణ్యమైనది (వా 20-25) అన్నివర్ణముల క్షేమము ఆకాంక్షింపబడినది

రుచంనో ధేహిబ్రాహ్మణేషు
రుచంరాజ సునస్కృధి
రుచగ్ం విశ్వేషు శూద్రేషు
మయిధేహిరుచారుచం 18-48

దేవా! మా బ్రాహ్మణులలో తేజస్సును గల్గించుము మా క్షత్రియులలో వైశ్యులలో శూద్రులలో తేజస్సును గలిగించుము నాయందు తేజస్సునుంచుము

ఆశ్రమధర్మములు — బ్రహ్మచర్యము బహుస్థలములలో స్తుతింపబడినది

బ్రహ్మచారిష్ణం శ్చరతిరోదసీ ఉభే
తస్మిన్ దేవాస్సంమనసోభవన్తి
సదాధార పృథివీందివంచ
స ఆచార్యం తపసాంపర్తి అథ-11-5-1

వేదాధ్యయనము చేయుచున్న బ్రహ్మచారి ఇంద్రియనిగ్రహవ్రతము నాచరించువాడై భూమ్యాకాశాంతరమైన సర్వమును పరిశీలించుచు సంచరించుచుండగా దేవతలెల్లరు వానికనుకూలు రగుదురు అతడు భూమిని స్వర్గమునుగూడ స్వాధీనము చేసికొనగలడు అతడు తనతపస్సుచే గురునియాశయము లన్నింటిని నెరవేర్చును స్మృతులలో చెప్పబడిన బ్రహ్మచారి ధర్మములు - భిక్షాచర్య అగ్నికార్యము కార్ష్ణధారణము మున్నగునవికూడ వేదములలో గన్పట్టుచున్నవి (అథర్వ 11-5-6 9)

బ్రహ్మచార్యేతి సమిధాసమిద్ధః
కార్ష్ణంవసానో దీక్షితో దీర్ఘశ్మశ్రుః
ససద్య ఏతిపూర్వస్మాదుత్తరం
సముద్రం లోకాన్తస్సంగృభ్యముహురాచరిక్రత్
(అథ 11-5-6)

అతిథిపూజ యజ్ఞరూపమయిన దేవతారాధనము, సంతానప్రాప్తి గృహస్థాశ్రమప్రయోజనములుగా చెప్పబడినవి పతిపత్నులు కలిసియే యజ్ఞము చేయుదురు

యాదంపతీ సుమనసాసు నుత ఆచధావతః
దేవాసోనిత్యయాశిర (ఋ సం 8-31-5)

"ఓ దేవతలారా పతిపత్నులు సమానమైన మనస్సుగలవారై నిరంతరము మీకు సోమరసమును అర్పింతురు"

దంపతులిద్దరు కలసి యొకేవ్యక్తి

ఉతఘానేమో అస్తుతః పుమాన్ ఋ 6-61-8
తలియనీలో ఆమె పతి యర్ధభాగము

దాంపత్యము ఈ జన్మలో దృఢముగానున్నచో లోకాంతరములలో కూడ అది సాగగలదు (అ 18 8-1)

పత్ని పతిని ప్రేమధారలలో ముంచవలయును (ఋ 8-5-8-8) పతివ్రత పవిత్రురాలు అనవద్యాపతిజుష్టేవనారీ" (ఋ 1-73-2)

దోషరహితయు పతిచేత సేవితయునగు స్త్రీవలె అగ్ని యున్నాడు

పత్నిగృహమునకు రాణి (ఋ 10-85-46)

పత్నిపారిణహ్యస్యేశే" తై సం 6-2-1-1

"ఇంటిలోని సొత్తుకంతకును పత్నియే అధికారిణి"

దాన ప్రస్థమునకు ప్రధానలక్షణమైన తపోమస్థానాది నియమములు సంహితావాఙ్మయములో బహువిపులముగా ప్రతిపాదింపబడియున్నవి నివృత్తిమార్గమునకు బీజములు బ్రహ్మచర్యగార్హస్థ్యములలోనే యున్నను చివరకు త్యాగ ప్రధానజీవితము విధింపబడినది

"తేనత్యక్తేన భుంజీథా" (వా సం 40-1-2)

అన్ని బంధములు తొలగిన ఎన్నటు మృత్యువుండదు

"ఉర్వారుకమివబంధనా
మృత్యోర్ముక్షీయ మామృతాత్-"

"ఓ దేవా పండిన దోసకాయ తీగనుండి తొలగునట్లు నన్ను మృత్యువునుండి విడిపింపుము"

జీవుడు సహజముగా దివ్యుడు అమరుడు

"అమృతస్య పుత్రా" (ఋ 10-13-1)

ఆ సహజస్థితిని పొందుటకుగాను మానవుడు సర్వమును త్యజింపవలయును అదియే మోక్షార్థత మోక్షచిహ్నము

"ఇతిచా ఇతిమే మనోగామశ్వంప నయామితి
కిం వితోర్యమపాస్యామితి" (ఋ 10-119-58-1)

నేను ఆధ్యాత్మికజ్ఞానము పొందినాను కావున గోవులను అశ్వములను దానము చేసి వేసెదను'

"ప్రవాతా ఇవదోధత ఉన్మిపీతా అయంసత
కువిత్సోమస్యాపామితి" (ఋ 10-119-59-2)

"నేననుభవించుచున్న ఈ ఆధ్యాత్మికోన్నతి బంఝా మారుతమువలె ప్రపంచసుఖముల నుండి వినరివైచుగాక!"

గుణత్రయము - శుద్ధసత్త్వమును ఈ విధముగా వేదము విధించుచున్నది సత్త్వప్రేరకమైన రజోగుణము బహుస్థలములలో కోరబడినది దేవా నీవు పరాక్రమ స్వరూపుడవు నాకు పరాక్రమము నిమ్ము నీవు దుష్టులపై ప్రవర్తించు క్రోధమవు నాకా క్రోధమునిమ్ము (ఋ 8-2-18 1-9-8) ఇట్టి యాకాంక్షలు మిక్కుటముగా నున్నవి నిద్ర మంద కొడితనము మున్నగు తమోలక్షణములు నిరసింపబడినవి (8-2-18)

సచ్ఛీలము కర్మకాండ - సత్ప్రవర్తనము ముఖ్యము యజ్ఞములు జరుగుచోటునకు దుర్వృత్తిగలవారలను రానీయరాదు

"మాశిశ్న దేవా అభిగుర్ఋతంనః"

దుష్కర్మల నాచరించు వారికి యజ్ఞకర్మలు ఫలింపవు

ఋతస్యపంథానతరన్తి దుష్కృతః" ఋ 9-73-6

ధర్మము సత్యము(అ 12-1-1) భూతదయ (వా 31-8) అస్తేయము (వా సం 40-1-2) పరోపకారము మున్నగు సద్గుణములు ప్రశంసింపబడినవి

సర్వభూతమైత్రి - మనుష్యులనేకాక సర్వప్రాణులను మిత్రభావముతో చూడవలయును

"మిత్రస్యమాచక్షుషా సర్వాణి భూతాని సమీక్షే
మిత్రస్యచక్షుషా సమీక్షామహే"(వా 31-18)

సర్వభూతములు నన్ను మైత్రితో చూచుగాక! మేము సర్వభూతములను మిత్రదృష్టితో చూతుము గాక!"

గోవు విశేషముగా పూజింపదగినది
గోవులు తల్లులవంటివి (గోమాతరః)
అవి హింసింప తగనివి (గావో౽ఘ్న్యాః)
గోషుమాశీర్షః (అథ 6-114-8)

స్మృతిపురాణ మతములలో కన్పట్టు నెన్నియో యాచారములు పాపపుణ్యములకు సంబంధించిన భావములు వేద మతములో కన్పటుచున్నది తీర్థములలో స్నానముచేయుట శ్రేయస్కరము (తై సం తీర్థేస్నాతి సతీర్థమేవ సమానానాం భవతి) అతిథులకు దేవతలకు అర్పింపకుండ ఆహారము తినువాడు పాపమునే తినుచున్నాడు కేవలాఘో భవతి కేవలాదీ (ఋ 10-117-6) బహిష్ఠలైన స్త్రీలు బహునియమములను పాటింపవలెను (తై సం 2-5-1) మృతకళేబర

ములను దహనముచేయవలయును (వా సం 40-15) అంత్యేష్టి విహితము (ఋ 10-18) ఇత్యాదు లోకములు కలవు

స్వర్గనరకములు కర్మఫలము -

ఋతుమార్గమును (ధర్మమును) అనుసరించినవారి ఇహలోక పరలోక పరజన్మసుఖములును అధర్మమార్గమునను సరించినవారికి తద్విరుద్ధఫలమును గల్గును

మధు వాతా ఋతాయతే
మధుక్షర న్తిసింధవః
మాధ్వీర్నస్సంత్వోషధీః
మధున క్తముతోషసో
మధుమత్పార్థివంరజః
మధు ద్యౌరస్తునఃపితా (ఋ 1-90-67)

ధర్మమార్గము ననుసరించువానికి ఈ లోకములోను స్వర్గములోను ఆనందము కల్గును నదులు ఓషధులు రాత్రులు ఉషస్సులు భూమి స్వర్గము- అన్నియు మధుమయములై యుండును

పాపాసస్సన్తో అనృతా అసత్యా
ఇదంపదమజనతాగభీరం" (ఋ 4-5-5)

పాపమార్గము ననుసరించువారు మానసిక కాయిక సత్యపరులై లోకైన ప్రసిద్ధమగు నరకమును కల్పించుకొనుచున్నారు

విశ్వకళ్యాణమే వేదమతముయొక్క పరమలక్ష్యము

"ద్యౌశ్శాంతి రంతరిక్షం శాంతిః
పృథివీశాంతి రాపశ్శాంతి రోషధయశ్శాన్తిః
వనస్పతయశ్శాంతిర్విశ్వే దేవాశ్శాంతిర్బ్రహ్మశాన్తిః,
సర్వంశాంతిశ్శాంతిరేవశాంతిస్సామేశాన్తిరేధి"
(అ 19-9-14)

"స్వర్గమునకు శాంతి కల్గుగాక! అంతరిక్షమునకు శాంతి గల్గుగాక! భూలోకమునకు శాంతియగుగాక! ఉదకములకు ఓషధులకు వృక్షములకు శాంతి గల్గుగాక! సమస్త దేవతలకు బ్రహ్మకు శాంతి యగుగాక! సర్వమునకు శాంతి కిని గూడ శాంతి గలుగుగాక! అట్టి శాంతి నాకును కలుగుగాక!

జ. వృ

## వైద్య ధర్మశాస్త్రము (ఆంగ్లవైద్యము)

వ్యవహార వైద్యకము (Forensic medicine) వైద్యక న్యాయశాస్త్రము (Medical jurisprudence) వైధియ వైద్యము (Legal medicine) ప్రభుత్వవైద్యకము (State medicine) అను పదములు సమానార్థకములుగా పోయినను సర్వసాధారణముగా పర్యాయపదములుగనే నేడు వాడబడుచున్నవి ఇటుల వాడుట చాలకాలమునుండియు అమలులోనున్నను అట్టి వాడుక సరియైనది కాదనుట మాత్రము యథార్థము వైధియవైద్యకమను పదము అమెరికా యూరపుఖండములందు మాత్రమే వాడుకలో నున్నది ప్రభుత్వవైద్యకమను దానియందు ఆరోగ్యశాస్త్రము (Hygiene) కూడ చేర్చబడి పూర్వకాలములో యూరపునందు వాడుకలో యుండెడిది కాని ఇప్పుడది వాడుకలో లేదు

వైద్యకన్యాయశాస్త్ర ఉత్పత్తి - వైద్యకన్యాయశాస్త్రమారంభమయిన తీరుతెన్నులను కనుగొన యత్నించినపుడు మనము నాగరికతా ప్రాదుర్భావకాలమునకు పయనించవలసియున్నది శాస్త్రవిజ్ఞానములేని చికిత్సకుల (quacks) వారినుండియు ఇచ్చవచ్చిన రీతిగా మందులను నిర్ణయించు ప్రగల్భకుల (charlatans) వారినుండియు తమను తాము రక్షించుకొను నావశ్యకతను మానవసమాజము తొలియుగములందే గుర్తింపగలిగినది ఇందుల కనుసరించిన చర్యలను నియమములను గురించిన విషయములు ఆదిమకాలపు వైదీయుల ధర్మశాస్త్రములందును పౌరకీయుల న్యాయశాస్త్రములందును కానవగును పవిత్రగ్రంథములందు నిర్వచింపబడిన చికిత్సానియమముల నుల్లంఘించిన ఫలితముగా రోగి మరణించునెడల అట్టి చికిత్సను నిర్వహించిన వైద్యునకు ప్రాచీనకాలమున ఈజిప్టునందు శిరఃఖండన మొనర్చెడివారు పశువులకుగాని మానవులకుగాని శాస్త్రసమ్మతముగాని చికిత్సను చేయుట ప్రాచీన హిందూధర్మశాస్త్రముల రీత్యా శిక్షార్హమగు నేరము అంతేకాదు, వైద్యవృత్తి నిర్వహణము ఆనాటి భారతదేశమున క్రమబద్ధమొనర్పబడియుండెను ప్రభుత్వ ఆమోదితులైనవారు మాత్రమే వృత్తి నిర్వహణమున కనుమతింపబడెడివారు వైద్యవృత్తి నిర్వహింపదలచువారు తొలుత తమ సమర్థతను ఋజువుచేసికొనవలసి యుండెడిది; వైద్యవృత్తియు సువ్యవస్థితమై యుండెను ...ద్యులకు

ను రోగులని వైద్యుడొనర్చు సేవకును సంబంధించిన అనేక వృత్తి నిర్వహణ ఒడంబడికలు కాదు గుర్తింపబడినవి వృత్తి నిర్వహణములో జరుగు దుర్వినీతికి తగుశిక్ష విధింపబడుటకు ఏర్పాటులు గావింపబడియుండెను

వైద్యకన్యాయశాస్త్ర విస్తృతి, నిర్వచనము - వైద్యక న్యాయశాస్త్రము న్యాయశాస్త్రమునందలి ఒక శాఖ వైద్య వృత్తిని వ్యవస్థీకృతము చేయుటయు క్రమబద్ధమొనర్చుటయు దాని ఉద్దేశములై వైద్యునకును రోగికిని మధ్యయుండు చట్టబద్ధమైన బాధ్యతలను వైద్యవృత్తి నిర్వహించు వానిపై ప్రభుత్వము విధించు బాధ్యతలను గురించి ఈ న్యాయశాఖ విస్పష్టము చేయును

న్యాయశాస్త్రములో ఇది ఒక భాగమే అయినను వైద్య వృత్తిలో యుండువాడు దీనిని తెలిసికొనుట తప్పనిసరి వైద్య వృత్తికి సంబంధించినవాడుగా తనకుగల సాంఘిక ప్రతిపత్తి ఎట్టిది ? ఆ ప్రతిపత్తికి చెందియుండు హక్కులు ఎట్టివి ? బాధ్యతలు ఎట్టివి ? అనువాటిని గురించి క్షుణ్ణముగా తెలిసికొని యుండుట చాల ముఖ్యము తన బాధ్యతలను గుర్తెరుగక వాటిని నిర్వహించుటలో ఏలోపముజరిగినను అది కొన్ని దుష్ఫలి తములకు దారి తీయవచ్చును అట్టి బాధ్యతలను గురించి తన కేమియు తెలియదని బాధ్యతారహితముగా నుండదలచిన దాని నొక సమర్థనీయమైన కారణముగా లెక్కించి బాధ్యతా నిర్వహణలోపమును క్షమింపరు

కావున వైద్యకన్యాయశాస్త్రమనునది వ్యక్తుల పౌర సామాజిక హక్కులకు భంగము కలిగించునట్టి అన్ని సమస్యలను చర్చించుచు వ్యక్తి శరీరమునకు కలుగు అన్నివిధములైన ఆ ఘాతము లను తన పరిధియందు ముడుచుకొనియుండుటయేగాక తత్ఫలితముగా వైద్యవృత్తిలోనున్న వానిని న్యాయశాస్త్ర ముతో సన్నిహిత సంబంధము కల్పించుచున్నది దీని సాధార ముగా కొందరు ప్రజలు వైద్యవృత్తిలో తమకు కలిగిన హాని నష్ట పరిహారమునకై కొన్నిటి ఎడల సకారణమును మరి కొన్నిటి ఎడల అకారణముగను న్యాయస్థానములకు పోవలసి వచ్చెను వీటిలో సకారణములైనవాటిని అందరును సమర్థించెదరు అట్టిసందర్భములందునష్టపడిన రోగికి తగు న్యాయమైన నష్టపరి హారము చేకూరవలయు ననియు నష్టకారకుడగు అసమర్థు డైన వైద్యుడు వృత్తినుండి వైదొలగవలయుననుట సంఘ మునందు అనేక వైద్యులు మనసార వాంఛించెదరు కాని నిజమునకు ఈ వృత్తి నిర్వహణ సంబంధమైన దావాలు అనేక ములు అకారణముగను అన్యాయముగను వేయబడుచున్నవి అట్టి దావాలవలన వైద్యులు తమ ప్రతిష్ఠను కోల్పోవుటయు తమ విలువైన కాలమును నష్టపరచుకొనుటయు జరుగు చున్నది చట్టరీత్యా నిర్వర్తింపదగు విధులను చేయక పోవుట వలన ఆ వైద్యుడు శిక్షార్హుడగుటయేకాక ఆ వృత్తికి సంబంధించిన విషయములను గుర్తెరుగక పోవుట యను నేరము క్రింద మరలవేరొక శిక్షకుకూడ లోనగుపరిస్థితి ఏర్పడవచ్చును ఈ విధముగా ప్రశంసనీయులు ప్రతిభావంతులునైన వైద్యు లలోకూడ అనేకులు చట్టరీత్యా తమకుగల బాధ్యతలను నియ మములను గుర్తెరుగక పోవుటచేతనో లేక అశ్రద్ధచే వాటిని విస్మరించుటవలననో అనవసరముగా కష్టముల పాలగుట జరుగుచున్నది అట్టి సందర్భములందు వైద్యుడు తన వాదము ను సమర్థించుకొను ఆవశ్యకత ఏర్పడుచున్నది వైద్యక న్యాయశాస్త్రము పైన వివరించిన సమస్యలను సవివరముగా చర్చించును అందుచే దైనికవృత్తి నిర్వహణములో వైద్యుల కెదురగు సమస్యలను పెక్కింటిని పరిష్కరించి వాటిని క్రమరీతిలో నడుపుటకు ఈ శాస్త్రపరిజ్ఞానము వైద్యునకు తప్పనిసరియగుచున్నది

ప్రస్తావనవశమున ఇంకొక విషయము కూడ చెప్పవలసి యున్నది న్యాయశాస్త్ర విషయములకు వైద్యశాస్త్ర పరిజ్ఞానమును వర్తింపచేయుటచే రూపొందిన ఆధునికవ్యవహార వైద్యకము (Forensic medicine) వైద్యకన్యాయశాస్త్ర ముకంటె ఆధునికమైనది వైద్యశాస్త్రములోని సర్వశాఖలును జీవశాస్త్ర రాసాయనికశాస్త్రములును ఈ వ్యవహార వైద్యక మునకు ప్రాతిపదిక విజ్ఞానమును చేకూర్చునవి న్యాయశాస్త్రా వసరములకు అనుగుణమగు రీతిలో ఆ విజ్ఞానమును వర్తింప జేసిన ఫలితముగా ఈ వ్యవహార వైద్యకము రూపొందినది ఇందు విషయవిజ్ఞానము సహితము ఒక భాగముగా చేరి యున్నది ఈ వ్యవహారవైద్యకము, వైద్యకన్యాయశాస్త్ర ముకంటె విస్తృతియందును నిర్వచనమునందును వేరై యున్నదనుట యథార్థము

జి ఆర్ ఖా

## వైద్య ధర్మశాస్త్రము (ఆయుర్వేదము)

మనము చేయవలసిన విధులే ధర్మములనబడును. వేటిని ఆచరించుటచేత మానవుడు సుఖవంతుడై ఆరోగ్యవంతుడై సృష్టికర్తను సాధించి బంధవిముక్తుడగునో అవియే ధర్మములు. "వైద్యశాస్త్రము ధర్మశాస్త్రము స్థూల దృష్టిచే భిన్నములుగ అగపడినను సూక్ష్మదృష్టితో జూచినచో రెంటికి భేదము లేకపోవుటయేగాక రెంటియొక్క పరమార్థము పరతత్త్వ సాధనమేఅని తెలియగలదు. శరీరము ధర్మసాధనకు మూలము. అట్టి శరీరమును రక్షించుకొనుటకై ధర్మములు చెప్పబడినవి. వాటిని బోధించునదే వైద్య ధర్మశాస్త్రము. ప్రతిజీవి ప్రపంచములో సుఖమును కోరును. అట్టి సుఖసంపాదనమునకు మార్గము ధర్మానుష్ఠానము.

సర్వవిధములైన జీవుల ప్రవృత్తి సుఖసంపాదనమునకై జరుగును. అట్టి సుఖము ధర్మపాలనము (నియమపాలనము) లేనిది చేకూరజాలదు. కాబట్టి సర్వప్రాణులు ధర్మపరులు కావలయును. అనగా శాస్త్రనిర్దిష్ట మార్గములో నడువవలయును అని వైద్యాచార్యుడగు వాగ్భటాచార్యుడు వచించెను.

ఆరోగ్యవంతుని లక్షణము. - ఎవని శరీరములో వాత పిత్త కఫములనెడు త్రిదోషములును, జఠరాగ్ని, రసము రక్తము మాంసము మేధస్సు, అస్థి మజ్జ శుక్రము అనెడు సప్త ధాతువులును మలము మూత్రము స్వేదము అనెడి త్రిమలములును వికృతి చెందక సమస్థితిలో నుండునో ఎవని కర్మ జ్ఞానేంద్రియములు మనస్సు ఆత్మ ప్రసన్నముగనుండునో వాడే స్వస్థుడు అనగా ఆరోగ్యవంతుడు. ఆయుష్మంతుడు వాడే ధర్మార్థ కామమోక్షములనెడు చతుర్విధ పురుషార్థములను సాధింపగలడు. అట్టి ఆరోగ్యమును సాధించుటకై కొన్ని నియమములు చెప్పబడినవి.

దినచర్య రాత్రిచర్య ఋతుచర్యఅనునవి శాస్త్రములలో చెప్పబడినవి. శాస్త్రోక్త విధముగ వాటిని ఆచరించిన మనుజుడు ఆరోగ్యము కలిగియుండగలడు.

దినచర్య. - వేకువజామున 4 గంటలకు నిదురమేల్కొని భగవంతుని ప్రార్థించి దర్పణాదులదర్శించి మలమూత్ర విసర్జనముచేసి దంతధావన జిహ్వోల్లేఖనములనొనర్చుకొని వ్యాయామముచేసి తైలాభ్యంగన స్నానమాచరించి శుద్ధ వస్త్రములధరించి నిత్యానుష్ఠానమొనర్చి హితమైన ఆహారమును మితముగ భుజింపవలయును. ఎదప తాంబూల చర్వణము చేయవలయును.

రాత్రి. - రెండవ జామువనే నిదురించవలయును. ఎదాచారమును సద్వృత్తమును అనుసరించవలయును. శరీరమును ఆరోగ్యముగనుంచుకొనుటకై మలమును మూత్రమును ఆకలిని దప్పిని నిద్రను నిరోధింపగూడదు. అట్లు వీటి వేగముల నాపుటచే సర్వరోగములు కలుగును.

ఋతుచర్య. - ఏయే ఋతువులలో ఏయే ఆహారము విహారములు చెప్పబడినవో వాటిని సేవింపవలయును. వర్జ్యములను విడువవలయును. లోభము అసూయ ద్వేషము మాత్సర్యము వీటి వేగములను అరికట్టవలయును. అట్లు అరికట్టనియెడల అనేక విధములైన వ్యాధులు—ముఖ్యముగ మానసిక వ్యాధులు కలుగును.

చిగుళ్లకు బాధకలుగకుండ ఒక్కొక్క దంతమునే శుద్ధపరచవలయును. అనుదినము అభ్యంగనము చేయవలయును. దాని వలన శరీరమునకు పుష్టి, చర్మమునకు కాంతి కలుగును. వాతము తగ్గును. ముఖ్యముగ శిరమునకు పాదములకు తైలము పట్టించి రుద్దవలయును. చెవులలో తైలమునుంచుట అవశ్యకము. భోజనమునకుముందు అల్లమును లవణమును సేవించినచో అగ్నిదీప్తి కలుగును. ఉదరముయొక్క రెండు భాగములను అన్నముతోను ఒక భాగమును జలముతోను నింపి నాల్గవ భాగమును వాయుసంచారమునకై వదలవలయునేకాని ఉదరమును పూర్తిగ అన్నముతోనే నింపగూడదు.

దప్పిగల వాడు ఆహారమును భుజింపరాదు. అట్లుచేసిన గుల్మరోగము కలుగును. ఆకొన్నవాడు ఉదకపానము చేయరాదు. అట్లుచేసిన జలోదరము కలుగును. తొలుత భుజించిన ఆహారము జీర్ణముకానిదే తిరుగ భుజించరాదు.

ఆహారము మైథునము నిద్ర చదువుట దారినడచుట అను కృత్యములను సంధ్యాకాలములో చేయరాదు.

రాత్రియందు మేల్కొనుట పగటియందు నిదురించుట రోగమును కలిగించును. సజ్జనులతో స్నేహము చేయవలయును. దుర్జనులతోడి స్నేహము యత్నపూర్వకముగ విడువవలయును. సర్వప్రాణులయందు దయగలిగియుండవలయును. ఆకలిగొన్నవారికి వ్యాధిగ్రస్తులకు, దుఃఖితులకు ఉపచారముచేయవలయును. సత్యమైన వాక్కును ప్రియముగ చెప్పవలయును. పరుషవాక్కులు పలుకకూడదు. అబద్ధమాడ

కాదు ఇంద్రియములను ఎక్కువగ లాలించకూడదు పూర్తిగ కాని సుఖమును త్యజించకూడదు

జఠరాగ్నినను సరించి భుజించినచో బలము కలుగును శుక్రము ను ధరించినచో జీవితము వృద్ధియగును కాన అగ్నిశేషమ్మును రక్షించవలయును సదాచార సద్వృత్తుల నను ష్ఠించినచో ఆయుస్సు ఆరోగ్యము ఐశ్వర్యము యశస్సు ఇహలోకాముష్మిక సుఖములు లభించును

వైద్యుని ధర్మములు — శాస్త్రమును చక్కగ చదివి విశేషముగ చికిత్సానుభవము కలిగియుండవలయును శుద్ధమైన మనస్సు దేహము వస్త్రములు కలిగియుండవలయును రోగియందు దయ దాక్షిణ్యము కలవాడై మెలగవలయును రోగితోగాని అతని పరిజనము తోగాని మృదువైన సంభాషణము చేయవలయును వ్యాధిని చక్కగ పరీక్షించి సరియైన ఔషధాదులతో రోగికుపచరించవలయును ఔషధములతో నివర్తించని వ్యాధులను పూర్వజన్మకృతకర్మమువలన పుట్టినవిగ తెలిసికొని వాటిని దాన జప హోమదైవ ప్రార్థనాదులతో చికిత్సచేయవలయును అన్నదానము జలదానము ఔషధదానము చేసినవాడు యజ్ఞములుచేయకయే స్వర్గమును చేరును రోగములనెడి బురదనుండి రక్షించువాడు వైద్యుడు అతడు ఏ ధర్మకార్యములతో అక్కరలేకయే సర్వవిధములైన పూజలకు అర్హుడగును శాస్త్రజ్ఞానము లేకచేసిన చికిత్సవలన పై ధర్మములను విడనాడినవాడై వైద్యుడు ఘోరనరకమును పొందును

రోగిధర్మములు — రోగికి వైద్యునియందు, అతని చికిత్సయందు విశ్వాసముండవలయును వైద్యుడు చెప్పిన ఆహారవిహారాదులసేవించుచు తనశక్త్యానుసారము వైద్యునికి చికిత్సార్థముద్రవ్యమును ఒసగవలయును అతనియందునిరాదరణ చూపక కృతజ్ఞుడైయుండవలయును

పరిచారకుడు — అతడు రోగియందు ప్రేమగలవాడై అతనికి ఉపచరించుటయందు దక్షతగలిగి వైద్యుడు చెప్పినట్లు చేయువాడుగనుండవలయును

ప్ర వెం సు

## వైద్యశాస్త్రి చరిత్ర

మానవుడెంత ప్రాచీనుడో వైద్యశాస్త్ర చరిత్రయు అంత ప్రాచీనమైనది అతిప్రాచీనకాలపు వైద్యశాస్త్రము జానపద భావము లనూడి సంగ్రహింపబడినది

మిక్కిలి ఆదిమవైద్యశాస్త్రజ్ఞులు ఈజిప్టుదేశీయులు వారు రచించిన వైశాస్త్రము క్రీ పూ 3400–1200 నాటిది దానిని గురించి తెలిసికొనుటకు ఆధారములు ఈజిప్టువారి సమాధులు ఈజిప్టు రాజుల పేటికలు అచ్చటి పురోహితులే వైద్యులుగ నుండిరి వారే మృతదేహములకు అంజనములు పట్టించెడివారు కండ్లు తల మొదలగు అవయవములకు అంజనములు పట్టించుటలో ఒక్కొక్కరు ఒక్కొక్క అవయవము విషయములో ప్రత్యేక నైపుణ్యము కల్గియుండిరి

ప్రాచ్యవైద్యశాస్త్రములలో హిందూవైద్యశాస్త్రము పేర్కొనదగినది (ఋగ్వేదము క్రీ పూ 1500 సుశ్రుతుడు క్రీ శ 400 500) హిందూ శస్త్రచికిత్స అమోఘమైనది అన్ని ముఖ్య విషయములును ప్రాచీన హిందువులకు తెలిసియేయుండెను అంటువ్యాధులు గాలిలోనియణువులకు విదితమైయుండెను యూదులు వైద్య న్యాయశాస్త్రములను కన్గొనిరి చైనీయులు పెక్కు ఔషధములను వృద్ధిలోనికి తెచ్చిరి

గ్రీసుదేశమున హిపోక్రటీస్ అనునతడు (క్రీ పూ 670–480) ఆష్టాగోష్ఠిగా వైద్యశాస్త్రమును బోధించు పద్ధతిని ప్రారంభించెను వ్యాధుల నివారణమందు ప్రకృతి మనకు తోడ్పడునని ఆతడు నమ్మెను అతని వైద్యగ్రంథము వైద్యశాస్త్రగ్రంథములన్నిటిలో మిగుల ప్రాచీనమైనది ప్రయోగపూర్వక శారీరశాస్త్రమునకు సేవచేసిన వారిలో క్రీ శ 131–201 మధ్య జీవించిన గెలెన్ అనునతడు మొట్టమొదటివాడు అతని సిద్ధాంతములు అమోఘముగా చెలామణియాడెను సుమారు పదువాల్గు శతాబ్దముల కాలము యూరోపియన్ వైద్యశాస్త్రము రొదుగు బొదుగులు లేకయుండెను సైనిక శాస్త్రములను చట్టములచే రూపొందించి అమలు జరుపుటలో మాత్రమే రోమనులు నిపుణులైయుండిరి శవములను దహనముచేయుట నగరప్రదేశములను నిర్మించు విధానము గాలి వెలుతురు లభించు గృహముల నిర్మాణము బ్రహ్మాండమైన ఆనకట్టలు కట్టుచు మురుగు కాల్వలు త్రవ్వించుట ప్రజలందరికి అందుబాటులో మండు స్నానవసతులు ఆనాటి అద్భుతకృత్యములు

బైజాంటియన్ కాలమువారు క్రీ శ 476–732 సం॥ మధ్య విజ్ఞానవిషయములను పశ్చిమయూరపువారు వాటి విషయమై శ్రద్ధ తీసికొను వరకు సంరక్షించి వాటిని పశ్చిమ

యూరపియనుల వశ మొనర్చిరి

అరబ్బుల పరిపాలనాకాలములో (క్రీ శ 732–1096) ఖలీఫాల ఆస్థానములందు యూదువైద్యులు మిగుల ప్రాముఖ్య ముకల్గియుండిరి అప్పటికి క్రైస్తవ వైద్యులు మంత్రతంత్ర ములను తావీసులను ప్రయోగించు దశయందే యుండిరి యూదు మహమ్మదీయ వైద్యులకే మంత్రతంత్రములందు విశ్వాసములేకుండెడిది ఏవిసెన్నా అనువాడు (క్రీ శ 980–1037) ఈకాలపు వైద్యులలో మిక్కిలి ప్రసిద్ధుడు

మధ్యయుగము (క్రీ శ 1096–1438) నాటి వైద్య శాస్త్రము మాటల చాపల్యమునకులోనై ఛాయను వస్తువుగ పరిగణింపసాగినది అప్రకీర్ణ వైద్యులు కృషిచేసి (తాము పరిశోధించిన అంశములతో నిర్మించిన పునాదిపై) క్రమక్రమ ముగా శస్త్రచికిత్సను వృద్ధిచేయుటయే వైద్యశాస్త్రాభివృద్ధికి రాచబాటయని విశ్వసించిరి వారు ముఖ్యముగా ఫ్రాన్సు దేశమునందు బహిష్కరింపబడిరి పారిస్ వైద్యశాఖకును అప్పటి శస్త్రచికిత్సకులగు మంగలివారికిని ఎడతెగని కలహము సాగుచుండెను తుదకు 1372 లో మంగలివారు కొద్దిపాటి శస్త్రచికిత్సలు చేయుటకు అనుమతివ్వబడిరి క్రమముగా అట్టి శస్త్రచికిత్సా విధానము అంతమయ్యెను పలుతావులలో వైద్యశాలల స్థాపన ప్రధానముగసాగెను 1270 80 సంవత్సర ముల మధ్య సులోచనములు ప్రవేశపెట్టబడినవి పదునేనవ శతాబ్దమునాటికి వాటి ఉపయోగము సర్వసాధారణమైనది 1110 వ సంవత్సరమునందు పారిస్‌లోను 1167 లో ఆక్సు ఫర్డులోను 1209 లో కేంబ్రిడ్జియందును 1281 లో మాంట్ పిల్లియందును విశ్వవిద్యాలయములు స్థాపింపబడినవి

విజ్ఞాన పునరుజ్జీవనకాలము (1453–1483):— ఈకాలమున వైద్యులు జంతు శాస్త్రవృక్ష శాస్త్రములను తమ పరిశోధన ములందు ముఖ్య విషయములుగా గ్రహించిరి శవములను కోసి పరీక్షించుట మొదలయ్యెను రసవాదమింకను వ్యాప్తి లోనే యుండెను 1630 లో సింకోనాబెరడు వాడకము ప్రారంభమైనది సాధారణ వైద్యులు శస్త్రవైద్యులు మంగలివారు కూడ వైద్యులుగా నుండిరి విద్యాగంధములేని మంగళ్లు బహిష్కరణకు నిషేధమునకు గురిచేయబడినను, ఒక్క విషయములో వీరే ఈ ముగ్గురిలో బహుశ్రేష్ఠులై యుండిరి రాజాజ్ఞచే 1660 వ సం॥ నందు మంగళ్లతో కూడిన 'శస్త్రవైద్యుల సమష్టిసమితి" ఆంగ్లదేశమున నెల కొల్పబడెను

పదునాల్గవలూయీ ప్రభువు యొక్క ప్రాబల్యము వైద్యశాస్త్రముపై కూడు విధముగ నుండెను 1657 వ సం॥నందు అతనికి కల్గినసన్నిపాత జ్వరము (టైఫాయిడ్) ఫలితముగా సుర్మాల వాడుక విస్తారముగా వ్యాప్తిలోనికి వచ్చెను అతనికి 1686 లో వచ్చిన భగందరము ఫ్రాన్సులో శస్త్రచికిత్స పునఃస్థాపితమగుటకు కారణమయ్యెను 1663 లో అతని ఉంపుడుకత్తె ప్రసవమునకు క్లిమెంటు అనునతడు సహాయకుడుగా నుండుటకు అనుమతింపబడుట మగమంత్రసాని పద్ధతి పెంపొందుటకు దోహదకారియయ్యెను

విలియంహార్వే (1578–1657) రక్తప్రసారమను విషయ మును కనుగొనెను

1562 వ సం నందు పారిస్‌లో పారే అనునతనిచే తొలి సారిగా శవపరీక్ష జరుపబడినది

వెసేలియస్ (1514–1564) అనునతని వలన శవఖండన విధానము (Dissection) పాఠ్యమేకాక గౌరవప్రదముకూడ నయ్యెను

జయప్రదముగా వృత్తినిర్వహించు వైద్యులకేగాక బూటకపు వైద్యులకు కూడ 18 వ శతాబ్దము స్వర్ణయుగ మయ్యెనని చెప్పవచ్చును బూటకపువైద్యుడు యెల్లెడల రాణించుచునేయుండెను ఫ్రాన్సులో తప్ప తక్కినచోట్ల శస్త్ర చికిత్స మరుగుపడియుండెను సైనికులకు వైద్యసహాయము చేయుట ప్రభుత్వముయొక్క బాధ్యత అయ్యెను శరీరశాస్త్ర మునకు రోగపరీక్షా విధానములకు సంబంధించిన వైద్య శాస్త్రములో విద్యాబోధనాభివృద్ధికి యేర్పాట్లుచేయబడినవి

భావికాలపు రాణికాగల ఆనీ 1692 వసం॥లో హ్యూజ్ చంబర్లెన్ అనునతని వైద్యసహాయమున ప్రసవించెను జాన్ హంటర్ అనునతడు (1728 1793) శరీరాంగయవముల తొలగింపును గూర్చియు శస్త్రచికిత్సా విధానమును గూర్చి యు నూతన ప్రయత్నములు ప్రారంభము చేసెను హంటరు కాలమునాటికి యాంత్రికముగానున్న శస్త్రచికిత్స అతని ప్రతిభవలన ప్రయోగాత్మకమైన శాస్త్రముగ పరిణమించెను గుండెజబ్బులను నిర్మూలించుటలో ఒక వ్రేలును గుండెపై పెట్టి మరొక వ్రేలితో కొట్టుటవలనగల ఉపయోగమును వియన్నా నివాసియగు లియోపాల్డు వవన్ బ్రగ్గర్ (1722–1809) అను వైద్యుడు కనుగొనెను ధర్మామీటరు, వైద్యునిగడియార ము మిగులవ్యాప్తిలోనికి వచ్చెను ఎడ్వర్డు జన్నర్ (1749–

1828) మశూచివ్యాధికి గురికాకుండుటకై టీకాలు వేయించు కొనుటవలన గల ఉపయోగమును కనుగొనెను. ఈ శతాబ్ది మధ్యమున పాశ్చాత్య పద్ధతిప్రకారము వైద్యము చేయు వైద్యశాలలు మొట్టమొదట బొంబాయి మదరాసు కలకత్తాపట్టణములలో స్థాపింపబడినవి కృత్రిమపద్ధతిని ఎల్లలకు ఆహారము నిచ్చు విధానము 1867 వ సం॥ నుండి ప్రారంభ మైనది

19 వ శతాబ్దమున ప్రజలు మానసిక నైతికస్వాతంత్ర్య ములను పొందియుండిరి భౌతిక రసాయన జీవశాస్త్రములు వైద్యశాస్త్రమునకు తోడ్పడెను. హెల్మహోల్జ్ అనునతడు 1847 వ సం॥లో వ్రాసిన "శక్తి పరిరక్షణము" (conserva tion of energy) 1859 లో వచ్చిన డార్విన్ మహాశయుని "మానవ పరిణామము" (Origin of species) అను గ్రంథ ముల మూలమున వైద్యశాస్త్రాభివృద్ధికి నిరోధకములైన భావములు నిర్మూలింపబడెను. ఈ శతాబ్దపు ప్రథమ అర్ధభాగ మున మానసిక వశీకరణశక్తి మొదలగు అద్భుతచికిత్సావిధాన ములు అమలులో నుండెను. శస్త్రచికిత్స యందెన్నియో సాహసయుతములైన ప్రయోగములు జరుపబడెను. పెద్ద ధమనులకు జయప్రదముగా కట్టుకట్టుట సాధ్యమయ్యెను. 1842 వ సం॥ న క్రాఫర్డు విలియమ్సు అనునతడు ఈథర్ (Ether) అను పదార్థమును మత్తుమందుగా ఉపయోగించెను. 1844 వ సం॥ న హొరేస్ వెల్స్ అనునతడు పండ్లను పీకుటకు మత్తుమందుగా నైట్రస్ ఆక్సైడ్ వాయువును ఉపయో గించెను. సర్ జేమ్సు సింప్సన్ 1847 లో క్లోరోఫారమును ఉపయోగించెను. సూక్ష్మవస్తుదర్శిని వలనను వర్ణముల యొక్క ఉపయోగమువలనను సూక్ష్మజీవులను కనుగొనుట సాధ్యమై అది రోగలక్షణ శాస్త్రముయొక్క అభివృద్ధికి దోహదకరమయ్యెను.

రూడాల్ఫ్ వీర్ కో.-(1821-1902) ఛిన్నరోగ లక్షణముల శాస్త్రమును నిర్మించిన వాడితడే. లిస్టర్ ప్రభువు [1827-1912] గాయములు బొగ్గుపులుసు ద్రావకసహాయమున క్రిమి భూయిష్ఠములు కాకుండ కాపాడుటకు తోడ్పడు సూత్రములను కనుగొనెను. వాన్ బర్గమన్ అనునతడు 1886 లో పరికరములకు క్రిములు పట్టకుండ ఉడుకబెట్టు విధాన మును కనుగొనెను. అతడే 1891 లో శస్త్రచికిత్సకు ముందు చేతులు శుభ్రము చేసికొనుట మొదలగు పద్ధతులను కూడ కనిపెట్టెను. హైపోడెర్మిక్ పిచికారీని 1846 లో ఫ్రాన్సిస్ రాండ్ అను వైద్యుడును 1858 లో అలెగ్జాండర్ అను వైద్యుడును ఉపయోగించిరి. ప్రజారోగ్య విషయమున కూడ ఆంగ్లదేశము ముందంజవేయదొడగెను. 1866 సం॥ న విలియం బడ్ అనునతడు బ్రిస్టల్ పట్టణమున కలరావ్యాధిని నిర్మూలించెను. సికింద్రాబాద్‌నందు సర్ రోనాల్డురోస్ అను నతడు దోమలలో మలేరియా వ్యాధికి కారణములైన జీవులను కనుగొనెను.

20 వ శతాబ్దము.—20 వ శతాబ్దియందలి ముఖ్యవిషయ ములు ఆసుపత్రుల నిర్మాణము, రోగుల సంరక్షణము వైద్య విషయక సంబంధి శాసనముల నిర్మాణము వైద్యవిద్యకు సంబంధించిన యేర్పాట్లునైయున్నవి అంతర్జాతీయ సహకార సంఘభావముల మొదలగల దృక్పథము వ్యాధుల శాశ్వత నివారణము అరువదవ శతాబ్దపు వైద్యశాస్త్ర ప్రగతి లక్షణములు 1895 లో రాంట్జన్ యక్సు రేస్‌ను(క్షకిరణములను) కనుగొనెను. 1868 లో క్యూరీదంపతులు రేడియమును కను గొనిరి. అస్లర్ బిల్లింగ్ మొదలగు వారి కృషివలన వైద్య శాస్త్రబోధనము విశ్వవిద్యాలయ బోధనమందు అంతర్భాగ మయ్యెను. అనగా యేదేనివిషయమును వేదవాక్యముగా స్వీకరించుటకు బదులుగా విద్యార్థి తన పరిశీలనశక్తిని, యోచనను ఉపయోగించుటకు అవకాశము కల్గెను. రోగుల సంరక్షణము శాస్త్రసమ్మతమగు పద్ధతిని ఫ్లారెన్సునైటింగేల్ (1828–1910) చే ఏర్పాటు చేయబడెను. మానసిక వ్యాధుల చికిత్సలో శాస్త్రసమ్మతములగు విధానములు అవలంబింప బడెను. ప్రజారోగ్యమనగా కేవలము అంటువ్యాధులను అదుపుచేయుట అనుభావము నశించెను. శిశుసంక్షేమము మురికి కాల్వల నిర్మాణము నీటి సరఫరా ఆహారపదార్థములు మందులలో కల్తీనివారణము మొదలగునవి అందు అంతర్భాగ ములయ్యెను. యుద్ధరంగములో కూడ అంతర్జాతీయ పోలికలు ప్రవేశపెట్టబడినవి.

వ్యాధిగ్రస్తుడైన వ్యక్తి వ్యాధికన్నను సంఘమున కెక్కువ ప్రమాదకారియను విషయమును రెండు ప్రపంచ యుద్ధములును రుజువుచేసినవి. రెండవ ప్రపంచయుద్ధము ముగిసిన తరువాత నరముల వ్యాధిచే బాధపడువారికి చేయ వలసిన మానసిక చికిత్సకు శాశ్వతస్థానమేర్పడినది. వైద్య శాస్త్రము సర్వప్రజానీకమునకు ఉపయోగపడగల పెన్నులు

కానరాదొడగినవి రష్యాలో విప్లవానంతరము ను ఇంగ్లండులో 1945 వ సంవత్సరమున అది సాధ్యమైనది 1954లో భారతదేశమున పారిశ్రామిక కార్మికుల విషయములో అది అమలులోనికి వచ్చినది

వైద్యశాస్త్ర విజృంభణములో వైద్యవృత్తి నవలంబించు వారు ఏ శాఖలోనైనను ప్రత్యేక ప్రావీణ్యమును సంపాదించు పద్ధతి అమలులోనికి వచ్చినది వైద్యశాస్త్రమంతటికిని వైశిక భావనయే గుండె కాయవంటిది

ఈనాటి వైద్యశాస్త్రము చరిత్రకు పూర్వమునుండియే వృద్ధిపొందసాగినది శాస్త్రమును నిరోధింపగల హద్దులు లేవు రేడియో విమానము పత్రికలు మొదలగు సాధనములు వైద్యశాస్త్రమునకు అంతర్జాతీయ దృక్పథమును ప్రసాదించినవి ఒక నూతన ఔషధముగాని ఒక నూతన రోగపరీక్ష పద్ధతిగాని ఒక చికిత్సావిధానముగాని, కనుగొనబడిన యెడల అది రహస్యముగా దాచిపెట్టబడక వెంటనే లోకమునకు ప్రచురింపబడుచున్నది తత్ఫలితముగా ఒక విషయమును గ్రుడ్డిగా శిరసావహించక స్వయముగా పరిశీలించియే విశ్వసించు శాస్త్రవేత్తలుద్భవించిరి పరిసరముల శుభ్రతావశ్యకత వైద్యశాస్త్రమందలి ఇటీవలి సంఘటనము రోగిని సంరక్షించు విషయములోనే పరిసరములు కూడ అతని ఆరోగ్యమునకు దోహదకరములుగా నుండవలెను

నవీన వైద్యశాస్త్రమునకు ఉజ్జ్వలమైన భవిష్యత్తు కలదు వ్యాధినివారణమందు పెన్సిలిన్‌వంటి ఔషధములు కనుగొనబడి నవీనవైద్యశాస్త్రము మార్పుచెందుచునే యున్నది ప్రపంచములోని వివిధప్రాంతములందలి సాధకులు దానిని వృద్ధి చేయుచున్నారు వైద్యశాస్త్రము మానవజాతితో సమానమైన ప్రాచీనతగలది

ఎస్ వేం

## యక్తికధర్మము

శ్రీకృష్ణుడు భగవద్గీతలో 'శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్। స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః' అని చెప్పుటనుబట్టి ధర్మము ఎవరికైనను స్వధర్మమనియు రెండు విధములుగా విభజింపబడవచ్చుననుట సిద్ధము సర్వులకు సర్వకాల సర్వావస్థలయందును ధర్మమొకే విధముగానుండదు అందుచేత ధర్మమువారము ఎవరికి ఏపరిస్థితులలో ఏధర్మము వర్తించునో తెలిసికొనుటకష్టతరమైనవిషయము అందుచేత ధర్మశాస్త్ర లక్షణములయొక్క సూక్ష్మత ప్రసిద్ధికెక్కినది

భారతదేశములో చాలకాలమునుండి సమాజము వర్ణాశ్రమములనుబట్టి విభజింపబడియున్నది ఒక వ్యక్తి ఏవర్ణమునకు చెందునో ఆవర్ణధర్మమునే అతడు ఆచరించవలెను ఏ ఆశ్రమమునకు చెందునో ఆ ఆశ్రమధర్మమునే యనుష్ఠించవలెను ఈవిధములైన భేదములేగాక దేశకాలములనుబట్టి కూడ ధర్మభేదములు జనించును ఈనాడు హిందువులని పిలువబడు వారి పూర్వీకులు వైదికమతావలంబులై యుండిరి వారికి శ్రుతిస్మృత్యాది ధర్మశాస్త్రములు ప్రమాణములు క్రమేణ యవనులు బర్బరులుమొదలగు అవైదికులుభారతదేశమునకువచ్చి ఇక్కడ స్థిరముగ నివసించుచుండిరి అటువంటి వారికి ఏధర్మశాస్త్రములు ప్రమాణములో తెలియదుగాని వారివారి ఆచారముల నాశ్రయించి ధర్మములు వృద్ధిచెందుచుండినవి బౌద్ధులు జైనులు మొదలగువారుగూడ బ్రాహ్మణ ధర్మమును కొంతవరకు విడనాడి వారివారి ఆచారముల నాశ్రయించియుండిరి తరువాత ముస్లిములు శిక్కులు క్రైస్తవులు పారసీకులు భారతదేశవాసులైనారు ఇది భారతీయ సమాజ పరిణామ చరిత్ర హిందూరాజ్యములు ముస్లిమురాజ్యములు ప్రబలియున్న కాలములో హిందువులు హిందూ ధర్మములను ముస్లిములు వారి స్వీయధర్మములను అనుసరించుచుండిరి ఏదైన వివాదమేర్పడినచో వారివారి కులపెద్దలు ధర్మనిర్ణయముచేయుచుండిరి అట్లే బౌద్ధులు జైనులు శిక్కులు వారివారి ఆచారముల రీత్యా వారివారి కుల పెద్దల నిర్ణయములకు బద్ధులవుచుండిరి రాజులు న్యాయాధిపతులుగూడ వివాద పరిష్కారముచేయునప్పుడు ఎవరి ధర్మములను వారికి వర్తింపజేయుచుండిరి అందరికిని సామాన్యమైన ధర్మములు చాలవరకుండినను కొన్ని ప్రత్యేక ధర్మములుకూడ ఉండియుండెను ఆప్రత్యేక విషయములలోనే మార్పులుండెను ఉదాహరణకు పరహత్య స్తేయము (దొంగతనము) చేయరాదనునవి సామాన్య ధర్మములు ఒక మృతుని ధనమును పొందువారెవరు ? అను ప్రశ్నకు సమాధానము ఆ మృతుడు చెందిన మతము కులములమీద ఆధారపడును భారతదేశములో బ్రిటిష ప్రభుత్వము స్థిరపడిన తరువాత క్రైస్తవ మతస్థులు ఎక్కువ కాసాగిరి అట్లే ఒక దశలో పారసీక మతస్థులు భారతదేశములో స్థిరనివాసమేర్పరచుకొనిరి ప్రభుత్వముమీద ఎల్ల

స్పుడు న్యాయనిర్వహణ బాధ్యతయుండుటచేతను న్యాయము ధర్మశాస్త్రము ననుసరించియుండుటచేతను న్యాయస్థానము ఏధర్మశాస్త్రము ననుసరించి న్యాయమును చేకూర్పవలెనను ప్రశ్న ఉత్పన్నమాయెను ఇందుకు సమాధానముగా బ్రిటిషు రాణి [విక్టోరియా] హిందువుల ప్రత్యేక విషయములలో అనగా హిందూమతముమీద ఆధారపడిన వాటిని హిందూ ధర్మశాస్త్రము ననుసరించియు ముస్లిముల విషయములలో వారిమతశాస్త్రము ననుసరించియు న్యాయము చేకూర్చబడునని శాసించియుండెను అందుచేత దండశాస్త్రము [క్రిమినల్ లా] క్రయవిక్రయములు ఒడంబడికలు నష్టపరిహారాది సామాన్య విషయములను (general Law) గూర్చి సామాన్య ధర్మశాస్త్రముచేత న్యాయనిర్ధారణము చేయబడుచుండగ కుటుంబ ఆస్తి రిక్థము దత్తత వివాహము మహర్ విడాకులు మొదలగు విషయములు అవ్యవహారసంబంధము కలిగిన వ్యక్తుల మతధర్మశాస్త్రమునను సరించియుండుటచేత అట్టి విషయములు సాముదాయకముగా వైయక్తిక ధర్మశాస్త్ర (personal law) మను పేరుతో వ్యవహరించబడుచున్నది ఏదేశములోనైన ప్రజలందరు ఒకే మతమునకు చెందినచో వైయక్తిక ధర్మశాస్త్రమును ప్రసక్తియుండదు బహుమతావలంబులున్న దేశములలో ఎవరి ధర్మమును వారు కాపాడుకొను ఆసక్తియుండుటయు అట్టి ఆసక్తిని ప్రభుత్వము గౌరవించుటయు సహజము కాని ధర్మమెప్పుడును పరివర్తనము చెందునది కాబట్టి కాలక్రమేణ వైయక్తిక ధర్మముల దృశ్యమై సామాన్య ధర్మములోనే అవి లీనము కావచ్చును అందుచేతనే భారత రాజ్యాంగ చట్టములో భారతదేశ ప్రజ అందరికి ఒకే ఒకసమగ్ర ధర్మశాస్త్రమును (civil code) వర్తింపచేయుట ఆశయముగా చెప్పబడినది ఈ ఆశయమెప్పుడు నెరవేరునో చెప్పుట దుర్లభము పై ఉపోద్ఘాతమును దృష్టిలో నుంచుకొని భారతదేశములో ముఖ్యమైన వైయక్తిక ధర్మశాస్త్రములను క్లుప్తముగా సమీక్షించుదము

హిందూధర్మశాస్త్రము — ఇది శ్రుతులనుండియు మను యాజ్ఞవల్క్యాదులచే రచింపబడిన స్మృతులనుండియు వీటి మీద పండితులచే చేయబడిన వ్యాఖ్యానములనుండి సంగ్రహించబడిన సూత్రములచేతను సదాచారములచేతను నిర్మింపబడి వైదిక మతావలంబులను బద్ధులను చేయుచున్నది కాలక్రమేణ తన్మతమును విడనాడి నూతన పంథాలను త్రొక్కిన జైన బౌద్ధ లింగాయత బ్రహ్మసమాజ శిక్కు మతస్థులు గూడ ఆచారరీత్యా పూర్వపు వైదిక మతధర్మములనే అనుసరించియుండిరి ఇటీవల 1956 వ సంవత్సరములో విభిన్న ధర్మములను ఏకీకృతము గావించి పార్లమెంటు నాలుగు చట్టములను చేసినది

[1] రిక్థ ధర్మము లేక వారసత్వ చట్టము (Hindu Succession Act) [2] వివాహచట్టము (Hindu Marriage Act) (3) దత్తత మనోవృత్తి చట్టము (Hindu Adoption and Maintenance Act) హిందూ మైనారిటీ (పోగండ) సంరక్షకత్వ చట్టము (Hidu Minority and guardianship Act) (4) హిందూ మైనారిటీ (పోగండ) సంరక్షక చట్టము కేరళ రాష్ట్రములో స్త్రీల ద్వారా ఆస్తిసంక్రమించు మరుమక్కత్తాయము నుపద్ధతిని అవలంబించుచుండిన నాయర్ మొదలగు కులముల వారందరకుగూడ ఇప్పుడు సాధారణముగా ఈచట్టములు వర్తించుచున్నవి కొద్దికొద్ది భేదములతోనైన చెప్పబడిన వారందరు పై విషయములలో సమాన ధర్మమును కలిగియున్నారు కాని కుటుంబము కుటుంబాస్తి విషయములలో ఇప్పటి ని పూర్వపు భేదములు కొలది మార్పులతో అట్లే నిలిచియున్నవి

యాజ్ఞవల్క్యస్మృతి మీద విజ్ఞానేశ్వర యోగి మితాక్షర యను వ్యాఖ్యానమును రచించియున్నాడు ఈ మితాక్షరను ప్రధమ ప్రమాణముగా పెక్కుప్రాంతములందలి హిందువులు అంగీకరించి అనుసరించుచున్నారు వంగదేశములో కొన్ని ప్రాంతములవారు మాత్రము జీమూతవాహనుడు రచించిన దాయభాగ యను ధర్మశాస్త్ర గ్రంథమును ప్రధమ ప్రమాణముగా అనుసరించుచున్నారు మితాక్షర" ప్రకారము తండ్రి తాత ముత్తాతల ఆస్తిలో ప్రతివానికిని జన్మచేతనే స్వత్త్వము కలుగుచున్నది ఆత్మావైపుత్రనామాసి అను వేదవాక్య ప్రకారము ఒక పురుషుడు తన పుత్రుని రూపముదాల్చి పుట్టుచున్నాడు నీవే నీ పుత్రుడవై పుట్టుచున్నావని దీనియర్థము పుత్రుడనగా పుత్ర పౌత్ర ప్రపౌత్రులని భావము ఈ రెండర్థములను జోడించినచో నీవే నీ పుత్రుడవు పౌత్రుడవు ప్రపౌత్రుడవునై పుట్టుచున్నావను సమగ్రార్థము లభించును దీనిఫలితముగనే తండ్రి, తాత, ముత్తాతల ఆస్తికి కొడుకు, మనుమడు, మునిమనుమడు అధికారులయ్యెదరు

ఉదాహరణ – రామయ్య అను వ్యక్తికి రంగయ్య అను కొడుకు పుట్టినట్లు భావించుము పై శ్రుతిప్రకారము రామయ్యయే రంగయ్య రూపము దాల్చి పుట్టియుండుటచే ఇద్దరు రామయ్యలున్నట్లు భావింపవచ్చును అందుచేత రామయ్య ఆస్తి ఇద్దరు రామయ్యలకును చెందును రంగయ్య తనపుట్టుకతోనే రామయ్యయై యుండుటచేత రెండవ రామయ్యకు (అనగా రంగయ్యకు) జన్మచేతనే స్వత్వమేర్పడును అట్లే రంగయ్యకు రమణయ్య యనుకొడుకు పుట్టినట్లు భావించినచో రామయ్యలు ముగ్గురైనట్లు స్పష్టము కాగలదు అట్టిచో రామయ్య ఆస్తి ముగ్గురు రామయ్యలది కాగలదు అట్లే ప్రపౌత్రుని విషయములో పై వేదవాక్యం అర్థవంతము కాగలదు అందుచేత హిందూమతావలంబులలో ఏ పురుషునకైనను పూర్వార్జితమైన ఆస్తియుండి కుమారుడు పుట్టినచో పుట్టుకతోనే కుమారుడు పూర్వార్జితపు ఆస్తిలో అధికారి లేక స్వామికాగలడు పితృ పితామహ ప్రపితామహ ద్రవ్యేజన్మనైవ స్వత్వంస్యాత్ ఈ విధముగా కుమారోత్పత్తి కుటుంబాస్తికి బీజముచేయుటయైనది తదాది తరముల వారందరికి ఆ ఆస్తి కుటుంబాస్తి కాగలదు ఆ కుటుంబాస్తితో సంబంధము లేకుండ అనగా "తదవిరోధేన" ఎవరైన స్వార్జితముగ సంపాదించినచో అది స్వార్జిత ఆస్తియనబడును కాబట్టి ఒక హిందూపురుషుని చేతిలోని ఆస్తి వాని కుటుంబమునకు చెందినదైనను కావచ్చును లేక వాని స్వంత ఆస్తియైనను కావచ్చును ఎవరైనను ఆస్తిని కొన్నచో అది కుటుంబాస్తియైనయెడల కుటుంబధర్మమునకు లోబడియుండు వాని స్వంత ఆస్తియైనచో సామాన్యధర్మమునకు లోబడియుండును కుటుంబ ఆస్తియైనచో కుటుంబమందలి ఇతర సభ్యుల స్వత్వముకూడ అందులో ఇమిడియుండుటచేత ఎట్టి అన్యాక్రాంతమైనను వారి యధికారమును భంగపరచజాలదు ఈ విధముగా పుత్రజన్మ స్వత్వమును అది ప్రాతిపదికగాగల కుటుంబాస్తిని గూర్చిన నిబంధనములు హిందూధర్మ శాస్త్రములో తప్ప మరెక్కడను కానరావు ఇది హిందూమతమందలి విశిష్టత మరొకటి హిందూమతరీత్యా పుత్రులు లేనివానికి సద్గతులులేవు ( అపుత్రస్యగతిర్నాస్తి") ఈ విధముగ హిందూధర్మ శాస్త్రము పుత్రప్రాముఖ్యమును నిర్వచించియుండుటచేత పుత్రుడులేనివాడు ఒక పిల్లవానిని తన పుత్రుడుగా చేసికొనుట ధర్మశాస్త్రిదేశమైయున్నది అపుత్రుడుగాని మృతపుత్రుడుగాని పుత్రుడుకలిగిన మరొక పురుషుని యాచించి వానిచే ఇయ్యబడి శాస్త్రరీత్యా దత్తహోమము జరుపబడినచో ఆ దత్తపుత్రుడు ధర్మశాస్త్రరీత్యా తనపుత్రుడై పుత్రాధికారమును పొందగలడు ఈ విధముగ ప్రతివాడను పుత్రవంతుడు కాగలడు ఈ విధమగు దత్తపుత్రత్వము హిందుధర్మ శాస్త్రమున కొక ప్రత్యేకత

ఈ ప్రత్యేకతలు కాక కొన్ని ఇతర విషయములకు ద మతరీత్యా హిందూధర్మశాస్త్ర భాగములై హిందువులకు వర్తించుచున్నవి దాయలేక రిక్థక్రమము వివాహము విడాకులు ఆధారపడిన వారి పోషణము పోగండ సంరక్షక సంబంధములు ఇట్టి విషయములలో చట్టరీత్యా ధర్మసూత్రములు మార్పబడువరకు ప్రస్తుతధర్మశాస్త్రము ఆచారముతో సమన్వయము చేయబడి వర్తించగలదు-ఇవిగాక మతాదాయములు ధర్మాదాయములను గురించికూడ ధర్మశాస్త్రములో ప్రత్యేకప్రకరణములున్నవి అవి యిప్పుడు ఆచరణలోకూడ నున్నవి ధర్మకర్తలు అర్చకులు మహంతులు మఠాధిపతులు మొదలగు మఠాధికారుల అధికారబాధ్యతలు ధర్మశాస్త్రములో నిర్వచించబడియున్నవి పాపభీతి అధికార దుర్వినియోగమును కొంతవరకే నివారించును న్యాయస్థానములు హిందూమతదేవాదాయ చట్టములు అధికార దుర్వినియోగమును నివారించుటకును దేవాదాయమును క్రమమైన పద్ధతిలో ఉపయోగించుటకును విశేషావకాశములను కల్పించుచున్నవి కాని పాపభీతిలోపించి యుండుటచేతను స్వార్థపరత్వము విస్తరించి యుండుటచేతను కొంత దుర్వినియోగము తప్పుటలేదు

ముస్లిము ధర్మశాస్త్రము – భారతదేశములో హిందూమతస్థుల తరువాత ముస్లిము మతస్థులు అధికసంఖ్యలో నున్నారు వీరిని మహ్మదీయులనియు అందురు ఒక్కడే దేవుడనియు మహమ్మదు దేవదూత(ప్రవక్త) యనియు విశ్వసించువారు ముస్లిములు-మహమ్మదుస్థాపించిన మతము ఇస్లాము ఇస్లామునకు చెందినవారుముస్లిములు-వీరి పవిత్రమతగ్రంథమైన కొరాన్ ముస్లిములకు పరమప్రమాణమై యున్నది కాని ఆ గ్రంథములో కొద్దిభాగము మాత్రమే ఆస్తి వాక్యములకును న్యాయస్థానములో ఉపయోగపడు ధర్మసూత్రములకును సంబంధించియున్నది కొరాన్ మీద ముస్లిము మతగురువులు

చేయుచువచ్చిన వ్యాఖ్యానములు గూడ ప్రమాణములైనవే కాని సదాచారములు పూర్వనిర్ణయములు గూడ ప్రమాణములే పై ధర్మమూలములలో ఏ ఒక్క సూత్రము కూడ వర్తించనిచో ఆత్మప్రేరిత నిర్ణయము వర్తించగలదు ముస్లిములలో సున్నీమతస్థులనియు షియామతస్థులనియు రెండు అంతర్భాగము లున్నవి ఈ రెండును ముస్లిము మతచరిత్రను బట్టి ఏర్పడినవి సున్నీమతములో గూడ హనఫీ మాలికీ " "షాఫీ హన్బలీ యను తెగలుగలవు షియాలలో అత్నా-అషారియా అని ఇస్మాలియా అని జైద్యా' అని తెగలుగలవు అందుచేత అందరు ముస్లిములకు ఒకే ఒక ధర్మశాస్త్రము వర్తించదు ఒక ముస్లిమువ్యక్తి ఏ విభాగమునకు చెందినదియు తెలిసికొని ఆ వ్యక్తికి ఆ విభాగమునకు లేక తెగకు సంబంధించిన ధర్మశాస్త్రమును వర్తింపజేయవలెను భారతదేశములో ముస్లిములకు వివాహము విడాకులు(మహర్) అరణము వారసత్వము దానము మరణశాసనము మైనర్ల సంరక్షకులు భరణము మొదలగు విషయములలో ముస్లిము వైయక్తిక ధర్మశాస్త్రము వర్తించును ఇస్లాము మతరీత్యా ముస్లిము స్త్రీ పురుషులు తమ కలయికకొరకు చేసికొను ఒడంబడిక వివాహమనబడును పురుషుడు నలుగురు భార్యలను చేసికొ వచ్చును స్త్రీకి ఒకసమయములో ఒకే భర్త యుండవచ్చును విడాకులు పొందిన తరువాతగాని భర్త మరణించిన తరువాతగాని ఇంకొక వివాహము చేసికొనవచ్చును వివాహము చేసికొన్నందుకు ప్రతిఫలముగా స్త్రీకి పురుషుడు నిర్ణీతమైన అరణము (మహర్) ఇయ్యవలసి యుండును లేదా భవిష్యత్కాలములో యిచ్చుటకు బద్ధుడు కావలెను భర్త తనయిష్టము చొప్పున భార్యకు విడాకులియ్యవచ్చును భార్యకు మాత్రము భర్తసమ్మతిలేక విడిపోవు అధికారములేదు ప్రబలకారణ మున్నప్పుడు కోర్టుద్వారా భార్య విడాకులు పొందవచ్చును వివాహము శాశ్వతమైనది కావచ్చును; లేదా తాత్కాలికమైనది యైనను కావచ్చును అనగా 6 సంవత్సరములవరకో 10 సంవత్సరములవరకో లేక ఉభయులు అంగీకరించు కాలమువరకో భార్యాభర్తలుగా జీవించునట్లు ఒడంబడిక చేసికొనవచ్చును ఆ తరుణములో గర్భోత్పత్తియైనచో పుట్టుశిశువు ధర్మశాస్త్ర రీత్యా సక్రమమైన శిశువుగనే పరిగణించబడును ఒకని ఆస్తి వానికే చెందును గాని అతడు జీవించియుండగా సంతానమునకు ఆస్తిపై ఎట్టి హక్కునులేదు ఒకడు చనిపోయిన తరువాత వానివారసులు అందు నిర్ణీతభాగములు పొందగలరు ఒకరు స్త్రీ గాని పురుషుడుగాని చనిపోయిన తరువాత వాని సన్నిహితులు వారసు లనబడుదురు మరణశాసనము చేయక చనిపోయినచో వాని వారసులు ఆస్తికి హక్కుదారులు కాగలరు వారసులు రెండుతరగతులుగ నుందురు మొదటి తరగతివారు అంశభాక్కులు (Sharers) వారికి వారి మతధర్మరీత్యా నిర్ణీతమైన అంశము చెందగలదు వారు వారి అంశములను తీసికొన్నతరువాత శేషించిన ఆస్తిని తీసికొనువారు 'శేషభాక్కులు"గ (Residuaries) పేర్కొనబడుచున్నారు కొడుకు కూతురు లేక సోదరుడు సోదరి మొదలగు సమాన బంధుత్వము కలిగిన స్త్రీపురుషులున్నచో స్త్రీ ఒక భాగమును పురుషుడు రెండు భాగములును పొందగలరు సన్నిహిత బంధువులకు కొంచెమైనను ఆస్తి సంక్రమింపజేయు సూత్రములు వారసత్వమునకు సంబంధించిన ధర్మశాస్త్రములో ఇమిడియున్నవి స్థూలముగా పైసూత్రములు ముస్లిములకందరికిని వర్తించునుగాని సూక్ష్మములలో తెగతెగకును భేదములున్నవి ఏ ముస్లిమైనను తన మొత్తము ఆస్తిలో మూడవవంతుకంటె ఎక్కువభాగమును గూర్చి మరణశాసనము చేయరాదు మరణశాసనము లిఖితమైనది యైన కావచ్చును లేక వాగ్రూపమైనదియైన కావచ్చును అట్లే మరణకారణమైన వ్యాధితోనున్నపుడు తన ఆస్తిలో మూడవవంతుకంటె ఎక్కువభాగమును దానపూర్వకముగానైనను ఇయ్యరాదు మతధర్మకార్యములకైనను అట్టి వ్యాధితోనున్నప్పుడు దానముగాగాని మరణశాసనరీత్యాగాని ఆస్తిని అతడు అన్యాక్రాంతముచేయరాదు తనమీద ఆధారపడిన వారిని పోషించు బాధ్యత ప్రతి ముస్లిముమీద ఉన్నది మతధర్మసంస్థల నిర్మాణ పోషణములకు ధర్మకర్తలు మొదలగు ఉద్యోగుల అధికార బాధ్యతలను తెలుపు ధర్మసూత్రములున్నవి మసీదులు ప్రార్థనాలయములు మొదలగు మతాదాయ ధర్మాదాయ సంస్థలను నిర్వహించుటకు ముస్లిము "వాక్ఫుబోర్డు శాసనముద్వారా నెలకొల్పబడి ముస్లిము పేదల సహాయమునకు కూడ కృషిచేయుచున్నది

క్రైస్తవ ధర్మశాస్త్రము :— క్రైస్తవులకు సాధారణముగా అన్నివిషయములలోను సామాన్యచట్టములు వర్తించును హిందువులకు ముస్లిములకు వారివారి వైయక్తిక

ధర్మసూత్రములు వర్తించుచో ఆయాభాగములందు క్రైస్తవులకు భారతదేశపు సామాన్య ధర్మసూత్రములు వర్తించును క్రైస్తవమతము చాలవరకు పాశ్చాత్యనాగరికత పాశ్చాత్య ప్రభుత్వము భారతదేశములో నెలకొన్నతరువాత ప్రవేశించి వ్యాప్తిచెందినది కాబట్టి క్రైస్తవ ధర్మశాస్త్రము కొలది మార్పులతో భారతదేశసామాన్య ధర్మశాస్త్రము గాచట్టముల ద్వారా ప్రవేశపెట్టబడినది అందుచేత ఆసామాన్యధర్మశాస్త్రమే క్రైస్తవులకు కూడ వర్తించును ఈ చట్టములలో ముఖ్యమైనవి రెండు 1 భారతదేశ దాయక్రమచట్టము" 2 "భారతదేశపు విడాకులచట్టము" కాని వివాహవిషయములో క్రైస్తవులకు భారత క్రైస్తవవివాహచట్టము అనునది ప్రత్యేకముగనున్నది ఈచట్టముప్రకారము వధూవరులలో ఒకరుగాని ఇద్దరునుగాని క్రైస్తవులైనపుడు వారివివాహము ఆచట్టరీత్యా జరుగనిచో అట్టి వివాహము రద్దైనట్లు భావించబడును ఇది చాల ముఖ్యవిషయము వివాహము జరిగినదా లేదాయను సమస్య ఉత్పన్నమైనచో, ఈ చట్టరీత్యాలిఖిత పూర్వకసాక్ష్యముండగలదు భారతదేశపు దాయక్రమచట్టము అమలులోనికి రాకపూర్వము క్రైస్తవధర్మము సందేహాస్పదమైనదిగ ఉండెడిది మస్లిములుగాని క్రైస్తవులుగాని పెక్కురు ప్రారంభమున హిందువులై యుండి మతమును మార్చుకొన్న వారే గావున హిందూమతమును వారువీడినను చాలాకాలమువరకు హిందూమతధర్మమునే ఆచారముగా పాటించుచువచ్చిరి తండ్రి తాత ముత్తాతల ఆస్తిలో మగశిశువునకు జన్మతః ఏర్పడిన స్వత్వాధికారమును హిందూఅవిభక్త కుటుంబధర్మమును మతమును మార్చుకొనిన వారుకూడ చాలమంది పాటించుచుండిరి కొంతమందిమాత్రము ఆధర్మమును వీడి ఇంగ్లీషువారి పద్ధతుల నవలంబించియుండిరి ఉదాహరణమునకు క్రైస్తవులకు ఆచారరీత్యా హిందూధర్మము వర్తించునా లేక క్రైస్తవ ధర్మము వర్తించునా యను విషయము సాక్షిసాధకములమీద ఆధారపడియుండెడిది భారత దాయక్రమచట్టము అమలులోనికి వచ్చినతరువాత క్రైస్తవులందరికిని ఆ చట్టధర్మమే వర్తించును విడాకుల చట్టములోగూడ చాలవరకు ఇంగ్లీషుధా పొందుపరచబడినది ప్రబలమైన కారణము లున్ననేతప్ప విడాకులు పొందెడి అవకాశము లేదు ఏదైనను కోర్టు తీర్పు లేకయే విడాకులు పొందుట అసంభవము మనోవర్తి విషయములో సామాన్య ధర్మసూత్రములు వర్తించును సంరక్షకుల బాధ్యతలు భారతదేశపు సంరక్షకచట్టము (Guardians and Wards Act) నను సరించి యథాతథముగా వర్తింపబడును ఈవిధముగా చాలవరకు భారతదేశ ధర్మచట్టములును కొలది విషయములలో మాత్రము ప్రత్యేక ధర్మములును భారతీయ క్రైస్తవులకు వర్తించును

పార్సీ ధర్మశాస్త్రము వీరు ప్రథమములో ఈరాన్ (పర్షియా) దేశమునకు చెందినవారు ఆ దేశమున ముస్లిము మతము అచ్చట వ్యాపించుటతో ముస్లిముల దౌర్జన్యమునకు తాళలేక పారశీకులలో చాలమంది భారతదేశమునకు వలసవచ్చి మహారాష్ట్ర గుజరాతు రాష్ట్రములలో స్థిరనివాసములు ఏర్పాటు చేసికొని యున్నారు ఇతరరాష్ట్రములలో గూడ వీరు కొందరున్నారు ప్రధానముగా ఇప్పుడువీరిభాష గుజరాతీ వర్తకవ్యాపారములలోను ఉన్నతోద్యోగములలోను వీరు పెక్కురు ఇమిడియున్నారు ఈ మతమును స్థాపించినవారో లేక సంస్కరించినవారో జరతూస్త్రీ" అను నామధేయులు వారు రచించిన గ్రంథము - "జెండ్-అవస్త అందుచేత వే పారసీకులు జొరాస్ట్రియనులని కూడ పిలువబడుచున్నారు ప్రధానముగా వీరు అగ్నిదేవుని పూజించు ఆర్యుల తెగకు చెందినవారు వీరికిగూడ చాలవరకు భారతదేశసామాన్య చట్టములును భారతదేశదాయక్రమచట్టము"ను వర్తించును భేదములున్నచోట, ఆచట్టములోని కొన్నిభాగములు వీరికి ప్రత్యేకించబడినవి - వివాహము విడాకుల విషయములలో వీరికి ప్రత్యేక చట్టమున్నది ( The Indian Parsi Marriage and Divorce Act) వివాహము ఆశీర్వాద్ అను పద్ధతి ప్రకారము జరిగిననేగాని అది చెల్లుబడికాజాలదు ఆచట్టములో చెప్పబడిన కారణములను పురస్కరించుకొని మాత్రమే విడాకులు పొందనగును పైన చెప్పిన విధముగా విడాకులు కోర్టుద్వారానే పొందవలసి యున్నది

ఇతర ధర్మశాస్త్రములు హిందూ ముస్లిము క్రైస్తవ పారసీకులే గాక భారతదేశములో భిల్లులు గోండులు కోయలు మొదలగు తెగలవారున్నారు వారిది ఏ మతమో చెప్పుటకు వీలులేదు సాధారణముగా వారి ధర్మసమస్యలన్నియు కులపంచాయతీలద్వారానే నిర్ణయము కాగలవు ప్రభుత్వము పై తెగలకు చెందిన గిరి, అటవీజనులకు వర్తించు ధర్మములను ప్రకటించుటకు అధికారము కలిగియున్నది కాని వీరు ఇదివరకెన్నడును హిందూ ధర్మశాస్త్రమునకు బద్ధులు

కాలేదని నిరూపించినచో తప్ప సాధారణముగా వీరికి హిందూ ధర్మశాస్త్రమే వర్తించు నవచ్చును

మతములమార్పు ఇతరదేశములతో పోల్చిచూచినచో భారతదేశమును ఖండమని చెప్పవచ్చును ఎన్నో దేశముల ప్రజలు ఈ దేశమునకు వలసవచ్చి ఈదేశవాసులైనారు పౌరాణిక గ్రంథములలో హూణులు యవనులు బర్బరులు చెప్పబడి యున్నారు భరతఖండము చాల విస్తారమైనదై పెక్కు తరగతుల ప్రజలను కలిగి పెక్కురాష్ట్రములుగా విభజించబడి యున్నందున అందు పలువిధములైన ధర్మములు ప్రవర్తిల్లుట సహజము యవనాదులందరును కాలక్రమేణ హిందూసంఘము లో లీనమైపోయినారు అందుచేత పరమతమువారైనను హిందూమతములో చేరవచ్చును ఆక్లైందరో చేరినట్లు నిదర్శనము లున్నవి అట్లే హిందూమతమునుండి ముస్లిము మతము లోనికిని క్రైస్తవమతములోనికిని మారవచ్చును అట్లు మారిన తరువాత క్రొత్తమతములో నుండుట కిష్టములేకపోయినచో తిరిగి తమ మతమును మార్చుకొనవచ్చును (కాని పారసీక మతములోనికి ఇతరమతములవారెవ్వరును మారినట్లు తోచదు అందుచే కాబోలు ఆమతమువారి సంఖ్య క్రమేణ తగ్గిపోవుచున్నది) ఈవిధముగా మతములమార్పిడి ధర్మశాస్త్రరీత్యా సమ్మతమగును మతమును మార్చుకొన్ననాటినుండి నూతన మతధర్మము వారికి వర్తించును పూర్వమతములోని విధి నిషేధములు మతమును మార్చుకొనినతర్వాత వారికి వర్తించవు ఈ విషయమును గూర్చి బ్రిటిషు ప్రభుత్వము 1850 లో భారతదేశమున ఒక శాసనమును వర్తింపచేసి యున్నది ఈ చట్టరీత్యా మతమును మార్చుకొనినవానికి అప్పుడున్న ఆస్తి అధికారములుగాని - అనగా స్వత్వస్వామ్యములు గాని తరువాత వచ్చు దాయక్రమములో భాగముగాని నశించదు [దీనినే 'మతస్వాతంత్ర్యచట్ట' మనియందురు మతస్వాతంత్ర్య ముండిన యుండుగాక! ధర్మస్వాతంత్ర్యము గూడ ఉండుట సమంజసమా? అనగా తన కేధర్మముండవలెనో నిర్ణయించుకొను అధికారము వ్యక్తికి ఉండదగునా? ఒకనాటి ప్రాతః కాలమున హిందూధర్మమునకు బద్ధుడైయుండినవాడు మధ్యాహ్నమునకే హిందూధర్మమునువిడనాడి ముస్లిం ధర్మమునో లేక క్రైస్తవ ధర్మమునో స్వీకరించు అధికారము వ్యక్తి కుండుట మంచిదికాదు మతస్వాతంత్ర్యముపేరిట తరచుగా మతమును మార్చుకొనినచో ఇతరుల కన్యాయము జరుగు అవకాశము కలదు భర్త హిందూమతమునుండి ముస్లిము మతమునకో లేక ముస్లిము మతమునుండి హిందూమతమునకో మారినచో భార్యాపిల్లలకు కొంత అన్యాయము జరుగదా? ఇట్టిప్రశ్నలకు సంతృప్తికరముగా సమాధానమిచ్చుట కష్టము మతము లెన్నియున్నను భారతదేశవాసుల కందరికిని అన్ని మతములవారికిని ఒకేవిధమైన ధర్మమున్నచో కష్టముండదు అందుకే భారత రాజ్యాంగములో 44 వ నిబంధన ప్రకారము భారతదేశము మొత్తముమీద ప్రజలకందరికి ఒకే ఒక సామాన్య ధర్మశాస్త్రము ఆశయముగా చెప్పబడినది అన్ని మతములవారు ప్రజాస్వామ్యసూత్రములకును రాజ్యాంగమునకును కట్టుబడి ఈ ఆశయసిద్ధిని వాంఛించినచో అట్టిసామాన్య ధర్మమును రూపొందించుట సులభము కాగలదు కాని మతకలహములు ప్రబలుచున్న ఈ కాలములో అట్టి సర్వ సామాన్య ధర్మమును ఊహించుటయే కష్టమైన విషయము దానిప్రసక్తివచ్చుచో మత కలహములు తీవ్రమగునని భీతి కలుగును అందుచేతనే కాబోలు సమగ్ర సామాన్యధర్మము కావలెనని దేశములో ఎవ్వరును ఆందోళన చేయుటలేదు రాజ్యాంగచట్టములోని ఆశయము మాటల లోనే ఉండిపోయినది 1956 వరకు హిందువులు బౌద్ధులు సిక్కులు జైనులు విడివిడి మతములవారై ధర్మములలో భేదములు కలిగియుండిరి అట్లే వీరశైవులు లింగాయతులు బ్రాహ్మసమాజ ఆర్యసమాజ మతములవారు ఆచారరీత్యానేమి చట్టరీత్యానేమి ధర్మములలో కొలదిపాటి భేదము లైనను కలిగియుండిరి కాని 1956 నుంచి వీరందరు ముఖ్యమైన విషయములలో సామాన్య ధర్మశాస్త్ర చట్టములకు బద్ధులుగా చేయబడినారు కాని కుటుంబస్వత్వము భేదములకు దారితీయుచున్నది హిందువులు క్రైస్తవులు పారసీకులు ఏకపత్నీ ధర్మబద్ధులై యుండగా భారతదేశములోని ముస్లిములు బహుభార్యాత్వమును తమ ప్రధాన మతవిషయముగా భావించుచున్నారు ఇతరదేశములలోని ముస్లిములు బహుభార్యాత్వమును విడనాడినారు మతాంతర వివాహములు చేసికొనుటకు అచ్చట ప్రత్యేక వివాహ చట్టము (Special Marriage Act) అమలులో ఉన్నది భిన్నమతములకుచెందిన స్త్రీపురుషులు ఆ చట్టముప్రకారము వివాహము చేసికొనవచ్చును వివాహములు రిజిష్టరు కావలసియుండును ఆచట్టబద్ధమైన వివాహము ఏకపత్నీవివా

హము కుటుంబస్వామిత్వములేదు విడాకులకు న్యాయమైనమార్గ మున్నది ఒకేమతమునకుచెందినవారైనస్త్రీపురుషులు ఆచట్టము ననుసరించి వివాహము చేసికొనవచ్చును అప్పటినుండి వారు వివాహము విడాకులు దాయక్రమము మొదలగు విషయము లలో ఆచట్టరీత్యా తమ జీవితములను తీర్చిదిద్దుకొనవచ్చును వారు మతమును విడనాడవలసిన అవసరములేదు మతము వారి వ్యక్తిగతవిషయమైయుండును ఆస్తిపైయధికారములుచట్టము మీద ఆధారపడును గాని మతముమీద ఆధారపడవు ఆ వివాహచట్టము భారతదేశమందలి సర్వప్రజలకు వర్తింపజేయ వచ్చునేమో పరిశీలింపదగును

వు గో

## వైయక్తిక మనస్తత్త్వము

## (Individual psychology)

మనోవిశ్లేషణ సంప్రదాయమునకు భిన్నముగా ఆల్ఫ్రెడ్ అడ్లర్ అను పండితునిచే (1870-1937) ఆవిష్కరింపబడిన మనస్తత్త్వసంప్రదాయము వైయక్తిక మనస్తత్త్వ మని పేర్కొనబడుచున్నది మానవుని మూర్తిమత్త్వములో గోచరించు వైయక్తిక వ్యత్యాసముల ప్రాధాన్యమును నొక్కివక్కాణించుటకే దానికట్టి పేరొసగబడినది ఈ వైయక్తిక వ్యత్యాసముల విషయమై ఫ్రాయిడ్ మహాశయుడంతగా ఆసక్తిని ప్రదర్శించియుండలేదు

అడ్లరు ప్రథమమున ఫ్రాయిడునే అనుసరించెడివాడు కాని యథార్థమున కాతడు ఫ్రాయిడుశిష్యగణములోని వాడు కాడు ఫ్రాయిడు ప్రభావము క్రిందికి రాక పూర్వమే అడ్లరు స్వతంత్రమగు తన సిద్ధాంత మార్గమును త్రొక్కి దానిననుసరించుటయే ఇందుకు కారణము కొలదిసంవత్సరము లాతడు ముఖ్యముగా స్వేచ్ఛాసాహచర్యము "స్వప్న విశ్లేషణము అనుప్రక్రియల విషయమై ఫ్రాయిడ్ నాయకత్వమును అంగీకరించి తృప్తిచెందినమాట వాస్తవమే కానిఅనతికాలముననే అతడనేక అంశములందు ఫ్రాయిడుతో అభిప్రాయభేదము ప్రకటించుటచే తానొక ప్రత్యేకమైన స్వీయసంప్రదాయమును ప్రతిపాదింపవలసి వచ్చెను

అడ్లరు ఆవిష్కరించిన మనస్తత్త్వశాస్త్రము 'లింగోద్వేగము' లేక లైంగిక ప్రేరణము' (sexual impulse) నకు గాక అహంకారతత్త్వము'(ego or self assertive impulse) నకు అధికతర ప్రాధాన్య మొసగినది ఫ్రాయిడునకు అడ్లరునకు నడుమ పొడసూపిన ప్రధాన భేదము ఈ అంశమును గూర్చియే ఈ అహంకార తత్త్వము లైంగికోద్వేగముకంటె విశేషముగా జీవితమునందు బలిష్ఠమైన ప్రేరణశక్తిగను మజ్జాతంతుక్లేశములకు మూలహేతువుగను వర్తించుచుండునని అతడుద్ఘాటించెను ఫ్రాయిడుచే విశేషముగా నొక్కి వక్కాణింపబడిన శిశువుల కామోద్రేకము అడ్లరుచే అంతముఖ్యాంశముగ పరిగణింపబడియుండలేదు అడ్లరు దృష్టిలో అంతకంటె ప్రస్ఫుటము ప్రాథమికమునైన విషయమింకొకటి కలదు-అన్యుల ప్రాబల్యమును పెత్తనమును ప్రతిఘటించి తన ప్రాబల్యమును పెంపు చేసికొని తనదే పైచేయి అనిపించుకొనవలెనను శిశువుయొక్క ఆతురతయే అది జన్మతః శిశువు బలహీనుడుగను నిస్సహాయుడుగను పెక్కువిషయము లలో ఇరుగుపొరుగు బిడ్డలకంటె అల్పుడుగను ఉండవచ్చును; ఒక్కొక్కపుడు తాడనల్పుడనను భావముకూడ ఆబాలునకు కల్గుచుండును ఇట్టిభావమే పెరిగి పెద్దదై అందరికంటె మిన్నగా రూపొందుట కాతనికొక ప్రేరణశక్తిగా ప్రోత్సహించును అడ్లరు సిద్ధాంతముననుసరించి ప్రతివ్యక్తియు అధికార ప్రాబల్యమును సాధింపవలెనను ప్రాథమికేచ్ఛ సహజముగా కల్గియుండును అన్యులకంటె అధికముగా పెత్తనము ప్రాబల్యము చలాయింపవలెనను వాంఛ జనించును ఒకానొక విషయములో తాను తక్కువ స్థాయిలోనున్నటుల ఒక వ్యక్తి భావించుచో ఆ అంశమునందాతడు అధిక్యతను సాధించుటకు యత్నించును తన లోపములను పూరించుకొనుటకు కాతడు త్రికరణశుద్ధితో తీవ్ర ప్రయత్నములాచరించి కృతకృత్యుడు కావచ్చును అట్లుకాజాలనిచో అతడు హతాశుడై ప్రత్యర్థుల యెడ వైరభావమును సమాజమునెడ ప్రతికూల ప్రవృత్తియు అలవరచుకొనును తత్ఫలితముగా అతని మజ్జాతంతు వ్యవస్థయందు మనస్తత్త్వమునందు ఒడిదుడుకులు క్రమరాహిత్యము ఘటిల్లును

మానవుని మూర్తిమత్త్వము రూపొందుటయందు, బాల్యదశలో అతని కుటుంబ పరిస్థితి వహించు పాత్రనుగూర్చి అడ్లరు ఫ్రాయిడు లిరువురు విశేషముగా ఉద్ఘాటించియుండిరి కాని కుటుంబస్థితిగతులను వివరించు సందర్భములో, ఫ్రాయిడు లైంగిక ప్రేరణమునకు విశేషప్రాధాన్యమీయగా అందుకుభిన్నముగా శైశవావస్థయందు బిడ్డలకు జీవితము

వెడల రూపొందుచుండు దృక్పథమునకు అడ్లరు అధిక ప్రాముఖ్యమునొసగెను

అడ్లరు సిద్ధాంతము ప్రకారము శైశవదశను గడుప వలసియున్న సమగ్రమైన స్వీయకుటుంబ పరిస్థితి జీవితము పట్ల ఒకానొక వైఖరిని అవలంబించుటకు బాలుని పురిగొల్పుచుండును ఈ వైఖరిని అడ్లరు తన ప్రసిద్ధ పదసమాసముతో 'జీవిత విధానము" (style of life) అని పేర్కొనెను ఒక ప్రక్క అతిగారాబముతో అబ్బురముతో పెంచబడు బిడ్డ ఎల్లపుడు దుర్బలులపై పెత్తనము చలాయించి అధికార దర్పమును ప్రదర్శించుటకు ప్రయత్నించగా వేరొక ప్రక్క బలాఢ్యుని చూచి బెదరు బక్కశిశువు బలవంతుని చెరనుండి వైదొలగి భద్రత చేకూరు తావునకు తప్పించుకొన యత్నించును పెక్కు ఉదాహరణము లిట్టివి గలవు జీవితమునెడల బాల్యదశయందిట్టి వైఖరులేర్పడుచో అవి బిడ్డలయందు స్థిరపడు ప్రమాదముకూడకలదు ప్రతి మానవుడు తన బాల్యమునందే ఏదేని యొక స్వతంత్ర జీవిత వైఖరిని అలవరచుకొని, తన అనంతరజీవితఘట్టములందుదయించు సమస్యల నెదుర్కొనుటలో ఆ వైఖరినే అవలంబించుచుండును అడ్లరు లైంగిక 'ప్రేరణము' నకుగల ప్రాముఖ్యమును ప్రశ్నింపలేదుకాని, అవిషయమునకు మాత్రమాతడు ప్రధాన స్థానమియ్యనిరాకరించెను అడ్లరు దృష్టిలో జీవితమందలి ప్రధాన సమస్యలు లైంగికములు కావు అత్యావశ్యకము లైన లైంగిక సమస్యలను ఎదుర్కొనునప్పటికే మానవుని కొక జీవిత వైఖరి ఏర్పడియుండును సర్వసమగ్రమైన జీవిత విధానములో లైంగిక సంబంధదశ ఒక భాగము మాత్రమే ఈ ముఖ్యాంశమును దృష్టియందుంచుకొని మానవుడు తన జీవితాశయము స్వీయాధిక్యతయా లేక కానొక అంశముగా మాత్రమేనున్న మానవ సమాజము యొక్క సమష్టి అధిక్యతయా అను విషయమును నిర్ణయించుకొనవలెను

స్వప్నవిశ్లేషణమును గూర్చియు అడ్లరునకు ఫ్రాయిడు నకు నడుమ వ్యత్యాసమున్నది అడ్లరు ప్రతిపాదనము ననుసరించి స్వప్నము కేవలము మానవుని యొక్క ప్రాతకోర్కెల ఫలసిద్ధి మాత్రమే కాదు వర్తమాన సమస్యల పట్ల బాధితుని ఉద్వేగ పూరిత మనోభావములనుగూడ స్వప్నము బహిర్గత మొనర్పగలదు వాస్తవ జగత్తులో అతడు పెక్కు కార్యములను శీఘ్రగతిలో అచరింప వలసియుండును అట్టి కార్యముల యొక్క సాంకేతిక పునరభ్యాసమైన (symbolic rehearsal) స్వప్నము తత్కార్యములయెడ అతనివైయక్తిక మనోభావములను సూచించుచుండును

మ అ

## వైశేషికదర్శనము

భారతదేశమునందాస్తిక దర్శనములనియు నాస్తిక దర్శనములనియు దర్శనములు రెండురకములు వాటిలో న్యాయవైశేషిక సాంఖ్యయోగ పూర్వోత్తర మీమాంసలను వారును ఆస్తికదర్శనములు వాటిలో వైశేషికదర్శనము కణాదమహర్షి ప్రణీతము కణాదునకు శివుడు ఉలూక రూపమున నీదర్శనము నుపదేశించెను కాన దీనికి ఔలుక్య దర్శనమనియు వ్యవహారముకలదు ఇతర దార్శనికు లెవరును అంగీకరింపని విశేషమను పదార్థమును వైశేషికులంగీకరించుటచే ఈ దర్శనమునకు వైశేషిక దర్శనమని పేరు గలిగినది

జైమినివలె నీకణాదులును మొదటిసూత్రమున ధర్మమును వ్యాఖ్యానింతుమని చెప్పిరి కాని వీరి ధర్మమునకును, జైమిని ధర్మమునకును భేదముకలదు జైమినిమతమున వేద విహితములయిన కర్మలకు ధర్మమని కలదు కణాదమతమున సత్కర్మలవలనబుట్టి ఆత్మనాశ్రయించి పుణ్యమని వ్యవహరింపబడుగుణము ధర్మమని వ్రాయబడియున్నది ఈ ధర్మమును దీని కాశ్రయమగునాత్మను ప్రధానముగ నిరూపింపదలచియు ప్రపంచమును గూడ నిరూపింపదలచియు 'ద్రవ్యగుణకర్మ సామాన్యవిశేషసమవాయానాం షణ్ణాం పదార్థానాం తత్త్వాగమాన్ని శ్శ్రేయసమ్' అను సూత్రముచే ప్రపంచ స్వరూపము నిరూపింపబడినది

వీరి మతమున ద్రవ్యము గుణము, కర్మ సామాన్యము విశేషము సమవాయము అని ఆరు పదార్థము లంగీకరింపబడినవి వాటిలో పృథివీ జల తేజో వాయువులు ఆకాశము కాలము దిక్కు ఆత్మ మనస్సు అను తొమ్మిదియును ద్రవ్యములు రూపము, రసము, గంధము స్పర్శ సంఖ్య పరిమాణము పృథక్త్వము సంయోగము విభాగము శబ్దము మున్నగునవి ఇరువదినాలుగు గుణములు ఉత్క్షేపణము అపక్షేపణము, ఆకుంచనము, ప్రసారణము గమనముఅని అయిదు కర్మలు ఈమూడును లోకప్రసిద్ధములు సామాన్య విశేషసమవాయములు, వీరికి మాత్రమే ప్రసిద్ధములు వీటిలో సామా

న్యము(జాతి)లోక ప్రసిద్ధము కాగా విశేషము సమవాయము నను నీ రెండును వీరికి మాత్రమే ప్రసిద్ధములు ఈ విశేష మను పదార్థము నిత్యద్రవ్యముల నాశ్రయించి యుండును వీరు అణుకారణవాదులు కాగా పృథివీ జల తేజో వాయు వుల పరమాణువులు ఆకాశ కాలదిగాత్మ మనస్సులు నిత్యద్రవ్య ములు వీనిని సమవాయమను సంబంధముచే విశేషములుండును ఈవిశేషములు నిత్యద్రవ్యములకు పరస్పరము భేదమును సాధిం చుట కంగీకరింపబడినవి కార్యద్రవ్యములగు ఘటపటములకు తత్కారణములగు కపాల తంతువులే భేదమునుసాధించుచున్నవి నిత్య ద్రవ్యములందట్టి సాధకమగు కారణము లేనందున విశే షములను అంగీకరించిరి విశేషములు నిత్యద్రవ్యములందుండ ట కొక సంబంధము కావలయును దానినే సమవాయమం దురు ఈ సమవాయము అవయవావయవులకు గుణద్రవ్య ములకు జాతివ్యక్తులకు క్రియా క్రియావత్తులకు గూడ సంబంధ మగుచున్నది

మిగిలిన దార్శనికులు విశేషమను పదార్థము నంగీక రింపక అనిత్య ద్రవ్యములం దుండెడి గుణములే దానికి పరస్ప రము భేదమును సాధించును కాన విశేషమను పదార్థము నంగీకరింప పని లేదనుచున్నారు

ప్రత్యక్ష మొక్కటియే ప్రమాణమని చార్వాకులమతము చార్వాకులు నాస్తికులలో నగ్రగణ్యులు వీరిమతము ప్రస్తుత లోకమున కనుకూలము కావుననే వీరిని లోకాయతికులని యనుచున్నారు వీరి ప్రమాణవాదమును ఖండించి బౌద్ధులు వైశేషికులును ప్రత్యక్షము అనుమానము అని రెండుప్రమా ణముల నంగీకరించుచున్నారు నైయాయికులు ఉపమా నము శబ్దము అని మరి రెండు ప్రమాణములను గూడ అంగీ కరించుచున్నారు మానాధీనామేయసిద్ధిః అని ప్రమా ణము లేనిదే యేపదార్థమయినను మనకు సిద్ధించుటలేదు కావున నైయాయికులు వైశేషికులును ప్రమాణస్వరూప నిరూ పణము నందెక్కువ శ్రద్ధను వహించిరి నైయాయికులు చెప్పిన ఉపమానము శబ్దము అనుమానమునందే చేరిపోవునని వైశే షికులనుచున్నారు శబ్దోపమానయోః నైవపృథక్ప్రామాణ్య మిష్యతే అనుమానగతార్థత్వాదితి వైశేషికమతమ్

ప్రత్యక్షమన నింద్రియములు దానిచే గ్రహింపబడిన పదార్థము దాని జ్ఞానమును ప్రత్యక్షపదముచే చెప్పబడుచు న్నది అనుమానమన మనకగపడుచున్న ఒక హేతువునుబట్టి మన కగపడని వస్తువును నిర్ధారణము చేయుట చూడుడు పర్వ తము నందు దూరముగా మనకగపడుచున్న ధూమము(పొగ)ను బట్టి మనకగపడని యగ్ని ఆ పర్వతము నందున్నదని నిశ్చయిం చుచున్నారము అట్లే మనకగపడుచున్న జగత్తునుబట్టి మనకు దృగ్గోచరము కాని భగవంతుడున్నాడని నిశ్చయించుకొన వచ్చును కావుననే ఈయనుమానము ప్రమాణమూర్ధన్య మని తార్కికులనుచున్నారు

వేదాంతులు వేదము స్వయముగా ప్రమాణమనియు అది ధర్మమును ఈశ్వరుని నిరూపించుటకు భగవంతునిచే ప్రసా దింపబడినదనియు అనుచున్నారు వేదముచేతనే ధర్మమును ఈశ్వరుని తెలిసికొనవలయు ననియు వారు అనుచున్నారు

ఆస్తిక దర్శనములలో నైయాయికులు వేదాంతులు యోగులు ఈశ్వరుని గురించి స్పష్టముగ చెప్పియున్నారు వైశేషికులు మీమాంసకులు సాంఖ్యులు ఈశ్వరుని గురించి చెప్పుటలేదు వైశేషికులు సత్కర్మానుష్ఠానమువలన ధర్మము దానివలన నభ్యుదయము (ఉత్తమలోకమునందు) నిశ్శ్రేయ సము (మోక్షము) సిద్ధించుననుచున్నారు అధర్మానుష్ఠానము వలన దుఃఖము హీనయోనులందుజనించుట తప్పదనుచున్నారు ఇది వైశేషిక మతసంగ్రహము సారము కొ దం శా

## వైష్ణవ మతము-వివిధ సంప్రదాయములు

విష్ణువే పరదైవతమని విశ్వసించుమతము వైష్ణవ మతము ప్రధానమైన ఈ విష్ణుపారమ్యభావముకలిగి భారత దేశమున వ్యాపించిన సంప్రదాయములలో రామానుజ మధ్వ వల్లభ నింబార్క రామానంద శ్రీ కృష్ణచైతన్యాదులగు ఆచార్యులచే ప్రవర్తింపజేయబడినవి ప్రసిద్ధములై యున్నవి

రామానుజ సంప్రదాయము :-

శ్రీ రామానుజులు క్రీ శ 1007 సంవ శ్రీ పెరం బూదూరు అను పుణ్యస్థలమున ఉదయించిరి వీరు ఆసూరి వంశజులు, హారీతగోత్రజులు కాంతిమతీ కేశవాచార్యుల పుత్రులు వీరు ఆదిశేషుని అంశమున అవతరించిన విష్ణు మత స్థాపకులని విశిష్టాద్వైత మతానుయాయుల విశ్వాసము శ్రీ రామానుజులు ప్రతిపాదించిన విశిష్టాద్వైత మతసిద్ధాంత సంగ్రహమిది-శ్రీ మహావిష్ణువే పరమాత్మ జగత్సృష్టి స్థితి లయములు అతని లీలావిలసితములు చరాచరాత్మకమైన ఈ విశ్వమందంతటను ఆ సర్వేశ్వరుడే నిండియున్నాడు నేకోపనిషత్పురాణ బ్రహ్మసూత్రాదులు ఈతనిని శ్రీమన్నా

రాయణ వాసుదేవ ఆది నామములచే వ్యవహరించుచు సత్య జ్ఞానానంద స్వరూపుడనియు నిఖిలహేయ ప్రత్యనీక కల్యాణ గుణ పరిపూర్ణుడనియు ప్రశంసించిరి జీవాత్మ పరమాత్మ కన్న భిన్నుడు ఈ జీవాత్మలు నిత్య ముక్త బద్ధరూపమున ముత్తెరగులై యుందురు అనాదియగు కర్మవాసనబట్టి వీరుదేవ తిర్యఙ్మనుష్య స్థావరరూప ములైన ఉపాధులను ధరింతురు వేదాంతవాక్య శ్రవణాదులవలనను ఆచార్యోప దేశాదులవలనను శ్రీమన్నారాయణుడే ఉపాస్యుడని తెలిసి శ్రవణ మననాదికమైన ఉపాసనచే ఆతనిమెప్పించి తదను గ్రహమున విముక్తులగుట జీవులకు కర్తవ్యము అచిత్తు అని వ్యవహరింపబడు ప్రకృతి జీవునకు భోగస్థానమయినది ఈశ్వ రుడు (పరమాత్మ) చిత్తు (జీవాత్మ) అచిత్తు (ప్రకృతి) అను ఈ మూడును నిత్యములు ప్రళయదశలో చిదచిత్తులు ఈశ్వ రునియందు సూక్ష్మరూపమున చేరియుండును వ్యష్టిసృష్టిలో చిదచిత్తులు స్థూలరూపమున విస్తరిల్లగా తచ్ఛరీరకుడై ఈశ్వరుడు వెలయుచుండును ఈ పెర్కొన్న సూక్ష్మ చిద చిద్విశిష్టుడైన ఈశ్వరునకును స్థూలచిదచిద్విశిష్టుడైన ఈశ్వరు నకును భేదములేదు కాబట్టియే ఈ వైష్ణవ మత సంప్ర దాయమునకు విశిష్టాద్వైతమనియు నామాంతరము కలిగినది

జీవేశ్వరులు భిన్నులనుటకు ఈ క్రింది ఉపనిషద్వాక్యము లను ఈ సిద్ధాంత ప్రవర్తకులు ఆలంబనముగా ప్రదర్శింతురు

"పృథగాత్మానం ప్రేరితారంచమత్వా
జుష్టస్తత స్తేనాఽమృతత్వమేతి' (శ్వే ఉ)

"సోశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా
విపశ్చితేతి (తై ఉ)

"ఆత్మేశ్వరం శాశ్వతం శివమచ్యుతం" (మ నా ఉ)

'క్షరం ప్రధాన మమృతాక్షరం హరః
క్షరాత్మానావీశతే దేవఏకః" (శ్వే ఉ)

ద్వాసుపర్ణా సయుజాసఖాయా సమానం
వృక్షం పరిషస్వజాతే

తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్యనశ్నన్నన్యో
అభిచాకశీతి' (శ్వే ఉ)

సర్వేశ్వరుడు కల్యాణ గుణాశ్రయుడనుటకును-

'యస్సర్వజ్ఞస్సర్వవిత్' (మాం ఉ)

"పరాస్య శక్తిర్వివిధైవ శ్రూయతే
స్వాభావికీజ్ఞాన బలక్రియాచ" (శ్వే ఉ)

ఏష ఆత్మాఽపహతపాప్మా విజరో వి
మృత్యుర్విశోకో విజిఘత్సోఽపి
పాసః సత్యకామః సత్యసంకల్పః (ఛాం ఉ)

ఇత్యాది వాక్యములను చెప్పుచుందురు వీరు తిరుమణి (శ్వేతమృత్తిక) తిరుచూర్ణము (హరిద్రాచూర్ణము) లతో కేశవనామాదులతో లలాటాదిస్థలములందు ఊర్ధ్వపుండ్రము లను పన్నెండుచోట్ల ధరింతురు తాపము పుండ్రము నామము మంత్రము యాగము అను పంచసంస్కారములు వీరికి ముఖ్యములు మంత్రములలో అష్టాక్షరి ద్వయము అనునవి ముఖ్యములు

ఈ మతమునకు పాంచరాత్రమనియు భాగవత మార్గ మనియు కూడ పేర్లుగలవు వేదములవలెనె శ్రీమన్నారాయణ ముఖోద్గతముగా ప్రసిద్ధమైన పాంచరాత్రాగమము విష్ణు పురాణము గీత భారత భాగవతములు బ్రహ్మసూత్రములు ఆళ్వారులు రచియించిన నాలాయిర ద్రావిడ ప్రబంధమును ఈ సిద్ధాంతమునకు ఆధారములు శ్రీమన్నారాయణుడే దీని ప్రవర్తకాచార్యులలో మొదటివాడు క్రమముగా లక్ష్మీదేవి విష్వక్సేనుడు నమ్మాళ్వారు, నాథమునులు పుండరీకాక్షుడు రామమిశ్రులు యామునులు శ్రీరామానుజులు మొదలైన వారు ఈ సిద్ధాంతమును ప్రవర్తింపజేసినవారు శ్రీరామా నుజులు తమ శిష్యులగు డెబ్బదినలుగురు వైష్ణవాచార్యులను ఈ శ్రీవైష్ణవ సంప్రదాయ ప్రచారముకొరకు నియోగించిరి వారి మూలమున ఈ మతము భారతదేశమందంతటను విశేష వ్యాప్తిపొందినది ఈ సిద్ధాంత ప్రతిపాదకములగు సంస్కృత గ్రంథములను రచియించిన వారిలో యామునాచార్యులు రామానుజాచార్యులు సుదర్శనాచార్యులు వేదాంతదేశి కులు మున్నగు పండితప్రకాండులు పేర్కొనదగినవారు శ్రీ రామానుజులు-బ్రహ్మసూత్రములపై రచియించిన భాష్య మునకు శ్రీ భాష్యమని ప్రసిద్ధి గీతాభాష్యము వేదార్థసంగ్ర హము వేదాంతసారము వేదాంతదీపము గద్యత్రయము అనునవి ఈ ఆచార్యవర్యుని ఇతర కృతులు

మాధ్వసంప్రదాయము దీనికి ద్వైత సిద్ధాంతము, పూర్ణప్రజ్ఞదర్శనము తత్త్వవాదము అనియు పేర్లు ఈ సంప్రదాయ వ్యవస్థాపకులలో ముఖ్యులు శ్రీ మధ్వాచా ర్యులు ఆనందతీర్థులు పూర్ణప్రజ్ఞులు మధ్వమందారులు మున్నగు పేర్లతోను వీరిని వ్యవహరింతురు వీరి బోధనలు

మధువువలె ఆస్వాద్యములు ఆనందదాయకములు నగుటచే వీరికి మధ్వాచార్యులనియు సంపూర్ణమైన వేదాంతప్రజ్ఞ గలవారగుటచే పూర్ణప్రజ్ఞులనియు నామాంతరములు కలిగిన వందురు శ్రీ మధ్వాచార్యులు వాయుదేవుని యంశముతో అవతరించినవారని తన్మతానుయాయుల విశ్వాసము వీరు కన్నడ దేశము నందలి ఉడిపి తాలూకాలోని కల్లియన్ పురము అను పుణ్యస్థలమున క్రీ శ 1238 సం॥న జన్మించిరి ఈ కల్లియన్ పురమునే "రజతపీఠ"మను పేర "మధ్వవిజయ" కారుడు పేర్కొనెను ఇది ఒక క్షేత్రమనియు దీనికి వ్యవహారము కలదు వీరి తల్లి వేదవతి తండ్రి మధ్యగేహ భట్టాచార్యుడు శ్రీ మధ్వాచార్యునకు వాసుదేవుడని తొలుత పేరు పెట్టిరట! శ్రీ మధ్వాచార్యులు న్యాయ వేదాంతాది బహుశాస్త్రములలో మహాపండితులై యుండిరి వీరి గురువు అచ్యుతప్రకాశాచార్యులు శ్రీ మధ్వాచార్యులు ఛాందోగ్యాదులగు ఉపనిషత్తులపైనను వేదాంత సూత్రములపైనను భగవద్గీతపైనను ద్వైత మత సిద్ధాంత ప్రతిష్ఠాపకములగు భాష్యములు సంతరించిరి భాగవత తాత్పర్య నిర్ణయము మహాభారత తాత్పర్యనిర్ణయము అణుభాష్యము సన్న్యాయ వివరణము మున్నగు శాస్త్రీయ గ్రంథములేగాక యమక భారతము వంటి పద్య కావ్యము కొన్ని స్తోత్రములు పేర్కొనదగినవి వీరి కృతులు మొత్తము ముప్పది యేడు వరకును గలవు శ్రీ మధ్వాచార్యుల శిష్యులలో పద్మనాభతీర్థులు నరహరితీర్థులు మాధవతీర్థులు అక్షోభ్యతీర్థులు అను వారు ముఖ్యులు

శ్రీ రామానుజాచార్యుల వలెనే మధ్వాచార్యులును శంకరాచార్యులు ప్రతిపాదించిన జగన్మిథ్యావాదమును జీవేశ్వరుల అద్వైత వాదమును నిశితముగా ఖండించిరి

"జ్ఞాజ్ఞౌ ద్వావజా వీశనీశౌ" (శ్వే ఉ)

"అంతః ప్రవిష్టశ్శాస్తా జనానామ్" (శ్వే ఉ)

"య ఆత్మని తిష్ఠన్ నాత్మనో న్తరోయ మాత్మా న వేద యస్యాత్మా శరీరమ్ య
ఆత్మానమంతరో యమయతి స త ఆత్మాన్త ర్యామ్యమృతః" (అంతర్యామి బ్రా)

'స కారణం కరణాధి పాధిపః నచాస్య కశ్చిజ్జనితా న చాధిపః' (శ్వే ఉ)

భోక్తా భోగ్యం ప్రేరితారంచ మత్వా సర్వం ప్రోక్తం
త్రివిధం బ్రహ్మమేతత్ (శ్వే ఉ)

ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం
పరిషస్వజాతే తయోరన్యః
పిప్పలం స్వాద్వత్త్యనశ్నన్ అన్యో అభిచాకశీతి (శ్వే ఉ)

ఇత్యాది ప్రమాణముల ననుసరించి శ్రీ రామానుజాచార్యుల వలెనే వీరును తమ ద్వైత సిద్ధాంతమునకు ఉపష్టంభకముగా తీసికొనినారు

శ్రీ రామానుజులు జీవేశ్వర ప్రకృతులకు ప్రకార ప్రకారి భావము నొప్పుకొని విశిష్టాద్వైతమును సాధింపగా శ్రీ మధ్వాచార్యులు ఆ ప్రకార ప్రకారి వైశిష్ట్యమును గూడ నంగీకరింపక సర్వాత్మనా భేదమునే ప్రతిష్ఠాపించినారు ఈ భేదములు—

సత్యంభిదా సత్యంభిదా సత్యంభిదా
జీవేశయోర్భిదాచైవ జీవభేదః పరస్పరమ్
జడేశయోర్జడానాంచ జడజీవభిదా తథా
పంచభేదా ఇమేనిత్యాః సర్వావస్థాసు నిత్యశః

అను ప్రసిద్ధ కారికననుసరించి ఐదు విధములగుచున్నవి అవి ఇవి—

(1) జీవేశ్వరులకు భేదము (2) జీవులలో జీవులకు భేదము; (3) ప్రకృతికి ఈశ్వరునకు భేదము (4) ప్రకృతికి ప్రకృతికి భేదము (5) ప్రకృతికి జీవులకు భేదము

ఈ భేదములు సంసారావస్థ యందును ముక్తావస్థలోను, అన్నిటియందును అన్ని దశలలోను నిత్యముగా అనుగతమై యుండును ద్వైత మతములో ముక్తి యనగా అవిద్యాబంధ నివృత్తిపూర్వకమైన స్వరూపానందాభివ్యక్తియే ముక్తిసాధనములలో ఈ ద్వైత మతమున అత్యంతము ముఖ్యమైనది శ్రీ విష్ణుదేవుని యందలి అనన్యమైన భక్తియే శ్రీ రామానుజ మతమునందువలెనే ఇందును శ్రీ మహావిష్ణుదేవుని అవతారములయు తదర్చామూర్తులయు ఆరాధనము విహితమైయున్నది విష్ణు పారమ్యమును బోధించు వైదిక వాఙ్మయము పురాణాదులు భగవద్గీత, బ్రహ్మసూత్రాదులు ఈ మతస్థులకు ప్రామాణిక గ్రంథములు వీరు గోపీచందనముతో ఊర్ధ్వరేఖలును అక్షతలును శంఖచక్రాదిముద్రలును ధరింతురు శ్రీ మధ్వాచార్యులు ఉడిపిలో ఎనిమిది మఠము

లను స్వయముగా నెలకొల్పియుండిరి ఉత్తరాది మతము రాఘవేంద్రస్వామి మఠము మున్నైన పెక్కు మఠముల నధిష్ఠించిన ద్వైతయతి శేఖరులు మాధ్వ సిద్ధాంతమును భారతదేశమున పలు ప్రాంతములలో వ్యాపింపజేసిరి

శ్రీ మధ్వాచార్యులే తమ శిష్యులలో నొకరగు నరహరితీర్థుని ద్వైత మత ప్రచారమునకు ఓఢ్ర దేశమునకు పంపినట్లు చారిత్రక నిదర్శనములు కలవు మధ్వాచార్యులు స్వయముగా భారతదేశమున పలు ప్రాంతములలో విజయయాత్రలు సాగించిరి ఈ మాధ్వవైష్ణవులు కన్నడదేశములో విశేషముగాను మహారాష్ట్రమునను తమిళ ఆంధ్రదేశములలోను, మరి కొన్ని ప్రాంతములలోను సముచిత సంఖ్యలో కలరు

శ్రీ మధ్వాచార్యులు క్రీ శ 1318లో పరమపదము నొందిరి

నింబార్క సంప్రదాయము — తన పూర్వులగు శ్రీరామానుజ మధ్వాచార్యుల మార్గముననే జగన్మిథ్యావాదమును ఖండించుటలోను జీవేశ్వర ప్రకృతులకు భేదమును నిర్ణయించుటలోను ఉత్సహించి ప్రసిద్ధికొందిన మరియొక సిద్ధాంత ప్రవర్తకుడు శ్రీనింబార్కస్వామి ఈ ఆచార్యుడు తన సంప్రదాయ ప్రచారమునకు ఉత్తర భారతమును ప్రధాన రంగముగా చేసికొన్నవాడైనను, ఈతడుదయించినది మాత్రము దక్షిణ భారతప్రాంతమే అందునను ఈతడు ఆంధ్రదేశమున జన్మించినవాడని తెలియుట ఆంధ్రులకు మోదహేతువు గోదావరి తీరమందలి నింబగ్రామము (వేముపల్లి యుండునేమో) ఈతని జన్మస్థలమందురు; బళ్లారి ప్రాంతమందలి తెలుగుపల్లెయని కొందరు తలంచిరి ఈయన వైదిక బ్రాహ్మణ కుటుంబమున క్రీ శ 13 వ శతాబ్దమున సరస్వతి జగన్నాథభట్టారక దంపతుల కుదయించెను ఏతన్మతానుయాయులు ఈ నింబార్కస్వామిని శ్రీహరి సుదర్శన చక్రాయుధాంశ సంభూతునిగా భావింతురు నింబార్కాచార్యుడు వేదవేదాంగ పారంగతుడైన విద్వాంసుడే కాక కవియు మహాభక్తుడు నైయుండెను ఆతడు తనకు పూర్వము దేశమున విస్తరిల్లియున్న శ్రీమద్రామానుజాచార్యుల మత సిద్ధాంతమునే తన సంప్రదాయమునకు పట్టుకొమ్మగా పెట్టుకొనెను శ్రీరామానుజ, మధ్వాచార్యులవలెనే తానును బ్రహ్మసూత్రములపై వేదాంత పారిజాత సౌరభమనెడి వేదసూత్ర భాష్యమును రచించెను ఈ ఆచార్యుని మరియొక కృతి సిద్ధాంత రత్నము; ఇందీతని సిద్ధాంత సారము పది శ్లోకములలో సంగృహీతమైనది శ్లోకసంఖ్యనుబట్టి దీనికి దశశ్లోకి అనియు వాడుక సవిశేష నిర్విశేష శ్రీకృష్ణ స్తవరాజ మనునది ఈతడు వెలయించిన యొక స్తుతి రచన

చిద చిదీశ్వరుల స్వరూపనిరూపణాదులగు విషయములలో నింబార్కస్వామికి యతిరాజుల సిద్ధాంతమే ఆదర్శమైనను అతడు సాధన సామగ్రిలో ఉపాసనకు ప్రాముఖ్యమీయలేదు భక్తి ప్రపత్తులకే ప్రాధాన్యమిచ్చెను ఇతడు చిద చిదీశ్వరులకు భేదమును స్థాపించుచునే కార్యాకారణములకు అభేదము అను హేతువున అభేదమును గూడ సాధించును ఉపాస్య విషయమున పరవ్యూహాదికమైన పరమాత్మ మూర్తులలో ఈ యాచార్యుడు విభవమూర్తికి విశేషప్రాముఖ్యమిచ్చెను అందునను శ్రీకృష్ణుడే పరబ్రహ్మముగా ఉపాస్యుడనెను ఈ సంప్రదాయములో రాధాకృష్ణార్చనము ముఖ్యము శ్రీకృష్ణానుగ్రహమే మోక్షహేతువు శ్రీకృష్ణలీలా విహారరంగమైన మధురాబృందావనాది ప్రాంతమునే శ్రీనింబార్కాచార్యుడు తన సంప్రదాయ ప్రచారభూమిగా ఎన్నుకొని అచటనే పీఠమును నెలకొల్పెను ఈతని ఈ శ్రీకృష్ణ భక్తిమార్గము అచిరకాలముననే ఆ ప్రాంతీయులలో విశేషవ్యాప్తిగాంచెను ఉత్తర భారతముననే కాక క్రమముగా ఈ వైష్ణవ సంప్రదాయము వంగదేశమునకు కూడ ప్రాకెను నింబార్కుని పిమ్మట ఈ సంప్రదాయమును అతని శిష్యప్రశిష్యాది పరంపర క్రమముగా అందిపుచ్చుకొని ప్రచారము గావించెను వీరిలో కొందరాచార్యులు నింబార్కునివలెనే బ్రహ్మసూత్రములపై స్వతంత్ర వ్యాఖ్యలు రచించిరి అట్టి వారిలో దేవాచార్యులు కేశవ కాశ్మీరి పేర్కొనదగినవారు

వల్లభ సంప్రదాయము (పుష్టిమార్గము) శ్రీ రాధాకృష్ణ భక్తి ప్రధానమైన వైష్ణవ మత సంప్రదాయమును ప్రవర్తింపజేసినవారిలో అతి ప్రసిద్ధుడు శ్రీ వల్లభాచార్యుడు ఇతడు ఆంధ్రదేశమున క్రీ శ 1479 లో ఉదయించెను కృష్ణయజుర్వేద శాఖీయుడైన లక్ష్మణభట్టు ఈతని తండ్రి తల్లి ఎల్లమ విద్వాంసుడైన వల్లభస్వామి కృష్ణభక్తి ప్రేరితుడై శ్రీకృష్ణ దివ్యజన్మ బాల్యసంచార కేళీవిలాసములకు రంగస్థలములైన మధురా బృందావన యమునా తీరభూములను సందర్శింపగోరి ఉత్తర భారతమునకేగెను ఆప్రాంతములలో తాముండ

కొన్నటిరేయి శ్రీకృష్ణస్వామి భక్తునకు స్వప్నమున దర్శనమిచ్చి తాను గోవర్ధన గిరిపై దేవదమన నామమున అర్చామూర్తియై వెలయుచున్నాడననియు వచ్చి సేవించి ఆలయ గోపుర ప్రాకారాదులను నిర్మింపజేయవలెనననియు నీచే బోధింపబడు సంప్రదాయమే గోలోకమున నన్ను జేరు సాధనమగు"ననియు ఆనతిచ్చెను. భగవదాదేశము చొప్పున వల్లభాచార్యుడు గోవర్ధనగిరికి సపరివారుడై పోయి వెదుకగా శ్రీకృష్ణస్వామి విగ్రహము లభించెను. పరమానంద భరితుడై శ్రీకృష్ణ దేవునకు కోవెలకట్టించి నిత్యపూజావిధానమునకు తగిన కట్టడిచేయించెను. ఈ దేవదమనస్వామియే "శ్రీనాథజీ" అని పిమ్మట వ్యవహార ప్రసిద్ధినొందెను.

నాభాజీ రచించిన భక్తమాల గ్రంథమునుబట్టి మహారాష్ట్రదేశమున ప్రసిద్ధులైన భక్తులు శ్రీజ్ఞానదేవ నామదేవ త్రిలోచనులు క్రమముగా విష్ణుస్వామియను వైష్ణవాచార్యుని శిష్యులై ఆపీఠమునకుచెందిన వారనియు, వారి పిమ్మట ఆ విష్ణుస్వామి సంప్రదాయమునకు ఆచార్యత్వమును వల్లభాచార్యుడు వహించెననియు తెల్లమగుచున్నది.

పారిభాషికముగా ఈ వల్లభాచార్యుని సిద్ధాంతమునకు శుద్ధాద్వైతమని పేరు. ఇందు జీవ బ్రహ్మలకు అంశ అంశి రూపమున ఏకత్వము ప్రతిపాదితము. బ్రహ్మమునకు మాయా సంబంధములేదు. అది శుద్ధమైన బ్రహ్మము. అగ్ని-దానినుండి పుట్టినస్ఫులింగములకు గలసంబంధ మెట్టిదో అట్టిదే జీవబ్రహ్మలకుగల సంబంధము. కార్యరూపమున వేరై తోచినను కారణ రూపమున రెండును ఒకటియే కావున ఇదిశుద్ధాద్వైత మనబడినది. ఉపాస్యదైవమిందు శ్రీకృష్ణుడే. ఊర్ధ్వలోకములన్నిటికిని పైన గోలోకమున్నది. అందు పరబ్రహ్మమైన శ్రీకృష్ణుడుండును. సర్గ స్థితి లయములతని లీలలు. తల్లోకప్రాప్తి ముక్తి. అది యా శ్రీకృష్ణుని అనుగ్రహాధీనము. సదాచారము వినయము, తత్పరభక్తి మున్నైనవాటిచే యాభగవదనుగ్రహము కలుగును. శ్రీకృష్ణానుగ్రహజనకమైన విశేషభక్తికి "పుష్టిభక్తి"యని సంకేతము. ప్రవాహపుష్టభక్తి, మర్యాదాపుష్టభక్తి, పుష్టి-పుష్టభక్తి, శుద్ధపుష్టిభక్తి అని ఈ పుష్టిభక్తి నాల్గు విధములు. సాధకుని సాధనలోని తారతమ్యములనుబట్టి ఈ పుష్టిభక్తి భేదము చెందును. 'మర్త్యానాంక్షీణ పాపానాం కృష్ణేభక్తిః ప్రజాయతే' అనునట్లు క్షీణపాపులైన వారికిని బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్ మాంప్రపద్యతే వాసుదేవః సర్వమితి సమహాత్మా సుదుర్లభః' అనునట్లు (వాసుదేవుడే) శ్రీకృష్ణుడే సర్వమని భావించు మహాత్ముడు సుదుర్లభుడగునట్లును శ్రీకృష్ణభక్తి సంపన్నుడు భవబంధ విముక్తుడై గోలోకమును చేరి శ్రీకృష్ణ సాయుజ్యముక్తిపొందును.

శ్రీ వల్లభాచార్యుడు బ్రహ్మసూత్రములపై "అణుభాష్యము" అనుపేర వివరణమును వ్రాసెను. వల్లభాచార్యుని పుత్రుడు విఠలేశ్వరుడు. ఈ తండ్రి కొడుకు లిరువురును ఈ సంప్రదాయమున క్రమముగా పూజ్యభావమున ఆచార్య గోస్వామి పదములచే వ్యవహరింపబడుదురు. విఠలనాథ వ్రజనాథ పురుషోత్తమాదులగు ఆచార్యులును తమ ఆచార్యుని భావములను వివరించు గ్రంథములను వ్రాసిరి. శుద్ధాద్వైతమార్తాండము శ్రీ గిరిధరాచార్య కృతము, ప్రమేయరత్నార్ణవము శ్రీబాలకృష్ణభట్ట రచితము-మున్నైనవి ఈ శుద్ధాద్వైత సిద్ధాంత స్వరూపనిరూపకములగు గ్రంథములు.

శ్రీ వల్లభుల ఈ పుష్టిమార్గ వైష్ణవము ఉత్తరదేశమునను, గుజరాతు మధ్య దేశములలోను వ్యాపించినది.

రామానంద సంప్రదాయము ఉత్తరభారతమున విస్తరిల్లిన వైష్ణవశాఖలలో పేర్కొన దగిన మరియొకటి. శ్రీ రామానందస్వామి నెలకొల్పిన శ్రీరామభక్తి సంప్రదాయము. ఈ రామానందుడు క్రీ శ 14 వ శతాబ్ది ప్రారంభమున ఉత్తర భారతమున పుణ్యక్షేత్రమైన ప్రయాగలో ఉదయించెను. ఈ స్వామి కన్నడ దేశమందలి మేల్కోటలో (తిరునారాయణపురము) జన్మించెనని కొందరందురు. ఈతని తండ్రి కాన్యకుబ్జ బ్రాహ్మణశాఖకు చెందిన పుణ్యసదనుడను పండితుడు. తల్లి సుశీల. శ్రీ రామానందుడు కాశీక్షేత్రమున తొలుత విద్యాభ్యాసంగము కావించెను. అధ్యాత్మిక విద్య కొరకాతడు రాఘవానందుడను విశిష్టాద్వైతియగు ఆచార్యు నాశ్రయించెను. ఈ రాఘవానందుడు భగవద్రామానుజాచార్యులకు ప్రశిష్యులలో ఒకడు. శ్రీరామానుజాచార్యులచే నియమింపబడి, యుత్తరదేశమున విశిష్టాద్వైత సిద్ధాంతమును ప్రచారముగావించుచు ప్రసిద్ధుడైయుండిన శ్రీదేవాచార్యులవారికి రాఘవానందాచార్యుడు శిష్యుడు. శ్రీరాఘవానందు నాశ్రయించి విశిష్టాద్వైత సిద్ధాంతతత్త్వమును ఆకళింపు చేసికొనిన రామానందునకు మూల సిద్ధాంతములోని మాత్ర

ములకును ఆచార్యుల యనుష్ఠానమునందలి యంశములకును సంపూర్ణ సమన్వయము గోచరింపలేదు జాత్యాదుల విచారముతో పనిలేదు పరమభక్తులందరును సమానులేయను సిద్ధాంతము విధిగా వర్ణాశ్రమ ధర్మకర్తవ్యములను పాటించు ఆచార్యుల యనుష్ఠానమున సమన్వయించుటలేదని రామానందుడు తన మతసారమైన ప్రబోధము కొరకు తానే యొక సత్సంప్రదాయమును బయలుదేర దీసెను

రామభక్తి–రామానంద సంప్రదాయము — నింబార్కస్వామి శ్రీకృష్ణభక్తి కిచ్చిన స్థానమును రామానందస్వామి శ్రీరామభక్తి కొసగెను ఒక రామనామము సహస్ర భగవన్నామములకు సమానమన్నట్లు రామనామమహిమ అసాధారణమైనది అది సర్వపాపహరము తారకమంత్రమునకు మించిన మంత్రములేదు రామభక్తుడు పరమపవిత్రుడు రామభక్తు డేజాతివాడైనను పూజ్యుడే భాగవతము నింబార్కాదుల కాదర్శగ్రంథమైనట్లే శ్రీమద్రామాయణము రామానందాదులకు ప్రామాణిక మూల గ్రంథము ఆళ్వారులలో బ్రాహ్మణులు కానివారు కలరు స్త్రీకూడ కలదు కాని భాగవతులకు వారెల్లరు శిరోధార్యులే శ్రీమద్రామానుజులు భక్తినిష్ఠనుబట్టి కాంచీపూర్ణులను తమ ఆచార్యులలో ఒకరినిగా ఆశ్రయింపలేదా ! ఉడయవరులే తిరుమంత్రము నందరకును ఉపదేశించిరి కదా ! మేలుకోటలో శ్రీ ఆచార్యులవారే శ్రీ పెరుమాళ్ళ దర్శనము చేయించి కడజాతి వారిని కరుణింపరా ! అట్లు వారు చూపినదే రాచబాట–అని శ్రీ రామానందస్వామి ప్రచారము సాగించెను రామానందుని శిష్యులలో ముఖ్యులైన వారు వీరు–

1 అనంతానందుడు 2 సురసురానందుడు 3 సుఖానందుడు 4 నరహరియానందుడు 5 యోగానందుడు 6 పీపుడు 7 కబీరు 8 భావానందుడు 9 సేనుడు 10 ధన్నుడు 11 గాలవానందుడు 12 రాయిదాసు 13 పద్మావతి– వీరిలో పీపుడు రాజపుత్రుడు; కబీరు శూద్రుడు; మహమ్మదీయుడనియు వాదుక సేనుడు మంగలి ధన్నుడు జాటు జాతీయుడు పద్మావతి ఆడుది దీనినిబట్టి చూడ రామానందస్వామి అన్నిజాతులనుండియు, స్త్రీలనుండియు భక్తులను శిష్యులనుగా స్వీకరించెనని తెల్లమగుచున్నది ఈ స్వామి తన శిష్యవర్గముతో దేశమందెల్లెడల పర్యటించుచు తీర్థయాత్రలు చేయుచు అందందు పండిత గోష్ఠులలో అద్వైతమును మాయావాదమును నాస్తికములైన జైనబౌద్ధములను ఖండించుచు వైష్ణవము ప్రచారము చేసెను ఈ ఆచార్యుడు తన పరమాచార్యుడైన శ్రీరామానుజాచార్యుని వలెనే శతాధిక వర్షజీవియై తన నూట పదునొకండవయేట క్రీ శ 1467 వ సం॥న పరమపదించెను ఈ రామానందస్వామి ప్రచారము కావించిన శ్రీరామభక్తి సంప్రదాయము ఉత్తరభారతమున అటు పిమ్మట వెలసిన తులసీదాసాది రామభక్త కవులకు ఉద్బోధక మయ్యెను

కబీరుదాసు–రామభక్తి — రామానందస్వామి శిష్యులలో విశేషఖ్యాతిగాంచిన వాడు కబీరుదాసు ఈతడు క్రీ శ 1456 సం॥న కాశీపట్టణమున జన్మించెను ఒక బ్రాహ్మణవితంతువు తన శిశువును గంగాతీరమున విడిచిపోగా ఆ ప్రాంతముననే నడచి వెళ్ళుచున్న మహమ్మదీయ దంపతులా శిశువును జూచి జాలిగొని ఈశ్వర ప్రసాదితమైన కుమారరత్నమని యెత్తికొని యింటికి గొంపోయి కబీరని పేరుపెట్టుకొని పెంచుకొనిరట పెరిగి పెద్దయైన కబీరు, తండ్రి వృత్తియైన నేతపనినే చేపట్టెను కాని కబీరునకు నేతపై చేతము నిలువకుండెను అతడా క్షేత్రములో పురాణ కాలక్షేపములు జరుగుచుండు తావులకు తరచుగా పోవుచుండెను; హరికథలు వినుచుండెను క్రమముగా అతని హృదయమున రామునియందు భక్తి యంకురించెను ఆనాడు శ్రీరామానందస్వామి ప్రబోధామృత చంద్రికలు దేశమందెల్లెడల చల్లగ ములయుచుండుటచే తానును ఆస్వామి పాదముల నాశ్రయించి మంత్రోపదేశము నొంది ధన్యతగాంచవలెనని కబీరుని డెందము ఉత్కంఠితము కాజొచ్చెను కాని తాను మహమ్మదీయుడగుటచే ఆ మహాత్ముడు శిష్యునిగా తనను చేరనిచ్చునా ? ఎట్లైన ఆస్వామి పాదము లాశ్రయింపవలెనను సంకల్పము తీవ్రమగుటచే అతడొకనాడు శ్రీరామానందస్వామి స్నానార్థమేతెంచు గంగానది రేవులో మెట్లమీద బోర్ల పడియుండెను మసక చీకటిలో తీర్థమాడ విచ్చేసిన శ్రీస్వామి పాదము కబీరు శరీరమును తాకెను ఎవరినో పాపము ! చూడక త్రొక్కితినే యని స్వామి రామ రామ అనెను ధన్యుడను ! గురుదేవా ! ధన్యుడను ! రామ మంత్రముపదేశించి శిష్యుననుగ్రహించితిరి అని మ్రొక్కి కబీరు వినమ్రుడై స్వామియెదుర నిలచెను స్వామి సంగతి గ్రహించి మందహాసము చేసెను మహాభక్తుడైన కబీరుదాసు తన ఆచార్యునివలెనే ప్రజలలో శ్రీరామ

భక్తిని ప్రబోధించెను ప్రజలకు అర్థమగునట్టి అచటి దేశభాష యగు హిందీలో సులభశైలియందు గేయములు రచియించి యీదాసకవి వేదాంతసారమును వాడ వాడల కందించెను సర్వమతసమరస్య సంధాయకమును సర్వమానవ సౌభ్రాత్ర సంపాదకమును సర్వలోక కల్యాణసంపత్కరమునగు ఈ కబీరు దాసుని సంప్రదాయము కబీరు పంథా అను పేర జనావళిలో మేటి ప్రభావమును చూపెను

మలూకదాస రాయ్‌దాసాదులు – రామానంద సంప్రదాయ వైష్ణవ ప్రచారకులలో ఎన్నదగిన కొందరిలో శ్రీమలూక్ దాసొకడు ఈతడు పదునారవ శతాబ్దికి చెందినవాడు జప భక్తికి ప్రాధాన్యమిచ్చిన యీతడు శ్రీరామమంత్రజపమే సర్వాభీష్టప్రదమని ప్రచారము కావించెను

శ్రీ రాయ్‌దాసు మరియొక భక్తుడు ఈతడును రామానంద శిష్యకోటిలోనివాడే ఈ రామ భక్తాగ్రేసరుడు స్వకులాచార ధర్మాదులెరుగక విద్యాగంధములేక దారిద్ర్యమున దొగులాడు క్రింది తరగతులవారియెడల ప్రత్యేకముగా శ్రద్ధ వహించి వారికి బాహ్యాభ్యంతర శౌచ ధర్మాదులు తెలిపి రామ భక్తిని బోధించి యుద్ధరించెను

గోస్వామి తులసీదాసు – శ్రీరామభక్తుల ప్రస్తావములో పుణ్యమూర్తి తులసీదాసు పేర్కొనదగినవాడు వైష్ణవమత ప్రచారముగావించిన ఆచార్యుడుగాగాక గోస్వామితులసీ దాసు హిందీ పాఠక లోకమునకు శ్రీరామభక్తి సుధారసము నందించిన మహాకవిగా విఖ్యాతుడు తులసీదాసునిపై పూర్వులైన శ్రీరామానందాదుల ప్రబోధప్రభావము లెస్సగా పడెను ఈతడు సరయూపారీణశాఖకు చెందిన బ్రాహ్మణవంశమున క్రీ శ 1532లో జన్మించెను తండ్రి ఆత్మారామ్ శుక్లదూబె; తల్లి హులసీ; భార్య రత్నావళి కుమారుడు తారకుడు మహాభక్తుడైన తులసీదాసుని 'రామచరితమానస'మనెడి రామాయణము మిక్కిలి ప్రసిద్ధిగాంచిన గ్రంథరాజము

శ్రీ కృష్ణ చైతన్యస్వామి – (గౌడీయవైష్ణవ సంప్రదాయము) క్రీ శ 1486 సం॥న వంగదేశమున జన్మించిన శ్రీకృష్ణ చైతన్యస్వామి ప్రచారముకావించిన శ్రీ కృష్ణ భక్తి సంప్రదాయమునకు సిద్ధాంత సరణినిబట్టి అచింత్య భేదాభేద వాదమని వ్యవహారము కలదు జీవ, ప్రకృతి పరమాత్మలకు భేదాభేద సంబంధము జీవ–బ్రహ్మల సంబంధమువలె వేరుగా కన బడుచుకూడ విరుగనిది దీని సంబంధము బుద్ధికి అందనిది కావున అచింత్యము పరమాత్మగా ఇది అచింత్య-భేదాభేద సిద్ధాంతమని పేరుపొందినది పరమాత్మ తత్త్వశక్తి సర్వసంపన్నుడు తాను జగద్రూపమున పరిణమించియు వికారము పొందడు ఇదియే అతని అచింత్యశక్తి అతనికి మాయ అంటదు మాయవలన జీవునకు జ్ఞాన మంతరించును కలుగును పరమ కారుణికుడగు సర్వేశ్వరుడు జీవులనుద్ధరింప వేదాదుల ననుగ్రహించెను వ్యాసరూపమున అవతరించి అతడే తద్వ్యాఖ్యానము పురాణాదిరూపమునను బ్రహ్మసూత్రముల రూపమునను తెల్లముచేసెను గీతాచార్యుడై ధర్మమునుపదేశించెను శ్రీ కృష్ణుడే పరమాత్మయని సంపూర్ణ విశ్వాసముతో అనన్యమైన భక్తితో ఆస్వామిని భజించుట జీవుని కర్తవ్యము

ఇది చాలవరకు విశిష్టాద్వైత సిద్ధాంతము భాగవత సంప్రదాయముల అడుగుజాడలలో సాగిన భక్తిశాఖయే ఈ ఆచార్యుని తొలిపేరు విశ్వంభరమిశ్రుడు ఈతని తండ్రి జగన్నాథమిశ్రుడు తల్లి శచీదేవి అన్న విశ్వరూపుడు ఈ వంగీయ బ్రాహ్మణ కుటుంబమువారు మొదట పూర్వ బెంగాలులోని సిల్హటు వాస్తవ్యులై యుండిరి పిమ్మట వారు నవద్వీపమునకు వచ్చి స్థిరపడిరి శ్రీ కృష్ణుడే యీ విశ్వంభరమిశ్రుడుగా తిరిగి అవతరించెనని తత్సంప్రదాయుల విశ్వాసము కావుననే యీ స్వామిని వారు శ్రీ కృష్ణచైతన్యస్వామియని పిలుచుకొనుచుండిరి గౌరంగస్వామి గౌరాంగచంద్ర మున్నైనవియు ఈ చైతన్యస్వామికే పర్యాయములై వాడుకలోనికి వచ్చినవి ఈ స్వామికి అగ్రసోదరుడైన విశ్వరూపుడు బలరామదేవుని యవతారమనియు వారినమ్మిక ఈ విశ్వంభరుడు సన్యసించి తన సోదరునితోపాటు శ్రీ కృష్ణభక్తి సంప్రదాయ ప్రచారమున పాల్గొనెను శ్రీ చైతన్యస్వామిసాధకు నియందలి భక్తినే ముఖ్యముగా ఎంచి తన్నాశ్రయించిన యన్నిమతముల వారిని శిష్యులనుగా తీసికొని వారి నుద్ధరించెను ఈ చైతన్య సంప్రదాయము వంగదేశమునను అస్సాం ప్రాంతమునను ఓఢ్రదేశమునను విస్తరిల్లెను జయదేవుని గీతగోవిందాదులును శ్రీ చైతన్య స్వామిగీతావళులును తద నుయాయులగు రూపగోస్వామి సనాతన గోస్వామి మొదలైనవారి రచనలును ఈ మధుర భక్తి మార్గవ్యాప్తికి మిక్కిలి తోడ్పడినవి

నామదేవాదులు–విఠలభక్తిసంప్రదాయము:– మహారాష్ట్ర

దేశములో వ్యాప్తి చెందిన వైష్ణవమునకు ముఖ్యరంగము పాండురంగక్షేత్రము భీమరథీతీరమున వెలసియున్న విఠల (విష్ణు)స్వామి విఠోబాస్వామి శ్రీ కృష్ణభగవానుని యర్చామూర్తియే భక్తుడగుపుండరీ (లీ)కు ననుగ్రహించ వచ్చి యాతడిడిన యిటుకమీద శ్రీ కృష్ణస్వామి నిలబడెనట! రుక్మిణియే రుక్మాబాయి రుక్మాబాయితో కూడిన విఠోబాను భక్తితో సేవించి తన్నామజపము చేసి తరించుటయే యీ విఠల భక్తి సంప్రదాయమువారి ధ్యేయము ఈ సంప్రదాయమునకు మూలాచార్యుడు మహాభక్తుడైన పుండరీకుడే యందురు శ్రీ రామానందస్వామి శిష్యవర్గములో చేరిన విఠల్ పంతు అతని పుత్రులైన జ్ఞానదేవాదులును ఏకనాథస్వామి మున్నగువారును మహారాష్ట్రమున ఆధ్యాత్మిక భావప్రచారము చేసిన వారిలో పేరెన్నికగన్నవారు అటు పిమ్మట విఠల భక్తి మార్గమును ప్రవర్తింపజేసిన మహనీయులలో అధిక సంఖ్యాకులు వేదాది విజ్ఞానముగాని, శాస్త్రపాండిత్యాదులు గాని లేని సాధారణ వ్యక్తులు కులమునుబట్టి క్రిందితరగతులకు చెందినవారైనను వీరు జన్మాంతర సంస్కార విశేషము వలన సంసారమందు వైరాగ్యము శ్రీ విఠోబాయందు నిశ్చలమైన భక్తియు గలుగ జీవితములను భగవదర్పితము చేసిన ధన్యులు తమ యనుభవజ్ఞానమునుబట్టి తమ మాతృభాషయగు మరాటిలో గేయములు కూర్చి భక్తిధర్మములను తోడివారితో ప్రచారము గావించినారు

విసోబా ఖేచారు నామదేవు గోరాకుంభారు సంవతు నరహరి ఛోఖా జనాబాయి సేన కన్హోపాత్రా, తుకారామ్ మొదలైన ధన్యాత్ములు విఠల భక్తి రసామృతమును కుత్తుకబంటిగా గ్రోలినవారు అభంగములనబడు మరాటీ గేయములలో అమూల్యములయిన ఉపదేశరత్నములను పొదిగి వాడవాడలకు తిరిగితిరిగి ఆ పాటలను పాడిపాడి ప్రజలలో సదాచారమును భక్తిని ప్రచారము గావించినారు ఈ విసోబా నామదేవాదులు క్రీ శ 13వ శతాబ్ది మధ్యభాగమునకు చెందినవారు విసోబాకు జ్ఞానభిక్ష పెట్టినయోగి జ్ఞానదేవస్వామి ప్రసిద్ధుడైన నామదేవునకు గురువగు భాగ్యము విసోబాకు కలిగినది "ఈశావాస్యమిదం సర్వం యత్కించిత్ జగత్యాం జగత్" – జగత్తంతయు ఈశ్వరునిచే నిండియున్నది అతడు లేనిచోటులేదు అను ఈయుపనిషదర్థము ఈయోగివలననే నామదేవునకు కన్నులకు కట్టినట్లయినదట! ఒకనాడు నామదేవు విసోబాజీని చూడబోగా అతడొక దేవతావిగ్రహము మీద కాలుపెట్టియుండెనట! "ఇదేమి స్వామీ! అపరాధముకాదా! ' అనిన నామదేవునకు పోనీ ఇంకొకచోట పెట్టెదనులే అని విసోబా కాలుతీసి మరియొకచోట పెట్టిచూడగా అచ్చటను దేవతావిగ్రహమే కనబడినదట! నన్నేమి చేయమందువు; అంతటను అతడేయున్నాడు కదా?' అని విసోబా నవ్వెనట! ఆ దృశ్యము నామదేవు హృదయమున చెరగని ముద్రవేసినదట!

కుమ్మరియైన గోరా తానుచేసిన ఒక్కొక్క కుండలోను విఠలదేవునే చూచువాడట! ఒకసారి పెక్కుమంది భక్తులలో నామదేవుని చూచి ఈ కుండగట్టిది తక్కినవి ఓటివిలే!' అన్నాడట–అట్టిది ఆ మహనీయుని లోతుచూపు

అరణ్‌గాంవాసియైన సంవతయోగి యొకతోటమాలి. విఠోబా భక్తిని పండించుకొన్న సుకృతి తనతోటలోని ప్రతి పుష్పములోను ప్రతిపత్రములోను విఠోబాయే దర్శనమిచ్చుచుండెనట! ఇట్లే యానాడు స్వర్ణకారుడైన నరహరి చర్మకారుడైన ఛోఖా మున్నగు భక్తశ్రేష్ఠులు విఠల్ భక్తి మార్గమున జ్యోతులై వెలిగిరి

విఠల్ భక్తమణిమాలలో నాయకమణి యనదగిన నామదేవస్వామి క్రీ శ 1270 లో జన్మించెను అతి సామాన్యుడైన ఒకదర్జీవానికొడుకైన అతడు తొలుతచాలతుంటరి దారిదోపిడిగాడై పెక్కుహత్యలు గావించుచుండెను వీనికి తనచే హత్య గావింపబడిన ఒకని ఆలుబిడ్డల గోడుగాంచిన ఒక సంఘటనము వలన జ్ఞానోదయమాయెను తన పాపజీవితముపై రోతపుట్టెను వెంటనే అతడు గురువు నాశ్రయించి విఠోబా భక్తుడాయెను ఈశ్వరానుగ్రహమున నామదేవునకు సంపూర్ణమైన బుద్ధియోగము లభించెను నాటి జ్ఞానయోగులలో మిన్నయైన జ్ఞానదేవునితో చేరి నామదేవుడు తీర్థయాత్రలు గావించెను పెక్కురు భక్తులతో సహవాసముచేసెను అఖండ భగవన్నామ జపముచేసెను అన్నింట విఠోబా దర్శనము చేయగలిగెను జ్ఞానసుధాతరంగములైన అభంగములను అసంఖ్యాకములుగా రచియించి తనబోధనల సారాంశమును దేశీయులకందించెను నామదేవుని శిష్యురాండ్రలో జనాబాయి మహాభక్తురాలుగా ఖ్యాతిగాంచెను

తుకారాము ఇతడు క్రీ శ 1598 లో జన్మించెను అతని పెద్దభార్య రఘుమాబాయి, చిన్నభార్య జిజాబాయి

కొడుకు సంతు వంశపారంపర్యముగా సేద్యము వర్తకము వారి వృత్తి. ఆనాటి యొక దుర్భిక్షమున తిండిలేక అతని పెద్దభార్య కొడుకు - ఇరువురు చనిపోయిరి. వ్యాపారమున పెద్దనష్టము వచ్చెను పంటపాడయ్యెను. తుకారాము మానసిక క్షేత్రములో వైరాగ్యబీజములు పడెను. కేశవ చైతన్యుడను నామాంతరము గల బాబాజీ యనుగ్రహముతో అతనిని చేరదీసి జ్ఞానోపదేశముచేసెను. జ్ఞానదేవుని జ్ఞానేశ్వరి (మరాటి భాషలో భగవద్గీతపై వ్యాఖ్య) ఏకనాథుని భాగవతము (భాగవతము-11 స్కం మరాటి వ్యాఖ్య) నామదేవుని కీర్తనావళి కబీరుదాసుని కీర్తనలు (హింది) అను ఈ గ్రంథములు కీర్తనలు తుకారాము హృదయమునకు హత్తుకొన్న విజ్ఞానచంద్రికలు. తుకారాము గురువైన బాబాజీ జ్ఞానదేవుని శిష్యపరంపరలోనివాడు. పండ్లతరబడిగా చేసిన నామజపముచే తుకారాము భగవదనుగ్రహమునకు విశేషముగా పాత్రుడైనాడు. విశ్వేశ్వరుడు విశ్వములో అణువణువునను విఠోబా రూపములో ఆ భక్తశిఖామణికి గోచరుడు కాజొచ్చెను. ఆ యోగివర్యుని హృదయగిరి నుండి భక్తినిర్ఝరి కవితా రూపమున దూకసాగెను. అసంఖ్యాకములైన అభంగములు వెలువడినవి. సంతాజీ గంగారామ్ రామేశ్వరభట్టు మహాదాజీ పంత్ నిళోబా బహిణాబాయి మొదలైన భక్తులెందరో ఆ మహాత్ముని శిష్యులు. ఛత్రపతిశివాజీ తుకారామస్వామికి అమూల్యములైన మణిహారాదులను పంపెను. కాని ఆ సమలోష్టకాంచనుడైన ఆ స్వామి యా కానుకలను త్రిప్పివైచి సమర్థరామదాసనెడి యోగివర్యు నాశ్రయించి మేలుగాంచుమని యుద్బోధించెను. జ్ఞానదేవ నామదేవాదులు సాగివచ్చిన విఠోబా భక్తిమార్గమున వేయిదివ్వెలు వెలయించి తుకారామస్వామి చరితార్థుడాయెను.

సమర్థ రామదాసస్వామి మహారాష్ట్రములో శ్రీరామభక్తిమార్గమును ప్రబోధించిన యోగివర్యుడు సమర్థ రామదాసు. ఇతడు క్రీ. శ. 1580 లో శ్రీరామనవమి పావన తిథినాడు జన్మించెను. రామదాసు పూర్వజన్మమున ప్రారంభించిన యోగము పూర్తిగాక, దానిని పూర్తిచేసికొనుటకు జన్మమెత్తిన పుణ్యమూర్తి. బాల్యముననే అతనికి వైరాగ్యము కలిగినది. పెండ్లిపీటమీదినుండియే అతడు లేచిపోయెను. నాసిక క్షేత్రమునకు సమీపమున గోదావరి తీరమున పండ్రెండేండ్లు రామమంత్రము నుపాసించెను. శ్రీరామచంద్రుడు ప్రత్యక్షమై స్వయముగా ఆచార్యత్వము వహించి సన్న్యాసాశ్రమము ననుగ్రహించెనని భక్తాచార్యుడైన దాసబోధగ్రంథములో తెలుపునాడు. రామదాసస్వామి అటు పిమ్మట పండ్రెండేడు తీర్థయాత్రలలో గడపెను. ఆ సంచారములోనే స్వామి పండరిపురమునకు వచ్చి స్వామిదర్శనము చేసి రఘుపతియైన శ్రీరాముడే యీ పండరినాథుడైన విఠోబాయని యెలుగెత్తి కీర్తించెను. వృద్ధుడైయున్న తుకారాముని రామదాసు ఆ పుణ్యక్షేత్రముననే గుర్తించెనని యందురు.

రామదాసస్వామియెడ శివాజీకి అమితమైన గురుభక్తి. ఒకప్పుడు శివాజీ తన సామ్రాజ్యము సంపదని గురుభిక్షగా రామదాసు కర్పించెను. నిరీహుడైన రామదాసు శివాజీని ఆశీర్వదించి రామరాజ్యముగా ప్రజలను పాలించి కీర్తిగాంచుమని ఆ సామ్రాజ్యము వానికే యొసగెనట! శీలసంపన్నుడైన ఛత్రపతి గురువాజ్ఞను కాదనలేక తన గురువు చిహ్నమైన కాషాయపతాకను తన సామ్రాజ్యపతాకముగా ప్రకటించి యా గురుదేవుని యానతిచొప్పున ధర్మపరిపాలనకు దీక్ష వహించెను.

ఇట్లు మహారాష్ట్ర దేశమున వైష్ణవ సంప్రదాయము ప్రజల జీవితములను చక్కదిద్దుచు చిరకాలముగా వర్ధిల్లసాగినది.

ఎందరో మహానుభావులు అందరకును వందనములు

చె. రం.

## వ్యంగ్య చిత్రములు

నేటి దిన వార పక్ష మాసపత్రికలలో ముద్రితములగుచున్న హాస్యచిత్రములకు వ్యంగ్యచిత్రములను పేరు కల్గినది. ఆంగ్లములో 'కేరికేచర్' 'కార్టూన్' అన్నుపదములకు ఇది తెలుగుసేత. వ్యంగ్యచిత్రమను శబ్దము సాహిత్యచిత్రశాస్త్రముల ప్రకారము 'కేరికేచర్' 'కార్టూన్' అను పదములకు సమానవాచకమైనను కాకపోయినను ఆ శబ్దము జన వ్యవహారములో నేడు రూఢమై పోయినది.

హాస్యముకొరకును, అపహాస్యముకొరకును రూపచిత్ర అంగాంగ రేఖలను అతిశయింపజేసి వ్రాయుట ఇటాలియను భాషలో 'కేరికేతురా' అనబడుచుండెడిది. ఆ పదమే ఫ్రెంచి భాషలో 'కేరికేచర్' అయి ప్రపంచభాషలన్నిటిలో ప్రవేశము కల్గించుకొన్నది.

కార్టూన్ అను పదమునకు ఆదిలో వ్యంగ్యచిత్రమనిగాని హాస్యచిత్రమనిగాని అర్థము లేకుండెను. చిత్రవల్లికా బంధములతో రత్నకంబళముల నేతకును, కుడ్యచిత్రలేఖనమునకును

రంగురాళ్ళ ముక్కలతో భిత్తిచిత్ర నిర్మాణమునకును పూర్వము కాగితముపై ప్రమాణపథక చిత్రములను రచించెడివారు అట్టి చిత్రములకు "కార్టూన్లు" అను పేరు కల్గినది బహుశః సమగ్రమైన రేఖలు వర్ణలేపనము ఏమియు లేకయే హఠాత్తుగా ఆకారమాత్రముగా పథకప్రాయముగా గీసిన ఏ చిత్రమునకైనను తర్వాత కాలములో 'కార్టూన్' అను పేరు వాడకమునకు వచ్చియుండ వచ్చునని తోచుచున్నది అటు తర్వాత కించిత్ సారూప్యము మాత్రమే గలరేఖాచిత్రములకు – ముఖ్యముగా హాస్యచిత్రములకు–ఆ పేరు రూఢమై యుండియుండవచ్చును

'కేరికేచర్' రచనము 17-18 శతాబ్దులలో ఇటలీ దేశమున పుట్టి ఐరోపా దేశములన్నింటను వ్యాపించినది తొలి నాళ్లలో ఇటాలియను ఫ్రెంచి చిత్రకారులు సామాన్యమైన రూపచిత్రములవలెనే కేరికేచర్లను కూడ వర్ణపటములుగా తయారు చేసెడివారు కాగా 'కేరికేచర్' యొక్క ప్రధాన లక్షణమైన రేఖావర్ణముల అతిశయము ఆభాసము అందుండెడివి ఇట్టివాటిని ఆనాటి శ్రీమంతులు ఖరీదుచేసి తమ గృహములలో అలంకరించుకొను చుండెడివారు

తరువాత కొందరు చిత్రకారులు రాతి అచ్చులతో చిత్రముల ప్రతులను తీసి ఇంకను ఎక్కువ మంది ప్రజలకు వాటిని అందుబాటులోనికి తెచ్చియుండిరి 19వ శతాబ్ది ఆరంభము నాటికి ప్రత్యేకముగా కేరికేచర్లు ముద్రింపబడిన పత్రికలే వెలసినవి ఆనాడు సామంతులు శ్రీమంతులు కేరికేచర్లయందలి హాస్యములకును అపహాస్యములకును ఆలంబనముగ నుండెడివారు ఆయాచిత్రకారుల చిత్తవృత్తులను సంస్కారములనుబట్టి కొన్ని కేరికేచర్లు గిలిగింతలు పెట్టినట్లు సున్నితమైన హాస్యసంభరితములుగ నుండెడివి మరికొన్ని కటువుగను అధిక్షేపకరముగను ఉండెడివి ఈ కేరికేచర్లు ఐరోపాఖండము నుండి గతశతాబ్దమున తొలి దశాబ్దులయందే అమెరికాకు కూడ పయనించినవి అమెరికాలో అవి "కార్టూనులు" అను నామమును సంతరించుకొనినవి

అమెరికాలో కూడ ఐరోపాలో వలెనే కార్టూనులను ప్రకటించు ప్రత్యేకమగు పత్రికలుండెడివి అంతేకాక అవి దినపత్రికలకు ప్రత్యేకమైన అంగములుగా కూడ రూపొందినవి అంతవరకును కేవల సాంఘిక, సాంస్కృతిక సమస్యలను వాటికి సంబంధించిన వ్యక్తులను అపహాస్యము పాలుచేయుటకు సాధనములు మాత్రముగా నుండిన కార్టూనులు దినపత్రికల పెక్కుటతో అవి రాజకీయ ప్రాముఖ్యమును వహించినవి ముద్రణాయంత్రములు సకలదేశములకు ప్రాకుటతో వార్తాపత్రికల ప్రచురణమునందు కార్టూనులు కూడ క్రొత్తగా సంతరించుకొనిన రాజకీయ రూపములో యావత్ప్రపంచమునకు వ్యాపించినవి

ప్రాచీనత – సాంకేతికాభ్యున్నతి వలన వ్యంగ్యచిత్రములకు ఈనాడు విశ్వవ్యాప్తి కలిగినను వీటి పుట్టుక మాత్రము ఈనాటిది కాదు చిత్ర శిల్పకళల యొక్క శైశవదశయందే వ్యంగ్యచిత్రకళ కూడ ఆవిర్భవించియుండెనని చెప్పవచ్చును పేసన్ అను చిత్రకారుడు తన కగపడిన వారినందరిని ఆక్షేపించుచు వ్యంగ్యచిత్రములను రచించెడి వాడనియు అందుకై అతనికి తగిన శాస్తి జరిగినదనియు గ్రీకు తత్త్వవేత్తయగు అరిస్టాటిల్ వ్రాసియున్నాడు బుపులస్ ఎథెనిస్ అను పేర్లుగల ఇద్దరు వ్యంగ్య శిల్పులను గూర్చి ప్లినీ అను సుప్రసిద్ధ చరిత్రకారుడు పేర్కొనియున్నాడు హిప్పొనాక్స్ అను ప్రాచీన కవి ఒక వ్యంగ్య ప్రతిమను మలిచి ప్రజలు బహిరంగముగా ఆక్షేపణ చేయుటకై దానినొక శృంగాటకమున నిలిపినాడట! ఆ ప్రతిమను చూచిన వారందరు ఆ కవిని హేళనమాడెడివారట! దానికి కవి కినిసి గట్టిగా తిట్టుకవనము చెప్పినాడనియు ఆ కవిత్వపు కాకకు తాళజాలక శిల్పులు ఆత్మహత్య చేసికొనిరనియు ప్లినీ కథనము

భారత దేశమునందిట్టి కథలు ప్రచారమున లేవు కాని ప్రాచీనమైన పెక్కు హాస్యశిల్పములు హాస్య చిత్రములు మాత్రము లభించుచున్నవి హాస్య చిత్ర లక్షణములను గురించియు ప్రయోజనములను గురించియు భారతీయ చిత్ర శాస్త్రములు పేర్కొనుచున్నవి నాటకమునందు విదూషకుని పాత్రలోను ఒక శిల్పసమామ్నాయములోను చిత్ర సముచ్చయములోను హాస్యపు పాత్రలు తప్పనిసరియగును తెలుగునాట ప్రదర్శింపబడు తోలు బొమ్మలాటలో కేతిగాడు చోడిగాడు బుట్టుపోలిగాడు అల్లాటప్పయ్య బంగారక్క అను నామములతో దర్శనమిచ్చు పాత్రలు అప్పటికప్పుడు నాటి సమాజముమీదను, సామాజికులమీదను హాస్యవ్యాఖ్యానము చేయు వ్యంగ్య చిత్రములుగనే పరిగణింపబడుచున్నవి బుట్టుపోలిగానికి పూర్వీకులైన గుహ్యకులు, కుబ్జులు, కూష్మాండులు

మొదలైనవారి ప్రతిమలు మనకు బౌద్ధ శిల్పములలోను అనంతరము చెందిన వైదిక శిల్పములలోను విరివిగా కన్పట్టుచున్నవి. వీటిలో కొన్ని కేవల వ్యంగ్య శిల్పములుగను మరికొన్ని వ్యంగ్య చిత్రములుగను కూడ మనకు గోచరమగును

వైదిక దేవతయైన కుబేరుని బౌద్ధులు జంభాలుడని పిలిచెదరు ఐశ్వర్యము సంతానము ఆరోగ్యము అధికారము అన్నియు ఈ జంభాలుడు తన గుత్తసొమ్ముగా భావించెడివాడు జంభాలుని భార్యపేరు హారీతి అజంతా గుహాలలోని మొదటి గుహయందలి తోరణ శిల్పము జంభాలుని సకల విభూతులకును వ్యంగ్యవ్యాఖ్యాన మనిపించుకొనినది ఇక్షు శాలి యవ సస్యఫలాఢ్యమైన సింహాసనముపై జంభాలుడు ఆసీనుడైయుండగా అతని సరసను తొడపైనొక బిడ్డ ఒడినొక బిడ్డ సందిటనొక బిడ్డ చంకనొకబిడ్డ—ఇందరితో హారీతి ఆసీనయైయుండును అటుతరువాత జంభాల కుమారుల విద్యాభ్యాస దృశ్యముగోచరమగును కోడు విరిగిపోగా త్రాడుతో బిగించబడిన కుంటికుర్చీమీద డొక్కయందలి బొమికలను లెక్కించుటకు వీలుగా బక్కచిక్కిన బడి పంతులు కూర్చొని ఉండును అతని యెదుట వరుసగా జంభాలసంతానము ప్రత్యక్షమగును మొదటివాడు బుద్ధి కలిగి పుస్తకమును చదువుచుండగా రెండవపిల్లవాడు వ్రాయుచుండును మూడవవాడు దిక్కులుచూచుచుండగా నాల్గవయాతడు పరాఙ్ముఖుడగును ఇట్టిస్థితిలో అచ్చటినుండి లేచిపోవుటకు ప్రయత్నించెడివారు దళలవారీగా కన్పించుచుందురు ఆఖరువాడు గాడిద తోక పట్టుకొని వ్రేలాడుచుండును

కుబేర సంతానమునకు చదువు చెప్పుచున్నను ఈ బడి పంతుల బ్రతుకు బడుగు బ్రతుకేననియు 'పరువంబు కలిమి దొరతన మరయమి'—ఈ నాల్గును రాశిపోసిన శ్రీమంతుల బిడ్డలకును, చదువునకును తూర్పుపడమరలంత దూరమనియు ఆ శిల్పి వ్యంగ్యముగా వ్యాఖ్యానించినాడు పదునైదు శతాబ్దులకు పూర్వము అజంతాశిల్పి ఆనాటి సమాజస్థితిని ప్రతిబింబింపచేయుచు అద్భుతముగా మలిచిన ఈ వ్యంగ్య చిత్రము నేటికిని మన సమాజమును అపహాస్యము చేయుచునేయున్నది మనకు లభ్యమానమగు చిత్ర శిల్పములలోకెల్ల సంపూర్ణ వ్యంగ్య శిల్పమున దగినది ఇది ఒక్కటియే కనుక దీనిని మన ఆది వ్యంగ్య శిల్పమని వ్యవహరించుకొనవచ్చును

వ్యంగ్యచిత్ర స్వరూపము సాహిత్యమునందు సూత్ర రచన ఎట్టిదియో చిత్రరచనమున వ్యంగ్య చిత్రమట్టిది అల్ప రేఖలు అసందిగ్ధ భావాభివ్యక్తి సారంగను సర్వతోముఖము అయినది వ్యంగ్య చిత్రము సూత్రలక్షణములోని చివరపాదమునుగూడ అనువర్తించినచో వ్యంగ్యచిత్రకారుడే చిత్రవిత్తుకూడ అని చెప్పవచ్చును

వ్యంగ్య చిత్రములను కొందరు పెన్సిలుతో గీయుదురు మరికొందరు నల్లని కరక్కాయ-అన్నభేది సిరాతో వ్రాయుదురు గతశతాబ్దమున వ్యంగ్యచిత్రములకొక నిర్దిష్టమైన శైలియుండెడిదేకాని ఇప్పుడట్టి నిబంధనలేవియు కానరావు కేరికేచర్ పుట్టిన తొలిదినములలో కళాకారులు రూపచిత్రములను కొలదిగ వికారపరచెడివారు తరువాత తరువాత మానవముఖము జంతుశరీరము లేదా ప్రసిద్ధమైన "ఈసప్ కథలు మున్నగుగాథలయందలి పాత్రల రూపమును కల్పించుచు వ్యంగ్యచిత్రములను రచించు విధానమేర్పడినది రాజకీయ సంఘటనలను వ్యాఖ్యానించుట కుద్దేశించిన వ్యంగ్య చిత్రములను విపులముగా ఉపయోగించు దశ వచ్చునాటికి చిత్రకారునకు ఇతోధికముగా భావస్వాతంత్ర్య మబ్బినది

ఈనాటి వ్యంగ్యచిత్రముల యొక్క శైలిభేద మెట్లున్నను అభివ్యక్తిలో మాత్రము రెండు తరగతులేర్పడినవి మొదటిది చిత్రమును చూడగనే హాస్యసన్నివేశము కారణముగా అందలి వ్యంగ్యము అర్థమైపోయినట్లే యుండును రెండవది పాత్రల నోళ్లనుండి బుడగలు కల్పింపబడి వాటియందు పాత్రలు పలుకు పదములు (వాకోవాక్యాలు) గోచరమగును ఈపదముల ద్వారా హాస్యము వ్యంగ్యము రెండును వ్యక్తమగుచుండును ఈ రెండింటిలో మొదటి తరగతి చిత్రము ఉత్తమ శ్రేణికి చెందినట్టిదని చిత్రవ్యాఖ్యాతల అభిప్రాయము చిత్రరచనమునకు వాకోవాక్య రచనమును జోడించునపుడు పుట్టు హాస్యము భాషాజన్యమే కాని చిత్రజన్యము కాదనియు స్వతస్సిద్ధముగా రసోత్పత్తిని కలుగచేయలేని చిత్రము ఉత్తమ చిత్రము కాజాలదనియు వీరి మతము

కాగా, వాకోవాక్యాలుగల వ్యంగ్య చిత్రములు చిత్రకథా రచనమునకు దారితీసినవి సామాజిక సమస్యల మీద వ్యంగ్యవ్యాఖ్యానకములైన చిత్రకథలతోపాటు ప్రామాణిక కావ్యములకు సంబంధించిన చిత్రకథా రచనము

నరకు ఈ వ్యంగ్య చిత్ర రచనము వికాసము నొందినది. ఆంధ్రదేశమున పంచతంత్రము నందలి కథలను కీ. శే. విశ్వాత్ముల నరసింహమూర్తి చిత్రకథలుగా రచించినాడు. ఆధునిక తెలుగు వాఙ్మయములో చిత్రకథా రచనమునకు ఈయనే ఆద్యుడనవచ్చును.

చిత్ర శాస్త్ర ప్రమాణములు: భారతీయ చిత్రశాస్త్రములలో ప్రత్యేకముగ వ్యంగ్య చిత్రమను శబ్దము పేర్కొనబడకపోయినను వ్యంగ్య చిత్ర లక్షణములకు సరిపోలు ప్రమాణములు అందు లేకపోలేదు. చాళుక్యనరపతియైన భూలోకమల్ల సోమేశ్వరదేవుడు రాజభోగ సర్వస్వమగు అభిలషితార్థ చింతామణి అను గ్రంథమును రచించినాడు. అందులో ఆలేఖ్య కర్మను వివరించుచు నేటి వ్యంగ్య చిత్ర లక్షణములకు సరిపోలు చిత్రములను 'అవిద్ధచిత్రములు'గా అతడు పేర్కొన్నాడు.

ఆకస్మాల్లిఖితామీతి యదాకూద్దీక్ష్యవిఖ్యాతే
ఆకారమాత్ర సంపత్త్వే తదవిద్ధమితిస్మృతమ్॥

దర్పణములో ప్రతిబింబించునట్లు వ్రాయబడినది విద్ధ చిత్రమనబడెను. కాగా ఆకస్మికముగా రచింపబడినది ఆకార మాత్రసంపత్త్వముగలది అవిద్ధచిత్రమని పిలువబడెను. విద్ధ చిత్రమును ఈ నాటి చిత్తరువు లేక ఆలేఖ్యము (portrait) అని భావించుచో అవిద్ధ చిత్రమును కేరికేచర్ అని పిలువ వచ్చును.

పైన చెప్పిన సోమేశ్వరదేవుడే భావప్రధానమైన చిత్ర లక్షణమును గూడ పేర్కొనియున్నాడు. వ్యంగ్య చిత్రమునకు హాస్యము ప్రధాన లక్షణముగదా!

"శృంగారాది రసోయత్ర దర్శనాదేవ గమ్యతే
భావ చిత్రం తదాఖ్యాతం చిత్రకౌతుక కారకః॥"

ఈ నిర్వచనము ననుసరించి వ్యంగ్య చిత్రమును భావ చిత్రమనికూడ ఎంచవచ్చును. కాగా చిత్రకారుని శైలి అవిద్ధము రసము హాస్యములునై యుండవలెనని పై రెండు శ్లోకములను సమన్వయించుకొనవచ్చును. భోజమహారాజు "సమరాంగణ సూత్రధార" అను వాస్తుశాస్త్ర గ్రంథములో చిత్రలక్షణములను వివరించుచు దేవగణములను నానావిధ జంతు శీర్షములను మానవదేహములతోగాని, మానవశీర్షములను జంతుదేహములతోగాని రచింపవలెనని నుడివియున్నాడు. ఆయా రసభావాది సందర్భములనుబట్టి చిత్రకారుడు రూపకల్పము కావించుకొనవలెయునని అతని అభిప్రాయము. ఈ నరమృగసంయోగ విధానము కూడ వ్యంగ్య చిత్ర లక్షణమే కాగలదు.

వ్యంగ్యరసము: — వ్యంగ్య చిత్రమునకు ఏది ప్రధాన రసము? సాహిత్యశాస్త్ర నిర్వచనముల ప్రకారము వ్యంగ్య శబ్దార్థమేదియైనను కార్టూనులకు ప్రధాన రసము మాత్రము హాస్యమే. సాహిత్యశాస్త్రములో రసమీమాంసకులు రసమునకు అద్వైత సిద్ధిని కల్పించినారు. కాగా భోజుడు 'శృంగారమేవ ఏకరసః' అనియు ఇతరులు కొందరు 'ఏకోరసః కరుణ ఏవ' అనియు రసవైశేషికత్వమును సమర్థించియుండిరి. చిత్రకళకు సంబంధించునంత వరకు రసాద్వైత సిద్ధాంతముకంటె రస వైశేషికమే విశేషముగా వర్తింపగలదు. వైశేషిక తత్త్వరీత్యా రసమీమాంస గావించుచో శృంగార విశిష్టతను ఫ్రాయిడ్ ప్రతిపాదించిన కామతన్మాత్ర సిద్ధాంతమునకు త్రోవదీయును గనుక అది గ్రాహ్యము కాజాలదు. అట్లే కరుణావిశిష్టత బౌద్ధదుఃఖిత (దుఃఖిత) వాదమునకు పునాది వేయును గనుక అదియు వర్జనీయమే. కాగాపోగా ఒక్క హాస్యము మాత్రమే రసపారమితమైన ఆనందమునకు ఆలవాలము కాగలదు.

ఆదియుకాక ప్రపంచ సాహిత్యమందలి హాస్యరసమును పరిశీలించినచో దానికి ఇరుపైపుల శృంగార కరుణారసములు గోచరించుచుండును. సంస్కృత ప్రహసన కర్తలు శృంగార రసాభాసమును హాస్యముగా పరిగణించినారు. పాశ్చాత్య సాహిత్య వేత్తలు కరుణావిపాకమును ఉత్తమ హాస్యముగా పేర్కొన్నారు. అందుచేత కళా ప్రపంచమందలి ప్రధాన రసములైన శృంగారమునకు కరుణకు వారధిగా హాస్యము నిలిచియున్నది. అనగా శృంగార కరుణారసములు హాస్యమునకు రెండు పక్షములైనవి. వైశేషిక తాత్త్విక దృష్టితో పరీక్షించునపుడు హాస్యమొక్కటియే విశిష్ట రసమగును; తక్కిన రసములన్నియు దానినుండి ఉత్పన్నమై దానియందే లీనమగును. వ్యంగ్య చిత్రములలోగూడ ఈ లక్షణమే గోచరమగును. అద్భుత, వీర, భయానక బీభత్స జుగుప్సాది రసములు సహితము హాస్యమాత్ర మ్యూతములై వ్యంగ్య చిత్రములలో గోచరించుచుండును.

భారతీయ వ్యంగ్య చిత్రములు — భారతదేశములో వ్యంగ్య చిత్రములు ఇటీవలనే విశేషముగా ప్రచారములోనికి

చిత్రము - 90



పటము - 1

— "శంకర్స్ వీక్లీ" నుండి

నేటి అధ్యాపకులకు విద్యార్థులకుగల పరస్పర సంబంధముల తీరు

చిత్రము - 91



పటము - 2

ఉత్తర భారతదేశములో సాధువులు ముళ్ళమంచములపై పరుండుట ఆచారము అట్టి మంచము కొరకు సాధువు అంగడికి వెళ్లినపుడు యజమాని చెప్పిన సమాధానములో వ్యంగ్యభావమును గమనింపనగును "విలాస వస్తువులమీద పన్ను ఎక్కువైనది నీ మంచమున ఎక్కువ వెలను చెల్లించవలసి యుండును"

—"శంకర్స్ వీక్లీ" నుండి

వచ్చుచున్నవి దినపత్రికలలో రాజకీయ వ్యంగ్యచిత్రములు వారపత్రికలు మాసపత్రికలలో విశేషముగా సామాజిక వ్యంగ్య చిత్రములు ప్రచురితమగుచున్నవి కొంతకాలము క్రిందటి వరకు ప్రఖ్యాత బ్రిటిష్ వ్యంగ్య చిత్రకారుడైన సర్ డేవిడ్ లో రచించిన వ్యంగ్య చిత్రములు హిందూ ఆంగ్ల దినపత్రిక యందు ప్రచురింపబడుచుండెడివి ఇప్పటికి పెక్కు భారతీయ పత్రికలు విదేశ సామాజిక వ్యంగ్యచిత్రములను ప్రచురించుచునే యున్నవి

చిత్రము - 92



పటము - 3

గొప్పవారి లక్షణము

చిత్రకారుడు : తలిసెట్టి రామారావు "భారతి" నుండి

భారత దేశములో ప్రత్యేకముగా వ్యంగ్య చిత్ర రచనకు అంకితమైన మొట్టమొదటి ఇంగ్లీషు వారపత్రిక శంకర్స్ వీక్లీ అనునది ఈ పత్రికాధిపతియైన శంకరపిళ్లై భారతీయ వ్యంగ్య చిత్రకారులలో అగ్రగణ్యుడు అట్లే రేఖాసౌష్ఠవమునకును భావశబలతకును పేరెన్నికగన్న వ్యంగ్య చిత్రకారుడు ఆర్ కె లక్ష్మణ్ అను నతడు

తెలుగులో వ్యంగ్య చిత్రకళకు శ్రీకారముచుట్టినవాడు కీ శే తలిసెట్టి రామారావు ఆయన చిత్రములు భారతి మాసపత్రికలో ప్రచురితమగుచుండెడివి

రామారావు రచించిన చిత్రములలో కెల్ల "ప్రబంధ సుందరి" మకుటాయమానమైనది రంభాస్తంభము లూరువు లంభోరుహానిభము లతులని ప్రబంధకారుల వర్ణనములనుబట్టి ఉపమానవస్తువులతో అతడు ప్రబంధసుందరిని సృజించినాడు

దిన పత్రికలలోని ఒక పెద్దవ్యాసముగాని ఒక సంపాదకీయవ్యాఖ్యగాని చేయజాలని పనిని కూడ ఒక చిన్న వ్యంగ్య చిత్రము చేయగల్గుననుటలో అత్యుక్తి లేదు అందుకని ఆధునిక పత్రికా రచనములో వ్యంగ్య చిత్రమునకు మంచి సంపాదకీయమున కున్నంత ప్రాముఖ్యమేర్పడి యున్నది వ్యంగ్య చిత్రప్రయోజనము ఆయాచిత్రకారుల ప్రతిభావ్యుత్పత్తులపై ఆధారపడియుండును కొన్ని వ్యంగ్య చిత్రములు సమాజమందలి తప్పులను ఒక వంక ఎత్తిచూపుచునే మరియొక వంక గిలిగింతలుపెట్టగా మరికొన్ని వ్యంగ్య చిత్రములు మొరటు హాస్యపద్ధతి ననుసరించి ప్రదర్శిత మగుచుండును

భోజరాజు చిత్రములయొక్క ప్రయోజ్యాప్రయోజ్యములను పేర్కొనుచు సామాన్య గృహములలో శృంగార హాస్యరసచిత్రములను మాత్రమే రచింపవలెననియు దేవాయతనములలో మాత్రమే సకలరసములు ప్రతిబింబించు చిత్రములను చిత్రించవచ్చుననియు వక్కాణించినాడు సామాన్య గృహములలో పరాశరుడు దాసకన్యను పట్టినతీరును విశ్వామిత్రుడు మేనకను పట్టిన తీరును చిత్రించుట సముచితము కాజాలదుకదా ! అయినప్పుడు భోజుని మతమననుసరించి మిగిలినది ఒక్క హాస్యరసము మాత్రమే భోజుని ప్రయోజ్య ఆదేశములను మనమంగీకరించిన పక్షములో పత్రికలలోని పచ్చి శృంగార చిత్రములకంటెను, సామాజిక సమస్యలపై చక్కని ఆక్షేపణ వ్యంగ్య చిత్రములను ప్రచురించుట ఎంతయు ఆరోగ్యకరము అభిలషణీయము

రాం కృ

## వ్యంగ్యము (ప్రాచీన సంస్కృతాంధ్రములు)

"పద పదార్థ సంబంధః శక్తిః" అని నైయాయికులు శక్తిని నిర్వచించియుండిరి శక్తియనగా పదములకును వాని అర్థములకును గల సంబంధము ఈ శక్తికే వృత్తి వ్యాపారము అను నామాంతరములు కలవు వృత్తులు శబ్దవృత్తులు అర్థవృత్తులు అని రెండు విధములు శబ్దమును ఆశ్రయించి ఉండునవి శబ్ద వృత్తులు అర్థమును ఆశ్రయించి ఉండునవి అర్థవృత్తులు

అభిధ లక్షణ వ్యంజన అని శబ్దవృత్తులు మూడు విధములు ఇవి క్రమముగా వాచ్య లక్ష్య వ్యంగ్యార్థములను బోధించును తాత్పర్యశక్తి అను మరొకశక్తి కలదనియు అది తాత్పర్యార్థమును బోధించుననియు మీమాంసకులలో ఒక తెగవారు చెప్పుదురు కాని పలువురు తాత్పర్యార్థమునకు పార్థక్యము అంగీకరింపక అదియును వ్యంగ్యార్థమును అభిన్నములే అని భావించిరి

శబ్దార్థముల పరస్పరసంబంధమును నిర్ణయించుటకు సంకేతమని పేరు ఈ శబ్దమునకు ఈ అర్థముండవలెనను ఈశ్వరేచ్ఛయే సంకేతమని ప్రాచ్యులును లోకేచ్ఛయే సంకేతమని నవ్యులును తలంచిరి అట్లు సంకేతితమైన శబ్దార్థమును తెల్పు శక్తికి అభిధ అని పేరు సంకేతితార్థమన శబ్దమునకుగల ముఖ్యార్థము దీనికే వాచ్యార్థమని ఇంకొక పేరు వ్యాకరణము ఉపమానము ఆప్తవాక్యము వ్యవహారము వివరణము అన్యపదసాన్నిధ్యము అనునవి వాచ్యార్థమును నిర్ణయించును

ముఖ్యార్థమునకు అనుపపత్తి కలుగునప్పుడు ప్రయోజనమునుబట్టికాని లోకరూఢినిబట్టికాని ముఖ్యార్థముతో సంబంధము గల వేరొక అర్థమును బోధించు శబ్దశక్తి లక్షణ దీనిచే బోధింపబడు అర్థము లక్ష్యార్థము ఇది వాచ్యార్థముతో సంబంధము కలిగియుండునే కాని కేవలము భిన్నముగా ఉండదు ఇచ్చట ముఖ్యార్థబాధ ముఖ్యార్థసంబంధము ప్రయోజనముకాని రూఢి కాని ఉండుట అను మూడువిషయములను గమనింపవలయును ఉదా: గంగాయాం ఘోషః దీనికి గంగయందు గొల్లపల్లె అని అర్థము గంగయందు గొల్లపల్లె ఉండుటకవకాశములేదు అందుచే ఇచ్చట వాచ్యార్థమునకు బాధలేక అనుపపత్తి ఘటిల్లినది అప్పుడు దానితో సంబంధముగల మరొక అర్థమును గ్రహింపవలయును గంగాతీరమునందు గొల్లపల్లె అను అర్థమును గ్రహించినచో అ

బాధ తొలగును కాని ఇట్లు గ్రహించుటకు ప్రయోజనము కాని లోకరూఢి కాని కారణముగా ఉండవలయును. గంగాయాం ఘోషః అను మాటకు గంగాతీరమందు అను రూఢి లేదు కాని ప్రయోజనమున్నది. గంగయందలి శీతత్వపావనత్వాదులు ఘోషమందును స్ఫురించుటయే ఆ ప్రయోజనము. గంగాతీరే ఘోషః అనిచెప్పుట వలన ఆ ప్రయోజనము స్ఫురింపదు. ప్రయోజనమును బట్టి ఇచ్చట గంగయందు గొల్లపల్లె అని దానికి గంగాతీరమందు గొల్లపల్లె అనివాచ్యార్థ సంబంధము గల మరొక అర్థమును చెప్పుకొనుచున్నాము. ఈ అర్థాంతరమును స్ఫురింపజేయు శక్తికే లక్షణ అని పేరు. ఇది సంబంధ నిబంధనాలక్షణ సామ్య నిబంధనాలక్షణ అని ప్రధానముగా రెండు విధములు. ఇవి మరల రూఢి ప్రయోజనములనుబట్టి ఒక్కొక్కటి రెండేసి విధములు.

శబ్దములకు వాచ్యార్థము పొసగినపిమ్మట దానికి శోభాహేతువగు అర్థాంతరమును తోపించు శక్తి వ్యంజన అని పేరు. అభిధాశక్తి ప్రాకరణికమైన వాచ్యార్థమును లక్షణాశక్తి వాచ్యార్థమునకు అనుపపత్తి కలిగినపుడు దానితో సంబంధముగల మరొక అర్థమును బోధించును. వ్యంజనాశక్తి ప్రకృతార్థస్ఫురణ కలిగిన పిమ్మట అంతకంటె చారుతరమైన అప్రకృతార్థమునుకూడ స్ఫురింపచేయును. ఈ అర్థమునకే వ్యంగ్యమని పేరు. దీనిని సాహిత్యరంగమున ప్రతిష్ఠించిన ఆనందవర్ధనాచార్యులు. అంతకు పూర్వముండిన పండితులు శబ్దమునకున్న అర్థబోధక శక్తులను పరిశీలించి అభిధాలక్షణాశక్తులు రెండింటినే అంగీకరించిరి. వారికి వ్యంజనాశక్తి విషయమస్ఫుట స్ఫురితముగా ఉండెను. అట్టితరి ఆనందవర్ధనాచార్యుడు హేతువాదపూర్వకముగను ప్రతిభాప్రపూర్ణముగను దానిని నిరూపించి విద్వదానందవర్ధనుడై విరాజిల్లినాడు.

వ్యంజనాశక్తి శబ్దశక్తిమూల వ్యంజన అర్థశక్తి మూల వ్యంజన ఉభయశక్తి మూలవ్యంజన అనిమూడు విధములు. కొన్ని శబ్దములకుగల అనేకార్థబోధనశక్తికి శబ్దశక్తి అని పేరు. ఇది మూలముగా గల వ్యంజన శబ్దశక్తి మూలవ్యంజన. ఉదా: ప్రతాపరుద్రుని వాహినులు సర్వతోముఖసంక్రమములై శత్రుబల జలనిధిని ఉద్యత్కబంధాఢ్యముగా ఒనరించుచున్నవి. ఇచ్చట ప్రతాపరుద్రుని సేనలు అన్నివైపుల చరించుచు శత్రువులసేనయనెడి సముద్రమును ఎగురుచున్న మొండెములు కలదానిగా చేయుచున్నవని ప్రాకరణికార్థము. వాహినీ సర్వతోముఖ కబంధశబ్దములనేకార్థస్ఫూర్తికలవగుటచే నదులు సర్వతోముఖసంక్రమములై సముద్రమును నీటితో నింపుచున్నవను అప్రకృతమైన విశేషార్థము కూడ స్ఫురించుచున్నది. ప్రాకరణికార్థమును మాత్రమే బోధించు అభిధాశక్తికి అప్రాకరణికార్థప్రతిపత్తిని కలిగించు శక్తిలేదు. ఆ అప్రాకరణికార్థము వక్తృవివక్షితమగుటచేతను దాని నన్యవిధమున కల్పించుట కవకాశము లేకపోవుటచేతను ఇటు వ్యంజనాశక్తి సాహాయ్యమును పొందవలసివచ్చినది. వాచ్యార్థమున కనుపపత్తి లేకపోవుటచే నిచ్చట లక్షణావృత్తి లేదు. వ్యంగ్యార్థస్ఫూర్తికి వాహినీకబంధాది శబ్దముల శబ్దశక్తియే కారణమగుటచే ఇచ్చటి వ్యంజన శబ్దశక్తిమూలవ్యంజన. ఈ శబ్దములు పరివృత్తిని సహించునవి కావు. అనగా వానిని తొలగించి సమానార్థకములైన సేనాజలాది శబ్దములను వాడినచో వక్తృవివక్షితమైన విశేషార్థము స్ఫురింపదు.

అర్థశక్తి కారణముగాగల వ్యంజన అర్థశక్తి మూల వ్యంజన. దీనియందు శబ్దములు పరివృత్తిని సహించును. అనగా వానికి బదులు పర్యాయపదములను వాడినను వ్యంగ్యార్థ స్ఫూర్తికంతరాయముండదు. ఉదా — ప్రతాపరుద్రుని క్షోణీపాణిగ్రహణమును విని రాజు అంగుష్ఠముతో భూమినాలిఖించుచు నతాననులైరి. ఇచ్చట అతిలోక పరాక్రమశాలి యైన ప్రతాపరుద్ర దేవుడు పట్టాభిషిక్తుడయ్యెనను వార్త వినగనే రాజులు విషణ్ణులైరను వ్యంగ్యార్థము అర్థశక్తి మూలమున కలుగుచున్నది. కావున ఇది అర్థశక్తి మూలవ్యంజన.

వాక్యమునందలి శబ్దములుకొన్ని పరివృత్తిని సహించునవియు, కొన్ని సహింపనివియు అగుచో అది ఉభయశక్తి మూలవ్యంజన. ఉదా: విజితారిపురుడును మూర్తివిలసత్సర్వమంగళుడును అగు ఈ రాజమౌళి జగత్పతియై ప్రకాశించుచున్నాడు. శత్రుపురములను జయించినవాడును దేహమున సర్వమంగళ చిహ్నములు కలవాడును అగు ఈ రాజేంద్రుడు (ప్రతాపరుద్రుడు) జగత్పతియై యొప్పుచున్నాడనునది యిటు ప్రకృతార్థము. త్రిపురహరుడును, దేహమున ప్రకాశించు సర్వమంగళ (పార్వతి) కలవాడును అగు ఈ రాజమౌళి (చంద్రశేఖరుడు) జగన్నాయకుడై యొప్పుచున్నాడనునది

అప్రస్తుతార్థము ఇందు విజితారిపురుడు జగత్ప్రతియనునర్థ పరివృత్తిని సహించును ఇట అర్థశక్తిమూలవ్యంజన కలదు మూర్తి విలసత్సర్వమంగళుడు రాజమౌళి అనునవి పరివృత్తిని సహింపవు ఇట శబ్దశక్తిమూలవ్యంజన కలదు అందుచే నిది ఉభయశక్తిమూలవ్యంజన

అభినవ గుప్తుడు ధ్వని శబ్దమునకు ధ్వని కావ్యము వ్యంగ్యార్థము వ్యంజనాశక్తి అను మూడర్థములు చెప్పి యున్నాడు "యత్రార్థః శబ్దోవాత మర్థముపసర్జనీ కృత స్వార్థౌ వ్యంక్తః కావ్యవిశేషః సధ్వనిరితి సూరిభిః కథితః" ఎచ్చట అర్థము తన్ను శబ్దము తన అర్థమును అప్రధానము కావించి అర్థాంతరమును వ్యక్తమొనరించునో దానికి ధ్వని అని పేరు ఇది కావ్యపరమైన అర్థము ఒక్కొక్కప్పుడు వాచ్యార్థము బోధపడిన పిమ్మట అపూర్వ్యంపశ్యలగు స్త్రీల అవయవములందు తద్భిన్నముగా ప్రకాశించు లావణ్యమువలె సుహాకవుల కవ్యములందు వాచ్యార్థము కంటె భిన్నమును అంతకంటె చారుతరము నైన అర్థాంతరము స్ఫురించుచుండును ఇదివస్తురూపమునకాని, అలంకారరూపమునకాని, రసరూపమున కానితుండును దీనికే వ్యంగ్యార్థమని పేరు ఇది వాచ్యార్థము చేతనే ఆక్షిప్తమగుచుండును అనగా ముందు వాచ్యార్థము స్ఫురించిన పిమ్మట దాని సాహాయ్యముచేతనే అంతకన్న రమ్య తరమైన ఈవ్యంగ్యార్థము తోచుచుండును ఈక్రమమువస్తు అలంకారవ్యంగ్యములందు స్పష్టముగా గోచరించును కాని రస వంగ్యమునగోచరింపదు కావ్యమునకాత్మ ధ్వని అనునప్పుడు ధ్వని శబ్దమునకు వ్యంగ్యార్థము అను అర్థమునే గ్రహింపవలయును

ఈ ధ్వని అభిధామూల ధ్వని లక్షణామూల ధ్వని అని రెండు విధములు అభిధామూలధ్వనికి వివక్షితాన్యపర వాచ్యమనియు, లక్షణామూలధ్వనికి అవివక్షితవాచ్యమనియు నామాంతరములు వివక్షిత + అన్యపర + వాచ్యమనగా అన్య (ధ్వని) పరముగా వివక్షింపబడిన వాచ్యముకలదని అర్థము ఇందు వాచ్యార్థము పొసంగినను ధ్వనిపరముగా వివక్షింప బడును అవివక్షిత వాచ్యమనగా వివక్షింపబడనివాచ్యముగలది ఇందు వాచ్యార్థము పొసగకనే పొసగదు

అభిధామూలమైన వివక్షితాన్యపరవాచ్యము లక్ష్య క్రమవ్యంగ్యము అసంలక్ష్యక్రమవ్యంగ్యము అని రెండు విధ ములు మొదటిదానియందు వాచ్యవ్యంగ్యముల క్రమము స్పష్టముగా గోచరించును అనగా ముందు వాచ్యార్థము గోచరించిన తరువాత వ్యంగ్యార్థము స్ఫురించును అందుచే దీనికి అనురణన వ్యంగ్యమను పేరు కలిగినది అనురణమనగా ప్రతిధ్వని రెండవదాని యందత్యంత సూక్ష్మమగుటచే వాచ్య వ్యంగ్యములక్రమము గోచరింపదు పద్మపత్రములు నూరింటి నొకదానిపై నొకటిగా నమర్చి సూదితో గ్రుచ్చినచో ఆ సూది నిజముగా ఒక్కొక్క దళమునే గ్రుచ్చుచుపోయినను మనకు ఆక్రమము గోచరింపక అది అన్ని దళములను ఒక్కమారే గ్రుచ్చినట్లు గోచరించును అట్లే అసంలక్ష్యక్రమమున కూడ అర్థము వాచ్యమునుండియే వ్యంగ్యమునకు తరలినను ఆక్రమము గోచరింపదు అందుచే దానికి అసంలక్ష్యక్రమమను పేరు ఏర్పడినది

లక్ష్యక్రమ వ్యంగ్యము శబ్దశక్తిమూలము అర్థశక్తి మూలము ఉభయశక్తిమూలము అని మూడు విధములు ఇందు శబ్దశక్తిమూలము వస్త్వలంకారరూపముల రెండు విధములు ఇది మరల వాక్యభేదములచే ఒక్కొక్కటి రెండేసి విధములు ఈ విధముగా శబ్దశక్తిమూలధ్వని మొత్తము నాలుగువిధములు

అర్థశక్తి మూలలక్ష్యక్రమధ్వని స్వతస్సిద్ధము కవి ప్రౌఢోక్తిసిద్ధము కవినిబద్ధవక్తృప్రౌఢోక్తి సిద్ధము అని మూడు విధములు ఇది ఒక్కొక్కటి వస్తురూపము అలం కారరూపము వస్తుకృతాలంకారరూపము అలంకారకృతా లంకారరూపము అని నాలుగు విధములు ఈ విధముగా అర్థ శక్తి మూలధ్వని పండ్రెండు విధములగును ఈ పండ్రెండును పదగత వాక్యగత ప్రబంధగత భేదములచే ముప్పదియారు విధములగును

ఉభయ శక్తిమూల లక్ష్యక్రమవ్యంగ్యము వాక్యగతమై ఏకైకవిధముగా నుండును

ఇట్లు శబ్దశక్తిమూలమునందలి నాలుగు విధములు అర్థ శక్తిమూలమునందలి ముప్పది ఆరు విధములు ఉభయశక్తి మూలముయొక్క విధము కలసి లక్ష్యక్రమవ్యంగ్యము మొత్తము నలువదియొక్క విధములు

అసంలక్ష్యక్రమవ్యంగ్యము పదగతము వాక్యగతము, వర్ణగతము రచనాగతము పదైకదేశగతము ప్రబంధగతము అని ఆరువిధములు ఈవిధముగా అభిధామూలమైన వివక్షి తాన్య పరవాచ్యము (41 + 6) నలువదియేడు విధములు

లక్షణామూలమైన అవివక్షిత వాచ్యధ్వని అత్యంత తిర స్కృత వాచ్యము, అర్థాంతర సంక్రమిత వాచ్యము అని

రెండువిధములు. ఇవి రెండును పదవాక్య గతభేదములచే నాలుగు విధములు.

ఈవిధముగా అభిధామూలమగు వివక్షితాన్యపరవాచ్యము నందలి నలువదియేడు విధములును లక్షణామూలమగు అవివక్షిత వాచ్యధ్వనియందలి నాలుగు విధములును కలిసి శుద్ధధ్వని ఏబదియొక్క రకములు. ఈ ఏబదియొక్కటియు ఒండొంటి కలిసి సంకీర్ణములై 1326 విధములగును. ఇవి మరల త్రివిధ సంకరములచేతను ఏకవిధసంసృష్టిచేతను మొత్తము నాలుగు రెట్లగుటచే 5304 భేదము లేర్పడును.

పై ధ్వని భేదములలో ముఖ్యములైనవాని కాంధ్ర సంస్కృతములనుండి లక్ష్యములు చూపబడుచున్నవి.

1 కాంచనరత్న సంఘటిత సౌధంబులే
 మా కుటీరంబులు మాధవునకు
వివిధ నరేంద్రసేవిత రాజధానియే
 మాపల్లె యదువంశమండితునకు
సురభి పాదపలతా శోభితారామ మే
 మాయరణ్యము సింహమధ్యమునకు
కమనీయ లక్షణగజ తురంగంబులే
 మా ధేనువులు కంసమర్దనునకు
రూపవిభ్రమ నైపుణ్యరూఢలైన
మగువలె మేము మన్మథ మన్మథునకు
నేల చింతించు మముఁ గృష్ణుఁడేల తలఁచు
పృథివి నధిపులు మాతనప్రియులుగారె

—భాగవతము X పూర్వ

ఇవి గోపికలు కృష్ణునిగూర్చి యనుచున్న మాటలు "మేము సౌధములలో నివసించువారము కాదు గుడిసెలలో నివసించు అల్పురాండ్రము. ఇంతవరకు ఈ కుటీరములలో మాతో కలసిమెలసి సంచరించిన కృష్ణునకు ఇప్పుడు సౌధవాసినులు కావలసివచ్చినారు. సౌధవాసినులము కామని మమ్ము నప్పుడాతడు నిరాకరించినాడు" అనువ్యంగ్యార్థము స్ఫురించుచున్నది. మరియు మాధవునకు (వసంతునకు) కుటీరములే అర్హములు కాని భర్మసౌధము లర్హములు కావను అభిప్రాయముకూడ వ్యంగ్యమగుచున్నది. అదిగాక "అధిపులు మాతనప్రియు లగుటచే ఇప్పుడు పాతవారము మేము పనికి రాలేదు. కొంతకాలము జరిగిన పిమ్మట మధురాపురివారును కూడ ప్రాతవారై అతనిచే నిరాకరింపబడుదురు" అను అభిప్రాయముకూడ స్ఫురించుచున్నది. మా మేము అను పదములు గోపికలను సూచించును. పూర్వము ప్రీతిపాత్రలైన వారే ఇప్పుడు పనికిరానివారైరి.

మా మేము అనుపదముల వాచ్యార్థము లిచ్చట కాక పనికిరాని మా మేము అనువ్యంగ్యార్థము సంక్రమించుచున్నది. అందుచే ఇది అర్థాంతర సంక్రమిత లక్షణామూలధ్వని.

2 కాసైరింపక వర్ణయుండగ భవద్గర్వంబునం దాల్చిరే
 జోఁజసహ్యుండ్ శరజన్ముఁగాంచి యలనీహారక్షమా
 భృత్కుమా
రీసాపత్న్యముగన్న మోహపు పురంధ్రీ రత్నమౌదీవశ
వేసర్వజ్ఞునకేల నిన్నుదలపై నెక్కించుకోఁజాహ్నవీ

విజయ విలాసము

అర్జునుడు గంగను స్తుతించు సన్నివేశమిది. పార్వతి చేయలేని పనిని గంగ చేయజాలి శివునికత్యంత ప్రీతిపాత్రయగు మోహపుపురంధ్రీ రత్నమైనది. అతడందుచేనామెను తలపై నెక్కించుకొన్నాడు. ఎంత ప్రేమపాత్రలైనను ప్రియురాండ్రను నెత్తి నెక్కించుకొనుట లోకస్వభావముకాదు. ఇచ్చట తలపై నెక్కించుకొనుట అనుపదములు వాచ్యార్థమును తిరస్కరించి మిక్కిలిగా గౌరవించుట అను వ్యంగ్యార్థమును కలిగించుచున్నవి. అందుచే ఇది అత్యంత తిరస్కృత వాచ్యలక్షణామూలధ్వని.

3 రవి సంక్రాంత సౌభాగ్యస్తుషారావృత మండలః
 నిశ్వాసాంధ ఇవాదర్శ శ్చంద్రమా న ప్రకాశతే

—వాల్మీకి రామాయణము

సూర్యునియందు సంక్రమించిన సౌభాగ్యముకలవాడును మంచుచే గప్పబడిన బింబము కలవాడునగు చంద్రుడు నిట్టూర్పుగాయువులచే అంధమగు అద్దమువలె ప్రకాశింపకున్నాడు. అంధమనగా గ్రుడ్డిది అని అర్థము. అద్దము అచేతనమగువస్తువు. అది గ్రుడ్డి దెట్లగును? అందుచే అంధశబ్దము గ్రుడ్డిదను అర్థమును తిరస్కరించి కాంతిహీనమను అర్థమును స్వీకరించినది. అందుచే ఇది అత్యంత తిరస్కృతవాచ్య లక్షణామూలధ్వని.

4 ఏవం వాదిని దేవర్షౌ పార్శ్వే పితురధోముఖీ
 లీలాకమల పత్రాణి గణయామాస పార్వతీ —కుమార

ఈ విధముగా దేవర్షియైన నారదుడు పలుకుచుండగా

తండ్రి పార్శ్వమున అధోముఖయై పార్వతి లీలాకమల పత్రములను లెక్కించుచుండెను ఇచ్చట కమలపత్రములను లెక్కించుట అధోముఖ యగుట అనునవి లజ్జవలననే కలిగినవి కాదు అవి ఇతర కారణముల మూలమునకూడ కలుగవచ్చును కాని ఆమె పూర్వమాతని కొరకు తపస్సు చేసినవృత్తాంతము తోచినంతనే లజ్జావ్యక్తమగును తరువాత అలజ్జ ద్వారమున రసము స్ఫురించును అందుచే ఇది లక్ష్యక్రమవ్యంగ్యమే

6 హరస్తు కించి త్పరివృత్త ధైర్యశ్చంద్రోదయా
రంభ ఇవాంబురాశిః ।
ఉమాముఖే బింబఫలాధరోష్ఠే వ్యాపార యామాస
విలోచనాని —కుమార

చంద్రోదయారంభమందలి సముద్రమువలె శివుడుకొంచెము చలించిన ధైర్యముకలవాడై బింబఫలాధరోష్ఠమైన పార్వతి ముఖమందు చూపులను ప్రసరింపజేసెను ఇట విభావాను భావముల చర్వణము పూర్తిగా గోచరింపకయే రసస్ఫూర్తి కలుగుచున్నది అందుచే ఇది అసంలక్ష్యక్రమ వ్యంగ్యము

6 ఉర్వీధరము లెక్కి యుబుక నేకుచకుంభ
యుగమొల్లగాక తా నుబుకుమనిన
వాడికై దువులపై వ్రాలనే విరుచూపు
వాలొల్లగాక తా వ్రాలుమనిన
మున్నీట మునిపడమునుగనే నతనాభి
గనవొల్లగాక తా మునుగు మనిన
కెడగారు కాలాహిదొడకనే నూగారు
తొడనొల్లగాక తా దొడుకు మనిన
దె ప్పగురుడేమి చెప్పన చేయలేనె
కావెతన పొమ్ము మామక కాయ కర్మ
గతులు మొఱ్ఱోయనంగ లింగముమగటు
ఙంగమనసంగవలఁగూర్పఁజనదుగాక-పాండురంగ-
౫ ఆశ్వాస

ఈ పద్యము అయుతునకుగల వైరాగ్యమును చక్కగా వ్యక్తముచేయుచున్నది ఉర్వీధరములెక్కి ఉరుకుటకంటె వనితాకుచకుంభముల నాశ్లేషించుటయు వాడికైదువులపై వ్రాలుటకంటె వనితావీక్షణ బాణములకు గురియగుటయు ఎక్కువ భయంకరములని ఇట్టి ప్రౌఢోక్తుల ద్వారమున చెప్పఁబడినది దీనివలన అయుతుని వనితా పరాఙ్ముఖతారూపమైన వైరాగ్యమును గురుభక్తియు తెల్లగా వ్యంజితములగుచున్నవి ఇది కవినిబద్ధ వక్తృప్రౌఢోక్తి సిద్ధార్థ శక్తిమూల ధ్వని

7 శిఖరిణి క్వను నామకియచ్చిరం కి మభిధానమ
సావకరోత్ తపః ।
తరుణి యేన తవాధరపాటలం దశతి బింబఫలం శుక
శాబకః ।

"ఓ తరుణీ! శుకశాబకము నీయధరమువలె పాటలమైన దొండపండును కొరుచుకున్నది పర్వతమునందెచ్చట ఎంతకాల మేపేరుగల తపస్సాచరించెనో కదా!

ఇదియును కవి నిబద్ధ వక్తృ ప్రౌఢోక్తిసిద్ధార్థ శక్తి మూలధ్వనియే శుకశాబక మనన్య సాధ్యమైన మహాతపస్సొనరించి నీ అధరమువలె పాటలమగుదొండపండు నాస్వాదింపఁ జాలినదను నాయకుని పలుకు వలన అతనికి నాయిక అధరము నాస్వాదించుటయందలి ఉత్కటమగు అభిలాష వ్యంగ్యమగుచున్నది

8 అలించితె యాపలుకుల
పోలిక దెలియంగ కలహభోజనముని తా
బోలుమనమితవి గనియుచి
కాలాపము లాడిచనుటయభిమతమని యెన్
—కళాపూర్ణోదయము ౧ ఆశ్వా

నారద మణికంధరులు కలభాషిణ్యాదులను వర్ణించుట వినిన పిమ్మట రంభ నలకూబరునితో పలుకుచున్న పలుకులివి నారదుడనక కలహభోజనముని అని అనుటవలన అతడుకయ్యములతో కడుపునిండించుకొను వాడను నిరసనము తోచుచున్నది దీనివలన రంభకు అతనియెడగల అమర్షమును అతనిచే వర్ణింపబడిన స్త్రీల యెడగల అసూయయు వ్యంగ్యములగుచున్నవి ఈ పద్యమునందలి పలుకులు ప్రౌఢములుగాక సహజసిద్ధములుగానున్నవి అందుచే ఇది స్వతస్సిద్ధార్థశక్తిమూల ధ్వని

9 అరుదుగ నీవిమానము ప్రజాధిపుడుంబరషోత్తముండు
శంకరుడునుదక్కవన్యులకుగాదధిరోహమొనర్ప వారి ను
స్థరకరుణా విశేషమున జిష్ణుడనైకయికొంటి దీనినే
నరవరసర్వ సద్గుణగణంబుల ప్రోవగునీ కొసంగితిన్
—వసుచరిత్ర-౩ ఆశ్వా

ఇది ఇంద్రుడు వసురాజుతో చెప్పుచున్న మాటలు

త్రిమూర్తుల తప్ప అన్యులీ విమానమును ఎక్కుటకుతగరు ఆ త్రిమూర్తులదయా విశేషమువలన నేను దీనిని పొందితిని ఇప్పుడు సర్వోద్గుణ గణములకు నిలయమవగు నీకొసంగుచున్నాను అనిఇందలి యర్థము ఇందువసురాజునకు త్రిమూర్తులతోడను తదనుగ్రహము పొందిన ఇంద్రునితోడను సామ్యము వ్యంగ్యమగుచున్నది అందుచే ఇది అర్థ శక్తి మూల రూపకాలంకారధ్వని

10 శూన్యంవాసగృహం విలోక్యశయనాదుత్థాయ
కించిచ్ఛనైః
నిద్రావ్యాజముపాగతస్య సుచిరం నిర్వర్ణ్య పత్యుర్ముఖం
విస్రబ్ధంపరిచుంబ్య జాతపులకామాలోక్యగండస్థలీం
లజ్జానమ్రముఖీ ప్రియేణహసతాబాలా చిరంచుంబితా॥

ఒక ముగ్ధానాయిక శయనగృహమున మరెవ్వరును లేకుండుటగాంచి పాన్పునుండి మెల్లగాలేచి నిద్రావ్యాజమును పొందిన భర్త ముఖమును నిదానించి చూచి ఎవ్వరును లేరనునమ్మకముతో దానినిముద్దాడెను అంత ఆతని చెక్కిళ్ళపై పులకలు చూపట్టెను అప్పుడాతడు దొంగనిద్ర నటించుచుండెనని తెలిసికొని ఆమె సిగ్గున నతాస్య అయ్యెను ప్రియుడు నవ్వుచు నామెను చాలసేపు ముద్దాడెను

ఈ శ్లోకమున కవి నాయికా నాయకులు శృంగార రసము ననుభవించిరని వాచ్యముగా చెప్పకపోయినను ఇందు వర్ణింపబడిన చేష్టాదులు వాచ్యమున ప్రధానముకాకుండి వ్యంగ్యమైన సంభోగశృంగారమును స్ఫురింపజేయుచున్నవి ఇట వాచ్యవ్యంగ్యార్థములకు క్రమము గోచరింపదు అందుచే ఇది అసంలక్ష్యక్రమసంభోగ శృంగార వ్యంగ్యము

11 ననుముట్టి నీవువెండియు వనితలసంగతికిఁబోవు
చాడవెట్లైనన్
దను వేఁడసినఫలమే, కనిమొదవిడిచి త్తభవ
వికారముతెల్లన్
-విరాట - అశ్వా

ఇవి భీముడు కీచకునితో పల్కుచున్న మాటలు "నన్ను స్పృశించి నీవింక నన్యకాంతలసంగతికి పోవుదువా ? పోవు నేను నిన్నంతగా సుఖంపజేసెద" ననివాచ్యార్థము "నేటితో నీకాయువు ముగియుచున్నది ఇపుడు నన్ను ముట్టినవిధమ నీవింకెన్నడును పరస్త్రీలకాంక్షింపవు" అనునది వ్యంగ్యార్థము ఇచ్చట వాచ్యార్థమును తిరస్కరించి వ్యంగ్యార్థము స్ఫురించుచున్నది కావున నిది అత్యంత తిరస్కృత వాచ్యధ్వని

12 ఛన్నోపాంతః పరిణతఫలద్యోతిభిః కాననామ్రై
స్త్వయ్యారూఢే శిఖరమచలస్స్నిగ్ధవేణీ సవర్ణే
నూనంయాస్యత్యమరమిధునప్రేక్షణీయామవస్థాం
మధ్యేశ్యామః స్తనఇవభువః శేషవిస్తారపాండుః
-మేఘసందేశము

యక్షుడు మేఘునితో ఇట్లనుచున్నాడు "పండిన ఫలములతో నొప్పుకాననామ్రములచే కప్పబడిన ఉపాంతము గల ఈ ఆమ్రకూటాద్రి నీవు శిఖరమునధిరోహింపగనే అంతటను తెల్లగానుండి మధ్యశ్యామలవర్ణముగల భూదేవి స్తనమువలె అమరమిధునములకు దర్శనీయముకాగలదు" ఓ మేఘుడా ! నీవు ఆమ్రకూట పర్వతశిఖరముపై నుండుట రతి పరిశ్రాంతుడైన నాయకుడు ప్రియురాలి కుచకలశముపై విశ్రాంతికై నిద్రించుటవలె నుండునని వ్యంగ్యము ఇది కవి ప్రౌఢోక్తి సిద్ధార్థశక్తి మూలధ్వని

13 ఫలానిదిశభవ్యాని నివేశ్యమణిబంధనే,
బింబోష్ఠిచుంబనైర్లేవమాశి ! లాలయమాశుకమ్

"ఓ ! బింబోష్ఠి! చిలుకను మణి బంధమున నుంచి ఫలము లొసంగుము దానిని చుంబనములచే లాలింపకుము ఇది వాచ్యార్థము బింబఫలభ్రాంతిచే చిలుక నీ అధరమును ఖండించును ' అని ధ్వని దీనివలన నీభర్తకు వేరే భ్రాంతి కలుగును" అను వ్యంగ్యము తోచును ఇందు మొదటి వ్యంగ్యార్థము రెండవ వ్యంగ్యమునకు వ్యంజకము అందుచే ఇది సంబద్ధ సంబంధముగల వ్యంగ్యము

ఇట్లే ఇంకను పలువిధములైన వ్యంగ్యములు కలవు వైయాకరణుల స్ఫోటసిద్ధాంతమును అనుసరించియే ఆనంద వర్ధనుడు ధ్వనిసిద్ధాంతమును వ్యక్తీకరించెను వైయాకరణుల మతమున స్ఫోటము వ్యంగ్యము; ఆనందవర్ధనుని మతమున అర్థాంతరము వ్యంగ్యము, ఇదే కావ్యమునకు ఆత్మ

డి. వెం.

## వ్యంగ్యము (ప్రాచీన, అర్వాచీనాంధ్రములు)

మన పూర్వలాక్షణికుల ననుసరించి శబ్దశక్తులు ప్రధానముగ మూడు (1)అందు సంకేతితమగు అర్థమును మాత్రమే బోధించు శక్తికి 'అభిద' అనిపేరు ఇచ్చట సంకేతమనగా శబ్దమునకును అర్థమునకును గల పరస్పరసంబంధము. ఈ సంబంధమును బోధించు అభిదాశక్తి వలన కలుగు అర్థమునకు

వాచ్యార్థము ప్రాకరణికార్థము ముఖ్యార్థమువంటి పేర్లు కలవు (2) ఇట్టి ముఖ్యార్థమునకు బాధకలుగగా ఆ ముఖ్యార్థముతో సంబంధముగల ఇంకొక అర్థమును (రూఢినిబట్టిగాని ప్రయోజనమును బట్టిగాని)స్ఫురింపజేయు శక్తికి లక్షణ అని పేరు దీనిని ఆనందవర్ధనాచార్యుడు సారస్వతరంగములో ప్రతిష్ఠాపించెను స్థూలముగ చెప్పుచో మన పూర్వాలంకారికులను బట్టి వాచ్యార్థమునకు శోభావహమగు అర్థాంతరమును బోధించుశక్తి వ్యంజన మనబడినది అట్టి శబ్దము వ్యంజకము ఆ అర్థాంతరము వ్యంగ్యము ఇది శబ్దశక్తి-అర్థశక్తి ఉభయశక్తి-మూలకమని మూడువిధములు ఈ వ్యంగ్యమునే అభినవగుప్తుడు ధ్వని అని పిలిచి స్థూలముగ వస్తు-అలంకార-రసరూపములని త్రిధాకరించినాడు ఈ నాల్గవశక్తి తాత్పర్యశక్తి అని ఒకటియున్నట్లు మీమాంసకులలో కొందరి వాదము శబ్దము లేకయే వాక్యమేర్పడుచున్నదో అను నట్లు ఇది వాక్యశక్తిగాని శబ్దశక్తి కాదని కొందరును ఈ తాత్పర్యశక్తి వ్యంజనయందే గర్భితమని మరికొందరును వాదించిరి మొత్తము మీద ఈ నాల్గవశక్తి (వృత్తి) ప్రస్తుతము మనకంత ముఖ్యముకాదు కాగా ప్రాకరణికార్థమునకు శోభగూర్చు అర్థాంతరమైన వ్యంగ్యము మన ప్రాచీనాంధ్ర కావ్యముల యందెట్లు విలసిల్లెనో ముందు దిఙ్మాత్రముగా ప్రదర్శింపబడి ఆ పిమ్మట పోనుపోను అది అర్వాచీనాంధ్ర వాఙ్మయములో పాశ్చాత్యసంస్కార ప్రాబల్యము మూలమున సంఘాదిసంస్కారములకు మూలకమైన దుర్వాస క్రోధరూపమును అవహేళనము-అన్యాపదేశము-వ్యాజస్తుతి నిందలు-మున్నగువాని రూపమును ఎట్లు దాల్చెనో ఇచ్చట క్వాచిత్కముగ ఉదాహరింప బడగలదు

(1) కీచకునితోపాటు విరాటునిగూడ కీడడగింప బూచుచు చేరువనున్న ఉన్నతవృక్షమును నిరీక్షించుభీముని తన సంజ్ఞాకారమున తిక్కనార్యుని ధర్మతనయుడు వారించుచు ఇట్లనును

"వలలుం డెక్కడఁ జూచె వంటెడ న సేవ్యక్ష్మాజముల్
పుట్టవే ?
ఫలితంబై వర శాఖలొప్పగ ననల్ప ప్రీతి సంధించుచున్
విలసచ్ఛాయమహాశ్రిత ప్రకతికిన్ విశ్రాంతి గావింపఁగాఁ
గల యీ భూజము వంట కట్టెయలకై ఖండింపఁగా
నేటికిన్?"

(విరాట-ఆ 2 వ 186-పుట 47-వావిళ్ల)

"ఈ వంటవానికి వంటకట్టెల నిమిత్తమై ఈ వృక్షమే (విరాటరాజే) దొరకెనా! ఎవ్వరికిని ఆశ్రయమీయని చెట్లు లేవా? వంటి పై వాక్యములలో అన్యాపదేశ మార్గమున విరటుడు పాండవులకు అజ్ఞాత వాసకాలమునందు నిలువనీడ కల్పించుట వ్యంగ్యముగ తెలుపబడినది

నర్తనశాల చొచ్చి మదనఘూర్ణమాన హృదయుడై తనను తాను పొగడుకొన్న కీచకాధమునితో భీముడు తాను ద్రౌపదివలె నటించుచు (ద్రౌపది వినుచుండ) ఉచితనిగూఢభంగులగు మృదుభాషణములలో ఇట్లనెను

"ఇట్టివాఁడవు గావున నీవు నిన్ను బొగడికొనఁదగు నకట
నాపోల్కియాడు
దాని వెదకియు నెయ్యెడనైన నీకుఁ బడయవచ్చునె?
యొఱుఁగక పలికితిట్లు'

(విరాట-ఆ 2-వ 337-వావిళ్ళ)

నా మొడలు సేర్చినప్పుడనీ మొడలెట్లగునొ దాని నీ
వెఱిఁగెదు న
స్నేయబలలతోడిదిగాఁ, జేయఁ దలఁచితివి; తప్పుసేసితి
గంటే!''

(విరాట ఆ 2 వ 338-వావిళ్ళ)

నిజముగ రూపలావణ్య విలాస వివేకములు కలవాడవు కావున నిన్ను నీవు పొగడికొనదగును కాని నావంటి వనిత నీ కెంత వెదకినను దొరకదు! నిన్ను నే వొక్కతెనే యేలుకొంటిననుట నీవు తెలియక అన్నమాట సుమా!' ఇది పై మొదటిపద్యములో భీముని వాచ్యార్థము ధీరోద్ధతుడవు గావున ధీరత్వనత నీకే చెల్లును; మగపోడిమి కల్గియు అడుగాపున నున్న నా వంటిది నీకు తారసిల్లుట సాధారణముగ జరుగు పనికాదు-" ఇది వ్యంగ్యము

' నా శరీరమును స్పృశింపగనే నీ కెంత పారవశ్యము కల్గునో నేను చెప్పరాదు; నన్ను అందరి స్త్రీలతో సమానముగ చేయదలచుట తప్పుసుమా! ఇది పై రెండవ పద్యములో భీముని వాచ్యార్థము నన్ను తాకగనే నీ యెముకలు నుగ్గునుగ్గగును అది నీ కిప్పుడే తెలియగలదు; నన్ను సాధారణ స్త్రీగా భావించి గోతిలోపడితివి! ఇది భీముని వ్యంగ్యము ఇట్లే తర్వాతి పద్యముకూడ విశుద్ధవ్యంగ్య భాసభా విలసితము

ఇక ద్రోణుని మూడవనాటి యుద్ధమును పరిశీలింతము వః అమ్మేటి విలుకాని (కుంభసంభవుని) మొగంబున నిలువ ద్బోర్వక యా సైన్యక ప్రకరంబు తిరుగుడువడిన కాంతే యాగ్రజుం డూరకుండె కర్ణికార కేతు స్ఫీతుండును నగు ఖోత్రుంగనుంగొని

(ఆంధ్రమహాభారతము-యుద్ధపంచకము-ద్రోణ ఆ 2 పుట 158 వాలిక్ల)

కర్ణికారమనగా కొండగోగుపూవు ఇది అభిమన్యు కేతువునందుగల బొమ్మ కర్ణికారమునకు దోహదక్రియ నల్లా పము అందుచే ఇట్టి కేతువుగల అభిమన్యుడు ధర్మజుని నల్లా పములచే ఉత్సాహదోహలియై (తిరిగివచ్చు ఉపాయ మెరు కయే) పద్మవ్యూహమును చొరనమ్మతింపగలడని తిక్కనార్యుని వ్యంగ్యము

(2) ఇప్పుడిక నాచనసోముని నరకోర్వశీసంవాద ఘట్టము నమశీలింతము

"నాకపురంబులో మెఱుఁ నందనకేళిఁబరించి దివ్యకాం
తాకరశాల వృంతసముదాయ సమీరమునోక
రాజ్యముం
గైకొనిపేఁడు దిగ్విజయ గౌరవధన్యుఁడనైన నాసతన్
నీ కనుదోయి వెన్నెలలు నిండకకోర్కులు నాకు
నిండునే!"

(ఉ హరి ఆ 1-వ 62-పుట 14-వాలిక్ల)

నాచనసోముని నరకుడు ఇంద్రుని జయించిన పిమ్మట మెత్తనిమాటలతో సుకుమారమైన ప్రేమను వెల్లడించుచు తన సభ నలంకరింపుమని ఊర్వశిని నాగరకపద్ధతిలో వాచ్యముగ సైకి అడిగెను ఆమె కనుదోయి వెన్నెలలు నిండనిచో తన కోర్కెలు నిండకపోవుటవంటి పదముల ప్రయోగముచే తన కామెపైగల వాంఛితమును వ్యంజిత మొనర్చినాడు అప్పుడు ఊర్వశి పలికిన వాగ్విభూతిని పరిశీలింతము:

"చతురవచో విలాస! గుణసాగర! సాగరమేఖలావనీ
పతియగునీకు నింతులోక భ్రాంతిరో! నీ విటు గోరు
నిల్లనా
యతులితభాగ్య మింత నిజమైన గలంగకముప్పవై భవో
న్నతి మెఱయంగవచ్చి యొకచాఁ డయినన్ నను గా
రవించితే!"

(ఉ హరి ఆ 1-వ66-పుట 15-వాలిక్ల)

ఇంద్రవిజేతయగు నరకుని తిరస్కరించుటకు ఊర్వశి ఒక వన్నుగడ గన్నినది తన మనస్సు అవుడట్లు కలతవడియుండ కమునుపే నరకుడు తనగడకువచ్చి తనను గౌరవించినచో నెంతయో బాగుండెడిది అన్నది ఆ నరకుడు తీవపోవువాడు గాదు ఆమెయెత్తునకు పైయెత్తుగా అత డిట్లుపల్కెను

నేను మీ
దేవతలున్న వీటికరుదెంతువె?
లావునరాక పేఱోక తలంపున వచ్చినఁగీడుపుట్టదే?

(ఉ హరి ఆ 1-వ 67-పుట 16-వాలిక్ల)

దీనికి ఊర్వశి పెద్దయెత్తు ఎత్తినది

ఇందు నిమ్మ ర
మ్మనుట పొసంగ దొక్కడినమైనను నీ విహరించు
చోటఁవ్
నను పిలిపింపనైతి తగునా? చనవింతకు నాకుఁ
జెల్లదే?"

(ఉ హరి ఆ 1-వ 68-పుట 16 వాలిక్ల)

'నీ కిట్టి అనుమానమున్నను నిన్నిక్కడకు రమ్మన రాదు కాని నీవున్నచోటికి నన్నైనను రమ్మనవచ్చుగదా! ఆ మాత్రపు చనవునకు నేను నోచుకొనవా? ' అని మరల ఆమె తప్పించుకొన జూచినది ఈ సన్నివేశమంతయు మధురవ్యంగ్య రచనాబంధురమని ఒక్కమాటలో కల రూపంతయు చెప్పవే యవచ్చును

(3) పిమ్మట నైషధము నుండి ఒక్కటే చిన్న ఉదా హరణము:

'అధికరోషకషాయిత స్వాంతుఁడైన
నరపతికి విన్నవింపకు నా యవస్థ
పైత్యదోషోదయంబునఁ బరుసనైన
జిహ్వకకుఁ బంచదారయుఁ జేదుగాదె!"

(శృం నైష ఆ 2-వ 82-పుట 121 సర్వంకషా వ్యాఖ్య)

మానవులకు పైత్యదోషము ఉద్రేకించునపుడు నాలు కకు పంచదారకూడ చేదుగనేతోచును అట్లే నలునకుకోపము పెరిగినవేళలో కాంతల ప్రసక్తికూడ విరసము కావచ్చును అందుచే కుపితావస్థయందున్న నలునికడ నామాట ప్రస్తావింప వలదు " అని హంసతో దమయంతిచెప్పును. 'పంచదా రయు' అనుచోటగల సముచ్చయరూపమగు 'ఉయు' శబ్దము వలన 'నేనొక వేళ గుణోత్కృష్టనే అయినను' అను ధ్వనికలదు

పైత్యరోగికి మిక్కిలి తీయని పంచదారయే చేదగుననగ ఇతర రుచులెంత రోతకల్గించునో చెప్పవలెనా! అనుచు అర్థాపత్త్యలంకార రూపమున గుణవంతురాలి ప్రస్తావనయే కుమతునియెడ విరసముకల్గించుచుండగా మ్యాన గుణనగు నా ప్రస్తావనము విరసమగునని వేరుగాచెప్పనక్కరలేదుగదా! అని దమయంతి వినయభూషితయై పల్కినట్లు ఇచ్చట గ్రహించుట మతాంతరము కావచ్చును

(4) తదుపరి స్వారోచిష మనుసంభవము"ను పరిశీలింతము:

'ఇంతలు కన్నులుండ తెరువెవ్వరి వేడెదు ? 　　　　　　　　　　　　　　　　　　　　భూసురేంద్ర! యే
కాంతమునందునున్న జవరాంద్ర నెపంబిడి పల్కరించులా
గింతయెగాక! నీవెఱుఁగవే మునువచ్చిన 　　　　　　　　　　　　　　　　　　　　త్రోవచొప్పు? నీ
కింత భయంబులేకడుగ వెల్లిదమైతిమి; మాటలేటికిన్ ?"

(మను-ఆ2-ప41 -పుట 146 -వేంకట్రామ)

నరసభూపాలీయ మతమున ఈ పద్యమంతయు వ్యంగ్య ప్రధానమై ధ్వని (కావ్యము) అగుచున్నదనుటకు ఈ క్రింది శోభావహార్థములే ప్రబలసాక్ష్యముల -

(అ) భూసురేంద్ర అనుట భూమింగతుడవగు దేవేంద్ర! అనుటయే! ముందు పద్యములలో కానవ్సరనవి వరూధుని చెప్పకొనును అప్సరసలు ఇంద్రునకు సంబంధినులు కావున నేను నీదాననే అనెడి ఆమె భావము ఇచ్చట ధ్వనితము

(ఆ) ఇంతలు కన్నులు అనునది హస్తచేష్టలచే వ్యంజకమై విశాల నేత్రములు గలవాడు ప్రవరుడు' అని ధ్వనించుచున్నది

(ఇ) తెరు వెవ్వరివేడెదు' అను వాక్యమున ఇంతటి సుందరుడవు అగపడితివో లేదో అప్పుడే త్రోవ అడుగుచున్నావు! ఎవ్వరు చెప్పుదురు ?" అని మరియొక ధ్వని

(ఈ) ఏకాంతమునందు మన్న జవరాంద్రను' అనుట కానచ్చట ఒంటిగనుంటిననుట; తమరిద్దరకు నెట్టి అడ్డును లేదనుట తాను నిత్యయౌవనవతిననుట త్రిదశాంగననుట; కామోపభోగయోగ్యననుటయు కూడ

(ఉ) జవరాంద్రను' అని బహువచనము పల్కుట ప్రవరుడు తనవంటి జవరాంద్రను చెక్కురను పల్కరించు అలవాటు కలవాడే అని ధ్వనింపజేయుట

(ఊ) భయంబులేకడుగన్ అనుచోట మున్ను ప్రవరుడు తనను గూర్చి పల్కినట్లు తనకు (ఓటలేదు) భయములేదు అతడును భయములేనివాడు అందుచే అట్టియేకాంతమున కామిద్దరును నిర్భీతితో క్రీడింపవచ్చును-అని వ్యంగ్యము

(ఋ) ఎల్లిదమైతిమి అనుటచే తాను సులభసాధ్యననియు సుందరుడగు అతడు తాను మానవుడనని నిరుత్సాహపడనక్కరలేదనియు తమది ఇంద్రాప్సరోంగనా సంగమము వలె యుక్తమేయనియు వరూథిని ధ్వనింపజేసినది

ఇన్ని వ్యంగ్యార్థ రత్నముల మంజూషయగు ఈఅప్సరస్సు పద్యము పెద్దనార్యుని ప్రబంధమునకంతకును ఉద్దీప్తిగల్గించుచు దానికి ధ్వనికావ్యముగ లోకప్రీతి ప్రతిష్ఠలను గడించిపెట్టినది

(ii) ఎమ్మట పారిజాతాపహరణము' నుండి వ్యంగ్యమునకు విశుద్ధోదాహరణములు కొన్ని ఉటంకింపబడుచున్నవి పారిజాతాపహరణము నకు మనుచరిత్ర' కంటె శ్వేతయు శ్రేష్ఠతయు గూడ కలవు

"శ్రీమదికింబ్రియం బెసఁగ 　　　　" అని తన కావ్యారంభము చేసిన తిమ్మనార్యుడు శ్రీరూపయగు రుక్మిణిని సంతుష్టగా నొనర్చుటను తొలిపద్యములో వ్యంజితమొనర్చెనన వచ్చును లేదా యీ ప్రబంధమందు వర్ణ్యమానమగు సత్యభామా ప్రీత్యర్థ పారిజాతాపహరణ రూపమైన యితివృత్తమును వ్యంగ్యముగ తెలిపెననవచ్చును ఇట్లే

"తొలఁకుల్ గౌఁగిటఁగ్రుచ్చియెత్తి తలఁబ్రాలో
　　　　　　　　　　　　　　　　　　　　యించు నవ్వేళ నీ
తల గంగందననీడఁ దానకని మౌగ్ధ్యం బొప్ప వేఱొక్కతో
య్యలియంచున్నదని యెంచుపార్వతియసూయా
　　　　　　　　　　　　　　　　　　　　వ్యాప్తికి న్నవ్వుత్రి
స్నేఁవుఁదాలుపు కృష్ణరాయనికి సంధించున్న
　　　　　　　　　　　　　　　　　　　　హైశ్వర్యముల్

(పారిజా ఆ1-ప2-వావిళ్ల)

ఈ పద్యమున పార్వతీపరమేశ్వర వివాహావర్ణన రూపమగు శివస్తుతి జరిగినది పార్వతీదేవిని బాలతుకలు కౌగిట బొదివి ఆమెచే తలబ్రాలు పోయించుచున్నారు అప్పుడు శివుని జటాజూటమునందలి నిర్మలగంగాసలిలములలో ప్రతిఫలించిన తన ప్రతిబింబమునుగాంచి అది మరియొక కాంతయని భ్రమనొంది పార్వతి అసూయపడినది అదియెరిగి నవ్విన పరమేశ్వరుడు పై పద్యమున వర్ణింపబడినాడు ఈవర్ణనయందు

రుక్మిణీదేవి గృహమున నున్నప్పుడు నారదుడు తెచ్చి యిచ్చిన పారిజాత పుష్పమును శ్రీకృష్ణుడు తానచ్చటనున్న కారణముచేతను నారదప్రేరణముచేతను రుక్మిణికీయగా నిజమెరుగక సత్యభామ తాను పై తనపతికి ప్రేమలేదని అసూయపడుట మొదలగు కథాసందర్భములు వ్యంజితమైనవి

క్రొన్నెలపూఁదాలుపు అని కాలచంద్ర ధరుడైన శివుని ధ్యానించుట మూలమున తిమ్మనార్యుడిచ్చట పారిజాత కుసుమధారణమును ధ్వనిత మొనరించినాడు తనసీడఁ దాన కనిమౌగ్ధ్యం బొప్ప అను పదమునుబట్టి సత్యభామ ఊరకయే భ్రమచెంది ఈర్ష్య పూనెననియు అందు శ్రీకృష్ణుని తప్పేమియులేదనియు వ్యంగ్యములు స్ఫురించుచున్నవి

"తన దంతాగ్రముచేతఁ దీక్ష్ణమతి యుద్యత్కుంభ
యుగ్మంబుచే
తనికాంతోన్నతిదాన విస్ఫురణనుత్సాహంబు
తుండాముఖం
బున దీర్ఘాయువునిచ్చుఁగావుత గుణాంభోరాశికిం
గృష్ణరా
యనికివ్వీరణ రాజనక్షత్రుడు కృపాయత్తైక
చిత్తాబ్జుడై "
(పారిజా ఆ1 ప 8-వాలిక్ల )

ఈపద్యమున గణాధిపతి స్తుతింపబడినాడు గణపతి తన దంతాగ్రములు తీక్ష్ణములుగాన రాయలకు బుద్ధితైక్ష్ణ్యమును తనకుంభములు ఉన్నతములు గావున అత్యంతోన్నతిని తన దానవిస్ఫూర్తి ఉత్సాహకార్యముగాన ఉత్సాహమును తన తుండము అతిదీర్ఘముగావున దీర్ఘాయుష్యమును ఒసగుగాక యనుట వ్యంగ్యములను స్ఫురింపచేయుటయే! దీనిని కవి ప్రౌఢోక్తి సిద్ధార్థశక్తి మూలవస్తు ధ్వనియనియుచెప్పుదురు

"సరసపు టల్కఁదీర్పుతఱి కార్ష సుదర్శన నందకాఖ్యసం
కరణ గుణాప్తి నెన్నడుము పైఁగటి పై జఠపై
గళంబుపై
హరి నలుగేలుఁ జేర్చిన సుఖాంబుధినిచ్చుట
తోలలాడ నిం
దిర కృపఁజూచుఁగాత నరదేవశిఖామణిఁ
గృష్ణరాయనిన్ "
(పారి జా-ఆ 1-వ 4-వాలిక్ల )

ఈ పద్యమున లక్ష్మీస్తుతి జరిగినది మహావిష్ణువు లక్ష్మీదేవికి కల్గిన ప్రేమ అలుకను తీర్చుటకై ఆమెను ఓదార్చుకోరి శార్ఙమును ధాల్చు తన చేతిని ఆమె నడుము మీఁదను దర్శనమును దాల్చు తన చేతిని ఆమె కటి ప్రదేశము మీదను నందకమను కత్తిని దాల్చు తన చేతిని ఆమె జడ మీఁదను శంఖమును దాల్చు తన చేతిని ఆమె మెడ మీదను చేర్చి సంతోషపరచెనని భావము ఇచ్చట లక్ష్మీదేవి నడుము అతి సూక్ష్మమై ఎడ్లితో పట్టదగియుండుటచే వింటిని పోలియున్న దనియు కటి ప్రదేశము చక్రమువలె నున్నదనియు జడ కత్తిచందనమున నున్నదనియు కంఠము శంఖము పగిది నున్న దనియు ఉపమానములు వ్యంజితములైనవి కావున దీనిని శబ్దశక్తి మూలాలంకారధ్వని యందురు

"శ్రీరంగేశ్వర పాదపంకజరజశ్శ్రీకంబుఁ జోళేంద్ర త
న్వీరా జక్కుచపాళి మంజరులకంబైనప్యా భూభృత్తటీ
నీరంధ్రీకృత గైరిక ద్రవముకంబై వ్యపన్నగావింబఁ గా
వేరీ తోయముఁ గృష్ణరాయఁ డహితోర్వీనాథ రక్తప్రథన్ "
(పారిజా ఆ 1-వ 18 వాలిక్ళ)

శ్రీకృష్ణరాయలు శత్రు రాజులను చంపి వారి రక్తములను కావేరీ జలములలో ప్రవహింపచేయుట వలన అవి శ్రీరంగనాథస్వామి వారి పాదకమలము నందలి పుప్పొడుల కంటెను చోళ రాజాంగనల కుచప్రదేశాలంకారములగు పూలగుత్తుల కంటెను కావేరీ నదికి జన్మస్థానమగు సహ్యాద్రి తటముల యందలి గైరిక ద్రవము కంటెను కూడ మించిన రక్తవర్ణముచే విరాజితములై ఒప్పారినవని భావము దీని వలన రాయలు తొలుత శ్రీరంగమును తరువాత చోళ దేశమును ఎదప సహ్యాచల భూములను, ఆ ఎమ్మట కావేరీతీరమందలి శత్రు సముదాయమును జయించెనని వ్యంజితమగుచున్నది లేదా, రాయలు శ్రీరంగనాథుని సేవించి ఆ ఎదప జైత్రయాత్రావరుడయ్యెనని వ్యంగము

సీ॥ స-రి-గ-మ-ప-ధ-ని-స-సంజ్ఞ స్వరంబుల
మహతి నభోవాయు నిహతి మొరయ "
గీ॥ దేహకాంతుల కాల చంద్రికల నీన
నచ్చె నాకస్మికముగ
అరి వేరంపుఁ దపసి దైత్యారిఁ గడకు"
(పారిజా ఆ 1-వ 44- వాలిక్ళ )

ఈ పద్యమున నారదుడు భూలోకమునకు వచ్చుట వర్ణితము మహతి నభోవాయు నిహతి మొరయన్' అనుటవలన

పురుషప్రయత్నము లేకయే నారదుని వీణ పలుకుచున్నట్లు చెప్పబడి భావనాలంకారము వ్యంజితమైనది అందుచే దీనిని అలంకారాశ్రిత అలంకారధ్వని యందురు దేహకాంతుల శాల చంద్రికలమీసన్ అనుచోట నారదుని రాక రుక్మిణీకృష్ణులకును తదితరులకును వెన్నెల ప్రసరణమువలె ఆహ్లాదకరమయ్యెనని వ్యంగ్యము అతివేరంపుతపసు అని తిమ్మనార్యుడు తన నారదునిగూర్చి పలుకుట ఈ కావ్యములో ముమ్ముందు పారిజాత కుసుమదానము మూలమున తాను కూర్పబోవు కలహ విషయమును వ్యంగ్యముగ తెలుపుటకొరకే అని గమనింప నగును

ఇట్లు చెప్పుచుపోయినచో ఒక్క పారిజాతాపహరణము నందే శబ్దార్థోభయశక్తిమూలకములైన వ్యంగ్యములను వస్త్వలంకారరసధ్వనులను కోకొల్లలుగ ఉదాహరింప వచ్చును

(6) అనంతరము పింగళి సూరన ప్రభావతీ ప్రద్యుమ్నము' నుండి ఒక చిన్న ఉదాహరణమును చూపినచో ఆ మహాకవి రసవద్ఘట్టము లెట్లుండునో ఊహించుకొనవచ్చును ప్రభావతి మదనావస్థల క్రమమును ప్రద్యుమ్నునకు వర్ణించి చెప్పు హంసపల్కు లివి :

'ఆ పడతి యడలఁ జేసెను
జూపఁ నవుడేమి చెప్ప? కోపిలుచు గడున్
నీ పుత్త్రికయా నిముషము
లోపల రాదేని కాటిలు దశాంతరమున్"

(ప్రభా ఆ 4- ప 81-పుట 190- పీఠికాపుర సంస్థానప్రభువుల ముద్రణము )

ఇంతకు పూర్వము హ్రీత్యాగము ఉన్మాదమునంటి దశలు వర్ణితములు ప్రభావతి కార్శ్యమును చూచినవారు ఇపై ఆమె ఏమగునోగదా ! అని భయపడిరి నీ ఉత్తరము ఆ సమయమున చేరని పక్షమున ఆమెకు మరియొక అవస్థయు సంభవించెడిదే !'' అన్నది శుచిముఖి ఆ తుదిదశ మరణము ఇట్టి అమంగళమును వాచ్యము చేయరాదని కారదాతనయుని మతముగా రత్నాపణము కావున దశాంతరమున్' అని శుచిముఖి ఆ అవస్థను వ్యంగ్యముగాచెప్పి విడిచినది "మరణం మరణార్థమప్రయత్నః పరికీర్తితః 'అని ప్రతాపరుద్రీయము - ఇతరుల మరణమును వర్ణించినను దోషముకాదు; నాయికా నాయకుల మృతి అన్ననో రసవిచ్ఛేదము గనుక వర్ణింప రాని విషయము మరణార్థమైన ప్రయత్నమే మరణావస్థ అని ధనికుడు హేమచంద్రుడును శుచిముఖి పల్కులలోని వ్యంగ్యలేశమున ఇంత గాంభీర్యమర్యాద యున్నది

(7) ఇక రామరాజ భూషణకవి

"దంతా ఘట్టితరాజతాచలచలద్గౌరీస్వయం గ్రాహముం గంతుద్వేషికిఁగూర్చి శైలజకుఁ దద్గంగా ఝర చ్ఛాంతి న త్యంతామోదముమున్నగానిడి కుమారాగ్రేసరుండై పితృ ప్రాంతంబుల్ వెలయింపఁజాలు నిభరాడ్వక్త్రం బ్రశంసించెదన్"

(వసు ఆ 1-ప 7 - పుట 12 - వావిళ్ళ )

గౌరీ స్వయంగ్రాహము ను కంతుద్వేషి కి కూర్చిన గజముఖుని స్తోత్ర మిందు గలదు తన తల్లియగు పార్వతి తనంతట తానే భర్తయగు శివుని కౌగిలించుకొనునట్లు చేసి నాడు] గజాననుడు ఆ శివుని రామరాజభూషణుడు కంతుద్వేషి అని వ్యవహరించి మన్మథ విరోధియంతవానికి వధూ పరిష్వంగమును సమకూర్చిన వినాయకుని అఘటనాఘటన సామర్థ్యమును వ్యంగ్యముగ చెప్పినాడు అట్లే "మహిమున్ వాగమశాసనుండు సృజియింపన్" (వసు ఆ 1-ప 10 - పుట 16 వావిళ్ళ) అను పద్యమునందు రామరాజభూషణకవి కవిస్తుతిపరమగు అర్థముతోపాటు ప్రపంచసంబంధమగు అర్థాంతరమును వ్యంగ్యముగ స్ఫురింపజేసినాడు

"చరితలతాంత కాంతియను చందురు కావిచెలంగు దాటిన మ్మ్రోతవయోవిలాసముల మీటనవిచ్చు ఫలస్తనాగ్రముల్ తెలుపడఁగస్ఫుటత్క్షణము తేల్లితదోహదధూప ధూమ కుం తలములువిప్ప దాడిమలతాలలితాంగినృపాలుచెంగటన్ '

(వసు-ఆ 1-ప 167-పుట 189-వావిళ్ల )

గుబ్బలు పైటదాటుట సమకూడిన వయసుపొంకము మూలమున స్తనాగ్రములు అంటినచో విచ్చునటులుండెనని దాడిమలతాలలితాంగి పరముగ చెప్ప రామరాజభూషణుడు యౌవనపు బింకమును వ్యంగ్యము చేసినాడు అసలు వసుచరిత్రయంతయు గుణీభూతవ్యంగ్యమునకు ఉదాహరణ మను నది వేరొక మతము

(8) చేమకూర వారి విజయవిలాసము' నుండి రొకటి రెండు ఉదాహరణములు

"పోఁక ప్రాకులమహిమ కప్పురపుటనటి
యాకుఁదోఁటల సౌభాగ్య మందెకలదు

ప్రజలు మౌక్తిక పాధసంపదల సుహాను
వీటి గవామెచ్చవలయుఁ బోవేయునోళ్ల

(విజయ-అ 1-ప-82 పుట-వేదము)

పోకచెట్లయొక్కయు కప్పురపుటరటుల యొక్కయు తమలపాకు తోటలయొక్కయు సొంపు ఆపురము (ఇంద్రప్రస్థము) నందేకలదు ముత్యాలమేడల ఎరువుయొక్క అతిశయమును అందు వర్తిల్లుచుండును ఆ నగరముయొక్క బాగును సహస్రముఖముల తో పొగడవలెను ఇది వాచ్యార్థము పోకలు కర్పూరము తమలపాకులు ముత్తెపు సున్నము ను కలిపిన వీడెముయొక్కరుచి ఆ వీడెము వేయునోటికే తెలియనుగాని వేయని నోటికి తెలియదని వ్యంగ్యము "వీటిరహి" అనగా పట్టన సౌందర్యమనియు తములము మున్నగు "వీటియొక్కరుచి' యనియు చెప్పుకొనవలెను

'కన్నియలగాని వేళల తెలుగాను మనోహరరూప నీకునే
ఇన్నియ గట్టియుంటి గెలజవ్వనమంతయు నేటిదాక నా
కన్నులయాన నావలపు కస్తురినామము తోడు నమ్ము నా
దన్నము నీదుమోవి మధురామృతమానిట బాసచేసెదన్ '

(విజయ అ 1-వ 162-పుట 67-వేదము )

ఉలూచి పలుకులివి ' నేను పెండ్లికాని పడుచను నీవు మనోహరుడవు (లేదా మనోహరాంగినికూడ) దేవతకు మీదు కట్టినట్లు నాలేత వయస్సును నీకు మీదు కట్టి యున్నాళ్లను ఉంచితిని నాకన్నుల మీద ఒట్టు ! నా కస్తురి బొట్టు మీదఒట్టు ! నీవునమ్మవేని నీమోవి అని ఒట్టు పెట్టి కొమ్మన్నను పెట్టుకొందును" ఇది వాచ్యార్థము నా కన్నులయాన కస్తురి నామముతోడు ! అనగా నామాటలు అసత్యమేని నా కన్నులు పోవును నాకు కస్తురి బొట్టుపెట్టు కొను యోగ్యత తొలగిపోవును అని భావము 'నీదుమోవి మధురామృతమానిట బాసచేసెదన్"- అనుచోట 'విషము త్రాగి దివ్యప్రమాణచేసినట్లు' అని ధ్వని ప్రమాణము చేయుటకొరకైనను అధరామృతమును త్రాగనిచ్చినచో తనకిష్టసిద్ధియగునని ఉలూచివ్యంగ్యము

(9) కొన్ని యక్షగానములలో వ్యంగ్యధోరణులున్నవి ఉదాహరణమునకు ప్రహ్లాద' ఉషాపరిణయము, రామదాసు' దియక్షగానములు వ్యంగ్యార్థవిలసితములలో ఉత్కృష్టములు

(10) పోగా 'వేమననుండి రెండు మూడు ఉదాహరణములు:

ఆలివంక వారు ఆప్తబంధువులైరి
తల్లివంక వారు తగినపాటి
తండ్రివంక వారు దాయాదిపగవారు '

"ఆలివైపు వారిని తల్లివైపు వారిని వైరిలోకము నమ్ము ను. తండ్రివైపు వారిని పగతురుగ భావించును " అను భావము వ్యంగ్యముగ బలమైన కవిత మార్గములో చెప్ప బడినది

కులముగలుగువారు గోత్రంబుగలవారు
విద్యచేత విర్రవీగువారు
పసిడిగల్గువాని బానిసకొడుకులు

జగము ధనమూలమైనదని వ్యంగ్యము

తిరుమలకునుబోవ తురక దాసరికాడు
కాశికేగ పంది గజము కాదు
కుక్కసింగమగునె గోదావరికిబోవ?

ఇట్టువట్టి దృష్టాంతములనో ఉపమానములనో మాత్రమే చెప్పి ప్రస్తుత విషయమును వ్యంగ్యముచేయు మార్గమున వేమనకు ఆతమెంత శక్తియున్నమెందు

(11) ఇక శతకవాఙ్మయమును పరిశీలించినచో, శర భాంక లింగశతకము నను అడిదమునూరకవి రామలింగేశ్వర శతకము'నను కానుల పురుషోత్తమకవీంద్రుని శ్రీకాకు ళాంధ్రదేవశతకము నను హేళనాత్మక వ్యాజస్తుతి పూర్వక వ్యంగములు పుష్కలములు ప్రతి పద్యద్యోతకములు గోగులపాటి కూర్మనాథకవి చెప్పిన సింహాద్రినారసింహ శతకము లో కూడ వ్యాజస్తుతి ఉపాలంభనల పరముగ వ్యంగ్యము వెల్లువలై ప్రవహించును భల్లాపేరయ్య కవి వలికిన భద్రగిరి శతకము నందు నిందాస్తుతి పూర్వక వ్యంగ్యము శ్లాఘ లంఘనము

(12) త్యాగరాజస్వామి తనభక్తి పారవశ్యముతో కూడ వ్యంగ్యము నాశ్రయించుటకు సర్వలోకవిదితమగు ఒక ఉదాహరణము చాలును:

"ఖగరాజా నీయానతివినివేగా జనలేదో!
గగనానికి యిలకూ బహుదూరంబనినాడో!
జగమేలే పరమాత్మా! ఎవరితో మొరలిడుదూ? "

ఇందలి వ్యంగ్యము భగవంతుని అధికారహీనతను హేళన చేయుచున్నది

కాగా ఇక అర్వాచీనాంధ్రవాఙ్మయమునుండి క్వాచిత్క-

ముగ వ్యంగ్యరచనకు ఉదాహరణముల్తెత్తి చూపబడును

అర్వాచీనాంధ్రము అలంకారిక తాను సారియగు ప్రాచీనాంధ్ర కవితా పద్ధతిని ఆంగ్ల వాఙ్మయ ప్రభావితార్వాచీనాంధ్ర రచన పద్ధతిని వ్యంగ్యవిషయమున చాల వ్యత్యాసములు కలదు ప్రస్తుతార్థము ముగిసిన పిమ్మట శాబ్ద బోధాజనకమగు అప్రస్తుతార్థము వ్యంగ్యమనబడునని నిర్వచనము అధునికాంధ్ర వాఙ్మయమున కేవలము హేళన, వ్యాజస్తుతి నిందవంటి వానిలోనికి దిగజారుట పాశ్చాత్య భాషాధ్యయన ప్రభావజన్యము తమ ఆదర్శానికములకు వ్యతిరేకముగ కన్పించిన వ్యక్తులను సంస్థలను ప్రక్రియలను తత్త్వములను ఆచారములను భావాదికమును తీవ్రముగ విమర్శించుట పాశ్చాత్యరచయితలలో వ్యంగ్యమనిపించు కొనును ఇట్టి రచనకు (సటైర్ ఇండిగ్నాషియో) దుర్వాసమహాముని క్రోధమువంటిది కావలెనని యువెనల్ (క్రీ శ 60-180) మహాభాగునిపలుకు అధర్మము అన్యాయము దుర్మార్గము దురాచారము మొదలైనవానిని చూచి సహింపజాలని రచయిత చేతిలో అధునికాంధ్రము పాశ్చాత్య ధోరణిగల వ్యంగ్యము బ్రహ్మాస్త్రమైనది రామబాణమైనది

(11) ఇట్టి వ్యంగ్య చిత్రణములలో దుర్వాసక్రోధ సంవలితమైన ఆగ్రహావేగముల మార్గము ఒకశాఖవారిది అది స్థూలముగ భావకవిత్వము కావచ్చును; సూక్ష్మముగ దేశభక్తి కవిత కావచ్చును అభ్యుదయ గద్య-స్మృతి గేయ-జాతీయ మర్మ-ప్రతీక-ప్రకృతి పామర-అధిభౌతిక - ఆధ్యాత్మిక - అధివాస్తవిక-పురోభాగి-(cynical) భావావరణజన్య (Atmosp heric) మణిప్రవాళ-బీభత్స ఒప్లవ - అనవ్యాకా - రేఖాచిత్ర పర (Non Figurantism) భావచిత్ర (Imagism) - మన స్తత్వ-సర్గాది కవితలు కానవచ్చును రష్యను ఒప్లవ విజయానంతరము వెలసిన విప్లవాభి ముఖ్యరచనము గావచ్చును లేదా-దిగంబరకవిత్వము కావచ్చును ఏదైనను మొత్తము మీద ఆగ్రహోదగ్రతయు ఆ వేగమును ఇందున్న గుణులను

ఎంగిలి - కాటూరి కవులు స్వార్థపరుడగు మానవుడు ప్రకృతి యందలి శక్తి - స్వేచ్ఛా - సౌందర్యానందములను వికృతిగా పీల్చిపిప్పిచేయుచున్నాడో తమ కోకిల, బోనులోని సింగము' వంటి ఖండికలలో ప్రత్యక్ష సిద్ధమొనర్చిరి

"నిర్దయస్వాంత! కోకిల నిరపరాధి;
పర్వసముడగు దేవుడు పకలభూత
ముల కు నమ్మైన యధికరముసె యొసంగె

మనుజమర్కటరూ! నీకు మంచి గాదు
సింగపున్ స్వేచ్ఛ హరియింప
విడిచిపుచ్చుము సంగమ్ము విడిపుచ్చు
మనుజుండా! దాని ఓర్పునమ్మకుము నీవు "

విశ్వనాథవారి ఆంధ్రప్రశస్తి ఆంధ్రపౌరుషములు గాని భావలేదు చావలేదు ఆంధ్రు మహోజ్జ్వల చరిత్ర హృదయములు చీల్చి చదవుడో పదయులార! వంటి సంహాగర్జలు గల రాయప్రోలువారి రచనలుగాని కొడాలి కవుల హంపీ క్షేత్రముగాని శ్రీ శ్రీ గారి మహాప్రస్థానంవంటి కృతులుగాని అరుద్రగారివిగాని చెక్కురచనా ప్రక్రియలు ఇందుల కుదాహరణములు కాగలవు

భమిడిపాటివారి కొన్నినాటికలను విశ్వనాథ వారి దిండు క్రింది పోకచెక్క దానవాయిపాలెపు వృత్తాంతము, విష్ణుశర్మ ఇంగ్లీషుచదువు వంటివియు ఉన్నవ బుచ్చిబాబు గోపీచంద డా జి వి కృష్ణారావు మహీధర, బీనాదేవి రావు వంటి వారివియునగు నవలలను చలం వంటివారి నవలికలను పాలగుమ్మి మధురాంతకం బుచ్చిబాబు గోపీచందు, ముళ్లపూడి కందిల బలివాడవంటివారి కథానికలను మొదటి శాఖకు చెందినవిగా చెప్పవచ్చును

కేవలదూషణమార్గము ఇది రెండవశాఖవారిది ఇది న్యాయశాస్త్రాధీనమైన దూషణయే! వ్యక్తులను విధానములను దూయబట్టుట వీరికభిమతము ఇందు నిష్పాక్షికత గోచరింపదు ఈ శాఖీయులు సంస్కారమార్గమును అవలంబించుటయుత్తమ కేవలము తిట్టుకవిత యగు గ్యాసరము

కశ్మాల్యైై వెధవైై లభంగుమనిషై ఖడ్గప్రియా కర్తయై
వేస్సార్నాని-శెట్టినాయనను మహావేదాంతి-డాఫర్
బ్రదర్
విశ్వనాథము జంటకవుల భేరీప్రావు శాంతించు మా
ఘనస్సమ్మెల్లెను దాను గా దితఃడె వి ర్యో ఉల్లిపూ
వేమఃడి!

"ఖడ్గప్రియ" అను పద్యవ్యాసమును వ్రాయక యే వ్రాసినాడని చెప్పుకొనెడనబడిన ఎస్ ఎస్ ఎల్ ఎన్ రాను బి ఏ ను గూర్చి జలదూత్రము రుక్మిణీ నాథశాస్త్రి చెప్పిన ఆకువు ఇది ఇట్టిని అతనివి తెక్కుగలవు (శ్రీ)(శ్రీ) ఐకో-

కృచో జరుక్ నాథ మిణిశాస్త్రి అని జలరుక్కను కిక్కురు మననీయడు అన్నా! చెప్పలరా యా! కన్నొక్కటి కలదు గాని కౌరవపతివే! అనిన మా రాజుదేవీ ప్రసాదనివంటి వారి శైలీవిటకత్వ ధోరణిగల చాల రచనలుకూడ ఈ పద్ధతికే సాక్షీభూతములు అంగలో కన్నిటి కెరటాల వెన్నెలేల అను దానికి వంకాయతోడమ కావంకరేల? వెధవప్పడకు బ్రాతి పిండేల? కోడిగ్రుడ్డున కంతను నుపేల? అనునవి హేళన ప్రధానములైనవి అరయన్ శంతను పుత్రుపై విదురుపై నక్రూరుపై వంటి ప్రసిద్ధపద్యములకు ప్రతిగా అబ్బూరి వారి హేళన పద్య మింకొకటి చూడుడు

'వడపై నావడపై పకోడిపయి హల్వాతుంటపై
బూందిపయోం
బోడిపై నుప్పిడిపై రవిడిలిపయిన్ బోండావయిన్
నేమియా
మడిపై (చారు భవత్కృపారసము నిచ్చోకొంతశా
నిమ్ము నే
మడుకుంగాభని ఒక్క-చుక్క-గొనవే! ఓ కుంభదం
భోదరా!

ఇది కాఫీ పెట్టుకొను మొర ఇట్టి శైలీవికర్మ కవితా విధానము గలది ఆధునిక వ్యంగ్యరచనలలో నిర్మలినమగుటచే ఉత్తమమైనది నేడు కొన్ని నవలలు నాటికలు వ్యాసములు విమర్శలు గల్పికలు పత్రికలుగూడ ఈ ధోరణిలో ప్రహసన ప్రాయములై వెలువడుచున్నవి కేవల ప్రహసనములు వ్యంగ్యము నాశ్రయింపజాలవు అవి ద్వేష భూయిష్ఠములు

పోగా అన్యాపదేశములు వ్యాజస్తుతి వ్యాజనింద ఉపాలంభనములు - కాకువులు మున్నగు ఉపకరణములతో సాగు వ్యంగ్యరచనా మార్గము మూడవశాఖవారిది దీనికి శతకకవిత్వ భావకవిత్వాదులనుండి మున్నే పెక్కు లుదాహరణములు చూపబడినవి శిచకవధలో తిక్కనగారి 'వలలుం డెక్కడ జూచె అను పద్యమును పోతనగారి భ్రమరగీతము లను మొదలుకొని (భాగవతము-దశమ, కాంచనపల్లి కన కాంబ సుబ్బావధానిగారల కొన్నిరచనల వరకును ఇట్టి అన్యాపదేశపూర్వక వ్యంగ్యమునకు నిదర్శనములు చూపవచ్చును వేదము వేంకటరాయశాస్త్రిగారి ప్రతాపరుద్రీయమున అచ్చమైన యిట్టి వ్యంగ్యఘట్టములున్నవి పైని చెప్పిన అన్ని ఆధునికసాహిత్య ప్రక్రియలనుండియు ఈ పద్ధతిని ఉదాహరింపనగును శ్రీ కే గరుగంటి సీతారామయ్య గారు చూపిన నాలుగు సంగ్రహ సూత్రములలోను నేటిపెక్కు సాహిత్యధోరణులు ఇమిడిరాగలవు అందుచే సంగ్రహముకొరకు ఆ సూత్రముల ననుసరించి రశీ చుటుచేశము

(అ) ఛందో బందో బస్తులన్నీ
ఛట్-ఫట్-ఛట్-మనిత్రెంచి
Dam it 'న్ఫటా భంచే
Pray Its poetry అందాం

(ఆ) అర్థాన్ని అధ్వాన్నపు టడవిలో వదలి "

(ఇ) గద్యాన్ని పద్యాన్ని చెప్పి చేదాం
కాదన్న మాదన్న యెవడైనా వుంటే
వేమన్న యేమన్నాడో చూడమందాం

(ఈ) హౌష్-హౌష్ హుష్-హౌష్
అని కేకలువేసి కాష్-కాష్-
మ్యావ్-మ్యావ్ అందాం గమ్మత్తుగా

నేడు కవితకు శబ్దార్థసౌకిదాంపత్య మక్కరలేదు; ఆల్లరి చిల్లర అల్లాయిపదాలే కవిత్వ' మని నైవానిలోని వ్యంగ్యము ఈ జాతికవులలో కొందరికి సంకేతములై వ్యామోహము మెండు.

"ఆటవెలది ద్విపద కత్తగారు ౯-౮-౨ అను క్రమాల్యద వంటివవి ఈ కవులలో మరల (నిరర్థక) శాబ్దికులను అలంకార ప్రియులును కొందరు; సంస్కృతమును చదువుకొనినవారిని పరిహసించుటకు అందులో మణిప్రవాళశైలివారు మరికొందరు

తురాయికంచె-ఆ
కురాయికంచె-కీ
చురాయికంచు హిమాం
కురాయి గొప్పవాడు

భుజంగప్రయాతం బుభుక్షాభిఘాతం
చలంగారి పాపం 'ప్రజామిత్ర' కోపం "

తండులాలు గృహమందు నసంతి
తిండికై బహుమంది వసంతి
ఇవి కొలదిపాటి ఉదాహరణములు మాత్రమే!

(4) వాచ్యార్థము కంటె భిన్నమై రమణీయమైన

వ్యంగ్యార్థమును ముఖ్యప్రతిపాద్యముగాగల సంస్కృత కావ్యరచనా మార్గము పాశ్చాత్యశాఖవారిది ఇది అన్ని సాహిత్యప్రక్రియలలోను కనుపట్టునట్టి సూక్ష్మమైన అంతఃపాతి ప్రక్రియలలోను గూడ గోచరమగును

తిరుపతివేంకటేశ్వరకవుల గీరతము పాణిగృహీత' ముమైన వానిలో కొన్ని తావులందు ఇట్టి వ్యంగ్యమున్నది కృష్ణపక్షము నకు శుక్లపక్షము ను దూరకావ్యగులకు గబ్బిలము ను (జాషువకవివి) వంటివి వ్యంగ్యములుగ వెలువడిన ఖండకావ్యములు గురుజాడవారి కన్యాశుల్కము లోను మానవతావాదము ప్రతిబింబించు ఆయన ఇతర కవితా ఖండికలయందును ఈ మృదువ్యంగ్యమార్గము కొంత కలదు కందుకూరివారి రాజశేఖర చరిత్ర లోను చిలకమర్తి వారి రామచంద్ర విజయము (నవల) గయోపాఖ్యానాదిక (నాటక)ముల యందును (వయస్సుమట్టి) తల్లావఝుల శివశంకరశాస్త్రినుండి దేవులపల్లికృష్ణశాస్త్రి వరకునుగల నవ్యసాహితీ సంఘ' సభ్యులందరి రచనా వైవిధ్యములోను వ్యంగ్యభంగీఫణితు లున్నవి

ఎప్పుడు సంపదగల్గిన నప్పుడె బందువులు వత్తు రదియెట్లన్నన్ "అన్నచోట అదియెట్లన్నన్' అను వివరణ కవితా రీతి యేగాదు దానిని శ్రీశ్రీ యోగశాలి పట్టించినాడు

ఇన్నాళ్లక-నిన్నేళ్లకు
వళ్లీకవనంబు చెప్పుటదియెట్లన్నన్
పల్లూడిన ముసలిదికు
పెళ్ళన్ సవరించినట్లు సిరిసిరిమువ్వా!"
("సిరిసిరిమువ్వా' శతకము శ్రీశ్రీ)
ముగ్గేలా? తాజమహాలు మునివాకిటిలో
విగేల కృష్ణశాస్త్రికి?
సిగ్గేలా భావకవికి? సిరిసిరిమువ్వా!'

అను 'దాని కూడ విస్పష్టమైనదే!

గేయ కవితాది శాఖయులందరి గేయములలోను జాతీయగీతములలోను 'వెంకిపాటలు' 'కిన్నెరసాని పాటలు' వంటి కాల్పనిక కృతులలోను, పింగళి-కాటూరి కవుల సంక్రాంతి సౌందరనందము'లలోను, సనాతనపక్షపాతి (Neo classicist) విశ్వనాథశాస్త్రి రామాయణ కల్పవృక్షము', 'వేనరాజు'లలోను సర్వశ్రీ రాయప్రోలు, మధునాపంతుల, ఆబ్బూరి దువ్వూరి, తుమ్మల, కరుణశ్రీ, గడియారము వేటూరి పువ్వాడ దాశరథి నారాయణరెడ్డి ప్రభృతుల రచనలలోను నార్లవారి జగన్నాటకం గంటి కవితా సంపుటములలోను అడవి శివరాధ చెలూరి కొడవటిగంటి బలివాడ రాచకొండ ఉప్పల మొక్కపాటి ఇంద్రగంటి పుల్లపూడి పాలగుమ్మి మధురాంతకం కండిల(బుద్ధవరం) సోమంచి బుర్రా ఇసుకపల్లి ద్వయము పోతుకూచి శ్రీమతులు వాసిరెడ్డి ఇల్లిందల శిష్టాకుంతల విజయలక్ష్మి మాలతీ చందూరు మొదలైన వారి గద్యకథా సాహిత్యములలోను చింతా, శ్రీపాద వేలూరి (శివయ్య) మునిమాణిక్యము ప్రభృతుల పెద్ద చిన్న కథలలోను తల్లావఝుల బుచ్చిబాబు రాజమన్నారు ముద్దుకృష్ణ చలం భమిడిపాటి సోమంచి మహోదయుల ఏకాంకికలలోను కపిలకాశీపతి బుచ్చిబాబు శ్రీశ్రీ పద్మరాజు ఆరుద్ర, రజనీ కాంతరావు మహాశయుల రేడియో నాటికలలోను, నార్ల చిరంజీవి మున్నగువారి పిల్లల నాటికలయందును ఆధునికయుగమున స్వచ్ఛమైన నాగ్గవ వ్యంగ్యమార్గము అంతయో యింతయో అగపడుచునే యున్నది

ఈనాడెన్నో నూతనప్రక్రియలు సాహిత్యవీధులలో వెల్లువలు కట్టినను వానికంటె భిన్నమైన పురాతన ప్రక్రియలుగల సాహిత్యవీధులయందే జిగివెలుగు విరియుచున్నది ఆ ప్రక్రియలదెసగానే మొగ్గుకానవచ్చుచున్నది కాలము లోకము-ఈ రెండే వానికి సాక్షిభూతములు

విశ్వశాంతి యేర్పడుటకును మానవత్వము మల్లెలు పూయుటకును జగత్కల్యాణము జాజులను గుబాళించుటకును లోకప్రగతికి సాహిత్యము సోపానమగుటకును వ్యంగ్య రచయిత సమాజశ్రేయోభిలాషి కావలయును సంఘమునకు స్నేహప్రీతిపాత్రుడు కావలయును సంఘ విరోధియు ద్వేషియు కారాదు ఉత్తమ వ్యంగ్యము సంఘపురుష చింతాఫలమైన సాహిత్యరూప సంపదనొంది సాంఘిక మనస్సును రమింపజేయగలదని ఆశాసింతముగాక!

తి వి కు శ.

## వ్యంగ్యము (ఆధునికాంగ్లము)

తన ఆదర్శములకు వ్యతిరేకముగా కన్పించు వ్యక్తులను సంస్థలను భావములను తీవ్రముగా విమర్శింపదలచిన రచయిత సామాన్యముగా వ్యంగ్యరచనలో నిమగ్నుడగును సమకాలికములైన తప్పులను నిరసించగోరి ఇటలీదేశమున

యువెనల్ ఇంగ్లండులో స్విఫ్ట్ ఇట్టి రచనలను చేసిరి మన కన్నమిన్నయని భావించు వారిని హేళనకు గురిచేసినప్పుడు మనకానందము కల్గుటసహజమే కాని కేవలము హేళనతో నిండిన రచనకు సాహిత్యములో స్థానములేదు ఒక వ్యక్తిని విమర్శించు రచనలో సార్వజనీనత కన్పించదు గనుక అది సాహిత్యము కాజాలదని అరిస్టాటిల్ నిర్ణయించెను

వ్యంగ్యరచన సమగ్రకావ్యమునగాని కావ్యములో నొకచోటగాని కన్పించవచ్చును "లవ్స్ లేబర్స్‌లాస్ట్" అను నాటకమునందు అచ్చటచ్చట కవులను ప్రేమికులను షేక్స్పియర్ వ్యంగ్యధోరణిలో చిత్రించెను ఈ ధోరణికి కావ్యత్వమును తెచ్చిన మొదటి పాశ్చాత్య రచయిత యువెనల్ (క్రీ శ 60-130) వ్యంగ్యరచనకు "సయేవా ఇండిగ్నాషియో" (దుర్వారకోపము) ఉండవలెనని అతని వాదు దీనికి ఉపకరించు మార్గములు నాల్గుకలవు అన్యాయముగాని దుర్మార్గముగాని మన పరిసరములలో జరుగుచున్నను మనము దానిని గమనించకపోవచ్చును అప్పుడు ఒక రచయిత అట్టి దానిని స్పష్టముగా వర్ణించదలచుట మొదటి మార్గము మతవిషయములలో అధికార పదవులనున్నవారిని ఛాసర్ మహాకవి ఈ రీతిగా ప్రదర్శించెను "పాయింట్ కౌంటర్ పాయింట్" అను గ్రంథమున ప్రథమ ప్రపంచయుద్ధము తర్వాత గల తనదేశ పరిస్థితులను ఈరీతిగా ఆల్డస్ హక్స్లీ అను ఆంగ్ల పండితుడు చిత్రించెను

న్యాయశాస్త్రమునకు లోబడి దూషణ గావించుట వ్యంగ్య రచయిత అవలంబించు రెండవ మార్గము ఇట్టిచోట్ల విస్పష్టిక చిత్రణ కన్పించదు డ్రైడన్ పోప్ మొదలగు ఆంగ్ల కవులీపద్ధతిని చేపట్టిరి చెస్టర్టన్‌ను విమర్శించిన ఆక్స్‌ఫర్డ్ పండితునిపై 'లైన్స్ టు ఎ డాన్" అని హిలేర్ బెల్లక్ వ్రాసెను దీనిలో ఆ పండితుని నవ్వులపాలు చేయుటయే రచయితయొక్క ముఖ్యమగు ఉద్దేశము

వ్యాజస్తుతి వ్యాజనింద కాకువు మొదలగు ఉపకరణములతో వ్యంగ్యరచన గావించుట మూడవమార్గము దీనిలోను ఘనుడు స్విఫ్ట్ (1667-1745) అనునతడు ఐర్లెండ్‌లో తీవ్రమైన క్షామము వచ్చినపుడు ప్రభుత్వము త్వరగా నివారణ కార్యక్రమములను స్వీకరించలేదు అప్పుడు స్విఫ్ట్ " నమ్రప్రతిపాదన" అను శీర్షికగల వ్యాసమును వ్యంగ్య ధోరణిలో వ్రాసి ప్రచురించెను సంఘముపై బరువుగాపడియున్న ముఖవి వాడిని పిల్లలను చంపి మిగిలిన వారికే మాంసమునిచ్చినచో, క్షామము నివారింపబడగలదని ఇందులో ముఖ్యప్రతిపాదన దీనిని శాంతముగా దృఢముగా వివరించుటలో ఉద్దేశము వేరు వాచ్యార్థమునకు విరుద్ధమైన వ్యంగ్యార్థమిందు గాంచుటచే వ్యంగ్యరచనలలో దీని అత్యున్నత స్థానమేర్పడినది గలివర్ యాత్రలు అను ఇంకొక గ్రంథమున మానవుని అల్పత్వమును ఇతడు చక్కగా చిత్రించినాడు ఎ టేల్ ఆఫ్ ఎ టబ్ అను గ్రంథమునగూడ ఈయన ఆనాటి మత వైషమ్యములను బాగుగా విమర్శించెను

నాల్గవమార్గమున రచయితయొక్క ప్రతిభ కన్పించును ప్రతిభలేనిచో వ్యంగ్యరచన నిలువజాలదు దూషణతో ఒక పెద్ద కావ్యమును అల్లజాలము కాకపు కొంతకాలమైన తర్వాత విసుగు పుట్టించును ప్రతిభవలన కావ్యము చదువుటకు ఆనందించుటకు యోగ్యము కాగలదు వ్యంగ్యరచయిత స్నేహపాత్రుడు కావలెనేగాని అందరను దుయ్యబట్టు మానవ విరోధి కాగూడదు ఇట్టిప్రతిభాసమన్వితమైన వ్యంగ్యరచన "గలివర్స్ ట్రావెల్స్" అనునది రచయితయొక్క ఉద్దేశమేదియైనను ఇదిపిల్లలనాకర్షించిన చక్కనికథగా రాణించినది వ్యవహార దక్షత సౌమ్యస్వభావము దేశభక్తిగల గలివర్ ఆయాదేశములను దర్శించినపుడు ఆయాదేశవాసులకు తనదేశపు సంస్కృతిని అందజేయవలెనను ఉత్కంఠను చూపును నాగరకలోకమున ఆచరణలో నున్న యుద్ధమును లలితకళను ఎరుగని హౌయనిమ్స్ ప్రజలకు దానిని వివరించెను పాశ్చాత్యనాగరకతను వారికి అందజేయవలెనను ఆపేక్షయాతనికి మిక్కుటము ఇతరదేశములను తమప్రభుత్వమునకు లోబడియుండునట్లు చేయవలెనను దృఢసంకల్పముతో అందందు తిరిగినాడు కాని ఈ దురాక్రమణను కొనసాగించలేక, ఆ దేశములలో విలువైనదేమియు కన్పించదని ఊరకొనినాడు వివిధ దేశములను ఆయా ప్రజల ఆచారవ్యవహారములను చక్కగా సృష్టించి ప్రతి సన్నివేశమును వ్యంగ్యార్థ సమన్వితముగా ప్రదర్శించినాడతడు

ఆంగ్ల సాహిత్యమున వ్యంగ్యరచన మొట్టమొదట ఛాసర్ (1840-1400) రచించిన కావ్యములలో కన్పించుచున్నది ఐరోపాసాహిత్యములో ఇట్టి రచనలను ప్రప్రథమమున గావించినవాడు అపూలియస్ ఇతడు గ్రీకు భాషలో "బంగారు గాడిద" అను నవలను వ్రాసెను. తర్వాత లాటిన్

భాగలో యువెనాల్ పెర్సియస్ హోరేస్‌లు వ్యంగ్య రచనలు గావించిరి. ఆంగ్లమున పదునేడవశతాబ్దములో డ్రైడన్ బట్లర్ అను కవులు పేరెన్నికగన్న కావ్యములను ఈ ధోరణిలో వ్రాసిరి. తర్వాతి శతాబ్దమున పోప్ స్విఫ్ట్ గోల్డ్‌స్మిత్ జాన్సన్ ఈ మార్గమునే అనుసరించిరి. క్రిందటి శతాబ్దారంభమున వర్డ్స్‌వర్త్ కవిని ఉద్దేశించి షెల్లీ అను కవి 'పీటర్ బెల్ దిథర్డ్' అను పద్యమును చెప్పినాడు.

ప్రీకాక్ అను నవలారచయిత క్రిందటి శతాబ్దమున వ్యంగ్యధోరణిని అవలంబించి సమకాలిక భావములను విమర్శించెను. తనకాలమున బయలుదేరిన భావకవుల ధోరణు లను భావములను వ్యంగ్యముగా ప్రదర్శించుటకు ఇతడు నవలలను వ్రాసినాడు. ఈ నవలలలో కథావస్తువు లేదనే చెప్పవచ్చును.

గత శతాబ్దమున శామ్యుయెల్ బట్లర్ (1835–1902) అను రచయిత "ఎరెహ్వాన్" అను నవల నిచ్చినాడు. ఈ గ్రంథనామమును తలక్రిందుగా చదివినచో "నోవ్హేర్" (శూన్యస్థలము) అని రాగలదు. యాత్రచేయుచు ఎరెహ్వాన్ దేశమునకు వచ్చి హిగ్గ్స్ అనునాతడు అచటి వింతలను విశేషములను వర్ణించుట ఇందలి కథావస్తువు. నేరములను చేసిన వారికి వైద్యశాలలు జబ్బుపడిన వారికి కారాగృహములు ఈ దేశమున విధించబడినవి. నిధినిక్షేపములను స్వీకరించు నేటి బ్యాంకులకు బదులు ఆదేశమున సంగీతపు బ్యాంకులున్నవి. గ్రండీ" దేవతనారాధించు ఆ ప్రజలకు మతము అనవసరము. అవివేక విద్యాలయములేగల ఆదేశమున ప్రతిభగాని మౌలికత్వముగాని స్పర్ధగాని కన్పించరాదు. యంత్రములు నిషిద్ధవస్తువులు. ఈ దేశము సమకాలిక పాశ్చాత్యజగమును పోలియున్నది.

"ది ఇన్సెక్ట్‌ప్లే" అను రచనలో మానవునిలోపములను అహ్లాదకరముగా చిత్రించినవాడు కారెల్ చపెక్. ఈ రచన లన్నిటిలోను సమకాలీన పరిస్థితులను ఆయారచయితలు వ్యంగ్యముగా విమర్శించుటకలదు. ప్రాణిశాస్త్రములో బయలుదేరిన డార్విన్ సిద్ధాంతములను హేళనపాలు చేయుటకు ఎరెహ్వాన్" ఉద్దేశించబడినది.

'గలివర్ యాత్రల"ను ఎరెహ్వాన్"ను అనుసరించి నేటి పరిస్థితులను విమర్శించిన గ్రంథము ఆల్డస్‌హాక్స్లి వ్రాసిన 'బ్రేవ్ న్యూవరల్డ్'' అనునది. నియంతృత్వము తలఎత్తిన దినములలో తమ నియంతల అభిప్రాయములను ప్రజలు ఏరీతిగా అనుకరింతురో దానిని గమనించినవాడు హాక్స్లి. ఈ క్రొత్త ప్రపంచమున శిశువులనందరను ఒకే చోట పరుండబెట్టి వారి మెదడులకు యంత్రములనమర్చి తద్వారా వైశస్థితిలోనే ఎల్లరను తమతమ భాగములకు ఏకంపడునట్లు చేయుదురు. దీనిని "బ్రెయిన్ వాషింగ్" అందురు. ఆ గతిలో స్థిరపడిన భావములనెవ్వరును వదలుకొనలేరు. ఇట్టి నియంతృత్వముల ప్రభావముచేత కల్గుప్రమాదములను తెలియజేయుటకే జార్జ్ ఆర్వెల్ అను రచయిత 1984 అనునవలను లోకమున కందించినాడు. నేటి ప్రజాస్వామ్యమును నాయకులేరీతిగా పాడుచేయుచుంటిరో తెలుపునది గొడ్లశాల (ఎనిమల్‌ఫామ్) అను అతని వేరొక నవల. జంతువులన్నియు సమానములే అయినా కొన్ని జంతువులు మిగిలినవాటికంటె కొంచెమెక్కువ సమానులు అను వాక్య మీ నవలలోనిది. ఈనాటి ప్రజాస్వామ్యముల నాయకులు ఆచరణలో పెట్టు సత్యమిదియేనని వేరుగా చెప్పనక్కరలేదు. పాలించుచున్న తెల్లవారు పాలింపబడు దేశస్థులతో సామ్యావస్థను పొందజాలక వారియెడల మానవత్వమును చూపజాలకపోవుటను వ్యంగ్యముగా విమర్శించిన నవల బర్మాలోని దినములు'' (బర్మీస్‌డేస్) అనునది.

కొంతవరకు వ్యంగ్యరచన ఎవెలిన్‌వాగ్ అనుకవి రచనలలో కలదు. నేటి నాగరకతవలన కల్గిన 'లోపములను'' తీవ్రముగా వ్యంగ్యముగా విమర్శించు నవలలు "స్కూప్ (1938) బ్లాక్‌మిస్చీఫ్ (1932) అనునవి. విద్యాసంస్థలలోని కుళ్లుసంస్కృతి అను పేరున ప్రదర్శింపబడు తద్విపరీతస్థితి మొదలగువాటిని వ్యంగ్యధోరణిలో కింగ్స్లి ఆమిస్ అను రచయిత తన "లకీజిమ్" (1954) అను నవలలో ప్రదర్శించినాడు. సాహిత్యవిమర్శలో కన్పించు అర్థరహితపదజాలమును అసంబద్ధపు హాస్య సిద్ధాంతములను దట్ అన్సర్టెన్ ఫీలింగ్" (1955) ఐ లైక్‌ఇట్‌హియర్'' (1958) అను రచనలలోను, నేటి పోషలిజమ్ము నివాదముచేయుగందరగోళమును "హర్రీ ఆన్ డౌన్" అను నవలలోను ఇతడు చక్కగా చిత్రించినాడు. జాన్‌బ్రెయిన్ వ్రాసిన "రూమ్ ఎట్ ది టాప్" (1957) లోను, అల్లన్ సిల్లిటో రచించిన 'సాటర్‌డే నైట్ అండ్ సన్‌డే మార్నింగ్' (1958)లోని ఈ సమాజభావ వ్యవస్థ వ్యంగ్యధోరణికి గురియైనది.

వ్యంగ్యరచన మీ శతాబ్దమున నవలలలో కొట్టవచ్చినట్లు కనబట్టుచున్నది. ఈ మార్గము కావ్యమున పంచ్ వంటి పత్రికలలో కల్పించను వ్యాసరచనలో ఎ. ఎ. హెర్బర్ట్ వంటివారు ఈ ధోరణిని చాల అభివృద్ధిపరచిరి. ఈయన వ్రాసిన స్నానఘట్టములు అను వ్యాసమును మేస్‌ఫీల్డ్ కవితను వెక్కిరించుచు వ్రాసిన ఎవర్ లాస్టింగ్ పెర్సీ" అను పద్యమును గణింపదగినవి.

ప్రో. సు. శా.

## వ్యవసాయ అర్థశాస్త్రము :

వ్యవసాయము అతిపురాతనమైన కృషిగా ఎన్నబడుచున్నది. మానవుని సకల జీవన రంగములకు అదివెన్నెముక వంటిది. ఇప్పటికిని భారతదేశము వ్యవసాయ దేశముగనే పరిగణింపబడుచున్నది. జనాభా పెరుగుదల మొదలైన కారణములచే ఆర్థికస్థితి విషమించగా అధికాహారోత్పత్తి అత్యవసరమగుటవలన వ్యవసాయమునకు ప్రాముఖ్యము హెచ్చినది. వ్యవసాయోత్పత్తి దానిని క్రమ పంపకము జరుగనిదే దేశము పురోగమింపజాలదు. వ్యవసాయరీత్యా భారతదేశాభ్యుదయపథమును తీర్చిదిద్దుటకు వ్యవసాయ అర్థశాస్త్రము ఆయువుపట్టువంటిది.

హైందవ ధర్మశాస్త్రములందలి చతుర్విధ పురుషార్థములలో అర్థము ఒకటి. కామము (కోరిక) దానికి మూలము కావున ఉపయుక్తము, మూల్యమునుగల వస్తువులు అర్థము అనిపించుకొనుచున్నవి. ఇట్లు ప్రయోజనము, మూల్యము ప్రముఖ లక్షణములుగాగల వివిధ అర్థముల ఉత్పత్తి, విభజనము, వినిమయము, వినియోగములనుగూర్చియు వీటికి సంబంధించు ధరలు, ద్రవ్యచలామణి మున్నగు రాజకీయ సంబంధమైన విషయములను గురించియు చర్చించబడి సిద్ధాంతీకరించబడు శాస్త్రము అర్థశాస్త్రమన బడుచున్నది. ఇందులో వ్యవసాయోత్పత్తులు ఆదిగాగల విషయములను గురించిన అర్థశాస్త్ర అంశములు వ్యవసాయ అర్థశాస్త్రమన బడుచున్నది.

చరిత్రాత్మకముగా భారతదేశములో ఆర్థికనీతి నియమముల పరిశీలనము "మనుస్మృతి" (క్రీ. పూ. 1000-500) యందు ప్రశంసింపబడియున్నది. ఇతర విషయములతోపాటు ఆహారాదుల ఉత్పత్తి, విభజన నియమములను గురించి కూడ అందు కొంతవరకు తెలుపబడినది. కౌటిల్యుని "అర్థశాస్త్రము"ను ఇట్టి అకాలపురాణాలు ప్రజల ఆర్థికాభివృద్ధివల్ల ఎంత శ్రద్ధ వహించుచుండిరో తెలుపగలవు. అయితే క్రీ. శ. 1200 నుండి భారతదేశములో బ్రిటిషు పాలన బలపడుచుండినను ప్రజల ఆర్థికస్థితిని తెలుసుకొనుటకు ప్రయత్నము గావించలేదు. ఈ యాధునిక యుగములో బ్రిటను, జర్మనీ మున్నగు దేశములలో కొందరు పండితులచే ఆర్థిక విషయములు పరిశీలింపబడి సిద్ధాంతీకరింపబడెను. సిద్ధాంతములననుసరించి పాశ్చాత్య దేశములలో పరిపాలనము సాగుచుండెడిది. ఈ విదేశ సిద్ధాంతములను విద్యావేత్తలైన భారతీయులు గత శతాబ్దమున గమనించి వాటిని విమర్శించిరి. ఇట్టి విమర్శకులలో గాంధిమహాత్ముడు అగ్రగణ్యుడు. భారతీయ గ్రామసౌభాగ్యమును నిలబెట్టుటకవసరమైన ఆర్థిక విధానమును ఆయన సూచించెను. ఆయన ప్రోద్బలముచే ఆర్థిక విధానమునందు కొన్ని స్వల్ప మార్పులు జరిగినను ప్రజల ఆర్థికాభివృద్ధి అనువగు సమగ్ర విధానమింకను ఆచరణములోనికి రావలసియేయున్నది. భారతదేశము స్వతంత్రమై ఇరువది సంవత్సరములు దాటినను మన ఆర్థిక విధానమింకను చాలవరకు పాశ్చాత్యసిద్ధాంతమునే అనుసరించుచున్నది. అదియుగాక గాంధిజీ ప్రతిపాదించిన ఆర్థిక సూత్రములు ప్రస్తుత పరిస్థితులకు అనుకూలములుకావేమో అను సంశయము కూడ లేకపోలేదు.

వ్యవసాయ ఆర్థికశాస్త్రము భారతదేశములో చాలవరకు వెనుకబడియున్నది. అర్థశాస్త్ర సూత్రములు ప్రయోగపూర్వకసిద్ధాంతములంతటి స్థిరములు కావు. దేశకాల పరిస్థితులను బట్టియు ప్రాకృతిక సాంఘిక పరిణామములను బట్టియు అర్థశాస్త్ర సూత్రములు కొంత మార్పుచెందుచుండును. కొన్ని పరిస్థితులందుసైతము అర్థశాస్త్రజ్ఞులు వారి మత భావములను బట్టి సిద్ధాంతములను ప్రతిపాదించుటయు గలదు.

వ్యవసాయోత్పత్తికి అతిముఖ్యములగు నేల, నీరు, విత్తులు, ఎరువు, సస్యరక్షణము, పశువులు, నిర్వహణము, వాటిపరస్పర సంబంధములు మున్నగు అంశములనుబట్టి వ్యవసాయవిధానము మారుచుండును. ఉత్పత్తికి సంబంధించు గిట్టుబాటులను తెలియజేయు అంశములు వ్యవసాయాభివృద్ధికెంతయు అవసరము. అందుచే వ్యవసాయ అర్థశాస్త్రమునందు ఉత్పత్తికి హెచ్చు ప్రాధాన్యమీయ వలసియుండును. అందుకు సంబంధించిన ఆర్థిక విభాగము లివి: (1) ఉత్పత్తి ఆర్థిక విధానము; (2) క్షేత్రముల నిర్వహణము; (3) భూమికి సంబంధించిన ఆర్థిక స్థితి, ఆర్థిక సూత్రములను ఆర్థిక సమస్యలను, భూమి పరి

ష్కార మార్గములను వ్యవసాయముతో సమన్వయించి పరిశీలించి చర్చించుటయు సిద్ధాంతీకరించుటయు పైజెప్పబడిన విభాగముల ముఖ్యోద్దేశము

ఉత్పత్తియగు వస్తుజాలములోగాని దాని మూల్యములోగాని కొంతభాగము ఉత్పత్తియందు పాల్గొనిన వారి శ్రమకు లేక ఉపకరణములకు ప్రతిఫలముగా చెందవలసియుండును అనగా భూమికిస్తు శ్రామికుల వేతనము పెట్టుబడికి వడ్డీ నిర్వహణమునకై చెల్లింపబడు లాభము మున్నగువాటి క్రింద ఉత్పత్తి ఆదాయము పంచి ఇయ్యబడవలయును ఇట్టి పంపకమే విభజన మనబడును ఉత్పత్తియగు ఏ వస్తువుల యొక్క విభజనమైనను వాటిని వాంఛించు వారి కందరకును తృప్తికరముగ జరుగవలెనన్నచో అట్టి వస్తూత్పత్తి గిరాకికి తగినంతగా కావలసియుండును గ్రామములందు కొన్ని కుటుంబములు సాముదాయకముగా కొన్నివస్తువులను మాత్రమే ఉత్పత్తిచేయుటచే ఉత్పత్తిదారుల వాటాలు పోను మిక్కిన భాగమును ఇతర వృత్తులవలన జీవించుగ్రామీణులకును పరిసరము లందలి నగరవాసులకును సరఫరాచేసి నగరవాసులుత్పత్తి చేయుపదార్థములనుండి తమ కవసరమైన వాటిని తీసికొనవలసియుండును ఇట్టిమార్పిడి విధానము వినిమయ మనబడును విభజనము వినిమయము పరస్పర సంబంధము గలవి ఇవి రెండును అన్నివర్గములకు చెందిన గ్రామీణులకు తృప్తిని కల్గించునవిగ ఉండవలెను ఇవి దేశకాల పరిస్థితులకు అనుకూలముగ నుండుటేగాక ఎగుమతి వ్యాపారమునకు తగురీతి యానసాధనములుగ నుండుటకూడ అవసరము

విభజన వినిమయములు వ్యాపారస్థులకు వదలివేయబడవలెనా? లేక ఉత్పత్తిదారులు సహకార సంఘముల ద్వారా ఏర్పాటు చేసికొనవీలగునా? ప్రభుత్వములు ఎట్టి పరిస్థితులలో ఏయేవస్తువులకు సంబంధించిన ఎగుమతి దిగుమతులపై సుంకములు విధింపవలెను? లేక నిషేధింపవలెను? విభజన వినిమయములకు సంబంధించు ఇట్టి సమస్యలను అర్థశాస్త్రము చర్చించి నిర్ణయించును

దేశమున ఉత్పత్తిచేయబడి వివిధప్రాంతములకు లభింపచేయబడు సరకులను ఉపయోగపరచుట వినియోగ' మనబడును వస్తువులధరలు ఉత్పాదకులకు గిట్టుబాటుగ నుండునట్లును వినియోగదారులకు భారమనిపించకుండునట్లును చేయుటకు వ్యాపారనియమములు అవసరము ఉత్పాదకుల విక్రయపు ధరలకును వినియోగదారుల కొనుగోలు ధరలకును సామరస్యము కుదురవలెను చలామణిలోనుండు ద్రవ్యపరిమాణమును ఎట్టి పరిస్థితులలో పెంచింపదగును? ఎప్పుడు తగ్గింపవీలగును? ఇవన్నియు అర్థశాస్త్రము పరిశీలించి నిర్ణయముచేయు వినియోగ సంబంధమగు విషయములు

పైన పేర్కొనబడిన ఉత్పత్తి విభజన వినిమయ వినియోగములగు గురించి వ్యవసాయమునకు సంబంధించినంతవరకు-ముఖ్యముగా తత్సంబంధమగు ఉత్పత్తిని చర్చించు శాస్త్రము వ్యవసాయ అర్థశాస్త్ర మనబడుచున్నది

ఆధునిక ఆర్థికవిషయములను గూర్చి భారతదేశమునందు గ్రంథరచనము వ్యాసరచనము గతశతాబ్దిలో ఆరంభమైనది విశ్వవిద్యాలయములలోను కళాశాలలలోను అర్థశాస్త్రము బోధనావిషయముగ నిర్ణయించినప్పటినుండి ఇట్టి రచనలు అధికమయ్యెను ఇటీవల వ్యవసాయ అర్థశాస్త్రమునకు కూడ ప్రాముఖ్య మేర్పడినది

భారతదేశములో వ్యవసాయము చాలవరకు కుటుంబకమతములుగా వ్యవహారమున నున్నది పెక్కుకుటుంబ కమతములు పరిశ్రమలకంటెను వ్యాపారములకంటెను తక్కువ లాభదాయకముగ నుండుటచే వాటి నుండి లభించు నికర లాభము వాటిని సాగుచేయు కుటుంబముల కనిష్ఠజీవన స్థాయికైనను చాలకున్నది అయినను పేదలైన గ్రామీణులు తమకమతములకు అంటిపెట్టుకొనియే జీవనము చేయుచున్నారు ఆర్థికముగా ఈ కమతములను పెంపొందించుటకు తగిన ప్రణాళికలను ముందుగా తయారుచేసికొని దాని ప్రకారము వాటిమీద లాభములను తీయవలెను ఈ ప్రణాళికల నిర్వహణమునకై తగు సలహాలను తత్సంబంధమైన సంస్థల ద్వారా పొందవలసియున్నది

తీరికకాలమందు గ్రామీణులు తమ కనుకూలములగు పాడిపరిశ్రమ కోళ్లపెంపకము తేనెటీగలపెంపకము 'ఇత్యాది ఉపపరిశ్రమల నెన్నిటినో స్థాపింపనగును వీటిమూలమున వారి ఆదాయము వృద్ధిచెంది జీవనస్థాయి పెంపొందును చాలీచాలని వ్యవసాయాదాయమునకు ఇది తోడ్పడగలదు వీటికి తోడు నవీన కృషిసాధనములను అమలులోనికి తెచ్చుటకు కర్షకులు తోడ్పడుటకూడ అవసరము మేలువంగడముల విత్తులను వివిధరకముల యెరువులను సాధించుట నీటివసతులను కల్పించుకొనుట అరిష్టనివారణ పద్ధతులను అవలంబించుట,

వాటి గిట్టుబాటులను లెక్కవేసి చూచుకొనుట మున్నగు అంచనాల ద్వారా వ్యవసాయము బహుముఖముగ అభివృద్ధి నొందగలదు

భూసంస్కరణ చట్టము లింకను ఆచరణములోనికి రావలసియున్నవి ఆర్థికవేత్తలలో ఈ విషయమై భేదాభిప్రాయములున్నవి ఈ సమస్యల నెదుర్కొనుటకై భూస్వాములకును కౌలుదారులకును కర్షకులకును వారి పనివాండ్రకును నడుమ ఏర్పడు తగవులను సామరస్యముగ పరిష్కరించుటకు తగిన సంస్థ లేర్పడవలెను పేదకర్షకులు తమ ఋణములను తీర్చుకొనుటకును తమభూములను అభివృద్ధి చేసికొనుటకును పెట్టుబడిసొమ్ము సులభముగా లభ్యమగు సౌకర్యములు పొందుటకును వసతులేర్పరుపవలసి యున్నది ఈ సమస్యలు పరిష్కారమైననేగాని భారతదేశము వ్యావసాయకముగా అభ్యుదయమును సాధింపజాలదు ఈ సమస్యలను పరిష్కరించుటకే పంచవర్ష ప్రణాళికలలో వ్యవసాయమునకు ప్రాముఖ్యమీయబడినది

వ్యవసాయోత్పత్తి విధానమును గూర్చి భారతదేశీయ ఆర్థికవేత్తలలో భిన్నాభిప్రాయములుగలవు భారతదేశములో కూడ ఇంగ్లండు అమెరికా ఆస్ట్రేలియాలలోవలె పెద్ద పెద్ద భూవిస్తీర్ణములలో వ్యవసాయమును యంత్రసహాయముతో శీఘ్రముగను సమగ్రముగను చేయుచో అధికోత్పత్తి కలుగ గలదని వాదించువారు కొందరున్నారు కాగా సాగుభూమి చిన్నచిన్న కమతములుగ విభజింపబడి జనసంఖ్య హెచ్చుగా నున్న భారతదేశములో జపాను కొన్ని ఐరోపాదేశము లందువలె ఒక్కొక్క కర్షకకుటుంబము సమర్థతతో సాగుచేయుటకు వీలైనంత విస్తీర్ణము మాత్రమేగల స్వల్పక మతములను సాగుచేయు విధానమే అనుకూలమని వాదించువారు మరి కొందరు గలరు

యంత్రవాదు లిందుకు సమాధానముగ రష్యాలోవలె ప్రభుత్వయాజమాన్యమున సమష్టి సహకార వ్యవసాయ సంస్థలద్వారా యంత్రసహాయమునవే భూమిని సాగుచేయవలె నని యందురు కాని రెండవ పక్షమువారు అట్లు సాగు చేయుటలో తగిన అనుభవమును సంపాదించి, ఇప్పటి కంటె హెచ్చుపంటను సాధింప వీలగునని ఋజువుచేసిననేగాని ఇప్పటి సాగు విధానములో తీవ్రమైన మార్పులను ప్రవేశపెట్టుట క్షేమకరము కాదని వక్కాణించుచున్నారు పెద్ద పెద్ద క్షేత్రములందు సమష్టి వ్యవసాయములో పాలుగొనుటలో ఏ కుటుంబమును తగుమాత్రపు భూమిని స్వేచ్ఛగ సాగుచేయగల ఆసక్తిని చూపకపోవుట మానవస్వభావము మరియు భారతీయ కర్షకులు అంతగా విద్యావంతులు కాకుండుటవలన వారిలో సహకార భావము కుదుర్చుకొనుట కష్టసాధ్యమగుటచే సమష్టివ్యవసాయ విధానము ఆచరణయోగ్యము కాజాలదని పెక్కుర అభిప్రాయము

ఇదియుగాక యంత్రములతో నేల సాగుచేసినంతమాత్రమున ఉత్పత్తి హెచ్చుట సందేహాస్పదము యంత్రముల నుపయోగించుటలో జీవనోపాధి జరుగనివారి సంఖ్య మరింత హెచ్చుననియు ఇతరపరిశ్రమలను ఎంతఅభివృద్ధి గావించినను యంత్రప్రయోగముచే జీవనోపాధి జరుగనివారికి తగినంత పనిని కల్పింప సాధ్యముకాదనియు ఈ పక్షమువారి వాదన అంతేకాక యంత్రప్రయోగమువలన పాడిపశువుల సంఖ్యతగ్గుననియు దీనికి గిరాకి తగ్గుటచే పాడియావులయొక్క దూడలయొక్క సంఖ్య తగ్గుననియు అందుచే పశువుల ఎరువు క్షీణింపగా భూమియందు సేంద్రియపదార్థము లోటగుననియు వీరు తమ వాదమునకు హేతువులుగా పేర్కొందురు

ఈ వాదములను పరిశీలించినమీదట ప్రస్తుత పరిస్థితులలో పంటను పెంపొందించు కొన్ని సంస్కరణలతోపాటు ఒక్కొక్కజంట పశువులకు ఒక్కొక్కకుటుంబమునకు సరిపడు కనీస విస్తీర్ణముగల చిన్నకమతములలోనే సాగుచేయుట అనుకూలమని నిర్ధారణ చేయదగును

వ్యవసాయోత్పత్తికి సంబంధించు మరియొక విషయములో కూడ అర్థశాస్త్రవేత్తలలో రెండుపక్షములు గలవు ఏయే ప్రదేశములలో ఏయేసస్యములు ఇతర ప్రాంతము లందు కంటె ఎక్కువ ఫలితమునిచ్చునో ఆ సస్యములనే అచ్చట విరివిగా పెంచుచు అచ్చట తక్కువైన పదార్థములను బాగుగా పండు ఇతర ప్రాంతముల నుండి దిగుమతి చేసికొనుట యుక్తము ఇట్లు చేయుటవలన ఉభయప్రాంతము లందును పదార్థములకొరత యుండక అచ్చటిప్రజల అవసరములు తీర గలవు ఇది ఒకపక్షమువారి అభిప్రాయము కాగా ఏ కమతమున ఆకమతమును ఏ గ్రామమున ఆ గ్రామమును ఏ ప్రాంతమున ఆ ప్రాంతమును ఏ రాష్ట్రమున ఆ రాష్ట్రమును తుదకు దేశమంతయు అన్నవస్త్రాదుల కవసరమగు వస్తూత్పత్తి యందు స్వయం సంపూర్ణమును సాధించువిధానమే భారతదేశము

నందు ప్రస్తుతపరిస్థితులలో అవలంబనీయమని సిద్ధాంతీకరించు వారు మరికొందరున్నారు

భారతదేశములో సుమారు 200 సంవత్సరములకు పూర్వము చాలవరకు స్వయంసమృద్ధివిధానమే అవలంబింపబడుచుండెను కాని ఇటీవల కొంతకాలమునుండి మొదట పేర్కొనిన విధానమునకు కొంత ప్రాముఖ్యమేర్పడినది కొన్ని ప్రాంతములందు కొందరు వ్యవసాయదారులు ధనలాభాపేక్షచే హెచ్చులాభము లిచ్చు పొగాకు మిర్చి వేరుసెనగ మొదలగు సస్యములనే విరివిగా సాగుచేయసాగిరి

హెచ్చు జనసంఖ్యగల కొన్ని ఇతర దేశములు ఆహారాది జీవితావసరములలో దాదాపు స్వయంసమృద్ధములుగనున్నవి ఆదేశము లందలి రాష్ట్రములుకూడ అట్టి స్థితిలోనున్నవి ఇట్లే భారతదేశము, అందలి రాష్ట్రములు జిల్లాలు, తాలూకాలతో సహా ఏదే ప్రాంతమున ఆప్రాంతము ప్రధాన వస్తూత్పత్తియందు సాధ్యమైనమేరకు స్వయంసమృద్ధములగుచో సామాన్య ప్రజలజీవితము సుఖకరమగును ప్రధానజీవితావసర వస్తువులతోపాటు ఇతర పదార్థముల ఉత్పత్తిలోకూడ స్వయంసమృద్ధి సాధించుట సులభమగును

పైన తెలుపబడిన ప్రకారము వ్యవసాయోత్పత్తిని సాధ్యమైనమేరకు స్వయంసమృద్ధి విధానమునను సరించి సాగించుచో ఉత్పత్తుల యొక్క వినిమయములును సులభతరమగును సామాన్యముగ వర్తకులు ఉత్పాదకుల నుండి సరకులను కొని వాటిని వినియోజకులకు విక్రయించుచు కొంతలాభమును గడింతురు వ్యాపార వాణిజ్యములు బహుళమై గ్రామములలోని ఉత్పత్తిదారునకును నగరములలోని వినియోజకునకును రాకపోకలు దూరభారమగుటతో వస్తువినిమయము మధ్యవర్తు చేతులలో పడినది ఇందువలన ఉత్పాదకుల అమ్మకపుధరలకును వినియోజకుల కొనుగోలు ధరలకును చాల వ్యత్యాసమేర్పడుచున్నది

ఇటీవల కొన్ని ప్రాంతములలో ఉత్పాదకుల యొక్కయు వినియోజకుల యొక్కయు సహకారసంఘముల స్థాపనము కొంతతగ్గినది కాని ఉత్పత్తియగు సరకుల క్రయవిక్రయము లింకను చాలవరకు వ్యాపారస్థులద్వారానే జరుగుచున్నది కావున ఉత్పాదకులును వినియోజకులును సహకరించి వస్తువినిమయమును వ్యాపారస్థులనుండి విముక్తమొనర్చినచో, ఉభయవర్గములకు మేలుకల్గును

కర్షకులుత్పత్తిచేయు పెక్కువస్తువులు ఎన్నోట కొన్ని సంస్కారములలోనైనగాని ఆ వినియోజకులకు ఉపకరింపవు ఇట్టి వానినన్నిటిని ఆయావస్తువుల ఉత్పత్తిపటెనే గ్రామములందు స్వయంసమృద్ధి సిద్ధాంతమును సరించి కుటుంబము లేక గ్రామపారిశ్రామిక సంస్థలు జరుపదగునా లేక యంత్రసహాయమున నడుపబడు పెద్దపెద్దకర్మాగారములందు కేంద్రీకరింపదగునా ? అను విషయముపై గూడ అర్థశాస్త్రజ్ఞులు భిన్నభిప్రాయములను ప్రకటించుచున్నారు

గ్రామములందు కర్షకులుత్పత్తిచేయు పదార్థములను ఉపయోగార్హము చేయుట కవసరమగు సంస్కారములను సాధ్యమైనంతవరకు గ్రామకుటీర పరిశ్రమలయందే జరుపుట భారతీయపరిస్థితులకు అనుకూలమైనవిధానము కుటీర పరిశ్రమలద్వారా ఉత్పత్తిచేయవీలులేని ఇనుము ఉక్కు వస్త్రరా ఖనిజసంబంధమగు పరిశ్రమలు మోటారుకారులు విమానములు రైళ్లు మొదలగు పరిశ్రమలను పెద్దపెద్ద కర్మాగారములందు జరుపుచు కర్షకులుత్పత్తిచేయు పదార్థముల సంస్కారమునకు సంబంధించిన పరిశ్రమలను కుటుంబపరిశ్రమలయందు జరుపుట భారతదేశమునకు శ్రేయోదాయకము

కె ఎస్ సు

## వ్యవహార ఆయుర్వేదము

ఆయుర్వేదశాస్త్రమున తెలుపబడిన విధినిషేధములనను సరించి మానవులు సంచరించుచుండినచో ఆరోగ్యకరముగా జీవయాత్రసాగించుటకు కొంతవీలుకలుగును వాటియందు నిర్లక్ష్యముతోనుండి యథేచ్ఛగా సంచరించువారు అడుగడుగునకు రోగముల పాల్పడుచు దుఃఖమయమైన బ్రతుకు బ్రతుకవలసవచ్చును

జనులు కొందరు ఆరోగ్యనియమములను శ్రద్ధతో పాటించుచున్నప్పటికిని కాలకర్మవశాత్తు రోగములకు ప్రమాదములకు పాల్పడి తుదకు మరణమునుకూడ పొందుచుందురు

శరీరముయొక్క ప్రకృతివికృతులతోకూడిన విజ్ఞానమంతయు వైద్యునకు అత్యంతావశ్యకమైయున్నది పంచభూతములచే నిర్మింపబడిన ఈ శరీరభాగమునకు, ఏరోగమో ప్రమాదమో, కారణముకాగా, స్థూలదృష్టికి గోచరముకాక శరీరగతమైయుండు ఇంద్రియములు సత్వము, ఆత్మ ఈ శరీరమునుండి విడిపోవుటయే మరణమని వైద్యశాస్త్రవేత్తలు

పేర్కొన్నారు.

మరణమునుపొందినట్టి చైతన్యరహితమైనట్టి శరీరమునకు (శవము) సంబంధించిన పరిజ్ఞానము పరిశీలనము—ఇవికూడ వైద్యశాస్త్రవిదులకు వ్యవహారరీతిగా అవసరమైయున్నవి.

లోకములో మనుజులు కామక్రోధాది అరిషడ్వర్గములకు గురియై లోకరీతినుపగించి సమనిత్యజీవితములో అనేక అధర్మకార్యములను సలుపుచు కష్టనష్టములకు పాల్పడి తుదకు మరణమును పొందుచుండెదరు. దొమ్మీలు దెబ్బలాటలు దొంగతనములు విషముపెట్టుట బలాత్కారమున స్త్రీలను చెరచుట ఆత్మహత్యలు నరహత్యలు భ్రూణహత్యలు గర్భస్రావగర్భపాతములు—ఇట్టి ఘోరమైన క్రూరమైన అధర్మకృత్యములకు ఒడిగట్టుచుండుటకలదు. ఇట్టివాటినన్నిటిని నాగరకసంఘములో నీతికోవిదులు సాంఘిక మర్యాదలననుసరించియు న్యాయశాస్త్ర నిబంధనలననుసరించియు అధర్మకృత్యములుగా పరిగణించుచున్నారు. సంఘము ఇట్టి కార్యములను ఘోరమైన నేరములుగా పరిగణించి ఏవగించుకొని వీటికి కారకులైన వారిని న్యాయస్థానములలో విచారించి శిక్షించుటకు పూనుకొనును. లోకములో ఇట్టి అకార్యకరణములను జరుపు దుర్మార్గుల ప్రవర్తనమును గూర్చియు అందువలన కలుగు అనర్థములను గూర్చియు పరిశీలనము అన్వేషణము శిక్ష ఇత్యాదివిషయములు వైద్యశాస్త్రములోను అర్థశాస్త్రములోను ధర్మశాస్త్రములోను విరివిగా వివరింపబడియున్నవి. వాటినన్నిటిని క్రోడీకరించి లోకవ్యవహారరీతిగా వైద్యుడు పరిష్కారమార్గమున ఎట్లు ప్రవర్తింపవలెనో తెలియజెప్పు విషయములనే "వ్యవహార ఆయుర్వేద" మని శాస్త్రవిదులు పేర్కొన్నారు.

అనారోగ్యముతో ఉన్న శరీరమును గూర్చి తాను తనబంధువులు స్నేహితులు శ్రద్ధగైకొని వైద్యుని వద్దకు పోయి రోగము ఫలానిదని నిర్ణయింపజేసికొని చికిత్సను పొంది ఆరోగ్యవంతులగుటకై ప్రయత్నింపగలరు. ఆరోగ్యవంతులైనచో సరే రోగము కుదురకగాని ఇతరకారణముల వలనగాని మరణమునే పొందినయెడల ఆశరీరమును(శవము) గూర్చి శ్రద్ధగైకొనని పౌరులెవ్వరును ఉండరు.

మృతకళేబరమును జూచినవెంటనే మరణము సహజమైనదైనచో సంఘమర్యాదలననుసరించి శవమును శ్మశానమునకుచేర్చి అపరకర్మలవలన దహనఖననాదులను వారివారి మత విధులననుసరించి జరుపుటకు పూనుకొందురు.

సాధారణముగా ఒక గ్రామములో ఒక వ్యక్తి మరణించినపుడు తనికళేబరమును విచక్షణతో చూచి కండ్లుమూసికొని తీసికొనిపోయి తగులబెట్టెదరు. [illegible] అతనికేమి జబ్బుచేసినది? ఏ వైద్యుడు మందిచ్చినాడు? ఎప్పుడు మరణించినాడు? ఇది సహజమైన మరణమేనా? కాక బలాత్కారమైనచో శరీరమున ఏవైనగాయములు ఇతరలక్షణములు కలవా? ఈ మొదలగు విషయములను విచారించి సహజమైన మరణమే అయినచో అపరకర్మలను అడ్డులేకుండ నెరవేర్చుదురు. అతని మరణమునుగూర్చి ఏదైన సందేహమేర్పడినచో వెంటనే సర్కారువారికి తెలియజేసి చట్టప్రకారము పంచాయతీజరిపి పంచాయతీదారుల అనుమతి అయిననేగాని శవమును అచ్చటినుండి కదల్పరు. పంచాయతీదార్లకు మరణమునుగూర్చి సందేహమే ఏర్పడినయెడల శవమును వైద్యపరీక్షకు పంపుతారు. ఈ స్థితిలో వైద్యశాస్త్రములో చెప్పిన వికృతి విజ్ఞానవిషయములకు ఎక్కువ ప్రాముఖ్యమేర్పడును. వైద్యునియొక్క అవసరము ప్రయోజనము సహాయము సంఘమునకు న్యాయాధికారికి న్యాయనిర్వహణలో తోడ్పడగలదు.

సంఘమర్యాదల నతిక్రమించియు పౌరధర్మములను పాటింపకయు రాజశాసనములను ధిక్కరించియు న్యాయాన్యాయవిచక్షణలేక ధర్మముతప్పసంచరించు జనులయొక్క అవినీతికరమైన ఘోరకృత్యములనన్నిటిని పేర్కొనుచు వైద్యశాస్త్రరీత్యా ధర్మాధికారికి తోడ్పడేవిధమున విషయవిమర్శనజరిపి విపులముగా సందేహనివృత్తిచేసి న్యాయనిర్వహణకు తోడ్పడు విషయములన్నియు వ్యవహార ఆయుర్వేదములో స్పష్టముగా తెలియగలవు. దీనినే ఇంగ్లీషులో "మెడికల్ జూరిస్ ప్రూడెన్సు" అనెదరు.

ఏవ్యక్తియైనను మరొకవ్యక్తినిగూర్చి దోషమొనరించి, అతనికి అభిఘాతము అంగవైకల్యము తుదకు మరణమును కూడకల్గించవచ్చును. ఒక్కొకప్పుడు మరణించిన ఆ మనిషి ఫలానివాడని గుర్తించుటకూడ కష్టముగావచ్చును. అభిఘాతాదుల స్వరూపస్వభావములు ఏ ఆయుధమువలన అభిఘాతముగాని మరణముగాని ఏర్పడినదియు మరణానంతరము శరీరములో ఎట్టి వికృతులేర్పడినవియు, ఈ మొదలగు విషయము

లను గూర్చి న్యాయాధికారికిగాని దోషమును నిరూపించు పోలీసు అధికారికిగాని తామేమియు స్వతంత్రించి స్వీయాభిప్రాయములనొసగు అధికారములేదు ఇట్టి సందిగ్ధ విషయములందు వైద్యునినే విషయజ్ఞునిగా తలంచి నేరమునకు సంబంధించిన సమస్త సామగ్రినిగాని గాయపడినవ్యక్తినిగాని మృతకళేబరమునుగాని వైద్యునకుచూపి ఆయన పరిశీలనా ఫలితముగా చెప్పగల సాక్ష్యవాఙ్మూలము మీదనే ఆధారపడి న్యాయాధికారి చర్య జరుపవలసియుండును

ఆకస్మిక ప్రమాదమునకు పాల్పడిన వ్యక్తిని చికిత్సించి ఆరోగ్యవంతునిగా జేయుటతోపాటు వైద్యునకు మరొక విధి కూడ కలదు ఈ ప్రమాదము ఎందువలన కలిగినది? ప్రాణాపాయమున్నదా? ఇది ఆకస్మికమా స్వయంకృతమా పరకృతమా అఘాయిత్యమా? అనుపరిశీలనము కూడ అవసరము రోగి మరణించినచో ఈ ప్రమాదము మరణమునకు పూర్వమే జరిగినదా? పిదపజరిగినదా?ఇత్యాదివిషయములుగూడ నేర్పుతో కనిపెట్ట వలసియుండును

ఆసన్నమరణుడై వచ్చిన రోగినిచూచి తాని వెంటనే తగువైద్యసహాయము చేయు అవసరమటుండగా తానిమరణకారణమునుగూర్చి అతనుచెప్పగల విషయమును తెలిసికొని వ్రాసియుంచుకొనవలసిన అవసరముకూడ వైద్యునకు కలదు

ప్రాచీనకాలము నుండి ధర్మాధర్మ విచక్షణాధికారము ధర్మవేత్తలకేగాక వైద్యులకుకూడ అవసరమను విషయము వైద్యశాస్త్ర గ్రంథములందేమి ధర్మ అర్థ కామ శాస్త్ర గ్రంథములందేమి విపులముగా వివరింపబడి యున్నది

రాజులు రాజ్యాంగములు ధర్మాధికారులు ధర్మము ననుక్రమముగా నెంతవఱకు పాటించెదరో ధర్మాచరణమువందు వైద్యులు సాక్ష్యమువలన నిజానిజములను కనిపెట్టి నేరస్థులను శిక్షించి ధర్మమును కాపాడవలసియుండును

రాజ్యాంగ వేత్తలచే ధర్మనిర్వహణము క్రమముగా జెరపబడుచున్నచో ఆయాశాస్త్రప్రవీణులు చెప్పగల సాక్ష్యమునుబట్టిగాని న్యాయాధిపతి సక్రమముగా న్యాయమును పాలింపజాలడు

శాస్త్రజ్ఞాని నైపుణ్యముతోపాటు సర్కారువారి ధర్మశాలు ధర్మశాస్త్ర విషయములు సాంఘికాచారములు,సాక్ష్యధర్మము. పౌరధర్మములు సత్యనిష్ఠ — వీటికికూడ శాస్త్రజ్ఞుడు గుర్తెరిగి బహుశ్రుతుడై యుండవలెను వ్యవహార ధర్మాచరణములో తమ వంతు బాధ్యతలను సక్రమముగా నెరవేర్చుటకు ఆయుర్వేద వైద్యులకు వ్యవహార ఆయుర్వేదము ఎక్కువగ తోడ్పడ గలదు

వే కం రా

## వ్యాపారపు లెక్కలు

వ్యక్తులవలెనే వ్యాపారసంస్థలు కూడ తమ ఆర్థిక పరిస్థితులను ఎప్పటికప్పుడు తెలిసికొనుచుండుట అవసరము ఆదాయవ్యయములను ఆస్తులను అప్పులను మూలధనము యొక్క వృద్ధిక్షయములను గూర్చి క్షుణ్ణముగా పరిశీలించుట ఎంతయు ముఖ్యమైనవిషయము వ్యాపారసంస్థల వ్యవహారములు అనేకములు బహుముఖములు ఆస్తులసేకరణము ముడిసరకుల క్రయ ఉత్పత్తి విక్రయములు, ఆదాయసేకరణము ఋణసంచయము, వ్యాపార నిర్వహణము మొదలైన పెక్కు కార్యకలాపములను కొనసాగించుట వ్యాపార లక్ష్యము పై అంశములు పైనందిన కార్యక్రమములలో అసంఖ్యాకముగా ఎదురవుటవలన వీటినన్నిటిని గణకశాస్త్ర సూత్రములననుసరించి క్రమబద్ధముగా పుస్తకములలో పొందుపరచి వర్గీకరించి చిట్టా ఆవర్జాలను తయారుచేసి, సంవత్సరాంతమున ముగింపులెక్కలను నివేదించుదురు

వ్యాపారవ్యవహారములను సశాస్త్రీయముగా సమీక్షించి క్రమపద్ధతిలో లెక్కలను సంక్షిప్తపరచి వాటి ఫలితములను వివరణచేయుటయే వాణిజ్యగణకశాస్త్ర మనబడును ఈ శాస్త్రమందలి ముఖ్యాంశములను క్రింది విధముగా పేర్కొనవచ్చును

శాస్త్రీయపద్ధతి — వాణిజ్య కార్యకలాపములందొక నిర్దుష్ట విధానము నవలంబించి లెక్కలను వ్రాయవలెను అశాస్త్రీయపద్ధతికి ఇందులో తావులేదు లెక్కలను ఒంటి పద్దు విధానమునగాని జంటపద్దు విధానమునగాని పొందుపరచవలెను

వర్గీకరణము —వాణిజ్య వ్యవహారములను క్రమపద్ధతిన వర్గీకరించి తత్సంబంధమైన చిట్టా ఆవర్జాలలో పొందుపరచుట వర్గీకరణమనబడును

లెక్కల నివేదనము వర్గీకరింపబడిన వ్యవహారములను సంక్షిప్తపరచిన పిమ్మట వాటి నిల్వలను క్రోడీకరించి ముగింపు లెక్కలను తయారుచేయవలెను ముగింపు లెక్కలద్వారా సంస్థలనికరాదాయములను ఆస్తి అప్పులయొక్క సరియైన

విలువలను కనుగొనవచ్చును

శాస్త్రీయముగా లెక్కలను సిద్ధపరచుటవలన సంస్థ యొక్క నిర్వాహకులకు దానియొక్క ఆర్థికసమాచారము క్షుణ్ణముగా అవగాహనయగును సంస్థలకుసంబంధించిన ఆస్తుల యొక్క సరియైన విలువలను ముడిసరకుల విలువలను ఋణ ముల వివరణమును సరియైనవిధముగా సమీక్షించుటకు వీలగును లెక్కలను పొందుపరచుటవలన ముడిసరకుల ధరలను నిర్ణయించి ఉత్పత్తిచేయుటకు అయిన వ్యయము అను రూపొందించి ఆ సరకులయొక్క విక్రయమూల్యమును నిర్ణయించవచ్చును ధరలను నిర్ణయించుటవలన సంస్థలు వలయు లాభములనార్జించుటకు వీలగును సరియైన లెక్కలను రూపొందించుటవలన సంస్థనిర్వాహకులు తమ ఆదాయముపై చెల్లించవలసియుండు పన్నుల పరిమాణమును తెలిసికొనవచ్చును ప్రభుత్వాధికారులకు కూడ పొందుపరచిన లెక్కలవలన తమ కార్యము సులభమగును

వ్యాపారనిర్వహణమున ఇట్టి కార్యకలాపములకు అత్యంత ప్రాధాన్యముండగలదు ఈ కార్యకలాపములు సంస్థ యొక్క వ్యాపార ప్రక్రియలపై ఆధారపడియుండును వ్యాపారి తన మూలధనమును నగదురూపమునగాని ఆస్తుల రూపమునగాని సేకరించి వ్యాపారమును నిర్వహించును నగదురూపమున సేకరించిన మూలధనముతో సంస్థకు వలయు ఆస్తులనుకొని వ్యాపారనిర్వహణమును కొనసాగించుదురు ఇట్టి ఆస్తులు చరస్థిరాస్తుల రూపముననుండును వ్యాపార మును కొనసాగించుటకై భవనములు యంత్రములు భూములు ఉపకరణములు ఎంతయు అవసరము ఇట్టి ఆస్తులు వ్యాపారాభివృద్ధికితోడ్పడును సాధారణముగా వీటి విలువలు స్థిరముగానుండి ఒక్కొక్కప్పుడు అధికమై సంవత్సరముల తరబడి వాటిఉపయోగములు కొనసాగుచుండును చరాస్తులు ద్రవ్యరూపమున గాని, ఖాతాదారుల విలువలనుబట్టి గాని నిర్ణయించబడును ఇట్టి ఆస్తుల విలువలు స్థిరముగానుండక వ్యాపారస్థితినిబట్టి ప్రతిసంవత్సరము మారుచుండును ఇవ్విధమైన ప్రక్రియలతో సంస్థలయొక్క మూలధనము సంస్థల ఆస్తులతో సమానముగ నుండును ఉదాహరణము

మూలధనము = స్థిరాస్తులు + చరాస్తులు

లేక

మూలధనము + ఋణము = స్థిరాస్తులు + చరాస్తులు

ఇట్టి పునరావృతవ్యాపార ప్రక్రియచేత సంస్థలయొక్క చరాస్తుల విలువలు వృద్ధిక్షయములు పొందుచు వాటి ప్రభావము మూలధనముపై విశదమగుచుండును ఇట్టి విధానము గణకశాస్త్రమున ఆస్తి అప్పుల సంవిధాన మనబడుచున్నది ముఖ్యముగా అమెరికా మొదలగు పాశ్చాత్యదేశములలో దీనికత్యంత ప్రాధాన్యముకలదు

ఒంటిపద్దు విధానము ఈవిధానము అతిప్రాచీనమైనది పూర్వకాలమున వాణిజ్య వ్యాపారవ్యవహారములు విస్తృత ముగాలేక కొలది పరిమాణములలో జరుగుచుండుటచే ఈ ఒంటిపద్దు విధానము ఎహుళముగా అమలులో నుండినది ఏకవ్యక్తి వ్యాపారపద్ధతియందు వ్యక్తియొక్క మూలధనము పరిమితమైయుండుటచే వ్యాపార పరిమాణముకూడ పరిమితమై యుండిన కారణముగా క్రమవిరుద్ధమైన అశాస్త్రీయ పద్ధ తిలో పద్దులు వ్రాయబడుచుండెడివి అనంతరము ఘటిల్లిన వ్యాపారాభివృద్ధితో వాణిజ్యము ప్రాంతీయ విపణులనుదాటి దేశ విదేశ విపణులకు విస్తరించినది దీనితోపాటు వ్యాపార విధానములలో మార్పులు అనివార్యమైనవి ఏకవ్యక్తి వ్యాపారమునుండి భాగస్వామ్య కంపెనీ వ్యాపార విధాన ములు రూపొంది గణకశాస్త్ర పద్ధతులలో మార్పులు ప్రవేశ పెట్టబడినవి క్రమముగా ఒంటిపద్దువిధానము అంతరించి జంట పద్దువిధానము వాడుకలోనికి వచ్చినది ఒంటిపద్దువిధానము లోపభూయిష్ఠముగ పరిగణింపబడి "దేశవాళీ విధానము"గా పేర్కొనబడుచువచ్చినది (ఉదా మార్వాడీ (భారతీయ) గణకపద్ధతి) ఒంటిపద్దు విధానమునందు వ్యాపార వ్యవహార ములు మూడు విధములుగా వర్గీకరింపబడినవి నగదు వ్యవ హారములను ఋణగ్రహీతలయొక్క ఋణదాతలయొక్క ఖాతాలను వ్యాపార నిర్వహణమునందు వచ్చిన నగదును వ్యాపారమునకై వెచ్చించిన నగదును నగదు ఖాతాలో పొందుపరచుదురు ఆదాయ వ్యయములను నగదు రూపమున వసూలు చేయుటకును చెల్లించుటకును కాక పత్రములను నిర్వహించు కొందరు క్రయవిక్రయములు అరువుపద్ధతిపై జరిగినచో అమ్మకపుదారులయొక్కయు కొనుగోలుదారుల యొక్కయు ఖాతాలను వేర్వేరుగారూపొందించి వ్యాపార మును నిర్వహించుదురు సంవత్సరాద్యంతములందు నిర్వాహ కులు తమ సంస్థలయొక్క ఆస్తి అప్పుల నివేదన పట్టికలను (Statement of affairs) సిద్ధముచేయుదురు ఇట్టి పట్టికల విభేదము సంస్థయొక్క లాభనష్టములను సూచించును ఈ

విధముగా పొందుపరచిన లెక్కలు సరియైన లాభనష్టములను సూచించలేవు. అనగా లాభనష్టముల వివరణ పట్టిక శాస్త్రీయమైనది కాదు.

జంటపద్దు విధానము - ఈ విధానము మొదట ఐరోపా ఖండములో ప్రవేశపెట్టబడి క్రమముగా ప్రపంచవ్యాప్తమైనది. ఈ పద్ధతి ప్రకారము ప్రతివ్యవహారము రెండంశములుగా భాగించబడి వాటి అనుబంధ ఖాతాలలో నమోదుచేయబడును. వ్యాపార వ్యవహారములు విలువలనుబట్టి మారకము జరుగుచుండును. విలువల ప్రయోజనములలో ఇచ్చినవి పుచ్చుకొన్నవి ముఖ్యముగా గమనించదగిన విషయములు. విలువల లాభమును పొందిన వాటిని "డెబిట్స్"గాను ఇచ్చిన వాటిని 'క్రెడిట్స్' గాను పరిగణించెదరు. ఈ విధానమునందు గణకములను (accounts) క్రిందివిధముగ విభజించి చూపవచ్చును.




వ్యక్తులకు సంబంధించు గణకము (ఖాతా)లలో వ్యక్తులు పొందు లాభములను లేక ప్రయోజనములను "డెటర్" అని యందురు. ప్రయోజనము లిచ్చు అంశములను క్రెడిటర్ అనెదరు. వ్యక్తులకు సంబంధించని ఖాతాలను వ్రాయునపుడు వ్యక్తుల అధీనములోనికి ప్రయోజనములు వచ్చినచో వాటిని డెబిట్స్ అనియు వ్యక్తుల అధీనము నుండి ప్రయోజనములు దాటిపోయినచో "క్రెడిట్స్" అనియు వ్యవహరింతురు. అట్టి ఖాతాలను తిరిగి విభజించుట జరిగినది. వాస్తవిక ఖాతాలలో వస్తుసంబంధమైన అంశములనే డెబిట్ క్రెడిట్ గా నమోదుచేయుదురు. అవాస్తవిక ఖాతాలలో వ్యవహారమునకు సంబంధించిన ఆదాయ వ్యయములను నమోదు చేయుదురు. ఆదాయము రాబడి లేక లాభములను 'క్రెడిట్స్'గను వ్యయములను నష్టములను లేక ఖర్చులను డెబిట్స్ గను చూపుట గమనింపదగిన విషయము.

దరమూల్య గణకశాస్త్రము (cost accounts) ముడి సరకుల కొనుగోలునుండి తయారైన వస్తువుల విక్రయదశ వరకు గల వివిధదశలను శాఖలను విభజించి వస్తు విక్రయ మూల్యమును నిర్దుష్టముగా సూచించునది మూల్య గణక శాస్త్రము. ఈ విధానమునందు అంతర్దశల మూల్యములను నిర్దుష్టముగా తెలిసికొని లోపములను సవరించుకొనవచ్చును. అనగా ప్రతివస్తువుయొక్క మూల్యమును సరియైన విధముగా రూపొందించవచ్చును. వస్తూత్పత్తి విధానమందలి తారతమ్యములను వస్తు మూల్యములద్వారా సూచించి సవరించుకొనవచ్చును. ప్రస్తుత మూల్యములను ప్రమాణములుగా గ్రహించి భావి ఉత్పాదనముల మూల్యములను నిర్దేశించవచ్చును. సంస్థల నిర్వాహకులు వస్తూత్పత్తి వ్యయమునననుసరించి సాధారణముగా తగుమాత్రపు లాభములు వచ్చునట్లుగా వస్తువుల ధరలను నిర్ణయించెదరు.

ఉ ల

## వ్యాపార వ్యవస్థ - తరగతులు :

వస్తువినిమయ పద్ధతితో ప్రారంభమైన వ్యాపారవ్యవస్థ అభివృద్ధిపొంది ద్రవ్యవినిమయ సంస్థగా పూర్ణస్థితిని పొందినది. వ్యాపార పద్ధతిలో ఏకవ్యక్తి వ్యాపారము భాగస్వామ్య వ్యాపారము సహకార వ్యాపారము కంపెనీ వ్యాపారము అను విధానములు అమలులోనికి వచ్చినవి. ఆర్థిక వాణిజ్య రంగములలో కల్గిన అభివృద్ధిమూలమున ఉత్పత్తి వినియోగము పెరిగి వ్యాపారములో పైవిధముగ తరగతులేర్పడినవి.

ఏకవ్యక్తి వ్యాపారము ఈ వ్యవస్థ స్థాపనకు ముఖ్యాంగములైన శ్రమ స్థలము మూలధనము నిర్వహణ మొదలగునన్నియు ఒకేవ్యక్తి సమకూర్చి వ్యాపారము చేయుచుండుటచే ఈ వ్యాపారమునకు ఏకవ్యక్తి వ్యాపారమను పేరు కలిగినది. ఈ వ్యాపార పద్ధతి అతి ప్రాచీనకాలమునుండి ప్రపంచమంతట అనుసరింపబడుచున్నది. ఇందలి ప్రధానవ్యక్తి తనవ్యాపారమునకు వలయు పెట్టుబడిని పెట్టి కుటుంబసభ్యుల సహాయముతో కార్యక్రమమును నిర్వహించును. ఈతడే తన వ్యాపారమునకు సర్వాధికారియై క్రయవిక్రయములకు సంబంధించు నిర్ణయములను తీసికొనును. వ్యాపారములో ఏర్పడు లాభనష్టములకు ఈతడొక్కడే పూర్తిబాధ్యుడు. వ్యాపారస్థాపన కూడ చాల సులభము. ప్రభుత్వమునుండి గాని రిజిస్ట్రారునుండి గాని అనుమతిని పొందనవసరములేదు. అందుచే స్వల్ప

పెట్టుబడియు నైపుణ్యమును గలవారు నేటికిని ఈ వ్యాపారమును విజయవంతముగ సాగించుచున్నారు. ఇట్టి వ్యాపారములో సాధారణముగ అరువుపై అమ్మకములు జరుగుచుండుట వలన లాభములు అధికముగ సంపాదించుటకు వీలుండదు. అయితే అరని ఖాతాదారులు అప్పు ఎగవేయుటవలన అతడు నష్టపడుటకు కూడ అవకాశము కలదు. ముఖ్యముగ ఈ రకమైన వ్యాపారములో వ్యాపారియొక్క ఋణబాధ్యత అపరిమితముగ నుండును. వ్యాపారములో నష్టము సంభవించినపుడు పెట్టుబడితోపాటు స్వంత ఆస్తిని కూడ అతడు పోగొట్టుకొన వలసి వచ్చును. అయినను ఈరకమైన వ్యాపారము సులభము కావున స్వల్ప పెట్టుబడిదారుడు దానిని స్థాపించి తన నైపుణ్యము నుపయోగించి తానే వ్యాపారమునకు సర్వాధికారి కాగల్గుటవలన పరిస్థితుల కనుగుణముగ వ్యాపారమును సాగించి లాభములను పొందుచున్నాడు.

భాగస్వామ్య వ్యాపారము: ఏకవ్యక్తి వ్యాపారములో ప్రధానలోపమైన స్వల్ప పెట్టుబడిని సవరించుచు వ్యాపారమును విస్తృతముగ జరిపించు ఉద్దేశముతో ప్రారంభమైన వ్యాపారము భాగస్వామ్య వ్యాపారము. అధిక పెట్టుబడి కొరకు, నిర్వహణ సామర్థ్యము కొరకు ఇద్దరుగాని అంతకంటె ఎక్కువమందిగాని కలిసి ఉమ్మడి మూలధనముతో ఇట్టి వ్యాపారమును సాగించెదరు. భాగస్వామ్య చట్టములో 4 వ సెక్షను నిర్వచించిన ప్రకారము లాభములో భాగమును పంచుకొనుటకు కొందరు వ్యక్తులుకూడి అందరుగాని, అందరి తరపున ఒకరుగాని కార్యక్రమమును నిర్వహించునపుడు వారి మధ్య గల సంబంధమే భాగస్వామ్యమగును. ఈ సంబంధముతో నడుపు వ్యాపారము భాగస్వామ్య వ్యాపారమని ఎలువబడుచున్నది. ఒడంబడికద్వారా ఏర్పడిన భాగస్వామ్య వ్యాపార సంస్థలో వివారందరు కొన్ని నియమములకు బద్ధులై వర్తించవలసి యుండును. భాగస్వాములు తమమధ్య భేదాభిప్రాయములు రాకుండ, వ్యాపారము నియమబద్ధముగ నడచుటకై నిబంధనలతో కూడిన పత్రముపై సంతకములు చేసి తదనుగుణముగ వ్యాపారమును సాగించెదరు. భాగస్వాములను నియమబద్ధులుగ చేయు పత్రమును "భాగస్వామ్య ఒడంబడిక పత్రము" అని యందురు.

చట్టము ప్రకారము భాగస్వామ్య వ్యాపార సంస్థను తప్పనిసరిగ రిజిస్టరు చేయవలెననెడి నిబంధన లేదు. కాని రిజిస్టరు చేయబడిన సంస్థలకు కొన్ని లాభములు కల్గుటచే సామాన్యముగ యిట్టి వ్యాపారసంస్థలు రిజిస్టరు చేయబడుచున్నవి. నమోదు చేయబడని సంస్థలు భాగస్వామ్య చట్టములోని సూత్రముల నుపయోగించుకొనుటకు వీలులేదు. అట్టి సంస్థలకు ఋణదాతలపై దావా వేయు హక్కుండదు. కాని ఋణదాతలు యితర వ్యాపారస్థులు మాత్రము ఆ సంస్థపై దావాచేయుటకు అధికారము కల్గియుందురు. అధిక పెట్టుబడి, నిర్వహణ అనునవి యిందు ఆసక్తిదాయకమైన అంశములగుటచే ఈ సంస్థలు అభివృద్ధి చెందుచున్నవి. వీటి స్థాపన సులభము కావున మాధ్యమిక స్థాయిలో వ్యాపారముచేయువారీ వ్యాపార విధానమును చేపట్టుచున్నారు. భాగస్వామ్య సభ్యుల కనీస సంఖ్య రెండు. గరిష్ఠ సంఖ్య సామాన్య వ్యాపారములందు 20, బ్యాంకు వ్యాపారములందు 10. భాగస్తుల అస్తిత్వముతోపాటు సంస్థ అస్తిత్వముకూడ నిలిచి యుండును. భాగస్తుల ఋణబాధ్యత అపరిమితమనునది యిందలి ముఖ్యాంశము. సంస్థకు నష్టములు సంభవించినచో భాగస్తులు తమ పెట్టుబడులలోని భాగములనుండియేకాక అవసరమైనయెడల వారి స్వంత ఆస్తులనుండి కూడ ధనము వసూలుచేయబడును.

సహకార వ్యాపారము: ఇతర వ్యాపార విధానములకంటె సహకార వ్యాపారమునకొక ప్రత్యేకత కలదు. ఏకవ్యక్తి, భాగస్వామ్య, కంపెనీ వ్యాపారములలో వినియోగదారుల సౌకర్యముల పట్లకంటె వ్యాపారులు తమ లాభములపట్ల విశేష శ్రద్ధ వహింతురు. సహకార వ్యాపారమునందు వాటాదారుల లాభ సముపార్జన ప్రధాన ధ్యేయముగానుండక వినియోగదారుల సౌకర్యములకు ప్రాధాన్యమియ్యబడును. వివిధ తరగతులకు చెందిన వ్యక్తులు వారికవసరమైన వస్తువులను సేకరించుకొనుటకై సహకార సంఘములను నెలకొల్పుకొని, లాభములను పొందుచున్నారు. ఉత్పత్తిస్థానములనుండి, సహకార సంఘములు వస్తువులను క్రయముచేసి సభ్యులకందించుట మూలమున మంచి వస్తువులను సరసమైన ధరలకు ప్రజలు పొందగలుగుచున్నారు.

ఈ సహకార పద్ధతి మొట్టమొదట ఇంగ్లండులో ప్రారంభమై క్రమముగా ఐరోపాలో వ్యాపించి రానురాను ప్రపంచమంతటను అన్ని రంగములందును విస్తరించినది.

సహకార సంఘముయొక్క ముఖ్యసూత్రము "ఒకరి కొరకు అందరు అందరికొరకు ఒకరు" అనునది సహకార

సంఘ సభ్యులకుగల వాటాల సంఖ్యనుబట్టి కాక ప్రతి సభ్యునకు ఒకే ఓటు అను నిబంధనయుండుటచే ఇది ప్రజాస్వామిక సూత్రముపై నడచుచున్నదని చెప్పవచ్చును చీకటిబజారును తొలగించుటకును టోకు చిల్లర వ్యాపారస్తులను తొలగించి వినియోగదారులకు నాణ్యమైన వస్తువులను సరసమైన ధరల కందించుటకును ఈ సంస్థలు పాటుపడును వినియోగదారులే నిర్వాహకులగుటవలన తమ సౌకర్యములను దృష్టియందుంచు కొని వారు క్రయవిక్రయములు సలుపుచుందురు ప్రస్తుత కాలమున అన్ని రంగములందు ఈ సంస్థలు అమలులో నున్నవి వ్యాపారరంగమున ఈ అంగముయొక్క ప్రాముఖ్యము అనల్పము

కంపెనీవ్యాపారము :- వ్యాపారమునకు ముఖ్యమైన మూలధనమును నిర్వహణమును భారీయెత్తున సాధించుటకును ఉత్పత్తి వినియోగ కార్యక్రమములను దేశవ్యాప్తముగ జరిపించుటకును కంపెనీవ్యాపార మవతరించినది మూలధనముతోను భారీపెట్టుబడితోను పెద్దయెత్తునవ్యాపారముచేయుటకై సభ్యులుగా చేరువాటాదారుల సమూహము కంపెనీ అనబడును కాని 'సభ్యులు" "కంపెనీ అనునవి రెండును ప్రత్యేకమైన అంగములు కంపెనీకి ప్రభుత్వ చట్టము ద్వారా ప్రత్యేకమైన వ్యక్తిత్వమీయబడును

కంపెనీల పరిపాలనకై ప్రత్యేకచట్టమొకటి 1850 వ సం॥లో భారతదేశమున అవతరించినది ఆ చట్టము ప్రకారము కంపెనీలన్నియు తప్పనిసరిగా రిజిస్టరు కావలెనని నిబంధన ఏర్పడినది ఆదిలో కంపెనీలయొక్క వాటాదారుల ఋణబాధ్యత అపరిమితముగనుండెడిది 1857 వ సం॥లో బ్యాంకులకు భీమాకంపెనీలకుతప్ప మిగిలిన కంపెనీలన్నిటికి పరిమితమైన ఋణబాధ్యత ప్రవేశపెట్టబడినది రాను రాను కంపెనీల పునరుద్ధరణకై ఈ చట్టములో పలువిధములైన సవరణలు చేయబడినవి 1860 సం॥లో బ్యాంకులకు భీమాకంపెనీలకుకూడ పరిమిత బాధ్యత ఒసగబడినది తరువాత 1918 సం॥ చట్టముతో కంపెనీ వ్యాపారము ప్రయివేటు 'పబ్లిక్" అను రెండురకములైన లిమిటెడ్ కంపెనీలుగ విభజింపబడినది

1950 వ సం॥లో ప్రభుత్వముచే నియమించబడిన భాభా సంఘము కంపెనీచట్టములోని లోపములను సవరించుచు సమర్పించిన నివేదికప్రకారము 1956 లో నూతన చట్టము తయారైనది ప్రస్తుతము అమలులోనున్న చట్టమిదియే

ఈ క్రొత్తచట్టము ననుసరించి ప్రభుత్వము ప్రతిరాష్ట్రములోను ఒక రిజిస్ట్రారును నియమించెను కంపెనీలరకమును బట్టి వాటాదారుల సంఖ్యలో భేదముకలదు పబ్లిక్ కంపెనీ యందు కనీసము ఏడ్గురు సభ్యులుండవలెను గరిష్ఠ సంఖ్యకు పరిమితిలేదు ప్రయివేటు కంపెనీని స్థాపించుటకు కనీసము ఇద్దరు సభ్యులుండవలెను వారి గరిష్ఠసంఖ్య ఏబదికి మించరాదు కంపెనీని రిజిస్టరుచేయుటకు ఈ క్రింది పత్రములను రిజిస్ట్రారువద్ద దాఖలుచేసి కంపెనీని రిజిస్టరుచేయుట కొరకు అర్జీని సమర్పించుకొనవలెను

(1) ఆశయ పత్రము - ఇది కంపెనీ పేరును ఆశయములను వ్యాపారసరళిని పెట్టుబడిని ఇతర ముఖ్యవిషయములనుగూర్చి తెలుపు ముఖ్యమైన పత్రము

(2) నిబంధనావళి - కంపెనీ ఉద్దేశములు కార్యక్రమము జరిపించుట కవసరమైన నిబంధనలు ఇందు లిఖింపబడియుండవలెను ఈనిబంధనల నతిక్రమించి కంపెనీ పనిచేరాదు కంపెనీ అంతరంగిక వ్యాపారమునకు ఇది మూలాధారము కంపెనీ పరిపాలన అంతయు దీనిపై ఆధారపడియుండును నిర్దేశకుల వాటాదారుల నిర్వాహకుల హక్కులు, సమావేశములు ఓటింగు ఇతరముఖ్యనిబంధనలన్నియు ఇందు పేర్కొనబడియుండును

(3) నిర్వాహక ప్రతినిధులు కార్యదర్శులు మున్నగు వారితోచేసికొను ఒడంబడికలు

(4) నామమాత్రపు మూలధనము యొక్క విలువ మొదలగు విషయములను గూర్చిన ఇతరముఖ్య పత్రములను ఒడంబడికలతోపాటు నమోదురుసుమును స్టాంపుడ్యూటీని రిజిస్ట్రారుకు సమర్పించవలెను రిజిస్ట్రారు వీటిని పరిశీలించి 'స్థాపనానుమతి పత్రము"ను ఇచ్చును ఈ పత్రమును పొందిన వెంటనే ప్రయివేటు కంపెనీ తనవ్యాపారమును ఆరంభింపవచ్చును పబ్లిక్ కంపెనీమాత్రము వ్యాపారము మొదలుపెట్టుటకుపూర్వము రిజిస్ట్రారునుండి "ప్రారంభానుమతిపత్రమును" పొందవలెను ప్రారంభానుమతి పత్రమును పొందుటకు ముందుగా విజ్ఞాపన పత్రమును కంపెనీ తయారుచేసి దాని ద్వారా వాటాలను కొనుమని ప్రజలకు విజ్ఞప్తిచేయవలెను వాటాలు మూలధనము కంపెనీ కార్యక్రమము నిర్దేశకుల పేర్లు హామీ మొదలైన ముఖ్య వివరములన్నియు విజ్ఞాపన పత్రములో పేర్కొనవలెను ప్రజలుకొను వాటాల యొక్క

మొత్తము విలువ కంపెనీయొక్క మూలధనమగును. ఈ విధముగా కనీసపుధనము చేరిన తరువాత రిజిష్ట్రారునకు విజ్ఞాపన పత్రమును పమర్పించి ప్రారంభానుమతి పత్రము" నొసగుమని అతనిని కోరవలెను. అతడు దానిని పరిశీలించి కంపెనీని నడపుటకు అనుమతి పత్రమునిచ్చును. ఈ పత్రమును పొందనిదే కంపెనీ పని ప్రారంభించుటకు వీలులేదు.

కంపెనీ వాటాదారుల దైనను నిర్వహణములో వారందరు ప్రత్యక్షముగా పాలుపంచుకొనుట కష్టము. కావున వారిచే ఎన్నుకొనబడు నిర్దేశికులచే కంపెనీ నిర్వహింపబడును. సంవత్సరమున కొకసారి వాటాదారులు అవసరమైనపుడు నిర్దేశికులు సమావేశములు జరుపుకొని ఆమోదించిన తీర్మానములను ఆచరణలో పెట్టుచుందురు. వాటాలవలన ఏర్పడు మూలధనములో ఋణములవలన సమకూరు ధనముకూడ భాగమగును. అది ఋణముల ధన (Debenture Capital) మనబడును. భారీయెత్తున దేశ విదేశ వ్యాప్తముగ వ్యాపారమును సాగించుటకు కంపెనీ వ్యాపారము అనువైనది.

వే. రా.

## వ్యాపార వ్యవస్థ శాఖలు, వాటి విధులు

వ్యాపారవ్యవస్థ యందలి వివిధశాఖలు వాటివిధులు ఈ దిగువ వివరింపబడినవి.

వాటాలు: కంపెనీ యొక్క మూలధనము వివిధభాగములు చేయబడి అది ప్రజలనుండి వాటాల రూపములో స్వీకరింపబడును. ఈ వాటాలను కొన్నవారు వాటాదారు లనబడుదురు. స్థూలముగ వీరు కంపెనీ యజమానులుగ పరిగణింపబడుదురు. కంపెనీ తన విజ్ఞాపనపత్రము (prospectus) ద్వారా మూలధనమును గూర్చియు వాటాలను గూర్చియు వివరించుచు వాటాలను క్రయముచేయుమని ప్రజలను కోరును. ప్రజలు తమ స్తోమతను బట్టి అభీష్టమును బట్టి వాటాలను కొని కంపెనీ మూలధనములో భాగస్వాములయ్యెదరు.

విజ్ఞాపనపత్రపు ఆధారముతో సేకరింపబడిన వాటామూలధనము కనీసపు చందాకు సరిపోయినచే గాని కంపెనీ వాటాలను విడుదలచేయరాదు. విజ్ఞాపన పత్రమును విడుదలచేసిన 180 దినములలో కనీసపు చందాను సంపాదించనిచో అప్పటి వరకు సేకరించిన సొమ్మును కంపెనీవారు పదిదినములలో ఆయావ్యక్తులకు త్రిప్పిపంపవలెను. వాటాధనమును కంపెనీ దశలవారిగా చెల్లింపవచ్చును.

1956 పూర్వము వ్యాపారముచేయు కంపెనీలు ఈ క్రిందిరకముల వాటాలను విడుదల చేయుచుండెడివి: (1) సాధారణ వాటాలు (2) ఆధిక్యపు (Preference) వాటాలు (3) విలంబిత (deferred) వాటాలు (4) సంచిత (cumulative) ఆధిక్యపువాటాలు (5) అసంచిత ఆధిక్యపువాటాలు (6) విమోచనీయ (redeemable) ఆధిక్యపువాటాలు. 1956 తరువాత రెండురకములైన వాటాలను మాత్రమే విడుదల చేయవలెనను నియమమేర్పడినది: (1) ఈక్విటీ (సాధారణ) వాటాలు (2) ఆధిక్యపువాటాలు. విమోచనీయ ఆధిక్యపు వాటాలనుకూడ ప్రత్యేకసమయములందు విడుదల చేయవచ్చును. ఆధిక్యపువాటాలకు రెండు ప్రత్యేకలక్షణములు కలవు: (1) నిర్ణీతలాభములను ప్రతిసంవత్సరము పొందుట (2) కంపెనీని రద్దుచేయునపుడు వాటాదారులు అసలు సైకము (సొమ్ము)ను పొందుటలో ప్రథములుగ పరిగణింపబడుట. వాటాదారుల యాజమాన్యమును ధృవీకరించు పత్రములను (share certificates) కంపెనీయజమానులు వారికొసగుదురు.

ఋణపత్రములు (debentures): వాటామూలధనము కాక వేరుధనమును కంపెనీలు ప్రజలనుండి ఋణపత్రముల ద్వారా సేకరింపవచ్చును. అవసరమైన ఋణమొత్తమును సమానవాటాలుగ విభజించి విజ్ఞాపన పత్రములద్వారా ప్రజలకు అమ్మి వారు చెల్లించు మొత్తములకు కంపెనీ ఋణపత్రముల నొసగును. ఇట్లు ఋణమూలధనములో భాగస్వాములై ఋణపత్రములు పొందినవారికి వారి యాజమాన్యము మేరకు కంపెనీ ఋణధృవపత్రముల నిచ్చును. ఈ ఋణధృవపత్రము (1) సాధారణ ఋణపత్రములు (2) తాకట్టు ఋణపత్రములు (3) విమోచ్య ఋణపత్రములు (4) అవిమోచ్యఋణపత్రములు (5) ధారక (Bearer) ఋణపత్రములు (6) మారకయోగ్య (convertible) ఋణపత్రములు అని పలురకములు. ఈ ఋణపత్రములయొక్క యజమానుల పేర్లు చిరునామాలు మున్నగు వివరములు కంపెనీ చిట్టాలో వ్రాయబడును. ఈ ఋణపత్రములు నమోదుచేయబడిన పత్రములుగ (Registered debentures) పేర్కొనబడుచున్నవి.

తరుగుదల: కాలగమనము వలన వాడకమువలన, వాతావరణస్థితివలన వ్యాపారపు ఆస్తులలో తరుగుదల ఏర్పడి,

వాటి మూల్యము క్రమముగ తగ్గుచుండును. వ్యాపార వాణిజ్య పారిశ్రామిక సంస్థలను నడుపుటకు ధనముతోపాటు యంత్రపరికరములు వాహనములు కూడ అవసరము. ఇట్లు ఘటిల్లు తరుగుదలను భర్తీచేయుటకు దాని సమానమూల్యము వ్యాపారధనము నుండి కేటాయించబడి నిలువచేయబడును. ఈ తరుగుదల వలన వ్యాపారి నష్టము పొందక తరిగిన ఆస్తికి సమానమూల్యమును ఆకాలపు ధనముద్వారా పొందగలడు. అందుచే తరుగుదల వ్యాపార పారిశ్రామిక సంస్థలలో లాభనష్టములను తేల్చుటయందు ముఖ్యాంశముగ భావించబడుచున్నది. ఇందుకై ముందుగా కంపెనీ ఆస్తియొక్క మొత్తపు మూల్యమును నిపుణులచే నిర్ణయించబడిన ఆస్తియొక్క కార్యకరణ కాలగమనశక్తిని కాలపరిమితి నిమ్నుట ఉపయోగించని ఆస్తి విలువను తిరిగి క్రొత్త ఆస్తిని సేకరించుటకగు మూల్యము-ఇవన్నియు నిర్ణయించబడును. క్రొత్త ఆస్తిని పొందుటకగు మూల్యమునుండి నిరుపయోగమైన ఆస్తియొక్క అమ్మకపు మూల్యమును మినహాయించి మిగిలిన సొమ్మును తరుగుదల సొమ్ముగా వ్యాపారాదాయము నుండి పొందుదురు. తరుగుదలను నిర్ణయించుటకై (1) నియమిత వాయిదా విధానము (fixed instalment method) (2) తగ్గింపు నరిళాతవిధానము (diminishing balance method) (3) వార్షిక ద్రవ్యవిధానము (annuity method) (4) తరుగు నిధి విధానము (depreciation fund method) (5) వాడుక తరుగుదల విధానము (basis of use method) (6) పునర్మూల్యనిర్ణయవిధానము (revaluation method) అను పలురకములైన పద్ధతులు ఈ విషయమును గూర్చి వాడుకయందున్నవి.

శాస్త్రీయ నిర్వహణము వ్యాపార కార్యక్రమములను సమర్థవంతముగ నిర్వహించి అధికలాభములను గడించుటకు అవలంబించు పద్ధతులు శాస్త్రీయ నిర్వహణపద్ధతులనబడును. ఈ పద్ధతులను అనుసరించుటలో వివిధ విజ్ఞానశాస్త్రములు విశేషముగా ఉపయోగపడుచున్నవి. యాంత్రికవిధానమును అవలంబించుటలో కూడ ఆధునిక సాంకేతికవిజ్ఞానము ననుసరించి గొప్పమార్పులు జరుగుచున్నవి. ఈ మార్పులను బట్టి తక్కువ వ్యయముతో తక్కువకాలములో నాణ్యమైనపనిని కార్మికులవలన ఇతర ఉద్యోగులవలన రాబట్టుకొని అధికతరమైన లాభములను వ్యాపారవేత్తలు ఆర్జించుటకు అవకాశము కలదు.

వ్యాపార పారిశ్రామిక వ్యవస్థలలో ఎట్టిదియందు తరచుగ మార్పులుచేయుట ద్వారా స్థానభ్రష్టము కల్గించుట వలన కార్మికులు తమ పనిలో కాలయాపనము కల్గించుట వలన కార్మికశక్తి సక్రమముగ ఉపయోగపడక వాంఛిత ఫలితములు ఎద్దిపక నష్టమువచ్చుటకవకాశము కలదు. ఈ లోపములను తొలగించుటవలన పనివానినుండి అధికఫలితములు పొందవచ్చునని తలచి టెయిలర్ (1856-1915) అను శాస్త్రజ్ఞుడు శాస్త్రీయ నిర్వహణవిధానమును ప్రవేశపెట్టెను. ఆ తరువాత ఈ విధానము ఇతర రంగములలో కూడ ప్రవేశించినది. శ్రేష్ఠమైన పరికరములు మంచి వాతావరణము ఉత్సాహము జనింపజేయు ఉపాయములు సహకారము శ్రమవిభజనము మొదలైనవి శాస్త్రీయ నిర్వహణము నందలి ముఖ్యాంశములు. ఈ దిగువ వివరింపబడిన అంశములను కూడ ఆచరణములో నుంచినయెడల శాస్త్రీయ నిర్వహణము సుసాధ్యమగును.

మానసిక పరిణామము యజమానిలోను పనివారిలోను మానసిక పరిణామము ఘటిల్లిననేగాని వ్యాపారసంస్థలలో శాస్త్రీయ నిర్వహణము జయప్రదముగసాగనేరదు. అనగా వారియందు విశాలదృక్పథమేర్పడవలెను. పనియందాసక్తి వారిలో కలుగవలెను. ఇందుకు విజ్ఞానము అవసరము. సహకారభావముతో పరస్పరము అర్థముచేసుకొనుటవలన ఉభయులకు ప్రయోజనము కల్గును.

కార్య నిర్ణయ విధానము కార్యస్థానములలో సాధారణముగా ఒక్కొక్కవ్యక్తి కొంతపని చేయవలసియుండును. ఇట్టి నియమము నిర్ణయములేనిచో ఎవరికి ఏపని తోచిన నప్పుడు చేయుటయు సంస్థలో సంక్షోభము అయోమయస్థితి ఏర్పడి ఫలితములు సిద్ధింపకుండుటయు జరుగును. అందుచే ఒకానొక విభాగములో ఒకానొక పనిని ఒకవ్యక్తి కొంత నిర్ణీత పరిమాణములో చేయవలెననెడి "కాలవిదారణ" సూత్రమునననుసరించి ఆసంస్థలో దినమునకెంతపని జరుగగలదో తెలుగలదు. ఈ సూత్రమును అమలులో పెట్టుటవలన సమర్థులెవరో, అసమర్థులెవరో సోమరులెవరో ఎవరెంతపనిచేయగల్గుదురో తెలిసికొనుట సులభమగును. ఈ విషయములను పరిశీలించి నిర్ణయించుటకు పలురకములైన ప్రక్రియలు వాడుకయందున్నవి.

**కార్యపరిమితి విధానము** ఈ విధానమునందు శ్రామికులకు ముట్టు వేతనము వారు చేయుపనిని బట్టి నిర్ణయించబడును. నియమిత కార్యము ఒక ప్రమాణముగ చేయబడి దానిని నిర్ణీత కాలములో పూర్తి చేసినవారికి ప్రేరక వేతనములు (Incentive wages) లభించును. పనివారలు పనియందు విశేషాసక్తిని చూపుటద్వారా అధిక వేతనములు పొందుచు యజమానులకు కూడ విశేషలాభములార్జించిపెట్టుట ఈ సూత్రమందలి ముఖ్యాంశము. పనిచేయజాలనివారిని అశక్తులుగ నిర్ణయించి తొలగించుటయు, శక్తిమంతులైన శ్రామికులకు అధిక ప్రయోజనములు చేకూర్చుటయు ఈ విధానమువలన సాధ్యమగును.

**కార్య వియామనము** **కార్యకరణము** కార్మికులకు శిక్షణనిచ్చి శ్రేష్ఠమైన పరికరములు వారికిచ్చినచో ఫలితములు విశేషముగ నుండునని శాస్త్రజ్ఞులు గ్రహించిరి. ఇట్లే ప్రణాళికా విధానములను శ్రేష్ఠమగు రీతిలో రూపొందించుట వలన అధిక లాభములను గ్రహింపవగునని టెయిలర్ నిశ్చయించెను. ఏదేని ఒక వ్యాపారసంస్థలో ప్రణాళికావిభాగము, ప్రధాన కార్యదర్శి విభాగము, ఇతర విభాగములు కేంద్రీకృత నిర్ణయములను పరస్పర సహకారముతో అమలు పరచినచో ఫలితములు విశేషముగా మండగలవని అనుభవమువలన తెలినది. ఇట్టి ప్రక్రియలలో కార్యక్రమములను నిర్వహించిన మొదల శ్రామికులకు విశేషాదాయము లభించుట ద్వారా సంతృప్తి కల్గుననియు, ఉత్పత్తి అధికమై యజమానులకు విశేష లాభములు చేకూరుననియు శాస్త్రీయ నిర్వహణ విధానమును ఆచరణయందు పెట్టుట మూలముగా స్పష్టపడినది.

**వ్యాపార ప్రకటనలు** ఆధునిక వాణిజ్యరంగములో విపరీతముగ ఉత్పత్తి యగువస్తువులకు గిరాకిని కల్పించుటకు బహిరంగ ప్రకటనలు ముఖ్యసాధనము. పూర్వమిట్టి సాధనములుండెడివికావు. దిన వార పక్ష మాస పత్రికలయందును, సినిమాలు, రేడియోలు, అద్దములలలంకరణములు, కరపత్రములు, గోడ బొమ్మలు, ప్రదర్శనశాలలు మొదలైనచోటియందును ఇట్టి ప్రకటనలు చేయుట నేడు వాడుకయందున్నది. ఈ ప్రకటనలయందు వస్తువులవివరములు తెలియచేయబడి వినియోగదారులను ఆకర్షించుచు వస్తువుల గిరాకిని పెంచుటకు వీలగును. ఉత్పత్తిదారులు క్రొత్త వస్తువులను విపణియందు ప్రవేశపెట్టునపుడు వాటికి గిరాకిని కల్పింపవలెనను ఉద్దేశముతో విశేషధనమును వ్యయించి పత్రికలలోను ఇతర సాధనములలోను ప్రకటనలు చేయుదురు. వస్తువుల నాణ్యమునందును, వాటిధరల సారళ్యమునందును ప్రజలకు సంతృప్తి కల్గించుటతోపాటు ప్రకటనలకూ ఆకర్షణీయముగ మన్ననేగాని అవి విశేషముగ వినియోగదారులలో గిరాకిని సృష్టించజాలవు. వ్యాపారసంస్థల ఆర్థికస్థితి మించి ప్రకటనలకై విశేషముగ ధనమును వ్యయపెట్టుచో నష్టమొందుటకును అసలు వ్యాపారమునకే ప్రమాదము కల్గుటకును అవకాశముండును.

**కార్మిక వేతనములు** పరిశ్రమల నిర్వహణములో కార్మికుల వేతనములు నిర్ణయించుటయు, వారిని సంతుష్టులను చేయుటయు ముఖ్యమగు బాధ్యత. అట్లు కావించినగాని పరిశ్రమలు వ్యాపారము ఫలవంతము కాజాలవు. ఈ క్లిష్టసమస్యను సవ్యముగ పరిష్కరించుటకై శాస్త్రజ్ఞులు పరిశోధనములు జరిపి మార్గములను కనిపెట్టిరి. వేతన నిర్ణయమునకు రెండుముఖ్య విధానములు నిర్ణయించబడినవి. (1) కాలపరిమితి విధానము (Time wage System) (2) కార్యపరిమితి విధానము (Piece wage System).

**కాలపరిమితి విధానము** దీనిననుసరించి వేతనములు నిర్ణయించుటకు కాలమొక కొలబద్దగ తీసికొనబడినది. కార్మికుని పనికై నిర్ణయించబడిన కాలప్రమాణమునకు ముందుగనే వేతనము నిర్ణయించబడును. ఆకాలపరిమితియందు కార్మికుడు పనిచేయుచున్నయెడల అట్టి కాలపరిమితి పూర్తికాగనే అతనికి నిర్ణయముననుసరించి వేతనము లభించును. ఈ కాలపరిమితి ఒక గంట లేక ఒక దినము లేక ఒక నెల అని నిర్ణయించవచ్చును. ఇచ్చట కాలమే నిర్ణయించబడినదిగాని కార్మికుడు చేయవలసిన మొత్తము పని నిర్ణయింపబడలేదు. ఈ విధానములో లాభములతోపాటు నష్టములు కూడ యుండును. కార్మికుడెంత సమయములో ఎంత పనిని చేసెనో తెలిసికొని ఆకాలపరిమితినిబట్టి వేతనములు నిర్ణయింప వీలగును. కార్మికునకు కూడ తన ఆదాయమును గూర్చి నిశ్చితాభిప్రాయమేర్పడును. సంతుష్టుడైనవాడు తనపనిని ఉత్సాహముతో చేయును. కాని ఈ విధానములో అధికోత్సాహముతో పనిచేయుశక్తి కార్మికునియందు ఒక్కొక్క సందర్భములో హీనపించును. పూర్తిచేసిన పనికి వేతనములు ముట్టక నిర్ణయించిన కాలమునుబట్టి వేతనము ఇయ్యబడుటచే అధికశక్తిగల వ్యక్తి తన శ్రమకు తగిన ఫలము ముట్టదను భయముచే ఆకాలపరిమితిలో

ఎక్కువ పనిని చేయును. చేయవలసినపనికి నిర్ణయము లేకుండుట చేతను కచ్చితముగ కాల పరిమితి ననుసరించియే వేతనములు ముట్టుటచేతను కార్మికులెందరు పనిపై శ్రద్ధవహించు అవకాశ ముండదు. వేతనములు మాత్రము నిర్ణీత కాలమున క్రమముగ లభించుటచే సంస్థలు నష్టపడును. అందుచే ఈ విధానము కాక పని వారినుండి న్యాయ్యమైన ఎక్కువ పనిని రాబట్టుటకు రెండవ విధానము అనుసరించబడినది.

కార్యపరిమితి విధానము: దీనియందు కాలముకాక కార్యసంపూర్తి వేగము ఆధారముగ తీసికొనబడును. కాల పరిమితి విధానముపై ఇది అభివృద్ధియని చెప్పవచ్చును. కార్మికులు పనిచేయుటకు నిర్దేశింపబడిరేగాని కార్యశాలములో ఉపవిష్టులగుటకు కాదనునదియే ఈ విధానపు ముఖ్యోద్దేశము. పనినిబట్టియే వారికి వేతనములు ముట్టవలెనని ఈ విధానము నందు నిర్ణయింపబడినది. వేతన కాలము అనుదానిని నిర్ణయించి అందు కార్మికుని కార్యసంపూర్తి వేగమునుబట్టి అతని వేతనము నిర్ణయించబడును. మొత్తము పని వివిధభాగములు చేయ బడి కార్మికులకీయబడును. వారు పూర్తిచేసిన వివిధభాగములకు ఒక్కొక్క భాగ వేతనముచొప్పున లెక్కకట్టబడి మొత్తము వేతనము చెల్లించబడును. అనగా శక్తిమంతుడైన కార్మికుడు పూర్తిచేయగల మొత్తము పనికి హెచ్చు వేతనము లభించును. ఈ విధానమువలన కార్మికుడు కాలమును వృథాచేయక తన సామర్థ్యమును అధికమొనరుకొని అధికోత్పత్తి చేయుటకు వీలుకల్గును. ఈ పద్ధతి అటు యజమానికి ఇటు కార్మికునకు సంతుష్టి కల్గించి ఇరువురకు సత్సంబంధములేర్పడును. కాని దీనియందు కొన్ని నష్టములు కూడ సంభవించుటకవకాశము న్నది. కార్మికులు హెచ్చు వేతనములు సంపాదించుటకై కార్యక్రమమును త్వరగాపూర్తి చేయుటవలన వస్తువుల ఉత్పత్తినిగూర్చి ఎక్కువ శ్రద్ధవహించరు. అందుచే సత్ఫలిత ములు లభింపవు. కార్మికులు హెచ్చువేతనములాశించుటచే ఉత్పాదనముల నాణ్యము క్షీణించుటయే కాక, వారి ఆరోగ్యముకూడ క్షీణింపవచ్చును. అందుచే ఈ రెండు విధాన ములను సంయోగించుచు "ప్రేరక ప్రణాళికలు" (Incentive plans) రూపొందించబడినవి. ఈ ప్రణాళికలు పెక్కురకములు గనున్నవి.

ఉభయనిర్ణయ విధానము: కాలపరిమితి కార్యపరిమితి విధానములలోని ముఖ్యాంశముల సమ్మేళనముతో ఈ విధాన ము అవతరించినది. ఇందు నిర్ణీతకాలములో చేయవలసిన నిశ్చయింపబడిన దానికి కనీస వేతనము నిర్ధరింపబడును. అనగా సాధారణ పరిస్థితులలో సామాన్యశక్తితో కార్మికుడు పూర్తి చేయు పనిని ఆ కాలపరిధినిబట్టి నిర్ణయించి దానికి కనీసవేతన ము నిర్ణయించబడును. ఇంకను ఎక్కువ వేగముతో ఎక్కువ ఉత్పత్తిని కార్మికుడు సాధించినచో కనీసవేతనమునకు నిర్ణయించిన ఉత్పత్తికంటె అదనముగా సాధించిన ప్రతిభాగ మునకు అతనికి వేరుగ మూల్యము చెల్లించబడును. శక్తి మంతుడైన కార్మికుడు కనీసవేతనముపై అధికోత్పత్తిని సాధించి అధికలాభమును పొందును. సాధారణ కార్మికునకు కనీసవేతనము నిశ్చయమై యుండును. కనీసవేతనము కాలము ప్రకారము అధిక వేతనము పని ప్రకారము నిర్ణయించ బడును. కాని ఈవిధానమునకూడ ఒక నష్టముకలదు. నిర్ణీత ఉత్పత్తికంటె ఒకటి రెండు ప్రమాణములు అధికముగ ఉత్పత్తిచేసిన వ్యక్తికి అతని వేగమునుసరించి కొంత హెచ్చు వేతనము లభించును. అదే పనియందు నిర్ణీతప్రమాణమును ఉత్పత్తిచేయజాలని వానికికూడ కనీసవేతనము తప్పనిసరిగా ముట్టును. ఆ ప్రమాణమూల్యములలో ఎక్కువ భేదము లేనందున, ఉత్సాహవంతులైన కార్మికులు ఉత్సాహమును కోల్పోవుదురు.

వైయక్తిక సామర్థ్యముపై కార్మికులకు వేతనములిచ్చుట వలన వారి ఉత్సాహము ఇనుమడించును. వారినుండి అధి కోత్పత్తిని పొందుటవలన యజమానులకు కూడ అధికలాభ ములు చేకూరును.

వేతన నిర్ణయములో అనుసరించుచున్న వివిధపద్ధతులు వేర్వేరు పరిస్థితులననుసరించి అవలంబింపబడును. వీటిని అవలంబించుటకు పూర్వము ఇందలి సాధక బాధకములను యజమానులు పరిశీలింపవలెను. 1948లో "కనీస వేతనముల చట్టము" అమలులోనికి తేబడి కార్మికులకు కనీసవేతనములు నిర్ణయించబడినవి. కార్మికుల తరగతులనుబట్టియు వారి శక్తియుక్తులనుబట్టియు వేతనములను వేరువేరుగా నిర్ణ యించుటకు సలహాసంఘ మొకటి ఏర్పరుపబడినది.

కార్యాలయ సజ్జీకరణము, వివిధము: వాణిజ్య వ్యాపార ఉత్పత్తి సంస్థలు తమ కార్యక్రమములను శాస్త్రీయపద్ధతు లలో నడిపించుటకు కార్యాలయ సజ్జీకరణమునకు క్రమ శిక్షణసిద్ధాంతమందలి ప్రయోజనములను గుర్తించి, కార్య

విభాగములుగా జేసి కార్యాలయమందలి శాఖలద్వారా కేంద్రీకృత నియంత్రణముతో నడిపించుట లాభదాయకమని గ్రహించబడినది. పెద్ద పెద్ద సంస్థలలో కార్యక్రమమునంతయు యజమానులచే నియుక్తుడైన వ్యవహర్తచే నిర్వహింపబడును. అందలి వివిధశాఖల అధిపతులాతనికి సహాయులుగ నుందురు. ఇట్టి శాఖలవలన కర్తవ్యనిర్వహణము సులభమగును. ప్రత్యేకముగ ఉత్తర ప్రత్యుత్తరముల శాఖ యొకటుండును. ఈ శాఖద్వారా ఒకానొక సంస్థతో సంబంధముండు వ్యక్తులతోను ఇతర సంఘములతోను ఉత్తర ప్రత్యుత్తరములు జరుగును.

కార్యాలయములలో ఉత్తర ప్రత్యుత్తరములను వివిధ పత్రములు మొదలైన వాటిని సవ్యమైన పద్ధతిలో భద్రపరచి, అవసరమైనపుడు వాటిని సులభముగ చూచుకొని వ్యవహరించుటకు వీలగును. దీనిని కవిలె (filing) విధానమందురు. ఆధునిక లౌకికవ్యవహార రంగములలో ఈ విధానమునకు మిగుల ప్రాముఖ్యముగలదు. ఈ విధానమందు పెక్కు పద్ధతులుగలవు. సౌలభ్యమునననుసరించి అవి అనుసరింపబడును.

నిర్వహణ ప్రతినిధులు: కంపెనీ నిర్వహణకై ఏర్పడు ప్రత్యేక వ్యక్తులు నిర్వహణ ప్రతినిధు (Managing agents) లనబడుదురు. విదేశీయులు భారతదేశములో పరిశ్రమలను స్థాపించి కొంతకాలమైన పిమ్మట తిరిగిపోవునపుడు తమసంస్థలను నిర్వహించుటకై ప్రతినిధులను నియమించిపోవుచుండెడివారు. భారతీయ పారిశ్రామికాధిపతులు కూడ ఈ పద్ధతినే అనుసరించి మేనేజింగు ఏజెంట్లు అను నిర్వహణ ప్రతినిధులను నియమించుచువచ్చిరి. నిర్వాహక ప్రతినిధుల సేవలను (1) వ్యవస్థాపన (2) ఆర్థికసేవ (3) నిర్వహణ అను మూడు తరగతులుగా విభజించవచ్చును.

వ్యవస్థాపన: కంపెనీని చట్టబద్ధముగ స్థాపించుట వ్యవస్థాపనమనబడును. ఈ ముఖ్యాంగమునందు యోచన, ప్రభుత్వ నిర్వహణ అర్థసమీకరణ, నైపుణ్యము, క్రయవిక్రయములు మున్నగునవి ప్రధానాంశములు. నిర్వాహక ప్రతినిధులు సాధారణముగ వ్యాపార నైపుణ్యము, అనుభవము కలిగియుండుటచే, వ్యవస్థాపక కార్యక్రమమును సులభముగ చేపట్టగలరు. సంస్థను స్థాపించుటకు అనుకూల ప్రదేశమును ఎన్నుకొనుట, కావలసిన ముఖ్యాంగములను సమీకరించుట, లాభసముపార్జనకై ప్రణాళికలు తయారుచేయుట మున్నగు పనులన్నియు వీరి కలాపములలో ముఖ్యమైనవి. కంపెనీయొక్క మౌలిక పత్రములగు ఆశయపత్రము, నిబంధనావళి, వివరణ పత్రము చట్టబద్ధముగ తయారుచేయబడును. వ్యవస్థాపకులగు ప్రాథమిక ఖర్చులను నిర్వాహక ప్రతినిధులే భరింతురు.

ఆర్థికసేవ: నిర్వాహక ప్రతినిధులొనర్చు సేవలలో రెండవది ఆర్థికసాధనములకు కంపెనీ పెట్టుబడిదారులుగా నుండుట. నిర్వాహకప్రతినిధులు వ్యాపార నైపుణ్యముతోపాటు ఆర్థిక సంపదకూడ కలవారైయుందురు. అందుచే కంపెనీని స్థాపించుటయేకాక దాని ఆర్థికము అనుకొనుటకు శక్తి కలిగియుందురు. క్రొత్తగా స్థాపింపబడు సంస్థలలో వాటాలకు ఋణపత్రములకు వీరు ధన మొసగుదురు. అంతేకాక బ్యాంకులకు హామీయిచ్చి కంపెనీ అవసరమగు ధనమును ఋణముగ ఇప్పించుచుందురు. వీరి పరపతి వలన ఇతరులు పెట్టుబడిదారులుగూడ అందు వాటాదారులుగ చేరి మూలధన సేకరణకు దోహదమొనగుదురు. వీరి పర్యవేక్షణలో పెక్కుకంపెనీలుండుటచే అవసర సమయములలో ధనమును సేకరించుట సులభమగును.

వ్యాపారసంస్థ జయప్రదమగుటకు పర్యవేక్షణము అత్యంత ప్రధానమైన విషయము. నిర్వాహక ప్రతినిధులు యజమానులతో గావించుకొను ఒప్పందముల ననుసరించి, వారి లాభముకొరకు సంస్థ లాభము కొరకు గట్టిగా కృషి చేయుదురు.

నిర్వహణ: నిర్వాహక ప్రతినిధులపాలనములో సంస్థకు ఒక్కొక్కప్పుడు నష్టముకూడ వాటిల్లుచుండును. వీరిపై ప్రత్యేక నియంత్రణము, చట్టనిబంధనలు లేకుండుటచే తమ ఇష్టానుసారము పెడచు సంబంధములు లేకపోలేదు. కంపెనీ వ్యవస్థాపనలో ప్రాథమిక కలాపమంతయు వీరిచే జరుపబడుటచే తమ స్వంత వ్యక్తులను మొదట నిర్దేశకులుగ కంపెనీయందు ప్రవేశపెట్టి తమ అజమాయిషీ క్రిందనా చేసనులను నిర్వర్తించుకొనుచుండిరి. కంపెనీ వీరితోనడుపు జరుగు ఒప్పందములను తమ నిర్దేశకులచే తమ కనుకూలముగ నుండునట్లు నిర్వాహక ప్రతినిధులు వ్రాయించుకొనుచుండెడివారు. ఇట్టి లోపాయికారి వ్యవహారములలో మోసములు జరుగుట సంభవము. ద్రవ్యపుమార్పులు తక్కువ ధరలకు క్రయములు, హెచ్చుధరలకు విక్రయములు మున్నగునవి జరుగుటచే కంపెనీలు నష్టపడుచుండెడివి. అంతేకాక వారు కోరు ప్రతిఫలము అధికముగనుండెడిది. దీనికితోడు వారు పెక్కుసంస్థలపై అధి

ర్యమము వహించుటచే ఏ ఒక్కదానిపైకూడ ప్రత్యేక శ్రద్ధ చూపజాలకుండిరి ఈ అస్తవ్యస్తములను సరిదిద్దుటకు తగిన చట్టనిబంధనలు లేకుండెడివి ప్రభుత్వ మీ పరిస్థితిని పరిశీలించి 1956లో కంపెనీ చట్టమును సవరించి నిర్వాహక ప్రతినిధుల పైకొన్ని చట్టబద్ధమైన అంశలు విధించినది వీటి ప్రకారము నిర్వాహక ప్రతినిధుల కార్యకరణ కాలపరిమితి 15 సంవత్సరములకు పరిమిత మొనర్పబడినది వారినే మరల నియమించవలెనన్నచో ప్రభుత్వానుమతిపై మరి 10 సంవత్సరముల వరకు అట్లు చేయవచ్చును ఏ నిర్వాహక ప్రతినిధియు పది కంటె హెచ్చుకంపెనీలను నిర్వహింపరాదు ఒక కంపెనీ మరియొక కంపెనీకి నిర్వాహక ప్రతినిధిగ పనిచేయుచున్నపుడు తనకు మరల వేరుగా నిర్వాహక ప్రతినిధులను నియమించుకొనరాదు వారినిర్వాహణములో లోపములున్నచో వాటాదారులు సాధారణ తీర్మానముద్వారా వారిని తొలగింపవచ్చును నిర్దేశకులు 5 గురిని మించనపుడు నిర్వాహక ప్రతినిధి ఒక నిర్దేశకుని తన తరపున నియమించవచ్చును నిర్దేశకుల సంఖ్య 5-6 మధ్య ఉండవలెను కొన్నిరకముల పరిశ్రమలలో నిర్వాహక ప్రతినిధులుండరాదని ప్రభుత్వము నిర్దేశించినది నిర్వాహక ప్రతినిధులకిచ్చు ప్రతిఫలము ఆయాసంవత్సర నికర లాభములో 11 శాతముండవచ్చును వీరు తమ హక్కులను ప్రభుత్వ అనుమతిలేకుండ వేరొకరికి అప్పగించరాదు పోటీ వ్యాపారము నడుపరాదు నిర్దేశకుల అనుమతిలేకుండ ఒకే నిర్వాహక ప్రతినిధిచే నిర్వహింపబడు వేర్వేరు సంస్థలు పరస్పరము అప్పులు పుచ్చుకొనుటగాని ఇచ్చుటగాని జరుగరాదు ఇట్టి చట్టబద్ధమైన అంశలు నిర్వాహక ప్రతినిధుల కార్యకలాపములపై విధింపబడినవి నిర్వాహక ప్రతినిధులు కంపెనీ వ్యాపారమునకు అవసరమని కొందరును అనవసరమని మరికొందరును ఈనాటివరకు వాదించుచునేయున్నారు కాని ప్రభుత్వము ఎట్టి మార్పును చేయక నిర్వాహక ప్రాతినిధ్య విధానమును కొనసాగనిచ్చుచునే యున్నది

వాణిజ్యసంయోగములు వాణిజ్య, వ్యాపార పారిశ్రామిక సంస్థలలో సంయోగమువలన విశేష ప్రయోజనము కలదని ప్రయోగములవలన నిర్ధరింపబడినది ఉత్పాదనచర్యలలో క్రయవిక్రయ కార్యక్రమములలో వ్యక్తులు సహకారసంయోగముల ద్వారా వారివారి కార్యక్రమములను మేళనముగావించుటచే అధికలాభము లార్జింపబడుచున్నవి సమ్మేళనములు (1) సూక్ష్మసమ్మేళనములు (Simple Associations) (2) సంయుక్తసమ్మేళనములు (Federations) (3) ఏకరూప సమ్మేళనములు (Consolidations) అని మూడు విధములు ఏకరూప సమ్మేళనములు మరల (1) పాక్షిక ఏకరూప సమ్మేళనములు (Partial Consolidations) (2) పూర్ణ ఏకరూప సమ్మేళనములు (Complete Consolidations) అని ద్వివిధము

పూచీ సమ్మేళనములు (Trusts) ఇవి మొదట అమెరికా దేశములో అవతరించినవి ఈ సమ్మేళనములు జరుపు వ్యాపారములో అందలి సభ్యుల నడుమ పోటీలు తగ్గి లాభములు అధికముగ సంపాదింపబడెడివి సభ్యుల వాటాల ననుసరించి లాభములు పంచిపెట్టబడెడివి వాణిజ్య వ్యవస్థలో పోటీ తత్త్వమును అరికట్టుటకును సహకార సంయోగముల ద్వారా లాభముల నార్జించుటకును ఈ సమ్మేళనములు బహువిధములుగ ఉపయోగపడుచున్నవి ఈ సంస్థలు స్వీయ సంయుక్త సమ్మేళనములకంటె మేలైనవి వేర్వేరు వ్యక్తులు కలయుటచే ఇవి ఏర్పడుటచే వీటి పరిధి ఎక్కువగ నుండును సాధారణముగ సంకలితవాటా మూలధన సంస్థలన్నియు ఈకోవకు చెందినవే నిర్వహణములో పనికిరాని విభాగములను తీసివైచి తక్కువ ఖర్చుతో ఎక్కువ ఉత్పత్తిని ఎక్కువ లాభములను సంపాదించుటకును ఈసమ్మేళనములు ఉపయోగపడుచున్నవి

స్వీయ సంయుక్త సమ్మేళనములు (Cartels) - ఇవి సంయుక్త సమ్మేళనములలో మొదటితరగతికి చెందినవి జర్మనీలో ప్రప్రథమముగ వాణిజ్యవ్యవస్థ ఆరంభమైనపుడు ఇట్టి సమ్మేళనము లేర్పడినవి ఒకేరకమైన వ్యాపారమును పరిశ్రమను చేపట్టిన వ్యక్తులు తమ వస్తువులకు విపణిలో ఏకాధికారము కల్గుటకు వీలుగా ఇట్టి స్వీయసమ్మేళన సంస్థలను స్థాపించుకొనుచుందురు వస్తువుల సరఫరా నియంత్రణమువలన, క్రయవిక్రయముల నియంత్రణమువలన ధరల నిర్ణయమువలన వారు తమ వస్తువులపై విపణిలో ఏకాధికారమును పొందగల్గుచున్నారు పోటీ ఉత్పత్తిదారులను అణచుటకును ఉత్పత్తి విక్రయములను అదుపునందుంచుటకును ఈ సమ్మేళనములు ఉపయోగపడుచున్నవి ఈ విధానముల వలన వారి ఉత్పాదనములకు గిరాకీ ఏర్పడుచో, వస్తువుల సాంద్యమును పెంచుటకుగాని, వినియోగదారుల అవసరము

లను తీర్చుటకుగాని వారు శ్రద్ధవహింపరు. సాధ్యమైనంత వరకు వస్తువుల సరఫరాను అదుపునందుంచి వాటి ధరలను పెంచి లాభములను సంపాదించుటకే వారు ప్రయత్నింతురు. ఎవరిలో ఏకాధికారమును పొందుట సాధారణ పరిస్థితులలో వాణిజ్య సంస్థలకు నష్టదాయకముగ గూడ నగును. క్రొత్త సంస్థలు అవతరించుట ఈ సమ్మేళనముల ప్రయోజనములకు ప్రతికూలమగుటచే పారిశ్రామిక ప్రగతి ఘటిల్లుటకవకాశముండదు. పూలీ సమ్మేళనములు మాత్రము స్వీయ సంయుక్త సమ్మేళనములకంటె ఉపయోగకరములై పారిశ్రామిక ప్రగతికి దోహదమొసగునని చెప్పవచ్చును. ప్రస్తుతమేర్పడుచున్న కంపెనీలు ఈ కోవకు చెందినవే. ఏమైనను సక్రమమైన పద్ధతులలో నడచినచో ఈ సంయోగములు ఆర్థిక వాణిజ్య ప్రగతికి కొంతవరకు దోహదకారులగును.

వే. రా.

## శంకరాచార్యుడు

భారతదేశమందలి అద్వైత మతపీఠాధిపతులలో పలువురు జగద్గురు శంకరాచార్య యనెడి బిరుదనామమును వహించుచున్నను శంకరాచార్యుడను వ్యవహారము వారందరికిని పరమగురువగు ఆదిశంకరులకే ప్రసిద్ధమైయున్నది. జగద్గురు షణ్మతస్థాపనాచార్య పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ శంకర భగవత్పాదులని కూడ వీరిని పేర్కొనుచుందురు. సృష్టియం దత్యంత పరమోత్కృష్టమగు జీవతత్త్వమును గురించి అనాదినుండియు పలువురు వేత్తలు చర్చించి ప్రవక్తలుగను మతస్థాపకులుగను ఖ్యాతినొందిన మహనీయులలో శంకరాచార్యుడొక విశిష్టస్థానమలంకరించెను. ఉపనిషద్రూపములగు వేదాంతములు విశ్వమునంతకు నేకేయద్వైతమును ప్రతిపాదించుచున్నవని ప్రత్యక్ష అనుమాన ఉపమాన ఆగమ అర్థాపత్తి అనుపలబ్ధియనెడి షడ్విధప్రమాణములతో సర్వప్రతివాద ఖండకముగ నిరూపించి సర్వకాలములకు శంకరుడు ఆచార్యపీఠము నలంకరించెను. అట్టిమహనీయుని జీవితవిశేషములను తెలుపు శంకరవిజయాదిగ్రంథములు, ఆయనరచనలను వివరించు ప్రౌఢవ్యాఖ్యానములు విమర్శనాత్మక వ్యాసములు అనేక భాషలలో అసంఖ్యాకములుగ నేడు లభించుచున్నవి.

జీవిత విశేషములు - దక్షిణభారతమున కేరళ రాష్ట్రములో కాలటియను గ్రామమునందు నంబూద్రి బ్రాహ్మణ వంశమున శివగురువు, ఆర్యాంబ యను పుణ్యదంపతులకు పరమశివుని యనుగ్రహమున శివుని అవతారముగనే ఈశ్వర సంవత్సర వైశాఖ శుద్ధ పంచమినాడు శంకరుడు జన్మించెను. బాల్యమునందే తండ్రి చనిపోయెను. ప్రతిభ విశేషముతో శంకరుడు [illegible] వేదవేదాంగాది [illegible] చిన్నతనముననే బ్రహ్మచారిగ గురువులయొద్ద నభ్యసించెను. ఒకప్పుడు ఆతడు నదియందు మొసలిచే పట్టుబడి ఆతురసన్న్యాసమును స్వీకరించెను. దైవవశముగ ఆ జలచరమునుండి విముక్తి నొందెను. ఐనను సన్న్యాసిగనే జీవితమును గడుప నిశ్చయించుచు తల్లిని ఆమె యవసానకాలమందు దగ్గరచేరనని యొప్పించి ఇల్లువిడిచిపోయెను. గురువు నన్వేషించుచు శ్రీ గోవిందభగవత్పాదులను దర్శించెను. భక్తిపురస్సరముగ వారికడ శుశ్రూష సలిపి అద్వైత తత్త్వము నుపదేశము నొందెను. వేదవ్యాసప్రణీతములగు బ్రహ్మసూత్రములకు ఉపనిషత్తులకు అద్వైతపరముగ భాష్యములను రచించి వాటిని ప్రచారము చేయుటకై బౌద్ధ చార్వాకాది నాస్తికులను కేవల కర్మపరులగు ఆస్తికులను శాస్త్రార్థమునందు పరాజితుల గావించెను. బ్రహ్మయొక్క అవతారమని ప్రసిద్ధిపొందిన పరమ కర్మిష్ఠుడైన మండనమిశ్రుని అతని భార్యయు సరస్వత్యవతారము నగు భారతిని వాదమునందు మెప్పించి మండనునిచే అద్వైతమే మోక్షదాయకమని యొప్పించెను. మండనుడు తన కర్మసిద్ధాంతము నధిగమించి శంకరునికి శిష్యుడై సన్న్యాసమును స్వీకరించుట శంకరవిజయమునందొక ప్రధానఘట్టము. ఆతడు ఋష్యశృంగాశ్రమమగు శృంగేరియందు శారదాపీఠమును నెలకొల్పి అచట పండ్రెండు సంవత్సరములు శిష్యవర్గమునకు స్వరచితములగు సూత్రభాష్యాదిగ్రంథముల నుపదేశించెను. తన ప్రధాన శిష్యులగు సురేశ్వర, పద్మపాద హస్తామలక, తోటకాచార్యుల యాధిపత్యమున భారతదేశమందు నలుమూలల కంచి జగన్నాథము జ్యోతి ద్వారకలనెడి క్షేత్రములందు శారదాపీఠ కేంద్రములను స్థాపించి అద్వైత ప్రచారమును సుస్థిరమొనర్చెను. అష్టాదశశక్తి పీఠములందు యంత్రోద్ధారము గావించి తత్ప్రభావమున అణిమాది సిద్ధుల నొందెను. షడ్దర్శనమతమును స్థాపించి వైదికమతము నుద్ధరించెను. నేపాళ కాశ్మీరాదిహిమవత్ప్రాంతదేశములందు పర్యటించి తుదకు బదరికాశ్రమమున కేదారక్షేత్రమునందు శివసాయుజ్యము నొందెను. శంకరుని జీవితమందలి యీ ప్రధాన ఘట్టములను గొని దివ్యశక్తులతో గూడిన ఉపాఖ్యానములు

శంకరవిజయాదిగ్రంథములు కావ్యములుగా రచింపబడినవి అందు ఆనందగిరి శంకరానందుడు అనంతానందగిరి సదానందుడు గోవిందనాథుడు విద్యారణ్యుడు మున్నగువారిచే రచింపబడిన గ్రంథములు ప్రధానములు వీటిలో విద్యారణ్య కృతమగు శంకరవిజయమే బహుళప్రచారములో నున్నది

జీవితకాలము శంకరాచార్యుని జీవితకాలమును గూర్చి శాంకరపీఠములందు లభించు వివరములకును చారిత్రకుల నిర్ణయములకును భేదము విశేషముగా కాన్పించును శృంగేరి శారదాపీఠము కలిశకము 2618 లోను జగన్నాథమునందలి గోవర్ధనమఠము కలి 2617 లోను బదరికాశ్రమమునందలి జ్యోతిర్మఠము కలి 2618 లోను ద్వారకలోని శారదాపీఠము కలి 2611 లోను కంచిలోని కామకోటి పీఠము కలి 2620 లోను స్థాపింపబడినట్లు ఆయాపీఠములందు లభ్యమగు సమాచారమునుబట్టి తెలియుచున్నది అనగా శంకరుడీపీఠములను సుమారు క్రీ పూ 480 ప్రాంతమునందు స్థాపించెననియు దానినిబట్టి ఆయన క్రీ పూ 520-480 నడుమ జీవించియుండెననియు తెలియుచున్నది కాని చారిత్రక పరిశోధకు లీకాలమున శంకరుడు లేడనియందురు ఉండియున్నచో క్రీ పూ 500 నుండి క్రీ శ 500వరకు వర్ధిల్లిన ప్రసిద్ధ భారతీయ గ్రంథకర్తలెవ్వరును శంకరుని గూర్చి నామమాత్రముగనైన స్మరింపకుండురాయని వారివాదము ఆ కాలము నాటి ప్రామాణిక గ్రంథములం దెచటను శంకరునిగూర్చి చెప్పబడలేదు ఆత్మానందయతి కృతమగు గురుపరంపర కావ్యముల నాధారముగా గొని శంకరుడు కలి 3889 లో జన్మించి కలి 3921 లో సిద్ధినొందె నని వీరు చెప్పుదురు అనగా క్రీ శ 788-820 నడుమ శంకరాచార్యులు జీవించియుండిరని నిర్ణయించిరి దీనినే పలువురు పరిశోధకు లంగీకరించుచు వచ్చిరి శాంకర భాష్యములలో కొన్ని తావులయందు పూర్ణవర్మ యను రాజు పేర్కొనబడుచున్నాడు గావునను ఆరాజు క్రీ శ 580-640 మధ్యనుండెను గనుకను శంకరుడు కూడ అప్పటివాడేనని కొందరందురు ఆదేకాలమున చైనాయాత్రికుడగు యువాన్ చాంగు భారతదేశమునందు చాలకాలము సంచరించి అనేకవిషయములను సేకరించెను; అట్టివాడు ప్రసిద్ధ శంకరుని గూర్చి మాటమాత్రముగనైన తన పర్యటనానుభవముల దెలుపు గ్రంథమునందు చెప్పకుండుటచేతను పూర్ణవర్మ పేరుగల రాజు లనేకులుండదగును గనుకను ఈవాదము త్రోసివేయబడెను మరికొందర శంకరుని సమకాలికులగు కుమారిలభట్టు అతని శిష్యులగు ప్రభాకరుడు మండనమిశ్రుడు ఉమ్వేకుడనబడు భవభూతుల కాలమును క్రీ శ 650-700 గను శంకరుని శిష్యులగు పద్మపాద సురేశ్వర హస్తామలక తోటకాచార్యులు వీరి సమకాలీనులుగను నిర్ణయించిరి శంకరుని పరమగురువగు గౌడపాదాచార్యులు క్రీ శ 600-650 మధ్యవాడనియు శంకరుడు క్రీ శ 655-687 నడుమ ఉండి యుండునవియు వీరు చెప్పుదురు ఇంకను ఈ విషయమందు పరిశోధనలు జరుగుచునేయున్నవి శంకరాచార్యుని జన్మకాలమునకు సంబంధించి వర్ణించబడిన గ్రహస్థితిని పురస్కరించుకొని ఆయన జన్మదినము క్రీ పూ 508 ఏప్రిల్ 18వ తేదీయని యిటీవల శ్రీ కె శ్రీనివాసరాఘవన్ అను జ్యోతిశ్శాస్త్రవేత్త చెప్పెను ("హిందూ" ఆంగ్లదినపత్రిక 1970 మార్చి 29 పేజీ 12) శంకరుని జీవిత పరిమితి 32 సంవత్సరములు మాత్రమేనని పరిశోధకులందరు అంగీకరించిరి

రచనలు శంకరుని రచనలు అనేకములుగలవు అందు భాష్యములు ప్రకరణములు స్తోత్రములు తదితరములుగలవు శ్రుతి ప్రస్థానమగు ఉపనిషత్తులకు న్యాయప్రస్థానమగు బాదరాయణముని ప్రణీతమైన బ్రహ్మసూత్రములకు స్మృతి ప్రస్థానమగు బాదరాయణ రచితమగు మహాభారతాంతర్గత భగవద్గీతకు అతిగంభీరమగు భాష్యములు శంకరుని గ్రంథములలో ఉత్తమశ్రేణికి చెందినవి కలవు అందున బ్రహ్మసూత్రభాష్యము అతిప్రౌఢమై వేదాంత వాఙ్మయమునందగ్రస్థానమలంకరించియున్నది ఇందు వేదవ్యాస తాత్పర్యము అద్వైతమేనని ప్రత్యక్ష అనుమానాది సమస్త ప్రమాణములతో నిరూపించబడినది ఉపనిషత్తులలో తైత్తిరీయోపనిషత్తు బృహదారణ్యకోపనిషత్తు ఈశావాస్య ఐతరేయ కాఠక కేన ఛాందోగ్య ప్రశ్న మాండూక్య ముండక ఉపనిషత్తులు శాంకర భాష్యములతో లభించుచున్నవి ఇందు బృహదారణ్యకము తైత్తిరీయము అతిప్రధానములు తార్కికుల యుక్తివాదమునకు తన సిద్ధాంతము లొంగదని ప్రతిజ్ఞాపూర్వకముగ శంకరుడు చెప్పియున్నాడు "తస్మాత్తార్కిక చాట భట రాజాప్రవేశ్యం అభయందుర్గమిదం అల్పబుద్ధ్యగమ్యం శాస్త్రగురు ప్రసాద రహితైశ్చ" (బృ ఉ భా 2-1-20) ఈ గ్రంథములకు శంకరునికి పూర్వమే రచింపబడిన వ్యాఖ్యాన

ను లు ఉండియున్నట్లు శంకరుని భాష్యములందు సంప్రదాయ విదుల. వృత్తికారులు మున్నగువారి మతప్రదర్శనముచేత తెలియుచున్నది శంకరాద్వైతసిద్ధాంతము నచ్చటచట విమర్శించు భట్టభాస్కరుడు కూడ కొన్ని ప్రాచీన వ్యాఖ్యానములను పేర్కొనును కాని అవి యేవియు లభ్యము కావు కనుక శాంకరభాష్యమే బ్రహ్మసూత్రములకు లభ్యములగు వ్యాఖ్యానములలో అతిప్రాచీనమైనది ఈ భాష్యముపై వాచస్పతి మిశ్రుని భామతియు గోవిందానందుని రత్నప్రభయు ఆనందగిరి న్యాయనిర్ణయము పద్మపాదుని పంచపాదికయు ప్రసిద్ధమైన ప్రామాణికములగు వ్యాఖ్యానములు తర్వాత రచింపబడిన వ్యాఖ్య లనేకములు గలవు శంకరుని రచనలలో భాష్యము లనబడు మరి రెండు వ్యాఖ్యానములు గలవు అవి సనత్సుజాతీయ భాష్యము విష్ణుసహస్రనామ భాష్యము మొదటిది మహాభారతము నుద్యోగపర్వమున ధృతరాష్ట్రునికి బ్రహ్మమానస పుత్రుడగు సనత్కుమారుడుపదేశించిన బ్రహ్మతత్త్వమునకు వ్యాఖ్యానము రెండవది శాంతిపర్వమున భీష్ముడు ధర్మరాజున కుపదేశించిన విష్ణుసహస్రనామ స్తోత్రమునకు వ్యాఖ్యానము ఇందు సనత్సుజాతీయ భాష్యము అతిప్రౌఢమై పండితులకు మాత్రమే బోధ్యముగ నుండును శంకరుని ప్రకరణ గ్రంథములు పై భాష్యములవలె ఉత్తమాధికారులకు మాత్రమే గాక మధ్యమాధికారులకు గూడ సుగ్రాహ్యములై యుండును ఇందు ఉపదేశసాహస్రి మొదట చెప్పదగినది ఇది గద్యపద్యాత్మకమగు నొక స్వతంత్ర రచన సర్వవేదాంత సిద్ధాంత సంగ్రహము, వివేకచూడామణి అపరోక్షానుభూతి ఆత్మబోధ తత్త్వోపదేశము అనాత్మానాత్మవిచారము శతశ్లోకి స్వాత్మప్రకాశిక జీవన్ముక్తానందలహరి వాక్యసుధ ప్రబోధసుధాకరము మున్నగు ప్రకరణ గ్రంథములు శంకరుని రచనలలో ముఖ్యమైనవి ఇవిగాక సాధకుడు నిత్యము స్తోత్రము చేయునట్లు అనేక వేదాంత స్తోత్రములు భక్తిస్తోత్రములు శంకరునిచే రచింపబడినవి వీటిలో దక్షిణామూర్తి స్తోత్రము పది శ్లోకములతోగూడిన చిన్న వేదాంత ప్రకరణమువంటిది శివానందలహరి నూరు శ్లోకములు సౌందర్యలహరినూరు శ్లోకములుగల చిన్నకావ్యములవంటివి సౌందర్యలహరిమంత్రశాస్త్రనిబద్ధమైనదనికూడ పండితులయభిప్రాయము ఈస్తోత్రములు కవిత్వదృష్టిలో అతిరమణీయములై శంకరాచార్యుని యొక్క కవితాసామర్థ్యమును ఉగ్గడించుచుండును భాష్యగ్రంథములు మొదలు స్తోత్రముల వరకుగల శంకరుని రచనలన్నియు అద్వైతసిద్ధాంత ప్రతిపాదనయందత్యంత ప్రామాణికములై యుండుటేగాక శైలియందతి మనోహరముగ నుండి పామరులకు వారి వారి యధికారము ననుసరించి సుగ్రాహ్యములుగాయుండును ముప్పదిరెండు సంవత్సరములు మాత్రమే జీవించి బహుగ్రంథకర్తయగుటయేగాక బౌద్ధ జైన చార్వాకాది నాస్తికమతములచేతను కర్మప్రధానమగు మీమాంసాదర్శనము న్యాయవైశేషికాది యితరదర్శనముల చేతను మరుగుపడి అల్పప్రచారములోనున్న అద్వైతసిద్ధాంతమును సుస్థిరమొనర్చి బహుళప్రచారమునుగావించి శంకరాచార్యుడు మహాచార్యులలో నగ్రగణ్యుడని మతాంతరులచే గూడ ప్రశంసింపబడెను

**శంకరుని సిద్ధాంతము** – శంకరుని వేదాంత సిద్ధాంతము సంగ్రహముగా అద్వైతమంతయు ఒకే తత్త్వమని భావము ఇది శంకరుడు క్రొత్తగా ప్రవేశపెట్టినదనుకొనరాదు శ్రుతి స్మృతి పురాణేతిహాసములందు ప్రసిద్ధమై గౌడపాద గోవిందాది ఆచార్యపరంపరలోనున్న సిద్ధాంతమే "బ్రహ్మసత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవ నాపరః" అనునది అద్వైతసిద్ధాంతము ఇందు జగత్తు మిథ్యయనియు జీవాత్మ బ్రహ్మకంటె వేరుకాదనియు నిరూపించినచో సత్యముగా మిగులునది బ్రహ్మమే ఇచట జగత్తు మిథ్యయనగా గగనకుసుమమువలె లేనిదని యర్థము గాక అనిర్వచనీయమని యర్థము సత్తుఅనికాని అసత్తు అనిగాని సదసత్తనిగాని నిర్వచింపరానిది ఆత్మనాశ్రయించి యుండు అవిద్యవలన ఈ సమస్తప్రపంచము పరిణమించినది ఆ అవిద్యతొలగినపుడు ప్రపంచము మిథ్యకాకతప్పదు అద్వైతమందు ఆత్మ ఒకటియే అది విజాతీయ సజాతీయ స్వగత భేదములు మూడును లేనిది విజాతీయమగు జగత్తు మిథ్యగాన విజాతీయ భేదమే లేదు అధిష్ఠానసత్తయే జగత్తుయందు భాసించును అందుచే ఆత్మకు విజాతీయ భేదము ప్రాప్తించదు సజాతీయమగు మరియొక ఆత్మలేనందున సజాతీయ భేదము కూడ ఆత్మకులేదు ఇచట నేను నీవు అను వ్యవహారము సిద్ధించవలెనన్నచో ఆత్మభేదము నంగీకరించక తప్పదని పూర్వపక్షము కలదు ఈ భేదము ఆత్మభేదమువలన బట్టిగాక అంతఃకరణభేదమును బట్టి వచ్చినదని సిద్ధాంతము అంతఃకరణ భేదముబట్టియే సుఖదుఃఖ భేదములు జ్ఞాన

భేదములు కలుగుచున్నవి దర్పణ భేదములనుబట్టి ప్రతిబింబ
భేదములు గోచరించినను బింబరూపమగు సూర్యునియందెట్టి
భేదములు లేనట్లు ఆత్మయందు భేదముండదు ఆత్మకంటెను
ఇంక మూడవది స్వగతభేదము ఆత్మనిరవయవము నిర్గుణము,
నిష్క్రియము నగుటచే వృక్షమునకు స్వగతమైన శాఖాదు
లతో భేదము ఎట్లు ఆత్మకు స్వగతభేదమున్నదనుట తగదు
కను త్రివిధభేదములు లేని ఆత్మ ఒకటియే యను సిద్ధాంతము
ఈ ఆత్మైకత్వ సిద్ధాంతమునే అద్వైత సిద్ధాంతమందురు
ఇతరము ఆత్మసత్తతో సమానమగు సత్తగల వస్తువు లేకుం
డుటచే వస్త్వంతరములేని అట్టి ఆత్మ సచ్చిదానంద
స్వరూపమగు బ్రహ్మమే దీనికి "తత్త్వమసి" "అహం బ్రహ్మాస్మి"
"అయమాత్మా సర్వానుభూః" "ఆత్మైవేదం సర్వమ్"
మొదలగు శ్రుతివాక్యములు ప్రమాణము

ఈ సృష్టికి పూర్వము సజాతీయ విజాతీయ భేదరహి
తమును సచ్చిదానందఘనమునగు పరమాత్మ వస్తువొకటియే
యున్నది అందు సత్తుగాను అసత్తుగాను విలక్షణమైన
మూలప్రకృతి లేక అవిద్యయనబడు నొక పదార్థము వస్తుతః
లేనిదైనను ఉన్నట్లు గోచరించును దీనినే మాయయని కూడ
వ్యవహరించుదురు చేతనాచేతనాత్మకమగు ప్రపంచమంతయు
ప్రళయకాలమున నిందే బీజమునందు వృక్షమువలె సూక్ష్మ
రూపమున లీనమైయుండును ప్రాణుల కర్మానుసారముగ
మాయోపాధికుడైన ఆ పరమాత్మకు జగత్సృష్టి విషయక
మగు సంకల్పము కలుగను అంతట హిరణ్యగర్భాదిక్రమ
మున పంచభూత భౌతికాత్మకమగు చరాచర విశ్వమంత
యు సృజింపబడును ఈ జగత్తంతయు మాయామయముగావున
తన్మూలమున పరమాత్మయొక్క అద్వితీయత్వమునకుగాని
సచ్చిదానందత్వమునకుగాని ఎట్టిహానియు కలుగజాలదు జాగ్ర
త్స్వప్న సుషుప్తి దశలలో జాగరమైయుండు నేను అను పదా
ర్థము సర్వావస్థలకు సాక్షియైయుండును ఈ నేను సద్రూపము,
చిద్రూపము నిరతిశయప్రేమాస్పదమగుటచే ఆనందరూపము
నగుచున్నది దాని సంబంధముచే నే దేహేంద్రియాదులు
జడములైనను చేతనములవలె కనబడును అయోగోళము
అగ్నితప్తమైనపుడు అగ్నిధర్మములగు దాహకత్వప్రకాశాదులు
అయోగోళమునందును దాని ధర్మములగు కఠినత్వ వర్తులత్వా
దులు అగ్నియందును ఆరోపించబడి వ్యవహరింపబడినట్లు
అనాదియగు అవిద్యవలన ఆత్మగతములగు చైతన్యాదులను
దేహేంద్రియములందును దేహేంద్రియాదిధర్మములగు
స్థూలత్వ కృశత్వ కర్తృత్వ భోక్తృత్వాదులను ఆత్మ
యందును ఆరోపించి వ్యవహరించుట జరుగుచున్నది ఇదియే
సంసారము దీనికి మూలమైన అవిద్య ఆత్మతత్త్వజ్ఞానముచే
నశించును సుప్తోత్థితునికి నిద్రాలోపమువలన కలిగిన స్వాప్నిక
ప్రపంచము నివృత్తమైనట్లు ఆత్మతత్త్వజ్ఞానముచే అవిద్య
అస్తమించగా దానితోపాటు అఖిలప్రపంచము నివృత్త
మగును తానే సర్వవ్యాపకుడును అఖండాద్వితీయు
డును సచ్చిదానందస్వరూపుడునై భాసించును ఇదియే
కైవల్యము లేక ముక్తి ఇట్టి కైవల్యము జ్ఞానముచేత
మాత్రమే పొందదగినదైనను చిత్తశుద్ధి జ్ఞానప్రాప్తికి
వేదోక్త ధర్మాచరణములు చిత్తశుద్ధికి సాధనములుగ చెప్ప
బడుటచే శంకరుడు కర్మసిద్ధాంతమును పూర్తిగా నిరసించె
ననుకొనరాదు వేదోనిత్యమధీయతాం తదుదితం
కర్మస్వనుష్ఠీయతామ్ అని తనోక్తిగా వైదిక కర్మా
చరణము ఆత్మతత్త్వజ్ఞానమునకు చిత్తశుద్ధి ద్వారా హేతు
వని బోధించెను అట్లే మోక్షసాధనోపాయములలో భక్తిని
గూర్చి చెప్పుచు మోక్షసాధన సామగ్ర్యాం భక్తిరేవగరీయసీ
అని నుడివెను ఈ వాక్యములన్నియు అధికారి ననుసరించి
చెప్పబడిన చిత్తశుద్ధ్యుపాయములు

శాంకరమతానుయాయులను ప్రచ్ఛన్న బౌద్ధులని
కొందరు దూషింతురు అద్వయవాదము ఉభయమతము
లందు సమానమనియు గౌడపాదకారికలు కొన్ని నాగార్జునుని
మధ్యమకారికలను బోలియుండుననియు అద్వైతుల మిథ్యా
వాదము, మాధ్యమికుల శూన్యవాదము వంటిదనియు వారు
చెప్పెదరు కాని నిదానించినచో అద్వైతులకు మాధ్య
మికులకు గొప్ప భేదము గానవచ్చును అద్వైతులు వేద
ప్రామాణ్యము నంగీకరించువారు ఆస్తికులు, బౌద్ధులు వేద
ప్రామాణ్యము నంగీకరించని పరమనాస్తికులు అద్వైతులకు
బ్రహ్మనిత్యముకాగా బౌద్ధులు సర్వశూన్యమును చెప్పెదరు
అద్వైతులు నిత్య జ్ఞానవాదులు బౌద్ధులు సర్వక్షణిక
వాదులు ఆత్మకు ఆనంద రూపత్వమును అద్వైతులుచెప్పగా
బౌద్ధులు సర్వము దుఃఖమయమందురు ఇట్టి అంతరము ఉభ
యుల సిద్ధాంతములందు కాన్పించుచుండ అద్వైతులు
ప్రచ్ఛన్న బౌద్ధులను వాదము నిరాధారము అట్లే మాధ్యమిక
వాద ప్రవర్తకుడగు నాగార్జునుని మతమునుండియే శంకరుడు

తన అద్వైతమును సృష్టించెనని వాదము కూడా సరియైనది కాదు. శంకరుల అద్వైతము ఉపనిషత్తులకును బ్రహ్మసూత్రములకును సమ్మతమైనది. శంకరుడు నాగార్జునునికి ఋణపడినవాడేనని నిశ్చయము కాలేదు. నాస్తికమతములగు బౌద్ధ జైనాది భారతీయమతముల కాచార్యులనదగు నాగార్జునుని వంటి విద్వాంసులు మున్ముందు వైదికశాస్త్రములను బాగుగ పఠించి రాజాదరణము వంటి కారణములను పురస్కరించుకొని మతాంతరులైరి గనుక వారి రచనలు వైదికసిద్ధాంతములను పోలియుండుటయు కద్దు.

పు. స. భా.

## శతకములు

శతకమనగా వందపద్యములుగల గ్రంథము. సంస్కృతము మున్నగు ఇతర వాఙ్మయములందు కూడ కొన్ని శతకము లున్నను తెలుగున వెలసినన్ని శతకములు మరే వాఙ్మయమందును వెలసి ఉండలేదు. ముద్రితములైన శతకములు సుమారు ఐదువేలున్నవి. అముద్రితములైనవి మరికొన్ని కలవు. శతకవిభాగమునకు తెలుగున విశిష్టస్థానమున్నది. తెలుగు కవులు పలువురు కవితా జీవితమునకు ఆరంభమున భగవదనుగ్రహ ప్రాప్తికై శతకములు వ్రాసి ఉండిరి. ప్రాయపు ప్రొద్దు పడమటికి వ్రాలిన వెమ్మట పశ్చాత్తప్తులై తమ జీవితమును సింహావలోకనమొనరించుచు శతకములు వ్రాసిన కవులును కొందరు కలరు.

పెక్కు శతకములలో నూరో నూటఎనిమిదియో పద్యములు గోచరించుచుండును. భగవన్నామస్తోత్రములందు సహస్రమో అష్టోత్తరశతమో నామములుండుట పరిపాటి అగుటచే శతకములుకూడ అష్టోత్తర శతపద్య పరిమితములై ఉండుట సంభవించినట్లు తోచుచున్నది. గ్రహములు రాసులు నక్షత్రములు అనునవి వరుసగా తొమ్మిదియు పండ్రెండును ఇరువదియేడును అయి ఉండుటచే ఆ సంఖ్యలలోగల సంబంధమునుబట్టి కూడ శతకములందలి సంఖ్య అష్టోత్తరశతముగా ఏర్పడి ఉండును. పద్యముల సంఖ్య వందకంటెను ఎక్కువగా ఉన్నను ఆ పద్యములుగల గ్రంథములను శతకములనుటయే పరిపాటియైనది. నూటికి తక్కువ సంఖ్యగల పద్యములతో గూడిన రచనలకు ప్రత్యేకములైన నామములున్నవి. పంచరత్నములు అష్టకములు నవరత్నములు, తారావళులు, వింశతులు త్రింశతులు పంచాశత్తులు సప్తతులు అనునవి. అందుకుదాహరణములు. సంస్కృత ప్రాకృతములందు త్రిశతులు పంచశతులు సప్తశతులు సహస్రములు కూడ కలవు.

శతకములలో పలురకములున్నను అందు భగవన్నుతి పూర్వకములైనవాని సంఖ్య హెచ్చు. భగవత్‌స్తుతులు ఋగ్వేదకాలము నుండియు గోచరించును. లౌకిక సంస్కృతమున మయూరుని సూర్యశతకము భర్తృహరి సుభాషిత త్రిశతి సుప్రసిద్ధములైనవి. శ్రీ శంకరభగవత్పాదుల శివానందలహరీ సౌందర్యలహరులను శతకములుగానే పరిగణింపవచ్చును. ఇవిగాక సంస్కృతమున అష్టోత్తరశత సహస్రనామ స్తోత్రములు పెక్కులున్నవి. ప్రాకృతమున హాలుడు సంకలనము చేసిన గాథాసప్తశతి ఏడువందల గాథల సమాహారము. ఇట్లే తమిళ కన్నడములందును కొన్ని పాశ్చాత్యభాషలందును కూడ శతకములును శతకప్రాయములైన రచనలును కనవచ్చుచున్నవి. కన్నడమున క్రీ. శ. 13వ శతాబ్దిలో త్రైలోక్య చూడామణి అను మకుటముగల శతకమొకటి రచింపబడినది. తెలుగున శతకములు వెలయుటకు ఇది ప్రేరకమై ఉండెనని తలంపవచ్చును.

విద్యానాథుడు మొదలైన సంస్కృతలాక్షణికులు శతకములను క్షుద్రకావ్యములుగా పరిగణించిరి. క్షుద్రకావ్యమనగా చిన్నకావ్యము. తెలుగు శతకములలో సంఖ్యామకుట వృత్తములకు సంబంధించిన నియమములు పాటింపబడినవి. అనగా నూరు కాని నూటఎనిమిది కాని పద్యములుండును. పద్యముల చివర సమానమైన మకుటము కానవచ్చును. ఈ మకుటము సాధారణముగా సంబోధనాత్మకమై ఏక ద్వి త్రి పదఘటితమై పాదమునందలి స్వల్పభాగమునో పాదార్ధమునో పాదమునంతనో ఆక్రమించి ఉండును. మద్దాలి ఉద్దండరాయశతకము మున్నగు ఒకటిరెండు శతకములందు మకుటము తృతీయ పాదాంతమునందే ఆరంభమగుచున్నది. ఇట్టివానియందును మకుటము చతుర్థ పాదమునంతను ఆక్రమించి ఉన్న శతకములందును అన్ని పద్యములలో ప్రాసముకూడ సమానముగా ఉండును. ఇవి ఏకప్రాస శతకములు. మకుటము సంబోధన రూపమున కాక వాక్యరూపమున ఉన్నశతకములును కొన్ని కలవు. "గోపాలుడు రంగరాయి మనపాలగలండు విచారమేటికిన్" "పూజన ముఖ్యుడాఘనన పూజ్యుడు మాకు బ్రసన్నుడయ్యెడిన్" అను

మకుటములు కల మంచెళ్ళ కృష్ణకవి రచించిన రంగశాయి పురుష ముఖ్యశతకములను మైలవరపు నర్సినారాయణ మూర్తి రచించిన జానకీ జానికి రామచంద్ర మహిజానికి సాటి విభుండు లేడిలన్ అను మకుటముకల జానకీ జానిశతక మును ఇందుకు దృష్టాంతములు "మనసా! హరిపాదము లాశ్రయింపుమా" అను మకుటముకల మానసబోధశతకమున సంబోధ్యపదమునకు తరువాత కొన్ని పదములు కూడ కన వచ్చుచున్నవి ఈ విధముగా తెలుగు శతకము న్నింట ఏదో ఒక మకుటము గోచరించును సంస్కృతశతకములందు మకుట నియమము కానరాదు మకుటనియమమునట్టి శతకములను ఒకే వృత్తమునందో సన్నిహిత గణసంబంధముగల వృత్తము లందో వ్రాయవలసివచ్చును చంపకోత్పలములకును శార్దూల మత్తేభములకును ఇట్టి సంబంధముకలదు తెలుగున శతకము లలో తప్ప ఇతర కావ్యములందు వృత్తనియమము కానరాదు అందు వృత్తవైవిధ్యము పార్శ్వతికము శతకములందలి పద్య ములు సాధారణముగా కథామాత్ర సంబద్ధములు కాక వేని కవే స్వతంత్రములై ఉండును అందుచే వీనిని ముక్తక కావ్య ములని చెప్పవచ్చును శతకములందు రసపాత్రపోషణమునకు అవకాశమంతగా కానరాదు కాని శృంగార భక్తి, వైరాగ్య రసప్రధానములైన శతకములు కొన్ని లేకపోలేదు ఇట్టి రసనియ మము కొన్నిశతకములలోనే కానవచ్చును కావ్యములందు కంటె శతకములలో భాషావిషయమున కొంత స్వాతంత్ర్యము అధికముగా గోచరించును అయ్యును అవి భాషాశుద్ధిశోభిత ములును సహజభావపూరితములును ఐ చదువరులకు ఆనంద ముతోపాటు వినయ విజ్ఞానములను కూడ కలిగింప దక్షములై ఉండును వానియందు పాండిత్య ప్రకర్షకంటె కవితా సంపద హెచ్చు వాడుక భాషలో రచింపబడిన చంద్రశేఖర శతక మొక్కటి మాత్రమే కానవచ్చుచున్నది

శతకములు సాధారణముగా గ్రంథకర్తల ఆత్మభావ ములను ప్రకటించునవిగానుండును వారు అందలి దోషములను మన్నించి ఆపదలను వారించి తమ్ముద్ధరింపవలెనని తమ ఉపాస్యదైవమును ప్రార్థింతురు ఆత్మపరిశీలనము చేసి కొనగా గతజీవితదోషములు స్మృతికి వచ్చుటచే పశ్చాత్తాపము పొందుదురు; తమ ఉపాస్యదైవముల గుణమహిమానుభావ ములను మనసార వర్ణింతురు ఈవిధముగా అవి వెన్ను ఆత్మా శ్రయ కవితాజాతికి చెంది ఉండును అవి భక్తులు నిజ హృదయములను భగవంతునికి విప్పి చెప్పు వినయపూర్వక విజ్ఞాపనలు ఆవిగాక నీతి ధర్మతత్త్వములను బోధించు శతకములును శృంగారహాస్యరసములకు సంబంధించిన శతక ములును కథాకవితచరిత్రలను వర్ణించు శతకములును వ్యాజ స్తుతిశతకములును లోకసామాన్య మత రాజకీయ పరిస్థితు లను వర్ణించు శతకములును సమస్యానిఘంటు శతకములును, జంతుసంబోధక శతకములును సామాన్యవిషయ వర్ణనాత్మక శతకములును ఎక్కుకలవు దీనినిబట్టి అణువు మొదలు బ్రహ్మపదార్థమువరకును గల వస్తువులను వర్ణించు వివిధ శతకములు కలవనియు అవి తత్కాల రాజకీయ సాంఘికాది పరిస్థితులను తెలిసికొనుటకు బహువిధముల తోడ్పడజాలు వనియు తెలియనగును

నన్నయ్యకు ముందుండిన ఆంధ్ర వాఙ్మయ స్వరూప స్వభావములను స్పష్టముగా తెలిసికొనుటకు ఆధారములు లేవు నన్నయ రచించిన ఆదిపర్వమున ఉదంకుడు నాగరాజు లను స్తుతించు సందర్భమున "మాకు ప్రసన్నులయ్యెడున్" అను ప్రార్థనతోకూడిన నాలుగు పద్యములున్నవి ఈ ప్రార్థన శతకములందలి మకుటమును పోలియున్నది అట్లే నన్నెచోడుని "కుమారసంభవమున" రెండుచోట్ల స్తుతి పూర్వకములై శతక పద్యములను తలపించు కొన్ని పద్యములున్నవి అందు "దారిద్ర్య విద్రావణా" అను సంబోధనతోకూడిన పద్యములు ప్రసిద్ధములైనవి శైవ మతాచార్యులైన మల్లికార్జున పండి తారాధ్యుడు "అజా రుద్రా శివా" ఇత్యాది మకుటము లతో కూడిన నాలుగైదువందల కందపద్యములు వ్రాసి వానికి "శివతత్త్వసార మని పేరు పెట్టెను శతకమను పేరు లేకున్నను మకుటభేదము గోచరించుచున్నను అందలి పద్య ములు శతక పద్యములనే పోలియున్నవి పాల్కురికి సోమ నాథుడు మల్లికార్జునపండితుడు రచించిన గ్రంథములను పేర్కొనుచు వ్రాసిన "శతకంబు శివతత్త్వసారము దీక్షశత" అను ద్విపద భాగమునందలి శతకపదమును విమర్శకులు శివ తత్త్వసారమునకు విశేషణముగనే భావించుచున్నారు అది గాక పండితారాధ్యుడు "శ్రీగిరి మల్లికార్జునా" అను మకు టముగల ప్రత్యేక శతకమును కూడ వ్రాసినట్లు తెలియు చున్నది ఎట్లయినను తెలుగున పండితారాధ్యుడే ప్రథమ శతకకర్త అని చెప్పనొప్పును ఆంధ్రమున వెలసిన తొలి శతక ములు శైవ సంప్రదాయ సంబద్ధములగుటయు ఉదాహర

నాదులగు దేశి ప్రక్రియలను తెలుగున ప్రవేశపెట్టిన శైవ కవులే శతకములను కూడ ఆరంభించుటయు గమనింపదగి యున్నది

ఆంధ్రమున శతకముల సంఖ్య పంచశత ప్రాధికముగా ఉండుటచే అందలి ముఖ్యములైన శతకములను గూర్చి మాత్రమే ఇచట ప్రస్తావింపబడుచున్నది

భక్తి శతకములు — ఆంధ్రమున లభించుచున్న భక్తి శతకములలో మొట్టమొదటిది పాల్కురికి సోమనాథుని వృషాధిప శతకము "బసవా బసవా బసవా వృషాధిపా" అను మకుటముగల ఈ శతకమున కవికి బసవేశ్వరునిపైగల భక్తి పారమ్యమును బహుభాషాపాండిత్యమును వృత్త రచనా కౌశలమును వెల్లడి అగుచున్నవి అతడు రచించిన చెన్నమల్లు సీసములు ముప్పదిరెండు మాత్రమే ఉన్నను అవి శతకపద్యములవలెనే ఉన్నవి శైవమత సిద్ధాంతమును చక్కగా వివరించు ఈ సీసములు వేగవంతములై అతనికి శైవమతమునగల ఆవేశమును సూచించుచున్నది కొంచెమించుమించుగా పాల్కురికి సోమనాథునికి సమకాలికుడైన యథావాక్కుల అన్నమయ్య అను శైవకవి క్రీ శ 1242లో సర్వేశ్వర శతకము రచించెను అతని కవిత్వము రసాలంకార భావ పరిపుష్టమును ధారాశుద్ధిశోభితమును ఐ శివభక్తి మహత్త్వమును వివిధముల వ్యక్తము చేయుచుండును

జక్కన తన "విక్రమార్క చరిత్రము"న కృతిపతియగు వెన్నెలకంటి ఎద్దన మంత్రి వంశమును వర్ణించుచు అతని తండ్రి అన్నమంత్రి (15వ శతాబ్ది) "పరమహృద్యంబైన పద్యశతంబుచే దేవకీతనయు విధేయు చేసె"నని తెల్పి ఉండెను ఆ శతకము పేరాతడు చెప్పి ఉండలేదు కాని "దేవకీనందన శతకము పేర ప్రచారమందున్నదే ఆ శతకమై ఉండునని పలువురి అభిప్రాయము ఈ శతకమున శ్రీకృష్ణుని శిష్టరక్షణ దుష్ట శిక్షణాది గుణగణములు చక్కగా వర్ణింపబడినవి ఇందలి శైలి సమాస భూయిష్ఠమయ్యును సుబోధమై హృద్యముగా ఉండును ఇట్లే కృష్ణుని బాల్యచేష్టలను, మహిమానుభావమును వర్ణించు నారాయణ శతకమొకటి ఉన్నది దీనిని బమ్మెర పోతన రచించెనని ప్రతీతి

అయ్యలరాజు రామభద్రుడు "రామాభ్యుదయము" నందలి గద్యలో తన తాత ఒంటిమిట్టరఘువీర శతకమును రచించినట్లు చెప్పి ఉండెను "రఘువీరా ! జానకీనాయకా!" అనుమకుటము మకుటము ఈ శతకము [illegible] భూయిష్ఠమును శబ్దాలంకార ప్రచురమును అయ్యు మిక్కిలి సరసమును సుబోధమునై ఆ రాగును ధూర్జటి మహాకవి రచించిన శ్రీకాళహస్తీశ్వర శతకము భక్తి [illegible] భాగాంభీర్యముచేతను మృదుమధుర [illegible] ప్రయోగముచేతను శతక వాఙ్మయమునకు తలమానికమని చెప్పదగినది అతడు పూర్వవయస్సున రాజులను, ధనికులను సేవించుచు భోగలాలసుడై కాలము పుచ్చి ఉండును అందుకై ఈ శతకమున అతడు పశ్చాత్తాపమును వెల్లడించుటయే కాక రాజులొనర్చిన ధూర్తకృత్యములను పలువిధముల నిరసించియుండెను ఇందు పెక్కుచోట్ల ఆ మహాకవి ఆత్మీయాంశము స్పష్టముగా గోచరించుచుండును ఇందలి శైలి ఎడనెడ వ్యావహారిక పదములతో కూడి ప్రౌఢమును హృద్యమును ఐ విధ ఎల్లుమంశును భక్తి విషయమున శ్రీకాళహస్తీశ్వర శతకముతో పాటికి పోటికి రాగల మరొక శతకము దాశరథి శతకము దీనిని రచించిన వాడు రామదాసను ప్రసిద్ధ నామముగల కంచర్ల గోపన్న ఇందలి శబ్దార్థాలంకారములును భక్తి వైరాగ్యములును పదలాలిత్యధారాశుద్ధులును మిక్కిలి ప్రశంసనీయములు ఈ శతకమునకు తెలుగుదేశమున విశేషమైన ప్రచారమున్నది కందపద్యమయమును కృష్ణలీలా మహిమానుభావ ప్రదర్శకమును అగు నృసింహకవి రచితమైన కృష్ణశతకము చిరకాలము నుండి బాలబాలికలకు పాఠ్యగ్రంథమై బహు ప్రశంసల నందుకొనుచున్నది

"భూరిమయవాస కొలిపాకపురనివాస వీరనారాయణ ముకుంద విశ్వవంద్య" అను మకుటము గల వీరనారాయణ ముకుంద శతకమును రచించినవాడు రాపూరి సంజీవకవి (1781) తెలంగాణమునందలి కొలను పాకలో మహమ్మదీయులు కల్గించిన సంక్షోభమువలన హిందువులు వీరనారాయణ విగ్రహమును పొలములో దాచగా సంజీవకవి రసవంతములైన నూరు సీసపద్యములు చదివి దానిని మందుకు రప్పించెనట ! ఇందలి సీసములు ప్రసాద గుణ భూయిష్ఠములును సరసములును ఐ సర్వజన సుబోధములుగా ఉన్నవి సంజీవకవి "వసుదేవనందన" శతకమును కూడ రచించెను శేషప్ప అను నామాంతరముగల శేషాచలదాసు "నృకేసరి శతకము" నరసింహ శతకము అను రెండు శతకములను రచించెను ఈ రెండును తెలంగాణములోని

ధర్మపురియందలి లక్ష్మీనరసింహస్వామిని సంబోధించుచు వ్రాయబడినవి "ప్రకేసరి శతకము నందు ధర్మపురీశ్వర కేసరీ అనునదియు నరసింహ శతమునందు భూషణవికాస శ్రీధర్మపురనివాస దుష్టసంహార! నరసింహ దురితదూర! అను నదియు మకుటములు. ఎడనెడ భాషా స్ఖాలిత్యములు గోచరించినను ఈ శతకములు భక్తి రసోద్బోధకములును సరసములును ఐ ఉన్నారుము ఇందలి సీసములు భక్తి వీచిమయములై హృద్యములుగా ఉండును

పరవస్తు మునినాథకవి "లక్ష్మీశతకము "లలితాశతకము" అను రెండు కందపద్యశతకములు రచించెను ఇందలి శైలి శబ్దాలంకారమయమై దోషరహితమై మిక్కిలి మనోహరముగా ఉండును తెలంగాణమునందలి యాదగిరి నరసింహస్వామిని స్తుతించుచు తిరువాయిపాటి వేంకటకవి అను సాతాని వైష్ణవుడు యాదగిరీంద్ర! మ్రొక్కెదన్' అను మకుటముతో యాదగిరీంద్రశతకమును రచించెను ఇతడు యాదగిరి నరసింహుని సంబోధించుచు ఒక కందపద్యశతకమును కూడ రచించెనట! రంగశాయి మనపాల గలండు విచార మేటికిన్ అను మకటముతో కూడిన రంగశాయి శతకము" యను శాన్వప్రాసాది శబ్దాలంకారమయమై మిక్కిలి ప్రౌఢముగా ఉన్నది దీనిని రచించినవాడు మంచెళ్ళ కృష్ణకవి ఇది కవికి వైష్ణవసంప్రదాయముతో గల గాఢపరిచయమును వ్యక్తము చేయుచున్నది ఇతడే "పురుషమ ఖ్యుడా భువనపూజ్యుడు మాకు గల్గు నన్నుదయ్యెడన్ అను పురుషముఖ్య శతకము ను కూడ రచించి ఉండెను

క్రీ శ 19 వ శతాబ్ది మధ్యభాగమున జీవించియుండిన మీనాక్షీభక్తుడు ఆప్పావు మొదలి అను కవి మాతృమహత్త్వ వాత్సల్యాతిశయములను వర్ణించుచు తల్లిని బోలరెవ్వరున్" అను మకుటముతో మాతృశతకము"ను రచించెను భక్తి ప్రధానములైన శతకము లింకను పెక్కు కలవు ఆధునికులలో శ్రీ ఉద్దాడి సుబ్బారాయకవి రచించిన భక్తచింతామణి శతకమందలి పద్యములు భక్తిరస నిధానములై మనోహరములుగా ఉండును ఈశతకమునకు కల్గినంత ప్రచారము ఆధునిక శతకములలో మరేశతకమునకును కలిగి ఉండలేదు ఆధునిక కాలమందలి ఇతర భక్తిమయ శతకములలో తిరుపతి వేంకటేశ్వరకవుల 'కామేశ్వరీ శతకము'ను శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి విశ్వేశ్వరశతకమును శ్రీ మాధవపెద్ది బుచ్చిసుందరశాస్త్రి మృత్యుంజయ శతకమును పేర్కొనదగి ఉన్నవి విశ్వేశ్వర శతకము భావబంధురమై అత్యంత ప్రౌఢముగా ఉండును

నీతిశతకములు ఇవి మానవ సంఘమునందలి వివిధ వ్యక్తులకు సంబంధించిన నీతులతో కూడి పూర్వగ్రంథములు లోకానుభవము ఆధారములుగా రచింపబడినట్టివి ఇందు రాజనీతి గృహనీతి లోకనీతి ప్రవృత్తినీతి ముఖ్యములైనవి నీతి శతకములలో కాలమునుబట్టియే కాక గుణవిశేషమును బట్టియు మొదట పేర్కొనదగినది సుమతీశతకము దీనిని క్రీ శ 13 వ శతాబ్దియందుండిన బద్దెన (భద్రభూపాలుడు) రచించెనని కొందరును వేములవాడ భీమకవి రచించెనని మరికొందరును సుమతి అను జైనకవి ఆత్మసంబోధన పరముగా రచించెనని ఇతరులును తలంచుచున్నారు ఇందు రాజనీతి, గృహనీతి లోకనీతి సర్వసుబోధమును జాతీయమును ఐన శైలిలో కందపద్యములలో చెప్పబడినది ఇందు కవి ప్రదర్శించిన లోకానుభవము అప్రతిమానమైనది చదువుసేర్చిన తెలుగు వారిందలి ఒకటి రెండు పద్యములైనను ఎరుంగకుండరు శాళ్వపాక పెదతిరుమలాచార్యుడు (16 వ శతాబ్ది) వేంకటేశ్వర శతకమును సీసపద్యములలో రచించెను ఇందు లోకనీతి రాజనీతులతోపాటు భక్తిభావములును వర్ణింపబడినవి ఇది తరువాత వెలసిన పెక్కు నీతిశతకములకు మార్గదర్శకమైనది "శరభాంగ లింగశతకము"న శివభక్తుల ప్రశంసతోపాటు జన హితకరములగు పెక్కు నీతులుకూడ వివరింపబడినవి ఇందు కవి తన కాలమున జనులలో వ్యాపించిన మూఢవిశ్వాసము లను నిరసించినాడు మలతుంపారమున ఉదాహృతమైన శరభాంకుని చాటుధారను రచించిన శరభాంకుడే దీనినికూడ రచించి ఉండునని విమర్శకుల తలంపు

ఆంధ్రదేశమున బహుళ ప్రచారమందిన నీతిశతకము లలో మారద వెంకయ్య రచించిన భాస్కరశతక మొకటి ఇందు ప్రతిపద్యమున ఒక నీతియు తదనుగుణమైన లోక దృష్టాంతములును చెప్పబడినవి ఇందలి దృష్టాంతములు కవికి గలఅపారమైన లోకానుభవమును చాటుచున్నవి ఇందలి శైలి సులభమయ్యు శక్తిమంతముగా ఉండును అప్పకవీయమున ఇందలి పద్యములు కొన్ని ఉదాహృతములై ఉండుటచే ఇది 17 వ శతాబ్దికి ముందే రచింపబడిందని చెప్పవచ్చును

చంద్రశేఖరశతకము ' నీతినాస్య సమ్మిళితమైఉన్నది

దీనిని ఎవరు రచించిరో తెలియదు మంగళగిరిపాన కాలిస్వామి జాతరలో జరుగు సామాన్య సంప్రసంగము లిందు హాస్య ధోరణిలో ఆ జనుల భాషయందే వర్ణింపబడినవి కవి ఇందు స్వార్థపరులైన లోభులను మిక్కిలిగ నిందించియున్నాడు వరాహగిరి కొండి రామామాత్యుడు రచించిన "జగన్నాయక శతకము భాస్కరశతకము వలెనే నీతులతోడను దృష్టాంతములతోడను కూడియుండును ఇది వరాహగిరిజగన్నాథ స్వామికి అంకితము చేయబడి ది

కవిసార్వభౌమ బిరుదాంకితుడైన కూచిమంచి తిమ్మకవి (1700 60) ఎరాపురమునందలి కుక్కుటేశ్వరస్వామికి అంకిత ముగా కుక్కుటేశ్వరశతకము 'ను రచించెను ఇది సీసపద్య మయమైనది అతనితమ్ముడు సూరకవి (1730 80) రచించిన "రామ లింగేశ్వర శతకము కూడ సీసపద్యములతో కూడి నీతి మయమై ఉండును ఈ రెండుశతకములందును భోగలాలసు లును అధర్మప్రవృత్తులు నగు ధనికులయు ఋ పతులయు దుశ్చర్యలు నిరసింపబడినవి ఆరోజులలో ఖ్యాతులైన విజయ నగర మహారాజు పక్షమున రాజ్యవ్యవహారములు సాగించుచు దేవబ్రాహ్మణవృత్తులకు హాని కలిగించుచుండిన సీతారామ రాజు కు హితుపదేశము చేయు ఉద్దేశముతో సూరకవి "రామ లింగేశ శతకము ను రచించె నని చెప్పుదురు

ఆధునికులైన అయ్యలకోట పార్థసారథిసెట్టియు వేంకట నరసింహకవియు రచించిన కుమార కుమారీశతకములు బాల బాలికలు నేర్వదగిన నీతులకు నిలయములై పాఠశాలలం దధిక మైనప్రచారమును పొందుచున్నవి పైని పేర్కొనబడిన నీతిశత కములలో కొన్నిమాత్రమే సాధారణముగ శతకములన్నింట ఎడనెడ కొన్ని నీతులు వివరింపబడుచునే ఉండును సుప్ర సిద్ధుడైన వేమనయోగి రచించిన బహుసహస్ర సంఖ్యాకము లైన ఆటవెలది పద్యములలో నీతిమయములు నిందామయ ములు తత్త్వబోధకములు దోషనిరాసకములు నగు అనేక ములు కలవు

తత్త్వశతకములు : ఉపనిషత్ప్రతిపాదితములైన తత్త్వ విషయములను సామాన్య జనులకుకూడ సుబోధము కావించు తలంపుతో కొందరు కవులు వానిని తేట తెలుగున శతక రూపములో వివరించి ఉన్నారు సామాన్యముగా శతకము లన్నింట అచ్చటచ్చట తత్త్వవిషయములుకూడ వివరింపబడు చునేయుండును జగన్మిథ్యాత్వమును ఆత్మనిత్యతను బోధించు తత్త్వశతకములు తెలుగున పెక్కులున్నవి వానిలో గేయరూప మైన నారాయణశతకము ప్రాచీనమైన ఇది యెవ్వనికర్తృ కమో తెలియదు భగవద్భక్తులందరి కస్త్వరవ ... లందు సర్వసుబోధమైన శైలిలో వివరింపబడినవి ఇట్టి గేయరూప మున రచితమైన మరొక శతకము రామ రామ శతకము ఇందు నూటాయు చరణములున్నవి దీనిని రచించినవాడు తోటవేంకటనరసింహకవి ఇందు సంసారోత్పత్తి సంచిత కర్మ ముద్రా యోగాది విషయములు మృదుమధురమైన భాషలో వెల్లడింపబడినవి పరమానందయతీంద్రుడు శివముకుంద పరమానందా అనుమకుటముగల శివముకుందశతకము ను సంపగిమన్నా' అను సంబోధనతో కూడిన సంపగిమన్న శత కము ను రచించెను ఈ రెండును కందపద్యములతో కూడి నవే శివముకుంద శతకమున హరిహరాద్వైతమును సగుణ నిర్గుణ స్వరూపమును వివరింపబడినవి అద్వైతమతాను సారముగ రచింపబడిన సంపగిమన్నశతకమున కవి యోగా భ్యాసము మోక్షప్రాప్తికి ముఖ్యసాధన మనియు దానిని విడిచి హేయములైన ఆచారములను అనుసరించుటవలనను ధూర్తులైన గురువుల నాశ్రయించుట వలనను లాభము లేదనియు తెల్పియున్నాడు వేదాంతబోధనమునందే కాక కవితా రచనమందును కవి ఇందు చాల కౌశలము ప్రదర్శించి ఉన్నాడు అతడు పై రెండు శతకములనే కాక దత్తాత్రేయ శతకము ను కూడ రచించినట్లు తెలియుచున్నది

సదానంద యోగి రచించిన "నవ్యతరభోగి శ్రీ సదా నంద యోగి అను మకుటముగల సదానంద యోగిశతకము" లోకుల దురాచారములను కపటయోగుల దంభములను కష్టీనుల ఔద్ధత్యమును సరసముగా ఖండించుచున్నది తేట గీతి పద్యములలో వ్రాయబడిన ఈశత ము ఎడనెడ స్వతంత్ర ప్రయోగములతో కూడినదయ్యు మిక్కిలి ప్రౌఢముగా ఉన్నది తాడేపల్లి పానకాలరాయ వి (18 వ శతాబ్ది) 'మనసా ! హరిపాదము లాశ్రయింపుమా" అను మకుటము గల "మానస బోధ శతకము"ను "చిత్తబోధ శతకము' ను రచించెను భక్తివైరాగ్య భావభరితములైన ఈరెండు శతక ములును చక్కని దృష్టాంతములతోకూడి కవితత్త్వపరిణతిని, లోకానుభవమును చాటుచున్నవి

వేమనయోగి రచించిన ఆటవెలది పద్యములలో తత్త్వ బోధకములైనవి చాలకలవు వానిలో ధాతువాద, రసవాద

సిద్ధాంతములను వివరించునవి కూడ కొన్ని ఉన్నవి. అతడు సుపరిచితములైన తాత్త్విక పారిభాషిక పదములకు బదులు స్వకపోలకల్పితములైన క్రొత్తపదములను వాడి ఉండుటచే కొన్ని పద్యములు దురవగాహములుగా ఉన్నవి. తత్త్వప్రధానములైన శతకములను రచించిన వారింకను పలువురు గలరు.

వ్యాజస్తుతి శతకములు : స్తుతిలో నింద కాని నిందలో స్తుతి కాని అంతర్గతమై ఉండుటకు వ్యాజస్తుతి అని పేరు. దేశము పరశోషకారులయు ధూర్తులయు అత్యాచారములకు గురియై ఆపత్సముద్రమున మగ్నము కానున్నప్పుడు భగవంతుడుపేక్ష వహించి ఊరకుండుట ఉచితము కాదనియు, అతడు కరుణ వహించి దేశమును భక్తులను కాపాడవలెననియు తీవ్రమైన ప్రబోధము కావించుచు కొందరు కవులు రచించిన శతకములు వ్యాజస్తుతితో కూడిన్నవి. పైకి భగవంతుని నిందించుచున్నట్లు కనిపించు ఆ శతకములలో భక్తిభావము అంతర్వాహినిగా ప్రవహించుచునే ఉండును. వీనివలన అప్పటి రాజకీయ మత సాంఘిక పరిస్థితులను తెలిసికొనవచ్చును.

వ్యాజస్తుతి శతకములలో మొదట పేర్కొనదగినది గోగులపాటి కూర్మనాథకవి (18వ శతాబ్ది ఉత్తరభాగము) రచించిన "సింహాద్రి నారసింహశతకము". యవనసేనలు సింహాద్రిపై కెక్కి సింహాచల క్షేత్రమును కొల్లగొట్ట యత్నించినప్పుడు భక్తుడైన కవి భగవంతుని అగ్రభాగమున నిల్పి దేశమును ప్రజలను కాపాడవలెనని ప్రబోధించియుండెను. ఇందలి పద్యములు జనుల కడగండ్లను, కవి ఆవేశమును చక్కగా సూచించుచున్నవి. "వైరిహరరంహ సింహాద్రి నారసింహ" అనునది ఇందలి మకుటము. ఇందలి సీసములు చక్కని జాతీయములతోడను సరసములైన సామెతలతోడను తీవ్రములైన ఉపాలంభములతోడను కూడి రమ్యములుగా ఉండును. భక్తుని ఉపాలంభములను సహింపలేక సింహాచలస్వామి కందిరీగల రూపమున ఆవిర్భవించి దుష్టులైన శత్రువులనుపటాపంచలొనరించి ఆలయమును జనులను వారి బారినుండి కాపాడెనని చెప్పుదురు. కూర్మనాథకవి "సుందరీమణి" అను మకుటముతో మరొక సరసమైన శతకమునుకూడ రచించెను.

క్రీ. శ. 18వ శతాబ్దిలో ధంసా అను యవననాయకుడు బెల్లంకొండపై దుర్గమును నిర్మించి భద్రాచలముపై దండెత్తి ప్రజలకును భక్తులకును అపారమైన క్లేశము కలిగించెను. శత్రువులు దేవాలయమునందలి విగ్రహములను ధ్వంసము చేయుదురేమో అను భీతిచే అర్చకులు వానిని పడవలపై పోలవరము చేర్చిరి. అప్పుడు భల్లా పేరయ్య అను కవి "ప్రజలందరును శత్రువుల క్రౌర్యమునకు పాల్పడి బాధపడుచుండ నీవు పోలవరమున సుఖముగా కూర్చుంటివా! వారు నిన్నును విడువ" రని నిష్ఠురములాడుచు నిందాస్తుతిమయమైన భద్రగిరి శతకము నరచించెను. విగ్రహములు పోలవరమున సుమారైదేండ్లుండెను. వాని నర్చకులు పోలవరమునకు చేర్చు సమయమున కవి శతకమును వ్రాయ నారంభించి మరల వానిని భద్రాచలమునకు తెచ్చునప్పటికి ముగించినట్లు తోచుచున్నది. యవనుల దుండగములు చూచి కవి పొందిన పరితాపాతిశయమును వెల్లడిచేయు ఇందలి పద్యములు మనోబోధములయ్యు తీవ్రములై అలరారుచున్నవి.

కృష్ణాతీరమునందలి శ్రీకాకుళ గ్రామమున కల ఆంధ్రవిష్ణు దేవాలయము పగదలకు పాలై పూజాపురస్కారములు లేక శిథిలావస్థలో ఉండుట చూచి తద్గ్రామవాసి యైన కాసుల పురుషోత్తమకవి (1790) నిందాస్తుతిపూర్వకముగా "చిత్ర చిత్ర స్వభావ! దాతృత్వభావ! హతవిమతజీవ! శ్రీకాకుళాంధ్రదేవ!" అను మకుటముతో ఒక సీసపద్య శతకమును రచించెను. ఇందు కవి ప్రదర్శించిన ఉపాలంభకౌశలమును వ్యంగ్య చమత్కారములను అద్భుతములైనవి. ఈ శతకమందలి కవిత్వము సులభజాతీయోక్తులతో కూడి ధారాశుద్ధి శోభితమై మిక్కిలి హృద్యముగా ఉండును. ఈ పురుషోత్తమ కవియే మానసబోధ శతకము, హంసలదీవి గోపాలశతకము, "భక్తకల్పద్రుమ శతకము" అనువానిని కూడ రచించెను.

నిందాస్తుతి పూర్వకములు కాకపోయినను తత్కాల చరిత్రాంశములను తెలుపు చారిత్రకశతకములు కొన్ని ఉన్నవి. ఔరంగజేబు వారణాసిలో మసీదు కట్టించిన సందర్భమున వెల్లూరి విస్సన్న రచించిన 'విశ్వేశ్వర శతకము'ను, రాచూరి లక్ష్మణదాసు రచించిన "శ్యామలాంబాశతకము"ను, వేంకటాచల విహారశతకము"ను, మట్టుపల్లి నృసింహశతకము'ను అందు ముఖ్యమైనవి.

"గోపాలకృష్ణమూర్తి శతకము"న ఒక ప్రసిద్ధ వ్యక్తి జీవితము వర్ణితమైనది. కీ. శే. మండపాక పార్వతీశ్వరశాస్త్రి "హరిహరేశ్వర శతకము"ను (ఆత్మ సపర్యాశరత్న)

శ్రీ కొక్కొండ వేంకటరత్నం పంతుల "బిల్హణీయము"ను స్వీయచరిత్రాత్మకము లైనట్టివి.

శృంగార హాస్య శతకములు: పూర్వము కొందరు కవులు శృంగార భక్తిరస మిశ్రితములైన శతకములు రచించిరి. వానిలో అన్నమయ్య "అలమేలుమంగ శతకము" ను, అన్నమాచార్యుల వేంకటేశ్వర శతకము ను పేర్కొనదగినవి. కేవలశృంగార రసమయములైన శతకములలో పెక్కు విప్రలంభ శృంగారాత్మకములై యుండెను. ఇందు విరహిణి యగు నాయిక నాయకుని తోడితెమ్మని దూతికచే సందేశము పంపుట ముఖ్యవిషయము. కలువాయి శతకము, "రాజగోపాల శతకము" మున్నగునవి ఇట్టివి. లావణ్యశతకము ను "సుభద్రానీశతకము" ను పురుషవిరహసంబంధులు. గోపీనాథ వేంకటకవి "బ్రహ్మానంద శతకము" సంభోగ శృంగార వర్ణనాత్మకమైనది.

హాస్యరస ప్రధానములైన శతకములలో రాయభట్టు వీరరాఘవకవి రచించిన "వేణుగోపాల శతకము"ను, "చంద్రశేఖర శతకము"ను, "కామాడప్ప శతకము"ను ముఖ్యములైనవి.

నిఘంటు శతకములు: కొందరు నిఘంటుకర్తలు తమ తమ ఉపాస్య దైవములను సంబోధించుచు నిఘంటువులను సీసపద్య శతకములుగా రచించిరి. ఇవన్నియు అచ్చతెనుగు నిఘంటువులే. గణపవరపు వేంకటకవి వెంకటాచల వనీ శాశ 'వేంకటేశ' అను మకుటముతో రచించిన వేంకటేశాంధ్రము ను, కస్తూరిరంగకవి సకలసుర చక్రవర్తి శ్రీసాంబమూర్తి అను మకుటముతో రచించిన సాంబనిఘంటువు ను, సుదురుపాటి వెంకన మాతృభూత జగత్త్రియీ మాతృభూత అను మకుటముతో రచించిన ఆంధ్రభాషార్ణవము ను ఈజాతికి చెందినవి.

అనువాద శతకములు: సంస్కృతమునందలి సౌందర్యలహరి, శివానందలహరులను, అమరుకమును, సూర్యశతకము ను, మహిషశతకమును, భర్తృహరి సుభాషిత త్రిశతిని, నీలకంఠ దీక్షిత నీతిశాస్త్ర రత్నావళి త్రిశతిని, మూకపంచశతిని పలువురు కవులాంధ్రీకరించియుండిరి. వీనిలో ఏనుగు లక్ష్మణకవి తెనిగించిన సుభాషితత్రిశతిలో మాత్రమే "సురభిమల్లా! నీతివాచస్పతీ" అను మకుటము కనవచ్చుచున్నది. మిగిలిన శతకానువాదములలో ఆంధ్రీకర్తలు మకుట నియమమును పాటించి ఉండలేదు.

ఇతర శతకములు: పైని పేర్కొనబడినవేకాక ఇతరములైన శతకములను పెక్కున్నవి. శ్రీ అదిభట్ల నారాయణదాసు వేల్పువంద (సంపోచల నారస హాశతకము) యను శ్రీదాసు శ్రీరాములు పంతుల చక్కట్లగండయును అచ్చ తెనుగు శతకములు. భట్టుకులమునకు చెందిన కన్నెమొయిళి చంద్రరాజు, పిరిపాటి రామచంద్రరాజు అనువారు "రమేశ! కేశవా!" "జామిషరిజనార్దనా!" అను మకుటములతోచాటు శతకములను రచించిరి. వంగూరి నరసకవి ప్రసన్నరాఘవ శతకము న రామాయణ కథ అంతను ఇమిడెను. ఆది భాగ శతకము ఆనందగజపతిప్రభువు సతీమణి సంతస మొసంగు సత్యవ్రతిన్ అను సమస్య నిచ్చి శతకరూపమున పూరింపు మనగా ఐదార్గురు కవులు సత్యవ్రతిశతకములను రచించిరి. అనుభవ రసకందళికగు ననటొప్పగదా అను మకుటముతో కూడిన శతకము కూడ ఇట్టిదే. వీనిని సమస్యా శతకములని చెప్పవచ్చును. జంతువులను సంబోధించుచు వ్రాయబడిన శతకములలో విశ్వాల రంగాచార్యుల శార్దూలశతకము ను, భమిడిపాటి రామసోమయాజుల "కుక్క శతకము" న్ను, భోయి భీమన్న ఎల్లిశతకము ను పేర్కొనదగినవి. వన్నాల సీతారాము బ్రహ్మశాస్త్రి పూచికపుడకను గూర్చియు, త్రిపురాన తమ్మయకవి నిగ్గును గూర్చియు శతకములను రచించిరి. దైవస్తుతి పూర్వకము లైన శతకములవలెనే మానవస్తుతి పూర్వకములైన శతకములుకూడ కొన్ని ఉన్నవి. ఇందు కవులు ప్రభువు లను సామంతులను మిత్రులను అధికారులను స్తుతించియుండిరి.

కొందరు శతకకవులు తమ శతకములను దశకములుగాను వింశతులుగాను విభజించి ఉండిరి. నారాయణ శతకమున అవతార దివ్యరూప నామదశకములు, కృష్ణావతారవింశతి, జ్ఞానవింశతి, మోక్షవింశతి అను విభాగములు కలవు. పైడిపాటి నృసింహకవి రామచంద్ర శతకమునను, దాశరథి శతకము ను మరికొన్ని శతకములందును దశకవిభాగము కనవచ్చును. కొటికలపూడి కోదండరామకవి 318 పద్యములతో కూడిన జానకీరామ త్రిశతిని మూడంకములుగా విభజించెను.

ఆంధ్రమున శతక వాఙ్మయమున కొక ప్రత్యేకస్థాన మున్నది. ఈ శతకములు స్వచ్ఛంద భావప్రకటనమునకును ధారాశుద్ధికిని లలిత మధుర జాతీయ పదప్రయోగమునకును పేరుగాంచినట్టివి. కొందరు కవులు శతకములలో అపారమైన లోకానుభవమును, తత్కాల ప్రవృత్తి విజ్ఞానమును, బహుశాస్త్ర పాండిత్యమును నిర్మలమైన భక్తిని ప్రకటించియుండిరి.

ఆంధ్రులు మొన్న మొన్నటివరకును బాలబాలికలచే ఉత్తమము లైన శతకములను వల్లింపజేయుచుండిరి ఇప్పుడా అలవాటు క్రమముగా తగ్గుచుండుట శోచనీయము కొన్నిశతకములు ప్రసిద్ధ కావ్యములవలెనే కళా కౌశలమునకును పాండితీ ప్రౌఢిమకును పట్టుగొమ్మలై సారస్యమాధుర్యములకు నిలయములై చదివినకొలంది చదువవలెనను ఉత్కంఠ రేకెత్తించుచుండును

ది. వేం

## కళావధానము (సాష్టావధానము)

అవధాన మొక సారస్వత వినోదప్రక్రియ. ఇది పశ్చిమ దేశముల కపరిచితమైనది. భారతదేశమందైనను ఇది ఆంధ్ర ప్రాంతమునందే పరిశాఖ బొందజాలినది. దీనిని జయప్రదముగా నిర్వహించుటకు అపూర్వమైన జ్ఞాపకశక్తి, ఆశుకవితా కౌశలము, సద్యఃస్ఫూర్తి అవశ్యకములు. అవధానములు పలురకములుగ నుండును. వానిలో అష్టకళావధానములే తరుచుగా చేయబడుచు బహుళప్రచారమును బొందినవి.

అవధానమనుపదము 'అవ' అను ఉపసర్గతోకూడిన 'ధా' ధాతువునుండి ఏర్పడినది. దానికి ఏకాగ్రత లేక తత్పరత అని యర్థము. ఏకాగ్రతాభంగహేతువు లెన్ని ఉన్నను మనస్సును అన్యథాచలింపనీయక అవశ్యక విషయముపై కేంద్రీకరించి ఉంచుట అందు ముఖ్యకర్తవ్యము. అవధానము కలవాడు అవధాని. తొలుదొల్త ఈ పదము వేదవిద్వాంసులకు మాత్రమే వాడబడుచుండెను. వేదపఠనమున స్వరమునకును వర్ణములకును అధికమైన ప్రాధాన్యము కలదు. వేదోచ్చారణ సందర్భమున స్వరవర్ణములందెట్టి లోపమొదవినను అభీష్టసిద్ధి కాకుండుటయే కాక ప్రత్యవాయముకూడ కలుగునని ప్రాజ్ఞులు చెప్పుదురు. "మంత్రో హీనః స్వరతో వర్ణతో వా మిథ్యా ప్రయుక్తో న తమర్థమాహ । స వాగ్వజ్రో యజమానం హినస్తి యథేంద్రశత్రుస్స్వరతో౽పరాధాత్" అనునది ఇందుకు తార్కాణము. అట్టి ప్రత్యవాయమునకు అవకాశము లేకుండుటకై వేదపండితులు వేదమంత్రోచ్చారణ సందర్భమున, స్వరవర్ణముల విషయమున అధికమైన తత్పరత లేక అవధానము వహింతురు. అందుచే అవధాని పదము వారి ఎడ సార్థకమైనది.

అవధాన కళ క్రమముగా వేదరంగము నుండి సాహిత్య రంగమునకు కూడ ప్రాకి అధికగౌరవ ప్రచారము అందినది. వామనుడను లాక్షణికుడు అవధానమును చిత్తైకాగ్ర్యమని నిర్వచించి దానిని కవితా సహాయములలో ఒకటిగా చేర్చెను. ఉత్తమ పద్యములు రచించు నప్పుడు కంటె కూడ అవధాన ప్రక్రియకు అధికతరమైన చిత్తైకాగ్ర్యమవసరము. ఒకే సమయమున ఎన్నివిషయములపై చిత్తము ఏకాగ్రముగా నుంచబడునో ఆ విషయముల సంఖ్యనుబట్టి అష్టావధానము శతావధానము సహస్రావధానము అను నామములు ఏర్పడినవి.

అష్టావధానమనగా ఒకేసమయమున ఎనిమిది విషయములయెడ లేక కార్యములయెడ చిత్తమును ఏకాగ్రమొనరించుట. ఈ ఎనిమిది ఏవి యనువిషయమున అభిప్రాయభేదములున్నవి. కవిత్వము, కావ్యపాఠము, శాస్త్రార్థము, పురాణములో గాథ, రామాయణము, చదరంగము, వ్యస్తాక్షరి, పుష్పగణనము అనునవి ఎనిమిదియు అష్టావధానమున ప్రసక్తములని సంప్రదాయజ్ఞులు చెప్పుదురు. సమస్యాపూరణమును వర్ణనమును కవిత్వము నందంతర్భవించుననిరయే ఒక్కొకప్పుడు ఘంటాధ్వని గణనము పుష్పగణనము స్థానమును ఆక్రమించును. కొందరవధానులు పై ఎనిమిదింటిలో కొన్నిటిని తొలగించి, వానిస్థానమున దత్తపది నిషిద్ధాక్షరి ఈయబడిన ఇంగ్లీషు తేదికి సరియైన వారమును చెప్పుట యాంత్రికచిత్రము లేక గణితచాతుర్యము మున్నగు వానిని ప్రదర్శింతురు. అవధానులు తమతమ అభిరుచి కౌశలమును బట్టి ఆ ఎనిమిదింటిని నిర్ణయించుకొందురు. తిరుపతి వేంకటేశ్వరకవులు అష్టావధానమును చెప్పుడు ఈ క్రింది శ్లోకమున వివరించియుండిరి.

"కావ్యాక్షీ కవితోక్తి రంచిత కళావిద్భిస్సదాభాషణం
పౌరాణోక్తిరమంద లౌకికగిరః వ్యస్తాక్షరోక్తి భ్రమం
ధీమద్భిశ్చతురంగఖేలన మహాసంఖ్యేయ పుష్పాశయః
యస్మిన్ స్యాద్యుగపత్త దేవకృతి నామష్టావధానాభిధం

పయి ఎనిమిది కార్యములను ఒకదాని తరువాత ఇంకొకటిగా చేయుటలో అంత కష్టములేదు. కాని వానిని అన్నిటిని ఏకకాలమున ఒనరించుట చాల క్లేశకరము. సాధారణముగా అవధానియు ఎనమండుగురు పృచ్ఛకులును సభారంగమున వేదికపై కూర్చుందురు. ఆరంభముననే పృచ్ఛకులందరును తమతమ ప్రశ్నలను ఒసంగుదురు. అవధాని వానికి సమాధానములు చెప్పుటకు ఆరంభించును. ఆ సమాధానములను అతడు పద్యములలో చెప్పును కావున మొదలు వరుసగా పద్యము లందలి మొదటిపాదములనే చెప్పును. అవి చెప్పుటచే అతడు

సందర్భమునకు ఎట్టి భంగమును కలుగకుండ చదరంగమాడు చుండును పురాణము చెప్పుచుండును లోకాభిరామాయణ మునకు నియుక్తుడైన పృచ్ఛకుని ప్రశ్నలకు సరసముగా సమాధానములు ఒసంగుచుండును పండితులతో శాస్త్రవాదము చేయుచుండును క్రమముగా అతడు పద్యమందలి ద్వితీయ తృతీయ చతుర్థపాదములను కూడ చెప్పి తుదకు పదసమాసాదు లందెట్టి వ్యత్యాసము లేకుండగనే ఒక్కొక్క పద్యమును పూర్తిగా పఠించును పైని పేర్కొనబడినవానిలో ఏ ఒక్కటి సరిగా నిర్వహింపజాలక పోయినను అది అవధాన భంగమునకు కారణమగును

కవిత్వములో ఒక భాగమైన సమస్యాపూరణము మిక్కిలి హృద్యముగా నుండును పృచ్ఛకుడు పద్యమునందలి చివరి పాదమును సమస్యగా ఒసంగును అది వాక్యరూపమునందే ఉండును కాని యథాతథముగా పరిశీలించినచో కొంత విపరీతార్థము కలిగించుచుండును అవధాని ఆ అర్థవైపరీత్యము తొలగునట్లుగా పైమూడు పాదములను చెప్పి దానిని అర్థవంతముగా సరసముగా ఒనరింపవలెను అట్లు చేయుటకు సద్యఃస్ఫూర్తియు అపారములైన అభ్యాస కౌశలములును అవసరములై ఉండును ఈ ఉదాహరణమును పరిశీలింపుడు:

"అంధుం డర్ధనిశీథమందు గనె నయ్యర్కేందు బింబంబులన్"

అనునది ఒక సమస్య గ్రుడ్డివాడు అర్ధరాత్రమున సూర్యచంద్ర బింబములను చూచెనని దానికి అర్థము గ్రుడ్డివాడు చూడగల్గుట అందును అర్ధరాత్రమున చూడగలుగట సూర్యుని గూడ చూడగలుగుట అసంభవములగుటచే పైపాదము నిజముగా సమస్యగానే ఉన్నది తిరుపతి వేంకటకవులు దానిని

> పుంభావోన్నత సరస్వతీ కవులతో భూపాలకుండాదిత
> యాంధ్రస్త్రీజనగర్భ సంభవుల సద్వ్యాప్తి వర్ణించిన
> గ్గ్రంథంబుల్ రచియింపుడీ యనిన తద్గ్రంథాను సంధానని
> ద్రాంధుం డర్ధనిశీథమందు గనె నయ్యర్కేందు బింబంబులన్

అని పూరించిరి తద్గ్రంథానుసంధాన నిద్రాంధుడనుటతో పూర్వపు అసందర్భత్వము అంతయు తొలగిపోవుటయు హృద్యమైన అర్థమేర్పడుటయు సంభవించినది సమస్యాపూరణము అవధాని కెంత క్లేశకరమో సభ్యులకు అంత ఆనందకరము

వ్యస్తాక్షరి అనునది కష్టసాధ్యమైనది ఒక పద్యమునందలి కాని పద్యపాదమునందలి కాని అక్షరములను అన్నిటిని వేరు వేరు కాగితపు ముక్కలపై వ్రాసి వానిపై అక్షరక్రమమును అనుసరించి వరుసగా అంకెలు వేయుదురు పిమ్మట ఆ కాగితపు ముక్కలనన్నిటిని క్రమరహితముగా కలిపివేసి పృచ్ఛకుడు తన చేతికి వచ్చిన ముక్కను ఒక్కొక్కదానినే అప్పుడప్పుడు అవధాని కిచ్చుచుండును అవధాని దానిని చూచి మరల పృచ్ఛకుని కిచ్చివేయును అందలి అక్షరమును తత్సంఖ్యను జ్ఞప్తి యందుంచుకొని చివరకు ఆ పద్యమునో పద్యపాదమునో సక్రమముగా పఠించును ఈ ప్రక్రియను నిర్దుష్టముగా చేయుటకు అపూర్వమైన ధారణాశక్తి కావలయును

నిషిద్ధాక్షరి వ్యస్తాక్షరికంటెను ఎక్కువ కష్టసాధ్యమైనట్టిది పృచ్ఛకుడు అవధానిని ఏదైన ఒక విషయమును తన కిష్టమువచ్చిన వృత్తములో వర్ణింపుమని అడుగును అవధాని పద్యమును ఆరంభించి అందలి మొదటి అక్షరమును చెప్పును పృచ్ఛకుడు తరువాత ఆతడే అక్షరమును చెప్పునో గ్రహించి దానిని నిషేధించును ఒక్కొక్క అక్షరము చెప్పునప్పుడెల్ల అవధానికి ప్రాణకంటకముగా నుండును పృచ్ఛకుడు ఏదియో ఒక అక్షరమును నిషేధించినను అచ్చట అర్థభంగముకాకుండ ఇంకొక అక్షరమును చెప్పి పద్యమును సాగించుటలో అవధాని యొక్క నేర్పు గోచరించును ఇట్లు అక్షరములను అన్నిటిని చెప్పి అంతమున ఒతడు ఆ పద్యమును యథాతథముగా పఠింపవలయును

పృచ్ఛకుడు కొంచెము ఇంచుమించుగా సమానధ్వనిగల పరస్పర సంబంధములేని నాలుగు పదములను సూచించి అవి నాలుగు పాదములయొక్క ఆరంభమునందు వచ్చునట్లుగా తన కిచ్చవచ్చిన విషయమును వర్ణించుచు తనకు అభిమతమయిన వృత్తమును చెప్పుమని అడుగుటకు దత్తపది అని పేరు ఇది ఒక విధముగా సమస్యాపూరణమువంటిదే కాని అంతకంటె ఇంచుక క్లేశకరమైనది అవధాని ఆ నాలుగు పదములను ఉపయోగించుచు రమ్యమైన అర్థము పొసగునట్లుగా అడిగిన విషయమునే వర్ణించుచు ఒక్కొక్కపాదముగా నాలుగుపాదములను చెప్పి చివరకు తుద తత్పూర్వక పద్యమునంతను పఠింపవలెను

యాంత్రిక చిత్రము గణిత కౌశలమునకు సంబంధించినది ప్రృచ్ఛకుడు ఒక సంఖ్యను తెలిపి ఒక చదరములో నిలువుగను అడ్డముగను ఐమూలగను కూడినచో ఆ మొత్తము వచ్చునట్లు కొన్నిగళ్లలో అంకెలు పూరింపుమని అడుగును

దానికి జ్ఞాపకశక్తితోపాటు గణితప్రావీణ్యము కూడ అవసరము కొన్నిఎడల పెద్దసంఖ్యలకు సంబంధించిన సంకలన వ్యవకలన గుణకారములు యాంత్రిక చిత్రములయొక్క స్థానము నాక్రమించును

అష్టావధానమును సమగ్రముగా ఆచరించుటకు సాధారణముగా మూడు గంటల కాలము పట్టును ఇది ఒకవిధముగా శతావధానముకంటె కష్టతరమని అనుభవజ్ఞులు చెప్పుదురు శతావధానమున ఒకేసమయమున పలు కార్యములు నెరింపవలసినఆక్కర లేదు అట్లని శతావధానముకావించుట అత్యంతసులభమనియు భావింపరాదు వందమంది పృచ్ఛకులు ఇందు అవధానిని తమకు అభిమతమైన వృత్తములలో తమకు అభిమతములైన విషయములనుగూర్చి వంద పద్యములను చెప్పుమని అడుగుదురు అందు సమస్యలు వర్ణనలు మున్నగునవెన్నియో ఉండును అవధాని ఎవ్వరే ప్రశ్నను అడిగిరో జ్ఞాపకముంచుకొని వారికి ఆ సమాధానమును ఒసంగుచు మొదటఒక్కొక్క పాదమునే చెప్పవలయును అతడు ప్రశ్న విషయమునకాని వృత్తము విషయమునకాని పృచ్ఛకుని విషయమునకాని పొరపాటు పడకూడదు ఒక్కొక్కప్పుడు పృచ్ఛకులు తాము కూర్చుండు స్థలములను మార్చుచుండుటయు జరుగుచుండును ఇట్లొక్కొక్క పాదము చొప్పుననే చెప్పి చివరకతడు మూరు పద్యములను ధారణచేసి మొదట చెప్పిన విధముగనే పదములను మార్చకుండ మరల తెలుపవలయును అధికమైన జ్ఞాపకశక్తియు ఆశుకవితా కౌశలమును శతావధాన నిర్వహణమునకు అత్యంతావశ్యకములు దానిని సమగ్రముగా ఒనరించుటకు సుమారు పదునారు గంటల కాలము పట్టును అందుచే దానిని మూడు నాలుగు రోజులపాటు సాయంసమయములందు చేయుచుందురు

అవధాని పండితుడును, కవియును సమయానుకూల సరససంభాషణ చమత్కారకారియు కావలయును పృచ్ఛకులు కూడ పండితులై ఉందురు. కావున వారు పెక్కుభంగుల అతనిని తప్పుత్రోవ పట్టింప యత్నించుచుందురు అవధానికి అది ఒక పరీక్షకాగా ఇతరులకు వినోదప్రాయముగా ఉండును నిర్విఘ్నముగా నిర్వహింపజాలినప్పుడు అది విజయ ధవ గౌరవములను సమకూర్చుటకాని పొరపాటు కలిగినచో అవమానాపహాస్యములకు గురిచేయును

అవధానవిద్య ఆంధ్రమున అతిప్రాచీనమైనది జక్కన కవి "విక్రమార్క చరిత్రము"న తాను అవధానాశుకవిత్వములలో నిపుణుడనని చెప్పుకొనెను వసుచరిత్ర కర్త భట్టుమూర్తి ఘంటాశతగ్రంథకల్పనుడు ఏకైకదినప్రబంధ ఘటనాపారీణుడు చిత్రభారత కావ్యకర్తయగు చరిగొండ ధర్మన్న శతలేఖన్యవధాన పద్యరచనాసంధా సురత్రాణ బిరుదాంచితుడు ఆధునిక యుగమున సైతము ఆంధ్రమున పలువురు అవధానులున్నారు వారిలో శ్రీమాన్ మాడభూషి వేంకటాచార్యులు అగ్రగణ్యులు వారి అవధానప్రావీణ్యమును ఆరసియే తిరుపతి వేంకటకవులు ఆ విద్యను అలవరచుకొని పలు రాజాస్థానములందు ఆంధ్ర గీర్వాణభాషలు రెండింట అష్టశతావధానములను పలుపర్యాయములు ఒనర్చి దానిని జనసమ్మతమును ఆనందప్రదమును ఒనరించిరి వారి సమకాలికులును ఆంధ్రాస్థానకవులును ఐన కీ శే మధ్వశ్రీ కాశీ కృష్ణాచార్యులు అవధాని శిరోమణులు తిరుపతి వేంకటకవుల శిష్యులైన కీ శే శ్రీ వేలూరి శివరామశాస్త్రి గురువులనుండి అవధానకళను అభ్యసించి శతావధానులై అఖండప్రతిష్ఠను ఆర్జించిరి కీ శే ఎలుపాటి చిదంబరశాస్త్రి గాడేపల్లి వీరరాఘవశాస్త్రి మండపాక పార్వతీశ్వరశాస్త్రి కొప్పరపు కవులు శ్రీ తిత్ర్యంబకరావు మున్నగువారు సైతము పలుసార్లు పలుప్రదేశములందు శతావధానములను జయప్రదముగా నిర్వహించి కీర్తిగడించిరి శివభారత కావ్యకర్తలైన శ్రీ గడియారం వేంకటశేషశాస్త్రియు, రాణాప్రతాపసింహ కావ్యకర్తలైన దుర్భాక రాజశేఖర శతావధానియు జంటకవులై శతావధానము లాచరించి 'అవధాని పంచానన' బిరుదమును ఆర్జించిరి కొప్పరపు కుమారకవులు అవధానముల నొనర్చుచు కుటుంబగౌరవమును నిలబెట్టజాలిరి శ్రీ గౌరిపెద్ది సుబ్బరామశాస్త్రి అవధానం చంద్రశేఖరశర్మ సి వి సుబ్బన్న శతావధాని డా కె యల్ వి ప్రసాదరావు ప్రభృతులు ఇప్పుడు కూడ అవధానములను కావించుచు ఆ విద్యను సమర్థతతో ఆరాధించుచున్నారు

ఆంధ్రదేశమున అష్టశతావధానులే కాక, సహస్రావధానులు పంచసహస్రావధానులు కూడ ఉన్నారు శ్రీజంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి సప్తతి పూర్తియైన పిమ్మటకూడ సహస్రావధానములను కావించుచున్నారు పోషకులు అభిమానులు ఉన్నచో వారు పంచసహస్రావధానమును కూడ ఒనరింపదగుదురు

అవధానములందలి విశ్వము ఆశుకవిత్వ మగుటచే అది కావ్యాకలి కానందజనకమైనను అంత రసవంతముగా ఉండదని కొందరి అభిప్రాయము. ఆశుకవిత్వమున వ్యర్థపదములు ఎక్కువగా చొచ్చుట కవకాశ మున్నమాట సత్యమే కాని సమర్థులైన కవులు ఈ కళను అభ్యసించుచో అందలి లోపము ఒను తగ్గించి అంగలి కవిత్వమునుకూడ రసమును హృద్యము కావింపజాలుదు రనుటకు సందేహములేదు

తిరుపతి వేంకటకవులు ఒకప్పుడు శతావధానము సర్కసుతో పోల్చియుండిరి మస్తిష్క వ్యాయామములకును ఆట వెలది తేటగీతులకును నిలయమగుటచే శతావధానము నిజముగా సర్కసువంటిదే కాని అది కేవల దైహిక ప్రక్రియ కాక మానసిక ప్రక్రియ అగుటచే సర్కసుకంటెను ఎక్కువ ఆనందజనకమై అలరారును

అవధానమున నేత్రావధానము నాట్యావధానము మున్నగు రకములుకూడ కలవు వానినిచేయు విధానములు భిన్నములైనవి శ్రీ ధారా రామనాథశాస్త్రి శ్రీ వి వి సత్యనారాయణమూర్తి నాట్యావధానమును నిపుణతతో నిర్వహించుచున్నారు నేత్రావధాన మిప్పుడు నామమాత్రావశిష్టమై ఉన్నది

అవధానము వట్టి వినోదము కాదు అది కవితా పాండిత్యములకు కట్టుగొమ్మ యైన సరసవినోదము ఈ సరసవినోదము కళావిశేష మగుటచే ఎక్కువలకు నిగళిత వేద్యాంతరమైన ఆనందమును సమకూర్పగలుగుచున్నది ఇటీవల సరియైన పోషణ ప్రోత్సాహములు లేమిచే అవధానకళ క్రమముగా క్షీణించుచు కొనవూపిరితో ఉన్నది ఆంధ్రదేశమునకు ప్రత్యేకమై ఆంధ్రుల ధారణాశక్తికి నిధానమైన ఈ కళను ఆంధ్రులును ఆంధ్ర ప్రభుత్వమును పునరుజ్జీవింప జేయవలసిన ఆవశ్యకత ఎంతైన ఉన్నది

ది వేం

## కల్యపృష్ఠములు (Echinodermata)

కల్యపృష్ఠములన్నియు సముద్రములలో మాత్రమే జీవించును అవి నేల మీదగాని నదులలోగాని జీవించజాలవు సముద్ర నక్షత్రము (Sea-Star), పెళుసునక్షత్రము (Brittle Star) సముద్రపు ముళ్ళ చిప్ప (Sea-urchin), సముద్రపు దోసకాయ (Sea-cucumber), సముద్ర పుష్పము (Sea-Lily) మొదలగు జంతువులన్నియు ఈజాతికిచెందినవే ఇవి సముద్రపు టడుగు భాగమున ఇసుకలోను రాళ్ళయందులలోను జీవించును వీటి దేహములు గట్టి ముళ్ళకవచములతో కప్పబడియుండును అందుచే వీటిని కల్యపృష్ఠములందురు ముళ్ళవంటివి వీటి శరీరములమీద పుట్టుచుండును వీటి శరీరములు కేంద్రవృత్తము (Radial Symmetry) కలిగియుండును వీటి అస్థిపంజరములు చిన్నచిన్న ఫలకములతో కూడియుండును వీటి శరీరములలో నీటినాళములు కలవు ప్రత్యేకమైన అవయవములుగా ఏర్పడియుండును ఇది కల్యపృష్ఠముల యొక్క ప్రత్యేకత ప్రథమదశలో ఇవి ద్విపార్శ్వ సౌష్ఠవము కలిగియుండును కల్యపృష్ఠములను పొడిచేసి దానిని మొక్కలకు ఎరువుగా నుపయోగింతురు కొన్ని దేశములలో వీటిని ఆహారముగా కూడ నుపయోగింతురు

కల్యపృష్ఠము ఐదు తరగతులుగా విభజింపబడినది

1 యాస్టరాయిడియా - ఉదా సముద్రనక్షత్రము
2 వోఫిరాయిడియా - ఉదా పెళుసునక్షత్రము
3 ఎకినాయిడియా - ఉదా సముద్రపు ముళ్ళచిప్ప
4 హోలోథురాయిడియా - ఉదా సముద్రపుదోసకాయ
5 క్రైనాయిడియా ఉదా సముద్రపుష్పము

సముద్రనక్షత్రము సముద్ర నక్షత్రములు సముద్రపు టడుగుభాగమున నివసించును వీటి శరీరము మధ్యగల ఫలకము నుండి ఐదుదిశలలో బలిష్ఠములైన సన్నని బాహుగములు వ్యాపించియుండును ఇవి చూచుటకు నక్షత్రమును బోలియుండును ఫలకము క్రిందిభాగమున మధ్యలో నోరుండును శరీరమంతయు చిన్నచిన్న పొలుసులతో కప్పబడియుండును శరీరముపై చిన్నచిన్న గట్టిముళ్లుండును ఈముళ్ల మధ్య అక్కడక్కడ చిన్న కత్తెరవంటి ఆయుధములుండును శరీరముపైన మలినపదార్థములు పడినచో వాటిని ఈ ఆయుధములు తీసివేసి శరీరమును శుభ్రముగా నుంచును శరీరముపై అక్కడక్కడ దారములవంటి సన్నని శ్వాసావయవము లుండును వీటి ఉపరితలముపై నొక చిన్నని గుండ్రని చిల్లుల ఫలకముండును సముద్రపునీరు ఈచిల్లుల ఫలకము ద్వారా దీని శరీరములో ప్రవేశించును దీని మీసములో గుసముండును

దీని అడుగు భాగమునగల నోటినుంచి ఐదు అంగముల లోనికి ఐదు సన్నని కాలువలుండును వాటికిరుపైపుల చిన్న గొట్టపు పాదములుండును ఒక్కొక్క అంగము చివర ఒక కన్ను, ఒక మీసమును ఉండును

ఈ సముద్ర నక్షత్రములలో అనేక రకములు గలవు ఉదా — యాస్టిరియస్ లూడియా లిన్‌సియా సోలాస్టర్ వొఫిరాయిడియా

పెళుసు నక్షత్రము పెళుసునక్షత్రములు కూడ సముద్రపు అడుగుభాగమున రాళ్ళసందులలోను ఇసుకలోను నివసించును వీటి శరీరమున కూడ మధ్య ఫలకముండి సన్నని పొడుగైన అయిదంగములు ఐదుదిశలలో విస్తరించియుండును ఈఅంగములు దేనికైన తగులుచో అవి విరిగిపోవును అందు చేతనే వీటికి పెళుసునక్షత్రములను నామము సార్థకమాయెను కాని విరిగినచోట వేరొక అంగము మొలచును ఫలకమునకు క్రిందిభాగమున మధ్యలో నోరుండును దీనికి గుదములేదు చిల్లులఫలకము శరీరపు ఉపరితలముపైగాక నోటికి సమీపములోనే ఉండుట వీటిప్రత్యేకత వీటిలో చిన్నకాలువలు కూడ లేవు అంగముల క్రిందిభాగమున గొట్టపుపాదములుమాత్రము గలవు వీటికి పైన చెప్పిన కత్తెరలవంటి ఆయుధములు లేవు ఐదు అంగములమీద చిన్నచిన్న ముళ్ళుండును వీటిలో అనేక రకములు గలవు

ఉదా ఓఫియోడెర్మా ఓఫియూరా యాస్ట్రోనిక్స్

సముద్రపు ముళ్ళచిప్ప ఇదికూడ సముద్రపు అడుగు భాగమున రాళ్ళసందులలోను ఇసుకలోను ఉండును వీటికి సముద్రనక్షత్రమువలె పెళుసునక్షత్రమువలె ఐదు అంగములు విడివిడిగా నుండవు అవి బంతివలె గోళాకారములోనుండును వీటిశరీరమంతయు దళసరివి గట్టివి పొడుగుపాటివినైన ముళ్ళతో కప్పబడియుండును వీటికొకవైపున చదునుగానుండి మధ్యనోరుండును దీని నోటిలో ఆహారమును చిన్నచిన్న ముక్కలుచేయుట కొక ప్రత్యేక అవయవముండుట దీనిప్రత్యేకత దీనికి ఐదు పళ్లుండును దీనినోటిచుట్టును ఐదుజతలగొట్టపు పాదములు ఐదుజతల శ్వాసావయవములు ఉండును ఉపరితలపై భాగమున గుదముండును శరీరముపైగల ముళ్ళ మధ్య అక్కడక్కడ కత్తెరలవంటి ఆయుధములు అనేకము గలవు పై ముళ్ళను తీసివేసినచో వీటిశరీరము ఒకగుండ్రని చిప్పవలె నుండును ఈ చిప్ప అనేక చిన్నచిన్న ఫలకములచే నిర్మింపబడినది ఈ సముద్రపు ముళ్ళచిప్పలలో మూడు రకములు గలవు కొన్ని గోళాకారములోనుండును వీటిని 'సీ అర్చిన్స్' అని యందురు కొన్ని గుండె ఆకారములో నుండును వీటిని 'హార్ట్ అర్చిన్స్' అనియందురు మరికొన్ని పలుచగా బిళ్ళలవలె నుండును వీటిని 'కేక్ అర్చిన్స్' అని యందురు వీటిలో గూడ చాలరకములుగలవు ఉదా ఎకైనస్ స్ట్రాంగైలోసెన్‌ట్రోటస్ క్లైపియాస్టర్ ఎకైనో కార్డియమ్

సముద్రపు దోసకాయ : ఇదికూడ సముద్రపు అడుగు భాగమున ఇసుకలో నుండునవే వీటి శరీరములు గుండ్రముగా లావుగా పొడుగుగా నుండును వాటికి ఒకకొన యందు నోరు వేరొకకొనయందు గుదము ఉండును వాటికి విడివిడిగా అంగములుగాని వాటిలోనికి పోవు కాలువలుగాని లేవు నోటిచుట్టును మీసములుండును శరీరముపై చిన్నచిన్న బుడిపెలుండును శరీరముపై నోటినుండి గుదమువరకు వరుసగా ఐదుజతల గొట్టపుపాదములుండును వీటిశరీరముపై కత్తెరలవంటి ఆయుధములుగాని ముళ్లుగాని లేవు వీటిలో కూడ చాల రకములుగలవు ఉదా హోలోథూరియా, సైనప్టా థైయోన్ యాక్టినోసైగా

సముద్రపు పుష్పము ఇవి సముద్రపుటడుగుభాగమున రాళ్ళకును ఇతర గట్టిపదార్థములకును కరచుకొనియుండును వీటికి మధ్య నొక ఫలకముండును ఈఫలకమునకు సన్నని, పొడుగైన ఐదంగములుండును ఒక్కొక్క అంగము రెండుగా చీలియుండును, అనగా మొత్తము పదిఅంగములుండును ఒక్కొక్క అంగమునకు చిన్నచిన్న కొనెలుండును ఫలకము మీద నోరు గుదము రెండును యుండును ఫలకముక్రింది భాగమున ఒక కాండముండును దీనితో ఇవి రాళ్ళను కరచుకొనును వీటిలో సన్నని కాలువలు కలవు వీటికరుపైపుల చిన్ననిగొట్టపు పాదములుండును

వీటిలో కూడ చాలరకములుగలవు

ఉదా యాంటిడాన్ మెటాక్రైనస్

జి హెచ్ ఆర్ క

## శాకీయ పునరుత్పత్తి : (Vegetative Reproduction)

జీవంతములగు మొక్కల పునరుత్పత్తి సాధారణముగా గింజలద్వారా జరుగుచుండును కాని సహజముగనో, కృత్రిమ పద్ధతులవలననో శాకీయ పునరుత్పత్తి జరుగు జీవంతములు చాలగలవు ఇట్టి శాకీయ పునరుత్పత్తి పుష్పరహితములగు ఉద్భిజ్జములలో నచ్చటచ్చట గానవగును వాటిలో

సాధారణముగా అలైంగిక పునరుత్పత్తి సామ్యగానుండును మొక్కయొక్క భాగములలో గింజలుగాక మరి యేభాగమైనను భూమిపై బడి అనుకూలపరిస్థితులలో అది మరల క్రొత్త మొక్కగా వృద్ధిచెందు పద్ధతి శాఖీయపునరుత్పత్తి యనబడును శాఖీయపునరుత్పత్తి పద్ధతులు పలురకములుగా కూడ నుండును

యీస్టు (Yeast = కిణ్వము) అను పదార్థము మొగ్గల వంటి ఉద్వర్ధనముల ద్వారా పునరుత్పత్తిచెందును యీస్టును చక్కెర ద్రావణములో నుంచినచో చిన్నచిన్న ఉద్వర్ధనములు కొన్ని దాని జీవకణముపై బయలుదేరి త్వరలో దానినుండి విడిపోయి ఒక్కొక్కటి ఒక్కొక్క యీస్టుకణముగా వృద్ధి చెందును తరచుగా యిటువంటి మొగ్గలు గొలుసుకట్టుగా నేర్పడుచుండును

నాచుజాతి హరితములకును (mosses) ప్రహరితములకును (liver worts) ఆకుపైగాని శాఖపైగాని సూకాయము (thallus) పై గాని జెమ్మా (gemmae) అనబడు ప్రత్యేకమగు ఉద్వర్ధనములుబయలుదేరి వానిద్వారా శాఖీయ పునరుత్పత్తి జరుగుచుండును

పర్ణములలో (Ferns) కొన్ని వానిపత్రముల చివర బయలుదేరు మొగ్గలద్వారా పునరుత్పత్తి చేసికొనుచుండును ఉదా: అడియాంటంకాడేటం అడియాంటమ్‌లూనులేటం మొదలయినవి వానిపత్రము వంగి దానికొనభూమికి తగిలినవెంటనే అచ్చట వేళ్లు బయలుదేరి నాటుకొని మొగ్గ ఏర్పడును అది తరువాత క్రొత్త మొక్కగా వృద్ధిచెందును పర్ణములలో సామాన్యముగా శిఫావృంతముల (rhizomes) ద్వారా శాఖీయ పునరుత్పత్తి జరుగుచుండును

పుష్పవంతములగు మొక్కలలో శాఖీయ పునరుత్పత్తి పలువిధములుగా నుండును కొన్ని మొక్కలకు భూమిలో నున్నవాని కాండముల ద్వారా పునరుత్పత్తి జరుగును అట్టి కాండములకు శిఫావృంతములు అని పేరు ఉదా: అల్లము, అరటి పసుపు మొ॥ ఆకందములకు (Stemtubers) ఉదాహరణములు బంగాళాదుంపలు మొదలగునవి కందికలకు (corms) ఉదాహరణములు చేమ, కంద మొదలయినవి లశునములకు (bulbs) ఉదాహరణములు ఉల్లి వెల్లుల్లి మొదలయినవి వాని లక్షణభేదములనుబట్టి వేరువేరు నామములు గలవు కాండములపై మొగ్గలు బయలుదేరి వాని ద్వారా శాఖీయ పునరుత్పత్తి జరుగుచుండును వీనిలో ఉల్లి వంటి కొన్ని మొక్కలు గింజలద్వారా కూడా వృద్ధిపొందుచుండును

భూమిపైగాని నీటిపైగాని ప్రాకుచు జీవించు కొన్ని రకముల మొక్కలు భూస్తారి (Runner ఉదా: హైడ్రోకాటైల్) విరోహము (Stolon ఉదా: చేమ భూస్తారిక (Offset ఉదా: ఐస్టియా) అధోభూస్తారి (Sucker ఉదా: చేమంతి) అనుకములకు చెందినవి తమ కాండముల ద్వారా పునరుత్పత్తి చేసికొనుచుండును వాని కాండములు అచ్చటచ్చట తెగిపోయి ఒక్కొక్క ఖండము ఒక్కొక్క మొక్కగా వృద్ధిచెందుచుండును

శాఖీయ పునరుత్పత్తి ఆకులద్వారా కూడా కొన్ని మొక్కలలో జరుగుచుండును ఉదా: రణపాలాకు ఈ మొక్క ఆకుయొక్క అంచు గొగ్గులు కలియుండును ఆకు తడినేలపై నున్నచో ప్రతిగొగ్గు నుండియు మొగ్గలు బయలుదేరి అవి తరువాత వేరువేరు మొక్కలుగా పెరుగుచుండును అట్లే కొన్ని మొక్కల వేళ్ళనుండి కూడ అట్టి అస్థానిక కోరకములు (adventitious buds) బయలుదేరవచ్చును ఉదా: చిలగడదుంప మూలేకు మొ॥

వెల్లుల్లి మొక్కయొక్క పుష్పగుచ్ఛములో క్రిందిభాగమున నున్న కొన్ని మొగ్గలు రూపాంతరము నొంది ప్రకలికలు (bulbils) గా తయారగును అవి క్రిందరాలి ఒక్కొక్కటి ఒక్కొక్క మొక్కగా వృద్ధిచెందును అట్టి ప్రకలికలద్వారా కూడ కిత్తనార అడవిపెండలము అనాస మొదలగుమొక్కలలో శాఖీయ పునరుత్పత్తి జరుగుచుండును

అంతేగాక ఉద్యానవనములలో చాలమొక్కలు కృత్రిమమైనవి వివిధ శాఖీయ పద్ధతులలో పునరుత్పత్తి చేయబడుచుండును కొన్ని మొక్కలు ఖండములద్వారా వృద్ధి చేయబడుచుండును గులాబి చెరకు క్రోటనులు కర్రపెండలము మునగ మొదలగు మొక్కలయొక్క కాండఖండములను తడినేలలో పాతినప్పుడు అవి వేళ్ళు తన్ని మొగ్గలను పెంచును తరువాత అవి సంపూర్ణమగు మొక్కలుగా తయారగును ఒక్కొక్కప్పుడు నిమ్మ చింత మొదలగు మొక్కల వేళ్ళను నరకి, ఆవేళ్ల ఖండములను తడినేలలో పాతినచో అవికూడ కొన్నాళ్ళకు వేళ్ళను కాండమును వృద్ధిచేసికొనును

గులాబి, మల్లె మొదలగు మొక్కలను నేల అంటు త్రొక్కి వృద్ధిచేయుదురు కొమ్మను నేలపై వంచి, అది నేలకు

తగులు స్థలమున కొమ్మపై బెరడును ఒకటి రెండంగుళములు తీసివేసి ఆ భాగమును మెత్తనిమట్టిలో గ్రొక్కి దానిపై గుడ్డపైనరాయి పెట్టెదరు మూడు నాలుగు నెలల లోపల దానికి వేళ్లు బయలుదేరును అప్పుడాకొమ్మను తల్లి మొక్క నుండి వేరుచేసి వేరొకచోట నాటెదరు

కృత్రిమశాకీయ పునరుత్పత్తి విధానములలో గూటీ కట్టుట మరియొకటి నిమ్మ నారింజ జామ మొదలగు మొక్కలను ఈవిధముగా వృద్ధిచేయుచుందురు వర్షకాలములో మొక్కయొక్క కొమ్మలలో ముదిరి ఆరోగ్యముగా నున్న కొమ్మను ఎంచుకొని దానిపైనున్న బెరడును 1-2 అంగుళముల పొడవున తీసివేయుదురు అక్కడ దానిపై రేగడి మట్టిని దట్టముగు పట్టినటవేసి పైన గడ్డితోగాని గోనెగుడ్డతో గాని గట్టిగా కట్టుదురు ఆ ట్టిని ప్రతిరోజు ఉదయము సాయంకాలము నీటితో తడుపుదురు గాలిలో తేమ లేకపొడిగా నున్న సమయములలో పైనున్న కొమ్మకొక కుండలో నీరు పోసి ఒక రంధ్రముద్వారా కొంచెముగా నీరు పట్టిని తడుపు నట్లు అమర్చెదరు 1-3 నెలలలో ఆ గూటీకి వేళ్లు బయలు దేరును తరువాత అచ్చట ఆ కొమ్మను నరికి వేరుచేసి మరి యొకచోట నాటుదురు

కృత్రిమశాకీయ పునరుత్పత్తి విధానము మరియొకటి కలదు అది అంటుకట్టుట అంటుకట్టుటలో నాటుకొనిన ఒక మొక్కతో మరియొక మొక్కయొక్క చిన్నకొమ్మను ప్రవేశ పెట్టి ఆ రెండును ఒకదానితోనొకటి అతుకుకొనునట్లుచేసి తరువాత ఆ రెంటిని ఒకేమొక్కగా పెంచుదురు ఉదా పాల మొక్క కాండముపై సపోటా మొక్క కొమ్మను అంటు కట్టుట భూమిలోనున్న మొక్కను స్టాక్ (Stock) అనియు దానితో అంటుగట్టిన మొక్కను సయన్ (Scion) అని అందురు ఫలవృక్షములను పుష్పవృక్షములను కొన్నిటిని ఈ విధముగ పునరుత్పత్తి చేయుదురు సయనుకు దాని తల్లి మొక్క లక్షణములన్నియునుండును స్టాక్ మొక్క తన వేళ్లతో భూమినుండి సయనుకు కావలసిన నీటిని ముడిఆహార పదార్థములను అందజేయుచుండును అంటుకట్టుటలో చేరువు అంటు (Approach grafting) మొగ్గంటు (Bud grafting) నాలుక అంటు (Tongue grafting) చీల అంటు (Wedge grafting) కిరీటపు అంటు (Crown grafting) అను రకములు గలవు ఆయాసయనులకు ఏరకపు అంటు సరిపడునో చూచి ఆ రకపు అంటు కట్టుదురు

ఒక మొక్కయొక్క లక్షణములలో ఏ మార్పు లేకుండ వానినే యథాతథముగ తరతరములవరకు నుంచవలెనన్నచో శాకీయపునరుత్పత్తి విధానము చాల ఉపయోగపడును ఉదా పలురకముల మామిడి అంట్లు కాని కొన్ని తరములు తరువాత ఆయా లక్షణముల బలము క్షీణించుచుండుట కద్దు శాకము కలదు సాధారణముగా గింజలద్వారా ప్రవర్ధనము చెందని మొక్కలను ఈ విధముగనే పునరుత్పత్తిచేయుదురు ఉదా: చెరకు బంగాళదుంప చేమ ఉల్లి పసుపు మొదలగు వానిని వ్యవసాయదారులీవిధముగనే పైరుచేయుచుందురు సరియైన ఆహార పరిస్థితులు ఉష్ణోగ్రత మొదలగువానిని కృత్రిమముగా పరిశోధనాలయములో ఏర్పరచుకొని ఛో మొక్కలలోగాని జంతువులలోగాని సజీవముగానున్న ఏదైన జీవకణమును మరల సంపూర్ణజీవిగా పునరుత్పత్తి చేయ వచ్చునని శాస్త్రజ్ఞులిటీవల నిరూపించియున్నారు

వి వి ర

## శాక్తతంత్రము

తంత్రమనగా 'జ్ఞానమును విస్తరింపచేయునది' అని యర్థము తత్త్వమంత్రముల అర్థమును స్పష్టీకరించి మానవుని బంధమునుండి రక్షించి విముక్తుని చేయునదగాన తంత్రమని కామికాగమమునందు తంత్రపదవ్యుత్పత్తి చూపబడినది

"తనోతి విపులానర్థాన్ తత్త్వమంత్ర సమన్వితాన్
త్రాణంచ కురుతే యస్మాత్ తంత్ర మిత్యభిధీయతే"

దీనినిబట్టి తంత్రములకును వేదములకును పరమలక్ష్య మొక్కటే యని సూచిత మగుచున్నది తంత్రములకు ఆగమములని నామాంతరము భారతీయసంప్రదాయము ననుసరించి తంత్రములకు వేదములే మూలము ఈ విషయము 'తస్మా ద్వేదాత్మకం శాస్త్రం విద్ధికౌలాత్మకం ప్రియే' అనికులార్ణవతంత్రమునందు శివుడు పార్వతితో చెప్పిన మాటలచే స్పష్టమగుచున్నది కృతయుగమునందు వేదములు త్రేతాయుగమునందు స్మృతులు, ద్వాపరయుగమునందు పురాణములు, కలియుగమునందు తంత్రములును విశిష్టప్రమాణములుగ గ్రాహ్యములు

హిందూమతమున అడుగడుగునను తంత్రముల ప్రభావము గోచరించుచుండును ఎన్నియో పూజలు, వ్రతములు, ఉత్సవములు ప్రత్యక్షముగనో పరోక్షముగనో తంత్రసంబద్ధములై

ఉన్నవి. వైదికకర్మల విషయమునందువలె శాక్త తాంత్రిక విధానమునందు స్త్రీ పురుష భేదములేక అన్నివర్ణములవారును అధికారులే. "సర్వవర్ణాధికారశ్చ నారీణాం యోగ్య ఏవచ" అని గౌతమీ తంత్రము చెప్పుచున్నది.

తంత్రములు భారతదేశమునందు మాత్రమేకాక భారతవర్షమునందంతటను వ్యాపించినవి. భారతవర్షమనగా మన మిపుడు ఇండియా అనెడు భారతదేశముకంటె చాల విస్తృతమైనది. పూర్వకాలమునందు దీనిని విష్ణుక్రాంత రథక్రాంత అశ్వక్రాంత అని మూడు భాగములుగ విభజించియున్నారు. వింధ్యపర్వతమునకు తూర్పున జావావరకును వ్యాపించిన భూఖండము విష్ణుక్రాంతము. వింధ్యపర్వతమునకు ఉత్తరమున మహాచీనాదేశమువరకును గలది రథక్రాంతము; వింధ్యమునకు పశ్చిమప్రాంతమునందున్న భూఖండము అశ్వక్రాంతము. ఈ మూడుక్రాంతములకును ఒక్కొక్కదానికి ముప్పది యారుచొప్పున తంత్రములు చెప్పబడినవి. ఈ తంత్రములలో బౌద్ధమతమునకు చెందిన తంత్రములు కూడ ఎన్నియో ఉన్నవి.

హిందూమతమున ప్రధానముగ గాణాపత్యము, సౌరము, వైష్ణవము, శైవము, శాక్తము అను ఐదు తంత్రములుగలవు. ఇపుడు గాణాపత్యసౌరములు అంతగ ప్రచారమునందు లేవు. శైవ వైష్ణవ తంత్రములు అత్యధిక ప్రచారములో నున్నవి.

శాక్తము ఇప్పటికంటె గూడ పూర్వము అధికప్రచారములో నున్నట్లు అగపడును. శక్తి శివుని భార్యగాన శాక్తమునకు శైవముతో ఘనిష్ఠ సంబంధము కలదు. శాక్తతంత్రమునందు ఎన్నియో అర్చనావిధానము లుండెడివి. వీటిలో కాలక్రమమున కొన్ని అనాచారములు ప్రవేశించుటచే శాక్తము కొంచెము అపఖ్యాతికి పాలయినది. కాని ఈ దురాచారములను తద్ద్వారా వచ్చిన అపప్రచారమును దూరముగనుంచి ఇందలి మూలసిద్ధాంతము లను పరిశీలించినచో ఈ శాక్తమునందలి రహస్యము స్పష్టమగును.

దార్శనిక దృష్టితో చూచినచో శాక్తదర్శనము ఒకవిధముగ అద్వైతదర్శనమని చెప్పవచ్చును. ఈ దర్శనము ప్రకారము సర్వలోకాధారమగు ఒకతత్త్వమున్నది. అదియే శక్తి. అది అద్వితీయము; సచ్చిదానందస్వరూపము; నిర్గుణము. దీనికంటె భిన్నముగ కన్పట్టుచున్న వస్తువులన్నియు వాస్తవమున శక్తితత్త్వాభిన్నములు. ఈ అద్వైతతత్త్వము మాయా ప్రభావముచే ద్వైతప్రపంచరూపమున భాసించుచున్నది. జీవులెల్లరు పరాశక్తి స్వరూపులు. "అహం దేవో నచాన్యోఽస్మి బ్రహ్మైవాహం నశోకభాక్ సచ్చిదానందరూపోఽహం నిత్యముక్తస్వభావవాన్" అని శాక్తుల ధ్యానవిధానము. ఇంతవరకు శాక్తమునకును శాంకరాద్వైతమునకును దగ్గిర పోలిక లున్నవి. శంకరాచార్యుల సిద్ధాంతము ప్రకారము అద్వితీయ బ్రహ్మమును ఆవరించి జగదాభాసమునకు కారణభూతమగు మాయకూడ మిథ్యారూపమైనది. కాని శాక్తమునందు ప్రకారము ఈమాయ సత్యమైనది. ఈవిషయమున శాక్తము కాశ్మీర శైవమునకు సన్నిహితమైనది. ఈరెండు మతముల ప్రకారము కూడ పరమతత్త్వము శివశక్త్యాత్మకమైనది. అనగా జ్ఞానశక్తి శక్తిస్వరూపమైనది శివతత్త్వము. నిశ్చలచైతన్యాత్మకము శక్తితత్త్వము. తత్ప్రయుక్తచలనశక్త్యాత్మకము. ప్రపంచ సృష్టి స్థితిలయములకు ఈ చల స్థిరతత్త్వములు రెండును అవశ్యకములు. శివుడు ప్రపంచమునకు మూలాధారము. శక్తి తన్నిర్మాణవ్యాపృతము. శివుడనెడు మూలాధారముపై శక్తి ఈప్రపంచమునంతను సృజించుచున్నదనెడు విషయము శాక్తతంత్రములలోని శక్తివర్ణనములవలనే స్పష్టమగుచున్నది. మణిద్వీపమునందలి కల్పవృక్షవనమునందు జగన్మాత సింహాసనమును అధిష్ఠించి యుండును. ఆసింహాసనమును శవములవలెనుండు ఐదు శివమూర్తులు మోయుచుండును. ఈ ద్వీపమునందలి బంగారు సైకతములను అమృతమహోదధి తరంగములు కడుగుచుండును. ఈచిత్రము శివశక్తిస్వరూపమును స్పష్టముగ బోధించుచున్నది.

శక్తియందు కూడ రెండు అంశములున్నవి. మొదటిది విద్య లేక చిచ్ఛక్తి; రెండవది అవిద్యలేక మాయాశక్తి. చిచ్ఛక్తి ప్రకాశరూపమైనది. తనను తాను ఆవరించుకొని ప్రపంచరూపమున అభివ్యక్తమగు శక్తి మాయాశక్తి. దీనికే విమర్శశక్తియనికూడ పేరు. ఈశక్తిద్వారా అద్వైతతత్త్వము ద్వైతస్వరూపమును దాల్చుచున్నది. మహత్తత్త్వాది ప్రపంచరూపమున అభివ్యక్తమగుచున్నది. ఈసృష్టిచే శివునియందు ఎట్టివికారమును కలుగదు. ఆతడు విశ్వమయుడైనను విశ్వోత్తీర్ణుడుకూడ. ఈవిధముగ కాశ్మీరశైవమునందువలె శాక్తమునందుగూడ పరమతత్త్వము శివశక్త్యాత్మకమైనను శైవులు ఇందలి శివతత్త్వమునకును శాక్తులు శక్తితత్త్వమునకును ప్రాధాన్యము నంగీకరింతురు. ఇదియే ఈరెంటిని గల ప్రధానభేదము.

శాక్తులీ జగదుత్పత్త్యాది హేతుభూతమగు పరమ తత్త్వమును స్త్రీమూర్తిగను జగజ్జననిగను భావింతురు అందుచే శాక్తమున స్త్రీలకు మాతృరూపములుగ అధిక ప్రాధాన్య మీయబడినది స్త్రీలను కన్యలను పూజించుట శాక్తారాధనములోని ప్రధానాంగము స్త్రీదూషణము స్త్రీ విషయమున కఠినముగ ప్రవర్తించుట నహాగమనము మొదల గునవి శాక్తులకు నిషిద్ధములు భార్యను దుర్భాషలాడినవాడు ఒకరోజు ఉపవాసముచేసి ప్రాయశ్చిత్తము చేయవలెనని మహానిర్వాణతంత్రము బోధించుచున్నది చివరకు యజ్ఞము లలో ఆడిపశువులను బలి ఈయరాదని కూడ శాక్తుల సిద్ధాంతము ఈవిధముగ శాక్తమున స్త్రీలకు అత్యంత పూజనీయ మగు ఉత్తమస్థాన మీయబడినది

పైన చెప్పిన విధముగ శాక్తులు జగదుత్పత్త్యాదికారణ భూతమగు తత్త్వమునకు కేవలము ఉపాసనార్థము మాత్రమే స్త్రీత్వమును కల్పించి ఆ తత్త్వమును జగన్మాతగభావించి ఆరాధించుచుందురు కాని ఆ పరతత్త్వము వాస్తవమున స్త్రీగాని పురుషుడుగాని నపుంసకుడుగాని కాదనియు ఈ స్త్రీత్వము కేవలము కాల్పనికమనియు ఒక తాంత్రికగ్రంథము నందలి "నేయం యోషిత్ నచపుమాన్ నషండో నజడస్మృతః" అను వాక్యము స్పష్టీకరించుచున్నది

సాధారణముగ అన్నితంత్రములందును ఆయాదేవత లను పూజించు విధానమునకు అత్యధిక ప్రాధాన్యమొసగ బడెను ఈ ఆరాధనావిధానమును అవలంబించుటచే మాన వుడు పరమలక్ష్యమగు మోక్షమును అనాయాసముగ పొంద గలడని వీరి యభిప్రాయము శాక్తతంత్రమునందు కూడ ఇట్టి పూజావిధానమునకు ఎక్కువ ప్రాధాన్యమీయబడినది అద్వై తులవలెనె శాక్తులకు గూడ అద్వితీయాత్మసాక్షాత్కారమే పరమలక్ష్యము కాని శాక్తులు ఆ అద్వితీయ తత్త్వము ప్రపం చాదిరూపమున పరిణతమగుటగూడ సత్యమేయనియు అందుచే నిరంతర ప్రయత్నము చేతను ధ్యానాదులచేతను మాత్రమే అట్టి సాక్షాత్కారము లభించునవియు అంగీకరింతురు ఇందు లకై ప్రపంచమునుండి దూరముగనుండుటకంటె ప్రపంచ ముతో ఘనిష్ఠ సంబంధమేర్పరచుకొనుటయే ఆవశ్యకమని వారి అభిప్రాయము ప్రపంచమునందలి అన్నివస్తువులందును, నిఖిల కార్యకలాపములందును వారు అదివ్య శక్తిని సాక్షా త్కరింపచేసికొన ప్రయత్నింతురు ఈ దృష్టితో చూచువారికి ప్రపంచమున నింద్యకర్మయనునదిగాని పరిహార్యవస్తువు గాని లేదు జీవుడు ప్రపంచరూపమగు బహిర్ముఖ ప్రవాహమునందు కొట్టుకొనిపోవుచు తన వాస్తవ స్వరూపమగు శివతత్త్వము నుండి దూరమైనాడు ఈ ప్రవాహమును వెనుకకు మరల్చి మరల తన విస్మృత తత్త్వమును చేరగల్గుటయే ఈ అర్చనా విధానమునకు లక్ష్యము వామాచారమనగా బహిర్ముఖమగు ఈ ఉత్పత్త్యాది ప్రవాహమును వెనుకకు మరల్చుటకై చేయు ప్రయత్నమని యర్థము

శాక్తతంత్రముల ప్రకారము జీవులు పశువులనియు వీరులనియు దివ్యులనియు మూడు విధములుగ నుందురు వీనిలో ఉత్తరోత్తరులు ఉత్తములు బంధములోనున్న జీవులు పశువులు తమఃప్రధానులు వీరు సాధనద్వారా క్రమముగ రజస్సుచే తమస్సును జయించి వీరులుగను సత్త్వముచే రజస్సును జయించి దివ్యులుగను అగుదురు ప్రతిజీవుడును తానేస్థితిలో నున్నాడో తెలిసికొని దానికనుగుణమగు సాధనావిధానమును అవలంబింపవలెను కులార్ణవతంత్రమునందు వేద వైష్ణవ శైవ, దక్షిణ వామ సిద్ధాంత కౌలాచారములనెడు ఏడు ఆచార ములు ప్రతిపాదింపబడినవి వీటిలో పూర్వముకంటె పరము ఉత్తమమైనది మొదటి మూడును పశుజీవులకుపయుక్తము లైనవి వేదమునందు కర్మకును వైష్ణవమునందు భక్తికిని, శైవమునందు జ్ఞానమునకును ప్రాధాన్యముండుటచే ఈమూడు ఆచారములును కర్మ భక్తి జ్ఞానమార్గములని చెప్ప వచ్చును ఈ మార్గత్రయమునవలంబించుటచే లభించిన ఫల మును పరిపుష్టమునేయుటకై ఏర్పడినది దక్షిణాచారము ఈ నాల్గు ఆచారములును బహిఃప్రవాహరూపములైనవి వామా చారముతో ఈ ప్రవాహము తిరుగుముఖము పట్టును వామా చారమునందు ప్రచారములోనున్న కొన్ని విధానములనుబట్టి ఈ ఆచారము కొంత అపప్రథకు పాత్రమైనది పూజకు సంబం ధించిన ఈ విధానములకు పంచతత్త్వ విధానములని పేరు ఇందు మద్యము మాంసము మత్స్యము ముద్ర(ధాన్యము) మైథునము అనునవి దేవికి అర్పింపబడును దీనికి పంచమకార పూజయని పేరు

"మద్యం మాంసంచమీనం చ ముద్రామైథునమేవచ
మకార పంచకం ప్రాహుర్యోగినాం ముక్తిదాయకమ్ ''

దీనియందుకూడ మూడువిధములు కలవు మొదటి దానికంటె రెండవది రెండవదానికంటె మూడవది ఉత్తమ

మైనది. ఈ పంచమకారములను యథాతథముగ సమర్పించుట మొదటి విధానము. వాటికి ప్రతినిధులుగ పాలు మొదలగునవి సమర్పించుట రెండవ విధానము. కేవలము మానసికముగు పంచతత్త్వములను సమర్పించుట మూడవ విధానము. ఇది అత్యుత్తమమైనది. ఈ మూడు విధానములలో పంచతత్త్వముల అర్థమేమనగా, మద్యమనగా సహస్రార చక్రమునుండి స్రవించు అమృతము. దానినాస్వాదించుట మద్యపానము.

"వ్యోమ పంకజ నిష్యంద సుధాపాన రతో నరః
మధుపాయీ సమః ప్రోక్తస్త్వితరే మద్యపాయినః"

(కులార్ణవము)

పుణ్యాపుణ్యములనెడు పశువులను జ్ఞానఖడ్గముతో ఖండించుట, పరతత్త్వమునందు మనోలయమును చేయుట మాంసాశనము.

"పుణ్యాపుణ్య పశుం హత్వా జ్ఞాన ఖడ్గేన యోగవిత్
పరేలయం నయేచ్చిత్తం మాంసాశీ సనిగద్యతే"

(కులార్ణవము)

ఇడాపింగళా నాడులలో సంచరించు శ్వాసమును కుంభకము ద్వారా నిరోధించి సుషుమ్నా నాడియందు ప్రవేశింపచేయుట మాత్స్యసాధన.

"గంగాయమునయోర్మధ్యే ద్వౌమత్స్యౌ చరతః సదా
తౌ మత్స్యౌ భక్షయేద్యస్తు స భవేన్మత్స్య సాధకః"

(ఆగమ సారము)

గంగాయమున అనగా ఇడాపింగళానాడులు. వాటియందు ప్రసరించు శ్వాసప్రశ్వాసములే మత్స్యములు.

సత్సంగముచే అసత్సంగమును ముద్రించుట ముద్ర.

"సత్సంగేన భవేన్ముక్తి రసత్సంగేషు బంధనమ్
అసత్సంగముద్రణం యత్తు తన్ముద్రాః పరికీర్తితాః"

(విజయతంత్రము)

కుండలిని సహస్రారమునందలి పరమశివునితో కలియునట్లు చేయుట లేదా సుషుమ్నకు ప్రాణముతో సంబంధము కలుగునట్లు చేయుట మైథునము.

"ఇడాపింగళయోః ప్రాణాన్ సుషుమ్నాయాం ప్రవర్తయేత్"

సుషుమ్నాశక్తి రుద్దిష్టా జీవోయంతు పరః శివః,
తయోస్తుసంగమేదేవైః సురతం నామకీర్తితమ్"

ఈ విధముగ పంచమకారతత్త్వము అతిగహనమైనది. దీనినిబట్టి పంచమకారములను యథాతథముగ సమర్పించుట అధమమని లలిత ఇందలి ముఖ్యోద్దేశముకూడ ఆత్మనిగ్రహమే. సామాన్యదృష్టిలో అపవిత్రములైనను ఆకార్యములుగను కనబడు ద్రవ్యక్రియలందు కూడ దివ్యశక్తిని చూడ కల్గుటను అభ్యసించుటయే ఇందలి ప్రధానోద్దేశము. దీనిని అనుసరించుటకు పశువులకు అర్హతలేదు. రాజసిక సాధనాపరుడగు వీరుడే ఇందులకు అర్హుడు. కాని సాధకుడు అంతటితో సంతృప్తిచెందరాదు. వీరభావమునుండి దివ్యభావమును చేరుటకు ప్రయత్నింపవలెను. సిద్ధాంత కౌలాచారములు ఇందులకై ఉద్దిష్టమైనవి. భోగానుభవమునందే భోగాది పరిత్యాగము, పరమ సుఖదుఃఖముల విషయమును గ్రహించుటను సిద్ధాంతమనిపేరు. ఈ విషయమును గ్రహించి సర్వసన్న్యాస పూర్వకముగ బ్రహ్మసాక్షాత్కారమునుపొందుట అంతమగు కౌలాచారము. శాక్తమతమున కుల శబ్దమునకు చాల అర్థములు చెప్పబడినవి. అందులో బ్రహ్మ యనునర్థము ఒకటి. కావున అంతిమమగు బ్రాహ్మస్థితికి కౌలాచారమని పేరు.

"కర్దమే చందనేఽభిన్నం పుత్రే శత్రౌ తథా ప్రియే
శ్మశానే భవనే దేవి తథైవ కాంచనే తృణే
నభేదోయస్యదేవేశి స కౌలః పరికీర్తితః"

అని 'భవచూడామణి' తంత్రము చెప్పుచున్నది.

ఈ పూర్వోక్త దశలన్నిటియందును ఆచారోపాసనము అత్యావశ్యకము. శ్రీశక్తి మూర్తియే పరమగురువు. మనుష్యరూపమునసున్న గురువుకూడ ఆ పరమ గురుని అవతారమేయని విశ్వాసము.

తాంత్రికారాధనాక్రమమునందు బాహ్యమగు భౌతిక పూజ మొదలు మానసిక పూజవరకును ఎన్నియో అంగములు కలవు. సాధకుడు భౌతిక పూజతో ప్రారంభించి అంతటితో ఆగక అద్వైతాత్మ సాక్షాత్కారము కలుగువరకును స్తోత్రము, జపము, ధ్యానము మొదలగు అంతర పూజావిధానములను గూడ అనుసరింపవలెను. ఈ సాధకులు మొదట బాహ్యపూజకై విగ్రహములను ఉపయోగింపవచ్చును. అవి సాలగ్రామాదులవలె కరచరణాద్యవయవములు లేనివి కూడ కావచ్చును. వివిధ రేఖారూపములగు యంత్రములందుగాని, ధ్వన్యాత్మకములగు మంత్రములందుగాని దేవతామూర్తిని ధ్యానింపవచ్చును. పూజావిధానము అతిక్లిష్టమైనది. పూజకుడు మొదట పంచభూతాత్మకమగు తనదేహమును శుద్ధముచేసికొన

వలెను. దానికి భూతశుద్ధియని పేరు. తరువాత మంత్రములను చదువుచు తన శరీరమునందలి వివిధావయవములను హస్తాంగుళులతో స్పృశింపవలెను. దీనికి అంగన్యాస కరన్యాసములని పేరు. ఎదుటనున్న దేవతామూర్తిపై ప్రాణప్రతిష్ఠాన చేయవలెను. తన మానసమునందున్న అభిలాషా విశేషములను సూచించుచు హస్తములతో వేరువేరు సంకేతములను చేయవలెను. వీటికి ముద్రలని పేరు. పిమ్మట ఆ దేవతకు స్నానాద్యుపచారములు చేయవలెను. ఈ పూజావిధానమున కంతకును మనస్సును పవిత్రముచేసికొని దానిని భగవదున్ముఖము చేయుటయే ప్రయోజనము.

తాంత్రిక విధాన బహుళమగు ఈ శాస్త్రవాధ యందు ఎన్నియో నిగూఢార్థములను సంప్రదాయజ్ఞులకు మాత్రమే తెలియునవియు నగు విషయములు విధింపబడినవి. సాధకుడు వాటి బాహ్యార్థమును మాత్రమే గ్రహింపక ఆచార్యాది సహాయముచే వాటి యాంతరార్థమును చక్కగ ఆకళించుకొని ఆవిధముగ ప్రయత్నింపవలెను. ఉదాహరణమునకు - మేక దున్నపోతు లి గొఱ్ఱె ఒంటె మనుష్యుడు వీటి మాంసమును కేశాస్థి సహితముగ సమర్పించినచో దేవి సంతసించునని కర్పూరాదిస్తోత్రమునందు చెప్పబడినది. సాధకుడు దీని బాహ్యార్థమును మాత్రమే గ్రహించినచాలదు. కామ క్రోధ లోభ మోహ, మద మాత్సర్యములను, బాహ్యవస్తువులను గూడ పరిత్యజింపవలెనని దాని యభిప్రాయము. తన అహంకారమును దేవతాపాదమూలమునందు సమర్పించి జీవబ్రహ్మైక్య సాక్షాత్కారమును సంపాదించుటయే తాంత్రిక పూజకు పరమ లక్ష్యము. ఈ విషయమును

"ఐక్యంసంభావయేద్ధీమాన్ జీవస్యబ్రహ్మణోఽపిచ"

అను గాంధర్వతంత్ర వాక్యము స్పష్టీకరించుచున్నది.

వ. శ్రీ. చం.

## శాలిహుండం

ఆంధ్రదేశమున వర్ధిల్లిన బౌద్ధ తీర్థరాజములలో శాలిహుండ మొకటి. ఈ గ్రామము శ్రీకాకుళము తాలూకాలో ఉత్తర సరిహద్దు వంశధారనదీ తీరమునందున్నది. అతి ప్రాచీనకాలమున మిక్కిలి ప్రసిద్ధిచెందిన కళింగరేవు పట్టణమునకు ఆరుమైళ్ళ దూరములోను శ్రీకాకుళము రైలుస్టేషనకు పన్నెండు మైళ్ళదూరములోను ఈ గ్రామము వెలసినది.

శాలిహుండమునకు దక్షిణపు దిక్కున వంశధారానదికి సమాంతరముగా తూర్పు పడమరకు రెండుకొండలు విస్తరిల్లియున్నవి. ఈ కొండలు శాలిహుండం కొండ లనబడుచున్నవి. వీటి ఎత్తు 400 అడుగులు. వీటిలో తూర్పువైపున గల కొండనెత్తిపైన శాలిహుండ బౌద్ధక్షేత్రమునకు సంబంధించిన పెక్కు శిథిలావశేషములు కనుగొనబడినవి.

ఈ కొండపైగల చైత్యములలో వస్తు సముదాయము చాల భాగము శిథిలమైపోయినది. వాటి పునాదుల అవశేషములుమాత్రము నిలిచియున్నవి. ఇచ్చటుగల కట్టడములన్నియు ఇటుకలతోను సున్నముతోను నిర్మింపబడియున్నవి. ఈ కొండ తూర్పువాలుమీద గుర్రపులాడ ఆకారముగల ఒక చైత్యగృహమును చతురస్రాకారములోనున్న ఒక మండపమును శిథిలములై యున్నవి.

స్తూపములు: కొండ అగ్రభాగముననున్న కట్టడములలో వర్తులాకారపు పెద్ద స్తూపమొకటి కలదు. అది ఈ క్షేత్రమునకు సంబంధించిన ప్రధానమైన ప్రసిద్ధ కట్టడము. దీని వ్యాసము 48 అడుగులు. దీని లోపలిభాగము రాళ్ళతోను మట్టితోను నింపబడియున్నది. ఇందు స్తూపాకృతిలోనున్న ధాతునిక్షేపికగల ఒక భరణి లభించినది. ఈ స్తూపము పెద్ద ఇటుకలతోను సున్నముతోను నిర్మింపబడినది. ఈ ప్రధాన స్తూపముచుట్టును ఇటుకలతో నిర్మించిన అరుగుగలదు. అది ప్రదక్షిణపథము. దీనికి పడమరగా 12 అడుగుల దూరమున మరిరెండు చిన్న స్తూపములున్నవి. ఈ స్తూపముల వ్యాసములు 25 అడుగులు వెడల్పుగలవి. ఇందొక దానియందు చితాభస్మముగల శిలా పేటిక యొకటి లభ్యమైనది.

ఈ కొండ తూర్పువాలునందుగల పెద్ద స్తూపమునకుత్తరముగా 110 అడుగులు దిగువభాగమున రెండు పెద్ద మట్టి దిబ్బలున్నవి. వీటి వ్యాసము [illegible] 80 అడుగులు. ఎత్తు 8 అడుగులు. ఒక మట్టి దిబ్బను త్రవ్వగా అందు 28 అడుగుల వ్యాసముగల స్తూపము బయలుపడినది. అది బండిచక్రపు నమూనాలో నిర్మింపబడియున్నది.

చైత్యగృహము: పైన పేర్కొనబడిన పెద్ద స్తూపమునకు నూరుఅడుగులు దిగువగా ఒక చైత్య గృహమున్నది. దీనిపొడవు 24 అడుగులు, వెడల్పు 12½ అడుగులు. దీని గోడల మందము 2 అడుగులు. ఈ చైత్యగృహములో 12 అడుగులఎత్తుగల బుద్ధ విగ్రహము ప్రతిష్ఠింపబడి యున్నది. ఈ విగ్రహము పద్మాసనాకృతియందున్నది. అది సున్నము, ఇటు

కలతో నిర్మింపబడినది. దీనిపై గవ్వసున్నముతో ధగధగ మెరయునట్లు మనోహరముగ పలాస్టరు చేయబడియున్నది. నేడిది శిథిలావస్థలో నున్నను తన పూర్వవైభవమును చాటుచున్నది. ఈ విగ్రహము గల మూడు ప్రక్కవలయాకృతిలో నున్న గోడలను మధ్యగల భూప్రదేశము ఇటుకలతోను మట్టితోను నింపబడియున్నది. తొమ్మిది అడుగులఎత్తు ఆరు అడుగుల వెడల్పుగల ఈ విగ్రహము ఒక అడుగుఎత్తుగల అరుగుమీద ప్రతిష్ఠింపబడినది.

ఇచ్చట పురాతత్త్వశాఖవారు ఖనన పరిశోధన జరిపినప్పుడు ఈ మహాతీర్థముకు సంబంధించిన పెక్కు ప్రాచీన వస్తువులు బయల్పడినవి. వీటిలో 12 బౌద్ధ శిల్పములు ఒక ఆరాధ్య చైత్యము పేర్కొనదగినవి. ఇవన్నియు క్రీ. శ. 8, 9 శతాబ్దులనాటి మహాయాన బౌద్ధశాఖకు చెందిన శిల్పములని వారు భావించిరి. నాగరలిపిలో నున్న శాసనములుకూడ ఇచట లభించినవి. ఈ వస్తువులేకాక శాసనస్థములైన పెక్కు శిలాఫలకములు ప్రాచీన లిఖితములుగల శిలాశకలములు ఎముకల ముక్కలతోను అంగారముతోను తయారైన పుష్పములు దాచియుంచబడిన మృత్పేటికయు లభించినవి. రమణీయములైన బుద్ధ అవలోకితేశ్వరుల విగ్రహములు కూడ లభ్యమైనవి.

లభ్యమైన శాసనములనుబట్టి శాలిహుండమునకు పూర్వము 'శాలిపేటిక' అను నామమున్నట్లు తెలియుచున్నది. కొండపైమహావిహారమున్న ప్రదేశమునకు మహాఉగపర్వత" మను పేరుండినట్లు భావింపబడుచున్నది. ఈ శాసనములన్నియు క్రీ. శ. 8, 9 శతాబ్దుల నడిమికాలమునకు చెందినవై యుండును. అందుచే ఈ క్షేత్రము మహావైభవమనుభవించిన ప్రాచీనకాలము నాటిదని పురాతత్త్వశాస్త్రజ్ఞులు తెలుపుచున్నారు. ఈ క్షేత్రము నదీతీరమున నుండుటచే దేశవిదేశీయ బౌద్ధ యాత్రికులకు కూడలిస్థానమై ఆకర్షణీయముగనుండి అంతర్జాతీయఖ్యాతి నార్జించినది.

వ. వెం.

## శాసనములు

ఏదేశచరిత్రనైనను పునర్నిర్మించుటయందు శాసనములు అతిముఖ్యములైన ఆధారములుగా ఉపకరింపగలవు. భారతదేశ చరిత్ర విషయమందును విశేషించి దక్షిణభారత చరిత్ర విషయమందుకూడ ఇవి మిగుల యథార్థము. చరిత్రాంశము లను తర్కబద్ధముగను హేతుయుక్తముగను కూర్చుటయందు శాసనములు సహాయపడును. అందుచే చరిత్రను అధ్యయనమొనర్చువారికి శాసన పరిశీలనము అత్యంత ముఖ్యవిషయమగుచున్నది. ప్రజల జీవిత విధానముమీద ప్రజాపాలకుల ప్రభుత్వ పద్ధతిపైన శాసనములు తేజోవంతమైన వెలుగును ప్రసరింపజేయును. ఇతర వాఙ్మయాధారములవలన ఇదివరకే విదితమైన రాజవంశీయుల గాథలకు శాసనములు పరస్పర సంబంధమును కల్పించును. భారతదేశ చరిత్రను ప్రభావితమొనర్చు ప్రాచీన గ్రామములయు నగరములయు రాజప్రాసాదములయు రాజధానులయు విపణివీధులయు భౌగోళిక ప్రాంతములయు ఉనికిని ప్రాముఖ్యమును నిర్ధరించుటలో శాసన పరిశోధనము దోహదమొసగును. అంతేకాక రాజ్యములయు రాష్ట్రములయు మండలములయు ప్రభుత్వ కార్యస్థానములయు కలాపములకు సంబంధించు సమాచారమును వెల్లడిచేయుటయందును దేశసంపద వ్యాపార వాణిజ్య సంస్థలు వివిధమతముల వికాస హైన్యములు మతసహన మతోన్మాదములు దేవాదాయ ధర్మాదాయములు విశ్వవిద్యాలయాది విద్యాసంస్థలు వైద్య చికిత్సాలయములు మున్నగు పెక్కు విషయములను గూర్చి శాసనములు పరిజ్ఞానమును కల్గింపగలవు. శాసనములలో లిఖితములైన ప్రశస్తులు రాజకుటుంబములను వారి ఘనకార్యములను ఉగ్గడించును. వారు దానమొసగిన దేవబ్రాహ్మణమాన్యములను గూర్చియు వారి రాజ్యముల సరిహద్దులను గూర్చియు శాసనములలో వివరింపబడి యున్నవి. పూర్వశాసనములలో పేర్కొనబడిన గ్రామ నగర నామముల సహాయముతో నాటి స్థానములందే నూతన నామములు ధరించిన ప్రదేశములను గుర్తింప వీలగును. ఉదాహరణమునకు గౌతమబుద్ధుని జన్మస్థలమైన లుంబినీవనము, అశోకుడు నాటిన "రుమ్మిన్ దెయి" అను శాసనస్థలముగా గుర్తింపబడినది. అట్లే హర్షవర్ధనుని లోహశాసనములో పేర్కొనబడిన అహిచ్ఛత్రభుక్తి అను నామము చేత అహిచ్ఛత్రపురముగా పోల్చబడినది. ఈ విధముగనే పురాతనమగు కవితెపత్రములలో వ్రాయబడిన పిష్టపురమే నాడు పిఠాపురమను పేరబరగుచున్నది.

చిత్రము - 98



పటము - 1

క్రీ పూ 3వ శతాబ్దినాటి అశోకుని పడేరియా (రుమ్మిన్ దెయ్)
శిలా స్తంభశాసనము

1 దేవానపియేన పియదసిన లాజినవీ సతివసాభిసితేన
2 అతన అగాచ మహీయితే హిదబుధే జాతే శాక్యమునీతి
3 శిలావిగడ భీచా కాలాపి తసిలా థభేచ ఉసపాపితే
4 హిద భగవమ్ జాతేతి లుమ్మినిగామే ఉబలికే కతే
5 అఠభాగియేచ

అ ను వా ద ము

దేవతలకు ఇష్టుడైన ప్రియదర్శి తన ఇరువదియవ రాజ్య పాలన కాలమున స్వయముగ బుద్ధశాక్యముని జన్మస్థలమును దర్శించి పూజలు సలిపెను సూర్యప్రతిబింబితమైన ఒక ఫలకమును ఒక రాతిస్తంభమును ఆతడే త్రించెను పూజార్హుడైన శాక్యముని జన్మించిన పవిత్ర ప్రదేశమగు లుంబిని గ్రామమును పన్నుల నసూలునుండి మినహాయించుటయే కాక అతడు దానిని ధనధాన్య సమృద్ధముగా నొనరించెను

కొన్ని శాసనములందు దిట్ట ప్రశస్తులు చక్కిత చర్వణముగ కన్పట్టును ఇట్టివాటిలో తంజావూరు శాసనములు ప్రాచీన సంప్రదాయక శ్రేణికి చెందియున్నవి అచ్చటి బృహదీశ్వరాలయములో రాజరాజ చోళచక్రవర్తిచే ప్రతిష్ఠింపబడిన రాజరాజేశ్వరము డైయార్ దేవతా విగ్రహమును గూర్చిన శాసనములు కూడ నున్నవి అందు ఆరాజు న్యుని అక్క కుందవ సామంతులు సైన్యాధిపతులు దానమిచ్చిన ఆభరణములు లోహవిగ్రహములు మున్నైనవాటి తూకములు మూల్యములు స్పష్టముగ వివరింపబడినవి అంతే కాక తూకపురాళ్ళు కొలమానములు వాటికి సంబంధించు మారకపు పట్టికలు ప్రామాణికములైన ప్రభుత్వపు బంగారు వెండినాణెములు మొదలగువాటి వివరములు పొందుపరచబడినవి ఆయాకాలములనాటి ప్రభువుల నామములుకూడ అందు లిఖితములై యున్నవి ఈశాసనముల ఆధారముతో ఆనాడు వాడుక యందుండిన వస్తువుల ధరలు తెలియగలవు ఆకాలపు వస్తువినిమయ విధానములో వరిధాన్యము నెయ్యి బియ్యము, నూనె మేకలు మున్నగునవి ప్రధానపాత్ర వహించియున్నవి

ప్రాచీనశాసనములలో కొన్నిటియందు ఆనాటి నీటి పారుదల విధానములు తటాకముల నిర్మాణము వాటి మరమ్మతులను గూర్చిన ప్రసక్తి కన్పించును మౌర్యులకాలమున పంటపొలముల కుపయోగపడు బ్రహ్మాండమైన సుదర్శన తటాకము వారి అనంతరము క్షాత్రపరుద్రదమనుని చేతను ఎమ్మట గుప్తరాజుల చేతను అది ఎట్లు మరమ్మతు కావింపబడినదియు స్కందగుప్తుడు వేయించిన జునఘడ్ శాసనములో పేర్కొనబడినది అట్లే పల్లవరాజులనాటి పెక్కు పంటనీటిచెరువులను మహేంద్ర వైరమేఘ పరమేశ్వర తటాకములు గూర్చి శాసనము లున్నవి క్రీ శ 11 వ శతాబ్దినాటి శాసనములలో కావేరినది వరదలను నివారించుటకై కరికాల చోళునిచే నిర్మింపబడిన బృహదాకారపు అడ్డుకట్టల ప్రశంసగలదు విశేషయు పరిపాలనా దక్షుడును కవియు కవిపోషకుడును, ఉద్దండపండితుడును మహాప్రభువునైన భోజుడు నిర్మింపించిన "భోజసాగర" మను తటాకము ఆనాటి స్థాపత్య నైపుణ్యమునకు ఉజ్జ్వలోదాహరణముగా పేర్కొనబడుచున్నది అట్లే వేమారెడ్డి భార్యయగు సూరమాంబచే నిర్మింపబడిన "సంతానసాగర" తటాకమును గూర్చి రెడ్డిరాజుల ఆస్థానకవిగా విలసిల్లిన శ్రీనాథకవి సార్వభౌమునిచే కీర్తింపబడుచు రచితమైన శాసన మిప్పటికిని చూడగలము కాకతీయ ప్రభువరేణ్యులు త్రవ్వించిన పాలంపేట పాకాలమున్నగు పంటనీటి చెరువుల ప్రశస్తి ఆనాటి వారి శాసనములలో మెండుగా కలదు

ప్రాచీన ప్రభువుల పరిపాలనాపద్ధతి వివిధశాఖలలో ఎంత

దేదీప్యమానముగా విరాజిల్లుచుండెనో శాసనాధారముల వలననే తెలియగలదు. ప్రభుత్వపాలనము రాజకీయసంస్థలు ప్రజాజీవిత విధానము మున్నగువాటి తీరును గూర్చి చరిత్రకారుల దృక్పథమును విప్లవాత్మక మొనర్చినది కౌటిల్యుని అర్థశాస్త్రగ్రంథము. ఇందులో చెప్పబడిన రీతిగా పరాంతక చోళుని కాలమునాటి గ్రామీణ సంస్థలెట్లు రూపుసంతరించుకొన్నవో అతడు వేయించిన ఉత్తరమల్లూరు శాసనము నందు వివరముగా తెలుపబడినది.

గ్రామీణ జీవితము దేవాలయమునకు పరివ్యాప్తమగు రీతిగా ప్రాచీన భాగవతీయపండితులు దాని నిర్మాణమును రచించినారు. దేవాలయములు ఉన్నత విద్యాసముపార్జన నిలయములుగను సాధారణ మానవునకు వినోదస్థలములుగను వైజ్ఞానిక సంస్కృతిపరులకు కళాసౌందర్యోపాసనా కేంద్రములుగను భక్తులకు పుణ్యతీర్థములుగను ఉపయోగించినవి. దేవాదాయముల గూర్చియు వాటిపోషణమునకై ధర్మకర్తలు వహింపవలసిన బాధ్యతలను గూర్చియు శాసనములలో వివరింపబడినది. పైన చెప్పబడిన విధముగా వేదాంత, తర్క, వ్యాకరణ అలంకార, మీమాంసాది వివిధ శాస్త్రముల నధ్యయన మొనర్చుటకు దేవాలయ వాతావరణము ప్రశాంతముగ నుండెడిది. అంతు మానవ చికిత్సా సౌకర్యములకై దేవాలయములకు వైద్యశాలలు అనుబంధితములై యుండెడివి. కాకతి రుద్రమాంబచే నిర్మింపించబడిన మల్కాపురము శాసనమునందు ఇట్టిసౌకర్యముల వర్ణనము కన్పట్టును. ఘటికాస్థానములు వివిధశాస్త్ర విషయములను గూర్చి ప్రజలకు విరివిగా జ్ఞానమును వెదజల్లుచు వచ్చినవి. ప్రాచీన హిందూ ప్రభువులు జాతి మత వర్ణవివక్షత లేక అందరి యెడ సహన సమాన భావములు ప్రదర్శించెడివారు. కొన్ని కొన్ని శాసనములు దూరప్రాంతములైన జావా సుమత్ర, బోర్నియో మున్నైన ద్వీపములలో భారతీయ విజ్ఞాన సంస్కృతి వైనిక ప్రభావమెట్లు ప్రసరించెనో వెల్లడించుచున్నవి. క్రీ శ రెండవ శతాబ్దిలో పశ్చిమ జావాయందు రుద్రవర్మచే నిర్మింపబడిన సంస్కృతభాషా శాసనముల వలన ఆ ప్రాంతములకును భారతదేశమునకును గల పూర్వసంబంధములు బోధపడుచున్నవి.

శాసనములవలన ఆనాటి ప్రభువుల మూర్తిమత్త్వలక్షణములు పై యుక్తికమైన ఇతర గుణవిశేషములు అవగతమగును. ఉదాహరణమునకు అశోకచక్రవర్తి తన ప్రజలతో తాను అతిసులభమైన భాషలో వేయించిన శాసనముల ద్వారా సంభాషించినట్లు తెలియగలదు. ఈ శాసనములలో ప్రజల యెడ పశుపక్ష్యాదులయెడ ఆతనికి గల గాఢాభిమానము ఆతని సహనశీలము నిరాడంబర జీవితవిధానము ప్రపంచమును గూర్చి ఆతని పాలనాపద్ధతిని గూర్చి ఆతని భావములు చిత్రింపబడినవి. దుఃఖితయైన మాతృమూర్తి గౌతమీబాలశ్రీ, మరణించిన తన ప్రియతనయుడు గౌతమీపుత్ర శాతకర్ణి యొక్క ఉదాత్తగుణములను స్మరించుచు నిర్మించిన నాసికా శాసనమును ఇప్పటికిని చూడవచ్చును. రుద్రదమనుడు వేయించిన జునగడ్ శాసనము అతని ఉత్తమపాలనా పద్ధతిని గూర్చియు ఆనాటి పండితుల బహుముఖ పాండిత్యమును గూర్చియు చాటుచున్నవి. అలహాబాదు శిలాస్తంభ శాసనమును వాటించిన సముద్రగుప్త సార్వభౌముడు పండితుడుగా గాయకుడుగా వీరసేనానిగా లోకమునకు వెల్లడియైనాడు.

కళింగరాజగు ఖరవేలుడు వేయించిన హాతిగుంఫ శాసనము నందు అతని జీవితోదంతము సంగ్రహముగా పేర్కొనబడినది. అట్లే పరాక్రమశాలియైన రాజరాజు అతని కుమారుడు రాజేంద్రుడు తమ పరిపాలనా విశేషములను గూర్చియు తమ మూర్తిమత్త్వ గుణములను గూర్చియు తమ శాసనములలో విపులముగా వ్రాయించినారు. తంజావూరు బృహదీశ్వరాలయ మందలి సుదీర్ఘశాసనములో రాజరాజు శౌర్య పరాక్రమములు జయపరంపర అతని పాలనా యంత్రాంగము, అపారసంపద నిరుపమాన ఉదారశీలము చోళ సామ్రాజ్య అఖండవైభవము అభివ్యక్తమగుచున్నది. అట్లే గంగైకొండ చోళపుర నిర్మాతయగు అతని కుమారుడు రాజేంద్రుడు నాటిన జయస్తంభ జలస్తంభములను శాసనముల మూలమున అతని ఘనకీర్తియు వెల్లడగుచున్నది. కాకుత్స్థవర్మ వేయించిన తలగుంద శాసనమునందు కదంబ వంశజుడైన ఒక బ్రాహ్మణయువకుడు వేదాధ్యయనమునకై కంచికి వెళ్ళి పల్లవప్రభువుల అశ్వదళాధిపతిచే అవమానితుడై యుద్ధవీరుడుగా మారి ఒక నూతనరాజ్యము నెట్లు స్థాపింప గలిగెనదియు తెలుపు ఉదంతము వర్ణింపబడినది. మహేంద్రవర్మ వేయించిన మండగపట్టు శాసనములో క్రొత్తదనము గోచరించును. గుహాలయవాస్తు నిర్మాణములో ఈ మహారాజు ప్రవేశపెట్టిన మార్పులిందు వివరింపబడినవి.

ప్రాచీన సంగీత నాట్యకళాశాస్త్రములను అవగాహనచేసి కొనుటలో శాసనముల ప్రాముఖ్యము. పల్లవ ప్రభువులు నిర్మింపించిన వాటివలన సుబోధమగును. చిదంబరము కుంభకోణము మొదలైన తావులలో ఆలయగోపురములపై భరత నాట్యశాస్త్రమునందు ఉల్లేఖింపబడిన బహువిధభంగిమలు చిత్రింపబడి అభివర్ణింపబడినవి. శిల్పములతో పాటు నిర్మితములైన శాసనముల సహాయముతో ఆ శిల్పనిర్మాణ మెప్పుడు ఎవరి వలన ఏపరిధర్మముచే ఎట్టి పరిస్థితులలో కావింపబడినదో తెలియగలదు. శిల్పనిర్మాణకాలము దాని భావము ప్రయోజనము కూడ వాటివలన అవగతమగును.

పురాతన ప్రభువుల రాజ్యకాలమును వారి ఘనకార్యములను యశస్సును గ్రహించుటకు శాసనము లెంతయు ప్రయోజనకారులై మానవ చరిత్రలో శాశ్వతస్థానమును సంపాదించుకొన్నవి. ఆయాయుగములలో వెలసిన శాసనములను అర్థముచేసికొనుటకు ప్రాచీన లిపులను గూర్చిన శాస్త్రజ్ఞాన మత్యవసరము. శాసనకాలము భాషావికాసము ఆయా భాషల వాఙ్మయ సౌందర్యము- ఇవన్నియు లిపుల తరువాతి అంశములే.

అత్యంత పురాతన శాసనములు ప్రాయశః అశోక చక్రవర్తి కావించిన రాజశాసన ప్రకటనములనవచ్చును. ఇవన్నియు ప్రాకృత భాషయందు లిఖితములైనవి. అనంతరము వాటి స్థానములలో సంస్కృత భాషాశాసనములు ప్రవేశమొనర్చినవి. రుద్రదమనుని గిర్నార్ సంస్కృత భాషాశాసనము ప్రాచీన యుగము నాటిది. నాహపణుని అల్లుడు ఉషవదత్తుని నాసికా గుహాశాసనముకూడ అట్టిదే. వీటినిబట్టి అంతకుపూర్వము అధికార భాషగా సంస్కృతము వ్యవహారములో లేదని అర్థము కాదు. ఆనాడు ప్రజలలో అత్యధికులచే ప్రాకృతము మాటాడబడి అర్థముచేసికొనబడియుండుటచే, ఆభాషయే శాసనములలోని కెక్కినది. తరువాత సంస్కృతము రాజభాషయైనప్పుడు, అది దేశమంతట ఉన్నత వర్గములకుచెందిన మేధావుల భాషయైనది. గుప్త వర్ధన ప్రతీహార, చందేల, గాంగ వంశముల ప్రభువులెల్లరు తమ శాసనములను సంస్కృత భాషయందే వ్రాయించి ప్రతిష్ఠించిరి. దక్షిణభారతములో సంస్కృతముకూడ కొంతకాలము రాజభాషగా వర్ధిల్లినది. ఉత్తర హిందూస్థానములో ప్రచారమందుండిన దేవనాగరిలిపి నేటి నాగరిలిపికి కొంచెము హెచ్చుతగ్గుగ నుండగా దక్షిణప్రాంతమందలి ఆకాలపు నాగరిలిపి ఒక మండలమునకును మరియొక మండలమునకును భేదించుచుండెడిది. దక్షిణభారతములో సంస్కృతభాషా శాసనములతోపాటు ఆయప్రాంతీయ భాషలలో కూడ శాసనములు వ్రాయించబడుచుండెను. రాష్ట్రకూటుల శాసనములు విశేషముగా ఆనాటి నాగరిలిపిలో సంస్కృత భాషయం దుండెడివి. అప్పుడప్పుడు మాత్రము సంస్కృతము లేక కన్నడములోగాని రెండింటి మిశ్రమములోగాని ఉండి తెలుగు-కన్నడలిపిలో వ్రాయబడుచుండెడివి. కాగా తెలుగు దేశములో తెలుగు, సంస్కృత భాషా శాసనములకై తెలుగు-కన్నడ సమ్మిశ్రలిపి ఉపయోగింపబడుచుండెడిది. సంస్కృత భాషేతర శాసనములు ఆయాప్రాంతీయ భాషాలిపులలో వ్రాయబడుచుండెడివి. వీటిలో తెలుగు కన్నడ తమిళములు శాసనములలో విశేషముగా కన్పట్టును. ఉదాహరణమునకు క్రీ. శ. 10 వశతాబ్దినాటి యుద్ధమల్లుని బెజవాడ శాసనము తెలుగులో పద్యరూపమున కానవచ్చును. తూర్పుచాళుక్య సేనానియగు పండరంగని శాసనములు క్రీ. శ. 9 వ శతాబ్ది నాటివి. తూర్పుచాళుక్యులు రెడ్డిరాజులు విజయనగర చక్రవర్తులు తెలుగు సారస్వత పోషకులగుటచే వారు వేయించిన శాసనములన్నిటిలో రాజభాషలతోపాటు సంస్కృత భాషయు వాడబడుచుండెడివి.

ప్రాచీనశాసనములన్నియు పత్రాకారలోహపు రేకులపై చెక్కబడియున్నవి. ఈ ఆధారమునుబట్టి అత్యంతప్రాచీనకాలమున లిఖితములన్నియు తాళపత్రములపైననో లేక భూర్జపత్రములపైననో ప్రవర్తిల్లుచుండినవని గ్రహింపవలెను. పురాతన బౌద్ధవాఙ్మయమునందును జాతక కథలయందును పర్ణశబ్దము ఉపయోగింపబడుట ఇందుకొక ఉదాహరణము. లేఖక పరికరముగా తాళపత్రపు ప్రాచీనత క్రీ. శ. 7 వ శతాబ్దికి చెందినదనవచ్చును. ప్రప్రథమముగా క్రీస్తుశకపు తొలిసంవత్సరములలో పత్రములను పోలు రాగిరేకులపై రాజులు దానశాసనములను వ్రాయించినట్లు ఆధారములుకలవు. 'గ్రంథము' 'ప్రబంధము' అను ప్రయోగములనుబట్టి వర్ణములనెడి పుటలు క్రమబద్ధముగా కాండ సర్గ అను విభాగములుగా అమర్చబడి పుస్తకరూపములో బంధింపబడినట్లు తెలియుచున్నది. శాసనమునకు బదులు లేఖ అనుశబ్దము పర్యాయముగ వాడుక

యందున్నది. అశోకుని శాసనములందు ప్రయోగింపబడిన 'ధర్మలిపి' అను పదమునుబట్టి లిపి శబ్దముకూడ వ్యవహారమునందుండినది. 'లిపి' శబ్దము అక్షరములను చిత్రించుట అను నర్థమును సూచించగా 'లిఖించుట' అనునది అక్షరముల చెక్కడము అను అర్థమును స్ఫురింపజేయుచున్నది.

పూర్వము శాసనములు శిలలమీద లోహములమీద మట్టి స్తూపులమీద చెక్కబడియుండినట్లు చూడగలము. సాధారణముగా ప్రాచీన కాలమున రాజశాసనములు "మహాసంధి విగ్రహిక" లేక "రహసిక" అనబడు దూతయొక్కగాని అమాత్యుని యొక్కగాని ఆజ్ఞననుసరించి "అక్షపటలిక" (దివిరపతి) అను శాసన సంరక్షకుడు ఏదేని అనుకూలమగు ఆకుపై గాని కొండరావి బ్రమాను తెరడుపైగాని వ్రాయబడుచుండెడివి. ఇట్లు వ్రాయబడిన పత్రములు లేక తెరడులు లోహపత్రములపై శాసనములను చెక్కుటకు పంపబడెడివి. ఆలోహశాసనముల ద్వారా దానగ్రహీతలకు సంక్రమించు భూములపై వారికి సర్వాధికారము ఏర్పడెడివి. ఈ శాసనములను వారు జాగ్రత్తగా పదిలపరచుకొనుచుండిరి. ఈ దాన శాసనములు గోకర్ణముచేత కుశాగ్రముచేత పునీతమైన రాజహస్తము ద్వారా "గోకర్ణకుశలతా పూతకరతలోదకపూర్వమాచంద్రార్కం యావత్ శాసనీకృత్య ప్రదత్తః" ఇత్యాది మంత్రోచ్చారణమున తిలోదకముతో దాన గ్రహీతల కొసగబడెడిది. రాజముద్రికపై ప్రభువు చేవ్రాలు చేయుటతో శాసనములకు రాజాధికారము స్థిరపడెడిది. చేవ్రాలు 'స్వహస్తో మమ' అనుపదముచే వ్యక్తీకరింపబడుచుండెడిది. ఇందుకుదాహరణము కళాశోభితముగా రూపొందింపబడిన హర్ష చక్రవర్తి చేవ్రాలు. విజయనగర సమ్రాట్టులు హరిహర లేక "శ్రీ విరూపాక్ష" అని మాత్రమే తమ ముద్రికలందు లిఖింపజేసెడివారు. ప్రాచీన ధర్మశాస్త్రములు దానశాసనములపై రాజముద్రికలను అచ్చొత్తించుట విధిగా పేర్కొనుచు వాటి మూలముననే శాసనములకు సాధికార ప్రమాణమేర్పడునని వక్కాణించినవి. రాజముద్రికయే అతని సర్వాధికారమునకు ఏకైక చిహ్నముగా పరిగణింపబడెడిది. ఒక్కొక్కప్పుడు రాజుచేవ్రాలు లేకున్నను, ఆతనిముద్రికయే సర్వాధికార చిహ్నముగా గుర్తింపబడి చెలామణి అయ్యెడిది. అయినను ఒకానొక సందర్భమున ఏదేనియొక రాజలాంఛనము రాజముద్రికతో సరిసమానప్రతిపత్తి ప్రమాణము కలదిగా వ్యవహరింపబడుచుండెడిది.

భారతదేశములో ప్రాచీన కాలమునుండి వివిధరకముల అధికారముద్రికలు వాడుకయందుండుచుండెను. ప్రైవేటు వ్యాపార వాణిజ్య సంఘములు ఉన్నతోద్యోగులు మంత్రులు సేనానులు నలందవిహారము వంటి విద్యాసాంస్కృతిక సంస్థలు వారివారి అధికారముద్రికలను ఉపయోగించుచుండెడివారు. అత్యంత ప్రాచీనమైన మొహెంజదారో నాగరిక యుగమునాటి ముద్రికలపైగల ఆలేఖ్యములందలి గూఢభావమింతవరకు సవ్యముగను సంపూర్ణముగను బోధపడకయున్నది. కొన్ని ప్రాచీన శాసనములపై జంతువులుకూడ చిత్రింపబడియున్నవి. అలహాబాదు సముద్రగుప్తుని శిలాస్తంభ శాసనముపైగల గరుడచిత్రము ఇందు కుదాహరణము. ఆనాటి రాజముద్రికలు శిల్పకళానైపుణికి ఉత్తమోదాహరణములు. నంది వరాహము మత్స్యము సింహము పెద్దపులి ఇత్యాదులు ఇతర చిహ్నములతోపాటు రాజలాంఛనములుగా చిత్రింపబడెడివి. వంగదేశమేలిన పాలవంశ రాజుల ముద్రికలపై ధర్మచక్రమునకిరు ప్రక్కల రెండు దుప్పులు చిత్రింపబడియున్నవి. తూర్పు గాంగవంశరాజుల శాసనములీ విషయమున ఇంకను ముందంజవేసినవి. వారి రాజముద్రికలపై ఇట్లు లిఖింపబడియున్నది: "రాజానుగ్రహము వలన పొందబడిన శంఖము భేరి పంచమహాశబ్ద వాద్యములు శ్వేతచ్ఛత్రము బంగారు చామరములు శ్రేష్ఠమైన వృషభ లాంఛనము- వీటిచే అత్యంత ప్రకాశమానమైన సకలసామ్రాజ్యము యొక్క మహిమగలవారు"

శాసన స్వరూప స్వభావములు: రాగి శాసనముల పరిమాణము ప్రాచీనకాలమునుండి క్రమముగా మారుచు వివిధ పరిణామములు చెందుచువచ్చెను. శాలంకాయన విష్ణుకుండిన ప్రభువులచే ఒసగబడిన శాసనముల పరిమాణము అత్యల్పమైనది. కాగా విజయనగర చక్రవర్తుల శాసనముల పరిమాణము అత్యధికముగనుండెడిది. మంగళశ్లోకముతో ఆరంభముకాని శాసనముకాని వాఙ్మయముకాని ఒక్కటికూడ ఆనాడుండెడిదికాదు. ఒక్కొక్కప్పుడు మంగళశ్లోకములు స్వస్తిక చిహ్నములచే సూచితమగుచుండెడివి. అశోకుని శాసనములు "దేవానాంప్రియ" అను వాక్యముతో ఆరంభమాయెను. ఒక్కొక్క సమయమున అవి 'నమో !' అను అభివందన పదముతోకూడ ఆరంభమగుటకలదు. వాకాటక

గుహాశాసనములందు సంకర్షణ వాసుదేవ ఇంద్ర చంద్ర సూర్య అశ్వ్యాది దేవతల ప్రశంసలు మొదలగు సంకేతములు కానగును. పల్లవ శాలంకాయనరాజుల తామ్రశాసనములందు కూడ స్వస్తిక సంకేతము లేర్పట్టెను. ఉత్తర భారత గుప్త రాజుల తొలిశాసనములలో సిద్ధమ్ అను శబ్దప్రయోగము గావింపబడినది. పశ్చిమ చాళుక్య రాష్ట్రకూటరాజుల శాసనములు ఓమ్ అను మంగళ శబ్దముతో ఆరంభమైనవి. ఓమ్ నమశ్శివాయ నమో బుద్ధాయ ఓమ్ నమో భగవతే వాసుదేవాయ ఓమ్ నమో బ్రహ్మణే అను ప్రయోగములకు సాధారణముగ వాడబడుచుండెడివి. అయితే విజయనగర శాసనము లన్నిటియందును గణాధిపతయే నమః" అను ప్రార్థనా వాక్యమే కానవచ్చును.

గేయరూపములో శివ విష్ణు స్తోత్రము సామాన్యముగా పెక్కు శాసనము లంగరిడను కొన్నిటియందు దేవీ ప్రార్థనము కూడ కలదు. ఉత్తర భారతీయ శాసనములందు త్రివిక్రముడు వాసుదేవుడు ఆదివరాహము మున్నైన దేవతామూర్తుల ధ్యానమగపడును. నెహ్రోలి శిలాస్తంభశాసన మందలి శివ విష్ణు స్తోత్రమిందుల కుదాహరణము. జైనశాసనములలో జినప్రార్థనము, బౌద్ధశాసనములలో మంజుఘోష వసుధర మంజుశ్రీల స్తోత్రము సర్వసాధారణముగా కన్పట్టును.

శాసనముమీద అభివందన వాక్యములై న పిదప ప్రభువు యొక్కగాని దాతయొక్కగాని మూడుతరముల వంశావళి పేర్కొనబడును. వంశావళియందు వారి బుషులు వారు అర్చించు దేవతలు వారి మత విశ్వాసములు వివరింపబడును. వీటితోపాటు వారి పూర్వులు సాధించిన ఘనకార్యములు ఉగ్గడింపబడును. ఇట్టి శాసనములు వేయించిన వారిలో పల్లవ ప్రభువగు సింహవర్మ ఒకడు. గుప్తరాజుల శాసనములలో దానశాసన మిచ్చు ప్రభువు కాలమువరకు వంశక్రమమును ఖాయించుట ఆచారముగ నుండెడిది. చరిత్రకారులకిట్టి వంశావళులతో కూడిన శాసనములు లెస్సగా ఉపయోగపడును.

శేషించిన శాసన భాగములలో దానముయొక్క ప్రయోజనము పేర్కొనబడియుండును. దాన శాసనములను గ్రహించువారు విద్వాంసులగు సేనానులైన కావచ్చును. వేద సాహిత్య పండిత ప్రకాండులు కావచ్చును. దేవాలయ అర్చకులు కావచ్చును. రాజ్యరక్షణమునకు ప్రజాక్షేమమునకు సేవ లొనరించినవారు కావచ్చును. సంగీత నాట్యవిశారదులు కావచ్చును. మరియెవరైన ప్రముఖులు కావచ్చును. దాన [illegible] చెరువులను దాన గ్రహీతల నామములు [illegible] గోత్రాదులు [illegible] ములలో పేర్కొనబడును. సంక్రమింపజేయబడిన ఆస్తి [illegible] దానగ్రహీతలకు ప్రభువులు సర్వవిధముల సహాయపడుచుండెడివారు.

ఇట్టి దాన శాసనములు శుభసమయములందొసగబడి వాటిపైన ఆ సమయములుకూడ లిఖింపబడెడివి. ఈ శుభ మహూర్తములు సూర్య చంద్ర గ్రహణదినములందైనను లేక గ్రహముల కుటమి ఘటిల్లు పవిత్ర దినములందైనను నిర్ణయింపబడుచుండెడివి. క్రీస్తు శక సంవత్సరమునకు సరియగు భారతీయ శక సంవత్సరమును నిర్ధరించుటకీ ఎవరములు సహాయపడుచుండెడివి. ప్రాకృత భాషాశాసనములలో ప్రభువులచే దానశాసనము లొసగబడిన కాలము — ఋతు మాస పక్ష తిథి వార నక్షత్రములు మొదలైనవి వివరింపబడియున్నవి. ఖరవేలుని హాథిగుంఫశాసనము లిట్టి కోవకు చెందినవి. గాంగ రాజవంశీయుల శాసనములపై గాంగశకమునకు సంబంధించు దిన వారాదులు పేర్కొనబడియున్నవి. ఇదే విధముగ బాదామియందలి పశ్చిమ చాళుక్య ప్రభువగు మంగళేశుని శాసనముపై శకయుగము లిఖితమైయున్నది. మాధ్యమిక యుగ శాసనములలో విక్రమ, శాలివాహన శకములు పేర్కొనబడియున్నవి. చేది శకము హర్ష శకములను నవి అంతగా ప్రముఖములు కావు. మాధ్యమిక యుగశాసనములలో ఋతు దినములకు ప్రత్యామ్నాయముగా అయనము మాసము పక్షము తిథి వార నక్షత్రములను చూడవచ్చును.

ముఖ్యముగా సంస్కృత భాషాశాసనములలో కొన్నిటియందు దానమొసగబడిన భూములకు సరిహద్దులుగా శివారులున్నచో వాటిపేర్లు నదులు చెరువులున్నయెడల వాటి నామములు చెట్లు బావులు మున్నగునవి ఉన్నచో వాటి గుర్తులు ఆయాస్థానిక భాషలలో వ్రాయబడియుండెడివి. అనాటి తూకపురాళ్లు కొలమానములే కాక దేవతల కర్పింపబడు వివిధ ఆహారపదార్థములు కూడ శాసనములలో స్థానిక భాషలందు వర్ణింపబడినవి. సాధారణముగా దానశాసనములు ప్రభువులచేతను కులీనులైన సంపన్నులచేతను గ్రహీతలకు

ప్రత్యేకముగా ప్రసాదింపబడెడివి ఒక్కొక్క సమయమున రాజాస్థానములందలి ప్రధానాధికారులే రాజశాసనములను గ్రామములకు కొనిపోయి బహిరంగముగా ప్రజలకు చదివి వినిపించి దానగ్రహీతలకందించెడివారు

శాసనముల తుదిభాగమున ఆశీర్వాద శాపార్థగేయము లుండుట పరిపాటి ఈగేయములు ప్రాకృత సంస్కృత తెలుగుభాషలలో వ్రాయబడెడివి రానురాను తరువాతి శాసనములలో నేరస్థులను దూషణ పరంపరకు గురిచేయుచు వ్రాయబడిన గేయముల సంఖ్య అధికమైనది ఈ ఆశీర్వాద శాపగేయములు విశేషముగా వేదములనుండియు ధర్మశాస్త్రముల నుండియు ఉటంకింపబడినవే శాసన నిబంధనములనన్నిటిని తమ భవిష్యద్రాజ వంశీయులెల్లరు ధర్మబద్ధమైనవిగా పాటించవలెనని ప్రభువులు శాసనములందు స్పష్టముగ వ్రాయించెడివారు ఇతర రాజవంశీయులనుకూడ దానశాసనముల కెవ్విధముగను అపచారము కల్పించవలదని అర్థించెడి వారు

కొన్ని శాసనములపై లేఖకుల యొక్కయు శాసన రచయితల యొక్కయు పేర్లు వ్రాయబడు చుండెడివి అట్టి ప్రాచీన లేఖకులలో అశోకుని బ్రహ్మగిరి సిద్ధపూర శిలా శాసనములను చెక్కిన చాపాదుడు లిపికారుడు అనువారును ఆదిత్యసేనుని శాసనమును చెక్కిన శివుడను తూర్పుచాళుక్య ప్రభువైన నరేంద్ర మృగరాజు శాసనమును చెక్కిన బెజవాడ వాస్తవ్యుడు అచలిశాచార్యుడును ప్రముఖులుగ పేర్కొన దగినవారు

సాధారణముగా ప్రభువు కొలువుకూటములో ప్రకటించిన శాసనములు అమాత్యుడు లేక సంధి విగ్రహికుడు మున్నగు ఉన్నతాధికారులచే అప్పటికప్పుడు ప్రత్యేకముగ వ్రాయబడి ప్రభువు ఆమోదమును వెంటనే బడసెడివి కవులచే రాజప్రశస్తిని గూర్చి రచింపబడు వాక్యములు కరణికుడు కాయస్థుడు లేఖకుడు, లిపికారకుడు అనువారిచే వ్రాయబడు చుండెడివి అనంతరము సూత్రధారుడు రూపకారుడు, తక్షుడు లేక శిల్పి అనువారు వాటిని లోహశిలాదులపై చెక్కెడివారు వీరి సేవలకు తగువిధముగా పారితోషికములు ప్రసాదింపబడెడివి

శాసన లేఖనా విధానము శిలలపైనను, లోహములపైనను ఒకేతీరుగనుండెడిది ఇదివరలో పేర్కొనినట్లువాటిపై సూర్యచంద్రులయు నందిగణపతులయు గోమాతయు మున్నగు రాజలాంఛనములకు తోడుగా ప్రాన్వదీర్ఘాకృతులలో కరవాలములు కూడ చిత్రింపబడుచుండెడివి మృత వీరుల దివ్యస్మృతిని, గ్రామప్రజలను పీడించు అరిష్టములను వ్యక్తీకరించు ఛాయాస్తంభములు సతీస్తంభములు మున్నైన నామములతో ఒప్పు శిలాశాసనములు మిగుల ప్రఖ్యాతి చెంది యున్నవి తుదకు సంతానకాముకులైనవారు స్థాపించిన సుదీర్ఘములైన "నాగశిలాస్తంభ శాసనము" లనునవి విశిష్టమైన తరగతి క్రింద నిర్మింపబడియున్నవి

శా సు

## శాసన సభలు

నేటి రాజ్యములలో భారతీవనమునకు శాసనములు అత్యవసరము పూర్వకాలమున చక్రవర్తియే శాసనాధికారిగా నుండెను రాజరిక వ్యవస్థ సన్నగిల్లినది మొదలు శాసనాధికారము ప్రజా ప్రతినిధుల పరమయ్యెను శాసనములు చేయుటకై ప్రజలచే ఎన్నుకొనబడు ప్రతినిధుల సభకు శాసనసభ అనిపేరు భారతదేశములో కేంద్ర శాసనసభ పార్లమెంటు అని పిలువబడుచున్నది ప్రజాప్రతినిధులు వాగ్వాదముల ద్వారా తీర్మానములను వివిధరకముల చట్టములను చేయు సభయే నేటి శాసనసభ పరోక్ష ప్రజాస్వామ్యములో ప్రజాభిప్రాయమును ప్రతిబింబించుచు ప్రజల సార్వభౌమాధికారమునకు చిహ్నముగా శాసనసభ వ్యవహరించును

ఐరోపాఖండ చరిత్రలో మధ్యయుగమందు పరిపాలకునకు సలహానిచ్చుటకును ధనము అవసరమైనపుడు క్రొత్తపన్నులను విధించుటకును శాసనసభ లేర్పరుపబడినవి వాటి నిర్మాతలు ప్రజాప్రతినిధులుకాక భూస్వాముల యొక్క, మతాధికారుల యొక్క ప్రతినిధులై యుండెడివారు ఉదా : ఫ్రాన్సులోని ఎస్టేట్స్ జనరల్ ఇంగ్లండులోని పార్లమెంటు జర్మనీలోని డయట్

శాసనసభల పుట్టుక పెరుగుదల అన్ని దేశములలో ఒక్కతీరుగా జరుగలేదు కొన్ని దేశములలో నిరంకుశ ప్రభుత్వములతో ప్రజలు పోరాడి క్రమానుగతముగా సంపాదించిన స్వాతంత్ర్యము ఫలితను గా శాసనసభలు స్థాపింపబడినవి ఇట్టి శాసనసభల నిర్మాణాధికారములు సంప్రదాయసిద్ధములు మరికొన్ని దేశములలో విప్లవఫలితముగా స్వాతంత్ర్య సంపాదనము జరిగి శాసనసభ లేర్పరుపబడినవి వాటి స్వరూపములు,

అధికారములు రాజ్యాంగ పరిషత్తులచే నిర్ణయింపబడినవి నేడు అన్ని దేశములలోను శాసనసభలు స్థాపింపబడినను వాటి నిర్మాణము అధికారములు ఒకేరీతిగాలేవు

19 వ శతాబ్దినుండి పరోక్ష ప్రజాస్వామ్యము అభివృద్ధి నొందుటతో నేటి శాసనసభలు అవతరించినవి నిర్మాణమును బట్టి శాసనసభలను రెండు తరగతులుగ విభజింపవచ్చును (1) ఏక సభావ్యవస్థ (2) ద్విసభావ్యవస్థ ద్విసభా వ్యవస్థను పాటించిన దేశములలో ఎగువసభ దిగువసభ అను రెండు సభ లుండును సాధారణముగ ఎగువసభ ప్రతినిధులు పరోక్షపు ఎన్నికపద్ధతిద్వారా ఎన్నుకొనబడుదురు ఉదా భారతదేశ మందలి రాజ్యసభ కొన్ని దేశములలో నియామక విధానము అనుసరింపబడుచున్నది ఉదా కెనడాలోని సెనేట్ సాధారణముగ అన్ని దేశములలోను దిగువసభ ప్రతినిధులు ప్రత్యక్షపు ఎన్నికపద్ధతివలన ఎన్నుకొనబడుదురు ఉదా : భారతదేశమందలి లోక్‌సభ సభ్యుల యోగ్యతలు వారి సంఖ్యాబలము పదవీ కాలపరిమితి మొదలగు విషయములలో ఇరు సభలనడుమ భేదముండును సంఖ్యాబలములో రెండు సభలకు భేదముండును ఎగువసభ సభ్యుల సంఖ్యకంటె దిగువసభ సభ్యులసంఖ్య హెచ్చుగానుండును ఉదా : భారతదేశములో దిగువసభ (పార్లమెంటు) యందు 500 సభ్యులుండగా ఎగువసభలో 250 మంది మాత్రమే ఉన్నారు పెక్కు దేశములలో దిగువసభ సభ్యులు 5 సంవత్సరములకొకసారి ఎన్నుకొనబడుదురు ఉదా : ఇండియా బ్రిటన్ దేశములలో ఎగువసభ కాలపరిమితి దిగువసభ దానికంటె హెచ్చుగానుండును సాధారణముగ ఎగువసభ సభ్యులందరు ఒక్కపెట్టున తమస్థానము లను కోల్పోవరు మూడువంతులలో ఒక వంతు మందిని ప్రతి 2 సం॥ లకు ఎన్నుకొనుపద్ధతి చాల దేశములలో ఆచరణయందున్నది ఉదా ఇండియా అమెరికా సంయుక్త రాష్ట్రములు, ఆస్ట్రేలియా

ద్విసభా వ్యవస్థ మొట్టమొదట ఇంగ్లండులో ప్రారంభమయ్యెను నేటి ప్రపంచములో చాల దేశములు ఈ పద్ధతిని అనుసరించుచున్నవి కొందరు రాజకీయవేత్తలు ద్విసభా వ్యవస్థను తీవ్రముగ విమర్శించుట కలదు ఎగువసభకు దిగువసభతో సమానముగా అధికారము లిచ్చినయెడల రెండుసభల మధ్య కీచులాటలు పెరిగి పరిపాలనము కుంటుపడును ఇంతేకాక, నేటిపరిస్థితులలో దిగువసభ తొందరపాటుతో చేసిన పొరపాటులను సరిదిద్దుటకు కమిటీలు ప్రతిపక్షములు ఉన్నందున ఎగువసభ అనవసరమని వీరి అభిప్రాయము

శాసనసభ్యులకు కొన్ని ప్రత్యేకహక్కులియ్యబడును వాటిలో ముఖ్యమైనది వాక్స్వాతంత్ర్యము శాసనసభా కార్యక్రమము సాగునపుడు సభ్యులు వ్యక్తపరచు అభిప్రాయములకును చేయుచర్యలకును వారిని శిక్షించు అధికారము న్యాయస్థానములకుండదు బ్రిటనులో పార్లమెంటు సభ్యులు పంచాయతీదార్లుగా (jurors) పనిచేయ నవసరములేదు ఇజ్రాయిల్ దేశములో శాసనసభ్యులకు నిర్బంధసైనికచట్టము వర్తింపదు పూర్వకాలమున శాసనసభ్యులకు వేతనములిచ్చు పద్ధతిలేకుండెను కాని బీదవారికికూడ శాసనసభ్యులుగా దేశ సేవచేయు అవకాశమును కల్పించు ఉద్దేశముతో శాసనసభ్యులకు వేతనములిచ్చు పద్ధతి ఆచరణములోనికి వచ్చినది స్విట్జర్లెండు హాలెండువంటి దేశములందు పార్లమెంటు సమావేశమగు కాలములో మాత్రము సభ్యులకు వేతనములిత్తురు అమెరికా సంయుక్తరాష్ట్రములు బ్రిటన్ ఇండియా మున్నగు దేశములలో నెలసరి వేతనములిచ్చు పద్ధతి ఆచరణములోనున్నది

శాసనసభ్యునకును అతనిని ఎన్నుకొను నియోజకవర్గమునకును ఎట్టి సంబంధముండవలెనను విషయమై విభిన్న సిద్ధాంతములున్నవి ఒక సిద్ధాంతము ప్రకారము శాసనసభ్యుడు తనను ఎన్నుకొను నియోజకవర్గముయొక్క అభిప్రాయములకు అనుగుణముగా శాసనసభలో ప్రవర్తింపవలెను గాని తనకు తోచినట్లు వ్యవహరింపరాదు శాసనసభ్యుడు ఏ పార్టీ ప్రణాళికపై ఎన్నికయ్యెనో దాని కాతడు బద్ధుడై ప్రవర్తింపవలెను శాసనసభ్యుడు స్వతంత్రముగా ప్రవర్తించుటకు స్వేచ్ఛ ఉండవలెననునది వేరొక సిద్ధాంతము దీని ప్రకారము ఎన్నుకొనబడు ప్రతినిధి దేశాభ్యుదయమును దృష్టియందుంచుకొని తనకుతోచిన రీతిని వ్యవహరింపవలెను శాసనసభ దేశమంతటికి సంబంధించిన దగుటచే శాసనసభ్యుడు దేశమునకు ఏది శ్రేయస్కరమో ప్రధానముగా దానిని సమర్థింపవలెనే గాని సంకుచిత దృష్టితో తన నియోజకవర్గ శ్రేయస్సుకై మాత్రమే పాటుపడరాదు నిజమునకు ప్రతి శాసనసభ్యుడు పై నుదహరించిన రెండు సిద్ధాంతములను సమన్వయపరచుటకు ప్రయత్నింపవలెను తనను ఎన్నుకొనిన నియోజకవర్గమునకు బాధ్యుడై ప్రవర్తించుచు, స్థానికావసరములతో సంఘర్షణ వచ్చినపుడు దేశశ్రేయమునకు ప్రాధాన్యము

నిచ్చుచు ప్రవర్తించుట సమర్థనీయము

శాసనసభా కార్యక్రమమును జయప్రదముగా నడపు బాధ్యత సభాపతిపైనుండును దిగువసభ యొక్క సభాపతిని శాసన సభ్యులెన్నుకొనుట ఆచారమైయున్నది ఉదా అమెరికా సంయుక్త రాష్ట్రములు ఇండియా బ్రిటను కాని ఎగువ సభయొక్క అధ్యక్షుని నియమించుటలో ఒకే పద్ధతిని అన్ని దేశములు పాటించుటలేదు ఇండియా అమెరికా సంయుక్త రాష్ట్రములు బ్రెజిల్ దేశములలో దేశ ఉపాధ్యక్షుడు ఎగువసభ అధ్యక్షపదవిని పొందును బ్రిటన్ ఇండియా మొదలగు కామన్‌వెల్తు దేశములలో సభాపతిగా ఎన్నికయగు సభ్యుడు పార్టీ ప్రమేయములేకుండ స్వతంత్రముగా వ్యవహరించు సంప్రదాయము పాటింపబడుచున్నది అమెరికా సంయుక్త రాష్ట్రములలో అట్లుకాక సభాపతి పార్టీ వ్యక్తిగానే వ్యవహరించును అన్ని దేశములలోను సభాపతిచేయు ముఖ్య కార్యము లివి (అ) శాసనసభా కార్యక్రమమును క్రమ బద్ధముగ నడపుట పగినమున ఏయే విషయములపై ఎంత కాలము చర్చలు సాగించవలెనో ఎప్పుడు ఓటు తీసికొనవలెనో మొదలగు అంశములను నిర్ణయించును (ఆ) సభా మర్యాదలను కాపాడు బాధ్యత తీసికొనవలెను సాధారణ సభ్యుడుకాని, తుదకు మంత్రి వర్యుడైనను సభా మర్యాదలకు విరుద్ధముగా ప్రవర్తించుచో అతనిపై తగు చర్య తీసికొనవలెను (ఇ) సభ్యుల హక్కులను కాపాడవలెను ఇట్టి గురుతరమైన బాధ్యతలను నిర్వర్తింపవలసి వచ్చుటచే శాసనసభా కార్యకలాపము లలో హెచ్చు అనుభవము కలవానిని యోగ్యుడగువానిని సభాపతిగ ఎన్నుకొనుట ఆచారమైయున్నది

శాసనసభా భవనములో సభ్యుల ఆసనముల నేర్పరచుటలో వివిధ దేశములు వివిధ పద్ధతులను అనుసరించుచున్నవి ఆయాదేశములలోని ముఖ్యమైన పార్టీల సంఖ్యపై ఈ ఏర్పాటు ఆధారపడియున్నది దేశములో అధిక సంఖ్యాకముగ పార్టీలున్న యెడల శాసన సభ్యుల ఆసనములు సభాపతికెదురుగా అర్ధగోళాకృతిలో ఏర్పరుపబడును ఉదా ఐర్లెండు స్విట్జర్లెండు ఒకేపార్టీగల పీపుల్సు డెమాక్రసీలు అన బడు దేశములలో అధ్యక్షునికెదురుగా సమానాంతర శ్రేణులలో ఒకదాని వెనుక మరొకటిచొప్పున ఆసనములు ఏర్పరుపబడును ఉదా ఆల్బేనియా బల్గేరియా యుగోస్లేవియా రష్యా ముఖ్యముగ రెండు పార్టీలు గల దేశములలో అధ్యక్షునికెదురుగా ఇరువైపుల సమానాంతర శ్రేణులలో సభ్యుల ఆసనములు అమర్చబడును ఉదా బ్రిటన్ భారత దేశము శాసనసభ యందు సభ్యుల ఆసనముల నమర్చుటలో ఏ ఒక్క పవిత్ర సిద్ధాంతమును ఆచరణమందుండదు వివిధ పక్షములకు చెందిన సభ్యులు కూర్చొనుటకు ఏది అనుకూలమైన ఏర్పాటో దానిని పాటించుట సమంజసమైయున్నది

శాసనసభలు తమకార్యక్రమములను సాగించుటలో కొన్ని నిబంధనములను పాటించును వీటిలో ముఖ్యమైనది కోరమ్ అనగా ఒక నిర్ణీతమైన సంఖ్యకు తక్కువకాని సభ్యులు సభలో లేనిచో సభాపతి కార్యక్రమమును నిలుపవలసియుండును సాధారణముగా ఈ నిర్ణీత సంఖ్య శాసనసభ మొత్తము సంఖ్యలో పదింట ఒక వంతు లేక అంతకంటె తక్కువగానుండును ఈ నిబంధనమును విశ్వాస రాహిత్య తీర్మానములుగాని లేక ముఖ్య చట్టములనుగాని చర్చించునప్పుడు తప్ప ఇతర సమయములలో అంతగా పాటింపరు బ్రెజిల్ ఫిన్లెండు స్వీడను దేశములలో కోరమ్ నిబంధనములేదు శాసనసభ ఏ విషయముపైనైనను చర్చముగించిన తరువాత తుది నిర్ణయము చేయుటకు సభ్యుల ఓట్లు తీసికొనబడును స్విట్జర్లెండులో సభ్యులు నిలువబడియుండుట ద్వారా తమ సమ్మతిని తెలియచేయుదురు సోవియట్ రష్యాలో చేతులెత్తుటవలన బ్రిటన్ ఇండియా ఆస్ట్రేలియాలలో వాక్కుద్వారా సమ్మతిని తెలుపుటవలనగాని లేక అనుకూలురు ఒక ప్రక్కకు ప్రతికూలురు వేరొక ప్రక్కకు చేరుటవలనగాని వోటు చేయు పద్ధతులు పాటింపబడుచున్నది

నేటి శాసన సభల కార్యకలాపములను నడపుటలో కమిటీలు ప్రధాన పాత్ర వహించుచున్నవి కొన్నివందల సభ్యులతో కూడిన ఒకానొక శాసనసభ ముఖ్య విషయములపై సాధారణ చర్చలను సాగించుటకు అనుకూలపడునుగాని సూక్ష్మముగను కూలంకషముగను ఏవిషయమునైన పరిశీలించుటకు వలనుపడదు అందువలన తక్కువ సంఖ్యతో కూడిన వివిధరకముల కమిటీల ద్వారా శాసనసభ తన వ్యవహారము లను పరిష్కరించుకొనును ముఖ్యమైన ప్రతి చిత్తు చట్టము ఒక కమిటీకి నివేదింపబడును అమెరికా సంయుక్త రాష్ట్రములలో దేశాధ్యక్షుడుగాని కార్య నిర్వాహక వర్గమునందలి ఏ ఇతర సభ్యుడుగాని శాసనసభలో చిత్తు చట్టములను ప్రవేశపెట్టుటకు వీలులేనందున వేర్వేరుకమిటీల అధ్యక్షులే

-త్తు చట్టములను తయారుచేసి కాంగ్రెసు (శాసనసభ)లో ప్రవేశపెట్టుదురు. అందువలన కమిటీని 'చిన్న శాసనసభ' అని యందురు.

పరోక్ష ప్రజాస్వామ్యములో శాసనసభలు పెక్కు విధులను నిర్వహించును. వాటిలో ప్రధానమైనది శాసనములను గావించుట. చట్టములను చేయు అధికారము శాసనసభలకు తప్ప ఏ ఇతర సంస్థకు ఉండదు. దేశమునకంతకు సంబంధించు శాసనములను స్థానిక విషయములకు పరిమితమగు శాసనములను, ప్రభుత్వాదాయమునకు సంబంధించు శాసనములను చేయుట శాసనసభ ముఖ్యవిధి. శాసనములను గావించుటలో పార్లమెంటు ఒక క్రమమును అనుసరించును. తటాలున ఏ శాసనమును చేయవలనుపడదు. చిత్తు శాసనమును నిర్ణీత దినమున ప్రవేశపెట్టుట మొదటి ఘట్టము. తరువాత అది ఒక కమిటీకి నివేదింపబడును. కమిటీ విచారణ పూర్తియైన తరువాత ఆచిత్తు శాసనము రెండవసారి సభలో చదువబడును. ఆ సమయమందే ప్రతి సూత్రము చర్చింపబడును. చిత్తు శాసనము యొక్క తుదిరూపమును నిర్ణయించుటలో ఇది చాల ముఖ్యమైన ఘట్టము. మూడవసారి చిత్తు శాసనము చదువబడి దానిపై ఓటు తీసుకొనబడును. ద్విసభావ్యవస్థలో రెండు సభల ఆమోదమును పొందిన తరువాత ఆ చిత్తు శాసనము రాష్ట్రపతి సమ్మతికై పంపబడును. ఇట్లు ఒక దీర్ఘమైన కర్మకాండను అనుసరించి శాసనములు గావింపబడును.

పార్లమెంటరీ ప్రభుత్వముగల దేశములలో కార్యనిర్వాహక వర్గమును అదుపులో పెట్టుట శాసనసభ యొక్క మరియొకవిధి. మంత్రులు బాధ్యతాయుతులుగా ప్రవర్తించునట్లు చేయుటకు శాసనసభ వివిధ మార్గములను అనుసరింపవచ్చును. శాసన సభ్యులు మంత్రులను ప్రశ్నించు హక్కు చాల ప్రధానమైనది. పార్లమెంటు సమావేశమగు తరుణములో ప్రతిరోజుగాని వారమునకు మూడు నాలుగు రోజులుగాని మొదటి గంట ప్రశ్నోత్తర సమయముగా పరిగణింపబడును. ఇతర తీర్మానములు, విశ్వాసరాహిత్య తీర్మానము మొదలగు సాధనములవలన కూడ శాసనసభ మంత్రి మండలిని అదుపులో ఉంచుటకు అవకాశము ఏర్పడుచున్నది.

ఆర్థిక విషయములను గూర్చి నిర్ణయములను చేయుట ప్రధానమైన శాసనసభ విధులలో నొకటి. సాంవత్సరిక ప్రభుత్వ ఆదాయ వ్యయముల అంచనాలను శాసనసభ చర్చించి నిర్ణయింపవలెను. బడ్జెటును శాసనసభ ఆమోదించిననేగాని ప్రభుత్వము పన్నులను విధించుటకును, వివిధ రంగములలో ధనమును ఖర్చు చేయుటకును వీలుపడదు. ప్రభుత్వ వ్యయమును నిర్ణయించు అధికారము శాసనసభకు వస్తుగతమైయుండును.

నేటి శాసనసభలు వాటి అధికారములలోను బాధ్యతలలోను నూతన పరిణామములను పొందుచున్నవి. పరిపాలనా విధానము, ప్రభుత్వ సమస్యలు ఈనాడు చాల క్లిష్టరూపమును దాల్చియున్నవి. అట్టివాటిపై నిర్ణయములను తీసికొనుట కేవలము శాసన సభ్యులకు మాత్రమే సాధ్యము కాకుండుటచే సివిల్ ఉద్యోగుల (ఐ సి యస్, ఐ ఎ యస్) సహకారము విశేషముగా అవసరమగుచున్నది. నేటి జాతీయ అంతర్జాతీయ రంగములలో రాజకీయ ఆర్థిక సాంఘిక పరిస్థితులు కూడ కార్యనిర్వాహకవర్గ (సివిల్ ఉద్యోగివర్గ) ప్రాబల్యమునకు దోహదమిచ్చుచున్నవి.

వ. శిం. మూ.

## శిక్షాశాస్త్రము

అవతరణిక : భారతీయ విజ్ఞానసంపదకంతకును వేదమే మూలము. అయ్యది శిక్ష - వ్యాకరణము - ఛందస్సు - నిరుక్తము - జ్యోతిషము - కల్పము అను ఆరు అంగములతో పురాణ న్యాయ మీమాంసాధర్మశాస్త్రము లనబడు ఉపాంగములతో ఉపబృంహితమగుచున్నది. అంగవిజ్ఞానము సమగ్రముగ నున్నప్పుడే అంగియగు వేదముయొక్క స్వరూపము యథాతథముగ విజ్ఞాతమగును. అంగములలో దేనికది విలక్షణమై ప్రాధాన్యము కలది యగుచున్నది. అందేది లేకున్నను లోపమే. ఐనను శిక్షాం ప్రాణం తు వేదస్య అనుటను బట్టి శిక్షాశాస్త్రమున కొక ప్రత్యేకత యున్నది. ఇతర లోపము లెట్లున్నను ముక్కులేని లోపము ముఖమందు కొట్టవచ్చినట్లు కానవచ్చునుగదా!

విషయ - ప్రయోజనములు - "శిక్ష్యతే వర్ణాద్యుచ్చారణమనయేతి శిక్షా" అను వ్యుత్పత్తి ననుసరించి వర్ణస్వరాదుల యుచ్చారణక్రమము నుపదేశించు గ్రంథము 'శిక్షా' శబ్దవాచ్యమగుచున్నది. అర్థసౌష్ఠవమునకు శబ్దసౌష్ఠవమువలె, శబ్దసౌష్ఠవమునకు ఉచ్చారణసౌష్ఠవమావశ్యకము. ఉచ్చారణలోని లోపము ఉచ్చరియబడు శబ్దమునను తద్ద్వారా అర్థమునను సంక్రమించి అనర్థపర్యవసాయి యగును. కావుననే శిక్షాకారు లిట్లు చెప్పుచున్నారు:

'మన్త్రో హీనః స్వరతో వర్ణతో వా మిథ్యాప్రయుక్తో
న తమర్థమాహ
స వాగ్వజ్రో యజమానం హినస్తి యథేన్ద్రశత్రుః
స్వరతోఽపరాధాత్॥'

అశ్వః-అస్వః శకృత్-సకృత్ శకలం-సకలం ఇట్టి శబ్దములలో ఉచ్చారణ లోపమున గలుగు వైపరీత్యము అర్థవైపరీత్య కారణమై అనర్థావహమగును. త్వష్ట యను నాతడు ఇంద్రుని జంపువాని బుట్టించు నుద్దేశముతో అభిచారహోమమును చేయుచు ఇన్ద్రశత్రుర్వర్ధస్వ అను మంత్రము నుచ్చరించినాడట. అందు స్వరము తారుమారగుటచే ఇంద్రుని జంపువాడు పుట్టుటకు బదులు ఇంద్రునిచే జచ్చువాడు పుట్టినాడట. (ఇన్ద్రశత్రు శబ్దము ఇన్ద్రస్య శత్రుః అని షష్ఠీతత్పురుషమైనపుడు సమాసస్య అను సూత్రముచే అన్తోదాత్తమగును. అట్లుగాక ఇన్ద్రః శత్రుః యస్య సః అని బహువ్రీహి యైనపుడు బహువ్రీహౌ ప్రకృత్యా పూర్వపదం అను సూత్రముచే ఆద్యుదాత్తమగును. త్వష్ట యీ మంత్రమును అన్తోదాత్తముగ నుచ్చరించవలసిన దానిని ఆద్యుదాత్తముగ నుచ్చరించుటచే అనిష్టమాపాదిల్లినది) లోకవ్యవహారములో గూడ శబ్దభేదము లేకున్నను కాకుస్వరాదులచే అర్థభేదము కలుగుచుండుట అనుభవసిద్ధమే. మానవు లుచ్చరించు వర్ణాత్మక శబ్దము లందేగాక పశుపక్ష్యాదు లుచ్చరించు ధ్వన్యాత్మక శబ్దములలో గూడ స్వరభేదము ననుసరించి సంతోష విషాదాది భావవిశేషము లభివ్యక్తము లగుచుండుట విజ్ఞులకు తెలియని విషయము కాదు.

ప్రామాణ్యము – అంగోపాంగరూపములగు ఆర్షగ్రంథము లన్నియు సాధారణముగ వేదమూలకములై యుండుటను బట్టియే శిష్టులు వాటి ప్రామాణ్యము నంగీకరించుచున్నారు. అందు కొన్ని అన్యూనాతిరిక్తముగ శ్రుత్యుక్తములగు విషయముల ననువదించుచుండుట మరికొన్ని శ్రుతిలో సూత్రప్రాయముగ దెలుపబడిన విషయములను సాంగోపాంగముగ సోదాహరణముగ వివరించుచు వ్యాఖ్యానరూపములై యుండుట ఈ దృష్టితో జూచినపుడు శిక్షాశాస్త్రము నైతము శ్రుతిమూలకమనుట విస్పష్టము. శుక్లయజుర్వేదీయమగు బృహదారణ్యకమునను సామసంబంధి యగు ఛాందోగ్యమునందును అథర్వణికమగు ముండకోపనిషత్తునందును ఈ శిక్షాశాస్త్రము యొక్క నిర్దేశము కనిపించుచున్నది. విశేషించి తైత్తిరీయ శ్రుతిలో శిక్షాశాస్త్ర సర్వస్వమిట్లు సూత్రీకరింపబడి యున్నది

'శీక్షాం వ్యాఖ్యాస్యామః వర్ణస్స్వరః మాత్రాబలమ్
సామ సన్తానః ఇత్యుక్తశ్శీక్షాధ్యాయః'

ఇందు పేర్కొనబడిన వానిలో అ క కాదివర్ణకములును ఉదాత్తాది స్వరములను ప్రసిద్ధములు. మాత్రాశబ్దముచే హ్రస్వ-దీర్ఘ-ప్లుతములు గ్రహింపబడుచున్నవి. బలశబ్దము బాహ్యాభ్యన్తర ప్రయత్నములను బోధించును. మిక్కిలి వేగముగను మిక్కిలి విలంబముగను కాకుండునట్లు ఏ వర్ణమున కెంత కాలముచితమో ఆ వర్ణమునంత కాలములో నుచ్చరించుట సామమనబడును. పూర్వోత్తర వర్ణములను అవ్యవధానముగ నుచ్చరించుట సన్తానము. వర్ణము మొదలు సంతానమువరకు గల ఆరువిషయములను సలక్షణముగ గ్రహించి ప్రయోగింపదగునని తైత్తిరీయ శ్రుతి తాత్పర్యము. ఇందు శిక్షాశాస్త్రము లోని ప్రధాన ప్రతిపాద్య విషయము ప్రకాశితమగుచున్నది. పాణిన్యాది ప్రణీతములైన శిక్షాగ్రంథములలో ప్రస్తాను ప్రసక్తముగ మరెన్నియో విషయములు వివరింపబడినవి.

శాస్త్రవిస్తరము – శిక్షలెన్ని? వీనిసంఖ్య ఇదమిత్థమని నిర్ణయించుటకు వీలు కాకున్నది. వ్యాసశిక్షా వ్యాఖ్యానములో నవశిక్షలనామము లిట్లు నిర్దేశింపబడి యున్నవి

ప్రథమా వ్యాసశిక్షా చ ఒత్యకిశిక్షా ద్వితీయికా
భారద్వాజీ తృతీయా చ శిక్షాఽఽరణ్యా తురీయికా।
పంచమీ శంభుశిక్షా చ షష్ఠీ దాఽఽపిశలీ తథా
సప్తమీ పాణినేశ్శిక్షా అష్టమీ కౌహలీ తథా॥
వాసిష్ఠీ నవమీ చైవం నవశిక్షాః ప్రకీర్తితాః।

ఇవిగాక శౌనకశిక్ష, యాజ్ఞవల్క్యశిక్ష, నారదశిక్ష, లోమశశిక్ష, వ్యాడిశిక్ష, మాధ్యందినిశిక్ష, కాత్యాయనశిక్ష, పారాశరశిక్ష, మాండవ్యశిక్ష, స్వరాంకుశశిక్ష, అమోఘానన్దిశిక్ష-ఇత్యాదులెన్నోయున్నవి.

వీనిలో కొన్ని సమగ్రస్వరూపముతో లభించుచున్నను, మరి కొన్ని ఆయా శిక్షా వ్యాఖ్యానాదులలో ఉదాహరించుటను బట్టి మాత్రమే ఉన్నట్లూహింపబడుచున్నవి. ఈ శిక్షలలో కొన్ని సర్వవేదశాఖా సాధారణములు కాగా మరికొన్ని ఆయా వేదశాఖలకు మాత్రము సంబంధించిన వర్ణస్వరాది విశేషములను బోధించునవై యున్నవి. ఇట్టివి కొన్ని 'ప్రాతిశాఖ్య' నామముతో ప్రసిద్ధి పొందినవి.

అంగశాస్త్రత్వము – కొందరు వ్యాకరణ శాస్త్రముతో

శిక్ష గతార్థమగుననియు ఇందు అపూర్వాంశము మృగ్యమనియు భావించుచున్నారు. అదిసరికాదు. రెండును శబ్దచింతాప్రధానములేయైనను విషయభేదమున్నది. గత్యర్థకమగు గమ్ ధాతువుకు ఔణాదికమగు డో ప్రత్యయమును చేర్చినపుడు నిష్పన్నమైన గో శబ్దము సాస్నాదులతో (గంగడోలు మూపురము అవయవముల) గూడిన పదార్థమును బోధించుటలో సాధువని వ్యాకరణము చెప్పుచుండగా శిక్షాశాస్త్రమా శబ్దమును జిహ్వామూలస్థానస్పృష్టప్రయత్నముతో నుచ్చరింపవలెనని యుపదేశించుచున్నది. మరియు స్వరవర్ణోచ్చారణోపయుక్తములగు స్థానప్రయత్నాదుల యొక్కయు ఉదాత్తానుదాత్త స్వరితాది స్వరములలోని అవాన్తరవిభాగముల యొక్కయు స్వరభక్త్యాది వర్ణవిశేషముల యొక్కయు లక్షణస్వరూపవివరణాదులు వ్యాకరణమునగాక శిక్షలోనే సాక్షాత్కరించుచున్నవి. వ్యాకరణశాస్త్రములోని స్వరవైదిక ప్రక్రియగూడ ప్రాయశః ప్రకృతియగు సంహితాపాఠమునకు మాత్రమే సంబంధించియున్నది. అవాన్తర ప్రకృతులగు పదక్రమాదుల యొక్కయు జటామాలా శిఖారేఖాది వికృతివిశేషముల యొక్కయు వివరణము సైతము శిక్షలలోనే కానవచ్చుచున్నది. కావుననే ప్రాచీనులు శిక్షను స్వతంత్ర విద్యాస్థానముగ పరిగణించియున్నారు.

వర్ణసమామ్నాయము – సాధారణముగ ప్రతిశిక్షా గ్రంథమునను మున్ముందు వర్ణనిరూపణము చేయబడినది. ఇది భిత్తిస్థానీయము. దీనినాలంబనముగ చేసికొనియే చిత్రస్థానీయములైన యితరాంశములు ప్రవర్తించును. వర్ణములను పరిగణించుటలో శిక్షాకారులు విభిన్నాభిప్రాయములను వెలిబుచ్చియున్నారు. యాజ్ఞవల్క్య శిక్షలో 58. వైదికాభరణానుసారములో-59. త్రిభాష్యరత్నానుసారములో-60. పాణినీయ శిక్షలో ఒకమతమున-63. మరియొక మతమున 64. శుక్లయజుః ప్రాతిశాఖ్యములో-65. ఆరణ్యక శిక్షలో-66. వ్యాసశిక్షలో-68. లక్ష్మీకాన్త శిక్షలో-108. ఈ విధముగ నిర్దేశింపబడియున్నవి.

నిజమునకు వ్యాకరణ మూలభూతములగు మాహేశ్వర (అక్షర సమామ్నాయ) సూత్రములలో నిర్దిష్టములైన అకారాది హకారాన్తములగు నలుబదిరెండు వర్ణములే ప్రధానమైనవి. సంఖ్యాధిక్యము ధర్మభేదమూలకమే గాని, ధర్మి (వ్యక్తి) భేదమూలకముకాదు. హ్రస్వదీర్ఘప్లుతాదికాలభేదముల వల్లను ఉదాత్తానుదాత్తాది స్వరభేదముల వల్లను ఆనునాసిక్య నిరనునాసిక్యాదుల వలనను ఒకే వర్ణము నానారూపముల వ్యవహరింపబడుచున్నది. రేఫోష్మసంయోగమున వచ్చు స్వరభక్తి, ఎకారాద్యక్షర చతుష్టయము, పంచమము రమగ వుడు వచ్చు యమములు, జిహ్వామూలీయోపధ్మానీయాదులు సైతము ఈ గణనలోనికే వచ్చును.

వీనిలో అకారాది ఔకారాన్తవర్ణములు "స్వయం రాజన్తే" అను వ్యుత్పత్తి ననుసరించి పరాపేక్షలేక స్వయముగ ప్రకాశించునవిగాన స్వరములనియు తదితరములు "వ్యంజ్యన్తే ప్రకాశ్యన్తే పరేణ స్వరేణ" అను వ్యుత్పత్తిచే స్వరముల సాయముతో వ్యక్తమగునవిగాన వ్యంజనములనియు వ్యవహరింపబడుచున్నవి. ఇవియే "ఆదిరన్త్యేన సహేతా" అను వ్యాకరణ సూత్రానుసారము అచ్ హల్ ప్రత్యాహార ఘటకములగుటచే యథాక్రమముగ అచ్చులు హల్లులనియు చెప్పబడుచున్నవి.

వర్ణోత్పత్తి – వర్ణోత్పత్తి క్రమము పాణినీయశిక్షలో నిట్లు వర్ణింపబడినది.

ఆత్మా బుద్ధ్యా సమేత్యార్థాన్ మనో యుంక్తే వివక్షయా।
మనః కాయాగ్నిమాహన్తి స ప్రేరయతి మారుతమ్॥
మారుతస్తూరసి చరన్ మన్ద్రం జనయతి స్వరమ్।
ప్రాతస్సవన యోగంతం ఛన్దో గాయత్ర మాశ్రితమ్॥
కంఠే మాధ్యన్దినయుగం మధ్యమం త్రైష్టుభానుగమ్।
తారం తార్తీయ సవనం శీర్షణ్యం జాగతానుగమ్॥
సోదీర్ణో మూర్ధ్న్యభిహతో వక్త్రమాపద్య మారుతః।
వర్ణాన్ జనయతే తేషాం విభాగః పంచధా స్మృతః॥

ఇచట ఆత్మయనగా అంతఃకరణము. అయ్యది తనలో సంస్కారరూపముగనున్న పదార్థములను తన బుద్ధివృత్తి విషయములుగావించి వానినితరులకు తెలుపవలెనను తలంపుతో మనస్సును ప్రేరేపించును. అయ్యది జఠరాగ్ని నుద్దీపింపచేయును. అదియు శరీరాన్తస్సంచారియగు ప్రాణవాయువును ప్రవర్తింపచేయును. ఆవాయువు హృదయము-కంఠము-శిరస్సు అను స్థానములలో క్రమముగ మన్ద్ర-మధ్యమ-తారధ్వనుల గలిగించుచు పైకిపోయి శిరఃస్థానమునుండి (దానిని దాటి పైకి పోవుటకవకాశములేకపోవుటచే) పరావృత్తమై ముఖబిలమున ప్రవేశించి కంఠతాల్వాది స్థానములలో అకారాది వర్ణములను వ్యక్తము గావించునని భావము.

స్వరసంచారము ఉదాత్తము అనుదాత్తము స్వరితము అను మూడును ముఖ్యమైన స్వరములు ప్రయత్న ప్రేరితమగు వాయువు సావయవములగు తాల్వాదిస్థానముల ఊర్ధ్వభాగమును స్పృశించి నపుడుత్పన్నమగు అచ్చు ఉదాత్తము బడును అట్టి వాయువే తాల్వాదిస్థానముల అధోభాగమును స్పృశించునపుడుత్పన్నమగు అచ్చు అనుదాత్తమన బడును ఉదాత్తత్వము - అనుదాత్త్వమునను ధర్మములు రెండును ఏ అచ్చులో గలిసియుండునో అది స్వరితము మరియు స్వరితమునకు పరమైన యనుదాత్తము సంహితా కాలమున ఉదాత్త సమముగ నుచ్చరింపబడును దానిని 'ప్రచయ' మనునామముతో వైదికులు వ్యవహరించుచున్నారు

శిక్షాకారులీస్వరములలో అనేకములగు అవాన్తర విశేషములను తెలిపినారు అందు ఉదాత్తమున మాత్రమెట్టి భేదములునులేవు అనుదాత్తను రెండుదాత్తములయొక్కగాని రెండు స్వరితములయొక్కగాని ఉదాత్తస్వరితముల యొక్కగాని కడుము వచ్చినపుడు- విక్రమ మను విశేషసంజ్ఞ కలదగును స్వరితము ఉచ్చారణ ప్రయత్నభేదమునననుసరించి క్షైప్రము-నిత్యము - ప్రాతిహాతము-అభినిహాతము-ప్రశ్లిష్టము-పాదవృత్తము-తైరోవ్యంజనము అను పేర్లతో వ్యవహరింప బడుచున్నది

మరియు సంగీతశాస్త్రమునందు స-రి-గ-మ-ప-ధ-ని- అనుసంకేతములతో ప్రసిద్ధములైన సప్తస్వరములలో నిషాద గాన్ధారములు ఉదాత్తమందును ఋషభధైవతములు అనుదాత్తమందును షడ్జమధ్యమపంచమములు స్వరితమందును అంతర్భూతము లగుచున్నవి

ఉదాత్తానుదాత్త స్వరిత స్వరములతో వేదవాక్యము లనుచ్చరించు విధానము విశేషించి సంహితాగ్రంథములలోనే కనిపించుచున్నది తైత్తిరీయములోదప్ప తదితర శాఖల బ్రాహ్మణారణ్యకాది భాగములలో త్రిస్వరక నియమము కానవచ్చుటలేదు సంహితలోని మంత్రములుగూడ యజ్ఞ ప్రయోగములలో యాజ్యాపురోనువాక్యారూపముగను శస్త్రపాఠరూపముగను వినియోగించునపుడు త్రైస్వర్యనియమమును విడచి కేవలము ఉచ్చస్వరముతో పఠింపబడుచున్నది ఇందుకు ఆశ్వలాయన శ్రౌతసూత్రాదులలో కొన్ని ఆధారములు కనిపించుచున్నవి లౌకికసంస్కృతమునగూడ ఈ స్వరప్రవృత్తియున్నట్లు పాణినీయాదులనుబట్టి తెలియుచున్నను ప్రస్తుతమా సంప్రదాయము లుప్తప్రాయమైనది

స్థాన - కరణ - ప్రయత్నములు ఉచ్చరించువాని యుద్దేశము ఉత్తమమేయైనను స్థాన-కరణ ప్రయత్నములలో వైకల్యము గలిగినేని సముచితమగు వర్ణము అభివ్యక్తము కాక శ్రోతలకు అర్థము భాసించకపోవుటయు విపరీతార్థము భాసించుటయు జరుగును కావున వర్ణోచ్చారణమునకు స్థాన-కరణ ప్రయత్న విశేషమావశ్యకము అచ్చుల విషయమున కంఠతాల్వాదులలో ఏ యవయవమునందేయవయవము ఉప సంహృతమగునో వానిలో మొదటిది స్థానమనియు రెండవది కరణమనియు చెప్పబడును ఉపసంహారమనగా సమీపమున చేర్చుట ఉదాహరణమునకు 'తాలౌజిహ్వామధ్యమివర్ణే' అను సూత్రముచే ఇవర్ణమునకు తాలువు (నాలుకక్రింది భాగము) - స్థానము జిహ్వామధ్యము కరణము అక హల్లుల విషయమున ఏ యవయవము ఏయవయవమును స్పృశించునో ఆ రెండును యథాక్రమముగ స్థాన - కరణములగుచున్నవి ఉదాహరణమునకు "హనూమూలే జిహ్వామూలేనకవర్గే స్పర్శయతి అను సూత్రముచే కవర్గమునకు హనూమూలము స్థానము జిహ్వామూలము కరణము నగుచున్నది

పాణినీయశిక్షలో వర్ణోచ్చారణ స్థానములిట్లు పరిగణింప బడినవి-

> "అష్టౌస్థానాని వర్ణానామురః కంఠః శిరస్తథా ।
> జిహ్వామూలంచదన్తాశ్చనాసికోష్ఠౌచ తాలుచ"

ఏ వర్ణమును ఏ స్థానమున నుచ్చరించవలసినదియు ఇట్లు వివరింపబడినది

> "కంఠ్యావహావిచుయశాస్తాలవ్యా ఓష్ఠజావుపూ ।
> స్యుర్మూర్ధన్యా ఋటురషాదన్త్యా లృతులసాః స్మృతాః ।
> జిహ్వామూలేతుకుఃప్రోక్తో దన్త్యోష్ఠ్యోవస్స్మృతోబుధైః ।
> ఏఐతుకంఠతాలవ్యాః ఓఔ కంఠోష్ఠజౌస్మృతౌ ।

మరియొక విశేషమేమనగా -

> "అనుస్వారయమానాంచ నాసికాస్థానముచ్యతే ।
> అయోగవాహావిజ్ఞేయా ఆశ్రయస్థాన భాగినః

అనుస్వార-విసర్జనీయ-జిహ్వామూలీయ - ఉపధ్మానీయ-యమవర్ణములు అయోగ వాహములుగ భాష్యములో

రిగణింపబడినవి అవి యేవర్ణమునాశ్రయించి యుండునో ఆ వర్ణముయొక్క స్థానమే వీనిని వర్తించును ఆ యీ వచనములను సమన్వయించి చూచినపుడు అనుస్వారయమములు ఆశ్రయస్థాన భాక్కులే కాక నాసికాస్థానభాక్కులు గూడ నగుచున్నవి అట్లే ఆ కారాదులకు నాసికయే కాక తాల్వాదులుగూడ స్థానములని తెలియుచున్నది ఒకే వర్ణమునకు స్థానద్వయాభివ్యక్తి అంశభేదముచే సిద్ధించును

స్థానకరణముల సంబంధమునకే ప్రయత్నమని పేరు బాహ్యాభ్యన్తరభేదముచే నిది ద్వివిధము అందు అభ్యన్తర ప్రయత్నము - స్పృష్టము ఈషత్స్పృష్టము వివృతము సంవృతము అని నాల్గు విధములై యున్నది వివారము సంవారము శ్వాసము నాదము ఘోషము అఘోషము అల్పప్రాణము మహాప్రాణము ఉదాత్తము అనుదాత్తము స్వరితము అను పదునొకండును బాహ్యప్రయత్నము నందలి భేదములు

**కాలనియతి** ఆయావర్ణముల నుచ్చరించునపుడు తదుచితమగు కాలనియతి ననుసరించవలసి యుండును హ్రస్వము-దీర్ఘము ప్లుతము అను మూడును ముఖ్యములైన కాలములు వాని పరిమాణభేదమునుగూర్చి యాజ్ఞవల్క్యశిక్ష యిట్లు చెప్పుచున్నది

"ఏకమాత్రో భవేద్ధ్రస్వః ద్విమాత్రో దీర్ఘ ఉచ్యతే।
త్రిమాత్రస్తుప్లుతో జ్ఞేయః వ్యంజనంత్వర్ధమాత్రికమ్॥
మాత్రాకాలమునుగూర్చి నారదశిక్షలో

"నిమేషకాలామాత్రాస్యాత్ విద్యుత్కాలేతి చాపరే।
అంగుళిస్ఫోటనంయావత్తావాన్కాలస్తుమాత్రికః"

కనురెప్పపాటు కాలముగాని మెరుపుమెరయుటకు పట్టు కాలముగాని చిటిక వేయుటకగు కాలముగాని 'మాత్ర' గా చెప్పబడినది హ్రస్వదీర్ఘప్లుతకాలములను గుర్తించుటకు వైయాకరణులు చెప్పిన "ఊకాలోఽజ్ఝ్రస్వదీర్ఘప్లుతః" అను లక్షణముకన్నను పాణినీయ శిక్షలోని యీలక్షణము సుగ్రహమైయున్నది

"చాషస్తువదతేమాత్రాం ద్విమాత్రంత్వేవ వాయసః।
శిఖీరౌతి త్రిమాత్రంతు నకులస్త్వర్ధమాత్రికమ్"

పాలపిట్ట యరుపు-ఏకమాత్రికము; కాకరుతముద్విమాత్రికము నెమలికేక త్రిమాత్రికము; ముంగిస పలుకు-అర్ధమాత్రికము. ఆయావర్ణములు సహజముగ నుచ్చరించు శబ్దముల ననుసరించి ఆ మాత్రాకాలములను గుర్తింపదగునని యభిప్రాయము

**వృత్తిత్రయము** వేదవాక్యముల నుచ్చరించుటలో ఉపయుక్తములగు ద్రుతము - మధ్యము విలంబితము అను మూడు వృత్తులను ఆచార్యులు ఉపదేశించియున్నారు వాని వినియోగమునుగూర్చి

అభ్యాసార్థే ద్రుతాం వృత్తిం ప్రయోగార్థేతు మధ్యమామ్।
శిష్యాణాముపదేశార్థేకుర్యాద్వృత్తింవిలంబితామ్॥

అనగా పూర్వము తానధ్యయనము చేసినగ్రంథమును ఆవృత్తి చేయునపుడు ద్రుతవృత్తిని కర్మానుష్ఠానకాలమున మంత్రముల నుచ్చరించునపుడు మధ్యమవృత్తిని శిష్యులకు బోధించు వేళ విలంబితవృత్తిని అవలంబించదగునని యాజ్ఞవల్క్యశిక్ష చెప్పుచున్నది

**ఉచ్చారణవిశేషములు** యజ్ఞప్రయోగమున ప్రాతస్సవనములో శార్దూలధ్వని వలెగంభీరము ఉరఃస్థితమునగు మన్ద్రస్వరముతోడను మాధ్యందినసవనములో చక్రవాకశబ్దమువలె కంఠగతమైన మధ్యమ స్వరముతోడను తృతీయ సవనములో మయూర-హంస-కోకిలారావములననుకరించుచు శిరోగతమైన తారస్వరముతోడను మంత్రమునుచ్చరింపవలెనని పాణినీయశిక్ష ప్రతిపాదించుచున్నది ఈ త్రివిధ స్వరములకును పూర్వావస్థారూపములగు ఉపాంశువు-ధ్వానము-నినదము-ఉపబ్దిమత్తు అనుమరినాల్గుప్రభేదములు నైతము లక్షణోదాహరణ సహితముగ ప్రాతిశాఖ్యమున ప్రవచింపబడియున్నది మరియు యాజ్ఞవల్క్య శిక్ష మొదలగు కొన్నిగ్రంథములలో కొన్ని వైదికశబ్దముల ఉచ్చారణవిశేషములను లౌకికోపమానములతో వివరించినరీతి అతిమనోహరమై అవిలంబగ్రహణమున కనుకూలమైయున్నది విస్తరభీతిచే వానినిచట వివరించుటలేదు

ఆయావర్ణముల నుచ్చరించుటలో నెంతటి యవధానమావశ్యకమో ఈ పాణినీయ శిక్షావచనమునుబట్టి యూహింపవచ్చును

"యథావ్యాఘ్రీహరేత్పుత్రాన్ దంష్ట్రాభ్యాం నచపీడయేత్
భీతాపతనభేదాభ్యాం తద్వద్వర్ణాన్ ప్రయోజయేత్"॥

ఆడపులి తనపిల్లలను నోటగరచుకొని ఒకచోటనుండి మరియొక చోటకు గొంపోవుచుండును అట్టిచో అది గట్టిగా నొక్కినా పదునైన తనపళ్ళ వనుమొనలు గ్రుచ్చుకొని గాయమగును అట్లని పట్టుసడలించెనా శిశువు క్రిందపడిపోవును ఈరెండు దోషములు గలుగకుండ అతి జాగరూకతతో అది

గొంపోవును వర్ణోచ్చారణమునగూడ అంతటి జాగరూకత యవసరము అక్షరములను మిక్కిలి పట్టి పట్టి పలుకుటగాని అతివిశ్లిష్టముగ నుచ్చరించుటగాని తగదని భావము

దశాక్ష్యుచ్చారణములో విహితములగు స్వర-కాలాదులను పాటింపక పోవుటయేకాక పాటపాడినట్లు పఠించుట అతివేగముతో నుచ్చరించుట శిరస్సు కంపించుట ఇత్యాదులు పాఠకాధమలక్షణములుగ చెప్పఁబడినవి

గీతీశీఘ్రీశిరః కంపీతథా లిఖితపాఠకః। అనర్థజ్ఞోల్పకంఠశ్చషడేతే పాఠకాధమాః

ఉచ్చారణలో మాధుర్యము స్ఫుటాక్షరత్వము పదవిభాగము స్వరసౌష్ఠవము ఇత్యాదులు పాఠకగుణములుగ పరిగణింపబడినవి -

మాధుర్యమక్షరవ్యక్తిః పదచ్ఛేదస్తు సుస్వరః ధైర్యం లయసమర్థంచషడేతే పాఠకాగుణాః॥

పర్యవసానములో యథోక్త దోషరహితము, మాధుర్యాది గుణసహితమునగు సమ్యగుచ్చారణము వివక్షితార్థ ప్రతిపత్తికే కాక క్రమముగ బ్రహ్మలోక ప్రాప్తికి గూడ సాధనమగునని శిక్షావచనములు స్పష్టీకరించుచున్నవి

'సమ్యగ్వర్ణప్రయోగేణ బ్రహ్మలోకేమహీయతే'

ప్రకృతి - వికృతులు - మంత్ర బ్రాహ్మణాత్మకమగు వేదమే అన్నింటినికి ప్రకృతి అందు సంహితాపాఠము ఆలంబనముగ చేకొనియే పద-క్రమ-జటా-ఘనాదులు బయలు దేరినవి వానిలో అర్థవిజ్ఞానార్థము ఆత్రేయాదులు ప్రవర్తింప జేసిన పదపాఠము తదసందేహార్థమగు క్రమపాఠము గూడ ప్రకృతులుగనే పరిగణింపబడినవి అట- జటామాలా శిఖా రేఖాధ్వజోదండో రథోఘనః అని చెప్పబడిన జట-మాల-శిఖ-రేఖ-ధ్వజము-దండము-రథము - ఘనము అను అష్టవిధ పాఠభేదములును వికృతులుగా చెప్పఁబడినవి

సంహితాపదక్రమములలో గూడ సంహితయే మూల ప్రకృతి అనాది అపౌరుషేయము 'ఇష్టప్రాప్త్యనిష్ట పరిహారయోరలౌకిక ముపాయం యోగ్రంథో వేదయతిసవేదః' అను వేదలక్షణ మిందేసమన్వితమగుచున్నది పదక్రమజటాదులు పౌరుషేయములు; ఆత్రేయాదులవలనఁ బ్రోక్తములు ఇవి అర్థవిశేషావబోధకములు కాకపోయినను జప-పారాయణాదులద్వారా సఫల విశేషసాధకము లగుచున్నవి పద క్రమములకును జటామాలాదులకును ఆర్షత్వము సమానమే యైనను అవిప్రకృతులుగను ఇవి వికృతులుగను పరిగణింపఁబడుటలో అవి అనులోమ పాఠరూపములగుటయు ఇవి ప్రతిలోమ పాఠాత్మకములై యుండుటయు ముఖ్యకారణమని గ్రహింపవచ్చును ఈ పద-క్రమ-జటా - ఘనాదులకు శిక్షలలోనేకాక, ఇతిహాస పురాణాదులలో సైతము అదృష్టద్వారకములగు అనేక ఫలములు చెప్పఁబడినవి మూలప్రకృతియగు సంహితాస్వరూపము అన్యథాభావము నొందకుండ పరిరక్షించుటయను దృష్టప్రయోజనము గూడ ఇందు గర్భితమై యున్నదని అభిజ్ఞులభిప్రాయపడుచున్నారు

వర్ణక్రమము - అకారాదివర్ణములకును ఉదాత్తాది స్వరములకును స్థాన-కరణ - ప్రయత్నాదులేకాక గుణము వర్ణము జాతి దేవత మున్నగు విశేషములు సైతము వ్యాస శిక్షాదులలో చెప్పఁబడియున్నవి వాని నన్నింటిని క్రోడీకరించి సమకూర్చిన పాఠపద్ధతియొకటి వర్ణక్రమము అని చెప్పఁబడుచున్నది ఇది విశేషించి దాక్షిణాత్యులైన తమిళులలో ప్రచారమున నున్నది వారిద్దానిని ఒక కళగా అభ్యసించి విద్వత్సభలలో ప్రదర్శించుచు ప్రశంసింపబడుచున్నారు ఆంధ్రులు కొందరిప్పు డిప్పుడే దీని నభ్యసించుచున్నారు ఇయ్యది - శుద్ధవర్ణక్రమము స్వరవర్ణక్రమము మాత్రావర్ణక్రమము అంగవర్ణక్రమము వర్ణసారవర్ణక్రమము అను నైదువిధముల నొప్పుచున్నది ఈ వర్ణక్రమపాఠము- "వర్ణక్రమేశతగుణం" ఇత్యాది వచనానుసారము సంహితాపాఠముకన్న శతగుణితమగు అదృష్టఫలమునకు కారణమగుటయేగాక ఆయావర్ణముల స్వరూపస్వభావ వృత్తాంత విశేషములను సాకల్యముగ భాసింపజేయుచు మిక్కిలి హృదయంగమ మగుచున్నది

బలాబలవిచారము స్థాన కరణ-ప్రయత్న-స్వర-కాలాదుల విషయమున శిక్షాగ్రంథములలో విభిన్నాభిప్రాయము లున్నపుడు ఏది అను సరణీయము? అనుప్రశ్న కలుగును ప్రాచీన వ్యాఖ్యాతలు నానావిధములగు న్యాయముల సాయముతో సాధ్యమగునంతవరకు వానికి సమన్వయమును చూపించి ఏకవాక్యతను సిద్ధింపజేయుటకు ప్రయత్నించి యున్నారు ఉదాహరణమునకు-(1) శౌనకశిక్షలో (అకుహాః కంఠజాః ప్రోక్తాః) కవర్గముకంఠస్థానీయమని చెప్పఁబడగా పాణినీయశిక్షలో (జిహ్వామూలేతుకుః ప్రోక్తః) అది జిహ్వామూలీయమని చెప్పఁబడినది. ఐనను శౌనకశిక్షలోని కంఠశబ్దము తత్సమీపవర్తియగు జిహ్వా

మూలమునకుపలక్షకమని యంగీకరించి పర్యవసానములో కవర్గము కంఠ-జిహ్వామూలోభయ స్థానీయమని వ్యాఖ్యాతలు తెలియజేయుచున్నారు (2) ఇంకను యాజ్ఞవల్క్య శిక్షలో "వ్యంజనంత్వర్ధమాత్రికం" అని చెప్పుటవలన ఙ-ము ఙ-ణ-న లకు అర్ధమాత్రాకాలము సిద్ధించుచుండగా "హ్రస్వాత్పరంతు సంయోగాదిమాత్రం యుత్తదుచ్యతే" అను శిక్షాంతర వచనమువలన ద్విమాత్రాకాలము ప్రాప్తమగుచున్నది. ఇచట సంహితా సంసర్గములగు వాక్యముల కర్ధమాత్రాకాలమనియు అవసానస్థలైనపుడు ద్విమాత్రాకాలమనియు ('అవసానే విశేషో యమన్వేషాంచ' నవి ద్యుతే) ఇట్లు విషయభేదముచే వ్యవస్థచేయబడినది. ఈవిధముగను సమన్వయము సంభవించని సందర్భములలో మాత్రమే బాధ్య బాధక భావమంగీకరింపబడినది. అదియును ఆయావచనముల ప్రాబల్యదౌర్బల్యములపై ఆధారపడియుండును. తన్నిర్ణయము నైతము శాస్త్రీయములగు అనేక సూక్ష్మాంశములకు లోబడియుండును.

ఈ ప్రాబల్యదౌర్బల్య విచారావసరమున ముఖ్యముగ గ్రహించదగిన కౌలిక పూర్వవంటి కొండొక వచనమిట్లు కనిపించుచున్నది:

"శిష్టపాఠ విరుద్ధంయత్ శాస్త్రం బహ్వాప్యసంత్యజేత్ ।
అపస్వల్పంపరిమాణం స్యాచ్ఛిష్టపాఠానుసారియత్ ॥"

దీనిని బట్టి శిష్టపాఠ మన్నిటికన్న బలవత్తరమైనది. ఇతర శిక్షలుగాని వ్యాకరణముగాని ప్రాతిశాఖ్యమేగాని శిష్టపాఠమునకు విరుద్ధము కానంతవరకే గ్రాహ్యములగుచున్నవి. ఈ దృష్టితో జూచితిమేని-వ్యాకరణ ప్రాతిశాఖ్యములలో ద్వైవిధీభావము ప్రసక్తమైనపుడు ఏది శిష్టపాఠానుగృహీతమో అదియే ప్రబలమని చెప్పదగియున్నది.

ఐతే ఈ విధముగ లక్ష్యమునకే ప్రాధాన్యమిచ్చినపుడు లక్షణరూపమగు శిక్షాశాస్త్రము నిరర్థకమేనా? అట్లెన్నటికిని కాదు. శిక్షాశాస్త్రము శోధకమగు విజ్ఞానమును సంపాదించకయే పల్లవగ్రాహిపాండిత్యముతో అనాది పరంపరా ప్రాప్తమగు శిష్టపాఠమును మారుమారు గావింపరాదన్నదే పై వచనము యొక్క తాత్పర్యము. విజ్ఞునకు తపోధనులగు ప్రాచీన మహర్షులు యాగ్లక్ష్యములను యథాతథముగ సాక్షాత్కరించుకొని యుండిరి. వారికి లక్షణములతో పనియే యుండదు. అయినను మందప్రజ్ఞులగు మనవంటి వారి ననుగ్రహించు తలంపుతోనే వారు లక్షణములను ప్రవర్తింపజేసిరి. అవియే మనకు గలుగు సంశయాంధకారమును నివర్తింపజేయుటకు మణిదీపములవలె సాధనములై యున్నవి. కావుననే అమరేశుడను శిక్షాకారుడు "ద్వైవిధీభావేముత్పన్నే లక్షణాన్నిర్ణయో భవేత్" అని చెప్పియున్నాడు. ఈ విషయమునే "అమోఘానందినీ శిక్ష"ని యీ వచనము లక్షణావశ్యకతను ఘంటాఘోషముగ ఘోషించుచున్నది.

"లక్షణేన వినా వాణీ విమలాపి పతోభతే
విమదారూపసంపన్నా దరిద్రస్యేవ యోషితా ।"

దరిద్రుని పాలబడిన రూపవతియగు యువతివలె లక్షణజ్ఞానరహితుని కడనున్న విశుద్ధమగు వేదవిద్యయు రాణించదని భావము. ఈ విధముగ జూచితిమేని లక్షణ ప్రాధాన్యమును బోధించు వచనములు కొన్ని, లక్ష్యప్రాధాన్యమును బోధించునవి మరికొన్ని. వీని నన్నింటిని సమన్వయించి చూచితిమేని సలక్షణమగు లక్ష్యజ్ఞానమే సర్వవిధముల శ్రేయోదాయకమను సారాంశము నిష్పన్నమగును. ఈ యర్థమును శిక్షాకారు లిట్లు సమర్థించుచున్నారు- "లక్ష్యలక్షణయోర్జ్ఞానీ తద్విపాఠం ప్రపఠతే"

స. ల. సూ.

## శిక్కుమతము

శిక్కు పదము శిష్యశబ్దము యొక్క మారురూపమే. శిక్కులనగా శిష్యులని అర్థము. శిక్కుమతమును అవలంబించు వారిసంఖ్య అరువది లక్షలకుమించి ఉన్నది. వీరిలో చాలమంది పంజాబునందును తత్పరిసర ప్రదేశములందును నివసించుచున్నారు. క్రీ.శ. 15వ శతాబ్ది మధ్యభాగమున స్థిరరూపము దాల్చిన శిక్కు మతము ఉత్తర భారతమునందును ముఖ్యముగా వాయవ్య భారతమునందును గల ప్రజల జీవితములను పలు విధముల ప్రభావితమొనర్చినది. 16, 17 శతాబ్దుల నాటి పశ్చిమోత్తర భారతమునందలి మత సంప్రదాయములపై శిక్కుగురువుల బోధనల ప్రభావము అధికముగా గోచరించును. ఆదినములలో శిక్కులు తమ మతమును, తమ భౌతిక జీవితమును గూడ రక్షించుకొనుటకు కఠోరమైన త్యాగము చేయవలసి వచ్చెను. క్రీ.శ. 17వ శతాబ్ది చివరను, 18వ శతాబ్ది ఆరంభమునను శిక్కుల బాధలు పరాకాష్ఠనందుకొనెను. కాని ఆకాలమునే శిక్కుల చరిత్రలో మహోజ్జ్వలయుగమని చెప్పవచ్చును. ఏలయన అప్పుడు శిక్కులు ఉదాత్తమును పవిత్రమునైన జీవితమును పుచ్చియుండిరి. అప్పుడే వారిమతము స్పష్టమైన రూపముతో అలరారెను. అప్పుడే శిక్కులు వీరోచితములైన మహా

కార్యము లోనరించి అన్నిరంగములందును తమ వర్తనమును నియమబద్ధము కావింపజాలినది. భాయిమణిసింగు, భాయితార్ సింగుమున్నగు మహనీయులు తమ మతమును రక్షించుటకై ప్రాణములను బలి ఒసంగిన దాకాలమునందే.

క్రీ శ 18 వ శతాబ్ది మధ్యభాగమునుండి శిక్కునాయకులు క్రమక్రమముగా సొంతరాజ్యములను స్థాపింపదొడగిరి. అట్టివారిలో రంజిత్‌సింగ్ ఒకడు. అతని రాజకీయ కౌశలము అప్రతిమానమైనది. అతడు ధైర్యసాహసములతో మొగలుల నుండి అధికారమును లాగుకొని కొంచెమించుమించుగా పశ్చిమోత్తర భారతమునంతను ఆక్రమించు పెద్దరాజ్యమును స్థాపించెను. అతనికి పంజాబుసింహమను బిరుదుకలదు. కార్యనిర్వహణమున అతనికిగల అపారమైన శక్తిచే ఆరోజులలో శిక్కులు మిక్కిలి శక్తిమంతులు కాజాలిరి. కాని అతని అనుయాయులు సమర్థులు కాకపోవుటచేతను తమలో తాము పోరాడుకొనుచుండుటచేతను 19వశతాబ్దిమధ్యభాగమునాటికి శిక్కులు ఆంగ్లేయుల అధికారమునకు లోబడిపోవలసివచ్చినది.

18 19 శతాబ్దులలో శిక్కులు రాజ్యాధికారమును నిర్వహించినను ఆరోజులలో వారి మతము ఎక్కువ అభ్యుదయమును పొందియుండలేదు. అది కొన్ని మూఢాచారయుతులకును హిందూ మతమునందలి వ్యర్థములైన కర్మకలాపములకును తావొసగి అంతకు పూర్వముండిన నైర్మల్యమును గోల్పోయెను. హిందూ సాంఘిక వ్యవస్థదానిపై తన ప్రభావమును చూపగడంగుటచే వర్ణ వర్గ లింగభేదములు అందుకూడ నంకురించెను. శిక్కులు తమ గురువుల బోధనలను, హిందువుల కొన్ని ఆచార సంప్రదాయములను సమానముగా ఆరాధింపదొడగిరి. కాలక్రమమున శిక్కుల పవిత్రగ్రంథమైన "గ్రంథసాహెబు"ను హిందువుల విగ్రహములను గూడ పూజింపనారంభించిరి. నానక్ బోధించిన నామరూపరహితుడైన ఏకేశ్వరుని మూలసూత్రమును విశ్వసించుచునే హిందూ మతమునందలి బహుదేవతలను వర్ణవ్యవస్థను ఆదరించుటకు వారు మొదలుపెట్టిరి.

19 వ శతాబ్ది చరమ భాగమున శిక్కు మతమును సంస్కరించి పవిత్రతర మొనరించుటకై లాహోరునుండి సింఘసభోద్యమము ఆరంభమాయెను. పంజాబున పెక్కుకేంద్రములందు సంస్కరణ సంఘములుస్థాపింపబడెను. వానిలో లాహోరునందలి ఖాల్సాదివాన్, అమృత సరమునందలి ప్రధాన ఖాల్సాదివాన్, భదౌరునందలి కేంద్ర ఖాల్సాదివాన్, అమృతసరమునందలి ఖాల్సాసమితి ముఖ్యములైనవి. "ఖాల్సా", "ఖాల్సా సమాచారము" అను పత్రికలుకూడ శిక్కు మతసంస్కరణమునకు తోడ్పడినవి. ఈ శతాబ్దియందలి మూడవ దశకమున త్యాగవిశ్వాస వ్యవస్థా సామర్థ్యములతోకూడిన అకాలి ఉద్యమము ఏర్పాటుచేయబడెను. పూజాస్థానములను సంస్కరించి వానిని సమాజాధీనముల నొనరింపవలెనని ఆ ఉద్యమము ముఖ్యోద్దేశము. ఆరంభదినములలో ఈ ఉద్యమము మహత్తరమైన అభ్యుదయము సాధింపజాలెను. కాని తరువాత స్వార్థపరతా పరస్పర విరోధాదులచే క్రమముగా సన్నగిల్లెను. దానికి ఫలితముగా శిక్కుమతముకూడ ఇతరమతములవలెనే మూఢవిశ్వాసములకును అర్థరహితములైన ఆచారములకును నెలవగుట సంభవించెను. ఇటీవలనే స్థాపింపబడిన గురు సేవక సభ శిక్కు మతమునుండి లోపములను తొలగించి దానిని పటిష్ఠము చేయుటకు ప్రయత్నించుచున్నది.

శిక్కుమతము పదిమందిగురువులబోధనల సమాహారము. అది సమగ్ర స్వరూపమునందుటకు సుమారు రెండున్నర శతాబ్దుల కాలము పట్టినది. క్రీ శ 17 వ శతాబ్ది చివర పదియవవాడును చివరిగురువును అగు గురుగోవిందసింగు ఖాల్సాను స్థాపించుటతో ఆ సమగ్ర స్వరూపము సిద్ధించినదని చెప్పవచ్చును. శిక్కుమతము జాతికిగాక మతభావముల మీదను సంప్రదాయముల మీదను ఆధారపడిన సౌభ్రాత్రమునకు ప్రాధాన్యమొసగెను.

శిక్కుమతమును స్థాపించినవాడు గురునానక్. అతడు క్రీ శ 1469 వ సంవత్సరమున లాహోరునకు సమీపమందలి తల్వండిలో జన్మించెను. తన నాడు జనులలో వ్యాప్తిచెంది యున్న మతాచారములు లాతనికి విపరీతములుగా తోచుటచే అతడు క్రొత్తమతమును స్థాపించెను. ఏకేశ్వరత్వము, మానవ సౌభ్రాత్రము అనునవి అతడు స్థాపించిన మతమునందలి ముఖ్య సిద్ధాంతములు. హిందూమతము నుండి అతడు కర్మ సిద్ధాంతమును పునర్జన్మ సిద్ధాంతమును మాయావిశ్వాసపిద్ధాంతమును గ్రహించెను. కాని అతడు సన్యాసము, తీర్థయాత్రలు, నదీస్నానములు విగ్రహారాధనము అనువాని నంగీకరించియుండలేదు. ఏకేశ్వర సిద్ధాంతము నాతడు మహమ్మదీయ మతము నుండి గ్రహించి యుండవచ్చును. అతనిమతము ననుసరించి భగవంతుడు ప్రజ్ఞా దయాదాక్షిణ్యములకు నిధానము.

ఇతని తరువాత ఇతని కుమారుడు హరకృష్ణుడు ఎనిమిదవ గురువయ్యెను. ఇతడు నాలుగేండ్లుమాత్రము గురుత్వము వహించి 1665 లో మశూచకముచే మరణించెను. మరణించుటకు ముందితడు తనతరువాత గురువుకాదగిన వాడొక గ్రామములో ఉండెనని సూచించెనట! శిక్కులాగ్రామమునకరిగి తేజబహదూర్ అను నతనిని వెదకి గురువుగా ఎన్నుకొనిరి. ఇతడు 1664 నుండి 1675 వరకును గురుత్వమువహించెను. అప్పుడు మొగలు సామ్రాజ్యమును పాలించుచుండిన ఔరంగజేబు ఖడ్గమునుపయోగించియైన భారతదేశమున ఇస్లాముమతమును వ్యాపింపజేయవలెనని దీక్షవహించెను. ప్రజలకు తమ ఇచ్చవచ్చిన మతము నవలంబించు విషయమునకూడ స్వాతంత్ర్యము లేకపోవుట చూచి ఆ దుస్థితిని తొలగించుటకై తేజబహదూరు ప్రాణములనైన బలియిచ్చుటకు సిద్ధపడెను. ఆ ఉద్దేశముతో అతడు ఢిల్లీకి వెళ్లెనుగాని వెంటనే కారాగృహమున బంధింపబడెను. అతడెట్టి పరిస్థితులందైన తనమతమును మార్చుకొనుట కంగీకరింపకపోవుటచే 1675 వ సంవత్సరమున ఉరితీయబడెను. మతగౌరవమును రక్షించుటకై ప్రాణము లొడ్డిన అతని మరణము మహమ్మదీయేతరుల హృదయములందు విషాదరోషములను రగిలించెను.

తేజబహదూరు తరువాత గురుపీఠము నలంకరించిన పదవ గురువు గోవిందరాయి. గురుత్వము స్వీకరించునప్పుడితడు దశవర్ష దేశీయుడై యుండెను. ఆసమయమున శిక్కులు దుర్భరములైన బాధలకు గురియగుచుండిరి. అది చూచి గోవిందరాయి శిక్కులకు సైనికశిక్షణ మధికము గావించెను. స్త్రీలుకూడ సైనికదళములందు చేర్చుకొనబడిరి. మతతత్త్వమును బోధనలద్వారా పునరుద్ధరించుటచే ద్విగుణీకృతములైన యత్నములు గావింపబడెను. గోవిందరాయికాలమున శిక్కులు సింగములుగా పరిణమించిరి. గోవిందరాయి గోవిందసింగయెను. అతడు ఖండాదిపహుల్ అను ఖడ్గశుద్ధి దీక్షను (Baptism of the sword), ఖాల్సా'అను సైనికసౌభ్రాత్రమును స్థాపించెను. తన అనుయాయులు నిత్యజీవితమున అనుసరింపవలసిన కొన్ని నియమములను ఏర్పరచి కొన్ని ప్రత్యేక చిహ్నములను ధరింపవలెనని అతడు ఆజ్ఞాపించెను. వానికి పంచకకారములని పేరు. పంజాబీభాషలో అవియన్నియు కకారముతో ఆరంభించును. ఆచిహ్నములివి: 1 కంఘా (కేశములను గడ్డమును దువ్వుకొనుటకు ఉపయోగించు దువ్వెన), 2 కర (ఇనుప కడియము) 3 కేశము (దీర్ఘ కేశములు) 4 కృపాణము (కత్తి) 5 కచ్ (పొట్టిలాగు). అతడు మద్యము పొగాకు మున్నగువానిని వాడరాదని నిషేధించెను; ఏకఖడ్గ ప్రహారమున చంపబడిన జంతువుల మాంసమును తినవచ్చునని అంగీకరించెను. తన తరువాత ఇక గురువులుండరనియు, తాను రచించిన గేయముల అనుబంధముతో కూడిన ఆదిగ్రంథమే ఏకైకగురువుగా ఉండుననియు అతడు ప్రకటించెను. క్రీ శ 1708 వ సంవత్సరమున గోవిందసింగు హైదరాబాదునకు సమీపమందలి నాందేడులో మరణించెను.

గోవిందసింగు తన సర్వస్వమును మతముకొరకు త్యాగము గావించెను. అతడు సమానతా త్యాగధైర్యసేవా భగవద్విశ్వాసములపై ఆధారపడిన ఒక నూతన మానవాదర్శమునకు రూపుదిద్దెను. ఇందు లింగవర్ణజాతి భేదములకు తావులేదు. శిక్కులెచ్చటనున్న, అచ్చట గురుద్వారము (దేవాలయము) ఖాల్సా శాఖయు ఉండును. బాలబాలికలందరికిని ఆ సమాజమున ప్రవేశార్హత కలదు. ఉదయముననే లేచుట, చలినీళ్ళస్నానముచేయుట, భగవన్నామము జపించుట, ప్రాతస్సాయములందు ప్రార్థనలు గావించుట అనునవి వారికి గోవిందసింగు ఏర్పరచిన దైనికనియమములు. శిక్కులందరును ఖాల్సాలోచేరి సింగునామమును ధరింతురని భావింపనవసరము లేదు. నానక్ ఏర్పరచిన శాంతాదర్శములను అనుసరించు నానక్ పథానుయాయులుకూడ పలువురున్నారు. వీరి మార్గమునకును హిందూమతానుయాయుల మార్గమునకును అంతగా భేదము కానరాదు. భారతదేశము భారతము పాకిస్తానము అని రెండుభాగములుగా విడిపడినప్పుడు శిక్కులు హిందువులతోడి సాన్నిహిత్యమును సహజీవనమును ఆదరించిరి.

ది. వేం.

## శిలలు

జీవరాసులు శిలలలోను శిలలపైనను బ్రతుకుచున్నవి. భూమిలో జనించిన ఘనపదార్థములను సర్వసామాన్యముగా శిలలందురు. శిలలు వివిధవర్ణములు కలిగియుండుననియు వేర్వేరు పటుత్వశక్తులు కల్గియుండుననియు, గట్టి తనము మరల పలువిధములనియు అందరికి తెలిసిన విషయమే. సాధారణ ప్రజలు ఇసుక, బంకమన్ను వంటి వానిని శిలలుగా భావించరు; కాని శాస్త్రజ్ఞుల దృష్టిలో ఇవి కూడ శిలలే. శిలలనుండియే మృత్తిక

జనించును అదియే ఉద్భిజ్జములు పెరుగుటకును వ్యవసాయమునకును ముఖ్యము జీవిత చక్రము ఈ శిలలపై ఆధారపడియే పరిభ్రమించుచుండును

ప్రస్తుత సిద్ధాంతముల ననుసరించి శిలలు భూమిలో 2900 కి మీ వరకు ఉన్నవి ఉటుపై భూమధ్యము వరకు అనగా 3740 కి మీ వరకు ద్రవరూపము లోనున్న లోహము లున్నవి భూభౌతిక శాస్త్రజ్ఞులు వీనిపై పరిశోధనలు జరుపుచునే యున్నారు శిలలను సూక్ష్మముగా పరిశీలించినచో అవి ఖనిజగుచ్ఛములని తెలియవచ్చును ఖనిజములు స్థిరమైన రాసాయనిక సంఘట్టన కలవియై ప్రకృతి సిద్ధములైనవి ఇప్పటి వరకు వర్ణించిన వేయిపైగాగల ఖనిజములలో యిరువది మాత్రమే భూమిపై భాగములో 99 వ శాతము వరకున్నవి ఇట్టి ఖనిజములు (1) సిలికేట్లు (ఫెల్స్పారులు అభ్రకములు పైరాక్సీనులు అంఫిబోలులు గార్నెట్లు) (2) ఆమ్లజనిదములు (శిలాస్ఫటికము హెమటైటు మాగ్నటైటు); (3) కర్బనితములు (కాల్సైటు డోలమైటు) భాస్వరితములు (ఫాస్ఫేటులు); (4) గంధకిదములు (సల్ఫైడులు) హరకిదము కెరైటు అను నాలుగు రకములు ఉత్పత్తినిబట్టి శిలలు మూడు రకములు -(1)అగ్నిశిలలు (2)నిక్షేప శిలలు(3)రూపాంతర శిలలు ఈ శిలలను గురించిన శాస్త్రమే శిలాశాస్త్రమన బడును ఇది భూగర్భశాస్త్రములో ఒక ముఖ్యభాగము

భూమి ఉద్భవించినప్పుడు చిక్కని కరగిన శిలలు చల్లబడుట వలన ఉపరితలమున పెచ్చుకట్టినట్లు భూగర్భశాస్త్రజ్ఞులు నమ్ముచున్నారు తారతమ్యగరిమలోని భేదములవలన పెచ్చులోని పై పొరలు ఆమ్లతమముగాను, సైలిస్యామ్ల జనిదగుగాను వీని క్రింది పొరలు క్షారతమముగాను మగ్నలోహితముగాను పెంపొందినవి తదుపరి ఉద్భవించిన శిలలన్నియు యీ పెచ్చునుండికాని దీని క్రిందిలోతైన భూభాగమునుండి కాని లభించినవి ఇట్టి శిలలను మూల లేక అగ్ని శిలలందురు శిలలు ద్రవరూపములోనున్న శిలా పదార్థమునుండి ఘనీభవించుట వలన జనియించును ఈ శిలాద్రవ పదార్థమునకు భూగర్భములోనే ఘనీభవించిన మాగ్మా' అనియు ఉపరితలము నకుచేరిన లావా' అనియు నామములు

మొట్టమొదటి పైపెచ్చు (గుల్ల) ఘనీభవించిన తదుపరి భూమిచుట్టు జలవాయు మండలములుకూడినవి అటుతరువాత శిలాసాతాభౌతిక ప్రారంభక్రియ యెట్టిది జనమయమున జలవాయువుల శక్తి ప్రస్తుతము కన్న అత్యధికమని నమ్మబడినది యాంత్రిక రసాయన వాతావరణుల మూలముగ జననమైన మృత్తిక జల వాయువుల వలన కొనిపోబడి భూమ్యుపరితలమందలి పెచుల్లోని పల్లపుభాగములలో అనుకూలపరిస్థితులందు దిగుబడియయ్యెను ఈ పల్లపుభాగములు నీటితో నిండుటతో సముద్రము లుద్భవించెను వానిలో పెరిగిన జీవరాసులు క్రమక్రమముగా మరణించుటచే వాని కాష్ఠములు అడుగునకు చేరినవి ఇట్టి దిగుబడు లన్నియు ఒత్తిడి వలనను గట్టిగా అంటుకొను ద్రవ్యముల మూలముననను శిలలుగా మారినవి ఇవియే నిక్షేపశిలలు

చిత్రము - 96




భూమిలో జనించు కంపనముల మూలమున అగ్ని నిక్షేప శిలలు భూగర్భములోనికి కొనిపోబడును అచ్చట ప్రబలమగు పీడనోష్ణములవలన శిలలు అసంపూర్తిగా కాని పూర్తిగా కాని మార్పుచెందును ఆ మార్పులనుబట్టి వాటి సహజలక్షణములు కూడ మార్పునొంది కొంగ్రొత్తలక్షణములను పొందును సహజస్థితినుండి మార్పుచెందిన శిలలే రూపాంతర శిలలనబడును

అగ్నిశిలలు:— అగ్ని శిలలు (1) చొచ్చుకొనునవి (2) బహిర్గతములైనవి అని రెండురకములు బహిర్గతమైనట్టి శిలలకు అగ్నిపర్వతపు శిలలని కూడ నామము బహిర్గతములైన శిలలందు జనించులావా కోణాకారమైన అగ్ని పర్వతముల యొక్క రన్నములనుండి కాని భూమి యందలి గుల్లలోని పెద్ద పెద్ద పగుళ్లనుండి కాని బయటకువచ్చి ప్రవహించును హొంతువెస్సువియస్ మౌంట్ ఎట్నా మౌంట్ పులి ఇట్టి అగ్ని పర్వతములు జగత్ప్రసిద్ధములు, హవాయి ఐలెండ్సు దీవుల లోని లావాబయల్లను దక్షిణ భారతములోని దక్కను 'ట్రాపులు' పగుళ్లనుండి బయటకువచ్చిన ... నకు ఉదాహరణములు

దానికి గాలితోకి అతిత్వరరగా చల్లబడి పైన పెచ్చుకట్టును కాని లోపల శిలాద్రవము పారుటకు ప్రయత్నించుచుండును అట్టి పెచ్చు లావా యొక్క చిక్కదనముపైన దానిలోని నీటి ఆవిరిపైన ఇతర వాయుపదార్థములపైన ఆధారపడి యుండును పెచ్చు యొక్క రూపమునుబట్టి లావాలు ఎల్లో లావా, రోపిలావా బ్లాకీలావా అను నామములు ధరించును

చొచ్చుకొను లక్షణములుగల శిలలు జనించు మార్గాన్ని, పెచ్చులోని పొరలలోనే ఘనీభవించును వాటిని ప్లుటానిక్ శిలలనుట కద్దు వాటి ఆకారము ప్రమాణము చొచ్చుకొను విధానము ననుబట్టి లభ్యమగు రూపములకు బేథొలిత్ లేకొలిత్ ఫేకొలిత్ డైకులు సిల్సు అని నామములు డైకు సిలీర్ఘా ములలో లభ్యమగు శిలలకు హైపోబిసల్ శిలలని పేరు

శిలలలోని ఖనిజ సంవిధానము ఒండొకని సంబంధము 'టెక్స్చర్ (కూర్పు) అనబడును ఇట్టి సంబంధమును సూక్ష్మ దర్శిని ద్వారా మాత్రమే కనుగొనవచ్చును అగ్నిపర్వతపు శిలలలోని టెక్స్చర్లు ప్లుటానిక్ శిలలలో వానికన్న వేరు విధముగానుండును కొన్ని అగ్ని పర్వతపు శిలలలో చిన్న చిన్న స్ఫటికములు రాతిగాజు (volcanic glass) లో పొదగ బడినట్లును, మరికొన్నింటిలో పెద్దస్ఫటికములు కాని వాటి గుచ్ఛములు కాని సూక్ష్మస్ఫటికములలో పొదగబడినట్లును ఉండును శిలపై చూచినచో పొరలకు నిదర్శనమైన గీతలు కూడ స్పష్టముగా తెలియును ప్లుటానిక్ శిలలలోని టెక్స్చర్లు పలురకములు కొన్ని ఖనిజములు స్ఫటికాకారము కలిగియుండును కొన్ని పెద్ద స్ఫటికములుగాను మరి కొన్ని చిన్నవిగాను ఉండును ఒక్కొకసారి ఒక రకమైన ఖనిజపు బద్ద రూపమునుండి మరియొక ఖనిజములో గ్రుచ్చుకొనియున్న ట్లుండును అట్లు ప్లుటానిక్ శిలలలో ఖనిజనిర్మాణము బహు విధములు

అగ్నిశిలలు కాని ఖనిజ రాసాయనిక సంఘట్టనమునుబట్టి పలు విభాగములుగా కూర్చబడినవి విసంయోగమైన సైలి ద్వ్యమ్లజనిదమును కలిగియుండునవి సేచ్యురేటెడ్ లేక ఓవర్ సేచ్యురేటెడ్ అనియు లేనివి అన్ సేచ్యురేటెడ్ అనియు పేర్కొనబడును సేచ్యురేటెడ్ శిలలు ఆమ్లగుణమునైనవిగాను, అన్ సేచ్యురేటెడ్ శిలలు క్షారగుణమునైనవిగాను పరిగణింప బడును, గ్రానైటు, గ్రానోడైరైటు, డైరైటువంటి శిలలు కాని అగ్నిపర్వతసమాంతరములైన ర్యోలైటు డాసైటు ఎండిసైటువంటివి సేచ్యురేటెడ్ శిలలనబడును పెరాక్సి నైటు పెరిడొటైటు గాబ్రో మొదలైనవి కాని అగ్నిపర్వత సమాంతరములైన ఫోనలైటు ఒలివిన్ బెసాల్టు మొదలైనవి అన్ సేచ్యురేటెడ్ శిలలనబడును ఇట్లు శిలలు వివిధ ఖనిజ ముల సంఘట్టనములతో వివిధ నామములు పొందును

విక్షేప శిలలు నిక్షేపశిలల ఖనిజ సముదాయములు రెండురకములు మొదటి రకము శిలావియోగమువలన కలి గిన ఇసుకమట్టి అభ్రకములు స్ఫట లోహనీరజామ్లజనిదములు వంటివి ద్రావణీయతమైన మిగులు పదార్థములు రెండవ రకమునకుచెందిన శిలాస్ఫటికములు జిర్కన్ రుటైల్, టోర్మలీన్ వంటివి తరతమభేదముతో గట్టిగా నిలబడు ఖనిజ ములు ఈ శిలల ఖనిజసంఘట్టనము ఏ శిలలనుండి మట్టులు ముఖ్యముగా లభించునో వానిపై ఆధారపడియుండును వివిధ ఖనిజములకు వాతాహతిని తట్టుకొనుశక్తి వివిధముగనుండును, అవి ప్రయోగాత్మకముగా నిర్ధరింపబడినవి నిక్షేపశిలల నిర్మాణలక్షణములు పొరుదలపొరలు (current bedding పై పటము చూడుడు) సైజువారి పొరలు, అలలగుర్తులు మంచుగడ్డగీతలు లోడ్ కాస్టులు బురదపగుళ్లు వార్వులు ఉండలు అను వివిధరకములు ఈ శిలలయొక్క ఖనిజసంఘట్ట నమును నిర్మాణ లక్షణములను క్షుణ్ణముగా తెలిసికొనవలె నన్నచో ఆ శిలల మట్టులు దిగువల జరుగుచున్నప్పటి పరిస్థి తులు కాని రవాణాపద్ధతి అప్పటి వాతావరణ పరిస్థితి దిగుబడుల మాధ్యమముయొక్క రసాయనస్థితి ఆ ప్రాంతపు ప్రాచీన భూగోళ లక్షణములు – ఇవియన్నియు క్లుప్తముగ చేర్కొనవలెను ఈ సందర్భమున భూగర్భ చరిత్రము అధ్య యనము చేయుట అవసరము

జననమూలాధారముగా నిక్షేపశిలలు మూడురకము లగు మట్టులనుండి ఉద్భవించినవి అవి (1) క్లాస్టిక్ మట్టులు, (2) రసాయనమట్టులు (3) సేంద్రియమట్టులు క్లాస్టిక్ మట్టులు ముఖ్యముగా భౌతిక వాతాహతివలన సంభవించినవి కావున వాటియందు శిలాస్ఫటికము ఇంకనున్న అధిక భాగమునుండును వానిఅధికత్వమునుబట్టి అరినేషియస్' అనియు ఆర్గిల్లేషియస్' అనియు శిలలను పేర్కొందురు క్వార్ట్‌జైటు, ఇసుకరాయి, ఆర్కోజు, గ్రువకాక్కి సముదాయము అయినవి అరినేషియస్, క్లాస్టిక్-మట్టులనుండి లభించినశిలలు, షెల్-రాయి [illegible],

ఇంకమట్టిరాయి మొదలైనవి ఆర్జిల్లేషియస్ మస్తులనుండి వచ్చిన శిలలు గాలిమూలమున బహుదూరము కొనిపోబడి నిక్షేపింపబడు లోయెస్ అను ధూళి చైనా దేశములో ఎక్కువగా కాబడును

రసాయన బాహాహావివలన తయారై ద్రావణిరూపములో గాని ద్రావణిలో అవిరామముగా కొల్లాయిడ్స్‌గా గాని కొనిపోబడి అనుకూల రాసాయనిక భౌతికమార్పుల మూలమున నిక్షేపప్రాంతమున దిగుగల ఐయినవి రసాయన మస్తులనబడును సున్నపురాయి డోలమైటు యిట్టి మస్తులనుండి జనించిన ముఖ్యమైన శిలలు రంగురంగుల గీతలు కలిగియుండు అగేటు నిప్పురాయి మొదలగు ఖనిజములు యిట్టి పరిస్థితులలో ఉద్భవించును కాని అవి కొల్లాయిడ్లనుండి దిగుదల యగును పారిశ్రామికముగా బహుముఖ్యమైన పట్టినిర్మాణము కల లోహశిలాస్ఫటిక నిక్షేపము.లు కూడ కొల్లాయిడ్లనుండి దిగుదల అయినవే సముద్రపునీరు ఇగిరిపోయినపుడు వివిధ రకముల లవణములు లభించును సముద్రము పొంగినపుడు నీటిని కప్పివేయగా వేర్వేరు మస్తులు వీటిపై తయారగును తదుపరి సముద్రము వెనుకకు తొలగి తరని నిక్షేపశిలలు బయటపడినప్పుడు ఆలవణములు శిలలలో లభ్యమగును అందువలన అట్టి లవణము.లను కూడ మస్తులుగానే భావించుట కలదు

సేంద్రియమస్తులు ఉద్భిజ్జ జీవరాసుల అవశేషములవలన నీటిలో జనించినవి అట్టివి (1) కాల్కేరియస్ (2) ఫాస్ఫరకము, (3) కైలద్వ్యుత్పత్తిజనిద (4) కర్బనసత్వమస్తులని నాలుగు రకములు కాల్కేరియస్‌మస్తులు పగడపుగట్లు నత్తగుల్లల వంటిగుల్లలు చిప్పలుకల జీవరాసుల కాష్ఠములుకూడి జనించును చేపలను అధికముగా తిను సముద్ర ద్వీపములందలి పక్షులుచేయు మలవిసర్జనము ఆయా ద్వీపములలో నిక్షేపకములుగామారి అవి వ్యావహారికముగా గువానో (Guano) అనబడుచున్నవి అవి ఫాస్ఫరకమమైనవి సముద్రములో కోల్లలుగానున్న డయాటమ్స్ ప్లాంక్టన్ అను సూక్ష్మజీవరాసులు చనిపోయి సముద్రపుటడుగునకు చేరుటవలన కైలద్వ్యుత్పత్తిజనిదములైన మస్తులు సంభవించును సముద్రము పొంగుటవలన అరణ్యములు మునిగిపోవుటకలన, వరదలతోను, నదులలోను [illegible] తమున వృక్షములు కొట్టుకొనిపోయి ఒకచో కూడినప్పుడు అవి కర్బనసత్వమస్తులుగా మారును

రూపాంతరశిలలు :– అగ్నినిక్షేపశిలలు అధికముగా భూమిలో 10 లేక 20 కి మీ లోతువరకు పాతుకొనిపోవును అందలి ఉష్ణోగ్రత 250° నుండి 400° సెం గ్రే వరకుండును; కాని అగ్నిశిలలు చొచ్చుకొన్న ప్రాంతములలో 700° నుండి నుండి 800° సెం గ్రే వరను కూడ యుండును ఆ లోతులలోని అధికపీడనము 5 లేక 6 వేల బార్లు (బార్ = 10 లక్షల డైనులు 1 చ సెం మీ = 29 52 అం పాదరసము) వరకుండును రూపాంతరశిలలు యిట్టి సాధారణ పరిస్థితులలో ఉద్భవించినను పలుచోట్ల పలువిధములైన హెచ్చుతగ్గులుండును శిలలు తిరిగి సంఘట్టన మొందుటయే రూపాంతరము. వివిధ పీడనోష్ణస్థితులను బట్టి రూపాంతరములు వివిధరకములు వాటిని థెర్మల్ రూపాంతరము (ఉష్ణము అధికముగాను పీడన శక్తికొంచెము కాని లేకుండ కాని) ప్రాంతీయ లేక డైనమో థెర్మల్ రూపాంతరము (ఉష్ణము పీడనము కూడ అధికము) భార (Load) రూపాంతరము (పీడనము అధికము ఉష్ణము తగుమాత్రము) మెటాసొమాటిజమ్ రూపాంతరము (ఉష్ణము అధికము పీడనము తగుమాత్రము, ఖనిజోత్పత్తి మూలమగు ద్రవములు) అని ఆయాపరిస్థితులను బట్టి భూగర్భశాస్త్రజ్ఞులు వర్ణింతురు వివిధ రూపాంతరములను బట్టి శిలలు నిర్మాణ కూర్పులక్షణములుండును; క్రొత్త ఖనిజము లుద్భవించును కొన్ని ఖని జములు తిరిగి సంఘట్టనమొందుట వలన వాటి రూపములు మార్పు నొందును కైనైటు, సిల్లిమనైటు క్లోరైటు, ఎక్టినోలైటు మొదలగు ఖనిజములు శిలలుగా రూపాంతర మొందినపుడు మాత్రమే ఉద్భవించును డయాప్సైడు ఫెల్స్పార్లు అభ్రకము.లు, ఒలివీన్లు మొదలైనవి తిరిగి సంఘట్టన చెంది మార్పునొందు ఖనిజములు నైసోసిట్, షిస్టోసిటీ స్ఫటికీకరణము వంటివి ఈ శిలల నిర్మాణలక్షణములు నైసోసిటీ షిస్టోసిటీల వలన రూపాంతర శిలలు సులభముగా పొరలుపొరలుగా విడిపడును పలకరాయి ఫిల్లైటు, పలురకములైన షిస్టులు నైసులు పాలరాయి రూపాంతరశిలలకు ఉదాహరణమైన ఉదాహరణములు రూపాంతర శిలల ఖనిజముదాంపత్యమును నిర్మాణ కూర్పులక్షణము.లను పరిశీలించినచో, వాని చరిత్రను అప్పటి పీడనోష్ణ పరిస్థితులను తెలిసికొనవచ్చును

ఆ పరిస్థితుల ఆధారముతో (గ్రానైట్ నుండి వంటి శాస్త్రవేత్తలు రూపాంతరశిలలు భూమిలో [illegible] [illegible] [illegible] అను భూగర్భములలోని (హైమండి ప్రీతిలో [illegible]

కోరలలో ఉద్భవించినట్లు విశ్వసించిరి ఎస్కోలా అను ఫిన్లెండు శాస్త్రవేత్త రూపాంతర శిలలలోని వివిధఖనిజసముదాయములు రూపాంతరపు వివిధ అంతరములను తెలుపునని నిరూపించెను ఈ రూపాంతర శిలలలోని అంతరాంతరములను ఆ ఎస్కోలా వివరీకరించెను గ్రీన్‌షిస్టు' ఎపిడోట్ - ఆంఫిబోలైట్' 'ఆంఫిబోలైట్ గ్రాన్యులైట్ ఎక్లోగైట్' అనునవి ముఖ్యమైన అంతరములు రూపాంతర శిలలలో క్రమక్రమముగా ఉష్ణపీడనశక్తులు అధికమగునని ఈ విభజనము తెలుపును ప్రతి అంతరాంతరమునకు సలక్షణమగు ఖనిజసముదాయమును అతడు నిర్ణయించి నిరూపించెను ఆ సముదాయములు ఆయా పీడనోష్ణ సరిహద్దులలో సమానత్వము పొందినట్లు తెలియవచ్చుచున్నది

శిలల భౌతికలక్షణములు శిలల భౌతిక లక్షణములను భూమి నైజమును సంవిధానమును అంతర్గత నిర్మాణమును తెలిసికొనుట మిగుల ఉపయోగకరము ఈ లక్షణములను అర్థము చేసికొనుటవలన ఖనిజనిక్షేపములకై పరిశోధనములను తగుమాత్రపు విస్తీర్ణములోనే చేసి త్వరగా పూర్తి చేయవచ్చును; మానవాళికి ఎట్టి శిలలెట్టి పనుల కుపయోగపడునో కూడ తెలియును

అగ్నిశిలలలో క్షారతమమైన శిలల క్షారతమ్యగరిమ సుమారు 3 3 ఆమ్లతమమైన శిలల క్షారతమ్యగరిమ 2 5 కంటె అధికము స్ఫటి రూపము పొందిన శిలల క్షారతమ్యగరిమ అచేలాపాయనిక సంఘట్టన కలిగి గాజు రూప మధికముగా పొందిన శిలలలో కన్న అధికము నిక్షేపశిలల క్షారతమ్యగరిమ ఇసుకరాయిలుగల 2 2నుండి సున్నపురాయిగల 2 7 వరకుండును రూపాంతర శిలలగరిమ 2 7 నుండి 2 95 వరకుండును

అగ్నిరూపాంతర శిలలకన్న నిక్షేపశిలల రంధ్రత్వశక్తి ఎక్కువ ప్రయోగపూర్వకముగా గ్రానైటు శిలల రంధ్రత్వశక్తి 0 3 నుండి 2 6 వరకు గాబ్రోకు 3 00 బెసాల్టుకు 0 4 నుండి 0 5 వరకు అనియు సైన్ శిలలకు 2 5 నుండి 4 4 వరకనియు పాలరాతికి 0 4 నుండి 1 8 వరకనియు సున్నపురాతికి 1 0 నుండి 20 0 వరకనియు ఇసుకరాతికి 1 9నుండి 22 00 వరకనియు నిర్ణయించబడెను ఈ లక్షణమునుబట్టి వీనిలో వాటి లభ్యతకూడ తెలుసుకొనవచ్చును షేల్ వంటి శిలల రంధ్రత్వశక్తి బహుకొద్ది వీటి లభ్యతకూడ చాల తక్కువ ఇట్టి పరిశోధన ముఖ్యముగా రకరకములైన శావులద్వారా నీరు సరఫరాచేయుట కుపయోగపడును కొన్ని ఖనిజనిక్షేపములు రంధ్రత్వ శక్తినిబట్టి ఒక్కొక్కచోట లభ్యమగును; ఒక్కొక్కచోట లభ్యముకావు

ఉష్ణోగ్రత పెరిగికొలది శిలలలోని వివిధ ఖనిజముల పరిణామములు పలువిధములుగా మారును శిలాపరిణామములో అంత్యముగా సంభవించు పెరుగుదలయే ఉష్ణపరిణామపు పెరుగుదల అనబడును ఇట్టి పెరుగుదల భూగర్భములో ఎట్టి పరిస్థితులలో ఎంతయుండునో తెలిసికొనుటకు అప్పటి పరిస్థితులను ప్రయోగశాలలలో జనింపజేయుట అసంభవము అందువలన ప్రయోగాత్మకముగా నిర్ణయించిన పరిమాణపు పెరుగుదల దాని అంతరమును మాత్రమే సూచించును దానిని బట్టి భూగర్భమున సంభవించు పరిస్థితుల నూహించవచ్చును ఇట్టిప్రయోగమువలన నిక్షేపశిలల పెరుగుగల (1 సెం గ్రే కు 10 లక్షలలో 4 2 నుండి 29 వంతుల వరకు, అగ్నిశిలలలో (1 సెం గ్రే కు 10 లక్షలలో 4 1 నుండి 17 వంతుల వరకు) కంటె అధికమని తెలియుచున్నది ఈ పెరుగుదల ఉష్ణోగ్రత పెరుగుకొలది హెచ్చును కాని 800° సెం గ్రే దాటిన పెరుగుదల బహుకొద్దిగా మాత్రమే హెచ్చును

శిలలద్రవీకరణ ఉష్ణోగ్రత అగ్నిపర్వత ప్రాంతములలో ప్రయోగాత్మకముగా నిర్ణయించబడెను ఆమ్లగమమైన అగ్నిశిలలు 1250° సెం గ్రే ఉష్ణముగల ప్రాంతములలోను క్షారతమమైన శిలలు 1100° సెం గ్రే ఉష్ణముగల తావులందును ద్రవీకరణమొందును నిక్షేప రూపాంతరశిలల ద్రవీకరణమునకు ఉష్ణోగ్రత అంతకంటె తక్కువ కావలయును

కొంచెమించుమించుగా అన్నిశిలలును వానిలోనుండు రేడియో ధార్మిక ఖనిజములనుబట్టి రేడియోధార్మికశక్తి కలిగియుండును ఈ శక్తి అధికముగానున్న ఉష్ణమువలనగాని భూమిలో పూడియుండుటవలనగాని మార్పుచెందదు రేడియో ధార్మికఖనిజములు పలుకారణములవలన ప్రకృతిలో అన్నిరకముల శిలలలోను కేంద్రీభూతములై నిక్షేపములుగా లభించును రేడియో ధార్మికశక్తిని బట్టి ఆయా ప్రాంతములలోని వేడిని తెలిసికొనవచ్చును అణువిఘటన మూలమున వేడి జనించునని నిరూపింపబడెను గ్రానైటులో రేడియో ధార్మికశక్తి $2\ 7 \times 10^{-12}$ గ్రా/గ్రా బెసాల్టులో $1\ 185 \times 10^{-12}$ గ్రా/గ్రా గాబ్రోలో $1\ 3 \times 10^{-12}$ అనియు నిర్ణయించబడెను

సంకోచశక్తి (Compressive strength), స్పర్శపీడన శక్తి (shearing strength) సాగుడు శక్తి (tensile strength) కూడ శిలలముఖ్యమైన భౌతిక లక్షణములు అగ్నిశిలల సంకోచశక్తి (గ్రానైటులో 1000 నుండి 2800 కి గ్రా చ సెం మీ) నిక్షేపశిలలలో (400 నుండి 1600 కి గ్రా చ సెం మీ) కన్న ఎక్కువ అమకముమైన అగ్నిశిలలకు రూపాంతరశిలలకు ఘటించబడిన నిక్షేపశిలలకు స్పర్శపీడన శక్తి చ సెం మీ కు 100 నుండి 300 కి గ్రాములు ఇసుకరాయివలె తక్కువగా కుదించబడిన నిక్షేపశిలల స్పర్శపీడన శక్తితక్కువ (100 కి గ్రా చ సెం మీ ప్రాంతము) నిక్షేప రూపాంతరశిలల సాగుడుశక్తి అగ్నిశిలలకన్న తక్కువ

ఖనిజ నిక్షేపములు మానవకోటికి ఉపయోగకరమగు ప్రతి ఖనిజము నిక్షేపములుగా పైన వర్ణించిన మూడురకముల శిలలలో కలిసియుండును బంగారము రాగి సీసము తుత్తునాగము వోల్ఫ్రామ్ మోలిబ్డినమ్‌వంటి ధాతువులు గ్రానైటు పెగ్మటైటు శిలాస్ఫటికమువంటి ఆమ్లతమమైన శిలలలో ఉత్పత్తియగును వజ్రములు ప్లాటినం – నికెల్‌-కోబాల్ట్ - ఖనిజనిక్షేపములు – క్రోమైటు మాగ్నటైటువంటి నిక్షేపములు క్షారతమమైన కింబర్లైటు గోబ్రైటు పెరిడొటైటు కార్బొనైటు వంటి శిలలలో లభ్యమగును రాగి సీసము తుత్తునాగము ఇనుము మాంగనీసువంటి ధాతువుల ఖనిజములు నిక్షేపరూపములో రూపాంతర శిలలయందు లభ్యమగును గుంటూరుజిల్లాలోని అగ్నిగుండాల ప్రాంతములోని రాగి సీస తుత్తునాగ నిక్షేపములును ఖమ్మంజిల్లాలోని మైలారవు ప్రాంతములోని రాగి నిక్షేపములును అనంతపురము జిల్లాలోని రామగిరి వద్దనున్న బంగారునిక్షేపములును వజ్రకరూరువద్ద వజ్రములు కలిగియున్న కింబర్లైటును కృష్ణాజిల్లాలోని కొండపల్లి క్రోమైటును శ్రీకాకుళంజిల్లాలోని మాంగనీసు నిక్షేపములును ఆంధ్రదేశపు ఖనిజసంపదలోని ముఖ్యోదాహరణములు యురేనియం థోరియంవంటి రేడియోధార్మిక ధాతువులు బీహారురాష్ట్రములో సింగభూమి జిల్లాలోని జాదుగుడా ప్రాంతమున రూపాంతర శిలలనుండి ఖననము చేయబడుచున్నది అంతేకాక ఇట్టి నిక్షేపములు భారతదేశములో పలుచోట్ల వివిధరకముల శిలలలో లభించినట్లు తెలియుచున్నది

ఎపసొైటు బెరైటువంటి ధాతునిక్షేపములు మాగ్మానుండి అంత్యదశలలో వేరై పలురకముల శిలలలో నిక్షిప్తమైనట్లు తెలియును టాల్క్ స్టియటైటు (రాతిచిప్ప–ఆంధ్రదేశములో ఈ ఖనిజమును గిన్నెలుగా రూపొందించి ఉపయోగించెడివారు) రాతినార నిక్షేపములు క్షారతమమైన శిలలు సున్నపురాళ్ళగుండా చొచ్చుకొని వచ్చినప్పుడు ఆశిలలయొక్క సంగమస్థానమున ఎపసొైటు బెరైటు ధాతునిక్షేపములు జనించును సున్నపురాయి పలకరాయి గ్రానైటు బెసాల్టు డోలమైటు మొదలైనవి పరిశ్రమలలోను నిర్మాణములలోను ఉపయోగపడును మిక్కిలి నాణ్యమైన సున్నపురాయిలేనిదే ఉక్కుపరిశ్రమ సాధ్యముకాదు పశ్చిమదేశములలో చలినితట్టుకొనుటకు శిలలనుండి తయారుచేసిన రాతిఉన్ని గృహనిర్మాణమున ఉపయోగింపబడును

జి. వి. రా.

## శిలాజీవశేషములు

క్రీస్తుపూర్వము 6 వ శతాబ్దమునుండియు గ్రీసు దేశస్థులు శిలాజీవశేషములను గుర్తించుచుండిరి క్రీస్తు తరువాత 18 వ శతాబ్దమువరకు శాస్త్రజ్ఞులు వీటి ప్రాముఖ్యతను గురించి చర్చించుచునేయున్నారు గ్రీకుచరిత్రకారులు తత్త్వవేత్తలు సముద్రమునకు దూరముగా శిలా రూపములలోయున్న సముద్రగుల్లల ఆధారముగా ఆ ప్రాంతములో ఒకానొకప్పుడు అచ్చట సముద్రమున్నదని నిర్ధరించిరి అట్టి శాస్త్రజ్ఞులలో జెనోఫేనిస్ (Xenophanes), జెనోథోస్ (Xenothos) హెరొడోటస్ అనువారు ముఖ్యులు పలుశతాబ్దములుగా శాస్త్రవేత్తలు శిలా జీవశేషముల గురించి తర్కించినను, లియొనార్డోడావిన్సి అను ఇటలీ చిత్రకారుడు యీ శిలాజీవశేషములు జలోత్పత్తిరైన శిలలలో మాత్రమే లభించునని నిరూపించి ఈ శిలలు జీవశేషములని నిర్ధరించెను

భూమి ఉపరితలములో సహజకారణములవలన దాచబడిన జంతు వృక్షశేషములే ఈ శిలా జీవ శేషములు ఇవన్నియు భూమిపై పుట్టి పెరిగి జీవించినవి ఇట్టి శేషములు కొన్ని కోట్ల సంవత్సరములనుండి యున్నవి జలోత్పత్తిరైన శిలలు ఒకేవిధముగనున్నను కొన్ని ప్రాంతములలో అట్టి శేషములు ఎక్కువగాను కొన్నిటిలో తక్కువగానుదొరకును ఎక్కువగా దొరకుచోట్ల వాటి సంరక్షణకు తగు పరిస్థితులు లభ్యమైనట్లు స్పష్టముగా తెలియును

సర్వసాధారణముగా జంతువుల వృక్షముల గట్టి భాగములు మాత్రమే సురక్షితముగ నుండగలవు. మెత్తనిభాగములు చనిపోయిన మొదలైనట్టి కారణముల వలన క్షీణించుటకు అవకాశము కలదు. ఇవి భూమిలో పాతుకొనిపోవును. ఇట్టి పరిస్థితులు భూమిపైగల సముద్రములలో మాత్రమే లభించును. ఇట్టి పరిస్థితులలో జలచరములకు సులభసాధ్యము. అందువలననే శిలాజీవశేషములలో అధికభాగము జలచరములుగ నుండును.

క్రిందటి శతాబ్దములో కనుగొనబడిన జీవశేషములలో అతి విచిత్రమైనది బొచ్చుతో ఉన్న గజరూపి (wooly mammoth). ఇది సైబీరియా రాష్ట్రపు మంచుగడ్డలనడుమ లభ్యమైనది. ఈ గజరూపి చర్మము కండరములు మృదువైన అంతర్భాగములు సర్వావయవములతో కూడిన పూర్ణస్వరూపమున లభ్యమైనది. ఇట్టి అవశేషములు లభించుట అరుదు.

ఇట్టి జీవశేషములను గురించి విశదీకరించు విజ్ఞానశాస్త్రమే శిలాజీవశేషశాస్త్రము (Palaeontology). ఇది భూగర్భశాస్త్ర భాగముగా పరిగణింపబడినప్పటికిని జంతు వృక్షశాస్త్రములతో దీనికి చాల సంబంధమున్నది.

జీవరాసుల యొక్క గట్టిభాగములు (అస్థిపంజరము) కర్బనమైన నిర్మాణములపైన వాటి భద్రత ఆధారపడియుండును. వీటినిబట్టి గట్టిభాగములు కలవైనను కొన్ని జీవరాసులు విధ్వంసమై వాటి శేషములు దొరుకుటలేదు. జీవరాసుల అస్థిపంజరములయందు అధికభాగము కాల్షియం కర్బనితము సిలికా భాస్వరపదార్థములు కలిసియుండును. వాటిలో మార్పులు చాలతక్కువ. సాధారణముగ నీటిలో కర్బనితామ్లము లుండును. కాల్షియం కర్బనితము అందులో కరిగిపోవును. ఆ కరుగుదల కర్బనితపు నిర్మాణముపై ఆధారపడియుండును. అట్టి నిర్మాణము గుల్లగాను పారదర్శకము (Transparent) గాను ఉన్నచో కరగుదల ఎక్కువగ నుండును. ఇది ప్రయోగపూర్వకముగా కూడ నిరూపింపబడినది.

భద్రతావిధాన మాధారముగా శిలాజీవశేషములు (1) సిసలైన శిలాజీవశేషములుగను (2) గుర్తింపబడు ముద్ర రూపములుగను విభజింపబడెను. సిసలైన శిలాజీవశేషములు (అ) మృదువైనభాగములు (ఆ) గట్టిభాగములు (ఇ) ఎలికాశిలగ మారిన భాగములు (ఈ) కర్బనితములుగా మారిన భాగములు అను వర్గములుగా విభజింపబడినవి.

అన్ని భాగములును యథాతథముగ భద్రముగనుండు జీవశేషములు లభించుట చాల అరుదు. అట్టి శేషములు మంచుగడ్డలోను చమురులోను ఒక్కొక్కప్పుడు లభించును. దేవదారు వంటి చెట్లనుండి స్రవించు వచ్చని బూర్జకపూస (Amber) లోను మాత్రమే లభించును. చమురు స్రవణ గావాలలో చిన్న జీవరాసులు మాత్రమే దొరుకును. మంచుగడ్డలలో ఉన్న శేషములు కొన్ని వేలసంవత్సరములనాటి వేకాని లక్షల సంవత్సరముల నాటివి కావు. జీవరాసుల గట్టిభాగములు పెద్దమార్పులు పొందక యే భద్రముగ నుండగలవు. బహు పురాతనమైన శిలాజీవశేషములలో సహితము యిప్పటికిని వర్ణపు మెరుపు కనిపించుచునే యుండును. సాధారణముగా భూమిలో అంతర్వాహిని ప్రవహించు నీటి వలన భూగర్భశాస్త్ర ప్రకారము బహు పురాతనమైన శిలాజీవశేషములు మార్పులుచెందును. శిలలుగ మారుటవలననే అవి భద్రముగ నున్నవి. అట్టి శిలారూపమైన మార్పులకు 70 మూలద్రవ్యములు (elements) కారణభూతములుగ నున్నవి. వాటిలో కాల్షియము సిలికాలు ముఖ్యమైనవి. సెల్యులోజ్ ఉన్న వృక్షపదార్థములు నీటిలో మునిగినతరువాత అవి క్రుళ్ళి వాటిలోని మీథేన్ నీరు బొగ్గుపులుసు వాయువు (Carbondioxide) కర్బనములుగా మారును. ఈ మార్పును కర్బనీకరణమని అందురు. జీవముల గుల్లభాగము ఎరగనైట్ (aragonite) అను ఖనిజముతో తయారై ఎక్కువ నీటిపారుదలగల శిలలలో యున్నచో వాటిగుల్ల నీటిలో కరిగిపోయినను వాటి ముద్రల రూపములు (moulds) మాత్రము మిగిలియుండును.

శిలాజీవశేషముల ఉపయోగములు శాస్త్రకారులకు మెండు. ముఖ్యముగా వివిధ ప్రదేశములలోని శిలలను అనుసంధించుటకు అవి ఉపయోగపడును. శిలాజీవశేషములనుబట్టి శిలలుగామారిన మట్టి ఎట్టి వాతావరణములో ఉద్భవించినదియు తెలిసికొనవచ్చును. వీటి మూలముననే అల్పాతి అల్పమైన జీవరాసులనుండి మానవకోటివరకు జరిగిన పరిణామమును స్పష్టముగా అర్థము చేసికొనవచ్చును.

కె. వి. ప్రా.

## శిలావాతాహతి

భూమ్యుపరితలముపైని ప్రతిపదార్థము అంతులేని మార్పులకు లోనగుచుండును. కాలగతిని కఠినమైన శిలలు కూడ శిథిలమై మట్టిగ మారిపోవును. వాతాహతి శిలాశిథిలమునకు ఒక ముఖ్యకారణము. భువిపై ప్రకృతిలో పలుకారణముల వలన జరుగుచున్న ఈ శిలాశిథిలమే వాతాహతియనబడుచున్నది. అట్లు ఏర్పడిన మట్టి ఒక చోటనుంచి మరొక చోటికి తరలిపోవుటయు అచ్చటి శిలలు వాతాహతికి లోనగుచుండుటయు జరుగుచుండును. ఈ వాతాహతి అతి నెమ్మదిగా జరుగుట వలన దానిని గుర్తించుట అశక్యము. శిలావాతాహతియొక్క ప్రమాణము ఆయాప్రాంతముల శిలల యొక్క స్వభావముపైనను శిలలపై తాకిడి కలుగజేయు వాతాహతియొక్క లక్షణములపైనను ఆధారపడియుండును. ఈ కారణముల వలన వాతాహతి రెండు విధములుగ నుండును (1) భౌతిక వాతాహతి (2) రాసాయనిక వాతాహతి

భౌతిక వాతాహతివలన శిలల రాసాయనికకూర్పులో ఎట్టి విధమైనమార్పులు ఉండవు. వాతావరణములోని వివిధమార్పుల వలన ఉద్భిజ్జముల పెరుగుదలవలన జీవరాసుల మూలమున గాలి మంచు నీటి ఒరిపిడివలన ఇట్టి వాతాహతి సంభవించును. ప్రకృతి సిద్ధముగా అవి ఉద్భవించినప్పుడుకాని భూకంపముల వంటి చలనములవలనకాని శిలలలో పగుళ్లు బీటలువంటి వివిధ పరిణామములు మొదలగును. భౌతికశిలావాతాహతి ఇట్టి బీటలు నుంచి ప్రారంభమగును. అతి చల్లనిప్రదేశములలోను పర్వత ప్రాంతములలోను ఘటిల్లు సూక్ష్మమైన పగుళ్లలోకూడ నీరు ప్రవేశించును. ఉష్ణోగ్రత తగ్గినప్పుడు ఆ నీరు ఘనీభవించును; నీరు ఘనీభవించునపుడు దాని పరిమాణము పెరుగును. ఆ కారణముగా శిలలయందలి పగుళ్లు పెద్దవగును. క్రమక్రమముగా ఈ శిలలకు శైథిల్యము సంభవించును. అదేవిధముగా ఎడారిప్రదేశములలోను కనిష్ఠ, గరిష్ఠ ఉష్ణోగ్రతల తారతమ్యము అధికముగా ఉండు ఇతర ప్రదేశములలోను శిలల పరిణామము లలో మార్పులు జరుగుచుండును. ఆమార్పులు అతిత్వరితముగా జరుగుటవలన భౌతికవాతాహతి సంభవించును. కొన్నిరకముల శిలలను ఉష్ణోగ్రతల తారతమ్యముగాని, నీటి ఒరిపిడిగాని తగు మాత్రపు లోతువరకే మార్పగలవు. ఈ వాతాహతివలన, ఆ శిలలలో సంభవించు పగుళ్ల మూలమున అందు ఉల్లి పొరల వలె ఏర్పడు పెచ్చులు క్రమముగా ఊడిపోవును. ఇట్టి శైథిల్యమును "ఎక్స్‌ఫోలియేషన్" అందురు. ఒక్కొక్కప్పుడు ఉద్భిజ్జముల వేరులు లోతులలో ఉండు ప్రాణులు మెల్లగా శిలల పగుళ్లలో చేరి వాటి శైథిల్యమునకు దోహదమిచ్చును. ఇట్టి పరిస్థితులలో కూడ భౌతిక వాతాహతి సంభవించును. గాలివీచు నప్పుడు దాని ఉధృతమునకు ఇట్టి ఇసుక రేణువులు గాలితో పయనించును. ఇట్టి రేణువులు మెత్తని శిలలపై ప్రయాణించు నపుడు ఒరిపిడివలన ఆ శిలలు క్రమముగా పలుచబారును. ఇట్టి వాతాహతివలన కొండలలోను ఎత్తుప్రదేశములలోను గాలి వీచుచున్నవైపు సాధారణమైన వాలును ఎదుటివైపు నిట్రమైన వాలును సమకూరును. ఇట్టి వాతాహతిని సముద్రపుటొడ్డునకూడ చూడవచ్చును. అట్టి ప్రాంతములలోని యిండ్లకు అద్దములు అమర్చబడిన కిటికీలున్నచో ఆ అద్దముల పారదర్శకత కాలగతిని క్షీణించును. భౌతిక వాతాహతియే దీనికి కారణము.

రాసాయనికముగా స్వచ్ఛమైన నీటికి యితర పదార్థములను కరగించుశక్తి చాలఎక్కువగా నుండును. కాని ప్రకృతిలో అట్టి నీరు లభించదు. ప్రకృతిలో అధికభాగము నీరు వర్షము వలన లభించుటచే గాలిలోని ఉదజని ఆమ్లజని బొగ్గుపులుసు వాయువు అందులో కరగియుండును. అట్టి నీరు సజలకర్బనికామ్లముగా వ్యవహరించును. ఆమ్లతమమైన అట్టి నీరు వివిధ శిలలను పలువిధములుగా మార్చును. స్వచ్ఛమైన సున్నపురాళ్లు ఆమ్లయుతమైన ఈ నీటపూర్తిగా కరగిపోవును. ఇసుక రేణువులున్న సున్నపురాయి మన్నువు పదార్థములో కూర్చబడిన ఇసుకరాయి నీటిలోకరగిపోయి ఇసుక మాత్రము మిగులును. ఇట్లుకరగిపోవు దానిని హీనపటుత్వపు భాగములనియు నిప్పురాయి రేణువులుకలిగియున్న భాగములను పటుత్వముగలవి గాను పరిగణింతురు. శిలలకూర్పు నిర్మాణములనుబట్టి రాసాయనిక వాతాహతి వలన శిలల గంధ్రత్వశక్తి (porosity) పెరిగి వాని నీటి పారుదలశక్తి (permeability)) ఎక్కువగును. అప్పటికి ఆ శిలల పటుత్వము క్షీణించును. రాసాయనిక వాతాహతి పలువిధములుగ నుండును. ఉదా:- కర్బనిదత్వము (Carbonation), ఉదజనిత్వము (Oxidation,) జలత్వము (hydration), ఇట్టి వాతాహతి వలన శిలల పరిమాణము తగ్గుచు క్రమముగా అది శిథిలమగును.

ప్రకృతిలో ఉద్భిజ్జములు పెరుగుచోట్ల, వాటి భాగములు నేలకొరిగి క్రుళ్లిపోవును. అందుండి హ్యూమిక్ఆమ్లము

(humic acid) తయారగును అదికూడ శిలలను కరగించి మార్పులు తెచ్చును వర్షకాలములో కరగిన ఆ శిలాభాగములు నీటి ప్రవాహముచే తరలిపోవును క్రమముగా కొంత కాలమునకు అట్టి వాతాహతి స్పష్టమగును ఉద్భిజ్జములు క్రుళ్లుచున్నపుడు సూక్ష్మజీవుల వి నిలయములగును వాటి వలన కూడ వాతాహతి సంభవించును అట్టి పరిస్థితులలో వాతాహతి త్వరితమగును

శిలావాతాహతి మానవాళికి ఆర్థికముగా అధికోపయోగమైనది వాతాహతి వలననే మట్టి తయారగును అది పాడి పంటలకును మానవ జీవనోపాధికిని సహాయభూతమగును వాతాహతివలన ధాతునిక్షేపములలో నిరుపయోగమైన పదార్థములు తీసివేయబడి ఆర్థికముగా ఖననయోగ్యములగును అట్టి ధాతువులు మానవకోటి కెంతయో ఉపయోగకరములు అట్టి నిక్షేపములలో పేర్కొనతగినవి యురేనియము మాంగనము వజ్రాలు భౌతిక వాతాహతివలన శిథిలమైన శిలలనుండి బంగారము ప్లాటినము రత్నమాణిక్యములు మొదలైనవి నీటితో కొనిపోబడి నిక్షేపములుగా లభించును

జె వి ప్రా

## శివదేవయ్య

కళలకు కాణాచియై స్వధర్మము తెప్పగా అనుష్ఠింపబడిన కాకతీయ సామ్రాజ్యమును గణపతిదేవ మహారాజు పాలించు తరుణమది దక్షిణమున మనుమసిద్ధి పదచ్యుతుడై గణపతిదేవుని సాయమర్థించెను తిక్కనామాత్యుని ప్రోద్బలమువలన కాకతి గణపతిదేవుడు దక్షిణమునకు దాడివెళ్లి మనుమసిద్ధిని పదస్థు నొనరించెను ఆ సమయమున మనుమసిద్ధి రాజు వొద్దనున్న "వేద వేదాంగ పాఠక పరమార్థ తత్త్వార్థ శివ చిద్విజ్ఞాన పాదరాయణుడును సద సద్వివేక లక్షణ రక్షణుండును విదిత శైవాగమ విద్యాధరిష్ఠుడు" ను అగు శివదేవుని తిక్కనామాత్యుడు గణపతిదేవునకు పరిచయమొనరించెను ఈ శివదేవుడే విశ్వేశ్వరదేశికుడనీ విశ్వేశ్వరశివాచార్యుడనీ విశ్వేశ్వరుడనీ, దేశికుడనీ, విశ్వేశ్వరశంభువని శివదేవయ్యయనీ నానావిధ నామములతో బరగుచుండెనని వివిధ ఆధారములవలన తెలియుచున్నది

శివదేవయ్య గౌడరాఢమండల పూర్వగ్రామ నివాసియగు ధర్మశంభువు తనయుడు ధర్మశంభువు దాహాలమండలమున గోళకిమఠ స్థాపకుడైన సద్భావ శంభువుయొక్క శిష్య ప్రశిష్యులకోవకు చెందినవాడు ఈ పరంపరనే విశ్వేశ్వర శంభువుకూడా అనుష్ఠించెను చోళ మాళవరాజు లితనిని శిష్యులైరి కళచురి కాకతీయరాజుల కితడు దీక్షాగురువై ప్రఖ్యాతినందెను మహావిద్వాంసుడగుటచే నీతడు గణపతి మహారాజు విద్యాపీఠమునందు అధ్యక్షుడుగా నుండెను ఈతనికి గణపతిదేవుడు వెలనాటను కంద్రవాటి విషయమున కృష్ణానదికి దక్షిణమందు మందరము అను గ్రామమును దానము చేసెను అతని పుత్రికయగు రుద్రాంబకూడ వెలగపూడి గ్రామమును దత్తముచేసెను అచట నీశివదేవయ్య విశ్వేశ్వర గోళకి యను నొక మఠమును విశ్వేశ్వరాలయమును సత్రాలయమును చికిత్సాలయమును నిర్మించెను "సదా దాంతస్స్వాంత స్థిరతరోల సద్యోఙ్నాటి మహాశాంతః । శాంతో జయతి భువి విశ్వేశ్వర శివః" అని ఈతడు మల్కాపుర శాసనమున ప్రస్తుతింపబడెను ఈ గోళకి మఠమునకు దక్షిణ దేశమునందనేక శాఖ లుండినవి

శివదేవయ్య రాజనీతికోవిదుడుకూడ 'పురుషార్థసారము' అను రాజనీతి గ్రంథమును ఇతడు పద్యరూపములో రచించెను ఈ గ్రంథము నేడు మనకు పూర్ణరూపమున లభ్యము కాకున్నను దీనిలోని విస్తృతభాగములు బద్దెనకవి సంకలనము చేసిన 'సకల నీతిసమ్మతము' అను గ్రంథమున ఉల్లేఖింపబడినవి ఈ గ్రంథస్థనీతి ప్రాచీనహైందవ రాజనీతికి గీటురాయి వంటిదే సమకాలీన కాకతీయ రాజనీతికి తీర్చిదిద్దుటయే కాక భావి కాలముపై కూడ తన ప్రభావమును వెరపెను

గణపతిదేవుని రాజ్యావసానకాలమందు శివదేవయ్య మంత్రిగా నియమింపబడెను 'భావికాలజ్ఞాన పారీణమాత్రు' డగు ఈతడు రుద్రమదేవికాలమునకూడ మహాగౌరవములు బడసి మహారాజ్ఞి అంతరంగిక వ్యక్తులలో నొకడుగా పరిగణింపబడెను ప్రతాపరుద్రునికి శివదేవయ్య 'గురుండును, పక్షుండును, మంత్రియునై' మెలగెను ప్రతాపరుద్రుని పట్టపుదేవేరి శివదేవయ్యను సాక్షాత్తు అపరశివునిగా చూచుకొనెడిదట ! ప్రతాపరుద్రుని నిర్యాణానంతరము శివదేవయ్య శ్రీశైలమునకు చని శేషజీవితమును గడపెను

## శిశురోగములు - శిశుపోషణము (ఆంగ్లవైద్యము)

ఒక దేశము సాధించిన పురోభివృద్ధిని ఆదేశపు భావిపౌరులైన శిశువులనుగూర్చితీసుకొను శ్రద్ధనుబట్టి నిర్ణయింపవచ్చును కొంతకాలము క్రితము అంటువ్యాధులు అతిసార సంబంధమైన అస్వస్థతలు పెక్కురు బిడ్డల మృతికి కారణమగుచుండెడివి పాశ్చాత్య దేశములు ఈ విషయమున ముందంజవేసి వ్యాధులను జయింపజాలినవి భారతదేశములో శిశు మరణముల సంఖ్య పూర్వము అధికముగనుండెడిది కాని భారతదేశము స్వతంత్రమై నప్పటి శిశువుల సంక్షేమముపై ఆసక్తి పెరుగుచున్నది ఈ కారణముచే పసిబిడ్డల మరణశాతము క్రమముగా తగ్గుచున్నది

శిశు వ్యాధులను ఈ క్రింది శీర్షికల క్రింద విభజింపవచ్చును -

ఎ) గర్భస్థ స్థితిలోనే అంకురించు వ్యాధులు

బి) పరిపక్వతకు ముందుస్థితి

సి) పుట్టగానే సంఘటిల్లు పరిస్థితులు

డి) శరీరమందు మాంసకృత్తులు విటమినులు మొదలగు అవసర పదార్థములు లోపించుటవలన కల్గు అస్వస్థతలు;

ఇ) జఠర ఆంత్ర సంబంధమైన అస్వస్థతలు

ఎఫ్) అంటు వ్యాధులు

రసివలన కలుగు వ్యాధులు —

(1) ఆటలమ్మ (2) మసూచి (3) పొంగు (4) పోలియో వ్యాధి (5) సంపర్క దోషసంబంధమైన కాలేయవ్యాధి

సూక్ష్మజీవి సంబంధమైన వ్యాధులు —

ఎ) ఆర్జవ జీవుల (పారసైట్సు) వలన కల్గు సంపర్క దోషములు

బి) శ్వాస సంబంధమైన వ్యాధులు

సి) గుండెజబ్బులు

డి) నాడీమండల వ్యాధులు

ఇ) ప్రమాద సంఘటనములు, విషప్రయోగములు-

శిశువ్యాధులు తలిదండ్రుల యందలి వివిధలోపముల వలనగాని గర్భధారణ కాలములో తల్లి అనారోగ్య పరిస్థితిని బట్టిగాని అనగా మొదటి మూడు మాసములలో తల్లి వ్యాధులగు మందులు వాడుట ఆమెను X-రేలకు రేడియేషనుకు గురిచేయుట ఆ దుష్ఫలితములు శిశువులకు సంక్రమించు అవకాశమున్నది

గర్భధారణ కాలములో మొదటి మూడు మాసముల యందు తల్లి జర్మన్ పొంగుకు గురియైన యెడల పుట్టిన శిశువులకు శారీరకముగాను మానసికముగాను వైకల్యమేర్పడును అట్టి శిశువులకు హృదయ సంబంధమైన నేత్ర సంబంధమైన లోపములు కూడ కల్గును

గర్భవతి నివసించు గృహపరిసరములు రోగముల కతీతముగా నుండవలెను గర్భవతికి అవాంఛనీయములగు మందులను వాడుటగాని ఆమెను వివిధమైన ప్రయోగములకు గురిచేయుటగాని కూడదు

పుట్టిన ఏడాదిలోగా చనిపోవు వారిలో పెక్కురు గర్భస్థకాలము ముగియక పూర్వము పుట్టినవారే అట్టి పిల్లలకు కల్గు చిక్కులు చాలయెక్కువ వారి శరీర శీతోష్ణస్థితి క్రమబద్ధముకానేరదు పాలను కుడుచుట మ్రింగుట శ్రమముగా ఉండును అట్లే గాలిని పీల్చుకొనుట కూడ ఒడుదుడుకులతో కూడియుండును పెరుగుదల మందకొడిగా నుండును దానికి ప్రతిక్రియగా, కొలదిపాటి శక్తిగల మాదిమందునియ్యవచ్చును నెలలునిండకముందు పుట్టిన వారి స్థితి దీనివలన అదుపులోనికి వచ్చును ఇట్టి వారినిగూర్చి శ్రద్ధతీసికొనుటకు ప్రత్యేకసౌకర్యముగల వైద్యశాలలు కొన్ని నగరములందు స్థాపింపబడియున్నవి ఇట్టి పసికందులను శీతోష్ణస్థితిచే కట్టుబాటు చేయబడిన అమ్లజని వాతావరణపు గాజుపేటికలమండి గొట్టముల ద్వారా ఆహార మీయబడును

బిడ్డలు గర్భమునందు అసహజమగు స్థితిలో నుండుటవలన కాని పరికరములసహాయముతో గర్భమునుండి తీయబడుటవల్ల చేతులకు కాళ్లకు వ్రేళ్లకు బాదులకు మెదడుకు గాయములు తగులవచ్చును శిశువులకు తగులు ఈ గాయములు, కోతిపుండు బ్రహ్మరాక్షసి వలెపరిణమించ వచ్చును

తల్లి బిడ్డను తన చనుబాలతో పోషింపజాలని స్థితి గద్దు సమస్యగా తయారగును శిశువు సాధారణముగా రోజులో ఇరువది గంటలు నిద్రపోవును పాలకొరకు కొలదిసార్లు నిదుర నుండి లేచుట ఒకటి రెండుసార్లు పసుపువచ్చని విరోచనము లగుట సంభవించును శిశువు బాహ్యవాతావరణమునకు అలవడుట మెల్ల మెల్లగా జరుగును జననానంతరము శిశువున

చెయ్యబడు పాలు సరిపడక అతర బృహదాంత్ర వ్యాధి కలుగ వచ్చును (gastro intestinal disoder) శ్వాస సంబంధమైన సంపర్క దోషము లేర్పడుట మరియొక ప్రమాదస్థితి అవి బాధించు వలె వ్యాపించి శిశువు క్లిష్టమైన వ్యాధికి గురి యగును తల్లి స్తన్యమును కుడువజాలని శిశువునకు తీవ్రమైన అస్వస్థత వాటిల్లు అవకాశములు మెండుగానుండును

పుటుకతో వచ్చు లోపములను రెండువర్గముల క్రింద విభజింపవచ్చును మొదటి తరగతి లోపముల విషయములో కొన్నిటికి పుటిన కొలది కాలములోనే శ్రద్ధ తీసికొనవలెను ఒకానొక శిశువు మలవిసర్జనము చేయుమార్గము లేదే పుట్ట వచ్చును మరియొక శిశువు యొక్క పెద్ద ప్రేగులలో సూటి యైన మార్గము లేకుండగనే పోవచ్చును శిశువు బ్రతుకవలె నన్నచో ఇట్టిలోపములను వెంటనే సరిదిద్దవలసి యుండును

భారతదేశము లో ఇట్టి వ్యాధులు బహుతరచుగా సంభవించుచున్నవి అవి మాంసకృత్తులు విటమినులు లోహధాతువులు శరీరములో లోపించుటవలన వాటిల్లవచ్చును

భారతదేశమందలి శిశువుల సంఖ్యలో సగమునకుపైగా సరియైన పోషకాహారము లేక బాధపడుచున్నారు ప్రజసముదాయ ఆర్థిక విద్యావిషయములతో ముడివడి యున్నది ఈ సమస్యాపరిష్కారము కై పాలఉత్పత్తిని పెంపొందించి వాటిని ముఖ్యముగా పిల్లలకు రోగులకు న్యాయముగా పంచ యించవలెను కూరగాయలలోని మాంసకృత్తులను ఎట్లు సద్వినియోగపరుచవలెనో తల్లులకు విజ్ఞానము కలుగవలెను బిడ్డపుట్టి ఎదిగెడి మొదటి మూడు సంవత్సరముల వరకు ప్రొటీనుల అవసరము అత్యధికముగా నుండును

విటమిన్ ఎ :— దీని కొరత పదాదికంటె ఎక్కువ వయస్సుగల శిశువులలో సంభవించి వారి పెరుగుదల నిలిచి పోయి సంపర్క దోషములకు గురియగుదురు రేచీకటి, అంధత్వము ఇట్టి దోషములు అంధత్వము దక్షిణ రాష్ట్రము లలో తరచుగా ఘటిల్లుచున్నది ఆకుకూరగాయలు వెన్న చేపనూనె ఆ ధర్మమునకు నివారణోపాయములు

విటమిన్ బి-కాంప్లెక్సు — శరీర ప్రక్రియలకు ఈ విటమిను లవసరము వీటిలోపమువలన కలుగు నష్టము శిశుదశ యందంతట గోచరించును నాలుక నొప్పియుండును; నోటి కోణములవద్ద చీటలు వారును కాళ్లు చేతులు వాయును; కాళ్లలో తిమ్మిర్లు పొడగట్టును; నీళ్ళ విరేచనములు కాని, మానసిక అస్వస్థతగాని జరుగవచ్చును పచ్చికూరగాయలను పాలతో తయారైన వస్తువులను తినుటవలన వీటిని నిరోధించ వచ్చును

విటమిన్-సి — ఇది లోపించుటవలన కాళ్లు చేతులలో నొప్పులు వ్రేళ్లను కదల్చుట కష్టతర చిగుళ్లువాపు చిగుళ్ల నుండి నెత్తురుకారుట అధికముగా ఏడ్పుట సంభవించును ఈలక్షణములు తరచుగా 1—2 సంవత్సరముల వయస్సుగల శిశువులయందు కనబడును ఎదిగిన కొందరు పిల్లలలోకూడ ఈలక్షణములు గోచరించును ఈ వ్యాధి నిరోధమునకు ఫలరసములు పచ్చికూరగాయలు ఉసిరికాయలు ఇయ్య వచ్చును

విటమిన్-డి — ఈవిటమిను కొరత మూడుమాసముల నుండి 3 ఏండ్లవరకు వయస్సుగల శిశువులలో గోచరించును అట్టి శిశువులు కొద్దిగా కదలికలను ప్రాకుటకు కూర్చుండు టకు నిలబడుటకు శక్తియుండదు పెక్కు కారణములవలన అంగవైకల్యము కూడ సంభవించవచ్చును నాలుగు నెలలలోపు పిల్లలకు ఈఅంగవైకల్యమువలన మూర్ఛలుకూడ రావచ్చును శిశువుల ఆహారములో డి విటమినును కలిపి ఇచ్చుటవలన అస్థి మార్దవరోగమును (రికెట్సు) అరికట్టవచ్చును

రక్తక్షయరోగములు ఇనుము $B_{12}$ ఫోలిక్ ఆసిడ్ అమ్లమువంటి పదార్థముల లోపముల వలన బిడ్డలకు రక్తక్షయము కలుగును ఇందువలన వారికి శక్తి ఉడిగి ఆటలాడుటకును ఆహారము తినుటకును కూడ నిరాకరింతురు కొందరిలో గోళ్ల వద్ద చర్మము తెల్లగానగును మరికొందరిలో గోళ్ళు బల్లపరుపుగా నుండి గుల్లబారును పిల్లలకు పాలిచ్చు తల్లులు ఆకుకూరలతోసహా సంపూర్ణాహారమును తీసికొనుట శిశువులకు గ్రుడ్డు నందలి పసుపుసొనను ఇచ్చుట రక్తక్షయమునకు నివారణోపాయములు

అతివిరేచనములు నెత్తురువిరేచనములు ఇవి శిశువులు కొన్ని గంటలలోనే ప్రాణములు కోల్పోవుటకు దారితీయు వ్యాధులు ఇవి దుర్వాసనతో కూడియుండి పెక్కుదుర్లక్షణములకు దారితీయును (1) కళ్ళు లోతులు తప్పుట (2) చర్మము పొడిగా నగుట (3) గొంతు పిడచ కట్టుట (4) పాలు త్రాగుట కనిష్టము (5) ఉష్ణోగ్రత పెరుగుట, మున్నగునవి

సంపర్క దోషములు: శిశువులెన్నో సంపర్క దోష

ములకు గురియగుదురు వీటిలో కొన్ని మృత్యువునకు గూడ దారితీయజాలినవి ఈ దోషములు రసి (వైరస్) వలన, సూక్ష్మక్రిములవలన సంక్రమించును సంపర్క దోషములలో (1) ఆటలమ్మ (2) మసూచి (3) పొంగు లేక తడపర దద్దు (4) పోలియో మైలిటిస్ ముఖ్యములైనవి కడుపులో పిల్లి మరి యొక సాధారణ వ్యాధిగా పరిణమించి దీనిచే చాలమంది మృతి నొందుచున్నారు 1-3 సంవత్సరముల వయస్సు గల పిల్లలు దీనికి గురియై బాధ పడుదురు ఇది భారతదేశములో ముఖ్యముగా మగ పిల్లలకు సంక్రమించుచున్నది తొలుత శిశువు మందకొడిగా నుండి అన్నింటను ఆసక్తిని కోల్పోయి పెద్దదిగా గోచరించు పొట్టను కలిగి యుండును పొట్ట పైభాగము గట్టిగ నుండును తరచుగా జ్వరము చీటికి మాటికి కోపము అధికమైన ఆకలి తెల్లని మలవిసర్జనము ఈ వ్యాధిలక్షణములు వ్యాధివృద్ధియైన కొలదియు ముఖము పాదములు పొట్టవాయును తద్వ్యతిరేకముగా ఎముకరొమ్ము, చేతులు కాళ్ళు సన్నపడును దరిమిలా దశలలో చర్మము కండ్లు మూత్రము పసుపెక్కును మూత్రము దుర్వాసన కల్గియుండును శిశువు నిద్రమత్తు నుండి స్పృహలేని స్థితికి దిగజారును తరచుగా నెత్తురు క్రక్కుకొనుచు తుదకు మృతి చెందును

హెపటైటిస్ ఇది రసిద్వారా అన్నివయస్సుల పిల్లలకును తరచుగా సంక్రమించు అంటువ్యాధి తొలిదశలో జ్వరము సోకి ఆకలి మందగించుట వాంతులగుట కొలది సేటిలోనే మూత్రము కండ్లు పచ్చబడుట సంభవించును ఈ వ్యాధినుండి శిశువులను రక్షించు మూదిమందులు లేవు కాని ఇది అంటువ్యాధియై వ్యాపించినపుడు కాచిన నీటిని పరిశుభ్రమైన ఆహారమును సేవించినచో కొంతవరకు రక్షణము కల్గును

టైఫాయిడ్ పేరాటైఫాయిడ్ ఇది సూక్ష్మజీవుల వలన కలుగు వ్యాధి సాధారణముగా మూడేండ్లు పైబడిన పిల్లలు దీనికి గురియగు అవకాశమున్నది పదాదేండ్లకంటె తక్కువ వయస్సుగలవారికి ఈ వ్యాధి వచ్చుచో ఫలితము ప్రమాదకరముగ నుండగలదు రోగికి నిర్విరామముగ జ్వరముండుట ఈ వ్యాధి ముఖ్యలక్షణము. వైద్యశాస్త్రము అభివృద్ధియైన ఈ దినములలో దీనిని నివారింప సాధ్యమగుచున్నది

ఘటసర్పి (డిఫ్తీరియా): ఇదికూడ బిడ్డలకు సూక్ష్మజీవుల వలన కలుగు వ్యాధియే త్వరితముగా గుర్తింపనిచో ఇది మృత్యువునకు గూడ దారితీయగలదు గొంతునొప్పి మెడ వాపు మ్రింగుటకు వడకుండుట ఊపిరి పీల్పనశక్తత దీని ముఖ్య లక్షణములు ఈ వ్యాధి ఒక్కొక్కప్పుడు కోరింతదగ్గుతోను ధనుర్వాతముతోను మిళితమై యుండును రోగిని ఇతరులనుండి వేరుచేయుట యాంటీ-సీరంతోను పెనిసిలిన్ తోను చికిత్సచేయుట అవసరము నివారణ అంతకంటెను సులభము

కోరింత దగ్గు ఇదియును సూక్ష్మక్రిముల ద్వారా సంభవించు సంపర్కదోషము బిడ్డలు దీనికి గురియగుదురు క్లిష్టస్థితి ఆసన్నమగుచో మృతికూడ ఘటిల్లవచ్చును దీర్ఘకాలముగా దగ్గు ఊపిరి ఆడకుండుట వాంతులు ఈ వ్యాధి ప్రధానలక్షణములు ఈ వ్యాధి ఉధృతిని క్రిమిసంహార ఔషధముల ద్వారాను, స్వచ్ఛమైన గాలిని పీల్చుటద్వారాను తగ్గింపవీలగును

క్షయ ఇది సూక్ష్మజీవుల మూలమున కలుగు వ్యాధి ఎందరో శిశువులు ఇందువలన మృతినొందుచున్నారు; కొందరు అశక్తతకు గురియగుచున్నారు ముఖ్యముగా పిడాదిమొదలు మూడేండ్లవరకు వయస్సు గల పిల్లలు ఈ వ్యాధివలన ఎక్కువగా బాధపడుదురు వయోజనులైన రోగులనుండి ఈ జబ్బు పిల్లలకు వ్యాపించును ఊపిరితిత్తులు పొట్ట మెదడు ఈ వ్యాధికి గురియగును జ్వరము దగ్గు బరువుతగ్గుట దీని సామాన్య లక్షణములు సాధారణముగా ఈ వ్యాధి పిల్లల నుండి ఇతరులకు సంక్రమించదు త్వరలో దీని కనిపెట్టి సరియైనచికిత్స చేయించినచో పూర్తిగా నివారణకావచ్చును ఇందుకు బి సి జి వాక్సినేషన్ ద్వారా కూడ నిరోధకచర్యలు గైకొనవచ్చును

పరాశ్రయ సూక్ష్మజీవులు వివిధ రకములకు చెందిన ఈ సూక్ష్మజీవులు పిల్లల ప్రేగులలో నివాస మేర్పరచుకొని కడుపులో నొప్పిని అజీర్ణమును కల్గించును ఏలికపురుగులు అధికసంఖ్యలో ప్రేగులయందు చేరినయెడల వాటి నిర్మూలనమునకు ఔషధములనిచ్చి తీవ్ర పరిణామములను నివారింపవలెను

కొంకిపురుగులు : అల్పపరిమాణముగల కొంకిపురుగులు ముఖ్యముగా గ్రామీణ ప్రాంతములలో గోచరించును వీటి గ్రుడ్లుండు పొలములలో పిల్లలు పాదరక్షలు లేకుండ తిరుగ

కాదు అట్లు తిరిగినచో ఈ పురుగులు ఎట్లో వారి ప్రేగు లలో ప్రవేశించి రక్తమును పీల్చివేయును అట్టివారికి చికిత్స చేయించి నెత్తురును ఎక్కించుట అవసరము

రొమ్మునడిసెము శైశవమందు తొలిదశలో సాధారణముగా సంభవించు వ్యాధి రొమ్మునడిసెము ఈ స్థితిలో జ్వరము దగ్గు శ్వాసకోశపు పెరుగుదల ముఖ్య లక్షణములు తీవ్రస్థితియందున్న శిశువు ప్రాణమును కాపాడుటకు క్రిమి సంహార ఔషధములును ఆమ్లజనియు అవసరము

కొందరు శిశువులు పాల ఉబ్బసమునకు పదేపదే గురి యగుదురు కాని వారు వయోజనులైన ఎమ్మట ఈ వ్యాధి నిర్మూల మగును

గవదబిళ్ళలు కొయ్యగండలు బిడ్డలకు సంక్రమించు మరి రెండు సాధారణ వ్యాధులు గొంతులోని గవద బిళ్ళలు ముక్కులోని కొయ్యగండలు జ్వరము గొంతు నొప్పి మ్రింగుట కష్టతర ప్రారంభమున తరచుగా సంభ వించుచుండును తరువాతిదశలలో కండరములు కీళ్ళు శిరముల నొప్పిగా నుండుటచే శిశువు బాధ అధికమగును చెడిపోయిన గవదబిళ్ళలకు కొయ్యగండలకు శస్త్రచికిత్స చేసి బాధను నివారింపవచ్చును

చంటిబిడ్డ గుణము పసిబిడ్డలకు సంక్రమించు వ్యాధులన్ని టిలో మిక్కిలి హఠాత్తుగా సంభవించునది చంటిబిడ్డ గుణము ప్రాణాపాయకరమైన ఈ రోగము సాధారణముగా అన్ని వయస్సుల ఎల్లలకును ఘటిల్లును అప్పుడే జనించిన శిశువున కిది సంభవించుచో ఫలితము తీవ్రముగనుండును మెదడునకు కల్గు సంపర్క దోషముద్వారా వచ్చు జ్వరము స్పృహ తప్పుటకు కారణ భూతములైన మూర్ఛలు మిక్కిలి ప్రమాదకరములు జ్వరము లేకుండ అప్పుడప్పుడు కల్గు మూర్ఛలు అపస్మారమును సూచించును వీటికి దీర్ఘకాలము ఔషధసేవ చేయవలెను కోపము వచ్చు కొందరు పిల్లలు కంపనమునకు గురియగుదురు ఈ మూర్ఛలు భయంకర ముగా గోచరించును మరణహేతువులు కావు

మెదడు పొరలు సంపర్కదోషమునకు గురియైనట్లు అనుమానము కల్గినచో మజ్జాసంధి (Spinal Sac) నుండి ద్రవమును తీసివేయుటకును మూర్ఛలకు సంపర్క దోషములకు చికిత్స చేయించుటకును వైద్యశాలలో చేర్చుట మంచిది వ్యాధిని ప్రథమదశలోనే గుర్తించినచో, చికిత్స వలన సత్ఫలితములు తప్పక కల్గును

మానసిక దౌర్బల్యము పెక్కురు బిడ్డలు మాన సికముగా వెనుకబడి యుండుట చూచుచున్నాము పుట్టుక సమయమందు తరువాతను కలుగు శరీరాంతర్గత గాయముల వలన గాని ఉచ్ఛ్వాస నిశ్వాసముల లోపమువలన గాని మెదడు పెరుగుదల లోప భూయిష్ఠ మగుట వలన గాని ఈ దౌర్బల్యము ఘటిల్లవచ్చును ఇట్టి లోపములు గల శిశు వులను గూర్చి శ్రద్ధ తీసికొను సంస్థలు భారతదేశములో చాల తక్కువ యున్నవి అయితే తల్లిదండ్రులు వైద్యులు ప్రారంభములోనే శ్రద్ధ తీసికొనినచో ఎంతయూ మేలును చేకూర్చుటకు అవకాశము కలదు

ఎ. కె. డి.

## శిశురోగములు - శిశుపోషణము (ఆయుర్వేదము)

ప్రాచీనకాలము నుండి ఆయుర్వేదవైద్యము అనుష్ఠా నములో నున్నది చికిత్సావిధానములలో ఆయుర్వేదము విశిష్టమైనది ఆయుర్వేద చికిత్సకు ఎనిమిది అంగములు కలవు (1) కాయచికిత్స (General treatment) (2) బాలచికిత్స (Pediatrics) (3) గ్రహచికిత్స (Demonology) (4) ఊర్ధ్వాంగ చికిత్స (Diseases of ears eyes, nose, throat etc) (5) శస్త్ర చికిత్స (6) విషచికిత్స (Toxicology) (7) రసాయన చికిత్స (Rejuvination) (8) వాజీకరణ చికిత్స (Aphrodisiacs) ఇందులో రెండవదైన బాలచికిత్సకే "కౌమారభృత్యము" అను నామాంతరము కలదు ఇందులో బాలురు పుట్టినది మొదలు వారిని పెంచవలసిన విధానము వారికి కలుగు వ్యాధులు తన్నివారణోపాయములు తెలుపబడినవి బాలురు వారి వయ స్సుల ననుసరించి ముత్తెరగుల మన్నారు (1) పాలుత్రాగు వారు (2) పాలుత్రాగుచు అన్నముతినువారు (3) కేవలము అన్నము తినువారు కేవలము పాలు త్రాగువారును పాలు త్రాగుచు అన్నముతినువారును శిశువులనబడుదురు చాలావు వీరివయస్సు 2 లేక 3 సంవత్సరములుండును బాగుగ జ్ఞానము లేనివారు స్వతంత్రముగ వారిపనులను వారు నెరవేర్చుకొన లేనివారు తమ బాధలను తెలుపలేని స్థితిలో నుండువారు శిశువు లనబడుదురు

శిశువ్యాధులకు కారణము తల్లి లేక దాది ఆహార విహార నియమములకు కట్టుబడియుండక స్వేచ్ఛగా చరించినచో వారి స్తన్యము దుష్టమై, ఆ పాలు త్రాగు శిశువులకు వ్యాధులు

జనించును వాతపిత్తశ్లేష్మములు ఒక్కొక్కటిగగాని జంటలుగ గాని ప్రకోపించి వాటి లక్షణములకు తగిన వ్యాధులను కల్గించును జ్వరము మొదలగు వ్యాధులు పెద్దలకు ఎల్లలకుకూడ సమానలక్షణములతోనే కలుగును బాలురకు మాత్రము కొన్ని ప్రత్యేకవ్యాధులు కల్గును తాలుకంటకము పారిగర్భికము కకూణకము నాభిపాకము గుదపాకము దన్తోద్భేదక రోగములు మట్టితినుటవలన కలుగు రక్తక్షీణత కుక్కుర కాసము (కుక్కుదగ్గు) ఇత్యాదులు శిశువులకు బాలగ్రహములు సోకును వాటిని ధూపము వేయుట గ్రహశాంతి చేయుట బలిదానాదుల నిచ్చుటచే తొలగింపవచ్చును

**బాలరోగము తెలిసికొనుట** బాలురకు అంగ ప్రత్యంగములయం దెచ్చట బాధకలుగునో ఆయా అంగములను మాటిమాటికి వారు త్రాకుచుందురు ఆ ప్రదేశమున బాధ యున్నదని తెలియవలెను శిశువు రోదన మధికముగ నున్న యెడల మిక్కిలి తీవ్రమైన బాధ యున్నదనియు కొంచెము ఏడ్చుచున్నయెడల బాధ కొలదిగ తీవ్రమై యున్నదనియు తెలియదగును శిశువును మగమెచ్చట తాకిన బాధబడుచుండునో అచ్చట బాధ కల్గినదని తెలియనగును

**చికిత్సానియమములు** పెద్దవారలకు జ్వరములందిచ్చు ఔషధములనే శిశువులకు వారివారి వయసు ననుసరించి చాల కొద్ది మోతాదులలో సౌమ్యములైన అనుపానములతో వాడవలయును పాలుత్రాగు శిశువునకు ఆ పాలలోనే కలిపి మందియ్యవలయును పాలిచ్చు తల్లికి లేక దాదికికూడ ఆ మందునే ఇప్పించవలయును శిశువులకు జ్వరాదులు కల్గినపుడు స్నానపానాదులను నిషేధింపవచ్చునుగాని స్తన్యపానమును నిషేధించరాదు స్తన్యమిచ్చు తల్లికి లేక దాదికి పథ్యాశన మియ్యవలయును కుక్కదగ్గు పళ్లువచ్చు సమయమున కలుగు వాంతి జ్వరము విరేచనములు గర్భవతియైన తల్లియొక్క పాలు త్రాగుటచే కలుగు పారిగర్భికమను వ్యాధి శిశువుల ఆక్షేపక వాతము (బాలపాపచిన్నె) ఇత్యాది వ్యాధులయందు వైద్యుడు శాస్త్రాధారముతో అనుభవమును జతపరచి సరియైన చికిత్స చేసినచో ఆయా బాధలు తొలగును

**శిశుపోషణము** శిశువు జనించినతోడనే మాయ (జరాయువు) తొలగింపబడినతర్వాత నాళ(బొడ్డు)చ్ఛేదనము చేసి స్నానముచేయించి పిదప ఆశిశువునకు కుడిచెవిలో "అంగాదంగాత్సంభవసి" అను మంత్రమును జపింపవలయును; జాతకర్మ చేయించవలయును స్తన్యపానమును విధిప్రకారము చేయించుచుండవలయును పదునొకండవదినమున శిశువునకు స్నానముచేయించినపదప పట్టువస్త్రముపై శిరస్సు తూర్పుగ నుండునట్లు పరుండబెట్టి భూత రాక్షసబాధానివారణార్థమై రక్షోనివారక ధూపములు వేసి ఓషధులధరింపజేసి నామకరణము చేయవలయును తల్లిస్తన్యము శిశువునకు మిక్కిలి బలమునుకలిగించును "చత్వారస్సాగరా "అనుమంత్రముచే స్తన్యమును అభిమంత్రించి స్తన్యపానము చేయించవలయును తల్లిలేనియెడల లేక తల్లికి పాలులేనియెడల శిశువుయందు ప్రీతికలిగి ఆరోగ్యవంతురాలైన దాదియొక్క స్తన్యమును శిశువున కిప్పించవలయును నీటిలోపడు స్తన్యము అందులో కలిసిపోవునదిగను తెల్లనిదిగను పలుచనిదిగను శుద్ధమైనదిగను ఉన్నచో అట్టి స్తన్యము ఆరోగ్యమును బలమును ఇచ్చును చిక్కగనుండి నీటిలో కలియని స్తన్యము దుష్టమై శిశువునకు వ్యాధులను కల్గించును అట్టిస్థితిలో స్తన్యశుద్ధికరములైన చికిత్సలను తల్లికిగాని దాదికిగాని చేయించవలయును స్తన్యము చాలినంత లేనియెడల స్తన్యవృద్ధికర చికిత్సలు చేయదగును

**కుమారాగారము** – అనుకూలమైనగాలి వెలుతురు కల్గిన గృహములను శిశువులకేర్పాటుచేయవలయును అందుపశువులు క్రిమికీటకాదులు ఇతర విషజంతువులు ప్రవేశింపరాదు వంటశాల స్నానశాల మున్నగు ప్రదేశములు కుమారాగారమునకు అనుకూలమైనవికావు శిశువును పరుండబెట్టుటకు తగినమంచము పరుపు ఊయలతోపాటు అవసరము పరుపు గుడ్డలు మెత్తగనుండవలెను శిశువులకు అనుదినము స్నానము చేయించి పొడిగుడ్డచే బాగుగతుడిచి సుగంధధూపములను వేయవలెను శిశువులకిచ్చు ఆటవస్తువులు మనోహరముగను విచిత్రధ్వని కల్గించునవిగను బరువు వాడికొనలు లేనివిగను నోటిలో ప్రవేశింపజాలనివిగను ప్రాణహరములు కానివిగను భయముకల్గింపనివిగను ఉండవలెను

**శిశువుల పెంపక విధానము :–** శిశువులను బెదరించి భయపెట్టరాదు బాధకలుగకుండ వారిని ఎత్తుకొనవలెను నిదురించునపుడు వారిని ఆకస్మికముగ లేపరాదు శిశువులను ఎగురవేసిన ఉబ్బుకల్గును సర్వకాలములందు శాంతిసంతోషము కల్పించుచుండవలెను కూర్చొనలేని శిశువులను కూర్చుండబెట్ట ప్రయత్నింపరాదు ఎండ గాలి, వేడిమి, చలువ ఇత్యాదులు తగుమోతాదులలో సోకునట్లు వారిని కాపాడ

వలెను ఇట్లుపచరించుచుండినచో వారికి క్షేమ ఆరోగ్యము కల్గును

విధిప్రకారము వారికి ఆరవమాసమున (లేక ఇతరసరి మాసములలో) మంచిముహూర్తములో అన్నప్రాశనము చేయించవలెను. కర్ణవేధ (చెవులు కుట్టుట) కేశఖండనము, శాస్త్రోక్తప్రకారము జరిపించవలెను పళ్ళువచ్చిన పిదప వారిచే అన్నమును బాగుగా అభ్యాసము చేయించుచు స్తన్యమును క్రమముగా విడిపింపవలెను సౌమ్యములైన ఔషధాదులచే మాత్రమే వారిజబ్బులకు చికిత్స చేయించవలయును శిశువులకు కఫప్రధానములైన వ్యాధులెక్కువగ వచ్చును అట్టిచో వారిచే క్రొలదిగ వమనము చేయించవలెను వసగంధమువాడుట చాల మంచిది కరక్కాయగంధము కూడ అనుకూలమైనదే వెల్లుల్లి బిడ్డలకు చాలమంచిది "తల్లిచేయు మేలు తల్లికూడచేయదు" అను లోకోక్తి ఉండనేయున్నది! బిడ్డలకు కల్గు వాత పిత్త శ్లేష్మవ్యాధులకు ఈ తెల్లఉల్లి అమృతోపమము వెల్లుల్లిని సేవించినచో తల్లులకు స్తన్యము వృద్ధియగును త్రిఫలములను పిప్పళ్లనుచూర్ణించి, నెయ్యి తేనెలతో ఆచూర్ణమును చేర్చి శిశువులచే నాకించినచో వారి రోదనము తగ్గును ఆముదము పిల్లలకు లఘువిరేచనకారి రెండుమూడు రోజులకొకసారి ఆముదమును బాలురకు పెట్టుట ప్రాచీనసంప్రదాయము మిల్క్ ఆఫ్ మెగ్నీషియా కంటె ఆముదము బాధలేని విరేచనకారి శిశువులకు ఓమము సైంధవలవణము కరక్కాయ వస యిత్యాదులనుచేర్చి ఉగ్గు అనబడు ద్రవౌషధము నిచ్చుట ఉత్తమమగు ప్రాచీన వైద్యవిధానము అజామోదార్కము (వామువాటరు) వారి అజీర్ణమును అతిసారములను కట్టించును, కృశించిన బిడ్డలు బలవంతులగుటకు అశ్వగంధాదిఘృతము చాలశ్రేష్ఠమైనది వెన్న బాలురపాలిటి కల్పతరువు శిశువుల జీర్ణశక్తి ననుసరించి తాజావెన్నను వాడుట శ్రేయస్కరము తల్లిపాలుగాని దాదిపాలుగాని లేనిచో ఆవుపాలు శిశువులకు శ్రేష్ఠమైనవి క్షీరపాకవిధానములో ఆవుపాలను కాచి వాడవలెను ఇతరపశువులపాలు అంతశ్రేష్ఠమైనవికావు నేటికృత్రిమమైన డబ్బాలలోని గడ్డపాలు పాలపిండిపాలనుగూర్చిన విషయము ఆధునికవైద్యులే పైవిధానముల ననుసరించి శిశువులను పోషించుచో వారు తేజోబలములును ఆయురారోగ్యములును కలవారగుదురు

ప్ర షేం సు

## శీలము :

మానవు డెన్నియో పనులు చేయుచుండును ఇవన్నియు ఒకదానితో ఒకటి సంబంధములేని అస్తవ్యస్తపు చేష్టల సముదాయము కాదు ఈ చేష్టలయందు ఒక అవిచ్ఛిన్నత కలదు ఈ అవిచ్ఛిన్నతను తెలిసికొనుటద్వారా వ్యక్తి ఏయే పరిస్థితులలో ఎట్టి చేష్టలకు ఉద్యమించునో చెప్పుటకు వీలగును మనుజుని మానసిక జీవితము నిరంతరమును మారుచుండు భావములతో కూడుకొనినది పరిణామసహితమైన ఈ భావముల వెనుక శాశ్వతమైన భావసమైక్యములతో భావప్రవృత్తులతో కూడుకొనిన ఆధారభూమి ఒకటి కలదు ఈ ఆధారభూమి చాల నిదానముగా మారును; లేదా అది మారనే మారదు మార్పులేక నిదానముగా నుండు నైతికజీవితము యొక్క ఆధారభూమినే శీలమని అందురు

తాత్కాలికమైన ఒకభావోద్వేగమువలన ప్రేరితమైన ఒకచేష్ట శీలమునకు విరుద్ధముగా తోచవచ్చును కాని సుదీర్ఘకాలముగా నొకవ్యక్తి యొక్క చేష్టలు పరిశీలించినచో అవి అతని శీలమునకు సరిపడినవే యుండును అందుచేత ఒకనిచేష్టలకు విలువకట్టునప్పుడు అతని శీలముయొక్క ప్రసక్తి వచ్చును హారములోని పూలు దారమునాశ్రయించియున్నట్లు మనుజుని నైతికచేష్టలన్నియు అతని శీలముపై ఆధారపడి శీలమునాశ్రయించియే యుండును అందుచేతనే సచ్ఛీలము" దుశ్శీలము"అని వాడుకకలదు సచ్ఛీలి మంచిపనులు దుశ్శీలి చెడ్డపనులు చేయ ప్రేరేపింపబడుదురని భావము దీనినాధారముగా చేసికొని వ్యక్తులకు శాశ్వతమైన నైతికమూల్యములుకట్టుటకు వీలగును సంఘహానికరమైన శక్తులను అణచుటకును సంఘాభ్యుదయకర శక్తులను ప్రోత్సహించుటకును వ్యక్తుల నైతిక మూల్యములను నిర్ణయించుట అత్యావశ్యకము

శీలమునుగురించి ఎక్కువగా అర్థముచేసికొనుటకు ఇతర అంశములను పరిశీలించవలసియుండును అవి సహజాతములు అలవాటులు వాంఛలు భావోద్వేగములు అనునవి ఇవి యన్నియు శీలమునకు సంబంధించినవే (1)వీటిలో ఒకదానితో మరియొకదానికి ఎట్టి సంబంధము కలదు? (2) ఏభాగము మిగిలిన వాటిని నియంత్రించి నడపగలుగుచున్నది? ఏభాగము దానికి లోబడి నడచుకొనును? (3) ప్రవర్తన మాత్రములు ఆదర్శములు శీలలక్షణసమూహము - ధైర్యసాహసములు, నిరంతరకృషి, పట్టుదల సాధుస్వభావము, సహిష్ణుత,

కారుణ్యము ఓపిక ఆర్జవము వీటి విరోధులు ఇవియన్నియు ఎప్పుడు ఎట్లు వచ్చినవి? వివిధ భాగములకు మొత్తముతో ఎట్టి సంబంధము కలదు? అను విషయములను తెలిసికొనుట మొదటి సమస్యయై యున్నది.

**కొన్ని విరోధములు:** శీలము-మేధాసంపత్తి, శీలము-పరిసరములు, శీలము-నడవడి అనునవి చిరకాలమునుండి వాడబడుచున్నవి. శీలము నడవడి (ప్రవర్తన) యందు ప్రతిబింబించును. యాంత్రికమైన చర్యలు 'ప్రవర్తన' లో చేర్పబడవు. ఏదియో ఒక మేరకు ఇచ్ఛాశక్తికి లోబడియుండు చర్యలే ఇందుచేర్చబడును. సహజాతములచేత ప్రేరేపింపబడు చర్యలే ఇందు చేర్చబడును. అన్ని నైతిక చేష్టలకు వెనుకనుండి శీలము సారథ్యశక్తిగా పని చేయును. గమ్యస్థానమును చేరుకొనుటలో శీలమునకు మేధాశక్తి మార్గదర్శకముగా పని చేయును. శీలము మేధాశక్తి ఈ రెండు మొత్తమే మానవుని మేధస్సు (mind), మరియు అవి దీనిలో విడివడనివిగా నున్నవి.

**శీలముయొక్క వివిధదశలు:** ఈ వివిధ దశలు సంగ్రహముగా మూడుతరగతులుగా విభజింపబడినవి. ఈ మూడు తరగతులు మానసికవికాసముయొక్క మూడుస్థాయిలకు సరిపోవును. ఆ మూడుస్థాయులు (1) సహజాతములస్థాయి (2) భావోద్వేగములస్థాయి (3) భావసంఘటితములస్థాయి. జంతుజీవితము బాల్యజీవితము, వయోజనజీవితము వరుసగా పై మూడు మానసిక వికాసస్థాయులకు ప్రాతినిధ్యము వహించును.

ఇందులో మొదటిదానియందు నిర్వహణము పరిణతినందినది-కాని ఇందు మార్పునకవకాశమే లేదు. మేధాశక్తి నిర్మాణాత్మకముగా చేయునదేమియు ఉండదు. రెండవదశ పూర్తిగా నిస్సహాయస్థితిలో నుండును. ప్రాథమిక దశలో నున్న నిర్వహణమునుండి ఇది ఉన్నత నిర్వహణముపైపు జరుగు మార్పు (గతి) ను గుర్తించును. ఈ దశలో వయోజన మేధస్సుయొక్క మార్గదర్శకత్వము తప్పక అవసరము. మూడవదైన భావసంఘటితముల స్థాయి (వయోజనజీవితము) అత్యంత స్థిరీకృతముగాక మార్పునకనుకూల స్వభావము కలది; విస్తృతమైనది. అనగా ఇతర విషయములను తనలో చేర్చుకొను తత్త్వము కలది. కాని దీని నిర్వహణము ఎప్పుడు పరిపూర్తికాదు. హేతువు (reason) ఆలోచన ఆత్మసంయమనము స్వీయపాత్రను నిర్వహించుటకు ఇందు పూర్తిగా అవకాశముకలదు. అయినప్పటికిని ఇదే తప్పులతో పొరపాట్లతో కూడుకొన్న దశ. జంతువులకు పొరపాట్లు దోషములు ఆపాదించలేము. ఈ వయోజన దశలోనే తప్పుడు విలువలు కట్టుట అందుచేత భ్రమలకు లోనగుట జరగును. ఇందులో అభివృద్ధి పతనము నిలకడ చంచలత్వము అనునవి ఇమిడియున్నవి. అందుచేత ఇప్పటికిని ఇది పూర్తిగా అవగాహనము చేసికొనబడలేదు.

**మానవ సహజాతములు:** జంతువుల సహజాతములు జన్మతః అనగా వారసత్వముగా సంక్రమించునవి. ఒక్కొక సహజాతమునకు దానిఉద్దేశము నెరవేరుటకై ఒక్కొక విధమైన క్రియారూపము నిర్దిష్టముగా నుండును. మొత్తము ప్రవృత్తియొక్క రూపమిట్లుండును: చేతన మనస్సునందు ఒక ప్రేరణము దీనిననుసరించి 'కేంద్రీకరణము' (attention) తత్సందర్భ సహజమైన క్రియారూపమును అనువర్తింపచేయుట అనునది. ఆ రూపము మానవులయందు మామూలు సహజాతములు-చప్పరించుట మునుగుట వంటివి మాత్రమే నిర్దిష్టమైన క్రియారూపములను కలిగియున్నవి. మిగిలినవి ఇట్టి క్రియా రూపములను కోల్పోయినవి. అనుభవముద్వారమున మానవశిశువు ప్రాతమార్గములకు బదులు క్రొత్తవి నేర్చుకొనవలెయుండును. మానవులలో కొన్ని ముఖ్యమైన సహజాతములు (ఇవి కొన్ని ఉద్దేశములను నెరవేర్చును) ఇట్టివి: పారిపోవుట వేటాడుట బాహ్యతమును బహిరంగపరచుట, అధికారము నెలకొల్పుకొనుట, లోబడియుండుట ఆకర్షణము-వికర్షణము వినాశము నిర్మాణము రక్షణకై అర్థించుట (ఏడ్చుట) రక్షణమిచ్చుట జిజ్ఞాస అన్వేషణ ఆహారము, మైథునము-ఇవిఅన్నియు సాంఘిక భావుక జీవితముయొక్క సేవలోనుండి ఆతని ఉనికిని భద్రతను పరిరక్షించును. వాటి వలన నెరవేరు వాటిలో కొన్ని-ధనము అధికారము కీర్తి సౌఖ్యము సంతోషము పరిపూర్ణత అనునట్టివి.

సహజాతములు భావోద్వేగములపై ఆధారపడియుండవు. అవి స్వతంత్రములు (1) వాటి సహజగతి నిరోధింపబడినపుడు అవి కోపమునుగాని భయమునుగాని జనింపచేయును (2) అట్లుకాక వాటి ఉద్దేశము నెరవేరినపుడు అవి తృప్తిని ఆనందమును కలుగచేయును (3) ఒకవేళ వాటి ఉద్దేశము విఫలమయినచో అవి నిరాశకు, విచారమునకు కారణమగును

భావోద్వేగముల మాత్రము ఎప్పుడును సహజాతములకంటె స్వతంత్రములుగా వర్తించవు. వాటి వ్యవస్థయందు సహజాతముల ఉద్వేగములు నెరవేరుటకై కావలసినదానినంతను పొందుపరచును.

భేదములు :— సహజాతము విశేషముగా అలవాటు వంటిది. ఈ రెండును స్థిరమైనవి, క్రమబద్ధమైనవి. భావోద్వేగము—అవరోధములేనిచో చంచలముగాను క్రమరహితముగాను ఉండును. దానిచర్యలు ఆశ్చర్యమును గొలుపును. సహజప్రక్రియలు గ్రహాంతము (realm) గా నుండి అంతగా గుర్తించబడవు. కాని భావోద్వేగములు గుర్తింపబడును. అవి ప్రత్యేక పరిస్థితియొక్క ఆవసరములను పూర్తిచేసి తర్వాత అణగిపోవును. ఒకవేళ సందర్భావసరములు తీరి వెనుక ఉద్వేగములు అట్లేయుండినచో అవి అనారోగ్యప్రదములుగా పరిణమించును. అంతేకాక ఉద్వేగములు క్లిష్టమైనవి. బలమైన భావోద్వేగమును పరించి నాడీవ్యవస్థయందు విస్తరణ స్వభావసహితమైన వికేంద్రీకరణము జరుగును అని బెయిన్ మహాశయుని కాలమునుండి గుర్తించబడినది. ఇది మారుచున్న పరిస్థితికి అనుకూలముగా వర్తించునట్లు ఉద్వేగమును చేయవచ్చునని భావము.

ఉద్వేగమునకుగల విలువకు కారణము అది రెండు విషయములలో సహజాతములనుండి భేదించుటయే. (1) ఉద్వేగము ఒక ప్రత్యేక పరిస్థితిని ఎదుర్కొనుటకు వ్యక్తికి కావలసిన శక్తిని సమకూర్చును. (2) అంతేకాక అది శక్తిమంతమైన క్లిష్టమైన పరిస్థితులను చక్కగా అనువర్తించెడి వ్యవస్థ. ఇది భావసంఘటనముల కొరకు తప్పనిసరి అయినది. ఇది లేనిచో ప్రేమ ద్వేషములు లేవు. శీలములో సంఘటించు గొప్పమార్పు లన్నిటికిని ఉద్వేగముల ప్రభావపాత్రయే కారణము.

భావసంఘటితముల దశ : ఆత్మసంయమనము భావోద్వేగములకంటె ఉన్నతమైన వ్యవస్థవలననే సాధ్యమగును. ఈ వ్యవస్థ విస్తృతిమైది. బయటినుండి వచ్చుదానిని అర్థము చేసికొని తనయందు ఇముడ్చుకొనగలుగును. ఇదియే అంతఃకరణమునకు ప్రాతినిధ్యము వహించును. ప్రధాన భావసంఘటితములు ప్రేమ ద్వేషము అను ఈ తత్త్వములను కలిగియున్నవి. ఇవి కాపించి నడవగలుగు శీలముయొక్క భాగములు కాపించుటకు ఇతర భాగములన్నియు వీటి అధికారమునకు లోబడియుండును.

ప్రేమయొక్క నిర్మాణాత్మకభాంధలు భావి ఆశయములు నెరవేరుటకు అనుకూలముగా ఏర్పడును. ప్రేమింపబడినది సంతోషముగా సుఖముగానుండుట, ప్రేమింపబడిన దానితో ఐక్యము (సామీప్యము) బదులుగా ప్రేమింపబడుట, ప్రేమించుటయందు సంతోషానుభూతి అనునవి ప్రేమ లక్ష్యములు. వీటిని సాధించు ప్రయత్నమునందే అది జీవమగును. ద్వేషము ఇందుకు విరుద్ధము. ద్వేషము గలచోట ఐక్యము సుఖము ఉండవు. ద్వేషింపబడినదాని అత్యంత హీనదశ, నిశ్చష్టత, దూరము, వినాశము — వీటిని చూచియే ఆనందించుట జరుగును.

ప్రేమ ద్వేషముల ఆత్మసంయమన సూత్రములు ఈ గొప్పకోరికలయందే ఇమిడియున్నవి. కాని వీటి (ప్రేమ ద్వేషముల) భావోద్వేగములయందు లేవు.

అణచివేత : భావసంఘటితము సంయమనము నకు చరమదశయే అనబడును. ఏ భావోద్వేగములు ఉద్వేగములు లేదా ఆశయములు హానికరములుగా తోచునో ఆ ఉద్వేగాదులు అణచివేయబడును. అంతరాత్మ (conscience) అనునది మరియొక భావసంఘటనము. ఇది ప్రేమ ద్వేషములకంటె భిన్నమైనది. వీటివలెనే అంతరాత్మకూడా తరచుగా అణచివేతకు లోనగును.

ప్రేమయంతటికి ఒక ప్రత్యేకమైన అంతరాత్మ ఉండును. ఇది ప్రేమింపబడినదానిపట్ల పక్షపాతముగా నుండును. ఏ ప్రత్యేక సమాజములో మానవుడు జీవించునో ఆ సంఘముయొక్క ప్రతినిధివ్యవస్థలు అధికారము ప్రభావము ఉపయోగించి బోధించిన నైతికవిలువలు విశ్వాసములే సంఘటితమయి అంతరాత్మగా ఏర్పడును. అందుచేత ఒక వ్యక్తియొక్క అంతరాత్మ మరియొకని అంతరాత్మకంటె వేరగును.

కాని అంతరాత్మ అంతకంటె ఉన్నతమయిన (మానవుని) శీలముయొక్క సజీవమైన శక్తి." ఈ సందర్భములో అది అతని జీవితానుభవములద్వారా ప్రేమకు సంబంధించిన క్రమలద్వారా నిరాశలద్వారా వృద్ధియగును. ఈ యనుభవములు కొన్ని ఆదర్శములను విధులను వ్యక్తియొక్క మనస్సుపై ముద్రించును. ఈ క్రొత్తగా ముద్రితములయిన విధులు లోకముచే తరచుగా వర్ణింపబడు ఆదర్శములకంటె విధులకంటె భిన్నములు. ఈ క్రొత్తవిధులు ఆదర్శములు అంతరాత్మయొక్క సజీవమైన, శక్తివంతమైన భాగముగా నైతికమును వీటియందలి స్నేహముయొక్క పక్షపాత బంధనములు

తోఁగింపబడినవి

ఈక ప్రేమయొక్క ఆదర్శములు వివిధరూపములలో గూడ చూఁపదగిన. ఒకవేళావుడ అతిసాధారణములును అతిముఖ్యములును నైన విధులు పెక్కుమందిపై ముద్రితము అగును

సహజాతములు భావోద్వేగములు భావసంఘాతముల యందు ప్రవర్తించు (నిచేయు) విధము శీలమునకు ప్రాతినిధ్యము వహించుచున్నట్లు ఇంతవరకు చూపబడినవి అయినను అవి ఎంత అసంపూర్ణముగా శీలమునకు ప్రతినిధులుగా ఉండగలుగునో ఆ విషయముకూడా స్పష్టమైనది

దీ. నా.

## శుద్ధాంధ్రకావ్యములు

శుద్ధాంధ్రమునకే అచ్చతెనుగని మరొకపేరు ఆంధ్ర వ్యాకరణకర్తలు పలువురు తెలుగుభాషను తత్సమము తద్భవము దేశ్యము గ్రామ్యము అనినాలుగువిధములుగా విభజించిరి ఇందుమరల దేశ్యమును దేశ్యము అన్యదేశము అనియు గ్రామ్యమును గ్రామ్యము అనింద్యగ్రామ్యము అనియు రెండేసి తెరగులుగా విభజింపవచ్చును కేతనయు విన్నకోట పెద్దనయు వైనాల్గింటికి అచ్చ తెనుగునుకూడ కలిపి తెలుగుపలుకులు పంచవిధములని చెప్పియుండిరి అనంతామాత్యుడు ఈ ఐదింటిలో గ్రామ్యమును విడిచి మిగిలిన నాల్గింటినే పేర్కొనియున్నాడు అప్పకవి అన్యదేశజాంధ్రము, తెనుగుమరుగులు ప్రాదెనుగు పదములు అని మరికొన్ని భేదములను చెప్పియుండెను "సంస్కృతము తెనుగైన తత్సమపదంబు, దానఁబుట్టి తెనుంగైన తద్భవంబు దేశితెనుగు దేశజము, అచ్చతెనుగు తెనుగు" అని అనంతుడు తత్సమతద్భవదేశ్యములను అచ్చతెనుగును నిర్వచించి వానికి క్రమముగా నిర్మలుడు నిరి, ఒరయడు నిక్కము అనుపదములను ఉదాహరణములుగా ఒసంగినాడు ఇందు అచ్చతెనుగు తెనుగు అను నిర్వచనము అస్పష్టముగాఉన్నది దేశ్యమునకును దానికిని భేదమేమో తెలియుటలేదు కేతన పెద్దనాదులుకూడ దేశ్యమును అచ్చతెనుగును భిన్నముగాచెప్పి ఉన్నారు పెద్దన "శ్రేయములై జనులదేశానేయములై భక్తజనము నెరదనములునై యాయాకాలవుల తెవులకు దీయము లగు పలుకులెల్ల దేశ్యములరయన్" అనుపద్యమున జనులదేశానేయములై శ్రవణపేయములగు పదములన్నియు దేశ్యములే అని చెప్పెను దీనినిబట్టి అతడు దేశ్యములను అన్యదేశ్యము అను ఒక భేదముగానే పాటించినట్లు తెలియుచున్నది చిన్నయసూరి అన్యదేశ్యమును వేరుగా చెప్పక త్రిలింగదేశవ్యవహారసిద్ధమగు భాష దేశ్యమని నిర్వచించెను దేశ్యములైనను అన్యదేశ్యములైనను తెలుగుదేశమున వ్యవహారమందున్న పొడల దేశ్యములే అని అతడు భావించియుండును అతడు అచ్చతెనుగు అనుభేదమునుకూడ పేర్కొనియుండలేదు కాని అచ్చికప్రకరణమున సంస్కృతసమేతరంబైన యీభాషయచ్చయనంబడు" నని అచ్చతెనుగను నిర్వచించెను దీనినిబట్టి సంస్కృతసమములు కాని యితరపదములన్నియు అచ్చతెనుగుపదములే అని అతడు భావించినట్లు తెలియుచున్నది

నిజము పరిశీలింప తద్భవములు సంస్కృతభవములగుటచే వానిని అచ్చతెనుగు పదములుగా పరిగణించుట యుక్తము కాదు కాని తత్సమములను తద్భవములను పరిహరింపగా మిగిలిన తెనుగుపదములు అల్పసంఖ్యాకములగుటచే వానితోడనే ఉదాత్తములైన భావములను స్పష్టముగా వెల్లడించుటకు అవకాశము ఉండదనికాబోలు అచ్చతెనుగు కావ్యములను రచించిన కవులు అందరును తద్భవములనుకూడ విరివిగా వాడిఉండిరి ఆంధ్రనామసంగ్రహము సాంబనిఘంటువు మున్నగు నిఘంటువులలోకూడ తద్భవములు పెక్కు చేర్పబడి ఉన్నవి గ్రామ్యము ప్రయోగోచితము కాకపోవుటచేతను, తత్సమము సంస్కృతప్రాయమే అగుటచేతను మిగిలిన తద్భవదేశ్యపదములు మాత్రమే అచ్చతెనుగులుగా పరిగణించుట సంభవించినది

ఆంధ్రకవులు తమకావ్యములలో తత్సమతద్భవదేశ్యశబ్దములను అన్నిటిని స్వేచ్ఛగా వాడిఉండిరి వారికావ్యములలో అచ్చటచ్చట అచ్చతెనుగుపద్యములుకూడ కాన్పించును అవి యాదృచ్ఛికములు కావచ్చును; లేక వైవిధ్యమునకై వారు ప్రయత్నపూర్వకముగా వ్రాసినవి కావచ్చును కావచ్చును సౌందర్యవంతములై న అట్టి అచ్చతెనుగుపద్యములచే ఆకర్షింపబడి కొందరుకవులు కావ్యమును అంతను అచ్చతెనుగుభాషలోనే వ్రాయుటకు యత్నించి కృతార్థులైరి ఆంధ్రమున శ్లేషకావ్యములుకూడ ఈవిధముగానే ఉత్పత్తిల్లి ఉండును

తెనుగుసారస్వతమున మొట్టమొదట వెలసిన అచ్చతెనుగు కావ్యము యయాతిచరిత్ర' దీనిని రచించినవాడు పొన్నిగంటి తెలగన్న (1520-1580) ఇతడీ కావ్యమును గోల్కొండ నవాబగు మల్కిభరాముని కడ ఉద్యోగిగానుండిన అమీనుఖాను

నకు అంకితము చేసెను ఇందు ఐదాశ్వాసములుకలవు యయాతి, దే యానీ శర్మిష్ఠలను వివాహమాడిన వృత్తాంతము ఇందు వర్ణింపబడి ది తెలగన్న భారతమందలి యయాతిచరిత్రను అనుసరించిననూ దీనిని వ్రాసినను పడుమ రామాయణవృత్తాంత మును కూడ ప్రవేశ పెట్టెను ఇది అనవసరమై ప్రధానకథా గమనమునకు అడ్డుకలిగించుచున్నది తెలగన్న ఈ కావ్యమున ప్రబంధలక్షణములను అన్నిటిని పాటించినాడు ఇందలి వర్ణ నములు సహజములును రమ్యములును ఐయున్నవి అచ్చతెనుంగు పద్య మొకటైనను కబ్బములోన నుండినన్ హెచ్చని యూను చుదు రనియు పొత్తమెల్లనచ్చతెనుగున నడిచిన నందలి చంద మెరుంగు వారబ్బురమనియు మేలనియు మెచ్చుకొందు రనియు తెలగన్న అభిప్రాయము ఇతని కావ్యము అచ్చతెనుగు కబ్బ ములకెల్ల మొ టిదేయనను, సరసమను భాషాశుద్ధిశోభితమును హృద్యవర్ణనా లితమును ఐ తరువాతి అచ్చ తెనుగు కావ్యము లకు అన్నటి ని యల్ల బంధి ది

క్రీ శ 1817 శతాబ్దులో నివసించిన మరింగంటి సింగరాచార్యులను కవి శ్రీమచ్ఛుద్ధాంధ్రనిరోష్ఠ్యసీ తాకల్యాణ ప్రబంధము ను రచించెను ఇది శుద్ధాంధ్రపదఘటిత మే కాక నిరోష్ఠ్యము కూడ అగుట ఒక విశేషము ఈకవి దశరథ రాజనందన చరిత్ర రోష్ఠ్యాదివింశతి ప్రబంధనిర్మాణపారీణుడనియు శారాదాప్రశ్నవివరణ శతఘంటావధాన బిరుదాంచితుడనియు ఆశ్వాసాంత గద్యమున చెప్పబడి ది సీతాకల్యాణమున మూడా శ్వా ములు ఉ న్నవి ఇది శ్రీకృష్ణునకు అంకితముచేయబడినది 'అచ్చతెనుంగు పద్యమొకటైనను కబ్బములోనమండిన' నిత్యాదిపద్యమిందుకూడ కనబడుచున్నది ఇందు కథాభాగము మాత్రమే అచ్చతెనుగున ఉన్నది అవతారిక షష్ఠ్యంతములు ఆశ్వాసాంతపద్యములు మున్నగువానియందు తత్సమపదములు కూడ వాడబడినవి సింగరాచార్యుల కవిత సలక్షణమై పండిత ప్రశంసలందజాలి ది ఈయన వంశమునందే జనించిన మరింగంటి వెంకటనరసింహాచార్యులను కవి చిలువపడగరాచేని పేరణము' అను కావ్యమును అచ్చతెనుగున రచించెను ఇందు దశరథమని వివాహము వర్ణింపబడినది నాగశేషను దనుటకు చిలువపడగ రాచేడనునది అచ్చతెనుగురూపము

అరిదము భాలభాస్కరుడు సుప్రసిద్ధుడైన అడిదము సూరకవి తండ్రి ఇతడు విజయనగరమునకు సమీపమందుగల "రేగ" గ్రామమున నివసించెను (1700) ఇతడు అచ్చతెను గులో శుద్ధాంధ్రరామాయణము రచించినట్లు ఇది శ్రీమన శేషమనీషహృదయంగమ మృదుపద నీరంధ్ర శుద్ధాంధ్రరామా యణ ఘటనావైదుషీ నుసంధ రాడిసము బాలభాస్కరకవితనూ భవ అని ఆశ్వాసాంతగద్యలలో సూరకవి చెప్పకొనుటనుబట్టి తెలియుచున్నది ఈ కావ్యము లభించుట లేదు ఇది మనీషి హృదయంగమమనియు మృదుపదనీరంధ్రమనియు సూరకవి ప్రశంసించెను

ఈ పాలు గ్రంథకర్తయు కనిపాక్వభామ బిరుదాంకితుడును కందరాడనివాసియు ఐన కూచిమంచితిమ్మకవి (18 వ శతాబ్ది పూర్వార్ధము) నీలాసుందరీపరిణయము అచ్చతెనుగురామా యణము అను రెండు అచ్చతెనుగు కావ్యములను రచించెను నీలాసుందరీపరిణయము మూడాశ్వాసముల కావ్యము నందుని బావ అగు కుంభకుడు తనగోష్ఠమునందలి ఎద్దు కొన్ని మదించి రేల రేగి గ్రామమ్ము ను బాధించుచుండ వానిని బంధింపగలవారికి తన కూతునిచ్చి పెండ్లి చేసెదనని ప్ర టించెను కృష్ణుడు అట్లుచేసి నీలను పెండ్లాడెను దీనిని తెలుగున నీలపెండిలికత అందురు అచ్చతెనుగురామాయణము షట్కాండముల గ్రంథము బిరు దములను పేర్లను అచ్చతెనుగు చేయవలసిన అవసరము లేక పోయినను తిమ్మకవి ఇందు దశరథునకు పదితేరుదొర' అనియు బ్రహ్మకు నీటిపుట్టుగుపట్టి అనియు వాడియున్నాడు ఈ రెండు గ్రంథములును సరసపదప్రయోగములకును సహజ వర్ణనములకును పేరుపొందినవి వీనిని రచించుటవలననే తిమ్మ కవికి అభినవ వాగనుశాసనుడను బిరుదు కలిగినట్లు చెప్పదురు

దేవీభాగవతాంధ్రీకర్త ఐన ములుగు పాపయారాధ్యులు సగ్వమధుసముగ అచ్చతెనుగులో రచించిరి శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులు శుద్ధాంధ్ర భారతసంగ్రహము (1872) శుద్ధాంధ్రరామాయణ సంగ్రహము (1874) శుద్ధాంధ్రనిరోష్ఠ్య నిర్వచనసైషధము (1888) రసికజనమనోరంజనము (18 9) మున్నగు కావ్యములను అచ్చతెనుగున ప్రాసిఉండిరి మచ్చ వెంకటకవి (1884) యొక్క శుద్ధాంధ్రనిరోష్ఠ్య నిర్వచనకుశ చరిత్రయు దేవులపల్లి నరసింహశాస్త్రి (1900) అచ్చాంధ్ర నిర్గద్యనిరోష్ఠ్యసారంగధర చరిత్రయు అయ్యలసోమయాజుల పార్థ సారథి ( 900) సత్యవిజయమును పాటిబండ పురుషోత్తమ వి (1900) కంసవిజయమును రాయసము గవర్రాజు (1915) శుద్ధాంధ్రహరిశ్చంద్ర చరిత్రయు అబ్బరాజు హనుమంతరాయ పాకయాజి (1915) శుద్ధాంధ్రహరిశ్చంద్రకథయు, అడవిసాంబ

శివరావు (1915) శుద్ధాంధ్ర మేఘసందేశమును అకొండి వ్యాసమూర్తి శాస్త్రి (1916) ఋతుసంహారమును ఇరువదవ శతాబ్దిఆరంభమున వ్రాయబడిన అచ్చతెనుగు కబ్బములు

సుప్రసిద్ధ వాగ్గేయకారులును హరికథాపితామహులు నగు శ్రీమదజ్జాడాదిభట్ల నారాయణదాసు (1864-1945) పెక్కు అచ్చ తెనుగు కావ్యములను వెలయించిరి. మేలు కొలుపు వెన్నుని వేయిపేర్ల వినకరి (విష్ణుసహస్రనామములు) వేల్పుమాట మ్రొక్కుబడి నవరసతరంగిణి గౌరిపెండ్లి లలితాసహస్రనామములు రెంటఁబ్రాగుడుగొంగ పుట్టిటి వేల్పుశతకము (రెంటఁ బాగుడు - ఏనుగు దానిని సంహరించునది కావున దానికి శత్రువు సింహము పుట్టింటి వేల్పు - సింహాచల నరసింహస్వామి) అనునవి అందు ముఖ్యములైనవి.

పర్లాకిమిడి వాస్తవ్యులైన బోడావ్రగడ కృష్ణమూర్తి 'విష్ణు పురాణమును తరిదాల్పునడసరి' అను పేర అచ్చతెనుగున రచించిరి. ఎరుకున మరుకువ వెన్నెలవాన తేనెలమేలువాని యింపుకొట్టు (ఇది శివానందలహరి కావచ్చును) అనునవి వారి యితర శుద్ధాంగ్ర రచనలు. తిరుమామిడి రామస్వామిశాస్త్రి 'కవ్వడికై వారము' దాసు శ్రీరాములు పంతులు 'చక్కట్ల దండ' అను వికూడ అచ్చతెనుగు రచనలే. రాయలసీమ యందు సుప్రసిద్ధులైన శ్రీనాగు నాగనార్య కవిచంద్రులు కొన్ని అచ్చతెనుగు కబ్బములను వెలయించిరి.

పద్యరూపమున వ్రాయబడిన అచ్చతెనుగు నిఘంటువులు కూడ కొన్నికలవు. వానిలో పైడిపాటిలక్ష్మణ కవి 'ఆంధ్రనామ సంగ్రహము' అడిదము సూరకవి 'ఆంధ్రనామశేషము' కస్తూరిరంగకవి సాంబనిఘంటువు గణపవరపు వేంకటకవి 'వేంకటేశాంధ్రము' చాటరాతిలక్ష్మనకవి 'విశేషాంధ్రము' ముదుసుపాటి వేంకటార్యుని 'ఆంధ్రభాషార్ణవము' రామాయణము కృష్ణయామాత్యుని 'దేశ్యనామార్థకోశము' కవి చౌడప్ప 'శౌనక సీసములు' అందు ముఖ్యములైనవి.

అచ్చ తెనుగు కావ్యములందు వర్గయుక్కులు శషలు ఋఋ్ఌౡలు మున్నగు పరుషోచ్చారణముకల వర్ణములుండవు కావున అవి మధురములై వినుటకు ఇంపుగానుండును ప్రాకృత కవులు తమకబ్బములు మాధుర్యమునకు నిలయములై ఉండునని ప్రశంసించుకొనుటకుకూడ ఇదియే కారణమైఉండును. అచ్చతెనుగు కావ్యముల వాడుక తక్కువై పోవుటచే, విస్మృత ప్రాయములై పోయినపదములను,పలుకుబళ్లను సజీవములుగా నిల్పుటకు అవితోడ్పడును. ద్వ్యర్థి కావ్యములవలె అచ్చతెనుగు కావ్యములును కవుల భాషాపాండితీ పాటవమునకు తార్కాణములుగా ఉండును. దీర్ఘసంస్కృత సమాసభూయిష్ఠములైన రచనలకంటె నేటితెలుగుపలుకుల విలసనముతోకూడిన సహృదయ హృదయానందసంధాయకములుగా ఉండుటలో అచ్చెరువులేదు. కాని కాలక్రమమున అచ్చతెనుగుకవులు సంస్కృత నిఘంటువులందలిపదములనే తెలిగించి వాచస్పతి యనుటకు 'కడుపుబంగారు కొడుకునిచ్చిన మేటి' అనియు వాల్మీకి అనుటకు కనువినుకవి తాపు చూలి' అనియు పంచాననుడనుటకు అరపదిమోములవేల్పు" అనియు కలహాశనుడనుటకు "పోరోగిరము తిండిబోతు" అనియు కృత్రిమ సమాసములను కల్పించి విరివిగావాడుటకు మొదలుపెట్టుటచే అచ్చతెనుగు కావ్యములు దురవగాహములు రసహీనములును అగుట సంభవించినది. మరియు చిన్నమాటను డొంకతిరుగుడుగా క్లిష్టమైన పెద్దసమాసముతో చెప్పవలసిన అవసరముకూడ కొన్నిచోట్ల కలుగుచున్నది. జలజసంభవుడుఅనుటకు నీటిపుట్టుగుపట్టి హిమవంతుడనుటకు మరుమేపుకందోయిమామ వంటివి ప్రయోగింపబడుట ఇందుకు నిదర్శనము ఇవియు చిత్రకావ్యములందలి శబ్దాలంకార భూయిష్ఠములైన పద్యములవలె అర్థావబోధమునకు కొంత ఆటంకము కలిగించుచున్నవి. అదియునుగాక తత్సమపదబహుళమైన భాష తెనుగువారికి అలవాటై పోవుటచే అచ్చతెనుగు కావ్యములను అర్థముచేసికొనుటకు వారెక్కువ శ్రమపడవలసి వచ్చుచున్నది. అట్లుకాక సులభములును లలితసుందరములును అగు అచ్చతెలుగు పలుకులను కూర్చి మెలకువతో వ్రాసినచో శుద్ధాంధ్ర కావ్యములు కూడ జనరంజకములు కాజాలును.

ది. వేం.

## శేషాద్రి రమణ కవులు

ఆంధ్రసాహిత్యరంగమున ప్రసిద్ధిచెందినకవులలో శతావధానులలో చరిత్రకారులలో ఎన్నదగినవారు శేషాద్రిరమణకవులనుసోదరద్వయము. వీరి అసలుపేర్లు శేషాచార్యులు వేంకటరమణాచార్యులు. వీరితండ్రి దూపాటి రంగాచార్యులు.

దూపాటివారు గుంటూరుజిల్లాలోని కొమ్మాలపాడు నివాసులు. వీరిపూర్వులొకప్పుడు గురుపీఠమధిష్ఠించియుండిరి. ఆపదవి క్రమముగ అంతరించినను వారిది పండితకుటుంబముగ ప్రసిద్ధిచెందియున్నది. ఈసోదరులిద్దరు తండ్రివద్దనే సంస్కృ

శాస్త్రములు నేర్చుకొని పండితులై కవులై శతావధానులు గూడనై దూపాటివంశమునకు అలంకారములుగ వర్ధిల్లిరి

ఆశుకవిశ్రేష్ఠులగు కొప్పరపు సోదరకవులు గుంటూరులో అవధానము చేయుచుండునపుడు శేషాద్రిరమణకవులు వారి అవధానాదికార్యకలాపములందు పాల్గొనుచు చొరవతో వ్యవహరించుచుండిరి. చిన్నవయస్కులైన ఈ సోదరుల పాండితీ వైభవమును గమనించి ఎల్లరును ముచ్చటపడిరి. కొప్పరపు కవులు శేషాచార్యుల వేంకట రమణాచార్యుల పాండితీపటిమను కవితాసామర్థ్యమును ప్రశంసించుచువారికి "శేషాద్రిరమణకవులు" అను నామ మొసగిరి. అప్పటినుండి ఈ జంటసోదరులు పైనామముతోనే రచనావ్యాసంగము ప్రారంభించిరి

వీరిరువురును సంస్కృతాంధ్రములందు సమానమగు పండితులు. కవిత్వరచనయందును ఇంచుమించుగ సమానులే. వీరిలో ఎవ్వరే గ్రంథము వ్రాసినను లేక ఇద్దరును కలిసి రచించినను అది శేషాద్రిరమణకవుల పేరుతో ప్రకటింపబడు చొచ్చెను. ఈ యిద్దరిలో చిన్నవాడగు వేంకటరమణాచార్యులు ప్రతిభావంతులై సాహిత్యరంగమున విశేషించి చరిత్రపరిశోధనమున ఎక్కువగా పరిశ్రమించిరి

యుక్తవయస్కులై తెలుగు సంస్కృతములందు మంచి పాండిత్యము గడించినతరువాత ఈసోదరులు ఉద్యోగాన్వేషులై పలుప్రాంతములందు సంచరించిరి. కొంతకాలము వీరు గంపలగూడెం కుమారరాజా కోటగిరి వేంకటకృష్ణారావు ఆస్థాన కవులుగనుండిరి. విజయవాడయందలి ఆంధ్రగ్రంథాలయముద్రణాలయములో పండితులుగా మరికొంతకాలము గడపిరి. తరువాత శేషాచార్యులు బందరు హైస్కూలునందును వేంకటరమణాచార్యులు నందిగామ హైస్కూలునందును తెలుగుపండితులుగ స్థిరపడిరి. శేషాచార్యులు బందరు హైస్కూలులో పండితులుగ పనిచేయుచున్నపుడు 60 వ యేట మరణించిరి. కాగా వేంకటరమణాచార్యులు వరంగల్ కళాశాలయందు పండితపదవిని వహించిరి. సర్కారు ఉద్యోగ కాలపరిమితి ముగియగా ఈయన విరమించుకొని తదుపరి మట్టెవాడలోని ఆంధ్రభాషాభివర్ధనీ హైస్కూలులో కొంతకాలమును, పిదప హైద్రాబాదు ప్రభుత్వ పురాతత్త్వశాఖయందు మరికొంతకాలమును పనిచేసిరి. అనంతరము ఆయన విశ్రాంతిగైకొనుచు 1961 మార్చి 3 వ తేదీన హనుమకొండలో స్వగృహమున మరణించిరి. మరణమునాటికి ఆయన వయస్సు 68 సంవత్సరములు

శేషాద్రిరమణ కవుల తెలంగాణ ప్రవేశముతో నిజాము పాలనమునందు ఆంధ్రత్వమును విస్మరించిన ఈ ప్రాంతము నందలి ప్రజలకు నూతన చైతన్యము కల్గి ఆంధ్ర సాహిత్య చరిత్రకు విశేషముగ వికాసము చేకూరినది. వీరి సాహిత్య కలాపములు బహురూపములు దాల్చినవి. పెక్కు ప్రాచీన కవుల గ్రంథములను వీరు పరిష్కరించినారు. వీరి సంపాదకత్వమున ప్రకటితమైన ప్రబంధములలో పోతనామాత్యుని ఆంధ్ర భాగవతము మనుచరిత్రము వసుచరిత్రము సీతారామాంజనేయ సంవాదము ఆంధ్రపద నిధానము నిఘంటువు దానబోధ అను తత్త్వగ్రంథము పేర్కొనదగినవి. ప్రతికావ్యమునకు వీరు వ్రాసిన విపులపీఠికలు వారి ఆంధ్ర సాహిత్య సమాలోకనమును విమర్శనాపాటవమును వ్యాకరణాలంకారముల పాండిత్యగరిమను ప్రస్ఫుటము చేయుచుండును. ఆ పీఠికల పఠనముచే వారి చర్యాప్రధానము సర్వంకష పాండిత్య ప్రదర్శనము గోచరమై పాఠకులకు విజ్ఞానప్రదమై తనరారుచుండును. వీరు సంపాదకభారము వహించి మెరుగుతెచ్చిన వాటిలో ఆంధ్రశతకములు పేర్కొనదగి యున్నవి. ఈ శతకముల పీఠికలను వీరు చరిత్రదృష్టితోను భాషాదృష్టితోను రచించి విషయవిమర్శనము గావించినారు. శతకముల విషయములో ఇట్టి పని అంతవరకు ఎవ్వరును చేసియుండలేదని తెలియుచున్నది

వీరు రచించిన 40 గ్రంథములు పద్యప్రబంధములుగను శతకములుగను నాటకములుగను నవలలుగను విమర్శలుగను జీవితములుగను చరిత్రలుగను వర్గీకరింపబడదగును. అనేకవ్యాసములుగ పత్రికలయందు ప్రచురింపబడిన వీరి వ్యాసములు సంపుటములుగ ప్రకటితము కాలేదు. గ్రంథములలో 11 మాత్రమే ముద్రితములైనట్లు కనబడుచున్నది. వీరు రచించిన పద్యకావ్యములలో విక్రమోర్వశీయమును దానికి మహాకవి కాళిదాసుని విక్రమోర్వశీయనాటకము ఆధారమైనను అది స్వతంత్రరచనముగనే భాసించును. దృశ్యకావ్యమును శ్రవ్యకావ్యముగ మలచుట కష్టమైనను, ఆ కార్యమును వీరెంతో సమర్థముగ నిర్వహించి దానిని రసవత్తరమొనర్చినారు. ప్రాచీనార్వాచీన వర్ణనములు, శైలులు కూర్పబడిన ఈ ప్రబంధమున 589 పద్యగద్యములు కలవు

"పాపారాయుని నిర్యాణము" "అర్జునపరాభవము",

"చంద్రరేఖ" "చిత్రవివాహము" "సుశీల" వీరి ముఖ్యమైన స్వతంత్ర నాటకములు. ఇందు "పాపారాయని నిర్యాణము" బొబ్బిలి యుద్ధమునకు సంబంధించిన గాథ. "చంద్రరేఖ" అస్పృశ్యతా నివారణమును 'సుశీల' వరకట్న నిషేధమును ప్రచారముచేయు నాటకములు.

భక్తవత్సల శతకము సర్వలోకేశ్వర శతకము సూర్య శతకము ప్రబోధ శతకము మున్నగునవి శేషాద్రిరమణ కవుల ఆస్తిక్యమును పారమార్థిక చింతను నైతికాదర్శములను వెల్లడిచేయును. ఇవికాక మరికొన్ని అముద్రిత పద్య కావ్యములు సుమారు 400 పుటల పరిమితిగలవి నాలుగు సంపుటములలో గలవు.

శేషాద్రిరమణ కవులకు ఆంధ్ర సాహిత్యమునందువలె ఆంధ్ర చరిత్రయందుగల అభిమానము అపారమైనది. ఆంధ్ర చరిత్ర విషయములను విశదీకరించుచు వీరు జీవితములను నవలలను వ్యాసములను, గద్యకావ్యములను రచించినారు. తెలుగు ప్రభువులనుగూర్చి తెలుగు వీరులనుగూర్చి తెలుగు మహనీయులనుగూర్చి జీవిత చరిత్రలను వ్రాసినవారిలో వీరే ప్రథములైనట్లు తోచుచున్నది. వసుంధర, అన్నయమంత్రి, కొండపల్లి ముట్టడి అను చారిత్రక నవలలు ఆయా కాలములలో ఆంధ్రసమాజ పరిస్థితులను ఆచారములను మర్యాదలను రాజనీతి వ్యవహారములను, ఆంధ్రదేశ వర్ణనలను, శిల్పాది కళావృత్తాంతములను స్పష్టముగ వర్ణించుచున్నవి. వీటియందు పూర్వులవైభవము సౌజన్యము ధర్మపరాయణత, సాహసౌదార్యములు దర్పణప్రాయముగనుండును.

వేంకటరమణాచార్యులు 1932 లో వరంగల్లు కళాశాలలో పండితపదవిని వహించినదాదిగ, ఆయన చారిత్రక పరిశోధనాసక్తి వికసించినది. నిజాము రాష్ట్రాంధ్రులు తెలుగువారు కారనియు, తెలంగాణములో తెలుగుకవులు లేరనియు ప్రచారము జరిగిన దినములవి. అట్టి ప్రచారమును 45 సంవత్సరముల క్రిందట హైదరాబాదులో స్థాపితమైన "లక్ష్మణరాయ పరిశోధకమండలి" యను సంస్థ అరికట్టినది. ఈ మండలిచే సేకరింపబడిన పెక్కు తాళపత్ర గ్రంథములనుండియు, శాసన ప్రతిబింబములనుండియు పైజెప్పిన ప్రచారము అసత్యమని రుజువైనది. ఈ మహత్తర పరిశోధనా కృషియందు శేషాద్రిరమణకవులు అమోఘముగ తోడ్పడినారు. లక్ష్మణరాయ పరిశోధకమండలి ఘనత ముఖ్యముగ శేషాద్రిరమణ కవులకు చెందియున్నది. ఈ మండలిపక్షమున ఈ జంటకవులు శ్రమకోర్చి తెలంగాణమున పర్యటన జరిపి చరిత్రసామగ్రికి సంబంధించిన ప్రాచీన గ్రంథజాలమును శాసన ప్రతిబింబములను సంపాదించినారు.

శేషాద్రిరమణకవులు శిలాశాసనములకు ప్రతిబింబములను తీయుటయు వాటిని చదువుటయు వాటిని విమర్శించి చరిత్రాంశములను క్రోడీకరించి సమన్వయపరచుటయు ఎరిగిన ప్రజ్ఞావంతులు. ఈ పండితద్వయము గావించిన కృషికి ఫలితముగ పెక్కు అపూర్వవిషయములు బయల్పడినవి. అనిశ్చిత విషయములు స్థిరరూపము దాల్చినవి.

శేషాద్రిరమణకవులు సిద్ధాంతీకరించిన కొన్ని అంశములు దిగువ పేర్కొనబడినవి.

(1) పోతనామాత్యుడు ఒంటిమెట్ట నివాసికాడు; వరంగల్లు సమీపమందలి బమ్మెర గ్రామనివాసి.

(2) మల్లికార్జున పండితారాధ్యుడు తెలంగాణమునందు ప్రథమాంధ్రకవి. ఆయన రచించిన 'శివతత్త్వసారము' ప్రథమాంధ్ర గ్రంథము.

(3) ద్విపద రచన జన్మస్థానము తెలంగాణము.

(4) తెలంగాణమందలి ఆంధ్రులు వలస వెళ్లినవారనుట చరిత్ర స్మృతిలేకుండుటచే.

(5) త్రిలింగములలో కాళహస్తి ఒకటికాదు. కరీంనగరుజిల్లాయందు గోదావరిలో ఇంద్రావతి సంగమించెడి తావుననున్న కాళేశ్వరమను శివక్షేత్రము త్రిలింగములలో ఒకటి.

(6) తెలంగాణములోని మంథెనయే మంత్రకూటము.

(7) రుద్రమదేవి గణపతిదేవుని కుమార్తె.

(8) ప్రతాపరుద్రుని మంత్రి పురవారమహాదేవనాయకుడు.

(9) మహామహోపాధ్యాయ కొలచలము మల్లినాథసూరి మెదకుజిల్లాలోని కొలచలను గ్రామనివాసి.

ఈ పై అంశములతో ఎందరు ఆంధ్ర చరిత్రకారులు ఆంధ్రచరిత్ర పరిశోధకులు ఏకీభవింతురో చెప్పజాలము.

శేషాద్రిరమణకవులు కారణజన్ములు; అజరామరమైన కీర్తిమంతులు.

## శ్యామాశాస్త్రి :

కర్ణాటక సంగీతమూర్తిత్రయములో శ్యామాశాస్త్రి ఒకడు. ఇతడు వడదేశత్తు వడమాళ్ అను తమిళప్రాంతమునకు చెందినవాడు. ఇతని పూర్వులు కర్నూలుజిల్లాలోని కంభం వాస్తవ్యులు. త్యాగరాజు పూర్వికులు కూడ కంభం తాలూకాయందలివారే అని తెలియుచున్నది. శ్యామాశాస్త్రి వంశీయులు పూర్వము తమిళనాడుకు వలసవెళ్ళి తమిళమును మాటాడుటకలవాటుపడినను మాతృభాషాభిమానమును పురస్కరించుకొని వారు తెలుగులోనే అపూర్వములగు సంగీత రచనములు చేసిరట.

శ్యామాశాస్త్రి పూర్వికులు ఆదిశంకరుని కాలమునాటికే కాంచీపురము వచ్చి యుండిరట. శంకరాచార్యుడు వీరిని అచ్చటి స్వర్ణకామాక్షీదేవి విగ్రహమునకు అర్చకులుగా నియమించెను. శ్యామాశాస్త్రి తండ్రిపేరు విశ్వనాథశాస్త్రి. ఇతనికి ౬౦ సం॥ ల వయస్సుననే శ్యామాశాస్త్రి తంజావూరు జిల్లాలోని తిరువరూరులో క్రీ శ 1762 ఏప్రిలు 26 వ తేదీన జన్మించెను. ఆతనికి తలిదండ్రులు మొదట వెంకటసుబ్రహ్మణ్యమని పేరుపెట్టిరి; ముద్దుగా శ్యామకృష్ణ యనియు వారు అతనిని పిలిచెడి వారట !

విశ్వనాథశాస్త్రి పూర్వులనాటినుండి సంగీత సంప్రదాయము పరంపరాగతము కాకుండుటచే శ్యామాశాస్త్రి సంగీత రచనములో ప్రసిద్ధుడు కాగలడని అతని జననీజనకులు ఊహించలేదు. సంస్కృతాంధ్రములను అభ్యసించి కొలదిగ సంగీతమును పాడనేర్చిన తన మేనమామవద్దనే శ్యామాశాస్త్రి స్వరజ్ఞానమువరకు గానవిద్య నభ్యసించెనట !

శ్యామాశాస్త్రి 18 సం॥ లు వచ్చుసరికి జననీజనకులతో తంజావూరు వచ్చిచేరెను. అతని సుకృతవశమున సంగీతస్వామి యనువొక సుప్రసిద్ధుడు శ్యామాశాస్త్రియింటికతిథియై వచ్చెను. శ్యామాశాస్త్రిలో బీజరూపమున్న సంగీతశక్తి స్వామికి గోచరించెను. భవిష్యత్తులో శ్యామాశాస్త్రి గొప్ప వాగ్గేయకారుడు కాగలడని స్వామి అతని తండ్రితో చెప్పెనట ! సంగీతస్వామి పూర్వాశ్రమములో వొక ఆంధ్రబ్రాహ్మణుడు. మూర్తిత్రయములో త్యాగరాజునకు శారదుడు ముద్దుస్వామిదీక్షితునకు చిదంబరనాథయోగి శ్యామాశాస్త్రికి సంగీతస్వామి సంగీతశాస్త్రమున గురువులుగా లభించిరి.

సంగీతస్వామివద్ద మూడుసంవత్సరములు శ్యామాశాస్త్రి సంగీతశాస్త్ర లక్ష్యలక్షణములను తెలిసికొని గొప్ప ప్రతిభావంతుడయ్యెను. గురువగు సంగీతస్వామి శ్యామాశాస్త్రినుద్దేశించి నీవు నావద్ద సంగీతమును సలక్షణముగ నేర్చితివి. నీవిప్పుడు మంచి సంగీతమును మాత్రము వినుచుండవలెను. తంజావూరు ఆస్థానవిద్వాంసుడైన పచ్చిమిరియం ఆదిఅప్పయ్య గావించు గానము మాత్రము వినుచుండుము. అతనివద్ద ఏమియు నేర్చుకొన నవసరములేదు అనిచెప్పి శిష్యుని ఆశీర్వదించి కాశికి వెళ్లిపోయెను. అప్పటినుండి శ్యామాశాస్త్రి గురువు ఆదేశము ననుసరించి ఆదిఅప్పయ్య గానమును వినుచుండెను. వీరిరువురు మంచిస్నేహితులైరి. శ్యామశాస్త్రిని కామాక్షి అని అప్పయ్య ముద్దుగా పిలిచెడివాడట. ఒకనాడు శ్యామాశాస్త్రి తాంబూలమునమలుచు అప్పయ్యతో మాట్లాడుచుండగా ఆతని నోటితుంపరలు గురుతుల్యుడైన అప్పయ్యమీద పడెనట ! శ్యామాశాస్త్రి అందులకు క్షమార్పణమర్థించగా "ఇది కామాక్షి అనుగ్రహము. దీనికై నేను వేచియున్నాను !" అని అప్పయ్య జవాబిచ్చెనట !

తండ్రి తరువాత శ్యామాశాస్త్రికి కామాక్షీదేవి అర్చకత్వము సంక్రమించెను. శ్యామాశాస్త్రి స్వయముగా రచించిన స్వరజతులు తానవర్ణములు కృతులు విద్వాంసుల మన్ననలను పొందినవి. శ్యామాశాస్త్రి త్యాగరాజు లిరువురు మిత్రులైరి. అప్పుడప్పుడు త్యాగరాజు శాస్త్రియింటికి వెళ్లిన సందర్భములలో ఇరువురిమధ్య సంగీతచర్చలు జరగుచుండెడివి. శ్యామాశాస్త్రి తన రచనలకు 'శ్యామకృష్ణ' యను ముద్రను వేసికొనెను. కొన్నికృతులలో 'శ్యామకృష్ణ సహోదరి' అని యుండుటచే కామాక్షమ్మను అడపడుచుగా ఎన్నుకొన్నట్లు కనబడుచున్నది.

శ్యామాశాస్త్రి తన రచనలన్నిటిని దేవీపరముగ చెప్పినాడు. ముఖ్యముగా శుక్రవారపు పూజాసమయములలో ఈ అపూర్వరచనలు వెలువడుచుండెడివట ! శ్యామాశాస్త్రికి దేవి ప్రత్యక్షమగుచుండెడిదని కొందరు చెప్పుకొనెడివారు. మొదట 'జననీ నతజన పరిపాలిని భవానీ' అను సంస్కృతకృతిని సావేరి రాగములో ఇతడు రచించెను. అతని రచనలు జటిలములై ఎక్కువ సంగతులతో నుండుటచేతను వీటిని నేర్చుకొనుట త్యాగరాజు కృతులవలె సులభసాధ్యము కాదు. కనుకను ఇతనికి పెక్కురు శిష్యులు లేరని తెలియుచున్నది. త్యాగరాజు

రచనలు ద్రాక్షాపాకోపేతములును, ముద్దుస్వామి దీక్షితుల రచనలు నారికేళపాకసమమును కాగా శ్యామశాస్త్రికృతులు కదళీపాకశోభితములని పలువురు పెద్దల అభిప్రాయము. శ్యామశాస్త్రి రచనలన్నియు కలిసి మూడువందలవరకుండ వచ్చును. తాళప్రస్తారమునుగూర్చి అతడు కొన్ని గ్రంథములు వ్రాసెను. అతడు రచించిన భైరవి, యదుకులకాంభోజి, తోడిరాగముల స్వరజతులు నిరుపమానములు. అతని ప్రత్యేకాభిమానమైన ఆనందభైరవిలో అతని రచనలు పెక్కు లున్నవి. అట్లే చాపుతాళములో కూడ అనేకములు గలవు. ఆరోజులలో బొబ్బిలి కేశవయ్య అను సంగీతవిద్వాంసుడు కొందరు ఆస్థానగానపండితులను జయించి వారినుండి జయపత్రికలను గ్రహించుచుండెడివాడట! ఒకసారి కేశవయ్య తంజావూరు వెళ్ళగా అచ్చటి ఆస్థాన విద్వాంసులు భయపడి శ్యామశాస్త్రివద్దకు పోయి సంస్థాన గౌరవమును కాపాడుమని విన్నవింపగా దేవ్యనుగ్రహముచే శ్యామశాస్త్రి కేశవయ్యను ఓడించెనట! ఇట్టివెన్నియో ఉదాహరణములుగలవు.

శ్యామశాస్త్రి తన రచనలన్నిటిని దేవీపరముగాచేసెను. ఇతడు త్యాగరాజువలె తన మరణసమయమును ముందుగనే తెలిసికొనెనట! ఇతడు 1827 ఫిబ్రవరి 6వ తేదీన పరమపదించెను.

ఇతనికి పంజుశాస్త్రి, సుబ్బరాయశాస్త్రి అను నిరువురు కుమారులుండిరి. ఇతని శిష్యులలో అలసూరు కృష్ణయ్య, తలంగంబాడి పంచనదయ్య మొదలగువారు ముఖ్యులు. త్యాగరాజువలె ఇతడు తీర్థయాత్రలు చేయలేదు. ఒకసారి మాత్రమొక శిష్యునితో కలిసి మధుర కేగినపుడు దేవిమీద తొమ్మిదికృతులు రచించెను. ఈ కృతిసముదాయమునకు నవరత్నమాలిక యనిపేరు. ఇతడే క్రిందికృతులు రచించెనని ప్రసిద్ధి.

| కృతులపేర్లు | రాగము | తాళము |
|---|---|---|
| సరోజదళనేత్రి | శంకరాభరణము | ఆది |
| దేవిమీననేత్రి | | |
| మరివేరెగతి | ఆనందభైరవి | చాపు |
| నన్నుబ్రోవులలిత | లలిత | |
| మాయమ్మ | అహిరి | ఆది |
| దేవీపాదసారస | కాంభోజి | |
| మీనలోచని | ధన్యాసి | చాపు |
| శంకరి శంకరు | సావేరి | ఆది (తిశ్రగతి) |
| దురుసుగా కృప | | ఆది |
| నిను వినాగమరి | పూర్వికల్యాణి | మిశ్రచాపు |
| తల్లి నిన్ను నెర | కల్యాణి | |
| హిమాద్రిసుతే | | రూపకం |
| బిరానవరాలిచ్చి | | |
| బ్రోవవమ్మ | మాంజి | చాపు |
| ఓ జగదంబ | ఆనందభైరవి | ఆది |
| హిమాచలతనయ | | |
| పాహిశ్రీగిరిజాసుతే | | |
| స్వరజతులు | | |
| రావేహిమగిరికుమారి | తోడి | ఆది |
| కామాక్షి అనుదినము | భైరవి | చాపు |
| కామాక్షి | యదుకులకాంభోజి | |

సంగీతమూర్తిత్రయము వెలసినకాలము క్రీ. శ. 1750–1850 కర్ణాటకసంగీతము ఉచ్ఛదశయందున్న కాలము స్వర్ణయుగమని చెప్పబడుచున్నది. ఈ సంగీతశాస్త్రము నుద్ధరించుటకు ఈమూర్తిత్రయమవతరించినదనుట యుక్తము.

పే. సు.

## శ్రీకాకుళము జిల్లా

జిల్లానిర్మాణము:– పూర్వపు విశాఖపట్టణముజిల్లాను పరిపాలనాసౌలభ్యముకొరకు 1950 వ సంవత్సరములో ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వము రెండుగా విభజించి శ్రీకాకుళముజిల్లాను ఏర్పరచినది. ఈజిల్లాలో శ్రీకాకుళం, చీపురుపల్లి, బొబ్బిలి, పాలకొండ, పార్వతీపురం, సాలూరు, సోంపేట, నరసన్నపేట, టెక్కలి, సోంపేట, ఇచ్ఛాపురము అను పదకొండు తాలూకాలున్నవి. ఆంధ్రప్రదేశ్‌కు ఉత్తర సరిహద్దునున్న తుదిజిల్లా ఇది.

ఉనికి–విస్తీర్ణము:– ఈజిల్లా ఉత్తరఅక్షాంశము 18° 20′ నుండి 19° 10′ వరకును, తూర్పు రేఖాంశము 83°-5′ నుండి 84°-50′ వరకును వ్యాపించియున్నది. దీని విస్తీర్ణము 8,889

చదరపుమైళ్లు గ్రామములు 3246 పురములు 13 జనసంఖ్య 2 340 8 6 వారిలో పురుషులు 1 149 447 మంది స్త్రీలు 1 191 431 మంది గ్రామవాసులు 2 136 236 పురవాసులు 204 640 సగటు జనసాంద్రత 602

పరిహద్దులు — శ్రీకాకుళంజిల్లాకు ఉత్తరమునను పడమరను ఒరిస్సారాష్ట్రము తూర్పున బంగాళాఖాతము దక్షిణమున విశాఖపట్టణము జిల్లాయును ఉన్నవి

నైసర్గిక స్వరూపము — ఈజిల్లా నైసర్గికముగా (1) ఏజన్సీప్రాంతము (2) తీర మైదానము అనిరెండుభాగములుగా విభజింపబడియున్నది

(1) ఏజన్సీప్రాంతము — పాలకొండ పార్వతీపురము సాలూరు తాలూకాలలోని కొంతభాగము మరియు పాతపట్నము, సోంపేటతాలూకాలలోని కొండప్రాంతములు ఏజన్సీ ప్రాంతములో చేరియున్నవి తీరప్రాంతములందలి తాలూకాలు అనేకవర్రలతో నిండియున్నవి

(2) తీరమైదానము — ఇచ్ఛాపురము సోంపేట టెక్కలి నరసన్నపేట శ్రీకాకుళము చీపురుపల్లి తాలూకాలు సముద్రతీరమును అనుకొనియున్నవి ఇవిసారవంతమైన ప్రదేశములు

ఈజిల్లాలో తూర్పుకనుమలు సముద్రతీరమునకు సమాంతరముగా ఈశాన్యదిక్కునుండి నైరృతి దిక్కునకు వ్యాపించియున్నవి

శీతోష్ణస్థితి — ఈజిల్లాయందు ఏప్రిల్ నుండి జూన్ వరకు యెండలు మెండుగా నుండును సోంపేట ఇచ్ఛాపురము శ్రీకాకుళము తాలూకాలలో సమశీతోష్ణముగా నుండును టెక్కలి తాలూకాలలో వేసవి కాలమందు ఎండలుఎక్కువగాను శీతాకాలములో చలి అధికముగాను ఉండును దైనిక సరాసరి గరిష్ఠఉష్ణోగ్రత 87.6° ఫా కనిష్ఠ ఉష్ణోగ్రత 74.9° ఫా సంవత్సరములో అత్యధికఉష్ణోగ్రత 101° ఫా అత్యల్పఉష్ణోగ్రత 57° ఫా

వర్షపాతము — నైరృతిఋతుపవనమువలన ఈజిల్లాలో వర్షములు కురియును సంవత్సరపు సరాసరి వర్షపాతము 44" లు

అడవులు:— 236 98 చదరపుమైళ్ల వైశాల్యముగల అడవి ఈజిల్లాలో ఉన్నది పాలకొండతాలూకాలోని అడవి వైశాల్యము అధికము టెక్కలితాలూకాలో వంటచెరకుకు పనికివచ్చు అడవియు సోంపేటతాలూకాలో కుంకుడుచెట్లుగల అడవియుగలవు పార్వతీపురము తాలూకాలో కూడ ఇట్టి అడవియే కలదు ఈఅడవులలో సాలవృక్షములున్నవి బొబ్బిలి తాలూకాలో మంచిజాతి వృక్షములుగల అడవియు చీపురుపల్లి తాలూకాలో పొదలతోనిండిన అడవియుగలవు

ఖనిజసంపద — చీపురుపల్లి తాలూకాలోగల గర్భాం గరవిడి పెరిపి శిరివరం మొదలైన గ్రామప్రాంతములందును సాలూరుతాలూకాలోని మేడంగి మొదలైనప్రదేశములందును మాంగనీసు గనులున్నవి

నదులు — (1) నాగావళి (2) వంశధార (3) జంఝావతి (4) మహేంద్రతనయ (5) వేగవతి యను నదులు ఈజిల్లాలో గలవు

(1) నాగావళి (లాంగుల్య):— ఈనది ఒరిస్సారాష్ట్రమందలి తూర్పుకనుమలలో జన్మించి ఈజిల్లాలోగల పార్వతీపురపు పాలకొండతాలూకాలలోను, చీపురుపల్లి శ్రీకాకుళము తాలూకాలకు సరిహద్దునను ప్రవహించి సముద్రములో సంగమించుచున్నది దిగువతాలూకాలో దీనిని లాంగుల్యనది అనివ్యవహరింతురు స్వర్ణముఖ దీనికి ఉపనది పార్వతీపురముతాలూకాలో తోటపల్లివద్ద నాగావళినదికి ఆనకట్టకట్టి దీని నీటితో ఆప్రాంతమున పల్లపుసేద్యము చేయుచున్నారు దీనివలనను దీనిఉపనదివలనను పాలకొండ శ్రీకాకుళము తాలూకాలలో విస్తారమైనభూమిని పార్వతీపురము తాలూకాలో కొంతభాగమును సాగుచేయుచున్నారు ఈనదిపొడవు 130 మైళ్లు సంవత్సరముపొడవున ఈనదిలో 20 నుండి 30 అడుగుల ఘనపుటడుగులవరకు నీరు ప్రవహించును దీనిమొత్తము అరగాణి విస్తీర్ణము 3461 చదరపుమైళ్లు

(2) వంశధార — ఈనదికూడ ఒరిస్సారాష్ట్రములోని తూర్పుకనుమలలోపుట్టి శ్రీకాకుళముజిల్లాలోని పాతపట్నము తాలూకాలో ప్రవేశించి, నరసన్నపేట శ్రీకాకుళము తాలూకాలమధ్యగా ప్రవహించి కళింగపట్నమువద్ద సముద్రములో కలియుచున్నది దీనినీటితో పాతపట్నము శ్రీకాకుళముతాలూకాలలో వ్యవసాయము జరుగుచున్నది ఈనదిపొడవు 140 మైళ్లు జిల్లాలోకెల్ల ఇది పెద్దనది దీని అరగాణి విస్తీర్ణము 4,400 చదరపుమైళ్లు వంశధారకు కుడివైపుయందు ప్రక్కనుండు

యీజిల్లాలో 60 వేలఎకరములభూమి సాగగుచున్నది

(౪) బహుద - ఇది ఇచ్ఛాపురముతాలూకాలో ప్రవహించునది దీనివలన ఈతాలూకాలో కొంతభాగమున వ్యవసాయము జరుగుచున్నది

(౫) మహేంద్రతనయ - ఈనది సోంపేటతాలూకాలో ప్రవహించుచు అచట వ్యవసాయమునకు సాయపడుచున్నది

(౬) వేదావతి - (వేగవతి) ఇది సాలూరుతాలూకాలో ప్రవహించి అచట కొంతభూసేద్యమునకు ఉపకరించుచున్నది

వ్యవసాయము - ఈజిల్లాలో వ్యవసాయమునకు పనికి వచ్చుభూమిని స్థూలముగా మూడుభాగముల క్రింద విభజించవచును (1) ల్లభూమి (2) ఎర్రభూమి (3) ఎరువు నలుపుకలసిన మిశ్రమభూమి

జిల్లాలో వరి ముఖ్యమైన ఆహారపువంట ఇది గాక జొన్న సజ్జ మొక్కజొన్న రాగి వరిగ కొఱ్ఱ మొదలైన ఆహారధాన్యములను పెసర కంది మినుము మొదలైన పప్పుపదార్థములను వేరుసెనగ ప్రత్తి జనపనార నూనెగింజలు మొదలైన వాణిజ్యపు పంటలను ఈజిల్లాలో పండుచున్నవి మామిడి అరటి జీడిమామిడి మొదలైన పండ్లతోటలుగూడనున్నవి

ఈజిల్లాలో వ్యవసాయము కొంతభాగము పూర్వపద్ధతిలోను కొంతభాగము ప్రభుత్వవ్యవసాయ డిపార్టుమెంటు ప్రోత్సాహముతో మరనాగండ్లు బుల్‌డోజర్లతోను సాగుచున్నది కొండప్రాంతములందు ఏజన్సీప్రాంతములందును వ్యవసాయాభివృద్ధికి ప్రభుత్వముప్రత్యేక కృషిసలుపుచున్నది మెట్టప్రదేశములలో వర్షపుసేద్యమువలనై చెరువులు కుంటలు కాలువలు ఉపయోగపడుచున్నవి

జిల్లాలోగల 24 88 981 ఎకరముల భూమిలో అడవులు 4 85 968 ఎకరములు; వ్యవసాయము చేయక వృథాగానున్న భూమి 6 88 188 ఎకరములు వ్యవసాయయోగ్యము కానిభూమి 15 45 898 ఎకరములు వ్యవసాయముచేయు నికరవైశాల్యము 8 78 022 ఎకరములు; దీనిలో నీటిపారుదల వసతిగల భూమి 5,02,891 ఎకరములు

పశుసంపద - కుదిమట్టముగను బలిష్ఠముగను ఉండు మేలురకము పశుజాతి ఇచ్చటగలదు

పశువైద్యము - శ్రీకాకుళము, టెక్కలి పార్వతీపురము బొబ్బిలి నరసన్నపేట ఇచ్ఛాపురము పాలకొండ సోంపేటలలో పశువైద్యశాలలుగలవు ఇతరతావులలో పశువైద్యకేంద్రములున్నవి

గృహపరిశ్రమలు - ఈజిల్లాయందుగల ముఖ్యమైన చేనేతపరిశ్రమవలన 87088 మందిప్రజలు జీవింతురు పొందూరునందు సన్న ఖద్దరువస్త్రములు తయారగును దీనివలనగూడ పెక్కుమందికి జీవనాధారము కల్గుచున్నది

భారీపరిశ్రమలు - ఈజిల్లాలో చెప్పదగిన భారీపరిశ్రమలు లేవు గరివిడి గర్భాము లయందు మాంగనీసుగనులున్నవి నౌపాడ అనుచోట ఉప్పుకొఠారులున్నవి బొబ్బిలి సీతానగరములలో ఒక్కొక్కచక్కెరఫాక్టరీ గలదు టెక్కలిలో జీడిపప్పుపరిశ్రమయు బొబ్బిలిలో నూనెకర్మాగారములును గలవు

రోడ్లు - శ్రీకాకుళము నుండి విశాఖజిల్లాకును జిల్లాఅంతర్భాగములకును ఒరిస్సారాష్ట్రమునకును రోడ్లుపోవుచున్నవి వీటినిడివి 1011 మైళ్లు వీటిలో ముఖ్యమైనవాటి నిడివి 558 మైళ్లు

రైలుమార్గములు:- ఆగ్నేయరైల్వేసంస్థకు చెందిన బ్రాడ్‌గేజి 147 మైళ్లు పొడవునను నేరోగేజి 21 మైళ్లు పొడవునను ఈజిల్లాలో విస్తరించియున్నవి మద్రాసు-కలకత్తా బ్రాడ్‌గేజిలైను చీపురుపల్లి శ్రీకాకుళము నరసన్నపేట టెక్కలి సోంపేట ఇచ్ఛాపురము తాలూకాలగుండా పోవుచున్నది టెక్కలితాలూకాయందలి నౌపాడానుండి బయలుదేరు నేరోగేజిరైలుమార్గము పాతపట్టణముగుండా ఒరిస్సారాష్ట్రములోనికి పోవుచున్నది విజయనగరము-రాయపూరు బ్రాడ్‌గేజిలైను సాలూరు బొబ్బిలి పార్వతీపురము తాలూకాలగుండా పోవుచున్నది

పోస్టు-టెలిగ్రాఫ్ సౌకర్యములు ఈజిల్లాలో మొత్తము 888 పోస్టాఫీసులు 28 టెలిగ్రాఫ్ ఆఫీసులు 4 టెలిఫోన్ ఎక్స్ఛేంజి ఆఫీసులు 17 పబ్లిక్ కాల్ ఆఫీసులునుగలవు

విద్య : ఇతరజిల్లాలప్రగతితో పోల్చగా విద్యావిషయములో ఈజిల్లా కొంతవరకు వెనుకబడియున్నది జిల్లాయందలి అక్షరాస్యుల సంఖ్య 15 29% ఇటీవల ప్రభుత్వము ప్రవేశపెట్టిన అభివృద్ధిపథకములు ఈజిల్లాప్రజల విద్యాభివృద్ధికి తోడ్పడుచున్నది

| విద్యాసంస్థల వివరము (1) | సంఖ్య (2) | ఉపాధ్యాయులు (3) | విద్యార్థులు (4) |
|---|---|---|---|
| ప్రాథమిక పాఠశాలలు | 3106 | 5434 పురుషులు | 140630 మగపిల్లలు |
| | | 424 స్త్రీలు | 104780 ఆడపిల్లలు |
| | | 5858 మొత్తము | 245410 మొత్తము |
| మాధ్యమిక పాఠశాలలు | 128 | 737 పురుషులు | 17867 మగపిల్లలు |
| | | 67 స్త్రీలు | 11914 ఆడపిల్లలు |
| | | 804 మొత్తము | 29781 మొత్తము |
| ఉన్నత పాఠశాలలు | 185 | 1511 పురుషులు | 27206 మగపిల్లలు |
| | | 127 స్త్రీలు | 5635 ఆడపిల్లలు |
| | | 1638 మొత్తము | 32841 మొత్తము |
| మల్టిపర్పస్ హయ్యర్ సెకండరీ పాఠశాలలు | 11 | 371 పురుషులు | 9458 మగపిల్లలు |
| | | 11 స్త్రీలు | 1014 ఆడపిల్లలు |
| | | 382 మొత్తము | 10472 మొత్తము |
| ట్రెయినింగు పాఠశాలలు | 5 | 37 పురుషులు | 404 మగపిల్లలు |
| | | 11 స్త్రీలు | 84 ఆడపిల్లలు |
| | | 48 మొత్తము | 488 మొత్తము |
| వయోజనవిద్యాకేంద్రములు | 160 | 225 | 4225 విద్యార్థినీ విద్యార్థులు |
| వృత్తిబోధక పాఠశాలలు | 3 | 31 | 559 విద్యార్థులు |
| కళాశాలలు | 2 | | 800 స్త్రీ పురుషులు |

(1966 – 67 లెక్కల ననుసరించి)

వైద్య సౌకర్యము : బోదకాళ్ల వ్యాధి ఈజిల్లాలో అధికము. దీని నిర్మూలనకు ఆస్పత్రులద్వారా ప్రభుత్వము కృషి సల్పుచున్నది. ఏజన్సీ తాలూకాలలో మలేరియావ్యాధి నిర్మూలనకు గూడ తగిన ఏర్పాట్లు ప్రభుత్వము కల్పించినది. పాలూరులో క్షయవ్యాధినిరోధక వైద్యశాల ఒకటి గలదు. ఇవిగాక ఆధునిక వైద్యసౌకర్యములుగల ప్రభుత్వవైద్యశాలలు పదమూడును లోకల్ ఫండుశాఖయాజమాన్యమున ఇరువది నాల్గును ప్రైవేటుయాజమాన్యమున నలుబదియు ఈజిల్లా యందు నెలకొనియున్నవి. ఇవికాక ఆయుర్వేదవైద్యశాలలు పదకొండును యునానీవైద్యశాలలు మూడును ఈజిల్లా యందు నడపబడుచున్నవి.

ముఖ్యవృత్తులు : జిల్లాలో ప్రజలముఖ్యవృత్తి వ్యవసాయము. వీరిని నాలుగుభాగములుగా విభజించవచ్చును (1) స్వంతముగా సేద్యముచేసికొనువారు (2) కౌలుదారులు

(3) వ్యవసాయకూలీలు (4) భూస్వాములు

వృత్తుల వివరములు (1) వ్యవసాయజీవనముచేయు వారి సంఖ్య 16 40 56 ; (2) వ్యాపారజీవనముచేయువారు 93 339 (3) పరిశ్రమలలోను ఇతర ఉత్పత్తిరంగములలోను పనిచేయువారు 2 33 3 6 (4) ఇతరవృత్తులలో జీవించు వారు 2 09 325

గ్రంథాలయములు జిల్లాలోకల్ లైబ్రరీఅధారిటీక్రింద శ్రీకాకుళమునందు 1 కేంద్రగ్రంథాలయమును తాలూకా లలో 10 శాఖాగ్రంథాలయములును నడుపబడుచున్నవి

జిల్లాను చరిత్ర క్రీస్తుకు పూర్వము నాలుగు మూడు శతాబ్దములనుండి ఈప్రాంతము జనావాసమై వర్ధిల్లి నట్లు ఆధారములు లభించుచున్నవి ఓఢ్రఉత్కళ కళింగ ములుగా విభజింపబడియున్న ఈసువిశాల భూభాగమునకు దక్షిణపుదిక్కునయున్న ఈజిల్లా, అనాదికాలమునుండి వర్ధిల్లు చునేయున్నది ఈజిల్లాయందు సముద్రతీరమునయున్న కళింగ పట్టణము మిక్కిలి ప్రసిద్ధమైనది పూర్వము ఇదిప్రాచ్య ద్వీపములతో వర్తకవ్యాపారసంబంధము కలిగియున్నది అనాడు ఇచట జైన బౌద్ధమతములు విరివిగా వర్ధిల్లినవి

అశోకునిచేత జయింపబడిన ఈకళింగరాష్ట్రము అతని మరణానంతరము స్వతంత్రమైనది క్రీస్తుశకారంభమువరకు ఈప్రాంతమును చేదివంశపురాజులు పాలించిరి వీరిలో ఖరవేలుడు ప్రముఖుడు ఇతడు మగధను దక్షిణాపథములోని అధికభాగమును జయించెను క్రీస్తుశకము 1 2 3 4 శతాబ్దములలో ఈప్రాంతమును ఏయేరాజులు పాలించిరో ఖచ్చితముగా తెలుపు ఆధారములు లభింపలేదు అయినను ఇచ్చట లభ్యమైన నాణెములనుబట్టి యవనులు అను వారు ఈప్రాంతమును పాలించియుందురని చారిత్రకపరిశోధకులు భావించుచున్నారు

క్రీ శ మూడవశతాబ్ది అనంతరము ఘటిల్లిన సముద్రగుప్తుని దండయాత్రవలన కళింగము చిన్నచిన్న రాజ్యములుగా చీలిపోయినది తూర్పుగాంగరాజులు కళింగదేశమును 5వ శతాబ్ది తుదిభాగమునుండి 15వ శతాబ్దమువరకు అవిచ్ఛిన్నముగా రాజ్యపాలనము చేసిరి భారతదేశములో ఏప్రాంతమును పాలించిన ఏఇతరరాజులును తూర్పుగాంగవంశపురాజుల వలె ఇంత సుదీర్ఘకాలము రాజ్యపాలనము చేసియుండలేదు.

ఒరిస్సారాష్ట్రములో, వైతరణినదినుండి ఆంధ్రదేశమునందలి విశాఖపట్టణముజిల్లాలో వరాహానదివరకుగల భూభాగమంతయు అనాడు కళింగరాజ్యములో నుండెడిది నేడువిశాఖ శ్రీకాకుళముజిల్లాలు విస్తరించిన ప్రాంతమంతయు అనాడు అరాజ్యాంతర్భాగముగా నుండెడిది శ్రీకాకుళముజిల్లాలోని ముఖలింగేశ్వర మనునామాంతరముగల "కళింగనగరము" అనాడు తూర్పుగాంగవంశపురాజులకు రాజధానియై వర్ధిల్లి యున్నట్లు చారిత్రకపరిశోధకులు కనుగొనిరి

నాలుగవ భానుదేవుని కాలమున (1414—1434)గజపతులను పేరొకవంశమువారు ఈరాజ్యమును తమవశము చేసికొనిరి వీరిలో కపిలేంద్రగజపతి కొడుకు పురుషోత్తమగజపతి, అతనికొడుకు ప్రతాపరుద్రదేవగజపతి చాలముఖ్యులు వీరు నెల్లూరుజిల్లాలోని ఉదయగిరివరకు తమరాజ్యమును విస్తరింపచేసికొనిరి

క్రీ శ 1520వ సంవత్సరమున శ్రీకృష్ణదేవరాయలు గజపతిరుద్రదేవరాజుతో యుద్ధముచేసి అతనినిఓడించగా అతడు తనకుమార్తెను కృష్ణదేవరాయలకిచ్చి వివాహముచేసి ఉభయవంశములమధ్య మరల స్నేహసంబంధమును నెలకొల్పుకొనెను

1565 లో ఘటిల్లిన తళ్లికోటయుద్ధఫలితముగా విజయనగరసామ్రాజ్యము పతనమైపోగా 1575-1687 సంవత్సరములమధ్య శ్రీకాకుళముజిల్లాప్రాంతమంతయు గోలకొండ నవాబుల స్వాధీనమై మహమ్మదీయుల అధికారముక్రిందికి వచ్చినది

1757వ సంవత్సరమున బొబ్బిలియుద్ధము జరిగినప్పుడు ఫ్రెంచిజనరల్ బుస్సీ విశాఖపట్టణము గంజాంజిల్లాలు గల ప్రాంతమునంతటిని ఆక్రమించుకొనెను ఫ్రెంచివారి కుతంత్రములతో విసుగుచెందిన విజయనగరజమీందారులు, ఆంగ్లేయుల సహాయముతో తూర్పుగోదావరిజిల్లాలో చందుర్తి యను ప్రదేశమున 1758 లో జరిగినయుద్ధమునందు ఫ్రెంచివారి నోడించిరి అప్రభువులీప్రాంతమును తమస్వాధీనములోనికి దీసికొనిరి

1571వ సంవత్సరమున ఇబ్రహీంకుతుబ్‌షా ఈప్రాంతమును జయించెను ఇతరప్రాంతములతోపాటు శ్రీకాకుళముసర్కారు కూడ అతని స్వాధీనమైనది కొంతకాలమునకు గోలకొండ రాజ్యముతోపాటు ఈప్రాంతముగూడ మొగలుల వశమైపోయినది. మొగలుల ప్రతినిధులుగా నైజామునవాబు లీప్రాంతమునందు అధికారము నెరపిరి

చందుర్తి యందు ఫ్రెంచివారిని ఆంగ్లేయులు పరాజితులను జేయగా సంతసించిన నైజాము నవాబులు గుంటూరు జిల్లా తప్ప మిగిలిన ఉత్తరసర్కారులనన్నింటిని ఆంగ్లేయుల కొసగిరి.

క్రీ. శ. 1764 వ సంవత్సరమునుండి ఈప్రాంతమును ఆంగ్లేయులు పాలింపదొడగిరి.

ముస్లిములపాలనలో చికాకోల్ సర్కారు ఇచ్ఛాపురం చికాకోల్ కాశింకోట అను మూడు భాగములుగా విభజింపబడియుండెను. వీటిలో మొదటిరెండింటిని గంజాంజిల్లాయందును మూడవదానిని విశాఖజిల్లాయందును ఆంగ్లప్రభువులు కలిపివైచిరి. 1802 వ సంవత్సరమున జరిగిన పర్మనెంటు సెటిల్ మెంటుచట్టము ననుసరించి ఈజిల్లాలో పెక్కు జమీందారీలు యేర్పడినవి. అదివరకు స్వతంత్రులై రాజ్యపాలనము సాగించిన రాజులు జమీందారులుగా మారిపోయిరి.

ఈజిల్లాయందు ప్రథమమున జమీందారీప్రాంతమధికముగా నుండెడిది. పెద్దవియగు పర్లాకిమిడి బొబ్బిలి విజయనగర జమీందారులకు జెందిన గ్రామములేగాక, "మందసా" మొదలయిన చిన్నగ్రామములుకూడ ఎన్నియో ఉండెడివి. భూస్వామ్యవిధానము రద్దగుటవలన ఇవన్నియు రైతువారీవ్యవస్థలోనికి వచ్చినవి. 1936 సం॥ లో ఒరిస్సా రాష్ట్రనిర్మాణము జరిగినప్పుడు గంజాంజిల్లాయందలి దక్షిణభాగమును విశాఖజిల్లాలోని ఉత్తరభాగముతో కలిపిరి. 1950 సం॥ రంలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము విశాఖజిల్లానుండి దీనిని విడదీసి నేటి శ్రీకాకుళముజిల్లాగా రూపొందించినది.

వృ. వేం.

## శ్రీ కృష్ణావతారము

ధర్మసంస్థాపనముకొరకు భగవానుడుపుడమిపై అవతరించుట అవతారమనబడుచున్నది. ఈఅవతారములు ఆవేశావతారము అంశావతారము పూర్ణావతారము పూర్ణతరావతారము, పూర్ణతమావతారము అని యైదువిధముల మహర్షులువర్ణించిరి. ఒక ఘనకార్యమును సాధించుటకు భగవచ్ఛక్తి యొకవ్యక్తిని ఆవేశించుట ఆవేశావతారమనబడుచున్నది. పరశురామాదులు ఆవేశావతారముల కుదాహరణములు. మత్స్యకూర్మాదులు అంశావతారములు. వీటియందు భగవత్కళ అభివ్యక్తమగును. మానవరూపమున పూర్ణముగ భగవత్కళ అవతరించుట పూర్ణావతారము. శ్రీరామచంద్రాదులు పూర్ణావతారములు. నృసింహరూపమున ఉగ్రశక్తితో అవతరించుట పూర్ణతరావతారము. శ్రీకృష్ణు డట్టివారిలో పూర్ణతమావతారమని మహర్షుల మతము. వివిధపథములయందు భగవత్తత్త్వముయొక్క పరిపూర్ణరూపము గోచరించుటయు భగవద్గీతను ఉపదేశించుటయు శ్రీకృష్ణుడు పూర్ణతమావతారమనుటకు నిదర్శనము. యోగియు భోగియు త్యాగియు బ్రహ్మచారియు బహుభార్యావంతుడును రాజనీతివేత్తయు యోధుడునై విశ్వరూపమును చూపుట ధర్మోపదేశ మొనర్చుట మొదలైన బహువిధ ధర్మములు శ్రీకృష్ణునియందు ఆదర్శముగ గోచరించుచున్నవి. వేదములయందు బీజరూపముగను శ్రీకృష్ణుని చరిత్రము భారత భాగవత హరివంశ విష్ణుపురాణాదులయందు విపులముగ వర్ణింపబడియున్నది. పాతంజల యోగశాస్త్రమున వర్ణింపబడిన సిద్ధులన్నియు శ్రీకృష్ణచరిత్రమున సనిదర్శనముగ వర్ణితములై గోచరించుచున్నవి. అయినను నళినీదళగతజలబిందువువలె శ్రీకృష్ణుడు లోకయాత్రకు అతీతుడై యుండుట అతని పరమాత్మత్వమునకును అవతారశ్రేష్ఠత్వమునకును కారణములగుచున్నవి. విరుద్ధధర్మములు వాటి సహజవైరుధ్యమును పరిత్యజించి ఈ అవతారపురుషునియందు అభివ్యక్తములైనవి.

కృష్ణచరిత్రము : కృష్ణుడు దేవకీవసుదేవుల పుత్రుడు. దేవకియొక్క అష్టమగర్భమున ఇతడు జన్మించెను. దేవకి సోదరుడు కంసుడు. దేవకి అష్టమపుత్రుడే తనను సంహరించునను ఆకాశవాణిపలుకులు విని కంసుడీదంపతులను కారాగారమందుంచెను. దేవకి ప్రసవించగనే తనకావార్త తెల్పుడని కంసుడు భటులనాజ్ఞాపించి వారినచట కావలియుంచెను. పుట్టగనే కృష్ణుని చంపవలెనని కంసుడు నిశ్చయముతో నుండెను. కృష్ణుడు జన్మించు సమయమున భటులు గాఢనిద్రలో నుండిరి. వసుదేవు డాశిశువునుగొనిపోయి వ్రేపల్లెలో అపుడే ప్రసవించిన యశోద ప్రక్కను బెట్టి యామె కనిన స్త్రీశిశువును తెచ్చి దేవకిదగ్గర నుంచెను. దేవకి ప్రసవించిన వార్త విని కంసుడు వచ్చెను. ఖండించుటకు ఆతడు తన కత్తినెత్తి శిశువును పైకెగురవేయగా ఆమె, నిన్ను చంపువాడు వ్రేపల్లెలో పెరుగుచున్నాడని చెప్పి యంతర్ధానము నొందెను.

వసుదేవుడు చేసిన మార్పు యశోదకు తెలియదు. కృష్ణుని తన కుమారునిగనే భావించి పెంచుచుండెను. ఈబాలుని చూచుటకు వసుదేవుడు తనపురోహితుని పంపెను. ఆతడు నందుని

యింటికి వచ్చి బాలుని చూచి ఈశిశువు తొల్లి ధవళారుణ పీతవర్ణుడై యిపుడు నల్లనైనకతంబున కృష్ణుండయ్యె నని యెను. అప్పటినుండియు అతనికి కృష్ణుడను నామము వచ్చెను.

ఆ మాయాకన్యవలన తనను జంపువాడు వ్రేపల్లెలో పెరుగుచున్నాడని విని కంసుడా బాలుని జంపుటకు నేకయత్నములు చేయుచుండెను. కృష్ణుని గుర్తింపలేక అతడు శిశువుల నందరిని మయింపజేయుచుండెను. తృణావర్తుడను రాక్షసుడు సుడిగాలియై వచ్చి దీని నెగుర వేసికొనిపోయి బరువు భరింపజాలక క్రిందబడెను. వానిని కృష్ణుడు సంహరించెను. పూతన యనురాక్షసస్త్రీ యొకతె కృష్ణుని జంపుటకై సుందరాకారయగు వరకాంతవలె వచ్చి శిశువులందరికి నెలెనే కృష్ణునిపట్ల కూడ వాత్సల్యము నటించుచు తన విషదుగ్ధము నిచ్చెను. కృష్ణుడీ రాక్షసవనిత శక్తిని పీల్చి విగతజీవిత నొనర్చెను. కంసుడు తన ప్రయత్నమును వీడక ధేనుకాసురుడు బకాసురుడు కేశివ్యోములు మొదలగు రాక్షసులను పంపి కృష్ణుని తుదముట్టింప ప్రయత్నించెను. వారు వచ్చి కృష్ణు నంతమొందింపదలచి వానిచే వారే హతులయిరి.

బాల్యమున కృష్ణుడు మిక్కిలి యల్లరి చేయువాడు. ఈయల్లరి పనులెల్లరకు హృదయరంజకముగనే యుండును. అతడు పాలు వెన్నలను దొంగిలించి భక్షించినను ప్రేమతో నవ్వుదురే కాని కొట్టరైరి. యశోదా! నీకుమారుడల్లరి చేయుచున్నాడని నలుగురు చెప్పగా ఆమె యాతనిని రోటికి కట్టివేసెను. అతడు ప్రాకుచు రోటిని యీడ్చుకొనిపోయెను. దానినతడు రెండు మద్దిచెట్లమధ్యను డి యీడ్చుకొనిపోగా అవి కూలి అందుండి శాపవిమోచితులైన యిరువురు గంధర్వులు నలకూబరమణిగ్రీవులను వారు వచ్చి కృష్ణునకు నమస్కరించి చనిరి.

ఒకనాడు కృష్ణునితో ఆడుకొను బాలురు యశోదతో కృష్ణుడు మన్ను తినుచున్నాడని చెప్పిరి. యశోద కృష్ణుని మందలింప అతడు నోరు తెరచినంతనే అందు వాల్గు భువనములను ఆమె చూచి తన కుమారుడు సకలభువనకర్తయని గ్రహించెను.

కృష్ణుడంతటివాడైనను తన తోడి గోపబాలకులతో కలిసిమెలసి మసలువాడు. అతడును జల్దిచిక్కములను భుజముపై వేసికొని యరణ్యములకు పోయి పశువులను గాచువాడు. యమునానదీతీరమున కృష్ణుడు పశువులను కాచుచుండగ రాక్షసుడొకడు లేగయై వచ్చి దూడలను చంపుచుండెను. దూడరూపమున వచ్చిన రాక్షసునెరింగి వానిని కృష్ణుడు వధించెను. ఆవులనింటికి మరలించి వచ్చుచుండగ అవి కాళింది మడుగులోని జలమును త్రాగెను. ఆనీరు కాళియ విషముతో సంకలితమగుటచే గోవులు మృతినొందెను. కృష్ణుడు వానిని బ్రతికించి ఆమడుగునకు సమీపమునమున్న చెట్టునెక్కి కాళియుడను సర్పముపై నురికెను. భుజగము వానిని కరవబూనెను. కాని కృష్ణుని పదభారమున దాని శిరస్సు క్రుంగిపోయెను. నాగకన్యలు వచ్చి తమకు పతిభిక్షమిమ్మని వేడ కృష్ణుడు కాళియుని జంపక విడచెను.

ఒకనాడు వ ములో గోవులను మేపుచుండిన గోపకులను గోవులనుగూడ బ్రహ్మ మాయాగుహయందు దాచెను. కృష్ణుడెంత నెచ్చట వెదకినను అవి కనబడలేదు. తనతోవచ్చిన వారిని వారివారి తలిదండ్రుల కప్పగింపక కృష్ణుడు తానే అన్ని రూపులలో గోపులలై గోవులను తోలుకొనిపోవు వాడలై వారివారి యిండ్లలో సంచరించుచు నొకయేడుండెను. బ్రహ్మ అచ్చెరువంది కృష్ణుని సందర్శించి స్తుతియించెను.

ఒకనాడు వనములో కార్చిచ్చు వ్యాపింపగా గోపకులెల్లరు భీతిల్లిరి. వారు కృష్ణుని చేత రక్షింపుమని వేడగా కృష్ణుడు వారిని కన్నులు మూసికొనుడని యాదావాగ్నిని మ్రింగివేసెను. బాల్యమున అతడు కావించిన అమానుష కార్యములు వర్ణనాతీతములు. నందుడు ఇంద్రయాగమును చేయబోగా ఇంద్రునికై యాగమేల? ఇష్టముండెనేని పర్వతములను గోవులను బ్రాహ్మణులను సంప్రీతులను చేయుమని తండ్రిచేత కృష్ణుడాయాగమును మాన్పించెను. ఇంద్రునకు కోపమువచ్చి రాళ్ళవాన కురిపింపగా కృష్ణుడు గోపకులకభయమిచ్చి గోవర్ధనపర్వతమును తనవ్రేలితోనెత్తి గొడుగుగబట్టి దానిక్రిందకు సకలజనులను పశువులను రావించి రాళ్ళవానవలన అపదరాకుండ కాపాడెను. అప్పుడింద్రుడే సిగ్గుపడివచ్చి కృష్ణునకు నమస్కరించెను.

కృష్ణుడును బలరాముడును సాందీపునొద్ద చదువుకొనిరి. అపుడే కుచేలునితో కృష్ణునికి స్నేహమయ్యెను. ఆపేద బ్రాహ్మణునితోడి చెలిమిని, కృష్ణుడు రాజైన పిదపకూడ

మసుపలేదు ఒకనాడాతడు తెచ్చిన అటుకులను కృష్ణుడు ప్రీతితో పుచ్చుకొనెను కుచేలునికి కావలసిన సంపదలిచ్చెను సాందీపుని పుత్రుడు ప్రభాసతీర్థమున స్నానము చేయుచు మునిగెను తనకు గురుదక్షిణముగ తనకుమారుని తెచ్చియిమ్మని సాందీపుడు కోరగా కృష్ణుడు సముద్రునికడ కరిగి సాందీపుని పుత్రుడు యమలోకమునందుండుటెరిగి అచ్చటికేగి గురుపుత్రుని దెచ్చి గురువున కర్పించెను

కృష్ణుని గోపకాంతలందరును ప్రేమించియుండిరి అతని సౌందర్యము వేణుగానము గోపకాలోకమును మిక్కిలి మోహపెట్టుచుండెను అతని గానమును విని వారు తన్మయులై తమ్మును తమవారిని మరచి యతనిని చేరియుండురు కృష్ణుడు వారితో కలసిమెలసి యాడుచుండును ఒకనాడు గోపకాంతలు తమపుట్టములను వదలి గట్టున పెట్టి స్నానముచేయుచుండగా కృష్ణుడు ఆ వలువలను పట్టుకొని చెట్టెక్కి కూర్చుండెను విగతవస్త్రలైన యావనితలు సిగ్గుచే చాలసేపటివరకు బయటకు రాక తుదకెట్టులో వచ్చి యాతనిని ప్రతిమాలుకొనిరి వారి నట్లు రావింపగల్గినందుకు కృష్ణుడు నవ్వుకొని వారి చీరలను వారికిచ్చివేసెను

లోకమంతయు కృష్ణుని ప్రేమించుచుండెను కాని కంసునికంతకంతకు వానిపై ద్వేషము హెచ్చుచుండెను అతనిని చంపుటకిదివరకు చేసిన యత్నములు నిష్ఫలములయ్యెను తననగరమునకు రావించి యచ్చట అతనిని సంహరించుటకై కృష్ణుని పిలుచుకొనిరమ్మని యక్రూరుని పంపగా కృష్ణుడు బలరాముడును మధురానగరమునకేగిరి క్రౌర్యముతో కంసుడు వీరిమీదికి తోలిన కువలయాపీడమను మదపుటేనుగును మావటివానినిగూడ కృష్ణబలరాములు వధించిరి ముష్టియుద్ధముచే వీరిని సంహరింపుమని పంపబడిన చాణూర ముష్టికులను మల్లురుకూడ కృష్ణబలరాములచే తుదముట్టింపబడిరి తుదకు కృష్ణుడు కంసునిపైబడి అతనిని వధించి తన తలిదండ్రులగు దేవకీవసుదేవులను బంధవిముక్తులను గావించి కంసుని తండ్రియగు ఉగ్రసేనునకు పట్టముకట్టెను కృష్ణుని పొందగోరిన కంసదాసియగు కుబ్జకు కృష్ణుడు దర్శనమిచ్చి యామె కుబ్జత్వమును బాపెను

కంసుని మామయగు జరాసంధున కీవార్త తెలిసి, కృష్ణుని వధింప కాలయవనుని పంపగా ముచికుందుని తీక్ష్ణదృక్కుచే అతడు భస్మమయ్యెను కాలయవనుడు గతించినను, జరాసంధుడు కృష్ణుని వెంటబడి బాధించుచుండుటచే కృష్ణుడు మధురానగరమును వీడి కొంతకాలము ప్రవర్షణగిరిపై కాలముగడపెను

ఇట్లుండ భీష్మకరాజు కుమార్తె రుక్మిణిని శిశుపాలునకిచ్చి వివాహముచేయుటకు ఆమె సోదరుడగు రుక్మి నిశ్చయించి స్వయంవరమును చాటింపించెను కంస జరాసంధ శిశుపాలాది దుష్టులు రుక్మికి మిత్రులు కృష్ణునియందే రుక్మిణి మనస్సు లగ్నమగుటచే, అతడు స్వయంవరమునకు వచ్చునో రాడో యనియు వచ్చినచో దుష్టులు అతనికెట్టి యపకృతిగావింతురో యనియు ఆమె భయపడి ఒక వృద్ధబ్రాహ్మణునిచే కృష్ణునకు తనను రాక్షసవివాహమున కొనిపొమ్మని వర్తమానమంపెను కృష్ణుడట్లే వచ్చి సకలనృపకుమారుల సమక్షములో రుక్మిణిని గ్రహించి తనరథముపై పెట్టుకొని రథమును నడిపించెను రుక్మి కృష్ణునితో యుద్ధమునకు తలపడగా కృష్ణుడాతనిని సంహరింప నిశ్చయించుకొనియు బలరాముని కోరికపై రుక్మి తలను బోడిగజేసి, యవమానించి పంపెను

కృష్ణుడు రుక్మిణినేకాక జాంబవతిని సత్యభామను కాళిందిని మిత్రవిందను భద్రను నాగ్నజితిని లక్షణనుగూడ వివాహమాడెను ఈయెనమండుగురు భార్యలేకాక పదునారువేల గోపికలతోకూడ కృష్ణుడు క్రీడించువాడు ఒకనాడాతని మహత్త్వమును చూడగోరి నారదుడు గోపికలందరిండ్లకు చనగా అందరిచెంతను అతనికి కృష్ణుడు కనబడియెనట!

ద్రౌపదీస్వయంవరమును చూచిననాటినుండి కృష్ణునకు పాండవులయెడ ముఖ్యముగా అర్జునునియెడ అనురాగమధికమయ్యెను అందుచే బలరాముడు నగరమున లేనిసమయమున అతనికిష్టములేకున్నను తనచెలియలగు సుభద్రను అర్జునునకిచ్చుటకై యతిరూపమున అతనిని రావించి సుభద్రార్జునుల వివాహము గావించెను తదాది తటస్థించిన యుద్ధములన్నిటియందు అర్జునుని ప్రక్కన కృష్ణుడుండి అన్నివిధముల సహకరించుచుండెడివాడు

ఆకాలమున కృష్ణునకు వైరిరాజులు పలువురుండెడివారు వారి క్రూరత్వమును కృష్ణుడు సహింపకుండుటయే ఆరాజులతో వైరమునకు కారణమయ్యెను జరాసంధుడు చెరబెట్టి వధింపబోవుచుండిన రాకుమారులను కృష్ణుడు విడిపింప యత్నించుటయే అట్టివైరమునకు హేతువు తరచుగా మధురపై దాడివెడలుచుండిన జరాసంధాదులకు శిశుపాలాదులును

సహాయపడుచుండిరి. కృష్ణుడు సైతము జరాసంధాదుల బాధలు తాళలేక కొలదికాలము మధురనుకూడ వదలి వెళ్లవలసినదాయెను.

ధర్మరాజు తలపెట్టిన రాజసూయయాగమునకు పూర్వమే కృష్ణుని ప్రోత్సాహమువలన భీముడు జరాసంధుని సంహరింపగల్గెను. రాజసూయయాగసందర్భమున పూజార్హుడు కృష్ణుడే యని భీముడు పలుకగా సభయందుండిన శిశుపాలుడు ఆగ్రహించి కృష్ణుని నిందింప నారంభించెను. శిశుపాలుని నిందావాక్యములను సహింపజాలని కృష్ణుడు చక్రప్రయోగముచే అతనిని ఖండించిన ఫలితముగా శిశుపాలుని దేహమునుండి తేజస్సు బయల్వెడలి కృష్ణునియందు ప్రవేశించెను. ధర్మజుని రాజసూయము పూర్తియగుటయు కృష్ణుడు తన నగరమునకు వెడలుటయు సంభవించెను.

ఒకసారి కృష్ణునికడ కింద్రుడు వచ్చి యదితి కుండలములను వరుణచ్ఛత్రంబును నరకుడపహరించెనని చెప్పగా కృష్ణుడు సత్యభామ వెంటరా నరకునిపై యుద్ధమునకు వెడలెను. యుద్ధమున వారు నరకుని సంహరించి అతనిచే చెరపెట్టబడిన పదునారువేల స్త్రీలను విడిపించి కుండలములను ఇంద్రనగరములో ఇచ్చివైచెను. ద్వారకకు మరలివచ్చుచు కృష్ణుడు నందనవనమందలి పారిజాతములను కొనితెచ్చుచుండగా ఇంద్రుడడ్డగించి కృష్ణునిచే ఓడెను. సత్యభామాకృష్ణులు ఎట్టకేలకు ద్వారకకు చేరుకొనిరి. శిశుపాలుని చంపెనను కోపముతో దంతవక్త్రుడను నాతడు కృష్ణునిపై యుద్ధమునకువచ్చి అతనిచేతిలో మడిసెను.

ఇట్లెన్నియో పోరాటములందు శత్రువధలో నిమగ్నుడై యున్న కృష్ణునకు పాండవుల వార్త తెలియదయ్యె. ఈ లోపుననే వారు జూదమాడుటయు రాజ్యము నోడుటయు వనవాసమున కేగుటయు కృష్ణుడు విని చింతాక్రాంతుడై వారిని చూచుటకు అరణ్యమున కేగెను. కృష్ణుడు పాండవులతో ముచ్చటించి కౌరవులు న్యాయముగ పాండవులకు రాజ్యభాగమీయకుండిరేని యుద్ధమొనర్చి వారిని గెలుచుటే తగిన ధర్మమని చెప్పి వెనుదిరిగి చనియెను.

ద్రుపదుని పురోహితుడు రాయబారము నెరపుటకై కౌరవులచెంతకు పోయెనుగాని వారు రాజ్యభాగమిచ్చుట కంగీకరింపకుండుటచే యుద్ధము తప్పనట్లుండెను. యుద్ధములో కృష్ణుని సహాయముకోరుట కర్జునుడు అతని సన్నిధికి వచ్చునప్పటికే దుర్యోధనుడచ్చటకేతెంచి కృష్ణుని తలదగ్గర నున్నాసనమున కూర్చుండియుండెను. తాను ముందుగ జూచిన అర్జునుని తనకేమిసాయము కావలెనో కోరుకొమ్మని యడుగ అర్జునుడు ఒక కృష్ణుని సహాయమునడిగెను. దుర్యోధనుడందులకు సంతసించి కృష్ణుని సైన్యమును తనకు సహాయముగ నిమ్మని కోరెను. అంతట కృష్ణుడు ఇరువురను వీడి పాండవులను జూడ ఉపప్లావ్యమునకు వెడలెను. కౌరవులతో ఎట్లయినను సంధి పొసగింపుమని పాండవులపక్షమున ధర్మరాజు కృష్ణుని వేడ కృష్ణుడు అట్లేయని బయలుదేరి కౌరవులవద్దకు వెళ్లెనే గాని తాను ద్రౌపదితో చెప్పిన మాటలనుబట్టి చూడగా అతడు మనసార సంధిని వాంఛించియున్నట్లు తోచదు.

కృష్ణుని రాక విని అతని గౌరవార్థము హస్తినాపురమలంకరింపబడినది. విదురునింట కృష్ణుని ఆతిథ్యమొసగబడినది. కౌరవసభలో కృష్ణుడు ధృతరాష్ట్రునకు చెప్పవలసిన రీతి నతనికిని దుర్యోధనునకు చెప్పవలసిన తీరున అతనికిని హితవు పల్కెను. కాని అతనిమాటలు వారి కెక్కకుండుటచే దుర్యోధనుడు కృష్ణుని నిరసించి పాండవుల ప్రాపును నశింపజేయ దలచెను. కృష్ణుడీకపట నాటకమును కనిపెట్టి నిండుసభలో తనవిరాట్ స్వరూపమును చూపగా భీష్మాది సుజనులాతనిని స్తోత్రముచేసిరి. అప్పటికిని సుయోధనునకు వివేకముదయింపక, పాండవుల రాజ్యభాగము అపహరింపవలెనను దుశ్చింతతోనే యుండెను. కృష్ణుడు తిరుగుమార్గమున కర్ణుని తేరదీసి అతడు కుంతీతనయుడగుట నెరుకపరచి పాండవులతో వైరమును మాని అరవభర్తగా పాంచాలిని పెండ్లియాడి పాండవులతో కలిసి సుఖముగా రాజ్యమేలుమనియు ఘోరయుద్ధమును, జననాశనమును తప్పింపుమనియు వినవించెను. కాని స్వార్థరహితుడును మహాశూరుడును స్వామికార్యపరాయణుడునైన కర్ణుడు అచంచలమైన తన మనోనిశ్చయమును వీడలేదు.

సంధిపొసగనందున కౌరవపాండవయుద్ధము జరుగవలసి వచ్చెను. కృష్ణుడు పార్థునకు సారథియయ్యెను. ఇరుపక్షముల వారు తమతమసేనావాహినులతో కురుక్షేత్రమున చేరి అర్జునుడు తనసేనలను ఎదిరిసేనలను, అందు భీష్మాదియాప్త బంధువులను జూచి వికలమనస్కుడయ్యెను. వారిని జంపినగాని తనకు లభింపని రాజ్యము తనకు వదలని విముఖుడయ్యెను. తనచేతులార ఆప్తబంధువులను జంపజాలననియెను, అట్టి అవ

త్సమయమున కృష్ణుడర్జునునకు తత్త్వోపదేశము చేసెను. యుద్ధము చేయువాడర్జునుడుగాని చేయించువాడు తానే. యుద్ధమంతయు కృష్ణుడే నడిపెను. ఎవ్వరితో ఎప్పుట్టున ఎట్లు పోరాడి శత్రువుల హతముచేయవలెనో కృష్ణుడర్జునునకు బోధించుచు శత్రువులజేయులై గెలువరాకున్న సమయములలో అతడుపాయము మాత్రము సూచించుచు అర్జునునిచేత వే కౌరవులను వధింపజేయుచుండెను. ఇట్లు పాండవుల సహజపరాక్రమముచేతను అమోఘమైన తన ఉపాయపరంపరచేతను కృష్ణుడు కౌరవసైన్యమును నిస్సైన్యమొనరెను. యోధానుయోధులగు కర్ణదుర్యోధనాదులెల్లరు యుద్ధమున మడసిరి.

భీముడు దుర్యోధనుని చంపిన తీరును చూచి సహింపజాలక బలరాముడు భీమునిపై హలమెత్తగా కృష్ణుడు వానితో పూర్తిగా యథార్థములుకాని వాక్యములను కొన్నిచెప్పి అతనిని శాంతచిత్తుని జేసెను. దుర్యోధనవధానంతరము అశ్వత్థామ పాండవవంశనిర్మూలమొనర్పగోరి ఉత్తరగర్భమునున్న శిశువుపైగూడ బాణప్రయోగము చేయగా కృష్ణుడాశిశువును రక్షించెను. ఇవ్విధమున కురుపాండవయుద్ధమంతయు కృష్ణుడే నడపించి దుష్టసంహారమును శిష్టరక్షణమును గావించి కృతార్థుడయ్యెను. కురుపాండవయుద్ధానంతరము కృష్ణుడు ద్వారకకు చని సుఖముగనుండెను.

కృష్ణునకు రుక్మిణియందు ప్రద్యుమ్నుడు చారుదేష్ణుడు సుచారుడు భద్రచారుడు మొదలగువారును సత్యభామయందు భానుడు చక్రుడు మొదలగువారును జాంబవతియందు సాంబుడును మిత్రవిందయందు మిత్రవంతుడును నాగ్నజితియందు సునీథుడు మిత్రబాహువు మొదలగు కుమారులు కలిగిరి. వారికుచితరీతిని వివాహములయ్యెను.

కొంతకాలము తర్వాత కృష్ణుని జూచుటకై కణ్వుడు నారదుడు విశ్వామిత్రుడు ద్వారకకు రాగా యాదవకుమారులు కొంటెగ మన సాంబునకు స్త్రీవేషము వేసి ఆమునుల వద్దకు కొనితెచ్చి 'అయ్యా! ఈమె బభ్రువుని భార్య. సంతానము కలుగునా?' అనియడుగ, వారాతని సాంబునిగ నెరిగి, యాదవకులమునకు నాశనకరమైన ముసలము పుట్టునని చెప్పిరి. మరునాడే సాంబుని కడుపునుండి రోకలి పుట్టెనట! ఈమాట యాదవులు కృష్ణునితో జెప్ప వారు చేసిన కొంటెపనికి కృష్ణుడు విచారించి రోకలిని ముక్కలుగ చేయించి సముద్రమున పారవేయించెను. పిమ్మట కొలది దినములకే యాదవులు సముద్రతీరమునకరిగి మద్యపానమత్తులై రోషజనకముగ సంభాషించుకొనుచు ఒకరినొకరు కొట్టుకొని చచ్చిరి. ఇట్లు యదువంశము క్షయముకాగా బలరాముడు నగరమును వీడి తపోవనమునకేగెను. అది విని కృష్ణుడు తానును తపమొనర్చుటకై వనమునకేగి సేదదేరుటకై పరుండెను. అతనిని చూచి మృగమని తలచిన బోయవాడొకడు గురిపెట్టి బాణమును విడువగా అది కృష్ణుని అరకాలియందు తగిలి అతడు పరమపదమునొందెను. కృష్ణునికై అరణ్యములో వెదకుచు వచ్చిన అర్జునుడు అతని శరీరమును గాంచి దుఃఖితుడై దానికగ్నిసంస్కారము చేసెను.

గీతా సందేశము — భగద్గీత అమృతమహోదధి. సంకుచితమగు మానవబుద్ధికి గీతార్థము పూర్తిగా అవగతమగుట అసాధ్యము. గీతాచార్యుడైన కృష్ణభగవానుని మనస్సుతో తాదాత్మ్యమునొందినవారికే అది సమగ్రముగ బోధపడును. అంతవరకు మానవునిది సంకుచితదృష్టియే. ఏనుగును చూడబోయిన గ్రుడ్డివారివలె ఏకాంశమునుమాత్రము గ్రహించి అదే పూర్ణసత్యమని వాదించు సంప్రదాయకులింది వైరితనమునకు తప్పరు. దృక్పథములన్నిటిని సమన్వయమొనర్చిననేగాని సత్యమును సమీపింపజాలము.

గీత బ్రహ్మవిద్యయనియు యోగశాస్త్రమనియు చెప్పబడినది. వేదముయొక్క తుదిభాగమైన ఉపనిషత్సారమది. దేనిని తెలిసికొన్నచో ఇక తెలియనిదియుండదో అట్టి సర్వోత్కృష్టమగు బ్రహ్మవిద్య రెండువిధములు. (1) ఇంద్రియగోచరమగు విషయములను బోధించునది. ఈనాటి శిక్షణమంతయు ఈజ్ఞానమునే అందజేయును. - (2) ఆత్మజ్ఞానమును తెలుపునది. తెలుపునది ఆత్మజ్ఞానమైన ఈ బ్రహ్మజ్ఞానమును ప్రతిపాదించు ఉపనిషత్సారమే గీత. బ్రహ్మవిద్య గ్రంథములందును ప్రవచనములందును మాత్రముండి పరోపదేశమునకే ఉపయోగపడునెడల అది శుష్కవేదాంతమనిపించుకొనును. మానవజీవితసాధనమునకు పునాదియగు వేదాంతవిజ్ఞానము నిత్యజీవితమందు ఆచరణయోగ్యమైనప్పుడే దాని యనుభవముకల్గి మానవజన్మ సఫలతగాంచును. నిత్యజీవితమందీ వేదాంతవిజ్ఞానమును అనుసంధించు విధానమే యోగశాస్త్రమనబడుచున్నది.

గీతాసారమగు రెండవఅధ్యాయమందు సాంఖ్యబుద్ధి, యోగబుద్ధి అను పేర్లతో శ్రీకృష్ణుడు బ్రహ్మవిద్యను, యోగ

శాస్త్రమును వివరించినాడు. జ్ఞానస్వరూపుడగు శ్రీకృష్ణుడును ధనుర్ధారుడై కర్మరంగమున క్రియాశీలుడగు అర్జునుడును కలిసినచోటనే సిరిసంపదలు జయము సుస్థిరముగా నెలకొనును. అనగా జీవితవిధానము నెరుగుటకైన జ్ఞానము మొదటి అవసరము; దానిని క్రియ రూపమున ఆచరించుట రెండవ అవసరము. ఈ రెండిటి సమన్వయము సిద్ధించిననేగాని జీవితము పూర్ణము కాదు. ఈ విషయమునే శ్రీకృష్ణుడు తనసందేశములో వివరించినాడు. మానవుడు తానున్న పరిస్థితులతో అసంతృప్తిచెంది ఆవేదన అతనిలో జనించినగాని అంతకంటె ఉన్నతతరము విశాలతరము నగు జీవితమున్నదా లేదా ? అను ప్రశ్న అతనియందుత్పన్నము కాదు. కావుననే బ్రహ్మజిజ్ఞాసకుగాని ధర్మజిజ్ఞాసకుగాని తీవ్రమగు ఆవేదన మూలము.

కురుక్షేత్రసంగ్రామరంగమున బంధువులను చూచి వారి వధకై వగచి యుద్ధవిముఖుడైన అర్జునునకు శ్రీకృష్ణుడు గీతను బోధించి యుద్ధోన్ముఖునిగా చేసెను. యుద్ధరంగమున గీతనుపదేశించుటచే ధర్మక్షేత్రమగు మానవశరీరమే కురుక్షేత్రమనియు అందు సదా రెండువిధములగు యుద్ధములు ఘటిల్లుచుండుననియు శ్రీకృష్ణుడు సూచించినాడు (1) పురాణములందలి దేవాసురులు రామాయణమందలి రామరావణులు భారతమందలి కౌరవ పాండవులవలెనే మానవుని మనస్సునందు ధర్మాధర్మభావములకును, సద్వాసనదుర్వాసనలకును ఎడతెగనిసంఘర్షణము జరుగుచుండును (2) ఇట్లే బాహ్యప్రాపంచిక జీవితములో శిష్టులకు దుష్టులకు సంగ్రామమెప్పుడును సాగుచునేయుండును. ఈ రెండుపోరాటములను ఎట్లునిర్వహింపవలెనో గీత బోధించుచున్నది. కర్మఫలితములు దైవాధీనములు గావున దేవునిపై భారమిడి ఫలప్రాప్తికి అధర్మప్రవృత్తిని విడనాడి ధర్మమార్గమున చరించుటచే పాపము అంటదనియు సర్వేశ్వరుడగు తననే సదా స్మరించుచు జీవితసంగ్రామమును నిర్భీతితో నిర్వహింపవలెననియు అర్జునునకు శ్రీకృష్ణుడు చేసినబోధ.

ఈయుద్ధములను జయప్రదముగా సాగించుటకు మానవుడు మూడువిధములుగా సిద్ధపడవలెను (1) ఆహార నిద్రా విహారాదులందు నియమములను పాటించి ఇంద్రియమనో నిగ్రహములను సాధించి ఆత్మశక్తులను కేంద్రీకరించుకొనవలెను (2) తోడిమానవులతో ఇచ్చిపుచ్చుకొనుట ద్వారా స్వార్థమును తగ్గించుకొని ఆదర్శపౌరుడై మానవత్వమును సిద్ధింపజేసికొనవలెను (3) ధార్మికజీవితమును అలవరచుకొని తనతోను సమాజముతోను సఖ్యమలవరచుకొని తనలో సాన్నిహిత్యమును అభ్యసింపవలెనని శ్రీకృష్ణుడు చేసిన మరియొక బోధ.

మానవుడేకాక ప్రతిప్రాణియు సుఖమును వాంఛించును. ప్రాపంచికవిషయములవలన లభించు సుఖము అల్పము క్షణికము దుఃఖప్రదము. కనుక వివేకియైన వ్యక్తి అఖండము అనంతము శాశ్వతము దుఃఖరహితమునగు సుఖమునకై యత్నింపవలయును. దీనికై నిత్యానిత్యవస్తువివేకమలవరచుకొని అనిత్యములు అసుఖములగు విషయములయెడ్ల వైరాగ్యమభ్యసింపవలెను. విషయములందు రాగమును వీడుట పరమాత్మయందు భక్తిని అలవరచుకొనుట అత్యవసరము. కాని పూర్వాభ్యాసబలము ఎక్కువగానుండుటచే సక్తతపోయి యుక్తత కుదురుట కష్టము. దీనికై సాధన అత్యావశ్యకము. లోకవ్యవహారములందు నిష్కామబుద్ధిని అభ్యసింపవలెను. జ్ఞానము లేనిదే నరుడు పశుత్వమునుండి మానవత్వమునకును అందుండి దివ్యత్వమునకును క్రమాభివృద్ధినొందజాలడు. ఈ జ్ఞానానుభూతి లేకుండ కావించునది కామము. అది జ్ఞానమును ఆవరించి మానవుని భ్రమలోపడవేయును. నిష్కామకర్మాచరణమువలన స్వార్థమును ఈశ్వరోపాసనమువలన మనోవిక్షేపమును వేదాంతవిజ్ఞానముయొక్క శ్రవణమననాదుల వలన బుద్ధియొక్క ఆవరణదోషమును దూరీకరించి బుద్ధిగుహయందు అజ్ఞానాంధకారములో మిణుకుమిణుకుమని ప్రకాశించు ఆత్మజ్యోతిని మానవుడు దర్శింపవలెనని శ్రీకృష్ణుడు చేసిన ఉపదేశసారము.

ప్రతివ్యక్తియందును సత్త్వరజస్తమోగుణములు హెచ్చుతగ్గులుగానుండును. వీటిననుసరించి వివిధ తత్త్వము లేర్పడినను ఈగుణములు అవినాభావ సంబంధముగలవే. మానవుడు పూర్ణాభివృద్ధినొంది దైవము కావలెనన్నచో అతడీ త్రిగుణముల నాశ్రయించి సాధన సాగింపవలెను. సత్త్వగుణముచే జ్ఞానోదయము రజోగుణముచే అనురాగము తమోగుణముచే మనోనిశ్చయము అలవడును. అనగా సత్త్వగుణ విశిష్టులకు జ్ఞానమార్గము, రజోగుణులకు భక్తిమార్గము తమోగుణులకు కర్మమార్గము స్వాభావికములగునని భావము. వీటిలో ఏదియో ఒకటి ప్రధానముగనున్నను మిగిలినవి పూర్తిగా లోపించుటమాత్రము అసంభవము. కనుకనే శ్రీకృష్ణుడు తనభక్తులకు వలయుజ్ఞానవైరాగ్యములను ప్రసా

దించి వారి నుద్ధరింతునని ఘోషించినాడు ఇదియే గీతా సమగ్రయోగము లేక సమన్వయయోగము అనబడును దీని వలననే మానవునకు ఈశ్వరసాక్షాత్కారము లభించి దివ్య ప్రేమ సాధ్యమై జీవన్ముక్తుడై తరింపగలడు ఇదియే భగవద్గీత యొక్క దివ్యసందేశము

తూ శ్రీ మూ

## శ్రీనాథుడు

జననము క్రీ శ 1375-80 సం॥లకు మధ్యకాలములో శ్రీనాథుడు జన్మించియుండును ఈ వాదమునకుగల ఉపపత్తు లన్నియు ఘుణాక్షరన్యాయమున శ్రీనాథుని కావ్యసంపుటి యందే కుదురుకొన్నవి తన జననకాలమును కావ్యరచనాది జీవితవిశేషములను సూచించు ఆధారచక్రములో "చిన్నారి పొన్నారి - చిరుతకూకటినాడు" (కాశీఖండము-అవతారి - ప 7) అను ఈతని సీసపద్యమునుబట్టి కౌమారము దాటిన యౌవనమును సుమారు పదియేండ్ల ప్రాయమన వచ్చును

జన్మస్థలాదికము తన్నుగురించి గ్రహించుటకు తగిన సాధనసంపత్తిని ప్రసాదించిన పూర్వాంధ్రమహాకవులలో శ్రీనాథుడు ప్రథముడు అయినను ఇందొక వైచిత్ర్యము కలదు అంత సాధనసంపద నొసగియు శ్రీనాథుని యొకొన్ని లీలలను గూర్చియోగాని కడచువగు ఈతని జన్మకర్మాదులనుగూర్చి స్పష్టముగ తెలియవచ్చుటలేదు ఆ తెలిసిన కొద్దిపాటి అంశములయందుకూడ ఊహాపోహములకును ఖండనమండనము లకును అవకాశము అధికము

శ్రీనాథునిది భారద్వాజసగోత్రము; ఆపస్తంబసూత్రము ఆతని తండ్రి మారయ తల్లి భీమాంబ (కాశీ అవ 1 - 12) ఆతడు పాకనాటి నియోగి బ్రాహ్మణుడు ఆతని తాత కమలనాభామాత్యుడు (భీమ 1 21); పద్మపురాణకర్త; వాసిధనటి కాల్పట్టు దాధీశుడు నేటి సముద్రతీరపట్టణములలో నెల్లూరు గుంటూరు కృష్ణామండలమునందలి కలపటము కాల్పట్టణము కాల్పట్టణకోట రేవల్లె దగ్గరనున్న నల్లూరు పూర్వము ... ల్లూరుగా ... ఇప్పటి నెల్లూరు దానికి సమీపస్థమగు కృష్ణపట్టనము? మున్నగువానిని పెక్కుంటిని పెక్కువిధముల శ్రీనాథుని జన్మభూములుగ విమర్శకులు నిర్దేశించియున్నారు భీమమండలము పై ఆతనికిగల ప్రేమాదరములనుబట్టి ఈ మండలము ఈతని జన్మభూమియని కొందరనిరి మొత్తముమీద ఒకవిధముగ కృష్ణామండలమువాడని తేలినను ఈతనినొక కొండవీటివాడనిగాని నెల్లూరివాడనిగాని నిర్ణయింపలేకున్నాము ఎన్నడో విమర్శకాకరికి సార్వభౌముడైన కమల నాభామాత్యచూడామణి కాలమునాటి కాల్పట్టనము నామ రూపములు మారక మనకు చిక్కుటగాని ఒకతాతగారి ఊరును బట్టి మనుమని ఊరు నిర్ధారితమగుటగాని కష్టసాధ్యముగదా! విస్మృతప్రాయములైన యీతని జన్మభూమ్యంశములుబట్టి యీతడాంధ్రుడే కాడు కర్ణాటుడన్న వాదమొకటి రేగెను కాని తనది పాకనాడగుటవలనను కమలనాభామాత్యుడు కాకతీయులనాడు ప్రసిద్ధాంధ్రమహాకవియు ఆంధ్రప్రముఖుడును అగుటవలనను, నాచికేతూపాఖ్యానకర్తయగు దగ్గుబల్లి దుగ్గన తనకు బావమరది అగుటవలనను శ్రీనాథుడు ఆంధ్రుడనియు ఆంధ్రభాషామహాకవియనియు సిద్ధాంతీకరింప బడినది

విద్యాధ్యయనము శ్రీనాథుని బాల్యమునుగూర్చిగాని విద్యాభ్యాసాదులనుగూర్చిగాని ... కరించు సాధనసంపత్తి మృగ్యము కేవలము ఈతనిచేత రచనలయందలి అంశములను ఆధారముగ చేసికొనియే యీనాటివరకు ఈ మహాకవి పాండిత్యగరిమను మనము ఊహించుకొనవలసివచ్చుచున్నది

శ్రీనాథుడు చిన్నవాడే వేదవేదాంగ వేదాంతవిత్తము డయ్యెను వైశేషికమును న్యాయమును సేశ్వరనిరీశ్వర సాంఖ్యదర్శనములను వేరొక షడ్దర్శనములను ఈతడు ఆలోడించినాడు శైవవైష్ణవాగమములను పారము ముట్టెను ఈతని గ్రంథరాశిలో అగపడు సమస్తవిద్యాప్రావీణ్యమును పరికించినచో సమస్తశాస్త్రపరిశ్రమకును పరిసీమ ... దగినది కాశీఖండము నైషధము తర్కమునకు నికషోపలము ప్రాకృతాది భాషాపరిజ్ఞానమునకు సప్తశతి ప్రమాణము పదంటలికృత మహాకావ్యపర్యంతమైనది తన వైదుష్యవైదగ్ధ్యమునకు ఈతడు సర్వత్ర ప్రదర్శించు శాబ్దికజ్ఞానమే తార్కాణము తాను పండితుడైనను జన్మతః కవి అనుటకు ఈతని కావ్యసంచయమంతయు దృష్టాంతము

సంస్కృతకవిప్రపంచములో కాళిదాసమహాకవియు, మురారికవీంద్రుడును భారవి, శ్రీహర్షుడును శ్రీనాథునకు గురుస్థానీయులు సంస్కృతకవులలో అందరియందుకంటె ఆతనికి భట్టబాణునియందు భక్తి అధికము కీర్తిరాణ్మా కావ్యస్య అను బాణుని (భట్టబాణ) మతమును శ్రీనాథకవి తన

కయ్యాసౌభాగ్యముచే తలపించును

ఆంధ్రకవులలో కవిత్రయమునెడమ వేములవాడ భీమకవి యెడను శ్రీనాథునకు సుస్థిరమైన శిష్యభావము

జీవితసంగ్రహము తన జీవితసంగ్రహమును ఆకళించు కొనుటకై శ్రీనాథుని కవితాజీవితమును నాలుగుదశలుగ విభజింపవచ్చును

క్రీ శ 1400-24 వరకుగల యీ ప్రథమదశ యిరువదియైదేండ్లపాటిగలది జననమాదిగ విద్యాభ్యాసాదికమును మరుత్తరాట్చరిత్రము శాలివాహనసప్తశతి పండితారాధ్య చరిత్రమువంటి కృతుల నిర్మాణాదులును ఈ దశావిశేషము లకు పూర్వము జరిగినవని చెప్పనొప్పును అట్టిచో కోమటి వేమ భూపాలుని ఆస్థానమునందు నిర్వహించిన విద్యాధికారిపదవియు ఆ కాలమున నెరవేర్చిన శృంగారనైషధానువాదమును ఈదశకు చెందినవి కావలెను ఈవరికి శ్రీనాథునకు సుమారు నలువది యేండ్లవయస్సు

క్రీ శ 1426-29 ఈదశ రెండవది రమారమి మూడేండ్ల ప్రాతిది అప్పుడు రాజమహేంద్రవరమునకు వీరభద్రారెడ్డి ప్రభువు ఈవీరభద్రారెడ్డి విద్యాంసుడైనాడు శ్రీనాథుడు ఈరెడ్డికి మంత్రిపుంగవుడు బెండపూడి అన్నయ ఇప్పుడే ఆ అన్నయామాత్యుడు శ్రీనాథుని సత్కరించెను ఇతడు అతనికి భీమేశ్వరపురాణమును అంకితముచేసెను ఇది శ్రీనాథుడు సుమారు ఏబదియేండ్లవయస్సునకు లోబడిన కాలము ఈద్వితీయదశావిశేషాగంతము నాటికే కొండవీటిరెడ్ల రాజ్యము అస్తంగతమైనది ఇందుచే శ్రీనాథమహాకవి నిరాశ్రయుడయ్యెను కావున ఇతడు తన ఆబాల్యమిత్రుడగు అవచితిప్పయ్యశెట్టిని సందర్శించి హరవిలాస కృతిని అంకితమొనరించియుండుట యీ దశావిభాగములో జరిగియుండవచ్చును సింగనాయని తెలుంగాధీశునిచే కస్తూరికాది బహుకృతులబొంది విప్రవంశోత్తంగుండు సోమపానాన్నముల విందు లారగించి పంటమైలారవిభునిచే దినవెచ్చములు దీర్చుకొని ద్రాక్షారామ భీమేశ్వరుని సంసేవించి, అయాయుత్సవములలో విహరించి పాండిత్యప్రకర్షకయాత్రలీతడు జరిపినది యీ కాలమునందే అందురు

క్రీ శ 1430-40 ఇది యించుమించు పదియేండ్లపాటు గల తృతీయదశ శ్రీనాథుడు ఇప్పుడు అయిదవపదిదాటి అరవపదిలో ప్రవేశించినాడు అప్పటిదనుక ఇతనికి రాజమహేంద్రవరపు రెడ్డిరాజుల ఆస్థానియందు సన్మానమువందు కొను అవకాశము లభింపలేదు కొండవీటిరెడ్ల రాజ్యమునకును రాజమహేంద్రవరపు రెడ్లరాజ్యమునకును పొసగదాయెను శ్రీనాథుడు కొండవీటి రెడ్డిరాజుల కవిగదా మరి! ఇంతే గాదు రాజమహేంద్రవరపు రెడ్డిరాజుల ఆస్థానపండితులతో ఇతనికి వాగ్వాదమును వైరస్యమును కలుగుట యింకొక దురదృష్టము

ఈ మహాకవి యీ కాలమున మరల దేశసంచారకార్యక్రమమునకు ఉపక్రమించినాడు అన్నయామాత్యునితో కలిసి సింహాద్రియాత్రను నెరవేర్చుకొని శ్రీకాకుళస్వామిని సేవించి అందందుగల చోద్యములనెల్ల తన చాటుప్రబంధములయందు నిబంధించెను వినుకొండ వల్లభరాయని సేవించి క్రీడాభిరామము మూలమున ఆయన మెప్పువడసి సత్కారము నందుకొనినాడు ఆవల్లభామాత్యుడొసగిన ప్రోత్సాహమును పురస్కరించుకొనియే విజయనగరప్రభువగు ప్రౌఢదేవరాయలను సందర్శించి అతని ఆస్థానపండిత ప్రకాండుడైన చంద్రశేఖరక్రియాశక్తి సమక్షమున గౌడడిండిమభట్టును నానాశాస్త్రార్థములలో జయించెను ఈదశయందే డిండిముని కాంస్యఢక్కావిపాటనమును శ్రీనాథునకు స్వర్ణస్నానజనిత ప్రసిద్ధి కలనయు కవిసార్వభౌమ బిరుదప్రదానమును జరిగినవి విన్నట ఇతడు సర్వజ్ఞసింగభూపాలుని కొలువులో సత్కారము నొందెనని కొందరు విమర్శకులు కాని ప్రౌఢరాయలసన్నిధియు డిండిముని కంచుఢక్కను వ్రక్కలించుటయు శ్రీనాథునకు జీవితములో తొలిదశయందే లభించినవని మరికొందరు విమర్శకులు వక్కాణించిరి

క్రీ శ 1440-60 ఈ చతుర్థదశ సుమారు ఇరువది యేండ్లది శ్రీనాథుని కీర్తిలతలు దేశములో నాల్గుచెరగుల యందును కొనలుసాగినవి ఇతని పాండిత్యప్రాగల్భ్యములు దేశమున దిగంతములయందు యశోంబరములు నేయుట వీరభద్రారెడ్డికిని వేమారెడ్డికిని తెలియవచ్చెను వీరి ఆశ్చర్యాద్భుతములకు మేరలేదు 'ఈశ్రీనాథ నినుబోలు సత్కవులు లేరీనాటికాలంబునన్' అని తన్ను సంస్తుతించిన వీరి నుతులను పరశ్శతములుగ శ్రీనాథుడు అందుకొనినాడు తన్మాత్రమే కాదు వేమారెడ్డి తానై 'కాశీఖండము'ను వీరభద్రయ్యపేర అంకితము చేయుమని ఇతనిని అర్థించెను ఈ మహాకవి 'వీరభద్రారెడ్డి విద్యాంసు'డనుటకు ఈశుభారంభముతో శ్రీకారము

చట్టబడినది. ఇక భోగభాగ్యముల కితనికేమి లోపము! కాని సాధనకు పట్టినంత కాలము ఎద్దికి పట్టలేదు. ఇంతలోనే ఆ రెడ్ల రాజ్యము అస్తమించెను. శ్రీనాథుని అదృష్టమును అస్తవ్యస్త మయ్యెను.

ఇప్పుడు శ్రీనాథుడు నిరాలంబుడు. ఆదరమర్యాదలుచూపు పోషకు లితనియెడ నిష్ప్రత్యరమైరి. దీనితో మచ్చరము ఘన మయ్యెను. ప్రాయపు ప్రొద్దుకూడ పడమరముఖము పట్టినది. వీటి అన్నిటికి తోడుగ ఆతనిని వార్ధకములో సంసారభారము కూడ నేదో క్రుంగదీ నట్లుండెను. అర్జితమేగాని ఊర్జితము లేని యాతనికి చినవెచ్చమునకుగూడకరవైనది. రాజమహేంద్ర వరము వీడి "డొంకదేనిజనమటలెన్న" అనుకొనిన యితడు పల నాడుచేరి ప్రజాకవియై పలనాటివీరచరిత్ర కు ప్రాణము పోసినాడు. ఒక వీధినాటక మేమి! "కాటమరాజుకథ" యేమి! గొల్లసుద్దులేమి! వయసు మరలినపదప మహాకవులందరు వెల యించినట్లే యాతడును ప్రజాహితరచనలు పూర్తిగ వెల యించెను. శ్రీశైలయాత్రకు చని శివరాత్రిమాహాత్మ్యము'ను సంతరించి పవ్వూలశాంతయ్యను అలంకరించినాడు. జీవిత సంధ్యాకాలములో 'బొడ్డుపల్లె' ను గుత్తకుగొని కృషిపాల నమునందు నష్టపడి ఒడ్డెరాజుల దండనలకు గురియై కలియు గంబున నికమందరగష్టమమును దివిజకవివరుగుండియల్ దిగ్గురనంగ' అమరపురీయాత్రాకౌతుకుడైనాడు. ఈచరమ చరిత్రతో శ్రీనాథునిజీవితమున చతుర్దశ పరిపూర్ణమైనది.

అలభ్య కృతులు: పల్నాటివీరచరిత్ర ' 'వీధినాటకము క్రీడాభిరామము మున్నగునవి శ్రీనాథునికృతులేకావని ఒక దెస కొందరభిప్రాయపడుచుండగా దంతులూరికాపిరాజు రచించిన మూర్తిత్రయోపాఖ్యానము నందు చెప్పబడిన ధనంజయవిజయము శ్రీనాథునికృతి యేయని మరియొక దెస వినబడుచున్నది. ఇదేరీతిగ నెల్లూరి శ్రీరామకవి రచించిన "కామకళానిధి" లోని ప్రస్తావనను బట్టి శ్రీనాథమహాకవి యొక కామశాస్త్రగ్రంథమునేదో కూర్చినట్లుండెనని కొందర వాదము. మరియు నందనందనచరిత్రము ' మానసోల్లాసము వంటికృతులు శ్రీనాథకృతములేయని ప్రతీతి. ఇట్టిగ్రంథము లన్నియు నేడు అలభ్యములు. ఇందుచే ఈవాదములోని నిజము పరిశీలించుటయు నిగ్గును నిర్ధరించుటయు ఇంతలో పొసగునది కాదు.

సాంసారిక జీవితాదికము: శ్రీనాథుని కుటుంబచరిత్రము గురించియు సాంసారిక జీవితమునుగురించియు కూడ ఇట్లే కొన్ని ఊహాగానములవంటివి కలవు. కాని అన్నెహదీపన్యాయ మున అవిక్రమక్రమముగ ఊహించుచున్నవి. దగ్గుబల్లి దుగ్గనసోదరి మాత్రము శ్రీనాథునకు భార్యకావచ్చును. శ్రీనాథదంపతుల కొక కుమార్తె కలదని వదంతి. ఆమెకు సంతానముకూడ కల దట! ఆదౌహిత్రులేలనోగాని శ్రీనాథునిప్రోదినే పెద్దవారైరట. వారికి శ్రీనాథునివారని యింటిపేరు వచ్చెనట! ఇట్లువచ్చుట శ్రీనాథునకు వారు దత్తులగుటవలననేమో తెలియరాకున్నది. మొత్తముమీద శ్రీరామాభిషేక గ్రంథకర్త తాను ఆవంశ ములోనివాడనని చెప్పుకొనుటమాత్రము జరిగెను.

పోతన శ్రీనాథులకు అంటగట్టబడిన బావమరదులవరుస జనశ్రుతమైపిదప జనవల్లభమైనది. ఈవరుసవావులు చారిత్ర కముగ పొందిపొసగుటలేదు. పొలకువలేని ఈవరుసవావులు స్వార్థమునువిడిచిపెట్టి అత్యంత తిరస్కృతవాచ్యములు కావలెను. ఇట్టివి శ్రీనాథునకుగల లోకప్రియత్వమునుగూడ చాటుచున్నవి.

కావ్యదృష్టి-సృష్టి: శ్రీనాథుడు విశాలాంధ్ర సంచా రముచేసి మహాపండితకవి అగుటచేత ఆంధ్రదేశమునందు ప్రజా జీవనములో జాతీయకాజీవితవిభూతి ఫలించినది. ఆ అభ్యు దయమునెల్ల శ్రీనాథుడు తన కవితాసామ్రాజ్యమునందు ప్రతి ఫలింపచేసి ప్రజాశ్రేయోభిలాషియై సార్వకాలికమగు ఒక సాహిత్య సమగ్రసందేశము నందించుట తనకవితా విధేయధర్మ మని విశ్వసించినాడు.

తాను కవితాక్రతుదీక్షితుడై భావాంబరవీధివిష్ఠితు డై నప్పుడెల్ల శ్రీనాథకవిసార్వభౌమునకు యావదాంధ్ర ప్రదేశమును భావనావస్తువుగ కన్నులకు పొడకట్టును. ఒక్క ప్రజాహిత ప్రభుత్వవిధేయధర్మమును గూర్చియేమి, ఒకపతి దేవతాప్రభావాతిశయమును గూర్చియేమి శ్రీనాథునివాణి కావ్యభణితిలో భారతీయధర్మయాథాత్మ్యమును నిరూపించినది. కావున పూర్వాంధ్రమహాకవుల విజ్ఞానానుభవములతో తన సంస్కారసంప్రదాయములను మేళగించి కరగింపగా రూపు కట్టిన ఆంధ్రత్వముతో ఆంధ్రులకొరకై ఆంధ్రమునందు కావ్యావతరణమును ఒనరించినవాడితడనవచ్చును. మానవ జీవితవిజ్ఞానసర్వస్వమును సుకుమారసుందరముగ వర్ణించిన వాడితడనవచ్చును. అవర్ణ్యసాహిత్యవిజ్ఞానసంపదనంతయు అమృతపాకములో వడకట్టి రసికరసాయనమును సిద్ధముచేసి

లోకమునకు అందిచ్చినాడనవచ్చును.

కావ్యరచనయందలి తన కావ్యనిర్మాణమునందు ఈతని ప్రజాహితవైఖరియు ఈతడు నియోగించిన భాషాసామగ్రియు ఇతడు అవలంబించిన అనువాదపద్ధతియు ప్రశస్తి గాంచినవి.

తాను సాంఘిక జీవితములో (మిసాధింపవలెనన్న ఆలోచనను ప్రజాసాధారణ్యమునందు వెలిగింపగల్గుట శ్రీనాథుని సాహిత్యసృష్టికి ప్రధానదృష్టి. వర్ణాశ్రమాచార నిరతి జ్ఞానసాధనమని యీయన సదుపదేశము. గార్హస్థ్య ధర్మము ముక్తిమంటపసోపానమనికూడ ఇతని నిశ్చితాభిప్రాయము.

ఈ హేతువులను పురస్కరించుకొనియే ప్రజాహిత జీవితవిధానమునుగురించియు నీతినియమవర్తనాదికమును గురించియు ఈతని గ్రంథములలో విపులీకరింపబడెను. నీతినియమములయందు ఆసక్తితో భక్తిరక్తులతో భుక్తిముక్తులను సాధించుటయే సర్వమానవజీవితపరమార్థమన్నది శ్రీనాథ కవిసార్వభౌముని కావ్యసందేశముగా దధిమథనముచేసి విజ్ఞ ధార్మికలోకము వెన్నతీసినది.

స్థూలముగ చెప్పుచో ప్రతిపదార్థరమ్యప్రచురసాహిత్యమును భావానుగుణకల్పితభాషణమును శాబ్దికరూపతాసంధాకౌశల్యమును ఉపసర్గవియోజనాశక్తియు గంభీరతర నిరాఘాట ధారాధుర (ర్య) ధాతునామేంచువిధానచణతయు ప్రసాదరసోచితసంసక్తియు విస్రబ్ధకథనసవిధక్కియు సంస్కృతాంధ్రభాషాద్వయీసాహితీప్రపంచపోషాకరశక్తియు శ్రీనాథకవిసమ్రాట్టునందు సర్వేసర్వత్ర మిక్కిలిబాగ త్తెక్కినవని చెప్పవచ్చును. నైషధాంధ్రీకరణమున ఈతని కవితా ప్రాగల్భ్యములు పొంగారెను. "హరవిలాసము"న కవితారసికత వెల్లివిరిసెను. దిక్కాశీఖండభీమఖండముల తీర్పరితనమే వేరు. ఆయా రచనలకు పూర్వరంగమైన ఈతనిభావన జాలగంభీరము విశాలము నివ్యక్తమగును. శ్రీనాథుని తెలుగుపోకడలలో గీర్వాణపుతల్లి పోలికలు నిండుగా అందగించినవి; సోదర భాషాకీరుతీయములు మధురముగా మేళవించినవి. అట్టి యీ భాషనే ఈతడు 'నాకవిత్వంబు నిజము కర్ణాటభాష' (అనగా, యావత్ దక్షిణభారతభాష) అని చెప్పుకొనినాడు. ఈతడెంతో గంభీరహృదయముతో, ఎంతోవిశాలాంధ్రదృష్టితో ఆంధ్ర భాషామహాసాహిత్యమును సృజించియుండెను.

ఇతని శైలి ప్రౌఢభాషానిగుంఫములతో ప్రఖ్యాత శయ్యతో జాతివార్తానిధానముతో రసధునియై చిందులు త్రొక్కును. ఇది ప్రసవసౌరభ్యములను తరంగములను ఘుమఘుమారావములను ద్రాక్షాఫలమాధుర్యములను కాటుకటాక ధళ్యములను విరజిమ్మగలదు. నిరర్గళధారావిలసితమై శయ్యాసౌభాగ్యముతో ఉక్తివైచిత్రితో రసతరంగములు పొంగించు గంగాస్రవంతి యీతనిశైలి. పూర్వకవుల పెట్టుబడిని సంస్కృతాంధ్రముల అమృతమును సోదరభాషల సొగసుమెరుగును సంతరించుకొని నిగ్గుదేరి ఒకముద్రగా అచ్చుగొన్నది శ్రీనాథ కవితాప్రపంచము. ధ్వనిప్రస్థానమర్మజ్ఞతకును ప్రయోగవిజ్ఞతకును పెక్కురీతుల పేర్వడిన యీతని ప్రతిభ పరుసవేదియై సంస్కృతమూలమును పరిమళించు బంగారముగా మార్చివేసినది.

ఇక ఈతనికి అనువాదపద్ధతియు శబ్దభావరసౌచితుల నిర్ణయమునందు తన అనుభూతియు తన అభిరుచియు శ్రీనాథునకు ప్రమాణములు. అట్టి సంస్కారము రూపుకట్టిన యీకవి రసవద్ఘట్టములను పోషించును. కడమ వానిని కుదించును; ఒక్కొకప్పుడు కొన్ని విడివిడి భావములను ఒకచోటికి తీసుకొనివచ్చి ఒక పద్ధతిలో వానిని అలంకరించి ఒక రూపకల్పనమును ఒక భావసాక్షాత్కారమును కల్గింపగలడు. గ్రంథసంగ్రహవిస్తరాది సంస్కారములు సర్వమును ఈతనివి స్వతంత్రములే అనుట ఒక్కమాటలో ఈతని అనువాదపద్ధతిని గూర్చి చెప్పుట. సంస్కృతములోని ధర్మశాస్త్రకారికలవంటి శ్లోకములు గూడ పదబంధబంధురమై కవిత్వముగా అనువాదము పొందుచేసినవనుటకు ఈశానసంహితకు అనువాదమైన శివరాత్రిమాహాత్మ్యములోని పెక్కుపద్యములే ప్రబలసాక్ష్యములు. మొత్తముమీద ఒకవిధముగ అనువాదములయ్యును ఈతని కృతులన్నియు తెలుగుపొలముల కమ్మని పంటలుగా విలసిల్లినవి. శ్రీనాథుని అనువాదపద్ధతి బాగుగలేదని విమర్శించు ఆధునికులు కొందరున్నారు. అర్థప్రధానమైన శాస్త్రానువాదము వేరు; రసప్రధానమైన కావ్యానువాదము వేరు. ఇట్టి విజ్ఞానవ్యాపనదృష్టియో లేక కవితాశిల్పవ్యాపన దృష్టియో ఈ అనువాదమునందున్నది? అనుసరితము మరియు వేరు యథామాతృకానువాదమొక ఘనకార్యమని చెప్పుకొన్నచో అది అట్లుచేసినవారి ఉత్సాహమే. భావమ్మును ఆ తల్లిబిడ్డలను తమవలెనే లోకముకూడ చూచుచున్నదనుకొనుట

వారిక్రమ అట్లు చూడవలెననుకొనుట వారికోరిక ఆంధ్ర ప్రజల అందరి క్షేమము కొరకై సృజింపబడిన కవిత్రయమువారి అనువాద పురాణసాహిత్యమునే కావ్యధర్మములో అలంకరించిన శ్రీనాథుని అనువాదములు మనకు నిరంతరము ఆరాధ్యములను ఆస్వాద్యములునుగాక యెట్లుండగలవు !

కవితా ప్రశస్తి ఇతనిని చిన్ననాడే వలచివచ్చిన కవితా రీతియు- శాస్త్రలోకజ్ఞానసంపత్తియు కీర్తి మోహనవని అశ్లేశయ్యానుభగత్వమునకును ఛందౌచిత్యమునకును తెలుగుదనమునకును జాతీయములకును లోకోక్తులకును సంధియుగ సమస్తధర్మములకును కవ్యావేశమునకును వర్ణనా వైశద్యవైపుల్యములకును జగదుపదేష్టృతకును రసమయ కావ్యభంగీపణితికిని పదవాక్య ప్రమాణజ్ఞతకును గుసుకు వడపి ముల గమకములకును భక్తిశృంగారభావనా కలితత్వ రక్తికిని అలంకారిక రచనాప్రసక్తికిని ప్రత్యేకముగ ప్రశంస గన్నది శ్రీనాథుని కవిత్వము ఈతని యెదలో ఏభావము మెదలి, శాబకమై మురళి పెదవులపై కదులునో అది ఆనందకందమై రసానందమై అందమై ఛందమై పదమై పాదమై పద్మవేశమై, ఘట్టమై కావ్యముగా రూపుకట్టును

గుణశీలములు శ్రీనాథుని గుణశీలములనుగురించి పలువురు పండితులు పలు విధములుగా భావించిరి వానిపై వాదోపవాదములును పూర్వపక్ష సిద్ధాంతములును విపులముగ సాగినవి మొత్తము మీద కావ్యములయందు వెల్లడియగు శ్రీనాథునిలో ఎట్టిదోషమును అగపడదని తత్జ్ఞులు నిర్ణయించినారు కావున కావ్య శ్రీనాథుని గురించి వారి వారి వాదములను సవిమర్శముగ నిచ్చట నిరూపింపనక్కరలేదు అంతేకాదు ఎవరు ఈ వాదమునకు మూలమో ఆ శ్రీనాథుడు ఇపుడులేడు ప్రతివాది లేనప్పుడు వాదములోని సత్యాసత్యములు తేలజాలవు ముందు ఈ నిందయందు అభిజ్ఞతకంటె అసూయయే అధికమనికూడ తేలుచున్నది ఏకవిధముగ ఇందలి సత్యమును తెల్సికొనియు మనమిప్పుడు చేయగలిగినదిలేదు ఆ మహాకవి యిడిన సాహిత్యభిక్షమాత్రము అమృతతుల్యమై ఆంధ్రులకు రిక్థముగా కలిసివచ్చెను దీనిని భావనచే వృద్ధిచేసికొని అస్మదమ్ములమై అనుభవించుటయే గాక రానున్నతరము వారికి పిత్ర్యమై శాశ్వతమైన ధనముగ చెందనిచ్చుటయు మన విధుక్తధర్మము

శ్రీనాథుడు శృంగారరసమును విచ్చలవిడిగ భోగించి అనుభవించియుండనిచో ఆరసము అతని గ్రంథములలో అంత విరివిగా వెల్లివిరిసియుండదనెడి వాదము తర్కబద్ధమైనది కాదు అనుభవింపనిదే రసాస్వాదమెరుగజాలని పశుజాతికి చెందినవాడుగాడు మానవుడు అనుభవింపని దానిని ఊహించి తెలిసికొనగల వివేకమున్నది భావించి ఆస్వాదింపగల హృదయమున్నది సమాధానముతో సంతృప్తినొందగల అనుభూతియున్నది అట్టి మానవులకు మకుటాయమానుడైన కవి అన్ని రసములను ప్రత్యక్షముగ అనుభవించియే ప్రపంచింపవలెననుట వితండవాదము మనము ఒకానొక సాహిత్యబిందువు ఒసగునట్టి ఆతిథ్యము నారగించి దానికి ప్రతిఫలముగ అతనినిగూర్చి పాపము లాడుకొన్నచో అట్టి మన సంస్కృతిని ఇతరజాతుల వారు పరిహసింపరా ! కవిసార్వభౌముని పోల్చినచో ఒక్క కవిబ్రహ్మతోడనే పోల్పవలెను లోకశాస్త్రజ్ఞతలయందును రాజాస్థాన మర్యాదాభిజ్ఞతయందును భోగకాంక్షానుభూతుల యందును ఆతడతనికిసాటి కాని తిక్కన శ్రీమత్త్వవ్యామోహకమనార్థము హరిహరనాథు నర్థించిన మహాయోగి

శ్రీనాథునకు ఇహపరలోకముల రెంటియందు రెండు కన్నులున్నవి తిక్కనవలెగాక ఆతడు పుట్టుకచేతనే భోగి ఆధునికులలో విశ్వకవి రవీంద్రుడీతనికి ఈడువచ్చును పంచేంద్రియతర్పణమనునది ఈ యిర్వురి కవితకును ఉద్బోధకము రసపోషకము సౌశీల్యబాధకముకాదు - ఐహికాముష్మికములలో మొదటిదానిని ఈతడు తుదివరకు చూడకమానలేదు రెండవదానిని పరిపూర్ణముగ చూడనులేదు పోతన వంటి మహనీయులు యోగులు శ్రీనాథునివంటి రసికులు భోగులు; ఒకరిగుణములను ఇంకొకరిలో మనము ఆశింపరాదు

కవిసార్వభౌముడు తాను కనకాభిషిక్తుడనుగదా ! యని ఇతరులకు నిష్కారణ పరాభవము తలపెట్టడు ఎవ్వనితో నెచ్చోటను జీవికకు జేదాపవలదు చేదాపినచో నివ్వాలనవ్వాల లోకులు నవ్వకయుండంగ గడచనా నెరపవలెనా - ఆతడు స్వతః పరమసాధువు రెచ్చగొట్టినయెడల తలపొలమునవగాని విడ్వనిది యీతని ప్రతీకారదీక్ష తన్నాదరించిన ప్రభువులను స్వర్గప్రస్థానమప్పుడు సైతము విస్మరింపనిది యీతని మిత్రధర్మాభిజ్ఞత

ఆంధ్రుల జీవిత సభ్యతను సరసత్వమును సమగ్రముగ చిత్రించిన ఈతని సారస్వతజ్యోతికి ధన్యవాదములుచెప్పి నమోవాకములర్పించి కృతజ్ఞులమై తరించుట మనవిధి ఈతని జాతీయకీర్తిమూర్తికి మౌక్తికనీరాజనము పట్టుట మన విధేయధర్మము

బి వి కు శ,

## శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి ఈ శతాబ్దిలో ఖ్యాతిగాంచిన ప్రతిభా వ్యుత్పత్తులుగల సవజోక్తి. క్రీ.శ. 1866 అక్టోబరు 29 వ తేదిన గోదావరీమండలములోని దేవరపల్లియను గ్రామమున ఇతడు జన్మించెను. తల్లి వెంకటసుబ్బా సోమిదేవమ్మ; తండ్రి వెంకటసోమయాజులు. వీరు వెలనాటి వైదిక బ్రాహ్మణులు; కాశ్యప గోత్రులు. శాస్త్రిగారి వంశము మొదటినుండియు శ్రీవిద్యోపాసనచేతను అగ్నిష్టోమాది క్రతువులాచరించుటచేతను వేద శాస్త్ర శ్రౌత స్మార్తవిద్యల నభ్యసించుటచేతను కావ్యశాస్త్రజ్ఞత చేతను గొప్ప ప్రసిద్ధిని వహించినది. ఈ లక్షణములన్నియు శ్రీకృష్ణమూర్తిశాస్త్రియందు మూర్తీభవించినవి.

శాస్త్రికి ఎనిమిదవయేట ఉపనయనమైనది. గాయత్రీమంత్రమును దీక్షగా జపించుటవలన ఆయన బుద్ధి సూక్ష్మవిషయములనెల్లను గ్రహించు సామర్థ్యము కలదియైనది. మొదట ఆంగ్లపాఠశాలలో చేరి ఆవిద్యయం దిష్టములేక అందును మాని సంస్కృతమువైపు తన దృష్టిని మరలించెను. కావున నాటకాలంకార వ్యాకరణములను శాస్త్రి ఇవటూరి నాగలింగశాస్త్రియొద్ద చదివెను. పదునైదేండ్లుండునప్పటికే తమ ఇంట మేనమామ శిష్యులకు చెప్పుచుండగా విని స్మార్తమును షోడశకర్మాంతముగ నేర్చుకొనిరి. ఇతనికి చయనాంత శ్రౌతమును చెప్పిన గురువు వాజపేయాజుల పాపయ్య సోమయాజులు. శాస్త్రి తన పదునెనిమిదవయేట తమతండ్రి చేసిన యజ్ఞమునందు అధ్వర్యుడుగా నుండెను. ప్రాయశ్చిత్తము లేకుండ యజ్ఞనిర్వహణమునందు పేరుమోసిన అధ్వర్యులలో శాస్త్రి ఒకడుగా ఆనాడు కీర్తి కెక్కెను.

కృష్ణమూర్తిశాస్త్రికి పండ్రెండవయేట సంస్కృతమున కవిత్వము చెప్పుట అలవాటయ్యెను. అతరువాత శ్రీనాథుని గ్రంథములను చదివి, తెలుగులో కవిత్వము చెప్పుటకు మొదలిడెను. శాస్త్రికి ఆంధ్రకవితాగురువు శ్రీనాథుడే. ఇతడు రచించిన మొదటి తెలుగుపద్యమును వినిన అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి లక్షణగ్రంథములను చదువవలసినదని ఆయన కుపదేశించెను. శాస్త్రి అంతట తెలుగులక్షణగ్రంథములను చదివెను. కాశీమజిలీకథలు వ్రాసిన మధిర సుబ్బన్నదీక్షితులు శాస్త్రికి సహాధ్యాయులై వర్తిలెను.

కృష్ణమూర్తిశాస్త్రికి పదునారేండ్ల వయస్సుననే మొదటి వివాహమైనది. దైవప్రాతికూల్యమున భార్య కాలధర్మము చెందిన పిమ్మట వెంకటరత్నాంబ యనునామెను శాస్త్రి పెండ్లియాడెను. ఈమెయందు విశాలాక్షి - గాయత్రి అను ఇద్దరు పుత్రికలు కల్గిరి. సుదర్శనసుధి యనువాడొక కొడుకు కూడ జన్మించెను. శ్రీకృష్ణభారతమున అభిమన్యువధాఘట్టము వ్రాయుచుండగా, ఆకొడుకు హఠాత్తుగా మరణించెను. శాస్త్రి పెద్దకుమార్తె విశాలాక్షి కల్లూరి విశాలాక్షమ్మయై భావార్థ భగవద్రామాయణకావ్యామృతమును రచించినది.

కృష్ణమూర్తిశాస్త్రి మంత్రతంత్రములయందును ఆగమములయందును భక్తిశ్రద్ధాసక్తులుగల మనీషి. గాయత్రి పంచదశి మొదలయిన మంత్రములను జపించి ఇతడు సిద్ధిపొందెను. భూతవైద్యము కూడను ఇతడు చేసెను. నిరంతర విద్యానిష్ఠాపరుడైన శాస్త్రికి నిరంతరము భగవత్సాక్షాత్కార మగుచుండెడిదట!

అష్టావధాన శతావధానములయందు కృష్ణమూర్తిశాస్త్రి కడుంగడు సమర్థుడు! ఆంధ్రదేశమునందలి ముఖ్యపట్టణములందు అవధానములను చేసి ఇతడు పెక్కు సన్మానములనందెను. బొబ్బిలి, పిఠాపురము, విజయనగరము, మడికొండ, వెంకటగిరి, జటప్రోలు మొదలయిన ఆంధ్ర సంస్థానములలోనే గాక మయూరభంజ్ మొదలయిన రాష్ట్రేతర సంస్థానములయందును ఎన్నోమారులు అష్టావధాన శతావధానముల నీశాస్త్రివర్యుడొనరించెను. ఒరిస్సాలోని మయూరభంజ్ సంస్థానమునందే ఇతనికి కవిరాజు అను బిరుదము లభించినది. ఉర్లాము సంస్థానము ఆస్థానకవిగా కూడ కృష్ణమూర్తిశాస్త్రి నియమింపబడి గౌరవమును పొందెను. గండపెండేరపు సత్కారమును, కనకాభిషేకసత్కారమును పొందిన మహాపండితుడును మహాకవియునై ఈయన ప్రకాశించెను.

కృష్ణమూర్తిశాస్త్రి సంపన్నగృహస్థు. పెక్కుమందికి తమయింట భోజనముపెట్టి చదువుచెప్పెను. ఆతని శిష్యులలో మొట్టమొదట పేర్కొనదగిన పండితకవి చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి. వేదుల సత్యనారాయణశాస్త్రి మున్నగు ఆధునికకవులును శాస్త్రికి శిష్యులే. శాస్త్రి యిల్లొక అన్నసత్రముగ నుండెడిది. పదిమందితో కలిసి కూర్చొని భోజనముచేయుటయే నిజమైన భోజనమని ఆయన భావించెడివాడు. ఆయన లక్షలు సంపాదించి లక్షలు వ్యయముచేసెను. ఆయనవెంట ధనము

పడినదే కాని, ధనమువెంట ఆయన పడినవాడు కాడు ఆయన సర్వతంత్ర స్వతంత్రుడు

కృష్ణమూర్తిశాస్త్రి శుద్ధగ్రాంధిక భాషావాది ఆయన 'కళావతి' యను మాసపత్రికను 1899 వ సంవత్సరమున మద్రాసునుండియు ఆతరువాత రాజమహేంద్రవరము నుండియు ప్రకటించెను "వందేమాతరమ్" అను వారపత్రికనుకూడ ఆయన కొంతకాలము నడిపెను మరియు "మానవసేవ" యను మాసపత్రికను వజ్రాయుధమను మాసపత్రికను కొన్నిసంవత్సరములు ఆయన నిర్వహించెను "గౌతమి" యను దినపత్రికనుగూడ ఒకసంవత్సరముపాటు ప్రచురించెను ఆంధ్రప్రదేశమున ప్రచురింపబడిన మొట్టమొదటిదినపత్రిక శ్రీశాస్త్రి యొక్క గౌతమి యే

శాస్త్రి ఆంధ్రవాఙ్మయమునగల ప్రాచీనపురాణేతిహాస కావ్యప్రబంధముల మార్గమున బహుగ్రంథములు రచించిరి భారత భాగవత రామాయణములను నైషధకావ్యమును ఆయన తిరుగవ్రాసెను అనేకకృతులసంఖ్యాకములు ఆయన తనువు చాలించువరకు గ్రంథరచనను సాగించుచునే యుండిరి శాస్త్రి ఒకేసారి నాలుగైదుగ్రంథములను మొదలు పెట్టి ఒకసారి అది ఒకసారి ఇది - ఒకసారి ఇంకొకటిగా రచించుచు అన్నింటిని ఒకేసారి పూర్తిచేయు అలవాటు కలవారు శతాధికములుగానున్న ఆయనరచనలపట్టికచూచినచో ఆయన ఎంతనిర్విరామముగా రచనావ్యాసంగమును అకుంఠితదీక్షతో అనవరతము కొనసాగించుచుండెనో తెలియగలదు

కృష్ణమూర్తిశాస్త్రి గ్రంథములలో ముఖ్యముగా పేర్కొనదగినవి చాలగలవు అందు శ్రీకృష్ణభారతము, శ్రీకృష్ణభాగవతము శ్రీకృష్ణరామాయణము నైషధీయచరిత్రము అను పూర్వకవికృతములైనవి తిరుగవ్రాయబడినవి ఇవి కాక మధురవిజయము ఆంధ్రాభ్యుదయము మరుత్తరాట్చరిత్రము మున్నగున కూడ పేరెన్నికగన్నవి ఇతడు రచించిన నాటకములలో బొబ్బిలియుద్ధము వేణీసంహారయజ్ఞఫలాదినాటకములు, కళాభాండి రాజభక్తి భోజరాజవిజయము మిగులప్రఖ్యాతములైనవి సత్యనారాయణోపాఖ్యానము గౌతమీమహాత్మ్యము, గజాననవిజయము శ్రీకృష్ణకవిరాజీయము, సావిత్రీచరిత్రము, వేదాద్రిమహాత్మ్యము యాజ్ఞవల్క్యచరిత్రము- ఇవి ఈ కవీంద్రుని పద్యకావ్యములు-బ్రహ్మానందము శాకుంతలము - ఇవి ఈయనవ్రాసిన అచ్చతెనుగుకావ్యములు వచనగ్రంథములలో పేర్కొనదగినవి సంస్కృతకవిజీవితములు కాళిదాసవిలాసము, తెనాలి రామకృష్ణచరిత్రము మిగుల ప్రఖ్యాతము అనువాదములు కాని స్వతంత్రములు కాని మొత్తముమీద ముప్పదిరెండు నాటకములను కృష్ణమూర్తిశాస్త్రి రచించిరి ఈ పండితకవి స్వీయచరిత్రమును రాజేంద్రప్రసాదు జీవితమును సంస్కృతమున రచించెను ఈ మహాకవి గద్య కృతులు ఎన్నింటికో వెలయించెను

సహస్రమాసజీవియు ద్విశతాధిక గ్రంథకర్తయు శతావధానియు, సంస్కృతాంధ్రభాషామహాంబుధులనాపోశన మెత్తిన అపరఅగస్త్యుడును అయిన కృష్ణమూర్తిశాస్త్రి ప్రజలవలనను, ప్రభుత్వమువలనను అనేక సముచితసన్మానములను పొందెను "మహామహోపాధ్యాయ" 'కళాప్రపూర్ణ' కవిరాజు" కవిసార్వభౌమ మొదలయిన బిరుదములందెను తన మరణానంతరము తమగండపెండేరము రజతపతకములు తలపాగ శృంగేరిపీఠాధిపతులొసగిన బంగారుపూవులపట్టు శాలువ మణికిరీటము ఊటకలము కన్నులజోడు ఇవన్నియు ఆంధ్రవిశ్వవిద్యాలయమునకు చెందునట్లుగా మరణశాసనమును వ్రాసి 29-12-1960 ముక్కోటిఏకాదశి నాటిరాత్రి కాలమున విష్ణుసాయుజ్యమును చెందిన మహనీయుడు కృష్ణమూర్తిశాస్త్రి

కే రా శా

## శ్రీముఖ శాతవాహనుడు

పూర్వము ఆంధ్రదేశమును పాలించిన రాజవంశములలో శాతవాహనులదొకటి కాలమునుబట్టియే గాక చారిత్రక ప్రాముఖ్యమునుబట్టికూడ అది ప్రథమముగా ఎన్నదగినది ఈవంశమునకు మూలపురుషుడు శ్రీముఖుడని పురాణములు తెలుపుచున్నవి అతనికి సిముక అను ప్రాకృతభాషాపరమైన పేరుగూడ కలదు అతని జాతిని మతమును జన్మభూమిని, రాజకీయప్రాభవమునుగురించి భిన్నాభిప్రాయములున్నవి

శ్రీముఖుడు ఆంధ్రుడా, ఆంధ్రేతరుడా? అతడు ఆంధ్రుడు కాడని, మహారాష్ట్రుడని మహారాష్ట్ర విద్వాంసుల వాదన అతని వంశపురాజుల శాసనములలోగాని నాణెములమీదగాని వారు ఆంధ్రులుగా పేర్కొనబడలేదు వారిభాషప్రాకృతము వారిలో కొంతమంది పేర్లు మహారాష్ట్రసంప్రదాయము ప్రకారము మాతృనామమును కలిగియున్నవి వారు ఆంధ్రభృత్యులుగా వర్ణింపబడినారు ఇవి వారిని ఆంధ్రేతరులుగ ఎంచుటకు-

చూపబడిన కారణములు. అయితే ఇవి బలీయమైనవి కావు. ఎందువలన? ఆంధ్రదేశమును పాలించిన ఇతర ఆంధ్ర రాజులు కూడ తాము ఆంధ్రులమని చాటుకొనలేదు. జగమెరిగిన సత్యమునకు ప్రత్యేక ప్రకటన ఏల? అని సిరిముఖుడు మాతృ నామమును ధరించు ఆచారము శ్రీముఖుని కాలమున లేదు. అతని అనంతరము పాలించిన కొందరు ప్రముఖులకే గలదు! ఆంధ్రభృత్యు లనగా మౌర్యచక్రవర్తులకు భృత్యులయిన ఆంధ్రులు అని సరియగు అర్థము. ఈ శాసనములలోని శాతవాహనరాజుల పేర్లు పురాణములలోని ఆంధ్రరాజుల పేర్లకు చక్కగా సరిపోవుచున్నవిగదా! అన్నిటికన్న మిన్నగా మత్స్య పురాణమునందు శ్రీముఖుడు ఆంధ్రజాతీయుడని స్పష్టముగా పేర్కొనబడినది. కావున అతడు ఆంధ్రుడు. అతనిది హిందూ మతము. బ్రాహ్మణకులము. అతని వంశనామము శాతవాహన గాను సాతవాహనగాను పేర్కొనబడినది. శాతవాహనుడను మూలపురుషుని సంతతికి చెందినందువలన అతనిది శాతవాహన వంశమనుట సమంజసము. శాతకర్ణి అను పేరు అతని గోత్రము నకు చెందినదట!

ఆంధ్రజాతీయుడైన శ్రీముఖుని జన్మభూమి ఆంధ్రదేశ మగుట సహజము. అందుకు ఇటీవల బయలుపడిన నాణెములు ప్రోద్బలమిచ్చును. అంతేగాని అతని జన్మస్థానము కర్ణాటకము గాని మహారాష్ట్రముగాని కాదు.

ఆంధ్రదేశమున జన్మించిన శ్రీముఖుని రాజకీయ ప్రాముఖ్యము ఆంధ్రదేశములోనే ప్రారంభమాయెను. అతడు ఆంధ్రులరాజ్యమును స్థాపించినట్లు పురాణములు తెలుపును కాని కొన్ని ఆధారములవలన ఆశ్చర్యమును నెరవేర్చినది అతనికి పూర్వికుడైన శాతవాహనుడనురాజు అని తెలియగలదు. అశోకచక్రవర్తి మరణానంతరము మౌర్యసామ్రాజ్య విచ్ఛిన్నము మొదలాయెను. ఆతరుణమున ఆంధ్రదేశమునందు ఆంధ్ర పాలకుడైన శాతవాహనుడు మౌర్యులసామ్రాజ్యాధికారము చెదిరించి తనసామంతప్రతిపత్తిని తొలగించి స్వతంత్ర రాజ్య స్థాపనము కావించెను.

అయితే అతడు స్థాపించిన ఆంధ్రరాజ్యమును సుస్థిర మొనర్చి దానిని విశాలసామ్రాజ్యముగా విస్తరింపచేసినవాడు శ్రీముఖుడు. సామ్రాజ్యస్థాపకుడైనందున పురాణములు శ్రీముఖుని రాజ్యస్థాపకుడుగా కీర్తించుట జరిగినది. అతడు వింధ్యప్రాంతమునందున్న రథిక, భోజక, పుళిందాదిజాతులను జయించెను. మహారథులతో మైత్రి చేసికొని వారి రాకుమార్తెలలో నొకదానిని తనకుమారుడైన శాతకర్ణికి వివాహముచేసి వారితోగల సంబంధమును పెంపొందించుకొనెను. తనరాజధానిని పశ్చిమదిశనగల పైఠానునగరమునకు మార్చెను. ఉత్తరదేశమునుండి శకులు తనసామ్రాజ్యముపై పడకుండ పైవిధముగా రక్షణచర్యలు తీసికొని దానిని భద్రమొనర్చుకొనెను. అతని రాజకీయవివేకమునకు చాతుర్యమునకు ఇవి నిదర్శనములు. అతడు క్రీస్తుపూర్వము 221 నుండి ఇరువది మూడుయేండ్లు పాలించెను.

శ్రీముఖునితరువాత అతనివంశమునకు చెందినవారు 29 మంది రాజ్యపాలనచేసిరి. అనంతము రమారమి నాలుగువందల యేబదియేండ్లు (క్రీ పూ 230–క్రీ శ 220మధ్య) పాలించినది. కేవల ఆంధ్రప్రదేశము వారిసామ్రాజ్యములో చేరియుండెనని అంతే కాదు. వారి అధికారము కొంతకాలము ఉత్తరాదిన మగధపై కూడ సాగినది. వారి పాలనక్రింద దక్కనుప్రాంతమందలి ప్రజలకు రాజకీయభద్రత సుస్థిరత లభించినవి. వ్యవసాయము వాణిజ్యము వృద్ధియైనవి. సిరిసంపదలతో ప్రజలు సుఖించిరి. శాతవాహనరాజులు హిందూమతోద్ధరణకు పాటుపడినను బౌద్ధుల నాదరించి మతసామరస్యమును పాటించి తమ ప్రజలలోగూడ దానిని ప్రోత్సహించిరి. ఇది గమనింపదగినఅంశము. ఆకాలమున ఆంధ్రదేశమునందలి ప్రాకృతవాఙ్మయము శిల్పము అభివృద్ధిచెందినవి. మొత్తముమీద శ్రీముఖుని వంశ పాలనము హిందూదేశచరిత్రలో మరపురాని మహోజ్జ్వల ఘట్టము.

ఓ. వ. మూ.

## శ్రీరామకృష్ణ పరమహంస :

క్రీ శ 19వ శతాబ్ది ఆరంభమున పాశ్చాత్య నాగరికతా ప్రభావముచే ఆధ్యాత్మికతా ప్రధానమైన భారతీయ జీవనము అనాత్మవాదమునకు ఐహిక సుఖాన్వేషణమునకును తావొసంగి కలుషితమైపోవుచుండ దానిని విశుద్ధమును, ఆత్మోన్ముఖమును గావించి క్షీణించిపోవుచున్న భారతీయ వాహినిని మరల పరిపుష్టమొనరించుటకై యుద్భవించిన అవతారమూర్తి శ్రీ రామకృష్ణపరమహంస. కామార్పుకూరు నివాసులైన చంద్రమణీ క్షుదీరాములు అను తల్లిదండ్రులు వారొకప్పుడు మహాప్రసిద్ధమైన గయాక్షేత్రమును దర్శింపనేగిన తరి గదాధరుడైన శ్రీమన్నారాయణుడు క్షుదీరామునకు

కలలో కనబడి "నేను నీ కుమారుడనై పుట్టెద" నని పలికి అంతర్హితు డయ్యెనట! కుదీరాము డానందభరితుడై, యా వృత్తాంతమును భార్యకెరింగించెను. కొన్ని దినములైన తరువాత వారు కామర్పుకూరునకు తిరిగివచ్చిరి. చంద్రమణీదేవి గర్భముధరించి 1836 ఫిబ్రవరి 18వ తేదీన మగశిశువును ప్రసవించెను. గదాధరుడే తనకు పుత్రుడుగా నుదయించెనను విశ్వాసముచే కుదీరాము తడనికి గదాధరుడని నామకరణము కావించెను. రామకుమార రామేశ్వరు లాతని యగ్రజులు.

గదాధరుడు బాల్యమున కామర్పుకూరునగల పాఠశాల యందే విద్యనభ్యసించెను. పురాణభాగవతములన్న నతనికి మిక్కిలి ప్రీతి. అతడు రామాయణ భాగవతములకు సంబంధించిన నాటకములనెల్ల మక్కువతో దర్శించి యింటికి వచ్చినపిమ్మట ఆ నటకుల అభినయాదులను పద్యములతోకూడ అనుకరించుచుండెను. అతడు గ్రామమునందలి మచ్చెపని వాండ్రనుండి బొమ్మలు చేయుటయు వాటికి తగిన రంగులు వేయుటయు నేర్చుకొనెను. కొన్ని సమయములందాతడూరికి దవ్వుగానుండిన శ్మశానమునకరిగి యొంటరిగా ధ్యానము చేయుచుండెను. అప్పుడప్పుడాతడు గ్రామస్థులకు పురాణములు చదివి వినిపించుచు కొన్ని రసవద్ఘట్టములందు తన్మయత చెందుచుండెను. ఇట్లుండ అతని ఏడవయేట తండ్రి మరణించెను. అప్పటినుండియు కొంతమార్పునకు గురియైన అతని చిత్తవృత్తి ఆ గ్రామమునందు లాహా వంశమువారు కట్టించిన సత్రమునకు వచ్చుచుండు సన్యాసుల శుశ్రూషచే వైరాగ్య సంపన్నమగుట తటస్థించెను.

తొమ్మిదవయేట గదాధరునకు ఉపనయనమయ్యెను. అతడు తమ యింటవేల్పైన రఘువీరుని శిలావిగ్రహమును భక్తితో నారాధించుచు తీరిక దొరికినప్పుడు గ్రామమునకు చెంతనుండిన మామిడితోపునకేగి భక్తిమయములైన పాటలు పద్యములు పాడుకొనుచు కాలము పుచ్చుచుండెను. గదాధరుని జ్యేష్ఠసోదరుడైన రామకుమారుడు కామర్పుకూరు నందలి రాబడి కుటుంబ పోషణమునకు చాలకపోవుటచే కలకత్తా నగరమున కరిగెను. కొన్నినాళ్ళ పిమ్మట నతడు గదాధరునికూడ కలకత్తాకు పిలిపించి కొందరు గృహస్థుల యిండ్లలోని గృహదేవతల నర్చించుటకై యాతనిని నియోగించెను. సహజభక్తి సంపన్నుడైన గదాధరుడాపనిని మిక్కిలి మక్కువతో చేయుచు గృహస్థులందరి ఆదరమునకు పాత్రుడయ్యెను.

ఈ సమయమున దేవీభక్తురాలగు రాణిరాసమణి యను నొక సంపన్నురాలు కలకత్తాకు సమీపమునయుండిన దక్షిణేశ్వరమున నొక పెద్ద కాళీదేవ్యాలయమును కట్టించి ప్రతిదినము దేవీపూజ కావింపవలెనని రామకుమారునికుత్తరము వ్రాసెను. రామకుమారుడందు కంగీకరించి గదాధరునితోకూడ దేవీ ప్రతిష్ఠామహోత్సవమునకు దక్షిణేశ్వరమున కరిగెను. రాణిమేనల్లుడైన మథురనాథవిశ్వాసునకు ప్రథమదర్శనముందే గదాధరునిపై అవ్యాజమైన భక్త్యాదరము లుదయించుటచే అతని నెట్లైన దేవీసేవకవర్గములో నొకనిగా నియమింపవలెనని అతడు నిశ్చయించెను. గదాధరునకు రామకృష్ణుడను పేరుపెట్టిన వాడీ మథురనాథుడే. మొదట రామకృష్ణుడందు కంగీకరింపక పోయినను తరువాత మథురుని బలవంతముచే దేవి యాభరణముల భద్రముచేయు బాధ్యతనెవరైన వహించుచో తానామె సేవకంగీకరించెదనని తన సమ్మతి నెల్లడించెను. మథురుడానందసాగరమున నోలలాడి యాసమయమున రాధాకాంతుని గుడిలో అర్చకుడవసరమగుటచే అతనిని తాత్కాలికముగా అర్చకుడుగా నియమించెను. రామకుమారుడు కాళికాలయమున నర్చకుడయ్యెను.

రామకృష్ణుడు రాధాకాంతుని గుడిలో తనధర్మమును ఏకదీక్షతో నిర్వహించుచుండుట కలరి రామకుమారుడతనిని కాళిగుడిలోకూడ అర్చకుడుగా ప్రవేశింపుమని కోరెను. అన్న యానతిని కాదనజాలక రామకృష్ణుడు కాళీదేవ్యాలయమున కూడ అర్చనాదులు శ్రద్ధతో నొనరించుచుండెను. కొన్నినెలలకు రామకుమారుడు వ్యాధిగ్రస్తుడై మరణించెను. సంసారభారమంతయు రామకృష్ణునిపై పడెను. అతడు కాళీమాతనే నమ్ముకొని దేవి సాక్షాత్కారము తనకెప్పుడగునా యని ఉవ్విళులూరుచుండెను. అతడు భక్తులు రచించిన కీర్తనలు తన్మయుడై పాడుచు దేవిదర్శనము కాలేదని యొక్కొక్కప్పుడు బాలునివలె గొంతెత్తి యేడ్చుచుండెను. క్రమముగా నాతడు నిద్రాహారములు మానివైచెను. తేజోరాశియైన దేవి అతనికొకసారి దర్శనమొసంగెను. అప్పటినుండియు నాతడు మరింత ఉన్మత్తుడై "తల్లీ! ఇంకొకసారి నీ దివ్యదర్శనమీయమ్మా!" అని నిరంతరమేడువ నారంభించెను. తల్లి అతనికి నిరంతరము సాక్షాత్కరించుచు అతడిడిన నైవేద్యములను ప్రత్యక్షముగా వచ్చి ఆరగించుచుండెను. మథురుడొకటరిగా నరుదెంచి ధ్యాననిష్ఠుడై దేవిపూజకావించు

చున్న, రామకృష్ణుని దర్శించి సంతసించి అతడెట్లు వర్తించినను అతని జోలి కెవ్వరును పోరాదని ముదలయొసంగెను.

రామకృష్ణుడు క్రమముగా శాంత దాస్య సఖ్య వాత్సల్య మధుర భేదముల ననుల్లసిల్లు పంచవిధభక్తులను సమగ్రముగా సాధించెను. ఈ సాధనమున అతనికి భావించు భావము ననుసరించి రూపముకూడ మారుచుండెనట. రామకృష్ణుని భక్తి మహిమ నలుదెసల ప్రాకజొచ్చెను. పలువురు భక్తులు సాధకులు అతని దర్శనమునకై రాదొడంగిరి. ఈవృత్తాంతమంతయు తెలిసి చంద్రమణీదేవి అతని నొకసారి స్వగ్రామమునకురమ్మని కబురంపెను. రామకృష్ణుడు తల్లియాన తలదాల్చి కామర్పుకూరున కరిగెను. తల్లియు అన్నయు తనకు వివాహము చేయదలంచుచున్నట్లు గ్రహించి అతడన్నను పిల్చి జయరాంబటిలోని రామచంద్రముఖోపాధ్యాయుని కూతురు శారదామణి తనకు తగిన భార్యయని చెప్పెను. రామేశ్వరుడు జయరాంబటికేగి సంబంధము కుదిర్చెను. క్రీ. శ. 1859వ సం॥న శారదామణీ రామకృష్ణులకు వివాహము జరిగెను. తరువాత రెండుసంవత్సరములకు రామకృష్ణుడు మరల దక్షిణేశ్వరమున కరుదెంచి పూర్వపు ధ్యానసమాధులను కొనసాగించెను.

కాలముతోపాటు మనుజులకు రామకృష్ణునిపై భక్తి యతిశయించెను. క్రీ. శ. 1861 లో రాణిరాసమణి కీర్తిశేషురాలయ్యెను. ఆమె సర్వస్వమునకును మథురుడు వారసుడై రామకృష్ణుడు చెప్పినదంతయు తుచ తప్పక చేయుచుండెను. ఒకనాడు తాంత్రిక వైష్ణవ సాధన లన్నిటియందు ఆరితేరిన భైరవీబ్రాహ్మణియను యోగిని దక్షిణేశ్వరమున కరుదెంచి, రామకృష్ణుని మహత్త్వము నెరింగి యతనిచే నలువదినాల్గు తాంత్రికసాధనలు చేయించెను. అజన్మసిద్ధుడగుటచే అతడన్ని సాధనలయందు స్వల్పకాలములోనే సిద్ధిని పొందజాలెను. భైరవీబ్రాహ్మణి గురుత్వమతనికి నామమాత్రమే. ఆమె ఆ మహనీయుని యోగసిద్ధి కచ్చెరువంది అతడు పరమేశ్వరుని అవతారమని ఘోషించెను. అతడింక ఇతరుల కుపదేశింపవచ్చునని కాళీమాత యనుజ్ఞ నొసంగెను. పూర్వమాతనికి గురుత్వము నెరపినవారే అతనివలన గూఢార్థముల నెరింగి శిష్యత్వము నవలంబింపజొచ్చిరి.

రామకృష్ణునకు వేదాంతవిద్యాభ్యాసము నలవరించిన గురుపుంగవుడు తోటపురి యను యోగీశ్వరుడు. అతడు వివిధ పుణ్యక్షేత్రములు సేవించి, తిరిగివచ్చుచు, దక్షిణేశ్వరమున రామకృష్ణుని చూచి వేదవేదాంగములందలి ప్రమాణవాక్యములు వినిపించుచు అతని కద్వైతవేదాంతమంతయు ఉపదేశించెను. అతని సూచన ననుసరించి రామకృష్ణుడు నిర్వికల్ప సమాధినందె నట్లే మూడుదినములుండి పోయెను. తనకు నలువదియేండ్లు పట్టిన అనుభూతి అతని కొకేదినమున ఎట్లలవడెనని తోటపురి ఆశ్చర్యచకితుడయ్యెను. అతడు రామకృష్ణుని చెంత పదునొకండుమాసములుండి వెడలిపోయెను. రామకృష్ణుడప్పుడప్పుడు సమాధిస్థితినంది ఆహారనిద్రలు కాని శరీరజ్ఞానము కాని లేకుండ దీర్ఘకాల ముండిపోవుచుండెను. దేవి ఒకప్పుడు లోకసంగ్రహమునకై వ్యవహారజ్ఞానములో నుండుమని రామకృష్ణుని కుపదేశించెను. అప్పటినుండి అతడు సమాధిస్థితి పొందియుండలేదు. అతని కద్వైతసిద్ధి కరతలామలకమయ్యెను. అతడు కొన్ని దినములు మహమ్మదీయ మతతత్త్వసాధన మొనరించి అందు సంపూర్ణసిద్ధుడు కాజాలెను. ఇట్లే అతడు క్రైస్తవసిద్ధాంతముల ననుగుణముగా సాధన కావించి యందును సిద్ధి గాంచెను. పరమార్థసాధనకు ఉపకరించినచో, మార్గమేదైనను హానిలేదని అతని యాశయము. ఇది అతని సర్వసమానతకును సాధనాసమన్వయమునకును తార్కాణము.

ఒకప్పుడు మథురునిభార్యయైన జగదంబదాసికి తీవ్రమైన రోగమంకురింప మథురుడు భయపడి రామకృష్ణుని కెరింగించెను. రామకృష్ణు డేమియు భయములేదని ఊరడించెను. జగదంబదాసి ఆరోగ్యము పొందెను. కాని ఆరోగము రామకృష్ణుని కంకురించెను. అతడు గ్రహణివ్యాధితో బాధపడుచు హృదయశాంతి చేకూరునను తలంపుతో కామర్పుకూరున కరిగెను. అత డున్మత్తుడయ్యెనని వినిన గ్రామవాసులు బ్రహ్మతేజో విరాజమానమైన అతని ఆననమును గాంచి అచ్చెరువంది ప్రతిదిన మాతని దర్శించి, ఆశీస్సులొంది పోవుచుండిరి. రామకృష్ణుడు కామర్పుకూరునకు వచ్చెనని విని శారదామణి తల్లిదండ్రులామె నచ్చటికి గొనివచ్చిరి. అప్పటి కామె వయస్సు పదునాలుగేండ్లు. రామకృష్ణు డామె తనయొద్ద యుండుట కొప్పి అభ్యంతరమును చెప్పక పాకశాస్త్రము మొదలు పరతత్త్వ సాధనమువరకు ఆమెకు బోధింప సిద్ధుడై యుండెను. శారదామణియు భర్త మహత్త్వమును గుర్తించి అతనిని అనన్యభావముతో ఆరాధించుచుండెను. రామకృష్ణుడు దక్షిణేశ్వరమున కరిగినపిమ్మట ఆమె మరల పుట్టినింటికరిగి, భర్త తన్నెప్పుడు పిలుచునోయని ఎదురుచూచుచుండెను.

తాలుగే శైగను కబురురాకుండుటచే ఆమె కొమ్ములపున్నమకు బయలుదేరి ఆ గంగాస్నానమున కరుగు స్త్రీలతో తాను కూడ బయలుదేరెను దారిలో ఆమెకు తీవ్రమైన జ్వరము వచ్చెను రాత్రి ఆమెకు కలలో ఒక బాల కనిపించి నేను దక్షిణేశ్వరమునుండి వచ్చుచున్నాను నీ భర్త అచట సుఖముగా ఉన్నా"డని పల్కి అదృశ్యురాలయ్యెను వెంటనే ఆమెకు జ్వరబాధ తగ్గెను దక్షిణేశ్వరము చేరినప్పుడు రామకృష్ణుడామెకు శ్రద్ధతో సకలోపచారములు కావించి సంపూర్ణారోగ్యము కలిగించెను అతడామెకు క్రమముగా విద్యాబుద్ధులతో పాటు తత్త్వము కూడ బోధించెను ఒక అమావాస్యనాడు రామకృష్ణుడామెను దేవీస్థానమున కూర్చుండుమని సైగచేసి దేవివలె ఆమెకు షోడశోపచారపూజ కావించెను రామకృష్ణుడు భార్యలో కూడ జగదంబను చూడగలిగిన మహనీయుడు

మధురుడొకప్పుడు రోగగ్రస్తుడు కాగా రామకృష్ణుడతని యింటికి రాగెను మధురుడాతని పాదధూళి హృదయమున పెట్టుకొని "స్నిధూళి దివ్యధామమునకు కొనిపోజాలు' నని తన తాకేసైగిల భక్తిభావమును వెల్లడించెను తరువాత కొన్ని భాకృతు మధురుని కోరికననుసరించి రామకృష్ణుడతనికి భావసమాధి కలిగించెను తాకినమాత్రముననే శిష్యులకు శక్తిపాతము చేయుటయు వారిని సమాధిస్థితులనొనరించుటయు రామకృష్ణుని లీలావినోదములలో నొకటి 1868లో మధురుడు రామకృష్ణునితో కూడ తీర్థయాత్రకు వెడలెను దారిలో నొక పల్లెటూరిప్రజల పేదరికము చూచి జాలిపడి రామకృష్ణుడు వారికందరికి అహారవస్త్రాదులిప్పించెను మధురలో రామకృష్ణునికి వసుదేవుడు బాలకృష్ణుని బుట్టలో పెట్టుకొని యమున దాటిన దృశ్యము సాక్షాత్కరించెను దక్షిణేశ్వరమునకు తిరిగివచ్చినతరువాత రామకృష్ణుడు తాను బృందావనమునుండి తెచ్చిన మట్టిని పంచవటియందును తనసాధనాలయమందును చల్లించెను అప్పటినుండియు అప్రదేశమునకు బృందావనము పేరు కలిగెను 1871 లో మధురునకు పెద్ద జబ్బు చేసెను అతడు జగదంబసన్నిధానమున చేరుసమయ మరుదెంచెనని రామకృష్ణుడు మిత్రులతో చెప్పెను, మరునాడు కలకత్తానుండి మధురుడు మరణించెనువార్త వచ్చెను 1886 వ సంవత్సరమున చంద్రమణిదేవి స్వర్గస్థురాలయ్యెను అన్నలు ముందే మరణించుటచే రామకృష్ణుడే ఆమెకు పారలౌకిక్రియలు చేయవలసియుండెను కాని సన్యాసి అగుటచే అతడు కర్మలు చేయ నంగీకరింపక ఆమెపాదములపై ఒక పుష్పోపహారమర్పించి తృప్తిపడెను

ఆరోజులలో బ్రహ్మసమాజమతము నవలంబించి ప్రచారము చేయుచుండిన కేశవచంద్రసేను ప్రతాపచంద్రమజుందారు పండితశివనాథశాస్త్రి మున్నగుప్రముఖులు పలువురు రామకృష్ణుని దర్శించి అతనియుపదేశముల ననుసరించి తమమతమునందలి సిద్ధాంతములను కొన్ని సవరించుకొనిరి రామకృష్ణుడు కామర్పుకూరునుండి దక్షిణేశ్వరమున కరుదెంచిన సమ్మట పలువురాతని దర్శించి శిష్యులు కాదొడంగిరి సురేంద్రుడు రామచంద్రదత్తు లాటూ రఖాలుడు అనువారందు ముఖ్యులు రామకృష్ణుడు వారియెడ అపార వాత్సల్యము చూపుచు వారి అధ్యాత్మికాభివృద్ధికి పలువిధముల పాటుపడుచుండెను

రామకృష్ణుని శిష్యులలో అగ్రగణ్యుడై అతనిసాధుమును సిద్ధాంతములను భారతదేశమందే కాక పాశ్చాత్యదేశములందుకూడ విఖ్యాతమొనరించి "మహనీయుడు వివేకానందుడు అతనికి తల్లిదండ్రులు పెట్టిన పేరు నరేంద్రనాథుడు అతడు బాల్యమునుండియు భగవద్ధ్యానము కావించుచు భగవంతుని ప్రత్యక్షముగా చూడవలెనని కోరుచుండెను అతడొకసారి మహర్షి దేవేంద్రనాథటాగూరును దర్శించి స్వామీ ! మీరు దేవుని దర్శించితిరా?" యని ప్రశ్నించెను కాని ఆయన ఇచ్చిన సమాధానము తృప్తికరముగా లేకుండుటచే అతడు తన అన్వేషణముసాగించుచు ఒకనాడు దక్షిణేశ్వరమునకరిగి రామకృష్ణుని దర్శించి స్వామీ! తాము భగవంతుని దర్శించితిరా?" యని ప్రశ్నించెను రామకృష్ణుడు వెంటనే "నేను నిన్నెట్లు చూచుచున్నానో భగవంతుని కూడ అట్లే చూచుచున్నాను ఆర్తితో పిలుచుచు అతనికై పరితపించినయెడల అతడు ప్రత్యక్షమైతీరు 'నని పలికెను భగవంతుని ప్రత్యక్షముగా చూచితినని స్వానుభవపూర్వకముగా పల్కిన మహనీయుని కాంచుటకు నరేంద్రుని కదియేమొదటిసారి అతనిచర్యలకును మాటలకును పామరత్వము కనబడకపోవుటచే నరేంద్రుడు సంశయగ్రస్తచిత్తముతోడనే కాళికతనియొద్ద సెలవుతీసికొని వెడలి మరల నొక నెలరోజులైనతరువాత అతనిని దర్శించెను రామకృష్ణుడు మెల్లగా అతని సమీపించి తనకుడికాలితో అతని స్పృశించెను నరేంద్రుని కన్నులు గిర్రునతిరుగసాగెను అతడు భయగ్రస్తుడై

"ఇదేమి! ఇంద్రజాలమా? మీరేమిచేయుచుంటిరి?" అని గొం
తెత్తి యరచెను. రామకృష్ణుడు తన కాలిని మేనినుండి తొల
గించెను. నరేంద్రుడు సామాన్యస్థితి కరుదెంచెను. మరొకసారి
రామకృష్ణుడిట్లే యాతని స్పృశించి అతడు బహిఃప్రపంచమును
విస్మరించిన స్థితిలో ఉన్నప్పుడు పెక్కు ప్రశ్నలువేసి అతని
పూర్వోత్తర జన్మములకు సంబంధించిన విశేషము తెలిసికొ
నెను. క్రమముగా నరేంద్రునికి రామకృష్ణునిపై భక్తి
పెంపొందెను. రామకృష్ణునికిని నరేంద్రునిపై గల ప్రీతి యింతింత
కాదు. నరేంద్రుడు కనబడనిచో అతనికి నిద్రపట్టెడిది
కాదు. నరేంద్రుడు రామకృష్ణుని ఉపదేశము ననుసరించి
అద్వైతమత ప్రతిపాదకములగు గ్రంథములనేకములు చదివి
సర్వము బ్రహ్మమయమను సిద్ధాంతమర్థరహితమని వాదింప
దొడగెను. రామకృష్ణుడేమియుచెప్పక అతని మేనిస్పృశించెను.
అతనికి సర్వమును బ్రహ్మమయముగా కనిపించి అద్వైతమున
విశ్వాసము జనించెను. అతడు వివాహ మాడనంగీకరింపక
సన్న్యసించి గురుప్రసాదమున సంపూర్ణసిద్ధుడై పాశ్చాత్యఖండ
ములనేగి అద్వైతమును గూర్చియు కర్మజ్ఞానభక్తి మార్గము
లను గూర్చియు మహోపన్యాసములొసగి ప్రపంచము నలు
మూలల సనాతనమత మహత్త్వమును చాటినప్పుడు. అతని
భావిమహత్త్వమును ముందే ఎరిగినవాడగుటచే రామకృష్ణు
డతనిపై ఎవ్వరెన్ని నేరములు చెప్పినను పాటిచేయక అతనిని
ప్రత్యేకాభిమానముతో చూచుచుండెను. రామకృష్ణుని అవ
తారమూర్తిగా భావించి తదుపదేశామృతాస్వాదనమున తమ
జన్మములు పూతములు గావించుకొన్న శిష్యులింకను పలువురు
కలరు. వారికందరికి ఈశ్వరకోటియని పేరు. రామకృష్ణుని
ఆశ్రమమునందుండిన భక్తురాండ్రలో అఘోరమణి యనుపరి
వ్రాజిక అగ్రగణ్య. ఆమె రామకృష్ణుని యనుగ్రహముచే
సమాధిస్థితి గాంచి మహానందము ననుభవించెను.

1886 లో రామకృష్ణుని కంఠభాగమున వ్రణమయ్యెను;
వైద్యులెంతచెప్పినను వినక అతడు సమాధిస్థితి పొందుచు
వచ్చినవారికెల్ల ఉపదేశము లొసంగుచునేయుండెను. అతనికి
వ్యాధియెక్కువయ్యెను. శిష్యులాతని కలకత్తాకు గొనివచ్చిరి.
సుప్రసిద్ధవైద్యుడగు మహేంద్రలాల్ సర్కారతనికి చికిత్సచేయు
చుండెను. ఒకప్పుడతడు సమాధిగతుడై యున్నతరి రామ
కృష్ణుని హృదయమును పరీక్షించి ప్రాణచిహ్నములేవియు
లేకుండుట కచ్చెరువంది అది వైద్యశాస్త్రమున కతీతమైనస్థితి
అనిచెప్పెను. రామకృష్ణుని వ్యాధి నానాటికతిశయించుచుండెను.
శిష్యులాతని ప్రశాంతవాతావరణముగల కాశీపురోద్యానము
నకు గొనివచ్చిరి. నరేంద్రుడితరశిష్యులతో నతని సమీపించి
"మాకొరకైనను మాతనడిగి మీ వ్యాధి కుదుర్చుకొను" డని
ప్రార్థించెను. రామకృష్ణుడు కొంతసేపు కన్నులు మూసి
తెరచెను. మాత ఏమన్నదని నరేంద్రుడడిగెను. అంత
రామకృష్ణుడు "కొంచెమైన ఆహారము లోనికి పోనిమ్మని దేవి
నడిగితిని. ఆమె శిష్యులైన మిమ్మందరిని చూపి ఇన్నిముఖ
ముల నీవాహారము తినుచుండియు లేదనుచుంటి వేమని పల్కిన
దని సమాధానమొసగెను. రామకృష్ణుని శిష్యతాదాత్మ్యమున
కెల్లరును ఆశ్చర్యమందిరి.

1886 వ సంవత్సరము డిసెంబరు మొదటిదినమున రామ
కృష్ణుడు శిష్యులందరికిని భావసమాధినొసంగి నరేంద్రుని
చెంతకుబిల్చి "ఈ శిష్యులందరిని నీపై పెట్టి పోవుచున్నాను. వీరు
సాధనామార్గము నతిక్రమింపకుండ చూడు" మని ఆదేశించెను. రామ
కృష్ణుని కవసానకాలము సమీపించెనని శిష్యులెరిగిరి. ఒకనాడు
రామకృష్ణుడు యోగీసుబాయను బిల్చి అమావాస్య యెంతమిగిలి
యున్న పంచాంగము చదువుమనెను. అతడు చదువుచుండగా
అమావాస్యదగ్గర ఆగుమని రామకృష్ణుడు ఆదేశించెను.
నాల్గుదినములైన తరువాత నరేంద్రుడు గురుని శయ్యకడకరుగ,
నతడతని తదేకదృష్టితో చూచి సమాధి స్థితుడయ్యెను.
నరేంద్రుడించుకసేపు బాహ్యస్మృతి గోల్పోయి కన్నులు తెరచి
చూచునప్పటికి రామకృష్ణుడు కన్నుల నీరు కార్చుచుండెను.
నరేంద్రుడు కారణమేమని అడుగ నతడు "నేనీనాడు నా సర్వ
స్వమును నీకర్పించి అకించనుడనైతిని. ఈశక్తితో నీవు లోక
మునకు చాల మేలుచేయగల" వనిపల్కెను. అమావాస్య
వచ్చెను. రామకృష్ణుని నాడి బలహీనమయ్యెను. అతడు
చాలాసేపు సమాధిలోనుండి రాత్రి రెండుగంటలవేళ కాళీ
నామమును మూడుసారులుచ్చరించి ప్రాణములు విడిచెను.
ఉదయమునకే శిష్యులందరును తండ్రిని గోల్పోయిన బిడ్డలవలె
ఏడ్చుచు అతని భౌతికదేహమును బారానగరమందలి స్మశాన
మునకుగొనివచ్చిరి. అచ్చటసుగంధద్రవ్యాదులతో నతని భౌతిక
దేహము సంస్కరింపబడెను. నరేంద్రుడు దగ్ధశేషము నొక
పాత్రలో గ్రహించి 'జయరామకృష్ణ' యని ఘోషించుచు
సోదరశిష్యులతో కాశీపురోద్యానమునకు తిరిగివచ్చెను.

రామకృష్ణుని హృదయమతివిశాలమైనది. సర్వమతసమ

స్వయ మాతని అదర్శము అయన ఎక్కువగా మాటలాడక ఒక్కొక్క "తోనో మాటతోనో ఎక్కి క్లిష్టవిషయము నుకూడ స్పష్టముగా విప్పిచెప్పుచుండెను. ఆత్మసాక్షాత్కారమే మానవునకు పరమార్థమనియు సాధనసంపద లేని శాస్త్ర పాండిత్యము నిరర్థకమనియు కామకాంచనవిజయము మోక్షబోధమునకు మొదటి మెట్టనియు అయన విశ్వసించుచుండెను. వర్ణాశ్రమాచారములను గాని సాంఘికసంప్రదాయములను గాని క్షుద్ర దేవతారాధనములను గాని ఆయన ఎన్నడును నిరసించియుండలేదు. భగవంతు నేరూపమున ఆరాధించినను చిత్తపరిశుద్ధి యున్నచో తద్దర్శనము తప్పక కలుగునని ఆయన శిష్యులకు బోధించుచుండెను. ప్రతిప్రాణియు భగవత్స్వరూపమని యెంచి మానవులు జీవసేవ చేయవలయుననియు జీవారాధనము లేని శైవారాధన మర్థములేని ప్రలాపమనియు అతని అభిప్రాయము. అతడు భక్తిజ్ఞానమార్గములకును నవీనశాస్త్రసిద్ధాంతములకును తనజీవితమున సామరస్యము కల్పించెను. రామకృష్ణమఠసేవాసంఘము లాతని తత్త్వమెత్తిన కార్యరూపములు. వానివలన రామకృష్ణుని యథార్థరూపమెరిగి భారతీయులు తమ జీవితమార్గమును సరిదిద్దుకొని తరింతురుగాక !

ది. వెం.

## శ్రీశైలము

శ్రీశైలము మహనీయమగు మహాశివక్షేత్రము

శ్లో॥ "మైనాకం మందరం మేరుం శ్రీశైలం గంధ మాధనమ్
పంచశైలాన్ ప్రపశ్యేన్నిత్యం మహాపాతకనాశనమ్ ।"

అని కొనియాడబడిన పావనములగు పంచమహాపర్వతములలో ఇది యొక పర్వతము. దీనినామము నుచ్చరించినంతమాత్రముననే మహాపాతకములెల్ల నశించుననగా దీని మాహాత్మ్యమునుగూర్చి వేరుగచెప్ప నవసరములేదు. పురాణములందును శైవలోకమునందును దర్శనమాత్రముచేతనే మోక్షమొసంగజాలిన పవిత్రక్షేత్రముగా నుతింపబడిన సిద్ధక్షేత్రమిది. మూడులోకములలో నీక్షేత్రమువంటి క్షేత్రములేదు. శ్రీశైలము దక్షిణకాశిగా చెప్పబడినది. శైలాగ్రమీ రెండింటి ని మూలము. ఇచట మరణించినవారి కర్ణమున తారకమంత్రము విశ్వేశ్వరుని చే ఉపదేశింపబడునట! దర్శనమాత్రముననే ఇది ముక్తిదము అని "శ్రీశైల తీర్థసారము" నందు కీర్తింపబడిన దక్షిణకాశి ఈ పుణ్యక్షేత్రము. ఇతర క్షేత్రములకంటెను మిన్నయైన సిద్ధక్షేత్రముగా ప్రశంసింపబడిన క్షేత్రరాజమిది. కామమోచ్చారణమ త్రిగుణ బహుళముకృతపాపసను లంహారింగజాలిన జ్యోతిర్లింగములుగా చెప్పబడిన ద్వాదశలింగములలో నొకటైన మల్లికార్జునస్వామి ఇచట అధిష్ఠాన దేవత.

ఉనికిపట్టు : శ్రీశైలము కర్నూలు మండలమునందలి నల్లమలలలో ఉత్తరభాగమున నున్నది. భారతదేశమున ప్రసిద్ధములగు తూర్పుకనుమలలో నల్లమల లొకభాగము. మిక్కిలి ఎత్తైన ఈ నల్లకొండలు దట్టమగు అరణ్యములతో చుట్టుముట్టబడియున్నవి. ఈ యడవులలో టేకు వెగ మొదలగు మహావృక్షములు మొలచుచుండును. పులులు ఎలుగులు మొదలగు మృగములు స్వేచ్ఛావిహారములు చేయుచుండును. ఆట గ్రామములవంటి కొండచిలువలు ఎత్తుగా దట్టముగా పెరిగిన గడ్డిని రెండుపాయలుగా చీల్చుకొనుచు కొండశిలలలో సాగిపోవుచుండును. చెంచులు కోయలు మొదలగు ఆటవికజాతుల వారచటచట గూడెములు కట్టుకొని కాపురము చేయుచుందురు. వారికి ఆ మహారణ్యములో తేనె వెదురుబియ్యము చారపప్పు వివిధములైన అరణ్యకఫలములు జంతుమాంసము మొదలగు ఆహారములను కల్పించుచుండును. దట్టముగా పెరిగి పెనవేసికొనిన పొదలతోను వెదురుగుబుర్లతోను ఆ యడవులడుగుమోపవీలు లేనంతగా క్రిక్కిరిసి భయవిస్మయానందముల గొల్పుచుండును. అట్టి నల్లమలలలో ఈ శ్రీశైల క్షేత్రమున్నది.

ఆకృతి - చారిత్రకవ్యాఖ్యానము : ఈ క్షేత్రముండు పీఠభూమి ఎనుబదిరెండు చదరపుమైళ్ళ వైశాల్యము కలిగియున్నది. ఇందు రమణీయములగు ఆలయములు, ఎత్తైయిన గోపురములు, ప్రాకారములు వివిధ మంటపములు కుండములు ఉన్నవి. ఈ క్షేత్రమునకు తూర్పుమార్గమున శిఖరేశ్వరమున్నది. అచటినుండి చూచిన మల్లికార్జునాలయ శిఖరము కన్పించును. ఈ శిఖరదర్శనమే మోక్షప్రదమని ప్రతీతి కలదు. ఈ క్షేత్రపీఠభూమిమధ్యలో 28 అడుగుల ఎత్తును 500 అడుగుల తూర్పుపడమరలును 600 అడుగుల దక్షిణోత్తరములును కల ప్రాకారమున్నది. అందు నలువైపుల ఎత్తయిన గోపురములున్నవి. ఈ ప్రాకారము మధ్యలో శ్రీ మల్లికార్జునస్వామి ఆలయమున్నది. దీనివెనుక భ్రమరాంబదేవళాలయము కలదు. అస్మదాది దృష్టి నాటిగా లింగములైన పదునెట్ల ఆలయములు రెండును నిర్మింపబడినవి. ఈ దేవి అష్టా

దక్షయజ్ఞములో చేసిన మహాశక్తి శ్రీ ఆదిశంకరులు ఇచట శ్రీచక్రమును ప్రతిష్ఠించిరి. చైత్రమాసమున అతిరునాళ్ళ అను పేర మహోత్సవములు జరుగును. ప్రస్తుతమాంధ్ర ప్రభుత్వము శ్రీశైలమున గొప్ప ప్రాజెక్టును నిర్మించుచున్నది. తత్కార్యకలాపములకు సంబంధించిన సిబ్బందితో సున్నిపెంట యను పేర గొప్ప గ్రామము ఏర్పడియున్నది.

మల్లికార్జునస్వామి కెడమవైపున పార్వతీ దేవ్యాలయమున్నది. సంక్రాంతినాడు పార్వతిని శివరాత్రినాడు భ్రమరాంబను కల్యాణములు జరుగును. భారతదేశమందలి శివక్షేత్రములలో రెండుకల్యాణములు జరుగు శివక్షేత్రము ఇదియొక్కటే. ఈ ఆలయము ప్రక్కనే సాక్షిగణపతి ఆలయము కలదు. ఈ గణపతి యాత్రికుల పట్టికను వ్రాసికొని నిత్యము లింగోద్భవసమయములో పరమేశ్వరునకు విన్నవించుననియు శంకరుడు వారికోర్కెలు తీర్చి చివరకు మోక్షమొసగుననియు చెప్పుదురు. ఈ ప్రధానాలయసమీపములో మరి తొమ్మిది శివాలయములు కలవు. తొమ్మిదవ ఆలయములోని లింగము సహస్రలింగమని ప్రతీతి.

ఇచట మహారాష్ట్రప్రభువులు, కాకతీయులు విజయనగరరాజులు కట్టించిన గోపురప్రాకార మంటపాదులనేకములు నేటికిని చెదరక కన్పించుచున్నవి. కాకతీయరుద్రమదేవి ప్రతిసంవత్సరము రెండుమూడుమాసములు మల్లికార్జునస్వామిని సేవించుచుండెడిదట. శివాజీప్రభువు ప్రతివత్సరము సపరివారముగా వచ్చి భ్రమరాంబాదేవి నర్చించి వెళ్లెడివాడట. ప్రాకారములోని ఉత్తరపుగోపురము శివాజీ కట్టించినదే. దీనిని శివాజీగోపురమందురు. శ్రీనరసింహరాయలును శ్రీకృష్ణదేవరాయలును భక్తియుక్తులై కొన్నికట్టడములను కట్టించిరి. వాటిని నేటికిని యాత్రికులు గుర్తించి చెప్పుకొనుచుందురు. ఇచటి పండితారాధ్యమఠము భారతదేశమునందలి పంచమహాశైవమఠములలో నొకటియని చెప్పబడుచున్నది. ఈ క్షేత్రము కొంతకాలము కాకతీయుల పాలనములోను పిమ్మట మహారాష్ట్ర పాలనములోను ఉండి మహారాష్ట్రపతనానంతరము గోల్కొండనవాబుక్రింది అక్కన్న-మాదన్నల పరిపాలనలోనికి వచ్చినదని చెప్పుదురు. అక్కన్నమాదన్నలు గోల్కొండలో నుండియు, స్వామికై నైవేద్యమైన పిమ్మటనే నిత్యము భుజించువారనియు ఆసంగతి వారికి అంచెలంచెలుగా మ్రోగు నగారా మ్రోతలద్వారా తెలిసెడిదనియును ప్రసిద్ధికలదు.

కాశీదేవునికి అరువదియెనిమిది గ్రామములనిచ్చిరట. విజయనగరరాజులెన్నియో మాన్యములనిచ్చిరట. పూర్వమిచట సుమారు మూడువేల గృహములుగల ఒక నగరముండెడిదట. అందుచే ఈ క్షేత్రమునకు నగరము అను ప్రసిద్ధివచ్చినది. అవన్నియు కాలగర్భమున ఎట్లుకలసిపోయినవో! స్వామి తన ఆదికేతు నామమును సార్థకముచేసికొనుచు యాత్రికుల కానుకలపైననే ఆధారపడవలసిన కాలము తటస్థించినది. బంగారురేకులతో మెరసెడి కట్టడములెల్ల కాంతిహీనములై శిథిలములైనవి. ప్రత్యేక ఆంధ్రరాష్ట్రము ఏర్పడిన తర్వాత మరల అన్నియు పునర్నిర్మాణమునందుచు నూతనకళతో శోభిల్లుచున్నవి. ఈ ఆలయమునకు రెండుమైళ్ల సమీపముననే కృష్ణానది ప్రవహించుచున్నది. దీనికే పాతాళగంగ అని పేరు.

ముఖ్యదర్శనీయములు — ఇందు దర్శనీయములగు విశేషములెన్నియో యున్నవి. అందు (1) వృద్ధమల్లికార్జునస్వామి (లింగమునుండి ఎల్లప్పుడు నీరు స్రవించుచుండును) (2) సారంగమంటపము (3) పంచాక్షరీమంటపము (4) చంద్రమంటపము (4) ఘంటామల్లేశ్వరాలయము (7) చంద్రపుష్కరిణి (దీనిని ఏనుగులచెరువందురు) (8) లింగాలగట్టు (9) నృసింహాలయము (10) సహస్రలింగాలయము (11) రుద్రాక్షమంటపము (12) హాటకేశ్వరము (13) శిఖరేశ్వరము (14) పాతాళగంగ, అనునవి ముఖ్యములైనవి. చూచుటకు సాధ్యమైనవియు ఇవియే. ఇంకను ఎన్నియో ఆలయములు మంటపములు లింగములు, కుండములు దొనలు గుహలు విగ్రహములు కాలవశమున శిథిలములై పోయినవి.

పౌరాణిక ప్రశస్తి — పూర్వము శివాపరాధముచే కాశిని వదలి వచ్చిన వ్యాసుడు బ్రహ్మపుత్రుడగు సనత్కుమారుని కలసికొని ఆత్మశాంతికి మార్గము తెల్పుమని కోరగా ఆదేవర్షి స్కాందసంహితను రచింపుమని యాదేశించి వెసనెను. శివతత్త్వమాహాత్మ్యమును దెల్పు ఈసంహిత బహుఖండములతో ఆరుభాగములుగా విభజింపబడియున్నది. అందు శ్రీగిరిమాహాత్మ్యము అను ఒకఖండము కలదు. దానిలో క్షేత్రోత్పత్తియు తత్కారణములును శ్రీశైలము పర్వతము, మల్లికార్జునుడు భ్రమరాంబ అనునామములుగల్గుటకు నిమిత్తములును వివరింపబడినవి. ఎన్నెన్నియో ఆలయ-లింగ-కుండ-మంటప-తీర్థములును దివ్యప్రభావసంపన్నములగు నదీ-నద-వృక్ష-వన-లతా-గుల్మాదులును తెలుపబడి

వని ఆవిషయములు చదివి ఒకదృష్టితో భావించుకొలది, బుద్ధి అయోమయమై అవి అభూతకల్పనలా అని సందేహము పొడముచు. వేరొకదృష్టితో ఆలోచించినచో ఇదియే కైలాసమని ఇదియే సర్వదేవతాయతనమని ఆత్మనిర్వృతి చెందును. ఆస్తిక్య గుణ ధనవంతు లగువారికి అట్టి ఆర్ష వాక్యములలో అప్రామాణ్యము గోచరింపదు కదా!

కృతయుగమున శ్రీశైలప్రాంతము మునిపల్లెలతో నిండియుండెను. అందొక పల్లెలో శిలాదుడు అను బ్రహ్మర్షి కలడు. ఆయన అగ్నిహోత్రుల ఉత్తముడు. భార్యపేరు సుశీల. ఆమె సార్థకనామధేయ. వారికి చాలకాలము సంతానములేదు. శిలాదుడా పల్లెకొండలలోని ఒక ఎత్తైన శిఖరమందు సంతానార్థియై శివునిగూర్చి తపము చేసెను. శివుడు ప్రత్యక్షమై అతని కోర్కె ననుసరించి పుత్రద్వయము కల్గునట్లు వరమిచ్చి మాయమయ్యెను. పిమ్మట సుశీల గర్భవతియై పుత్రుల కన్నది. అందొకనికి నంది యనియు రెండవవానికి 'పర్వతుడు' అనియు నామకరణములు చేసిరి. అచటి ఋషులందరు వారిని సాక్షాత్తు శివస్వరూపులని కొనియాడుచుండిరి. వారిరువురు నిరంతరము శివధ్యానమగ్నులై యుండి ఒకనాడు తపస్సున కేగిరి.

తమతండ్రి తపముచేసిన ప్రదేశముననే చెరియొక కొండపై కూర్చొని పుత్రులిరువురు ఘోరముగా తపస్సుచేసిరి. శంకరుడు మెచ్చి నందికి సాక్షాత్కరించి వరము కోరుకొమ్మనెను. "స్వామీ! నీవాహనముగా నన్ననుగ్రహింపుము" అని నంది కోరెను. అంత శంకరుడానందిని ఆదరించి "నేను వృషాంకుడను. నీవు ఎల్లకాలము నాకు వృషభరూపమున వాహనమై యుండగలవు" అని వరమిచ్చి అతనిని వెంటనిడుకొని పర్వతుని చేర "వత్సా! నీతపస్సునకు మెచ్చితిని వరముకోరుకొమ్ము" అని పల్కెను. అంత పర్వతుడు

"స్వామీ! శంకరా! నా పేరునకు తగినట్లు నన్ను పర్వతరూపముగా ననుగ్రహింపుము. అందు కైలాసమునందువలె దేవితోను సకల దేవగణములతోను నిత్యనివాసులై యుండుము. మూడులోకములలోని సర్వతీర్థక్షేత్రాదులు నాయందుండునట్లనుగ్రహింపుము. నాపైనున్న నిన్నుగాంచి సర్వమానవులు తరించునట్లు ప్రసాదింపుము" అని వరము కోరెను. పరమేశ్వరుడు 'తథాస్తు' అనెను. తత్క్షణమే ఆపరమశివుని వరమునననుసరించి నగముగా మారిపోయినది. ఆ పల్లెకొండల ప్రదేశమంతయు రెండవ కైలాసమైపోయినది. 'పర్వతము' అనుపేరు కొండలకెల్ల సామాన్యనామమైనను పర్వతుడు శ్రీశైలముగా మారిపోవుటచే ఆ శ్రీగిరికి 'పర్వతము' అనునది విశేషనామమై వెలసినది. నేటికిని శ్రీశైల యాత్రికులు పర్వతము వెళ్ళితి మనియు పర్వతమునుండి వచ్చితి మనియు చెప్పుచుందురు.

శ్రీశైలము ఈ పర్వతముగందలి బ్రహ్మతీర్థ మను ఒక ప్రదేశమున 'శ్రీ' యను ఒకయువతి పెక్కు వత్సరములు తపస్సుచేసినది. అసలీమె యొక గంధర్వరాజపుత్రి. పేరు వసుమతి. పార్వతి పరిచారిక. ఒక చిన్న తప్పుచే శాపమునొంది భూలోకమున పద్మావతీ శ్రీముఖులు అను దంపతులకు పుట్టినది. వారామెకు శ్రీ అని పేరుపెట్టిరి. శ్రీముఖుడు నాగాంధ్రదేశపురాజు. కొంతకాలమునకు విద్యావతియు యౌవనవతియు అగు ఆ కుమార్తెకు వివాహము చేయనెంచి శ్రీముఖుడు స్వయంవరము చాటెను. అనేకులు రాజులు వచ్చిరి. కళింగరాజగు 'అనంతవర్మను' ఆమె వరించినది. ఇతరరాజులు ఈర్ష్యతో యుద్ధమునకు తలపడిరి. ఆ యుద్ధములో మామయు అల్లుడును మరణించిరి. పద్మావతి సహగమనము చేసినది. శత్రురాజులాంధ్ర రాజధాని నాక్రమించిరి. అపుడు శ్రీముఖుని వృద్ధమంత్రియగు రుద్రనాగుడను కొంతరాజున కప్పగించి కాలధర్మమునందెను.

రుద్రనాగుడు శ్రీముఖుని సామంతుడు దయగలవాడు. శ్రీని కన్నబిడ్డవలె కాపాడుచుండెను. తమరాజునకుగల్గిన పరాజయమునకు కినిసి తన సైన్యముతో ఆంధ్రరాజధానిపై దండెత్తిపోయెను. పెద్దయుద్ధము జరిగినది. ఆ యుద్ధములో రుద్రనాగుడును మరణించినాడు. అంత శ్రీదేవి విరక్తినొంది 'బ్రహ్మతీర్థమున తపస్సుచేయగా శివుడు మెచ్చి ప్రత్యక్షమై వరము కోరుకొమ్మన "సదాశివా! నా పేరు నీ పర్వతమునకు తో జతపరచి శాశ్వతము కావింపుము" అని శ్రీ ప్రార్థించినది. అంతశివుడు "స్వాహాగ్నిహోత్రులవలె శ్రీ-పర్వతముల' రెంటికి నిత్యసంబంధముండును' అని వరమొసగెను. తదాదిగా ఈ పర్వతము శ్రీపర్వతమనియు శ్రీశైలమనియు ప్రసిద్ధిగాంచినది.

మల్లీశ్వరుడు (మల్లికార్జునుడు) శ్రీశైల సమీపమున 'చంద్రగుప్తపురి' అను ఒక పట్టణముండెను. అందు మహావీరుడగు చంద్రగుప్తను రాజుండెను. అతడొకప్పుడు దిగ్విజయమునకై బయలు వెడలెను. ఆ సమయమున అతని భార్య గర్భవతి. ఈరాజు దిగ్విజయము ముగించుకొని, మరలివచ్చు

## షా జార్జి బెర్నార్డ్ :

జార్జి బెర్నార్డ్ షా డబ్లిన్ (ఐర్లెండు) నగరమున క్రీ. శ. 1856 జూలై 26వ తేదీన జన్మించెను. ఐర్లండు దేశములో తరతరాలుగా స్థిరపడిపోయిన ప్రొటెస్టెంట్ వంశమునకు చెందిన ఆతని తండ్రి జార్జి కార్ షా భూస్వాముల కుటుంబమున జన్మించిన స్త్రీని పెండ్లియాడెను. డబ్లిన్ లోని న్యాయస్థానములలో కొంతకాలము పనిచేసి ధాన్యవ్యాపారమున నష్టపడి, త్రాగుబోతైన కార్ షా తన భార్యను ముగ్గురు పిల్లలను పోషించుటకు అశక్తుడాయెను. బెర్నార్డ్ షా తల్లి చక్కని గాయకి. ఆమెవద్ద, ఆమె స్నేహితురాండ్రవద్ద బెర్నార్డ్ షా సంగీత రూపకముల (ఒపేరా) నభ్యసించెను. ఆతని పదునారవయేట తన ఇద్దరు కుమార్తెలను తీసికొని ఆమె లండన్ నగరమును ప్రవేశించెను. సంగీత పాఠములనిచ్చుచు గానసభలలో ప్రదర్శనల నొసగుచు ఆమె తనను, తన పిల్లలను పోషించుకొనసాగెను.

చిత్రము-97

జార్జి బెర్నార్డ్ షా

తన పదునైదవయేటివరకు డబ్లిన్ లో విద్యాభ్యాసముచేసి 1876 ఏప్రెల్ వరకు ఒక భూస్వామి కార్యాలయములో జార్జి బెర్నార్డ్ షా ఉద్యోగముచేసి తర్వాత తల్లివద్దకు చేరెను. ఇంటి పరిస్థితులతో సంబంధములేని ఒంటరి, ఎల్లలెరుగని సంగీతమే పరమావధిగా భావించిన తల్లిని గమనించిన షా క్రమక్రమముగ మానసిక స్వాతంత్ర్యము నలవరచుకొనెను. సంప్రదాయములతోగాని ఇతరుల ఆజ్ఞలతోగాని నిమిత్తము లేకుండా ప్రతి విషయమును తర్కాత్మిక బుద్ధులతో షా పరిశీలింపగల్గుటకు స్వాతంత్ర్యమెంతయో తోడ్పడెను.

మాతృప్రేమ లభింపకున్నను సంగీతముపై ఆమెయందు అలవరచుకొనిన అభిమానము, గౌరవము, ప్రేమ షాకు లండనులో చాల ఉపకరించెను. లండనులో సాయంత్రము వెలువడు 'స్టార్' అను పత్రికకు సంగీత విమర్శకుడుగా షా నియమింపబడెను. కొంతకాలమైన తర్వాత "దిసాటర్డే రివ్యూ" అను వారపత్రికకు నాటక విమర్శకుడుగా వ్యవహరించెను. ఈ రెండింటిలోను ప్రచురింపబడిన షా వ్యాసములు నేటికి గూడ ప్రామాణికములే.

స్వతంత్ర నాటక రచనకు షా ఉపక్రమించినపుడు పాత్రలుచ్చరించవలసిన శబ్దముల ధ్వనులను సంగీతజ్ఞుని శ్రవణేంద్రియముతో గ్రహించి వాడుటచే ఆ నాటకములలోని వాక్యములు లయబద్ధములయ్యెను. ఉచ్చారణసౌలభ్య మేర్పడినది. గనుకనే అందలి దీర్ఘోపన్యాసములు సహితము మనల నాకర్షించజాలియున్నవి. సంగీతరూపక ప్రభావము ఆతని "మేన్ అండ్ సూపర్ మేన్" (మానవుడు తదతీతుడు) అను నాటకములో తృతీయాంకమున గాంచనగును.

కేవలము రచనలవలన చేకూరు ఆదాయముతోనే లండనులో జీవించుట కష్టమగుటచే మొదటి పదియేండ్లు తన వసతి, భోజనములకు షా తన తల్లిపై ఆధారపడవలసి వచ్చినది. ఈ కాలమున రాజకీయ సంఘములలో చేరి ఉపన్యాసవేదికలపై మాట్లాడుట మొదలైన కార్యక్రమములను ఆతడు చేపట్టెను. "అభివృద్ధి దారిద్ర్యము" అను గ్రంథమును రచించిన అమెరికా ఆర్థిక శాస్త్రజ్ఞుడగు హెన్రీ జార్జి 1882 సెప్టెంబరులో ఒకనాడు లండన్ నగరమున ఉపన్యసించెను. అనేక వస్తువులపై వివిధరకముల పన్నులను వేయుటకు బదులు భూమిపై వేయు ఒకే ఒకపన్నుతో జాతీయాదాయమును పెంచ వీలున్నదని ఆయన ఉపన్యాససారాంశము. ఈ ఉపన్యాసమును శ్రద్ధగా ఆలకించిన షా ఆనాడే సమాజవాదిగా మారి అప్పుడే స్థాపితమైన 'ఫేబియన్' సంస్థలో సభ్యుడాయెను. సమాజవాదమును ఆచరణములోనికి క్రమపరిణామము ననుసరించి తీసికొని రావలెననునది ఫేబియనుల ముఖ్యసిద్ధాంతము.

ఇదే సమయమున అనీబెసెంటును షా కలిసికొనెను. షాపై విపరీతమగు అభిమానముగల్గి వెంటనే ఆతనిని ఫేబియన్ సంఘమున సభ్యునిగా చేర్పినది ఆమెయే. మానవ సమానత్వమును పెంపొందించి ధనికుల సంపదలను తగ్గించి పేదల నుద్ధరించగల శాసనసభా కార్యక్రమములద్వారా నాగరక సమాజముల పరిస్థితి మెరుగుపరచవలెనని షా తన ఫేబియన్ రచనలలో వాదించెను. వయస్సువచ్చినకొలది శాసనసభలపై నమ్మకమాయనకు సన్నగిల్లెను. సంఘమును బాగుచేయుటకు కావలసినవి చట్టములు కావనియు, దీనికి ధర్మాత్ములగు పురుషులే ముఖ్యమనియు ఆతడు భావింపసాగెను.

క్రైస్తవ దేవాలయములగు చర్చిలలో ప్రార్థనలు

చేయ బడుచున్న క్రైస్తవమతముపై చిన్ననాడే షాకు నమ్మకము పోయినది కాని ఆయనప్రవర్తనము విశ్వాసములు ఆధ్యాత్మికమార్గమును వీడలేదు ప్రతిజీవి యొక్క ప్రాణము పవిత్రమైనది జీవితము నిర్మలముగా శుద్ధముగా నుండవలెను మాంసాహారము త్రాగుడు పొగాకు పరిత్యాజ్యములు అందరియెడల దయను ఉదారత్వమును చూపవలెను ప్రతి వ్యక్తి తాను ఈలోకమునుంచి నిర్గమించునప్పటికి తాను చూచిన ప్రపంచమును మెరుగుపరచ యత్నించుట విధిగా భావింపవలెను. రాబోవు తరములవారికి జీవజ్యోతిని కాంతివంతముగా అందజేయవలెను – ఇట్టి భావములను నమ్మి షా తనజీవితమును గడిపినాడు

అతని రాజకీయములు పత్రికారచనలు 1898 వరకు సాగినవి 1879 నుండి 1883 వరకు గల కాలమున ఐదు నవలలను వ్రాసెనుగాని అవి జయప్రదములు కాలేదు 1885 లో మొట్టమొదటిసారిగా నాటకరచన కుపక్రమించి ఈ నాటకమును 1892 లో పూర్తిచేసెను ఈ నాటకముపేరు "విడోయర్స్ హౌసెస్" (భాగ్యములేనివారి ఇండ్లు) లండన్ నగర పరిసరములలో హీనవారికి అద్దెలకై ఇండ్లనుకట్టి వాటిని అనారోగ్యపరిస్థితులలో నుంచినవారిపై తీవ్రమైన విమర్శ ఈ నాటకమున గలదు వాస్తవమైన సాంఘికదుష్కృత్యములపై ఇట్లు నాటకములను వ్రాసి ప్రదర్శించుట బ్రిటన్ లో అనటికి అపూర్వమే దుష్ప్రవృత్తి (మిసెస్ వారెన్స్ ప్రొఫెషన్ – శ్రీమతి వారెన్ ఉద్యోగము) యుద్ధము (ఆర్మ్స్ అండ్ ది మేన్) మతదురభిమానము (ది డెవిల్స్ డిసైపుల్) ప్రతీకారము (కెప్టెన్ బ్రాస్ బౌండ్స్ కన్వర్షన్) మొదలగు వాస్తవ సమస్యలపై నాటకములను వ్రాసి ఇతడు అనేకుల ఆగ్రహమునకు గురికావలసివచ్చినది చాల సంవత్సరములిట్లు కష్టించిన తర్వాతనే నాటకములద్వారా ఇతడు ధనార్జన చేయగలిగెను క్రమక్రమముగా బౌద్ధికస్వాతంత్ర్యమునకు ప్రజలనేకులీయనను మార్గదర్శకునిగా స్వీకరించిరి

సమకాలిక సాంఘిక రాజకీయ ఆధ్యాత్మికవిషయములపై నార్వేలో 1876 నుంచి ఇబ్సెన్ అను పండితుడు అనేక నాటకములను రచించినాడు ఆయన మార్గమున జయలుదేరిన షా వచ్చువరకు బ్రిటనులో ఇట్టినాటకములు లేవు లండనులోని కోర్టుథియేటరులో 1904 న షా నాటకములు ప్రదర్శింపబడిన తర్వాతనే అనేకులకీయన నాటకములతో పరిచయమేర్పడెను 1904 నుండి 1907 వరకు షా వ్రాసిన పదకొండు నాటకములు 711 పర్యాయములిట్లు ప్రదర్శింపబడినవి వీటిలో మొట్టమొదట పేరుగన్న నాటకము "జాన్ బుల్స్ అదర్ ఐలెండ్" బ్రిటిషువారి మారుపేరు జాన్ బుల్ ఈయనకుగల ఇతర ద్వీపము ఐర్లెండు బ్రిటనుకు ఐర్లెండుకు మధ్యగల సంబంధములపై ఈనాటకేతివృత్త మాధారపడినది ఇదేనాటకరంగమున 1905 మే 23 న "మేన్ అండ్ సూపర్ మేన్" అను నాటకప్రదర్శన జరిగెను మోటారుకారును నడపు హెన్రీ స్ట్రేకర్ అనుపాత్ర ఈ నాటకములోనిది నవీన యంత్రములను అర్థము చేసికొని వాటితో ఆనందపడు క్రొత్తరకపు కార్మికుడితడు యంత్రతంత్రయుగమున ఇట్టివ్యక్తికే ప్రాధాన్యమున్నదని షా ఇతని పాత్రను సృష్టించెను ఈ నాటకములోని మూడవ అంకము విశిష్టమైనది మొదటిరెండు అంకములలో వచ్చుపాత్రలకు సంభవించిన స్వప్నమే ఈఅంకమునందలి కథాంశము డాన్ జువాన్ అతడు వలచి వదలివేసిన డోనాఅన్నా అతనిచేతిలో హతుడైన ఆమె తండ్రియొక్క భూతము–ఈముగ్గురును నరకమున సంభాషింతురు మానవుడు మూర్ఖుడు దుష్టుడు అతనిని నాశనమునుంచి ఎవ్వరును కాపాడలేరని భూతము వారిచే నమ్మింప యత్నించును కాని మానవునిలో ఒకశక్తి కలదనియు ఈశక్తిద్వారా ప్రేరితుడైన మానవుడు అతీతమానవుని సృష్టింపగలడనియు ఈ అతీతుడే అందరికన్న వివేకియనియు డాన్ జువాన్ వాదించును ఈ శక్తిని "లైఫ్ ఫోర్స్" (జీవశక్తి)అని షా వ్యవహరించినాడు ఈ జీవశక్తియొక్క పరిణామములను వివిధరంగములలో వివరించుటయే షా వ్రాసిన నాటకములలోని పరమలక్ష్యము

ఈసంవాదము సుదీర్ఘమైనదైనను శ్రోతలకు విసుగు కలుగదు హాస్యము చమత్కారము సమయస్ఫూర్తి ఇచట మెండుగా కలవు ఇందలి సంభాషణను వాగ్గేయకారుడుగా షా రచించెను మొదటినుండి షాకు పదములనిన ప్రీతిమెండు ఆంగ్లభాషలో పదములోనివర్ణములకు అపదముయొక్క ఉచ్చారణకు భేదమున్నది వివిధవర్గములవారు వివిధప్రాంతములవారు ఒకేఒకపదమును అనేకరీతులనుచ్చరింతురు ఉచ్చారణలో కన్పించు ధ్వనులకు సరిపోవు వర్ణములు ఆంగ్లమున లేవు ఈ సమస్యలను విమర్శించుచు "పిగ్మలియన్" అనునాటకమును షా వ్రాసెను మరణానంతరము తనఆస్తిలో చాలభాగమును లిపిసంస్కరణకు ఉపయోగింపవలెనని షా నిర్దేశించెనుకూడ

1905 నుంచి ప్రపంచమునగల మేటినాటకరచయితలలో అగ్రగణ్యుడుగా షా పరిగణింపబడినాడు. షేక్స్పియర్ తర్వాత చెప్పదగిన గొప్ప నాటకకర్త షా మాత్రమే అనికూడ కొందరి భావన. ఈతడు 1925లో సాహిత్యమునకొసగు నోబెల్ బహుమతి షాకు లభించినది.

మతసంబంధమైన పుస్తకములు భావములు అతని అనేక నాటకములలో కన్పించుచున్నవి. అటులో ముఖ్యమైనది "సెయింట్ జోన్" (1923). ఫ్రాన్సుదేశచరిత్రలోగల జోన్ ఆఫ్ ఆర్క్ ఈనాటకమందలి కథానాయిక. పదునైదవ శతాబ్దమున ఆంగ్లసైన్యములను ఫ్రాన్సు నుంచి పారద్రోలిన వీరవనిత ఈమె. చర్చిలోని మతగురువును పాటించక తనఅంతరాత్మలో వినబడు భగవద్వాక్యములనే ఈమె అనుసరించసాగెను. చివరకు రాజకీయనాయకులు, క్రైస్తవమతగురువులు ఈమెను సజీవముగ తగులబెట్టిరి. ఈమెలో మూర్తీభవించిన వ్యక్తిస్వాతంత్ర్యము అంతర్వాణి గల ప్రాధాన్యము అంతరాత్మ యొక్క శక్తి షా లో గూడ కలవు.

కార్మిక మిత్రులు షాను రష్యాకు 1931 లో బయలుదేరదీసిరి. తర్వాత 1932-1933 లో అనేకదేశములను షా దర్శించెను. ప్రపంచదేశములలో సంచరించకున్నను, షా నిజమైన అంతర్జాతీయవ్యక్తి. మాతృదేశమునకు దూరముగా నివసించిన షాకు ఐర్లండుపై వాత్సల్యము గౌరవము కలవు. జాతిదురభిమానములేని షా అందరిని నిష్పాక్షికముగా పరిశీలించినవాడు. ఆర్థిక రాజకీయ విషయములపైన సంగీతము మీద నాటకములపైన అనేకవ్యాసములను గ్రంథములను రచించిన షా మొత్తము ఏబదినాటకములను వ్రాసెను. ఈ నాటకములకు సుదీర్ఘములగు ఉపోద్ఘాతములున్నవి. కొన్ని చోట్ల నాటకములకన్న ప్రధానముగా కనిపించు ఉపోద్ఘాతములలో చక్కని గద్యరచన కలదు.

షా వ్రాసిన చివరి ముఖ్యనాటకము "హీవ ల్ హార్ట్" (1919). 1922లో వ్రాసిన "బేక్ టు మెథూసెలా" అనునాటకము శ్రేష్ఠమైనదని షా భావించినాడు. షా యొక్క తత్త్వజిజ్ఞాస ఇందులో పరాకాష్ఠనందినది.

1950లో మరణించిన షా బహుముఖవ్యక్తి. ఆయన నాటకములలో "ఆర్మ్స్ అండ్ ది మేన్" "కాండిడా," "సెయింట్ జోన్" చిరస్మరణీయములు. ఇవే చివరకు మిగిలెడి మహానాటకములు.

బో. మ. రా.

## షితాబుఖాను (సీతాపతిరాజు)

వరంగల్లు అని ఇప్పుడు వ్యవహారములోనున్న నామమునకు ఓరుగల్లు అనునది కాకతీయాంధ్రరాజుల కాలమునాటి రాజధానికిగల పేరు. కాకతీయుల అనంతరము ఓరుగల్లును దక్షతతో పాలించిన రాజశేఖరుడు షితాబుఖాను. కారణజన్ముడైన ఈ తెలుగువీరుడు ఒక పేద కుటుంబమున జన్మించి స్వశక్తిచే ఆంధ్రరాజకీయరంగమున ఒక్కమెరుపు మెరిసి వీరవిహారమొనర్చి వీరస్వర్గమును చూరగొనిన యశస్వి. ఇతని మొదటిపేరు సీతడు. పిమ్మట సీతాపతిరాజైనాడు. ప్రాభవదశయందు షితాబుఖాను చితాపుఖాను అనుబిరుదనామములతో జీవితమును చాలించినాడు.

ఓరుగల్లురాజ్యము 12వ శతాబ్ది మధ్యభాగమునుండి 14వ శతాబ్దిమధ్యభాగమువరకు కాకతీయరాజన్యుల పాలనములోనుండెను. కాకతీయవంశములో ప్రతాపరుద్రుడు కడపటివాడు. శాసనాధారములనుబట్టి ప్రతాపరుద్రుడు క్రీ. శ. 1326 వరకు జీవించియుండెనని నిస్సంశయముగ తెలియుచున్నది. అతని మరణానంతరము ఆరాజ్యమేమైనదో తెలియరాకున్నది. కడపజిల్లాలోని ఉప్పరపల్లి శాసనమునుబట్టి ప్రతాపరుద్రునకు 'జుట్టయ' అను కుమారుడున్నట్లు తెలియుచున్నది. అయినను ప్రతాపరుద్రుని తరువాత వీరభద్రుడను వాడు రాజ్యమునకు వచ్చినట్లును అతడు తన స్థానమును కొండవీడునకు మార్చుకొనవలసివచ్చినట్లును ఎల్ వాల్టర్ ఎలియట్ అను చరిత్రపరిశోధకుడు వ్రాసియున్నాడు. ప్రతాపరుద్రుని యనంతరము రాజ్యమేలినది కృష్ణుడనియు అప్పుడాతని రాజ్యము చాలతగ్గియుండెననియు 'స్యూయల్' అను పరిశోధకుడు వేరొకవిధముగా వ్రాసినాడు. ఇట్లుండ ప్రతాపరుద్రుని కుమారుడు, నాగదేవుడను నామాంతరముగల వినాయకదేవుడని మహమ్మదీయ చరిత్రకారులు వ్రాసినట్లుగా శ్రీ వెంకయ్య అను వేరొక పరిశోధకుడు చెప్పినాడు. కాని ఈయన అందుకు ప్రమాణాధారమేవియు చూపలేదు. వీరభద్రుడు, కృష్ణుడు, నాగదేవుడను వినాయకదేవుడు — వీరిని గూర్చి చిత్రశాసనాధారములు కానవచ్చుటలేదు. కావున కాకతీయవంశము తన ప్రాముఖ్యమును కోల్పోవుటయో లేక సామంతాధికారమును వహించుటయో సంభవించి క్రమముగా రాజకీయరంగమునుండి వైదొలగియుండవచ్చును.

బహమనీవంశ ప్రభువైన అల్లాఉద్దీన్ హసన్ (క్రీ. శ

1347) ఓరుగంటి హిందూరాజులనుండి కప్పము గొనుచుండెను. క్రీ. శ. 1422 లో బహమనీ సైన్యములు ఓరుగల్లును వశ మొనర్చుకొనెను. బహమనీ సంతతము విశాల్యమైనప్పుడు ఓరుగల్లునగరము గోలకొండ కుతుబుషాహీల వశమైనది. కుతుబుషాహీలు ఓరుగల్లుపై అధికారము నెరపిన కాలమునకే ఇందు చర్చింపబడుచున్న శాసనము సంబంధించియున్నది. ఈ శాసనము నందు కాకతీయప్రశంస చేసినతీరును బట్టి చూడగా ఈ పూర్వవంశములోని యొక రాజపుత్రుడు అప్పటికి జీవించియున్నాడనియు, షితాబుఖాను అడ్డులేని యధికారమును వహించి ఓరుగల్లుకు రాజుగానున్నను ఆ రాజపుత్రుడే శాస్త్రరీత్యా నైతికముగ ప్రభువుగా పరిగణింపబడినట్లును తోచుచున్నది.

షితాబుఖాను బహమనీరాజుల క్రింద ఓరుగల్లు గవర్నరుగా మొదట వ్యవహరించుచుండినను తానొక స్వతంత్ర రాజ్యాధినేతగనే పాలించుటకు యత్నించి జయప్రదుడయ్యెను. ఇతని రాజ్యములో ఖమ్మము, ఓరుగల్లు, నల్లగొండ ప్రాంతములు చేరియుండినవి. వరంగల్లుకోటలో "షితాబుఖాను దర్బారుహాలు" అనుమందిరముండుటయు, పాకాలచెరువుగట్టు మీద షితాబుఖానుచబూతరా అను నిర్మాణముండుటయు గమనించినచో ఈ శిలాశాసనము ప్రకారము ఈ అదృష్టజాతకుడు ఓరుగల్లుకు సరదారుగనో రాజుగనో యుండియుండెననుట తథ్యముగ గన్పట్టుచున్నది.

షితాబుఖాను ఓరుగల్లును జయించి వేయించిన శిలాశాసనము ఓరుగల్లుకోటలో నున్నది. షితాబుఖాను దర్బారు మందిరమునకు దక్షిణమున శంభుని ఆలయమున్నది. ఈ శాసనమిచ్చట పూర్తిగ చేర్కొనబడినది. అందలి అంశములను బట్టి షితాబుఖానునుగూర్చి తెలిసిన విషయములను సమన్వయించి అతని పూర్వోదంతమును గ్రహించుటకు చరిత్రకారులు వ్రాతలు, కైఫియతులు, కొన్ని ఆంధ్రకావ్యములు తోడ్పడుచున్నవి. శాసనపాఠము సుదీర్ఘమైనదగుటచే దానినిచ్చట ఉదాహరించుట కవకాశము లేకున్నది.

ఈ శాసనమునందు షితాబుఖానునామము చితాపుఖాన, చిత్తాపుఖాన, చిత్తపుఖాన, ఎత్తపుఖాన, సితాపఖాన, చిత్తాపఖానాయః అని వేర్వేరువిధములుగ చేర్కొనబడినది. గజాను కూలాయి గమండుటకై ఈమార్పులను శాసనమును రచించిన అన్నెంబనూత్రుడును, భారద్వాజగోత్రుడును అన్నార్యుడు తుడునైన మార్పులను చేసియుండవచ్చును.

ఈ శాసనమునందు షితాబుఖాను వంశవృత్తము ఈయబడినది. ఆతనిది భోగివంశము. ఈ వంశమున నాగాఖ్యుడను నాయకుడుండెను. అతని కుమారుడు మానయాఖ్యుడు. ఇతడు "భూరిసారుడు నరపతివిరచితుసు దీనబంధు సర్వోత్తవీరభటుని వాడు". ఈతడి పత్ని గౌరాంబ. మానయాఖ్యునకు గౌరాంబగర్భమున పుత్రులనేకులుదయించిరి. వారిలో నొకడైన షితాబుఖాను పెక్కురు ప్రభువుల ప్రశంసలనందినవాడు. అతని అంతఃపురము "రత్నాంబరాలంకృతమై గంధర్వస్వర భేదమోహన కథానిర్యాపసంభావితమై తనరారుచుండెనట! రాణివాసమందెందరో రాణులున్నను అందరిలో దేవాంబిక యను నామె షితాబుఖాను ప్రియపత్నియైనది. ఈమె ఇరువురి కుమారులలో గుణనిధియగు ఆ ధూతఖాను శ్రేష్ఠుడు. వీరుడగు పురాంతకుడు రెండవవాడు. షితాబుఖాను రెండవ భార్యయగు అనుమాంబ అనుకూలవతి. ఈమెకు ముగ్గురు కొమరులుదయించిరి.

ఈ శాసనములో షితాబుఖానుని శౌర్యపరాక్రమములు, శాత్రవఖండనము విపులముగా వర్ణింపబడినవి. అతనికీర్తి పంచభూతములను కప్పివేయుచుండెను! అతనిఖడ్గము "శయనమై వైరినికాయకాయములనుండి రక్తమును ప్రవహింపజేయు"చుండెడిదట! రౌద్రరుద్రావతారమగు ఈతడు శత్రుక్షాత్త్వమందు భీమసేనుని బోలునట!

శా. శ. 1426 రుధిరోద్గారి మాఘ శు పంచమి ఆదివారమునాడు షితాబుఖాను ఓరుగల్లుకోటను పట్టుకొనెను. ఇతడు పెక్కురు రాజన్యుల సింహాసనము లాక్రమించి దీనదయాపరుడగుటచే వారికి మరల వాటిని ఇచ్చివేయుచుండెనట! దుష్టుల దౌర్జన్యము ఓరుగల్లులో శ్రీకృష్ణుని విగ్రహమునకు స్థానభ్రష్టము కలుగగా రాజ్యమునకు వచ్చిన వెంటనే షితాబుఖాను ఆ విగ్రహమును పునఃసంప్రోక్షణ మొనర్చి స్థాపించెనట. లక్ష్మీవిగ్రహమును తురుష్కులు కాకతి రాజ్యపీఠమునుండి పెరికిపారవైవగా ఇతడు ధర్మశాస్త్రవిధి పూర్వకముగ ఓరుగల్లునందు దానిని పునఃస్థాపిత మొనర్చెనట! షితాబుఖాను ఓరుగల్లునందు స్వయంభూశివుని, కాకతివంశ రక్షాచింతామణిని పూజించి అవ్యాహతమగు ఐశ్వర్యశోభితుడాయెనట!

షితాబుఖాను ఓరుగల్లు, ఖమ్మము, బెల్లముకొండ దుర్గ

రాజ్యముల కధిపతియై యుండెనుబట్టి ఇతడు ఓరుగల్లు - గుంటూరునగరముల మధ్యమున్న విశాలప్రాంతము నేలుచుండి నట్లు స్పష్టమగుచున్నది. బురహాన్-ఇ-మాసిర్ అను ఉర్దూ గ్రంథమునుబట్టియు 'ఫెరిస్తా' అను చరిత్రకారుని వ్రాతలను బట్టియు షితాబుఖాను సుల్తాన్ షాకు సామంతుడైన అమీరుగానుండినట్లును దురదృష్టవశమున తన రాణివాసపు స్త్రీని విడిచి బ్రతుకజీవుడాయని పారిపోవలసివచ్చెననియు సుల్తాను ఆజ్ఞప్రకారము సామాన్యజన సమక్షమున ఆ నారీ జనము బాధింపబడిరనియు తెలియుచున్నది. 'తారీఖ్ మహమ్మద్ కుతుబ్ షాహి' అను మరియొక గ్రంథము షితాబుఖాను ఖమ్మమురాజనియు నిర్భీతచేతస్కుడగు కాఫరనియు వర్ణించుచున్నది. ఈ చారిత్రక గ్రంథమును ఇంగ్లీషులోనికి భాషాంతరీకరించిన బ్రిగ్స్ అనువాడు షితాబుఖానును సీతాపతియను హిందూనామముతో వ్యవహరించినాడు. ఇందు కాధారము వాడు పేర్కొనియుండలేదు. మూలగ్రంథమగు 'తారీఖ్' నందు షితాబుఖానునామమే కన్పట్టుచున్నదిగాని సీతాపతి పేరెచటను గోచరించదు. అయితే షితాబుఖానుని అసలు పేరు సీతాపతియనియే ఉత్తరకథవలన తెలియనగును.

సుల్తాన్ కులీకుతుబ్ షా సైన్యముల దండయాత్రల ఫలితముగా ఘటిల్లిన బెల్లంకొండ పతనమునుగూర్చి షితాబు ఖాను వినినంతనే అతడు సేనాసమేతుడై సుల్తానును యుద్ధ రంగమున ఎదిరించుటకు బయలువెడలెను. ఇరువాగులనడుమ ప్రజ్వరిల్లిన పోరాటములో పెక్కురు విహతులుగాగా హిందువులు తుదకు పలాయితులయిరి. షితాబుఖాను ధనరాసులను, యుద్ధసామగ్రిని సుల్తాను వశమొనర్చుకొని గోలకొండకు మరలినాడు. అనంతరము పారిపోయిన సీతాపతి (షితాబుఖాను) ఖమ్మమునకు పరుగెత్తి కొండపల్లి ఇంద్రకొండ వాదల్లి ఎద్దీరు మొదలైన పరిసరప్రాంతముల రాజులయొద్దకు రాయబారులను పంపి కులీకుతుబ్‌షాను ఎదిరించుటకై వారి సహాయ మర్థించెను. కుతుబుషా అప్పటికే తెలంగాణములో అధికభాగ మాక్రమించియుండెను. సీతాపతి అభిమానానుసారము ఆరాజన్యులందరు ఖమ్మముకడ తమతమసేనలతో కలియునట్లు నిశ్చయించుకొనిరి. కులీకుతుబ్ షా వారినెదిరించుటకు తన సైన్యముల నచటికి నడిపెను. ఖమ్మము పరిసరములలో జరిగిన ఘోరయుద్ధమునందు మహమ్మదీయులు విజయులైరి. సీతాపతిరాజు పలాయనమొనర్చెను. మహమ్మదీయ సైన్యములు ఇంద్రకొండ ఎద్దీరు ప్రాంతములను స్వాధీనపరచుకొనెను. ఖమ్మము దుర్గమును తనకు స్వాధీనమొనర్పుమని దుర్గాధికారికి సుల్తాను సందేశమంపగా అతడు నిరాకరించెను. స్వీయనాయకత్వమున సుల్తాను తన సైనికులచే ఒకేసారి నాల్గుముఖములనుండి దుర్గముపై దాడిచేయింపగా విశేషజన నష్టముతో తుదకు దుర్గము సుల్తానుస్వాధీనమైనది. సీతాపతి కుటుంబస్త్రీనుతప్ప తక్కినవారందరిని పురుషులు స్త్రీలు శిశువులను భేదమెంచక తురుష్క సైనికులు నిర్దాక్షిణ్యముగా నరికివైచిరి. సీతాపతియొక్క రాణివాస స్త్రీలు మాత్రము సుల్తాను అంతఃపురములో చేర్చుటకై ప్రత్యేకింపబడిరి.

షితాబుఖాను పైనచెప్పినట్లు పరాజితుడై గజపతీంద్రుని కుమారుడగు రామచంద్రగజపతియొద్దకు పరుగిడెను. రామచంద్రగజపతి కొండపల్లి రాజధానిగా ఆ ప్రాంతమునకును బంగాళా రాష్ట్రమువరకుగల ఓఢ్రసముద్ర తీరప్రాంతమునకును అధిపతియై యుండెను. సుల్తానుకులీ చేతిలో అతడు పడినపాట్లను షితాబుఖాను రామచంద్రగజపతికి నివేదించుకొనగా అతడు తన మిత్రవర్గములకు తమతమ సైన్యములతో కొండపల్లికి చేరవలసినదిగా ఆజ్ఞలుపంపెను. ఆ తికాలములో మూడులక్షల కాల్బలము ముప్పదివేల అశ్వికదళము కొండపల్లిలో సమాయత్తమయ్యెను. కులీకుతుబ్షా అయిదువేల అశ్వికబలముతోనే వారిని ప్రతిఘటించుటకు సిద్ధమై పాలవెన్నూరు సమీపమున శత్రువులను సంధించెను. తన సంఖ్యాబలమెంతో అసమానముగనున్నను కుతుబుషా శీఘ్రా హస్తుడైన హిందూసైన్యమును తరిమివైచెను. రామచంద్రరాజు బందీయయ్యెను. అతని సైన్యము ద్రవ్యరాసులతోపాటు, సముద్రతీరము వరకు విస్తరించియుండిన ప్రాంతమంతయు పాదుషా స్వాధీనమైనది. పాదుషా అచటనుండి తరలి కొండపల్లిని స్వాధీనమొనర్చుకొనెను. తరువాత ఏలూరు రాజమహేంద్రవరము మున్నగు నగరములుకూడ అతని కైవశమాయెను.

కైఫియ్యతులు: పైన పేర్కొనిన శాసనములనుబట్టి గ్రంథములనుబట్టి షితాబుఖాని జీవితగాథ అట్లుండగా, వేరులక్ష్యములు ఆలక్ష్యములునైన కైఫియత్తులనుబట్టి అతని జీవితవిశేషములు వేరువిధముగనున్నవి. కమ్మూరుకైఫియ్యతు ప్రకారము అచ్చటికి 8 మైళ్ళదూరమునన్న రాచపూడి గ్రామములో అవసరాల పెద్దిరాజు అను బ్రాహ్మణుండె

నట్లును పోషములో అనేక పశువులను సీతడను బోయ వాండకు మామూలు ప్రకారము గలు ప్పెండుగండలకు పెద్దిరాజు అన్నము తీకొనిపోగా అనమయమున నిద్రించుచుండిన సీతడి పడిముపై ఎండపొడ తగలకుండ ఒక నాగ సర్పము పడగవిప్పియుండెననియు పెద్దిరాజీ దృశ్యమును చూచి సీతడు గొప్పవాడగునని భావించి అతనిని లేపి అన్నముపెట్టి నీరుత్రాగించి జరిగిన ఉదంతమును అతనికి తెలియపరచి నీవు గొప్పవాడవైనచో నాకేమి యుపకారము చేసెదవు? అని అడుగగా సీతడు తనకు భాగ్యమందినచో పెద్దిరాజునకు దత్తమొసంగెదనని ప్రత్యుత్తరమిచ్చినట్లును తెలియుచున్నది. ఆనాటినుండి సీతడి పశువుల కాపరితనము తీసివేయబడినదట! పెద్దిరాజు అతనిని చదువువేసి సకలాయుధ విద్యలందు ప్రవీణుని చేయసాగెను. కొంతకాలము తరువాత గోలకొండను డిల్లీ జమహేంద్రవరమునకు వచ్చిన సర్ లష్కరు నొద్ద పనిచేయ సీతడు ఆరంభించెను. మొదట ఇతడు అరువది మంది కటుకులకు నాయకుడై యుండి విధినిర్వహణయందు అధికారి మెప్పును పొందుటచే క్రమముగనే 200 మంది సిపాయిల కధికారియయ్యెను. కంగంపేట పొదినికొండ ప్రాంతపు కోయవాండ్ర తిరుగబడుటచే సీతడు 600 భటులకు అధికారియై "షితాబుఖాను" బిరుదాలంకృతుడై మన్నె ప్రాంతపు శాంతి ముఖ్యపాలకుడుగా నియమితుడయ్యెను. సీతడు పెద్దిరాజును పిలిపించుకొని అతని సంరక్షింపుపై అరణ్యములో రాజపూడి వద్ద రాతికోటను కట్టించెనట! తరువాత ప్రభుత్వముపై తిరుగుబాటుసల్పిన ఆ పర్వతారణ్యప్రాంత సామంత ప్రభువులను జయించి వారి భూములను వశపరచుకొని పెద్దిరాజును దివానుగా నియమించుకొనెనట!

షితాబుఖానుకు అప్పలమ్మ అను నవవయస్కయగు కూతురుండెను. ఆమె పెద్దిరాజునుచూచి మోహింపగా, సీతడు తనకు పోషకుడగు ప్రభువగుటచే ఆమెను సోదరిగా భావించి పెద్దిరాజు ఆమె ప్రణయమును అంగీకరింపకుండెను. ఆమె కుపితయై పెద్దిరాజు తనను వలచి నిర్బంధించుచుండెనని తండ్రికి చెప్పుకొనెనట! షితాబుఖాను ఆగ్రహోదగ్రుడై పెద్దిరాజును దోషిగా అనుమానించుటచే, పెద్దిరాజు తన నిర్దోషిత్వమును చాటుటకై తన రెండుకండ్లను కత్తితో పెరికివైచుకొనెనట! తన శీలమునకు అవమానము కల్గినందున తనను తానే శిక్షించుకొంటిననియు అట్టి దురాపవాద ఫలితము క్రమముగనే సిద్ధించుననియు అతడు పలికెను. పిమ్మట పెద్దిరాజు రాజమహేంద్రవరమునకు వెళ్ళి సర్ లష్కరగు అలీ కులీఖానను కలిసెను. కులీఖా నిచ్చిన సైన్యముతో పెద్దిరాజు తరలి రాజపూడిని ముట్టడించెను. షితాబుఖాను అనితో సుపద్రది దినములు యుద్ధమునర్చి కోటనువదలి పలాయితుడయ్యెను. పెద్దిరాజు అతనిని తరుముచుపోయి "శాటవల్లి లొద్ది" యొద్ద దానిని తలగరిగి వాల్లుగడియలలో కులీఖానుకు వార్తను తెలిపెను.

పేరు గుర్తింపబడని మరియొక కైఫియ్యతుప్రకారము అసపరాల పెద్దిరాజు తూర్పుగోదావరిజిల్లాలోని బిక్కవోలు పరగణాయందలి మసువెల్లపాలెము కాపురస్థుడనియు సీతడు కూరటీనిగా పెంపొందుటకై పెద్దిరాజాతనికి వేయిరూపాయలు ఇచ్చివంపెననియు అతడు ఓరుగల్లుకుచని రాజసైనికులలో చేరి పిఆరువదిమందికి సర్దారుగానుండి క్రమముగా మూడు నాలుగువేల సైన్యమునకు దళాధిపతియయ్యెననియు తన క్రిందనున్న సైన్య పోషణార్థము చిన్నజాగీరాతనికీయబడెననియు తెలియుచున్నది. మహమ్మదీయులు ఓరుగల్లును వశపరచుకొనగా అప్పటికే షితాబుఖాను పేరొందిన సీతడు ఓరుగల్లును వీడి కటకమునకు వెళ్ళి ముకుందదేవగజపతి సైన్యములో చేరెనట! రాజమహేంద్రవరపు దుర్గపాలకుడైన శిరిశ్చంద్రుని గజపతి కటకమునకుమార్చి షితాబుఖానును నాల్గయిదువేల సైన్యముతో అక్కడ దుర్గపాలకుని చేసెను. చాళుక్యుల కాలమునుండి వర్ధిల్లుచుండిన సోమగిరిదుర్గమును వీడి షితాబుఖాను రాజమహేంద్రవరమునకు ఉత్తరమునందుండిన కోటను బలపరచి అందు నివసింపసాగెనట! ఇట్లాతడు రాజమహేంద్రవరపుకోటకును తస్వాత్రాజారామమునకును పాలకుడై పెద్దిరాజును పిలిపించుకొని అతనిని దివానుగా చేసికొనెనట! పెద్దిరాజు అధికారిగా నియమితుడయ్యెనట!

ఈ కైఫీయతులలో షితాబుఖాను కుమార్తె పేరు అప్పలమ్మకు బదులుగా నాగమ్మ అనియున్నది. ఆమెకు వలపు దించి, పెద్దిరాజుకు అంటగట్టబడిన ప్రేమగాథకూడ ఇందు పేర్కొనబడియున్నది. విగతచక్షుడైన పెద్దిరాజు గోలకొండకుపోయి షితాబుఖాను ఉదంతమును సుల్తానుకు నివేదించగా, అతడు పెద్దిరాజునాయకత్వమున ఒక్క వరాతి సైన్యమును సమాయత్తపరచి షితాబుఖానుపై పంపగా వారాతని తరిమిపట్టుకొని శాటపల్లి లొద్దివద్ద తలనరకివైచిరట!

"సికిలాపనగర కైఫియ్యతు," పై రెండు కైఫియ్యతు

లకు విరుద్ధకథనమును చెప్పుచున్నది. ఇది షితాబుఖానును హిందూద్వేషిగను విశేషించి కాకతీయుల ద్వేషిగను వర్ణించుచున్నది. ఏ శిలానగర కైఫియ్యతు ననుసరించి షితాబుఖాను చతుర్ముఖేశ్వర దేవాలయమును వేయిస్తంభాలగుడిని కాకతీయులు నిర్మించిన ఇతర మందిరములను నాశనమొనర్చి ప్రతాపరుద్రుడు అసంపూర్తిగవిడచిన రాతికోటను ఆ శిలలతో పూర్తి చేసెనట! "చరికొండ కైఫియ్యతుకూడ చితాపుఖానును పేర్కొనుచున్నది కాని ఆతనినొక మహమ్మదీయునిగా వర్ణించుచు అతని సంతతివారు డెబ్బది సంవత్సరములు (క్రీ శ 1428–1498) ఆ ప్రాంతమును పాలించినట్లు అది వచించుచున్నది.

ఆంధ్రకావ్యములు: చరిగొండ ధర్మన్న ప్రణీతమైన చిత్రభారతము చితాపుఖానును గూర్చి విశేషముగ ప్రశంసించుచున్నది. ఈ కావ్యము ఎనుములపల్లి పెద్దామాత్యున కంకితమీయబడినది. అతడు చితాపుఖానునకు మంత్రిగా ఓరుగల్లులో నుండుటచే అందలి కథనము సమకాలికముగ కన్పట్టుచున్నది. ఈ పెద్దామాత్యుడే పెద్దన్నగను గొద్దిరాజుగను కైఫియ్యతులందు వ్యవహరింపబడినాడని సుప్రసిద్ధ శాసనపరిశోధకులు డా॥ హీరానందశాస్త్రి వ్రాసినారు. కాని అతడు అవసరాల పెద్దామాత్యుడు. కాగా ఈ మంత్రి ఎనుములపల్లి పెద్దామాత్యుడు. కావున వీరిద్దరు వేర్వేరు వ్యక్తులు.

ఎడ్డంకి గంగాధరకవి రచించిన "తపతీసంవరణోపాఖ్యానము" నందుకూడ చితాపుఖానుని యుద్ధంతము సూచితమైనది. ఈ కావ్యము గోలకొండనవాబగు ఇబ్రహీం ముల్కునకు కృతియీయబడుటచే షితాబుఖాను ఇబ్రహీం ముల్కునకు సమకాలికుడగుచున్నాడు. షితాబుఖాను గోదావరిని దాటి పారిపోవుట కులీకుతుబుషాహా విజయనాథదేవగజపతులమధ్యజరిగిన పూర్వోక్తసంధిని సూచించుచున్నది.

కుమారధూర్జటి ప్రణీతమైన "కృష్ణరాయవిజయము" నందు హెచ్చుగ చితాపుఖాను ప్రశంస కలదు. శ్రీకృష్ణదేవరాయలు పూర్వదిగ్విజయయాత్రకు బయలుదేరి కందుకూరు కొండవీడు కొండపల్లి, వినుకొండ మొదలైన కోటలను జయించి గజపతిపై దండయాత్రకు వెడలిన సందర్భములో రాయలకు చితాపుఖానుతో సంగరము తటస్థించి, చితాపుఖానుడోడిపోయినట్లు అందు వివరింపబడినది (క్రీ శ 1515 16). ఈ సంఘటనము విశ్వనాథనాయని స్థానాపతి రచితమైన రాయవాచకము నందుకూడ వర్ణితమైనది. కృష్ణరాయలు 1515–1516లో కళింగదేశముపై దండెత్తుటచే ఆ కాలమునకు సంబంధించిన ఈ సంఘటనము కృష్ణరాయవిజయము' నందలి వర్ణనములతో సరిపడుచున్నది.

షితాబుఖానెవరు? ఈతని పూర్వవంశీయులను గూర్చిన యథార్థ చారిత్రకవిశేషములు తెలియవచ్చుటలేదు. ఈతని మొదటి పేరేమో అది సరియైనదగునో కాదోగూడ బోధపడదు. శాసనములనుబట్టి ఇతని పేరు షితాబ్ ఖాన. ఇది షితాబు ఖాను అను పదమునకు సంస్కృతీకరణము. కైఫియ్యతులు కావ్యములు ముసల్మానుల వ్రాతలనుబట్టి ఇతని మొదటి పేరు సీతడు. ప్రాథమికదశలో సీతాపతి అని సగౌరవముగా పిలువబడినాడు. తరువాత షితాబుఖాను అను బిరుదము వహించియుండవచ్చును. కొంతకాలము మహమ్మదీయ ప్రభువుల క్రింద సరదారుగా నుండుటచే హుమయూనుషహాయో మరి యెవ్వరో ఈతనికి బిరుదమిచ్చియుందురు. లేక తనకు తానే ఈ బిరుదము పెట్టుకొనియుండవచ్చును. ఈ నామమీతని శీఘ్రోన్నత్యాభ్యుదయములను సూచించును. షితాబు అనగా అభ్యుదయము. ఖాను అనునది కూడ నాయకుడను అర్థమిచ్చెడి బిరుదనామము. ఖాను అని పిలువబడినంతమాత్రమున అతడు ముసల్మానై యుండవలసిన అవసరములేదు. హిందువుకూడ అట్లే పిలువబడవచ్చునుగదా! శాసనమునుబట్టి షితాబ్ఖాను కుమారుడు హిందువైన అవధూత్ఖాను అను నామమును వహించియున్నాడు. అవధూత అనునది హిందువులు పెట్టుకొను సంస్కృతనామము. శాసనమువలన ఆతడును ఆతని కుమారుడును హిందూమతపరాయణులని తెలియుచున్నది.

"తారీఖికుతుబుషాహీ" అను గ్రంథము ఇతడు కాఫరు అని స్పష్టముగ నుడువుచున్నది. శాసనానుసారము షితాబుఖాను బోగివంశములో జన్మించినాడు. బోగి అనునది బోగిని అనుశబ్దమునకు రూపాంతరమో బోయశబ్దమునకు సంస్కృతరూపమో చెప్పజాలము. శాసనములో అతడు బ్రాహ్మణుడనిగాని శూద్రుడనిగాని పేర్కొనబడియుండలేదు. ఇతని పితామహుడు నాయకేంద్రుడగు నాగాఖ్యుడు; తండ్రి ధామనృపవీరుడగు మానాఖ్యుడు; తల్లి గౌరాంబ.

"బురహానిమాసీర్" అను గ్రంథమునుబట్టి కులీకుతుబ్షా తెలంగాణములోని సామంతులందరిపై ప్రభుత్వము వహించి

తన పూర్వ రాజ్య ప్రాంతములగు ఓరుగల్లును కోయిలకొండను వాటి సామంతరాజ్యములను కలిపివేయుటచే షితాబుఖాను 1504 లో కులీ కుతుబ్షావలన ఓడి ఓరుగల్లును స్వాధీనమొనర్చుకొని యుండుటను బట్టి ఇతడు స్వాతంత్ర్యమును ప్రకటించియుండడు. కులీకుతుబ్షా 1512 లో ఓరుగల్లుపై దాడి చేసి ఈమారు పూర్తిగా ఓడించి మరల ఓరుగల్లును పట్టుకొనియుండుటచే ఈ నగరము షితాబుఖాను స్వాధీనములో ఎక్కువకాలము నిలిచియుండలేదు. ఇతడు తన విజయఫలమును అరేడేండ్లకంటె ఎక్కువకాలము అనుభవించి యుండడు. ఈ స్వల్పకాలములోనే ప్రాచీన హిందూ ప్రభువులవలె దేవాలయములకు దానధర్మాదులు చేసిన షితాబుఖానునకు ఈ ఆరేడేండ్లు అంత స్వల్పకాలము కాదేమో అని పించుచున్నది.

పై వర్ణితమైన కథనము నుబట్టి షితాబుఖాను హిందువే గాని మహమ్మదీయుడు కాజాలడని భావింపవచ్చును. పూర్వోక్త కృష్ణరాయవిజయము నందును రాయవాచకమునందును వర్ణితమైన అంశములనుబట్టి షితాబుఖాను వీరవిహారము సల్పుచు క్రీ. శ. 1516 వరకు జీవించియున్నట్లు స్పష్టమగుచున్నది. ఈ రెండు కావ్యముల వర్ణనాంశములనుబట్టి ఇతడు కృష్ణదేవరాయలతో ఘటిల్లిన యుద్ధమునందు వీరశయనము చెందియుండలేదేమో అని యనుమానము కల్గుచున్నది. లేదా తరువాత ఎప్పుడో ఎట్లో షితాబుఖాను జీవితము ముగిసి కాలగర్భములో కలిసియుండును.

ప్ర. రా. సు.

## షెల్లీబిష్ పెర్సీ (1792-1822)

ఆకాశప్రకాశించు తనరెక్కలను శూన్యములో వ్యర్థముగ టపటపలాడించు మనోహరము నిరుపయోగమునైన దేవదూత షెల్లీ అనునది 19 వ శతాబ్దినాటి ఆంగ్లకవివిమర్శకుడైన మాథ్యూ ఆర్నాల్డ్ వ్యాఖ్య. ఇంగ్లండు కవిచక్రవర్తులలో "భావగీతికాపాదషా" అని పేరొందినవాడు షెల్లీ ముప్పదేండ్లుకూడ నిండని తన జీవితములో అతడు భావగీతికా రచనావ్యాసంగముతో ముంచెత్తివేసినాడు. నిర్దిష్టమైన కవితారీతుల ననుసరించి మృదుమధురస్వర సంచయముతో హృదయంగమమైన శైలితో కవిత నల్లినాడాయన. కాల్పనిక కవులందరు (Romantic poets) శాశ్వతజగత్తునకు చెందిన ఏకాంతజీవితానందమును అనుభవించుచుండెడివారు. మానవసమాజముతో తమ కర్తవ్యములను వారుగుర్తించినను, అసాధారణమైన తీవ్రతయే ఒకటి వారిని సాటి కవులనుండి వేరుపరచి అత్యున్నతస్థానమునకు గొనిపోయినది. షెల్లీ రచనలలో ఇట్టి అనుభూతి మరింత ప్రస్ఫుటముగా గోచరమగును.

షెల్లీ క్రీ. శ. 1792 లో ఇంగ్లండులోని 'సెక్స్' రాష్ట్రములో జన్మించినాడు. ఇతని తలిదండ్రులు ఇంగ్లండు రాజకీయ వాఙ్మయచరిత్రలో గణుతికెక్కిన ప్రాచీన కులీన కుటుంబములకు చెందినవారు. కుటుంబములో పెద్దకుమారుడగుటచే అనురాగమును కురిపించు అక్కచెల్లెండ్ర నడుమ పెరిగినవాడితడు. బహుశః అందువల్లనే షెల్లీకి అతిసున్నితమగు మనస్తత్వమేర్పడినది. చిన్నతనముననే రాడ్క్లిఫ్ సతీమణి రచనలతని నాకర్షించి ఊహాలోకమునందు తేలియాడ జేసినవి.

ఆదినములలో ప్రాథమిక పాఠశాలలయందు ప్రధానోపాధ్యాయులు ప్రదర్శించుచుండు క్రౌర్యము నిర్దాక్షిణ్యము షెల్లీకి కలతకల్గి చెడిపోవు పాఠశాల ఒకనరకముగా కాన్పించెడిదాయనకు. సమాజములో ఏర్పడిన సుస్థిరవ్యవస్థలన్నిటిపైన తిరుగుబాటుచేయవలెనను కాంక్ష పొటమరించినదాయన మనస్సులో. పండ్రెండేండ్ల వయస్సులో ప్రఖ్యాతిగాంచిన ఈటన్ పాఠశాలలో విద్యార్థిగా ప్రవేశించినాడతడు. సహోపాధ్యాయుల మొరటుప్రవర్తనము అధ్యాపకుల కాఠిన్యమును ప్రత్యక్షముగ చవిచూచినాడు. అచ్చట విద్యముగించుకొని అతడు 1810 లో ఆక్స్ఫర్డు విశ్వవిద్యాలయములో చేరినాడు. అప్పటికే ఆయన కొంతకవిత రచనమును సాగించినాడు. ఆకవనము అగ్రశ్రేణికి చెందినది కాకున్నను ఉత్తరోత్తర అతడు ప్రదర్శించిన వ్యక్తిగతగుణములు మనఃప్రవృత్తులు అందు ద్యోతకమైనవి. ఉత్సాహావేశములు ప్రగాఢవాత్సల్యము ప్రపంచమునే సంస్కరించవలెనను గాఢవాంఛ తన ఆదర్శములు అతులు పవిత్రములను విశ్వాసము-ఇవన్నియు ఆతనిరచనలలో ప్రతిబింబించుచుండును. విద్యార్థిగా చేరిన కొన్నినెలలకే అతడు 'నాస్తికత అవశ్యకతను' అను కీర్తితో కరపత్రము ప్రచురించగా 1811 మార్చినెలలో విశ్వవిద్యాలయాధికారులాతనిని బహిష్కరించివారు.

విద్యార్థిదశ ఇట్లుముగియగనే షెల్లీ లండనునగరము చేరుకొనినాడు. అనాటినుండి ఆయనజీవితమునందు కొడుకులేని స్థిరమైనచోట నిర ఉచేలేదు. ఒకచోటనుండి మరియొకచోటకు అనూహ్యమైన శక్తిచే త్రోయబడినట్లు అయోమయావస్థలో అతడు జీవితమును గడిపినాడు. అట్టిసందర్భమున అతనికి అనగరమున గాడ్విన్, లీహంట్ అనువారి బృందముతో పరిచయ

మేర్పడినది. చిన్నతనముననే గాడ్విన్ రచించిన ఇన్‌క్వైరీ ఇన్‌టు పొలిటికల్ జస్టిస్ అను గ్రంథమును చదివి దానిచే షెల్లీ ప్రభావితుడైనాడు. ఆ సోదరియొక్క స్నేహితురాలైన హారియెట్ వెస్ట్‌బ్రూక్‌తో అతనికి పరిచయమేర్పడి అది తొందరపాటు పరిణయమునకు ప్రోత్సహించినది. వివాహకాలమున షెల్లీకి 19 యేండ్లు వెస్ట్‌బ్రూక్‌నకు 16 యేండ్లుమాత్రమే! అనిర్వచనీయమైన ఆకర్షణముకొరకై వివాహమాడిన వారి దాంపత్యజీవితము అననుకూలముగ పరిణమించి తుదకు భగ్నమయ్యెను.

అనంతరము షెలీ ఉత్సాహవంతులైన యువకబృందమునకు నాయకుడును అరాజకసిద్ధాంత (anarchism) బోధకుడైన గాడ్విన్ కుమార్తెయగు మేరీతో ప్రేమకలాపము ప్రారంభించినాడు. 1816 లో భగ్నహృదయ హారియెట్ ఆత్మహత్యానంతరము షెల్లీ మేరీని వివాహమాడినాడు. హారియెట్ వలన కల్గిన ఇద్దరుబిడ్డలను న్యాయాధిపతులు షెల్లీపరము చేయక వారికి సంరక్షకులను నియమించిరి. న్యాయస్థానములు, చట్టములు ప్రజల హక్కులను కాలరాచుచున్నవని షెల్లీభావమును ఈ సంఘటనము ఇనుమడింపజేసినది.

తనచుట్టునున్న సమాజమే తనపై పగబూనినదను భావముచేతనేమి, అనారోగ్యకారణములచేతనేమి షెల్లీ 1818 లో ఇటలీ చేరుకొనెను. వాళ్లేండ్లు అచటనే ఉండి తిరిగివచ్చుచుండగా అతడు నౌకాభంగము కారణముగా ప్రాణములు వీడెను. కొన్నినాళ్ళకు అతనికళేబరము దొరకగ మిత్రులయిన బైరన్, లీహంట్ ప్రభృతులు దానికి దహనసంస్కారమొనర్చిరి. అతని చితాభస్మము రోమ్‌నగరమందలి ప్రొటెస్టెంట్ చర్చికి సంబంధించిన ఖననభూమియందు నిక్షేపింపబడినది.

ఇటలీ వెళ్ళుటకు పూర్వమే (1818) షెల్లీ రచించిన క్వీన్ మేబ్', 'అలాస్టర్' అను గ్రంథములు ప్రచురింపబడినవి. మొదటి కావ్యములో అతడు రాజులను రాజనీతిజ్ఞులను మతగురువులను, వైవాహికవ్యవస్థను వైరిస్థానములందు నిలబెట్టినాడు. ప్రపంచము విశ్వమానవ ప్రేమమాత్రము మీదనే పునరుద్ధరింపబడగలదని ఘోషించుచున్నాడు. తన సిద్ధాంతమును ప్రజలలో ప్రచారముచేయుటయే షెల్లీ తన ప్రధానవిషయముగా ఎంచుకొన్నాడు. ఈ గ్రంథములో రెండవ కావ్యములో ఒక ఆదర్శవాది తనస్వప్నసుందరిని వెదకుకొనినట్లును, నిత్యజీవితములో నిరాశానిస్పృహలను అనుభవించి వాడు

పోవుచున్నట్లును అతనిని చిత్రించుచున్నాడు. ఈ కావ్యములో రసపోషకములైన ఎన్నియో సుందరశబ్దచిత్రణములగపడును. చంద్రోదయాది ప్రకృతివర్ణనములు పుష్కలము. ప్రపంచమహోదయమునుగూర్చి ఈ కవిగల అచంచలవిశ్వాసము ఈ కావ్యములో ప్రకటితమగుచు ఉండును. భవిష్యత్కాలమున షెల్లీ ఉదాత్తమైన కవితలను చెప్పగల్గిన విషయమును చాటినది. రివోల్ట్ ఆఫ్ ఇస్లామ్ (1818) అను కావ్యమునందుకూడ సాంఘిక వ్యవస్థనుగూర్చి ఈతని నిరసనము కనబడును. ఈ కావ్యాంతమున విప్లవనాయకులు సజీవదహనమునకు గురిచేయబడినను మానవమేధస్సు మంచితనము అనునవి ఎప్పటికైనను విజయమును సాధింపగలవను తనవిశ్వాసమును కవి యుద్ఘాటించును. గాడ్విన్ గ్రంథములవలనను ప్లేటో మహాముని సూక్తులవలనను గ్రహించిన విషయములను మానవజాతికి తాను భావించిన సత్యములుగా మలచినాడు. విశ్లేషించి స్థూలముగ చూచినచో తాను మానవజాతికి అందచేయదలచుకొనిన సందేశములతో తన విశ్వమును షెల్లీ పూరించినాడనవచ్చును. అవినీతి పరపీడనము అధికారదుర్మార్గము అసూయాక్రౌర్యములు నిర్మూలమై, మానవజీవితమొక సుందరనందనవనముగా భాసిల్లవలెనని షెల్లీ ఆకాంక్ష.

ఇటలీలోనున్న కాలమునందు షెలీ తన ఆరోగ్యమును, ఉత్సాహమును బాగుగా పుంజుకొన్నాడు. ఆతరుణముననే ప్లేటో వ్రాసిన సింపోజియమ్ అను గ్రంథమును ఆంగ్లములోనికనువదించినాడు. రోజలిండ్ అండ్ హెలెన్ అను ఆంగ్ల భాగరికమైన కావ్యమునుగూడ రచించినదప్పుడే. కొన్నినాళ్ళకాతడు వెనీస్‌నగరమునందు బైరన్‌మహాకవిని కలుసుకొన్నాడు. ఈసమాగమము ఫలితముగా జూలియన్ అండ్ మెడలో అను సంభాషణపూర్వకమైన గేయమునాతడు రచించినాడు. తనను జూలియన్‌గను బైరన్‌ను మెడలోగను షెల్లీ చిత్రించినాడీగేయములో మానవుడు తనబుద్ధిశక్తులతనైగల్గిన అధికారమీగేయమందలి ప్రధాన ఇతివృత్తము.

సుమారు రెండేండ్లకాలములో షెల్లీ రచించిన 'ప్రామిథ్యూస్ అన్‌బౌండ్ 'అను పద్యనాటకము కవిత్వగుణవిశేషములను పుణికిపుచ్చుకొన్న గ్రంథము. తన జీవితకాలమంతటిలో ఈకవి వివిధరచనలయందు అందజేసిన సందేశమీ పద్యనాటకమునందు కాన్పించును. గ్రీకు విషాదనాటకకర్తయగు

ఇస్కిలస్ నాటకరూపములో రచించిన ఒక పురాణగాథను షెల్లీ మార్చి వ్రాసినాడు. ప్రొమిథ్యూస్ అనునతడు మానవ జాతికి ప్రతినిధి. భూమాతపుత్రుడు. దేవతలకు ప్రభువైన జూపిటర్ అతనిని పర్వతములపై బంధించి రాబందులచేత హింసించు చుండును. కాని ధైర్యశాలియు సహనశీలుడును స్థిరచిత్తుడును గంభీరమూర్తియునైన ప్రొమిథ్యూస్ అనంతమైన శక్తిని గూడ ప్రకటించు శక్తిగలవాడగుటచేతను దురాశ, అసూయ, ప్రతీకారవాంఛ యనునట్టి దుర్గుణములకు దూరుడై, సహనశాశ్వత్వ స్వభావుడగుటచేతను జూపిటరు పెట్టిన హింసలకు లొంగినవాడు కాడు. కాలము కలిసివచ్చుటతో అధికశక్తి ప్రతినిధియైన డీమొగార్గన్ జూపిటరును పారద్రోలినాడు. శుభగుణములకు ప్రతినిధియైన హెర్క్యులీస్ ప్రొమిథ్యూసునకు విముక్తి కల్గించును. ఈ సంఘటనముతో జగత్తంతయు ప్రేమమయమగును. మానవులు విశృంఖలులై కుల మత జాతి భేదములకతీతులై ఐకమత్యభావముతోను సమతావిత్తవృత్తితోను వివేకముతోను న్యాయముగ మెలగెదరు. మానవాళియొక్క నైతిక విముక్తి అనునది ఈ పద్యనాటకపు ఇతివృత్తమనవచ్చును. భావుకత పెన్నుగా గల్గిన భావగీతికాకార మీగ్రంథము యవ్వనోత్సాహము తొణికిసలాడు రచనము. ఇదు అద్భుతమైన శబ్దచిత్రణము గానభరితమైన రచనము కొదుగట్టినది.

ది సెంచి' (1819) అను ఇతని వేరొక నాటకము భయంకరమైన విషాదగాథను వర్ణించును. వావివరుసలు లేని కాముకుని కథ. ఇది సాధారణముగా కాల్పనికకవుల నాటకము లెట్టివో విజయవంతము కాలేదనియే చెప్పవచ్చును. కాని షెల్లీ రచనాశోభనము ప్రదర్శనాయోగ్యముగ లేకున్నను అతరగణికి చెందినట్టిది కాదు. దీనినుండి భవిష్యకవి కగపడినట్లుగా షెల్లీ మొట్టమొదటిసారిగ బియాట్రిస్ అనుకథానాయికను వాస్తవిక జగత్తుకుచెందిన సజీవ మానవపాత్రగ సృష్టించినాడు. "ఓడ్ టు వెస్ట్ విండ్" 'ది క్లౌడ్' 'ఓడ్ టు స్కైలార్క్', "ది విచ్ ఆఫ్ అట్లాస్" అను పద్యము లితడు మనోహరముగ రచించినాడు. ఎపిసైకిడియన్ (1821) అను మరియొక పద్యములో షెల్లీ "విరియానని" యనునామెయందు ఆదర్శ స్త్రీత్వమును చిత్రించి ఆమెపై తనకుగల మమకారమును సూచించినాడు.

థామస్ పీకాక్ ప్రాచీన కవిత్వవిమర్శనాగ్రంథమునకు జవాబుగా 'ది డిఫెన్స్ ఆఫ్ పొయిట్రీ' (1821) అను వచన గ్రంథమితడు వ్రాసినాడు. అసంపూర్ణకమైనను అంతరుచి కవి ఆలోచనాపరంపరకు అలవాలముగ నుండునట్లు మనస్సును మేల్కొల్పి దాని అవధులను విస్తరింపజేయునది కవిత్వమని నిర్వచించినాడీయన. నిత్యజీవితమునందు సుపరిచితములైన వస్తుజాలమును అవగాహనకురానియుండు మేలిమి ముసుగును పైకెత్తి మరుగుపడిన అందమునా బహిర్గతమొనర్చును. అవి కొంతవస్తువులా యను విభ్రాంతిని కవిత్వము కల్గించునని షెల్లీ అభిప్రాయము. ఇట్టి ధోరణులు గల్గిన షెల్లీ కవిత్వమును గురించియు కవులనుగురించియు ఉదాత్తములైన భావములను వెలువరించినాడు. 1821 లో ఇతడు రచించిన "హెల్లాస్" అను పద్యనాటకము గ్రీసుదేశీయుల స్వాతంత్ర్యపోరాట ఇతివృత్తముగ గలది. అదేసంవత్సరములో 'ఎడోనిస్' అనుశోకగీతము కీట్స్‌మహాకవియొక్క మరణమును పురస్కరించుకొని రచించినది.

ఈమహాకవియొక్క ఖ్యాతియు ప్రతిభయు త్వరితగతిలో పాశ్చాత్యజగత్తునందు వ్యాప్తిచెందినవి. సమకాలికు లాతనిని నాస్తికునిగను విప్లవవాదిగను పరిగణించినారు. మృత్యువునకు చేరితిరిన ఆనాటి పడక ప్రమాదము అతని పై పనిందరకు తగిన శిక్షగా కొందరు భావించి సంతోషించినారు. కాని ఆయన మరణించిన కొలది సంవత్సరముల తరువాతనే షెల్లీ విశ్వమునకెల్లి సాంకేతిక విలువల దృష్ట్యా ఇంగ్లండు కవులందరిలో షెల్లీ ఉత్తమకవిగా వర్ధిల్లు మహోదయుడు అభిభాషించినాడు. భావికరములవారిపై ముఖ్యముగ బ్రౌనింగ్ టెన్నిసన్‌లపై షెల్లీ ప్రభావము ప్రస్ఫుటముగ కన్పించును. కవిత్వరచన ఒక పవిత్రకార్యముగ భావించినవాడు షెల్లీ. స్వేచ్ఛా సత్యాన్వేషణము విశ్వమానవత మున్నగు ఉన్నతభావములపట్ల ప్రగాఢమైన మమకారముగలవాడు. గూఢ అతని కవనమునందు ఆకాశములో విహరించు విహంగములు చైతన్యవంతములైన ప్రకృతిశక్తులు విశేషముగ కన్పించుచుండును. స్థిరములును జడములునైన పదార్థములు అందు అరుదుగనుండును. అతని కవనమునందలి శబ్దచిత్రణము వెన్నెలరాత్రియందు సముద్రముపై తేలియాడు పడవవలె గోచరించును. యువకులకు ఉత్సాహవంతులకు ఉద్వేగభరితులకు ఆశావాదులకు విశ్వమానవకళ్యాణమాకాంక్షించువారికి షెల్లీ కవనము మహోత్కృష్టముగనుండును.

గ. వేం. శే.

## షేక్స్పియర్ విలియమ్ (1564–1616)

కాలగమనములో ఒకజాతి ఒక దేశ చరిత్ర సజీవముగ నిలిచి పోవుటకు మహాపురుషులుగూడ కారకులే. ఆ యోగ్యదరు ప్రజలఅదృష్ట ములకు అనుభవములకు ఉద్దేశములకు ఉద్వేగమైన భావము లకు వారు తమతమ దేశభాషలలో రూపకల్పనచేసి రమణీయ మైన రచనలు కమనీయమైన గాథలు అందజేయుదురు తమ జాతీయ జీవన విధానమును తమ ఉద్గ్రంథములలో చిత్రించు దురు. వారి రచనలలోని శాశ్వతముల సమ్మిశ్రమము కర్ణ పేయముగను హృద్యముగను మనోల్లాసకరముగను గోచ రించును. అట్టి రచయితలు జాతీయపరిహద్దులను అధిగమించి, కలకాలము నిలిచిపోగల విశ్వజనీనకృతులను భావితరముల వారికి వదలివెళ్లుతారు.

విశ్వవిఖ్యాత నాటకకర్తయగు విలియంషేక్స్పియర్ అట్టికోవకుచెందిన మహాకవి. అతడు క్రీ శ 1564 ఏప్రిల్ 23 వ తేదీన స్ట్రాట్ ఫర్డ్ ఆన్ ఏవన్ అనునొక చిన్నవగరమున జన్మించినాడు. ఆయన తండ్రియగు జాన్ చిల్లరవల్లర వ్యాపారములు చేసెడివాడని జనవాక్యము. జాన్ ఆర్డెన్ అనువ తను వివాహమాడిన ఫలముగా అతనికి కొంతఆస్తి సంక్రమించినది. ఈ దంపతులకు కల్గిన సంతానములో మొదటి ఇద్దరు ఆడపిల్లలు. మూడవబిడ్డడు విలియమ్ షేక్స్పియర్. స్వగ్రామమునందలి గ్రామర్ స్కూలు లో పదునాల్గేండ్లు వచ్చువరకు షేక్స్పియర్ చదివియుండునని ప్రతీతి. ఆ దినము లలో పాఠశాలలయందు లాటిను గ్రీకు భాషలను విధిగా నేర్పెడివారు. షేక్స్పియర్ లాటిన్ నాస్తి గ్రీకుభూజ్యము అను హేళనకు పాత్రుడైనను ఆయన రచనములనుబట్టి ఆ భాషలలో అతనికి కొంత ప్రవేశమైనను ఉండియుండవలెను.

1582 లో తనకంటె ఎనిమిదేండ్లు పెద్దదైన యాన్ హేథవేను షేక్స్పియర్ వివాహమాడినాడు. వీరిద్దరికిని కల్గిన ముగ్గురు బిడ్డలలో హామ్నెట్ అను బాలుడు పిన్నవయసునందే మరణించగా సుసన్నా జుడిత్ అను బాలికలిద్దరు పెరిగి పెద్ద వారై చాలకాలము సుఖముగ సంసారమును తీర్చిదిద్ది కొన్నారు. తన తండ్రి ఆర్థికముగ చితికిపోవుటవలనను, సంసారభారమును మోయవలసిన బాధ్యత తనపై పడుటవల నను షేక్స్పియర్ ఉదరపోషణార్థము స్వగ్రామమును విడిచి పోవలసివచ్చియుండెనని జనశ్రుతి. ఇట్లుండగా చిన్నతనపు ఆటపాటయితనముతో సర్ థామస్ లూసీ అనునొక ధనికుని పశు వులను షేక్స్పియర్ దొంగిలించినందుకై రాబోవు విపరిణా మములనుండి తప్పించుకొనుటకు అతడు స్వస్థలమును వీడ వలసి వచ్చినదట! ఏదెట్లయినను సుమారు 1586 లో షేక్స్ పియర్ స్వగ్రామమును విడిచి లండన్ నగరమును చేరినాడు.

ఆ రోజులలో లండన్ మహానగరము ఉత్సాహోద్వేగ పూరితులైన యువకులకు నాడాలి. విద్యాగంధములేని పల్లె టూరి కుర్రవాడయిన గాని చేతి చిల్లిగవ్వగూడ లేక షేక్స్పియర్ రాజధానిలో అడుగుపెట్టినాడు. అప్పటిలో ఆనగరము హేమాహేమీలైన నాటకరచయితలకు ప్రసిద్ధికెక్కినది. వారెల్లరు ఉన్నతవిద్యలలో ఆరితేరిన విశ్వవిద్యాలయ పట్ట భద్రులు. అట్టి అతిరథులు మహారథులమధ్య షేక్స్పియర్ వంటి అమాయక యువకుడెట్లు నెగ్గగలడను ది ఊహాతీత మైన విషయము.

ఆరంభమున షేక్స్పియర్ ఎన్నియో చిన్న చిన్న ఉద్యో గములు చేయవలసివచ్చినది. ఆ తరికాలముననే అతడు నాటక ములలో వేషములు కూడ వేయుటయు చిల్లరమల్లర పుస్తక ములు వ్రాయుటయు నాటకాలరాయుళ్ళతో నేస్తముకట్టు టయు నేర్చుకొన్నాడు. స్వల్పకాలములోనే ఈ విషయము లందు గణనీయమైన ప్రతిభ ప్రదర్శించినట్లును రచయితలలో సముచిత స్థానమును సంపాదించినట్లును నిదర్శనములగపడు చున్నవి. 1592 సెప్టెంబరులో రాబర్ట్ గ్రీన్ అను నాటక రచ యిత చనిపోవుచు తన అముద్రిత గ్రంథమును వదలివెళ్ళినాడు. అందులో నానాటికి పెంపవుచున్న షేక్స్పియర్ యొక్క ప్రఖ్యాతినిసూర్చి అసూయాపూర్వకమైన వాక్యములుండెనట!

1593 1594 సంవత్సరములలో షేక్స్పియర్ వరుసగా వ్రాసిన 'వీనస్ అండ్ అడోనిస్' 'లుక్రీస్' అను కావ్యములు అతనికి జనాదరణమును పేరు ప్రతిష్ఠలను తెచ్చిపెట్టినవి. అతడు 'లార్డ్ ఛేంబర్లేన్' నాటక బృందము లో సభ్యుడై నాటకములువ్రాసియు వాటిని వరంపరగా ప్రదర్శింపజేసియు ధనమార్జించి నాటకపు కంపెనీలలో వాటాలుకూడ కొనగల్గి నాడట! ప్రారంభములో అతని నాటకములు సర్వజనరంజక ముగ నుండి రంగస్థలముపై విజయపతాకను నెలకొల్పజాలి యుండెడివి. ఈస్థితిలో షేక్స్పియర్ 1599 లో గ్లోబ్ థియే టరులో భాగస్వామియైనాడు. అతడు రచించి ప్రచురించిన 'సానెట్స్' అను లఘుగేయములలో మణిపూసలవంటివి కొన్నిగలవు. కొన్ని పేలవముగనున్నవికూడ కలవు. వీటి బాధా

…రము గాని అతనివ్యక్తి జీవితముపై కొందరు విమర్శకులు పెక్కు ఊహాగానములుచేసిరి. 1611నాటికి షేక్స్పియర్ నాటకీయరచన కాలభాగము పూర్తియైనది. పిమ్మట అతడు స్వగ్రామమునకు చేరి జీవితశేషమును అచ్చటనే గడిపి 1616 ఏప్రిల్ 23 వ తేదీన కీర్తిశేషుడయ్యెను.

షేక్స్పియర్ లండన్ నగరమునందున్న రెండు దశాబ్దముల కాలములో 37 నాటకములు వ్రాసినాడు. ధారావాహినిగా రచింపబడిన ఈ నాటకములలో వైవిధ్యము ప్రదర్శింపబడినది. సుఖాంత నాటకములు విషాదాంత నాటకములు సుఖదుఃఖ మిశ్రమములు చరిత్రాత్మకములు అభూతకల్పనలు మున్నగు తరగతుల క్రింద ఆయన రచనలు వర్గీకరింపబడినవి.

షేక్స్పియర్ రచించిన గ్రంథములివి 1 టూ జెంటిల్‌మెన్ ఆఫ్ వెరోనా 2 మెర్రీవైవ్స్ ఆఫ్ విండ్సర్ 3 ట్వెల్ఫ్త్‌నైట్ 4 మెజర్ ఫర్ మెజర్ 5 మచ్ యాడో ఎబౌట్ నథింగ్ 6 ఎ మిడ్ సమ్మర్ నైట్స్ డ్రీం 7 లవ్స్ లేబర్స్ లాస్ట్ 8 ది మర్చంట్ ఆఫ్ వెనిస్ 9 యాజ్ యు లైక్ ఇట్ 10 ఆల్ ఈజ్ వెల్ దట్ ఎండ్స్ వెల్ 11 ది టేమింగ్ ఆఫ్ ది ష్రూ 12 ది వింటర్స్ టేల్ 13 ది కామెడీ ఆఫ్ ఎర్రర్స్ 14 కింగ్ జాన్ 15 కింగ్ రిచర్డ్ ది సెకండ్ 16 కింగ్ హెన్రీ ది ఫోర్త్ (1, 2 భాగములు) 17 కింగ్ హెన్రీ ది ఫిఫ్త్ 18 కింగ్ హెన్రీ ది సిక్స్త్ (1, 2, 3 భాగములు) 19 కింగ్ రిచర్డ్ ది థర్డ్ 20 కింగ్ హెన్రీ ది ఎయిత్ 21 ట్రాయిలస్ అండ్ క్రెసిడా 22 టైమన్ ఆఫ్ ఏథెన్స్ 23 కొరియొలేనస్ 24 జూలియస్ సీజర్ 25 యాంటనీ అండ్ క్లియోపాట్రా 26 సింబలీన్ 27 టైటస్ యాండ్రోనికస్ 28 పెరిక్లీస్ 29 కింగ్ లియర్ 30 రోమియో అండ్ జూలియట్ 31 మెక్‌బెత్ 32 హామ్లెట్, 33 ఒథెలో 34 టెంపెస్ట్ మొదలైనవి.

షేక్స్పియరు యొక్క ప్రజ్ఞను తెలిసికొనుటకును నాటకరచనాదక్షతను గ్రహించుటకును ఆయన రచనా వ్యాసంగ కాలమును నాల్గుభాగములుగా విభజించుట కలదు. డౌడెన్ అను విమర్శకుడు ఈ నాల్గు భాగములకు ఈ దిగువ పేర్లను పెట్టినాడు (1) 1595 వరకు నాటకరచనను అభ్యసించు కాలము; (2) 1596–1601 వరకు నల్గురినడుమ మెసలుచు రచనలు సాగించు కాలము; (3) 1601–1608 వరకు జీవితపు లోతులను గ్రహించు కాలము; (4) 1608–1612 వరకు జీవితపు ఔన్నత్యమును రుచిచూచిన కాలము. ఈ విభజనము దృష్ట్యా అతని నాటకములను పరిశీలించుచో అతని మేధాశక్తి ఎట్లు పరిణామము చెందుచు వచ్చెనో అతని నాటకీయత ఎట్లు అత్యున్నతశిఖరములను అందుకొనగల్గినదో అవగాహన కాగలదు.

కొన్ని అంశములలో షేక్స్పియరుకంటె ఉన్నతతర ప్రమాణములను చేరగల్గిన నాటకకర్తలు ఆయన సమకాలికులలోను అనంతరీయులలోను లేకపోలేదు. కాని విశేషాంశములలో వారందరికంటె ఆధిక్యతను సంపాదించినదియు ప్రపంచమందలి వివిధ దేశముల ప్రజలను రసవాహినిలో మునకలు వేయించినదియు నిస్సంశయముగా షేక్స్పియర్ మహాశయుడే. మానవజీవితమును మథించి చక్కగా అవగాహనము చేసికొన్నవాడాతడు. విశ్వవిద్యాలయపు విద్యాముద్ర లేకున్నను విశ్వమే విశ్వవిద్యాలయముగను మానవులే పాఠ్యగ్రంథములుగను వారి నడవడి వారి గుణగణములు వారి శీలమే అభ్యసించదగిన అంశములుగను ప్రకృతిమాత ఒడిలో చిరునవ్వుతో విస్మయానందముతో ఆడుకొను బిడ్డవలె షేక్స్పియర్ జగద్రహస్యములనే గ్రహించినాడు. వైవిధ్యములోను మానవతా దృక్పథములోను అతనికి అతడేసాటి. అతని రెండు నాటకములును ఒకేరీతిగ నుండవు. వందలాది పాత్రలను సృష్టించినను ఏ రెండుపాత్రలును ఒకేతీరున నుండవు. ప్రతిపాత్రలో ప్రత్యేకమైన విశిష్టత ఉట్టిపడుచుండును. అతడు సృష్టించిన పాత్రలు జీవితరంగములో అన్నివర్గములకు చెందినవారు— రాజులు రాణులు పండితులు పామరులు వీరులు భీరులు సరసులు, సన్యాసులు దురదృష్టులు దుష్టులు నెరజాణలు ముగ్ధలు చతురులు చపలలు వికటవినోదులు — ఒకరేమిటి అందరును ప్రత్యక్షమయ్యెదరు. షేక్స్పియర్ నాటకములలో విశ్వజనీనత గోచరించుచుండును. అతడు మానవజీవితమును బాగుగా అవగాహన చేసికొనిన రచయిత కనుకనే అతని రచనలు అన్నివర్గములవారికి ఆహ్లాదమును కల్గించును. గెటీ (Goethe) అను విఖ్యాత జర్మన్ రచయిత అన్నట్లు మానవ హృదయములకు సంబంధించు ప్రతివిషయము షేక్స్పియర్ నాటకములలో ప్రతిబింబించుచుండును. మంచి చెడుల రెండింటిని స్వీకరించి పాత్రలద్వారా రూపకల్పన చేసినాడు షేక్స్పియర్. డెస్డిమోనా వంటి ఆదర్శప్రాయమైన స్త్రీని

మాత్రమే కాక గానెరిల్ రీగన్ లేడీ మెక్‌బెత్ వంటి భయంకర స్త్రీపాత్రలనుగూడ సృష్టించినాడతడు. అతని రచనలను చదివినను ఆయా పరిస్థితులలో ఆయాపాత్రలకున్న గుణగణములు కల్గియున్నచో మనముకూడ అవిధముగనే ప్రవర్తించెదవారమను భావము మనకు కలుగకమానదు. ఈవిధమైన పాత్రపోషణము చేయుట ఏ మానవరచయితలకు చేతకాని పనికాదు. అందుచేతనే షేక్‌స్పియర్ బహుముఖప్రజ్ఞాశాలి (Myriad minded) యని కోల్‌రిడ్జ్ మహాశయుడు ప్రశంసించినాడు.

షేక్‌స్పియర్ తన నాటకములద్వారా ఆనందమును అందియ్యడమేగాని నీతిబోధనమునుదానిని ఒకలక్ష్యముగ ఎంచుకొనలేదని జాన్సన్ పండితుని అభిప్రాయము. మహాకవియైనవాడెవ్వడును తనరచనలద్వారా లోకమునకు సందేశములనందింప కపోవడు. నైతికవిలువలు అభిప్రాయములు జీవితసూత్రములు — ఈ అంశములన్నియు నాటకరచనలో అంతర్భాగములుగ ఉండునేగాని సంఘసంస్కర్తవలె మతప్రవక్తవలె రచయిత వాటిని సూటిగా బోధించడు. షేక్‌స్పియర్ నాటకములలో స్పష్టముగా కన్పించునదియు చదువరులను మంత్రముగ్ధులను చేయునదియు మానవ జీవనస్రవంతిలోని సంఘర్షణల సజీవచిత్రణమే. మంచికి చెడుకు, క్రమబద్ధమైన వ్యవస్థకు చిన్నాభిన్నమైన వ్యవస్థకు సాధారణ పరిస్థితులకు అసాధారణమును అనౌచిత్యమునైన పరిస్థితులకు నడుమ కల్గు సంఘర్షణమును ఉన్నతస్థాయిలో మనోజ్ఞముగ చిత్రించినాడతడు. నైతికవిలువల చిత్రణములో అటు చదువరులను, ఇటు ప్రేక్షకులను షేక్‌స్పియర్ నాటకభాగమున విశ్వాసము నందు భాగస్వాములనుచేయును. ఈ భాగస్వామ్యము కేవలము భౌతికస్థాయికే పరిమితమై యుండక మానసిక నైతికస్థాయిలకు కూడ వ్యాప్తమగుచుండును. ఉదాహరణముగ మెక్‌బెత్ రాజ్యకాంక్షతో దురాశాపూరితుడై హత్యాకాండ సాగించుచు తుదకు పతనము చెందును. అతనియెడ మనకు ద్వేషము జనింపక కలుగుటకు పూర్వము విశేషగౌరవాభిమానములు మొలకెత్తునట్లు రచయిత అందుచే నాటకాంతమున ఆపాత్రపై మనకు జాలి యేర్పడును. ఎన్ని గొప్పగుణములున్నను ఒకేఒక లోటున్నందువలన విషాదాంత నాటకమందు కథానాయకులందరు పతనమైపోయెదరు. హామ్లెట్‌లోని డోలాయమాన మనస్తత్త్వము ఒథెల్లోలోని అసూయ, తద్వారా కల్గిన ప్రతీకారవాంఛ, లియర్‌లోని వార్ధక్యానుగతమైన అవివేకము, మెక్‌బెత్‌లోని దురాశ — ఇట్టివెన్నియో లక్షణములు సామాన్యముగ సజీవతముగ మనకు నిత్యము కన్పించునట్టి లక్షణములే. ఆ లక్షణములు చిత్రితమగు నాటకములతోను అందలిపాత్రలతోను మనము తాదాత్మ్యము చెందుదుము.

షేక్‌స్పియర్ ఒకయుగమునకుమాత్రమేగాని ఒకదేశమునకుమాత్రమేగాని చెందినవాడుకాడు. అతడు సర్వకాలములకు సకలదేశములకు చెందిన మహనీయుడు. కనుకనే ఇటీవల అతని చతుశ్శతజయంత్యుత్సవములు సకలదేశములందును భక్తిగౌరవప్రపత్తులతో జరుపుకొనినవి. బ్రిటిష్ సామ్రాజ్యము ఉన్నను లేకపోయినను షేక్‌స్పియర్ చిరస్థాయిగా ప్రపంచచరిత్రయందు నిలిచిపోగలడను కార్లైల్ మహాశయుని వాక్యము నందలి సత్యమీనాడు ప్రపంచమునకు తేటతెల్లమైనది.

గ. వేం. శో.

## సంధిపాదజంతువులు (Arthropoda)

సంధిపాద జంతువులన్నియు — ఈగలు దోమలు చీమలు అద్దంకులు తేళ్లు రొయ్యలు పీతలు మొదలగునవి — సంధిపాదములను కల్గియుండును. వీటికి రెక్కజతల ఉపాంగములు కూడ యుండును. వీటిలో కొన్ని నేలమీదను కొన్ని మంచినీటియందును, మరికొన్ని సముద్రములలోను జీవించును.

ఆర్త్రోపోడా అను ఈ జంతుజాతి ఐదు తరగతులుగా వర్గీకరింపబడినది.

(1) క్రస్టేషియా: ఇవి నీటిలో నివసించును. ఉదా: రొయ్యలు, పీతలు

(2) ఇన్‌సెక్టా: ఇవి నేలమీదను, గాలిలోను జీవించు పురుగులు. ఉదా: ఈగలు దోమలు అద్దంకులు; వీటికి రెండుజతల రెక్కలు, మూడు జతల కాళ్లు ఉండును

(3) ఒనైకోఫోరా — ఇవి నేలమీద జీవించు పురుగులు; వీటికి పెక్కుజతల కాళ్లుండును ఉదా: పెరిపాటస్

(4) మిరియాపోడా — ఇవి కూడ నేలమీదనే జీవించును; వీటి కూడ అనేకజతల కాళ్లుండును ఉదా: మిల్లిపీడ్ సెంటిపీడ్

(5) అరక్నిడా — వీటిలో కొన్ని నీటియందును, కొన్ని నేలమీదను జీవించును. వీటికి నాల్గుజతల కాళ్లుండును

ఉదా: గాంబీర్ సాలీడు తేలు

క్రస్టేషియా: ఇవి జలచరములు. వీటికి రెండు జతల మీసములు, మూడు జతల దవడలు ఉండును. వీటి శరీరము పైకడుపు పొత్తికడుపు అను రెండు భాగములుగనుండును. ఇవి అనేక ఉపాంగములు కల్గియుండును. ఇవి నీటిలో ఈదుటకును ఆహారమును సేకరించుటకును వాయు వినిమయమునకును సంయోగక్రియకును ఉపకరించును. క్రస్టేషియా అను తరగతి మరల ఐదు ఉపతరగతులుగ విభజింపబడినది.

రొయ్యలు: ఇవి పెక్కు జతల ఉపాంగములు కల్గి నదులలోను సముద్రములలోను జీవించును. కేరళ ప్రాంతమున ఇవి విశేషముగ లభించును. సముద్రపు రొయ్యలలోను మంచినీటి రొయ్యలలోను మరల అనేక వర్గములు గలవు. గంగ గోదావరి కృష్ణ నదులలోగూడ ఇవి విరివిగా గలవు. చిలకా సరస్సు పులికట్ కొల్లేరు సరస్సులలోకూడ ఇవి లభ్యమగును. రొయ్యలలో ఆడ మగ జాతులుండును. వీటిని ఆహారముగ ఉపయోగింతురు. ఇవి బాగా రుచిగ నుండును. వీటిలోను కొన్ని ద్రావకములలోను ఉడకబెట్టి పిదప ఎండబెట్టి డబ్బాలలో భద్రపరచి వండుకొని తిందురు.

పీతలు: పెక్కు తరగతులుగల వీటిని ఆహారముగ నుపయోగింతురు. వీటి శరీరముపై గట్టి కవచముండును. మన రాష్ట్ర తీరమున ఇవి విరివిగా లభించును. వీటిలోగూడ ఆడ మగజాతులున్నవి.

ఇన్‌సెక్టా: ఈ సంధిపాదజంతువులు మూడు జతల కాళ్లను రెండు జతల రెక్కలను కల్గియుండును. వీటి నోరు అందలి అవయవములు ఇవి తిను ఆహారమునుబట్టి వివిధముగ మారుచుండును. పళ్లు దవడలు, తొండములు సూదులవంటి గొట్టములు మున్నగునవి ఈ అవయవములు. వీటిలో కొన్నిటికి రెక్కలు లేవు ఉదా: నల్లులు పేలు. వీటి జీవితచరిత్ర పెక్కు దశలలో పూర్తియగును. ఈ తరగతి జంతువులు ప్రధానమైన రెండు ఉపతరగతులుగను అవి ఒక్కొక్కటి మరల పెక్కు వర్గములుగను విభజింపబడినవి. కీటకాలలో కొన్ని ఆత్మసంరక్షణార్థము రకరకములుగా మారగలవు. అనగా అవి జీవించు పరిసరముల రంగును సృష్టించుకొని శత్రువులబారినుండి రక్షించుకొనును. మరికొన్ని జంతువులు విషగ్రంథులు కల్గియుండును.

ఈ పురుగులలో కొన్ని మానవులకు మిగుల ఉపయోగకరములు ఉదా, తేనెటీగలు పట్టుపురుగులు. కొన్ని పురుగులు మొక్కలను నాశనము చేయు క్రిములను తిని మానవునకు సహాయభూతములుగ నున్నవి. కాగా కొన్ని పురుగులు పంటలను పాడుచేయును. మరికొన్ని మానవుని కుట్టి రోగములు వచ్చుటకు కారణభూతములగుచున్నవి ఉదా: దోమలు ఈగలు.

పెండపురుగు: ఇది పుస్తకములలో జీవించును. వాటిని పాడుచేయుచుండును. తెల్లగా మెరయుచు చిన్నపురుగులకు రెక్కలుండవు. బద్దెంకలు చెదలు పేలు నల్లులు ఈగలు దోమలు సీతాకోకచిలుకలు పట్టుపురుగులు చీమలు తేనెటీగలు మొదలైనవి సంధిపాదజంతువులలో ఒక ఉపతరగతికి చెందినవి. వీటిలో కొన్నిటికి రెండు జతల రెక్కలుండును. వీటి జీవితముగూడ పెక్కు దశలలో పూర్తియగును. బద్దెంకలు గొల్లభామలు మిడుతలు మొదలగువాటి నోళ్లలో పళ్లుగల దవడలుండును. ముందుజత రెక్కలు గట్టిగా చర్మసదృశముగానుండి పలుచని వెనుకజత రెక్కలను కప్పియుండును. వీటికి మూడు జతల కాళ్లుండును.

బద్దెంకి: ఇది వంటయింటిలోను పాయఖానాలందు గదిలోను నివసించును. పగటిపూట దాగియుండి రాత్రులందు బయట సంచరించుచుండును. ఇందు ఆడ మగ జాతులు గలవు. తల పైకడుపు పొత్తికడుపు అను మూడుభాగములు దీని శరీరమందుండును. తలయందు కన్నులు మీసములు నోరు దవడలు మొదలగు ముఖ్యావయవములుండును. పైకడుపు మూడు భాగములతో రెక్కలను కాళ్ళను కలిగియుండును. పొత్తికడుపు పదిభాగములను కలిగియుండును. ఇది కూరలను, అన్న[illegible]లను తినును.

చెదలు: చెదలు నేలలో సమూహములుగా నివసించును. ఇవి ముఖ్యముగా కొయ్యను గడ్డిని, పుస్తకములను తినివేయును. వీటిలో కొన్నిటికి రెండు జతల రెక్కలుండును. ఈ రెక్కలు వీటి జీవితదశలలో కొలదికాలము మాత్రముండును. సంయోగసమయములో అవి ఉపయోగపడును. సంయోగానంతరము ఆడ మగజాతుల రెక్కలు రాలిపోవును. మగచెదలు మరణించును. రెక్కలు లేనిచెదలు పూర్తిగా పెరుగని ఆడ మగ జాతులుగ నుండును. వీటికి శృంగావయవములు పెరుగవు. వీటిలో పనివారు సైనికులు అను రెండు తెగలుండునట. పనివారు గూళ్లు నిర్మించుట ఆహారము సేకరించుట, సైనికులు శత్రువులనుండి రక్షించుకొనుట మున్నగు పనులలో నిమగ్న

అగుచుండను

పేలు: ఇవి మానవుని తలవెంట్రుకలలో దాగియుండి, స్రవము బ్రాగగ బాధించుచుండును వీని శరీరము వలుచగనుండి తల మైకడువు పొత్తికడువు అను మూడు భాగములుగ నుండును వీటికి ఆరు కాళ్ళు ఒకజత మీసములు ఉండును మైకడువుకు మూడు జతల కాళ్ళుండును పొత్తికడువులో తొమ్మిది భాగములుండును ఆడ మగజాతులుగనుండు ఇవి అనేకవిధముల రోగములను కలిగించును

నల్లులు వీటియందు మూడు తరగతులు గలవు ఒక తరగతి మానవుని రక్తమును పీల్చి జీవించును ఇంకొక రకము మొక్కలలోగల ద్రవమును పీల్చుకొనును; మూడవరకము నీటిలోనుండును వీటికి సూదివంటి తొండముండును మొక్కల పట్టు నల్లులు వాటిని నాశనమొనర్చును మామూలు నల్లులు మానవుని రక్తమును పీల్చివేయును వీటికి ఒకజత రెక్కలు మాత్రముండును వీటిపై ఎర్రని మచ్చ లుండును వీటి కాళ్ళ గట్టిగనుండును

సీతాకోకచిలుక: సీతాకోకచిలుకలు, చిమటలకు తొండముండును; రెండుజతల రెక్కలుండును వీటి జీవితచరిత్ర కొన్నిదశలలో పూర్తియగును సీతాకోకచిలుకలు పూవులలోని మకరందమును తొండములద్వారా పీల్చును వీటికి దవడలుండవు మైకడువుకు మూడుజతలకాళ్ళుండును గొంగళి పురుగు సీతాకోకచిలుకయొక్క జీవితచరిత్రలో ప్రథమదశ ఇది మొక్కలను తిని జీవించును గొంగళి పెరుగుచుండి మాతృదశ పొందును సీతాకోకచిలుకలు రంగురంగు రెక్కలతో చాల ఆకర్షణీయముగనుండును

చీమలు తేనెటీగలు ఇవి పెద్దపెద్దసమూహములుగా నివసించును వీటికి రెండుజతల రెక్కలుండును తేనెటీగలు గూళ్ళు కట్టుకొని వాటిలో నివసించును వాటిలో మగజాతి ఆడజాతి పనివారు అను మూడు తెగలుండును కాని చీమలలో పనివారు ఈ మూడు జాతులకు రెక్కలుండను తేనెటీగలు మానవునకు తేనెను మైనమును లభింపచేయును

ఈగలు దోమలు వీటికి ఒకజతరెక్కలుండును సూదివంటి గొట్టముతో ఇవి ఆహారమును పీల్చుకొనును దోమల శరీరము తల మైకడువు పొత్తికడువు అనుమూడుభాగములుగ నుండును వీటిలో పెక్కురకములు గలవు ఇవి మానవునకు అనేక రోగములను కల్గించును ప్లాస్మోడియం అనుమలేరియా క్రిములు ఎనాఫిలిస్ దోమద్వారాను ఫైలేరియాక్రిములు క్యూలెక్స్ దోమద్వారాను పచ్చజ్వరక్రిమి స్టీగోమియా దోమద్వారాను మానవుని శరీరములో ప్రవేశించి హానికల్గించును ఈ దోమల జీవితముగ్రడ్లు లార్వాప్యూపా ఇమాగో అనునాలుగు దశలలో పూర్తి అగును

వాసైకోపోరా పెరిపాటస్ అనుపురుగు ఈజాతికిచెందినది ఇది రాళ్ళక్రింద చెట్ల బెరడులోను నివసించును ఇది సన్నగా పొడవుగా గొంగళి పురుగువలె యుండును దీనికి అనేకజతల కాళ్ళుండును నోటి దగ్గర గుండ్రని పెదిమ యుండును దాని మీద కండకములుండును తలమీద ఒకజత మీసములు ఒకజత దవడలు ఒకజత కండకములు ఉండును వీటియందు మగ ఆడ జాతులుండును

మిరియపోడా తరగతికి చెందిన సెంటిపీడ్ మిల్లిపీడ్ అను పురుగులు సన్నగను పొడవుగనుండి పెక్కుభాగములు కల్గియుండును తల యందొకజత మీసములు ఒకజతకళ్ళు, రెండులేక మూడుజతల దవడలు ఉండును పెక్కుజతలుగల కాళ్ళుగూడ యుండును

అరక్నిడా: తేళ్ళు సాలీళ్లు రాజపీత ఈజాతికిచెందినవి వీటికి మీసములు దవడలు లేవు వీటిలో కొన్ని నేలమీద కొన్ని సముద్రములోను నివసించును రాజపీత సముద్రమునందే నివసించును తేళ్ళు రాళ్ళక్రింద భూమిమీది కంతలలోను నివసించును వీటి తోకల చివర విషపుముళ్ళ విషగ్రంథులుండును ఇవి మానవునకు హానికరములు వీటిలో ఆడ మగ జాతులు గలవు సాలీళ్ళు ఇండ్లలోమూలల యందు గూళ్ళు కట్టుకొని అందు జీవించును

ఈవిధముగా సంధిపాదజంతువులలో పెక్కువేలరకములు గలవు

జి హెచ్ ఆర్ కె

## సంసారనియంత్రణము

ఎన్నియో కారణముల క్రితమే కుటుంబనియంత్రణా వశ్యకము సర్వత్ర గుర్తింపబడినది ఏ కారణములవలననైన గాని మానసికముగా అందోళన చెందువారికి సంతానము కల్గుట అవాంఛనీయమనియు అట్టివారు సమాజమునకు, స్వీయకుటుంబమునకు భారమై పరిణమించు అవకాశము కలదనియు విజ్ఞులగు కొందరు శాస్త్రవేత్తలయొక్కయు, ఇతరులయొక్కయు అభిప్రాయము. అట్టి వ్యక్తుల జీవములను

గర్భోత్పత్తికలుగు అవకాశము ఎక్కువగాకలదు. ఈ రోజులలో సంభోగము మానినచో తక్కిన రోజులలో గర్భధారణము సంభవించు అవకాశముండదు. ఈ పద్ధతిపై ఆధారపడుట నమ్మదగినదియు కాదు. గ్రుడ్డు వెలువడు రోజు ఒకే తీరుగా నుండక పోవుటయే ఇందుకు కారణము.

కోరిన వ్యవధిలో పిల్లలు పుట్టునట్లు కూడ కుటుంబనియంత్రణము ఉపయోగపడును. కుటుంబనియంత్రణమునకు గల ఆర్థిక కారణములు అంతరకును సువిదితమైనవే. ఇద్దరు ముగ్గురు బిడ్డలను సవ్యముగా పోషించునట్లు హెచ్చుసంఖ్యగల బిడ్డలను పోషించుట సాధ్యముకాదు.

ఇటీవల గర్భస్రావమునుగూర్చి ప్రభుత్వము శాస్త్రవేత్తలు తీవ్రముగా ఆలోచించుచున్నారు. సోవియట్ రష్యాలో గర్భస్రావము చట్టబద్ధము చేయబడినది. అచ్చట స్త్రీలైనను కుటుంబనియంత్రణముకొరకు గర్భస్రావము వాంఛించినను గర్భస్రావమును కోరువారు జూటకవు వైద్యులవద్దకు వెళ్లి అపాయమును కొనితెచ్చుకొనకూడదు. ఇటీవల గర్భస్రావమునకు సంబంధించిన చట్టము బ్రిటనులో విశేషముగా సడలింపబడినది. ఈ చట్టమును భారతదేశములో కూడ సడలింపవలసిన అవసరమున్నది.

ఎస్. వేం. రా.

## సంస్కృతభాషావాఙ్మయచరిత్ర

సంస్కృతభాష భారతీయుల పురాతనభాష. గ్రీక్, లాటిన్ మొదలగు భాషలవలెకాక సంస్కృతభాష నేటికిని భారతీయులకైనందిన జీవితముతో ఘనిష్ఠముగ సంబంధించి యున్నది. ఇది భారతజాతీయసంస్కృతికి మూలకందము. మూడు నాలుగు భాషలు తప్ప ఇతర భారతీయ భాషలన్నిటికిని ఇది ఉత్పత్తిస్థానము. ఇది భాషాశాస్త్రమునను సరించి ఇండో-యూరపియన్ భాషలనెడు పేరుతో ప్రసిద్ధమగుభాషాశాఖలో అతిప్రధానమగు భాష. దీని సౌందర్యసమగ్రత్వాదుల కాశ్చర్యపడి పాశ్చాత్యపండితులుగూడ దీనిని కొనియాడిరి. సర్ విలియమ్‌జోన్సు అను పాశ్చాత్యపండితుడు 1786 వ సంవత్సరమున సంస్కృతభాషనుగూర్చి చెప్పుచు "సంస్కృతభాష ఎంతప్రాచీనమైనదను విషయమెట్లున్నను దాని రూపము అత్యద్భుతమైనది, గ్రీకుభాషకంటె చాల పరిపుష్టమైనది, లాటిన్‌భాషకంటె చాల సమృద్ధమైనది. ఈ రెండిటికంటెను అతిసుందరమగు విధమున సంస్కృతమైనది. ధాతువులు వ్యాకరణముమొదలగు విషయములనుబట్టి చూచినచో ఈభాషలన్నియు ఒకే కుటుంబమునకు చెందినవని చెప్పవచ్చును" అని ఉద్ఘోషించియున్నాడు. జోన్సు చేసిన ఈ ఉద్ఘోషణముతో పాశ్చాత్యపండితుల దృష్టి ఈ భాషవైపు మరలినది. దీనితో భాషాశాస్త్రమనెడు ఒక నూతనశాస్త్రమునకు బీజావాపమైనది.

సంస్కృతవాఙ్మయేతిహాసము అతిప్రాచీనమైనది. ఇంచుమించు ఆరువేల సంవత్సరములనుండి అవిచ్ఛిన్నముగ వచ్చుచున్నది. ఇతిహాసము ఈభాషను వైదికభాషయనియు లౌకికభాషయనియు విభజింపవచ్చును. అతిప్రాచీనములగు కొన్ని ప్రాంతీయభాషలచే నేర్పడినది వైదికభాష. ఇది వైదికవాఙ్మయమునకు మనయుక్తమైనది. ఈభాషనే భిన్నకాలములలో అనేక వైయాకరణులు సంస్కరింపగా ఇంచుమించు క్రీస్తుకు పూర్వము ఆరువందల సంవత్సరముల నాటికి ఒకవిధమగు భాషారూపము (classical language) నిష్పన్నమైనది. క్రీస్తుపూర్వము 7 వ శతాబ్దికి చెందిన పాణిని వైదికభాషను ఛందస్సు అనియు పరినిష్ఠిత సంస్కృతభాషను భాష యనియు పేర్కొనెను. దీనినిబట్టి పాణినిచే వ్యాకృతమగు భాషను అనాటి జనులు దైనందిన వ్యవహారమునందుపయోగించుకొనెడివారని చెప్పవచ్చును.

ఈవిధముగ సంస్కృతభాషావాఙ్మయములు ప్రపంచమునందలి భాషావాఙ్మయములలో అతి ప్రాచీనమైనవి. అతి విస్తృతమైనవి. వివిధ విషయములపై అతిప్రాచీనకాలమునుండియు ఎన్నియో గ్రంథరత్నము లీభాషలో రచితములైయున్నవి. క్రీ. శ. 1840 వ సం॥ ప్రాంతమునాటికి లక్షయగు మూడునాలుగువందల సంస్కృత గ్రంథములనుచూచి ఆశ్చర్యచకితుడై ఎల్‌ఫిన్ అనునొక పాశ్చాత్యపండితుడు ఈసంస్కృత గ్రంథముల సంఖ్య పాశ్చాత్యుల ప్రాచీనభాషలగు గ్రీక్ లాటిన్ భాషలలోగల మొత్తము గ్రంథముల సంఖ్యకంటె అతివిస్తృతముగనున్నదని వ్రాసియున్నాడు. 1940 వ సం॥ వరకు మరికొందరు పాశ్చాత్యవిద్వాంసులుచేసిన పరిశోధనల ఫలితముగను నేపాలు టిబెట్ మొదలగు సుదూర ప్రాచ్యదేశములకు వెళ్ళిన హరప్రసాదశాస్త్రి, రాహుల సాంకృత్యాయన్ మొదలగు మహాపండితులు చేసిన అన్వేషణ ఫలితముగను ఇపుడు లభించుచున్న సంస్కృతగ్రంథముల సంఖ్య ఇంచుమించు లక్షకు దగ్గరగనున్నది. ఇంకను తీవ్రాన్వేషణము

కేసనచో మఱికొన్ని లభ్యగ్రంథములు లభింపవచ్చునని పండితుల అభిప్రాయము. సువిశాలమగు ఈ సంస్కృత గ్రంథ వాఙ్మయమును ఈ క్రిందివిధముగ విభజింపవచ్చును.

(1) వైదిక వాఙ్మయము (2) వేదాంగములు (3) పురాణేతిహాసములు (4) ధర్మశాస్త్రార్థశాస్త్ర కామశాస్త్రాదులు (5) దర్శనములు (6) బౌద్ధ జైన వాఙ్మయము (7) ఆయుర్వేదాద్యుపవేదములు (8) కావ్యనాటక చంపూ కథాసాహిత్యములు (9) అలంకారశాస్త్రము (10) వ్యాఖ్యానములు (11) తంత్ర గ్రంథములు భక్తివాఙ్మయము (12) శిలాశాసన లేఖాది సాహిత్యము (13) ఇతర విషయములు

వైదిక సాహిత్యము: ఋగ్యజుస్సామాథర్వణములని వేదములు నాలుగు. అందు యజుర్వేదసామవేదములు యజ్ఞములతో సన్నిహితసంబంధము కలవి. ఋగ్వేదాథర్వవేదములలో ఎన్నియో అపూర్వవిషయములుగూడ మనకు లభించును. భారతీయ ప్రాచీన సంప్రదాయముప్రకారము వేదములన్నియు అపౌరుషేయములు. అనగా పురుషవిరచితములు కావు. కాని ఆధునిక విమర్శకులు వేదములకు అపౌరుషేయత్వమును అంగీకరింపరు. వీరి మతముప్రకారము ఋగ్వేదము ప్రాచీనతమమైనది. మాక్స్‌ముల్లరు మొదలగు కొందరు క్రీ. పూ. 15వ శతాబ్దము ఋగ్వేదకాలమనిచెప్పగా బాల గంగాధరతిలక్ మొదలగు మరికొందరు విమర్శకులు వేదకాలము కనీసము క్రీ. పూ. 4500 సం॥ రములకు ఈవలకాదని నిర్ణయించియున్నారు. ఋగ్వేదఋక్కులభాష ఏకవిధముగ లేదు. కొన్ని ఋక్కులభాష అతిప్రాచీనముగ కన్పట్టును. కొన్నిటిలోని భాష అర్వాచీనముగ కన్పట్టును. సామాథర్వవేదములలోని కొన్నిమంత్రములు ఋగ్వేదకాలముకంటెకూడ చాల ప్రాచీనమైనవని కొందరు విమర్శకుల అభిప్రాయము. ఈ వేదములపై ఇప్పుడు లభ్యమగుచున్న భాష్యములన్నియు చాలవరకు అర్వాచీన సంప్రదాయముపై ఆధారపడియుండుటచే కొన్నిమంత్రముల అర్థము అజ్ఞేయముగనే ఉండిపోయినదని పండితులు చెప్పుదురు.

వైదికసాహిత్యము సంహిత, బ్రాహ్మణము, ఆరణ్యకము అని మూడువిధములుగ విభజింపబడినది. అందు సంహితాభాగము ప్రాచీనతమములు. బ్రాహ్మణములు గద్యరూపములు. వీటియందు యజ్ఞాదులకు సంబంధించిన అనేక విషయములు వర్ణింపబడినవి. సంహితాభాగములకు పరిపూర్ణ ప్రామాణ్యము సంగ్రహించి వాటి యర్థమును స్పష్టీకరించుటకై బ్రాహ్మణములు ప్రయత్నించినవి. ఇపుడనేక బ్రాహ్మణములు లుప్తమైపోయినవి.

ఉపలభ్యమానములగు బ్రాహ్మణములలో ఋగ్వేదమునకు చెందిన ఐతరేయశాంఖాయన బ్రాహ్మణములు, కృష్ణయజుర్వేదమునకు చెందిన తైత్తిరీయబ్రాహ్మణము, శుక్లయజుర్వేదమునకు చెందిన శతపథబ్రాహ్మణము, సామవేదమునకు చెందిన తాండ్య (పంచవింశ) జైమినీయ బ్రాహ్మణములు, అథర్వవేదమునకు చెందిన గోపథబ్రాహ్మణమును ప్రధానమైనవి.

బ్రాహ్మణముల చివరనున్న భాగములకు ఆరణ్యకములని పేరు. వీటిని అరణ్యములలో మాత్రమే అధ్యయనము చేయవలెనను నియమముండుటచే వీటి కాపేరు వచ్చినది. భారతీయాధ్యాత్మికవిచారమునకు మూలకందములగు ఉపనిషత్తులు ఆరణ్యకముల అంతముననున్నవి. అందుచే వీటికి వేదాంతములని పేరు.

మొత్తము నూటయెనిమిది ఉపనిషత్తుల నామధేయములు ముక్తికోపనిషత్తులో ఈయబడినవి. ఇంకను ఎన్నియో ఉపనిషత్తులున్నవని విజ్ఞుల అభిప్రాయము. వీటిలో ఛాందోగ్య బృహదారణ్యక ఈశావాస్య కఠ తైత్తిరీయ ఐతరేయ, ప్రశ్న ముండక మాండూక్య కేన శ్వేతాశ్వతర కౌషీతకి మైత్రాయణీయోపనిషత్తులను పదమూడు ఉపనిషత్తులును ప్రాచీనములగుటయే కాక ప్రధానమైనవి.

వేదాంగములు: అతివిస్తృతమగు వైదికసాహిత్యమును బాగుగ అర్థముచేసికొని తత్ప్రతిపాదితములగు ధర్మములనాచరించుటకు సహాయపడుటకై బయల్వెడలిన వాఙ్మయమునకు వేదాంగములని పేరు. వేదాంగములన్నియు చాలవరకు సూత్రరూపమునను శ్లోకరూపముననను ఉన్నవి. అవి ఆరు: శిక్ష వ్యాకరణము ఛందస్సు నిరుక్తము జ్యోతిషము కల్పము. శిక్షాగ్రంథములు ఎన్నియోయుండెనని తెలియుచున్నది. కాని చాలవరకు అలభ్యములుగ నున్నవి. ఇందు వర్ణోచ్చారణాదులకు సంబంధించిన నియమములు చెప్పబడినవి.

ప్రస్తుతము ప్రచుర ప్రచారములో నున్నది పాణిని వ్యాకరణము. పాణిని క్రీ. పూ. 7వ శతాబ్దికి చెందినవాడని పలువుర విశ్వాసము. ఇంతటి సర్వాంగసుందరమగు వ్యాకరణ మెచ్చటను బయల్వెడలలేదని పండితులఅభిప్రాయము. పాణిని వ్యాకరణమునందు ఎనిమిది అధ్యాయములుండుటచే దానికి

అష్టాధ్యాయి అని పేరు. ఇందు 3983 సూత్రములు గలవు. ఇందులో కొన్ని క్రొత్త విషయములను చేర్చుటకై కాత్యాయనుడు వార్తికములను వ్రాసెను. సూత్రవార్తికముల మొత్తము సంఖ్య 5100 అష్టాధ్యాయిపై క్రీ పూ రమారమి 150వ సం॥ ప్రాంతమున పతంజలి మహాభాష్యమును రచించెను. ఈ అష్టాధ్యాయిపై రమారమి ఏబది వ్యాఖ్యానములు బయలుదేరినవి. వీటిలో చాలవరకు లుప్తమైనవి. పాణినికి పూర్వము ఎన్నియో వ్యాకరణములుండెడివి. తరువాతకూడ పాణిని వ్యాకరణము బాధకముగగాని ఎన్నియో వ్యాకరణములు బయలుదేరినవి. వీటిలో కలాప చాంద్ర జైనేంద్ర శాకటాయన సంక్షిప్తసార సారస్వత హేమచంద్ర ముగ్ధబోధ సుపద్మ వ్యాకరణములు ముఖ్యముగ పేర్కొనదగినవి.

ఛందశ్శాస్త్రమున పింగలసూత్రము అతిప్రాచీనమైనది. పింగలునకు అశోకచక్రవర్తికి గురువని యొకవాదము కలదు. నిరుక్తము నిఘంటువుపై వ్యాఖ్యానము. ఇందు నిఘంటువులో సంగృహీతములగు పదములకు నిర్వచనము చూపబడినది. దీని రచయిత పాణినికి పూర్వుడైన యాస్కుడు. ఈతడు వ్రాసిన నిరుక్తముకంటె పూర్వము కొన్ని ప్రాచీన నిరుక్తములుండెడివి కాని అవి లభ్యమగుటలేదు.

వేదాంగజ్యోతిషము పేరుతో లగధమునికృతములగు రెండు గ్రంథములు లభ్యమగుచున్నవి. ఒకటి ఋగ్వేదాంగము రెండవది యజుర్వేదాంగము. వీటిలో మొత్తము 45 శ్లోకములు కలవు. ఇంచుమించు గణనావిధానము ఈ పురాతనమైనది. కాలక్రమమున ఈ జ్యోతిషము సంహిత గణితము జాతకము అను మూడుస్కంధములుగ విభజింపబడినది. ఒక్కొక్కస్కంధముపై అనేకములగు గ్రంథములు రచింపబడినవి. గణితమున భారతీయులు ప్రపంచమునకెన్నియో నూతనవిషయముల నందించిరని అభిజ్ఞుల ఆశయము.

కల్పసూత్రములు మూడువిధములు (1) శ్రౌతసూత్రములు (2) ధర్మసూత్రములు (3) గృహ్యసూత్రములు. శ్రౌతసూత్రములందు వైదికయజ్ఞవిధానము నిరూపింపబడినది. ధర్మసూత్ర గృహ్యసూత్రములందు నిత్యనైమిత్తికకర్మలు సువిస్తృతముగ వర్ణింపబడినవి. వాటినాధారముగగొని అతివిస్తృతమగు స్మృతివాఙ్మయము బయల్వెడలినది. అతివిశాలమగు ఈ శ్రౌత ధర్మ గృహ్యసూత్ర వాఙ్మయమేకాక శుల్బసూత్రమను మరియొక సూత్రముగూడ బయల్వెడలినది. ఇందు యజ్ఞవేదికల పరిమాణాదికము బోధింపబడినది. ఈ శుల్బసూత్రములలో రేఖాగణితమునకు సంబంధించిన వైజ్ఞానిక సిద్ధాంతములు ప్రపంచమునందు ప్రప్రథమముగ ప్రతిపాదింపబడినవి. ఈ విధముగ అనంతమైన వేదాంగసాహిత్యము అభివృద్ధిచెందినది.

పురాణేతిహాసములు (క్రీ పూ 600–క్రీ శ 400):— సూత్రకాలము తరువాత అనుష్టుప్ఛందస్సు అనుశ్లోకఛందస్సు ప్రచారములోనికి వచ్చినది. పురాణేతిహాసములలో చాలవరకు ఈ ఛందస్సు ఉపయుక్తమైనది. రామాయణభారతములు క్రీ పూ రమారమి ఐదవశతాబ్ది ప్రాంతమున వ్రాయబడినవని ఐతిహాసికులు చెప్పుదురు. పరంపరాగతములగు పెక్కు ఇతిహాసములు మహాభారతమునందు కూర్చబడినవి. రామాయణము పరంపరాప్రాప్తమగు మహాకావ్యము. ఇది మనకిపుడు లభ్యమగుచున్న రూపముననే పూర్వముకూడ ఉండెడిదని చెప్పుటకు వీలులేదు. ఈ గ్రంథములందు వివిధసమయములలో ఎన్నియో మార్పులు కూర్పులు చేయబడినట్లు కనబడును. ఉత్తరభారతమునందు లభ్యమగు భారతమునకును దక్షిణమున లభ్యమగు భారతమునకును సుదూరదక్షిణమగు కేరళప్రాంతమునందు లభ్యమగు భారతమునకును ఎంతయో భేదమున్నది. ఎన్నియో పాఠభేదములున్నవి. అట్లే రామాయణముకూడ తూర్పు ప్రాంతమునందు ఒకరూపమునను పశ్చిమప్రాంతమునందు వేరురూపమునను మధ్యప్రాంతమునందు మరియొకరూపమునను కన్పట్టుచున్నది. రామాయణమునందలి బాలకాండ ఉత్తరకాండములు చాల అర్వాచీనములని పండితుల అభిప్రాయము.

మహాపురాణములు పదునెనిమిది — బ్రాహ్మము, పాద్మము వైష్ణవము శైవము లేక వాయవీయము భాగవతము నారదీయము మార్కండేయము ఆగ్నేయము, భవిష్యము, బ్రహ్మవైవర్తము లైంగము వారాహము, స్కాందము, వామనము కౌర్మము మాత్స్యము గారుడము, బ్రహ్మాండము అనునవి.

ఉపపురాణములుకూడ పదునెనిమిది. ఈ ముప్పదియారునుకాక పురాణము అను పేరుతో ప్రసిద్ధమైనవి సుమారు నూరు గ్రంథములు కలవు. వాటి కాలనిర్ణయము కష్టమైనది. ఇవన్నియు ఒకకాలమునందు రచింపబడినవికూడ కావు. వీటిలో కొన్ని క్రీస్తుకు పూర్వమే యుండెడివని పర్గిటర్ అనునతడు నిర్ణయించియున్నాడు. క్రీ పూ ఆరువందల సంవత్సరములనాడు పురాణనామధేయముగు ఒక గ్రంథముండెడిదనియు, అదియే ఇతర

పురాణములన్నిటి ని పరమమూలమనియు జేక్‌సన్ అను విమర్శకుని అభిప్రాయము. ఈపురాణములలో ఆర్యేతరజాతులకు సంబంధించిన విషయములు ఎన్నియో ఐతిహాసిక ధార్మిక విషయములు లక్ష్యమగుచున్నవి. వైదిక మత సంబద్ధములగు పురాణములతో పోటిగా జైనులుకూడ ఎన్నియో పురాణములు వ్రాయుచున్నారు.

ధర్మశాస్త్ర గృహ్యశాస్త్ర కామశాస్త్రములు: కల్పసూత్రముల నాధారము గొని సూత్రరూపమున అనేక ధర్మశాస్త్ర గ్రంథములు రచింపబడినవి. ఇవి మానవుడాచరింపవలసిన లౌకిక పారలౌకిక ధర్మములను ప్రతిపాదించుచున్నవి. అట్లే పురాణకాలమునందే శ్లోకబద్ధములగు అనేక స్మృతులుకూడా బయలుదేరినవి. స్మృతివాఙ్మయము అతివిశాలమైనది. క్రీస్తుకు పూర్వమే అనేకస్మృతిగ్రంథములు బయలుదేరినవి. ఇట్టి స్మృతుల సారమే మనుస్మృతి. ఈకాలమునందే అర్థశాస్త్రమునకు సంబంధించిన అనేక గ్రంథములు రచింపబడినవి. అర్థశాస్త్రమునకు సంబంధించిన అనేకసిద్ధాంతములు ఎందరో ఆచార్యులచేత ప్రసిద్ధిలోనికి వచ్చినవి. ఇట్టిసిద్ధాంతము లన్నియు కౌటిల్యుని అర్థశాస్త్రమునందు సంగ్రహింపబడి యున్నవి. క్రీ. పూ. మూడవశతాబ్దిప్రాంతమున వ్రాయబడిన కౌటిల్యుని అర్థశాస్త్రము నాధారముగ గొని ఎందరో రచయితలు అర్థశాస్త్రగ్రంథములను వ్రాసియున్నారు. కాని అవి చాలవరకు లుప్తమైపోయినవి.

ఐహిక సుఖభోగాదులను గూర్చికూడ ఎందరో ఆచార్యులు అనేక గ్రంథములను వ్రాసియున్నారు. ఇట్టి గ్రంథముల సారమును సంగ్రహించి వాత్స్యాయనుడు క్రీ. పూ. రెండవశతాబ్దమున కామసూత్రములు అను గ్రంథమును రచించెను. దాని నాశ్రయించుకొని పిమ్మట ఎన్నియో గ్రంథములు బయలువెడలినవి. కామసూత్రముల యొక్క ప్రభావము తరువాత వచ్చిన సంస్కృతమహాకావ్యములపై అత్యధికముగ ప్రసరించినది.

దర్శనములు: భారతీయదర్శనములకు మూలము వేదము. వైదికమతమును ఖండించుటకై బయలుదేరిన జైనబౌద్ధమతములు గూడ చాలవరకు ఉపనిషత్సిద్ధాంతములచే ప్రభావితములైనవి. ప్రధానములగు దర్శనములు ఆరు: సాంఖ్యము, యోగము, న్యాయము, వైశేషికము, పూర్వమీమాంస, ఉత్తరమీమాంస వేదాంతము) ఈ దర్శనముల మూలగ్రంథము లన్నియు సూత్రరూపమున రచింపబడినవి. అందుచే వాటిపై భాష్యములు (విస్తృత వ్యాఖ్యలు) అవశ్యకములైనవి. జైమిని రచించిన పూర్వమీమాంసాసూత్రములపై రచితమగు శాబరభాష్యము అతిప్రాచీనమైనది. ఈ శబరాచార్యసంప్రదాయమును పరిపుష్టము చేసిన వారిలో కుమారిలభట్టు మహాపండితుడు. ఈతడు క్రీ. శ. ఏడవశతాబ్దికి చెందినవాడు. భారతదేశములో బౌద్ధమతమును నిర్మూలించుటకు ఈతడే ప్రధాన కారణభూతుడు. దీనిపిమ్మట న్యాయదర్శనముపై వాత్స్యాయనుడును వైశేషికదర్శనముపై ప్రశస్తపాదుడును భాష్యములను రచించిరి. కాలక్రమమున న్యాయవైశేషిక దర్శనములు కలిసిపోయి నవ్యన్యాయమను పేర అతివిస్తృతమగు వాఙ్మయము బయల్వెడలినది. యోగదర్శనముపై క్రీ. శ. ఐదవ శతాబ్దికి చెందిన వ్యాసుడు భాష్యమును రచించెను. సాంఖ్యదర్శనమునకు చెందిన మూలసూత్రభాష్యము లిపుడు లభ్యమగుటలేదు. సాంఖ్యసూత్రము పేర ఇపుడు లభ్యమగు గ్రంథము అర్వాచీనమైనది. ఈదర్శనముపై ఇపుడు లభ్యమానమగు ప్రామాణిక గ్రంథము ఈశ్వరకృష్ణ విరచితమగు సాంఖ్యకారిక. ఇది క్రీ. శ. ఐదవశతాబ్దినాటిది. జైన బౌద్ధ సిద్ధాంతములు చాలవరకు అతిప్రాచీనమగు ఈ సాంఖ్య సిద్ధాంతముపై ఆధారపడియున్నవని కొందరు పాశ్చాత్యపండితుల అభిప్రాయము. సాంఖ్యకారికపై గౌడపాద వాచస్పతి మిశ్రులు రచించిన వ్యాఖ్యానములు సుప్రసిద్ధములు, ప్రామాణికములు.

వేదాంతసూత్రములపై రచితములగు భాష్యములలో అతిప్రాచీనమైనది శాంకరభాష్యము. వేదాంతసూత్రములపై అధిక పరిశ్రమచేసిన థైబో అను పాశ్చాత్యపండితుడు నేటి వరకును జన్మించిన మహాబుద్ధిశాలులు ప్లేటో శంకరాచార్యులు కాంటు అను ముగ్గురేయని చెప్పియున్నాడు. శంకరాచార్యులు చూపిన మార్గమును అనుసరించి అతివిస్తృతమగు వాఙ్మయము బయల్వెడలినది. శంకరుని పిమ్మట రామానుజులు మధ్వాచార్యులు విష్ణుస్వామి వల్లభాచార్యులు మొదలగువారు వేదాంతసూత్రములపై భాష్యములను రచించిరి. ఒక్కొక్క సంప్రదాయము ననుసరించి ఎన్నియో గ్రంథములు రచింపబడినవి. ఒక్కొక్క సంప్రదాయముపై ఐదేసి వందలకు తక్కువ కాకుండ గ్రంథములుండునని పండితుల అభిప్రాయము.

బౌద్ధ జైనవాఙ్మయము: జైనస్థాపిత అర్ధదర్శనములును

ఆస్తికదర్శనములు. ఇవి వేదప్రామాణ్యము నంగీకరించును. ఇవి కాక ఆరు నాస్తికదర్శనములుగూడ బయలుదేరినవి. ఇవి వేదప్రామాణ్యము నంగీకరింపవు. వీటిలో ప్రత్యక్షమాత్ర ప్రామాణ్యమును నంగీకరించు చార్వాక మతము అతిప్రసిద్ధము. ఇది లోకాయతికవాదము. కాని ఈ దర్శనమునకు సంబంధించిన వాఙ్మయము పూర్తిగ లుప్తమైనది. బౌద్ధులలో బాహ్యార్థ ప్రత్యక్షత్వమును అంగీకరించు వైభాషికులు, బాహ్యార్థాను మేయత్వవాదులగు సౌత్రాంతికులు, బాహ్యశూన్యత్వవాదు లగు యోగాచారులు, సర్వశూన్యత్వవాదులగు మాధ్యమికులు అను నాలుగుశాఖలు కలవు. ఈ నాలుగుశాఖలును నాలుగు భిన్నదర్శనములుగ పరిగణింపబడినవి. ఆరవ దర్శనము ఆర్హత జైనదర్శనము. బౌద్ధ జైనమతములకు సంబంధించిన వాఙ్మయము అతివిస్తృతమైనది. జైనన్యాయము భారతీయ దర్శనములందు ఒక ప్రశస్తస్థానమును ఏర్పరచుకొనినది. క్రీ. శ. రెండవశతాబ్ది మొదలు ఆరవశతాబ్దివరకు ఈ న్యాయమునకు సంబంధించిన ఎన్నియో ప్రామాణికగ్రంథములు రచింపబడినవి.

క్రీ. శ. రెండవశతాబ్ది ప్రాంతమున బౌద్ధమతమునందు మహాయానశాఖ ఆవిర్భవించినది. ఈ మతమును శక రాజులు, సిథియన్ రాజులును పోషించుటచే ఇది ఇతరఖండములలో కూడ అతిశీఘ్రముగ వ్యాపించినది. ఈ మతమునకు సంబంధించిన ఆచార్యులు తమ గ్రంథములను పాలీభాషలో కాక సంస్కృత భాషలో వ్రాసిరి. అశ్వఘోషుడు బుద్ధచరితము, సౌందర నందము అను మహాకావ్యములను కొన్ని నాటకములను వ్రాసెను. బౌద్ధతర్కగ్రంథములుగూడ ఎన్నియో బయల్వెడలెను. కాని చాలవరకు ఈగ్రంథములు బౌద్ధమతముతో పాటు విదేశములకు తరలిపోవుటచే ఇచట లభ్యమగుటలేదు. మధ్యాసియా టిబెట్ నేపాలు మొదలగు ప్రాంతములందు మాత్రము కొన్నిగ్రంథములు లభించినవి.

ఆయుర్వేదాద్యుపవేదములు: ఆయుర్వేదము ధనుర్వేదము, గాంధర్వవేదము శిల్పవేదము అనునవి నాల్గువేదములకును ఉపవేదములుగ బయలుదేరినవి. కొందరి మతముప్రకారము నాల్గవ ఉపవేదము తంత్రశాస్త్రము. వీటిలో అత్యంత ప్రధానమైనది ఆయుర్వేదము. ఆయుర్వేదమునకు సంబంధించిన కొన్ని ఔషధములు అథర్వవేదమునందు వర్ణింపబడినవి. ఆయుర్వేదమునకు శల్యము శాలాక్యము, కాయచికిత్స, భూతవిద్య, కౌమారభృత్యము, అగదయంత్రము, రసాయన తంత్రము, వాజీకరణము అను ఎనిమిదిఅంగములు కలవు. ఈ అష్టాంగములకు సంబంధించిన ఎన్నియో గ్రంథములు క్రీస్తుపూర్వమే రచియింపబడినవి. ఈ గ్రంథముల సారమును చరకము శుశ్రుతులు తాము రచించిన సంహితలలో పొందు పరచిరి. చరకుడు కనిష్కుని స్థానమునందు (క్రీ. శ. మొదటి శతాబ్దము) రాజవైద్యుడుగ ఉండెనని చైనా భాషలోనికి అనూదితములగు బౌద్ధ త్రిపిటకములద్వారా తెలియుచున్నది. సుశ్రుతుడుకూడ దాదాపు ఈ కాలమువాడే. చరకసంహిత, సుశ్రుతసంహితల పిమ్మట వాగ్భటుడు రచించిన అష్టాంగ హృదయము మహోత్కృష్టమైనది. వీటికి ఆయుర్వేదమునందు 'బృహత్త్రయి' అని పేరు. వీటిపిమ్మటగూడ అసంఖ్యాకము లగు గ్రంథములు ఆయుర్వేదమున రచింపబడినవి. వాటిలో కొన్ని మూలగ్రంథములు లుప్తమైనను వాటి టిబెట్ భాషాను వాదములు లభ్యమగుచున్నవి.

కావ్యనాటకాదులు: క్రీ. శ. ప్రారంభమువరకును సంస్కృతకావ్యములు ప్రధానముగ ధార్మికదృష్టితోడను ఆధ్యాత్మికదృష్టితోడను రచింపబడెడివి. క్రమక్రమముగ రస ప్రధానములగు కావ్యముల నిర్మాణము ప్రచారములోనికి వచ్చినది. కాళిదాసు భారవి మాఘుడు శ్రీహర్షుడు మొద లగు మహాకవులు రచించిన మహాకావ్యములచే సంస్కృత వాఙ్మయము అతిసమృద్ధమైనది. ఈ పద్యకావ్యములతో పాటు సుబంధురచితమగు వాసవదత్త, బాణభట్టరచితమగు కాదంబరి మొదలగు గద్యకావ్యములును గద్యపద్యమిశ్రితము లగు చంపూకావ్యములును పెక్కులుగా ఆవిర్భవించినవి. గద్య వాఙ్మయమున పంచతంత్రము మొదలగు కథాగ్రంథములు గూడ బయల్వెడలినవి. ఇట్టికథలు ప్రథమముగ భారతదేశ మునందే అవతరించెనని బెన్‌ఫీ మొదలగు పాశ్చాత్యపండితులుగూడ అంగీకరించిరి. పంచతంత్రకథాప్రభావము ప్రపంచమునందలి అన్ని కథాసాహిత్యములపైనను ప్రసరించినది. క్రీస్తుశకప్రారంభమున గుణాఢ్యుడు బృహత్కథయను కథా గ్రంథమును పైశాచిభాషలో రచించెను. ఈమూలగ్రంథము లుప్తమైనను, కథాసరిత్సాగరము, బృహత్కథామంజరి, బృహత్కథాశ్లోకమంజరి అనుపేర్లతో దాని సంస్కృతాను వాదములు లభ్యమగుచున్నవి. పంచతంత్ర, బృహత్కథాది గ్రంథముల నాశ్రయముగగొని సంస్కృతభాషలో ఎన్నియో కథాగ్రంథములు వ్రాయబడినవి.

సంస్కృతమునందలి రూపకవాఙ్మయముగూడ అతి విస్తృతమైనది. సంస్కృతరూపకములు గ్రీకునాటకములచే ప్రభావితములైనవను పాశ్చాత్యవాదము నిరాధారమైనది. భారతీయకవులు పెక్కువిధములగు రూపకములను రచించిరి. నాటకము ప్రకరణము భాణము ప్రహసనము డిమము వ్యాయోగము సమవాకారము వీథి అంకము, ఈహామృగము అను పది ప్రధానరూపకములను ఎన్నియో ఉపరూపకములను బహుళవ్యాప్తిలో నుండెడివి. క్రీ. శ. మూడవశతాబ్దియందు రచితమైన మృచ్ఛకటికము పాశ్చాత్యవిమర్శకులమండికూడ మన్ననలనందుకొన్నది. అంతకుపూర్వమే రచితములగు భాసుని "స్వప్నవాసవదత్త" మొదలగు నాటకములు, కాళిదాసుని మాళవికాగ్నిమిత్ర విక్రమోర్వశీయ అభిజ్ఞానశాకుంతల నాటకములు, భవభూతిరచించిన మాలతీమాధవ మహావీరచరిత ఉత్తరరామచరితములు, హర్షుని రత్నావళీ ప్రియదర్శికా నాగానందములు, విశాఖదత్తుని ముద్రారాక్షసము, భట్టనారాయణుని వేణీసంహారము తదితర రూపకములును సంస్కృత రూపకసాహిత్యమెంత సమృద్ధమైనదో స్పష్టీకరించుచున్నది.

అలంకారశాస్త్రము: రూపకకావ్యాదులతోపాటు తద్విమర్శనాత్మకమగు నాట్యశాస్త్ర అలంకారశాస్త్రగ్రంథములుగూడ చాలకాలమునుండి ప్రచారములోనున్నవి. ఇపుడు మనకు లభించుచున్న భరతనాట్యశాస్త్రమునకు పూర్వము (క్రీ. శ. రెండుశతాబ్దులపూర్వమే) నాటకాదివిమర్శనాత్మకములగు అనేకగ్రంథములుండెడివి. వాటియందు నాటకసంబద్ధములగు నృత్యసంగీతాభినయాదులతోపాటు రసాలంకారాదులుకూడ ప్రతిపాదింపబడినవి. ఈగ్రంథములందలి విషయములనే కూర్చి క్రీ. శ. ప్రారంభమునాటికి భరతనాట్యశాస్త్రము రచింపబడినది. దీనివిమ్మట ఏడవశతాబ్దికి చెందిన భామహుడును ఆరవశతాబ్దికి చెందిన దండియు అలంకారగ్రంథములను రచించిరి. విమ్మట వామనుడు, రుయ్యకుడు, రాజశేఖరుడు మొదలగువారు అనేకగ్రంథములను రచించిరి. తొమ్మిదవశతాబ్దికి చెందిన ఆనందవర్ధనుడు ధ్వన్యాలోకమున ధ్వనియేకావ్యాత్మయని సప్రమాణముగ నిరూపించెను. అభినవగుప్తుడు భరతనాట్యశాస్త్రముపై "అభినవభారతి" యను వ్యాఖ్యానమును ధ్వన్యాలోకముపై ధ్వన్యాలోకలోచనమను వ్యాఖ్యానమును రచించి ధ్వనిసిద్ధాంతమును సుదృఢముగా గావించెను. అతని తరువాత చెప్పుకొనదగినవారిలో కావ్యప్రకాశకర్తయగు మమ్మటుడు, సాహిత్యదర్పణకర్తయగు విశ్వనాథుడు, కువలయానందాదికర్తయగు అప్పయదీక్షితులు, రసగంగాధర నిర్మాతయగు జగన్నాథపండితరాయలు ప్రథములు. పండితరాయలు మహావిమర్శకుడేకాక గొప్పకవికూడ. వీరుకాక ఇంకెందరో ఆలంకారికులు స్వతంత్రగ్రంథములను వ్యాఖ్యానములను వ్రాసియున్నారు. వక్రోక్తికారుడగు కుంతకుడు, వ్యక్తివివేకకారుడగు మహిమభట్టు మొదలగువారు ధ్వనిసిద్ధాంతమును ఖండించి తమ సిద్ధాంతములను స్థాపించుటకై ప్రయత్నించిరి. వక్రోక్తిజీవితమునందు కుంతకుని స్వతంత్రవిమర్శనాశక్తి అడుగడుగునను గోచరించును.

వ్యాఖ్యానములు (క్రీ. శ. 800–1400): భారవి రచించిన కిరాతార్జునీయముతో సంస్కృతకావ్యములలో ఒకవిధమైన కృత్రిమమగు ఆలంకారికశైలికి సూత్రపాతము లభించెను. ఈకావ్యములలో వర్ణనములకును శబ్దవిన్యాసమునకును, కృత్రిమాలంకారసంవిధానమునకును ప్రాధాన్యమీయబడినది. ఈకాలమున ఇట్టి కావ్యములు పదులకొలది బయలుదేరినవి. కొందరు జైనాచార్యులు ఎన్నియో ఐతిహాసికకావ్యములను గూడ రచించిరి. ధర్మశాస్త్రములపై అనేక వ్యాఖ్యానగ్రంథములు బయల్వెడలినవి. మనుస్మృతిపై కల్లూకభట్టాదులచే రచితములగు వ్యాఖ్యానములు, అపరార్క, కర్కనారాయణ వరదరాజాదులచే అనేకగ్రంథములపై రచితములగు వ్యాఖ్యానములును అతిప్రసిద్ధములు. ఆవ్యాఖ్యానగ్రంథములే యైనను స్వతంత్రగ్రంథములవలె అనేకనూతనవిషయములను ప్రతిపాదించుట గమనింపదగిన విషయము.

ఈకాలమున దార్శనిక భాష్యములపై ఎన్నియో వ్యాఖ్యానములుకూడ బయలుదేరినవి. వాస్తవమున దార్శనిక సూత్రములపై రచితములగు భాష్యములు కేవలవ్యాఖ్యానములు మాత్రమేకాక మూలగ్రంథము తమ మతమునకనుకూలముగ నున్నట్లు చూపుటకై విరచితములగు పాండిత్యపూర్ణములైన స్వతంత్రగ్రంథములు, అట్టి భాష్యభావమును స్పష్టీకరించుటకై వాదోపవాదపూర్వకముగ రచితములగు గ్రంథములు వీటి వ్యాఖ్యానములు, ఈ వ్యాఖ్యాకారులుకూడ భాష్యకారులవలె మహాపాండిత్యసంపన్నులు. ఈమహాపండితులందరును స్వతంత్రగ్రంథములు వ్రాయుటకు బదులు ఇట్టి ప్రౌఢవ్యాఖ్యానములు వ్రాసి తమపాండిత్యమును

ప్రకటించియున్నారు. ఇది సంస్కృతవాఙ్మయములోని ఒక వైశిష్ట్యము. వాచస్పతిమిశ్రుడు ఆరుదర్శనములపైనను వ్యాఖ్యానరూపమున అత్యుత్తమగ్రంథములను రచించెను. సర్వవాఙ్మయమునందుకూడ అనేక వ్యాఖ్యాగ్రంథములు రచింపబడినవి. ఇవి మూలగ్రంథములకంటె అతిజటిలమైనవి. భాష్యముపై వ్యాఖ్యానము దానిపై వ్యాఖ్యానము మరల దానిపై వ్యాఖ్యానము ఈవిధముగ వ్యాఖ్యానపరంపరాప్రాయపద్ధతి నాడేకాక నేడుకూడ ప్రచారములోనున్నది.

తంత్రాదులు: కొందరుపండితుల అభిప్రాయముప్రకారము తంత్రగ్రంథములు ఏడవశతాబ్దమున భారతదేశమునకు వచ్చినవి. నాథసంప్రదాయము ఆకాలమునందే బయల్వెడలినది. ఇందలి ప్రధానాచార్యులగు మీననాథ, గోరక్షనాథాదులు అనేకగ్రంథములను వ్రాసిరి. కొందరు విమర్శకులు అనాదికాలమునుండియు తంత్రగ్రంథములు భారతదేశమున నుండెడివనియు వాని బీజములు వైదికవాఙ్మయమునందే కలవనియు చెప్పుదురు. ఈమతమునకు అనుగుణముగ అనేకప్రాచీనతమగ్రంథములు ఇపుడు ప్రకటింపబడుచున్నవి. శక్తి గణపతి శివుడు మొదలగు దేవతలను ఆరాధించు విధానవిశేషమునకు తంత్రమనిపేరు. ఇట్టి వివిధతంత్రములకు సంబంధించిన వందలాదిగ్రంథములు అప్రకాశితములై ప్రాచ్యపరిశోధనాగారములందు సురక్షితముగనున్నవి.

ఈకాలమునందే అతివిస్తృతమగు భక్తిసాహిత్యము ఆవిర్భవించినది. ఇందు వైష్ణవభక్తిసాహిత్యము ప్రధానమైనది. దీని రచన ప్రధానముగ దక్షిణప్రాంతమునందును వంగదేశమునందును జరిగినది. గౌడీయవైష్ణవసంప్రదాయమునకు చెందిన అనేకపండితులు వైష్ణవసంప్రదాయమునకు సంబంధించిన ఎన్నియోగ్రంథములను కావ్యనాటకాదులను రచించిరి. చివరకు వ్యాకరణముకూడ హరినామసంస్కృతమై రచింపబడినది. ఈవైష్ణవాచార్యులలో చైతన్యుని శిష్యులగు రూపసనాతనులు జీవగోస్వామిప్రభృతులు చెప్పుకొనదగినవారు. ఈకాలమునందు బయల్వెడలిన భక్తిసాహిత్యముతోపాటు అపూర్వమగు స్తోత్రసాహిత్యముకూడ ఆవిర్భవించినది. ఇది ఇతరదేశవాఙ్మయములలో నేటియందును కానరాని అసాధారణము అతివిస్తృతము నగువాఙ్మయము. ఇందు శైవ, శాక్త, వైష్ణవ, జైనాగమములకు సంబంధించిన వేలకొలది స్తోత్రములున్నవి.

శాసనసాహిత్యము : సంస్కృతసాహిత్యమునకు సంబంధించిన ఎంతయో విశాలమగు వాఙ్మయము ప్రస్తరములందే కాక శిలాఫలకములపైనను పర్వతకుడ్యములపైనను తామ్రపత్రములపైనను నిక్షిప్తమైయున్నది. ఈవాఙ్మయము నాధారముగ నెన్నియో ఐతిహాసికవిషయములు నిర్ణయింపబడినవి. క్రీ. శ. 150 ప్రాంతమున రుద్రదాముడు వ్రాయించిన గిరినార్ శిలాలేఖనమునందు ఉత్తమ గద్యకావ్యలక్షణములు కనబడుచున్నవి. ఇట్టి శాసనములు దేశమునందన్ని ప్రాంతములందును లభ్యమగుచున్నవి. వీటిని ముద్రించినచో ఎన్నియో బృహద్గ్రంథములు తయారగును.

ఇతరవిషయములు : పైన పేర్కొనిన విషయములను గూర్చియేకాక ఇతరవిషయములను గూర్చికూడ ఎన్నియో గ్రంథములు సంస్కృతమున రచింపబడినవి. వీటిలో శిల్పము వాస్తువిజ్ఞానము క్రీడావిషయములు నాట్యసంగీతకాదికము పశుపక్ష్యాదులస్వభావము వాటినిపోషించువిధానము సాముద్రికశాస్త్రము వ్యవహారశాస్త్రము నీతిశాస్త్రము ఇట్టివిషయములపై వందలకొలది గ్రంథములు రచింపబడినవి. ఇవికాక అనూచానముగ వచ్చెడు అజ్ఞాతకర్తృకములగు సుభాషితముల సంఖ్య అనంతమైనది.

ఈవిధముగ కాశ్మీరముమొదలు కన్యాకుమారివరకును గల అతివిస్తృతమగు భారతదేశమునందు ఎన్నియో వేలసంవత్సరములనుండి ఎన్నియోవేలమంది మహామేధావులు నిరంతరపరిశ్రమచేసి కనుగొనిన ఎన్నియో విషయములు ఈభాషయందు నిక్షిప్తములైయున్నవి. పరిశీలకులు ఇంతవరకును చేసినప్రయత్నముచే ఈభాషయందు నిగూఢమైయున్న విజ్ఞానమునుండి శతాంశమైనను గ్రహింపబడలేదని చెప్పినచో అతిశయోక్తి కాజాలదు.

వ. శ్రీ. చం.

## సంస్కృత వ్యాకరణశాస్త్ర చరిత్ర

ఐంద్రవ్యాకరణము : అఖండపదరూపముగానున్న శబ్దములను ప్రకృతిప్రత్యయరూపమున విభజించి వర్గీకరించి, సూత్రీకరించుట వ్యాకరణమనబడును. దేవతల అభ్యర్థనముపై ఇంద్రుడు వాయుదేవుని సాయమున మొట్టమొదటి వ్యాకరణమును నిర్మించెను (తై. సం 6-4-7). ఇంద్రుడు రచించిన వ్యాకరణమునకు ఐంద్రవ్యాకరణమని ప్రసిద్ధికలిగినది. ఐంద్రవ్యాకరణము అతివిస్తృతమైనది. దానిననుసరించియే వ్యాసా

డులు ప్రయోగములు చేయుండిరి సముద్రమువంటిదైన దానిముందు పాణిని వ్యాకరణము గోప్పదమువంటిదట! (సు భార జ్ఞానదీపిక దేవబోధుడు) ప్రస్తుతము ఐంద్ర వ్యాకరణము లభించుటలేదు కాని దాని మొదటి సూత్రము "అథ వర్ణసమూహః" అనియుండెనని భట్టారకహరిచంద్రుడు చరకవ్యాఖ్యానమున వచించెను

ప్రాతిశాఖ్యములు ఇంచుమించుగా ఆదేకాలమున ప్రతి వేదశాఖకును సంబంధించు వర్ణవిభాగ పదవిభాగ స్వరవిషయములను చర్చించు ప్రాతిశాఖ్యములు నిర్మితములయ్యెను అవి కేవలము వ్యాకరణ గ్రంథములనుట కవకాశములేదు వర్ణోచ్చారణశిక్ష కొంత సంధి మొదలగు పదపాఠమున కావశ్యకములైన విషయములుకొన్ని స్వరవిషయమును ప్రాతిశాఖ్యములలో చర్చనీయాంశములుగనున్నవి

ప్రస్తుతము శౌనకవిరచితమైన ఋక్ప్రాతిశాఖ్యము అజ్ఞాతకర్తృకమైన తైత్తిరీయప్రాతిశాఖ్యము కాత్యాయన విరచితమైన వాజసనేయ ప్రాతిశాఖ్యము వరరుచికృతమైన సామప్రాతిశాఖ్యము శౌనకవిరచితమైన అథర్వ ప్రాతిశాఖ్యము (చతురధ్యాయిక) మైత్రాయణీయప్రాతిశాఖ్యము లభించుచున్నవి ప్రాతిశాఖ్యములవంటివే కొన్ని వైదికవ్యాకరణములను ప్రస్తుతము లభించుచున్నవి అవి ఋక్తంత్రము (శౌనకకృతము) ప్రతిజ్ఞాసూత్రములు (కాత్యాయనకృతము) సామతంత్రము (ఔదవ్రజికృతము) భాషికసూత్రములు (కాత్యాయనకృతము) అథర్వతంత్రము (ఆపిశలికృతము) లఘుఋక్తంత్రము

ఐంద్రపాణినీయమధ్యయుగము ఇంద్రవాయువుల తరువాత వ్యాకరణప్రవచనము సలిపినవాడు భరద్వాజుడు ఈయన ఇంద్రునియొద్ద వ్యాకరణము నభ్యసించి పలువురు ఋషులకు ప్రవచనము చేసెను (ఋక్తం 1-4) వాజసనేయ ప్రాతిశాఖ్యమున "భారద్వాజకమాఖ్యాతమ్" (అ-3) అనియున్నది దీనినిబట్టి ఆఖ్యాతవిషయమున ఈయన ఎక్కువగా వివరించియుండునని చెప్పవచ్చును

పాణినికిముందును సమకాలమునను కొందరాచార్యులు వ్యాకరణములను రచించిరి వీరిలో భాగురి, పౌష్కరసాది, చారాయణుడు కాశకృత్స్నుడు, వైయాఘ్రపద్యుడు మాధ్యందిని రౌఢి శౌనకి, గౌతముడు వ్యాడి అనువారిని పాణిని పేర్కొనలేదు. వ్యాడి పాణినికి మేనమామయు సమ కాలికుడను పాణిని ఆపిశలి (సూ 6-1-91) కాశ్యప (సూ 1-2-25 4-1 125) గార్గ్య (సూ 8-3-20 7-3-99 గాలవ (సూ 6-3-60 7-1-74) చాక్రవర్మణ (సూ 6-1-123) భారద్వాజ (సూ 4 2 124; 7-2-63) శాకటాయన (సూ 8-4 111 8-3-18 8-4 50) శాకల్య (సూ 1-1-16 8-1 125 8 4-51) సేనక (సూ 5 4-112), స్ఫోటాయనుని (సూ 6-1-123) పేర్కొనియుండెను ఈ ఆచార్యులలో కాశకృత్స్నుడు రచించిన వ్యాకరణసూత్రములు కొన్ని కాశకృత్స్న శబ్దకలాపధాతుపాఠములో దొరుకుచున్నవి మిగిలిన వారిమతములును చెదురుచెదురుగా కొన్ని సూత్రములును భాష్యమునందును తద్వ్యాఖ్యానములందును కనిపించుచున్నవి

శాకటాయనుడు ఈ ఆచార్యులలో శాకటాయనుని ప్రభావము నిరుక్తముమీదను వ్యాకరణము మీదను హెచ్చుగా నుండెను ఋక్ప్రాతిశాఖ్యమునను వాజసనేయప్రాతిశాఖ్యమునను నిరుక్తమునను మహాభాష్యమునను ఈతని ప్రసక్తి కలదు "అను శాకటాయనం వైయాకరణాః (కాశి 1-4 86), "ఉపశాకటాయనం వైయాకరణాః" (కాశి 1-4-87) అను కాశికోదాహరణములవలన వైయాకరణులకీతడు తలమానికమని తెలియుచున్నది నామములన్నియు ధాతుజములేయను ఈతని సిద్ధాంతమును గార్గ్యుడు ఆతని అనుయాయులు తప్ప తక్కిన నిరుక్తకారులందరు అంగీకరించియుండిరి ఈతని వ్యాకరణము లభించలేదు

కాశకృత్స్నుడు పాణినికిముందు కాశకృత్స్నుడు ఆపిశలి రచించిన వ్యాకరణములు ప్రసిద్ధములుగనుండినట్లు కనిపించుచున్నది "అష్టకం పాణినీయమ్ దశకం వైయాఘ్రపదీయం త్రికం కాశకృత్స్నం" (కాశి 6-1-58); "అష్టకా ఆపిశల పాణినీయాః" (కాశ వ్యా అమో వృ 2-161) అను ఉదాహరణములనుబట్టి కాశకృత్స్నుని వ్యాకరణమున మూడధ్యాయములును ఆపిశలి వ్యాకరణమున పాణినీయమునవలె ఎనిమిది అధ్యాయములును ఉండినట్లు తెలియుచున్నది కాశకృత్స్నుడు, ఆపిశలి ప్రభృతి ఎనిమిదిమందియు ఆదిశాబ్దికులలోనివారని బోపదేవుడు వ్రాసెను (కవికల్ప శి)

చెన్నవీరకవి రచించిన కన్నడవివరణములోని కాశకృత్స్నశబ్దకలాపధాతుపాఠమున కాశకృత్స్నుని వ్యాకరణ సూత్రములు 170 ఉదాహృతములైనవి. ఈవ్యాకరణము

మహాభాష్యవ్యాఖ్యాతయగు కైయటుని కాలమువరకును లభించుచుండెడిదని 'కాశకృత్స్నస్య' "ప్రత్యయోత్తరపదయోం" సూత్రమేతద్వికారయతి" (మ భా ప్రదీ 2-1-50) అను వాక్యమువలన గ్రహించవచ్చును కాశకృత్స్న వ్యాకరణము ఇంద్రవ్యాకరణపద్ధతిని అనుసరించినదని అభిజ్ఞుల యభిప్రాయము

స్వరములు (అచ్చులు) వ్యంజనములు (హల్లులు), సమానములు (అక్) సంధ్యక్షరములు (ఏచ్) నామి (ఇచ్) మొదలగు పార్థకసంజ్ఞలతో కాశకృత్స్నుడు వ్యాకరణ రచన చేసియుండెను ఇతని ధాతుపాఠమున ఇతర ధాతుపాఠములలో లేని రెండువందల ధాతువులు హెచ్చుగా కలవు అందు 'శాద్ శబ్దే' అనునొక ధాతువునుపఠించుటచే కాశకృత్స్నుని మతమున శ కారదీర్ఘము గలదని తెలియుచున్నది

ఆపిశలి : కాశకృత్స్నతంత్రము తరువాత పాణినికిని నికటపూర్వమున ఆపిశలి వ్యాకరణము వెలయుచుండెను ఎనిమిదధ్యాయములుగల ఆపిశలము పాణినీయాష్టాధ్యాయికి కరవిదియైనదనవచ్చును "కథం పునరిదమాచార్యేణ పాణినినావగతమేతేసాధవ ఇతి? ఆపిశలేః పూర్వవ్యాకరణేన' (పదమంజరి) అను హరదత్తుని వాక్యములు ఈయూహను ధ్రువపరచుచున్నవి ఆపిశల పాణినీయముల పరిభాష ఇంచుమించు ఒకేవిధముగనున్నది శప్ అను వికరణసంజ్ఞ ఆపిశల పాణినీయములకు సమానము దానికి పూర్వమందుండిన కాశకృత్స్నవ్యాకరణమున దీనికి బదులు అన్' అని ఉపదేశింపబడినది కాతంత్రములోని "అని చవికరణే" "కరోతే" మిదేః" (కా 3-6-3 4 5) అను సూత్రములతో పై ఆపిశల సూత్రమును పోల్చినచో పరిభాష వేరయినను ఆపిశలము కాతంత్రమునకు మాతృకయైన కాశకృత్స్న వ్యాకరణమును ఎట్లనుసరించెనో గమనించవచ్చును "విభక్త్యంతం పదమ్" అను ఆపిశలసూత్రమును పాణిని కొంతవివరణతో "సుప్తిఙన్తం పదమ్" (పాణి 1-4-14) అని చెప్పినాడు ఉభయోర్థయోః ద్వివచన టాపోః అను ఆపిశల సూత్రమును చూచిన పాణిని ఆకారాన్తస్త్రీలింగమున కుపయోగించినటాప్ డాప్ చాప్ లకు మూలము కనిపించును 'శతాచ్ఛతస్యోపగ్రస్తే' అను కాశకృత్స్న ఆపిశలుల సూత్రమే 'శతాచ్ఛతస్యోపగ్రస్తే' (పా 5 -21) అను పాణినీయసూత్రమునకు మూలమని కైయటవచనము (మ భా ప్రదీ 5-1-21) గలదు కాశకృత్స్న వ్యాకరణముకంటె ఆపిశలము విషయబాహుళ్యము గలిగియుండుటచే దీనికి హెచ్చుప్రచారము కలిగియుండును

పాణినీయము : నేటికి సమగ్రముగా లభించిన ప్రాచీనతమవ్యాకరణము పాణినీయము అది ప్రభవించిననాటినుండి నేటివరకు యావద్భారతమునను ఇది పఠనపాఠనములలో నున్నది పాణినీయము ఎనిమిది అధ్యాయములుగల శబ్దానుశాసనము దానిని మించిన వ్యాకరణశాస్త్ర మింతవరకు వేరొకటి వెలువడియుండలేదు అష్టాధ్యాయి నధ్యయనముచేసిన పాశ్చాత్యుల శబ్దతత్త్వశాస్త్రమున (philology) విప్లవకరములైన మార్పులు గలిగినవి

పాణిని : వ్యాకరణాకాశమున పాణిని ధ్రువతారగా వెలుగొందుచున్నాడు అతని అభిజనము నేడు లాహోరనబడు శలాతురగ్రామము అతని వంశపు మూలపురుషుడు పణి తండ్రిపేరు శలంకుడని కొందరును పాణినుడని కైయటహరదత్తులును వ్రాసిరి తల్లిపేరు దాక్షి. దాక్షి ప్రాతాయణ నామాంతరములుగల వ్యాడి ఇతనికి మేనమామ తమ్ముడు ఛన్దశ్శాస్త్రప్రణేతయైన పింగళుడు ఆచార్యుడు వర్షోపాధ్యాయుడు

అష్టాధ్యాయిరచనాక్రమము : వైదిక లౌకిక భాషల యనుశాసనమునకై నిర్మింపబడిన పాణినీయము శాస్త్రీయమునకంతకును మూర్ధన్యమైనది వేదాంగములలో వ్యాకరణ స్థానమును అధిరోహించినది ఇందు 3990 సూత్రములున్నవి గ్రంథమంతయు ఎనిమిది అధ్యాయములుగను అధ్యాయమొక్కొక్కటి నాలుగేసి పాదములుగను విభజింపబడియున్నది పాణినీయము లౌకికభాషకేగాక వైదికభాషకును అనుశాసనము. ఇందు ప్రత్యయములతో కలిపి ఞ్ చ్ ప్ ట్ న్ ర్ ల్ మొదలైన స్వరబోధకములగు అనుబంధములను వాడుటయేగాక ప్రత్యేకము స్వరవిధివిషయకములైన 400 సూత్రములున్నవి అయినను పాణినీయము పరిపూర్ణమైన వైదికశబ్దానుశాసనము కాదు

పాణినీయమున సామాన్యముగా ప్రథమాధ్యాయములో సంజ్ఞాపరిభాషలు ద్వితీయాధ్యాయమున సమాసకారకములు తృతీయాధ్యాయమున ధాతువులకు చేర్పబడు ప్రత్యయములు, కృదన్తనిష్పత్తి చతుర్థ పంచమాధ్యాయములలో తద్ధితములు షష్ఠసప్తమాధ్యాయములలో స్వరవిధులు అంగకార్యాదులు అష్టమాధ్యాయమున వాక్యములలో పదములు పొందు

మార్పులు వివరింపబడినవి. ఒక విషయమును చర్చించునపుడు ప్రసక్తానుప్రసక్తముగా దానికి సంబంధించని విధులుకూడ నడుమనడుమ చర్చింపబడినవి. అందుచేత నిర్దిష్ట విషయవిభాగము కన్పించదు. కాని అష్టాధ్యాయీసూత్రక్రమమున చదివి నప్పుడుగాని సూత్రముల పరస్పర సంబంధము తెలియదు.

పాణినీయ పాఠభేదములు : పాణిని తనగ్రంథమున కను బంధములుగ గణపాఠము, ధాతుపాఠము, ఉణాదిసూత్రములు, లింగానుశాసనము రచించెను. అనేక శిష్యవర్గములకు ప్రవచనముచేసి ఇతడు తనగ్రంథమునకు తగిన ప్రచారము చేసెను. మొదటమొదట చేసిన ప్రవచనమునకును పిదప చేసిన ప్రవచనమునకును కొంత భేదముండెను. "ఉభయథాహ్యాచార్యేణ శిష్యాః సూత్రం ప్రతిపాదితాః" (మ భా 1-4-1) "కేచిదత్ర భగ్నః పిపఠి పనిపతి దరిద్రాణామితిపఠన్తి" (కాశి 7-2-49)- ఈ మొదలైన వాక్యములచేతను ముద్రితములైన గ్రంథముల పరిశీలనచేతను పాణినీయమునకు బృహత్పాఠమును లఘుపాఠమును కలవని చెప్పవచ్చును. స్థూలముగా భట్టోజీదీక్షితులు గ్రహించినది లఘుపాఠమనియు కాశికాకారాదులు గ్రహించినది బృహత్పాఠమనియు చెప్పవచ్చును.

కొందరు మార్పులు చేర్పులు : పాణినీయము ముఖ్యముగా ఆపిశలమునుండియు తత్సన్నిహితములగు ఇతర వ్యాకరణములనుండియు సంగ్రహింపబడినది. కనుకనే ఇందు ఋ ఌ వర్ణములకు పరస్పరసావర్ణ్యము మొదలగు కొన్నిసామాన్య విధులుకూడ సంప్రదాయము విడువబడినవి. కొన్ని సూత్రములలోనున్న ప్రయోగములకు సాధకములగు సూత్రములు కనబడవు (ఉదా జనికర్తుః తత్ప్రయోజకః) లోకవిదితములైన కొన్ని పరిభాషలు వదలివేయబడినవి.

పాణినీయానుబంధములలో గణపాఠము ఉణాదిపాఠములలో కొంత పరివర్తనము జరిగియుండవచ్చునని తోచుచున్నది. "గతికారకోపపదయోః పూర్వపదప్రకృతి స్వరత్వంచ" (ఉణాది4-226) అను ఉణాదిసూత్రము "గతికారకోపపదాత్ కృత్ (ఉత్తరపదం తత్పురుషేసమాసే ప్రకృతి స్వరం భవతి-కాశి)" (పా 6-2-139) అను పాణిని సూత్రమునకు వ్యతిరేకముగానున్నది. ఇట్టి మార్పులును చేర్పులును దీనిలో కానవచ్చుచున్నవి. పాణిని టాప్ తన్ మొదలైన కొన్ని సంజ్ఞలను ఆపిశలినుండి గ్రహించెను. టి, ఘు, భ మొదలైన కొన్ని సంజ్ఞలను తాను కల్పించుకొనెనని ఊహింపబడు చున్నది.

పాణినీయవైశిష్ట్యము : పాణినీయవైశిష్ట్యమునుగురించి "పాణినినా ఉపజ్ఞాతం పాణినీయమ్ అకాలకంవ్యాకరణం" (కాశి 4-3-115) అని చెప్పబడినది. ఇందువర్తమానా పరోక్షా భవిష్యన్తీ హ్యస్తనీ శ్వస్తనీ మొదలగు పూర్వాచార్యోక్త కాల సంజ్ఞలకుబదులు లట్ లిట్ లృట్ లఙ్ లుట్ మొదలగు దశలకారములు చెప్పబడినవి. కనుక పాణినీయము అకాలకమని పేర్కొనబడినది. శాస్త్రమునకు లాఘవమును సంపాదించుటకై అన్వర్థసంజ్ఞలను వదలి పాణిని నూతన సంకేతము లను బీజగణిత పద్ధతులను కల్పించెను. ఉదా "తరప్తమపౌ ఘః" (పా 1-1-22); "ఆయనే యీనీయియః ఫ ఢ ఖ ఛ ఘాం ప్రత్యయాదీనామ్" (ప్రా 7-1-2); "యువోరనాకౌ" (పా 7-1-1) మొదలయినవి.

భారతీయపరిగణనము ననుసరించు నందరాజకాలమున కవి 16 వ శతాబ్ది ఉత్తరార్ధములో (క్రీ పూ 17 వ శతాబ్ది ఉత్తరార్ధమున) పాణినీయము రచింపబడినట్లు తెలియుచున్నది. పాశ్చాత్యమతానుయాయుల బహుసమ్మతమత ప్రకారము పాణినీయరచనము క్రీ పూ 6వ శతాబ్దికి చెందుచున్నది. పాణినీయమును కేంద్రముచేసికొని మహత్తరమైన శాస్త్రౌఘము బయలుదేరినది. అందుముఖ్యమైనవి (1) సంగ్రహము (2) వార్తికములు (3) మహాభాష్యము.

సంగ్రహము : పాణినీయము పూర్వవ్యాకరణముల నుండి సంగ్రహగ్రంథముగా వెలయుటచే పెక్కువిషయములు లోపించియుండెను. సర్వవిషయములను సమగ్రముగాచర్చించు నుద్దేశముతో దాక్షాయణుడైన వ్యాడి సంగ్రహ మను లక్ష శ్లోకాత్మకగ్రంథమును రచించెను. అదియు నేడు లభించుట లేదు. దానిని "శోభనాఖలు దాక్షాయణేన సంగ్రహస్యకృతిః" (మ భా 2-3-66) అని పతంజలి ప్రశంసించియున్నాడు. "తదస్యపరిమాణమ్" (చాంద్ర 4-1-62) అను చాంద్రసూత్రమువై వృత్తిలో పంచకః సంగ్రహః అష్టకం పాణినీయం సూత్రమ్" అని ఉదాహరింపబడుటచే సంగ్రహమున ఐదధ్యాయములుండెనని గ్రహింపనగుచున్నది.

వార్తికములు : అష్టాధ్యాయిలోని కొరతలను పూరించుటకు వార్తికములు చెప్పబడెను. ఉక్తానుక్తదురుక్త విమర్శనముచేయునది వార్తికము (కావ్యమీమాంస)కాత్యాయనుడు, భారద్వాజుడు, సునాగుడు, క్రోష్టుడు, వాడవుడు, వ్యాఘ్రభూతి, వైయాఘ్రపద్యుడు అనువార్తికకారులుండిరని మహా

భాష్య తద్వ్యాఖ్యానములవలన తెలియుచున్నది కొన్ని వార్త్తికములు వాక్యరూపమునను కొన్ని శ్లోకరూపమునను గలవు

మహాభాష్యమున ప్రధానముగా గ్రహింపబడినది కాత్యాయనుని వార్త్తి పాఠము ఈ కాత్యాయనమునికే వరరుచి యని నామాంతరము వాక్యకారుడను పేరును గలవు ఇతడు దక్షిణాత్యుడని "ప్రియతద్ధితాదాక్షిణాత్యాః" అను భాష్యవచనమువలన తెలియుచున్నది కాత్యాయనునియెడ భాష్యకారున కపార గౌరవ మనుటకు తడు భగవచ్ఛబ్దముతో కాత్యాయనుని నిర్దేశించుటయే నిదర్శనము కాత్యాయనుడు పాణిని సూత్రములలోని అవ్యాప్త్యతివ్యాప్తులను చర్చించి అవ్యాప్తిగలచోట్ల లోపమును పూరించెను అతివ్యాప్తి కలిగిన చోట్ల సూత్రమునుండి మినహాయించవలసిన యంశములను సూచించెను కొన్నిచోట్లసూత్రార్థమును స్పష్టము చేసినాడు "నాజ్ఝలౌ" "దీధీవేవీటామ్" ఇత్యాది సూత్రము లనావశ్యకములని కాత్యాయనుడు వాదించెను కాత్యాయనుడు రచించిన వార్త్తికములకు అనంతంత్రమని ఖ్యాతిగలిగెను (వాక్యపదీయబ్రహ్మకాండ స్వోపజ్ఞ టీక పుట 38)

మహాభాష్యము కాత్యాయనుని వార్త్తికముల నాధారముగా కొని పాణినీయమును మథించి నిగ్గుతేల్చిన మహానుభావుడు పతంజలి ఈయన మహాభాష్యము వ్యాకరణశాస్త్రమున తుదివాక్యముగా గ్రహింపబడుచున్నది పతంజలి తన కాలమువరకు నున్న వాఙ్మయమును ముఖ్యముగా వివిధవార్త్తికములను అప్పటికే బయలుదేరియుండిన కొన్ని భాష్యములను పరిశీలించి తరచితరచి సిద్ధాంతముచేసినాడు ఈయన పేర్కొన్న ఇతరవార్త్తికములు భాష్యములు లభించుటలేదు ఈయనకు పాణినియందుగల పరమాదరము కాత్యాయనుడు పాణినిసూత్రములలో చూపిన పెక్కుదోషములను ఈయన ఖండించి సూత్రపాఠప్రామాణ్యమును నిలుపుటలో కనిపించును పాణినీయ వార్త్తికములకు లొంగని శిష్టప్రయోగములకై పతంజలి ఇష్టులను కల్పించెను "అతేర్వృత్తి ఘఞపోః" (పా 2.4.50) అను సూత్రభాష్యమున సూతవైయాకరణ సంభాషణమును కల్పించి యిష్టిపద్ధతి తెలియని వైయాకరణుని సూతునిచే "ప్రాప్తిజ్ఞో దేవానాంప్రియః, నత్విష్టిజ్ఞః" అని హేళన చేయించెను. పతంజలి వచనరచన అలతియలతి పదములతో సూటిగా భావమును తెలుపుచు చక్కదనము చిక్కదనము కలిగి సాటిలేని మేటిరచనగా నాటికిని నేటికిని ప్రశంసింపబడుచున్నది పతంజలి శేషుని యవతారమని ప్రతీతి ఈయన మగధాధిపతియైన పుష్యమిత్రశుంగుని కాలమువాడని చెప్పుదురు పుష్యమిత్రుడు మహాభాష్యమున పేర్కొనబడియుండుటయే యిందుల కాధారము పతంజలి పుష్యమిత్రశుంగుని కాలమున నున్నచో భారతీయ గణనానుసారము కలి 19వ శతాబ్ది ఉత్తరార్ధమున (క్రీ పూ 13వ శతాబ్ది ఉత్తరార్ధమున) ఉండి యుండవచ్చును పాశ్చాత్యానుయాయుల మతప్రకారము క్రీ పూ 2వ శతాబ్ది ఉత్తరార్ధమగును

మహాభాష్య పునరుద్ధరణము కాలక్రమమున వైతి కోశవుడు హర్యక్షుడు అను శుష్కతర్కానుసారులచే మహాభాష్యము విమర్శింపబడగా జనులలో మహాభాష్యపఠనపాఠనములు నష్టమైపోయెను (వాక్యప 2 487 489) – అప్పుడు కాశ్మీరాధిపతియైన అభిమన్యుని యాజ్ఞచే చంద్రాచార్యుడు కలి 20వ శతాబ్దము ఉత్తరార్ధమున (క్రీ పూ 12వ శతాబ్ది ఉత్తరార్ధమున) దక్షిణదేశమునుండి కష్టముమీద నొకప్రతిని సంపాదించి మహాభాష్యపాఠప్రవచనముల నుద్ధరించెను (రాజత 1-176) మరల క్రీ శ 8వ శతాబ్దిలో నష్టము కాగ, కాశ్మీరాధిపతియైన జయాపీడునియాజ్ఞచే క్షీరుడను విద్వాంసుడు మహాభాష్యపాఠప్రవచనము నుద్ధరించెను (రాజత 4 488 489) పిమ్మట సిద్ధాంతకౌముదీప్రాశస్త్యములో మరుగుపడిన భాష్యప్రవచనమును 18 19 శతాబ్దులలో ఉద్ధరించినవారు స్వామివిరజానందులు స్వామిదయానందులు మొత్తముమీద పాణినీయాగమమనగా అష్టాధ్యాయి, వార్త్తికములు మహాభాష్యమునని అభిజ్ఞులందరును అంగీకరించినవిషయము "త్రిమునివ్యాకరణమ్" (కాశికా 2-1-19)

వృత్తులు అష్టాధ్యాయి సూత్రగ్రంథమగుటచే సూత్రవివరణమునకై పెక్కువృత్తిగ్రంథములు వెలువడినవి తన సూత్రములను ప్రవచనముచేయునప్పుడు పాణిని స్వయముగా వృత్తి ఉదాహరణ ప్రత్యుదాహరణములు చెప్పియుండెను ఈవిషయము "ఉభయథాహ్యాచార్యేణ శిష్యాః ప్రతిపాదితాః" (మ భా దీపిక 1-1-45) అను భర్తృహరివచనమువలన తెలియుచున్నది పిదప భాష్యకారునికి ముందు కుణి మాథుర శ్వోభూతులు వృత్తులు రచించినట్లు తెలియుచున్నది వీరి నామనిర్దేశము భాష్యమునం దుదాహరింపబడియున్నది (మ భా ప్ర 1-1-75; మ భా 4-3-101; మ భా

1-1-57) విక్రమార్క సభాసదుడైన వరరుచికూడ నొక వృత్తిని రచించెనని ఆఫ్రెక్టు గ్రంథసూచికయందు గలదు (వ్యా శా ఇ పుట 820). క్రీ శ 5వ శతాబ్ది చివరిభాగమున జైనేంద్రవ్యాకరణము రచించిన పూజ్యపాదాపరనామకుడగు దేవనంది శబ్దావతారన్యాసమనువృత్తిని పాణినీయముపై రచించెను (46వ శాసనం నగర్ తహశీలు-షిమోగ జిల్లా) చుల్లిభట్టి నిర్లూరవృత్తులు జినేంద్రబుద్ధిపాదుని న్యాసమనను శ్రీపతిదత్తుని తంత్రపరిశిష్టమునను పేర్కొనబడినవి. వామనజయాదిత్యుల కాశికావృత్తి (క్రీ శ 7వ శతాబ్ది) భర్తృహరి భాగవృత్తి (క్రీ శ 7వ శతాబ్ది చివరభాగమ.) పురుషోత్తమదేవుని భాషావృత్తి (11వ శతాబ్ది) శరణదేవుని దుర్ఘటవృత్తి (క్రీ శ 12వ శతాబ్ది) భట్టోజీ దీక్షితుల సిద్ధాంత కౌముది శబ్దకౌస్తుభము (క్రీ శ 16 శతాబ్ది ప్రారంభమున) అను వృత్తిగ్రంథములు వెలువడెను.

ఆధునికవృత్తులు: క్రీ శ పదునారవశతాబ్ది చివరిభాగమున అప్పయదీక్షితులు సూత్రప్రకాశవృత్తిని పదునేడవ శతాబ్దియారంభమున నీలకంఠవాజపేయి పాణినీయదీపికావృత్తిని ఆదేకాలమున అన్నంభట్టు పాణినీయమితాక్షరయను వృత్తిని పదునేడవశతాబ్ది ఉత్తరార్థమున గోపాలకృష్ణశాస్త్రి శాబ్దిక చింతామణియనువృత్తిని క్రీ శ 1900 ప్రాంతమున సింగంభట్టు వ్యాకరణదీపిక యనువృత్తిని రచించియుండిరి. వీనిలో అన్నంభట్టు రచించిన వ్యాకరణమితాక్షర అన్వర్థనామధేయమైనది. ఇది కాశికావృత్తికి సంగ్రహమని చెప్పవచ్చును. కాని యిందు కాశికలోని భాష్యవిరుద్ధాంశములు యథాస్థానమున పేర్కొనబడి ఖండింపబడినవి. చాంద్రవ్యాకరణములోని కొన్ని యంశములుగూడ ఇందు పొందుపరుపబడినవి. వ్యాకరణశాస్త్రము ప్రారంభించువారికిది మిక్కిలి యుపయోగకరమైనది. సింగంభట్టు వ్యాకరణదీపికలో సిద్ధాంతకౌముదిలోని ప్రక్రియ పాణినీయ సూత్రక్రమమున కూర్పబడినది.

దయానందుని భాష్యము: క్రీ శ 19వ శతాబ్దాంతమున స్వామిదయానందసరస్వతి అష్టాధ్యాయీభాష్యమను పేర నొక వృత్తి రచించియుండిరి. ఇది 4వ అధ్యాయము చివరివరకు మాత్రమే రచింపబడినదని తెలియుచున్నది. ఇందు భట్టోజీ దీక్షితులు చేసిన పొరపాట్లు పలుచోట్ల వివరింపబడి ఖండింపబడినవి. 4వ అధ్యాయము చివరివరకు మాత్రమే ముద్రింపబడినది.

ఇతరములు: ఇంకను వేంకటార్య పుత్రుడగు అప్పన్నయ్యగారు రచించిన ప్రక్రియాదీపిక, గోవిందపుర వాస్తవ్యుడగు నారాయణపండితుడు రచించిన అష్టాధ్యాయీ ప్రదీపనామాంతరముగల శబ్దభూషణము, రుద్రధరుడను మైథిలపండితుడు రచించిన వృత్తి, కాశికావృత్తికి సంగ్రహముగా ఉదయనపండితుడు రచించిన మితవృత్త్యర్థసంగ్రహము, అదేవిధమున రామచంద్రపండితుడు రచించిన వృత్తిసంగ్రహము, అజ్ఞాతకర్తృకములయిన శ్లోకవృత్తి, పాణినీయసూత్రవృత్తి, పాణినీయసూత్రవివరణ, పాణినీయసూత్రవివృతి, లఘువృత్తికారికలు మొదలగు సనేకవృత్తులు చెన్నపురి మైసూరు తిరువనంతపురములు మున్నగు రాజకీయ తాళపత్రగ్రంథాలయములలో నున్నవి.

పాణినీయవ్యాఖ్యానయుగము: ఇంతవరకు పాణినీయ తంత్రమున బయలుదేరిన స్వతంత్రగ్రంథములను గురించి వివరింపబడినది. ఈ స్వతంత్రగ్రంథములు ముఖ్యముగా 1 అష్టాధ్యాయి 2 వార్తికములు 3 మహాభాష్యములు 4 వృత్తులు అని నాలుగు భాగములుగా నుండినట్లు గమనించియుంటిమి. ఇంక వీనిపై వ్యాఖ్యానోపవ్యాఖ్యానములుగా వెలువడిన వాఙ్మయమును గురించి తెలుపబడును. అష్టాధ్యాయికి మిగిలిన గ్రంథసముదాయమంతయు వ్యాఖ్యానప్రాయము.

వార్తికములపై వ్యాఖ్యలు: వార్తికములపై హేలారాజు వార్తికోన్మేషమును, రాఘవసూరి అర్థప్రకాశమును, రాజరుద్రయజ్వ వృత్తిశ్లోకవ్యాఖ్యానమును గలవు. వీనిలో మొదటిదానినిగూర్చి ఆగ్రంథకర్త వాక్యపదీయమునకు వ్రాసినటీకలో "వార్తికోన్మేషే సంస్తరేణ యథాతత్త్వమస్మాభి ర్వ్యాఖ్యాతమితి తత ఏవావధార్యతామ్" అను వాక్యమువలన తెలియుచున్నది. మిగిలిన రెండును చెన్నపురప్రాచ్యలిఖితగ్రంథ భాండాగారమునందున్నవి.

భర్తృహరి "దీపిక": మహాభాష్యముపై క్రీ శ ప్రథమ శతాబ్దిలో వసుదాత శిష్యుడగు భర్తృహరి మహాభాష్యదీపికయను పంచవింశతిసహస్రశ్లోకాత్మకమగు వ్యాఖ్య రచించెను. ఇతడే వాక్యపదీయమను శబ్దతత్త్వశాస్త్రమును గూడ రచించెను. భాష్యకారుని తరువాత ఇతనిదే యున్నత స్థానము. ఇతడు బౌద్ధుడని ఇత్సింగ్ అను చైనాయాత్రికుడు వ్రాసెను. కాని బ్రహ్మకాండమున నితడు నచాగమాదృతే ధర్మస్తర్కేణవ్యవతిష్ఠతే అనిచెప్పుటచే నితడు వైదికుడని

స్పష్టమగుచున్నది

కైయటుని ప్రదీపము: ఉపలబ్ధమహాభాష్యవ్యాఖ్యానములలో మకుటమువంటిది కైయటోపాధ్యాయుని ప్రదీపము. ఇది క్రీ శ. పదునొకండవ శతాబ్దిలో రచింపబడినది.

నాగేశభట్టు-ఉద్ద్యోతము: కైయటుని ప్రదీపముపై ముఖ్యమైన వ్యాఖ్యానము నాగేశభట్టు రచించిన ఉద్ద్యోతము. ఇతడు "నాతి స్తీర్ణం నవిస్తీర్ణం మధ్యానామిహోత్కృత్" అని తన వ్యాఖ్యానమునకు లక్షణమును చెప్పుకొనెను.

శేషవంశము - మహాభాష్యము: మహాభాష్యమునకు వ్యాఖ్యలు రచించియు ప్రవచనముచేయు ఆంధ్రులైన శేషవంశీయులు కాశీలోనుండి గొప్ప కీర్తి కుటుంబమును విస్తరింపజేసిరి. వారిలో నృసింహ, చంద్ర, చింతామణి, కృష్ణ, వీరేశ్వర ఇత్యాది పండితులు పేరెన్నికగన్నవారు.

కాశికా వ్యాసము: వృత్తులలో ముఖ్యమైన కాశికావృత్తి కనేక వ్యాఖ్యానములు గలవు. జినేంద్రబుద్ధిపాదుల కాశికా వివరణపంజికా న్యాసము మొదట పేర్కొనదగినది. ఇతడు క్రీ శ. ఎనిమిదవ శతాబ్దమున నుండెను.

పదమంజరి: న్యాసము తరువాత పేర్కొనదగిన వ్యాఖ్య హరదత్తమిశ్రుని పదమంజరి. ఇతడు ఆంధ్రదేశీయుడు. క్రీ శ. 11 వ శతాబ్దివాడు.

ప్రక్రియా గ్రంథయుగము: క్రీ శ. 11వ శతాబ్ది నాటికి కాతంత్ర, చాంద్ర, జైనేంద్ర, శాకటాయన వ్యాకరణములు వ్యాప్తిలోనికి వచ్చెను. వ్యాకరణమును వీలైనంత సంగ్రహముగాను స్పష్టముగాను చెప్పుట వీని యుద్దేశము. అవి [illegible] బాలకు మాత్రమే అనుశాసనములు.

రూపావతారము: ధర్మకీర్తిసూరి క్రీ శ. పదునొకండవ శతాబ్దిలో నుండెను. ఇతడు సింహళదేశీయుడగు బౌద్ధభిక్షువు. ఇతడు గ్రంథాదిని "సర్వజ్ఞమనంతగుణం ప్రణమ్య బాలప్రబోధనార్థమిమమ్ రూపావతార మల్పం సుకలాపమృజుం కరిష్యామి" అని చెప్పుకొనెను. ఆనాడు కావలసిన లక్షణములు మూడు (1) అల్పముగా నుండుట, (2) ప్రక్రియ సులభముగా చెప్పుట (3) మూటగా చెప్పుట. ఇవి యుండునట్లు ధర్మకీర్తి తన గ్రంథమును తీర్చిదిద్దెను.

రూపమాల, పిదప పేర్కొనదగినది విమలసరస్వతి రచించిన రూపమాల. ఇది పదునాలుగవ శతాబ్ది నాటిది.

ప్రక్రియా కౌముది: క్రీ శ. 15 వ శతాబ్ది ప్రారంభమున ఆంధ్రదేశీయుడు శేషవంశాలంకారుడు నగు రామచంద్రాచార్యుడు ప్రక్రియా కౌముదిని రచించెను. ప్రక్రియా కౌముదిపై శేషకృష్ణపండితుడు ప్రకాశమును విఠలుడు ప్రసాదమును చక్రపాణిదత్తుడు ప్రక్రియా ప్రదీపమును, వారణవనేశుడు అమృతసృతిని, విశ్వకర్మశాస్త్రి ప్రక్రియావ్యాకృతిని, నృసింహపండితుడు ప్రక్రియావ్యాఖ్యానమును, అజ్ఞాతపండితుడొకడు నిర్మలదర్పణమును, జయంతుడు తత్త్వచంద్ర వ్యాఖ్యను, విద్యానాథదీక్షితుడు ప్రక్రియారంజనమును, వరదరాజు వివరణమును అను వ్యాఖ్యలు రచించిరి.

సిద్ధాంతకౌముది: ప్రక్రియా కౌముది సమస్తపాణినీయ సూత్రములను గ్రహింపనందున ప్రకరణవిభజనముతో సూత్రపాఠమును వ్యాఖ్యానించు గ్రంథము రచింపవలెనని మహారాష్ట్రదేశీయుడగు భట్టోజీ దీక్షితులును కేరళదేశీయుడగు నారాయణపండితుడును సంకల్పించి కృతకృత్యులైరి.

భాష్యసిద్ధాంతములను తుణ్ణముగా తరచితరచి వానికొక అంగుళముకూడ అటునిటు దాటిపోకుండ గ్రంథరచన సాగించినవాడు భట్టోజీదీక్షితులు. కనుకనే మునిత్రయమంతే ప్రమాణబుద్ధిగల ఆనాడు సిద్ధాంత కౌముదిచే ప్రక్రియా కౌముది వెనుకకు నెట్టివేయబడినది. భట్టోజీదీక్షితులను మునిత్రయ సిద్ధాంతస్థాపకు డనవచ్చును.

సిద్ధాంత కౌముది ఆసేతుహిమాచలమును బహుళప్రచారము నందినది. అవైదికములైన కాతంత్ర శాకటాయన ముగ్ధబోధాదివ్యాకరణముల ప్రచారము పడిపోయినది. అంతేగాక పాణినీయసూత్రక్రమమున అధ్యయనముచేయు పద్ధతికూడ తప్పిపోయెను. తుదకు మహాభాష్యముకూడ తలచకొనువారు ప్రత్యేకించి లెక్కింపదగినవారుగ నేర్పడిరి. సిద్ధాంతకౌముదిని దాని వ్యాఖ్యానోపవ్యాఖ్యానములను చదువుటతో వ్యాకరణాధ్యయనము ముగియసాగినది.

సిద్ధాంతకౌముదివ్యాఖ్యలు: సిద్ధాంత కౌముది విశ్వజనీనమైన దనుటకు దానిపై వెలువడిన అసంఖ్యాక వ్యాఖ్యలే నిదర్శనములు. జ్ఞానేంద్ర సరస్వతి తత్త్వబోధిని, నీలకంఠ వాజపేయి సుఖబోధిని, రామానందుని తత్త్వదీపిక, రామకృష్ణయ్య రత్నాకరము, రంగనాథయజ్వ పూర్ణిమ, తిరుమలయజ్వ సుమనోరమ మొదలగు వ్యాఖ్యలు వ్రాసియుండిరి. వాసుదేవ వాజపేయి రచించిన బాలమనోరమావ్యాఖ్యానము మిక్కిలి సులభముగా సవిస్తరముగా

నందుకే నేడు పఠనపాఠనములలో హెచ్చుగానున్నది.

నాగేశభట్టు కృతులు : కౌముదీ వ్యాఖ్యానములలో ప్రధానమైనవి లఘు బృహచ్ఛబ్దేందుశేఖరములు. వీనిని నాగేశభట్టు రచించెను. అతడు భట్టోజీదీక్షితుల మనుమడైన హరిదీక్షితుల యొద్ద వ్యాకరణశాస్త్రాభ్యాస మొనరించెను. సర్వతోముఖ పాండిత్యము నితడు సంపాదించెనట. ఈతని మహాభాష్యప్రదీపోద్యోతము, శబ్దేందుశేఖరము, పరిభాషేందుశేఖరము, మంజూష, లఘు పరమలఘుమంజూషలును ప్రసిద్ధములు. ఇతడు భర్తృహరి తరువాత అంత ప్రామాణికుడుగాను, వైయాకరణ యుగప్రవర్తకుడుగాను ఎన్నబడుచున్నాడు.

నారాయణభట్టు—ప్రక్రియాసర్వస్వము : భట్టోజీదీక్షితులు సిద్ధాంతకౌముదిని రచించు కాలముననే నారాయణభట్టు కేరళదేశమున ప్రక్రియాసర్వస్వమను గొప్ప గ్రంథమును రచించెను.

సిద్ధాంతకౌముదులు : భట్టోజీదీక్షితుల శిష్యుడు వరదరాజపండితుడు సిద్ధాంతకౌముదీ సంక్షిప్తగ్రంథమును రచించెను. క్రమముగా దానికంటె చిన్నవిగా మధ్యసిద్ధాంతకౌముది లఘుసిద్ధాంతకౌముది సారసిద్ధాంతకౌముది యను వాటిని తయారు చేసెను.

ఖిలపాఠములు : పాణినీయమున కనుబంధముగా రచింపబడిన గణపాఠము ధాతుపాఠము ఉణాదిపాఠము లింగానుశాసనము అను ఖిలపాఠము లందురు. వీనిలో గణపాఠమును వర్ధమాన పండితుడు శ్లోకబద్ధ మొనరించి గణరత్నమహోదధియను గ్రంథమును రచించెను. ఇందు వర్ధమానుడు సర్వవ్యాకరణపర్యాలోచనము చేసి ఉత్తమవ్యాఖ్యను గూడ రచించెను.

ఏకదేశటీకలు : పాణినీయమునకు సంబంధించిన వాఙ్మయములో ఇంక పేర్కొనదగినది పాణిని రచించిన శిక్ష. పాణిని యొక్కగాక అతనికి పూర్వవైయాకరణులలో ఆపిశలి కూడ శిక్షను రచించియుండెను. శ్రీకల్యాణానందభారతీ స్వాములు అక్షరదర్పణమను గ్రంథమును రచించిరి. శ్రీ ఉయ్యగంటి నీలకంఠశాస్త్రి దానిపై లోచనమను వ్యాఖ్యను, స్వతంత్రముగా తెలుగులో అక్షరసమామ్నాయమను గ్రంథమును వ్రాసిరి. వీనిలో పాణినీయ (మహేశ్వర) చతుర్దశసూత్రితత్త్వమును, అసూత్రరచనలోని సాధర్మ్యవిశేషములను చక్కగా వివరించెను.

ఇతర భాషలలో పాణినీయము : హిందీలోను ఆంగ్లములోను గూడ పాణినీయ ప్రక్రియాగ్రంథములు వెలసినవి. వానిలో హిందీలో శ్రీ దయానందసరస్వతి రచించిన వేదాంగప్రకాశము ఉత్తమగ్రంథము. ఆంగ్లమున వెలువడినవానిలో కోల్ బ్రూక్, విల్సన్, మోనియర్ విలియమ్స్, మాక్స్ ముల్లర్ వ్రాసిన సంస్కృతవ్యాకరణములు పూర్తిగా పాణినీయము ననుసరించినవి. భారతీయులు ఆంగ్లమున వ్రాసిన వానిలో శ్రీశచంద్రవాసు దాసవసువులును శ్రీ కుముదరంజనరాయియు రచించిన సిద్ధాంతకౌముదీ అనువాదములు, ఆర్. కాలే రచించిన Higher Sanskrit grammar ప్రశస్తగ్రంథములు. ధాతువుల విషయమున ప్రత్యేకముగా శ్రీ [illegible] రచించిన ధాతురూపచంద్రిక ఉత్తమగ్రంథము. ఇంకను జర్మన్ ఫ్రెంచి భాషలలో గూడ పాణినీయానువాదములు గలవు. జర్మన్ భాషలో బోథ్లింక్ వ్రాసిన 'Paninis grammatik' ప్రామాణికమైనది. ఇంతగా విశ్వజనీనమగుటయే పాణినీయ ప్రాశస్త్యమునకు నిదర్శనము.

పాణినీయము చక్కగా చదువు విధము : పాణినీయము నభ్యసించుటకు సిద్ధాంతకౌముది మున్నగు ప్రక్రియాపద్ధతి గ్రంథములు చదువుటకంటె అష్టాధ్యాయీక్రమమున చదువు పద్ధతియే ప్రాచీనమైనది.

ఇతరవ్యాకరణములు : పాణినీయము ప్రచారములోనికి వచ్చిన తరువాత గూడ అనేక వ్యాకరణములు బయలుదేరినవి. పాణినీయమునకు ముందు కాశకృత్స్న ఆపిశల వ్యాకరణములు పొడచూపుచుండెడివి. ఆపిశలమునకు సంగ్రహముగా పాణినీయము బయలుదేరినట్లు కాశకృత్స్న వ్యాకరణమునకు సంగ్రహముగా కాతంత్రము బయలుదేరినది. పాణినీయము లౌకిక వైదిక భాషల కనుశాసనము. కాశకాతంత్రము కేవలము లౌకిక భాషకు మాత్రమే అనుశాసనము.

చాంద్రము : చంద్రగోమియను బౌద్ధవిద్వాంసుడు చాంద్రవ్యాకరణమును రచించెను. ఇతడు కాశ్మీరరాజగు అభిమన్యుని (క్రీ. పూ. 12 శ.) కాలము వాడని రాజతరంగిణి వలన తెలియుచున్నది.

క్షపణకవ్యాకరణము : చాంద్రము తరువాత వచ్చినది క్షపణక వ్యాకరణము. క్షపణకుడు క్రీ. శ. మొదటి శతాబ్దిలో పాలించిన విక్రమార్కుని సభలోని నవరత్నములలో నొకడు. ఇతని ఉణాదిసూత్రములను గురించి ఉజ్జ్వలదత్తుని ఉణాది

వృత్తిలోను వ్యాకరణమునుగురించి మైత్రేయరక్షితుని తంత్ర ప్రదీపములోను పేర్కొనబడెను గ్రంథముమాత్రము లభ్యము కాలేదు

జైనేంద్ర వ్యాకరణము : ఐదవ క్రీ శ 6వ శతాబ్ది ప్రారంభమున జైనేంద్ర వ్యాకరణము పూజ్యపాద దేవనందిచే రచింపబడెను ఈ వ్యాకరణమునకే శబ్దార్ణవసూత్రములని యు వ్యవహారముండెను ఈ వ్యాకరణమున దాక్షిణాత్యసంస్కరణ మున 3700 సూత్రములును ఔదీచ్యసంస్కరణమున 3000 సూత్రములును గలవు ఇందు 5 అధ్యాయములు గలవు

విశ్రాంత విద్యాధర వ్యాకరణము : జైనేంద్రము ననుసరించి సమకాలముననే వామనుడు విశ్రాంత విద్యాధర వ్యాకరణము రచించెను ఈ వ్యాకరణము వర్ధమానుని గణ రత్నమహోదధిలోను హేమచంద్రుని శబ్దానుశాసన బృహ ద్వృత్తిలోను ప్రభావక చరితములోని మల్లవాది ప్రబంధము (గాథ) లోను పేర్కొనబడినది మల్లవాది దీనిపై వ్యాఖ్యను రచించెనట కాని వీనిలో నేదియు లభించుటలేదు

(అభి న) శాకటాయనవ్యాకరణము : పాల్యకీర్తియను నామాంతరముగల శాకటాయనుడు క్రీ శ 9వ శతాబ్ది ప్రారంభమున నొక శబ్దానుశాసనమును రచించెను దీనికే శాక టాయన వ్యాకరణమని పేరు ఈ శాకటాయనుడు శ్వేతాంబర జైన మ. (మహాశ్రమణసంఘాధిపతి సకలజ్ఞాన సామ్రాజ్య పదము నందినవాడు

శ్రీసరస్వతీ కంఠాభరణ వ్యాకరణము : క్రీ శ 12వ శతాబ్ది ప్రారంభమున సుప్రసిద్ధ కవిపోషకుడగు భోజరాజు సరస్వతీకంఠాభరణమను శబ్దానుశాసనమును రచించెను ఇందలి పాణినీయమునకు ప్రథమ సంస్కరణమైనట్లే, సరస్వతీకంఠాభరణమునకు ద్వితీయము తుదిసంస్కరణమునయినది

సిద్ధహైమ శబ్దానుశాసనము : క్రీ శ 12వ శతాబ్ద ములో సుప్రసిద్ధ జైనాచార్యుడును, సర్వతోముఖ ప్రజ్ఞా నిధియు అనేక శాస్త్రగ్రంథరచనాధురంధరుడు నగు హేమ చంద్రసూరి సిద్ధహైమశబ్దానుశాసనమును రచించి తన నాశ్రయదాతయైన సిద్ధరాజునామమును చిరస్థాయి గావిం చెను ఈశబ్దానుశాసనమును అష్టాధ్యాయియే అయితే ఇందలి అష్టమాధ్యాయము ప్రాకృత వ్యాకరణము 1119 సూత్రములు గలిగి యిది ప్రత్యేకగ్రంథముగానే ప్రసిద్ధికెక్కి నది మొదటి ఏడధ్యాయములును సంస్కృతశబ్దానుశాసనము ఇందు 3566 సూత్రములున్నవి ఇది కేవలము లౌకికభాషకు అనుశాసనము హేమచంద్రుడు సంస్కృతవ్యాకరణములో చెప్పవలసినదంతయు చెప్పివేసెను హేమచంద్రుని తరువాత మరల అంతటి శబ్దానుశాసనకర్త పుట్టలేదనవచ్చును

సంక్షిప్తసారము : హేమచంద్రుని తరువాత వచ్చిన వ్యాకరణములు శబ్దానుశాసనములని చెప్పదగినవి కావు కాలానుకూలముగా కొలదివరిధిలో తగినంత వ్యాకరణ జ్ఞానము కలిగించుటకు ప్రయత్నములు జరిగెను ఆప్రయత్న ఫలితములే సంక్షిప్తసారవ్యాకరణము ముగ్ధబోధవ్యాకర ణము సారస్వత వ్యాకరణము

సారస్వత వ్యాకరణము : క్రీ శ 13వ శతాబ్దముననే ఇంకొక ఉత్తమవ్యాకరణము బయలుదేరినది అది సారస్వత వ్యాకరణము అనుభూతి స్వరూపాచార్యులు రచించిన సారస్వతప్రక్రియతో అది వెలుగులోనికి వచ్చినది

ఇంతకంటె సమీచీనమైన ప్రక్రియాగ్రంథము సిద్ధాంత చంద్రిక ఇది భానూజిదీక్షితుడను నామాంతరముగల రామా శ్రమిచే రచింపబడినది భానూజిదీక్షితుడు భట్టోజిదీక్షితుని కుమారుడందురు

భట్టోజిదీక్షితుల శిష్యుడైన రఘునాథశిరోమణి సరస్వతీ సూత్రములపై సూత్రక్రమమున లఘుభాష్యమును రచించెను ఇది పూర్వపక్ష సిద్ధాంతములతోకూడిన ప్రౌఢగ్రంథము ఇందు పలుచోట్ల పాణినీయకాతంత్రములలోని లోపములు చర్చింప బడియున్నవి

ఇంతేగాక క్షేమేంద్రుడొక టిప్పణమును మాధవ పండితుడొక వ్యాఖ్యను సరస్వతీసూత్రములపై వృత్తులుగా రచించిరి

సిద్ధాంతచంద్రికపై సదానందుడు సుబోధినియను పేరను లోకేశకరుడు తత్త్వదీపికయను పేరను చక్కని వ్యాఖ్యలు వ్రాసిరి

సారస్వతప్రక్రియపై పుంజరాజు, కాశీభట్టు చంద్ర కీర్తిసూరి మొదలగు పలువురు వ్యాఖ్యలురచించిరి వానిలో చంద్రకీర్తిసూరి రచించిన "సుబోధిక" పలుతావుల నేటికిని పఠనపాఠనములలో నున్నది అది పేరునకు తగినట్లు రచింప బడిన సరళమైనవ్యాఖ్య

సారస్వత వ్యాకరణమున కనుబంధములుగా సిద్ధాంత చంద్రికా కారుడైన రామాశ్రమి పంచపాదాత్మకమగు

ఉణాదిపాఠమును లింగానుశాసనమును రచించెను. హర్ష కీర్తిసూరి ధాతుపాఠమును రచించెను.

సుపద్మవ్యాకరణము క్రీ. శ. 14వ శతాబ్దిలో పద్మనాభ దత్తుడు సుపద్మవ్యాకరణమును రచించెను. ఇందు పాణినీయ ప్రత్యాహారములు సంజ్ఞలు గ్రహింపబడినవి.

హరినామామృత వ్యాకరణము. మతప్రాతిపదికపై రూపగోస్వామి జీవగోస్వామి యనువారు హరినామామృత వ్యాకరణములు రచించిరి. ఇట్టిదే చైతన్యామృత వ్యాకరణము. "పాంకే(యం) వ(?)... అశేషాఘహారం ఐద..." అనునదే వారి ధ్యేయము. దీర్ఘము పొడగుము కలిసి వచ్చినట్లు వారు వ్యాకరణములు వ్రాసికొనిరి. మధురాపుర ప్రాంతమందలి వైష్ణవులు ఈ వ్యాకరణములు చదువుచుందురు. ఇట్లే ప్రబోధప్రకాశమను శైవవ్యాకరణము గలదు. దీనికర్త బలరామపంచాననుడు. ఇందు శివసంధిపాదము శక్త్యన్త పుంలింగపాదము శివాన్త స్త్రీలింగ పాదము ఈవిధమైన ప్రకరణవిభజనము గలదు.

ఇవిగాక తారానాథతర్కవాచస్పతి రచించిన ఆశుబోధ వ్యాకరణము సులభమైనది. పాణినీయ పద్ధతికి చెందనిది. ఇంకను దృతబోధము అలంకారవ్యాకరణము శీఘ్రబోధము జ్ఞానామృతము మొదలగు అనేక వ్యాకరణగ్రంథములు సామాన్యమైనవి యున్నెకలవు.

ఆంగ్లమున పాణినీయేతర వ్యాకరణకర్తలు. ఆంగ్లమున మొట్టమొదట వెలువడిన విల్కిన్సు సంస్కృతవ్యాకరణము సారస్వత వ్యాకరణము ననుసరించినది (క్రీ. శ. 1808). కేర యను శాస్త్రీయుడు ముగ్ధబోధము ననుసరించి సంస్కృత వ్యాకరణమును ఆంగ్లమున రచించెను (క్రీ. శ. 1806). ఆంగ్లమున స్వతంత్ర సంస్కృత వ్యాకరణములు గూడ కొన్నికలవు. వీనిలో అన్నివిధముల ప్రశస్తమైనది మాగ్డొనాల్డు రచించిన "Sanskrit Grammar". ఇతడే వైదిక వ్యాకరణములు చిన్నది, పెద్దది రచించినాడు.

ఎస్. పి. యస్. శేం

## సమాజము-కుటుంబవ్యవస్థ

సమాజమునకు కుటుంబము మూలస్తంభము వంటిది. కొన్నికుటుంబములు కలిసిన ప్రాదే సముదాయములు సంఘములు మున్నగునవి ఏర్పడును. స్త్రీ పురుషుల మైత్రీసంయోగముల ఫలితముగా సంతాన మేర్పడి కుటుంబముగా పరిణామమునొందును. కుటుంబమును గూర్చియును మెకైవర్ నిమ్‌కాఫ్ వంటి కొందరు పాశ్చాత్య సామాజికశాస్త్రవేత్తలు వేర్వేరు నిర్వచనములనిచ్చిరి.

కుటుంబము అనాదియైనది సార్వజనీనస్వభావము కలది. ఇది అన్ని కాలములందును అన్ని దేశములందును కానవచ్చు మానవసమాజమందలి ప్రాథమిక వ్యవస్థ. కుటుంబవ్యవస్థ యందే మానవుడు సంపూర్ణ జీవితానుభవము కల్గును. మానవుడు తనకామేచ్ఛను తీరుకొనుచు సంతాన వంతుడై వారియెడల అనురాగము కల్గి తనకష్టసుఖములను తన కుటుంబము యొక్క కష్టసుఖములను అరయుచు తన కుటుంబము యొక్క అభ్యుదయమును తనదేశాభ్యుదయమును ప్రపంచాభ్యుదయమును కూడ కాంక్షించుచుండవలయును.

కుటుంబము ఇతర మానవసమూహములవలె కాక పరిమితమైన సభ్యత్వము కలది. ఇతర సంఘములందలి సభ్యత్వమువలె కాక కుటుంబ వ్యక్తుల సభ్యత్వము జీవసంబంధమైన శాశ్వతత్వము కలది. అసలు కుటుంబమున అత్యంత ప్రధానమగు ఉత్తమలక్షణములు కుటుంబమునందలి ప్రతి వ్యక్తిపై ఒకరి యందొకరికి ప్రభావమును కల్గించును. వ్యక్తిప్రవర్తనమును, శీలమును చక్క దిద్దుటయందు కుటుంబము యొక్క పవిత్ర జీవితము మిగుల ప్రధానపాత్ర వహించును. కుటుంబ సభ్యులు శైశవదశనుండియు ప్రవర్తననటును, పశ్చిమమునకును బీజములు నాటుకొనవలయును.

పై అంశముల ననుసరించి సమాజమనునది ఎన్నియో కుటుంబముల కలయిక యనియు ప్రాథమిక సమూహమగు కుటుంబము సమాజమునకు జీవకణము వంటిదనియు తెలియుచున్నది. అనగా సమాజవ్యవస్థయంతయు కుటుంబముమీదనే ఆధారపడియున్నది. సమాజమునకు కేంద్రమగు కుటుంబ వ్యక్తులు బాధ్యతాయుతముగా ప్రవర్తించుటకు పాటుపడవలెను. ఇట్టి బాధ్యతాయుత ప్రవర్తనము మరియేయితర సామాజిక సమూహమునందును కానరాదు. కుటుంబము యొక్క అవిచ్ఛిన్నమైన ఐక్యతకొరకును అభ్యుదయముకొరకును అందలి ప్రతివ్యక్తియు బాధ్యతతో ప్రవర్తించునపుడే అది సమాజక్షేమమునకు దోహదముచేకూర్చి చిరకాలము మనగల్గును.

సమాజములో ఒకభాగమైన కుటుంబము ఆ సమాజ మందలి ఆచారవ్యవహారములకు ప్రాతినిధ్యమువహించుచు

అందలి సభ్యులు కుటుంబసంప్రదాయములకు విరుద్ధముగా ప్రవర్తించక వాటికి బద్ధులై యుందురు ప్రాచీనకాలము నుండి సంప్రదాయబద్ధుడైన ప్రతికుటుంబసభ్యుడు తనకుటుంబము యొక్క ఐక్యతకొరకే పాటుపడుచుండెడి వాడుగాని అందుండి వైదొలగి దాని విచ్ఛిత్తికి దారితీయువాడు కాడు

సమాజములో కుటుంబమొక శాశ్వతమైన సంస్థయో, ఆదేశమయిననూ అది తాత్కాలికమైనదికూడ. కుటుంబ మొక సంస్థగా సమాజములో శాశ్వతమైనది. ఒకకుటుంబ మెన్నియో ఇతరకుటుంబములను ఉత్పన్నింపజేయును. ఒక కుటుంబములోని ఒకకుమారుడు వివాహితుడై మరియొక కుటుంబమును సృష్టించుచున్నాడు. కుటుంబమందలి భార్యాభర్తలలో సంతానహీనులై యెవరు మరణించినను, కుటుంబాభివృద్ధి అంతటితో సమసిపోవును. ఈవిధముగా కుటుంబము తాత్కాలికమైనది. పైనచెప్పనవిధముగా ఒక కుటుంబము మరికొన్ని కుటుంబముల సృష్టికి కారణభూతమైనదగుటచే దానికి శాశ్వతత్వము గూడ కలదు

రక్తసంబంధముండు ఒకేటి మానవసమూహము కుటుంబమగునని తెలిసికొంటిమి. ఈ సమూహప్రాముఖ్యము వివాహముతో ఆరంభమగును. కుటుంబములో ఏ సభ్యునికి వివాహము జరిగినను అందు మార్పు ఆరంభమగును. ఈ మార్పుతో పాతకుటుంబమునుండి క్రొత్తకుటుంబము ఏర్పడుటకు అవకాశము కలుగు

కుటుంబస్వరూపాంతరములు

భార్యభర్త వారిసంతానము కలిసిన సమూహము కుటుంబమనబడును. ఈ సమూహము నిర్దిష్టమైన ఒక క్రమపద్ధతితో ప్రవర్తించవలెనన్నచో దానికొక నాయకుడవసరము. అనాదినుండియు తనసంతాన సంక్షేమము కొరకును వారి అభ్యుదయము కొరకును వంశముయొక్క శాశ్వతత్వము కొరకును కుటుంబవ్యవస్థను ఏర్పరచుకొన్నాడు. కుటుంబముయొక్క శాశ్వతత్వము రెండంశములమీద ఆధారపడియుండును (1) వంశపారంపర్యము; (2) ఆస్తిసంక్రమణము. ప్రాగ్చరిత్రకాలమునుండియు వంశాభివృద్ధి పురుషపారంపర్యముగగాని స్త్రీపారంపర్యముగగాని కొనసాగుచు వచ్చినది. సమాజములో రెండుతరగతులకు చెందిన కుటుంబవ్యవస్థ కూడ నెలకొనియున్నది. సాధారణముగా వంశపారంపర్యమును బట్టియే ఆస్తిసంక్రమణము జరుగుచుండును

భార్యభర్త వారిబిడ్డలు కలిసిన సమూహమే కుటుంబమైనను కుటుంబయాజమాన్యము ననుసరించి ఆ సమూహకాలములో కల్గు మార్పులచే కుటుంబము విభిన్నరూపములను సంతరించుకొన్నది

యాజమాన్యపరంపర దృష్టితో చూచినచో కుటుంబము రెండురకములుగనుండును (1) పితృస్వామిక కుటుంబము (2) మాతృస్వామిక కుటుంబము. పితృస్వామిక కుటుంబములో తండ్రి కుటుంబయజమానియై యుండును. ఈ రకమైన కుటుంబము పురుషపరంపరగ కొనసాగును. అనగా కుటుంబములో పురుషసంతతి మాత్రమే వంశనామము ఆస్తియాజమాన్యము సంక్రమించును. అధునిక సమాజములో పితృస్వామిక కుటుంబములు అధికసంఖ్యలోనున్నవి. ప్రాచీనులైన హిబ్రూ గ్రీకు రోమను జాతీయులును భారతదేశములోని ఆర్యజాతీయులు మున్నగువారి కుటుంబములును ఈ తెగకు చెందినవి

మాతృస్వామికవిధానము పితృస్వామిక విధానమునకు పూర్తిగా భిన్నమైనది. ఈ కుటుంబవ్యవస్థలో తల్లి యజమానురాలు. ఆమెవంశనామము ఆమె స్త్రీసంతతికి సంక్రమించును. అట్లే ఆస్తిహక్కులు వాటి యాజమాన్యము గూడ ఆడపిల్లలకే సంక్రమించును. కొందరు సామాజికవేత్తలు సామాజికపరిణామక్రమములో మొదటిది మాతృస్వామిక కుటుంబమని అభిప్రాయపడిరి. ఇప్పటికిని ఈ తరగతికి చెందు కుటుంబవ్యవస్థ ఉత్తర అమెరికాయందలి అనాది భారతీయజాతి వారిలోను మలబారు ప్రాంతీయులలోను ఖాసీ అనుకొండజాతి వారిలోను కానవచ్చును

సంతానక్షేమము కొరకేర్పడిన కుటుంబవ్యవస్థ విధులను మెకైవర్ రెండువిధములుగా విభజించెను (1) ప్రధాన విధులు (2) అప్రధాన విధులు. ప్రధానవిధులు జాతితాలలో స్థిరమగు లైంగికవాంఛాతృప్తి సంతానోత్పత్తి, వారి పెంపకము గృహజీవనము మున్నగు అంశములను అతడు చేర్చెను; అప్రధానవిధులలో ఆర్థిక ఆరోగ్య మత విద్యాదివిషయములను చేర్చెను

నిరవధికముగను విస్తృతముగను వృద్ధిచెందుచున్న శాస్త్రవిజ్ఞానము శాస్త్రపరిశోధనములు సమాజమును సామాజిక సంస్థలను గాఢముగా ప్రభావిత మొనర్చుచున్నవి. అంతేకాక సమాజములో యేర్పడు విప్లవములు ప్రాథమిక సంస్థ

యగు కుటుంబమును పరివర్తనమునకు లోనుచేయుచున్నవి. పదునారవ శతాబ్దములో ఐరోపాలో ఘటిల్లిన సాంస్కృతిక పునరుజ్జీవనము మతసంస్కరణోద్యమము అను రెండు ప్లవముల అనంతరము శాస్త్రవిజ్ఞానములోను ప్రజాస్వామ్యములోను నూతనశక ప్రారంభమగుటతో ఏకస్వామికకుటుంబపు పునాదులు కదలినవి. ఒకవంక ఆర్థికవ్యవస్థలో మార్పు పారిశ్రామికీకరణము తత్ఫలితముగా ఘటిల్లిన నగరవ్యవస్థానిర్మాణము ఇందుమూలముగా హెచ్చిన ప్రజల చలనశీలత మున్నగు పరిణామములు కుటుంబవ్యవస్థయందనేక మార్పులను తెచ్చెను. మరొకవంక సాంస్కృతిక కారణములవలన ప్రజాస్వామిక ఆదర్శముల వికాసము మతప్రభావక్షీణము కారణముగా ఏకస్వామిక కుటుంబవ్యవస్థ విచ్ఛిత్తి ప్రారంభించినది.

ఆర్థికవ్యవస్థలో కల్గిన మార్పువలన పూర్వసమాజమునందు స్త్రీ గల హోదా వ్యక్తిత్వము, విధుల కూడ మారినవి. నేటి సమాజములో తన యితర హక్కులను పొందుటయేకాక ఆర్థిక స్వాతంత్ర్యమునుకూడ ఆమె సంపాదించుకొనుచున్నది. ఈ రెండింటిమూలముగా కుటుంబముయొక్క అప్రధానవిధుల నన్నిటిని సమాజములోని ఇతరసంస్థలు చేపట్టినవి. ఉదాహరణమునకు ఆర్థిక మత విద్యావిషయకమైన విధులు పూర్వసమాజములో కుటుంబముయొక్క ఆర్థికసంస్థ. ఈనాటి కుటుంబము ఉత్పత్తికంటె అనుభవయోగ్యతను విశేషముగా సంపాదించుకొన్నది. పూర్వమువలె ఈనాటి కుటుంబము మతముచే ప్రభావితముకాక మతాతీతమైన ఐహిక లౌకికత్వమును పెంచుకొనుచున్నది. వీటన్నిటికంటె కుటుంబమునకు మూలమైన వైవాహికవ్యవస్థ వైవాహికబంధము నేటిప్రజల దృష్టిలో పవిత్రమైన బంధముగ పరిగణింపబడుటలేదు. కొంతవంకు సామాజికదృష్టిలో అది సామాజికబంధముగా పరిగణింపబడుచున్నది. దీనికంతకు కారణములు ప్రభుత్వము న్యాయశాస్త్రము ప్రసాదించిన విడాకుల యేర్పాటు శాస్త్రవిజ్ఞానము కల్పించుచున్న సంతాననిరోధకావకాశములు పరిమిత కుటుంబనిర్మాణమునకు ప్రభుత్వమిచ్చుచున్న దోహదము ఇవన్నియు పాటించుటకు ప్రతిదేశము తన జీవనప్రమాణమును పెంచుకొనవలెనను కోరికయే కారణము.

సమాజము ప్రాచీనమైనదిగాని ఆధునికమైనదిగాని, నాగరకమైనదిగాని ఆటవికమైనదిగాని అతురాస్యతకలదిగాని, శైవిదిగాని— కుటుంబవ్యవస్థ విచ్ఛిన్నముకాకుండ కాపాడుకొనుటయే ప్రజల కర్తవ్యము స్త్రీపురుషులయొక్క పరస్పర ఆకర్షణము కామవాంఛ సంతానేచ్ఛ మున్నగునవి మౌలికమైన జీవసంబంధమగు సహజవాంఛలు. కాని ఈ వాంఛను అవరించుకొనియున్న సామాజిక వాతావరణము నిరంతరము మార్పుచెందుచు స్త్రీపురుషులను ప్రభావిత మొనర్చుచున్నది.

పి. అ.
శి. వ.

## సమాజీకరణము :

మానవసమాజము కాహ్యగోచరమగునదియేకాక సమాజసభ్యుల చిత్తములలో సదా అనుభవమైన విషయముగనే యుండును. క్రొత్తగా పుట్టిన వ్యక్తి సమాజీకరణ ప్రక్రియద్వారా సమాజములో ఒక అంతర్భాగముగ ఇముడుటకు ప్రయత్నించును. ఈనిరంతర ప్రక్రియవలననే సమాజము అవిచ్ఛిన్నముగ సాగుచున్నది. వ్యక్తికిని సమాజమునకును మధ్య సామరస్యమును ఏర్పరచుటకు అతనిని సమాజములో కార్యకారియుతమైన సభ్యునిగా తీర్చిదిద్దుటకు సమాజీకరణము తోడ్పడును.

సాంఘికాచారములను నియమములను పాటించుచు సామాజికప్రమాణముల నంగీకరించి కట్టుబాట్లకు బద్ధుడై, సాంఘికస్థితిగతుల కనుగుణముగా వ్యక్తి తనను తాను మలచుకొను క్రమమును సమాజీకరణమని నిర్వచించవచ్చును. ఈ ప్రక్రియద్వారా వ్యక్తి సామాజికతను పెంపొందించుకొనుటయేకాక స్థిరమైన వ్యక్తిత్వమునుకూడ పెంపుచేసికొనును. ప్రతిమానవుడు తనచుట్టునుండు స్థితిగతులకు వాతావరణమునకు అనుకూలముగ తయారగుటకు ప్రయత్నించును.

మెకైవర్ భావనలో సమాజమునందలి జీవులొకరితో మరియొకరు అధికమైన విస్తృతమైన సంబంధముల నేర్పరచుకొని వాటికి బద్ధులై యుండుటయు పరస్పరమాధారపడియుండుటయు తమకర్తవ్యమును బాధ్యతను వ్యక్తిత్వమును పెంపొందించుకొనుటతోపాటు ఇతరుల వ్యక్తిత్వమును కూడ గుర్తెరిగి విశాలపరిధిలో సహకారసద్భావనలు ప్రాతిపదికగాగల వ్యవస్థను నిర్మించుటకునయుక్తమగు ప్రక్రియ సమాజీకరణమనబడును.

ఆగ్‌బర్న్ అను శాస్త్రవేత్త దృష్టిలో కలిసిపనిచేయుట, సామూహిక బాధ్యతను పెంపొందించుకొనుట, ఇతరుల క్షేమ

మును దృష్టిలోనుంచుకొని వర్తించుట మున్నగు ప్రక్రియలు సమాజీకరణ మనబడెను అనగా పై నిర్వచనమును పరిశీలించుచో వ్యక్తులు సమాజములో అంతర్భాగముగ నేర్పడుటకు జరుగు ప్రక్రియను సమాజీకరణమని సూక్ష్మముగా చెప్పవచ్చును మానవుడు సమాజజీవి ఇతరులతో అతనికి కలుగు సంపర్క సహవాసములవలన వంశానుగతముగ అతనిలో సంక్రమించు గుణములు శక్తులు వికాసమునొందును నిర్జన వాతావరణములో అతడు తనశక్తులను పెంపొందించుకొనజాలడు మానవుడు సాధారణముగా ఇతరులను అనుకరించుటకే యత్నించుచుండును బాల్యదశలో అట్టి అనుకరణ సహజముగనుండును కాని వయస్సు పెరిగినకొలది అతని విచక్షణ శక్తి పెరిగి అనుకరణను ఇచ్ఛాపూర్వకముగ చేయును అనుకరణమనునది సమాజీకరణ ప్రక్రియలో ఒకభాగముగనుండును అనుకరణ మూలముగా అతడు ఇతరులవలె సమూహములో ఒకభాగముగా రూపొందును

మానవజీవితములో అనుకరణము వివిధదశలలో వివిధములగానుండును ఇదియంతయు అతడు మిగిలినవారిలో కలిసిమెలిసిపోవుటకును తన ఆధిక్యతను నిలబెట్టుకొనుటకును సమాజములో ప్రత్యేకస్థానమును పొందుటకును నిరంతరము చేయు ప్రయత్నము మానవుడు శైశవదశలో తనకు సన్నిహితులైన తల్లి తండ్రి సోదరి సోదరులను గుర్తించినట్లుగా ప్రతిస్పందించ మొదలగును ప్రథమదశయందు అతనికి సహజాతమైన శక్తిమాత్రమే తోడ్పడును పెద్దపెరుగుచున్నకొలది అతని విచక్షణశక్తియు పెరుగుచుండును ఏ పనిచేసినచో తల్లిదండ్రుల ఆమోదమును పొందునో ఏ పనిచేయుటవలన వారి ఆగ్రహమునకు గురియగునో తెలిసికొను పరిజ్ఞానము వారిలో పెంపొందును గృహవాతావరణమునుబట్టియు తల్లిదండ్రుల పెంపకమునుబట్టియు అతడు తన అలవాట్లను ఏర్పరచుకొనును బాల్యదశలో గృహవాతావరణమునకుతోడు పరిసరవాతావరణము కూడ అతనిని ప్రభావితమొనరుచును బాలబాలికలు ఇల్లువాడి స్నేహితులకొరకు ఆటపాటలకొరకు ఎప్పుడు బయటికి వెడలెదరో అప్పుడు సమాజీకరణప్రక్రియలో రెండవదశయందు వారు అడుగిడుదురని అర్థము అట్లే విద్యాభ్యాసమునకై పాఠశాలలో అడుగుపెట్టినపుడు వారి వ్యక్తిత్వమునకొక అదర్శము లభించుట ప్రారంభమగును వారు విద్యాలయమును విడిచిపెట్టునంతలో గురువులవలన, సహాధ్యాయులవలన వారిని స్త్రీపురుషత్వము చాలవరకు తీర్చిదిద్దబడును విద్యాభ్యాసము పూర్తిఅగు కాలములోనే సమాజీకరణకాలము లెక్కువ గలవు అచ్చట బాలబాలికలు పొందు అనుభవములు ఇంటిలో కంటె భిన్నముగ నుండును ఒక్కొక్కప్పుడు వారిస్వాభిమానములు తోటివారి మాటలవలన చర్యలవలన దెబ్బతినవచ్చును, లేక తమమాటలవలన తమ నడవడివలన తోటివారిలో విశిష్టస్థానమును సంపాదించవచ్చును ఇట్లు వారు వైయక్తికమైన క్రొంగ్రొత్త అనుభవములతో తమనుతాము మలచుకొనుచునే యుందురు ఇతరులతో కలిసిమెలిసి సంచరించునప్పుడు బాలబాలికలు పరస్పరము గౌరవించుకొను పద్ధతులు అలవడును పాఠశాలవాతావరణము బాలబాలికలకు విశాలదృక్పథమును అలవడచేయును ఈవయస్సులో వారికి వివిధవిషయములపై శ్రద్ధాశక్తులు అభిరుచులు ఏర్పడును తమ సమవయస్కుల మనోభావములను గ్రహింపవీలగును పరస్పర అవగాహనము వలన పరస్పరము వారు ప్రభావితులగుదురు ఈవయస్సు సమాజీకరణ ప్రక్రియలో ముఖ్యమైన దశ

యౌవనోదయముతో వ్యక్తులయందు సమాజీకరణ ప్రక్రియ క్రొత్తదారులను త్రొక్కును వ్యక్తులు పరిసరముల కనుగుణముగా మారుటకు సమాజసంప్రదాయములు రీతిరివాజులకు వ్యక్తిగతాభీష్టములకు మధ్య పొత్తును సామరస్యమును కుదురుటకు తోడ్పడును పదునైదేండ్లవయస్సులో మానవుడు తనఅనుభవములను కొంతవరకు పాఠశాలయందు సంపాదింపగలడు కాని అట్టి అనుభవములను విమర్శనాదృష్టితో విచక్షణచేయుటగాని వివేకముతో పరామర్శించుటగాని, మంచిచెడుగులను నిర్ణయించుటగాని జరుగదు పదునైదేండ్లు దాటగానే వ్యక్తికిని సమాజమునకును మధ్య సంఘర్షణము ఆరంభమగును యౌవనదశలో శారీరకమైనమార్పు స్త్రీపురుషులమధ్య ఆరంభమగును పరస్పరాకర్షణ భావోద్వేగము నూతనకాంక్షలు మున్నగు లక్షణములు వారిలో ప్రవేశించి క్రొత్తసమస్యలను ఉత్పన్నముచేయును ఈదశలో కల్గు అనుభవములను యువతీయువకులు విమర్శనాజ్ఞానముతో స్వీకరించుటయు వాటివిలువ నిర్ణయించుటయు సంభవించును ఈవిలువలు వైయక్తికమైనవై ఒక్కొక్కప్పుడు సమాజసంప్రదాయపు విలువలతో పోటీపడుచుండును ఈదశలో వ్యక్తులు తాము ఒంటరిగా నుందుము కామనియు తమ వెనుక సమాజము దానికి కొన్నివిలువలు సంప్రదాయములు

కలవనియుగుర్తించెదరు. ఎట్లయినను సమాజముతో పొత్తు కుదుర్చుకొనవలెనను ఆవశ్యకము వారిలో కల్గును. ఈవిషయములో కొందరు సమాజముతో ఘర్షణ విరమించి రాజీపడుదురు. కాగా కొందరు ఘర్షణ కొనసాగించి సమాధానము కుదుర్చుకొనలేక తమలో తాముమాత్రమే సమాధానపడెదరు. కాని బాల్యదశలో ఇట్టి సంఘర్షణయునకు తావులేదు. బాలబాలికల ఊహలో వాస్తవజగత్తు మనది లేదు. వారి దంతయు ఊహాజగత్తుమాత్రమే. బాలబాలికలను తలిదండ్రులు అనుకరణము కావాడు గృహవాతావరణము పాఠశాలలో సాయంత్రమువరకు గురువులతో గల సంబంధము—ఇదియే వారి పరిమితవలయమేగాని విస్తృతానుభవము గడింపగల విశాల ప్రపంచము కాదు. ఈ పరిమితవలయములో ఊహాజగత్తులో బాలబాలికలు విచక్షణారహితముగా సర్వవిధములైన అనుభవములకును లోనయ్యెదరు. కాని యౌవనదశలో వారి అనుభవ స్వీకారము తద్భిన్నముగనుండి విమర్శనాపూర్వకముగనుండును.

యౌవనదశలో పైనచెప్పినట్లు వ్యక్తిత్వము విచక్షణాజ్ఞానము ఉదయించుటతో పరస్పర అవగాహనము, పరస్పర సహకారము ప్రేమాభిమానములు అనురాగము, తమ్మూలముగా స్త్రీపురుషుల నడుమ కల్గుపరిణయవాంఛ మున్నగునవి సమాజీకరణ ప్రక్రియకు పూర్ణత్వమును కూర్చును.

వివాహఫలితముగా కలుగు సంతానమువలన వ్యక్తులలో సమాజీకరణప్రక్రియ మరియొక మలుపు తిరుగును. అంతవరకు స్వీయసంతోష సుఖములకొరకై శ్రమించిన స్త్రీపురుషులు సంతానోత్పత్తి పిమ్మట వారికొరకై జీవించి శ్రమించుటయే సాధారణముగా తలిదండ్రుల ప్రధానాశయముగా మారును. వయస్సు మళ్ళినకొలది తమ సుఖసంతోషములను విస్మరించికూడ తమబిడ్డలకు అభ్యుదయము కల్పింపవలెనని తలిదండ్రులు తహతహ చెందెదరు. సంతానక్షేమమునకై సమాజమందలి ఇతరులతో వారు సంపర్కము కల్గించుకొందురు. మానవజీవితములో ఇది అనివార్యమైనప్రక్రియ. ఒక్కమాటలో చెప్పవలెనన్నచో, మానవుడు తోటివారలతో పొత్తుకలిసి, సమాజ సంప్రదాయములతో విలువలతో, సమాధానపడి సమాజములో లీనమగుటయే సమాజీకరణప్రక్రియ యనబడును.

కొందరువ్యక్తులు సహజముగా యువక దృక్పథమును కల్గియుందురు. అట్టివారిలో సమాజీకరణప్రక్రియ నిరంతరము వయస్సుతో సంబంధములేకయే జరుగుచుండును. వారు యువకులతో కూడి కలిసిమెలిసి జీవించుచుందురు. సాధారణముగా మానవులలో వార్ధక్యము ప్రవేశించుటలో మార్పు చెందుటకు త్వరగా వారిష్టపడరు. తమ పాతభావములను పాతపైఖరులను పాత ప్రవర్తనమును మార్చుకొనుట కంగీకరింపరు. వారి శరీరస్థితికూడ కొంతవరకు అందుకనుకూలముగనుండదు. మారుతున్న సమాజముతో మారుతున్నవిలువలతో నూతన ప్రమాణములతో వారు రాజీపడలేక తమ అధికృతను నిలబెట్టుకొనుటకు వారు పెనగులాడుచునేయుందురు. అనగా వయస్సు మళ్ళుతున్న తరుణములో సమాజీకరణప్రక్రియ చురుకుగా సాగక మందగించును. ఈవిధముగా సమాజీకరణప్రక్రియ నిరంతరము విభిన్న అవస్థలలో విభిన్నరూపురేఖలను దిద్దుకొనుచుచేయుండును.

సి. అ.
రా. వ.

## సమాజోత్పత్తి :

సాధారణార్థములో సమాజమనగా పెక్కురు వ్యక్తుల సమూహము. కాని సామాజికశాస్త్రములో 'సమాజము' అనుపదమునకు విస్తృతార్థము కలదు. సామాజిక స్వభావముగల మానవులు తిరిగి తిరిగి నిర్మించుకొనుచుండు బాంధవ్యముల వ్యవస్థను సమాజమని యందురు. అట్టివ్యవస్థ వారిని పలువిధములుగా అదుపులోనుంచుటయేకాక మార్గదర్శిగాకూడ నుండగలదు. సమాజమను పేరుతో పిలువబడు ఈవ్యవస్థ మానవుల కార్యకలాపములకు హద్దులను నిర్ణయించుటయేకాక కొంత స్వేచ్ఛనుకూడ కల్పించును. వారు అనుసరించుటకు కొన్ని ప్రమాణములను ఏర్పరచును. మానవచరిత్రలో ఎంత అసంపూర్ణతయు, ఎంత నియంతృత్వదోరణులును గోచరమైనను, మానవుడు సంపూర్ణమైన జీవితము ననుభవించుటకు సమాజమొక అత్యంతావశ్యకమైన వ్యవస్థయని సామాజిక శాస్త్రవేత్తలంగీకరించినారు. కొందరు శాస్త్రజ్ఞులు సంఘములో ఒకరినొకరు గుర్తించి, సాముదాయక ప్రయోజనములను, భావములను కల్గియుండు స్థితిని సమాజమనిరి. ఉదాహరణమునకు ఇద్దరు వ్యక్తులు రైలుబండిలో ఒకచోటునుండి బయలుదేరి కొంతదూరము కలిసి ప్రయాణించి ఒకేచోట దిగి

సంత మాత్రమున ఆ స్థితిని సమాజమని పిలువజాలము. కాని వారు ఒకరుతో నొకరు సంభాషించి సామాజిక బంధములను నెలకొల్పుకొనినచో అట్టి స్థితియందు వారిలో సామాజికత నెలకొన్నదనవచ్చును. పరస్పరమైన ఈ గుర్తింపుభావనమును గిడ్డిగ్స్ అను శాస్త్రకారుడు సామాజిక ప్రక్రియగా నిర్వచించినాడు. శాశ్వత సాముదాయకమైన ప్రయోజనముల కొరకు అభిప్రాయ సామరస్యము గల వ్యక్తులు ఒకరినొకరు గుర్తించి కలిసిమెలిసి పని చేయుటయే సమాజమని చెప్పవచ్చును.

సమాజమనగా సమరసమైన సమానాభిప్రాయములుగల వ్యక్తుల కలయిక అనియే అర్థముకాదు. భేదాభిప్రాయములు భిన్నత్వములు కలిగి కూడ సహజీవనము సాగించుటకు వ్యక్తులు చేయు కృషి ఫలితమునుకూడ సామాజికజీవితమనవచ్చును. సామ్యముమీదనే ఆధారపడి నిర్మింపబడిన సమాజమునందు సామాజికబంధములు తక్కువపరిమితిలో సంకుచితముగ నుండును. సామాజికవ్యవస్థలో సామాజిక సంబంధములు భిన్నప్రకృతులమధ్య నెలకొనును. కుటుంబవ్యవస్థ స్త్రీపురుష సంబంధముమీద ఆధారపడి ఏర్పడినది. శ్రద్ధ విశ్వాసము ఆసక్తి భక్తి మొదలగు విషయములలో మానవులమధ్య భిన్నత్వము కన్పించును. భిన్నప్రకృతులుగల వారినడుమ సామాజికజీవనము అంతర్ క్రియా కలాపములు జరుగుచునే యుండును. సామ్యతకు భిన్నత్వమునకును, సహకారమునకు పోరాటమునకును నడుమ అంతర్ క్రియ సంభవించుచునే యుండును. అట్టి భిన్నత్వము సమాజజీవితమునకు అవసరము. సామ్యత భిన్నత్వములే కాక, పరస్పరాశ్రయముకూడ సమాజమునకొక లక్షణము. కుటుంబము సమాజమునకు పునాదివంటిదని తెలిసికొంటిమి. స్త్రీపురుషుల అన్యోన్యాశ్రయము జీవసంబంధమైనదగుటచే వీరిలో ఏ ఒక్కరు లోపించినను జీవితము పూర్ణమైనది కాజాలదు. అట్టి అన్యోన్యాశ్రయము సమాజమునందే కాక దేశముల నడుమకూడ అత్యావశ్యకము. మానవజీవితములో పరస్పరసహకారముకూడ అత్యావశ్యకమైన అంశమే. సమాజమునందైనను సహకారము లుప్తమైనచో మానవులు జీవింపజాలరను విషయము చరిత్ర మనకు బోధించుచున్నది. అట్టిసమాజమునకు వికాసమనునది లభించుట దుర్లభము. సామ్యత, భిన్నత్వము, అన్యోన్యాశ్రయము, సహకారము- ఈ నాల్గంశములు సమాజ పుట్టుకకు మూలస్తంభములు.

సమాజోత్పత్తికి గల కారణములనుగూర్చి సామాజిక శాస్త్రవేత్తలు వాదోపవాదములు కావించిరి. ఇందు రెండు ముఖ్య సిద్ధాంతములు కలవు. మొదటిది వైయక్తికవాదము. ఈవాదమునుగూర్చి విశేషముగా చర్చించినవారు హాబ్స్, లాక్, రూసో అను పండితులు. మానవుడు సమాజముకంటె ప్రాచీనుడనియు సమాజము అతని మీదుగాతనే ఆవిర్భవించెననియు వీరి ఊహ. ప్రాచీనకాలమున మానవులు ఒకరితో నొకరు సంబంధబాంధవ్యములు లేక ఎవరికి వారుగా జీవించుచుండిరి. ఇట్టిస్థితిని నైసర్గికస్థితిగా శాస్త్రవేత్తలు వర్ణించిరి. మానవులు విచక్షణాశక్తి లేక ఒండొరులయందు సహకార సద్భావములు లోపించి అనాగరికులై "బలవంతుదే రాజ్యము" గానున్న స్థితిలో సమాజమేర్పడుట సంభవించినది. అనంతరము బలవంతులనుండి దుర్బలులను రక్షించుటకును శాంతిని నెలకొల్పుటకును సమాజములో అనుకూలవాతావరణము కల్పింపబడినది. ఈ ప్రయోజనార్థము ఆనాటివారు కొందరు ప్రకృతిసిద్ధమైన స్వేచ్ఛను వదలుకొనినట్లై బుద్ధిపూర్వకముగా ఆయాచితముగా ఇష్టపడిరి.

రూసో మహాశయుడు విఖ్యాతిచెందిన "సామాజిక ఒప్పందము" అనుసిద్ధాంతము నొకదానిని ప్రతిపాదించినాడు. దానిని బట్టి మానవులు ఇష్టపూర్వకముగా అంగీకారమునకు వచ్చుట వలన సమాజ మావిర్భవించెను. అట్టి ఒప్పందములకు గల హేతువులనుగూర్చి శాస్త్రవేత్తలమధ్య ఈనాటివరకు ఏకాభిప్రాయము లేదు. అంతేకాక ఒప్పందములు ఆనిమిత్తముగా ఎప్పటినుండి ఏర్పడినవను విషయమునుగూడ ఎవరును నిర్వచింపలేదు. ఈ వైయక్తికవాదమును పూర్ణముగా అంగీకరించుటకవకాశము లేదు. ఏలనన సమాజము లేనిదే మానవునకు మానవత సిద్ధింపదుగదా! సంఘమునుండి వేరుచేయబడిన వ్యక్తులకు వికాసముకలుగదు. సామాజిక శాస్త్రవేత్తలు కొందరు సంఘమునుండి వేరైన కొందరు బిడ్డలనుగూర్చి, చర్చించి వారి మనస్తత్వమునుగూర్చి ప్రవర్తనమునుగూర్చి ప్రయోగములు జరిపిరి. 1920 వ సంవత్సరప్రాంతమున సామాజికశాస్త్రజ్ఞులు 8 ఏళ్ళ వయస్సుగల కమల యను బాలికను తనవారినుండి వేరుచేసి రెండేళ్ళపాటు తోడేళ్ళు నివసించు గుహలో ఉంచగా, ఆ పిల్లకు మానవసంఘములో నుండగా అబ్బు అలవాట్లుగాని లక్షణములుగాని ప్రవర్తనముగాని అబ్బలేదు; జంతువులమధ్య అంతకాలము పెరుగుటవలన

అల్లికకు వాటి అలవాట్లే అబ్బినవి. కావున మానవుడు సమాజము మధ్యగాక మరియొక వాతావరణములో మానవుడుగా మనుగడ సాగించజాలడని ఈ ఉదాహరణమువలన రుజువు కాగలదు.

వ్యక్తికిని సమాజమునకును గల సంబంధమును తెలుపు జీవజంతుసామ్యవాదమను మరియొక సిద్ధాంతము కలదు. ఈ సిద్ధాంతమును ప్రతిపాదించినవాడు స్పెన్సర్ అను పండితుడు. ఈతని సిద్ధాంతము ప్రకారము సమాజమొక జీవజంతువువంటిది. సమాజములోని వ్యక్తులు జీవకణములవంటివారు. అనగా అంగనిర్మాణమొక సమాజవ్యవస్థవంటిదని అర్థము. అది వేర్వేరు విభాగములు కలిగి ఏవిభాగమునకావిభాగము ప్రత్యేక విధులను నిర్వర్తించుచుండును. ఆ విభాగములన్నియు కలిసి వ్యవహరించుటచే మొత్తముమీద అంగనిర్మాణపు పెరుగుదలకు అవకాశమేర్పడును. స్పెన్సర్ ఇట్టి అంగనిర్మాణమునకును సమాజమునకును సాదృశ్యము తెచ్చెను. సమాజముకూడ వేర్వేరు వ్యవస్థలక్రింద విభజింపవచ్చుననియు వాటి ప్రత్యేక విధులు కలవనియు అతనివాదము. జీవజంతువువలెనే సమాజమునకు ఉత్పత్తి, అభివృద్ధి, క్షైణ్యము అను దశలుండును. జీవజంతువునకుగల భౌతికాంగములవలె సమాజమునకు వివిధములైన సంస్థలు, సంఘములనునవి అంగములు. ఈతనివాదము ప్రకారము జీవజంతువులోని జీవకణములకు ప్రత్యేకవిశిష్టత లేనట్లే సమాజములోని వ్యక్తులకుకూడ ప్రత్యేకవ్యక్తిత్వము ఉనికియుండదు. వ్యక్తులు తమవ్యక్తిత్వమునకు వ్యక్తిశ్రేయస్సునకు కాక సమాజప్రయోజనములకు సమాజాభివృద్ధికి విశేష ప్రాధాన్యమియ్యవలెననునది ఈతని సిద్ధాంతము.

వ్యక్తికిని సమాజమునకును గల సంబంధమును వివరించుటలో పై రెండువాదములు పూర్తిగా తోసిపుచ్చదగినవి కావు. కాని ఈ రెండు వాదములలోగల యథార్థవిషయములను సమన్వయపరచవచ్చును. ప్రతివ్యక్తియు సామాజికసంబంధము యొక్క బిడ్డవంటివాడు; ఏ ఒకవ్యక్తియు ఈసృష్టిలో మొదలును, తుదియు కాజాలడు. జీవనపరంపరలో అతడు కీలకమువంటివాడు. మానవుని సంపూర్ణవికాసమునకు సమాజముయొక్క ఉనికి అత్యంతావశ్యకము. ఒకవ్యక్తి జీవనముతోనే అతని కొక సమాజము, సంప్రదాయము, చరిత్ర, ఆచారవ్యవహారములు ఏర్పడియుండును. అతడు భూమిమీద జన్మించకపూర్వమే ఇవన్నియు నిర్ణయమగును. సామాజికవాతావరణము లేకుండ మానవుడు మానవతను, మానవసమాజమునకు తగిన వాతావరణమును అలవాట్లను నడవడిని అలవరచుకొనలేడు. కావున సంఘము లేనిచో మానవుడే లేడనవచ్చును. అంతమాత్రమున వ్యక్తికిని సమాజమునకును గలసంబంధమును గూర్చి చర్చించునపుడు వ్యక్తి సమాజమునుండి వేరనిగాని లేక సమాజము వ్యక్తికంటె ఉన్నతమైనదనిగాని నిర్ధారణ చేయకూడదు. సామూహికమైన ప్రయోజనముల కై మానవులు ఒకరితో నొకరు చేయి కలిపి అజ్ఞాతమగు ఒప్పందము ప్రకారము కలిసి జీవించుటకు పాటుపడెదరు. అట్టిస్థితినే సమాజమని పిలువవచ్చును. కావున మానవులమనస్సులలో, భావనలలో, అనుభూతులలో సమాజముయొక్క ఉనికి గోచరమగును.

స. ల.
కె. వ.

## సమీకరణములు

వ్యాపారమునందు తులాదండమువలె గణితశాస్త్రమునందు సమీకరణము ప్రముఖపాత్ర నిర్వహించుచున్నది. రెండు సమాసములు సమానము అని నిర్వచించు బీజగణితవాక్యము (Algebraic Statement) ను "సమీకరణము" అందురు.

ఉదాహరణకు — (క) $2x-3y=-3y+2x$

(చ) $(x+1)^2=x^2+2x+1$

(ట) $x+4=7$

మొదలగునవి సమీకరణములు. ఒకసమీకరణములో సమానముగుర్తు ( = ) నకు ఎడమవైపు సమాసమును ఎడమవైపుభాగము (ఎ. వై.) అనియు కుడివైపు సమాసమును కుడివైపుభాగము (కు. వై.) అనియు అందురు. పైనఉదహరించిన (క) యందు—

$x=3,\ y=1$ అయిన

ఎ. వై. $=2\times3-3\times1=6-3=+3$ మరియు

కు. వై. $=-3\times1+2\times3=-3+6=+3$

ఎ. వై. $=$ కు. వై.

అటులే (చ) నందును $x=0, 1, 2, 3$ విలువలు ప్రతిక్షేపించిన సమీకరణము సరిపోవును. అట్లు చలనరాముల విలువలన్నిటికి సరిపోవుసమీకరణమును "సర్వసమీకరణము" (Identity) అందురు. కాని (ట) $x+4=7$ అనుసమీకరణము $x=3$ అయినప్పుడే సరిపోవును. $x$కు మరియే ఇతర

విలువనిచ్చినను అదినరిపోదు కావున చలనరాసుల ప్రత్యేక విలువలకు మాత్రమే సరితూగు సమీకరణములు నిబంధన సమీకరణములు (conditional equations) లేక కాదుక భావలో సమీకరణములు అని అందురు

సామాన్యసమీకరణము లేక ఏకవర్ణ సమీకరణము ఒక సమీకరణమును సూక్ష్మీకరించినపిదప ఒకే చలనరాశి కల్గి ప్రథమపరిమాణములో (First Degree) నున్నయెడల దానిని సామాన్య సమీకరణము లేక ఏకవర్ణసమీకరణము" అందురు

ఉదా:— (క) $\frac{x}{12} + \frac{1}{2} = \frac{1}{4}$

లేక

$$x+6=3$$

(చ) $2x+7 = 3x-5$

సమీకరణములోని అవ్యక్తరాసుల విలువలను కనుగొను పద్ధతిని "సమీకరణమును సాధించుట అనియు వాటివిలువలను "మూలములు" అనియు తెలిసికొనవలయును

సమీకరణమును త్రాసుతో పోల్చవచ్చును త్రాసు యొక్క రెండుపళ్లెములు సమీకరణములోని కుడి ఎడమ భాగములను పళ్లెములను కలుపు దండి సమీకరణములోని సమానము గుర్తు ( = )ను పోలియున్నవి

రెండుపళ్లెములలోని వస్తువులబరువు సమానమైయున్నపుడు సమానబరువు కలిగిన వస్తువులను రెండువైపులకలిపినను లేక తీసివేసినను త్రాసునందు ఏమార్పును ఉండదు అట్లే బరువును ఇరువైపుల రెట్టింపుచేసినను లేక సగముచేసినను త్రాసు స్థిరముగా నుండును సమీకరణములకు ఈసామ్యము వర్తించును

సమీకరణము లను సాధించుట ఈక్రిందినాలుగు ప్రత్యక్ష సిద్ధాంతముల (Axioms) పై ఆధారపడియున్నది

(1) సమానరాసులకు సమానరాసులను కలిపినయెడల మొత్తములు సమానములుగనుండును

(2) సమానరాసులనుండి సమానరాసులను తీసివేసినచో శేషరాసులు సమానములగును

(3) సమానరాసులను సమానరాసులచే గుణించినచో లబ్ధములు సమానములగును

(4) సమానరాసులను సమానరాసులచే భాగించిన యెడల భాగఫలము సమానముగనుండును

ఉదా:— $2x-8=15$ (1)

ఇరువైపులకు 8 కలిపినచో

$$2x-8+8 = 15+8$$

$$2x = 15+8 \quad (2) \text{ అగును}$$

(1) మరియు (2) లను పరిశీలించినచో ఎడమవైపున నున్న −8 కుడివైపున +8 గా ప్రత్యక్షమైనది అదే విధముగా కుడివైపుననున్న పదమును ఎడమవైపునకు మార్చిన 'గుర్తు' మారును పదముల మార్పిడిచేత సమీకరణము సాధింపబడును

రెండు అవ్యక్తరాసులను ఉమ్మడిగా రెండు సామాన్య సమీకరణములను తృప్తిపరచినపుడు వాటిని సమన్విత సమీకరణములని పేర్కొందురు

$$(1) \quad \left.\begin{aligned} 2x+3y &= 18 \\ 3x+4y &= 12 \end{aligned}\right\}$$

$x, y$ లు అవ్యక్తరాసులు

$$(2) \quad \left.\begin{aligned} 4k-5h &= 2 \\ 7k+3h &= 27 \end{aligned}\right\}$$

$k, h$ లు అవ్యక్తరాసులు

$$(3) \quad \left.\begin{aligned} 2\text{క} + 3\text{చ} &= 18 \\ 3\text{క} + 4\text{చ} &= 18 \end{aligned}\right\}$$

ఇందు క చ లు అవ్యక్తరాసులు

మూడు అవ్యక్తరాసులు ఉమ్మడిగా మూడు త్రివర్ణ సామాన్యసమీకరణములను తృప్తిపరచినపుడు వాటిని "సమన్విత త్రివర్గసమీకరణములు (Simultaneous equations in three unknowns) అందురు

$$\text{ఉదా} — \left.\begin{aligned} 3x+y+2z &= 13 \\ x+4y+3z &= 14 \\ 2x+3y+4z &= 16 \end{aligned}\right\}$$

ఇందు $x, y, z$ లు అవ్యక్తరాసులు

$n$ అను అవ్యక్తరాసులయొక్క విలువలను కనుగొనవలె నన్నచో అవే అవ్యక్తరాసులు కలిగిన $n$ యొక్క సామాన్యసమీకరణములు అవసరము

వర్గసమీకరణములు (Quadratic Equations)

ద్వితీయపరిమాణములో నుండు సమీకరణమును వర్గసమీకరణమందురు ఇది సాధారణముగా $ax^2+bx+c=0$ ($a \neq 0$) అను రూపములోనుండును ఇందు $a, b, c$ లు స్థిర

రాసులు దీనిని సాధారణ వర్గసమీకరణమని అందురు. శబ్దము లోపించిన (ఉదా - $7x^2-63=0$) యెడల దానిని శుద్ధవర్గ సమీకరణమని అందురు.

వర్గసమీకరణముల చరిత్ర చాలపురాతనమైనది. ప్రాచీన హిందూగణితశాస్త్రజ్ఞుడగు బ్రహ్మగుప్తుడు (క్రీ శ 680) వర్గ సమీకరణమును సాధించుటకు ఆధారములు కలవు. అష్టే 9వ శతాబ్దమున బాగ్దాదులో ఏడవఅబ్బాసిద్ ఖలీఫా కాలమున అల్‌ఖ్వారిజ్మి అను ప్రఖ్యాత గణితశాస్త్రజ్ఞుడుకూడ ఈవిషయములో విజయము గాంచెను. అంకగణితమునకు (arithmetic) ఆనాడు వాడుకలోనున్న అల్‌గొరితమ్ అనుశబ్దము పై శాస్త్రజ్ఞుని నామము యొక్క వికృతిరూపమే. మరియు అరబ్బీపదము "అల్‌జీబ్రా" సమీకరణము సాధించునపుడు అల్‌ఖ్వారిజ్మి యొక్క పదముల మార్పిడి పద్ధతిని సూచించును.

12వ శతాబ్దపు హిందూగణితశాస్త్రజ్ఞుడు భాస్కరాచార్యుడు అతని "బీజగణితము" నందు వర్గసమీకరణమును ఈ క్రిందనుదహరించిన పద్ధతిలో సాధించెను. దీనిని సామాన్యముగా "శ్రీధరాచార్యుల పద్ధతి" అందురు.

మొదటిపద్ధతి —

$$ax^2+bx+c=0 \quad (a\neq 0)$$

$$ax^2+bx = -c$$

$4a$ చే ఇరువైపుల గుణించగా

$$4a^2x^2+4abx = -4ac \text{ అగును}$$

$b^2$ ను ఇరువైపుల కలిపినచో

$$4a^2x^2+4abx+b^2 = b^2-4ac$$

$$(2ax+b)^2 = b^2-4ac$$

$$2ax+b = \pm\sqrt{b^2-4ac}$$

$$2ax = -b\pm\sqrt{b^2-4ac}$$

$$x = \frac{-b\pm\sqrt{b^2-4ac}}{2a}$$

రెండవపద్ధతి — ఈపద్ధతి మొట్టమొదటిసారిగా అరబ్బీ గణితశాస్త్రజ్ఞుడగు మహమద్ బిన్ మూసాచే ప్రవేశపెట్టబడినది.

$$ax^2+bx+c = 0 \longrightarrow (1) \quad (a\neq 0)$$

$x = y+z$ అనుకొనుము

$$a(y+z)^2+b(y+z)+c = 0$$

$$ay^2+y(2az+b)+(az^2+bz+c) = 0 \qquad (2)$$

$y$ యొక్క గుణకమును శూన్యమునకు సమానము చేసినచో

$$2az+b = 0 \qquad z = -b/2a \text{ అగును}$$

$$ay^2+(az^2+bz+c) = 0$$

$$y^2 = \frac{-az^2+bz+c}{a} \qquad (3)$$

$z$ యొక్క విలువను (3) నందు ప్రతిక్షేపించిన

$$y^2 = -\frac{1}{a}\left[a\times\frac{b^2}{4a^2}-\frac{b^2}{2a}+c\right]$$

$$= -\frac{1}{a}\left[\frac{b^2-2b^2+4ac}{4a}\right]$$

$$= -1/a\left[\frac{-b^2+4ac}{4a}\right]$$

$$= \frac{b^2+4ac}{4a^2}$$

$$y = \pm\frac{\sqrt{b^2+4ac}}{2a}$$

కావున $x = y+z$

$$= +\frac{\sqrt{b^2+4ac}}{2a}-\frac{b}{2a}$$

$$x = \frac{-b\pm\sqrt{b^2-4ac}}{2a}$$

మూడవపద్ధతి — సామాన్యముగా వాడుకలోనున్న ఈ సులభపద్ధతి వర్గము పూర్తిచేసి $x$ యొక్క రెండువిలువలను కనుగొనుటయే. ఇది యోగాలకారకాంకముల పద్ధతిలో గూడ విలువలను సాధించవచ్చును కాని ఇది ఎల్లవేళల సాధ్యముకాదు.

వర్గసమీకరణపరిమాణము రెండు కావున అవ్యక్తరాశియగు "x" నకు రెండువిలువలుమాత్రమే యుండును. వర్గసమీకరణము శుద్ధమైనపుడు రెండు మూలముల యొక్క అంకవిలువ సమానమేగాని గుర్తుమాత్రము భిన్నముగనుండును. ఉదా - $x^2 = 25$ అయినచో $x$ విలువ $+5$ లేక $-5$ ఉండును. దీనినే $x = \pm 5$ (Plus or minus 5) అని వ్రాయవలెను. $ax^2+bx+c=0$ అను వర్గసమీకరణమున మొదటిరెండు పద్ధతులలో $x$ విలువలు

$$\frac{-b+\sqrt{b^2-4ac}}{2a} \text{ లేక } \frac{-b-\sqrt{b^2-4ac}}{2a}$$

అని తెలిసికొంటిమికదా! అందు $(b^2-4ac)$ అనునది నిర్ణయరాశి అందుము. ఏలనన మూలముల స్వభావము దానివిలువపై ఆధారపడియుండును.

ఘన సమీకరణము

తృతీయ పరిమాణములోనుండు సమీకరణమును ఘన సమీకరణమందురు అనిశ్చితరాశి ఒక్కటే ఉన్నచో ఘనసమీకరణము యొక్క సామాన్యరూపము $x^3 + px^2 + Qx + R = 0$ అగును

క్రీ పూ 2000 సం॥ నుండి క్రీ శ 1500 వరకు ఘనసమీకరణమును సాధించుటకు ప్రయత్నించిన శాస్త్రజ్ఞులలో కాని లోనియా గణితశాస్త్రజ్ఞులుమాత్రము ఇంతవరకు కృతకృత్యులై మార్గదర్శకులైరి ఆతరువాత (క్రీ శ 1505) స్కిపియోఫెరో అనునాతడు ఈఘనసమీకరణమును సాధించుటకు కొన్ని విధానములుగలవు కాని అప్పటివరకు ఘనసమీకరణమునకు మూలములుగా నిజరాసులు మాత్రమే యుండునవియు ఊహ్యరాసులు (Imaginary or Complex)మూలములుగా నుండుటకు వీలులేదనియు ఆ శాస్త్రవేత్తలు తెలిసికొనిరి

$$\text{ఉదా} — x^3 + 2x^2 - x - 2 = 0$$

$$(x+1)(x-1)(x+2) = 0$$

$$x = +1 \text{ or } -1 \text{ or } -2$$

కావున అప్పటిలో రేఖాగణితపద్ధతి మూలమున సులభముగా మూలములను కనుగొనెడివారు కాని పైటా అనుప్రాంతి శాస్త్రజ్ఞుడును టార్టాగ్లియా (1500 – 1557) కార్డాన్ (1501 – 576) అను ఇటలీ గణితశాస్త్రజ్ఞులును నూతనమార్గములను కనుగొనిరి వీరిపద్ధతి గణితశాస్త్ర చరిత్రలో చాలముఖ్యమైనది వీరిమూలములనే ఊహ్యాంశవ్యాఖ్యానము యొక్క ఉపయోగము మొట్టమొదట ప్రపంచమునకు తెలియవచ్చినది

ఇచ్చిన $x^3 + px^2 + Qx + R = 0$ అనుఘనసమీకరణమున రెండవపదము శూన్యమునకు సమానముచేసి

$x^3 + Qx + r = 0$గా సూక్ష్మీకరించవలెను దీనిని సాధించుటకు $x = y + z$ అనుకొనుము

$$y^3 + z^3 + (3yz + Q)x + r = 0$$

x యొక్క గుణకమును సున్నకు సమానముచేసిన

$3yz + Q = 0$ లేక $yz = Q/3$ అగును

$$y^3 + z^3 = -r \quad y^3 z^3 = -\frac{Q^3}{27}$$

కావున $y^3 z^3 t^2 + rt - \frac{Q^3}{27} = 0$ అను వర్గసమీకరణము యొక్క మూలములగును

$$y^3 = -\frac{r}{2} + \sqrt{\frac{r^2}{4} + \frac{Q^3}{27}} \qquad (1)$$

$$z^3 = -\frac{r}{2} - \sqrt{\frac{r^2}{4} + \frac{Q^3}{27}} \qquad (2)$$

(1) (2)ల నుండి y z ల విలువలు గణనచేయవచ్చును కావున $x = (y+z)$ విలువనుగూడ సులభముగా కనుగొనవచ్చును ఇందువలన తొమ్మిది విలువలు వచ్చును కాని $yz = -\frac{Q}{3}$ అయినందువలన y z ల బద్ధము అంగీకరణీయముగానుండవలెను

పై నిబంధనమాధారముగా మూడువిలువలు మాత్రమే సాధ్యమగును అనగా సమీకరణము యొక్క మూడుమూలములు

(క) $y+z$ (చ) $wy + w^2z$ (ట) $w^2y + wz$

ఇచ్చట $w$ $w^2$ అనునవి ఏకము (Unity) యొక్క ఊహ్యఘనమూలములని గమనించవలెను

n పరిమాణముగల అంశణీయపూర్ణాంక సమాసమును శూన్యమునకు సమానము చేసినచో అది సర్వసాధారణసమీకరణమగును అనగా

$$x^n + p_1 x^{n-1} + p_2 x^{n-2} + \dots + p_{n-1} x + p_n = 0$$

X నందు వరుసగా సామాన్య వర్గ ఘనసమీకరణములు వచ్చును

కొన్నిముఖ్యసూత్రములు —

(1) n–పరిమాణముగల సమీకరణమునందు మూలములసంఖ్య n కన్నఎక్కువఉండదు (n విలువను అధిగమించదు)

(2) పై సమీకరణమునందలి గుణకములు నిజరాసులైనచో మూలములలో ఊహ్యమూలములు జతలుగానుండును

(3) డెకార్టేసంజ్ఞాసూత్రములు (Descartes rule of Signs)

(ii) $f(x) = 0$ అను సమీకరణముయొక్క ధనమూలములసంఖ్య చానిపదములగుర్తులయొక్క మార్పుల సంఖ్యను అధిగమించదు

ఉదా॥ $f(x) = x^5 - 3x^2 + x - 1 = 0$ నందు పదములగుర్తులను వరుసగావ్రాసిన $+ - + -$ అగును ఇందు మొత్తము 3మార్పులుగలవు అనగా ఇచ్చిన సమీకరణ

ణమునందు ధనమూలములు 8కంటె ఎక్కువ ఉండవు

iii $f(x) = 0$ అను సమీకరణముయొక్క ఋణమూల సంఖ్య $f(-x) = 0$ పదములగుర్తులయొక్క మార్పుల సంఖ్యను అధిగమించదు

సమీకరణముయొక్క పరిమాణము 4కంటె ఎక్కువైనచో దానిని సాధించుటకు వీలుగాదని ఏబెల్ అను గణితశాస్త్రజ్ఞుడు నిరూపించెను కాని సమీకరణములోని గుణకములు పూర్ణాంకములైనపుడు నిజమూలముయొక్క అత్యంతసన్నిహితవిలువను హార్నర్ పద్ధతిలో కనుగొన నగును

ఆధునిక గణితశాస్త్రము నందు $\frac{1}{2}+\frac{1}{2}=1$ అను సమీకరణముయొక్క అర్థమును ఆలోచించినకొలదియు అది పలువిధములుగ మారును అనగా ఏదేని రెండు సగములను కలిపినచో ఒకటికి సమానము అనిగదా పై సమీకరణముయొక్క భావము! ఒకటి అనునది జీవరాశియైనచో పై సమీకరణమునకు అర్థములేదు అట్లుగాక "1" అనుసంకేతము నిర్జీవరాశులకుపయోగించినచో పై సమీకరణము ఎల్లవేళల సత్యమగునేమో పరిశీలించెదము

ఉదా :- '1' అనుసంకేతము ఏదేని ఒక పండువిలువ అనుకొందుము '½' అనునది సగము పండుయొక్క విలువ యగును ఒక పనసపండ్ల వ్యాపారి ఒకపండును రు 1-75పై చొప్పున అమ్మును అట్లుకాక అదేపండును రెండుసగములుగా చేసి ఒక్కొక్కదానిని రూ 1-00కి అమ్మవచ్చును అట్టిచో ఒకపండువిలువకంటె రెండుసగముల విలువవలన అతనికి లాభము ఎక్కువ లభించునుగదా! అనగా దానిని $\frac{1}{2}+\frac{1}{2}>1$ అని వ్రాయవలెను పైవిధముగానే మరేదైన వస్తువును ఉదహరించి $\frac{1}{2}+\frac{1}{2}<1$ అనికూడ నిరూపించవచ్చును

అయితే $\frac{1}{2}+\frac{1}{2}=1$ అనుదానిని నిత్యజీవితములో ఎల్లవేళల సత్యముగ తేము గణితశాస్త్రములో ఉపయోగించబడు +, —, ×, — అను సంకేతమునకు నిత్యజీవితములో అర్థమును కల్పించుట చాలాకష్టము వాటిని ఆధునిక గణితశాస్త్రములో ప్రయోగములు (Operations) అని యందురు

ఉదా :- $x(+)y = y(+)x$ అనుసామాన్యసమీకరణమును వివరించిన x ను y పై ప్రయోగించినపుడు వచ్చు ఫలితము y ని x పై ప్రయోగించునపుడు వచ్చు ఫలితముతో సమానమని అర్థము. ఫలితము సమానము కానియెడల

$$x(+)y \neq y(+)x$$ అగును

ఉదాహరణమునకు రసాయనశాలలో సజలనత్రికామ్లమును తయారుచేయవలెననుకొందుము ఇందు x అనునది గాఢనత్రికామ్లము అనుకొందుము y అనునది నీరు అనుకొందుము (+) అనగా ద్రవమును లను పరీక్షనాళికలో కలుపుట దీనిని బట్టి పై సమీకరణములోని ఎడమవైపు $x(+)y$ అనగా ఒకపరీక్షనాళికలో నీరుతీసుకొని గాఢనత్రికామ్లమును కలుపుట అని అర్థము ఫలితము సజలనత్రికామ్లము అట్లుగాక కుడివైపు $y(+)x$ అయినచో ఫలితము పరీక్షనాళిక వేడివలన బద్దలగుటయే అగా

$$x(+)y \neq y(+)x$$

అనగా బీజగణితమునందును అంకగణితమునందును సామాన్యముగా వర్తించు వ్యత్యయన్యాయము (Commutative Law) కూడ ఇచ్చట ఎల్లప్పుడును వర్తించదు

x y లకును ప్రయోగములకును కల్పించు అర్థములను బట్టి సమీకరణములు ఆశ్చర్యకరములగు ఫలితముల నిచ్చును

వి రా

## సముద్రగుప్తుడు

భారతదేశచరిత్రలో దేశసమైక్యముకొరకు సాగినకృషి ప్రధానమైనది రాజకీయరంగమున దానిని సాధించినవారు యోధులైన రాజులు మౌర్యసామ్రాజ్యము క్షీణించినపుడు దేశము రాజకీయముగా ఐకమత్యమును కోల్పోయి ఛిన్నాభిన్నమైనది విదేశీయుల దండయాత్రలతో దేశీయపాలకుల అంతఃకలహములతో అల్లకల్లోలము పాలైనది ఇట్టిదుర్గతిని తొలగించిన కీర్తి గుప్తరాజవంశమునకు దక్కినది యోధాగ్రేసరులు పాలనాదక్షులు అయిన గుప్తరాజులు ఉత్తరదేశమందలి చాలాభాగమును తమ ఏకచ్ఛత్రాధిపత్యముక్రిందికి తెచ్చి ప్రజలకు శాంతిభద్రతలను సాధించిపెట్టిరి అచ్చట పాడిపంటలు వర్తకవాణిజ్యములు వివిధవిద్యలు లలితకళలు, సంస్కృతి వెల్లివిరిసినవి ఆదొక స్వర్ణయుగముగ భాసించినది నాటిమహోజ్జ్వలచరిత్రలో ప్రముఖపాత్రను నిర్వహించినవారిలో సముద్రగుప్తుడు పేర్కొనదగినవాడు

పాటలీపుత్ర ప్రాంతమునమున్న గుప్తరాజ్యమును స్వతంత్రరాజ్యముగా మార్చి పాలించినవాడు మొదటిచంద్రగుప్తుడు (క్రీ శ. 319—335) ఇతనిపుత్రుడు సముద్రగుప్తుడు తండ్రి అనంతరము అతడు గుప్తరాజ్యసింహాసనమును అధి

క్షించెను. ఇందుకు సంబంధించిన గాథ ఒకటికలదు. మొదటి చంద్రగుప్తుడు తనతరువాత రాజ్యమునేలుటకు సముద్రగుప్తుని నియమించెననియు అందుకు సముద్రగుప్తుని అన్న (కచ) సమ్మతింపక తండ్రి మరణానంతరము సింహాసనమునకై పోరాడెననియు అందు సముద్రగుప్తుడు అన్నను ఓడించి సింహాసనము నాక్రమించెననియు ఈగాథయొక్క సారాంశము. అయితే చాలామంది చరిత్రకారులీగాథను విశ్వసింపరు. ఎట్లయినను సముద్రగుప్తుడు క్రీ శ 335 ప్రాంతమున రాజ్యపాలనము ప్రారంభించి 380వరకుసాగించెను.

సుదీర్ఘమైన ఆతనికాలమున ప్రముఖముగ కనబడునది ఆతని దిగ్విజయపరంపర. దీనిని ఆతని సేనానియైన హరిసేనుడు 'ప్రశస్తి' రూపమున వర్ణించినాడు. ఈ "ప్రశస్తి" ప్రస్తుతము అలహాబాదునందున్న శిలాస్తంభము మీద లిఖింపబడియున్నది. అది ఆగుప్తచక్రవర్తి దిగ్విజయచరిత్రకు మూలాధారము. దానిననుసరించి ఆతని జైత్రయాత్ర లిట్లు సాగినవి.

సింహాసనమునెక్కినవెంటనే సముద్రగుప్తుడు ఉత్తరదేశమునందున్న పాలకులపై బడెను. అహిచ్ఛత్రమునేలు అచ్యుతనాగ మథురపై అధికారముగల నాగసేన పద్మావతిని పాలించు గణపతినాగ ప్రభృతులు ఆతనిచే ఓడింపబడిరి. మగధ సరిహద్దునగల కోటవంశప్రభువుకూడ ఆతనికి లోబడినాడు. ఈవిజయముల ఫలితముగా ఉత్తరదేశమందలి మధ్య తూర్పుభాగములు గుప్తసామ్రాజ్యములో లీనమైనవి.

అంతట సముద్రగుప్తుడు తనదృష్టిని దక్షిణదేశముపైపు మరల్చినాడు. దక్షిణాదిన జరిగిన ఆతని దండయాత్రను వర్ణించునప్పుడు ఆతని సేనాని హరిసేనుడు జయింపబడిన రాజులయొక్క వారిరాజ్యములయొక్క పేర్లను వివరముగా పేర్కొనెను. ఆరాజ్యములుదక్షిణదేశమున ఎచ్చటనుండెనోను విషయమై చరిత్రకారుల నడుమఅభిప్రాయభేదముతేర్పడినవి. అందుచే దక్షిణమున సముద్రగుప్తుని దిగ్విజయము ఎంతవరకు సాగినదో కచ్చితముగా చెప్పజాలము. ఎరండపల్లి దేవరాష్ట్ర రాజ్యములు వివాదగ్రస్తములైనవి. స్మిత్ మున్నగు చరిత్రకారులు మొదట వీటిని ఖాన్‌దేశ్‌లోని ఎరండోల్ మహారాష్ట్రరాజ్యములుగా గుర్తించిరి. అందుచే, దక్షిణదేశమున తూర్పుతీరమువెంట కంచివరకును పడమటితీరమునగల మహారాష్ట్ర ఖాన్‌దేశ్ ప్రాంతములను సముద్రగుప్తుడు జయించెనని వారూహించిరి. అనగా దక్షిణమున ముఖ్యభాగమంతయు సముద్రగుప్తుడోడించినట్లు వారినిర్ణయము. ఇందుకు విరుద్ధముగా మరియొక ఊహకలదు. దానిననుసరించి సముద్రగుప్తుడు ఒరిస్సాతీరమును దాటి దక్షిణమునకు వెళ్లలేదనితెలుచున్నది. ఈఅభిప్రాయము సముద్రగుప్తుని విజయమును సంకుచితమొనర్చును. పైరెండు అభిప్రాయములకు భిన్నముగా మరొకటి కలదు. దీనిప్రకారము ఆతడు నేటి మధ్యప్రదేశ్‌లోని తూర్పుప్రాంతమును ఒరిస్సాతీరమును ఆంధ్రదేశమును తమిళదేశములో కంచివరకును జయించెను. ఈవిషయమును అధునికరచయితలలో పెక్కురు అంగీకరించుచున్నారు. ఆంధ్రదేశమున శ్రీకాకుళముజిల్లాలోని ఎరండపల్లి ప్రాంతమునేలిన దామనయు విశాఖపట్టణముజిల్లాలోని కొత్తూరు రాజ్యమునేలిన స్వామిదత్తుడను పిఠాపురమును పాలించిన మహేంద్రుడును వేంగిని పాలించిన హస్తివర్మయు నెల్లూరుప్రాంతమునేలిన ఉగ్రసేనుడును సముద్రగుప్తునిచే జయింపబడిరి. ఆతనికి లొంగిపోయిన అవముక్తరాజ్యము గోదావరీతీరముననేకలదట. దక్షిణదేశమందు జయించినరాజ్యములను తనసామ్రాజ్యములో చేర్చుకొనక సముద్రగుప్తుడు వాటిని తిరిగి ఆయారాజులకిచ్చివైచెనట! దీని అంతరార్థమును గ్రహింపలేని గ్రంథకర్తలు ఆతడు దక్షిణదేశపాలకులను జయింపనేలేదనియు పైపెచ్చువారిచే ఓడింపబడెననియు విపరీతవ్యాఖ్యానములు చేసిరి. ఆతడు జయించిన రాజ్యములను తిరిగి ఇచ్చివేయుటకు ముఖ్యకారణము ఆతని కీర్తికాంక్షయే కాని లోభపూరితమైన సామ్రాజ్యవిస్తరణకాంక్ష కాదట!

సముద్రగుప్తుడు దక్షిణాపథమునందలి రాజన్యులతో పోరాడునప్పుడు ఉత్తరదేశమునందలి ప్రభువులు కొందరాతనికి ఎదురుతిరిగిరి. నాగదత్త గణపతినాగ నాగసేన మొదలైనవారు వాకాటకచక్రవర్తియగు రుద్రసేనుని నాయకత్వమున ఏకమై గుప్తసామ్రాజ్యమును కూలద్రోయుటకు సిద్ధపడిరి. కౌశాంబిప్రాంతమున ఇరుపక్షములకు జరిగిన ఘోరయుద్ధములో సముద్రగుప్తుడు వారినందరినిఉక్కుమ్మడిగ ఓడించి తన బలపరాక్రమములను ప్రదర్శింపగల్గినాడు.

అనంతరము నేటి మధ్యప్రదేశ్ పరిసరములందలి ఆటవిక రాజ్యము లాతనికి లోబడినవి. తూర్పుబెంగాలు అస్సాము నేపాలు రోహిల్‌ఖండ్‌లందలి రాజులు తమకుతామే ఆతనికి తలయొగ్గిరి. ఆతని సామ్రాజ్యమునకు దక్షిణపుసరిహద్దునమున్న

గణరాజ్యములాతనికి కప్పము లర్పించినవి. విదేశీయపాలకులలో కాబూల్ నదీప్రాంతమును పాలించు కుషాణప్రభువు వశి మదికనున్న శకపాలకులు దక్షిణమున సింహళమునేలు మేఘవర్ణుఁడును గుప్తచక్రవర్తి స్నేహమునర్థించిరి. భారతదేశమావల జావా సుమత్ర మొదలగు దీవులపైకూడ సముద్రగుప్తుని పెత్తనము సాగెనట! సువిశాలదేశమున నిరాటంకముగ సాగిన అతని దిగ్విజయముల దృష్ట్యా అతడు అశ్వమేధయాగము నొనర్చి తనవిజయమును చాటుకొని తద్ద్వారా తనసార్వభౌమత్వమును ప్రకటించుకొనెను. యూరపు చరిత్రకారులతనిని నెపోలియనుతో సమానమైన యోధాగ్రేసరునిగా ప్రశంసించిరి.

సముద్రగుప్తుడు రాజ్యములను జయించుటలో నేకాక పాలనవిర్వహణములోను చాలసమర్థుడు. తనరాజధానియగు పాటలీపుత్రమునకు బహుదూరమునయున్న దక్షిణాపథ రాజ్యములను జయించికూడ వాటిని తిరిగి ఇచ్చివేయుట ఆతని రాజకీయవివేకమునకు ప్రబలనిదర్శనము. రాజ్యవిస్తరణమును విపరీతముగ చేసి అందుచే ఏర్పడు పాలనానిర్వహణభారముచే కృంగిపోవుటకిష్టములేక ఉత్తరదేశమందలి సామ్రాజ్యమునకు సుపరిపాలనమునిచ్చుటతోనే సంతృప్తి చెందిన రాజనీతిజ్ఞుడతడు. కత్తిపట్టి శత్రువులను జయించుటయందేకాక కలముపట్టి కావ్యమును రచించుటయందుకూడ అతనికి నేర్పుకలదు. అందుకాతడు 'కవిరాజు' అనుకీర్తిని గడించినాడట! అంతేకాక సంగీతమాతనికి ప్రియమైన కళ. అతని నాణెములపై అతడు వీణను వాయించు దృశ్యము కన్పడును. అతడు హిందూ మతోద్ధరణమునకు పాటుపడిన ప్రభువైనను ప్రాచీన భారత పాలకులవలె మతసామరస్యమును పాటించినవాడు. బౌద్ధులకు దానధర్మములు చేయుట, సింహళపాలకుడైన మేఘవర్ణుకు బుద్ధగయలో బౌద్ధమతవిహారనిర్మాణమునకై అనుమతినొసగుట బౌద్ధమతమునెడల అతనికిగల అభిమానమును చాటగలదు.

సముద్రగుప్తుడు మహాయోధుడు; రాజనీతిజ్ఞుడు; కవిపండితపోషకుడు; లలితకళాభిమాని; మతోద్ధారకుడు. గుప్తరాజులపై భవనము నిలబెట్టుటకెంతయో తోడ్పడిన మహాప్రభువు. భారతదేశపాలకులలో అతనిస్థానము ఉన్నతమైనది.

ఓ. న. మూ.

## సముద్రప్రవాహములు-పవనములు

వాతావరణములో నిర్ణీతమైన పవనములు ఏర్పడునట్లే సముద్రములందు నిర్ణీతప్రవాహములేర్పడుచుండును. సముద్రప్రవాహములు విభిన్నజలసమూహములను విభిన్నప్రాంతములకు కొనిపోవుచుండును. ఈ సాగరప్రవాహములు మూడు విధములు.

(1) సముద్రజలమందు సాంద్రతాభేదమువలన ఏర్పడునట్టివి.

(2) పవనములశక్తిచే ఏర్పడు ఉపరిజలప్రవాహములు.

(3) సముద్రపు ఆటుపోటులవలనను అంతరతరంగములవలనను ఏర్పడునట్టివి.

అమెరికాసంయుక్తరాష్ట్రముల తూర్పుతీరమువెంబడి ప్రవహించు గల్ఫ్‌ప్రవాహము, జపాన్ తూర్పుతీరమువెంబడి ప్రవహించుకుర్యోషియోప్రవాహము, భూమధ్యరేఖాప్రాంతమందలి ఉష్ణప్రవాహములు, ఆఫ్రికా పశ్చిమతీరమున ప్రవహించు బెంగులా ప్రవాహము మొదలగునవి ప్రవాహముల కుదాహరణములు. ఒకేవైపునుండి స్థిరముగా వీచు పవనముల శక్తిచే సముద్రోపరిజలప్రవాహములేర్పడును. సాగరప్రవాహముల స్థితిగతులపై పవనముల ప్రభావమెక్కువగా నుండును. సముద్రపు ఆటుపోటులవలనను అంతరతరంగములవలనను ప్రవాహములేర్పడును. ఇట్లేర్పడిన ప్రవాహములు విపర్యయముగా (reverse in direction) నుండును. ఇవి మిగులవేగవంతమైనవైనను జలమందు గణింపదగు మార్పులను కలుగజేయజాలవు. వాతావరణముపైగూడ వీటిప్రభావము తక్కువ.

పైన పేర్కొనిన మూడువిధములైన ప్రవాహములు ఒకేసమయమున ఒకేప్రాంతమున ఏర్పడవచ్చును. వేర్వేరుగా వాటిని గుర్తించుట కష్టము. సాగరప్రవాహగతులను గుణించుటకుగూడ వాతావరణమందువలె (1) భూమ్యాకర్షణశక్తిని (2) ప్రేషప్రమాణశక్తిని (Pressure gradient force) (3) కొరియాలిస్ ప్రమాణమును (4) ప్రవాహముల వలన గలుగు ఘర్షణశక్తిని గుణింపవలెను.

పవనప్రధావితములగు ప్రవాహముల వేగము పవనముయొక్క శక్తిపై ఆధారపడియుండును. అనగా ప్రవాహములు కొనిపోవు జలసంచయము మొత్తము పవనశక్తిపై ఆధారపడియుండునన్నమాట. సముద్రజలచలనము గాలి

వీచు దిక్కునకు లంబదిశగానుండును. ఇది నీటిలోతుపై ఆధారపడియుండదు. ప్రవాహములు కలుగజేయు జలసమూహముల చలనముదృష్ట్యా ఇది ముఖ్యమైన విషయము.

నిర్ణీతమైన దిక్కులనుండి యొకొక పవనములు ఒకప్పుడు అభిసరణముగాను (converging) మరియొకప్పుడు అపసరణముగాను (diverging) వీచుచుండును. ఇట్టి పవనములవలన అల్పసాంద్రతగల సముద్రోపరిజలమంతయు ఒకచోట చేరి సముద్రజలమట్టము పెరుగవచ్చును. కొన్నిప్రాంతములందు అధికసాంద్రతగల జలము సముద్రపులోతులనుండి పైకి వెడలి వచ్చును. ఈవిధముగ పవనములవలన కలుగు ప్రవాహములు సముద్రజలములలో సాంద్రతభేదములను కలుగజేయును.

సముద్రోపరితలముపై వీచు గాలులవలన తరంగములు లేచును. పవనముకంటె తక్కువ వేగముతో ఈకెరటములు పవనము వీచు దిక్కుగనే పోవుచుండును. ఇట్లేర్పడిన తరంగములు రెండువిధములు (1) పురోగమనతరంగములు పవనముతో ప్రయాణించును (2) నిశ్చలతరంగములు నిశ్చలముగా నున్నట్లు కన్పించును. ఇట్లేర్పడిన తరంగప్రమాణములందు భేదములుండవచ్చును. దీర్ఘతరంగములు హ్రస్వతరంగములు అని వాటిలక్షణములచే పేర్కొనవచ్చును. చలనగతిచే దీర్ఘతరంగములందు కలుగు శక్తి హ్రస్వతరంగములందుకంటె రెట్టింపు ఎక్కువ. వీచెడి పవనశక్తినుండియే తరంగములు శక్తిని గ్రహించును. ఇట్లేర్పడిన కెరటములకు ఒకవైపుననే ఒత్తిడి ఎక్కువగనుండగా మరుగువైపున ఒత్తిడి తక్కువగనుండును. ఇందుమూలముగా కెరటములు పైకిలేచును. వాటియందు గర్భితమైన శక్తికూడ ఎక్కువే. తరంగదైర్ఘ్యమునందలి ఏడవవంతుకంటె ఎక్కువపైగా కెరటము లేవదు; కాని ఒత్తిడి ఎక్కువైనకొలది తరంగము పైకిలేచును. పైన పేర్కొనిన ప్రమాణమును దాటినచో తరంగము పతనమగును. ఇట్టిప్రక్రియలో జలఘర్షణమువలన తరంగాగ్రములు చెదరుటచే అవి తెల్లగాకన్పించును. అప్పుడు పురోగమించు తరంగాగ్రములు పరుగిడుతున్న శ్వేతాశ్వములవలె కన్పించును.

దైర్ఘ్యము పెరిగినకొలదియు తరంగము పవనమునుండి మిక్కుటముగా శక్తిని గ్రహించి పైకిలేచును. అట్టితరంగములు ఎక్కువకాలము ప్రయాణము చేయుటచే తమయందు ఎక్కువ శక్తిని గుప్తముచేసికొనును. తరంగదైర్ఘ్యము పెరిగినకొలదియు తరంగవేగము హెచ్చుచుండును. తరంగదైర్ఘ్యము పవనము కలుగజేయు ఒత్తిడిపై ఆధారపడియుండును. అందుచే తరంగవేగము పవనవేగమును మించదు. అనగా తరంగదైర్ఘ్యము నిర్ణీతప్రమాణముకంటె పెరుగదు. ఇది పవనముకలుగజేయు ఒత్తిడిపై ఆధారపడి యుండును.

ఒకే ఒక సమయమున గుర్తించిన పవనవేగమునుబట్టి తరంగవృత్తాంతమును (వేగము ఎత్తు మొ॥) చెప్పజాలము. ఆసమయమునకు పూర్వ వర్తమాన సముద్రస్థితి అంతకుముందు పవనము వీచిన కాలపరిమాణము సముద్రముపై వీచుచున్న పవనవిస్తారముపైన ఆధారపడియుండును. వేగముగా వీచుచున్న పవనము ఒక్కసారిగ స్తంభించినపుడు హ్రస్వాగ్ర తరంగములు త్వరగా నశించును. దీర్ఘాగ్రములుగల తరంగములెక్కువకాలము మనగలవు. హ్రస్వాగ్రతరంగములు మిక్కిలి నిట్రముగనుండుటచే అవి త్వరలో నశించును. అందుచేతనే సముద్రముపై ఏర్పడుతుఫాను ప్రాంతమునుండి బయల్వెడలు అలల పొంగులుమాత్రమే తీరప్రాంతములను చేరుట గమనింతుము. ఇట్లు తీరప్రాంతములను సమీపించుచున్న అలలపొంగులు ముఖ్యమైన కొన్నిమార్పులను పొందును. ఈఅలలు దీర్ఘాగ్రములను కలిగియుండును. తీరమును చేరుచున్నకొలదియు నీటిలోతు తక్కువగుచుండుటచే అలలయందలి శక్తి వేరువిధముగా వినిమయమగును. హ్రస్వాగ్రములుగల అలలు తీరమునకు దూరముననే పైకిలేచి పతనమై నశించును. ఇందుమూలమున పరస్పరానురూపముగా (Symmetric) బయలుదేరిన అలలు విరూపము (asymmetric) చెందును.

తీరమును చేరినకొలదియు నీటిలోతు తగ్గుచుండుటచే అలలవేగముకూడ తగ్గును. అలలు ఒకదిక్కునుండి తీరముచేరుచుండవచ్చును. తీరమును ముందుగా చేరుచున్న కెరటభాగము నేలను తగులుటచే దాని వేగము తగ్గును. మిగిలిన భాగముయొక్క వేగము మారకుండుటచే మొత్తముమీద తరంగచాపముయొక్క మార్గము, స్వరూపము మార్పుచెందును. అందుచే ఏవైపునుండి వచ్చుచున్న కెరటమైనను తీరమును చేరునరికి కెరటచాపము తీరమునకు సుమారు సమాంతరముగనున్నట్లు కన్పించును. తీరమును చేరుచున్న కెరటములు తలకెరటములకు (Surface waves,) దీర్ఘకెరటములకు మధ్యస్థలక్షణములను కలిగియుండును. వీటి దైర్ఘ్యము నీటిలోతుకంటె ఎక్కువగనుండును. మిక్కిలి దైర్ఘ్యకెరటములు తీరమును చేరుచున్నపుడు మధ్యస్థకెరటము లేర్పడును. ఇట్లేర్పడిన కెరట-

ములఎత్తు హ్రస్వకెరటముల ఎత్తుకంటె తక్కువ ఉండవచ్చును అయినను ఆకెరటములు నీటిఅడుగున నేలను తగులుచుండును ఇట్టి ప్రక్రియలో తరంగములు తీరప్రాంతమునందలి ఇసుకను భిన్నప్రాంతములకు తరలించుచుండును

తీరమును చేరుకెరటములు నీటిఅడుగున నేలను తగులుటచే అవి పైకి లేచి పతనమగును నీటి అడుగున నేలను తగిలిన కెరటముయొక్క అడుగుభాగపు వేగముతగ్గి పై భాగపు వేగము హెచ్చును అప్పుడు తరంగము వక్రీభవనము చెందును

సముద్రప్రభావముచే నిమ్నప్రాంతముల నైసర్గికస్వరూపము పూర్తిగామారినట్లు కొన్నిసమయములందు కన్పించును ఇట్టి విధ్వంసక చర్యలను కలుగచేయునదియే సముద్రపు ఉప్పెన ఇట్టి ఉప్పెనలు భూకంపములవలనను భీకరమైన తుపానులవలనను కలుగుచుండును

ఆర్ రా

## సముద్రములు-వాతావరణము

భూగోళము మూడింట రెండువంతులు సాగరావృతము భూగోళముపై దట్టమైన వాతావరణము 20 కిలోమీటర్లలోపునసే నిండియున్నది సాగర భౌతిక ఆతివృత్తములను అందలి జీవజాలముల చరిత్రను తెలియచేయునదియే సముద్రశాస్త్రము భౌతికముగా సముద్రప్రభావము వాతావరణము పై గణనీయమైనది గోళముయొక్క ఉపరితలమందలి వాయువు సముద్రములందలి జలము భూమ్యాకర్షణసూత్రముల ననుసరించి చరించుటచే రెండును పరస్పరప్రభావితములగుచుండును ఈజలము వాయువు రెండును సదాభౌతికమైన మార్పులను చెందుచు శక్తివినిమయము చేసికొనుచుండును ఈవిధముగా గోళముపై తాపసమతాస్థితి (thermal equilibrium) కలుగచేయబడును అందుచే గోళముపై వృక్షజంతుజాలములకు వాసయోగ్యముగా వాతావరణమేర్పడుచున్నది నేటిమానవునకు వాతావరణప్రక్రియలు తెలిసినట్లుగా సముద్రవిజ్ఞానము తెలియదు సహజమైన కుతూహలముతో నేటిమానవుడు శీతోష్ణములను తనకనుకూలముగా మార్చుకొనుటకు ఆశక్తినంతను ఉపయోగించుచున్నాడు అదట్లుండగా సముద్ర విజ్ఞానము నౌకాయానమునకు వలయు మార్గములను నిర్ణయించుటతో ఆగిపోయినది వర్తమానకాలములో సముద్రవిజ్ఞానము అన్నివిధములుగా అభివృద్ధిచెందినది సముద్రములు వాతావరణమును ప్రభావితము చేయుననియేగాక వాటినుండి తనకువలయు ఆహారాదులుకూడ లభించునని మానవుడు తెలిసికొనినాడు వాతావరణమునందలి స్థితిగతులను సమగ్రముగా తెలిసికొనవలెనన్నచో సమగ్రమైన సముద్రవిజ్ఞానమవసరము

భూమిపై సహజముగా జరుగు భౌతిక రాసాయనిక జీవసంబంధి మార్పులకు సౌరమండలమునుండి వచ్చు శక్తియే ఆధారము చదరపు సెం॥మీ॥కు సగటు 0 276 గ్రాము కేలరీల సౌరశక్తి (Solar energy) ప్రతినిమిషమునకు భూమిని చేరుచున్నది సృష్టిక్రమము ననుసరించి అంతశక్తియు తిరిగి భూమినుండి ఏదేనిరూపములో ఈ విశ్వాంతరాళములోనికి పోవలెను ఇది గాలియందలి తేమనుండిగాని మేఘములనుండిగాని వికిరణరూపములోగాని పోవును భూభ్రమణము ననుసరించి భూమధ్యరేఖాప్రాంతములందు హెచ్చుగను ధృవప్రాంతములందు తక్కువగను సౌరశక్తి చేరును అందుచే భూమిపై భూమధ్యరేఖనుండి ధృవములవరకు తాపక్రమములో భేదముండును ఈ భేదమువలననే వాతావరణములో పరిణామగతులేర్పడును భూమధ్యరేఖాప్రాంతము తాపోత్పత్తిని చేయగా ధృవప్రాంతము శీతాపమును లయము చేయునట్లుగా తోచును భూమిపైనున్న ఈవాయుగోళము తాపక్రమమందలి భేదముచే అనుద్భూతశక్తిని (Potential energy) గతినిర్దేశకోద్భూతశక్తిగా (Kinetic energy) మార్చు మహాశక్తియంత్రమువలె పనిచేయును ఈవిధముగా భూమధ్యరేఖాప్రాంతమునుండి ధృవప్రాంతమునరకు ధార్మికమార్పులు ప్రవాహమార్గముగా జరుగుచుండును ఇట్లు సృష్టించబడిన యామ్యోత్తరవాయుసంచలనములు (Meridional motions) కొరియాలిస్ త్వరణము మూలముగా మండలసంచాలకములుగా మారును (ఈకొరియాలిస్ త్వరణము భూభ్రమణము మూలమున ఏర్పడును) దానిఫలితముగా తూర్పుపశ్చిమగాలు లేర్పడును భూమిపైనున్న దట్టమైన వాతావరణములో తరంగము లేర్పడును వాతావరణగతులపై భేదప్రభావము తక్కువ అందుచే భూవాతావరణమంతయు గురుత్వసమతాస్థితిని (Gravitational equilibrium) పొంది భూమితోపాటుగనే చలించుచుండును

ఉత్తరమున 80°, దక్షిణమున 80° అక్షాంశములమధ్య భూమి $10^{11}$ గ్రాము కెలోరీల ఉష్ణశక్తిని వికిరణరూపములో పొందుచున్నది మిగిలిన ధృవప్రాంతముల వరకు గల ప్రదేశ

ములో అదే విధముగల శక్తిని కోల్పోవుచున్నది. వాతావరణమందుగాని సాగరములందుగాని సమతాస్థితిని కలుగజేయుటకు భూమధ్యరేఖాప్రాంతములనుండి ధ్రువప్రాంతములవరకు ఉష్ణమును మోసికొనిపోవు ప్రవాహములు లేనిచో నేటి వాతావరణస్థితి వాసయోగ్యముగాని అత్యుష్ణమండలముమధ్యరేఖా ప్రాంతములుగను ధ్రువప్రాంతములు అతిశీతలమండలములుగను మిగిలిపోయెడివి. ఒక ప్రాంతమందలి సాంవత్సరిక తాపక్రమములవలను పరిశీలించగా మార్పు గోచరించుటలేదు. దీనిని బట్టి ఉష్ణతాపకిరణ సమతాస్థితియేగాక గోళముపై శీతోష్ణముల ప్రయాణముకూడ క్రమమైన మార్గములో వాయుప్రవాహములద్వారాను సాగరప్రవాహములద్వారాను జరుగుచున్నట్లు తెలియుచున్నది. గోళముపై శక్తివినిమయము స్పర్శోష్ణముద్వారాను గుప్తోష్ణము ద్వారాను జరుగుచున్నది. ఇందు సాగరప్రవాహములు అందజేయు ఉష్ణముకూడ ఎన్నదగినది.

జలమయమగుటచే సాగరములు నేలకు భిన్నముగా ప్రవర్తించును. భూభ్రమణమువలన సాగరములందు చలనము ఏర్పడును. సౌరశక్తి నేలపై కొంతలోతువరకే వ్యాపించగా సాగరములందు మరింత లోతునకు చొచ్చుకొనిపోవును. బలమైన గాలులచే సాగరములందు ప్రవాహము లేర్పడును. ఈ ప్రవాహములు తమయందలి శీతోష్ణములను ఇతర ప్రాంతములకు గొనిపోవును. గాలులచే సృష్టించబడిన కెరటములచే సముద్రములు కల్లోలితమై సూర్యాతపము (solar insolation) సముద్రమందు లోతుకు వ్యాపింపజేయును. ఇట్టి ప్రక్రియలో ఒక ప్రాంతమందు గ్రహించబడిన ఉష్ణశక్తి మరొకప్రాంతమందు బాష్పోత్సేకము (evaporation) కు వినియోగపడవచ్చును. ఇట్టి మార్పులు ఎన్నెని జరుగవచ్చును. ఇందుకుదాహరణముగా ఉత్తర అమెరికాలో అట్లాంటిక్ మహాసముద్రపు తూర్పుతీరమందు ప్రవహించు గల్ఫ్ప్రవాహము ఉష్ణమండలమునుండి ధ్రువప్రాంతములకు ఉష్ణమును గొనిపోవు ప్రవాహముగా పేర్కొనవచ్చును.

వాయుగోళమందలి గాలులకు, సముద్రప్రవాహములకు గల పోలికచే సముద్రప్రవాహములు ఒకప్రాంతమందలి శీతోష్ణములను ప్రభావితము చేయునని తోచుచున్నది. అదే విధముగా బలమైనగాలులు సముద్రప్రవాహములను అదుపులో నుంచునని చెప్పవచ్చును. నేటి శాస్త్రజ్ఞుల దృష్టిలో పరస్పర ప్రభావితములగు ఈ సాగరవాయువులలో కార్యకారణ సంబంధమేదియో నిర్ణయించిచెప్పుట కష్టము.

సముద్రప్రవాహములకు వలయు శక్తి గాలులు కలుగజేయు ఒత్తిడివలన లభించును. సాగరప్రవాహము గాలులను తాపక్రియములవలనను బాష్పోత్సేకమువలనను ఆతపక్రియ వలనను వర్షపాతమువలనను సముద్రజలములో సాంద్రతా భేదము లేర్పడును. ఈవిధముగ సాంద్రతలో కలుగు భేదము (density distribution) పరిణామము సమస్థితి Dynamic equilibrium) వలన కలుగును.

ఉష్ణవాహనము బాష్పోత్సేకము వర్షపాతము ఉష్ణకిరణము మొదలైన ప్రక్రియలన్నియు వాతావరణస్థితిని తెలిసికొనుటకు ఉపయోగపడును. సముద్రపుగతులు నీటి ప్రధనము తాపక్రియను వాతావరణములో జరుగు బలమైన మార్పులచే ప్రభావితములు. వేరొకదృష్ట్యా వాయుగోళములో జరుగు పరిణామములకు వలయు శక్తినంతయు సాగరములే అందజేయునని చెప్పక తప్పదు. ఈ శక్తివినిమయము సాగరప్రవాహస్థితిపై కూడ ఆధారపడియుండును. వాతావరణప్రక్రియలన్నియు సాగరమునుండి లభించు శక్తివలన జరుగుచుండును. ఉదాహరణమునకు సాగరముపై ఏర్పడు వాయుగుండములను గూర్చియు పరస్పరప్రభావితములగు సముద్ర వాతావరణ ప్రక్రియలను గూర్చియు వేరువేరుగా చర్చించుటకువీలులేదు. నేటి శాస్త్రజ్ఞులిది గ్రహించి మానవాళికి వలయు శాస్త్రసంపదను కూర్చుటకు ప్రయత్నించుచున్నారు.

శీతోష్ణస్థితులు - సాగరప్రభావము: వాతావరణముపై గల సముద్రప్రభావమునుబట్టి శీతోష్ణస్థితులను రెండువిధములుగా విభజింపవచ్చును. మొదటిది ఖండాంతరశీతోష్ణస్థితి. రెండవది సముద్రసామీప్యశీతోష్ణస్థితి. మధ్యకాలభూభాగములందు ఖండాంతరశీతోష్ణస్థితి కన్పట్టును. ఈభాగములందు వేసవి మిక్కిలి తాపముగను శీతకాలము మిక్కిలి చలిగను ఉండును. వేసవి శీతకాలముల తాపక్రమభేదము మిక్కిలి ఎక్కువ. రాత్రింబవళ్ళ తాపక్రమముతోకూడ గణింపదగు వ్యత్యాసము కన్పించును. ఖండాంతర భూభాగములందు మేఘములేర్పడుట తక్కువగుటచే వర్షపాతముకూడ తక్కువగ నుండును. శీతప్రాంతములందు వేసవి శీతకాలముల తాపక్రమములో భేదము ఎక్కువగ నుండదు. వేసవులు చల్లగాను శీతాకాలములు వెచ్చగాను

ఉండను రాత్రింబవళ్లయందుకు డ తాపక్రమములో భేదము ఎక్కువగా పొడగట్టదు ఆకాశము మేఘావృతమై వర్షపాతము కూడ ఎక్కువగ నేయుండును

మధ్యాకాంశ ప్రాంతములందు పడమటిగాలులు వీచుటచే తూర్పుతీర ప్రాంతములు ఖండాంతర పవనములచే ప్రభావితము లగును పశ్చిమతీర ప్రాంతములు సముద్రపవనములచే ప్రభావితములగును అందుచే తూర్పుతీరములు ఖండాంతరశీతోష్ణ స్థితిని (Continental climate) పడమటితీరములు సముద్ర సామీప్య శీతోష్ణస్థితిని (maritime climate) కలిగియుండును భూమధ్యరేఖా ప్రాంతములందు గాలులు తూర్పునుండి పడమర కు వీచను తీర ప్రాంతములందలి శీతోష్ణస్థితులు పైన పేర్కొన బడిన శీతోష్ణస్థితులలో పరివర్తనము నుపొందును

ఈవిధమైన శీతోష్ణములందలి వ్యత్యాసమునకు నేలకును నీటికిని ఉష్ణమును గ్రహించి గుప్తము చేయగల్గు సామర్థ్యమునందలి భేదమే కారణము భూమియొక్క ఉపరితలము మాత్రమే ఉష్ణమును గ్రహించుటచే కాలిక తాపక్రమము (seasonal temperature)లో అధికవ్యత్యాసము కన్పించును జలోపరి తలముపై ప్రసరించు ఆతపశక్తి (insolation) లోతులకు చొచ్చుకొని జలమంతట వ్యాపించును అందుచే సముద్రములు ఉష్ణమును గుప్తముచేయగల శక్తిని కలిగియుండును కాలిక తాపక్రమవ్యత్యాసముకూడ తక్కువగానుండును మార్కొ తపనమువలన నీటిమీదకంటె నేలమీద తాపక్రమము త్వరగా హెచ్చును సముద్రములలో శీతోష్ణములను మోసికొనిపోవు ప్రవాహములు లేనిచో ఖండాంతర ప్రాంతములకు తీర ప్రాంత ములకు తాపక్రమములో ప్రస్తుతముకంటె ఎక్కువ భేదము కల్పించెడిది అంతేకాక సముద్రముమీది తాపక్రమమునకు భూమిమీది తాపక్రమమునకు మిగుల వ్యత్యాసమేర్పడి యుండెడిది మార్కొతపమునకు జలమందంతటను వ్యాపించు లక్షణముండుటచే సముద్రముమీది వాతావరణము మిక్కిలి సమత్వమును కలిగియుండును వస్తుతః సముద్రమునందలి ఉష్ణప్రవాహములు శీతలప్రవాహములు తమగతిచే ప్రాంతీయ వాతావరణములనేకాక సముద్రముమీది వాతావరణమును కూడ మార్పుచెందించును ఉదాహరణమునకు ఒకతీరమందు ప్రవహించు సముద్రప్రవాహము ఆతీరమందలి తాపక్రమము కంటె ఎక్కువ విలువను కల్గియుండవచ్చును అట్టిపరిస్థితులలో ఆప్రవాహము ఆప్రాంతమందలి శీతోష్ణస్థితులను మార్పుచెందిం నవచ్చును భూమియొక్క ఉపరితలమందలి వాతావరణము

పెద్దమొత్తములో సముద్రమునుండి బాష్పోత్సేకముద్వారా ఉష్ణశక్తిని గ్రహించి తయందు పరిణామగతులను పొంది వాయుగోళములో క్రమబద్ధమైన వాయువులను సృష్టించును సముద్రోపరితలముపైనున్న గాలియొక్క తాపక్రమముకంటె నీటియొక్క ఉపరితలతాపక్రమము ఎక్కువగానున్నపుడు బాష్పోత్సేకము మిక్కిలి అధికముగా జరుగును ఖండముల తూర్పుతీరములవెంబడి ఉష్ణప్రవాహములు ఉష్ణజలమును ధ్రువప్రాంతములవైపు గొనిపోవుట తెలిసినవిషయమే పశ్చిమతీరములవెంబడి శీతలప్రవాహములు భూమధ్యరేఖా ప్రాంతములకు శీతలజలమును గొనివచ్చుటకూడ ఎరిగిన అంశమే పైన తెలిపినట్లు మధ్యాకాంశరేఖా ప్రాంతములందు శీతాకాలములో గాలులు పశ్చిమమునుండి వీచును తూర్పు తీరములకు ఖండాంతరమునుండి చల్లనిగాలులు వీచును పశ్చిమతీరములకు వెచ్చనిసముద్రపవనములు వీచును ఇందు మూలమునకూడ తూర్పుతీరమందలి సముద్రజలము శీతల వాయువులకంటె వెచ్చగానుండును కాని పశ్చిమతీరమందలి జలములు చల్లగానుండును దీనినిబట్టి తూర్పుతీరములందు శీతాకాలమున సముద్రమునుండి బాష్పోత్సేకము ఎక్కువగా జరుగునని చెప్పవచ్చును ఇదేవిధముగా సముద్రోపరిభాగము నుండి స్పర్శోష్ణవినిమయము (sensible heat transfer) కూడ ప్రాంతీయముగానే యుండునని చెప్పవచ్చును కనుక శీతాకాలములో మధ్యాకాంశప్రాంతములందు ముఖ్యముగా తూర్పుతీరములందు-సముద్రోపరిభాగమునుండి వాతావరణ ము ఉష్ణమును గ్రహించునని చెప్పవచ్చును

వాతావరణమునందు జలసాంద్రీకరణము (Condensation), వర్షోత్పత్తియు జరుగుచున్నది బాష్పోత్సేకము మాండలికముకావున సాంద్రీకరణముకూడ మాండలికముగనే యుండును పరస్పరప్రభావితములగు సముద్రము వాతావరణములమధ్య జరుగు ఉష్ణవినిమయమాండలికము వాటి సంపర్కముపై ఆధారపడియుండును ముఖ్యవాతావరణ ప్రక్రియలగు సాంద్రీకరణము బాష్పోత్సేకము ముఖ్య వాయుసమూహముల సృష్టి-ఇవన్నియు వాటికి లభ్యమగు శక్తిపై ఆధారపడియుండును కాన్పికముగ చూడగా సముద్రముపైగాని తీరములపైగాని,ఖండాంతరములందుగాని వాతావరణము సముద్రవాయుసంపర్కముపై ఆధారపడి యుండునని చెప్పతగును

ఆర్ ౯

## సరస్వతీమహాలు

సరస్వతీమహాలుగ్రంథాలయము తంజావూరులో నెలకొనియున్న యొకమహాసంస్థ. పేరున కిదియొక గ్రంథాలయమే యైనను, సర్వసాధారణముగా మనము చూచుచున్న గ్రంథాలయములవంటిది మాత్రముకాదు. లిఖితపుస్తకములతో అందునను తాళపత్రములలో వ్రాయబడిన వాటితో ఒక గ్రంథాలయమును సమకూర్చుట సామాన్యమైన విషయము కాదు. ఒక్క సంస్కృతవిభాగమునందే ముప్పదివేలమమించి గ్రంథములున్నవన్నచో దాని విస్తృతినిగూర్చి వివరింపబని లేదు.

చోళమండలమునకు తలమానికమైన తంజాపురమున వెలసిన ఈ సరస్వతీమహాలు నేడు భాషాపరిశోధకులనో సారస్వతారాధకులనో లేక చారిత్రకపరిశీలకులనో తప్ప తక్కిన సామాన్యాంధ్రప్రజలను ఆకర్షించుటలేదు. దానికి కారణము కాలమే. ఒకనాడాంధ్రసామ్రాజ్యలక్ష్మి సర్వాంగసుందరియై సర్వాలంకారశోభితయై నృత్యముచేయునట్టి రంగస్థలమైనది తంజావూరు. అట్టి పావనక్షేత్రము నేడు తెలుగుప్రజల దృష్టికి దూరమైనది. తంజావూరును గురించిన కొన్నివిషయములింకను తెలుగుప్రజలకు క్రొత్తవిగానే యున్నవి. కాని మనయదృష్టము ఫలించినదోయనినట్లుగ, త్రివిధసంస్కృతిప్రతీకగా నేడు నిలిచియున్నది సరస్వతీమహాలు. పూర్వులు చేసిన సారస్వతతపస్సు విజ్ఞానసముపార్జనములో వారి యకుంఠితదీక్ష — వీటన్నిటియొక్క సమన్వితస్వరూపమే నేటి సరస్వతీమహాలు.

క్రీ॥శ॥ 1550లో విజయనగరాధిపతియగు అచ్యుతదేవరాయలచే రాజప్రతినిధిగా నియమింపబడిన చినచెవ్వప్పనాయకుడు తంజావూరును పాలించిన తెలుగునాయకరాజులకు మూలపురుషుడు. ఇతని కాలమున, ఇతనిపుత్రుడగు అచ్యుతనాయకుని కాలమునగూడ రాజ్యమును సురక్షితముగను సుఖితముగను చేయుటకు తగిన ప్రయత్నములతోనే కాలము గడచిపోయినది. తరువాతి తంజావూరుపాలకుడగు రఘునాథనాయకుడు (1614–1632) నాయకరాజవంశమునకు మణిదీపమువలె వెలుగొందినాడు. శౌర్యపరాక్రమము లందద్వితీయుడై రాజ్యమేలిన రఘునాథనాయకుడు సారస్వతసామ్రాజ్యమునగూడ పట్టభద్రుడై నిష్పత్నముగ వెలసినవాడు. ఇతడు సంస్కృతాంధ్రభాషలలో ఎనలేని పాండిత్యమును గడించినవాడు. విద్వత్కవి. ఇట్టి సారస్వతోపాసకుడైన చక్రవర్తి రాజ్యమునేలుచుండగా కవులు పండితులు తమ కృతులవాణి నారాధించుట సహజమే. రఘునాథుని యాస్థానము కృష్ణరాయల యాస్థానమునకుజ్జీయై విఖ్యాతి నందినది.

దక్షిణాంధ్రసారస్వతమునకు మూలపురుషుడైన ఈ రఘునాథుని కాలమున వెలసిన కవులగ్రంథముల నన్నిటిని ఇంచుమించుగా నేడు సరస్వతీమహాలుగ్రంథాలయమునచూడ వచ్చును. ఇతని కాలములోనే సరస్వతీమహాలు గ్రంథాలయము నిర్మింపబడినదని ఊహింపవలసియున్నది. అంతకుపూర్వమట్టిసంస్థ యొకటుండినట్లు తగిన ఆధారములు లేకుండుట పై అభిప్రాయమును దృఢముగావించుచున్నది.

దక్షిణదేశమున తెలుగుబిడ్డల వీరార్జనమునందుకొన్న తెలుగుతల్లి దక్షిణాంధ్రసామ్రాజ్యాధినేతలిచ్చిన నివాళినిగూడ స్వీకరించి సుమారు మూడుశతాబ్దములు దక్షిణమున నిష్కంటకముగా నృత్యముచేసినది. మహారాష్ట్రపాలకుల కాలములో కూడ తెలుగుభాషయే రాజభాషగా కలిగినది. ఆంధ్రవాఙ్మయ చరిత్రలోకూడ దక్షిణాంధ్రసారస్వతము తనకొక ప్రత్యేకస్థానమును సృష్టించుకొన్నది. అనాటితెలుగు చక్కదనము మొదలుకొని తెలుగువారి చారిత్రకవిశేషములవరకుగల సకలమునకు సజీవనిదర్శనముగా నిలచియున్నది తంజావూరులోని ఈసరస్వతీ మహాలుగ్రంథాలయము. ఒక్కచో చోళరాజులు, నాయకరాజులు మహారాష్ట్రరాజులయొక్క విభిన్న సంస్కృతులు త్రివేణిసంగమమువలె మిళితమై లోకుల యజ్ఞానమనెడి పాపమును తొలగింపగలవిధముగ నుండుట ఈగ్రంథాలయమున ప్రత్యక్షముగా తిలకింపవచ్చును. ప్రతివానికిని ప్రతిదినము ఒక్కొక్క క్రొత్తవిషయ మిచట స్ఫురించుచుండుట అనుభవసిద్ధము.

రాజులు మారుచో రాజభాషకూడ మారుటసహజము. కాని తంజావూరులోమాత్రము అట్లు గాదు. తెలుగురాజుల తరువాత మహారాష్ట్రులు పాలించినను, తెలుగుమాత్రము తనస్థానమును కోల్పోవలేదు; అంతేకాదు మహారాష్ట్ర ప్రభువులు స్వయముగ తెలుగునేర్చి తెలుగుగ్రంథములను నిర్మించి తెలుగుకవులై ధన్యులైనారు. అట్టిచో వారికాలమున తెలుగుభాషకు, తెలుగుకవులకు విశేషాదరణయుండెనని వేరుగా చెప్పనక్కరలేదు. మహారాష్ట్రప్రభువులందరు తెలుగుతల్లి యాశ

స్సుల నందుకొనినవారే విశేషించి ఆంధ్రదేశమునకు చెందిన యక్షగానవాఙ్మయమును తంజావూరులో నాయకరాజులు ప్రవేశపెట్టగా దానిని నానావిధముల పోషించి తాముకూడ ఆగేయవాఙ్మయమును అనేకరకములుగా సృష్టించినవారు శహాజీవంటి మహారాష్ట్రప్రభువులు ఇట్టినూతనసంవిధానములతో గూడిన వాఙ్మయవికాసవిశేషములను తంజావూరు సరస్వతీమహలులో తప్ప మరెచ్చటను చూడజాలము ఆంధ్రప్రాంతీయ లలితకళలగు సంగీతము భరతనాట్యము మొదలగు వాటికి సంబంధించిన గ్రంథములన్నియు అనువాదములుగను స్వతంత్ర గ్రంథములుగను నాయకరాజుల కాలమునందును మహారాష్ట్రప్రభువులకాలమునందును స్వరూపమునుపొందినవి తెలుగుసారస్వతము వేయిశంగుల వెల్లివిరిసినది తత్ఫలితముగనే ప్రబంధములు యక్షగానములు ఛందస్సు నిఘంటువులు సంగీతము నాట్యము వైద్యము జ్యోతిషము సాముద్రికము ఆదిగాగల వివిధవిభాగములలోని ఆనాటిఉత్తమోత్తమగ్రంథములన్నియు ఈనాడు సరస్వతీమహలునందు లభ్యములగుచున్నవి

ఈగ్రంథాలయమున భద్రపరుపబడిన గ్రంథములలో ముఖ్యములైన విభాగములు నాలుగు అందులో ప్రధానవిభాగమైన సంస్కృతమున ముప్పదివేలకుపైగా గ్రంథములున్నవి తమిళమున 8000; తెలుగున 2000, మహారాష్ట్రిమున 2000 ఇవికాక స్వల్పముగనైనను ఇతర భాషాగ్రంథములుకూడ ఇచ్చట సురక్షితములై యున్నవి పై విషయమును పర్యాలోచించిచూడగా, తంజావూరుపాలకులకు భాషావిభేదమును కిసుమంతైన ఆస్కారము లేకుండెనని బోధపడగలదు

తంజావూరు మహారాష్ట్రపాలకులలో ఇంచుమించు కడపటివాడైన శరభోజీ సరస్వతీమహలునుగూర్చి ప్రత్యేక శ్రద్ధను కనబరచినాడు ఆగ్రంథాలయమునకొక ప్రత్యేకాధికారిని నియమించి, గ్రంథములను భద్రపరచుటలో విశేషాదరణమును చూపినాడు కాశీయాత్ర చేయుచు అతడు దారిపొడవున తారసిల్లినచోట్ల వ్రాతప్రతులనన్నిభాషలలో సంగ్రహించి, వాటిని సరస్వతీమహలులో భద్రపరచెను, ఇతని కాలమున (1798–1832) ఆంగ్లప్రభావము భారతదేశముపై అధికముగా ప్రసరింప నారంభించినది కావున అతడుసేకరించిన గ్రంథములలో అచ్చొత్తించిన ఆంగ్లగ్రంథములుకూడ ఎక్కువగనుండెను ఇట్లు తంజావూరులో పరిపాలనావిధానము మారినను సారస్వత వ్యాసంగము మాత్రము కుంటుపడక యథాప్రకారముసాగుచుండుటచే ఆనగరము దేశమంతటికిని మార్గదర్శకమైనది తత్ఫలితముగాఏర్పడిన గొప్పవ్రాతప్రతుల గ్రంథాలయమే ఈ సరస్వతీమహలు శరభోజీ ఈగ్రంథాలయము విషయమున చూపిన విశేషశ్రద్ధకు చిహ్నముగా ఆరాజు పేరుతో కలిపి "తంజావూరుమహారాజాశరభోజీ సరస్వతీమహల్ గ్రంథాలయము" అని నేడు వ్యవహరింపబడుచున్నది సరస్వతీమహల్' అను పేరీ గ్రంథాలయమునకు మహారాష్ట్రరాజుల కాలములో ఏర్పడియుండ వచ్చునని యూహ కొన్నివ్రాతప్రతులమీద సద్భారతీసద్మ' అని యుండుటనుబట్టి ఆ పేరుబహుశః నాయకరాజులకాలమున ఈగ్రంథాలయమునకుండియుండవచ్చునని అభిజ్ఞు లభిప్రాయపడుచున్నారు

శరభోజీ, ఈసరస్వతీమహలులో నుండిన సంస్కృతాంధ్రవైద్యగ్రంథముల నాధారముగా గొనియు దేశప్రజల నుండి సేకరించిన ప్రక్రియలను ఊతగాగొనియు సుమారు 5000 అనుభవైకప్రక్రియలను విశిష్టములుగా నిర్ణయించి వాటిని తమిళభాషలో ఛందోబద్ధములు గావించి వ్యాధుల క్రమమున వర్గీకరించి 18 సంపుటములుగా భద్రపరచినాడు ఆవిధముగా వర్గీకరణమనునది ఆయుర్వేదవైద్యవిధానమున అంతకుపూర్వము జరిగియుండలేదు ఈగ్రంథములన్నియు తాళపత్రాత్మకములే శరభోజీ గావించిన ఈకృత్యము భారతదేశమంతటికి మహోపకారమనకతప్పదు

మొత్తముమీద జ్ఞానతపస్వులకు విజ్ఞానతృష్ణగలవారికి సారస్వతోపాసకులకు సరస్వతీమహలు గ్రంథాలయమొక పట్టుగొమ్మ ఆంధ్రులదృష్టితో పూర్వులనిరంతరకృషికి సారస్వతారాధనకు యశోవైభవవికాసములకు పాండిత్యప్రకర్షకు కళారాధన, కళాభిజ్ఞత్వములకు ప్రథమ తార్కాణమీ సరస్వతీమహలనుట అత్యుక్తి కానేరదు అంతేకాదు–దాని ప్రారంభకులే తెలుగువిద్వాంసులగుట, ఆంధ్రులకు మరియొకగర్వకారణము సంగ్రహముగా చెప్పవలసివచ్చుచో ఆంధ్రసంగీత నృత్య నాట్య, వైద్య సారస్వతాద్యఖిల ప్రాచీనకళావిజ్ఞానపేటిక ఈసరస్వతీమహలుగ్రంథాలయమని చెప్పుట యుక్తతమమగును

వి. సుం. శ

## సరోజినీనాయుడు

క్రీ శ 1879 ఫిబ్రవరినెల 13వ తేది సరోజినీదేవి పుట్టుకచే చరితార్థమైనది. ఈమె పశ్చిమవంగరాష్ట్రమున "బ్రాహ్మణ గ్రామము"నకు చెందిన డాక్టర్ అఘోరనాథ చటోపాధ్యాయుని ప్రథమ పుత్రిక. తల్లి పేరు వరదసుందరి. వంగభాషలో అఘోరనాథుడు మహా పండితుడు, విద్యావేత్తయు. వంగరాష్ట్రమునకు చెందిన ఒక పురాతన పండితబ్రాహ్మణకుటుంబము వారి కీతని పూర్వపురుషులు. అఘోరనాథ చటోపాధ్యాయుడు కలకత్తానుండి హైదరాబాదునకు సకుటుంబముగ వచ్చి ఇచ్చటనే స్థిరపడిపోయెను. విప్లవభావములను సంస్కృతిసంపన్నతయు సత్యధర్మప్రీతియు ప్రజ్వలదేశాభిమానమును శాంతికళ స్వందిబుద్ధిధారయు వంటి గుణములను ఈమె తన తండ్రినుండి పుణికిపుచ్చుకొనెను. వంగభాషలో సుమధుర గేయకారకురాలైన తనతల్లినుండి యీమెకు కవితావ్యసనము అలవడినది.

వృద్ధాచారవు లౌకికముగ లాంఛనప్రాయమైన విద్యాభ్యాసంగము ఈమెకు చిన్ననాడు ఇంటియొద్దనే ఆరంభమయ్యెను. ఆందవ ఈమె 12వయేటనే మెట్రిక్యులేషన్ పరీక్షలో ఉత్తీర్ణురాలైనది. కాని యింటియొద్ద పొందినశిక్షయే యీమె విద్యాసాధనలో ప్రధానమైనది. తీరని జ్ఞానపిపాస విషయమునను అసాధారణగ్రహణధారణాశక్తుల విషయమునను ఈమె యొక అద్భుతురాలు. బీజగణితములో తాను గ్రాహ్యముగా చేయవలసిన లెక్కలను ఎగగొట్టి మనోహరమైన గేయముల్లి బీజగణితజ్ఞుడైన ఉపాధ్యాయుని అభినందనలను పదియవయేటనే యీమె సంపాదించినది. గద్య పద్య కథా సాహిత్యముల నిర్మాణమును, దినచర్య రచనయు ఈమెకు ఉగ్గుపాలతో పెట్టిన విద్యలు. ఇట్టి అంశములన్నియు ఈమె చేపమానసూక్ష్మబుద్ధిని భావనోల్లాససామర్థ్యమునకును నిదర్శనములు.

అనాటి హైదరాబాదుప్రభుత్వమువద్ద ఉచితవిద్యావేతనము సంపాదించి యీమె క్రీ శ 1895 సెప్టెంబరులో ఉన్నతవిద్యాభ్యాసమునకై ఇంగ్లండు వెళ్లెను; ముందు లండను నందు "కింగ్స్ కాలేజి"లోను, అపిదప కేంబ్రిడ్జియందు 'గిర్టన్ కాలేజి'లోను అధ్యయనము చేసినది. తదుపరి ఈమె విద్యాభ్యాసంగమునకు అనారోగ్యము అడ్డుతగిలెను. విశ్రాంతికై యీమె స్విట్జర్లెండ్ ఇటలీదేశములను సందర్శించి క్రీ శ. 1898 సెప్టెంబరులో స్వస్థలమగు హైదరాబాదునకు తిరిగి వచ్చినది.

సరోజినికి చిన్ననాడే వైధవ్యము సంప్రాప్తించెను. కటు పిమ్మట హైదరాబాదులో నైజాముప్రభువునకు ప్రధాన వైద్యాధికారియు ఆంధ్రప్రముఖుడును అగు మేజర్ ముత్యాల గోవిందరాజులు నాయుడుతో పునర్వివాహము జరిగినది. అది వర్ణాంతరవివాహమేగాక వితంతువివాహముకూడ అగుటచే ఇందు ద్వివిధసంస్కరణములిమిడియున్నవి. ఆదినములలో ఆంధ్రదేశమున ప్రముఖ సంఘసంస్కర్తయైన కందుకూరి వీరేశలింగముపంతులే ఈవివాహమునకు అధ్వర్యము వహించిరి. నిరంతర దేశసేవకు అంకితమయ్యును సరోజినీదేవి గృహస్థధర్మనిర్వహణ విషయమున నిర్నిద్రురాలై మెలగి భారతీయ స్త్రీరత్నముల సంప్రదాయమును నిలబెట్టెను. పైపైకి కవ్వించు జాతీయతాభావమును సౌకుమార్యమున ప్రపంచించు కవయిత్రియగు ఈమెకు "భారతదేశపు నైటింగేల్" అని వ్యవహారము కల్గినది.

పదియవయేటనే కవితావాసనను గుబాళింపజేసిన ఈమె కవితాలత ఇంగ్లండునందున్న మూడేండ్లకాలములో పుష్పించి పెక్కుమంది నాకర్షించుటయేగాక, ఎడ్మండ్ గాస్, ఆర్థర్ సైమన్ ప్రభృతి ప్రసిద్ధ సాహిత్యవిమర్శకుల స్నేహాలంబనమును గూడ సంపాదింపగలిగెను. వారి ప్రోత్సాహప్రోద్బలముల మూలముననే యీమె నిర్దుష్టకవితాదర్శనము జాతీయమై, నైజప్రకాశనసామర్థ్యము కల్గి ప్రాచ్యమగు భావియమును అలంకారికత్వమును సంతరించుకొన్నది. ఆర్థర్ సైమన్ చెప్పినట్లు సరోజిని గేయములు విహంగ(మ) సంగీతము కలిగి పురోహితులకును, ప్రవక్తలకును తమతమ మతవిశ్వాసముల సంతోషమెట్లో, ప్రభువులకును "పటాలము"లకును తమతమ శౌర్యముల ఘనకీర్తియెట్లో కీర్తులకు శాంతియు వీరులకు ఆశయునెట్లో తనకు కవితానందమును అట్లే అని యీమె తన 'గూర్ డన్' (బహుమతి) అను గ్రంథములో పాడుకొనెను. క్రీ శ 1905లో 'దిగోల్డెన్ త్రెషోల్డ్' (సువర్ణద్వారము) 1912లో "దిబర్డ్ ఆఫ్ టైమ్" (కాలవిహంగము) 1917లో 'దిబ్రోకెన్ వింగ్' (భగ్నగరుత్తు) అను మూడు మనోజ్ఞపద్య సంకలనములను ఈమె ప్రచురించినది. క్రీ శ 1918లో 'దిసెప్టర్డ్ ఫ్లూట్' (అధికారదత్తవేణువు) అనుపేరిట సార్థకమగు సరోజినీదేవి పద్యకావ్యసంకలనమొకటి వెలువడెను. తనకు

కైజర్-ఇ-హింద్ అను సువర్ణపతకమును సంపాదించిపెట్టినది యీమె అద్భుత కవితాప్రతిభ. క్రీ. శ. 1914లో ఈమె రాయల్ సొసైటీ ఆఫ్ లిటరేచర్ నకు ఎన్నిక అయ్యెను.

సరోజినీదేవి కవితాగౌరవము అంతర్జాతీయవిఖ్యాతి వార్జించుచున్న దినములవి. ఆ సమయమున ఈమెపై గాంధిమహాత్ముని ప్రభావము ప్రసరించినది. అంతకుపూర్వమే స్వాతంత్ర్యోద్యమాభిముఖముగ ఆకృష్టురాలైన ఈమె గాంధిమహాత్ముని నాయకత్వమున ఆయన ఉద్యమమునకు తనకుతానై అంకితమయ్యెను. దానితో ఈమె మహోత్కృష్టమగు దేశభక్తిని ప్రకటించుటలో ఒకనివేశముగల ఉదారకవయిత్రిగ ప్రసిద్ధికెందెను. క్రీ. శ. 1931 నాటికే ప్రవర్ధమానకాలికుంతోపాటు స్వదేశ రాజకీయములలో మునిగితేలజొచ్చినది.

అఖిలభారత జాతీయసంస్థతో సంబంధము ఈమెకు 1913నందు లక్నోలో ఏర్పడెను. క్రీ. శ. 1918లో కంజీవరమున రాష్ట్రీయ కాంగ్రెసు సమావేశమును ఈమె అధ్యక్షించెను. క్రీ. శ. 1924-25లలో జాతీయకాంగ్రెసు ఈమెను భారతదేశపుమాతిగను వ్యాఖ్యాతృత్రిగను కెన్యా దక్షిణాఫ్రికాలయందు నియమించినది. క్రీ. శ. 1925లో ఈమె భారతదేశమునకు తిరిగిరాగా అప్పటికే కాంగ్రెసు అధిష్ఠానవర్గములో ప్రముఖురాలైన కారణముచే కాన్పూరులో జరిగిన అఖిలభారత కాంగ్రెస్ సమావేశమునకు ఈమె అధ్యక్షత వహింపవలెనని గాంధిమహాత్ముడు ప్రతిపాదించెను. కాన్పూరు కాంగ్రెసునకు సామర్థ్యముతో చాకచక్యముతో సారథ్యమువహించి ప్రశంసలనందుట అల్పమైన విషయముకాదు. విజయులకు ఈసృష్టితోడనే సమకాలీనులందరు నీమె నధ్యక్షురాలినొనర్చుటకు అంగీకరించిరి.

ఆధునికయుగమునందు స్త్రీలలో ఈమె మేటియనుట నిర్వివాదము. స్త్రీల స్వత్వములనుగురించి ప్రపంచమునుముందు వాదించుటకై నవభారతము సృజింపగల్గిన యువతి యీమె. భారతభూమిని ఉత్తేజపరచుటకై బద్ధకంకణురాలైన "జోన్ ఆఫ్ ఆర్క్" అని యీమెను ఆనాడు పత్రికలు ప్రశంసించినవి. కాన్పూరు కాంగ్రెసు మహాసభాధ్యక్షపీఠమునుండి ఈమె చేసిన ఉపన్యాసము సంగ్రహతకును మనోహరతకును పెట్టినది పేరు. అందు మంజుల మనోజ్ఞమగు కవిత్వము ప్రవాహమైనది. "కాంగ్రెసు సంస్థ ప్రజావాణి కావలెను, రాజకీయవాదుల వాణి కారాదు; మన యెదుటనున్న గమ్యము జాతీయ ప్రయోజనముగాని వైయక్తిక ప్రయోజనముకాదు" అని యీమె ఉద్ఘోషించెను. సరోజిని వాణి సభ్యులను ముగ్ధులనొనర్చెడిది. ఈమె ఉపన్యాసములన్నచో ప్రజలు విరుగబడెడివారు. అదియొకయు అప్రయత్నసిద్ధమైన యీమె వక్తృత్వమునందలి ఆకర్షణశక్తి. సాహిత్యాభ్యాసముతో చూచినప్పుడు ఈమె ఉపన్యాసములన్నిటిని అమూల్యములుగ నేటికిని భావింతురు. ఈమె వాక్చాతుర్యమును మించినది యీమె ప్రౌఢభాషాపరిగల్పశయు సంవాదచాతురియు ఉక్తివైచిత్రి. ఈమె పుట్టిల్లు. ఈమె గద్యము పద్యముకంటె ఏ మాత్రము శక్తిహీనము కాదు. క్రీ. శ. 1922నందు అహమ్మదాబాదు విచారణసందర్భములో న్యాయస్థానమునందలి గాంధిమహాత్ముని ఉపన్యాసమునుగూర్చి యీమె చేసిన వర్ణనము సంగ్రహమయ్యు మహాకావ్యమనదగును.

కేథరీన్ మేయో తన మదర్ ఇండియా అను కుగ్రంథము మూలమున కల్పించిన కృత్రిమభావచిత్రమును తొలగించి భారతీయ సముదాచారములను వ్యాఖ్యానించు ఉద్దేశముతో ఈమె 1923యందు భారతదేశప్రతినిధిగా అమెరికా పర్యటనమునకు అంగీకరించెను.

చిరకాలమునుండియు గాంధిమహాత్మునితో సరోజినీదేవికిగల సన్నిహితసంబంధము భారతదేశస్వాతంత్ర్యోద్యమమునందొక ప్రధానవిషయము. గాంధిజీని ఈమె క్రీ. శ. 1914 నందు లండనులో తొలిసారిగ కలిసికొనుటతో ఈమెకాయనయందు యీ జీవితభక్తిభావము ప్రారంభమయ్యెను. ఆయనకీమె అంగరక్షకురాలయ్యెనన్నను తప్పుకాదు. ఏప్రిలు 1930 నాటి చరిత్రాత్మకమగు దండిసత్యాగ్రహయాత్రలో ఈమె ఆయనకు బాసటయై నిల్చినది; ధరసన ఉప్పుకొటార్లపై ఈమె సత్యాగ్రహదండయాత్రముగూడ నెరపినది. క్రీ. శ. 1931లో లండను నగరమున జరిగిన రౌండుటేబిల్ సమావేశమునకు స్త్రీలప్రతినిధిగా ఈమె గాంధిమహాత్మునివెంట వెళ్ళి అందు పాల్గొన్నది. అయినతోపాటు పెక్కుమారులు చెరసాలకేగినది.

కారాగారనివాసబాహుళ్యమున సరోజినీదేవి ఆరోగ్యము చెడిపోయినది. కాని ఈమె ధైర్యము అజయ్యము. "హృదయవ్యాధి ప్రమాదకరముగ ప్రకోపించుచున్నదని వైద్యనిపుణుల భావము. కాని పరప్రభుత్వమునకు బలిదానమైన భారతదేశపు విషాదగాథనుగూర్చి లోకము వారి హృదయములను కదలింపనిదే నేనెట్లు విశ్రమింపగలను?" అని ఈమె

1920లో విదేశములనుండి గాంధికి వ్రాసినది ఈమె లిఖితవేశము తనచేయిపోకిన ప్రతియంశమును పరివర్తింపింపగలదు

ఈమెకుగల మతసామరస్యసతుపాతము అనదృశము చిన్నవాడు ఈమె నానామతములవారిని చుట్టియుండెడిది "నా ప్రేమను విస్తృతపరచికొనినాసామర్థ్యమిని విస్తరణమొనర్చికొని నానాజాతులవారితోడను నాగరకులతోడను సాన్నిహిత్యమేర్పరచుకొనుటచే నా దర్శనము నిర్దుష్టమయ్యెను" ఇది అవిభక్తభారతమొసగుదర్శనము భారతీయసంస్కారవిభిన్నజలవాహాముల ప్రగాఢసంశ్లేషమునదగినది ఈమెవ్యక్తిత్వము అసంస్కారమునకేమె టీకాప్రాయమైనది ప్రాశ్చాత్యములను కలువు కొలికిపూసయైనదిత్రి ప్రజాతీయవాదియయ్యెను ఈమె అంతర్జాతీయ అవగాహన గలది సర్వజీవకారుణ్యముగలది యీమె మానవతావాదము

క్రీ శ 1947 అగస్టు 15 నాడు భారతదేశమునకు స్వాతంత్ర్యము సిద్ధించినపదవ సరోజినిని ఉత్తరప్రదేశము'నకు గవర్నర్'గానియమించుట యీమె దేశసేవను గుర్తించుటయే! ఆ నియామకము నొసనదగినియని భావించక బాధ్యతగా భావించి ఒకటిన్నర సంవత్సరములపాటు కఠోర దీక్షతోడను, అసాధారణ సామర్థ్యముతోడను నిర్వహించి 'ఉన్నతాధికారిణియైన దేశసేవిక' అనిపించుకొనిన ధన్యురాలు సరోజినీదేవి

ఈమె క్రీ శ 1949 మార్చి 2వతేదినాడు దివంగతురాలయ్యెను అమరునాడు విధానసభలో ప్రధానిసెహ్రూ, "సరోజినివంటివ్యక్తి భారతదేశమున తిరిగి జన్మించుననిగాని జన్మింపగలదనిగాని నమ్మలేము ఈమె బుద్ధివిశేషమట్టిది ప్రజ్ఞయు ప్రాముఖ్యమును అట్టివి చిత్తసంస్కార విశిష్టతయు అట్టిదే" అని వక్కాణించినాడు ఈమె ఎనుబదియైదవ జన్మదినోత్సవ సందర్భమున భారతదేశమునందలి తంతి తపాలా' శాఖవారు ఈమె స్మారకచిహ్నముగ నొక తపాల బిళ్ళను విడుదలచేసి తమకృతజ్ఞతను వెల్లడించుకొన్నారు

బి వి కు శ

## సర్వజ్ఞసింగభూపాలుడు

సర్వజ్ఞసింగభూపతినామధేయులు ఇద్దరు కలరు వీరు రేచర్లవంశీయులు ఈవంశమునందు చరిత్రకారులు సింగమనామధేయమహీపాలురను ముప్వురిని గుర్తించుచున్నారు 'సర్వజ్ఞ' బిరుదము మూడవ సింగభూపాలునకుమాత్రమే కలదనియు, అట్టి బిరుదము రెండవసింగమనీనికి లేదనియు మధ్యచరిత్రపరిశోధకులు శ్రీమల్లంపల్లిసోమశేఖర శర్మయు డా॥ నేలటూరివేంకటరమణయ్యయు భావించుచున్నారు సర్వజ్ఞబిరుదభూషితుడైనను మూడవసింగమనీడు రచించిన గ్రంథము లేవియు కానరావు ఈమూడవసింగభూపుడే జమ్మెరపోతరాజకృత భోగినీదండకము'న ప్రశంసింపబడి ఆ మహాకవి నామములో కలిసి కీర్తిప్రపంచమున విహరించుచున్నాడు

సర్వజ్ఞ' బిరుదము లేదనిచెప్పబడు రెండవసింగభూపాలుడు రసార్ణవ సుధాకరము' ఆదిగాగల ఉద్గ్రంథములను రచించి ఖ్యాతిగాంచినాడు ఈతని ప్రసిద్ధగ్రంథములలో తెలియవచ్చినవి మూడు (1) రసార్ణవసుధాకరము అను అలంకారిక మహాగ్రంథము (2) రత్నపాంచాలిక అను నామాంతరముగల కువలయావళీనాటిక (3) సంగీతసుధాకరము అను సంగీతరత్నాకర వ్యాఖ్య రసార్ణవసుధాకరమునందు గాని కువలయావళీనాటికయందుగాని సింగభూపాలుడు తనకు సర్వజ్ఞ' బిరుదమును వైచుకొనలేదు రత్నపాంచాలిక ఆముఖమునందు సూత్రధారుడు నాటకకర్తనుగూర్చి చేసిన ప్రశంస "సముచితముగను మితముగను ఉన్నది రసార్ణవసుధాకరమునందు గ్రంథప్రస్తావనాసందర్భమున సింగభూపతి తనవంశమును ఆత్మవితరణప్రతాపాదికమును వివరించినాడు

ఈరాజన్యుడు వినయభూషితుడైనను ఆత్మప్రత్యయము లేనివాడు కాడు సుధాకరము నందలినాటిక ప్రకరణమున చతుర్విధకవులనుగూర్చి ఇతడుప్రసంగించుచు కవులు ఉదాత్త, ఉద్ధత, వినీత ప్రౌఢ భేదములచే చాతుర్విధముల నుందురని చెప్పి అందు ప్రౌఢ కవిభేదమునకులక్ష్యముగా తననే చెప్పికొనెను సింగభూపాలుడు సంస్కృతకావ్యనాటక అలంకారశాస్త్రవాఙ్మయమును మంథరపర్వతమువలె మథించినవాడు అందును కాళిదాసుకృతులీయనకు ప్రత్యేకాభిమానపాత్రములు రసార్ణవసుధాకరము'నందు అన్నియుల్లాసములందును లక్షణము తొసంగు సందర్భములో కాళిదాసు ప్రబంధములనే ఇతడెక్కువగా ఆదరించెను ఈప్రభువు తలిదండ్రులు అన్నమ అనపోతనాయకులని సింగభూపాలీయమునందు చెప్పబడినది కువలయావళీ నాటికయందు తల్లిపేరు అన్నమ అమటుకులదులు లేఖకప్రమాదముచే, ఉమ' యని పేర్కొనబడినది అనపోతనాయకుడు ప్రచండవిక్రమశాలి తనకు ప్రత్యర్థులైన రాచవారిని నిర్దాక్షిణ్యముగ శిక్షించుటచే ఈయనకు 'సోమకులపరశురామ' అను బిరుదు లభించెను

సింగభూపాలుడు క్రీ. శ. 1885-1897 సంవత్సరముల నడుమ వంశక్రమాగత రాజధానియైన రాచకొండయందు ధర్మ పరిపాలనము గావించెను. ఈకాలపు ఆంధ్రదేశాధీశ్వరుల రాజ్యవిధానప్రణాళికాపద్ధతి బహుళమయ్యె. నయవిరహిత మగుటచే శత్రుబాహుళ్యమునందు మిత్రదానాము ను ఆత్మదానా మునే విస్తారముగ చేసెనట. తద్యోగ్యులు రెండవసింగభూపాలునికి సమకాలికుడు కొండవీటికుమారరెడ్డి. ఈ ప్రభువులిద్దరు మహాపండితులు. సర్వగీతప్రియులగుట చిత్రము.

సింగభూపాలుని యాస్థానమునందు విశ్వేశ్వరపండితుడను మహావిద్వాంసుడుండెననియు, అతడు చమత్కారచంద్రిక మున్నగు పెక్కు గ్రంథములను వ్రాసెననియు తెలియుచున్నది. సింగభూపతికి ఈతనిపై అమితగౌరవము. విశ్వేశ్వరపండితుని స్తుతులనందుకొనుటయే తనసౌభాగ్యమని ఈనృపాలుడెంచెడివాడు. రత్నపాంచాలిక యందును సింగభూపాలీయమునందుగూడ ఈపండితునిపై తనకుగల గాఢాభిమానమును ఈరాజశేఖరుడు ప్రకటించెను.

సింగభూపాలుని తండ్రి అనపోతనాయకుడు గూడ సంస్కృతమునందు నాటకరచయితగా కన్పట్టుచున్నాడు. ఇతడు భయంకరఖడ్గధారిగనే తెలియవచ్చుచున్నాడుగాని మృదుకవితారీతియందు వడితిరిగిన చేయిగలవాడుగా వినబడుటలేదు. విశృంఖలశక్తిగల సింగమనాయకుడు తనతండ్రి రచనను పేర్కొని ఆయన సారస్వతక్షేత్రమున ప్రశంసింపబడు భాగ్యమును అతనికి కల్గించినాడు. అనపోతనాయనికాలమున అతని ఆయనవోలు శాసనమువలన తెలియవచ్చు పశుపతినాగనాథుడను విద్వత్కవి కలడు. ఇతడు విశ్వేశ్వరకవి శిష్యుడని తెలియుచున్నది. విశ్వేశ్వరపండితుడు సింగభూపాలునితండ్రి కాలముననే వర్ధిల్లి కడువృద్ధుడైయుండవలెను. సింగభూపాలుడు విశ్వేశ్వరుని శిష్యుడో కాడో నిర్ణయింపజాలము.

అనపోతనాయకుడు శైవమతాభినివేశము గాఢముగ కలవాడనియు, శైవప్రతిష్ఠలు చేసెననియు "ఆంధ్రుల చరిత్ర" వాకొనుచున్నది. ఈనాయడు వీరప్రతాపుడై అట్లు చేసియుండునేమో! కాని అతడు విష్ణుభక్తివిహీనుడు కాదనుటకు ఆయనపేర తెలియవచ్చు అభిరామరాఘవనాటకము నుండి యూహింపనగును.

కువలయావళి రసార్ణవసుధాకరము అలో వదిపూర్వమో వదిపరమో నిర్ణయించుటకు నిశ్చితాధారములు కన్పట్టుటలేదు. "సుధాకరము"నందు రత్నపాంచాలికాశ్లోకము లేనియు ఉదాహృతములైనట్లు కానరాలేదు. "రత్నపాంచాలిక" మాళవికాగ్నిమిత్రము రత్నావళి" వంటినాటికల కోవకు చెందిన మధురరూపకము. కాముక నామధేయము కువలయావళియైనను దీనికి రత్నపాంచాలిక యను సంకేతమును నాటికాంతమున కవియే యొసగియున్నాడు. ఇదికథాగతమైన కల్పనయేకాని వ్యర్థమైనదికాదు. ఇది చిన్నదైనను ముద్దులొలుకుభాషయు కలుగుచును గల రూపకము.

సింగభూపాలవిరచితమగు రసార్ణవసుధాకరము"నకు అలంకారశాస్త్రమునందు ఉన్నతస్థానము కలదని చెప్పుదురు. వ్యాఖ్యాతృచక్రవర్తి మల్లినాథసూరి ఈగ్రంథమును ప్రామాణికముగ భావించి దీనిని తనవ్యాఖ్యానములలో పరామర్శించుట గాంతుము. మొత్తముగా విచారించుచో సింగభూపాలుడు స్వతంత్రముగా రచన చేయువాడుగాని గతానుగతికముగ ఇతరులను అనుకరించువాడుకాడు.

ఇది యట్లుండ ఈరాజమౌళియొక్క వితరణాదికమును గూర్చి వర్ణించు ఒకానొకశ్లోకార్థము ననుసరించి ఇతడు భూసురులకు కల్పవృక్షము కామధేనువు చింతామణి పర్వతములవంటి వాడని వారు ప్రశంసించుచుండినట్లు విదితమగుచున్నది.

ని౦ ఉ

## సర్దార్ భగత్ సింగ్

అది క్రీ. శ. 1929వ సంవత్సరము ఏప్రిల్ 8వ తేది. భారతదేశ కేంద్రశాసనసభయందు కార్మిక వివాదముల బిల్లునుగురించి చర్చ సాగుచున్న సమయమది.

భారతదేశమునకెట్టి రాజ్యాంగము అవశ్యకమో నిర్ణయించు నిమిత్తము ఆంగ్లేయప్రభుత్వము పంపిన సైమను సంఘ" సభ్యులుకూడ ప్రత్యేక ప్రేక్షకస్థానములయందు అప్పుడు ఆసభలో కూర్చుండియుండిరి. బ్రిటిష్‌ప్రధాని పదవిని ఎమ్మట అలంకరింపనున్న క్లిమెంట్ అట్లీ కూడ ఆసంఘములో ఉండెను.

హఠాత్తుగ అసభాభవనము దద్దరిల్లినది. అది శతఘ్నిప్రేలుడు. చెవులు చిల్లులుపడెడి ఆభీకరధ్వనికి సభ్యులందరు ఒక్కమారుగ ఉలికిపడిరి. నాటిసభాధ్యక్షుడు శ్రీ విఠల్ భాయిపటేల్ (శ్రీ వల్లభాయిపటేల్ అన్న) కూడ ఉలికిపడెను. కాని భయపడలేదు. సైమనుసంఘ సభ్యుని స్థితియు

అదిరిపోయినది; హోంమెంబరు సర్ జేమ్స్ క్రెరార్ [illegible] బోర్లపడినాడు. ఎవరికేమి మూడినదో యెవ్వరును ఎరుగరు. అందరును అరచేతిలో ప్రాణములు పెట్టుకొని;

ఇంతలో 'ఇంక్విలాబ్ జిందాబాద్!' (విప్లవము వర్ధిల్లవలెను!) 'సామ్రాజ్యవాద్ నాశ్ హో!' అనుచు రెండు మేఘగంభీరస్వరములు వినబడినవి. ఈనినాదములతోపాటు కొన్ని యెర్రని కరపత్రములుకూడ ఎగురవేయబడెను. ఇదంతయు జరిపినవారు ఇద్దరుయువకులు. ఏమిజరిగినదో యిప్పటి కొంచెము సభాస్తారులకు తెలియ మొదలిడెను. అప్పుడుగాని వారు దిగ్భ్రాంతినుండి తేరుకొనలేదు. తక్షణమే శాసనసభ మార్షలును ప్రభుత్వరక్షణ భటులును వచ్చిపడిరి. వారు విప్లవవాదులగు సర్దార్ భగత్‌సింగును ఆయన సహచరుడగు శ్రీబటుకేశ్వర దత్తునుకూడ నిర్బంధములోనికి తీసికొనిరి.

ఈసంఘటనమువలన భారతదేశమునందు మహోగ్ని సంధుక్షణము జరిగినది. రవి అస్తమింపని ఆంగ్లేయసామ్రాజ్య ప్రభుత్వాధికార దర్పములకు ఆనవాలైనది ఆనాటి కేంద్రశాసనసభ. దానిని తుండలకొనిది రక్షకభటులు కంటవత్తినిడుకొని కాపాడుచుండిరి. ఆంగ్లేయ ప్రభుత్వ ప్రత్యేక ప్రతినిధులగు సైమనుసంఘ సభ్యులున్న ఆ సదస్సులో ఇద్దరు సాధారణ భారతీయ యువకులు శతఘ్నిని ప్రేల్చుటయా! ఇదెట్లు సాధ్యపడెను! ఇంతటి సాహసమునకు ఆనాడు ఎంతటి గుండె ఉండవలెను! ఈసంఘటనతో యావద్భారతదేశము ఊగిపోయినది. బ్రిటిషు సామ్రాజ్యవస్తంభము సడలిపోయినది. త్వరలోనే న్యాయస్థానమందు భగత్‌సింగు బటుకేశ్వరదత్తులపై అభియోగము తేబడి విచారణ ప్రారంభమయ్యెను.

"మాకు ప్రాతినిధ్యములేదని భారతీయులెన్ని విధముల ఆందోళనచేసినను వినక పరప్రభుత్వము సైమనుసంఘమును నియమించినది. బ్రిటిషు ప్రభుత్వపుముందు ప్రజావాణి బధిరునకు శంఖారావమయ్యెను. అందుచే ఆసామ్రాజ్యవాదుల బాధిర్యము పోగొట్టు నిమిత్తమే యీశతఘ్ని ప్రయోగము కాని ఎవ్వరినో హత్యచేయుటకును గాయపరచుటకును మాత్రముకాదు. జీవకారుణ్యము విషయములో మేమెవ్వరికిని తీసిపోము!" అని నాటిన్యాయస్థానమునందు సర్దార్ భగత్‌సింగు చేసిన గంభీరప్రకటన చారిత్రకతను సంతరించుకొనెను; దేశభక్తి ప్రపూర్ణులనందరను ఆవేశపరులనొనర్చెను. దానితో భగత్‌సింగును, బటుకేశ్వరదత్తును విడుదలచేయవలెనని ప్రభుత్వవ్యతిరేకాందోళనము దేశవ్యాప్తముగసాగినది. కాని అది బ్రిటిషువారిముందు మూగ చెవిటివారి ముచ్చట అయ్యెను. భగత్‌సింగునకు మరణదండనమును అతనిమిత్రుడగు బటుకేశ్వరునకు ద్వీపాంతరవాసదండనయు తప్పలేదు.

ఈవార్త భారతావనిలో బడబాగ్నిగా ప్రజ్వరిల్లినది. స్వాతంత్ర్యవీరులకు దండన రద్దుచేయవలెనని కల్లోలము మిన్నుముట్టినది. కాని నిర్దయమైన ప్రభుత్వము దానిని లక్ష్యపెట్టక మట్టుపెట్టెను. రాజప్రతినిధిని క్షమాభిక్ష వేడుకొనినచో మరణదండన తగ్గగలదని కొందరుహితైషులు భగత్‌సింగునకు ఉపదేశముచేసిరి. అయినను విప్లవసింహమైన అతడు జీర్ణతృణము మేయునా!

దేశస్వాతంత్ర్యమును కోరిన దోషమునకును పరప్రభుత్వమును తొలగింపనెంచిన పాపమునకును సర్దార్ భగత్‌సింగును క్రీ॥శ॥ 1931 మార్చి 23వ తేదీనాడు బ్రిటిషుపాలకులు ఉరితీసి చంపివేసిరి. వారు తనను ఉరితీసి తనశవమును భస్మము చేసివేయవచ్చునుగాని ప్రతిభారతీయుని హృదయమునందును రగులుచున్న స్వాతంత్ర్యాగ్నిని మాత్రము చల్లార్చలేరని ఉరిస్తంభమునుండి భగత్‌సింగు గర్జించినాడు. పరప్రభుత్వము అతని కళేబరమునైన తలిదండ్రులకు అప్పగింప నిరాకరించెను. అతని చితాభస్మమును భారతీయులకు దక్కనిచ్చినచో దేశమున నలుమూలల అగ్ని ప్రజ్వరిల్లునని బ్రిటిష్ ప్రభుత్వము బెదరిపోయినది. అతని శరీరము పంచభూతములలో లీనమైపోయెను. కాని అవిప్లవము దేశమునెల్ల ముంచెత్తినది. నిద్రావస్థలో మునిగిన భారతీయులకు మేల్కొలుపు పాడినది. యావద్భారతమునకు స్వాతంత్ర్యోద్యమము రేకెత్తెను. అదియే క్రీ॥శ॥ 1947 ఆగస్టు 15వ తేదీగా రూపొంది భారతదేశము దాస్యశృంఖలలనుండి విడుదలపొందుటకు దారితీసెను.

భగత్‌సింగు పంజాబునందలి ఒకరైతుకుటుంబమున జననమొందినాడు. పైచెప్పిన కేంద్రశాసనసభలో బాంబు శతఘ్నిప్రయోగము చేయునాటికి అతని వయస్సు పట్టుమని పాతికయేండ్లు కూడలేదు. పదునాలేండ్లకే విప్లవమునుగూర్చిన భావములు అతనిని ఆకర్షించినవి. అప్పుడది లాహోరుకళాశాలలో అతడు ఇంటర్మీడియెటు తరగతి చదువుచున్న కాలము. క్రీ॥శ॥ 1926లో (తనయిరువదవయేట) అతడు చంద్రశేఖరఆజాద్ ప్రభృతులతో కలిసి "హిందూస్థాన్ సోషలిస్టు రిపబ్లికన్ ఆర్మీ"ని స్థాపించెను

భారతశాసనిలో సాంఘికవాదోద్యమవ్యాప్తికి ఆనేన చేసిన సేవ నిస్సీమము.

స్వర్గీయ భగత్‌సింగు సమాధినిగురించి అతని మిత్రుడు రామ్‌ప్రసాద్ బిస్మిల్ తన ఒక గేయములో పలికిన పలుకులు మరపురానివి సత్యసంకల్పములైనవి. "అగుటకది ఒడిగెడు మట్టిదేగాని దానినుండి వేలాది ఎర్ర వీరులు ఉద్భ వించి బ్రిటిషుప్రభుత్వవినాశమునకు ఉద్యమమును చేప్పదురు!" అనునది ఆగేయములోని భావము. బిస్మిల్ సిద్ధసంకల్పుడు; దూరదర్శి ప్రవక్తయు. సర్దార్ భగత్‌సింగు సమాధి భారత దేశమున ఆంగ్లసామ్రాజ్యమునకే సమాధికట్టినది.

భగత్‌సింగు నేడు మనమధ్య లేడు. అయినను అంతటి లేతవయస్సులో అతడు చేసిన త్యాగమును చూపిన సాహసమును నెలకొల్పిన ఆదర్శమును భారతజాతికి చిరస్మరణీయము. ఎల్లరకతడు నిత్యస్మరణీయుడు. అతడు ఆదినములలో గత్యంతరములేక వైయక్తికహింసాపథమును త్రొక్కియుండవచ్చునుగాక! అందుచేతనిర్దిష్టపరిపూర్ణ ఉద్యోగఫలితములను ఈయజాలకపోవచ్చునుగాక! కాని అది అతని అభినివేశమును ఆవేశమును ఉష్మలతను త్యాగబుద్ధిని దేశభక్తిని పరువమును భావావేశమును సామ్రాజ్యవాదమువెడ జుగుప్సను రుజువుచేయగలదు.

అతని అనాటి ఆత్మత్యాగము వ్యర్థముకాలేదు. అది క్రమక్రమముగ భారతీయులనందరను ప్రచలితులను చేసెను. ప్రతిభారతీయుని రక్తమును ఉడుకెత్తించెను. దేశభక్తి స్వాతంత్ర్యజ్వాలలను రగిలించెను. "కరో! యా మరో!" (కరణమో మరణమో)అని మహాత్మాగాంధి ఒత్తిన సందేశశంఖారవము దేశమున నాల్గుచెరగులందును మారుమ్రోగునట్లు చేసినది. భయనిశేతనమును పరాధీనమును అగు తనజీవితమువెడ ప్రతిభారతీయునకును రోతగల్గునట్లు చేసినది; నూరేండ్లు కలకాలము జీవించుటకంటె హంసగా ఆరునెలలు జీవించుటయే చాలునని ఆత్మసాక్షాత్కారముతో అతడనుకొనునట్లుచేసినది.

భగత్‌సింగ్ స్మృతికి భారతప్రభుత్వమేమిచేసినదో స్పష్టముగ తెలియరాదుగాని అతని జీవితమునుగూర్చి యిటీవలనే "షహీద్" అనుపేరుతో ఒక చక్కని చలనచిత్రము దేశభక్తి ప్రపూరితముగను కరుణరసప్రధానముగను వెలవడినది. పంజాబు రాష్ట్రములో ప్రజ నీకము ఇటీవలనే (1970) అతని కాంస్య విగ్రహమును ఒకటి నెలకొల్పెను.

భగత్‌సింగ్ తల్లి యీనాటికిని సజీవురాలు. అనదమ పంజాబురాష్ట్రపౌరులు తనకు కానుకగానిచ్చిన ఐదువేలరూప్యములనిధిని యీమె అప్పటికి వ్యాధిగ్రస్తులైయున్న బటుకేశ్వరదత్తునకు దానముచేసివేసినది. మరల ఇటీవల భగత్‌సింగ్ స్మారకదినమునాడు భారతప్రభుత్వము అతనితల్లిని గౌరవించినది.

భగత్‌సింగుతోపాటు ఆయనతోడివారగు రాజగురు సుఖదేవులునైతము ఉరికంబమెక్కింపబడిరి. భారతజాతి వారి త్యాగనిరతిని మరచిపోజాలదు.

దేశభక్తి స్వాతంత్ర్యవాంఛలనగా వారివి ఆత్మత్యాగములనగా అవి వారు. దేవయాత్ర చాలించినను వారి నిరుపమ త్యాగరతియు అసామాన్యదేశాభిమానమును భారతజాతి స్వాతంత్ర్యచరిత్రలో సువర్ణాక్షరలిఖితములైనవి. వారు మనకు ప్రాతఃస్మరణీయులైనారు.

వి. వి. కు. శ.

## సర్దార్ వల్లభభాయిపటేల్

క్రీ. శ. 1942 ఉద్యమమునతో తనకు భారతదేశములో ఇక నిల్వపుట్టవు నూకలు నిండుకొన్నవి అని నిర్ణయించుకొనిన ఆంగ్లేయ ప్రభుత్వము క్రమముగా 1947 ఆగష్టు 15 నాటికి భారతదేశమునకు సంపూర్ణ రాజకీయస్వాతంత్ర్యము నిచ్చివేసెను. స్వదేశమునకు తరలిపోవుచున్నప్పుడుకూడ కుటిలనీతికి ప్రసిద్ధిగన్న ఆ ప్రభుత్వము భారతదేశమునకు కొన్ని విషమ సమస్యలను సృష్టించి మరియు పోయినది. అందు అన్నిటికంటె క్రూరతర సమస్యలు రెండు. భారతదేశవిభజన మొకటి. 500 మందికి పైగ గల సంస్థానాధీశులను రెచ్చగొట్టి వారిని స్వాతంత్ర్యము ప్రకటించుకొనుడని ప్రోత్సహించుట రెండవది. భారతప్రజలకు ఏమాత్రము ఇష్టములేకపోయినను జిన్నా సాహేబు మంకుపట్టును మన్నించుటకై గత్యంతరములేక దేశ విభజనమునకు జాతీయనాయకులు అంగీకరింపవలసివచ్చినది. ఆంగ్ల ప్రభుత్వపు దుస్తంత్రము వెరిగిన అగ్రనాయకులు పోయినపాకిస్తానుపోగా తక్కిన దేశమునైనను సమైక్యపరచి దానిలో సామరస్యమును నెలకొల్పవలెనని తపనపొందిరి. జటిలమైన ఈసమస్యాపరిష్కారమునకు ప్రధానసాధకభూతుడు "ఉక్కుమనుష్యు" డని ప్రసిద్ధినొందినసర్దారువల్లభభాయిపటేలు.

పెద్దచదువులు చదువుకొని యువకుడై నప్పటికూడ చాలకాలమువరకు చీట్లపేక ఆడుకొనుచు ఉల్లాసముగ జీవిత

మును గడపినవల్లభభాయిపటేలు గాంధిమహాత్ముని ప్రభావముచే దేశసేవకుడై అగ్రనాయకుడై శాశ్వతయశస్సునార్జించెనో తెలిసికొందము

సోదరులగు వల్లభభాయి విఠలభాయి పటేలులు విద్యావంతులు మేధావులు వీరి స్వరాష్ట్రము గుజరాతు వీరు "ఖైరా" మండలములో ఒక సంపన్నగృహస్థునింట జన్మించిరి వ్యవసాయము అయిన వృత్తి ఉదారస్వభావమునకు చాల ప్రఖ్యాతిపొంది తనపుత్రుల ఉన్నతవిద్యాభ్యాసమునకు ఎడు పాటుపడినవాడు ఆతండ్రి

వృత్తినిర్వహణము ఈసోదరులిర్వురిలో విఠల్ భాయికి చిన్ననాటినుండి విద్యాభ్యాసంగమునందు ఆసక్తి మెండు వల్లభభాయి తెలివితుండియు చదువునందు ఆసక్తితక్కువ పైగా అతడు పెంకెతనమునకు పెట్టినదిపేరు వయసువచ్చినతర్వాత కూడ వల్లభభాయిలో అమాంతతనము అంతగాఅంతరింపకపోయి నను చదువువిషయములో మాత్రము శ్రద్ధాసక్తులు పెరిగినవి ఆయన కాలక్రమమున న్యాయవాదవిద్యలో పట్టభద్రుడుకూడ అయినాడు అచిరకాలములోనే ఆయన గొప్ప క్రిమినలు లాయరుగాకూడ కీర్తినార్జించినాడు ఆదాయముపై తమ వృత్తులమునగనుండెడిది ఆయన వాదబలమునకును వాగ్ధాటికిని న్యాయాధికారులు ఆశ్చర్యచకితులయ్యెడివారు తరువాత అతడు ఇంగ్లండుపోయి బారిష్టరుపరీక్షలోకూడ కృతార్థుడై వచ్చి తనవృత్తిలో పెద్దపేరుప్రఖ్యాతులు సంపాదించెను

రాజకీయరంగప్రవేశము వృత్తినిర్వహణములో తానెంత శ్రద్ధాళువై కృషిచేసినను వల్లభభాయి తనవిశ్రాంతి వేళలయందు 'క్లబ్' లో చీట్లపేకఆటతో కాలము గడపుచుండు అలవాటు కలవాడు. ఆ వేళలలో ఇతరవిషయములను పట్టించుకొనువాడుకాడు

భారతస్వాతంత్ర్య సముపార్జనకు సత్యాగ్రహమును ఆయుధముగా మహాత్మగాంధి యెన్నుకొన్నప్పుడు ఆయాయుధము పరప్రభుత్వముపై పటిష్ఠముగాదని పరిహసించిన వారు వల్లభభాయిపటేలు అట్టివాడుగాంధిజీదివ్యసందేశమును శ్రద్ధగా వినుటతో మారిపోయి ఆయనకు శిష్యుడైనాడు

ఆదినములలో యావద్భారతదేశముతో పోల్చినచో రాజకీయముగ గుజరాతు రాష్ట్రము చాలవెనుకబడియున్న ప్రాంతము. అచ్చటిప్రజలకు బ్రిటిష్ ప్రభుత్వ దమనచర్యలను గూర్చి బోధించి వారినందరిని ఒకత్రాటిపైనడిపించి తన సహాయనిరాకరణోద్యమము నకు వారితోడ్పాటు సంపాదింపగల సామర్థ్యముసర్దారు వల్లభభాయిపటేలుయందు దేనున్నదని మహాత్మగాంధి గ్రహించుటచే ఆయన వల్లభభాయిని తనముఖ్యానుచరులలో ఒక్కనిగా చేసికొనుట జరిగెను యథార్థమునకు వల్లభభాయియందు చిత్తవిశుద్ధియను ఒకఅద్భుతగుణమున్నది ఏ కార్యమునైనను తాను నిర్వహింప నిశ్చయించుకొన్నచో దానిని అంతశ్శుద్ధితో నిర్వహించుట స్వభావము అతనిది అందువలననే పటేలు యేనాడుగాంధి శిష్యుడయ్యెనో ఆనాటినుండియు త్రికరణశుద్ధితో ఆయన అడుగుజాడలలో నడవసాగినాడు

వల్లభభాయిముందుగాగుజరాతుప్రజానీకము కు ఆనాటి మనదేశస్థితిగతులను గూర్చియు పరప్రభుత్వము మనలను కొల్లగొట్టుటను గూర్చియు తనఉపన్యాసములలో ఎల్లరకును తెల్లమగురీతిలో వెల్లడించెను, జాతికి వెన్నెముకయయిన రైతువర్గము బ్రిటిషుపరిపాలనలో ఎట్లు అష్టకష్టముల పాలగుచున్నదియుకూడ వివరించెను నయగారా జలపాతవేగముతో సాగిపోవు వల్లభాయి ఉపన్యాసములు విని ఆకృష్టులుగాని గుజరాతీయులు లేరు మహాత్మునినాయకత్వమునకును వల్లభభాయి నాయకత్వమునకును బద్ధులమైయుండగలమని మాటయీయని వ్యక్తులులేరు రాజకీయరంగముకోనికి చొరవచేసి కొని వచ్చిన కొద్దికాలమునకే యిట్లుప్రజాభిమానములను చూరగొనగలిగినవాడు వల్లభాయిపటేలు

పన్నులనిరాకరణోద్యమము - దీనికి తోడు గాంధీజీ 1928లో పన్నులనిరాకరణోద్యమమును ప్రారంభించి దానిని జయప్రదముచేయు భారమంతయువల్లభభాయిపైననే మోపెను తన పిలుపునందుకొనిన రైతులందరకును ఆ ఉద్యమము యొక్క ఆవశ్యకతను వల్లభభాయి వివరింపగా వారును తమ తమ సంపూర్ణ సహాయ్యసహకారముల నొసగెదమని యాయనకు మాటయిచ్చిరి ప్రధానముగ బార్డోలీయందు ఈపన్నుల నిరాకరణోద్యమము తీవ్రరూపము దాల్చినది దానిని అణచివేయుట ప్రభుత్వమునకుసాధ్యపడలేదు వల్లభభాయికి ఈవిజయము దేశమందంతటను పేరుప్రఖ్యాతుల నార్జించిపెట్టెను బ్రిటిషుసామ్రాజ్యాధిపతుల శత్రుత్వమునుకూడ అదికొనితెచ్చిపెట్టెను అయినను అప్పటిలో ఆయనపై తగుచర్య తీసికొను అవకాశము ప్రభుత్వమునకు చిక్కలేదు

శాసనోల్లంఘనోద్యమము: అవిమ్మట 1930లో మహాత్ముడు

శాసనోల్లంఘనోద్యమమును ప్రారంభించెను. గుజరాతులో ఈ ఉద్యమమును జయప్రదమగుటకు వల్లభభాయి పడిన పాట్లు ఇంతింతనరానివి. ఏ ఉద్యమమును నెరవేర్పవలెనన్నను ఆయా వ్యవహారసంపన్నత ముందు కావలెనని అతడెరుగును. అందుచేత తన రాష్ట్రమునందుగల ఆశ్రమాలన్నిటియొద్దను ప్రభుత్వకార్యాలయములన్నిటియొద్దను అతడు బహిరంగ సభలనేర్పాటు చేసి ఎన్నెన్నో పెద్దలకును ఉద్యమావశ్యకతను నచ్చచెప్పి వారివారి పదవులను చూరగొని సహకారమును సమీకరించెను. ఇట్లు జరిగినది ఒకరోజు కాదు రెండురోజులుగాదు వారములతరబడి నెలలతరబడి రాష్ట్రము నాల్గుచెరగుల సంచారము చేసి రాత్రియనక పగలనక సభలనేర్పరచి ఉపన్యాసములిచ్చి ప్రజలను విశేషముగ ఆకర్షించినవాడు ఉత్తేజపరచినవాడు. ఆయన ప్రబోధము మూలమున పాశ్చాత్యవిద్యలకు స్వస్తిచెప్పినవారిసంఖ్యయు ప్రభుత్వోద్యోగములకు తిలోదకములిచ్చినవారి సంఖ్యయు ఏమంత తక్కువ కాదు.

ఇక ఈ ఉద్యమవ్యాప్తిని అణచివేయుట తనకర్తవ్యమని భావించినది ఆంగ్లప్రభుత్వము. పెద్దలనలేదు–పిన్నలనిలేదు–ఈ ఉద్యమముతో సంబంధమున్నదని తానూహించినవారి నెల్లరను లాఠీప్రహారముల పాలు చేసినది. కళాశాలలను వీడవచ్చిన విద్యార్థులకు శ్రమములిప్పించినది. ఆదినాలలో లాఠీపోట్లకు గురియై దీర్ఘవ్యాధిగ్రస్తులై తుదకు మృత్యుగహ్వరప్రవిష్టులైన దేశభక్తుల సంఖ్య అనల్పము. వైద్యసౌకర్యములులేక మృత్యువువాతపడిన పీడిత స్వాతంత్ర్యయోధుల సంఖ్యయు స్వల్పముకాదు. ఒకవైపు ఉద్యమసాఫల్యమునకు పాటుపడుచు ఇంకొకవైపు కష్టనష్టములకు లోనైన దేశాభిమానులను ఆదుకొనుటలో వల్లభభాయి ఉక్కిరిబిక్కిరి అయ్యెడిది. ఉత్సాహవంతులైన కార్యకర్తల సహకారముతో అతడు ప్రజానీకమునుండి విరాళములు ప్రోగుచేసి ఆసొమ్మును పీడితప్రజాసేవకుల నిమిత్తము వెచ్చించుచుండెడివాడు. లాఠీ దెబ్బలను గాయములను పడినవారికి ఆసొమ్ముతో వైద్యసౌకర్యములు కలిగించెడివాడు. ఈ ఉద్యమసందర్భములో వల్లభభాయితో కలిసి గుజరాతు రాష్ట్రమంతటను పర్యటించిన మహాత్మాగాంధికి వల్లభభాయిపట్లగల ప్రజాదరాభిమానములు విశదమై విశేషసంతోషమును ఆశ్చర్యమును కలిగించినవి.

అఖిలభారతకాంగ్రెసు అధ్యక్షపదవి: శాసనోల్లంఘనోద్యమము సమస్త రాష్ట్రములలో దిగ్విజయముగ సాగిపోయెను. గుజరాతునకు ఆవిషయమున అగ్రతాంబూలము లభించుటతో వల్లభభాయి యశస్సు అన్నిదిశలయందును ధవళాంబరగుణను నేయజొచ్చినది. దీనిఫలితముగనే ఆతడా మరుసటియేడు అఖిలభారతకాంగ్రెసునకు అధ్యక్షుడుగా ఎన్నికపొందెను. ఆ అధ్యక్షపీఠమునుండి ఆయన కావించిన మహోపన్యాసగర్జన అప్పటి ఆంగ్లప్రభుత్వముపై అశనిపాతమైనది.

కారాగారవాసము: ఇటు ప్రజలలో ఉద్రేకము హెచ్చు పెరిగిపోవుటయు అటు ప్రభుత్వము తన దమననీతిని పెంచి దేశభక్తులను నానాహింసల పాలుచేయుటయు కారణములుగా 1930లో తాను ప్రారంభించిన శాసనోల్లంఘనోద్యమమును గాంధిమహాత్ముడు రెండేండ్లపాటు నిలుపుదలచేసినాడు. అన్నిరాష్ట్రములయందును 1932లో తిరిగి ఈ ఉద్యమము ప్రారంభము కాగా అగ్రనాయకశ్రేణి దేశమంతటను కష్టించి పనిచేసినపుడు వల్లభభాయి గతములోకంటె ద్విగుణీకృతోత్సాహముతో దీనిసాఫల్యమునకు కృషిచేసి సాకల్యముగ కృతకృత్యుడయ్యెను.

ఇట్లు దేశములో పెల్లుబికిన ఆవేశము బ్రిటిషుప్రభుత్వమును దద్దరిల్లజేసినది. అన్నిముఖ్యపట్టణములలోను 144 వ సెక్షను ప్రవేశపెట్టబడెను. మునుపటివలె కార్యకర్తలను దండించుటతో తృప్తిపడని ప్రభుత్వము ఈసారి నాయకులను కూడ చెరబెట్టినది. ముందుగా గాంధిగారిని నిర్బంధములోనికి తీసికొన్నది. ఆపిదప రాష్ట్రస్థాయిగల వివిధ నాయకులను బంధించెను; ఈ ఊపులో వల్లభభాయిని వదలలేదు. ఎట్టి న్యాయస్థానవిచారణము లేకయే నాయకులందరకును రెండేండ్ల కఠినశిక్ష విధింపబడినది. అది అక్రమమని ప్రజలెల్లరు ఘోషపెట్టిరి. వారిమొర వినువారేలేరు. తనప్రియతమ నాయకుడు వల్లభభాయిని నిర్బంధించినందులకు గుజరాతు అట్టుడికినట్లు ఉడికిపోయినది. ఆవేశపూరితులైన ప్రజలను అదుపులో పెట్టుట కష్టమయ్యెను. అందుచే అలజడులు లాఠీలపోట్లు, కారాగారనివాసములు మితిమీరిపోయినవి. చెరసాలలోనుండియే వీటినన్నిటిని గురించియు వినిన వల్లభభాయి తనరాష్ట్రప్రజలకొక సందేశమును పంపుచు శాంతప్రవర్తనమును ఉద్బోధించెను.

జాతీయోద్యమమునందు చేరినది మొదలుకొని కారాగారశిక్షకు గురియగువరకును వల్లభభాయి యించుక విశ్రమించినదిలేదు. మునుపు నిరంతరము శ్రమపడినందున చెరసాలలోనుండగా ఆయనకు కొంచెము శరీరారోగ్యత యేర్ప

డెను. కాని త్వరలోనే స్వాస్థ్యము లభించినది. చెరసాలలో కూడ ఉత్తమగ్రంథపఠనమును, దేశస్వాతంత్ర్యసముపార్జనా కార్యక్రమచింతనము ఆయనకు నిత్యకృత్యములైనవి.

సంఘసేవాధికము: బీదసాదలకు అనాథులకును సేవ చేయుపట్ల వల్లభభాయికి ఆసక్తి అధికము. బీదలను కలవారిని కూడ ఒకేమాపున చూచి ఆదరించి గౌరవించు ప్రవృత్తి ఆయనది. నెహ్రూపండిత[illegible]యావద్భారత దేశమునందు ప్రజోద్ధరణముకొరకై రూపొందించిన పథకములను గుజరాతులో ఆచరణయోగ్యములుగ చేయుట వల్లభభాయి వంతు అయ్యెను. ఆయన సాధించిన విశేషమింకొకటి. దేశమునందలి ధనికులను కాంగ్రెసుసంస్థలో చేర్పించవలెనన్నది మొదటి నుండియు ఆయన ఆశయము. దానికికారణము క్రమశిక్షణగల సంస్థలో సభ్యులైనవారు తమనాయకుల ఆజ్ఞలకు బద్ధులై దేశసేవాపరతంత్రులై యుండగలరన్న విశ్వాసము. ఈదృష్టితోడనే పెక్కుమంది ధనికులను ఆయన తనచాకచక్యముతో చిక్కపట్టి కాంగ్రెసులో చేర్పించినాడు. ఆదినములలో ఇది చాల విప్లవాత్మకమైన మార్గమనుట అతిశయోక్తి కాజాలదు.

ఉప్పుసత్యాగ్రహము :- ఉప్పుసత్యాగ్రహ సందర్భములో వల్లభభాయి నిర్వహించిన పాత్ర బహురూపముల ప్రధానమైనది. ఈ ఉద్యమమునకు ప్రజాశక్తిని విశేషించి స్త్రీశక్తిని సమీకరించుటకు ఆయన అత్యంతము కృషిచేసెను. సత్యాగ్రహమున ఉద్యమములు కొనసాగవు. శక్తి క్రమశిక్షణలో నుంచుటయందే విజయరహస్యమిమిడి యున్నది. అక్కడనే నాయకుని సామర్థ్యము వెల్లడికాగలదు. ఈ విషయమున వల్లభభాయి ప్రతిభాసంతు దర్శించుకొని యావద్భారతజాతి గౌరవమును గుర్తగానెను.

మహాత్ముని పాదచిహ్నములలో -

స్వాయముగ వల్లభభాయి కొంచెము నిరంకుశుడు. సంఘములోను సమాజములోను చేరి ఒక్కొక్క విషయమును గురించి అందరిని సంప్రతించి వ్యవహరించుట ఆయన స్వభావమునకు గిట్టినిదని. అట్టివ్యక్తి మహాత్ముని ప్రభావము మూలమున ప్రజాభిప్రాయవిరుద్ధముగా వ్యవహరించినచో గలుగు అనర్థములను గ్రహించుకొనినాడు. రాజకీయవ్యవహారములలో పెక్కుసందర్భములయందు గాంధిగారి అభిప్రాయములతో తానేకీభవించజాలకపోయినను, ఆయన ఆజ్ఞను శిరసావహించి నిర్వహించెడివాడు. అతరమువారి క్రమశిక్షణయు నాయకుని యందలి అచంచలభక్తివిశ్వాసములును అట్టివి.

ఒకసమయములో కాంగ్రెసునకింక శాసనసభాప్రవేశార్హత రాలేదని గాంధిగారు సూచించినారు. కాని దేశబంధు చిత్తరంజనుడును నెహ్రూపండితుడును విఠల్‌భాయి పటేలును నేతాజీయు వంటి ప్రముఖులు గాంధిమహాత్ముని అభిప్రాయముతో ఏకీభవించలేదు. ఐనను ఆసందర్భములో గాంధిగారి అడుగుజాడలలో నడచుటయే తమవిధియని వల్లభభాయి వారితో వాదించి గెలిచెను. ఆతరువాత మహాత్ముని ఆజ్ఞానుసారము కాంగ్రెసువాదులు ఎన్నికలలోనికి దిగినప్పుడు ప్రముఖనాయకులందరితోపాటు అహర్నిశలు శ్రమపడి ఒడలు సెగలు పొగలు చేసికొని ప్రచారము సాగించి కాంగ్రెసుసంస్థకు అతడు అఖండవిజయమును సమకూర్చినాడు.

తాను అహమ్మదాబాదు పురపాలక సంఘాధ్యక్షుడుగా పనిచేసినది కొలదికాలముపాటే అయినను తనకుగల ఆకొద్దిపాటి అవకాశములోనే ఆనగరము రూపురేఖలను తీర్చిదిద్దినందుకు ఇప్పటికిని అప్రజలు అతనికి కృతజ్ఞత ప్రకటింతురు.

సనస్కారము -వల్లభభాయి' ఉక్కుమనుష్యుడ'న్న పేరు ఊరకేరాలేదు. ఆయనమనోదృఢిమకొక్కనిదర్శనమేచాలును. ఒకనాడొక యభియోగములో తీవ్రముగ ఆయన వాదించుచుండెను. న్యాయస్థానమున అనుకవేసిన రాలనంతటి జనము. ఇంతలో ఆయనకొక తంతివార్త వచ్చినది. అది ఎక్కడ నుండి వచ్చినదో అని ఆవార్తగల కవరు చింపి చూచుకొని మరల మడిచి అతడు దానిని జేబులో పెట్టుకొని తనవాదమును పూర్తిగా మరింత తీవ్రముగ సాగించినాడు. అది ఏదోవ్యవహారమునకు చెందిన తంతికాబోలు అని ప్రేక్షకులందరు ఆయన ముఖకవళికనుబట్టి అభిప్రాయపడిరి. ఆనాడు న్యాయస్థానము ముగిసినతరువాతగాని ఆవార్త ఆయన సతీమణి మరణమునకు సంబంధించినది అన్న సంగతి ఎవ్వరికిని తెలియలేదు.

"క్విట్ ఇండియా" ఉద్యమము :- 1942లో పాశ్చాత్యులు భారతావనిని విడిచిపోవలెనని గాంధిజీ ఒక మహోద్యమమును కడసారిగా ప్రారంభించినాడు. అంతవరకు సాగిన జాతీయోద్యమములు ఒక యెత్తు. ఈఉద్యమము ఒక యెత్తు. ఇది కొంత విప్లవమార్గమున నడచినది. ఇందు వల్లభభాయి వహించిన పాత్ర అపూర్వము అసదృశమును. అటు ప్రభుత్వమును హెచ్చరించుటయు ఇటు ప్రజాశక్తిని పెడత్రోవలు పట్టనీయకుండుటయు అను రెండు బాధ్యతలు నిబ్బరముతో

నిర్వహించి పై యుద్యమమును జయప్రదము గావించిన వల్లభభాయి పరప్రభుత్వమునకు ప్రక్కలో బల్లెమైనందున మరల కారాగార నిర్బంధమునకు గురి కావలసి వచ్చినది

దేశ విభజనము — అనాడు మహమ్మదీయులయందు జాతీయవాదులలో అగ్రగణ్యుడని ప్రసిద్ధిగన్న జిన్నాసాహేబును సైతము అధికార ప్రలోభకల్పనలచే బ్రిటిషువారు భారత దేశ విభజనవాదమునకు పురికొల్పిరి ఈ విభజనము బ్రిటిషు వారికే లాభదాయకము కాని భారత పాకిస్తానులకు కాదని యెందరు అగ్రనాయకులు చెప్పినను జిన్నా గిన్నా పుణ్యమున బోలేదు దేశవిభజనమనర్థదాయకమని నిరూపింపగోరి చేసిన కృషిలో పైయర్థము గుర్తించినను వల్లభభాయి వహించిన పాత్ర ప్రశంసనీయమని ప్రజాభిప్రాయము ముక్తకంఠముతో ఘోషించెను

స్వాతంత్ర్య ప్రకటనము — హిందూముస్లిములలో అంతఃకలహములు వ్యాపించి తీవ్రరూపము దాల్చగలవని భారతీయులకు పరిపూర్ణవిశ్వాసము కలిగినవెంటనే ఆంగ్లేయ ప్రభువులు భారతదేశమునకు స్వయంపరిపాలనా ప్రతిపత్తిని సంపూర్ణ స్వాతంత్ర్యమును గూడ ప్రసాదించి మనను అంతయు మమ్మీపనే ఉంచి శరీర మాత్రముగా తమ దేశమునకు తరలి పోయిరి నెహ్రూ పండితుడు ప్రధానిగా నేర్పడిన కేంద్ర ప్రభుత్వమునందు సర్దారు పటేలుభాయి ఉపప్రధానిగా నియమింపబడెను 1947 ఆగష్టు 15వ తేదితో మనకు సర్వాధికారములను సంక్రమించిన తర్వాత నవభారత రాజ్యాంగమును రూపొందించుటయందు వల్లభభాయి చేసిన తోడ్పాటు కరబడి లేనిది

స్వతంత్ర సంస్థానముల సమస్య — సంస్థానాధీశుల నెల్లరను కలిసికొని వారి సమస్యలను నయానభయాన పరిష్కరించి సంస్థానములన్నిటిని భారత ప్రభుత్వములో విలీనము చేయుటయందు ఆయన చూపిన అభినివేశమును అభినందించుచు ప్రశంసాపూర్వకముగ "ఉక్కు మనుష్యు"డన్న బిరుదముతో ప్రజాకోటి ఆయనను బహుమానించినది

కాశ్మీరు యుద్ధము — భారత దేశ వాయవ్యదిశలో దోపిడులను దుండగములను వృత్తిగాగల కొండజాతి మహమ్మదీయులచే పాకిస్తాను కాశ్మీరముపై దండయాత్ర జరిపించినపుడు భారత ప్రభుత్వమును కాశ్మీరము శరణువేడుకొనగా వల్లభభాయి ఆ దుండగులపై తగినచర్య తీసికొనెను అప్పుడు కాశ్మీరము ఆత్మబుద్ధితో భారతదేశమున సంలీనమై అంతర్భాగమైనది కాని నేటివరకును కాశ్మీరముపై పాకిస్తాను కన్నవిషదృష్టిని ప్రసరింపచేయుచునే యున్నది హైదరాబాదు సంస్థానముపై "పోలీసుచర్య" జరిపి దానిని భారతదేశములో సంలీనముచేసి భాషా ప్రయుక్తరాష్ట్రవిభజనకు నాందిగా ఆంధ్రప్రదేశమును అవతరింపజేయుటలో ఆతడు ఎదుర్కొనిన తీవ్రప్రతిరోధములు అతని నేర్పుధీరతను గాంభీర్యౌదార్యములను చాటగలవు

పాలనాదక్షత — విదేశములతో మంచి సంబంధములను నెలకొల్పుకొను కృషిలో ప్రధాని నెహ్రూ నిమగ్నుడు కాగా ఉపప్రధానిగా వల్లభభాయి స్వదేశములోనివివిధ సమస్యలను పరిష్కరించు కృషిలో నిమగ్నుడైనాడు ముఖ్యముగ ప్రజలకు కావలసినది గ్రాస-వసన-వాస-దైన్య నిర్మూలనమని యెరిగి వారి శ్రేయస్సంపాదనము నెడల ప్రత్యేక శ్రద్ధ చూపెను అంతేగాదు పరిపాలనా యంత్రాంగమునందలి పెక్కు లోపములను సరిదిద్దుటకు ఆయన పడిన శ్రమ సాధారణమైనదనలేము ఒకవైపు ఉపప్రధాని బాధ్యతలను నిర్వహించుచునే వేరొకవైపు మాతృసంస్థయైన కాంగ్రెసు కార్యకలాపములయెడ ఆయన అపరిమిత శ్రద్ధాసక్తులు చూపెడివాడు ఆ సంస్థలో వర్గములుగాని ముఠాలుగాని చీలికలుగాని ఏర్పడినవని తెలిసినచో ముందుకు దుమికి అందరిని మందలించి సర్వవిషయములను సక్రమమార్గములో పెట్టుట ఆయనకు పరిపాటి

పెక్కుదశాబ్దులు గణనీయముగ మాతృదేశమునకు నిర్విరామసేవ సలిపవల్లభభాయి1950లో ఉపప్రధానిగనుండియే పరమపదించెను ఆయన మరికొంతకాలము జీవించియుండిన యెడల కాశ్మీరసమస్య ఇంకను ఇట్లు "రావణునికాష్ఠము" గ సిద్ధమయ్యెడిదికాదు అది అట్లు జరుగకపోవుట భారతీయుల అదృష్ట హీనత

వి వి శ శ

## సర్వేపల్లిరాధాకృష్ణయ్య

డాక్టరు సర్వేపల్లి రాధాకృష్ణయ్య 1888వ సంవత్సరము సెప్టెంబరు 5 వ తేదీన మదరాసునకు 40 మైళ్ళ దూరమునగల తిరుత్తని అనుచోట పైనక్షేత్రమున జన్మించెను 12సంవత్సరములవరకు అతడు తిరుత్తనియందును తిరుపతిక్షేత్రమునందును వసించెను తిరుపతియందలి "లూథరన్ మిషన్"

ఉన్నతపాఠశాలయందును రాయవేలూరునందలి "వూర్హ్" అను కళాశాలయందును మదరాసునందలి క్రిస్టియను కళాశాల యందును అతడు విద్యనభ్యసించెను. మదరాసు క్రిస్టియను కళాశాల యందు విద్యనభ్యసించునప్పుడు రాధాకృష్ణయ్య డా॥ స్కిన్నరు ప్రొఫెసరు ఏ జి హాగరు అను ప్రముఖుల బోధనలచే అత్యంత ప్రభావితుడయ్యెను. ఎం ఏ పరీక్షయందు "అద్వైత వేదాంత నీతివిచారము" అను నొక వ్యాసమును సమర్పించెను (1909) ఎం ఏ పట్టభద్రుడయిన రాధాకృష్ణయ్య మదరాసు ప్రెసిడెన్సీ కళాశాలలో వేదాంతవిషయమున సహాయ ఆచార్యుడుగ నియుక్తుడై 1916–17లో అచటనే తత్త్వశాస్త్రాచార్య స్థానము నధిష్ఠించెను.

రాధాకృష్ణయ్య 'మోనిస్టు' 'మైండు' మున్నగు పెక్కు అంతర్జాతీయ నీతిప్రతిపాదక పత్రికలలో 27 సంవత్సరముల ప్రాయమునకుముందే కర్మ స్వేచ్ఛాసంకల్పము నీతి విధ్యాభిధానమున మతమునకుగల స్థానము మున్నగు అనేక అమూల్యవ్యాసరాజములను ప్రచురించెను. భగవంతు నధికరించి బెర్గ్‌సన్ వ్రాసిన తాత్త్వికభావములపై గూడ అతడు వ్యాఖ్యను ప్రచురించెను. 1918 వ సంవత్సరములో "రవీంద్రనాథ ఠాకూరు వేదాంతము" అను గ్రంథమునతడు ప్రచురించెను. "భక్తిమార్గమనివార్యము సర్వమతైక్యసామరస్యములను గుర్తించుటకును ఆత్మయొక్క పరిపూర్ణతను సాక్షాత్కరించుకొనుటకును సాంప్రదాయిక పంథననుసరింపవలసి లేదు" అనునది ఈ గ్రంథమునందలి సారాంశము.

1917వ సంవత్సరములో రాధాకృష్ణయ్య తత్త్వశాస్త్రాచార్యుడుగ రాజమహేంద్రవరమునందలి ప్రభుత్వకళాశాలకు బదిలీచేయబడెను. అచ్చట అతడు ప్రప్రథమముగ రచించి ప్రచురించిన ప్రముఖగ్రంథము సమకాలికతత్త్వశాస్త్రమున మతాధికారము అనునది. ఈ గ్రంథముమూలమున రాధాకృష్ణపండితుడు ఉపజ్ఞాసమృద్ధిగల తత్త్వచింతకుడుగా ప్రసిద్ధి నొందెను.

అతడు 1918 జులై నుండి 1921వ సంవత్సరము ఫిబ్రవరి వరకు మైసూరువిశ్వవిద్యాలయమున తత్త్వాచార్యపదవి నలంకరించెను. మహావిద్యావేత్తయగు అశుతోష్ ముఖర్జీ రాధాకృష్ణపండితుని కలకత్తా విశ్వవిద్యాలయమున మానసిక నైతికశాస్త్రాచార్యుడుగ నియుక్తుని కావించెను. అపదవియందుండినపుడు రాధాకృష్ణయ్య 1923 1927వ సంవత్సరములలో రెండుసంపుటములుగా "భారతతత్త్వశాస్త్రచరిత్రము" అను ఉద్గ్రంథమును ప్రచురించెను. ఈ సంపుటములు 20వ శతాబ్దిమున వెలువడిన అత్యంతోదాత్తమైన భారతీయ తత్త్వశాస్త్రమువై దుష్యసంభరితములుగా కొనియాడబడినవి. 1926 వ సంవత్సరమునాటికి రాధాకృష్ణపండితుడు భౌతికపదార్థములపై కంటె ఆధ్యాత్మికవిషయములపై ఆధారపడు మానవునకే శాశ్వతశాంతిని సాధింపనగునని నొక్కి వక్కాణించెను. పాశ్చాత్యతత్త్వపండితులు భారతతత్త్వశాస్త్రముపై కావించిన దోషారోపణములకితడిందు సరుచితమైన సమాధానముల నొసగెను.

1926 వ సంవత్సరమున ప్రప్రథమముగా రాధాకృష్ణయ్య విదేశపర్యటన మొనర్చెను. ఆయన కలకత్తా విశ్వవిద్యాలయము పక్షమున బ్రిటిషు సామ్రాజ్య విశ్వవిద్యాలయ పరిషత్తునందు పస్థితుడై కేంబ్రిడ్జిసదస్యు లెన్నడును వినియెరుగని అద్భుతమైన ధోరణిలో భారతతత్త్వశాస్త్రమునధికరించి దివ్యప్రవచన మొనర్చెను. అటుపిమ్మట కొలది కాలమునకే అతడు ఆక్స్‌ఫర్డు విశ్వవిద్యాలయమునందు

చిత్రము 98

డా॥ సర్వేపల్లి రాధాకృష్ణయ్య

'భారతీయ జీవితదృక్పథము' అను విషయముపై అత్యంతగంభీరోపన్యాసమొనర్చి సదస్యులను విస్మయావిష్టమనస్కుల నొనర్చెను.

1929 వ సం॥లో ప్రచురితమైన "నేడు రేపు" అను గ్రంథసంపుటములలో 'కల్కి లేక నాగరకతాభవిష్యత్తు' అను విషయమునుగూర్చి రాధాకృష్ణపండితుడు మచ్చటించెను. అందాతడు నాగరకతాభవిష్యత్తును నావశ్యకమైనది సహకారముగాని మానవకోటియందలి సర్వజాతుల ఐక్యమతముల సర్వసంస్కృతుల అభిజ్ఞానము కాదని ఉద్ఘాటించెను.

ఆసంవత్సరమందే రాధాకృష్ణయ్య 'ఆదర్శవాదిజీవితదృక్పథము' అనువిషయముపై నొక ఉపన్యాసపరంపర నొసగెను. అది రాధాకృష్ణయ్య రచించిన అత్యంతోదాత్తమును భావగర్భితమును ఆధునికమునైన వేదాంతతత్త్వమహోప

వ్యాసపరంపరగా విశ్రుతమైనది "ప్రపంచావర్తములను ఆర్థిక-సాంఘిక - రాజకీయ పరిష్కారములు రూపుమాపజాలవు వాటిని నిర్మూలించుట సుశిక్షితగాత్రులును సుశిక్షిత మనస్కులునైన నూతనమానవవంశ్యులకే సాధ్యమగును" అని రాధాకృష్ణయ్య వచించెను ఆగ్రంథముపై శ్రీ అరవిందఘోషుని ప్రభావము స్పష్టముగ గోచరించుచున్నది "మతానుభవము బుద్ధిప్రమీకరణము" అను నాతని గ్రంథముచే రాధాకృష్ణయ్య సహజజ్ఞానానుభవమును పొందిన ధన్యవక్తి యని నిరూపించుచున్నది అందు వేదాంతి ఔదాసీన్యము వహింపదగదనియు ఔదాసీన్యము మతసంప్రదాయ వ్యాదయములదనియు త్యాగముచే అనుభవముచే అమృతత్వమును అనుభవింపుమని ఈశోపనిషత్తు శాసించుచున్నదనియు అతడు వక్కాణించెను

1930 వ సం॥ జులై 8వ తేదీన ఆక్సుఫర్డునందు 'శాస్త్రానుభవద్వారమున పరివర్తనము' అను నొక మతధర్మోపన్యాసము నొసగుచు రాధాకృష్ణపండితు డిట్లు ఉద్ఘాటించెను "భగవత్సేవకులమైనచో మానవునకు మానవునకు మధ్య సంఘమునకు సంఘమునకు మధ్య జాతికి జాతికి మధ్య సక్రమసంబంధమును మనము స్థాపింప యత్నింపవలయును ఎవడు తనజాతికి సంక్రమించిన అవమానమునెల్ల తనదిగా భావించునో అతడే నిక్కమయిన నాయకుడు ఉదార బుద్ధులు క్లేశానుభవమునే వరింతురు మనము సత్యయోధులమై ప్రేమాయుధులమై దివ్యపరిపాలనము భూమిపై స్థాపింపబడువరకు విశ్వమును తలక్రిందుచేయుచు అశాంతమొనర్పవలయును' అని ఈ ఉపన్యాసము నొసగునపుడు మహాత్మాగాంధి అతని స్మృతిపథమున నుండెను

1930 వ సం॥ డిసెంబరులో పంజాబు విశ్వవిద్యాలయ స్నాతకోపన్యాసమొసగుచు మనము అన్ని మత రాజకీయ పక్షములను అధిగమింపవలయును మనము బాధలకు గురియగుదుముగాక ! మనకు కృతకృత్యత చేకూరకపోవచ్చునుగాక ! మనలను ప్రపంచము విస్మరించుగాక ! కాని మన మెప్పుడును నీచత్వమునకు అల్పత్వమునకు పాల్పడగూడదు; మన జీవితమును సార్థకమొనర్చునది మహత్త్వమే ' అని సర్వవిశ్వవిద్యాలయములవారికి రాధాకృష్ణపండితుడు విన్నవించెను

ఆక్సుఫర్డు విశ్వవిద్యాలయమునందు స్పాల్డింగు' ఆచార్యుడుగా నియుక్తుడైన రాధాకృష్ణయ్య 'ఈస్టరన్ రెలిజియన్స్-వెస్టరన్ థాట్' అను విషయముపై ఉపన్యసించుచు ప్రసవవేదనాకారణముగ ఒక నూతనప్రపంచముత్పన్నము కానున్నది ఒక నూతనజ్యోతిరావిర్భావము పొడసూపుచున్నది ఒక రహస్యాత్మకలదు అది సర్వప్రాణులందును తుల్యము ఏకమునై భాసిల్లుచున్నది ప్రపంచమున దానికి అత్యుత్తమమైన వాహనము మానవత్వమే జ్ఞానసముపార్జనమొనర్చి పరమాత్మరాజ్యమును భూమిపై స్థాపించుటకొరకై ప్రవర్ధమానమగుచున్న వాంఛాయుతమైన ఏకకేంద్రాభిముఖమగు ప్రయత్నసాక్షాత్కారము" అని వక్కాణించెను

1940 వ సం॥ లో రాధాకృష్ణపండితుడు బ్రిటిషు అకాడమీవారిచే మాస్టర్ మైండ్ సీరీస్ లో ఉపన్యసించుటకై ఆహూతుడయ్యెను బుద్ధునిగూర్చి ఉపన్యసించుచు రాధాకృష్ణయ్య "బుద్ధునియెడ జనులకుగల ఆదరాభిమానములు గౌరవము క్రమముగ అతిశయించుచున్నవి బుద్ధుని సందేశము మానవజాతికొక అమూల్యమైన నిధి అతడు ఆసియావాసులలోనెల్ల అత్యంత మేధాసంపన్నుడు మానవుని జీవితముపై ప్రసరించిన అతని ప్రబోధప్రభావ మద్వితీయము బుద్ధుడు ఉపనిషద్భావములను కొన్నింటిని స్వీకరించి వాటికి నూతనరూపకల్పన గావించెను బుద్ధుడు పాషండుడు కాడు అతడు భూతదయ శాంతి క్షాంతి కరుణ మున్నగు సుగుణములను బోధించెను అని వాక్రుచ్చెను

1947 వ సం॥లో రాధాకృష్ణయ్య మతము-సంఘము" అను విషయమునధికరించి రచించిన "కమలోపన్యాసములు" అను ఉత్తమగ్రంథమునందు మతము' అను శబ్దార్థమును "శాంతి యుద్ధము కుటుంబము వివాహము" అను అధునిక సమస్యలకు వర్తింపజేయు విధానమును చర్చించెను ఆసంపర్కమున ఎడివాదములకును ఆచారములకును ఈశ్వరవాదభేదములకును ప్రాధాన్యమొసగుట మతము కాజాలదనియు, మతము ఆచారములు కాలానుగుణముగ మారుచుండుననియు శాశ్వత సనాతనధర్మమే మతహృదయమనియు దాని నవలంబించుటయే నిక్కమయిన మతమనియు అతడుద్ఘోషించెను

1931-39 వరకు రాధాకృష్ణయ్య నానాజాతిసమితికి సంబంధించిన బౌద్ధిక సహకారసంఘమున సభ్యుడుగనుండి ఘనమయిన మానవసేవ నొనర్చెను దేశములమధ్య మానసికావగతి అనుకూలమగు వాతావరణమును సృజించుటయే ఆ

సంఘముయొక్క ముఖ్యోద్దేశము ఆసంఘమునందు విశ్వమందలి అత్యుత్తమ మేధాసంపన్నులకందరికి ప్రాతినిధ్యమొసగ బడెను.

రాధాకృష్ణయ్య 1931–36 వరకు ఆంధ్రవిశ్వవిద్యాలయమున ఉపాధ్యక్షుడుగను 1939 – 1948 వరకు కాశీవిశ్వవిద్యాలయ ఉపాధ్యక్షుడుగను పనిచేసెను. ఆకాలమున భారతీయ విశ్వవిద్యాలయములయొక్క ఉపాధ్యక్షులందరిలోను అతడు చిన్నవయస్కుడు. విశ్వవిద్యాలయములు విద్యావిధాన సంఘాధ్యక్షుడుగా అతడు సిద్ధపరచిన నివేదిక భారతీయవిద్యావిధానమును నిర్ణయించుటయందు అత్యంతప్రముఖమైన పాత్ర వహించెను (1950). యువకులకు స్వేచ్ఛనొసగుట ఆత్మగౌరవ చైతన్యమును ప్రబుద్ధమొనర్చుట మానవసేవకై మానవప్రగతిసాధనకై నూత్న శోధులను అంకితమొనర్చుట– విశ్వవిద్యాలయములు సాధింపవలసిన మహోదాత్తకృత్యములని రాధాకృష్ణయ్య వెల్లడించెను. అత్యంత శీఘ్రకాలములో ఆంధ్రవిశ్వవిద్యాలయ భవనములను నిర్మింపించి ఆంధ్రవిశ్వవిద్యాలయమునకు అత్యున్నతస్థితిని చేకూర్చినందులకై రాధాకృష్ణయ్యను విశాఖపట్టణ పురపాలకసంఘమువారు గొప్పగ కొనియాడిరి.

1944 వ సం॥ లో రాధాకృష్ణయ్య భారతరాజ్యాంగ నిర్మాయక సభాసభ్యుడుగనుండి "మనరాజ్యాంగ విధానము ననుసరించి ప్రతిపౌరుడు దేశభక్తి సంపన్నుడై యుండగలడు. ఈ విధానమునందు రాజకీయస్వేచ్ఛకు ఆర్థికస్వేచ్ఛకు నీతిధర్మములకు సముచితస్థానము లభింపగలదు" అని గంభీరోపన్యాస మొనరించెను.

ద్వితీయప్రపంచ యుద్ధానంతరము 1946 నుండి 1951 వరకు ఐక్యరాజ్య ఆర్థిక సాంఘిక సాంస్కృతిక సంఘమున భారతదేశ ప్రతినిధి వర్గనాయకుడుగనుండి రాధాకృష్ణయ్య గణనీయమైన సేవనొనర్చెను. 1952 – 1954 వరకును 1955 లోను అతడు ఐక్యరాజ్యసమితి సాధారణసమావేశమునకు అధ్యక్షుడుగనుండెను. అంతర్జాతీయరంగములో భారతీయ ప్రముఖులలో జవహర్ లాల్ నెహ్రూ తరువాత అతడే మిగుల ప్రఖ్యాతికెక్కినవాడు.

1949–52 సం॥ లలో డా॥ రాధాకృష్ణయ్య సోవియట్ రష్యాలో భారత రాయబారిగానున్నపుడు ఇతరులకు దుర్లభమైన దర్శనమును స్టాలిన్ అయనకొసగెను. రాధాకృష్ణయ్య నిర్వహించిన ఈ రాయబారము కారణముగ భారతదేశమునకు రష్యాతో ఆర్థిక వైజ్ఞానికవిషయములందు సంబంధములేర్పడెను. రాధాకృష్ణయ్య సంకుచితహృదయముగల దేశభక్తుడు కాడనియు ఆపన్నులను జూచినచో అతనిహృదయము కరుగుననియు స్టాలిన్ అతనిని ప్రశంసించెను. రాధాకృష్ణయ్యను మాస్కోవిశ్వవిద్యాలయము ఆచార్యుడను గౌరవబిరుదముచే సత్కరించెను.

1952 వ సం॥ లో రాధాకృష్ణపండితుడు భారతదేశపు మొదటిఉపాధ్యక్షుడుగను 1962 సం॥ లో దేశాధ్యక్షుడుగను ఎన్నుకొనబడెను.

1954 వ సం॥ లో అత్యున్నతమయిన "భారతరత్న" అను బిరుదముచే గౌరవింపబడెను. రాజ్యసభాధ్యక్షపీఠమునధిష్ఠించినతరుణమున తనఅపూర్వబోధనాశక్తిచే సుగమవ్యాఖ్యానవైఖరిచే అసాధారణపాండితీప్రకర్షచే సర్వులను మెప్పించి సర్వుల ప్రశంసలను అతడందుకొనెను. రాజ్యసభాధ్యక్షుడుగానుండి రాధాకృష్ణయ్య ప్రపంచమువెల్లి పర్యటించెను.

ఇట్లు నిర్విరామముగా అధికారకృత్యములలో నిమగ్నుడైయుండియు రాధాకృష్ణయ్య సారస్వత శాస్త్రీయ గ్రంథరచనా వ్యాయామవిషయమున అప్రమత్తుడై వర్తిల్లెను. 1943వ సం॥లు పిమ్మట రాధాకృష్ణయ్య తనప్రస్థానత్రయ భాష్యమును ప్రచురించెను. అభాష్యమాతని అసాధారణ ప్రజ్ఞాసంపత్తికి ప్రత్యక్షనిదర్శనము. ఇదిగావేదాంతము అను వ్యాసమున భిన్నభిన్నమతసంప్రదాయములవారు ఏకైకసర్వేశ్వరుని భిన్నభిన్నాకృతులతో భావించిరి. వారు తమదృక్పథవైవిధ్యముచే మానవజాతికి బహువిధదివ్యార్థములను ప్రసాదించిరి. భారతీయ ఆధ్యాత్మికప్రథ యూదీయుల ఏకేశ్వరనియమవిధేయత, ప్రకృత్యారాధకులగు గ్రీకులజీవితసౌందర్యము బౌద్ధమతీయ సత్యాకారుణ్యము క్రైస్తవమతమందలి దివ్యప్రేమ ఇస్లాముమతమునందలి శరణాగతితత్త్వము–ఇవన్నియు ఈవేదాంతమున ఇమిడియున్నవి అని అతడు చెప్పెను.

రాధాకృష్ణపండితుడు రాష్ట్రపతిహోదాలో అనేకదేశములలో పర్యటించుచు భారతీయుల ఉత్తమాదర్శములను నిక్కవముగ ఎఱింగించెను. 1963వ సం॥ లో ఇరాను దేశమును దర్శించిన సందర్భమున, టెహరాను విశ్వవిద్యాలయము అతనిని డాక్టరేటు బిరుదముతో సత్కరించెను. అది అయనపొందిన 40వ బిరుదము.

ఆచార్యరాధాకృష్ణయ్య సహధర్మిణి 1956వ సం॥న దివంగతయయ్యెను. అసతీమణి అయనకు అత్యంతసహకారిణిగ ప్రవర్తించెను. రాధాకృష్ణయ్యకు ఐదుగురు కుమార్తెలును ఒకకుమారుడును కలరు.

శ్రీ హ

## సలహాసంఘములు, ఒత్తిడి సంఘములు

ప్రభుత్వము నిర్వహించు కార్యక్రమములలో అధికారులకు సలహాలిచ్చుటకు నిర్మించబడు సంఘములకు సలహాసంఘము లనిపేరు వీటిని ప్రభుత్వము నిర్మించుచున్నది ఇట్టి సంఘములు ప్రధానముగ రెండు అవసరములను తీర్పగలవు

పరిపాలనాధికారము నందుండు వారు పరిపాలనమునకు సంబంధించిన విషయములన్నిటియందు జ్ఞానము కలవారు కారు వారు పదవులలోనికి వచ్చుటకు వారికిగల జ్ఞానము ఆధారము కాదు యోగ్యత ధనము పలుకుబడి – వీటిమూలమున వారు అధికారములోనికి వచ్చెదరు కాని పరిపాలనము చక్కగను కౌశలముగను జరుగుటకు వివిధ విషయములగురించిన జ్ఞానము అవసరము ఆరోగ్యమును గురించిగాని వ్యవసాయమును గురించిగాని విద్యావిధానమును గురించిగాని ప్రభుత్వము ఒకచట్టమునుగాని కార్యక్రమమునుగాని తలపెట్టినపుడు ఆరోగ్యశాస్త్రము వ్యవసాయశాస్త్రము విద్యాశాస్త్రము ఎరిగినవారి సహాయము తప్పనిసరి అగుచున్నది ఈ శాస్త్రములనెరిగినవారు మంత్రివర్గములోనుండజాలరు ఆయాపరిపాలనశాఖలకు – ఆరోగ్యశాఖ వ్యవసాయశాఖ విద్యాశాఖకు చెందిన ఉన్నతోద్యోగులలో వీటిని ఎరిగినవారు ఉండెదరు కాని వారు స్వతంత్రించి నిర్భయముగ మంత్రిమండలికి తమసలహాలను అందజేయలేకపోవచ్చును ఈ కారణముచేత ప్రభుత్వోద్యోగములలో లేని అనధికారులగు శాస్త్రవేత్తల సలహా అవసరమగుచున్నది అందుచేతనే సలహాసంఘములన్నిటియందును అనధికారసభ్యులే అధికముగనుండెదరు. శాస్త్రపరిజ్ఞానము నిపుణత్వము – వీటినిబట్టి వారు సభ్యులుగ నియమింపబడెదరు ప్రభుత్వమునకు కావలసిన సాంకేతికజ్ఞానము వీరిసాధనమున లభించును సలహాసంఘములు తీర్చు అవసరములలో ఇది మొదటిది

ఇదికాక ప్రభుత్వము తలపెట్టు కార్యక్రమములు ప్రజల ఆమోదమునకు పాత్రములు కావలసిన అవసరమున్నది కార్యక్రమముల మూలమున కలుగు ప్రయోజనములు ప్రజలకు తెలియకపోవచ్చును వాటిమూలమున తాత్కాలికనష్టమును పొందువారు ఇబ్బందులకు లోనగువారు కొందరుండవచ్చును నిర్బంధప్రాథమికవిద్యావిధానము కలరా, మశూచి మొదలగు వ్యాధులు రాకుండుటకై టీకాలు వేసికొనుట – ఇలాటి సంస్కరణముల అర్థమును గ్రహించలేక ప్రజలలో కొందరు వాటికి ఆటంకములను కలిగించుచుందురు అందుచేత సంస్కరణములను ప్రవేశపెట్టుటకు పూర్వమే ప్రజాప్రతినిధులతో సంప్రదించి వారి అభిప్రాయములను తెలిసికొనుట అవసరమగుచున్నది సలహాసంఘములలో నిపుణులతోపాటు ప్రజాప్రతినిధులనుకూడ కొందరిని నియమించుచుండెదరు వీరిమూలమున ఈ రెండవ అవసరము తీరుచున్నది పరిపాలకులు ప్రజలు వీరిమధ్య సన్నిహితసంబంధము ఏర్పడుటకు ఈ సంఘములు సాధనములగుచున్నవి

దీనినిబట్టి ఈ సంఘములలో మూడురకములగు సభ్యులుండెదరనిచెప్పవచ్చును (1) అధికారులు (2) నిపుణులు (3) సామాన్యప్రజాప్రతినిధులు వీరందరు కలసి చర్చలు సాగించిన తర్వాత అధికారులకు అనధికారుల అభిప్రాయము తెలియుటకు అవకాశమేర్పడుచున్నది అన్నిరకములవారు పరస్పరము అర్థముచేసుకొనుటచేత ప్రభుత్వము తలపెట్టిన కార్యక్రమములు శాస్త్రీయసరళముగను ప్రజామోదయోగ్యముగను జరుగుట సాధ్యమగుచున్నది సలహా సంఘముల మూలమున కలుగు ప్రయోజనములివియే

ప్రభుత్వకార్యక్రమములు రెండుదశలలో సాగుచుండును మొదటిదశలో కర్తవ్యనిర్ణయము చట్టనిర్మాణము జరుగును రెండవదశలో చట్టములను అమలుపరచుట జరుగును సలహాసంఘములు ఈ రెండుదశలలోకూడ ప్రభుత్వమునకు అవసరమైనను వీటినిఎక్కువగ రెండవదశయందు ఉపయోగించుట జరుగుచున్నది

ప్రతి పరిపాలనశాఖకు కొన్నిసలహాసంఘములు అనుబంధములుగనున్నవి కేంద్ర విద్యాశాఖకు కేంద్రవిద్యాసలహాసంఘము అఖిలభారత సాంకేతిక విద్యాసంఘము అఖిలభారత వయోజన విద్యాసంఘము అఖిలభారత స్త్రీవిద్యాసంఘము అనుబంధములుగనుండు సంఘములలో కొన్ని వ్యవసాయశాఖకు అనుబంధములుగ ఆహారపదార్థముల ధరలను నిర్ణయించుసంఘము ఎరువుల స్థాయిసంఘము గోసంవర్ధన కేంద్రసంఘము మత్స్యపరిశ్రమ సలహాసంఘము మొదలగునవి ఉన్నవి సమాచారశాఖకు సినిమాసెన్సార్ల సలహాసంఘము ఆకాశవాణిసలహాసంఘములు మొదలగునవి అనుబంధములుగ నున్నవి సలహాసంఘములు అనుబంధములుగలేని పరిపాలన శాఖ ఒకటికూడలేదు కేంద్రమునందేగాక, రాష్ట్రస్థాయిలోను, కొన్నిశాఖలలో జిల్లా స్థాయిలోను సలహాసంఘములున్నవి

అన్ని దేశములలో ఈనాటి పరిపాలన విధానములో ఈ సంఘములు ప్రధానపాత్రను వహించుచున్నవి

ఈ సంఘములలోని సభ్యుల సంఖ్య పరిమితముగనుండుట మంచిది 15–20కి మించరాదు సభ్యులసంఖ్య ఎక్కువ కాను కాను చర్చలలో పాల్గొనువారిసంఖ్యయు వాటియందు శ్రద్ధవహించువారిసంఖ్యయు తగ్గుచుండును ఒకే వ్యక్తి అనేక సంఘములలో సభ్యత్వము వహించుటకూడ వాంఛింపతగినది కాదు అట్టివ్యక్తులకు ఏ సంఘమునందును కావలసినంత శ్రద్ధ ఉండదు ఇతరుల కంటె మరీ గొప్ప వారిని ఇట్టి సంఘములలో నియమించుటకూడ కొంత ప్రమాదకరము వారు సభ్యులుగ నుండు సంఘములలో వారే ఎక్కువగ చర్చలతో పాల్గొనుటయు వారి అభిప్రాయములకే – మంచివి అయినను కాకపోయినను – ఎక్కువ విలువ ఉండుటయు జరుగును సామాన్యులతో కూడిన సహకారసంఘములే ఎక్కువ లాభకరములు

కొందరు అనధికారులుకూడ అధికారుల మెప్పును పొందుటకై స్వతంత్రాభిప్రాయములను వ్యక్తీకరించలేక అధికారుల అభిప్రాయములతో ఏకీభవించు ప్రమాదమున్నది, అట్టి ప్రమాదము సంభవించకుండుటకై తమ అభిప్రాయములను వ్యక్తపరచునంతటి ధైర్యముగలవారిని సభ్యులుగ నియమించుట అవసరము

ఒత్తిడిసంఘములు: ప్రజాప్రభుత్వముగల రాజ్యములన్నిటిలో ఒత్తిడిసంఘముల ప్రాధాన్యము దినదినాభివృద్ధిగాంచుచున్నది ప్రభుత్వమునుండి ఒకేవిధమైన ప్రయోజనమును సంపాదించగోరి అందుకై పరిపరివిధములుగ ప్రభుత్వముపై ఒత్తిడిచేయనుద్దేశించు వ్యక్తులందరు కలిసి ఏర్పరచుకొనిన సంఘమునకు ఒత్తిడిసంఘమని పేరు అక్కర సంఘము (Interest Group) అనునది దీనికి పర్యాయపదము

ఇట్టి సంఘములు మనదేశమందు ప్రస్తుతము అనేకములుగనున్నవి తమ వేతనములను పెంచుకొనుటకును ప్రభుత్వమునుండి ఇతర సౌకర్యములను సంపాదించుకొనుటకును ఏర్పడిన ఉద్యోగుల సంఘములు ఉపాధ్యాయుల సంఘములు కార్మిక సంఘములు రైతుసంఘములు, వ్యవసాయకూలీలసంఘములు రైల్వేపనివారల సంఘములు, తపాలా సిబ్బంది సంఘములు బ్యాంకుసిబ్బందిసంఘములు, విద్యార్థి సంఘములు–ఇవి అన్నియు ఇట్టి సంఘములు వీటినిగురించిన వివరణములలో కొన్ని ప్రధాన విషయములను గుర్తించుట అవసరము వీటిలో మొదటిది, సంఘములోని సభ్యుల సామాన్యలక్షణము రెండవది వారు సంపాదించగోరు ప్రయోజనము (అక్కర) మూడవది ప్రభుత్వముపై వారు తెచ్చు ఒత్తిడియొక్క స్వరూపము

మన దేశములోని ఒత్తిడిసంఘములను సభ్యులలోని సామాన్యలక్షణమునుబట్టి రెండురకములుగ వర్గీకరణముచేయవచ్చును ఒకవర్గమునకు చెందిన సంఘములలోని సభ్యులందరు పుట్టుకనుబట్టి ఆయా సంఘములలో సభ్యులగుచున్నారు కుల సంఘములు మతసంఘములు భాషాసంఘములు ఈవర్గమునకు చెందినవి ఆర్యవైశ్యసమాజము రజకసంఘము నాయీ బ్రాహ్మణసంఘము విశ్వకర్మసంఘము యాదవసంఘము రెడ్డిసంఘము బలిజసంఘము నాడార్ సంఘము నాయర్ సంఘము క్షత్రియసంఘము. వీటిలో కొన్ని క్రైస్తవుల సంఘము. ముస్లిములసంఘము అకాలీసంఘము ఆంధ్ర సంఘము కేరళసంఘము మహారాష్ట్రసంఘము ద్రావిడ సంఘము–ఇవికూడ ఈలాటివే

రెండవవర్గమునకు చెందినవి ఒకే వృత్తిగల సభ్యులతో కూడినట్టివి ఉపాధ్యాయులసంఘములు నాన్ గెజిటెడ్ ఉద్యోగులసంఘములు కార్మికులసంఘములు వర్తకసంఘములు మొదలగునవి ఇట్టివి ఇందులో ఒక్కొకదానియందు భిన్నకులములకు, భిన్నభాషలకు భిన్నమతములకు చెందినవారు సభ్యులుగ నుండెదరు వారందరి సమానధర్మము వారు అనుసరించు వృత్తి

ఒత్తిడిసంఘములు సంపాదించదలచు ప్రయోజనములు కూడ రెండురకములుగనుండును సభ్యుల స్వార్థము ఒకరకములోనిది సంఘములనేకముల ఉద్దేశము ఇట్టిదే తమ జీతములను పెంచుకొనుట తమసౌకర్యములను వృద్ధిచేసికొనుట–ఇవియే అనేక సంఘముల యొక్క ఉద్దేశము స్వాతంత్ర్యము లభించినతర్వాత దేశములో కులసంఘముల సంఖ్య విపరీతముగ పెరిగినది తమసభ్యులకు విద్యాసౌకర్యములు వృత్తి సౌకర్యములు ఉద్యోగసౌకర్యములు, ఇతర సదుపాయములు ప్రభుత్వసాధనమున సంపాదించు ఉద్దేశముతోనే ఈ సంఘము లన్నియు ఏర్పడినవి వృత్తిసంఘముల ఉద్దేశము కూడ స్వార్థము కాని పరార్థమునకై ఏర్పడిన సంఘములుకూడ ఒత్తిడిసంఘములలో కొన్ని ఉన్నవి హరిజన సేవకసంఘము, ఆదివాసి సేవకసంఘము గోరక్షణసంఘము మద్యపాననిషేధ సంఘములు, సాంఘికసంక్షేమసంఘములు ఇట్టివి ఇందులో

చేరిన పక్షములు తమలాభముకొరకుగా ఇతరులలాభము కొరకై కృషిచేయదలచినవారు ఒత్తిడిసంఘములలో ఈలాటి సంఘములుకూడ కొన్నిఉన్నవని గ్రహించుట అవసరము

తాము సంపాదించవలసినది స్వార్థమైనను పరార్థమైనను ఈసంఘములన్నియు ప్రభుత్వముపై ఒత్తిడి తెచ్చునట్టివియే ఇదియే వారు ఉపయోగించుసాధనము ప్రభుత్వముపై ఏయేసంఘములు ఎక్కువ ఒత్తిడిని తేగలవో వాటికి విజయము లభించుచున్నది ఆఒత్తిడిని సహించలేక ప్రభుత్వము వారికోరికలను చెల్లించుటయు అంతటి ఒత్తిడిని తేసికొనిరాలేని సంఘములకోరికలను చెల్లించకపోవుటయు జరుగుచున్నది కోరికలలోని న్యాయాన్యాయములను బట్టికాక ఒత్తిడినిబట్టి విజయము లభించుటయు లభించకపోవుటయు ఈసందర్భములో గమనించవలసిన విషయము

సాధారణముగ ప్రభుత్వముపై ఒత్తిడితెచ్చుటకు ప్రజలు ప్రయోగించగల సాధనములు ఏడురకములుగ నుండునని ప్రస్తుతకాలపు రాజనీతిశాస్త్రవేత్తలు నిర్వచించియున్నారు అవి (1) ప్రజాభిప్రాయమును తమవైపు త్రిప్పుకొనుట (2) అధికారములోనుండు మంత్రులు మొదలైనవారిపై చర్చలు సంప్రదింపులద్వారా ప్రత్యక్షముగ ఒత్తిడి తెచ్చుట (3) రాజకీయపక్షములద్వారా ప్రభుత్వముపై ఒత్తిడితెచ్చుట (4) ఎన్నికలలో తమ అభ్యర్థులను నిలబెట్టి వారిని గెలిపించి శాసనసభలలో వారిద్వారా తమకోర్కెలను సఫలముగావించుకొనుట (5) అధికారమందుండు మంత్రులకు ఇతర ఉద్యోగులకు లంచము లిచ్చుట (6) సత్యాగ్రహమును సాగించుట (7) దౌర్జన్యయుత కార్యక్రమములలో దిగుట రాజకీయ ప్రయోజనములను అనగా కొరిక లద్వారా సంపాదించకోరు ప్రయోజనములను సంపాదించుటలో అన్నికాలములందును అన్నిదేశములందును ఈసప్తవిధములగు కార్యాచరణసాధనములు ఉపయోగములో ఉన్నట్లు చెప్పవచ్చును ఆయాదేశముల పరిస్థితులను బట్టి వీటిలో కొన్ని ఎక్కువగ ఆచరణయోగ్యములగుటయు మరికొన్ని అట్లుకాకపోవుటయు జరుగుచున్నది

పరిణతిగాంచిన ప్రజాస్వామిక దేశములలో-అనగా ఇంగ్లండు ఫ్రాన్సు స్విట్జర్లెండు బెల్జియం నెదర్లాండ్సు స్కాండినేవియన్ రాజ్యములు అమెరికా కెనడా ఆస్ట్రేలియా న్యూజిలెండు జపాను మొదలగువాటిలో - 1,2 3 సాధనములు ఎక్కువగ ఉపయోగింపబడుచున్నవి అప్పుడప్పుడు కొన్ని సంఘములు నాల్గవసాధనమును ఉపయోగించుటకూడకలదు లంచములనిచ్చి అధికారులద్వారా తమప్రయోజనములను సంపాదించు విధానము 18 19వ శతాబ్దములలో ఎక్కువగ ఉండినను ప్రస్తుతము దానిప్రభావము చాలవరకు తగ్గినది సత్యాగ్రహము నిరాహారదీక్ష వీటిప్రసక్తి చాలతక్కువ కాని సమ్మెలద్వారా ప్రత్యక్షచర్యలను సాగించు కార్మికసంఘములు ఇతరసంఘములు అనేకములున్నవి రక్తపాతము దహనకాండలు ఆస్తివినాశము-వీటితోకూడిన దౌర్జన్యయుతములగు సాధనములను ఉపయోగించువారిసంఖ్య చాలతక్కువ వార్తాపత్రికలు సభలు సమావేశములు విజ్ఞాపనములు అధికారులతో రాయబారములు సంప్రతింపులు - శాంతియుతములగు ఇట్టిసాధనములద్వారా ప్రభుత్వముపై ఒత్తిడితెచ్చి తమ తమప్రయోజనములను సంపాదించుట ఈదేశములలోని ఒత్తిడి సంఘముల సహజలక్షణమని చెప్పవచ్చును

నియంతలుగాని కమ్యూనిస్టులుగాని పరిపాలించు రాజ్యములలో ఇట్టిసంఘములు ఏర్పడుటకు అవకాశములేదు

మనదేశములో ప్రజాస్వామికము ఏర్పడి ఉన్నది రాజ్యాంగములో పౌరులందరికి వాక్స్వాతంత్ర్యము సంఘములుగ ఏర్పడుస్వాతంత్ర్యము సమావేశములు జరుపుకొను స్వాతంత్ర్యము సమర్పించబడినది అందుచేతనే రకరకములగు ఒత్తిడిసంఘములు ఏర్పడినవి కాని ప్రజాస్వామికమింకను శైశవదశలోనుండుటచేతను ప్రజాస్వామికములో విశ్వాసము లేని రాజకీయపక్షములు కొన్ని ఉండుటచేతను అధికారములో నుండు మంత్రివర్గములకు తగినంత బలములేనికారణమునను అవినీతి ప్రాబల్యము గాంచినందునను 5 6 7 సాధనములు ఎక్కువ ఆచరణయోగ్యములగుచున్నవి తరతరములుగ నిరంకుశత్వమునకు అలవాటుపడినట్టియు తరతమభేదములు విపరీతముగనున్నట్టియు నిరక్షరాస్యులసంఖ్య ఎక్కువగనున్నట్టియు సంప్రదాయ బద్ధమగు జీవితమును సాగించునట్టియు ప్రజలతోకూడిన దేశములలో ప్రజాస్వామికము పరిపక్వమగుటకు కొంతకాలము పట్టుననియు సంధికాలములో ప్రజలు ప్రత్యక్షచర్యలను, దౌర్జన్యముతోకూడిన కార్యక్రమములను లంచగొండితనమును సాధనములుగ జేసికొని ప్రభుత్వముపై ఒత్తిడితెచ్చుట సాధారణలక్షణమనియు రాజనీతిశాస్త్రవేత్తల అభిప్రాయము భారతదేశములోని ఒత్తిడిసంఘములు చాలవరకు ఈఅభిప్రాయములోని సత్యమును రుజువుపరచుచున్నవి

మా. వెం.

## సస్యవర్గీకరణము

ఉపయోగమునుబట్టి సస్యములు ఆహారసస్యములనియు ఆహారేతర సస్యములనియు ద్వివిధముగా విభజింపబడినవి మానవాహారమునకు సంబంధించిన పంటలన్నియు మొదటి తరగతికి చెందినవి తక్కినవి రెండవ తరగతికి చెందినవి పంటల పై వచ్చు ఆదాయమునుబట్టి వ్యవసాయపరిశ్రమలకు ముడి పదార్థములను చేకూర్చునట్టియు ఇతర దేశములకు రవాణా చేయబడునట్టియు పైర్లను వాణిజ్యసస్యములుగా పేర్కొను చున్నారు రైతులకు వాణిజ్యసస్యములవలన వచ్చు ఆదాయ మెక్కువ ఉ - ప్రత్తి చెరకు వేరుసెనగ నార పొగాకు మొదలైనవి వ్యావసాయక వర్గీకరణము పంటల తీరుమబట్టి చేయబడియున్నది అట్టివర్గీకరణము ననుసరించి పంటలు 16 జాతులు కలవిగా పేర్కొనబడినవి

ధాన్యజాతులు ధాన్యములన్నియు ఆహారవుదినుసులు మానవాహారముగా ఇవి పిండిపదార్థము నొసగుచున్నవి ఆహారమునందలి పిండిపదార్థము మిక్కుటముగా నుండవలెను పిండిపదార్థములు మానవశరీరమునందు ఉష్ణశక్తి జనకములు అందుచేత ధాన్యముల ప్రాముఖ్యము మెండు వాటి పంట విస్తీర్ణమెక్కువ ఆంధ్రరాష్ట్రములో సాగుచేయబడు భూమిలో 60వ భాగమునందు ధాన్యజాతులు పండుచున్నవి ధాన్యములు మానవునకు ఆహారముగాను దానికి సంబంధించిన గడ్డి పశువుల కాహారముగాను ఉపయోగపడుచున్నవి వృక్షశాస్త్రము ననుసరించి ధాన్యములన్నియు "గ్రామినే" యనబడు గడ్డి జాతికి చెందిన పైర్లు ఈపైర్లు పలువిధములైన నేలలకు శీతోష్ణస్థితులకు వాతావరణములకు తట్టుకొనగలవు వీటిని వర్షాధారపు (మెట్ట) పైర్లుగను నీరుకట్టు (తోట) పైర్లుగను రెండుసాగువిధానములలో సాగుచేయుదురు కొన్ని ధాన్యజాతులు బీదభూములందును గట్టినేలలందును చవిటినేలలందుగూడ సాగుచేయబడును ఇవి ఉష్ణవాతావరణమునుండి, ఆర్ద్ర వాతావరణమువరకు మగల భిన్నపరిస్థితులను సహింపగలవు ధాన్యములనియు తృణధాన్యములనియు చిరుధాన్యము లనియు ధాన్యములు మూడువర్గములుగా విభజింపబడినవి

ధాన్యములు - ఇవి ప్రధానమైన ఆహారసస్యములకు చెందినవి వీటి పంటవిస్తీర్ణమెక్కువ ఇవి పలుదేశములందు సాగునందున్న ధాన్యములు

ఉ - వరి గోధుమ మొక్కజొన్న బార్లీ ఓట్లు

తృణధాన్యములు - ఇవి చాలవరకు ఉష్ణప్రదేశములందు పండింపబడుచున్నవి వీటికి తడి చాలతక్కువగానుండ గల యును కొన్నిదేశములలోనే ఇవి సాగుబడియందున్నవి తృణ ధాన్యపరిమాణము సాధారణ ధాన్యపరిమాణముకంటె చిన్నది ఉ జొన్న సజ్జ (గంటె) తమిద (చోడి లేక రాగి) కొర్ర

చిరుధాన్యములు ఇవికూడ ఉష్ణదేశపుపంటలే వీటిపంట విస్తీర్ణము తృణధాన్యములకంటె తక్కువ గింజల పరిమాణము గూడ చాలస్వల్పము ఉ - వరిగ చామ (సామ) ఆరిక ఊద

పప్పుదినుసులు లేక కాయధాన్యములు ధాన్యజాతులతరు వాత పప్పుదినుసులు ప్రధానమైనవి మానవుని ఆహారముగా ఇవి మాంసకృత్తులను కల్పించుచున్నవి వృక్షశాస్త్రము ప్రకారము, పప్పుదినుసులన్నియు లెగూమినోసీ అనుజాతికి చెందినవి ఈదినుసుమొక్కలకు గాలినుండి నత్రజనిని సేకరించు కొని ప్రేళ్ళయందు బొడిపెలుగా ఇముడ్చుకొని యుంచుకొన గలశక్తియున్నది ఈమొక్కల ననుసరించియుండు కొన్ని సూక్ష్మజీవుల సాహచర్యమువలన ఈశక్తి వీటికి కలుగు చున్నది ఈపైర్లలో ఆకురాలుడుకూడ ఎక్కువ రాలిన ఆకు చివికి నేలయందలి అంగపదార్థమును పెంపొందించును పై కారణములచే ఈపైర్లు భూరక్షకసస్యములు అనబడు చున్నవి పశువులకు పచ్చిమేతపైర్లుగను నేలను బలపరుచు పచ్చియాకుయెరువు పైర్లుగను, పప్పుదినుసుపైర్లు విశేషముగా సాగుచేయబడుచున్నవి ఈపైర్లుగూడ పలువిధములగు నేలల కును వాతావరణములకును అనువైనవిగానున్నవి పంటలు మహానూలు చేయునపుడు లభించు ఆకు-అలములు గింజల నుండి పప్పును వేరుచేయగా వచ్చు పొట్టు పశువులకు మేతగా ఉపయోగపడుచున్నవి ఆంధ్రరాష్ట్రమునందు సాగుబడి యందున్న భూమిలో 11 భాగము పప్పుదినుసుపైర్లకై విని యోగపడుచున్నది ఉ - కంది ఉలవ పెసర మినుము సెనగ అలచంద అనుము, బఠాణి మొదలైనవి

నూనెగింజలు నూనెగింజలనుండి నూనెను తీయుదురు ఆహారములో గ్రహింపబడు నూనెలు మానవశరీరములో క్రొవ్వుపదార్థములను సమకూర్చుచున్నవి అందుచేత పప్పు దినుసులతరువాత నూనెగింజలు ప్రాముఖ్యమును పొందు చున్నవి ఇందు ఆహారమునకు పనికిరాని నూనెగింజలుకూడ నున్నవి ఉ - ఆముదాలు ఆముదమువైరు ప్రత్యేకముగ వాణిజ్యోపయోగకారి నూనెగింజలనుండి తీయునూనె పలు

విధములైన పరిశ్రమలలో వాడబడుచున్నది. నూనెగూడ ఇతర రాష్ట్రములకును ఇతర దేశములకును రవాణాచేయబడుచున్నది. అందుచే ఈపైర్లన్నియు వాణిజ్య సస్యములుగా పరిగణింపబడుచున్నవి. ఆంధ్రప్రదేశమందు నూనె పరిశ్రమ చాల ప్రాముఖ్యము కలది. ఈ ముఖ్యమైన వ్యవసాయ పరిశ్రమ దేశసౌభాగ్యమునకు తోడ్పడుచున్నవి.

వృక్షశాస్త్రరీత్యా నూనెగింజలు పలుజాతులకు చెందియున్నవి. నూనెగింజలపైర్ల కాలమానము మూడు-నాలుగు మాసములనుండి (వేరుసెనగ, నువ్వు మొ॥) ఎనిమిదిమాసములవరకును (ఆముదాలు) బహువార్షికముగను (కొబ్బరి) నున్నది. పై పైర్ల అభివృద్ధిలోగూడ పెక్కువ్యత్యాసము లున్నవి. సాగువిధానమునందుసహితము పెక్కుభేదములున్నవి. అన్నింటిలోను నూనె తీసినతరువాత వచ్చు పిండి భూమికి నత్రజనిరూపమైన ఎరువుగా ఉపయోగపడుచున్నది. ఆముదపు పిండితప్ప తక్కినవన్నియు పశువులకు దాణాగా వాడబడుచున్నవి.

పై కారణములవలన ఇవి మానవులకు మిక్కిలి ఉపయోగపడుచున్నవి. మానవపోషణమునకు క్రొవ్వుపదార్థమును జంతుపోషణమునకై మాంసకృత్తులను భూసారపోషణమునకై నత్రజనిని సమకూర్చు నూనెగింజల సస్యములు ముఖ్యమైన పారిశ్రామికసస్యములుగా రూపొందుచు దేశసౌభాగ్యమునకు తోడ్పడుచున్నవి. ఉ- వేరుసెనగ నువ్వు ఆముదాలు కుసుమ వెర్రినువ్వు ఒలిసెలు ఆవాలు కొబ్బరి.

**నారపైర్లు:** నారపైర్లనుండి గుడ్డలునేయుటకు వలయు దూది గోనెసంచులకు గోనెపట్టాలకు త్రాళ్ళకు, తదితర సామగ్రికి వలయు నారనుచేకూర్చుచున్నవి. నారపైర్లుగూడ వాణిజ్యసస్యములుగా పరిగణింపబడుచున్నవి. వీటివలన రైతులకు వచ్చు ఆదాయము మెండు. ఈపైర్లు దూదినారపరిశ్రమలకు తోడ్పడుచున్నవి. ఇవి చాలవరకు వర్షాధారపుపైర్లు. ప్రత్తిని నీరుకట్టికూడ పండింపవచ్చును. భారతదేశమునందలి మొత్తముప్రత్తి పంటలో 18వ శాతము నీరుపెట్టబడుతోటలలో సాగచేయబడుచున్నది. ఉదా –ప్రత్తి గోగు జనుము కిత్తనార లిన్సీడ్ (ఫ్లాక్స్‌నార) అరటి (కొన్నిఅరటిరకములనుండి నారతీయుదురు), కొబ్బరి (దీని పీచు నారగా పనికివచ్చును) శాటి (దీనిపట్టలనుండి నారతీయుదురు)

**చక్కెరపైర్లు:** ఇందు ముఖ్యమైనపైరు చెరకు. తరువాతిది చక్కెర బీటుదుంప. ప్రపంచమందలి చక్కెర ఉత్పత్తిలో చెరకువలన 60 శాతము చక్కెరయు చక్కెరబీటుదుంప వలన 40 శాతము చక్కెరయు లభించుచున్నది. కొబ్బరి తాటి ఈత రసములతో కల్లును బెల్లమునుకూడ తయారు చేయుచున్నారు. పశ్చిమదేశములలో "మేపుల్" అను చెట్టు రసముతో గూడ కొలదిపాటి చక్కెరను తయారుచేయుచున్నారు. చెరకు ముఖ్యమైన వాణిజ్యసస్యము. చెరకుపైరును సారవంతమైన తోటభూములలో సాగుచేయవలెను. చక్కెరను ఉపాహారదినుసుగ ఎన్నుకొనవచ్చును.

**విషాదినుసులు:** ఈ జాతిపైర్లలో పొగాకు ప్రాముఖ్యము కలది. ఇది వాణిజ్యపుపైరు. తరువాత పేర్కొనదగినవి గంజాయి నల్లమందునిచ్చు పొప్పి. తమలపాకు పోకగూడ ఈ వర్గమునకు చెందినవే.

**మసాలాదినుసులు:** మసాలాదినుసులు వాణిజ్యపు పైరులు. ఇవి చాలవరకు తోటలలో సాగుచేయబడుచున్నవి. ధనియము వర్షాధారముచేపండు మెట్టపైరు. వీటి పంట విస్తీర్ణము స్వల్పము. మిరప మెట్టపైరుగను తోటపైరుగను గూడ సాగునందున్నది. పసుపు అల్లము ఉల్లి వెల్లుల్లి జీలకర్ర మొదలైనవికూడ మసాలాదినుసులలో చేరినవే.

**సువాసనద్రవ్యములు:** వీటియుత్పత్తి వాడుకగూడ స్వల్పము. వీటిసాగు చాలవరకు పశ్చిమకనుమల ప్రాంతములందుమాత్రమే. ఇవిఅన్నియు బహువార్షికములు. ఉదా - మిరియాలు ఏలకులు లవంగాలు జాజికాయ జాపత్రి లవంగపట్ట చిరంజియాలు మొ॥

**ఓషధులు:** పూర్తిగ ఈవర్గమునకు చెందిన పైర్లు మిక్కిలి తక్కువ. చెన్నరాష్ట్రమందలి తిరునల్వేలిజిల్లాలో సునాముఖి ఓషధిగా పైరుచేయుట కలదు. కొన్ని సువాసన ద్రవ్యములు మసాలాదినుసులుగూడ ఓషధులుగ వాడుకయందున్నవి. కొన్ని విషాదినుసులుకూడ ఓషధులుగా ఉపయోగపడును. ఇటీవల సర్పగంధియను మొక్కలను ఓషధులుగా సాగుచేయుచున్నారు. మిరియాలు, ధనియాలు గంజాయి నల్లమందు కూడ ఓషధులుగా పరిగణింపబడుచున్నవి.

**దుంపపైర్లు:** దుంపపైర్లలో ఫలసాయము భూమిలోపల వృద్ధియగును. వీటికి లోతైన సారవంతమగు నేలలు కావలెను. ఈపైర్లన్నియు తోటలలో సాగుచేయబడుచున్నవి.

ధాన్యపు పైర్లన్నియు మానవుల ఆహారమున కుపయోగపడు చున్నవి ఇది పలువిధములగు వృక్షజాతులకుచెందిన మొక్కలు వీటివలన ఆదాయము మెండు పంటవిస్తీర్ణము తక్కువ ఉదా - బంగాళదుంప లేక ఉర్లగడ్డ చిలగడదుంప లేక గెనుసుగడ్డ కంద చేమ పెండలము కఱ్ఱపెండలము చారకంద

మేతపైర్లు ఇవి పశుగ్రాసపుపైర్లు వీటిలో కొన్నిటిని పచ్చిమేతగ కోసివేయుదురు కొన్నిటిని ఎండబెట్టి నిలువచేసి చొప్పగా వాడుదురు అన్నిటిని పచ్చిగానున్నప్పుడుకూడ కోసి పాతిగపేసి నిలువచేసి మేపుదురు ఈపైర్లు చాలవరకు గడ్డిజాతికిని పప్పుదినుసుపైర్ల జాతికిని చెందినవి వీటిని మెట్ట పైర్లుగను తోటపైర్లుగనుకూడ సాగుచేయుదురు చాలవరకు ఇవి మూడు-నాలుగు మాసములపైర్లు కొన్నిటిని బహు వార్షికములుగా పైరుచేయవచ్చును పచ్చికబయళ్ళలో గడ్డినిగూడ మేతకై సాగుచేయుచున్నారు దీర్ఘకాలపుపైర్లను సాధారణముగా ఒకేభూమియందు 2-3 సంవత్సరము లుంచుట కలదు వీటికి బాగుగ బలముచేసి నీరుకట్టి సాగుచేయవల యును కోసినతరువాత ఈపైరు మరల పెరిగి కోతకువచ్చును వీటిని సాలుకు 6 8 సార్లు కోయవచ్చును మేతపైర్లు పాడిపశు వులకు చాలఅవశ్యకములు

స్వల్పకాలపుపైర్లు ఉదా - జొన్న సజ్జ, జనుము పిల్లిపెసర బొబ్బర ఉలవ కొల్లగలిజేరు లేక పాలకాడ బెర్సీమ్

దీర్ఘకాలపుపైర్లు : ఉదా - గినిగడ్డి నేపియర్ గడ్డి లేక ఏనుగుగడ్డి లూసరిన్ లేక గుఱ్ఱపుమసాలా గేదెగడ్డి

పచ్చియాకు ఎరువుపైర్లు వీటిని మాగాణిపైర్లకు తోట పైర్లకు ఎరువుగా పెంచి నేలలో కలియదున్నవలయును సామాన్యముగా వర్షాధారముతోగాని నేలలో ఇమిడియున్న తేమతోగాని వీటిని పైరుచేయవచ్చును ఈ పైర్లన్నియు పప్పుదినుసుజాతికి చెందినవి

ప్లాంటేషన్‌పైర్లు ప్లాంటేషన్‌పైర్లను తోటపులనియుతోట లనియు గూడవ్యవహరింతురు బహువార్షికములగు వీటిని వందలు వేలఎకరముల విస్తీర్ణములో ఎక్కువ పెట్టుబడిపెట్టి భారీఎత్తున సాగుచేయుచున్నారు వీటినివ్యష్టికమతములుగాను సమష్టికమతములుగాను సాగుచేయుటకలదు ఇవి కూడ వాణిజ్యపుపైర్లే వీటివలన మంచిలాభముకలదు ఈ వర్గము నకు చెందిన ముఖ్యమైనపైర్లు కాఫీ టీ రబ్బరు, కోకో ఏలకులనుగూడ ఈ వర్గములో చేర్పవచ్చును

కాయగూరలు కాయగూరలు ఆహారపుపంటలు వీటిని అన్నికాలములలో సాగుచేయవచ్చును సారవంతమైన తోట భూములలో వీటినిసాగుచేయుట అలవాటు వీటిసాగుబాలలాభ దాయకము విశేషమగు శ్రద్ధవహింపవలసి వచ్చుటచే కమత ములలో వీటి విస్తీర్ణము తక్కువగానుండును ఫలసాయము ఎక్కువదినములు నిలువచేయుటకు వీలుగాదు వీటిలో కొన్ని శీతకాలపు పైర్లుమాత్రమే గుమ్మడిజాతి మొక్కలను వాన కాలములోనే విత్తవలెను ఇతరపైర్లు అన్నికాలములలో పెరుగును

పండ్లు పండ్లజాతులు బహువార్షికములు వీటిలో అరటి బొప్పాయి ఏకవార్షికములుగ పరిగణింపబడుచున్నవి బాగుగ ఎదుగువరకు వీటికి నీరుకట్టవలెను కొన్నిటికి నీరుపెట్ట నవసరములేదు ఉదా - మామిడి జీడిమామిడి జామ సపోటా నారింజజాతికి విశేషముగ నీరు బలము అవసరము ఉష్ణమండలపు ఫలవృక్షములు శీతలమండలపు ఫలవృక్షములు అని రెండువిధములు రెండవరకమును శీతలప్రదేశములలోనే సాగుచేయవలెను ఉదా - (1) ఏకవార్షికములు - అరటి బొప్పాయి (2) బహువార్షికములు - మామిడి నారింజ నిమ్మ దబ్బ, బత్తాయి కమల సపోటా జామ దానిమ్మ, ద్రాక్ష అనాస మొ॥ (3) శీతలమండలపువండ్లు ఏపిల్ పియర్ పీచ్ స్ట్రాబెర్రీ రాస్పబెర్రీ ప్లమ్ మొ॥

పువ్వులు పుష్పజాతులైన తోటపైర్ల విస్తీర్ణము తక్కువ వీటిని శ్రద్ధగా కృషిచేయవలెను సామాన్యముగ వీటిని బహువార్షికములుగా సాగుచేయుట కలదు వీటిని నిలువచేయుట తగదు శీఘ్రకాలములోనే ఇవి అమ్ముడుకా వలెను వీటిసాగు ఎక్కువగా పట్టణప్రాంతములలో నున్నది ఉదా - మల్లె సన్నజాజి గులాబి చేమంతి కనకాంబరము సంపంగి మొ॥ దవనమును మరువమునుగూడ ఇందు చేర్ప వచ్చును చాలతక్కువగా విరజాజి మొల్లలుగూడ పెంచ బడుచున్నవి

బి సాం

## సహకార సంస్థలు

ప్రతివ్యక్తియు సామూహిక జీవనమునకు అలవాటుపడిన వాడు ఏదైనసొక కార్యమును సాధించుటకు కొందరు సమ ష్టిగా కృషిచేయుట సహకారమనబడును సమష్టికృషియం

విధానములలో సహకార భావము ప్రధానముగా గోచరించును. స్వల్పతరగతి జనులు మొదలు భారతదేశస్వాతంత్ర్య ద్విసంటి మహా కార్యముపరకు పరస్పర సహకారము మూలముననే నెరవేరినవి. ప్రపంచమందలి పలుదేశములు సమష్టిగా కట్టుబడి కృషిచేయుట వలననే మహాకార్యములు నిర్వహింపబడి సాధింపబడినవి.

శక్తిసంపన్నులను చక్కగా వినియోగించి సత్ఫలితములను స్వయంసమృద్ధిని సాధించుటకు సహకారవిధానము అమూల్య సాధనము. దేశము పొంగుటకు ఆర్థికాభివృద్ధికి సహకార మెంతయు తోడ్పడుచున్నది.

సహకారోద్యమ ప్రారంభము - దినదినాభివృద్ధి - 19వ శతాబ్దిలో భారతదేశము తీవ్రమగు ఆర్థిక మాంద్యమునకు గురియయ్యెను. తత్ఫలితముగా ముఖ్యముగా పేద రైతులు పెద్ద దెబ్బతినిరి. వారి ఋణము అధికముగా నుండుటచే ఎన్ని బాధలకు గురియైరి. ఫ్రెడరిక్ నికల్సన్ అనువాతడు సహకార సంఘములు స్థాపింపవలెనని సూచించెను. 1901 లో కగపుకమిషను వారు కుడ గ్రామములలో సహకార పరపతిసంఘములను స్థాపింపవలెనని సూచించిరి. 1904లో భారత సహకారచట్టము ప్రవేశపెట్టబడెను. కొలది ఆదాయముగల రైతులు సహకార పద్ధతులనను సరించి వారి ఆర్థికాభివృద్ధికి తోడ్పడుటయే ఈ చట్టపు ముఖ్యోద్దేశము. 1912లో ప్రవేశపెట్టబడిన మరియొక చట్టము వలన సహకారము పరపతిరంగములో నే కాక ఇతర రంగములలో కూడ ప్రవేశపెట్టబడెను. దీనివలన కేంద్రసంస్థలు ప్రాథమికసంస్థలు కేంద్రబ్యాంకులు రాష్ట్రబ్యాంకులు స్థాపింపబడెను. 1915లో మాక్లగన్ కమిటీ వారు సహకారోద్యమమును పరిశీలించి ఒక నివేదికను సమర్పించిరి. కాని మొదటి ప్రపంచయుద్ధకారణముగా దానిపై ప్రభుత్వ మెట్టి చర్యను తీసుకొనలేకపోయెను. 1919 తరువాత ప్రవేశపెట్టబడిన సంస్కరణములవలన సహకారశాఖ ప్రజలచే ఎన్నుకొనబడిన మంత్రి ఆధీనములోనికి వచ్చెను. దానివలన సహకార సంఘముల సంఖ్య పెరిగెను. 1931లో ఘటిల్లిన ఆర్థికమాంద్యము వలన వ్యవసాయదారులకు విపరీతమగు నష్టము రాగా వారికి ఋణ పరపతి అవకాశములు హెచ్చుగా కావలసి యుండెను. 1935లో రిజర్వు బ్యాంకు ప్రత్యేక వ్యవసాయ పరపతిశాఖను స్థాపించెను. రెండవ ప్రపంచయుద్ధము తరువాత సహకారసంస్థలు హెచ్చయ్యెను.

స్వాతంత్ర్యోదయమైన తరువాత సహకారమునకు క్రొత్త రూపు వచ్చెను. భారతరాజ్యాంగ విధానములో సహకార సిద్ధాంతమునకు ఉత్తమస్థానము లభించెను. ప్రణాళికలలో సహకారకృషికి ప్రభుత్వపు ప్రోత్సాహము కూడ లభించెను.

1951లో గ్రామీణ విధాన అభివృద్ధిని పరిశీలించుటకు రిజర్వు బ్యాంకు ఒక సంఘమును నియమించెను. ఋణవ్యాపారస్థులు మంజూరు చేయుచున్నవాటిలో నూటికి మూడువంతులు మాత్రమే సహకారసంస్థలద్వారా లాభము పొందుచున్నట్లు వ్యవసాయ సంఘముల క్రయవిక్రయములను చూచుకొనవలెననియు వ్యవసాయ సరకులకు మార్కెట్లు లభించునట్లు చూడవలయుననియు శిక్షణపద్ధతులు కూడ ముఖ్య సరకులనియు ఈకమిటీవారు చెప్పియున్నారు. 1955 లో రిజర్వు బ్యాంకు చట్టములో ప్రవేశపెట్టబడిన మార్పులవలన రాష్ట్రీ సహకారబ్యాంకులకు మంచి సహాయము లభించెను.

1958లో జాతీయసహకారాభివృద్ధిసాధింపబడెను. శిక్షణ సౌకర్యములుకూడ హెచ్చగుటకు అవకాశములు కల్గెను. పంచవర్ష ప్రణాళికలలో సహకారసిద్ధాంతమునకు సహకార సంస్థలకు ముఖ్యస్థానమేర్పడెను. మొదట ఈఉద్యమము పరపతి సహాయమిచ్చుటకు అవతరించినను ఇది రానురాను వివిధ రంగములకు విస్తరించెను.

సహకారసంస్థలు ఈక్రింది సూత్రములనవలంబించును - (1) పరిమితి కొత్తత్వముండవలెను (2) లాభముల పంపిణి (3) పెట్టుబడి మీద పరిమితమైనవడ్డీ (4) పరస్పర సహాయము (5) పొదుపు స్వయం సహాయము (6) విద్యాభివృద్ధి

సహకార సంఘముల నీక్రిందివిధముగా విభజింపవచ్చును

సహకార సంస్థలు

- పరపతి సంఘములు
  - వ్యవసాయ పరపతి సంఘములు
    - స్వల్పకాలికము
    - దీర్ఘకాలికము
- పరపతేతర సంఘములు
  - వ్యవసాయమునకు సంబంధించినవి
  - తదితరము లైనవి

పరపతి సహకార సంస్థలు – నాటికి సుమారు 6 వంతులు పరపతి సహకార సంఘములుగా వ్యవహరించుచున్నవి సహకారపరపతి సంఘములద్వారా స్వల్పకాలిక ఋణములు ఇట్వబడాయగుచున్నవి ఆధునిక వ్యవసాయ పరికరములతో వ్యవసాయోత్పత్తులను తక్కువ ధరలకు కొనుచున్నారు రెండవ పంచవర్ష ప్రణాళికాకాలములో వ్యవసాయదారులకు సుమారు 250 కోట్ల రూప్యములవరకు పరపతి సౌకర్యములు కావలెనని అంచనా వేయబడినది

సరసమైన వడ్డీరేట్లకు ఉత్పత్తి ఋణములను ఎరువులను విత్తనములను ఇచ్చుటకు గ్రామస్థాయిలో ప్రాథమిక సహకార సంస్థలు విశాలప్రాతిపదికపై సహకారసంఘములు గ్రామీణ బ్యాంకులకు సెంట్రల్ బ్యాంకులు పెట్టబడి పెట్టుచున్నవి రాష్ట్రస్థాయిలో రాష్ట్రసహకారబ్యాంకు జిల్లాస్థాయిలో కేంద్రబ్యాంకు గ్రామస్థాయిలో ప్రాథమిక సహకారసంఘము ఈపరపతి వంటి దీని సాగించుచున్నవి ద్వితీయప్రణాళికా కాలము పూర్తియగుసరికి ప్రతిగ్రామమందును ఇట్టి సహకార పరపతి సంస్థలుండవలెననియు అందలి సభ్యత్వము పెరుగవలెననియు కృషిజరుగుచున్నది

రాష్ట్రస్థాయిలో సహకారవ్యవహారములను చూచుటకు రాష్ట్రసహకారబ్యాంకు పనిచేయును జిల్లాస్థాయియందున్న జిల్లాకేంద్రబ్యాంకులకు అవసరమైనపరపతిని ఈసంస్థ సమకూర్చును అవసరసమయములలో రిజర్వుబ్యాంకు రాష్ట్రబ్యాంకులకును జిల్లాబ్యాంకు గ్రామీణసహకారసంస్థలకును ఋణములిచ్చును

దీర్ఘకాలిక పరపతి భూమితనఖాబ్యాంకులు: పెద్ద పెట్టుబడితో భూమిని అభివృద్ధిచేయవలెనన్న దీర్ఘకాలిక ఋణములవసరము దీనికి గ్రామీణపరపతిసంస్థలు స్వల్పకాలిక ఋణములనుమాత్రమే ఇయ్యగలవు అభివృద్ధి పెట్టుబడినితీర్చుటకు 10 20 సంవత్సరములు తెలిసవాయిదాలమీద సాధ్యమగును జర్మనీలో ఇట్టిబ్యాంకులు వ్యవసాయాభివృద్ధికి ఎంతయో తోడ్పడెను రాష్ట్రస్థాయిలో కేంద్రభూమితనఖా బ్యాంకియే కాక స్థానికముగా ప్రాథమిక భూమితనఖా బ్యాంకులుకూడపనిచేయుచున్నవి వ్యవసాయదారులపాతఋణములను తీర్చుటకును భూమిని శాశ్వతముగా అభివృద్ధిచేయుటకును ఇవి తోడ్పడుచున్నవి ఈసంస్థలు న్యాయమైనవడ్డీని మాత్రమే పుచ్చుకొనును కాని వీటివలన వ్యవసాయదారులు అంతగా లాభముపొందుటలేదు నీటి పారుదలవసతులులేని భూములకు అధికముగా ధనము లభించుటలేదు భూమితనఖా బ్యాంకులు వ్యవసాయదారుల అభివృద్ధికి ఎంతయో తోడ్పడవచ్చును

మార్కెటింగు విపణవసతులకు సంస్థలు సరియగు మార్కెటింగు సౌకర్యములున్నచో, రైతుపండించుపంటకు సరియగు ధరవచ్చును ఈసంస్థలు ఎరువులను పనిముట్లను సరఫరా చేయవచ్చును పంటలకు ధరవచ్చువరకు వాటినినిలువచేయుటకు వసతులను కల్పించవచ్చును సహకారసేవ్యము వలన సేవచేయు అధికోత్పత్తిని సాగించుటకవకాశము కలదు దీనివలన వ్యవసాయవిధానములో నూతనసాంకేతిక పద్ధతులు అమలులో పెట్టవచ్చును సహకారసిద్ధాంతములు వివిధరంగములలో బహుళప్రయోజనములను సాధించుటకు అన్వయించబడుచున్నవి వ్యవసాయదారుల సర్వతోముఖాభివృద్ధికి తోడ్పడవలెనన్నచో వారికవసరమైనది పరపతి మాత్రమే కాదు వారు ముడిపదార్థములనుత్పత్తి చేయునప్పుడు వాటిని పరిశ్రమలలో వారే స్వయముగా ఉపయోగించు అవకాశములను కలుగజేయవలెను వికేంద్రీకరణసిద్ధాంతముపై కుటీరపరిశ్రమలద్వారా వ్యవసాయదారులద్వారా గ్రామసీమల అభివృద్ధికి సహకారసంస్థలెంతయో తోడ్పడగలవు దీనివలన పూంజీవాదము బలహీనపడి వచ్చులాభము రైతులే పంచుకొనగలరు వారికి ఉపవృత్తి లభించును అఖిలభారతఖాదీ గ్రామీణ పరిశ్రమలబోర్డువారు ఈవిషయమై శ్రద్ధవహించుచున్నారు

వ్యవసాయక్షేత్రమందు సహకార విధానముపై సహకారసంస్థలెట్లు వ్యవహరించుచున్నవో అట్లే పారిశ్రామిక క్షేత్రమందు వివిధ ప్రాంతములలో పారిశ్రామిక సహకార సంస్థలు నడపబడుచున్నవి రష్యా అమెరికా మున్నగు పెక్కుదేశములందు సహకారవిధానము జయప్రదముగా జరుగుచున్నది కాని భారతదేశములో పారిశ్రామిక సహకార సంఘములు అంత జయప్రదముగా నడుపబడుటలేదు సభ్యులకు సహకార సిద్ధాంతములలో శిక్షణ అనుభవము బాగుగా కావలెననిన, పెట్టుబడి లభ్యమగుట అనుభవముల లెక్కలు నిర్ణీతకాలములో తనిఖీయగుట తయారైన వస్తువులకు మార్కెట్లు లభ్యమగుట, వీటికి ఒక కేంద్రసంఘమును నిర్మించి తద్వారా సభ్యులకు శిక్షణనిచ్చి యంత్రసామగ్రిని

సరఫరాచేయుట మార్కెటింగు సౌకర్యములు కలుగజేయుట అవసరము భారతదేశమువంటి పేదదేశమునకు సహకార సంఘములు కల్పతరువువంటివి

ఇతర రంగములందలి సహకార సంఘములు కుటీర పరిశ్రమల సహకారసంస్థలు వ్యవసాయరంగములోను ఇతరరంగములలోను పనిచేయుచున్నవి కొనుగోలుదారుల సహకార సంస్థలు లేక క్రయవిక్రయసహకారసంస్థలు భారతదేశ ఆర్థిక వ్యవస్థలో ముఖ్యపాత్రవహించుచున్నవి ప్రపంచయుద్ధకాలమున మౌలికపదార్థముల ధరలు హెచ్చెను సహకార సంఘములు కొరతపడిన సరకులను మౌలిక పదార్థములను సక్రమ విధానములో పంపిణీచేయుటకు ప్రభుత్వము ప్రోత్సహించెను కాని కొంతకాలమైనతర్వాత మార్కెటులో అన్నివస్తువులు సులభముగా లభ్యమగుచున్నపుడు కొనుగోలు దారుల సంఘములు పనిచేయుటమానెను బొంబాయి మద్రాసు నగరములలో మాత్రమే ఈసంఘములు బాగుగా పనిచేసెను

గతకొలదిసంవత్సరములనుండి సరకులధరలు విపరీతముగా పెరిగినందున సామాన్యులు ప్రయోజనము పొందుటకు ప్రభుత్వము సహకారసంఘములకు దోహదమిచ్చెను కావలసిన వాటాధనము పెట్టుబడి వేతనములుకూడ మంజూరు చేయబడినవి కాని ఈ సంఘములు ఇప్పటివరకు నష్టముమీదనే నడచుచున్నవి సరకులను పెద్దఅంగడులలో కొని బజారుధరలకంటె తక్కువ ధరలకువాటిని అమ్మి నిర్వహణ వ్యయములలో తగ్గించుకున్నచో ఈ సంఘములు జయప్రదము కాగలవు

స్వల్పాదాయము వచ్చు మధ్యతరగతివారికిని పెద్ద ఆదాయమువచ్చు వారికికూడ గృహనిర్మాణమునకై దీర్ఘకాలిక ఋణములను సహకారసంఘములిచ్చుచున్నవి స్త్రీలు పురుషులు వివిధ వృత్తివర్గములకు చెందిన శ్రామికులు పెక్కు రంగములలో సహకారసంఘములను స్థాపించుకొని ప్రయోజనములను పొందుచున్నారు మహిళలు జీవనోపాధికై పెక్కు క్షేత్రములలో వారుశ్రమించి సహకార సంఘముల ద్వారా వారి జీవనప్రమాణమును మెరుగుపరచుకొనుచున్నారు

తగినసాధనములు లేకపోవుటచే సహకారోద్యమము కొన్నిరంగములలో అభ్యుదయమును సాధింపలేదు కొన్నిటిలో నిర్వహణ సక్రమముగా లేకుండుటయేగాక అనైక్యత వలనగూడ ఈ ఉద్యమమునకు బలము చేకూరుటలేదు అంతర్గతముగానున్న లోపములను సరిదిద్దవలయును ప్రజల విద్యావిహీనత అత్యధిక ప్రభుత్వ జోక్యము మొదలగు సమస్యలను పరిష్కరించవలయును సక్రమైన ప్రజాస్వామిక సిద్ధాంతాచరణము ప్రజలలో ఐక్యత ఈ సహకారోద్యమమునకు మూలకందములు ఈసిద్ధాంతముపై ఆధారపడిన కార్యాచరణము దేశాభ్యుదయమునకు దారితీయగలదు

ఆర్ వి రా

## సహజ కృత్రిమ రబ్బరులు

ఆధునిక నాగరికతకు అత్యంతావశ్యకములైన పదార్థములలో రబ్బరు ఒకటి నేడు రకరకముల వస్తువులు రబ్బరుతో తయారగుచున్నవి ముప్పదివేల తరగతుల రబ్బరువస్తువులు పారిశ్రామికముగా తయారగుచున్నవనియు వాటిలో సగము అయిదువందలు మోటారుకార్ల నిర్మాణములోనే వాడుకయగుచున్నవనియు తెలియవచ్చినపుడు రబ్బరు ప్రాముఖ్యము స్పష్టమగును రబ్బరు సహజముగా సృష్టిలోనున్న యుఫోర్బియేసియే' అను కుటుంబమునకు చెందిన హీవియా బ్రెసిలియెన్సిస్ అనబడు రబ్బరుచెట్టునుండి తయారుకాబడుచున్నది ఆచెట్ల కాండమునందు ఒకతీరుగా గాడిచేర్పరచి దానియందు స్రవించెడి పాలవంటి పదార్థమును తొట్టెలలోనికి సేకరించెదరు తర్వాత ఆపాలనుండి విరుగుడువలన రబ్బరు తయారగును ముప్పదేండ్లపాటు జీవించి అనిరామముగా రబ్బరుపాలనిచ్చెడి చెట్లుకూడ నున్నవి రబ్బరుచెట్లు అడవి వృక్షములవలె కేరళరాష్ట్రములో పెరుగుచున్నవి మెక్సికో లైబీరియా దక్షిణఅమెరికా ఇండోనేషియా మలయా జావా మొదలైన దేశములలో రబ్బరుపరిశ్రమ సాగుచున్నది

రబ్బరుచెట్లుపాలలో నీరువలె రబ్బరుబిందువులు వ్యాపించియున్నవి అందుచేత రబ్బరుపాలను సేకరించి దానికి స్వల్పముగా ఎసిటిక్ ఆసిడినో ఫార్మిక్ ఆసిడునో కలిపిగాని వెచ్చచేసిగాని దానినివిరుగునట్లుచేయుదురు ఆ విరుగుడుపదార్థమేముడి రబ్బరు అది స్వచ్ఛముగనున్నచో ఎట్టిరంగును లేకుండును నీటిలోగాని ఆమ్ల ఆల్కలీ ఆక్సిహారములలోగాని రబ్బరుకరగి, లీనముకాదు అదియే రబ్బరుయొక్క ప్రత్యేకలక్షణము పెట్రోలు, బెంజీను కర్పూరతైలములలోను కొన్ని యితర తైలములలోను అది కరగి లీనమగును

రబ్బరుపాల విరుగుడులో 90–95 పాళ్లుమెత్తగనుండి, లాగినచో, సాగెడి స్వభావముగల క్రేప్‌రబ్బరు కలదు దానిరసాయన స్వభావము హైడ్రోకార్బను $(C_5 H_8)_n$ మిగిలిన

6-10 పాళ్లుగల ఇతర ఆర్గానిక్ పదార్థములు దానితో కలిపి మలినము లుగనుండును క్రేప్ రబ్బరు చేసి అటుకొనుచు వేడి పెట్టినప్పుడు మరింత మెత్తబడి సాగుచుండును దానిని ఆర్గానిక్ ద్రావణముతో కలిపినపుడు ఉబ్బి పరిమాణమధిక మగును

మెక్సికో దేశమందున్న ఆదిమవాసులు రబ్బరు ఉండలతో బంతులాడుచు వినోదించుచుండెడివారు పెన్సిలుతో వ్రాసిన అక్షరములను చెరుపుటకు రబ్బరు ఉపయోగపడునని ప్రీస్ట్లీ అను నతడు 1770 లో కనుగొన్నాడు రబ్బరుపూత పూసిన దుస్తు అను వానతాకిడినుండి తప్పించుకొనుటకుపయోగింపవచ్చునని 1819 లో మెకింటోష్ అను నాతడు వివరించినాడు ఆయన రబ్బరుతో కల్పించిన వానకోట్లు వేసవికాలములో కొంత భాగము కరిగి దేహమునకు అంటుకొనుటయు శీతకాలములో రబ్బరుపూత పెళుసెక్కి పగిలి రాలిపోవుటయు జరిగెడిది అందుచే రబ్బరును యథాతథముగా వాడుటకంటె ఏదో రీతిగా మార్చి తీర్చిదిద్దవలసిన అగత్యమున్నదని శాస్త్రవేత్తలు గుర్తించినారు అందుకు వారు కృషిచేయనారంభించిరి

1839 లో గుడ్ ఇయర్ హాన్ కాక్ అను శాస్త్రవేత్తలు విడివిడిగా వల్కనైజేషను విధానమును కనుగొన్నారు ముడి రబ్బరును 125-140 డిగ్రీల వేడి వచ్చువరకు కాచి దానిలో నూరింట 8-10 పాళ్ల గంధకమును కలిపి నాల్గుగంటలపాటు కలియబెట్టుచు ఉంచినచో గట్టిపడునని వారు తెలిసికొనిరి గంధకపు పరమాణువులు రాసాయనికముగా రబ్బరుతో సంయోగమై దాని స్వభావమునే మార్చివైచి గట్టిగానుండెడి పదార్థమునిచ్చినవి అందుచే వల్కనైజు కాబడిన రబ్బరు యొక్క మన్నిక హెచ్చినది. అట్టి రబ్బరుతో మైళ్లు ఇంజను బెల్టులు తయారైనవి దానితో ముడిరబ్బరునకు గిరాకి హెచ్చినది.

అందుచేత ఒకసారి వాడినవి పాతబడినవి పనికిరానివి యగు రబ్బరు వస్తువు నుండి రబ్బరును ఆసిడుతోగాని ఆల్కలీతోగాని గ్రహించి కడిగి శుభ్రపరచి ఎండబెట్టి క్రొత్తగా తయారుచేసిన ముడిరబ్బరుతో కలిపి వాడుచున్నారు కావున రబ్బరు కొంతవరకు ఆదాయకరమైనది రబ్బరుయొక్క రాసాయనిక లక్షణములను అవగతమొనర్చుకొని దానిని కల్పించ మొనర్చుట సాధ్యమగునేమో అని 1860 నుండి శాస్త్రవేత్తలు కృషిసల్పిరి ఆ సంవత్సరమే రబ్బరునుండి విలియమ్స్ అను శాస్త్రవేత్త ఐసోప్రీన్ అను హైడ్రోకార్బనును తయారొనర్చెను అది గాలిచొరకుండ రబ్బరును స్వేదనక్రియకు (distillation) గురిచేయుటవలన లభించెను ఐసోప్రీన్ హైడ్రోకార్బనుయొక్క అణురచన యిట్లుండును

$$H_2C=C_1-CH=CH_2$$

అది 34.3 డిగ్రీల ఉష్ణోగ్రతలో సలసలమరిగి ఆవిరియగును గాలిలో 068 శాతము ఐసోప్రీన్ కలిసియున్నచో ఎలుకల మనుగడకు హానికరమగును అందుచేత రబ్బరులో ఐసోప్రీన్ అణువులు ఏదోరీతిగా ఇమిడి యుండునని స్పష్టమైనది

1879 లో బౌఖర్డాట్ అను శాస్త్రవేత్త ఐసోప్రీన్ అణువులను వాటితో అవియే సంయోగమై ఉంగరములుగనో పెంటిగనో పెనవేసికొనునట్లు చేసినప్పుడు రబ్బరువంటి పదార్థము తయారగునని కనుగొనెను తర్వాత పరిశోధనముల వలన సుమారు 15 వేల ఐసోప్రీను అణువులు తమలో తామే గొలుసుకట్టుగా సంయోగమై రబ్బరుగా మారెనని స్పష్టమైనది మొదటి ప్రపంచయుద్ధకాలములో జర్మను శాస్త్రవేత్తలు తమ దేశమున కవసరమైన రబ్బరును తమదేశమందు లభించిన ముడిసరకులను వాడి తయారు చేయవలసి వచ్చెను వారు 2 3 డై మెథిల్ బ్యూటాడయీనును వాడి బ్యూనారబ్బరును తయారుచేసిరి శూన్యప్రదేశమైనదు వాతావరణములో బ్యూటాడయీనును సోడియమ్ ధాతు సంపర్కములో ఉంచినప్పుడు తక్కువరకము రబ్బరు తయారైనది దానినే వారు అట్టి అవసరములలో ఉపయోగించిరి యుద్ధము ముగిసినతర్వాత దానితయారీ ఆగిపోయెను

రెండవ ప్రపంచయుద్ధకాలమున రాసాయనికముగా సృష్టించిన రబ్బరు ఆవశ్యకమయ్యెను అట్టితరుణమున దూర ప్రాచ్యదేశములు జపాను ఆక్రమణముక్రింద నుండెను అమెరికా బ్రిటిను దేశములకు రబ్బరు సరఫరా పూర్తిగా తగ్గిపోయెను తమ అవసరములలో నూరింట 90 వంతుల రబ్బరు సరఫరా ఆగగానే, అమెరికా శాస్త్రవేత్తలు పోటాపోటిగా పరిశోధనములు సాగించి 1941 నాటికి తమ దేశములో రాసాయనిక రబ్బరు పరిశ్రమనుసృష్టించి, అభివృద్ధికి కర్తలైనారు మొదట ఏడాదికి 8000 టన్నుల రాసాయనిక రబ్బరుమాత్రమే తయారయ్యెను నాలుగేండ్లలో అది 6 లక్షల టన్నులవరకు పెరిగెను ఈ నాలుగేండ్లలో రాసాయనికులు ఇంజనీర్లు

| | రాసాయనిక రబ్బరు | దాని నిర్మాణమునకు కావలసిన పదార్థము | దాని ప్రయోజనములు |
|---|---|---|---|
| 1 | బూనా - ఎస్ లేక GR - S | 1, 3 బ్యుటాడయీన్ + స్టైరీన్ | సహజమైన రబ్బరువలె పనిచేయును |
| 2 | బ్యుటైల్ పోలీ బ్యుటీన్ లేక GR - I | ఐసో బ్యుటిలీన్ | సైకిల్ కారుట్యూబులకు ట్యూబులు లేని టైర్లకు వాడవచ్చును వాటిలో గాలి బాగుగా నిలుకడగా ఉండగలదు |
| 3 | బ్యూనా - N లేక పెర్ బ్యూనాన్ లేక హైకార్ లేక కెమిగమ్ | 1, 3 బ్యుటాడయీన్ + ఎక్రిలో నైట్రైల్ | నూనెలు తగిలినను చల్లబడినను చెడదు దీనిని చేతితొడుగులను గ్యాస్‌కెట్లను హోస్ పైపులు తయారుచేయుటకు వాడుచున్నారు |
| 4 | నియోప్రీన్ | క్లోరోప్రీన్ | సహజమగు రబ్బరునకు సన్నిహితమైన కృత్రిమ రబ్బరు వైద్యులు వాడు రబ్బరు వస్తువులను, ఇండ్లలో వాడు రబ్బరుసామానులను దీనితో తయారు చేసారు |
| 5 | థయోకాల్ | ఎథిలీన్ క్లోరైడు + సోడియమ్ పోలి సల్ఫైడు | తైలపదార్థముల సంపర్కము ఎక్కువ ఉండు సందర్భములలో దీనితోచేసిన వస్తువులు వాడబడును గట్టిగా ఉండే గిలకలు ఉపకరణములు కూడ దీనితో తయారగును |

ఎంతో ప్రయాసముగా కృషిచల్పిరో ఊహింపవచ్చును ఈ కృషి వలన బ్యూనా S రబ్బరు బ్యూనా N రబ్బరు బ్యుటైల్ రబ్బరు నియోప్రీన్ థయోకాల్ అను అయిదు రకముల రబ్బరు తయారయ్యెను లారీటైర్ల నిర్మాణమునకు ఈ అయిదురకముల రబ్బరు సహజముగా లభించు రబ్బరుకంటె ఏదో విధముగా ఉత్తమమైనదే వీటిధరలలో ఎక్కువ వ్యత్యాసముండదు సహజముగా లభించు రబ్బరు వెల రబ్బరు తోటలలో పనిచేయు కార్మికుల సమస్యలతోడను రబ్బరు కంపెనీల మధ్యనుండు పోటీలతోడను ముడిపడి మారుచుండును అందుచే యుద్ధానంతరముకూడా రాసాయనిక రబ్బరు పరిశ్రమ విస్తృత ప్రగతి నొందెను

ఈ అయిదురకముల రబ్బరులలో బ్యూనా S అమెరికాలో మొత్తము రాసాయనికముగా తయారగుచున్న రబ్బరులో మూడువంతులుండును 1963లో 15 లక్షల టన్నుల రాసాయనిక రబ్బరు అమెరికాలో తయారైనదనియు అందులో ఎక్కువగా (61 శాతము) సైకిలు కార్ల టైర్ల నిర్మాణమునకు వినియోగమైనదనియు తెలియుచున్నది ప్రపంచమంతటికి అవసరమైన రబ్బరులో మూడింట రెండువంతులు మలయా ఇండోనీషియాలలోని రబ్బరుతోటలనుండి సరఫరా అగుచున్నది అది సుమారు 19 లక్షల టన్నులుండును ప్రస్తుతావసరములనుబట్టి అన్ని దేశములకు సంవత్సరమునకు కనీసము 44 లక్షల టన్నుల రబ్బరు కావలసియుండును అది యంతయు రబ్బరుతోటలనుండియు రాసాయనిక రబ్బరు ఫ్యాక్టరీలనుండియు సరఫరా కావలసియున్నది

కేరళ రాష్ట్రములో 1950-51 సంవత్సరములో 58 500 హెక్టర్ల విస్తీర్ణముగల రబ్బరు తోటలనుండి 12 994 టన్నుల రబ్బరు తయారయ్యెను 1966-67 నాటికి రబ్బరుతోటలు 158 657 హెక్టర్లకును రబ్బరుతయారీ 60 465 టన్నులకును వృద్ధిచెందెను ఎంతకృషి చేసినను ఏడాదికి దానిని 1 శాతము కంటె హెచ్చింపలేము ఈవృద్ధి అత్యంత విస్తృతమై అభ్యుదయమార్గమున పయనించుచున్న భారతదేశముయొక్క రబ్బరు అవసరములను తీర్చుటకేమాత్రము చాలదు అందుచే రాసాయనిక రబ్బరుపరిశ్రమకు భారతదేశములో విశేషముగ అవసరము, అవకాశములుగూడా కలవు

హ. అ.

## సాంకృత్యాయన్ రాహుల్ (1893.1964)

రాహుల్ సాంకృత్యాయన్ గొప్ప పురాతత్త్వశాస్త్రవేత్త; భారతీయ పండితుడు బహుభాషా కుశలుడు ఇతని అసలు పేరు కేదారనాథ్ తండ్రి గోవర్ధనపాండే ఇతడు ఉత్తరప్రదేశ్ లోని అజమ్‌ఘడ్ జిల్లాలో పందహా గ్రామమందలి యొక బ్రాహ్మణ రైతుకుటుంబములో 1893వ సంవత్సరములో జన్మించెను కుటుంబ పరిస్థితులవలన ఇతడు ఎక్కువగా మాతామహుని ఇంటనే పెరిగెను

1912లో గ్రామములో కలరా వ్యాపించుటచే తాత ఆతనిని మహాదేవపాండే అను పండితుని యొద్దకు సంస్కృతమభ్యసించుటకై పంపెను ఒక నెల రోజులు విద్యాభ్యాసము తరువాత శాలనుండి వచ్చిన వర్తమానమును పురస్కరించుకొని కేదారనాథ్ ఇంటికి మరలి వెళ్లెను వెంటనే అతనికి ఉపనయన సంస్కారము జరిగెను 1909వ సంవత్సరములో కేదారనాథ్ రెండవ తరగతి యందుత్తీర్ణుడై, మూడవ తరగతిలో ప్రవేశించెను ఆతనికి పుస్తకపఠనము మీద శ్రద్ధ క్రమముగా ఎక్కువై స్వయముగా అంగడికి పోయి కోరిన పుస్తకములను కొనితెచ్చువాడు

కేదారనాథుని పెద్దలు కూడబలుకుకొని పదునొకండవ యేటనే అశుభము శుభము తెలియని వయసులో ఆతనికి వివాహ మొనర్చిరి పదునైదవయేట కొంచెము మాట రాగనే పెద్దలు చేసిన పెండ్లిపట్ల ఆతనికి వైముఖ్యము కల్గెను అతడింటికి వచ్చుట వాటినుండియు తగ్గించి, కొన్నాళ్ళయిన పిదప అసలు వచ్చుటయే మానినాడు బాల్యములో జరిగిన వివాహమునట్ల అతడు క్రమముగా వైరాగ్యమును బూని ఇరువదియైదు సంవత్సరములపాటు దేశాటనములలో కాలము గడిపినాడు

అతడు పాఠశాల విద్యార్థిగా గడపిన కొలది కాలములో తన తరగతి యందు ప్రథముడుగ నుండెడివాడు గణితములో కౌశల్యమేర్పడినది విలేఖతోనే చరిత్రాంశములను గ్రహింపగల్గెడివాడు భూగోళశాస్త్ర విజ్ఞానములో ఉపాధ్యాయునితో తుల్యముగ నుండెడువాడు ఏకసంధగ్రాహియగు కేదారనాథ్ పాఠశాలను గృహమును వీడి ప్రథమమున కలకత్తాకు పారిపోయెను కలకత్తా రైలుస్టేషనులో పార్సెళ్ళపై గుర్తులు వేయు 'మార్కరు'గా నౌకరిలో చేరి కొంతకాలమైన పిదప ఒక సస్యము దుకాణములో జమ ఖర్చులు వ్రాయు లెక్కగాడుగ కొంతకాలము పనిచేసి ఇంటికి మరలివచ్చెను కాని ఇంటివద్ద కూడ అతడు నిలుకడగా ఉండలేకపోయినాడు కలకత్తా యందున్నపుడు అతడు హరికిరణదాసు అను పండితుని యొద్ద హిందీ భాషలో కొన్ని వేదాంత గ్రంథములను పఠించెను వేదాంత విషయమునందు తనికి అభిరుచి మెండుకాగా సంస్కృతగ్రంథములను అధ్యయన మొనర్చననేగాని అందలి పరిజ్ఞానము కొంతవరకైన ఏర్పడజాలదని అతడు నిశ్చయించుకొనెను అట్లయినచో వైరాగ్యము ముదిరి అతడు సన్యాసి యగునేమో అని భయపడి తండ్రి తాతలు విద్యాభివృద్ధికి అవరోధములు కల్పించుచుండిరి

విద్యాశమపార్జనాసక్తుడై కేదారనాథుడు లభించినది తినుచు కాలినడకన అయోధ్య మీదుగా హరిద్వారమును చేరుకొనెను అచ్చట ఆశాభంగము కలుగగా అతడు బదరీనాథ్ మీదుగా కాశీ వెళ్లి అచ్చట చక్రపాణిబ్రహ్మచారి అను పండితవర్యుని యొద్ద సంస్కృతమభ్యసింపసాగెను ఇది వినిన తండ్రి కాశీకి చని కుమారుని ఇంటికి తోడ్తెచ్చినాడు ఇంటియొద్ద లఘుకౌముదిని రెండు నెలలు చదివి తిరిగి యాత్రాసక్తితో ప్రయాగకు తిరునాళ్ల చూచు నెపముతో ఇలు వెడలి తిరిగి కాశీ చేరుకొనెను అచ్చట వ్యాకరణ మొకరి యొద్దను వేదము మరొకరి యొద్దను నేర్వసాగెను యజుర్వేదాధ్యయనము వైష్ణవుల సాంగత్యము కేదారనాథుని వైష్ణవమత వ్యతిరేకిగా నొనర్చెను రఘువంశము వాల్మీకి రామాయణములను చదివి అన్వయజ్ఞానమును పొంది గురువుల సలహా ననుసరించి కలకత్తాలో జరుగనున్న ప్రథమ వ్యాకరణ పరీక్షకు అతడు తయారు కాసాగెను

లఘుకౌముదిని నెట్లో ముగించి, సిద్ధాంత కౌముదిని ప్రారంభించి దానితోపాటు సరళ నాటకములను కావ్యములను చదివిన కేదారనాథుకు, క్రొత్తగా స్థాపింపబడిన 'దయానంద పాఠశాల లో ఏడవ తరగతి యందు ప్రవేశించెను అచ్చట గణితములో ప్రజ్ఞ సంపాదింపగల్గెను ఆంగ్ల వ్యాకరణములో వెనుకబడినందు కాతడు మందలింపులు తినెను ఆ తరుణమున ఒకానొక మఠాధిపతియైన మహంతును కలువగా ఆ మహంతు దృష్టి కేదారనాథునిపై పడి, తన అనంతరము మఠాధిపతి యగుటకు తగినవాడు కేదారనాథుడే అని

యాతడు భావించెను. మహంతు అతనిని మఠమునకు గొనిపోయి తప్తముద్రాంకితు నొనర్చి సాధువుగ మార్చివైచెను. సాలీనా పండ్రెండువేల రూప్యముల రొక్కపు రాబడి అంతే యేవిలువగల ధాన్యపు రాబడియు గల ఆ మఠమునకు కేదారనాథుడు ఉత్తరాధికారియై రాజభోగముల ననుభవింప సాగెను.

ఈ జీవితముతో కొంత అనుభవము గడించిన ఎమ్మట అతనికి మరల చదువుపై దృష్టిమరలెను. తనతోసాహచర్యము చేయుచుండిన సాధువుల ప్రవర్తపట్ల కేదారనాథునికి వెగటు చీదరింపు గూడ ఏర్పడెను. ఆకస్మికముగా ఒకనాడాతడు దక్షిణయాత్రోన్ముఖుడై మద్రాసు చేరుకొనెను. మార్గమధ్యమున వివిధ రాష్ట్రీయుల వేషభాషలను ఆచార, సంప్రదాయములను అతడు పరిశీలించుచు తిరుపతి చేరి ఉత్తరాది మఠమున మకాముచేసెను. ఉత్తరదేశమునుండి తిరుపతి వచ్చిచేరిన ప్రసన్నాచార్యునియొద్ద కేదారనాథుడు అపరిచితమైన కావ్యనాటకములనెన్నిటినో చదివి తిరిగి యాత్ర కొనసాగించి, పక్షితీర్థము కంచి రామేశ్వరము ధనుష్కోటి మున్నగు క్షేత్రములను దర్శించెను.

కొంతకాలమునకు అయోధ్యచేరి ఒక వేదాంత పాఠశాలయందు ప్రవేశించెను. అచ్చట అతడు స్వచ్ఛమైన స్వరసహిత సామవేదమును నేర్చి చర్చలయందుగూడ పాల్గొనెడివాడు. అచ్చటనుండి ఆగ్రానగరముచేరి సంస్కృతమును అరబ్బీ భాషను నేర్చి క్రైస్తవ మహమ్మదీయ హిందూసంప్రదాయములను వాటియందలి బలహీనతలను గ్రహించి ఆర్యసమాజ శిష్టతనుగూర్చి తెలిసికొనెను. సమర్థుడైన ఆర్యసమాజప్రచారకుడై ప్రతికూలసిద్ధాంతములను పూర్వపక్షము చేయుటలో సిద్ధహస్తుడయ్యెను.

ప్రథమ ప్రపంచ యుద్ధానంతరము పంజాబు వీరుల స్వాతంత్ర్య పోరాటము, లాహోరు కుట్రకేసు కేదారనాథుని ఆకర్షించినవి. ఆయనలో జాతీయభావము ప్రబలమైనది. లాహోరువెళ్లి డి ఎ వి కాలేజీలో "సంస్కృత విశారద" పట్టమునకై ఒకవంక చదువుకొనుచు స్వంత చిల్లర ఖర్చులకై మరియొకవంక విద్యాబోధనచేయుటద్వారా కొలదిగ ధనమును గడించుచు కాలమునుగడపినాడు. ఆర్యసమాజము తరపున విద్యాలయములను స్థాపించి వాటి నిర్వహణమునకు చందాలు గూడ వసూలుచేయుచు, వేదపరీక్షయందు తీర్ణుడయ్యెను.

ఇంతలో రష్యాయందు ఘటిల్లిన బోల్షెవిక్ విప్లవమును గూర్చిన వార్తలను ఆసక్తితో తెలిసికొనుచు భావికాలమున రూపొందనున్న సామ్యవాదగణతంత్రము మానసికాంబరముపై దర్శించుచు లాహోరులో రౌలట్ చట్ట ప్రతికూలోద్యమ ఫలితముగా అమలులోనికివచ్చిన మార్షల్ లా అత్యాచారములను కళ్లారచూచి అతడు ఆగ్రహోదగ్రుడయ్యెను. అశాంతి మనమున రేకెత్తగా కేదారనాథుడు మరల దేశాటన మారంభించి కాశీనగరముచేరి మీమాంసశాస్త్ర ప్రథమపరీక్షయందు ఉత్తమశ్రేణిలో ఉత్తీర్ణుడయ్యెను. అంతట బుద్ధుని జీవితముతో సంబంధముకల్గిన స్థలములను చూడగోరి అతడు సారనాథ్ చేరెను. అచ్చటనుండి లుంబినీవనము అశోకశిలాస్తంభము ప్రాచీనకపిలవస్తునగరము నలందాలను సందర్శించి స్వరాష్ట్రమునకు తిరిగివచ్చి రాజకీయములలో పాల్గొని సత్యాగ్రహియై కారాగార శిక్షననుభవించి విముక్తుడు కాగానే జిల్లా కాంగ్రెసు కార్యదర్శిగా వ్యవహరించి తర్వాత గయ కాంగ్రెసులోను మహాబోధిసభలోను పాల్గొని పాళి ఇంగ్లీషు సంస్కృతభాషలలోనిచ్చు ఉపన్యాసములను అనువదించుచు స్వయముగాగూడ మాట్లాడుచు అనంతభాషజ్ఞుడనిపించుకొన్నాడు. కొంతకాలముతర్వాత బౌద్ధమతమునకు సన్నిహితుడై రాజకీయకలాపములనుండి తప్పుకొని నేపాలు యాత్రకు వెడలి తిరిగిరాగనే ప్రభుత్వమాతనిని పట్టి శిక్షించి హజారీబాగ్ కారాగారమున బంధించెను. కారాగార జీవితమును జ్యోతిష గ్రంథరచనమందును హిందీ నవలా రచనమందును అతడు గడపెను. కారాగృహమునుండి విడుదలయై లామాలతో పరిచయము కల్గించుకొని టిబెట్టుభాషాసాహిత్యములనుగూర్చి తెలిసికొనెను.

సార్‌నాథ్‌యందలి బౌద్ధభిక్షువుల సలహాననుసరించి, కేదారనాథుడు 1928లో లంకకుచేరి సంస్కృతాధ్యాపకుడుగా వ్యవహరించి త్రిపిటకాచార్యుడై 'బౌద్ధమతభిక్షువుగా మతస్వీకారమొనర్చినాడు. పూర్వమున్న 'దామోదరస్వామి' అను పేరును బిరుదైన పిమ్మట, తనగోత్రమును జోడించి 'దామోదరసాంకృత్యాయన్' అనునామమును అతడు ధరించెను. కాని ఆశ్రమస్వీకారముతో పేరును పూర్తిగా మార్చుకొనవలసిన ఆచారమునుసరించి అతని నామము 'రాహుల్ సాంకృత్యాయన్' అయినది.

లంకనుండి భారతదేశమునకు మరలివచ్చి బీహారు సోష

ట్రస్టుపత్రికి కార్యదర్శిగా కొంతకాలము వ్యవహరించి ఐరోపాకు పయనించి లండన్ పారిస్ బెర్లిన్ మున్నగు నగరములలో బౌద్ధమత ప్రసంగములుచేయుచు కాలముగడిపి స్వదేశమునకు మరలివచ్చెను పురాతత్త్వశాస్త్రముపట్లగల శ్రద్ధ వలన రాహుల్ సాంకృత్యాయన్ అమరావతి గోలి నాగార్జునకొండ శిల్పశిథిలములను పరిశీలించి భారతీయుల నృత్యకళా కౌశలమును అందు విశేషించి ఆంధ్రుల విశిష్టతను అవగాహన చేసికొనినాడు బరోడాలో జరిగిన ప్రాచ్యభాషాసమ్మేళనములో పల్గొని బీహారు భూకంప బాధితుల సేవాకార్యక్రమమును నిర్వహించి టిబెటును రెండవసారి సందర్శించినాడు అచ్చటనుండి బయలుదేరి ఎన్నియో బౌద్ధక్షేత్రములను దర్శించి బౌద్ధ సంస్కృతిని బౌద్ధ వాఙ్మయనిధులను క్షుణ్ణముగా అవగాహన చేసికొనెను సాంకృత్యాయన్ తిరిగి యాత్రోన్ముఖుడై బర్మా జపాన్ కొరియా మంచూరియా దేశముల మీదుగా సోవియట్ రష్యాచేరి అచ్చటి ప్రజాజీవితమును శ్రద్ధతో గమనించెను మాస్కో విశ్వవిద్యాలయ మందలి అమూల్యము అపారమునైన గ్రంథ సముదాయమునుచూచి హర్షామోదమునందెను ఆరోగ్యవంతులై నిరంతరము పాటుపడుచు విద్యాసంస్కృతులగడించి సుఖజీవనము ననుభవించుచున్న రష్యా ప్రజానీకమును చూచి అతడు ముచ్చటపడెను

దీర్ఘకాలము రష్యాయందును పరిసర దేశములందును సంచరించి అమూల్యమైన అనుభవమును సంపాదించి తిరిగి భారతదేశమునకు చేరుకొనెను నానాదేశములు సంచరించి అందలి సాహిత్యమును అధ్యయనమొనర్చి తనకు హేతుబద్ధము శాస్త్రీయము అని తోచిన కమ్యూనిస్టు వాఙ్మయమును గూడ నిశితముగ పరిశీలించి అవగాహనమొనర్చుకొనినాడతడు పాట్నానగరములో టైఫాయిడ్ జ్వరపీడితుడై, చావుబ్రతుకుల నడుమ ఊగిసలాడునప్పుడుగూడ దేవునిపేరు స్మరింపనిరాకరించిన నిశ్చిత నాస్తికుడు రాహుల్ సాంకృత్యాయన్

కొంత స్వస్థత చిక్కగానే సాంకృత్యాయన్ తీరని జ్ఞాన దాహముతో మరల రష్యాకెళ్ళి ప్రాచ్య విద్యాసంస్థ అధ్యక్షుని సాహచర్యముతో కొంతకాలమచ్చటగడిపి సంస్కృత భాషయందాసక్తిగల 'లోల' యను రష్యనుయువతిని అర్ధాంగిగా స్వీకరించినాడు అతడు భారతదేశమునకు తిరిగివచ్చి రాజకీయ కలాపములలో మరల అడుగిడగనే బ్రిటిష్‌ప్రభుత్వము అతనిని భారతరక్షణచట్టముక్రింద మలాకాజైలులో 29 నెలలు నిర్బంధించెను ఇంతకాలమును అతడు రచనావ్యాసంగములోనే గడిపినాడు విడుదలకాగానే అతడు పూర్తిగా మరచిపోయిన జన్మస్థలమును కాలగతిచెందక మిగిలియున్న బంధుజనమును దర్శించి ఆనాటినుండి ఒవాక వాసనల నుండి పూర్ణముగా విముక్తిపొందినాడు

టిబెటు సంస్కృతభాషల సమ్మేళనమే కిన్నరభాషయని అతడు భావించి దానిని బాగుగా అభ్యసించుకొని అత్యంతమధురముగా ఆలపింపబడు కిన్నరభాషాగీతములను విని ఆనందించి కొన్నిటినాతడు సేకరించినాడు. కూడ మధ్యఆసియా చరిత్రను రెండుసంపుటములుగా రచించి అతడు భారత సాహిత్య అకాడమీవారి ఐదువేలరూప్యముల బహుమతి గౌరవమును పొందినాడు కాశీవిద్యాపీఠము సమర్పించిన మహాపండిత బిరుదమును భారతప్రభుత్వముచే పద్మభూషణ బిరుదమును అతడు 1958లో స్వీకరించెను శాక్యశ్రీభద్రుని ప్రమాణవార్తిక భాష్యమును వసుబంధుని అభిధర్మకోశభాష్యమును చంద్రవ్యాకరణమును నాగార్జునుని అష్టసాహస్రి వజ్రచ్ఛేదికాపారమిత విగ్రహవ్యావర్తిని నైయాయికుడు జ్ఞానశ్రీ రచించిన గ్రంథములలో యెన్నదగిన యోగాచార భూమి సంబంధపరీక్ష వార్తికాలంకారము హేతుబిందుటీక ప్రమాణవార్తికమను ధర్మకీర్తిరచనలు వాదన్యాయముపై శాంతరక్షితునిటీక జ్ఞానశ్రీరచించిన క్షణభంగాధ్యాయము మహానిధిని ప్రమాణవార్తికవృత్తి తర్కరహస్యము వాదరహస్యము వినయపిటకము తత్త్వకౌముది మాఘుని శిశుపాలవధకు భవదత్తుటీక ప్రజ్ఞాదీపావళి అను బుద్ధశ్రీజ్ఞాన్ రచించిన వేదాంతగ్రంథము ఇత్యాది ఎన్నియో ప్రాచీన గ్రంథములను రాహుల్ సాంకృత్యాయన్ తన టిబెట్టు యాత్రలో సంపాదించి లోకమునకందించి బుద్ధధర్మమును సేవించినాడు

తన రచనావ్యాసంగముచేతను దీర్ఘపర్యటనానుభవము చేతను విశేష గ్రంథపఠనముచేతను శాస్త్రీయ, హేతువాద దృక్పథముచేతను ఉత్తేజితుడైనరాహుల్ సాంకృత్యాయనుడు యువతరమునకు పెక్కువిధముల గురుతుల్యుడై మార్గదర్శకుడైనాడు ఆయన రచనలలో రెండువందలనుండి వెయ్యిపుటల వరకుగల అమూల్యగ్రంథములు 200 వరకు గలవు వాటిలో 'వోల్గానుండి గంగానదివరకు', దర్శన్-దిగ్దర్శన్' 'వఝే

భాగో నహీఁ 'నయే భారత్ కే నయే నేతా', 'హిందీకావ్యధార', 'శైలి రూప రేఖా', యాత్రా విజ్ఞాన శాస్త్రము, జయ యౌధేయ, సింహ సేనాపతి, 'ఋగ్వేదీయ ఆర్యులు', 'ఖురాన్‌సారం (హిందీ సంస్కృత భాషలలో)', 'బంగారు డాలు', 'ఇరువదియవశతాబ్దము' మొదలగునవి. 'దర్శనదిగ్దర్శనము', 'కిన్నరదేశములో', 'మానవ సమాజము', 'సోవియట్ భూమి', 'కారల్ మార్క్స్ జీవితచరిత్ర', 'యము' (హిందీ అనువాదము) మొదలగునవి చూచుటకు గోర్కీ నాటి 'యాత్ర', 'విశ్వబంధు', 'ఢిల్లీ (రష్యా విప్లవ ప్రభావ ర్జితమైన సంస్కృత కావ్యము)', 'లెనిన్', 'స్టాలిన్', 'కమ్యూనిజమే ఎందుకు కావలయును?', 'పలాయనము వలదు - పరివర్తనము కావలయును' అను గ్రంథములు పేర్కొనదగినవి. "ఆ మేధావి" అను లెనిన్ రచనవలన తొలి గ్రంథములను సాంకృత్యాయన్ విశేషముగా ఉత్తేజితుడై ప్రగాఢముగనే కాంక్షించిన పండిత సత్తముడగు రాహుల్ సాంకృత్యాయన్ ధన్యజీవి.

పా. అ.

## సాంఖ్యదర్శనము

షడ్దర్శనములలో సాంఖ్యదర్శనము ప్రాచీనము. దీనికి ప్రవర్తకుడు కపిలముని. ఈయన ఆసురిపంచశిఖాదిశిష్య ప్రశిష్య సంతతిచే ఈదర్శనమును లోకమున విస్తరింపజేసెను. ఆ విద్యావంశమునకు చెందిన ఈశ్వరకృష్ణుడు డెబ్బదిరెండు కారికలలో సాంఖ్య సిద్ధాంతమును సంగ్రహించెను. ఈ కారికలకు సర్వతంత్ర స్వతంత్రుడగు వాచస్పతిమిశ్రుడు తత్త్వకౌముది యను టీక నొసగించెను. ఈ సాంఖ్యతత్త్వకౌముది నేడు సాంఖ్యశాస్త్రప్రమేయ ప్రతిపాదకమై ప్రమాణగ్రంథముగా విరాజిల్లుచున్నది.

సాంఖ్యమున ఇరువదియైదు తత్త్వములు అనగా పదార్థములు గలవు. ఇందు పురుషుడు చేతనుడు. తక్కినవి జడములు. జడతత్త్వములలో ప్రధానమైనది సత్త్వరజస్తమోగుణసామ్యము పొందియుండు మూల ప్రకృతినామమున బరగును. ఇది మరియొక తత్త్వమునకు వికృతికాదు. ఈమూల ప్రకృతి నుండియే మహత్తు (బుద్ధి) దానినుండి అహంకారము, అందుండి పంచతన్మాత్రలు (శబ్ద స్పర్శ రూప రసగంధములు) ఉద్భవించినవి. ఈ యేడును ప్రకృతి వికృతులు అనగా క్రింది తత్త్వములకు ప్రకృతులు, పైతత్త్వములకు వికృతులు అను అయియున్నవి.

కే అవికృతులు దునారు. అవి పంచమహాభూతములు. పంచకర్మేంద్రియములు, పంచమహాభూతములు పంచతన్మాత్రలనుండి జనించును. ఏకాదశేంద్రియములు సాత్త్వికాహంకారమునుండి ఉత్పన్నములు. పురుషుడు ఒకదానికి కారణముకాడు. కార్యమును కాడు. పురుషతత్త్వము జీవులు. వీరిలో కొందరు పుట్టుచుండగా మరికొందరు గిట్టుచున్నారు. ఇట్లే కొందరు భోగభాగ్యములతో సుఖించుచుండగా మరికొందరు కష్టపడుచున్నారు. బహుజనులు సంసార బంధమునకు గురికాగా శుకవామదేవాదులు కొలదిమంది ముక్తులుగా వ్యవహరింపబడుచున్నారు. కావున అన్ని దేహములలోనున్న చేతన పురుషుడు ఒక్కడుకాడు. ప్రతి శరీరమున జీవుడు వేరు వేరుగా నుండును.

వీరిదర్శనమున ఈశ్వరతత్త్వమునకు అంగీకారము లేదు. ఒకవేళ ఈశ్వరుడేయున్నచో సృష్టికర్తగా కదా అంగీకరింపబడుచున్నాడు! ఇది విచారింపగా పొసగదు. ఏలనందురా? ఈ ఈశ్వరుడు ముక్తుడా? బద్ధుడా? ముక్తుడైనచో అభిమానము లేనందున సృష్టికి పూనుకొనడు. బద్ధుడైనచో మనవంటివాడే నుక జగత్సృష్టి చేయజాలడు. కరుణచే జగత్సృష్టి యందుమా! జీవదుఃఖమును జూచిగదా కరుణ! సృష్టికి పూర్వము కరుణ ఎట్లు? ఈశ్వరు నంగీకరించువారు వైషమ్య నైర్ఘృణ్యము ఆతనికి లేదని నిరూపించుటకు జీవుల పూర్వ సుకృత దుష్కృతముల ననుసరించి ఈశ్వరుడు సృష్టిచేయునని చెప్పుదురు. అట్లైనచో కర్మఫలమనునే సృష్టిసాగిపోవుచుండగా మధ్య ఈశ్వరునితో పనియేమి? అని వీరి యభిప్రాయము.

అయితే ఈసృష్టిని నిర్వహించునది ఏది? సత్త్వరజస్తమోగుణాత్మ మగు ప్రకృతియే గదా! "ప్రకృతిః కర్త్రీ పురుషస్తు పుష్కరపలాశవన్నిర్లేపః" ప్రపంచములో పదార్థములన్నియు సుఖ దుఃఖ మోహములను కలిగించుచున్నవి. సత్త్వము సుఖమును రజస్సు దుఃఖమును తమస్సు మోహమును జనింపచేయును. ప్రకృతి గుణత్రయ సామ్యావస్థను పరిత్యజించి ఈగుణముల న్యూనాధిక భావమును స్వీకరించి తత్త్వాంతరమున పదార్థసృష్టి చేయును. కార్యకారణములకు అభేదమగుటచే సృష్టిలోని పదార్థములన్నియు సత్త్వరజస్తమోగుణాత్మకములును, సుఖ దుఃఖ మోహ స్వభావములును అయియున్నవి.

ఈ ప్రకృతి యొక్క మొదటి పరిణామము

మహత్తత్త్వము. దీనినే బుద్ధియని వ్యవహరింతురు. ఈ బుద్ధి సుఖదుఃఖకామక్రోధలోభమోహభయామర్షములకును పాపపుణ్యములకును ఆశ్రయము. జగత్కార్యానుకూలకృతి (యత్నము) బుద్ధిధర్మమే. ఇట్టి బుద్ధికి ప్రకృతి ఉపాదానకారణమగుటచే కర్త్రి అని చెప్పబడినది. బుద్ధి జడపరిణామమయినందున దానికి చేతనత లేదు. చేతనుడు పురుషుడు. ఇతడు స్వతః శుద్ధుడు. అసంగుడు. తామరాకును నీరంటని విధమున ఇతనిని సుఖదుఃఖాదులు అంటనేరవు. అయినను అవి బుద్ధియందు ప్రతిఫలించి బుద్ధి తాదాత్మ్యమును పొందుటచే సుఖదుఃఖాదులు కలవానివలె మానవుడు కనిపించును. స్వచ్ఛతవలన బుద్ధి చేతనప్రతిబింబమును గ్రహించి చేతనమువలె వ్యవహరించును. జడమగు ప్రకృతి భోగ్యసృష్టిచేసి భోక్తృచేతన పురుషుని అపేక్షించును. చేతనపురుషుడు కూడ ప్రకృతిసంసర్గముచే ఆధ్యాత్మికాధి భౌతికాధి దైవిక దుఃఖములకులోనై పరితపించుచు కైవల్యము కోరి తత్సాధనమగు సత్త్వపురుషాన్యతాఖ్యాతికై ప్రధానమునపేక్షించును. ఈ విధముగా ప్రకృతిపురుషులు ఇరువురును "సంజ్యంధ న్యాయమున (కుంటివాడు గ్రుడ్డివాని బుజమెక్కి దారిచూపగా ఇరువురు గ్రామము చేరుట) పరస్పరాపేక్షతో ఉభయకార్యములను సాధించుకొనెదరు. సృష్టివ్యవహారమంతయు ఈరీతిగా నడుచుచున్నది. ఇది బుద్ధి పరిణామము. దీనివలన నిత్యశుద్ధ బుద్ధ పురుషునకు కైవల్యము ఘటిల్లును. వీరిది సత్కార్యవాదము:

"అసదకరణాద్ ఉపాదానగ్రహణాత్ సర్వసంభవాభావాత్
శక్తస్యశక్యకరణాత్ కారణభావాచ్చ సత్కార్యమ్"

—సాం. కా. ౯

పుట్టుటకు పూర్వము అనగా కారణవ్యాపారమునకు ముందు — కార్యము కారణమునందుండును. మహావృక్షము వటబీజమునందు సూక్ష్మరూపముగానుండియే క్షితిజలపవనసంయోగమున అభివ్యక్తమగుచున్నది. ఇట్లే నువ్వులలోనున్న నూనె శక్తివలన పొదుగులోనున్నపాలు దోహనమువలన, అభివ్యక్తములగుచున్నవి. ఇసుకరేణువులలో నూనెలేకపోవుటచే ఎంతపిండినను నూనెరాదు. మనుష్యులకు కొమ్ములేదు. అది ఎప్పుడును పుట్టదుకదా! అట్లే జగత్తు, కార్యము పుట్టుటకు పూర్వము అసత్తు ఐనచో ఎట్లుపుట్టును? కావున అసత్కార్యవాదము త్రోసిపుచ్చదగినది.

'శూన్యమునుండి జగత్తుపుట్టినది' అను బౌద్ధవాదము కూడ సమంజసము కాదు. శశవిషాణ-వంధ్యాపుత్రుడు గగనకుసుమము దేనికైన కారణమగుట చూచినారమా!

ఇక వివర్తవాదము మిగిలియున్నది. మాయావాదులగు అద్వైతవేదాంతులు ఈవాదమునాశ్రయింతురు. కారణము తనస్వరూపమును కోల్పోవకయే కార్యాకారముగా ప్రతీతమగుచుండును. కార్యము వివర్తము. వస్తువు (సత్యము) కాదు. రజ్జుసర్పము శుక్తిరజతము ఉదాహరణములు. ఇట్లే బ్రహ్మవివర్తము జగత్తు అని వీరి ఆశయము. కాని సాంఖ్యులకిది సమ్మతము కాదు. భూగిరినదీసముద్రనక్షత్రగ్రహాదులతోను కృమికీటపశుపక్షిమనుష్యదేవాదిప్రాణినివహంబుతోను కూడియున్న చతుర్దశభువనాత్మకమగు జగత్తు రజ్జుసర్పమువలె మిథ్యకానేరదు. అసత్యమే అందరము నిర్బాధముగా చూచుచున్నాము. దృష్టిదోషములేదు. ఎందుచే మిథ్యఅగునవలెను? కనుక కార్యము సద్రూపమే. వీరు ఇరువదియైదు తత్త్వములకు సాధకముగా ప్రమాణత్రయమంగీకరింతురు. చార్వాకులు ప్రత్యక్షమొక్కటే ప్రమాణమనిరి. వైశేషికులు ప్రత్యక్షానుమానములను రెంటిని ప్రమాణములుగా అంగీకరించిరి. వీరు ఆప్తవచనమగు శబ్దమును కూడ ప్రమాణముగా గ్రహించిరి. వేదము ఆగమము స్మృతులు ఇతిహాసములు, పురాణములు దీనిక్రిందకు వచ్చును. బౌద్ధ జైన చార్వాకాదివచనములు ఆగమాభాసములు ప్రమాణములుకాజాలవు.

కేవలస్థూలశరీరము భోగసాధనము కాకపోవుటచే సాంఖ్యులు లింగశరీరమును అంగీకరించిరి. సృష్ట్యాదియందు ప్రకృతిచే ఒక్కొక్కజీవునకు ఒక్కొక్కలింగశరీరము సృజించి ఇయ్యబడును. ఇది ప్రళయపర్యంతముండును. ఇందు బుద్ధి కర్మేంద్రియమనస్సులుచేరియుండును. వేదాంతనయమునందువలె ప్రాణపంచకము చేరదు. వీరి మతమున సామాన్యకరణవృత్తిః ప్రాణాద్యావాయవః పంచ అనిచెప్పుటచే మహదహంకారమనస్సుల సముచితవ్యాపారమే ప్రాణము. పృథక్త్వము కాదు. పావురములు కలిసి పంజరమును కదలించినట్లు మహదహంకారమనస్సులు కలిసి ఉచ్ఛ్వాసనిశ్వాసములనాడించుచున్నవి-శరీరమునకు జీవము పోయుచున్నవని భావము. ఈ లింగశరీరమే ధర్మాధర్మ, జ్ఞానాజ్ఞాన వైరాగ్యావైరాగ్య ఐశ్వర్యానైశ్వర్యభావములద్వారా జననమరణ సంసారయాత్రానిర్వాహకమగుచున్నది. ఈభావములు బుద్ధినాశ్రయించియుండుటచే బుద్ధికి ప్రాధాన్యము కలుగుచున్నది. మాకా

పితరులవలన జనించిన పాంచభౌతికస్థూలశరీరము లేకుండ ఈ లింగ (సూక్ష్మ) శరీరము భోగసాధనము కాజాలదు. ధర్మముచే పుణ్యలోకములు అధర్మముచే క్రిమికీటపశుపక్షిస్థావరాదిజన్మలు జ్ఞానముచే మోక్షము అజ్ఞానముచే బంధము వైరాగ్యమువలన ప్రకృతిలయము రాగమువలన సంసారము ఐశ్వర్యమువలన కార్యసిద్ధి అనైశ్వర్యము వలన కార్యవైఫల్యము ప్రాప్తించును. ఇందు ధర్మజ్ఞానవైరాగ్యైశ్వర్యములు ఉపాదేయములు. జ్ఞానము మోక్షహేతువు. తక్కినవి పురుషుని బంధములోనే ఉంచును. ఇవి ప్రకృతిగుణములోనివి యగుటచే సంసారబంధమోక్షములు ప్రకృతివేలయిన ఏ భృత్యజయపరాజయములు ప్రభువునందువలె వివేకాగ్రహమున పురుషునియందు ప్రతీయమానములై వ్యవహరింపబడుచున్నవి. ప్రకృతి అచేతనమైనను క్షీరము శిశుపోషణమునకై ప్రవర్తించినట్లు ప్రవర్తించును. అది భూతభౌతికసృష్టి చేసి భోగమునిచ్చును. వివేకఖ్యాతిని కూర్చి మోక్షమునకు సహాయపడును. రంగస్థలమున నర్తకి ప్రదర్శనమిచ్చి నివృత్త అయినట్లు ప్రకృతి వివేకికి తరువాత కంటబడదు.

ఈ పంచవింశతితత్త్వపరిశీలనము వలన నాస్మి (అక్రియుడను) న మే (నాదేదియు లేదు) నాహమ్ (కర్తను కాను) అను విశుద్ధమగు జ్ఞానముదయించును. రజస్తమోవృత్తి కలుష బుద్ధితో కలియక హాయిగానుండును. తనకంటె బుద్ధిని వేరుగా దర్శించును. బుద్ధికంటె వివిక్తముగా తన స్వరూపమును దర్శించుటచే ప్రకృతిమోహమునకు వశుడు కాడు. జ్ఞానాగ్నిచే సంచితకర్మ బీజభావముతో దహింపబడును; ప్రారబ్ధకర్మ భోగముచే క్షీణించును. ఈ విధముగా వివేకఖ్యాతి మహిమచే పురుషుడు ఆధ్యాత్మికాది త్రివిధదుఃఖములనుండి విముక్తుడగును. ఇక మరల దుఃఖమతనిని అపేక్షింపదు.

దుఃఖము త్రివిధము: (1) ఆధ్యాత్మికము (2) ఆధిభౌతికము (3) ఆధిదైవికము. ఆధ్యాత్మికము మరల రెండువిధములు (అ) శారీరము (ఆ) మానసము. వాతపిత్తశ్లేష్మ ధాతువైషమ్యమువలన జనించు జ్వరాదిదుఃఖము శారీరము; కామక్రోధలోభమోహభయేర్ష్యా విషాదాదులవలన జనించు దుఃఖము మానసము.

(2) మనుష్యపశుపక్షిసర్పవృశ్చికాదుల వలన కలుగు దుఃఖము ఆధిభౌతికము.

(3) గ్రహావేశభూకంపాదులవలన కలుగు దుఃఖము ఆధిదైవికము.

వైద్యము మనోజ్ఞవస్త్రాలంకారచందనాదులు నీతిశాస్త్రాభ్యాస నిరుపద్రవదేశవాసము మణిమంత్రౌషధాదులు దుఃఖనివారణోపాయములుగా లోకమున పెక్కు కలవు. కాని వాటి వలన ఉపశమమే కాని పూర్తిగా దుఃఖనివారణ మగుటలేదు. అందుచే సాంఖ్యదర్శనమావశ్యకము.

శ్లో॥ సంఖ్యాం ప్రకుర్వతే యస్మాత్ ప్రకృతిం చ ప్రచక్షతే।
తత్త్వాని చ చతుర్వింశత్ తేన సాంఖ్యం ప్రకీర్తితమ్॥

అను వచనానుసారము ప్రకృతి పురుష వ్యక్తావ్యక్తజ్ఞానమును లేదా చతుర్వింశతితత్త్వప్రక్రియను ప్రతిపాదించుటచే ఈ దర్శనమునకు సాంఖ్యమని పేరువచ్చినది.

ప్రకృతిపురుషవివేకము బుద్ధిపురుషభేదసాక్షాత్కారము మోక్షసాధనములుగా ఈ దర్శనమునందు ప్రతిపాదింపబడినవి. ఈశ్వరాంగీకారము లేకపోవుటచే ఈశ్వరసాక్షాత్కార సాధనము దర్శనశబ్దార్థముగా స్వీకరించుటకు వీలుపడదు. అయినను సాంఖ్యదర్శనము ఆస్తికదర్శనములలోనే చేరును.

పరలోకమును పునర్జన్మను విశ్వసించి వేదమును ప్రమాణముగా ఎంచువారు ఆస్తికులు. సాంఖ్యులు ఈ రెండింటిని అంగీకరించుచున్నారు.

ఈ సాంఖ్యదర్శనము షడధ్యాయ సూత్రగ్రంథముగా నేడు ఉపలబ్ధమగుచున్నది. అర్వాచీనాచార్యనామములు ('అవివేకనిమిత్తో వా పంచశిఖః' సాం సూ ౬.౮ ఇత్యాదిసూత్రములు) ఇందు కనబడుటచే ఇవి కపిలమహర్షి కర్తృకములు కావేమోయని కొందరు సంశయించుచున్నారు. విజ్ఞానభిక్షు కృతములని మరికొందరనుచున్నారు. శ్రీశంకరభగవత్పాదులు తమ భాష్యములో సాంఖ్యకారికలనే యుదహరించుటబట్టి ఈ వాదములకు కొంతబలము చేకూరుచున్నది. ఏమైనను కపిలమహర్షి దర్శనమే ఈ సూత్రములందు పొందుపరచబడినది. సాంఖ్యదర్శనగ్రంథములు నేడు కొలదిగానే లభించుచున్నను ఈ దర్శనప్రభావము యోగవేదాంతములందును భారతభాగవతపురాణాది వాఙ్మయమునందును విరివిగా కనిపించును. ఆయుర్వేద మూలసిద్ధాంతముల నిరూపణమునకును ప్రకృతిస్వభావవిశ్లేషణముచే పరిశోధకజ్ఞానవ్యాప్తికిని సాంఖ్యదర్శనము మిక్కిలి ఉపకరించును.

సూ. శా. శా.

## సామాజికశాస్త్రీ సంశోధన విధానము

సంఘములోని విభిన్నవిషయములను అధ్యయనము చేయుటకు సామాజికశాస్త్రమును ఎందరో ద్ధతులు అవలంబింపబడి నిసాంఘిక యథార్థములను సేకరించుటకును సేకరించిన వాటిని విశ్లేషించుటకును కొన్ని విధానములను అవలంబింపవలెను సమాజశాస్త్రము ఇటీవల వైజ్ఞానికతనొందుచున్నవిజ్ఞానము కొన్ని పద్ధతులను ఇతరశాస్త్రములనుండి గ్రహించి వానిని సమాజశాస్త్రమునకు అన్వయించుట సరియైనదని హెర్బర్ట్ స్పెన్సర్ అను ఆయన అభిప్రాయపడెను సమాజశాస్త్రము ఇతరమానవశాస్త్రములవలె పరాశ్రయమైనది (objective) ఇందు పరిశీలకుడు పరిశీలించు విషయములో తానును మారవచ్చును సమాజవ్యవస్థలు కాలముతోపాటు విడిసించిపరిణమించునును అందువలన ఇతర శాస్త్రములు ఈవిషయములో ఏవిధానముల ననుసరించునో ఆవిధానము ననే సమాజశాస్త్రముకూడ అనుసరించుట సమంజసము

సామాజిక ప్రతిభాసము (Social phenomena) మిక్కిలి సంకీర్ణమైనది సేకరింపవలసిన అంశము లకూడ ఎక్కువగా నుండును ఈ అంశముల స్వరూపము వివిధములుగనుండును కావున సామాజిక శాస్త్రము ఏవిధానము ననుసరించుట సరైనదో నిర్ణయించుట చాల కష్టము ఈవిషయమును దృష్టిలో నుంచుకొని సామాజిక వేత్తలు వివిధవిధానముల ననుసరించిరి ఈ క్రింద సామాన్యముగా వాడుకలోనున్న విధానములను వివరింతము

శాస్త్రీయపద్ధతి : ప్రతిశాస్త్రము విషయశోధనమునకై శాస్త్రీయవిధానమును అవలంబించును ఇందు ఐదుదశలు కలవు (1) పరిశీలనము (2) వర్గీకరణము (3) ఉపపత్తి Hypothesis) (4) నిరూపణము (5) భవిష్యన్నిర్ణయము

పరిశీలనమనగా విషయములను శ్రద్ధతో అవలోకించి గ్రహించుట ఇదిరెండువిధములు (1) స్వయంపరిశీలనము (2) నియంత్రితపరిశీలనము ఏదైన సంఘటన సంభవించినపుడు సామాజిక వేత్త ప్రత్యక్షముగాని పరోక్షముగగాని పరిశీలించినప్పుడు దానిని స్వయంపరిశీలన మందురు.

ఒక కృత్రిమమైన సందర్భమును లేక సంఘటనను సృష్టించి పరిశీలించు పద్ధతి రెండవది ఈ పద్ధతిలో పరిశీలకుడు తనకుతానై సృష్టించిన సంఘటనను పరిశీలించును

ఉదాహరణకు భగోళశాస్త్రజ్ఞుడు గ్రహములగమనమును గాని నక్షత్రముల లోకచక్రగమనమును గాని పరిశీలించుట మొదటి పద్ధతిక్రిందికి వచ్చును అట్లే సామాజిక వేత్త ఒక ఉద్యమమునుగాని ఆవేశముకు లోనైన సమూహమును గాని పరిశీలించుట స్వయంపరిశీలనము సామాజిక వేత్త ప్రయత్నపూర్వకముగా సంఘటనను కల్పించి వాటిపై ప్రయోగము చేసినచో అది నియంత్రితపరిశీలనము కాగలదు ఇట్టి కల్పితప్రయోగములు ప్రకృతి శాస్త్రములలో యెక్కువ సులభము కాగా సాంఘికశాస్త్రములలో ఇవి మిగుల కష్టసాధ్యము ఉదాహరణమునకు ఒక కరువుపరిస్థితిని లేక యుద్ధమువంటి అసాధారణ పరిస్థితిని తిరిగి తిరిగి కల్పించి అందు జరుగు మార్పులను తదితర సామాన్యీకరణములను (Generalisations) నిర్ణయించుట చాలకష్టము

శాస్త్రీయపద్ధతిలో రెండవమెట్టు వర్గీకరణము సమస్య లను సంఘటనలను గూర్చిన కొన్ని సత్యములను అంశము లను సేకరించిన తరువాత వాటిని ఒక క్రమపద్ధతిలో వర్గీకరించవలెను ఒకే లక్షణములుగల ఆయా అంశము ను తదనుగుణమైన వర్గములలోనికి క్రోడీకరించి పరిశీలించు విధానమే వర్గీకరణ మనబడును ఈపద్ధతి సమస్యలను క్రమగతిలో అర్థముచేసికొనుటకు సహాయపడును

మూడవదశ ఉపపత్తి వర్గీకరణమువలన అంశముల నుండి గ్రహించిన విషయములను కొన్ని నిర్ణయములక్రింద సూత్రములక్రింద వివరించవచ్చును ఈ వివరణము లనుగా ఉపపత్తి లేక ఊహానిర్ణయము చేయుట సాధ్యమగును

నాల్గవదశ నిరూపణము పై మూడుదశలలో రూపకల్పన చేయబడిన ఉపపత్తులను యథార్థ పరిస్థితులలో పునః పరీక్షగావించి తద్వారా వాటిని అంగీకరించుటయో లేక త్రోసిపుచ్చుటయో జరుగును దీనివలన సత్యాసత్యనిర్ణయము విషయపరిశీలనము సులభసాధ్యమగును ఉదాహరణమునకు ; ఒక జైలులోని దొంగలచరిత్రలను పరిశీలించి యొకల వారిలో చాలమంది బీదకుటుంబములనుండి వచ్చినవారని తెలియవచ్చును అంతమాత్రమునచే ధనిక కుటుంబములలో అట్టివారుండరని ఊహించుట కాని వాదించుట కాని మంచిది కాదు కావున సంఘటనలకు కార్యకారణ సంబంధమును ఆరోపించుటకు ముందు నిరూపణము లేక పునఃపరీక్ష చేయవలెను

చివరిదశ భవిష్యన్నిర్ణయము విషయ పరిశీలనము తరు

వాత దానినుండి వెలువడిన యథార్థములననుసరించి ముందు జరుగబోవు విషయములను గూర్చియు వాటి స్థితిగతులను గూర్చియు నిర్ణయము చేయవచ్చును. ఈ పద్ధతిని భవిష్యన్ని ర్ణయ మందురు.

ఒకసూత్రమును ప్రతిపాదించుటకు పూర్వము దానిని మరొకసారి పరీక్షించుట నిరూపణచేయుట యొక్క అవస రము. సామాజిక సూత్రములు సార్వత్రికముగా అన్ని పరి స్థితులలో వినియోగపడవు. ఐనను కొన్ని ప్రాథమికసూత్ర ములు అన్నిదేశములకును సమాజములకును కూడా వర్తిం చును. ఉదాహరణకు వివిధ ప్రాంతముల నుండి వచ్చు పల్లెలు మంచిఅభ్యాసములతో ఉన్నతస్థితులకు వచ్చుట దుర్లభము. ఈ సామాన్యీకరణము అనే పరీక్షలకు లోనైనను సార్వత్రి కముగా నిరూపించుకొనును. అయినను అపవాదము ప్రతి సూత్రమునకును కలదు.

సమాజశాస్త్రమునకు సూటిగా ప్రయోగపద్ధతి ననుసరించుట కొన్ని సమయములలో కష్టము. మానవసంఘము సంకీర్ణమైనది. అట్టి వర్తనమును అనుపులోనికి తెచ్చి పరిశీలిం చుటయు పోల్చుటయు ప్రయోగముక్రిందికి తెచ్చుటయు అనువైన విషయములు కావు. అయినను సాధ్యమైనమేరకు సమాజశాస్త్రము శాస్త్రీయపద్ధతి ననుసరించి విషయ నిర్ణ యము చేయు అంశములను సేకరించి వర్గీకరించి వాటి పరస్పర సంబంధమును నిర్ణయించి ఎవగణనచేయు సామాన్యసూత్ర మును నిర్ధరించుటకు ప్రయత్నించును.

చారిత్రకపద్ధతి: చరిత్రాత్మక పద్ధతిద్వారా పూర్వ సంస్కృతులలోని వ్యవస్థలను ప్రక్రియలను సంఘటనలను అధ్య యనము గావించుటయు వాటి పుట్టుపూర్వోత్తరములను పరిశీ లించుటయేకాక సమకాలీన సాంఘిక జీవనముపై వాటి ప్రభావమును తెలిసికొందురు. చరిత్రయు సమాజశాస్త్ర మును పరస్పరసంబంధముగల విజ్ఞానశాఖలు. అందువలననే టి. ఇ. హోబ్‌హౌస్ వంటి సమాజశాస్త్రవేత్తలు చరిత్రను గతిం చిన సమాజశాస్త్రముగను సమాజశాస్త్రమును వర్తమాన చరిత్రగను భావించిరి. ఈనాటి ఆచారవ్యవహారములు రీతి రివాజులు, సామాజిక జీవ పద్ధతులు మొదలగువాటి పుట్టు పూర్వోత్తరములు తెలిసికొనవలెనన్నచో చరిత్రయే ఆధార మను విషయము సత్యదూరముకాదు.

కాని ఈ పద్ధతితో సమాజశాస్త్రములోని అన్ని సమస్య లను పరిశోధించుటకు వీలుకాదు. చరిత్ర అందించు విజ్ఞాన ముతో మాత్రమే సరిపెట్టుకొని సమాజశాస్త్రపరిధిని నింపు చిరపరచలేము. కొన్ని చారిత్రకాంశములు శాస్త్రపరిశో ధనమునకు నిలువజాలవు. ఈ పద్ధతిద్వారా సమాజశాస్త్రవేత్త యొక్క అన్నిప్రశ్నలకు సమాధానములు దొరకవు.

తులనాత్మకపద్ధతి: సమాజజీవనములోగల భిన్న అంశ ముల పరస్పర సంబంధములను కనుగొనుట సమాజశాస్త్రము యొక్క ప్రధానకర్తవ్యము. సంఘమునందుగల వివిధ వ్యవస్థ లకుగల పరస్పరసంబంధమును గాని సాంఘిక జీవనములో కలుగు భేదములుగ నుండు సంబంధ బాధ్యతలను గాని తెలిసికొనుటకు పరిశోధనపద్ధతి అంత సాధ్యము కాకపోవచ్చును. కాని అట్టి విషయములలో తులనాత్మక పద్ధతిని ప్రవేశపెట్ట వచ్చును. ఈ పద్ధతిలో వివిధ మానవ సమూహములను గాని విభిన్న సమాజములనుగాని తులనాత్మకముగా పరిశీలింప వచ్చును. అట్టి పరిశీలనమువలన సమూహముల లేక సమాజ ముల మధ్యనున్న సామ్యమైన పోలికల లేక భిన్నత్వముల వివరణము సాధ్యమగును. సమాజజీవనములో ఏయే విషయ ములు ప్రత్యక్షముగా అన్యోన్య సంబంధమును కలిగి యున్నవో తెలుపుటకు తులనాత్మక పద్ధతిని పెక్కురు సమాజ శాస్త్రవేత్తలు అనుసరించుచున్నారు. డెయులర్ అనువాతడు ఆదిమవాసులలోని కుటుంబ వ్యవస్థలమధ్య అన్యోన్య సంబంధ మును ఈ పద్ధతిని ఉపయోగించి కనుగొనెను. అట్లే మాక్స్ వెబర్ అనునతడు ఆర్థికవ్యవస్థకును విభిన్న మతములలోని ధార్మిక మూల్యావళికిని గల అవినాభావసంబంధమును తులనా త్మక పద్ధతిద్వారా పరిశీలించి ధనికవాద వికాసగతిని వివ రించెను.

కాని ఈ పద్ధతి పైకి కన్పించునంత సులభముకాదు. ఎందుకనగా, సామాజిక విలువలు దేశకాల పరిస్థితులచే పరి మితమై విభిన్నరూపరేఖలు దాల్చవచ్చును. ఇందువలన తుల నాత్మకమైన అధ్యయనమునకు లోపభూయిష్ఠమగు ప్రమాద మున్నది.

గణాంక పద్ధతి: సమాజ ప్రతిభాసమును సామాజికాం శములను గణితపద్ధతిద్వారా కొలుచుట గణాంక (సంఖ్యా) పద్ధతి యనబడును. ఒక సమస్యను పరిమాణములో వివరించు టకు గణాంకపద్ధతిని అనుసరింపవచ్చును. ఉదాహరణమునకు జనాభాపెరుగుదల జననమరణములశాతము ఆదాయములో

పెరుగుదల లేక తరుగుదల మున్నగు విషయములను గూర్చి చెప్పుటకు ఈపద్ధతి సుగమమైనది సమాజశాస్త్రములో జనాభా న మస్యను చలనశీలతను (migration) ఆర్థిక స్థితిగతులు మున్నగు అంశములను పరిశీలించుటకు గణాంక పద్ధతి విశేష ముగా ఉపయోగపడును కాని సాంఘికసమస్యలు ఎక్కువగా గుణసంబంధమైనవేగాని పరిమాణసంబంధమైనవి కావు

ప్రవృత్త్యాత్మకవాదము ఇటీవల ఈ వాదమునకు సమాజశాస్త్రములో విశేష ప్రాధాన్య మియ్యబడుచున్నది సమాజములోని విభాగములైనను దాని పుట్టుపూర్వోత్తర ములను బట్టియు ఉపయోగములననుసరించియు విధివిధాన ములను బట్టియు వివరింపవచ్చును అనగా సామాజికాంశము లై కుటుంబము వర్గము రాజకీయ మతవ్యవస్థలు మొదలైన వాటిని బట్టియు అవి నిర్వహించు విధులనుబట్టియు అర్థము చేసికొనుటకై గావించు ప్రయత్నమే ప్రవృత్త్యాత్మకవాదమన బడుచున్నది సమాజమును కొన్ని విభాగముల కలయికగా గుర్తించి ఆయావిభాగముల పరస్పర సంబంధమును పరస్పరాశ్రయమును అధ్యయనమొనర్చుటకు ఈపద్ధతి ఉపయోగ పడును సామాజిక విభజనమువలన ఏర్పడిన భాగములను అవి నిర్వహించు విధులనుబట్టి అర్థముచేసికొనవచ్చును

సామాజికమితి (Sociometry) నేటి సమాజమందలి విభిన్నమైన ప్రక్రియలను గణాంకపద్ధతి మొదలైనవాటి సహా యముతో వివరించుటయేకాక కొన్నిసమయములలో సామా జికమితి అను క్రొత్తపద్ధతినిగూడ సమాజశాస్త్రవేత్తలుపయో గించుచున్నారు ఈపద్ధతిని సాంకేతికాత్మక దృశ్యముల సహా యముతో కూడ వివరింపవచ్చును ఉదాహరణమునకు వైరు ధ్యము వర్గపోరాటము సామాజికసామరస్యము నాయక త్వము మొదలైన ప్రక్రియలను వివరించుటకీపద్ధతి ఉపయోగ పడును అంతేకాక ఆకర్షణవికర్షణలను విభిన్నవ్యక్తులమధ్య గల సంబంధబాంధవ్యములను తెలుపుటకుకూడ ఇదొక అను వైన పద్ధతి ఈపద్ధతి భిన్న విభిన్న సామూహిక వ్యవస్థలను (group structures) సామాజిక అంతస్థులను వివరించుటకు కూడ ఉపయుక్తముగనుండును

పైనవివరించిన విధానములలో ఏ ఒక్కటియు సమగ్ర మైనదనిగాని ఒకదానికంటె మరియొకటి మెరుగైనదనిగాని, తరుగైనదనిగాని భావించనవసరములేదు ప్రతివిధానమందును బాగోగులున్నవి ఆయా పరిస్థితులబట్టియు సమస్యయొక్క స్వరూపమును బట్టియు ప్రక్రియయొక్క స్వభావమును అను సరించియు ఆయావిధానములలో అనుకూలమైనదానిని గణన గావించి సామాజికాంశములను అధ్యయనమొనర్చుట ఎన్నిక గావించుట సబబైన మార్గములు కాగలవు

సి. ల.
కె. వ.

## సామాజిక సమూహము

మానవజీవితము చాలవరకు సామూహికజీవితమన వచ్చును మానవుడు నిరంతరము సమూహములను ప్రస్తావించుటయేకాక ఒకవిధమైన వాక్సంకేతములను (Verbal symbols) పెంపొందించును మన నవసమాజములో సమూ హము' అనుపదమును విభిన్నమైన గుంపులకు వాడుదురు ఉదా కుటుంబము మూక వర్గము సముదాయము మొద లైనవి ఒకజాతికి చెందిన సభ్యులను ఒకమతమునకు సంబం ధించినవారిని ఒకవృత్తిని అవలంబించువారిని ఒకవయస్సుగల వారిని వివిధములైన సమూహములక్రింద పరిగణింపవచ్చును

సమాజములకు పునాదులని చెప్పదగినవాటిలో సమూ హము లేక గుంపు ప్రముఖస్థానమాక్రమించును సామాన్య ముగా వ్యక్తులు కలుసుకొనునప్పుడు వారిలో సాంఘికభావ ములు మొలకెత్తును ఆయాసందర్భములననుసరించి సామా జిక సంబంధములు పెంపొందు అవకాశము లేర్పడుచుండును సామాజికశాస్త్రములో సమూహమను శబ్దము విశేషార్థ ములో ప్రయోగింపబడును ఈసమూహమునందలి సభ్యుల సంఖ్య రెండునుండి వేలు లక్షలవరకుండవచ్చును ఒండొరులతో సామాజికసంబంధముగల మానవసమూహమని ఈపదమున కర్థము చెప్పకొనవచ్చును ఉదా। క్రికెట్ టీము భజనసమా జము ఇత్యాదులు ఈటీము ఈసమాజము మొదలైనవాటి యందలి సభ్యులమధ్య ప్రతిచర్యయు ప్రతిసంబంధమును కొంత వరకు పరస్పర అవగాహనము గుర్తింపు ఏర్పడినపుడే అది సామాజికసంబంధమనిపించుకొనును ఇది ప్రాతిపదికగా గ్రహించి జనాభాను వివిధసమూహములక్రింద-అనగా సమాన వయస్కులసమూహము దాదాపు ఒకే ఆదాయముగల ఉద్యోగివర్గము మేధావివర్గము-విభజింపవచ్చును సామాజిక సమూహము సాధారణముగా వ్యవస్థీకృతమైయుండును మరి యొక సామాన్యలక్షణమేమనగా ప్రతిసామాజికసమూహము విధిగా కొన్ని నియమములను పాటించుచు సభ్యులను నియం

ప్రణముద్వారా అనుభవించుచుకొనును. అంతేకాక సమూహనాయకుని తక్కిన సభ్యులు అనుసరించుచుందురు.

సాంఘిక వేత్తలు సమూహముల స్వభావమును లక్షణములను అనుసరించి వాటిని ప్రాథమిక సమూహములు, మాధ్యమిక సమూహములు లేక అనుషంగిక సమూహములు అని విభజించిరి. ఇదికాక మూక (crowd) ప్రజ (Public) అను వాటిని కూడ సాంఘిక సమూహముల క్రింద చేర్చవచ్చును.

ప్రాథమిక సమూహ లక్షణములు

ప్రాథమిక సమూహము పరిమాణములో చిన్నదిగ నుండును. ఈ సమూహములో సభ్యులు ముఖాముఖి పరిచయము కలవారై సహకార సంఘీభావములతో సన్నిహితులుగ మెలగుచుందురు. సాంఘిక సంబంధములు పరిమితముగనుండుటయే కాక సామూహిక శ్రద్ధ అభిరుచులు సాధింపవలసిన ఆశయములు బహుపరిమితముగను డును. సభ్యులమధ్య సన్నిహిత సంబంధము కలిగి ఒకరిభావము లొకరు పంచుకొనుట సలహాలు పాటించుట అభిప్రాయములు బహిరంగముగ వెలిబుచ్చుట జరుగును. ఇట్టి చిన్న సమూహములలో సభ్యులు వ్యక్తిగతముగ పరిచయస్థులై గాఢమైన సాంఘిక సంబంధములను కలిగి యుందురు. ఉదా: కుటుంబము క్రీడాసమూహము అధ్యయన మండలి మొదలైనవి. ఇంతేకాక సమూహ సభ్యులు ఇంచుమించు ఒకేతరగతికి చెందినవారై సామ్యతను ఎక్కువగా కలిగియుందురు. వీరి అనుభవములోను మేధస్సులోను దాదాపు ఒకేరకమైన ప్రమాణము కనిపించును. అట్లుకానిచొ కొందరి సభ్యులలో కొందరు సమూహ కార్యకలాపములకు అభ్యంతరము కల్గించుచుందురు. ఈ లక్షణము ముఖ్యముగా చర్చా సమూహములలో గమనింపవచ్చును. సభ్యుల ప్రమాణముల ననుసరించియే సమూహము యొక్క ఆశయములు సభ్యుల పరిమిత శ్రద్ధ రూపు చెందును. ఈ లక్షణములే కాక ప్రాథమిక సమూహములలో సహకారము స్నేహభావము ఎక్కువగా ప్రబలియుండును. ఈ సమూహములలో నిర్ణయములు చర్చలద్వారాను సలహాసంప్రదింపులద్వారాను జరుగుచుండును. సభ్యులనడుమ నిర్మాణాత్మకమైన ప్రేరణ కూడ యుండును. సభ్యుల సంపూర్ణ అంగీకారముతోనే నిర్ణయములు అమలు జరుపబడుచుండును. నాయకత్వము ఈ సమూహములకుండు మరియొక ముఖ్యలక్షణము. సభ్యులందరు అయాచితముగా నాయకుని అనుసరించుచు అతని కనుసన్నలలో మెలగి అతని ఆమోదప్రమోదములను పొందుటకు ప్రయత్నించుచుందురు. ప్రాథమిక సమూహములో సభ్యత్వము స్వేచ్ఛాపూర్వకమైనది.

సమాజములో ప్రాథమిక సమూహముల పాత్ర చాల ముఖ్యమైనది. వ్యక్తి యొక్క సమాజీకరణము ప్రాథమిక సమూహములలోనే ఎక్కువగా జరుగుచుండును. ఇట్టి సమూహములలో మొట్టమొదట పేర్కొనదగినది కుటుంబము. ఇచ్చట మానవుడు భవిష్యత్తులో తాను నడచుకొను రీతులను గ్రహించును. వ్యక్తి సమాజజీవిగ రూపొంది సమాజములో అంతర్భాగముగా ఇమిడిపోవలెనన్నచో ప్రాథమిక సమూహములలో అతనికి చక్కని శిక్షణ లభించుటయే కాక భిన్నమైన ఉన్నతమైన అనుభవములను పొందుట ఎంతయో అవసరము. వ్యక్తివికాసమునకు, సంస్కృతీ నాగరికతలను అవగాహన చేసికొనుటకు సాంఘిక జీవనము ఒడుదుడుకులు లేక సాఫీగాసాగిపోవుటకు ప్రాథమిక సమూహములు విశేషముగ తోడ్పడును.

మానవ నాగరికత వికాసము చెందనప్పుడు సమాజములో ప్రాథమిక సమూహములు మాత్రమే ఏర్పడినవి. కాలక్రమమున వివిధరంగములలో వచ్చుచున్న మార్పులవలన మానవ జీవితము పూర్తిగా పరివర్తనము చెందుచు ప్రాథమిక సమూహముల అవశ్యకత ప్రాధాన్యత రోజురోజుకు క్షీణించుచున్నది. నాగరికతాభివృద్ధితో మాధ్యమిక లేక అనుషంగికమైన సమూహముల ప్రాధాన్యత హెచ్చుచున్నది.

మాధ్యమిక సమూహములు

ఆధునిక సమాజములో మాధ్యమిక సమూహములు ప్రముఖపాత్రను వహించుచున్నవి. ఉదా: దేశము రాష్ట్రము పట్టణము రాజకీయపక్షము కార్పొరేషను కార్మికసంఘము మొదలైనవి. ఈ సమూహముల మధ్యగల సాంఘిక సంబంధములను నిర్వచించుట కష్టతరమైనపని. సంబంధములు పరిమితమై కొన్నిలక్ష్యములు సంకుచితముగానుండును. మాధ్యమిక సమూహములోని సభ్యునకు ఇతరసమూహములోని సభ్యులతో అప్రత్యక్షమైన సంబంధములు కల్గియుండును. ముఖాముఖి పరిచయము వ్యక్తిగతమైన సాన్నిహిత్యము చాల అరుదుగనుండును. సాధారణముగా సమూహములో అతని కార్యకలాపములన్నియు ప్రాతపూర్వకముగను, అప్రత్యక్ష

ముగను జరుగుచుండును

మాధ్యమిక సమూహలక్షణములు ప్రాథమిక సమూహ లక్షణములకు పూర్తిగా భిన్నముగ నుండును పరిమాణములో అది పెద్దదిగ నుండి సభ్యుల సంఖ్య అపరిమితముగ నుండును సమూహము యొక్క కార్యకలాపములు విస్తృతముగ నుండును ఇట్టి సమూహము ఏర్పడుటలో కొన్ని సాముదాయక ప్రయోజనములను కలిగియుండుటే కాక నిర్దిష్టమైన కార్యరంగము కూడ నిర్దేశింపబడును సభ్యులు యిష్టపూర్వకముగ సమూహము యొక్క కార్యకలాపములను అభిరుచులను కొనసాగించుటలో సహకారము నందింతురు వారి కార్యక్రమమంతయు నిర్ణీతమైన ఆశయసిద్ధి కొరకు ఉద్దేశింపబడియుండును

మాధ్యమిక సమూహము కొన్ని సూత్రములు లేక నియమములమీద ఆధారపడి యుండును సభ్యులందరికి నిర్ణీతమైన పనులు ఏర్పరుపబడును ఎవరి పనులను వారు చేయుటలో కృతకృత్యులైనచో సామూహిక ప్రయోజనములు సాధింపబడగలవు ప్రాథమిక సమూహములలో ప్రయోజనములు కచ్చితముగా సాధింపబడు అవకాశములు తక్కువగ నుండును కాని మాధ్యమిక సమూహములలో అట్టి నిర్ణీత పద్ధతిలో కార్యకలాపములు ప్రణాళికాబద్ధముగ జరిగినను, సభ్యుల మధ్య సామాజిక సంబంధముల ప్రాబల్యము అంతగా ఉండదు వారి మధ్య సంబంధములు, సంఘీభావము తాత్కాలిక ధోరణిలో నుండును భావప్రాబల్యము తక్కువగ కన్పట్టును ఈ సమూహములలో సామాజిక సంబంధములు దృఢతరమైనవి కావు కాని ఆ సమూహ కార్యక్రమములు యెట్టి సమయములోనైనను వాటంతట అవియే క్రమపద్ధతి ననుసరించి అవిచ్ఛిన్నముగా సాగిపోవును ఉదా రాజకీయ పక్షములు ఇత్యాద్యాధునిక మున్నగునవి

మూక వ్యక్తులు సందర్భానుసారముగ ఒక్కొక్కప్పుడు తాత్కాలికముగను మరొకప్పుడు శాశ్వతముగను సమూహములుగా ఏర్పడుదురు ప్రయోజనసాధనమే సమూహము ఏర్పడుటకు కారణము ప్రయోజనముల ననుసరించి సమూహ లక్ష్యములను నిర్ణయించ వచ్చును ప్రాథమిక మాధ్యమిక సమూహములు సమాజములో శాశ్వతమైనవి మూక అను దితాత్కాలికమైన సమూహము మాత్రమే అప్పటికప్పుడేర్పడి అది మరుక్షణములో మాయమగును ఈ సమూహము ముందుగా నిర్ణయించిగాని ప్రణాళికా పద్ధతి ననుసరించిగాని ఏర్పడునదికాదు మూక సామాన్యముగా ప్రజలలో కలుగు తాత్కాలిక ఉత్సాహ ఉద్రిక్తతలవలననో కొన్ని తాత్కాలిక ప్రయోజనముల సిద్ధికొరకో ఏర్పడుచుండును ఆవేశము ఉద్రిక్తత చల్లారగనే మూక కూడ మాయమగుచుండును ఉదాహరణమునకు రోడ్డు మీద నడచి పోవునపుడు ఘటిల్లు ప్రమాదముగాని ఊరేగింపుగాని గారడీ ఆటగాని మొదలైనవి మూక ఏర్పడుటకు అవకాశమొసగును మామూలుగా ప్రజలు ఎవరి పనుల మీద వారు సాగిపోవునపుడు వారు సమూహమని వ్యవహరింపబడరు కాని వారిని సమూహముగా చేర్చుట కవకాశమిచ్చు ఏదేని ఒక సంఘటనము వారిని మూక క్రింద మార్చివేయగలదు పైన చెప్పినట్లు-అనగా హఠాత్తుగా జరుగు రోడ్డు ప్రమాదము ఉన్మాది యొక్క చేష్టలు గారడీ ఆట, ఆందోళన పూరితమైన ఊరేగింపు ప్రజలు మూకగా ఏర్పడుటకు దోహదమొసగును

ప్రాథమిక మాధ్యమిక సమూహములు సమాజములో నిర్మాణాత్మకమైన పాత్రను వహించగా మూకలు ఒక్కొక్క సందర్భములో సమాజములో కల్లోల స్థితిని వినాశస్థితిని కూడ తాటియుట కలదు

సముదాయము (Community) సముదాయము, వర్గము అను పదములు సామాజికశాస్త్రములో స్థిరపడిన ప్రజా సమూహములకు వాడబడును ఉదాహరణమునకు ఒక గ్రామమునగాని పట్టణమునగాని నివసించు మానవ సమూహమును సముదాయమని అనవచ్చును ఒక సముదాయములోని సభ్యులు ఏవియో కొన్ని ప్రత్యేకమైన అభిరుచులను పంచుకొనుటయే కాక జీవనసరళిలో సమభాగస్వాము లయ్యెదరు ఒక సముదాయములోని సభ్యుని జీవితమంతయు ఇంచుమించుగా తన సముదాయములోనే గడచిపోవును ఏ వ్యక్తియు తన పూర్తి జీవితమును ఒక వ్యాపార సంస్థలో గాని దేవాలయ సంస్థలోగాని మరియే యితర సంస్థలో గాని గడపలేడు కాని ఒక సముదాయములో అది సాధ్యమగును మానవుడొక్కొక్క ప్రదేశములో స్థిరనివాస మేర్పరచుకొని సామాజిక సంబంధములను దృఢపరచుకొని విస్తృతపరచుకొనును సముదాయమనునది పూర్తిగా భౌగోళికార్థములో వాడబడుచున్న పదము

సము దాయములు స్వయం సమృద్ధిని కలిగియుండవలె నను నియమములేదు కాని ప్రాచీన మానములో సముదాయముల సభ్యుల సంఖ్య తక్కువలో నుండెడిది అవి స్వయం సమృద్ధములై కూడ యుండెడివి ఆధునిక సముదాయము లిట్టివి కావు ఆర్థికముగ రాజకీయముగ అవి ఇతర సముదాయములపై ఆధారపడియున్నవి

సముదాయ మేర్పడుటకు రెండు ముఖ్య కారణములు గలవు (1) స్థానికత (2) సాముదాయక భావన సముదాయము ఒక ప్రదేశము నాక్రమించుకొనను సంచారశీలము కలిగిన జిప్సీ సముదాయము కూడ తాత్కాలికముగనైనను ఒక ప్రదేశము నాక్రమించుకొని ఆహారాన్వేషణకై ఒక ప్రాంతము నుండి మరొక ప్రాంతమునకు పోవుచుండును సముదాయ సభ్యులు ఒక శాశ్వత స్థిరనివాస మేర్పరచుకొని దృఢమగు సంబంధములు కలిగి పరస్పరానుబంధమును పెంచుకొందురు ఈ సాముదాయక భావనయే సముదాయములు విచ్ఛిన్నముకాకుండ తోడ్పడును వర్తమానకాలమున ఈ సాముదాయక భావన ప్రాబల్యమంతగ కన్పించదు స్థానిక వాసుల మధ్య రాకపోకలు సంపర్కము తగ్గిపోయి ఎవరి కార్యకలాపములలో వారు నిమగ్నులగుటయే ఇందుకు కారణము ఇందుచే ఒక ప్రదేశములో నివసించినంత మాత్రమున అచ్చటివారిని సముదాయము క్రింద జమకట్టలేము స్థానికతతోపాటు సాముదాయక భావనను జీవన సరళిని సభ్యులు పంచుకొనినప్పుడే అది సముదాయమని ఎలువబడును

సి ఆ

కె వ

## సామ్రాజ్యములు

ప్రపంచ రాజకీయ వ్యవస్థలలో సామ్రాజ్యములకొక ప్రత్యేకస్థానముకలదు ఇటీవలి కాలమున సామ్రాజ్యతత్త్వమును ఖండించు వారనేకులు బయలుదేరినను సామ్రాజ్యములకుగల ప్రాధాన్యమింకను తగ్గలేదు ఒకరకపు సామ్రాజ్యములు అంతరించినను, మఱియొకరకపు సామ్రాజ్యములు వాటిస్థానమును ఆక్రమించుకొనుచున్నవి

ఒక రాజ్యము బలప్రయోగముచేసి, యుద్ధములో ఇతర రాజ్యములనోడించి వాటిని వశపరచుకొని వాటిలోని ప్రజలపై పరిపాలనాధికారమును వహించుటయే సామ్రాజ్య వ్యవస్థ దీనిఫలితముగ జయింపబడిన రాజ్యములు వాటి స్వేచ్ఛను వ్యక్తిత్వమును కోల్పోవుటయు జయించినరాజ్యపు ప్రాబల్యము వృద్ధిగాంచుటయు సంభవించును తరచుగ సామ్రాజ్యములో పాలకులు ఒకజాతికి చెందినవారుగను పాలితులు మఱియొకజాతికి చెందినవారుగను ఉండెదరు ఈ ఆక్రమణ కొన్నిపరిస్థితులలో పాలకపాలితజాతులు కలసిపోవచ్చును కాని దీనికి కొంతకాలము పట్టునన్నది కొన్ని సందర్భములలో వీరు కలియక తుదవరకు వేరువేరుగ ఉండుటకూడ కలదు కావున సామ్రాజ్యపాలన చాలవరకు పరాయిపాలన అని చెప్పదగియున్నది రాజ్యపాలనమునకు ప్రజలసమ్మతియు బలప్రయోగములో ఒకొక్కటియు కొంతవరకు ఆధారమగునని శాస్త్రవేత్తలు చెప్పుచుందురు సామ్రాజ్య పరిపాలనమునకు ప్రజలసమ్మతికంటె పాలకులసైనికబలమే ఎక్కువ ఆధారమని చెప్పవచ్చును

బలముగల తెగలు జాతులు రాజ్యములు ఇతరులను జయించి వశపరచుకొనుట మానవచరిత్రకు లక్షణము అధికార వ్యామోహము పేరుప్రతిష్ఠలను సంపాదించుటయందు వాంఛ, ఇతరుల ఎరిసంపదలను అపహరించవలెనను కోరిక ఇవి సామ్రాజ్య సంస్థాపనకు పురికొల్పు కారణములు, దీనిఫలితముగ ప్రాచీన కాలమందు ఈజిప్టు బాబిలోనియా పారశీకము మాసిడోనియా రోమ్‌నగరము చైనా మొదలగు దేశములను పాలించినవారు విశాలసామ్రాజ్యములను స్థాపించి పాలించిరి మధ్య యుగమందు యూరపుఖండములో ఫ్రాంకులు నార్మనులు, ఆసియాఖండములో ముస్లిములు తార్తారులు మంగోలులు అమెరికాలోని ఇంకాలు ఆధునికయుగములో ఆటోమన్ తురుష్కులు, యూరపులో రష్యా ఇంగ్లండు ఫ్రాన్సు స్పెయిన్,పోర్చుగల్ హాలెండు దేశములవారు, ఆసియాలోని జపాన్‌వారు గొప్పసామ్రాజ్యములను స్థాపించిరి ఒకొక్క సామ్రాజ్యము కొంతకాలము వృద్ధిగాంచి తర్వాత అంతరించెను ఆధునికయుగములో పూర్వ సామ్రాజ్యములన్నియు ఇటీవల విచ్ఛిత్తిగాంచెను

సుమారు 2500 సంవత్సరముల నుండి భరతఖండములో అనేకసామ్రాజ్యములు వృద్ధిక్షయములగాంచెను నందరాజులు, మౌర్యులు, ఆంధ్రశాతవాహనులు గుప్తులు చాళుక్యులు, చోళులు, కాకతీయులు ఆఫ్ఘనులు విజయనగరచక్రవర్తులు, మొగలులు మహారాష్ట్రులు, బ్రిటిషువారు సామ్రాజ్యములను స్థాపించిన వారిలో ప్రధానముగ పేర్కొనదగిన

వారు భరతఖండము చక్రవర్తిక్షేత్రమనియు అందుచేత అది ఒకచక్రవర్తి పరిపాలనములో ఉండవలసిన సామ్రాజ్యమనియు 2800 సంవత్సరముల క్రిందట కౌటిల్యుడు చెప్పెను. అసేతు హిమాలయపర్యంతమును వ్యాపించిన ఈదేశమందు రాజ్యము లనేకములుండినను వీటినన్నిటిని జయించి వీటిపై ఏకచ్ఛత్రాధిపత్యము వహించుట క్షత్రియ ధర్మమనుభావము రాజులందరిలో వ్యాపించియుండెను. వీరిలో కొందరి ప్రయత్నములు ఫలించినవి. మరికొందరి ప్రయత్నములు ఫలించలేదు. కాని సామ్రాజ్యస్థాపనమే అందరి లక్ష్యముగనుండెను.

ఉత్తమములును శాస్త్రవములును అగు పరిపాలనవిధానములను రూపొందించుటయందును సాంస్కృతికముగ మానవకోటి అభివృద్ధిని సాధించుటయందును సామ్రాజ్యములు ప్రత్యేకపాత్రను వహించెను. చిన్న చిన్న రాజ్యములలో ఉత్పన్నములుకాని క్లిష్టసమస్యలనేకములు సామ్రాజ్యములలో ఉత్పన్నములగుటచేత నూతనములగు విధానములను రూపొందించుట సామ్రాజ్యపాలకులకు అవసరమయ్యెను. సామ్రాజ్యములు విస్తీర్ణాధిక్యము కలవి. పాలింపబడవలసిన ప్రాంతము లనేకములు రాజధానికి దూరమందుండును. గొప్పసామ్రాజ్యములలో వివిధజాతులకు చెందినవారు వివిధములగు సంప్రదాయములను ఆచారములను కలవారు వివిధభాషలను మాట్లాడువారు ఉండుట సహజము. దూరమందుండు ప్రాంతములను, విభిన్నప్రజలను పాలించుటకు కావలసిన ఏర్పాటులనేకములను సామ్రాజ్యాధిపతులు చేయవలసినవారైరి. పరిపాలనవిధానము అభివృద్ధిగాంచుటకు ఇదియే ప్రధానకారణము.

సామ్రాజ్యమును రాష్ట్రములుగ విభాగముచేయుట, ఒక్కొక్క రాష్ట్రమును పాలించుటకు ప్రత్యేకఅధికారులను నియమించుట, వారు కేంద్రప్రభుత్వముపై తిరుగుబాటుచేయకుండుటకు కావలసిన నిబంధనలను నిర్ణయించుట, వారిప్రవర్తనమును పర్యవేక్షించుటకు గూఢచారుల నియమించుట - ఇవన్నియు ఒకవర్గమునకు సంబంధించిన విధానములు. అన్నిపనులను కేంద్రప్రభుత్వమే చేయదలచినయెడల పరిపాలనభారము వహించరానిదిగ పరిణమించును. అట్లు కారాదని రాష్ట్రగవర్నరులకు అధికారము నొసగినయెడల వారు నిరంకుశముగ ప్రవర్తించి ప్రజలను బాధపెట్టుటయు కేంద్రముపై తిరుగుబాటుచేయుటయు తప్పదు. అనేక సామ్రాజ్యములు కూలిపోవుటకు ఇట్టితిరుగుబాటులే కారణము. కావున ఇట్టి ప్రమాదములు సంభవించకుండునట్లు కేంద్ర స్థానిక ప్రభుత్వములమధ్య సంబంధములను రూపొందించుటలో వివిధ సామ్రాజ్యములు ఎన్నియో క్రొత్తక్రొత్త ఏర్పాటులను చేసినవి. ఇప్పటి పరిపాలనపద్ధతులలో వాటి ప్రభావము కనిపించుచున్నది.

రవాణాసౌకర్యములను ప్రయాణసౌకర్యములను సమాచారసౌకర్యములను పెంపొందించుటలోకూడా సామ్రాజ్యములు ప్రత్యేకశ్రద్ధను వహించవలసివచ్చెను. రోమనులు నిర్మాణముచేసిన రోడ్లు యూరపులో ఇప్పటివరకు చెక్కుచెదరక ఉన్నవి. సైన్యములను సకాలములో వివిధ రాష్ట్రములకు తరలించుటకు ఇవి ఎంతయో అవసరము. పారసీకసామ్రాజ్యమందును మౌర్యసామ్రాజ్యమందును ఇట్లే జరిగెను. బ్రిటిష్ మొదలగు ఆధునికసామ్రాజ్యములలో ఇట్టిసౌకర్యముల నిర్మాణము ప్రధానస్థానము వహించెను. ప్రభుత్వవ్యవహారములను అంచనవేయుటకు ప్రత్యేకవర్గమొకటి ఏర్పాటుచేయబడెను. ఇందుకై పశువులను నిప్పులను పొగను ఉపయోగించుట సర్వసాధారణమయ్యెను. ప్రస్తుతకాలమున ప్రభుత్వములన్నిటిలో సమాచారశాఖ ప్రాధాన్యము వహించియున్నది. దీనికి ఒరవడిపెట్టినవారు సామ్రాజ్యాధిపతులు.

ప్రజలు అనుసరించు విభిన్నములగు ఆచారములను ఎంతవరకు పాటించుట యుక్తము, ఎంతవరకు వాటిని మార్చుట అవసరము అనునది సామ్రాజ్యములన్నియు ఎదుర్కొనిన సమస్య. దీనిని పరిష్కరించుటలో క్రమక్రమముగా పరిపాలకులు వారివారి సామ్రాజ్యములలో ఒకేవిధమగు ధర్మశాస్త్రమును దానిని అమలుపరచుటకు ఒకేవిధమగు న్యాయస్థానములను న్యాయపరిపాలనావిధానములను రూపొందించిరి. అందుచేత ప్రజలందరు ఒకేవిధానమునకు అలవాటుపడినవారైరి. దీనిమూలమున వారిలో ఐక్యభావము పెంపొందెను. భారతదేశములో మనుస్మృతివంటి స్మృతులకు దేశమంతట ప్రాధాన్యము లభించుటకు కొంతవరకు ప్రాచీనకాలపు సామ్రాజ్యములు కారణమని చెప్పవచ్చును. బ్రిటిష్‌పరిపాలనకాలమున పరిపాలనవిధానము దేశమందంతట ఒకేమాదిరిగ నుండుటచేత, జాతీయభావము వృద్ధిగాంచెను. రోమన్ సామ్రాజ్యముయొక్క ఘనతకు ఒకేధర్మశాస్త్రమును రోమన్ చక్రవర్తులు ప్రవేశపెట్టుట ఒక ప్రబలకారణము. ఇప్పటికికూడ యూరపులో అనేకదేశములవారు ఆశాస్త్రమునే అనుసరించుచున్నారు. పౌరులలో సమతాభావము వృద్ధిగాంచుటకుకూడ

ఇట్టి ఏకకైన్యాయపరిపాలనావిధానము ఎంతయో తోడ్పడెను సామ్రాజ్యములందును ఒకేవిధముగ పరిపాలింపవలెనన అంగ మేర్పడుటచేత చక్రవర్తులు ఒకేవిధమగు తులామానములను ఒకేరకమైన ద్రవ్యచెలామణిని ప్రవేశపెట్టిరి దీని మూలమున వర్తకవ్యాపారములు వృద్ధిగాంచెను ఆర్థికముగ ప్రజలు బాగుపడగలిగిరి సైన్యములకు జీతములిచ్చుటకు కావలసిన ద్రవ్యమును పన్నులమూలమున వసూలుచేయుసందర్భములో జనాభాలెక్కలను తయారుచేయవలసిన అవసర మేర్పడెను అట్టివారు లెవరు? ఎవరెవరు ఎంతపన్నును చెల్లింప సమర్థులు? అని నిర్ణయించుటకు అట్టి లెక్కలు అవసరమయ్యెను వీటిని తయారుచేయుటలో సామ్రాజ్యాధిపతులు ఇప్పటివారికి మార్గదర్శులైరి

రాజ్యములనేకములున్నపుడు వాటిమధ్య తరచుగ యుద్ధములు సంభవించుట తప్పదు వాటిమూలమున ప్రజలు శాంతిభద్రతలు లేక బాధపడవలసినవారగుదురు ఇట్లుగాక రాజ్యములనేకములు ఒకేసామ్రాజ్యముగ ఏర్పడినయెడల యుద్ధభయము తగ్గి ప్రజలు శాంతిభద్రతలు కలవారై ప్రశాంతముగ జీవితమును సాగించుట సాధ్యమగుచున్నది సామ్రాజ్యములమూలమున కలిగిన ఫలితములలో ఇది ప్రధానముగ గుర్తించదగినది

ఒకప్రాంతపు సంస్కృతి మరియొకప్రాంతమునకు వ్యాపించుటలోను విభిన్నసంస్కృతులు కలిసిపోవుటలోను వ్యాప్తి గాంచిన సంస్కృతిపునరుజ్జీవమగుటలోను సామ్రాజ్యములు వహించిన పాత్ర అమోఘము ఆర్యసంస్కృతి దక్షిణ భారతమునకు వ్యాపించుటలోను ఆర్యానార్యసంస్కృతులు కలిసి భారతీయసంస్కృతిగ రూపొందుటలోను ముస్లిం సంస్కృతికి మనదేశములో ప్రవేశము గలుగుటలోను నిర్జీవావస్థలోనున్న భారతసంస్కృతి చైతన్యవంతమగుటలోను భారతదేశమందలి ప్రాచీనసామ్రాజ్యములయొక్కయు ఆఫ్ఘన్ మొగలాయిసామ్రాజ్యములయొక్కయు బ్రిటిష్‌సామ్రాజ్యము యొక్కయు ప్రభావము ఎంతయో కలదు ఇట్లే అలెగ్జాండరు సామ్రాజ్యము కారణముగ గ్రీకుసంస్కృతి పశ్చిమఆసియా దేశములలోను ఈజిప్టులోను రోమన్‌సామ్రాజ్యము మూలమున గ్రీకు రోమన్ సంస్కృతులు యూరపుఖండమంతటను వ్యాపించగలిగెను వివిధభాషలు మాటలాడు ప్రజలు ఏదేని ఒకసాధారణభాషను మాటలాడుటకును, విద్యాబోధకభాషగ నుపయోగించుటకును సామ్రాజ్యములు కారణము సంస్కృతము గ్రీకు ల్యాటిను ఆంగ్లభాషల చరిత్ర దీనిని స్పష్టము చేయుచున్నది

20వ శతాబ్దము రు పూర్వము సామ్రాజ్యముల వ్యాప్తిని ఖండించిన వారనేకులు లేరు కాని గత 60 70 సంవత్సరముల మధ్య ఇట్టివారి సంఖ్య విపరీతముగ పెరిగెను ప్రస్తుతము సామ్రాజ్యవిధానమును సమర్థించువారు ప్రపంచములో ఎవ్వరును లేరని చెప్పవచ్చును యుగయుగములుగ సహజపరిణామముగ భావింపబడుచుండిన సామ్రాజ్యవ్యవస్థపట్ల ఇంతటి విరోధము కలుగుటకు ప్రబలకారణములనేకము లుండెను

వాటిలో ఒకటి ఫ్రెంచి విప్లవఫలితముగ యూరపుఖండములో జాతీయతాసిద్ధాంతమునకును ప్రజాస్వామిసిద్ధాంతమునకును ప్రాబల్యము లభించుట ఒకజాతివారు మరియొకజాతి వారిని జయించి పరిపాలించుట అధర్మమనుటయే జాతీయతా సిద్ధాంతము ఏరాజ్యములోని ప్రజలు ఆరాజ్యమును ప్రత్యక్షముగగాని లేదా తాము ఎన్నుకొనిన ప్రతినిధులద్వారాగాని పరిపాలించుటయే సక్రమమగు పరిపాలనవిధానమనుట ప్రజాస్వామికసిద్ధాంతము ఈ సిద్ధాంతముల ప్రాబల్యముచే ప్రథమమున యూరపుఖండమందును క్రమక్రమముగ ఇతరఖండములందును సామ్రాజ్యములపై అనేకతిరుగుబాటులు సంభవించి వాటి విచ్ఛిత్తికి దారితీసెను

సామ్రాజ్యములయెడ్ల విరోధభావము ప్రబలుటకు మరియొక కారణముండెను గత మూడు వందల సంవత్సరముల మధ్య స్థాపింపబడిన సామ్రాజ్యములన్నియు (ఒక జపాన్ సామ్రాజ్యము మినహాగా) శ్వేతజాతివారగు యూరోపియనులచే రంగుజాతులు నివసించు ఆసియా ఆఫ్రికాఖండముల లోని దేశములలో స్థాపింపబడినట్టివి వీటిని స్థాపించిన శ్వేత జాతులవారు తమ పరిపాలనములో నుండిన కోటానుకోట్ల రంగుజాతుల వారిని అధములని భావించి సర్వవిధముల వారిని అగౌరవపరచసాగిరి వారి పరిపాలనములో నుండిన భారతదేశమువంటి దేశముల సంస్కృతియెడ్ల మతములయెడ్ల పాలకులలో అత్యధిక సంఖ్యాకులకు ఎట్టి గౌరవభావమును లేకుండెను ఇట్టి అగౌరవమును, జాతివివక్షణ భావమును ప్రజలు భరించలేకపోయిరి ఇదిగాక శ్వేతజాతుల వారు వర్తకదృష్టితో వారి సామ్రాజ్యములను పాలించసాగిరి తమ

తమ దేశముల లాభ మొక్కటియే వారికి పరమలక్ష్యము అయ్యెను. పాలిత ప్రజల ప్రయోజనములపట్ల వారెట్టి శ్రద్ధను వహించరైరి. అందుచేత వారి సామ్రాజ్యములలో నుండిన దేశముల పరిశ్రమలు నశించుటయు దారిద్ర్యము వృద్ధిగాంచుటయు జరిగెను. సామ్రాజ్యములు వర్తక సంఘముల రూపమును ధరించుటను పాలితప్రజలు సహించరైరి. ఇట్టి కారణముల మూలమున సామ్రాజ్యములపై తిరుగుబాటులు వృద్ధిగాంచి వాటి పతనమునకు దారితీసెను.

ప్రస్తుతము మానవకోటి ఒక క్లిష్టసమస్యను ఎదుర్కొనియున్నది. ప్రపంచమందు స్వతంత్ర రాజ్యముల సంఖ్య పెరిగినది. స్వతంత్ర రాజ్యములనగా ఒకటితోనొకటి మైత్రిని చేసికొనుటకుగాని అనివార్యమైనచో, యుద్ధమును సాగించుటకైనగాని స్వాతంత్ర్యముగల రాజ్యములని అర్థము. రాజ్యములనేకములుండుటచేత యుద్ధములు సంభవించి శాంతికి భంగము కలుగు ప్రమాదము ఇనుమడించెను. పూర్వము అనేక రాజ్యములు కలిసి ఒక సామ్రాజ్యముగ నేర్పడినప్పుడు శాంతి భద్రతకు ఎక్కువ అవకాశముండెడిది. కాని ఆట్టి కాలపు సామ్రాజ్యములు పాలితులగు ప్రజల శ్రేయస్సును వృద్ధిచేయలేకపోయినవి. స్వతంత్ర రాజ్యముల సంఖ్య వృద్ధి అగుటవలన ఒక విధమగు ప్రమాదమును సామ్రాజ్యముల మూలమున మరియొక విధమగు ప్రమాదమును సంభవించుచున్నవి. ఈ రెండు ప్రమాదములకు అవకాశములేని రాజకీయ వ్యవస్థ ఏదైన కలదా అనుటయే మానవకోటి ప్రస్తుతము ఎదుర్కొనుచున్న క్లిష్టసమస్య.

దీనిని పరిష్కరించుటకు రెండు ఉపాయములను శాస్త్రవేత్తలు సూచించుచున్నారు. మొదటి ఉపాయము : ఐచ్ఛికముగ స్వతంత్ర రాజ్యములన్నియు కలిసిపోయి ఒక ఫెడరల్ వ్యవస్థగా రూపొందుట. రెండవది : రాజ్యముల మధ్య యుద్ధములు సంభవింపకుండ చేయుటకు ఏర్పడిన ఐక్య రాజ్య సమితిని ఇప్పటికంటె పటిష్ఠము కలదిగ నిర్మాణముగావించుట. ఈ రెండింటిలో దేని మానవకోటి అనుసరించునో లేదా, రెంటిని త్యజించి మరియొక నూతన వ్యవస్థనే వాంఛించునో, భవిష్యత్తు నిర్ణయము చేయవలసియున్నది.

మా. వెం.

## సాయణాచార్యులు

పదునాల్గవ శతాబ్ద్యారంభమున మైసూరు ప్రాంతమునందలి ద్వారసముద్రమును రాజధానిగా జేసికొని హొయసలులు దక్షిణాపథమునెల్ల పాలించుచుండిరి. ఆ నాటి పాలకుడు మూడవ బల్లాలభూపతి. ద్వారసముద్రమునకు సమీపముననే కలాపనగరమను నొక గ్రామము కలదు. అందు ధర్మమూర్తియు హొయసల మహారాజులకడ దండనాయక-మంత్రి పదవుల నిర్వహించుచున్న మహాపురుషుల వంశీయుడును అగు సంగమభూపతి యనునాతడు వర్ధిల్లుచుండెను. అతడు చంద్రవంశ యాదవుడు. ఆతనికి హరిహర-కంప-బుక్క-మారప-ముద్దపలను ఏవురు పుత్రులుండిరి. వీరెల్లరు తండ్రిని మించిన సమర్థులు. కనుకనే నాటి పాలకుడగు మూడవ బల్లాలభూపతి వీరియందు మిక్కిలి గౌరవాదరములు గల్గియుండెను. మహమ్మదీయుల వెల్లువ దక్షిణభారతమును సైతము ముంచివేయ సమకట్టిన మహమ్మదీయులను పారద్రోలుటకై తృతీయ బల్లాలుడు సమర్థులైన తత్కార్యనిర్వహణకై తమ యొక్క మండలేశ్వరులుగా నున్న సంగమ పుత్రులను ఆయా ప్రాంతములందు నియమించెను. దక్షిణభారతమునకు హృదయస్థానమనదగిన విజయనగర ప్రాంతమున (విద్యానగరము) హరిహర-బుక్కరాయలను, తూర్పున నెల్లూరునందు కంపరాయలను పశ్చిమమున మారపను నియమించెను. ఈ వీరసోదరులు యవనుల పారద్రోలి రాజులు కట్టిన కోటలై వర్ధిల్లుచుండ విధివిలాసముగ నొక యుద్ధములో రాజగు తృతీయ బల్లాలుడును ఆతని పుత్రుడును దివంగతులైరి. తద్వంశము అంతరించినది. దక్షిణాపథ పాలన-భరణభారము హరిహరాదులపై బడినది. అంత హరిహరరాయలు ఆ హొయసల రాజ్యమునే విజయనగర సామ్రాజ్యముగా రూపొందించి తన నలువురు సోదరుల సాయమున ధర్మజునివలె రాజ్యమేలదొడగెను. నాడు వారి రాజధాని విద్యానగరము (విజయనగరము). ఈ హరిహరుని పరాక్రమమునుగూర్చి బిట్రగుంట శాసనమున

"తత్ర రాజా హరిహరో ధరణీమశిషచ్చిరమ్,
సుత్రామసదృశో యేన సురత్రాణః (సుల్తాన్) పరాజితః"

అనియున్నది. ఈ హరిహరసోదరులు మిక్కిలి వీరులు, ధీరులు, ధార్మికులు, దాతలు, త్రాతలు, యశశ్చంద్రులు

ధర్మమూర్తులగు ఈహరిహరసోదరులు విజయనగరము రాజధానిగా దక్షిణభారతమును ధర్మోత్తరముగా పాలించు సమయముననే పూజ్యులగు సాయణ-మాధవులు విజయనగరమునకు సమీపమున కర్ణాటాంధ్రముల కూడలియొద్ద తుంగభద్రాతీరమునందలి యొక బ్రాహ్మణాగ్రహారమున జన్మించి విద్యామూర్తులై ధర్మమూర్తులై వర్ధిల్లుచుండిరి.

సాయణాచార్యుల-దక్షిణభారతమతపరిస్థితులు -ఆసమయమున దక్షిణభారతములో శైవ - వైష్ణవ - జైన మతములు అహమహమికలతో సాగుచుండెను. అపుడే శ్రీరామానుజులు వైష్ణవమత ప్రచారము కావించుచుండిరి. ఆతరుణముననే శ్రీపూర్ణప్రజ్ఞులు ద్వైతమతమును విస్తరింపజేయసాగిరి. అప్పుడే కాలాముఖవీరశైవమతసహితము తలయెత్తజూచినది. దానిని క్రియాశక్తిస్వామి చేయూతనొసంగెను. లకులీశసంప్రదాయమును ఆనాడే బయలుదేరినది. విక్రమార్కునికి పూర్వమే ఉత్తరభారతములో పుట్టిపెరుగుచున్న జైనమతము నైతము దక్షిణభారతమునకు క్రమక్రమముగా ప్రాకసాగినది. దేశిగణ-మాధనంది - అభయచంద్ర - రామచంద్రమలధారాదులు గ్రంథములను వ్రాసి జైనమును ప్రచారము చేయుచుండిరి. ఈరీతిగా కర్ణాటకదేశము నాడు బహుమతములకు నిలయమైనది. ఆమతములు మెల్లమెల్లగా ఆంధ్ర తమిళదేశములకు వ్యాపింపజొచ్చినవి. ఇకవిశుద్ధహైందవసనాతనమత స్థితి!

మాధవసాయణుల విద్యార్థిదశాసమయమువరకే (పదునాల్గవశతాబ్దిపూర్వభాగము) దక్షిణభారతమున పెక్కుగ్రంథరాజములు సంస్కృతభాషలో వెలసియుండెను. సామవేదసంహితాభాష్యకర్తయగు శ్రీభారతస్వామియు కావ్యప్రకాశమునకు సంప్రదాయప్రకాశిని అను వ్యాఖ్యనురచించిన విద్యాచక్రవర్తియు ప్రతాపరుద్రయశోభూషణకర్తయగు విద్యానాథమహాకవియు రఘువంశాది పంచకావ్యములకు అమూల్యవ్యాఖ్యలు రచించిన పండితప్రకాండుడగు కోలాచల మల్లినాథసూరియు 'లీలావతి'యను ఆఖ్యాయికను రచించిన కన్నడమహాకవి నేమినాథుడును ఆనాటివారే.

ఇట్లనేకమహాకవులు గీర్వాణవాణీమతల్లి నారాధించుచున్న సమయముననే విద్వాంసులై యౌవనారూఢులైన సాయణమాధవులకు విద్యానగరాధీశ్వరులైన హరిహరసోదరుల ఆశ్రయము లభించినది. అది బంగరుకు తావియబ్బినట్లు కామధేనువు కల్పవృక్షచ్ఛాయను చేరుట. అపుడాపండితమండలిలోని సాయణమాధవులు నక్షత్రమండలిలోని సూర్యచంద్రులు.

సాయణాచార్యుని కుటుంబము సాయణాచార్యుని నామము కర్ణాటభాషాసంప్రదాయముననుసరించి సాయణ అని వ్యవహరింపబడుచున్నను సాయన అనునదే ఆంధ్రరూపము. తెనుగువారుచ్చరించు నకారమును ణకారముగా వాడుట కర్ణాటకులకు పరిపాటి. ఉదా - రామణ్ణ గోవిణ్ణ కేశవణ్ణ అనురీతిగా.

ఈయన తండ్రి మాయణ తల్లి శ్రీమతి వీరు ముప్పురు సోదరులు. జ్యేష్ఠుడు మాధవాచార్యులు ద్వితీయుడు సాయణాచార్యులు తృతీయుడు భోగనాథాచార్యులు. భారద్వాజసగోత్రులు. వీరిది కృష్ణయజుశ్శాఖ బోధాయనసూత్రము. అన్న మాధవాచార్యులు మహామనీషి బహుగ్రంథకర్త అపరశంకరుడు. తమ్ముడు భోగనాథాచార్యుడు మహాకవి. సంగమవంశ్యుల ఆస్థానకవిగను నర్మసచివుడుగను ఖ్యాతిగాంచిన ధీశాలి భోగభాగ్యవిలసితుడై కవితారచనాదక్షతచే యశశ్చంద్రికల నలుగడల వెలయించిన కవిచంద్రుడీయన. సాయణుని అలంకారసుధానిధిలో రామోల్లాసము త్రిపురవిజయము, శృంగారమంజరి ఉదాహరణమాల మహాగణపతిస్తవము గౌరీనాథాష్టకము మొదలగు సంస్కృతగ్రంథములను భోగనాథుడు రచించినట్లుదాహరింపబడినవి. ఇందుచే భోగనాథుని రచనలు ఆలంకారికాభిమానపాత్రములనియు ఉత్తమములనియు తెలియుచున్నది.

సాయణాచార్యుని కొకసోదరి కలదు. ఆమెకు లక్ష్మీధరదేవుడు అహోబలపండితుడు అను ఇరువురు పుత్రులుగల్గిరి. వీరిలో తెనుగుభాషకు అహోబలపండితీయమను పేర సంస్కృతమున నన్నయరత్నివళి వ్యాకరణగ్రంథమును వ్రాసిన అహోబలపండితుడు సాయణాచార్యుని మేనల్లుడే. ఈతడు తనవ్యాకరణమున తనమేనమామయగు సాయణుని ధాతువృత్తిని పేర్కొనినాడు.

సాయణాచార్యులకు కంపన మాయణ శింగణలను ముగ్గురు పుత్రులుగలరనియు, వారు వరుసగా సంగీత, సాహిత్య వేదవిద్యలలో గొప్పనిష్ణాతులనియు, అలంకారసుధానిధి మూలమున తెలియుచున్నది.

సర్వదర్శనసంగ్రహకర్తగా ప్రసిద్ధిగాంచిన మాధవాచార్యులును సాయణపుత్రుడగు మాయణుడును ఒకరేననియు, మాయణుని గురువుగా ప్రసిద్ధిగాంచిన 'సర్వజ్ఞవిష్ణువు' స్తుతి సర్వదర్శనసంగ్రహారంభమునందుండుట ఈవాదమును ధృవీక

రించుచున్నదనియు ఒక అభిప్రాయము గలదు ఈ మహిమ భావుని తృతీయపుత్రుడగు సింగణ గొప్ప ధనాఢ్యుడనియు దానకర్ణుడనియు సాయణుని శతపథబ్రాహ్మణ భాష్యమున వ్రాయబడియున్నది ఇట్లు సిరిసంపదలతో విరాజిల్లినది సాయణాచార్యుని కుటుంబము

సాయణుని జీవితక్రమము-పాండిత్యసంపద - సాయణాచార్యులు లోకోత్తరవ్యక్తి సర్వశాస్త్రవేత్త అఖండమేధావి ఇతడు ఈతని జీవితవిధానమే వేరు అదియొక అసాధారణచరిత్ర బాల్యాదిసర్వావస్థలయందును నూతనాదర్శవర్తకుడై మహాపండితుడు ఈతడు క్రీ శ 1315 వ సం లో జన్మించి 1387లో అంతరించినట్లు చరిత్రలు వచించుచున్నవి సమగ్రజీవితము డెబ్బదిరెండు వత్సరములు సాధించిన సారస్వతధర్మకృషి వెయ్యేండ్లది ఎక్కువకాలమును హిందూమతదీక్షా మహాసౌధమునకు మూలస్తంభములైన వేదములకు భాష్యములు రచించుటయందే గడిపెను ఋగ్వేదప్రథమాష్టకభాష్యమును గాంచినచో వ్యాకరణమున అపరపతంజలియని తోచక మానదు వైదికపదముల సిద్ధరూపముల యొక్క ప్రక్రియాదుల చర్చించి నిర్ణయించినరీతి అసాధారణము షట్శాస్త్రములను షడంగములను ఆపోశనపట్టిన అగస్త్యుడీతడు వైదిక ధర్మోద్ధరణకై అవతరించిన కారణజన్ముడు

ఈపండిత వీరుడు విద్యాభ్యాసానంతరము ముప్పదియొక్క సంవత్సరముల వయస్సువరకు కంపరాయలవద్ద ప్రధానమంత్రిగానున్నట్లు నెల్లూరు మండలమునందలి కొడవలూరుశాసనము చెప్పుచున్నది సుభాషితసుధానిధి పీఠికలో పూర్వపశ్చిమసముద్రాధీశ్వర కంపరాయ మహామాత్యసాయణాచార్య' అని వ్రాయబడియున్నది

ఈ బృహస్పతి తొమ్మిదివత్సరములు (1347 నుండి 1356 వరకు) కంపరాయలవద్ద మంత్రిగానుండి రాయలు 1355లో దివంగతుడుకాగా ఆతని పుత్రుడగు సంగముని రాజ్యపీఠమున నిల్పి ఆతనికి విద్యాబుద్ధులు గరపుచు రాజ్యమును పాలించెనట! ఈ మహాపురుషుడు నలువైపుల పదనుగల చతురస్రశస్త్రము

యుద్ధములు-విజయములు కంపరాయల యనంతరము సామంతులెదురు తిరుగగా సాయణాచార్యులు సంగమునిచే దండయాత్రలు కావింపించి సంగరములుచేయించి శత్రువులను సంహరింపచేసి రాజ్యమునకు శాంతిభద్రతలు కల్పించినట్లు శిలాశాసనములు గలవు

విరించిపురము రాజధానిగా నేలిన చంద్రశేఖరుని జయించి విజయలక్ష్మీసమేతుడై సాయణుడు విజయనగరికేతెంచినట్లుకూడ శిలాశాసనములవలన తెలియుచున్నది ఆ విజయానంతరమే ఈమనీషి మేధాశ్వేతరములగు అనేక గ్రంథములను సంస్కృతభాషలో రచించెను అటుపిమ్మట బుక్కరాయలయొద్ద మంత్రిగా చేసినట్లు తెలియుచున్నది ఈ విషయము నెల్లూరి శాసనమున గలదు ఇందుకు రాజకుటుంబమునందు కలిగిన వైషమ్యములో తేటపడు జ్యవిధానము మూలమున బుక్కరాయలకీ పండితునియందు కల్గిన విశేషాదరమో కారణమైయుండునని చరిత్రకులూహించిరి

1364 నుండి 1379 వరకు సాయణాచార్యుడు మొదటి బుక్కరాయలవద్ద మంత్రిపదవి నధిష్ఠించెను ఆ మహారాజు ప్రోత్సాహమువలనే ఆతడు వేదభాష్యరచనకు పూనుకొనెను ఆరాజు ఈ పండితరాజును మంత్రిగనేగాక గురువుగను ఉపదేష్టగను సంభావించి సత్కరించెను ఈ పదారువత్సరముల కాలమే ఈపండితుని విజ్ఞానసస్యముల ఫలించు అమూల్యసమయము కాన సుమారు సాయణుని యేబదివత్సరముల వయసులో వేదభాష్యము లవతరించియుండును

1379వ సం లో బుక్కరాయలు కాలధర్మమందగా అతని పుత్రుడగు ద్వితీయహరిహరరాయలు రాజ్యమునకు వచ్చెను అతనియొద్దకూడ కొంతకాలమీతడు మంత్రిపదవి స్వీకరింపవలసివచ్చినది అప్పుడీ సాయణుని వయస్సు అరువదినాల్గు వత్సరములు ఆ మంత్రిపదవినినీడి శేషించిన వేదభాష్యరచనములో నిమగ్నుడై రెండవహరిహరుని విశేషభక్తిగౌరవములకు పాత్రుడై వైదికసంహితాబ్రాహ్మణములకు భాష్యముల రచించెను ఈ వేదభాష్యము లన్నియు సాయణునిచేకర్తృకములనుట నిర్వివాదవిషయము (1) సుభాషితసుధానిధి (2) ప్రాయశ్చిత్తసుధానిధి (3) ఆయుర్వేదసుధానిధి (4) అలంకారసుధానిధి (5) ధాతువృత్తి (6) పురుషార్థసుధానిధి (7) యజ్ఞతంత్రసుధానిధి అనునవి సాయణుని ఇతర గ్రంథములు వీటిలో చాలవరకు ప్రస్తుతము లభించుచునేయున్నవి

వేదభాష్యములు ఈ అపరవ్యాసుడు చతుర్వేదములకును భాష్యములు రచించెను (1) తైత్తిరీయసంహిత (2) ఋగ్వేదసంహిత, (3) సామవేదసంహిత (4) అథర్వవేదసంహిత (5) శుక్లయజుర్వేదసంహిత (6) శుక్లయజుర్వేద

బ్రాహ్మణ (7) తైత్తిరీయబ్రాహ్మణ (8) తైత్తిరీయారణ్యక (9) ఋగ్వేదబ్రాహ్మణ (10) ఐతరేయబ్రాహ్మణ (11) ఐతరేయారణ్యక (12) సామవేదబ్రాహ్మణ (13) పంచవింశమహాబ్రాహ్మణ (14) షడ్వింశబ్రాహ్మణ (15) శతపథబ్రాహ్మణాది సర్వవేదాంశములకును ఉపనిషత్తులకును భాష్యములు రచించి భారతీయ వైదికవిజ్ఞాన ధర్మములను కరతలామలకములు కావించిన మహోపకారి ఈ సాయణాచార్యులు -

ఇట్లు వైదికధర్మోద్ధరణమే ప్రధాన లక్ష్యముగా సాధించి శ్రీవ్యాసమహామునికృషిని ఫలింపజేసిన ఈ మహామనీషి క్రీ. శ. 1387 వ సంవత్సరమున తన 72 వ యేట కైవల్యమునందినాడు.

మ. స. శా.

## సాళువ నరసింగరాజు

రెండవదేవరాయల అనంతరము చరిత్రనిర్మాణము దుస్సాధ్యమని న్యూనిజ్, అబ్దుల్ రజాక్, ఫెరిష్టా, అల్ బుర్హాన్-ఇ-మాసిర్, ఖర్నెల్ వంటి చరిత్రకారుల పరస్పర విరుద్ధరచనలవలనను డా॥ హెల్ ప్సిచేసిన విగ్రతిపన్న కాలనిర్ణయములవలనను తేటపడగలదు. రెండవదేవరాయల పుత్రుడు మల్లికార్జునరాయలు. ఈ మల్లికార్జునరాయలకొక కొడుకు. అతని పేరుతెలియరాదు. ఈ పేరుతెలియరానివాని పుత్రుడు విరూపాక్షుడు. విరూపాక్షుడు తన ప్రథమపుత్రునివలనను ఆ ప్రథమపుత్రుడు తిరిగి తన తమ్ముడగు పడేరావు (ప్రౌఢరాయ) వలనను హతుడయ్యెను. అప్పుడు సాళువ నరసింగరాజు విజయనగరసింహాసనము నాక్రమించి రాజ్యమును అపహరించినాడనుట చారిత్రకుల సిద్ధాంతము.

మొత్తముమీద రాజమహేంద్రవరము కొండపల్లి ముఖ్యగు రాజ్యములయందు ఘటిల్లిన యుద్ధమును మహమ్మదు గవాను మరణమును దక్షిణాపథము అయిదు చిన్నచిన్న రాజ్యములుగ చీలిపోవుటయు బీజాపురరాజు గోవాను, బెల్గామును ముట్టడించుటయు రష్యను యాత్రికుడగు నికిటిన్ ప్రభృతులనుబట్టి విజయనగరసామ్రాజ్యములోకూడ ఆరాజకపరిస్థితులు తటస్థపడిన నలుబదియేండ్ల కాలమునందు ఆరాజ్యము ఛిన్నాభిన్నమై పెన్నపాలెగాండ్రకు హస్తగతమయ్యెను. ఆనాడు రాజకీయోద్యమములతోడను ప్రజలఅసంతృప్తితోడను పూర్వరాజకుటుంబములందలి పరస్పరవిద్వేషములతోడను, మహాసామ్రాజ్యప్రతిష్ఠితోడను ఆరాజ్యము అట్టుడికినట్లు ఉడికిపోయినది. ఈ పరిస్థితులలో క్రీ. శ. 1487-1490 నడుమ సాళువనరసింగరాజు విజయనగర రాజ్యమును అపహరించెను. అతని రాజ్యాక్రమణ కాలము క్రీ. శ. 1490 అని ప్రామాణిక శాసనాధారములనుబట్టి నిరూపించిన చారిత్రకులును కలరు.

మహమ్మదుషా రాజమహేంద్రవరమును కొండపల్లిని వరంగల్లును వశపరచుకొని తన ప్రతినిధులచే నేలించుచు సాళువ నరసింహునిపై దాడివెడలెను. అప్పటికే సాళువ నరసింహుడు విజయనగరరాజ్యములో ఒక భాగమునకు పరిపాలకుడు. కాని మహామండలేశ్వర మేదినీశ్వరగండన్ కట్టారి సాళువ ధరణీవరాహ నరసింహరాయఉడయార్ వంటి అప్పటి యాతని బిరుదములు మహారాజుల బిరుదములు కావు. ఆదినములలో విజయనగరరాజులకు సామంతుడైన నరసింహుని రాజధాని నేటి కర్నూలుపట్టణమునకు సమీపస్థమైయుండెను. ఫెరిష్టా రచనలనుబట్టి నరసింహుని రాజ్యము కర్ణాటకము తెలంగాణముల మధ్యనిమిడియుండెను (ఆనాడు తురుష్కులు తెలంగాణము అనిపిలుచు దేశము కర్ణాటకములోని భాగమే) సముద్రతీరమున మచిలీబందరువరకు వ్యాపించినది.

సామంతుల తిరుగుబాటునకు భీతిల్లి రెండవవిరూపాక్షుని కొడుకు పడేరావు (మొదటివంశములోనివరివరాజు) రాజధానిని విడిపారిపోగా ఆసామంతులలో నొకడగు (రెండవవంశపు మొదటిరాజు) నరసింహుడు రాజ్యమాక్రమించి విజయనగరమును నలుబదినాలుగేండ్లు పరిపాలించెననియు అతనికి ఇరువురు పుత్రులనియు తనమృతినాటికి ఆపుత్రులిరువురును బాలురగుటచే ఈనరసింహుడు తనమంత్రియగు నరసనాయకునకు రాజ్యముసప్పగించెననియు ఆపిమ్మట నరసింహుని పుత్రులిరువురును హత్యగావింపబడిరనియు న్యూనిజ్ పండితుని పలుకు. సాళువనరసింహుని ఆనలుబదినాలుగేండ్ల పరిపాలనయు కేవలము రాజుగాకాక మంత్రిగా పేరుకెక్కినవాటినుండియు నలుబదినాలుగేండ్లని లెక్క కట్టబడియుండవలయును.

విజయనగరరాజుల రెండవవంశమును నరసింహుని రాజ్యాపహరణము. విజయనగరరాజుల మొదటివంశముతో నరసింహునకుగల బాంధవ్యము చరిత్రకారులకొక తీరనిసమస్యగనే మిగిలిపోయెను. ఇతడు సాళువవంశమువాడు. ఆనాటి శాసనములయందును సాహిత్యమునందును ప్రఖ్యాతులైన యీతనివంశపు రాజులను గూర్చియు, ఈతనివంశీయులగు రాజబంధువులను

గూర్చియు విందుము క్రీ శ 1472–78నాటి ఒక (1396శకాబ్ది) శాసనమును బట్టియు, క్రీ శ 1482–88 నాటి యింకొక శాసనమునుబట్టియు సాళువనరసింహుడు గొప్ప సామంతుడు మాత్రమే అని తెలియవచ్చుచున్నది కాని క్రీ శ 1495–96నాటి యింకొక శాసనమునందు ఇతడు మహారాయ (లేక–మహారాజు) అని వ్యవహరింపబడెను అయినను సింహాసనాపహరణసంవత్సరముగాని అపహారికిని సింహాసనభ్రష్టునకు మగల సంబంధకాలవ్యవధులుగాని స్పష్టముగ తెలియరాకున్నవి నూనిజ్ చారిత్రక వృత్తము డాక్టర్ బర్నెల్ కథనమును బట్టి క్రీ శ 1490 ప్రాంతములో సాళువనరసింహుడు రాజగుటమాత్రము సర్వాంగీకృతము

క్రీ శ 1536 ప్రాంతమునందు (అచ్యుతునిరాజ్యకాలము) తన రచనసాగించి హిందువుల రాజధానియగు విజయనగరములో నివసించి అందే మరణించిన న్యూ నిజ్ రచనలు అహమ్మదాబాదునందు నివసించుచు క్రీ శ 1607వరకును తనరచనను సాగించిన ఫెరిష్టారచనలకంటె విశ్వసనీయములేకాని న్యూనిజు నిబట్టి సాళువ నరసింహుని సింహాసనాధిరోహణకాలము క్రీ శ 1454 అనియనలేము ఏమనగా అది నరసింహుడు మంత్రిగా విజయనగరరాజ్యమున ప్రబలుడైన సంవత్సరము కావచ్చును సాళువనరసింహుని మంత్రియగు నరసనాయకుని కొడుకు భుజబలరావు అరేండ్లు రాజ్యమేలెనట! అట్లయినట్లు క్రీ శ 1509లో శ్రీకృష్ణదేవరాయలు ప్రభువయ్యెను ఇందుచే భుజబలుడు క్రీ శ 1503లో రాజై యుండవలెనుగదా! నరసనాయకుడు ఇరువదేండ్లపాటు ప్రాయశః పరిపాలనముచేసియుండునని మనమూహించిన యెడల క్రీ శ 1483లో అతడు రాజై యుండవలెయును అనగా అది సాళువనరసింహుని మరణకాలము కావున క్రీ శ 1480–83 నడుమ రమారమి ఎనిమిదేండ్లకాలముసాళువ నరసింగరాజు విజయనగర మేలియుండవలెను రివరెండ్ హెరాస్ సాళువనరసింహుని రాజ్యపాలనారంభమును క్రీ శ 1487 గా నిర్ణయించుటయు గమనార్హము

నరసింహుని రాజ్యకాలాదులు—అతనిపరిపాలనము:– క్రీ శ 1489లో యూసఫ్ ఆదిల్ షా తాను బీజాపురమునకు స్వతంత్రప్రభువునని ప్రకటించుకొనెను కొలదికాలములోనే అతనిశత్రువగు ఖాశింబరీద్ తుర్కుకుదకు అహమ్మదాబాదు మండలమునకు రాజై ఆదిల్ షాయందలి యీర్ష్యచే బీజాపురముపై దెత్తిపోవుటకు విజయనగరరాజ్యముప్రాపు కోరినాడు అంతేకాదు కాశిము సాళువనరసింహునకు ముద్గల్లు రాయచూరులను (లేదా కృష్ణాతుంగభద్రమధ్యమండలమును) తిరిగి ఇప్పించగూడ నిశ్చయించెను నరసింహుడు ప్రబల గొందూ సైన్యముతో తుంగభద్రను దాటి ఘోరయుద్ధముచేసి మరల ముద్గల్లు రాయచూరులను విజయనగరరాజ్యమునకు చేర్చి విజయనగరసామ్రాజ్యమును సుస్థిరమొనరించినాడు ఇది క్రీ శ 1493 ప్రాంతకాలమున జరిగియుండును

క్రీ శ 1493 ప్రాంతములో సుల్తాను యూసఫ్ ఆదిల్ కృష్ణానదిని దాటి తాను కోల్పోయిన ముద్గల్లు రాయచూరులను తిరిగి సంపాదింపగల్గినాడు దీనికి కారణము సాళువనరసింహుని యుద్యోగుల అవివేకప్రవర్తనయే కాదు ఆయించిన దేశమును సకాలములో సుస్థిరమొనరుచుకొనలేకపోవుట వారు ప్రజలను దోచుకొనజూచిరి నరసింహుని చెరనుండి తప్పించుకొని పోయిన ఒక తురుష్కోద్యోగి ఆదిల్ షాతో ఈవార్త చెప్పి పునర్యుద్ధమునకాతనిని ప్రోత్సహించెను హఠాత్తుగ యూసఫ్ ఆదిల్ షా తనసేనతో నరసింహునిపైబడి ఆశ్చర్యపరచి ఆతనిని ఓడించినాడు సాళువనరసింహరాజు విజయనగరమునకు పలాయనముకాకతీరలేదు తిరిగి ముద్గల్లు–రాయచూరుమండలము తురుష్కాక్రాంతమైనది గోవా యింతకుమునుపే మహమ్మదీయుల అధీనములోనుండెను

మొత్తముమీద సాళువనరసింగరాజు మహాపరాక్రమశాలి బహుపటిష్ఠదుర్గాధిపతి గజాశ్వపదాతి బలాధికుడు ప్రజానురంజ శీలి తనవంశమువారిలో మిక్కిలి ప్రశావంతుడు: విజయనగరరాజుల రెండవవంశమున రాజ్యవిస్తృతికిని సుస్థిరతకును తీవ్రకృషిసలిపిన రాజశ్రేష్ఠుడు

బొ పు శ

## సావర్కారు

వీరసావర్కారు పూర్తి పేరు వినాయకదామోదర సావర్కార్ వీర అను ఉపపదముతోగూడిన ఈయనపేరు విన్నంతమాత్రముననే స్వాతంత్ర్యప్రియుల రక్తములు ఉద్రిక్తములుగాకయుండవు భారతదేశస్వాతంత్ర్యసంగ్రామయజ్ఞములో ఈతని అధ్వర్యవము అటువంటిది

తరములతరబడిగా తనమాతృభూమి పరపాలనావరిపీడితమగుట చూచి యీతని హృదయము ఇంతగుండె రంపకోతబడెను భారతవీరమాత తన ఆరనిచాస్యవేదనచే ఈతని యువకహృదయమును గాయపరచినది: ఉరుకులెత్తించినది పదునారేండ్ల

ప్రాయమప్పుడే యీయన దుర్గాదేవివిగ్రహముముందు భారత స్వాతంత్ర్యసాధకుడై వీరశపథము చేసినాడు. ఇరువది రెండవయేట పూనానగరములో విదేశీ వస్త్ర బహిష్కార సందర్భమునందు ఈతడు చేసిన మహోపన్యాసము అనర్గళమును అమోఘమైన విదేశీవస్త్రదహనోద్రిక్తులను గావించెను. ఆనాటి భారతస్వాతంత్ర్యోద్యమ ప్రథమదశలో సావర్కారు ప్రభావము అడుగడుగునను అగుపడగలదు. తన త్యాగశీలమే యీతనికి వీర సావర్కారు అనెడి పేరును సార్థకపరచెను. ఆ పేరే యెల్లరకును ఉత్తేజకరమై యెల్లరను ప్రభావితులై రి.

సభ్యులను ఉద్రేకపరచి ఉద్రిక్తులను చేయగలిగెడి ఈతని వాక్చిత్ర పాటవము ఉత్తేజపరచునది ఈతని రచన. ఈయన గొప్ప సంఘసంస్కర్త, నాటకకర్త, కవి, నవలాకారుడు, చరిత్రకారుడు. ప్రతిభారచయితయుకూడ. కౌమారమునందే విప్లవోద్యమనాయకుడైనందులకు ఆపిమ్మట యీతడు పడని బాధలు లేవు. కడచూడని కడగండ్లు లేవు.

బాల్యము - విద్యాదులు — మహారాష్ట్రదేశములో వీరులకు ప్రఖ్యాతిగన్నది నాసిక్ మండలము. అందు 1883 మే 28వ తేదీ నాడు భాగూరు అనెడి గ్రామములో సావర్కార్ జన్మించెను. నాసికయందు ప్రవేశపరీక్ష ముగించుకొనిపిమ్మట ఫెర్గుసన్ కళాశాలలో ప్రవేశించినాడు. అక్కడనే ఒకవిద్యార్థి సంఘమును స్థాపించెను. ఆసంఘ సభ్యులు "స్వదేశస్వాతంత్ర్యము నిమిత్తమై ప్రాణార్పణమైన చేసెదమని అందరును ప్రతిబూనినవారు. పిదప 1904 నందు రెండువందలమంది అనుయాయులతో అభినవభారత్ అను విప్లవసంస్థను సావర్కారు నెలకొల్పినాడు. అప్పటికింకను పట్టభద్రుడైనవాడు కాలేదు. ఆవశ్యకమగుచో ఆయుధధారణచేసియైన భారతదేశస్వాతంత్ర్యమును సంపాదింపవలెయునన్నది ఆసంస్థకు లక్ష్యము. 1905లో పట్టభద్రుడైపిమ్మట ఈతడు బొంబాయిలో న్యాయశాస్త్రవిద్యయభ్యసనకు పూనుకొనెను. ఆ దినములలో విహారి అనెడి పత్రికయందు తనవ్యాసములను ప్రకటించెడివాడు. ఆ నాటికే మహారాష్ట్రములో విప్లవోద్యమము వేరుదన్నినది. దానికి నాయకుడుగా వీరసావర్కార్ సర్వేసర్వత్ర గుర్తింపబడెను.

విదేశములో విద్యాదికము — 1906లో సావర్కార్ శ్రీ శ్యామ్‌జీకృష్ణవర్మ వేతనమునొంది బారిష్టరుపరీక్షకు చదువుటకై లండను తరలిపోవుట జరిగినది. ఈతనికి ఈ ఉచితవేతనము లభించుటకు తోడ్పడినవారిలో లోకమాన్య బాలగంగాధర తిలక్‌నకుగూడ ప్రముఖపాత్రకలదు. అప్పటికే లండననందలి ఇండియాహౌసులో హోమ్‌రూల్ సొసైటిని స్థాపించి భారతదేశస్వాతంత్ర్యమునుగురించి ఆందోళన జరుపుచుండిన శ్యామ్‌జీ కృష్ణవర్మ సావర్కార్ దేశభక్తిచే ఆకర్షింపబడి యీతని అభినవభారత్ లో చేరి తదనంతరము ఈతనికే ఇండియా హౌస్ అధ్యక్షపదవినంతయు అప్పగించి తాను పారిస్ నగరము చేరెను.

పిమ్మట సావర్కార్ లండనులో ఫ్రీఇండియాసొసైటీని నెలకొల్పి దానిమూలమున తన అభినవభారత్ సంస్థకు సభ్యులను సంపాదింపజాలెను. ఆసొసైటీయందుచేరి తదనంతరము మహాప్రసిద్ధులైనవారిలో మేడం కామా ఒకమహిళ. 1907నందు జర్మనీలో సామ్యవాదుల సభలుజరిగిన సందర్భమున భారతజాతీయపతాకను మొదటిసారిగ ఆవిష్కరించిన గౌరవము ఈ మేడమ్‌కామాకు లభించినది.

1857నాటి భారతస్వాతంత్ర్య ప్రథమ సంగ్రామమును సిపాయికలహము అను పేరిట కించపరచుచు అందు తమరు సాధించిన విజయమునకు వార్షికోత్సవము జరుపుకొనుచు (1907 మే నెల) ఆకలహమునకు కారణభూతులైన నానా సాహెబ్ ఝాన్సీలవంటివారిని బందిపోటుదొంగలుగా చిత్రించుచు బ్రిటిషుప్రభుత్వము విర్రవీగుచుండెను. అప్పుడు వీర సావర్కారు దానికి ప్రతిగా భారతస్వాతంత్ర్యసమరస్వర్ణోత్సవములు అను పేరిట 1907 మే 10వ తేదీని సభలు జరిపించినాడు. సావర్కారు యాజమాన్యమున లండనులోని భారతీయులందరును ఆనాడు ప్రత్యేకమైన బాహుబంధములు ధరించి ఉపవాసముండి 1857 విప్లవ మృతవీరులందరకును జోహార్లు సమర్పించినారు.

ఆ తరువాత సావర్కారు "భారతస్వాతంత్ర్యప్రథమ సంగ్రామము" అను మహాగ్రంథమును మొదట మరాఠీ భాషలోను పిదప ఆంగ్లములోను రచించెను. ఆంగ్లప్రభుత్వము దాని ముద్రణమును నిషేధించినది. అందుచే దాని ఆంగ్లానువాదము హాలెండులో ముద్రితము కావలసివచ్చెను. ఆ దేశమువారు దానిప్రతులను 'డివర్‌క్యాన్వ్' 'సర్ వాల్టర్ స్కాట్', 'ఎక్ పేపర్స్' అని మారుపేర్లుగల కాగితపు సంచులలో పెట్టి భారతదేశమునకు చేరవేసిరి. అయ్యదియు అనూదితప్రతి బహిష్కృతమగుటచే పాఠకుల ఆసక్తి పెరిగి వ్రాతప్రతి యీ దేశమున రహస్యప్రచారము నందుచుండెడిది.

అందలివాక్యములు ఆనాడు యువకవిద్యార్థులను ఉద్రేకపరచినవి భారతస్వాతంత్ర్యానంతరమే ఆ గ్రంథముపై గల నిషేధాజ్ఞలును ఆంక్షలును తొలగిపోవగలిగెను లండను నందుండగనే దేశదాస్యవిమోచనమునుగురించి సావర్కారు గాంధి మహాత్మునితో చర్చించెను కాని వారిరువురి నడుమను విధానములలో విభేదములేర్పడి అవి చివరివరకును సమసిపోలేదని తజ్జ్ఞులు చెప్పుదురు

**విప్లవభావములు — సాహసకార్యములు** — సావర్కారు విప్లవవిధానము ఆంగ్లప్రభుత్వమును అలజడిపరచెను తాను రాజకీయములలో పాల్గొననని ప్రభుత్వమునకు లిఖితపూర్వకముగ మాట యీయనికారణముచే ఈయనకు బారిష్టరు పట్టము లభింపలేదు 1910లో అహమ్మదాబాదునందు వైస్రాయి లార్డ్ మింటోపై ఎవరో ఒకబాంబు విసరిరని సావర్కారు తమ్ముడగు నారాయణుని అండమలో నున్న సావర్కారును బ్రిటిషుప్రభుత్వము నిర్బంధములోనికి తీసికొన్నది 1910జూలై 8వ తేదీన తన్ను లండనునుండి ఎస్ ఎస్ మోరే అను నౌకమీద భారతదేశమునకు తీసికొనివచ్చుచుండగా సావర్కారు మార్సెయిల్స్ రేవు సమీపమున నౌకనుండి సాహసించి సముద్రములోనికి దుమికి యీదుకొనుచు తీరముచేరి ఐదువందలగజములు ఫ్రెంచిభూభాగముపై పరుగెత్తినపిమ్మట ప్రభుత్వరక్షకభటులు శతఘ్నులవర్షమును కురిపించుచు అతని నెట్టకేలకు పట్టుకొనిరి సావర్కారును తప్పింపదలచి ప్రయత్నించిన మేడంకామా శ్రీఅయ్యరులు మార్సెయిల్స్ రేవు చేరుకొనుటకు కొంచెము ఆలస్యమయ్యెను అట్లుకానిచో ఈతడు బ్రిటిషువారికి చిక్కెడివాడేకాడు ఈతని యీసాహసకృత్యము యావద్భారతావనిని సంభ్రమమొనర్చినది ప్రజలెల్లరు ఈయనకు వీరపూజలొనర్పసాగిరి మార్సెయిల్సునుండి బ్రిటిషుప్రభుత్వము వెంటనే యీయనను బొంబాయికి తీసికొనివచ్చి ప్రత్యేకన్యాయస్థానమున మున్నూరు విచారణ సలిపి యేబదియేండ్లపాటు ద్వీపాంతరవాసశిక్ష విధించినది

**యావజ్జీవకారాగారశిక్ష** — విద్యాభ్యాసమునకై విదేశములకు పోకపూర్వమే యీయనకు వివాహమయ్యెను సామ్రాజ్యవాదప్రభుత్వ మీయనను అండమానుద్వీపములకు పంపునప్పుడు ఈయనను చూచుటకై భార్యకు అనుమతి నొసగినది ఆట్టికష్టదశలలో నిగ్రహశక్తిని చూపగల్గుట యీయనకు పరిపాటి అంతేకాదు సావర్కార్ అనగా అండమాను దీవులలో చెరయందుండగా ఒకగట్టిముల్లు సంపాదించి దానితో చెరసాలగోడలపై 'పానిపట్టుయుద్ధము' నుగురించి పదివేల పంక్తులు రచించి ఆకావ్యమును కంఠపాఠముచేసిన మేధావి కూడ ఈయన బంధవిమోచనమునుగూర్చి భారతీయు లెన్నియో ప్రయత్నములుచేసిరి ప్రభుత్వము కట్టకడకు ఈయనను ఈయనఅన్నగారగు గణేశసావర్కారును భారతదేశమునకు తీసికొనివచ్చి రత్నగిరిచెరసాలలోనుంచినది కొన్నాళ్లకు వినాయకసావర్కారును విడుదలచేసికూడ రత్నగిరిపట్టణము దాటరాదనియు రాజకీయములలో పాల్గొనరాదనియు ఆంక్షలు విధించినది

**సంస్కరణోద్యమము** — రత్నగిరి' లోనున్నప్పుడే యీయన హిందూమతమునందు జరుగవలసిన సంస్కరణములనుగురించి పెక్కువ్యాసములను పత్రికలలో ప్రకటించెను 1937లో భారతదేశమున కాంగ్రెసుప్రభుత్వము లేర్పడినవి అప్పుడీతనిపైగల నిర్బంధాజ్ఞలు తొలగిపోయెను తరువాత హిందూమహాసభాధ్యక్షుడుగాకూడ ఇతడు ఎన్నికయైనాడు గాంధి మహాత్ముని హత్యాభియోగమునందు ఈతడు భారతప్రభుత్వముచే చెరలో నిర్బంధింపబడుట మిక్కిలి దురదృష్టకరమైన సంఘటన "నేనుకూడ దేశభక్తుడనే! మహాత్ముని హత్యచేయు సంతతి నీచదశకు నేను దిగజారలేదు" అనివాఙ్మూలమిచ్చుచు ఈతడు కన్నీరుగార్చినప్పుడు తీవ్రవేదనతో దుఃఖింపని భారతీయుడులేడు ఈతని ప్రజానురంజనమట్టిది కాకున్నచో ఈతని మార్గమీకనిది అది విప్లవమార్గము

**చరమదశ** — 1948నుండి యీతని ఆరోగ్యము అస్తవ్యస్తమగుచువచ్చెను దీనికితోడు మహాత్మగాంధిహత్యతో ఈయనకు సంబంధమున్నదని అపోహపడినవారిలో అల్పులు కొందరుఈయనపై దాడులుసలిపి దౌర్జన్యము చేయసాగిరి దానితో ఈయన ఆరోగ్యస్థితి మరింతగాక్షీణించినది చివరకు 1966ఫిబ్రవరి26నాడు ఈయన పరమపదించెను అప్పటికి సావర్కారునకు 83ఏండ్లు ఈయనమృతితో స్వదేశభక్తులయు, స్వాతంత్ర్యసమరయోధులయు ఆకాశమునుండి ఒకమహోజ్జ్వలతార నేలకు రాలిపోయినది

ప్రపంచ స్వాతంత్ర్యోద్యమముల సువర్ణ చరిత్రలో వినాయకసావర్కారునకు ఒక ప్రకరణము ప్రత్యేకింపబడగలదు సైమన్‌బోలివార్ మాజిని గారిబాల్డి డివెలరా ప్రభృతి మహాయోధుల సమీపమున ఇతనికి స్థానము లభింపగలదు ఇది నిస్సందేహము దేశ - ప్రాంతీయ - పక్ష - విభేదములకు అతీతుడై యెల్లరిగౌరవాంజలికిని అర్హత సంపాదించుకొన్న మహనీయుడు వినాయకదామోదరసావర్కారు

బి వి కె శ

## సింహళము (భూ)

సింహళద్వీపము భారతదేశపు దక్షిణాగ్రమునకు దక్షిణ దిశయందున్నది ఇది ఒకప్పుడు భారతదేశాంతర్భాగముగ దానిలో కలిసియుండెడిది ఈద్వీపవైశాల్యము మద్రాసు రాష్ట్రవైశాల్యములో దాదాపు సగముండును-అనగా 25 000 చదరపుమైళ్లు ఈద్వీపమధ్యమున పర్వతపంక్తులును వాటి పరిసరములందు విశాలమైన తీరమైదానములును ఆవరించి యున్నవి ద్వీపమధ్యమునందుగల పర్వతములలో అత్యున్నతమైనదాని ఎత్తు 8000 అడుగులు మన్నార్ అనుసింహళ ద్వీపపు ఉత్తరాగ్రము భారతదేశపు దక్షిణకొనయందున్న ధనుష్కోటికి 22 మైళ్లదూరముననున్నది దక్కనుపీఠభూమి యందువలెనే సింహళద్వీపమందలి పర్వతములు ప్రాచీనములైనవి స్ఫటికాకృతి ధరించిన ఈశిలలు కఠినముగనుండును ఇట్టిశిలలు తీరమైదానపు ఉపరితలమునకు క్రిందుగాకన్పట్టును ఉపరితలమంతయు దట్టమగు ఎర్రని ఒండుమన్నుచే కప్పబడి యుండును పూర్వమీఉపరితలముపైగల స్ఫటికశిలలు వర్షాఘాతముచే క్రమముగా మెత్తనై చిల్లులుపడి గోధుమవర్ణమునకు తిరిగెను ఉత్తరసింహళమునందు ప్రాచీనకాలము నందేర్పడియున్న శిలాసమూహము లీనాడు మెత్తనిసున్నపురాయిచే ఆవరింపబడియున్నవి తీరముచుట్టును అనేకభ్యాకముగ ఇసుకరాయి ఆవరించియున్నది ప్రాచీన శిలాస్ఫటిక భాగమంతయు రత్నమాణిక్యాది అమూల్యసంపదకును గ్రాఫైటుఖనిజనిక్షేపమునకును ఈనాడు ప్రసిద్ధిబడయుచున్నది

సింహళములో విశేషభాగము భారతదేశములోని దక్షిణప్రాంతముకంటెను భూమధ్యరేఖకు సన్నిహితముగనున్నది సముద్రముచే పరివేష్టింపబడియుండుటచే ఈద్వీపమందలి వాతావరణాదులు అత్యంతానుకూలములుగనుండును శీతోష్ణస్థితివిషయములో రాత్రింబవళ్ల నడుమ భేదమంతగా కన్పట్టదు రాజధానియగు కొలంబోయందు శీతోష్ణస్థితి 7డిగ్రీలసెంటిగ్రేడునందుండును జనవరినెల అత్యంతశీతలముగను (27 డిగ్రీలసెంటిగ్రేడు) మేనెల అత్యంత ఉష్ణముగను ఉండును కాని కొలంబోలో పైరెండుకాలములకును నడుమ మూడు డిగ్రీలసెంటిగ్రేడు మాత్రము భేదము కన్పట్టును ఈద్వీపమునకు నైరృతి ఈశాన్య ఋతుపవనములవలన వర్షములు ఘటిల్లును నైరృతిఋతుపవనములచే పశ్చిమప్రాంతమునందును నైరృతితీరమండలమందును పర్వతములపైనను వర్షపాతమధికముగనుండును అట్లే సంవత్సరాంతమున ఈశాన్యఋతుపవనముల ప్రభావముచే ఈశాన్యతీరమండలమందును పర్వతములయొక్క తూర్పు కనుమలయందును అధికవర్షములు కురియును ఉత్తర ప్రాంతమందుగల శుష్కభూమియందును ఆగ్నేయప్రాంతమందును కొండలు లేకుండుటచే వర్షములుండవు సింహళము విశేషవైశాల్యముగల ద్వీపము కాకున్నను అందలిశీతోష్ణవాతావరణములలో వైవిధ్యమున్నది

శీతోష్ణవాతావరణాదులయందుగల వైవిధ్యమువలెనే సింహళద్వీపమందలి సహజోద్భిజ్జసంపదయందుకూడ వైవిధ్యము గోచరించును పూర్వము సంవత్సరముపొడవున పర్వతములపై చూడముచ్చటగొల్పు అరణ్యములు ఛేదింపబడి వాటి స్థానములో రబ్బరుతోటలు ఇతరవనములు నాటబడుటచే, ఈ నాడచ్చట విలువగల కలపవృక్షములంతగా కానరావు పల్లపు భూములలో విశేషభాగమీనాడు వరిపంట, కొబ్బరితోటలచే ఆవరింపబడియున్నవి మెరకప్రాంతములలో ఇంకను సాగు చేయుటలేదు మొత్తముమీద సింహళములోసుమారు ఐదవ వంతుభూమి మాత్రమే ఫలవంతముగనున్నది ఐదవవంతుభూభాగమును సాంద్రారణ్యములాక్రమించియున్నవి

జనసంఖ్య :- సింహళద్వీపజనసంఖ్యదాదాపు 85 లక్షలు వీరిలో ముఖ్యులు సింహళజాతీయులు వీరిపూర్వీకులు 2000-3000 సంవత్సరముల క్రిందట భారతదేశపు ఉత్తరప్రాంతము నుండ సింహళముపై దండెత్తి దానిని జయించిరట ! మతరీత్యావీరు బౌద్ధులు; భారతదేశమునుండి పూర్వము విశేతలుగా వచ్చిన తమిళపాలకవర్గవంశీయులును, ఇటీవల రబ్బరుటీతోటలలో పనిచేయుటకు వచ్చిన తమిళకార్మికులును ఉత్తరసింహళములో నివసించుచున్నారు వీరుకాక ఉత్తరాఫ్రికానుండి ప్రప్రథమముగ వచ్చిచేరిన ముస్లిమువ్యాపారులును కాలిక

లును క్రైస్తవులును నివసించుచున్నారు. పర్వతప్రాంతములలో “వెడ్డలు” అను అతిప్రాచీన జాతులవారు కొలదిగ నివసించుచున్నారు. నిస్సారమగు ప్రాగుత్తర ప్రాంతములందుకూడ ప్రజలు కొలదిగ నివసించుచున్నారు.

సహజమండలములు. — ఈ చిన్నదేశమును మూడు సహజమండలములుగా విభజింపవచ్చును (1) దేశమధ్యమునందు వెయ్యిఅడుగులఎత్తునకు పైగాగల పర్వతమయప్రాంతము (2) తూర్పు దక్షిణ పశ్చిమతీర మైదానప్రాంతము (3) ద్వీపపు ఉత్తరదిశాగ్రమందు సున్నపురాయిగనులచే ఆక్రమింపబడిన ప్రాంతము.

పర్వతప్రాంతము. — ఈమండలము కొండలవరుసలతోడను నడుమనడుమలోతైనలోయలతోడను మైదానములతోడను విస్తరింపబడియున్నవి. ఇరోపియనులిచ్చట రబ్బరు మొదలైన తోటలు నాటుటకు పూర్వముండిన అరణ్యములు ఎమ్మట ఛేదింపబడినవి. ఈమండలములో విశేషభాగమునందు వారములకొలది మెండుగా వర్షములు కురియును. ఇందు ముఖ్యముగ పశ్చిమభాగమున రబ్బరు మొదలైన తోటలున్నవి. పర్వతపార్శ్వభాగములను చదునుచేసి అందు వరిధాన్యమును పండించుచున్నారు. పూర్వమువలె కాఫీతోటలిప్పుడు విరివిగా పెంచబడుటలేదు.

ప్రాచీనరాజధానియగు కాండీనగర మీమండలమునందున్నది. కొలంబోనుండి 72 మైళ్లదూరమునగల ఈనగరమునకు కొండపైగల రైలుమార్గముద్వారా ప్రజలు ప్రయాణించుచుందురు.

తీరమైదానప్రాంతము — పర్వతప్రాంతముచుట్టును సముద్రమట్టమునకు వెయ్యిఅడుగులయెత్తుగల విశాలమైదానములు కలదు. ఇది భూగర్భమున కప్పబడియున్న ప్రాచీన కఠిన శిలా ఖండములపై బురద మన్ను మందముగా పేరుకొనియున్నది. భారతదేశపు పశ్చిమతీరమునందువలె ఇచ్చట ఉప్పునీటిసరస్సులు కలవు. ఈతీరమైదానపు శీతోష్ణస్థితి అడుగడుగున భేదించుచుండును; కాగా ఆగ్నేయభాగమున వర్షములు కురియవేకురియవు. తూర్పుప్రాంతములో ఈశాన్యఋతుపవనములవలన విశేషముగా నవంబరు డిసెంబరు నెలలలో వర్షములు పడును. వర్షములు కురియు పల్లపుప్రాంతములో జనసమ్మర్దము అధికముగనుండి ముఖ్యముగా నైఋతి పశ్చిమప్రాంతములో విశేషభూభాగము సేద్యముచేయబడుచున్నది. సమతలప్రదేశములందును లోయలయందును ఏడాదికి రెండు పంటలు పండుచున్నవి. ప్రతి వ్యవసాయదారుడు తన భూమియందు కొబ్బరితోటలు మామిడితోటలు పనస తోటలు, మిరియపుతోటలు పెంచుకొనుచున్నాడు. కొండప్రాంతమందలి న హద్దునందు రబ్బరు టీతోటలు పెంచబడుచున్నవి. తీరమండలమందంతట కొబ్బరితోటలు విస్తరించియుండును. కొబ్బరితోటలకు సంబంధించిన పరిశ్రమలలో అధికసంఖ్యలో కార్మికులు పనిచేయుచుందురు. ఈద్వీపమునందు విరివిగా పండు యాలకులు లవంగములు మొదలైన సుగంధద్రవ్యములు విదేశములకు విశేషముగా ఎగుమతిచేయబడును.

తీరప్రాంతమంతట చేపలపరిశ్రమ ప్రధానమైనదిగనున్నది. రాజధానియు ప్రధాన సముద్రపురేవును అయిన కొలంబోనగరము పశ్చిమతీరమందున్నది. ఈనగరము ఐరోపానుండి దూరప్రాచ్యమునకు పోవు మహాసముద్రమార్గముమీద నున్నది. ప్రపంచమందలి ప్రధానసముద్ర మార్గములలో కొలంబో ఒక కూడలిగనున్నది. ఇచ్చటినుండి ముఖ్యమైన వ్యాపారమార్గములు సింగపూరునకును చైనాకును సాగిపోవుచున్నవి. కొన్నిశాఖలు మద్రాసు కలకత్తా రంగూను, ఆస్ట్రేలియాలకు పోవుచున్నవి.

ఉత్తరమైదానము — ఉత్తరమైదాన ప్రాంతమంతయు సున్నపురాతి నేలచే ఆక్రమింపబడియున్నది. సముద్రమట్టమునకది 200-300 అడుగుల యెత్తునపైగ ఈమండలము ప్రకాశవంతమైన ఎర్రనేలచే ఆవరింపబడియున్నది. చిరుఅడవులతో నిస్సారమైన ఈ ప్రాంతమందు సాలుకు 40 అంగుళముల వర్షపాతము ఘటిల్లుచున్నది. విశేషముగా ఇచ్చట తాటి ఈతజాతిచెట్లు పెరుగును. జాఫ్నానగరము ఇచ్చట ప్రధానమైనది. ఉత్తరమునందున్న తలైమన్నార్ నుండి పొగఓడలు ప్రతిదినము ధనుష్కోటికి ప్రయాణమైపోవుచుండును. ఉత్తరసింహళమొకప్పుడు గొప్పసామ్రాజ్యమునకు ప్రధానకేంద్రస్థానమైయుండెనట! అచ్చటి అరణ్యములలో నేటికిని ప్రాచీననగరముల శిథిలావశేషములు కన్పట్టును. 1930 లో ఈప్రాంతమంతటిని సింహళప్రభుత్వము మరమ్మతుచేసి వ్యవసాయమునకును పరిశ్రమలకును అనుకూలమైనదిగ చేసెను.

సింహళములో అందమైన చెక్కరోడ్డుగహదారులు గలవు. ఇవన్నియు ప్రధానమయిన రైల్వేమార్గములతోను, రాజమార్గములతోను కలుపుచున్నవి. ప్రయాణసౌకర్యములు

కును వరకులగవాణాకను మోటారువాహనములు ట్రక్కులు ఉపయోగింపబడుచున్నవి. బర్మావలెనే ఈదేశము ప్రధానముగా తేయాకు కొబ్బరికాయలు కొబ్బరినారసరకులు రబ్బరు మొదలైనవాటిని విదేశములకెగుమతిచేయును. సింహళద్వీపము యొక్క జనసంఖ్య స్వల్పమైనను వారికి సరిపోవు ఆహారపదార్థములు కూడ ఆదేశములో ఉత్పత్తియగుటలేదు. అందుచే ముఖ్యముగా బర్మానుండి ఈదేశము చాలినన్ని బియ్యమును దిగుమతిచేసికొనుచున్నది. కొలంబోరేవుపట్టణము సువిశాల మహాసముద్రమార్గముల నడుమనుండుటచే అది వాణిజ్యరీత్యా ప్రాముఖ్యము గాంచియున్నది. భారతదేశములోని ప్రతి ఒక్క నౌకాస్థావరమునకు వచ్చు ఓడలకంటెను కొలంబోరేవుకు వచ్చిపోవు ఓడలసంఖ్య అధికముగనుండును.

ఎ. వి.

## సింహాద్రి క్షేత్రము

నృసింహస్వామిక్షేత్రములు ఆంధ్రప్రాంతమున నున్నంత విరివిగా ఇతర రాష్ట్రములలో లేవనియే చెప్పవచ్చును. సింహాచలము అంతర్వేది మంగళగిరి వేదాద్రి అగిరిపల్లి అహోబిలము మొదలగునవి ఆంధ్రప్రాంతమందలి సుప్రసిద్ధ నరసింహక్షేత్రములు. తెలంగాణమునకు చెందిన వేల్పుకొండ యాదగిరిగుట్టలు మున్నగు ప్రఖ్యాతవైష్ణవక్షేత్రములు ఈస్వామి కొరకు ప్రతిష్ఠింపబడినవి.

జలనరసింహ ఉగ్రనరసింహ లక్ష్మీనరసింహ జ్వాలానరసింహ బిలనరసింహ వరాహలక్ష్మీనరసింహ అను సంకేతములు ఆయా ప్రత్యేక యాత్రాస్థలములందు స్వామికి పెట్టిన పేర్లు. దశావతారావిర్భూతుడైన నరసింహునకు విష్ణులాంఛనములైన శంఖుచక్రములమర్చబడి యుండును.

సింహాచలక్షేత్రము విశాఖపట్టణమునకు ఉత్తరదిశగా 10 కిలోమీటర్లదూరమున నున్నది. పూసపాటి విజయనగరాధీశ్వరులు ఈ ఆలయమునకు ధర్మకర్తలు. సముద్రమట్టము

చిత్రము - 98



సింహగిరి ఆలయ క్షేత్రము

నకు 800 అడుగుల ఎత్తైన కొండమీద ఈ దేవాలయ నిర్మాణము జరిగినది కొండ ఎక్కుటకు సువిశాలమగుసోపానములు నిర్మింపబడినవి ఈఆలయరక్షణకు చుట్టును బురుజులతోకూడిన శిథిలప్రాకారము అందుప్రవేశించుటకు హనుమాన్ పేరుతో ఒక ద్వారమును ఏర్పడియున్నవి చూపరులను చకితులను చేయు ప్రకృతిరామణీయక దృశ్యములిచట ఇంపుగొలుపుచుండును

పురాణకథననుసరించి ఈ దేవాలయము ఆంధలిమూర్తి, భక్తాగ్రేసరుడగు ప్రహ్లాదునిచేస్థాపింపబడినది హిరణ్యకశ్యపుడు విష్ణుభక్తుడగు ప్రహ్లాదుని సముద్రమున కూలద్రోసి పెద్దకొండను ఆతనిమీద బరువుగా పెట్టినట్లును ఆశిలను నరసింహస్వామి కదల్చి బాలుని రక్షించి రౌద్రుడై హిరణ్యకశ్యపుని అచటనే హతమార్చినట్లును 'స్థలమహాత్మ్యము నందు చెప్పబడినది ఇచ్చట వైశాఖశుద్ధతృతీయదినమున చందనయాత్ర జరుగును ఆంధ్రదేశములో పలుప్రాంతములనుండియేగాక అన్యరాష్ట్రములనుండియు వేలకొలది యాత్రికులు సింహాచలక్షేత్రమును దర్శించెదరు

ఈ క్షేత్రమునకుచెంది కాలగర్భమున కలిసిపోయిన అనేకాంశములు ఇచటలభ్యమైన శాసనములవలన తెలియవచ్చినవి నరసింహనాథుని అంగరంగభోగములకు కళింగాధిపతులైన గజపతిగాంగేశ్వరులు మత్స్యవంశీయులు నాగవంశోద్భవులు తమ దేవేరులతోసహా అనేకదానములు చేసిరి ఒకప్పుడు ప్రాచ్యాంధ్రము కళింగాధిపతుల ఏలుబడిలోనుండి త్రికళింగశబ్దోత్పత్తిని పొందినది ఈభూభాగమందలి జంతురునాడుసీమ ఒడ్డాదిసీమలలోని పెక్కుగ్రామాదాయములు నరసింహనాథునిసేవకు కల్పితమైనవి కళింగదేశచరిత్ర నిర్మాణమునకును, పరిశోధనమునకును ఇచటి శాసనములెంతయు ఉపయుక్తములు

కృష్ణదేవరాయలు తన పూర్వదిగ్జైత్రయాత్రా సందర్భమున శక సం॥ 1438 (ధాత సంవత్సర చైత్ర బహుళ ద్వాదశిరోజున) ఈ మహాక్షేత్రమున రాణులగు చిన్నమ్మ తిరుమలదేవమ్మలతో సందర్శించి నరసింహనాథునకు సేవలు చేయించిరి రాయలు తన తల్లిదండ్రుల (నాగాంబిక, నరసరాజు) పుణ్యముగా స్వామికి కంఠమాల ముత్యములు, వజ్రమాణిక్యముల కడియాలజోడు శంఖచక్రాదులు, పతకము పైడిపళ్లెము మొదలుగాగల ఆభరణములను సమర్పించెను

తిరిగి అతడు శక సం॥ 1448 లో సింహాచలస్వామిని దర్శించి శ్రీవారి భోగములకు ప్రతాపరుద్రగజపతినుండి కొనిన కళింగదండతోపాటు కొన్ని గ్రామములను దానమిచ్చినట్లు శాసనాధారములు కలవు ఆదేసమయమున భీమునిపట్నం తాలూకాలోని పొట్నూరునకు సమీపమున దిగ్విజయస్తంభమును రాయలు నెలకొల్పెను

అక్కారాయనింగారు గోలుకొండ కులీకుతుబ్షాతరపున ముకుంద బాహుబలేంద్రుని జయించిసింహాచలస్వామినిదర్శించి అచట ఒక శాసనమును శక సం॥ 1528 లో వేయించెను

పదునెనిమిదవ శతాబ్దమున గోగులపాటి కూర్మనాథుడను కవిభక్తుడు సింహాద్రినారసింహశతకమును రచించెను ఈ శతకరచన ఆంధ్రవాఙ్మయమునందు గొప్ప విశిష్టతనందుకొనినది ఇందు చారిత్రకాంశములు పొందుపరుపబడినవి ఈయన కాలమున పిండారీదండు దేవాలయమును కొల్లగొనుటకు వచ్చుటయు వారిబారినుండి రక్షింపుమని నృసింహనాథుని ఈ మహాకవి పద్యరూపములో ప్రార్థించుటయే తడవుగా వేలకొలది గండుతుమ్మెదలొక్కుమ్మడి తండోపతండములుగా వచ్చిదుండగులనుతరిమికొట్టి ఒకకొండబిలములో దాగినవనియు తదాదిగా ఆకొండ తుమ్మెదలమెట్ట యని ప్రఖ్యాతిపొందెననియు ఒకగాథ ప్రచారములోనున్నది

వినోదపర్యాటకులకు భక్తమహాజనులకు చారిత్రక పరిశోధకులకు సింహాచలక్షేత్ర మొక అద్వితీయ సాగరసంగమము వంటిది

కొ వెం

## సిడ్నీ - బీట్రిస్ దంపతులు

సామాజికశాస్త్రముల పరిశోధనయందును సృజనాత్మక స్వతంత్ర రచనావ్యాసంగమునందును దీక్షాదక్షతలతో కలిసి కృషిసల్పిన వెబ్ దంపతులవంటి మేధావులు చాలఅరుదుగా కన్పించెదరు విజ్ఞానశాస్త్రప్రపంచమునందలి "క్యూరీ" దంపతులతో వీరిని పోల్చవచ్చును జార్జిబెర్నార్డుషా వీరిని అనన్యసామాన్యమైన దంపతులనియు ఆంగ్లేయ మేధాప్రపంచము ఉత్పన్నముచేయగల మానసిక శక్తులనియు వచించెను సాంఘిక రాజకీయ ఆర్థిక సాంస్కృతికరంగములలో ఆంగ్లేయ సమాజమును సంస్కరించుటయందు వీరు సాధించినకృషి చరిత్రప్రసిద్ధమైనది ఇద్దరిలో బీట్రిస్ పెద్దది రిచర్డుపాటర్, లారెన్సినాహేవర్త్ అను దంపతులకు ఈమె ఎనిమిదవ కుమా

్తెగా 1858 లో జన్మించెను

రిచర్డుపాటర్ పారిశ్రామిక వేత్తయైకూడ గోష్ఠులకొరకు తనయింటికి తత్వవేత్తలను సంస్కర్తలను ఆకర్షించు చుండెను ఈ చర్చలే బీట్రిస్ నకు విద్యాశిక్షణములను సమకూర్చినవి బీట్రిస్ పసితనమునుండి అనారోగ్యవంతురాలు అయినను తన్నాకర్షించిన గ్రంథములన్నియు చదివి గృహమునకువచ్చు పెద్దలతో చర్చలు జరుపుటద్వారా తన అభిప్రాయములకు పదునుపెట్టుకొనుచు స్వయంకృషివలన విదుషీమణియయ్యెను తొలిరోజులలో ఈమెను ప్రభావితము చేసినవి ప్రఖ్యాత ఆంగ్ల తత్త్వవేత్త హెర్బర్టుస్పెన్సరు రచనలు. 1882 లో తల్లి మరణించగా ఈమెయే ఒంటరిగాడైన తండ్రికి అన్నివిధముల చేదోడువాదోడైనది గృహకృత్యములు నెరవేర్చుటయందు తండ్రికి ప్రియకుమార్తెగా, వ్యాపారమున అతనికి సలహాలీయగల కార్యదర్శినిగా అతిథుల నాదరించు మహిళగా ఆమె రూపొందినది ఈ సందర్భమున జోసెఫ్ ఛేంబర్లిన్ తో (తరువాత ప్రధానియైనాడు) ఈమెకు పరిచయమేర్పడినది అతడు తన అధికృతను నిలబెట్టుకొనవలెనను మనస్తత్త్వముగలవాడని ఆమె గ్రహించుటతో అప్పటివరకేర్పడిన పరిచయము పరిణయమునకు దారితీయు ప్రేమగా మారకమునుపే ఆయనతో తన పరిచయమును తగ్గించివేసికొనెను

చిత్రము - 99



బెర్నార్డుషా బీట్రిస్ వెబ్ సిడ్నీవెబ్ లు సమకాలీన సాంఘిక సమస్యలను చర్చించుచున్న దృశ్యము

కాగా, క్రిందివర్గమునుండి వచ్చినవాడు సిడ్నీ వెబ్ అతనితల్లి తండ్రులు పిల్లలను అతికష్టముమీద పెంచి చదివించగల్గుచుండిరి సిడ్నీ ఇంగ్లండు జర్మనీ స్విట్జర్లెండులలో విద్యనభ్యసించెను 16 సంవత్సరముల వయసునాటికే అతడు బడి వదలి ఉద్యోగము చూచుకొనవలసివచ్చెను గుమాస్తాగా జీవితమారంభించి పట్టువిడువక బిర్క్ బెక్ కళాశాలలో సాయంతరగతులకు హాజరగుచు విద్యను కొనసాగించెను ఐతే ఈయనవంటి ప్రతిభావంతులగు విద్యార్థులు చాల అరుదుగా నుండెడివారు పార్కులలో చిన్నపిల్లలు పువ్వులేరినట్లు ఈయన స్కాలర్ షిప్పులు సంపాదించెనని బెర్నార్డుషా చమత్కరించెను వివిధదేశములలో చదువుటచే యూరపియన్ భాషలనేకము ఆయన ధారాళముగా మాట్లాడగల్గుచుండెను అధ్యయన మొనర్చు గ్రంథ విషయములన్నిటిని జ్ఞాపకముంచుకొనుచుండెడివాడట! పోటీ పరీక్షలోనెగ్గి 1878 లో యుద్ధశాఖయందు గుమాస్తాగ ప్రవేశించినాడు. మరుసటి సంవత్సరము వలసలశాఖలో కిమారి మరియొక పోటీపరీక్షలో నెగ్గి 1881 లో వలస రాజ్యవ్యవహారశాఖలో ఉద్యోగింపబడినాడు 1885 లో న్యాయవాదిత్వమును చేపట్టి 1891 లో దానిని వదలి స్వతంత్ర పత్రికారచనము సామాజికశాస్త్రముల పరిశోధనము ఆరంభించెను సంఘసేవకు జీవితము నంకితముచేయు కృతనిశ్చయమే ఇందుకు కారణము

సిడ్నీ బీట్రిసులు మొట్టమొదట కలిసినది 1890లో ఉద్యోగానుభవమిచ్చిన అవకాశముతో విద్యయొసగిన జ్ఞానముతో స్టూవర్ట్ మిల్ వంటి మేధావుల గ్రంథములమూలమున అర్జించిన మానసికశక్తితో సాంఘిక సమస్యలను పరిష్కరించి ఉన్నత సమాజమును స్థాపించుటకు ఉత్సుకత ప్రదర్శించుచున్న వ్యక్తి సిడ్నీ పుస్తకములకు పరిమితమైన జ్ఞానముతో అతడు తృప్తిపడలేదు కాగా ప్రత్యక్షముగా పేదల జీవితమునర్థము చేసికొనుటకై వారిమధ్య జీవించుటకు సిద్ధపడిన వ్యక్తి బీట్రిస్ ఉన్నతవర్గమునకు చెందిన తనకుటుంబమునకు దూరముగా లండనులో అనారోగ్యప్రాంతమైన ఈస్ట్ ఎండ్ లో నివసించుచున్న పేదప్రజలమధ్యకు ఆమె చేరినది దైన్యస్థితిలోనున్న అచ్చటి స్త్రీల పేదబ్రతుకులను ఆమె స్వయముగా చూచినది కార్మిక సమస్యలతో ప్రత్యక్షపరిచయమామెకు ఏర్పడినది ఆ దినములలో ఛార్లెస్ బూత్ అనునతడు ఆంగ్ల ప్రజల దైనందిన జీవితమును వర్ణించుచు రచనలను ప్రకటించుచుండెను బీట్రిస్ తొలిపరిశీలనమునకీరచనలు చాలవరకు తోడ్పడినవి 1888లో పార్లమెంటు యొక్క ఉపసంఘముముందు పేదశ్రామికుల

స్థితిగతులను తెల్పుటకామె ఆహ్వానింపబడినది. సహకారవికాస మునకై సహకారసంస్థలు పనిచేయు విధానమును పరిశీలించి 1891లో ఈమె సహకారోద్యమముపై తన ప్రథమగ్రంథమును ప్రకటించెను. తరువాత ఈమె దృష్టి కార్మిక సంఘములపై మరలెను. 1889లో జరిగిన ప్రసిద్ధ కార్మిక సంఘముల మహాసభలకు ఈమె హాజరైనది. కార్మిక సంఘముల పరిశీలనము ఈమె శావించినపాటిలో నెల్ల ముఖ్యమైన అంశమాయెను. సంపూర్ణమైన సాధికారగ్రంథమును వెలయించుటాకాంక్షయే ఈమె నిర్విరామకృషికి కారణమైనది. ఎవరైనను ఈ కార్యక్రమమున తనకు తోడ్పడుదురేమోయని ఎదురుచూచు చుండగా కొందరు మిత్రులు సిడ్నీ వెబ్ పేరును ఆమెకు సూచించిరి. సంఘసంస్కరణప్రియులు సిడ్నీని ఎన్నదగినవ్యక్తిగా పరిగణించు సమయమది. మార్క్సిస్టు సామ్యవాదమును ఆంగ్ల సంప్రదాయముల కనువర్తించుటకై ఫేబియన్‌సొసైటీ ఏర్పరచిన మేధావుల సమాఖ్యకు బెర్నార్డుషా ద్వారా సిడ్నీ పరిచయము చేయబడినాడు. సామ్యవాదులకు కొన్నిముఖ్య సత్యములు" అను అసమాఖ్యయొక్క ఉత్తమ కరపత్రమును 1887లో ఆయనవ్రాసెను. 1889లో "సామ్యవాదమున ఫేబియన్ వ్యాసములు" అనునది ఆయనచే రచింపబడి ప్రకటింపబడిన సుప్రసిద్ధగ్రంథము. ఈ సమాజప్రచురణములలో ఎక్కువగా విక్రయింపబడిన గ్రంథమిదియే. సిడ్నీని కలియుటకు ముందు బీట్రిసు అతని ఉపన్యాసముల సంపుటమును చదివి ఆయన మేధాసంపత్తిచే ఆకర్షితురాలాయెను.

మొదటి కలయికలోనే వారిరువురు పరస్పరము ప్రేమించుకొనిరి. తమతమ కార్యక్రమములలో ఒకరికొకరు చేదోడుగా ఉండగలమని గుర్తించుకొనిరి. 1892 జూన్‌లో పెండ్లియైన వెంటనే దంపతులిరువురు గ్లాస్గో, డబ్లిన్ నగరములలోని కార్మికసంఘముల పరిణామములో పరిశోధనలు జరుపుటకు బయలుదేరిరి. వివాహమైన సంవత్సరమే డెప్ట్‌ఫోర్డ్ నియోజకవర్గమునుండి లండన్ కౌంటికౌన్సిలు సభ్యుడుగా సిడ్నీ ఎన్నికయాయెను. అప్పటినుండియు అతడు ఆకౌన్సిలుకు విద్యావిషయక అంశములపై ప్రయోక్తయను, అభ్యుదయవాదులకు నాయకుడుగను, కరపత్రరచయితగను పేరుగాంచెను.

ఆర్థిక చరిత్రరంగమున ఘటిల్లిన పరిశోధన వీథికలయిక యొక్క మొదటి ఫలితము బీట్రిస్‌చే ప్రారంభింపబడిన "కార్మికోద్యమచరిత్ర" ఈదంపతులచే పూర్తిచేయబడి 1894లో ప్రకటింపబడినది. కార్మికులలో వర్గచైతన్యమును మొదటి సారిగా సృష్టించిన ఇంతటి సమగ్రమైన చారిత్రక గ్రంథము మున్నెన్నడును రచింపబడలేదని బెర్నార్డుషా గణించినాడు. 1897లో "పారిశ్రామిక ప్రజాతంత్రము" అను గ్రంథమును వీరు రచించిరి. అనంతరము వెబ్ దంపతుల దృష్టి స్థానిక ప్రభుత్వ సంస్థలపై ప్రసరించి, ఆయంత్రాంగపు చారిత్రక సమస్యలను పరిశీలించుటకు పూనుకొనె. ఫలితముగ బృహద్రచనము ఇది పది సంపుటములుగా 1906–1929 సంవత్సరముల మధ్య వెలువడినది.

తీవ్ర పరిశోధనాఫలితమైన గ్రంథరచనమిట్లు ప్రక్క సాగుచుండ మరొకవంక వీరు జాతీయ కార్యకలాపములలో కూడ పాల్గొనుచుండిరి. దంపతులిరువురిలో సిడ్నీయే ప్రజా కార్యకలాపములందు విశేషముగానుండువాడు. 1895, 1898, 1901, 1904 సంవత్సరములలో వివిధ ప్రజాసంస్థలకు సంబంధించిన ఎన్నికలయందు ఆయన గెలిచి కౌన్సిలు యొక్క సాంకేతిక విద్యాశాఖాధ్యక్షుడై ఉద్యోగోపయోగమైన విద్యావిధానము నమలుపరచుటయందు ఇంగ్లండుకు లండను మార్గదర్శియగుటకై తోడ్పడెను. వివాహానంతరము మొదటి పది సంవత్సరములలో భార్యసహాయముతో ఆయన సాధించిన ఘనకార్యములివి: 1. లండన్ స్కూల్ ఆఫ్ ఎకనామిక్సు స్థాపనము. 2. లండను విశ్వవిద్యాలయ పునర్వ్యవస్థీకరణము. 3. జాతీయ విద్యావిధాన రూపకల్పనము మున్నగునవి. ఈయన ప్రతిపాదించిన సమగ్రవిద్యావిధానము మార్పులు లేక 1902–1903లో ప్రభుత్వశాసనముగా రూపొందెననిచో దాని ప్రాముఖ్యము విదితము కాగలదు. అప్పటికి ఆచరణమందున్న "పూర్ లా" శాసనమును పరిశీలించుటకేర్పడిన రాయల్ కమీషన్‌లో వెబ్ దంపతులిరువురును సభ్యులు.

అనంతరము జాతీయస్థాయిలో సిడ్నీ రాజకీయ నాయకత్వమారంభమయ్యెను. తొలుదొలుత ఆయన లిబరల్ పార్టీతో చేతులు కలిపెను. ఫేబియనులతో కలసిన తరువాత సామ్యవాది ఆయెను. ఆమైన కన్సర్వేటివ్ నియోజకవర్గములను సహితము లేబరుపార్టీ స్థానములుగా మార్చుటలో ఈయన రచనలు, ఉపన్యాసములు సాధించిన ఫలితములు ఉపకరించి పార్టీ నాయకులనెల్లరను అబ్బురపరచినవి. 1909నుండి లేబర్ పార్టీ ఎన్నికల వ్యూహమునగూడ పలువిధముల సహకరించినది ఈదంపతులే.

రాజకీయకలాపములలో మునిగినను వారు పరిశోధన మానుమ లేదు 1914లో న్యూస్టేట్స్‌మన్ అను పత్రికను వారు స్థాపించిరి అదే సంవత్సరమున సామాజిక శాస్త్రములలో పరిశోధనను పెంపుచేయుటకు ఫేబియన్ పరిశోధన శాఖను స్థాపించిరి మొదటి ప్రపంచయుద్ధకాలమున వీరు లేబరు ఉపసంఘములలో పనిచేసిరి యుద్ధానంతరము గనిపనివారల ప్రతినిధిగా బొగ్గుగనుల వ్యవహారములకు సంబంధించిన కమీషనులో సిడ్నీ పనిచేసెను ఈ సందర్భమున అతడు బొగ్గుగనుల జాతీయకరణము కొరకు పథకమును తయారుచేసెను 1915 నుండి 1925 వరకు లేబరుపార్టీ కార్యనిర్వాహకసంఘ సభ్యుడై "కార్మికులు-నూతన సమాజము" అను ప్రణాళికను తయారుచేసెను 1922లో సీహామ్ హార్బరు నియోజకవర్గము నుండి ఆయన పార్లమెంటుకు ఎన్నికయ్యెను లేబరుపార్టీ ప్రభుత్వమున ప్రవేశించినపుడెల్ల ఆయన వాణిజ్యశాఖకు మంత్రిత్వము వహించెను 1929 నాటి మేక్డొనాల్డు మంత్రిమండలిలో "వలసపాలిత ప్రాంతముల శాఖ"పై అతడు అజమాయిషీ చేసెను

1930 నాటికి ఈ దంపతులకు రాజకీయములపై ఆసక్తి సన్నగిలుచుండగా రష్యా నూతనవ్యవస్థ వీరి నాకర్షించినది 1932లో వీరు రష్యాకేగి విషయపరిశీలనము చేసి అచట నెలకొన్న సామ్యవాద సంస్కృతి ఒక "నవనాగరికత" యని ప్రకటించిరి స్వదేశమునకు తిరిగివచ్చి 1935లో వారు సోవియట్ కమ్యూనిజమ్-ఒక నవనాగరికత అను మహా గ్రంథమును ప్రచురించిరి ప్రపంచమందలి అభ్యుదయ కాముకులైన మేధావులను ఉర్రూతలూగించిన గ్రంథమిది

సిడ్నీ ఫేబియన్ సమాజములో చేరక పూర్వము ఆంగ్ల సామ్యవాదము లోపభూయిష్ఠమగు రెండు ధోరణులకు గురైనది (1) ...టి కలలు కను కవులు వేదాంతులు సంస్కర్తలు నిర్మించుకొనిన సామ్యవాదసమాజము (2) సాధింపగలమో లేమో అను ముందు వెనుకలు తెలియక సామ్యవాద సమాజమును స్థాపించుటకై అరాజకవాదులు కొందరు గోరెడి కొన్నట్లు చేయు దుస్సాహసములు భీతి కలుగజేసిన ప్రమాదములనుండి బ్రిటిష్ సామ్యవాదమును సిడ్నీ రక్షించెను రాజ్యాంగమునకులోబడి కాలక్రమేణ సామ్యవాదసమాజమును ఎట్లవతరింపజేయ వీలగునో సిడ్నీ తనరచనలలో చూపెను సామ్యవాదము ప్రజాతంత్ర ఆదర్శము యొక్క ఆర్థిక విభాగమని ఆయన సామ్యవాదమును నిర్వచించెను జాతీయకరణ విధానమును వెబ్ దంపతులు ప్రశంసించిరి గాలివాటున సునాయాసముగా లభించు సంపదను వారు నిరసించి అది జాతీయపరమగుట అవసరమనిరి బొగ్గుగనుల జాతీయకరణమునకు సిడ్నీ తయారుచేసిన ప్రణాళిక గణన కెక్కినది 1945లో ఏర్పడిన లేబరు ప్రభుత్వము ఫేబియన్ సొసైటీ చేసిన మంచి సూచనలన్నింటిని ఆచరించుచు అమలు చేసినది

రష్యానుండి తిరిగివచ్చిన కొంతకాలము తర్వాత ఈ దంపతులు క్రమముగా రాజకీయ జీవితమును విడనాడి విశ్రాంతి ననుభవింప దలచిరి సిడ్నీ బ్రిటను దేశమునకు చేసిన సేవకు ప్రతిఫలముగా ప్రభుత్వము ఆతనిని "ప్రభువు"ను చేసినది

నిరవధిక దేశసేవ సామ్యవాద సమాజ నిర్మాణమునకు అవిరళకృషి తీవ్రపరిశోధనా ఫలితమైన ఉత్తమ గ్రంథముల రచనము చేసిన సిడ్నీ బీట్రిస్‌లు ఆదర్శ దాంపత్యజీవితమును గడిపిరి ఆరువురిలో పెద్దదైన బీట్రిస్ 1943 లోను సిడ్నీ 1947 లోను మరణించి చరితార్థులైరి వీరి భౌతికకాయములు లండన్ వెస్ట్ మినిస్టర్ ఏబీ లో సమాధి చేయబడినవి

సూ కృ

## సిరియా (భూ)

సిరియా పశ్చిమాసియాలోని ప్రసిద్ధమైన ఒకదేశము దీనికి ఉత్తరమున టర్కీ తూర్పున ఇరాక్ దక్షిణమున జోర్డాన్ ఇజ్రాయిల్ పడమరన లెబనాన్ అనుదేశములు గలవు ఈ దేశవైశాల్యము 72,000 చదరపుమైళ్లు డమాస్కస్ ఈదేశముయొక్క ముఖ్యపట్టణము ఈ పట్టణము ప్రధానమైన వ్యవసాయ వ్యాపార కేంద్రము

సిరియాను భౌగోళికముగ ఏడుభాగములక్రింద విభజింపవచ్చును (1) లటాకియా మైదానమువలన ఏర్పడిన మధ్యధరా తీరమండలము, (2) తూర్పున జెబెల్ అన్సారియా మొదలుకొని దక్షిణమున ఆంటిలెబనాన్ పర్వతములవరకు ఆక్రమించిన మిట్టప్రదేశము (3) అలెప్పో హామాలయందు గల సారవంతమైన మైదానములు ఒరాంటిస్ నదీలోయ వలన ఏర్పడిన మధ్యప్రాంతము (4) దీనికి ఆగ్నేయమున చరిత్రాత్మక ప్రదేశమగు పామిరాతో కూడిన సిరియా ఎడారి (5) ఈ ఎడారికి ఉత్తరమున యూఫ్రటిస్ నది దాని ఉపనదు

లతో ఏర్పడిన సారవంతమైన లోయ ప్రాంతము (6) ఎడారికి దక్షిణమునన్న ఘుటా లోయ హౌరాను యొక్క కొండ ప్రాంతములు (7) అగ్నేయమందు 6,900 అడుగుల ఎత్తుగల నల్లని పర్వతమయప్రదేశము

వేసవిలో లెబనాన్ పర్వతములు వాటికి తూర్పునగల దిగువ ప్రదేశమందు ఘటిల్లు వాయు ప్రవాహములవలన అధికముగా మంచును సమకూర్చుకొనగలుగుచున్నవి ఈ పర్వతములకు సముద్రపుటిశయందుగల ఏరులవలన వాటి కొనవలన వెక్కుగండు ఏర్పడియున్నవి

సిరియా తీరప్రాంతమందు చాలవరకు మధ్య ధరాసముద్రపు సమశీతోష్ణస్థితిగలదు లోతట్టుభాగమున ఉష్ణముగనుండును ఉత్తరదిశయందుగల కొండదరి చాలతక్కువ వైశాల్యముగలదగుటచే ఓరాంటిసు నదిచెందిన పల్లపులోయలో గూడ వర్షము మోతాదుగా కురియుచున్నది సిరియాలో వర్షకాలము నవంబరు నెలలో ఆరంభమై మార్చి ఏప్రెల్ నెలలో ముగియును తీరప్రాంతమున 40 అంగుళములు సిరియా ఎడారిలో 4 అంగుళములు ముఖ్యపట్టణమైన డమాస్కస్ నందు 10 అంగుళములు వర్షపాతము కలదు ఇచ్చటి వేసవికాలపు సగటు ఉష్ణోగ్రత 76° F శీతకాలమున 45° F

సిరియా దక్షిణభాగమున నీటిపారుదలకు అధికజలము లభించుచున్నను లోయలలో వర్షము చాల తక్కువగనుండును ఈ కారణముచే హౌరాను పీఠభూమి వానములలో పచ్చిక పెరుగుచుండును

సిరియా గొప్పవ్యవసాయకదేశము ఇచ్చటి జనాభాలో అధికభాగము వ్యవసాయదారులు పలురకముల పైరుల పండించుటకును వివిధములైన పెంపుడు జంతువులను పోషించుటకును సిరియా భౌగోళికపరిస్థితులు అనుకూలించుచున్నవి పొలములలో ఎక్కువభాగము మెట్టపంటలకు వినియోగపడుచున్నది స్వల్పభాగములో నీటిపారుదలతో ఫలవృక్షములను కూరగాయలచెట్లను పెంచుటకు అవకాశమున్నది తీరమండలములో అలేవియా అనుప్రాంతము సేద్యమునకు తగియున్నది బీకాట్ మున్నగు ప్రాంతములందలి ఎరుపు దిగుడుభూములు ఆలివు, కమలాఫలములు పెంపుదలకు మాత్రము అనువైయున్నవి ఈ ప్రదేశములకు ఇచట టర్కీ మార్గములవలన ప్రాముఖ్యము కలిగినది సిరియాలోని ఉత్తర, ఈశాన్యప్రాంతములలో గూడ వ్యవసాయాభివృద్ధికి పదుపాయము గలదు ఇచ్చటి పంటలలో గోధుమ బార్లీ మొక్కజొన్న బీటుదుంపలు ప్రధానమైనవి పారిశ్రామిక పంటలలో పొగాకు ప్రత్తి గోగునార ముఖ్యమైనవి ఇచ్చటి వస్త్రపరిశ్రమ చాల అభివృద్ధిలో నుండెను డమాస్కస్ పరిసరములలోను అటు యీ తీరప్రదేశములలోను పండ్లు అధికముగా పండును పశుసంపదలో మేకలు, గొర్రెలు ఒంటెలు ముఖ్యమైనవి

సిరియా పరిశ్రమలు అచ్చటి వ్యవసాయముతో సన్నిహిత సంబంధము కలిగియున్నవి అందుచేత వాటిసంఖ్య చాల తక్కువ పరిశ్రమలలో నూనెతీత ఎగరెట్లు, రాయాణి ఎంతువుల ఉత్పత్తి ప్రత్తినుండి గింజలను వేరుచేయుట బట్టలనేత ఎమెటు కాగితపు పరిశ్రమలు మొదలగునవి అధికముగానున్నవి

సిరియాయందు మాంగనీసు అంటిమొని ఉప్పు జిప్సమ్ గనులును నూనెగనులును కలవు

సిరియాదేశమునగల చరిత్రాత్మక మత సంబంధమైన స్థలములు విహారయాత్రికుల కాకర్షణము కలిగించును వీటిలో ప్రసిద్ధిచెందినవి ఎడారి రత్నములు అనదగు పామిరా శిథిలములు, పుమాయద్ మసీదు అజమ్ రాజభవనము, సాలాదీన్ గోరి డమాస్కసునగరమందలి నేషనల్ మ్యూజియముగూడ చూడదగినవి

సముద్రముమీద సరకుల రవాణా విశేషముగా జరుగుటచే ఒంటెల బిడారుల అవసరము తగ్గినది ఎడారి ప్రాంతమంతటికిని డమాస్కస్ నగరము ప్రధాన విపణిగానున్నది సిరియా యెడారి ప్రాంతముపై గగనతలము వాయువిమాన మార్గముగా ఉపయోగపడుచున్నది

ముడిప్రత్తి సజీవజంతువులు కూరగాయలు ఆహార ధాన్యములు తినుబండారములు పొగాకు, రసాయనములు చర్మములు బట్టలు మొదలగునవి సిరియానుండి పరదేశములకు ఎగుమతి యగును కలప లోహములు యంత్రములు సిరియా యొక్క ముఖ్యదిగుమతులు

కె వి ర

## సిసిరో (క్రీ పూ 106-43)

పాశ్చాత్యుల సంస్కృతులకు పునాదులు వేసినవారు ప్రాచీనకాలపు గ్రీకులు, రోమనులు కాని గ్రీకులు వేసిన పునాదులకును రోమనులు వేసిన వానికిని గొప్పభేదమున్నది గ్రీకులు విజ్ఞానశాస్త్రమును, తత్త్వశాస్త్రమును సృష్టించి

అభివృద్ధిచేసినవారు. రాజనీతి వాఙ్మయ తత్త్వశాస్త్రములలో ఒక భాగము. వారిలో ఉత్తములని ప్రఖ్యాతిగాంచి వారందరు మేధావులు. అట్టివారిలో అగ్రశ్రేణి చెందిన ప్లేటో అరిస్టాటిల్ వ్రాసిన రాజనీతిగ్రంథములు ఈనాటివరకు పాశ్చాత్యుల రాజకీయ తత్త్వముపై అత్యంతప్రభావము వహించినవి.

రోమనులు కార్యశూరులు. రణరంగము పాలనరంగము వారి జీవితక్షేత్రములు. సైన్యాధిపతులు పరిపాలకులు చట్టనిర్మాతలు వారిలో ప్రసిద్ధిగాంచినవారు. ఒకప్పుడు రోమునగరము ఒక చిన్న నగరరాజ్యముగనుండెను. కాలక్రమమున విస్తృతసామ్రాజ్యమునకై త్యాగములు చేసిన ప్రజల సహకారముతో నాయకులు సువిశాలసామ్రాజ్యమును సంపాదించగలిగిరి. భిన్నజాతులవారు భిన్నభాషలను మాట్లాడువారు భిన్నసంస్కృతులుగలవారు ఒకేసామ్రాజ్యమందు పౌరులుగనుండుట సాధ్యమని రోమనులు రుజువుచేసిరి. సామ్రాజ్యమును సుస్థిరపరచుటకు వారు ఉత్తమపరిపాలన విధానమును నిర్మాణముగావించి, మానవకోటికంతకు వర్తించగల న్యాయశాస్త్రమును దానికి ఆధారముగచేసిరి. ఈన్యాయ విధానము (దీనినే ప్రాచీనభారతీయులు స్మృతులనియు ధర్మశాస్త్రములనియు చెప్పిరి. ఈనాటివారు చట్టములనియు శాసనములనియు పేర్కొనుచున్నారు) ఇప్పటికూడ (ఇంగ్లండు మినహాగా) యూరపుఖండపు అనేకదేశములలోను దక్షిణ అమెరికాలోను ఉత్తరఅమెరికాలోని కొన్నిప్రాంతములందును అమలులోనున్నది. ప్రాచీనరోమనులనుండి పరిపాలనవిధానమునుగ్రహించి విషయములనేకములను పాశ్చాత్యులు నేర్చుకొనిరి.

సిసిరో ఇట్టిసామ్రాజ్యమునకు చెందినవాడు. అతడు రోమునగరములో న్యాయశాస్త్రమును నేటిగ్రీసురాజధాని యగు ఏథెన్సునగరమందు తత్త్వశాస్త్రమును అభ్యసించి న్యాయవాదవృత్తిలో ప్రవేశించి పేరుప్రతిష్ఠలుసంపాదించి, కాలక్రమమున పరిపాలనరంగములో అత్యున్నతపదవులకు ఎన్నుకొనబడి సమర్థతతో వాటిని నిర్వహించినవాడు. పరిపాలనరంగమందు గడించిన వ్యావహారికజ్ఞానమును గ్రీకుల తత్త్వశాస్త్రమును ఆధారములుగ చేసికొని అతడు "రిపబ్లిక్" "లాస్" అను రెండుగ్రంథములను రచించెను. ప్లేటోకూడ తానురచించిన గ్రంథములకు ఇవేపేర్లు పెట్టెను. సిసిరో రాజకీయతత్త్వము ఈ రెండుగ్రంథములలో సుస్పష్టమగుచున్నది.

అతడు వీటిని వ్రాసినకాలము రోమనుసామ్రాజ్యచరిత్రలో సంధియుగముగ గణింపబడెను. క్రీ. పూ. 500 సం. నుండి రోమునగరము ప్రజాస్వామ్యము గల్గియుండెను. అధికారుల నందరిని ప్రజలే ఎన్నుకొనుచుండిరి. శాసనములన్నియు వారి ఆమోదముతోనే చేయబడుచుండెను. రాజ్యాధికారమునకు ప్రజలసమ్మతమే ఆధారమను సూత్రము ఆచరణలోనుండెను. కాని దీనితోపాటు ప్రజలపై ధనికులును ఉత్తమకుటుంబీకులగు శిష్టులును నాయకత్వము వహించియుండిరి. వారి సలహాల ననుసరించి ప్రజలు తమ అధికారమును చెలాయించుచుండిరి. ఈకారణముచే రోము పరిపాలన విధానము స్వచ్ఛమైన ప్రజాస్వామ్యముగాని స్వచ్ఛమైన శిష్టవర్గప్రభుత్వముగాని కాక ఒకవిధమైన మిశ్రమప్రభుత్వముగ రూపొందెను.

ఇట్టివిధానము ప్రాబల్యముగాంచిన కాలముననే రోము పౌరులు ఒకసామ్రాజ్యమును స్థాపించిరి. కాని సామ్రాజ్య విస్తరణ ఫలితముగ ఈ పరిపాలనవిధానము కుంటుపడెను. ఆర్థికముగ ప్రజలలో అవాంఛనీయములగు మార్పులనేకములు సంభవించెను. ప్రజలలో అత్యధికభాగము సైన్యములో చేరినందున వ్యవసాయము క్షీణించెను. నగరవాసులలో అనేకులు నిరుద్యోగులై అహోరాత్రములు అవసరములకు ప్రభుత్వము ఉచితముగ సరఫరాచేయు వస్తుసామగ్రిపై ఆధారపడవలసినవారైరి. దీనికి అలవాటుపడుటచే వారు సోమరులై రాష్ట్రములలోని ప్రజలనుండి అధికములగు పన్నులను వసూలుచేసి అట్లు లభించిన ఆదాయము తమఅవసరములు తీర్చుటకై వినియోగముకావలెనని ఆందోళన చేయసాగిరి. సామ్రాజ్యము అందరిశ్రేయస్సుకొరకు కాక తమశ్రేయస్సుకు మాత్రమే ఉపయోగపడవలెనని వీరివాదము. దీనికితోడు సామ్రాజ్యవ్యాప్తిమూలమున వర్తకవ్యాపారములు పెరిగి నూతనధనికవర్గమొకటి ఏర్పడెను. వారికిని పేదరికమున బాధపడుచుండిన సామాన్యప్రజలకును మధ్య విరోధమగు అగాధమేర్పడెను. ఇదిచాలదన్నట్లు అధికారముకై శిష్టవర్గములోనివారు పరస్పరము కలహించుకొని అంతర్యుద్ధములు లేవదీయసాగిరి. దేశములో అరాచకపరిస్థితులేర్పడెను. ఇట్టిస్థితిలో సామ్రాజ్యము నిలబడగలదాయను సందేహముకూడ ఉత్పన్నమయ్యెను.

ఈ సంధికాలములో సిసిరో ఉన్నతపదవులలోనుండెను. సామ్రాజ్యమునకు సుస్థిరత్వము కల్పించుటకు సైనికాధిపత్యము వహించిన నియంతయే సాధనమని కొందరునాయకులు విశ్వసించి,

ప్రజాస్వామికమునకు శిష్టపాలనమునకు భిన్నముగ అట్టినియంతృత్వమును స్థాపించు ప్రయత్నమును కొనసాగించుచుండిరి తుదకు వారికే విజయము లభించి ప్రజాస్వామి ము నామమాత్రమై చక్రవర్తులు సామ్రాజ్యమును పరిపాలించు విధానము అమలులోనికి వచ్చెను

అట్టి సందిగ్ధ సమయములో సిసిరో సంప్రదాయ సిద్ధమైన ప్రజాస్వామ్య శిష్టస్వామ్య మిశ్రిత ప్రభుత్వమే ఆదర్శ ప్రభుత్వమనియు ఏకస్వామ్యమగు నియంతృత్వమును వాంఛించరాదనియు అతని గ్రంథములలో ఈ విధముగ ప్రతిపాదించెను రాజ్యములకు ప్రజలఅంగీకారమే ఆధారముగనుండవలెను; ఏకస్వామ్యము లోను శిష్టస్వామ్యములోను ప్రజలకు స్వేచ్ఛ ఉండదు స్వేచ్ఛ లేనిపరిపాలనలో భాగస్వామ్యము లభింపదు; మానవత్వమునకు అదియే లక్షణము. అదిలేని నాడు మానవులు మానవత్వమును కోల్పోయి బానిసలగుదురు; రాజ్యము యొక్క పరమావధి న్యాయమును చేకూర్చుట న్యాయము చేకూరునంత వరకు రాజ్యము ఏకస్వామ్యముగగాని శిష్టస్వామ్యముగగాని ప్రజాస్వామికముగగాని ఉండవచ్చును కాని ఆచరణలో ఒక్క ప్రజాస్వామికమందుమాత్రమే అందరికి న్యాయము చేకూరగలదు అందుచేత స్వేచ్ఛదృష్ట్యా న్యాయము దృష్ట్యా ప్రజాస్వామ్యమే పరిపాలనకు ఆధారము కావలెను అందులోని స్వల్పదోషములు నివారణమగుటకు శిష్టుల నాయకత్వము అగుట సాధనము

ప్లేటో, అరిస్టాటిలుల దృష్టి చాలసంకుచితమై నట్టిది వారి ఆదర్శరాజ్యము ఒకనగరమునకుమాత్రము పరిమితమైన నగర రాజ్యము అట్టి చిన్న రాజ్యములుండుటచేతనే గ్రీకులు పరస్పరము కలహించుకొని విదేశీయులచే జయింపబడిరి ఈ విషయమును గ్రీకుతత్త్వవేత్తలు గ్రహించరైరి సిసిరో అట్లుగాక విశాలసామ్రాజ్యమే ఉత్తమరాజ్యమని గుర్తించెను అనేక దేశములకు వ్యాపించినసామ్రాజ్యము వివిధ ప్రజానీకము మధ్య సంభవించు యుద్ధములను విరమింపజేసి అందరుము శాంతిభద్రతలు అనుభవించుటకు సాధనమగుచున్నది రోము సామ్రాజ్యము మానవకోటికి చేసిన మహోపకారమిదియే గ్రీకుతత్త్వవేత్తల దృష్టికిని సిసిరో దృష్టికిని ఇదియే గొప్ప భేదము వారి అనుభవములు వేరు; వారు జీవించినకాలము వేరు వారి తత్త్వములలో కలిగిన భేదమునకిదియే హేతువు.

విభిన్న జాతులమధ్య ఆచార భేదములుండవచ్చును కాని వాటిని అధిగమించి అందరికిని వర్తించు న్యాయసూత్రములను నిర్మించుట కష్టసాధ్యముకాదు రోమనుపరిపాలకులు అట్టి సూత్రములనునిర్మించి పౌరులందరు ఒకేవిధముగ విధివిధేయులగునట్లు గావించిరి ఇది సాధ్యమగుటకు ప్రబల హేతువుకలదు మానవులందరియందు కార్యకారణ సంబంధమును తెలిసికొనగల బుద్ధి అనుశక్తి ఒకటి ఉన్నది దానిని అందరును ఉపయోగించగలరు అది చక్కగ ఉపయోగించబడినపుడు అందరికి ఆమోదయోగ్యమగు న్యాయసూత్రములు ఉద్భవించుచున్నవి ఒకరికి ఒకన్యాయము ఇంకొకరికి మరియొక న్యాయము ఉండరాదు ధనముదృష్ట్యా, సహజమగు తెలివితేటలదృష్ట్యా మానవులలో విభేదము లేర్పడుచున్నవి ఆ మనుజులను న్యాయదృష్ట్యా ఏలాటి భేదములుండనట్లు పరిపాలనము సాగించుట రాజ్యముల కర్తవ్యము అన్నిరంగములలో సమానతయు సాధ్యము కాకపోయినను కొన్నిరంగములలో అది సాధ్యమగుచున్నది న్యాయరంగమట్టిది అందుచేత ప్రతిరాజ్యములో చట్టములు, శాసనములు న్యాయసూత్రములు అందరిపట్ల సమానముగ వర్తించునవిగ ఉండవలెను

గ్రీకుతత్త్వవేత్తలు సిద్ధాంతములను ప్రతిపాదించుటతో తృప్తిపడిరి కాని సిసిరోకు అట్టి తృప్తి లేదు సిద్ధాంతములకు స్వతహాగా అమలులోనికివచ్చు శక్తిలేదు సిద్ధాంతముల ననుసరించి ప్రభుత్వమున్యాయసూత్రములను నిర్మాణముగావించి దానికిగల బలప్రయోగసాధనమున వాటిని అమలుపరచగలిగినప్పుడే సిద్ధాంతములకు సార్థక్యము ప్రభుత్వమునకు ప్రభుత్వ శాసనములకుగల అవసరమును సిసిరో పైవిధముగనిరూపించెను

చట్టమునకు శాసనమునకు ఇట్టిప్రాధాన్యమును కల్పించుటలో సిసిరోపై స్టాయిక్ తత్త్వవేత్తల ప్రభావము అత్యధికముగ నుండెను గ్రీసు దేశస్థులు స్వాతంత్ర్యమును కోల్పోయిన తర్వాత ఈ తత్త్వవేత్తలు ప్రాబల్యముగాంచిరి వారు మానవులందరిని దృష్టిలోనుంచుకొని న్యాయాన్యాయములకు రూపకల్పనచేసిరి ప్రకృతిఅంతయు న్యాయబద్ధమనియు అందుచేతనే సూర్యచంద్రాదులు వాటివాటి గమనమునన్నిట నియమబద్ధముగ సంచరించుచున్నవనియు, అట్టి ప్రకృతిసిద్ధమగు న్యాయమునకటి జగత్తులో ఉన్నదనియు అది సామరస్యమును ప్రోత్సహించునట్టిదనియు దానిని ఆదర్శముగచేసికొని మానవకోటిఅంతయు న్యాయసూత్రములను బుద్ధిసాధనమున నిర్మా

ణముగానెంచుకొనవచ్చుననియు కొంత తత్త్వవేత్తలు ప్రతిపాదించిరి ప్రకృతి సిద్ధమగు న్యాయమును బుద్ధిసాధనమున కనుగొనవచ్చును ఆన్యాయమే బుద్ధి రూపాంతరము ఈబుద్ధి మానవులలో ఉన్నట్లే ప్రకృతిలోకూడ ఉన్నది సర్వవ్యాప్తమగు బుద్ధి న్యాయమంతటికి ఆధారము అందుచేత ప్రకృతిలోని న్యాయమునకు మానవప్రపంచములోని న్యాయమునకు సాదృశ్యమున్నది ఈ సిద్ధాంతమును ఎందరో అంగీకరించి మానవులందరికి వర్తించు న్యాయమును సృష్టించుటకు సాధ్యమగుననియు రోమను సామ్రాజ్యమున అట్టిసృష్టి జరిగినదనియు ఋజువుచేసెను

న్యాయమునకు పరిపాలనవిధానములో అత్యంతప్రాధాన్యము కల్పించి మానవులందరు ఒకత్రాటిపై నడచుటకు అదియే ఉత్తమసాధనమని నిరూపించుటచే ఎందరో రాజకీయ తత్త్వములోని విశిష్టత

మా వెం

## సుఖరోగములు

లైంగికసంపర్కమువలన సంభవించు వ్యాధులు సుఖవ్యాధులనబడును సంపర్కదోషమునకు గురియైన వస్తువుల ద్వారా కూడా ఇవి సంక్రమించవచ్చును

కొరుకుసవాయివ్యాధి (సిఫిలిస్): ఈ వ్యాధికి స్పయిరోకీటా పేలిడా అను క్రిమియు లైంగిక సంభోగమును కారణములు గాయము తగిలినపుడు సంపర్కదోషము వాటిల్లి ఈ వ్యాధి సంక్రమించుటకుకూడ అవకాశముకలదు ఉదాహరణమునకు సంపర్కదోషయుతమైన మంగలికత్తి ఈవ్యాధియందీ క్రిందిదశలు గోచరించును

మొదటిదశ సంపర్కదోషమునకు గురియైన చోట నొప్పిలేని మొటిమలులేచును అవి బ్రద్దలై అచ్చట పుండు ఏర్పడును ఆపుండునుండి వచ్చు రసిలో పైన చెప్పబడిన క్రిములు స్పష్టమగును అచ్చటి మాంసగ్రంధులు పెద్దవగును ఇది తరచుగా పురుషులకు లింగముయొద్ద అంకురించినను ముఖము నోరు మొదలగు ప్రదేశములందుకూడా పుట్టును స్త్రీలకు ఈ పుండు మర్మాంగములో ఏర్పడుటచే, అది గమనింపబడకనే పోవచును ఈ పుండు ఔషధచికిత్సవలన పథ్యపానాదులవలన నివారణయగును

౨ వదశ : సాధారణముగా మూడువారముల తరువాత ఈ పుండు గోచరమగును ఒకప్పుడది గోచరముకాక పోవచ్చును 1 కోటిమీద,శరీరరంధ్రముయొద్ద, పృష్ఠభాగముపైన పుండుఏర్పడుట 2 శరీరమంతటసన్నని పొక్కులువేలుట (ఈపొక్కులు కుసుపురంగా రూపాంతరము చెందును) 3 గొంతునొప్పి 4 శోషరసగ్రంథి పెద్దదగుట 5 కొద్దిపాటిజ్వరము 6 ఆకలిమొదలైనవి మందగించుట 7 కీళ్లనొప్పులు రాత్రులందు తీవ్రమగుట 8 కనుగ్రుడ్డు వాపు- మొదలైన ఈ వ్యాధి చిహ్నములు పదేపదే సంభవించుచుండును పరీక్షించినచో ఆపుండ్లనుండి స్రవించు ద్రవమునందు సంపర్కదోషచిహ్నములు కానవచ్చును

మూడవదశ సూక్ష్మజీవులు సృష్టికాకపూర్వమే కొందరియందు పెద్ద తరబడిగా ఈ వ్యాధి అంతర్గతముగనుండి యుండవచ్చును క్రిములుస్థానికముగా గోచరింపవు నాడీసంబంధమైన కొరుకుసవాయివ్యాధిలో స్పైరిక్రోస్పయినల్ ద్రవము-నుండి + వకు మారును ప్లీహము కాలేయము ఎముకలు హృదయము మొదలగుచోట్ల వాపు కప్పట్టను హృదయరక్తనాళమండలమునందు ధమనులవ్యాధి పెరియార్టిస్‌ఎన్యూరిజం అను వ్యాధి ఏర్పడును మెదడు పొరయందలి రక్తనాళములు నాడీమండలము మెనింగోవెస్క్యులర్ అను కొరుకుసవాయివ్యాధికి గురియగును ఊరువులు పక్షవాతమునకు గురికావచ్చును కాలేయమునకు ప్లీహమునకు మూత్రకోశములకు ప్రేగులకు సంబంధించిన ధాతువు యీవ్యాధి సోకవచ్చును కొన్ని ప్రమాదకరపరిస్థితులలో మృత్యువుకూడ సంభవించవచ్చును

పుట్టుతోవచ్చు కొరుకుసవాయివ్యాధి ఇందువలన శిశువు గర్భములోనే చనిపోవచ్చును సజీవముగా పుట్టినను కొలది వారములలోనే మరణించవచ్చును శిశువుయొక్క ఎముకల కొనలయందునొప్పి ముక్కునుండి ద్రవము కారుట ఎరుదులు, అరచేతులు మొదలగుచోట్ల ప్రేలుడు మొదలగునవి ఈవ్యాధి లక్షణములు శిశువు నేత్రములలో నల్లపొర తెలుపగును ప్రేళ్ళలో ద్రవముచేరును హఠాత్తుగా నాడీసంబంధమైన చెవుడు కల్గును జననకాలములో శ్వేతన్యుమోనియా ఘటిల్లును కాలేయము కొరుకుసవాయికి గురియగును ఇవన్నియు బాల్యావస్థలోనే మరణము సంభవించుటకుగల సామాన్యకారణములు ఈ రోగమునకు క్రిందిచికిత్సలు చేయబడుచున్నవి: (1) నోటిద్వారా అయొడైడ్సును మ్రింగించుట (2) పెన్సిలిన్ మొదలగు మందును ఎక్కించుట (3) పన్నెండురోజులలో 120 లక్షల పెన్సిలిన్ మోతాదులనిచ్చుట (4) బిస్మత్ మొది

మందునుకూడ ఎక్కించుట

ఖొరకపువాయికి గురియైన రోగియొక్క రక్తమును కనీసము రెండేండ్లపాటు అప్పుడప్పుడు రీక్షింపవలెను పరీక్షాఫలితము పాజిటివ్ అయినయెడల చికిత్సాక్రమమును పొడిగింపవలెను

సెగసంకటరోగము (గనేరియా) ఇది గనోకోకై అను సూక్ష్మజీవిద్వారా సంక్రమించి లైంగికచర్యవలనకాని సంపర్కదోషమునకు గురియైన బట్టలవలనకాని వ్యాపించును ఇది అంకురించు కాలము 24-48 గంటలు మాత్రమే మూత్రము వదలునప్పుడు నొప్పికలుగును అంగముయొక్క ముఖద్వారములో చీము వచ్చును దానిని పరీక్షించినచో గనోకోకై జీవులు కానవచ్చును తీవ్రవస్థితులలో ద్రవపదార్థములను విశేషముగా త్రాగుటవలన పెన్సిలిన్ మందులను సల్ఫా ఔషధములతో కలిపి సూదిద్వారా ఇచ్చుటవలన ఉపశమనము కల్గును

పురుషులకు సెగసంకటవ్యాధి వంటబట్టినచో ఈ క్రింది క్లిష్టపరిస్థితి యేర్పడవచ్చును (1) మూత్రద్వారము వద్ద కౌపర్స్ అను మాంసగ్రంధివాపు (2) ప్రాస్టేట్ గ్రంధివాపు (3) మూత్రద్వారము సన్నగిల్లుటవలన మూత్రము ఒక్కసారిగా కాక బొట్లుబొట్లుగాపోయును అందుచే మూత్రద్వారమును ఇనుపకడ్డీతో పెద్దదిగా చేయవలయును (4) కీళ్లవాపు (5) కంటివాపు (6) ఇంద్రియముపై పులిపిరికాయలు గోచరించును (7) ఎపిడిడైమిటిస్

స్త్రీలవిషయములో ఈక్రిందిలక్షణములు గోచరింపవచ్చును (1) బార్తోలిన్ మాంసగ్రంథులవాపు (2) గర్భాశయముఖద్వారపువాపు (3) సల్పింజైటిస్ గూడకములోని గొట్టములవాపువలన, పొత్తికడుపు క్రిందిభాగములో నొప్పి (4) కీళ్లవాపు (5) కంటివాపు

శిశువులు : శిశువు గర్భమునుండి బయటపడగానే నేత్రములు సంపర్కదోషమునకు గురియై, తుదకు అంధత్వమును కూడ పొందును అట్టిస్థితిలో సిల్వర్ నైట్రేట్ ద్రవమును శిశువు కంటిలో రెండు మూడు పర్యాయములు వేసినచో ఈ వ్యాధి బాధాపు నిర్మూలమగును

పసిబాలికలు : మర్మాంగములకు రోగభూయిష్ఠములైన బట్టల సంపర్కమువలనగాని ప్రత్యక్షసంపర్కమువలనగాని పసిబాలికలు విజినైటిస్ అను వ్యాధిని పొందవచ్చును ఈ వ్యాధి వయోజనులలో సంభవించదు పెన్సిలిన్ తోపాటు ఒవేరియన్ హార్మోన్ అను ఔషధమునుగూడ నియ్యవలెను తద్వారా గనోకోకై అనుజీవి నశించును వ్యాధి జీర్ణించినవారి పైరోక్సియల్ చికిత్స—అనగా పాలవగైరాలను సూదులద్వారా యిచ్చి జ్వరమును తెప్పించుట ఉపయోగకరము

షాఫ్ట్ సోర్ డుక్రేసీ అను సూక్ష్మజీవివలన ఈవ్యాధి రెండు మూడు రోజులలో అంకురించి లైంగిక సంపర్కమువలన వ్యాపించును స్త్రీ పురుషులకు మర్మాంగముపై పెక్కు వ్రణములు లేచి ఎక్కువైన బాధ కల్గించును మాంసగ్రంధులు వాచుట చీముపట్టుట జరుగవచ్చును క్రిమిసంహారక ద్రావణముతో వ్రణములను కడిగి టెర్రామైసిన్ ఆరియోమైసిన్ (బ్రాడ్ స్పెక్ట్రమ్) ఆంటీబయటిక్సును వాడవలెను

కష్టమండలి బూబోవ్యాధి ఇది రసిద్వారా కొలది రోజులలో అంకురించు వ్యాధి ప్రాథమికదశలో ఇంద్రియముపై చిన్న వ్రణములు గోచరించును ఆరువారములలో గజ్జలయందు మాంసగ్రంధులువాచి నొప్పి జ్వరముకల్గును అవిచీముపట్టి పగిలి అందురంధ్రము లేర్పడవచ్చును పెక్కుసంవత్సరముల తరువాత పృష్ఠరంధ్రము సంకోచించును స్త్రీల మర్మాంగములు ఉబ్బవచ్చును పనేథియోమెజిన్ అను సూదిమందువలన అవి మానును వైద్యులిప్పుడు స్ట్రెప్టోమైసినును ప్రయోగాత్మకముగా ఉపయోగించుచున్నారు

గ్రానులోమా ఇంగ్వినాలీ ఈవ్యాధికి కారణము తెలియదు దీనిని సుఖవ్యాధిగా పరిగణించవచ్చునా అనునదియు సందేహాస్పదమే! ఇది ఒకవ్రణముగా గర్భోత్పత్తియగు స్థానమున ప్రారంభమై వ్యాపించును ఈ వ్యాధి విస్తరించు శారీరక చిహ్నములేవియు స్పష్టముగ కాన్పింపవు కాని పరీక్షలఫలితముగా అందుజీవాణువులు గోచరించును ఫ్యురాన్ లేక ఏన్థియోమైసిన్ వంటి సూదిమందులవలన ఆరోమైసిన్ వలన మంచిఫలితములు కల్గుచున్నవి ఈ వ్యాధి తిరుగబెట్టు అవకాశము కలదు

సుఖవ్యాధుల నివారణము : భారతదేశములో ఈవ్యాధులకు గురియైన పెక్కురు వైద్యశాలలలో చికిత్సనొందుచున్నారు చికిత్సా విధానముతోపాటు ఇతర పద్ధతులవలనగూడ సుఖవ్యాధులను అరికట్టవచ్చును సంభోగసమయమున స్త్రీ పురు

షులు మర్మావయవములకు సురక్షితమైన పరికరము ఉపయోగించినచో కొంతవరకు సుఖవ్యాధులు వారిని అంటజాలవు ఎంథోగ్రానంతరము అభాగను లను వెక్కగా శుభ్రపరచి 33 శాతము కాల్‌మిల్ అయింట్‌మెంటును మర్దన చేయవలయును పై నివారణచర్యలను తీసికొనినను వ్యాధిసోకనే వైద్యునకు తెలియజేయుట మంచిది

ఎస్. వేం. రా.

## సుబ్బారావు బెల్లంకొండ

అభినవ కృష్ణుడని పేరుగాంచిన బెల్లంకొండ సుబ్బారావు జన్మస్థలము పలనాటిసీమయందలి కారెంపూడి గ్రామము ఈయన తన అపూర్వ నటనా కౌశలముద్వారా ప్రముఖుడై ఆంధ్ర నాటకరంగమును సజీవత మొనర్చిన కొలదిమందిలో ఒకడుగా ప్రశంసలు పొందినవాడు ఈయన విద్యార్థి జీవితము విశేషముగా గుంటూరుజిల్లాయందే గడచినది బందరునందలి నోబుల్ కళాశాలయందీతడు 1920-22 లో పట్టభద్రుడై 1923-25 సం॥ల నడుమ మద్రాసు న్యాయశాస్త్ర కళాశాలయందు న్యాయవాది పరీక్షలో ఉత్తీర్ణుడైనాడు అనంతరము నరసరావుపేట గురజాలనగరములలో కొంతకాలము న్యాయవాదిగను పిమ్మట గవర్నమెంటు ప్లీడరుగను వ్యవహరించినాడు

శ్రీ శ్రీ దుగిరాల గోపాలకృష్ణయ్య యడవల్లి సూర్యనారాయణ ప్రభృతులతో కలసి సుబ్బారావు అగ్రసోదరుడు లక్ష్మీనరసింహారావు నాటకములలో పాత్రలుధరించుచుండగా బాలుడగు సుబ్బారావు చిన్న చిన్న వేషములు ధరించుచు చక్కని అనుభవమును సంపాదింపగలిగినాడు

"గుంటూరుఏమెచూర్స్" నాటక సమాజమును స్థాపించినవారిలో సుబ్బారావొకడు ఈ సంస్థనిర్వహించిన గయోపాఖ్యానము లో కొంతవరకు కృష్ణుడుగను మిగిలిన భాగములలో అర్జునుడుగను ఇతడు పాత్రలు ధరించి పత్రికల మెప్పును పొందగల్గి బంగారుపతకములు సన్మానములు సంపాదించినాడు అనంతరము కొంతకాలము హరిశ్చంద్రుడుగను కృష్ణరాయబారములో దుర్యోధనుడుగను పాండవవిజయములో ధర్మరాజుగను గయోపాఖ్యానములో గయుడుగను వేషములు వేయుచు అత్యధికమైన ప్రశంసల నందుకొనినాడు పిమ్మట నక్షత్రకుడుగను బాహుకుడుగనుగూడ పాత్రధారియై విశేషఖ్యాతి గడించినాడు కొంతకాలము చింతామణి నాటకములో బిల్వమంగళుడుగను బొబ్బిలి నాటకములో పాపారాయుడుగను ప్రసన్నయాదవ నాటకములో నరకాసురుడుగనుకూడ సుబ్బారావు భూమికలు ధరించి మన్ననలందెనవాడు


బెల్లంకొండ సుబ్బారావు

అనంతరము నటకుడుగా పరిణతి పొందినపిదప ఆయన పాండవోద్యోగవిజయములలో కృష్ణపాత్రనుధరించి ఆ నాటకమునకు విశిష్ట స్థానమును చేకూర్చినాడు తన నాటకములో ఈపాత్రను అఖండ సామర్థ్యముతో నటించినందుకు శతావధాని చెళ్ళపిళ్ల వేంకట శాస్త్రి సుబ్బారావును మిగుల ప్రశంసించినారు ఆయన ముఖవర్చస్సు గంభీరముగ నుండి కృష్ణపాత్రకు సహజముగ అచ్చుగుద్దినట్లు సరిపోలుచుండెడివి ఆభూమి లో ఆయన వచనమును ఉచ్చరించుపద్ధతియు పద్యమును పఠించుతీరును కంఠమాధుర్యమును ప్రదర్శించు హావభావగాంభీర్యాదులును కృష్ణ పాత్రౌచిత్యమును సమర్థించునవిగనుండెను సుబ్బారావు నటించిన ఇతర పాత్రలన్నిటికంటె పాండవోద్యోగ విజయ నాటకమందలి కృష్ణభూమిక అత్యంతవిజయవంతముగ నుండుటచే ఈయనకు అభినవకృష్ణుడను బిరుదు సార్థకమైనది ఈయనను మీసాలకృష్ణుడని కొందరు ఆదరముతో పిలిచెడివారు తన నాటకబృందముతో ఈయన ఆంధ్రదేశమందే కాక మద్రాసు కలకత్తా బొంబాయి నాగపూరు మొదలైన నగరములందుకూడ పాండవోద్యోగ విజయనాటకములలో కృష్ణపాత్రను బహుసమర్థముగ నటించి అశేష ప్రజల ప్రశంసలను బంగారుపతకములను గెల్చుకొన్నారు

సుబ్బారావు తాను ధరించుపాత్రల అంతర్గర్భిత భావములను మనఃప్రవృత్తులను ఆకళింపుచేసికొని వాటితో తాదాత్మ్యమును పొందెడివాడు తనకంటె చిన్నవారిచేత నాటకములలో వేషములువేయించి ప్రోత్సహించెడివాడు పేదవిద్యార్థులకు చదువుచెప్పించి, విద్యాభివృద్ధికెంతయు తోడ్పడెడివాడు నాటకములాడగావచ్చు సంపాదనలో కొంత

భాగము పేదవిద్యార్థుల వసతిగృహనిర్మాణములకు ఆయన గుప్తముగ దానము చేయువాడట!

తన రెండవ కుమార్తె అకాల మరణముతో సత్యారావు మానసికముగను, శారీరకముగను క్రుంగి అస్వస్థుడై 1953 నవంబరు 21 వ తేదీన మరణించినాడు. ఆయన ఆంధ్ర నాటకరంగమునకు సల్పినసేవ చిరస్మరణీయమైనది.

పు వెం

## సుభాషచంద్ర బోసు

భారతభూమిని శ్వేతజాతివారి దాస్యశృంఖలములనుండి తప్పించుటకు ఎందరోమహనీయులు తమ సర్వస్వమును ధారవోసిరి. వారిలో భిన్నపద్ధతులను అవలంబించిన ఇద్దరు మనకు ముఖ్యులైనారు. సత్యాగ్రహాయుధముతో శాంతియుత విప్లవమును లేవదీసిన గాంధీజీ ఒకడు. మహత్తరమైన జాతీయసైన్యనిర్మాణముచేసి భీషణయుద్ధముజరిపి బ్రిటిషు వారిని గడగడలాడించిన సుభాషచంద్రబోసు మరియొకడు.

ఒరిస్సాకు పూర్వపు ముఖ్యపట్టణమైన కటకము నందు సుభాషుతండ్రి రావుబహదూర్ జానకీనాథబోసు సుప్రసిద్ధ న్యాయవాది. దేశాభిమానియైన జానకీనాథబోసు బ్రిటిషు వారి పరిపాలనయెడ నిరసనగా తన 'రావుబహదూర్' బిరుదమును పరిత్యజించెను. ఆయన ఎనిమిదిమందిపుత్రులలో ఆరవవాడై సుభాషు క్రీ శ 1897 జనవరి 23వనాడు జన్మించెను. స్వాతంత్ర్యసమరములో ప్రధానపాత్రదాల్చిన శరత్‌చంద్ర బోసు సుభాషునకు సోదరుడు.

చిన్ననాటినుండియు సుభాషు ప్రజాహిత కార్యకలాపనిమగ్నుడై తనతండ్రితోడి చర్చలకొరకు అనుదినమును పురప్రముఖులెందరో వచ్చుచుపోవుచుండుట శ్రద్ధాసక్తులతో ఆలకించుకొనగల అతని లోకజ్ఞానము లోకప్రసిద్ధమైనది. విజ్ఞానవతియైన తల్లి ప్రభావతి బోధయు అతనికి మార్గదర్శకమైనది.

ప్రాథమికోన్నతపాఠశాలావిద్యాదశలో బోసు ప్రథముడుగ పరిగణనమొందెడివాడు. క్రీ శ 1913 లో స్కూలు ఫైనల్ పరీక్షయందు సుభాషు రాష్ట్రద్వితీయుడుగ ఉత్తీర్ణుడయ్యెను. అవిమ్మట ప్రవేశించిన కలకత్తాయందలి ప్రెసిడెన్సీ కళాశాలకు ఓటన్ దొర ప్రిన్సిపాలుగనుండెడివాడు. అతడు విద్యార్థులను అవమానించుచుండుటయు వారు బాధపడుచు కూడ ఏమియు చేయలేకుండుటయు బోసు పరికించినాడు. ఒకనాడట్టి సన్నివేశమేర్పడినపుడు బోసు సైపలేక ప్రిన్సిపాలను చెంపమీద చెళ్లున కొట్టగా అతడు కళాశాలనుండి బహిష్కరింపబడెను. రెండేడ్ల అనంతరమతడు కలకత్తాలోని 'స్కాటిష్‌చర్చి' కళాశాలయందు ప్రవేశించి క్రీ శ 1919లో ప్రథముడుగ పట్టభద్రుడైనాడు.

పట్టభద్రుడగునప్పటికే తనకు రాజకీయములలో చక్కని పరిజ్ఞానము కలుగగా అతడు భారతదేశస్వాతంత్ర్యసమరములో పాల్గొనవలెనని సంకల్పించుకొనెను. అదేవేళకు భారతదేశములో ఆంగ్లప్రభుత్వము రౌలట్ శాసనమును ప్రవేశపెట్టినది. బోసునందు పెరిగిన స్వదేశాభిమానరతి నిస్సీమముగ హెచ్చెను. కాని అతనిని ఐ సి యస్ కొరకు పంపవలెనని తండ్రి కాంక్షయు అధికమైనది. బోసు ఇంగ్లండుపోయి ఐ సి యస్ లో నెగ్గెను. కాని మాతృదేశసేవాభిలాష అతనిచే ఐ సి యస్ పట్టమును వదలుకొనునట్లు చేసెను. క్రీ శ 1921లో అతడు భారతదేశమునకు మరలివచ్చినాడు.

వచ్చుటనే అతడు గాంధిమహాత్ముని కలిసికొని ఆయన ఉపదేశమునుబట్టి దేశబంధు చిత్తరంజనదాసునకు రాజకీయములలో శిష్యుడైనాడు. దాసు తాను నెలకొల్పిన జాతీయ కళాశాలకు బోసును ప్రిన్సిపాలుని చేసెను. విద్యార్థులలో జాతీయభావమును వెల్లువింపచేయుటకై బోసు తనశక్తిని వినియోగమొనర్చి చాలమంది స్వాతంత్ర్యసమరయోధులను సంసిద్ధముచేసినాడు. అప్పుడు బోసు వంగరాష్ట్రకాంగ్రెసు సంఘమునకు ప్రచారశాఖాధికారికూడ.

అదేసమయములో భారతీయులయందు ప్రభుభక్తి వర్ధిల్ల చేయవలెననుకొని బ్రిటిషువారు ప్రిన్స్ ఆఫ్ వేల్సును భారత దేశమునకు తీసికొనిరాగా కాంగ్రెస్ ఆదేశమునుబట్టి అతని రాకకు నల్లజెండాలతో నిరసన వెల్లడించి చిత్తరంజనదాసు మోతీలాల నెహ్రూలతోపాటు సుభాషు ఆరుమాసముల దండనకు గురియయెను. అతరువాత చిత్తరంజనుడు కాంగ్రెసు అధ్యక్షుడుగాగయలో ఎన్నికయై కాంగ్రెసుస్వరాజ్యపక్షమును స్థాపించి కేంద్ర రాష్ట్ర ప్రభుత్వములయందు కాంగ్రెసు ప్రవేశించి ప్రభుత్వ రాజ్యాంగమును భగ్నము చేయుట్లు కోరుచు ఆస్వరాజ్యోద్యమమునకు ఒకస్వచ్ఛందదళమును నిర్మింపించెను. దానికి బోసు అధికారి. తన రాజకీయభావముల ప్రచారము కొరకు దాసు 'ఫార్వర్డ్' అను ఒకదినపత్రికను నెలకొల్పి దానికి బోసును సంపాదకునిగ చేసినాడు. 1924లో కలకత్తా

నగరపాలకసంఘాధ్యక్షుడుగా దాసు ఎన్నికయ్యె బోసును ప్రధాన కార్యనిర్వాహకాధికారిగ నియమించుకొనెను. బోసు ఇట్లు ప్రజాదరణము సంపాదించుట కోర్వలేక బ్రిటిషు ప్రభుత్వమాతనిపై ఏదోనేరము మోపి అక్టోబరు 1924లో నిర్బంధములోనికి తీసికొని విచారణచేయక ప్రజాభీష్టమునకు వ్యతిరేకముగ బరంపురము అలీపురము మాండలేవంటి పెక్కుచెరసాలలకు రెండున్నర యేండ్లపాటు త్రిప్పెను.

ఇట్లు చాలాకాలము కారాగారములలో నుండుటవలన బోసు ఆరోగ్యము పూర్తిగ క్షీణించినది. ఆయనను అప్పుడు మాండలేనుండి ప్రభుత్వము రంగూను చెరకు మార్చెను. ఆయన విడుదలనుగూర్చి దేశవ్యాప్తముగ ప్రజాందోళనము దారుణముగ సాగినది. తాను భారతదేశమున దిగక రంగూను నుండి హుటాహుటిగ స్విట్జర్లాండు వెళ్ళి చికిత్సపొందవలెననెడి ప్రభుత్వ నియమమునకు బోసు తలయొగ్గమిచే గత్యంతరములేక ప్రభుత్వమాతనిని 1927 లో నిర్బంధవిముక్తుని చేసెను. కాని తాను మాండలే చెరలోనుండగనే చిత్తరంజనదాసు స్వర్గస్థుడైనందులకు ముందే కుందుచున్న బోసునకు రంగూన్ కారాగార విమోచనము జరుగగనే స్వరాజ్యపార్టీని నడపు బాధ్యత యొకటి పైబడినది. ఇంతలో మదరాసు కాంగ్రెసు మహాసభల యందు బోసు నెహ్రూతోపాటు కాంగ్రెసు కార్యదర్శిగ కూడ ఎన్నికయ్యెను.

ఇట్లుండ చిత్తరంజనుడు మరణించుటచే కాంగ్రెసులో మితవాదశక్తి పైచేయికాగా, కలకత్తాలో కాంగ్రెసు సభలుముగియగనే 1928) అఖిలభారతయువజనసంఘమహాసభ' లకు అధ్యక్షుడై మితవాదతత్త్వమును దుయ్యబట్టుచు చరిత్రాత్మకమైన ప్రసంగముచేసి యువలోకమును ఉత్తేజపరచి దానికి నేతాజీ అయ్యెను. ఆ పిదప 1929 లో లాహోరు కాంగ్రెసునకు నెహ్రూ అధ్యక్షుడైనపుడు బోసు చిరస్మరణీయమైన ప్రసంగము సలిపి లాహోరుకాంగ్రెసు సభలయందు భారతదేశ సంపూర్ణ స్వాతంత్ర్యతీర్మానమును జనవరి 26 నాడు ఆమోదింపజేసినాడు. ఈనాటి జనవరి 26 నకు గల పూర్వప్రాధాన్యమిది. క్రీ. శ. 1930 లో వంగరాష్ట్రమందు ఉప్పుసత్యాగ్రహమును అఖండవిజయప్రదమొనర్చి నేతాజీ తిరిగి తొమ్మిదిమాసములు చెరసాలపాలయ్యెను. ఆ శిక్షననుభవించుచు చెరలోనున్నప్పుడే అతడు కలకత్తా నగరపాలక సంఘాధ్యక్షుడుగ ఎన్నుకొనబడినాడు. చెరవదలిన పిదప భారత ట్రేడ్ యూనియను కాంగ్రెసు అభివృద్ధికి తీవ్రముగ పాటుపడి దానికధ్యక్షుడుగ ఎన్నుకొనబడెను. సంపూర్ణస్వాతంత్ర్య తీర్మాన దినోత్సవమును (జనవరి 26) కలకత్తాలో ప్రభుత్వము నిషేధింపగా దానిని ఉల్లంఘించి తీవ్రమైన లాఠీదెబ్బలకు గురియై తిరిగి 6 నెలలు చెరసాలలో ఉన్నాడు. ఇట్లే 1932 నందుకూడ కారాగారవాస పీడితుడై ఆరోగ్యమును పూర్తిగ కోలుపోగా ప్రభుత్వమాతనిని 1933 లో యూరపువెళ్లి చికిత్స పొందుటకై విడుదలచేసినది.

చికిత్సకొరకై ఆస్ట్రియాకు రాజధానియైన వియన్నా నగరమునుచేరి నతడు యాదృచ్ఛికముగ అచటకు వచ్చిన విఠల్‌భాయిపటేలుతో కలిసి మాతృదేశవిముక్తికి సాధనములను అరయుచునే ఉండెడివాడు. తాను నడుపు సత్యాగ్రహోద్యమ సందర్భమున ఎచ్చటనో ఎవరో బ్రిటిష్ అధికారులపై హింసాచరణ జరుపుటను కారణముగ పురస్కరించుకొని గాంధి మహాత్ముడు హఠాత్తుగ ఆ ఉద్యమమును నిలుపుచేసెను. అట్లు చేయుట మితవాదపక్షమువారు తమ పరాజయము నంగీకరించుటయే అని బోసు విఠల్‌భాయిలు వియన్నానుండి ప్రకటించి భారతదేశమునకు విప్లవనాయకత్వము ఆవశ్యకమనియు కాంగ్రెసు ఒక అతివాదపక్షమును నెలకొల్పవలెననియు వాదించిరి. తన ఆరోగ్యము కొంత కుదుటపడగానే యూరపుఖండ పర్యటనమునకు పూని భారతదేశ స్వాతంత్ర్య సమరమును గురించి బోసుచేసిన మహోపన్యాసములు విదేశీయులను ఆకర్షించినవి. తండ్రి తీవ్రవ్యాధిగ్రస్తుడగుటచే అతడు స్వదేశమునకు రాకతీరలేదు. తాను వచ్చుసరికే తండ్రి పరమపదించుట అతనికి వేరొక ఆఘాతమైనది. అప్పుడు దానికితోడు ప్రభుత్వమాతనికి గృహనిర్బంధమును విధించెను. ఇన్ని కష్టములతో అతనికి అనారోగ్యము మరల తిరుగబెట్టినది. 1935 జనవరిలో తిరిగి వియన్నాకుపోయి చికిత్సనొంది 1936 ఏప్రియలులో మాతృదేశమును చేరెను. చేరగనే తనను గూర్చి విదేశములలో దుష్ప్రచారము చేసినాడను నేరము మోపి బ్రిటిషుప్రభుత్వమాతనిని మరల నిర్బంధించినది. 1937 లో రాష్ట్రవ్యాప్తంగా ఎన్నికలు జరుగనుండుటచే ప్రభుత్వమాతనిని విడుదలచేసినది.

క్రీ. శ. 1938 లో హరిపురమునందు అఖిలభారత కాంగ్రెసునకు బోసుమహాశయుడు అధ్యక్షుడైనాడు. రష్యా సోషలిస్టువ్యవస్థను దృష్టాంతీకరించి చరిత్రనుండి క్రొత్త గుణపాఠము నేర్చుకొని వలసలను వీడినగాని సామ్యవాదసిద్ధాం

సామ్యవాదిక రాజ్యముగా భారతదేశము రూపొందవలెనని నేతాజీ తన అధ్యక్షోపన్యాసమందు వక్కాణించెను. హరిపుర కాంగ్రెసుమహాసభ ముగిసినపిదప బోసు భారతదేశమంతట పర్యటించి సామ్యవాదసిద్ధాంతమును గూర్చి విశేషముగా ప్రచారముచేసి ముఖ్యముగ యువతరమువారిని ఎక్కువగా ఆకర్షించినాడు. పిమ్మట 1939 నందు కాంగ్రెసు అధ్యక్ష స్థానము కొరకు బోసునకును డాక్టరు పట్టాభికిని నడుమ పోటీ జరుగుటయు అందు జరిగిన పట్టాభి ఓటమిని గాంధిమహాత్ముడు తన ఓటమిగనే భావించుటయు జగద్విదితము. కొలదిదినములలో కాంగ్రెసు మహాసభలు జరుగనున్నవనగా మౌలానా అజాద్, సర్దారుపటేలు, నెహ్రూ, రాజేంద్రప్రసాదు ప్రభృతులు ఒకే సారిగ తమ కాంగ్రెసు కార్యవర్గసభ్యత్వములను వదలుకొనిరి. తీవ్రజ్వరముతోనుండియు బోసు త్రిపురకాంగ్రెసు మహాసభా ధ్యక్షతవహించి భారతీయుల స్వరాజ్యవాంఛను బ్రిటిషువారికి తుది హెచ్చరిక రూపములో ఎరుకచేసినారు. అది మితవాదు లకు రుచించలేదు. అందుచే రానున్న క్లిష్టసమయములో దేశ మును గాంధీజీ ఒక్కడే సమర్థతతో నడపగలడు గాన కాంగ్రెసువర్గమును ఆతని అభీష్టానుసారముగ నియమింపవలె నని ఆ సభలో గోవిందవల్లభపంతు తీర్మానమును ప్రతిపాదించెను. అతివాదులు దానిని వ్యతిరేకించినను అధికసంఖ్యాకులు అనుకూలముగ ఓటుచేయుటచే తీర్మానము నెగ్గెను. అంతటితో బోసు తన అధ్యక్షపదవిని వదలుకొని కాంగ్రెసుతో సంబంధమును తెగత్రెంపులు చేసికొనెననవచ్చును. బోసు జీవితములో ఇదియొక గొప్పపరివర్తనమును తెచ్చిపెట్టిన సంఘటన.

క్రీ.శ. 1939 మే నెలలో కాంగ్రెసునందలి వామపక్ష శక్తులను సమీకరించి ప్రజ్వలింపజేయు ఉద్దేశముతో బోసు 'ఫార్వర్డుబ్లాకు'ను నెలకొల్పినాడు. దీనికి ఒక నిర్ణీతనియమపూర్వక కార్యక్రమము కలదు. రాష్ట్రములన్నిటియందును శాఖోపశాఖలేర్పడినవి. 'ఫార్వర్డుబ్లాకు' అను ఒక ఆంగ్లవారపత్రికను కూడ తన ఆశయముల ప్రచారముకై బోసు దీనికి అంగముగ నెలకొల్పెను.

కలకత్తానగరమునందున్న 'హాల్వెల్' శిలావిగ్రహమును తొలగింప నెంచినందులకు ప్రభుత్వము బోసును 1940 జులైలో మరల చెరయందుంచెను. దానిపై కలకత్తా ప్రజలలో తీవ్ర సంచలనము బయలుదేరి అది మహోద్యమముకాగా, ప్రభుత్వమే హాల్వెల్ విగ్రహమును అచ్చటినుండి తొలగించినది. కాని నేతాజీని మాత్రము విముక్తుని చేయలేదు. ఆంగ్లప్రభుత్వము ద్వితీయప్రపంచసంగ్రామములో చిక్కుకొని బాధలు పడుచున్న సమయమని, అట్టి అనుకూలావకాశమును పురస్కరించుకొని బోసు తన చెరలో ఆమరణ నిరాహారదీక్షబూని యెటకేలకు బంధవిముక్తుడైనాడు. కాని గృహనిర్బంధితుడై ప్రజాశక్తిని సమీకరించు అవకాశమును కోల్పోయెను. అప్పు డాయన ఒక నిర్ణయమునకువచ్చి కార్యక్రమమును రూపొందించుకొనినాడు. దానిప్రకారము భారతదేశములో నుండుటకంటె బైటనుండియే బ్రిటిషువారిపై తీవ్ర రణసన్నాహములు చేయవలెను. ఈ దేశములో చూచుచున్నచో తన ఆశయములకు పూర్తిగ మద్దత్తు లభింపలేదు. మితవాదసంస్థయైన కాంగ్రెసు బ్రిటిషువారితో రాజీచేసికొను ధోరణిలో పడినది. అందుచే గృహనిర్బంధమందున్న రెండు నెలలలో పైనిశ్చయాభిప్రాయమునకు అతడు వచ్చినాడు.

1941 జనవరి 26 నాడు వెలువడిన ప్రభుత్వప్రకటన భారతభూభాగమునుండి నేతాజీ అంతర్ధానమైనట్లు తెలిపెను. అతని యింటిలోనివారికికూడ అతడున్న జాడ రవంతయు తెలియదు. అతనికి కాబూలులో ఉత్తమచంద్ అను భారతీయ వణిజుడు ఆతిథ్యమిచ్చి తనమాతృదేశభక్తిని వెల్లడించుకొనెను. 1941 మార్చి 18 నాడు నేతాజీ కాబూలునుండి ముజొట్టా అను పేరిట ప్యాస్‌పోర్టు సంపాదించి మార్చి 27 నాడు బెర్లినుచేరిన ఉదంతము ఒక గ్రంథము కాగలదు.

నేతాజీ తానుముందే రూపొందించుకొనియున్న కార్యక్రమమునుబట్టి ఆజాద్‌హింద్ ఫౌజ్ అను భారతజాతీయ సైన్యము నొకదానిని నిర్మించి భారతదేశపు ఎల్లలవెలుపల ఒక స్వతంత్ర భారత ప్రభుత్వముకూడ ఏర్పరచినాడు. ఇంతలో ద్వితీయప్రపంచయుద్ధమునందు బ్రిటిషు వారిపక్షమున పోరాడు భారతయోధులు సుమారు 2700 మంది జర్మనులకు వశమైరి. వారందరును నేతాజీ జర్మనీ చేరి భారతస్వాతంత్ర్యమునకు కృషిచేయుట యెరిగి సంతోషపూర్వకముగ 'ఆజాద్ హింద్ ఫౌజ్'లో చేరినారు. ఉమ్మడి శత్రువైన బ్రిటనుతో పోరుటకు జర్మనీసహాయ్యమును భారతీయులు సద్వినియోగము చేసికొనవలెనని నేతాజీ వారికి బోధించెను. తనయత్నము ఫలించినచో స్వాతంత్ర్యలక్ష్మిని బాపూజీ పాదముల చెంతనుంచుటయే తనలక్ష్యమని నేతాజీ వక్కాణించి జర్మనీనుండి మరల అంతర్ధానమై సింగపూరుచేరి

ఆజాద్ హింద్ ఫౌజును నిర్మించవచ్చునట్లు రేడియో ప్రసంగము ద్వారా వెల్లడించినాడు. ఆ ఫౌజు కాతడు సర్వాధికారి. 1948 జులైలో భారతస్వాతంత్ర్యసాధనసంఘము నొకదానిని అతడు నెలకొల్పెను. అక్టోబరు 21 నాడు యానన్ లో ఆజాద్ హింద్ ప్రభుత్వమును కూడ నెలకొల్పినాడు. బ్రిటిషువారిపై యుద్ధమును ప్రకటించి దానిని నిర్వహించుటకు ప్రత్యేక సైన్యము. ఆ ప్రభుత్వ సైనికశాఖయే ఆజాద్ హింద్ ఫౌజు. 'ఛలో ఢిల్లీ' అనునది దాని నినాదము.

ప్రజల నిరాశయములు కొన్నికోట్ల రూప్యములు ప్రోగైనవి. అజాదువారు బ్యాంకు కూడ స్థాపనమయ్యెను. కాని వందలయేండ్లుగ భారతదేశమునందు పాతుకొనిపోయిన పరప్రభుత్వమును పారద్రోలి జాతీయప్రభుత్వనిర్మాణము చేయుట ఒకనితో అగు పనికాదు. ఆజాదువారు మంత్రివర్గమును కూడ అతడేర్పరచినాడు. దానికి తాను తాత్కాలికప్రధాని. 1948 అక్టోబరు 24నాడు బ్రిటనుపై అతడు యుద్ధము ప్రకటించినాడు. భారతప్రజానీకము సంతోషసంరంభములతో నిండిపోయినది. శత్రుసేనను కనబడినచోటనెల్ల ఆజాద్ హిందు ఫౌజు చెండాడసాగెను. 1944 ఫిబ్రవరి 4 నాడు ఆజాద్ హిందుసేన భారతదేశములోని బ్రిటిష్ ప్రభుత్వముపై యుద్ధమునకు దిగినది. నయాపిఎయను నేతాజీ సైనికులచేతికి చిక్కెను. మార్చి 6 వ తేదీ నీలాడను కూడ పతనమై నేతాజీకి వశమయ్యెను. ఈ విజయోత్సాహముతో 1914 మార్చి 19 నాడు ఫౌజు ఇండియా - బర్మా యెల్లలనుకూడ దాటి తన మాతృదేశమునందు ప్రవేశించినది. ఒక్కనెలలోనైన తిరుగలేని పెక్కుప్రాంతములను వశము చేసికొన్నది.

కాని ఆయుధములు ధనము తదితర సౌకర్యములును బ్రిటిషువారికున్నట్లు బోసునకెట్లు సిద్ధింపగలవు! గత్యంతరము లేక తిరోగమించెను. బోసు తుదిసారిగ మరల అంతర్ధానమైనాడు. ఒక విమానప్రమాదములో అతడు మరణించెనని కొందరును నేటికిని జీవించియేయున్నాడని మరికొందరును భావించిరి. సజీవుడైయుండుట నిజమేఅగుచో స్వదేశమునకు తిరిగివచ్చి భక్తులను తీర్చిదిద్దలేకుండునట్టి ఆలసుడగునా! ఏమైనను అతడు నేడు మనమధ్యలేడు.

వి వి ఠ శ

## సుమత్ర

సుమత్ర అనునది హిందూమహాసముద్రములోని యొకపెద్ద ద్వీపము. ఇది మలక్కాజలసంధిచేత మలయాద్వీపకల్పమునుండియు సుందాజలసంధిచేత జావానుండియు వేరుచేయబడుచున్నది. దీనిని మధ్యగా భూమధ్యరేఖ పోవుచున్నది. అందుచే ఇచట వేడి యెక్కువగా నుండునని యనవచ్చును. కాని ఇది సముద్రమునకు మధ్యనుండుటచే ఇచట వాతావరణము సామాన్యముగ చెమ్మగనుండును. ఈ దీవి వాయవ్య - ఆగ్నేయదిశలకు విస్తరించియున్నది. దీనిపొడవు సుమారు 1100 మైళ్లు. వెడల్పు 250 మైళ్లు. వైశాల్యము 1 60 0 0 0 చ॥ మైళ్లు. ఈ దీవియొక్క తూర్పు పశ్చిమతీరము పొడవున కొన్ని చిన్న దీవులు కలవు. ఇది ప్రస్తుతము ఇండోనీషియాదేశములో నొక భాగము.

ఈ దీవిలో అనేకనదులు ప్రవహించుచున్నవి. అందు మూసి, జాంబి, ఇంద్రగిరి, కాంపర్, సియాక్, రోకన్, బలాపనై అనునవి ప్రధానమైనవి. ఈ ద్వీపపు పశ్చిమతీరప్రాంతమంతయు పర్వతశ్రేణులచే ఆవరింపబడియున్నది. ఈ పర్వతములకును సముద్రమునకును మధ్య కొన్ని సారవంతమైన భూములున్నవి. ఈ పర్వతములకు తూర్పున విస్తారమైన ఎగుడుదిగుడు మైదానభూములు గలవు. సుమత్ర అగ్నిపర్వతములకు పుట్టినిల్లు. ఈ దేశములో సంవత్సరమునకు 80 మొదలు 180 అంగుళములవరకు వర్షము పడుచుండును. ఇచట అడవులు మెండు. ఈ యడవులలోను పర్వతములపైనను అనేకరకముల వన్యమృగములు వాసము చేయుచున్నవి. ఈ దీవియందు సతతహరితములగు నాడీమండలవృక్షజాలము విరివిగ పెరుగును. అందు పైన్, గోవాచెట్టు, చింత, కొబ్బరి, నారింజ కివక్కి గణనీయమైనవి. అచటి సంపదను వృద్ధిచేయుటలో ఈ వృక్షజాతులు ప్రముఖపాత్రను వహించుచున్నవి.

సుమత్రలో వివిధజాతుల ప్రజలు నివసించుచున్నారు. స్థానికులగు మలయసంతతివారగాక చైనీయులు యూరోపియనులు, అరబ్బులు ఉన్నారు. స్థానికప్రజలలో అనేకజాతులవారున్నారు. అందు అచినులు లాంపాంగులు బట్టకులు రాజంగరులు అను తెగలు పేర్కొనదగినవి. ఓరాంగ్-కుబూ, ఓరాంగ్-లుబూ యనెడి ఆటవికులు కొరించిలు యను కొండజాతివారుకూడా నున్నారు. క్రైస్తవులు,

మహమ్మదీయులు బౌద్ధులు హైందవులు (శైవులు) విశేషముగనున్నారు జనాభా 1 88 00000

సుమత్రదీవిలో చెరకు కాఫీ వరి మొక్కజొన్న పొగాకు నీలియాకు ప్రత్తి బంగాళదుంప మొదలగు పైరులు విరివిగ పండును కొబ్బరి రబ్బరుతోటలకు కొదువలేదు సుగంధద్రవ్యములకీద్వీపము కాణాచి జామ నిమ్మ నారింజ మొదలగు ఫలములీ దేశములో కోకొల్లలు వ్యవసాయము పశుపోషణము చేపలుపట్టుట ఖనిజములు వెలికితీయుట ప్రజల ప్రధానవృత్తులు పెంపుడుజంతువులలో వరాహములు ఆవులు గుఱ్ఱములు ముఖ్యములు ఖనిజసంపదలో బంగారము రాగి ఇనుము బొగ్గు సున్నపురాయి లిగ్నైట్ పటిక గంధకము ప్రధానమైనవి పెట్రోలియమ్ కూడా విస్తారముగ లభించును ఇచటినుండి రబ్బరు కొబ్బరి సింకోనా కోకో కాఫీ చేకు వెదురు కర్పూరము మొదలగునవి అధికముగ ఎగుమతిచేయబడును

సుమత్రయొక్క నాగరికతాసంస్కృతులకు మాతృక హైందవసంస్కృతియేనని నిర్ద్వంద్వముగ చెప్పవచ్చును తొలుదొల్త భారతీయులెందరో ఈద్వీపమునకు వలసబోయిరి వారిలో కొందరు వ్యాపారము నిమిత్తమును మరికొందరు మతప్రచారముకొరకును వెళ్లిరి వలసవెళ్లిన భారతీయులలో కొందరచట రాజ్యములను స్థాపించి పాలించిరి సుమత్రాలోని పాలెంబాంగ్ను రాజధానిగ క్రీ శ 7వ శతాబ్దములో శ్రీవిజయరాజ్యము స్థాపించిన శైలేంద్రులు భారతీయులే! ఒకానొకప్పుడు సుమత్రలో భారతీయులు సర్వాంగసార్థకారులైయుండిరి వారు భారతీయసంస్కృతిని అచ్చటి దిగుమతిచేసి ఈదీవిని భారతావనికి ప్రతిరూపముగ మార్చివైచిరి ఐటూర్, పెర్తిలి జాంబి మున్నగు ప్రాంతములలోని హైందవజీర్ణదేవాలయములు బౌద్ధస్తూపశిథిలములు పాగార్ జంగ్ వద్ద లభించిన సంస్కృతభాషా శిలాశాసనములు ఈవిషయమును చాటిచెప్పుచున్నవి

క్రీ శ 13వ శతాబ్దములో అరబ్బులును 16వ శతాబ్దములో యూరోపియనులును ఈదీవిపై కాలుపెట్టిరి అచ్చట వర్తకస్థావరముల నేర్పరచుకొన్న యూరోపియనులలో మొదటివారు పోర్చుగల్ దేశీయులు వీరివెనుక డచ్చివారు వచ్చి బలపడి పోర్చుగీసువారిని తరిమివేసిరి అనతికాలములోనే ఆంగ్లేయులు వచ్చి డచ్చివారికి ప్రత్యర్థులుగ నిలిచిరి 1685 సం లో ఆంగ్లేయులు బెంకూలెన్ వద్ద నొక వర్తకస్థావరమేర్పరచుకొని వ్యాపారము చేయదొడగిరి క్రమముగ డచ్చివారికిని ఆంగ్లేయులకును యుద్ధ సంఘర్షణలుఘటిల్లినవి 1824వ సం॥లో వీరిరువురు నొకయొడంబడిక జేసికొని ఆంగ్లేయులు సుమత్రను డచ్చివారికి వదలివెళ్లునట్లును ప్రతిఫలముగ ఆంగ్లేయులకు మలక్కాను డచ్చివారిచ్చునట్లును ఏర్పాటుగావించుకొనిరి 1825 వ సం॥ లో డచ్చివారు బెంకూలెన్ను ఆంగ్లేయులనుండి స్వాధీనపరచుకొనిరి పిదప డచ్చివారు క్రమముగ సుమత్రనంతటిని జయించి తమ అధీనములోనికి తెచ్చుకొని పాలింపసాగిరి

డచ్చివారు సుమత్రను 1945 వ సం॥ వరకు తమయధీనములో నుంచుకొనగల్గిరి 1945 ఆగస్టు 17 వ తేదీన డాక్టర్ సుకర్నో నాయకత్వమున ఇండోనీషియా ప్రజాసత్తాకరాజ్యముగ రూపొందినది సుమత్రకూడ ఇండోనీషియాలో నొకభాగముగ పరిగణింపబడుటచే నాటితో ఈదీవి ప్రజలు పరాయిపాలనమండి విముక్తులైరి స్వాతంత్ర్యానంతరము ఇండోనీషియా కేంద్రప్రభుత్వము పరిపాలనాసౌలభ్యమునకై సుమత్రను అరురాష్ట్రములుగ విభజించినది ప్రతిరాష్ట్రమున కొకగవర్నరు పాలనాధిపతిగనుండును పాలనావ్యవహారము లందు గవర్నరుతో సహకరించుటకై రాష్ట్రీయసంఘమొకటి యుండును ఇండోనీషియారాజ్యములో నొకభాగముగ సుమత్ర పురోగమించుచున్నది

ఎ వెం

## సుశ్రుతుడు

ఆయుర్వేదశాస్త్రము అష్టాంగవిశిష్టమైనది అష్టాంగములలో శస్త్ర (శల్య) చికిత్సకూడ ఒకటి దీనినే శల్యతంత్రమని కూడ అందురు ధన్వంతరిసంప్రదాయమునకు చెందినవారందరు శస్త్రచికిత్సకు ప్రాధాన్యమిచ్చియున్నారు

కాశీపట్టణప్రభువుగా అవతరించిన దివోదాసధన్వంతరియొద్ద సుశ్రుతుడు శస్త్రవిద్యను అభ్యసించెను తాను గురువునొద్ద నేర్చిన విద్యనంతటిని సహాధ్యాయులకు వివరించిచెప్పుటయేగాక "సుశ్రుతసంహిత" యను పేర ఒకగ్రంథమునుకూడ రచించినాడు ఇప్పుడు అది మనకు లభించుచున్నది

సుశ్రుతుని పేరు అథర్వవేదములోకూడ వినవచ్చుచున్నది రామాయణకాలమునాటి విశ్వామిత్రకుమారుడుగ కూడ కొన్ని ఉదాహరణములు కలవు మహాభారతమునను

సుశ్రుతుని ప్రశంసకలదు ఇందువలన సుశ్రుతుడు పురాణ పురుషుడని నమ్మవలసియున్నది చరిత్రాధారములనుబట్టి ఇతడు క్రీ పూ 1000 సం॥లనాటివాడని కొందరును క్రీ పూ 600 నాటివాడు కాదగునని మరికొందరును అభిప్రాయపడుచున్నారు

వేదపురాణాదులలోని సుశ్రుతుడు వృద్ధసుశ్రుతుడనియు గురుపరంపరలోని సుశ్రుతుడు వేరొకసుశ్రుతుడనియు కొందరు భావించుచున్నారు వీరిలో ఏసుశ్రుతుడు మొదట "సుశ్రుత సంహిత"ను రచించినాడో సరిగానిర్ణయించుటకు తగిన ఆధారములు లేవు

"సుశ్రుతసంహిత" క్రీ పూ 6 7 శతాబ్దులకు చెందినదిగా చరిత్రకారులు నిర్ణయించినారు ఇది అరబ్బీ చైనా లాటిన్ ఇంగ్లీషు జర్మనుభాషలలోనికూడ అనువదింపబడినది చైనా యాత్రికుడు ఇత్సింగుకూడ దీనిని ఉదాహరించినాడు

సుశ్రుతసంహిత—సూత్ర నిదాన శారీర చికిత్సాకల్ప స్థానములుగా 5 భాగములు కలిగి 120 అధ్యాయములతో నున్నది ఉత్తరతంత్రమను పేర, 66 అధ్యాయములుగల మరికొంత గ్రంథభాగమును కనిష్కునికాలమునాటి (క్రీ పూ 5 శ) నాగార్జునుడు రచించి దీనికి చేర్చినాడని ప్రతీతికలదు అయితే సుప్రసిద్ధులైన ఇద్దరుముగ్గురు నాగార్జునులలో ఇతడెవరో స్పష్టముగా చెప్పలేము సుశ్రుతమునకు నాల్గు వ్యాఖ్యానములు ప్రసిద్ధమైనవి కలవు చక్రపాణిదత్తుని భానుమతివ్యాఖ్య (క్రీ శ 1060) గయదాసకృతన్యాయచంద్రిక లేక పంజిక (క్రీ శ 1100) డల్హణవిరచిత నిబంధసంగ్రహము (క్రీ శ 12వ శతాబ్ది), హారణచంద్రచక్రవర్తి (క్రీ శ 19వ శతాబ్ది) ఇవిగాక జెజ్జట భాస్కర మాధవ బ్రహ్మదేవులుకూడ వ్యాఖ్యలు రచించినారటగాని అవిసంపూర్ణముగా లభించుటలేదు

శస్త్రచికిత్స సద్యఃఫలదాయకమగుటచేత అన్నిచికిత్సలకంటె దీనికి సుశ్రుతుడు ప్రాధాన్యమిచ్చి గ్రంథమును రచించినాడు ఈతని శస్త్రచికిత్సాకౌశలము అసామాన్యమైనది శస్త్రచికిత్సావలంబకులకు శరీరశాస్త్రజ్ఞానము (రచనా శారీరము) పరమావశ్యకమగుటచేత సుశ్రుతుడు విపులముగా తనగ్రంథమునందు ప్రత్యక్షజ్ఞానముకలుగునట్లు శవపరిచ్ఛేదన విధానమునుగూడ వివరించి చెప్పినాడు రక్తముకూడ, వాతపిత్తకఫములవలె ధాతువులను దూషింపజేయునదగుటచేత, రక్తమును నాల్గవదోషముగా పరిగణించినాడు

సైనికుల ఆరోగ్యరక్షణ గాయపడినసైనికుల చికిత్స శల్యోద్ధరణ శస్త్రచికిత్స విషప్రయుక్తమైన ఆహారపానీయ తృణకాష్ఠాదులనుండిరక్షణ మొదలైన విశేషవిషయములు సుశ్రుతమున గలవు ప్రాచీనకాలమున రాజుల విజయ యాత్రలకు సాధకమైన యుద్ధములు శస్త్రచికిత్సాభివృద్ధికి చాలవరకు తోడ్పడినవి రాజులవెంట వారిసైన్యములవెంట శస్త్రవైద్యుడుండి పైవిషయములలో జాగ్రతలు తీసికొని ప్రాణాచార్యుడుగా మెలగవలసిన అవశ్యకమును ఆనాడే గ్రహించి ఆచరణలో పెట్టినట్లు "సుశ్రుతసంహిత వలన తెలియుచున్నది యంత్రములు శస్త్రములు శ్రేష్ఠమైన ఉక్కుతో తయారుచేయబడి రోమములనుగూడ నిలువున ఛేదించగలట్టిపదును గలవిగానుండవలెనని సుశ్రుతుడుచెప్పినాడు శస్త్రచికిత్సకు పూర్వకర్మ ప్రధానకర్మ పశ్చాత్కర్మ - వీటి ప్రాముఖ్యము వీటిలో ఏయేజాగ్రతలు తీసికొనవలెనో ఏయే ఉపకరణములను సిద్ధపరుపవలెనో ఏయేశోధనపాయనవిధులను ఎట్లు ఎప్పుడు ఆచరింపవలెనో రోపణ కావన బంధన విధులెన్నివిధములో వాటినెట్లు చేయవలెనో వీటినిగూర్చి సుశ్రుతుడు చెప్పిన విషయములను పరిశీలించినచో నేడు ఆరితేరిన శస్త్రవైద్యులకుకూడ ఆశ్చర్యము కలుగగలదు

గర్భిణిస్త్రీ ప్రసవించలేనపుడు కుక్షిని ఛేదించి గర్భస్థ శిశువును ఎట్లు కాపాడవలసినదియు చీల్చబడిన తల్లి ఉదరమును మరల ఎట్లు కుట్టవలసినదియు ఆంత్రములలోను శల్యమును బయటకు తీయువిధానము పుర్రెలో రంధ్రముచేసి మెదడు నుండి శల్యమును దీయుట చెడిన ముక్కును తీసి మంచి ముక్కును అతుకుట క్రొత్తచెవిని అమర్చుట, విరిగిన ఎముకల నతుకుట లింగనాశ (cataract)చికిత్స మరియు శరీరములో మరొకచోటనుండి చర్మభాగమును కత్తిరించి అవసరమైన చోట అతుకుట మత్తుమందులనిచ్చు ఆవశ్యకత "సుశ్రుత సంహిత"యందు వివరింపబడియున్నవి శస్త్రముల పాయన సంస్కారము ఆతురశరీరసంస్కారము, శుచి శుభ్రత, నేర్పరితనము - ఈవిషయములనుగూర్చిన శ్రద్ధ, ఈయనకే కలదన్నట్లుగను ఈయనవలననే నేర్వవలసినంత పరిశీలనతో వివరించి చెప్పగలిగినాడీయన

కంటికి కానరాని క్రిములు రక్తములో పుట్టగలవనియు, అవి రక్తమును వహించు సిరలలో సంచరించుచుండుననియు, అవి వివిధరోగములకు కారణములు కాగలవనియు, సుశ్రుతుడు

వనాడో వివరించినాడు. ఆధునిక శస్త్రచికిత్సకు సుశ్రుతుని ఆయుర్వేదశస్త్రచికిత్స ప్రాతిపదికయేగాక మేలుబంతి కాగలదు.

ఆయుర్వేదమునగల శస్త్రచికిత్సాకౌశలము కాలకర్మ వశాత్తు ఇప్పుడు మరుగున పడిపోయినదిగాని సుశ్రుతుని కాలమున ఎంతటి ఉచ్చదశలోను ఉండెనో సుశ్రుతసంహిత నుశ్రద్ధగా చదివిన వారికి విశదము కాగలదు. అందుచేతనే "శస్త్రకర్మసు సుశ్రుతః శ్రేష్ఠః" అని పూర్వము పేరుపొందియు నేడు "శారీరే సుశ్రుతో ప్రోక్తః" అని ఆయన పేరు మరుగున పడిపోవలసి వచ్చినది.

వే. శం. శా.

## సూత్రస్మృతిశాస్త్రజాతము

సూత్రలక్షణము : భారతీయ విజ్ఞానకల్పతరువుయొక్క వివిధశాఖలు సూత్రబద్ధములై విరాజిల్లుచున్నవి. వాఙ్మయమును గద్యపద్యాత్మకముగ విభజించినపుడు సూత్రములు గద్యభాగములోనే చేరినను సాధారణగద్యమునకును సూత్రములకును ఎంతయో అంతరమున్నది. అధికార్థప్రతిపాదకమగు అల్పశబ్దసందర్భము సూత్రమనబడుచున్నది.

వేదములో సూత్రములు ప్రత్యేకించి సూత్రశబ్దముతో ప్రచురప్రచారము లేకున్నను కొన్ని వేదవాక్యములు సూత్రములుగ పరిగణింపబడియున్నవి. అవియే తర్వాతి సూత్రములకు ఆలంబనభూతములని భావింపవచ్చును.

వేదమూలకమగు ఆర్షవాఙ్మయమునవలోకించితిమేని షడంగములలో షడ్దర్శనములలో తదితరవిద్యాస్థానములలో సూత్రగ్రంథములు పరశ్శతములు కనిపించుచున్నవి. ప్రస్తుతము స్మృతిరూపములైన ఆపస్తంబాది ప్రణీతములగు ధర్మసూత్రములనుగూర్చియు తదుపరి ఛందోబద్ధములగు మన్వాదిధర్మసంహితలనుగూర్చియు అతి సంగ్రహముగ పరిచయము గావింపబడును.

స్మృతులు ధర్మశాస్త్రములు : వేదమూలకములగు ఆర్షగ్రంథములన్నియు స్మృతులుగనే పరిగణింపదగియున్నను విశేషించి మనుపరాశరాపస్తంబబోధాయనాదిప్రణీతములగు ధర్మసంహితలయందే స్మృతిశబ్దము అనాది శిష్టవ్యవహారమున యోగరూఢమై ప్రయుక్తమగుచున్నది.

స్మృతి ధర్మశాస్త్రశబ్దములు పర్యాయములని తెలియవచ్చుచున్నది. అభ్యుదయనిశ్శ్రేయససాధనముగ వేదము దేనిని విధించుచున్నదో అది ధర్మము. తద్విపరీతము అధర్మము. ధర్మాధర్మములను శాసించునదిగాన వేదము ధర్మశాస్త్రమనబడుచున్నది. స్మృతి సంస్కారమూలకము. సంస్కారము అనుభవజన్యము. కాగా ప్రత్యక్షముగ సిద్ధమైన యనుభవము అనగా ధర్మాధర్మానుభవజ్ఞానము స్మృతికర్తలకెట్లు లభించినది? ధర్మాధర్మములు లౌకికములు ప్రత్యక్షానుమానాదిలౌకికప్రమాణములు వానివిషయమున ప్రవర్తించుటకే వీలులేదుగదా! ఈశంకకు స్మృతికర్తలలో అగ్రగణ్యులగు మనువిట్లు సమాధానమిచ్చుచున్నాడు.

యః కశ్చిత్కస్యచిద్ధర్మో మనునా పరికీర్తితః।
స సర్వోఽభిహితో వేదే సర్వజ్ఞానమయో హి సః॥

మనూక్తములగు సమస్తధర్మములును వేదమూలకములని దీనిభావము. ఒక్క మనుస్మృతిమాత్రమేకాదు శిష్టసంప్రతిపన్నములగు స్మృతులన్నియు అట్టివే.

వేదమూలకములగుటచేతనే స్మృతిప్రామాణ్యమాధారపడియున్నదిగాని స్మృతికర్తలగు మన్వాదుల వ్యక్తిగతమగు మహత్త్వముపై ఆధారపడిలేదు. కావుననే వేదమూలకములుకాని బౌద్ధజైనాదిస్మృతులను శిష్టులు ప్రమాణముగ పరిగణించుటలేదు. బౌద్ధజైనాదిస్మృతులేకాదు మన్వాదిస్మృతులైనను వేదవిరుద్ధమైన యర్థమును ప్రతిపాదించుచో ఆయంశమున అవియప్రమాణములేయగును. అట్లే ప్రత్యక్షశ్రుతివిరోధము లేకున్నను ఏస్మృతివాక్యములగు రాగద్వేషాదులను మూలముగజేకొని ప్రవర్తించినదని నిర్ణయించుటకు వీలగునో అదియును అప్రమాణమేయగును. ఏస్మృతికి రాగాదిమూలకత్వము సంభావితమో అద్దానికి వేదమూలకత్వమును కల్పింపరాదని సూత్రతాత్పర్యము. పర్యవసానములో-ప్రత్యక్షవేదవిరుద్ధము రాగద్వేషాదిమూలకము కానట్టి శిష్టపరిగృహీతస్మృతిమాత్రమే మూలభూతవేదానుమానద్వారమున ప్రమాణమగుచున్నది.

స్మృతిప్రణయనప్రయోజనము : స్మృతిమూలభూతములగు శ్రుతులు మన్వాదులకు పరిజ్ఞాతములే కాని కాలక్రమమున మానవులలో బుద్ధిబలముతోపాటు శరీరబలము సైతము క్షీణించి విశేషనియమాపేక్షమగు వేదశాఖాధ్యయనాధ్యాపనపరంపర ఉత్సన్నప్రాయమగుచున్నస్థితిలో దూరదృష్టిగలమహర్షులు ముందుయుగములలోని మానవుల యుపయోగార్థము

వేదార్థమును స్మృతినిబద్ధముగావించిరి శ్రుత్యర్థము పరమగంభీరము దురవగాహము వివిధవేదశాఖలలో విప్రకీర్ణములైయున్న ధర్మములను క్రోడీకరించి అనుష్ఠానక్రమమును సమకూర్చుటయును సంకీర్ణములైయున్న విధ్యర్థవాదములను విభజించి విధేయార్థమును గ్రహించుటయును మంత్రబ్రాహ్మణమూలకములు న్యాయసిద్ధములునగు విధినిషేధములనుద్ధరించుటయును సామాన్యులకెంతమాత్రమును సాధ్యము కాదు మందమధ్యమాధికారులకు సైతము వేదార్థగూఢమగు ధర్మము సుబోధము కావలెనను తలంపుతోకూడ ఋషులు సులభశైలిలో స్మృతులనుంచించినారు

స్మృతులవేదమూలకత్వము స్మృతులన్నియు వేదమూలకములేయగుచో ఇప్పుడున్న వేదశాఖలలో స్మృత్యుక్తములగు ధర్మములన్నియు కనిపించుచున్నవా అందురేమో! అన్నియు కనిపించకపోయినను కొన్ని కనిపించుచునేయున్నవి ఉదా గురురనుగమనం అనుస్మృతికి తస్మాచ్ఛ్రేయాగ్ంసం పాపీయాన్పశ్చాదన్వేతి అను శ్రుతియు పరిపాలకర్తవ్యా అను స్మృతికి ధర్షవంతి అను శ్రుతియు మూలమగుచున్నవి ఇట్లెన్నింటినేని పేర్కొనవచ్చును శిష్టపరిగృహీతములైన యితరస్మృతులకుగూడ మూలభూతములగు శ్రుతులు స్మృతికర్తల కాలములో నుండెననియు అవి తరువాత అధ్యేతృదౌర్బల్యముచే ఉత్సన్నములై యుండుననియు భావింపవలెయున్నది కావుననే ఆపస్తంబమహర్షి —

బ్రాహ్మణోక్తా విధయస్తేషాముత్సన్నాః పాఠాః ప్రయోగాదనుమీయన్తే" అని చెప్పియున్నాడు

ఐతే బౌద్ధగ్రంథములలోని సర్వాహింసాది బోధకములగు సత్యంవద' నహింస్యాత్సర్వాభూతాని అనునవి శ్రుతివేదవాక్యమూలకములుగ కనుపట్టుచున్నవిగాన పూర్వోక్త శాక్యముని చైత్యంవందేత ఎగిగేసుంజీత కేశాన్ లుంచేత్ ఇత్యాదివాక్యములుగూడ వేదమూలకములే కావలసివచ్చునందురేమో! తత్కర్తలగు బౌద్ధులే తమకు వేదము ప్రమాణముకాదని వాదించుచున్నపుడు వారివాక్యములకు వేదమూలకత్వమును కల్పించుటకై ప్రసక్తికూడ లేనపుడు యితరులకేమున్నది!

స్మృతికర్తలు స్మృతికర్తలు ఇరువదిమందిగా పేర్కొనబడినారు వృద్ధయాజ్ఞవల్క్యస్మృతిలో - నారద - పులహ - గార్గ్య - శాతాతప - బౌధాయన - జాతూకర్ణ - విశ్వామిత్ర పితామహులనువారును పైఠీనసిస్మృతిలో - గురువు ప్రచేతసుడు సుమన్తువు, శాక్యుడు, భృగువు, పైఠీనసుడు వ్యాఘ్రుడు సత్యవ్రతుడు, భరద్వాజుడు గార్గ్యుడు జాబాలి జమదగ్ని మున్నగువారును స్మృతికర్తలని చెప్పబడినది మహాభారత-పరాశరస్మృత్యాదులనుబట్టి మరికొందరు స్మృతికర్తలున్నట్లు తెలియుచున్నది వీరు రచించిన స్మృతులలో అనేకములు నష్టములైపోగా కొన్నిమాత్రమే నేడు ప్రచారములోనున్నవి

స్మృతిప్రతిపాద్య విషయ సంగ్రహము ముఖ్యములగు మన్వాదిస్మృతులలో సాధారణముగ ప్రపంచసృష్టి నారంభించి క్రమముగ శుభాశుభకర్మనిమిత్తకములగు జీవుల ఉచ్చనీచగతులు చతుర్విధభూతగ్రామోత్పత్తి ధర్మలక్షణము శ్రుతిస్మృతిసదాచారాత్మతుష్టిరూపములగు ధర్మప్రమాణములు బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులను నాలుగువర్ణములకు బ్రహ్మచర్య - గార్హస్థ్య వానప్రస్థ - సన్యాసరూపకములగు నాలుగాశ్రమములను సంబంధించిన నిత్యనైమిత్తికకామ్యనిషిద్ధకర్మవిశేషములు జీవికానిర్వహణార్థము వారవలంబించవలసిన యాజనాధ్యాపనప్రతిగ్రహప్రజాపాలనకృషి వాణిజ్యగోరక్షాపరిచర్యాదివృత్తివిశేషములు ముఖ్యవృత్తితో జీవనము జరుగనిపరిస్థితిలో అవలంబించవలసిన ఆపద్ధర్మములు భక్ష్యాభక్ష్యవివేకము ద్రవ్యశుద్ధి విహితకర్మలను అనుష్ఠింపకపోవుట నిషిద్ధములననుష్ఠించుటవలన గలుగు ప్రత్యవాయములకు పరిహారార్థములగుప్రాయశ్చిత్తములు స్త్రీధర్మములు వివిధవర్ణములకుచెందిన స్త్రీపురుషుల సంపర్కముచే నేర్పడు అనులోమప్రతిలోమసంకరజాతులు తద్ధర్మములు కర్మవిపాకము మున్నగు అదృష్టప్రధానములగు విషయములు సాంగోపాంగముగ ప్రతిపాదింపబడినవి

అటుపైని రాజు మంత్రులు ఇతర ఉద్యోగులు వారి విధులు దుర్గాన్తఃపురాదినిర్మాణము చతురంగబలసంపాదనము కోశవర్ధనము కరాదానము ప్రజాపాలనము న్యాయనిర్ణయవిధానము అపరాధిశిక్షణము గూఢచారులద్వారా స్వపరరాష్ట్రరహస్యవృత్తాన్తములను సంగ్రహించుట సామదానభేదదండోపాయములలో శత్రువును వశీకరించుకొనుట సన్ధి - విగ్రహ - యాన - ఆసన - ద్వైధీభావ - సమాశ్రయణములనుషడ్గుణములు దాయభాగవ్యవస్థ మొదలగు దృష్టార్థప్రధానములైనవిషయములుగూడ నిరూపింపబడినవి

కావుననే స్మృతులు వర్ణాశ్రమధర్మాదులవిషయమున వేదమూలకములనియు, ప్రజాపాలనాదివిషయములలో ప్రత్య

కానుమానాది లౌకిక ప్రమాణ మూలకములనియు పండితులు కొందరు భావించుచున్నారు అయినాయంశముల నన్నింటిని సావధానముగ పరిశీలించితిమేని స్మృతులు సమగ్రములగు ధార్మిక రాజ్యాంగ వ్యవస్థా గ్రంథములవదగియున్నవి స్మృతికర్తలు ఏయడవులలోనో ముక్కుమూసికొని తపముచేసికొను పరమ భాగవతులనియు లోకజ్ఞాన శూన్యులనియు తలంచుట పొరపాటు

ఆపస్తంబ సూత్రము విషయసమగ్రతగలిగి మాత్రాత్మకమునై యున్న స్మృతులలో ఆపస్తంబధర్మసూత్ర మగ్రగణ్యము అఖిల శ్రౌతస్మార్తకర్మల అనుష్ఠానక్రమమును బోధించుచు ఆపస్తంబమహర్షి రచించిన త్రింశత్ప్రశ్నాత్మకమగు సూత్రసమామ్నాయములో ఇది చరమభాగము ఇందు మొదటిప్రశ్నలో ముప్పదిరెండు ఖండలు రెండవ ప్రశ్నలో ఇరువదితొమ్మిది ఖండలు మొత్తము 61 ఖండలు కలవు సూత్రములు 1889 దీనికి అఖిలవిద్యాపారంగతుడగు హరదత్తాచార్యుడు రచించిన ఉజ్జ్వలావృత్తి యను ఉత్తమ వ్యాఖ్యానమొండు కలదు

ఆపస్తంబుని సూత్రములలో గోచరించు గంభీరత హేతుబద్ధత న్యాయసంచార నైపుణ్యము శాఖాన్తరోక్త సంహారసామర్థ్యము ధర్మాతిదేశచాతురి మరెందును గానరావు. అనధ్యాయ బ్రహ్మయజ్ఞానుష్ఠానవిషయమునను విద్యావిశేషసముపార్జనకై గృహస్థుగూడ ప్రతివత్సరమునను కొంతకాలము గురుకులమున నుండవలెనను సందర్భమునను; పతితోత్పన్నులగువారికి పాతిత్యమును ప్రతిపాదించు ప్రకరణమునను ఆశ్రమతారతమ్య నిరూపణావసరమునను మరియు అనేక స్థలములలో ఆతని ప్రతిపాదనాపద్ధతి మీమాంసాధికరణ పద్ధతిని తలపించుచు ఎంతయు హృదయంగమమైయుండును

బోధాయన ధర్మసూత్రములు ఇది నాల్గుప్రశ్నలుగ, ఏబదిఎనిమిది ఖండలుగ పండ్రెండువందల అరువదినాల్గు సూత్రములుగ విభక్తమైయున్నది వసుధర్మశాస్త్రములోని వచనము లనేకములిందు కానవచ్చుట గౌతమమతమనువదింపబడుట మున్నగు కారణములచే మనుస్మృతి-గౌతమ ధర్మసూత్రములకంటె ఇది యర్వాచీనమని భావింపబడుచున్నది బోధాయనుడుగూడ సమగ్రమగు శ్రౌతస్మార్తకల్ప సూత్రమును సమకూర్చినాడు దీనిపై గోవిందస్వామి ప్రణీతమగు వివరణమొకటి యున్నది

ఇందలి దేశాచారప్రామాణ్య విషయకమగు విచారము విమర్శకులకు విశేషాసక్తిని కలిగించునదై యున్నది దీని సారాంశమిది దాక్షిణాత్యులలో స్త్రీలతో అనుపనీతులతో కలసి భుజించుట పర్యుషితాన్నమును భుజించుట మేనత్త మేనమామల కుమార్తెను పెండ్లాడుట - ఇట్టి యాచారము లున్నవి వీనిని ఔత్తరాహులు అధర్మముగ భావింతురు ఇక ఔత్తరాహులలో కంబళ్ళవ్యాపారము అశ్వవిక్రయము ఆయుధజీవనము మద్యపానము సముద్రయానము ఇత్యాద్యాచారములున్నవి వీనిని దాక్షిణాత్యులు అధర్మమందురు ఈ విధముగ విప్రతిపత్తియున్నపుడు ఏదిధర్మమో ఏదియధర్మమో నిర్ణయించవలసిన యవసరము కలుగుచున్నది దీనిపై కొందరు-దేశభేదముచే వ్యవస్థచేయదగునను చున్నారు అనుపనీతసహభోజనాదులు దక్షిణదేశముననే ధర్మములగును కంబళివిక్రయాదులుత్తరదేశముననే ధర్మములగును వానిని దేశమునగాని వీనినా దేశమునగాని ఆచరించుట అధర్మము

ఆపాతదృష్టితో చూచిన ఇది యుచితముగ నున్నట్లే తోచునుగాని విమర్శకు నిలువజాలదు శిష్టులగు మను గౌతమాది మహర్షులు ప్రత్యక్షశ్రుతిస్మృతి విరుద్ధములుకాని దేశ-జాతి-కుల ధర్మములుమాత్రమే ప్రమాణమనుచున్నారు అనుపనీత సహభోజన-కంబళవిక్రయాదులన్ననో అట్టివి కావు వీటిని నిషేధించువచనము లనేకములు శాస్త్రములలో కనిపించుచున్నవి కావున ఇట్టి దురాచారములు దేశభేదముతో నిమిత్తములేకుండ సర్వులకును పరిత్యాజ్యములే యగుచున్నవి; దేశాచార కులాచారముపేరిట శాస్త్రవిరుద్ధముగ సంచరించువారికి విచారము కనువిప్పు కాగలదు

గౌతమ ధర్మసూత్రము ఇది ప్రశ్నత్రయాత్మకము ఇందు మొత్తము ఇరువది యెనిమిది అధ్యాయములను సుమారు పదివందల సూత్రములును కలవు ఆపస్తంబధర్మసూత్రములకు ఉజ్జ్వలావృత్తిని రచించిన హరదత్తాచార్యుడీ సూత్రములకు మితాక్షర యనువృత్తిని నిర్మించినాడు ఇది కాక మస్కరి కృతమగు విస్తృతవ్యాఖ్యానము మరియొకటి కనిపించుచున్నది

కేవలము ఆర్థిక - సైనిక - శారీరకబలములతో రాజు ప్రజలను రక్షింపజాలడనియు బహుశ్రుతుడగు బ్రాహ్మణుని తోడ్పాటు అతనికావశ్యకమనియు గౌతముడతిమనోజ్ఞముగ ప్రతిపాదించియున్నాడు వేదములను వేదాంగములను ఇతిహాసపురాణాదులను సమగ్రముగ నధ్యయనమొనర్చినదుత్తము లగు కర్మలనుష్ఠించుటేకాక లోకవ్యవహారమునునైతము

బాగుగ గుర్తించినవాడు బహుశ్రుతుడనబరగుచున్నాడు దేశకాలోచితముగ కర్తవ్యాకర్తవ్యములను శాస్త్రదృష్టితో విమర్శించి ఉపదేశించుట బ్రాహ్మణుని బాధ్యతకాగా, వానిని సామదానభేదదండోపాయములతో యథోచితముగ ప్రజలలో ప్రవర్తింపజేయగలుగుట బాధ్యత రాజుదై యున్నది

విష్ణుధర్మసూత్రము - ఇది నూటదియధ్యాయముల గ్రంథము తొమ్మిదివందలయెనుబదొమ్మిది సూత్రము లిందుగలవు పేరుపెట్టియు పెట్టకయు మనువచనము లిందు అడుగడుగునను ఉదాహరింపబడినవి అన్యత్ర దృష్టములుకాని ధర్మవిశేషము లనేకము లిందుగోచరించుచున్నవి

మనుస్మృతి - ప్రామాణ్యమునట్టియు విషయసమగ్రతనుబట్టియు అన్నిస్మృతులలో మనుస్మృతి అగ్రగణ్యమగుచున్నది ఈగ్రంథము సాక్షాన్మనుప్రోక్తమా? లేక మనూక్తమగు అర్థమును మరెవరైన ఛన్దోబద్ధము గావించినారా? అను విషయమున పండితులలో విభిన్నాభిప్రాయములున్నవి మనుస్మృతి ప్రథమాధ్యాయములోని వచనములను తద్వ్యాఖ్యానమును పరిశీలించితిమేని విధినిషేధసమూహరూపము అతివిస్తృతమునగు నీశాస్త్రమును ఆదికాలమున బ్రహ్మయే సమకూర్చి మనువుకుపదేశించెననియు మనువు మరీచి భృగ్వాదులకుపదేశించినాడనియు ప్రస్తుతమున జిజ్ఞాసువులగు మహర్షులకు మనువుయొక్క ఆజ్ఞచే భృగుమహర్షి సంగ్రహించి బోధించినాడనియు విదితమగుచున్నది

మేధాతిథి గోవిన్దరాజాది మహావిద్వాంసులనేకులు మనుస్మృతికి వ్యాఖ్యానములను రచించినారు మనుస్మృతిలో 12 అధ్యాయములను 2684 శ్లోకములనుగలవు ముద్రిత మనుస్మృతిగ్రంథములో ఉపలక్ష్యమానములుకాక హేమాద్రి - ధర్మసింధు - నిర్ణయసింధు - పరాశరమాధవీయాది నిబంధన గ్రంథములలో మనువచనములుగ ఉదాహరింపబడిన శ్లోకములు మరినాల్గువందలదాక యున్నవి ప్రాచీనకాలమున అతివిస్తృతమగు సూత్రరూపమైన మనుధర్మశాస్త్రమొకటియుండెడి దనియు, దానినాధారముగగొనియే శ్లోకరూపమగు ప్రస్తుత మనుస్మృతి నిర్మింపబడినదనియు కొందరు చరిత్రకోవిదులు భావించుచున్నారు అఖిలధర్మశాస్త్రనిబంధములకు మనుస్మృతి ఆకరమనదగియున్నది ఇందుగల విషయములే సంక్షేపవిస్తరములతో ఇతరస్మృతులలోనున్నవి ఇందులేనివి మరెందును లేవని చెప్పవచ్చును

యాజ్ఞవల్క్యస్మృతి అనేకకారణములచే మన్వాది స్మృతులకన్న యాజ్ఞవల్క్యస్మృతి అర్వాచీనమని విమర్శకులు తలంచుచున్నారు ఇందు సుపరిష్కృతమైన శైలిలో ముచ్చటగ మూడధ్యాయములు ఆచార-వ్యవహార-ప్రాయశ్చిత్తము అనుసంజ్ఞలతో సమకూర్పబడియున్నవి విషయములు సంకీర్ణములుకాక సంజ్ఞానుగుణముగ సువిభక్తములై యున్నవి ఇయ్యది ఛందోబద్ధమై శ్లోకరూపముగనున్నను బహ్వర్థసంగ్రాహకమై సూత్రగ్రంథమనదగియున్నది కౌటిలీయార్థశాస్త్రములోని యనేకవిషయములు ఏతత్స్మృతిసాపేక్షములని విమర్శకులు కొందరభిప్రాయపడుచున్నారు శుక్లయజుశ్శాఖాప్రవర్తకుడును జనకునకు తత్త్వోపదేష్టయునగు యాజ్ఞవల్క్యమహర్షియే దీనికి కర్తయని సాంప్రదాయికుల యభిప్రాయము

ఈస్మృతికి మిక్కిలి ప్రౌఢమైన విశ్వరూపాచార్యవిరచితమగు బాలక్రీడాభిధానమైన ప్రాచీనవ్యాఖ్యానమొకటికలదు అటుపిమ్మట విజ్ఞానేశ్వరవిరచితమగు మితాక్షరావ్యాఖ్య ప్రసన్నగంభీరము న్యాయనిర్ణయప్రధానమునై విశేషఖ్యాతినిగాంచినది ఇందలి వ్యవహారాధ్యాయమితాక్షరనాధారముగ చేసికొని పెక్కునిబంధనగ్రంథములువెలసినవి నిన్నమొన్నటివరకు భారతీయన్యాయస్థానములలోనైతము దాయభాగాదినిర్ణయములలో ఈమితాక్షరకు అమితమైన ప్రాధాన్యముండియుండెను

పరాశరస్మృతి మన్వాదిస్మృతులవలె విస్తృతము విషయపరిపూర్ణము కాకపోయినను కలియుగమున పరాశరస్మృతి పరమప్రమాణముగ పరిగణింపబడుచున్నది ఇద్దానికి చతుర్వేదవ్యాఖ్యానిఖ్యాతులును మహర్షికల్పులునగుమాధవాచార్యులు రచించిన వ్యాఖ్యానము ధర్మతత్త్వజిజ్ఞాసువులకు చిన్తామణివలె మహోపకారకమగుచున్నది ఇందలి శ్లోకసంఖ్య 578 అధ్యాయములు

ఇందు మొదటిమూడధ్యాయములలోమాత్రము వర్ణాశ్రమధర్మాదిరూపమగు ఆచారము తక్కిన తొమ్మిది అధ్యాయములలో ప్రాయశ్చిత్తములను నిరూపింపబడినవి కలిలో పాపబాహుళ్యము సంభావితముగాన తదనుగుణముగనిందు ప్రాయశ్చిత్తకాండకు ప్రాధాన్యమీయబడినది మరియు అల్పశక్తులు అల్పాయుష్కులునగు కలియుగమానవులయందలి కరుణాతిశయముచేగాబోలు ఆచారములలో ప్రాయశ్చిత్తములలో చాలవరకిందు సంకోచముచేయబడినది

స్మృతులపరమతాత్పర్యము స్మృతులలో దృష్టాదృష్ట

ఫలములగు కర్మలు ప్రధానముగ ప్రతిపాదింపబడియున్నను కేవలము వాని ననుష్ఠించుచు ఐహికపరసుఖభోగముల ననుభవించుటే వానితాత్పర్యముగాదు. చత్వారింశత్సంస్కారముల కన్నను సత్యాహింసాస్తేయ శమదమాద్యాత్మ గుణములకే స్మృతులు అధికప్రాధాన్యమిచ్చుచున్నవి. కర్మానుష్ఠా నమ్మగు చిత్తశుద్ధి ద్వారా ఆత్మజ్ఞానసముపార్జనమే అపునరావృత్తి లక్షణమగు పరమపురుషార్థమని స్మృతుల పరమసిద్ధాంతము.

స. ల. మూ.

## సూయజ్ కాలువ

సూయజ్ కాలువ ప్రపంచప్రఖ్యాతి బడసిన అంతర్జాతీయ జలమార్గములలో ఒకటి. అది సూయజ్ భూసంధికి అడ్డముగా సాగిపోవుచు మధ్యధరాసముద్రమునకును హిందూ మహాసముద్రమునకును నడుమ ఓడల ప్రయాణమునకు సౌకర్యము లను కల్పించుచున్నది. క్రీ. శ. 1854 లో ఫెర్డినాండ్-డి-డెస్సెప్స్ అను అలెగ్జాండ్రియాలోని ఫ్రెంచికాన్సులర్ సభ్యుడు సూయజ్ కాలువ ప్రాజెక్టు విషయములో శ్రద్ధగైకొని ఈజిప్టుయొక్క ఈజిప్తు వైస్రాయితో చర్చించి దాని నిర్వహణమునకై అనుమతిని పొందెను. ఈ కాలువనిర్మాణము పూర్తియైనప్పటి నుండి 99 సంవత్సరములు దానిని ఉపయోగించుటకును తత్సంబంధమైన అంతర్జాతీయ సంస్థనొకదానిని నెలకొల్పుటకును అతడు ఆమోదమును సంపాదించెను. ఈ కాలువనిర్మాణమాతనిచే పదిసంవత్సరములలో పూర్తిచేయబడి 1869 లో ప్రప్రథమముగా ఉపయోగములోనికి తేబడినది. దీని పొడవు 160 కిలో మీటర్లు; నీటిపై వెడల్పు 197 అడుగులు. లోతు 38 అడుగులు.

మధ్యధరాసముద్రమునుండి సూయజ్ కాలువలోనికి ఓడలు ప్రవేశించి ప్రపంచమందెల్ల గొప్ప ఓడరేవులలో ఒకటి యగు 'పోర్ట్ సెడ్'ను దాటి దక్షిణదిశగా పయనించి టిమ్సా సరస్సులో ప్రవేశించును. ఈసరస్సు సమీపముననే ఇస్మాయిలియా నగరము నెలకొనియున్నది. అప్పటినుండి ఓడలు మరల ప్రయాణమై "గ్రేట్ బిట్టర్ సరస్సు" "లిటిల్ బిట్టర్ సరస్సు"ల గుండా సాగిపోయి తుదకు సూయజ్ నగరమును చేరును.

ఈ కాలువకు రెండు చివరలయందుగల దేశముల నడుమ ప్రత్యక్షసంబంధము ఏర్పడినది. ఆఫ్రికా ఆసియా ఆస్ట్రేలియాఖండముల దేశములతో పాశ్చాత్యదేశములకొక నూతన జలమార్గమేర్పడి ప్రయాణము మరింతగా సుగమమైనది. దీని ఫలితముగా యూరోపునుండిగాని, అమెరికానుండిగాని దక్షిణ ఖండమును చేరుటకు పూర్వపు సుదీర్ఘమగు గుడ్‌హోప్ అగ్రమార్గమును చుట్టిరావలసిన అవసరము ఇప్పుడుండదు. సూయజ్ కాలువ మార్గమిప్పుడు ప్రయాణములకు సన్నిహితమైనది.

కాలువప్రయోజనము: సూయజ్ కాలువవలన యూరోపు ఆసియా ఆస్ట్రేలియా ఖండములకిప్పుడు ఈ క్రింది ప్రయోజనములు చేకూరుచున్నవి.

| | సూయజ్ ద్వారా దూరము కి. మీ. | గుడ్‌హోప్ అగ్రము ద్వారా దూరము కి. మీ. | సూయజ్ ద్వారా ప్రయాణ దినములు | గుడ్‌హోప్ అగ్రము ద్వారా ప్రయాణదినములు |
|---|---|---|---|---|
| లండన్ నుండి పెర్షియన్ గల్ఫు | 9 4 0 | 16 200 | 37 | 65 |
| " మొంబాసా | 9 0 4 | 12 6 5 | 30 | 43 |
| కలకత్తా | 11 938 | 16 450 | 40 | 57 |
| " బొంబాయి | 9 230 | 16 0?0 | 31 | 54 |
| కొలంబో | 10 ?02 | 16 350 | 34 | 52 |
| " సింగపూరు | 12 240 | 16 075 | 41 | 53 |
| " హాంకాంగ్ నగరి | 11 960 | 16 ?85 | 40 | 58 |
| " " సిడ్నీ (ఆస్ట్రేలియా) | 16 6?0 | 18 350 | 58 | 62 |
| " " వెల్లింగ్టన్ (న్యూజిలెండు) | 18 650 | 19 250 | 68 | 66 |
| నెదర్లెండ్సు నుండి ఇండోనేషియా | 12,502 | 16,150 | 48 | 56 |

బ్రిటనుతో కామన్వెల్తు దేశములకిప్పుడు ఈకాలువ సన్నిహిత మార్గమగుటచే దీని ప్రాముఖ్యము అత్యధికమైనది ఈ కాలువ ఉపయోగమునకు వచ్చినప్పటినుండి బ్రిటిష్ ఓడలకు ఆధిక్యత ఏర్పడినది. 1882 తరువాతనే "సూయజ్ కాలువ కంపెనీ" పరిపాలనములో బ్రిటిష్ ప్రభుత్వము ప్రత్యక్షముగా పాల్గొనినది. 1956 వరకు సూయజ్ కాలువ యొక్కయు సూయజ్ భూసంధియొక్కయు సంరక్షణకర్తగా బ్రిటిష్ ప్రభుత్వము గుర్తింపబడినది. ఇప్పటికిని ఆసియా ఆస్ట్రేలియా తూర్పుఆఫ్రికాలకు సూయజ్ కాలువ ప్రధాన జలమార్గముగ ఉపకరించుచున్నది. ప్రాక్పశ్చిమఖండములనడుమ ఈ కాలువద్వారా 1968 లో 20 కోట్లటన్నుల సరకు రవాణాయైనది. సూయజ్ కాలువ నిర్మాణమువలన ఓడల ప్రయాణకాలము తగ్గుటతోపాటు సరకులరవాణారేటుకూడ తగ్గినది.

మధ్యప్రాచ్యదేశములలో పెట్రోలు గనులుండుటచేత వాటిమీద ఆధారపడు పాశ్చాత్యదేశములకు ఈకాలువ రాజకీయముగా ప్రాణప్రదమగుచున్నది.

పెనుగాలులచే పరిసరములయందున్న ఎడారులనుండి ఇసుక విపరీతముగా కొట్టుకొనివచ్చి ఈ కాలువలో మేటవేయుచుండుటచే తరచుగ ఈకాలువ మరమ్మతులు కోరుచుండును. కాలువద్వారా సరకులు రవాణాచేయు ఓడయజమానులపై అధికసుంకములు విధింపబడుటచే వారి ప్రయోజనములను సంరక్షించుట మరియొక సమస్యగా పరిణమించుచుండును. సరకులను వేగముగా రవాణాచేయు అవసరములేనప్పుడు ఓడలు సుంకములను తగ్గించుకొనుటకై గుడ్‌హోప్ అగ్రమార్గముగుండా పయనించుచుండును. పనామాకాలువ నిర్మాణమైనప్పటి సరకుల రవాణావిషయమై అది సూయజ్ కాలువకు ప్రత్యర్థియైనది. పనామాకాలువవలన అమెరికాకును జపాను హాంకాంగ్ ఫిలిప్పైనులున్నగు దేశములకును నడుమ మార్గము సన్నగిలి వాణిజ్యవ్యాపారములు పెంపొందినవి. ఐరోపానుండి న్యూజిలేండు, ఆస్ట్రేలియా జపాను దేశములకు సూయజ్ కాలువద్వారా జరుగు సరకులరవాణాలో కొంతభాగము పనామాకాలువ పంచుకొనుచున్నది.

1888 లో బ్రిటన్ జర్మని, ఆస్ట్రియా, హంగరి, స్పెయిన్, ఫ్రాన్సు ఇటలీ, నెదర్లాండ్సు రష్యా, టర్కీ రాజ్యములనడుమ జరిగిన ఒడంబడికమూలముగా సూయజ్ కాలువకు నిర్ధించిన ప్రత్యేక రాజకీయప్రాముఖ్యమునుబట్టి అన్నికాలములలో ఎట్టి వివక్షతలేకయే ఒడంబడికపై సంతకములుచేసిన ఈ రాజ్యములయొక్క ఓడలు స్వేచ్ఛగా ఈ కాలువపై ప్రయాణించవచ్చును.

సమైక్య అరబ్బురిపబ్లికునకును ఇస్రాయిల్ రాజ్యమునకును 1967 లో ఘటిల్లిన సంఘర్షణము కారణముగా సమైక్య రిపబ్లికుచే సూయజ్ కాలువ మూసివేయబడినది. ఈ కాలువ వలన ముఖ్యముగా అమెరికా రష్యా ఇరాన్ పశ్చిమఐరోపా ఖండదేశములకు విశేషప్రయోజనములు చేకూరుచుండెను. తన నౌకాదళములు హిందూమహాసముద్రమునకు సులభముగా సాగిపోవుటకు అనువైన సూయజ్ కాలువ మూతపడుటతో సోవియట్ రష్యా తన బాల్టిక్-కాస్పియన్ ఉత్తర సముద్రపు రేవులను సముద్రమార్గములను అభివృద్ధిపరచి బలపరచుకొనుటకు అవకాశముకల్గెను. బాల్టిక్ - కాస్పియన్ సముద్రమార్గములను ఉపయోగించుకొనుటవలన పశ్చిమ జర్మనీవంటి ఇతర ఐరోపాదేశములతో ఇరానుదేశమునకుగల వాణిజ్య వ్యాపారసంబంధములు సన్నిహితములైనవి. సూయజ్ కాలువమార్గము దీర్ఘకాలము బంధింపబడుటచో దానిద్వారా రవాణాయగు సరకు దీర్ఘకాలికముగా బాల్టిక్-కాస్పియను జలమార్గము ద్వారాను ఉత్తరసముద్రమార్గము ద్వారాను మరల్పబడవలసియుండును.

వి. వి.

## సూరదాసు : (క్రీ. శ. 1485–1562)

సూరదాసు ఔత్తరేయ భక్తశిఖామణులలో చేర్గాంచినవాడు ఇతనిజన్మస్థానముకొందరు ఢిల్లీదగ్గరనున్నసీహో గ్రామమనిరి మరికొందరు రునక్త (రేణుకాక్షేత్రమనిరి) సారస్వత బ్రాహ్మణుడగు రామదాసు సూరదాసు తండ్రి. రామదాసు ఎనిమిదవయేట సూరదాసునకు ఉపనయనముచేసి పదియవయేట తతోగూడ అతనిని మధురానగరయాత్రకు తీసుకొనిపోయెను. సూరదాసు తల్లిదండ్రులను విడిచి కృష్ణభక్తి తత్పరతతో అచ్చటనే ఒక భక్తుని సంరక్షణములో నుండిపోయెను. అతడు కొంతకాలమునకు గౌఘాట్ అను గ్రామమునుచేరి విరాగియై మధూకరవృత్తిచే పొట్టనింపుకొనుచుండెను.

సూరదాసుకొకనాడు స్వప్నమువచ్చెను. దీనిలో కాలుజారి

ఒక గోతిలోపడెను అనిర్జనప్రదేశములో అతని రోదనమునాల కించువారు లేకపోవుటచే నాల్గుదినములు నిరాహారస్థితిలో అందే కాలక్షేపము జేసెను శ్రీకృష్ణుడు తనకు శరణ్యుడని భావించి కృష్ణునిపై కీర్తనలను రచించి పాడుచుండెను తెల్లవారుజామున పదేండ్లబాలుడు చేయిపట్టుకొని సూరదాసును పైకిలాగి పడవేసెను సూరదాసు ఆబాలునిచేతిని గట్టిగాపట్టుకొనెను బాలుడు చేయివిడిపించుకొని అంతర్ధానమునొందెను

1524 సం॥ లో వల్లభాచార్యులు గౌఘాట్ నకేతెంచినపుడు సూరదాసు ఆయనకు పాదాభివందన మాచరించెను వల్లభాచార్యు డితనిని ఆశీర్వదించి గోపాలకృష్ణమంత్రము నుపదేశించి భాగవతమును బ్రజభాషాగేయ రూపమున రచించి తరింపుమని ఆనతిచ్చెనట

సూరదాసు గోకులబృందావనము చేరి గోపాలదేవుని ఆలయములో కూర్చుని పదములను రచించి పాడదొడంగెను జీవిత మధ్యములో ఇతనికి అంధత్వము ప్రాప్తించెను అందుచేత సూరదాసు శ్రీకృష్ణసన్నిధిని తంబురను చేబూని సంకీర్తనమొనర్చుటలో నిమగ్నుడై యా జీవమును గడిపెను అంధుడగుటచే యాత్రలు చేయలేదు తాను సంస్కర్తనియు ఉపదేశకుడననియు భావములు లేనివాడగుటచే ఎట్టి సిద్ధాంతములను రచించి ప్రత్యేకసంప్రదాయమును స్థాపించలేదు

సాహిత్యరచన॥—సూరదాసు అసంఖ్యాకములగు కీర్తనలను రచించి, గేయకుసుమమాలను శ్రీకృష్ణునకర్పించి తత్సాక్షాత్కారమును బొందిన ధన్యజీవి ఈగేయము లీమహాకవికవితా పాటవమును ప్రకటించుటయేగాక, భగవత్ప్రేమలో మునిగియున్న ఇతని భావపరంపరను, శబ్దప్రయోగచిత్రములను, గోపికల అర్తాలాపములను యశోదయొక్క మాతృప్రేమను, కృష్ణప్రేమయొక్క అలౌకికభావనను సూరదాసుని ఉన్మత్త హృదయమును ప్రస్ఫుటము చేయుచున్నవి

ఇతని కవనము భగవత్ప్రేమచే ప్రపూరితమయిన హృదయమునుండి అవరణము లేకుండగనే వెల్లువవలె పొంగినది సూరదాసు ప్రేమపూరితహృదయమును శబ్దరూపములో ప్రకటించి కృష్ణుని ప్రజలకు ప్రత్యక్షముగా నివేదించెను వారితని పాటలను విని ఆనందాబ్ధిలో మునిగిరి ఈరసప్రవాహములో జీవనము క్లేశత్వత్రప్రాయముగా కొట్టుకొని పోయినది,

ఇతడు గొప్ప గాయకుడగుటచే శృంగార శాంత అద్భుత హాస్యరసములను తోడి సారంగ మరట విభాస మారువ మున్నగు రాగాలలో నిమిడ్చెను జ్ఞానచేతావను లగు కబీర్ తులసీదాసుల వలెగాక ఇతడు భక్తిపారవశ్యములో రచించుటచే ఇతనిగేయాలకు అగ్రస్థానము లభించినది వ్రజస్త్రీలు రాసమండలిలో ఇతని పాటలను పాడి ఆనందింతురు అతని కవితలో భాషా మాధుర్యము స్వాభావికము అదియు సంగీతమయముగా నుండి సుందర అలంకార ప్రయోగములచే పూరింపబడినది ఇతని గాత్రమాధురి వర్ణనాతీతము పుష్టిమార్గసంప్రదాయములోనే వెలసిన అష్టదిగ్గజాలలో సూరదాసునకు సముచితస్థానము కలదు

సూరదాసుకీర్తనలు మానసబోధద్యోతకములు మనాకే మాధవసో కర్ ప్రీతి తజోమన్ హరివిముఖ వకోసంగ్ అను పదము లితని మనోభావనను స్పష్టీకరించును తననొక అజ్ఞానిగను పాపిగను, వ్యర్థునిగను తలచుచు మానవజన్మయెత్తి నందుకు జీవితమును వృథాగా గడుపక పరమార్థప్రాప్తికొరకు పాటుపడవలెనన్న నీతులను తన మనస్సునకు సంబోధించి ఇతరులకు బోధించు అర్హత తనకు లేదని వ్యవహరించెను శ్రీకృష్ణుడు సూరదాసుయొక్క ఆరాధ్యదైవము అందుచే శుద్ధాద్వైతతత్త్వమును తనగేయములలో నితడు పొందుపరచెను

రచనలు — సూర్ సాగర్, సూర్ సారావళి, సాహిత్యలహరి అను ఇతని గ్రంథములు ముఖ్యములు ఇతని పదములలో ఉపమా—ఉత్ప్రేక్ష—అలంకారములు హెచ్చుగానున్నవి

తనమరణసమయమును ముందుగనే తెలిసికొని సూరదాసు పారసోలీ గ్రామమునకేగెను ఈ వార్తను వినిన గోస్వామి విఠలనాథుడచ్చటికిపోయెను గురుపుత్రుడైనగోసాయి విఠలనాథుడు రామదాసు, కుంభనదాసు పరమానందదాసు, కృష్ణదాసు చతుర్భుజదాసు మున్నగు భక్తులబృందము పరివేష్టించియుండగా శ్రీ కృష్ణుని సన్నిధానములో పారసోలిలో 1562 లో సూరదాసు భౌతిక కాయమును త్యజించి గోలోకవాసితుడయ్యెను ఇతని కీర్తి కాంత దేశమంతటను వ్యాప్తమయ్యెను

సం. శా. శా.

## సూర్యకుటుంబము

సూర్యుడు చంద్రుడు బుధుడు శుక్రుడు మున్నగు నవ గ్రహములు నిశ్చలముగనున్న భూమి చుట్టును తిరుగుచున్నవని పూర్వులు భావించిరి కాని కోపర్నికస్ అను శాస్త్రవేత్త (1473-1543) తనచుట్టు తాను తిరుగుచుండు భూమితో సహా అన్ని గ్రహములు సూర్యుని చుట్టు తిరుగుచు రాత్రింబవళ్లను కల్పించు చున్నవని ప్రతిపాదించెను 17వ శతాబ్దిలో కెప్లర్ అను పరిశోధకుడు కోపర్నికస్ అభిప్రాయముతో ఏకీభవించెను

చిత్రము 101



ఆ సూర్యుని నుండి గురుని వరకు గల గ్రహకక్ష్యలు

ఆ గురుని తరువాత గల గ్రహకక్ష్యలు

పటము 1

సూర్యుడు నిశ్చలమైన మండెడు స్వయం ప్రకాశక వాయుగోళమనియు మిగిలిన గ్రహములు అట్లు కాక సూర్యకాంతిని పరావర్తనము చేయుచున్నవనియు అసందిగ్ధముగ తెలియుచున్నది చంద్రుడు సూర్యుని చుట్టు తిరుగు గ్రహము కాక భూమి చుట్టు తిరుగు ఉపగ్రహమనియు రాహు కేతువులు కూడ ఉపగ్రహములే నియు అవి భూమి సూర్యుని చుట్టు తిరుగు కక్ష్య చంద్రుడు భూమిచుట్టు తిరుగు కక్ష్య కలియుచోట ఏర్పడిన రెండు బిందువులనియు తెలియవచ్చినది అందుచే గ్రహముల జాబితా నుండి సూర్య, చంద్ర రాహు, కేతువులు తొలగింపబడినవి క్రొత్తగా సూర్య కుటుంబములో యురేనస్ నెప్ట్యూన్ ప్లూటో అను గ్రహములే కాక లఘుగ్రహములు, ఉల్కలు కూడ కలవని పరిశోధనల వలన తెలిసినది

**బుధుడు:** బుధుడు సూర్యునకు అతిదగ్గరగనున్న గ్రహము, సూర్యుని నుండి దీని సగటు దూరము 3 కోట్ల 60 లక్షల మైళ్లు ఇందుచే ఇది సూర్యాస్తమయ సమయమున పడమరయందును సూర్యోదయమునకు ముందు తూర్పునందును కన్పించును బుధుని సంచారము స్థిరమైన కక్ష్యలో జరుగుచున్నట్లు కన్పింపక పోవుటచే సూర్యునకు బుధునకు మధ్య మరియొక గ్రహమున్న దని అపోహ జనించెను కాని ఐన్‌స్టీన్ శాస్త్రవేత్త సాపేక్ష సిద్ధాంతముచే బుధుని కక్ష్య కూడ సూర్యుని ప్రభావముచే తిరుగు చున్నదని ఋజువు చేసెను సూర్యుని వైపు తిరిగియుండు

చిత్రము 103



పటము - 2

బుధుడు - 1934

బుధుని పార్శ్వము అత్యుష్ణముగను తక్కిన పార్శ్వము అతి శీతలముగను ఉండును బుధునకు ఉపగ్రహములు లేక చంద్రుని వలె కళలను ప్రదర్శించుచుండును

శుక్రుడు భూమికి అతి దగ్గరగనుండు ఈ గ్రహము కూడ చంద్రుని వలె కళలను చూపించును కొన్ని దినములలో ఉదయమున తూర్పునను, కొన్ని దినములలో సాయంత్రమున పడమర యందును కాంతిమంతముగ కన్పట్టును ఒకానొకప్పుడు పగటి యందు కూడ దూరదర్శిని లేకయే దీనిని చూడవచ్చును భూమి యందువలె శుక్రునిలో వాతావరణమున్నదనియు అరుణ కాంతి దానిపై ప్రసరించుచుండుననియు పరిశోధనల వలన తెలిసినది. శుక్రుని నుండి ప్రసరించు వర్ణమాలలో తేమలక్షణములు

చిత్రము 103

పటము 3

శుక్రగ్రహుడు—కళలు

గాని ప్రాణవాయువులక్షణములుగాని కానరావు కాని కర్బన ద్వి-ఆమ్లజనియున్నట్లు ఆధారములు గోచరించెను శుక్రునకు ఉపగ్రహములులేవు

భూమి : ఇది తనలోతాను తిరుగుటకు 24 గంటలను సూర్యునిచుట్టు తిరిగివచ్చుటకు 365¼ రోజులను పట్టును భూమి సూర్యునిచుట్టు తిరుగునపుడు ఏర్పడు కోణమువలన భూమిపై ఋతువులు కల్గుచున్నవి భూమికి 20-30 కిలోమీటర్ల దూరమునను్న ప్రాణవాయుపొర సూర్యునినుండి ప్రమాదకరమైన పూర్వనీలలోహితకిరణములు భూమిపై పడకుండ జీవరాశులను రక్షించుచున్నది భూమికి 80 కిలోమీటర్ల దూరమునందున్న ఎలక్ట్రానుపొరలు భూమిపై నుండి ప్రసారమగు రేడియో తరంగములను పరావర్తనమొనర్చి మరియొక చోటికి చేరునట్లు చేయును ఈపొరలు భూమిపై లేనిచో రేడియో సంభాషణములు అసంభవములయ్యెడివి

సూర్యుని నుండి వచ్చు విద్యుత్కణములు భూమ్యయస్కాంతక్షేత్రమును ఛేదించుకొనలేక అయస్కాంతక్షేత్ర రేఖలవెంట తిరుగుచుండును భూమికి ఉపగ్రహమైన చంద్రుడు భూమిచుట్టు ఒకసారి తిరిగివచ్చుటకు 27 రోజులకుపైగాపట్టును ఈకాలములో చంద్రుడు తనలోతాను ఒకసారి తిరుగును కావున చంద్రుని ఒకముఖమును మాత్రమే చూచుచున్నాము రెండవముఖమును గూర్చి తెలిసికొనుటకై శాస్త్రజ్ఞులు పరిశోధనలు చేయుచున్నారు మరపైపునగల చంద్రుని ముఖము మీద పెక్కు గోతులు కొండలు ఉన్నట్లు వినుచున్నాము చంద్రుని ఉపరితలముపై పడిన ఉల్కాలు పెద్దగోతులకు కల్పించియుండవచ్చును అందుండిన అగ్నిపర్వతముల ప్రభావముచేత ఈగోతులేర్పడినవని కొందరిమతము

చంద్రుని ఆకర్షణశక్తిచేత సముద్రములలో కెరటములు కల్గుచున్నవి చంద్రుడు భూమికిని సూర్యునకును మధ్యగా వచ్చినప్పుడు సూర్యగ్రహణము సూర్యునకును చంద్రునకును మధ్యగా భూమివచ్చినప్పుడు చంద్రగ్రహణము కల్గును

అంగారకుడు అంగారకుడు (కుజుడు) ఎరుపురంగుతో కాన్పించును ఇందలి వాతావరణము పలుచగనుండుటచే గ్రహోపరితలమును బాగుగ చూడవచ్చును దీనిపై మచ్చలు

చిత్రము 104

పటము—4

అంగారకుడు—వివిధ భ్రమణదశలలో

శిశలు కాల్పించును జలాశయములు గాని ప్రాణికోటి గాని ఈ గ్రహముపై యున్నట్లు శాస్త్రజ్ఞులు కనుగొనలేదు ఈ గ్రహవాతావరణమందలి పొర సూర్యుని నుండి ప్రసరించు పూర్ణనీలలోహిత కాంతిని అడ్డగించును

అంగారక గ్రహమునకు ఫోబస్ డైమస్ అను ఉపగ్రహములున్నవి ఫోబస్ 3700 మైళ్ల దూరమునుండి 7 గంటల లోను డైమస్ 12 500 మైళ్ల దూరమునుండి 30 గంటలలోను అంగారక గ్రహమును చుట్టివచ్చును ఈ రెండు ఉపగ్రహములు చాల చిన్నవగుటచే అందు వాతావరణముండజాలదట! సూర్యకుటుంబములోని మరే ఇతర ఉపగ్రహము దాని గ్రహము చుట్టును ఇంత హెచ్చు వేగముతో తిరుగుటలేదు

గురుడు (బృహస్పతి): ఇది సూర్యకుటుంబమందలి గ్రహములలో కెల్ల పెద్దది బరువైనది దీని భ్రమణవేగము చాల హెచ్చుగా నుండుటచే ఇది ధ్రువములవద్ద నొక్కబడి మధ్యరేఖా ప్రాంతములు ఉబ్బియుండును శుక్రుని యందువలె దీని ఉపరితలముపై విశేషసంచలనము గల నల్లని తెల్లని మేఘములుండుటచే దానిని చూడజాలము కొన్ని వేళలలో ఈ మేఘములపై మచ్చలు పుట్టి కొంతకాలముండి మాయమగును 1878లో కన్పట్టిన ఎఱ్ఱని మచ్చ ప్రముఖమైనది

చిత్రము 105



పటము 5

గురుడు—ఈ గ్రహముపై నుండు తెలుపు నలుపు మేఘములను ఎఱ్ఱని పెద్దమచ్చను చూడవచ్చును

గురుని ఉపరితలముపై 184°F ఉష్ణోగ్రతయు, అందలి మేఘములలో అమ్మోనియా వాయువును ఉన్నట్లు తెలియుచున్నది; మీథేను అను ప్రేలుడు వాయువుకూడ కలదట 1955లో ఈ గ్రహమునుండి రేడియో తరంగములు ప్రసరించినట్లు కనుగొనబడెను ఇవి ఎట్లు పుట్టెనో ఇంతవరకు కనుగొనబడలేదు సూర్యకుటుంబములో ఏ గ్రహమునకు లేనన్ని ఉపగ్రహములు గురుని చుట్టు తిరుగుచున్నవి ప్రస్తుతము 12 వరకు కనుగొనబడినవి వీటి ఉపరితలములు కూడ మేఘములతో ఆవరింపబడి యున్నవి

శనిగ్రహము ఈ గ్రహము దూరదర్శిని ద్వారా అందముగ కన్పించును మిగిలిన గ్రహములవలె గాక దీని చుట్టును మూడు వలయములు విడివిడిగనుండుట ఒక విశేషము ఇవి గ్రహమధ్యరేఖకు సమాంతరముగనున్నవి ఈ వలయములోని ఇసుక రేణువులు సన్నని గులకరాళ్ల వంటి పదార్థములు మంచు

చిత్రము 106



పటము—6

శనిగ్రహము

వంటివస్తువులతో కప్పబడి ఈ గ్రహముచుట్టును, ఒకదానినొకటి ఢీకొనక తిరుగుచుండునని కనుగొనబడినది ఈ వలయము లెట్లేర్పడెనో పరిశోధకులింతవరకు ఇదమిత్థముగ నిర్ణయించలేరు

శనిగ్రహపు సగటు సాంద్రత నీటిసాంద్రతకంటె తక్కువగుటచే దాని పరిమాణములో చాల భాగము దాని

చిత్రము 107



పటము—7

వివిధ కాలములలో శనిగ్రహము

వాతావరణముచేతనే ఏర్పడియుండును వర్ణమాలపరిశోధనము ద్వారా ఈ గ్రహవాతావరణములో అమ్మోనియా మీథేను వాయువులున్నట్లు తెలియుచున్నది శనిగ్రహముచుట్టునుగల 9 ఉపగ్రహములలో 8 ఉపగ్రహములు చంద్రునికంటె చిన్నవి అన్నిటికంటె పెద్దదైన టైటన్ యందలి వాతావరణములో మీథేనువాయువున్నట్లు కన్గొనబడినది

యురేనస్ 17 వ శతాబ్ది తర్వాత కనుగొనబడిన మూడు గ్రహములలో ఒకటైన యురేనస్ భూమికి చాల దూరమునమండి సూర్యునినుండి తక్కువకాంతిని పొందుటచేత అది ప్రకాశమానముగ నుండదు దీని సగటు సాంద్రత భూమి కంటె చాల తక్కువ తక్కిన గ్రహములు పడమరనుండి తూర్పునకు భ్రమణమొనర్పగా యురేనస్ తూర్పునుండి పడమరకు భ్రమణముచేయుచున్నట్లు కన్పించుచున్నది ఈగ్రహము మధ్యరేఖ సూర్యునిచుట్టు తిరుగు కక్ష్యాతలమునకు 98 డిగ్రీల వంపులో నుండుటయే ఇందుకు కారణమట

ఈ గ్రహమునకుగల 5 ఉపగ్రహముల కక్ష్యలు గ్రహముయొక్క మధ్య అక్షాంశమునకు సమాంతరముగ నుండుటచే ఈ ఉపగ్రహములకు గతులు గ్రహకక్ష్యకు లంబ మార్గములోనుండును సూర్యకుటుంబములో ఏ ఉపగ్రహము ఇట్లు తిరుగుటలేదు

నెప్ట్యూన్ బెర్లిన్ ఖగోళపరిశోధనాలయములో లెవెరియర్ అను ఫ్రెంచిశాస్త్రజ్ఞునిచే ఈ గ్రహము కన్గొనబడినది భూమి శుక్రుడు కవలలవలెనెట్లుండునో యురేనస్ నెప్ట్యూనులు కూడ అట్లే యుండునట! ఈగ్రహము సూర్యునకు చాలదూరమున నుండుటచే ఇచ్చట మిగుల శీతలముగ నుండును నెప్ట్యూనునుండి సూర్యునిచూచినచో శుక్రుడెట్లు కన్పట్టునో అట్లే నెప్ట్యూను గోచరించునట! నెప్ట్యూనునకు ట్రైటన్ నెరీడ్ అను ఉపగ్రహములు కలవు ట్రైటన్ యురేనస్ యొక్క ఉపగ్రహములవలె నెప్ట్యూనుయొక్క కక్ష్యకు లంబముగ తిరుగును కాని నెప్ట్యూను తక్కిన అన్నిగ్రహములవలెనే తిరుగుచున్నది

ప్లూటో: నెప్ట్యూను గ్రహగతిలో కన్గొనబడిన మార్పుల పరిశీలనవలన ప్లూటో అను మరియొక గ్రహము కన్గొనబడినది ఈ గ్రహము భూ శుక్ర అంగారక గ్రహములను పోలి యుండును దీనికక్ష్య తక్కిన గ్రహకక్ష్యలకంటె భిన్నముగ నుండి దానిప్రక్కనేయున్న నెప్ట్యూను కక్ష్యను తాకుచు

చిత్రము 108




అ

పటము—8

పోవుచుండును ఇట్టిస్థితి మరే గ్రహమునందును కానరాదు ఇందుచే ఒకప్పుడు ప్లూటో నెప్ట్యూనుకు ఉపగ్రహముగనుండి దాని ఆకర్షణశక్తినుండి ఎడివడి సూర్యునకుగ్రహముగా మారెనని శాస్త్రజ్ఞులూహించుచున్నారు దీనినిగూర్చి ఇతర వివరములేమియు తెలియుటలేదు

సూర్యకుటుంబపు పుట్టుక సూర్యకుటుంబమెట్లు పుట్టెనను విషయముపై పెక్కువాదోపవాదములు బయలుదేరి నెబ్యులా సిద్ధాంతము చేంబర్లిన - మౌల్టన్ సిద్ధాంతము జైఫ్రెస్ సిద్ధాంతము అనునవి నూతనముగా ఆవిష్కరింపబడినవి వీటిలో నెబ్యులా సిద్ధాంతము ముఖ్యమైనది

1755 లో ఇమాన్యూల్ కాంట్ అను శాస్త్రవేత్త నెబ్యులా సిద్ధాంతమును ప్రతిపాదించినాడు ఈవిశ్వములో ఒకానొకచోట భ్రమించుచున్న నెబ్యులా తన ఆకర్షణశక్తిచే సంకోచింపనారంభించినపుడు దానికేంద్ర అక్షాంశమువద్ద కొంతదిగా ఉబ్బును భ్రమణవేగము హెచ్చినపుడు ఈ ఉబ్బుకూడ హెచ్చి తుదకది నెబ్యులానుండి విడిపోయి దానిచుట్టును వలయము వంటిదేర్పడును ఇట్టి వలయములనేకములు నెబ్యులానుండి విడిపోవును కొంతకాలమునకీ వలయములలోని వాయువు కూడ సంకోచింప నారంభించి చివరకు ఒక గ్రహమువలె తయారై మొదటి నెబ్యులాచుట్టును తిరుగుచుండును ఇట్టి గ్రహములుగా మారిన వాయువు సంకోచించునపుడు కూడ పూర్వమువలెనే దానినుండి కొంతవాయువు విడిపోయి అదియే ఉపగ్రహముగ తయారగును ఇట్లు గ్రహములుగను ఉపగ్రహములుగను మారక మధ్యగా భ్రమణమునొందుచు మిగిలిపోయిన నెబ్యులా బాగుగ సంకోచించి చివరకు సూర్యునివలె మారును సూర్యకుటుంబమిట్లు ఉద్భవించియుండునని శాస్త్రజ్ఞుల ఊహ

ఎం బి కె శ

ప్రజ్ఞను శ్లాఘించుచు మరియొక జమీందారు వెండికొడవలి బహూకరించి ఘనముగా సత్కరించెను. యడవల్లి నటజీవిత మెంత ఉదాత్తమైనదో ఆయన లౌకిక జీవితము అంత ఉత్తమమై తోటి నటులకు ఆదర్శపాత్రమై అనుకరణ యోగ్యమై యుండెడిది.

1939 వ సంవత్సరమున అమలాపురములో శాకుంతల నాటక మాడుచుండగా దుష్యంతపాత్రధారియైన యీ నటమూర్తి గుండెపోటుతో రంగస్థలముపైననే ఇహలోక యాత్రను ముగించినట్లు తెలియుచున్నది. తాను మనసార ప్రేమించిన నాటకరంగస్థలముపైననే ఇతడు తనజీవితనాటకమును ముగించుట అద్భుతసన్నివేశము.

పు. పెం.

## సోక్రటీస్ (క్రీ. పూ. 469–399)

సోక్రటీస్ గ్రీకు తత్త్వవేత్త. ఆయన తండ్రి ఏథెన్సు నగరమున శిల్పిగానుండెను. సోక్రటీస్ కూడ కొన్నాళ్లు తండ్రి వృత్తినే అవలంబించెను. తరువాత అతడు యుద్ధభటుడై పెక్కు దండయాత్రలలో పాల్గొనియుండెను. ఒకప్పుడతడొక బహిరంగసభకధ్యక్షత వహించుచు స్వకర్తవ్యనిర్వహణమును ఉపేక్షించిరని పదిమంది సేనానాయకులపై తెచ్చిన అభియోగము అన్యాయమని తీవ్రముగా వాదించెనట! ఏథెన్సు ముప్పది మంది నిరంకుశుల అధికారమున నుండినప్పుడు వారి శాసనములు ధర్మేతరములని భావించుటచే అతడు వానిని ధిక్కరించెను.

మధ్యవయస్సు వచ్చినప్పటికి సోక్రటీస్ వ్యాపారము నుండియు రాజకీయములనుండియు విరమించెను. అతడు శాస్త్రీయ చర్చలయందాసక్తి కలిగియుండెను. గ్జాన్‌తిప్పి అను దానిని భార్యగ గయ్యాళిగంపయని పేరుబడసినదట! అన్నిరకముల మంచి ప్రవృత్తులుగల మానవులతో కలసి సంచరించుట అలవాటు చేసికొనుటకై అతడామె గయ్యాళితనమున్నియు శాంతముతో భరించుచుండెను. అతడు కోరికలను సాధ్యమైనంతవరకు తగ్గించుకొని నిరాడంబరమైన జీవితమును గడుపుచుండెను. చెదరిన పెద్దముక్కును దళసరి పెదవులను, విశాలనేత్రములను బట్టతలయు కలిగిన అతడింద్రియార్థములను వర్జించి ఎన్నడును ఆవేశమునకు లోనుకాక ఆ కాలమునందలి నీతిపరులైన ఉత్తమ పురుషులలో ఒకడుగా పేరుపడియుండెను.

సోక్రటీసు ఏథెన్సువీధులలో తిరుగుచు కనబడిన వారినెల్ల ఏవో ప్రశ్నలు వేయుచుండెడివాడు. ఈ ప్రశ్నించు విధానమువలన అతడు ఏథెన్సు నగరవాసులలో ఎక్కువమందికి అప్రియుడయ్యెను. అతని ధైర్యచమత్కారములను మెచ్చుకొనువారు కొందరుమాత్రమే ఉండిరి.

సోక్రటీస్ కనబడినవారి అజ్ఞానమునెల్ల బహిరంగముగా వెల్లడి చేయుచుండుటచే పురప్రముఖులు కొందరతని పీడ తొలగించుకొనవలెనని నిశ్చయించిరి. చివరకతడు యువకుల చిత్తములను కలుషితములు కావించుచున్నాడనియు ఆరాధ్యులైన వేల్పులనుగూర్చి అగౌరవముగా ప్రలపించుచున్నాడనియు అభియోగము తెచ్చెను. సోక్రటీసు తాను సమర్థించుకొన్న విధానమును ప్లేటో "అపోలజీ" అను శీర్షికతో వ్రాసియుండెను. సోక్రటీసు ఎంతగా వాదించినను వినక న్యాయమూర్తులతని అపరాధమును స్థిరపరచి, అతడు విషము త్రాగి మరణింపవలెనని తీర్పుచెప్పిరి.

సోక్రటీసు ఆ శిక్షననుభవించుటకు కారణాంతరములచే కొన్నిదినములు ఆలస్యమయ్యెను. ప్రతిదినము ఉదయము అతని భార్యయు ముగ్గురు కుమారులును అనుచరులును అతడున్న కొట్టుదగ్గరకు వచ్చుచుండిరి. అతడేమియు అతడెందిరవారితో మామూలుగానే మాటాడుచుండెను. ఆ సమయమున అతడు అపోలోనుగూర్చి ఒక గేయమును రచించెననియు, ఈసప్ నీతికథలను పద్యరూపమున వ్రాసెననియు చెప్పుదురు. అతడు తప్పించుకొనిపోవుటకు కొన్ని ఉపాయములు పన్ని అంగీకరింపవలెనని అతని మిత్రులతనిని ప్రార్థించిరి. న్యాయమైనను అన్యాయమైనను శాసనమును అనుసరించుట పౌరుల విధియని తెల్పి అతడందుకంగీకరింపడాయెను.

చివరిదినమున అతని భార్యయు మిత్రులును తుదిసారి అతనిని కలిసికొనుటకు వచ్చిరి. భార్య అతనిని చూడగనే దుఃఖావేశమునకు గురియై బిగ్గరగా వాపోవసాగెను. సోక్రటీస్ తన ప్రశాంతికి భంగము కలుగుచుండెనని తెల్పి ఆమెను అచ్చటనుండి దూరముగా తీసికొనిపొమ్మని మిత్రులను వేడుకొనెను. తరువాత అతడు వారితో తనధర్మమునుగూర్చియు ఆత్మహత్యనుగూర్చియు ఆత్మ అమరత్వమునుగూర్చియు కొంతసేపు ప్రసంగించెను. తన పల్కులన్నియు వారు జ్ఞప్తియందుంచుకొని మానవకల్యాణమునకై యత్నింపవలెనని

అతడు ప్రబోధించెను. నియమిత సమయమున అతడు శాంత చిత్తముతో విషము త్రాగి మరణించెను. మనకు పరిచితులైన వారందరిలో సుగుణమున మిక్కిలి ఉదాత్తుడును నీతిమునను మిక్కిలి మేధావియు ధర్మాత్ముడును అగు అమహనీయుడిట్లు పరమపదించెనని ప్లేటో వ్రాయుచుండెను. ఈలోకము నుండి పైలోకమునకు నా ప్రయాణము భద్రముగా సాగింపవలెనని నేను దేవుని వేడవలయును" అనునవి సోక్రటీసు ఉచ్చరించిన తుదిపల్కులు.

మహామహితుడును నిర్భయుడునైన సోక్రటీస్ సిద్ధాంతములు అతని శిష్యులైన ప్లేటో క్జెనోఫోన్ అను వారి వ్రాతల వలన తెలియుచున్నవి. అతని భావములాదర్శ వేదాంతమునకును అతని తరువాత వర్తిల్లిన మానవవివేకమును పరిశోధిత మొనరించిన నీతిశాస్త్రమునకును ఆధారములయ్యెను.

సోక్రటీస్ విధానము: మరియొక విధానమును సోక్రటీస్ పరిణమింపజేసెను. దీనిననుసరించి అతడు సరళములు శక్తిమంతములు అగు ప్రశ్నలువేసి జీవితమునకును పౌరసత్వమునకును సంబంధించిన సమస్యలకు తమంతటతామే సమాధానములను కనుగొనునట్లొనరించెను. అతడు వీధిలో పోవు పౌరునొకనిని ఆపి ఏదో ఒక విషయమును ప్రశ్నించి దానినిగూర్చి తనకేమియు తెలియదని చెప్పుచుండెను. ఆ పౌరుడు దానినిగూర్చి తనకు తెలిసినదానిని వివరించుటకారంభింపగా సోక్రటీసు పలుతములైన ప్రశ్నలువేసి అతని వివరణమంతయు దోషభూయిష్ఠమని నిరూపించుచుండెను. ఆలోచనామార్గమున లేక వివరణమార్గమున కల దోషములను నిరూపించు ఈ విధానమును సోక్రటీస్ చమత్కారము (Socrates irony) అని చెప్పుచుందురు. సోక్రటీస్ సౌశీల్యము, ధర్మము, న్యాయము, పవిత్రత మున్నగు వాటిని సంబంధించిన తత్త్వమును వెలుగునకు తెచ్చుటకు కూడా ఈ ప్రశ్నోత్తర విధానమునే అవలంబించుచుండెనట!

"నిన్ను నీ వెరుగు" అనునది సోక్రటీసు ఆదర్శము. అవగాహనమును ఆత్మపరిశోధనమును గాంచుటకై మనఃపూర్వకమైన అన్వేషణమును సాగించు తత్త్వాన్వేషకుడైన 'జ్ఞాని' అని పేర్కొన్నచో అతడొప్పుకొనెడివాడు కాడు. తనను వివేకప్రియుడని కాని తత్త్వాన్వేషి అని కాని పిల్చుట అతనికానందము.

సోక్రటీసు మరణించినపిమ్మట ఏథెన్సుపౌరులు క్రూరమైన తమచర్యకు పశ్చాత్తప్తులై తమ దోషమునకు ప్రాయశ్చిత్తముగా లిసిప్పస్ అనువాడు నిర్మించిన సోక్రటీసు కంచు విగ్రహమును అతని స్మారకచిహ్నముగా నిల్పిరని చెప్పుదురు. అతని అభియోక్తలలో కొందరు వధింపబడిరనియు కొందరు బహిష్కరింపబడిరనియు తెలుపు గాథకూడ కలదు.

ది. వే.

## సోమనాథుడు పాల్కురికి

పండ్రెండవశతాబ్దమున దక్షిణభారతమున వీరశైవము క్షీణదశనొంద తత్పునరుద్ధరణమునకై కర్ణాటకదేశమున బసవేశ్వరుడును ఆంధ్రదేశమున మల్లికార్జునపండితారాధ్యుడును అవతరించిరి. వీరిరువురి చరిత్రములను రచించి తన్మత ప్రచార మొనర్చుటకు పాల్కురికి సోమనాథుడు జన్మించెను.

సోమనాథుని నివాసము అనంతపురము జిల్లాలోని పాల్కురికి అని కీ. శే. డాక్టరు చిలుకూరి నారాయణరావు అభిప్రాయము. వరంగల్లు జిల్లాయందలి పాలకురికి గ్రామమాతని జన్మస్థలమని విమర్శకాగ్రేసరులైన బండారుతమ్మయ్య నిరూపించినారు. ఆగ్రామమిప్పుడొక పుణ్యక్షేత్రమనియు అచ్చటనున్న సోమేశ్వరాలయమును సోమనాథుని అనంతరము అతని శిష్యులు ప్రతిష్ఠించిరనియు వారు వ్రాయుచున్నారు.

పండ్రెండవ శతాబ్దిలో రాజ్యమేలిన కాకతిప్రతాపరుద్రుని (1వ) కాలములో సోమనాథుడు జీవించి కావ్యరచనసాగించి ప్రసిద్ధిగాంచెనని కందుకూరి వీరేశలింగము వ్రాసియుండెను. దీనినే పలువురు పండితులు సమర్థించిరి. శ్రియాదేవి విష్ణురామిదేవుడు సోమనాథునికి తలిదండ్రులు. ఇతడు పుట్టుకతోడనే వీరశైవుడని తెలియుచున్నది. ఇతడు అనుభవసారము, బసవపురాణము, బసవోదాహరణము, పండితారాధ్యచరిత్రము, చతుర్వేదసారము, రుద్రభాష్యము, త్రివిధలింగాష్టకము మున్నగు పెక్కుకృతులను రచించెను. ఇతని రచనలు కొన్ని గీర్వాణభాషలోను కొన్ని కన్నడములోను ఉన్నవి. వానిలో 150 పద్యములుగల అనుభవసారము ఈతని మొదటి పద్యకావ్యము. శివదీక్షను బట్టికొందఱను కొనునట్లు ఈకృతి సోమన తన చరమదశలో రచించెననుట సరికాదు. బసవేశ్వరుని గూర్చియు అతని అనుయాయులను గూర్చియు విశేషములు సేకరించి స్తవములు, రగడలు మున్నగు చిన్నకృతులు రచించిన పిమ్మట జానుతెనుగు ద్విపదకావ్యముగ ఏడాశ్వాసములలో బసవపురాణమును సోమనాథుడు రచించెను. అనంతరము

వృషాధిపశతకమును చంపకోత్పలములలో భక్తిభాసురముగ రచించెను. సోమనాథుడు అనుభవసారము ను సంస్కృత సమాసభూయిష్ఠముగ రచించినను బసవపురాణము ను సులభమగు సరళమైన జాను తెనుగులో వ్రాసెను. ఇది యు వృషాధి శతక శైలియు అచ్చతెనుగునకె తోచును. కాని ఇతడు ఇతర గ్రంథములలో కావ్యముపదములను దీర్ఘమగు సంస్కృత సమాసములను యథేచ్ఛముగా వాడియున్నాడు.

సోమనాథుని కృతులలో సంస్కృతసమాసభూయిష్ఠ మగు గద కు అనుభవసారము' నందలి ఈ క్రింది పద్యమొక ఉదాహరణము

"దానావేశ మహా తపోనిచయ సద్ధర్మాళి తీర్థావళి
స్థానస్తోమ జపవ్రత ప్రముఖ యజ్ఞ వ్రాత మంత్రోక్తరి
శ్యాన్వయ స్థాన విధానము న్ పలువు పుణ్యంబంతయుంగూడ నా
శ్యానా దాంఘ్రులు బూన్చి పుష్పసమప్రాంశంబును

బోలునే"

వృషాధిపశతకము లోని జాను తెనుగు రచన క్రింది పద్యమొక ఉదాహరణము

"బలుపొడ తోలు సీరయును బాపసరుల్ గిరుపాపు కన్నుచె
న్నొలసిన పేదు కత్తుకయునిండిన వేలుపు చేటు లుప్పా
ఎలుగుల జేరి తెంక పనిజాను తెనుంగున విన్నవించెద
వలపుమదందలిర్ప బసవా! బసవా! బసవా! వృషాధిపా"

అతనికృతులలో బసవపురాణము పండితారాధ్య చరిత్ర ఎన్నికగాంచినవి. వృషాధిపశతకము లో బసవపురాణము లోని కథాసారమే కాంచనగును. శతకసద్యములకైలి ఉదాత్తముగను డును మల్లికార్జునపండితారాధ్యుని రచన యగు శివతత్త్వసారము లో శ్రీశివపండితుడు చెప్పిన చొప్పుచ్చందములో కట్టిన మహామ గర్భింపబడినది. ఇది శతకలక్షణ ముల కతీతముగను న్నందున సోమనాథుని వృషాధిపశతకము అన్నివిధముల మకుటాన శతకలక్షణములతో నొప్పు మొదటి శతకరచనయని నిశ్చయింపనగును. బసవోదాహరణము ఆంధ్ర వాఙ్మయములో ఒక శిష్టకృతి

కర్ణాటక దేశమున బిరించి అచటనే విశేషముగ వీరశైవ మతోద్ధరణము కావించిన బసవేశ్వరుని చరిత్రమును సోమనాథుడు పురాణముగా విస్తరించి వ్రాసినాడు. "బసవాదు మృక్తి ద్విపద హేతువగుట ద్విపదవాజరగు"నను సోమనాథుని ద్విపదా నిర్వచనము స్మార్తమును, అపూర్వమునైనది. అతిముండి అంతమువరకు బసవేశ్వరుని భక్తి పవత్తులే బసవపురాణమున కనగును. అసమానుడాగు సమైనిత్వనని అని విశ్వాసము ఉపనయనసంస్కారము వలదని సహేతుకముగా ఎదిరించి బసవేశ్వరుడు బలదేవదండనాయకుని పుత్రికయగు గంగాం బను వివాహమాడి కళ్యాణనగరము బిజ్జలభూపతికి దండనాయకు డయ్యెను. రాజధనముకతని అంగముపూర్వమున అకసిలాంగి బిజ్జలు డడిగినంత పేటిక తెరువగా ధనము దేయుండుటయు తన భార్య గంగాంబ కట్టిన చీరను ఒక జంగము కోమ్మని కోరగా బసవన్న భార్యను విడిచి చీరనిమ్మనినంత ఆమె చీర విప్పగను ఆమె కీ మున బట్ట తొలగకుండుటయు మున్నగు అద్భుతచర్యలు ఈపురాణమునందు వర్ణింపబడినవి.

పరసతిపైగృష్టిపరవరవిదాం పరధనంబుమిఁశా సవడ

కుండుజావ

పరనిందసేయ కేటకోరయనిజాన పరమర్మకర్మముల్

పలుకనిజావ"

అను బసవేశ్వరుడాచరించిన జావలు మిక్కిలి ఉదాత్తములు పవిత్రాదర్శములు.

సోమనాథుని పండితారాధ్యచరిత్ర అతని చరమవయస్సులో అతిపౌఢముగా వీరశైవమతావేశముతో సంతరింప బడిన బృహద్గ్రంథము. ఇందు దీక్షాప్రకరణము పురాతన ప్రకరణము వాదప్రకరణము హరిహర తారతమ్యము దక్షా ధ్వరధ్వంసము మహిమప్రకరణము పర్వతప్రకరణము అను విభాగములు గలవు. భూతిరుద్రాక్షలు ధరించుట లింగధార ణము మున్నగునవి దీక్షాప్రకరణ విషయములు. వాదప్రకరణ మున ... శివుడె పరమేశ్వరుడని హా... పురాతనభక్తుల చరిత్రములు మహిమ సహితముల పర్వత ప్రకరణము అన్యతో సాత్త్వికవనోక్తిరాశియు శైవవైభ వము ఇది విధము మల్లికార్జునపండితుని అవతార సకుటుం బముగా శివైక్యమంద గ్రంథసమాప్తి ఇందలి రచన ప్రౌఢ తరము

సోమనాథుడు తన ప్రముఖ గ్రంథములు రెండింటిని ద్విపద లలో రచించి ద్విపదకు విశేషాస్తను నిర్వహించెను. ప్రాస, యతి విపులముగ వాడి ప్రాసోవా, యతిర్వా అని సమర్థిం చెను. గసడదవాదేశమును నిత్యమొనర్చెను. సంధులలో, సమాసములలో నిరంకుశత్వము వహించెను. సోమనాథుని లోకజ్ఞానము, పాండిత్యము అనన్యసామ్యములు. పండితా

శాస్త్రచరిత్రలో ఆతడు పేర్కొనిన గ్రంథజాలము పాఠకులను విస్మయనిమగ్నుల జేయును. వ్యాకరణ ఛందోలంకారాదులే కాక జ్యోతిష కౌటిల్యక సంగీత భరతశాస్త్రములు వైద్యశాస్త్రముకూడ ఆతడు పేర్కొనెను. వీరశైవమున నిండు విశ్వాసము గలిగి ఆవేశముతో బౌద్ధ జైనులతో ఇతరమతములను ఖండించి జైన బ్రాహ్మణులను ప్రాతిపూలలనియు గార్దభములనియు పెక్కుతెగుల ఇతడు నిందించెను.

సోమనాథుని ప్రశిష్యులలో నొకడగు ఎడపర్తి సోమనాథుడు బసవపురాణమును రచించి ఆతనికంత మొదలైనను యథావాక్కుల అన్నమయ్య, శివ సర్వేశ్వరశతక రచయితయగు సోమనాథు ననుకరించెను. సోమనాథుడు రచించిన జానుతెనుగును దేశ్యపదములను తరువాతి కవులనుసరించిరి. పూర్వకవులెవరును స్మరింపలేదు. వీరమాహేశ్వరాచారవ్రతుడైన సోమనాథుడు శైవమత వ్యాప్తియందు శాస్త్రయోగమున ఎవలుడై భక్తపూజలందిన శివైక్యమొందెను. ద్విపద రచనలో ప్రసిద్ధుడై సమకాలికులమెప్పునంది ప్రసన్నకవితారీతుల భావి కవులకు మార్గము చూపించి శైవమతవ్యాప్తి చేసి మహోదార కావ్యరచనా వైశిష్ట్యము చేతను సోమనాథుడు వీరశైవ వాఙ్మయయుగపురుషుడయ్యెను.

వి. వ.

## సోవియట్ రష్యా (చ) :

వైకింగులను ఒక తెగకు సంబంధించిన వరంగియనుల రాకతో రష్యా చరిత్రకు నాందిపలికినది. క్రీ. శ. 9 శతాబ్దిలో ఖజారులను అటవికుల బాధ దుస్సహముకాగా స్లావు జాతులు వరంగియనుల నాహ్వానించిరట! తెట్ లెండు నుండి రూరిక్ అనునాతని నాయకత్వమున వీరు రష్యాలో ప్రవేశించి కీవ్ అనునగరమును కేంద్రముగ చేసికొని పాలించిన రాజ్యమును 'రస్' అని బడెడిది. వరంగియనులు స్థానికులైన స్లావ్ జాతీయుల నాగరికతా సంస్కృతులకు క్రమముగా అలవాటుపడిరి. ఎమ్మట కీవ్ పాలకవర్గము బైజాంటియమ్ సమ్రాట్టులతో సంబంధములు నెరపిన ఫలితముగ గ్రీకు సనాతన క్రైస్తవమతము రష్యాలో వ్యాపింపసాగినది. రష్యను భాషను పోలిన చర్చిస్లావాని అను బల్గేరియా భాషద్వారా మత లౌకిక సాహిత్యము క్రైస్తవమతబోధకులచే వృద్ధిగావింపబడినది. ఈ సమయములో కీవ్ పాలకులు ఖజారుల బాధలను నిర్మూలించి రాజ్యమును రక్షించుకొనిరి. 1019-1054 ల నడుమ పారస్పరిక వ్యాపారాభివృద్ధితోపాటు రష్యను న్యాయసూత్రముల క్రోడీకరణముకూడ జరిగినది.

అప్పటివరకు ప్రభువుగనుండిన యస్లావ్ మహారాజానంతరము రాజ్యాధికారమునకై అంతర్యుద్ధములు జరుగగా కీవ్ రాజ్యమందు వ్యాపార వాణిజ్యములు క్షీణించినవి. ఈ స్థితిలో 12 శతాబ్దియందు రష్యాయందలి నొవొగొరొడ్ నగరవాసులు స్వతంత్ర ప్రజాప్రభుత్వమును స్థాపించుకొనిరి. సొసాడిక్ అను ప్రభువు పాలనముక్రింద నొవొగొరొడ్ మహానగరముగా వృద్ధిచెందినది. ఇట్లుండ లిథూనియనులను ... జాతివారు జృంభించి కీవ్ తోపాటు విశాలప్రాంతము నాక్రమించిరి. ఈ కారణమున కీవ్ రాజ్యముతో సంబంధములేని ఈశాన్య రష్యా ప్రాంతమందుండిన మాస్కోనగర నిర్మాణమునకు నూతనముగా పునాదులు వేయబడినవి.

మంగోలుల పాలనము : క్రీ. శ. 1287 లో మంగోలులు రష్యాపై దండెత్తి సైబీరియా నాక్రమించి కజాన్ వాసి మిర్ మాస్కో కీవ్ యున్నగు నగరములను ధ్వంసమొనర్చిరి. పోలెండుకూడ కొంతభాగము వారిచే ఆక్రమింపబడెను. తార్తారు నాయకులచే ఈ సైన్యయాత్ర ఆకస్మికముగ అంతమైనది. కాని వోల్గానదీతీరమున సరాయ్ అనునగరమును వారు నిర్మించుకొని దానిని పశ్చిమమంగోలియా సామ్రాజ్యమునకు కేంద్రమొనర్చుకొని సుమారు రెండు శతాబ్దులు నిరంకుశముగ పాలించిరి. రష్యను రాకుమారులు మంగోలులకు సామంతులై కప్పములు కట్టుచుండిరి.

అలెగ్జాండర్ నెవిస్కీ యువరాజు పాలనములో మాస్కో రాజ్యము విస్తరిల్లినది. సామంతులైనను వీరు అంతరంగిక విషయములలో స్వతంత్రముగా వర్తించిరి. ఇవాన్ కలిటా అను మాస్కో ప్రభువు కాలములో మాస్కో రాజ్యము స్వతంత్రమై బలపడి కొన్ని ప్రాంతములనుండి కప్పమును వసూలు చేయు అధికారమును మంగోలు ఖానుల కప్పగించెను. నాటినుండి మాస్కో సర్వతోముఖాభివృద్ధి చెందినది. మంగోలుల పాలనము 18 0 లో తుదకుట్టి పగ్గలైను. మంగోలులలో ఘర్షణ అంతఃకలహములు ఇందుకు దోహదమొసగినవి. అయితే అతికాలము చేతై యూరల్ నాయకత్వమున మంగోలులు మరల విజృంభించి మాస్కో పాలకులను సామంతులనొనర్చుకొనిరి. కాని 15 వ శతాబ్దిపూర్వార్ధమున మంగోలుల సార్వభౌమాధికారము విచ్ఛిత్తికాగా వారు కజాన్ క్రిమియా ప్రాంతములలో వేర్వేరుగా చిన్నరాజ్యములను స్థాపించుకొనిరి. కాని రష్య

నులు క్రమముగనే మంగోలుల చిల్లర రాజ్యములను కూల ద్రోసి సర్వస్వతంత్రముగ పాలించదొడగిరి

రష్యాలో మంగోలులపాలనము అంతమైనను దేశీయ ప్రభువుల నిరంకుశపాలనము శాసనవిధానము ఘోషాపద్ధతి మున్నగు దురాచారములు ప్రవేశించినవి ఎన్నియనేక బాధలు పడిరి. తక్కిన యూరపుఖండముతో రష్యాకు సంబంధము లేకుండ పోయినది

మాస్కోరాజ్యాభివృద్ధి క్రీ శ 1462-1612 ల నడుమ ఇవాన్ రాజుపాలనములో మాస్కోరాజ్యము అన్నివిధముల అభివృద్ధిచెందె. నొవోగరాడ్ బైజాంటియమ్ క్రిమియా మొదలైన విశాల భూభాగములు దాని ఆధీనముక్రిందికి వచ్చినవి. అతని అనంతరము మూడవవాసిలీ అను అతని పుత్రుడు జార్ బిరుదమును ప్రప్రథమముగ గ్రహించి రాజ్యాభివృద్ధికే కాక ప్రభుత్వ యంత్రనిర్మాణమునకుకూడ పాటుపడినాడు అతని హయాములో మాస్కోరాజ్యము రష్యారాజ్య మని వ్యవహరింపబడుట ఆరంభమైనది. వాసిలీ అనంతరము అతని కనిష్ఠపుత్రుడైన ఇవాన్ మూడు సంవత్సరముల ప్రాయమున సింహాసనమధిష్ఠించెను. క్రూరుడైన ఇతని పాలనమున రష్యా రాజ్యము దిక్కుల విస్తరించినది. ఇతడు ప్రజలయెడనేగాక తన రక్తబంధువులయెడకూడ కాఠిన్యముగ ప్రవర్తించెడివాడట! ఇతని మరణముతో రష్యాకు అనిశ్చిత పరిస్థితి కలిగినది. ఇతని కుమారులు ఫెడర్ డిమిత్రీలు బాలురగుటచే బోరిస్ అనునాతడు సంరక్షకుడుగనుండి రాజ్యవ్యవహారములను పర్యవేక్షించుచుండెను. 1598 లో ఫెడర్ మరణించగా, బోరిస్ రాజై డిమిత్రీని హత్యచేయించినాడు. 1605 లో బోరిస్ ఆకస్మికమరణము పొందగా వాసిలీషుయిస్కీ అను కులీనుడు 'జార్' గా ప్రకటింపబడెను. ఇతని హయాములో జరిగిన కానిసలతిరుగుబాటు అణచివేయబడినను ఎన్నోకలిగిన సైనికవిప్లవములో ఇతడు పదవీభ్రష్టుడయ్యెను. పిదప పోలెండు ప్రభువగు సిజిస్మండ్ రష్యాకురాజైనాడు. పోలెండు సైన్యములు రష్యాముఖ్యనగరముల నాక్రమించినవి. డిమిత్రీపోజార్స్కీ నాయకత్వమున రష్యనులు పోలెండు సైన్యములను దేశమునుండి తరిమివైచిరి. 1613 లో సమావేశపరుపబడిన అసెంబ్లీ మైకేల్ రోమనోవ్ అను బోయరుజాతీయుని రష్యారాజుగ (జార్) ఎన్నుకొనుటచే నాటినుండి ఆదేశమును రోమనోవ్ వంశజులు పాలింపదొడగిరి

రోమనోవ్ పాలనము మైకేల్ పాలనము సమర్థవంతముగ జరిగినది. పాతప్రభుత్వచట్టములనితడు క్రోడీకరించి పరిపాలనమును సువ్యవస్థితమొనరించినాడు. అనంతరీయులైన అలెక్సిస్ ఫెడర్ ప్రభృతులు పన్నులభారమును పెంచగొండి తనమును వ్యతిరేకించి తిరుగుబాటు సల్పిన కర్షకులను కాఠిన్యముగ అణచివేసినారు. మతపరమైన అల్లరులనుకూడ వీరు కూరముగ నిర్మూలించినారు. వీరి తరువాత ఇవాన్ పీటరులు అధినేతలైరి. రష్యానుపాలించిన ప్రభువులలో పీటర్ కడుసమర్థుడు. ఇతని కాలమున దేశము అన్నిరంగములలో ముందంజవైచినది. సైన్యాభివృద్ధి త్వరితగతితో ఘటిల్లినది. 1696లో అజోవ్‌నగరమును 1709లో స్వీడనును లోబరచుకొని ఎస్తోనియా లివోనియారాష్ట్రములను పర్షియాతో పోరాడి కాస్పియన్ పశ్చిమతీరమును ఆక్రమించినాడు. దేశమును నాగరికమొనర్చుటకు పీటరుపెక్కు సంస్కరణములను ప్రవేశపెట్టెను. మతబోధకులు రైతులుతప్ప ఇతరులు గడ్డములు పెంచరాదని అతడు శాసించెను. పాలనాసౌలభ్యమునకై దేశమును ఎనిమిదిభాగములుచేసి ప్రభుత్వయంత్రాంగమును అదుపులో పెట్టుటకు సెనేటు అనుసభను ఏర్పరచెను. ఇతడు పీటర్సుబర్గునగరమును నిర్మించి రాజధానిని అచటికి మార్చెను. చర్చి ఆదాయవ్యయములను తన అధీనములోనికి తెచ్చుకొని ప్రభుత్వోద్యోగములు మేధావులకు దక్కునట్లేర్పాటుచేసెను. రష్యను క్యాలెండరను సంస్కరించి జనవరి సంవత్సరపు మొదటినెలగానుండునట్లు కట్టడిచేసినాడు. రైతులబిడ్డలకునిర్బంధవిద్య అమలునట్లను స్త్రీలు నిర్భయముగ పదుగురిలో తిరుగునట్లను ప్రోత్సహించినాడు. ఇతరభాషలలోని సాంకేతిక గ్రంథములను రష్యనుభాషలోనికనువదింపజేసినాడు. సైన్య అకాడమీనికూడ ఇతడే స్థాపించినాడు. పీటరు ఆశయములను గ్రహింపజాలనివారు అతని కార్యక్రమమును క్రైస్తవమత వ్యతిరేక చర్యలుగాభావించిరి. ఎన్ని అవరోధములు కల్గినను పీటరు తనకాలములో రష్యానుగొప్పదేశముగా తీర్చిదిద్దినాడు జర్మనీతో అతడేర్పరచుకొనిన సంబంధమువలన రష్యాకెంతో మేలుజరిగినది

1725లో పీటరు మరణించిన పిమ్మట అర్ధశతాబ్దిపాటు రక్షకభటవర్గమువారు రాజ్యాధికారులుగా వ్యవహరించిరి. రాజులను చేయుటలోను వారిని భ్రష్టుల నొనర్చుటలోను ఈ కాలములో ఈవర్గమువారు కీలకమైన పాత్రవహించిరి

ఒకటవ క్యాథరిన్ రెండవపీటర్ ఎలిజబెత్ మున్నగువారు ఈవర్గము యొక్క అగ్రహానుగ్రహములపై ఆధారపడి గద్దె నెక్కినవారే!

వీరి అనంతరము ఉదారస్వభావుడైన అలెగ్జాండరు రాజ్యాంగబద్ధమైన ప్రభుత్వమేర్పరచి బానిసలను బహిరంగముగ అమ్మగూడదని శాసించినాడు సాంస్కృతికాభివృద్ధికి ఇతడు దోహద మొనర్చినాడు ఇతని అనంతరము 1825 ఇతని సోదరుడు నికోలస్ రాజ్యమునకువచ్చి తలయెత్తిన ప్రజావిప్లవములను క్రూరముగ అణచివైచెను తురుష్కసామ్రాజ్యమును నిర్మూలించుటకితడు బ్రిటను ఫ్రాన్సులతో చేతులుకలిపి టర్కీని ఓడించి మాల్దేవియా మున్నగు ప్రాంతములను తన అధికారపరిధిలోనికి తెచ్చుకొనెను 1833లో టర్కీసుల్తానుతో ఇతడు చేసికొన్న ఒడంబడికవలన రష్యాయుద్ధనౌకలు బాస్ఫరస్ జలసంధిగుండా ప్రయాణింప వీలుకల్గినది కాని 1841లో పశ్చిమ రాజ్యముల ఒత్తిడిలోబడి రష్యా తన ప్రత్యేక హక్కును వదలుకొనినది

ఇతని కాలమున సారస్వతము మూడుపూవులు ఆరుకాయలుగా వికసించినది గొగోల్ దస్తవిస్కీ బెలిన్‌స్కీ హెర్జెన్ వంటి మేధావులు కవితా విజ్ఞాన శాస్త్రీయరంగములందు అమూల్యమైన కృషిసల్పిరి బానిసల స్థితి మెరుగుపరచుటకు ఇతడు కొంత ప్రయత్నించినాడు పారిశ్రామికాభివృద్ధి కూడ దోహదమును కూర్చినాడు ఇతని కాలములో (1843 ప్రప్రథమముగ పీటర్సుబర్గునుండి మాస్కోకు రైలుమార్గము నిర్మింపబడినది క్రిమియాయుద్ధములో రష్యాపరాజయము నొందిన కారణముగా తన పూర్వులు సంపాదించిన సామ్రాజ్యభాగములను టర్కీవంటి విదేశ ప్రభుత్వములకు తిరిగి ఈయవలసివచ్చినది

ఇతని అనంతరము అధికారమును చేపట్టిన రెండవ అలెగ్జాండరు జిల్లా రాష్ట్రస్థాయిలలో ప్రజాపరిపత్తులను స్థానిక సంస్థల నేర్పరచి 1861 లో బానిసత్వమును పూర్తిగా నిర్మూలించు శాసనములను అమలు జరిపినాడు; న్యాయస్థానములను ఫ్రెంచి పద్ధతిపై సంస్కరించి ప్రజలకు న్యాయము చేకూరునట్లు చేసినాడు ఇతని కాలములో పెక్కురు మేధావులు సోషలిస్టు వ్యవస్థను స్థాపించుటకై దేశమంతట విప్లవప్రచారము సల్పిరి వాక్ ముద్రణా సంఘస్వాతంత్ర్యములకై అతివాదులు పోరాటమారంభించిరి [illegible] అరికట్టుటకై అలెగ్జాండరు పెక్కురను కారాగృహములందుంచెను; కొందరిని దేశబహిష్కృతులుగావించెను అయినను ఈప్రచారము విజృంభించి తిరుగుబాట్లకు ప్రోత్సహించినది వీరిలో ఒక వర్గమువారు తెగించి 1881లో అలెగ్జాండరును హత్యగావించిరి ఈసమయమున అంతర్జాతీయరంగములో రష్యాపూర్వప్రాభవమును తిరిగి సంపాదించుకొన్నది

1831లో రాజ్యాభిషిక్తుడైన మూడవ అలెగ్జాండరు పారిశ్రామికముగా దేశమును అభివృద్ధిపరచెను సాంఘిక విప్లవములను నిర్మూలించుటకు బద్ధకంకణుడయ్యెను ట్రాన్స్ సైబీరియను రైలుమార్గము ఇతని కాలముననే నిర్మింపబడినది అల్పసంఖ్యాకులగు యూదులవంటి పెక్కు జాతీయులు ఇతని పాలనమున బాధలకుగురియైనారు రష్యాలో మార్క్సిస్టు ప్రచారమారంభమై పెరుగ సాగినది ఇతని కాలముననే

రొమనోవ్ వంశపతనము బోల్షివిక్ విప్లవము: మూడవ అలెగ్జాండరు అనంతరము రాజ్యాధిపతియైన రెండవనికోలస్ రొమనోవ్ వంశములో తుదివాడు ఇతడు నిరంకుశుడు ఇతనినాటికే దేశములో సోషల్ డెమాక్రటిక్ పార్టీ ఏర్పడుటయు బోల్షివిక్కులు అప్పుడప్పుడే పాతుకొనుటయు జరిగెను ఇంతలో 1905 వ సం॥న జపానుతో యుద్ధము సంభవించి అందు రష్యా ఓడిపోవుటయు సమ్మెలు తిరుగుబాట్లు చెలరేగుటయు సంభవించినది అతికష్టముమీద శాంతి స్థాపింపబడినది ప్రజాభిప్రాయము ననుసరించి ప్రభువు కొన్ని సంస్కరణములను ప్రవేశపెట్టవలసి వచ్చినది నూతన శాసనమునుసరించి ఒకసారి ప్రజాప్రతినిధులు మరియొక సారి ప్రభుత్వపక్షీయులైన మితవాదులు శాసనసభకు అధిక సంఖ్యలో ఎన్నుకొనబడిరి

ఇంతలో 1914లో ఆరంభమైన ప్రథమప్రపంచ యుద్ధములో మిత్రమండలి పక్షమువహించిన రష్యా ప్రారంభమున పెక్కు రణరంగములలో తీవ్రపరాజయము నొందినది రాజ్యాంగయంత్రము అస్తవ్యస్తమై ధరలు పెరిగి ప్రజలబ్రతుకు దుర్భరముకాగా దేశమంతట తీవ్రమైన అసంతృప్తి చెలరేగినది 1917 మార్చి నెలలో కెరెన్‌స్కీ ప్రజలను సంతృప్తిపరచుటకై యువరాజును ప్రభుత్వాధినేతగా చేసి, తాత్కాలిక ప్రభుత్వము నేర్పరచెను కాని ప్రజలకు సంతృప్తి కలుగలేదు ఇంతలో బోల్షివిక్ మహానాయకుడైన లెనిన్ ప్రవాసమునుండి బయటపడి శ్రామిక ప్రజావిప్లవమునకు పిలుపునిచ్చి స్వయముగా నాయకత్వము

వహించినవాడు అప్పటికే బలపడిన బోల్షెవిక్కులు పెట్రోగ్రాడ్ (ఇప్పుడది లెనిన్‌గ్రాడ్ అని పిలువబడుచున్నది) సోవియటులకు అధిక సంఖ్యలో ఎన్నికై తమ అధికారమునచట స్థాపింపగల్గిరి. ఆసంవత్సరము నవంబరులో వారు కార్మిక కర్షక విప్లవసైనిక వర్గముల బలముతో ప్రభుత్వభవనముపై దాడి సల్పి మంత్రులను బంధించి ప్రభుత్వాధికారమును హస్తగతమొనర్చుకొనిరి. ఇదియే అక్టోబరు మహావిప్లవమని ప్రపంచప్రఖ్యాతి బడసినది.

లెనిన్ ఆధిపత్యమున బోల్షెవిక్కులు కార్మిక కర్షకుల ప్రజాప్రభుత్వమును నెలకొల్పిరి. రష్యా సామ్రాజ్యవాదులు పూర్వము అక్రమముగా గెలుచుకొనిన విశేష భూభాగములను సోషలిస్టు ప్రభుత్వము ఆయారాజ్యముల కిచ్చివైచి దేశములో శాంతిని స్థాపించుటకు సకల ప్రయత్నములు చేసినది. నూతనముగా బోల్షెవిక్ ప్రభుత్వము అమలుజరిపిన రాజ్యాంగ శాసనమునను సరించి 18 సంవత్సరముల వయస్సు గలవారికందరకు ఓటుహక్కు కల్గినది. పాలనా వ్యవహారములను నిర్వహించుటకై కార్యనిర్వాహకవర్గము శాసనసభ ప్రెసిడియమ్ అను సంస్థలు కేంద్రమున నెలకొల్పబడినవి. 1918లో బోల్షెవిక్కులకును ప్రత్యర్థులకును నడుమ జరిగిన అంతర్యుద్ధములో ప్రత్యర్థులు పూర్తిగా ఓడింపబడిరి. దేశములో ఘటిల్లిన కల్లోల పరిస్థితులను అవకాశముగాగొని బ్రిటన్ ఫ్రాన్సువంటి కొన్ని రాజ్యముల సైన్యములు రష్యాపై దండయాత్ర జరిపి సోవియట్ ప్రభుత్వ ప్రతికూలుర అండతో కొన్ని కీలక ప్రాంతములనాక్రమించినవి. అయితే అచిరకాలములోనే ప్రజాబాహుళ్యము యొక్క సహాయముతో సోవియట్ ప్రభుత్వము అంతర్విద్రోహశక్తులను పూర్తిగా ఓడించి విదేశ సైన్యములను వెనుకకు తరిమి వేసినది.

1924లో నూతన రాజ్యాంగశాసనమునను సరించి రష్యాలో సోవియట్ల సమాఖ్య (U S S R) ఏర్పడినది. ఇందు వివిధభాషలు మతసంస్కృతులు గల 16 రాష్ట్రముల ప్రజలు కలిసి ఈనాటికిని సోదరులవలె జీవించుచున్నారు. రష్యాలో పరిశ్రమలు వ్యవసాయము, విద్య, సాంకేతిక విజ్ఞానము, త్వరితగతిలో పురోగమించుటకై పంచవర్షప్రణాళికలను లెనిన్ అనుసరించినాడు. మహా వ్యవసాయ క్షేత్రముల నిర్మాణము వీటిలో ముఖ్యమైనది. జాతీయమొనర్పబడిన సకల సంపదయు శీఘ్రకాలములో అభివృద్ధియై ప్రజల అవసరములను తీర్పగలిగెను. లెనిన్ కార్ల్ మార్క్సు సిద్ధాంతములను ఆనాటి రష్యాపరిస్థితుల కనుగుణముగా మలచి శ్రామిక ప్రజానీకమంతటికి ఎంతయో మేలుకూర్చినాడు (లెనిన్ జీవితగాథను గూర్చి ఈసంపుటమునందే వేరువ్యాసము కలదు).

లెనిన్ మరణానంతరము (1924) అధికారమునకు వచ్చిన స్టాలిన్ బోల్షెవిక్కుల విశ్వాసమును చూరగొని లెనిన్ ప్రారంభించిన నిర్మాణకార్యక్రమమును అప్రతిహతముగ కొనసాగించినాడు. విదేశ ప్రభుత్వ గూఢచారులుగా వ్యవహరించిన సోవియట్ ప్రతికూలురను అతడు కాఠిన్యముగ అణచివైచినాడు. బోల్షెవిక్కు పార్టీలో కూడ సిద్ధాంతపరముగ తప్పుడుమార్గము పట్టిన వారితో అతడు తీవ్రముగ వాదించెడివాడు. కొందరియెడల అతడు నిర్మొగమాటముగ కాఠిన్యముగ వర్తించెడివాడు. అందుచే ఆయనపట్ల వారు ద్వేషభావమును భయమునుకల్గి లోలోన వానిని అడచుకొనెడివారు. ఈవిధముగా స్టాలిన్ బోల్షెవిక్కు పాలనమును నిష్కంటకమొనర్చి ఏకైక బోల్షెవిక్కునాయకుడుగా కడుసమర్థతతో రాజ్యమును పాలింపసాగినాడు. అతనికాలములో జరిగిన సర్వసమగ్రమైన అభివృద్ధిలో ఎర్రసైన్యమును అత్యధునాతన పద్ధతులపై అభివృద్ధిచేయుట ప్రముఖమైన విషయముగా పేర్కొనబడినది.

రష్యాసాధించిన అభివృద్ధి జర్మనుదండయాత్ర(1941) ఫలితముగా కుంటుపడినది. ఈ దండయాత్రలో జర్మను సైన్యములు రష్యాయందలి కొన్ని పెద్ద పెద్ద పారిశ్రామిక కేంద్రములను పంటభూములను గ్రామములను విద్యుదుత్పాదక స్థావరములను నాశనమొనర్చినవి. శత్రుసైన్యములు లెనిన్‌గ్రాడ్ స్టాలిన్‌గ్రాడ్ నగరములను ముట్టడించి మాస్కో పొలిమేరలవరకు ఆక్రమించినవి. సోషలిస్టు విజయములు, సోవియట్ నాగరికత అంతమొందునేమో అని ప్రపంచమాందోళనము చెందినది. కాని సోవియట్ ప్రజలు ఎర్రసైన్యము ఒక్కటై శౌర్యపరాక్రమ త్యాగాలతో ప్రాణములను సరకుగొనక వీరోచితముగ పోరాడి జర్మను సైన్యములను ప్రతిఘటించుటేకాక తిరుగుదాడిసల్పి వాటిని బెర్లిన్ వరకు తరిమివైచినవి. తుదకు హిట్లరు దుర్మరణము నాజీ సైన్యముల పరాజయము తప్పలేదు.

జర్మనుదండయాత్ర వలన రష్యాకు విశేష నష్టము వాటిల్లినను, అనంతరము అది త్వరితముగా కోలుకొని, శీఘ్ర

కాలములో అమెరికాతో సమానమైన అగ్రరాజ్యముగ సర్వతోముఖాభివృద్ధిగాంచినది. యుద్ధానంతరము బాల్టిక్ రాజ్యములైన ఎస్తోనియా లట్వియా లిథుయానియా ప్రజాస్వామిక దేశములు బలవంతముగా సోవియట్ యూనియనులో అంతర్భాగములైనవి. యుద్ధానంతరము ఆసియా ఐరోపాఖండములలో నూతనముగ స్థాపింపబడిన సోషలిస్టు రాజ్యములు మరింతగా రష్యాతో సన్నిహితములైనవి.

స్టాలిన్ నాయకత్వమున రష్యాలో జరిగిన సర్వతోముఖాభివృద్ధియందు అంతరిక్ష పరిశోధనములోను ఉపగ్రహములను పంపుటలోను అమెరికాతో సమానముగ అది సాధించిన విజయము చరిత్ర ప్రాముఖ్యముగలది. సాంకేతిక ఇంజనీరింగు రంగములలో కూడ రష్యావలె శీఘ్రకాలములో ఇంతటి ఘనమైన అభ్యుదయమును సాధించిన దేశము మరేదియు లేదు.

స్టాలిన్ మరణానంతరము (1953) వరుసగా మాలెంకోవ్ బుల్గానిన్లు ప్రధానమంత్రులైరి. పిమ్మట 1957 లో క్రుశ్చేవ్ ప్రధానియైనాడు. ఇతడు ఇతని సహచరులు మరణించిన స్టాలినుపై కొన్ని అభియోగములు తెచ్చి ఆయనవ్యక్తిత్వమును ఆయన సాధించిన ఘనవిజయములను కించపరచిరి. స్టాలిన్ నిర్వహించిన పాత్రయెడల అతని విధానములయెడల అంతర్జాతీయ కమ్యూనిస్టు వర్గములలో కొందరు అభిమానమును ప్రకటించగా మరి కొందరు క్రుశ్చేవ్ ప్రభృతులవలె నిరసింపసాగిరి. ఈనాటికిని ఎవరి అభిప్రాయములు వారికి అట్లేయున్నవి. క్రుశ్చేవ్ పాలనములో దేశీయ విదేశీయవ్యవహారములలో గణనీయమైన మార్పులు కలిగినవి. కొందరు రాజకీయ ప్రతిపక్షులయెడల అతడు కొంతమేరకు ఉదారవైఖరిని అవలంబించినాడు. విదేశ విధానములో సహజీవన సిద్ధాంతమును అమలు జరుపుటయందును రాజకీయ విముఖత చూపక అన్యదేశనాయకులను గౌరవించుటయందును ఈయన పేరు బడసినాడు. వెనుకబడిన రాజ్యములకు సహాయమొసగ్గుటలో రష్యాముందడుగు వేసినది. సోషలిస్టు రాజ్యముల మనుగడను నిల్పుటకై వాటికి సహాయమందించినది. రష్యాచైనాల నడుమ తలయెత్తిన సిద్ధాంతపరమైన విభేదములు కమ్యూనిస్టు ప్రపంచముయొక్క సంఘటిత శక్తిని బలహీనపరచినవి. ప్రస్తుతము కోసిగిన్ నాయకత్వమున సోవియట్ రాజ్యము సర్వతోముఖముగా అభివృద్ధి నొందుచు, తన నూతనవిధానమునకనుగుణముగ ఇప్పటికిని సామ్రాజ్యవాదులతో పోరాటమును తోచినవిధముగా సాగించుచు శాంతికై పాటుపడుచునే యున్నది.

ఆర్. సూ. మూ.

## సోవియట్ రష్యా (భూ)

ప్రథమప్రపంచ సంగ్రామమునకుపూర్వము ఐరోపాఖండములోకెల్ల రష్యాపెద్దదేశము. పూర్వపు రష్యాసామ్రాజ్యము ఐరోపా ఆసియాలలోని విశాలభూఖండముల నాక్రమించి యుండెను. 1917 వ సం॥లో అచ్చట జరిగిన బోల్షెవిక్ విప్లవానంతరము ఏర్పడిన సోషలిస్టుప్రభుత్వము రష్యను జారు చక్రవర్తులచే పూర్వము ఆక్రమింపబడిన విదేశప్రాంతము నువదలుకొని వాటికి స్వాతంత్ర్యము నిచ్చివేసెను. అట్టివాటిలో ఫిన్లెండు ఎస్తోనియా లట్వియా లిథుయానియా పోలెండు దేశములు ముఖ్యములైనవి. ఈ ప్రాంతములను వదలుకొనగా మిగిలిన రష్యాదేశము రష్యన్ సోవియట్ సోషలిస్టు రిపబ్లికుల సమాఖ్య అనుపేర పదునారు ప్రాంతీయ రిపబ్లికులుగా విభజింపబడినది. 1940 వరకు స్వతంత్రముగనుండిన ఎస్తోనియా లట్వియా లిథుయానియా రిపబ్లికురాజ్యములు ద్వితీయ ప్రపంచయుద్ధానంతరము 1945 లో రష్యన్ సోషలిస్టు రిపబ్లికుల సమాఖ్యలో అంతర్భాగములుగా చేసినవి. తత్ఫలితముగా, రష్యాసరిహద్దులు మరల నిర్దిష్టపడినవి. ప్రపంచమునందెల్ల పెద్ద సోషలిస్టు ప్రజాతంత్రరాజ్యముగా పిలువబడుచున్న ఈ విశాలదేశమునకు మాస్కోనగరము రాజధాని.

సోవియట్ రిపబ్లికురాజ్యము తక్కిన అన్నిరిపబ్లికులకంటె భిన్నమైనది. అందలి జలభూభాగములు అరణ్యములు గనులు పశుసంపద ఫ్యాక్టరీలు పరిశ్రమలు నదులు సముద్రములు లోహములు రైల్వేలు మున్నగునవి ప్రజాప్రతినిధియగు ప్రభుత్వపు ఆస్తులుగా పరిగణింపబడుచున్నవి. ప్రతిప్రాంతీయ రిపబ్లికునందును సోవియట్స్ అను సభలచే ఎన్నుకొనబడు మంత్రివర్గములు వ్యవహరించుచుండును. ప్రత్యక్షఎన్నికల ద్వారా ఎన్నికయగు కేంద్రప్రభుత్వము ప్రాంతీయ రిపబ్లికులన్నిటిపైన సర్వాధికారము వహించి దేశమును పాలించుచుండును. దేశాధ్యక్షుడు రాజ్యాధిపతియై, రాజ్యపాలనమును పర్యవేక్షించుచుండును.

సోవియట్ రష్యా వైశాల్యము 87 లక్షల చ. మైళ్లు. జనాభా 21 కోట్లు. ఈ దేశమంతయు దాదాపు సమతలముగ

మందును తూర్పున ఇది ఆసియాఖండమునుండి యూరల్ పర్వతశ్రేణులచే వేరుచేయబడుచున్నది. దక్షిణదిశాగ్రమున కాకేసస్ పర్వతములచే ఇది ప్రత్యేకించబడుచున్నది. బాల్టిక్ సముద్రము నుండి కాస్పియన్ సముద్రమువరకును తెల్ల సముద్రము నుండి నల్ల సముద్రమువరకును కార్పేథియన్ పర్వతముల నుండి యూరల్ పర్వతములవరకును విశాలభూభాగములావరించియున్నవి. దక్షిణదిశయందు నీపర్ డాన్ నదులనడుమ గాని ఓల్గాపశ్చిమతీరమునందుగాని గలభూఖండముల ఎత్తు వెయ్యి అడుగులకు మించియుండక అందలి ఏటవాలుడు కన్పించియు కన్పించనంత స్వల్పముగనుండును. భూమ్యుపరితలమంతయు సమముగనుండుటచే నీటిపారుదలవసతులు సహజముగలేక చిత్తడినేలలచ్చటచ్చట నేర్పడియున్నవి.

రష్యాదేశమంతటిలో ఓల్గానది మిగులగొప్పది. పెక్కు ఉపనదులుగల ఈమహానది దేశమునకడ్డముగా ప్రవహించుచు, ప్రపంచములోనెల్ల పెద్దసరస్సయిన కాస్పియన్ సముద్రములో కలియుచున్నది. యూరపియనురష్యాలో అర్ధభాగమునకు పైగా ఓల్గాపరీవాహకమండలమందున్నది. ఉత్తరదిశగా ప్రవహించు ముఖ్యనదులలో ఉత్తరద్వినాఅనునది ఆర్కిటిక్ సముద్రములోను, పశ్చిమద్వినాఅనునది బాల్టిక్ సముద్రములోను, పడుచున్నవి. దక్షిణదిశగా ప్రవహించు నీస్టర్ నీపర్ డాన్ అనునదులు నల్లసముద్రమును చేరుచున్నవి.

శీతోష్ణస్థితి: ఈదేశపు నైసర్గికలక్షణములు దాదాపు ఒకేరీతిగా నుండుటవల్లే శీతోష్ణస్థితికూడ అట్లేయుండి విశాల భూభాగముపై ఉద్భిజ్జవికాసముకూడ ఒకేవిధముగనున్నది. పశ్చిమ సరిహద్దున స్వల్పప్రాంతమునందుతప్ప యూరపియను రష్యావిభాగమందలి శీతోష్ణస్థితి ఐరోపాఖండముయొక్క నడిగడ్డయందలి శీతోష్ణస్థితిని పోలియుండును. ప్రాగ్దక్షిణ ప్రాంతములందీ లక్షణములింకను సుస్పష్టముగనుండును. అట్లాంటిక్ సముద్రపు వాయుతరంగముల ప్రభావమునుండి ఈ ప్రాంతములు దూరముగనుండుటచేనను ఇతరకారణములచేతను ఈలక్షణములు గోచరించుచున్నవి. ఐరోపానడిగడ్డ శీతోష్ణస్థితియే యూరపియనురష్యాలో నుండుటవలన శీతాకాలపు రాత్రులు దీర్ఘముగనుండి శీతోష్ణస్థితి ఘనీభవకాంకము (Freezing point) కంటె 20-0 డిగ్రీలు తక్కువస్థాయికి దిగును. నేలవిశాలపరిమితి తక్కువగనుండి శీతోష్ణస్థితి సాధారణముగా హెచ్చుస్థాయిలో నుండును. సముద్రమునుండి వివిధప్రాంతములవరకుండు దూరముపై వర్షపాతమాధారపడియుండును. సముద్రము నుండి పశ్చిమదిశగావీచు నైరృతిపవనములవలన పశ్చిమప్రాంతములో 25 అంగుళముల వర్షపాతము కురియును. ఈపవనములు ఉత్తరమునకు తూర్పునకు ఆగ్నేయమునకు పోనుపోను వర్షపాతమచ్చట 10 అంగుళములు మాత్రముండును.

ఉగ్రమైనశీతోష్ణస్థితికారణముగా ఐరోపారష్యావిభాగములో ప్రజలంతగా నివసింపరు. అచ్చట విశేషముగా అరణ్యములు పెరుగును. ఈయరణ్యములలో ఉత్పత్తియగు అమూల్యమైన కలప పలుప్రాంతములకు ఎగుమతిచేయబడును.

వ్యవసాయము: దాదాపు రష్యాఆర్థికజీవితము విశేషముగా వ్యవసాయముచే ప్రభావితమగుచున్నది. గోధుమ, బార్లీ, బంగాళాదుంప, పంచదారబీటుదుంప ఇత్యాదుల ఉత్పత్తిలో ఈదేశము ప్రపంచప్రఖ్యాతిగాంచినది. ఉక్రెయినులోని సారవంతమైన నేలయందు విశేషముగా గోధుమ పంచదారబీటుదుంప పండుచున్నది. పూర్వమీదేశము ప్రజల అవసరములను తీర్చగలిగి గోధుమలను ఐరోపాదేశములకెగుమతి చేయుచుండెడిది. కాని తరువాత స్వదేశములో జనసంఖ్య అధికమగుటచే తమ జీవనప్రమాణము పడిపోవుటచేతను సోవియెట్ ప్రభుత్వము ఈఎగుమతులను నిలిపివేసినది. ఫలితముగా ప్రజలజీవనప్రమాణము చాలవరకు పెరిగినది. ఉత్తరమధ్య రష్యాలో వాతావరణము చల్లగనుండుటచే రై ధాన్యమచ్చట పుష్కలముగా పండుచున్నది. ఎల్లగిసె అనుసు మొక్కలుగలపంటలు అంతకంటె తక్కువసారవంతమైన బాల్టిక్ సముద్రతీరమండలమునందు పండుచున్నవి. ప్రత్తి కిర్గిజియా జార్జియా రాష్ట్రములలోను బంగాళాదుంపలు సర్వత్ర సర్వకాలములలోను పండును.

సోవియట్ ప్రభుత్వస్థాపనకుపూర్వము ఈదేశమందలి వ్యవసాయవిధానము అతిపురాతనపద్ధతియందుండెడిది. పంటభూముల వైశాల్యముగాని అందుపండు పంటగాని అత్యంతస్వల్పముగనుండెడిది. 1929 నుండి అమలుజరుపబడిన పంచవర్షప్రణాళికలకాలములో వ్యవసాయవిధానము పూర్తిగా ఆధునికమొనర్పబడుటచే పంట విరివిగ పండనారంభించినది. భూమియంతయు ప్రభుత్వపరమగుటచే ప్రభుత్వము సమష్టి వ్యవసాయక్షేత్రములనేర్పరచి భూమిలేని వ్యవసాయదారులకు భూవసతిని కల్పించుటద్వారా ఉత్పత్తిని అత్యధికమొనర్చెను. భూస్వామ్యవ్యవస్థను రద్దుచేసి, భూమిని ప్రభుత్వము తన

స్వాధీనమొనర్చుకొనుటవలననే సాధ్యమైన అభివృద్ధి రైతుల కందియే నైపుణ్యముగల సాంకేతిక శాస్త్రజ్ఞులు తయారగుట చేతను తాము పండించినపంట తమకు న్యాయముగా దక్కుట చేతను సమష్టి వ్యవసాయవిధానముచే రైతాంగమునకు మిగుల ప్రోత్సాహము ప్రయోజనము కల్గినది రైతులలో అక్షరాస్యత దినదినాభివృద్ధి చెందుటవలన వ్యవసాయమును శాస్త్రీయ పద్ధతులపై వారు సులభముగా సాధింపగల్గిరి దీనికి తోడు అత్యధునాతనమైన వ్యావసాయక యంత్రము లచ్చటనే తయారగుటవలన వ్యవసాయరంగములో రైతులు శరవేగముతో అభ్యుదయమును సాధింపగల్గిరి ఎరువుల వాడకము గూడ రైతులు నేర్చియుండుటచే పంట ఉత్పత్తిప్రమాణము వేగముగ పెరుగసాగెను ఇంత సహాయసంపత్తితో అభివృద్ధి యగుచున్న సమష్టివ్యవసాయ విధానమీనాడు మొత్తము భూభాగములో 80 శాతమునందు నిత్యకల్యాణము పచ్చతోరణముగ పురోగమించుచున్నది

పశుసంపద రష్యాయందలి మెట్టప్రాంతములలోని పచ్చికబయళ్ళలో పశువుల మేపకము చాలకాలమునుండి ప్రాముఖ్యము వహించియున్నది లక్షలకొలది పశువులు ఏపుగా పెరిగిన ఈ పచ్చికబయళ్లలో మేయుచుండును గొర్రెలపెంపకములో రష్యా ఈనాడు ప్రపంచములో ద్వితీయస్థానమును తక్కిన పశువుల విషయములో తృతీయస్థానమును ఆక్రమించుచున్నది

లోహసంపద లోహసంపదలో అమెరికా తరువాత రష్యా అగ్రస్థానమాక్రమించుచున్నది ఈ లోహములలో గని బొగ్గుది ప్రథమస్థానము ప్రపంచములో లభ్యమగు గని బొగ్గులో 7 శాతము రష్యాయందున్నది యూరపియను రష్యావిభాగములోను డానెట్జ్ మండలమునందు ప్రసిద్ధములైన బొగ్గుగనులు నెలకొనియున్నవి ఇనుపఖనిజము అత్యంత సమీపముననుండుటచే, ఈ రెండుమండలములును అత్యంత ప్రాధాన్యము వహించియున్నవి వీటికి సమీపముననే మాంగనీసు మున్నగురాయికూడ విశేషముగా దొరకుటచే ఈదేశపు పారిశ్రామిక అభివృద్ధి ఊహింపజాలనంత చురుకుగా సాధింపబడినది ఈనాడు డానెట్జ్ మండలము పారిశ్రామికముగను ఆర్థికముగను అత్యంతశోభాయమానముగ నుండుటకు ఇవియే కారణములు డానెట్జ్ మండలముతర్వాత ఖనిజసంపదయందు యూరల్ పర్వతప్రాంతము మిగులపేరుబడసినది వీటితర్వాత సైబీరియాలోని కుజ్బాస్ మండలము టుంగస్ డాన్‌బాస్ కరగండ మండలములు ప్రసిద్ధివహించియున్నవి

ఐరోపాఖండమంతటిలో ఒక్కరష్యాయందే పెట్రోలు అత్యధికముగా ఉత్పత్తియగుచున్నది ప్రపంచమంతటిలో పెట్రోలుఉత్పత్తియందు ఈదేశము తృతీయస్థానమాక్రమించియున్నది రష్యాఆగ్నేయభాగమున కాకాబ్దములనుండి పెట్రోలు ఉత్పత్తియగుచునేయున్నది కనుచూపుమేరలో ఈయుత్పత్తి తగ్గెడు లక్షణములు కన్పట్టుటలేదు బాకు నూనెగనులనుండి నల్లసముద్రపురేవయిన బాటమ్ అనురేవునకు గొట్టములద్వారా పెట్రోలు తరలించబడును అట్లే కాకస్పర్వతముల కుత్తరముగనున్న గ్రాజ్నీ మైకాప్ నూనెగనులకును టాప్సిరేవునకును నూనెరవాణాకై గొట్టములమర్చబడియున్నవి రష్యాయొక్క దూరప్రాచ్యమండలములలోకూడ పెట్రోలుగనులు విరివిగ కనుగొనబడినవి అచ్చటికి కూడ రవాణామార్గములు విస్తరించినవి అందుచే పెట్రోలు ఉత్పత్తి ఇంకను అత్యధికమై పాశ్చాత్యదేశములకుకూడ రష్యానుండి ఎగుమతులు హెచ్చుగా సాగుచున్నవి

ఇనుపఖనిజపుఉత్పత్తిలో రష్యాదేశము ప్రపంచమునందు మూడవస్థానమాక్రమించినది పెట్రోలు ఇనుముతోపాటు మాంగనీసు గ్రాఫైటు ప్లాటినము బంగారము మైక మొదలైన ఖనిజముల ఉత్పత్తిలో ఈ దేశము అగ్రస్థానమాక్రమించినది

పరిశ్రమలు సోషలిస్టు విప్లవమునకు పూర్వము పారిశ్రామికముగా ఈదేశము చాల వెనుకబడియున్నను ఇటీవల శరవేగముతో ముందంజవేసినది ప్రథమ ద్వితీయ పంచవర్ష ప్రణాళికలననుసరించి భారీపరిశ్రమల నిర్మాణములో ఈ దేశము అగ్రస్థానమలంకరింపగల్గినది తక్కిన పారిశ్రామిక వస్తువుల ఉత్పత్తిలోకూడ ఈదేశము స్వయంసమృద్ధినిసాధింపజాలినది

పెద్ద పెద్ద మౌలికపరిశ్రమలన్నియు మాస్కోనగరము చుట్టును డానెట్జ్ బొగ్గుగనుల పరిసరములందును యూరల్ మండలమునందును నెలకొనియున్నవి భారీపరిశ్రమలలో విశేషభాగము దక్షిణరష్యాయందున్నవి మాస్కోమండలములో ముఖ్యముగా బట్టలపరిశ్రమ యంత్రనిర్మాణపరిశ్రమ స్థాపింపబడియున్నవి యూరల్ మండలములో ప్రత్యేక నైపుణ్యముకొరకు లోహ రసాయనశుద్ధి కర్మాగారములు,

ఇతర యంత్రాగారములు పనిచేయుచున్నవి తక్కిన పరిశ్రమ లన్నియు వాటి కవసరమగు ముడిసరకులు లభ్యమగుచోవు లందును రవాణాసౌకర్యములు అందుబాటులోనుండు చోవు లందును నెలకొల్పబడినవి.

రవాణాసౌకర్యములు.— విస్తారమైన రాష్ట్రములందును రవాణాసౌకర్యములు కల్పించుట దేశముయొక్క ఆర్థిక వికాసమునకు అత్యవసరమైనది. బోల్షెవిక్ విప్లవమునకు పూర్వము ఈదేశమునందు రవాణా సౌకర్యములు హీనస్థితియందుం డెను. అనంతరము జల భూ ఆకాశమార్గములలో ఆధునిక పద్ధతిపై రవాణా సౌకర్యములు అభివృద్ధి చేయబడినవి. నీటిరహదారులుగా ఓల్గా నీవర్ నీస్టర్ ద్వినాముల్నగు నదులిప్పటికిని ప్రాముఖ్యము వహించియున్నవి. సంవత్సరములో మూడు మాసములు అవిమంచుదిబ్బలచే కప్పబడి యుండుటచే వాటిని ఛేదించు ప్రత్యేకయంత్రములతో అమర్చబడిన పడవలు ఈనదులను చాలవరకు తొలగించుచున్నవి. జలమార్గములద్వారా ప్రయాణమును సుకరమొనర్చుటలో సోవియట్ ప్రభుత్వము అద్భుతమైన విజయము సాధించినది. ముఖ్యనదుల మధ్య ఓడల ప్రయాణము అనుకూలించునట్లు కాలువలను నిర్మించి, వాటిని పరస్పరముగ కలిపివేయు అన్నిఋతువులలో ప్రవాహము సమానముగా సాగునట్లు వాటిపై ఆనకట్టలుకట్టియు అభివృద్ధిని సాధించినది. మాస్కో-ఓల్గా కాలువయు తెల్లసముద్రపుకాలువయు బాల్టిక్ సముద్రమునుండి తెల్లసముద్రమునకు సరాసరి ప్రయాణమును సుకరమొనర్చుటకై నిర్మింపబడినవి. ఫలితముగా రష్యాలో జరుగు మొత్తము సరకులరవాణాలో 15 శాతము ఈ జలమార్గములపై సాగుచున్నది.

రష్యాలో నూతనముగా నిర్మించబడిన రైలుమార్గములలో ట్రాన్స్-సైబీరియా రైలుమార్గము ప్రసిద్ధమైనది. యూరప్ మండలమును మాస్కోతో కలుపు వివిధ రైలుమార్గములు ముఖ్యములైనవి. యూరప్ మండలమును సైబీరియాలోని తూర్పు గమలతో కలుపు రైలుమార్గము ద్వితీయ పంచవర్షప్రణాళిక కాలములో సైబీరియాలోని ఆయుధాగారములనుండి యూరప్ మండలమునకు రష్యాలోని ... మునకు ఆయుధసామగ్రిని చేరవేయుటలో ఇది ముఖ్యమైనపాత్ర వహించినది. ప్రతిసంవత్సరము ఈరైలుమార్గములు ఆధునాతనపద్ధతులననుసరించి విస్తృత పరచబడుచున్నవి.

ఎరోప్లేన్ విమానయానసౌకర్యములు విరివిగా ఏర్పడినవి. రష్యాఅంతటను ఎరోప్లేన్ విమానయాన కేంద్రమైన మాస్కోనగరమిప్పుడు అటు యూరప్ రష్యాభాగముతోను ఇటు మధ్యప్రాచ్యమండలములతోను విమానసౌకర్యములచే సంధింపబడినది. విమాననిర్మాణము ఈదేశములో రెండవప్రపంచయుద్ధకాలమున చాల చురుకుగను నైపుణ్యముగను జరిగినది.

వి. వి.

## సౌందర్యమీమాంస (భౌతికవాదము)

జగత్తు సౌందర్యమయము పుష్పములలో సౌందర్యమున్నది; శిలలలో సౌందర్యమున్నది జంతుసంతానములో సౌందర్యమున్నది సకలప్రకృతియందును సౌందర్యమున్నది కాని సౌందర్యానుభూతి మానవునిలో మాత్రమే కలదు. సృజనశీలమైన కర్మ పశువునుండి మనిషిని వృథక్కరించినది, మనిషిని మానవునిగా మలచినది. అతని జ్ఞానమునకు వాగ్రూపమును వైఖరీరూపమును కల్పించినది. సౌందర్యానుభూతిని సంతరించిపెట్టినది. ఈఅనుభూతికి కళారూపమునుకూడ కల్పించినది. ఈసౌందర్యానుభూతియు కళావైఖరియు మానవుని సృజనశీలమగు కర్మతోపాటే పెంపొందుచున్నవి. తద్వారా మానవసమాజము ఉన్నతోన్నతశిఖరములకు పయనించుచున్నది. అందుచేత సౌందర్యపరిశీలన చారిత్రకమైనది.

చారిత్రకముగా మానవుడు సంచితమొనర్చుకొన్న సౌందర్యము ఏయేన్యాయములకు కట్టుబడినదో వివరించునది విజ్ఞానశాస్త్రము. అందువలన సౌందర్యపరిశీలన విజ్ఞానశాస్త్రమైనది. మానవుని సౌందర్యానుభూతియు తదనుభూతినై భావయగు కళలును సమాజపరిణామమునకు కళలు నిర్వహించిన పాత్రయు మానవునకును సమాజమునకును గల సంబంధము, మానవునకును సౌందర్యమునకును ప్రకృతికిని గల సమన్వయము—వీటిని పరిశీలించునది తత్త్వశాస్త్రము. కావుననే సౌందర్యమీమాంస ఒకచరిత్ర ఒకవిజ్ఞానశాస్త్రము ఒకతత్త్వశాస్త్రముకూడనైనది. చారిత్రక శాస్త్రీయ, తాత్త్వికదృష్టితో మాత్రమే సౌందర్యమీమాంస సాధ్యమగును. అయినప్పుడు సౌందర్యమీమాంసయందు తాత్త్వికభేదములు, శాస్త్రీయవాళు

మతములు పొడచూపుట సహజము.

భారతదేశములోను ఇతర దేశములలోను పెక్కు శాస్త్రీయ భేదములు కానవచ్చుచున్నవి. కాగా ప్రధాన తత్త్వములు రెండే రెండని చెప్పవచ్చును (1) భౌతికవాదము (2) భావవాదము. ఈ రెండింటి నడుమనుండని శాస్త్రీయ బహుమతములు. ఈ గ్రంథమునందు సమీక్షింపబడునది చారిత్రక శాస్త్రీయ భౌతిక సౌందర్యము.

ప్రాచీన భారతదేశములో సౌందర్యవస్తు చారిత్రకముగాని శాస్త్రీయముగాని ఇంతవరకు జరుగలేదు. కాగా సౌందర్యచర్చలు సౌందర్య అభివ్యక్తియు వేదకాలమునుండి కన్పించుచున్నవి. బాబిలన్ ఈజిప్టు చైనాలవంటి ప్రాచీన దేశములలో కూడ ఇదియే ఘటిల్లినది. కాని గ్రీకు, రోమను తాత్త్వికులు మాత్రము వారి తాత్త్వికచింతనకు గ్రహించిన సకలవిషయములలో సౌందర్యము కూడ ఒక ప్రధానాంశమైనది. 2500 సంవత్సరముల పూర్వము గ్రీకుపండితులు సౌందర్యమనేమి? అనుభూతియనేమి? అను అంశములపై చర్చలు సాగించినారు. మానవసమాజచరిత్రలో గ్రీకు తాత్త్వికుల కాలము బానిసయుగము. నాటి మేధావులైన హెరాక్లిటస్, డెమాక్రిటస్, సోక్రటీస్, అరిస్టాటిల్, ప్లేటో మున్నగువారి గ్రంథములలో సౌందర్యతత్త్వవిచారణ పుష్కలముగ కన్పట్టును. అట్లే లుక్రిటియస్, హోరేస్ వంటి రోమను తాత్త్వికుల రచనలలో కూడ సౌందర్యసమాలోచనలు గోచరమగును.

సౌందర్యతత్త్వమును గూర్చిన నాటి భావములు నాటి సామాజికమైన ఆర్థికమైన వర్గానుసారముగ నుండుట సహజము. ఆనాడు అసంఖ్యాకులైన ప్రజలు కొలదిమంది బానిసయజమానుల భోగ సౌఖ్యముకొరకు సంపదను సౌందర్యమును సృజించుచుండెడువారు. నాటి సౌందర్యము బానిసయజమానుల భోగవిలాసములకు మాత్రమే ఉపకరించినది. సౌందర్యస్రష్టలైన దాసులకు సౌందర్యభోగానుభవమునకు వీలులేదు. వారు నిర్మించిన భవంతులు, దేవాలయములు బ్రహ్మాండమైన సుందరశిల్పములు బానిసయజమానుల ప్రభుత్వములకు చిహ్నములే కాని, స్రష్టల సౌందర్యానుభూతి మాత్రము ఉద్దిష్టములు కావు.

భారతదేశపరిస్థితి ఇందుకు భిన్నము. భారతదేశములో కుటుంబదాసులుండిరే కాని, దాససమాజమనాడు లేదు. అందువలన దాససమాజపరిస్థితిని ప్రతిబింబించు సౌందర్యతత్త్వములుగాని సూత్రములుగాని భారతదేశములో ఆనాడు కానరావు. ఆర్యావతరణమునకు పూర్వముండిన ఆదిభారత సమాజము బానిససమాజము కాదు. నాడు మానవులు సృజించిన సౌందర్యము సమాజపు సొత్తు. సకలప్రజల సౌఖ్యమునకు. మొహంజదారో హారప్పా శిథిలావశేషములను పరిశీలించినవారు అవి దాససమాజముకంటె పూర్వయుగమునకు చెందినట్టివని నిర్ణయించినారు. ఆనాటి మానవుల సౌందర్యభావన ఎట్టిదో తెలిసికొనుటకు మనకాధారములెవ్వియు లేవు.

ఆర్యావతరణముతో మానవుని మనోభావములు కవితారూపము దాల్చి ఈనాటివరకు మనకు తెలియవచ్చుచున్నవి. కావున ఆదిమార్యుల సౌందర్యదృష్టి అనుభూతి ఆరాధన వారి ఆదికవితయైన వేదములలో కానవచ్చుచున్నవి.

ఆర్యులదృష్టిలో సుఖజీవనమునకు ఆధారభూతమైన సకలవస్తుసముదాయము సుందరము. సుఖజీవనమునకు అడ్డుతగులు ప్రతిదియు వారు అసుందరముగ భావించినారు. సౌందర్యపోషణము అసౌందర్యముతో పోరాటము — ఇదియే వేదములలో ప్రతిపదమునను గోచరించును. ఆర్యులగోగణము సుందరము, గోగణమునకు పుష్టినిచ్చు గడ్డి సాంద్రమైన పర్వత సానువులు సుందరములు. పుష్కలజలమును ప్రసాదించు నదనదములు సుందరములు. గ్రీష్మాంతమున ఓషధీజీవహేతువులైన రసములను వర్షించు మేఘములు సుందరములు. మేఘములను తోడ్కొనివచ్చు వర్షర్తువు సుందరము. హేమంతమున శీతబాధనుండి రక్షించి అన్నమును వండనొసగు అగ్ని సుందరము. అగ్నిని జ్వలింపజేయు అశ్వము సుందరము. సమిధలు సుందరములు. సమిధలకు అగ్నిచే మిచ్చు ఆ వని సుందరము. మృత్యుతుల్యమైన మంచును సంహరించి ప్రాణచైతన్యసందేశములు కొనివచ్చు ఉషస్సు సుందరాతిసుందరము; ఉషస్సు ననుసరించు ఆ శుమంతుడు అతిసుందరుడు. పశుమాంసమున హవిస్సురూపమునున్న అన్నము సుందరము, హవిర్భాగమును పంచియిచ్చు యజ్ఞము సుందరము. దేహపుష్టికితోడు మనస్తుష్టినిచ్చు సోమము సుందరము. తుష్టి పుష్టి కలిగిన ఉద్గాతయు కమ్మగా ఎలుగెత్తి గానము చేయు సామగానము సుందరములు; మత్తిల్లిన మనస్సుతో నర్తించుచు సంగీతము పాడు రథంతరి సుందరము. కాగా ఉరుములతో మెరుపులతో, భయంకరమైన గ్లానిదేహముతో నిర్విరామముగ వర్షించు కాలమేఘము అసుందరము; నదీజలములను నిరోధించి గోత్ర

ములను గోక్షేత్రములను వరదలలో ముంచెత్తు వృత్రుడు అసుందరుడు జగమును మంచుతో ముంచెత్తి జీవరాశిని కదల నీయక కట్టిపెట్టు హేమంతమృత్యువు అసుందరము ఆకలి అసుందరము చలి అసుందరము ఇట్టివన్నియు వేదకాలము నాటి సౌందర్యాసౌందర్య సంచయములు

ఎరుపు-సౌందర్యము సమాజము పశుపాలకదశనుండి వ్యవసాయదశకు చేరినది మానవునకు స్థిరావాసమేర్పడినది జీవిక చిక్కినది సృజనశీలమైన కర్మ మరింత సాంకేతికతను సంతరించుకొన్నది ఆగని సౌందర్యభావసంచయము మరింత సంపన్నమైనది మిల మిల మెరయు రాళ్లు వన్నెలు చిన్నెలు చిమ్ము లోహములు అతని సౌందర్యదృష్టిని ఆకర్షించినవి కగ్గని కాంతిదెసని వెండిబంగారముల సౌందర్యమును మానవుడు గ్రహించినాడు మేదినీగర్భమున మెరుగులీను ఉజ్జ్వల లోహములు వెండిబంగారములు సంచితసంపదకును వస్తువినిమయమునకును ప్రతీకలు కాకపూర్వమే వెండిబంగారములు మానవునకు సౌందర్యాకరములైనవి వెండి వెలుతురులోని వర్ణపటలినంతను ప్రతిబింబింపగా బంగారము కాంతి యందలి సాంద్రతర వర్ణమును మాత్రమే ప్రతిబింబించును వర్ణపటలములోని సాంద్రతర వర్ణము లోహితము అందువలననే రంగులన్నిటిలో ఎరుపునకు అత్యంత సౌందర్యమయమై మానవునకు కన్పట్టుట సహజము వేదకాలమున అతిసౌందర్యమునకు రక్తోజ్జ్వలమైన హిరణ్యము ఆలంబనమైనది

సమాజాభ్యుదయసాధకమైనది సృజనగర్భితమైన కర్మ అందుకనియే సృజనగర్భుడైన ఊహామూర్తి సౌందర్యమును వర్ణించుటకు వేదకాలమునాటివారు ఎరుపునే ఆశ్రయించి వారు సకల చరాచరస్రష్ట హిరణ్యగర్భుడని ఆర్యుల విశ్వాసము సకలసంపదకును సర్వసౌఖ్యములకును ఆలవాలమైనది "హిరణ్య వర్ణాంహరిణీం" అయిన లక్ష్మియని వారిమతము ప్రపంచమునకు ప్రాణశక్తిని ప్రసాదించునది హిరణ్యరేతస్కుడైన సూర్యుడు సౌందర్యమునకును అసౌందర్యమునకును జరుగు సంఘర్షణలో తుదకు సౌందర్యమునకే విజయము తథ్యమని వేదకాలమునాటివారి నమ్మకము ఈనమ్మకమునే అథర్వణవేదము ఎలుగెత్తి చాటినది సౌందర్యలాంఛనమైన 'రక్తపతాకము ఎవరిహస్తమున నుండునో వారికి విజయము తథ్యము అని అందలి ఒకమంత్రము ఘోషించుచున్నది

కావ్యము - సౌందర్యము మానవుని సృజనశీలమైన కర్మద్వారా సమాజము సమాజసంపద పెంపొందినవి సమాజ స్వరూపము మారినది, సమాజములో రాజన్యనియతి ప్రవేశించినది అందుకవసరమైన ధర్మశాస్త్రములు అర్థశాస్త్రములు దైవశాస్త్రములు తత్త్వశాస్త్రములు రచింపబడినవి ఈశాస్త్రములకు ప్రోదిగా సౌందర్యభావన మారినది తదనుగుణములైన కళలు కావ్యములు అవతరించినవి వాటి సామాజికనీతి ఉదాత్తసౌందర్యమైనది రాజన్యుల భోగలాలసములకు ఆలంబనమైన స్త్రీ సౌందర్యమునకు ప్రతీకయైనది సౌందర్యమన స్త్రీసౌందర్యము సౌందర్యానుభూతియన కామోపభోగము అనునవి రూఢమైనవి ఈ కాలమునపుట్టిన కళలలోను సాహిత్యములలోను సాహిత్యమీమాంసలైన అలంకారశాస్త్రములలోను ఈవిషయమే పాదోపపాదముల వడుమ గోచరించును

కాని మహాకవులైనవారు కొందరు కామోపభోగమైన సౌందర్యమును తిరస్కరించి సమాజప్రగతికి అవసరమైన నీతిసౌందర్యమునే ఉత్తమ సౌందర్యముగా భావించినారు మంచి చెడులకు సమాజములో నిరంతరము సంఘర్షణము సాగుచునే యున్నది వీటిలో మంచి సుందరము చెడు అసుందరమునైనవి సమాజజీవిత సాదృశ్యమునను సరించి సౌందర్యాసౌందర్య ఘర్షణములో సౌందర్యపక్షము వహించిన కవుల కావ్యములు నేటికిని మహాకావ్యములుగా సుందరకావ్యములుగా నిలిచి భాసించుచున్నవి జీవిత సాదృశ్యమును విస్మరించి కామోపభోగకములుగా స్త్రీ సౌందర్యమును కామవిలాసములను వర్ణించు కావ్యములు సహృదయుల ఆదరమును పొందజాలకున్నవి

జీవితసాదృశ్యము-ఔచిత్యము ఐరోపా పునరుజ్జీవనోద్యమనాయకులైన పెట్రార్క్, ఆల్బర్టి, లియొనార్డోడావిన్సీ, డ్యూరర్, బ్రూనో, మాంటెయిన్ మొదలైనవారు మధ్యయుగములనాటి ఆధ్యాత్మిక దివ్యసౌందర్యము (Divine beauty) ను ఖండించి మానవతను, ఔచిత్యమును పాదుకొల్పినారు భారతీయ మహాకవులవలెనే వారును రాజన్యుల లలితకామోపభోగసౌందర్యవాదమును ఎదిర్చినారు

తరువాత వచ్చిన కాంట్ స్కెల్లింగ్ హెగెల్ వంటి జర్మను తాత్త్వికులు సౌందర్యమీమాంసను జీవిత సాదృశ్యమైన

ఔచిత్యవాదమునుండియే కాక మొత్తము భౌతికజగత్తు నుండియే తిరోగమింపజేసినారు సౌందర్యసమస్యలను వారు సునిశితమైన గతితర్కముతో (dialectics) చర్చించినారు అయినను తమవాదనలలో పరస్పర వైరుధ్యములను వ్యాఘాతములను తొలగించుకొనజాలకపోయినారు

బెలిన్‌స్కి, హెర్జెన్, చెర్నిషెవిస్కి మున్నగు శాస్త్రజ్ఞులు ఈ వైరుధ్యములను అధిగమించి సౌందర్యమీమాంసను తిరిగి ప్రజాజీవితమునకు సన్నిహితమొనర్చినారు జీవితసాదృశ్యముగల ఔచిత్యకళలకువారు న్యాయమును నిర్ణయించినారు కళలు ప్రజలతో సన్నిహితసంబంధము కల్గినట్టివని సౌందర్యమీమాంసకు లోకనూతనశాస్త్రీయరూపమును సంతరించినారు కళాస్వచ్ఛత -అనగా కళకళకొరకే" అను వాదమును ఖండించి విమర్శనాత్మక ఔచిత్యముగల కళలకు శాస్త్రీయమైన పునాదివేసినారు తరువాతికాలపు శాస్త్రీయ, భౌతిక సౌందర్యమీమాంసకును సామ్యవాద (Socialist) ఔచిత్యమునకును పీఠిప్రయత్నమెంతయు దోహదముచేసినది

క్షేమేంద్రుని ఔచిత్యవాదము భారతీయులలో జీవితసాదృశ్యమే సౌందర్యమనియు అదియే ఔచిత్యమనియు మొట్టమొదటిసారిగా ప్రతిపాదించినవాడు క్షేమేంద్రుడు ఇతడు ఇప్పటికి తొమ్మిదిశతాబ్దుల పూర్వము కాశ్మీరదేశమున జీవించియుండిన పండిత ప్రకాండుడు

"ఉచితం ప్రాహురాచార్యాః సదృశం కిలయస్యయత్
ఉచితస్యచ యోభావ స్తదౌచిత్యం ప్రచక్షతే

అని ఏది జీవితసాదృశ్యమో అదియే ఉచితమనియు ఉచితత్వభావమే ఔచిత్యమనియు ఇతడు స్పష్టముగ నిర్వచించినాడు తన ఔచిత్యవాదముతో కావ్యసౌందర్యమీమాంస చేసినాడు క్షేమేంద్రునకెన్నియో శతాబ్దులకుపూర్వమే జీవితసాదృశ్యమైన ఔచిత్యమును పాటించి వాల్మీకి కాళిదాసు భవభూతి మున్నగుమహాకవులు ఉత్తమకావ్యములను వెలయించినారు వాల్మీకి రామాయణములో ఒక కాండమునకు సుందరకాండయని పేరు దీనికి పేరెట్లు కల్గినది? సీత అతిలోకసుందరి! రాముడు అతిలోకసుందరుడు! అతిలోకసుందరులైన ఈ ఉభయులగాథ ఈ కాండయందున్నదికనుకనే ఇది సుందరకాండ అని పిలువబడినట్లు పండితుల వాదము కాని నిజమునకు అయోధ్యకాండనుండియే సీతారాములగాథ రామాయణమున ప్రసక్తము. అప్పుడు ప్రత్యేకముగ ఈ కాండనే సుందరకాండ అనిపిలువనేల? ఇందుకు వేరుకారణమున్నది సౌందర్యాసౌందర్యముల సంఘర్షణ మంచిచెడులనడుమ పోరాటము మంచిని సాధించుటకొరకే ఎన్ని ఆటంకములెదురైనను ఎదిరించి ప్రతిఘటించుట-అను జీవితసాదృశ్యమైన సౌందర్యము ఈ కాండలో మెండుగానున్నట్లు మరేకాండయందును కానరాదు అందుకనియే ఇది సుందరకాండయైనది

అనితరసాధ్యమైన సముద్రలంఘనమొనర్చి లంకను చేరవలసియున్నది అట్టిసందర్భమున వానరప్రముఖులెల్లరు సమావేశమై కార్యసాధనమార్గములను కూలంకషముగ చర్చించెదరు సామూహిక సమాలోచనము జీవితసాదృశ్యమే కాక సత్సమాజలక్షణము కూడ తుదకు సముద్రలంఘనభారము ఆంజనేయునిపాల పడినది అతని ఉద్యోగమునకు దారిలో సురస మైనాకులు అడ్డుతగిలినను ఆయడ్డంకులను తొలగించుకొని అతడు లంకను చేరినాడు అచ్చట మరియొక అడ్డంకి లంకిణి ఎదురైనది ఆయవరోధమునుకూడ తొలగించుకొని అతడు లంకానగరమున ప్రవేశించుచున్నాడు ఎన్ని అవరోధములు కల్గినను దీక్షను సడలనీయక నిరాశానిస్పృహలకులోనుగాక ఇట్లు పురోగమించుట అనునది జీవితసాదృశ్యమొకటియే కాదు ఉత్తమ ఆదర్శముకూడ రావణాంతఃపురములో ఒక అతిలోకసుందరి రావణుని పర్యంకమునందున్నది భౌతికముగ చూచినచో సీతా సౌందర్యలక్షణములు ఆమెయందున్నవి ఆమె సీతయేఅగునా? అనుశంక ఆంజనేయునకు కల్గినది మానవసహజమగు ప్రవృత్తులన్నిటిని తిరస్కరించిన అతడు తనకుగల సాముద్రికజ్ఞానముతో ఆమెయందలి వైధవ్యలక్షణములను పరిశీలించి ఆమె సీత కాజాలదని నిర్ణయమునకు వచ్చినాడు ఇది ఎంతటి జీవితసాదృశ్యమో, ఎంతటి ఉన్నతాదర్శమో సహృదయులు గ్రహింపగలరు తరువాత ఘటిల్లిన సీతాదర్శనము రావణునితో అతని ప్రసంగము మున్నగు సన్నివేశములలోని ఔచిత్యము శిల్పపరాకాష్ఠనందుకొన్నది ఇందుకనియే ఇది సుందరకాండయైనది

వాల్మీకివలెనే కాళిదాసుకూడ సమాజాభ్యుదయమును సాధింపగల ఔచిత్యమును సౌందర్యముగ పరిగణించినాడు శాకుంతలములో దుష్యంతుని రూప ఐశ్వర్యబలదర్పములు కాళిదాసుదృష్టిలో సుందరములు కావు; శకుంతల శరీరసౌష్ఠవము, రూపలావణ్యాదులు కాళిదాసు మనసునాకర్షించిన సౌందర్యములుకావు సకల ఆశ్రమజీవులపట్ల, ప్రకృతి

పట్ల శకుంతలకుగల అపారవాత్సల్యము సర్వకాలసర్వావస్థలలో ఆశ్రమౌచిత్యమును పాటించు ఆమె ఇంగితము—ఇవి కాళిదాసు మతప్రకారము మహాసుందరములు. సర్వసంగపరిత్యాగియగు కణ్వుడు శకుంతలను అత్తవారింటికి పంపునపుడు పడిన మానసనహజమైన వేదన సుందరతరము. ఈసౌందర్యమే జర్మను మహాకవియైన గోథేను ఆకర్షించి అలరించి మత్తెక్కించి నర్తింపజేసింది. గోథేకూడ కాళిదాసువలెనే ఔచిత్యవాది. ఈ ఔచిత్యము పాశ్చాత్యులు ప్రయోగించు రియలిజం అను శబ్దమునకు సమానార్థకము.

సౌందర్యము—ప్రేమ మానవుని సుందరభావనలలో కెల్ల సుందరతమమైన భావము ప్రేమయని కావ్యమీమాంసకులెల్లరు అంగీకరించిన విషయము. కాగా ప్రేమకు నిర్వచనములో మాత్రము సమాజ చారిత్రక దశలనుబట్టి మతభేదములనేకములున్నవి. దాసనమాజము నాటి గ్రీసు రోములలో స్త్రీ కాని యజమానుల విలాసవస్తువులలో నొకటియైనది. ఆమెకొక ప్రత్యేకత లేదు. కనీసము వ్యక్తియను ఆదరముకూడ లేదు. అనాడు కామవాంఛయే ప్రేమగా పరిగణింపబడినది. తర్వాతికాలపు రాజస్వామ్య సమాజములోకూడ స్త్రీపరిస్థితి మెరుగుపడలేదు. స్త్రీ శ్రీమంతుల విలాసవస్తువేకాక వినిమయవస్తువుకూడ మారినది. జూదములో ధనకనకవస్తువాహనాదులతోపాటు స్త్రీనికూడ పణముగ పెట్టవచ్చును; కుదువ పెట్టవచ్చును; విక్రయింపవచ్చునుకూడ. తుదకు పాత్రమువలె పారవేయనువచ్చును. ధర్మశాస్త్రకర్తలుకూడ గృహములు, పశువులతోపాటు భార్యనుకూడ దానవిక్రయయోగ్యత్వాలుగల ఆస్తిజాబితాలో నిక్షేపించినారు. ఇద్దరు అసమానుల మధ్య కామమునకు తావు ఉండవచ్చునేమోగాని మానవతాసౌందర్యముగల ప్రేమకు తావుండదు! కాని ఔచిత్యవాదులైన మహాకవులు ఉదాత్తమూ పతాభానమైన ప్రేమను మహాసౌందర్యముగా ఆరాధించి కావ్యములలో చూపినారు.

క్షత్రియబాలకు భార్గవరాముని పరశుఘాతమునకు భయపడి అడుగడుగునదాగులు ఆపద మొక్కలుగ రోజులలో కన్యలకు శాపెట్టిన దశరథుని కుమారుడు రాముడు అయినను మహాలీల మూర్తిమంతములోగల అమానుషత్వమును తిరస్కరించి ఏకపత్నీవ్రతమును అవలంబించినవాడు. సీతను ప్రాణాధికముగ ప్రేమించినవాడు. ఆమెవియోగమును సహింపజాలక విలవిల విలపించినవాడు. ప్రేమయన్ననది విప్రలంభములో కన్పించినంత చక్కగా చక్కగా సంభోగములో కూడ కానరాదు. అందువలననే రామాయణమునకు ప్రేరణము కరుణాత్మకమైన క్రౌంచవిప్రలంభమైనది.

సీతారాముల కారుణ్యమయమైన విప్రలంభ సౌందర్యము ప్రేమ భవభూతిమహాకవియొక్క ఉత్తరరామచరిత్రలో శిఖరస్థాయినందుకొన్నది. రాముని నాటి సమాజములో ప్రేమనెరిగిన వ్యక్తులు రామునివంటివారు కొలదిమంది ఉందురేమో! స్త్రీకి సమానత ఇంకను అనాటికి సమాజములో అలవడలేదు. అందుకనియే రాముడు సమకాలీన సమాజధర్మమునకు తలయొగ్గి ప్రేమనిధానమైన సీతను త్యజించినాడు. ఈవిధముగ సమాజ సాదృశ్యమును చక్కగా చిత్రించినది కావుననే రామాయణము సుందరకావ్యమనబడినది.

సమాజశ్రేయస్సు సమాజాభ్యుదయములకు అనువైన భావమే సౌందర్యమైనప్పుడు కామవాంఛకంటె ప్రేమ సుందరతరమై భాసించగలదు గదా! దాంపత్యప్రేమ సామాజికప్రేమను విశ్వప్రేమను అలవరచుకొనుటకు సోపానమేగాని అదియే చరమలక్ష్యముకాదు. కాని దాంపత్యప్రేమను ఎరుగనివానికి సమాజప్రేమ విశ్వప్రేమ అవగతమగుట దుర్లభము. ఈవిషయమునే శ్రీహర్షుడు తన "నాగానందము"లో అతిసుందరముగ నిరూపించినాడు. మలయరాజకన్యను వివాహమాడి ప్రేమయందలి ప్రథమసోపానమును అధిరోహించిన జీమూతవాహనుడు పసుపుబట్టలతోనే వాహ్యాళికి వెడలును. అతడొక వృద్ధవనిత ఆర్తనాదమును విని అరయబోవును. ఆమె నాగస్త్రీయనియు నాగులను హింసించు తార్క్ష్యునితో నాగులకు కుదిరిన ఒప్పందమననుసరించి రోజున కొక నాగయువకుని తార్క్ష్యునికి బలిపెట్టు ఆచారమేర్పడినదనియు నాడు ఆవృద్ధవనితయొక్క ఏకపుత్రునివంతు వచ్చెననియు ఆమెవలన గ్రహించినాడు. దాంపత్యప్రేమానుభూతిని పొందిన జీమూతవాహనునిలో తోటివారిపట్ల ఆపదలోనున్న అందరిపట్లకూడ ఉదాత్తమైన ప్రేమ పెల్లుబికినది. నాగయువకునకు మారుగా తానే బలిపీఠమును అధిరోహించి సాటిమానవుల శ్రేయస్సుకై ఆత్మత్యాగము చేయువాడే మహాసుందరుడను నొక అపూర్వభావమును ప్రపంచమునకు ప్రసాదించినాడు. తర్వాతి కథ ఇచ్చట అప్రస్తుతము. దాంపత్యప్రేమకు మానవప్రేమ పరమావధియైనట్లు దేశప్రేమకూడ ఒకపరమావధియే కాగలదు.

శూద్రకుడు తన మృచ్ఛకటికమునందు మాఱుశ్రుతులైన అసుందరులను వారితో పోరాడు సమాజవ్యాప్తులైన సుందరులను సృష్టించినాడు. కాగా నాగానంద మృచ్ఛకటిక నాటకములు పరకీయ మాఘ సాహిత్యము దిగమించి వర్ణించదగు ముందుకేసి భావిసమాజములో మాత్రమే అనుభూతి రాగల మహా సౌందర్యమును అపూర్వవైచిత్ర్యమును చూపుటవలన ఆ నాటకములు క్రాంతదర్శులుకాని సంప్రదాయ పండితుల ఆదరమును అంతగా పొందజాలకపోయినవి. నేటికి కూడ భారతదేశమున కవుల సౌందర్యానుభూతి రాజకీయ సామాజిక పరిధులను అతిక్రమించకపోవుటచే ఈ నాటకములకు ఈనాటికిని ఆదరణ అంతంత మాత్రముగనే ఉన్నది.

కాని భారతస్వాతంత్ర్యసమరకాలములో స్వేచ్ఛకై పరితపించిన కవులలో మాత్రము దేశప్రేమ, మాతృదేశసౌందర్యము పెక్కురూపములలో సాక్షాత్కరించినది. బంకించంద్రుడు మొదలు గురజాడను కూడకట్టుకొని నేటివరకు కవితల్లి నేర్చిన ప్రతివారును దేశప్రేమను దేశసౌందర్యమును అనుభావించినవారే.

సౌందర్యము–భావవాదము: భారతదేశములో శంకరుని అవతరణముతో భావవాదము కేవలమైన తాత్త్విక ప్రతిపత్తి పొందినది. పశ్చిమదేశములలో 18, 19 శతాబ్దులనాటికి గాని ఈ స్థితి ఏర్పడలేదు. కాని అంతకు పూర్వముండిన మతము ద్వైతతత్త్వముల ప్రభావము సౌందర్యాలోకముపై పడక పోలేదు. భారతదేశములో శంకరుని పూర్వము భావవాదమునకు కొంచెము భౌతికవాదమునకు ప్రాబల్యమెక్కువగ యుండెడిది. న్యాయవైశేషిక సాంఖ్యములు భౌతిక దర్శనములు భూతవాదము భూతచైతన్యవాదము వంటి మరికొన్ని భౌతిక దర్శనముల ప్రభావము కూడ నాటి సౌందర్యతత్త్వముపై ప్రసరించినది. పాశ్చాత్యదేశములలో క్రైస్తవ ద్వైతతత్త్వము ననుసరించి దివ్యసౌందర్యవాదము తలయెత్తినది. భారతదేశములో శంకరాద్వైతఅవతరణమునకు పూర్వముండిన సౌందర్యవాదములన్నిటిని తర్వాతివారు భావవాదముతో సమన్వయించుటకు చేసిన ప్రయత్నమువలన అనేక వైరుధ్యములు వ్యాఖ్యానములు మతభేదములు తలయెత్తినవి. అదివరకు వాల్మీకి, కాళిదాసాదులు పాటించిన లౌకికతకు సంఘశ్రేయస్సు సామాజిక ప్రయోజనములు క్రమముగా లుప్తమై వేదాంతమొక్కటియే ప్రతిబింబనకును పరమావధియైనది. సౌందర్యము మంచిని పెంచు మానవతా లక్షణములను కోల్పోయి తిరిగి స్త్రీల అంగాంగముల నాశ్రయించినది. కేశాదిపాదాంతస్తుతులు పాదాదికేశాంతస్తుతులు చివరకు చీకటిచెఱ్ఱమాటున దాగిన అవయవములుకూడ కవుల సౌందర్యవర్ణనకు ఆలంబనమైనవి.

భావవాదము ననుసరించి దృక్కు దృశ్యము పరస్పర విలక్షణములైనవి. ఇందులో దృక్కు సత్యము బ్రహ్మము దృశ్యము మాయ మిథ్య. అట్టియెడ మిథ్యయైన దృశ్యములో కేశాదిపాదాంత సౌందర్యమునకు తావెట్లో అది ఎటనుండి వచ్చెనో భావవాదకవులకే ఎరుక! శంకరాద్వైత అవతరణతో కాలగర్భమున కలిసిపోయిన భౌతికవాదములు పోగా శేషించిన భౌతికవాదములను శాంకరభావవాదముతో సమన్వయమొనర్చుటకు పెక్కుప్రయత్నములు జరిగినవి. అట్టిప్రయత్నముల ఫలితముగా జనించిన సంకరతత్త్వములలో శాక్తదర్శనమైన అభిజ్ఞానవాదమొకటి. సౌందర్యమీమాంసకు ఈ సంకరతత్త్వముల ప్రభావముకూడ సోకుటవలన పూర్వముండిన వైరుధ్యములు ఇంకను అతిశయించినవి.

జర్మను తత్త్వవేత్తలైన కాంట్, హెగెల్ మున్నగువారు సమకాలీన విజ్ఞానశాస్త్రమును గణితర్కమును ఆధారముగ చేసికొని భావవాదమును గ్రహించినారు. కాంట్ మత ప్రకారము సౌందర్యమనునది ఒక భావము మాత్రమే. భావాతీతమైనదిగాని భౌతికమైనదిగాని సౌందర్యము కాజాలదు. ఒకవేళ ఏ వస్తువునను అట్టిసౌందర్యమే ఉన్నచో అది భావాంగముమాత్రమే. అజ్ఞేయమైన భౌతికసౌందర్యము వారి దృష్టిలో మిథ్యమాత్రమే. సౌందర్యము మానవుని దృక్కులోను భావలోను కలదని అతని మతము. ఈ విషయమును నిరూపించుటకు పరస్పర విరుద్ధములైన సిద్ధాంతములను అతడు రచించినాడు. సౌందర్యము భావాతీతము కాదు; అది భావమునకు సంబంధించిన ఒకధర్మముమాత్రమే. కాగా ఆ ధర్మము కను మానవునిలోగల ప్రత్యేకమైన ఒకానొక చేర్పరితనమునకును సంబంధముండునని అతడనును. ఆ నేర్పరితనముతోనే మానవుడు తనభావములకు సౌందర్యమును సమాహితము చేయుచున్నాడనికూడ అతడు వక్కాణించును. అయితే భావముమాత్రము స్వతస్సిద్ధముగా సౌందర్యభావమై ఉండదనియు సౌందర్యమనగా ఒనసే భావము సౌందర్యస్ఫూర్తినొందుననియు అతనివాదము. ఈ మతమునకు ఆధార

మేది? దృశ్యమానజగద్వస్తువుమాత్రముకాదని అతడు చెప్పునే కాని మరేదియో స్పష్టముగ చెప్పడు

సౌందర్యము-భౌతికవాదము: భౌతికవాదము ప్రకారము జగద్వస్తువు జ్ఞానముకంటెవిలక్షణమైనది జగత్తు స్వయంభువు స్వతస్సిద్ధము గతి తార్కిక భౌతికతత్త్వమునను సరించి జగద్వస్తువు నిరంతర గతిశీలము; పరిణామశీలము ఈ పరిణామము ద్వంద్వముల సంఘర్షణము సమన్వయముల ద్వారా జరగును జ్ఞానమును కలిగిన మానవుడేకూడ వస్తుమయమే అయినందున మానవజ్ఞానము సహితము పరిణామశీలముకదా! జ్ఞానసంబంధియైన సౌందర్యానుభూతియు పరిణామశీలమే కనుక నే సౌందర్యమీమాంసకు చారిత్రక పరిశీలనమవసరము

చారిత్రక శాస్త్రీయ భౌతికసౌందర్యమును సమాలోచించునపుడు సౌందర్యలక్ష్యము జగత్సౌందర్యమును మానవుడు తన అనుభూతిద్వారా సంతరించుకొన్న విధానమును పరిశీలించవలసియున్నది ఈ పరిశీలనమునకు ఉపకరించు అంగములు మూడు (1) వాస్తవికమైన జగద్వస్తు సౌందర్యము-ఇది దృశ్యమునకు సంబంధించునది (2) వ్యక్తిపరమైన సౌందర్యజ్ఞానము-ఇది ద్రష్టకు సంబంధించునది (3) సృజనశీలమైన కర్మద్వారా మానవుడు నిర్మించిన కళలు ఈ మూడును అన్యోన్యాశ్రయములు; అవినాభావసంబంధములు ఈమూడింటి సారాంశమును వాటియందలి నియతిని వాటి గతితార్కిక సమన్వయమును నిరూపించునది సౌందర్య మీమాంస మానవుడు ప్రయోజనాత్మకమైన సృజనకర్మ ద్వారా జగత్సౌందర్యమునుసంతరించుకొన్నాడు ఈకృషిలో మానవుని సామాజికజ్ఞాన సారాంశము సృజనశక్తియు తన పరిసర ప్రకృతిని సమాజమును సుఖమయముగా మార్చుకొనుటకు ఉద్దిష్టములైనవి ఆప్రయత్నములోనే అతని సృజనశీల క్రియాశక్తి సమగ్రముగను స్వచ్ఛందముగను ఒకనియతి ననుసరించియు పెంపొందుచున్నది మానవుడు సమాజావసరములను ఉత్పాదించునపుడుగాని, ప్రకృతిపట్ల సంస్కృతిపట్ల నిశ్చితవితము పట్ల తనవైఖరిని ప్రదర్శించునపుడుగాని సౌందర్య మీమాంసాంగములైన సుందరము-అసుందరము ఉదాత్తము-నీచము సంతోషము-శోకము, ధీరత్వము - భీరుత్వమువంటి ద్వంద్వములే అతని సౌందర్యభావమునకు ఆలంబనములుగా మున్నవి మానవుని మనోగతమైన సౌందర్యానుభూతి అభిరుచి సంవేదన సంభావన ఆలోచన, ఆదర్శము-ఇవన్నియు భౌతికమైన సౌందర్యపరిణామముల ప్రతిబింబములుమాత్రమే సృజనశీలమగు తన కర్మఫలితమును ఆస్వాదించుటలో అతడు సౌందర్యానందమును పొందుతాడు ఉదాత్తాశయసాధనకు పోరాడుటలోను ప్రజల స్వేచ్ఛాసౌఖ్యములను సాధించుటలోను అతడు అతిశయానందమును అనుభవించుతాడు తన పరిసరములను ఆవరించిన వైచిత్ర్యమును అసుందరమును ఏవగించుకొనును కళలు సౌందర్యజ్ఞానము సమాజ అస్తిత్వమునకు తోడ్పడువిధానమును సౌందర్యమీమాంస నిరూపింపగలదు కళలస్వభావవైవిధ్యమును కళాసృజనక్రమమును అది సశాస్త్రీయముగ నిరూపించును కళలపుట్టుపూర్వోత్తరములను వాటి సారాంశమును ఇతర సామాజిక జ్ఞానములకును కళలకునుగల సంబంధమును కళలకు ప్రజలకుగల చుట్టరికమును వాటి ప్రతిపాదిత స్వరూపస్వభావములను వాటి చారిత్రకన్యాయములను కళారూపముల ప్రత్యేకతలను కళాశిల్పములకు వస్తువునకుగల పరస్పరసంబంధమును కళావిధానము శైలి వాస్తవికతల యొక్క మూలసూత్రములను సమాజప్రగతిపట్ల వాటి పాత్రను సాంగోపాంగముగ సశాస్త్రీయముగ చర్చించునది భౌతికవాద సౌందర్యమీమాంస

భౌతికతత్త్వశాస్త్రానుసారము వ్యక్తిమనుగడ సమాజముపై ఆధారపడియున్నది అందుచే అతని ఆలోచనలు చేతలు సమాజశ్రేయస్సుకు భిన్నముగ నుండరాదు కనుకనే భౌతికసౌందర్యమీమాంస ప్రకారము సమాజోన్నతికిని సమాజప్రగతి ని తోడ్పడు భావములే సుందరములుగాని అన్యములెన్నటికిని సుందరములు కాజాలవు

భావవాదులు సమాజాస్తిత్వమునే అంగీకరింపరు వ్యక్తి, అతని ఉన్నతి అతని ముక్తి తప్ప మరొకదానిని వారు ఒప్పుకొనరు కాని వైయక్తికమైన సౌందర్యభావము, సౌందర్య భోగలాలస సమాజశ్రేయస్సునకు భంగకరముగా పరిణమించునపుడు దీనిని నియతిని తుదకు దివ్యసౌందర్యమును వారు ఆశ్రయింపవలసి వచ్చుచున్నది అట్టిచో వ్యక్తిస్వాతంత్ర్యమునకును స్వేచ్ఛకును భంగమువాటిల్లుచున్నదను చెపముతో వారిలోవారికి ఘర్షణలు తప్పుటలేదు ఈఘర్షణలనడుమ సౌందర్యము నలిగి నానావికారములతో ఆధునికత అను పేర నేటిసమాజమున సాక్షాత్కరించుటనుచూచుచు నేయున్నాము

భౌతికవాదమున సౌందర్యానుభూతికిని సామాజికనీతికిని వైరుధ్యముండనేరదు అవి రెండును అవినాభావసంబం

ధముకలవి మానవసౌందర్యజ్ఞానము నానాటికి పెంపొంది సమాజమును ఉన్నతోన్నతికి కొనిపోవుటకే తోడ్పడును భావవాదులు అనాదిగా కర్మబంధములనుండి ముక్తికొరకు విఫలప్రయత్నములు చేయుచునేయున్నారు కాని నేటి భౌతికవాదుల నిరంతరకృషివలన మానవబంధములనుండి కర్మవిముక్తమై ప్రకృతిని సమాజమును సకలమానవాళిని సుందరతరమొనర్చ తీరును ఆనాడు మానవుని మస్తిష్కములో పేరుకొనియున్న అసుందర భావములన్నిటితోపాటు భావవాదముకూడ అంతరించగలదు

రాం కృ

## సౌందర్యాలోకము (సంప్రదాయమతము)

సుందరము! సుందరము! అని అందరుము అందురు సౌందర్యమును స్మరింతురు సుందరమనగేమి? సౌందర్యమెట్టిది! సమాలోచన మొనరింపవలసియున్నది సమాలోచనము సమాలోకనము ఒనరింపలేనివారును సుందరమును భావింతురు సౌందర్యమననుభవింతురు సౌందర్యలక్షణమును కొందరుప్రాచీను లీవిధముగ భావించిరి

వయోవస్థాదిసంభూతం ఔజ్జ్వల్యం రామణీయకం
భూషణాలేపనాద్యైశ్చ శోభా సౌందర్యమిష్యతే
"అంగప్రత్యంగకానాం యః సన్నివేశో యథోచితం
సుశ్లిష్టః సంధిబంధః స్యాత్ తత్ సౌందర్యముదాహృతం"

వయోవిశేషమున అవస్థాదుల విశేషముల వలన గల్గిన ఉజ్జ్వలత్వమును సౌందర్యమందురు అది రామణీయకము భూషణధారణమున ఆలేపమున గల్గుశోభావిశేషము సౌందర్యమగును దేహమునందలి అవయవములు తగిన స్థానమునందుండగా దేహమున శోభావిశేషము దయించును అట్టిశోభ సకలమనోహరమగును దేహమునందలి అంగప్రత్యంగములలో సముచితమైన సన్నివేశము చక్కనికూర్పు ఉండును అవయవముల సంధిబంధములు సుశ్లిష్టములై యుండును అట్లుండుట సౌందర్యమని వర్ణింతురు ఇట్టి సౌందర్యలక్షణమును భావింపగా సౌందర్యము దేహగతముగానున్నట్లు కొందరు భావించిరనిపించును సౌందర్యము దేహగతమే కాదు; నానావిధముల నున్నది ఆత్మసౌందర్యము కావ్యసౌందర్యము నాట్యసౌందర్యము ప్రకృతిసౌందర్యము కళాసౌందర్యము ఇట్లనేకవిధముల సౌందర్యమును విశేషింపజేసి వ్యవహరించుచున్నారు

నవత్వము సౌందర్యము

క్షణేక్షణేయన్నవతాముపైతి
తదేవరూపంరమణీయతాయాః

అని కవులవ్యవహారమున్నది ప్రతిక్షణము నవత్వము పొందువస్తువు రమ్యముగానుండునందురు వస్తువునందు ప్రతిక్షణము నవ్యత ఏలకల్గును? భావించువారి భావనావిశేషమున తదనుసారమున నవ్యతకల్గును భావనాప్రధానమైన విశేషము రమ్యతను సౌందర్యమును సంపాదింపగలదు నవ్యతాసంపాదకములు అనేకవిధములనున్నట్లు సాహిత్యదర్పణప్రియులు భావించిరి

పండితరాయలు రసగంగాధరములో "రమణీయార్థ ప్రతిపాదకః శబ్దః కావ్యం" అని సంకేతించెను ఈరమణీయత ఏమి? లోకోత్తరమగు ఆహ్లాదమును కల్గించుభావములో గోచరించునది రమణీయము లోకోత్తరమనగా ఆహ్లాదగతమైన చమత్కారము' అనుపేరుగల అనుభవసాక్షికమైన విశేషము సౌందర్యము చమత్కృతిని సంపాదించుధర్మము చమత్కృతి అన్నది ఆనందవిశేషము ఈవిషయము రసపర్యాలోచనమున నిరూపించవలసియున్నది

రసపర్యాలోచనము భరతుడు నాట్యవేదమున రసమును రససామగ్రిని ఉపయోగమును తద్విశేషములను నిరూపించినాడు

"విభావానుభావవ్యభిచారి సంయోగాద్రసనిష్పత్తిః"

అని భరతసూత్రము సహృదయునిలోచిదంశము ఆవరణముతోనున్నది ఈఆవరణము తొలగిపోగా చిదంశము స్ఫురించును ఆ స్ఫురణమే రసాస్వాదము జడమైన జగమంతయు అలౌకికమైన భావమువలన సుందరమై చైతన్యస్ఫురణమునకుపయోగించును రససౌందర్యమునుభవించు భావుకులు ఆలంబనముగానుందురు ఇట్టిసౌందర్యభావము సహృదయుని ఆత్మగతము ఇదిచిదంశోల్లాసము ఇదిఆత్మస్ఫురణము లోకములోనున్నది ఎట్టిదైనను భావుకుని భావనమున రసత్వమునే పొందును భావుకునే సౌందర్యమనునది వస్తుగతముగానుండదనియు, భావుకగతముగా నుండునియు కొందరు భావించుచున్నారు

కంచుకపంచకము కళా విద్యా, రాగ కాల, నియతి అను అయిదింటిని కంచుకపంచకమందురు ఆత్మసౌందర్యమునకు ఈపంచకము ఆచ్ఛాదికముగనున్నది సాధకుడు రాగముకల

కాదు కాగా విద్యావిషయమై తెలిసికొనవలసిన ఆత్మసౌందర్యమును గుర్తించుటకు కలాతత్త్వము సహకరించును.

సౌందర్యము బహిర్వస్తుగతమని కొందరు భావింతురు. అంగనల దేహములందు పర్యావయవములకంటె అతిరిక్తముగా లావణ్యము స్ఫురించును. సౌందర్యము సముదాయధర్మము. లావణ్యరూపము స్వసంవేదనమునకిది వ్యంజకము. పార్వతిని వర్ణించు కాళిదాసు సర్వోపమాద్రవ్యములను ఒకచోట చేర్చి సమవేతము కలుగు సౌందర్యమును చూడదలచి విధాత ఉమాదేవి రూపమును నిర్మించెనని అనెను. ఒకవస్తువు ఒకనికి సుందరముగను వేరొకనికి కాదు. సౌందర్యము వస్తుగతమే అయినచో, చూచువారందరకు అది ఏలసుందరము కాదు? సౌందర్యము చూచువారి భావనలో నున్నదా? అపుడు సౌందర్యము సౌందర్యగత తన గనభావమునకను రూపమైనవస్తువును సుందరముగా భావింపగలడు అది వేరొకనికిసుందరము కాకపోవచ్చును. అతని రసభావము వేరు. ప్రతివ్యక్తియు తన ఉపభోగమునకను తనలను హాని విడగినవస్తువును సుందరమని భావించును. కానిసౌందర్యముగ తామసరజస గుణ ఉపభోగమునందును ఆయావస్తువుల సౌందర్యానుభవమునందును స్వసంవేదనమునే సహృదయుడాస్వాదించును. ఒక్కొక్కరసము ఒక్కొక్కనికి ఇష్టము అయినను సర్వరసముల సర్వజ్ఞాస్వాదము సకలిత ముగ నేయుండును. అదియే ఆత్మగనము. దీనిని హాని లేనిదియే అతనికి సుందరమగుచున్నది.

చిత్రమునందును శిల్పమునందును నియతమైన అవయవ సంస్కారమున్నప్పుడే చిత్రము శిల్పము శోభించును. ఆయా అవయవములట్లుండుటకు నియతమగు శాస్త్రమున్నది. శాస్త్రనియమానుసారముగా నైన శిల్పములు సుందరముగా నుండును.

వస్తురూపగతమైన సౌందర్యమొకటియున్నది. అదివరు ప్రత్యక్షము. శుక్ల నీల పీతాదివర్ణములు నియతముగా నుండగా సంగతముగ భాసించును. నానావర్ణముల మేళనముగ ఒకవిధమగు సౌందర్యము భాసించును. శ్రోత్రములకు సుందరముగున మృదుమధురపాటి వర్ణములతో నాదసంవాదిస్వరవిన్యాసములతో లయక్రమ విశేషములతో నుండును. అన్నిటను రసాత్మకమైన సంవేదనమే సౌందర్యమును కూర్చును. రసమాస్వాదనను షడ్విధసౌందర్యము కూడ ఇట్టివైవిధ్యమున్నది. ఇక్షుక్షీరగుడాదిగ్రాహ్యమును సుందరము. సర్వేంద్రియగ్రాహ్యములైన శబ్ద స్పర్శ రూప రస గంధములు సుందరము అగుచున్నవి. కాని సౌందర్యమును మానసమందుకొనుచున్నది. జ్ఞానేంద్రియములు కర్మేంద్రియములు మనః ప్రేరణమును పొందినవై వస్తుసౌందర్యమును గుర్తించుచున్నవి. ఆ మనస్సు ఆత్మ సంయోగమున సర్వజగమునకు సౌందర్యలేశమును కల్గించుచున్నది.

సౌందర్యాలోకము వేదాంతములలో ఆత్మ ధీవృత్తిలో అనుగతమైయున్నట్లు నిరూపితమైనది. "ఆత్మా మనసా సంయుజ్యతే మన ఇంద్రియేణ ఇంద్రియమర్థేన తతః ప్రత్యక్షము త్పద్యతే" అను క్రమము జగద్వస్తువునకును ఆత్మకును గల సంబంధమును సౌందర్యమును నిరూపించుమార్గముగానున్నది. లోకదృష్టమైన వస్తువు వస్తురూపమున నేమనకు గోచరింపను. అది చిత్తవృత్తిరూపకమై భాసించును. చిత్తవదార్థమే చిద్పదార్థమగును. చిన్మయాకారమునే సౌందర్యము కలుగుచున్నది. ఇంద్రియములకును పదార్థములకును కలుగు సన్నికర్షము సౌందర్యమును కాదు. మను ఇంద్రియగోచరమున్నను పదార్థభేదమున్నను మనస్సుష్టి సకలమునకే యుండును. కావున ఆత్మసంవిదనుభూతి సౌందర్యమునకు నిదానము. ఇదియే సౌందర్యాలోకము.

కవితాసౌందర్యము కవితాసౌందర్యము కవితత్త్వముగా ఎన్నదగినది. యశోవాకోవిదర్తాతే అప్రాప్యమనసాసహ — అనునది సౌందర్యరసమునను మనసంగతమునను ఇట్టిది అనిర్వచనీయమని సూచనకని "చలువకలవెన్నెలలు" మొదలుగా గలకవితాసౌందర్యమును ఉగ్గడించెను. ప్రకృతి సౌందర్య ప్రశంస వేదరాశిలోకలను ఉషోవర్ణనమిట్టిది. ఇంచు అనుగతముగా ఆత్మసౌందర్యానుభూతియున్నది. ప్రీతిశాహాత్పాహు అను శక్తియుండనని భవభూతియనెను. "ఇతి కారాణాం తరతోపహేతుః" అభిమానాత్మకమైన అంతరహేతువొకటి జగత్పదార్థములను సంబంధించియుండి ప్రీతిసౌందర్యమును కూర్చును. ప్రేమాకర్షణాదము ను సంగతపరచినమైత్రేయీ బ్రాహ్మణము గూఢముగా సౌందర్యతత్త్వమును వ్యాఖ్యానించినది. "భర్తను భర్తకై ప్రేమింపరు ఆత్మకై ప్రేమింతురు" అనునది అంతరితత్త్వము.

కవితాగత సౌందర్యమువలె భాషాగత సౌందర్యమును వివిధముగా భావింపవలసియున్నది. సర్వమును రసావేశముగా నుండుట అందును కలదు. వర్ణములు పదములు వాక్యములు రచన, ప్రబంధము, భావము మొదలగునవన్నియు పర్తాని

చిత్యానుసారమున వాచ్యౌచిత్యానుసారమున కావ్యౌచిత్యానుసారమున ఉండును

దార్శనిక మతము: దర్శనప్రియులందరు సౌందర్యాన్వేషణమునకై యత్నించిరి. నిత్యానందము దర్శనకారుల లక్ష్యము. అది సౌందర్యాత్మకమని నిశ్చయింపవచ్చును. ఈశ్వరసిద్ధికై తర్కయుక్తిననుసరించిన నైయాయికులు తమలక్ష్యములో సౌందర్యమునే ఆరాధించిరి. అభ్యుదయనిశ్శ్రేయసములను సంపాదింపవలెనని తలచిన వైశేషికులును సౌందర్యమునే లక్ష్యముగా చేకొనిరి. సాంఖ్యయోగములలో పూర్వోత్తరమీమాంసలలో ఇట్టివిషయమునే దర్శింపవచ్చును. వారల కందరకును చరమలక్ష్యము సౌందర్యాత్మకము. స్వరూపనిర్వచనములో కొంతగా విభేదమున్నను ఆస్వాదానుభూతిలో విభేదములేదు. లౌకికములైన హేయగుణములులేని కల్యాణగుణమయదేవుని అంగీకరించినవారందరు సౌందర్యమునే దర్శించిరి.

చైతన్యసంప్రదాయమునందు ఉజ్జ్వలనీలమణి అయిన శ్రీకృష్ణదేవుని సౌందర్యాత్మకములైన కళావిశేషములే అభివర్ణితములైనవి. అసౌందర్యములు నిరసనీయములు. వాని కొకనాటికి అంతమున్నది లేదు. వానిని అవగతముచేసికొనుటకై సంధినీశక్తి సంవిచ్ఛక్తి హ్లాదినీశక్తి కలవారు కావలయును. సంధినీ, సంవిన్మయీ శక్తులు హ్లాదినీశక్తికి అవయవములు. అఖండరూపమైన హ్లాదినీశక్తి అనంతమయుడైన భగవానునవగతము చేయును. ఆయన సౌందర్యమును సాక్షాత్కరింపజేయును. హ్లాదినీశక్తిరూపముగా మహారాధాభావమును వారు వెలయింపజేసిరి.

ప్రత్యభిజ్ఞాసంప్రదాయము: ప్రత్యభిజ్ఞాసంప్రదాయమును ఉన్మీలింపజేసిన దర్శనకారులు సౌందర్యమీమాంసకై యత్నించిరి. శివుడు మొదలుగా భూతత్త్వమువరకు ముప్పదియారు తత్త్వములను వారంగీకరించిరి. శివుడు మొదటి తత్త్వము. శక్తి రెండవది. ఈశక్తి త్రిపురసుందరి. భావసర్గాంతమున్న సకలతత్త్వములందును శక్తిగతసౌందర్యమును నిరూపించినది. ఈసృష్టితో వారు కలిందరు జడభావమును లేక మొదలుకొని సౌందర్యమును దర్శించిరి. ఈసౌందర్యసాక్షాత్కారమే పరనిర్వృతి. రసాస్వాదము. జగమును దేవముగా సంభావించుటయే సౌందర్యోపాసనము. ఇది ప్రత్యభిజ్ఞచే కలుగును. ప్రతిభానము స్మృతమై ధీవృత్తి ప్రత్యభిజ్ఞ. ప్రత్యభిజ్ఞయున్నచో సర్వము సుందరము శివమునగును. అది లేకున్న అసుందరము అశివము.

భావనోపనిషత్తులో త్రిపురతాపినిలో సౌందర్యోపాసనము సూచితమైనది. సౌందర్యలహరిలో ఇంకను ఇట్టి గ్రంథములలో శ్రీచక్ర శ్రీవిద్య శ్రీచక్ర శ్రీయాగవిధానములలో సౌందర్యారాధనమున్నది. ఇంతేకీతిమే రూపాంతరమున ఇతరుల భావములలో కానవచ్చును. మమ్మటుడు "కావ్యప్రకాశము"లో "శివేతరక్షతి" కావ్యఫలముగా చెప్పి సద్యఃపరనిర్వృతియు ఫలమనెను. అది శివేతరక్షతివలన కలుగు శివకల్యాణము సౌందర్యము.

సాహిత్యప్రస్థానములను ఆదరించిన వారిలో ప్రథముడైన భరతముని నాట్యవేదమున సౌందర్యాలోకమును సాక్షాత్కరింపజేసెను. భరతుని గ్రంథమున 36 అధ్యాయములు కలవు. 36 తత్త్వములను అంగీకరించు ప్రత్యభిజ్ఞావాదుల పరమార్థమును అతడు వ్యక్తమొనర్చెను. సర్వరసముల పర్యంతసీమ మహారసము. సర్వపురుషార్థముల పరిసమాప్తి మోక్షము. సౌందర్యాస్వాదము రసము. మోక్షము సౌందర్యము లక్ష్యమైన మోక్షస్థితిని అందించియు తాను నశింపదు. ఈ భావమును సూచించుటకు "ధ్వన్యాలోకము"లోని ఆనందవర్ధనుని ఈవాక్యము సమర్థము:

"ఇహ వ్యంగ్యే ప్రతీయమానే వాచ్యబుద్ధిః
దూరీభవతి వాచ్యావభాసినా భావేన
తత్ప్రకాశనాత్ ఘటప్రతీతే సత్యామపి
ప్రదీపప్రకాశో న నివర్తతే"

వ్యంగ్యము గోచరించినను వాచ్యబుద్ధి పోదు. ఘటము గోచరించినను ప్రదీపప్రకాశము పోనట్టి రసమోక్షస్థితి భాసించినను సౌందర్యస్ఫురణము పోదని గుర్తింపవలెను.

అలంకారికులవాదము: భామహుడు అలంకారసౌందర్యమును భావించెను. అతిశయోక్తి సర్వాలంకారమూలమని అతడనెను. లోకవిలక్షణమైన ఉక్తివిశేషము వక్రోక్తి. అది అతిశయోక్తి. సర్వాలంకారములలో ఈవక్రోక్తియున్నది. శబ్దనిష్ఠము అర్థనిష్ఠమునైన సౌందర్యము.

వామనుడు రీతిసౌందర్యమును కావ్యసౌందర్యముగా భావించెను. రీతియనునది మధురరచన, ఓజోరచన, ప్రసన్నరచన అనెడిభావమున భరతరచనయందే కలదని అభినవభారతము సూచించినది. సౌందర్యమును నవరసములలో

సమితమొనరింపజాలక రుద్రటుడు కావ్యాలంకారములో స్నేహమును ఇతరములను రసములనెను ఆస్వాద్యమగునది సర్వము రసమని అతడంగీకరించెను రసనాద్రసత్వమేతేషాం'- అతనిదృష్టిలో రసమునకు పరిమితి లేదు

ధ్వన్యాలోకశాస్త్రకర్తయైన ఆనందవర్ధనుడు గుణాలంకారాదులవలని చారుత్వము ధ్వన్యమానమునకు అంగముగా నుండుటలోగల సౌందర్యమును నిరూపించెను ధ్వన్యాలోకము సర్వసౌందర్యాలోకమునకు సౌందర్యమును సంపాదించినది ధ్వనిఖండనమునకుద్యమించిన మహిముడు సౌందర్యమును ద్విధా విభక్తమొనరించి అనుమాపకసౌందర్యమును అనుమేయసౌందర్యమును స్ఫుటమొనరించినాడు స్వస్పంద సుందరమైన వక్రోక్తిసౌందర్యమును ఆరువిధములుగా విభజించి కుంతకుడు కావ్యసౌందర్యములోని అవాంతరవిశేషము లను సుందరవచనరచనా చమత్కారమున నిరూపించినాడు, క్షేమేంద్రుడు ఔచిత్యమును నిరూపించుచు ఉచితస్థానవిన్యాసమున సర్వము సౌందర్యమున నుండునని ఔచిత్యమునది స్వరూపప్రతిష్ఠముకాదు అందువలనే క్షేమేంద్రుడు రససిద్ధస్య అనిప్రయోగించెను పండితరాయల "రసగంగాధరము సర్వమూర్ధన్యమైన ప్రామాణికగ్రంథము "ధ్వన్యాలోకము"నకది భాష్యరూపము

శృంగారప్రకాశము"ను రచించిన భోజదేవుడు కవివాక్కునందు తాత్పర్యమును వనితాదేహమున లావణ్యమును నిరూపించుచు సౌందర్యము లావణ్యప్రముఖ్యముగ చెప్పెను "రసార్ణవసుధాకరము"న సర్వజ్ఞసింగభూపాలుడును సౌందర్యాలోకమును సాక్షాత్కరింపజేసెను

సౌందర్యనిరూపకుల నిరూపణవిధానమును పరిశీలింపగా ఈశ్వరుడు త్రిఅనుపచార్థద్వయము సౌందర్యమూలతత్త్వముగా భావించినట్లు ఎంచవచ్చును జగదతీతమైన పూర్ణసౌందర్యము ఈశ్వరాత్మకముగను, జగన్మయమైన సౌందర్యము వనితాత్మకముగను భాసించును విశ్వోత్తీర్ణుడైన శివుడు ప్రథమతత్త్వము. విశ్వమయమైన శక్తి ద్వితీయతత్త్వము సకలవిశ్వము శక్తిపరిస్పందనముల్లసనము; అద్యపరిస్పందము వాక్కు; అదే పరావాక్కు; అఖిలవాఙ్మయప్రపంచమునకు నిదానము

సౌందర్యాన్వేషణములో భౌతికవాదులు కొందరుకలరు ఆధ్యాత్మికవాదులును కొందరుకలరు; ' శకేక్ సౌందర్యమంగానాం సన్నివేశోయథోచితం" ఉచితస్థానవిన్యాసముండగా సౌందర్యమావిర్భవించునని క్షేమేంద్రుడు తలచెను వైశేషికుల సౌందర్యదృష్టి ఔచిత్యమును దాటి ప్రసరింపలేదు ఉపయోగమునుసరించి సౌందర్యములలో విశేషమునుభావించును అప్పుడు వస్తుగతసౌందర్యము ఆస్వాద్యమగును ఇంద్రియజన్యసౌందర్యము ఇంద్రియతృప్తిని ఇచ్చును సాహచర్యకృతమైన సౌందర్యము సాహచర్యము లేనప్పుడు వేదనను కల్గించును సాహచర్యము కలుగగా వేదనాశాంతిరూపమునవేళల సంవేదనాత్మకమైన సౌందర్యమును సంపాదించును ఇట్టిసౌందర్యములన్నిటిలో మానససౌందర్యము ప్రముఖముగ భావింపదగియున్నది మానవుల ఉపయోగదృష్టి కాలక్రమమున వానిలో ఉపభోగదృష్టియే ముఖ్యముగా కనబడుచున్నది ప్రపంచములోని పదార్థములు మానవులకు సౌందర్యభావమును కలుగజేయవు సౌందర్యజాగరణము కలుగునేని మనసులో సౌందర్యముద్రలు కూడుకొనగలవు అవి రూఢములై సౌందర్యానుభవమునకు మానవులను ప్రేరణ చేయుచున్నవి ఈచెప్పునది సౌందర్యవిషయమున భౌతికమైన వాదసారము ఇందు ఆధ్యాత్మికమైన భావసారమును కలదు సౌందర్యమనునది భావించువారి భావనమునందునని ఇది వరలో తెలిసికొంటిమి ఇట్లు సౌందర్యము మనోవస్తువు ఇట్టి సౌందర్యములో బహిర్వస్తువుల అపేక్షలేదు అయినను బహిర్వస్తువులందున్న గుణములను భావింపగా ఆత్మసౌందర్యముకూడ బహిర్వస్తువులకు సంక్రమించి భౌతికమే అగుచున్నది అయినను అట్టి సౌందర్యమునుకూడ ఆధ్యాత్మికముగా మలచుకొనుట కవకాశమున్నది

శివభావము సత్యభావము బహిర్వస్తువునందు సంభావితమైనప్పుడు సౌందర్యము సాక్షాత్కరించును ఈశ్వరగుణములైన శివత్వ సత్యత్వసౌందర్యములను బహిర్వస్తువులందు భావింతుమేని ఈశ్వరుడు వస్తువులందు అనుగతుడై భాసించును

ప్రమాతకును ప్రమాణముచే గుర్తించు ప్రమేయమునకును ఐక్యమును భావించుటలోనే సౌందర్యమున్నది అనగా విశ్వమునకును విశ్వాతీతమునకును అభిన్నత్వమును భావింపవలెనని అర్థము "అహంఇదం" అను అధ్యాస ఉన్నప్పుడే సౌందర్యమనుభవింపవలెనను తృష్ణ కలుగును ఇట్టి తృష్ణాత్మకమగు సౌందర్యకాంక్ష లలితకళలలో స్పష్టమగును ఇట్టి ఈసౌందర్య నిర్వచనము సంపూర్ణముగా ఆధ్యాత్మికము

కాలేదు వస్తుగతమై కళాగతమై ఇంద్రియగతమై ఈ సౌందర్యము లౌకికసౌందర్యమునకు ఉదాత్తత సంపాదించిన విధముగనున్నది

చేతనసృష్టియొకటియు ప్రతీయమాన సృష్టియొకటియు కలవు జగద్గతమైన సౌందర్యమంతయు ప్రతీయమానము ప్రతీయమానమగు జగత్సౌందర్యమునకు చేతనసౌందర్యమే మూలము కావున చేతనమే సుందరము వస్తువేదేని సుందరముగా కన్పట్టిన అది సౌందర్యమువలననే సుందరమగును సౌందర్యము నారాధించుట సౌందర్యమునకేగాని అన్యమునకు కాదు సౌందర్యము అఖండధర్మము అది భిన్నభిన్నముగా నుండదు ఈశ్వరసౌందర్యమే ప్రథమసౌందర్యము జగద్గతసౌందర్యము ఈశ్వరుని ప్రతిబింబరూపము లేక విధముగా ఇది అనుకరణాత్మకమగును దీనిని వగతము చేసికొనుటకు మూడు సోపానములు కలవు

(1) జడాత్మకమైన జగత్తులో నానావిధములగు కర్మల నాచరింపవలసియున్నది అది యంతయు బంధము ఈకర్మబంధములో సౌందర్యానుభవమునకవకాశములేదు తీరిక యుండదు

(2) నైతికమగు జగత్తు ఒకటిగలదు ఇది చేయదగును ఇదిచేయరాదు-అనునీతినిబంధనములు నైతికజగత్తులోనున్నవి ఇట్టి నీతినియమను లుకూడ బంధములే ఈబంధములోనున్నవారికికూడ సౌందర్యమును అనుభవించు అవకాశములేదు

(3) కేరొక జగముకలదు అది క్రీడాత్మకజగము దీనిలో జడజగత్తునకు నైతికజగత్తునకు సంబంధముకలదు ఇది యొక సౌందర్యాత్మకమైన జగత్తు ఈసౌందర్యమయ జగమునందే మానవునకు వాస్తవమైన మానవత్వము వికసించును మొదట చెప్పిన బంధములు ఈజగములో బంధములుగానుండవు ఇంద్రియగోచరమగు సౌందర్యమే వైయక్తికమైన ఆనందము నిచ్చును స్ఫురణాత్మకమగు అంతస్సౌందర్యమున్నది అది సమష్టిరూపమైన ఆనందమును ఆస్వాదింపజేయును ఒకానొక అదృశ్యశక్తియొక్క అభివ్యక్తి సౌందర్యమనమున్నది మానవులకు గోచరములుకాని అదృశ్యశక్తు లనేకములు కలవు గోచరించిన శక్తులలో గోచరించు సౌందర్యముసాధ్యము అది అభావరూపమేకాని వాస్తవసౌందర్యముకాదు అదృశ్యములైన శక్తులు అనంతముగా విశ్వమునవ్యాపించియున్నవి ఆశక్తులు మానవునిలోని గుప్తములు గూఢములు అయిన శక్తులను వికసింపజేయగలవు బహిర్వస్తువులందు సౌందర్యమును అభివ్యక్తము చేయగలవు

జగత్పదార్థములు శక్తిస్పందనముగల మానవునకు సౌందర్యమును స్ఫురింపజేయుచున్నవి ఈశ్వరసంబంధియైన ఇచ్ఛాశక్తి సౌందర్యాత్మకముగా సుందరపదార్థమున స్ఫురించును కావున సౌందర్యము వస్తుగతముకాదు. మనోగతమును కాదు మనశ్శక్తులు మూడుకలవు శుద్ధబుద్ధియొకటి అది ఇచ్ఛాశక్తి సంబంధి వ్యావహారిక బుద్ధియొకటి, అది జ్ఞానశక్తి సంబంధి మూడవది బోధసంబంధముతోనుండు బుద్ధి ఆత్మబుద్ధి యందే సౌందర్యాలోకము సాక్షాత్కరించును ఈసౌందర్యమున మానవునకు నిస్స్వార్థమైన ఆనందముకలుగును వైదేశికుల భావనములో సౌందర్యవివేచనమిట్లేయున్నది కాగా సౌందర్యము వస్తుగతముకాదనియు ప్రమాతయగువాని అంతఃకరణమున ఉండుననియు గోచరించును

సౌందర్యాలోకవిషయమున నేటివరకు సంపూర్ణమైన సఫలమైన వ్యాసంగము జరుగలేదు సౌందర్యము జ్ఞానవిశేష సాక్షాత్కారము ఇట్లు సౌందర్యాలోకమును దర్శింపగా, సమాజవికాసమునకును మానవ్యక్తిత్వసిద్ధికిని సౌందర్యము తదాస్వాదము బాగుగా ఉపకరింపగలదని విశ్వసింపవచ్చును సనాతనములుగాని అధునాతనములుగాని నిరూపించిన సౌందర్యాలోకమును సహృదయాలోకముతో పరిశీలించినచో ఉపాదేయాంశములు బహుళముగా భాసించును హేయాంశములు కొన్ని ఉండవచ్చును కాని వారి స్వీకారము తప్పనియయమున ఆస్వాదమిచ్చినప్పటికిని, మానవశైతన్యవికాసమునకు అవి ఉపకరింపవు స్వాత్మశైతన్యస్ఫురణముతో సౌందర్యాలోకమును దర్శించినచో రసాత్మకమైనఆత్మసౌందర్యముభాసించును

"స్వశ్ఛంద సుందరం సమ్యగాత్మసౌందర్యవాసితమ్
అస్తు శ్వస్త్యయనం లోకే సౌందర్యాలోకలోచనమ్"

జ. హా. శ

## స్ఫటికములు—I

ప్రతిమానవుడు స్ఫటికములను తరచు చూచుచునే యుండును అట్టివి రాతిలవణము సముద్రపులవణము, ముతక పంచదార, పటికబెల్లము మొదలైనవాటిలోకూడ కన్పడును. కాని అవి గుచ్ఛములు పుంజములు కావున, సాధారణముగా గుర్తింపబడవు అట్టిపుంజములలో ఒక్కొక్కకణమును విపులముగా పరీక్షించినచో అది నునుపైన తలములుకలిగి, ప్రక్క-

ప్రక్కనేఉన్న ఒకేరకపు తలముల మధ్య సంబంధము ఒకేవిధముగానుండును. ప్రకృతిలో వివిధఖనిజములు ముఖ్యముగా స్ఫటికములుగా లభ్యమగును. సర్వసాధారణముగా లభ్యమగు స్ఫటికశిలాస్ఫటికము (quartz or rock crystal). శాస్త్రజ్ఞులు ప్రతిపదార్థము పరమాణుపుంజమనియు అట్టి పరమాణువులు స్థిరముగ జడములైనను వాటిలో విద్యుచ్ఛక్తివంటి శక్తి కలదనియు నిరూపించిరి. స్ఫటికముల నిర్మాణపథకములు రేఖాగణిత శాస్త్రబద్ధములగుటచేత ఘటాద్యాకారము ఉత్పన్నమగును. ఆయా ఆకారముల పలురకముల స్ఫటికములుగా రూపొందును. అందుచే రసాయనద్రవ్యములలో వాయులేక ద్రవస్థితి నుండి ఘనస్థితికి మారునప్పుడు పరమాణుశక్తుల వలన నిర్ణీతమైన పలురకములైన నున్నని తలములు గల రూపముగా స్ఫటికమును చేర్పవచ్చును. ప్రకృతిలో దాదాపు ఖనిజములన్నియు స్ఫటికరూపముననే లభించును. స్ఫటికములను విపులముగా వివరించునదియే స్ఫటికవిజ్ఞానశాస్త్రము.

స్ఫటికవిజ్ఞానశాస్త్రము ఎకోలస్ స్టెనో అను డెన్మార్కు దేశీయ శాస్త్రజ్ఞునిచే ఆవిష్కరింపబడెను. అతడు స్ఫటికతలముల మధ్యనుండు అంతర్కోణములను కొలిచి ఒకేరకమైన తలముల మధ్యనుండు కోణము ఎప్పుడును ఒకటిగానే యుండుననియు, స్ఫటికములలోని లోపలను వాటి అవయవ రూపత్వమును స్పష్టీకరించవచ్చుననియు నిరూపించెను. 1912 వ సంలో మాక్స్‌వాన్‌లూ అను శాస్త్రజ్ఞుడు X కిరణములను కనుగొనిన తర్వాతనే స్ఫటికముల అంతర్నిర్మాణమును గూర్చి తెలిసికొనుటకు వీలైనది. తదుపరి విలియమ్‌బ్రాగ్, లారెన్స్‌బ్రాగ్ అను తండ్రికొడుకులు స్ఫటికముల అంతర్నిర్మాణమును X కిరణముల ద్వారా తెలిసికొనవచ్చునని నిరూపించి ఆధునిక స్ఫటికవిజ్ఞానశాస్త్రమును నెలకొల్పినారు.




స్ఫటికముల ముఖ్యలక్షణములు రెండు (1) సహజ ప్రత్యక్షరూపము (2) పరోక్ష అణునిర్మాణము.

ప్రత్యక్షరూపము అణునిర్మాణముపై ఆధారపడు ప్రత్యక్షరూపములు, వాటి వివిధలక్షణములు తెలిపినచో అంతర్నిర్మాణము సులభముగా అర్థమగును. స్ఫటికములు పలురకములైన నున్నని తలములు కలిగియుండును. ప్రకృతిలో లభించు స్ఫటికముల తలములలో కొన్ని అసంపూర్ణతలు కన్పించును. ఈ అసంపూర్ణతలవలన ప్రకృతిసిద్ధమైన స్ఫటికములను కృత్రిమమైనవాటిని గుర్తించవచ్చును. అసంపూర్ణతలు తలముల రూపములోను వాటిపై కూడ కన్పించును. ఈ స్ఫటికముల తలములు కుంభాకారములో నుండను స్ఫటికీకరణసమయములో తరంగరూపమైన యాంత్రికజనితమగు మార్పుచే కొన్ని స్ఫటికములు వాలి ముక్కలైనట్లు కన్పడును. స్ఫటికముల తలములు కొన్ని పెద్దవిగను కొన్ని చిన్నవిగను ఉద్భవించును. అన్నిరకములు ఒకేచోటగాని ఒక్కొక్కరకము ఒక్కొక్కచోటగాని ప్రకృతిలో లభించుటలేదు. ఈ క్రింది పటములోని జిర్కన్ ఖనిజస్ఫటికములు ఇందు ఉదాహరణము.

స్ఫటికములెంత చిన్నవైన అవి అంతపారదర్శకత కలిగియుండును. పెద్దపెద్ద స్ఫటికములు ప్రకృతిలో బహు అరుదు. వీటిలో పేర్కొనదగినవి నెల్లూరు అభ్రకపు గనులలో లభించిన 4 మీ ఎత్తు 9 అం వ్యాసముగల ఫెల్స్పార్ ఇటలీలో

చిత్రము-110




పటము-1

ఒకేరకమైన తలములు ఒకేఅక్షరములో చూపబడినవి

మీన్‌గరమువద్ద లభించిన 8.25 మీ ఎత్తు 5.5 అం వ్యాసము (870 టనుల బరువు) గల శిలాస్ఫటికము అమెరికాలోని న్యూహాంప్‌షైర్ వద్ద లభించిన 4 మీ ఎత్తు 2.5 అం వ్యాసముగల బెరిల్ అనునవి. స్ఫటికము ఎట్టి రూపము నున్నను ఎట్టి పరిమాణము కల్గియున్నను వాటిలో ఒకేసంబంధముగల తలముల మధ్యనుండు అంతర్కోణము ఒక్కొక్క ఖనిజ రసాయన ద్రవ్యములలో ఒకేవిధముగా నుండును. ఉదా: మిశ్రిత అభ్రకల అంబఫలక (Prismatic) తలముల మధ్యకోణము 115°-18'

స్ఫటికములలోని వివిధతలములు, వాటి అంతర్కోణ

సాంబంధ్యమునట్టి వాటిలోని అవయవానురూపత్వమను ప్రకృతిలక్షణము కొన్ని గణితసూత్రాధారములపై నేర్పడినది. అవయవానురూపత్వముగా ఒక తలముగాని కోణముగాని అట్టి మరిదేయితరలక్షణముగాని ప్రతిబింబత్వమొందుట. అట్టి ప్రతిబింబరూపములు స్ఫటిక విజ్ఞాన శాస్త్రబద్ధమైనను రేఖాశాస్త్రబద్ధములు కానవసరములేదు. కనుక స్ఫటిక విజ్ఞాన ప్రకారము అంతరకోణసాంబంధ్యమే ముఖ్యముగాని వాని రూపపరిమాణములు వానిమధ్య దూరములు ముఖ్యము కావు. అట్టి అవయవానురూపలక్షణములు మూడురకములు (1) అవయవానురూపతలము (Plane of symmetry) (2) అవయవానురూపఅక్షము (axis of symmetry) (3 అవయవానురూపమధ్యమము (centre of symmetry) ఈ అవయవానురూపలక్షణముల ఆధారముగా స్ఫటికములు 32 విసర్గలు లేక వర్గములుగా విభజింపబడినవి. అవయవానురూపలక్షణములు అధికముగనున్నకొలది అది అంత అధిక అవయవానురూపత్వము పొందిన స్ఫటికమని చెప్పబడును.

ఘనవర్గ (cubic system) లోని స్ఫటికములకు అవయవానురూపత్వము అధికము. ట్రైక్లినిక్ వర్గలోనివాటికి అన్నిటి అవయవానురూపత్వము కంటె అల్పము. ఈ క్రిందిపటములో ఆమూడు లక్షణములు చూపబడినవి.

కొన్ని స్ఫటికములు బాహ్యరూపమున అధిక అవయవానురూపత్వము కలిగినవిగా కనిపించినను అంతర్నిర్మాణమును బట్టి అవి తక్కువ అవయవానురూపత్వము కలవిగా తెలియుచున్నది. మరికొన్ని స్ఫటికములలో అవి తక్కువ అవయవానురూపత్వముగల విసర్గకుచెందినను తలాంతరకోణములు కొంచెమించుమించు ఎక్కువ అవయవానురూపత్వముగల విసర్గలో వలెనే యుండును.

స్ఫటికముల తలములను వర్ణించవలెనన్నచో మూడు మూలరేఖలు లేక అక్షములు వానిలో యున్నట్లు భావించుట అవశ్యకము. అట్టి అక్షములు విశ్లేషరేఖాశాస్త్రము ఆధారముగా పరిగణింపబడుచున్నవి. ఆ అక్షములమధ్య లంబకోణములు (90°) ఉండి మూడును ఒక బిందువువద్ద కలిసియుండి, 3వ పటములో చూపించినట్లు a b c అని పేర్కొనబడును.

వివిధవర్గల స్ఫటికములయొక్క అవయవానురూపత్వమునుబట్టి స్ఫటికముల నిర్దిష్టాక్షములు నిర్ధరించబడును. ఘనవర్గలోని స్ఫటికములలో మూడు అక్షములు ఒకే కొలతలో నుండుటవలన అన్నిటిని a a a' అని పేర్కొనుట కద్దు. టెట్రాగోనల్ వర్గకు చెందు స్ఫటికములలో మొదటిరెండు అక్షములు ఒకే కొలత గలవిగా యుండుటవలన 'a a' అనియు, మూడవదానిని 'c' అనియు పేర్కొందురు. మిగతవర్గలకు

చిత్రము—111

సిమిట్రీ తలము

ఆంఫిబోల్

పటము - 2

ఘనములోని అవయవానురూప అక్షములు

చిత్రము—112

రోడొనైట్

పటము-3

అక్షములు

ప్రస్తుతము పరిగణింపబడుచున్న 32 విసర్గలలోను 7 విసర్గలకుచెందిన స్ఫటికములు కృత్రిమముగా తయారుచేయబడిన రసాయనపదార్థములలోమాత్రమే లభించును. మిగత విసర్గలకు చెందు స్ఫటికములు ప్రకృతిలో దొరకు ఖనిజములలో లభించును.

చెందు స్ఫటికములలో మూడు అక్షములు వేర్వేరు కొలతలు గలవిగాయుండుటవలన a b c, అని పేర్కొనబడును. హెక్సగోనల్ వర్గకుచెందిన స్ఫటికములలోమాత్రము లంబ ఫలకతలములు (prismatic faces) 6 ఉండుటవలన 4 అక్షములు— a, a, a, c కలిగియుండును. సాధారణగా 'b అక్షము,

లోగా 2వ అక్షము సౌష్ఠవాక్షముగా ఎంచుకొనబడెను. మిగత అక్షముల కొలతలు దాని నిష్పత్తిగా పేర్కొనబడును. ఉదా: ఆర్థోరాంబిక్ గంధకస్ఫటికములలో a : b : c = 0.8131 : 1 : 1.9034. టెట్రాగొనల్ జర్కన్‌స్ఫటికములలో a : a : c = 1 : 1 : 0.6404. టెట్రాగొనల్ వర్గస్ఫటికములలోని అక్షముల కొలతలను వ్రాయునపుడు c = 0.6404 అని పేర్కొనుటకద్దు. అట్టి మూడు అక్షములలోను ఏర్పడు

చిత్రము–114



పటము–5
రెండు రకముల కవలస్ఫటికములు

కవలస్ఫటికములు స్ఫటికములనగ్గ అను జట్టి కాంటాక్టు కవలలు చొచ్చుకొనిన కవలలు పోలిసింథటిక్ కవలలు అని పలు రకములుగా నుండును.

చిత్రము–118





పటము–4

మైకా    రూటైల్    స్టారొలైట్

అక్షములు కలిగియున్న తలమైనను అక్షాంగతలమని (axial plane) అనబడును.

కవలస్ఫటికములు: స్ఫటికములుత్పన్నమగునపుడు అప్పటి వాతావరణపు మార్పులవలన అవి గుంపు గుంపులుగా పెరుగును. కొన్నికొన్నిటిలో ఒకదానిలో నొకటి చొచ్చుకొన్నట్లును ఒకదానితోనింకొకటి అంటిపెట్టుకున్నట్లును గల విధములుగా పెరుగును. అట్టి స్ఫటికములు కవలస్ఫటికములని చెప్పబడును. ఉదాహరణమునకు 4వ పటమును చూడుడు.

ఇట్టి కవలత్వము స్ఫటికముల జన్మసమయమందే అణువుల సంఘాతములవలన కలుగును. ఒక్కొక్కప్పుడు కవలత్వమొందిన స్ఫటికము పూర్తిగా పెరిగిన సాధారణ స్ఫటికమువలె గోచరించును. ఉదా: శిలాస్ఫటికము. అయినను సూక్ష్మదర్శినితో గాని ఎక్స్ కిరణములతోగాని పరీక్షించినయెడల వానిలోని కవలత్వము స్పష్టమగును. 5వ పటములో కవలత్వమొందిన రెండురకముల స్ఫటికములను చూడవచ్చును.

జి. వి. రా.

## స్ఫటికములు II

వాయు ద్రవపదార్థములకువలెకాక ఘనపదార్థములకు స్థిరమగు ఒక రూపముండును. ఈ ఘనపదార్థములను స్ఫటికాకృతి కలవియనియు చూర్ణములనియు వ్యవహరించుచున్నారు. స్ఫటికాకృతియందున్న పదార్థములతో పరమాణువులుగాని ఒక్కొక్కప్పుడు అణువులుగాని క్రమపద్ధతిగ నుండును. చూర్ణరూపములోనున్న పదార్థములను ద్రవపదార్థభేదములనియు వాటిలో ప్రవాహశీలవ్యతిరేకత అతి ఎక్కువయనియు లాగినచో సాగునట్టి స్వభావము వాటికి అతితక్కువయనియు పరిగణించుచున్నారు. వేడిచేసినచో ఇవి ద్రవపదార్థములుగా మారును. ఈమార్పు క్రమముగా జరుగునేగాని ఒక్క ప్రత్యేక ఉష్ణోగ్రతస్థితిలోను కానరాదు. స్ఫటికాకృతిలోనున్న ఘనపదార్థములట్లు కావు. అవి వాటి స్వభావానుగుణములైన ఉష్ణోగ్రతస్థితియందు ద్రవరూపమును పొందును. ఆ ఉష్ణోగ్రత వాటి వ్యక్తిత్వసూచకలక్షణమై యొప్పుచుండును.

కరిగిన ఘనపదార్థములు చల్లారినప్పుడును పదార్థముల

యొక్క సంశ్లిష్ట ప్రమాణములు ఊహింపబడెను. రెండు విధములైన స్ఫటికములేర్పడును. స్ఫటికాకృతిలోనున్న అణువులు స్ఫటికములో ఒక విధానమువలన ఏర్పడినవని భావింప వచ్చును. ప్రయోగశాలలో రెండవ విధానమును అనుసరించి కొన్ని పరిమాణములలో స్ఫటికములను తయారుచేయుట సాధ్యమగును.

స్ఫటిక జ్ఞానశాస్త్రము: స్ఫటికముల ఆకారవిశేషములను శోధించి వివరించెడి శాస్త్రమును స్ఫటికవిజ్ఞానశాస్త్రమనబడు చున్నది. ఎన్నియో స్ఫటికాకృతులు కన్పట్టుచున్నను వాటిని ప్రధానముగా ఏడు వర్గముల క్రింద విభజింపవచ్చునని 1818లో వెయిస్ అనువాడును 1830లో హెస్సెల్ అనువాడును సూచించిరి. సృష్టిలో కాన్పించు అసంఖ్యాకస్ఫటికములు ఈ ఏడు వర్గములలో ఇమిడియున్నను వాటినిగూర్చిన జ్ఞానమును క్రోడీకరించుటకుగాను వెయిస్ ప్రతిపాదించిన సిద్ధాంతములో స్ఫటికము యొక్క అంతర్భాగమునందు ఒక బిందువు వద్ద సమకోణాత్మకమైన మూడు రేఖలను మూలరేఖలు (అక్షములు = axes)గా గ్రహించినప్పుడు స్ఫటికము యొక్క ఉపరితలము లోపల దానిపై నున్న యొక దానిని ఆవరించిన రేఖల రీతిగానున్నట్లు గోచరించుననియు మూలరేఖల పొడవులలోను వాటిమధ్యనుండు కోణములలోను భేదములుండుటవలననే ఏడు వర్గముల స్ఫటికములేర్పడుననియు స్పష్టమయ్యెను. ఆ వర్గముల పేర్లు వాటిముఖ్యలక్షణములు వాటికుదాహరణములైన పదార్థములు ఈ క్రిందిపట్టికలో పొందుపరుపబడినవి.

| స్ఫటికవర్గము | స్ఫటికలక్షణములు | ఉదాహరణములు |
|---|---|---|
| 1) ఘనరూపము లేక సమత్రిమ రూపము | మూడు మూలరేఖల నిడివి 1 1 1 నిష్పత్తిలోను మూడు మూలరేఖా కోణములు 90 డిగ్రీలు ఉండును | ఉప్పు, సైనైకు, అరన్, పైరైటిను, సోడియము క్లోరైడు, వజ్రము, సీసము, వెండి, బంగారము |
| 2) టెట్రాగొనల్ స్ఫటిక వర్గము | మూడు మూలరేఖా కోణములు 90 డిగ్రీలు. మూడు మూలరేఖలలో రెండింటి నిడివి సమానము. మూడవ దాని నిడివి భిన్నము 1 1 7 | పొటాషియము, డయాక్సైడు, తగరము, పొటాసియము, డై హైడ్రోజనిఫాస్పేటు |
| 3) హెక్సాగొనల్ స్ఫటిక వర్గము | 60 డిగ్రీల కోణములలో ఒకే సమతలములో ఉన్న మూడు రేఖలు అను తలమునకు 90 డిగ్రీలలో ఉన్న వేరొక రేఖయు మూలరేఖలుగ నుండును. ఒకే సమతలములో ఉన్న మూడు మూలరేఖల నిడివి సమానము. దానికి సమకోణాత్మకముగనున్న రేఖ నిడివి వేరుగ నుండును 1 1 1 x | మంచుగడ్డ, గ్రాఫైటు, మెగ్నీషియా, జింక, కార్బైడు, మెర్క్యురిక్ సల్ఫైడు (సిన్నబార్) |
| 4) ఆర్థోరాంబిక్ లేక రాంబిక్ స్ఫటికవర్గము | మూడు మూలరేఖా కోణములు 90 డిగ్రీలు. మూలరేఖల నిడివి సమానముగ నుండదు వాటినిష్పత్తి x 1 y | బెరైటిస్ (బేరియమ్ సల్ఫేటు) సెరసైట్ (లెడ్ కార్బొనేటు), పొటాసియము సల్ఫేటు, పొటాసియము నైట్రేటు సల్ఫరు వివిధ రూపములలో ఒకటి |

| స్ఫటికవర్గము | స్ఫటికలక్షణములు | ఉదాహరణములు |
|---|---|---|
| 5) మోనోక్లినిక్ స్ఫటికవర్గము | మూడు మూలరేఖా కోణములలో రెండు 90 డిగ్రీలు మూడవది 90 డిగ్రీలకు సమము కాదు మూడు మూలరేఖల నిడివి సమముగ నుండదు వాటి నిష్పత్తి x : y | జిప్సమ్ (శిలాజిత్తు) గంధకము ఏకరూపము లో ఒక రూపము ప్యాన్ఫర్ట్ ఖనిజములలో ను హోర్నెబ్లెండు (పొటాసియం మెగ్నీషియం సల్ఫేటు) |
| 6) రోంబోహెడ్రల్ లేక ట్రైగొనల్ స్ఫటికవర్గము | మూడు మూలరేఖలు వంపుగా నుండను రేఖాకోణములు 90° కంటె భిన్నముగ నుండును మూడు మూలరేఖల నిడివి సమానముగ నుండును వాటి వృత్తి 1 : 1 : 1 | కాల్సైటు మాగ్నెసైటు సోడియము నైట్రేటు స్ఫటికశిలగా పేరందిన క్వార్ట్జ్ ఆర్సెనిక్ అంటిమొని బిస్మత్ |
| 7) ట్రైక్లినిక్ లేక ఎనార్థిక్ స్ఫటికవర్గము | మూడు మూలరేఖా కోణములు 90 డిగ్రీలకంటె వేరుగను మూడు మూలరేఖల నిడివి వేర్వేరుగను ఉండును వాటి వృత్తి x : y | మైతుత్తము పొటాసియము డైక్రోమేటు |

చిత్రము-115










స్ఫటిక వైవిధ్యము

స్ఫటికముల గుణవిశేషములు సమ ఘన రూపమునకు చెందిన వర్గ స్ఫటికములకు మినహా యించినచో మిగిలినవన్నియు ఉష్ణీయ వైద్యుత ప్రసార సామర్థ్యములో బరువు మోయనప్పుడు సాగేటి లక్షణములో తేడాలను వ్యక్తము చేయును ఈ లక్షణములు స్ఫటికములో ఏదిక్కుగా కేంద్ర బిందువు కు ఎంత దూరముగా స్థానము ఆనుకొని యున్నదో ఉష్ణవిద్యుత్ప్రసారము సాగుచున్నదో దాని ననుసరించియుండును దౌతిక లక్షణములు స్ఫటికములో అన్నిదిక్కులయందును ఒకేరీతిగా ఉన్నచో వాటిని ఐసోటోపిక్ స్ఫటికములనియు అట్లు లేనిచో ఎనిసోటోపిక్ స్ఫటికములనియు పిలిచెదరు రోంబిక్ మోనోక్లినిక్ ట్రైక్లినిక్ వర్గములకుచెందిన స్ఫటికములలో ప్రవేశించు కాంతికిరణములు వక్రీభవనమై రెండుదిక్కులకు ప్రయాణము చేయును కాల్సైటు స్ఫటికముల లక్షణమును విస్పష్టము చేయును తెల్లని కాగితము మీద ఎర్రచుక్కను వేసి దానిపై కాల్సైటు స్ఫటికమును ఉంచి పరిశీలించినప్పుడు రెండు ఎర్ర చుక్కలు కాన్పించును అప్పుడు స్ఫటికమును గిరగిర త్రిప్పినచో ఎర్రచుక్కలలో ఒకటి నిశ్చలముగను మరియొకటిదానిచుట్టు ప్రదక్షిణము చేయుచున్నట్లును కాన్పించును కాల్సైటులో

వ్యక్తమగు స్ఫటికగణస్వభావమే అస్ఫటికము యొక్క విషమరూపకమును వ్యక్తమూర్తి కార్బనయోగిములలో విషమరూపాణువులను గుర్తించుటకుపయోగపడు పోలారిస్కోపు సాధన నిర్మాణమును సాధ్యమొనర్చెను.

సమస్ఫాటిక రూపములుగల రెండు రాసాయనిక పదార్థముల రాసాయనికాణురచన ఒకేరీతిగా ఉండునను విషయమును మిట్‌షర్‌లిఖ్ అనుశాస్త్రవేత్త గుర్తించి ఆనియమమును కొన్నిమూలద్రవ్యముల పరమాణుభారనిర్ణయమునందుపయోగించెను.

స్ఫటికములో పలకల రీతిగా వరుసలో ఒకదానిపైన మరియొకదానిని తీర్చిదిద్దియున్న అణుసముదాయములమధ్య నుండెడి దూరములు అత్యల్పమైనందున అత్యల్పతరంగదైర్ఘ్యముగల X కిరణ ప్రసారమువలననే వాటిని నిర్ణయించుటయు, స్ఫటికముల నిర్మాణవిన్యాసమును అవగాహనచేసికొనుటయు సాధ్యమైనది. డబ్లియు బి బ్రాగ్ శాస్త్రవేత్తయు ఆయన కుమారుడైన డబ్లియు సి బ్రాగ్ మొదలైనశాస్త్రవేత్తలును ఈవిధమైన పరిశోధనలను కావించి వజ్రము గ్రాఫైటు మొదలైనవాటి నిర్మాణమును వెల్లడిచేసిరి.

హా. అ.

## స్టాలిన్ జోసెఫ్ :

19 4లో ఘటిల్లిన లెనిన్ మరణానంతరము సోవియట్ ప్రభుత్వమునకు నేతృత్వము నెరపిన మహానాయకుడు జోసెఫ్ స్టాలిన్. లెనిన్ అనుయాయిగా జాతీయఅంతర్జాతీయశ్రామిక వర్గనాయకుడుగా ధనికరాజ్యముల కుతంత్రములనుండి మాతృభూమిని గాపాడిన యోధాగ్రణిగా ప్రజ్ఞాధురీణుడైన మార్క్సిస్టు సిద్ధాంతవేత్తగా ఇతడు చారిత్రకపురుషుడై ప్రపంచశ్రామికజనముచే కీర్తింపబడినాడు.

ఇతడు కైఖస్ రాష్ట్రమందలి గోరిగ్రామమున 1879 డిసెంబరు 21వ తేదీన ఒక చర్మకారునియింట జన్మించి బాల్యదశయందే ఒకపాదరక్షలపరిశ్రమాగారములో ఉద్యోగము నెరపినాడు. 189[illegible]లో ఆతడొక క్రైస్తవమతపాఠశాలలో విద్యపూర్తిచేసి, అందే ఒక నౌకరుగాచేరినాడు.

19వ శతాబ్దితుదిదశలో రష్యాయందు ధనికవాదము, కార్మికోద్యమమును విజృంభింపసాగినవి. లెనిన్ మహాశయుడు నిర్మించిన సోషల్ డెమాక్రాటిక్ కార్మికోద్యమము దేశము నాల్గుచెరగుల ఊపులువిస్తరింపసాగినది. ఈఉద్యమప్రభావముచే జార్ ప్రభుత్వనిరంకుశమొకవంక ధనికవర్గము వేరొకవంక శ్రామికులను పీడింపసాగినవి. శ్రామికవర్గములో అనాటికే ప్రభావము వహించుచున్న విప్లవవాదులు మార్క్సిస్టు సిద్ధాంతములను ముఖ్యముగా ప్రచారముగావించుచున్నారు. ఈసంఘటనముచే ఉత్తేజితుడై స్టాలిన్ విప్లవోద్యమములో చేరి రహస్యముగా ప్రచారముచేయ మొదలిడినాడు. మార్క్స్ లెనిన్ ప్రభృతులు రచించిన గ్రంథములను నిశితముగా అధ్యయనమొనర్పగలిగి తనసిద్ధాంతపజ్ఞానమును వికసింపచేసికొన్నాడు. క్రైస్తవమతాధికారులు స్టాలిన్ ప్రవర్తనమును పసికట్టి అతనిని బహిష్కరించినారు. వెంటనే అతడొక వేధశాలయందుద్యోగిగా ప్రవేశించి విరామకాలములో విప్లవకార్యక్రమమును దీక్షతో కొనసాగించుచుండెను. లెనిన్ రచనలను అధ్యయనమొనర్చినఫలితముగా ఆయన మేధాసంపన్నతయెడ్ల శీలముపట్ల దీక్షాపటుత్వముపట్ల అపారమైనభక్తి విశ్వాసములు స్టాలినుకేర్పడినవి.

1900 సంవత్సరములో రష్యాయందు చెలరేగిన ఆర్థికసంక్షోభముకారణముగా కార్మిక కర్షకమాధ్యమికవర్గములలో అసంతృప్తి జనించి అది విప్లవోద్యమముగా పరిణమించినది. ప్రభుత్వము దేశమంతట నిర్బంధవిధానమును అమలుజరిపినది. ప్రభుత్వభటులు స్టాలినును అరెస్టుచేయుటకై వెదకనారంభించినారు. 1901 లో అజ్ఞాతజీవితమారంభించిన అతడు 1917 ఫిబ్రవరివరకు రహస్యజీవితమునే గడపవలసివచ్చినది. అజ్ఞాతవిప్లవజీవితములో తనసహచరులలోను శ్రామికవర్గములోను అప్పుడప్పుడు అంకురించుచుండిన అవకాశవాదధోరణులను మితవాదతత్త్వమును అతడెప్పటికప్పుడు అరికట్టుచుండెడివాడు. 1903లో ప్రభుత్వముచే ఆయన మూడుసంవత్సరముల పాటు సైబీరియాకు ప్రవాసమంపబడినాడు. 1904 లో తప్పించుకొని కాకేసస్ మండలమునకు మరలివచ్చి నూనెగనులు నూనెశుద్ధికర్మాగారములందలి కార్మికులలో తీవ్రప్రచారము చేయసాగినాడు. దేశమందన్ని ప్రాంతములలో విప్లవోద్యమము మిన్నుముట్టుచున్న దినములవి. వివిధశాఖలకు చెందిన సంస్కరణవాదులతోను అవకాశవాదులతోను మెన్షివిక్కులను ముఠాతోను సోషల్ రివల్యూషనరీలను వేరొకవర్గముతోను లెనిన్ స్టాలినుల సిద్ధాంతపోరాటము తీవ్రమైన సమయముకూడ అదియే. బోల్షివిక్కుల నాయకత్వమున శ్రామిక

వర్గమును సమైక్యపరచి మార్క్సిస్టు సిద్ధాంతబలముతో జార్ ప్రభుత్వమును తొలగించి సోషలిస్టువ్యవస్థను స్థాపించుటయే లెనిన్, స్టాలినుల ప్రధాన ఆశయముగనుండెడిది

చిత్రము–116



స్టాలిన్ జోసెఫ్

1905లో లండనులో జరిగిన ప్రథమ బోల్షెవిక్ మహాసభకు స్టాలిన్ హాజరై అచ్చట ప్రవాసమనుభవించుచున్న లెనిన్‌ను మొదటిసారిగా దర్శించినాడు అనంతరమే రష్యాలో ఘటిల్లిన ప్రథమ విప్లవము పరాజయమొందగా బోల్షెవిక్కులకు ప్రత్యర్థులుగా నిలిచిన మెన్షెవిక్కులు అరాచకవాదులైన అనార్కిస్టులు సిండికలిస్టులు పరస్పరము చేతులు కలిపినారు విప్లవపోరాటము తాత్కాలికముగా వెనుకడుగు వేసెను లెనిన్ నాయకత్వమున స్టాలిన్ యొక్క పోరాటముతో నిర్విరామముగా ప్రచారము కొనసాగించుచునేయున్నాడు

1907లో లండనులో జరిగిన రష్యను సోషల్ డెమాక్రాటిక్ కార్మిక మహాసభయందు అల్పసంఖ్యాకులైన మెన్షెవిక్కులపై బోల్షెవిక్కులు జయము లభించినది ప్రథమ ద్వితీయ విప్లవముల మధ్యకాలములో లెనిన్ స్టాలినుల జీవితము రహస్యపరంపరలతో దినదినగండముగా గడచినది ఈ కాలములో స్టాలిన్ పదునారుసార్లు ప్రవాసమునకు పంపబడి, అయిదుసార్లు తప్పించుకొని బయటపడినాడు అతని రహస్యజీవితమంతటిలో కాకేసియా నూనెబావి కార్మికుల మధ్య ఆయన సాగించిన ప్రచారము ఆయన నాయకత్వమున కార్మికులు చేసిన పోరాటములు చరిత్రాత్మక ఘట్టములుగా పేర్కొనబడినవి

1912లో ప్రాగ్‌లో జరిగిన సోషల్ డెమాక్రాటిక్ కార్మికులలో మెన్షెవిక్కులు బహిష్కృతులగుటయు, బోల్షెవిక్ పార్టీ సుఘటితమగుటయు పార్టీ కేంద్రకార్యవర్గములో స్టాలిన్ ఎన్నుకొనబడుటయు సంభవించినది ఈ వార్త వినిన స్టాలిన్ ప్రవాసమునుండి మరల తప్పించుకొని దేశవ్యాప్తముగ మేడే ఉత్సవములను జరుపుటకు సన్నాహములు చేయుటకై ప్రజా మండలములందు చురుకుగా పర్యటించినాడు బోల్షెవిక్ పార్టీ సువ్యవస్థితమై బలపడుటచే (1912) స్థాపకమైన ప్రావ్దా (సత్యము) అను సుప్రసిద్ధ సిద్ధాంత పత్రికకు స్టాలిన్ ప్రథమ సంపాదకుడైనాడు నాటినుండి లెనిన్ స్టాలినుల సాన్నిహిత్యము మరింత బలీయమైనది ఈ సందర్భమున అంతర్జాతీయ ప్రసిద్ధి గాంచిన "మార్క్సిజమ్ – జాతుల సమస్య" అను గ్రంథమును స్టాలిన్ రచించినాడు. 1913 ఫిబ్రవరి నెలలో అతడు మరల అరెస్టు కాబడి ఉత్తర ఆర్కిటిక్ సముద్రమండలమునకు ప్రవాసమంపబడినాడు

1914లో ఆరంభమైన మొదటి ప్రపంచయుద్ధము సామ్రాజ్య విస్తరణకై అంతర్వైరుధ్యములు చెలరేగిన ధనికరాజ్యముల నడుమ జరిగిన అధర్మయుద్ధమని లెనిన్ స్టాలినులు గ్రహించి తీవ్రమైన యుద్ధప్రతికూల ప్రచారమొనర్చుచు యుద్ధములో రష్యా పాల్గొనరాదని ఉద్ఘాటించినారు జాతీయ అంతర్జాతీయ శ్రామికుల ఐక్యతను విధ్వంసము చేయుటకు విరుద్ధముగా ప్రవర్తించి రెండవ ఇంటర్నేషనల్ అను ప్రపంచ కార్మికపక్షముల కూటమినుండి వైదొలగి యుద్ధములో పాల్గొన్న రాజ్యములతో చేతులు కలిపిన కొన్ని సోషలిస్టు పక్షముల వైఖరిని లెనిన్ స్టాలినులు దుయ్యబట్టినారు

జార్ ప్రభుత్వముతో సమాధానపడిన ఉదారవాదులు కెరెన్‌స్కీ నాయకత్వమున రష్యాలో తాత్కాలిక ప్రభుత్వమేర్పరచగా స్టాలిన్ మోలటోవ్ సెర్గోవ్ మున్నగు పెక్కురు బోల్షెవిక్ ప్రముఖులు కారాగారమునుండి ప్రవాసమునుండి ముక్తులైనారు అధర్మయుద్ధములో భాగస్వామియైన కెరెన్‌స్కీ ప్రభుత్వమును తొలగించుటయే తమ తక్షణ కర్తవ్యమని స్టాలిన్ స్పష్టముగ వక్కాణించినాడు దీర్ఘకాల ప్రవాసానంతరము విదేశములనుండి లెనిన్ స్వదేశమునకు 1917 ఏప్రిల్ నెలలో మరలిరాగా ప్రభుత్వాధికారులు ఆయనను వెంటాడుచు పెక్కు చిక్కులు కల్పించుటవలన ఆయన మరల అజ్ఞాతవాసము గావింపవలసివచ్చినది ఈ సందర్భమున ట్రాట్స్కీ అను ప్రముఖ విప్లవనాయకుడు రష్యాలో విప్లవపరిస్థితి లేనందున కేవలము దానిపై ఆధారపడి తక్కిన దేశములలో కూడ అట్టి అనుకూలావకాశము ఏర్పడునంతవరకు ఒక్క రష్యాలో విప్లవము జయప్రదము కాజాలదని వాదింపసాగినాడు కాని విప్లవవిజయానంతరము రష్యాలో సోషలిస్టు వ్యవస్థ బల

పడుటచే ట్రాట్స్కీవాదములో సత్యములేదని రుజువైనది. అట్టి స్థితియందే కెరెన్స్కీ ప్రభుత్వము జనరల్ కార్నిలోవ్ అను సేనాని సహాయముతో జార్ పరిపాలనమును రష్యాలో పునరుద్ధరింప ప్రయత్నించుచుండెను. అట్టి ప్రమాద సమయములో ఇందరు ప్రత్యర్థులతో స్టాలిన్ పోరాడవలసి వచ్చినది.

1917 అక్టోబరు 24 వ తేదీన రష్యను కార్మిక కర్షకులు రెడ్‌గార్డులు ప్రభుత్వపుకొలువులోనున్న విప్లవసైనికవర్గములు ఒక్కుమ్మడిగా ప్రభుత్వసైనికబలములపై మొనపువాడి సల్పి మంత్రులను బంధించి ప్రభుత్వశకటమును ఆక్రమించినారు. పదిదినములు ప్రజ్వరిల్లిన చరిత్రప్రసిద్ధమగు ఈ మహావిప్లవము ప్రపంచమును దద్దరిల్లజేసి పరాధీనదేశములకును ప్రపంచ శ్రామికవర్గమునకును ఆశాజ్యోతిగా కన్పట్టినది. పండిత నెహ్రూవంటి వివిధదేశముల జాతీయనాయకులు ఈ విప్లవముపట్ల విశేషాసక్తిని ప్రకటించి ఉత్తేజితులైనారు.

కెరెన్స్కీ ప్రభుత్వము పతనమై అధికారమంతయు బోల్షివిక్కుల పరమైనది. లెనిన్ ప్రధానిగా స్టాలిన్ ప్రభృతులు సహచరమంత్రులుగా ఏర్పడిన సోవియట్ ప్రభుత్వముపై బృహత్తరమైన దేశపునిర్మాణబాధ్యత పడినది. శూరమయమునసే నూతన ప్రభుత్వ జీవయమునకు తర్వాతిరేకవర్గములకు నడుమ మొదలైన అంతర్యుద్ధమును సోవియట్ ప్రతికూలురకు సహాయపడుటకై రష్యాపై జరిగిన పరరాజ్యములసైనిక దండయాత్రలను బోల్షెవిక్ ప్రభుత్వమునకు తీవ్రప్రతిబంధకములైనవి. వాటిని వీరోచితముగా ప్రతిఘటించి విదేశదండయాత్రలను నిర్మూలించి సోవియట్ ప్రభుత్వము తుదకు విజయము సాధింపగల్గినది.

ఏండ్లు అంతర్యుద్ధములు విదేశదండయాత్రలు కారణముగా దేశములో జరిగిన భీకరక్షామువలన కరువుకాటకములు తారాపథమునంటినవి. జారీయొక్కయు అన్నిరంగములలోను దేశము పురోగమింపవలసియున్నది. వర్గశత్రువులు దేశములో కుట్రలు పన్నుచునేయున్నారు. పరరాజ్యములు నూతన ప్రభుత్వమును కబళించుటకు పొంచియున్నవి. అట్టి సంకటసమయములో లెనిన్ ఆరోగ్యము అస్తవ్యస్తమై పూర్వమువలె శక్తివంతముగ పనిచేయజాలనిదుర్భలస్థితి ఏర్పడినది. అందుచే దేశమునంతటిని నడుపవలసిన ప్రధానబాధ్యత స్టాలినుపై పడినది. అట్టి క్లిష్టదశలో విభిన్నభాషలు విభిన్న సంస్కృతులుగల వేర్వేరు రాష్ట్రీయులను సమైక్యమొనర్చిననే గాని దేశము పటిష్ఠముకాజాలదని లెనిన్ స్టాలినులు గుర్తించినారు. లెనిన్ ఆదేశముపై స్టాలిన్ రచించిన జాతుల సిద్ధాంతము ననుసరించి "సోవియట్ సోషలిస్టు రాజ్యముల సమాఖ్య (U S S R) అను నూతన ప్రజాస్వామిక రాజ్యాంగము ప్రవేశపెట్టబడినది. ఈ సమాఖ్యలో రష్యాయందు వివిధ భాషలు వివిధసంస్కృతులుగల వేరువేరు జాతుల ప్రజలు అన్నదమ్ములవలె సమగ్రమగు అభ్యుదయమును గాంచుచున్నారు. ఈ జాతుల సమస్యాపరిష్కారముతోపాటు నూతన ఆర్థిక విధానముకూడ అమలు జరుపబడినది.

1924 లో లెనిన్ మరణించిన ఎన్నటి కూడ అంతర్గృహశత్రువు వలన సోవియట్ ప్రభుత్వమునకు చిక్కులు కల్గుచునేయున్నవి. అయినను నూతన ఆర్థికపథకము ననుసరించి పంచవర్ష ప్రణాళికల ద్వారా సమష్టివ్యవసాయ క్షేత్రములను నిర్మించుచు పరిశ్రమలను సమాజపరమొనర్చుచు నూతనపరిశ్రమలను నెలకొల్పుచు ఎర్రసైన్యమును బలపరచుచు అత్యంత శీఘ్రగతిలో ప్రపంచమాశ్చర్యమునొందునట్లు అన్ని రంగములలోను రష్యా ముందడుగు వేయగల్గినది. స్వీయరక్షణమునకే కాక పారతంత్ర్యమనుభవించుచుండిన బలహీనదేశముల సహాయమునకుకూడ సోవియట్ ప్రభుత్వము తనదేశమును అన్నివిధముల పటిష్ఠమొనర్చుకొనెను. శ్రమసాధ్యమున ఇన్ని సాహసకార్యములు స్టాలిన్ నిర్వహింపగల్గుట చరిత్రలో అసాధారణవిషయముగా గుర్తింపబడినది. ఇన్ని ఘనకార్యములు సాధించినను స్టాలిన్ నిగర్వియై జీవించి లెనిన్‌యెడల పరమవిశ్వాసమును ప్రదర్శించినాడనుటకు, జర్మను రచయిత ఎమిల్ లడ్విగ్‌తో ఆయన పలికిన పలుకులే తార్కాణము: "నాయంతట నేను మహామేధావియగు లెనిన్ శిష్యుడను మాత్రమే. నేను జీవించువరకు ఆ మహాగురుని శిష్యుడుగ మెలగుటయే నా లక్ష్యముగా ఎంచుకొంటిని."

దేశములో శాంతిస్థాపనజరిగి అభ్యుదయము సాధింపబడుచున్న సమయములో సోవియట్ ప్రభుత్వమును కూలద్రోయుటకు మరల శత్రురాజ్యములు సన్నాహములు చేయుచునే యున్నవి. వాటిలో హిట్లరునాయకత్వమునను్న జర్మనీ రాజ్యమొక్కటే గలదని స్టాలిన్ ఊహింపగల్గినాడు. ప్రపంచశాంతి స్థాపనవిషయమై ఇంగ్లండు ఫ్రాన్సులపై ఆధారపడ సందేహాస్పదముగనున్నదని ఆయన గ్రహించి ప్రప్రథమమున ఆత్మరక్షణకై జర్మనీతో నిర్యుద్ధసంధిని కుదుర్చుకొన్నాడు. తన్మూలము

మున లభించిన విరామమును తన దేశమును సైన్యమును పటిష్ఠ మొనర్చుటకై వినియోగించినాడు

1941 జూన్ నెలలో నిర్యుద్ధసంధిని ఉల్లంఘించి జర్మను సైన్యములు రష్యాపై ఆకస్మికదండయాత్ర జరిపి మాస్కో పొలిమేరలవరకు ఆక్రమింపగల్గి లెనిన్‌గ్రాడ్ నగరమును దిగ్బంధ మొనర్చెను రష్యాకు జీవన్మరణసమస్య ఎదురై తన అస్తిత్వమునకు మహోపద్రవము సంభవించింది స్టాలిన్ మాటామాటికిగా రాజకీయదురంధరులను యుద్ధతంత్రనిపుణులైన సహచరులతో "రక్షణసమితిని" నిర్మించి తాను సర్వసైన్యాధ్యక్షుడై దేశప్రజలను ఎర్రసైన్యమును సేనానులను ఉద్దేశించి "సకలత్యాగములతో సమస్తవనరులతో ప్రాణము లొడ్డి అమూల్యము, ప్రాణప్రదమునైన సోషలిస్టువ్యవస్థను వీరోచితముగా రక్షింపుడని ఉద్బోధించినాడు ఆదేశానుసారముగ ఇరువదికోట్ల ప్రజానీకము సేనానాయకులు ఎర్రసైన్యము ఒక్కటై నిలిచి సకలాయుధసంపత్తితో జర్మను సైన్యముల నెదురొడ్డిపోరాడి పోరాడిపోరాడివారు మాస్కో, లెనిన్‌గ్రాడ్ స్టాలిన్‌గ్రాడ్ రంగములలో నాజీసైన్యములను నిర్మూలించుటయందు రష్యాసైన్యములు ప్రదర్శించిన శౌర్య పరాక్రమత్యాగములు చరిత్రయందు అనుపమానమై సువర్ణాక్షరములలో లిఖింపదగినవని సమకాలీన యుద్ధతంత్రనిపుణులాడిమాటలు యావత్ప్రపంచము సోవియట్ సైన్యముల వీరోచితప్రతిఘటనకెట్లు విస్మయము చెందినది గాంచినవి సాక్షిగా మాస్కో లెనిన్‌గ్రాడ్ స్టాలిన్‌గ్రాడ్ రంగములనుండి పలాయనమైన జర్మనుసైన్యములను బెర్లిన్ చేరువరకు రష్యాసైన్యములు తరుముచు హతమార్చుచునేయున్నవి తుదకు హిట్లరునకు ఆత్మహత్యయు శేసించినజర్మనుసేనానులకు జర్మనుసైన్యములకు ఘోరపరాజయమును తప్పలేదు

సోవియట్ ఆర్థికపునర్వ్యవస్థీకరణమందును, అజేయమైన ఎర్రసైన్యనిర్మాణమునందును జర్మనసైన్యములను ఓడించుటలో ప్రదర్శించిన యుద్ధతంత్రనైపుణ్యమందును అనుపమానప్రజ్ఞాపాటవములను ప్రదర్శించిన స్టాలినుకు వివిధదశలలో సోవియట్ పార్లమెంటు 'ఆర్డర్ ఆఫ్ రెడ్ స్టార్' 'ఆర్డర్ ఆఫ్ సువరోవ్' 'ఆర్డర్ ఆఫ్ లెనిన్' 'హీరో ఆఫ్ సోషలిస్టులేబర్' 'హీరో ఆఫ్ సోవియట్ యూనియన్' అను అత్యున్నత బిరుదములతోపాటు సువర్ణ పతకములెన్నియో బహూకరింపబడినవి

స్టాలిన్ రచించిన పెక్కుగ్రంథములలో "లెనినిజము సమస్యలు" "జాతుల సమస్యలు" అత్యంతప్రముఖమై జాతీయ అంతర్జాతీయ శ్రామికోద్యమమునకు ప్రామాణిక సిద్ధాంత గ్రంథములుగా ఉగ్గడింపబడినవి

జీవితమంతయు అవిశ్రాంతమైన విప్లవకార్యభారమును నిర్వహించుటచే ఉక్కుమనిషి' అనిపించుకొనిన స్టాలిన్ ఆరోగ్యము తుదిదినములలో కొలదిగ సడలనారంభించినను కార్యనిర్వహణమున అప్రమత్తుడై యుండి సహచరులతోకలిసి తన బాధ్యతలను పూర్వమువలె శక్తివంతముగా నిర్వహించుచునేయున్నాడు 1952 వ సంవత్సరమంతోకనాడు ఆకస్మికముగా ఆయన మెదడునందలి రక్తనాళములు చిట్లి ప్రశాంతముగా కన్నుమూసినాడు

సిద్ధాంతవేత్తగా ఆచరణకర్తగా నిర్మాణకుశలుడుగా లెనిన్ అనంతరము స్టాలిన్‌స్థానము అద్వితీయము ఆయనరచనలు మార్క్సిస్టు సిద్ధాంతవికాసమునకును అంతర్జాతీయశ్రామికోద్యమమునకును విశేషముగా దోహదమొనగినవి ఆయన ఉపన్యాసములలో ప్రసంగములలో రచనలలో కనబడుతర్కశుద్ధి భావస్పష్టీకరణము ఆత్మవిమర్శనాశక్తి వాదనాపటిమ అద్భుతమైనవని పలువురు విజ్ఞుల అభిప్రాయము ఆయనతో అనేకసందర్భములలో సంభాషించిన విదేశప్రముఖులు పత్రికావిలేఖరులు ఈఅభిప్రాయమునే ప్రకటించినారు సోషలిస్టుసౌధమును నిర్మించుటలో మార్క్సిసిద్ధాంతములను స్టాలిన్ తన దేశపరిస్థితుల కనుగుణముగా అన్వయించిన తీరు ఆయనఅసాధారణ ఔచిత్యమును సామర్థ్యమును రుజువు చేయగలవని పెక్కురురాజనీతిజ్ఞుల ప్రశంసావాక్యము

స్టాలిన్ మరణానంతరము అధికారమునకువచ్చిన ఆయన సహచరులలో కొందరు "వ్యక్తిఆరాధనతత్త్వము"ను ప్రోత్సహించెనను అభియోగమును మరికొన్ని దోషములను మరణించినస్టాలినుపై మోపి ఆయన వ్యక్తిత్వమును ఘనతను కించపరుప యత్నించినారు వాటికి జవాబియ్యగలవ్యక్తి ఈనాడు లేడుగదా !

ఏదెట్లయినను స్టాలిన్ మరణముతో రష్యాప్రజలు, ప్రపంచశ్రామిక ప్రజానీకము విప్లవయోధుడును చారిత్రకపురుషుడును అగు ఒకమహత్తరవ్యక్తిని కోల్పోయినారనుట నిర్వివాదము.

ప్ర రా సు

ఇట్టి నిరంకుశాధికారము మూలమున అనేక చిక్కులు సంభవించెను. వ్యవహారములలో ఐహికాలౌకికములలో (ఐహికాపారలౌకిక) విభాగము లేదు. మధ్యవర్తులు లేకుండుటచేత పోపులకు రాజులకు మధ్య వివాదములు తప్పనిసరియైనవి. ఒక్కొక్కప్పుడు అంతర్యుద్ధములకు కూడ దారి తీసెను. ఇదే విధముగ భూస్వాములకు రాజులకు మధ్య కూడ వివాదములు సంభవించినవి. రాజకీయ ప్రగతికి నష్టము కలిగింపసాగెను. ఈ పరిస్థితుల మూలమున ప్రజలు నష్టపడుచుండిరి. ఈ విధానము నంతము చేయ తలపెట్టి సమర్థులగు రాజులు క్రమక్రమముగ భూస్వాములను అణచి లౌకిక శాసనాధికారము నంతయు తమ హస్తగతము చేసికొనిరి. కొందరు పోపులపై తిరుగుబాటు చేసి పారలౌకిక వ్యవహారములను కూడ తమ వశము లోనికి తెచ్చుకొనిరి. క్రీ. శ. 1500 తర్వాత యూరపు ఖండమందు గొప్పమత సంగ్రామము చెలరేగి క్రైస్తవులు రెండు శాఖలుగ విడిపోయిరి. ప్రొటెస్టెంటు శాఖవారు పోపుల అధికారమును తిరస్కరించిరి. కొన్ని దేశములందు రాజులే మతమునకు కూడ అధిపతులుగ అంగీకరింపబడిరి. అదే కాలమున రాజులు భగవదంశసంభూతులన్న సిద్ధాంతము ప్రాబల్యము గాంచెను. మధ్యయుగమున పోపులు మాత్రమే భగవంతుని ప్రతినిధులుగ అంగీకరింపబడుచుండిరి. ఇప్పుడు రాజులు కూడ నట్టి ప్రాతినిధ్యము వహించినవారైరి. ఈ కారణముల చేత ఫలితముగ రాజుల అధికారమునకు అడ్డుగానుండిన హద్దులన్నియు తొలగి వారు నిరంకుశులగుట సంభవించెను.

నిరంకుశాధికారమే ఉత్తమపరిపాలనమునకు మూలమను నూతనస్వామ్య సిద్ధాంతమును శాస్త్రవేత్తలు ప్రతిపాదింపసాగిరి. నిరంకుశాధికారవిధానములో ఎవరి అధికారమునకులోబడుటకు పోపుల అధికారమునకా, రాజుల అధికారమునకా, భూస్వాముల అధికారమునకా అనునది, తెల్పుకొనలేక ప్రజలు చిక్కులు పొందుటయు అంతర్యుద్ధములు సంభవించుటయు వీరు గర్హించిరి. రాజ్యమునకంతకు ఒకడే శాసనకర్త ఉండుటను అతని శాసనాధికారము ఎట్టి హద్దులకు లోబడక ఉండుటను వీరు సమర్థించిరి. వీరిలో ఫ్రెంచి శాస్త్రవేత్త బోడిన్ (1576 లో ఇతని ఉద్గ్రంథము "రిపబ్లిక్" అనునది ప్రచురింపబడెను) ఆంగ్లేయశాస్త్రవేత్త హాబ్సు (1651 లో ఇతని ఉద్గ్రంథము "లెవియాథన్" అనునది ప్రచురింపబడెను) ప్రముఖులు. స్వామ్యమను హద్దులేని అధికారమని, అవిభక్తశాసనాధికారమని దీనికి రాజకేంద్రమని పేరు ప్రతిపాదించిరి. అద్వితీయ యుగములో ప్రాబల్యము గాంచిన స్వామ్యసిద్ధాంతమిదియే.

17, 18 శతాబ్దములలో మొదట ఇంగ్లండులోను తర్వాత అమెరికా ఫ్రాన్సులలోను మహాత్తరములగు రాజకీయ విప్లవములు సంభవించెను. వీటి ఫలితముగ రాజుల అధికారము అంతరించి ప్రజల యొక్కయు ప్రజలు ఎన్నుకొనిన పార్లమెంటుల యొక్కయు అధికారము స్థాపింపబడెను. స్వామ్యమునకు కేంద్రము-లేక మూలము-జనులయు లేదా ప్రజలు ఎన్నుకొనిన పార్లమెంటులనియు అనేకులు ప్రతిపాదించిరి.

రాజ్యాధికారము వహించువారెవరైనను రాజులైనను ప్రజలైనను పార్లమెంటులైనను - వారి శాసనాధికారము సంపూర్ణముగను హద్దులేనట్టిదిగను ఉండవలెనని వేరొకదిక్కునుండి కొందరు ప్రతిపాదించిరి.

వారిలో ఆంగ్లేయ న్యాయశాస్త్రవేత్త జాన్ ఆస్టిన్ అగ్రగణ్యుడు. "ప్రతిసమాజములో అన్యాయములు అక్రమములు ఎన్నియో ఉన్నవి. పాతకాలపు చట్టములు ఆచారములు అమలులో నుండుటయేదీనికి కారణము. అట్టి చట్టములను రద్దుచేసి కాలానుసారములగు నూతన శాసనములను నిర్మాణము గావించి సమాజమును ఆత్మీకముగను హాయిగను సంస్కరించుటకు ప్రభుత్వమునకు సంపూర్ణాధికారముండవలెను. ఆచారములచే టను మూఢ మౌలిక హక్కులచే కేటను ప్రభుత్వాధికారమును సంకుచితపరచుట అభివృద్ధి నిరోధకమగును" అని ఆస్టిన్ భావించి హద్దులేని రాజ్యాధికారసిద్ధాంతమును మరింత బలపరచెను.

19, 20 వ శతాబ్దములలో అభివృద్ధిని సాధించిన దేశము లన్నిటిలో ఈ సిద్ధాంతానుసారముగ పరిపాలన సాగెను. ఇప్పటికిని అట్లే సాగుచున్నది. ప్రభుత్వాధికారమును వహించినవారు లెక్కలేని ప్రాచీనకాలపు శాసనములను, ఆచారములను రద్దుచేసి లెక్కలేని క్రొత్తశాసనములను చేసిరి. అభివృద్ధి మార్గములో నడచుటకు ప్రారంభించిన భారతదేశమువంటి దేశములలో కూడ ఇదియే విధానము అనుసరింపబడుచున్నది. కమ్యూనిస్టు విధానమును అనుసరించిన దేశములలో ఈ విధానము ఉచ్చస్థితిలోనున్నది. ఆ దేశములలో రాజ్యాధికారమునకు ఎట్టి హద్దులు లేవు.

రాజ్యమునకు ఇంతటి సర్వస్వామ్యము ఉండతగునా అని సందేహించు శాస్త్రవేత్తలు లేకపోలేదు. బహుస్వామ్యవాదులు, మానవ

లకు కొన్ని మౌలికహక్కులు కలవనియు వాటికి భంగకర ముగ ఎట్టిశాసనమును చేయకూడద యు శాసనాధికారము వాటికి లోబడి ట్టిదిగ నుండవలెననియు వీరివాదము నిరంకు శముగు శాసనాధికారము దుర్వినియోగము కాగలదనియు అందుచేత అధికారమునకు సర్వకాలములలో కొన్నిహద్దు లుండవలెనియు వీరి సిద్ధాంతము భారతరాజ్యాంగమువంటి రాజ్యాంగములలో మౌలికహక్కులను కొన్నిటిని చేర్చుటకు ఇదియే కారణము

మొత్తముమీద ఇప్పటిపరిపాలనవిధానములు స్వామ్యము దృష్ట్యా రెండురకములుగ నున్నవని చెప్పవచ్చును ఒకరక ములో స్వామ్యము సంపూర్ణము నిరంకుశము దానికి హద్దు లనునవి లేవు సోవియట్ రష్యా కమ్యూనిస్టుచైనా ఇతర ములగు కమ్యూనిస్టు రాజ్యములు దీనికి ఉదాహరణములు రెండవరకములోనివి స్వామ్యమునకు కొన్నిహద్దులుండవలెనని అంగీకరింప బడినట్టివి భారతదేశము ప్రజాస్వామికము గల అనేక దేశములు దీనికి ఉదాహరణములు వీటిలో కూడ ప్రభుత్వాధికారము బహువిశాలముగనున్నది కాని మానవ జీవితమంతయు శాసనబద్ధముగనుండుటలేదు మతము కళలు సత్యాసత్యములకుసంబంధించిన చర్చలు మొదలగు వాటితో పరిపాలకులు ఎక్కువసంబంధముకల్పించుకొనుటలేదు స్వామ్య మునకు ఉండవలసిన హద్దులు ఇవి మిక్కుటములని నిర్ణయించుట సాధ్యముకాకపోయినను ఏదియో కొన్నిహద్దులుండవలెనను విషయముతో ఈవర్గమునకు చెందిన దేశములలో చాలవరకు ఏకాభిప్రాయమున్నది

మా వెం

## స్పెయినుదేశము (భూ)

స్పెయిను దేశము ఐరోపాఖండములో నైరృతిదిక్కున నున్నది ఐబీరియాద్వీపకల్పములో ఇది దాదాపు 5/6 వంతు వైశాల్యమునాక్రమించి ఐరోపాఖండమునకు చతురస్రాకార ముగు ఉపాంగముగనున్నది పోర్చుగల్ రాజ్యము స్పెయినుకు పశ్చిమమునను పైరెన్నీసుపర్వతములు ఈశాన్యమునను లవు ఈదేశము ఉత్తరమునుండి దక్షిణమునకు 500 మైళ్లును తూర్పునుండి పశ్చిమమునకు 640 మైళ్లును విస్తరించియున్నది దీని విస్తీర్ణము 1,94,188 చ మైళ్లు 18 లక్షల జనాభాగల మాడ్రిడ్ నగరము ఈ దేశమునకు రాజధాని.

ఈద్వీపకల్పములో అట్లాంటిక్ మధ్యధరా సముద్రము ల మధ్యగాని మధ్యధరాసముద్రమునకును వాయవ్య ఐరోపా కను మధ్యగాని సహజమగు వ్యాపారమార్గములులేవు ఐరో పాతోకంటె విశేషించి ఆఫ్రికాతోగల భౌతికసంబంధమువలన, తురుష్కుల దండయాత్రవలన ఇస్లాముమతముతో 800 సంవ త్సరములుగా జరగిన దీర్ఘపోరాటమువలన ఈదేశము ఘోర మైన విపరిణామములకు గురియయ్యెను

ఈద్వీపకల్పములో విశేషభాగము సగటున 2500 అడు గుల ఎత్తుగల పర్వతములచే ఆక్రమింపబడినది ఈపర్వతముల ఎత్తు పశ్చిమమునకు పోనుపోను క్రమముగా తగ్గుచుండును

ఐబీరియాశీతోష్ణస్థితి ఈద్వీపకల్పము మూడుప్రధాన శీతోష్ణమండలములుగా విభజింపబడినది

(౧) బిస్కే అఖాతమునకు సరసనున్న ఉత్తరపర్వత ములు తీరమైదానము ఈప్రాంతము వాయవ్య ఐరోపా శీతోష్ణస్థితినిపోలియున్నది

(౨) పోర్చుగీసునిమ్నభూములు మధ్యధరా తీర ప్రాంతము ఇందలిశీతోష్ణస్థితి మధ్యధరాసముద్రపులక్షణములు కలది

(౩) శేషించిన ద్వీపకల్పాంతర్గతవిభాగము: ఇచ్చటి శీతోష్ణస్థితికి మహాఖండలక్షణములు సంక్రమించినవి

స్పెయిను సహజ విభాగములు నైసర్గిక శీతోష్ణస్థితు లనుబట్టి ఈ దేశమును 5 సహజమండలములుగ విభజింపవచ్చును (1) ఉత్తరపర్వతప్రాంతము (2) పీఠభూమి (3) అండలూ షియా మైదానములు (4) అరగాన్ మైదానములు (5) మధ్యధరాపరిసరమండలము

ఉత్తరపర్వతప్రాంతము: ఈప్రాంతము మరలమూడు విభాగములు చేయబడినది

(౧) వాయవ్యమందలి గెలీషియా ఉన్నతభూమి

(౨) కాంటబ్రియన్ పర్వతములు

(౩) పైరెన్నీస్ పర్వతములు

గెలీషియా-ఇది ప్రాచీన శిలామయ మండలము; సముద్రతీర మునకు సమాంతరముగనున్నది ప్రయోజనకరమైన ఓడ రేవులు తక్కువగానున్నవి లోయలు తరచుగా సముద్రజల మువలన మునుగుచుండును అట్లాంటిక్ తీరమును పోలి యున్న ఈప్రాంతము మత్స్యపరిశ్రమకు ప్రాముఖ్యము వహించినది.

చిత్రము - 118




కాంటబ్రియన్ పర్వతమండలము: ఇది గెలీషియానుండి ఫ్రెంచి సరిహద్దువరకు విస్తరించినది. 6000 అడుగుల ఎత్తు కలిగియుండు ఈపర్వతములను దాటుట దుర్లభము. అందుచే ఉత్తరమును దక్షిణమున లోతట్టుప్రాంతముతో కలుపు రెండు రైలు మార్గములు (1)గిజాన్ నుండియు (2)శాంటాండర్ నుండియు నిర్మింపబడినవి. తీరమైదానము పశుపోషణమునకు ఆపిల్ తోటలకు ఓట్లు బార్లీ గోధుమపంటలకు ప్రసిద్ధమైనది. ఇందు బొగ్గు మాంగనీసు ఇనుము కోబాల్టు తుత్తునాగము మున్నగు ఖనిజములు లభించును. తూర్పున కాంటబ్రియన్ పర్వతముల సమీపమున "బాస్క్" రాష్ట్రములున్నవి. మాడ్రిడ్ నగరము నుండి ఫ్రాన్సు దేశమునకుపోవు ప్రధాన రహదారిమార్గము ఈప్రాంతమున నిర్మింపబడినది.

పిరెన్నీస్ పర్వతములు: వీటి ఎత్తు 11000 అడుగులు. అట్లాంటిక్ మహాసముద్రము నుండి మధ్యధరాసముద్రమువరకు విస్తరించినవి. ఈపర్వతములను దాటుట కడుదుర్లభము. స్పెయిను, ఫ్రాన్సుదేశములను కలుపు రైలుమార్గమొకటి ఈపర్వతముల మీదుగా నిర్మింపబడినది. తూర్పున వడిగా ప్రవహించు జలములనుండి ఉత్పత్తియగు విద్యుత్తు దేశపరిశ్రమలకెంతయు ప్రయోజనకారిగానున్నది.

స్పెయిను పీఠభూమి: స్పెయిను కేంద్రమండలము ప్రాచీన శిలామయమగు మెసెటా అను నొక పీఠభూమి. ఈ పీఠభూమి స్పెయినుకు నడిగడ్డగా పరిగణింపబడుచున్నది. తూర్పున దీని ఎత్తు 7000 అడుగులు. ఇచట డౌరో టాగస్ గ్వాడియానా అనునదులు జనించి పీఠభూమి మీదుగా పోర్చుగల్

నిమ్న ప్రాంతములలోనికి ప్రవహించును. వడిగా ప్రవహించు ఈ నదీజలములు ఓడల ద్వారా సరకుల రవాణాకు ప్రతిబంధకము కల్గించుచున్నవి. నదీపరీవాహక ప్రదేశమందు కొన్ని ముఖ్యనగరములు, రవాణాదారుల కూడలి కేంద్రములున్నవి.

ఈపీఠభూమియందు ఉష్ణ శీతలములు రెండును అత్యుగ్రముగనుండును. వర్షపాతము స్వల్పము. ఇందు విశేషభాగము పచ్చిక మైదానములచే ఆక్రమింపబడియున్నది. ఇందు పండు గోధుమ బార్లీ ప్రజలకు ముఖ్య జీవనాధారము. గొర్రెల పెంపకము ప్రజల ప్రధానవృత్తి. గొర్రెలకై ఈ దేశము ప్రసిద్ధి. కాని ఆస్ట్రేలియా అర్జెంటినా దేశముల పోటీ నిలువలేక ఈ దేశపు ఉన్ని వ్యాపారమునకు నష్టము కలుగుచుండును. అత్యంత భాగ్యవంతమైన ఖనిజసంపద ఇందు కలదు. బొగ్గు సీసము పాదరసము రాగి తగరము ఇచ్చటి ప్రధాన ఖనిజములు. ప్రపంచమంతట ఉత్పత్తియగు పాదరసములో 40 శాతమును తుంగ్స్టనులో 6 శాతమును స్పెయినులో ఉత్పత్తియగుచున్నవి. మాడ్రిడ్ నగరమునకును తీరప్రాంతపు నగరములకును నడుమ రైలుమార్గములు నిర్మింపబడినవి. "డూరో" దీలోయ యందున్న వల్లడోలిడ్ నగరము ఒక గొప్ప విపణి కేంద్రము.

ఆండలూసియా మైదానములు: ఇవి సైరానెవాడాకును సైరామొరీనాకును నడుమనున్నవి. సారవంతమగు ఈ మైదానములలో నారింజ ఆలివ్, ద్రాక్షతోటలు విరివిగాగలవు. ఇచటి విశాలమైనమైదానములలో పెరుగు పచ్చిక ముఖ్యముగా పందెపు ఆబోతుల ఆహారమునకుపయోగపడుచున్నది. సెవిల్లీ కార్డోవా ఈ మైదానమందలి అత్యంత ప్రముఖ పట్టణములు. ఇవి పూర్వము స్పెయినుపై దండెత్తిన 'మూరు' లనుదాడి మూకలకు రక్షణదుర్గములుగ వ్యవహరించినవి. ఈ నగరములలో సుందరమైన ప్రాచీన మూరుజాతీయశిల్పసంపద ఇప్పటికిని భద్రపరుపబడియున్నది.

ఆరగాన్ మైదానములు: ఇవి ఎరినీస్ పర్వతములకును "మెసేటా" పీఠభూమికిని మధ్యనున్నవి. ఇచ్చట పడు వర్షజలము ఎబ్రోనదిలో చేరును. జలభరితమైన వాయుప్రసారమును నలువైపులనున్న పర్వతములు అడ్డగించుటచే ఇచట వర్షపాతము స్వల్పముగనుండును. సారగోసా అను పెద్దనగరము ఈ నదీపరీవాహక ప్రాంతమునగలదు. ఫ్రాన్సునుండి మాడ్రిడ్ నకును, బిల్బావునుండి బార్సిలోనాకును పోవు రహదారులకిది గొప్ప కూడలిగానున్నది.

మధ్యధరాసరిహద్దు మైదానము: ఈ మండలమందు గ్రానడా మూర్షియా అను పీఠభూములను జిబ్రాల్టరు ఈబో డి ముఖద్వారమునందునుండు పెక్కు చిన్న తీరమైదానములను, కేటలోనియా రాష్ట్రమును చెందియున్నవి.

తీరమైదానములు: సారవంతములైన ఈ మైదానములు మధ్యధరాసముద్రతీరమున నున్నవి. ఇచ్చట భారీయెత్తున నీటిపారుదల జరుపబడుచున్నది. ఇది స్పెయినులోకెల్ల జనసమ్మర్దముగల ప్రాంతము. వేసవి అత్యుష్ణముగను శీతాకాలము సౌమ్యముగను ఉండుటచే ఈ మైదానములందు వరి చెరకు ప్రత్తి అరటి ఖర్జూరము అత్తి ద్రాక్ష నారింజ నిమ్మ బాదమ్ము మున్నగు పంటలు పండును. వాలెన్షియా సీమబాదము కాయలకును ఎండుద్రాక్షఫలములకును ప్రసిద్ధమైన ప్రాంతము. ఈ మైదానములనుండి అత్యధికముగా నారింజ ఫలములు విదేశములకెగుమతియగుచున్నవి.

కాటలోనియా: ఇది స్పెయినుదేశమందలి ప్రధానపారిశ్రామికమండలము. ఇచ్చటి వస్త్రములలో ప్రత్తి ఉన్ని పట్టు ఇంజనీరింగు కాగితము చర్మము విరచాపరిశ్రమలు ముఖ్యములు. ఇచటి బార్సిలోనానగరము మాడ్రిడ్ తరువాత పెద్దది. ఇది ప్రధాన నౌకాశ్రయము.

ధ. ప్ర.

## హంగరీ (భూ)

హంగరీ ఐరోపాఖండమందలి ఒకచిన్న స్వతంత్ర ప్రజాస్వామిక సోషలిస్టు రాజ్యము. హంగరీ దేశము ఆల్ప్సు పర్వతశ్రేణికి సంబంధించు కొండలచే చుట్టబడియున్నది. రుమేనియా యుగోస్లేవియా ఆస్ట్రియా చెకొస్లోవేకియా దేశములు దాని ఎల్లలందున్నవి. ఈ దేశపు విస్తీర్ణము 35 000 చ. మైళ్ళు. అందలి జనసంఖ్య 66 లక్షలు. వీరిలో 90 శాతము మగ్యారులను జాతివారు. నిమ్నముగానుండు ఈ దేశము పెక్కుతావులలో- ముఖ్యముగా నదీపరిసరములందు - సారవంతమగు బంకమట్టి పేటపేసియుండును. ఇచ్చటచ్చట సరస్సులేర్పడియున్నవి. కాకొని అను 3800 అడుగుల ఎత్తుగల సుగిర్యము అరణ్య ప్రాంతమొక్కటే ఈదేశమందలి పీఠభూమి. ఇది డాన్యూబ్ నదికి నైరృతిదిశయందున్నది. ఈఅటవీమండలము మైన పేర్కొనిన పల్లపుమైదానము (1) అల్పప్రమాణనిమ్న

పెంచబడుచున్నవి. ఈ విశాలమైన భాగములో వృక్షములు పెరుగవు. ఆత్యుష్ణమును అనావృష్టిని సహించి అల్పప్రమాణములో పాలనిచ్చు హంగేరీజాతి ఆవులే ఇచ్చట జీవించును. వీటిలో గుఱ్ఱములు గొఱ్ఱెలు కూడ చేరియున్నవి.

ఒకవంక ఆరామ నగరములని వర్ణింపబడు పెద్దపెద్ద గ్రామములలో రమ్యహర్మ్యముల దుర్గములు కేంద్రీభూతమై జీవించుచుండగా మరియొకవంక నగరములనడుమ అచ్చటచ్చట చిన్నపొలములలో నిర్మితములైన గృహములలో కొందరు ప్రజలు చెదురుగ నివసించుచున్నారు. ఈ దృశ్యము చూచుటకు విచిత్రముగను మనోహరముగను ఉండును.

హంగేరీదేశము వ్యవసాయప్రాధాన్యముగలది. అందనేక గ్రామములున్నవి. కొన్ని గ్రామములు ఒకదానికొకటి సమీపముగనే గుంపుగా నిర్మింపబడి వాటి మొత్తము జనసంఖ్య లక్షన్నరకు మించియుండును. లక్షజనాభాగల గొప్ప జనపదములు కూడ కొన్నికలవు. ప్రజలలో సగమునకు పైగా కర్షకులు. ఈ గ్రామముల రహదారులందు వర్షపాతముచే గంటలేర్పడి రాకపోకలకు మిగుల అసౌకర్యము కల్గించుచుండును.

1930 సం॥ నకు ఎమ్మటు ముఖ్యముగా వ్యవసాయోత్పత్తులాధారముగాగల పరిశ్రమలను నిర్మించుటకై యత్నములు చేయబడెను. ఉదా॥ పంచదారశుద్ధికర్మాగారములు, బట్టీద్వారా ప్రక్రియజరుగు కర్మాగారములు (distilleries) పానీయములు తయారగు కర్మాగారములు ఇండివిచలు.

10 లక్షల జనాభాగల బుడాపెస్టునగరము ఈ దేశమునకు రాజధాని. ఈ నగరము డాన్యూబ్ నదీతీరమందున్నది. ఐరోపాఖండములో నెల్ల ఇది పిండిమరలకు మిగుల ప్రసిద్ధిచెందినది. బుడాపెస్టునగరము రెండు భాగములుగ విభజింపబడెను. బుడ అను భాగములో ప్రాచీనరక్షణదుర్గములును ప్రభుత్వభవనములును కలవు. అది కుడితీరమున ఎత్తయినభూమిపై నున్నది. 'పెస్టు' అనుభాగము యొక్క పారిశ్రామిక - వాణిజ్య కేంద్రము. అది నదియొక్క ఎడమతీరముననున్నది. వియన్నా, ప్రాగ్, బెల్గ్రేడ్, ట్రీస్టే మున్నగు నగరములకు ఇచ్చటనుండి రైలు మార్గములు కలవు.

1918 - 1938 సంవత్సరములమధ్య ఇచట అన్యదేశములకు ఎగుమతిచేయదగిన వ్యవసాయోత్పత్తులు సమృద్ధిగా పండెను. కాని ఆతరుణములో పొరుగుదేశములు (ముఖ్యముగా జర్మనీ) వ్యవసాయోత్పత్తుల విషయమందును ధనసంగ్రహమందును స్వయంసమృద్ధిని సాధించుటకు యత్నించుటచే హంగరీదేశమునకు ఎగుమతుల విషయములో చిక్కులేర్పడెను. అయినను హంగరీ కొంతవరకా చిక్కులను అధిగమించి ముఖ్యముగా గోధుమలను పండ్లను నాణ్యమైన చవుకపారు ద్రాక్షసారమును గ్రుడ్లను కోళ్ళను వేయించుకొనుటకు ఇంగ్లండునకెగుమతిచేయగల్గెను.

బాక్సైటు, బొగ్గు, లిగ్నైటు, పెట్రోలియము, ఇనుము మున్నగు ఖనిజములకుకూడ హంగరీదేశము ప్రసిద్ధమైనది.

ధ. ప్ర.

## హ(అ)నుమకొండ

కాకతీయచరిత్రలో రుద్రదేవునివరకు గల ఆకంకపురాజులకు రాజధానీనగరమై అనుమకొండ ఖ్యాతిగాంచెను. వీరికి పూర్వముగూడ ఈ నగరము మాండలికపాలిత తత్పరిసర ప్రాంతమునకు కేంద్రమైయుండినట్లును ఆప్రాంతము ఈ నగరపేరుతోనే యనమకొండ విషయమని వ్యవహరింపబడుచుండినట్లును శాసనములవలన తెలియుచున్నది. సుమారు క్రీ. శ. 872 వ సంవత్సరమునాటి రాష్ట్రకూటరాజైన అమోఘవర్షుని బాజీపేట శాసనమందీ నగరము మొదటగా పేర్కొనబడినది. అప్పటి దీనియొక్క జైనస్థావరము ప్రాధాన్యము తెలియు ఇచ్చట కానరాదు. ఆక రెండవదశలో ఇది అనుమడు కొండడు అననిద్దరు నాయకులను యుద్ధములో చంపి కాకతీయుల ప్రసిద్ధుడైన మొదటి బేతరాజు వారినగరమునే తాను అనుమకొండ యను పేరుతో రాజధానిని గావించుకొనినట్లు 18వ శతాబ్దినాటి రెండు శాసనమందును సిద్ధేశ్వర చరిత్రాదిగ్రంథములందును జనవాక్యముగనుకూడ ప్రసిద్ధమైయున్నది. కాని పైన పేర్కొనిన అమోఘవర్షుని శాసనమునాటికే దీనికి "అన్మకుండ" యను పేరుండగా 11వ శతాబ్దివాడగు బేతరాజుచేనోటుపడిన అనుమడు కొండడులతో దానికా పేరు వచ్చెనుట కల్పితకథయని తేలును. ఇక ముందు, అనుమకొండయను పేరెట్లువచ్చెనో నిశ్చయముగా తెలియదు.

రాష్ట్రకూటరాజుల పాలనములో ఇతరజైన స్థావరములలోవలె అనుమకొండలోగూడ ఒక 'వసది' యుండెడిది. దానికి 'కడకాలయబసది' యను పేరు. రెండవప్రోలుని క్రీ. శ. 1117 వ సం॥ నాటి ▼ శాసనమున కానవచ్చుచున్నది. ప్రోలుని మంత్రియగు బేతన భార్య మైలమ దానిని నిర్మించి

నట్లును, దానికి ప్రోలుడు జైనరాజా దానము చేసినట్లును కలదు. ఊరివెలుపల కొండపైన పెద్దబండలనడుమ గుహవంటి భాగమును గర్భాలయముగ చేసికొని దానిపైన శిఖరము ముందు మూయబడిన మండపముల నిర్మాణమే ఈయాలయ స్వరూపము. అగ్నికలోనున్న గోడవంటి నిలువుకొండరాతిపై నిలుచున్నట్టియు కూర్చున్నట్టియు పార్శ్వనాథుని విగ్రహములు, మరియితర జైనవిగ్రహములు చెక్కబడియున్నవి. ప్రక్కనే చాళుక్యులనాటి అస్పష్టశాసనమొకటి కలదు. గుడిలోపల 24 గురు తీర్థంకరుల విగ్రహములు కల శిల్పము కాయోత్సర్గభంగిమలోనున్న తీర్థంకర శిల్పము పరివారయక్షిణితోకూడ గలవు. ఇందొక యక్షిణియే నేటి పద్మాక్షిగా చెప్పబడుచున్నదని భావింపబడుచున్నది. జైనసన్యాసులు నివసించుటకు తగిన ప్రకృతిసిద్ధమైన శిలాంతరస్థానము శిఖాండలపైగలవు. రాష్ట్రకూటప్రభువులేకాక మొదటి కాకతీయరాజులు కూడ ఈ జైనవసతిని బాగుగా పోషించుచుండిరి. పైన చెప్పిన రెండవప్రోలుని యొక్క అచటి విపులశాసనమే అందులకు నిదర్శనము. ఇక్కడి జైనావశేషములింకను పరిశోధింపబడవలసిన యావశ్యకతగలదు. రాజకీయముగా కాక జైనమత స్థానముగ అనుమకొండ ప్రాచీనకాలమున ప్రాముఖ్యము వహించెను.

రుద్రదేవుని నాటినుండియు కాకతీయులు పూర్తిగా జైనమతమును విడిచిపెట్టుట జరిగెను. మొదటిప్రోలరాజు అతని పుత్రులు రెండవబేతరాజు కాలాముఖ శైవాచార్యుడగు రామేశ్వరపండితుని ఉపదేశము పొందినయనట్లు తెలియును. అనుమకొండ ప్రక్కనే దామెర్చెర్ల రెండవప్రోలుడుకూడ శైవము స్వీకరించి తనసంతతికూడ శైవనామములగు రుద్ర, మహాదేవాదిపేర్లు పెట్టుకొన్నాడు. ఈ శైవాభిమానులు రుద్రుని కాలములో వేయి స్తంభములగుడిని యాపాదించిరి. జైనస్థానమైన పద్మాక్షిగుట్టప్రక్కనే శైవస్థానమైన సిద్ధేశ్వరు గుడి యున్నది. ఈ రాజ్యములోని ఇతర జైన స్థానములకు కూడ ఇట్లే వీరశైవముతో స్పర్ధలేర్పడినవి. జైనరామవల్లిలో కూడ జైనాలయము పాడుపడి రుద్రుని కాలములో దగ్గరనున్న తెక్కట్లగట్టుమీది సిద్ధేశ్వరునకు ప్రాముఖ్యమేర్పడినది. ఇట్లే పనుమాను ముమ్మగు తావులయందుకూడ జరిగినది. కనుక రాజకీయముగనే కాక మతవిషయములోకూడ రుద్రుని కాలము భారతదేశమందు నూతన విప్లవాత్మక పరిణామము లను కొనినది. జైనమతము పూర్తిగా నశించినది. దాని సంపర్కమే కూడదనినట్లు రుద్రదేవుడు అనుమకొండనే విడిచి, తన కేంద్రమును ఓరుగల్లుకు మార్చుకొన్నాడు. రాజకీయముగ కూడ నూతన విశాలరాజ్యమునకు ను చిరకాలపు చెన్నట్లు గల క్రొత్తకోటను నిర్మించుట అవశ్యకమైన మార్పయు నిజమే. దీనితో అనుమకొండ ప్రాముఖ్యము నశించినది.

వేయి స్తంభములగుడి: ఇది రుద్రదేవుడు తనపేర ప్రతిష్ఠ చేసికొన్న రుద్రేశ్వరాలయమైనను త్రికూట సంప్రదాయము ననుసరించి విష్ణువు సూర్యుడుకూడ ముఖ్యదేవతలుగా ఇందు స్థాపింపబడినట్లు ఇచటి శాసనము చెప్పుచున్నది. పేరునుబట్టి చూచినచో ఈగుడియందు వేయి స్తంభములున్నవని యర్థమగును. కాని అట్టి స్తంభములెప్పుడుండుటగాని పూర్వముండి శిథిలమైపోయినట్లు చిహ్నములుగాని కానరావు. కాగా అనేక పూర్ణస్తంభములతోపాటు అలంకరణార్థము నిర్మింపబడిన అర్ధస్తంభములు అంతకంటె చిన్నవికూడ లెక్కలోనున్నట్లు భావింపవలెను. దీని నిర్మాణము మతపరివర్తన కాలములో జరిగెను కావున కొన్ని జైనవాస్తుసంప్రదాయములు అందు దాగియున్నవి. అట్లుకాదేని దీనిని నిర్మించియుండవచ్చును. ఈయాలయముయొక్క ప్రవేశమండపము జైనచతురప్రాకారమండి గమునుపోలి నలువైపుల ద్వారములను కల్గియున్నది. ప్రతి

చిత్రము - 120



పటము - 1

హనుమకొండలోని వేయి స్తంభాల గుడి యందలి నంది విగ్రహము

దప్పుగోగల కాలివలంటి పార్శ్వకుడ్యములు నిర్మింపబడినవి ద్వారబంధముకూడ అందమైన నగిషీపనితో మనోహరముగ నుండును ప్రక్క ద్వారమున మరియొక ముఖమండపముగలదు పరిమాణమున ఇది చిన్నదైనను గోడలపైన ద్వారముపైన శిల్పవిగ్రహములు అందముగ చెక్కబడినవి ఇచ్చటి గర్భాలయమున విష్ణువిగ్రహమున్నది మరియొక పార్శ్వాలయము కూడ ఇట్లే చక్కని నగిషీతో నిర్మింపబడినది ఇట్టి ప్రవేశముతో గూడిన అంతర నిర్మాణముగల ఈయాలయపు గోపురమెట్లుండియుండెనో ఊహింపజాలము కాని అంతటికి పైదగ్గఱముతో ఆనాడు ప్రకాశించిన ఆస్థలమందిప్పుడు చిన్న చిన్న దిబ్బలుమాత్రము కాన్పించును

ఈయాలయము ఇత్తగి మున్నగుచోట్లనున్న చాళుక్యాలయములను దృష్టియందుంచుకొని ప్రారంభింపబడిన నిర్మాణమా యనిపించును తర్వాత నిర్మింపబడిన పాలంపేట పిల్లలమఱ్ఱి హానుమకొండ మున్నగు ఉన్నతశ్రేణికిచెందిన కాకతీయాలయములకిది మార్గదర్శకమైనది కాకతీయ శిల్పచరిత్రలో ఇది ప్రథమాధ్యాయమనదగును

పు వ

## హరప్పా సంస్కృతి :

సింధు నాగరికత ప్రపంచమందలి అన్నినాగరికతలయందును అతిప్రాచీనమైనది ఈనాగరికత క్రీ శ 1920వ సం॥ లో ప్రప్రథమముగా 'హరప్పా' "మొహెంజదారో" అను రెండుప్రదేశములయందు బయల్పడెను ఇవి రెండును భారతదేశమునకు వాయవ్యమున్న సింధునదీప్రాంతమునందుండుటవలన ఈనాగరికతకు సింధునాగరికత' అనుపేరు వచ్చినది "హరప్పా"యనుచోట ఈనాగరికతయొక్క అవశేషము లెక్కువగ యుండుటవలనను మొట్టమొదట ఈ ప్రదేశమునందు ఆనాగరికత యుండెనని కనుగొనుటవలనను, దీనికి "హరప్పాసంస్కృతి" అను పేరుకల్గెను

హరప్పా మొహెంజదారో త్రవ్వకముల మూలముగా సర్ జాన్ మార్షల్ అతని అనుచరులు పురాతత్త్వశోధనమునందు 2000 సంవత్సరములనాటి పూర్వచరిత్రకు పునాదులు వేసిరి

క్రీ పూ 4 8 వేల సంవత్సరములకుపూర్వము ఇరానియన్ పీఠభూమికి చెందిన యూఫ్రటిస్ - టైగ్రిస్ నదుల లోయలయందు క్రొత్తరాతియుగమునకు (Neolithic period) ఎక్కువగా అలవాటుపడిన ఆదిమ మానవ సంఘములుండెడివి వీరు గుట్టలమీద తాత్కాలికముల్లైన ఇండ్లుకట్టుకొని పశువులను మేపుకొనుచు కొలదిపాటివ్యవసాయమును చేయుచును జంతువులను పెంచుకొనుచు స్థిరమైన గృహములులేక ఒకచోటు నుండి మరియొక చోటుకు తమస్థావరములను మార్చుకొనుచుండెడివారు కొన్నిసంవత్సరములు తరువాత వీరిలో కొన్ని గుంపులు మెసపొటేమియాలోని నదీప్రాంతములందు స్థిరనివాసములేర్పరచుకొని కొన్నిపల్లెసంస్థలకు సంస్కృతులకు కారకులయిరి వీరు క్రమముగా నదీలోయయందలి వ్యవసాయప్రాముఖ్యమును గుర్తెరిగి బెబిలోనియా అస్సిరియా మొదలైనతావులకు వలసపోయి అచ్చటి నదీలోయలలో వ్యవసాయము చేయుచుండెడివారు ఇవన్నియు ఎక్కువసారవంతమైన ప్రాంతములగుటచే అనాదినాగరికతావృద్ధికి దోహదమొసగెను ఈపల్లెసంస్థలనకును రాకపోకల సౌకర్యము ఉండుటచే పశ్చిమమునయున్న "ఉరాయిడ్" మొదలగు ప్రాంతములకును తూర్పున సింధునదీప్రాంతమునకున్న అమ్రి నాల్ మున్నగుతావులకును సంబంధములేర్పడెను ఈ చిన్న చిన్న ప్రదేశములలో నుండిన నాగరికతాసంస్కృతులు వికాసముచెంది హరప్పాసంస్కృతిగ పరిణామముచెందెను భారతదేశమునకు పశ్చిమమున చీనాబ్ రావి బియాస్ సట్లెజ్ జీలమ్ అనునదులు హిమాలయపర్వతములనుండి దిగి, ఏకైక సింధునదిగా ప్రవహించి అరేబియన్ సముద్రములో కలియుచున్నవి హరప్పాయనునది జీలమ్ చీనాబ్ రావి నదుల కూడలికి పైన రావినదికి ఎడమప్రక్కనున్నది మొహెంజదారో అనునది సింధునదికి కుడిప్రక్కన కలదు ఇది హరప్పా నగరమునకు ఈశాన్యముగా 400 మైళ్ళదూరమునన్నది

సింధునాగరికత'యని ప్రసిద్ధిబడసిన ఈరెండు నగరములు ఇంచుమించు ఒకేచుట్టుకొలతయు ఒకేనైసర్గిక వైశాల్యము గలవి దీనినిబట్టి ఇవిరెండును పథకించిన (planned) చేసి కట్టబడినవని తెలుచున్నది జాగ్రత్తగా పరిశీలించినచో సింధు నాగరికత గల్గిన రెండుపురాతనపు దిబ్బలలో ఒకటి ఎగుడుగను మరొకటి దిగుడుగను కన్పించును ఇట్టి నైసర్గిక స్వభావము హరప్పా మొహెంజదారోలలో నేకాక, ఇతర ప్రాంతములందుకూడ కానవచ్చును సింధునదిప్రాంతమున ఇట్టి

చిత్రము – 124



పటము–1
హారప్ప నాగరికతనాటి ఇటుకరాతి గృహములు–వీధులు

చిత్రము – 125



పటము–2
హారప్పనాగరికతనాటి శవపేటిక అందలి మృణ్మయ పాత్రలు

చిత్రము–126



పటము–3

చిత్రము–127



పటము–4

చిత్రము–128



పటము–5

చిత్రము 129



పటము–6
హారప్ప నాగరికత 3 4 5, 6 చిత్రములు రూపర్ లోథల్ కాలిబంగన్ మున్నగు నగరములకుచెందిన వాణిజ్య సంస్థల ముద్రలను సూచించును



శ్రీ వివేకానందస్వామి

( వ్యాసమును 264 వ పుటలో చూడుడు

ప్రాచీనసంస్కృతిగల తావులు రమారమి ఇరువది గలవు. చనుహుదారో, కోట్‌డిజి, మాధారెవకో, కోటాసూర్ అను అట్టి తావులు సింధునదియొద్దనే కలవు. అంతేకాక భారతదేశమందలి సౌరాష్ట్రమునందు, లోథల్, రోజిడి, రంగపూరు, సోమనాథ్, అహాడ్ అను తావులందును, కచ్‌లోని దేశల్‌పూరు సుర్‌కోయిడా మొదలయిన ప్రదేశములందును ప్రాచీనసంస్కృతి అవశేషములు కన్పట్టును. ఈ ఎగుడుదిగుడు దిబ్బలను త్రవ్వినప్పుడు వీటినడుమ ఒకవిధమైన సామూహ్యత గోచరించెను. మొహెంజోదారో త్రవ్వకములలో దిబ్బచుట్టును ఇటుకలతో నిర్మింపబడిన ఒక పెద్ద కోటగోడ బయల్పడెను. ఇది కొన్నిచోట్ల పడిపోయినది; కొన్ని తావులలో ఇది మూడు అంచెలలో నిర్మింపబడి ఇప్పటికిని నిలిచియున్నది. క్రిందిభాగమున ఈ గోడ బాగుగా వెడల్పుగనుండి పోనుపోను చివర సన్నమై రెండు మూడు ఇటుకలవరుసలలో నిర్మింపబడియున్నది. కొన్ని తావులందీ కోటగోడకు ఆశ్రయముగ మరియొక ప్రాకారకుడ్యము కలదు.

దిబ్బపైన బృహత్ స్నానకుండము అను అతిముఖ్యమైన కట్టడము కలదు. ఇది అతిబాక చాకచక్యముగా నిర్మింపబడినది. నీరు బయటిపోకుండ అరికట్టుటకు ఇటుకలతో తయారైన ఈ కట్టడమునందు లోపలిగోడలకు ఇటుకలను తారుపరచెను. దు అస్ఫాల్టుతోను సిద్ధపరెను. బిట్యుమెన్ అను పదార్థముతోను అతికిరి. ఈ స్నానకుండమునకు దగ్గరగా బయటి ప్రాకారమునకు అందగా ఒక పెద్ద ఇటుక అరుగు కలదు. దీనియందు కలపను భద్రపరచెడి చావాని అందలి అవశేషములనుబట్టి తెలిసికొనవచ్చును. దీనికి కొంచెము దూరమున ఒక ఓడరేవు కలదు. ఓడనుండి సరకును పైకెత్తుకొనుటకు ఒక పెద్ద అరుగు కలదు. ఆ అరుగునకు ఒకవైపున కలపను భద్రపరచు చోటు, మరొకవైపున కొన్ని ధాన్యపుకొట్లును గలవు. ఈ కొట్లకు క్రింది వరుసలో కొన్ని కిటికీలు గలవు. వీటిద్వారా ధాన్యమునకు గాలిపోక ముక్కవాసనతో చెడిపోకయుండును.

రెండు పెద్దమండపములు, ఒక పెద్దహాలు ఈ దిబ్బయందుండు ఇతరకట్టడములు. ఈ మండపములలో చిన్నగదులున్నవి. వీటియందు నీరుపోవుటకు కాలువలు కలవు. ఇవి దేవపూజలకు వినియోగింపబడిన గదులని ఊహించుచున్నారు. వీటి ప్రక్కనున్న పెద్దహాలు పొడవు 280 అడుగులు, వెడల్పు 7 అడుగులు. ఇది ఒక రాజగురువుయొక్క స్థానమో లేక దైవకార్యములకును, అధ్యయనమునకును వినియోగించు శాలయో అయియుండవచ్చును. ఈ మహాలుకట్టడము క్రీ. పూ. 3000 సం॥ నాటిదని తెలిసికొనుట ఎంతయో ఆశ్చర్యమును గొల్పును.

మొహెంజదారో దిగువ దిబ్బయందు ఆశ్చర్యమును గొల్పు విశేషములుగలవు. అసలు నగరమంతయు ఈ దిబ్బయందున్నదని చెప్పవచ్చును. ఇది ఎగువదిబ్బనుండి సుమారు రెండుమైళ్ల పొడవున తూర్పుగా సింధునదివరకు విస్తరించియున్నది. ఆకాలములో సింధునదియందలి ఒక పాయ మొహెంజదారో నగరము మధ్యగా పోయియుండవచ్చునని ఊహింపబడుచున్నది.

ఈ నగరమునందు క్రింది వరుసలో ఉత్కృష్టమైన పురాతనపు పునాదులుకలవు. వీటినిబట్టి ఇండ్లన్నియు వరుసలుదీరి ఒకదానివెనుక మరొకటి నిర్మింపబడినట్లు గోచరించును. వీటియందు కొన్ని పెద్దవి, కొన్ని చిన్నవియునుగలవు. కొన్నిగదులు గుండ్రముగా గలవు; కొన్ని మేడలుకూడ గలవు. ఇండ్లపై కప్పు చదునుగనున్నది. మేడలందు స్నానశాలలున్నవి. ప్రతియింటి ఒక బావి కలదు. మరుగుదొడ్లు క్రిందిభాగములందు ఎక్కువగా కన్పించుచున్నవి. ప్రతి వీధిలోనికిని ఇండ్లలోనుండివచ్చు నీరు ప్రవహించు కాలువలుగలవు. అక్కడక్కడ వీధులందు పెద్దపెద్ద గుంటలను (man holes) కాలువలలోని ప్రవాహమును సరిచేయుటకు నిర్మించిరి. చిన్నకాలువలను కలుపుచు ఒక పెద్దకాలువ కలదు. కొన్ని కాలువలచివర చెత్త పైకి వచ్చునట్లుగను నీరు దిగిపోవునట్లుగను కొన్ని కుండలు (urns) అమర్చబడినవి. ఇండ్లలోని అరుగులకు కోటలోని కట్టడములకు వచ్చియుండు బాధపడినవి. నది పొంగినప్పుడు ఇటుకగోడలు కాని పడిపోగా మరల ఆగోడలను పెద్దవిగా నిర్మించి ఇటుకలు కరగిపోకుండ కొన్నిరకములైన పూతలను పూసి ప్రజలు వరదలను అరికట్టుచుండెడివారు. ఈ వసతులన్నియు చూచినచో ఆధునికములైన అట్టి సౌకర్యములకు అవి ఎంతమాత్రము తీసిపోవనివని తెలియుచున్నది.

సింధునాగరికత వెలసిన స్థలములందు జనులెట్లు నివసించెడివారో చెప్పుట కష్టము కాని మొహెంజదారోలోను, హరప్పాలోను ఎన్నియో అస్థిపంజరములు బయటపడెను. కొన్ని తావులలో మానవులయందు కొంత చిత్రవధ జరిగినట్లు ఆధారములున్నవి. హరప్పానగరమునందు 60 అస్థిపంజర

ములు కెలిపబెను. సమాధులలో అస్థిపంజరములను ఉత్తర దక్షిణములుగా ఉంచెడివారు. కొన్ని సమాధులు పచ్చి ఇటుకలతో కట్టబడినవి. సౌరాష్ట్రములో లోథల్ అను ప్రదేశమందు 17 సమాధులు బయటపడినవి. వాటిలో ఒకదానియందు రెండు అస్థిపంజరములు కన్పట్టెను. దీని బట్టి ఎందు నాగరికతయందు సహగమన ఆచారముండెడిదేమో అని ఊహించుచున్నారు. మానవశాస్త్రము ననుసరించి ఈ నాటి సౌరాష్ట్రీయులకును అనాటి ప్రజలకును కొన్ని అంశములలో సారూప్యము గోచరించును.

సింధునాగరికుల అవశేషములలో కొన్ని ముఖ్యములైన శిలామూర్తులు గలవు. కాని సర్వాంగములు కల్గినవి లభ్యము కాలేదు. వీటిలో చెప్పదగినవి రెండు మొండెములు. ఇవి హరప్పాలో దొరకినవి. వీటిలో ఒకటి ఎరుపురంగుగలది. రెండవది నలకరంగుగలది. మొదటిదానియందు కాళ్లు తల లేవు. మేఢ్రము చిత్రితమైయున్నది; కాని అది పగిలిపోయినది. చేతులు తల యుండుచోట పొట్టలుండుటచే అచ్చట మరల వాటిని అమర్చుటకు అవకాశమున్నదని ఊహింపవచ్చును. రెండవదానియందు కాళ్లు విరిగిపోయినవి. కాని భుజములను ఎడమకాలి భంగిమను పరిశీలించుచో అది నాట్యము నుద్దేశించి శిల్పిచే తయారుచేయబడిన ప్రతిమవలె కన్పట్టును. ఈ రెండింటియందును కళాకారుని శిల్పనాశక్తి విశేషముగా గోచరించును.

పైన ఉదాహరించిన మూర్తులకంటె ఉత్కృష్టమైనది మొహంజదారోలో దొరకిన లాంఛనపురుషుని ప్రతిమ. దీని యొక్క అర్ధ నిమీలితనేత్రములు ధ్యానమును సూచించును. అంగవస్త్రమునందు మూడాకుల చిహ్నములతో కూడిన నమూనా గోచరించుచున్నది. శిరస్సు చుట్టును బంగారు పట్టీ చుట్టబడినది. మీసమును గడ్డమును తొలగించినచో బుగ్గపైవరకు లేక సంస్కారమొనర్చబడిన ముక్కుపొడిగిన అదిపోలు గన్పట్టు చిహ్నములు కలవు. దానియందు దేశీయ లాంఛనిక లక్షణములు ఉట్టిపడుచుండును.

మొహంజదారోయందు లభ్యమైన కొలది కాంస్య విగ్రహములలో నృత్యభంగిమలోయున్న నగ్న స్త్రీయొక్క చిన్నకాంస్య ప్రతిమ ఎంతో రమణీయముగ కన్పించును. దీనియందు యౌవన స్ఫుటముగా శిల్పింపబడినది. ఒక చేయి కటిపై ఎత్తియున్నట్లును, మరియొక చేయి ఎడమతొడపై ఉంచినట్లును చూపబడినది. ఎడమచేయి భుజమువరకు వలయములుగలవు. ముంజేతికి గాజులవంటి ఆభరణములు గలవు. మెడలోని హారము చిన్నకుచ్చుతో శోభిల్లుచున్నట్లు చిత్రింపబడియుండెను. కరిపై పున్నగల ధమ్మిల్లము ఎంతో రమణీయముగ కన్పట్టును. ముఖము గంభీరముగనున్నది. ఈ ప్రతిమ ఆదిమనివాసుల నృత్యభంగిమను జ్ఞప్తికి తెచ్చును.

వీరు స్టియటైట్ ముద్రలను ఎక్కువగా ఉపయోగించెడివారు. మొహంజదారోవద్ద సుమారు 1200 ముద్రలు దొరకినవి. వీనిని మట్టిముద్దమీద ముద్ర వేయుటకుపయోగించెడివారని సర్ మార్టిమర్ వీలర్ చెప్పియుండెను. ఈ ముద్రలు నలుచదరముగను గుండ్రముగను స్తంభాకారముగను ఉండెడివి. వీటియందు ఏనుగులు మేషములు ఏకశృంగ జంతువులు మకరములు దున్నలు పెద్దపులులు మొదలైన జంతువుల చిత్రములు విరివిగా కన్పట్టును. మేషమువలె కన్పట్టు జంతువు వింతగానుండును. దాని కొమ్ములు వెనుకవైపుకు వంపుతిరిగియుండును. తొండముగల్గి ముఖము గాజుపురుగును పోలియుండును. వీటిలో కొన్నిటియందు ఒకే దేహము మూడుతలలు కన్పించును. ఒకముద్రయందు ఒక యోగి సింహాసనముపై కూర్చొని దున్నకొమ్ములవలెనుండు కిరీటమును ధరించి ఏనుగులు పెద్దపులులు మొదలగు జంతువులతో పరివేష్టించియున్నట్లగపడును. దీనిని పశుపతిముద్ర యని యెంచెదరు. ఈముద్రయందు కొన్ని అక్షరములుగలవు. వీటిని చదువుటకు పెక్కురు ప్రయత్నించిరి. కాని ఎవ్వరును నిర్ధారణముగా ఇదమిత్థమని చెప్పజాలకుండిరి.

ఈముద్రలు ఎక్కువగా సరకును ఒకదేశమునుండి మరొకదేశమునకు తీసికొనిపోవుటకు హరప్పాప్రజలు వాడిన చిహ్నములని కొందరి అభిప్రాయము. కుతి ఏనుగులు మొదలైనవి యుండుటవలన ఇవి అనాటి మతచిహ్నములని మరికొందరివాదము. ఏది ఎట్లున్నను దానిపైనున్న అక్షరములను చదువగలిగినప్పుడే వాటి ఉపయోగమును గూర్చి తెలియగలదు.

హరప్పానగరవాసుల మతమును గూర్చి తెలిసికొనుటకు ఈ ముద్రలు ఒక ఆధారముగనుండగలదు. వృషభములు ఎక్కువ ముద్రలయందు కాన్పించును. దీనినిబట్టి వారు వృషభారాధకులని చెప్పవచ్చును. ఇవిగాక మట్టితో చేయబడిన స్త్రీమూర్తులు వీరి అవశేషములయందు లభించెను. ఈమూర్తులు

అనే హారములతోను కిరీటములతోను దేవతలను పోలి యుండెను వీటినిబట్టి వీరు మాతృదేవతారాధకులనిగూడ చెప్పవచ్చును వీరిలో నరబలి పశుబలి మొదలగు ఆచారము లున్నవని చెప్పుటకు ఆధారములుకలవు వీరి కాలమునందు బ్రాహ్మణులు రాజగురువులు పూలతో అలంకరించిన అంగవస్త్రము కప్పుకొనువారలుగనుండి కిరీటమువలె చుట్టుకొన్న హారము మొదలగు వి వీరు ధరించెడివారు

సామాన్యమానవుడు ఆ కాలములో వ్యవసాయము చేసి కొని జీవించెడివాడు వీరు గోధుమలకు అలవాటుపడినవారని చెప్పుటకు కొన్ని ఆధారములున్నవి చెట్టుచేపలను కొట్టుటకు వీరు రాగిగొడ్డళ్ళను ఉపయోగించుచుండెడివారు కత్తులను పదునైన లోహపురేకులనుకూడ వీరు వాడుచుండెడివారు వీరు రాళ్ళతో పూసలు తయారుచేసెడివారు 'కార్నీలియన్' అనురాతితో వీరు చక్కని పూసలను తయారుచేయుచుండెడి వారట వీటితోపాటు స్టియొటైడ్ పూసలు బంగారపు గొలుసులు బంగారపుపూసలు మొదలగువాటినెన్నిటినో వీరు వాడుచుండిరి వీరు కంటికాటుకను బొమ్మవస్త్రములను ధరించెడివారు చేపలు పట్టుటయందు వీరు నిపుణులని చెప్పుటకు ఆధారములుగా రాగిగాలములు కొక్కెములు మొదలగునవి లభ్యమైనవి వీరు కళాపిపాసులు వీరుపయోగించిన కుండల మీద ఎన్నియో రకముల చిత్రములు జంతువులబొమ్మలు నల్లని సిరాతో ఎంతో అందముగ తీర్చిదిద్దబడినవి

రా. మ.

## హరికథ

హరికథ అను పదమిప్పుడు ఒకానొక కావ్యప్రక్రియానిర్దేశమునకును కథాప్రవచనమునకును వాడబడుచున్నది కావ్యముగా అది బహుగేయ దృశ్యపద్యాయుక్తమును కథాప్రధానమును బకుండును దానిని ప్రవచించువారికి హరిదాసులు, హరికథా) కథకులు భాగవతార్లనిపేరు హరికథ శ్రవ్యకావ్యమే అయినను దానిని సాధారణముగా ఎవ్వరును పఠింపరు హరిదాసులుసంగీతముతోడను అభినయముతోడనుఉపన్యసించుచుండ భక్తులు విని ఆనందింతురు ప్రవచనరూపమున అందు దృశ్యకావ్యలక్షణములుకూడ గోచరించును గానము అభినయము వేషధారణము అనునవి అందుండుటయే అందుకు కారణము హరిదాసులు' సాధారణముగా నిలబడి అభినయముచేయుచు కథను ఉపన్యసింతురు; హరికథయందు శ్రవ్యదృశ్యకావ్యపురాణ లక్షణముల సమ్మేళనము గోచరించును

హరికథలనగా విష్ణువుయొక్క కథ అనికాని విష్ణుకథను అధికరించి వ్రాయబడినకావ్యము అనికాని అర్థముచెప్ప వచ్చును ప్రారంభమున విష్ణువునకు తదవతారములలో ఒక దానికో సంబంధించిన కథను గ్రహించి హరిదాసులు ప్రవచనము సాగించుచుండుటచే హరికథకు ఆపేరు కలిగియుండును హరిదాసు భాగవతారు అనుకథకనామములుకూడ ఆవిషయమునే సూచించుచున్నవి కాని కాలక్రమమున హరికథలతో పాటు హరకథలను సురకథలను దేవీకథలను భక్తకథలను దేశభక్తకథలనుకూడ హరిదాసులు ప్రవచించుటకుఆరంభించిరి వారు ఏ కథను గ్రహించినను దానిని హరికథ అను పేరే రూఢమైపోయినది ఇచ్చట హరిపదము ఉపలక్షణముమాత్రమే వేదకాలముననే హరికథాప్రక్రియ బీజరూపమునయుండినట్లును, రామాయణమున కుశలవులు రామాయణకథాగానము నొనరించుట హరికథవంటిదే అగుటచే ఆకాలమునకు అది కొంతస్పష్టతరమైన రూపమును పొందినట్లును కొందరు భావించుచున్నారు కాని అది ఇప్పుడు మనకు గోచరించుచున్న రూపమున పరిణమించుట మధ్యయుగముననే అనియు మహారాష్ట్రదేశమున దానికి అట్టి స్థిరమైరూపము ఏర్పడెననియు డా॥ యస్వీ. జోగారావు వ్రాసియున్నారు క్రీశ 17 వ శతాబ్ది పూర్వభాగమున తుకారామ్ అనుప్రసిద్ధమహారాష్ట్రభక్తుడు హరికథాకాలక్షేపములు సాగించుచుండినట్లు తెలియుచున్నది హరికథను మహారాష్ట్రమున అభంగ్ అనియు తమిళమున కాలక్షేపము అనియు వ్యవహారము ఈ ప్రక్రియ మహారాష్ట్రదేశమునుండి దక్షిణమునకు ఎప్పుడుఎట్లుఅవతరించెనో స్థిరముగా చెప్పజాలము తంజావూరునాయకరాజ్యము మహారాష్ట్రుల వశమైనతరువాత మహారాష్ట్రరాజులు అచ్చట ప్రచారమునఉన్న యక్షగానము చే ఆకర్షింపబడి వానిని అధికముగాపోషించుటయేగాక స్వయముగ రచించుటకును ఆరంభించిరి కాని వారు తెలుగున హరికథలవంటివియు తమమాతృదేశమున అధికప్రచారము పొందినవియు అగు అభంగములను రచించినట్లు కానరాదు మహారాష్ట్రులకు పొరుగువారైన మధురమహారాష్ట్రులవారు తెలుగున కొన్ని హరికథలను వెలయించిరట దానిని చూచియు అందలి గీతచ్ఛందోవైవిధ్యముచే ఆకర్షింపబడియు, తరువాత తెలుగువారుకూడ హరి

కథలను రచించుటకు ఆరంభించిరి

కన్నడదేశమున యక్షగానమునే హరికథగాచెప్పు అర్వాచీనసంప్రదాయము ఒకటి ఉన్నదట వేషరచనలేకుండనే మద్దెల తాళము హార్మోనియము అను వానిని సహాయములుగా గ్రహించి ఒకరు యక్షగానమును చేయుచుండ మరినలుగురు వేర్వేరు పాత్రలను పంచిపుచ్చుకొని నాటకీయపద్ధతిలో సంభాషణలు చేయుచుందురనియు అందు ఆటగాని, అభినయముగాని ఉండవనియు అది ఒకరుచెప్పు హరికథవలె నలుగురుపంచుకొని చెప్పునట్లుండుననియు దానిని 'తాళమద్దెల' అనిపేర్కొందురనియు శ్రీ ముట్నూరి సంగమేశం వ్రాయుచున్నారు ఇది హరికథలచే యక్షగానములు ప్రభావితములైనతీరును సూచించును అయినను దక్షిణమున యక్షగానములు ప్రాచీనములనియు హరికథలు తరువాత వెలసినవనియుచెప్పుటకు సందేహింపనక్కరలేదు

హరికథాయక్షగానములకు కొంతసాదృశ్యము సంబంధమును ఉండుటచే పలువురు ఆరెండుప్రక్రియలును అభిన్నములని భావించియుండిరి చంద్రహాసచరిత్రము ఇంద్రజయోపాఖ్యానము, అనసూయాచరిత్రము మున్నగు హరికథాకావ్యములను రచించిన హిందూపురనివాసి బాగేపల్లి అనంతరామాచార్యులు వానిలో కొన్నింటిని యక్షగానములనియే పేర్కొనిరి సుప్రసిద్ధవాగ్గేయకారకులును హరికథాపితామహులును అయిన శ్రీమదజ్జాడాదిభట్టనారాయణదాసు తమ అంబరీషచరిత్ర హరికథ పీఠికయందు వ్రాయుచు తామురచించిన హరికథలను యక్షగానములనియే పేర్కొనియున్నారు శ్రీ భమిడిమర్రి రామమూర్తి సతీసక్కుబాయిహరికథకు రచించిన పీఠికలో శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రి దానిని యక్షగానమని ఉట్టంకించి కుండలీకరణములో హరికథ అని పేర్కొనిరి అట్లే శ్రీ అయ్యగారి వీరభద్రరావు శ్రీభక్తవిజయమను హరికథను. వీరేకాక ఇంకను పలువురు విమర్శకులును పండితులునుకూడ హరికథలు యక్షగానములేయని భావించియుండిరి దక్షిణాంధ్రయుగమున యక్షగానములు అను దేశీయరూపకములు తండోపతండములుగా రచింపబడినవి వానిని రచించినవారిలో ఎవ్వరుకాని వానిని హరికథానామముతో పేర్కొనియుండలేదు హరికథాయక్షగానప్రక్రియలకు అభ్యాజకథానమును ఆపాదించిన వారును కొందరుకలరు కాని యక్షగానములనుగూర్చి కూలంకషమైన పరిశోధనకావించిన శ్రీ డా॥ యస్వీ జోగారావు తమయక్షగానవాఙ్మయచరిత్రలో హరికథా యక్షగానములు రెండును సదృశప్రక్రియలగుటచే వానికి చారిత్రకకారణములచే సాన్నిహిత్యసంబంధములేర్పడినను వాని ఉత్పత్తి వేర్వేరనియు వానిప్రయోగపద్ధతులను ప్రయోజనములు విభిన్నములనియు స్పష్టముగ వ్రాసియుండిరి

నీతిధర్మతత్త్వభక్తిప్రచారమున హరికథలు శక్తిమత్తరములైన ఉత్తమసాధనములు ఆ తొలుత భక్తిప్రచారమునకే ఉద్దేశింపబడినను తరువాత క్రమముగా వీరపురుషదేశనాయకజీవితకథాప్రచారమునకును జాతీయభావప్రచారమునకుకూడ ఉపయోగింపబడినవి ఇవి పద్యములతోడను దీర్ఘవచనములతోడను దోరా తోహరా మున్నగుగేయములతోడను కీర్తనలతోడను ద్విపదలతోడను దండార్థములతోడను కూడియుండును శ్రీ నారాయణదాసు దోరా తోహరాలకు బదులు మంజరియను గేయవిశేషమును వాడియుండిరి ఇది మంజరీద్విపదకంటె భిన్నమైనది కొంచెమించుగా దోరావంటిదే హరిదాసులు హరికథాప్రవచనము చేయునప్పుడు సందర్భానుసారముగా భాగవతభారతరామాయణాదికావ్యముల నుండి రసవంతములైనపద్యములనుకూడ చదివిసభ్యులనానందింప జేయుచుందురు ఇటీవల ప్రసిద్ధాంధ్రనాటకములనుండియు, ఆధునికకావ్యములనుండియు సందర్భానుగుణముగా కొన్ని పద్యములను చదువుట కొందరు హరిదాసులకు పరిపాటి అయినది సంగీతప్రావీణ్యముకల హరిదాసులు భక్తిరసపూరితములైన సన్నివేశములందు త్యాగరాజకీర్తనలను అష్టపదులను రామదాసుకీర్తనలనుకూడ పాడుచుందురు

హరికథోపన్యాసకులు పండితులు గానకళాకోవిదులు వాగ్మిశేఖరులు అగుచో హరికథలు వినోదకరములే కాక విజ్ఞానప్రదములుకూడ కాగలవు ప్రధానకథను అవలంబముగా చేకొని పండితులైన హరిదాసులు ప్రసక్తానుప్రసక్తముగా పురాణేతిహాసములనుండియు లోకమునుండియు పెక్కుకథలను ఉపాఖ్యానములను చెప్పి సభ్యులను అలరించుచుందురు కొందరు హాస్యచమత్కారపూరితములైన సన్నివేశములను చెప్పి పామరులనుసైతము రంజింతురు పురాణేతిహాసములందలి నీతి ధర్మ భక్తి తత్త్వ ప్రతిపాదకములైన కథోపాఖ్యానములను సర్వజనసుబోధము లొనరించుటకు హరికథవలె శక్తివంతమైన సాధనమింకొకటిలేదు.

ఆంధ్రదేశమున హరికథాప్రవచనమున ఆరితేరిన హరిదాసులు పలువురు జనించిరి. వారిలో కొందరు కేవల హరిదాసులే కాక కవులు పండితులు గూడనై పెక్కు హరికథాగ్రంథములను రచించియుండిరి. అట్టివారిలో బాగేపల్లి అనంతరామాచార్యులు, అజ్జాడ ఆదిభట్ల నారాయణదాసు, అయ్యగారి వీరభద్రరావు, గల్లపల్లి బవిరెడ్డి, బాలాజీదాసు, దీక్షితదాసు ముఖ్యులు. వీరు రామాయణభారతభాగవతకథలను అందలి ఉపాఖ్యానములను హరికథలుగా రచించి వానిని స్వయముగా ప్రవచించి కీర్తిగౌరవములను గడించినవారు.

ది. వెం.

## హరి నాగభూషణము

ఈయన కృష్ణామండలములో హరిపురమను గ్రామమునందు 24-12-1884వ తేదీన గాయకోత్తములైన హరి నరసింహము, రాజమ్మలకు జన్మించినాడు. నాగభూషణము తండ్రియొద్దనే ఫిడేలువాద్యమును నేర్చుకొని ఆయనతో కలిసి సదస్సులందు సంగీతకచేరులు చేయుచు ప్రశంసలను పొందుచుండెను.

ఈయన పదునెనిమిదవయేట తండ్రి మరణించుటచే తల్లితోను సోదరసోదరీలతోను బందరులో కాపురము పెట్టి సుసర్ల దక్షిణామూర్తి శాస్త్రులవద్ద తాను నేర్చినవిద్యను ప్రదర్శించి వారి సాయముతో అచటి హిందూపాఠశాలలో ఉపాధ్యాయుడుగా ప్రవేశించి 1910వ సం॥ వరకు ఆవృత్తియందే కాలముగడపెను. 1911లో నాగభూషణము న్యాయశాస్త్రమును అధ్యయనము చేయుటకై మద్రాసు వెళ్ళి అపరీక్షయందు ఉత్తీర్ణుడయ్యెను. మద్రాసులోనుండు కాలమున అచ్చట జరుగు సంగీతకచేరీలకు హాజరగుచు సంగీతవిద్వాంసులకు తన జంత్రగాత్రనైపుణ్యమును ప్రదర్శించుచు వారి మెప్పును పొందెడివాడు.

అనంతరము బందరులో జరిగిన సంగీతసభలలో ఈయన ఫిడేలువాద్యప్రదర్శనము చేసి పురప్రముఖులవలననే గాక, సహపాఠులైన సహాధ్యాయులవలనగూడ ప్రశంసలనందుకొనెను. 1912లో నాగభూషణము గౌరవార్థమై ఏర్పాటుచేయబడిన పౌరసన్మానసభయందు శింగరాచార్యులచే ఆయనకు బంగారుతోడా బహూకరింపబడెను. 1913లో బరోడామహారాజు ఏర్పరచిన అఖిలభారతసంగీతసభకు ఈయన ప్రతినిధిగా వెళ్ళి కర్ణాటకసంగీతమునుగూర్చి దీర్ఘోపన్యాసము గావించి, జంత్రగాత్రమును ప్రదర్శించి సన్మానింపబడెను. 1916లో శతావధానశిరోమణి చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి సమక్షములో జరిగిన ఈయన జంత్రగాత్రమును ఆయన విని నాగభూషణమును ప్రశంసించుచు అనువుగా పెక్కు పద్యములు చెప్పినారు. 1929లో మైసూరుమహారాజుచే ఆహ్వానింపబడి ఆయనవల్ల గొప్పసన్మానమునందెను. 1932లో బందరులో యావదాంధ్ర గానవిద్యాంస జ్ఞాన సమితమున జరిగిన విద్వత్సభలో ఈయన "వాగ్గేయకారరత్న" బిరుదమును పొందిరి.

అనంతరమీయన ఆంధ్రదేశములోని పెక్కునగరములయందును దక్షిణదేశమున మద్రాసు తిరుచిరాపల్లి కుంభకోణము రాయవెల్లూరు పుదుక్కోట మైసూరు బెంగుళూరు మున్నగు నగరములలోను పెక్కు గానసభలుసల్పి మహాపండితులచే మెప్పుబడసిరి. 1933లో విశాఖపట్నములో సుప్రసిద్ధ మార్దంగికులు పుదుక్కోట దక్షిణామూర్తి పిళ్లై ప్రక్కవాద్యముతో ఈయన జంత్రగాత్రకచేరి సల్పి శ్రోతలను ఆనందసముద్రములో ముంచివైచిరి. 1934లో విజయనగరమునందు వీణ వెంకటరమణదాసు, అజ్జాడ ఆదిభట్లనారాయణదాసుల సమక్షమునను, 1935లో డా॥ సర్వేపల్లి రాధాకృష్ణయ్య సమక్షమునను నాగభూషణము గానసభలు జరిపి వారి ప్రశంస

అను చూరగొనిరి 1937లో తిరువయ్యారులో జరిగిన త్యాగరాజస్వామి ఉత్సవసందర్భమున ఈయన స్వరముతో రామనామమును పోషించి శక్తిపూర్వకముగ కచేరి సల్పి తమిళులకు ఆంధ్రులు తీసిపోవువారు కారను చిరకీర్తిని తెలుగుదేశమునకు సంపాదించి పెట్టిరి

త్యాగరాజు దైవస్వరూపుడను భావముతో 1910సం॥ నుండి నాగభూషణము స్వాతంత్ర్యముతో ఆయన ఆరాధనోత్సవములను ఆంధ్రదేశమున కొన్ని తావులలో ప్రప్రథమముగా ఆరంభించిరి ఆంధ్రదేశములో సంగీతకళయందు ప్రజలలో అభిరుచిని పెంపొందింపజేయుటకై ఈయన బహువిధముల కృషి సల్పెను సంగీతము లోకానందముకొరకు మాత్రమే గాక నాద బ్రహ్మోపాసనముగ ఉపాసించుచో అది మోక్షప్రదమగు బ్రహ్మవిద్యయగునని తలచి ఈయన ఏటేట పుష్యబహుళ పంచమినుండి అయిదురోజులు ఉత్సవములు చేయుచుండెడివారు ఈ ఉత్సవములలో ఆంధ్రదేశమందలి పెక్కురు గాయకశ్రేష్ఠులు పాల్గొనెడివారు

నాగభూషణము ప్రతిదినము రామాయణమును పురాణప్రవచనము చేసెడివాడు సత్యవాగ్మియను నీతిమంతుడును ఏకసంతగ్రాహియను ఇతడు పేరుపొందినవాడు పెక్కురీయన వద్ద కూర్చుండి గానవిద్య నభ్యసించిరి

ఈయన మహారాష్ట్రభాషయందును సంస్కృతాంధ్రము లందును పండితుడు సంస్కృతము నందును తెలుగునందును 'త్యాగయోగి' అను మకుటముతో కృతులు వర్ణములను శంకరాచార్యచరిత్ర రామఅష్టోత్తరనామావళి త్యాగరాజ చరిత్ర మున్నగు వాటిని హరికథలుగాను ఈయన రచించినాడు

1941 లో కాకినాడయందు జరిగిన సరస్వతీగానసభయందు ఈయన కచేరి సల్పి తిరిగి స్వస్థలమునకు వచ్చిన కొలది రోజులకు పక్షవాతమునకు గురియైరి 1944 లో ఈయనకు భార్యావియోగము కల్గినది 13 సంవత్సరములు ఈయన పక్షవాతముతో బాధపడి 1949లో పరమానంద భారతీస్వామిచే ప్రణవోపదేశము పొంది బ్రహ్మభూతులైరి

కొం పే అం

## హరి ప్రసాదరావు

"ఆంధ్ర నటవిశారద"ని తెలుగు మాగాణమున విఖ్యాతుడైన హరిప్రసాదరావు అపూర్వ నటనాకౌశలములో భావప్రకటనావైదగ్ధ్యములో నిరుపమానప్రజ్ఞానిధియై తెలుగు నాటకరంగసామ్రాజ్యమునకు దానిక్రమవికాసమునకు తన సర్వస్వమును ధారవోసిన కళాతపస్వి భరతనాట్యకళా సరస్వతికి వాడాధిష్ఠానమైన కూచిపూడి అగ్రహారము ప్రసాదరావు జన్మస్థలము హరిప్రసాదరావు 1871 వ సం॥ న కామమ్మ, నరసింహారావు అను దంపతులకు జన్మించినాడు

జన్మస్థలము కూచిపూడియైనను అతని నటనాజీవితమునకు గుంటూరు క్షేత్రమైనది ఇతడు స్కూలుఫైనలవరకు విద్యనభ్యసించెను తెలుగు భాషాజ్ఞానము లోకానుభవము విశేషముగా గలవ్యక్తి ఈయన "పుస్తు మోహనరూపాయ" అను శ్లోకమును సార్థకపరచు సుందరరూపము ప్రసాదరావుది

ప్రసాదరావు ప్రథమమున రైల్వేడిపార్టుమెంటులో సిగ్నలర్‌గాను పిమ్మట టెలిగ్రాఫ్ ఆఫీసులో గుమాస్తాగాను పనిచేసినాడు ఆయనకు ఉన్నతపదవితో దూరప్రాంతమునకు మార్పిడి జరుగగా ఆమార్పువలన తనకు అత్యంత అభిమానపాత్రమైన కళారాధనమునకు అంతరాయము కలుగును భావముతో దానినాతడు నిరాకరించి తన ఉద్యోగమునకు రాజీనామాను సమర్పించెను పిమ్మట తన జీవితలక్ష్యమైన కళారాధనకే తన సర్వస్వమును అంకితము చేసికొనెను కాని జీవితభృతికొరకు గుంటూరు జిల్లాకోర్టులో "కాపియిస్టు"గా కొలువు చేసినాడు

సీతమ్మ యనునామెతో ప్రసాదరావునకు వివాహము జరిగినది విధివశమున కొలదికాలమునకే భార్య మరణింపగా ప్రసాదరావు మరల వివాహమాడక తన జీవితమును సంసారజంజాటములోని కిరికించుకొనక మనసార ప్రేమించిన నాటకకళోద్ధరణకు జీవితమును అంకితమొనర్చినాడు

ప్రసాదరావు నాటకరంగనిర్వహణమున యెంతటి అప్రమత్తుడో ఉద్యోగవిధినిర్వహణములోగూడ అంతటి శక్తిసామర్థ్యములను ప్రదర్శించుచుండెడివాడు అతడు చేసిన ఉద్యోగముల ద్వారా లభించిన రాబడి తక్కువదయ్యెనను దానితోనే తృప్తినందుచు సుఖజీవితమును గడపినాడు

చిత్రము ...

హరిప్రసాదరావు

ప్రసాదరావు బాల్యము నుండి నాటకకళకు పుట్టినిల్లైన గుంటూరునందు నివసించుచు 1893లో స్థాపించబడిన "హిందూ నాటకసమాజము లో చేరి 1930 వరకు సభ్యుడుగా వ్యవహరించుచు దానిఅభివృద్ధికి అవిరళకృషి సలిపినాడు ఈసమాజ పక్షమున ప్రదర్శింపబడిన పెక్కునాటకములలో ఇతడుముఖ్య

ధు విశేషము లక్ష్యంత స్పష్టమగ నిర్వహించుచుండెడి వాడు

ప్రసాదరావు హరిశ్చంద్రనాటకములో హరిశ్చంద్రుడుగను సారంగధరనాటకములో సారంగధరుడుగను చిత్రనళీయనాటకములో నలుడుగను బాహుకుడుగను శాకుంతల నాటకములో దుష్యంతుడుగను ప్రతాప పాండవ విజయనాటకములో దుర్యోధనుడుగను సిరియాళనాటకములో ... యముడుగను సాత్రాజితీయమున శ్రీకృష్ణుడుగను చింతామణి యందు సుబ్బిసెట్టిగను వేషములను ధరించెడివాడు ఇవిగాక సుంకరకొండడు మొద్దబ్బాయి భావదోయీ వంటి అర్థాంతరమైన విచిత్రవేషము లెన్నింటినో వేసి తన హాస్యరసప్రదర్శనముద్వారా ప్రేక్షకులను కడుపుబ్బ నవ్వించి మంత్రముగ్ధులను గావించెడివాడు

ఆతడు ఏ వేషము ధరించినను దానికి తగినవిధముగా పోషించి భావగాంభీర్యములను ప్రకటించుచు నూతనముగా ఆవిర్భవించిన తెలుగు నాటకకళకు అపూర్వశోభను కూర్చెను

ప్రసాదరావు ప్రక్కన కోట హనుమంతరావు కడియాల రత్తయ్య మద్దెగ్గరాజు ఉప్పులూరి సంజీవరావు స్థానం నరసింహారావు ముగ్గురు ప్రముఖులు నాయికాపాత్రలను ధరించి నాటకప్రదర్శనమునకు శోభకల్గించెడివారు

ప్రసాదరావునకు ఆనందభైరవి ముఖారి మోహన వశ్యాంగ శ్రీ కారువ రాగములపైన మిక్కిలి అభిమానము ఆయా రాగములను ఆయన శిష్టమైన ఫణితిలో ఆలపించుచుండుటచే ప్రజలు హరిప్రసాదరావు సంగీతబాణి యని దానికి నామకరణము చేయుచువచ్చిరి ఆయన పద్యపఠనావిధానమును యడవల్లి సూర్యనారాయణ డి.వి. సుబ్బారావు వెల్లంకొండ నరసింహారావు కెల్లంకొండ సుబ్బారావు మొదలైనవారు కొంతవరకు అనుకరించిరి ఆరోహణావరోహణక్రమము తప్పక రాగమును శృతిబద్ధము చేసి పద్యమును ఎత్తి ప్రేక్షకులను రంజింపజేసెడి ప్రతిభ ప్రసాదరావునకు మెండుగ నుండుటచే నేటికిని ఆయన తెలుగునాటకరంగమున చిరస్మరణీయుడైనాడు

ప్రసాదరావునకుగల సంగీతసాహిత్యముల కలయిక, నటనాప్రాగల్భ్యము, వస్త్రధారణము రంగస్థలమునకు వన్నె తెచ్చిన శాశ్వతకీర్తి ఆయన ధరించు ధీరోదాత్తపాత్రలకెంతయు శోభమానముగలిగినది కనుకనే ఆయన "ఆంధ్రనాటకపితామహుడు" బిరుదముతో సార్థకనామధేయుడై పెక్కురు యువనటులకు గురుతుల్యుడైనాడు

అభిజ్ఞానశాకుంతలనాటకమున ప్రసాదరావు దుష్యంత పాత్రధారియై కణ్వాశ్రమములో శకుంతలను ప్రప్రథమమున చూచినప్పుడు ఆమె సౌందర్యమాధుర్యములను ప్రకటించుచుండగా "చల్లనివై శ్రమంబడవజాలిన తామరపాకు వీవ లే" అను పద్యమును పాడుచు ఆమెను లాలించు సమయమున ప్రసాదరావు ప్రదర్శించిన అభినయము అవలోకనీయముగ నుండెడిది

సత్యహరిశ్చంద్రనాటకములో "కాలంపుంగతి చెప్పుదేని యెటులో గ్రాసంబు పొప్పాటనౌ" అను పద్యమును హరిశ్చంద్ర పాత్రధారియైన ప్రసాదరావు పేతృక గమస్తప్రదేశమును వి ధర్మముగా పరిపాలించు మహారాజు ఆతురముగ అనుభవించు దుర్భరతను తెలుపుచు నవ్వును ఏడ్పును మిశ్రితముచేసి నటించుతీరు అపూర్వమైనది

"చిత్రనళీయము"లో నలుడుగను బాహుకుడుగను ప్రసాదరావు వేషములు వేయుచుండెడివాడు చిత్రనళీయ నాటకకర్తయైన ధర్మవరం రామకృష్ణమాచార్యులు ప్రసాదరావు ధరించిన నలభూమికను తామూహించిన విధముగా పోషించుటజూచి ముగ్ధులై నాటకప్రదర్శనము మధ్య రంగస్థలమెక్కి తనను ప్రేక్షకులకు పరిచయముచేసికొని నిండు మనస్సుతో ప్రసాదరావును ఆశీర్వదించినాడు

"సారంగధర" నాటకమున సారంగధరుడుగా నటించుచు "పావురముల నెగడయుదము బాలికా!" అని పాడుచు తోడి బాలురతో విహరించుసందర్భమున వయసుమళ్లిన ఆయన యువకేంద్రుల నివలె చంగుచంగున యెగురుచు చాకచక్యమును ప్రదర్శించి ప్రేక్షకుల ప్రశంసలనుపొందినాడు

చరమదశవరకు ఆ మహోదయుడు తన అపూర్వనటనావైదుష్యముతో ప్రేక్షకులను ఆనందడోలికలలో ఓలలాడించి తెలుగు నాటకరంగమును తేజోవంతమొనరించి భావినటులకు ఆ మార్గమునను గమనమొనర్చినాడు ఆంధ్రప్రజలు ఆయన యెడలగల గౌరవప్రపత్తులను ప్రదర్శించుచు "ఆంధ్రనాటకపితామహ" యను బిరుదమును ప్రసాదించియు గండపెండేరమును బహూకరించియు ఏనుగపై ఊరేగించియు సత్కరించినారు ప్రసాదరావునకు ఆంధ్రదేశమున అఖండఖ్యాతి తెచ్చిపెట్టినది ఆతని హరిశ్చంద్రభూమిక

ప్రసాదరావునకు నస్యము పీల్చు అలవాటుండుటచే రంగస్థలమున కొన్నిశబ్దములను ముక్కుతో ఉచ్చరించుచుండెడివాడు దానివలన ఆయన సంభాషణలలో కొంతదోషము కనిపించినను అనన్యసామాన్యమైన అతని నటనా చాతుర్యము ముందు అదియొక లోపముగ భావింపబడెడిది కాదు

సుమారు అర్ధశతాబ్దికాలము ఆంధ్రనటలోకమున నటపితామహుడుగను, నాటకకళయందు నవశకనిర్మాతగను వెలుగొందిన హరిప్రసాదరావు 1936 అక్టోబరు 7వ తేదిన స్వర్గస్థుడై ఆంధ్రనాటకకళాలక్ష్మికి తీరనిలోటు కలిగించినాడు

వు వెం

## హర్షవర్ధనుడు (క్రీ శ 606-647)

హర్షవర్ధనుడు భారతదేశమును పాలించిన పూర్వచక్రవర్తులలో గణనీయుడు గుప్తసామ్రాజ్యపతనానంతరము భారతదేశము అల్లకల్లోలముగాగా అందు కొంతభాగము హూణుల వశమయ్యెను ఉత్తరాపథమున పెక్కురురాజులు పరస్పర కలహములలో మగ్నులైరి ఇట్టితరుణమున హర్షుడుదయించెను ఉత్తరాపథమునెల్ల జయించి అచటనొక మహాసామ్రాజ్యమును స్థాపించి ప్రజారంజనమున సుప్రసిద్ధుడై సర్వమతస్థులను తుల్యదృష్టితో జూచుచు స్వయముగ మహావిద్వాంసుడును కవియునై విద్వత్కవులపాలిటి కల్పభూజమై అఖండకీర్తివలయితుడై వరలిన మహాపురుషుడు హర్షవర్ధనుడు

హర్షునితండ్రి ప్రభాకరవర్ధనుడు, తల్లి యశోమతీదేవి హర్షుని బాల్య విద్యాభ్యాసాదులనుగూర్చిన విశేషములు తెలియవచ్చుటలేదు యుక్తవయస్సున క్షత్రియోచితములైన శస్త్రాస్త్రవిద్యల నభ్యసించి దృఢకాయుడై వరలినవాడతడు అతనికి శౌర్య ధైర్యసాహసములు వెన్నతోబెట్టిన విద్యలయ్యెను బాల్యముననే మృగయావినోదమున కడుదిట్టగా పేరొందెను

తండ్రిమరణము తల్లియొనర్చిన భర్తృసహగమనము చెల్లెలైన రాజ్యశ్రీ భర్తయగు గ్రహవర్మ దుర్మరణము రాజ్యశ్రీకి ఘటిల్లిన కారాగారవాసము పిదప వింధ్యాటవీప్రవేశము గౌడరాజొనర్చిన కుట్ర కారణముగ అన్నయగు రాజ్యవర్ధనుని అకస్మాక్ మరణము - ఈ క్లిష్టఘటనలన్నియు హర్షుని దుఃఖభారాక్రాంత మనస్కునొనర్చెను కాని ధైర్యశాలియగు అతడు అనుమంతయు చలింపక, ప్రజాభీష్టముకు గౌరవించి క్రీ శ 606 వ సంవత్సరమున స్థానేశ్వర, కాన్యకుబ్జరాజ్యములకు ప్రభువయ్యెను రాజ్యాభిషిక్తుడవ్వుటయేతడవుగ శత్రుమండల దిగునావశ్యకతను గుర్తించి అతడు దైత్రయాత్రాపసన్నద్ధుడయ్యెను

5000 గజబలముతో 2000 అశ్వికబలముతో 50 000 పదాతులతో దైత్రయాత్రకు వెడలి అవిశ్రాంతముగా ఆరు సంవత్సరములు యుద్ధములనొనర్చెను. అప్పటినుండి యుద్ధసంకరములు గాని తొలగింపబడుట కవకాశమొసగని శక్తిశాలుడు హర్షవర్ధనుడు అతడు ప్రప్రథమమున శత్రుభీకరుడైన కామరూపాధీశుడగు భాస్కరవర్మవంశ అనూల్యులగు కాన్కలను గ్రహించి అతనితో సంధినొనర్చుకొనెను ఎదప అతడు సింధు నేపాళ కాశ్మీరములను జయించెను ప్రాక్పశ్చిమప్రాంతము లందలి రాజన్యులతో పోరాపోరిపోరాడి పంచహిందూ రాజ్యమును స్వాధీనమొనర్చుకొనెను అనంతరము పుండ్రనగరముపై దండెత్తి శశాంకునోడించి అతనిని తనరాజ్యమును దాటిరావలదని శాసించెను హిమాచల మీపగతమైన దుర్గరాజ్యమును స్వాయత్తము గావించుకొనెను పశ్చిమమునగల వలభీదేశాధిపతియగు ధ్రువసేనునోడించి అతనికి తన కూతునిచ్చి వివాహమొనర్చి అతనిని తనసామంతునిగ జేసికొనెను తదనంతరము పశ్చిమమునమున్న చిన్నరాజ్యములతడు సులభముగ జయించెను

హర్షుడు తనగజబలమును అరువదివేలవరకును అశ్వికబలమును లక్షవరకును వృద్ధిచేసికొనెను తనపేరనొక శకమును స్థాపించి సమస్తరాజన్యులచే సార్వభౌమపదము స్వీకరించిన అతడు ఉత్తరాపథమును జయించి దక్షిణ పథమునకు పోవయత్నింపగా అత్యంతసమర్థుడైన పశ్చిమచాళుక్యరాజగు రెండవపులకేశి నర్మదాతీరమున హర్షునెదుర్కొని అతనికి తీరని పరాజయమును కల్పించెను అంతటితో హర్షుని దక్షిణదిగ్విజయసంరంభ మాగిపోయెను గౌడరాజగు శశాంకుని మరణమునకు పిమ్మట క్రీ శ 637 లో హర్షుడు ఉత్తరవంగదేశమును ముట్టడించి మగధలో తనఅధికారమును స్థాపించుకొనెను క్రీ శ 643లో అతడు గంజాముప్రాంతమునుకూడ జయించెను హర్షుడు శాంతిభద్రతలతో అఖండరాజ్యపాలన మొనర్చెను అతనిరాజ్యము ఉత్తరమున హిమాలయపర్వతములనుండి దక్షిణమున నర్మదానదివరకును, పశ్చిమమున వలభినుండి తూర్పున గంజామువరకును వ్యాపించియుండెను

హర్షచక్రవర్తి రాజ్యపాలనకళయందు కూడ కడుం

గల రతుడు తన విస్తృతరాజ్యమున తరచుగ తృణనిర్మితము లైన గుడారములందు ప్రచ్ఛన్నుడై నివసించుచు శిబిరము నుండి శిబిరమునకు సంచరించుచు ప్రజలకష్టములనరయుచు న్యాయ మొనర్చుచుండు దయామయుడు అతని ప్రయాణ సన్నాహ సూచకముగ ఢంకాలు ప్రయోగించబడుచుండెడి వట. అతడు స్వీయరాజ్య వృత్తాంతములను చీనాప్రభృతి దేశాంతర వృత్తాంతములను చారులవలన తెలిసికొనుచుండెడి వాడట.

పగటిని మూడుభాగములుగను చర్చి అందొక భాగమును రాజకీయ విషయములకును శేషించిన భాగములను మత ధార్మికాది విషయములకును హర్షుడు వినియోగించుచుండెను అనలసుడై నిద్రాహారములకు దర్శించియు రాజకీయాది విషయములను జాగరూకుడై అతడు పర్యవేక్షించుచుండెను మంత్రిపరిషత్తువలన రాజకీయాంశములందు సలహాలను స్వీకరించెడివాడు. రాగు శాసనములను చెక్కి భద్రపరచువారు వాటిని విషయాధిపతులకందిచ్చువారు హర్షునిచే అధికృతులై యుండిరి.

హర్షుని రాజ్యమునకు రాష్ట్రము దేశము మండలము అను నామములు వ్యవహారమునందుండెను రాజ్యము గ్రామములు గా [illegible] విషయములుగా భుక్తులుగా (provinces) విభజింపబడినవి. భుక్తులందు రాజకుమారులు అధికారులుగా నియుక్తులగుచుండిరి. వీరికి ఉపరికమహారాజులని పేర్లు. ఈ యధికారులు తమ విషయాధిపతుల పేర్వరచుకొనుచుండిరి. వీరికి అయుక్తపురుషులనియు వినియుక్తపురుషులనియు నామములుండెను. ఈయుద్యోగులకు మహాసామంతులు మహారాజులు ప్రమాతారులు, రాజస్థానీయులు, కుమారామాత్యులు, విషయపతులు అను పేర్లుండెడివి. విషయపతులు నేటి కలెక్టరుల వంటివారు. వీరికార్యస్థానములకు అధికరణములను పేర్లుండెను. వీరందు పట్టణములకు అధిష్ఠానములని పేరు. వీరు పట్టణములందు దండనాథులను నియమించుచుండిరి. గ్రామములలో గ్రామికులు అష్టకులాధికరణులు ఉండెడివారు. అరణ్య దుర్గసంరక్షకులు కూడ నియుక్తులవుచుండిరి. భూమిపన్నులను వసూలుచేయు అధికారులు భాండాగారరక్షకులు సర్వవిషయ పర్యవేక్షకులు సర్వాధ్యక్షులుగూడ నుండిరి. జనసంఘములు, నగరశ్రేణులు ఏర్పడియుండెను. పార్థివాపాలు సందేశహారులు నియమింపబడుచుండిరి.

ఈ చక్రవర్తి రాజభూమును నాల్గుభాగములుగ చేసె. మొదటి భాగాదాయమును రాజ్యపరిపాలనమునకును రెండవ భాగాదాయమును మంత్రిసభ్యతుల సంరక్షణమునకును మూడవ భాగాదాయమును ప్రతిభవంతులను గౌరవించుట కొరకును నాల్గవభాగ యమును ఎల్లమతస్థుల పోషణము కొరకును వినియోగించెడివాడు. సదీకరణవిధేయమున సుంకములు లేకుండెను. ప్రజలో రగుచున్న వారికి శ్రమానుసారము ఇయ్యకుండెను. రేవులవద్ద వస్తువులపై సుంకము వసూలు చేయబడుచుండెను. మనునశాసనమునుబట్టి తూనికల కొలతల వివరములు అవగతమగుచున్నవి. కొన్ని రకముల పన్నులు బంగారము రూపమునగూడ వసూలు చేయబడుచుండెను.

యుద్ధసామగ్రిని మోయుటకు ఒంటెలు ఉపయోగింపబడుచుండెను. సైన్యాధికారులుగ సేనాధిపతులు మహాసేనాధిపతులుండిరి. సంధివిగ్రహాది తంత్రనిర్ణాయకులు యుద్ధభాండాగారరక్షకులు గజవైద్యులు సేనాశిబిరరక్షకులు నియుక్తులగుచుండిరి. రాష్ట్రీయహద్దులను రాజప్రసాదములను పరిరక్షించుట సైనికుల విధ్యుక్తధర్మము. ధైర్యసాహసోపేతమైన రాష్ట్రసైనికదళ మొకటి చక్రవర్తికి ఎల్లవేళల తోడ్పడుచుండెను. బల్లెములు ధనుస్సులు శరములు ఖడ్గములు యుద్ధసాధనములుగ నుండెను. రాజమార్గరక్షకులు, గ్రామక్షేత్రపాలకులు నియుక్తులై యుండిరి. ఇన్ని రక్షణకట్లుబాట్లు చేయబడినను చోరభీతి అపుడపుడు కల్గుచుండెడిదట. ఇందు కుదాహరణముగ ప్రఖ్యాతచైనాయాత్రికుడగు యువాన్ చ్వాంగును పంజాబులో ఏదో దొంగలు తటమి పట్టుకొని అతని ఆస్తిని అపహరించిరట.

ఆనాటి న్యాయశాస్త్రము చౌర్యమునకు తీవ్రదండనమును విధించెనేగాని హర్షచక్రవర్తి దయామయుడగుటచే దోషులకు సులభదండనమునే విధించుచు ప్రజల మన్ననలను చూరగొనెడివాడు. అతనిపాలనములో జనులు ఋజువర్తనము గలవారై యుండిరట. అవినీతులను దండించు "వినయస్థాపకు" లుండిరట. రాజద్రోహులకు మరణదండనము అవినీతిపరులకు హస్తపాదఖండనము విధింపబడుచుండెను.

హర్ష చక్రవర్తి నాణెముల కొకవైపున సింహాసనాధిష్ఠిత యగు దేవతయొక్క ప్రతిమయు, రెండవవైపున ఒక అశ్విక విగ్రహమును చిత్రింపబడియుండెను. దానిక్రింద 'హర్షదేవ'

ఘటిల్లెను. హర్మ్యనిర్మాణశిల్పము ప్రవృద్ధమయ్యెను. రాజమార్గములు రహదారులు నిర్మితములయ్యెను. ప్రజలు ధనధాన్యసమృద్ధితో విజ్ఞానసంపత్తితో తులతూగుచుండిరి.

అతని గుణములన్నియు అతని మహాచక్రవర్తిత్వము సార్థకమని నిరూపించుచున్నవి. అశోకుని యొక్కయు సముద్రగుప్తుని యొక్కయు ఉత్తమగుణములు హర్షునియందు సమ్మిశ్రితములైనవి. అశోకునివలె ఇతడు తన ప్రజల ఆర్థిక నైతిక సంపత్సమృద్ధికొరకై నిరంతరము పాటుపడినవాడు. సముద్రగుప్తునివలె ఇతడు మహత్తర జిగీషాసంశోభితుడయినవాడు.

హర్ష చక్రవర్తి సంతానవిహీనుడై క్రీ. శ. 647వ సంవత్సరమున దివంగతుడయ్యెను.

గ. ల.

## హాలుడు :

ఆంధ్ర వంశమునకుచెందిన శాతవాహనులలో హాలుడని నామాంతరము గల ఈతని శాలివాహనుడనికూడ పేరు కలదు. ప్రతిష్ఠానపురమును రాజధానిగగొని రాజ్యము చేసెను. బృహత్కథాకర్తయగు గుణాఢ్యుడు మహావైయాకరణుడగు శర్వవర్మ మొదలగువారు ఈతని ఆస్థానపండితులుగనుండిరి. వారు సంస్కృత ప్రచారనిమిత్తమై విక్రమాదిత్యుడు ప్రయత్నించెనో శాలివాహనుడావిధముగ ప్రాకృతభాషాసాహిత్యప్రచారమునకై పాటుపడెనని భోజవిరచితమగు సరస్వతీకంఠాభరణమునందలి ఈక్రింది శ్లోకమున చెప్పబడినది.

"కేఽభూవన్నాఢ్యరాజస్య రాజ్యే ప్రాకృతభాషిణః, కాలే శ్రీసాహసాంకస్య కే న సంస్కృతవాదినః" (2-15)

అఢ్యరాజః-శాలివాహనః-సాహసాంకః-విక్రమాదిత్యః' అని వ్యాఖ్యాతలు. శాలివాహనుడు తన అంతఃపురమునందు ప్రాకృతమునందే వ్యవహరించెనని రాజశేఖరుడు తన కావ్యమీమాంసలో వ్రాసినాడు. ఈతడు క్రీ. శ. 69వ సంవత్సరప్రాంతమువాడని కొందరి అభిప్రాయము.

హాలుడు చిరకాలమునుండియు ప్రచారములోనున్న కొందరు ప్రాచీనమహాకవుల ప్రాకృతగాథలనుండియు సమసామయికులగు కవులగాథలనుండియు ఉత్కృష్టములగు 700 గాథలను ఏర్చి గాథాసప్తశతి (గాథా సప్తశతి) అనునొక సంకలనగ్రంథమును కూర్చెను. మహారాష్ట్రీప్రాకృతములో నున్న ఈగాథలన్నియు ఉపమారూపకాద్యలంకారసుశోభితములై ధ్వన్యర్థప్రధానములై ఒప్పుచున్నవి. కోటి ప్రాకృత గాథలనుండి 700 గాథలను ఏరి ఈ గాథాసప్తశతి కూర్పబడినదని హాలుడే గ్రంథప్రారంభమున ఇట్లు చెప్పెను. "సత్తసఆఇం కఇవచ్ఛలేణ కోడీఅ మజ్ఝఆరమ్మి హాలేణ విరఇఆఇం సాలంకారాణ గాహాణం" ఈగాథాసప్తశతి ఆలంకారికులగు పలువురుమహాకవుల మన్ననలనందినది. మమ్మటాదులీ గ్రంథమునుండి ఎన్నియో గాథలను వివిధ ధ్వనివిశేషములకుదాహరణములుగ చూపిరి.

గాథాసప్తశతి శృంగారరసప్రధానము. అందుచే ఇందు నాయికానాయకుల వర్ణనములు అత్యధికముగ కన్పట్టును. ప్రసంగవశముచే సాధ్వి కులట పతివ్రత వేశ్య స్వకీయ పరకీయ సరియస్త్రీల చపలస్వభావ మొదలగు వివిధనాయికల మనఃప్రవృత్తులు చక్కగ చిత్రింపబడినవి. ప్రేమకు సంబంధించిన విభిన్నరసములు ఎంతయో మనోహరముగ వర్ణింపబడినవి. ప్రసంగమునకనుసరించి వర్షధారలు మయూరనృత్యములు కమలవనములు పెనుయెండ్లు గ్రామ్యజీవనము పచ్చని పంటపొలములు వింధ్యపర్వతము నర్మదానది గోదావరి మొదలగు ప్రాకృతికదృశ్యములుకూడ కండ్లకుకట్టినట్లు ఉపస్థాపితములైనవి. అట్లే పల్లెయందున్న హాలికోత్సవము మదనోత్సవము వేషభాషలు ఆచారవిధానములు, నోములువ్రతములు మొదలగునెన్నియో సాధారణజనులకు సంబంధించిన విషయములుకూడ ప్రతిపాదితములైయున్నవి. పారలౌకికచింతన యనునదిలేక కేవలము ఐహికవిషయములకు మాత్రమే సంబంధించిన కావ్యమిట్టిది మరియొకటి లేదని చెప్పినచో అతిశయోక్తి లేదు. ఈగాథాసప్తశతిపై మనకు పదునెనిమిది వ్యాఖ్యలు వెలువడినవన్నచో దానిప్రచురప్రచారము స్పష్టమగును. కొందరు జైనపండితులు కూడ దానిపై వ్యాఖ్యలు వ్రాసిరి.

గాథాసప్తశతిలోని చమత్కారపూర్ణవర్ణనములకు రెండు మూడుదాహరణములు: పురిసాయచ్చిఅ ఏఅఆఏహ ఇసో పిఅజ్జతాముఅరం సంమీలిఅదావాణఅం తుఇఅవి ఏహాంవలో ఇస్సం "

"ఓ చామనేత్రమా! నీవు అడుగుటచే పరదేశమునకు పోయిన ప్రియకముకు నేడు తిరిగివచ్చినచో కుడికన్నుమూసి నీతోడనే అతనిని చూడగలను "

అజ్జంగఅ త్తి అజ్జంగఅ త్తి అజ్జంగఅ త్తి గణిరీఏ పఢమ
దిఅహద్దే కుడ్డో రేహాహి చిత్తలిఓ ॥

ఈరోజుగడచినది ఈరోజుగడచినది 'ఈరోజుగడచి నది' అని దివసములను రేఖలచే లెక్కచూచు బాలిక దివస ప్రథమార్థమునందే గోడనంతను రేఖలతో నింపివేసెను"

ణి క్కమ్మాహి చ్చేత్తాహి పామరో ణేఅ వచ్చఏ వసహం ము అపి అ జాఆసుణ్ణఘర గేహదుక్ఖం పరిహరన్తో ॥

"భార్యా మరణముచే శూన్యమగు గృహము నందలి దుఃఖమును మరచుటకై పామరుడు పొలమునందు పని యేమియు లేకున్నను ఇంటికి పోవుటలేదు"

ఈవిధముగ హాలుడు అతిమనోహర వివిధభావసంపన్నము లగు గాథలను గాథాసప్తశతియందు సంగ్రహించియున్నాడు కాని ఈగాథాసప్తశతినిగూర్చియు తత్సంగ్రహకర్తయగు హాలుడు-వాని కాలాదికమునుగూర్చియు పండితులలో విభిన్నాభిప్రాయములుగలవు

దండికావ్యాదర్శమునందు సర్గబద్ధమగు మహాకావ్యమునుగూర్చి ముచ్చటించి, ఎమ్మట కోశమను నొక కావ్యవిశేషముకూడ ఉన్నదనియు ఇందు పరస్పరనిరపేక్షము లగు శ్లోకములు సంగృహీతములై యుండుననియు కోశశ్లోకసమూహస్య స్యాదన్యోన్యానపేక్షిణః అని పేర్కొనియున్నాడు అట్టి కోశములజాతికి చెందిన గాథాకోశ మనెడు నొక గ్రంథవిశేషమునుగూర్చియు తద్రచయితయగు హాలునిగూర్చియు బాణభట్టు ఉద్యోతనసూరి అభినందుడు రాజశేఖరుడు హేమచంద్రుడు జినప్రభసూరి మేరుతుంగుడు సోడ్ఢలుడు రాజశేఖరసూరి యనువారు ఏడవశతాబ్దిమొదలు పదునాల్గవశతాబ్ది వరకుచెందినకవులు తమగ్రంథములందు పేర్కొనియున్నారు కాబట్టి ఈకోశము అతివిస్తృతమగు గ్రంథమని స్పష్టమగుచున్నది

గాథాకోశము నాల్గుభాగములుగ విభజింపబడియున్నదని ప్రమాణాంతరములచే తెలియుచున్నది కాని గాథాసంగ్రహాపరనామధేయమగు గాథాకోశము లభ్యముకాకుండుటచేతను, రచయితనామము హాలుడేయగుటచేతను నేడు ప్రసిద్ధముగ ఉపలభ్యమానమగు గాథాసప్తశతియే ఆగాథాకోశమనెడు భ్రాంతి చాలమంది పండితులలో వ్యాపించినది దీనిచే గాథాసప్తశతికర్తయగు హాలుడు క్రీశ ప్రథమశతాబ్దమునకు చెందినవాడని వీరు భావించుచుండిరి కాని గ్రంథమునందలి అంతరంగిక ప్రమాణములననుసరించి కీత్ పండితుడు ఈగ్రంథము ద్వితీయ పంచమశతాబ్దముల మధ్యకాలమునకు సంబంధించి యుండవలెననియు వెబర్ పండితుడు తృతీయ సప్తమశతాబ్దముల మధ్యకాలమునకు సంబంధించి యుండుననియు భండార్కర్ పండితుడు ఆరవశతాబ్దికి చెందినదనియు మిరాశీ పండితుడు ఎనిమిదవశతాబ్దికి చెందినదనియు ఈవిధముగ భిన్నాభిప్రాయములను తెలిపియున్నారు దీని పట్టి గాథాకోశసంగ్రహకర్తయగు హాలునకును గాథాసప్తశతీసంగ్రహకర్తయగు హాలుడను వ్యక్తికిని భిన్నవ్యక్తులని స్పష్టమగుచున్నది ఇంతేకాక గాథాకోశకర్తయగుహాలుడు హైందవ మతావలంబియనియు ఆగ్రంథమునందలి తెలియుచున్నది కాని సప్తశతీకర్త హిందూమతావలంబియని అందలిగాథలనుబట్టి తెలియును

బాణభట్టాదులు కూడ గాథాకోశమును గూర్చియే ముచ్చటించిరిగాని, గాథాసప్తశతినిగాని దానియందు ఏడువందలగాథలుమాత్రమే యున్నవనిగాని చెప్పియుండలేదు పదునాల్గవశతాబ్దికి చెందిన మేరుతుంగుడు ప్రప్రథమముగ గాథాసప్తశతినిగూర్చి ముచ్చటించెను అందుచేతగూడ ప్రాచీనులగు బాణాదులకు తెలిసినది గాథాకోశమేయనియు గాథాసప్తశతి చాలఅర్వాచీనమనియు ఊహింపవచ్చును కావున వాటి రచయితలగు హాలులుకూడ భిన్నవ్యక్తులు కావలెను

అతిప్రాచీనమగు గాథాకోశమునకు సంపాదకుడగు హాలుడు శాలివాహన శాతవాహనాద్యపరనామధేయులగు దాక్షిణాత్యరాజై యుండును ఇతనితరువాత దాదాపు తొమ్మిదిశతాబ్దులు గడచిన ఎమ్మట మేవాడ్ నందలి గుహిలోత వంశమునకు చెందిన నరవాహనునిపుత్రుడగు శాలివాహనుడు, హాలాపరనామధేయుడై ప్రాచీనహాలనిర్మితగాథాకోశము నుండియు ఇతరగ్రంథములనుండియు శృంగారరసప్రధానము లగు ఏడువందలగాథలను సంగ్రహించి గాథాసప్తశతిని రచించెనని విమర్శకుల యభిప్రాయము ఈవిధముగ క్రీస్తుశకప్రారంభమునందలి ఆంధ్రవంశమునకు చెందిన హాలుడు గాథాకోశమును, పదవశతాబ్దమునకుచెందిన మరియొకహాలుడు గాథాసప్తశతిని రచించిరి

వి శ్రీ

## హాలెండు (చ)

హాలెండు పశ్చిమోత్తర ఐరోపాయందొక చిన్నదేశము. ఈ దేశీయులు మాటాడుభాష డచ్ అనబడును. క్రీ శ 1581లో ఇది డచ్ రిపబ్లిక్ అను పేరుతో స్వాతంత్ర్యమును ప్రకటించుకొనువరకు దీనిని బెల్జియమ్‌దేశముతో కలిపి నెదర్లాండ్స్ అని పిలిచెడివారు. దీని వైశాల్యము 33 397 చ. కిలోమీటర్లు, జనాభా 1 15 26 200. రాజధాని ఆమ్‌స్టర్‌డామ్.

పూర్వచరిత్ర: క్రీ పూ 57 సంవత్సరములో జూలియస్ సీజరు నెదర్లాండ్సుపై దండెత్తి దానిని జయించిన నాటినుండి సుమారు 3½ శతాబ్దులు ఇది రోమనుసామ్రాజ్యమునందుండి క్రీ శ 4వ శతాబ్ది ఆరంభమున దీనిని ఫ్రాంకులను జర్మను జాతీయులు జయించి నాలుగు శతాబ్దులపాటు పాలించిరి. క్రీ శ 814లో చార్లమెన్ ప్రభువు మరణానంతరము ఫ్రాంకు సామ్రాజ్యము విచ్ఛిత్తి కాగా నెదర్లాండ్సులోని ఉత్తరప్రాంతమును జర్మనీ, దక్షిణప్రాంతమును ఫ్రాన్సు ఆక్రమించినవి. నాటినుండి ఈ దేశములో భూస్వామ్యవిధానము క్రమాభివృద్ధినందెను. ఆ కాలములో అనేక జమీందారీలు తలయెత్తి వృద్ధిచెందినవి.

బర్గండి ప్రభువుల పాలన: క్రీ శ 1284లో బర్గండివంశస్థుడగు ఫిలిప్ ఫ్లాండర్స్, ఆర్టాయిస్ ప్రాంతములకధిపతియయ్యెను. బర్గండి ప్రభువులు శక్తియుక్తులచే తమ అధికారమును పొరుగు సంస్థానములపై విస్తరించిరి. 1467లో చార్లెస్ తన ప్రభుత్వమును అన్నివిధముల కట్టుదిట్టముగావించెను. 1477లో అతడు నాన్సీయుద్ధములో మరణించగా అతని ఏకైక పుత్రికయగు మేరీ అధికారమును స్వీకరించెను. రాజ్యమంతట గందరగోళముగా నుండెను. ఈమె పాలనలో సంస్థానాధిపతులు సమైక్యతతో వ్యవహరించి ఆమెనుండి పెక్కు హక్కులను పొందిరి. ఆస్ట్రియాలోని హాప్స్‌బర్గువంశపు చక్రవర్తియగు 1వ మాక్సిమిలానును ఈమె వివాహమాడెను. 1482లో ఈమె మరణించగా పుత్రుడగు 1వ ఫిలిప్పును మాక్సిమిలాను బర్గండి సింహాసనముపై కూర్చుండబెట్టెను. నాటినుండి హాలెండు దేశము హాప్స్‌బర్గురాజుల ఏలుబడిక్రిందికి వచ్చినది.

హాప్స్‌బర్గుల పాలన: 15 6 సంవత్సరములో నెదర్లాండ్సుపాలనాధికారమును మాక్సిమిలాన్ దౌహిత్రుడగు 5వ చార్లెస్ వహించెను. ఇతడు ప్రజలను పీడించుటచే వారు ప్రతికూలురైరి. ప్రజలకును ప్రభుత్వమునకును సంఘర్షణములు కూడ జరుగుచుండెను.

అతని ఎమ్మట 1556 నుండి 1598 వరకు ఈ దేశమును పాలించిన అతని పుత్రుడు రెండవ ఫిలిప్ పాలనకూడ హాలెండువారికి దుర్భరమనిపించెను. ప్రముఖస్థానములందున్న హాలెండువారిని పదవీభ్రష్టులగావించి స్పెయినువారిని వారిస్థానములలో నియమించి నిరంకుశముగ పాలింపసాగెను. ప్రొటెస్టెంటుమతవ్యాప్తిని అరికట్టుచు పెక్కురు ప్రొటెస్టెంటుమతానుయాయులను ఉరితీయించెను. ఆతనితో విసిగి వేసారిన ప్రజలు ఆరంజి వంశీయుడగు విలియమ్ నాయకత్వమున ఆందోళనము చేయగా ఫిలిప్ దానిని అణచివేసెను. దేశబహిష్కృతులైన హాలెండు దేశీయులు సాయుధులై ఫిలిప్పునకండగానుండిన స్పెయిను వ్యాపారనౌకలను కొల్లగొట్టి స్పెయినుసైన్యములను తరిమి పెక్కునగరములను స్వాధీనపరచుకొనిరి. విముక్తమైన ప్రాంతములకువారు విలియమును పాలకునిగ ఎన్నుకొనిరి.

విప్లవకారులచే జయింపబడిన పట్టణములను స్పెయినువారిసహాయముతో ఫిలిప్ తిరిగిస్వాధీనపరచుకొని ప్రజలమీద తన పాలనను సాగించి అణచజూచెను; కాని కృతకృత్యుడు కాలేదు. స్పెయినువారు హాలెండులో గావించిన దారుణకృత్యములు డచ్చిప్రజలనొక్కుమ్మడిగ మేల్కొల్పినవి. తమ దేశమునకు విముక్తి కల్గువరకు నిర్విరామముగా కృషిచేయుటకు వారు దీక్ష వహించిరి. 157 లో డచ్చి గవర్నరైన అలెగ్జాండర్ ఫార్నెస్ క్యాథలిక్ మతాభిమానులైన దాక్షిణాత్యులను చేరదీసి, ప్రొటెస్టెంటులైన ఉత్తరాదులను అలక్ష్యముతో పాలింపదొడగెను. ఈ ద్వివిధానముచే ఉత్తర దక్షిణరాష్ట్రములమధ్య వైమనస్యములు పొడసూపెను. ప్రొటెస్టెంటు ప్రతినిధులు 1581లో సమావేశమై డచ్చిస్వాతంత్ర్యసమరమును తామే కొనసాగింప నిశ్చయించిరి. 1581 జులైలో వీరు డచ్‌రిపబ్లిక్ అను పేర తమస్వాతంత్ర్యమును ప్రకటించుకొనిరి.

ఆరంజి వంశీయుల పాలన: ప్రజాస్వామ్యరాజ్యస్థాపనానంతరము హాలెండు, స్పెయినుతోగల సంబంధములను త్రెంచుకొనినది. విలియమ్ ఆధ్వర్యమున హాలెండునకొక స్వతంత్రరాజ్యాంగము రూపొందినది. 1584లో విలియమ్ హత్యగావింపబడగా అతనిపుత్రుడు మారిస్ రిపబ్లికునకు అధ్యక్షుడయ్యెను. అప్పటినుండి డచ్చివారు స్పెయినుతో పోరుచునేయుండిరి. 1596లో హాలెండులోని కొన్నిప్రాంతములు మరల స్పెయినుకు స్వాధీనమైనవి. 1639లో స్పెయిను యుద్ధనౌకాదళము ఆంగ్లేయులచే పరాజయమగుట డచ్చివారికి లాభదాయకమైనది.

ఈయనకుమారుడు మారిస్ తనసేనలను సమాయత్తమొనర్చుకొని స్పెయిన్ సైన్యమును తరిమిగొట్టెను 1596లో ఇంగ్లండు ఫ్రాన్సులతోకలసి హాలెండు ఒకకూటమినేర్పరచుకొనగా 1609లో డచ్చిస్వాతంత్ర్యమును స్పెయిను గుర్తింపవలసివచ్చినది

1621లో తిరిగి డచ్చి - స్పెయినుదేశములనడుమ యుద్ధజ్వాలలు ప్రజ్వరిల్లగా ఇంగ్లండు ఫ్రాన్సుదేశముల సహాయముతో హాలెండు దీర్ఘకాలము స్పెయినుతోపోరాడి విజయము సాధించితనస్వాతంత్ర్యమునకు సుస్థిరత చేకూర్చుకొనెను ఈ యుద్ధములో స్పెయిను పూర్తిగా చితికిపోయినది నాటినుండి హాలెండు పాటిరాజ్యములలో నొకటిగ గుర్తింపబడినది

17వ శతాబ్దిలో హాలెండు తనవర్తకవ్యాపారములపై దృష్టిని కేంద్రీకరించి బ్రిటిష్ పోరుగునదేశములతో పోటీపడి వానితో యుద్ధములుగూడ చేయుటకగుమార్గము అట్లే స్పెయిను అధీనమందున్న హాలెండుభూభాగముల నాక్రమించ యత్నించుచున్న ఫ్రాన్సుతోకూడ డచ్చివారు పోరాడవలసివచ్చినది ఇవానుముఖముగ ఇట్లు నిరంతరము యుద్ధములు చేయుటచే హాలెండు ఆర్థికస్థితి నీరసించినది అయినను అది ఐరోపారాజకీయములలో ప్రాశస్త్యముకల్గించుకొనెను ప్రజల యోగక్షేమముల వరయలేకుండెను ప్రజలలో నిరాశానిస్పృహలు పెల్లుబుకుచుండెను ఈస్థితిలో ఫ్రెంచివిప్లవప్రభావము డచ్చిప్రజలహృదయములపై హత్తుకొనగా ప్రభుత్వమునకు ప్రతికూలముగ" వారు దేశభక్తవర్గము"ను నిర్మించిరి హాలెండు ప్రజలు రెండువర్గములుగ చీలిరి దీనినవకాశముగా తీసికొని 1795లో ఫ్రాన్సు హాలెండును జయించి "దేశభక్తవర్గము"తో కలిసి ప్రభుత్వమును 'బటేవియన్ రిపబ్లిక్' అనుపేర పునర్వ్యవస్థీకరించినది 1806లో నెపోలియను దానినొక ప్రత్యేకరాజ్యముగ చేసి తనసోదరుడైన లూయీని రాజుగ చేసెను తనచెప్పుచేతలలోనుండకపోవుటచే అతనిని నెపోలియను తొలగించి ఆరాజ్యమును 1810లో ఫ్రెంచిసామ్రాజ్యములో కలిపివైచెను

నెపోలియను వాటర్లూ యుద్ధములో పరాజితుడైన పిదప 1815లో జరిగిన వియన్నాసమావేశమున హాలెండు మరల ఆరంజివంశస్థుడగు 1వ విలియమ్ప్రభువునకీయబడినది; బెల్జియముకూడ హాలెండులో చేర్చబడినది కాని 1839లో జరిగిన లండన్సమావేశమందు హాలెండు బెల్జియము దేశములు రెండును వేర్వేరు స్వతంత్రరాజ్యములుగా వ్యవహరించునట్లామోదింపబడినది

1848లో జరిగినఫ్రెంచివిప్లవమువలన హాలెండు రాజకీయములలో ఉదారభావము వ్యాప్తిగాంచెను 1849-90వరకును రాజ్యాధికారమునవహించిన 3వ విలియమ్ కాలములో హాలెండుప్రజలు రాజకీయములందు చొరవగా పాల్గొననారంభించిరి

3వ విలియమ్ అనంతరము అతని పుత్రిక విల్హెల్మినా పాలనములో హాలెండు ప్రథమ ద్వితీయప్రపంచసంగ్రామములను చవిచూడవలసివచ్చెను ప్రథమసంగ్రామములో ఈ దేశము తటస్థవిధానమునవలంబించగా అనుమతించక బ్రిటను హాలెండుపై వర్తకపుటాంక్షలు విధించినది ఫలితముగా హాలెండు పలువిధములగు బాధలకు గురైనది ప్రజల ఆర్థికస్థితి స్థాయి తరిగిపోయినది హాలెండుప్రభుత్వము పెక్కురను నిరుద్యోగమునకు గురిచేసినది పోషించుటకు ప్రభుత్వము ప్రణాళికలు ద్వారా ... ఫలితముగా సోషల్ డెమోక్రాటు పక్షము ప్రభుత్వములో ప్రాతినిధ్యము పొందగల్గెను

హిట్లరు హాలెండుపై దురాక్రమణ జరిపినపుడు హాలెండురాణి విల్హెల్మినా మంత్రివర్గముతో ఇంగ్లండుచేరినది స్టాలిన్ గ్రాడ్ ఉత్తరాఫ్రికా యుద్ధరంగములలో మిత్రరాజ్యముల సైన్యములు ఘనవిజయములు సాధించిన ఫలితముగా హాలెండులో పెల్లుబుకుచున్న దేశభక్తి చైతన్యమును జర్మను సైన్యములు అణచివేసి ప్రజలను పెక్కుకష్టములకు గురిచేసినవి 1945 మే నెలలో మిత్రరాజ్యముల సైన్యములు హాలెండునుండి జర్మను సైన్యములను నిశ్శేషముగ పారద్రోలి దేశమునకు విముక్తి కల్గించినవి

రెండవ ప్రపంచయుద్ధానంతరము హాలెండుప్రభుత్వము జటిలసమస్యల నెదుర్కొనవలసివచ్చెను నిరాశ్రయులకు పునరావాసము కల్గించుట మిగుల కష్టమైనది ఈవిషమస్థితికితోడు, 1953లో జీలాండు ప్రాంతమున ఘటిల్లిన వరదలు గొప్పధనప్రాణనష్టము కల్గించినవి ప్రభుత్వము దీక్షతో దేశసమస్యలను జయప్రదముగా పరిష్కరింపగల్గినది హాలెండు ఐక్యరాజ్యసమితిలో సభ్యరాష్ట్రమై, అలీనవిధానము నిష్ప్రయోజనమని పూర్వానుభవము తెల్పుటచే 1949లో ఉత్తరఅట్లాంటిక్ రాజ్యకూటమిలోను ఐరోపా సాముదాయకవిధానములోను భాగస్వామిని యైనది

హాలెండుప్రభుత్వము రాజ్యాంగబద్ధమైన రాజరికవ్యవస్థ రాజ్యాధికారము వంశపారంపర్యముగ సంక్రమించును.

షరతుపై సంతతి లేనిచో స్త్రీలు వారసులగుదురు. నేడు రాణి జూలియానా అధికారము నెరపుచున్నది. 1848 లో ప్రవేశపెట్టబడిన రాజ్యాంగము నేటి రాజ్యాంగమునకు మూలాధారమై పెక్కు పర్యాయములు సవరింపబడినది. ఈ రాజ్యాంగము ననుసరించి ప్రభువే ప్రధాన కార్యనిర్వాహకుడు. శాసన నిర్మాణ విషయములో ప్రభువు కేంద్రపార్లమెంటు ద్వారా అధికారము వహించును. పార్లమెంటులోని రెండు శాఖలలో ప్రథమశాఖ సభ్యులు [illegible] రాష్ట్రీయ శాసనసభ్యులచేతను ద్వితీయసభ సభ్యులు ప్రత్యక్షముగ ప్రజలచేతను ఎన్నుకొనబడుదురు. ప్రథమ సభలో సభ్యత్వము ఆరుసంవత్సరములపాటుండును. ప్రతిమూడు సంవత్సరములకొకసారి సగము మంది సభ్యుల పదవీకాలము ముగియును. ఖాళీ స్థానములలో క్రొత్తసభ్యులెన్నికయగుదురు. ద్వితీయ సభా కాలపరిమితి 4 సంవత్సరములు. ఇది మొత్తము ఒక్కసారిగా రద్దగును. అవసరమైనచో ఈ రెండు సభలను ప్రభువు రద్దుచేయవచ్చును. 40 రోజులలోగా తిరిగి ఎన్నికలు జరుపవలెను. ప్రభుత్వముగాని ద్వితీయ సభవారి క్రొత్తబిల్లులను ప్రవేశపెట్టవచ్చును. ప్రథమ సభ బిల్లులను ఆమోదించవచ్చును లేదా తిరస్కరించవచ్చును. పాలనావ్యవహారములను మంత్రిమండలి చూచుచుండును. ఈ మంత్రిమండలి సభ్యులు సహాయదారుల స్థాయిలో మాత్రమే రెండు శాఖలలో పాల్గొనవచ్చును.

ఎ. వెం.

## హిందీభాషాచరిత్ర

ప్రపంచభాషలన్నియు పండ్రెండు కుటుంబములుగ విభజింపబడినవి. నేటివరకు భాషాతత్త్వశాస్త్రవేత్తలీ విధముగా వేరుచేసిన వాడుకలో నున్న ఈ పండ్రెండు కుటుంబములలో ప్రప్రథమముగ గణనీయమైనది భారత–యూరోపియను కుటుంబము. ఈ కుటుంబమునందలి భాషలు యూరోపా, ఇరాన్, అఫ్ఘనిస్తాన్ మున్నగు ఉత్తర దేశములయందు వాడుకలోనున్నవి. ఈ భాషా కుటుంబమును భాషాతత్త్వశాస్త్రవేత్తలు 'కెంటమ్' 'శతమ్' అని రెండు భాగములుగ చేసిరి. మొదటి భాగములో యూరపు భాషలను రెండవ భాగములో ఇరానీ భారతీయభాషలను పరిగణింపబడినవి. వీనికే పాశ్చాత్యశాఖ, ప్రాచ్యశాఖ అని కూడ పేర్లు. ప్రాచ్యశాఖయందలి భాషలలో సంస్కృతము అత్యంత ప్రాచీనము. ఈ సంస్కృతము వైదికము, గ్రాంథికము అని రెండు విధములు. వేదములందలి సంస్కృతము వైదికము. రామాయణ, మహాభారతాది గ్రంథములందలి సంస్కృతము గ్రాంథికము. ఈ గ్రాంథికసంస్కృతము ప్రచారమునందున్న చివరిదశలో ప్రాకృతము భిన్నభిన్నప్రాంతములలో వాటి పేర్ల ననుసరించి వ్యాపించినది. ఉదా: మహారాష్ట్రీ ప్రాకృతము, శౌరసేనీ ప్రాకృతము, మాగధి, అర్ధమాగధి మున్నగునవి. ఈ ప్రాకృతభేదములు తీవ్ర చివరిదశలో ఈ ప్రాకృతముల అపభ్రంశము వ్యవహారములోనికి వచ్చినది. ఇదికూడ ప్రాకృతము వలెనే స్థానభేదము ననుసరించి అనేక అపభ్రంశములుగ వ్యాప్తి చెందినది. దీని అంతిమ దశలో (రమారమి క్రీ. పూ. పదియవ శతాబ్దిలో) క్రమముగా భారతీయభాషలు (సింధి, గుజరాతి, హిందీ, పంజాబి మున్నగునవి) యీ ప్రాకృతముల అపభ్రంశములనుండి వికాసము నొందినవి. వీటిలో అన్నిటికంటె ప్రజాబాహుళ్యాదరముగలది హిందీభాష. రమారమి 16 కోట్ల భారతీయులు హిందీని మాటలాడువారు. వాస్తవమునకిది మధ్యప్రదేశమునకు చెందిన ఆధునిక భాష అయ్యు ఆసేతుహిమాచలపర్యంతము ఈనాడు ఇది వ్యాప్తిలో నుండుటయేకాక జాతీయభాషగ పేరెన్నికగన్నది. ఆర్యులభాష క్రీ. పూ. 2000–500 మధ్య భారతదేశమునందు ప్రవేశించినది. ఈవిధముగ ఆర్యుల యీ ప్రాచీనతమ భాషనుండి హిందీ ఉద్భవించినది.

హిందీశబ్దోత్పత్తిక్రమము: సంస్కృతమునందలి 'స' అను వర్ణము పారసీభాషయందు 'హ' గ ఉచ్చరింపబడును. పారసీ (ఇరాన్ లేక పర్షియా) దేశస్థులు భారతదేశమునందు సింధుప్రాంతముతో సంపర్కమును పెంచుకొనిన కారణమున 'సింధు' 'సింధీ' శబ్దములు పారసీయందు 'హింద్' 'హిందీ' గా ఉచ్చరింపబడినవి. అందుచే వాస్తవమునకిది పారసీశబ్దము. సంస్కృత ప్రాకృతగ్రంథములందుగాని మరియే యితర భారతీయ భాషలయందుగాని యీ పదము కానరాదు. అందుచే 'హింద్' (సింధ్) ప్రాంతముతో సంబంధము కలిగియుండుటవలన యీ హిందీశబ్దము. కాని నేడు 'హింద్' (సింధ్) వాసులు లేక 'హింద్' ప్రాంతపుభాష యను అర్థములో ఇది వాడబడుచున్నది.

హిందీభాషకు మరల రెండు ఉపశాఖలున్నవి. పశ్చిమప్రాంతపు హిందీ, పూర్వప్రాంతపు హిందీ అని. వాటి వ్యవహారము ఖడీబోలీ, బాంగరు, వ్రజ, కనౌజీ, బుందేలీ అనునవి పశ్చిమప్రాంతపు హిందీ మాండలికములు. అవధి, బఘేలీ, ఛత్తీస్‌గఢీ అనబడు మాండలికములు పూర్వప్రాంతమునకు చెందినవి. వీటిలో ఖడీబోలీ, వ్రజభాష, అవధివంటి మాండలికములకు సాహిత్యభాషలయందు స్థానమేర్పడినది. భాషాశాస్త్ర

దృష్టితో పరిశీలించినచో మధ్యప్రదేశమునకు చెందిన ఏ మిది మాండలికములకును 'హిందీ' పదము వాడబడుచున్నది. అదే దృష్టితో చూచినపుడు ఉత్తరమునందు తరాయీ, పశ్చిమమునందు అంబాలా హిసార్ జిల్లాలను తూర్పునందు ఫైజాబాద్, ప్రతాపగఢ, అలహాబాదుజిల్లాలను దక్షిణమునందు రాయపురము, ఖండవాలవరకు గల ప్రదేశములును కలిసి హిందీ ప్రదేశముగ ఇదును. ఇంతియేకాక రాజస్థానీ, బిహారీ, పహాడీ, ఉర్దూ, హిందుస్థానీ అనునవి దీని ఉపభాషలు.

హిందీమాండలికములలో అత్యంతముగ ప్రాప్తిగన్నది ఖడీబోలీ. ఇది హిందీ ఉర్దూభాషల సమ్మిళితరూపము. ఢిల్లీ మీరట్ల మధ్యప్రాంతమునందు వ్యవహారములో నున్నది. ఇప్పుడు దీనికి మాండలికముగ కాక ఒక సారస్వతభాషగ ఒక జాతీయభాషగ ప్రపంచభాషలలో ప్రముఖభాషగ ఎక్కుడు గౌరవము లభించినది.

హిందీ సాహిత్య చరిత్ర: సాహిత్యమీమాంసాకారులనేకులు సాహిత్యస్వరూపమును అనేకవిధముల వర్ణించినారు. వాటిలో సహితస్యభావః సాహిత్యమ్ అనునది సాహిత్యమను పదముయొక్క అర్థమును వ్యక్తీకరించును. మానవుని భావములలోగల సహభావమును లిపిబద్ధమొనర్చుటయే సాహిత్యసృష్టి. లిపిబద్ధమొనర్పబడిన సహభావనలే సాహిత్యరూపమును పొందుచున్నవి. అనగా ఉత్తమోత్తమ శైలిలో సార్థకములును సర్వోత్కృష్టములును అగు సహభావములు వ్యక్తమగు లిపిబద్ధరూపమే సాహిత్యము. రాజకీయ మత సాంఘికపరిస్థితులననుసరించి సాహిత్యము అనేకరూపములలో వెలువడుచున్నది. భారతీయభాషలన్నిటిలో అభివృద్ధిచెందిన సాహిత్యముకలవి కొన్ని భాషలుమాత్రమే. వాటిలో హిందీభాష యొకటి.

సాహిత్యచరిత్ర: హిందీసాహిత్యచరిత్రయందు గాలింపబడిన యుగవిభజనవిషయమున ఆచార్యులలో అనేకాభిప్రాయభేదములు కలవు. హిందీసాహిత్యారంభమునుగూర్చియు దాని పరిణామయుగముల క్రియలవలన పేర్లనుగూర్చియు ఆయా యుగముల ఆరంభాంతములనుగూర్చియు పండితులలో అభిప్రాయభేదములు వచ్చినవి. ఏదియెట్లున్నను నేటివరకు ఒక యుగవిభజన ప్రామాణికమైనదని విమర్శకులనుచున్నారు.

హిందీసాహిత్యచరిత్ర కాలము నాల్గుయుగములుగ విభజింపబడినది. ఆయాయుగములయందలి కవితాప్రవృత్తులను బట్టి ఆయాయుగములకు వేరువేరు పేర్లీయబడినవి. క్రీ. శ. 7వ ప్రాంతముననే హిందీసాహిత్యరచన ప్రారంభింపబడినదని కొందరువిమర్శకుల యభిప్రాయము. ఆ సంవత్సరమున పుష్యుడనుకవి ఒక అలంకారగ్రంథమును రచించెననియు దానివలన హిందీసాహిత్యరచన అప్పటినుండియే యారంభమయ్యెననియు వీరివాదము. కాని పుష్యునిగ్రంథము లభ్యము కానందున హిందీసాహిత్యారంభము దీని ఎవ్వరూ అంగీకరించనని మరి కొందరి మతము. ఏ ఎట్లున్నను క్రీ. శ. 993 నుండియే హిందీ సాహిత్యరచన యొక్క క్రమపద్ధతిలో నడచినదని వక్కాణింపవచ్చును.

క్రీ. శ. 993 నుండి 1318 వరకు మొదటిభాగముగను క్రీ. శ. 1318 నుండి 1643 వరకు రెండవభాగముగను క్రీ. శ. 1643 నుండి 1843 వరకు మూడవభాగముగను క్రీ. శ. 1843 నుండి నేటివరకు నాల్గవభాగముగను ఈ సాహిత్యయుగము విభజింపబడుచున్నది.

శ్రీ॥ శే॥ ఆచార్యరామచంద్రశుక్ల అను నొక సుప్రసిద్ధ హిందీసాహిత్యవిమర్శకుడు హిందీసాహిత్యచరిత్ర కాలమునకు వీరగాథా యుగమనియు, భక్తి యుగమనియు రీతి (శైలి) యుగమనియు ఆధునికయుగమనియు నాలుగు పేర్లిడినారు.

వీరగాథాయుగము: ఈయుగమునకు ఆదియుగమనియు సిద్ధసామంతయుగమనియుకూడ పేర్లు. హిందీసాహిత్యమునకు ఆరంభయుగముగుటవలన ఆదికాలమనియు వీరగాథలను గానమొనర్చుట ఆయుగప్రధాన లక్షణముగుటచే వీరగాథా కాలమనియు గూడ సార్థకనామములు వచ్చినవి. ఖుమన్ రాసో, బీసల్దేవ్ రాసో, పృథ్వీరాజ్ రాసో, విజయపాల్ రాసో, పరమాల్ రాసో, హమ్మీర్ రాసో, 'కీర్తిలత', కీర్తిపతాక, జయచంద్ర ప్రకాశ్, జయమయంక జసచంద్రిక, విద్యాపతిపదావళి, ఖుస్రోకీపహేలియాఁ' వంటివి యీ యుగరచనములలో ప్రసిద్ధిగన్నవి. ఈ కాలమునాటి రాసో గ్రంథములరచనవలన ఈ యుగము విశేషితము. ఆయాయుగములలోని చక్రవర్తుల జీవితఘట్టములే ఈ గ్రంథముల కథావస్తువులు. 'రాసో' అనునది ఈయుగపు ప్రధానసాహిత్యప్రక్రియ. ఈ శబ్దోత్పత్తిక్రమమును గూర్చియు ఆచార్యులలో అభిప్రాయభేదములు కలవు. చివరకు విమర్శకులు ఇది 'రాసక' శబ్దభవమనితలచిరి. ఈ 'రాసక' శబ్దమే ఉచ్చారణలో 'రాసఅ' గాను పిమ్మట 'రాసఉ' గాను మారి,

అనంతరము రాసో రూపము దాల్చినదని వారిసిద్ధాంతము. కీర్తి ఆనాటి జానపద వాఙ్మయమని చెప్పవచ్చును. ఈ గ్రంథములన్నియు శృంగార వీరరసప్రధానములు.

ఈ యుగమునకు చెందిన మరియొక సుప్రసిద్ధకవి విద్యాపతి. ఈతడు క్రీ. శ. 1360-1448 నకు చెందినవాడు. ఈతని గ్రంథములలో సుప్రసిద్ధమైన విద్యాపతిపదావళి భక్తిపారవశ్యమున కవి రచించిన కొన్నిపదముల సంకలనము. ఈతని పదములయందు జయదేవుని ప్రభావము మెండుగగన్పట్టుటచే ఈతడు అభినవజయదేవ బిరుదాంకితుడును, మధురమైన మైథిలి భాషలో రచనలు చేయుటచే మైథిలికోకిల బిరుదాంచితుడును అయెను. రాధాకృష్ణులీతని కవితకు నాయికా నాయకులు. అపభ్రంశభాషలో కూడ ఈతని గ్రంథములు కీర్తిలత, కీర్తి పతాక అనునవి కలవు.

భక్తియుగము: ఇటుపిమ్మట భక్తియుగమారంభమైనది. క్రీ. శ. 1318 నుండి 1643 వరకు ఈయుగము నడచినది. ద్రావిడదేశములో ఆళ్వారులు నాయన్మారులచే నాటబడిన భక్తిబీజము రామానుజాదులవలన పోషింపబడి దినదినాభివృద్ధినొంది ఒకమహావృక్షమై ఉత్తరాపథమందు వ్యాప్తి చెందినది. ఆనాటి భక్తిమార్గములో ఆర్యావర్తమునందు కొన్ని శాస్త్రమతధర్మములనియమములును, నిగ్రహములును ఉండెడివి. దూరద్రష్టయు ప్రతిభాశాలియునగు రామానందుడు ఈనిగ్రహములవలన రాగలుగు దుష్పరిణామమును గమనించి వాటిని సర్వసమ్మతముగా సవరించి భక్తిమార్గమునందు జాతిభేదములేక ఎల్లరకు ప్రవేశము కల్పింపజేసినాడు. ఈకాలమునందు భక్తిధార శాఖోపశాఖలుగ ఉత్తరభారతదేశమునందు ప్రవహించినది. దీనిలోని శాఖలు రెండు (1) నిర్గుణభక్తి (2) సగుణభక్తి. ఈనిర్గుణశాఖ మరల రెండుఉపశాఖలుగ చీలి జ్ఞానాశ్రయమైనశాఖ, ప్రేమాశ్రయమైనశాఖ అను నామముల గొన్నది. సగుణభక్తిశాఖ మరల రామభక్తిశాఖ, కృష్ణభక్తిశాఖ యని రెండుఉపశాఖలుగ చీలినది.

ఈవిధముగ ఈ యుగమందలి భక్తిపద్ధతికి నిర్గుణబ్రహ్మయు రామకృష్ణులును అలంబనములు. రామానందుని శిష్యుడైన కబీరుదాసు జ్ఞానాశ్రితభక్తిశాఖకు చెందిన కవులలో ప్రప్రథముడు. ఈతడు క్రీ. శ. 1399-1518 నాటికి చెందినవాడు. ఈతడు తనభావములను చాలవరకు దోహాల (ద్విపద) రూపమున స్వతంత్రముగ వ్యక్తపరచి యొంటరిగా వెలసెను. దాదు, ధర్మదాసు, గురునానక్, దాదు అతని శిష్యులగు సుందరదాసు, చారణదాసు, సహజాబాయి మున్నగువారీయుగమునకుచెందిన ఇతరకవులు. కవయిత్రులును. ప్రేమాశ్రయశాఖకు చెందినవారు నిర్గుణోపాసకులగు సూఫీకవులు. ఆధ్యాత్మికభావములను తమకు నచ్చినవిధముగా లౌకికథావస్తువులుగ నేర్పరచి వాటిని ఛందోబద్ధముగా వీరు ప్రతిపాదించిరి. వీరందరిలో పేరెన్నికగన్నవాడు మల్లిక్ మహమ్మద్ జాయసీ (1519-1540). పద్మావత్ అనునది హిందీసాహిత్యరంగములో ఈతని సుప్రసిద్ధ కావ్యము.

సగుణభక్తిశాఖకుచెందిన రామభక్తిశాఖీయుడైనవాడు గోస్వామితులసీదాసు. ఈతనిరచనలలో "రామచరితమానసము" ఉత్తరభారతదేశమందంతటను ప్రసిద్ధిగన్నది. ఇతరగ్రంథములలో వినయపత్రిక, దోహావళి, కవితావళి మున్నగునవి కలవు. ఈతడు ఆనాడు వాడుకలోనున్న కవితయందలి పద్యరీతులు, దోహాచౌపాయి గీతము లాదిగాగల మున్నగు ఛందోరీతులనన్నిటిని తనగ్రంథములలో వాడిన మహామేధావి. అవధి వ్రజభాషలలో కావ్యరచన సాగించిన మహాకవి ఇతడు.

ఇందలి కృష్ణభక్తకవులలో ఎనమండుగురు కవులగ్రగణ్యులు. వీరిని "అష్టఛాప్" కవులందురు. వారిలో సూరదాసు అగ్రగణ్యుడు. "సూర్" అనగా అంధుడని అర్థము. తన "సూరసాగర్" నందీతని కవితావాహిని శృంగార వాత్సల్యములనెడు రెండుపాయలుగ చీలి హిందీసాహిత్యభూమిని పదును పరచినది. ఈ రెండురసములవర్ణనయందు ఈతడద్వితీయుడనిపించుకొనినాడు. ఈతడు వల్లభసంప్రదాయమునకు చెందినవాడు. అంతవరకు ఆలంకారికులచే ఒకరసముగ పరిగణింపబడని వాత్సల్యమును ఈతడు విభావానుభావాదులచే పరిపుష్టరసమని నిరూపితమొనర్చురీతిగా అత్యంతసుందరమును మధురమునైన పద్ధతిలో వర్ణించినాడు. ఈతనికాలమునుండియే వాత్సల్యమునకు రసత్వమేర్పడినదనవచ్చును.

జగత్ప్రసిద్ధిగాంచిన మహాభక్తురాలు మీరాబాయియు, మహమ్మదీయ భక్తాగ్రగణ్యుడు రసఖాన్ మున్నగువారును ఈ శాఖకుచెందినవారు. ఈయుగములో చైతన్యుని "గౌడీయ" సంప్రదాయమును హితహరివంశప్రచరితమైన "రాధావల్లభ" సంప్రదాయము మున్నగునవెన్నియో ఈభక్తిశాఖ కుపశాఖలై ప్రవహించినవి. సర్వవిమర్శకాగ్రేసరసమ్మతమైన ఈ

యుగమును హిందీసాహిత్యమున స్వర్ణయుగమనుటలో అతిశయోక్తి లేదు.

రీతి (శృంగార)యుగము : క్రీ॥ శ॥ 1650-1857 మధ్య కాలమును రీతియుగమనిరి. దీనినే "ఉత్తరమధ్యకాలము" అని కూడ వ్యవహరింతురు. ఈయుగరచనలు అధికముగ అలంకార శాస్త్రగ్రంథములు. "రీతి" అనుశబ్దము సంస్కృతసాహిత్యరంగమున వాడబడిన అర్థమునగాక అలంకారశాస్త్రమనునర్థమున హిందీసాహిత్యరంగమున వాడబడినది. కావ్యలక్షణముల నిరూపణమును ఆయాలక్షణములను దృష్టియందుంచుకొని సాగించు రచనాపద్ధతియు ఈకాలపు గ్రంథముల ప్రముఖప్రవృత్తులు. ఈకాలపు రచనల ప్రధానరసము శృంగారము. అట్టి శృంగార రచనలకానాటి సాంఘిక రాజకీయ స్థితులే కారణములు. భక్తియుగపు చివరిభాగములోని అలౌకిక భక్తిభావమైన మధురభక్తి క్రమముగ లౌకిక శృంగారరూపము దాల్చింది. ఆనాటి కవిజీవితము రాజసంస్థానములనుండి పూరిగుడిసెలవరకును నిర్విఘ్నముగ విలాసభరితమునై యున్నది. నాటివారికి ఈకామప్రవృత్తియే ప్రధానవిలాసవస్తువై నాటి కావ్యవస్తువుగ మారినది.

ఈకావ్యరచనాపద్ధతికి శ్రీకారము చుట్టినవాడు ఆచార్య కేశవదాసు. ఇతడు భక్తియుగమునకు చెందినవాడైనను రీతికావ్యరచయితలలో అగ్రగణ్యుడైనాడు. ఇతని 'కవిప్రియ' 'రసికప్రియ' అనుగ్రంథములు ఈకోవకు చెందినవే. 'కవిప్రియ' యందు కవి ఆనాటి అన్నికావ్యపద్ధతులను శిక్షేమును సంగ్రహపరచినాడు. కావ్యదోషములను అలంకారములను కూడ వర్ణించినాడు. రసికప్రియయందు నాయికాభేదములు, రసనిరూపణమును కానవచ్చును. ఈగ్రంథములు రెండును నాటికవులకీగ్రంథములకు మార్గదర్శకము లనవచ్చును. కృపారాముని 'హితతరంగిణి'యు సేనాపతిదైన 'కవిత్త రత్నాకరము'ను ఆనాటివే. పద్మాకరుని 'పద్మాభరణము'ను, 'జగద్వినోద్' అనుగ్రంథమును భూషణ్ రచించిన 'శివరాజభూషణ్' దేవకవిదైన 'భావవిలాస్' 'రసవిలాస్', 'భవానీవిలాస్' 'కావ్యరసాయన్' దాసకవిదైన 'రసనిర్ణయ్' అనునదియు ఈకాలమునకు చెందిన ప్రముఖగ్రంథములు. చింతామణి తనగ్రంథమైన 'కవికల్పతరు' చేతను, భిఖారీదాసు తన 'కావ్యనిర్ణయ్' అనుగ్రంథముచేతను హిందీసాహిత్యమును విభూషితమొనర్చినారు.

అట్టి కామప్రియరచనలతో సంబంధములేని రచనావ్యాసంగము కూడ ఈకాలమున వర్ధిల్లినది. అది కేవలము శృంగార రసభూయిష్ఠము. అందలి కావ్యవస్తువు కేవలము శృంగారవర్ణనయే. అట్టిరచనలకు బిహారీవిరచితమైన 'సత్‌సయీ' ప్రతినిధి. దీనియందలి ఏడువందల దోహాద్విపదలలో శృంగారలీలలు అనేకములు వర్ణితములు. బిహారీకవిని ధ్వనివాదియనవచ్చును. ఈతని ప్రతిదోహాయు భావగర్భితము. రాజకీయబాధ్యతలను మరచి కామక్రీడాలోలుడైన పాదుషాకు భావగర్భితమగు ఒక్క దోహా వలననే కనువిప్పు కలిగించిన ప్రతిభాశాలి ఇతడు.

ఆధుని యుగము : క్రీ॥ శ॥ 1848 నుండి ఈయుగమారంభమైనది. ఈయుగమునందు హిందీసాహిత్యవృక్షమనేక శాఖోపశాఖలుగ వర్ధిల్లినది. అంతకుపూర్వయుగములో లోపించిన గద్యసాహిత్యమనేకవిధములుగ విస్తరిల్లినది. అందుచే దీనిని గద్యయుగమన్నను అనవచ్చును.

పాశ్చాత్యుల ఆగమమునకు పూర్వము గోరఖ్‌నాథ్ 'విఠల్‌నాథ్' గోకుల్‌నాథ్ నాభాదాస్ సురతిమిశ్ర వంటిభక్తులగద్యరచనలు లభించినను అవి వ్రజభాషలో రచింపబడినవి. మొట్టమొదట ఖడీబోలీని కావ్యభాషగ రూపొందించిన కీర్తి అమీర్ ఖుస్రోకు దక్కింది. ఖడీబోలీ భాషలో గద్యరచనచేసినవారిలో ప్రథముడు అక్బర్ పాదుషా ఆస్థానమునందున్న గంగకవి "చందఛంద్ బర్ణన్ కీ మహిమా" అను గ్రంథము రచించెను. రామప్రసాద నిరంజనీకృతమైన 'భాషా యోగవాసిష్ఠ' కూడ అట్టిగ్రంథమే. పాశ్చాత్యసంస్కృతి ప్రభావమీయుగసాహిత్యముపై కన్పట్టును. ముద్రణయంత్రము పుణ్యమాయని ఖడీబోలీ సాహిత్యప్రచారమింకను సులభసాధ్యమై దానిప్రాధాన్యము హెచ్చినది.

ఈయుగసాహిత్యమంతయు ఖడీబోలీ భాషయందే విస్తృతి నొందినది. నవలలు కథానికలు నాటకములు గలిగి కలుమున్నగునవి ఈసాహిత్యశాఖలు. ఈయుగగద్యమునకు శ్రీకారము చుట్టినవాడు భారతేందు హరిశ్చంద్ర. ఇతడు 'కవివచనసుధ' 'హరిశ్చంద్రమేగజీన్' 'హిందీప్రదీప్' వంటి అనేకపత్రికలమూలముగ కూడ ఖడీబోలీ గద్యమును ప్రచారములోనికి తెచ్చినాడు. ఈతని రచనలు సాగిన కాలము భారతేందుయుగమనబడినది. ఈతడు గద్యరచయితగను నాటకకర్తగను ప్రసిద్ధినొందినాడు. ఇతడు సంస్కృతవంగభాషలనుండి అనేకనాటకములననువదించుటయేగాక ఎనిమిదినాటకములను స్వీయముగ

రచించినాడు. ఈతనిపిమ్మట ఉల్లేఖింపతగినవాడు ఆచార్య మహావీరప్రసాద్ ద్వివేది. ఈతని యుగములో భాష వ్యాకరణశుద్ధము చేయబడినది. కామతాప్రసాదు గురు హిందీవ్యాకరణమును రచియించినవాడితడు. ఇది మొట్టమొదటి హిందీ వ్యాకరణగ్రంథము. అంతేకాక పరవ్రతి అనువదించుటచే, రచయితలకు వ్యాకరణశుద్ధభాషాప్రాధాన్యమును తెలియజేసినాడు. ఈ యుగములోనే శ్యామసుందర్ దాసు, రామనారాయణమిశ్ర వంటి ప్రముఖరచయితలు 'నాగరీప్రచారిణీ సభ'ను స్థాపించి ఈగద్యరచనలను దనమును ప్రోత్సహించిరి.

పిమ్మటవిమర్శకులలో ఆచార్యరామచంద్రశుక్ల ఎన్నదగినవాడు. హిందీసాహిత్యవిమర్శకులందరిలో దిట్టఅనదగినవాడితడు. సాహిత్యచరిత్రనంతను ఆమూలాగ్రముగ పరిశీలించి ప్రామాణికచరిత్ర గ్రంథమును పాఠకులకుగ హిందీసాహిత్యరంగమునకందజేసినవాడితడు. ఆచరిత్రరచనను అసంపూర్ణముగనే నిలిపి ఈతడు దివంగతుడైనాడు. 'చింతామణి' రెండు భాగములను ఈతనివ్యాసముల సంగ్రహములు. ఇందు మనస్తత్వశాస్త్రసంబంధములైన వ్యాసములు కూడ కలవు. ఈతని భ్రమరగీతసారము రసశంబంధియగు రచన. "రసమీమాంస" కూడ ఉల్లేఖింపదగినది. ఇట్టి సమీక్షకులలో డా॥ రామకుమారవర్మయు డా॥ నగేంద్రయు మరువరానివారు.

ఈవిధముగ ఈయుగములో విమర్శ సాహిత్యమధికముగ వెలువడినది. అటుపిమ్మట ప్రేమ్‌చంద్ ప్రసాద్ వంటి ప్రసిద్ధ రచయితలు హిందీసాహిత్యరంగమునాక్రమించిరి. నవల నాటకము ఏకాంకిక సమీక్షవంటి అనేకప్రక్రియలతోపాటు 'కామాయని' వంటి మహాకావ్యములు ఖడీబోలీభాషయందు రచింపబడినవి. ఈయుగములోనైతము ప్రజభాషయందు కవిత రచింపబడినది. అట్టివారిలో జగన్నాథదాసు రత్నాకర్, అయోధ్యాసింహ్ ఉపాధ్యాయ, హరిఔధ్ ఎన్నదగినవారు. ఈయుగకవులలో ప్రసిద్ధిగన్నవాడు మైథిలీశరణ్ గుప్త. 'భారత్ భారతి' 'సాకేత్' 'యశోధర', వంటి కృతులనురచించి దేశభక్తిభావమునకు రసస్వరూపమును కల్పించిన ఆధునికకవియీతడు.

శ్రీమతిమహాదేవివర్మ కవిత మార్మికమైనది. ఈమె వేదనయందే పరమాత్మను దర్శించి ధన్యతనొందదలచిన ఆధునిక కవయిత్రి. సుమిత్రానందన్ పంత్ అనునతడు హిందీయందలి ప్రకృతికవితకు ప్రతినిధి. ఈతనికవిత మృదుమధురమై శ్రోతలకానందమును గూర్చునట్టిది. ఆధునికహిందీకవులలో డాక్టరు రామకుమారవర్మ విమర్శకునికంటె కవిగా అగ్రస్థానమును అలంకరించినాడు. నవరసభరితములైన ఈతని రచనలు హిందీరంగమునందు అనేకములు. పాఠకుని తనతో పాటుగ భావరసతరంగములో ఓలలాడింపజేయసమర్థుడితడు. ఇతడు హిందీసాహిత్యచరిత్రనుకూడ రచించినాడు.

ఇంతేకాక ఈయుగములో రామనరేశ త్రిపాఠి, రామధారీసింహదినకర్, హరివంశరాయ్ బచ్చన్, శ్రీధర్ పాఠక్ వంటి కవులనేకులు కలరు. ఈయుగములో నాటకసాహిత్యమునకుకూడ కొరతలేదు. కృష్ణప్రేమి, జయశంకరప్రసాదు వంటిప్రముఖులు అనేకములైన చారిత్రాత్మకనాటకములను రచింపగా ఉదయశంకరభట్, లక్ష్మీనారాయణ్ మిశ్ర, ఉపేంద్రనాథ్ అశ్క్ వంటివారు తమసాంఘికనాటకరచనలతో సాహిత్యక్షేత్రమును మహితమొనర్చినారు.

నవలాసాహిత్యము తక్కిన సాహిత్యప్రక్రియలకంటె అధికముగ విస్తృతినొందినది. ఇందును సాంఘికనవలాసాహిత్యమధికము. ఇంచుమించు సాంఘికసమస్యలన్నియు ఈనవలలయందు చర్చింపబడినవి. సాహిత్యము సమాజజీవితమునకు ప్రతిబింబమనునానుడి ఈ సాహిత్యరచనమువలన మరింత బలపడినది. జయశంకర్ ప్రసాద్, దేవకీనందన్ ఖత్రీ, ప్రేమచంద్, గురుదత్, ఇలాచంద్రజోషి, భగవతీచరణ్ వర్మ, ఉపేంద్రనాథ్, యశ్‌పాల్, పాండ్యా బేచన్‌శర్మ ఉగ్ర, అజ్ఞేయ, అమృతలాల్ నాగర్, విశ్వంభర్ మానవ్, భగవతీప్రసాద్ వాజపేయి వంటివారు సుప్రసిద్ధనవలాకారులుగా ఉల్లేఖింపదగినవారు. బృందావన్‌లాల్ వర్మ ఐతిహాసికనవలాకారులలో అగ్రగణ్యుడు.

కథావస్తువులుగా నాటిగ్రామీణసమస్యలును ప్రేమ సౌందర్యములును ఈనాటికథాసాహిత్యమునందు ప్రోత్తరూపము దాల్చినవి. ప్రేమచందు, జయశంకరప్రసాదు, చంద్రధర శర్మగులేరి, మహాదేవివర్మ, పాండ్యా బేచన్‌శర్మఉగ్ర, విశ్వంభరనాథశర్మ, సుభద్రాకుమారిచౌహాన్, భగవతీచరణ్ వర్మ, మదన్‌, బృందావన్‌లాల్ వర్మ మున్నగువారు ఈసాహిత్యప్రక్రియయందు ప్రసిద్ధిగన్నకథారచయితలు.

ఈనాటి ఖడీబోలీ హిందీసాహిత్యమీరీతిని మూడుపూవులారుకాయలుగ దినదినప్రవర్ధమానముగుచున్నది.

ఇ. శి.

## హిమాలయములు

హిమాలయములు భారతదేశమునకు ఉత్తరదిశయందు తూర్పుపడమరలుగా దాదాపు 2000 మైళ్ల పొడవు ను 250మొదలు 800 మైళ్ల వెడల్పును పెట్టనికోటవలె విస్తరించి యున్నవి ఇవి మూడుఅంతరువులుగ నున్నవి మొదటి అంతరువు 6000 అడుగులఎత్తున దట్టమైన అడవులతో ఆవరింపబడి యున్నది ఈ అడవులలో ఋద్ధమృగములు పెద్దపులులు చిరుతపులులు మొదలగు భయంకరములైన వన్యమృగములు నివసించుచున్నవి చిలుకలు గోరువంకలు పలువిధములైన రంగురంగులపిట్టలు నానావిధములైన ఫలవృక్షములు ఇందుగలవు హిమాలయములు జగత్ప్రసిద్ధములును అమూల్యములునైన మహానదులకు పుట్టినిల్లని ప్రాచీన గ్రంథములు చాటుచున్నవి హిమాలయముపైగల పలువర్ణముల శిలలపై మంచు పేరుకొనియుండును సూర్యకిరణములు వాటిపై ప్రసరింపగనే కరిగిన హిమజలము వివిధరంగులలో భాసించుచు పెలపెలసై ప్రవహించుచు, ప్రకృతిశోభను ఇనుమడింపజేయుచుండును

మొదటి పర్వతాంతరువునకు రెండవ పర్వతాంతరువునకు నడుమ బ్రహ్మాండమైన ఒక లోయగలదు రెండవ అంతరువుఎత్తు12000అడుగులు ఇందే లోకప్రసిద్ధిగాంచిన యాత్రాస్థలములుగలవు రెండవ అంతరవును ఎక్కినపుడు యాత్రికులకు విచిత్రమైన అనుభవము కల్గును ఇచ్చట గిరికాదిభాగములపైనుండియు సరస్సులపైనుండియు వీచుగాలి పాదచారులైన యాత్రికులకు నూతన శక్తిని ఉత్తేజమును ప్రసాదించునట్లు అనుభవము కలుగును ప్రాచీనకాలమున సప్తఋషులు ఇచట తపమాచరించి, ఉత్తేజితులై వేదములను ధర్మశాస్త్రములను రచించి తమ్మూలముగా లోకమును ఉద్ధరించిరని ప్రతీతి కలదు వ్యాసుడు తన అష్టాదశపురాణములను రచించిన పవిత్రస్థలమిదియేనని పండితవాక్యము వాల్మీకి మహర్షి శ్రీరాముని జననమునకు పూర్వము ఇందుండియే రామాయణమును రచించెనందురు తన్మూలమున భారతీయ నాగరికతకు హిమాలయము పుట్టినిల్లని ఉగ్గడించుటయు కలదు

ఈ రెండవ అంతరువులో ముఖ్యమైన ఉపనదులు జనించి గంగ సింధు బ్రహ్మపుత్రా నదులలో కలియుచున్నవి. ఈ అంతస్థులో పదునేల అడుగుల ఎత్తున పాదచారులై నడచు పాదుల ముఖములను చెక్కిళ్లను మేఘములు రాచుకొని పోవు దృశ్యము వింతగొల్పుచుండును ఆదిశంకరుడు భాష్యత్రయమును రచించిన బద్రీనాథ్ 10 000 అడుగుల ఎత్తున ఈ రెండవ అంతరువునందే కలదు అల్లసాని పెద్దన రచితమైన మనుచరిత్రయందు వర్ణితమగు ఘట్టములు కేదారనాథ్ సమీపమునందే ఘటిల్లినట్లు అచ్చటి ప్రకృతిశోభయే ఋజువు చేయుచున్నది కేదారనాథ్ యొక్క ఎత్తు 11 760 అడుగులు ద్వాదశజ్యోతిర్లింగములలోని ప్రధానలింగము ఈకేదారమునందే కలదు ఆదిశంకరుడు తన నశ్వరశరీరమును విడిచిన స్థలమునందు సమాధి నిర్మింపబడినది ఈ జ్యోతిర్లింగసమీపమునందే ఈశ్వరుడు మన్మథుని భస్మీపటలము చేసినట్లు పురాణములు చెప్పుచున్నవి పేరునకు మందాకిని యైనను ధూతదుష్ప్రవాహగము ముగల మందాకిని దీనియొక్క జన్మస్థలముకూడ ఇదియే తరచుగ సరస్సులలో కాన్పించు కమలములు ఇచ్చట భూమిపైననే వికసించు మనోహర దృశ్యము అమితానందమును కలుగజేయును

10 600 అడుగుల ఎత్తుగల యమునోత్రి 10 300 అడుగుల ఎత్తు నున్న గంగోత్రి విలములు ఈరెండవ హిమసన్నగాంతరమునసే విరాజిల్లుచున్నవి గంగోత్రి సమీపమున పది గుహలున్నవి చాయ భక్తులైన అవధూతస్వాములిందు తపమాచరించుచుందురు అరుదుగ వారిదర్శనము యాత్రికులయందు అమోఘమగు ప్రభావమును కలుగజేయును అమరనాథ్ గుహలో శంకరుని మంచులింగ దర్శనము ఉత్తేజపూరితమై ట్టిది ఈశ్వరుడు తన అర్ధాంగియగు పార్వతికి అమరగీతముపదేశించిన దివ్యస్థలమిదియేనట! శుకమహర్షి తన పూర్వజన్మయందు శుకరూపములోనున్నపుడు ఈ అమరగీతము నాలకించి అమరత్వమును పొందిన పుణ్యస్థలి యని చెప్పుదురు

మూడవ అంతరువు 13 000 అడుగుల ఎతుకలది ప్రపంచములోకెల్ల మిక్కిలి ఎత్తయిన గౌరీశంకర్ శిఖరము (29 005 అడుగులు) ఈ మూడవ అంతరువుపైననే కలదు 28 000 అడుగుల ఎత్తుగల కాంచనగంగ శిఖరము 27 670 అడుగుల ఎత్తుగల ధవళగిరియు ఈ మూడవ అంతరువునందున్నట్టివే సింధు గంగ బ్రహ్మపుత్రానదులుకూడ ఈమూడవ అంతరువునందే ఉత్పన్నమగుట మరియొక విశేషము టెన్సింగ్ నార్కే యను నేపాలుయోధుడు "గౌరీశంకర్" శిఖరమును

అధిరోహించి భారత జాతీయపతాకము నచట ప్రతిష్ఠించి, ప్రపంచవిఖ్యాతుడైనాడు.

మహాకవి కాళిదాసు తన అమరకావ్యమందు పర్వత శాఖలైన హిమవన్నగముపై గల అద్భుత ప్రకృతిదృశ్యములను అచటి నిక్షిప్తములై యున్న అమూల్య నిధులను రసవత్తరముగ వర్ణించియున్నాడు. హిమాలయము లనాటిదు "రత్నగర్భ"గా వర్ణించుట సహజమే.

ఉత్తుంగహిమాలయ పర్వతములు ఉత్తరధ్రువమునుండి వీచు అత్యంతశీతలవాయువులను అడ్డగించుచు భరతఖండము నందలి గంగానదీతీరవాహక ప్రాంతమును సస్యశ్యామలమొన రించుచు అందు పండు పంటలకు రక్షణకల్పించుచున్నవి. అంతేకాక హిమవత్పర్వతముల శాఖలనుండి భారతదేశముపై దాడిచేయనుండు పరరాజ్యములకి హిమాలయ పర్వతపంక్తులు పెట్టని కోటవలె దుర్భేద్యములుగనున్నవి.

యు. పి.

## హృదయము

తనవైపునకే వంగిన కండరపుగొట్టముగా హృదయము వికసించుచు తనయందు గదులను జఠరికలను (Ventricles) కర్ణికలను (Auricles) ఏర్పరచుకొనును. హృదయమీవిధముగ వికసించునపుడు గొట్టముతో మార్పులుకల్గును. గుండె నడుమ కొంచెము ఎడమవైపుగ ఊపిరితిత్తులమధ్య హృదయము అమర్పబడియున్నది. ఎముకనుమొన క్రిందగల ఐదవ అంతరవకాశమునందు హృదయము కొట్టుకొనుట గమనించగలము. హృదయము పెరికార్డియల్ అనుసంచిలో వ్రేలాడుచుండును. రెండుకర్ణికలు రెండు జఠరికలు అను నాల్గుగదుల కలయికవలన హృదయమేర్పడును. కుడికర్ణికలోని ఊర్ధ్వ అధోబృహత్సిరలు తిరచుకొని శరీరమందలి రక్తమును రక్తనాళముల ద్వారా తెచ్చుకొనును. కర్ణికలనుండి రక్తము, త్రిపిధానములచే రక్షింపబడు రంధ్రము (Orifice) ద్వారా కుడిజఠరికలోనికి ప్రవహించును. కుడిజఠరికనుండి రక్తము ఊపిరితిత్తులలోనికి శ్వాసకోశధమని (pulmonary artery) ద్వారా పంపబడును. అది అచ్చట శుభ్రమగును. ఎదవ కుడ్డరకనాళములలోని రక్తము శ్వాసకోశసిరల (pulmonary veins) గుండ ఎడమకర్ణికలోనికి చేరును. ఎడమకర్ణికనుండి రక్తము మైట్రల్ వాల్వుచే రక్షింపబడు రంధ్రముగుండ ఎడమజఠరిక లోనికి పోవును. అచ్చటనుండి రక్తము బృహద్ధమనిగుండ శరీరములోని అన్నిభాగములకు పంపబడును. జఠరికలకు కర్ణికలకు మధ్యగల రంధ్రము కుడివైపున త్రిపిధానముచేతను, ఎడమవైపున యమిట్రల్ వాల్వుచేతను సంరక్షింపబడు చుండును. ఈ పిధానములు రక్తమును జఠరికవైపునకేగాని అందుకు వ్యతిరేకదిశకు పోనీయవు. పుపుసధమనియొక్కయు బృహద్ధమనియొక్కయు తెరచికొనియుండు భాగములుకూడ పిధానములచే సంరక్షింపబడియుండును.

కర్ణికలురెండును జఠరికలురెండును కలిసి ముడుచు కొనును. అటువిమ్మట కొంతవిరామముకల్గును. హృదయము నిమిషమునకు డెబ్బదిరెండసార్లు కొట్టుకొనును.

హృదయపిండము (Foetal Heart) : పిండము ఊపిరిపీల్చు కాలమందున రక్తమును ఊపిరితిత్తులకు పంపవలసిన అవసరముండదు. అందువలననే కుడికర్ణికలోని రక్తము చాలవరకు ఎడమకర్ణికలోనికి ప్రవహించును. శ్వాసకోశధమనియు బృహద్ధమనియు డక్టస్ ఆర్టిరియోసస్ అనుపేరుగల ఒక చిన్న గొట్టముద్వారా కలుపబడియున్నవి. ఊపిరితిత్తులలోనికి పోవలసిన రక్తము

చిత్రము - 132

హృదయమును నిలువున కోయగా కన్పట్టు అంతము యొక్క బాహ్యస్వరూపము

(1) కుడికర్ణిక (2) ఎడమకర్ణిక (3) కుడిజఠరిక (4) ఎడమజఠరిక (5) ట్రయికస్పిడ్ వాల్వు (6) మైట్రల్ వాల్వు (7) బృహద్ధమని

చేయగా బృహద్ధమనిలోనికి మరలింపబడును. పుట్టిన శిశువు ఊపిరి పీల్చ నారంభింపగనే ఈ ఊపిరితిత్తుల పని ప్రారంభమగును. తరువాతి కొలదిదినములలో ఎడమ కర్ణికలోనికి రక్తము ప్రవేశించు రంధ్రము మూసికొనిపోవును. అంతేకాక డక్టస్ ఆర్టిరియోసిస్ కూడ సంపూర్ణముగా అంతరించును.

హృదయము కావలసినంత రక్తమును రక్తనాళముల లోనికి నెట్టుటయే హృదయముయొక్క పని. హృదయకండరములు ఈ క్రిందిపనులను నిర్వర్తించును — (1) ప్రకోపింప చేయుట సంకోచపరచుట (2) వాహకశక్తి (Conductivity) (3) లయబద్ధత (rhythmicity) (4) నినాదత (tonus)

ఊర్ధ్వ అధోబృహత్సిరలమధ్య గల సైనో ఆరిక్యులర్ నోడ్ యందు ప్రేరేపణ ప్రారంభమగును. కర్ణికాకండరము గుండ ఆ ప్రేరేపణ ప్రయాణించుచు కర్ణికాద్వారపు కుడివైపున నున్నగల వెంట్రిక్యులర్ నోడ్ ను చేరును. జఠరికయొక్క వెలుపలిగోడకు ఆవలి అంచుగుండ హిస్' మార్గము మీదుగా ఆ ప్రేరేపణ ప్రయాణముచేయును. కర్ణికలకు, జఠరికలకు పరస్పరమగు లంకె హిస్' మార్గమొక్కటియే. ఈమార్గము కుడి ఎడమలుగా చీలిపోవును. ప్రతిశాఖయు మరల ఉపశాఖల క్రింద నార ఆకారములో విచ్ఛిన్నమగును. ఈవిధముగా 'ఎస్ ఏ' అను ముడియొద్ద ఆరంభమగు ప్రేరేపణ, జఠరికా కండరములను చేరును. ప్రత్యేకధాతువులు ఈక్రిందివాటివలన లభ్యమగును (1) వాహకశక్తిని (conductivity) వృద్ధిచేయు సహాయకనాడులు (Sympathetic nerves) (2) వాహకశక్తిని తగ్గించు చలననాడులు

ప్రేరేపణ కర్ణికయందు వ్యాపించుటకు 0 1 నిమిషము పట్టును; హిస్ మార్గమునందు ప్రయాణించుటకు రెండు క్షణములు పట్టును; జఠరిక ముడుచుకొనుటకు 0 1 క్షణము పట్టును. ఆగెడువ్యవధి కాలము 0 4 క్షణములు

ఈక్రిందిఅంశములు హృదయముపై తమప్రభావమును కనబరచును (1) ఆమ్లజనిలోపము (2) ఉష్ణోగ్రత (3) బొగ్గుపులుసువాయువు అధికమగుట (4) కపాలములో ఒత్తిడి (5) అడెరినలిన్ (6) హృదయముపర్యవసంబంధు గ్రంథియొక్క ప్రకోపము (7) ఈప్రకోపము ఎత్తువగల కేంద్రములలో సంభవించుట (8) బృహద్ధమని, కార్టాయిక్ సైనస్ మున్నగు వాటినుండి సంభవించు ప్రతిఫల (Reflex) చర్య

బృహద్ధమనియందు ఉద్భవించు కరోనరి శుద్ధరక్త నాళములద్వారా గుండెకు రక్తము సరఫరాయగును. కఠినవ్యాయామములలో హృదయము తన పనిని 10 రెట్లు వృద్ధిపొందించుకొనుశక్తిని కల్గియుండును.

గుండెకొట్టుకొనుట: గుండెకొట్టుకొనునపుడు 'లబ్-డబ్' అను క్రమబద్ధమైన రెండుధ్వనులను సులభముగ వినగలము. మూడవశబ్దము అంతసులభముగ వినబడదు. మొదటిశబ్దము జఠరికలు ముడుచుకొనుటవలన సంభవించును. అది చాలకాలము తగ్గుస్థాయిలో జరుగును. రెండవశబ్దము హఠాత్తుగ సంభవించును. ఇది హెచ్చుస్థాయిలో స్పష్టముగ నుండును. అది పుపుసధమనియొక్కయు బృహద్ధమనియొక్కయు శుద్ధరక్తనాళముల పిధానములు మూసికొనుట వలన సంభవించును.

పుట్టుకతోవచ్చు గుండెవ్యాధులు: హృదయాభివృద్ధి ఆగిపోవుటవలన పుట్టుకతోడనే గుండెవ్యాధులు సంభవించును. కొందరు శిశువులు రెండుగదులుగల గుండెతోగాని కవ్వుపతె మూడుగదులుగల గుండెలతోగాని పుట్టవచ్చును. మధ్యగోడయందలి మార్గము, జననము తర్వాతకూడ తెరచియుండవచ్చును. అట్టిసందర్భములందు మలినరక్తము శుద్ధరక్తము కలిసిపోవును. కావున పుట్టిన శిశువు నీలిరంగు కలదిగనుండును. ఈనీలిరంగుబిడ్డలయొక్క లోపము తీవ్రమైనచో వీరు కొన్ని నెలలకంటె ఎక్కువకాలము బ్రతుకజాలరు. ఇతర వర్గముల ఎల్లప్పుడు నీలిరంగువ్యాధి (Cyanosis) ఉండదు. ఉదా — పరిణతిచెందు స్వభావముగలధమనులు (డక్టస్ ఆర్టిరియోసిస్) జననానంతరము మూసికొనిపోవలెను. అవి మూసికొనక పోవుటగాని బృహద్ధమని సంకోచించుటగాని జరుగవచ్చును. అట్టిధమనులను కట్టివేయుట, బృహద్ధమనులంచు అవరోధక సైనోసస్ లో వెలికొల్పుట కొన్నిసందర్భములలో శస్త్రచికిత్స ద్వారా విజయవంతముగ సాధించుటకూడ జరిగినది.

పుపుసధమనికి సంబంధించిన సైనోసిస్ మూలమున రక్తమునకు నీలిరంగనో వయొడరి పుపుధమనిని సబ్ క్లేవియన్ ధమనితో సమ్మేళనము చేయుటవలన దానిని నివారింపవచ్చును.

హృత్కోశపువ్యాధులు: క్షయ కీళ్ళరోగములు మొదలగు వ్యాధులు కారణముగా హృత్కోశపుసంచి వాయవచ్చును. లేక అది ద్రవముతో నిండిపోవచ్చును. న్యుమోనిక్ వ్యాధులలో అది తీవ్రమగు క్షయవ్యాధులకు సంబంధించిన చీము కావచ్చును. లేదా, విషవ్యాధులలో రక్తపుజీరలు కల్గియుండ

వచ్చును అట్టి ద్రవము మితిమీరి చేరినచో అది శ్వాసను బంధించును కావున దానిని తీసివేయవలెను. హృదయమునకు గాయము తగిలినయెడల రక్తము అపరిమితముగా కూడుకొనును. దీనిని తీసివేయవలెయును.

హృదయపధానవ్యాధులు : కొన్ని నొప్పులు : మైట్రల్ కవాటము అరుదుగా అయోర్టిక్ కవాటము భంగపరచును. సవాయివ్యాధివలన ఇది పాడగును. ఇందు కవాటము సంకోచించి రంధ్రము చిన్నద్వారముగ మార్పు చెందవచ్చును. దీనినే స్టినోసిస్ అందురు. లేక పిధానముల శక్తి తగ్గియుండవచ్చును. అవి రెండును కలిసి మూసికొనపోవుటవలన రక్తము ప్రవహించవచ్చును. పై రెండుపరిస్థితులలో యాంత్రిక కారణముల వలన గుండెకు హాని కల్గుచున్నది. ఇటువంటి మైట్రల్ స్టినోసిస్‌నకు శస్త్రచికిత్సచేయుట ద్వారాకూడ వ్యాప్తిలోనికి వచ్చినది. పుట్టుకతోవచ్చిన గుండెజబ్బులలో పుపుస సంబంధమైన లక్షణ మేర్పడును. వి ధపధానముల వ్యాధులందను హృదయమందలి గ్రిప్ప ప్రాంతమందును వివిధములగు సన్న ధ్వనులు వినవచ్చును.

పధానములు సూక్ష్మజీవులుండుటవలన కలుషితములు కావచ్చును. హృదయపు లోపలి పొరయందు సూక్ష్మజీవులుండుటవలన తరచుగా జ్వరము ఘటిల్లి తెల్లరక్తకణములు పెరుగును. అట్టి స్థితి సంభవించినవారికి పూర్వము మరణమే తరణ్యముగ నుండెడిది. కాని ఈనాడు పెనిసిలిన్ వంటి క్రిమిసంహారకౌషధములను నిర్విరామముగ ఉపయోగించి ఈ వ్యాధిని నివారింపవచ్చును.

హృదయపు లయలో మార్పు : సాధారణపరిస్థితులలో హృదయము యొక్క లయ rhythm క్రమబద్ధముగ నుండును. క్రొత్తగా కర్ణికలు యొద్దగాని జఠరికయొద్దగాని ప్రారంభమై అది హృదయకోశముకు వ్యాపించును. ఒక్కొక్క పరిస్థితిలో కర్ణిక ప్రతినిమిషమునందు 170-180 సార్లు కొట్టుకొనును. అట్టిది కొన్ని వ్యాధులవలన లేక థైరాయిడ్ గ్రంధి ఎక్కువగా పని చేయుటవలన లేక జీవాణువిషము వలన సంభవించును. ఒక్కొక్కప్పుడు హఠాత్తుగా అనవసరపు హృత్సంకోచము అధిక వేగముతో సంభవించవచ్చును. అట్లా నిమిషమునకు 170-180 సార్లు జరుగుట సహజముగు లయ తొలగిపోవుట సంభవించవచ్చును. అది హఠాత్తుగ ప్రారంభమై హఠాత్తుగ ముగియును. ఈపరిస్థితినే పెరాక్సిస్మల్ టాకికార్డియా అందురు. ఈదశయందు నాడీవేగము తగ్గును. వ్యాధిమూలమున ప్రేరేపణ మార్గములోనే అడ్డుపడవచ్చును. హృదయము నిమిషమునకు 20 సార్లకంటె తక్కువగా కొట్టుకొన్నచో రోగికి స్మృతితప్పి కంపము కల్గును.

కరోనరీధమనులకు చెందినవ్యాధులు : హృదయమునకు రక్తమునిచ్చు కరోనరీధమనులు కొరక్రమముగా సంకుచితములు కావచ్చును. హృదయకండరములకు పోషణ అందుటవలన తగ్గిపోవును. ఆంజినపెక్టొరిస్ అను వ్యాధియందు రోగి నడచినప్పుడు గుండెలో తీవ్రమైన నొప్పిగాని, భోజనానంతరము ఆయాసముగాని వచ్చును. రోగి పాలిపోయి, తిరుగుటకు భయపడును. విశ్రాంతిని తీసికొనుటవలన లేక నైట్రోగ్లిసరిన్ గోలిని చప్పరించుటవలన ఉపశమనము కల్గును. హృదయకండరములకు రక్తము సరిగా లభింపకపోవుటయే ఈనొప్పికి కారణము. ఒకప్పుడు కరోనరీధమనిని నెత్తురుగడ్డ అడ్డగింపవచ్చును. అందుచే ఆధమనిపై ఆధారపడు హృదయ కండరభాగము చెడును. రోగికి లోపల నొప్పిపుట్టి అశాంతి పొందుచు చెమటకార్చుచు కృంగిపోవును. ఆ బాధ కొన్ని గంటలు లేక కొన్నిదినములు కూడ ఉండవచ్చును. రోగి వెంటనే మరణించుటకాని వ్యాధి తీవ్రతగు తక్కువపుడు చికిత్సవలన జీవించుటకాని సంభవించవచ్చును. అధమపక్షము రోగి ఆరు వారములపాటు విశ్రమించుటయే ఈవ్యాధికి చికిత్స.

హృదయకండరవ్యాధి Myocarditis : డిఫ్తీరియా న్యుమోనియా మొదలగు వ్యాధులు తీవ్రముగా సంభవించినయెడ, హృదయకండరములు పాడగును. కావున విశ్రాంతి అవసరము. రక్తపీడనవలన కరోనరీధమనుల గట్టిపడుటవలన హృదయకండరములు పోషణమును కోల్పోవును. అందుచే వాటికి హాని కల్గును.

హృదయము బలహీనపడుట : హృదయము బలహీనమైనచో అది పలసినంత రక్తమును రప్పించుకొనజాలదు. హృదయమందలి గదుల కదలికవలన ఈ కష్టము కొంతవరకు పూడును. మలినరక్తనాళములలో రక్తము కూడుకొనును. ఒత్తిడి హెచ్చుగనే ద్రవము శరీరములోని రంధ్రములలోనికి, ధాతువులలోనికి చేరబడును. హృదయదౌర్బల్యముకలరోగి మేలుకొనియుండగను ఉద్రిక్తమైన గుండెవ్యాధి పాదములయొద్ద ప్రారంభమై శరీరమంతట వ్యాపించును. మెదడులోపలి రక్తనాళములుపూర్తిగా ద్రవముతో నిండిపోవును ప్లీహము

పెద్దదై బాధకల్గించును; దగ్గువచ్చును ఊపిరి ఆడదు గోళ్ళు, పెదవులు నీలవర్ణము గల్గును మూత్రము చాలా స్వల్పముగా వచ్చును పొట్టయందును గుండెయందును ద్రవమేర్పడును కొన్ని సందర్భములలో కుడిజఠరిక ఊపిరి తిత్తులలోనికి రక్తమును పంపుచు సరిగా పనిచేయును కాని ఎడమజఠరిక ఊపిరి తిత్తులనుండి గ్రహించిన రక్తమును పంపజాలదు తన్మూలమున ఊపిరితిత్తులలో ఇరుకటమేర్పడును ఎడమ జఠరిక యొక్క అశక్తత మూర్ఛలుగా అర్ధరాత్రులందు గోచరించును రోగి దగ్గుచే ఊపిరాడక ప్రక్కమీదనుండి లేచుచుండును దీనినే హృదయసంబంధమైన ఉబ్బసవ్యాధి (cardiac asthma) మందురు ఈపరిస్థితియందు సాధారణముగా రక్తపుపోటు కూడ కల్గియుండును

హృదయ దౌర్బల్యమునకు చికిత్స (1) విశ్రాంతి (2) గుండెవేగమును తగ్గించుటకు డిజిటాలిస్‌వంటి ఔషధము లుపయోగించుట (3) మూత్రము సరిగా వెడలుటకు మెర్క్యురియల్ డయురెటిక్ అను ఔషధమును వాడుట (4) పొట్టలో చేరుకొనిన ద్రవమును తీసివేయుట

రక్తపుపోటు : సాధారణమైన రక్తపుపోటు గుండె యొక్క ప్రాబల్యమువలన, రక్తవాహికల శక్తివలన నిలువబడును అతిసారవిరేచనములవలన శరీరమునుండి కల్గు ద్రవము నష్టమై, శరీరఅవ్యవయవములవలన వాహికలు స్తంభించును ఈ కారణములవలన సంభవించు శక్తికచే రక్తపుపోటు తక్కువగును అనగా సాధారణముగా సుమారు 120–80 మధ్యనుండునది నూరుకంటె తక్కువగును నాడీవేగము హెచ్చును మనస్సు విహ్వలమగును కాని రోగిపరిస్థితి క్లిష్టమగును వెంటనే నష్టమైన ద్రవములను భర్తీచేయుటకై నూదిమందు యిచ్చుట మొదలైన చర్యలు తీసికొననియెడల రోగి చనిపోవు అవకాశముకలదు

కొన్నిపరిస్థితులలో రక్తపుపోటు 140–100 పైన ఉండును మూత్రకోశవ్యాధులుగాని మాంసగ్రంధులరుగ్మతగాని దీనికి కారణము కాకుండినచో, దీనిని "హైపర్ టెన్షన్" అందురు మితిమీరిన రక్తపుపోటు దీర్ఘకాలముండినచో హృదయము బలహీనపడుట మూత్రకోశము చెడుట మెదడులోని రక్తవాహికలు తెగి పక్షవాతము కల్గుట సంభవించవచ్చును ఉద్రిక్తతకు అవకాశములేని క్రమబద్ధమైన జీవితమును గడుపుటయు, రక్తపుపోటును తగ్గించుటకును సర్పగంధి, మెథోనియమ్ వంటి ఔషధములు సేవించుట అవసరము

ఎలక్ట్రోకార్డియోగ్రఫ్ ఇది హృదయము యొక్క పనిని రికార్డుచేయు సాధనము హృదయముయొక్క అయకోని మార్పులు హృదయకండరముల పరిస్థితి ఈ సాధనమువలన గ్రహింపవచ్చును కరోనరీ త్రాంబోసిస్ వ్యాధిలో ఇది మిక్కిలి ఉపయోగకరమైనది

వివిధములైన స్థితులలో తీయబడిన ఎక్స్‌రే పటములు హృదయవ్యాధులను గుర్తించుటకు తోడ్పడును

ఎస్ వేం రా

## హెగెల్ రాజకీయతత్త్వము

తత్త్వవేత్త ఎంతటి మహామహుడైనను దేశకాలపరిస్థితులను వాటిమూలమున కలుగు ప్రభావమును అధిగమించలేడు హెగెల్ (1770–1831) విషయమునకూడ ఈసూత్రము వర్తించుచున్నది అతడు జర్మనీదేశస్థుడు ఫ్రెంచివిప్లవము సంభవించినకాలములో యౌవనమును గడపినవాడు ఆనాటి జర్మనీదేశపు పరిస్థితులు ఫ్రెంచివిప్లవమునకు ఆధారములైన సిద్ధాంతములమూలమున జర్మనీ కలిగిన కష్టనష్టములు అతనిపై ప్రభావము వహించి అతని రాజకీయతత్త్వమునకు జన్మస్థానములయ్యెను

అప్పటికి జర్మనీదేశము పాండిత్యశకముగ పేరుప్రఖ్యాతులు గాంచినట్టిదైనను రాజకీయయుగము మిక్కిలి వెనుకబడి యుండెను దేశమునకంతకు ఒకే ప్రభుత్వములేక చిన్నచిన్న రాజ్యములనేకము లేర్పడియుండెను వీటిమధ్య అనాదిగ వైషమ్యముండుటచే పోరుగుగమున్న బలవత్తరమగు ఫ్రెంచి రాజ్యము అనేకపర్యాయములు జర్మనీపై దండెత్తివచ్చుటయు కొన్ని ప్రాంతములను జయించి వశపరచుకొనుటయు జరుగుచువచ్చెను దేశాభిమానియగు హెగెల్‌కు ఈపరిస్థితి ఎంతమాత్రము నచ్చకపోవుటలో ఆశ్చర్యములేదు జర్మనీ సమైక్యతను సాధించి యూరపుఖండములోని బలవత్తరములగు రాజ్యములలో ఒకదానినిగ రూపొందించుటకు అతడు సాధనము లన్వేషించువాడయ్యెను యుద్ధములనిన భయపడక, పటిష్ఠముగు సైన్యసాధనమున బలప్రయోగముచేయగల రాజ్యమొకటి ఏర్పడుటయే దీనికి ఉత్తమమార్గమని నిర్ణయమునకాతడువచ్చెను అట్టిరాజ్యమే ప్రజలు సాధించదగిన రాజ్యమనియు అది వారికి ఆరాధ్యదైవముగనుండవలెననియు దాని శాసనములలోని గుణదోషములతో నిమిత్తములేక వాటిని

కరసాపహించుటయే వారివిధియనియు అతడుసిద్ధాంతీకరించెను. ఈసిద్ధాంతమునకు దేశపరిస్థితులు ప్రధానకారణములైనను తత్త్వగ్రాహ్యతకూడ అతడు దానిని సమర్థించెను.

రాజ్యము ప్రజలకు ఆరాధ్యదైవముగ నుండవలెనని అతడు సిద్ధాంతీకరించుటకు ఫ్రెంచివిప్లవము మూలమున తన మాతృదేశమగు జర్మనీకి కలిగిన భంగము కష్టనష్టములుకూడ కారణములయ్యెను. ఫ్రెంచివిప్లవమును లేవదీసిన విప్లవకారులు తమఉద్దేశము మానవసమత్వమును మానవస్వేచ్ఛను మానవసౌభ్రాతృత్వమును తమదేశములోనేకాక యూరపు ఖండమందంతటను ప్రపంచమందంతటను నెలకొనునట్లుచేయుటయేఅని ప్రకటించిరి. ఇందుకై తమదేశములోని రాచరికమును నిర్మూలమొనర్చి ఒకవిధమైన ప్రజాస్వామికమును స్థాపించిరి. కాని విప్లవము తొలివిప్లవకర్తలనుకొనినట్లు సాగలేదు. కొంతకాలమునకది అతివాదుల అధికారమునకు దారితీసి దేశమునంతను రక్తపాతమగునట్లుచేసెను. దీనిఫలితముగ సైన్యాధ్యక్షుడగు నెపోలియన్ రాజ్యాధికారము నంతను హస్తగతముచేకొని విప్లవమునకు పూర్వము దేశమును పాలించిన రాజులకంటె నిరంకుశముగ పాలింపసాగెను. విప్లవము తప్పక నిరంకుశత్వమునకు దారితీయునని ఆతనిపరిపాలన స్పష్టమొనర్చెను.

కాని నెపోలియన్ ఇంతటితో తృప్తిచెందలేదు. మానవసమత్వాదివిప్లవసిద్ధాంతములను జర్మనీమొదలైన ఇతరదేశములలోకూడ ప్రవేశపెట్టదలచి వాటిపై దండెత్తి తనసామ్రాజ్యాధికారమును ఆయాదేశములలో స్థాపించెను. జర్మనీలో చాలభాగమును తనపరిపాలనలోనికితెచ్చి ఫ్యూడల్ విధానమును రద్దుచేసి ప్రజలఉపయోగార్థమై కొన్ని సంస్కరణములను గావించెను. ఫ్రెంచిసైన్యములు తమదేశముపై దండెత్తివచ్చి తమరాజులను ఓడించుటను జర్మనుదేశాభిమానులు ఎంతమాత్రము హర్షించలేదు. ఇంతేకాదు తనసామ్రాజ్యవ్యాప్తికై నెపోలియన్ జర్మనుప్రజలనుండి పన్నులువసూలుచేయుటయు, వారివర్తకవ్యాపారములపై ఆంక్షలు విధించుటయు పరిపాటి అయ్యెను. మానవసమత్వమును, స్వేచ్ఛను ప్రవేశపెట్టుటకై వచ్చినఫ్రెంచివారు తమసామ్రాజ్యాధికారవ్యాప్తికి సాధనముగ తమ్ములవినియోగించుకొనుచున్నారని జర్మనులు గ్రహించిరి. ఆదేశపు మేధావులనేకులలో ఈకారణముచేత ఫ్రెంచి విప్లవసిద్ధాంతములపట్ల విముఖత్వమేర్పడెను. అట్టి వారిలో హెగెల్ ప్రముఖుడు.

1806లో నెపోలియన్ పదభ్రష్టుడయ్యెను. 1818-31 వరకు జర్మనీరాజ్యములలో అగ్రస్థానమునహించిన ప్రష్యారాజ్యమునకు ప్రధానగరమైన బెర్లిన్‌యందలి ప్రసిద్ధిచెందిన విశ్వవిద్యాలయములో హెగెల్ ఆచార్యపదవిని అధిష్ఠించి తనరాజకీయతత్త్వమునకు రూపురేఖలుదిద్ది గ్రంథములరూపమున వాటిని ప్రపంచమునకంతకు ప్రకటించెను. జర్మనీ తరించుటకు ఏకైకోపాయము దేశములో బలవత్తరమగు రాజ్యమేర్పడుట. ఈతత్త్వమునకాధారము బలవత్తరమగు రాజ్యములేక ఏదేశముగాని ఏప్రజలుగాని తరించలేరని తనసిద్ధాంతమునకు అతడు ప్రపంచవ్యాప్తిని కలిగించెను.

ఈసిద్ధాంతమును ప్రతిపాదించుటలో అతడు ఫ్రెంచి విప్లవ సిద్ధాంతములో ప్రధానములైన సమానత్వమునకు, స్వేచ్ఛకు సంబంధించువాటిని ఖండించుట అవసరమయ్యెను. విప్లవము మూలమున ఫ్రాన్సులో రక్తపాతము సంభవించుటయు నెపోలియను నిరంకుశత్వము బలపడుటయు ఇతరదేశములు ఫ్రెంచిసామ్రాజ్యములో వలసరాష్ట్రములగుటయు జరిగెను. ఇవన్నియు అవాంఛనీయ పరిణామములని అతడు గుర్తించెను. దీనినుండి హెగెల్ ఒకసత్యమును నిరూపించెను: విప్లవము లెన్నడును ప్రజలకు శ్రేయస్సును కలిగించు సాధనములు కాజాలవు. వాటిమూలమున ఒకవిధమైన నిరంకుశత్వము తొలగినను ఇంకొకవిధమగు నిరంకుశత్వము స్థాపింపబడును. ఈనూతన నిరంకుశత్వము గతించినదానికంటె బలవత్తరమై ప్రజలశ్రేయస్సుకు మరింతభంగకారి కాగలదు. అందుచేత సమాజములో జరుగవలసినమార్పులు పరిణామాత్మకముగ జరుగవలసియున్నవేగాని విప్లవపూర్వకముగ జరుగరాదు.

ఇంతేకాదు సమత్వము స్వేచ్ఛఅనువాటికిసంబంధించిన సిద్ధాంతములు మిక్కిలిప్రమాదకరమైనవి. అవి రాజ్యాధికారమును బలహీనపరచి అరాజకమునకు దారితీయగలవు. పరిపాలనాధికారమును సామాన్యప్రజలు వహించరాదు; అందుకవసరమైన అర్హత వారికి లేదు. అది సర్వదా వంశపారంపర్యముగ సింహాసనమునధిష్ఠించు రాజులచేతులలోనుండవలెను. అట్టి రాజులు రాజ్యమందలి శిష్టులసహకారముతో పరిపాలనము సాగించుటయే ఉత్తమవిధానము. రాజులపరిపాలనమునకు లోబడి ప్రవర్తించుటయే నిజమైనస్వేచ్ఛననుభవించుట

నిజమైనస్వేచ్ఛ నామమాత్రపుస్వేచ్ఛ అను స్వేచ్ఛకు సంబంధించు ద్వీకరణము హెగెల్ సిద్ధాంతములో కేంద్ర స్థానమును వహించుచున్నది. విప్లవకారుల సిద్ధాంతములను ఖండించుటలో అతడీవర్గీకరణమును వినియోగించెను.

విప్లవకారుల వాదములో స్వేచ్ఛ అనగా బాహ్యులు విధించు నిర్బంధములు లేనందున తన ఇష్టమువచ్చినట్లు ప్రవర్తించు అవకాశము. ఇట్టి అవకాశము వ్యక్తికున్నపుడే అతడు స్వేచ్ఛ అనుభవించుచున్నాడు. కాని హెగెల్ ఈనిర్వచనమును అంగీకరించుటలేదు. స్వేచ్ఛకు ఇట్టిఅర్థమును కల్పించుటలో రెండువిధములగు లోపములున్నవి. ఒకటి మానవుని స్వేచ్ఛకు భంగము కలిగించునట్టివి బాహ్యులు విధించు నిర్బంధములు మాత్రమేకావు. అతనిలోని చాంచల్యము ఇంద్రియలోలత్వము వీటికంటె బలవత్తరములై అతని నిజమైనస్వేచ్ఛకు భంగము కలిగించుచున్నవి. మానవునిలో రెండురకములగు ఇచ్ఛలున్నవి. అందులో మొదటిది అధమము రెండవది ఉత్తమము. అధమేచ్ఛ అవాస్తవికము. ఉత్తమేచ్ఛ వాస్తవికము. అధమేచ్ఛ చాంచల్యములను తాత్కాలికములను అయిన ఇంద్రియవాంఛలకు లొంగునట్టిది. దీనిప్రకారము ప్రవర్తించువారు తనప్రవర్తనమునుగూర్చి తానే ఆలోచించుకొనునపుడు మిక్కిలి విచారించును. ఎందుకు ప్రవర్తించితినా అని పశ్చాత్తప్తుడగును. అందుచే ఇది అతని నిజమైన ఇచ్ఛకాదు. ఇంద్రియములను స్వాధీనములో ఉంచి ఆలోచనపూర్వకముగ తనకేది మంచిదో ఏదికాదో నిర్ణయించుకొనునపుడు అతనిలో కలుగు ఇచ్ఛ అతని నిజమైన ఇచ్ఛకాగలదు. దీననుసరించి ప్రవర్తించునపుడు అతడు పశ్చాత్తాపపడవలసిన అవసరముండదు. అతని నిజమైన ఇచ్ఛ స్వార్థరహితమై సామాజిక శ్రేయస్సును కోరునట్టిదగును.

దీనినుండి హెగెల్ మరియొక సత్యమును ప్రతిపాదించెను. రాజ్యముయొక్క ఆశయము సమాజములోని అందరి శ్రేయస్సును కోరునట్టిది. ఏ ఒకరి శ్రేయస్సునుగాని ఏ ఒక వర్గముశ్రేయస్సునుగాని కోరునట్టిదిగాదు. అందువలన వ్యక్తియొక్క నిజమైన ఇచ్ఛకు రాజ్యముయొక్క ఇచ్ఛకును విభేదములేదు. రెండింటిని ఐక్యమొక్కటే. కావున రాజ్యము విధించు శాసనములకులోబడి ప్రవర్తించు వ్యక్తి తన నిజమైన స్వేచ్ఛను అనుసరించి ప్రవర్తించవలెను. అట్టిశాసనములు బాహ్యులు విధించు నిర్బంధములని భ్రమపడరాదు.

స్వేచ్ఛ అనుమాటకు విప్లవవాదులు కల్పించిన నిర్వచనములోని రెండవలోపమును హెగెల్ ఈ క్రింది విధముగ వివరించెను:

స్వేచ్ఛకు భంగకరములని ఎదావాదులు చెప్పు బాహ్య నిర్బంధములన్నిటికి ఈ లక్షణములేదు. ఇతర వ్యక్తులు స్వార్థపరులై విధించు నిర్బంధములకు మాత్రమే ఇట్టి లక్షణమున్నది. కాని సమాజము అందలి వర్గకలహములను రూపుమాపి, అందరిమధ్య సామరస్యమును కల్పించుటకేర్పడిన రాజ్యము. ఈ రెండును విధించు నిర్బంధములిట్టివికావు. జన్మించినపుడు నిస్సహాయుడు అతనిని పోషించి పెద్దజేసి అతనికి విద్యాబుద్ధులు గరపి అతనిలో నిగూఢమై ప్రచ్ఛన్నముగనుండు వివిధశక్తులను వికసింపజేసి మానవత్వమును అతనికి ప్రసాదించునది సమాజమే. తల్లిదండ్రులు కుటుంబము కులము విద్యాలయము వృత్తిసంఘములు వీటిసాధనముచే తరతరములుగ ఏర్పడిన సంప్రదాయములు ఆచారములు ఈధర్మమును నెరవేర్చుచున్నవి. ఇవి విధించు నిర్బంధములమూలమున అతడు ఇంద్రియప్రలోభత్వమునకు పూర్తిగ గురికాక కొంతవరకైన అధమేచ్ఛను వదలి ఉత్తమేచ్ఛానుసారము ప్రవర్తించువాడగును. విధినిషేధరూపమునుండు రాజ్యశాసనములుకూడ ఈ ఉద్దేశమునే నెరవేర్చుచున్నవి. సమాజము రాజ్యము రూపొందించు సంప్రదాయములు చట్టములు పైకి స్వేచ్ఛకు భంగకరములుగ కన్పించినను వాస్తవమునకవి మానవునకు స్వతహాగాలేని శక్తిసామర్థ్యములను కౌశలమును సమకూర్చి అతని ఇష్టమును నెరవేర్చుకొనుటలో అతనికెంతయో సహాయపడుచున్నవి. సమాజములో సభ్యుడుగాను రాజ్యములో పౌరుడుగాను ఉండక ఏకాకిగ కాలము గడుపువాడు భాష, సంస్కృతి మంచిచెడుగు అనుభేదమును తెలియక మృగతుల్యుడగును. అందుచేత ఇవి విధించు నిర్బంధములు నిజముగ నిర్బంధములు కానేకావు. ఇవి అతని రక్షణకు అభివృద్ధికి మూలసాధనములు.

సమాజమును రాజ్యమును కాదని కట్టెపై తిరుగుబాటు చేసి విప్లవములు లేదీయుట అవ్యక్తమేకాక మానవద్రోహము వంటిదే. సమాజము తనకి ప్రసాదించిన స్థానమును న్యాయపూర్వకముగ ఆక్రమించి ఆ స్థానమునకు సంబంధించు విధులను నిర్వహించుటయే మానవుని కర్తవ్యము.

శాసనములసాధనమున వ్యక్తులను నియమితమార్గములో

ప్రవర్తించునట్లు చేయు రాజ్యమే మానవులకు ఇహలోకమందు ఆరాధ్యదైవమని నిరూపించుటకై హెగెల్ మరియొక వాదమునుకూడ సహాయకారిగ చేసుకొనెను.

సూర్యచంద్రాదులతో కూడిన ప్రకృతిసిద్ధమైన ప్రపంచము చట్టబద్ధమై ప్రవర్తించుచున్నది. గ్రహములు వాటిగతిని తప్పుటలేదు. ప్రకృతిలోని సకలశక్తులు వాటివాటి నిర్ణీతమార్గములలో నడచుచున్నవి. మానవుడు తన బుద్ధిని వినియోగించి కార్యకారణసంబంధరూపమగు హేతువాదము ద్వారా ప్రకృతిని నడుపు చట్టమును గ్రహించి అర్థము చేసికొని ఆ అర్థమును సాధనముగ చేసికొని ప్రవర్తించుచున్నాడు. ప్రకృతిలోని చట్టమును ధర్మమును అతడు మార్చుట సాధ్యము కాదు. ప్రకృతిని నడపించు హేతుబద్ధమగు చట్టమొకటి ఉన్నట్లే మానవసమాజమును నడపించు చట్టమొకటున్నది. అదికూడ హేతుబద్ధమైనట్టిదే. ఆ చట్టమును ప్రపంచమునంతను ఆవరించిన మహాశక్తి నిర్మించుచున్నది. మానవచరిత్ర అంతయు ఆ మహాశక్తియొక్క కార్యకలాపముల ఫలితమే. ఆ మహాశక్తిని మానవుడు హేతుదర్శనముద్వారా అర్థము చేసికొనగలడు. అంతమాత్రమేకాని అది విధించు ధర్మములను చట్టములను అతడు మార్చజాలడు. చట్టబద్ధమగుటలో ప్రాకృతిక ప్రపంచమునకును మానవసామాజిక ప్రపంచమునకును పోలిక పూర్తిగ నున్నది. విప్లవతత్త్వవేత్తలు ఇట్టి పోలిక లేదనియు మానవ ప్రపంచధర్మమును మానవులు తమ చిత్తవృత్తి ననుసరించి మార్చుట సాధ్యమనియు, సమాజమును తమ ఇష్టానుసారము మార్చవచ్చుననియు భ్రమపడి ఫ్రెంచివిప్లవమును లేవదీసినను, దానివలన వారి ఉద్దేశము నెరవేరకపోవుటయేకాక వారు తలపెట్టని అవాంఛనీయపరిణామములకు అది దారితీసినది.

మానవచరిత్రను ప్రచ్ఛన్నముగ నడపు మహాశక్తి అవసరమైనపుడు సమాజములో మార్పులు కల్గించుచుండును. ఒక్కొక్కప్పుడు సమాజములోని పరిస్థితులు క్లిష్టములై 18-19 శతాబ్దములోని జర్మనీపరిస్థితులవలె అభ్యుదయనిరోధకములుగ నుండవచ్చును. వీటికి కారణముకూడ ఆమహాశక్తియే. అట్టిపరిస్థితులను అదియే చక్కబెట్టగలదు. చరిత్ర ఏవిధముగ మారవలెనో ఆమహాశక్తి ఏర్పరచిన ధర్మమే నిర్ణయించుచుండును.

చరిత్రను సాగించుటలో ఆమహాశక్తి రాజ్యమును, రాజ్యాధికారమును ప్రధానసాధనములుగ వినియోగించుచున్నది. మహాశక్తి విధించు నీతినియమములకు రాజ్యము నిలయము. అందుచే ఇహలోకమున ఏది నీతి ఏదికాదు? అని నిర్ణయించగల అధికారము రాజ్యమునకుమాత్రమే ఉన్నది. నీతికి రాజ్యము బాహ్యస్వరూపము. సూర్యుడు ఉష్ణమునకు వెలుగునకు కేంద్రమై ప్రపంచమునకు ఉష్ణమును వెలుతురును ప్రసాదించునట్లు నీతికి కేంద్రమైన రాజ్యము మానవకోటికి నీతినియమములను ప్రసాదించుచున్నది. రాజ్యముచేయు చట్టములను కాదని వేరొక నీతిని సృష్టించవలచుట చరిత్రగతిని నిర్ణయించు మహాశక్తియొక్క ఉద్దేశమునకు విరుద్ధము. అట్టి ప్రయత్నమునెవరును పూనరాదు.

రాజ్యమును పాలించువారు సర్వదా సైనికబలమును సమకూర్చుకొని తమ అధికారమును నిలబెట్టుకొనుటకును, విస్తరింపజేసికొనుటకును సంసిద్ధులుగ నుండవలెను. రాజ్యముల మధ్య విరోధము తప్పదు. క్షాత్రమే రాజధర్మము. రాజ్యమును నిలబెట్టుటకై ప్రతిపౌరుడును సమస్తత్యాగములను చేయవలెను. దీనికి మించిన నీతి ఇంకొకటిలేదు. దేశాభిమానముకంటె ఉత్కృష్టమగు సద్గుణము మరియొకటి ఉండజాలదు.

ప్రజలకు రాజ్యమే ఆరాధ్యదైవమను తనసిద్ధాంతమును హెగెల్ పైవిధముగ సమర్థించెను. కాని వ్యక్తిస్వాతంత్ర్యమును ప్రజాస్వామికమును అభిమానించు తత్త్వవేత్తలు దీనిని ఖండించుచున్నారు. హెగెల్ రూపొందించిన రాజ్యము ఆదర్శప్రపంచమందేగాని వాస్తవప్రపంచమందెచ్చటను లేదు. అట్టిరాజ్యమును సృష్టించుట సాధ్యముకాని పని. అన్ని రాజ్యములను పరిపాలించువారు మానవమాత్రులే. చట్టములనగా అధికారములోనుండు మానవులు విధించు మాత్రములే గాని మానవాతీతులు విధించునట్టివికావు. వారు సర్వజ్ఞులనియు వారిచట్టములలో లోపములుండవనియు చెప్పుట సాహసము. వారిని విమర్శించు అధికారము ప్రజలకు ఉన్నప్పుడే చట్టములలోని లోపములు బహిర్గతమగుటకును వాటిని సవరించుటకును అవకాశముండును. సమాజము నిలబడుటకు రాజ్యాధికారము అవసరమే. కాని ఆ అధికారము ప్రజలశ్రేయస్సుకై వినియోగింపబడినపుడే దానికి సార్థకత్వము లభించుచున్నది. వాస్తవప్రపంచములోని రాజ్యములు అన్నికాలములలో అన్నిదేశములలో ప్రజలశ్రేయస్సుకై పాటుపడునట్టివికావు. వాటిని పరిపాలించు ప్రభుత్వములను తొలగద్రోసి, వాటిస్థానే మరియొకరకములగు ప్రభుత్వములను

స్థాపించుట అవసరముగుచున్నది. ఒక్కొక్కప్పుడు ఈమార్పు హింసకు జమూలమునకే జరుగుటకు అవకాశమున్నది.

హెగెల్ ఆదర్శవాది. అతడు చిత్రించిన ఆదర్శప్రపంచమునకును వాస్తవప్రపంచమునకును వైరుధ్యములు లేవు. అందుచేత అతని రాజకీయతత్త్వము తత్త్వదృష్ట్యా విశిష్టతకలది అయినను వాస్తవికదృష్ట్యా లోపములతో కూడుకొన్నట్టిది. అతనికాలపు జర్మనీలోని పరిస్థితులను చక్కబెట్టి జర్మనీసమైక్యతను స్థాపించి నిలబెట్టుటకు ప్రబలశక్తిగల రాజ్యము అవసరము. మరియు అంతమాత్రముచేత ప్రపంచమునకంతకు మానవకోటికంతకు వంశపారంపర్యముగా అధికారములోనికివచ్చు రాజులచే పాలింపబడు రాజ్యములే శాంఛనీయములని వాదించుట పొరపాటు.

మా. వెం.

## హేతువాదము :

హేతువాదమనునది అధికారములేక శాస్త్రముపై కాక, తర్కము లేక హేతువుపై ఆధారపడునొక విశ్వాసము మత సిద్ధాంతములకును విజ్ఞానశాస్త్రములకును చరిత్రకును సకల మానవశాస్త్రములకును ప్రపంచమున జరుగు ప్రతిసంఘటనమునకును తర్క సిద్ధాంతములను అన్వయించుటయే హేతువాదమనెడును విశ్వమున ఘటిల్లు ప్రతిసంఘటనము ప్రకృతి సహజమైన హేతువులవలననే జరుగుచున్నదికాని అమానుషమైన తర్కాతీతమైన అదృశ్యావహమైన క్రియలవలన సంభవించుటలేదని హేతువాదము చాటుచున్నది.

ఈ హేతువాదభావన తత్త్వశాస్త్రమునందు ఒక ముఖ్యాంశము. తత్త్వశాస్త్రమునందు విశ్వమంతయు నొక మహత్తర ఘటితము. ఒక దివ్యమైన వ్యవస్థ సర్వస్వముగా ఏర్పడియున్నది. అట్టి విశ్వమును మానవుడు తన హేతువాదముచే విశ్లేషించి అందలి మర్మములను పరిశోధించి వెల్లడించగల్గుచున్నాడు. అందుచే హేతువాదము విజ్ఞానశాస్త్రములలో ఒలియమైన పాత్రను వహించి ప్రకృతిసృష్టి పరిణామములకు శాస్త్రీయ-గణితశాస్త్రీయసంబంధ దృష్టిని విమర్శనాత్మకపథమును స్థిరపరచినది. అంతేకాక మానవజాతికి కలిగియుండిన అన్నిరంగములందును ఈనాడు హేతువాద దృక్పథము అవలంబింపబడుచున్నది.

ప్రకృతిగాని ప్రపంచముగాని అంతర్జ్ఞానముచే సృష్టింపబడినదను వాదమును హేతువాదము అంగీకరింపదు. అయితే, ప్రపంచమునుగూర్చి మనమార్జించిన పరిజ్ఞానములో సహేతుకముకాని ప్రతిఅంశము పూర్తిగా వర్జనీయమని మాత్రము హేతువాదము బోధించదు. సిద్ధాంతరీత్యా ఇంద్రియగోచరమగు బాహ్యప్రపంచమునందలి వివిధస్వరూపములను హేతువాదమంగీకరింప నిరాకరించునుదాదాపు మానవుని వ్యష్టి సమష్టి జీవితమునందు ఘటిల్లు అదృష్టము యాదృచ్ఛికము, దైవఘటన అనుఅకస్మాత్ సంఘటనములను హేతువాదము ప్రతిఘటించును.

చంచలమైన ప్రకృతియందు మానవుడు తన అంతర్జ్ఞాన ప్రేరితమైన ఊహలు జోస్యము సంకల్పాదులు కావని భావించుటయే కాక అతనిస్వానుభవముపై అటివి తరచుగా లోకభూయిష్ఠములనికూడ యెంచెను. అందుచే మానవుడు హేతువాదశక్తిచే ప్రభావితుడై ప్రపంచన ఘటనములను సహేతుకముగా సశాస్త్రీయముగా సవిమర్శకముగా శ్లేషింపగలిగి మానవునికి శక్తి నిరపేక్షతంత్రమైన అంశమని విశ్వసింపదగ్గుచున్నాడు.

అరిస్టాటిల్ అను గ్రీకతత్త్వవేత్త తన తార్కికవాదములోని ఆలోచనాక్రమమంతయు హేతువుమీదనే ఆధారపడియుండునట్లు రూపొందించుకొనెను. ఈ ఆలోచనావిధానము ప్రపంచసృష్టిస్థితిలయములనుగూర్చి తెలిసికొనుటకై మానవుడు హేతువాదదృష్టిని అవలంబించుకొను విషయములో సహాయపడెను. గ్రీకుప్రజలనుసరించిన హేతువాదమునందు తత్త్వవేత్తయగు సోక్రటీసు అవలంబించిన తార్కికవాదమొక మంచు తునక. మానవజీవితమునెడల గ్రీకప్రజలపై ఖరి అంతర్జ్ఞానముపైకంటె విషయపరిజ్ఞానముపైననే విశేషముగా ఆధారపడియుండెను.

రోమనులవ్యష్టి జీవితమునందును రాజకీయ జీవితమునందును హేతువాదమొక శక్తివంతమైన ఆలోచనావిధానముగ ఉపకరించెను. జీవితనియంత్రణమునకై హేతువాదమొక అత్యవసరమైన సాధనముగా రోమనుప్రజలు పరిగణించిరి. ఆలోచనాపరులైన ప్రతివ్యక్తియు అనాటి సమాజములో నైతిక, హేతువాదదృక్పథమును అనుసరించవలసినవారై యుండెను.

భారతీయతత్త్వవేత్తలనేకులు తమతమ తత్త్వసిద్ధాంతములను వివిధరకముల హేతువాదముపై ఆధారపడి ప్రతిపాదించిరి. మహావీరుడు బుద్ధుడు, శంకరుడుమొదలైన తత్త్వ

వేత్తలు ప్రకృతిని ప్రపంచమును పరిశీలించి నిర్వచించుటలో హేతువాదమును మార్గదర్శకముగా స్వీకరించిరి ప్రపంచనిర్వచనమునకై అవలంబింపబడిన హేతువాదదృష్టిమండియే మంచిచెడులను గుణములు ఉత్పన్నములయ్యెను

అయితే మధ్యయుగములో ఆస్తికులైన కొందరు భారతీయతత్త్వవేత్తలు మానవజీవితమునుగూర్చి ఒక నూతన దృక్పథమును ప్రతిపాదింపనెంచిరి ఈదృక్పథమునందు హేతు తార్కికవాదధోరణులు ప్రముఖపాత్ర వహింపలేదు మానవ జీవితము భగవంతునివలననే రూపుదిద్దబడి ఆతనిచేతనే ఉత్తేజిత మగుచుండుననియు అందుచే హేతువాదము ప్రపంచము యొక్క అస్తిత్వమునుగూర్చి వివరింపజాలదనియు భగవంతుని దివ్యశక్తియొక్కచే విశ్వముయొక్క సృష్టిస్థితిలయములను గూర్చిన మర్మములను బహిర్గతమొనర్పజాలుననియు భారతీయ తత్త్వవేత్తలానాడు వక్కాణించిరి

పాశ్చాత్యఖండములలో ఘటిల్లిన పునరుజ్జీవనయుగము నందైనను హేతువాదము ప్రముఖపాత్రను వహింపలేదు ఆనాటి సాహిత్యమునందును తత్త్వశాస్త్రమునందును ప్రకృతియొక్క పరిణామగతి హేతువిరుద్ధమైనదిగను అనూహ్యమైనదిగను చంచలమైనదిగను వర్ణింపబడినది కాని కాలక్రమమున మానవుడు ప్రశాంతచిత్తముతో ప్రపంచమును గూర్చియు మానవ జీవితమునుగూర్చియు సుదీర్ఘముగ వితర్కింపసాగెను అంతేకాక అతడు ఆనాటి మతసిద్ధాంతములు, మత సంప్రదాయములను గురించి విమర్శకదృష్టితో శంకింపదొడగెను ఈ విధముగా విజ్ఞానములో నూతన చైతన్యముదయించెను ప్రపంచములోని ప్రతిసంఘటనమును గూర్చియు తీవ్రముగ ఆలోచించి తర్కించుటతో హేతువాద దృష్టి ప్రజలలో క్రమముగ వ్యాపింపసాగెను ఇట్లు 17 వ శతాబ్దిలో సశాస్త్రీయమైన హేతువాద దృక్పథము విజ్ఞాన వర్గములో పాదుకొనెను ఈ కారణమువలననే గణితశాస్త్రమొక ప్రధాన విజ్ఞానశాస్త్రముగ వికాసమందెను దీని నాధారముగాగొని ఆనాటి తత్త్వవేత్తలు గణితశాస్త్ర సహాయముతో ప్రపంచ సంఘటనములనన్నిటిని నిర్వచింపయత్నించిరి అట్టి గణితసిద్ధాంతములను నూతనముగా ప్రతిపాదించిన శాస్త్రవేత్తలలో గెలిలియో ప్రథముడు ఈ సిద్ధాంతము సాంఘిక, రాజకీయ జీవితమునకుకూడ అన్వయింపబడెను

18వ శతాబ్దిలో హేతువాదభావన మరియొక రూపమును దాల్చనారంభించెను ఈభావన "ఇచ్ఛాస్వాతంత్ర్య" మనబడినది ప్రజలలో వర్గవ్యత్యాసములు పొడచూపెను వ్యక్తుల ఆర్థికవ్యాసంగములో సాధ్యమైనమేరకు స్వేచ్ఛ నొసగవలెనను అభిప్రాయమానాటి అధికారవర్గమునకేర్పడెను హేతువాద దృష్టితో తమతమహక్కులను సాధించుకొనుటకై వివిధవర్గముల వారు వివిధ రూపములలో ఆందోళనములను కొనసాగించిరి

17 18వ శతాబ్దులలో విశ్వసింపబడిన హేతువాదధోరణులవడుమ విశేషముగుభేదముకలదు తొలిదశలో ప్రజలమీద పైవర్గమువారిచే హేతువాదము నిర్బంధముగా ప్రయోగింపబడిన సిద్ధాంతముగా భావింపబడెను సమాజములో వివిధ వ్యక్తులయందు వివిధరూపములలో ప్రబలియున్న హేతువిరుద్ధ భావములను మతాచారములను మూఢనమ్మకములను అణచివేయుటయే ఆనాడు హేతువాదమును ప్రవేశపెట్టిన వారి ప్రధానోద్దేశము అట్లుచేయుటవలననే సంఘజీవితము సుఖప్రదమగునని వారి అభిప్రాయము తర్వాతికాలములో ప్రజలయందు హేతుదృష్టి ఏర్పడినదను నమ్మకముతో దానిని విద్యామూలమునను, సాంస్కృతిక వినోద కార్యక్రమముల మూలమునను వికసింపజేయుటకు పైవర్గములవారు పూనుకొనిరి

19వ శతాబ్దిలో హేతువాదభావన వేరొకరీతిలో ఇంకను వికాసముచెందెను ఈనూతనభావన ప్రజల చారిత్రక సాంఘిక జీవితమునందలి సంఘటనములను తార్కికముగా ప్రశ్నింపనారంభించెను జనసామాన్యములో చారిత్రక సాంఘిక చైతన్యము ప్రస్ఫుటముగా గోచరించెను సాంఘిక సాంస్కృతిక పరములైన సంఘటనములపట్ల విజ్ఞానులలో ఆధ్యాత్మిక చింతనముకంటె ఐహికచింతనమునకు ప్రబలమైన స్థానమేర్పడెను పాశ్చాత్యఖండములలో ఎడ్మండ్ బర్కుమున్నగ ప్రముఖులు ప్రజాజీవితములో సాంఘిక ఆర్థిక అసమానత్వము పెడల సానుభూతిని వహించి, అట్టి అసమానస్థితికిగల కారణములను అవగాహనచేసికొనవలెనని సాటివిజ్ఞానులను ఉద్బోధించిరి అయినను కేవలము హేతువాదదృక్పథమువలననే ఈ అసమానస్థితియొక్క లోతుపాతులు బోధపడజాలవను అభిప్రాయమును అతడు సూచించెను

కాని హెగెల్ అను ప్రఖ్యాతశాస్త్రీకుడు హేతువాద దృక్పథమునకు నూతననిర్వచనమునొసగెను హేతువాదమను

నది ఒక్కసారి అకస్మికముగా రూపొందగల భావక్రమము కాజాలదనియు చారిత్రకపరిణామములో గతతార్కిక ఆలోచనావిధానఫలితముననే అది రూపు దిద్దుకొనగలదనియు అతడు ఉద్ఘాటించెను. చరిత్రగమనమునకాతడు హేతువాద దృష్టిని కల్పించి అశాస్త్రీయమైన అవాస్తవికమైన పెడధోరణులను విమర్శించి త్రోసిపుచ్చెను.

అయితే హేతుబద్ధములైన విజ్ఞానశాస్త్రములు హేతువాదప్రాతిపదికమీదనే నిర్మితములైనవని చాటిన తొలినాటి హేతువాదధోరణియందలి సత్యమును 20వ శతాబ్దినాటి కొందరు శాస్త్రజ్ఞులు తత్వవేత్తలు శంకించి విజ్ఞానశాస్త్రాంశములు మానవుని హేతువాదదృష్టిని సమర్థింప వాటికి అతీతముగా నున్నవనియు, అట్లే అర్థికరంగములో కూడ హేతువాదమునకు కాక అందుకు భిన్నమైన వ్యక్తిప్రాబల్యమును పురిగొల్పు స్వాతంత్ర్యమునకే అధిక ప్రాధాన్యమున్నదనియు వీరు వక్కాణించిరి. ఇట్లు 18 వ శతాబ్దినాటి హేతువిరుద్ధమైన ఉదారవాదము మరల తలయెత్తెను. ఇట్లు హేతువాదమునకును తద్విరుద్ధమైనభావములకును సంఘర్షణమేర్పడెను. కాని ఎటు చూచినను ఈనాడు సకలప్రపంచములో హేతువాదదృష్టియు విమర్శనాదృష్టియు ప్రాబల్యమువహించి వివిధకోణములలో, వివిధరూపములు దాల్చి క్రమముగా ప్రాబల్యము వహించి పురోగమనముగావించుచున్నది.

శ్రీ శ్రీ

## హైందవపర్వములు :

ఋతుపరివర్తనముచే నేర్పడు ప్రకృతి పరిణామములు పరంపరాగతములైన గాథలు నక్షత్రగ్రహాదుల సన్నివేశములు-మున్నైనవెన్నియోకలిసి భారతదేశములో పర్వములుగా రూపుధరించినవి. ప్రాచుర్యమువమున్న కొలదిపర్వములు మాత్రమిచ్చట సంగ్రహముగ వర్ణింపబడుచున్నవి.

1 ఉగాది: అనంతమైనకాలమును గ్రహించుటకు ప్రాచీనులు సంవత్సరమును ఒకమానదండముగా భావించినారు. చంద్రబింబముయొక్క హైన్యపూర్ణత్వములనుచూచి పూర్ణిమనుండి పూర్ణిమకునడుమగల కాలవ్యవధిని లెక్కకట్టి మానవుడానాడు దానిని చాంద్రమాసమని వ్యవహరించినాడు. చంద్రునిగమనమును ఆబింబముసమీపమునుండు ప్రభాసనక్షత్రములను, చంద్రబింబము వాటిని సమీపించునపుడు ప్రకృతిలో కల్గు పరివర్తనములను అతడు పరిశీలించినాడు. ఋతుపరిగణనమెప్పుడెట్లుజరిగెనో స్పష్టముగా చెప్పజాలము గాని ప్రకృతివిలాసములననుసరించి నిర్ణయమైన ఋతువుల ఆవృత్తినిబట్టియే సంవత్సరముకూడ లెక్కకట్టబడియుండును.

భారతదేశమున మాఘమాసము పంటలుపండు కాలము. కర్షకులు తమశ్రమఫలమును చూచుకొని మురిసిపోవుచుందురు. ఉత్తరాయణమున ఘటిల్లు మకరసంక్రాంతినుండి ప్రకృతిలో మార్పులారంభమగుటచే సహజముగా సంక్రాంతిపండుగ ఆంధ్రులకు ఉగాది కావలసియుండగా వారిపర్వమును చైత్ర శుద్ధపాడ్యమినాడు చేసికొనుచున్నారు.

సంవత్సరారంభము వేర్వేరుయుగములలో వేర్వేరుగ నిర్ణయింపబడినది. వేదకాలమున పండ్రెండునెలలుగలసంవత్సరము మూడుఋతువులుగ విభాగమైనదట! అందుచే ఎప్పటికప్పుడు మారుచుండిన ప్రకృతిధర్మములనుబట్టి కాలధర్మమును, దానిననుసరించి ఋతునామములును ఏర్పడియుండుట సహజముగనుండెను. తదనుసరణముగ వరాహమిహిరాచార్యుడు మున్నగు వారినిర్ణయములననుసరించి శుద్ధపాడ్యమినుండి అమావాస్యతో అంతమగు కాలమును మాసముగను, చైత్ర శుద్ధపాడ్యమిని సంవత్సరాదిగను పరిగణించు ఆచారమేర్పడినది. ఈనిర్ణయమును భాస్కరాచార్యుడు మున్నగుపండితులు సమర్థించినారు.

ఉగాదినాడు ఆంధ్రులు అభ్యంగనస్నానముచేయుదురు. సంపన్నులైన కొందరు నూతనవస్త్రములనుగూడ ధరింతురు. ఇండ్లన్నియు పుష్పపల్లవతోరణములచే అలంకృతములగును. అందు ఆ సంవత్సరపంచాంగము సంవత్సరాధిదేవతయు పూజింపబడును. క్రొత్తచింతపండు క్రొత్తబెల్లము వేపపూవు మామిడిముక్కలు మున్నగువాటితో మిశ్రితమైన రసాయనము ఇష్టదైవమునకు నివేదింపబడును. ప్రకృతిచే ప్రసాదింపబడు ఈ రసాయనము సుఖదుఃఖమిశ్రమగు మానవుని జీవితమునకు ఉపలక్షణమనకొనవచ్చును. రసాయనమును సేవించిన పిమ్మట బంధుమిత్రులు కలసి భుజించెదరు. సాయంత్రమొక బాహ్యప్రదేశమునగాని ఇంటి ఆవరణమునగాని జనులు సమావేశమై పంచాంగశ్రవణము జరిపించి సంవత్సరమందలిసమగ్రమైన వారివారిభావిజీవిత క్రమమునుగూర్చి తెలిసికొందురు.

2 రామనవమి: రామావతారము దశావతారములలో సంపూర్ణావతారమని పురాణాదులు చెప్పుచున్నవి. పాతివ్రత్యమునకుసీతను, పితృవాక్యపాలనమునకు, ఏకపత్నీవ్రతమునకు

రాముని భ్రాతృప్రేమకు పరదారవిముఖతకు లక్ష్మణుని మించినవారు భారతీయసాహిత్యమునలేరని హిందువుల సాధారణవిశ్వాసము

బౌద్ధ జైనవాఙ్మయమందలి రామాయణగాథకును వాల్మీకిరామాయణమునకును భారతదేశములో ఉత్తరదక్షిణ ప్రాంతములలో ప్రాచుర్యమువహించిన వేర్వేరురామాయణములకును కొన్నిఅంశములలో వ్యత్యాసములున్నను అది ప్రాచీనకాలమునుండి ఆదరింపబడుచున్నది రాముడు చైత్రశుద్ధనవమినాడు పునర్వసునక్షత్రమున జన్మించెనట! ఇతడుపదునొకండువేలసంవత్సరములు రాజ్యమేలెనని రామాయణమున కలదు మానవుడైన ఇతడు ఇంతకాలము పాలించెననుట ఆశ్చర్యముగనుండుటచే పలువురుపండితులీవిషయమై పరిపరి విధముల వ్యాఖ్యానించినారు ఏదెట్లయినను అతడు సంపూర్ణ ఆయుఃపరిమాణము గలవ్యక్తిగా జీవించి దీర్ఘకాలము రాజ్యమేలియుండును

రామనవమినాడు కొందరుభక్తులుపవాసమొనర్చి అతని నారాధింతురు రాత్రి జాగరణముచేయువారుకూడ కలరు ధనవంతులు కొందరు బ్రాహ్మణులకు సంతర్పణమొనర్చి దానములను కూడనిత్తురు ఇట్లుచేయువారు విష్ణుపదమును పొందుదురని విశ్వసింపబడుచున్నది దేశమందు ఇతరప్రాంతములకంటె భద్రాచలమున రామనవమిఉత్సవము ఎక్కువ వైభవోపేతముగ జరుగుట అందరెరిగిన విషయమే

3 ఏరువాకపూర్ణిమ జ్యేష్ఠశుద్ధపూర్ణిమ ఏరువాక పున్నమఅనబడుచున్నది ఇది వ్యవసాయదారులకు ముఖ్యమైనపర్వము ఏరువాకయనగా దుక్కి ప్రారంభమనిఅర్థము ఈనాడు కర్షకులు ఎద్దులను శుభ్రపరిచి, కొమ్ములకు రంగుపూసి మువ్వలు గంటలు మున్నగువాటితో అలంకరింతురు ఎద్దులను కట్టివేయు గాటిని ధూపదీపాదులతో పూజించి, వాటికి పొంగలిపెట్టుదురు సాయంత్రము వ్యవసాయపరికరములను ఎద్దులను ఊరేగించుచు పొలములకుపోయి నాగళ్ళకు మ్రొక్కి దుక్కి ప్రారంభించెదరు ఇట్లాచరించుటవలన వ్యవసాయ కలాపములకు శుభముకల్గునని వారివిశ్వాసము ఋష్యాదికలాపము సకలజీవాధారమగు సస్యాభివృద్ధికి ఉపలక్షణమగుటచే కాబోలు, ఏరువాకపూర్ణిమ కర్షకులకు పర్వదినముగా పరిగణింపబడినది

వర్షఋతువు ఆరంభముకాగనే ఈనాటికర్షకులవలె వేదకాలమునాటివారును దుక్కి ఆరంభమొనరించుచుండినట్లు ఋగ్వేదమునందున్నది పాలీ ప్రాకృతసాహిత్యములో ఏరువాక వేరొకపేరుతో ఎలువబడుచుండెడిదట! బుద్ధునితండ్రి శుద్ధోదనుడు కపిలవస్తునగరములో ఆనాడు లాంఛనప్రాయముగా బంగారురంగుగల నాగలిని కర్షకులకు బహూకరించినట్లు జాతకకథయందు కలదు జైనాభాషగల బౌద్ధవాఙ్మయమందును గాథాసప్తశతి యందును ఏరువాక ప్రస్తావన కలదు

4 శ్రావణపూర్ణిమ ఋతువులనుబట్టి ప్రాచీనభారతీయపండితులు విద్యారంభమునకు నిర్ణయించినకాలమే శ్రావణపూర్ణిమఅని తెలియుచున్నది ఆదినమున బ్రాహ్మణ క్షత్రియ వైశ్యకులజులు వేదోక్తకర్మను జరుపుచుండిరట! అదియేనేడు ఉపాకర్మయని వ్యవహరింపబడుచున్నది ఈనాడు బ్రాహ్మణులలో కొలదిమందిమాత్రమే దీనినాచరించుచున్నారు ఉపనయనకర్మమే సంగ్రహముగనొనర్పబడు కలాపమిది నూతనయజ్ఞోపవీతధారణమైనపిదప బ్రాహ్మణులు పితృతర్పణమాచరించి ప్రతివేదమందలి ఆద్యంతఋక్కులను ఉపనిషత్తుల ఆద్యంతవాక్యములను ఉచ్చరింతురు పిదప అధ్యయనహోమమాచరింతురు మరునాడు గాయత్రీజపమును గాయత్రీహోమమును చేయుదురు రక్షాబంధనము శ్రావణపూర్ణిమనాడాచరింపబడుటచే దానికి రక్షాపూర్ణిమ లేక రాఖీపూర్ణిమ అనువ్యవహారమేర్పడినది

5 కృష్ణజయంతి ; దశావతారములలో కృష్ణుని అవతారము ఎనిమిదవదియని చెప్పబడుచున్నది ఇతడు మహాపురుషుడుగను రాజనీతిచతురుడుగను తత్త్వవిదుడుగను పురాణములలో వర్ణితుడైనాడు కురుక్షేత్రమున ఇతడర్జునునకుపదేశించిన గీత విశేషముగా గౌరవింపబడి, వివిధరీతుల వ్యాఖ్యానింపబడినది భారతయుద్ధకాలమున పలువురు ప్రభువులపాలనముక్రింద భరతభూమి ఖండములుగనుండుటచే అరాజకము పెచ్చరిల్లగా కృష్ణుడు ప్రజాక్షేమమునాశించి, ధర్మవర్తనముకలవాడనిపించుకొనిన ధర్మరాజుపాలనముక్రింద కేంద్ర ప్రభుత్వవిధానములుజరుగుట శ్రేయస్కరమని నిశ్చయించి, బలగర్వితులగు రాజులను పాండవులచే నమయింపజేసి ధర్మరాజును ప్రభువుగనొనర్చి, ప్రప్రథమముగా భారతదేశములో కేంద్రపాలనమును స్థాపింపజేసెనట!

కృష్ణునిజన్మదినోత్సవము భారతదేశమంతట బ్రాహ్మ

బహుళఅష్టమినాడు జరుపబడుచున్నది ఆనాటిరాత్రి రోహిణి నక్షత్రమున ఆతడుజన్మించుటచే భక్తులుకొందరు పగలు ఉపవసించి సాయంత్రము కృష్ణవిగ్రహమును ఊరేగించుటయు, అతని జననసూచకముగ ఉయ్యాలలుకట్టి ఆడించుటయు కలదు బాల్యమున అతడు సల్పినదుండుడుకుచేష్టలకు నిదర్శనముగ ఉట్లుకొట్టు వినోదముకూడ జరుగుచుండును

కృష్ణుని రాజనీతిజ్ఞతకు కర్ణునితో ఆతడాడినమాటలే తార్కాణముగా చెప్పబడుచున్నది భాగవతమువననుసరించి ఆతడు 125 సంవత్సరములు జీవించెనట! కాని ఛాందోగ్యోపనిషత్తుప్రకారము 116 యేండ్లుమాత్రము బ్రతికియుండునని పరిశోధకుల అభిప్రాయము అనాదతనిని ఆరాధించువారికి ధర్మార్థకామమోక్షాదులు లభ్యమగునని పురాణములు చెప్పచున్నవి

6 వినాయకచవితి త్రిమూర్తుల తర్వాత విశేషముగ ఆరాధింపబడువాడు వినాయకుడు కవులు తమయిష్టదేవతాస్తుతిలో ఆతనినికూడ చేర్చినారు సాధారణముగా శుభకార్యారంభమున పూజింపబడు ఈయన విశేషముగ భాద్రపద శుద్ధ చతుర్థినాడు కొలువబడుచున్నాడు ఈదినమున వైదికమతాభయాయులు విఘ్నేశుని పత్రితోపూజించి ఆతనికిష్టమగు ఉండ్రాళ్లు కుడుములు మున్నగుపదార్థములను ఆయనకు నివేదింతురు

పురాణములచే ఈతని జననవృత్తాంతము వివిధముగ వర్ణింపబడినది ఇతడు విఘ్నములను కల్పించుటకును నివారించుటకునుకూడ సమర్థుడగుటచే ప్రతికార్యారంభమున పూజింపబడుచున్నాడు వినాయకుడు గజరూపుడనియు, ఏకదంతుడనియు మూషికవాహనుడనియు బ్రహ్మచారియనియు తెలియుచున్నది శివుడు ఇతనిని గణాధిపతిగ నియమించగా బ్రహ్మ అణిమాద్యష్టసిద్ధులను ఇతనికి భార్యలుగా నొసగెనట! ఇతనినిగూర్చిన గాథలు పరస్పరవిరుద్ధములై విచిత్రముగోల్పుచుండును

ఋగ్వేదమితనిని బ్రహ్మణస్పతిగను, విద్యాధిదేవతగను పేర్కొన్నది వినాయకుడు విద్యారంభకుడై నమటుకు నిదర్శనముగ వినాయకచతుర్థినాడు సామవేదులు ఉపాకర్మచేయుదురు అక్షరాభ్యాసకర్మ వినాయకపూజతో ఆరంభమగుట ద్యాసునిప్రార్థనముపై వినాయకుడు భారతరచనమునకు లేఖకుడుగనుండుటకంగీకరించెనట! అందుచే ఆతడు లేఖన సంప్రదాయప్రవర్తకుడుగ పేర్కొనబడినాడు

ఎలుకయొక్క వాడిదంతములకును బ్రహ్మచారియొక్క నిశితబుద్ధికిని పోలికకల్పింపబడి ఎలుకతో వినాయకునకు సంబంధమేర్పరుపబడినది తాంత్రికవిధానమునుబట్టి బౌద్ధవాఙ్మయములో గణపతికి స్థానముకల్పింపబడినదట! గణపతికి పురాణకాలముననే ప్రాధాన్యమేర్పడి తర్వాత పెక్కుసంప్రదాయభేదములు ప్రవేశించినవి ఏనుగు తల మేధస్సునకును, ఎలుక శ్రద్ధకును చిహ్నములనియు విజయమునకిలక్షణములవసరములగుటచే వినాయకునకీరూపము కట్టుకథలతో కల్పింపబడినదనియు కొందరు పరిశోధకులన్నారు

బౌద్ధులు వినాయకుని దేవతగ పరిగణించుటచే కాబోలు జపాను ఇండోనేషియామున్నగు దేశములలో ఆతడు ఆరాధింపబడుచువచ్చినాడు పరిశీలింపగా, బ్రహ్మచర్యదీక్ష విద్యాసముపార్జన సస్యాభివృద్ధి పురాణగాథలు మున్నగునవెన్నియో ప్రాచీనకాలమునుండి కలగాపులగమై వినాయకచవితిపండుగ ఆచారముగా నిలిచిపోయినట్లు పండితులూహించినారు

7 మహాలయపక్షము భాద్రపదకృష్ణపక్షము మహాలయపక్షమనబడును మహాలయమనగా వినాశమని అర్థము ఉత్తరాయణము దేవతలకాలమగుటచే అది ఉత్తమకాలమనియు, దక్షిణాయనము పితృకాలమగుటచే అది అశుభకాలమనియు చెప్పదురు ఆషాఢమునుండి ఆరంభమగు దక్షిణాయనము వర్షములచే చిత్తడిచే చికాకుగనుండుటవలన అది అశుభముగ తోచి మహాలయము ప్రాప్తించినదని పూర్వులు భావించియుందురు అందుచే ఈపక్షమున పితృశ్రాద్ధములు జరిపినచో, వినాశము తప్పునని వారు విశ్వసించియుందురు

8 నవరాత్రములు; నవరాత్రములు మూడువిధములుగా ఆచరింపబడుచున్నవి (1) చైత్రశుద్ధ పాడ్యమినుండి రామనవరాత్రము; (2) వినాయకచవితి నుండి గణపతి నవరాత్రములు (3) ఆశ్వయుజశుద్ధపాడ్యమి నుండి దేవీనవరాత్రములు ఈమూడింటిలో దేవీనవరాత్రములు మిగుల ప్రసిద్ధములైనవి పూర్వము జంతుబలులతోకూడిన ఈనవరాత్రుల్యుత్సవములలో మార్పుకల్గి ప్రస్తుతము సాత్త్వికవిధానమనుసరింపబడుచున్నది

దేవ్యారాధకులు ఆశ్వయుజశుద్ధపాడ్యమినాడు కలశస్థాపనమొనర్చి, దేవీమూర్తిని ఆవాహనము చేయుదురు నవమి

వరకు హోమాదులతో పూజాకలాపము పూర్తియగును దశమి నాడు దేవీప్రస్థానము జరుగును సాత్త్వికవిధానముననుసరించి కూష్మాండాదులు మాత్రమే బలియియ్యబడును

ఆదికాలమున భగవంతుని పురుషుడుగకంటె శక్తిరూప మున భావించుటయే పరిపాటియైయుండెననుటకు మొహంజదారో హరప్పాలశిథిలములను పరిశీలించినవారు ప్రకటించిన అభిప్రాయమే ఆధారము అనంతరము ఈశక్తియే ఆదిశక్తి యను స్త్రీరూపము వ్యాప్తికివచ్చి ఇంటింటను ఆమెవిగ్రహము లను పూజించెడివారట ! కుమారిగా పరిగణింపబడిన ఆదిదేవి అయోనిజుడగు మానసపుత్రుని సృష్టించి అతనికి సహచరియ య్యెననియు వీరిసంయోగముచే దేవతలు స్థావరజంగములు ఉద్భవించెననియు ప్రాచీనులు చేసినఊహకు హరప్పాలో లభించిన స్త్రీనగ్నప్రతిమ ఉదాహరణముగా పేర్కొనబడినది ఈభావన శాక్తమతమునకు శ్రోపతియయ్యెను సకలదేవతా శక్తిస్వరూపిణిగా భావింపబడు ఈమెప్రతీకములు దేశమున విస్తరించిన దుర్గఅని విశ్వసింప బడుచున్నది వేర్వేరురూపములు ధరించిన ఆదిశక్తి ప్రస్తావన ఉపనిషత్తులయందు మహాభారతాది గ్రంథములయందుగలదు ఈదుర్గమహాత్మ్యముమహాయానబౌద్ధ మునగూడ ప్రసరించి,ఆమెనుబోలువిగ్రహముల బౌద్ధమతము ప్రబలిన దూరప్రాచ్యదేశములలో కన్పట్టినవి

ఈనవరాత్రములు పారమార్థికముగ పురుషులకెట్లు ముఖ్యమో లౌకికముగ స్త్రీలకును అంతప్రధానము

9 విజయదశమి నవరాత్రోత్సవములవెనువెంటనే శుద్ధదశమినాడు జరుపుకొనుపర్వము విజయదశమి లేక దసరా ఇది శరన్నవరాత్రములకు మకుటాయమానమైనది ప్రజలా నాడు పగలు ఇష్టదేవతనారాధించి సాయంకాలము మేళతాళ ములతో ఊరేగుచు పొలిమేరదాటి శమీవృక్షమును పూజించి మరల గ్రామమున ప్రవేశింతురు నవరాత్రములసందర్భమున శరదృతువు రమణీయముగనుండి,జలసమృద్ధితో మార్గములు ప్రయాణానుకూలముగనుండుటచే, పూర్వపురాజసైనికులు వ్యవసాయకలాపములు ముగించుకొని దసరావేళ యుద్ధసన్నద్ధులై యుండెడివారట ! ప్రభువులు సాధించిన విజయమునకు చిహ్నముగా విజయదశమి జాతీయోత్సవమైనదని తెలియు చున్నది.

మహిషాసురవధ, రావణవధ, ఉత్తరగోగ్రహణము ముఖ్యమైనగాథలను పేర్కొనును, పురాణములు ఈపర్వము నకు వేర్వేరువిధములుగా ప్రాముఖ్యమునుకల్పింపగా విజయదశమినాడు నాల్గువర్ణముల సమైక్యము సంభావింపబడినట్లు ఆచార్యకలేల్కర్ అనుప్రసిద్ధపండితుడు వ్యాఖ్యానించినాడు నాల్గువర్ణములవారు సమష్టిగా జరుపుచువచ్చిన కృష్యుత్సవము విజయదశమియను జాత్రోత్సవముగ మారుట చారిత్రకముగా హేతుబద్ధముగనున్నది చారిత్రకదృష్టితోపాటు ఆధునికమైన శాస్త్రీయదృష్టితోచూచినచో నవరాత్రి విజయదశమిఉత్సవము లకు ప్రకృతిపరిణామము మూలకారణమను భావమేర్పడ గలదు

10 దీపావళి సేతుశీతనగపర్యంతము ఆబాలవృద్ధు లను ఆనందతన్మయులను చేయుపర్వమిది సత్యభామచే జరిగిన నరకవధానంతరము ఆనందపరవశులైన ప్రజలారాత్రియు మరుదినము ఉత్సవముజరుపుకొనుటచే అవి నరకచతుర్దశి దీపావళిఅనునామములతో ప్రసిద్ధములైనవి కాని దీపావళికి ముఖ్యలక్షణమైన బాణసంచాకాల్పులు జరుపబడు నరకవధ ప్రస్తావనము ఎచ్చటను కానరాకుండుటచే అది దీపావళి కారణమను పూర్వసంప్రదాయము విశ్వసనీయముకాజాలదని తోచుచున్నది నరకుడను పేరొకనివధతో అస్సాముప్రాంతము ఆర్యజాతికి వశమైయుండుటచే తదుపలక్షణముగ దీపావళితో ఈకథ జోడింపబడినదని ఒకపండితుని విశ్వాసము జైనమత ప్రవర్తక మహావీరుడు అమావాస్యనాడు నిర్యాణముచెందగా ఆప్రాంతమున దీపములు వెలిగించబడి అనాటినుండి దీపావళి ఏర్పడెనని జైనహరివంశమునకలదు జాతకకథలలో లక్షదీపోత్సవము జరుపబడినట్లు చెప్పబడినది

పూర్వము ఈజిప్టు మున్నగు మధ్యప్రాచ్యదేశములలో సూర్యదేవత యొక్క జన్మదినమునకుపలక్షణముగ జరుపబడిన దీపదానము ఈనాటికిని కొన్నివర్గముల క్రైస్తవులలో వ్యవహారమునమున్నది చైనాలోకూడ పితరుల సంస్మరణ మునకై దీపోత్సవము జరుపబడెడిదట ! మహమ్మదుపైగంబరు నూతనసంప్రదాయమును స్థాపించి మక్కాకు తిరిగివెళ్ళిన సందర్భమును పురస్కరించుకొని షబేబరాత్ ఉత్సవమును జరుపునప్పుడు మహమ్మదీయులు బాణసంచాప్రేల్చుటకాబులు వెలిగించిరట!మహమ్మదీయులకును భారతీయులకును సంబంధ మేర్పడినపిమ్మటనే భారతదేశములో దీపావళినాడు బాణసంచా కాల్పెడి ఆచారమేర్పడియుండును

11 మకరసంక్రాంతి : శ్రమజీవులగు ప్రాచీనులు,

తాము ఉత్పత్తిచేసినపంటను అనుభవించి పంచభూతములను తృప్తిపరచి ఆనందించుపండుగ. ఇది ఈపర్వము పుష్యమాసములో జరుపబడును. సూర్యుడు మేష కటక తులామకర ఘట్టములు చేరువప్పుడు ప్రకృతిప్రదర్శించు విలాసముల విశిష్ట స్వరూపమే మకరసంక్రాంతి. సంవత్సరారంభమునుండి చేసిన శ్రమకు అనురూపమైన ఫలము ప్రాప్తించినందుకై కర్షకులు ఆనందించుచుందురు.

పూర్వాచారములచేతను తత్త్వవిచారములచేతను ఉత్తరాయణదివసమగు సంక్రాంతిపండుగ రూఢమైనది. ఈ సందర్భమున ప్రజలు తమ ఇళ్లువాకిళ్లను ముచ్చటగొలుపు ముగ్గులతో గొబ్బిళ్ళతో అలంకరించెదరు. ఉత్తరాయణమున సూర్యుడు మకరరాశిలో ప్రవేశించి తీక్ష్ణమును పెంచుకొనుచు ప్రకృతిని ఉత్తేజపరచును. మకరరాశ్యధిపతియగు శని వాత ప్రధానగ్రహమగుటచే వాతహరమగుకూష్మాండాదులు ఆనాడు పురుషులకును మాంగల్యాభివృద్ధికై ఫలపుష్పసుగంధాదులు స్త్రీలకును ఒసగబడును. ఆంధ్రప్రాంతములో స్త్రీలు గొబ్బి గౌరీవ్రతమాచరించి ఇంటింట బొమ్మలతో అలంకరించెదరు.

కనుముపండుగ కర్షక జీవితసంబంధమగుటచే తమకు బాసటగనుండు పశువులను వారానాడు అలంకరించి పొంగలిని పంటపొలములపై చల్లుదురు. ఇట్లు పొలిచల్లుటచే పంట పొల్లుపోవక గింజలాలుబడి హెచ్చునని వారివిశ్వాసము. కర్షకులతోపాటు శ్రమించు ఎద్దులను తియ్యనిపాలతో తనవితీర్చు గోవులను ఆదరించు కృతజ్ఞతా సూచకమీపర్వము.

12 రథసప్తమి : సూర్యగ్రహణతుల్యమైన ఈపండుగ మాఘశుద్ధసప్తమినాడు జరపబడును. ఈ దినమున నదీతటాకాదులున్నచోట్ల ప్రజలు దీపారాధనమును నెత్తిపై నుంచుకొని, సూర్యధ్యానమైనపిదప దానిని నీటిపై వదలి జిల్లేడాకులను తలపైనిడికొని స్నానమాచరించెదరు. అనంతరము సూర్యునకర్ఘ్యమిచ్చి పితృతర్పణమాచరింతురు. బంగారురథముపై ప్రయాణించునని విశ్వసింపబడుసూర్యుడు, వేదకాలమునుండి ఆరాధింపబడుచున్నాడు. సూర్యుడు సంవత్సరమును ఒకేచక్రముగల విశ్వమను రథమెక్కి, ఛందస్సులను ఏడశ్వములను పూన్చిప్రయాణించునని సూర్యసిద్ధాంతము చెప్పుచున్నది. సంవత్సరము ఆరుఋతువుల సముదాయమగుటచే, అది చక్రముగను, సూర్యకిరణములో ఏడురంగులు ప్రకాశించుటచే, వాటిని అశ్వములుగను పూర్వులచే వర్ణితమైనట్లు పరిశోధకు లభిప్రాయపడుటచే తదుపలక్షణముగ సప్తమినాడు సూర్యారాధన నియమమేర్పడినది. రథసప్తమితో చలియు మసకయు తొలగి నూతన తేజస్సుతో సూర్యుడుత్తరమునకు పయనించునట్లు గోచరమగుటచే సూర్యునిపట్ల కృతజ్ఞతా సూచకముగ ఈపండుగ జరుపుకొనబడుచున్నది.

13 మహాశివరాత్రి : మాఘబహుళ చతుర్దశినాడు వచ్చు ఈపర్వము ముఖ్యముగ శివభక్తులకు సంబంధించినది. ఉపవాసానంతరము శివభక్తులు రాత్రియంతయు శివపూజలతో శివలీలాకథనములతో జాగరణచేయుదురు. శ్రీశైలమున పూర్వమీనాడు జరుగుచుండిన శివరాత్ర్యుత్సవమును పాల్కురికి సోమనాథుడు పండితారాధ్యచరిత్రమున వర్ణించినాడు. శివరాత్రి మాహాత్మ్యమునుగూర్చి స్కంద లింగ భవిష్యత్పురాణములలోని గాథలు పరస్పరవిరుద్ధములుగనున్నవి. శివరాత్రి వసంతఋతు ప్రారంభమనుటకు "ప్రాచీనఖగోళ" మను గ్రంథమును ఉదాహరణముగా పేర్కొనవచ్చును. బాలగంగాధరతిలక్ కూడ ఈ యభిప్రాయమును సమర్థించినాడు.

విగ్రహారాధనవ్యతిరేకించు ఆర్యసమాజానుయాయులు కూడ శివరాత్రిని ఉత్సవదినముగా పాటించెదరు. సర్వాద్వైత సమబుద్ధిగల హిందువులలో రానురాను శైవవైష్ణవభేదములు ప్రబలగా బసవేశ్వరాదులవలన వీరశైవము ఆంధ్రదేశమున వ్యాపించినది. శివరాత్రి వీరశైవులకు మహోత్సవముగాను ఆరాధ్యులకు స్మార్తులకు ముఖ్యవ్రతముగ పరిగణింపబడుచున్నది.

14 హోలీ : ప్రకృతి నూతనశోభను సింగారించుకొనగా, దానికి స్వాగతమిచ్చు పూర్వాచారముయొక్క ఆనందస్వరూపము హోలీ. ఋతు పరివర్తనముచే ఏర్పడు ఈ పర్వము ఫాల్గుణ పూర్ణిమనాడు జరుపబడును. ఫాల్గుణములో పంటలను కోయు కోలాహలమే ఈ పండుగకు మూలమని కొందరనగా హోలికయను రాక్షసి వధింపబడిన దినమగుటచే, ఇది హోలీపండుగయైనదని మరికొందరిమతము. ఆంధ్రప్రాంతములో దీనిని కాముని పున్నమ యందురు.

శివుడు తనతపస్సును భగ్నమొనర్పవచ్చిన మన్మథుని భస్మమొనర్చినది ఫాల్గుణపూర్ణిమనాడని ప్రాచీనులవిశ్వాసము. మన్మథుడు భస్మముకాగా భార్యయగు రతీదేవి శివుని పతిభిక్ష వేడ, అతనిని అశరీరునిగా చేసికొనెనట ! మన్మథుని పునర్జన్మదినమ్ముగ అనాటినుండి ఈ పండుగ జరుపబడుచున్నది.

"గాథాసప్తశతి లో ఇది ఫాల్గుణోత్సవమనియు మదనోత్సవమనియు వర్ణితమైనది. ఆనాడు స్త్రీ పురుషులు వసంతాదులను చల్లుకొనుట దోషరహితమని అందుచెప్పబడినది. "దశకుమారచరిత్ర" యందు వసంతోత్సవ వర్ణనము కలదు. అరబ్బుపండితుడు అల్ బెరూని 11 వ శతాబ్దిలో భారతదేశమున పర్యటించుచు కామదహన పర్వమును పూర్ణిమనాడు చూచినాడట! విజయనగర చక్రవర్తులు ఈపండుగను వసంతోత్సవముగ జరుపుకొనెడి వారట! ఈపండుగ ఉత్తరభారతమున అధికోత్సాహముతో జరుపబడుచుండును. ఆంధ్ర కన్నడ తమిళ రాష్ట్రములలో జరుపబడు కామదహన విధానము చాలవరకు తుల్యముగనుండును. ఈ యుత్సవములలో పాల్గొను గ్రామయువతులు కుసుమవర్ణపు రవికలు తొడగిన గుత్తపు చనుకట్టుతో నరముల హృదయములను ఆకర్షించుచుందురు.

భారతదేశమున ఋతుపరివర్తనమును తెలుపుటకు హోలీపండుగనాడు మంటలువేయునట్లే యూరోపులో చలిని మరలించుటకు వసంతగ్రీష్మములందు అగ్న్యుత్సవమును జరుపు ఆచారమున్నది. ఈ యుత్సవములో విశేషముగ కష్టజీవులైన సాధారణప్రజలు పాల్గొనుటచే ఇది ప్రజలపండుగ యనవచ్చును.

ప్ర. రా. సు.

## హైదరాబాదుజిల్లా

హైదరాబాదుజిల్లా నేటిఆంధ్రప్రదేశ రాష్ట్రమునకు దాదాపుమధ్యభాగమందున్నది. ఇది ఉ. అక్షాంశరేఖదాదాపు 16° 55′ నుండి 17° 35′ వరకును తూ. తులారేఖ 78° 8′ నుండి 78° 45′ వరకును విస్తరించియున్నది.

ఈజిల్లా 1949లో ఏర్పరుపబడినది. అంతకుముందు హైదరాబాదు నగరము ప్రత్యేక పరిపాలనాధికారమున నుండెను. ఈ నగరము చుట్టునుండు భాగము 'అత్రాఫిబల్దా' అనుపేరుతో ఒక జిల్లాగ నుండెడిది. పూర్వము హైదరాబాదునకు ఉత్తరమున 'బాగాత్' అనువొక చిన్నజిల్లాయుండెను. అత్రాఫిబల్దా బాగాత్ అను జిల్లాలు రెండును చాలవరకు నిజాము ప్రభువు స్వంతజాగీరుభూములు సర్ఫేఖాస్ అని ఈప్రాంతము పిలువబడుచుండెను.

1947లో భారతదేశమునకు స్వాతంత్ర్యము లభ్యమైనపుడు అందలి సంస్థానములు తమ అస్తిత్వమును వదలుకొని భారత ప్రభుత్వములో విలీనమైనవి. కాని నిజాము అందుకంగీకరింపకుండుటచే 1948 సెప్టెంబరులో భారత ప్రభుత్వపక్షమున సేనానిగా వ్యవహరించిన జయంతనాథచౌదరి అనునతడు హైదరాబాదు సంస్థానముపై పోలీసు చర్య జరిపి సంస్థానమంతటిని స్వాధీన పరచుకొని దానికి మిలిటరీ గవర్నరుగా నియుక్తుడయ్యెను. ఈగవర్నరు సహాప్రకారము నిజాము ప్రభువు సర్ఫేఖాసుపై తనకుగల హక్కులను వదలుకొని తన రాజ్యమును అతనికి స్వాధీనముచేసెను. అత్రాఫిబల్దా బాగాత్ జిల్లాలకు మరికొందరి జాగీరుభూములనుచేర్చి ఆ ప్రాంతమంతటిని హైదరాబాదుజిల్లా గా మిలిటరీ గవర్నరు 1949లో ఏర్పరచెను. ఆంధ్రరాష్ట్రమందలి ఇతర జిల్లాలవలెనే ఈజిల్లాపరిపాలనము ఆంధ్రప్రభుత్వోద్యోగులచే ప్రస్తుతము నిర్వహింపబడుచున్నది. ఈజిల్లా కార్యస్థానములన్నియు హైదరాబాదు నగరమునందే నెలకొనియున్నవి.

1961వ సం॥ లెక్కలప్రకారము ఈజిల్లా విస్తీర్ణము పురములు గ్రామములు జనసంఖ్య మున్నగు వివరములిట్లున్నవి.

విస్తీర్ణము—2997 1 చ. మై. తాలూకాలు 8 గ్రామములు 953 పురములు 15 జన సంఖ్య 20 62 995 గ్రామవాసులు 7 80 317 పురవాసులు 12 82 678 జనసాంద్రత (చ. మైలుకు) 688

మేడిచెలం తాలూకా విస్తీర్ణము-307 1 చ. మైళ్లు గ్రామములు-98 జనసంఖ్య 87 597

హైదరాబాదు(తూర్పు)తాలూకా విస్తీర్ణము-268 8 చ. మైళ్లు గ్రామములు 98 జనసంఖ్య 88 518

హైదరాబాదు(పశ్చిమ)తాలూకా విస్తీర్ణము-287 8 చ. మైళ్లు; గ్రామములు 96; జనసంఖ్య 77 744

ఇబ్రహీంపట్టణంతాలూకా; విస్తీర్ణము 524 8 చ. మైళ్లు గ్రామములు 116; జనసంఖ్య 1 21 639 జనసాంద్రత 232

చేవెళ్లతాలూకా విస్తీర్ణము371 4 చ. మైళ్లు; గ్రామములు 118 జనసంఖ్య1 00 783 జనసాంద్రత 271

వర్గితాలూకా; విస్తీర్ణము389 8 చ. మైళ్లు; గ్రామములు 144 జనసంఖ్య1 07,181 జనసాంద్రత 275

శాందూరుతాలూకా; విస్తీర్ణము371 2 చ. మైళ్లు; గ్రామములు128 జనసంఖ్య98 555; జనసాంద్రత 266

వికారాబాదుతాలూకా; విస్తీర్ణము476 7 చ. మైళ్లు, గ్రామ

చ.మై 178 జనసంఖ్య 1 34 359 జనసాంద్రత 883

పురము-జనసంఖ్య (1961 సం॥):

| | |
|---|---|
| హైదరాబాదు డివిజను (నగరముతో కలిసి) | — 2049885 |
| సికిందరాబాదు డివిజను (కంటోన్మెంటుతో కలిసి) | — 285833 |
| ఉస్మానియా విశ్వవిద్యాలయము | 5 775 |
| ఆల్వాల | 9 336 |
| జమిస్థాన్ పూరు | 1 877 |
| కందికల్లు | 182 |
| బోయినపల్లి | 1 696 |
| లాలాగూడ | 2 109 |
| అత్తాపూరు | 1 968 |
| ఫతేనగరు | 11 818 |
| మల్కాజగిరి | 13 910 |
| మచ్చబొల్లారమ్ | 4 958 |
| మంషాబాదు | 5,780 |
| శాందూరు | 16,786 |
| వికారాబాదు | 9 088 |

హైదరాబాదు మ్యునిసిపల్ కార్పొరేషను పరిధి క్రిందను సికింద్రాబాదు డివిజను క్రిందను మూసారాంబాగ్, శీగలగూడ మాదన్నపేట జంగంపేట, అసఫ్ నగర్ మల్లేపల్లి, నాంపల్లి, ఖైరతాబాదు ఎర్రగడ్డ బోమాజిగూడ ముషీరాబాదు అంబరుపేట ఖాగాత్, బేగంపేటపాయగా మారెడుపల్లిపాయగా మియాకుంట బోయిగూడ మున్నగు 55 గ్రామములు నెలకొని యున్నవి

| | |
|---|---|
| జిల్లాలోని గృహములు | 3 46 384 |
| కృషీకులు | 2,10 985 |
| వ్యవసాయ కార్మికులు | 1 88 288 |
| వర్తకులు | 80 184 |
| పాటుపడనివారు | 12 27,327 |
| విద్యావంతులు | 7,28 000 |

(1961 లెక్కననుసరించి)

**పర్వతములు** ఈ జిల్లా అంతయు గుట్టలమయము గుట్టల నిండా దట్టపుటడవులు గల రాచకొండ పర్వతశ్రేణి అంబరుపేట ప్రాంతములోని పీపలపాడునుండి ప్రారంభమై, ఆగ్నేయ దిశగా సాగిపోయి నల్లగొండ జిల్లాలో ప్రవేశించును అనంతగిరి గుట్టల వరుస మహబూబునగరు జిల్లాలో ప్రారంభమై వికారాబాదు జిల్లాలో ప్రవేశించి సికిందరాబాదు-వాడిరైలు మార్గమును కోసుకొని ఉత్తరపథముగా పోయి వికారాబాదుకు సమాంతరముననే ధారూరువరకు వ్యాపించును విడివిడిగా నల్లరాతి గుట్టలు అంతటను కనిపించుచు హైదరాబాదు నగరమును చుట్టుకొనియున్నవి వీటిలో మౌలాలి గోలకొండ శైలము తిరుమలగిరిలోని బండశైలము ముఖ్యమైనవి ఈ ప్రదేశపువాలు పడమరనుండి తూర్పునకు ఆగ్నేయమునకు దిగుచున్నది

**నదులు** ఈ జిల్లాలో ముఖ్యమైనది మూస (ముచుకుంద) నది ఇది శివారెడ్డి పేటవద్ద అనంతగిరి గుట్టలలో పుట్టితూర్పునకు సాగుచు హైదరాబాదు నగరము మధ్యగా పయనించి నల్లగొండ జిల్లాలో ప్రవేశించును మంజీరానది జిల్లా వాయవ్య దిశయందు (హైదరాబాదుకు పడమర) శాందూరు తాలూకాలో రెండు గ్రామములను మాత్రమే తాకి ఈ జిల్లాను వీడును కాకలవాడి ఈసి వాగ్ది(పసుపులేరు) అనునవి చిన్న నదులు

**భూతత్త్వము** ఈజిల్లా పురాణయుగమునకు సంబంధించిన పాషాణపుపొరలు కలదిగా మన్నది హైదరాబాదుచుట్టుప్రక్కల యందును దానికి పడమరగా 16 మైళ్ల దూరముననున్న లింగంపల్లి వరకును గండశిలలు వ్యాపించి యున్నవి ఈ గండశిలలు ఒక దానిపై నొకటి పేర్చబడి విడ్డూరపు ఆకారములలో గలిబిలిగ నుండును

**అరణ్యములు** ఈ జిల్లాలోని గుట్టలయందడవులు గలవు సాధారణముగా జిల్లాయంతటనుపలుచనైన అరణ్యప్రాంతము చెదురు ముదురుగ నుండును ఈ అరణ్యములందు టేకు తుమికి నల్లమద్ది మొదలగు వృక్షజాతులు గలవు ఇంటి వానములకు వంటచెరకునకు పనికివచ్చు సామాన్యపుకలప అన్ని ప్రాంతములందును కలదు

**ఖనిజములు** : ఈ జిల్లాలో ఇసుక, కంకరరాళ్ళు, నల్లరాళ్లు గృహాదినిర్మాణములకు ఉపయోగించుచున్నవి ఆర్థికముగా విలువగల ఖనిజములు కనపడవు, కాని క్వార్ట్జ్ ఫెల్స్పర్ అనునవి కొంతప్రాధాన్యము గల ఖనిజములు క్వార్ట్జ్ గాజు పాత్రల నిర్మాణమునకు ఎక్కువగా ఉపయోగపడుచున్నది

**శీతోష్ణస్థితి** ఈజిల్లాలో అధికముగా చెరువులు వాగులు

ఉన్నందున శీతోష్ణస్థితి సమముగానుండును. వర్షకాలములో మన్యపుజ్వరములు సర్వసాధారణముగా ప్రబలియుండును. అక్టోబరునుండి మార్చినెలవరకు ఆరోగ్యప్రదమైయుండును. వర్షపాతము సగటున 30·4 అంగుళములు.

నేల: నేల ఈ జిల్లాయందు అనేకవిధములుగ నుండును. నల్లరేగడ భూమి అచ్చటచ్చట మాత్రమే కలదు. వట్టూరు జడ్కల్ ప్రాంతములలో నల్లరేగడ భూమి కలదు. నదీతీరములందును పర్వతపాద ప్రాంతములందును నేల సారవంతమైనది.

నీటివసతులు: ఈ జిల్లాలోని ఈసీ మూసీనదులకు ఆనకట్టలు కట్టబడి రెండు గొప్ప జలాశయములు నిర్మింపబడినవి. ఉస్మాన్‌సాగర్ అనునది 1920లో మూసీనది కడ్డముగా నిర్మితమైనది. హిమాయత్‌సాగర్ అనునది 1927లో ఈసీనది కడ్డముగా ఆనకట్టకట్టుటవలన ఏర్పాటైనది. హుస్సేన్‌సాగర్ మీర్‌ఆలంచెరువు ఉందాసాగర్ ఇబ్రహీంపట్నతటాకము ఎన్నికగన్న జలాశయములు. ఆసిఫ్‌నహర్ కాలువ మూసీనదినుండి త్రవ్వబడినది. ఇంకను పెక్కుతటాకములు వ్యవసాయమునకు జలాధారములుగనున్నవి.

పంటలు: ఈజిల్లాలో జొన్న, సజ్జ, మొక్కజొన్న, పప్పుధాన్యములు మొదలైనవి ముఖ్యమగు ఆహారపుపంటలు. ఆముదాలు నువ్వులు ముఖ్యమైన వ్యాపారపు పంటలు. ఉల్లి మిర్చి చెరకు పొగాకు స్వల్పముగ పండును. కొంత కాలమునుండి అనాబెషాహీ అను మేలిరకమునకు చెందిన ద్రాక్షపండ్ల ఉత్పత్తికి ఈజిల్లా చాల ప్రసిద్ధివహించినది.

పరిశ్రమలు: పారిశ్రామికముగ ఈజిల్లా చాలముఖ్యమైనది. సిగరెట్లు, వస్త్రనిర్మాణము, లోహపరిశ్రమ గాజు పరిశ్రమ నూనె రంగులు ఔషధములు మొదలగు పరిశ్రమలు పెక్కుగలవు. నగరమునకు ఆగ్నేయదిశయందు గొప్ప పారిశ్రామికవాడ వెలసినది. సనత్‌నగరునందును, బాలానగరునందును తక్కిన ప్రదేశములయందుకంటె పరిశ్రమలు కేంద్రీకృతములై యున్నవి. వీటిలో భారతహెవీ ఎలక్ట్రికల్స్, హిందూస్థాన్ మెషిన్‌టూల్స్ హిందూస్థాన్ ఎయిరోనాటిక్స్ సిమెంటు సామానుల పరిశ్రమ, ఆల్విన్ కంపెనీ, హైలమ్‌కంపెనీ మొదలగు వందలాది పరిశ్రమలు కలవు.

నూలువస్త్రముల నిర్మాణము, రంగుల అద్దకము అమ్మనని ఉన్నివడకుట త్రాళ్లుపేనుట బీడీలు చుట్టుట. పేము బెత్తముతో వివిధ నాజూకు వస్తువుల అల్లకము బొమ్మల తయారీ మున్నగునవి ఈజిల్లాలోని ముఖ్యమైన కుటీర పరిశ్రమలు.

విద్య: ఆంధ్రప్రదేశ్ రాష్ట్రములోని 21 జిల్లాలకు రాజధానీ నగరమగుటచే హైదరాబాదు విద్యావిషయములో మిన్నగనున్నది. హైదరాబాదునందు ఉస్మానియా విశ్వవిద్యాలయము రాజేంద్రనగరునందు వ్యవసాయవిశ్వవిద్యాలయము నెలకొనియున్నవి. ఈ రెండింటికి అనుబంధములుగా పెక్కు కళాశాలలు పెద్దవియు చిన్నవియు కలవు. హైస్కూళ్లు మిడిల్‌స్కూళ్లు ప్రాథమికపాఠశాలలు వందలాదిగా కలవు. ఇంజనీరింగు కళాశాలలు సాంకేతిక కళాశాలలు పోలిటెక్నిక్ కళాశాలలు వృత్తివిద్యాశాలలు సంగీత నాట్య కళాశాలలు ఎన్నియో కలవు.

గ్రంథాలయములు పరిషత్తులు, వివిధ వైజ్ఞానిక సాంకేతిక పరిశోధనాసంస్థలు సాహిత్యసంస్థలు వగైరాలు విద్యావిజ్ఞాన ప్రసారమునందు అధికముగా పరిశ్రమించుచున్నవి.

దర్శనీయ ప్రదేశములు: హైదరాబాదు పురాతనపట్టణమగుటచే ప్రాచీన, అర్వాచీన నాగరికతలకు ఆలవాలమై ఆకర్షణీయముగనున్నది. గోలకొండదుర్గము చార్మినారు మక్కామసీదు హష్మత్‌పేట కెయిరములు సీతారాంబాగ్ దేవాలయము హైకోర్టు పబ్లిక్‌గార్డెన్స్ (పురోద్యానము) అజంతాపెవిలియన్ శాసనసభామందిరము హెల్తుమ్యూజియము హైదరాబాదు మ్యూజియము సాలార్జంగు మ్యూజియము ఉస్మానియా విశ్వవిద్యాలయము ఉస్మానియాజనరల్ అస్పత్రి హుస్సేన్‌సాగర్ ఉస్మాన్‌సాగర్ హిమాయత్ సాగర్ మీర్‌ఆలంచెరువు, జంతుప్రదర్శనశాల మొదలగునవి ఇందు ముఖ్యమైనవి.

చరిత్ర: క్రీ. శ. 1150 నుండి 1325 వరకు ఈజిల్లా కాకతీయసామ్రాజ్య భాగముగనుండెను. అంతకుపూర్వము దక్షిణాపథములోని పెక్కుప్రాంతములవలెనే ఈప్రాంతము కూడ సహజముగ రాజ్యదశాపరిణామములను పొందియుండును. కాకతీయులు గోలుకొండకోటను నిర్మించినపుడు దానికి మానుగల్లు అను పేరుండెను. మానుగల్లు మట్టికోటను ఓరుగల్లురాజగు కాపయనాయకుడు [illegible]లో బహామనీరాజులకు దత్తముచేసెను. బహామనీసామ్రాజ్య పతనమున కుతుబ్

ముల్క్ అనునాతడు సుబేదారుగా గోలకొండనుండి తెలంగా
ణమునేలెను ఇతడు 1512 లో స్వాతంత్ర్యమును ప్రకటించు
కొని గోలకొండలో సుల్తాన్ కులీకుతుబ్షా అను బిరుదనామ
ముతో క్రొత్త రాజవంశమునకు మూలపురుషుడయ్యెను
గోలకొండ కుతుబ్ షాహి రాజన్యులలో ఐదవవాడగు సుల్తాన్
మహమ్మద్ కులీకుతుబ్షా 1589 లో మూసీనది దక్షిణతీరమున
తన భోగకాంతయగు భాగమతి పేరిట భాగానగరమును కట్టిం
చెను ఈ భాగానగరమునకే తరువాత హైదరాబాదు అను
పేరువచ్చినది. తెలంగాణమునకు రాజధానిగనున్న గోలకొండ
పట్టణ ప్రాధాన్యము తగ్గి హైదరాబాదు ప్రాముఖ్యము హెచ్చు
హాగెను 1687 లో హైదరాబాదును మొగలులు జయించిరి
మొగలుసామ్రాజ్య పతనమున తెలంగాణమునకు సుబేదారుగా
నిజాముల్ ముల్క్ నియమితుడయ్యెను ఇతడు 1724 లో
స్వాతంత్ర్యము ప్రకటించి హైదరాబాదు అసఫ్ జాహీ వంశము
నకు మూలపురుషుడయ్యెను; హైదరాబాదు రాజధాని
యయ్యెను ఈ అసఫ్ జాహీ నిజాములవంశములో ఏడవ
వాడగు సర్ మీర్ ఉస్మాన్ అలీఖాన్ బహద్దరు పరిపాలకుడుగ
నుండెను ఈ చరిత్ర సందర్భమున 1948 సెప్టెంబరు 18 వ
తేదీ పేర్కొనదగినది ఈరోజున హైదరాబాదు రాజ్యము
ఇండియన్ యూనియన్ లో విలీనమైనది దానితో అప్పటి
నిజాంరాజు రాజప్రముఖ్' బిరుదాంచితుడైనాడు

1950 లో భారతదేశము రిపబ్లిక్ (ప్రజాసత్తాకము) గా
అవతరించినప్పుడు, స్వదేశసంస్థానముల ఉనికికి అవకాశము
లేకుండెను నిజాంప్రభుత్వ మానాటితో అంతరించినది ఉత్తర
సర్కారులు రాయలసీమలోని ఇతర తెలుగు జిల్లాలతో తెలం
గాణమును కలిపి 1956 లో ఆంధ్రప్రదేశ్ అను నూతనరాష్ట్ర
ప్రభుత్వము భాషాప్రాతిపదికపై ఏర్పరుపబడినది ఆనాటి
నుండి ఈనూతన రాష్ట్రమునకుకూడ హైదరాబాదునగరమే
రాజధానిగనున్నది

ఆ వీ

## హోమర్

హోమర్ అనునతడు అత్యంతప్రాచీనుడైన పాశ్చాత్య
సాంప్రదాయికకవిగా ప్రపంచమున విఖ్యాతుడై వరలినాడు
ఇతడు ఇతిహాసచక్రవర్తిగాకూడ గణుతికెక్కినాడు ఈతని
జీవితవిశేషములు లోకమునకెక్కువగ తెలియవు ఈతనిరచనం
యందలి స్వీయవిషయములు ఇష్టదేవతాస్తుతి పూర్వకగేయ
ములలో కొంతిగ పొందుపరుపబడినవి అనియే మనకాధార
ములు ఈమహాకవి కాలమునకుచెందినవానికి ఇదమిత్థముగా
తెలియక పెక్కుఊహాగానములు బయలుదేరినవి హెరడటస్
అను గ్రీకుచరిత్రకారుడు హోమర్ సుమారు క్రీ పూ 850 వ
సంవత్సరమునకు చెందినవాడని ప్రతిపాదించినాడు ఆధునికులలో
పెక్కురు ఈప్రతిపాదనమునే ఆమోదించినారు కాని ఆతడు
క్రీ పూ 1050-850 మధ్యకాలమునాటి వాడని కొందర వెనుక
వడియేమైనను ఆయన అస్ఫుటవ్యక్తి (shadowy
figure)గానే చెలామణియైనాడు

హోమర్ జన్మస్థలమును గూర్చికూడ వాదోపవాదము
లేర్పడినవి ఈసందర్భమున స్మిర్నా, కైయాస్ కొలొఫోన్
సెలమిస్ రోడస్ ఆర్గోస్ ఏథీనా అను ఏడునగరనామములు
వినవచ్చినవి క్రీ శ 18వ శతాబ్దిలో వాడుకయందుండిన ఒక
చమత్కారగేయమునననుసరించి హోమర్, తనఉదరపోషణా
ర్థమై ఏ యేడునగరములలో ఉపాదానమెత్తినాడో ఆతని
మరణానంతరము ఆనగరముల ప్రజలు ఆతడుమావాడు!
మావాడు!' అనుచు ఆప్యాయతతో పోటీపడిరట! అయితే
ఈయుదంతమునుగూర్చిన రుజువులేవియు లభింపలేదు

హోమర్ గ్రుడ్డివాడని కొందరిఅభిప్రాయము గ్రీకు
భాషలో ప్రావీణ్యముగల గిల్బర్ట్ మర్రీఅను ఆధునికాంగ్ల పండి
తుడు ప్రాచీన గ్రీసుదేశమునుగూర్చి అస్పష్టమైన స్మృతులు
ఉన్నవనియు అచ్చటిప్రజలు దృఢకాయులు, శూరులునైన
యుద్ధవీరులనియు గ్రుడ్డివారు పాటలు పాడుకొనుచుండు
వారనియు వ్రాసియున్నాడు హోమర్ యొక్క రచనలుగా
గుర్తింపబడిన ఇలియడ్ ఒడిసి అనుగ్రంథములు ఆతనివి కావ
నియు, కొందరు ప్రాచీనకవులు సంప్రదాయబద్ధముగ వ్రాసి
పాడుకొను పాటలసంకలనమే ఈగ్రంథములనియు హోమర్
వీరిలో ఒకడైయుండవచ్చుననియు కొందరి ఊహ ఈయూహా
గానము లెంతెంతసత్యమున్నను హోమర్ ఎట్టివాడైనను
ఆతనిపేరనిలిచిపోయిన పై రెండుఇతిహాసములను ప్రధానమై
నవిగా ఎంచవలెను పాశ్చాత్యదేశములందలి ఇతిహాసములలో
వాటిని మించినవి 'వధూతోపకవిద్యతి' అని విమర్శకాగ్రేసరుల
అభిప్రాయము గ్రీకుదేవతలనుగూర్చి పాశ్చాత్యులకు తెలిసిన
విజ్ఞానము చాలవరకు హోమర్ ఇతిహాసములద్వారముననే

హోమరుకు పూర్వము కవులు గాయకులు ఉండియుండి
రనుట నిర్వివాదాంశముగ కన్పట్టుచున్నది. అయితే వారికి

వారికి ఉన్నతవిద్యాసంస్కారముండియుండదు కాని వీరో చితగాథలను వర్ణించు కావ్యములు వారికి కంఠస్థములై యుండి యుండును ఇట్టి కావ్యములను మంచికల్లప్రాయముగ వల్లించి నేర్చిన ఈదిట్టలు వాటికి కొన్ని కల్పనలను చేర్చి రసవత్తరముగ పాడెడివారు. ఇట్టివర్ణనాంశములు అవ్యవహితముగా తరతరములనుండి వారికి సంక్రమించుచువచ్చినవి ఇట్టివాటిలో సూర్యోదయవర్ణనము భుజబలప్రదర్శనవర్ణనము వస్త్రధారణవర్ణనము సమరసన్నాహవర్ణనము ముఖ్యములు వీటన్నిటికిని హోమర్ వారసుడైనాడు ఈసామగ్రితోపాటు మరికొన్ని కథలను అతడు చేర్చి ప్రతిభావంతముగ కవిత్వమును అల్లిపోగినాడు విషయమును ఎన్నుకొనుటయందును బృహత్కథాసంవిధానసామర్థ్యమునందును అసంఖ్యాకమైన సంఘటనలను అల్లి కావ్యైక్యమును ఒకవంక సాధించుచునే మరియొకవంక వేర్వేరుఘట్టములు వాటికవియే ఆకళింపగునట్లు రచించుటయందును పూర్వకవులరచనలకంటె స్వీయగ్రంథరచనములను సుదీర్ఘముగను సవిస్తరముగను సుందరముగను మలచుటయందును హోమర్ సిద్ధహస్తుడైనాడు

ఆదిలో రచింపబడిన కావ్యములన్నియు బృందగానమునకు ఉపయుక్తములుగనుండెడివి శ్రోతలకొలక్ష్యముకొరకై పునరుక్తిపద్ధతి కావ్యములలో ప్రవేశపెట్టబడినది మూర్గాహ్యములుగనుండు ఉపమానములు, మరి చిరములైన పదప్రయోగములు కూడుడు అందు కొల్లలుగ కన్పించెడివి హోమర్ అశేషప్రజలు ఆనందమునను భవించుటకై తన కావ్యములను గానమొనర్చియుండవలెను ఇంగ్లండులోకపాటి దేశప్రజలు తండోపతండములుగ రాజధానికి తరలివచ్చెడి వారనియు వారి ఆహ్లాదముకొరకు ప్రభుత్వమోవాడు కావ్యగానము నేర్పరచెడి దనియు తెలియవచ్చుచున్నది ఈకావ్యగానము బృందములచేత సమష్టిగా జరుపబడు విధానమునుబట్టి, హోమర్ కావ్యములు లిఖితరూపములో ఉండియుండగలవని కొందరుపండితపరిశోధకుల ఊహ కాగా, హోమర్ లిఖితపూర్వకముగ తనరచనలను ఉంచలేదనియు, తర్వాతితరముల వారు తమతమ జ్ఞాపకశక్తినిబట్టియే అతనికావ్యములను క్రమబద్ధముగ కూర్చిరనియు మరికొందరి వాదము ఏదెట్లయినను క్రీ పూ రివశతాబ్ది మధ్యప్రాంతములో ఏథెన్సునగరమున వ్రాతప్రామాణిక గ్రంథముండి యుండవలెననియు, కాని అది ఎక్కువకాలము నిలువలేదనియు, అందుచే, మరల క్రీ పూ 150 వ సంవత్సరములో హోమర్ కావ్యభాగముల వరుసక్రమము నిర్ణయింపబడినదనియు మరికొందరు ప్రతిపాదించినారు

హోమర్ కావ్యములందలి కథానాయకులు పండారకృష్ణగలవారు పాలకులు వారివారి ధైర్యసాహసో పేతులైన మిత్రులమీదనో అనుయాయులమీదనో ఆధారపడువారేగాని పటిష్ఠమగు బాంధవ్యబంధనములు కల్గియుండువారుకారు వారు సంగ్రామశీలురు గానలోలురు గ్రీకుదేశీయులు ప్రకృతిశక్తులను సర్వదేవతామూర్తులను పూజించెడివారు చనిపోయినవారిని దహనమొనర్చెడివారు

హోమర్ కవితా శైలి సూటిగను పటిష్ఠముగను ఉండును ధీరోదాత్తనాయకుల లక్షణములు వారి కాలప్రభావమునుబట్టి చక్కగాచిత్రింపబడును అందు కళాత్మకరచనాసంవిధానము ఉదాత్తస్థాయిలో కన్పించును పోకడ పొందాగా క్లిష్టమగుండును ముఖ్యకథావృత్తముపై ఏకాగ్రత ద్యోతకమగుచుండును తక్కువ వివరములతో భావోద్దీపనము వేరుగా కలుగజేయు రచనావిధానము అందు పొడగట్టును వివరములకు వీలైనంతవరకు అస్పష్టముగనుంచుట ఉన్నతమైన గ్రీకువితావాణియొక్క ప్రత్యేకలక్షణము

తన కావ్యములలో హోమర్ నైతికవిలువలకు సముచితస్థానమును కూర్చినాడు గౌరవము ధర్మబద్ధమునైన ఆగ్రహము అనృతభాషణమునెడ అసత్యాహత్యమునెడ ద్వేషము శరణార్థులను నిస్సహాయులను వృద్ధులను ఆపదలనుండి నివారణము-ఇట్టి నీతిసూత్రములు హోమర్ కావ్యములో స్పష్టముగ కన్పట్టును

'ఇలియడ్' 'ఒడిసి' అను ఈతని అతిప్రాచీనఇతిహాసగ్రంథరాజములలో కథావిష్కరణ కావించుటకవసరమైన లక్షణములన్నియు సంపూర్ణస్థాయిలోనున్నవి అతని రచన చదువరులకు చాలఆసక్తిదాయకముగనుండి పాత్రపోషణమునందును సంఘటనల వర్ణనమునందును నాటకీయతప్రస్ఫుటముగ కన్పించును యథార్థజీవితచిత్రణములో వాస్తవికత కొట్టవచ్చినట్లుండును అతడెన్నుకొనిన ఛందోరీతి గ్రీకుభాషకు గ్రీకుకవిత్వమునకు చక్కగ సరిపడునట్టిది సిద్ధహస్తుడైన ఈతని రచనలలో, మృదుమధుర సంగీతభరితమును అప్రయత్నపూర్వకమునైన కవితాశయ్యయు సాక్షాత్కరించును

ట్రాయ్ దేశమునకు ఇలియమ్ అను నామాంతరముండుటచే, ఇలియడ్' అనుశబ్దమునకు ట్రాయ్ దేశపుకథ అను

సర్గము ఏర్పడినది. ఇది 15 500 పంక్తులుగల 24 భాగముల కావ్యము. ట్రోజనులకు గ్రీకుప్రజలకు నడుమ జరిగిన పది సంవత్సరముల భీషణసంగ్రామములో తుదిసంవత్సరమునందలి 51 దినముల సంఘటనములను ఈ యితిహాసము సుదీర్ఘముగా వర్ణించును. ట్రాయ్ దేశపు రాకుమారుడగు పారిస్ స్పార్టా (గ్రీకునగరరాజ్యసమాఖ్యలోనిది) రాజన్యుని భార్యయగు హెలెన్‌ను అపహరించి తీసికొనిపోగా గ్రీకుప్రభువులందరు ఏకమై ట్రాయ్‌మీదకు దండెత్తి వెళ్లెదరు. స్పార్టాప్రభువగు మెనిలాస్ సోదరుడును ఆర్గోస్ పాలకుడును అయిన అగమెమ్‌నాన్ గ్రీకుసైన్యాధిపతిగా నియమితుడౌతాడు. మహాబలసంపన్నుడగు అకిలీజ్ అను గ్రీకువీరుడు అగమెమ్‌నాన్‌చే కించపరుపబడి అగ్రహోదగ్రుడై యుద్ధముచేయనని భీష్మించుకొనికూర్చొనగా ఇంతలో తనమిత్రుడగు పెట్రోక్లస్ పారిస్ సోదరుడైన హెక్టర్ చేతిలో మరణించెనని తెలిసికొని యుద్ధరంగమునకురికి హెక్టరును హతమార్చును. యుద్ధఫలితముగా ట్రాయ్‌ధ్వంసమగును. హెలెన్ తిరిగి తన భర్త వద్దకు చేరుకొనును. 'ఇలియడ్' కావ్యముయొక్క కథాసారాంశమిది.

చారిత్రకముగా ట్రాయ్‌విధ్వంసము క్రీ.పూ. సుమారు 1200వ సంవత్సరములో ఘటిల్లినది. దేశముల భవితవ్యమును తదనరంగపు కార్యకలాపములను ఆలంబనముగా తీసికొని, మానవులలోని సహజభావోద్రేకములను చిత్రించు కావ్యము 'ఇలియడ్'. ఈసంఘటనలో దేవతలుకూడ ప్రమేయము కల్గించుకొనెదరు. ఈవిధముగా కొందరువ్యక్తుల స్వకీయవిషయములతో దేశచరిత్రయొక్క గమనమును ముడిపెట్టి రచనలు సాగించువిధానమును తరువాతి తరమువారుకూడ అనుసరించినారు. ఇందుకు థామస్‌హార్డీ రచించిన 'డిడైనాస్ట్స్' టాల్‌స్టాయ్ రచించిన 'వార్ అండ్ పీస్' అనుగ్రంథములు ఉదాహరణములుగ పేర్కొనవచ్చును.

ఒడిసి' అనునది సుమారు 12 000 పంక్తులుగల్గిన 24 భాగముల కావ్యము. 'ఇలియడ్' కంటె నిడివిలో చిన్నదైనను, ఇతివృత్తగమనములో ఇది దానికంటె మిన్నయని విమర్శకుల అభిప్రాయము. ఒడిసెస్ (ఇథాకాద్వీపపురాజగు యులిసిస్‌కు గ్రీకునామాంతరము) ట్రోజన్‌యుద్ధానంతరము పదేండ్లపాటు జరిపిన సంచారములో గావించిన సాహసకృత్యములు ఈకావ్యమునందు వర్ణింపబడినవి. సైక్లాప్స్ అను ఒంటికంటిరాక్షసులను హతమార్చుట, సర్సీ అనుమంత్రకత్తె మాయలో చిక్కుకొని తుదకు బయటపడుట మొదలగు అద్భుతగాథలెన్నియో ఇందు గుదిగ్రుచ్చబడినవి.

పైరెండుకావ్యములు అన్నివయసులవారిని ఉత్తేజపరచును. కమ్మని కథలు, మనోహరములైన వర్ణనములు హృదయమును ద్రవింపజేయు సన్నివేశములు ఇందు కొల్లలుగ నున్నవి. మానవుని ఆవేదనలు హోమర్ హృదయమును మొదలంట కదలించివేయును. ప్రకృతియంతయు అతనికి అంతుపట్టని విషాదపూరితశక్తిగా గోచరించెడిది. నిండుమనస్సు, ఉదారహృదయము దైవచింతనము పాపభీతియు గలవాడు హోమర్. తనదేశశత్రువులను గురించికూడ తన కావ్యములలో ఆతడెచ్చటను పల్లెత్తు పరుషశబ్దమును ప్రయోగించి ఎరుగడు. మానవహృదయమును అవగాహనచేసికొనుటలో షేక్స్‌పియర్ ఒక్కడే హోమరును అధిగమించగల్గినాడని విమర్శకుల నిర్ణయము.

అతని రచనలప్రభావము ఐరోపాసాహిత్యముపై బలీయముగ ప్రసరించినది. అతడు 'కవీనాంకవి'గా ప్రపంచసాహిత్య చరిత్రమున చిరస్థాయిగా నిలిచిపోయినాడు. ఇతిహాసరైలికి అతనికావ్యములు మచ్చుతునకలు; ఆయన వాణి పాశ్చాత్య విజ్ఞానమునకు అనివంటిది.

గ. వేం. జో.

## హోమియోపతి వైద్యము

హోమియోపతి అనునది హానిమన్ మహాశయునిచే 18వ శతాబ్దిలో కనుగొనబడిన చికిత్సావిధానము. ఈచికిత్సావిధానములో ఏఔషధము ఎట్టిలక్షణములుగలవ్యాధిని నిర్మూలించును? అనునది కీలకసూత్రము. ప్రాచీనాయుర్వేదమునందుకూడ సమచికిత్స, విషమచికిత్స అనురెండువిధానములు పేర్కొనబడినవి. అందుకు సంబంధించిన శ్లోకములుకూడ ప్రాచీనగ్రంథములలోగలవు. తర్వాత ఇతరచికిత్సావిధానములు వ్యాప్తిలోనికి వచ్చినను, వాటికికూడ కొన్నిహోమియోపతి సూత్రములు అన్వయింపబడినవి. ఉదాహరణమునకు తన్యములను పుటముపెట్టుటద్వారా, నూరుసార్లు లేక వేయిసార్లు ఘాటిశక్తి పెంపొందినఫలితముగా, అవి ఎక్కువ గుణమిచ్చుట మనకు విదితమైన విషయమే.

హానిమన్ కాలములో ఆంగ్లవైద్యవిధానము ఈనాటివలె ఉన్నతస్థాయిలో లేకుండెను. రోగికి విరేచనములగుటకై మందిచ్చుట, అతనిచే వాంతిచేయించుట, శరీరమునుండి రక్తమును లాగివేయుట, శరీరమునకు చెమటపట్టించుట వంటివి మాత్రమే ఆనాటి వైద్యులకు తెలిసిన చికిత్సావిధానములు. అందువలన రోగి మరింత బలహీనుడయ్యెడివాడు. ఆరోజులలో తీవ్రవ్యాధిపీడితులకు తగుచికిత్సలేకపోగా, ఆవైద్యులు అవలంబించిన పైపద్ధతులవలన రోగి మరింత బలహీనుడగుచుండెను. ఆనాటి పెక్కురు రాజులు రోగమువలనకాక అశాస్త్రీయమైన మొరటుచికిత్సవలననే మరణించిరనికూడ తెలియుచున్నది.

అట్టి పరిస్థితులలో స్వయముగా వైద్యుడైన హానిమన్ బ్రతుకుటకంటె చనిపోవుటకే కారణభూతమైన ఈ చికిత్సావిధానముతో అసంతృప్తిచెందెను. ఆరోజులలో మలేరియా జ్వరమును కుదుర్చుటకు సింకోనాబెరడును రోగికి ఇచ్చెడివారు. అది కొందరికి చాలప్రయోజనకారిగా నున్నదని తెలిసికొనిన హానిమన్ ఆరోగ్యవంతుడైన తానే సింకోనాబెరడును పుచ్చుకొనుటవలన ఎట్టిప్రభావము కలుగునో తెలిసికొనగోరి దానిని తనపైననే ప్రయోగించుకొనెను. ప్రతిదినము అతడు సింకోనాబెరడును పుచ్చుకొనుటవలన అతని శరీరమందు మలేరియా చిహ్నములు గోచరముకాజొచ్చెను. ఆరోగ్యవంతునకు మలేరియా రోగచిహ్నములుద్భవించుటకు కారణభూతమైన ఒకేవస్తువును అదే వ్యాధిలక్షణములుగల రోగికి ఇచ్చినచో వ్యాధినయమగునను సూత్రమును అతడుప్రతిపాదించెను. అటువిమ్మట అతడు సింకోనాబెరడునుస్వల్పాతిస్వల్పమున్తైన మోతాదులలో రోగులకు ఇయ్యమొదలిడగా వ్యాధి అతివేగముగా నయముకాసాగెను. తుదకు అంతకంటె చిన్న మోతాదులలో ఆబెరడును పాలచక్కెరవంటి ప్రమాదరహితమైన అనుపానముతో "పొటెన్సీ" ప్రాతిపదికపై వర్గీకరించుటవలన అది ఇంకను బాగుగా పనిచేయునని అతడు కనుగొనెను.

హానిమన్, ఔషధములలో కొన్నిటిని తనపైనను, ఆరోగ్యవంతులైన కొందరు స్త్రీ పురుషులమీదను ప్రయోగించి వాటి శక్తిని ఋజువుచేసికొనెను. తమపై ఎట్టిచిహ్నములు గోచరించినవో, అట్టిచిహ్నములేగల రోగులపై ఔషధములనాతడు ప్రయోగించెను. తత్కాలమున అత్యద్భుతఫలితములు గోచరించినవి. హోమియోపతిచికిత్సకు ఇదియే ప్రాతిపదిక. జర్మనీలోను హానిమన్ తన కడపటిదినములలో దర్శించిన ఫ్రాన్సులోను ఈచికిత్సావిధానమెంతయో పురోభివృద్ధి గాంచినది. క్రమముగా ఆయనకెందరో శిష్యవర్గమేర్పడిరి. వారు యూరపులోను అమెరికాలోను ఈ చికిత్సావిధానమును వ్యాప్తిచేసిరి.

ఈ చికిత్సావిధానము ప్రపంచవ్యాప్తమై దాదాపు అన్నిదేశములలో శాస్త్రీయమైనదిగా గుర్తింపబడినది. అమెరికా ఇంగ్లండు జర్మనీ రష్యా మెక్సికో ఇండియా మొదలగు పెక్కుదేశములలో హోమియోపతి వైద్యశాలలుగలవు. ఇరువదవ శతాబ్దములో ఆంగ్లవైద్యముగూడ యెంతయో అభివృద్ధిచెందినది. సల్ఫాఔషధములు మైసిటినులు ప్రచారమగుటతో లోగడ రోగిని మృత్యువాతపడవేసిన న్యూమోనియా టైఫాయిడ్ రక్తగతవిషదోషము ప్రసూతి మొదలగు వ్యాధులను ఆంగ్లౌషధములు జయింపకల్గినవి. ఈఔషధములలో ఎన్నోమార్పులు వచ్చినవి. అనేకమంది మేధావులు ఆంగ్లవైద్యవిధానము నవలంబించిరి. ఈనాడు మనము దాని అంతస్థును శక్తిపాటవములను చూచుచున్నాము.

1920 సం॥ తర్వాత హోమియోపతి చికిత్సావిధానములో అసాధారణ ప్రతిభాశాలురు లేకుండుటవలన ఆంగ్ల వైద్యమునకు విశిష్టప్రచారము కల్గుటవలన హోమియోపతి వైద్యముయొక్క అంతస్థుతగ్గి మైసిటినుల సిద్ధాంతమువలన ఇంజక్షనులవలన హోమియోపతిమాత్రలకంటె ఆంగ్లౌషధములకు ఆర్థికప్రయోజనము అధికముగాయుండుటవలన, మేధావులలో అత్యధికులు ఆంగ్లవైద్యవిధానమునే అవలంబింపసాగిరి.

ఆంగ్లవైద్యవిధానము ఎట్టిప్రయోజనములను సాధించినను అది విఫలమైన అనేక సందర్భములలో హోమియోపతి విధానము అద్భుతవిజయమును సాధించినది. ఆంగ్ల హోమియోవైద్యవిధానములు రెండును, పరస్పరము సహకారులేగాని, ప్రత్యర్థులు కాజాలవను విషయమును, ఈరెండు విధానములను అవలంబించువైద్యులు గమనించి ఒకవిధానము వలన ఫలితముకలుగని యెడల రోగి ప్రయోజనార్థము రెండవవిధానమును ప్రయోగింపవలసి యుండునని.

ఈనాడు విశేషముగా ప్రతిష్ఠమైన సంస్థలోను శిక్షణ పొందక, కేవలము స్వయంశిక్షితులైన ప్రోత్సాహకులచేతిలో హోమియోపతి వైద్యవిధానము వికసించుటలేదు అందుచేత దేశమంతట హోమియోపతి వైద్యకళాశాలలను స్థాపించి మేధాసంపత్తిగల అధ్యాపకులను విద్యార్థులను ఆకర్షింపవలెను అప్పుడే తక్కినవాటితోపాటు హోమియోవిధానము సామాన్యపౌరుని అభివృద్ధికై కృషిసల్పగలదు

హోమియోపతి ఔషధములను అంగ్లౌషధములతో పోల్చినచో మొదటిదానికగు వ్యయము రెండవదానికంటె చాలా తక్కువగుట ప్రజలకావిధానమందు కలుగగల ప్రధాన సౌకర్యము కాబట్టి భారతదేశమువంటి పేద దేశములో హోమియోవిధానము మిగుల అభిమానింపబడి పోషింపబడదగియున్నది హోమియోపతి విధానమునకు ఉజ్జ్వలభవిష్యత్తుగలదు భారతదేశమున బాల్యావస్థలోనున్న ఈ వైద్యవిధానమును ప్రజలు ప్రభుత్వము జాగ్రత్తగా పరిరక్షించి వృద్ధిచేసికొనవలసియున్నది

ఆర్ వి కె పా



# సూచిక

## య



## ర



## ల

# పారిభాషిక పదములు

### అ

అంగారయుగము - Carboniferous Period
అండాణువు - Ova
అంతిమప్రయోజనము - Final degree of utility
అనిషిక్త బీజములు - Ovules
అర్ధశిల్ప - Boss relief
అల్పరోమములు - Oligochaeta
అవయవానురూప అక్షము- axis of symmetry
అవయవానురూపతలము - Plane of symmetry
అవయవానురూప మధ్యమము - Centre of symmetry
అష్ట పుటులు - Ootocysts

### ఆ

ఆదియోనులు - Archegonia

### ఉ

ఉత్సర్జన మండలము - Excretory system
ఉన్నత అపుష్పోద్భిదములు - Higher cryptogams
ఉపధాతువు - non metal
ఉపనివేశకులు - Settlers
ఉపపత్తి - Hypothesis
ఉపభోగ స్తంభన లేక నిరీక్షణ సిద్ధాంతములు - Abstinence or waiting theories
ఉపరితల బిగువుసిద్ధాంతము - Surface Tension Theory

### ఊ

ఊర్ధ్వాంగ చికిత్స - Diseases of ears, nose, eyes, throat etc.,

### ఋ

ఋణ నిధుల సిద్ధాంతము - Lonable Funds Theory

### ఎ

ఎర్రగా వేడిచేయబడిన విద్యుదగ్రము - High Voltage Canode

### ఏ

ఏకకణ - Unicellular
ఏకముఖ విద్యుత్ప్రవాహము - Direct current
ఏకవర్ణ కాంతి - monochromatic light
ఏకాంతర జననదశలు - alternation of generations
ఏధ - cambium

### క

కర్బనరసాయన - Organic
కాయచికిత్స - general treatment
కాలాభిమాన సిద్ధాంతము - Time preference Theory
కిరణ వక్రీకరణ సూచి - refractive index
కీన్సీయ తరళతాభిమాన సిద్ధాంతము - Liquidity Preference Theory
కేంద్రకము - Nucleus
కోశికరహితమైన - noncellular
క్షార సంబంధి - alkaline
క్షీణ ఫలముల న్యాయము- Law of Diminishing Returns
క్షేత్ర సౌష్ఠవము - geometric symmetry
క్రయ వ్యవహారోద్దేశము - Transaction motive

### గ

గ్రహసంబంధములైన మధ్యమ చలనముల స్థిరత్వము - Invariability of planetary mean motions

### ఘ

ఘనవర్గ - cubic system

### చ

చూర్ణ ప్రాణికములు - mollusca
చేరువు అంటు - approach grafting
ఛాందస మతము - non-Conformism

### జ

జలూకావర్గము - Hirudinea
జనకకోశములు - germ cells
జలత్వము - hydration
జలమానము - Hydrometer
జలవాహకకోశములు - tracheids
జాతీయలాభాంశము - National dividend
జీవపదార్థము - Protoplasm
జ్యోతిర్విశ్వము - galaxies
జ్యోతిర్విశ్వాంతరాకాశము - Intergalactic space

### డ

డెకార్టే సంజ్ఞా సూత్రములు - Descartes rule of signs

### త

తారతమ్య సాంద్రత - Specific gravity
తేజో దూరవర్గ విలోమ సూత్రము - Inverse square law of distance

### ద

దేహగుహ - Coelom
ద్రావణి - Solvent
ద్విధావిచ్ఛిత్తి - Binary Fission

### ధ

ధాత్వంతర యౌగికములు - Intermetallic Compounds

### న

నక్షత్రాంతరాకాశము - Inter Stellar medium
నల్లసీసము - Graphite
నాలుక అంటు - Tongue grafting
నిసాదత - tonus
నిబంధన సమీకరణములు - Conditional equations
నీహారికా ప్రమేయము - nebular hypothesis

### ప

పక్ష్మవలయజీవి - trochozoan
పరిభ్రమణ ద్రవరాశి యొక్క క్షేత్రతలసామ్యము - Figure of Equilibrium of rotating fluid mass
పారదర్శకము - Transparent
పార(పూర్వ)నీల లోహిత కిరణములు - ultra violet rays
పారుదలశక్తి - Permeability
పురాకల్పము - Paleozoic era
పురకోశములు - Polycliastes
పేషణి - gizzard
ప్రత్యేక సాపేక్షతావాదము - Special theory of relativity
ప్రసృష్ట - Phylum
ప్రస్ఫురణ తెర - Fluorescent screen

### బ

బహుధావిచ్ఛిత్తి - Multiple Fission
బొగ్గుపులుసువాయువు - Carbon dioxide

### మ

మజ్జాసంచి - Spinal sac
మత్స్యయుగము - Devonian period
మొగ్గంటు - Bud grafting

### ర

రంధ్రత్వశక్తి - Porosity
రసాయనచికిత్స - Rejuvination

## ACKNOWLEDGMENTS

We offer our grateful thanks to the following Institutions who have very kindly helped us in reproducing in this Volume some of the illustrations from their publications (mentioned within brackets) and also to other individuals including the authors of articles published in this Volume who were good enough to provide us with drawings, diagrams, photographs, maps blocks and other valuable material and rendered our project a success

1 Archaeological Survey of India, New Delhi
("Archeaological Remains, Monuments and Museums")

2 Telugu Bhasha Samithi, ("తెలుగు విజ్ఞాన సర్వస్వము")
Madras University Buildings,
MADRAS

3 The Publishers, "Andhra Patrika" ("భారతి")
Thambuchetty Street George Town
MADRAS

4 The Publishers,
"The Shankar's Weekly'
NEW DELHI

5 The Publishers
"Indian Express"
VIJAYAWADA

6 The Publishers,
"Deccan Chronicle"
SECUNDERABAD

7 The Publishers,
"Illustrated Weekly of India"
BOMBAY

8 The Guntur Medical College, Guntur
("Guntur Medical College Magazine" 1969)

PUBLISHERS.